# భారతి

## సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు

కా. నాగేశ్వరరావు

సంపుటము ౧౯, సంచిక ౧

# భారతి—పంచదశ సంపుటము—భా. ౧

## వ్యాసముల అకారాది సూచి

## త్రివర్ణచిత్రముల అకారాది సూచి



## భారతి చందాదార్లకు హెచ్చరిక

ఈ క్రింది కనబరచిన నెంబర్లవారికి ఈ నెల (1938 సం. మే నెల)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమునకు చందా మాకు చేరునట్లు ఈ నెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమయొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్ము రానిచో సహజభాషాభిమానులను తాము తిరిగి ఇంకొక సంవత్సరము వఱకు చందాదారులుగ నుందురను నమ్మకములో 1938 సం. జూన్ 10-వ తేదిని రూ 6-4-0 లకు వి.పి. పంపుచున్నాము. గావున తామెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన ప్రార్థితులు. ఒకవేళ తమకీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మా కావిషయము వెంటనే తెలియజేసినయెడల వి. పి. పంపుట మాపుదుము.

D 4. G 3. H 20, 22, 23, 57. J 1. K 8, 9, 10, 17, 20, 21. M 14. N 8, 10. P 10, 12 13, 14, 29. R 9, 41. S 36, 25, 38, 39, 42, 44, 46, 48, 105, 110, 111, 113, 114, 135, 136. S 135 Old. V 14. Y 2.

# విషయసూచిక



## చిత్రములు

# భారతి చందాదార్లకు హెచ్చరిక

ఈ క్రింది కనబరచిన నెంబర్ల వారికి ఈ నెల (1938 సం. జనవరి నెల)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమున కగు చందా మాకు చేరునట్లు ఈ నెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమయొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్మురానిచో సహజభాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరము వరకు చందా దారులుగ నుందురను నమ్మకముతో 1938 సం. ఫిబ్రవరి 10-వ తేదిని రూ॥ 6-4-0 లకు వి.పి. పంపుచున్నాము. గావున తా మెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన ప్రార్థితులు. ఒకవేళ తమ కీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మా కావిషయము వెంటనే తెలియజేసినయెడల వి. పి. పంపుట నాపుదుము.

A 9 B 11 18 H 64 J 13. K 21 22 23 24 N 11 27 28 P 18 50 52 R 18 29 22 48 49 52 S 57 165 168 174 176 179 181 182 183 184 187 188 189 190 V 16 17 18 45 46.



త్రి శూ ల ము

(శ్రీ ప్రమోద కుమారచటర్జీ)

శ్రీ చటర్జీగారు ఆంధ్రజాతీయ కళాశాలనుండి వెళ్లిపోవుచున్నప్పుడు శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారికి కానుకగా ఇచ్చినది.

# భారతి

సంపు. ౧౫ — ఈశ్వర, పుష్యమాసము (జనవరి 1938) — సంఖ్య ౧

"స్వ" సంస్మరణము మానవులకు చిత్రవిచిత్ర భావప్రపంచమును స్మరింపజేయును. స్వభావము ప్రవృత్తియందు పురుషార్థమునకు మూలము. ధర్మార్థకామమోక్షములకు స్వస్వరూపజ్ఞానమే మూలము. ప్రవృత్తి జీవజాలములకు సాధనమైన సాధనసంపత్తితో నిండియున్నను స్వాభిమానస్వార్థపరత్వములు పరావలంబనాక్రమణములను అపేక్షించుచున్నవి. పరాపేక్ష సకలసందర్భములందును జ్ఞానయోగములను సంకుచితముచేయుచు ఆత్మశక్తిని స్తంభింపజేయుచున్నది. సకలకార్యములందును ఆత్మవిశ్వాసముగలిగి పనిజేయుట కార్యసిద్ధికి సాధనముగ నుండగలదు. మహాసంకల్పముతో నారంభించిన కార్యములు విఫలములగుటయు, సామాన్యవిషయములు సఫలములగుటయు ప్రవృత్తియందు సహజావస్థలు.

మానవకృత్యములందు పరిపూర్ణత్వము దుర్లభము. సకలకార్యములును లోపభూయిష్ఠములై, నిందాస్తోత్రములకు పాలగుచుండును. ధీమంతులు సంకల్పించిన కార్యములను యథాశక్తిని నిర్వహించుట లోపభూయిష్ఠమైనను స్వాత్మవికాసమునకును, పరార్థమునకును పరమార్థసాధనము. విశ్వమంతయును పరమాణువునుండి పరబ్రహ్మమువఱకును శ్రుతిబద్ధమై విశ్వకల్యాణమునకు విశ్వయాత్రను చేయుచున్నది. విశ్వయాత్రయందు విశ్వకల్యాణమునకు వినియోగపడెడి సకలమును ఏకశ్రుతిబద్ధమై సమ్మేళనమును పొందుచున్నది. సంకల్పశ్రద్ధానురూపమైన ఫలము సకలకార్యములకును గలుగును; వ్యక్తులు నిమిత్తమాత్రులు. కర్తృత్వాభిమానము నిరర్థకము. గతించిన పదునాలుగేండ్లయందును భారతి నిర్వాహకులు యథాశక్తిని పత్రికానిర్వహణమును చేయుటకు చేసిన ప్రయత్నముల ఫలము లోపభూయిష్ఠమైనను ఆంధ్రసాహిత్యప్రపంచమునకు విదితము.

రుధిరోద్గారి సంవత్సరము ఆంధ్రదేశచరిత్రమునందు ప్రఖ్యాతవత్సరము. ఆంధ్రదేశమునందు కాకినాడ పురమునందు ప్రసిద్ధ మహమ్మదీయ నాయకుడు మౌలానా మహమ్మదాలీ అధ్యక్షతక్రిందను కాంగ్రెసు సమావేశమైనది. శ్రీయుత కొండా వెంకటప్పయ్యగారు సన్మాన సంఘాధ్యక్షుడు. మహర్షి సాంబమూర్తిగారు నిర్వాహకుడు. ఆ మహోదయసమయమునందు ఆంధ్రలోకమునందలి సుప్రసిద్ధనాయకులే గాక, అఖిలభారత సుప్రసిద్ధనాయకులును కాకినాడయందు సమావేశమైరి. గాంధీనగరము ధర్మస్థాపనమునందు శాశ్వతచిహ్నముగ స్థాపితమైనది. ఆ పవిత్ర సమయమునందు భారతి ప్రారంభమైనది. ఆరంభమునందు స్వవిషయావలోకనమునందు సంకల్పించిన సంకల్పములు కేవలము దేశాభ్యుదయమునకు నిమిత్తమాత్రములు. కాకినాడ కాంగ్రెసునందు ప్రతిపాదితములైన ప్రస్తావనలు వర్తమానకాలమునందు సఫలములైన విధమునను ప్రథమ సంచికయందు సంకల్పించిన సంకల్పములు సకలరంగములందును సఫలములగుచున్నవి. అనేకములైన మాసపత్రికలు, వారపత్రికలు గతించిన పదునాలుగేండ్లయందును వెలువడి సాహిత్య కళాభ్యుదయమును హృద్యముగను చేయుచున్నవి. గతించిన పదునాలుగేండ్లయందును రాజకీయ, సాంఘిక, సాహిత్య, కళా, వైజ్ఞానికాది విషయములందు కలిగిన స్వాతంత్ర్యభావ పరివర్తనము మానవ స్వాతంత్ర్య ప్రియులకు పరమానందమును కలుగజేయగలదు. ఈ మహోదయమునకు భారతియును యథాశక్తిని జ్ఞానాంజలులను సమర్పించినది.

అనంతమైన విశ్వమునందు వ్యక్తులకు కర్మాచరణమునందు గల యధికారము ఫలాపేక్షయందు గలుగకుండుట ధర్మము. ఇటీవల నేను జబ్బుతోనుండగా డాక్టరు నంజప్పగారు నన్నుజూచి ఇట్లనిరి: "నీవు విచారగ్రస్తుడవుగ కనబడుచున్నావు. నీవును, ఇతరులును ఏ స్వరాజ్యసంపాదనమునకై శ్రమపడితిరో, ఆ సుదినము సంప్రాప్తమైనది. సత్యాగ్రహము ధర్మవిజయమును బడసినది. ఖద్దరుటోపి, త్రివర్ణపతాకము, వందేమాతరం గీతము విజయమును పొందినవి. ఇది నీ వానందింపవలసిన సమయము." నంజప్పగారి గంభీరభావములు స్వధర్మ నిర్వహణమునందలి పరమార్థమును విశదముచేసినవి. విశ్వపరిణామమునందు వ్యక్తుల ప్రాజాపత్యము నిమిత్తమాత్రము.

ఆంధ్రాభ్యుదయము గతించిన ఇరువదియేండ్లయం దవిచ్ఛిన్నముగ సాగుచుండిన విధమును రాజకీయ, సాంఘిక, సాహిత్య, కళాదిరంగములందు ప్రవర్ధమానంబగుచున్న నవీన వికాసము విశదము చేయుచున్నది. సత్యాగ్రహమునందు ఆంధ్రులుజూపిన ధైర్యసాహసములు ప్రశంసలకు పాత్రములైనవి. హరిజనోద్యమము ఆంధ్రదేశమునందు స్వాగతమును బడసినది. నవీన సాహిత్య కళారచనలు ఆంధ్రుల స్వాతంత్ర్యప్రియత్వమును విశదము చేయుచున్నది. స్వరాజ్య ప్రభుత్వమునందు ఆంధ్రనాయకులకు ఉచితములైన స్థానములు లభించినవి. ఆంధ్రాభ్యుదయ మవిచ్ఛిన్నముగ సాగుచున్నను ప్రత్యేకాంధ్రరాష్ట్రభావము సకలరంగములందును పూర్ణవికాసమును దుర్లభముజేసినది. శ్రీయుత పట్టాభి సీతారామయ్యగారి నాయకత్వము క్రిందను ఆంధ్రరాష్ట్రము అచిరకాలములోనే సార్థకమగు గాక! భారతియును గతించిన పదునాలుగేండ్లయందును ఆంధ్రాభ్యుదయమునకును, దేశకల్యాణమునకును పాటుపడిన విధమునను భావికాలమునందును [illegible]ంతుడును ఆంధ్రలోకమును అనుగ్రహించు గాక!

కా. నాగేశ్వరరావు

# ఆంధ్రపతాకము

## శేషాద్రి రమణకవులు

ప్రళయజీమూతసంభవభాంకృతుల మించు ఘుర్ఘురధ్వనికి దిక్కులు గలంగ
కాలానలోజ్జ్వలజ్వాలల నిరసించు దృగ్గోళరక్తమరీచులోలయ
అష్టదిఙ్మత్త వేదండ భయాపాది నిబిడ దేహచ్ఛాయ నివ్వటిల్ల
విలయవేళానటద్వీరభద్రకరస్థ ఖడ్గవైఖరికోఱ కాంతిలంగ

విశ్వరక్షణదీక్షతో వెలసియున్న - ఆదికిరిమూర్తిచేఁ గేతనాదికములఁ
జేసి రాంధ్రులు భావవైచిత్రి మెఱయఁ - దన్మహాసుస్వరూప మెంతయు స్మరింతు.

అసురోత్క్షిప్త వసుంధరాభరణ దంష్ట్రాంకూర మొప్పార, ది
గ్వ్యసరాంధంకర ఖాంగకాళిమ నభోవీథిన్ విడంబింప, ధ
ర్మసముద్ధారణ దీక్షతోడఁ గిటియై రాజిల్లు శ్రీ విష్ణుసా
హసవృత్తంబు చళుక్యభూవిభు పతాకాంకంబుగా భాసిలెన్.

పరమప్రాభవులౌ చళుక్య నృపతుల్ బంగారునాణెంబులన్
బరగం గూర్చిరి, యాంధ్రకేతనములన్ భాసిల్లె నే యీశ్వరే
శ్వరరూపంబు వరాహచిహ్న మది శోభావంతమై కాకతీ
శ్వర తేజోంకముగాఁ దనర్చె రిపుభూపక్షోభ చేకూర్చుచున్.

అని కాకత్యుఁడు ప్రోలభూవిభుఁడు గుండాధీశుఁ జెండాడుము
న్ననవద్యంబగు నాత్మముద్రిక వరాహాంకంబు మైనద్దెఁ ద
జ్జననాథాన్వయ కేతనాంచలములన్ సంస్థాపితంబయ్యెఁ బా
వనమా నాదికిరిస్వరూప మది సంభావ్యంబు మా కెల్లెడన్.

దురమునఁ గాకతీయ నృపతుల్ నిజకేతన చిత్రమా మహా
కిరివరమూర్తిఁ జూప నొగిఁ గీడ్వడి తొల్లిటి సేవణక్షమా
వరులు స్వదుర్గ భూములకుఁ బాఱి కెలంకులనున్న వన్యసూ
కరములఁ జూచి క్రమ్మఱఁట కాకతికేతన చిహ్నదుర్భ్రమన్.

ఓరుంగంటి నృపాలమందిర సమీపోత్తాల భూజంబుపై
నారూఢంబుగ బంధితంబయిన స్తంభాగ్రంబు క్రోడాంకమై
వైరివ్యూహభయప్రదాయకముగా వర్తిల్లెఁ దత్తజ్జయ
ప్రారంభంబుల కంతరార్థము గ్రహింపన్ రాదు మా బోంట్లకున్.

మును చాళుక్య వసుంధరాధిపమణుల్ పూజాంజలుల్ నించి మిం
చిన భక్తిం బ్రకటించిరే కిరివర శ్రీ కేతనం బద్ది, యాం
ధ్ర నరాధీశులు కాకతీయు లోరుగంటన్ నిల్పి సేవించి ప్రా
క్తన తేజంబును నిల్పి రప్పటి జనుల్ కైమోడ్పు గావింపఁగన్.

---

# భవభూతి : నాటకకర్త

పుట్టపర్తి

నారాయణాచార్యులు

ప్రపంచము విరుద్ధశక్తుల కొక నాట్యరంగము. తటిల్లతలు మనోహరములై మెరయుచున్నవి. అంధకారములు దట్టముగ గ్రమ్మి హృదయనిర్భేదకములై యున్నవి. మదించిన గజములవలె, అలవోకవోవు మేఘమాలికలతో, మయూరకన్యకలతో, నవసౌందర్యముల, చిరునవ్వునవ్వు పంటపొలములతో సహృదయుల కన్నుల దనియించు వానకారులున్నవి. వెంటనే నిప్పులు గ్రుమ్మరించి వీరభద్రునివలె వికటాట్టహాసములుగావించు వేసవులున్నవి. శంకరాచార్యుల మతబోధలును, బుద్ధుని యహింసాతత్త్వమును సాదుకొన్న వంగముననే భయంకరములగు యుద్ధములు, దారుణములగు హత్యలు కానుపించుచున్నవి. అసలు నుంచి ప్రపంచమున కెంత యావశ్యకమో చెడ్డయు నంతే. మహాత్ముడు ఒకచోట త్రాచులు మొదలైనవి పంటను పాడుచేయు పురుగుల భక్షించునని తెలవిచ్చినాడు. మనము స్థూలదృష్టితో యుద్ధములు మొదలగునవి యనర్థదాయకము లన్నను కొంత లోతుగ విచారించిన నవియు దేశకల్యాణమునకే యని చెప్పకతప్పదు. ఒకమహాత్ముడు సృష్టికన్న ముందు నాశన మావశ్యకమన్నాడు. లోకమున నెలకొను శాంతికి యుద్ధములును కారణములే. ఒక ప్రపంచముననేకాదు, మనుష్యుల—సామాన్యముగా ప్రాణిమాత్రముల యంతరంగ బహిరంగస్థితులయందును నీవిరుద్ధపరిస్థితి యుండనేయున్నది. బాసుగా చదివిన శ్రోత్రియునకు—ఆచారవంతునకు భర్తగారికి దినమును సహస్రనామము వడ్డించు కాళరాత్రి దాపురించుచున్నది. రూపవంతునికి కొంగమెడగల పెండ్లామును, మంచిరూపము గల భార్యకు అందచందములులేని యష్టావక్రమూర్తియు లభించుట చూచుచునేయున్నాము. హరిశ్చంద్రుడు చక్రవర్తి; ధార్మికుడు; సత్యమునకు కొడుకును, దేహమును, మానమును, కడకు భార్యనుగూడ అమ్మిన త్యాగి. కాని ఆతని ధర్మనిష్ఠురతలో సామాన్యహృదయమునకు కొన్ని యోర్వరానివి లేవా? పెండ్లామ నమ్మినపుడు—విధిని నిందించని, హరిశ్చంద్రుని దూరని పాఠకు డుండునా?

అట్టి విరుద్ధధర్మములను చూచినపుడు, వానిచే అనుభూతికి, ఆనందమునకు, సత్యమునకు గలుగు కొరతను పరిశీలించినపుడు కన్నులున్నవాడు— హృదయమున్న రసికుడు— కంట తడివెట్టి యయ్యోయని వాపోవకుండ లేడు. అట్టియెడ వాడు—సృష్టి తనకు లోబడినదికాకపోవుటచే వికలత నొంది—తన్ను, దైవమును నిందించును. అట్టిలోపమును నివారించువారికై విలపించును. కడకు కర్మసిద్ధాంతముననైనను నాత్మను తృప్తినొందింప బ్రయత్నించును.

మరి యీ విరుద్ధధర్మముల తత్త్వమేమి? దీనికి వ్యాఖ్య నేరీతి గల్పింపవలయును? ప్రపంచములోని కొరతకై, విరోధమునకై కృశించు పేదజీవి యట్లే కుళ్లికుములవలసినదేనా? ప్రపన్నజీవికి ముండ్లకంచె లడ్డునైచి మార్గమును మరింత క్లిష్టముగ జేసినైచుటేనా భగవంతుని యుద్దేశము? చక్కని రాచబాట నైచి వేయికన్నులతో గనిపెట్టి రక్షించుట గాదా? కాదు కాదు. క్లిష్టపరిస్థితు లడ్డునైచి, నానానైకల్యములచే మనస్సును కలంచివైచుటయే. ఇదంతయు దేనికి? జ్ఞానోపార్జనకు—తత్త్వదృష్టికి. కాచినబంగారు దడదడ పరుగెత్తిపోవుచున్నది. ఆవేశిత హృదయము శీఘ్రముగా తత్త్వము నందుకొనుచున్నది.

ఇట్టి క్లిష్టపరిస్థితులు మహాత్ముల కందరికి సంభవించినవే. అప్పుడు వారును కష్టములకు జిక్కి తలపోసినవారే. రామభక్తుడగు కబీరు, దేవాలయముగట్టిన రామదాసు, మొన్న మొన్నట లేపాక్షిలో సరస సౌందర్యము గల శిల్పవిద్యకై ధనము వెచ్చించి కన్నులూడ పెరికించుకొన్న విరుపణ్ణయు నీ కోటిలోనివారే. చంద్రగిరిలో భిక్షమెత్తిన తిమ్మరుసు మంత్రి భావిజీవితమున అఖండ సామ్రాజ్యమును తన చేతిలో నాడించి మహామండలేశ్వరుడై భళిరా యనిపించుకొన్నాడు. మొన్నటివరకు నూరుపేరులేని విశ్వేశ్వరయ్య, అల్లాడి, ఆంధ్రకేసరులు నేడు సకల సమ్మాన్యులు గాలేదా? కష్టము లెదురొడ్డినపుడు ఆత్మశక్తిని గుర్తించి, లోన పరమాత్ముడున్నాడని తెలిసికొని, సింగపు పిల్లలవలె లంఘించి మహోన్నతపదవిని జేపట్టిన ధన్యులు వీరు. మనుష్యునికి కష్టములు, దుఃఖపరంపరలు సంభవించుటవలననే ఆత్మపరిశోధన, సంయమనము మొదలగు మహాపురుష లక్షణము లభ్యాసమగుచున్నవి. వేయియేండ్లుచేయు గురుబోధలకన్నను నివి యతిత్వరలో పురుషుని కార్యములకు బ్రేరేచి గెలిపించుచున్నవి. ఆకష్టములచే వారి జీవితములు ధన్యము లగుచున్నవి. మహాత్ముడగు "జీసస్" ఉరికంబ మెక్కకున్నచో అతని సిద్ధాంతములకు సరియగు సమన్వయ మేర్పడియుండదేమో? ఆనందపాంథుడగు సిద్ధార్థుడు పుష్కలమగు రాజ్యమును, ప్రేమరూపిణి యశోధరను త్యజించి యేకాకియై జ్ఞానమునకు బ్రయత్నించి బుద్ధుడయ్యెను. ఇంతకుముందు దక్షిణాఫ్రికాలో తన్నులుదిన్న మహాత్ముడు నేడు భగవత్స్వరూపుడు గాలేదా?

ఈ సిద్ధి దొమ్మరసామువంటిది. క్రిందబడెనా శకలములైపోవలసినదే. తరళతరళములగుసముద్రపుటలలవలె కష్టసందోహములు హుంకరించి మీదబడుచున్నపుడు చేయెత్తి నిలిపి ఆత్మశక్తిని రక్షించుట సామాన్యమైనదా? ఒకవంక దృశ్యమాన ప్రపంచము, వేరొకయెడ ఆదర్శము తీరని దయ్యములై పట్టిపాలార్చుచుండ మనస్సునకు శాంతి యెక్కడిది? కాని యిందులోనే సిద్ధి గలదు. దుగ్ధార్ణవమునుండి తరచి గడ్డకుదీసిన యమృతభాండమునువలె మానవు డీకష్టములను మథించిననాడే జ్ఞానామృతము లభించుచున్నది.

ఈ తెగలో చేరినవాడు మన భవభూతి మహాకవి. "పదవాక్య ప్రమాణ పారావార పారీణుడు"; జ్ఞాని; చదివిన శాస్త్రములు, సంపాదించిన జ్ఞానము పాలకుపాలు నీళ్లకు నీళ్లవలెగాక తన ప్రవర్తనమున జోడించుకొన్న మహానుభావుడు; ఆదర్శ జీవితమునకు లోనైనవాడు; ప్రకృతియందలి పదార్థముల తత్త్వమును, సంఘమునందలి లోటుబాటులను చక్కగ విమర్శించి అవగతము చేసికొన్న మహాత్ముడు; కార్లయిల్ తపస్వియన్నట్లు * సూక్ష్మపరిశీలనకు దగినట్లు అభిప్రాయములు కట్టబడిన త్రాళ్లవలె దృఢములుగా నిర్ణయించుకొన్న సంయమి. ప్రపంచమంతయు గాదన్నను తనయభిప్రాయమును దృఢముగ నమ్మువిశ్వాసము, దానిని సమర్థించుభావన యితని వెన్నెముక కంటియున్నవి. భవభూతి యొక్క వ్రాతగాడుమాత్రము గాడు; సంఘసంస్కర్త. ప్రపంచములోని యన్యాయములు, కుట్రలు చూచిచూచి, నివారింప సర్వశక్తుల వినియోగించి, విఫలుడై దరిలేని వేదన ననుభవించి సొమ్మసిల్లిన జీవి. నిజముగా భవభూతి ప్రపంచమంతయు దుఃఖమయము గాదనియు, అందు ఆనందము, సుఖమును కలదనియు, కళకు పరమావధి కన్నీరు గాదనియు తలచియుండెనేని యితనికే యగ్రతాంబూల మిచ్చి సాహిత్యవీథులలో త్రిప్పియుందుము. కాని యట్లు గాలేదు. తన జీవితమునే కన్నీటి కాహుతి నిచ్చినాడు. తుదకు "సతాం సద్భిస్సంగః కథమపిహి పుణ్యేన భవతి" అని వాపోయినాడు. ఇంత విశాల ప్రపంచమున తన మనోభిప్రాయము నూకొట్టజాలు సత్పురుషుడే దొరకలేదుగాబోలీ పేదజీవికి. నాకు జూడ కాళిదాస భవభూతుల మనఃప్రవృత్తులకు నిదే పెద్దభేదముగ గన్పట్టుచున్నది. కాళిదాసానందోపాసకుడు. దృశ్యమాన ప్రపంచమును, ఆదర్శమును చక్కగా నొడిగట్టుకొన్న పుణ్యవంతుడు. ప్రపంచమున నున్న కొరతను గమనింపకపోలేదు. ప్రతిదినము దైనికజీవితమున తా ననుభవించిన యనుభవములు, సాంఘికాచారములు, ప్రకృతి యొక్క స్వభావము, పదార్థముల మితిని వెంటనే మరచిపోక కన్నతల్లివలె సమయమున కందిచ్చు మహాత్ముడీతడు. కొన్ని ప్రకృతి నియమములకు తానే తగినభంగి సమాధాన మిచ్చుకొన్నాడు. కొన్ని మనసునకును నచ్చినవి. ఎవు డెట్లు ప్రవర్తించవలెనో, ఏకాలమున కేది యాచరణీయమో, ధర్మాధర్మములు ఆచారములు మొదలగునవి దేశకాలపాత్రముల ననుసరించి యేరీతి మారునో యితనివలె గమనించిన కవి సంస్కృత సారస్వతమున లేకన వచ్చును. ఆవేశ మున్నియెడలను పనికిరాదనియు, కార్యశీలత వీడరాని సద్గుణములలో ఒకటియనియు స్మరించిన ప్రతిభావంతుడగుటచే తన కావ్యముల మనుష్యున కావశ్యకములగు భౌతికధర్మములు, నెక్కసముగాని పరచింతలు గుమ్మరించినాడు. ఒక్క యుదాహరణమాత్రము గానుపింతును. శాకుంతలమున దుష్యంతుని సమీపమునకు శకుంతలను దోడ్కొనివచ్చిన మునికుమారు లామెను జూచి,

"సతీమపి జ్ఞాతికులైకసంశ్రయాం
జనోఽన్యథా భర్తృమతీం విశంకతే,
అత స్సమీపే పరిణేతు రిష్యతే
తదప్రియాపి ప్రమదా స్వబంధుభిః".

ఏమనుచున్నాడు? పరమపతివ్రతయైనను పుట్టినింట నున్న కుమారికను ప్రపంచము నిందించుచున్నది. కాన నుత్తమురాలగు కన్యకకు భర్తృసాన్నిధ్యము వీడరానిది.

శకుంతల పతివ్రతయగు మునికుమారిక. ఆమెనివాసమును, శిశువు ఒకటియు భావోద్రేకమునకు తావొసగునవి కావు. మనసార దుష్యంతుని ప్రేమించిన ప్రణయైకజీవి. ఇపుడు ప్రియునిచే నిరాకరింపబడ్డది. తా నేగి పుట్టినింట నున్నచో లోకము నిందింపదా? తప్పక నిందించును. శకుంతలా దుష్యంతుల యొడంబడిక నెవ్వరు చూచిరి? అపరోక్షములగు వారి త్రికరణప్రవృత్తుల నెవ రెరుంగుదురు? గొప్పవారుగూడ నొక్కొకయెడ వికారములకు లొంగిపోలేదా? దానిలో లేత వయస్సు- జగములు మోహించు రూపము- ఇంద్రియగ్రామము బలవత్తరమైనది గదా! లేదు, ఒకవేళ శకుంతల నియమముననే దినములు గడపె ననుకొందము. అ దెవరికి గావలయును? "ఎద్దీనె నన్న గాట కట్టు"మను కసుమాలపు ప్రపంచమున కాసంత యవకాశము దొరకిన పండువుగాదా? అట్టియెడ ఊరూర దిరిగి ఉపన్యాసము లివ్వగలదా శకుంతల? ఇచ్చిన వినువా రెవ్వరు? ఇట్టి నెదకిన దొరకుచునే యుండును. అందుకే సృష్టియందు సౌఖ్యము ననుభవించి జీవితకావ్యమును రమణీయముగ జెప్పిందిపోయినాడు. ఈ మహాకవికి మితమెరిగిన యాత్మతృప్తి మిక్కుటము. ఇంకేల, అంతఃకరణ ప్రవృత్తు[illegible] లోబడియుండినవి గాని ఇతడు వానికి బానిసయై యుండలేదు. అందుకే కవిచక్రవర్తియై ప్రపంచమున కిలువేల్పయి మ్రొక్కులందుకొన్నాడు. అతడే "నైసర్గికీ సురభిణః కుసుమస్య సిద్ధా మూర్ధ్ని స్థితిః న చరణై రవతాడితాని" అని మాల గూర్చొని విలపించుచుండినచో మన మేనాడో విస్మృతకవులలో చేర్చియుందుము.

భవభూతియెడ నిట్టి సన్నివేశము లరుదు. అతడు నియమమును, ఆదర్శమును దాటిన సహించలేడు. తన మనస్సునకు విరుద్ధములగు ప్రవృత్తులను, ధర్మమునకు తొలగిపోవు కార్యములను చూచినపుడు తటస్థుడైయుండుట గాని, లేక సముచితముగ బోధించి కార్యకారియగు పద్ధతిగాని భవభూతియెడ గానము.

అగ్నిశిఖలకన్నను జ్యోతిస్సుగల దీతని మనఃప్రవృత్తి. వేయి కత్తిపోటులకన్నను వాడియైనది మాట. ప్రపంచమునంతయు నొక్కసారిగా సహృదయతతో నింపివేయవలయునని యితని యాశ. ప్రపంచమునకు తా నొసగు దానికన్న వేయిరెట్లధికముగ గోరువాడు. ఆత్మనిశ్చయ మెక్కువ. ధీరత చలించనిది. లేకున్న విశాలమగు ప్రపంచమును ధిక్కరించి "యేనామ కేచి దిహ నః ప్రథయంత్యవజ్ఞాం జానంతి తే కిమపి తాన్ప్రతి నైష యత్నః" అని ధైర్యముగా నిలిచి చెప్పకొన గుండె లెవరి కున్నవి? ఇంతేకాదు. ఉత్తర

---

* *A man of strong understanding is ever a man of strong character*

రామచరిత్రలో "వక్తవ్యమేవ వక్తవ్యం కుతో స్యావచనీయతా, యథా స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః" "నటి- అతిదుర్జనఇతి వక్తవ్యం" అని పలికించి తనకు ప్రపంచముపయిగల రోఁవమెంతను కుంఠలతో గ్రుమ్మరించినాడు.

భవభూతిమనః ప్రవృత్తులీకీతియగుటకు కారణమేమి? నాకు దోచిన కారణ మిది. భవభూతికాలమే దీనికి గారణము. క్షేమేంద్రుడు భవభూతిపద్యముల దృష్టాంతములుగ గ్రహించుటచేతను(౧౦౫౦-౧౦౬౩), రాజశేఖరుడు (౯౦౩-౯౬౭), ధనంజయుడు, ధనపాలుడు (౯౭౪-౯౯౫), వామనుడు (౮౦౦) మొదలగువారు భవభూతి మహాకవిని పేర్కొనుటచేతను, ఇతని కాచార్యుడగు భట్టకుమారిలుడు ౮౦౦ కి కొంత వెనుకగా నుండుటవల్లను మన మీతని నెనిమిదవ శతాబ్దముకొనయందు తొమ్మిదవశతాబ్దము మొదటను నిలుపవచ్చును. ఆనాటికి భోజకీర్తి లస్తమించియుండెను. సామంతులు రాజ్యముల నాక్రమించి పరిపాలించుచుండిరి. రాజులకును తదాశ్రయులకును నిరంతరము భయము, కఠినత, రక్తపానమున ఆశ—జనులలో నొక యశాంతి ప్రబలియుండెను. అదియునుగాక నానాటికి శంకరబోధలు క్రొత్తలగుటచే బౌద్ధమతముదాడి తగ్గలేదు. వారు రాజుల నాశ్రయించి, వారిమూలమున ప్రజలలో హుకుముల చెలాయించుచుండిరి. భవభూతి యజ్ఞములుచేసినవారియింటి బిడ్డ. ఆర్యమతముల ధర్మములనే గలియని నమ్మి వేదక్రియలను నిర్వహించిన కర్మనైష్ఠికుడు. కనుకనే యానాటి యభిరుచులు-ఆచారములు భవభూతికి గర్హ్యములయినవి. తుదకు "తరుచ్ఛాయాధీనం తదపి తపసో యోగ్య మశనం, ఫలంవా మూలంవా తదపి న పరాధీన మిహవః" అని పాడుకొనుచు నెక్కడనో కొండ గుట్టలలో తన జీవితము గడుప నిశ్చయించుకొన్నాడు. మరియొకటియు కారణము గలదు. ఇతడు స్వయముగా నావేశి. భవభూతి నాటకములలో నగుపడు తన్మయీభవనశక్తి మరియెవరి వ్రాతలయందును గానుపింపదు. వీణాతంత్రివంటి దీతని మనస్సు. ముట్టిన వెంటనే "ఖంగ్" అని మ్రోగును. ఎంతటి సామాన్యదృశ్యమైనను "అపిగ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయం" అని యతనిచే ననిపింపగలదు. సామాన్యులగు మనకు అతని యావేశ మొకసారి బరువుగా తోచును. అది మన కంతటి హృదయము లేని దౌర్భాగ్యమే గాని యామహాకవికుంచికది గాదు.

ఇతని యావేశమునకు సమగ్రమగు తీక్ష్ణదృష్టియు నొకింత యవకాశమును గలిగించినది. ఒక దృశ్యమునుగాని, ఒక విషయమును గాని మననచేయ నారంభించినచో నెన్ని యబ్దములైనను విడచువాడు గాదేమో యనిపించును. భవభూతివర్ణనలందు సమగ్రములగు బహిరంగవర్ణనములు, సామాన్యహృదయమునకు, ఒక్కొకచోట పరిణత మనస్కులకును దోచని భావరహస్యములు కుప్పలుతెప్పలై యుండును. ఒకటిరెం డుదాహరణములిత్తును.

మాలతీమాధవమున మాలతీ కటాక్షముల వర్ణించుచు మహాకవి

"స్తిమితవికసితానా ముల్లసద్భ్రూలతానాం
మసృణముకులితానాం ప్రాంతవిస్తారభాజాం,
ప్రతినయననిపాతే కించి దాకుంచితానాం
వివిధ మహమభూవం పాత్రమాలోకితానామ్"

ఇందులో మాలతీదృష్టు లెన్నిరీతుల వెడలినవి! ఆమెభ్రూలత లుల్లాసము జెందినవి. మసృణముకులితము లైనవి. ప్రతినిపాతమునను లజ్జచే కించిదాకుంచితము లయినవి. దీనియందెంత స్పష్టముగా భావములు నిరూపింపబడినదియు సహృదయులు గ్రహింపకపోవరు. "భ్రమిషు కృతపుటాంతర్మండలావృత్తచక్షుః ప్రచలితతరుణభ్రూతాండవైర్మండయంత్యా"

ఇందు సీతాదేవికనుబొమలతోబాటు భవభూతిశ్లోకమును సుడిదిరిగెనది. ఇట్టి యుదాహరణము లడుగడుగునకును భవభూతి నుండి దీసి చూపవచ్చును. కొన్నియెడల వస్తు ప్రత్యక్షీకరణదాహము సౌందర్యమును గూడ వెనుకకీడ్చి ముందు నిలుచుచున్నది. చూడుడు.

"...వలితకంధర మాననం తత్
వ్యావృత్తవృంతశతపత్రనిభం వహంత్యా"

ఇందు వ్యావృత్తవృంతపదముపమానసమీకరణమునకై వచ్చినదికాని సౌందర్యమునకు గాదని యే సోమారిపోతు డైనను చెప్పగలడు.

ఈతీక్ష్ణదృష్టి, ఈభావన యితనియుదారములగు నమ్మకములకు తావొసగినదని చెప్పవచ్చును. ఏకాంతముననుండి ప్రతియొక విషయమును సమగ్రముగ నాలోచించి తేల్చుకొన్నవాడగుటచే రనవి యనదగు కొన్ని భావములనైనను వాఙ్మయమున నుంచిపోగలిగినాడు. మెక్డొనాల్డు మహాశయుడును నీవిషయమును బాహాటముగ వివరించినాడు.

కేవల మనోవేద్యములయి,మాటలచే చెప్పరాని భావరహస్యములకు నీతని కవిత నిధి. ఇత డొకచోట

"అద్వైతం సుఖదుఃఖయో రనుగతం
సర్వా స్వవస్థాసు య-ద్విశ్రామో హృదయస్య
యత్ర జరసా యస్మి న్నహార్యో రసః"
అని ప్రేమను నిర్వచించినాడు.

"వ్యతిషజతి పదార్థానాం తరః కోపి హేతుః
నఖలు బహిరుపాధీన్ ప్రీతయ స్సంశ్రయంతే."

అని మానవహృదయ పుస్తకమును సమగ్రముగ ద్రిప్పినాడు.

"స్నేహాశ్చ నిమిత్తసవ్యపేక్షశ్చేతి విప్రతిషిద్ధమేతత్"అని స్వభావవాదమును తరచినాడు. ఇట్లు కేవలము తత్త్వ ప్రపంచముపయి దృష్టి నిడి సాగినవాడు భవభూతి. అందులకే ప్రపంచమున సౌఖ్యమును రుచిచూడ లేకపోయినాడు. ఇతని కవితలో లలితవర్ణనములు, చెప్పలల్లార్చు భావములు, తల దిరుగజేయు కల్పనలు లేవు; నరి యుక్కుతునియల బోలు పలుకులు, వేడి నిట్టూర్పులు, కన్నీరు. ఇతని జీవిత మొక దుఃఖాంతనాటకము. ఒకవేళ శృంగారాదిభావములు వర్ణించినను, నందులో మితభాషిత్వము, గొప్పతనము దాగియుండును. ఈ రెండిటి నడుమ నేదో వచింపరాని నిగూఢమగు ఆవేదన ప్రత్యక్ష మగుచుండును. ఇతని జీవితమున శాంతిలేదు. పంజరమున జిక్కి,బయటికి వెళ్లుటకై గింజుకొనుచుండు చిలుకవలె కఠినమానవప్రపంచమున జిక్కి నిష్కృతియాచించు ప్రపన్నజీవి యనుభావ

ములే గోచరించును. భవభూతికి సిద్ధిపయి గొప్ప యపనమ్మకము. చేతికందిన పండు నోటి కందునో యందదో యని తల్లడిల్లు హృదయ మీతనిది.

"విధాతుర్వ్యాపారః ఫలతుచమనోజ్ఞశ్చభవతు
వికారః కోప్యంత ర్జడయతిచతాపంచతను తే"

బ్రహ్మయొక్క విధానము ఫలించినను మనోజ్ఞ మగునో కాదో, జడత నాపాదిన్నచో, తాపము కలిగించునని యర్థమగునో కాదో యని యాశంకించుకొని తార్కికశాబ్దబోధలవలె, నతివ్యాప్త్యవ్యాప్తులను నివారించి చెప్పు టీతని యలవాటు. తాను వాకొన్నట్లే యితని శైలి కర్కశగభీరము. కాళిదాసునందువలె చూచినవెంటనే యాకర్షించు భావముగాని, పుష్పితమగు శైలిగాని, లలితముగ చిత్రించిచెప్పు విధానముగాని భవభూతియెడ గానము. ఇతని పలుకు లాచార్యునివలె కఠినముగా మందలించు శిక్షలుగాని సరస గూర్చుండి చెంపచెంప గలిపి వాకొను ప్రియురాలి సల్లాపములు గావు. కవిత్వమును పవిత్రముగ నెంచి, యుపనిషత్తులవలె సత్యమును బోధింప దొరకొన్న మహాత్ముడు. ఇతని నాటకములందలి పాత్రలును ఆదర్శ ప్రపంచమునుండి దిగివచ్చినవారివలె గానబడుదురేగాని సామాన్యపు మనుష్యులు గారు. స్వయముగా నితనికి ఆవేశ మెక్కువగుటచేతా నేపట్టు వర్ణించుచున్నను సమగ్రముగ దానియందే లయించుటచే పూర్వాపరముల సరిదిద్దుకొను జాగ్రత్తయు, కావ్యసృష్టికి పరిపూర్ణమగు రూపము నిచ్చు నిలుకడయు నంతగా గానరాదు. మహావీరచరితమున ముప్పదియేడు పాత్రలట. భవభూతిని మనము పరిశీలించునపుడు అతనిని ఆవేశియగు కవిగా నర్థముచేసికొన్న నేగాని నాటకకర్తగా తలచినచో మనకు దొరకు పదార్థము చాలతక్కువ. అయిన నీతడు స్వతంత్రకావ్యముల వ్రాయక నాటకములకై యేల పూనెను? ఇది యాకాలపు అభిరుచి యేమో? భవభూతి నాటకకర్తకన్న కావ్యకర్తయై యున్నచో బాగుండెడిదని నాయూహ. ఇతని నాటకములు మూడు. అందు రెండు రామాయణకథకు సంబంధించినవి; ఒకటి యాకాలపు సాంఘికాచారముల వెల్లడించు కల్పితమగు ప్రకరణము ఈ నాటకముల పూర్వాపరభావమును సరించి కూల్కర్ మహాశయుడీయంచనా వేసియున్నాడు:

"మహావీరచరితమున మానవుని బాల్యము వర్ణింపబడినది. అందు వ్యక్తియొక్క ముగ్ధతయు, పెద్దలయెడ విధేయతయు చక్కగా వర్ణింపబడినవి. రెండవ ప్రకరణమగు మాలతీమాధవమున చంచలమై పాదరసమువలె పరుగిడు యౌవనమును వివరించినాడు. దానిచే గలుగు తొందర, ఆవేశము, రసమును స్వయముగ ననుభవించి యాలోచించు మనస్సు, మానవసంఘమునకు జెందిన ప్రేమ మొదలగు వానిననుసరించి వితర్కించుట, నానికై తమ బ్రతుకు నర్పించుట మొదలగునవి వర్ణింపబడినవి. మూడవదియగు నుత్తరరామచరితమున ననుభవముపండిన సంసారిజీవిత మున్నది. ఇందులో లోకవృత్తమున ప్రవర్తించునపుడుండు జాగ్రత్తయు, బాధ్యతయు, గడచిన జీవితమునకై దుఃఖమును జెప్పబడినవి. వ్యక్తి ప్రపంచమందు బాల్యకృతమగు ముగ్ధతను వహించి పెద్దవారియెడ వినయవిధేయతలు గలిగి, యభిప్రాయములు చేకూర్చుకొనుచు యౌవనమున బ్రవేశించును. అపుడు బాల్యమున నేర్చుకొన్న యభ్యాసములపై తత్వము నీడలుచల్లుచుండును. వాడు ప్రపంచమునుండి తల పైకెత్తి చూచి, మానవస్వభావమునకు దగ్గరగానుండునవియు, తత్వప్రపంచమునకు గొనిపోవునవియు నగు కొన్ని గుణముల నలవాటుగావించుకొనును. అచటినుండి నిస్సారమగు ప్రపంచమును విడిచి పరీక్షాక్షమములు గాని కొన్ని తత్వములు తిరస్కరించి, సత్యస్వరూపమగు నాదర్శప్రపంచమునకు దారి తీయుచున్నాడు. వీరత మొదలగు మహాపురుష లక్షణములు రుచిచూడబడినవి. ప్రత్యాశలు, కోరికలు, ప్రయత్నములు, ఫలచింత మొదలగు ఘట్టములు వాని జీవితమున వర్ణచిత్రములై పరుగిడినవి. అతని యాలోచన లీనాడు పండి పక్వములయినవి. తా మిదివరకు తరించివచ్చిన యెండమావులపయి నిట్టూర్పు విడచి బాష్పలలితములగు చూపుల జూచుచున్నాడు. తదవంతరము గడచినదానికై  తమునయినను సప్రయోజనముగ గావింతునని కృతసంకల్పు డగుచున్నాడు." ఈ మూడు నాటకములయందు ప్రతిబింబితములగు భావములు భవభూతి స్వయముగా ననుభవించినవియే. అతనికి అనుభవము, జ్ఞానము ముదిరిన కొలది పైపయి యుత్కృష్టనాటకముల రచించెనని తలప వీలగుచున్నది.

మహావీర చరితమును రచించునాటికి భవభూతి యప్పుడే చదువుముగించిన స్నాతకుడు. తాను చదివిన లక్షణముల గొంతవర కనుసరింప దలచినాడు. నాటకనియమముల ననుసరించి, రాముని కేవలము వీరపురుషునిగనే చిత్రింప దలచుకొన్నాడు. ఈకాలమున కాతని కింకను సమృద్ధములగు స్వతంత్రాభిప్రాయములు లేవు. లక్షణకారులపయి యాసక్తి, రసమున కంతగా నుపయోగింపని నియమములపయి పట్టుదలయు నక్కడక్కడ గానుపించును. భాషాదేవి నింకను పరబ్రహ్మముగ ధ్యానింపలేదు. పాత్రముల యాంతరికమన స్తత్వమును సమగ్రముగ నిరూపింపలేదు. పరశురాముని పాత్రయం దాద్యంతము కర్కశత గలదు. కవి పోషించిన గుణములకు, వ్యక్తులకు సంబంధము సమీచీనముగ లేదేమో యని పించును. అయినను నక్కడక్కడ నీతని తత్వదృష్టి ప్రత్యక్షమగుచు నేయున్నది. ఉత్తరరామచరితమునందువలె ఖండఖండమును రసము జిలుకకున్నను నచ్చటచ్చట హృదయముగలచు భావములు లేకపోలేదు. మాలతీమాధవమునాటికి భవభూతి యౌవనమున నుండెను. భట్టబాణుని భాషాప్రవాహము లోకముల ముంచియెత్తు కాలమది. ఆనాటికే శబ్దాలంకారములయందలి యాసక్తి విజృంభించినది. భవభూతికిని ఏలకో స్వతంత్రుడైనను నీచాపల్యము కొంతవరకు గనబడుచున్నది. ఇతని నిగూఢములగు భావములు, పరిణతములగు సత్యములు సమాధిగల మననచే దెలియదగినవి గాని "సోమరయ్యల"కు ప్రత్యక్షములగునవి కావు. అంతమో రెవరికి? అందులకే భవభూతిశిష్యుడగు వాక్పతిరాయడు (ప్రాకృతమున గౌడవహాకర్త) పై యభిప్రాయమునే

చెప్పి విలపించినాడు. కవి స్వతంత్రుడగుటచే మాటలయందు మరుసమట్టములులేవు. కాళిదాసువలె రక్తమురాక గిచ్చువాడు గాడు. ఇతని ప్రవర్తనలును స్వతంత్రములే. భవభూతి నాట్యమందలి చాపల్యముచే ఆటగాంగ్రతో జేరెనని యొక కథగలదు. ఇతని నాటకములే పరీక్షించినచో మన కట్టివి కొల్లగ దొరుకును. రాముడు సీతాదేవిని గురించి పలుకుచు

"ఉత్పత్తిపరిపూతాయాః
కిమస్యాః పావనాంతరైః,
తీర్థోదకంచ వహ్నిశ్చ
నాన్యతః శుద్ధిమర్హతః"

అని గొంతెత్తి ప్రపంచమును సవాలుకు పిలుచుచున్నాడు. పైన కనబరచిన "సతీమపి జ్ఞాతికులైకసంశ్రయాం" అను కాళిదాసు శ్లోకమును దీనిని పరీక్షించినచో వీరిరువురి మనస్తత్వము లెంత భిన్నములో తెలిసివచ్చుచున్నది.

ప్రపంచముతోడి సహవాస మశక్త్తెరవంటిది. ఎట్టివారికైన తూలనాడుట స్వభావము. రమణీయమగు కీట్స్ "ఇసబెల్లా" పయి నిప్పులు జెరగు ఖండన బయలు దేరినది. ఆవిమర్శనయే యతని రక్తము ద్రావినది. భవభూతిమహాకవిపైనను నిట్టివిమర్శనములే బయలుదేరియుండనోపు! అతడు క్రుద్ధుడై వాకొన్న శ్లోకమే యిందుకు ప్రబలసాక్ష్యము. బౌద్ధమతములో నున్న పవిత్రసిద్ధాంతములు మారిపోయి నటన లయ్యెను. అవి సామాన్యులకే హృదయోద్వేగకరములై యుండె నన్న భవభూతి నడుగవలయునా? ఆనిట్టూర్పుల ఫలమే కామందకీ పాత్రనిర్వచనమని తోచుచున్నది. కాపాలికులు మొదలగు క్షుద్రులు ప్రబలిరి. హింసలు బలమయ్యెను. అఘోరఘంటుడు, శ్మశానవర్ణనమును నిందుకు ప్రబలసాక్ష్యము. భవభూతియు షేక్స్పియరును (జూలియట్టులో) ప్రేమను వర్ణించిరి. రెండు నాటకములయందలి ప్రేమయును ననేకవిఘ్నముల కెదురునిలిచినదే. రెంటియందును మతనిబంధనయే ప్రణయపరిణతికి కారణము. షేక్స్పియరు మహాకవి "మాంక్" వలెనే భవభూతి కామందకీపాత్రమున్నది. అయిన మాలతీ, జూలియట్టుల మనః పరిపాకమున కొంత భేదము గలదు. జూలియట్టు సకలమునకన్నను- కడకు ప్రాణమునకన్నను రోమియో నెక్కువగ ప్రేమించుచున్నది. మాలతి కట్లుగాదు. ఆమె తన కన్నను, వరునికన్నను కౌలీనత నెక్కువగ గారవించుచున్నది. ఇది బహుశః భవభూతి మనస్సునందు గల హైందవ సిద్ధాంతాభిమానము గావచ్చును. కామందకి ఈ నాటకమునందలి ప్రధానపాత్రము. ఆమె చాల తెలివిగలది. కార్యము లెన్నడును విఘటించి యెరుగదు. మానవస్వభావమును చక్కగ గుర్తెరిగినది. నందనునకసత్యే వివాహము గావించుటకు మకరందుని సిద్ధపరచుటయందును, మాలతీ మాధవుల ప్రేమాభివృద్ధికై యామె గావించు కార్యములయందును కామందకి మనస్సు చక్కగా పరిస్ఫుట మగుచున్నది.

శ్రీకంఠపదలాంఛనుని భావపరిస్ఫూర్తి విరిసి వికసించిన వనచత్వర ముత్తరరామచరితము. ఇందులో నానంద మనుభవింపలేని హృదయము శిలకన్న దీనము. ఈ నాటకము నాటికి కవివయసు కొంత పడమటికి వ్రాలియున్నది. మాలతీమాధవము రచించునాటి కుండిన యుత్సాహశక్తి, జగత్తును లెక్క సేయని గావుసండెతనము అతనిలో తగ్గినవి. మహావీరచరితమునాటి ముగ్ధత లేదు. శరీరమున బలము తగ్గినది. నరములు కార్యశక్తికి నెను కాడుచున్నవి. దృశ్యమానప్రపంచమును గాంచి సహింపలేడు; విడిపోవను లేడు. కర్తవ్యమును నిర్వహింపలేడు; నిర్వహింపకుండను లేడు. ప్రాపంచికసుఖములపయి వాసన పూర్తిగ లేదు. అరణ్యముల ముక్కుబట్టి కూర్చొను నాత్మశక్తి లేదు. సంఘమును మెప్పించి దానినుండి యభివాదనముల గ్రహింపవలయునను ప్రత్యాశ యున్నది. ప్రక్కలో సంఘమునకు దగినట్లు మారలేని మనస్సున్నది. ఈ రెంటినడుమ నలిగి నీరైనాడు కవి. ఆనీరే నాటకమై పారినది. ఉత్తరరామచరిత మంతయు తత్వమునకు, ప్రపంచమునకు నడుమ కృశియించు ప్రపన్న జీవితమునకు వ్యాఖ్యానమే. లేకున్న రావణ సంహారముతో మహావీరచరితమును సమగ్రముగా ముగించిన కవికి మరల నీనాటకము నందుకొను కారణము గానరాదు. ఆనాటికి తని జీవితము దుఃఖమయముగనే మారుట వల్ల మరల తాను విడిచినకథను ముందుకుసాగించి, విషాదగీతముల బాడుకొన్నాడు.

రాము డొక యనుభవజ్ఞుడగు రాజకుమారుడు. అతనికి మతసూత్రములపయి యభిమానమెక్కువ. సీతాదేవియం దమితమగు నమ్మకము. జానకీదేవి రామునికయి తన సర్వస్వమును వినియోగించిన ప్రణయైకజీవిని. సీతాదేవిని త్యజించిన యనంతరమున హిరణ్మయమయమగు సీతాదేవిప్రతికృతి నుంచి ప్రేమించుచున్నాడు. భార్యావియోగ మాతని హృదయమున శూలమయినది. అతడు రూపొందిన ధర్మమూర్తి. ప్రజలయొక్క సౌఖ్యమునకయి తన జానకిని, ఆత్మానుభావములను త్యాగము గావించెను. అయినను నివృత్తియందు సంపూర్ణమగు స్వతంత్రము లేనివాడగుటచే నున్మాదియైనాడు.

సీతాపాత్రము మొదటియంకమున ప్రభాతమువలె సంపూర్ణసౌందర్యమున మెరసిపోవుచున్నది. రాజకులోచితమగు గాంభీర్యము, మితభాషిత్వము, స్థితిగోపనము కన్నులగట్టినట్లు ప్రత్యక్షమగుచున్నవి. నిండుగర్భమున నున్న యామెనుచూచి శిలలు ద్రవించినవి. ఆమెయాకారము మనసును వశీకరించు కట్టుయంత్రము. 'కులపెద్దలు' నేర్పిన గుణములు, భర్తయెడల భక్తివినయములు, ప్రేమ, పరిణతభావముతో దోచు స్త్రీహృదయము వాసించుచున్నవి. సీతాదేవియు, శకుంతలయు నొకవిధమగు భర్తృశాపమునే యనుభవించిరి. రాముడును, దుష్యంతుడును లోకనియమముల ననుసరించియే భార్యల తిరస్కరించిరి. అయిన దుష్యంతుడు శాపమోహితుడు. రాముడన్ననో ప్రత్యక్షముగ సీతాదేవిపవిత్రతయందు నమ్మకముగలవాడు. అటులయినను ప్రజల మనోరథపరిపూర్తికయి చేతులార ప్రియురాలి నడవులపాలు జేయుచున్నాడు.

ఉత్తరరామచరితమున కరుణరస మనియు, కొందరు విప్రలంభశృంగార మనియు వాదిం

తురు. మన కీవాదముతో పనిలేదు. వాసంతికనోటనే కవి తన యభిప్రాయమును బలికించినాడు. నాటకమున మొదటనే కరుణరసమున కన భావమగు నిర్వేదమును సూచించుచున్నాడు. కాన భవభూతి యభిప్రాయము కరుణమనియే నేమో! ఎన్నియో నిబంధనలను మీరిన భవభూతికి ఈనియమాతిక్రమణము గొప్పగాదు. నాకుజూడ నుత్తరరామచరితము విషాదాంతముగ గాఢగా కవి సంకల్పించె నేమో యనిపించును. కాని లోకాభిరుచిని బట్టియు, నెంతటి స్వతంత్రునికైనను మానవమాత్రునికి చాపల్యము వీడరానిది గనుకను తన యభిప్రాయము మార్చుకోక తప్పినది కాదు. వేణీసంహారమునందువలెనే యీనాటకమందును కడపటియంక మతికించబడినది.

హృదయమున్న మనుష్యుడంతయు చదివి యానందించదగిన దిది. నిజముగా తన్మయీభవనమే కవికి వలయు సత్కృష్ట సాధనములలో మహత్తరమైనచో భవభూతినాటకమొక్కటే వాఙ్మయమున కలంకార మని చెప్పకతప్పదు. ఈనాటకములోని ప్రతిఘట్టమును, ప్రత్యక్షరమును రేడియోవలె కరుణాలులితమగు భవభూతి మనస్సును ఎత్తిచెప్పుచున్నది. ఇతడు సీతారాముల ప్రేమ నభివృద్ధినొందించిన విధములు, ప్రథమాంకములోని చిత్రపట సందర్శనము మనుష్యమాత్రున కెన్నటికి మరపురానివి. కొందరు పండితులు భవభూతికి సంస్కారము లేదన్నారు. అంత కన్నను వారికే కవిత్వమును గ్రహించు నాళములు లేవనుట యుక్తము. ప్రత్యేకము నీ నాటకమునే గురించి యెంతయో వివరింపవచ్చును. విస్తరభీతిచే జారుకొందును. ఈ తన్మయీభవనశక్తి యధికముగ నుండుట చేతనే కల్పనకు సంబంధించిన శక్తు లీతనికి కొరవడినవి. మాలతీమాధవకథ పదియంకములకు దగినది గాదు. తొమ్మిది ఎనిమిది యంకములు కేవలవర్ణనలతో నించినాడు.

భవభూతికి రసపోషణయం దెంత సమగ్రమగు దైవశక్తి యున్నదో యంత యౌచిత్యనిర్వహణమున లేదు. కాళిదాసుని నాటకములవలె సర్వతోముఖమగు దృష్టి, పాత్రలకు తగిన పరిస్థితి, సమయమునకు దగిన మాటలు నిందులో లేవు. ఒకొకచోట ప్రారంభించినచో ముందువెనుకలు చూడక బాణుని కాదంబరిలోవలె నొకటే తెంపున నేసును. పలుకుచోట కాలపాత్రముల గమనింపడు. మూడవయంకమున లవంగిక దీర్ఘోపన్యాసము నిచ్చుచున్నది. మహాకవి దృష్టి యంతయు మాలతిపయిననే లగ్నము గావించినాడు. ఉత్తరరామచరితమున రెండవ యంకమునకును మొదటిదానికిని చాలయంతర మున్నది. కాలవిషయమున సముచితమగు నేకత కవిచే పాటింపబడలేదు. రాముడు ప్రథమాంకము కడపట సీతాదేవిని అరణ్యములకై విడిచి, శంబూకుని తపస్సును మాన్పించుటకైబయలు దేరినాడు. ఈ మధ్యకాలమున గలుగు కుశలవుల జననము, వారికి బోధన విద్యాభ్యాసము, మేధో విజృంభణము మొదలగునవన్నియును విష్కంభముననే చెప్పబడినవి. ఈ రెండవయంకమున రంగమున జరుగుదానికన్నను జవనికాంతర్భాగమున గడచిపోవున దెక్కుడు. రెండవ యంకమంతయు వర్ణనమునకే వినియోగింపబడినది. దానితో కథాబాహుళ్య మెంతగునో కనిపెట్టలేకపోయినాడు. కడకు చైతన్యము నారోపించుకొని మిగిలిన భాగములన్నియు నొక విష్కంభమున చిమ్మినాడు. ఆరవ యంకమునను నిట్లే యొక దీర్ఘ విష్కంభ మున్నది. లక్ష్మణుని యనుభావములు భవభూతి సమగ్రముగ జెప్పించలేదు. రాముడు లక్ష్మణున కాజ్ఞనిచ్చుట, సీతాలక్ష్మణుల ప్రయాణము మొదలగు ఘట్టములు విడువబడినవి. బహుశః అతనికి లక్ష్యము లడ్డుదగిలెనేమో? కథను చాకచక్యముతో మార్చు నేర్పులేదు. రామునియందే సంపూర్ణ దృష్టి లగ్నమయియుండుటచే లక్ష్మణుని మరచినాడు. ఇంతనాటకమున రెండుసారులే లక్ష్మణుని ప్రవేశ మున్నది.

భవభూతికి కాళిదాసువలె సర్వతోముఖ దృష్టి తక్కువ. అందుచే దానికి సంబంధించిన పాత్రపోషణ, ఔచిత్యము మొదలగుగుణములును చాలినంత లేవు. ఇతని నాటకములలో నాద్యంతమును నిబిడమై కనబడునది రసానుభూతి యొక్కటే. అదియే మనదృష్టి నాకర్షించునది. ఆయాఘట్టములు పాఠకుని మనస్సును సంపూర్ణముగ వశీకరించుకొనును గాని పూర్వాపరముల విచారించినచో కొరత గన్పించును. అందుకే భవభూతి నాటకకర్త కన్నను కావ్యకర్తయయిన బాగుండెనంటిని. ఆవేశము, తన్మయీభవనము భవభూతివలె పోషించినవాడు సంస్కృత వాఙ్మయముననే లేడని నిస్సందేహముగ జెప్పవచ్చును. "కవయః కాళిదాసాద్యాః భవభూతి ర్మహాకవిః" అన్నారు పెద్దలు.

# కావ్యాలంకార చూడామణి

## అలంకారప్రకరణము

బులుసు వేంకటరమణయ్య

హారాదులను నలంకారములు శరీరము నలంకరించి తన్మూలమున ఆత్మతృప్తిని కలిగించునట్లు ఉపమాదులను నర్థాలంకారములు కావ్యశరీరము నాశ్రయించి యథార్థమున కావ్యజీవిత మను రసమునే అలంకరించుచున్నవి. కావుననే రసమలంకార్యము. కావ్యజీవితము నలంకరింపలేక శరీరాలంకరణమాత్ర పర్యవసితములను నలంకారములు శవాలంకారములట్లు నిష్ప్రయోజనములు.

కావ్యాలంకారచూడామణిలోని అర్థాలంకార ప్రకరణమునకు మూలము సంస్కృతమున దండ్యాచార్యుడు రచించిన కావ్యాదర్శము.

కావ్యాదర్శమున ముప్పదియైదర్థాలంకారములు చెప్పఁబడినవి.[౧] చూడామణికర్తయగు పెద్దయకవి ముప్పదియా అలంకారములను క్రిందివిధమున చెప్పెను:

'వ. అది యెయ్యది యనఁగా-[౨]---స్వభావాఖ్యానంబును, నుపమయు, రూపకంబును, దీపకంబును, నావృత్తియు, నాక్షేపంబును, నర్థాంతరన్యాసంబును, వ్యతిరేకంబును, విభావనయు, సమాసోక్తియు, నతిశయోక్తియు, నుత్ప్రేక్షయు, హేతువును, నుదారంబును, సూక్ష్మంబును, లవంబును, గ్రమంబును, ప్రేయస్కంబును, రసవంతంబును, నూర్జస్వియు, పర్యాయోక్తియు, సమాహితంబును, నుదాత్తంబును, నపహ్నుతియు, శ్లిష్టంబును, విశేషోక్తియు, తుల్యయోగితయు, విరోధంబును, నప్రస్తుతస్తుతియు, వ్యాజస్తుతియు, నిదర్శనంబును, సహోక్తియు, పరివృత్తియు, నాశీర్వచనంబును, వక్రోక్తియు, * భావికంబును నను నర్థాలంకారములు షట్త్రింశత్ప్రకారంబులై వర్తిల్లు.' [చూడా. ౫-3]

దండి చెప్పని 'ఉదారము' ఇం దధికము; కావ్యాదర్శములో లేని 'వక్రోక్తి' క్రొత్తగ చేర్పఁబడినది.

పయి యలంకారముల కిందు లక్షణోదాహరణములు మాత్రము ఈయఁబడినవి. సమన్వయపద్ధతి వివరింపఁబడలేదు.

ఉన్నవియైనను కొన్ని లక్షణోదాహరణము లుచితరీతిని లేవు. విద్యార్థులయొక్కయు, జిజ్ఞాసువులయొక్కయు సౌకర్యార్థ మట్టివాని యున్నరూపు, ఉండవలసిన పద్ధతియు నీ వ్యాసమున వివరింపఁబడును. లక్షణము లన్నియు ఛందోనిబద్ధములగుటచే సులభముగ బోధపడుటకయి అవియన్నియును ఇందు సంగ్రహింపఁబడును.

౧. స్వభావాఖ్యానము, లేక జాతి:

జాతి, గుణ, ద్రవ్య, క్రియ లున్నవున్నట్లు ఇంపుగఁ జెప్పఁబడిన స్వభావాఖ్యానము (జాతి). జాతి - గోవు మొదలగువాని యం దుండెడి గోత్వము మొదలగునవి (అనేక పదార్థములం దుండు ధర్మము). గుణము - రూపము మొదలగునవి. ద్రవ్యము (ప్రత్యేక వ్యక్తినే బోధించునది)- మదరాసు, హిమాలయము మొదలగునవి. క్రియ - వచ్చుట, పోవుట, జీవించుట మొదలగునవి. ప్రపంచములోని పదార్థజాల మంతయు నీ నాలుగు తెగలలో నేదియం దైనను చేరుచుండును.

జాతి, గుణ, క్రియా, ద్రవ్యముల వివిధ స్వరూపమును వివరించునది స్వభావోక్తి యని మూలమందలి లక్షణము. అలంకార సామాన్య లక్షణము చమత్కారమును కలిగించుట. కాబట్టి అనువాదమునఁ గల 'ఇంపుగ' అను పదము పయి అభిప్రాయమును స్పష్టపఱచుచున్నది.

౨. ఉపమ.

గుణ, క్రియాది ధర్మములచే స్ఫుటముగ నుపమానోపమేయములకు సామ్యమును జెప్పిన ఉపమాలంకారము. వర్ణింపఁబడునది ఉపమేయము (వర్ణనవిషయము). సాటి తేఁబడిన అప్రస్తుత ముపమానము.

పయి లక్షణము మూలాభిప్రేతము. అనువాదమున 'గుణ, ధర్మ, కర్మముల నుల్బణ మయ్యెడు వస్తువునకుఁ బరువడిఁ దుల్యప్రణయనముఁ జేయు నెయ్యది గణుతింతురు దాని నుపమగా బహువిధులన్ (౫-౭)' అని ఈయఁబడిన లక్షణము చాల అస్పష్టముగ నున్నది.

ఉపమానిరూపణ మైనపిదప మూలగ్రంథమున ఉపమాదోషములు చర్చింపఁబడినవి. అందు తొలుత

"న లింగవచనే భిన్నే
న హీనాధికతాఽపి వా,
ఉపమాదూషణా యాలం
యత్రోద్వేగో న ధీమతామ్'

అని చెప్పఁబడినది.

'సహృదయ హృదయములకు ఉద్వేగము కలుగనిచో ఉపమానోపమేయములు భిన్నలింగములలోను, భిన్నవచనములలోనుగూడ ఉండవచ్చును. అచట సమానలింగ, వచనకత్వ నియమము వర్తింపదు. అట్లే అట్టిచోట్ల ఉపమానోపమేయము లొకదానికంటె నింకొకటి న్యూనము, నధికముగూడ (సమానముకాక) కావచ్చు'నని పై మూలమున కభిప్రాయము.

ఉపమానోపమేయములు విభిన్నలింగ, వచనముల వయి యున్నను, ఉపమాసాధకమను సాధారణధర్మము రెండిటియందును సమన్వయింప వీలుండినఁ జాలును. అప్పుడు సహృదయుల కుద్వేగము కలుగదు. ఈ యాశయమును పెక్కురు అంగీకరించియున్నారు. కావున 'హారే స్తనురివ నేత్రే నీలోత్పలదల

౧. కావ్యాదర్శము, ద్వితీయ పరి. ౪-౭.

౨. 'అవి యెయ్యవి యనఁగా' అని దిద్దుకొనవలెను.

* సంకరము వివరింపఁబడినను ఈ పట్టికలో నీయఁబడలేదు.

స్పర్ధినీ' అను సంస్కృతోదాహరణను సరి పడుచున్నది [విష్ణువుదేహమువలె కన్నులును నల్లగలువతో సాటియైనవి అని పయి సంస్కృతమున కర్థము]. ఇచటి సాధారణ ధర్మవాచకపదము 'నీలోత్పల దల స్పర్ధినీ' అనునది. ఇచటి ఉపమేయము నేత్రపదము [నపుంసకలింగము; ప్రథమా ద్వివచనము]; ఉపమానము తనుశబ్దము [స్త్రీ లింగము; ప్రథమైక వచనము]. పయి పదములు రెండును విభిన్నలింగ వచనకములు. అట్లయినను సాధారణ ధర్మ ప్రతిపాదకపదము రెంటను సమన్వయించుచున్నది. అది ఉపమేయవిశేషణ మగుచో నకారాంత నపుంసకలింగ ప్రథమాద్వివచన రూపమగును; ఉపమానవిశేషణమగుచో ఈకారాంత స్త్రీలింగ ప్రథమైకవచనరూప మగును. కావున ఇచటి యుపమ నిర్దుష్టము.

పయి సంస్కృతశ్లోకమునకు క్రింది యాంధ్రానువాదము కలదు.

'లింగంబుల, వచనంబుల
భంగులు హీనాధికతల పాటియు వీడ్పా
టుం గదిసిన నుపమకు నిం
పుం గలుగంజేయునండ్రు బుధు లుచితోక్తిన్.
[కావ్యా. ౫-౧౦]

లింగ, వచనముల పద్ధతియు, హీనాధికతల పద్ధతియు వీడ్పాటును పొందిన- అనఁగా నియమమును తప్పిన ఉపమకు ఇంపు కలుగు నను నంశ మనువాదమువలన తెలియుచున్నది. 'వీడ్పాటు కలిగినను' అనునర్థమే అపేక్షితము. అది యిచట అస్పష్టము. నియమము తప్పినను తప్పులే దనుటకు బదులుగ 'ఇంపుం గలుగఁ జేయు' ననుట సరికాదు.

భిన్నలింగ, వచనములకు మూలమునఁ గ్రిందియుదాహరణము లీయఁబడినవి.

'స్త్రీవ గచ్ఛతి షండోఽయం
వక్త్యేషా స్త్రీ పుమానివ,
ప్రాణా ఇవ ప్రియోఽయం మే
విద్యా ధన మివార్జితా.'

పయిదానికి పెద్దయకవి యనువాదము-
'అరుగుచున్నాఁడు పేడివాఁ డతివపోలెఁ
బలుకుచున్నది పురుషునిపగిది నింతి,
ప్రాణములు నాకు నీతఁ; డుపార్జితార్థ
మిన్ని విద్యలు (ననినను నెసఁగు నుపమ.)'

తెలుఁగులోవలె సంస్కృతమునఁ గ్రియలకు లింగములఁ బట్టి రూపములమార్పు లేదు. కాన 'గచ్ఛతి', 'వక్తి' అను క్రియలు ఉభయాన్వయులు.

'ప్రాణా ఇవ ప్రియోఽయం మే' అనునది వచనభేదమున కుదాహృతి. ప్రాణశబ్దము నిత్య బహువచనాంతము. దాని కెప్పుడును ఏకవచన ముండదు. కాన ఇచట వచనదోషము లేదు.

'విద్యా ధనమివార్జితా' అనునది భిన్నలింగోదాహృతి. ధనశబ్దము నియతనపుంసకలింగము కావున దాని ననుసరించి 'యథా ధన మర్జితం, తథా విద్యా ఆర్జితా' అని సమన్వయము చేసికొనవలెను. కాని యిట్టివి చాల అరుదు. పెద్దల ప్రయోగములే సమర్థనీయములు!

పయి యంశములనుబట్టి 'అరుగుచున్నాఁడు పేడివాఁ డతివపోలె; పలుకుచున్నది పురుషునిపగిది నింతి; ఉపార్జితార్థ మిన్ని విద్యలు' అను నాంధ్రోదాహరణములు సరిగా లేవని చెప్పవలెను.

న్యూనాధికతల కుదాహృతులు మూలానువాదములం దొకేరీతి నుచితముగనే యున్నవి.

౩. రూపకము:

మూలమున 'ఉపమైవ తిరోభూత భేదా రూపక ముచ్యతే' అని కలదు. ఉపమానోపమేయములకుఁ గల భేదము గోచరింపనిచో- అనఁగా కప్పఁబడి, యని రెండు నభిన్నము లగుచో రూపక మగునని అభిప్రాయము.

అనువాదమునందు మాత్రము ఇది క్రింది రీతిని క్లిష్టముగఁ జెప్పఁబడినది.

ఉపమానంబునకును, న
య్యుపమేయంబునకురూపయోజనమేకో
ల్లపితమయి వెలుఁగు నెచ్చటఁ
బ్రపంచితమురూపకంబు బహువిధలీలన్.'

'ఉపమానోపమేయములకు రూపయోజన మేకోల్లపిత' మనుచో కర్త్రభిప్రాయ మేమో స్పష్టముగ గోచరింపలేదు,

భ్రాంతిమంతము

కావ్యాదర్శమున నీ యలంకారము లేకున్నను, పెద్దయకవి అలంకారపట్టికలో దీని నీయకున్నను రూపకనిరూపణ సందర్భమున వివరించెను.

లక్షణము—
'కవిసమ్మతి సారోప్య
ప్రవణానుభవంబు భ్రాంతిపదమునఁదత్సం
భవమయ్యెడుదానికిఁ జే
రువిరళముగ భ్రాంతిమంత మనఁగాఁబరఁ
గున్.

'భ్రాంతివలన నుపమేయమునందు ఉపమానబుద్ధి కలిగినచో భ్రాంతిమదలంకారము' అని పయిలక్షణపద్యము నభిప్రాయము.

౪. దీపకము:

జాతి, గుణ, క్రియా, ద్రవ్యములలో నేదేని యొకటి ఒక్కయెడనే యుండి ఆ వాక్యములోని తక్కినపదములతోఁగూడ సమన్వయించినచో (వాని కుపకారక మగుచో) దీపక మగును. అది ఆదిగతము, మధ్యగతము, అంతగతము నని మువ్విధములు. ఇది మూలమందలి లక్షణము. అనువాదమున జాతిగుణాదులగ బదులు 'క్రియాపదమయొండె కారకమెండెన్' అని చెప్పఁబడినది. అది యుచితముగ లేదు.

౫. ఆవృత్తి:

చెప్పినదానినే పెక్కుసారులు చెప్పట ఆవృత్తి. అది శబ్దావృత్తి, అర్థావృత్తి, ఉభయావృత్తి యని మూఁడు విధములు.

అనువాదోదాహరణములలో శబ్దోభయావృత్త్యుదాహృతులు తారుమారయినవి. 'అరుల అమరదీర్ఘికలలోఁ గ్రీడింతురు; తత్పురపరిఖాతాయత సరసులలో క్రోడసంతతి క్రీడించు' ననునది ఉభయావృత్త్యుదాహరణము. ఇచట శబ్దమునకేగాక అర్థమునకును ఆవృత్తి కలదు.

'ధరణివరాహంబగు పతి ధరణి వరాహంబుఁబోలె' అనుచోట ఆవృత్తి శబ్దములకే గలదు. ఇచటి అర్థములు వేఱు. కాన నిది శబ్దావృత్తి కుదాహరణమగును.

౬. ఆక్షేపము :

'ప్రతిషేధోక్తి యాక్షేపము. అది కాలములనుబట్టి (భూత, భవిష్య, ద్వర్తమానముల నుబట్టి) మూఁడు విధములు.' అని మూలలక్షణము. ప్రతిషేధ ముండునట్లు చమత్కారముగఁ జెప్పుటయే ఆక్షేపము. యథార్థమగు నిషేధ మాక్షేపముకాదు. అచట చమత్కారము ఉండదు. అనువాదమున 'తొడఁగిన కృతకృత్యంబుల నడఁచు నిషేధోక్తి యాక్షేపమగునని మూలమే అనుసరింపఁబడినది. ఉదాహరణముమాత్ర ముచితముగ లేదు. అందలి "వీరభార్యలు భర్తల 'కాహవంబున వారక విశ్వభూవిభుని వాలున కగ్గముగాకుఁ' డని రొజ్జఁగించుట" యథార్థనిషేధ మగును. ప్రతిషేధోక్తి కాదు.

౭. అర్థాంతరన్యాసము :

ఒక యంశమును జెప్పి దానిని సమర్థించుటకు వేఱొక యంశమును కూడ నిబంధించిన అర్థాంతరన్యాస మగును. ఈ సమర్థ్య, సమర్థకములకుఁ గల సంబంధము సామాన్య, విశేష భావరూపము గాని, కార్యకారణ భావ రూపము గాని కావలెను. ఇచటి మూలోదాహరణములు సామాన్య, విశేషభావ విలసితములయి యున్నవి.

అనువాదమునఁగల

'క్షమలో వేఁడనివారికేనియును వి
శ్వక్ష్మావిభుండిచ్చు న
చ్చమునై పొచ్చెములేని సంపదల శ
శ్వత్సర్వలోకాశ్రయ
త్వము, నైజంబుగ నట్లకాదె తలఁ పన్
వాంఛార్థహీనస్ఫుర
త్కమలోజ్జృంభణకల్పనంబు రవికిన్
కర్జంబు మిన్నందియున్.'

అను నర్థాంతరన్యాసోదాహరణము సరి కాదు. ఇచటి సమర్థ్య, సమర్థకములకు సామాన్య విశేషసంబంధము కాని, కార్యకారణ సంబంధము కాని లేదు. అర్వాచీనాలంకారికుల మతమున నిట దృష్టాంతాలంకారము కలదు. ఆ యలంకారము మూలమున లేదు. మూలమున లేకున్నను పెద్దయకవి నిరూపింపఁ దలఁచినచో దృష్టాంతలక్షణమును తెల్పి దీని నుదాహరించుట యుచితము. 'విశ్వేశ్వర రాజు కోరనివారికి సయితము పొచ్చెములేని సంపదల నిచ్చును; ఉదారుల కెప్పుడును కోరకుండఁగనే ఒసఁగుట పరిపాటి' అను నీమాదిరి యుదాహరణమే అర్థాంతరన్యాసమున కనుగుణము.

౮. వ్యతిరేకము :

ఉపమానోపమేయములకుఁ గొంత భేదమున్నట్లు తెలిపిన వ్యతిరేకము. వ్యతిరేకమున ఉభయసాధారణమగు ధర్మము వాచ్యమైనఁ గావచ్చును; వ్యంగ్యమయినను క్షతి లేదు. ఇది మూలాభిప్రేతమగు లక్షణము. అనువాద లక్షణము—

'అమరఁగ శబ్దార్థంబులు
క్రమతుల్యము లయ్యు భేదకథనముచే వ
ర్ణ్యము నతిరిక్తముఁ జేయుట
నమితవ్యతిరేకమనఁగ నగుఁ బలుకుబడిన్.'

ఈ లక్షణము స్పష్టముగ లేదు.

౯. విభావన :

కార్యోత్పత్తికి లోకప్రసిద్ధమగు కారణమును విడిచి వేఱొక కారణమును జెప్పినను, లేదా కారణమును చెప్పకున్నను విభావన యగును. లక్షణానువాదము—

'సహజ విఖ్యాత హేతువు జాఱవిడిచి
కారణాంతరకల్పనకథన మెండెఁ
గామవిహితస్వభావసంగతియ యొండె
నమరఁ బల్క విభావన యనఁగఁ బరఁగు'

ఇందలి మూఁడవపాద మస్పష్టము. ఉదాహరణము సరిగా లేదు.

౧౦. సమాసోక్తి :

ప్రస్తుత మగు నొక విషయమును మనస్సున నిడికొని దానికి సమానమగు నప్రస్తుతమును చెప్పుట సమాసోక్తి. ఇచట అప్రస్తుతము వాచ్యము; ప్రస్తుతము వ్యంగ్యము (అర్వాచీనాలంకారికుల మతమున నిది అప్రస్తుతప్రశంస).

పెద్దిరాజు చెప్పిన లక్షణము—

'తగు వినిహితార్థగర్భిత
యగు నన్యార్థోక్తిగతి సమాసోక్తి యగున్
సుగమార్థగోపనముచే
[illegible]'

౧౧. అతిశయోక్తి :

వర్ణనీయమునందలి విశేషమును లోకోత్తర మగునట్లు వర్ణించుట అతిశయోక్తి. అన్ని యలంకారములలోను ఇదియే ప్రధానమని మూలమున నిట్లు చెప్పఁబడినది.

'అలంకారాంతరాణామ
ప్యేక మాహుః పరాయణమ్,
వాగీశమహితా ముక్తి
మిమా మతిశయాహ్వయామ్.'

ఇది యీక్రిందిరీతి ననువదింపఁబడియున్నది.

'ఉల్లసితాలంకృతులకు
నెల్లఁ బరాయణము కవుల కెలమి యనఁగ శో
భిల్లుం బెక్కు తెఱంగుల
జెల్లుం బొరి నేకపదముచే నొడఁగూర్పన్'

౧౨. ఉత్ప్రేక్ష :

చేతనాచేతనముల స్వాభావికస్థితి చమత్కారముకొఱకు వేఱొకరీతిని వర్ణింపఁబడిన ఉత్ప్రేక్ష యగును. ఉపమానమునందలి గుణక్రియాదిధర్మసంబంధముచేత ఉపమేయమును ఉపమానముగా ఊహించుట ఉత్ప్రేక్షయని భావము.

మూలలక్షణము—

'అన్యథైవ స్థితా వృత్తి
శ్చేతన స్యేతరస్య వా,
అన్యథోత్ప్రేక్ష్యతే యత్ర
తా ముత్ప్రేక్షాం విదుర్యథా.'

అనువాదము—

'అలవడ శబ్దార్థములకుఁ
జెలువంబగు నన్యశక్తి సృజియించి సము
జ్జ్వలదుత్ప్రేక్షా వ్యంజన
ములచే నుత్ప్రేక్ష యనఁగ మొనయుం
గృతులన్.'

అనువాదలక్షణము మూలలక్షణమువలెఁ గాక చాల అస్పష్టముగ నున్నది.

మూలోదాహరణము—

'మధ్యందినాతపతప్తములగు గజములు సూర్యునిపయి అలుకచే తత్పక్షులగు కమలములను పెకలించుటకో యనునట్లు సరస్సును ప్రవేశించుచున్నవి.' అని.

స్నాన, పానములకును, తామరతూండ్లఁ దినుటకును ఏనుఁగులు జలావగాహన మొన రించుట స్వభావము; ఇచట ఆ స్వాభావిక విషయము వైరమును సాధించుకొనుటకో యనున ట్లూహింపఁ (ఉత్ప్రేక్షింప) బడినది. తెలుఁగున మాత్రము—

'కొరలు చళుక్యవిశ్వవిభు
కేతువరాహము నన్యభీతి కృ
ద్గురుతరకృత్యమందు రొక
కొందఱు, కొందఱు వైరివాహినీ
నిరుపమమృత్యువందు, రిట
నేనయినన్ రిపురాజమండలా
హరణము సేయ వేఁడి పొలు
పారెడి రాహువుగాఁ దలంచెదన్.'

అని యుదాహరింపఁబడినది. ఇయ్యది అప హ్నుత్యుదాహరణము కాని ఉత్ప్రేక్షోదా హరణము కాఁజాలదు. కాని

'గజభుజగాదులదెసఁగల
గుజిబిజికింగాక వీఁడుకొన్న దివోలెన్
భజియించి నిలిచె వలపటి
భుజమున విశ్వేశ్వరునకు భూసతి ప్రీతిన్.'

అను నుదాహరణాంతరముమాత్రము ఉచిత రీతి నున్నది.

౧౩. హే తు వు :

క్రియారూపమగు నర్థమును సాధించు కార కమును, వస్తుజ్ఞానరూపమగు నర్థమును సాధిం చు జ్ఞాపకమును [రెంట నేదేనొకటి] హేతు వులుగా వర్ణింపఁబడినచో హేత్వలంకార మగును. 'కారక, జ్ఞాపకా హేతూ' అనునది మూలమునందలి లక్షణము.

అనువాదమునఁగల—

'కారకమును గ్రియయును న
ర్థారంభంబునకు బీజమగు నేమిట నిం
పార నది హేతు వనఁజను
భూరిప్రతిభావిశేషములఁ జెక్కరయన్.'

అను లక్షణమున 'జ్ఞాపకము'నకు బదులు క్రియ యుండుట యుచితముగా లేదు.

౧౪. ఉ దా ర ము :

ఉదారాలంకారము మూలమున లేదు. ఇందే కాదు, మఱియెందును చూడామణిలోఁ జెప్పఁబడిన ఉదారాలంకారము కానరాదు, కష్టపడి యార్జించిన ధనము నితరులకు త్యాగ మొనర్చుట తల్లక్షణమని పెద్దయ వ్రాయుచున్నాఁడు-చూడుడు :

'ఆయాసోపార్జితము, న
దేయమును మనోహరాభిధేయమ్మను శ్ర
ద్ధేయము నగు ధన మొసఁగు న
పాయ ముదారంబునాఁగ నవనిం బర్వున్'

మీఁది యౌదార్యము నాయకున కుండ వలసిన ఉత్తమగుణములలో నొకటి. కావ్య గుణమగు నౌదార్యము (ఉదారత) దీని కత్యంత విలక్షణము. పానకమునఁ బుడకవలె నీ యుదారత అలంకారములనడుమ నెట్లు చేరినదో ?

౧౫. సూ క్ష్మ ము :

అభిప్రాయమును తెలియఁజేయు చేష్టల చేతను, అంగవికారములచేతను అభిమతార్థ మును బోధించుట సూక్ష్మము. ఆ యభిప్రా యము వ్యంగ్యమగుట సూక్ష్మబుద్ధులకేకాని అల్పబుద్ధులకు తెలియరానిది. కావుననే అలం కారనామ మన్వర్థమగుచున్నది.

౧౬. ల వ ము:

కొంచెము ప్రకటితమయిన యంశమును వేఱొకదానిచే (మిషచే) కప్పిపుచ్చుట లేశ మగును. అర్వాచీనాలంకారికుల మతమున నది ఛేకాపహ్నుతి.

౧౭. క్రమము :

తొలుతఁ గొన్ని పదార్థములను జెప్పి ఆ క్రమము ననుసరించియే పిదపఁ జెప్పఁ బోవు పదార్థములను సమన్వయించినచో క్రమాలంకార మగును. సంఖ్యానము, యథా సంఖ్యము అనునవి దీనికి నామాంతరములు. అనువాదమునఁ గల—

'ఉపమానము నుపమేయము
నుపమల పరిపాటి తప్పకుండఁగనొడువన్
నిపుణత్వము క్రమమునఁ జనుఁ
బ్రపటుప్రఖ్యాతశబ్దపంక్తులచేతన్.'

అను లక్షణమునుబట్టి క్రమాలంకారమున ఉపమానోపమేయముల క్రమమే అపేక్షిత మని తెల్లమగుచున్నది. మూలమున నీసంగతి లేదు. అర్వాచీనాలంకారికుల మతమునుబట్టి చూచినను క్రమసమన్వయపద్ధతి యున్నఁ తనే క్రమాలంకారమగునని తెలియుచున్నది. కావున చూడామణిలక్షణము సరికాదు.

౧౮. ప్రేయస్కము :

భావము లభివ్యక్తము లగునట్లు ప్రియతర ముగ వర్ణించుట ప్రేయోఽలంకారము.

౧౯. రసవదలంకారము :

రసము లుచితరీతి వ్యక్తములగునట్లు వర్ణిం చిన రసవదలంకారమగును.

రసము ప్రధానమయినను అప్రధాన మయి నను రసవదలంకారమనియు, భావము ప్రధాన మయినను అప్రధానమయినను ప్రేయోఽలం కారమనియు దండి మొదలగు ప్రాచీనాలం కారికుల అభిప్రాయము. అర్వాచీనాలం కారికుల మతమున అప్రధానములగు రస, భావములు క్రమముగ రసవత్ప్రేయోఽలంకా రము లగును.

చూడామణియందు భావ, రస ప్రకరణ ములందు అర్వాచీనాలంకారికుల మతే మను సరింపఁబడినది. కాన అలంకారవివేచనమునను తన్మతమునే అనుసరించుట శ్రేయము. కాని యిచట తన్మతవిరుద్ధముగ ప్రాచీనుల మత మునే అనుసరించుట ఉచితము కాదు.

మూలోదాహరణమును బట్టియు, చూడా మణ్యుదాహరణమును బట్టియు హాసమాత్ర ప్రతిపాదనమున హాస్యరసమగునట్లు తెలియు చున్నది. అర్వాచీనుల మతమున నివి హాస్యో దాహృతులు కాఁజాలవు.

కరుణాదిరసముల నుదాహరించు సందర్భ మున ననువాదమున 'విమతినికరముఁ గరుణం గనుగొని కాచుట' విశ్వేశునికి 'నైజము'; [కరుణమునకు]. 'నిరతోత్సాహంబు విశ్వేశు పునక యొప్పున్'; [వీరరసమునకు] 'భీతిన్ వెఱతురు'; [భయానకరసమునకు]. 'సమధిక మగు నచ్చెరు వచ్చుముగా......' [అద్భుత రసమునకు] అనురీతి వర్ణనములు కనఁబడు చున్నవి. ఆయా వర్ణనములలో పయి స్థాయి భావబోధక పదములు తప్ప రసప్రతీతిజనక ములగు విషయములు వేఱు కానరావు. కరు ణాది పదప్రయోగ మాత్రమున రసస్ఫూర్తి కలుగదు. దానికిఁ గావలసినది విభావాది

భావసామగ్రి. స్థాయిపదప్రయోగము రస ప్రతీతి కత్యంతము అననుగుణము. మూలమునందలి యుదాహరణము లుచితరీతిని గలవు. ఉదాహరణవివరణసందర్భమునసే స్థాయిపదప్రయోగము సందర్భము ననుసరించి యొనరింపఁబడినది.

౨౦. ఊర్జస్వి :

అహంకారమును ప్రకటించు వర్ణన మూర్జస్వి.

౨౧. పర్యాయోక్తము :

కావలసిన సంగతిని చెప్పక దానిని ప్రకారాంతరమునఁ దెలిపినచో పర్యాయోక్తమగును.

మూలలక్షణము—

'అర్థ మిష్ట మనాఖ్యాయ
సాక్షాత్ తస్యైవ సిద్ధయే,
యత్ ప్రకారాంతరాఖ్యానం
పర్యాయోక్తం తదిష్యతే.'

ఆంధ్రానువాదము—

'కార్యార్థకల్పితచేఁ ద
త్కార్యార్థప్రాప్తికొఱకుఁ గల్పించిన మా
ధుర్యయుత భాషితంబది
పర్యాయోక్తంబునాఁగఁ బరఁగుం గవితన్.'

చూడామణిలోని పయి లక్షణ మంత స్పష్టముగా లేదు.

మూలానువాదములందలి యుదాహరణములు రెండును ఒకేరీతి నున్నవి. అర్వాచీనాలంకారికుల మతమున నివి 'వ్యాజమున నిష్టసాధనరూప'మగు పర్యాయోక్తిభేదమునకే ఉదాహరణము లగుచున్నవి.

౨౨. సమాహితము :

ఒకపనిని చేయఁ దలఁపుకొనఁగా దైవవశమున దాని కనుకూలమగు సాధనము లభించుట సమాహితము.

౨౩. ఉదాత్తము :

అభిప్రాయమునైనను, ఐశ్వర్యము నైనను లోకోత్తరమగు గొప్పదానినిగా వర్ణించిన ఉదాత్తమగును.

౨౪. అపహ్నుతి :

స్వాభావికమగు ధర్మమును కప్పిపుచ్చి ఏదయిన వస్తువునందు వేఱొక వస్తువుయొక్క ధర్మమును వర్ణించిన అపహ్నుతి యగును.

౨౫. శ్లిష్టము :

ఒక్కటే వాక్యము అనేకార్థములను బోధించిన శ్లిష్టము.

౨౬. విశేషోక్తి :

ప్రస్తుతార్థమునకు బలమును కూర్చుట కొఱకే జాతి గుణ క్రియాదుల న్యూనత వర్ణించుట విశేషోక్తి యగును.

చూడామణియందలి—

'జాతిక్రియాగుణాదుల
యాతత హీనత్వకథన మలవడు నెచటన్
బ్రీతివివక్షేతరార్థ
స్ఫీతతకై యదియ తగు విశేషోక్తియనన్'.

అను లక్షణములోని 'ప్రీతివివక్షేతరార్థస్ఫీతతకై' యనుచోట 'ఇతర' అనుటకంటె 'ప్రకృత' అనునర్థమిచ్చు పదము ఉపయోగింపఁబడుట యుచితము. లేదా, ఇతరమనఁగా అప్రస్తుతేతరమగు (జాత్యాద్యతిరిక్తమగు) ప్రస్తుత మనియైన అర్థము చెప్పవలెను.

౨౭. తుల్యయోగిత :

వర్ణనీయమును కొనియాడుటకుఁ గాని, నిందించుటకుఁగాని ఆయా విషయములలో నుత్కృష్టము లగు వస్తువులతో (అప్రస్తుతములతో) సమానముగ వర్ణించుట తుల్యయోగిత. ఈయంశము క్రింది చూడామణిలక్షణమున స్పష్టముగ లేదు.

చూడామణిలక్షణము—

'ఖ్యాతగుణంబులచే ను
ద్ద్యోతితసదృశోక్తి తుల్యయోగిత యగుఁ బ్ర
స్ఫీతస్తుతి, నిందనములు
జాతీయముగాఁగఁ జెప్పఁ జనుసంద్రదు బుధుల్.'

అర్వాచీనుల మతమున నిది తుల్యయోగితా తృతీయభేద మగుచున్నది.

౨౮. విరోధము :

ప్రస్తుతమును ఉత్కృష్టముఁ జేయుటకొఱకు విరుద్ధములగు పదార్థములకు సంబంధమును కల్పించుట విరోధ మగును.

'తమలో నొంటను రెంటఁ బ
దములకు సంభావితార్థదర్శన మెచటన్
గ్రమమున విరుద్ధమగు నది
యమరు విరోధంబునాఁగ నయ్యెడ నెల్లన్.'

అను నాంధ్రలక్షణమున నీఁది యాశయము స్పష్టముగ లేదు.

౨౯. అప్రస్తుతస్తుతి‡:

ప్రస్తుతార్థనింపను మనస్సులో సంకల్పించి అప్రస్తుతార్థమును కొనియాడుట అప్రస్తుత ప్రశంస. మూలలక్షణము— 'అప్రస్తుతప్రశంసా స్యా ద్ప్రక్రాంతేషు యా స్తుతిః' అని- తెలుఁగున నీవిషయము స్పష్టముగ లేదు; అక్కఱలేని యంశము కొంత ప్రస్తుతింపఁబడినది. చూడుఁడు :

'వివిధసేవాదికంబుల విసువుచేత
నడరి యప్రస్తుతస్తుతి యనఁగఁబరఁగు
ననుచితార్థప్రశంసన మయ్యు నదియు
నొనరు నొక్కొక్కచోటను నొప్పనొసఁగు'

ఇచట సమన్వయమును కుదురుటకష్టము.

ఈయలంకారమున కుదాహరణముగనిందు

'కస వశనంబు, పేయ ముద
కంబు, విహారము కొనలోపలన్,
వసుమతి శయ్యప, ట్టొరుల
వంకఁ జరింపమి సంతసం బిలన్,
పసులకునెల్ల వృత్తి, జన
పంక్తులకైన నభీప్సితేందిరా
వసుమతియైన విశ్వజన
వల్లభదృష్టియ వృత్తి నిచ్చలున్.'

అను పద్య మీయఁబడినది. ఇది ఏవిధమునను అప్రస్తుతప్రశంసోదాహరణము కాఁజాలదు. ఇందు ప్రస్తుతము వ్యంగ్యముగ లేదు; దాని నిందయు నిచట లేదు.

౩౦. వ్యాజస్తుతి :

ఏదేని నిందింపఁబడినట్లు కనఁబడినను యథార్థమున కొనియాడఁబడునో అది వ్యాజస్తుతి యనఁబడును.

౩౧. నిదర్శనము :

కార్యాంతరప్రసక్తమగు విషయము తనకు సమానమగు మంచినిగాని, చెడ్డనుగాని లోకమునకు బోధించునట్లు చెప్పుట నిదర్శనము.

౩౨. సహోక్తి :

గుణ, క్రియా, ద్రవ్యాదులకు పరస్పరము సహార్థకపదప్రయోగమున సంబంధముకూర్చివర్ణించుట సహోక్తి.

---

‡ ముద్రణమున 'అప్రస్తుత స్థితి' అని పడినది. అది అచ్చుపొరపాటు.

౩౩. పరివృత్తి :

న్యూనము, అధికము, సమానము నను వస్తువులకు పరస్పరము మార్పు వర్ణించుట పరివృత్తి.

౩౪. ఆశీర్వచనము :

కోరఁదగిన యర్థమున శుభాశంసనముగాని ప్రాప్తీచ్ఛాప్రకటనముగాని ఆశీరలంకారము.

౩౫. వక్రోక్తి :

ఈ యలంకారము మూలమున లేదు. అలంకారాంతరచర్చాసందర్భమున దండి శ్లేషము వచనభంగిరూపములను నన్ని వక్రోక్తులందును ఉండి చమత్కారమును కలిగించుచున్నదని చెప్పెను. వక్రోక్తి యనఁగా అతని మతమున అతిశయోక్తి;స్వభావోక్తికంటె భిన్నములను నలంకారము లన్నియును వక్రోక్తులనియే-అనఁగా అన్నింటియందును అతిశయవర్ణన ముండుననియే అతని మతము. చూడుఁడు :

'శ్లేషః సర్వత్ర పుష్ణాతి
ప్రాయో వక్రోక్తిషు శ్రియమ్,
భిన్నం ద్విధా స్వభావోక్తి
ర్వక్రోక్తిరితి వాఙ్మయమ్.'

అని ఆచార్యదండి నిర్వచనము. అతిశయోక్తి గొప్పతన మా యలంకార వివరణ సందర్భమున బాగుగ తెలుపఁబడియే యున్నది. అచటిమూలమతము ననువాదమును ఆమోదించియే యున్నది. అట్లయ్యును అనువాదమున మరల మూలమునలేని ఈ క్రింది రూపమున వివరింపఁబడినది.

లక్షణము—

'స్తుతియు నభయంబుగాముున్న దోఁచిపిదప
దోడుతో వంకవంకరై దొరకు పలుకు
కవులు వక్రోక్తి యననొప్పఁ గబ్బములను'

తొలుత స్తుతించునట్లును, అభయప్రదముగను జెప్పి పిదప వంకరమాటలాడుట వక్రోక్తి యగు ననుట మూలాభిప్రాయ మైనట్లు తోఁచుచున్నది.

ఉదాహరణము—

'పరపుష్టంబులు కోకిలంబు లనిశ
భ్రాంతుండు చంద్రుండు క్రో
వ్విరు లస్త్రంబు లనంగురంగభవుఁ డీ
వీ రిట్లు ని న్నేచ ను
ర్వరలో నెంతటివారు? వారక సఖుల్
వారింపఁగాఁ బోయి సుం
దరి! విశ్వేశ్వరుఁ జూచి తద్విభుమహ
త్త్వం బీ దశాభేదముల్.'

అర్వాచీనుల మతము ననుసరించి చూచిననిది వక్రోక్తి కుదాహరణముకాదు; మీఁదిది లక్షణమును కాదు. 'శ్లేషచేతఁగాని, కాకుస్వరమునఁగాని ఒక యర్థమును మఱియొక రీతిని మార్చుటయే' తన్మతమున వక్రోక్తి.

సంకరము

ఒక్కచో అనేకములను నలంకారములను కూర్చుట సంకీర్ణము(లేక సంకరము). అది అంగాంగిభావ రూపము, సమానస్థితిరూపము అను భేదములచే రెండు విధములు.

మూల లక్షణము—

'నానాలంకార సంసృష్టిః
సంకీర్ణం తు నిగద్యతే,
అంగాంగిభావసంస్థానం
సర్వేషాం సమకక్షతా,
ఇత్యలంకారసంసృష్టే
ర్లక్షణీయా ద్వయీ గతిః.'

అర్వాచీనాలంకారికులు మొదటి భేదమును సంకీర్ణము, లేక సంకరమని, రెండవ భేదమును సంసృష్టియనియు చెప్పియున్నారు.

అనువాదమునమాత్రము—

'వివిధాలంకృతిసమ్మతిఁ
జవిగా నొనరించు నర్థసంగతిచేతన్,
సవరసయి కర్ణముల కు
త్సవపదమగుకబ్బమరయసంకరమయ్యెన్.'

అను సామాన్యలక్షణమే ఈయఁబడినది; కాని దాని భేదద్వయము చెప్పఁబడలేదు.

౩౬. భావికము :

కావ్యమున సమాప్తిపర్యంతము నుండు కవ్యభిప్రాయము భావము; ఆభావము కలది భావికము. ఇది ఉత్తమమగు నలంకారము. కవి యామోదింపఁదగిన భావములు—కథావస్తువులను పరస్పరోపకారకములుగ వర్ణించుట, వ్యర్థవిశేషణములను విడుచుట, సాభిప్రాయవిశేషణములను పరిగ్రహించుట, నిగూఢమగు నంశమునుగూడ ఉక్తిచమత్కారముచే విశదముగ తెలుపుట; ఏతద్భావయుత్తమగున దంతయు భావికము. ఇంతియు కాదు. ఇతరలాక్షణికులు చెప్పిన సంధి, సంధ్యంగఘటనాదికమును భావికము కావచ్చును.

ఇది మూలమునఁగల లక్షణము.

అనువాదమున—

'భావమనఁగను గవియభిప్రాయ మండ్రు;
భావభేద నియుక్తంబు భావికంబు;
వివిధరూప ప్రబంధోక్తివిషయగుణము;
దగు వివేకింప సూక్ష్మసందర్శనమున.'

అని మాత్రమే కలదు. ఆ భావభేదము లేవియో చెప్పఁబడలేదు.

ఉదాహరణము—

'వివిధపదార్థభావ, రస
వృత్తుల, రీతులఁ గావ్యపాకసం
భవమగు సూక్ష్మబంధమునఁ
బర్వు నలంకృతులెల్లఁ జూచి, స
త్కవుల వివేకమెల్లఁ బొడఁ
గానఁగనేర్చు చతుర్యవిశ్వభూ
ధవుఁ డనుమాట లొజ్జ లవి
దర్పమెలర్ప సభాంతరంబులన్.'

ఈ యుదాహరణము సరికాదు. భావికము కావ్యపరిసమాప్తిపర్యంతము నుండవలసినది. కాన దానిని ప్రత్యేకముగ నుదాహరించుట దుర్ఘటము. ప్రబంధగతమగుదానిని ప్రత్యేకమొక పద్యమునఁ జెప్పుట సాధ్యమగునా? కావుననే మూలమున దాని కుదాహరణ మీయఁబడలేదు. అనువాదమందలి ఉదాహరణమున కావ్యశోభాధాయకమగు సామగ్రి ఏకరువుపెట్టఁబడినది. అంతమాత్రముననే అచట లక్షణము సమన్వయింప వీలగునా?

ఇవియే చూడామణియందుఁ గల అర్థాలంకారములు. ఈ వ్యాసమున అలంకారలక్షణములుమాత్ర మీయఁబడినవి; మిక్కిలి అసంగతములగు ఉదాహరణములు చర్చింపఁబడినవి. అన్నింటికిని ఉదాహరణములను, వివరణమును ఇచ్చినచో గ్రంథము పెరిగిపోవునని విడిచితిని.

ఉపరినిరూపితాంశములఁబట్టి మూలానువాదముల తత్త్వము కొంత తెలియఁగలదు.



# త్రిశూలము

[చరిత్రాత్మక నాటకము]

విశ్వనాథ సత్యనారాయణ



'కృతిపతి'

## పాత్రలు

**పురుషులు :**

బిజ్జలుఁడు—రాజు,
బసవేశ్వరుఁడు,
జగదేవుఁడు,
త్రిపురాంతకభట్టు,
అల్లయ్య,
మధువయ్య,
మడివాలు మాచయ్య,
మల్లయ్య,
కిన్నరబ్రహ్మయ్య,
చ రాశయ్య,
దౌవారికుఁడు,
నలుగురు శైవులు,
నలుగురు బ్రాహ్మణులు,
గొల్లబోయలు,
శిష్టదేవుఁడు,
ఇద్దఱు మంత్రులు.

**స్త్రీలు :**

నీల, కళియంబ.

# నాంది

శ్రీశర్వాణిని జుట్టి నృత్తరచనాశృంగారియై శృంగర
ఘ్యాశింజానముమువ్వలోఁ బ్రణవనాదం బా వృషస్వామియుక్
గాశీనాథుని వంగడంబునను వంకల్ లేని జాబిల్లి నా
గేశుఁ దేశహితైకజీవితుని రక్షించుఁ ఘృణాపీనయై.

దేశోద్ధారక విశ్వదాత బిరుదాధిష్ఠానపీఠంబు స
ర్వాశాపూరణదానకీర్తి విభవారంభప్రియంభావుకం
బీశారాధనలబ్ధసంపదభిరామేచ్ఛావిహారంబు నా
గేశాఖ్యంబను దీప్తియాంధ్రవిషయంబెల్లన్ బ్రకాశించెడున్.

ఇస విశ్వదాత చే విదలించెఁగాఁబోలు
నీగ్రంథభాండార మెంత యొప్పు
కూడి దేశోద్ధారకుఁడు దయఁజూచెనో
జాతీయ మయ్యె శాసనసభాళి
పెరిమఁ గాశీనాథవిబుధుఁ డిచ్చెనో యేము
కవుల చేతుల ఘలంఘలలు పుట్టె
ప్రథిమ నాగేశ్వరరాయప్రసాదమో
యెల్లసంస్థలు తలలెత్తుకొనియె
నని యెవని కీర్తి తెలుఁగునేలను విపూల
లందు సైతమ్మ పాడుట యయ్యె నేడు
నామహామహుఁ గణియించునట్టి నంది
పేర్చి నాట్యాత్తసుఖము చేకూర్చుఁగాత.

ఆంధ్రవిశ్వవిద్యాలయోద్యన్మహోధి
కారిదత్త కళాప్రపూర్ణోరుబిరుద
దీపితవసంతరుచికంబెఁ దేఁకువగుచు
మత్కృతిపతిత్వ మొకక్రొత్త మగ్గ తేరు.

ఇది పాలకురికిసోమన
విదితకృతి ప్రభాకరుండు వేటూరికొల
మ్మదివియ చక్కని పీఠిక
పొదిగించి పరిష్కరించెఁబోఁ దెనుఁగొలయన్.

వేటూరివారి వ్యాఖ్యలును పీఠికలున్ దెనుఁగుసంబోలంతికన్
వేటులుశేసు గందవొడివెట్టిన పూఁతలు నంతయయ్యె నా
శేటికొ వట్టి వేదతనమే భజియింతురు నెంతయయ్యె కో
నాటకు నెక్కుటో తెలుఁగునాటకి నాఁటికి నాఁటి కక్కటా!

తెలుఁగును బహుమార్గంబుల
వెలిఁగించెడునట్టి దొరలు పిండీకృతశా
టులవోలె బండ లెక్కఁగఁ
గొలనీదును బాతలంచకోలముల భాతిన్.

ఎలమిఁగూర్చుఁ బరిష్కారయితయుఁ గాశీ
నాథనాగేశ్వరబుధుండె నాకృతీశ్వ
రుండు సామరస్యం బిట్లు ప్రోవువడియె
నావిరచితంబయైనది నాటకంబు.

నన్ను నెఱుఁగరో యీ తెల్గునాట మీరు
విశ్వనాథకులాంభోధివిధుని బహువి
చిత్రచిత్రధ్వనిబహువిచ్ఛిత్తిమన్మ
హాకృతిప్రణేత సత్యనారాయణకవి.

## ప్రస్తావన

## ప్రథమాంకము

[ప్రవేశము: బిజ్జలుఁడు — ప్రదేశము: రాజాంతఃపురము]

బిజ్జ:—

ఃపురంపుర్ దళుకుల్ వెలార్చు గిరిజెన్కన్ దీప్తిమన్మూర్తియై
విపులాకాశము నావరించుచుఁ ద్రిధావిర్భూతరోచిశ్ఛటా
కృపమై సత్వరజస్తమోవివరణక్రీడాప్రచండంబు తై
లపదేవుం డెటు దాఁచె నేనును ద్రిశూలం బట్టులే చూచితిన్.

(అంతట జగదేవుఁడు ప్రవేశించును.)

బిజ్జ:—దళవాయీ! బసవేశ్వరుఁ డెంతదూరము వచ్చెను?

జగ:—ఊరుబయటికి వచ్చెను.

బిజ్జ:—అయ్యయో! అట్లయినచో మనము బయలు దేరిపోవలయును. కల్యాణకటక మంతయును శృంగారించిరా? మండలాధీశ సామంత ప్రధానదండాధినాథ మాతంగ తురగాది పరివారములు సిద్ధముగా నున్నవా? వివిధవాద్యధ్వనులు దివిడీటుకొన్నవా? బసవకుమారుని సద్భక్తిశృంగారుని నసదృశాకారుని దత్వార్థవిచారుని జంగమవ్యాపారుని సజ్జనాధారుని విమలశివాచారుని ద్రిమలధిక్కారుని నీవు చూచితివా?

జగ:—మహారాజా! నేను వారి దర్శనముచేసితిని.

బిజ్జ:—ఆయన నీ కెట్లు కన్పించెను? పరవశుఁడై యుండెనా? ఆయనయెడ లాయనకుఁ దెలియుచున్నదా? బాలునివలె నున్మత్తునివలెఁ బిశాచమువలె లేఁడు కదా!

జగ:—మహారాజ! ఆయన యట్లేరీతిగను లేఁడు. సర్వమానవులవలె సంభాషించుచు నవ్వుచుఁ జమత్కరించుచు మహారాజువలె ఠీవి నెఱపుచు గంభీరముగఁ జూచుచు మహాభక్తునివలె నడుమనడుమ ప్రత్యగ్దృష్టి యగుచు నాంతరపరిజ్ఞానసూచిగా మెల్లఁ హసించుచు నున్నాఁడు.

బిజ్జ—దళవాయీ! నీవు బ్రాహ్మణుఁడవు కదా! ఈవీరశైవుఁడు నీ ప్రశంసకుఁ బాత్రమగుచున్నాఁడా?

జగ:—ప్రభువులును బ్రాహ్మణమతస్థులే.

బిజ్జ:—నేను బ్రాహ్మణమతస్థుఁడ నైనను శివారాధకుఁడను. వీరశైవము నే నవలంబింపకున్నను బరతత్వము శివుఁడనియే నా యభిప్రాయము.

జగ:—ప్రభువులు మతవైషమ్యము లేకుండఁ బాలించుచున్నారు గనుక నేను బ్రాహ్మణుఁడను.

బిజ్జ:—వీరశైవము పరమత సన్నికర్ష మొప్పుకొనదు. బసవేశ్వరుఁడు నామతసామ్య మంగీకరించునో, యంగీకరింపఁడో?

జగ:—త్రిభువనమల్లురు మఱి బసవేశ్వరు నేల మంత్రిగాఁ బిలిపించుచుండిరి?

బిజ్జ:—జగదేవా! బలదేవదండనాయకు నెఱుఁగుదువుకదా! ఆ మహాపురుషునియం దభిమానముచేత బసవేశ్వరున కీ మంత్రిపద మర్పించుచుంటిని. బలదేవుఁడు చనిపోయిననూడ నా కన్నులయెదుట నున్నాఁడు. ఆయన యుపకారము నా బిడ్డ బిడ్డతరాన నేను మఱచిపోలేను. సర్వరాజ్యమేలిన మంత్రి చనిపోవువేళకు సంస్కారమునకింటఁ జిల్లిగవ్వ లేనిచో నాయననిష్కామప్రవృత్తి యెంతయని చెప్పవలయును? బసవేశ్వరుఁడుకూడ మేనమామ పోలిక యనుకొందును.

జగ:—కాని, మహాప్రభూ!

ఒకఁడు రాజును బ్రజయు నన్యోన్యభక్తి
నలరఁజేసెడు వట్టి రాజ్యాంగ వేత్త
మఱియొకఁడు నూతన విచిత్రమార్గములను
దక్కఁ దొరుచు నున్న మతప్రవక్త.

బిజ్జ:—దళవాయీ! రాజ్యాంగమునకు మతమునకు సంబంధము లేదు. వీరశైవుఁడైనంత నే కల్యాణకటక మంతయు వీరశైవముచేయునా? అందఱును మానవులే. అందఱిలోనను జీవుఁ డున్నాఁడు. అందఱకు క్షుత్పిపాస లున్నవి. అందఱకు నాలుబిడ్డ లున్నారు. ఎవ్వఁడును దన మత మితరునిమీఁద బలవంతముగాఁ జొనిపి వానికిఁ బ్రాణోపద్రవము తేరాదు.

జగ:—త్రిభువనమల్లు రట్లే పాలించుచున్నారు.

బిజ్జ:—జగదేవా! ముఖస్తుతి కాదు. నే నేమి పాలించుచున్నాను? మీ పన్నిద్దఱుమంత్రులు పాలించుచున్నారు. ఆ గుణదోషములు నావి కావు. రాజ్యమున నేవైన దోషములు సంప్రాప్తించినచో నాదోషములు నావికావు. అట్టి మిమ్ము నియమించిన దోషమే నాది. మీ రెల్లరు వేదవేదాంగవేత్తలు; నీతిశాస్త్రకోవిదులు; యుద్ధవిద్యానిపుణులు,

జగ:—మహాప్రభూ! తమకన్న యుద్ధవిద్యానిపుణు లీ రాజ్యమునందు లేరు.

బిజ్జ:—దళవాయీ! ఖడ్గకళానైపుణ్య మేమి చేయును? ఏదిచేసినను దైవము చేయవలయును. నే నొంటరిగ శయ్యామందిరమున నిదురించుచుంటి నను కొనుము. అప్పుడు నాయొద్ద ఖడ్గ ముండదు. మాట వరుసకు నీవే ఖడ్గము పుచ్చుకొని నన్ను నఱుకవచ్చెదవు. నా యస్త్రకళాకోవిదత్వ మేమగును?

జగ:— పాపము శాంతించుఁగాక! ప్రభూ! యెంతమాట!

బిజ్జ:—దళవాయీ! అదికాదు. నేను తైలప దేవుని సంహారింపలేదా? నీవు నన్ను సంహారింప వచ్చును. నీవుకాదు, మఱియొకఁ డనుకొనుము.

జగ:—మహాప్రభూ! పశ్చిమచాళుక్యరాజుల రక్తమునుండి వెచ్చదనము తొలఁగిపోయినది. వారు రాజ్యము నిభాయించుకొనలేకపోయిరి. త్రిభువనమల్లురు తమరు సమయమునకుఁ గలచుర్యవంశదీప్తిఁ బ్రజ్వలింపఁజేసితిరి. లేనిచో నీతెలుఁగు కర్నాటకము బీరువడి యుండును.

బిజ్జ:—ఇదిగో! నేను బయలుదేరుచున్నాను. మీరు పదండు.

(జగదేవుఁడు నిష్క్రమించును.)

బిజ్జ:— ("కపురంపుఁ దళుకు" లిత్యాదిపద్యమును చదువును.)

జగ:—(ప్రవేశించి) మహాప్రభువులు పిలిచిన ట్లున్నారు.

బిజ్జ:—జగదేవా! నీ కొక రహస్యము చెప్పెదను.

జగ:—మహాప్రసాదము.

బిజ్జ:—దళవాయీ! నేను వచ్చుచున్నాను. మండలాధీశ్వరులను సామంతులను గజతురగపదాతులను సిద్ధముగా నుండుమనుము. మహామాత్యుఁడైన బసవేశ్వరుని పోయి తోడితెత్తము.

(పరిక్రమింతురు)

(బసవేశ్వరుఁడు, మంత్రులు నెదురువత్తురు.)

బిజ్జ:—(అంజలిపట్టి)

విమలశివాచార త్రిమలధిక్కార
అమిత సహాచార! అచలితధీర
విరహితసంసార! వీరావతార
పరిహృతాహంకార! భక్తినిహార
శివభక్తిసార! విశిష్టప్రకార!
వృజినతరుకుఠార! విహితోపకార!

బసవేశ్వరుఁడు:—మహారాజా! మీయాజ్ఞ(బట్టి) వచ్చితిని. ఉపకారము ప్రభువులవలన జరిగినది.

బిజ్జ:— మంత్రిసత్తములారా! బసవేశ్వరుఁడు కల్యాణకటకవీథులవెంట వచ్చుచుండఁగా నేను చూచి పోతినిగదా! అప్పుడు వీథు లెట్లున్నవో!

ఒకమంత్రి:—

పుణ్యపణ్యాంగనల్ పురవీథులందు
పుణ్యాత్ము బసవప్రభుని జూచువేడ్క
చూడఁగవచ్చెద సుదతి నే ననుచు
వేడుక చెలుపక వేగ రమ్మనుచు
బసవన్న జూడక పడఁతి పో ననుచు
ముసుఁగిడి వేగ రా ముకియక యనుచు

ఇంకొకమంత్రి:—

మానిని బసవన్న మహిమ యిదనుచు
మానుగా భర్తల మఱి చూత మనుచు
కంటినే బసవయ్య గనులాయతాక్షి
కంటి నే మోక్షమ్ము కంటిగా కనుచు

మూడవమంత్రి:—

వచ్చువారును చూచువారును గట్ట
నిచ్చువారును జూచి యేగెడువారు
పారిపారి తెచ్చి విభూతి వీడ్యంబు
లరుదొంద బసవయ్య కర్పించువారు

నాల్గవమంత్రి:—

అంగనల్ వివిధపుష్పాంజలు లిచ్చి
మంగళారతు లెత్తి మహి మ్రొక్కువారు
స్వస్తి దీర్ఘాయువు శంకర యనుచు
ప్రస్తుతిదీవనల్ పచరించువారు

బిజ్జ:—ఈ నాఁటికినా రాజ్యమునుమంత్రి నిమిత్త మైనది. ఇంతటి ప్రజానురంజకుఁడు రాజ్య సర్వకార్య

నిర్వహణము సాగించుచుండఁగా నేను సుఖనిద్ర పోయె దను. జగదేవదండనాయకా! చూచితివా! బలదేవ దండనాయకుఁడు బసవేశ్వరుఁడుగా మీ యెదుట సాక్షా త్కరించెను.

జగ:—మహామంత్రికి జగదేవుఁడు నమస్కరించుచున్నాఁడు.

కలియుగరుద్ర సత్కరుణాసముద్ర
విలసనభద్ర సద్వినయనిర్నిద్ర

(నమస్కరించును)

తక్కినమంత్రులు:—
విపులక్షమాకార వినయప్రచార
సుపవిత్రకవిస్తార శుద్ధశరీర

(నమస్కరింతురు)

బిజ్జ:—జగదేవా! భువనాశ్రయ మహామంటప మునకు దారి తీయింపుఁడు. తక్కిన మంత్రు లందఱు నెచ్చట?

జగ:—భువనాశ్రయ మహా మంటపమునందే సామంతమండలాధీశులు, మంత్రిదండనాథులు మహాప్ర భువులయు, నమాత్యులయు రాకకై వేచియున్నారు.

(తెరయెత్తఁగా నభిషేకసంభారములతో సభ కనిపించును)

బిజ్జ:—(బసవేశ్వరుని దనప్రక్కనున్న పెద్ద గద్దియమీఁద నెక్కించి వస్త్రాభరణము లిచ్చి)

సకలసామ్రాజ్య పూజ్యస్థితి కెల్ల
ప్రకటింపఁగా నీవు పతి వట్లుగాక
నాయర్థమునకుఁ బ్రాణమునకుఁ బతివి
వేయును నేల నీవే నేను బసవ!

బసవా! నిన్ను నమ్మితిని.

బస:—

సకలలోకైక రక్షకుఁడగు శివున
కొక నిన్ను రక్షించుటకు నెంతపెద్ద
కావున మాలింగదేవు భక్తులకు
నేవేళ నెఱిచుండు మింతియచాలు
నీరాజ్య మేలించు టిది యెంత పెద్ద
నీరధి మేరగా నిన్ను నేలింతు-

(బిజ్జలుఁడు జగదేవునివంకఁ జూచును. జగదేవుఁడు బిజ్జలుని వంకఁ జూచును.)

బిజ్జ:—బసవేశ్వరా! ఈ రాజ్యమంతయు నీకుఁ గైవసము చేసితిని. మీ మేనమామయుఁ గల్యాణకటక ప్రతిష్ఠాచార్యుఁడును సర్వమతసామరస్యమహామతియు నైన బలదేవదండనాయకుల మార్గ మవలంబించి మమ్ముఁ గృతార్థులఁ జేయ వేఁడుచున్నాను.

బస:—మహారాజా! సర్వము శివప్రీతిగాఁ జేసె దను. నాకుఁ దృణ మక్కరలేదు. సర్వజగమ్ము ప్రమథ మయము. ప్రమథార్పితమైన దంతయు రుద్రార్పితము. లింగధారులే ప్రమథమూర్తులు. శివమయమైన యీ సర్వప్రపంచము శివమయముగాఁ జేసెదను.

మంత్రులు:—కల్యాణకటకరాజ్యవర్ధమానధీవిభవాచార్య! త్రిభువనమల్లప్రసాదపరిలబ్ధమహామాత్య పదవీపదచిహ్నమకుటరత్నపరిశోభిత మస్తకాలంకార! బసవేశ్వర! జయము! జయము!

(తెరలోఁ బెద్దధ్వని.)

జగ:—అమాత్య పట్టాభిషేక సమయజనిత సంతోష కోలాహలము దిక్కులఁ బిక్కటిల్లుచున్నది.

బిజ్జ:—మహామాత్యా! ఇంకఁ దక్కిన సర్వ వ్యవహారములు తామే చూడవలయును. నేఁటికి సభ చాలించితిని.

(జగదేవుఁడు, బిజ్జలుఁడు దక్క నందఱును వెడలిపోదురు.)

బిజ్జ:—జగదేవా! బసవేశ్వరుఁ డన్నమాట లెట్లున్నవి?

జగ:—వీరశైవమతావేశముతో నిండి తొలుకాడుచున్నవి.

బిజ్జ:—ఆవాక్యములు మరలఁ జెప్పుము.

జగ:—

కావున మాలింగ దేవభక్తులకు
నేవేళ నెఱిచుండు మింతియ చాలు,

అని యొకటి.

భక్తులే ప్రమథులు, ప్రమథులే శివుఁడు,

అని మఱియొకటి.

బిజ్జ:—దళవాయీ! బసవేశ్వరుఁ డేమియు గోప్యముగాఁ జెప్పలేదు. ఈయన వీరశైవులను బైకెక్కించునా యేమి?

జగ:—అట్లేలచేయును? ఆయన శివావతారము గనుక జగత్తంతయుఁ దనమయముగాఁ జూచెను. రాజనీతికి మతమునకు సంబంధ మేమి?

బిజ్జ:—జగదేవా! నీవు నేదో దాఁచి మాట్లా డుచుంటివి. మీరు పదండు. నేను గొంత విశ్రాంతితీసి కొనవలయును.

(జగదేవుఁడు నిష్క్రమించును.)

బిజ్జ:—

మంత్రి నిక్షిప్తమైన సామ్రాజ్య మెల్ల
మంత్రియదుపాజ్ఞలందున మసలుచుండు
దండనాథులు వాని మంత్రంబునందె
బద్ధవిశ్వాసులై యుని పట్టఁబోరు.

మంత్రియైనవాఁడు వట్టి రాజ్యనీతివేత్త కావల యునుగాని వాని కన్యవిషయావేశము కూడదు. మంత్రి కవియైనచో బొక్కసము కవులకు దోచిపెట్టును; గాయ కుఁడైనచో గాయకులకు గొల్లయిచ్చును; ఒక ప్రబల మత విశ్వాసియైనచోఁ దన్మతానుయాయులకు బొక్క సము చూఱవిడుచును. అతని యభినివేశమునకుఁ బ్రాబల్యము తక్కిన రాజ్యాంగ విషయములయందు దౌర్బల్యము తెచ్చును. బసవేశ్వరుని పాలనము నేట తేపట నిర్ణయింపరాదు. సంగమయ్య సాక్షాత్తుగా వచ్చి స్వాగతమొసఁగిన బసవేశ్వరుఁడు తక్కిన యల్పులైన మతావిష్టులవలెఁ బ్రవర్తింపఁడు. కొలఁదిదినములలోననే బసవేశ్వరుని రాజ్యపాలనా నిపుణత్వ మెఱుకపడఁగలదు కదా! సుప్రతిష్ఠితుఁడైన యమాత్యుని దొలఁగించుట దుర్లభము. ఉంచుటయో తొలఁగించుటయో శీఘ్రకా లములో నిర్ణయింపవలయును. శివభక్తులకు వెఱచుచుం డవలయుననుట చిత్రము. రాజు శివభక్తులకు వెఱువ వలయునా? రాజునకు సర్వప్రజలు వెఱువవలయును; మహామాత్యుఁడుకూడ వెఱువవలయును. ఎవఁడురా అక్కడ?

దౌవారికుఁడు:— (ప్రవేశించి) మహాప్రభూ! ఏమిసెలవు?

బిజ్జ:—"తైలపదేవుం డెటు చూచె నేనును దిశూలం బట్టులే చూచితిఁ."

దౌవా:—చిత్తము.

బిజ్జ:—ఏమిరా! ఇంకను నిచ్చటనే యుంటివా?

దౌవా:—మహాప్రభువుల యాజ్ఞ తెలియలేదు.

బిజ్జ:— పోయి త్రిపురాంతకదేవభట్టారకునిఁ బిలుచుకొనిరమ్మని చెప్పలేదా?

దౌవా:—చిత్తము.

(నిష్క్రమించును.)

బిజ్జ:—శివభక్తు లందఱు ప్రమథులా? సర్వము వారి యర్పితమైనచో శివప్రీతికరమా!

(త్రిపురాంతకభట్టు ప్రవేశించును.)

బిజ్జ:—త్రిభువనమల్లుఁడు కాలచుర్యుఁడు బిజ్జ లుఁడు నమస్కరించుచున్నాఁడు.

త్రిపు:—మహారాజ! స్వస్తి.

బిజ్జ:—ఆర్య! శివభక్తులందఱు ప్రమథులా!

త్రిపు:—అని వీరశైవుల విశ్వాసము. వారి భక్తియం దున్నంత విశ్వాసము మఱియొకదానియం దుండదు. వారు వర్ణవ్యవస్థయందుఁ గర్మలయందు విరో ధింతురు. కేవలభక్తి శివైక్యము నాపాదించునని వారి భావము.

బిజ్జ:—జగత్తంతయుఁ గర్మాధీనముకదా!

త్రిపు:—బ్రాహ్మణులు కర్మాధీన మందురు. వీరశైవులు భక్త్యధీనమందురు.

బిజ్జ:—భట్టారకా! బసవేశ్వరునకు మహా మాత్యపట్టము గట్టితిమి.

త్రిపు:—ప్రభువుల దయ. మహారాజు దయ చూచినచో నిరుపేదకు నీరాజన మెత్తుదురు.

బిజ్జ:—బలదేవదండనాయకునందు మాకుఁ గల భక్తి యట్లు చేయించినది.

త్రిపు:—బలదేవదండనాయకులు వీరశైవులయ్యు సర్వమతసామరస్యము కలవారు.

బిజ్జ:—బసవేశ్వరుఁ డచ్చముగా మేనమామను బోలినవాఁడు.

త్రిపు:—చిత్తము.

(అంతట జగదేవుఁడు ప్రవేశించును.)

బిజ్జ:—భట్టారకు లింకఁ బోవచ్చును.

(త్రిపురాంతకుఁడు నిష్క్రమించును.)

జగ:—మహారాజా! మహాసభనుండి వెడలి నంతనే బసవేశ్వరుఁడు వీరశైవుల సభ చేసెను. ఆసభలోఁ దన యమాత్యత్వ మెట్లు నిర్వర్తింప బడునో యని యొక భాస చేసెను. ఆభాస మెట్టి దనఁగా,

శివరాత్రి నిత్యమ్ము చెల్లించు బాస
శివభక్తు లెల్లను శివుఁడను బాస
భక్తుల యొగ్గులు పట్టని బాస
భక్తుల కుల మెత్తి పలుకని బాస
అడిగిన యర్థంబు లెడపనిబాస
యేమివేఁడిన నడుగిడ కిచ్చుబాస
కలనైన శివునకు గెలుపీని బాస
గెలుపు భక్తుల కిచ్చి కీడ్పడు బాస
పరసమయంబులఁ బరిమార్చుబాస
పరవాదులను బట్టి భంజించుబాస
హరగణపరతంత్రుఁడై యుండుబాస
హరభక్తు లెట్లున్న నట్లను బాస
భవికి మ్రొక్కని బాస భవికీని బాస
భవబాధలకు నగపడకుండు బాస.

ఇట్టిది. ఇంక భవ్యులైనవారికి బ్రదుకుఁదెరువు లేదు. భవులు శైవులకుఁ గంటఁబడరాదు.

బిజ్జ:—దళవాయీ! నీవును, నేనును భవులము. బసవఁడు శైవుఁడు. రాజును నేను. మంత్రివి నీవు. మన మిద్దఱ మతనికంటెఁ బడమా?

జగ:—వారి చర్మచక్షుస్సులు కాదు. జ్ఞానచక్షుస్సు లనుకొందును.

బిజ్జ:—అయినచో బసవేశ్వరుని బాసలోఁ దప్పు లేదు. మఱియు నింకేమైన విశేషము లున్నవా?

జగ:—బసవేశ్వరునకు మహామాత్యపట్టము దొరకిన దన్నంతనే కటకమున జంగములసంఖ్య యెక్కువైనది. జంగముల మూఁకలో నిసుక వేసిన రాలుట లేదు. కొందఱు (అర్థోక్తి)

బిజ్జ:— ఏదియో చెప్పవచ్చి యాఁగితివి! కొంద ఱేమి?

జగ:—మహాప్రభువులు మన్నింపవలయును.

బిజ్జ:—భయము లేదు. చెప్పుఁడు.

జగ:—మహారాజులు వీరశైవదీక్షఁ బుచ్చుకొందు రని కొంద ఱనుకొనుచున్నారు.

బిజ్జ:—ఎవ రా కొందఱు? నే న ట్లనుకొనుట లేదు. నేను శైవుఁడనే కాని వీరశైవుఁడను గాను. వర్ణాశ్రమాచారధర్మములకు నేను వ్యతిరేకిని గాదు. నారాజ్యమునఁ దద్విపరీతము జరుగరాదు. కాని, జగదేవా! బసవేశ్వరుని యెదుట నున్నప్పుడా మహామాత్యుని మొగమువంకఁ జూచుచున్నప్పుడు నేను వీరశైవుఁడనే యనుకొంటిని.

జగ—నేను న ట్లే యనుకొంటిని.

బిజ్జ:—అందఱు న ట్లే యనుకొనిరి. మన యందఱ మాటలు వీరశైవుల కవితాపద్ధతి యగు ద్విపదచ్ఛందమునే యాశ్రయించినవి.

జగ:— బసవేశ్వరుఁ డొక మహాపురుషుఁడు. మహాపురుషుల లక్షణమే యది. వారియెదుట నున్నంతసేపు మఱియెవ్వఁడును నోరు మెదపలేఁడు; స్వతంత్రభావము లూహింపలేఁడు.

బిజ్జ:—జగదేవా! నేను బసవేశ్వరుని మహామాత్యుఁడని, బలదేవదండనాథుల మేనల్లుఁడని గౌరవించుచుంటినే కాని యాయన వీరశైవుఁ డని కాదు; ఆయన యొక యవతారమనియుఁ గాదు.

జగ:—నేను నిన్నటివఱ క ట్లే యనుకొంటిని. ఆయనదర్శనముచేత నాయొడలిలోని ప్రతిరక్త బిందువు కళవళపడినది. నా మనస్సుమాత్రము బ్రాహ్మణమతమునే తర్కించి సిద్ధాంతముచేసి విశ్వసించుచున్నది. నా హృదయ మాయనవంకకే లాగుచున్నది.

బిజ్జ:—మంత్రులు పరస్పరము ప్రేమభాజనులై యుండుట మంచిదిగదా!

జగ:—చిత్తము. కాకతిప్రోలునిమీఁద దండయాత్రకై సైన్యసన్నాహము చేయవలసియున్నది. నేను సెలవుతీసికొందును.

(నిష్క్రమించును.)

బిజ్జ:—పూర్వచాళుక్యులనుండి చీలి కాకతి ప్రోలుఁడు రాజ్యమేర్పఱచెను. పశ్చిమచాళుక్యులనుండి చీలి నే నేర్పఱచితిని. ప్రోలుఁడు చాళుక్యుల సామంతుఁడు. తైలపదేవుని రాజ్యము నాకుఁ బ్రాప్తించినది. ప్రోలుఁడు నాకు సామంతుఁడు కావలయును. కాని స్వాతంత్ర్య మవలంబించుచున్నాఁడు. జగదేవుఁ డీపనికిఁ జాలినవాఁడు. జగదేవుని సాయము లేక కల్యాణకటకము నాకు సిద్ధించెడిది కాదు. శుభముహూర్తమున బసవేశ్వరుని యాశీర్వాదముతో జగదేవుని సైన్యములతో ననుమకొండకుఁ బంపించెదను. బసవేశ్వరా! నీ రాజనీతి యొక్కటియేగాక నీ మహాశివభక్తికూడ మా కీయుద్ధములో జయముకలిగించుఁగాక. నేనుగూడఁ గ్రమముగా శైవదీక్షఁ బుచ్చుకొందునా? అదిగో త్రిశూలము మఱల

నాకుఁ గన్పించుచున్నది. ఈ త్రిశూలదర్శనమైనప్పు డెల్ల నొకసంహారము జరుగుచునేయున్నది. ప్రోలరాజీ సంహారాగ్ని ముందు శలభాయమానుఁ డగును.

ప్రత్యంతధాత్రి సర్వము నల్లనై క్రమశశ్శ్వేతమై పైకి సాగుకొలఁది
సాగిన శిఖరంబు శారదనీరదాచ్ఛము శివవృషకకుత్సదృశ మనుచు
సాపైని తేజోమయాకృతి సత్త్వరజస్తమస్త్రిగుణభాస్వంత మనుచు
మూఁడు వర్ణములతో మూఁడుమండలములై పరివేష సుప్రభాభాజి [యనుచు
వెనుక సర్వనీలాకాశమునకు శైవ
ముద్రవేసినగతి శ్రీసమూహి కాఁగ
లలిని నాకంటికిని త్రిశూలంబు తోఁచు
తైలపునినాఁటి సంహారవేళఁబోలి.

[తెర]

## రెండవ యంకము

[ప్రదేశము: రాజమందిరముముందు. ఇద్దఱు మంత్రులు, నలుగురు పౌరులు.]

ఒకపౌరుఁడు:—అయ్యా! నమస్కారం. వాఁడెవఁడో చాకలిఁట. శివభక్తుఁడుఁట. దారి నడ్డంవచ్చిన వాళ్లనల్లా చంపేస్తున్నాఁడు.

రెండవవాఁడు:— అయ్యా! తమరు ప్రభువుగారితో చెప్పాలి. ఈదురాగతం యెల్లా మానిపిస్తారో చూడండి. వాఁడు శివభక్తుల గుడ్డలు మోసుకుపోతోంటే యెవఁడూ వాడి కడ్డం రాకూడదఁట. ఆగుడ్డలు యెవళ్లూ తాకకూడదఁట. అడ్డంవచ్చినవాళ్లని చంపేస్తున్నాఁడు. ఇవ్వాళ ఒకణ్ణి చంపేశాఁడు. ఊరంతా గగ్గోలుగా ఉంది. రాజుగారితో చెప్పి యేదో చేయించకపోతే మనుష్యులు బతకలేరు.

ఒకమంత్రి:—వాణ్ణిగురించి మేమూ విన్నాము. ఇవ్వాళ యెవరిని చంపాఁడు?

పౌరు:—అసలు వాఁడు దారివెంట పోతూనే కేకేసుకుంటూపోతాఁడు.

"భవులు-శరణులవస్త్రముల్ సంధిల్లి రేని
ఓసఁ జాపాడుతుఁ జుండో యని..."

గంటకట్టి యూరివెంటఁ దిరుగుతున్నాఁడు. వాఁడి చేతిలో యెప్పుడూ కత్తి వుంటుంది. ఈవుపద్రవం తొలగించే ఉపాయం చూడండి.

మంత్రి:—మహారాజు సభలోఁ గూర్చుండి యున్నారు. అక్కడికి పోదాము రండి.

(తెరయెత్తఁగా బసవేశ్వరుఁడు, జగదేవుఁడు, బిజ్జలుఁడు, ప్రవేశింతురు.)

మంత్రి:—మహాప్రభూ! ఈ పౌరు లేదో మనవి చేసికొనుటకు వచ్చిరి.

౧ పౌరు:-ప్రభూ! ఎవఁడో చాకలివాఁడట. వాని పేరు మడివాలు మాచయ్య యఁట. వాఁడు శివభక్తుల వస్త్రములు గాని యుదుకఁడఁట. దారివెంటఁ బోవుచో భవులు వాని వస్త్రములు తాఁకినచోఁ జంపివేయుచున్నాఁడు. వాఁ డొక గంట పుచ్చుకొని దానిని మ్రోగించుచు 'నా కడ్డమువచ్చినచోఁ జంపెద' నని యఱచుచు వీథులవెంటఁ బోవును. నేఁ డొక పరదేశి విప్రుఁడు తెలియక దగ్గరగాఁ బోఁగా వానిని సంహరించినాఁడు. ఆశవముతలగూడఁ గన్పించుటలేదు.

బిజ్జ:—బసవేశ్వరా! ఇది యేమి యాగడము? నీవు మహామాత్యుఁడ వైతివని చాకలులు మాలలు యథేచ్ఛముగాఁ బ్రవర్తించుచున్నారు. ఈ భక్తుల ముందిం కెవ్వరును బ్రదుకుటకు వీలులేదా? ముఱికిగుడ్డలుదుకు చాకలి కింత కావరమా? చీరలు ముట్టుకొనచో ముఱిగిపోవునా? ఊరిలోనివారే యింత యదరిపడి పోఁగాఁ బరదేశి యింక మనయూరు వచ్చి యేమి బ్రతికిపోవును? వాఁడు చాకలియా, రాక్షసుఁడా! జగదేవా! యామికులను బిలిపించి వానిని వెంటనే చంపింపుము.

బసవఁడు:—మహారాజా! "చాకి చాకి యని యేల సందడించెదవు? చాకియే యతఁడు సాక్షాల్లింగమూర్తి. కులజుండు నతఁడె యకులజుండును నతఁడె, కులములేకయు నన్నికులములు నతఁడె. ఆసీలగణు నపరావతారంబు. పరమేశు భక్తుల పరిధానవితతిగాని యొం డుదుకఁడు. వానిని నంటఁగానీఁడు. ఇతరులు ఘుట్టించునెడ భక్తుల చీరలు భక్తుల కిచ్చు, జంగము బడిగిన సమకట్టనిచ్చు. చీరలువైచినవా రడిగినను వారికిఁ దమతమ వస్త్రంబు లిచ్చు. చీరలంటినమాత్రఁ గారించు భక్తుఁ డూరకుండునె చంప కీరుపోయినను వల నభిమానంబు పొలిపుచ్చుకొనరు."

బిజ్జ:—ఏమీ! అభిమానము పొలిపుచ్చుకొందునా? వాఁడు తప్పకుండఁ జంపునేమి? జగదేవా! నీవును యామికులును బోయి దుర్వారాంధకారనామక మదాంధగంధగజంబుఁ బైకొల్పి వానిని జంపిరండు.

(జగదేవుఁడు, మంత్రులు, పౌరులు నిష్క్రమింతురు.)

బసవఁడు:—మహారాజా! పొరపాటు చేయుచుంటివి. అతఁడు చాకలి కాఁడు. బ్రహ్మదేవుని జడలు

జన్నిదములుగ భిక్షించిన బ్రాహ్మణుఁ డతఁడే. అతఁడే యష్టవర్గసామ్రాజ్యమును సహజముగఁ బాలించు క్షత్రియుఁడు. దుర్భవకర్మఘటవహిత్రమును భవాంబుధిఁ ద్రిప్పు వైశ్యుఁ డతఁడే. అతఁడే సత్కార్యములను బండించి నూర్చెడు శూద్రుఁడు. వానికిఁ గులము లేదు. అతఁ డజరామరుఁ. డయోనిజుఁ డవ్యయుఁడు.

బిజ్జ:—వానిపే రేమి ?

బస:—మడివాలు మాచయ్య.

బిజ్జ:—వాని దేయూరు ?

బస:—హిప్పరిగెగ్రామము. నే నమాత్యుఁడ నైతి నని విని నేను శివభక్తుఁడనని యీయూరు చేరినాఁడు. రాజా ! మాచయ్య సాక్షాత్సంగమయ్య. నేను వానికి భక్తుఁడను.

బిజ్జ:—బసవేశ్వరా ! నీవు మహామాత్యుఁడవు కదా ! నీవు వాని నాజ్ఞపెట్టలేవా ?

బస:—నే నతని యాజ్ఞలో మెలఁగువాఁడను.

బిజ్జ:—మంత్రియాజ్ఞలోఁ దక్కువారు మెలఁగుదురుగాని తక్కువారి యాజ్ఞలో మంత్రి యుండఁడు.

బస:—పరమేశ్వరునకు మంత్రియు మంత్రికామియు లేదు. మాచయ్య కారణపురుషావతారుఁడు. వానికిని సంగమయ్యకును భేదము లేదు.

జగదేవుఁడు:—(ప్రవేశించి) మహారాజా ! రక్షింపుము, రక్షింపుము.

బిజ్జ:—ఏమి జరిగినది ?

జగ:—మేముపోయి యేనుఁగుతో వాని రాక కరిగట్టి నిలచితిమి. వాఁడు మమ్మల్లంతఁ బొడగని యార్చి బొబ్బిడుచుఁ 'గల్లినాథుని భద్రగజ మొక్కనరుని యేనికదున్నకు నేల పంకించు, మానవుల్ చావక మగుడుఁ డో'యనుచు మమ్మందఱ నెదుర్కొని గంట మ్రోఁగించి యేనుఁగును దాఁకెను. వాని ధాకకుఁ దాళ లేక యేనుఁ గొత్తిగిల్లెను. మావంతులు పోయి వాని నెదుర్కొనిరి. వాఁడు తనవీపుమీఁద నున్న బట్టలమూటయుఁ జేతిగంటయుఁ జిత్రముగా నాకాశమునం దిరియించి, మావంతులను జంపి యేన్గుతొండము రాదిగిచి త్రొచ్చి యేన్గును నుగ్గునుగ్గుగాఁ బొడిచెను. మాలకు మాంసము, గొడారికిఁ దోలును గాకుండఁ దొలఁగిద్రొ సెను. పైగా నిట్లనెను: "ఎవఁడు నామీఁద ఏనుఁగు నిట్లుసికొలిపెనో యారాజుక్రొ వ్వడగింతు"నని. నేనొక్కఁడనే తప్పించుకొని తమ కిది మనవిచేయుటకు వచ్చితిని.

బిజ్జ:—ఓహో! జగదేవా! కాళతిప్రోలుని మీఁదికి దండయాత్రకుఁ బోయెడు మొనగాఁడవు. వానిమీఁదికిఁ దక్కిన మంత్రులను బంపెదను.

బసవఁడు:—మహాప్రభూ ! మంత్రుల నందఱను వాఁడు చంపును. మన మిర్వరము పోదము.

బిజ్జ:—సరే నడువుఁడు.

(పరిక్రమింతురు.)

బస:—మహాప్రభూ! తమరి కిరువదాండారి కథయు, బాపూరి బ్రహ్మయ్యగారికథయుఁ జెప్పితిని గదా ! మహాభక్తుల లక్షణము లట్లేయుండును. మాచయ్య నన్ను లెక్కచేయఁడు. శివభక్తులుగాని తమ రన్నచో నసలు లెక్కసేయఁడు. హరుఁడు శరభావతార మెత్తినగతి విజృంభించు నతనిముందు మన సైన్యములు, మనశక్తులు ఆఁగవు.

బిజ్జ:—అయినచో మఱి యేమిచేయుమందురు?

బస:—అతఁడు పరమేశ్వరుఁడే కాకున్న బట్టలమూటయు, గంటయు నాకాశమునం దిరియింపఁగలఁడా! మనుజుని తలఁ గొట్టినచో నేలఁ బడదా ! ఏనుఁగు తోలు మాంసములు కన్పింపకుండ నెవఁడైనఁ జంపఁగలఁడా ? మన మతనిఁ బోయి శరణుచొత్తము. ధూర్తులమై పోయినచో నతఁడు మనలనుగూడఁ జంపును.

జగ:—బసవేశ్వరా! అతఁడు మహాభక్తుఁడే కావచ్చును. లోకదృష్టికిఁ జాకలిగదా! త్రిభువనమల్ల దేవుఁ డాయనను శరణుచొరరాదు.

బస:—జగదేవా ! మంచిమాట చెప్పితివి. రాజట్లు చేయవలదు. అచ్చట బండారి బసవయ్యగారుందురు. ఆయన మాచయ్యగారి భక్తుఁడు. ఆతనితోఁ జెప్పించెదము.

(తెరయెత్తఁగా మాచయ్యయు, నాతనికి సాష్టాంగనమస్కారము చేయుచున్న బండారి బసవయ్యయుఁ గన్పింతురు.)

బసవేశ్వరుఁడు:— మాచయ్యగారూ ! క్షమిం చాలి. పక్షిమీఁదఁ బాశుపతం తొడుగుతారా ? ఈ రా జనఁగా యెంత? ఈరేడులోకాల్లో నీ కెదు రెవఁడు? ఈతప్పు క్షమించాలి.

మాచయ్య:—ఏతప్పు క్షమించాలి? నీవు చేసిన తప్పా, నీరాజు చేసిన తప్పా ? నాలుగులక్షల అరవై వేల గీతాలు వ్రాశాననా నీ కహంకారము? నీయంత సంగీత పాటకుఁడు లేఁడనా నీపొగరు ? ఓరి అవినీతుఁడా ! కల్లి నాథుఁడు నీతప్పును క్షమిస్తాఁడా ? నీవు వ్రాసిన ఆ పాడు గీతం విని నేను శివశివాయని చెవులు మూసుకొన్నా నే. నీవు కుబేరుఁడివిరా! శివభక్తులందఱూ నీకు యాచకులా? గొప్పమంత్రి వైనావు. అధముఁడా ! అడిగేవారు లేక యిట్లా బడగవైపోయినావు. అటువంటి యాచకుల్ని చూస్తున్నా గాని యిట్లాంటి యాచకుల్ని చూడటం లేదు.

బస:—మాచయ్యా, క్షమించు, క్షమించు.

ఆక్రాంతసంతతాహంకారనిరతు
నక్రమాఁటాపు నిర్వక్రాపరాధు
నూర్జితక్రోధు వివర్జితసత్యు
దుర్జనాచారు ననిర్జితకాము
నజ్ఞానపుంజమ్ము నపగతశౌచు
విజ్ఞానహీను వివేకవిదూరు
నిర్భాగ్యచూడామణిని భక్తిరహితు
దుర్భావకు నవినీతుని నన్ను నింక
గాచి రక్షింపవే కారుణ్యపాత్ర
యేచిన మద్గర్వ మెల్ల మాయించి.

ప్రభూ ! సంగమేశ్వరా ! నాల్గులక్షల యఱువది వేల గీతముల గర్వముచే నాతల తిరిగిపోయినది.

మాచయ్య:—ఓరీ బసవా ! యాచకులగు శివ భక్తులకు నీ విచ్చు నేనికలు దున్నలు. నీవిచ్చు గుఱ్ఱములు గాడిదలు. నీ విచ్చు నగ్రహారములు పచ్చమన్ను. ఛీ ఛీ నీమొగము నేను జూడను.

బిజ్జలుఁడు:—( సాష్టాంగపడి ) మాచయ్యా ! రక్షించు! రక్షించు! నీవే పరమేశ్వరుఁడివి. నీవు శివుఁడ వని తెలుసుకోలేక మోసపోయాను. బసవేశ్వరుఁడు నీకు నిజమైన భక్తుఁడు. ఆయన్నీ నన్నూ నీవు రక్షించాలి. భక్తుల్ని దైవం రక్షించకపోతే మఱెవరు రక్షిస్తారు ?

మాచయ్య:—రాజా! లే! లే! బసవఁడు మా ముద్దుబిడ్డ. వాణ్ణి మే మేమి చేస్తాము ? బసవా ! సేద దేరవోయి, సేద దేరు.

బస:—

నీమహత్త్వము చూడ నే నెంతవాఁడ
ధీమణి సంగయ్య, దేవ! మాచయ్య
నీవు శంకరుఁడవు నేను గింకరుఁడ
నీవు నిర్మలుఁడవు నేను దుర్మలుఁడ
నీవు విజ్ఞానివి నే నవిజ్ఞాని
నీ వమృతాంగుండ వే విషాంగుండ
స్వామి త్రైలోక్యచూడామణి వీవు
భూమి నిర్భాగ్యచూడామణి నేను.

మాచ:—బసవా ! బసవా ! నీ వెవ్వరు, నే నెవ్వరు ? నేను వట్టి చాకలివాఁడను. నీవూ మీ సంగమయ్యా దేవుళ్లు. నేను శివభక్తుల కాలిదుమ్మును. రాజా ! నీయేనుఁగులూ మావతులూ చచ్చిపోలేదు. ఆ బ్రాహ్మఁడూ చావలేదు. వాళ్లను నే బ్రతికిస్తాను. మీరు పదండి. మీ వెంటనే వాళ్లూ వస్తారు.

(మాచయ్య నిష్క్రమించును.)

బిజ్జ:—బసవేశ్వరా ! మీ రేమి తప్పు చేశారు ?

బస:—నే నొక గీతం వ్రాశాను. అందులో అహంకారం చూపించాను. నే నర్థార్థికల్పశాఖి నని, యాచకులందరికీ అడిగినదల్లా యిస్తానని అహంకారంగా వ్రాశాను. మాచయ్యగారు నాకు తగినశిక్ష చేశాఁడు.

జగ:—మహాప్రభూ ! అదిగో మావంతులతో దుర్వారాంధకారమత్తగజము వచ్చుచున్నది. ఆ పరదేశివిప్రుఁడుకూడ ద్రుళ్లిసలాడుచుఁ గేకిసలు కొట్టుచుఁ బోవుచున్నాఁడు.

బిజ్జ:—జగదేవా ! ఏనుఁగును గొట్టములోఁ గట్టివేయు మనుము. నే నంతఃపురమునకుఁ బోవు చున్నాను. మీ రందఱు మీమీపనులమీఁదఁ బొండు.

(మంత్రులందఱు నిష్క్రమింతురు.)

బిజ్జ:— నామనస్సు వీరశైవముఖముగాఁ దిరుగు చున్నది.

నీలలోచన:—(ప్రవేశించును.)

శివ నీ యడుగులు తేవే చివురాకులఁ బూజించెద
తవిలి బూజ పట్టకుండ గవుసెన వేసెద వానికి ॥శివ॥
శివ నీ జడ లిటు తేవే పువులు దవనమును పెట్టెద
గవిసి మంచు కప్పకుండఁ గై జతలోపలఁ బొదిగెద ॥శివ॥
శివ నీ పాపనగలు తేవే చిచ్చికొట్టి జోకొట్టెద
నవియఁజేయు విసములపై నమృతము నవ్వులు చిలికెద ॥శివ॥
శివ కట్టు కళాసము తేవే తవిలిన దుమ్మును దులిపెద
తొవలబావికాడ నుదికి తొగరువన్నె తెప్పించెద ॥శివ॥
శివ నీ గొంతుక దేవే తవిలి నలుపు తుడిచివేతు
పువుబూడియ పట్టించెద శివనేత్రము కట్టించెద ॥శివ॥

బిజ్జ:—చెల్లీ ! ఈపాట యెక్కడ నేర్చావు ?

నీల:—నేనే పాడుతున్నాను.

బిజ్జ:—నీవు కవివా యేమిటి ?

నీల:—నేను గాదు కవిని. శివుఁడు కవి.

బిజ్జ:—అంటే ?

నీల:—నాలో ఆయ నుండి పాడిస్తున్నాఁడన్న మాట.

బిజ్జ:—అటువంటిపాట నీవు వ్రాయలేవు.

నీల:—ఎందుకు వ్రాయలేను ? బసవఁడు—

బిజ్జ:—బసవఁ డెవరు ?

నీల:—పెద్దమంత్రి బసవేశ్వరుఁడు.

బిజ్జ:—ఆయన నీకు బసవఁడా ?

నీల:—బసవఁడు కాదు, బసివిగాఁడు. వాఁడు నాలుగులక్షల అరవై వేల పాటలు వ్రాశాఁడఁట సంగ మయ్యమీఁద. ఆ సంగమయ్య మాశివయ్యకన్న యెక్కువవాఁడా ?

పాట:—

శివా ! నీవా ! సంగమయ్యా యెవరెక్కువా ?
యెవరెక్కువయ్యా ? శివా
యెవరెక్కువయ్యా ! సంగమయ్యా !
అలా సంగమయ్యకు ఇలా శివయ్యకుం బలె జడలున్నవా ?
జడలపై సురమకుస తొడుక్కాడునా ?
మకుగు ఒడ్డున చందమా మున్నదా ?
మామ వెన్నెలలు ఒళ్లంతాను బూదల్లె ప్రాకున్నదా ?
శివా ! నీ వెక్కువా ! సంగమ య్యెక్కువా ?
అలా సంగమయ్యకు ఇలా శివునివలె పులితో లున్నదా ?
తోలుపై జిలుగారు మ చ్చున్నదా ?
మచ్చమచ్చకు మధ్య మణగియుండిన నెమ్మికను లున్నవా?
కనులలో బంగారుకాం తున్నదా ?
కాంతిలో జిలుగారు కై పున్నదా ?
కైపుతో వడిదుడుకుగా నన్ను నాడించు కాపున్నదా !
శివా ! నీ వెక్కువా సంగమ య్యెక్కువా ?
అలా సంగమయ్యకు ఇలా శివునకుం బలె యెక్క యెద్దు [న్నదా ?
యెద్దుపై బంగారుజీ నున్నదా ?
జీనుపై నందాలగా రున్నదా ?
గొరుకన్నులలోని కలకలల తలతలల కమ్మదన మున్నదా,
సంగమయ్యా ! నీకు ! సంగమయ్యా !

బిజ్జ:—నీలా ! అమ్మా ! బసవని నెప్పుడైన చూశావా ?

నీల:—చూశానా ? మే మెప్పుడూ కలిసే వుంటాంగా !

బిజ్జ:—ఇప్పు డేఁడీ !

నీల:—ఉన్నాఁడులే, నీకు తెలియదు.

బిజ్జ:—నీవు పిచ్చిదాన వైపోతున్నావు.

నీల:—నీ కిష్టంలేకపోతే వెళ్లిపోతున్నాను లే.

బిజ్జ:—కాదు, కాదు, వెళ్లవద్దు. వెళ్లవద్దు, ఇంకోపాట పాడు.

నీల:—అన్నా ! నా కేమిపాటలు వచ్చు ?

బిజ్జ:—ఇప్పుడు రెండుపాటలు పాడావుకదా !

నీల:—నేను పాడలేదే.

బిజ్జ:—అయితే వెళ్లు.

నీల:—(పోవుచు)

శివుని మెత్తగొంతుకెల్ల చేదువిసము కందించునో
శివుని బెడగునాడలు పట్టి చిలువనగలు నొరిపించునో
యేమిసేతు నేమిసేతు నిల్ల శివుని కేమాదును — శివుని.
పైని గంగ తండ్రి కెంత బరువుచేసి యలయించునో
పూని చందమామ తాను మోయరాక బరువౌనో
యేమిసేతు నేమిసేతు నిల్ల శివుని కేమాదునో — శివుని

(నిష్క్రమించును.)

బిజ్జ:—ఆహా ! ఈబిడ్డ మహాభక్తురా లగు గుచున్నది. తన భక్తి తనకుఁ దెలియుట లేదు. బసవే శ్వరున కీపిల్లసంగతి తెలియదు. తెలిసినచో నేమి సేయునో ! జగమ్ము కర్మప్రధాన మని లోకము వంచింపఁ బడుచున్నది. భక్తిలో నున్న పారవశ్యము మోక్షమే. మోక్షమునకును దానికిని భేదము లేదు.

(త్రిపురాంతకభట్టు ప్రవేశించును.)

బిజ్జ:—భట్టారకా ! మాచయ్యకథ విన్నారా ?

త్రిపు:—వింటిని. మీయుద్దేశ్య మేమి ?

బిజ్జ:—అతఁడు శివావతారము.

త్రిపు:—మహాప్రభూ ! భక్తి వేఱు. భక్తి విషయమైన శివుఁడు వేఱు. వాఁడు శివభక్తుఁడు కావచ్చుఁగాని శివుఁడు కాఁడు.

బిజ్జ:—శివునకు శివభక్తునకు భేదము లేదు,

త్రిపు:—ప్రభూ! బసవేశ్వరుని మతము మీకు రుచించుటలో నాశ్చర్యము లేదు.

బిజ్జ:—నేను గ్రుడ్డిగా నవలంబించుట లేదు.

త్రిపు:—నేను సెలవుతీసికొందును.

(నిష్క్రమించును.)

(తెరలో ధ్వని.)

బిజ్జ:—జగదేవుఁడు దండయాత్రకు బయలు దేరుచున్న ట్లున్నది. జగదేవుని బంపించకముందు బసవేశ్వరుని యాశీర్వాదము పొందవలయును.

జగదేవుఁడు:-(ప్రవేశించి) మహారాజా! సర్వము సన్నద్ధమైనది. ప్రభువుల యనుజ్ఞయే యాలస్యము.

బిజ్జ:—బసవేశ్వరునకుఁ గబురంపించవలయును.

జగ:—వా రిదే వచ్చుచున్నారు.

(అంతట బసవేశ్వరుఁడును, మంత్రులును ప్రవేశింతురు)

బిజ్జ:—మహామాత్యా! నమస్కారము. జగదేవుని యుద్ధమునందు గెలుచునట్లు మీ రాశీర్వదింపవలయును.

నీశివభక్తి కారణము నేలకు నాకును నీప్రసాదరే
ఖాళమితంబులై యడఁగుఁ గష్టములెల్ల భవాబ్ధిపోత! నా
యాశలనెల్ల నీబుజమునందునఁ బెట్టితిఁ గేల్చు మంచు నీ
వే శరణంటి సద్గుణనిధీ! బసవా! బసవా! వృషాధిపా!

బస:—మహారాజా! శివుని దయచేతఁగాక మన మెవరిచేత నేమగును? అతఁడు మనల గెలిపింపఁ దలఁచినచో గెలిపించును; ఓడింపఁ దలఁచినచో నోడించును.

జగ:—బసవేశ్వరా! అట్లు కాదు. నీనోట నాశీర్వాద మొక్కడు వచ్చెనేని మా కది చాలును. మేము జగములెల్ల గెలిచెదము. స్వామీ! నీమాట మీఁద జగములు నిలువక యెట్లు తప్పించుకొని పోఁగలవు? నీవే సంగమేశ్వరస్వామివి. నీవే బసవేశ్వరుఁడవు.

బస:—జగదేవా! నే నమాత్యుఁడను; రాజనీతివేత్తను. శివునియందు నాకుఁ గొంతభక్తి కలదు. నామాటకుఁ బ్రపంచములు నిలుచునా!

బిజ్జ:—బసవా! పరాఙ్ముఖుఁడవు గాకుము. కాకతీయులు చాళుక్యులకు సామంతులు. చాళుక్యవంశమే నేఁడు కాలచుర్యవంశమైనది. అందుచేత మనకును వారు సామంతులు గాకతప్పదు.

జగ:—నీదయచేత మేము రిపుల గెలువఁజూచుచుంటిమి. మీరు మ మ్మాశీర్వదింపకతప్పదు.

బస:—జగదేవా! శివుని దయ యున్నచో గెలుతువుగాక, పొమ్ము. విభూతి సర్వరక్షగా భావింపుము. లింగధారణములేక శివభక్తుఁడు కాఁడు. నీవు భవివి. శివుఁడు ని న్నెంత చూచిన నంత చూచును.

బిజ్జ:—బసవేశ్వరా! జగదేవుఁ డిదివఱకు గెలిచిన యుద్ధము లన్నియు భవిగానే గెలిచెను. నీ యాశీర్వాద మున్నచో దీనినిగూడ భవిగానే గెలుచును.

బస:—నాయాశీర్వాదము వచ్చినది.

(అందఱును బర్మిక్రమింతురు.)

బిజ్జ:—జగదేవా! గెలిచిరమ్ము, పొమ్ము. బసవేశ్వరుని యాశీర్వాదము వచ్చినది. ప్రోలునకు బుద్ధిచెప్పి రమ్ము.

మా సామంతుఁడు గాగ నుండక నిలింపజ్యేష్ఠుఁడైనన్ రణ
వ్యాసంగంబున నిల్వలేఁడు జగదేవా! నీభుజప్రౌఢి స
ర్వాశానేకపకుంభపాటనకళావ్యాపారపారీణతా
భ్యాసం బైనది గెల్పిరా! ప్రళయమార్తాండప్రతాపార్చిషే!
అదిగో త్రిశూలమ్ము పియ
త్పద మెల్లను నావరించె ప్రళయానేహోఽం
బుదమాలాక్రాంతిఁ జెడిన
చిదుకుల యాతపములట్లు చెడు రిపుబలముల్.
మాబసవేశ్వరుం డిల కమాత్యుఁడుగా నెపుడయ్యె నప్పుడే
మాబవరంబులన్ గెలుపు మాడి, రిపుల్ వినమచ్చిరల్ మదా
జ్ఞాబధిరత్వ మేచి యనిఁ జత్తురు కాలమరీప్రభాచ్ఛటన్
గూబలబోలె దాగుకొన గూళ్లులు లేక చరింతు రెల్లెడన్.

(తెర.)

# ఋగ్వేదము - విమానములు

మండపాక పార్వతీశ్వరశాస్త్రి

ఏదైనా వింతవస్తువు విదేశాలనుంచి వచ్చినప్పుడు మనము చూచి ఆనందించడానికి మారుగా "ఓ. దీనిలో ఏముంది? మా తాతల నాడు మన దేశంలో ఇంతకన్నా గొప్పవస్తువులు ఉండేవి" అనడం మనకు అభ్యాసమై ఉంది. వాయువిమానాలు మొట్టమొదట మన దేశంలోకి వచ్చేటప్పుడు "మన రామాయణంలో పుష్పకవిమానం లేదురా? ఇదీఅంతే" అనేవాళ్లము. విమానాలు దినదినాభివృద్ధి పొందసాగినవి. యుద్ధపరికరాలు చేర్చి, విమానాలతో వాయుపథంలో యుద్ధము చేయడం ఆరంభమైంది. సౌభకవిమానం జ్ఞాపకానికి వచ్చినది.

"కామగమనంబును, సతిని స్సృతంబునుగా మయుండు లోహంబున నిర్మించిన" యీ సౌభకవిమానము "వలయునెడల నభ్రపదంబున దిరిగెడునట్టి మహితవాహన"మై ప్రాచీనభారతీయ విజ్ఞానసూచకమైన విషయం గోచరించేది. అందులోనూ పోతన్నగారు చెప్పిన

"ఒకమాటు నభమున బ్రకటంబుగా దోచు
నొకమాటు ధరణిపై నొయ్య నిలుచు
నొకమాటు శైలమస్తకమున వర్తించు
నొకపరి చరియించు నుదధినడుమ
నొక్కతోయంబున నొక్కటియై యుండు
నొక్కెడ గనుగొన నెక్కలసును
ఒకమాటు సాల్వసంయుక్తమై పొడసూపు
నొకతోయ మన్నియు నుడిగితోచు
నొక్కతేప కొఱవి యుడుగక త్రిప్పిన
గతి మహోగ్రవృత్తి గానవచ్చు
మఱియు నెక్కగతుల నరివరుల్ గలగంగ
దిరిగె సౌభకంబు ధీవరేణ్య"

అనేపద్యం చదువుతూ ఉన్నప్పుడు పోతన్న ఈ ఇరవైయొకశతాబ్దంలో విమానయుద్ధాలు చూచి పద్యం చెప్పేడా అన్నట్టు ఉందిరా అనుకొనేవాళ్లం.

రానురాను విమానాలలో క్రీడాసౌకర్యాలుకూడా ఏర్పాటు అవుతూ ఉన్నవని చదువుతూ ఉన్నప్పుడు భారతం సభాపర్వంలో మయసభ జ్ఞాపకానికి రావడమేకాకుండా దేవతల ఇతరసభలుకూడా జ్ఞాపకానికి వచ్చేవి. భారతసభాపర్వంలో సభ అనేపదం ఇప్పుడు సభలు (Meetings) అనే పదంవంటిది కాదు. ఈసభలు అత్యుత్తమశ్రేణిలో చేరిన విమానాలే అయి భారతీయుల శిల్పకళాచాతుర్యమునకు నిదానాలై యుండినవి.

ఇంద్రసభ "వైహాయసం బయి, కామగమనం బయి, వ్యపేతశీతాతపం బయి, సకలకాలకుసుమ ఫలభరిత పాదపవన సంకీర్ణ సరోవరవిరాజితం బయి" నట్లు దేవేంద్రనిర్మితమైనదట. యమసభ "కామగామియును, సూర్యతేజోనిభ శుభతేజంబును, సర్వసుఖ సంపాదనంబును నై చూడ నొప్పుచుండె" నట. వరుణునిసభ "యమరాజు సభయంతియ విస్తారాయామరామణీయకంబును, కామగామిత్వంబును గలిగి, విలసిల్లి, జలస్తంభనంబు నేసి, జలంబులలో నుండి విశ్వకర్మ రమణీయముగా రచించిన"దట. కుబేరుని సభ "గగనచరంబయి, కనకమయ తరులతాలంకృతం బయి, తటిల్లతా విచిత్రశరదంబుదంబు ననుకరించుచుండె"నట.

ఈ వర్ణనలు చూస్తే దిక్పాలకులందరకూ ప్రత్యేకప్రత్యేకముగా సభలనేపేరుతో విమానాలు ఉండేవనీ, అవి నేటి పాశ్చాత్యనిర్మిత విమానాలవంటివే యై, అంతకన్న నత్యుత్తమశ్రేణిలో చేరినవై, ఆటలకు, పాటలకు వీలైన క్రీడాసరస్సులు వగైరాలు కలవై యుండినట్లు కనపడుతూ ఉన్నది. అయితే ఇవన్నీ పుక్కిటిపురాణాలని ఒక్కమాటలో కొట్టిపారవేయడం సులభమైనపని, మనలో రెండురకాలవాళ్లు ఉండడంచేత. మా తాతలు నేతులు తాగేవారని [illegible] చెప్పుకొని తిరిగే రకం ఒకటి; పురాణాలన్నీ బూటకాలని కొట్టిపారవేసే రకం ఒకటి. ఈ రెండే రకాలుగాని మూడోరకం లేదు. విచారించేవారూ లేరు, విచారణ చేసేవారూ లేరు. పురాణాలలో విమానాల వర్ణనలు చదువుతూ ఉన్నప్పుడు ఇవి నిజంగా పుక్కిటిపురాణాలేనా అని తోస్తూ ఉండడమే కాకుండా అవి అబద్ధాలే అయితే ఈకాలపు విమానాల వర్ణనలతో ఏలాగు సరిపోతూ ఉన్నాయి అని సందేహంకూడా కలుగుతూ ఉంటుంది.

ఇక మనకు పరమప్రమాణం వేమయగారి వేదం ఒకటి ఉన్నది. అది ఏదంటే తెల్లవారి బొల్లిమాటలు. మన వాఙ్మయానికి శ్వేతమహర్షులు "నిఖిల పురాణవ్యాఖ్యానవైఖరీ" సమేతులై సాయించిన సాయింపులు. ఈసాయింపులు మహాచిత్రంగా ఉంటాయి.

మాక్‌డొనాల్డు దొరగారు సెలవిచ్చిన ఈక్రింది వాక్యాలు చిత్తగించండి:

"డుగాల్డు స్టూవార్టు అనే తత్త్వదర్శి భారతీయ విజ్ఞానమునుగూర్చి ఒకవ్యాసము వ్రాసి ఉండెను. అలెగ్జాండరుగారుహిందూదేశమును జయించినపైని, గ్రీకువారి వాఙ్మయమును, గ్రీకువారి భాషయును గమనించి వాటికి ఫోర్జరీగా (కృత్రిమానుకరణముగా) ఉండేటట్లు కపటచర్యగల బ్రాహ్మణులు సంస్కృత వాఙ్మయమున్మాత్రమే కాకుండా సంస్కృత భాష అంతాకూడా కల్పించినారని ఆయన ఆవ్యాసములో ఋజువుచేయడానికి ప్రయత్నించెను. ఆదరిమిలాను క్రీ. శ. 1838 ప్రాంతములో డబ్లిను నగరములోని యొక సాహిత్యాచార్యుడు పై యభిప్రాయమును మిక్కిలిగా బలపరిచెను."

పాశ్చాత్యులు నిర్మించిన భారతీయవాఙ్మయపరిశోధన సౌధానికి వేసిన పునాది ఎంత చక్కగా ఉన్నదో చూచి ఆనందించండి. ఇక ఆసౌధరాజం ఎంత మనోహరంబుగా వెలుగుతుందో ఆలోచించుకోండి.

ఏదో తప్పి చెడి పుట్టిన వైదికవాఙ్మయం ఆలాగు విడిచిపెట్టివేసి చూస్తే పాశ్చాత్యుల దృష్టిలో భారతీయ వాఙ్మయం అంతా అలెగ్జాండరుగారిద్వారా భారతీయులు భుజించిన గ్రీకువారి ఎంగిలిప్రసాదమే. పాపం,

అలెగ్జాండరుగారు భరతవర్షానికి దయచేసి నప్పుడు గోదాంతో గోదామెడు గ్రీకు పండితులను భరతవర్షానికి తీసుకొచ్చేడట.వారంతా విజ్ఞానసంతర్పణ చేసివేసి వెళ్లిపోయినారట. అందుచేత మనకు విజ్ఞానంలోని ఏవిషయమైనా వారిచ్చిన భిక్షయేనట! పోనీ ఇతర శాస్త్రాలిలా, కళలూ, వీటిమాటకేమి గాని, చిట్టచివరకు పిట్టకథలు కల్పించుకోవడానికి కూడా మనకు స్వతంత్రత లేదు. అదీ గ్రీకు దేవుళ్ల ప్రసాదమే. అలెగ్జాండరు పూజారి గారు గ్రీకుదేవుళ్లకు నైవేద్యంపెట్టి భారతీయులకు సంచిపెట్టిన ప్రసాదాలు ఇన్నీ అన్నీ కావు. చూడండి మాక్డొనాల్డుగారి వాక్యాలు :

"ఈ విధముగా కట్టుకథలూ, పిట్టకథలూ కల్పించుకోవడంలో భారతీయులకు ఐరోపావారు మధ్యయుగంలో ఋణపడిఉన్నా, ప్రాచీనయుగములో కట్టుకథలూ,పిట్టకథలూ కల్పించడంలో భారతీయులే మొట్టమొదటివారని చెప్పడం సత్యమునకు దూరమైనమాట. ఈసపు, బేబ్రియస్ అను గ్రంథకర్తల కథల సంపుటిలలో భారతీయులకథలకు దరిదాపుగా ఉన్న కథలు కనబడుతూఉన్నవి. భారతీయుల కథలలో ఉన్న నక్కకూ సింహానికీ అనుబంధము సూచించే కథలు స్వభావసిద్ధముగా ఉన్నవనిన్నీ, గ్రీకువారి కథలలో నక్కకూ సింహానికీ అనుబంధము సూచించే కథలలో పునాదియే లేదనిన్నీ భారతీయపక్షవాదులు చెప్పతారు. ఈవాదానికిప్రతికూలంగా ఉండేవారు చెప్పేదేమంటే, భరతవర్షములోమాత్రమే ఉండే జంతువులకూ పక్షులకూ జరిగే సంభాషణలు భరతవర్షపు కథలలో చాలా తక్కువగా ఉన్నవనిన్నీ, క్రీస్తుపూర్వము ఆరవ శతాబ్దానికే నక్కా, కాకీ, వీటినిగురించిన కథ గ్రీకువారి కథలలో కలదనిన్నీ. భారతీయులు గ్రీకువారి వద్దనుండి కొన్నికథలుమాత్రమే సంగ్రహించుకొన్నారనిన్నీ, అంతకుపూర్వమే వారికి కొన్ని స్వతంత్రకథలు కలవనిన్నీ వీబరు, బెన్ఫే అనే పండితులు నిర్ణయించినారు."

మ్రింగలేక కక్కలేక, చచ్చీ చెడీ శాయంగల విన్నపాలుగా వ్రాసిన ఈ వాక్యాలు చదివితే నవ్వు రాకుండా ఉంటుందా ? కొన్ని-కొన్ని మాత్రమే - కథలు. గ్రీకువారి వద్దనుండి ఎరువుతెస్తేగాని, పాపం, మనవాళ్లకు జరిగిందికాదు. ఏం చేస్తాం మరి విధిలేక పోయినప్పుడు ?

ఈలాంటి భావాలలో పుట్టి పెరిగిన పాశ్చాత్యులు వేదవిమర్శలు చేస్తారు; వైదిక వ్యాఖ్యానాలు చేస్తారు. ఋగ్వేదభాష్యాన్ని గురించి మాక్డొనాల్డుగారు వ్రాసిన వాక్యాలు చూడండి :

"వైదికవాఙ్మయమునకు వ్యాఖ్యానములు చేయడంలో భారతీయ వ్యాఖ్యాతలు తాత్కాలికకష్టములను తొలగించుకోవడానికి మాత్రమే ప్రయత్నించినారు. ఆప్రయత్నములవల్ల భాషాసమన్వయములో తబ్బిబ్బులు చేయడం మాత్రమే కాకుండా ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికవిషయములలో విస్మృతకాలములోని భావాలను సమకాలికభావాలతో సరిపెట్టి ముడిపెట్టడమే ఫలితమైనది."

అత్యాధునికు డగు సాయనాచార్యులు విస్మృతార్థమగు వైదికవాఙ్మయమునకుచేసిన యర్థము సక్రమముగా లేదని మాక్డొనాల్డుగారు వ్రాస్తే నిజమే అనుకొన్నాము. కాని ఇది సవతితల్లిప్రేమరా యని అనుకోలేదు. భారతీయుల నాగరికత అత్యుచ్చదశలో ఉన్నప్పుడు పుట్టిన వైదికవాఙ్మయానికి నాగరికతక్షీణించిననాటి సాయనాచార్యులు వ్రాసిన వ్యాఖ్యానము చాలదని అనుకోవడంలో మన కేమీ సందేహం లేదు. అయితే పాశ్చాత్యులు చేసిన దేమిటి? నీ యెడమచేయి తీసివేయి, నా యేదో చెయ్యి పెడతా నన్నట్లు, వేదకాలమున భారతీయుల నాగరికత శైశవావస్థలో ఉన్నట్లు ఋజువు చేయడానికి ప్రయత్నించడమే చాలా అద్భుతము. మాక్డొనాల్డుగారి వాక్యాలుచూడండి:

"ఇతరవాఙ్మయములలోకన్న వైదికవాఙ్మయములో భావపరిణామమున ప్రాచీనతర దశ కనబడుచున్నది. ప్రకృతిలో గల శక్తులు దేవతలుగా మార్పుచెందుటలో గల క్రమమును అవగాహనము చేసికొనుటకు తగినంత ప్రథమావస్థను ఆ వాఙ్మయము సూచించుచున్నది. నాగరికత చాల తక్కువగా ఉన్న జాతులలోని మనుష్యునివలె వైదికకాలములోని భారతీయుడు మామూలు పనిపాట్లు చేయగల మనుష్యులు చేసేవి కాకుండా ఉండే ప్రకృతిసంబంధమైన పనిపాట్లను గమనించినప్పుడు వాటికి కారణములయిన ప్రకృతిశక్తులలో మనుష్యత్వమును సహజముగా భావించుచుండెను. ప్రకృతిశక్తులు చేయుచుండే ఆశ్చర్యములను చిన్నపిల్లలవలె చూచి అద్భుతమును పొందుచుండెను."

పైదానిలో క్రిందగీతలు గల పదములు చూడండి. వేదార్థము యథార్థముగా నిర్ణయించడానికి సాయనాచార్యులుగారి వ్యాఖ్యానము చాలదన్నమాట సత్యమేగాని, ఋగ్వేదకాలమునాటి భారతీయ విజ్ఞానము శైశవావస్థయం దుండెనా, లేక పరిపక్వదశయం దుండెనా యను విషయముమాత్రము విచారణీయమైయే యున్నది.

ఇంద్రుడు, మిత్రుడు, వరుణుడు మొదలుగువా రందరూ ఆకాశముమీద నక్షత్రాలే గాని దేవతలూకారు, మనుష్యులూకారు అనే సిద్ధాంతాలను బలపరచే విద్వాంసులకు మేము చేయవలసినది నమస్కారమే. వారితో మాట ఏతగవూ లేదు. వారి లోకమే వేరు, మా లోకమే వేరు. అయితే ఈ ఇంద్రుడూ, మిత్రుడూ, వరుణుడూ మొదలుగువా రెవరు అని ప్రశ్న. పాశ్చాత్యు లేమన్నా రంటే—

"ఋగ్వేదములోని మంత్రములు దేవతలను గురించిన ప్రార్థనలే కావున వాటిలోని విషయములు చాలవరకు ఆధ్యాత్మిక కల్పితగాథలే.***సూర్యుడు, సూర్యోదయము, అగ్ని, వాయువు మొదలగు ప్రకృతిశక్తులే మనుష్యత్వారోపణమును పొంది, ఋగ్వేదములోని ప్రధానదేవతలైనవి. ప్రాచీనతరకాలమునుండి వచ్చుచున్నవా రగుటచే, ఈ దేవతలలో భౌతికశక్తులరూపమైన పునాది కొంచెం మెక్కువతక్కువగా కనబడుచునే యుండును.(ఇక్కడ ప్రాచీనతరకాలమనగా ఆర్య

లు భరతవర్షమునకు వచ్చుటకు పూర్వపు కాలమని ఉద్దేశము.)"

వీరి ఉద్దేశంలో ఈ ఇంద్రుడూ, మిత్రుడూ, వరుణుడూ మొదలనువారు ఆకాశం మీద నక్షత్రాలు కారుగాని, ప్రకృతిలోగల శక్తులే. వీటికి కవులు మనుష్యత్వము ఆరోపణచేసి వర్ణించినారు. అయితే, ఇక్కడ పెద్దచిక్కొకటి వచ్చినది.

"కొందరు దేవతలను యుద్ధవీరులనుగా చెప్పిఉన్నారు. వీరు కవచములను, కిరీటములను ధరించి, బల్లెములను, గండ్రగొడ్డళ్లను, విండ్లను, అమ్ములను చేత బట్టుకొన్నట్లు చెప్పియున్నారు. వీరందరును వాయువులో దివ్యరథములపైని సంచారముచేయునట్లును ఆ రథములను తరుచుగా గుఱ్ఱములుగాని, ఒక్కొక్కప్పుడు ఎడ్లు, మేకలు, లేళ్లుగాని లాగుచున్నట్లును చెప్పియున్నారు. ఈ రథములపైని ఈదేవతలు యజ్ఞములలో కూర్చుండుటకు వత్తురట."

ఈ వర్ణనలనుబట్టి ఈ దేవతలు ప్రకృతి శక్తులా, మనుష్యులా అన్న సందేహం కలగడంలో అన్యాయమేమీ లేదు. కాబట్టి, ఉద్దేశం కొంచెం వివరించి వ్రాస్తాను. నేను చేయబోయేది ఋగ్వేదములోని విమానములనుగూర్చిన ప్రశంస. ఈ ప్రశంస వరుణదేవుని సుజించిన కొన్నిమంత్రాలలో కనబడుతూఉన్నది. గనుక వరుణునిగురించి మాక్డొనాల్డుగారు ఏమి వ్రాసినారో చూశాం:

"ఆకాశమునందలి దేవతలలో ఇంకను ప్రధానుడొకడు కలడు. ఆయన వరుణుడు. ఆయనయందు మనుష్యత్వారోపణ చాల లోతుగా పోయినది. కావున ఆయనప్రవర్తనలోని విషయములవల్లమాత్రమే ఆయనను కల్పించుటకు మూలభూతమైన ప్రకృతికార్యములను తెలిసికొనవలసియున్నది. ఆయన ఉత్పత్తినిగూర్చి తెలిసికొనుటలో గల యీ అగోచరత్వమునకు కారణములు, ఆయన భరతవర్షమునకు ఆర్యులు వచ్చినతరువాత కల్పింపబడినవాడు కాక తత్పూర్వమే ఆర్య విజ్ఞానములో చేరినవాడయియుండుటయు నుఆయన పేరు "ద్యుః" అనేధానివలె ప్రకృతి కార్యములను సూచించునది కాకపోవుటయును అయిఉన్నవి. వరుణ అనేపేరు మొట్టమొదట ఆవరణరూపమైన ఆకాశము అర్థముగలదిగా ఉన్నట్లు కనబడుచున్నది. వేదములోని వరుణపదము గ్రీకుభాషలోని "ఔరనస్" పదముతో సంబంధముగలదిగా కనబడుచున్నది. కాని ఈ రెండుపదములును ఒక్కటే అని భాషాతత్త్వశాస్త్రమువల్ల ఊహించుటకు కష్టముగానే ఉన్నది. *** ఆకాశముపైని పక్షు లెగురుటనుగూర్చి వరుణు డెరుగును. సముద్రముపైని పోయే నౌకల మార్గములు వరుణు డెరుగును. దూర సంచారము చేసే వాయువుయొక్క మార్గమును వరుణు డెరుగును. ఇదివరకు జరిగినవియును, ఇకముందు జరుగబోయేవియును అగు అద్భుతములను వరుణు డెరుగును."

వరుణదేవునిగూర్చిన ఋగ్వేదమంత్రాలలో కనబడుతూఉన్న మహానాయక లక్షణాలను సమన్వయముచేసుకోవడం చేతగాక దొరగారు పడ్డ పాట్లు క్రిందగీతలుగల పదాలవల్ల ఊహించుకోవచ్చును. ప్రాపంచిక విజ్ఞాన వ్యాపనమార్గములను సమన్వయము చేసుకోవడంలో పాశ్చాత్యులు మొట్టమొదట తొక్కిన తప్పుత్రోవలూ, వ్రాసిన అబద్ధాలూ, చేసిన అసత్యపు సిద్ధాంతాలూ ఒకదానికొకటి కలియకపోవడంచేత ఈ కాలు జారడాలు తటస్థించినది. ఈతప్పుసిద్ధాంతాలకు ముఖ్యమైన కారణం ఏమంటే—

(1) బైబిలులో సెమెటిక్, హెమెటిక్ విభాగం, (2)ఈవిభాగానికి భిన్నంగా గ్రీసు, రోము, పర్షియా, ఇండియా వగైరాలలో కనబడే ఆర్యనాగరికత అనే ప్రత్యేకత.

ఈరెండూ సమరసం చేసుకోవడంలో ఆర్యులనేవారు మధ్యఆసియాలోనో, ఎక్కడో మొట్టమొదట ఉండి, అక్కడినుంచి కొంతదూరం ప్రయాణం చేసి, అక్కడ చీలి, కొందరు జర్మనీవైపు, కొందరు గ్రీసువైపు, కొందరు పర్షియావైపు విడిపోయినట్లున్ను, పర్షియావారు తిరిగీ విడిపోయి ఒకశాఖ ఇండియాకు పంజాబుమార్గంగా వచ్చి, భారతీయులైనట్లున్ను సిద్ధాంతాలు లేవదీసినారు పాశ్చాత్యులు.

ఇక బైబిలులో చెప్పిన సెమెటిక్, హెమెటిక్‌వారు ప్రత్యేకనాగరికతలు వృద్ధి చేసుకొన్నారట. ఈ సిద్ధాంతాలనుగూర్చిన విచారణ ఇప్పుడు మనకు అవసరములేదు. కాని వరుణదేవుని గురించి వ్రాసిన "ఆయన ఉత్పత్తినిగూర్చి తెలిసికొనుటలో గల అగోచరత్వము", "ఆర్యులు వచ్చిన తర్వాత కల్పింపబడినవాడు కాక" వగైరాపదములు ఈసమన్వయలోపమువల్ల కలిగినవే యని చెప్పకతప్పదు. ఏమంటే, విజ్ఞానము ప్రప్రథమమున భారతవర్షమునసే ఉద్భవిల్లినది. భరతవర్షమున పుట్టిన ఈ విజ్ఞానమును వ్యాప్తి చేసినవారు ఇంద్ర,మిత్ర, వరుణాదులు. వీరు మనుష్యులేగాని మహానాయకులు. ఈవిజ్ఞాన వ్యాపనము సామ్రాజ్యనిర్మాణమువలన జరిగినది. స్థలము (Land) పైని సామ్రాజ్యనిర్మాణము చేసినవాడు ఇంద్రుడు. జలము (Sea) పైని సామ్రాజ్యనిర్మాణము చేసినవాడు వరుణుడు. స్థలజలములపైని (Both on land and sea) సామ్రాజ్యనిర్మాణము చేసినవాడు. మిత్రుడు తరువాత మిత్రవరుణానుచరులు ఏకీభవించినపైని పుట్టిన నాయకులు మైత్రావరుణులు ఇద్దరు: వశిష్ఠుడు,అగస్త్యుడు. వీరిద్దరును ఆర్యవిజ్ఞానమును వ్యాపింపజేసినవారే. ఇక ప్రస్తుతము ఆర్య సాగర సామ్రాజ్యనిర్మాతలలో ప్రధానుడు వరుణుడు. కావున సాగరసామ్రాజ్యమును గూర్చి ఇంచుక వ్రాసెదను.

ప్రాచీనకాలమున సాగరసామ్రాజ్యమును పరిపాలించినవారు ఫినీషియనులు (Phoenicians). ఈ ఫినీషియను పదము గ్రీకుభాషలో ఫొనీకియన్ అగును. అనగా ఫినీషియనులు వణిక్కులన్నమాట. వెనుక నేను "ఫినీషియనులు: వారి భారతీయోత్పత్తి" (Phoenicians & their Indian origin) అనేవిపులమైన వ్యాస మొకటి వ్రాసిఉంటిని. ఈ వణిగ్జాతులు పెక్కులుండెను. కరణులు Cannan లోను, గుప్తులు Egypt లోను, వైదేహకులు Bedouin - Arabia లోను, కిరాటులు Crate లోను, సార్థులు (హేలులు) Helina

Greece లోను, ఈవిధముగా వణిగ్జాతులు వ్యాపించి సామ్రాజ్యము స్థాపించినారు. తరువాతి కాలములో సార్థులును కరణులును గలసి, ఏకమై సార్థకరణు లన్న పేర Canta-Greece సామ్రాజ్యము పశ్చిమముననను, సార్థకరణ(సాతకర్ణి - సాలవాహన) సామ్రాజ్యము తూర్పునను ఏర్పాటుచేసి పరిపాలించినారు. ఈ సాగర సామ్రాజ్యము స్థాపించిన వణిగ్జాతులు భారతీయవైశ్యులు. ఋగ్వేదములో ఈవణిక్కులకు పణులన్న పేరుండెను.

"దాసపత్నీ రహిగోపా అతిష్ఠ న్నిరుద్ధా ఆపః పణినేవ గావః"

(ఋగ్వే. ౧-౩౨-౧౧)

ఇక్కడ సాయనాచార్యులుగారు "పణినేవ గావః—పణినామకో అసురో గా అపహృత్య, బిలే స్థాపయిత్వా, బిలద్వార మాచ్ఛాద్య యథా నిరుద్ధవాన్, తథా ఇత్యర్థః" అని వ్రాసినా "అత్ర యాస్కః" అని తిరిగీ యెత్తుకొని, "నిరుద్ధా ఆపః పణినేవ గావః— పణి ర్వనిగ్భవతి పణిః పణనా ద్వని క్పణ్యం నేనేక్తి"అని యాస్కులను స్మరించి, పణిశబ్దానికి వణిక్ అనే అర్థం సూచించినారు. కాబట్టి ఈమంత్రంలోను, సరమాపణిసంవాద మంత్రాలలోను ఉన్న పణులు వణిక్కు లన్నమాట సత్యము. ఈవణిక్కులు వైశ్యులు. వీరి నాయకుడు వరుణుడు.

"యచ్చిద్ధి తే విశో యథా ప్రదేవవరుణవ్రతం."

(ఋగ్వే. ౧-౨౫-౧)

హేవరుణ, యథా లోకే విశః ప్రజాః కదాచిత్ ప్రమాదం కుర్వంతి, తథా వయమపి.

విశు లనగా వైశ్యులు, వరుణనాయకుని ప్రజలు. సాగరసామ్రాజ్యనిర్మాతలైన యీ వణిగ్జాతుల నాయకుడగు వరుణుడు భరతవర్షమునుండి వైదేహుల దేశముద్వారా కరణ, సార్థ, గుప్త, కిరాటాది వణిగ్దేశములకును, మధ్యసాగర (Madagascar) ద్వీపముద్వారా Congo (గంగ)కును, అక్కడనుండి సార్థకరణ (Catgreu) దేశముద్వారా శ్వేతద్వీపమునకును(Britain) పోవలసిఉన్నది. ఈ ప్రయాణములు నౌకలపైని, విమానములపైని వరుణదేవుడు చేయుచుండె నని ఋగ్వేదము చెప్పుచున్నది. ఆ మంత్రములను పరీక్షిద్దాము.

(1) పైని చెప్పిన "యచ్చిద్ధి తే విశో యథా" అనే మంత్రంవల్ల వరుణుని ప్రజలు వైశ్యులని తేలినది. ఈ వైశ్యులు వణిగ్జాతులనియు, వీరు సాగరసామ్రాజ్యనిర్మాతలనియు తేలినది.

"నిషసాద ధృతవ్రతో వరుణః పస్త్యా స్వా సామ్రాజ్యాయ సుక్రతుః."

(ఋగ్వే. ౧-౨౫-౧౦)

ధృతవ్రతః పూర్వోక్తో వరుణః పస్త్యాసు దైవీషు ప్రజా స్వా నిషసాద ఆగత్య నిషణ్ణవాన్-కిమర్థం ప్రజానాం సామ్రాజ్య సిద్ధ్యర్థం.

ఈ మంత్రమువలన వరుణుడు తన ప్రజలకు సామ్రాజ్యసిద్ధి కలిగించుటకై ఎప్పుడూ సంసిద్ధుడుగా ఉంటాడని తేలినది.

ఈ సందర్భములో స్వారాజ్య, వైరాజ్య, సామ్రాజ్యపదాలు విచారించవలసిఉన్నది. రాజుల ప్రథమ పుత్రులు స్వారాజ్యపరిపాలకులు. ద్వితీయపుత్రులు విదేశములను జయించిగాని, విదేశ స్త్రీలను పెండ్లియాడి గాని వైరాజ్యపాలకులైరి. స్వదేశవిదేశములను రెండింటినీ పాలించినవాడు సమ్రాట్. వీనిది సామ్రాజ్యము. ఇట్టి సామ్రాజ్యము పాలించినవాడు వరుణుడు.

"కదా క్షత్రశ్రియం నర మా వరుణం కరామహే, మృళీకా యోరుచక్షసం."

(ఋగ్వే. ౧. ౨౫. ౫.)

మృళీకాయ అస్మత్సుఖాయ, వరుణం కదా కస్మిన్ కాల ఆకరామహే అస్మిన్ కర్మ ణ్యాగతం కరవామ. కీదృశం - క్షత్రశ్రియం బలసేవినం, నరం నేతారం, ఉరుచక్షసం బహూనాం ద్రష్టారం క్షత్రశ్రియం క్షత్రాణి శ్రయతీతి క్షత్రశ్రీః—

ఈమంత్రమున వరుణదేవుడు "క్షత్రశ్రియం" అన్నందున క్షాత్రతేజస్సు గలవా డనిన్నీ, "నరం" అన్నందువల్ల ప్రజలకు నాయకుడనిన్నీ, "ఉరుచక్షసం" అన్నందువల్ల విశాలనేత్రములు (రాజలక్షణము) గలవా డనిన్నీ తేలుచున్నది.(చూ:"కామం కర్ణాంతవిశ్రాంతే విశాలే తస్య లోచనే"- రఘు.)

"బిభ్రద్ద్రాపిం హిరణ్యయం వరుణో వస్త నిర్ణిజం. పరిస్పశో నిషేదిరే."

(ఋగ్వే. ౧-౨౫-౧౩)

హిరణ్యయం సువర్ణమయం, ద్రాపిం కవచం, బిభ్రద్ధారయన్, వరుణో నిర్ణిజం పుష్టం స్వశరీరం వస్త ఆచ్ఛాదయతి, స్పశో హిరణ్యస్పర్శినో రశ్మయః పరినిషేదిరే సర్వతో నిషణ్ణః—

ఈమంత్రమువల్ల సామ్రాజ్యనిర్మాతయగు వరుణుడు బంగారు కవచమును ధరించినాడని తేలుచున్నది.

"అతో విశ్వా న్యద్భుతా చికిత్వా అభి పశ్యతి, కృతాని యాచ కర్త్వా."

(ఋగ్వే. ౧-౨౫-౧౧)

అతో అస్మాత్ వరుణాత్, విశ్వా న్యద్భుతా సర్వా ణ్యాశ్చర్యాణి చికిత్వాన్ ప్రజ్ఞావాన్ అభిపశ్యతి సర్వతో అవలోకయతి. యా కృతాని యా న్యాశ్చర్యాణి పూర్వం వరుణేన సంపాదితాని చకారా దన్యానియా న్యాశ్చర్యాణి కర్త్వా ఇతఃపరం కర్తవ్యాని తాని సర్వా ణ్యభిపశ్యతీతి పూర్వత్రాన్వయః

ఈ మంత్రమువల్ల ఈ వరుణుడు అనేకములైన అద్భుతములను చేసిచూపినాడని తెలియుచున్నది. ఈ అద్భుతములను కొన్నిటిని వివరించుచున్నాడు.

"వేదా యో వీనాం పద మంతరిక్షేణ పతతాం, వేదనా వః సముద్రియః

వేదమాసో ధృతవ్రతో ద్వాదశప్రజావతః వేదా య ఉపజాయతే,

వేదవా తస్య వర్తని మురో ఋష్వస్య బృహతః

వేదా యే అధ్యాసతే."

(ఋగ్వే. ౧-౨౫-౭, ౮, ౯)

ఈ మంత్రముల అర్థవిచారణమే చాలా కష్టమై ఉన్నది. ఈ మంత్రములకు సాయనాచార్యులు వ్రాసిన అర్థము మొట్టమొదట చూదాము;

"వేదా.....సముద్రియః."

అంతరిక్షేణ పతతాం ఆకాశమార్గేణ గచ్ఛతాం వీనాం పక్షిణాం పదం యో వరుణో వేద-తథా సముద్రియః సముద్రే అవస్థితో వరుణో నావో జలే. గచ్ఛంత్యాః పదం వేద జానాతి.

"వేదమాసో.....ఉపజాయతే."

ధృతవ్రతః స్వీకృత కర్మవిశేషో యజ్ఞోక్తమహిమోపేతో వరుణః ప్రజావతః తదాతదోత్పద్యమాన ప్రజాయుక్తాన్ ద్వాదశ మాస శ్చైత్రాదీన్ ఫాల్గునాంతాన్ వేద జానాతి. య స్త్రయోదశో అధికమాస ఉపజాయతే సంవత్సరసమీపే స్వయమేవ ఉత్పద్యతే తమపి వేద.

"వేద వా తస్య.....అధ్యాసతే."

ఉరో ర్విస్తీర్ణస్య, ఋష్వస్య దర్శనీయస్య, బృహతో సకా రధికస్య, వాతస్య వాయోః వర్తనిం మార్గం వేద వరుణో జానాతి. యే దేవా అధ్యాసతే ఉపరితిష్ఠంతి తానపి వేద జానాతి.

ఈ అర్థమునకు సారము.

(౧) అంతరిక్ష మార్గమందు సంచారము చేయు పక్షుల ("వి"ల) మార్గములను వరుణు డెరుగును.

(౨) సముద్ర మార్గమందు సంచరించు నౌకల మార్గములను వరుణు డెరుగును.

(౩) సంవత్సరమునకు గల పంౘ్రెండు మాసములలో ఏమాసములో ఏమేమి పుట్టునో అధికమాస మెప్పుడు వచ్చునో వరుణు డెరుగును.

(౪) ఉరుత్వము, ఋష్వత్వము, బృహత్త్వము అనే లక్షణములు గల వాయువుయొక్క వర్తన వరుణు డెరుగును.

సాయనాచార్యులుగారు ఇంతమాత్రమే అర్థము వ్రాసినారు. ఇంతకన్న మిన్నగా వారికి వ్రాయడానికి అవకాశముకూడా లేదు. ఇది సరిగా సమన్వయము కాకపోవడంచేతనే వరుణునిగూర్చి, "ఆయనఉత్పత్తినిగూర్చి తెలిసికొనుటలో గల "అగోచరత్వము" అనిన్నీ, "ఆర్యులు వచ్చినతర్వాత కల్పింపబడినవాడు కాక" అనిన్నీ, ఇంకా ఏమేమో వ్రాసినారు మాక్డొనాల్డుగారు.

"ఆకాశముపైని పక్షు లెగురుటనుగూర్చి వరుణు డెరుగును. సముద్రముపైని పోయే నౌకల మార్గములు వరుణు డెరుగును. దూర సంచారము చేసే వాయువుయొక్క మార్గమును వరుణు డెరుగును. ఇదివరకు జరిగినవియును, ఇకముందు జరుగబోయేవియును అగు అద్భుతములను వరుణు డెరుగును."

అనిన్నీ వారు తర్జుమాచేసినారు. అత్యున్నత సాగర సామ్రాజ్యాధిపతి యగు వరుణుని మహిమనుగూర్చి ఆధునికుడగు సాయనాచార్యు లెరుగకపోవుట సహజమే. కాని తెలిసికొనుటకు ప్రయత్నింపక "ఆయన ఉత్పత్తినిగూర్చి తెలిసికొనుటలో గల అగోచరత్వము" అనిన్నీ, "ఆర్యులు వచ్చిన తర్వాత కల్పింపబడినవాడు కాక" అనిన్నీ కొట్టిపారవేసి, ప్రాచీన భారతీయ విజ్ఞానమునకు శిశుత్వము నాపాదించిన పాశ్చాత్య విద్వాంసులను గురించి ఏమి వ్రాయవలసియున్నదో నాకు గోచరించలేదు. ఈ వేమాయలు చెప్పిన వాక్యములే మనకు వేదవాక్యములైనవి. ఇక విచారణచేదాము.

(౧) వరుణుడు సాగరసామ్రాజ్యనిర్మాతలగు వైశ్య (వణిక్) జాతులకు నాయకుడు.

(౨) సంవత్సరములో నున్న పంౘ్రెండు మాసములలో ఏయే మాసములలో, ఏయేదేశములలో ఏయేపంటలు పండునో, ఏయేదేశములలో అధికమాసపులెక్క ఏయేవిధములుగా చేయవలసిఉన్నదో, ఆ సంగతి వరుణుడు బాగుగా ఎరుగును.

(౩) వాయువుయొక్క ఉరు(Volume), ఋష్వ (Speed), బృహత్ (Density) అను ధర్మములను, దాని ననుసరించిన వాయు మార్గములను వరుణు డెరుగును.

(౪) సాగరసామ్రాజ్యమున ఏయేస్థానములలో ఏయే జాతుల మనుష్యులు గలరో, ఏయే స్థానములలో తన ప్రజలను వణిజ్జాతులలో ఎవ్వరెవ్వరు గలరో, వారితో ఎట్టి సంబంధము కలిగిఉండవలెనో వరుణు డెరుగును.

(౫) సముద్రముపైని పోయే నౌక లేయే మార్గములను బోయిన నేయేదేశములకు పోవునో ఆ మార్గములను వరుణుడు బాగుగా ఎరుగును.

(౬) ఆకాశమార్గమున పోయే "వి"ల మార్గములను, సముద్రముపైని పోయే నౌకల మార్గములను వరుణు డెరుగును.

ఈ సమన్వయములో ఒకచిక్కు ఉన్నది. వాయువుయొక్క గతులును, సముద్రముపైని సంచారముచేయు నౌకలమార్గములును ఎరిగిన వరుణునకు ఆకాశమందు పోయే పక్షుల మార్గములను తెలిసికొన్న ప్రయోజన మేమి? అంత పెద్దవిషయములను తెలిసికొగలిగినట్టిన్నీ నౌకలమార్గములూ, వాయువుగతులూ తెలిసికొనగలిగిన వరుణునకు పక్షుల మార్గములతో పని యేమి? ఈ సమన్వయము కుదరక ఆధునికవ్యాఖ్యాతలు చాలా బాధపడ్డారు. పాపము, ఒక వ్యాఖ్యాత ముఖర్జీగారి 'ఇండియన్ షిపింగ్' (Indian Shipping) అనే పుస్తకములోని ఈ క్రిందివాక్యాలు ఉదాహరించి సమన్వయము కొంచెము మార్చినాడు:

"దిఘ్ఘనికాయము(బౌద్ధగ్రంథము)౧-౨౨౨లో స్థలభాగము కనబడకుండా జలముపైని చాలాదూరము చేసే ప్రయాణములనుగూర్చి చెప్పియున్నది. ఈ ప్రయాణములలో నౌకలపైని వర్తకముచేయుటకు పోయేవర్తకులు తమ ఓడలలో బలమైన రెక్కలుగల కొన్ని జాతుల పక్షులను తీసికొనిపోతారనిన్నీ, భూమి చాలా దూరములో ఉన్నప్పుడు ఎంతదూరములో ఉన్నదో తెలిసికొనుటకు ఈ పక్షులను విడిచి పెట్టెదరనిన్నీ, భూమి సమీపముగా లేనప్పుడు నాలుగువైపులా పరుగెత్తి పరుగెత్తి ఈ పక్షులు తిరిగీ ఓడలోనికి మరలివచ్చుననిన్నీ, కొన్ని మైళ్లదూరములోనే భూమి కనబడినప్పుడు ఈపక్షులు తిరిగిరావనిన్నీ ఆ గ్రంథములో వ్రాసి ఉన్నది."

ఈవిధముగా పక్షులను తరిఫీయతు చేయడం వరుణదేవునకు తెలియు నని ఆయన వ్యాఖ్యానము చేసినాడు, కాని ఈసమన్వయ

ములో ఉన్న చిక్కు ఏమంటే, ఈతరిఫీయతుకు వాయువుయొక్క ఉరు, ఋష్వ, బృహత్ అనే ధర్మాలున్ను, తదనుసరణము గల వాయుగతులున్ను తెలిసికోవలసిన అవసర మేమైనా కలదా? కాబట్టి ఈసమన్వయముకూడా అతకలేదు. కాబట్టి ఇక్కడ "వి" అనే పదానికి విమాన మని మేము అర్థము చెప్పతాము. అప్పుడు ఈవిధమైన సమన్వయము కలుగును.

సాగర సామ్రాజ్య నిర్మాత లగు వైశ్యుల (వణిగ్జాతుల) నాయకుడగు వరుణుడు తన సామ్రాజ్యమం దంతటను లెస్సగా సంచారముచేయగలుగుటకై ఆకాశమార్గమందు సంచారముచేయు విమానముల మార్గములును, సముద్రమార్గమందు సంచారముచేయు నౌకల మార్గములును, వాయువు యొక్క ఉరు, ఋష్వ, బృహత్ అనే ధర్మములవల్ల గలిగిన వాయు వర్తనములును లెస్సగా తెలిసికొనెను. ఈ కారణము చేతనే సాగరసామ్రాజ్యాంతర్భాగములగు Egypt, Cannan, Crate, Greece మొదలగు దేశములలోకూడ వరుణుని ప్రభావము కనబడుచున్నది. ఇదియంతయును భారతీయ నాయకుడగు వరుణునితో సంబంధించినదే యని తెలుసుకోలేక మాక్డొనాల్డుగారు ఆవిధముగా వ్రాయ సాహసించిరి.

"వి" శబ్దమునకు విమానము లని అర్థము చెప్పితే వరుణుని "అగోచరత్వము" విడిపోయి ఆతని "ఆర్యులు వచ్చిన తర్వాతకల్పింపబడుట" స్థిరపరచి, భారతీయ విజ్ఞానము యొక్క ఉత్కృష్టతను స్థాపించి, భరతవర్ష విజ్ఞానమునకు ప్రాచీన విజ్ఞానస్థానము లగు Egypt, Phoenicia, Greece, Babylonia మొదలగు దేశముల పరస్పర సంబంధములను స్పష్టము చేయును.

ఈ "వి" పదమునకు మరియొకచోటకూడ విమానమనియే అర్థము చెప్పవలసి ఉన్నది.

"వయో న వసతీ రుప."

(ఋగ్వే. ౧-౨౫. ౮)

వయో న పక్షిణో యథా వసతీ ర్నివాసస్థానా న్యుప సామీప్యేన ప్రాప్నువంతి తద్వత్- అని సాయనాచార్యులుగారు వ్రాసినారు.

ఇక్కడ విచారించవలసినవి రెండు పదములు: వి అనేది ఒకటి; వసతి అనేది ఒకటి. వసతి అంటే నివాసస్థాన మని సాయనాచార్యులు వ్రాసినారుగాని నేడు దీని వికృతియగు "బస్తీ" అనే పదం అనేక హిమాచలమున్నూ అన్ని భాషలలోనూ పట్టణమనే అర్థంలోనే వాడుక అవుతూ ఉన్నది. కాబట్టి ఇక్కడకూడా బస్తీ అనగా పట్టణమని అర్థం చెప్పితే పట్టణాలు వణిక్కులతో సంబంధించినవి గనుక (నైగమో వణిజో వణిక్- అమరము) పట్టణాలకు సమీపముగా విమానము లెగ్లో అట్లే అని అర్థమగును.

ఫొనీషియనులు నగరనిర్మాత లని ప్రసిద్ధి పడ్డారు. వణిక్కులు నైగములని నిఘంటువు. కావున ఫొనీషియనులున్నూ, వణిక్కులున్నూ ఒక్కటే అయితే, సాగరసామ్రాజ్య నిర్మాతలగు ఫొనీషియనులున్నూ, వణిక్కులున్నూ భారతీయ వైశ్యులే అన్నమాట. వైశ్యుల నాయకుడగు వరుణుడు తన సాగర సామ్రాజ్యమున గల పట్టణములకు విమానములపైని పోవుచుండె నని రూఢి అగుచున్నది. కాబట్టి ఈరెండవ మంత్రములో కూడా వి-అంటే విమానము అనే అర్థమే చెప్పవలసి ఉన్నది.

ఇప్పుడు పర్యవసానము చెప్పతూ ఉన్నాము.

(౧) విజ్ఞాన వ్యాపకులగు ఆర్యులు మధ్య ఆశియానుంచిగాని, ఉత్తర ధ్రువప్రాంతముల నుండిగాని వచ్చినవారు గారు.

(౨) ప్రాచీన స్థానములగు ఈజిప్టు, బాబిలోనియా, ఫినీషియా, క్రాటు, ఛాడ్డియా మున్నగు దేశములలోని విజ్ఞానములు ప్రత్యేకత గలవి గావు.

(౩) వేదకాలమునందలి విజ్ఞానము శైశవదశయం దున్నదికాదు. ఉచ్చదశయం దున్నదే.

(౪) విజ్ఞానము భరతవర్షమునందే ఆరంభమై ఇతర దేశములయందు భరతవర్షము ద్వారా వ్యాపించియుండెను.

(౫) ఆ వ్యాపనమునకు కారణభూతులు ఇంద్ర, మిత్ర, వరుణాదులు.

(౬) వరుణుడు సాగరసామ్రాజ్య నిర్మాతలగు వణిగ్జాతులకు నాయకుడు. భారతీయ సాగర సామ్రాజ్యము అన్ని సముద్రతీరముల యందును వ్యాపించియుండెను.

(౭) ఆ సముద్ర తీరమునందు గల పట్టణములకు (వసతులకు) నౌకలపైని, విమానములపైని వరుణుడు పోవుచుండెను. ఉరు, ఋష్వ, బృహత్ అనే ధర్మములుగల వాయువునకు గల గతుల భేదములను తెలిసికొని, అది ఆధారముగా సముద్రమున నౌకలపైని, ఆకాశమున విమానములపైని వరుణుడు ప్రయాణము చేయుచుండెను. మార్గమధ్యమందు ఏయే ప్రజలు గలరో, వారు ఏయే మాసములలో ఏమేమి పండింతురో, అధికమాస మెప్పుడు వచ్చునో, దాని ప్రయోజన మేమో, వారిలో ఎవ్వరెవ్వరితో ఎట్లెట్లు ప్రవర్తింపవలెనో వరుణు డెరుగును.

ఆతడు హిరణ్యకవచము తొడుగుకొని, తన ప్రజలగు వైశ్యుల సాగర సామ్రాజ్యము వృద్ధిచేయుటకు సిద్ధుడుగా ఉండును.

ఆతడు క్షాత్రతేజస్సు గలవాడు. విశాల నేత్రములు గల నాయకుడు.

ఇట్టి మహిమలు గల వరుణునిగూర్చి వ్రాసిన వేదము శైశవదశలోని విజ్ఞానమును చెప్పుచున్నదో, ఉచ్చదశలోని విజ్ఞానమును చెప్పుచున్నదో ఊహించవలసియున్నది. ఆర్య విజ్ఞానము భరతవర్షమునుండి ఇతర దేశములకు వ్యాపించిన విధమును, ఆర్యనాయకులు విజ్ఞాన వ్యాపనమునకై అవలంబించిన పద్ధతులును చర్చచేసి ప్రత్యేకవ్యాసములు వ్రాయవలసి ఉన్నది.

# కొడవటిగంటి కుటుంబరావుగారి 'స్వగతం'

[విమర్శన]

బుర్రా
వేంకటసుబ్రహ్మణ్యం

కుటుంబరావుగారు ప్రస్తుతం కథలువ్రాసే వాళ్ళల్లో కొంత పేరుపడ్డవారు. వారు కథలు వ్రాయడంలోనే కాకుండా మిగిలినవాళ్ల వ్రాతలని విమర్శించడంలో కూడా తెలివితేటలు చూపించినవారు. తెలుగుభాషలో కొత్తగా బయలుదేరుతున్న వాఙ్మయం ఎటువంటిదో తెలిసినవాళ్లందరికీ ఆయనరచనలంటే కొద్దో గొప్పో పరిచయం ఉండక తీరదు అందువల్ల విమర్శకులకి ఆయనకథల గురించి చర్చించడంలో సామాన్యులగురించి వ్రాసినట్టు కాకుండా ఎక్కువశ్రద్ధ వహించవలసిన బాధ్యత ఉంది.

కాని కుటుంబరావుగారు వారికి విమర్శకులంటే పూర్తిగా విరక్తి పుట్టినట్టు ఈకథల సంపుటికిచివర వారువ్రాసిన 'వ్యాఖ్యానం'లో ప్రకటించుకున్నారు. ఈవిరక్తి ఎంతవరకు వెళ్లిందంటే, "సరిఅయిన విమర్శన రాలేదని తోచినట్టయితే ఇంకోసారి నన్ను నేనే విమర్శించుకుంటాను" అని వారు రాబోయే విమర్శకులని భయపెట్టడందాకా వెళ్లింది. "ఆపైన నాకథలమాట అటుంచి విమర్శకులు నా విమర్శననే విమర్శించవలసివస్తుంది" అని కూడా వారు శెలవిచ్చారు. వారివిమర్శనని విమర్శించవలసిన అవసరం ఇంకా ఎప్పుడో రావడంబదులు ఇప్పుడే వచ్చిందని నా ఉద్దేశ్యం. ఎందువల్లనంటే, ఈ సంపుటిచివర నున్న వీరి వ్యాఖ్యానాన్ని తమ కథలగురించి తమరే వ్రాసుకున్న విమర్శనగా భావించక తప్పదు. అటువంటి సందర్భంలో వారి వ్యాఖ్యానాన్నే ముందు విమర్శించవలసొస్తుంది.

కుటుంబరావుగారికి వారి 'కారుణ్యం' అన్న కథలసంపుటి గురించి పత్రికలలో పడ్డ విమర్శనలు చూడగానే విమర్శకులంటే అసహ్యం పుట్టినట్టు వారు తెలియపరుస్తున్నారు. వారి 'కారుణ్యం' అన్న కథలసంపుటి నేను చదవలేదు. ఆకథల గురించి ప్రకటింపబడ్డ విమర్శనలుకూడా నేను చదివినజ్ఞాపకం నాకు లేదు. ఆ విమర్శకుల లోపాలెటువంటివో నాకు తెలియవు. అందువల్ల కుటుంబరావుగారు ఈ 'వ్యాఖ్యానం' ఇంత పట్టుదలగా ఎందుకు వ్రాసేరో నేను గ్రహించలేకుండా ఉన్నాను. కాని, వారు ఈ 'వ్యాఖ్యానం' వ్రాయకుండా ఉండుంటే బాగుండుననుకునే వాళ్లల్లో నేనొకడిని. మన పరిస్థితులలో మన విమర్శకులమీద కత్తులునూరడం మన కథకులకి తగనిపని. మన విమర్శకులు తగినంత తెలివైనవారు కాదంటే అదొక వింత కాదు. సాధారణంగా ఏదేశంలోనైనా ఎప్పుడూ కథకులని మించిన ఘనులు విమర్శకులలోనూ ఉండరు, విమర్శకులని మించిన ఘనులు కథకులలోనూ ఉండరు.

"'ఈకథ ఏమిటి? ఎందుకు రాశావు? ఇది ఇట్లా రాయటంలో నీ అభిప్రాయం ఏమిటి?' అని నన్ను స్వయంగా అడిగి నాసమాధానంతో తృప్తిపడి వెళ్లిపోయిన పెద్దమనుష్యులున్నారు. విమర్శకులకి కూడా అటువంటి సందేహాలు కలిగినప్పుడు నన్నడిగి తమసందేహాలు తీర్చుకునిఉండటం వారివిధి." అని కుటుంబరావుగారు వ్రాస్తున్నారు. ఇది కేవలం అన్యాయమైన అభిప్రాయం. విమర్శకుడు మరీమొద్దు కాకుండా ఉండి, ఉన్నపాటి తెలివితేటలతో కథకుడు ఏ అభిప్రాయంతో కథ వ్రాసేడో గ్రహించలేకపోయినట్టయితే తప్పంతా కథకుడిదికాని విమర్శకుడిది కాదు. సామాన్యపు తెలివితేటలున్న చదువరికి కూడా కథ చప్పన అర్థంకాకపోయినట్టయితే అవమానం అంతా చదువరిదే అని కుటుంబరావుగారు శాసించడం ధర్మం కాదు. ప్రశస్తమైన ఊహాలతో కథని అల్లడానికి పూనుకున్నంతమాత్రాన కథకుడి కర్తవ్యం పూర్తయినట్టు కాదు. ఆప్రశస్తమైన ఊహాలన్నీ సామాన్యచదువరులందరూ సులభంగా గ్రహించగలిగేటట్టు కథకుడు కథాసారాన్ని పోషించుకుంటూ రావాలి. తనకథలు వ్యాఖ్యానాలు లేకుండా అందరికీ అర్థం అయేటట్టు చూసుకోవాలి. అంతేకాని, 'నీకు నాకథ అయోమయంగా ఉన్నట్టు తోస్తే వెంటనే నాకథలో నీకు బోధపడని గొప్ప అర్థం ఏదోఉందని నమ్ము. ఆ అర్థం ఏమిటని నన్నొచ్చి అడుగు. అప్పుడు నేను బోధపరుస్తాను' అని ఫిర్మాను ఇవ్వడం న్యాయంగాలేదు.

ఈ కథల సంపుటిలో ఆరుకథలున్నాయి. అందులో రెండుకథలు మాత్రం చాలావరకు బాగున్నాయనే చెప్పొచ్చును. ఈ రెండు కథలూ 'ఇంతలోఉంది' అన్నకథా 'పశ్చాత్తప్తుడు' అన్నకథా. 'అరణ్యం' అన్నకథ అతికంగారుగానూ, అసహజంగానూ ఉంది. 'వరాన్వేషణ' అన్నకథ ఏపాశ్చాత్యకథకో సారంలేని అనువాదంలా ఉంది. 'కాలభైరవుడు' అన్నకథ అందంగాలేదు. 'అశోకవనం' అన్నకథకి అర్థంలేదు.

'అశోకవనం' అన్నకథ గురించి ముందు చర్చిద్దాం. "ఈ కథకూ శ్రీముద్దుకృష్ణగారు రచించిన 'అశోకం' అన్ననాటకానికీ ఏమీ సంబంధం లేదు" అని కుటుంబరావుగారు వ్యాఖ్యానంలో తెలియపరచుకున్నారు. శ్రీముద్దుకృష్ణగారి 'అశోకం' అనే నాటకాన్ని చదివే అదృష్టం ఇంకా నాకు పట్టలేదు. "వాల్మీకి రామాయణంకంటే, ముద్దుకృష్ణగారి 'అశోకం' కంటే ఈకథ ఎక్కువనుకోటానికి అవకాశంలేదు" అని కూడా 'వ్యాఖ్యానం'లో ఉంది. కుటుంబరావుగారి వంటి విచక్షణకల మనిషి కూడా వాల్మీకి రామాయణాన్నీ ముద్దుకృష్ణగారి నాటకాన్నీ ఈవిధంగా ఒకే తరగతికి చెందినవాటినిగా భావిస్తుంటే ఈ 'అశోకం' అన్నగ్రంథం

నాకంట పడలేదే అన్నవిచారం నాకు మకీ ఎక్కువగా ఉంది. కాని కుటుంబరావుగారి కథని ముద్దుకృష్ణగారి రచనతో పోల్చే అవకాశం నా కిప్పుడు లేదు.

"రావణుడికి ఎవ్వరూ చెయ్యనిన్యాయం కొంత ఈ కథద్వారా చేశానని నేను నమ్ముతున్నాను" అని కుటుంబరావుగారు వ్రాసేరు. రావణుడికి 'న్యాయంచేసే' పద్ధతి రాముడికీ సీతకీ 'అన్యాయం చెయ్యడమే' అయినట్టయితే కుటుంబరావుగారు వారుచెయ్యదలచుకున్నంతపనీ చేసేరనే చెప్పొచ్చును. ఉదాహరణికి వీరికథలో ఒకచిన్నవిషయం గమనిద్దాం. లంకచేరుకున్నాక రావణుడు సీతకి అశోకవనంలో నివాసస్థలం ఏర్పాటు చేసినప్పుడు "అన్ని బంగారపుమేడలు పెట్టుకుని నన్నీపొదలమధ్య పారేసి ఇంత అందమైనచోటు ఎక్కడా లేదంటావా?" అని రావణుడితో ధుమధుమలాడుతుంది కుటుంబరావుగారి సీత. తనభర్తకీ తనకీ ఎడబాటు తెచ్చేడన్న బాధ కాదు; బలవంతంగా మారుమూలకి లాక్కొచ్చాడన్న దుఃఖం కాదు; అంతఃపురాలుండగా అశోకవనమా తనకి ఏర్పాటు అని కోపం! 'రావణుడికి న్యాయం చెయ్యదలచుకున్నాను'అనడం బదులుకుటుంబరావుగారు 'రామాయణం అంతా మార్చి వ్రాయదలచుకున్నాను' అన్నట్టయితే సరిగ్గా ఉండును. రామాయణంలోనూ, భారతంలోనూ, భాగవతంలోనూ నచ్చని విషయాలూ, నమ్మతగని విషయాలూ అనేకం కనిపెట్టికూడా ఆ గ్రంథాలు ఇంత ప్రసిద్ధికెక్కిన సందర్భంలో ఇన్ని శతాబ్దాలతర్వాత వాటిని మరమ్మతుచెయ్యడం అసాధ్యమైన పని అని గ్రహించి, శ్రద్ధగా తమస్వంతకథలే వ్రాసుకునే కథకులు అంత తెలివి తక్కువవారు కారనే చెప్పాలి.

ఈ కథలో రావణుడికి అశోకవనం అంటే ఉన్న విపరీతప్రేమ చాలా హాస్యాస్పదంగా ఉంది.

లంకాద్వీపానికి పోతున్న విమానంలో రావణుడు 'చిరునవ్వునవ్వుతూ' సీతతో అనే మాట లివి: "నీ అందం చూచి నేను మోహించానని నువ్వెట్లా ఊహించావు? ఒకవేళ అది నిజమయినా నువ్వేచెప్పుకోడం ఏమంత బాగాలేదు. నిన్ను చూచిన ప్రతివాడూ నీకోసం చస్తున్నాడని నీ కొక నమ్మకం ఉన్నట్టుంది—లేక అది కోరికా?" ఈ మాటలు పురాణకాలంలో రావణుడు సీతతో అన్నాడంటే నమ్మతగినమాటలలా లేనేలేవు. మొన్న మొన్నటివరకూ పాశ్చాత్యదేశాలలో కూడా ఏ సందర్భంలోనైనా ఏస్త్రీతోనూ ఇంత నిర్మొఖమాటంగా మాట్లాడే పరపురుషుడు ఉండడం అసంభవం. ఈ మాటలు ఫ్రాయిడ్ తీవ్రజ్వరంలో పలవరిస్తున్న మాటలలా ఉన్నాయికాని ఈ కథకి అనుకూలమైన మాటలు కానేకావు.

కాని, కుటుంబరావుగారి 'అశోకవనం'లో ఒక ప్రశస్తమైన గుణం ఉంది. వారు పురాణకథని చరిత్రాత్మకమైనకథగా మార్చేందుకు ప్రయత్నించారు. దేవుడి అవతారం అనబడేవాడిని మనుష్యమాత్రుణ్ణిగా చూపించేందుకు తలపెట్టేరు. రామరావణ వైరాన్ని ఆర్యులకీ అనార్యులకీ ఉన్న వైరంగా సూచించబోయారు. ఇవన్నీ ఆమోదించవలసిన ప్రయత్నాలే. అయితే, ఇటువంటి ప్రయత్నాలు చేస్తున్న గ్రంథకర్త రావణుడు విమానంలో సీతని లంకకి తీసుకువెళ్తున్నట్టు వ్రాయకూడదు. రాముడన్నవా డుండుంటే మనుష్యమాత్రుడే అయుండాలని గ్రహించిన చరిత్రపరిశోధకులకి ఆకాలంలో విమానాలు లేవన్నమాట వేరే చెప్పనక్కరలేదు. అదికాక రామాయణగాథనంతనీ సామాన్యమానవ నాటకంగా చూపించబోయే గ్రంథకర్త మారీచుడికథా, హనుమంతుడు సముద్రం దాటడమూ, లంకాదహనమూ, మొదలైన అసందర్భాలన్నిటినీ మొదట్లోనే వదులుకోనైనా వదులుకోవాలి, లేకపోతే ఎక్కడలేని ప్రజ్ఞా చూపించి ఇటువంటి విషయాలుకూడా పూర్తిగా నమ్మతగిన విషయాలులాగే కనిపించేటట్టు అనేక వివరాలు సమకూర్చివర్ణించనైనా వర్ణించాలి. అంతే కాని "సీతను ఎవరు తీసుకు వెళ్లినదీ రామలక్ష్మణులకు తెలియకుండా ఉండగలందులకు మారీచుడు తనకు సహాయంచెయ్యటానికిఒప్పుకున్నాడు" అన్నంతమాత్రానకాని, "ఏదో పెద్ద జంతువు అశోకవనంలో ప్రవేశించింది ప్రభూ! చెట్లన్నీ ధ్వంసంచేస్తున్నది"అన్నంతమాత్రాన కాని కుటుంబరావుగారు సృజించిన రామాయణ కథలో వాల్మీకి రామాయణంలోఉన్న అసందర్భాలన్నీ మాయమైపోయినట్టు కాదు. అసలు సంగతి ఈ అసందర్భాలన్నీ ఈ రోజులలో ఎంత గొప్ప గ్రంథకర్త తలపెట్టినప్పటికీ మాయంఅయేవి కావు. ఒకవేళ ఈఅసందర్భాలన్నీ వదులుకుందామంటే ఆఖరికి రామాయణమే మిగలదు. అందువల్ల, మానవ స్వభావాన్ని సహజంగా నిరూపించడమే తమ కర్తవ్యంగా భావించుకుంటున్న మన కొత్త కథకులు రామాయణంవంటిఅసహజమైన పురాణకథలని ఎంత ముట్టుకోకుండా ఉంటే అంత మంచిది. అంతే కాని, ఇప్పుడుశూర్పణి రావణుడికి న్యాయం చేద్దామనుకోడంలోనూ, దుర్యోధనుడికి న్యాయంచేద్దా మనుకోడం లోనూ, కంసుడికి న్యాయం చేద్దామనుకోడం లోనూ నాకు అంతగా పొగడతగిన ఊహ ఏదీ కనపడడంలేదు.

'కాలభైరవుడు' అన్నకథ మొదలు పెట్టడం కుటుంబరావుగారు చాలా అందంగా మొదలుపెట్టేరు. రానురాను కథ క్షీణించింది. మొదట్లో చదువరులకి కలిగే ఉద్దేశ్యం ఏమిటంటే, కథకి కుక్కకంటె శ్రీనివాసరావే ఎక్కువముఖ్యమని. అధమం, కథకి కుక్కకంటె శ్రీనివాసరావు తక్కువ ముఖ్యం కాదని. మొదటిపేజీ చదవగానే, నేను కథ చెప్పే పెద్దమనిషీ శ్రీనివాసరావూకలిసి పునర్జన్మగురించి దీర్ఘపరిశోధన చెయ్యబోతారనీ, కథంతా ఈపరిశోధనగురించే అయుంటుందనీ ఈ పరిశోధనలో కథచెప్పేమనిషికి చటుక్కున పునర్జన్మగురించి పరిశోధనమాని పిచ్చివాడైన శ్రీనివాసరావు గురించి పరిశోధన మొదలుపెట్టవలసిన అవసరం వస్తుందనీ అనుకున్నాను. చూస్తే, రెండవపేజీలో మొదటి వాక్యం ఇదీ: "తీరా రైలెక్కిన తర్వాత తట్టింది శ్రీనివాసరావుకు కొంచెం మతిభ్రమ ఏమయినా ప్రారంభమయిందేమో నని." దగ

నా దే తప్పు అనుకున్నాను. వెంటనే శ్రీనివాసరావుయొక్క స్వభావం విపులంగా వర్ణింపబడిఉంది. మళ్లీ, ఏదోవిధంగా ఇంకా శ్రీనివాసరావే కథకి ముఖ్యం అనుకున్నాను. ఆ ఉద్దేశ్యం కుక్కకథలోకి ప్రవేశించాక కూడా పోలేదు. కథకి శ్రీనివాసరావు ముఖ్యుడు కాడేమోనన్న సందేహం ఈ ౧౪ పేజీల కథలోను మొదటి ౧౧ పేజీలలో ఎక్కడా కలగలేదు. చివరకి కథంతా కుక్కనిసరించేననీ, శ్రీనివాసరావుముఖ్యుడు కాడనీ తేలింది. అటువంటప్పుడు శ్రీనివాసరావు పాత్రని అంత ప్రధానపాత్రగా పోషించుకుంటూ రాకూడదు. మొదటినుంచీ చదువరుల దృష్టిఅంతా కుక్కమీదకే వెళ్లేటట్టూ, కుక్కమీదనేఉండేటట్టూచూసుకోవాలి. లేకపోతే కుక్కా శ్రీనివాసరావూ కూడా కథకి చివరవరకూ సమాన ముఖ్యులుగా ఉండేటట్టు మనోకల్పితమైన కథనిఅల్లాలి. ఇంతకీ, ప్రస్తుతం కథలో ఈకుక్కయొక్క చేష్టలు ఎక్కడా చదువరులయొక్క దృష్టిని వాటిమీదనే నిలుపుచేసేటంత విశేషమైనచేష్టలు కానే కావు. 'రహస్యశోధన' అనీ, 'పరిశోధన' అనీ, 'ఫినామినన్'అనీ, 'శోధనోద్రేకం'అనీ నాలుగైదు పెద్దముక్కలు కథలో ఇక్కడా అక్కడా పడ్డాయన్న మాటేకాని, కాలభైరవుడిని గురించి కథ వ్రాయవలసినంత పరిశోధన కూడా ఎక్కడా కనపడలేదు. ఇటువంటి పరిశోధన ముఖ్యం కాకపోయాక, శ్రీనివాసరావూ ముఖ్యం కాకపోయాక, కుక్కయొక్క చేష్టలలోనూ ఏమీ విశేషం లేకపోయాక ఈకథ ఎందుకు వ్రాసినట్టో తెలియడంలేదు. ఈకథలో భజనమందిరం గురించీ, పురాణం చెప్పించుకునే వితంతువుల కలలగురించీ ప్రశస్తమైన వర్ణనలూ, వివరాలూ ఉన్నాయన్నమాట నిజమే. కాని, ఇవి కథకి ఒకపక్కనుంచి ఎంత అందం తేబోయినా, కథకి కథమాత్రంగానే ఉన్న ప్రధానలోపం అవి తీర్చలేవు. 'వ్యాఖ్యానం'లో కుటుంబరావుగారు "'కాలభైరవుడు' నీతితోకూడుకున్న కథ. ఆ కథయొక్కనీతి కథచివరనే ఉంచాను. నీతితోకూడుకున్న కథ ఆధునికంగా ఉండటానికి అవకాశంవుందనీ, కథయొక్క నీతి కథచివర ఉంచటంవల్ల కథయొక్క అందం చెడదనీ నిరూపించటానికి ఇది రాశాను." అని వ్రాస్తున్నారు. వీరి ప్రకారం కథయొక్కనీతి ఈకిందివాక్యంలో ఉన్నట్టు: "ఈకుక్కకి భగవంతుడు ప్రసాదించిన శక్తిని అది వృథాచెయ్యకుండా, ఆశక్తిని కుక్కలజాతియొక్క మేలుకే ఉపయోగించితే ఆజాతికి చాలామేలు చేసినదయ్యే దనుకుంటాను." అసలు, ఈమాత్రం నీతి కథచివరని ఇంతగంభీరంగా చెప్పవలసిన కారణం ఏమీ కనపడదు. అదికాక, కథ కంగారుగా ఉందన్న విషయం అటుంచనిచ్చినా, ఈకథకీ ఈనీతికీ తప్పనిసరిగా సంబంధం ఎలాఉన్నట్టో పూర్తిగా సూచింపబడలేదు.

" 'వరాన్వేషణ' అన్నకథ ఇంగ్లీషు కథ కాదు. నాకు తెలిసినంతవరకు అనుకరణం కూడా కాదు" అని కుటుంబరావుగారు 'వ్యాఖ్యానం'లో వ్రాసేరు. కాని, చాలావరకు ఈకథ సీమనుంచి వచ్చే చవక పత్రికలలో కథలలాగే ఉంటుంది.

ఈ కథలో పార్వతి తన స్నేహితురాలు సుశీలకి వ్రాసిన ఉత్తరం:

"ప్రియురాలా, సుస్సీ—నిన్ను పెళ్లికూతురుగా చూడాలన్న ఉత్సాహం నాకు నాటినాటికీ జాస్తీ అవుతున్నది. ...నీకున్న దుస్తుల్లో మంచివి నాలుగు వెంట తీసుకుని వెంటనే బయలుదేరి వస్తావా?...మా సాగర్ కూడా నిన్ను చూడాలని ఉవ్విళ్లూరుతున్నాడు— నీ ప్రియురాలు, పా."

'పా' అంటే పార్వతి. సాగర్ పార్వతి స్నేహితుడు. ఈ ఉత్తరం చదువుకున్నాక సుశీలఉద్దేశ్యం సాగర్ తనని పెళ్లిచేసుకుందామనుకుంటున్నాడనిన్నీ, పార్వతి ఆవిషయం ఈ ఉత్తరంలో తెలియపరచదలచుకుందనిన్నీ. పార్వతికి భద్రం అని ఒక అన్న కూడా ఉన్నాడు. తూకం నూట తొంభై యెనిమిది పౌన్లు. భద్రం సుశీలని పెళ్లిచేసుకుందా మనుకుంటున్నాడు. కాని రెండేళ్లబట్టి ఈమాట పార్వతికి చెప్పడానికికూడా సిగ్గుపడిపోతున్నాడు. పార్వతి ఈ సంగతి గ్రహించి సుశీలని తన ఊరు రమ్మనడం భద్రంకోసమే. రమ్మనడం సాగర్ కోసమని భ్రమపడుతుంది సుశీల. కాని తీరా వెళ్లేక సాగర్ తనతో చమత్కారంగా మాట్లాడుతూ ఉన్నా, పెళ్లిఉద్దేశ్యం అతనికున్నట్టు తనకి కనపడదు. రాత్రి భోజనం అయాక సాగర్ భద్రం పార్వతీ సుశీలా కలిసి వెన్నెలలో భద్రంకారులో కొండల దగ్గిరికివెళ్తారు. సాగర్ పార్వతీ కలిసి చటుక్కున కొండల మీదకి ఎక్కిపోతారు. భద్రం ఎక్కలేక కూలబడిపోతాడు. సుశీల భద్రంపక్కని చేరుకుంటుంది. సిగ్గుపడుతూ సిగ్గుపడుతూ పెళ్లిచేసుకోమని అడుగుతాడు భద్రం. ఒప్పుకుంటుంది. "భద్రం తన్ను దగ్గిరికి లాక్కుని కొండలన్నీ మారుమోగేట్టు ముద్దుపెట్టుకున్నాడు." ఇల్లు చేరుకున్నాక రాత్రి పన్నెండున్నరకి పార్వతివచ్చి సుశీలని "భద్రం ఏమైనా కదలబారాడా?" అని అడుగుతుంది. అప్పుడు సుశీల పార్వతి తన నిక్కడికి రమ్మనడం సాగర్ కోసం కాదనీ, భద్రం కోసం అనీ గ్రహిస్తుంది. అప్పుడే పార్వతి సాగర్ గురించి కూడా చెప్తుంది. "సాగర్ నన్ను పెళ్లిచేసుకుంటానన్నాడు. నువు సాగర్‌ను బాగా ఎరగవు. నేను చేసుకోను పొమ్మన్నాను! వాడు చాలా కష్టమైన మనిషి!" తర్వాత "తన్ను పార్వతి భద్రాన్ని పెళ్లాడటానికి రమ్మన్నదని తెలిసినప్పుడు తనకు పార్వతిమీద కలిగిన కించిత్తు కోపమూ పార్వతి ఆఖరుకు అన్నముక్కతోగాని ఉపశమించలేదు..."

మనదేశపు పరిస్థితులు మరిచిపోగలిగినట్టయితే ఈ కథలో ఆట్టే చెప్పతగిన లోపాలు లేవు. సంభాషణ అక్కడక్కడ అసహజంగా ఉన్నమాట నిజమేకాని, సంఘనిరూపణలోనే కథయొక్క ముఖ్యమైన దోషం. సంభాషణగురించి చర్చిస్తే, భద్రం సుశీలతో తను అందంగా ఉందని చెప్పినప్పుడు, సుశీల ఆతురతతో "నేనా?....అందంగా ఉన్నానంటావా? ఆవిషయం నీకు తెలిసిందంతా

ఓపిక ఉన్నంతవరకు చెప్పు. వినాలని సరదాగా ఉంది—నీ నోటివెంట!" అనడం చాలా అసహజంగా ఉంది. కాని సంభాషణ గురించి ప్రశంస అంత ముఖ్యం కాదు.

'వరాన్వేషణ'లో కథ మనసంఘంలో జరిగుండొచ్చునని చదువరులు నమ్మాలంటే కుటుంబరావుగారు ఈ కథలోవచ్చిన పాత్రల యొక్క చరిత్రలు ఇంకా విపులంగా చెప్పవలసింది. ఇచ్చినవివరాలు చాలవు. కొన్ని విషయాలు ఆలోచిద్దాం: భద్రం పార్వతీ తప్ప భద్రంఇంట్లో మరెవరూ లేరు. అంటే వాళ్లకి తల్లితండ్రుల ఘోషకాని, అమ్మమ్మ నాయనమ్మలఘోషకాని, అత్తల పింతల్లుల ఘోషకాని ఏమీ లేదన్నమాట. భద్రం ఉద్యోగం చేస్తున్నాడు. పార్వతి భద్రం ఇంటిసంగతులు కనిపెట్టూ భద్రంతో ఉంటోందన్నమాట. పార్వతికి ఏమీ ఉద్యోగం లేదు. ఎంత చదువుకున్నదయినా స్వంతంగా ఉద్యోగం చెయ్యాలంబదులు అన్న ఇంట్లో ఉండడమే నయమనుకుం దన్నమాట. వీళ్ల ఇంటికి సాగర్ వంటి పురుషులు అతిథులుగా వచ్చి అతిచనువుగా ఉండడం చాలా సామాన్యమైన విషయం. భద్రం కచ్చేరికి పోయినప్పుడు ఇంట్లో సాగర్ పార్వతులు తప్ప మరెవరూ లేకపోవడం అంత ప్రత్యేకంగా చెప్పవలసిన విషయం కాదన్నమాట. సుశీలవంటి స్నేహితురాలు ఇంటికివస్తే సుశీలకీ పార్వతికీ వేరువేరుగదులు. ౨౩వ పేజీలో "రాత్రి పన్నెండున్నరకు పార్వతి తన గదిలోకివచ్చి తన పక్కమీద కూర్చుని......" అంటే రాత్రుళ్లు పడుకోడంకూడా పార్వతి ఒక గదిలోనూ, సుశీల ఒకగదిలోనూ అన్నమాట. తర్వాత ఈఇల్లు స్వయంవరాలకి పుట్టినిల్లు. సుశీల వెంటనే భద్రాన్ని పెళ్లిచేసుకుంటానని ఒప్పుకుంటుంది. ఆ సమయంలో తన కొకతండ్రి ఉన్నట్టూ, ఆతండ్రికి కూడా తన పెళ్లివిషయమై ఉద్దేశ్యాలుండొచ్చునన్నట్టూ, తన పెళ్లికి తన తండ్రి అనుమతి ఏమాత్రమైనా కావలసినట్టూ సుశీలకి తట్టదు. ఇక తండ్రికథ ౨౫వ పేజీలో: "...తన తండ్రి తన మూలంగా పడుతున్న బాధ. సగౌరవంగా తనకు పెళ్లిచెయ్యటానికి ఆయన కభ్యంతరం లేదు. కాని తన మూలకంగా నిరాధారమైన అపనాదు కావటం—తన మూలకంగా ఇంటికి వయసులోఉన్నవాడెవడూ రావటానికి వీలులేకపోవటం- ఆయనకు చాలాకష్టంగా ఉంది. ఎవరినో ఒకర్ని చేసుకోటానికి తనకు అభ్యంతరం లేకపోయినా ఆయన కభ్యంతరం ఉంది." బాలవితంతువైన సుశీలకి మనసంఘంలో తండ్రి సగౌరవంగా పెళ్లి చెయ్యడానికి సంసిద్ధుడై యుండడమే ప్రత్యేకమైన సంగతి. తండ్రి స్వభావం కథలో ఇలా కొంతవరకు చర్చించిన తర్వాత, ఇంటికి వయసులోఉన్నవాడెవడినీ రాకుండా చూసుకుంటున్న ఈ తండ్రిమాట కథలో కొన్ని ముఖ్యసమయాలలో సుశీల తలపెట్టకపోవడం మరీ అసందర్భంగా ఉంది. కథకుడు తండ్రిమాట ఎత్తకుండానే ఉంటే కొంత నయంగా ఉండునేమో.

కథ పాశ్చాత్యసంఘంలో జరిగినకథ అయితే కథలో ఉన్న వివరాలుతప్ప మరేమీ అక్కరలేదు. అక్కడ అన్నా చెల్లెలూ మాత్రమే కలిసి ఉండడం, పురుషులు ఇటువంటి ఇంటికి స్వేచ్ఛగావచ్చి అతిథులుగా ఉండడం, స్నేహితురాలు వస్తే ఆవిడకి ప్రత్యేకంగా ఒకగది ఏర్పాటుచేసి స్నేహితురాళ్లిద్దరూ వేరువేరు గదులలో పడుకోడం, అన్నీ సామాన్యమైన విషయాలు. ఈదేశంలో అలాకాదు. ఈ దేశంలో ఇటువంటి విషయాలన్నీ విపరీతమైన విషయాలు. ఈవిపరీతపరిస్థితులు ఈకుటుంబాలకీ ఈమనుష్యులకీ ఎలా సంభవించాయో పనిపెట్టుకుని ప్రత్యేకంగా బోధపరచడమో, లేక అక్కడక్కడ అవసరం వచ్చినప్పుడల్లా చిన్న చిన్న వాక్యాలలో సూచించడమో చేస్తేకాని, ఈకథ కుటుంబరావుగారు ఎప్పుడో చదివిమరిచిపోయిన ఇంగ్లీషుకథకి అనువాదమేమోనన్న అనుమానం కొందరిని బాధిస్తుంది.

కాని, "ఇది మనసంఘంలోనే జరగటానికి అవకాశం ఉందని పాఠకులూ విమర్శకులూ నామాటమీద నమ్మవచ్చును" అని కుటుంబరావుగారి 'వ్యాఖ్యానం'. ఇంతధాటీగాచెప్తే సమాధానం చెప్పడం కొంచెంకష్టం.

సుశీలని చిన్నప్పుడు మొగుడుపోయినదానిలా చిత్రించవలసిన అవసరం ఏమీలేదు. కథకి ముఖ్యమైన విషయం సాగర్ తనని పెళ్లి చేసుకోబోతాడని సుశీల భ్రమపడడమూ, చివరకి భద్రాన్ని పెళ్లి చేసుకోడమూను. అనవసరమైన మొదటిపెళ్లి తెచ్చిపెట్టుకోడంవల్ల కథ కొంచెం ఎక్కువకంగారుగా తయారయిందికాని వేరేలాభం కనపడదు.

'వరాన్వేషణ' గురించి ఇంతవ్రాస్తే 'అరణ్యాం' గురించి చెప్పవలసినది అంతలేదు. సంఘనిరూపణలో 'అరణ్యాం' అన్నకథ 'వరాన్వేషణ'ని మించిపోయి తప్పులతడకగా ఉంది. కూతురుపెళ్లిప్రశంస వచ్చినప్పుడు "నాచేతిమీదగా నేనుచెయ్యను. మొగుడు కావలసినప్పుడు ఎవరితోనూ చెప్పకుండా అదే లేచిపోతుంది. పాపమూ పుణ్యమూ నాకక్కర్లేదు" అనే తండ్రులూ, "నా అందమూ వయస్సూ నాకెందుకు? ఎవరు నాకు సుఖం ఇస్తే వాళ్ల కవి ధారపోస్తాను. నాఅందాన్నీ వయస్సునూ నలిపేసేవాడు కావాలి నాకు" అని కేకలువేసే కూతుళ్లూ, "నీవెళ్లేతీసుకో! నీకు భర్తకాదగినవాణ్ణీ, నీకు భర్త అయినఆయనతో కులగోత్రాలలోనూ సంపదలోనూ సమానుణ్ణీ, వయసులో అంతకంటె నీకు తగినవాణ్ణీ, తెలివితేటల్లో- నేచెప్పకుంటే బావుండదుకాని-సామాన్యంగా సాటిలేనివాణ్ణీ, నే నిట్లాఉండగా నిన్ను మానాన్న చేసుకున్నాడు." అని సవతితల్లి వచ్చినొత్తలో సవతితల్లితో మాట్లాడే సవతికొడుకులూ కుటుంబరావుగారి 'అరణ్యాం'లో కనపడతారుకాని మన 'జంబుద్వీపే, భరతఖండే'లో ఎక్కడా ఉండరు.

కథలో పాత్రలు ఎంత అసహజంగా ఉన్నారో కథావిషయంకూడా అంత అసందర్భంగానూ ఉంది.

సంఘనిరూపణలో మన తెలుగుకథకులు ఒకవిషయం జాగ్రత్తగా చూసుకోకపోతే ఇటువంటిబాధలన్నీ బయలుదేరుతాయి. ఈ

నాటి మన సంఘపరిస్థితులకీ పాశ్చాత్యపద్ధతులకీ చాలా వ్యత్యాసం ఉంది. ('పాశ్చాత్య పద్ధతు'లనడంలో ప్రస్తుతం ఈ పద్ధతులు పాశ్చాత్యదేశాలలో నేడున్నాయన్న అర్థం.) అప్పటికీ కొందరుపురుషులూ కొందరు స్త్రీలూ మనలోకూడాసంఘాన్ని అతిక్రమించి పాశ్చాత్యమార్గాలు అవలంబించడమో, లేక అవలంబించడానికి ప్రయత్నించడమో జరుగుతూనే ఉంది. ఈ అవలంబించడం రహస్యంగానైనా జరుగుతోంది, బహిరంగంగానైనా జరుగుతోంది. అంటే, సంఘంలోఉన్న యావత్తు ప్రజనీ తీసుకుంటే, కొందరు ఆలోచించకుండానూ, కొందరు ఆలోచించీ సంఘం ఎలాచెప్తే అలాచేస్తున్నారు; కొందరు పూర్తిగాభయపడీ కొందరు సాహసం చాలకనూ ప్రస్తుతపరిస్థితులకి లోబడిపోతున్నారు; కొందరు సాహసం చాలనప్పటికీ సంఘానికి పూర్తిగా లొంగిపోవడానికి ఇష్టపడక, ప్రస్తుతపరిస్థితులు మార్చలేక రహస్యంగా వాళ్లకి ఎలాజీవించాలని ఉందో అలా జీవిస్తున్నారు; కొందరు సంఘానికి వెరవకనో తమస్వభావాలని తప్పుకోలేకనో, సంఘాన్ని మార్చాలన్న అభిలాషతోనో, అటువంటి అభిలాష లేకుండానో స్వేచ్ఛాజీవులవుతున్నారు. కాని అందరూకూడా సంఘపరిస్థితులతో ఏదో ఒకవిధంగా సంబంధం ఉన్నవాళ్లే. ఈ సంబంధం స్నేహభావంతో కూడుకున్నదీ, అనుకూలమైనదీ అయినా కావచ్చును; రహస్యమైన వైరంతోనో, లేక బహిరంగమైన వైరంతోనో కూడుకున్నదైనా కావచ్చును. కాని "సంఘం ఎటువంటిదైతే నాకేమిటి? సంఘానికీ నాకూ ఏమీ సంబంధంలేదు." అనగలిగినవాళ్లెవరూ ఉండరు. ఏ కథకి తగినట్టు ఆకథలో సంఘంయొక్క ప్రస్తుతి పరిస్థితులకీ, కథలో ముఖ్యపాత్రలయొక్క నడవడికీ సంబంధం జాగ్రత్తగా చూపిస్తే కాని కథ నమ్మతగినట్టుండదు. ఇందువల్లనే మనసంఘపరిస్థితు లెటువంటివో సమంగా సూచించనికథ లన్నీ కూడా ఎన్నడూ కనీవినీ ఎరగని దేవుళ్లగురించో దెయ్యాలగురించో వ్రాసిన కథలలా ఉంటాయి. పునాదులులేని ఇళ్లూ, వేర్లుపారని చెట్లూ, సమమైన సంఘనిరూపణలేని కథలూ అన్నీ ఒకేతరగతికి చెందిన విరుద్ధాలు. సామాన్యసంఘ నియమాలని అతిక్రమించేవాళ్లగురించి కథ వ్రాస్తున్నప్పుడు కూడా సంఘనియమా లెటువంటివో, వాటిని ఎందువల్ల అతిక్రమిస్తున్నారో, ఎలా అతిక్రమిస్తున్నారో, ఎలా అతిక్రమించగలుగుతున్నారో సూటిగా సూచించలేక పోయినట్టయితే కథచెప్పిన లాభంలేదు. కథవ్రాస్తున్నప్పుడు కథలోవచ్చే ప్రతిమనిషియొక్క మనోజీవితానికీ సంఘపరిస్థితులకీ ఉన్నసంబంధం ఎటువంటిదో కథకుడు ప్రతిక్షణం దృష్టిలో ఉంచుకోవాలి. ప్రతిక్షణం సమంగా చూపించాలి.

'ఇంతలోఉంది' అన్నకథా 'పశ్చాత్తాపుడు' అన్నకథా ఇటువంటి లోపాలు ఆట్టే లేకుండా ఉన్నాయి. ఈమొదటి కథలో, చాలాకాలం ఉద్యోగంలేక భార్యచేత పోషింపబడుతూ చటుక్కున ఉద్యోగం సంపాదించి భార్యతో వైరం తెచ్చిపెట్టుకున్న ఒకభర్తయొక్క స్వభావాన్ని కుటుంబరావు మంచి పరిశీలనాశక్తి చూపించి రమ్యంగా చిత్రించారు. ఈకథల'కూడా సంభాషణ కొన్నికొన్నిచోట్ల అసహజంగా ఉన్నప్పటికీ మొత్తంమీద కథ చాలాబాగుంది. ఈ కథలసంపుటి చదివినవాళ్లందరూ కుటుంబరావుగారు ఇటువంటికథలు చాలా వ్రాయాలని కోరుతూ ఉంటారు.





'గాయనులు'

౧౮ - వ శతాబ్దపు రాజపుత్ర చిత్రము.

చిత్రకారుడు : కొ. నరసింహాచారి



# దీపలక్ష్మి

విశ్వనాథ వేంకటేశ్వర్లు

మినుకు మినుకుమను సంధ్యా
సనాతన స్వచ్ఛకాంతి స్థాలంకృత నూ
తన ముగ్ధవధూప్రవిలా
సనిభృత దీపకళికా సుసాధ్వికి వినతుల్.

మాయిలువేల్పవై జననీ! మంజులహాసరుచి ప్రణీతశో
భాయతి దెల్గు రాజ్యముల నాముదపుంగొల పంటచేలలో
శ్రీయుత మూర్తి దోచి సరసీరుహకోరక రమ్యదీపికా
ధ్యేయశుభాకృతిన్ మధురదీప్తులు నింతువు తెల్గులిండ్లలో.

తెలుగుల తోడబుట్టువయి తీర్చిన మంగళరమ్యరూప శో
భలుగొని పుట్టినింటికిని బచ్చనితోరణమాల చిల్కవై
కలకలలాడు నెమ్మొగము కాంతులలో నెఱ భాగ్యలక్ష్మి సొం
పులు వెలయించుచున్ రుచిరమూర్తిని వెల్గుదువమ్మ! చెల్లెలా!

నిను మా కన్నుల కద్దుకొందుము చిరంటీ! వేదకాలాలు సా
దిన ముత్తైదువు పైడి ప్రత్తి తెలివత్తిన్ వెన్నెలల్ పిండి ని
న్ననుకంపామతి జ్యోతిరాకృతిని నాత్మాంత శ్శిఖామూర్తి ది
ద్దెను తెన్గుంజవరాండ్ర మెత్తనెద నుద్దీపించు రేవెల్గుగన్.

నీదరహాస చంద్రికలు నించిన సంజల దెల్గులేతము
త్తైదువు బ్రాహ్మి లేనొసట దార్చిన కస్తురి నిల్వుబొట్టునా
గాదిలి వెల్గురేక కడకన్నుల నద్ది హసించు నూహలో
నూదిన ప్రేమ మా తెలుగు నోమినదమ్మ విలాస భారతీ!

తెలుగుల దేవమాతృకలదీప్తి నెసంగెడు పౌష్యలక్ష్మి ని
చ్చలు చెలిమిన్ వహింప నిరుసంజల బొల్చిన నీదు లాస్య మం
జుల రుతి బుక్కరించు నెద సొక్కుచు దెల్గుల పంటలేమ కెం
పులు తులకించు ధాన్యములు పొంగుచు గాదెలకెత్తి నవ్వెబో!

నిను నాత్మజ్యోతినిగా
గని కనిమెద నాడుపడుచు గారవమొప్పన్
జననీ! బ్రహ్మవిదాం వరు
లనుభూతి మహస్సువనుచు నర్చింత్రు నినున్.

నెలలబిడ్డకు కచ్చికల దీపికలదృష్టి
గడప గడపన్ దొక్కు కన్నతల్లి

పసపుబట్టల పెండ్లిపడుచుపాపల దారి
కలిమి నూరేగెడు కల్పవల్లి
ఇల్లాలి పాపట నెసగు ముత్యపుకాంతి
ప్రతిఫలించెడు మేలిపాలవెల్లి
పండుముత్తైదువు నిండు ప్రేమ మనస్సు
మీలనంబున నించు మించువల్లి

శైశవాభ్యస్త విద్యాప్రకాశమాన
భారతజ్యోతి సత్కృపాపరతచేత
మామనఃపాత్రికల ప్రేమమధువునింపి
ప్రాణమయ దీపకళిక గాపాడుగాక.

జనని! విలాతిదేశముల సాహసదీపిక లుద్ధతప్రభఁ
చననరులై జనంబుల ప్రసన్నమనోహర తావకీనదీ
ప్తిని విహసించుచుఁ వెలుగువేడిమి జూపి తెలుంగునేల నూ
తనవికృతంపు నృత్యముల దల్లడపెట్టు మనోంకురంబులఁ.

ఈ విల్లాలితనమ్ము, సాత్వికనవ హ్రీరమ్యవైరాగ్యయో
షావిన్యాసము చూపుచుందువు, నిరస్తశ్రీలు దుష్టద్యుతి
ప్రావీణ్యాల్ కలివైభవోద్ధతలునౌ వైదేశికజ్యోతులు
ద్భావల్ తెల్గువెలంది లేమెడద గ్రువ్వంజొచ్చె గన్వెట్టిగాఁ.

చల్లనిదీధితుల్ పఱపి స్వాంతము మెత్తనగాగ సంప్రదా
యొల్లన దాత్మవైభవము నూహారసస్థితి నొందజేయు ని
న్నొల్లరు బో జనమ్ము కలుషోద్ధతి నావిరి ముక్కుకోల్లు కం
పిల్ల శిరస్సు గిర్రుమన విహ్వలులై సుఖమందు రంబికా!

జడసత్త దీపింప సర్వంసహాగర్భ
మగలి మిన్నెక్కిన యందకత్తె
లాదీపికలతోడ వాదేల, తెల్గుల
హృదయాబ్ధి ద్రచ్చిన నుదితమైన
యమృతాంశుకళవు, ప్రాగాంధ్రసదాచార
రూపమొందిన ధర్మరోచి వగుచు
నీవు తెల్గులయింట నెసగిననాళ్లను
జలకాష్ఠతృణసమృద్ధులు చెలంగ
తెలుగుదేశమ్ములును భాగ్యదీప్తములయి
యింటనింటను బాడియు పంట లెసగి
తెలుగు లాబాలగోపాల మెలమి ప్రాణ-
చిహ్నమధురాంక! నిన్నుపాసింత్రుగాక!

# చాటువూ, తెఱచాటువూ

ఆశ్వయుజమాసపు భారతి తరువాయి

జి. వి. సుబ్బరావు

## పతనసౌభాగ్యము

తాంబూల మిచ్చి, రదనిక దాటిపోయిన సమ్మంనైపు దిగాలపడి చూస్తూ నిలబడ్డది విలాసవతి. తర్జని కంటుకున్న కుంకుమపరాగాన్ని చీరకు తుడుచుకుని యెందుకో కంట నీరుపెట్టింది. ఇంతవరకూ నిలబడి కొయ్యలా వున్న కనకవల్లి నోరువిప్పి

కన:—చీరకు తుడువకపోతే ఆనొష్టకే పెట్టుకోలేక పొయ్యావ్ - బాగుందేది! నీకు ముండెనా నేను? సాధుపలవ్వే నీవు! నేనేమో అనుకొన్నానుగాని!

విలా:—(మాట్లాడదు.)

కన:—ఏం? మొద్దులా అలా నిలబడ్డావేం? గడియవూడా వేసిరా, సాగనంపటం పూర్తవుతుంది.

విలా:—నువ్వే వెయ్యావే ; దినమూ నేనే వేస్తున్నానేం ?

కన:—నువ్వెందుకేస్తున్నావ్! నువ్వు రాణీవాయ! అన్నితొక్కులాటలు నాకుగాని నీ కేముంది? (అని పోయి తలుపేసి) అవచ్చిన మనిషెవరో చెపుతావా చెప్పవా? ఆపతమేమిటో, ఆపదాలేమిటో వెంటనే చెప్పక పోతివా నిజంగా నిన్ను గొంతుపిసికి ఆకోనేరులో పారేస్తాను. గడుసులంజా! ఎవరనుకున్నావ్ ? కళ్లు నెత్తికివచ్చాయా, ఈమాణ్ణాళ్ల సౌభాగ్యానికి ? జాగ్రత్త! వొళ్లు దగ్గిర పెట్టుక బ్రతుకు!

విలా:—నీ కేం చెప్పవలసిన అవసరం లేదే నాకు: పూర్కే అతిగా నోరుచేసుకోవద్దు.

రూపా:—అమ్మ! దానిమనసులో ఏదో కష్టంగావుంది : ఎందుకే దాన్ని నీ విప్పుడు బాధించటం ? మనకుమాత్రం తర్వాత చెప్ప దూ, తొందరపడతావుగాని !

కన:—నువ్వూ యేకమైనావుటే దొంగ భడివా? మీ యిద్దర్ని వొయ్య వొలవకపోతే నాపేర్న పెట్టి పిలవకండి !

రూపా:—తిట్టవే తిట్టు ! నీయిష్టమొచ్చినట్లు తిట్టు! అందులో మొదలెడ్తే నీ విప్పుడాపుతావా ! బ్రహ్మ దిగిరావల్సిందేగాని !

అక్కా ! నువ్వు వెంటనే పైకిపో! నే నిక్కడుండి వింటాలే, దీని శాపనార్థాలన్నీ. (అని చెయ్యిపట్టుకొని లోపలికి నెట్టును. విలాసవతి గడియవేసుకొని పైకిపోవును.

రూపావతి సమ్మంమీద కూర్చుని) తిట్టవే ఇక తిట్టు, నీయిష్టమొచ్చినన్ని !

కన:—ఎంత మేకువయ్యావే నీవు ? ఆ ! నాకళ్లెదుట పెరిగావ్ ! నీకూ పొయ్యేకాల మొచ్చిందీ? నాకేం? కట్టకట్టుకు చావండి. నాదేం పోతుంది? ఇంత అదుపూ ఆజ్ఞా లేకుండా మితిమీరిపొయ్యారని అనుకోలేదే !

రూపా:—అయితే, అమ్మ ! ప్రతి విషయమూ నీకు చెప్పితీరాల్టే ? పెద్దవాళ్లు మన యింటికి రాకూడదా, వాళ్లతో మాట్లాడకూడదా ? తెలియక అడుగుతాను !

కన:—నోరుమూయ్ పుట్టుకుంకా. మొన్న మొన్న కళ్లు తెరిచావో లేదో! ఛీం రాచకార్యాలే మీ కింతసేపు ? దాని వొయ్యారం చూస్తే నాకు వొళ్లు మండుకుపోయింది. ఆగండి, తిక్కకుముండల్లారా, ఈ కొంపకు చిచ్చంటుకున్నప్పుడుగాని మీకు తెలిసిరాదు !

రూపా:—అయితే యిప్పుడు యేమంటావే నీవు?

కన:—ఏమంటానా? మీ యిద్దర్ని పురిపోసి ఆమాలానికి వేళ్లాడతీస్తానంటాను.

రూపా:—అలాంటిరోజేవస్తే మేమే పురి పోసుకుంటాం. నీకెందుకే యీ కష్టం పెంచిన ముండకు?

కన:—ఛీ! ఛీ! గడుసులంజా! నీమొహం చూస్తే పాపాలు చుట్టుకుంటాయ్. అనుభవిస్తార్లే, పదండి! తలవపట్ట మెందుకు?

రూపా:—అమ్మ! నిన్ను చూస్తే నాకేమీ అనటానికి నోరు రావటం లేదే - ఏడుపొస్తున్నది గాని. నీకాళ్లకు మొక్కుతాను, నీ నోరాపి, తప్పిదముంటే మమ్మల్ని క్షమించవే.

కన:—ఏడవ్వే యేడు ! ఈనట్టింట కూర్చుని నువ్వూనూ, మేడమీద అదీనీ శ్రుతిపెట్టు కేడవండి. మీఋణం నాకు తీరింది. నేనేమో మావాళ్లింటికి వెళ్లిపోతున్నాను. (అంటూ కఱ్ఱపట్టుకొని గడియతీసి, గభాల్న తలుపు తెరచి, చివాల్న నిష్క్రమించును.)

రూపా:—అమ్మ! తోడురమ్మంటావా! వస్తాను !

కన:—(బైటనుండి) నీసంకత్తోడు నాకేం అవసరము లేదు. జ్ఞానముంటే మీతోడు మీరు చూసుకోండి (అంటూ సాగిపోవును)

రూపా:—దీంతో యేదివచ్చినా కష్టమే! మంచికీ యింతే, చెడ్డకీ యింతే.

అనుకుంటూ గడియవేసుకొని పట్టెమంచం మీద వ్రాలింది. రెండవయామం జరిగింది. ఇంటి దగ్గిర పహరాకువచ్చే రాజభటులు ఇంకా రాలేదు. వాళ్ల ఆయుధధ్వనికోసం చాలాసేపు వేచింది. జఠరాగ్ని యెక్కుడై నిద్రపోయింది. పీడ కలవచ్చి, భయమేసి పలవరిస్తూ "అమ్మ! అమ్మ" అంటూ లేచింది. తర్వాత "అక్కా! అక్కా!" అని కేకలు వేసింది. జవాబు రాలేదు. తలుపుతెరచి చూసేసరికి వరాండికంలో ఇద్దరుకృపాణులు నిద్రపోతున్నారు. మేల్కొలిపింది. "ఏం! గభాల్నతీశావ్ రూపమ్మ!" అన్నారు రాజభటులు.

రూపా:—ఏం లేదు! అమ్మముండ పోట్లాడిపోయిందీ! అందుకని.

భటు:—శ్రీవారు వేంచేసి చాలా సేపైందనుకుంటాం.

రూపా:—వచ్చింది మీకు తెలియదూ?

భటు:—మాకు తెలియకుండా వారొస్తారు ; వారికి తెలియకుండా మేము రావాలి! వారికి ముందే మేల్కొని కోటదాకా వారికి త్రోవ కాపాడాలి. అదీ మాకిచ్చిన ఆజ్ఞ!

రూపా:—రాజుగారేనా యిచ్చింది ?

భటు:—ఏం వేళాకోళాలమ్మా! చదువు రాని ముండావాళ్లతో!

రూపా:—మరెవ్వ రిచ్చారు?

భటు:—అమాత్యులు.

రూపా:—ఓహో! రామన్న గారా! తెలిసింది! నిద్రపొండి. మా అమ్మ వస్తే తల్పు తట్టండి.

అంటూ తలుపేసుకొని మళ్లా శయనించింది. అక్కగారు వ్రాసిన శృంగారకావ్యాన్ని తీసి చదవడం మొదలెట్టింది. ఏ పద్యం మధ్యనో నిద్రవచ్చి, వక్షస్థలాన గ్రంథాన్ని విడిచి గుర్రుపెట్టింది. కడపటియామంలో కోడికూసింది. నెల పుటుక్కున పొడిచింది. మందమారుతాలు దొంగవేటుగా వీస్తున్నాయి. నాయికానాయకుల పరిష్వంగబంధము సడలలేకసడలలేక సడలింది.

మెల్లగా మెట్లు దిగివచ్చి విలాసవతి చెల్లెలి ప్రక్కవద్ద నిలబడి "ఎంతసుఖమైననిద్ర నీకు ప్రసాదించాడే పరమేశ్వరుడు, రూపా! పసిపాపని ప్రశాంతం తాండవిస్తున్నావ్" అని నుదురు ముద్దుపెట్టుకుంది. రూపావతి తటాల్న మెడ పెనవైచుకుంది; కళ్లుతెరుస్తూ "నీవటే అక్కా! ఎంత పొరపడ్డానే! అతడే అనుకొన్నాను." అంది.

విలా:—ఎవడే నీ అతడు!

రూపా:—నే చెప్పనే.

విలా:—చెప్పకపోతివా మళ్లా ముద్దెట్టుకుంటాను; ఈ తడవ ఆ అధరాన్ని.

రూపా:—అయితే, అద్దైంతర్వాత చెప్తా (విలాసవతి అధరాన్ని లీలగా చుంబించును.)

రూపా:—భాస్కరుడే! భాస్కరుడు!

విలా:—ప్రధానిగారి పుత్రరత్నమా? తెలిసింది! అస లిదంతా యెప్పుడు?

రూపా:—ఎప్పుడో చెప్పేదీ? నిన్నుకన్నుమరగి చేశానే ఓపని. మొన్న మన యింట జరిగిన సావిత్రీ గౌరీదేవి నోములకు వాలలాడించటానికి పోలా?

విలా:—అవును! పొయ్యాం.

రూపా:—కోనేరు-రంగనాథుడి కోనేరు—నీకు జ్ఞాపకం రాలేదూ-గోడచాటున నాకు హఠాత్తుగా ప్రత్యక్షమయ్యాడు. వెంటనే యేదో ఆవేశమొచ్చి, పట్టెడుకుంకం మొగాన కొట్టాను.

విలా:—కొట్టావు. కొడితే?

రూపా:—ఓ చిరునవ్వు నామీద ప్రసరించాడు. అంతే. తరువాత ఎన్నిమారులో కబుర్లు చేశాడు. స్వయంగాకూడా వచ్చాడు. కాని యింతమాత్రానికే చోటిస్తానటే అక్కా!

విలా:—సరే! దాని బగులు కలలుగంటున్నావుగా! తీరిపోయ్.

రూపా:—నేనేమో - రంగనాథుడి కోవెల్లోకి-పూజకెళ్లాన్లే.

విలా:—ఊ! ఈరాత్రేనా?

రూపా:—నవ్వకే, నవ్వకు. పూజచేశానో లేదో జ్ఞాపకం రావటంలేదుగాని బైటకు వచ్చినట్లు గుర్తుంది. అంతా నిర్మానుష్యంగా వుంది. లోపల బికు బికూ మంది. చేతిలో పూలపళ్లెం ఎందుకో వణికింది. ధ్వజస్తంభం చాటునుంచి ప్రత్యక్షమయ్యాడు. ఏంజేసేదీ?

విలా:—తర్వాత?

రూపా:—"రూపా! ఈ హృదయం తీసి ఆ పళ్లెరంలోపెట్టి నీకు సమర్పిస్తాను. ఒక్క ముద్దియి" అన్నాడు. నే నొప్పనన్నాను.

విలా:—ఏం ధైర్యమే నీది?

రూపా:—మెల్లగావచ్చి, పాదాలుదగ్గిర మోకరించి, "అడుగుదాటి కదలనివనూ" అని కూనరాగంతో అన్నాడు. ఏం చెయ్యమంటావ్?

విలా:—ఎంతతప్పే రూపా! ఎంతతప్పు! మనకు గౌరవాస్పదుణ్ణి అలా యెప్పుడూ హీనంచెయ్యరాదు, కలలోనైనా సరే.

రూపా:—అక్కా! నిజంచెపుతాను. నోరలా పల్కిందిగాని, హృదయం వెనకాడిందే. ఏం చెయమంటావ్? నేనూ పళ్లెరం క్రింద పెట్టి మోకరించి వారిపాదాలు పట్టుకొన్నాను.

విలా:—నువ్వూ మంచిదానివేనే: మర్యాద దక్కించావు. సంతోషం!

రూపా:—నుదురు ముద్దుపెట్టుకొని, శిరా న్ని చేతుల్తో ముంచివేశాడు.

విలా:—మరి నువ్వేంజేశావ్?

రూపా:—నేనూ వారిశిరాన్ని బాహువ లతో పెనవేసుకున్నాను. ఇంతలో మెళుకు వొచ్చింది. చూస్తే నువ్వు.

విలా:—అయితే మంచిసమయంలోనే నిన్ను నేను ముద్దెట్టుకున్నానే! తెల్లవారు జాము కలలు నిజమవుతై అంటారు పెద్దలు.

రూపా:—పక్కమీద ఆనుకొని కూర్చో అక్కా! కొంచెం మాట్లాడాలి (అని రెక్కలు పట్టుకుని ప్రక్కమీదికి లాగును) నీకళ్లెందుకే ఎఱ్ఱగా వున్నాయ్? మొహమేమో జేగురుముద్దలా వుంది?

విలా:—నీతో అబద్ధమెందుకే! రాత్రంతా వూరికే దుఃఖించాను, అందుకూ. తరతరగాలుగా వచ్చింది. ఆపుకోలేకపొయ్యాను.

రూపా:—అది నాకు కొంచెం లీలగా బడుతునే వుండింది. కారణమేమీ అ నేనడిగేది!

విలా:—శ్రీవారు యీ దినం యెంతసే నా రాలేదే!

రూపా:—అంతమాత్రానికే యింత దుఃఖం టే? రాచకార్యా లుండొచ్చు. ఇంకేమైనా వుండొచ్చు. రేపురాత్రి తప్పక వస్తారు.

విలా:—చెల్లీ! నీకున్నంతనమ్మకం నా కెందుకో లేదే! మనస్సేమో కళవిళగా వుంది దుఃఖం వూరికే లోపల గుబుల్తొంది.

రూపా:—అక్కా! ఆభాగ్యశాలెవరే! అంతసేపు మాట్లాడావు! పోనీ పేరేమిటి!

విలా:—పే రడగటం మరిచానే! శ్రీరాణీ కళావతీదేవిగారు పంపించారు.

రూపా:—పళ మెత్తుకరమ్మనా?

విలా:—శ్రీవారినే యెత్తుకరమ్మని!

రూపా:—ఓహో! తెలిసింది! దాంలో సరిచెప్పావేం?

విలా:—వివరంగా తరువాత చెప్తాను అన్నట్లు - అమ్మేదే రూపా! మంచం ఖాళీ కనే వుంది!

రూపా:—నీవు పైకెళ్లిన తర్వాత నన్నిం కా కొంచెం తిట్టి ఆకోపంతోనే అలాగే వెళ్లిపోయింది.

విలా:—ఎక్కడికై వుంటుంది ?

రూపా:— ఎక్కడికెందుకే ? పిన్నమ్మ వెంకటగిరింటికి పోయుంటుంది.

విలా:—అయితే యిప్పట్లో రాదే!

* * *

అదేరాత్రి. మూడోయామం. రాజభవనమంతా నిశ్శబ్దంగా వుంది. పసమట మేఘాలు పట్టి చలచల్లగా ఆకాశమంతా ఆవరించినాయి. వాయువు చల్లబడి, మందమందంగా వీస్తూంది. ఉఱుముల్లేని మెఱుపులు రాణీవారి శయ్యాభవనంమీద వుండివుండి పిల్లడి యేడ్పుతర్వాత వెక్కిలా తళతళమంటున్నాయ్. నిశాదేవి నాథుణ్ణి చీరచాటుచేసి తనబాహువుల్లో చిక్కబట్టి శృంగారంలో తేల్చివేస్తూవుంది. చిటిపొటి చినుకులు ఆనంద బాష్పాల్లా భూమిమీద జాఱి, కమ్మనిసౌరభాల్ని వెదఁగక్కుతున్నాయ్. ప్రకృతికాంత మేలిముసుగు కప్పుకొని సుఖ్ఖువెట్టి సుఖనిద్ర పోతూంది యీదినం.

భవనంముందు వనంలో, శిలామండపం మీద మైత్రేయుఁడు సురాపాత్రను వక్షస్థలం మీద పెట్టుకొని, ఆనందపారవశ్యంతో అల్లల్లాడుతున్నాడు. పాత్రలో చుక్క లేకపోయినా భ్రాంతిమాత్రం వదలిందికాదు అతగాడికి.

వసంతుడు రాజభవనమంతా శుభవర్తమానం అందరికీ అందజేశాడు. నిద్ర యేమాత్రం పట్టిందికాదు. ఏమీతోచక ఆరాటాన్ని ఆపుకోలేక మైత్రేయుణ్ణి వెదకటం మొదలెట్టాడు. ఎన్నితావులు చూసినా యేమాత్రం ఆచూకీ దొరికిందికాదు. విసుగుపుట్టి, చివరకు, రాజుగారి పాకశాలకు బోయి, ఓసురాభాండాన్ని చేజిక్కించుకొని, మూతవిప్పి, తిరగటం మొదలెట్టాడు. వనం ప్రవేశించేవరకు, దూరాన రాలిన ఆకుల చప్పుడైంది.ఆగి నిశీథాన్ని గ్రుచ్చిచూసేసరికి దూరాన తూఁగుతూ ఓశరీరం కనబడ్డది. "వస్తున్నా ! వస్తున్నా ! అక్కడే నిలబడు ! ఊఁ !! ఇది రాజుగారి నిజరసం ! ఏలా దొంగిలావు తొత్తుకొడకా ? కంఠం నులుముతాను !" అని వినబడ్డది.

వసంతుడు శునకాన్ని పిలిచినట్లు: "ఛు ! ఛు" అని సంబోధించాడు.

మైత్రే:—నీవా బావా ? నీవా ? ఎవరో అనుకున్నాను !

వసం:—నేనేలే. వెదికివెదికి వేసరిపోయ్యాను.

మై:—ఏం కథ ? ముందాపాత్ర నియ్యి : తర్వాత యెంతైనా మాట్లాడుతాను. (అని పాత్ర నందుకొని, సగం త్రావి, (త్రేన్చి) మధువంటే ఇది. అచ్ఛమైన రసరాజం.ఏమిటీ చెప్పొచ్చింది ?

వసం:—నేకాదు, నువ్వే చెప్పొచ్చింది.

మై:—ఏం, ఈదినం నన్న భిసరిస్తున్నావు?

వసం:—ఊఁసుపోక !

మై:—మాచెల్లెలు రదనిక నెక్కడికైనా మళ్లా పంపించావా యేం ?

వసం:—దానికేం?మేడపైనుంది. సుఖంగా నిద్రపోతూవుంది.

మై:—ఈ ఒక్కదినానికేఇలానెత్తికెత్తితే, నిన్నేమనను బావా! చెప్పు ! పోనీ, నాసంగతేంచెపుతావ్, అభం శుభం యెఱగని ముండావాణ్ణి ?

వసం:—మనమూ యీ ఆర్నెల్లు ప్రవాసమే. నా కష్టాలు నీ కేం తెలుసు? కానీ ! ఒకసంగ తడగొచ్చాను.

మైత్రే:—ఏమిటది ?

వసం:— ప్రసంగమంతా విన్నతర్వాత రాజు నీతో యేమన్నాడు?

మై:—అనటంలేదు, గినటంలేదు. కంఠం చేతుల్తో పిసికి పిసికి, నాలుగువూపులు వూపి, క్రిందికి నెట్టి చక్కాపొయ్యాడు.

వసం:—తర్వాత ?

మై:— వెంటనే తిరిగివచ్చి తానే లేవదీసి, వెంటబెట్టుకపొయ్యాడు.

వసం:—ఏదో జరిగిందని వూహించాను కాని, ఈలా అనుకోలేదు. పద, మండపం మీదికి; అక్కడ కాలక్షేపం చేతాం. ఈదినం కళ్లు బలవంతంమీద మూసుకున్నా మనసు మాత్రం నిద్రపోదు.

అంటూ మండపంమీదచేరి, వస్త్రాలు పరచుకుని తత్వం పాట్టం మొదలెట్టారు.

"అనుని మేవంబు నీయధరబింబంబు
పిలుచుచున్నటు వలపించు వర్ణమున
అలరు ద్రాక్షారసం; బాపాత్రతోడ
ప్రేయసీ! తెచ్చి నాపెదవి కందిమ్ము
ఇకరాదు తిరిగిపోయిన నిమేషమ్ము
మనది యౌనో కాదొ మరునిమేషమ్ము
తత్‌క్షణమ్మే తెమ్ము ద్రాక్షారసమ్ము
ఆస్వాదనానంద మనుభవింతమ్ము !!
నే వెన్నదీయగా నీళులం జిలికి
ఒడి బిడ్డనుండగా నూరెల్ల వెదకి
చెలియమూల్యంబైన జీవితమునందు
అకట కాలంబెంతొ హతమొనర్చితిని"

* * *

సూర్యోదయమైంది. కాల్యకృత్యాలు నిర్వర్తించుకొని, విజయరాజు కొలువుకూటానికి బయల్దేరాడు. వేత్రహస్తు లిద్దరు శయ్యాభవనంముందు సన్నాహంగా వున్నారు. రాజు మెట్లుదిగి మొగసాలలోకి వచ్చేసరికి "ఎవరువారూ? వారెవరూ?" అని ఓకోమల కలస్వనం వినబడ్డది. నిర్మానుష్యమైనచోట శబ్దాన్ని విన్నందుకు అచ్చెరువొందుతూ నిలబడ్డాడు. " నీ కెటుచూస్తే అటేచూపా ! ఎత్తు ! తల పైకెత్తు" అని మళ్లా వినబడ్డది. శిర మెత్తి చూచాడు: గోరువంకా, పంజరము. నిర్ఘాంతపడి, చిరునవ్వు నవ్వి, చేతులు చఱిచి ముద్దందిచ్చాడు నెలవంక సరిరాని గోరువంకకు.

మైనా:—ఎవరు మీరు, మీరెవరు ?

రాజు:—నేనా? విజయరామరాజును. ఈ రాజ్యాని కధిపతిని.

మైనా:—క్షమించు, రాజా, క్షమించు. ఇదేమీ ప్రథమదర్శనం నాకు.

రాజు:—నాకుకూడా అంతే!

మైనా:—మీకిరీటాగ్రం మీదున్న విశాల రాజ్యానికంతా అధిపతి న్నేను. మనలో యెవరు గొప్పంటావ్ ?

రాజు:—నువ్వే !

మై:—అయితే, సగౌరవంగా సంబోధించండి నన్ను: ఇచ్చిపుచ్చుకో మన్నారు మర్యాదను.

రాజు:—పక్షిరాజా అనమంటావా ?

మై:—కవిగాయకరాజులం గూడాను.

రాజు:—అయితే, కవిరాజా! తమ నామధేయం ?

మై:—రాజరాజు. మాతల్లి ముద్దుపేరు "రారాజు".

రాజు:—మీతల్లెవరు ?

మై:—మహారాణీ శ్రీ కళావతీదేవిగారు. నన్ను మీ రెరుగరు గాని మిమ్ము నేనెరుగుదును.

రాజు:—(తలవంచి మాట్లాడుతూ కొంచెము మోకరించి) రారాజా ! ఇన్నిదినాలు తమరు మాయింటనున్నా, వుచితమర్యాదలు చేయనందుకు క్షమించండి !

మై:—క్షమాగుణం వుగ్గుపాలతో పోసి పెంచింది, ధీమంతురాలు మాతల్లి . లేవండి! తప్పిదమనేదే లేదు మారాజనీతిలో.

రా:—మీ అనంతదయారసానికి కృతజ్ఞుడను !

మై:—రాజా ! మా జననికి దర్శనమిచ్చి వస్తున్నారా ?

రా:—కవిరాజా ! నేనే దర్శన మర్థించాను.

మై:—ఎంతమాట !

రా:—నాదేవి నాకు ప్రసన్నమైంది.

మై:–రాజా! నిరంతరసుప్రసన్న మామాత.

రా:—ఆనందపరవశంలో వున్నాను !

మై:—మ రిన్నాళ్లూ ?

రా:—పరవశానందంల్లో.

మై:—వ ర్తమానంల్లో ?

రా:—వికృతినుండి ప్రకృతిలో పడ్డాను. దానికి చిన్నెగా ఆస్థానకవిసార్వభౌమ బిరుదం మీ కిచ్చా నీక్షణం.

మై:—సభల కెక్కే కులంకాదు మాది. మహోన్నతమానసవీథుల్లోనే మాసంచారం. సాధుత్వానికే సాగిలపడతాం. మ రెలాగు ?

రా:—అందుకే మా ఆంతరంగికాస్థానం మీకు నెలవు. మీకులాచారాలను మన్నించి కాపాడుతాను.

మై:—అభయహ స్త మియ్యండి.

రా:—ఈ ముద్దుటుంగరం మీకు గండపెండేరం. దయచేసి పాదం సాచండి.

మై:—(పాదం సాచి) కారాగృహంలో కనకాభిషేకం !

రా:—అహోరాజా ! పొరపడ్డాను. క్షమించండి. తలుపుతెరచి స్వేచ్ఛనిస్తాను. నా హ స్తంమీద అధివసించండి.

మై:—బాసచే స్తేనేగాని బయటకు రాను.

రా:—ఏమనీ మీశలవు ?

మై:–తర్వాతెపుడూ ఈపంజరాల మమ్ము పడవేయనని.

రా:—ఆహా ! అలాగే. ఈ చంద్రహాసం ముట్టి బాసచేస్తున్నాను.

మై:—మీహృదయం ముట్టి చేయండి.

రా:—(వక్షస్థలంతాకి చిరునవ్వుతో గవాక్షం పైకెత్తి) ఈ పీఠ మధిష్ఠించండి.

మైనాపిట్ట తుర్రున యెగిరిపోయి, కళావతి శయ్యాసదనంలో ప్రవేశించి, రాణీవారి భుజంమీద వ్రాలింది. రాజు వెన్నంటిపోయి చూచేసరికి జననికర్ణపుటంవద్ద మంతనాలాడుతూంది.

కళావతి:—నాథా ! తిరిగి వచ్చా రెందులకు ?

రాజు:-కారణం మనకవిరాజు. రారాజా! మీబిరుదం మరచివచ్చారు.

మై:—మాకు మరుపులే లేవు. మీరే మీ హృదయాన్ని ముట్టలేకపొయ్యారు, ఏం చేసేది ?

కళా:—(నవ్వును.)

రాజు హృదయేశ్వరి నాలింగనం చేసుకొన్నాడు. మైనా కాలుసాచి బిరుదం స్వీకరించింది. ఆ దినం కొలువుకూటానికి వెళ్ల లేదు విజయరాజు.

* * *

సాయంకాలమైంది. అక్కా చెల్లెలు గదిలోచేరి తలదువ్వుకొంటున్నారు. అగరు నూనె రాచి, దువ్వి, పాయలుతీసి, జడవేసి, కొండీముట్టచుట్టి, పూలచెండు తీర్చిపెట్టింది రూపావతికి అక్కగారు. తల తనవైపు త్రిప్పుకొని, పాపట సరిదిద్ది వ్రేళ్లతో కణతలనువొత్తి తన బుగ్గమీద మెటికవిరుచుకొని "నాకన్నాకాచివే" అన్నది. రూపావతి అక్కగారి వొళ్లో వ్రాలి నడుము కౌగలించుకొని తటాలునలేచి "అక్కా ! దాచక నిజం చెబుతానంటే ఓసంగతి అడుగుతాను."

విలా:—అడుగు. నీదగ్గిర నాకేం దాపరికాలు ?

రూపా:—ఎన్నిమాసాలే నీకు?

విలా:—అంటే?

రూపా:—ఎన్ని నెలలని నే నడిగేది !

విలా:—ఏమిటి నీవనేది? అలాగా ! ఆ! నాకు తెలియదే.

రూపా:—సరే! యిటు తిరుగు, తల దువ్వుతాను. ఎంత అవ్యక్తురాలివే అక్కా నీవు.

అని కేశబంధం సడలించి తలదువ్వి ముచ్చటముడి వేసింది.

విలా:—అందుకనేయిటీవల ఆహారంమీద అయిష్టం పుట్టింది.

రూపా:—అక్కా! యెంత తెలివిమాలిన దానివే! మునుపే కొంతనయం. రాజుగారు వచ్చింతరువాత మరీ మారిపొయ్యావు.

విలా:—మనచేతిలో యేముందే?నాకేం తెలియటంలే దిప్పుడు: హృదయం తీసి వారి పాదాలవద్ద పెట్టి నివేదనచేశాను. అంతే.

రూపా:—అక్కా ! యేమైనా చెప్పు! మనకుల మింత బానిసలం కాకూడదే. చాలా చిక్కు లున్నాయి.

విలా:—మనమూ మానవజాతికి చెందిన వాళ్లమేనే.

రూపా:—లేకుంటే యీ భూలోకంలో యెందుకుంటాం? అదికాదు నేచెప్పేది. మన స్వేచ్ఛమాత్రం యివ్వకుండా మనం అట్టే పెట్టుకోవాలి.

విలా:—అది దానిస్వాధీనంలోనే వుండేది కాదు. మన కెలావుంటుంది! నీ కింకా తెలియదు, పిల్ల వు.

రూపా:—తెలుసునో గిలుసునో, అమ్మ చెప్పిన నాలుగుముక్కలు మెదడులో నాటిపొయ్యాయి.

విలా:—అవి నామెదడులో ఎక్కనే లేదు: ఏమంటావ్ ?

రూపా:—ఎందువల్ల ?

విలా:—ఈ చెవిలో చెప్పేది ఆచెవిలో గుండా వదిలేదాన్ని.

రూపా:—అది నే నెందుకు చెయ్యలేక పొయ్యాను?

విలా:—చానిసంటిచే-అ దయిపొయ్యావు నీవు దానికి.

రూపా:—ఎందువల్లే అక్కా ?

విలా:—పురాకృతంవల్ల: శకుంతల కణ్వుడికి దొరికింది- నీవు మనమాయలమల్లికి దొరికావు!

రూపా:—ఎక్కడి కెక్కడికే?

విలా:—అలా అనకు. ఎక్కడికక్కడికే అని నేనంటాను.అది ఋషివాటిక; ఇది వేశ్యవాటిక. అక్కడ వినిర్మలప్రకృతితో స్నేహం; ఇక్కడ విపరీతమానవ ప్రకృతితో నేస్తం అది పరమపావనం; ఇది పాపభూయిష్ఠం.

రూపా:—నీ వెంతైనాచెప్పు, ఏనుగ దోమ సామెతగా వుంది నీపోలిక.

విలా:—నీమనోనేత్రాన్ని నిగిడ్చి చూడు. అసల్లో భేదా లేం లేవు; తర్వాత తల్లో వున్నాయిగాని. దుష్యంతుడు ఆశ్రమానికే రాకుంటే ఆ శకుంతల యేమైవుండేదో చెప్పు.

రూపా:—ఏమయ్యేదా? కాళిదాసుకంఠం కత్తిరించుక పొయ్యేది. అప్పుడు వన్యమృగాలు ఋషుల్ని బాధించేవేకావని నేనంటాను. “మాతాత బ్రతికుంటే” అనేసామెతగా వుంది నీప్రశ్న.

విలా:—చెల్లీ, తొందరపడకే, నీకు తెలియదు.ప్రతివిషయాన్ని యిలా త్రిప్పిచూస్తేనే గాని, నిజాని కున్న తూకం గ్రహించలేం.

రూపా:-అయితే నువ్వేసినకథ నువ్వేవిప్పు.

విలా:—శకుంతలే దుష్యంతుడివద్దకు పొయ్యేది; కణ్వుడే రాజు నాజ్ఞాపించేవాడు వివాహమాడమని. రక్తం రక్తాన్నలా ఆకర్షించుకొంటుంది.

రూపా:—ఏవేదంలో చదివావే అక్కా!

విలా:-ఈప్రకృతే వేదమే. చదువెందుకు? భారతవంశకర్త ఉద్భవించవలసివచ్చింది గనుక, అన్ని పావనపరిస్థితులు ఘటించాడు దైవం దానికి. ఆవంశీకు ల్నుద్ధరించమని మనకులం పుట్టించాడు. సమానశక్తుల్ని రెంటిని యిలా తనవిలాసంకొరకు ఢీకొల్పుతాడు.

రూపా:—ఇలాగైతే చాలదూరం పోతావుగాని, పర్యవసానమేమిటో తేల్చిచెప్పు.

విలా:—అమ్మ చెప్పిన ముక్కలన్ని సాంతం మరచిపో.

రూపా:—సరే! తర్వా తేమిచేయమంటావ్?

వి:—నీహృదయా న్నమ్మకానికి చూపు.

రూ:—అదెలాగే అంగడి కెక్కించడం?

విలా:—శరీరాన్ని తాకనివ్వకు: సౌందర్యాన్ని నెమలిపింఛంలా విప్పిచూపించు:లోపలున్న హృదయాన్ని చూడమను.

రూపా:—చూడ్లేని మూర్ఖుడైతే ?

వి:—అంతటితో తృప్తిచెంది బైటికెళ్లమని భద్రంగా చెప్పు.

రూపా:—ఇలాగైతే యెంతకాలం జరుగుతుంది ?

విలా:—దానివాడు దాని కొచ్చేదాకా జరుగుతుంది.

రూపా:—తర్వాత ?

వి:—తర్వా తేముంది? తలుపులు మూసేసి బైట తాళంవెయ్యి. ఈ యింట్లోమనిషి అంతర్ధానమైందని చెప్పు.

రూపా:—అప్పుడు మనమూ ఓసంసారులమే అయిపోతాంగా! ధన మార్జించాలిగా! అ దెలాగూ మరి ?

విలా:—ఆర్జించి యెవరి కివ్వాలే నువ్వు ? నీపిడికెడు కడుపుకూ పట్టెడుతగాడే వేస్తాడు. తృప్తిపడు. నిన్నెవరు కొడ్తారు ?

రూపా:— మనకుల మేమైపోతుందే అప్పుడు?

విలా:—కులంకులమంటావ్? ఎక్కడుందే మనకులం? వున్నదంటేవుంటుంది. పోవ్వాలంటే పోతుంది. వున్నదని చెప్పుకోటం ఎంత సిగ్గుచాటే? ఇంకా నీకు తెలియలేదుగాని!

రూపా:—సరే! నీతత్వం ఆచరణలోకి పెడతాను, ఏం మెప్పు?

విలా:—నీకు నువ్వే మెప్పు!

రూపా:—ఎంత మారిపొయ్యావే నువ్వు అక్కా! ఏమో అనుకున్నాను గాని.

విలా:—పోనీ! ఎవరిమెప్పో మనకెందుకే? నీకు నేనూ, నాకు నువ్వూ మెప్పు. చాలదూ? సంతోషం.

రూపా:—(అక్కపాదాలకు అభివందనం చేసి, పూలచెండు ముడిమీద సవరించింది.)

అక్కా! చిత్రపటంస్థానే యీనిలువుటద్ద మెప్పుడు తగిలించావే? చెప్పవూ ?

విలా:—గతరాత్రే. అ దటు దాటింది. ఇది పై కెక్కింది.

రూపా:—వంగదేశాన్నుంచి తెప్పించారే-అదేనా యిది ?

విలా:—అదే! కాని దీని కోమంత్రం పెట్టాను.

రూపా:—ఏమని ?

విలా:—రాజుగారెప్పుడుకోరితే అప్పుడు దీంట్లో ప్రత్యక్షమవుతారు.

రూపా:—నాకూ్కడా దర్శనమిస్తారా మరి ?

విలా:—నీ కామంత్రం రాలేదుగా!

రూపా:—నీ కెలావచ్చింది?

విలా:—వారే వుపదేశించారు.

*   *   *

గగనతలాన సుధాకరుడు నిశాదేవిగయ్యాళి తనానికి జడుగరచుకొని, పక్కన చిన్నపోయి, ఆగిఆగి వెనకంజ వేస్తున్నాడు. ప్రకృతి తన తేజాన్ని ముకుళించుకొని శబ్ద బ్రహ్మన్ని పల్లవించక కీచురాళ్ల కొదిలెట్టింది.

వేశ్యవాటిక యీదినం ఋషివాటికలా "శాంతమిదం" గా వుంది. విటవిటీ కిలకిలా రవాలు, మంద్రస్థాయికి దిగి, శ్రుతి తప్పి అపస్మారాన పడ్డాయి. రంగనాయకి వీథి మరింత బావురుమంటూంది. రసికహృదయాలుకూడా బికుబికుమంటూ నిలబడ్డాయి. జీవి దాటిపోయిన గృహంలా వుంది రంగసాని మేడ. వీథిలో గడ్డిపోచలుకూడా ధైర్యం వచ్చి గృహబహిరంగణాని కెక్కినాయి. దుమ్మూ ధూళీ అంతటా నిండిపోయింది. లోపల జీవం స్తంభించిపోయినట్లు నిశ్చలంగా వుంది. ఎలుగెత్తి ఏడ్వకముందుండే పసివాని వెక్కలా అంతా 'గీవ్' మంటూ వుంది.

అలంకారాలన్నీ పెట్టుకొని, ఎర్రనిచీర గట్టుకుని, సన్నాహపడ్డది విలాసవతి. నిరీక్షించి నిరీక్షించి శయ్యమీద వ్రాలిపోయింది.

రూపావతి పైకీ క్రిందికీ వుర్కే తారట్లాడింది తలుపుతియ్యటానికి. చివరకు మంచం మీద చేరి చాతకపక్షిలా గుడ్లుపీక్కొపోయ్యేదాకా కనిపెట్టుకుంది. నిశిరాత్రైనా రాజపల్లవుడు రాలేదు. మెల్లెక్కి గదితలుపులు మెల్లగా తెరిచింది. గుర్రుపెట్టి నిద్రపోతూంది అక్కగారు. ప్రక్కచేరి, వామహస్తం పట్టుకొని నిమరటం మొదలెట్టింది. త్రొట్రుపాటుతో కళవిళగా పైటసవరించుకుంటూ మేల్కొని, మంచం దిగబోయి, "నివ్వటే రూపా! నివ్వటే రూపా" అంది విలాసవతి.

రూపా:—అక్కా! రాజుగా రెందుకో యీదినంకూడా రాలేదే!

విలా:—అప్పుడప్పుడూ ఇంత ఆలస్యంగా రావటంకూడా వుంది. అన్నట్లు ఆకులైపోయినయి కాబోలు తెచ్చావా?

రూపా:—అవునే అక్కా! మరిచాను. క్షమించాలి (పోయిబల్లమీద భరిణనుదీసి పెదిమలువిరిచి) కస్తూరికూడా అయిపోయిందే. బుడ్లలో పన్నీరు చుక్కైనా లేదు; ఎప్పుడైపోయిందే?

విలా:—మొన్నదినం మా జలకాలకైపోయింది.

రూపా:—ఎంత గ్రుడ్డిదాన్నే! గంధం గిన్నెకూడా ఖాళీగానేవుంది.

విలా:—శ్రీగంధ మొద్దుగాని చందనం తియ్యి. ఏవేళకైనా వచ్చితీర్తారు.

సానమీద చందనంతీస్తున్నది రూపావతి. ఘర్మబిందువులు మొగాన క్రమ్మి, నాసిక మీదుగా జారుతున్నాయి. జాలిగా చెల్లెల్ని చూచి కంట నీరుపెట్టి,

విలా:—ఎందుకేనీ కింతకష్టం? అదక్కడికాపు.

రూపా:—నాకేం కష్టమే? దినమూ చేసే పనికి!

విలా:—గంధం తీయట మింత కాయకష్టమని తెలుసుంటే దానిచర్చే మానుండేదాన్ని. నీ కోమలబాహువులతోనా మా ఆతపాన్ని తీరుస్తున్నావ్? ఛీ! ఛీ! ఎంత కర్కశాలే హృదయాలు!

రూపా:—ఈదినం నన్నుగురించి యింత జాలిపడుతున్నా వెందుకు?

విలా:-నీకష్టాలు కళ్లారా చూస్తున్నాను గనుక.

రూపా:-మీరిద్దరూ నాకు పార్వతీ పరమేశ్వరుల్లా వున్నారు. పూజార్నిగనుక మీకు సేవజేస్తున్నాను. దీనికి నీమనస్సెందుకు చివుక్కుమనాలి?

విలా:-చిట్టితల్లీ! నాలో నీకంతగొప్పతనమేం కనపడ్డదే?

రూపా:-నీ సౌందర్యమే ఓగొప్పతనమని నేను వాదిస్తానే. (అది రాజుగారిచేతిలో పడి మరింత రాణించింది. ఈ నీచగృహంలో పావనాంకుర మొకటి మొలిచింది. దానికి నీరాలుపోసి నేను పెంచాను. విశ్లేష లతాకుడుంగానికి నా స్నేహలతను ప్రాక పెట్టి పెనవైచుకున్నాను. నా ఆనందం నీ కేం తెలుసును?

విలా:—ఎవరిసేచ్చి వారి కానందం. ప్రతి దినం నీ అచ్చటముచ్చటిలా తీర్చుకుంటున్నావా? అందుకే రాజుగారు త్వరలో నీకు కన్నెరిక మన్నారు!

రూపా:—నిజంచెపుతా నక్కా! ఒక్క దినమైనా నావంక వారు కన్నెత్తి చూడ లేదు. ఒంటరిగా చిక్కినా పరసలాడను లేదు, పల్కరించనూ లేదు. వా రెందుకంటారే, నువ్వే అనుండాలి!

విలా:—ఒట్టు సుమా! వారే అందించారు యీమాట నాకు. పైగా నీచిత్తవృత్తిని బట్టి నన్ను పొమ్మన్నారు.

రూపా:—ఏమోనాకేం తెలియదే. సిగ్గూ, భయమూ, రెండూ వేస్తున్నాయి నీవావిషయమెత్తితే.

విలా—సరే! లేచివచ్చి నీ యిష్టమొచ్చిన వ్రేలు ముట్టుకో. ప్రశ్న చూడాలి.

రూపా:—ఎవరి కీప్రశ్న?

విలా:—నీక్కాదులే, నాకే.

అని కుడిచేతి మధ్యవ్రేళ్లనుఎడమ పిడికిటిలో క్షణమాత్రముంచి, హూష్మని మంత్రించి చేతి కందించింది. రాజగౌరవంవల్ల వుంగరమున్న వ్రేలుచటుక్కున పట్టుకుంది చెల్లెలు. మొఖం చిట్లించి చిన్నపోయి దుఃఖిస్తూ శయ్యమీద పడిపోయింది విలాసవతి. "ఏమిటే అక్కా! చెప్పవే అక్కా!" అని రూపావతి తట్టితట్టి బ్రతిమాలుతుంది. "శ్రీవారు ఇక రారని వచ్చిందే" అని హోరుహోరున ఏడ్చింది విలాసిని.

*   *   *

మరునాడు నిశీథ సమయాన కనకపల్లి వెంకటగిరినీ, మరో పేదరాజు పెద్దమ్మనూ వెంటబెట్టుకొని స్వగృహం వేంచేసింది. లేని నిద్ర నటిస్తూ ఎంతవరకూ తలుపుతీసిందికాదు కొంటెపిల్ల రూపావతి. తరువాత కళ్లునులుము

కుంటూ "నీవశే అమ్మా నీవశే" అంటూ తీసింది. ముగ్గురూ లోన ప్రవేశించారు. తల్లి తలుపు భద్రంగావేసి "యీ వయస్సుకే యింత నిద్రయితే ఇల్లాలినే అయిపోతావే?" అంటూ నెత్తిమీద మొట్టుతూ పైకిపోయి పెద్దెల్లను లేపి మంచంమీద కూర్చుంది. విలాసవతి కళవళపడ్డది, వ్యక్తుల సన్నాహం చూసి.

కన:-అమ్మా! నా మాటంటే నీవ తికాణా లేదుగదా! అందుకని మా పిన్నమ్మను తీసుకొచ్చాను. అదేదో నీతో మాట్లాడుతుంది. బాసపడవల్సి స్తే విను.

విలా:-వినలేనిదేమా పైతే ఎవరుచెప్పినా వింటాను. ఈ రాత్రిసమయాన పడిపోతూవచ్చా రెందుకు ?

గిరి:-వచ్చాంలే! వచ్చాం! కాని నీవు నా మర్యాద దక్కించి 'సరే' అంటే సంతోషిస్తాను.

విలా:-విషయమేమిటో చెప్పు.

గిరి:-మనకులంలో సౌందర్యానికి నిన్ను మించిన పడుచు లేదని నీకే తెలుసుగదా! అది మాచిత్తజల్లువారి అదృష్టమేనని నే నంటాను.

విలా:-దేనికీ యీవుపోద్ఘాతమంతాను ?

గిరి:-నీవంటివాళ్లు నిలుపుకోరాదు గర్భాన్ని. అందుకని మా అమ్మ ఈ భాగ్యశాలిని బ్రతిమాలుకొని లాక్కొచ్చింది. సాధారణంగా ఇల్లు వదిలేమనిషి కాదు.

విలా:-సరే మీరువచ్చినపని అర్థమయింది. ఆలోచించుకోటానికా, వ్యవధిలేదు. ప్రశ్న చూసుకొంటాను. బైట నిలబడివుండండి.

అంటూ ముగ్గురినీ త్వరచేసిబయటకుపంపి ఖంగున గడియవేసుకొని, శయ్యచేరి "గడిచా నీగండం!" అనుకుంటూ సుఖనిద్రపోయింది.

తర్వాత ప్రాణంవిసిగి తల్లిముండ తట్టితట్టి కన్నివేసింది తలుపును. జవాబులేదు. కసిదీర తిట్టితిట్టి శపించింది. "నీపతం నీ నెత్తినే కొట్టుకో! నీ కర్మకు నే నేంచేస్తాను? నాచచ్చిన శవాన్నికూడా చూడనివ్వను నీ మొగాన్ని!" అంటూ నిష్క్రమించింది కనకవల్లి.

వెలుగుచోట చీకటీ, చీకటిచోట వెలుగూ ఈవిధంగా దినాలుమీద దినాలు జరిగి నెల మీదపడ్డది. కనకవల్లి వెంకటగిరి యింటనే శేవిణీవేసింది. రూపావతివెళ్లి యెన్నిమారులు బ్రతిమాలినా రాలేదు. విసుగుపుట్టే దాకా వేధించినా ముసలిదాని మనసు ఏమాత్రం కరిగిందికాదు. గిరికూడా "వెళ్లవే! పిల్లముండలు! ఎల్లకాలం ఒకేరీతిగా గడుస్తుందా? ఏవేళకు యేమార్పు కలుగుతుందో ఎవరికి తెలుసును? ఎప్పటికైనా ఫలానా కనకవల్లి అంటారుగాని విలాసవతి యిల్లు అనరుగదా! నీవు మాత్రం ఈ కోపం మంచిదా? అని నిన్ను కాళ్లట్టుకున్నప్పుడు నామనస్సుకూడా కరిగింది" అని సుతిమెత్తనగా అంటించింది. అన్నిటికిని 'ససేమిరా' అంది బక్కకోపం. పనికత్తె రూపావతి వంటలక్కకూడా అయింది. పాచిపనిదగ్గరనుంచి పరుపులు దులిపేపనివరకు తానే నిర్వహించవలసివచ్చింది. "ఎవ్వరి అగత్యం లేకుండా ఈబండి దొర్లిస్తా. నావోపిక నీ వెరగవు" అంది అక్కగారితో. చిట్టితల్లీ! చిట్టితల్లీ! అని దుఃఖంతో తల వూచేది ఊర్ధ్వాన్ని ఆశిస్తూఉన్న ఆశేవం.

రాత్రంతా సోలిసోలి, వేగివేగి, వెచ్చగిలి, సూర్యోదయమైన యెప్పటికో రెప్పల నెత్తుకొని విశ్వదర్శనం చేసేది, ఆ దుఃఖాక్రాంత. తెప్ప లుబికి, కళ్లుబ్బబడి, ముఖచంద్రుడు రాహువునోట బడ్డట్టు శయ్య నంటుకపోయుండేది ఆ ఆక్రంద. అశ్రుధారలు నెమరు కణతలమీద చారలు కట్టి, గంగా యమునా తరంగిణుల్లా ఆపట్టు దిండుమీద ఏకీభవించేవి. పట్టెమంచం పందిరీ కున్న పద్మలతావితానాన్ని అదృశ్యమయ్యే దాకా ఆట్టే చూస్తూవుండేది. ప్రాతఃకాలానికి, అపరిష్కృతకేశాల్ని ముడివేసి పాన్పు దింపేది రూపావతి. వెంటనే వమనమయ్యేది. కణతలను పట్టుకొని నీళ్లందించి సుందేరాచేది. కాల్యకృత్యాలు తీర్పించి నూతనవస్త్రం కట్ట బెట్టి, శయ్యచేర్చి తన పనిపాటల్ను చూచుకునేది.

ఎంత పిలిచినాభోజనానికి దిగివచ్చేదికాదు అక్కగారు. "నిన్నే నే పిలిచేది" అని గట్టిగా అన్నా, నిలువుగ్రుడ్లుపడి వెర్రిచూపులు చూసేది. "చింతమానవే. శ్రీవారెప్పటికైనా వచ్చితీరుతారు." అంటే వెక్కివెక్కియేడ్చి అపస్మారమైపొయ్యేది. నీళ్లుచిలికి, వోణీతో తుడిచి, స్మృతిరప్పించి, వెన్నుచరచి, ధైర్యం పూది, ధారకం చేయించి, పండజేసి, జోకొట్టేది.

అలవాటు పడ్డ రాచయింటి రుచ్యాలూ, వంటకాలూ అసహ్యం పుట్టినాయి. సాయంకాల సన్నాహాలన్నీ సాంతం యెప్పుడో మాయమయ్యాయి. అభిమానవాద్యాః, ముఖవీణ మూలపడి పండ్లికిలిస్తున్నది. అన్నిక్రీడలు, అన్నివిలాసాలు ఆదినంలోనే అంతరించిపొయ్యాయి.

తనజవాహిరీనంతా చెల్లెలి చేతులోపెట్టి అశ్రుబిందువులతో దత్తంచేసింది. మెళ్లో సూత్రం వకటి, గాజులజత, నీలముద్రిక తప్ప మరేం కాక్షించిందికాదు ఆవిరాగిని. మొరదువోయిన బూరుగువృక్షంలా ఎప్పుడూ మంచాన వ్రాలుండేది ఆ జీవచ్ఛవం.

ధనికపుత్రులెందరో ధారావృష్టి కెలచూపినా వచ్చినత్రోవనే మరలిపోవలసివచ్చింది. "అక్కవొల్లకపోతే చెల్లెలికేంరోగం?" అని కొందరు బుద్ధిమంతు లన్నారు. పేరెన్నికగని ప్రజల నువ్విళ్ళూర్చిన రంగసాని వృత్తాంతం అప్పటికే స్వప్నగతమైంది. "ఇంతకన్న కొమ్ములు దిరిగినవార్నే చూశాం! ఈ పాతివ్రత్యాలేమిటి ఇంతలేసిముండలకు?" అని కొంతమంది విటశిఖామణు లన్నారు. "రహస్యప్రియుడెవ్వడో దీని కున్నాడండీ." అని కొంతమంది రసికమార్తాండు లన్నారు. "విటులువిభులైతే వారకాంతలకు వారసత్వా లొస్తాయా?" అని కొందరు రసవేత్త లన్నారు. "రాజుగారిమీద అభిమోగానికట, యీ అసభ్యత్వం" అని కొంతమంది రసకోవిదు లన్నారు. "నాలుగుదినా లోపికపడితే యీ నంగనాచులు నడివీథికెక్కి తీరుతారు." అని మరికొందరు విటరాజు లన్నారు. ఎవరేమన్నా "వీళ్లల్లోకూడా వీరవనిత లుంటా"రని యావన . విశ్వాసం భాస్కర విప్రుణ్ణిమాత్రం బాధిస్తూవుండేది. ఎన్నిమా

రులు అభిసరించినా ఎడమియ్యని రూపావతి ఓముహూర్తాన తలుపుతీసి "మీ వేధ నే పడ లేను. రండీ లోపలికి" అని మంత్రిపుత్రుణ్ణి చెయ్యిపట్టుకొని లాగింది. గడియవేసి తలు పానుకొని "తెలిసినవాండ్లే మీరు కూడా మమ్మింత రభసచేస్తే తెలియనివాళ్లు సంగతి చెప్పాలా!"

భాస్క:—రభసని తోస్తే వెళ్లిపోతాను. తొలిగి తలుపుతియ్యి మరి.

రూపా:—(గ్రుడ్లిచ్చి నిలబడి కన్నీరు నించింది.)

భాస్క:—(గ్రుడ్లిచ్చి నిలబడి కన్నీరు నించాడు.)

రూపావతి వంటయింట్లోకి పోయి, దొడ్డి గుమ్మంమీద కూర్చొని, మొగం మోకాళ్ల మీదెట్టుకొని, చేతులు తలమీద జోడించింది. భాస్కరుడు ప్రక్కనే చేరి,

"మీ అమ్మ యింకా రాలేదన్నమాట. వంటకూడా నీకు చేతవునా రూపా?"

రూపా:—అ చెందు కొస్తుంది! దానంత దది!

భాస్క:—ఈ బావురుమనే యింట్లో భయంలేకుండా వున్నారటే మీరు?

రూపా:—భయమనేమాటే మరచిపొయ్యాము. భయమెందుకూ, భయం?

భాస్క:—మీఅక్కవంట్లోయెలావుంది?

రూపా:—ఎలావుంటే మీ కెందుకు? నే చెప్పను.

భాస్క:—చెపితే తప్పా?

రూపా:—ఆర్చేవారా తీర్చేవారా? ఎందుకూ మీకు?

భాస్క:—జాలీవల్ల అడుగుతున్నాను!

రూపా:—ఎలావుందని చెప్పేది? దిన దినము పాలీపోతూంది. ఎప్పుడూ యెడతెరపి లేని శోకమే.

భాస్క:—పాపం, యేం జేస్తుంది మరి?

రూపా:—ఏనాటికీ గట్టి చేసుకోదండీ మనస్సు! ఏం జేయమంటారు?

భాస్క:—చెప్పటం తేలికే. చెయ్యటమే కష్టం!

రూపా:—"శ్రీవారే ఎప్పటికైనా వచ్చి తీర్తారే" అంటే వొళ్లు తెలియకుండా విరుచుక పడిపోతుందండీ!

భాస్క:—రూపా! ఇదేదో వ్యాధే! రాజవైద్యు ణ్ణెవణ్ణయినా తీసుకొచ్చి చేయి చూపించేది? స్నేహితు డొక డున్నాడు.

రూపా:—ఎవరండీ ఆయన?

భాస్క:—ఆస్థానవైద్యులు రంగాచార్లు గారి పెద్దకుమార్డు.

రూపా:—ఆయన కూడా వైద్యమొచ్చు?

భాస్క:—రాకుండా ఎలావుంటుంది?

రూపా:—గుడ్లొచ్చి పిల్ల సెక్కిరించినట్లున్నది మీముచ్చట. మావాడ వైద్యుకు పిచ్చయ్యగారిని పిలిస్తే పరుగెత్తుకొనివస్తాడు. కాని ఏంలాభం? వైద్యుమూవద్దు, వైద్యమూ వద్దు అని గట్టిగా భీష్మించుకుంది.

భాస్క:—ఈలాంటి స్థితిలో మీ కేం సహాయం చెయ్యలేనందుకు చింతిస్తున్నాను. మీకష్టాలు చూసి నాగుండె నీరైపోతూంది.

రూపా:—మీప్రేమ మిమ్మలాచేస్తూంది.

భాస్క:—కావచ్చును! పోనీ, ఓపని చేసేదీ? వొప్పతావో, వొప్పవో? నీతోపాటు నేనుకూడా, మీ అక్కకు తెలియకుండా యిక్కడేవుండిపోతాను. మగతోడు లేకుండా నీవొక్కతెవూ నిర్వహించలేవే, చిన్నదానివి.

రూపా:—వూరుకోండీ! మాట్లాడక. మీ ఆలోచన నాకు తెలుసును!

భాస్క:—మరి నన్నేమి చెయ్యమంటావిప్పుడు? నే చెప్పినట్లుగా నీవో, నీవు చెప్పినట్లుగా నేనో వినితీరాలె. లేకుంటే మన కెలాగ?

రూపా:—నాశరీరాన్ని యెవరికీ అమ్మదలచలేదు.

భాస్క:—పోనీ, నీహృదయా న్నమ్మతావా?

రూపా:—అదీ అమ్మను. అర్పిస్తా నెప్పటికైనా.

భాస్క:—బైరాగివై పోతావా యేం?

రూపా:—నానోమ్ము ప్రాసుంటే అలాగే అయిపోతాను.

భాస్క:—పోనీ! నీహృదయాన్నే అర్పించు. అంతే చాలు నాకు.

రూపా:—ఒకషర్తుంది.

భాస్క:—చెప్పు వేధించక.

రూపా:—పరమరహస్యంగా వుంచుతానని ఒట్టెయ్యండి, చెబుతాను.

భాస్క:—"నీతోడు" వొట్టుసుమా! (అని చేతిలో చేయివేసి గిల్లుతాడు)

రూపా:—నే లాగినందుకూ, మీరు గిల్లినందుకూ సరిపోయింది. ఇక మరి నన్ను ముట్టనివ్వను - కొంటెవారు.

భాస్క:—కాలయాప నాతూంది, చెప్పు మరి!

రూపా:—రాజుగా రెందుకు మా కున్నారో రహస్యంగా నిజంకనిపెట్టి ఎప్పుడు చెపుతారో అప్పుడు నాహృదయ మిస్తాను.

భాస్క:—మల్ల వీడు వెళ్లి విశ్వనాథశాస్త్రి నడిగితే నిమేషమాత్రంలో తేలిపోతుంది. వెంటనే పయనమవుతాను.

రూపా:—మంత్రుల కొడుకు లెక్కగా ప్రశ్నలకు పోరు! ఇవన్నీ అయిపోయాయండి! ప్రశ్నలు, పూజలు, పునస్కారాలు, మొక్కుబళ్లు, సోదెలు, వీభూతులు అన్నీ గాలించాను. విధిమాత్రం త్రోవలేప్పింది కాదు.

* * *

మరో రెండునెల్లు గడిచాయి. మేసవి టమే కష్టమై పోయింది గర్భవతికి. మీగాళ్లు మొహమూ నిగారించినాయి. నడిస్తే ఆయా సం, ఎక్కువ మాట్లాడితే పడిపోవటం రాత్రిళ్లు కలవరింపులు హెచ్చినందువల్ల రూపావతి అక్కగారి ప్రక్కనే పరుండేది.

ఓదినం అసురసంధ్యవేళ రూపావతి క్రింద వంటచేస్తూంది. మేడపైన యేదో వస్తువు

పగిలిన శబ్దం వినపడి, వెంటనే పైకిపోయి చూసింది. నిలువుటద్దం నేలమీద పడి భిన్న భిన్నంగా వుంది. అక్క శయ్యమీదకూర్చొని వికటహాసం చేస్తూంది. నిర్ఘాంతపడి కొంత వడి మాట్లాడలేక,

"ఏమిటే అక్కా ! యిది ?"

విలా:—అద్దం పగిలిపోయిందీ ! చూస్తుంటివిగా !

రూపా: — ఎందుకని నేనడిగేది.

విలా:—అదే నే నడిగేదీని.

రూపా:—ఎందుకూ అలా నవ్వుతున్నావు? నన్ను చూశా, అద్దాన్ని చూశా ?

విలా:—నిన్ను చూసీకాదు, దాన్ని చూసీ కాదు; నన్ను చూసుకుని. రాక్షసిముండ! నువ్వెప్పుడొచ్చావే? (అని వలవల యేడుస్తూ తెరవచ్చి పడిపోయింది. వెంటనే నీళ్లు జిలికి శైత్యోపచారాలు చేసింది ధీరకన్య రూపావతి. విలాసవతి కళ్లు తెరిచింది.)

రూపా:—వొళ్లు తెలిసిందా పిచ్చితల్లీ !

విలా:—రూపా ! నీవెప్పుడొచ్చావే? ఏడుస్తున్నా వెందుకు?

రూపావతి:— (విలాసవతిని లేపి వొళ్లో కూర్చోపెట్టుకొని) ఎందుకూ లేదు. అద్దం పగిలిపోయింది. అందుకు.

విలా:—అ దెప్పుడు పగిలిందే?

రూపా:—నీకు తెలియదన్న మాట !

విలా:—అయ్యో ! తెలియదే నాకు! దాని దగ్గర కెళ్లి రాజుగారిని కనపడమని ఆజ్ఞాపించాను. దర్శనమిచ్చారు. కాని నిమిషంలో మాయమైపొయ్యారే! వారిస్థానే నా ప్రతిబింబం కనపడ్డది. తర్వాత నావొళ్లు నాకు తెలియదు.

రూపా:—అయితే నీకు వున్మాదంలోకి దించిందే అక్కా ! ను వ్వౌషధం తినకపోతే నే నెందులోనైనా దూకి చచ్చిపోతాను.

విలా:—నే నెందు కిక్కడ? నీతోపాటు నేనూ వస్తాను. పోనీ, వురిత్రాడు మెళ్లో వేసి మరీ పోవే.

రూపా:—నీకు కొట్టి చెప్పలేను కదా! మరి నన్నేం చెయ్యమంటావు?

విలా:—చిట్టితల్లీ ! మనోవ్యాధికి మందు లేదే !

రూపా:—నువ్వు చాలా బేలపొయ్యావే, లాభంలేదు.

విలా:—ఇకముందు చూడు ! తెరలొస్తే వొట్టుపెట్టు. నా మనస్సును దిక్కబడతాను.

రూపా:— రాజుగారు తిరిగి వస్తారనే నమ్మక ముందిటే నీకు?

విలా:—ఆహా! ఎప్పటికైనా వచ్చి తీరాలి. మా హృదయా లల్లా పెనవేసుకొని ముళ్లుపడి పొయ్యాయి.

రూపా:—పోనీ ! ఓ చిన్న లేఖ వ్రాసి నా చేతికియ్యి. నేదర్శించి వస్తాను.

విలా:—నేను వ్రాసీ యివ్వను, నీవు వెళ్లనూ వద్దు. వారి గౌరవమూ మన గౌరవమూ మంట గలుపుతావు. నిజమైన ప్రేమ లిఖింపబడేదికాదే ! ప్రేమలేఖ ప్రేమకు ప్రేతభూమి.

రూపా:—పోనీ, నీకు చెప్పనేర్చిందాన్ని కాదు గాని, శ్రీవా రెందుకు మానుకున్నారో చెప్పవే.

విలా:—నీకు తెలిసినట్లే వుంది ! నువ్వే ముందుచెప్పు !

రూపా:—ఎంతైనాచెప్పు, విరక్తని నా గట్టినమ్మకం.

విలా:—పిచ్చిదానా ! ఒకమాటచెపుతా విను. విరక్తికలిగే హృదయాలు అసలు రక్తినే పడవు. పడ్డతర్వాత పరమేశ్వరుడి తరం కాదు వేరుతీయటానికి.

రూపా:—వూరికే వేదాంతం మాట్లాడుతావుకాని మరిప్పుడు వా రిక్కడ యెందుకు లేరే ?

విలా:—అక్కడున్నారుగనుక యిక్కడ లేరు. ఒకేదినము రాణీవారి విషయం మా కిద్దరకూ జ్ఞప్తికివచ్చింది-అదీ కారణం. అర్నెల్లక్కడ, అర్నెల్లిక్కడ. వారిది న్యాయపరిపాలనం- రామరాజ్యం.

రూపా:—నీదేమో వున్మాదసామ్రాజ్యం.

* * *

మరో నెల గడిచేసరికి నవమాసాలూ నిండినై విలాసవతికి. కాళ్లు, మొహము మరింత వుబ్బరించి, మనిషి సాంతం పాలిపోయింది. మేల్మిబంగారం శుద్ధశ్వేత సత్వమైంది. ఆయాసం మిక్కుటమై చలనానికి స్వస్తి చెప్పింది. గాజులు బిగుతై వుంగర మంటుకపోయింది. దినచర్యను యావత్తు తాళపత్రాల మీద లిఖించడం మానివేసింది. వ్రాసిందాన్నంతా తిరిగీ చదివి అమర్చి కట్టలుకట్టి పరుపుక్రింద భద్రంగా దాచుకుంది. అచ్చటచ్చట వివిధజాతుల పుష్పాలు లోపల గుర్తులు పెట్టింది. అయోమయం పరధ్యానం రెండూ అధికమయినాయి. ఎప్పుడూ నిలువుగద్దు పెట్టుకుని ఏదో చూస్తూవుండేది. అన్నపానాదులమీద అయిష్టం యెక్కువై మానివేసింది.

ఆదిన మమావాస్య. అప్పుడే చీకటిపడ్డది. వంట చేస్తూన్న రూపావతికి యేదో గుబులు వచ్చి యేడ్చింది. అప్పుడే "కృష్ణవేణీ! కృష్ణవేణీ!" అని వెంకటగిరి బయట తలుపు గొట్టింది. చెంగున వెళ్లి గడియతీసి శావురుమంది.

వెంక:—నీ వెప్పుడు విన్నావే !

రూపా:—ఏమిటి ?

వెంక:—పెద్దముంత దాటిపోయింది!

రూపావతిఆ! ఆ! అని గొల్లుమని యేడ్చింది. ఇద్దరూ పైకిపోయి అక్కగారిగదిముందు నిలబడ్డారు. వీరినిచూచి ఆకృశీభూత "అమ్మ పోయిందనిచెప్పొచ్చారు" అనివెక్కిపెట్టింది. రూపావతి అక్కగారిని కౌగలించుకుని గోడుగోడున యేడ్చింది "ఇంత త్వరలో పోతుందని అనుకోలే"దని ఒకరూ, "దాని పంత మది చెల్లించుకున్న" దని వొకరూ వంతె పలుకుతూ యేడ్చారు. గిరి గది గుమ్మంమీద కూర్చుని వోదార్చింది. కాని కడుపు నాపలేకపోయింది. "పిచ్చివాళ్లలా వున్నారు ! దాని రోజొచ్చి అది పోయింది ! ఎల్లకాల మెలా బ్రదికుంటారే ఏళ్లొచ్చిన ముండలు ? ఎందు కేడుస్తారు? మనసు గట్టి జేసుకోండి." అని మెల్ల మెల్లగా అందించింది. కాని యెంత చెప్పినా శోక మాగింది కాదు. చివరకు

మంచందగ్గరకు పోయి, చిన్నదాని రెక్క పట్టుకుని ప్రక్కకులాగి, "నువ్వుకూడా యిలా వేలుపోతే దాని గతేంగాను చెప్పు. ఇంత పిరికిదాన వనుకోలేదు! అదిచూద్దామా, ఇటు కాల్దీసి అటుపెట్టలేకుండా వుంది. కూతురు నైనా కొడుకునైనా నువ్వే! లే పోదాం! ముందు చాలాతవీకు వుంది! అమ్మా రంగా! పెద్దదానిని నీకు నే జెప్పే దేముంది? నీ విక్కడే వుండు రావే రూపా! ముసలిదాన్ని మన్ను చేసే పుణ్యం నీకు దక్కవలసి వుంటే దాని కెలా దక్కుతుంది? అమ్మా! కనకాంగిని తోడు పంపుతాను." అంది గిరి. "నాకేమీ తోడువద్దు! దిక్కులేని వాళ్లకా దీనబాంధవుడే తోడు!" అని శ్రీ కృష్ణవిగ్రహాన్ని కళ్లతో గురిచేసి చూపించింది విలాసవతి. "నీది చాలా వుత్త మజన్మే రంగా! కులానికంతా శిరోభూషణా నివి. నీకు నే చెప్పేదిలేదుగాని మనస్సు రాయిచేసుకో" అని రూపావతిని క్రిందికి లాక్కు వెళ్లింది గిరి.

భాస్కరుడొక శయ్యమీద కూర్చుని కన్నీటితో నుబులుతున్నాడు. "నువ్వు ముందు నడు. నేనిప్పుడే వస్తాను" అని పెద్దమ్మను బైటికి పంపించి తలుపు దగ్గర వేసి

రూపా:—అదేమిటండీ, నా కేం బాగా లేదు! మీ రెందుకూ దుఃఖించడం?

భాస్క:—(మాట్లాడడు)

రూపా:—ఎవరైనాచూస్తేనవ్విపోతారు. (అని దగ్గరకుపోయి పమిటెతో కన్నీరు తుడిచింది)

భాస్క:—మీకష్టాలు చూసినాకు దుఃఖ మొచ్చిండి. ఏంజేయమంటావు? బాగా పరీక్షిస్తున్నాడు భగవంతుడు మీయిద్దర్ని! ఈయింటనిలబడి అన్నిటిని ప్రతిఘటిస్తాను! నీప్రక్క నుండి లోకాన్ని ధిక్కరిస్తాను!

రూపా:—మీ నవనీత హృదయానికి నా అంజలి యిదే. (అని పాదాలనంటుకొని, కళ్ల కద్దుకొని, కన్నీటితో అభిషేకం చేసింది.) పెద్దదాని కంత్యక్రియలు నెరవేర్చి యిప్పుడే వస్తాను. అంతవరకూ మీ రిక్కడుండరూ? అక్క వక్క తే పైనుంది. ఎవ్వరూ దిక్కులేరు దానికి. అందులో నిండుమాసాలు: దానికర్మ యిలా పుష్పించి పండింది!

భాస్క:—రూపా! యథావిధిగా అన్నీ నెరవేర్చిరా! నే నిక్కడే వుంటాను. నీవుగా నన్ను భావించి నిశ్చింతగా పో. ఈవరహాలను నీవద్దవుంచుకొని, సంకోచించక ఖర్చుపెట్టుకో. (అని చేతిలో ఒకమూటపెట్టి వెన్ను చరిచి బయటికి పంపి గెలు వేసుకున్నాడు.)

దుఃఖమాగిందికాదు. శయ్యమీదపడుకొని గద్గదికను బడ్డ శృంగారాన్ని త్రిప్పుకోటానికి రసమీమాంసలో పడ్డాడు. చివరకన్ని రసాలకు నాయక శిరోమణి కరుణరసమని తేల్చుకున్నాడు. స్థానంకూడా నిరూపించటానికి తంటాలుపడ్డాడు. అంతా నిరాకార నిరంజనమై, రూపావతికేశాల్లాంటి అంధకారంలో పడ్డాడు. అదే నిద్రలోకి మెల్లగా జోకొట్టింది. ఓచింత స్వప్నమైంది.

మొదట చీకటిచీకటిగానే వుండిపోయింది. అందులో విష్ణ్వాలయం సాక్షాత్కరించింది! ఎక్కడచూచినా పెద్ద పంగనామాలు, అలంకారం. ప్రాకార ద్వారంమీదో నామం, చిన్నపోయి చిన్నపోయి, ఓపచ్చని పండు లాంటి వ్యక్తిముఖం మీదికెక్కింది. తర్వాత కుండలాలు, కాశ్మీర నేలువ, సింహతలాటాలు, గండభేరుండపుటంచు ధోవతి ఏర్పడ్డాయి. మొదటెవరైందీ సుర్తుతెగిలింది కాదు. రాను రాను రాజసురువులు!! మంచంవద్దకు వచ్చి కళ్లుతిమి మెట్లనైపుకు తిరిగా . . తా నడ్డపడి పోనిచ్చాడు కాడు. "శపిస్తా"నని శరీరమంతా వారు కంపించటం, "జంకూ కొంకూ లే"దని తాను పంపించడం పదేపదే జరిగింది. "రంగనాథుడురా! రంగనాయకి!" అని హర్షాశ్రువులతో గర్జించాడు. తలవంచి తాను తిరిగేసరికి అంతర్ధానమైనాడు అజానుబాహుడు. తర్వాత మళ్లా చీకటి!! ఇంతలో హోరుమని గాలీ, వర్షమూ, మెరుపులూ—తల విరియబోసుకొని, తడిసినవస్త్రంతో, పసుపుమొహంతో పరుగుపరుగున వచ్చింది కనకవల్లి. "నీకూ పుట్టిందీ రిమ్మతెగులు" అని మెటికలు విరచి రివ్వున పైకి పోయింది. భయమేసి వణుకుతూ మేల్కొన్నాడు. వెన్నుచరచుకొని మంచ[illegible] దిగి నిలబడ్డాడు. దీపకళిక కునికిపాట్లతో వెక్కిరిస్తూంది.

బైటకూడా హోరుమని గాలి, వర్షం! కనకవల్లి నిజంగా యింటవున్నదా అ[illegible] చింది. దెసలు పరికించాడు. ఇంతలో రూపావతి తలుపుకొట్టింది. తలుపుతీసి నిర్ఘాంతపడి పోయ్యాడు: తల్లి కన్న వేయిరెట్లు [illegible] హంగా కనపడ్డది కూతురు. తలుపేసి యిద్దరూ పైకిపోయ్యారు. గదిముందు తెల్లనిచీర గట్టుకున్న అకారం పడుంది. భాస్కరుడు చీకట్లో ఆగిపోయ్యాడు. రూపావతి పరు[illegible] పరుగున పోయి అక్కను గట్టిగా చర[illegible] మేల్కొలిపింది.

విలా:—తల్లీ! నువ్వేనా? అమ్మనుభూ[illegible] కర్పించి వచ్చావూ?

రూపా:—(ఏడ్చును)

విలా:—మన మిపు డెక్కడున్నాం?

రూపా:—ఎక్కడెందుకే? మనయింట[illegible]

విలా:—నిజంగానూ? అయితే ఆ చల్ల[illegible] గుడ్డ పెట్టి కప్పకుడు.

రూపా:—(తుడిచి) నువ్విక్కడెందు[illegible] పడున్నావు? ముందు చెప్పు.

విలా:—మీరు పోయినవెంటనే [illegible] తెలియని నిద్రపట్టింది. ఎంతసేపైందో [illegible] యదు. ఎవరో పంగనామాలరాయుడు ప[illegible] క్కన నుదురు ముద్దుపెట్టుకున్నట్లు [illegible] కూడా అయింది. కళ్లు తెరిచాను. ఎవ[illegible] కన్పడలేదు. వూరికే గంధంవాసన మా[illegible] కొట్టింది మళ్లా కళ్లు ముయ్యబో[illegible] నాముద్దుకోసం. ఇంతలో ఓ యేడ్పు [illegible] బడ్డది. అమ్మవచ్చి- నిజంగా అమ్మే! ఆ గుమ్మంవద్ద నిలబడి, "అమ్మా! రంగా! నీకష్టాలు నేను చూడలేను; రా నా[illegible]" అని యేడ్చింది. భయపడి సంశయించా[illegible] వ్రేలితో మళ్లా శాసించి పిలిచేసరికి [illegible] మందు చల్లినట్లయిపోయింది.

రూపా:—ఇందుకే పిన్నమ్మ తోడుపం[illegible] తానంది: వింటేగా నీవు! అక్కా! [illegible] నా చెప్పు, నీవు చాలా ఓగాయిత్తురాలివే!

విలా:—లేచి మెల్లగా మంచందిగి అడుగుల్లో అడుగు వేసుకుంటూ నడిచాను. వెనకంజ వేస్తూ అమ్మ నడిచింది. గుమ్మం తగిలి క్రింద పడ్డాను కాబోలు. అందుకూ.

రూపా:—(వొళ్లు చరిచి) యిప్పుడైనా స్మృతికి వచ్చావా?

విలా:—ఆహా! యెప్పుడో తెలిసిందే! ఆతడి గుడ్డ లెందుకు? స్నానంచేసిరా, నా క్రొత్త చీరె కట్టపెడతాను. అన్నట్లు నీవనక నీవెవరో నిలబడ్డున్నారు! ఎవరే వారు?

రూపా:—వారే నా తోడునీడ!

విలా:—అలాగా! ఏం సుదినమే, దుర్దినానవచ్చింది. తండ్రీ! రండి లోపలికి.

భాస్క:—తర్వాతెప్పుడైనా వస్తాను.

విలా:—మీ దర్శనభాగ్యం నాకెప్పుడూ లభించలేదు. లోపలికొచ్చి, ఆసీనులై మా సత్కారా లందుకొని, నా ముచ్చట తీర్చిపొండి.

భాస్క:—(సంశయించును)

రూపా:—నే లాక్కొస్తాగాని నువ్వు ముందుపోయి పడుకో. ఆయాసంగావుందినీకు!

(విలాసవతి లోపలికిపోవును.)

రూపా:—రండీ లోపలికి. (అనిచెయ్యి పట్టుకుని లోపలికి లాక్కుపోయింది భాస్కరుణ్ణి.)

విలా:—నాయనా! ఆ పీఠ మలంకరించండీ.

భాస్క:—(కూర్చొని తలవంచి) అయితే మీ అమ్మకూ, మాకూ ఋణం తీరిపోయిందీ!

విలా:—పెద్దది! ఎప్పుడైనా పొయ్యేదే! అందులో దానికి హృద్రోగమండీ!

భాస్క:—అరవై యేండ్లులేవూ ఆమెకు?

రూపా:—అంతే. లేకపోతే ఒక టట్రో, ఒక టిటో. గట్టిలెక్క.

భాస్క:—మీ వొంట్లో యెలావుంది?

విలా:—ఇటు ఇహలోకమూ కాదు, అటు పరలోకమూకాదు; త్రిశంకు స్వర్గంలో వున్నాను. రూపా! నీకు సరియైన వుత్తమ పురుషైకవచనం లభించినందుకు సంతోషంగా వుంది నాకు. ఇకముం దీశృంగార సదనం మీది! నీకన్నె చెర వదలించిగాని యీ కాయం విడువను!

భాస్క:—శ్రీవారి పదదళితము ఈ శయ్యాగారం. మాబోంట్లకు కా దిక్కడ.

విలా:—చెల్లీ! మంత్రుల పుత్రు లెంత చెడ్డా మంత్రుల పుత్రులేనే! తడిగుడ్డల్తో నిలబడ్డావు, స్నానంచేసిరా! మరిదిగారితో మాట్లాడుతూ వుంటాను!

"పుట్టెడుసిగ్గు వారి"కని రూపావతి క్రిందికి నిష్క్రమించింది.

విలా:—నాచిట్టితల్లి కోచిట్టితండ్రి దొరికాడూ! బాగుంది!

ఆర్యా! మీ వయస్సెంత?

భాస్క:—పదునెనిమిది.

విలా:—తీరిపోయ! సమవయస్కులు! కపోతమిథునాలు: నా హృదయపంజరంలో దాచుకుంటాను.

భాస్క:—మరి రాజుగారేం చేస్తారు?

విలా:—నా భ్రూమధ్యానికి మెట్టించుకున్నాను. ఆరోగ్యంగా వున్నారా? ఎంత కాల మైంది మీరు దర్శించి? చెప్పరూ?

భాస్క:—ఎంతకాలమెందుకూ? దినమూ దర్శిస్తునే వుంటాను మా తండ్రిగారితో.

విలా:—వారిమీద ఓ గ్రంథం కృతిగ్రవ్రాశాను. ఈ స్థితిలోవచ్చి వినిపించి, సత్కారం పొందేభాగ్యం నాకులేదు. దయచేసి దాన్ని వారి కంకితంచేస్తారూ?

భాస్క:—తప్పకుండా!

విలా:—(పరుపుక్రింది తాళపత్ర సంపుటీని తీసియిచ్చును.)

భాస్క:—అయిదూ యిచ్చి.

విలా:—అయిదూ అయిదు ఆశ్వాసాలు. పంచమాశ్వాసం మువ్పాతికపైగా వ్రాశాను. శేషం మహారాజుగారే పూర్తిచేస్తారు. అన్యథాభావిస్తే రూపావతిచేతి కిచ్చి పంపుతాను.

భాస్క:—వద్దులెండి! నేనే సక్రమంగా అందచేస్తాను.

(రూపావతి విరియబోసిన తల దులుపుకొంటూ ప్రవేశించి)

అక్కా! మరిదిగా రేం జేశావు?

విలా:—కొంతసిగ్గు వదిలించాను.

భాస్క:—(లేచి) వెళ్లొస్తాను.

రూపా:—అగ్రంథాలేమిటండీ?

విలా:—నేనిచ్చాన్లేవే!

రూపా:—సరే! బాగానే కుదిరారు. రండిపోదాం. (అని క్రిందికి తీసికెళ్లింది తన ప్రియుణ్ణి.)

అయితే మళ్లా దర్శనాలు?

భాస్క:—నీయిష్టమొచ్చినప్పుడు.

రూపా:—ఇకముందు మీ యిష్టమే. నేను మీపదదాసిని.

భాస్క:—మహాపీడకలవచ్చిందేరూపా! నీవు రాకముందు.

రూపా:—మీ రేమంచంమీదా పడుకుంది?

(భాస్కరుడు కుక్కి నవారుమంచం చూపును.)

రూపా:—సరే! అందుకే అనుకోండి! అది మాఅమ్మపాతపురాణం! స్వప్నభయంవల్ల మే మెవరం శయనించం దానిమీద. (అని కౌగలించుకుని బుగ్గకొరుకును.)

భాస్క:—పిల్లా! నీవరకు నువ్వే మరిచావు. నాత ప్పేంలేదు. (అని తానుకూడా అదే కొంటెతనం చూపును.)

రూపా:—నేను మీ కోసిపోయ్యి అన్నిటినీ మరిచాను. క్షమించండి.

భాస్క:—రాజుగారి హృదయం మీ అక్కమీద యెలా లగించిందో ఆలాగే విరిగిపోయింది. అది నేను మొదట్నే అనుమానించాను. ఈదినం సంశయనివృత్తి అయింది. పిచ్చినానా! మీ అక్క నరుపుత్రిక. (అని చెవులో వూదాడు.)

* * *

మరునాడు సాయంసమయాన పట్నంబైట వుద్యానవనానికి విహారార్థం పొయ్యాడు విజయరాజు. మాలతీలతలావరించిన పొదరింట్లో స్ఫటిక శిలాతలాన వెన్నువాల్చి, మహారాజత్వంలోనుండి మానవత్వంలోకి బయటపడడానికి సాధన చేస్తున్నాడు. వికసించిన ముఖపద్మం ముకుళించటం పసిపట్టి మైత్రేయుడు చల్లగా జారుకున్నాడు. సింహకిశోరచిత్రితం మీదున్న వామహస్తాన్ని శీతలస్పర్శ వణికించివేసింది. ఎడమకన్నదిరి నీరు క్రమ్మింది. హృదయం చెమ్మగిలి, సుళ్లు తిరుగుతూవున్న భావాలు సురిగిపొయ్యాయి. సవ్వడిలేకుండా సన్నిధానానికి వచ్చి తల వంచుకొని నిలబడ్డాడు భాస్కరకుమారుడు. "ఆసీన మలంకరించు. నాయనగారు పంపించారా" అని ప్రక్కనున్న ఓ శిలావితర్దిని సూచించాడు రాజు.

భాస్క:-వారు పంపలేదు. నేనేవచ్చాను.

రాజు:—దేనికి ?

భాస్క:—ఏకాంతానికి.

రాజు:—బిడ్డా! నాతోడనా? విషయం?

భాస్క:—ఓ ఉద్గ్రంథ సమర్పణం.

రాజు:—నీవేనా రచయితవు ?

భాస్క:—నేకాదు- ఓదాసురాలు.

రాజు:—దూతవా నీవు? సరి!

భాస్క:—అన్నిటికీ తెగించే అగ్రజాతి నాది.

రాజు:—యాచకత్వానికి, దూతకృత్యానికి చాలా దూరముంది. ఆలోచించుకో నెమ్మదిగా.

భాస్క:—పేదరికానికి దూత, యాచకత్వం. నాకు రెండూ దగ్గరగానే కనపడ్డాయి.

రాజు:—కాని, కుమారా! నీవు మంత్రిపుత్రుడవు!

భాస్క:—రాజా! నేనూ మానవుడనే. ప్రేమభిక్ష యాచించబోతే రెండవది లభ్యమైంది. ఏంచేసేది? గ్రంథాన్ని స్వీకరించండి. మీ యేకాంతానికి భంగపాటు కలిగించినందుకు క్షమించండి. (అని ఓవస్త్రం మీద పట్టుదారాలతో బంధించిన గ్రంథసంపుటీని సమర్పిస్తాడు.)

రాజు:—(నిర్ఘాంతపోయి కూర్చొని) నాయనా, నువ్వూ పెద్దవాడ వయ్యావు సుమా !

భాస్క:—యథా రాజా తథా ప్రజాః.

రాజు:—(చివుక్కుమని అధరం కొరుక్కున్నాడు.)

భాస్క:—పాషాణహృదయం రాజులది.

అంటూ గిరుక్కున తిరిగి అంతర్ధానమయ్యాడు. తత్క్షణమే రాజు బంధాల్ని చంద్రహాసంతో ఛేదించి ఆ పీతవర్ణపు కంచుకాన్ని విప్పుతూ కన్నీరు మున్నీరయ్యాడు. కళ్లకద్దుకొని కవచంక్రింద దాచుకున్నాడు. ఆత్రంగా గ్రంథపఠనం ప్రారంభించాడు. చదివినకొద్దీ వెక్కివెక్కిపొయ్యాడు. గ్రంథాన్ని ప్రక్క నుంచి, ఓ మాలతీకుసుమాన్ని తదేకంగా కన్నీటిప్రవాహంలో చూస్తున్నాడు. మైత్రేయుడు తిరిగివచ్చి నిశ్శబ్దంగా నిలబడ్డాడు. ఆతంత్రగాణ్ణి వీక్షిస్తూనే, తటాలున లేచి, కంఠంపట్టుకొని, వూపి వూపి క్రింద పడవేసి, చంద్రహాసంతో పీక వుత్తరించబొయ్యాడు. "ఇది రెండోసారి! మూడోమారు ముఖ్యంగా మీ ముచ్చట నేనే తీరుస్తాను." అన్నాడు మైత్రేయుడు.

* * *

మరునాడు పడుతూ లేస్తూ లేని వోపికలు తెచ్చుకొని చెల్లెలి కన్నెరిక మహోత్సవం వెళ్లబుచ్చింది విలాసవతి.

కులంవాళ్లనందరినీ పిలిచింది. సూత్రధారణం మొదలు సువ్వాలలుదాకా విధ్యుక్తంగా దగ్గరుండి అన్ని అచ్చటముచ్చట్లు తీర్చుకుంది. నవ్వుటాలుగా నడిచే కన్నెరికపుతంతు తీవ్రమైన పంటిబిగువుల్తో జరిగింది. "కన్యాశుల్కమూ, వరశుల్కమూ లేని కన్నెరికమిది." అని అక్కగా రమ్మెక్కల్తో ఆవేళ పడ్డది. పాన్పుదగ్గర పాటలన్నీ మరెవ్వర్నీ నోరెత్తకుండా తానే పాడింది. శయ్యామీదున్న వధూవరులు కామదేవు. ణ్ణారాధిస్తూ కూర్చున్నారు.

"పట్టెడుకుంకం నాకు ప్రసాదించినప్పుడు లేని సిగ్గు పాన్పుమీద యిప్పుడెలా ఆవేశించిందో మీ చెల్లెలి"కన్నాడు భాస్కరుడు.

"రాత్రించరుడైన భాస్కరుణ్ణి నమ్మ జాలక ముకుళించుకుంది మాపిల్ల హృదయకమలం. ప్రాతఃకాలాని కల్లా తప్పకుండా ప్రసన్నమౌతుంది" అని చల్లగా జారుకొని తలుపువేసిపోయింది విలాసవతి.

ఛంగున క్రిందికి దూకింది కురంగభూమని రూపావతి. "వెయ్యటానికా, తియ్యటానికా" అని మధుపర్కాన్ని పట్టుకొన్నాడు భాస్కరుడు. తలుపుదాకా పోయి తంటాలుపడ్డది. బ్రహ్మముడి మరింత బిగిసింది.

బైట అంతా కిలకిలారావాలతోను, కోలాహలాల్తోను నిండిపోయింది. గిరి కూతురు కనకం "కన్నెరిక మంటే యిం తర్థముందని తెలిసుంటే నేను దాని కొప్పేదాన్నేకా" దంది.

వెన్ను తడుతూ, "ఇదేం చూశావే! కన్నె చెరబాపినవాడు కన్నెతోనే వుండిపోతే మన కులం మర్నాటితోనే మాయమైపోతుంది." అన్నది గిరి. "తండ్రి కీ సంగతి తెలియదనా నీవుద్దేశ్యం"అంది మళ్లా కూతురు. "తెలుసునో గిలుసునో, రామన్నగా రెండుకో ముభావంగా వూరుకొన్నారు" అంది తల్లి.

* * *

సంపుటీ నందుకొనటంమొదలు ఏకాంతమందిరం విడువలేదు రాజు. దినానికోఆశ్వాసం చొప్పున పఠించా డా హృద్గ్రంథాన్ని. చదివిన కొద్దీ కుమిలికుమిలిపొయ్యాడు. నేత్రాలుబికి యెర్రబడి విషాదం ముఖపద్మాన తాండవించింది. దృశ్యాన్ని చిత్రించుకుని నాయకుడు నాయకిగా మారిపొయ్యాడు. శోకం స్తంభించి నీరసించాడు.

పుష్పాల్నెందు కమర్చిందో యేమాత్రం తెలిసిందికాదు. అన్నిటినీ తీసి భద్రపరిచాడు కంచుకంలో. తుది పత్రంమీద చివరకు దొరికింది మందారం. ఎత్తిచూచేసరికి కొన్ని పంక్తులు జిలుగుజిలుగుగా కనపడ్డాయి. "ఆయాసమధికమయినది - దౌర్బల్య మెక్కువై దీని

పరిసమాప్తిచేయ నోపికయు .నంతరించినది. నా తుచ్ఛశరీర మానిబిడ నిశీథమందిరమున నుండినదిగాని నాహృదయకమలము మాత్రము తమ పాదసన్నిధానముననే యున్నది. దీనికి కల్గు బాధలే నాకు విదితములుగాని దాని యవస్థలు తమచిత్తమునకే యెరుక.

భూవల్లభా! ఈ దాసురాలి తప్పిదముల క్షమించుడు. తమరూప మనవరతమూ నా దృక్కీమనే నివసించి యిప్పటివరకునూ వూరట నిచ్చినది.

రూపావతి కన్నిటను నచ్చిన ప్రేమమూర్తి యో విప్రవరుడు లభ్యపడినాడు. త్వరలో దాని కన్నె చెర తీర్పుచున్నాను. దేవరకృపా కటాక్షవీక్షణము లాకపోతములపై ప్రసరింప చేయ ప్రార్థించుచానను.........

గర్భవేదన- భరింపజాలను- చిట్టితండ్రి- దాసురాలు, దాసురాలు."

సుబులుతూవున్న దుఃఖాన్ని భరింపజాలక హోరుహోరున శోకించి, వొళ్లు తెలియక మూర్ఛపొయ్యాడు. బైట నింతవరకు నీరాలు విడిచిన మత్స్యంలా కొట్టుకుంటూన్న మైత్రే యుడు నిశ్శబ్దత ననుమానించి, లోపలికి పొయ్యాడు. మిత్రుడికి శైత్యోపచారాలు చేశాడు. కొంతవడికి తెలివిదెచ్చుకొని రాజు "ఏమైందోయి? ఏమైంది?" అన్నాడు.

మైత్రే:—ప్రభూ! ఏమిటీ ఏమైంది?

రాజు:—మాతాశిశువులు సుఖంగా వున్నారా?

మైత్రే:—ఎవరిమాట మీరడిగేది? రదనిక కింకా ఐదో మాసమే.

రాజు:—విలాసవతీ, దాని శిశువు; నే నడిగేది!

మైత్రే:—ద్వారజాగరణతప్ప నా కింకేం తెలియదు; మరెవ్వరినైనా అడిగొస్తాను!

రాజు:—పిచ్చివాడా! నా మూర్ఛలో ప్రసవించింది ఆ విలాసవతి. ఘోరవిపత్తులో వుంది. నాకళ్లారా చూశాను. చూపు లందే భాగ్యం వుందో లేదో నాకు. దీనికంతా కారణార్థం—ఎందుకులే?

అని కళ్లు మూసుకొని తటాలున లేచి వెఱ్ఱిచూపుల్తో పయనమయ్యాడు. మొదట అడుగులు తడబడి, తర్వాత స్థిరపడి వేగాన్ని తెచ్చుకున్నాయి. తెరచా పెత్తిన నౌకలా యేదో ధోరణిన బడిపోతున్నాడు రాజు. రాజమందిరాలన్నీ అనుగమించి కోటసింహద్వారం దగ్గరి కొచ్చే సరికి అమాత్యశేఖరులు రామన్నగారు ప్రత్యక్షమై "వత్సా! వేగిరపడకు. ఆస్థానవైద్యు లక్కడే వున్నారు మధ్యాహ్నం నుండి" అన్నాడు. "ఆర్యా! అన్నిటనూ కృతజ్ఞుణ్ణి మీకు. కాని ఆజ్యోతి ఆరిపోతోంది. చూ పందదని నాకు తెలుసు" అన్నాడు రాజు. "ఓవెలుగు వెలిగిగాని ఆరిపో దమర జ్యోతి: రండు పోదాం" అన్నాడు రామన్నగారు.

మంత్రి ముందు, రాజు వెనకా. రాజు వెనక మైత్రేయుడు. అతడివెనుక వసంతుడు. వీరివెనుక రాజపరివారం— ఒక్కుమ్మడిగా రాజమార్గాన బడ్డారు. ఆబాలగోపాలం వీరి ననుసరించారు. కాని శబ్దంమాత్రం స్తంభించి అందరిముఖాలమీద తెలతెలపోయింది.

"తనవెంటఁ సిరి లచ్చివెంట నవరోధ వ్రాతముఁ" అని మైనాపిట్ట రాణీవాసంలో కాకలీస్వనంతో పాడింది.

స్వల్పకాలంలోనే రాజమార్గాల ప్రజలు వందలకొలది గుంపులుగూడారు. రంగసాని వీథి ఇసుకవేస్తే రాలటంలేదు. కాని ఏలికను చూచినవెంటనే ప్రక్కలకు నొక్కుకొని మార్గమిచ్చారు. గృహ బహిరంగణం కూడా వారకాంతల్తో నిండిపోయింది. కాని మోము వంచి పొయ్యాడు రాజు.

* * *

పైన గదిగుమ్మంమీద చీరకొంగు కళ్ల కంటించుకొని, సీత్కరిస్తూ నిలబడ్డది వెంకట గిరి. ప్రక్కన పీఠంమీద రజతపేటిక నొక దానిని నొక్కుతూ కూర్చున్నాడు ఆస్థాన భిషక్సింహ రంగాచారిగారు.

గిరి:—అదుగో! చంద్రోదయం కూడా అయింది. (అని యేడ్చింది.)

రంగా:—జీవుడు త్వరలోనే వెళ్లిపోతాడు. చివరకు అచ్ఛమైన నవరత్న చింతామణికూడా వాడాను. జవా బివ్వలేదు.

గిరి:—అయ్యా! యింతకూ కొల్కిపూస బాగుండాలి! మీ రేం జేస్తారు? కోట్లధనం పోసినా ఇంతవారు మాయిండ్ల కొస్తారా? వచ్చి యింతకన్న అమృతా లేమైనా పోస్తారా? ఏమో అనుకొంటాంగాని!

రంగా:—ఏ విధంగానైనా మాట దక్కుతుందేమోనని ప్రయత్నించాను. ఈశ్వరాజ్ఞ వేరుగావుంది: ఏం చేసేది?

గిరి:—బాబూ! ఓమాట చెబుతా వినండి. ముసలిదాని చావు ముచ్చటగా పొయ్యేది కాదండీ! అది పోయినదినమే గుండెల్లో రాయిపడ్డది. దీన్ని చూద్దామా, మొదట్నుంచీ గట్టిపట్టు పట్టింది, ఏ మాత్రమూ ఔషధం సేవించనని. నోసటివ్రాత యెలా తప్పుతుంది, మృత్యుదేవత ముసించుక వస్తూ వుంటే?

రంగా:—పిల్ల డెలావున్నాడో చూసిరా. ఎందుకో ఏడ్పుమానాడు చాలా సేపట్నుంచీ!

గిరి:—ఆయన కేమండీ! చక్కగా వున్నాడు. జలకా లాడాడు. ఇల్లంతా రణగుణధ్వని పెట్టాడు. ఇప్పడా తల్లి రొమ్ముమీద చల్లగా పరున్నాడు. ఆయనకేం?

రంగా:—ప్రక్కన పండ వెయ్యమని యెన్నిసార్లో చెప్పాను; వింటేగా మీరు! అసలే ఆయాసం ఎగరగొట్టుకపోతూ వుందాజీవాన్ని.

గిరి:—అయ్యా! ఏంచెయ్యమంటారు? రూపావతి చేతుల్లో శిశువును వద్దన్నకొద్దీ లాక్కొని వెర్రిగా ముద్దులాడి తానే పండ వేసుకుంది. సత్తు వెక్కడ్నుం డొచ్చిందో దానికి?

రంగా:—సరే మనమేం చేస్తాం? ఆతల్లి కెలావుందో లోపల మన కెలా గ్రాహ్యమవుతుంది? పోనీ, ఆరక్తస్రావమన్నా ఆగిందో లేదో చూచిరా ఓమారు.

గిరి:-అది కట్టుకోనేలేదండీ, పైగా ఇంకా దూకుడుగా వుంది. ఇంత పాండురోగానికి ఇంతరక్త మెక్కడ్నుంచొచ్చిందనీ నాఆలోచన.

రంగా:—భూపాలుడి ఋణాలు బిడ్డతో తీర్చింది: సశేషంతో భూదేవికి కాటిసుంకం చెల్లిస్తూంది. ఏకోవృత్తకురాలు! మంచిజన్మ!

గిరి:—మరి ముందుగ రేమిటో చెప్పండి.

రంగా:—తిరిగీ ఔషధంవాడటానికి కొంత కాలం ఆగాలి.

గిరి:—చేతులో యెలావుందో చెప్పండి దాచక.

రంగా:—మధ్యాహ్నానికే మృతనాడి ప్రవేశించింది. పురిటితో అది మరీ శుష్కించింది. ఇదంతా ఔషధప్రభావ మనుకో.

గిరి:—అమృతంలాంటి బిడ్డ పోతూన్నదండీ (అని గోడుగోడున ఏడ్చింది.)

రంగా:—అందుకే అమృతాని కమృతం పొయ్యలేకపొయ్యాను. పెద్దదానివి! అన్నిటికీ ధైర్యం వహించాలి!

గిరి:—శాంతి నక్షత్రమేమో చూచి పెట్టండి.

రంగా:—సందేహ మెందుకు? అందులో గుణ్ణపుశాంతికోరుతూంది యీజననం.

గిరి:—ఎవ్వరికీ యేచిక్కూ లేకుండా అన్నిశాంతులూ ఆ అమ్మే తీరుస్తూంది తన ప్రాణధారతో. (అని మళ్లా దుఃఖించింది)

వైద్యుడు రోగిని పరీక్షించడానికి లేచి నిలబడ్డాడు. ఇంతలో మెట్లమీద చప్పుడై, త్వరితంతో రాజూ, వెనకంజవేస్తూ రావన్నగారూ ప్రత్యక్ష మయ్యారు. గిరి భంగున లోపలికిపోయి "వారొచ్చారే.వచ్చారేవారు" అని మెలమెల్లగా లోగొంతుతో అంది.

మంచంప్రక్క దుఃఖించి దుఃఖించి మూర్ఛలోవున్న రూపావతి కళ్లుతెరచి "ఏరీ! ఏరీ!" అని వెర్రిచూపులు చూచింది. "శ్రీవారే శ్రీవారే" అని స్మారకంతప్పిన తల్లి చెవిదగ్గర వూదింది గిరి. చలన మేం కలిగిందికా దాముఖపద్మంలో. పైగా ఘర్మబిందువులు శరీరమంతా క్రమ్మి మరింత శీతలమాపాదించింది. మంత్రసాని లేచివచ్చి వొళ్లునిమిరి, కాళ్లకూ చేతులకూ మరింత పసుపు తెమ్మన్నది.

రాజు గుమ్మంమీద వచ్చుగెట్టాడు- విలాసవతి కనుచూరి విప్పింది. దుఃఖాన్ని అణుచుకుంటూ కిక్కురుమనకుండా అందరూ గది బైటికి జారారు. చెల్లెల్ని చూచి కంటనీరుబెట్టి "నీవుహాత్ర ముంకిపో" అంది అక్కగారు.

రూపావతి తలుపేసి ఆనుకొని నిలబడ్డది. రాజు సంశయ కల్లోలాలతో కన్నీ రేకధారగా శయ్యాప్రక్క నిలబడ్డాడు. విలాసవతి నేత్రాంబుజాల్ని వికసించి, శయ్యాసదనాన్ని విద్యుత్కాంతులతో నింపివేసింది.

విలా:—ఎందు కలా దుఃఖిస్తారు?

రాజు:—నీ దురవస్థకు!

విలా:—నాకేం దురవస్థ? ఈసూర్యబింబం లాంటి చిట్టితండ్రిని వీక్షించి, చీకట్లు పోగొట్టుకోండి!

రాజు:-(దుఃఖము తమకొని) ఆ కిశోరాన్ని కూడా నామూర్ఛలోనే తిలకించాను.

విలా:—ముఖం మీది, శరీరం నాది. (అని శిశువును ముద్దిడుకుంది)

రాజు:—ఆయాసంగా వుంది నీకు. శ్రమ చేసుకోవద్దు.

విలా:—ఆయాసమూ పోయింది, ఆరాటమూ పోయింది దేవర దర్శనంవల్ల. ప్రశాంతంగా వున్నాను!

రాజు:—త్వరలో అనంతంలోకి కలసిపోనున్నావు. నీ అభీష్టాలు చెప్పు; నెరవేరుస్తాను.

విలా:—ఈ దాసురాలిని మరువవద్దు!

రాజు:—ఎన్నడు జరుగలేదు.-ముందు జరుగదు.

విలా:—నా తప్పిదాల్ని క్షమించండి!

రాజు:—నీకు తెలిసినవాటిని, తెలియని వాటిని మనసార క్షమించినాను.

విలా:—నే బ్రతికుండగానే యీ నవనీత చోరునికి నామకరణం చేయండి.

రాజు:—నీ యిష్టమైన పేరు చెప్పు.

విలా:—మీ యిష్టమే నాకు మహాప్రసాదం.

రాజు:—దేవదాస్!!

విలా:—ఎంత ముద్దుపేరు! ఎంత మహత్వంగల పేరు! (అని బిడ్డను ముద్దాడి ఒళ్లు నిమిరింది) మీ మూర్తిలో లీనమై మహీపాలనాథా! ఓసారు మీ ఆలింగనభాగ్య మిచ్చి మీ విశాలనేత్రాలను నాకండ్లమీద సరిచేసి, నా అసువులను ఆకర్షించివేయండి.

రాజు:—(తలవంచి నిలబడును)

విలా:—అయ్యో! సంశయించక చేరండి! నాకాల మాసన్నమవుతూంది!

రాజు:—నేను మహాపాతకుడను: నీవు మహాపావనివి. ఇక నాస్పర్శచేత అపవిత్రురాలవు కావద్దు!

విలా:—భూపతులు మాట తప్పరాదు.

రాజు:—(వెనకంజవేయును.)

విలా:—పోనీ! మీ దేవదాసుని మీ రందుకోండి. (అని బిడ్డనిచ్చును)

రాజు:—నాకు జ్ఞానోదయమిచ్చిన తేజఃపుంజానివి! సాక్షాత్తూ నాసురసమానురాలవు! అభివాదార్హవు గాని ఆలింగనార్హవు గావు! క్షమించు!

విలాసవతి వెలవెలబోయి, వెనక్కు వొరిగి నమస్కరిస్తూ వెంటనే ప్రాణం విడిచింది—

శయ్యాసదనం తెలతెలవోయింది. పసివాడు కండ్లు తెరచి, కెవ్వున నేడ్చి బాహువులు సాచాడు రాజువక్షస్థలంమీదికి. "శ్రీహరీ! శ్రీహరీ!" అని రాజు దుఃఖాన్ని అణచుకొని స్థాణువై పొయ్యాడు. రూపావతిని పిలిచి "రూపసీ! యీ రూపసి నందుకో" అని బిడ్డ నందించాడు. రూపావతి నెత్తి నోరు కొట్టుకుంటూ అక్కగారి శవంమీద పడి పిట్టలాగా గిలగిలా తన్నుకుంది.

రాజు పాదాలవైపు నిలబడి శయ్యాతలాన్ని నిర్ఘాంతపోయి చూచి, "అహో! విలాసినీ! వీరశయ్యను ఖించింది నీ మరణశయ్య" అని పాదద్వంద్వాన్ని స్పృశించి కళ్లకద్ద

కొని, ఆపసుపుతో తిలకాన్ని పెట్టుకుని పైకిచూచాడు. "హే పరమేశ్వరా! కృపాఘా! అనాథరక్షకా! యీ రక్తశయ్యను వీక్షించు! యీ ప్రేమస్వరూపిణికి కటాక్షించు నీపాదసేవ!" అని ప్రార్థించి నిమీలితుడై మూర్ఛపొయ్యాడు.

కాలపురుషుడు మరణశయ్యనుచూచి, అస్తమించే సూర్యబింబమో, ఉదయించే పూర్ణశశిబింబమో అని శంకించి, ముక్కుమీద వ్రేలిడుకొని, సోద్యం చూస్తూ నిలబడ్డాడు. మందార పూసెజ్జమీద వాడిపోతున్న కోకనదంలా ఉంది భోగాలపసును కళేబరం! ఇంతలో దీపకళికలన్నీ హఠాత్తుగా ఆరిపొయ్యాయి. కాలపురుషుడు డొంకి కర్ర పట్టుకొని సాగిపొయ్యాడు.

రూపావతికి భయమేసి, బిడ్డను రొమ్మున కంకించుకొని తలుపుతీసి బయటపడి గిరిచేతి కందించి, "అక్కసూడా అమ్మతోవపట్టిందే" అని యేడ్చియేడ్చి వ్రాలిపోయింది. ఏకో ఆవేశమొచ్చి, మైత్రేయుడు వసంతుని చేతనున్న బాకును లాక్కొని, రొమ్మున రువ్వుకొని క్రిందపడ్డాడు. అందరూ ఆ! ఆ! అన్నారు. రాజు దిగ్గున లేచివచ్చి మిత్రుణ్ణి చూచి బాకును బలవంతంగా పైకిలాగాడు. అంతా రక్తమయమైపోయింది. కొనవూపిరితో "వత్సా! నా తప్పిదాలు క్షమించు. నాశపథం నే నెగ్గించుకొన్నాను." అని ప్రాణం విడిచాడు మైత్రేయుడు. రాజు మిత్రుణ్ణి వక్షస్థలాన చేర్చుకొని పరమేశ్వరుణ్ణి తిరిగిప్రార్థించి రామన్నగారివైపు చూచాడు. "ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః" అన్నాడా పురోహితుడు.

*     *     *

అదేరాత్రి. చంద్రుడు నడివీథికెక్కి నవ్వుతూ పరుగుతున్నాడు. పట్నంలో ప్రజలందరూ వుద్యానవనంవైపు నడిచి నడిచి క్రిక్కిరిసిపొయ్యారు. ఎక్కడచూచినా దివ్వటీలే. శబ్దం లేని కోలాహలం, ఉత్సవమా కల్యాణమా అనిపించింది. పసుపూ, కుంకుమా, పుష్పాలు, సుగంధాలు, శ్రీగంధాలు—.

ప్రియమైన తన మాలతీలతాకుసుంగమధ్య స్ఫటికవేదికపైన విలాసవతికీ, బయట తన మిత్రునకూ అంత్యశయ్య లాజ్ఞాపించాడు విజయరాజు. గంధపుచెక్కలతోను, తులసి బృందావనాలతోను, స్వర్ణాలతోనూ నించి సిద్ధం చేయించాడు. ప్రజలనూ, నిజపరివారాన్నీ చూచి, నివ్వెరపడి కంట నీరుపెట్టి, పాదరింట్లోకి చిమ్మ చేతపట్టుకుపొయ్యాడు. ఆహృద్గ్రంథాన్ని వక్షస్థలంమీద భద్రపర్చి, ఆ వాడిపోయిన పుష్పాలను శరీరమంతా అమర్చాడు విలాసవతికి.

మందారాన్ని ముఖంమీద బొట్టుగా నలుకుపెట్టి, ముద్దిడుకొని, నిండిన చంద్రబింబాన్ని చూస్తూ, మూడుసార్లు హస్తంతో నివేదన చేశాడు. "హరిహరీ!" యని చిచ్చంటించి బయటపడ్డాడు. అదే ఆవేశంతో మిత్రశయ్యకు పోయి, బాకును వక్షస్థలానమిర్చి, శిరము ముద్దుపెట్టుకుని, చిచ్చంటించాడు.

శరీరమంతా కంపించి కన్నీటితో నిలబడ్డాడు. అగ్నిదేవుడు రోమభీషణాలతో చితుల నావరించివేశాడు.

సుప్పు సుప్పున మంటలెగసి, వుద్యానవనం ఓ వింతవెలుగు వెలిగింది! "ప్రభూ! ఆర్ద్రహృదయా! నా యౌవన ఆవేశాలని మన్నించండి. మీ ఋణానుబంధాలను మహోత్కృష్టంగా తీర్చుకున్నారు." అని మోకరించాడు భాస్కరుడు. "ఋణానుబంధాలు మావంతు. ప్రతిబంధకాలు కాబోయ్యే మంత్రులవంతు." అన్నాడు రాజు.

ఉద్యానవనానికి విలాసవనం అని నామకరణంచేసి పట్టణాభిముఖుడయ్యాడు. రంగనాథుని పుష్కరిణిలో స్నానమాడి, దైవదర్శనం కావించుకుని, బయట నాసీనుడై శ్లోకాలుపఠించి గాయత్రిజపించాడు. మరునాడు ప్రాతఃకాలాన రామ ప్రధానిగారికి రాజ్య మప్పగించి, అయిదూళ్లమాన్యం రూపావతికి శాసించి సపరివారంగా రామేశ్వర యాత్ర పొయ్యాడు.

*     *     *

అయ్యా! చివర కొకమాటచెప్తా, శ్రద్ధగా వినండి.

ఆ ఉత్తమరాజ పల్లవులనండి, ఆ పల్లవ రాజులనండి వారూ పొయ్యారు! ఆ పతివ్రతాశిరోమణులూ పొయ్యారు! ఆ వేశ్యభామాకురంగిణులూ పొయ్యారు!—ఇప్పుడు ఇదోకాలం!! మల్లెపూలు మాయమయ్యాయి; దానిమ్మపూలు దాపరించాయి!

ఇటీవల ఓ శిథిలరాచభవనంలో విజయరాజు చిత్రపతంమాత్రం దొరికింది. పతం మాసినా పద్యరాజంమాత్రం చిరస్థాయిగా వుంది. ఏ కాలానికైనా ఈ పద్యమే వేశ్యకాంత విటుల వీపులమీద వ్రాసి, వారిల్లు వదిలేటప్పుడు వారిగృహిణులను చదువుకోమని హెచ్చరిక చేస్తూంది.

# ప్రాచీనాంధ్రకవులు

## నాగులూటి శేషనాథుఁడు

నిడుదవోలు వేంకటరావు

శైవకవి శేషనాథుఁడు శ్రీశైలఖండ మను నాలుగాశ్వాసముల పద్యకావ్యమును రచియించిన ప్రౌఢకవి. ఈతఁడీవఱకు నాంధ్రకవుల చరిత్రమున మూఁడవభాగమున కెక్కియున్నాఁడు. ఈతఁడు పదునాఱవ శతాబ్దమునకుఁ బూర్వపువాఁడయ్యును నధునాతనులలోఁ జేర్పఁబడుటకుఁ గారణ మీతని గ్రంథముద్రణము. శ్రీశైలఖండము తొలుత క్రీ.శ. ౧౮౮౮ సంవత్సరమునఁ బ్రకటింపఁబడినపుడు గ్రంథముఖపత్రమున నిట్లున్నది.

> ఇది శ్రీమల్లికార్జున కృపాలబ్ధ మేదురాష్టభాషావిశిష్ట నాగులూటి శేషనాథార్య ప్రణీతంబైన శ్రీపర్వత మాహాత్మ్యంబను శ్రీశైలఖండము పద్యకావ్యము తత్ ప్రపౌత్రుండగు సోమయ్యగారి గ్రంథానుమతివలనను బొగ్గారపు రంగన్నగారి ద్రవ్య సహాయంబునను చెన్నపట్టణం తెనుగు జంగమకుల ప్రథమ యజమానియగు పాదర్తి అక్కయ్యదేవరచే శైవసిద్ధాంత ముద్రాక్షర శాలయందు ముద్రింపించి ప్రచురింపబడియె.

పైన నాగులూటి శేషనాథార్యుఁడని, యావెనుక తత్ప్రపౌత్రుఁడని యుండుటచే కవిచరిత్రకారులు ప్రపౌత్రుఁడు క్రీ. శ. ౧౮౮౦ సంవత్సర ప్రాంతము వాఁడు గావున శేషనాథుఁ డిప్పటికి నూతేండ్లపై కాలము వాఁడని వ్రాసిరి. కాని శేషనాథుఁడు ప్రాచీనుఁడగుటకు సాధనము గ్రంథమునందే కానవచ్చుచున్నది.

ఇందు ప్రథమాశ్వాసమున నవతారికయందు గల

> ఉత్తరపాటుతో నిరులు దద్దయు మాన్పగజాలు కన్ను న
> వ్వొత్తున వేల్పుమూకలకు విందులువెట్టెడు కన్నుదమ్మియున్
> మొత్తము నత్త లచ్చికిని మున్మను బుట్టిన ముద్దుపట్టి మే
> నెత్తిలజూచు కన్నుగల పెట్టికు వేలుపుగొల్తు నిచ్చలున్.

అను పద్యమును పెదపాటి జగ్గన తన ప్రబంధ రత్నాకరమున నుదాహరించియున్నాఁడు. జగ్గన యుదాహరించిన కవులు పదునాఱవ శతాబ్దమునకుఁ బూర్వము వారే యగుటచే శేషనాథుఁడు పదునాఱవ శతాబ్దికి బూర్వుఁడే యని చెప్పనొప్పును.

శేషనాథుఁడు కర్నూలుమండలమున నాగులూటి వాస్తవ్యుఁడగుటచే, నేఁడు కీర్తిశేషుఁడు నాకుఁ గడుఁ గూర్చు నెచ్చెలి శ్రీ మున్నంగి... శర్మగారి 'పడమటి సీమ' కవులలో నొకఁడు. కవి వీరశైవుఁడగుటచే

> శివజన్ముఁడ శివగోత్రుఁడ - శివలింగధ్యానపరుఁడ శీలవ్రతుఁడన్
> శివపూజాపరతంత్రుఁడ- శివయోగసుధానుభవుఁడ శేషాహ్వయుఁడన్.

అని తన కులగోత్రములఁ దెలియఁబఱచినాఁడు. తన పాండితీప్రకర్షను

> ప్రణుత శ్రీ గిరినాథలబ్ధకవితా ప్రజ్ఞాకళాభిజ్ఞుఁడన్.
> గణభుగ్గ్రంథమతప్రయోగవిలుఠద్గాఢార్థ సంవేత్తఁ ద
> త్ఫణిభాష్యాయతఫక్కికాదృఢ పదప్రౌఢీ సమారూఢకిత
> ప్రణిపత్యస్ఫుట శబ్దశాస్త్ర నివహప్రామాణ్య పారీణుఁడన్.

అనుపద్యమున నిగూఢము గావించినాఁడు. సంస్కృతాంధ్రభాషలఁ గూర్చి

> భూషణలీలల దేశి-భాషలు తత్తత్ప్రదేశ భాసురములగున్
> భూషించు వస్త్రమట్ల సు-భాషిత మై సంస్కృతంబుబహుదేశములన్!

> జనని సమస్తభాషలకు సంస్కృతభాష ధరాతలంబునన్
> ఘనకలితార్థగౌరవవికాసి తెలుంగభిరమ్య మంతకున్
> కనుగొన చూతబీజమునకంటెను కోమలపత్రపుష్పశో
> భనమృదుపల్లవాభినవజాలరసాలము సొంపు నింపదే.

అను హృద్యమగు పల్కులును, కవితా విషయమున

> తెనుగైన నేమి, కవితా- జనితాలంకారచిత్రసంగతపదవ
> ర్ణనవచనరచనచతురత-విన యోగ్యంబైన కృతియ విం ద్రదు మహాత్ముల్.

> దోషసమేత మెంతయును దొడ్డది యైనను నిందితంబు ని
> ర్దోషము గొంచెమైన జగదున్నతి నొందు కళంకహీన సం
> వేషశశాంకఖండమును విశ్వవిభుండు కిరీటకోటిపై
> భూషణలీల దాల్చె పరిపూర్ణశశాంకు ధరింపఁగోరనే?

అను తన యభిప్రాయమును శేషనాథుఁడు గ్రంథమునఁ దెలిపినాఁడు. కవి భాషావిషయమున తెలుఁగున నభిమానముగలవాఁడయ్యు కవితావిషయమున సంస్కృతాభిమాని.

శేషనాథుఁడు తనకు శివభక్తి చిన్ననాఁటనే యలవడిన దనియు, శివభక్తియే తన కవితాభ్యుదయమునకు హేతువనియు నిట్లు చెప్పియున్నాఁడు:

నావారున్ గడు చిన్నప్రాయమున 'నోనామః' వాక్కులున్ (?)
"శివా" వాక్కులు జెప్ప నాఁటఁగొలె నే సేవింతు నీయాన నా
భావంబందున నిన్నె యెన్నుదును విభ్రాజత్ప్రవద్భక్తి స
ద్భావజ్ఞాన సుధానుభావరతుగా భావింపు మల్లేశ్వరా!

చేలత్సూక్తికయందు భక్తికళలం జేకూర, శాస్త్రోదిక
వ్రాతం బక్షరమూర్తి మౌక్తికములౌ వర్ధిల్లుడున్ సత్ప్రభు
ఖ్యాతోపేత సుజప్రయుక్తి సదనాలంకార హారాళిగా
రీతిన్ సత్కవి గూర్పనేర్చును బుధశ్రేణీగళాగ్రంబునన్.

శేషనాథుఁడు తన కావ్యమునకు శివభక్తియే మూలమని యిట్లు చెప్పినాఁడు:

శివచారిత్రము బీజ,మంకురము నీనేనావివేకంబు, స
త్కవితాశ్రేణులు పల్లవంబులు, సమాఖ్యవ్రాతముల్ పుష్పముల్
భవదీయ స్తవముల్ ఫలావళులు సద్భావంబులే కీరముల్
భువి మత్కావ్యమహీరుహంబునకు శ్రీ భూభృత్పురాధీశ్వరా!

శేషనాథుఁడు వీరశైవకవి యయ్యు కవిస్తుతి యందుఁ బాల్కురికి సోమనారాధ్యుని స్తుతింపలేదు. శైవకవులలోఁ బ్రాచీనులేమి, యధునాతనులేమి పాల్కురికి సోమనాథుని స్తుతింపనివారు లేరు. ఇది యెంతయుఁ జిత్రముగ నున్నది. శేషనాథుని పర్వత పురాణమున పాల్కురికి సోమనారాధ్యుని పండితారాధ్య చరిత్రమునఁ గల పర్వత ప్రకరణమునఁ గల ద్విపదభావములే పద్యరూపముఁ దాల్చినవి. ఒక్క యుదాహరణము మాత్రమే చూపుదును.

ఘనతరధర్మార్థకామమోక్షములు
దనరు శ్రీపాదపద్మంబు లనంగ
కన్నులు దీపవృక్షంబులనంగ
చెన్నగు శృంగముల్ శృంగములనగ
గుహలు నాసాపుటకుహరంబులనగ
మహితభుజములు రోమమ్ము లనంగ
........................
వరచతుర్ద్వార నివాసలింగములు
సరసత నొప్పారు చన్ను లనంగ
దొరగు పుణ్యంబు లందుల దుగ్ధ మనగ
వరపరిమితోక్కటి వత్సంబులనగ
........................
నంతంబైన శ్రీనగకామధేను
వంద కా కెవ్వి యిష్టార్థము ల్గరియు."
—పర్వతప్రకరణము, వరంగలు ప్రతి, పుట ౩౧౨.

పురుషార్థంబులు పాదముల్ శుభను తత్పుచ్ఛంబు తచ్ఛృంగముల్
గిరిశృంగంబులు రోమరాజి తరువుల్ క్రేపుల్ దిదృక్షుపరుల్
వరపుణ్యంబులు దుగ్ధధారలు చతుర్ద్వారస్థలింగంబు లు
ద్ధురవక్షోజము లీనగంబు నుతులొందున్ కామధేనుక్రియన్.

ఇట్లే పర్వతప్రకరణమున శ్రీశైలము కల్పవృక్షముగను దుగ్ధపయోధిగను మహాభ్రముగను వర్ణింపబడిన ద్విపదభావము లన్నియు నిందు పద్యములఁ గలవు.

సోమనాథ రచితమగు నక్షరాంక గద్య యిందు ద్వితీయాశ్వాసమున పర్వతునికి శివుఁడు ప్రత్యక్షమైన ఘట్టమున నున్నది. పాతాళగంగ వర్ణనయందలి

సాలోక్యసామీప్య సారూప్యముక్తు
లోలి నీఁజాలు మహోర్మి దోర్లతిక
అనిమిష జనలోచనావర్తనాభి
ఘనతరపులిన జఘనకమలాస్య
యురురథాంగ స్తన యుగ ఫేనహార
వరహంసగమన ప్రవాహాంగ యనుచు-

అను పండితారాధ్య ద్విపదలే

అనిమిషలోచన యావర్తనతనాభి
పృథురథాంగ స్తని ఫేనహార
శృంగార సైకత శ్రీ జఘనస్థలి వికచ పద్మాసన-

ఇత్యాదిగా శేషనాథుని గ్రంథమున వెలసినవి.

శేషనాథుఁడు సోమనాథునికిఁ బూర్వుఁడు కాఁజాలఁడు. తాళపత్ర గ్రంథముల సోమనాథుని ప్రశంస గలదేమో పరిశీలించుచున్నాఁడను. ఇందు షష్ఠ్యంతముల యంతమునఁ గల

కంఠీరవాఢ్య విక్రమ – కుంతీసునకు కుంభిదైత్యకోపాటోపా
కుంఠ ప్రతాపహరునకు– కంఠేకాలునకు ప్రమథగణ పాలునకున్.

అను పద్యము అడిదము సూరకవి కవిజనరంజనము తొలి నున్నది. అది యెట్లో!

శ్రీ శైలఖండము పునర్ముద్రణము గావింపఁదగిన యుత్తమకావ్యము. ద్వాదశ జ్యోతిర్లింగములలో నొకటియై ప్రసిద్ధప్రాచీన శైవక్షేత్రమగు శ్రీ శైలముఁ గూర్చి. కావ్యముతోఁ గూడిన విషయ విమర్శనమున కిందు వలనుగామి విడిచినాఁడను. వ్యాసమున వచనము కన్న పద్యము లెక్కుడుగ నున్నను శేషనాథుని యీ క్రింది పద్యములతో ముగించిన పాఠకులు మన్నింపక పోరు. శిలాదతపోఘట్టమున

పరులను నాడ్వారం గుదియబట్టి జయించి పదద్వయంబునన్ మరగి చరించునట్టి పవమానుని జోకకుఁ దెచ్చి వానిచే దిరముగ పాపయింతిని విధేయవశంబున మేలుకొల్పి యా వరుసన వచ్చి నెన్నడిమివాకిలి గాంచియు నందు వాకిటన్

పవను గుంభించి మఱియు నప్పవనగమన
మహిమవశమున యోగాగ్ని మంటజేసి
దివియ ముట్టింప నారని దీపమైన
గరుసుమోవంగ లోని చీకటిని మాన్చి.

ఒకిక ముగాగ నెన్నడిమియుగ్గులు మానిపి శంభువూర్తికిన్ విడిదలకై దళద్వయనవీనపయోజము నిల్పి యందుపై మృడుగని సౌఖ్య మంది మదిమించిన పక్షి మనాడిచేత నై వడి గరగించె చిద్గగన వాకిలియందుఁ ప్రమోదచంద్రునిన్.



# కార్యనిర్వాహక న్యాయశాఖల విభజనము

వంద్రంగి రాజేశ్వరరావు

కార్యనిర్వాహక న్యాయశాఖల విభజన సమస్య యిటీవల మరల ప్రాముఖ్యమునకు వచ్చినది. ప్రస్తుతము మనదేశమం దీరెండు శాఖల యధికారములు వేర్వేరుగగాక మిళితమైయున్నవి. తూర్పుఇండియా వర్తక సంఘమువారి ప్రభుత్వమునాటినుండియు ఈ పద్ధతి అమలునం దున్నది. ఇంగ్లండునం దీరెండు శాఖలు స్వతంత్రముగ తమతమ యధికారములను చలాయించుచున్నప్పటికి బ్రిటిషువారు మనదేశము దీరెంటిని మిళితమొనర్చుటకు కారణము లేకపోలేదు. ఇట్లు చేయుటవలన ఖర్చు తగ్గుటయేకాక ప్రభుత్వమును సులువుగను, త్వరితముగను సాగించుటకు అనుకూలముగ నుండును. ఏప్రభుత్వమైనను సుస్థిరముగ నాటుకొనవలెనన్న జారీకాబడిన హుకుము లన్నియు త్వరితముగ కార్యరూపమును దాల్చవలసియున్నది. సర్వ సాధారణముగ కార్యనిర్వాహక శాఖవా రీపనులను శ్రద్ధాభక్తులతో నెరవేర్చెదరు. బ్రిటిషువారు భారతదేశమందు సులువుగను, నిరాఘాటముగను ప్రభుత్వమును సాగించుటకై ప్రధాన రాజ్యాంగ సూత్రములను విడనాడి మొట్టమొదట ప్రస్తుతపద్ధతి నాచరణలోనికి తెచ్చిరని తెలియుచున్నది.

కాని యీపద్ధతిని బలపరచువా రెవ్వరును మనదేశమందు లేకపోయిరి. ఈసమస్య విషయమై ౧౯౩౭ వ సంవత్సరము నుండియు తీవ్రాందోళనము జరుగుచున్నది. కాంగ్రెసు సంస్థకూడ ఈ సంస్కరణమునకు ప్రప్రథమము నుండియు ప్రాముఖ్యము నిచ్చినది. కాంగ్రెసుయొక్క రెండవ సాంవత్సరిక సమావేశమం దీరెండుశాఖల విభాగమును కోరుచు తీర్మానము కావింపబడినది. దరిమిలాను ప్రతి సాంవత్సరిక సమావేశమందును ఈ తీర్మానమును పునశ్చరణ గావించుట మామూలైపోయినది. ఈ సంస్కరణవిషయమై రాజకీయములం దాసక్తిగల పౌరు లందరును ఏకాభిప్రాయమును కలిగియుండిరి. చిట్టచివరకు ౧౯౦౮ వ సంవత్సరమునం దీసిద్ధాంతము ఇండియా గవర్నమెంటువారి దృష్టి నాకర్షించినది. ఆసందర్భమున అప్పటిహోము మెంబరగు సర్ హార్వే ఆడమ్సుగారు గవర్నమెంటుయొక్క వైఖరిని గూర్చి యిట్లు చెప్పిరి. "శాంతిభద్రతలకు సంబంధించిన నేరముల విచారణము సాధారణముగ న్యాయస్థానమునకు ఉచితమగురీతిని ప్రశాంతవాతావరణమందు నిష్పక్షపాతముగ జరుగుట లేదు. అందుచేత వీలువెంబడిని కార్యనిర్వాహక న్యాయశాఖలను జాగ్రత్తగ విభజించుటకు గవర్నమెంటువారు తీర్మానించిరి."

(In 1908 Sir Harvey Adams, the then Home member to the Government of India declared that "Criminal trials affecting the general peace of the District, are not always conducted in the atmosphere of cool impartiality which should pervade a Court of Justice and hence Government decided to advance cautiously and tentatively towards the separation of the Judicial and Executive functions.")

౧౯౨౧-వ సంవత్సర ప్రాంతమందు "మాంటేగు-ఛెలమ్సుఫర్డు" సంస్కరణల ఫలితముగ జిల్లాపరిపాలనము రాష్ట్రీయప్రభుత్వమునారి పరము కావింపబడినది. అపుడు రాష్ట్రీయశాసనసభ లన్నియు కార్యనిర్వాహక న్యాయశాఖల విభజనమును కోరుచు తీర్మానములను గావించినవి. తర్వాత ఈ సమస్య విషయమై పూర్తిగ విచారణజేసి సిఫార్సు చేయుటకై ప్రతిరాష్ట్రమునందును సంఘముల నేర్పరచిరి. ఈ సంఘములందు అనుభవముగల నిపుణులు చాలమంది పాల్గొనిరి. ఇప్పట్టున వివిధసంఘముల యొక్క శిఫార్సులను విశదీకరించుట అనవసరము. ఈ రెండుశాఖలను విభజించుట కెట్టి యాక్షేపణగాని, అడ్డంకులుగాని లేవని యేకగ్రీవముగ వివిధరాష్ట్రీయసంఘములు తమ నిశ్చితాభిప్రాయమును వెలిపుచ్చినవి. ఈసంస్కరణమును ఆచరణలోనికి తెచ్చుటకు ప్రణాళికను (Scheme) తయారుచేసి అందుల కగు ఖర్చును కూడ అంచనావేసిరి. బెంగాలునం దీసంస్కరణమునకై మొట్టమొదట రూ. ౧,౫౩,౦౦౦ లను, దరిమిలాను సాలీనా రు. ౪,౪౯,౬౫౦ లను ఖర్చు పెట్టవలసియుండునని అంచనావేయబడినది. మిగత రాష్ట్రములందుకూడ ఈ సంస్కరణకొరకై అగు ఖర్చు సుమారుగ ఇట్లే యుండును. ఇట్టి ముఖ్యసంస్కరణ నిమిత్తమై యీ కొద్దిపాటి వ్యయమునకై సంశయింపరాదు. అపు డింత కార్యకలాపము జరిగినప్పటికి గవర్నమెం టీవిషయమునంతను పెడచెవిని బెట్టినది.

ఇటీవలి క్రొత్త సంస్కరణల ప్రకారము రాష్ట్రీయ స్వపరిపాలనము (Provincial Autonomy) అమలులోనికి వచ్చుటచేత ఈ సమస్య తిరిగి రాష్ట్రీయ శాసనసభలందు చర్చింపబడినది. మన రాజధాని ప్రధానామాత్యులగు రాజగోపాలాచారిగారి ప్రతికూల వైఖరి చాలమందికి విషాదాశ్చర్యములను గలిగించినది. ప్రస్తుత స్థితియే శ్రేయస్కరమని ఆయన వాదించుట చిత్రముగ నున్నది. బెంగాలు మంత్రివర్గమం దొకరగు సర్ ఖ్వాజా నజీముద్దీనుగారు తప్ప మ రేరాష్ట్రీయమంత్రులును వీరియభిప్రాయముతో ఏకీభవించుట లేదు. సంయుక్త రాష్ట్రములందు న్యాయశాఖామంత్రులైన డాక్టరు కైలాసనాథ కట్జూ మొదట ఇట్టి యభిప్రాయమునే కొంతవరకు వెలిపుచ్చియుండినప్పటికిని దరిమిలాను ఉపసంహరించుకొనిరి. బొంబాయి, బీహారు రాష్ట్రములం దీరెండు శాఖలను త్వరలో విభజించుటకై తగు ప్రయత్నములు జరుగుచున్నట్లు తెలియుచున్నది. ఇంతకు రాజగోపాలాచార్యులవారియభిప్రాయముతో మదరాసుమంత్రివర్గమందుకూడ తదితర

మంత్రు లేకీభవించుచున్నట్లు కనుపడదు. ప్రస్తుతము జరూరుగా ఉన్న పనులను నెరవేర్చినపిమ్మట సాధ్య మైనంతవరకు కార్యనిర్వాహకన్యాయశాఖల విభజనము చేయబడు నని రెవిన్యూమంత్రియైన ప్రకాశం పంతులుగారు తమ వెల్లూరు ఉపన్యాసమునందు చెప్పియుండిరి. ఇందువల్ల రెవిన్యూమంత్రిగారు విభజనసిద్ధాంతము నంగీకరించినట్లు తేటతెల్లమగుచున్నది. ఇందులకై కొంచెము వ్యవధిమాత్రము కోరిరి. అందుచేత ఈ సమస్యను జాగ్రత్తగపరిశీలించుట చాలముఖ్యము.

నేరము నారోపించు అధికారము, శిక్షించు అధికారమును ఒక్కనిచేతియం దుంచకుండ చేయుటయే యిట్టి విభజనయొక్క ముఖ్యోద్దేశము. క్రిందికోర్టులందు న్యాయపరిపాలనము (Administration of Criminal justice) వివిధతరగతుల మ్యాజిస్ట్రేట్ల (Magistrates of different classes posssssing first class, second class and third class powers) చేతియందున్నది. డిప్యూటీకలెక్టరు కార్యనిర్వాహక న్యాయశాఖాధికారములను కలిపి చలాయించును. జిల్లాకలెక్టరు శాంతిభద్రతలకు బాధ్యుడగుటచే న్యాయపరిపాలనమును కనిపెట్టి చూచుచుండును. క్రింది మ్యాజిస్ట్రేట్ల భవిష్యత్తంతయు జిల్లాకలెక్టరుచేతియం దుండుటచేత వీరందరును ఆయన యిష్టానుసారము ప్రవర్తించుట సహజము. ఇట్లు పై యధికారి కలుగచేసుకొనుటకు అవకాశ ముండుటచే సరియగు న్యాయము కలుగుట సంశయాస్పదము. బహిరంగముగ పై యధికారిట్లు కలుగజేసుకొనిన దృష్టాంతము లేనంతమాత్రమున న్యాయపరిపాలనము స్వతంత్రముగను, నిష్పక్షపాతముగను జరుగుచున్నదని యెంచరాదు. దూరదృష్టితో చూచిన జిల్లాఅధికారు లందరును ఈ మార్పును హర్షించెదరని తోచుచున్నది. ప్రస్తుతము జిల్లాకలెక్టరునకు క్రింది మ్యాజిస్ట్రేట్లకు రెవిన్యూపనికితోడు న్యాయశాఖపనికూడ చూడవలసియుండుటచే పని ఒత్తిడి మిక్కుటముగ నున్నది. ఇందుచేతనే రెవిన్యూశాఖయొక్క పని మందముగను, ఆలస్యముగను జరుగుచున్నది. కొలదికాలము లోనే వివిధరాష్ట్రీయ శాసనసభలు రైతులకు, భూమిశిస్తులకు సంబంధించిన చట్టములను మార్పుచేయుటకు (Changes in the Tenancy and Taxation laws) సమకట్టినవి. ఇందువల్ల రెవిన్యూపని చాలహెచ్చగుననుటయందు సందేహము లేదు. జిల్లాకలెక్టరు, క్రిందిమ్యాజిస్ట్రేటులు ప్రజలతో కలసిమెలసియుండి వారినుండి భక్తివిశ్వాసములను చూరగొనుటకు వీలులేకున్నది. ముఖ్యముగ రెండధికారములు వీరిచేతియందే యుండుటవల్ల ప్రజలు వీరినై ఖరిని శంకించుట సహజము. జిల్లాయధికారుల వ్యక్తిత్వమును, గౌరవ మర్యాదలను పెంపొందింపవలె నన్న ఈ అడ్డంకును ఎంత సత్వరముగ తొలగించిన అంత మంచిది. ఈ సందర్భమున మరియొక విషయమునుకూడ జ్ఞప్తియం దుంచుకొనవలెను. సివిలుసర్వీసు ఉద్యోగులకు సాధారణముగ శాంతస్వభావము, వివేచన తక్కువ. హైకోర్టుజడ్జీలుగా పనిచేసి ఐ. సి. యస్. ఉద్యోగు లెవరును విశేషప్రఖ్యాతిని గాంచలేదు. ఐ. సి. యస్. ఉద్యోగులు హైకోర్టు ప్రధానన్యాయమూర్తులు కాగూడదని యింతవరకు ఉన్న అడ్డంకును నూతన రాజ్యాంగచట్టము తొలగించినది. ఈ సిఫార్సును న్యాయవాదసంఘము లన్నియు ఏకగ్రీవముగ ఖండించినవి.

ప్రస్తుత రాజ్యాంగముక్రింద బాధ్యతగల మంత్రు లుండుటచే ఎట్టి అన్యాయము జరుగజాలదనియు, ఒకవేళ అట్టిదేమైన జరిగిన ఆ యుద్యోగులు శిక్షాపాత్రు లగుదురనియు రాజగోపాలాచార్యులుగారి వాదము. ప్రస్తుతము రాష్ట్రీయమంత్రులకు జిల్లాఉద్యోగులపై గల అధికార విషయమై భేదాభిప్రాయములు కలవు. ఇట్టి యధికారము నికర మని చెప్ప వీలులేదు. చాలవరకు గౌరవచిహ్నముగ నెంచవలసియున్నది. ఇట్టి పునాదులమీద ఆశా సౌధములను నిర్మించుట ప్రమాదము. తరువాత ఇట్టినేరములను కనిపెట్టి రుజువపరచుట సాధారణమైన పనికాదు. తీగెలాగిన డొంకంతయు కదలునుగాన సివిలు సర్వీసు ఉద్యోగులీసందర్భమున తోడ్పడుదురని తలచుట పొరపాటు. ప్రధానామాత్యులు తమ అభిప్రాయమును ఇటీవల కాలికట్టు, కోయంబత్తూరు ఉపన్యాసములం దిట్లు విశదీకరించిరి: "ఒకప్పుడు సరిగనున్న పద్ధతులు మారవచ్చును. అట్టిపద్ధతులు ఇంగ్లండునందు, తదితర దేశములందు మారినవి. రాజ్యాంగవిధానము మారినపుడు అధికారములు, బాధ్యతలు, పద్ధతులుకూడ వేర్వేరుగ భాగింపబడవలయును. సాధారణముగ రాజ్యాంగపద్ధతులన్నియు సహకారమును పెంపొందించునట్లుగ నుండవలయును. దేశాభ్యుదయ కార్యక్రమమంతయు న్యాయపరిపాలన మొకభాగమై యున్నది. ఇది కార్యనిర్వాహకశాఖపైగల యధికారమునకు ముడిపెట్టబడియున్నది. విభజనవల్ల మనకు చాలనష్టము కల్గును. అభివృద్ధి ఆనాటికానాడు సన్నగిలును. న్యాయశాఖయొక్క స్వతంత్రమును బలపరచువారిలో నేను ముఖ్యుడను. కాని కార్యనిర్వాహక న్యాయశాఖలను రెంటిని విభజించి వేరుగ నుంచజాలము... పౌరుడు, ప్రభుత్వము పరస్పరవిరోధులుకాని వ్యక్తికి ప్రభుత్వమునకు అతీతుడయిన స్వతంత్రుడగు న్యాయమూర్తి యుండవలయుననెడి యభిప్రాయమునం దెంతమాత్రము నిజము లేదు."

("The policies which were right at one time may change and they have changed in every country including England. The distribution of powers, responsibilities and policies also must be different when the systems of Government have changed. From a general point the policies of administration must be co-ordinated. Administration of Justice is a part of the welfare scheme of the whole nation and it is intimately bound with authority over the executive. We shall loose much by such separation and shall be slow in our march forward.

# మధుర దేవాలయము: శిల్పసంపద



౧. మధురమీనాక్షి దేవాలయము : పుష్కరిణి



౨. పరమేశ్వరుని ఉగ్ర, శాంత స్వరూపము



3. నటరాజస్వామి

I am the strongest supporter of the independence of the Judiciary. But you can not have water-tight compartments between administration of affairs and administration of justice... ......The assumption that the individual was the enemy of the state and that state was the enemy of the individual and therefore the Judge should be independent of the state when he decided a problem in the court....... was not true." - Extracts from the speeches of Hon'ble Mr. C. Rajagopalachari at Calicut and Coimbatore)

మొట్టమొదటనే ఇంగ్లండు పేరెత్తిరిగాన అచ్చట ఈ సమస్య యెట్లున్నదో తెలుసుకొనవలసియున్నది. ఇంగ్లండునందు ఉన్నత న్యాయాధికారి (Highest Judicial functionary) యైన లార్డు ఛాన్సలరు ప్రధాన కార్యనిర్వాహకసంఘమగు మంత్రివర్గమందు (Cabinet) కూడ సభ్యులు. ప్రభువులసభ (House of Lords) ఉన్నతన్యాయస్థానమే గాక (Highest Judicial Tribunal) శాసననిర్మాణసభకూడ (Legislative body) అయియున్నది. నిజమునకు లార్డు ఛాన్సలరు, నల్గురైదుగురు న్యాయాధికారముకల్గిన ప్రభువులు (Law Lords) కలసి ఉన్నత న్యాయస్థానముయొక్క పనిని నెరవేర్చెదరు. పైకి మాత్రము ఈ వివిధశాఖలు మిళితమైనట్లు కనుపించినప్పటికి కార్యనిర్వహణము దేశాఖ కాశాఖ కేటాయింపుగనే యుండును. సుమారు రెండువందల నలుబది సంవత్సరములనుండి అనగా ౧౭౦౧ వ సంవత్సరము దనులులోకి వచ్చిన ఖరారుచట్టమునాటినుండి (Act of Settlement of 1701) న్యాయశాఖ సర్వస్వాతంత్ర్యము ననుభవించుచుండుటచేత ఈ వివిధశాఖల కలయికకు ఎంతమాత్రము అవకాశ ముండదు. న్యాయమూర్తులు లార్డు ఛాన్సలరుచేత నియమింపబడినప్పటికి వారి ప్రవర్తన సక్రమముగ నున్నంతకాలము (During good behavior) కదల్చుటకు వీలులేదు. పార్లమెంటునందలి రెండుసభలవారు (House of Lords and House of Commons) కలసి రాజునకు మహజరు పంపి న్యాయమూర్తులను పదభ్రష్టులుగ చేయవచ్చును. ఏదో పెద్ద అన్యాయము జరిగి గందరగోళమైనపుడు తప్ప సాధారణముగ ఇట్లు పదభ్రష్టుల నొనర్చుట సాధ్యముకాదు. ఇందువల్ల అచటి న్యాయశాఖయొక్క ప్రత్యేకత్వము, స్వాతంత్ర్యము తేటతెల్లమగుచున్నది.

రాజగోపాలాచారిగారు చెప్పినట్లు విభజనవల్ల దేశాభ్యుదయమున కనువగు కార్యక్రమ మమలుపరచుటయందు కొంత ఆలస్యమగును. కాని న్యాయపాలనముయొక్క పవిత్రతను, స్వాతంత్ర్యమును రాజ్యాంగ సౌకర్యముల నిమిత్తమై పోగొట్టుకొనకూడదు. న్యాయశాఖ యెల్లప్పుడు కార్యనిర్వాహకశాఖయొక్క కార్యకలాపములను వేయి కన్నులతో చూచుచుండవలెను. లోపము కనబడినవెంటనే దిద్దుబాటు చేయవలసియున్నది. న్యాయశాఖ వేరుగను, స్వతంత్రముగను ఉన్నప్పుడే యిట్లు చేయగల్గును. పౌరుడు, ప్రభుత్వము పరస్పరవిరోధులు కారు కనుక వీరి కతీతుడైన స్వతంత్రుడగు న్యాయాధిపతి అవసరము లేదను వాదము యుక్తియుక్తముగ లేదు. ఈ వాదమును ముఖ్యాంశమును కప్పిపుచ్చుటకై ఉపయోగించినట్లు కనబడుచున్నది. కార్యనిర్వాహకశాఖ ప్రభుత్వమునం దొకయంగముగా నున్నపుడు కార్యనిర్వాహకశాఖయే ప్రభుత్వమని చెప్పుట సాహసము. న్యాయశాఖ, శాసననిర్మాణసభ కూడ ప్రభుత్వమునకు ప్రధానాంగము లైయున్నవి. పౌరునియొక్క హక్కులను సంరక్షించుటయే న్యాయశాఖయొక్క ప్రధానాశయము. కార్యనిర్వాహకశాఖ హద్దుమీరి ప్రవర్తించకుండునట్లు కూడ చూచుచుండవలయును. ఇట్లుజరుగుటకే రెండు శాఖలను విభజించుట అత్యవసరము.

ఇటీవల రెండు మూడు సంవత్సరముల నుండి అమెరికా సంయుక్తరాష్ట్రములందు జరిగిన విషయములు చాలమంది కాశ్చర్యమును కలిగించినవి. అచటి రాజ్యాంగసూత్రముల ప్రకారము న్యాయశాఖ యేర్పాటుగను, సర్వస్వతంత్రముగను ఉన్నది. ఎప్పుడైనను కార్యనిర్వాహకశాఖకు, శాసననిర్మాణసభకు కలయిక యుండును కాని న్యాయశాఖమాత్ర మెప్పుడును వేరుగనే యుండును. ఫెడరల్ జడ్జీలను సెనేటుయొక్క అనుమతి ప్రకారము అధ్యక్షుడు నియమించును. ఇట్టినియమితాధికారము నామకః అధ్యక్షునిచేతియం దున్న మాత్రమున వారిస్వాతంత్ర్యమున కెట్టిహానియు కలుగదు. వారినడవడి సక్రమముగ ఉన్నంతకాలము ఉద్యోగమునం దుందురు. వారిమీద బహిరంగముగ నేరారోపణ చేసిగాని (Impeachment) ఉద్యోగమునుండి తప్పించుటకు వీలులేదు. ఇట్టిది జరుగుట అరుదు కాన వారిప్రత్యేకతను, స్వతంత్రతను గూర్చి వేరుగ చెప్ప నవసరము లేదు.

అమెరికా సంయుక్తరాష్ట్రముల సుప్రీముకోర్టు అధ్యక్షుడైన రూజువెల్టుగారియొక్క నూతనకార్యక్రమ (New Deal) మునకు సంబంధించిన ముఖ్యచట్టము లశాస్త్రీయమని (Unconstitutional) త్రోసిపుచ్చినది. దేశాభ్యుదయమునకై కావింపబడిన శాసనముల నిట్లు త్రోసిపుచ్చుటవలన తీవ్రమగు అసంతృప్తి కల్గినది. కాని రాజ్యాంగసూత్రముల ననుసరించి యేమి చేయుటకును వీలిచ్చినది కాదు. రూజువెల్టుగారు తిరిగి అధ్యక్షులుగా ఎన్నుకొనబడినపిమ్మట న్యాయశాఖయందు ముఖ్యముగ ఫెడరల్ జడ్జీల యుద్యోగము, విశ్రాంతికి సంబంధించిన కొన్నిమార్పులను చేయ సమకట్టిరి. కాని ప్రజాభిప్రాయ మిందుల కెంతమాత్రము ఒప్పుకొనకపోవుటచేత అట్టి ప్రయత్నమును మానుకొనవలసివచ్చినది. అప్పటినుండి యింతవరకు అధ్యక్షునకు సుప్రీముకోర్టునకు భేదాభిప్రాయ మేర్పడలేదు. కార్యనిర్వహణమంతయు సరళముగను, సులువుగను జరిగిపోవుచున్నది. ఇందువల్ల న్యాయశాఖ ప్రత్యేకత్వమును, స్వాతంత్ర్యమును కలిగియుండుట సకల విధముల శ్రేయస్కరమని తెలియుచున్నది.

ఇంతకన్న వివరము లవసరములేనందున ఈ సమస్యపై మనదేశమం దిటీవల ఏర్పడిన ఫెడ

రల్ కోర్టుయొక్క అభిప్రాయమును తెలిసి కొనవచ్చును. ప్రస్తుతము ఫెడరల్ కోర్టు తీరుబాటుగ నున్నది. ఈసమస్యను పరిష్కరించుటకు ఫెడరల్ కోర్టున కధికారము లేదని తలంపరాదు. క్రొత్తఇండియాచట్టము ప్రకారము ఫెడరల్ కోర్టునకు రాజ్యాంగసమస్యల (Constitutional issues) మీద సలహా యిచ్చుఅధికారము (Advisory Jurisdiction) కలదు. ఇదికాక ప్రస్తుత మున్న ఫెడరల్ న్యాయమూర్తులు మువ్వురు, అడ్వకేటు జనరలు ఇందుల కెంతయు తగియున్నారు. ప్రధాన న్యాయమూర్తులైన సర్ మారిస్ గ్వాయరుగారు బ్రిటనునందు మంత్రి వర్గమునకు ప్రధానసలహాదారులు (First parliamentary Counsel to the Treasury) పనిచేసియుండిరి. రెండవజడ్జియగు సర్ షా మహమ్మదు సులేమానుగా రిటీవలవరకు అలహాబాదు హైకోర్టునందు ప్రధాన న్యాయమూర్తులుగ నుండిరి. మూడవ జడ్జియగు ముకుంద రామారావు జయకరుగారు బొంబాయియందే కాక దేశమం దంతటను ప్రఖ్యాతిగన్న సుప్రసిద్ధుడయిన బారిష్టరు. అడ్వకేటు జనరలుగానున్న సర్ బ్రజేంద్ర లాలు మిత్రగా రిటీవరలో కలకత్తా హైకోర్టునందు అడ్వకేటు జనరలుగను కేంద్ర, రాష్ట్రీయ ప్రభుత్వములందు న్యాయశాఖా మంత్రులుగను పనిచేసి అపారమగు అనుభవమును సంపాదించిరి. ఇటువంటి అనుకూలమగు అవకాశమును తప్పక ఉపయోగించుకొనవలెను.

ఇటీవల కలకత్తాయందు జరిగిన అఖిల భారత కాంగ్రెసు కమిటీమీటింగునం దీ సమస్యపై ఒక్కతీర్మానమైనను చేయబడకుండుట శోచనీయము. ఇంతవరకు కాంగ్రెసు కార్య నిర్వాహక సంఘమువారు రాష్ట్రీయ ప్రభుత్వములకు తగుసలహాల నిచ్చి నడపుచు వచ్చిరి. ఇపుడు ఏడురాష్ట్రములు కాంగ్రెసు మంత్రుల యధీనమం దున్నవి. ఈరాష్ట్రములం దీసమస్యను తృప్తికరముగ పరిష్కరించిన మిగత నాల్గు కాంగ్రెసుఇతరరాష్ట్రీయ ప్రభుత్వములు వీటిని తప్పక అనుసరించును. ఇటువంటి ముఖ్యసంస్కరణ నమలులోనికి తీసుకువచ్చుట కిదియే మంచితరుణము. న్యాయశాఖయొక్క పవిత్రతయందును, స్వా తంత్ర్యమందును నమ్మకముకలవా రందరు ఇందుకు తోడ్పడవలసియున్నది. ఇది పార్టీ ప్రశ్న కాక జాతీయసమస్య యనెడి సంగతి అందరును జ్ఞాపక ముంచుకొనవలెను.

---



గ్రామ్యవేషము

—చిత్రకారుడు : దశరథరామయ్య



# బందరు నగర జల ప్రళయము

ఆచంట లక్ష్మీనరసింహము

జలప్రళయమునకు బలియైన బందరుపురవాసుల స్మారకార్థము కట్టిన కట్టడము

౧౮౬౪ సంవత్సరము నవంబరు ౧ తేదీ తెల్లవారెను. నాడు హిందువులకు దీపావళిపండుగయు, క్రైస్తవులకుబుషిదినమును(AllSaints Day) నగుటచే బందరుపౌరులు లాబాలగోపాలమును, రానున్న కీడును లవమాత్రమైన నెరుగక, సంతోషాంబుధి నోలలాడుచుండిరి. నాడు పండుగయగుటవల్లనే గాక వారి యానందమునకు వేరుకారణ ముండెను. క్షీణించియుండిన యా పురాతన పట్టణవర్తక వ్యాపారములు నూతనముగా నిర్మించబడిన బెజవాడ బందరు కాలువద్వారా కొలదిగా సాగి తేరికొనుచుండెను. లాకు నిర్మించబడిన పక్షము దినములలోనే లక్షరూపాయల సరకులు ఎగుమతియై యుండెను.

మరియు నాసమయము ప్రత్యేకించి, పట్టణములోని యాంగ్లేయులకు మరింత యానందమయమైయుండెను. అంతకు ముందువారమే బందరులోని ఇంజనీయరు ఆఫీసు మేనేజరగు స్కాటుగారికిని, బందరుకోట వాస్తవ్యులగు ఓట్‌మన్‌గారి జ్యేష్ఠకుమారికకును వివాహము జరుగుటచే వారందరు నపూర్వమైన యావివాహానందములో నుండిరి. మచిలీవాసులగు క్రైస్తవకుటుంబములును, ముఖ్యముగా నచట ఇరువది సంవత్సరములుగా నెలకొని, విశ్రాంతి నెరుగక సేవయొనర్చుచుండిన నోబిలుదొరగారికినికూడ నాసమయము ఆనందదాయకమై యుండెను. ఏలన, ఆయనచే దీక్ష గైకొనిన యిరువురు దేశీయులు, పెక్కు విఘ్నములు గడచి, క్రైస్తవ మతాచార్యులుగా నియమించబడి, తెలుగుదేశమున క్రైస్తవమతము యొక్క పునాధులు గట్టిపడెను.

గడచిన అక్టోబరుమాసమంతయు, వర్షపు చినుకులేక, ఆకసము వినిర్మలముగా నుండుటచే, వర్షాభావమువలన పైరులు చెడునని రైతులు భయమందుచుండిరి. కాలము సముద్రముమీద విహరించుటకు మిగుల అనుకూలముగానుండుటచే, కలెక్టరుగారియొక్కయు, మెయిడన్ దొరగారియొక్కయు చిరుత బాలికలు సముద్రముమీద వాహ్యాళికి వారమురోజుల కార్యక్రమ మేర్పరచుకొని, ఆరోజున బయలుదేరుటకు వుబలాటపడుచుండిరి. ఆనాడు తెల్లవారినప్పటినుండియు గడచిన దినముల వైఖరిమారి, నిర్మలమైన యాకాశమున చెదరినమబ్బు తునుకలు కాన్పించి వర్షపుతుంపరలు ప్రారంభించెను. బాలికలు బయలుదేరుటకు త్వరపడుచుండిరి. రానున్న యపాయ మేరికిని పొడకట్టలేదు. కాని పోర్టు ఆఫీసునందు సహోద్యోగిగా నున్న మెయిడన్ దొరగారు వాయుప్రసారమును దెలుపుయంత్రము తగ్గుచున్నదని గ్రహించి పిల్లల కులాసయాత్రను ఆప నిశ్చయించెను.

ఈ సంగతి పట్టణములోని యితరబాలికల తల్లిదండ్రులకు చెప్పివచ్చుటకుగాను ఆయనయు, భార్యయు తమ బందరుకోట నివాసమునుండి బండి ఎక్కి బయలుదేరిరి. ఆ కాలమున బందరును, బందరుకోటను కలుపు $1\frac{1}{2}$ మైలు బాటను వరదలనుండి కాపాడుటకు ఇరువైపుల ఎత్తయినగోడలుండెడివి. (ప్రస్తుత మీగోడలు పూర్తిగా కూలి, పునాదులుమాత్రమే కాన్పించుచున్నవి.) బండి యీబాటను నచ్చుచుండెను. కాని ప్రయాణముసాగించుట రానురాను దుర్ఘటమయ్యెను. బండి సమూలముగా ఎగిరిపోవునంతటి ప్రచండవేగముతో వాయువు విసర నారంభించుటచే, సగముదూరమునుండి వారు వెనుకకు మరలిరి. అపాయములేకుండ బండిని నడుపుటకుగాను బండిమనిషిగాక, మరి యిరువురుమనుష్యులు బండిని అదిమిపట్టుకొనవలసివచ్చెను.

అప్పటినుండి క్రమముగా వర్షము హెచ్చి దినమంతయు హోరున కురియుచుండెను. సాయంకాలము ౮ గంటలకు సరకులతో నిండియున్న పడవలన్నిటిని రక్షణకొరకు కష్టముతో లాకులోనికి చేర్చి, లంగరువేసి, యినుపగొలుసులతో బంధించిరి. ఆసమయమున నోబిలుదొరగారు తమ కళాశాలయందు యింటరుక్లాసులో పాఠము చెప్పుచుండిరి. తుపానువేగమును, దానితో నంధకారమును హెచ్చుచుండుట ఆయన గమనించుచునే యుండెను. కాని ౫ గంటలు కొట్టనిది ఆయన తన పాఠమును మానదలచలేదు. ౫ గంటలు వినబడగానే ఆయన పాఠము చాలించి, బాలురను చూచి "గుడ్డలు ఎత్తిపట్టుకొని, వీలైనంత త్వరగా యిండ్లు చేరు" డని పంపివేసెను. తుపాను ప్రచండముగా సాగజొచ్చెను. దారిపొడుగునను వృక్షములు ఊగిసలాడుచు, నేల కొరుగసాగెను. ఇండ్ల పైకప్పులనుండి పెంకులు పేకముక్కలవలె ఎగిరిపడుచుండెను. ఈ సమయముననే అతి పురాతనమును, శతాబ్దముక్రిందట డ్రేపరదొర కూర్చుండెడి పవిత్రనివాసమును నగు "ఎలైజా" వృక్షము నేలగూలెను.

సాయంకాలము ౬ గంటలయ్యెను. అప్పటికే తుపాను భీషణరూపము దాల్చుటచే, లైట్‌హౌసునందు దీపము వెలిగించు టసంభవమయ్యెను. మరికొంతసేపటిలో నా దీపస్తంభమే ఎగిరిపోవునని ఎల్లరును భయపడసాగిరి. నోబిలు కళాశాలయందు తలుపులు మూయుటకుగాని, దీపములు వెలిగించుటకుగాని సాధ్యముకాలేదు. పైకప్పుమీది పెంకులెగిరిపోవుటచే వర్షము సంతతధారగా పడుచుండెను. ప్రధానాచార్యుడను నోబిలుగారు తలకొక తువ్వాలును చుట్టికొని, చాలసేపు కుర్చీపై నిలుచుండి చుట్టునుగల బాలురతో "ఇరువది సంవత్సరములనాడు మే మనుభవించిన తుపానుకంటె నిది చాలతక్కువ" యని ధైర్యము చెప్పుచుండెను. ఒకరివెంబడి నొకరుగా సేవకులెల్లరును వచ్చి తమ స్థానముల నిలువలేకున్నామని. యాయన చుట్టును జేరుచుండిరి. ఇంతలో గుఱ్ఱపుపనివాడు పరుగెత్తుకొనివచ్చి సాల కూలినదనియు, గుఱ్ఱము కట్లు త్రెంచికొని పరుగెత్తినదనియుచెప్పెను. తమ యిల్లు కూలినదని వంటమనిషియు, నాతని కుటుంబమును వచ్చి, స్నాన పుగదిలో ప్రవేశించిరి.

రాత్రి ౧౦ గంటలకు సుడిగాలి నిలిచిపోయి, దారుణవేగముతో సముద్రజలము భూమిమీదికి పొంగ నారంభించెను. ఆ ప్రళయజలమునకు నూతనముగా నిర్మించబడిన లాకుతలుపులును, లాకులను గాపాడుచున్న నలుగురు లష్కరులును తొలియాహుతియైరి. అదృష్టవంతుడను మరొకలష్కరు దైవవశమున చేజిక్కిన యొక త్రాటిచెట్టు నంటిపెట్టుకొని, ప్రవాహమువెంబడి పదునాలుగు మైళ్లు కొట్టుకొనిపోయి, యచటనుండి యీవలకువచ్చి జీవించెను. అటులనే మరొక యదృష్టశాలియగు వృద్ధుడు పీటరునొర (ఏలూరు క్రైస్తవమిషనరీ. వృత్తిని చాలించి బందరులో ప్రశాంతజీవనము గడపుచున్నవారు) ప్రవాహమునందు జిక్కుకొని, తన ముందు తేలుచున్న యొక బండిచక్రమునుబట్టుకొని, దానిసాయమున నొకయింటి పైకప్పుపై నెక్కి ప్రాణములను గాపాడుకొనెను. ఈ సమయముననే బందరుకోటకును, సముద్రమునకును మధ్య కాపురమున్న ౨౦౦ మంది పల్లెవారు, స్త్రీ పురుష శిశువులు, ఆ సంక్షుభిత మహార్ణవమునకు ఎరయైరి. వారి జనపదము గుర్తింపరాకుండ రూపుమాసిపోయెను. పిమ్మట నా మహాప్రవాహము, నిర్నిరోధవేగమున, సముద్రమునకు ౫ మైళ్లదూరమునగల బందరుకోటను ముట్టడించెను.

సముద్రమునకై పుగల, పురాతనమైన ఫ్రెంచికోటగోడలు నూతనముగా నిర్మించబడిన లాకుకొరకు పడగొట్టబడనిచో బందరు కోట గ్రామమునకు కొంతరక్షణ యుండెడిదే. కాని యిప్పు డేమియు నడ్డులేకపోవుటచే ప్రవాహము మహావేగముతో ముందునకు సాగెను. ఒకటొకటిగా కమీషన్ గిడ్డంగులు, ఫ్రూవెల్, మెయిడన్‌దొరల కంపెనీ కొట్లు, మేజరుజాక్సనుగారి పెద్దయిల్లు పెద్దపెట్టున నేలగూలెను. కోటలోని ఫ్రెంచివారి కాలమునుండియు సాగుచున్న పురాతన రోమన్ కాథలిక్ చర్చి యొక్క నలువైపుల గోడలు పూర్తిగా పడిపోయెను. ప్రార్థనజరుపువేదికపై భాగమున, ఇటుకలతో నిర్మించబడిన వలయాకారముగల గోడమాత్రము నిలచెను. అందలియర్చకు లిరువురు నాగోడపై నెక్కి ప్రాణముల నరచేతిలో నుంచుకొని, రాత్రియంతయు నేకార్ణవముగా నున్న నలుదెసలను వీక్షించుచు గడిపిరి. కాని యిదేసమయమున ఇంగ్లీషుచర్చి యాచార్యుడగు గిబ్బన్‌గారి యనుభవము వేరుగా నుండెను. ఆయన పట్టణమునందు చుట్టును ఎత్తయినప్రాకారముగల యొకసుదృఢమైన డచ్చిబంగాళాయందు నివసించుచుండెను. ప్రళయభయానకమైన యారాత్రియందు, మదిలీ వాస్తవ్యులలో ఆయనయొక్కడు మాత్రమే కలతలేని నిద్దురలో తెల్లవారువరకు గడపెను.

ఈసమయమున మెయిడన్ దొరగారును ఆయనకుటుంబమును బందరుకోటలో నివసించుచుండిరి. అచటి వారికాపురమున్న యిల్లు మరమ్మతులో నుండుటచే వ్యాపారము చేయు భవనమునందే తాత్కాలికముగా నుండిరి. అది పైయంతస్థుగల యొకసువిశాల భవనము. ౧౭ వ శతాబ్దమున డచ్చికమాండరన్ చీఫ్‌కొరకు నిర్మించబడినదని చెప్పుదురు. భవనమంతయు నొక పెద్దనావయొక్క ... దేలినకలపతో నిర్మించబడి యుండెను. ... మునకు చుట్టును ౧౧ అడుగుల ఎత్తుగల ... కారముండెను. భవనము అడుగుభాగ... తయు ఎగుమతికొరకు చేర్చబడిన దూ... ళ్లతో నిండియుండెను. ఈకారణముల ... జలప్రళయమున కీభవనము ఆహుతి కాలే... పైకప్పుమాత్రము సాయంకాలమే ఎగి... రెను. కుటుంబమంతయు భవనముదిగువ... గమున తలదాచుకొనియుండిరి.

రాత్రి సుమారు ౧౦ గంటలప్పుడు ... స్మికముగా నొక పెద్దధ్వనియు, మరి కొం... సేపటిలోనే ప్రవాహము త్రోసుకొని వచ్చు... చున్నట్లు కెరటముల ధ్వనియు వినవచ్చె... సముద్రము పొంగివచ్చి పడుచున్నదనియు, నీటిని రుచిచూడగా ఉప్పగా నుండెననియు, సేవకు లెల్లరును భయభ్రాంత చేతస్కు... పరువిడివచ్చి మెయిడన్‌గారి కెరింగించి... పశువులన్నియు, ప్రవాహము నీదుకొను... వచ్చి, భవనములోపల బ్రవేశించెను. ... ములచే గొట్టబడి పెద్దగూబోతు ఇతి... పశువులతోగలసి, వసారాలోనికి చేరుకొనె... ఇదంతయుజూచి కుటుంబమువా రందరు... సేవకులును ఆత్రముతో మేడమీది కెక్కి... ప్రవాహము క్రమక్రమముగా ఎత్తగుచుం... యు, కెరటములమీద కుప్పలు తెప్పలు... భాస్వరపు మంటలను వారు కన్నార గా... చిరి. సేవకులతో గలసి వారు మొత్త... పాతికమంది యుండిరి. ఆగందరగోళము... మెయిడన్‌గారి కుమార్తె ధరించిన దుస్తు... (ఎట్లుపోయెనో) కొట్టుకొనిపోయెను. మెయి... డన్‌గారు తన ఫ్లానలు వస్త్ర నామెకు ... గిరి. ఆమె యావస్త్రతోనే 3 రోజులు ... పెను. వారి భోజనశాలయు, కచ్చేరి ... డియు పై యంతస్థులోనే యుండెను. ... దరును చేరిన వంటగదిలోనికి ప్రవేశి... ప్రవాహజలము కాలికి దగులుటచే, ... నుండి తొందరగా కచేరిసావడిలోనికి ... టకు ప్రయత్నించిరి. కాని వాయు ... వలన తలుపులు బిగుసుకొనిపోయి ... సాధ్యము గాకపోవుటచే ... నిలబడిపోయిరి. కొందరు ...

బల్లక్రింద తల దాచుకొనిరి. ఇంతలో గళ్ళిలుమను పెద్దధ్వనితో వీరు పోదలచిన గది నేలబడిపోయెను. దానితోబాటు వీరు దాగిన గదియొక్క అడుగుభాగము కొంతగూడ కూలిపోయెను. ఒక్కపడకగది తక్క మిగిలిన పడకగదులన్నియు నేలమట్టమైపోయెను. ఇంతలో మెట్లవరుసనుండి యొక పరిచారకుని కుమారుడు తనకుటుంబమంతయు వెల్లువపాలైనట్లును, తాను వరాండావద్దకు కొట్టుకొనివచ్చితిననియు నరవగా, మెయిసన్‌గా రతనిని రక్షించిరి.

అర్ధరాత్రమున తిరిగి రెండవసారి మరొక వెల్లువ కొట్టుకొనివచ్చెను. హతశేషులైన జాలరులు, ఈ రెండవ ప్రవాహము వచ్చుటకు ముందు సముద్రమధ్యమున సుడియుచున్న యగ్నిని చూచితిమని తెలుపుటచే, నది యగ్నిపర్వతసంబంధమని తలంచబడెను. మరి రెండుగంటల యనంతరము విలయతాండవముసల్పిన ప్రళయజలము సముద్రమువంకకు మరలుచున్న భయంకరధ్వని వినవచ్చెను. అంతట క్రమముగా గాలియు, ప్రవాహము తగ్గి, నెమ్మదిగా తెల్లవారి, వెలుతురు వచ్చెను.

మెయిసన్‌గారి యింటిప్రక్కనే సేనకు భోజనపదార్థములను సరఫరాచేయు సార్జంటుగారి యిల్లుండెను. తెల్లవారి చూచుసరికి ఆ గృహము పాడుపడియుండెను. వెలుతురు రాగానే ఆ గృహశిథిలములనుండి సార్జంటును, ఆయనభార్య, కుమారుడును వెలువడి వచ్చి మెయిసన్ కుటుంబముతో గలసికొనిరి. వారి మరొక కుమారుడు నాటి ప్రళయమునకు బలియైయుండెను. మెయిసన్‌గారి భవనమునకు రెండవవైపున బంగాళాలో మెయిసన్‌గారి సోదరుడు నివసించుచుండెను. ఆ బంగాళా పూర్తిగా కూలి, దౌర్భాగ్యులగు నాయన సతియు, నలుగురు బిడ్డలును మరణించిరి. జీవితశేషముండుటచే కాబోలు మెయిసన్‌గారి సోదరుడు మాత్ర మొకచెట్టుకొనకు జిక్కి బ్రతికెను. వారి బంగాళా శిథిలములను త్రవ్వగా నందుండి వారితో కాపురమున్న రాజమండ్రి వాస్తవ్యులగు మేజరు బెయిలరుగారి కుమారుడు బెయిలరుగారు, శరీరములోని ఎముకలన్నియు చిదుగగొట్టబడి కొన యూపిరితో బయలుపడెను. పాప మాయనకు నిశ్చయించబడిన వధువు రూత్‌కన్యయు, ఆమె మేనత్త వెబ్‌సతియు నాయనకు రెండుమాసములు పరిచర్యచేసిరి గాని యాతడు జీవించలేదు. (రూత్‌కన్య పిమ్మట బెయిలరుగారియన్నను పెండ్లాడెను.) ఓటుమన్‌గారి కుటుంబమును, పైన తెలుపబడిన స్త్రీలిరువురును మరొక పురాతన ఫ్రెంచి కట్టడమునందు సురక్షితులైరి. నాటిరాత్రి ప్రళయమునకు బందరు కోటయందు మిగిలినవి మెయిసన్‌గారి యొక్కయు, ఓటుమన్‌గారి యొక్కయు భవనములు రెండు మాత్రమే.

అచటికి సమీపముననే మేజరు బ్యాంక్సు గారి తల్లి, జేమ్సుసతి యుండెను. ఆమె మిగుల సచ్ఛీల. ఎల్లప్పుడును, అంత్యకాలమున తాను ఇతరుల కెంతమాత్రమును శ్రమ కలిగించకుండునట్లు భగవంతు డనుగ్రహించవలెనని ప్రార్థించెడిది. ఆమె కోరిక సరిగా నెరవేరెను. మరునాటి యుదయము చూచుసరికి, వారి యింటికప్పు ఎగిరిపోయియుండెను. ఆ వృద్ధురాలు చేతిలో ఇంటితాళముల సత్తిని పట్టుకొని, కుర్చీలో కూర్చుండి, మరణించియుండెను. ముగ్గురు మనుమలును, సేవకులును ఆమె పాదములకడ చచ్చిపడియుండిరి. ఆదృశ్యము మిగుల కరుణముగానుండెను. పాపము, కొంతభాగము పైకప్పు విరిగి మీద బడుటచే, వారంద రీవిధమున మరణించిరి. వారి శవములు దొరకిన పెట్టెలలో నుంచబడి, యొకచోటనే ఖననము చేయబడెను.

కాతలిక్ చర్చికి సమీపముననే ఫ్రూవెల్ గారు, ఆయనభార్య, యిరువురు కుమారులు, వితంతుకుమార్తె, అమాయకులైన యామె అయిదుగురు కుమారులును నివసించుచుండిరి. ఫ్రూవెల్‌గారు, తనకుమార్తె మరణించునెడల వెర్రివారగు నామెబిడ్డలను ఇతరులు పోషించరనియు, కావున వారందరను ఒకసారి మరణించుట తనకోరికయనియు మిత్రులతో ననుచుండువాడు. ఆయన వాంఛితముకూడ సిద్ధించెను. ప్రవాహవేగమున కొట్టుకొని వచ్చిన లాకుతలుపు ఒకటి వారి 'యింటికప్పును ఢీకొలునదాకి కూలద్రోచెను. పన్నెండుసురు గల యా కుటుంబమున తమ విషాదగాథను ప్రపంచమునకు తెలుపుటకు ఒక్కడును మిగులలేదు. మరికొంతకాలమునకు ఆస్థలము నందే ఫ్రూవెల్‌గారి సోదరుడు ఆకుటుంబము యొక్కయు, నాటి ప్రళయమునకు బలియైన ముప్పదివేల బందరు పురవాసులయు స్మారకార్థ మొక చిన్నకట్టడమును, అందొక శిలయు స్థాపించెను. (ఆస్మారక శిలయొక్క చిత్రపట మీసంచికయందు మొదట ప్రచురించ బడినది.)

జాక్సనుగారను నొక ఆంగ్లేయుడును, ఆయన కుటుంబమును బందరుకోటయందొక బంగాళాలో కాపురముండిరి. ఆబంగాళాపైకప్పునకు లోన పెంకులును, పైన సున్నపుపూతయు నుండెను. మరునాటి యుదయము హతశేషులు నాశనమైన యా బంగాళావద్దకు వచ్చి "పాపము జాక్సనుగారు మరణించినాడుగదా" యనుకొనుచుండగానే, జాక్సనుగారును, ఆయన ౫నురు సేవకులును నిరపాయముగా, నా శిథిలములనుండి యావలకు వచ్చిరి. వా రెట్లు తప్పించుకొనగలిగిరో పరమేశ్వరునకే ఎరుక. ౪ రోజుల యనంతరము మందుసండుకొట్టువద్ద, తిరుగబడియున్న యొక పెద్దపడవలోనుండి ధ్వని వినబడుటచే అందలియొక్క కొయ్యను కోయగా నందుండి ౨౧ మంది మనుష్యులు శవాకారములతో బయటికి ప్రాకివచ్చిరి.

నాటిరాత్రి సంఘమరణము పాలైన ౩౦,౦౦౦ ల జనాభాలో చాల కొలదిమందికి మాత్రమే దహనాదికములు జరిగెను. గవర్నమెంటు హాస్పిటలంతయు మరణించిన, మరణించనున్న జనుల వికృత కళేబరములతో నిండిపోయెను. శవముల నడుమ, మరణించెనని పరుండబెట్టిన యొకబాలుడు, డాక్టర్లు ప్రయోజనము లేదని చెప్పినను వినక కొందరు ధర్మాత్ములు ఉపచారములుచేయుటచే బ్రతికి, మద్రాసులోని యనాథశరణాలయమునకు జేర్చబడెను. అతి

డు మరణించెనని తలచిన విగతభర్తృకయైన
వానితల్లి, తన ఏకమాత్రపుత్రుడు గతించెనని,
ఆశలన్నియు చెడి పిచ్చియైపోయెను. బం
దరు బెజవాడ కాలువలోని నీరంతయు
ప్రవాహముతో బాటు సముద్రములోనికి
బోయి ఖాళీయయ్యెను. సామానులతోనిండి,
యినుపగొలుసులతో లాకులలో భద్రముచే
యబడిన పడవయొక్కటియు కాన్పించ
లేదు. కాలువమార్గ మంతయు మరణించిన
స్త్రీ పురుషుల శవములతో చపటాచేయబడి
నట్లు నిండియుండెను. గవర్నమెంటు ఆసు
పత్రి యావంతయు చెక్కుచెదర లేదు. తిరిగి
ఎన్నడును వాడుక కుపయోగించకపోయినను
బందరుకోటలోని యింగ్లీషుచర్చికూడ చెడ
లేదు. సంవత్సరముల యనంతర మచటి
యిటుకలన్నియు, పట్టణమునందు నూతన
ముగా నిర్మించబడిన సెయింటు ఆంథ్రూసు
చర్చికి వాడబడెను. (ప్రస్తుతే మా పూర్వస్థల
మున, చుట్టును చిన్నప్రాకారమును, ఘంట
స్తంభమును మాత్రమే యున్నవి.) బందరుకో
టయందు యింతకుముందు పేర్కొనబడిన
పురాతనములైన కట్టడములు తప్ప మిగతయిం
డ్లన్నియు కూలినవే. ఒక్కయింటి శిథిలముల
నుండి ౭౦ శవములు బయటపడెననిన, నచటి
మరణము లెంతహెచ్చుగానుండెనో యూ
హించుకొనవచ్చును.

సముద్రము యథాస్థితికి వచ్చిన కొన్నిరో
జులవరకును కూడ బందరుకోట మిగత ప్రపం
చముతో విడివడియే యుండెను. పట్టణమున
కును, బందరుకోటకును గలమార్గము పూర్తిగా
బాగుపడునప్పటికి ఆరు మాసములు పట్టెను.
ఎల్లెడలను బ్రతికినవారికంటె మరణించిన
వారిసంఖ్య మిగులహెచ్చుగానుండుటచే దహ
నాదికములు జరుపుట మిగుల కష్టమయ్యెను.
అసంఖ్యాకములుగా నున్న శవములను త్వరలో
తొలగించనిచో, నవి కుళ్లి దుర్గంధమువలన
నంటురోగములు ప్రబలునను భయము హెచ్చు
టచే, కాన్పించిన స్త్రీపురుష శిశుశవములను,
ఆవులు, ఎద్దులు, గాడిదలు, కుక్కలు,
పిల్లులు మొదలగు జంతుకళేబరములను హతశే
షులు విచక్షణలేకుండ సిపాయులు కవాతు
చేయు ప్రదేశమునగల ౨ పెద్దనూతులలోనికి
త్రోసివేసిరి. అంత్యసంస్కారములు జరుగ
కుండ సముద్రములోను, ఇతరత్రాను త్రోసి
వేయబడిన కళేబరములతో పోల్చిచూచు
నెడల పైబావులయందు త్రోయబడినవారి
సంఖ్య యత్యల్పము.

బందరుకోటకు పట్టణములో మొదటిసారి
వార్త దీర్ఘకాయుడును ధైర్యశాలియు నగు
ఓట్సుమన్‌గారి ద్వారా దెలియవచ్చెను.
నూతనముగా వారమురోజుల క్రిందటనే
వివాహమైన తనకూతురును, అల్లుడును ఏమైరో
తెలిసికొనవలెనను ఆత్రముతో నాయన ప్రా
ణములకు దెగించి బందరునకును బందరుకోట
కును నడుమగల జలమయమై, శవములతో
నిండియున్న బాటను ఈదుకొని వచ్చెను.
పాపము! ఆయన వెదుకవచ్చిన నూతనదంపతుల
గాథ యతివిషాదకరమైనది. బహుశః ఈ
యుదంతము ఆరాత్రి సంఘటనములన్ని
టిలోను పరమదారుణమని చెప్పవచ్చును.
ప్రణయబద్ధులైన యా నూతనవధూవరులు
సముద్రమునకు ౪ మైళ్లదూరమున దృఢ
ముగా నిర్మించబడిన యొకచక్కని బంగా
ళాయందు కాపురముండిరి. ఆయింటిచుట్టును
తాటితోపును, వెలుపల ప్రాకారము నుండెను.
సముద్రపుటలలు హెచ్చుగా భూమిలోనికి
చొరుచుకొని వచ్చినసమయమున ఏదేశపుదో,
ఎక్కడనుండివచ్చినదో తెలియని యొకపెద్ద
యోడ సముద్రమునుండి భూమిమీదికి కొట్టు
కొనివచ్చెను. (పిమ్మట నాయోడ నిర్మించబ
డినకలపనుబట్టి చూడగా నదియుత్తరయమెరి
కాయందు తయారైనట్లు తెలియవచ్చెను)
ఏఖండమునకోచెంది ప్రయాణీకులుగాని, నడు
పువాడుగాని కానరాని, మృత్యుమాతనుబోలి
న యీ యోడ ప్రస్తుత రైలులైనును, నోబిలు
హైస్కూలు, షార్కీగరల్సు స్కూలునుగల
ప్రదేశమునకు త్రోసికొనివచ్చి, తిన్నగా
స్కాట్సు దంపతుల నివాసమును తకాలున
దాకి, అర్ధనిముసములో నందలి నివాసులంద
రిని మృత్యులోకమున కంపి మరికొంత
దూరము సాగి, యచటి తాటితోపులో నిల
బడిపోయెను.

పట్టణములోని యిండ్లలో మొదటి తాకిడి
మిషనరీల భవనములకే తగిలెను. వెలువను
గాంచి, మొదట వారు వర్షపునీరని భ్రమించ
నోబిలుగారి స్నానపుగదిలో తలదాచుకొ
యొకబాలుడు నీటిని రుచిచూచి "అహో!
ఉప్పగా నున్నది! సముద్రపు నీరో" యని
చెను. తటాలున నోబిలుగారు తలుపు
చూడగా, భాస్వరపుమంటలతో
సముద్రపుకెరటములు దొర్లుకొని వచ్చు
డెను. ఆయన తిరిగి తలుపులుమూసి
వచ్చుట దుర్ఘటమయ్యెను. ప్రవాహము
ముగా ఎత్తగుచుండుట గాంచి దొర
తనతోనుండిన బాలురను రక్షించుట
కాత్రపడజొచ్చెను. వరాండాలోనున్న
నను లోనికి గొనివచ్చి, దానిని పైనగల
బాసు ఆనించి ముందు తాను పైకెక్కి
దరిని పైకి అందుకొని రక్షించ నిశ్చయ
చెను. కాని వరాండాలోనికి ప్రవాహ
ప్రవేశించియుండుటచే ఎవ్వరును
కొరకు పోయివచ్చుటకు సాహసించ
పోయిరి. ప్రాణములకు తెగించి నోబిలుగా
యాపనికి పూనుకొని ప్రవాహమును త్రో
కొని ముందునకు సాగుచుండెను కాని
క్రమముగా సందెలలోతు మించుటచే
నిచ్చెనకొరకు బ్రయత్నించి లాభములే
యాయన యతికష్టముమీద తిరిగి
వచ్చెను.

అటుపిమ్మట నీసమయమునుగురించి
దలి యొక బాలుడు "ఆ నిముసమున
మృత్యువును ముఖాముఖి నెదుర్కొంటి
పలికియుండెను. ఉత్తముడగు నోబిలుగా
ఇంటికప్పు మీద గూలి నీటిపాలను
దుర్మరణము తనకును తన సహచరులకు
తప్పిన బాగుండునని తలపోసెను. ఆయన
తరపునను, తన మిత్రుల తరపునను కడ
ప్రార్థనల నొనర్చెను. అచటనున్న ప్రతి
తోను కరస్పర్శన మాచరించి వారి భావ
నన్నిటిని క్రైస్తవైపునకు మరలించ
ననియు, అంత్యనిమిషము సమీపించుచు
టచే నిబ్బరముగా నుండవలెననియు నా
వారికి బోధించెను. కడపట నాయన
కైనను సముద్రమును మరలించుట ప్ర
నకు అసాధ్యముకాదు. కాన విశ్వాస
విడువకు" మనెను. ఎల్లరును కొలదినేపు

ఞ్ఞముగా నుండిరి. ఇంతలో నాకస్మికముగా నొకరు సముద్రపుపోటు తగ్గుచున్నదని యర చిరి. వాస్తవముగా చూడ నటులే జరుగు చుండెను. నోబిలుగారు ఆనందముతో "బిడ్డ లారా! రేపు మీకు పూర్తిగా సెలవిత్తు"నని యరచెను. కాని పట్టణ మంతయు పాడు వడుటచేత నాయన చెప్పిన ప్రకారము మరు నాడేగాక మరిపెక్కురోజులు సెలవీయ బడెను. ఆరాత్రి భయానకదృశ్యమును గాం చుటవలని శ్రమవలన నోబిలుగారి యారో గ్యము చెడ నారంభించి మరికోల్కొనలేదు. ఆ సంవత్సరాంతములోనే ఆయన మరణిం చెను.

నోబిలుగారి బంగాళాప్రక్కనే పార్కి బాలికాపాఠశాల యుండెను. నవంబరు ౧ తేదీని అందు ౬౬ గురు బాలిక లుండిరి. మరునాటి యుదయ మగుసరికి ౩౩ గురు మాత్రమే మిగిలిరి. అందలి బాలికలకు ఇంగ్లాండు నుండియు, ఇతరదేశములనుండియు ధర్మబుద్ధిగల పెక్కు రుస్త్రీలు సహాయమొనర్చుచుండుటచే విషాద మరణ మొందిన బాలికలకొరకు చాలమంది ప్రపంచవాసులు సంతాపమును వెల్లడించిరి. మరణించిన బాలికలందరును పరుండిన గది ప్రవాహముచే నిముసములో నాక్రమించబడి మునిగిపోయెను. వారిలోనుండి తప్పించు కొన్న యొక పరమ అదృష్టశాలియగు బాలిక తాను ఒక కొయ్యపెట్టె సహాయమున భవ నము చివరభాగమున కెక్కి బ్రతికితి నని చెప్పెను.ఆమె మిగుల దీర్ఘకాలము జీవించెను.

పార్కిస్కూలునకు ప్రక్కనే డాక్టరు హోవెల్ గారి భవన ముండెను. పాఠశాలబా లిక యొకతె ప్రవాహవేగమున వారి వసా రాలోనికి గొట్టుకొనివచ్చెను. అలలవేగమున నామె శరీరము గోడలకు తగిలినప్పుడెల్ల కలి గిన శబ్దమును, ఆమె యాక్రందనమును డాక్ట రుగారికి వినవచ్చుచుండెను. హోవెలుగారు బయటకువచ్చి, యామెను రక్షించవలెనని పెక్కుసారులు ప్రయత్నించెను. కాని ప్ర యోజనము లేకపోయెను. క్రమముగా నాబా లిక రోదనము సన్నగిల్లి, యాగిపోయెను.

తెల్లవారి తలుపులు తెరచిచూచుసరికి నలగ గొట్టబడిన యామె కళేబరము ద్వారము చెంత బడియుండెను. మరి పెక్కుగు బాలి కల శవములు జైలువద్దను, మార్కెటువద్దను కానిపించెను.

ప్రవాహము చాలసేపు జైలును ముట్టడిం చెను. డజన్లకొలది శవములు కొట్టుకొనివచ్చి చుట్టును జేరెను. కాని జైలుగోడలు పెక్కు చెదరకపోవుటచే ఖైదీ లెవరికిని అపాయము కలుగలేదు. చుట్టుప్రక్కల గల పోలీసు, సిపాయిలైనులన్నియు మూలమట్టుగ తుడిచి పెట్టుకొనిపోయెను. మొదటిలైనులో కాపు రమున్నవారు ౨౭౫ మందియు, రెండవలైను లోనివారు ౩౫౬ మందియు మరణించిరి. నాటినుండియు ప్రభుత్వమువారీ పట్టణమున సిపాయిల నుంచుట మానివేసిరి.

వరదలు హెచ్చుగా పట్టణమును ముట్ట డించిన సమయమున పోలీసుగార్డులు నియ మితులై కలక్టరుకచ్చేరీని, ఖజానాను కావలి గాయుచుండిరి. ప్రేమపాశములను ద్రెంచు కొని, సర్వబంధువులయందును, ప్రియములైన యిల్లువాకిళ్లయందును మమకారము విడిచి, స్వధర్మనిర్వహణమునందు అచంచలులై నిలు వబడియున్న యాధీరబృందము నెదుర్కొన మృత్యువు సైతము సాహసించలేక పోయెను. చుట్టుప్రక్కల మరణించిన జనులయొక్కయు గొడ్డుగోదల యొక్కయు మృతకళేబర ములు వారిచుట్టు ప్రక్కలకు కుప్పతెప్పలుగా వచ్చిపడుచున్నను అందొక్కడును భయ విహ్వలుడై తనవిధ్యుక్తమును విడచి పరువెత్త లేదు. ప్రవాహమంతకంతకును హెచ్చి ట్రెజ రీలో బ్రవేశించి యుద్వేగములో కొన్నిపె ట్టెలను పగులగొట్టి తేలనైచుకొని పోబో యెను. కాని యుక్కుతునకలవంటి యాతె నుగుజోదులు ప్రాణములపై నాశవీడి ప్రవా హముతో బోరాడి ట్రెజరీని గాపాడిరి. మనుజునియొక్క సర్వశక్తులకును నగ్నిపరీక్ష యనదగిన యాసమయమున నపారధైర్యసా హసములను, నిశ్చలకార్యదీక్షను గన్పరచిన యీయాంధ్రవీరులగాథ మచిలీపట్టణ చారిత్ర మున సువర్ణాక్షరములతో లిఖించబడినది.

ఆంధ్రులు కార్యశూరులు గారనునింద మోపు నజ్ఞాను లీయుదంతమును గాంచి తలలు వాల్చ దగును. ఆసమయమున సరిగా నిట్టివి గాకు న్నను తెలుగుజాతి సాహసౌదార్యములను బ్రదర్శించు పెక్కుకార్యములు జరిగినవి. త్వరలోనే యీరపుఖండ చరిత్రను తారు మారొనర్చిన బందరువాసులగు ఇరువురు చిరుతడోలుబాలుర వీరగాథను వెలివరచ గలను. (వీరెవ్వరైనదియు తెలియలేదు.)

ఆ వీరభటబృందములోని యొకడుమాత్ర మే మరునాడు మరణించెను. మరునాటి యుదయమున వరదలు తగ్గి మూవురు బిడ్డలను, అత్తగారిని గోల్పోయిన కలక్టరుగారు తీ దుకొని వచ్చి ట్రెజరీని చూచుసరికి భటులం దరును ఎవరిస్థానముల వారు నిలబడి ఏమియు జరుగనట్లుగానే తమవిధిని నిర్వర్తించుచుండు టను గాంచి నిర్విణ్ణులైయ్యెను. అనశ్వరమును, శాశ్వతమును నగు నీకార్య మొనర్చి కీర్తిగడిం చిన యాదళమువారు పెక్కుసహాయకార్య ములొనర్చి ధన్యులైరి. ప్రవాహవేగము ౧౭ మైళ్ల భూభాగము దూరముగల గుడివాడవరకు లోనికి చొరుచుకొనిపోయి, దారిపొడుగునను గలసర్వమును నాశన మొనర్చెను. రాత్రి ౨ గం టల పైనుండి ప్రవాహము వెనుకకు దిరిగెను. కాని తిరిగిపోవునప్పుడు సైతము ప్రవాహము నాశనమే గావించెను. సముద్రతీరమున నిలువబడి వెనుకకుమరలు చిన్ని కెరటములు సైత మెంత యావేగముతో ఇసుకను, నత్త గుల్లలను దొరలించికొని పోవునో గమనించిన వారికి ౧౭ మైళ్ల భూభాగము నాక్రమించి, సకల భవన, వృక్ష, సస్య, జీవ నాశనము గావించిన యామహా క్రుద్ధప్రళయ జలరాశి ఎంత యనర్థ మొనర్చియుండెనో కొంతవర కైన గ్రహించగలరు. ఈ తిరుగుప్రవాహము నాశనమును పూర్తిగావించెను. తొలి ప్రవా హమునకు పట్టువదలి, యూగిసలాడు పెక్కు భవనము లీదెబ్బతో నేలమట్టము లయ్యెను. ఈ ప్రవాహమే ౩ శవములను దెచ్చి ఆంగ్లేయ చర్చి యాచార్యుని గృహమునకు చేర్చెను గాని యప్పటికిని ఆయన సుఖసుషుప్తినుండి మేల్కొనలేదు. ఈప్రవాహములోనే పార్కి స్కూలుబాలికల శవములు జైలునకు గొట్టు

కొనివచ్చి, యచటి ముండ్ల డొంకలలో చిక్కుకొనిపోయెను. ఈ ప్రవాహములోనే, పాపము, శ్రీమతి స్కాట్సునతి శవము కొట్టుకొనిపోయినది. అతి మనోజ్ఞములైన యామె శిరోజను లొకవృక్షపు కొమ్మలకు పెనగొని వ్రేలాడుచుండెను. ఆమెను ఖననమునకు తీసికొని పోవలసినప్పుడు శిరోజములను కత్తిరించవలసి వచ్చెను. ఆమె భర్తశవము ఆవల 3 మైళ్ల దూరమున గాన్పించెను. ఈతిరుసు ప్రవాహములోనే వందలకొలది శవములు సముద్రమునకు తరలిపోయెను. నూతనములను పెక్కు సమాధులు పగిలి, శవములు వెలికి వచ్చెను.

పెక్కు కళేబరములు బురదయందు చిక్కి ౧,౨ సంవత్సరముల యనంతరము కాన్పించినను, వికృతములుకాక సహజస్థితిలానేయుండు టాశ్చర్యము గలిగించెను. కాని యదేమి చిత్రమోగాని, ప్రవాహము తగ్గిన తోడనే కాన్పించినను, సిల్కు, వులెను, నూలువస్త్రములు అగ్నిదగ్ధములైనట్లు ముట్టుకొనగానే పేలికలై పోయెను.

పట్టణమున నొకవృద్ధకాయురాలను సిపాయిభార్య వుండెను. తిరుగు ప్రవాహమున పాప మామెయు, నామె కంటిపెట్టుకొన్న మూవురుబిడ్డలును చిక్కుకొని, సముద్రము వంకకు కొట్టుకొనిపోయిరి. దారిలో నెటులనో ఆమె శిరోజములు లాకుగేట్లకు తగులుకొనుటచే నామెయు, అప్పటికిని ఆమెనంటిపెట్టుకొనియున్న మూవురుబిడ్డలును నీట దేలియాడుచు బయటపడుటకు పెనగులాడుచుండిరి. ఇంతలో మరొక ప్రవాహమువచ్చి యిరువురుబిడ్డల నామెనుండి వేర్పరచి, వారిని తరలించుకొనిపోయెను. ఆ యిరువురిలో నొక డెటులనో బ్రతికి, తల్లిని జేరుకొనెను. మూడవబాలుని జాడ ఏమయ్యెనో తెలియలేదు. తెల్లవారిన పిమ్మట కొందరు జాలరులు కోటవద్దకువచ్చి, లాకుగేట్లవద్ద బిడ్డతోగూడ తేలియాడుచున్న యామెను చూచి, తల వెంట్రుకలు కత్తిరించి, తల్లికొడుకుల నిరువురను రక్షించిరి.

పట్టణమున చర్చికి దక్షిణభాగమున నొక పెద్దయింటిలో కెప్టను హేస్టెడుగారు నివసించుచుండిరి. ఆయన నాటి భయానకసంఘటనమునుగూర్చి, తనకు రాత్రి ౧౧ గంటలప్పుడు సగ్రపువా డొకడు వచ్చి, సముద్రము పొంగివచ్చుచున్నట్లు తెలిపెననియు, మఱి కొంచెము నేపటికి కీవలకు వచ్చి చూడగా, చుట్టును, భాస్వరపుమంటలతో నిండి, ఉడుకుచు, సుళ్లుపడుచున్న ఏకార్ణవము తమ యింటిని ముట్టడించెననియు వర్ణించుచుండెడివాడు. ఆయనజ్ఞాపకముప్రకారము రాత్రి ౧౨ గంటలనుండి ప్రవాహము వెనుదిరుగ నారంభించెననియు, ౨ గంటలనుండి తుపాను పూర్తిగా తగ్గిపోయెననియు తెలియుచున్నది.

తూర్పురేఖలు పొడగట్టగానే ఆయన చర్చి ఏస్థితిలో నున్నదో చూడవలెనని యతికష్టముతో నీదుకొని యచట ప్రవేశించెను. తెలుగుదేశమందలి చర్చిలన్నిటిలోను పురాతనమైన యాకట్టడము తుపాను ప్రచండతకు నిలువగలిగెను. కిటికీలుమాత్రము గాలితీవ్రతకు విరిగి చెదరి పడిపోయెను. ప్రవాహము లోన బ్రవేశించుటచే లోపలిభాగ మంతయు బురదమయ మయ్యెను. ఆ పేటవాసులు చాలమంది సువిశాలమును, దృఢమును నగు నాభవనమున బ్రవేశించి ప్రాణములను గాపాడుకొనిరి. బెంచీలపై నాసీనులైయున్న యాజనుల నడుమనే మగ్గోరీబ్యాంకు అనుపేరు గల కలక్టరుగారు కూడ నుండిరి. అచటనుండి హేస్టెడు తమ మతాచార్యుని యునికను తెలిసికొనగోరి, యతికష్టముతో నాయన బంగాళాను బ్రవేశించెను. ఆయనయాశ్చర్య మేమనవచ్చును ? కాసంతయైన యీ యుదంతమే యెఱుగక, గిబ్సన్‌గారు కలతలేనిసుఖనిద్రలో నుండుట కాయన వింతపడి, కొంత కష్టముమీద నాయనను లేపి రాత్రి జరిగిన యుదంతమంతయు వినిపించెను.

నవ్వుమనిషి యగు నామతాధికారి, తన మిత్రుడు కట్టుకథ కల్పించెనని కడుపుబ్బనవ్వసాగెను. కెప్టనుగారు విపాదములను వర్ణించినకొలది ఆయన మరింత హెచ్చుగా నవ్వుచుండెను. హేస్టెడు చిరాకుపడి యాతనిని బలవంతముగా ప్రక్కకు త్రిప్పి చూపి ఒక యుదంతము ప్రకారము (ఇది ... బాహైయుండునని మనము విశ్వసించవచ్చు) సుందరములైన తన వృక్షములన్నియు ... క్రిందుగా వ్రేలాడుచుండుటయు, ఘోరశ... లను 3 మనుజశవములు తన ద్వారము ... పడియుంటయుగాంచి, యుల్లాసభరితుడ... నట.

ఈవిధముగా జలప్రళయము శాంతించె... కాని తోడనే నగరూపరాక్షసులు ... కొనిరి. వెలుగు కాన్పించగానే, రాత్రి ... గుల గొందుల నక్కి ప్రాణములు దక్కిం... కొన్నవారు బయటపడి రాక్షసులవలె ... ణించినవారి యాభరణములను పీక నారంభి... చిరి. బందరుకోటను, చుట్టుప్రక్కలను ... ణించినవారికి దహనాదికములు జరిపించుట... కెప్టన్ బ్రౌను, లెప్టినెంటు ఓస్రేడ్ గా... నాయకత్వమునను, పట్టణములోని మృత... సంస్కారములు జరుపుటకు కెప్టనుహేస్టె... గారి నాయకత్వమునను దళము లేర్పర... బడెను. కాని యీ ప్రయత్నములను సా...



జె. డబ్ల్యు. మొయిడను దొర

మునుట దుర్ఘటముగా నుండెను. బ్రతికినవారు సారాయిపీపాల చుట్టును జేరి గందరగోళము చేయసాగిరి. చచ్చినవారిపైబడి, వారి నగలను దోచుకొనుట కెవ్వరికిని భయములేకుండెనుకాని దహనాదికములు జరుపుటకు మాత్రము ప్రతివారును హాసలు నటించసాగిరి.

పాప మొకవిప్రుకురాలు స్కాట్సుసతి కళేబరమును త్రించి, దానిని ఖననమునకు పంపుటకు కప్పియుంచెను. హేస్టైకుగారు ఆమెను సమీపించునరికి ఆమెచేతి వ్రేలొకటి నరకబడి, యా వ్రేలికి వారచురోజుల క్రిందటనే యుంచబడిన వివాహపు టుంగరము హరించబడెను. బందరుకోటలో మరణించిన యొకరి మురుగులను హరించుటకు చేయినరకుచుండగా నొకనిని, తమ్మటలు హరించుటకు చెవి నరకుచుండగా నింకొకనిని పట్టుకొని బంధించిరి. విచారించగా వారు అట్టిపెక్కు దుర్ణయములు గావించినట్లు బయల్పడెను. ఈవిధముగా నగలను హరించి సంపులుసంపులుగా బంగారును అమ్ముకొనుటకు బాపట్లకు పరువిడుచుండు, జనులవలన బందరు విషాదగాథ బయటివారికి తెలియవచ్చెను.

పైయుదంత మొక మిషనరీచే నాంగ్లమున వ్రాయబడి, శ్రీ. జె. డబ్ల్యు. మెయిడన్ దొరగారివద్ద నున్నది. శతవృద్ధుడును, ప్రస్తుతము రోగపీడితుడును నగు నీదొరగారును, వారికుమార్తెయు నాప్రార్థన మంగీకరించి, ఈచరిత్రమును ఇచ్చినందుకు వారికి పరమకృతజ్ఞుడను.

పైన తెలుపబడిన జలప్రళయ స్మారకము బందరుకోటలో నున్నది. ఆసమయమున ప్రజలకు మిగుల సహకారియై తోడ్పడిన జిల్లా కలక్టరుగారగు జాగ్జితారన్ హెల్ గారిపట్ల కృతజ్ఞతను ప్రదర్శించుటకు బందరు పురవాసులు నిర్మించిన మరొకస్మారకము పట్టణ మధ్యభాగమున రాబర్ట్సన్ చౌకనందు గలదు. దీనిచుట్టును నొక కటకటాలచే రక్షితమైన యొకచిన్నకొలను నిర్మించి, దీనిని ఇటీవలివరకును కృష్ణోదకములచే నింపెడివారు. కాని ప్రజలకు అనారోగ్యము కలిగించుచున్నదని యిటీవలనే పురపాలకసంఘమువారీకొలనును పూడ్పించినారు. త్వరలోనే యొక పుష్పోద్యానము నిర్మించెదరట. ఈ స్మారకముపైన ౧౯౩౦ సం. రములో సత్యాగ్రహయోధుడగు తోట నర్సయ్యగారు జాతీయపతాకను స్థాపించుటయు, నా సమయమున పోలీసు లాయనను మిగుల తీవ్రముగా కొట్టుటయు జరుగుటవల్ల నీస్మారకము అసహాయోద్యమచరిత్రయందు చరిత్రాత్మకమైనది.



"నాజీవితపు నాద - మేజీవనము సేయు;
ఈపరద చిం చేతునా? - ఆవరద ముంచేతునా?
నాజీవితపు నాద - మేజీవనము సేయు;
ఈమదిర పంచేతునా? - ఆయుదధి వంచేతునా?"

అని పాట తేలించి వదుల్తూవుంటే ప్రక్కగది లోంచి "కనోజినీ!" అనే హాడలేసే గొంతు వినిపించింది. కనోజిని "నేను వేశ్యనుగాను సినీమానటిని." అని హాల్లో వున్న మనిషి లేచి వీథిగుమ్మం దరియబోయింది. "నేను వేశ్యనుగాను సినీమానటిని" అని కనోజిని అన్నమాట కు త్తిమ్ముడై యివలకు వస్తూ ముజఫర్ జంగు ఖడ్గందూసి "ఆగు! ఎక్కడికి వెడతావు? ఇదిగో మర్గయా" అని విదళించేడు.

ఆ విదళింపున కాఖడ్గం చటాల్ను కంఠంముడి తప్పి ఆస్త్రీయొక్క సిగముడిలోని పూలగుత్తి యొక్క రేకుల్ని తగిలి వాయి మడతడి వ్రూరుకుంది. దానివాయి ఎంత మెత్తందోగదా! అదే కనోజిని కుత్తుక్కు తగిలి వుంటే నిజంగా నెత్తురువఱ్ఱయి సింహద్వారపు పరదా మీదికి చిమ్మి చావడిలోని ఎల్లవస్తువులను ఎఱ్ఱపఱిచి యుండేది. దైవానుగ్రహంవల్ల అది ఆమెకుత్తుక్కు తగల్లేదు. ఆమె తొడిగిన, బొత్తాంలెడసిన నునుజినుగు 'కుర్తా' లోని అపూర్వ సౌందర్యలహరినే ప్రచలిత ప్రతిబింబమాత్రమై ఆమె కానాడు ప్రాణం దక్కించింది.

"కనోజినీ! ఇలా చూడు!" అన్నాడు ముజఫర్ జంగు. "ఆథుర్కీ, జుంకా, టర్రాయి, ఘూరి, అవన్నీ అక్కడపెట్టి మఱీవెళ్లు—ఖుషీగా వుండలేక! ఖుషీగా వుండలేక!"——

కనోజినికి ఏడుపు వచ్చేసింది. ఆగాడు;చూచాడు. "ఎందు కలామేలిముసుగు ముఖమ్మీదికి తీసుకు వెక్కి వెక్కి ఏడుస్తావు? ఎందు కేడుస్తావు?" అని అడిగాడు వినమ్రుడై తనచేతుల్లోకి కనోజిన్ని తీసికొంటూ—అంత వఱకూ కసాయివానికంటె అతిక్రూరంగా కాపడ్డ— ఆ ముజఫర్.

ఆలా వినమ్రుడై అతగాడు ఆవొళ్లోకి తీసికోవడ మనేది మోహలాలనగా, వొళ్లంతా శృంగారరసమయమై పోయింది ఆమెకు. ఏడ్పల్లా మొలకనవ్వుకింద మాఱింది. మొలకనవ్వల్లా అరవిరిన వ్వయింది. అరవిరి

# "వేశ్యను గా...

కవికొం...

నవ్వల్లా అతివిస్పష్టమైన "హహహ" నవ్వైంది. ము... ఫర్ జంగుమెడకు ఆసాగసి తన లేలేత బాహు... గు దేసి, అడుగుతూంది నవ్వుతూనే. "సీ క్రాఫ్ ముజఫ... ఆలా చెదిరివుందేం ఈరోజున?" అని అడిగింది.

ముజఫర్ అన్నాడు "సముద్రపుగాలి యీ... యంత్రం విపరీతంగా వీచింది. అది కారణ మైయు...



# సి నీ మా న టి ని"

వేంకటరావు

టుంది" అని. "ఆఁ! సముద్రపుగాలి! అయితే అది నీకు విపరీతసౌందర్యం తీసుకొచ్చింది." అని పిల్ల మెల్లగా తన మోవి పైకెత్తి ముజఫర్ మోవిని ముద్దెట్టుకుంది. ముద్దెట్టుకుంటూనే అడిగింది: "ముజఫర్! ముజఫర్! నీముద్దు ఈరోజున ఉప్పగా ఉందేం? ఉప్పగా ఉందేం?" అని. ముజఫర్ తన పెదవి తుడుచుకుంటూ "ఈ సాయం కాలం సముద్రంలో నా కోశంఖం దొరికింది. దాన్ని అలాచూస్తూ అప్రయత్నంగా మొగ మానించాగాబోలు. దాని సముద్రపుచెమ్మ మిగిలివుండబోలు-" అన్నాడు. "ఆఁ! సముద్ర శంఖం! అయితే అది నాకు విపరీత కంఠధ్వని తీసికొనివచ్చింది! ఆహా! ఏమి కంఠం నీది! ముజఫర్! ఏమి కంఠం!" అని దిగ్గనలేచి ముజఫర్ను విడిచి, వెళ్లి గదిలో వెతకసాగింది. ముజఫర్ హాల్లోంచే "దేనికోసం ఆ వెదకులాట? శంఖం కోసమా? లేదు! లేదు! ఆ శంఖాన్ని అక్కడే అప్పుడే ఆ సముద్రంలోకే గిరాటేశాను. నాతో తీసికొని రాలేదు." అన్నాడు. ఆ మాటకు గిరుక్కున తిరిగింది కనోజిని. గిరుక్కున తిరిగి అంది: "ముజఫర్! ఆ శంఖాన్ని వొక్కమాటు ముద్దెట్టుకు తిరిగి సముద్రంలోకి గిరాటేశినట్టే, నన్ను కూడా వొక్కమాటు ముద్దెట్టుకు ఎందుకు తిరిగి వదిలి పెట్టేశావు కాదు! ముజఫర్! నన్నెందుకు తిరిగి వదిలి పెట్టేశావు కాదు? ముజఫర్!"—ముజఫర్ అంటాడు వెనక్కలా కుర్చీలో జేర్లాబడి: "ప్యారీ! నిన్ను లోకానికి కనబర్చకుండా అతినిగూఢంగా తీసికొని వచ్చినవాణ్ణే—లోకానికి వదుల్తానా? ప్యారీ! నీవు నా నూర్జహానివి! నీవు నా మమ్‌టాజివి! నీవు నా షిరాజివి! రా! రా! నా చేతుల్లోకి రా! నా కౌగిల్లోపడు! నన్ను పరవశుణ్ణి చెయ్యి" అన్నాడు.



ముజఫర్ జేగు ఖడ్గందూసి ''ఆగు! ఎక్కడికి వెడతావు? ఇదిగో మర్గయ.'' అని విదళించేడు.

ఆలా ముజఫర్ ఆహ్వానిస్తూవుంటే కనోజిని గదిలో తన సామాను సర్దుకుంటూ వుంది, మగనితో చెప్పకుండా ఎక్కడికో ప్రయాణమై వెళ్లిపొయ్యే పెంకెపిల్లలాగు. ముజఫర్ గది తలుపు ఇవల గొళ్లెం వేసినాడు. "తలుపు తియ్యవ్?" అంది లోపట్నుంచి కనోజిని. "తియ్యను. తియ్యను సరిగదా తాళంవేసి పోతున్నా!" అన్నాడు ముజఫర్. అన్నాడేగాని ముజఫర్ తలుపు బార్లా తీసి పారేశాడు. కనోజిని ఆ గదిలోనుంచి పరుపూ, పెట్టె ఎత్తుకుని హాల్లోకి వచ్చి వీథిగుమ్మంకేసి నడుస్తూవుంది. "ఆగు! ఆఘుర్కి, జుంకా, టఱ్రయి, ఘూరి, అవన్నీ అక్కడపెట్టి మఱీ వెళ్లు" అన్నాడు ముజఫర్. కనోజిని ఆగి చూచింది. అదివఱకులా అతడు కత్తిదూయలేదాతడవ. ఆ తెఱపిని అంది ఆపె: "ఏం! ఈ ఘుర్కి, జుంకా, టఱ్రయి, ఘూరీ పెట్టుకు వెళ్లి

పోతే నేమి?" అని అడిగింది. ముజఫర్ "ఒక మహమ్మదీయ స్త్రీ—నా భార్య—లేచిపోతూవుంది అని అనుకొంటుంది లోకం!" అన్నాడు. "ఉం! లోకం అనుకొంటుందీ? ఏమనుకొంటుంది? ఒక మహమ్మదీయ స్త్రీ నీ భార్య లేచిపోతూవుంది అని అనుకొంటుందీ లోకం? నన్ను నీవు తీసికొనివచ్చినప్పు డనుకోలేదు - నీతో వొక మహమ్మదీయస్త్రీ లేచివచ్చిందని ? లోకం అనుకోలేదు?" అని అడిగింది కనోజిని.

ముజఫర్ ఇలాఅని సిద్ధాంతీకరించేడు. "నా భార్య ఆమె - నాప్యారీ ఆమె అని చెప్పాను. ఆలాగే లోకం నమ్మింది." అన్నాడు ముజఫర్.

కనోజిని కళ్లుమూసుకొని జ్ఞాపకం చేసికొంటూ వుంది. తాను తొల్త అతగాడితో చేసివచ్చిన ప్రయాణ మార్గంఅంతా చీకటి కనుమగుండాలా గనిపించింది. రంగూన్‌నుంచి మదరాసు వోడమీద ప్రయాణంచేసింది కాని సముద్రం చూడలే దామె. ఓడచాపలు దించి ఎత్తే చప్పుడు వింది కాని సముద్రపుగాలి మూచూడలే దామె. అదీ ఆమెసింహావలోకనం! ఆమెకు తెలిసిన దంతే!

ఆమెను దప్పించి లోకానికి తెలిసింది యోజింతాం—కనోజిని భోగంపిల్ల, పందొమ్మిదేళ్లు వయస్సు. ఊరులేని డొంకమల్లెలా గలముకొని, పేరులేని చిన్ని పువ్వులా తలపుకువచ్చే అసలైన అందం, చందం, ఆనందమూను దాంది. దానిచాయ పసినిమ్మపండు చాయ! సోసులో సువాసన! సువాసనలో సోసు! పాడిందా అంటే వీణతంతే దానిగొంతు క్కింకా వీసం లొక్కు.

ఆనాడు హాల్లో "నాజీవితపునాద మేజీవితమొనేయు" నన్నపదం కూనరాగంతో ఎత్తినప్పటి కలరుతము ముజఫర్‌జం గొక్కడికసహ్యామై పోయింది కాని, తదితరలోకాని కంతకూ అతిమనోహరమై మాఱుమ్రోగింది. అటువంటి మంజులస్వనం దాంది. ఆమెయొయ్యారం అమృతపుపొళ్లే! గోళ్లను గోరింటెట్టి నిలబడివుంటే

"ఈప్రభాతాన్ని అరుణద్వారం ఓచిన్నదానా! నీవేనా తెఱచినదానవు?" అని పలకరించబుద్ధేస్తుంది ప్రతీమానిసికీ. ఆమె కన్ను లలా మిన్నుకెత్తి మన్నుకు దించుతూ వుంటే అనురాగస్రవంతి నాకాశానికి ఎగతోడి క్రిందకు దిగతోడుతోందే అని మనంకూడా అనుకరించేస్తాం ఆవొడు చెప్పటికప్పుడు,—"అహో! ఈస్త్రీ యేవీరుని పెన్నిధి, ఏధీరునిభావాంబుధి, ఏమగవాని కేడుగడ, ఏ పురుషున కెత్తుగడ" అని ప్రతీవాడూ ఆమెదైన చెంగుచెలిమి అలవరుచుకోవడానికి ప్రయత్నించవలసిందే.

పిల్ల భోగంపిల్లకావడంచేత అందఱికీ అందుబాటులో వుండేటట్టుకూడా అగపించేది. అగపించేది అని ఎందుకు వ్రాస్తూవున్నానంటే ఆమె పయట కొండలమీది మేఘంలా మనలను లాక్కునేదే కాని మనకు చిక్కేదికాదు కాబట్టి. ఈ విచిత్రప్రవృత్తి యితర భోగంపిల్లల కందఱికీ వుంటుందా, వుండదా అనేది మన కిక్కడ అప్రస్తుతం. వాళ్లల్లో లేక యీమెకే వుంటే 'అధికస్య అధికం ఫలం.'

ముజఫర్ అంటూవున్నాడు సింహావలోకన సోయగంలో వున్న కనోజిన్ని ఓరకంట చూస్తూ: "కనోజినీ! నీ వీదాకా తెరచాటుపిల్లవై పరదా వెనుకాల వుంటూ వుండడంచేతనే నీ కా మార్దవం, మధురార్ద్రస్వభావం, ఆ పచ్చనిమిసిమి, ఆయేపూ నిల్చివున్నాయి. లేకపోతే కగ్గిపోయి, కమిలిపోయి, అగ్గిబుగ్గి లాగైయుందువు" అన్నాడు. కనోజిని "ఎండలోపెట్టి చూడు మొక్కని, కుండకిందపెట్టి చూడు మొక్కని!" అని చుఱుక్కున అంటించింది తన వాడి పల్కు. ముజఫర్ "మొక్కకూ మనకూ తేడావుంది. మనం మనుష్యులం. మొక్క మనిషికాదు. మనం పరదా చాటున ఉండవలసిందే. నడువు, గదిలోకి నడువు." అన్నాడు. కనోజిని "నడవకపోతే నన్ను తంతావా? నన్ను చంపుతావా?" అంది. "మళ్లా మాట్లాడితే అంతపనీ జరుగుతుంది"అని యింటితలుపు లన్నీ వేయించివేసి "చూడు! కనోజినీ! నాకు కావాలీఅంటే ఇక్రేసుమీద ఇక్రేసు ఫ్రోరో కాంక్రీటు స్తంభాలమీద నిలిపించి

నీ స్నేంతపైకైనా పోనిస్తాను. కాని గుమ్మందాటి అవతల కొక్క అడుగైనా పెట్టనివ్వను. దర్వాజాలన్నింటి దగ్గఱా విచ్చు కత్తుల పహరావాళ్లను వుంచేస్తున్నాను. ఫిరంగు లిటూ అటూ వేటకుక్కల్లా వుంటాయి. జాగ్రత్త! నన్ను తెలిసికో!" అన్నాడు ముజఫర్.



తన బుత్తులోనుంచి బా కీవలకుతీసి ఆ భీకరంజకాంతిలో ముజఫర్ ఎదుహరొమ్మున కసుక్కున గ్రుచ్చింది

కనోజని కుక్కిన పేనుమల్లే అయిపోయింది. నేల రాచిన నల్లిలాగ, గోడనంటిపెట్టుకున్న బల్లిలాగ అయిపోయింది. వేసంగిలో ఎండిపోయిన నడదారి గడ్డిలా అణగారిపోయింది. అయినా గొంతు చావలే. "ప్రేసు మీద ప్రేసుకట్టి?" అని అడిగింది. "ప్రేసుమీద ప్రేసుకట్టి, చుట్టూ పరదాలతో మూసి, నీ యిష్టం వచ్చిన ట్లాకాశంకేసి చూడుమంటూ!" అన్నాడు ముజఫర్. "ఊ" అంది కనోజిని. అని వూరుకుంది. ఆనిస్వనము, ఆనిస్వనమువెంబణ్ణే ఆ నిశ్శబ్దం, మనుగడకు ఊత అయిందీ తెలియలేదు: మనుగడకు కోత అయిందీ తెలియలేదు.

మూడురోజు లలా కడచన్నాయి. ప్రేసు మీద ప్రేసు లేవనెత్తి, అన్న ప్రకారం ముజఫర్, చుట్టూ పరదాలు కట్టించేడు. ఆ పరదాలనడుమ ఆ ఆకాశంకేసి "అంతా నీదే స్వేచ్ఛ" అన్నట్టు ఆమెను మసల నిచ్చేడు.

నాలుగోరోజున మట్టమధ్యాహ్నం ముజఫర్ చేత కనోజిని బాగా మదిర తాగించేసింది, అల్లిబాల్లి కబుర్లు చెబుతూ — ముజఫరుకు బాగా కైపెక్కిపోయింది. ఆమె తన వస్త్రువులన్నీ ఊడ్చి పారవేసింది క్రిందిగదిలో. ఒక పచ్చలపిడితోవున్న చక్కని చిన్ని బాకు సిగముడిలో కనబడీకనబడనట్టు గ్రుచ్చుకుంది. వలగ్నానైనా వస్త్రంలేనిదై ఎండలో దిగంబరాకాశంక్రింద పైప్రేసు మీద పరదాలనడుమ ఒకఅవయవపు నీడ మఱోఅవయవానికి కళాపోషక్కు పెడుతూవుంటే, నగ్ననృత్యం చేస్తూ సూర్యభగవాను నారాధిస్తూవుంది.

ఆనృత్యానికి దిగువహాల్లోని యాయలగొలుసులు కదిలిన ట్లయినయి. గొలుసుల చిరుగంటలు

ప్రమోగినట్లయినయి. ముజఫర్‌కు తెలివివచ్చి ఒడలు జల దరించిపోయింది. పైకి పరుగెత్తి "ఇక్కడున్నావా? కనోజీనీ!" అన్నాడు. "అవును! వున్నాను! నే నిప్ప డెలావున్నాను! ఏమతస్థురాలినిగా అగపిస్తూవున్నాను" అని అడిగింది. ముజఫర్ ఆమె నలా తిలకిస్తూ "మతం గితం జాంతానై! నీవు నాపాలిటి మహా భోగపదార్థంగా తోస్తూవున్నావు."

"ఛీ! ఛండాలా! అదే అనవద్దన్నాను. నేను వేశ్యనుగాను, సినీమానటిని అని ఇప్పటికైనా తెలుసుకో" అని తనజుత్తులోనుంచి బా కీవలకుతీసి ఆబీరెండకాంతిలో ముజఫర్ ఎదుట్రొమ్మున కసుక్కున గ్రుచ్చింది. కనో జిని కళ్లల్లోకి బుస్సునకొట్టింది చిమ్మట కొట్టినట్టు వాని ఉడుకునెత్తురు. పచ్చలపిడిబంటీ కనోజినిబాకు ముజఫర్ యొక్క గుండెకండ చవిచూచింది.

ఆమెచూపు కట్టడిపోయింది వొక నిమేషం. ఆమెచెవులు గళ్లడిపోయినాయి వోక్షణికం.

ఆ తాత్కాలికాంధస్సులో, ఆ తాత్కాలిక బధిరతలో కనోజిని అన్న ఆ పిల్ల మానసికంగా ఏం చేస్తూవుంది. స్వచ్ఛందమైన సముద్రపుగాలిలో నిలు వునా ఉఱ్ఱూతలూగుతూ ఆనందంగా చిందమూత్తూ వుంది! చిందమూత్తూ వుంది!





శ్రీ తూములూరి వేంకటశివరామయ్య

# ఆంధ్రనాటక కళాపరిషత్తు

## ఏలూరు, ౧౫-౧౨-౧౯౩౪

నెల్లూరి న్యాయవాది ప్రముఖులు శ్రీ తూములూరి వేంకటశివరామయ్యగారి యధ్యక్షతను పరిషత్తు సప్తమవార్షికోత్సవము జరిగినది. అధ్యక్షులు తమ యుపన్యాసమున నాటకకళాభ్యుదయమున కుపకరించు విషయములను పెక్కింటిని పేర్కొనిరి. అందలి విశేషము లీక్రింద నుద్ధరింపబడినవి :

"ఎంత ఆలోచించినను పరిషత్తువారు జయము కాంచినటుల కానరాదు. పరిషన్నిర్మాణములో నేలోపములు కానబడుచున్నవి. అన్ని మండలములందును పరిషత్తునకు శాఖలు లేవు. ఉన్నచోటులనైనను ఈ శాఖల ప్రయోజనము కానవచ్చుటలేదు. ఈ ఆరేండ్లుగా ఒకటి రెండు దక్క ఉత్తమ నాటకములు రచింపబడలేదు. ఆ రెండింటికైనను ఆదరము కల్గినట్లు తోపదు. నటులలో నూతనముగా ప్రసిద్ధికి వచ్చినవారు లేరు. కిరాయినటకుల నాటకములు 'అపూర్వనట సమ్మేళనములు' యథాప్రకారముగా నున్నవి. నాటకరంగమున నున్నవారే టాకీరంగముల నెక్కి ఆ సంప్రదాయమును తెలియక పాడుచున్నారు. టాకీలతో సంబంధము లేని స్వతంత్రనటబృందములు ఐచ్ఛికములుగాని, వృత్తిబృందములుగాని వృద్ధి గాంచుటలేదు. ఆంధ్ర నాటకశాలా నిర్మాణము ఊహాప్రపంచముననున్నది. నాట్యకళాబోధనశాల చూపుమేరదూరములో లేదు. ఇంతేకాక టాకీలదెబ్బకు నాటక ప్రదర్శనములు తగ్గిపోవుచున్నవి. తెలుగు సంగీతము ఏనాటకములందును ఎక్కువగా వినపడదు. హిందూస్థానీ సంగీతము తెలుగు సంప్రదాయమును ముంచినది. రసమును, సందర్భమును గమనింపక "ఆపాట పాడు, ఈపాటపాడు" అని యాజ్ఞాపించు ప్రేక్షకజన మిప్పుడును సమృద్ధిగ నున్నారు. ఇందులకు రంగమున రసోత్పత్తియందు లోపమే కావచ్చును. నానాటికి వారిలో రసజ్ఞత తగ్గిపోవుచున్నది. ఉపదేశకులుగా నుండతగినవారు నిరుత్సాహులై, మౌనమును ధరించినారు.

ఇది యిట్లుండుటకు కారణమేమి? ఉద్దేశ్యమే తప్పుమార్గముల బడినదా? ఉపదేశకులై నూతన నాట్యప్రపంచమును నిర్మింపగలిగిన సమర్థులు మనలో లేరా? ఆంధ్ర నటులు సమర్థులు, రసజ్ఞులు కారా? లేక మనవారు ఆరంభశూరులేనా? ప్రయత్నలోపమా? అనువిషయములాలోచించుకొనదగియున్నవి.

నాకుచూడ ఈదోషము లన్నియు కొంచెముగా కలిసికొని ఈదుస్థితికి కారణములయినవి. మనము ఉత్తమప్రాప్యముతో పని బూనలేదనియు, నూతన నాట్య ప్రపంచమును నిర్మింపగల సమర్థులు కానరారనియు, ఆంధ్ర నటులయందు శక్తిసామర్థ్యములను చాలినంత పెంపొందలేదనియు, శూరత్వమున ఆరంభమునందువలెనే పరిణామమునందునను పటుత్వము తగ్గకయుండవలయుననియు నా ఆశయము. ఈనాట్యములు కటువుగా నుండు నేమో కాని, సత్యేతరములు కావని విన్నవించు చున్నాను.

మనము దోషములను దిద్దుకొను నుత్సాహముతో పరిషత్తును నిర్మించితిమి. దోషములివియని వివరించినవారు ప్రాప్యమిదియని వివరింపరైరి. దోషమనగా నేమి? ప్రాప్యమునకును, దానినిపొందు ఉపాయములకును పరస్పర ప్రాతికూల్యమేకదా. ఇక ప్రాప్యమే సరియగునది కానిచో ఏమనవలెను ?

* * *

తెలుగు సంప్రదాయమున కనుగుణముగ రమణీయత ఒకటియే ప్రధానముగ నుద్దేశించి నూతన నాటకములను వ్రాయుటకాని, ఆడుట కాని విశేషముగా జరుగలేదు.

* * *

మన పరిషత్తును ఈదారిలో నెనుదీసినది గాదు. మునుపు నాటకముల కొక పోటీబెట్టితిమి. నాటకములు సాంఘికముగనే యుండవలెనంటిమి. వేరువిధముగ రమణీయవస్తునిర్మాణము కాదు కాబోలు. 'స్వగతములు, విష్కంభములు కూడవు. పద్యములు తగ్గిపోవలెను' అంటిమి. ఇది స్వాభావికవాద మాహాత్మ్యము కాబోలు. కవులకు ఇట్టి నియమము లేమి?

* * *

ఇట్టి నియమములవలన జీవకళ కల్పింపగలమా? మహనీయులగు కవులకు ప్రోత్సాహమిచ్చి వారు నాటకములను వ్రాయునట్లు చేయుట మనపని. ఆపైని కవులు సృష్టికర్తలు; మనకు చెప్పవలసినవారు. మనము నేర్చుకొన

వలసిన వారముగాని, వారిని ఆజ్ఞపెట్టువారము కాపాడేదు.

*    *    *

నృత్తనృత్య సంగీతములు లేని నాట్యకళ కుంకుమ కులుకు పలుకు లేని పెద్దమ్మ; మూలనుండవలసినది. పరిషత్తు నృత్తనృత్యములను విసర్జించినది. ఇట్టి త్యాగము ఉత్తమగతికి మార్గము కానేరదు. పరిషత్తువారు ఏర్పరచిన నిబంధనలను పరిశీలించి చూచిన, నాకొకటి తోచుచున్నది. ఆంధ్రనాటకరచనా ప్రారంభకాలముననే ఆంగ్లవిద్యయు వ్యాప్తి చెందుచుండెను. ఆంగ్లేయుల వేషభాషలు, వారి సాంఘిక వైజ్ఞానిక సాంప్రదాయములు వ్యామోహమును పుట్టించి స్వదేశముపట్లను, స్వభాషావేషముల యందును, స్వకీయ సాంఘిక వైజ్ఞానిక సాంప్రదాయముల యందును నిరసనభావమును కలిగించుచుండెను. అందుచేత ఆంగ్ల భాషలోకలవి అన్నియు విశేషణములనియు, అవి లేకపోవుట లోపమనియు తలపు ఏర్పడినది. ఈ అలవాటు ఇంకను మనలను వీడలేదు. అందుచేతనే మనము పద్యములకు,సంగీతమునకు నాటకములలో చోటు లేదనుచున్నాము. నిజముగా ఇవి కళాదృష్టికి లోపములాయని గమనించుటలేదు. నాటకములు జాతీయకళాజీవనమును ప్రతిబింబించు దర్పణములని మరచుచున్నాము. నాటకరచన అంతర్భూతమైన భావవాహిని యనియు, ఈ వాహినికి అన్యజాతిమత సాంఘికభాషా సాంప్రదాయములుగాని, నటకుల కోర్కులుగాని గట్లు వేయజాలవనియు మనము ఎరుగవలయును. అట్టి నిర్ఝరికి మార్గము స్వేచ్ఛాకృతమే.

*    *    *

కళావేత్త మొదట చేయితీరినవాడు, తరువాత ధ్యాని, సౌందర్యోపాసకుడు, భక్తుడు, అహంకారములేక సర్వమును దేవునకై, దేశమునకై, కళకై అని దీక్షతో శ్రమ చేయువాడును కావలెను.

పరిషత్తువారు ఇట్టి కళావేత్తలగు కవులను, నటులను ప్రోత్సహింపనున్నారా, సంతసము. లేదా, మన ప్రయత్నములవలన లాభము కలుగబోదు. రోగము కుదురవలెనన్న లక్షణములకు చికిత్సయొనర్చిన లాభములేదు. రోగమునకు మూలకారణములను తొలగింపవలయును.

మనల నావేశించిన స్వాభావిక వాదము వలన కళ ప్రకృతికి ప్రతిబింబమనియు, సంగీత నృత్తనాట్యములు నాటకములనుండెవనియు, వేషభాషలు ఉన్నవి ఉన్నట్లుండవలయుననియు, స్త్రీలే స్త్రీపాత్రలు ధరింపవలెననియు-మొదలగు నభిప్రాయములు పుట్టి పెద్ద సమస్యలయినవి.

సత్యమరయుచో, కళ అనుకరణముగాదు; సృష్టి. భావము ప్రధానము. దాని రూపకల్పన నిపుణుడగు నటుని యధీనము. ఇది జ్ఞప్తియందుంచుకొనిన యాథార్థ్యమునకును భంగముండదు. ఏలయనగా కవిగాని, నటుడుగాని సాధారణముగా తన భావమును దెల్పుటకు తా నెఱిగిన రూపములనే ఉపకరణములుగా గైకొనును. కాని కేవలము భావానుగుణమని వంగచిత్రశాల చెంతనున్న రేఖామాత్ర రూపలోలతకు ప్రక్కబోరాదు. భావానువాదము, ప్రకృత్యనుకరణము రెండును సమన్వయమును బొందవలెను. మన ఆంధ్రుల ప్రతిభ అదే; అజంతా చిత్తరువులు, దామెర్ల రామరాయల ప్రయత్నము అదే. మనము ఈ సంప్రదాయముల నవలంబించిన మనోహరమగు నాట్యకళ మరల నావిర్భవించును.

నాటక పరిషత్తును 'నృత్తనృత్యనాట్యాభినయ సంగీతముల నన్నింటిని యాదరింపు' డని వేడితిని. 'కవులు నిరంకుశులు. వారిజోలికిపోవల'దంటిని. కవుల నిట్లు వేడుకొందును:'తమరు శాసకులు. తమరు పశుభావముల నారాధించుచో దానికి తగిన రూపమే వచ్చును.

*    *    *

మీరు వ్రాయునవి పావనములైన చాలును. దృశ్యములగుటకు మీ నాటకము లనుకూలములగుచో ఆడుదుము. లేనిచో చదువుదుము.విశ్వశ్రేయమును కల్పించు దృశ్యకావ్యములను వ్రాయవలసినది. తమకు రమణీయవస్తునిర్మాణమే విధి; ధనముగాని, సంఘసంస్కారముగాని ప్రధానము గాదు. తమ యుదారభావములకు ఏ కళలు తగినట్లున్నవో వానినే కైకొనుడు, అవి పౌరాణికములే కానిండు. చరిత్రాత్మకములే కానిండు. సాంఘికములే కానిండు, తమభావయు తమభావముల కనుగుణముగను, స్పష్టార్థముగను, రసవంతముగను, జీవకళాయుతముగను, ఈ నియమములకు లోబడి సాధ్యమయినంత సులభముగను నుండనిండు. ఒకవేళ తమభాష కొంచెము కష్టమయిన మేమే కష్టపడి నేర్చుకొందుము' అని.

ప్రతిభాశాలియగు నాటకకర్తకు రచన విషయమై పరులు చెప్పవలయునా? కావలయునని పద్యముల సంఖ్యను హెచ్చించిగాని, తగ్గించిగాని రసాభాసము కల్గింపక పద్యముల వ్రాయుచో కథాగమనమునకుఅడ్డురానీయక, చూపర విసిగింపక రసవంతములైన ఘట్టములందే వ్రాయును. వచనమున వ్రాయతగిన దానిని తనకు శక్తియున్నదని పద్యముగా వ్రాయడు. సందర్భమును, ఔచిత్యమును కాపాడును. సంభాషణ క్రమమును మనోహరముగ బెంచు నేర్పును జన్మముతోనే కలిగియుండును. పాత్రస్వభావ నిరూపణశక్తి సహజముగ నతనికి కలిగియుండవలయును. ఆంధ్ర నాటక కర్తలలో అధికసంఖ్యాకుల కీసుగుణమున్నట్లు కనరాదు. లోకానుభవము, విచక్షణతా సమగ్రమగు దృష్టి, మానవప్రకృతిజ్ఞానము లేనిచో పాత్రసృష్టి ప్రీతికరముగా, ఆకర్షకముగా నుండదు. ఆంగ్లేయ నాటకములకున్న సుగుణమే యది. వారికిగల యింకొక సుగుణము కథాకల్పనము. ఇతివృత్తమును చక్కగ తీర్చి సంధుల బిగించి జీవకళ తాండవించునటుల చమత్కారముగ నాటకమును వ్రాయునేర్పు మన నాటకకర్తల కింకా లేని కావలసియున్నది.

మానవసాధారణములగు కొన్ని భావములు శాశ్వతములు, విశ్వజీవనములు, నిత్యములు. దేశకాలపాత్రములననుసరించి ఇది గోచరించు రీతులు మారవచ్చును గాని ఆగుణములు మారవు. కవి యే యితివృత్తమును గైకొన్నను అనగా మహాపురుష జీవితమునే కానిండు, పామర జనచరిత్రమునే కానిండు, ఈవిశ్వజనీన సత్యముల నెంతవరకు విస్ఫుటము

నేయునో అంతవరకే అతడు ధన్యతను చెందును; ఆనందమును గూర్చును. ఇట్టి సువిశాల దృష్టి గల మహానాటకకర్తలు మనకు కావలసియున్నారు.

నటులు ఐచ్ఛికులు, వృత్తిజీవనులు. ఐచ్ఛికులకు ద్రవ్యము ప్రధానము గాదు. వీరు పామరాభిప్రాయములను లెక్కసేయక సంస్కారమే ప్రధానముగా గ్రహించి కళానైపుణిని వృత్తినటులవద్ద నేర్చుకొని కళాసేవ చేయువారు. ఇట్టివారే పరిషత్తు నిర్వాహకమందుండుట మంచిది. జనులరుచి ఉత్తమముగా నుండుట వీరి చేతిలోనున్నది. సామాన్యముగ వీరిలోనున్న దుర్గుణము అతి స్వాతంత్ర్యము; నియమమునకు లోబడకుండుట; దీక్షయును లేకుండుట. ఇట్టివారు చక్కని సమాజములను నాశము చేయుదురు.

* * *

వృత్తినటుల కొకయనుకూలత యున్నది; ప్రతికూలత ఉన్నది. కళానైపుణి వీరిసొత్తు. వీరు నిరతాభ్యాసులు. వీరు చక్కగ ప్రదర్శింపనిచో ద్రవ్యమురాదు. వీరు నియమములకును లోబడుదురు. కాని వీరికి ప్రధాన కార్యము ద్రవ్యార్జన మగుటచే జనులనిర్బంధములకు, 'ఆపాటపాడు' మను నాజ్ఞలకు లోబడవలసినవారు. జనులలో ఉత్తమరుచి కల్పింప బనుటకు నైపుణి కళ వీరిచేతిలో నున్నది. ఐచ్ఛికులకు బోధకులుగను, జనసామాన్యమునకు ఉత్తమ నాటకములకు మధ్యవర్తులుగను ఉండవలసినవారు. ధనవంతులనుచో వీరివలన నను కళాసేవ ఇంకొకరివలన గాదు.

* * *

నాటకము వ్రాయుట కవిపని; ఆడించుట సూత్రధారునిపని. అట్లే నాటకాభినయమును, సినిమాఅభినయమును వేరు. కళలో ఒకదాని టెక్నిక్ రెండవదానికి సరిపోదు. నాటకరంగమున పేరుగాంచినవారు సినిమాలందు రాణింపకుండుట చూచుచున్నాము. ఈ రెండు తెగల వృత్తిజీవనులును ఒకరి రాజ్యము నింకొక రాక్రమించుకొనగూడదని నా విన్నపము.

పరిషత్తువారు మొదట నాట్యకళా బోధనాలయమును నిర్మింప బూనుకోవలెను. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు దీనికి ఆస్పద మేర్పరుపనున్నదని విని సంతసించితిని. మనమును ఒకకళాశాల నేర్పరచి అందు నృత్త నృత్య అభినయ నాట్య సంగీతములను ఉపాంగములుగా, వర్ణలేపనము అలంకారము (రంగమును, నటులను- వేషాదులచేతను), రంగస్థల నిర్మాణములను (వడ్రంగులు, కమ్మరులు, ఇంజనీయర్లు-వారికి ఇందుపని) నేర్ప బ్రయత్నించుదముగాక. దీని కనుబంధముగా నొక నాట్య గ్రంథాలయమును, పురాతనవస్తుశాలను నెలకొల్పవలెను. ప్రపంచ నాటకరీతులను పరికించుటకు, కాలోచిత వేషధారణమునకు అప్పుడు వీలగును.

ఈ యుద్దేశ్యములు నెరవేరుటకు పరిపాలకుల సాహాయ్యము కావలసియున్నది. ఇంగ్లాండులో ఒక్కొకకళకును సంస్థలు ఏర్పడియుండగా మనకాంగ్రెసు మంత్రులు తెలుగు నాట్యకళాపరిషత్తు ఇత్యాదుల నేల నిర్మింపగూడదు? నాటకముల సెన్సారుషిప్, నాట్యకళాశాలా నిర్వహణము ఇత్యాదికార్యముల నేల యొప్పింపగూడదు?

* * *

అన్నిటికిని చేహియనుట ఆత్మగౌరవమునకు తగిన పనికాదు. మనమహారాజులకు, ధనికులకు ఔదార్యమున్న పరులనడుగవలసిన పనిలేదు. మనకవులు నిజముగా మహానాటకకర్తలై, దివ్యకళామయములను నాటకములను సృజించిన, మన జనులలో రసజ్ఞత చావకున్న, 'కాలోహ్యయం నిరవధి ర్విపులాచపృథ్వీ' అని ఏకవియు నార్తనాదము కావింపబనిలేదు. మనసంగీతము రాజాస్థానముల వీడి ఏలపాటలయందే దాగియుండ నక్కరలేదు.

* * *

ఆంధ్రుల కొక ప్రత్యేక నాట్యసంప్రదాయమున్నది. భరతనాట్య విశిష్టమైన కూచిపూడి సంప్రదాయము మనది. సిద్ధయోగీంద్రుని కృపచే మనకు ఇంతవరకున్నది. అది అంతరింపవలసినదేనా? ట్రావెన్కూరువారి కథాకలి మరల బాసపడుచున్నది. మన సంప్రదాయము నాశనము కావలసినదేనా? ఆఖరుకు భరతశాస్త్రమే తెనుగున లేదే. నాట్యగురువులే లేరే. తెనుగుసంగీతము పరులచేత పడిపోయినదే. హిందూస్థానీ నెల్లువ ముంచివేయుచున్నదే. పరిషత్తు వీనికై రేమి చేయనున్నది?

* * *

మనకు జాతీయ మహానాటకకర్త ఇంతవరకు జనింపలేదు. వేంకటరాయశాస్త్రి రెండు జాతీయ మహానాటకములను నిర్మించి మీ సంప్రదాయముల కోల్పోవద్దని హెచ్చరించిపోయినారు. అతని తర్వాత నూత్నసృష్టికర్త రాక తప్పదు. అతని ఉదయమునకు మనము కాచియుండవలసినదే. ఆవసంతోదయముననే మన కళాపుష్పములు వికసింపవలెను. ఆతురతవలన లాభములేదు. ఈలోపల నేదైన జాతీయావేశమహాతరంగమును కల్పించు సంభవము కలుగునా, ఆస్పృష్టికర్తతనంతనే వచ్చును. ఆంధ్రరాష్ట్ర నిర్మాణము అట్టి దగునేమో చూడవలెను.

మొదటినుండి ఆంధ్రులు ఆర్యద్రావిడ విజ్ఞానములను మేళవించుచున్నారు. హిందూ బౌద్ధ విజ్ఞానముల మేళవించినారు. తెనుగు తమిళ సంస్కృతులను మేళవించినారు. శైవ వైష్ణవముల మేళవించి హరిహరోపాసననారంభించినారు. కేవల స్మార్తులైనారు. కనుక మనకు అన్నిటిని సమన్వయించుట యందు సహజమైన ప్రతిభ కలదు. కనుక అన్నిటిని సమన్వయించి నృత్త, నృత్య అభినయనాట్య సంగీతముల మేళవించి ఆంగ్ల సంస్కృతరీతుల సమన్వయించి మనోహరములగు నాటకసంప్రదాయముల నాంధ్రులు నాట్యకళాదేవిని నాటక పుష్పముల బూజింతురుగాక అని యాశించుచున్నాను."

తెలుఁగు సామెతలు

# 'జీలకఱ్ఱ సింగినాదము'

'కృష్ణకుమారి'

'కందువమాటలసామెత
లందముగాఁ జేర్చి చెప్ప నది తెనుఁగునకున్
విందై, రుచియై, వీనుల
విందై మతికొనపించు విబుధుల కెల్లన్.'
—మొల్ల

సామెతలు భావకు ఆమెతలు. ఒకజాతిలో ఉండే సాంప్రదాయాలు, ఆచారవ్యవహారాలూ, సాంఘిక పరిస్థితులూ, కులకట్టుబాట్లూ, భాషాపరిణామమూ, దేశచరిత్రా తెలిసికోవాలంటే ఆజాతివారు తఱచుగా వాడే సామెతలు చాలా తోడ్పడుతాయి. విజ్ఞానవేత్తలు తమ జీవితకాలంలో సముపార్జించిన అనుభవాన్నంతా కాచి వడబోసి గుచ్చెత్తి నిగ్గుతీసిన సారమే సామెతల రూపాన్ని తయారైంది. వెయ్యిమాటలు ప్రయోగించి తలకొట్టుకున్నా వ్యక్తీకరింపలేని భావాన్ని ఒక్క నూటైనసామెత,సునాయాసంగా వ్యక్తం జేస్తుంది. కావుననే మన పెద్దలు సామెతను రుచిలో ఉప్పుతోనూ, ఘాటులో మిరియంతోనూ పోల్చినారు. ఒకొక్కొక్క పట్టున సామెత జీడిపిక్కలాగ పట్టుకుంటుంది.

తెనుఁగుగడ్డకు సామెతలు జీవగఱ్ఱలు. తక్కిన బాసలకంటె తెలుఁగు పెద్దగద్దె సంపాదించుకొని పెద్దరికం నెఱపిందంటే, ఈభావంలోని సామెతల పుష్టీ, సౌష్ఠవం కూడా ఒక కారణం. జాను తెలుఁగు అని పిలిపించుకోవడానికి జాతీయోక్తులు కొంచెం సాయం జేశాయి. తెనుఁగు కవిత్వానికి వలెనే తెలుఁగు సామెతలకుకూడా కొన్ని నియమాలూ, కట్టుబాట్లూ ఉన్నవి. కవిత్వానికి ఉన్నట్లుగా వీనికీ యతులూ, ప్రాసలూ ఉన్నాయి కొన్నిచోట్ల అంత్యప్రాస, యమకంకూడా పాటింపబడుతుంది. కాని కవిత్వాన్ని బంధించినట్లుగా వీనిని వ్యాకరణ శృంఖలాలచే బంధించకూడదు. అలాచేస్తే ఇవి సౌకుమార్యాన్నీ, సౌరభాన్నీ కోల్పోయి, రామకృష్ణుడు పాండురంగ మాహాత్మ్యంలో ప్రయోగించిన "చక్షూరాజీవయుగంబు వాచె నిను గన్గొనుక్క" అన్న జాతీయోక్తి మోస్తరుగా అపహాస్యంపా లౌతవి. అందుకనే పెద్దలు మొనటినుండీ తాము సంభాషించే వ్యావహారికభావలోనే వీటిని పొదిగి ఉంచినారు. అలాచేయబట్టే ఇవి పద్దెముల కంటె ముద్దులుమూటగడుతూ, మొల్ల చెప్పినట్లు వీనులకు విందుగొల్పుతూ వినోదము కల్గిస్తూ ఉంటవి.

ఈ సామెతలలో కొన్నిటిని ఎత్తి నానేర్చినకొలదీ వానిప్రయోగాలను తెల్పుతూ భారతిలో అపుడపుడు ప్రచురింప దలపెట్టాను. సహృదయులు వానిలోని తప్పొప్పులు సవరించి నాకు తెలుపవలెనని ప్రార్థన.

ఈ సామెతలలో కొన్ని చారిత్రాత్మకంగా ప్రసిద్ధికెక్కినవి. వానిలో 'జీలకఱ్ఱ సింగినాదము' అనేవొకటి. ఇది మాటలునేర్చిన ప్రతి తెలుఁగుబిడ్డనోటికీ పరిచితమై ఉంటుంది. దీనిని నిర్లక్ష్యార్థంలో వాడుతుంటాము. ఉదా:-ఎవరైనా ఏదైనా చిన్న వస్తువును జాగ్రత పెట్టమని చెప్తారనుకోండి. అప్డు మనం దాన్ని "ఆ! పోనిద్దూ! 'జీలకఱ్ఱ సింగినాదము' దాన్ని జాగ్రత్త పెట్టేదేమిటి?" అంటాము. లేకపోతే ఎవరైనా ఏదైనా రహస్యంగా చెప్పుకొన్నపుడు మనం దాన్ని గూర్చి ప్రశ్నిస్తాప మనుకోండి. "ఆ! ఏమి లేదోయి 'జీలకఱ్ఱ సింగినాదము' అంతే ఏమి లేదు" అనడం కద్దు. "సింగినాదము జీలకఱ్ఱ" అని సామెతను త్రిప్పి పలకడంకూడా ఉన్నది. కాని ఆవ్యవహారం తప్పు. ఎలాగో తారుమారైంది. అంతే కాని "జీలకఱ్ఱ సింగినాదము" అనడమే ఒప్పు. ఈ సంగతి ముందు వ్రాయఁబోయే దీని కథనుబట్టి పాఠకులకే తెలుస్తుంది. కృష్ణా గోదావరి జిల్లాలలో దీన్ని తఱచుగా వాడుతారు. గుంటూరు మండలంలో దీనివాడుక తక్కువ. గంజాం మండలంలోకూడా ఇది వినఁబడుతూనే ఉంటుంది. తక్కిన మండలాలవిషయం నాకు తెలియదు. ఎక్కడ వాడినా, దీనిఅర్థం, ప్రయోగం తెలిసి వాడేవారుమాత్రం చాల అరుదనే నా అభిప్రాయం.

ఇంక దీని కథ. ౧౬ వ శతాబ్దంలో రాయలవారస్తమించినారు. ఆంధ్రరాజ్యరమ దిక్కులేని దివాణమైనది. రాయలఅనంతరం రాజ్యం అరాజకమై చాలా అల్లకల్లోలాలు జరిగినట్లు చరిత్రపాఠకులకు బాగా తెలిసినవిషయమే. ఆసందర్భంలో తురుష్క ప్రభువులొకప్రక్క నుండి తెలుఁగుభూమిని కబళించేస్తున్నారు. అపుడు బలిష్ఠులైన కొందఱు తురుష్కులు నాథుఁడులేని తెలుఁగుగడ్డమీఁద బడి అర్ధరాత్రకన, అన్నప్రొద్దనక లూటీచేసి వస్తువాహనాలు చేఁజిక్కించుకొనిపోయేవారు. ప్రజలు ప్రాణాలు గుప్పిటఁబట్టుకొని ఏ ఘడియ కా ఘడియ ప్రాణ, మాన, ధనాలమీఁద ఆసలు వదలుకొని భయంతో విప్లవపు మూకలను, ఆసతో ఆదరించే ప్రభువునూ ఎదురుచూస్తూండేవారు. ఈ తుంటరిమూక ఊరుబయట విడిసి తామువచ్చినట్లు గుర్తుకోసం వాళ్లధర్మమా అంటూ సింగినాదం (శృంగనాదం) చేస్తూండేవారు—బూరటకొమ్ము లూదేవా రన్నమాట. ఆ సింగినాదం వినడమే ప్రజలకు పైప్రాణాలు పైననే పోయేవి. అపుడు జనులు మూటా, ముల్లె కట్టుకొని పలాయనసూత్రం పఠించేవారు. కాని యీ లోపలనే మూకలు పైఁబడిపోయేవిలెండి పాపం!

సరిగా ఆ సమయంలోనే 'కాబూలు' దేశంలోనుండి ఆఫ్ఘనుల మూకలు జీలకఱ్ఱ బస్తాలు వేసికొని హిందూదేశానికి క్రొత్తగా దిగుమతిచేస్తూండేవారు. వాళ్లుకూడా ఊరుబయట విడిసి తమరాకకు గుర్తుగా వేరొకమాదిరిగా ధ్వనికల సింగినాదం చేసేవారు. ప్రజలు ఈ రెండువిధాలైన సింగినాదాలు వినడంలోనూ కళవళపడేవారు. ఒకొక్కపుడు కాబూలువారి సింగినాదం విని అది తుంటరితురకల సింగినాదం అనుకొని ఖంగారుతో ప్రయాణసరంజామ సిద్ధంచేసుకొనేవారు. అపు డెవరో బుద్ధిమంతుఁ డుండి "ఓయి నాయనలారా అది తురకగుంపుల సింగినాదంకాదు. కాబూలువారి జీలకఱ్ఱసింగినాదమోయి. మనం భయపడనక్కఱలేదు." అని తెలియఁజెప్పినమీదట ప్రజలు గుండె నిమురుకొని కళవళం అణఁగి 'డేందానన్ జెయి నెట్టుకొని' నిర్లక్ష్యంగా నిద్రించేవారు. అప్పటినుండి క్రమంగా నిర్లక్ష్యార్థంలో "జీలకఱ్ఱ సింగినాదం" అని వాడడం అలవాటైపోయిం దంటారు పెద్దలు.

# దేవీ ప్రసాద నారాయణరావు

**పి. రామనాథ శర్మ**

ఆంధ్రులలో ప్రఖ్యాతపురుషులనుగురించి యాంధ్రలోకమున కెఱుకపరచుట ప్రతి యాంధ్రునికిని విధియైయున్నది. ఆంధ్రమహాశయులలో నొక్కొక్క రొక్కొక్క త్రోవదొక్కి తెనుగునాడున కగణితకీర్తి గడించుచున్నారు. ఊరు పేరులచేగాని వేషభాష



మాధవపెద్ది
దేవీప్రసాద నారాయణరావు

లచేగాని వీరు వీరని నిశ్చయింపరాని ఈ కాలమున వారిం గూర్చి తెలిసినవారు తెలియనివారికై భారతీత్యాది పత్రికల మూలమున దెలిపినచో ఆంధ్రమాత గర్భశుక్తి ముక్తాఫలముల ప్రాశస్త్యమును గ్రహింప నవకాశము గల్గును. ఏలన మన నారాయణరావుగారు "దేవీప్రసా" దనియు, "దేవీ"అనియు పిలువబడుటచే వీరిని వంగీయులా యని సందేహించుటకు తావు గలదు. అది గాక వీరు బెంగాలీ, తమిళము, హిందుస్తానీకూడ చక్కగ మాట్లాడగలిగియుండుటవలన వీ రెవరా యనిపించుచుండెడిది. నిజమునకు వీరాంధ్రులు. వీరి యింటిపేరు అనప్పిండివారు. ౧౯౨౮ వ సంవత్సరమున వీరిని మదరాసు ప్రభుత్వ లలితకళాశాలయందు చేర్చుటకు మేనమామగారు వెంట గొనివచ్చిరి. పేరు వ్రాసికొను గుమాస్తా "ఇంటిపేరే" మని యడుగ మేనమామగారే యాలోచనలోనో తమయింటిపేరు "మాధవపెద్దివా"రని చెప్పిరి. ఆనాడు వీరికి మాధవపెద్ది దేవీప్రసాద నారాయణరావని నామకరణము చేయబడినది.

వీరి పితామహులైన సత్యనారాయణరావుగారు పాలకొండ సంస్థానమునందు దివానుపదవియందుండిరట. వీరితండ్రి ముత్యాలరావుగారు రాజమండ్రి నివాసస్థాన మేర్పరచుకొనిరి. నారాయణరావుగారి జన్మస్థాన మదియే.

వీరి విద్యాభ్యాసము విశాఖపట్టణమునందు గడచినది. వీరి కారంభమునుండియు చిత్రకళయం దభిరుచి కలదు. వీరు విశాఖపట్టణమందలి యున్నత పాఠశాలయందు జదువుచున్న కాలమున వీరి చిత్రకళాచార్యులు వీరి యభిరుచిని గుర్తించి కళాశాల విద్యలవలన నుపయోగము లేదనియు, ప్రత్యేకము కళాసేవకు బూనినచో యశోధనాదుల నార్జింప సులభమనియు చెవి నిల్లుగట్టుకొని చెప్పి వీరి కళాపిపాసకు దోహదము గావించిరి. తదనంతరమే వీరు మేనమామగారి సాయమువలన ౧౯౨౮వ సంవత్సరము మదరాసు చిత్రకళాశాలయందు చేరిరి.

ఈ కళాశాలకు శ్రీ దేవీప్రసాద రాయచౌదరిగారు ప్రధానాచార్యులుగ నేతెంచినప్పటినుండియే నారాయణరావుగారి కళాపిపాస గుర్తింపబడి యభివృద్ధి బొందుటకు మార్గ మేర్పడినదని చెప్పవచ్చును. ప్రధానాచార్యుల ప్రోత్సాహమున నారేడు సంవత్సరము లభ్యాసము ముగిసినతరువాత, ౧౯౩౮ వ సంవత్సరమున ప్రథమతరగతి యోగ్యతాపత్రము (1 st Class Diploma), వర్ణచిత్రరచనయందు బంగారు పతకమును బొందిరి. వీరు విద్యార్థి దశయందే చిత్రించి పలువురి మెప్పువడసిన చిత్రము లెన్నెని గలవు.



నారాయణరావుగారి 'శివతాండవ.' నాట్యము



అశోకుని బౌద్ధమత ప్రచారము

త్తా, అమరావతీయుగముల వెనుక శిల్పకళలో భారతీయ సంప్రదాయమును జొన్పి పౌరాణికభావముల నుద్రిక్తములు గావించి, చిత్తరువులను (Indian art in Bas Reliefs) సృష్టించుటలో ప్రప్రథముడవు నీవే యని యనేకమారులు .కళాశాలాచార్యులు చౌదరీగా రని యుండిరి. ఇది యథార్థము. ఇట్టిచిత్రములందు ముఖ్యముగ బేర్కొనదగినవి (౧) ప్రలోభనము, (౨) రాసలీల, (౩) రాగరాగిణులు. ఇందు మొదటిదానిలో బుద్ధభగవానుని ధీరచిత్తము, ఉత్తమకళావిశేషము, ఆ మహామహుని ముఖమునం దుట్టిపడు కళ అపూర్వము. ఆయనము మనోనైర్మల్యము భ్రమింపజేయవచ్చిన యాజవ్వనుల మనస్సులకును బ్రాకి వారలకర్తవ్యమును కేవలము భక్తిపూర్వకసేవగా మార్చినది. ఆ స్త్రీల సుఖసరోరుహములందు కామోద్రేకమును కలిగించు భావము మాయమయినది. బుద్ధదేవుని చరణకమల సేవాతత్పరతే గాననగును. బుద్ధుని విగ్రహమునకు సమీపమున నిరుప్రక్కల నున్న స్త్రీమూర్తు లొండొంటితోడను, ఆ తరువాత నిరుప్రక్కలగల స్త్రీమూర్తులు రెండు నొండొంటి



వసంతలీల

తోడను పొందిక యను విధానము (Figure balancing) అంగభంగిమతోడను విగ్రహరచనకు (Figure composition) రక్తి గూర్చుచున్నది. మిగిలినవియు చాల పొందికగ నమర్చబడియున్నవి. శ్రీకృష్ణుని 'రాసలీల' అను దివ్యశిల్పచిత్రము పేరెన్నిక గన్నది. దాని ఛాయాచిత్రమే అందలి గుణవిశేషములను స్పష్టీకరింప గలదు. ఇందు ముఖ్యముగ గమనించదగినది శ్రీ కృష్ణుని మూర్తి. అన్ని విధముల మూర్తిలక్షణము లమరియున్నవి. ఆమూర్తిఎత్తిన చేయిమీదుగా ఎడమకాలి

ఇపుడు నారాయణరావునుగూర్చి యాంధ్రలోకమునకు దెలియజేయవలయు ననెడి యుత్సాహమునకు కారణ మాయన కొక చిత్రకళయందున్న యసమానప్రజ్ఞ మాత్రము కారణముగాదు. కళాపిపాసకులై వివిధ కళలందొకటిగా ప్రతిభావంతులై యుండు టరిది. వీరన్నో చిత్రకళయందేగాక శిల్పకళయందును, భరతనాట్యమందునుగూడ సమానప్రజ్ఞావిశేషముల బొంది భావ్యాంధ్రలోకమును కళాప్రపంచమున నత్యంత శోభాయమానముగా చేయగల సామగ్రితో సిద్ధముగానున్న యువకుడు; ఆంధ్రుల నైదుష్యమును సర్వతోముఖముల వెల్లడింపనున్న కళామూర్తి.

భారతీయ చిత్రకళ భావప్రధానమైనది. ఆభావము చిత్రకారుని హృదయగతమైనది. ఇట్టి యుద్భావములనేకము పురాణాది గ్రంథములలో నంతర్లీనమై యున్నవి. వీనిలో సరస శృంగారరసాద్యనేకరస ప్రధానసన్నివేశములకు బుట్టినిల్లైన శ్రీ కృష్ణ చరిత్రము, బుద్ధచరిత్ర ఈచరిత్రలందలి భావములు చిత్రకారులచే రూపింపబడి యెల్లరికి నానందదాయకములై యున్నవి. నారాయణరావుగా రీచరిత్రలనుండియే యుద్భావములను గ్రహించి మనోహరచిత్ర సంచయమును సృష్టించి శ్లాఘనీయులై యున్నారు.

శిల్పము పాశ్చాత్య పద్ధతులలో తప్ప భారతీయ పద్ధతులలో ప్రదర్శించినవా రిటీవల గన్పించరు. "అజం

ననుసరించి మరల కుడిపాదము కొనవరకు గల వంపులతో విగ్రహభంగిమలక్షణము లతో (Convention bendings) ఎడమనైపున చివరనున్న స్త్రీ విగ్రహము కుడియర చేయి మొదలుకొని శరీరము ననుసరించి క్రిందవరకును గనుపరుపబడిన వంపులతోడను (Balancing in rhythm)-చున్నదని గ్రహింపగలరు. ఇవిగాక శ్రీ రామ పట్టాభిషేకమును, రెండవది యగు రాసలీలయు, శ్రీ యస్. వి. రామస్వామి మొదలియారుగారి శిల్ప సముదాయమునందు గాననగును. ఈ రాసలీల మరియొక ప్రతి వేడి కోలుపై న్యూయార్కు (అమెరికా) వాస్తవ్యులగు జేమ్సు కుష్మెన్ గారి కొరకు తయారు చేయబడినది. వారు విశేషధనము నొసంగి అమెరికాకు తీసికొనిపోయిరి. శ్రీ తిరువాన్కూరు మహారాజావారు లోహప్రతిమగా పోయించి సంపుమని కోరినమీదట రాగ రాగిణులు లోహప్రతిమకై ఇటలీ విగ్రహనిర్మాణశాల (Foundry) కు పంపబడినది.

శ్రీ విజయనగర మహారాణిగారి చిత్రసంచయమునందు గల వీరి 'యమునాతీరము'ను పరిశీలించినచో గీతగోవిందమునందలి యమునాతీరమున శ్రీకృష్ణభగవానుని వేణుగానామృతము, ఆవేణుగానామృత రసాస్వాదనకై యేతెంచిన సమస్త జీవులును యథార్థముగ చిత్రితము చేసియున్నారన్న ఆ గీతగోవిందము నెంతక్షుణ్ణముగా జీర్ణము చేసికొన్నారో తెలియగలదు. రెండవది 'బుద్ధ సుజాత' యను పటము. బుద్ధభగవానుడు బోధి తరుమూలమున తపోనిష్ఠ గూర్చుండియుండ సుజాత యనునొక కన్య యాసన్యాసియందలి ప్రేమగౌరవములచేత ప్రతిదినమును పాయసమును గొనియిచ్చుచుండెడిదట. ఆ కన్య ముఖపంకజమునందలి యుదారభావము పరిశీలనార్హము. ఇవి ౧౯౩౮ లో తయారుచేయబడినవి.



రాసలీల

శ్రీ నాభామహారాజావారి చిత్రసంచయములో వీరి 'రాసలీల' యథార్థముగా గీతగోవిందమునందలి 'రాసలీల' ఘట్టమును వేయినోళ్ల చాటుచున్నది. అందలి విగ్రహముల అంగభంగిమము, వంపులు అత్యంత హృద్యముగా కృష్ణున కిటునటు గల గోపికామూర్తులొండొంటితో నైపద్ధతుల నెంతయో పొందిక కల్గియున్నవి. ఇవన్నియుగాక శ్రీకృష్ణుని కుడిచేతి ననుసరించి యెడమచేయి వరకు నొక వంపును, మరల నటునుండి ఎడమనైపున గూర్చుండియున్న గోపీవిగ్రహము నా పాదాంతము గల వంపునకలసియు, కృష్ణుని తలమట్టును గల కిరీట వృత్తమును అనుసంధించి చూచినచో భారతీయ కళా ప్రధానభూతమైన ప్రణవస్వరూప మేర్పడును: ఇక రాగరాగిణులను విస్తరించి యెంతచెప్పినను చెప్పవచ్చును. ఈ శిల్పచిత్రము నెదుట నిల్చినవారు మంత్రముగ్ధులవలె నిలుచుండెదరు. మూర్తులు రెండే. ఒకదానితో నొకటి అతిభంగ, సమభంగి విధానములతో నలరారుచున్నవి. ముఖపంకజములు అత్యంత భావపూరితములు. ఇందునను పురుషుని కిరీటముకొననుండి స్త్రీ కటివృత్తము మీదుగ పాదములవరకును గల రెండు వంపులకును వీణాయంత్రము చివరభాగమునందలి వృత్తమును జతచేసి చూచిన స్పష్టమగు ప్రణవమేర్పడు



ప్రలోభనము

యాకర్షకములు. రెండవది 'శబరి'. ఇందలి శ్రీరాముని పరిశీలనము కళావిద్యార్థులకు సహాయకారి. కొడైకెనాల్‌లో జరిగిన (౧౯౩౫ సం.) చిత్రప్రదర్శనమునం దిది నాభా మహారాజావారిచేత కొన బడినది. కొందరి వేడికోలుపై మరియొకప్రతి తయారుచేయబడి



రాగ, రాగిణులు

మైసూరు దశరాత్రిప్రదర్శనమునకు పంపినపు డచ్చట మొదటితరము యోగ్యతా పత్రములను, పతకములను పొందినది.

నవాబ్ సాలర్‌జంగ్‌వారి సంచయమున గల "సహచరులు" (Comrades) భావభూయిష్ఠమై యున్నది.

(౧) మహాప్రజాపతి గౌతమబుద్ధ, (౨)అశోకుని బౌద్ధమత ప్రచారము, (౩) వసంతలీల–ఇవి ౧౯౩౬ సం. లో కలకత్తా అకాడమీచిత్రకళా ప్రదర్శనమునకు రూ. ౩౫౦,౬౦౦,౧౦౦౦౦ మూల్యములు నిర్ణయింపబడి బహుమతుల నందినవి. అందు ౨, ౩ పటముల ఛాయాచిత్రము లిందు పొందుపరుపబడినవి. ఇవిగాక "యోధవరుని వీడ్కోలు" అనునదికూడ నొకగొప్పచిత్రమే. ఇంకను ఎన్నియో చిన్న పటములును పాశ్చాత్యపద్ధతులలో ప్రకృతి చిత్రములనేకములు యథాశాస్త్రముగ మనోహరముగ చిత్రించిరి. ఆపాశ్చాత్య సంప్రదాయమునను గూడ పతకములను బడయగల్గిరి.

## శిల్పము

శిల్పమునందు మన భారతదేశమున ప్రఖ్యాతి జెందినవారే కొద్దిమందిలో చౌదరీగారు, నాగప్పగారు, మాత్రేగారు, కర్మాకరుగార్లు ముఖ్యులు. మన నారాయణరావు గారును ధారాళముగ నావరుసలో జేర్పదగిన వారే. ఒకభావప్రయోగమునందు చిత్రరచనము, శిల్పమును వేర్వేరుమార్గముల నడచినను భావస్ఫూర్తియం దొక్కటే గమ్యస్థానమును చేరుచున్నవి. స్ఫుటముగా నొక భావమునకు స్వరూపమును, వర్ణములు, నీడ, వెలుతురులలో (Lights & Shades) గాని ఘనస్వరూపమున వస్తునిర్మాణమును (Substantial form) వ్యక్తపరచుదానికిని విశేషభేదము గలదు. ఆ రెండవ విషయమే శిల్పము (Sculpture). ఏమహాపురాణకాలముననో అజంతా ఎల్లోరా అమరావతి ఇత్యాది కళాజన్మస్థానములందుగల శిల్ప చిత్రరువులందు తప్ప ఇటీవల సామాన్య ప్రకృతిస్వరూపము ఉన్నదియున్నట్లు శిల్పకళ చూపుటయే మనము చూచుచున్నాము. ఇది కేవల పాశ్చాత్య సంపర్కమే. అట్టి శిల్పమున మనశిల్పి సున్నితమగు సూక్ష్మములు గ్రహించి అనుభవము సంపాదించెను. రవీంద్రునియొక్క ప్రతిమ శిల్పియొక్క అద్భుతానుభవజ్ఞానములను విశదీకరించుచున్నది. ఈ సందర్భమున మదరాసు మెయిలు పత్రిక (౨౭ జనవరి ౧౯౩౭)



పాశ్చాత్యపద్ధతి రూపచిత్రము

టాగూరుగారి సహజగుణవిశేషము లన్నియు నున్నవి యున్నట్లీప్రతిమలో గాననగునన్న ట్లభిప్రాయమిచ్చియున్నది. ఇది నిశ్చితముగా నారాయణరావుగారి శిల్పములలో నత్యంతముఖ్యమైనదిగాను హృదయాకర్షణీయమైనదిగాను చూపఱులే గ్రహింపగలరు. దివాన్ బహదూరు డాక్టరు కె. కృష్ణన్ గారి (పాల్ఘాటు) విగ్రహము సర్వ



శ్రీ డా. రవీంద్రనాథ్ ఠాగూరుగారు

లక్షణ లక్షితము. డా. బిసెంటు దొరసానిగారి విగ్రహము చూచి యందలినైపుణిని ఊహింపవచ్చును. ఇంకను సామాన్యశిల్పము లనేకము ఈతని రచనములు కలవు.

## నర్తనము

భరతనాట్య మెట్టిదో, దానియందలి కళాప్రతిభ యెట్టిదో, అందెంత యగాధమయిన శాస్త్రవిజ్ఞానము నెలుగుచున్నదో యను నాశయముల ప్రసిద్ధనర్తకుడు ఉదయశంకరుడు ఖండాంతరములందు జాటివచ్చెను. ఆభారతీయ నాట్యకళయే కుమారి సిమ్కి (ఫ్రెంచి బాలిక), కుమారి కనకలత, మరికొందరు అమెరికనులనుగూడ నాకర్షించి యుదయశంకరుగారితో త్రిప్పుచున్నది. శ్రీమతి బాలసరస్వతి, శ్రీమతి రుక్మిణీ అరండేలు మున్నగు నర్తకీమణులవలన మరికొంత ప్రాశస్త్యము వెలువడినది. మన నారాయణరావుగారు సర్వకళోపాసకు డగుటవలన ఆ నాట్యకళనుగూడ సమగ్రముగ నవగాహనము గావించుకొని పైనిపేర్కొనబడిన ప్రముఖనర్తకులతో సమాన ప్రఖ్యాతి నందగలవా రగుచున్నారు. అయితే చిత్రలేఖన, శిల్పరచనయం దెక్కువకాలము వినియోగింపబడుచుండుటచే వీ రీనృత్యకళ నింకను పూర్ణాభివృద్ధి నొందించి యగ్రస్థానము నొందలేదు. ఇప్పటికిని ఈ కళయందు పరిశ్రమము గావించుచున్నారు. వీరినృత్యమున 'శివతాండవము' చూపఱులను విమోహితుల జేయును. నటననాదస్వరూపుడగు శ్రీ నటరాజమూర్తిస్వరూపమును చూపునప్పుడు ఆ కళాకాశలను చూచియేతీరవలెను. కొలదికాలములో వీ రొక చిన్న నర్తకబృందమును సమకూర్చుకొని ప్రపంచయాత్ర సలుపనుద్దేశించి యున్నారు. కార్వేటినగరసంస్థాన నాట్యాచార్యులగు వెంకటరాయలుగారు వీరి గురువులు.

ఇటీవల వీరు పాండిచేరి గవర్నరు శిలా విగ్రహమును తయారుచేసిరి. ప్రకృతము తిరువాంకూరులో మహారాజావారి కోరిక ననుసరించి రూపచిత్రములను, శిలావర్ణ చిత్రములను తయారు చేయుచున్నారు.

అటుపైని ఈ 3౭ వ సం. ఫిబ్రవరిలో వీరుఢిల్లీకి వెళ్లెదరు. అచ్చటనే నిలుకడగా నిలువవలయు నని వీరి యుద్దేశము. అక్కడ వీరు ఆరవజార్జి సార్వభౌముని ప్రతిమను పూర్ణప్రమాణమున (Life size full figure, తయారుచేసి పట్టాభిషేకోత్సవము సందర్భమున



శ్రీ కాశీనాథుని నాగేశ్వర రావుగారు
( ఇటీవల నారాయణరావుగారు రచించిన రూపప్రతిమ )

జరుగనున్న చిత్రప్రదర్శనమున నుంచుటకు కృషి చేయుచున్నారు. వీరి కళాపిపాస శాంతినికేతనమునకు గూడ వీరిని కొనివెల్లినది. సుప్రసిద్ధులగు చిత్రకారుల సన్నిధిని కృషి చేయించినది. వీ రందుండి బంగాళాభావను, సంప్రదాయములను కూడ ననుసరించినందు నను, ఈతని పేరు దేవీప్రసా దని యుండుట చేతను పెక్కుమంది యీతనిని బెంగాలీ యని తలంచుచుండెడివారు. వీరిప్రజ్ఞను గుర్తించిన వారును, ప్రోత్సహించినవారును గూడ వంగీయులే. వీరి కళాసేవ యెంతయాకర్షక మైన దో, ఎంతహృదయంగమ మైనదో వీరి ప్రకృతియు, ప్రవర్తనయు, హృదయమును నట్టివే. వీరియందు స్వాతిశయముగాని, గర్వముగాని, స్వార్థముగాని వెదకిచూచినను కానరావు. ఆహృదయమున కాపట్య కౌటిల్యములకు తావులేదు. అనుక్షణమును కళ, కళాపరిశ్రమ, కళాపిపాస- ఇవియే శరణ్యాము, ఆహారము సర్వస్వముగా గల్గిన ఆ యంతరంగమున లౌకి దుర్విషయములకు, దురాలోచనలకు చోర నసాధ్యము. విద్యార్థిగా నున్నపుడు కూడ "తెలియనివాడనై మెలగితిన్ గతమయ్యె నితాంత గర్వమున్" అన్నట్లు తనకన్న సం దరు ఎక్కువ తెలిసినవారేనన్న భావముతో నమ్రతతో మెలగుచుండెడివారు. పెద్దలయెడ గల నిరంతర భక్తిగౌరవములే యీ యున్నతికి కారణము. తమగురువులగు శ్రీ చౌదరీ గారియం దిప్పటికిని వారికి అపూర్వభక్తి. అద్దానిచే నాయనహృదయము నాకర్షింప గల్గెను. మొత్తమున "పుత్రా దిచ్ఛే త్పరా జయం" అన్నారు. శిష్యుడు ప్రత్యక్షుల్యాడు. కావున చౌదరిగారు తమకన్న తప యీ శిష్యుని యభ్యుదయమును కోరి యాశీర్వదించుచుందురు.

ఇంత చిరుతప్రాయముననే లలిత కళలయందు అనన్యసామాన్య ప్రతిభ సంపాదించిన వీరికి పరమాత్ముడెల్లపుడు పాలనుంచి, యభివృద్ధి కన్నిదినముల తోడ్పడుగాతమని ప్రార్థనలతో మాత్ర ముపయోగము లేదు. కళాప్రపంచమున తమ యశోవైభవమును ఆర్జింప గల్గెకట్టిన యీ యాంధ్రయువకుని కన్నిదినముల ఆంధ్రులు తోడ్పడు బాధ్యత వహింపవలయునని మనవినిసూడ గ్రహింపవలసియుండును.

# సూర్యుడు

వడ్లమాని కాళిదాసు

సూర్యుడు సర్వజనులకు పూజనీయుడు: ఎందు చేతనన, జీవకోటికి కావలయు తేజస్సు నిచ్చి పోషించు చున్నాడు. హిందువులు, పార్సీలు మొదలగువారు సూర్యుని దేవునిగా నుపాసింతురు. ఉపాసించుటకంటె వేరుసంగతులేమియు మనకు తెలియవు. కనుక సూర్యు నిగూర్చి కొన్నినూతనవిషయములను తెలిసికొందము.

సూర్యుడు ప్రకాశించు గోళరూపమున నున్నా డని అందరకు తెలిసిన విషయమే. సూర్యుడుకూడ భూమివలె కొంచెము వలయాకారమున నున్న కక్ష్య (Orbit) యందు తిరుగుచున్నాడు. ఈ కక్ష్యయొక్క వ్యాసార్థము (Radius) 92,80,000 మైళ్లు. దీనినిబట్టి సూర్యునివ్యాసమును కనుగొనవచ్చును. సూర్యుడు భూమివద్ద చేయుకోణము 32 మినిట్లు(Angular diameter). ఏవృత్తమునందైనను $360 \times 60$ మినిట్లుండును. అందుచే సూర్యుడు భూమి కేంద్రముగాను 92,80,000 మైళ్లు వ్యాసార్థముగా నుండినవృత్తమునందు $\frac{32}{360\times60}$-వ భాగమును ఆక్రమించును.

సూర్యవ్యాసము 8,64,000ల మైళ్లు. ఇది భూవ్యాసమునకు సుమారు 109 రెట్లున్నది. వీటిపరి మాణములలో తేడాను గ్రహించుటకు భూమిని ఆవ గింజతో (1/20 అం. వ్యాసము) పోల్చిన సూర్యుని $5\frac{1}{2}$ అంగుళములు వ్యాసముగా గలిగి 50 అడుగుల దూరమున నున్న పుచ్చకాయతో పోల్చవలెను.

సూర్యుని బరువును మనము కనుగొనవచ్చును. భూమికి సూర్యుని ఆకర్షణశక్తిని (Force of attraction) సరిగా ప్రతిఘటించు కేంద్రీకరణశక్తి (Centrifugal force) యున్నది.

సూర్యునిబరువు $2 \times 10^{27}$ మెట్రిక్ అని తేలు చున్నది.

సూర్యుని బరువు భూమి బరువునకు సుమారు 3,32,000 రెట్లున్నది. సూర్యుని పరిమాణము భూమి కంటె 13,00,000 రెట్లున్నది. దీనినిబట్టి సూర్యుడు భూమికంటె తేలికయగు పదార్థముతో చేయబడినట్లు తోచుచున్నది. నిశ్చయముగా సూర్యునియందలి కొంత భాగము వాయురూపమున నున్నది.

సూర్యునికిగూడ భ్రమణ మున్నది. ఈ భ్రమణ మున్నట్లు సూర్యునియం దున్న మచ్చలనుబట్టి చెప్ప గలుగుచున్నాము. ఒకసారి తిరుగుటకు 30 రోజులు తీసి కొనునట్లు కనుపించును. సూర్యభ్రమణమందు వింత యొకటి గలదు. సూర్యమధ్యరేఖ (Sun's equator) ప్రాంతము 24 రోజుల 16 గంటలలో పూర్తిగా ఒక సారి భ్రమించుచున్నది. ధ్రువప్రాంతము లొకసారి పూర్తిగా తిరుగుటకు 34 రోజులు తీసికొనుచున్నవి. దీనినిబట్టి సూర్యునియందు కొంతభాగము ఘనరూపము గను, మరికొంత ద్రవముగా గాని వాయురూపమునగాని యున్నదని గ్రహించవలసి యున్నది.

సూర్యుని అంతర్భాగ మేవిధమున నున్నది మనకు తెలియదు. కాని పైభాగము మాత్రము మంటతో జ్వాలాసముద్రమువలె నున్నది. సూర్యుని ఉష్ణోగ్రత (Temperature) భూమిపై నున్న ఏకొలిమికిని లేదు. మన మెప్పుడును చూచియెరుగని తుపానులు సూర్యు నిపై రేగుచుండును. కొన్నితుపానులు సెకనునకు 15, లేక 20 మైళ్ల వేగమున పోవుచుండును. ఇవి ప్రకా శించుచున్న వాయుపదార్థము కావచ్చును.

సూర్యుని ఫోటోతీసిన సాధారణముగా మచ్చలు కనుపించును. ఈమచ్చలు మధ్య నల్లగాను, చుట్టును కొంచెము తక్కువనల్లగాను ఉండును. ఈమచ్చలు నల్లగా నున్నప్పటికి మనము దీనిని చూడలేము. ఇవి

తుపాను లయి యుండవచ్చును. పెద్దమచ్చయొక్క నల్లని మధ్యప్రదేశము మనభూమికన్న రెండుమూడు రెట్లు పెద్దదిగా నుండును. మచ్చ లేర్పడుటకు ఆప్రదేశ మందు గాలిఒత్తిడి (Pressure) తగ్గుటయే కారణము. సూర్యునినుండి ఎల్లప్పుడు ఎలక్ట్రానులు ప్రవహించు చుండును.

సూర్యునిపై చెలరేగు తుపానులకు కారణము లేకపోలేదు. తుపాను పట్టుటకు వాయుపీడనమందును, ఉష్ణోగ్రతయందును హెచ్చు మార్పుండవలెను. సూర్యు నియం దీరెండును విశేషముగా నుండుటచే నిరంతరము తుపానులు కలుగుచునే యుండును.

సూర్యునియందలి జ్వాలలను (Prominences) ప్రత్యేక సాధనముల సహాయమున చూడగలము. సంపూర్ణ సూర్యగ్రహణము(Total eclipse)నాడు జ్వాలలు స్పష్టముగా ఎఱ్ఱని నాలుకలవలె మనకు కను పించును. ఒక్కొక్కప్పు డివి సుమారు 5 లక్షలమైళ్ల పొడవు గలిగి, గంటకు 300 మైళ్ల వేగమున వ్యాపించు చుండును. ఈ మండేవాయువు ఉదజని (Hydrogen) అయియుండ వచ్చును. జ్వాలలు సూర్యుని పైపొరయగు 'క్రోమోస్ఫియర్' నుండి పుట్టును. దీనిదళసరి 7 లేక 8 వేలమైళ్లున్నప్పటికి, భూమిపై నున్న వాయువు భూమితో ఏనిష్పత్తిలో నున్నదో సుమారు ఆనిష్పత్తి లోనే సూర్యునితో ఈ 'క్రోమోస్ఫియర్' ఉన్నది. గ్రహణసమయములందు మాత్రమే చూడనగు ప్రకా శముకూడ గలదు.

సూర్యుని అంతర్భాగము వెలుపలకంటె మిక్కిలి వేడిగా నిడుననుం మన మూహింపవచ్చును. ఏల నన, వేడిమి పైనుండి ప్రసరించుటచే లోపలినుండి వేడిమి బయటకు రావలెను ; కాని ఉష్ణ మెప్పుడును ఉష్ణప్రదే శమునుండి అంతకంటె తక్కువవేడిగల ప్రదేశమునకు ప్రవహించును. అందుచే సూర్యుని యంతర్భాగము బహిర్భాగముకంటె వేడిగా నుండును. సూర్యుని మధ్య నున్న ఉష్ణోగ్రత 2,00,00,000 °C అని అంచనా వేసి నారు.

సూర్యునినుండి విడుదలయగు శక్తి (Energy) అపరిమితము. ప్రతి చదరపు టంగుళము 50 గుఱ్ఱముల శక్తి (50 H. P.) ఇంజనును నిరంతరము నడపుటకు కావలసిన శక్తిని విడుదల చేయుచుండును. సూర్యుడు $5 \times 10^{22}$ H. P. శక్తి నిచ్చును. మన భూమి ఈశక్తిలో $25 \times 10^{13}$ H. P. ను తీసికొనుచున్నది. సహారా ఎడా రిపై బడు సూర్యరశ్మి నుపయోగించగలిగిన మనకే యంత్రము అవసరములేదు. సూర్యుని సరాసరి వేడిమి 6000°C ఉన్నది. సూర్యుని కీశక్తి (Energy) అంతయు పరమాణువుల మూలమున ఏర్పడుచున్నది. 1 గ్రాము పదార్థమును నాశనముచేసిన $9 \times 10^{22}$ ఎర్గుల (Ergs) శక్తి విడుదల యగును. సూర్యునియందున్న ఉదజని పరమాణువులు సెకనునకు 2,50,00,00,000 టన్నులు శక్తిగా (Energy) మారినచో సూర్యునినుండి వెలువడు శక్తికి సమానమగును.

ఈ విధముగా జీవకోటికి అనేకవిధముల నుప కరించుచున్న సూర్యభగవానుని మన పూర్వులు దేవు నిగా పూజించవలసినదని నియమించుటయందు ఆశ్చర్య మేమియు లేదు.

# కలగూరగంప

## ఆ వే ద న

మిత్రుడు పూడిపెద్ది వెంకటరమణయ్య చనిపోయాడన్న వార్త పిడుగులా దూకింది. విషాదమూ, ఆశ్చర్యమూ ఒక్కమారుగా చుట్టుముట్టుకున్నవి.



మొన్న వేసవి సెలవుల ప్రాంతాన ఆయన చెన్నపట్టణం వచ్చి నెలరోజులు ఉండి పోయాడు. అప్పుడెంతో ఆరోగ్యంగా ఉన్నాడు. తర్వాత ఎన్నో ఉత్తరాలు వ్రాశాడు. అనారోగ్యంగా ఉన్నానని ఎన్నడూ వ్రాయలేదు. జబ్బున్న వార్తయినా రాలేదు. హఠాత్తుగా చనిపోయాడు! ఎంత ఘోరం!!

వెంకటరమణయ్య మంచి ప్రాయంలో వాడు. ఏభయికి నాలుగైదేండ్లు తక్కువగానే ఉంటుంది. అంతటితో తీరిపోయింది ఆయనకు పరమాయుర్దాయం. నవ్యసాహిత్య నిర్మాతలపట్టికలో ఒకగట్టిపద్దు రద్దయి పోయింది శాశ్వతంగా.

వెంకటరమణయ్య ఒడ్డూపొడుగూ ఉన్న దండిమనిషి. ఆయనముఖంలో శాంతరసం ఉట్టిపడుతూ ఉంటుంది. కన్నుల్లో కాంతి వెలుగులు చిమ్ముతూ ఉంటుంది. వేషం ఎప్పుడూ మాయకుండా, చెక్కుచెదరకుండా జాగ్రత్తగా చూచుకునేవా డాయన. అన్నివిధాలా ఆయనది కన్నుతనిసిన విగ్రహం. తలచుకుంటే ఎదుట నిలువబడినట్లుంది!

ఆయన మనస్సు నవనీతంవంటిది. మృదువుగానూ, మితంగానూ మాటలాడేవాడు. ఆత్మస్తుతీ, పరనిందా ఆయనకు గిట్టదు. అనవసరంగా చర్చలలోకి దిగి ఇతరుల మనస్సును నొప్పించే స్వభావం కా దాయనది. ఏవిధాన చూచినా ఆయన స్నేహపాత్రుడు; సహృదయుడు.

వెంకటరమణయ్యది నిశితమయిన బుద్ధి; గ్రహణశక్తి దానికి తోడు. ఇట్టే ఒక చిన్న విషయం తీసుకొని అట్టే అద్భుతంగా ఒక కథ అల్లేవాడు. కథలు అల్లడమంటే అవలీల ఆయనకు. పరిశీలనశక్తికంటె కల్పనాశక్తి అధికము. ఆయన తనవద్ద వ్రాసిపెట్టిన కథలు కొన్నివందలు ఉన్న వన్నాడు మొన్న వచ్చినప్పుడు. కొత్తఛందస్సులో పద్యరచనలుకూడా ఎన్నో చేశాడు. వాటిలో కల్పనకూడా చమత్కారంగా ఉంటుంది. రచన కొంత కృత్రిమంగా ఉండడంవల్ల కొంత వెగటుగాతోచినా శక్తిలోమాత్రమూ కొరతపడేది కాదు; భావబంధురంగానూ ఉంటుంది.

భారతి మొదలయిన పత్రికల్లో చిరకాలాన్నుంచి ప్రకటింపబడుతూ వచ్చిన ఆయన రచనలు వందకు పైబడి ఉంటవి. అదికాక, తన రచనలకోసమని, ఆయన స్వయంగా ఒక త్రైమాసికపత్రిక ప్రారంభించి రెండు సంచికలు ప్రకటించాడు; ఆతర్వాత అది పోయిం దాపత్రిక. ఇది ఆరేడేండ్లకు పూర్వపు విషయం.

సాహిత్య విషయంలో—ముఖ్యంగా: కథలూ, ఛందోబద్ధ రచనలూ – వీటివిషయంలో— కొన్ని నూతనభావాలు ఆయన కుండేవి. వాటికి రూపం యిచ్చి నిలబెట్టాలని ఆయన సంకల్పం. ఆ సంకల్పం ఫలోన్ముఖం కాబోచ్చింది. ఇంతలో పాపిష్ఠి మృత్యువు ఆయనను పొట్టనుబెట్టుకొనిపోయింది! ఆయన సంకల్పం సంపూర్ణంగా సఫల మయితేనా నవ్యసాహిత్యానికి ఒక కొత్తశాఖ ఏర్పడి ఉండేది.

ఆయన పెద్దకుటుంబంలోవాడు. ఆయన కుటుంబమూ పెద్దది: అయిదారుగురు పిల్లలూ, ఇల్లాలూ, బంధుమిత్రాదు లనేకులు. తన కుటుంబసంపదను చెప్పుకొని ఎంతో మురిసిపోతూ ఉండేవాడు పాపం!

ఆయనతో ఏమాత్రం పరిచయం ఉన్నవారి కయినా ఆయన మృతికి కడుపు చెరువు కాక తప్పదు! ఆయనను ఎన్నటికీ మరిచిపోలేరు వారు. ఇంక ఆయన కుటుంబం దుఃఖానికి అంతంటూ ఉంటుందా? అది ఒక సముద్రం. దాంట్లోయావజ్జీవం ఈదుతూ ఉండవలసిందే.

ఆయనవంటివారు చాల అరుదుగాగాని పుట్టరు. ఆయన లేకపోవడంవల్ల నవ్యసాహిత్యానికి తీరనినష్టం కలిగింది.

గ. సు.

---

## నా కళాపూర్ణోదయ పరిష్కృత పాఠములు కొన్ని

ఇంతకుమున్ను ముద్రితమైన కళాపూర్ణోదయమునందు సుమా రాఱువందలపాఠములున్నవి. పదునాల్గు వ్రాతప్రతుల సాహాయ్యమున నట్టిదోషములను సవరించి మూలపాఠము పరిష్కరించి కళాపూర్ణోదయ కథ సుబోధ్యమగునట్లు భావప్రకాశికయను టీక రచియించితిని. ఆ మహాప్రబంధము శ్రీ శ్రీ పిఠాపురమహారాజావారి సమాదరణమున ముద్రిత మగుచున్నది. పరిష్కృతపాఠములు కొన్ని ముందుగాఁ బాఠకులోకమునకుఁ దెలుపుట మంచిదని మిత్రులు కొందఱు నాకు వ్రాయుటంబట్టి మచ్చునకుఁ గొన్ని యీపత్రికాముఖమున భాషాభిలాషులకుఁ దెలుపుచున్నాను. ముందు పూర్వముద్రిత పుస్తకపాఠకమును, తరువాతఁ బరిష్కృతపాఠమును జూపఁబడును. పాఠకులు దానికిని దీనికిని గల యర్థభేదాదులు గ్రహింతురుగాక.

౧ ఆ. ౩౦. "కటికిచీఁకటిఁ గప్పు కప్పఁ బూనినకొప్పు కొప్పుతోరంపుజక్కువ జెడంగు"

"కటికిచీఁకటికప్పు గప్పఁబూనికె కొప్పు కొప్పు తోరంపుఁ జక్కువ జెడంగు"

౨ ఆ. "చెలులం జుట్టల దండనాథుల విపశ్చిద్వర్యులన్ సత్కవీం,ద్రుల మంత్రీశుల వారముఖ్యుల ముకుందుం డెంతయుం బ్రీతితోఁ, బిలుపించెన్ బొడగాంచి రవ్విభవశోభిన్వారలన్ వేత్రహ, స్తులు దమ్మం దఱ నప్డుపేరెలుఁగుతోఁ దోడ్తో నెతిం గించుచున్."

"చెలులం జుట్టల దండనాథుల విపశ్చిద్వర్యులన్ సత్కవీం, ద్రుల మంత్రీశుల వార ముఖ్యుల ముకుందుం డెంతయున్ బ్రీతితోఁ, బిలిపించెం బొడగాంచి రవ్విభవ శోభిన్ వారలున్ వేత్రహ, స్తులు దమ్మం దఱనప్డు పేరెలుఁగుతోఁ దోడ్తో నెఱుం గింపఁగన్."

౨ ఆ. "అరిగితి మపు డేనను దుం, బురుఁడును విశ్వావసుండు మొదలుగ వీణా, ధరుల మొకకొందఱము త, త్పరతయు భక్తియుఁ దలిర్పఁ దత్సేవకునై"

౫ ఆ. "కృతకమరాళసమేతా, గ్రత నమరెడు నడిమిమానికపుఁగంబముతో, నుతకాంచన సోపాన, ప్రతతులతో నొప్పు నొకసరసి తూర్పుదరిన్."

కథాసందర్భమం దతిముఖ్యములైన యిట్టి పద్యములు మఱిరెండును, పూర్వోత్తర వాక్యములకు సందర్భము కలిపెడి చిన్నచిన్న వచనములు సుమారు నూటపదియుఁ బూర్వముద్రిత కళాపూర్ణోదయ పుస్తకములలో లేనే లేవు.

౩ ఆ. ౩౨ "చంచలనేత్ర యిట్లు వనసంగతి కొప్పటఁ గాంచి మాని దాఁ, గొంచక పట్టెఁ బైచెఱఁగు"

"...తనసంగతి కొప్పటగాంచి..."

,, ౨౫ "గల్లున నందియల్ గదలంగ నది తన్నెఁ గాంత యక్కజ మశోకంబయగును."

"...యక్కజ మశోకంబ యగును"

,, ౧౯౯ "కత్తి చేయెత్తి మ్రొక్కి, వ్రేయఁ బూనదీని వ్రేసిన నిద్దేవి, యానసుమ్ము."

"...వ్రేయఁ బూన దీన వ్రేసితే నిద్దేవి"

,, ౧౯౩ "ఓయింతి నీ స్వేదకితి సెల్లచోట్ల, నెందుఁగానక చోద్యమందుచు నప్పు డక్కడనుంటి విప్పు డిక్కడికి వచ్చితివి."

"...చోద్యమందితినప్పు డెక్కడనుంటివి".

,, ౨౩౯. "తన్నట్లుపలికి ద్రొబ్బఁగ, మిన్నక చన నంత నోరుమెదపక యది."

"చన నంత నోరుమెంగయె యది...."

౪ ఆ. ౧౦౬ "అప్పటితద్విలేపన పటాభరణాదుల వైభవోన్నతుల్, రెప్పలు విచ్చి మాడక చరింపనియట్టి పరాకుచేతఁ దా, నెప్పటియట్లయుండె నతఁ డింటికడన్ దడవుండియుండి నా, యొప్పమి యేమిసంఘటిలె నొక్కొ యటంచు విషాదమొందఁగన్."

"...యుండెనతఁ, డింతి కడున్ దడవుండి."

,, ౧౨౯ "కడుఁజనవిచ్చినన్ గర్వింపనీక యుండిన భేదమొందవు."

"కడుఁజనవిచ్చినన్ గర్వింప నీకయుండిన భేద మొందవు."

,, ౧౪౪. "చేర్చుకొనురాజ్యంబున్. ఆమణి స్తంభుఁ డాయకఁజూచి"

"తన మణిస్తంభుఁ డాయకఁజూచి..."

,, ౧౪౬. "పూతంబయ్యె మదీయపుణ్యాయుగమో."

"...మదీయకర్ణయుగమో పుణ్యంపుటిల్లాఁ!"

,, ౧౯౪. "ఓలలితాంగి చూడు కడునొప్పెడు నీరము నింపఁగాఁగఁదా."

"...నీరము నోరు నింపఁగా-"

ఆ. ౧౪. "ఉల్లంబు సల్గుట నట్లునెట్టుకొల్పి"

"ఉల్లంబునం గల్ల బెట్టు నెట్టు కొల్పి..."

,, ౨౧. "అతనువిజయగౌరవానీక సంప్రాప్తి కారణంబు."

"...గౌరవానిశ సంప్రాప్తి కారణంబు."

,, ౩౨. "అప్పడేమిచెప్ప నాతఁడాపువుఁబోఁడి యెట్టివారిని గణియింప దంత."

"అప్పు డేమిచెప్ప నాతఁ డో పువుఁబోఁడి! యెట్టివారును గణియింపరంత."

౩ ఆ ౧౪౦ "లోలత్వంబున నుండ నచ్చటికి నాలోలత్పదశ్రేణి"

"నాలోఁ దత్పదశ్రేణి చూ ప్పాలోకించుచు"

౫ ఆ. ౧౭౩. "మొగంబుల నవ్వొదవన్."

"మొగంబుల నల్పొదవన్."

అర్థము కానంత నిట్టిదోషము లొక్కొక్కపద్యమున రెండేసిమూఁడేసికూడఁ గలవు. పెక్కుచోట్ల నేపాత్రము మాటలాడెనో తెలియదు. అట్టిదోషములు సుమారు ౬౦౦ పరిష్కృతముద్రణమునఁ దొలఁగెనవనుట్ కిమ్ముందుగా మచ్చుచూపితిని.

మల్లాది సూర్యనారాయణశాస్త్రి.

# విమర్శనము

### కలిక

[గ్రంథకర్త: శ్రీ బొడ్డు బాపిరాజు, యువకార్యాలయం, తెనాలి. వెల నాలుగు అణాలు.]

వాఙ్మయమున కథారచనకు విశేషస్థానముకలదు. చరిత్రశిల్పము, వర్ణనానైపుణ్యము, కథనాకౌశలము ఈ రచనకు వన్నెదెచ్చు గొనములు. వినోదమునే దృష్టినిడికొని కథలు వ్రాయువారే అనేకు లున్నారు. కథావాఙ్మయము నేకాదు, సర్వసాహిత్యమును వీరీదృష్టితోనే విలోకింతురు.

ఉత్తమాశయములను మదిగొని సాహితీసృష్టికి గడంగువారు ప్రపంచమున గొలదిమందియే యుందురు. వీరిరచన లెన్నడు నస్తమయము నెఱుగవు.

ప్రస్తుతగ్రంథమందలి మొదటికథను చదివినంతన గ్రంథకర్త రవికవి యుత్కృష్టదృష్టాంతముపై కన్నునిలిపియుండునని యూహింతుము.

ఈ కథ "అతీతం." ఇందలి కథానాయకుడు సుందరశివం. నిష్ఠుర సంప్రదాయమును, సాంఘిక నిరంకుశత్వమును, భావదాస్యమును ప్రతిఘటించిన వీరు డీతడు. బిచ్చకునకును, ఆతనికన్నెకును చిరాశ్రయ మొసగిన సుగుణఖని సుందరశివం. ఆమె యాంతరంగిక సౌందర్యమును, బాహ్య లావణ్యమును విలోకించి ముగ్ధుడైనాడు. ఆమెను పరిణయమాడ నిశ్చయించినాడు. కాని నరసమ్మ తనహృదయమును రామున కప్పగించినది. రాముడును బిచ్చగాడే. రామునకును సుందరం ఆశ్రయం యిచ్చినాడు. ప్రేమికుల హృదయముల నొకగ్రంథియందు విలోకించినాడు. స్వీయకాంక్షను మనసునుండి తటిమికొట్టినాడు. దీనకరునిగాంచి నిస్స్వార్థి కౌగలిగినాడు. వారిరువుర నాలుమగల జేసినాడు. వారికొఱకు తాను భగ్నహృదయుడైనాడు. కాని చెల్లెలివంటిదైన నరసమ్మ వేడికోలును మన్నించి, ఆమెయిష్టమునకై ఆమె హృదయమున కానందము గొలుపుటకై తానుగూడ తోడ్తోడనే వివాహితు డగుటకు సమ్మతించినాడు.

కథ భావసందీప్తమైనది. కవితాసుధతో తొలుకాడు పలుకులును, ఉపమలును గలవు. ఈ కథయందు గమనింపవలసిన ముఖ్యాంశ మొండుకలదు. ప్రణయమయూఖము హృదయమున తళుక్కుత్తినపుడు సుందరుని రచనమున నూతనకళ వెలింగినది. వట్టిసన్యాసిగాని, ఎండు బెండుబోలు జీవితమును గడుపువాడుగాని రసభరితమైన రచనము గావింపలేడని, ప్రత్యక్ష జీవితమందలి సుధాకలశమును గ్రోలువాడే సుధాబంధుర భావరాజిని స్వీయ రచనమున చిల్కరింప జాలునని ఈ యంశమువలన నూహింపనగును.

(౨)దొంగదయ్యాలు:—ఇది మిగుల చమత్కారమైన కథ. నారాయణరావు పట్టభద్రుడు. కాని అమాయకుడు. ఏబదిరూకల ఉద్యోగములో నున్నాడు. జీతమందలి యర్ధభాగము మిత్రులకై వెచ్చించువాడు. వాని భార్య శారద గడుసుపడుచు. దైనికమైన అక్కరలుదీర్చి పైకమును సంచిత మొనరించి పైకిపోయి యుండెడు పైకముతో పైడినగలు చేయించుకొన్నది. భర్త కానందము గొలిపినది.

(౩) విధి:—కథ కరుణరస సంభరితము... మేనత్త మేనమామ బిడ్డలు. ఒకరినొకరు ప్రేమించుకొనిరి. కాని, బాలికతండ్రి ధనికునకు బిడ్డనిచ్చి పెండ్లిచేసినాడు. ఈ ధనికుడు పరలోకమునకు దారిదీసినాడు. బావయు మఱదలును పరస్పరానురాగబద్ధులై యున్నారు. ఆలుమగల్లట యొక తావలమున వసించిరి. రమణమ్మ మగబిడ్డను కనినది. మేనత్త బిడ్డను గొనిపోయి చెట్టుక్రింద పాఱవేసినది. తల్లి ఏడ్చుచు బిడ్డమెడ కొక యుంగరమును గట్టినది. శిశువు నొక లంబాడీయాడుది చూచి పదునేడేండ్లు పెంచినది.

అనంతరము బావకును మఱదలికిని పెండిలియైనది. కోటి (పెంపుడుతల్లి) బిడ్డకు కష్టపడి విద్యాబుద్ధులు గఱపినది. దైవవశమున రమణమ్మయింటిలో పనికత్తెయైనది. రమణమ్మకు ఏలకో ఆమె తనయునిపై ఎంతో మక్కువయుండెడిది. వ్యాధిగ్రస్తయై కోటి తనకథను ఎలమందకు వినిపించి పరమపదించినది. ఎలమంద రమణమ్మకడ కరిగి ఉంగరమునుజూపి విలపించినాడు. నిజతనూభవుని గుర్తించినది. ఆలుమగలు తనయుని అక్కున జేర్చికొనిరి. మాతృప్రేమ ఈ కథయందు చక్కగ చిత్రింపబడినది. సంఘస్థితిపై కన్నుంచియే గ్రంథకర్త ఈ కథను సృష్టించెను.

(౪) కిటికీ రెక్కలు:—మూఢ్యమువలన గూడని నమ్మకము లెట్లు మనసులం దుదయించునో, ఎట్టి యనర్థములు సంఘమున తల నూపునో ఇందు దెలుపబడెను. సూర్రావు నియమబద్ధజీవి.

(౫) ఏకోదరులు:—ఇది ఇరువురు కర్షక సోదరుల కథ. ఉభయులును పరస్పరానురాగ బద్ధులు. తమ్మునిభార్య విలాసిని; దుష్టురాలు. సోదరులను విడదీసినది. ఇరువురను ఘోరకష్టములపాలు చేసినది. పతిని దౌష్ట్యమునకు పురికొలిపినది. అన్న కొంపను, కాయమును తమ్ముడు నిప్పులపాలు గావించినాడు. సోదరుని దౌర్జన్యము నెఱిగియు అగ్రజుడు తన యనురాగమును మాపు గానీయలేదు. అంత్యముహూర్తమునగూడ దన యౌదార్యమును వ్యక్తీకరించినాడు. ఇందలి శైశవవర్ణన చక్కగా నున్నది.

(౬)పరీక్ష:— విరించి కళోపాసకుడు. ధునిని ప్రేమించినాడు. ఇరువురకును పెండ్లి యైనది. ధునితన పతివ్రతాధర్మమునకు భంగము తెచ్చుకొనినది. ముసల్మాను సేవకు డైన అబ్దుల్‌తో లేచిపోయినది. తుద కాతని నిష్ఠురచేష్టలకు పాల్పడినది. వ్యభిచారవృత్తిలో ప్రవేశించినది. అభాగ్యురాలైనది. శిథిల కాయ యైనది. కడకు పతిని జేరినది. పతి ఆమెను క్షమించినాడు. "కలకబారిన రెండు నదులుతిరిగియథాపూర్వకంగానిర్మలాలై కలసి ప్రవహించాయి" అని గ్రంథకర్తగా రనిరి. పరీక్షలో అపజయము వాటిల్లినది. ద్విజేంద్రుడు తన మహానాటకములలో నొకతావున నిట్లు వచించినాడు: "నైతికముగ కూలిపోయిన ఆడుదానిని దుష్టుడు గొడ్డలితో తల బగులగొట్టును ; సామాన్యుడు పరిత్యజించును; మహాత్ముడు క్షమించును."

(౭) నిష్కృతి:—ఇందు పంచములు పడే బాధలు వర్ణింపబడినవి. రాముడుకరణం రాఘవయ్య క్రౌర్యమునకు గుఱియైనాడు. కాని ప్రాణావశిష్టుడై పడియున్న విరోధిని కాపాడినాడు. తన యౌదార్యమునకుబదులుగదురంతమైన అత్యాచారమునకుబాల్పడినాడు ప్రాణములు గోలుపోయినాడు. తుదకు కరణం ఆంతరంగిక పరివర్తన మందినాడు. రాముని కొడుకును బిలిచి వానిచేతిలో కాగితము నిడి "ఇదే నాపాపాల కన్నిటికీ నిష్కృతి" అన్నాడు.

(౮) చిల్లి చెంబు:— చిల్లి చెంబు తీరని సమస్యలను తెచ్చిపెట్టినది. కాని దాని నిజ రూపము ప్రత్యక్షము కాగానే సమస్య లన్నియును సమసిపోయినవి.

(౯) పుణ్యాత్ములు:—కథాస్థానము రాజమహేంద్రవరము. పరార్థజీవి యొకండు నిస్సహాయుడై, నిరుపేద యైనాడు. బిచ్చమెత్తు బిడ్డ చేయు సేవవలన బ్రదుకు గడుపుచుండువాడు. తుద కొక దయామయుని దయ నందినాడు.

గ్రంథకర్తగారికి కథనాకౌశలము కలదు. వీరు భావనాశక్తి గలవారు. ప్రకృతిదృశ్యములను చక్కగచిత్రింపగలరు. వీరి శిల్పనైపుణ్యము కొనియాడదగినది. వీరి రచన యలంకారశోభితమై యుండును. మహాకథకుల యాశయములను హృదయంగమము గావించుకొని క్రమనిష్ఠకతన కవిత్వమునందువలె కథారచనమున గూడ కీర్తి నార్జింపగలరు.

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

---

## శ్రీయుత చేమకూర సత్యనారాయణ గారి చిత్రలేఖన సంపుటి

["సెక్రెటరీ! చామకూర్ ఆర్ట్సు ఎకాడెమీ. ౧౧౫, ఆర్మీనియన్ వీథి, జార్జిటవున్, మదరాసు. సంపుటం వెల పదిరూపాయలు]

మన ఆంధ్రులలో పేరెన్నిక గాంచి, చిత్రలేఖనము పెంపొందించుచున్న ప్రముఖులలో శ్రీయుత చేమకూర సత్యనారాయణగా రొకరు. వీరు కీ. శే. దామెర్ల రామారావుగారితొల్లింటి శిష్యబృందములోనివారు. మఱిన్ని బొంబాయి చిత్రకళాశాలలో మంచి శిక్షణమువడసి డిప్లోమాను పొందియున్నారు.

ఇప్పుడు కేవలము బొమ్మలను చిత్రించుటయే గాక ఆబొమ్మలను చక్కని సంపుటముగ అనువగులీల నచ్చొత్తింపించి, తెనుగువారి హస్తములం దుంచు మహత్తర కార్యము శ్రీ సత్యనారాయణగారు గావించినారు. అందులకు చిత్రకారుని, ఆ సంపుటమును ప్రకటించిన ప్రకాశకులను వేనోళ్ల గొనియాడదగు.

సర్వసాధారణముగ చిత్రకారులు తాము రచించిన చిత్రము లెంత మంచివయ్యును, ధనసాహాయ్యము లేమిని, సాహసము లేమిని ఒకమూల పారవైచుట పరిపాటి. అట్లుకాక శ్రీయుత సత్యనారాయణగారు ౨౪ బొమ్మలను, అతి సున్నితములగు భావములను ప్రదర్శించువానిని ఒక్క సంపుటములో నిక్కించి మనకు జూపుచున్నారు. ఆ సంపుటము నిజముగ ప్రతి ఆంధ్రునియింట నుండి చిత్రలేఖనమునం దభిరుచి గొల్పుట ఆవశ్యకము.

బొమ్మలలో పెక్కులు ఈ వఱకు ప్రదర్శనములకు బంపబడి బహుమానము లంది యున్నవి. సంపుటము నచ్చొత్తించు పద్ధతి బహుసుందరముగ నున్నది.

లోని చిత్రములలో "రాగ" చిత్రము త్రివర్ణశోభితము. శ్రీ కృష్ణుని వెతకునప్పటి శృంగారాభినయమును చాటుచున్నది. సిద్ధార్థుని చిత్రము అజంతాశైలిని స్మరణకు దెచ్చునదై యున్నది. అయిదవపటము "పల్లెటూరి చెరువు" అన్నది మన ఆంధ్రదేశములోని చేరువదృశ్యము. బొమ్మలోని స్త్రీలయొక్క చీరకట్టు, జడతీరు చూచుమాత్రలో వీ రాంధ్ర నారీమణులని అనుకొనునట్లు చేయును. ఇవి కాక కొన్ని బొమ్మలు పంద్రెండు పదమూడింటివఱకును చిత్రచిత్ర భావములను ప్రదర్శించు నొక యుత్తమశ్రేణికి జెందగలవని నా నమ్మకము. విచారము, అత్యుత్సాహము, ఆడంబరము మున్నగు విలాసములతో అవి విలసిల్లుచున్నవి. చివర నొక రెండుచిత్రములు సర్వసామాన్య మానవులనుండి చేకొనబడినవి కూడ గలవు. అందు 'బొబ్బిలి పాటగా' డొకడు.

ఈ పద్ధతిని సంపుటములుగ నచ్చొత్తించి ప్రతి ఆంధ్రచిత్రకారుని ముఖ్యరచనములను పైకి దీసికొనివచ్చుట ఆంధ్రలోక కర్తవ్యము. అందుచే వారివారి బొమ్మలు ప్రతియింటను నిలిచి మన కపరిమితానందమును జేకూర్చుటయేగాక "ఇది తెనుగువానికుంచె" అను గర్వమును మనలో రేకెత్తించును.

ఆంధ్రులందఱు ఈ సంపుటములను వెలకు దీసికొని ఏీతదుద్యమమును ప్రోత్సహింతురు గాక !

కవికొండల వెంకటరావు

---

## నమ్మాళ్వార్సు ప్రచురణాలు

పై ప్రచురణాలు యింతవరకు రెండు మాత్రమే వెలువడ్డాయి. ఒకటి నాటకశాఖకు సంబంధించిన, మోహనప్రదమైన తారాశశాంకుల ప్రణయగాథను గూర్చిన "శశాంక". రెండవది నేడు అంతఃకలహాలచే అల్లకల్లోలంగా వున్న "స్పెయిన్ దుస్థితి."

ఈ ప్రచురణాలు యింకమునుంచుగా 'పెంగ్విన్' పబ్లికేషనులవలె ఆకర్షణీయంగా తయారుచేయటానికి పూనుకొనినందుకు నమ్మాళ్వార్లు అభినందింప దగినవారు. ముద్రణం కూడ రైల్వే గ్రంథాలమాదిరిగాక చూడ ముచ్చటగ నున్నది. పేజీల లెక్కనుబట్టి ధర నిర్ణయించటమనే పద్ధతి కాకుండ యెన్ని పేజీల గ్రంథమైనాసరే ఆరు అణాలకే ఇయ్య బడే యేర్పాటని పై రెండు గ్రంథాలవల్ల ఊహించవలసియుంటుంది. రాజకీయ, ఆర్థిక, వాణిజ్య సంబంధమైన గ్రంథాలు, శాస్త్ర గ్రంథాలు, కథలు, కావ్యాలు, నాటకాలు, అంతర్జాతీయ విషయాలకు సంబంధించిన విమర్శలు, పురాణాలు క్రమంగా ప్రకటించ వలెనని వీరి ఆశయము. ప్రకాశకుల ప్రయత్నము ఫలప్రద మగుగాక!

## ౧ శశాంక

[క్రౌను ౧/౮ సైజు; సుమారు ౯౦ పేజీలు; పీచుకాగితం. రచయిత: గుడిపాటి వెంకటచలం.]

ఈరచయిత ఆంధ్రదేశానికి సుపరిచితుడు. ఆంధ్ర వాఙ్మయచరిత్రలో వీరి రచనలకి ప్రత్యేకస్థాన మియ్యవలసిన అవసర మెంతైనా వుంది. ఆధునిక ఆంధ్రకథకుల్ని గూర్చి చెప్పవలసివస్తే వెంకటచలంగారే ప్రథమ తాంబూలానికి అర్హు లౌతారు. వీరి రచనలు నవ్యసాహిత్యానికి అలంకారప్రాయాలు. వీరి రచన లన్నీ అదొక ఫక్కీని. వీరితాలూకు యేరచన పరిశీలించినా ఓ విశిష్టత గోచరిస్తుంది. ఎన్ని సంవత్సరాలక్రిందట రచింపబడినదైనా సరే, యిప్పటి వేడివేడి సరుకైనా సరే ప్రతిదానిలోను వారిలేఖిని ఒకేతీరున పరుగెడుతుంది. మనసా నమ్మిన సిద్ధాంతాన్ని ఒక అంగుళంకూడా వెనుక్కుగాని, ముందుకుగాని పోనీక ధైర్యంగా పాఠకులముందు వీరు పెడతారు.

వెంకటచలంగారు స్వేచ్ఛాప్రియులు. వీరి స్వేచ్ఛావిహారానికి ఒక పరిమితి, ఒక తెన్ను వుంది. వీరి ఆవరణ రాజకీయ రంగంకాదు, మోహాసుండంలో. స్త్రీపురుషుల్ని నైతికంగా బంధించటానికేర్పడ్డ వివాహాది కర్మకాండ వీరిసిద్ధాంతంలో వున్మత్తులు చేసే కొన్ని అవివేకపుచేష్టలు. పశుపక్ష్యాదులు, వృక్షలతాదులు మొదలైనవాటికి నరుల్లో మాదిరిగా లంకెలు లేని స్వేచ్ఛానుభవాన్ని భగవంతు డెవ్విధంగా ప్రసాదించాడో అదే స్వేచ్ఛానుభవానందం నరులకు గూడ యెందు కుండకూడదని వెంకటచలంగారి వాదన. వివాహాదితంతులు అట్టి స్వేచ్ఛకు భంగకారులు. మానవుల్లో అట్టికట్టుబాటు పటాపంచలు కావలెనని వీరి మతం. ఈ మతాన్నే ప్రతిరచనలోను వీరు పాఠకులకు శ్రుతపరుస్తూ వుంటారు.

వెంకటచలంగారు, రీమారు తారాశశాంకుల ప్రణయగాథను వస్తువుగ గ్రహించి "శశాంక" అనే నామధేయంతో నాటకరూపంలో రచించిన విధానాన్ని పరిశీలిస్తే చలంగారిని స్వేచ్ఛావిహారు లనటంకంటె బ్రహ్మజ్ఞానిఅనో సృష్టిరహస్యాన్ని అవగాహన చేసికొన్న బృహస్పతులనో, వేదాంతోపన్యాసకులనో, మహాయోగులనో అనవలసివుంటుంది. ఈరచనలో వీరు కనుపరచిన శక్తి, దృష్టి అతీతమైనవి. ఇంతే కాక తమ మతమందు తమకుగల గాఢ విశ్వాసాన్ని సూచిస్తుంది.

మనయొక్క శాస్త్రాల్ని, పురాణాల్ని తరచిచూస్తే యీ ప్రపంచం వొక వింతసృష్టి అని గోచరిస్తుంది. అందు వొక భావా న్నొక భావం ఒరుసుకుపోయే విషయాన్ని పరిశీలిస్తే యిదంతా ఒకమాయగతోచి సాధకుణ్ణి వైరాగ్యపథంలోకి యీడుస్తుంది.

పరస్త్రీగమనం పాపభూయిష్ఠమని ప్రపంచానికేర్పడిన అనేక 'Donts' లో ఒక 'డోంటు'. ఈ నియమం అన్నిమతాల్లోను, అన్నిశాస్త్రాల్లోను వుంది. కాని కొన్నికొన్ని సందర్భాల్లో పరస్త్రీగమనం పాపభూయిష్ఠంకాదని ప్రమాణాలు మనధర్మశాస్త్రంలో కనపడుతున్నయి.

ఇద్దరన్నదమ్ము లుంటారు. ఇద్దరూ వివాహం చేసుకుని సుఖంగా కాపురంచేస్తుంటారు. కాని ఒకరికీ సంతానం కలుగదు. కుటుంబం నిలువబెట్టుకునేందుకు అన్నగారు తమ్ముని భార్యను చేరవచ్చు. [illegible] కోసంకాక కేవలం సంతానాపేక్షతోనే యీపనిని చేస్తే అది అవినీతికార్యం కాదట. అప్పుడు పాపం అంటుకోదట. తిరిగి అన్నభార్యతో తమ్ముడు క్రీడించతలపెట్ట కూడదు, అన్నభార్య మాతృసమాన కావటం చేత.

స్త్రీకిగాని, పురుషుడికిగాని కామేచ్ఛ జనిస్తే అదితీరనిసందర్భంలో ప్రాణత్యాగాలు జరుగుతూ వుండటం తరుచు వినబడుతోంది. ప్రాణత్యాగం మహాపాపకార్యం. ఒకస్త్రీ తానుగ ఒక పురుషుణ్ణి చేరి కామేచ్ఛతీర్చవలసినదిగ ప్రార్థిస్తే ఆస్త్రీతో సంగమం తగుననీ, అట్టి స్త్రీకోరికను పురుషుడు చెల్లించక తెగనాడితే వానికి పాపమంటుకుంటుందనీ మరొకశాస్త్రం చెబుతున్నది.

ఒకస్త్రీకి, ఒకపురుషుడికి వివాహం జరిగి లక్షణంగా కాపురం జరిగిపోతూవుంది. పారబాటునో, గ్రహపాటునో పరపురుషుడు ఆమెవంక చూడటం తటస్థపడితే వాణ్ణి చీల్చాలన్నంత కోపం వస్తుంది ఆతడికి. ఆమెమీద తనకు సర్వహక్కులున్నవని ఆతని వూహ. కొద్దికాలం తరువాత ఆమె రోగిష్ఠి అయి మంచమెక్కి దుర్గంధంలో రోతపుడుతూ వుంటుంది. యముడు తీసుకుపోతాడు. ఆమె చనిపోయిన అనంతరం స్వంతమని అఘోరించిన భర్తయే ఆమెను చేతులార ఛండాలుడికి ఒప్పగించి దహనం చేయమంటున్నాడు. దీనిని గురించి శివవాక్యర్ ప్రమాణం.

వడివుకండుకొండ పెణ్ణై మట్రొరువన్
నత్తినాల్
విడువనో అవనై యిన్నుం నెట్టవేణుం ఎన్బనే
నడువన్ వంది అళైత్తపోదు నారున్ యిందనెల్లుడల్
షుడలై మట్టుం కొండుపోయ్ తోట్టిక్కై డుప్పరే.

ఈ పరిశీలనలో సృష్టి యెలా ప్రారంభమైందోకూడ తెలిసికోవటం అవసరమే. ఆదిలో బ్రహ్మ ఒక పురుషుణ్ణి సృజించి వానినుండి ఒక స్త్రీరూపాన్ని తయారుచేసినట్లు మన పురాణాలు చెబుతున్నయి. వారిద్దరి సంయోగంవల్ల ప్రపంచాభివృద్ధి అవుతూ

వచ్చింది. మానవకోటి అంతా బ్రహ్మ యొక్క సృష్టిగ పరిగణింపబడుతూ అతడే స్త్రీపురుషులకు తండ్రి, పరమపితగ నిర్వచింప బడుతున్నాడు. వీరందరు అతని సంతతిగ. పరిగణింపబడే సందర్భంలో పురుషుడు భర్త, స్త్రీ భార్య అనే సంబంధానికి తావెక్కడో గోచరించకుండావుంది. బ్రహ్మ దృష్టిలో యీ ప్రపంచంలోని స్త్రీపురుషులందరు సోదర సోదరీలు, యేకోదరులమాదిరిగ మెలగవలసిం దని అయి యుండవచ్చు. భార్య భర్త, కూతురు అల్లుడుఅనే బాంధవ్యపు కంపు సృష్టి ఆదిలో లేదని స్పష్టపడుతోంది. మరి యివన్నీ యిటీవల యేర్పడినట్లు గూడ స్పష్టపడుతోంది. భరతఖండంలో వివాహాదులు, బంధుబంధాలు మనువు రాజ్యకాలంలో శాసనరూపంగా ప్రవేశపెట్టబడినట్లు తోస్తుంది. ఈ మార్పుకు, యిట్టిశాసనాలకు కారణాలు సంఖ్యానేకంగా వుండొచ్చు. ఇక్కడ వాటిని తరచటం సమయం కాదు. దీని ననుసరించి బ్రహ్మ ప్రతిజీవికి స్వేచ్ఛ నుద్దేశించినాడే కాని బంధుబంధాలలో క్రమ్మవలసినదిగ శాసించలేదని స్పష్టపడుతోంది.

స్త్రీపురుషుల్లో గల వ్యత్యస్తతగూడ యిక్కడ పరిశీలించటం అప్రస్తుతం కాదు. అనేకవిధాల్లో స్త్రీ పురుషునికంటె ఆధిక్యము కలిగివుంది.

> " స్త్రీణాం ద్విగుణ మాహారం
> బుద్ధి శ్చాపి చతుర్గుణం,
> సాహసం షడ్గుణం చైవ
> కామ మష్టగుణం భవేత్. "

అన్నారు. పురుషునికంటె స్త్రీ రెండు రెట్లాహారం తీసికొంటుంది. స్త్రీ బుద్ధి పురుషుని బుద్ధికంటె నాలుగింతలు హెచ్చు. సాహసం ఆరింతలు. మైథునేచ్ఛ యెనిమిదింతలు. కామతీవ్రత కలిగివుండే జీవి యొక్క చర్యలు నిగూఢంగా వుంటవి. అందును స్త్రీహృదయం దుర్భేద్యమైంది. స్త్రీ జనహృదయాన్ని గ్రహించటం బ్రహ్మకు గూడ కష్టమని లోకోక్తి. పై కారణాల కనుగుణంగా వాత్స్యాయనుడు కామసూత్రాలలో సంభోగాలు అష్టవిధా లని నిరూపించాడు. స్త్రీకంటి కెదురుగ పురుషు డగుపడితేనే బూతు ఆపాదించవచ్చు సులభంగా. ఎనిమిదిరెట్లు కామోద్రేకం గల స్త్రీ అట్టి పరపురుషు డెదుటబడితే యేదృష్టితో చూస్తుందో భర్త తరమా గ్రహించటానికి ?

పై విషయానేకాన్ని బట్టి తీవ్రమైన యోచనచేస్తే ప్రపంచమంతా వొకమాయగా తోస్తుంది. దేవగురువు, కాశేషించి ఉపనిషత్సారహస్యాన్ని గ్రహించిన దిట్ట, సర్వజ్ఞమూర్తి అయిన బృహస్పతి తన శిష్యుడైన చంద్రుడుతో తన భార్య జరిపిన చర్యవిషయంలో ఋషులంతా యేకమై పంచాయితీ జరపతలపడితే లొంగిపోతాడా, సమర్థిస్తాడు కాని——

వెంకటచలం గారి "శశాంక"లో అనూరాధ అనే పాత్ర వొకటి నూతనంగా కల్పింపబడింది. మిగత ప్రధానపాత్రలు బృహస్పతి, తార, చంద్రుడు. అనూరాధ బృహస్పతిసోదరిగ గ్రహింపబడింది. గ్రంథకర్త నూతనంగా అనూరాధను కల్పించటంలో గల ఉద్దేశ్యం సదుద్దేశ్యమనే భావించాలి. మనుష్యప్రకృతులు వేరువేరుతీరులుగ నుంటా యని, ప్రేమ మోహములకు గల వ్యత్యస్తము యెట్టిదో చూపుటకే అనూరాధ గ్రహింపబడినట్లు తోస్తుంది.

చంద్రుడంటే అనూరాధకు అగణ్యమైన ప్రేమ. ఒకక్షణముగూడ ఆతనిని విడిచి ఆమె వుండలేదు. ఆతడు సదా ఆమె వెనువెంటనే మసలుతూ వుండాలి. తనకళ్లల్లో మెలగుతూ వుండాలి. హృదయపీఠిలో అనుక్షణము అర్చన జరుగుతూ వుంటుంది ఆతడే తనకు సర్వస్వంగా. ఆప్రేమ మాతృప్రేమ వంటిది కాదు. ఏకోదరులలో నగుపడెడిది గూడ కాదు. చుట్టరికపు పరిచయముతో కూడిన దంతకంటె కాదు. కామసంబంధ మైనదియు కూడ కాదు. ఏదో అవ్యక్తప్రేమ. అనేక ఘట్టాల్లో చంద్రుడు అనూరాధను ఉద్రిక్తపరచవలెనని యెన్నో యెత్తులు, యెన్నో లాలనలు, యెన్నో కాముకకథలు, వక్షాన్ని సహితం చీల్చగల మోహదృక్కులు ప్రయోగించి చూచినా ఆమెలో యేమాత్రంకూడ చలనం కలుగలేదు సరేగదా కోపగించనైనా లేదు. ఆతన్ని ఆమె యేమీ అనలేదు. ఆతడు ఆశ్రమంవిడిచి వెళ్లినపిమ్మట "యీఆశ్రమం శవంలాగు వేళ్లాడుతోంది" అంటుంది. కామిని పొదని కావిలించుకుని "ఆతనులాలించవస్తే దూరాన్నుంచాను. తప్పా. చూడు, నీకొక్కటే పుష్పమనుకో జీవనానికంతా! దాన్ని కోసి, వాసనచూసి నలిపి నీ ముఖాన్నె పారేసిపోతే నీ కెట్లా వుంటుంది? శశి నన్నట్లా చేస్తాడని భయం" అంటుంది.

చంద్రుడు అతిలావణ్యమూర్తి. చిన్నప్పటి నుంచి తారవొడిలో పెరిగాడు. చివరకు ఆమె ఆతనిని పొందగలిగింది.

బృహస్పతి ఋషి. అద్భుతమైన పాండిత్య మహిమను పొందినవాడు. దేవాసురసంగ్రామ సందర్భంలో దేవతలందరు వీని మహిమకు నిర్ఘాంతపడి రాక్షసులమీద పైయెత్తుగా దేవకోటికి గురువుగ యెన్నుకొని వానికి ఆచార్య పీఠం వప్పగింతచేశారు. బ్రహ్మముఖతః వెలువడ్డ సమస్తవేదాలను అవగాహన చేసికొనిన సర్వజ్ఞమూర్తి. దండనవల్ల అవినీతిని అరికట్టలేమనీ, శిక్షలవల్ల లోకోద్ధరణ జరగదనీ విశ్వసించేవాడు. ఈ విశ్వంలో ప్రతిజీవి చనిపోయేటప్పుడు ఒక పుచ్చినవక్కనైనా వెంట తీసుకుపోవటం లేనిసందర్భంలో బ్రతికి యున్నంతకాలం "నా" అనే అహంకారం, స్వార్థపరత యెందుకుండాలో తెలిసికొనిన వేదాంతి. దేనియందు మమకారమనేది లేదు. అందరకంటె తనకేమో హెచ్చుజ్ఞానము కలదని విర్రవీగటం యెరగని పరమసాత్వికతేజుడు. జ్ఞానము ఆత్మపారిశుద్ధ్యంకోసం యేర్పడిందనీ, యితరులలోని కల్మషాన్ని పెరకట కేర్పడలేదనీ గ్రహించిన విశాలభావము గలవాడు. సర్వలోకనాశనానైనా నిర్లక్ష్యమైన చిరునవ్వుతో వీక్షించగల సంపూర్ణవైరాగ్య సంపన్నుడు. ఎవరి కర్మానుభవం వారనుభవిస్తారంటాడు. భార్య అయిన తార చర్య సక్రమమైనదని బృహస్పతి సమర్థిస్తాడు,

ఏనాలుగవయేటో, అయిదవ యేటో బృహస్పతి చంద్రుణ్ణి శిష్యుడుగ స్వీకరించి

తారదగ్గర వదలినాడు. ఈ చంద్రుణ్ణి తార యెట్టిదృష్టితో సాకుతూవచ్చిందో పరమా త్మున కేమైన తెలుసునేమో! బృహస్పతికి సర్వము యెరుకే. ఒకటి రెండుతడవలు "శశాం కుడివృష్టి రాధనైపు మరల్చడానికి ప్రయ త్నించు" మని తారకు సలహా యిచ్చినప్పటికి ఆమె కడి కంటకంగా వుంటూ అనూరాధ ఒక టి తన ప్రయత్నాని కడ్డుదాపరించిందని కట కటపడేవి. శశాంకుడు రాధను నిర్లక్ష్యంగా చూస్తున్నాడని బృహస్పతికి తెలుసు. తారాచంద్రుల ప్రేమ అంతకంతకు కరడు కడుతోంది. తనలోగల అశక్తతను గ్రహించి ఆమెయెడ తృప్తికరంగా సంచరించటానికి అవకాశమమరక పోవచ్చు. తారప్రయత్నాని కడ్డు తగలటం పాపహేతువు. ఆశ్రమంలో తనయెదుట తారాచంద్రుల సమాగమాన్ని చూడలేదు; చూడటం సంభవిస్తే అహంకారం ఆవరించి యే అకార్యాన్ని చేయిస్తుందో. కోపం వచ్చింది గూడ (తనలో). "సంసార బంధం ఎంత తీవ్ర మయిందీ? పరిక్షాసమయం వొచ్చేసరికి జన్మమంతా తపస్సాధన మనశ్శక్తి వ్యర్థమైనాయి. సర్వప్రపంచాలనూ, మంత్రా లనూ, యోగాలనూ సాధించగలం గాని యీ మనోహంకారాన్ని, నా స్వంతమనే భావా న్ని జయించటం యీశ్వరుడితరం గాదు. కాని నేను సాధించితీరుతాను"అంటూ ఏకాంత సాధన అవసరమని చెప్పి తారాచంద్రులకు స్వేచ్ఛను కలిగించాడు.

తిరిగివచ్చేసరికి విశ్వామిత్రుడు, గౌత ముడు, ఇంద్రుడు మొదలైనవారంతా తన ఆశ్రమపు అరుగుమీద బైఠాయించి పంచా యితీ చేస్తున్నారు యీ అన్యాయాన్ని గురించి. బృహస్పతిముందు వ్యాఖ్యానిం చటానికివల్లా! తన యింట్లో జరిగిన యీ అకా ర్యాన్ని ప్రపంచం యేవిధంగా వ్యాఖ్యానం చేసినా నేరైన తన పవిత్రవాక్కులతో వారినోళ్లను అణచగల సాహసిగనుక "ఇంకా మమకారం వొదలలేదాబుషీ!" "ధర్మము, జ్ఞానము నీ జీవితాన్ని దిద్దుకునేందుకు ఉప యోగపడాలి; లోకాన్ని దిద్దేందుకు కాదు" "ప్రాణికోటికి ఆత్మాభివృద్ధి చెయ్యాలనే సంకల్పం వాస్తవంగా వుందా! వుంటే ప్రే మించు. సమస్తజీవుల్ని ప్రేమించు. నీకన్న, నీతపస్సుకన్న, నీభార్యకన్న, నీ యీశ్వ రుడికన్న అధికంగా దుర్గతిలో పెనగులాడే యీ లోకాన్నంతా ప్రేమించు. కల్మష మంతటితోను యీప్రపంచాన్ని నీ హృద యాని కద్దుకో. పాపంలో మునిగెనకొద్దీ, అంధకారంలో జారినకొద్దీ, నీచేతుల్ని యింకా కిందికిజాచి, హృదయాని కింకా దగ్గ రిగా వొత్తుకో; ఖండించకు, శిక్షించకు" అన్నాడు.

ఈరచన నింతచక్కగా రచించటానికి వెంకటచలంగారు వేదాంతసాధన చేసియుం డాలి. ప్రపంచ లంపటత వల్ల రోసిపోయి సన్యాసాశ్రమస్వీకారం చేసి గిరిగహ్వరాల్లో నరుని కంట బడకుండ సంపూర్ణ వైరాగ్యంతో వుండేవారికి సాధ్య మవుతుందేమోగాని తది తరులకు—ప్రపంచం చూసిచూసి, వేదాంత సారాన్ని తరచి తరచి అంతా అసోమ యం, అంతా మాయ అని బృహస్పతి యేలా నిర్ణయానికి వచ్చాడో వెంకటచలంగారు కూడ యీరచనాసాధనలో అపరంజ్యోతి లోని సత్యాన్ని అవగాహన చేసికొన్నా డంటే అతిశయోక్తి కాదు. చలంగారు అనేక కథలు వ్రాశారు; గేయాలు రచించారు; గ్రం థాలు చేశారు. అవన్నీ ఒకయెత్తు, 'శశాంక' వొకటి వొకయెత్తు.

రచన అమోఘ మైనది. గ్రహింపబడిన పాత్ర లన్నీ బహు చక్కగ పోషింపబడినవి. అనవసరఘట్టా లేమీలేవు. ప్రతిఅక్షరం, ప్రతి పదం, ప్రతిభావం బహుబటువుగా, ఒకఉబు కుతో పడినవి.

"శశాంక" కేవలం తారా శశాంకుల ప్రణయగాథ కాదు. వైరాగ్యమంటే యేమిటి, ఎట్టివి అహంకార అహంభావాలు; సత్య మెట్టిది; యథార్థమైన మానవసేవ యేది మొద లగు విషయాల్ని నిర్వచనం చేసే వేదాంత గ్రంథమని తెలుస్తుంది.

నాటకంగా—చక్కనిశైలి. రసపిపాసువు లకు అమూల్యమైన భిక్ష. వెంకటచలంగారి 'శశాంక' అభినయానికి తగినంత అవకాశము కలదు. పేరు పొందిన నటు లెవరైన ప్రద ర్శింప తలపడినప్పుడే దీనిప్రాముఖ్యము వెల్లడి అవుతుంది. ఎవ్వరేని త్వరలో ప్రయత్నింప వలసిన దని మనవి.

వ. కుటుంబరావు

---

## స్పెయిను దుస్థితి

[క్రౌను ౧/౮ సైజు, ౧౬౦ పేజీలు. శ్రీచుక్కాగితం. గ్రంథకర్త: ప్రతాప రామసుబ్బయ్య]

ఓడలు బండ్లు అవుతాయని, బండ్లు ఓడలు అవుతాయనే లోకోక్తిలో యథార్థం లేక పోలేదు. ఎల్లప్పుడూ కాలం ఒకేరీతిని గడు స్తుందనుకోటంత వెర్రి మరొకటుండదు. పద హారో శతాబ్దంలో స్పెయిన్ దేశం చరిత్ర పరిశీలిస్తే యూరపుఖండ రాజ్యాలలో అగ్ర స్థానాన్ని ఆక్రమించియుండింది. అప్పట్లో అదృష్టవశాత్తు ఒక బ్రహ్మాండమైన సామ్రా జ్యాన్ని అతిత్వరలో నిర్మించుకోగలిగిన అవ కాశాలు అమరినాయి. సమకూర్చుకుంది కూడ. కాని పునాదుల్ని గట్టిచేసుకోలేదు. గర్వం బలిసిపోయింది. తదుపరి యితర యూరపుఖండ రాజ్యాలలో జరుగుతూవచ్చిన అభివృద్ధికరాలైన మార్పులను అవగాహన చేసి కొనుట కవకాశం లేనంతటి మబ్బు వారికం డ్లను కమ్మివేసింది.

పై కారణాలచేత స్పెయిన్‌లో అభివృద్ధి అనేది యేమీ జరుగలేదు. అస లది వ్యావసా యిక దేశం. యంత్రపరిశ్రమలు శూన్యం. వ్యవ సాయానికి గూడ రైతును తిననీయకుండా జమీందారీ విధానం అమలులో వుండటం తటస్థించింది. ఈ పరిస్థితుల్లో దారిద్ర్యం హెచ్చి ప్రజలలో అశాంతికి కారణమైంది.

ఇదిట్లావుండగా స్పెయిన్‌లో మతోద్ధా రకుల ఆధిక్యము జాస్తి. వీరు ప్రజ లలో దయ, సత్యం, శౌచములను అలవడ జేయాలననే నియమాన్ని పూర్తిగ మరచి పోయి దొంగవేషంగా అభివృద్ధినిరోధకా లైన రాజకీయకక్షుల్లో ప్రవేశించి బహు విచ్చలవిడిగాను, క్రూరంగాను సంచరిస్తూ

దేశ సౌభాగ్యానికి, శాంతికి విఘాతం కలిగిస్తున్నారు.

పై అక్రమాలవల్ల యేర్పడే అశాంతివల్ల స్పెయినులో యెప్పుడూ అంతర్యుద్ధాలు, అంతఃకలహాలు. స్పెయిన్ దేశచరిత్రలో యిట్టి కల్లోలాలకు లెక్కలేదు. ఎన్ని అంతర్యుద్ధాలు సంభవించినా క్రూరమైన జమీందారీ విధానాన్ని తొలగించలేక పోయినారు. దీనికి తోడు యూరపు ఖండపు యితర రాజ్యాలలో రాజనీతి మృగ్యమై యేదోఒకటి తెగకుండా కూడ వచ్చింది.

నేడు స్పెయినులో యేర్పడ్డ ప్రధాన సమస్య అభివృద్ధియా, లేక వికృతస్వరూపము దాల్చిన ప్రతిఘాతమా? శాంతియు విజ్ఞానమా లేక అనాగరకతా మృత్యువా?

స్పెయిన్ పరిస్థితులు యించుమించుగ భరతవర్షపు పరిస్థితులతో పోలియున్నవి. ఆ దేశపుప్రజలకు కత్తి పట్టగల హక్కు వుంది. మన కది లేదు. ఇంతే భేదం. అందు కనే మనది శాంతిప్రధానమైన ధర్మసమరం. స్వల్ప వ్యత్యాసంతో స్పెయిను, భారత వర్షము ఒకే గాడిలో వున్నకారణంచేత మనకు స్పెయిను ప్రజలయందు సానుభూతి వుండవలసిన అవుసర మెంతైనా వుంది. మన చరిత్ర, మనఆధిక్యము, మన విజ్ఞానము మనం పూర్తిగ మరచిపోయినాము. ఇతర దేశ చరిత్రలు పఠించినపుడైన మన స్థితి కొంత స్ఫురణకు రాకపోదు. గనుక యీ గ్రంథకర్త తగిన సమయంలోనే యీరచన వెల్లువరించినా డనుటలో ఆక్షేపణ లేదు.

ఈ గ్రంథకర్త సహాయ నిరాకరణోద్యమం మంచిజోరుగ నున్న రోజుల్లో చదువుకు స్వస్తిచెప్పినాడు. నాటినుండి కర్షక కార్మిక సమస్యలలో శ్రద్ధతీసికొంటూ రెండుసార్లు జెయిలుకుపోయినాడు. ఇట్టి వీరు స్పెయిన్ గాథను క్షుణ్ణముగ అవగాహన చేసికొనినారన్నే అనవలె. కాని గ్రంథరచన యిదే ప్రథమప్రయత్న మవటంచేత విషయాన్ని పాఠకుల ముందు అరటిపండు వలిచినట్లు పెట్టలేకపోయినారు. స్పెయిన్ ప్రసక్తిలో ఇండియాన్నీ జర్మనీ, యిటలీ, బ్రిటన్, ఫ్రాంసుల ప్రసక్తులుగూడ తెచ్చి కలగాపులగం చేయటం పాఠకునికి కొంత భంగారు కలిగిస్తోంది. ముందుముందు వీరు రచించబోయే గ్రంథములవలన యింకను హెచ్చుప్రయోజన ముండగలదని నమ్మిక.

వ. కుటుంబరావు.

---

## బాలవ్యాకరణము

### (టీకాసహితము)

[టీకాప్రణేత: విద్వాన్ దూసి రామమూర్తిశాస్త్రి, డెమ్మిౘ/౧౬ సైజు. ౨౬౪ పుటలు. వెల మూఁడు రూపాయలు. ప్రకాశకులు: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, చెన్నపురి.]

తెలుఁగుభాషకుఁ గల వ్యాకరణము లన్నింటిలోను (సర్వజనోపయుక్తములలో) చిన్నయసూరి రచించిన బాలవ్యాకరణమే మొదటిది. అంతకుఁ బూర్వము వెలువడినవానిలోఁ గొన్ని సంస్కృతభాషాగ్రథితములు; కొన్ని పద్యాత్మకములు, సూరిగారి వ్యాకరణము నవ్య రచన. ఇందు వ్యాకరణసిద్ధాంతములకు విరుద్ధము లగు విషయములు కొన్ని యున్నవని కొందరి తలంపు. ఏది ఎట్లున్నను ప్రాథమిక పరీక్ష మొదలు పట్టపరీక్షవఱకును ఆంధ్ర విద్యార్థులకు బాలవ్యాకరణమే పఠనీయముగ నున్నది. మఱి యే ఇతరాంధ్రగ్రంథమునకును దీనికున్నంత చెల్లుబడి, ప్రచారము లేవు.

చిన్నయసూరి తనకు సాధ్య మగునంతవఱకును తనకుఁ బూర్వమున నుండిన ఆంధ్ర వ్యాకరణములను బాగుగా పరిశీలించి, తన సంస్కృతవ్యాకరణ పరిజ్ఞానము నుపయోగించి కష్టించి దీనిని వ్రాసెను. విషయముల నన్నింటిని సంగ్రహించు నుద్దేశమున నతఁడు సూత్రపద్ధతిని దీనిని వ్రాయవలసి వచ్చెను; కాన పెక్కుసూత్రములు, వివరణములు నిందు నిగూఢాశయములు కలిగి అందఱును దెలిసికొనన నువుగాక యున్నవి.

బాలవ్యాకరణమునకు శేషగ్రంథమనఁ దగు ప్రౌఢవ్యాకరణము, లేక త్రిలింగలక్షణ శేషమున తత్కర్తలగు శ్రీ సీతారామాచార్యులుగారు కొన్నియెడల సూరిసూత్రములను సవరించుచు, సూరిగారి ఆశయముల వివరించియుండిరి; అన్నిసూత్రములకును వివరణము లేనందునను, ఆచార్యులుగా రనుకొనినట్లు సూరి యభిప్రాయపడెనో, లేదో నిశ్చయింప నవకాశము లేనందునను సూరిమతము తెలియుటకుఁ బ్రౌఢవ్యాకరణ మంతగా ఉపయోగింపదు.

కీ. శే. కల్లూరి వేంకటరామశాస్త్రులుగారు సంస్కృతాంధ్ర వ్యాకరణములను బాగుగ పరిశీలించి 'బాలవ్యాకరణగుప్తార్థప్రకాశిక' అను వ్యాఖ్యను రచించి చాలవఱకును సూరిమతములను లక్షణాభిమానుల కెఱుకపఱచిరి. కాని అదియు కొన్నియెడల సూరిమతమును వ్యక్తపఱుపక, విరుద్ధసిద్ధాంతముల నొనరించినది; ఐనను అనుపయుక్తములగు ననుబంధములతోఁ గూర్పఁబడి ఎక్కువవెలకుఁ గాని లభింపని ఆ గుప్తార్థప్రకాశికయే బాలవ్యాకరణతత్త్వము తెలిసికొనుటకు నేటిదనుక ఆధారమయి ఉన్నది.

పయి యంశములను బాగుగ గమనించి శ్రీ దూసి రామమూర్తిశాస్త్రులుగారు సూరిమతమును ఆంధ్రలోకమునకుఁ దెలుపుటకు విశేషములతోఁ గూడ 'బాలవ్యాకరణసారస్య సర్వస్వపేటిక' యను వ్యాఖ్యానమును రచించినారు.

శ్రీ దూసి రామమూర్తిశాస్త్రిగారు సంస్కృతాంధ్రవ్యాకరణ లక్షణమును, సంప్రదాయమును బాగుగ నెఱిఁగినవారు; ప్రతిభావంతులు; శ్రీ వఝ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రులవారి సుశిక్షణమున సానదేరినవారు; విద్వత్పరీక్షలో ఆరితేరినది మొదలు విజయనగర మహారాజా సంస్కృతకళాశాలలో ఆంధ్రాధ్యాపకపదవి నధిష్ఠించి ౧౨ ఏండ్లపాటు పాఠప్రవచన మొనరించుచు విశేషము ననుభవమును సంపాదించినారు; కొంతకాలము శ్రీ శాస్త్రులవారిక్రింద సహాధ్యాపకులుగా నుండి వారి సలహాలఁ దీసికొనుచు తమ లక్షణపాండిత్యమును దిట్టపఱచుకొని వ్యాకరణగ్రంథరచనమున కధికారమును గడించుకొనినారు; కావుననే అనిదంప్రథమము వ్యాఖ్యను రచింపఁగలిగినారు.

ఈ వ్యాఖ్యయందు సూరిమతములు, వాని తత్త్వమును లెస్సగ వెల్లడింపఁబడినవి; కావలసినచోట్లఁ బ్రాచీనవ్యాకరణమతముల ఖండన, మండనము లొనరింపఁబడినవి; కొన్నియెడల స్వతంత్రమార్గ మవలంబింపఁబడినది; వీలగునంతవఱకును గుప్తార్థప్రకాశికలోని యాశయములు సవిమర్శముగ ఖండింపఁబడి చక్కని సిద్ధాంతములు వివరింపఁబడినవి. ఇంతకుఁబూర్వము వెలువడిన ప్రసిద్ధాంధ్ర వ్యాకరణముల మతముల నెఱుఁగుట కిది మిక్కిలి యుపయోగించుచున్నది.

ఈ వ్యాఖ్యానము జిజ్ఞాసువులకు, పరీక్షార్థులకు మాత్రమే కాక బాలవ్యాకరణాధ్యాపన మొనరించువిద్వాంసులకును సందేహనివారణ కుపయోగించును.

శ్రీ రామమూర్తిశాస్త్రులుగారు ఆంధ్రుల దురదృష్టమువలన ఈనడుమనే కీర్తిశేషు లయినారు. వారి భౌతిక దేహము మనకిఁక కన్పింపకపోయినను కీర్తికాయమును స్థిరముగ నిలుపుట కీ బాలవ్యాకరణవ్యాఖ్య చాలియున్నది.

లక్షణగ్రంథరచన కర్హు లగు పండితయువకులలో శ్రీ రామమూర్తి శాస్త్రులుగా రొకరు. కష్టనష్టముల లెక్కచేయక అట్టివారిచే నిట్టి గొప్పగ్రంథమును రచింపఁజేసి, చక్కఁగ ముద్రింపించి, వెలువరించిన వావిళ్ల ముద్రాలయాధిపతుల సేవను తెలుఁగుదేశ మెన్నటికిని మఱువఁజాలదు. ఈ రీతినే వారు తగినవారిచే తగిన గ్రంథములను రచియింపఁజేసి ఆంధ్రభాషావాఙ్మయముల నభివృద్ధి పఱచి తమ కీర్తిని ఇతోధికముగ వ్యాపింపఁజేయుదురుగాక!

బు. వేం.-ర.

---

## రమ్యకథలు

[అనువాదం: నార్ల వెంకటేశ్వర రావు, నవయుగ ప్రచురణాలయం, పెడనగల్లు (పోస్టు), కృష్ణాజిల్లా.]

కథావాఙ్మయాని కిప్పుడే భాషలోనూ లోటులేదు. తెలుగులోనూ అనేకవిధాలైన కథలు చాలరోజులనుంచీ వెలువడుతున్నవి: అనుకరణాలూ, స్వంతాలూ, అనువాదాలూ. విదేశాలవారి రచనాచమత్కృతిమాత్రం గమనిస్తూ పేర్లుమార్చి యిచ్చవచ్చినట్లు తర్జుమాచేసేవి అనుకరణాలు. అవి నిజంగా తర్జుమా అనిపించుకోకపోయినా ఆ సాంఘికపరిస్థితులూ వర్ణనలూ చూస్తే అట్లా అనిపిస్తవి. సాధారణంగా కొంచెం 'పచ్చి'గావుంటం వల్ల చాలమందికి చదవాలనిపిస్తవే గాని, వాటివల్ల ప్రయోజనం మృగ్యం.

స్వంతంగారాసే వేనైనా సర్వోత్తమాలు ఎప్పటికైనానూ. వాటిలో మన సంఘవైఖరీ, ఆచారవ్యవహారాలూ సరిగ్గావుంటే నిజమైన విలువ కనబడుతుంది.

అనువదింపబడిన కథలకుకూడా ప్రత్యేకమైన విలువవుంది. రవీంద్రుడు, టాల్‌స్టాయి మొదలయినవారి రచనలు తెలుగులోకి చాలా రోజుల్లక్రిందే వచ్చినవి. ఇక్కడికొత్తరచయితలకు ఆదర్శప్రాయంగా వుండటానికీ, ఆయా దేశాలలోని ఆచారాలూ స్వభావాలూ పరిశీలించటానికీ అవి సరిగా వుపయోగించాలంటే భావముగానీ, ధ్వనిగ్గాని, పలుకుబడిగాని మారకుండా చెక్కుచెదరకుండా తర్జుమాకావాలి.

వెంకటేశ్వరరావుగారి అనువాదం అట్లాగే వున్నది. తొణుకులేని సజీవమైనభాషలో యీ పద్దాలుగుకథలూ వ్రాశారు. కాని కొన్నిచోట్ల సరియైన తెలుగుమాట చిక్కకనో, తొందరలోనో భావం విస్పష్టంగా మారినట్లు కనబడుతుంది:

"వంచినతలను వంచినట్టే వుంచడంవల్ల ఆవిడకళ్లు నాకు కనబడ్డంలేదు. కాని సన్నగా, వంపుగావున్న ఆవిడకనుబొమ్మలూ, నిడివిగావున్న ఆవిడకనుపాపలూ మాత్రం నాకు కనబడుతూనే వున్నాయి."

షెకవ్, గార్కీ, డాస్టవస్కీ మొదలైన పదకొండు విఖ్యాతరచయితలవి, ప్రణయమూ, దేశభక్తీ,మానవసౌభ్రాత్రమూ, శాంతీ ఆదిగాగల విషయాలపై ఆధారపడిన గొప్ప కథ లివి. ఒకనాడు పత్రికలలో పడి అంతరించే 'ఖులాసా' రచనలవలెగాక, శాశ్వతముగా నిలిచే వాఙ్మయమునకు చెందినవి. ఈ అనువాదంవల్ల యింగ్లీషు చదవని తెలుసువారికి రష్యన్ వాఙ్మయంమీద శ్రోత్రీ అభిరుచి కలుగుతుంది డాస్టవస్కీ మొదలగువారి పెద్దపెద్దనవలలనుగూడా అనువదించటానికి నవ్యరచయితలకు ప్రోత్సాహము కలుగుతుంది.

కుం. న.

---

## అణిముత్యాలు.

[సాహిత్యలత - చీరాల.]

కవులందరు నవయువకులు. అనుగుణముగ భావములుకూడ నవీనములే. బాల సరస్వతిగారి "యాంధ్రమాత" ప్రాచీన ప్రాభవస్మరణ విచారము. గోపాల కృష్ణారావుగారి రచనలిందు మెండు. "కొండవీటికొండ", "రాణీసంయుక్త" మొదలగు చారిత్రికములును "వరాలనంది" వంటి చిన్నికథలై యున్నవి. వారణాసివారిది Wordsworth గారి ధోరణి. "హెచ్చు పన్నీ లేక యిల్లాలి మెడలోని పూసపుట్రయు నమ్మివేసినావు" అనియు, రైతుపోవణ దేశమునకు అవశ్యమనియు, రైతుదుఃఖమును "ప్రకృతిగానాల గల దెంత శ్రవణసుఖము" అని చక్కని ప్రకృతివర్ణనమును కావించినాడు. ఆదినారాయణగారి "నిర్వేదం" హరిజన సమస్య, "మాకును మీకు నైతము సమానమెయాగద చావుపుట్టువుల్" అని చక్కని భావములు చిత్రించినారు. "కర్మయే సృష్టి, సృష్టివిలాసమంత" యని కృష్ణశర్మగారి భావాలు. కర్లపాలెంవారి "కబీరుగీతాలు" తర్జుమాయైనా Edward గారి abdication లో ఉదాత్తత గుర్తించి "త్యాగమే ప్రేమ ప్రేమయే త్యాగమగును" అనియు స్వేచ్ఛలేని "మనుజపాలకుని కన్న మేల్గాదె కూలివాడు" అని హేమశృంఖలలను వర్ణించినారు. కాని వీరి హిందూ వేదాంతం కొంతమసక కల్పించినది. "స్వేచ్ఛకు జాలనట్టి చక్రవర్తిత్వమునకన్న సన్యసించుటుత్తమంబని యెంచిన తత్త్వవేత్త" యని చాల పొరబాటు పడ్డారు. ఎడ్వర్డు చక్కని గృహస్థు అయాడేగాని సన్యసించలేదు. "అమ్మయను మాట కర్థమే త్యాగమేమో" యని గంభీర భావం తెలిపారు.

రేము రూపాయి ధర కాగితాలమీద ప్రింటున్నా, ధరమాత్రం ముప్పావలానాకి

"జ"

## గ్రంథ స్వీకారము

స్వప్నానసూయ (పద్యకావ్యము)
క్రౌను ౧/౮ సైజు, పు. ౬౮. గ్రంథకర్త: ఆకొండి రామమూర్తి, C/o మధునా పంతుల సత్యనారాయణ మూర్తి, పల్లిపాలెం, ఇంజరము పోస్టు, తూ. గో.

కలంపోటు (నాటిక)
క్రౌను ౧/౮ సైజు. పు. ౬౨. వెల రు. ౦-౫-౬ గ్రంథకర్త: శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, కలాభివర్ధనీ పరిషత్తు, ఇన్నీస్ పేట, రాజమండ్రి.

Horizons
(ఆంగ్ల ఖండకావ్య సంపుటి)
గ్రంథకర్త: వి. యస్. భూషన్, ఇంగ్లీషు ప్రొఫెసరు, వాడియా కాలేజి, పూనా. (ఇండియా) వెల రు. ౧-౦-౦.

---

# బహుధాన్య సంవత్సరాది సంచిక

మహాశయా!

బహుధాన్య సంవత్సరాది సంచికకు విన్నపమిదివరకే చేరియుండును. కాని వర్తమాన రాజకీయార్థికసాంఘికపారిశ్రామిక పరిస్థితుల నవలోకించునపుడు సంచిక ప్రచురణము క్రొత్తమార్గము నవలంబించుట ప్రయోజనకరముగ నున్నది.

ఆంధ్రత్వ మతిప్రాచీనము. హిందూస్థానమునందలి, ఇతరప్రాంతములందలి పరిస్థితుల వలె, ఆంధ్రదేశ ప్రజాస్థితులు ప్రతిఘటనములకు పాలైనను, ఆంధ్రత్వము చైతన్యప్రదమై విలసిల్లుచున్నది. ప్రజాహృదయమునందు గాఢమైనప్రబోధ ముదయించినది. ఈప్రబోధ మును సార్థకముచేయుట ప్రజానాయకులకు ధర్మము.

చెన్నరాష్ట్రమునందు స్వరాజ్యప్రభుత్వము ఏర్పడినది. ప్రజలయందు విద్యా,విజ్ఞానములు, సౌభాగ్యము మొదలగు వానిని వ్యాపింపఁజేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. ఈ మహోదయ సమయమునందు ఆంధ్రులు వారి ప్రాచీన వర్తమానస్థితిగతులను కనుగొని భావి భాగ్యోదయమునకు పనిబూనుట పరమావసరము, పరమధర్మము. అందువలన బహుధాన్య సంవత్సరాది సంచికకు ఈక్రిందివిషయములలో తమకు పరిచితమైన విషయమునుగురించి వ్యాసమును వ్రాసి జనవరి 15-వ తేదిలోపల పంప ప్రార్థితులు. వ్యవధి తక్కువ, ప్రయత్నము సాహసికము. కావున త్వరలో శ్రమచేసి వ్యాసములను పంప ప్రార్థితులు. వీలైనయెడల సచిత్ర వ్యాసములు పంప ప్రార్థితులు.

1. ఆంధ్రచరిత్రములోని ముఖ్యఘట్టములు: (ఎ) అమరావతి, నాగార్జున స్తూపముల నాటి ఆంధ్రులు, (బి) శ్రీకృష్ణదేవరాయలనాటి ఆంధ్రులు. 2. ఆంధ్రదేశ పరిశ్రమలు: (ఎ) వ్యవసాయ పరిశ్రమ, (బి) నేతపరిశ్రమ, (సి) గృహపరిశ్రమలు, (డి) వర్తకవాణిజ్యములు. 3. ఆంధ్రకళ: (ఎ) చిత్రకళ, (బి) శిల్పము, (సి) గానము. (డి) ప్రాచీన నాట్యకళ. 4. ఆంధ్ర సాహిత్యాభ్యుదయమునందలి ముఖ్యఘట్టములు. 5. ఆంధ్రుల మతసాంఘికవ్యవస్థలు. గ్రామకట్టుబాట్లు, కులకట్టుబాట్లు. 6. ఆంధ్రోద్యమము. 7. సత్యాగ్రహము, గాంధి. 8. ఆంధ్రరాష్ట్రనిర్మాణావశ్యకత. 9. బ్రిటిషుపరిపాలనమున ఆంధ్రదేశము. 10. ఆధునికాంధ్ర జాతి నిర్మాతలు. 11. ప్రత్యేకాంధ్రసంస్థలు. 12. ఫెడరేషను-ఆంధ్రరాష్ట్రము. 13. ఫెడరలు ఫైనాన్సు. 14. ఫెడరలు, యూనిటరీప్రభుత్వములు; భారతదేశమునకు తగినదేది? 15. దేశాంతరములందలి ఆంధ్రులు.

కా. నాగేశ్వరరావు

---

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor:—K. Nageswara Rao.

# భారతి

## సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు

కా. నాగేశ్వరరావు

సంపుటము ౧౯, సంచిక ౨

# విషయసూచిక



## చిత్రములు

## భారతి చందాదార్లకు హెచ్చరిక

ఈ క్రింది కనబరచిన నెంబర్ల వారికి ఈ నెల (1938 సం. ఫిబ్రవరి నెల)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమునకగు చందా మాకు చేరునట్లు ఈ నెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమయొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్ము రానిచో సహజభాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరము వరకు చందా దారులుగ నుందురను నమ్మకముతో 1938 సం. మార్చి 10-వ తేదిని రూ 6-4-0 లకు వి.పి. పంపుచున్నాము. గావున తామెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన ప్రార్థితులు. ఒకవేళ తమకీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మా కావిషయము వెంటనే తెలియజేసినయెడల వి. పి. పంపుట నాపుదుము.

B 13. G 9. S 180, 186. C 10. J 14. L 14. M 14. P 54, 56, 57. R 53, 54. S 194, 197, 200, 202, 203, 204. T 6. V 47, 48. S 206, 207, 208. S 5. L 6. S 56, 63. B 5, 6, 7, 10. S 65, 67. T 1. V 20. H 46. P 32. S 95.




సంపు. ౧౫ ఈశ్వర, మాఘమాసము ( ఫిబ్రవరి 1938) సంఖ్య ౨

# తెలుగుకన్నె

బొడ్డు బాపిరాజు

ఇంత యోపిక నెచట గడించుకొన్న
దానవే తల్లి, యీచిన్నితనమునందె!
పిట్టలే రెక్క లల్లార్చి విడిచిపెట్ట
బోవు, మనికిప ట్టీమునిప్రొద్దువేళ.

ఎట్టికోరిక లున్నవో చిట్టియెడద,
కదలివచ్చుచునున్న సంక్రాంతిరమకు
తీపు లూరించు నభినవాతిథ్య మొసగ
యీయడావుడి నింత సాగించినావు.

ఎంతటి యపూర్వశిల్ప మీయిగురుచేతు
లం దిమిడియున్నదె, యెరుక కందకుండ!
పై కుబికివచ్చె నేటి కీపౌష్యలక్ష్మి
కలవరింపగ నాణిముత్యాలగద్దె.

వీలు చాలును లేక వీస్వీథి మిణుకు
తారలే నీకరస్పర్శ ధన్యము లయి
వరుసగట్టినవేమొ యీవరుస బిడ్డ!
ఒప్పుకొనుగాక నీనఖద్యుతుల నేడు.

ఇట్టిరంగవల్లిక రచియించు నేరు
పలవడినయదె నీ కనభ్యస్త మగుచు!

నీకు, సంక్రాంతిరమణికి నేస్త మెన్ని
యబ్దములనుండి కలసినదమ్మ! నుడువు.
తీరిచిన రేఖలందున తెలుగుదనము
విడిదిగొనియున్నది కుమారి! వీథివీథి

నీకళారాధనమున పునీతమయ్యె,
చెరిగిపోనట్టి కీర్తు లార్జించుకొంటి.
తోడి కన్నెపడుచులతో గూడిపోయి
గోమయము, బంతిపూ లేరి కోరి తెచ్చి

దిద్ది తీర్చిపెట్టిన గొబ్బిముద్దలకును
కొలువుపీఠ మీరంగవల్లులె అగునగు!
కోరుకొనవమ్మ, నీకున్న కోర్కెలెల్ల,
మల్లెపువ్వువంటిమగడు, చంపకమువంటి

బిడ్డ, డింక నింక—తథాస్తు వేల్పు లరుగు
చుందు రీశుభబ్రాహ్మముహూర్తమునను.
'నేటి కింక మా తెలుగుకన్నియలచేత
జీవనము నిల్పుకొన్నది శిల్ప' మనుచు

తియ్యని గళమ్ము లెత్తి కీర్తించుకొనుచు
కులుకుదుము తెలుగుకవీశ్వరులము మేము.

# ప్రాకృత గాథలు

[మఱికొన్ని]

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

[మంఖుకుని అలంకారసర్వస్వము నుండి]

రేఁగుపం డ్లొండొకటిపయి రెండుపెట్టి
బోడితలమీఁదఁ దడవు నిల్పుకొనఁజనెదు;
పోరపోకిరి! నిను నీవ మోసగించు
కొనెదు! మఱి జాణలేలలోఁగుదురు నీకు? (పు. ౮౩)

నియతియనెడుగరిత నిలువక పయనంబు
లాచరించు కాలమను మగనికిఁ;
జడ్డిగట్టువేళ నెద్దిచిక్కిన దాని
గొనునుగాని వెదకికొనదుచూవె! (పు. ౧౨౭)

సామి! కొంత యాఁగి చనుము, నీవిరహంపుఁ
జింతఁ జేసి గుండెచెడినమనసు
కొంతకుదుటఁబెట్టుకొని చెప్పెదును; లేక
యిల్లెపొమ్ము; చెప్ప నేమిగలదు ? (పు. ౧౪౦)

[ధ్వన్యాలోకము నుద్యోతము నుండి.]

పొమ్ము వేగమ; యేడ్పులూర్పులును నాకు
నొక్కతికె యివియన్నియు నుండనిమ్ము;
పాడుమొగమోటమునకు నాపడఁతిఁ బాసి
వచ్చితివి; నీకు నవి కల్గవలెనె యింక? (ఉ. ౧, పు. ౨౧)

పోవలవ దింక మఱలు; నీపుణ్యమగును;
తెలిమొగము వెన్నెలలఁ జీకటులు దొలంగె;
మగలఁ జేరఁగఁజను పెఱమగువలకును
అడ్డమై దాపురించెద వగడుపడుచ! (ఉ. ౧, పు. ౨౨)

అలిగినప్పు డలుకవెలిసినప్పుడు సంత
సించి నవ్వునప్పు డేడ్చునపుడు—
ఎపుడు చేరఁజనిన నపుడె వెల్లాటపుఁ
గులుకులాండ్రు చూఱగొండ్రు మదిని. (ఉ. ౧, పు. ౫౨)

క్రొత్తపడఁతి గబ్బిగబ్బలపై నెల
నొఁగఁ బ్రియుఁడు మెల్లఁ దీఁడినట్టి
దెబ్బ చిన్నదయ్యుఁ దీఱనిపెనునొవ్వ
గలుగఁజేసె సవతిచెలులమొదల. (ఉ. ౧౪, పు. ౧౨)

చెందిరంపుఁబూఁతచేఁ బొల్చు రిపుమత్త
కలభకుంభములకు వలచినంత
వలవ దెపుడు వీరవరుచూపు ప్రియురాలి
కుంకుమలఁదుకొన్న గుబ్బలకును. (ఉ. ౨, పు ౧౧౧)

పూలు రాలిన వేఱుకో; చాలు; కేలఁ
బట్టి వావిలికొమ్మ దుల్పంగవలదు;
కాపుకోడల! నీమామగారిచెవులఁ
బాడుగాజుల పెనుసద్దు పడిన దిపుడు. (ఉ. ౨, పు ౧౨౮)

పడ్చుకొఱకె పుట్టె నీపాడుకన్నులు;
తుడువవలదు వీనిఁ దొలఁగి పోర!
నిన్నుఁ జూచినంతనే యివి కైపెక్కఁ
గానవయ్యొ నీదు కటికమనసు. (ఉ. ౩, పు. ౧౫౫)

ధారికేల యడ్డుదగిలెదు? తొలఁగిపో;
సిగ్గులేదె? తెల్వి చెడినవాఁడ!
వట్టియిల్లు వదలివచ్చితి; నెవరుఁ గా
వలికి లేరు; పోవవలయు వేగ.

# ఆంధ్రగద్య వాఙ్మయ పరిణామము

[నన్నయ భట్టు మొదలు సూరన వఱకును—౧౧–౧౩ శతాబ్దులు]

గొబ్బూరి,
వెంకటానంద రాఘవరావు

## ఆంధ్రీ కరణ (చంపూ)యుగము.

క్రీస్తుశక మాఱవ శతాబ్దమునుండి దక్షిణ హిందూదేశములో ప్రాచీనవైదిక హిందూ మతమునకును, జైనబౌద్ధాది యవైదిక హిందూమతములకును పోరాటములు జరుగుచు వచ్చెను. కొంతవఱకు సమభావముతోను పరస్పర సహనముతోను నివి యొకదానిప్రక్క నొకటియొకటి నిలుచుచువచ్చినను, రాజావలంబన, ప్రజావలంబనముల ద్వారా ప్రాముఖ్యము బడయగోరి ఆయామతములు వైమనస్యములు పెంచుకొనజొచ్చెను. దక్షిణదేశ మంతయు కబళింతునని భుజాస్ఫాలనము చేయుచువచ్చి నహర్షవర్ధను నెదుర్కొని సత్యాశ్రయత్రిపుల కేశివల్లభుడు పరాజితుంజేసి మరల్చినపిమ్మట చాళుక్యు లీదక్షిణాపథమునకు ప్రభువులైరి. వారు వైదికమతావలంబకులు. దేవతలందరిలో పరమేశ్వరుడే వారికగ్రగణ్యుడు. స్వామిమహా సేనుడే వారిగోత్రరక్షకుడు. సంస్కృతవేద శాస్త్రపురాణాగమాదులు వారికి పరమపూజ్యములు. అట్లగుటచేత బౌద్ధ జైనమతముల వారికి రాజాశ్రయము తప్పినది. అయినను జనసామాన్యమునకు సుబోధకములగు ప్రాకృత భాషలలో నాయా మతముల వాఙ్మయము వ్యాపించి యుండుటచేత రాజావలంబనము లేకున్నను ఆమతములవారి కంత కష్టము తోపకుండెను. ఒకమూల కుమారిలభట్టు బయలుదేరి వేదబాహ్యములైన యీమతములను తీవ్రముగా ఖండించుచు వాని వినాశమునకు గట్టిగా సన్నాహములు చేయుచుండెను. పిమ్మట శంకరాచార్యులు భరతఖండమంతయు సంచారముచేసి వేదమత స్థాపనకై దిగ్విజయము చేసెను. అయినను సంస్కృతభాషా జ్ఞానముగల పండితోత్తములకు మాత్రము శంకరుల దిగ్విజయలాభము కలిగెను. జనసామాన్యమున కామత విషయజ్ఞాన మందుబాటులో లేకుండెను. సంస్కృత భాషలోగల జ్ఞాన ధనము తెలుగుభాషలోనికి పరివర్తనచేయించుట కప్పటి రాజకీయపరిస్థితు లతికల్లోలముగా నుండెను. చాళుక్యనృపాలురు, దక్షిణమున కాంచీపురపల్లవులతోను, పశ్చిమమున కదంబులు రాష్ట్రకూటులు లోనగు జాతులవారితోను, ఉత్తరమున కళింగులతోను ఆత్మరక్షణార్థము విధివిరామములు లేక పోరాటములు సలుపవలసి వచ్చుచుండెను. ఈదాడులతో ప్రజలు మంగలములోని ధాన్యమువలె వేగిపోవుచుండిరి. రాజకీయముగను, సాంఘికముగను శాంతియనునది రాజులకును ప్రజలకును, కూడ గగనకుసుమమువలె దుర్లభమయ్యెను. వేద, శాస్త్ర, పురాణాగమేతిహాస రూపమైన మహావాఙ్మయ మంతయు సంస్కృతభాషలోనే నిల్చిపోయినందునను, ఆంధ్ర జనసామాన్యమున కయ్యది యందనందునను, ఆంధ్రులు 'గాసటబీసటే చదివి గాథలు త్రవ్వుకొను' చుండిరి.

తుదకు పదునొకండవ శతాబ్దమునాటికి ఆంధ్రుల భాగ్యవిశేషముచేత రాజమహేంద్రవరమున రాజనరేంద్రుడు పట్టాభిషిక్తుడై యేలదొడగెను. ఆ రాజచంద్రుడు

సీ. "నిజామహీమండలప్రజఁ బ్రీతిఁ బెంచుచు
    పరమండలంబుల ధరణిపతుల
  నదిమి కప్పంబులు ముదముతోఁ గొనుచును
    బలిమి నీయనిభూమివలయపతుల
  నుక్కడఁగించుచు దిక్కులఁ దనయాజ్ఞ
    వెలిగించుచును"

బహు పరాక్రమవంతుడై యతిసమర్థతతో రాజ్యతంత్రము నిర్వహించు చుండుటచేత దేశమున శాంతి నిలిచెను.

రాజనరేంద్రుడు 'సకలభువన లక్ష్మీనివాసంబైన రమ్యహర్మ్యతలంబున మంత్రిపురోహితసేనాపతి దండనాయక దౌవారిక మహాప్రధానానంత సామంతవిలాసినీ పరివృతుడై యపారశబ్దశాస్త్ర పారగులైన వైయాకరణులును, భారత రామాయణాద్యనేక పురాణ ప్రవీణులైన పౌరాణికులును, మృదుమధుర రసభావభాసుర నవార్థవచనరచనావిశారదులైన మహాకవులును, వివిధతర్కవిగాహిత సమస్తశాస్త్ర గరీయఃప్రతిభులైన తార్కికులును నాదిగా గలుగువిద్వజ్జనంబులు పరివేష్టించి కొలువ విద్యావిలాసగోష్ఠీసుఖోపవిష్టుండై యిష్టకథావినోదంబుల నుండు' శుభదివసము లాంధ్రులకు చేకూరెను. వైదికమత సంరక్షణార్థము తెనుగున పరిశ్రమచేయవలసిన యవసరము గట్టిగా కలిగెను. వేదపఠనమున కనర్హులయిన స్త్రీశూద్రాదుల శ్రేయస్సు నభిలషించి కృపణవత్సలుడగు వేదవ్యాసుడు ఆమ్నాయార్థదర్శితమై, సమస్తధర్మబోధకమై, పంచమవేద మనబరగిన భారతసంహిత సంస్కృతమున రచించిన దట్లేయుండిపోయెను. ఆగ్రంథరత్న మాంధ్రజనుల యభ్యుదయమునకై ముందు తెనుగున రచింపబడుట మిక్కిలి యావశ్యకమయ్యెను. అంతేగాక, చంద్రుడు, పూరుడు, భరతుడు, కురురాజు, పాండురాజు లోనగుమహామహులు వంశకర్తలనగా ప్రసిద్ధికెక్కిన పాండవోత్తముల చరిత్రయే మహాభారతము. ఈ చంద్రవంశ సంజాతుడే యైన రాజరాజు, వంశాభిమానచోదితుడై తనకుల దేవతలన నొప్పినపాండవుల చరిత్ర తెనుగున ముందు విననభిలషించుట సహజము, సమంజసము నైయున్నది. విశేషించి బహుభాషలలో భారతకథ వినువారికి బహుయాగములు చేసిన ఫలము లభించుననియు, శాస్త్రోక్తముగ చేసిన కపిలగోశతదానఫలము భారతశ్రవణ

మాత్రమున నిక్కముగా కలుగుననియు దృఢ విశ్వాసము రాజరాజుమనమున ప్రబలియుండెను. ఈహేతువులచేత మరియే యితరగ్రంథముకంటెను భారతమే తెనుగున ముందు రచింపబడవలసి వచ్చెను. రాజనరేంద్రుడు సగౌరవముగ నన్నయభట్టారకుని పిలిచి యీ భారతాంధ్రీకరణ మహాకార్యమునకే నియోగించెను. ఆంధ్రమహాభారతము సర్వవిధముల చేతను నీయాంధ్రవాఙ్మయముఖమున నుండ తగిన మహాకావ్య మనుటకు సందేహము లేదు. పదునొకండవ శతాబ్దమునాటి యాంధ్రవాఙ్మయస్వరూపమేకాక, భవిష్యదాంధ్ర వాఙ్మయము యొక్క తత్త్వస్వరూప వైఖరులు నన్నపార్యునిచే నిరూపితము లైయనుశాసింపబడినవి. కాని మూడుపర్వము లైనను పూర్తి కాకపూర్వమే నన్నయభట్టు పరమపదించినందున భారతము పరపూరితము కావలసివచ్చెను.

మఱియొక శతాబ్దమున కనగా పండ్రెండవ శతాబ్ద మధ్యమున కావేరీతీరమున నొరయూరుపురము రాజధానిగా రాజ్యమేలిన సూర్యవంశజుడు, కాశ్యప గోత్రుడు, పరమ శైవోత్తముడునగు నన్నెచోడ కవిరాజశిఖామణి, భారతాంధ్రీకరణకార్యము నట్లె యుంచి, యుద్భటమహాకవి విరచితమైన కుమారసంభవమును ప్రబంధముగా నాంధ్రమున రచించి శైవమతవ్యాప్తికిని ఆంధ్రభాషావాఙ్మయములకును, అద్భుతమైన సేవచేసి ధన్యుడైనాడు.

ఆపిమ్మట పదుమూడవ శతాబ్దములో విక్రమసింహపురము రాజధానిగానేలిన మనుమసిద్ధియాస్థానమున నుండిన 'హరిహర పదారవింద వందనాభిలాషి యగు' తిక్కన మనీషి 'యర్థిలోకహిత నిష్ఠం బూని' కృష్ణద్వైపాయనుడు రచించిన భారతామ్నాయమునుగూర్చి వితర్కించి, యందలిసర్వోత్కృష్టతను గమనించి, మహితాత్ముడగు నన్నయభట్టు మూడుపర్వములు మాత్రమే రచించి విడిచినందుకు చింతించి, విరాటపర్వము మొదలు పదునైదు పర్వములును తెనుగుభాషలో 'జనసంప్రార్థ్యంబులై' యొప్పునట్లును, 'బుధ సంతోషంబు' నిండారునట్లును రచింపబూనెను. ఈ కావ్యమున కెవని కృతిపతిగా చేయుదునని యోజించుచు నతడు నిద్రింప నాటిరాత్రి హరిహరనాథుడు స్వప్నమున సాక్షాత్కరించి "నాయనా! తిక్కశర్మ! నీవు కావ్యరసము నెప్పుడును కొనియాడుచుందువు. పంచమవేదమైన భారతము జనుల కారాధ్యము. ఆ గౌరవమూహించి నీ వది తెనుగున రచింప నెంచుట పురుషార్థ మను వృక్షమునకు పండిన పండు. అందు కంగీకరించి కృతిపతిత్వ మర్థించి నేనే వచ్చినా," నని సెలవిచ్చెను. భగవంతు డిట్లు తన్నుం గరుణించుటచే ధన్యుడనైతి నని ముదమొందుచు, తిక్కన "జన్మాంతర దుఃఖముల్ తొలగునట్లుగ చేసి సుఖాత్ముజేయవే" అని యా దేవదేవునివర మర్థించెను. "జననమరణాదులైన సంసార దుఃఖములకు నగపడకుండ నిమ్మనను దెరువుగను వెలుంగు నీ కిచ్చితి" నని భగవంతు డంతర్హితుడయ్యె. అర్థిలోకహితార్థమై కృష్ణద్వైపాయనునిచే రచింపబడి, జనాభ్యర్చితమైన భారతసంహిత తెనుగున గద్యపద్యాత్మకముగా ఆంధ్రావని మోదము నొందునట్లు రచించి దేవసన్నిధిం బ్రశంసించుట యారాధనవిశేష మని తిక్కన కప్పుడు స్పష్టమయ్యెను. తెనుగువారందరు నెప్పుడును చదువుకొని యానందించునట్లు తెనుగుబాసలో భారతార్థము లేటతెల్లము చేసి జాతికిని, భాషకును, మతమునకును శాశ్వతమైన సేవ చేయుటయే మోక్షమార్గ మని యాతనికి విశదమయ్యెను. ముక్కుమూసుకొని మూలకూర్చుండుట యొక్కటే భగవంతుని యారాధించుటకు మార్గము కాదనియు, ఆంధ్రులయొక్క శ్రేయస్సును, అభ్యుదయమును నభిలషించి, ఆంధ్రులానందించువిధమున తాను చేయనేర్చిన స్వకర్మచే ఆంధ్రసేవచేసిన ప్రతియాంధ్రునికిని ప్రత్యేకప్రయత్న మవసరము లేకుండ మోక్షము సిద్ధించుననుసత్యమే యీ స్వప్నవృత్తాంతముయొక్క సారాంశమని నేను విన్నవించుకొనుచున్నాను. "స్వకర్మణాతమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః." అని భగవద్గీత (మోక్షసన్యాసయోగము ౪౬)యు; ప్రజలకంఠోక్తియే భగవంతునికంఠోక్తి (Vox populi vox dei_ The voice of the people is the voice of God) యనియు; వట్టిమాటలచేత గాక ప్రజోపయోగ శీలములై ప్రజారంజకములైన ఘనకార్యములచే భగవంతునారాధించి మోక్షము (Let thy great deeds be thy prayer to thy God) నొందుమనియు ప్రజాస్వామ్యరక్షణ పరతంత్రులగు నేటి పాశ్చాత్య కవిరాజులును ఏయంశములను బోధించిరో ఆయంశములే విరాటపర్వారంభమున తిక్కన సోమయాజి తన స్వప్నవృత్తాంత వివరణ సందర్భమున ప్రతియాంధ్రునికిని జన్మసాఫల్యసాధనమైన కర్తవ్యోపదేశము చేసినాడనియు, ఈ కవిబ్రహ్మోపదేశము ఆంధ్ర స్త్రీపురుషుల కందఱకును ప్రత్యహస్మరణీయమును, అనుసరణీయమును, ఆవశ్యాచరణీయమునని నొక్కి విన్నవించుకొనుచున్నాను. ఆంధ్రు డొకడు కవియై కావ్యములు వ్రాయవచ్చును; ఒకడు విమర్శకుడై యందలిసారస్యమును వ్యక్తము చేయవచ్చును. ఒకడు చిత్రకారుడై యాంధ్రుల రంజింపజేయవచ్చును. ఒకడు సాంఘికాభ్యుదయమునకు, మఱియొకడు రాజకీయౌన్నత్యమునకు, వేఱొకడు ఆంధ్రవాణిజ్యాభివృద్ధికిని పాటుపడి యాంధ్రమాతకీర్తి విస్తరింపజేయవచ్చును. ఎవ డెప్పు డెట్లు పాటుపడినను ఆంధ్రసోదరుల రంజింపజేసి వారిశ్రేయోభివృద్ధుల కనుగుణముగా కృషిచేయుటయే వ్యక్తికిని, జాతికిని మోక్షసాధనమను మూలసూత్రము తిక్కనవలె నిర్వచించినవార లరుదని గ్రహింతము. ఈ సూత్ర రత్నముయొక్క ప్రాముఖ్యము నెపుడును మఱువక తిక్కనార్యుడు విరాటపర్వము మొదలు స్వర్గారోహణ పర్వమువఱకు పదునైదుపర్వము లనన్యసామాన్య ప్రతిభావిశేషములతో నాంధ్రీకరించి ఆంధ్రదేశమునందు వేదమతము పునరుద్ధరణము గావించి, శాశ్వత యశోదేహముతో వెలయుచున్నాడు.

ఆంధ్రమహాభారతరచనానంతరము మార్కండేయపురాణమును తెనిగించిన మారనకవి తిక్కనసోమయాజి శిష్యుడు. తన కావ్య

మునం దీతడు తనగురువరు నిట్లు స్తుతించినాడు:

"ఉభయకవిత్వతత్త్వవిభ
వోజ్జ్వలునం విహితాధ్వరక్రియా,
ప్రభు బుధబంధు భూరిగుణ
బంధురు భారతసంహితాకథా
విభు, బరతత్త్వబోధను, న
వీన పరాశరసూను, సంతత
త్రిభువనకీర్తనీయయశుఁ
దిక్కకవీంద్రుని గొల్తు నర్థితోన్."

ఈమారన ప్రతాపరుద్రచక్రవర్తిని గొలుచు సామంతులలో నొకఁడగు నాగయగన్నవిభునికి తా రచించిన మార్కండేయపురాణము నంకితము చేసెను.

భారత మంతయు పూర్తిగా చదివినను పాఠకులకు కొన్ని సందేహము లుండుట సహజము. పురుషోత్తము డేల మనుష్యమూర్తి గైకొనెను? పాండవుల కైదుగురకు ద్రౌపది యొక్కతెయే యెట్లు అగ్రమహిషియయ్యెను? వివాహములైన లేక ఉపపాండవు లేల దిక్కుమాలి చచ్చిరి? అను సంశయములు బాధింపగా జైమిని మార్కండేయోపదిష్టక్రమమున ధర్మపక్షులకడ కరిగి సందేహనివృత్తి గావించుకొనెను. ఇందు కడప్రశ్న కుత్తర మిచ్చుసందర్భమున జగత్ప్రసిద్ధమైన సత్యహరిశ్చంద్రునికథ రచింపబడినది. తన పాతివ్రత్యభావముచే సూర్యగమనము నాపిన కౌశికపత్ని చరిత్రము నిందు వర్ణింపబడినది. విశేషించి ఇందలి ప్రవరవరూథినీవృత్తాంతము నాధారముగాఁగొని ప్రబంధము రచింపు మని కృష్ణదేవరాయ లాజ్ఞాపింప నాంధ్రకవితాపితామహుఁడు స్వారోచిషమనుచరిత్రము రచించెను. మహాభారతకథావిస్తరణ మని చెప్పదగిన యీ మార్కండేయ పురాణమును తిక్కన శిష్యుడగు మారన రచించుట సహజము యుక్తము నైయున్నది. తరువాతి శతాబ్దములలో భాగవతానుబంధమన దగు హరివంశమును ఎఱ్ఱాప్రగ్గడయును, ఉత్తరహరివంశమును నాచన సోమనాథుడును రచించుట కూడ సహేతుకమై సమంజసముగానున్నది.

మఱియు బహుశతాబ్దములనుండి ప్రాక్పశ్చిమ వాణిజ్యరమానాథులై బహుదేశములకును దూర ద్వీపములకును వలసపోయి తమ శిల్ప సారస్వత నాగరకతా వైభవముల నయ్యయియెడల సగర్వముగా ప్రతిష్ఠించిన మహాసాహసచరిత్రు లగు నాంధ్రనావికావీర శిరోమణుల యాత్రాచరిత్రలులోనగు నద్భుతకథాశ్రవణకుతూహలులగు నాంధ్రజనులు వినోదార్థమయి చదివి యానందించు నిమిత్తము తిక్కన సోమయాజి మిత్రుడగు కేతన చిత్రవిచిత్ర కథాజాలముచే శోభిల్లు దశకుమారచరిత్రను, సంస్కృతమున దండిమహాకవి రచించినదానిని, తేటతెనుగున నాంధ్రీకరించి తిక్కన కంకితమిచ్చి కృతకృత్యుడైనాడు.

ఇట్లు నన్నయ, నన్నెచోడ, తిక్కన, మారన, కేతన లాంధ్రీకరించిరని వ్రాసినాము. ఆంధ్రీకరణ మనగా మూలమున 'తు' 'చ' తప్పకుండ 'చుక్కకిమక్కి' యను సామెత ప్రకారము వ్రాయబడిన బానిసభాషాంతరీకరణము కాదు. సంస్కృత మూలమునందలి వివరము లవసరమయినపుడు సంగ్రహపఱచి, తెనుగుభాషలో తెనుగువారి కెట్లు చెప్పిన చక్కగా బోధపడునో ఆఫక్కి ననుసరించి వ్రాయుటయే ఆంధ్రీకరణమని మా తాత్పర్యము. పదునొకండవ శతాబ్దము మొదలు పదునారవ శతాబ్దాంతమువఱకు సంస్కృతమునందు గల గ్రంథరత్నములు (అనగా పంచమవేద మనబడు మహాభారతమును, భాగవత విస్తరణము ననుబంధములు ననదగు మార్కండేయ పురాణము, హరివంశము నను గ్రంథములును), పురాణములు, కథలు, ధర్మశాస్త్రములు లోనగునవి తెనుగులోనికి పరివర్తింపబడినకాల మగుటచేతను, దీని నాంధ్రీకరణయుగ మని చెప్పవచ్చును. విశేషించి చిన్ననాడు తిక్కనరచించిన నిర్వచనోత్తర రామాయణముతప్ప తక్కిన వాఙ్మయమంతయు గద్యపద్య మిశ్రితమై చంపూకావ్యరూపమున రచింపబడుటచేతను ఈ యుగమును ఆంధ్రీకరణ (చంపూ) యుగమని వ్యవహరింతము. (చంపూ) అని కుండలీకరణమున నుంచుట చాల అవసరము. ఏలయనగా ౧౭-౧౮ శతాబ్దములలో నాయకరాజుల యాదరణమునుబడసి తంజావూరు మండలమున సంస్కృతభారత, భాగవత, రామాయణాది పురాణవాఙ్మయ మంతయు కేవలవచన కావ్యములుగా వ్రాయబడినవి. ఆయుగమును ఆంధ్రీకరణ (గద్య) యుగ మని చెప్పవలసి యుండును.

ఆంధ్రమునందు గద్యకావ్యరచన మెప్పుడెట్లారంభమయ్యెనో సరిగా నిర్ణయించి చెప్పుటకు తగినయాధారము లింతవఱకు లభింపలేదు. నన్నయభట్టారకునికి పూర్వము కొందఱును, సమకాలికులై కొందఱును తెనుగుభాషలో 'మృదుమధురరసభావ భాసురనవార్థవచనరచనావిశారదులైన మహాకవు లుండియుందురు. భారతయుద్ధమునం దర్జునునికి నారాయణుడు తోడైనట్లే, నన్నయభట్టునకు మిత్రుడును, సహాధ్యాయుడును, వాఙ్మయధురంధరుడును నైననారాయణభట్టు తోడ్పడి భారతరచనము నిర్వహింపజేసెనని నన్నయభట్టే చెప్పియున్నాడు. రాజరాజనాస్థానమునందే పావులూరి మల్లన యనుగణకశిరోమణి యొకడు గద్యపద్యాత్మకముగా గణితశాస్త్రము రచించెను. అందు కొన్నిగణితశాస్త్రసంబంధములగు వచనము లున్నవి. అంతకంటె ఆకాలపుగద్యరచనలను, గూర్చి మనకేమియు తెలియరాకున్నది. మనకు తెలిసినంతవఱకు ఆంధ్రకావ్యములలో నట్టిచక్కనివచనరచన కుపక్రమించిన మహానుభావుడు నన్నయభట్టారకుడే. 'ఆంధ్రకవిత్వవిశారదుడు, విద్యాదయితుడు, మహితాత్ముడు'నని తిక్కనయు, 'ఆంధ్రకవితాగౌరవజనమనోహారి' అని పోతనయు నుతించిననన్నయభట్టారకుడు భారతాంధ్రీకరణమునకు ముందు, పూనుకొనుట ఆంధ్రులభాగ్యవిశేషము. ఉభయభాషాకావ్యరచనాభిశోభితుడును, నానారుచిరార్థసూక్తినిధియు నగునన్నయభట్టు 'సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తిలో నారసిమే'లనునట్లును, ఇతరులక్షరరమ్యత నాదరించునట్లును ఆంధ్రభారతము రచింపనెంచినవాడగుట, సంస్కృతపదబహుళమై,

సంస్కృతరచనావిధానములనే విశేషముగా
ననుసరించుచు, మృదువై, మధురమై, గంభీర
మై, మహనీయమై, విశేషశబ్దాలంకారభూషి
తమైన శైలిలో రచన సాగించి జగద్హిత మఖిల
షించినాడు. ఈతనిరచనలో మూడింట రెండు
పాళ్లు సంస్కృతము నొకపాలు తెనుగు నగ
పడుచున్నవి. తిక్కనయన్ననో 'జనాభ్యర్చిత
మైన భారతము కర్ణపుటంబుల నారగ్రోలియాం
ధ్రావలిమోదముం బొరయునట్లు'ను, 'బుధ
సంతోషంబు నిండారునట్లు'ను రచించినాడు.
ఇతనిరచనలో మూడింట రెండుపాళ్లు తెను
గుపదములు, ఒకపాలు సంస్కృతపదములు
కనబడుచున్నవి.

కేవల పద్యకావ్యరచనకంటె చంపూకా
వ్యము రమణీయ మగుటయేకాక ననేకవిధ
ముల బహుసదుపాయముగా నుండుననu
మర్మము బాగుగా నెఱిగినకళాకోవిదు డగుట
చేతను పద్యగద్యవిభాగము రూపమాత్రభే
దమేగాని తత్త్వభేదజనితము గాదనియు,
యథార్థకవిత క్రారూపభేదములతో నిమిత్తము
లేదనియు ననుసత్యము లెస్సగా నెఱిగిన
మహానుభావు డగుటచేతను నన్నపార్యుడు
తారచించిన భారతపర్వములలో సంఖ్యయం
దును, పరిమితియందును సగబాలువచనరచ
నలు గావించినాడు. నిర్వచనకవిత్వములో
నేమో గొప్పయున్నదనుకొని తిక్కన తాను
చిన్ననాడు రచించిన యుత్తరరామాయణ
మును నిర్వచనముగా వ్రాసెను. కాని పెద్ద
వాడై కష్టసుఖముల బాగుగా నెఱిగి భార
తము రచించునపుడు మూడింట నొకపాలు
వచనములుగల చంపూకావ్యముగానే భార
తము నాంధ్రీకరించినాడు.

ఈకావ్యములలో వచనములు కొన్ని సదు
పాయమును బట్టి రచింపబడినవి. అందు కొన్ని
కేవలము నుపక్రమణశీలములు అనగా ముందు
రాబోవు కథావిషయము లేమేమో సూచిం
చుటయె వీనిధర్మము. మఱికొన్ని వచనములు
పూర్వోత్తరసందర్భములం గలుపుసముచ్ఛ
యార్థకములు. పద్యములం దిముడుట కనువు
గానిపట్టిక లొకకొన్ని. పాఠకులకు విసువు
పుట్టకుండ దీర్ఘములగు పట్టికలకును, దీర్ఘతర
ములగు కథావివరణ రచనలకును, వర్ణనాత్మ
కములగు రచనలకును మధ్యమధ్య పద్యములు
గూర్పబడినవి. అట్టి సందర్భములే యోజించి
యీకవులు పద్యములమధ్య గద్యములనుకూడ
నేర్పుతో నెంచి కూర్చినారు. తొలిపద్యము
లందు వర్ణింపబడిన యంశములనే సంగ్రహ
ముగా వచనరూపమునకూడ రచించి పిమ్మట
నుత్తరకథాంశములతో సందర్భము కలుపు
కొనుటకు కొన్ని వ్రాయబడినవి. ఆశ్వా
సాంతగద్య లొకకొన్ని. ఇట్టిరచనలు స్వత
స్సిద్ధముగా రసాత్మకములు కాకున్నను పరమ
ప్రయోజనకారు లగుటచేత కావ్యమందు
వాని కెడమీయక తీరదు. తిక్కనరచనలలో
నీక్రింద వివరింపబడిన బహువిధ వచనరచనలే
గాక మరి మూడు రకముల వచనములు గోచ
రించుచున్నవి. (౧). ఒకే సంగతినిగూర్చి
పలువురు పలువిధముల నెట్లు వ్యాఖ్యానించు
కొనిరో తెలుపునవి. చూడుడు—ధర్మజుడు
యుద్ధారంభమునకు పూర్వము పాదచారియై
భీష్మాదులయొద్దకు బోయినపు డతనియింగిత
మెఱుగజాలక పలువురు పలుమాటలాడిరి.
అవన్నియు నొక్క వచనముగా తిక్కన
రచించినాడు. (౨) సంకుల సమరములో నే
యోధుడేశత్రుయోధుని మార్కొని పోరెనో
వివరించుటకు వచనములే రచించినాడు. (3)
మహా యుద్ధములో పాండవ కౌరవు సేనా
డేయేవ్యూహముల రచించిరో, ఆవ్యూహ
ములలో నేయేయోధు లెచటనెచట నిలిచి
రో, వివరములను తెలుపు రచనలన్నియు నిం
చుమించుగా వచనములోనే వ్రాయబడినవి.

## వాక్యరచనాక్రమము

ఏభాషలోనైనను ఎట్టిరచనకైనను వా
క్యము లవసరము. వాక్యమునకు కర్త, క్రియ
లు ముఖ్యములు. అవి వాక్యమునందు ప్రత్య
క్షముగా నుండవచ్చును. లేనపుడు కొన్ని
సందర్భములందు కర్తగాని క్రియగాని యధ్యా
హారముగా నుండవచ్చును. క్రియ సకర్మక
మైన పక్షమున వాక్యములో కర్మగూడ
నుండవలయును. సకర్మకక్రియలుగల వాక్యము
లందు ముందుగా కర్తను, పిమ్మట కర్మను,
ఆవెనుక క్రియను చెప్పుట ఆంధ్రభాషలో
వచనవాక్యములను రచించుపద్ధతి యైయు
న్నది. కర్తకర్మలను తత్తద్గుణవిశేషము
నిర్వచించు విశేషణములచేతను, వాక్యము
చేతను విస్తరింప చేయవచ్చును. క్రియలను
కాల, స్థల, రీతి, కారణాదులను తెలియజేయు
క్రియావిశేషణ పదజాలముచేత విస్తరింప
వచ్చును. ఇట్టి రచనాక్రమముగల వాక్య
జాలము నేర్చికూర్చి నవరసభరితము లైనగద్య
ముల రచించి యీ కవిసింహులు 'వ్యాసముని
ప్రణీత పరమార్థము' తెనుగువారికి తెల్లము
గావించిరి. వీరు చూపిన త్రోవలే పావనము
లైనవను భక్తి విశ్వాసములతో మారన, కేతన,
శంభుదాసాదులు నన్నయ తిక్కనలకూర్పుకే
మేలుబంతులుగ గ్రహించి తమకావ్యముల
రచించిరి.

సంభాషణార్థములైన రచనలు సహజ
ముగా కుఱుచలు. పాత్రల మనములందు దోచు
నాందోళనమును, స్వల్పకాలమునందు మను
ష్యుల మనశ్శరీరములందు పొడచూపెడి వికా
రపరంపరను సూచించుటకుకూడ నొకదా
నెంటనొకటి తఱుముకొనుచు వచ్చుచున్నట్లు
రచింపబడిన పెక్కు కుఱుచ వాక్యములే
మిక్కిలియనుకూలముగా నుండును. సంపూర్ణ-
కుఱుచ-వాక్యములు కాకున్నను, అసమాపక
క్రియలతో కూడిన వాక్యజాలమైన నిట్టి సంద
ర్భములందు మిక్కిలి ప్రయోజనకారులు
గావచ్చును. (చూ. శకుంతల యాందోళనము,
ఆది ౪ ౭౭) "అనిన విని వెలువెల్లనై వెచ్చ
నూర్చి నిశ్చేష్టితయై...కోపారుణితనయనం
బుల బాష్పకణంబులు దొరగం దల వాంచి
యారాజుం గటాక్షించుచు హృదయ సంతా
పంబు తనకుదాన యుపశమించుకొని..."ఇట్టి
యసమాపకక్రియాపూరిత మైన వాక్యములు
రచించుటవలన స్పష్టముగా నొక్క సదుపా
యముగలదు. కావ్యపఠనము త్వరగాను, సంగ్ర
హముగాను సాగిపోవుచు విసుగనునది లేక
కడు మనోజ్ఞముగా నుండును. అట్లుగాక వా
క్యము లెక్కడికక్కడ త్రుంచివైచి, శకుంతల
వినెను. ఆమె వెలువెల్లనయ్యెను. ఆమె వెచ్చ
నూర్చెను. ఆమె నిశ్చేష్టితయయ్యెను-అని
ఈ ప్రకారముగా పెక్కుసంపూర్ణ-కుఱుచ-

వాక్యములతో శ్వాసకాసాది రోగపీడితులు చదువుకొనుటకు సదుపాయముగా నుండు నట్లు కావ్యము రచింపబడెనేని, కర్తలను కర్తవ్యాంశములను పలుమారు పేర్కొనుచు పోవంబోవ గ్రంథ మనవసరముగా పెరిగి విసుగు పుట్టును. ఇట్టి యుపాయములచే సంస్కృతమూలమును మిక్కిలి సంగ్రహపఱచి, మనోజ్ఞతరము గావించి యాంధ్రపాఠకులకు భారత మందిచ్చిన కవిసింహుల కాంధ్రపాఠకులెల్ల మిగుల కృతజ్ఞులై యుండవలయును కదా! ఒకొక్కచో వీరు రచించినవాక్యజాలము లొక్కయచ్చున తీసినట్లు లొక్కమచ్చున గల నిడి తూచి నట్లుండును. వర్ణనాత్మకము లైన రచనలు దీర్ఘసమాసభూయిష్ఠములై దీర్ఘముగా నుండును. ఇంకను కొన్నిచోట్ల సంగీతశాస్త్రమునందు గల యారోహణావరోహణ విధానములు వీరి రచనలందును గోచరించును. కుఱుచవాక్యముతో నారంభించి, క్రమముగా దీర్ఘతరము లగువాక్యముల రచించి మధ్యకుబోవుసరికి దీర్ఘతమవాక్యమునుగూర్చి యాపిమ్మట క్రమముగా వాక్యములనిడివి తగ్గించుచువచ్చుట కుదాహరణముగా నన్నయకృతమైన భారతారణ్యపర్వమునందలి కిమ్మీరుడను రాక్షసునివృత్తాంతము చూడనగును (అరణ్య. ౧-౧౦౪). కథా వివరణరచనలను గూర్చి యాక్రింద చర్చింతము.

### వచనగ్రంథపరిమితి

కాని ముందుగా వీ రెవరెవ రెంతెంతవచనముగా రచించిరో నిశ్చయించుట యవసరము. నన్నయ సగపాలు వచనముగా రచించె నని పైని చెప్పియుంటిమి. ఇతని తరువాతివారెవరును వచనరచనల కీత డిచ్చినంత ప్రాముఖ్యము నియ్యలేదు. నన్నెచోడుడు కుమారసంభవమున నైదింటనొకపాలుమాత్రము వచనరచన గావించెను. తిక్కనసోమయాజి తాను రచించిన భారతమునందు మూడింట నొకపాలుమాత్రము వచనము రచించినాడు. 'అభినవదండి'యనబరగు కేతన తన దశకుమారచరిత్రమునందు నూటికి ముప్పదియొకటివంతున ననగా తిక్కనకేమాత్రమో తక్కువగా వచనములు గూర్చినాడు. మారన మార్కండేయపురాణమునందన్నో, నాలుగింటనొకపాలు మాత్రము వచనరచన గావించియున్నాడు. ఈ వచనములలో విశేషసంఖ్య కథావివరణ రచనలై యున్నవి.

### కథావివరణరచనలు.

ప్రాచీనసంస్కృతపురాణకథాదు లాంధ్రీకరించుటయే యాయుగమునాటి కవిచంద్రుల ముఖ్యకర్తవ్యమగుటచేత, విసువు పుట్టకుండ రసోత్పత్తికి భంగములేకుండ చక్కగా కథవివరించుకొనుచుపోవుటయే వారిముఖ్యాశయము. కావున నితరవిధములరచనలకంటె సంఖ్యయందును,పరిమితియందునుకూడ కథావివరణశాఖకు చేరినరచనలే వీరికావ్యములలో విశేషముగా చూపట్టుచున్నవి. ఇందు అసమాపకభూతక్రియలతోనిండిన యసంపూర్ణవాక్యములనేకములు చేర్చి యొక్క సంపూర్ణవాక్యముగా రచింపబడుట గమనింపవలయును. ఒకప్పుడు సంపూర్ణక్రియ లుండిన నుండవచ్చును. ఒకప్పుడామహావాక్యార్థమయిన పూర్తి గాకుండనే కవి యుత్తరపద్యరచన కుపక్రమింపవచ్చును. చూడుడు:

"అని శాపంబిచ్చిన దీర్ఘతమునకు నలిగి ప్రద్వేషిణి యిమ్ముదుకని నెటకేనియుం గొనిపోయి విడిచిరండని తనకొడుకులం బంచిన వారును నయ్యాతథ్యు నతిశాంతచిత్తు నతివృద్ధు జాత్యంధునింగనంబులతో బంధించి మదాంధులయి గంగలో విడిచిన నమ్మునియును ప్రవాహవేగంబునం బెక్కుదేశంబులు గడచిచనియె నంత నొక్కనాడు బలియనురాజు గంగాభిషేకార్థంబు వచ్చినవా డయ్యంధనబంధనంబున నుండియు, నుదాత్తానుదాత్తస్వరితప్రచయస్వరభేదంబు లేర్పడ సలక్షణంబుగా వేదంబులం జదువుచుం దరంగఘట్టనంబులం దనయున్న దరిం జేరవచ్చిన వాని మహర్షి మామతేయుంగా నెఱింగి యారాజు దన్నెఱింగించి నమస్కారంబు సేసి యిట్లనియె." నన్నయ, ఆది. ౮-౨౨౭.

"ఇట్లు ధర్మచారిణులు నిజాధీశ్వరులచేతం బరివర్జితలై మాఱువలుక నోడి పరమేష్ఠిపాలికిం జని యేకామకృతదోషంబులం బతులచేతం బరిభవింపబడితి మని విజ్ఞాపించినం జతురాననుండు తద్వృత్తాంతం బెఱింగి పతివ్రతావృత్తియందు వ్రతభ్రష్టలైనను నీశ్వరువీర్యంబు ధరియించినపుణ్యఫలంబున జ్యోతిర్లోకంబునం గృత్తికలనం బ్రవర్తింపుడని వరంబుగా విరించి గరుణించి నియమించిన మహాప్రసాదంబని పుణ్యగతికి నరిగె రటం గమలలక్ష్మి గర్భంబు నందున్న పిండంబులన్నియు నొక్కపిండయి యక్షణంబ పక్వంబునకు వచ్చి." నన్నెచోడ. ౨-౮౧౨.

"ఇంద్రాణి నిశాసమయంబున నుపశ్రుతి నారాధించిన, దదీయాధిదేవత నీసత్యంబువలన నీమగనిం గనియెదవని చెప్పి యనంతరంబ సాకారయై పొడచూపినం బౌలోమి నీవెవ్వరవని యడిగిన నదియును భవత్పాతివ్రత్యసత్యశౌచంబులకుం బ్రియంబందివచ్చితి నుపశ్రుతి నని చెప్పి నీకుం బాకశాసనుం జూపెద రమ్మని తోడ్కొని హిమవంతంబు నుత్తరంబున మంజువంతంబను మహాశైలంబున కరిగి దానియందు శతయోజన విస్తీర్ణంబైన యొక్కసరోవరంబు సొచ్చి యచ్చట నల్లసిల్లు పంచవర్ణకమనీయంబులగు కమలంబులలో నొక్కనాళంబు ఛేదించి ముందటం బ్రవేశించె నింద్రాణియుం దోడన చని తదీయతంతుమధ్యంబున సూక్ష్మరూపంబున నున్న సురపతిం గన్నంత నయ్యుపశ్రుతి యదృశ్యం బగుటయు." తిక్కన, ఉద్యోగ. ౧-౧౪౧.

"ఏనును పోటుగంటి నెత్తురువడసి తెప్పిఱి మర్మంబు గాడమికిం జేసి ప్రాణంబు విడువక యీ యవస్థ నడుచుటకుంగా బ్రతికి పతి యరిగినదెస నల్లనల్లన చని యొక్కపల్లెలోనం బథశ్రాంతనై యున్న మాతుంగని దానివలన రెండవ కుమారుండును బోయలపాలు వడి పోవుట విని "నా తెఱంగును దానికిం జెప్పి యడవి నేమిరువురము నొండొరువులం గౌఁగిలించుకొని యేడ్చుచున్నంత." కేతన, ౪-౧౫

"అట్లువోవుచు నప్పుడమిఱేఁడు నయ్యేటినీటిలో నీదుచు నొక్కపిడిదుప్పిచేరిన దానితోఁక పట్టికొనియె. నది యీడ్చుకొనిపోవ నప్పెనుజీఁకటి దిక్కుదెస యెఱుంగక యిట్టట్టునుం దిగిచి యెట్టకేలకు దరియెక్కిన నతండు మఱియును దానితోక విడువక చని

మనోహరంబగు వనంబుగని యన్నిబిడాంధ కార నీరంధ్రంబగు దానిలోనికి నమ్మగ్రిగి తపఃకృశుండును మహాభాగుండును నగునతనింది గిచికొనిచనునప్పుడు." మారన, మా. పు.-౨౩౧

ఈ రచనలలో గన్పట్టు శైలీభేదముల నించుక గమనింతము. నన్నయరచనలో నన్న యప్రాతిభాల్య ముండదు. మార్దవము వీనక జవగాంభీర్యములతో మహనీయగమనమైన ఖ రితో నీతనిశైలి మనోజ్ఞముగా ప్రవహించు చుండును. నన్నెచోడునిరచనలో నంతటి మార్దవముగాని జవగాంభీర్యములుగాని కన బడకున్నను, అదియును నొకానొక త్వరిత గమనమును చమత్కారవిజృంభణమును గలిగి సొంపుగానుండును. ఒకటి యఖండగౌతమీ ప్రవాహము. రెండవది రమ్యకావేరీప్రవా హము. ఇక తిక్కనకథావివరణములో, వాయుసదృశములు- స్వచ్ఛములు- వేగవంత ములు, దివ్యసౌరభోపేతములు, ఆంధ్రగద్య సారస్వతమునకు ప్రాణధారకములు. వీరరౌద్ర రసములు పొంగిపొరలినవు డవి గాడ్పులు, తుపానులునునై భయంకరములైనను సాధా రణముగా నదీవేగమునకు తీసిపోని త్వరితగమ నము గల్గియు తాపోపశమన శీలములగు శీతల వాయువులు, మనోజ్ఞములైన మందమారు తములు నని చెప్పవచ్చును. 'కవితచెప్పి' ఈ యుభయకవిమిత్రుని మెప్పించిన యభినవ దండి రచించిన దశకుమారచరిత్రము వివిధ విచిత్రకథాజాలమున కాకరముకదా? అందలి కథావివరణరచనలు నేటిసినీమాప్రదర్శనము లలో తెరమీదకు వచ్చుచుబోవుచుండు దృ శ్యములను స్ఫురణకు తేగలవు. మారన మార్కండేయపురాణమున రచించిన కథావివ రణరచనలు పైనలుపురిరచనములకు నన్నివిధ ముల తీసికట్టు. కాని వారలరచన లీతనికి మార్గదర్శకము లగుట ప్రత్యక్షము!

మఱియు నీరచనలలో శ్రోతలకేమేని సందేహములు కలిగెనేని, సందర్భమునుబట్టి యాసంశయ విచ్ఛేదనార్థము తత్సంబంధము గల పూర్వగాథలను సంగ్రహముగా వివరిం చుటయందు వీరందరును కుశలురే. చూడు డొక్కయుదాహరణము. సైంధవుతల నేల బడరాదని కృష్ణు డర్జునునకు తెల్పగా కారణ మేమి? కర్తవ్య మేమి? యని యర్జునుడు ప్రశ్నింప శ్రీకృష్ణుడు సైంధవుని తండ్రిశాపమును, పాశుపతాస్త్రప్రయోగావశ్యకతయు బోధిం చెను. ఇది వచనమునందే రచింపబడుట గమ నింపవలయును. ఇట్టి వనేకములు.

## వర్ణనలు

సముద్రము, పర్వతములు, భూమ్యంతరిక్ష ములు, రమ్యనదీనదములు, సూర్యోదయాస్త మయములు లోనగు సృష్టిసౌందర్యవిశేషము లను, ఆ నదీతీరములందు కుటీరములు నిర్మిం చుకొని తపస్స్వాధ్యాయనిరతులై కాలము గడుపు ఋషీశ్వరుల యాశ్రమములను మను ష్యప్రయత్నవినిర్మితములగు దుర్గపట్టణ సౌధ హర్మ్యములను నందు నివసించి చరించు నర నారీజనముల వారల రూపవిశేషములను, వారు ధరించినవస్త్రభూషణాదులను, వార లొనరించు వివిధవ్యాపారములను వర్ణించు పట్టుల నీకవివరులు సాధారణముగా నోజో గుణప్రధానములైన దీర్ఘసమాసముల రచించు వారలే. కాని ఆ యోజస్సు అర్థవ్యక్తికి ప్రతి కూలముకాక రమ్యముగానుండును. వీరి తరు వాతి గ్రంథకర్త లనేకులు ఇట్టివర్ణనాత్మక రచనలందు వీరికంటె దిట్టలనిపించుకొనవలచి కాబోలు బహుదీర్ఘసమాసములు రచించిరి. కాని యవి యాకవులరచనలవలె నేటలై "తేనెసోక నోరు తియ్యనయగుతీరుతోడ నర్థ మెల్లదోప"నియ్యవు. అందలి "నూఢశబ్దవితతి కొట్టాబ మూగచెవిటివారిముచ్చట." ఆరచ నలు ముట్టరానిముండ్లు; కొఱకరానికొయ్యలు: సమీపింపరాని సాంద్రారణ్యస్థిత మహాపాషా ణములు వానినిగూర్చి వేరొకచోట ముచ్చ టింతము.

ప్రకృతిసౌందర్యవిశేషములలో నుషస్సు చాల రమణీయమైనది. ఋగ్వేదమునం దుషా దేవతాకములైన సూక్తములు విశేషముగా గలవు. పంచమవేదమునందు కవిబ్రహ్మ కూ ర్చిన ప్రభాతసౌందర్యప్రదర్శనమున నొకసారి విహరింతము:—

"తదనంతరంబ యల్లనల్లన తెలుపిముచ్చి యవులవులఁ జనునంధకారంబు దూరంబున నెందును లేకునికివలనం గడల్కొప్పళించి నెఱ విరిసినం బోలుచుకలుకట్టలుంబోని దిక్తటం లును, దమబొసినకందువలుగోసి యెత్తినశై లును బచరించినచూడ్కులు, వేడ్కలం [illegible] దైనడెందంబులుం గలిగి మెలంగుచు కొం[illegible] టికట్టుగాంచియొదవు సమ్మదంబునం బొ[illegible] మేనులు బెరయించి పరమానందంబునం [illegible] క్కుచు జక్కవలు గలసిపొలసి నలిరేగి [illegible] గుచు రేయింటి యాఁకటి పెల్లున [illegible] కవిసి చంచువులం దిగిచి త్రుంచి [illegible] నిక్కనిక్కనఁ బఱచినం జిక్కువడియు[illegible] మృణాళశకలంబులవలన బాలచంద్ర [illegible] రామంబులగు శంభుజలమూర్తి విశేషంబు[illegible] బోని సరోవరంబులును, జీకటివాసినం [illegible] తంబను నింత మానిసి మెలంగి మసంగ[illegible] నట్లు మేలుకని యెలుకలువొడల విదిర్చి [illegible] కొని కలగానంబులకు పులుగుల యెలు[illegible] వలన నొండొంటిం దెలుపుకరణి నొప్పు[illegible] గుహంబులును బరగ నరుణోదయరాగ [illegible] లంబు నెనయుకెంజాయ రంగల్ల విక[illegible] రక్తారవిందంబుల పంక్తి నెగసి చరించు [illegible] రీకంబుల యెఱకల నెఱుల గిఱికొని [illegible] యగు కాంతిప్రవాహంబులం గనలుకొ[illegible] పుప్పొళ్లు విదిల్చి రాల్చుచుం బోలయు[illegible] యానిలంబు గ్రాలుకువ్వంపుఁ దీవల [illegible] గడివోయి తొరగిన విరులవలన మీనకేత[illegible] తన బాణశాలలుంబోని లతామంటపంబు[illegible] మొగిడియు జగంబు సంధ్యాంజలిపుట[illegible] బుల ననుకరించువినంబునం గెంపుగదుర [illegible] నీయంబులగు కుసుమవనంబులును [illegible] నెపంబున నొండొరుల మేలుకొల్పు [illegible] రమణీజనంబుల నర్మాలాపంబులన్ [illegible] దరహాసంబులకాంతిఁ దెలుపెక్కినట్లు [illegible] రారు దీపంబులును, రేపకడ వనలక్ష్మి [illegible] శ్రీ నలంకరించువడువున నెడపడక [illegible] నిగుడు విభాతకుసుమ కదంబ పరిమళం[illegible] నైయున్నంత." తిక్కన, విరాట [illegible]

ఇందు తిక్కనయొక్క సౌందర్యగ్రహ[illegible] త్వమును, తద్వర్ణనాసామర్థ్యమును చక్క[illegible] విశదమగుచున్నవి. 'హరిహరపదారవిం[illegible] దసాభిలాషి' యగు నాకవిచంద్రునికి [illegible]

లసరోవరములందు ప్రతిబింబితములను బాల
చంద్రమూర్తులు శంభుజలమూర్తి శేషంబుల
స్ఫురింపజేయుట మిక్కిలిసొగసుగానున్నది.
ఇట్టిచమత్కారము లెన్నియేనిగలవు. గ్రంథ
విస్తరభీతిచే వానిచర్చ చాలించి యుత్తరాం
శములకు పోవలసియున్నది.

## పాత్రభాషితరచనలు

కావ్యమునందలి వివిధపాత్రలమధ్య నడ
చుసంభాషణములు, వాదప్రతివాదములు,
యుక్తాయుక్తవిమర్శనములును, శ్రోతల శ్రే
యోభివృద్ధికై కొందఱు చేయుహితోపదేశ
ములు, ధర్మోపదేశములును, కార్యనిశ్చయ
సందర్భములందు జరుగుచర్చలు, ఒకరికొకరు
నచ్చచెప్పుకొనుటకు చేసికొను భావోపన్యా
సములు, క్లిష్టసమయములందు కావింపబడు
మహోపన్యాసములు లోనగునవి రచించుట
యందు ఈ యుగమువారందఱును కుశలురే
అయినను భారతమునందు ధృతరాష్ట్రదుర్యో
ధన ప్రముఖ కౌరవులయొక్కయు, ధర్మజ
భీమార్జునాది పాండవులయొక్కయు, తత్పక్ష
పాతియగు శ్రీకృష్ణునియొక్కయు నుపన్యా
సములును, ఈ యుభయులమధ్య విదురసంజ
యులయొక్క యుపన్యాసములును నిరుప
మానములై యొప్పుచున్నవి. రాజనీతియం
దేమి, వక్తృత్వసామర్థ్యమునందేమి యీ
రచన లద్వితీయములై రచనయందు తిక్కన
సోమయాజికిగల మహాద్భుత ప్రతిభను విది
తము చేయుచున్నవి. ఈ యుపన్యాసము
లును, శాంత్యానుశాసనికపర్వములలో శ్రీ
కృష్ణుని యానతి ననుసరించి భీష్ముడు ధర్మ
జునకు జేసిన ధర్మోపదేశములును భారత
సారమై శాశ్వతముగా ప్రకాశించునట్టివి.
బహురసవంతమై, సమయోచితమై, వేశా
కోళముతో నెత్తిపొడుపులతో ప్రతిపక్షుని
నోరడంపగలదై మనోజ్ఞమైన యీ రచనము
చూడుడు. ఇది తొడలువిరిగి పడిన దుర్యో
ధనునితో శ్రీకృష్ణునికైన సంవాదము.

"అనిన విని యచ్యుతుం డతని నవలో
కించి నీవు భీముని, బాలునిఁ బాములం గఱ
పించియు, విషంబిడియు, నీటంద్రోచియుం
బలుమాఱుం జంపఁదలఁచితివి. గొంతియుఁగొడుకు
లేపురుసు నిద్రించుసమయంబున జతుగృహంబు
దహించితివి. ధర్మోత్తర చరిత్రుండగు నజాత
శత్రుసంపదలఁ గపటద్యూతంబున నపహరించి
తంతఁ దనివింబోక యాజ్ఞసేని నేకవస్త్ర రజ
స్వల గొలువులోపల భంగపెట్టి తొప్రొద్ద
నిన్ను నిట్టిదురవస్థకుఁ దేరందగియుండ నట్లు
పోయి సమయంబునవుడు నీ చేసిన సకల
దుష్కృతంబులు సహించిన యిప్పుండవాగ్ర
జుండు నవుప నేను బుడమిపా లడుగవచ్చిన
నీనేరనైతి నీనేరమి నిట్లయితి భవదీయంబగు
లోభంబునం బాప నిశ్చయంబున మదంబున
శాంతచిత్తులగు శాంతనవ ద్రోణులకుం బ్రాణ
హాని వాటిల్లె వినుము ద్రుపదుని తపోయజ్ఞ
ప్రభావంబుల నదియపనిగా జనించిన శిఖండి
ధృష్టద్యుమ్ము లాభీష్మగురుల మరణంబులకుం
గారణంబులు గాక తప్పదుకే? పెక్కండ్ర
తోడం బోరి డస్సినసాత్యకిం జంపువాఁడైన
భూరిశ్రవుం జంపకుండు మే? అనేక ప్రౌఢ
యోధు లొక్కరుని బాలు సౌభద్రుం బొదివి
చంపినం బూనినపూన్కి నిఖిలోపాయంబుల
నెఱపక పుణ్యాత్మయైనపాంచాలి నరణ్యంబు
నం బరిభవించినపాపాత్ముని సైంధవుని బ్రదికిపో
విడిచి యర్జునుం డగ్నిం బ్రవేశించునే? ఇన్ని
తెఱఁగులచరిత్రంబులు నిర్మలంబులు ఘోష
యాత్ర నిన్ను గంధర్వులు పట్టుకొనిపోవు
నప్పుడు నీవారెల్లం బాఱిన నర్జునుండు నన్నుం
గాచుట యెఱుంగరాదే? నీవాపాదించిన
పాపంబులకెల్ల మూలంబైనకర్ణునరవంబు ధర
ణింగ్రుంగినఁ గవ్వడి వానినేయ కేలకాచికొని
యుండు? నుండెనేనియు భూసురశాపంబున
నట్లయినరథంబునకు నిష్కృతిగలుగునే కావున
నన్నిచుసమయించుట సముచితంబు. యుధిష్ఠి
రుండు శల్యుం దెగటార్చిన తెఱంగొప్ప నొప్ప
దని యుగ్గడింపక మేలునేసితి పాండునంద
నులు పుట్టినంతనుండి నేడుతుదిగా నీయెడ
ధర్మవిరోధం బాచరింపరు. కురుకులంబునకు
గుద్దలిగొని దుర్ద్యూతంబు నీవలొడరిచి దాన
నింతలు పుట్టెఁ బవనతనయుండు పట్టినప్రతిన
యెఱుంగవె? గద నూరుభంగంబు నేయుదు
నని పలికి పిడికిటం బొడుచునే? అవియెల్లను
వృథాజల్పంబు లూరకుండుము."

(శల్య. ౨-౩౬౯.)

## యాత్రావివరణములు

ఇతర ప్రదేశములయొక్కయు దేశముల
యొక్కయు వివరములును, అందలి జనుల
వృత్తాంతమును తెలుసుకొనవలయునను కుతూ
హలము మనుజులకు సహజము. శక్తిగలవారు
తామే స్వయముగా దేశసంచారము చేయు
దురు. దేశసంచారము విద్యాంగములలో నొక
టిగా పరిగణించి కొందరు దేశయాత్రగావిం
తురు. పుణ్యతీర్థసంసేవార్థమై కొందరు దేశా
టనము గావింతురు. స్వయముగా దేశసంచా
రము చేయజాలనివారు చేసినవారిని చేరి "నీ
వేదేశమునకుఁజని, యేవెరపున నేమిచేసి తేవే
వముతో నేవిధమున నెటునిలిచితి"వని ప్ర
శ్నించి తెలిసికొని యానందింతురు. ఆంధ్ర
కవితాపితామహుడు మనుచరిత్రయందు వర్ణిం
చినట్లు "తీర్థసంవాసు లేతెంచినా"రని విన్న
పుడు ప్రవరాఖ్యునివలె నెదురుగా నెంతద
వ్వైన నేగి, తత్పదములకెఱఁగి "ఏయేదేశము
లన్ వసించితిరి మీ రేయేగిరుల్ చూచినా,
రేయేతీర్థములందుఁ గ్రుంకిడితి రేయేద్వీపముల్
మెట్టినా, రేయేపుణ్యవనాళిఁ ద్రిమ్మరితి రేయే
తోయధుల్ డాసినా, రాయా చోటుల గల్గు
వింతలు మహాత్మా నాకెఱింగింపవే" యని
ప్రశ్నించి తెలిసికొనుటకు కుతూహలము మను
ష్యులకు స్వతస్సిద్ధముగా నుండును. కావున
పురాణాదులలో యాత్రాసంబంధమైన వివర
ములు విశేషించి వర్ణింపబడినవి. ఆంధ్రమహా
భారతములో నన్నయభట్టారకుడు అర్జునుని
తీర్థయాత్రాసందర్భమునను, రాజసూయార్థ
ము భీమాదులు దిగ్విజయము చేయుసందర్భ
మునను, పాండవులు సేవించిన తీర్థయాత్రా
వివరములందును యాత్రావివరణశీలములైన
వచనములు పెక్కు రచించెను. పాండవు
లజ్ఞాతవాసార్థము పోవునపుడు గడచిన దేశ
విశేషములు, బలరాముని తీర్థయాత్రవిశేష
ములు, అశ్వమేధయాగార్థము హయమువెంట
నరుగునర్జునుడు సందర్శించిన నానాదేశముల
వివరములు లోనగునవి తిక్కన చాలవర్ణించి
నాడు. కేతనకృతదశకుమారచరిత్ర యంతయు
నానాదేశములయొక్కయు, ద్వీపముల యొ
క్కయు, నందలివిశేషములయొక్కయు వివ

రములతోనేగాక ఆయాయువకు లొనరించిన యద్భుతసాహసములతో నిండియున్నది. మార్కండేయపురాణమునందును నిట్టి వివరము లాయాసందర్భములందు వర్ణింపబడినవి.

## ప్రకృతిశాస్త్ర విషయములు (Scientific topics)

సృష్టిపరిణామక్రమము (Evolution) జీవోత్పత్తివిధానము లోనగు శాస్త్రీయాంశములననుసరించి నన్నయ పెక్కుచోట్ల వచనములు రచించెను. అట్టి వింకను ననేకములు విశేషించి రచించుటయేగాక తిక్కనసోమయాజి భూగోళ, ఖగోళ, తత్త్వశాస్త్ర,చారిత్రక ప్రకారములను భారతమునందు భీష్మపర్వాదులను పెక్కుచోట్ల వర్ణించినాడు. గర్భధారణకాలమున మాతృదోషమున ధృతరాష్ట్రుడంధుడును, పాండురాజు పాండుడునైరని నన్నయ వర్ణించెనుగదా? అట్లే నన్నెచోడుడు గజముఖుని జన్మవృత్తాంతము వర్ణించినాడు. దాక్షాయణీపరమేశ్వరులు కైలాసపార్శ్వభూములందు సంచరించుచుండగా దాక్షాయణి యాప్రాంతములందు మదనాసక్తి చేఖెనంగుచున్న మత్తేభవిక్రీడితముం(?)గాంచి సాభిప్రాయముగా పరమేశ్వరు నవలోకింపనత డియ్యకొనె ననియు, నీశ్వరుడు కరియు, దాక్షాయణి కరిణియునై విహరింపగా తత్సమాగమఫలితముగా నాదంపతులకు గజవక్త్రుడుదయించె ననియు వర్ణించి, విఘ్నేశ్వరుడు కరిముఖుడగుటకు శాస్త్రీయమైన హేతువు నిరూపించినాడు. ఇట్లే మార్కండేయపురాణమునందు ౬-౬౧ లో మారన మహిషాసురునికి మహిషముఖము మానవదేహము కలిగియుండుటకు కారణము వానితల్లియగు దితి మహిషీరూపము దాల్చి తపమొనరించుటచే గల్గినశాపమని వివరించియున్నాడు.

ఈ లోకమునందు సమస్తప్రాణుల జీవనమునకును, క్రియానిర్వహణమునకు వలయు సామర్థ్యము అన్నమువలన గలుగుననియు, అన్నమాదిత్యమయమనియు నన్నయ(ఆరణ్యా. ౧-౩౯ లో) తెలిపినాడు. ఇది గొప్పశాస్త్రవిషయము. సూర్యకాంతి తగిలిన గాని ఓషధులులోనగు వృక్షజీవులు కాని, జంతువులు గాని మనుష్యులుగాని నిలువజాలవు. మారన మార్కండేయపురాణమునందలి సప్తమాశ్వాసమున నీ విషయమునుగూర్చి చాలవివరములు తెల్పియున్నాడు. రాజ్యవర్ధనుడనురాజు భాస్కరు నారాధించి, "చని యాభూపతి తాను భార్యయుం బ్రజాసందోహము స్పుత్రపౌత్రనికాయంబును బాంధువర్గము నమాత్యశ్రేణియు న్నిత్యశ్రీ, ధనలీల న్విగతామయత్వము జరాభారవ్యపేతక్రమం,బును నొప్పన్బదివేలు వర్షములు పెంపుంబొంది పాల్చెంగడున్." యథావిధిగ సూర్యనమస్కారములు చేసినచో రోగపీడితులగువా రారోగ్యవంతులై సుఖించుచుందురు.

## స్కాంతశక్తి (Magnetism)

కేతన దశకుమారచరిత్ర పంచమాశ్వాసమునందు నపహారవర్మ యనువానిచే చెప్పబడిన మరీచి యను మునివృత్తాంతము కలదు. ఆకథ నిటీవల సారంగు తమ్మయ రచించిన విప్రనారాయణ చరిత్రకు మాతృక యని చెప్పతగియున్నది. "బలవా నింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి" అను సుప్రసిద్ధగీతావాక్యమున కది చక్కని యుదాహరణము. మరీచిముని "అనంగవికార పారవశ్యమున నొక్క కామినికి వశుడై, దానివాక్యములకొడబడి చుంబకశిలాప్రతిమం దనలు నమ్మోరూపంబునుంబోలె దానిపజ్జ నరుదెంచినట్లు వర్ణింపబడినది. ఈశక్తి నే పాశ్చాత్యులు 'మేగ్నటిజమ్' అని వ్యవహరింతురు.

## ఆరోగ్యము-నగరనిర్మాణము

ప్రజలయొక్క ఆరోగ్యమునకు భంగము రాకుండ నగరాదులు నిర్మించు విషయము (Town planning) గూర్చి యిప్పటి శాస్త్రవేత్తలు చాల తాపత్రయపడుచున్నారు. ఈ విషయమును గూర్చిన యొక్క వచనరచన నిట నుదాహరించుట యుక్తము. మారన మార్కండేయపురాణము (౪-౩౯) లో పట్టణగ్రామ ఘోషాది నిర్మాణక్రమము నిట్లు వర్ణించియున్నాడు.

"శీతోష్ణాది ద్వంద్వంబులచేతం బీడితులై తమ కునికిపట్టులు విచారించి సహజంబులగు గిరిదుర్గ వనదుర్గ జలదుర్గంబులందు నివాసంబులు గావించి చతుర్థంబగు కృత్రిమదుర్గంబు నవల శాస్త్రోక్తప్రమాణవృత్తాయతప్రాకార పరిఖావృతంబులుగాం బుర ఖేట ఖర్వట ద్రోణీముఖంబులు రచియించి పెనుబయలు మంత్రిసామంత గుప్తముగా శాఖానగరంబును గృషీవలశూద్రబహుళంబుగా గ్రామంబును గోగణాకీర్ణ గోపాలజనోపేతంబుగా ఘోషంబును గడిభూమిం బరదేశభాగ దుష్టజనప్రాయముగా వృత్తియును ననని ట్లుష్ట విధంబులై యుండ నిర్మించి యందు గృహంబులును శాలలుం గల్పించుకొని శీతాతపాది బాధల జయించి..." (సశేషము)



# త్రిశూలము

★

విశ్వనాథ సత్యనారాయణ

## మూఁడవయంకము

[ప్రవేశము ; బిజ్జలుఁడు, ఒక మంత్రి.]

బిజ్జ:—బెజ్జదేవా! జగదేవునినుండి యేమని వర్తమానము వచ్చినది?

బెజ్జ:— మహాప్రభూ! జగదేవదండనాయకులు పోయి కోటను ముట్టడివేసిరఁట. నాల్గురోజులు ముట్టడి యైనతరువాత కోటగోడలో నొకచోట రంధ్రముచేసి సైనికులను పాఱఁద్రోలి మనవారు లోనఁ బ్రవేశింపఁ బోయిరఁట. ఇంతలో రెండువేల కాకతీయుల గుఱ్ఱపు ఫౌజు తానచ్చోటికి వచ్చి జగదేవుని సైనికులను పాఱఁద్రోలి రెండుగడియలకాలము కోటవెలికివచ్చి యుద్ధము చేసిరఁట. మనవారికిఁ బ్రతిపక్షులకుఁ దుములసంగరము జరిగెను. ఆయుద్ధానంతరము చూడఁగా మరలఁ గోటగోడ నిర్మింపఁబడియున్నదఁట.

బిజ్జ:—వెలికివచ్చిన రెండువేల గుఱ్ఱపుదళమును మనవారు హతమార్చలేదా?

బెజ్జ:—ప్రభూ! ఆయుద్ధములో వేయిమంది చనిపోయిరఁట. కడమ వేయిమంది పలాయితులైరి.

బిజ్జ:—జగదేవుఁడు తెలివితక్కువచేసినాఁడు. కోటగోడలోఁ గొంతభాగము తనకు వశమగుటయు, మఱల నది శత్రుహస్తగత మగుటయునా?

బెజ్జ:—ప్రభూ! ఇది నాల్గురోజులక్రిదంటి వార్త. నేఁడు మరల వార్త రావలయును.

దౌవారికుఁడు:—(ప్రవేశించి) బెజ్జదేవామాత్యులకొఱ కనుమకొండనుండి కాతువచ్చి వేచియున్నాఁడు.

బిజ్జ:—లోనికి రమ్మనుము.

(దౌవారికుఁడు నిష్క్రమించును, కాతు ప్రవేశించి యుత్తర మిచ్చి పోవును.)

బిజ్జ:—బెజ్జదేవా! ఈయుత్తర మేమో చదువుము.

బెజ్జ:—శ్రీజగదేవదండనాయకుఁడు శ్రీబసవేశ్వరుల పాదపద్మములకు నమస్కరించి యుద్ధమంత్రి బెజ్జదేవామాత్యులకు వ్రాయున దేమనఁగా, ఇదివఱకిచ్చట జరిగిన యుద్ధవార్తలు తమ కిదివఱకే తెలియఁజేసితిని. ఇదివఱకు మేము పట్టుకొన్న కోటగోడభాగము మఱల మేము వశముచేసికొంటిమి. కాని శత్రువు లంతఃప్రాకారమునకు బహిఃప్రాకారమునకు మేము పట్టుకొన్న భాగము రెండువైపుల నడ్డుగోడలు కట్టిరి. ఈకోట లోనిసైనికుల చాకచక్యము నా కబ్బురము గొల్పుచున్నది. ఈ యడ్డుగోడల మూలముగాఁ గోటగోడ పట్టుకొనియు ఫలము లేకపోయినది. ఆ యిఱుకుగోడల మధ్య యుద్ధమున కవకాశము లేదు. నిన్నసాయంకాలమున నొకవేయిదండు కోటవెలుపలికి వచ్చి మాకు యుద్ధమిచ్చినది. దానిని సంపూర్ణముగా నాశనము చేసి

తిమి. శ్రీబసవేశ్వరుల దయయున్నచోఁ గొలఁది దినములలో శ్రీశ్రీశ్రీత్రిభువనమల్లబిజ్జలమహాదేవుల విజయ పతాకము హనుమకొండపై నెగురఁగలదు.—విధేయుఁడు, జగదేవదండనాయకుఁడు."

బిజ్జ:—బెజ్జదేవా! జగదేవుడు క్రమక్రమంబుగాఁ బరాక్రమింపఁగలఁడు. జగదేవునకుఁ జాలినదండనాథుఁడు హనుమకొండలో లేఁడు.

బెజ్జ:—మహారాజా! విడియుద్ధమునయైనచో జగదేవుఁడు గెలువవచ్చును. కాని కాకతీయులు కోటగోడ వెనుక సురక్షితులైయుండఁగఁ గొంత గెలుచుట కష్టమే యగును.

బిజ్జ:—బెజ్జదేవా! ఇంక ననుమానమేనా ? బసవేశ్వరుఁ డెవరనుకొనుచుంటివి. సాక్షాత్పరమేశ్వరుఁడు. ఆయన మనల నొక్కహన్మకొండయేకాదు; భారతదేశమంతయు మనచేత గెలిపించి కాలచుర్యపతాకక్రింద నేలించును. ఒక్కభక్తుఁడు మడివాలు మాచయ్య బిజ్జలుని తల తనపాదములకుఁ దగిలించుకొనెనే. నందియవతారమైన బసవఁ డేమిచేయలేడు?

బెజ్జ:—బసవేశ్వరుఁడు తలంచుకొన వలయునే కాని యేమిచేయలేరు? నేను సెలవు తీసికొందును.

(నిష్క్రమించును.)

బిజ్జ:—బసవేశ్వరుని సాహాయ్యముతో సర్వదేశములు గెలిచి నాపతాక యెగిరించెదను. ద్వారసముద్రపు హోయిసాలులు, దేవగిరి యాదవులు, హనుమకొండ కాకతీయులు, దక్షిణముననుండలి చోళ పాండ్యులు కాలచుర్యచక్రవర్తిపాదములయందుఁ దలలు మోపవలయును. నందిరాజు నాకోటయం దమాత్యుఁడా! శత్రువులకోటలు కొమ్ములతోఁ గ్రుమ్మించి గిట్టలతోఁ దన్నించి పగిలించెదను. శివభక్తుల కేది వశముకాదు. ఆకాశములో వస్త్రములమూట యిరియించిన మహాత్తు చాకివానికిఁ గలుగ, బసవఁ డేమిచేయలేఁడు? స్పృశించి యాకాశమును మూర్తికట్టించఁగలఁడు. నీరు కంబములుగా నిలఁబెట్టఁగలఁడు. గాలి మూటగట్టి సైన్యము లువ్వెత్తుగా నుప్పరవీథి కెగయింపఁగలఁడు.

(బసవేశ్వరుఁడు ప్రవేశించును.)

బిజ్జ:—(అంజలి పూని)

శ్లో. పక్షీంద్రవాహనతపోబలసాధనీయ !
సర్వేశ్వరోల్లసితవాహన లాల్యమాన!
కాపాలిరూపసముపేత పునీతదృష్టే !
శ్రీవజ్రశృంగ వృషభాధిపతే నమస్తే.

బస:—బల్లహచూడామణీ! బెజ్జదేవునివలన హనుమకొండ వృత్తాంతము వింటిని. వార్త విజయసూచకముగా నున్నది.

బిజ్జ:—బసవేశ్వరా! నీదయయున్నచో ననుమకొండయనఁగా నెంత? నీవు నాకుఁ బ్రసన్నుఁడవు గమ్ము. మూఁడులోకములు గెలిచి నంపీశ్వరునిముందు కుడికాలికి మువ్వకట్టెదను. సర్వదేశ జనులచేత హృదయలింగములు కట్టించెదను.

బస:—మహారాజా! నారాజనీతియంతయు నీకు సైవసము చేసితిని. వలయునయేని యుద్ధరంగమున నీమొనమొగదల నాయసువులు బలిపెట్టెదను. నేనే నీకమ్ముడువోయితిని. నీయాజ్ఞకొలఁది నన్ననుసరింపఁజేసికొనుము. నేను సెలవుతీసికొని———.

బిజ్జ:—ఇంటియొద్ద నేమైనఁ బని యున్నదా?

బస:—పని యేమియును లేదు. మనస్సు స్వస్థముగా లేదు.

బిజ్జ:—అట్లయినచో వినోదార్థము చదరంగ మాడుదము.

(ఇర్వురును గ్రీడారంగమునకు బరిక్రమింతురు.)

బిజ్జ:—బసవేశ్వరా! ఈతెల్లపౌజు నాది. ఎప్పుడును భూపతియే తెల్లపౌజుతో నాడవలయుఁగదా! నీవీనాఁడు తెల్లపౌజుతో నాడుము. నేను నల్లపౌజు కొందును.

బస:—మహాప్రభూ! భూమిపతి శివునియవతారము. ఆయనకొఱకై వినియోగింపఁబడిన వస్తువులు మే ముపయోగింపరాదు.

బిజ్జ:—రాజు శివునియవతారమని యాగమములందుండవచ్చును. నీవు ప్రత్యక్షశివుఁడవు. తెల్లపౌజుతో నీవే యాడుము.

(ఆడుచుందురు.)

బస:—రాజా! నీయేనుఁ గిటు మంత్రిచేత నటబంటుచేతఁ జావనున్నది.

బిజ్జ:—బసవా! నీయనుగ్రహ మున్నచో నా బంటును బైకిద్రోసి నాయేనుఁగును మఱల బ్రదికించు కొందును.

(నీల ప్రవేశించును.)

శివగిరిచాప విభో, విభో విభో, శివగిరిచాప విభో.
కనకభూమిధర క్రమచాపధర,
కామాక్షీహృదయాధినాథ గురు— శివగిరి.
భసితలేపమధురాభిరామతను,
బాలచంద్ర శకలాభిరామశిర,
వారాహీకృతసేవ దేవ గురు— శివగిరి.
చాముండీకరతాళ నాట్యపద,
జలజమోహనాకార గురూ గురు,
శర్వాణీ మధురార్ధభాగగురు— శివగిరి.

(నీల తొంగిచూచి సిగ్గుపడి పాటిపోవును.)

బిజ్జ:—(పకాలున నవ్వి) బసవా! నీవు మానీల నెఱుఁగుదువా?

బస:—నే నెప్పుడు దర్శనము చేయలేదు.

బిజ్జ:—ఆమె నిన్నెఱుఁగునఁటగదా!

బస:—ఆమె న న్నెట్లెఱుఁగును?

బిజ్జ:—నిన్నెఱుఁగుదునని నాతోఁ జెప్పినది.

బస:—ఆమె రాజకుమార్తె. నే నామెను జూచుటకే వీలులేదు. న న్నెప్పుడైన నామె దూరము నుండి చూచియుండవచ్చును.

బిజ్జ:—బసవా! నీవు కొన్నిలక్షల గీతములు వ్రాసితివఁట గదా! నే నొక్క గీతమును వినలేదు. మా నీల పాడినగీతమును విన్నావా?

బస:—ఇప్పుడే విన్నాను.

బిజ్జ:—ఇదిగో, నా యేనుఁగు మఱల బ్రదికినది. మా నీల గొంతుక యెట్లుండును? ఆమె పాడెడు పాట లన్నియు నామె వ్రాసినవే. ఆమె వ్రాసినవి కావు. ఆమె పాడెడివి. తా నట్లు పాడుచుంటినని యామెకుఁ దెలియదు.

బస:—రాజా! నీ మంత్రి చిక్కువడనున్నాఁడు. నీ శకటులు గుఱ్ఱములు బంట్లు నెక్కడి వక్కడ చెదరి పోయినవి.

బిజ్జ:—బసవా! నా పౌజునంతయు మహామాత్యుఁడవని నీ చేతిలోఁ బెట్టితిని ఇట్లుచేయుట నీకు న్యాయము కాదు.

బస:—మహారాజా! నీ పౌజు నా చేతిలో సురక్షితముగా నున్నది. నా పౌజునే నీ చేతిలోఁ బెట్టి పాడు చేసినాను.

బిజ్జ:—రెండు పౌజులును సరిచూచు కొనలేవా?

బస:—(కనులు మూసికొని లేచి నిలుచుండి చేతులు పైకెత్తుచున్నాఁడు.)

బిజ్జ:—బసవా! ఇది యేమి? మాట మాటాడుచునే తన్మయత్వము పొందెదవు. ఓడకు మోడకు మనెదవు. ఇసుమంత బూడిద నొసలఁ బూసినను మసలక కొండంత మరు లొందుననుట తెల్లమయ్యెను. చెల్లరే బసవయ్య శివమరుల్ కొంటివో, భక్తిరసము తలకెక్కెనో.

బస:—రాజా! భక్తి తలకెక్కను లేదు, మరులును గొనలేదు. త్రిపురాంతకుని గుడి తూర్పుదిక్కునఁ గపిలేశ్వరమం దొకతపసి నిత్య మాఱుపుట్లపాలతో శైవాభిషేకము చేయుచున్నాఁడు. ఆపాలు కాలువలుకట్టి వీథులందుఁ బ్రవహింపఁగా నేనుఁగులు త్రొక్కి బురదయైనది. ఒకగొల్లది చల్ల నమ్ముకొనుచు నాఱొంపిలోఁ గాలుజాఱి పడఁబోవుచు నన్ను బసవరోయని పిలిచినది. నేను దానిని బడకుండఁ బట్టుకొంటిని.

బిజ్జ:—(పకాలుననవ్వి) అవునయ్యా! వృషభావతార! మంచిదయ్యా! బసవదండనాథుడా! చాగుచాగు, మహావీరశైవ! నిన్ను మే మిదివఱకే దేవుఁ డనుకొనుచున్నాము. ఇంకను మమ్ము నమ్మించుటకుఁ బ్రయత్నము లెందులకు?

బస:—(కోపముతో) రాజా! వెక్కిరింపుమాట లెందులకు? కబురంపి యాగొల్లదానిఁ గనుఁగొనవచ్చును. అది పడఁబోవునప్పుడు చూచినవా రున్నారు. వారినిఁ గనుఁగొనవచ్చును.

బిజ్జ:—మీ రిచ్చటనుండి కదలరాదు. ఎవఁడురా అక్కడ!

(దౌవారికుఁడు ప్రవేశించును.)

బిజ్జ:—శివభక్తుఁడా! ఏగొల్లదానికొఱకు వెదకు మందువు ?

బస:—అది నల్లనిది. దానికిఁ బెద్దముక్కర యున్నది. ముంతకొప్పున్నది.

బిజ్జ:—గొల్లవాండ్రందఱు అట్లేయుందురు.

బస:—పొట్టిది, తొగరురంగుచీర కట్టుకొన్నది.

బిజ్జ:—(నవ్వి) ఇవికూడ గుర్తులు కావు.

బస:—అది మహాభక్తురాలు. దానిశరీరయష్టియందు శివుఁడు నివాసమున్నాఁడు. దానిసంధిబంధములందుఁ బరమశివుఁడు జంగమలింగమై యున్నాఁడు.

బిజ్జ:—బసవా! మహామాత్యుఁడవు. ఇంతకన్న నే నభినయించితినని చెప్పరాదా ?

బస:—నే నబద్ధము చెప్పుచుంటిననియా? దానిని నేను జూచినట్లు వర్ణించితిని. ఆగుమాగుము. దానిపేరు కళియంబ. అది కళ్యాణకటక ముత్తరదిశయందు రాజవీథి దీపిక చిట్టచివరిది దాటిన నాల్గవయిల్లు.

బిజ్జ:—ఓరీ! నీవు పోయి వెంటనే దానిని బిలుచుకొనిరమ్ము.

(దౌవారికుఁడు నిష్క్రమించును.)

(నీల పాడుచుఁ బ్రవేశించును.)

ఉమ నీవు చూచుచూ ఊరకున్నావా
తమరు విసముమ స్వామి గ్రాగించినారా ?
ఒకబోలి కేగునా ఒకసొంటి కేగునా
ముదుకంటినడుమ తనమూర్తి చూచెడు సామి
ఒక్కరొక్కరు చేరి యుసికొల్పినారా
చక్కఁ జచ్చిన వాఁడె చచ్చునన్నారా— ఉమ నీవు.

కోర్కి చెట్టు నొకండు కోర్కులావు నొకండు
లచ్చి నొక్కఁడు తేనెలప్ప యింకొక్కఁడు
మెచ్చిలించినవారు మురిసిపోయారా
పచ్చివిసమును స్వామిఁ బట్టియిచ్చారా— ఉమ నీవు.

విసము గ్రాగెడువేళ విసము మండెడువేళ
విసము చంపెడువేళ వెఱ్ఱి లేత్తెడువేళ
దూరాన నిలఁబడి యూరకొన్నారా
వీరులై యందఱూ వెలిపెట్టినారా— ఉమ నీవు.

బిజ్జ:—బసవా! ఈపాట నీ విదివఱకు వింటివా?

నీల:—విన్నాఁడు, విన్నాఁడు.

బస:—విన్నాను, విన్నాను.

బిజ్జ:—నీవు నీల నిదివఱకుఁ జూచితివా?

నీల:—చూశాడు, చూశాడు.

బస:—చూశాను, చూశాను.

బిజ్జ:—ఇంతకుముందు చూడలేదంటివికదయ్యా! నీలా! బసవేశ్వరుఁడు నిన్నిదివఱకు చూడలేదట.

నీల:—చూడలేదా? చూశాడు, మఱచిపోయినాఁడు.

బిజ్జ:—ఏమయ్యా! ఎక్కడచూచితివి?

బస:—ఎక్కడచూచితినా? ఎక్కడచూచితినా?

నీల:—ఎక్కడచూశావో నేను చెప్పనా ?

బస:—

నందికొమ్ములనడుమ నాట్యమాడితి వీవు
నందికాళులమధ్య నాట్యమాడితి వీవు
తెలికొండకొడుపుపై తొలిమొద్దుమసమపై
నాఁడు పాడితి వీవు, నాఁడు ఆడితివీవు.

నీల:—ఆఁ, గుర్తుకు వచ్చింది.

బస:—మళ్లీ యివ్వాళ కనపడ్డావు.

(దౌవారికుఁడు ప్రవేశించును.)

దౌవా:—మహారాజా ! గొల్లది యాజ్ఞవేచి యున్నది.

బిజ్జ:—లోనికిఁ దీసికొనిరమ్ము.

(గొల్లది ప్రవేశించును.)

బిజ్జ:—నీపేరేమి?

గొల్ల:—కళియంబ.

బిజ్జ:—నీవు గంటక్రింద నెక్కడనుంటివి?

గొల్ల:—చల్లఅమ్ముతూ వీథివెంట పోతున్నాను బాబా!

బిజ్జ:—అప్పు డేమిసంభవించినది.

గొల్ల:—ఏమీా జరగలేదు. చల్లమ్ముకోవడం అప్పటికే అయిపోయింది. ఇంటికి వెళ్లాను.

బిజ్జ:—దారివెంట నెక్కడనైనఁ బడితివా?

గొల్ల:—పడలేదు బాబూ, కాదు, కాదు, పడబోయినాను స్వామీ!

బిజ్జ:—మఱీ యెందుచేఁ బడలేదు?

గొల్ల:—ఎవరో రెండుచేతుల్తో నన్ను పట్టుకున్నారు. నేను కుడిచెయ్యిమాత్రమే చూశాను. ఆచేతికి బంగారపుకడియం ఉన్నది. వేళ్లకు ఉంగరాలున్నవి.

బిజ్జ:—ఆ మనుష్యుని చూడలేదా?

గొల్ల:—నేను లేచి నిల్చుని చీరసర్దుకొని చూసేవఱకు మనిషి యెవరూ కన్పించలేదు.

బిజ్జ:—ఆచేయి గుర్తుపట్టఁగలవా?

గొల్ల:—చిత్తము, దేవరా! గుర్తుపడతాను.

బిజ్జ:—(బసవేశ్వరున కడ్డునిలుచుండి యాయన చేయి వెనుకనుండితీసి ముందుకుఁ జూపును.)

గొల్ల:—ఇదే చెయ్యి బాబూ! బొటనవ్రేలు చంద్రవంకల్లే తిరిగిఉంది.

బిజ్జ:—ఈచేయి యెవరి దనుకొందువు?

గొల్ల:—మహారాజా! తెలియడంలేదు.

బిజ్జ:—నీవు పడఁబోవుచు నెవరినైనఁ బిలిచితివా?

గొల్ల:—బసవరో అని పిలిచాను.

బిజ్జ:—ఎవ రాబసవయ్య?

గొల్ల:—మారాజా! మాయింట్లో బసవఁడిపూజ చేస్తూఉంటాం. ఆయన నందీశ్వరుఁడు. ఆయన్ని పిలిచాను.

బిజ్జ:—ఈరాజ్యములో మంత్రి యెవరే?

గొల్ల:—నాకుఁ దెలియదు మాదొరా!

బిజ్జ:—నే నెవరను?

గొల్ల:—నాకు తెలియదు మారాజా!

బిజ్జ:—వెనుకకు మళ్లి చూడకుండఁ బొమ్ము.

(బసవని కంజలిపట్టి)

జయ జయ బసవాంశా సత్యసద్భక్తివాసా
జయ జయ శివగోత్రా సత్ప్రసాదైకపాత్రా
జయ జయ భవదూరా! శాశ్వతైకాంగధీరా!
జయ జయ బసవాఖ్యా సంవిదాశ్చర్యసౌఖ్యా.

నీల:—

బసవని మంగాళిగంట పలఫల నవ్వింది వెంట
బత్తిరాజనాలపంట పడిరెు వచ్చి శివునింటి
బసవని కొమ్ముల తలతల బసవని ఫాలపు మిలమిల
వెండికొండ వెలుగువల్లి వీ తెంచిన విరులమల్లి—బసవని.

బిజ్జ:—

ఆద్య, నమస్తే; వేద్య, నమస్తే;
తత్త్వ, నమస్తే; చిత్త్వ, నమస్తే;
భావ, నమస్తే; భావి, నమస్తే;
సద్గురు, బసవస్వామిన్, నమస్తే.

నీల:—

నీగంగడోలు నను గోఁకనిచ్చేవా
నీమూపురముపైని యెక్కనిచ్చేవా
నీతోఁకకుచ్చుల్ల నిమురనిచ్చేవా
మేల్ ప్రత్తివిత్తులు మేపనిచ్చేవా?
బసవ బసవా నిన్ను పట్టనిచ్చేవా
నీకడానగునొడల్ తాఁకనిచ్చేవా?

బిజ్జ:—బసవేశ్వరా! నాయవిశ్వాసమును మన్నింపుము.

బస:—మహారాజా! భక్తి రెండువిధములు. ఒకటి సహజము. రెండలవఱచుకొన్నది. నాకుఁ బూజావేళ యగుచున్నది. నేను సెలవుతీసికొందును.

(నిష్క్రమించును.)

బిజ్జ:—నీలా! నీవు బసవేశ్వరు నెచ్చట చూచితివమ్మా!

నీల:—వెండికొండలో రోజూ అమ్మవెళ్లి స్నానం చేస్తుందే చిన్నమెరుపులవాగు, ఆవాగుప్రక్కను ఒకరోజున బసవఁడు కొమ్ములతో తెల్లమట్టి కుమ్ముతున్నాఁడు. మన్ను క్రింద రాలినకొద్దీ రత్నాలు పడుతున్నవి. నేను పోయి రెండురత్నా లేరుకొందా మనుకొన్నాను. బసవణ్ణిచూస్తే పొడుస్తాఁడేమో అని భయంవేసింది. నేను రోజూచూసేబసవఁడే కదా అని దగ్గరకు వెళ్లాను. అతఁడు నన్ను కుమ్మాలేదు; తన్నాలేదు. అతనికాళ్లక్రింద రత్నా లేరుకున్నాను. అతఁ డూరుకున్నాఁడు. నే నేరుకున్నంతసేపూ అతఁడూరుకున్నాడు. అదీ మాయిద్దరికీ స్నేహం; అప్పటినుంచి చాలాసార్లు కలుసుకున్నాం.

బిజ్జ:—అమ్మా! నీపే రేమి?

నీల:—శివుఁడిపేరే నాపేరు. శివుఁడు నీలలోచనుఁడు. నేను నీలలోచనను.

బిజ్జ:—తల్లీ! సంగమయ్య మీ వెండికొండ మీఁద లేఁడా?

నీల:—నా కెప్పుడూ కనపడలేదు. ఎవరో ఆ కొండమీఁద చాలామంది శివునివలె వేషాలు వేసుకొని ఉంటారు. ఎవరు శివుఁడో, యెవరు కాదో నాకు తెలియదు. ఆకొండపైతట్టున చుట్టూ యెనిమిదికొమ్ములమధ్యలో యలో రత్నాలమేడ వుంది. అందులో శివుణ్ణిమాత్రం నేను బాగా గుర్తుపట్టాను. నే నెప్పుడూ అక్కడే వుంటున్నానుగా!

బిజ్జ:—నీ విప్పు డిక్కడున్నావుగా!

నీల:—అన్నా!

బిజ్జ:—తల్లీ! యేమిటి?

నీల:—వదినెగారు నిన్ను పిలుచుకురమ్మన్నారు.

బిజ్జ:—నీ వింతదనుకనుండి యేమిచెప్పుచు న్నావు?

నీల:—ఏమిచెప్పుచున్నాను. వదినెగారు నిన్ను పిలుచుకొనిరమ్మన్నది.

బిజ్జ:—నేను వత్తునులే, నీవు పద.

నీల:—(వెళ్లుచు)

నగజాక న్నెఱ్ఱవడి, నాధమునిజట సడలి
మొగసాలనందిరా. కెగరొప్పినాడు
త్రిపురాసురులమాట దేవతలు కబురురా
కపురవన్నెలయెద్దు కొల్చి)వ్విన్నాఁడు
విష్ణు య్యతొండమ్ము విరిసి ఫీంకారింప
భుగ్నాక్షి బసవన్న బుసకొట్టినాఁడు.

బిజ్జ:—తల్లీ! నీవు నాయింటిలో నుండుటచేత నేను ధన్యుఁడనైతిని. నీ వెవ్వరియవతారమో తెలియ లేదు.

(త్రిపురాంతకభట్టు ప్రవేశించును.)

బిజ్జ:—భట్టారకా! మీకర్మసిద్ధాంతము తునుకలైపోయినది. మీదేవతలందఱుఁ గాలికి బుద్ధిచెప్పిరి. శివుఁడొక్కఁడే పరదైవతము. బసవేశ్వరుఁడే నంది. బసవేశ్వరుఁడే మోక్షదాత.

త్రిపు:—ఏమి జరిగినది?

బిజ్జ:—ఒకగొల్లదానిని బసవన్న పడకుండఁ బట్టుకొనియెను. మీకుఁ దెలియలేదా?

త్రిపు:—రాచనగరంతయు నీకథనే చిలవలు పలవలుగాఁ జెప్పుకొనుచున్నది. నేనును వినుచు న్నాను.

బిజ్జ:—దానికి మీ రేమందురు?

త్రిపు:—మహాప్రభూ! తమరు బసవేశ్వరుని యందు మిక్కిలి సుముఖులైయుండఁగా నాపూర్వపక్షములు పనికిరావు.

బిజ్జ:—పూర్వపక్షములు చేయుట కిందు వీలు లేదు. గొల్లది వచ్చువఱకు బసవేశ్వరు లిందే యున్నారు.

త్రిపు:—ప్రభువులు మన్నించినచో గొల్లదానిఁ దీసికొనిరమ్మని పంపించిన సేవకుఁడు దానితో నీ సంగతి చెప్పియుండవచ్చును.

బిజ్జ:—ఈగదిలో నేనును బసవేశ్వరుఁడు నిద్దఱమే యుంటిమి.

త్రిపు:—దౌవారికుఁడు చెవియొగ్గి లోన నేమి జరుగుచున్నదో యని వినియుండవచ్చును.

బిజ్జ:— గొల్లదివచ్చి యట్లు జరిగినదని యొప్పుకొన నవసరములేదు.

త్రిపు:— అది రాజభయముచేత నట్లు చేసియుండవచ్చును.

బిజ్జ:—బసవేశ్వరునకు దానిపే రెట్లు తెలియును? దానియింటిగు ర్తెట్లు తెలియును?

త్రిపు:—తెలియుటయే మఱియు ననుమానమునకు హేతువు. ఇదియంతయు నింతకుఁబూర్వమే యొకపన్నుగడగాఁ జేసియుండవచ్చును.

బిజ్జ:—భట్టారకా! బసవేశ్వరుఁ డట్టియవినీతిపరుఁడందువా?

త్రిపు:—మహాప్రభూ! త్రిభువనమల్ల! బసవేశ్వరామాత్యుని నే నట్లందునా? వాదపద్ధతిని జూపించితిని. బసవేశ్వరుఁడు భక్తాగ్రేసరుఁడు. ఆయన కర్మ లేదనుట, కులభేదములు లేవనుట యట్లుండనిండు.

గీ. పరమమైన సత్యాచారపరుఁడు తూగి
లేదనుట వానిజిహ్వకు రాదు శివుఁడొ
నంజియో యిట్టిరూపమ్ము నంది వచ్చె
నసలు వడియఁ జోసినభక్తిరసము బసివి.

బిజ్జ:—నిజము, భట్టారకా! నిజము. తక్కిన వన్నియు నట్లుంచుఁడు.

గీ. బాలుఁ డున్మత్తుఁడు పిశాచి బసవమూర్తి
ప్రభువు భక్తినిధానమ్ము బసవమూర్తి
మసలు మరులకుఁ దలమునక్క బసవమూర్తి
ప్రసరదావేశపరివేషి బసవమూర్తి

(తెర.)

## నాల్గవ యంకము

[రాజనగరు ముందు. ప్రవేశము : కొందఱు పౌరులు.]

ఒకడు:—ఓయీ! మనము రాజుతోఁ జెప్పుకోవాలి. ఈబాధలు మనము పడలేము. రాజంటే భయపడ నక్కరలేదుగాని శివభక్తుఁడంటే మనము భయపడక తప్పకవచ్చింది.

రెం. వాఁడు:—వారికి మనము దగ్గరగాఁ బోరాదఁట. వారు మన మతమును యథేష్టముగాఁ దిట్టవచ్చునఁట. వారి మతమును మన మేమీ అనరాదు.

మూ. వాఁడు:—మన పెండ్లిండ్లన్నియు శ్రాద్ధపుఁ బెండ్లిండ్లఁట. వాళ్లు చేసికొనే పెండ్లిండ్లే యథార్థమైన పెండ్లిండ్లఁట.

మఱొకఁడు:—ఓయీ! రాజు బసవేశ్వరుని కిష్టుఁ డగుటవలన మనయందఱ బ్రతుకు లిట్లు బండలెక్కినవి.

మొదటివాఁడు:—అందుకనియే రాజు తలఁచిన దెబ్బలకుఁ గొదువా యంటారు.

రెం. వాఁడు:— అయ్యో! ఊరిలో నీతిప్రవర్తన యంతా పోయింది. ఇఱువదివేల మిండజంగాలా! ఇది యంతా మతమా! ఈ నీతీ పాతిలేని వాళ్లందఱు మన కుల మర్యాదలు దక్కనియ్యటం లేదు. పోయి రాజుతో మొఱపెట్టుకొందాము.

(ప్రవేశము బిజ్జలుఁడు)

ఒకఁడు:—మహారాజా! మేము బ్రతుకలేము. బసవని యాశ్రయించుకొని మిండజంగము లూరంతయు బలిసినారు. వారు మా సంసారములు నిలువనిచ్చుట లేదు.

ఇంకొకఁడు:—స్వామీ! మాలమాదిగల దగ్గర నుండి యందఱును శివభక్తులఁట. వాండ్ర కెదురులేకుండ నున్నది. వాండ్రు వచ్చి మా యగ్నులమీఁద నుమియుచున్నారు. మేము వారి నాగలేకుండ నున్నాము.

ఇంకొకఁడు:—త్రిభువనమల్లా! వీరశైవుఁడనని ప్రతివాఁడును దూసినకత్తితోఁ దిరుగుచున్నారు. మా తలలు మామెడలమీఁద నున్నవో లేవో మాకే యనుమానముగా నున్నది.

మఱియొకఁడు:—బల్లహా! వారివలన మాకు హాని జరుగుచున్నది. మహారాజులు మీరు దయచూడనిచో మాకు బ్రతుకులు లేవు.

ఇంకొకఁడు:—మహారాజా! మా కీమిండ జంగములబాధ తప్పింపుము. అయ్యో! చాఁకలివాఁడు భక్తుఁడు. మంగలివాఁడు భక్తుఁడు. ఈడిగవాఁడు భక్తుఁడు. ఎందుకును పనికిరానివారము మేమే.

బిజ్జ:—మేము విచారించెదము. మీరుపొండు.

(పౌరులు నిష్క్రమింతురు. తరువాత పదిమంది భక్తులు వత్తురు.)

అల్లయ్య:—శివా! మహేశ్వరా! మాకు బసవఁడే రాజు. బిజ్జలుఁడు రాజే కాదు. బసవనికి బంటు. మేము బిజ్జలుని లెక్కసేయము.

మధుపయ్య:—ఓరీ! బిజ్జలుఁడు భవి. బసవని యాజ్ఞఅయితే నేను వాఁడితల యెగురవేస్తాను.

మాదిరాజయ్య:—నీలలోహితా! ఉమాప్రాణేశ్వరా! హరహర మహాదేవ? ఓరీ బిజ్జలుఁడుగూడఁ గొన్నాళ్లలో శివభక్తుఁ డవుతాఁడు.

బడవర బ్రహ్మయ్య:—బసవేశ్వరుఁ డడిగినదెల్లా యిస్తున్నాఁడు. పదండి పోదాము.

కిన్నెర బ్రహ్మయ్య:—నాకు మొన్న బసవఁడు బంగారుహార మిచ్చాఁడు.

కేశిరాజయ్య:—హరహర మహదేవ! నీ వాహారముతో నేమిచేశావు?

ముసిడిచౌడయ్య:—హరహర మహదేవ! ఏమి చేశాఁడా! రాజవీథి చివరనున్న మిండజంగముదానికిచ్చాఁడు.

అల్లయ్య:—బసవేశ్వరునియింటికి నేఁడు భక్తులందఱూ వస్తారా?

మధుపయ్య:—వస్తారు, వస్తారు. మోళిగ మారయ్య, సూరద బ్రహ్మయ్య, సురిగ చౌడయ్య, కలికేత బ్రహ్మయ్య, కక్కయ్యగారు, తెలుగేసు మసనయ్య, తెలుఁగు జొమ్మయ్య, నాకుఁగనిపించి వస్తున్నామన్నారు.

మాదిరాజయ్య:— గండకత్తెర నాచయ్య, కాలాగ్నిరుద్రి, శృంగి బొప్పయ్యగారు, సిగురుచందయ్య, సింగిరి మల్లయ్య, కదిరె రెమ్మయ్యలు వస్తున్నారు.

కన్నడ బ్రహ్మయ్య:—సింగరయ్య, వీరమారయ్య, కల్లయ్య, చిక్కయ్య, కక్కయ్యగార్లు నింక మఱికొందఱును నాకంటెముందే బయలుదేరారు.

(హరహరశంభో మహదేవ యని యందఱు నిష్క్రమింతురు.
త్రిపురాంతకభట్టు మఱి యిర్వురు బ్రాహ్మణులు ప్రవేశింతురు.)

త్రిపు:—ఈవీరశైవులగోల యెక్కువగా నున్నది. నేఁడు బసవేశ్వరునియింట లక్షమందికి భోజనములఁట. అందులో వారేదియడిగిన నది యిచ్చునఁట.

ఒకబ్రాహ్మణుఁడు:—లక్షమంది జంగములు దొరుకుదురా?

రెం. బ్రాహ్మణుఁడు:— ఓరి పిచ్చివాఁడా! ఇరువదివేలకుఁబైఁగా మిండజంగములే యున్నారు.

మొ. బ్రాహ్మణుఁడు:—వీరందఱకు బసవామాత్యుఁడు ధన మెచ్చటనుండి తెచ్చును.

రెం. బ్రా:—బసవేశ్వరున కమాత్యుఁడుగా వచ్చు వేతనముతక్క మఱియొండు లేదుగదా! ప్రతి దినమును వేలకొలఁది జంగములకుఁ బెట్టుటకు ధన మెచ్చటనుండి వచ్చుచున్నదో?

త్రిపు:—రాజుగారి బొక్కసము తనచేతిలోని పని. బిజ్జల మహారాజు కాదనునా?

మొ. బ్రా:—ఇట్లు రాజుగారి బొక్కసము ఖర్చుపడినచో రేపు యుద్ధము రావచ్చును, మఱియొక పని రావచ్చును, ధనము కావలదా?

త్రిపు:—పిచ్చివాఁడా! రేపటి యుద్ధముదాఁక నెందులకు? ఇప్పుడు జగదేవుఁడు హానుమకొండపై దాడిపోయి యున్నాఁడు. ఆయన డబ్బు కావలయు నని లేఖ లుఱికించు చున్నాఁడు. బెజ్జదేవుఁ డిటు బసవేశ్వరునితో నన లేఁడు; అటు మహారాజుతో మనవిచ్చేకొన లేఁడు.

మొ. బ్రా:—అయ్యా! ఈ రాజ రహస్యములతో మన కేమిపని? అందులో మనము రాజసౌధము ముం దుంటిమి. తలవరు లెవరు విన్నను బ్రాణము మీఁదికి వచ్చును. పోదము; రండు.

(నిష్క్రమింతురు.)

బి:—లోకము పలువిధములుగాఁ జెప్పుచున్నది.

(తరువాత నిద్దఱు తలవరులు ప్రవేశింతురు.)

ఒకఁడు:—ఓరీ! కక్కయ్యా! విన్నావా! బసవేశ్వరుఁడు మొన్న మాదిగ శివనాగమయ్యతో భుజాలు భుజాలు కలిపి రాజవీథిలోఁ దిరుగుచున్నాఁడు. నాకు బలే సంతోషంగా వుంది.

రెం. వాఁడు:—ఆ బసవయ్య ఆ గుడ్డలతోనే రాజసౌధంలోకిఁ బోతాఁడు. రాజుగారినిఁ దాకుతాఁడు. బ్రాహ్మలందర్నీ ముట్టుకొంటాఁడు. ఇంకఁ గులమేమిటి! వర్ణమేమిటి? హరహరశంభో! మహదేవ!

మొదటివాడు:—కక్కయ్యా! నీవుకూడ శివభక్తుఁడవైనావా యేమిరా?

రెం. వాఁడు:—అయ్యాము పో! ఇంక బ్రాహ్మణుఁడూ లేఁడు, మాలా లేఁడు; రాజూ లేఁడు, బంటూ లేఁడు. అందఱూ నొకటే. కాదన్నవాణ్ణి తల ఎగురవేస్తాను. బసవఁడియాజ్ఞ పదిదిక్కుల వెలసిన తరువాత రాజెవఁడు, బంటెవఁడు? బ్రాహ్మఁడెవఁడు, పంచముఁడెవఁడు? హరహర మహదేవ!

(ఇద్దఱు నిష్క్రమింతురు. అల్లయ్య మధుపయ్యలు ప్రవేశింతురు.)

అల్లయ్య:—మధుపయ్యా! ఏమి బసవఁడోయి! ఏమిబసవఁడు? లేదన్నమాట యాయన నాలిక్కి లేదు. ఒకభక్తుఁడికిఁ బదిపుట్ల ముత్యాలు దానమిచ్చాఁడు. మఱియొకడికిఁ బదివేల బంగారు నాణెము లిచ్చాఁడు. మిండజంగాలకు వేనవేలు భోగినుల నిస్తున్నాఁడు. తనయింటి నేవస్తువడిగినా లేదనక తీసికొని పొమ్మంటాఁడు. హరహర! మహదేవ! బసవా! బసవా!

మధుపయ్య:—అల్లయ్యా! ఈధనమంతా బసవయ్య యెచ్చటనుండి తెస్తున్నాఁడు.

అల్లయ్య:—హరహర మహదేవ! బిజ్జలధన ప్రాణాపహారా! బసవా! వృషభేశ్వరా! జయజయ మహదేవ! (నిష్క్రమింతురు.)

బిజ్జ:—ఈ వీరశైవులు గుంపులు గుంపులుగా గట్టునఁ ద్రేచుచుఁ బోవుచున్నారు. అందఱు ధనరాసులు మూటఁగట్టుకొనియే పోవుచున్నారు. హా హా! బసవేశ్వరా! నిన్ను నమ్మినందుకు మంచిపని చేసినావు! ఇదిగో! బసవామాత్యుని సౌధము. నేను లోనికిఁ బోయెద.

(అంతటఁ దెరగ...గా బసవఁడు, ఒక జంగముఁ గనిపింతురు.)

బస:—జంగమయ్యా! నీకును శివునకును భేదమేమి? నీ కేమి కావలయునో కోరుము. వెండికొండద్రవ్వి నీకిత్తునా? శివా! సంగమేశ్వర! వెండి కొండ యంతయుఁ ద్రవ్వి నీ కిచ్చినను నీది నీకిచ్చుట యేకాని నాది నీ కేమిచ్చుచుంటిని?

జంగము:—బసవా! ఈప్సితవస్తువితతి నీవు హెచ్చుగా నిచ్చుచుంటివని విని వచ్చితిని. నీబాసకూడ వింటినోయీ!

తలపెట్టు లట్టుల పలికెడుబాస
పలుకట్ల నడవడి పాలించుబాస
పలికి బొంకనిబాస పాలివోనిబాస
చల మెడపనిబాస సలిపెడిబాస
కలనైన శివునకు గెలుపీనిబాస
గెలుపు భక్తుల కిచ్చి కీడ్పడుబాస
మృదునైన నొకపరి యడుగనిబాస
యేమివేడిన నడుగిడ కిచ్చుబాస
చీమంత యైన వంచింపనిబాస
యడిగిన యర్థంబు గడపనిబాస.

ఈ నీ బాస విని వచ్చితిని.

బస:—సంగమా! నీ కేమి కావలయునో యడుగుము. తల కోసియిచ్చెదను. నాయాలి నమ్మి యిచ్చెదను. నా బిడ్డతల ద్రుంచి యిచ్చెదను.

జంగము:—బసవా! శివభక్తులందఱు శివు లందువుకదా! నీ కరుణవలన నందఱు జంగములకు సర్వైశ్వర్యములు నున్నవి. కట్టఁ బులితోలున్నది; తాల్ప జడలున్నవి; మ్రోగింప డమరువు లున్నవి; బసవఁడను భిక్షాపాత్ర చేతిలో నున్నది. నాకు నివియన్నియు నున్నవి. బసవా! బసవా! నాకు మూఁడవ కన్ను లేదోయి. చక్కన సంగమేశ్వరుఁడౌదునేని గ్రక్కన మూఁడవ కన్ను నాకిమ్ము.

(అని తడవుకొనుచున్నాఁడు.)

బస:—(హఠాత్తుగా గోడనున్న యద్దము తీసిజంగమయ్యకుఁ జూపించి, ఖడ్గముదూసి)

సంగమేశ్వర ప్రాణలింగ యో సంగ
హా! యెఱుఁగనె నీదుమాయ నే నకట
ముకురంబులోపల ముక్కన్ను నీకు
నకలంక సహజంబ యదె చూడుమయ్య.

(జంగమయ్య యంతర్హితుఁ డగును.)

బస:—(కత్తి విదలించుచు)

.........,చాపందపంద
యోడకుమోడకు మోరోరిసంగ
ఓడకు మోడకు మొకటియు నొల్ల.

ఓరిసంగా! పారిపోయితివా? నిన్నెప్పుడు నే నొక్కకాని యడుగలేదే! సత్యమాహేశ్వరులిండ్ల నిన్నుఁజూచుచు నెఱుఁగలేనా? దాసయ్యవలె నిన్ను నిధులిమ్మంటినా? సిరియాళునివలెఁ గొడుకు నిమ్మంటినా? కరికాలునివలెఁ గనకవృష్టి గురిపించుమంటినా? కుమ్మరగుండయ్యవలె మిండజంగము రాంద్ర నిమ్మంటినా? సంగా! సంగ! నీభక్తులయిండ్లలో నుచ్ఛిష్టము మాత్రమే నాకుఁ జాలునే. సంగా! సంగ! కాటకోటయ్య, పుష్పదంతుఁడు, దేవయ్య, నమినంది, మా పిళ్లనయనారు మొదలైన మాభక్తులే నీయింట నన్ని పనులకు నైనవారు. నిన్నడుగవలసినపని నాకు లేదు. నీయింట నియోగము కలవా రందఱును మావారలై యుండఁగా నా కేమి కొఱఁతోయి సంగా! నా కేమి కడమ! ఏమైన నడుగు నీ కిచ్చెద నింక! మానంబు వదలిన మఱి తల్లడిలిన మానుగాఁ బ్రమథులయాన నీయాన.

(నృత్యము సేయుచు)

సంగా! సంగ!

కాలకూటము కుత్తుకకు రాకమున్న
క్రాలుపురంబులు కాలకమున్న
గౌరివివాహంబు కాకటమున్న
యార నజాండంబు లలరకమున్న
తివిరి మూర్తులు నెన్మిదియు లేకమున్న
భువి హరిబ్రహ్మలు పుట్టకమున్న

అటనున్న యటనున్న యటనున్న మున్న
యిట నీవు నాస్వామి నేను నీబంట. (మూర్ఛపోవును.)

బిజ్జ:—బసవా! బసవ! నేను, నేను.

బసవేశ్వరుఁడు:—(లేచి) సంగా! మఱల వచ్చితివా? ఏమికావలయునో కోరుకొనుము.

ఓడకు మోడకు మోరోరిసంగ
ఓడకు మోడకు మొకటియు నొల్ల.

బిజ్జ:—బసవేశ్వరా! నేను బిజ్జలదేవుఁడను.

బసవేశ్వరుఁడు:—మహారాజా! తమ రెప్పు డరుదెంచితిరి?

బిజ్జ:—అమాత్యా! నీగృహ మంతయు నింత కల్లోలముగా నున్న దేమి?

బస:—మహారాజా! ఏమియునులేదు. పరమేశ్వరుఁడు లక్షరూపములతో జంగమయ్యలుగా వచ్చుచున్నాఁడు, పోవుచున్నాఁడు. ప్రభువులకు నామాటయందు విశ్వాసము లేదు.

బిజ్జ:—ఉన్నది. బసవా! నీవే శివుఁడవు. వేఱే శివుఁ డెవ్వరు? నీముందు శివుఁడు పంద. ఓరీసంగా! భయపడి పాఱిపోయితివా? మా బసవనిముందు 'చా పంద పంద యోడకు మోడకు మోరోరిసంగ!

(తెరలోఁ బెద్దధ్వని)

బస:—మహారాజా! ఆమహాధ్వని యేదియో చూడవలయును. తమరు కాల్నడ నాయింటికి రావచ్చునా? రాజప్రాసాదమునకుఁ బోదము పదండు.

(పరిక్రమింతురు.)

శివనాగుమయ్య (ప్రవేశించి) బసవా! బసవ! నన్నుఁ గౌఁగిలించుకొనుము. సంగమయ్య నీకు సాక్షాత్కరించెనఁటగదా! ముక్కన్నుకోసము తడుముకొనెనఁటగదా. ఆసంగఁ డేదారిని బోయినాఁడు?

బస:—(కౌఁగిలించుకొని, మఱలఁ గౌఁగిలించుకొని) ఈదారినే పోయినాఁడు. నీగుండెలోనికిఁ జొచ్చినాఁడు. నాగుమయ్యా! నన్ను మోసము చేయుచున్నావా? నీవే సంగమయ్యవు.

బిజ్జ:—బసవా! ఇతఁ డెవరు?

(త్రిపురాంతకభట్టు, బ్రాహ్మణు లిద్దరు ప్రవేశింతురు.)

మొ. బ్రా:—అదుగో! బసవయ్యయు మాల నాగయ్యయు నొకరిపై నొకరు పడిపోవుచున్నారు.

౨౦. బ్రా:—అయ్యా! మనకు దిగు లెందుకు? రాజుగారు దగ్గరనుండియే యట్లు చేయించుచున్నాడు. మనము పోయి యెవరితోఁ జెప్పుకొనవలయును?

త్రిపు:—అతఁడు మాలవాఁ డని రాజుగారికి తెలిసియుండదు. (సమీపించి రాజుతో) మహాప్రభూ! బసవేశ్వరుఁడు నాకు సమారాధ్యుఁడు. ఆయన

సెగకను మాటుసెట్టుకొని చేతి త్రిశూలను వెండికొండపై
నిసుమాను నుప్తమునుంబఱచి నీలగళంబునఁ గానిపింపకుం
డగ చిఱుబూది రాచి ప్రకటమ్మగు నద్రిసుతార్ధభాగమున్
సొగసుగ బూరుపార్థముగఁ జొన్పి సమాగతుఁడౌ నుమేశుఁడా.

బిజ్జ:—భట్టారకా! నిజము, నిజము. బసవఁడు సాక్షాత్పరమేశ్వరుఁడే.

త్రిపు:—ప్రభూ! అంతియేకాదు.

ఇంచువిల్తునకుఁ గోపించి ముక్కన్నులో నావిరేగిన మెఱుప్పుగాఁ
ముప్పురమ్ములు వెన్ను మోపిన యమ్ముచెరాలునిప్పులు తెచ్చురాగాఁ
ఇలయెల్ల తుదిసుబ్బటిలఁజేయు గగ్గోలుకడమంట మంశించుగబ్బిగాఁ
కడలిలో విసమబ్బి కడకుఁద్రోసినమంట గొంతుపట్టఁగఁ జూచుఁ
శీతనీహార కర్పూరవారి హీర [గాఁ
హారముక్తాఫలోదారచారుమూర్తి
యల్లుఁడే శైవభక్తి ధురాత్తశైవ
వీరసామ్రాజ్యపతి బసవేశ్వరుండు.

బిజ్జ:—భట్టారకా! నిజము, నిజము. బసవేశ్వరుఁడు గరళసర్పక్రోధములంటని సచ్చిదానందమూర్తియైన శివుఁడు.

త్రిపు:—ప్రభూ! కాని బసవఁడు వర్ణాశ్రమాచార ధర్మములను బాడుచేయు చున్నాఁడు. ఆశివనాగుమయ్యతో నట్లు కలియఁబడి క్రిందుపైనగుట—

బిజ్జ:—శివనాగుమయ్య యెవరు?

త్రిపు:—మాలవాఁడు.

బిజ్జ:—బసవేశ్వరా! అతఁడు మాలవాఁడు గదా! అయ్యా! ఇది నీమహత్తుకుఁ దగినట్లుగా లేదు. వానినిఁ దాఁకినబట్టలతోనే మమ్మునుఁ దాఁకుచున్నావు. మఱల స్నానముచేయకుండ రాజసౌధమునకు వచ్చెదవు.

త్రిపు:—బసవేశ్వరా! ఈపంచమసంసర్గదూషిత శరీరుఁడవై దేవాలయములకుఁ బోయెదవు. అచ్చట సమంత్రబీజాక్షరయుక్త యంత్రాగ్రలీలావిహారి పరమేశ్వరుని మైలపఱచెదవు.

మొ. బ్రా:—బీజాక్షరయంత్రము శక్తిసమన్వితమై యుండును. సచ్చిదానందమూర్తియైన పరమే

రుఁడు గుణరహితుఁడే; దిక్కాలవర్ణాద్యనవచ్ఛిన్నుఁడే. ఆపరమేశ్వరుఁడు బీజాక్షరములుగా వికారము పొందినంతనే వానికి నియమ మేర్పడుచున్నది.

రెం. బ్రా:—ప్రత్యుపాధికి నియమము లున్నవి. నియమాతీతుఁడైనభక్తుఁడు శుద్ధబుద్ధముక్త భగవంతుని చిత్కళ నుపాసింపవచ్చును. నామరూపగుణ సహితుఁడైన పరమేశ్వరుని నామరూపగుణ సహితులైన మానవులు నియమవంతులై యారాధింపవలయును. నియమము తత్త్వమార్గము ననుసరించుట.

బిజ్జ:—బసవేశ్వరా! నీప్రవర్తన శాస్త్రవ్యతిరిక్తముగా నున్నది.

త్రిపు:—'యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరోజన.' బసవేశ్వరా! నీకుఁ జెల్లుబడియైనది యందఱకుఁ జెల్లుబడి కాదు. నిన్నుఁజూచి ప్రతివాఁడును శివభక్తుఁడనని శివమెత్తి లోకమంతయు మాలకూడు చేయును.

బస:-రాజా! ఈ బ్రాహ్మణులు శాస్త్రవేత్తలా? వీరిది మతమా! వీరుశాసకులా! శివనాగుమయ్య మాలవాఁడా? లింగము ధరించినవానికిఁ గులము లేదు; గుణము లేదు, నామరూపములులేవు. శివనాగుమయ్య సంకల్పించినచో నిప్పుడే ప్రళయము రాఁగలదు. శివనాగుమయ్య యెవ రనుకొనుచున్నారు? త్రిపురాసుర సంహారము చేయుఁగాలరుద్రుఁడు.నందీశ్వరుఁడు ప్రచండమూర్తి యగుచున్నాఁడు. కాలిగిట్టలతో ధరిత్రియెల్లఁ గ్రక్కదలించి శృంగశిఖరములతో నక్షత్రగోళములు గుదాలింపఁ బోవుచున్నాఁడు. హరహర మహాదేవ! శంభో శంకర! (కత్తిదూసి) నాల్గులక్షుల వీరశైవులున్నారు. ప్రతివాఁడును సాక్షాచ్ఛంకరుఁడే. రాజా! ఒక్కశివునకు మడివాలు మాచయ్యకు దద్దరిల్లిపోతివి. నాల్గులక్షులమంది రుద్రులు నీరాజ్యమును, రాజ్యమునందలి భవులను జించిచెండాడెదరు. ఓయీ బ్రాహ్మణులారా! శాస్త్రోపన్యాసములు చేసెదరు. భవులకు నామరూపము లున్నవి. భవులమనస్సులలోఁ బరమశివునకు గుణము లున్నవి. శివభక్తులు పరమశివునే యెఱుఁగుదురుగాని వాని గుణములు, వాని నామరూపము లెఱుఁగరు. ఓయీ! రాజునకుఁ గోపమెక్కించి బసవని దండింపఁజేయఁ జూచెదరా?

త్రిపు:—అమాత్యశేఖరా! మాయుద్దేశ్య మది కాదు. శివనాగుమయ్యతో మీరు కలసిమెలసి తిరుగుచున్నచో లోకమున వర్ణాశ్రమాచార ధర్మములు చెడిపోవును.

బస:—వర్ణాశ్రమాచారధర్మములు మీకృత్రిమ బ్రాహ్మణులు కల్పించినవి. వానిని నేను నిర్మూలము చేసెదను. హరహర మహాదేవ శంభో శంకర.

శివా మహేశ్వర ప్రచండతాండవ కాలరుద్ర శివ శంభో శంకర
వర్ణాశ్రమసంహారక దేవా! ప్రళయతాండవారంభ భయంకర- శివా.
త్రిపురాసురసంహార కాలపరిదీప్త భయంకరచాపమండలా
దుష్టకంఠరుధిరావసేకపరిధూసర దేహ శివా శివా హర- శివా.

బిజ్జ:—బసవేశ్వరా! శాంతింపుము, శాంతింపుము. బ్రాహ్మణు లన్నది యొకటి. నీ కోపకారణము మఱొకటి. నాగుమయ్య మాలవాఁ డని వా రనుచున్నారు. నీవు బ్రాహ్మణసంహారము చేయుదు ననుచున్నావు. నీవు సంహారము తరువాతఁ జేసినఁ జేయవచ్చును. నాగుమయ్య మాలవాఁ డగునా, కాదా?

బస:—భక్తులకుఁ గులభేదము లేదు. వారు బ్రాహ్మణులకన్నఁ బవిత్రులు.

త్రిపు:—వట్టిమాటలతో నైనచో మీశివభక్తులందఱకన్నను బ్రాహ్మణులే పవిత్రులు.

ఉభయసంధ్యాప్రణిష్ఠామహానిధులును
ఉభయభిన్నాత్మపరివివేకోగ్రమతులు
బ్రాహ్మణులు పవిత్రతములు వారికన్న
దివిచికొందురె నతి యశాస్త్రీయమతులు.

బస:-రాజా! ఆమాటమీఁదనే నిలువుమనుము. నాగుమయ్య మాలవాఁడంటిరికదా! మాలతన మాతని యాత్మకున్నదా, శరీరమున కున్నదా?

త్రిపు:—శరీరము నాత్మయు నొకదాని నొకఁడంటుకొని యుండును. రెంటిని విడదీసిన మహాయోగికి నాత్మ మాల కాదు; శరీరమే మాల. ప్రారబ్ధసమను ప్రాప్తమైన యీశరీరమునకుఁ గులభేదము పోదు. ఈ దేహాంతమున యోగి ముక్తుఁడు కావచ్చును. దేహాశ్రయ దోషము దేహ మున్నంతవఱకును బోదు. ప్రతిమాల వానిలోను బరమాత్మ లేదు.

మొ. బ్రా:—పరమాత్మ యున్నచోట మాకభ్యంతరము లేదు.'చండాలోఽస్తు నతు ద్విజోఽస్తు గురురిత్యేషా మనీషా మమ' యని శ్రీశంకరులు పంచమ శరీరగత ముక్త జీవునిగుఱించి చెప్పిరి గాని. ప్రతి మాల వానినిగుఱించి చెప్పలేదు.

బస:—శివనాగుమయ్య శరీరము పంచముని శరీరము కాదు. అది పాలవెల్లి; గంగాధుని క్షీరమును గంగాంబువులును స్వతఃపవిత్రములుగదా!

రెం. బ్రా:—అతనిశరీరమునుండి మీరు క్షీరము లుత్పాదింతురేని మే మంగీకరింతుము.

బస:—ఇదిగో, (నాగుమయ్యచేతులు పట్టుకొని పిండును, పాలు స్రవించును.) ఓయీ! బ్రాహ్మణుఁడా! ఇదిగో శివనాగుమయ్య మాలయంటివికదా! నీవు చేతులు పిండి పాలు కురిపింపుము. లేనిచో నిన్ను నేను గెలిచినట్లు వాదములో గెలిచినవా రోడినవారి శిరశ్ఛేదము చేయించవచ్చును. మీశిరశ్ఛేదములు చేయించెదను. నీవు మాలవాఁడవా? నాగుమయ్య మాలవాఁడా?

రెం. బ్రా:—పాలు పిండింతు నని నీవే చెప్పితివి. పిండింపు మంటిని. పిండించితివి. నాగుమయ్య శరీరము పవిత్రమైనచో నీవును నాగుమయ్యయుఁ గలిసి తిరుగ వచ్చును. రాజు మి మ్మిద్దఱను దల కెక్కించుకొన వచ్చును. నేను బ్రహ్మనిష్ఠుఁడను. నీవు నాతల నెగుర వేయించెదవేని నేనుజెడను. కల్లబొల్లి గారడీలతనము మతముగాఁ బ్రకటించెదవు.

బిజ్జ:—బ్రాహ్మణుఁడా! ఓడిపోయి యెందుల కట్లు పరాక్రమించెదవు?

బ్రా:—మహాప్రభూ! బసవేశ్వరుఁడు మహా భక్తుఁడు. ఆయనదగ్గర కొన్నిమహత్తులు కలవు. అది మతము కాదు.

(నిష్క్రమించును.)

బిజ్జ:—భట్టారకా! మీ రేమనెదరు?

త్రిపు:—అయ్యా! మే మోడిపోతిమి. శివనాగు మయ్య మాలవాఁడు కాదని యొప్పుకొనుచున్నాను. బసవా! నీపరిశుద్ధతను శంకించినందులకు క్షమింపుము.

బస:—మీరు వేయిమంది చేయిమాట లన్నను శివభక్తులకుఁ గొఱంత లేదు. నాహృదయమునందు మీమూలమున వృథాగాఁ గోపభావము చెలరేఁగినది. నే నిట్టికోపము ప్రకటించినందులకుఁ బ్రాయశ్చిత్తము చేసికొనవలయును. నామనస్సు కల్లోలితమైనది.

బిజ్జ:—బసవేశ్వరా! క్షమింపుము, క్షమింపుము.

శమదమాచార సంపత్తిషట్క సహిత
మృదుల శాంతాచ్ఛవార్నిధి యెడఁద నీది
విమత భావతిమింగిల భ్రమణకలుష
వంతముగఁజేసి కల్లోలపఱచినాము.

దేవా! క్షమింపుము.

బిజ్జ:—బసవా! మేము నిష్క్రమించుచున్నాము. నీవు సచ్చిదానందరూపుఁడవై నీలో నీవే రమింపుము.

(బసవఁడు వినా యందఱును నిష్క్రమింతురు.)

బస:—సంగా! సంగ! నాహృదయమునందు యీకోపాదులైన నీచగుణములను దొలఁగింపుము. ఈ నీ సేవకుఁడు దుష్టమార్గములఁ బడిపోవుచున్నాఁడు. దిద్దుకొనుము.

నీల:—(ప్రవేశించి)

శివజటాజూటిలోఁ జిందుబుసగలగంగ
శిశిరతామూర్తియై చెమ్మగిల్లినదీ
తరిమంచుకొండకూఁతురు మేను తాఁకఁగాఁ
జలువపులకల శివుఁడు జలదరించాడూ—శివజటా.
చిన్నారిజాబిల్లి చిలుకుఁదే నెలవాఁక
శివునొసలి కనుమంట చెమ్మయొత్తికినదీ
వెండిమలతాపేఁట నిండువాఁగులచలువ
దండిచలువదనాలు గండరించినదీ—శివజటా.

బస:—నీలా! రత్నము లేమిచేసితివి?

నీల:—అమ్మ చీర చెఱఁగున కంచుగా కుట్టాను.

బస:—నీలా! అమ్మతో చెప్పావా?

నీలా:—ఏమని?

బస:—రత్నాలు బసవఁడు కుమ్మిపెట్టాడని.

నీల:—చెప్పాను, చెప్పాను.

అమ్మకనుగోసలో చెమ్మగిలి చిరుజాలి
కుమ్మ బసవనిమీఁద కోపగించినదీ—శివజటా.
అమ్మ తెలిపలువరున చిమ్మచందురువెలుఁగు
కుమ్మ బసవనిమీఁదఁ గోపగించితదీ-శివజటా.
అమ్మపయ్యెదచెంగు గుమ్మగా ముడుతలై
క్రుమ్మ బసవనిమీఁదఁ గోపగించినదీ-శివజటా.
బరువుచే నెగురని పైఁటఁ జూచిన యమ్మ
గాలి బసవనిమీఁద కారుపూనినదీ-శివజటా.

బస:—నీలా! నీల! నేను ని న్నేఱుమంటినా! నిన్ను పైఁటకొంగు కంచుగా తీర్చమంటినా?

నీల:—నవ్వుతూఅన్నాను, నవ్వుతూ అన్నావట్టి దే.

అమ్మరతనపుఁబైఁట హాసమొలుకఁగఁ జూచి
చిన్ని బసవనచేఁత చిత్తగించినదీ—
రతినాల తళతళల మతి సంతసిలి తల్లి
మించు బసవనిచేఁత మెచ్చుకొన్నాదీ—శివజటా.

(తెర.)

# హిందీ - అఖిలభారత భాష

గాడిచర్ల హరిసర్వోత్తమరావు

హిందీని అఖిలభారతభాషగా వినియోగించుకొనడముకొరకు కాంగ్రెసుమహాసభ బహుకాలముగా ప్రయత్నము చేయుచున్నది. ఏనాడు భాషాధారకముగా కాంగ్రెసు ప్రాంతాలేర్పడినవో ఆనాటినుండి యీ ప్రయత్నము దీక్షతో సాగినది. ఒకవైపు దేశభాషలలో కాంగ్రెసువ్యవహారములుజరుగుచుండగా మరియొకవైపు హిందీప్రచారము కాంగ్రెసు నిర్మాణకార్యక్రమమునం దొకభాగముగా జరుగుచువచ్చినది. ఆ రీతిగా జరిగినపని స్వల్పముగాదు. ఆంధ్రదేశమునందు కాంగ్రెసు మహాసభ జరిగినప్పుడు, అనగా ఇప్పటికి పదిమూడేండ్లక్రిందటనే, ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీ దేశభక్త కొండావెంకటప్పయ్యగారు తమ స్వాగతోపన్యాసమును హిందీలోనే వ్రాసి చదివి వినిపించిరి. ఆంధ్రదేశములోను, అంతకంటె నెక్కువగా తమిళనాడులోను ప్రతిసంవత్సరమును నూర్లకొలది స్త్రీలు పురుషులు హిందీపరీక్షలకు కూర్చొని ఉత్తమ రీతిని కృతార్థులగుచున్నారు. కొందరు హిందీలో గొప్పపండితులు కూడ నైనారు. హిందీనేర్చుకొనుట ఎవ్వరికి కష్టముగ నుండునని ఆదియం దాలోచనీయమై యుండినదో ఆ దాక్షిణాత్యులను మద్రాసుకోస్తావారే హిందీభాషాపోషకత్వమునకు నడుముగట్టిరి.

*　　　*　　　*

ఈ విస్తారప్రయత్నమందంతటను ఎక్కువజోక్యముకలవాడు శ్రీమాన్ సి. రాజగోపాలాచారి. అతడు మనరాజధానిప్రభుత్వమునందు ప్రధానమంత్రిత్వము వహించడముతో 'హిందీ'కి పూర్వమునకంటె ఎక్కువమంచిదినములు కలిగినవి. దక్షిణదేశములో హిందీయెడలగల యభిమానమును పురస్కరించుకొని రాజగోపాలాచారి హైస్కూళ్లలో మొదటిఫారమునుండి మూడవఫారమువరకు, అనగా మూడు సంవత్సరములకాలము నిర్బంధముగా నేర్పుట కేర్పరచెదమని యితడు ప్రకటించినాడు. ఈ ప్రకటన దేశమునందు గొప్పసిద్ధాంతరాద్ధాంతములను పురికొల్పినది. సిద్ధాంతపక్షము మొదట నాలోచింపదగినది.

*　　　*　　　*

భారతభూమియందు నివసించునట్టిమనము-నేను మనలోనుండి వేరుపడిపోయియుండు నట్టిబర్మాను వదలుకొని లెక్కపెట్టినను - ౩౦ కోట్లప్రజ లున్నాము. ఇందరిప్రజలకును నైక్యభావమును కలిగించినదేది? కలిగించగలదేది? బ్రిటిషుప్రభుత్వమువారి నడుగుదుమా తామే యీయైక్యమును కలిగించినవా రందురు. ఇందులో నిజ మున్నది. ఆజాతివా రవలంబించిన ప్రభుత్వార్థికవిధానముల యెడల ఆసేతుహిమాచలమును ప్రబలినవ్యతిరేకత్వము మన కైక్యమును కలిగించిన దనుట సత్యము. కాని దానిమీదనే మనయైక్యము ఆధారపడినదనినను ఆధారపడగలదనినను అది సరియగుమాట కాజాలదు. అనాదికాలమునుండి వ్యాప్తిలోనున్న మనజీవితసాంప్రదాయము,దానికి ఆధారమైనవాఙ్మయము,కళలు, అన్నిటిని వేలయేండ్లుగా కాపాడుకొని వచ్చిన ఒక్కభాష ప్రాబల్యము - అదియే సంస్కృతభాష - మనయైక్యమునకు కారణమని గ్రుడ్డివారయినను అంగీకరింపకతీరదు. రాజకీయస్వరూపముల తారతమ్యముతో నీయైక్యమునకు నిజముగా సంబంధము లేదు. నేటిదినము స్వదేశసంస్థానములలోని ప్రజలును మనమును మంత్రులక్రిందనున్న మనమును ఛీఫ్‌కమీషనరుల క్రిందనున్న కొడగు, ఢిల్లీలప్రజలును ఏకోదరులమని యనుకొనుచున్నామనిన కారణ మీసాంప్రదాయమే కాని వేరుగాదు. ఈ సంప్రదాయమున కొకనిత్యస్వరూపమున్నది. ఆనిత్యస్వరూపమును మార్చుటకు పైపైరుచు లుపచరించిపోవు తాత్కాలిక సిద్ధాంతరాద్ధాంతములకు వేటికిని బలము లేదు. జంఝామారుతములను విలయాంభోధులను ఆర్పలేని మహాజ్యోతి యీసాంప్రదాయమునం దున్నది. ఇది వేలయేండ్లచరిత్రచేత - కాదు, యుగములచరిత్రచేత - ఏర్పడినది. అందుచేతనే ౧౫౦ ఏండ్లుగ మహాప్రయత్నములు గావించిన ఆంగ్లసాంప్రదాయము ఈజ్యోతిని స్పృశించలేకపోయినది. అంతకుముందటి రాజకీయ సంక్షోభములును దీనిని అంటలేనివైనవి. ఇకముందు భారతజాతిచరిత్రయందు పాల్గొనువారందరును - తామే రాజకీయ స్వరూపాభిమానులైనను - ఈసాంప్రదాయమును గురుతించియే ముందంజె వేయవలసి యుందురు. నేటిహిందీ భాషాప్రయత్నమునకును ఈ సాంప్రదాయమునకును సన్నిహితసంబంధ మున్నందుననే అది సాగుచున్నదనుట గమనింపదగిన యంశము.

మన ౩౦౦ కోట్ల ప్రజలును నేడు రాజకీయార్థిక స్వాతంత్ర్యాభిమానను కలవారైనారు. వీరిలో వ్యక్తిత్వము కలవారందరకును-యుక్తవయసు వచ్చినవారందరకును - వోటీయవలసినదనియు అట్టివారందరును రాజ్యమేలే యధికారులనుట కవకాశముండవలెననియు నిశ్చితాభిప్రాయ మంతటను నేర్పడి యున్నది. అనగా ఆసేతుహిమాలయ భూఖండపు వ్యవహారములను దీర్చుటయందు వీ రొక్కొక్కరకును జోక్యముండుట కవకాశము కల్పించవలె ననుట ఆశయము. సర్వప్రాంతములవారును కలియవలసిన చోట మాట్లాడుకొనుట కేకభాష యుండితీరవలయు ననుట అందరును నంగీకరించినారు. ఇదివరలో నట్టిభాష ఇంగ్లీషుగా నున్నది. ఆభాషావ్యాప్తిచరిత్రమును జూచినయెడల నిక్కముం దది మన దేశమున సర్వప్రాంత ప్రజావ్యవహారమునకు పనికిరాదనుట రుజువుపడగలదు. రమారమి యొక శతాబ్దకాలము ఏకైక రాజకీయభాషగా నెలసియు విద్యాప్రచార మీభాషయందే జరిగియు మన దేశమునందు నేడు పదివేలమంది పురుషులలో 212 గురును పదివేలమంది స్త్రీలలో 28 గురును మాత్రమే యింగ్లీషు నెరింగినవా రున్నారు. నిరంకుశప్రభుత్వమును నడపుట కీ సంఖ్యలు చాలినవి గాని ప్రజాసామాన్యప్రభుత్వ మేర్పడినదినములలో

ప్రజాసాంప్రదాయములయందు లీనమైపో జాలని ఇట్టిభాష వ్యవహారమునకు పనికివచ్చునని బుద్ధిమంతులైన యింగ్లీషుసోదరులైనను ననజాలరు. కాబట్టి భారతసాంప్రదాయమునకు సంబంధించి భారతప్రజలరక్తమునందు ఇంకిపోగల మరియొకభాష యింగ్లీషునకు గల రాజకీయస్థానమును ఆక్రమింపక తప్పదు. అది యేది యనుటయే విచారణీయాంశము.

సంస్కృతమున కాస్థాన మియ్యజూచుట పొసగదు. మొదటికారణము సంస్కృతమెచ్చటను ప్రజలవాడుకయం దుండు భాష కాదు. తాను ఈశ్వరతత్త్వమువలె భారతభూమిలోని అన్నిభాషలయందును—ఉర్దూభాషతో సహా— ప్రవేశించి త్యాగియై విరాగియై నిలిచినభాష యిది. సంస్కృతము పారశీకము అరబ్బీ లేకకుటుంబజన్యములయ్యును తరువాతి చారిత్రకపరిస్థితులచేత మనదేశమునందు సంస్కృతమునకు మతసంబంధప్రతీతి యొకటి కలిగినది. కావున నేడు సంస్కృతమును ప్రత్యేకించి పునరుజ్జీవితను జేయ దలచుకొనినను పునరుజ్జీవింపజేయుటకు వీలులేదు. ఎదిగి పెద్దలై కోట్లకొలది ప్రజలమీద సామ్రాజ్యము వహించుచుండు బిడ్డలను కండ్లార జూచి సంతసించు సంస్కృతముబోటి యేతల్లి మరల తనకు రాజ్యము కోరుకొనగలదు ?

మనదేశమున ప్రచారమునందుండునట్టి దేశభాషల వ్యాప్తి యెరుంగుట యీ సందర్భమున అవసరము. హిందీ—దీనిని పడమటి హిందీ యని, తూర్పుహిందీయని, బీహారీయని శాఖలుగా వ్యవహరించుట గలదుగాని ఇప్పుడావ్యవహారమున కర్థములేదు— పదికోట్ల డెబ్బదిమూడులక్షలప్రజమాట్లాడుభాష. బంగాళీభాషాపుత్రులు అయిదుకోట్ల ముప్పదిరెండులక్షలు. ఆంధ్రులు రెండుకోట్ల అరువదినాలుగులక్షలు. మహారాష్ట్రము రెండుకోట్ల తొమ్మిదిలక్షలు. తమిళము రెండుకోట్లనాలుగులక్షలు. పంజాబీ కోటి ఏబదియెనిమిది లక్షలు. అందులో పడమటిశాఖ ఎనుబదియారులక్షలు. కన్నడము కోటి పండ్రెండులక్షలు. ఒరియా తమారమి అంతే. గుజరాతీ కోటి ఎనిమిదిలక్షలు. మలయాళము తొంబదియొకలక్షలు. సింధీ నలువదిలక్షలు.

దీనినిబట్టి 'హిందీ' భారతభూమిలోని మూడవవంతుప్రజ యేకఖండముగా మాట్లాడుభాష యని తేలుచున్నది. అంతే కాదు. అక్బరుపాదుషాహ హిందీకి చాల సన్నిహితసంబంధము కలదిగా 'ఉర్దూను' సృష్టించి రాజకీయముగా ఆ భాషను ప్రచారములోనికి తెచ్చుటచేతను మస్లిమురాజ్యము భారతభూమి యంతటను నేర్పడి మహమ్మదీయసోదరులంతటను మనతోబాటు నివాసము చేయుటచేతను హిందీ (దీనికి పరివర్తనపుపేళ్లే ఉరుదూ, హిందూస్థానీ లనవచ్చును.) దేశమంతటను చాలమందికి అర్థమగుస్థితిలోనికి వచ్చినది. ఇది నేడు జరిగెనది, కాంగ్రెసువారు చేసినది, గాంధీ తెచ్చిపెట్టినది తప్పనుట కింకొక సంగతికూడ వివరింపవచ్చును. హిందూస్థానీని దేశభాషగా రాజకీయవివయములలో బ్రిటిషువారు అంగీకరించకపోయినా మనదేశమునకు వచ్చిన బ్రిటిషుప్రజలు దీనిని సాంఘికవ్యవహారములలో భారతదేశభాషగా ఇదివరలోనే యంగీకరించినారు. లండను, బొంబయి, కలకత్తాలలో పుస్తకముల వ్యాపారముచేయు కోల్మన్ బెన్నెట్టు కంపెనీవారి ప్రకటనలను చదివిచూడుడు.

"How to speak Hindustani in a month—A Vocabulary that will enable the new arrival and the visitor to understand the language of the people."

హిందీని భారతరాజ్యభాషగా—ఆంధ్రరాష్ట్రభాషగాగాదు, ఇతరప్రాంతభాషగా కాదు—అంగీకరింపక మనము ముందడుగు వేయలేము. అందుచేత నీభాష సర్వభారతవ్యవహారమునకయి దేశమంతటను విద్యావిధానమున నేదో యొకభాగమున నేర్పక, నేర్వక తప్పదు. మరియొక విశేషముకూడ ఇందులో గమనింపదగినది కలదు. హిందీ నేర్చుట ఇంగ్లీషు నేర్చుటవలె కష్టమగు పనికాదు. హిందీ మన సాంప్రదాయములోని భాషయని, మనసోదరులలోచాలమంది మాట్లాడు భాషయని ఇదివరలోనే చెప్పితిమి. మరి భాషగాకూడ ఇది మరికొన్ని భాషలకు చాల సన్నిహితమైనది. గుజరాతీ, మరాఠీ, బంగాళీ, ఉరియా, సింధీ, పంజాబీలు తెలుగునకు కన్నడమెంత సన్నిహితమో హిందీకి అంత సన్నిహితము లయినవి. ఇన్నిటికిని హిందీకిని పదజాలముకూడ చాలభాగము సమమయినది. ఇన్నిభాషలును హిందీవలె ప్రాకృతములే. మన ద్రావిడభాషలును ప్రాకృతములే యని యంగీకరింతుమా పుట్టుకచేతనే మన భాషలు హిందీకి సన్నిహితములు. అట్లంగీకరింపకున్నను ఒక్క తమిళమున తప్ప తక్కిన భాషలలోనికి సంస్కృత ప్రాకృత పదజాలమేగాక వాని సంధి, సమాస, తత్సమ, తద్భవ, ఛంద స్సంప్రదాయము లనేకములు మారినవి. ముస్లిము, మహారాష్ట్ర బ్రిటిషు ప్రభుత్వములవారు అఖిలభారత భూమిలోను జొప్పించిన రాజకీయ వ్యవహారపదములును సమముగా జేరినవి. ఈ కారణములన్నిటిని బట్టి 'హిందీ'—అథవా హిందుస్థానీ—సర్వే సర్వత్ర సులభగ్రాహ్యమగుటకు బునాదులేర్పడినవి. ఈ యేర్పడిన పరిస్థితులను బురస్కరించుకొని ప్రజల మనోగతిని ఎదురు తిరుగని మార్గములో నడిపించు సామర్థ్యము మన కాంగ్రెసు పరిపాలకులకు కలదేని హిందీ భారతభూమిలో అఖిలభారత వ్యవహారమునకు సామాన్యభాషయగుట కెక్కువకాలము పట్టదు. మనభాషల కింత సన్నిహిత సంబంధముకలదిగాను ఇంత సులభముగా ప్రజలు నేర్చుకొనుటకు అవకాశము లుండడముచేతనే కొందరి మానసములలో నీభాష మన మాతృభాషలను మ్రింగివేయునేమో యను భీతికూడ కలదు.

ఎంతో అపరిమితోత్సాహముతో హిందీని ప్రజ లభ్యసింపవలసినదని దొరకొనిన ఆంధ్రరాష్ట్రములోనే ఇదివరకే కృశించినయిన మాతృభాష నింకను కృశింపజేయుటకే హిందీ దాపరించిన దని హిందీమీద దండయాత్ర లేవదేసిన సోదరులును ఉన్నారు. వారిని చులకనగా త్రోసివేయనురాదు. అసలు ప్రజలలో చదువు సంధ్యలు నేర్చుకొని ప్రజ

హిత కార్యములు నడుపువారే మనభాషలలో లేరు. నూటికి ఏతొమ్మండుగురో అక్షరజ్ఞులున్నారన్న వారిలో నెక్కువ భాగము సర్కారుద్యోగములలో ప్రవేశించినవారు. లేకున్న సర్కారుద్యోగులతో భుజాభుజిగా తిరిగి స్వకార్యసాధన చేసికొనువారు. తక్కువభాగము మాత్రమే దేశము, ప్రజ, భాష, యనునట్టి అభిమానము కలిగి ప్రాణములైనను ఇచ్చుటకు సిద్ధపడి ప్రజారాధనచేయువారు. ఇట్టియుప్పుగల్లువంటి రసవత్తమ జీవులు హిందీమోహమునందు పడిపోయిన యెడల మనదేశభాషలగతి యేమగునా యను హృదయావేదన భాషాపుత్రులకు కలిగెనదనిన యెడల దానిని అలతిగా దలంపరాదు. అందులోను మనము ౧౯౦౫-౦౬ వ సంవత్సర ప్రాంతములనుండియే మాతృభాషను వేవిధముల నారాధింప నుపక్రమించినవారము. ౧౯౧౧ వ సంవత్సర ప్రాంతమునుండియే మనమాతృభాషాధారకమైన రాష్ట్రమును సంపాదింపవలె నని పట్టుబట్టినవారము. నాటినుండి ఆంధ్రోద్యమము ననంతరూపముల ప్రబలజేసి ౧౯౨౬ లో ఆంధ్రవిశ్వవిద్యాలయమునుగూడ సాధించినవారము. పదునాలుగేండ్లకాలము మనమంత్రులు విద్యాధికారమందుండియును గూడ ఆవిశ్వవిద్యాలయమున నేర్పెడు విజ్ఞానమునకు మనమాతృభాషను ఆధారముచేయుటకు ప్రయత్నించియు కృతకృత్యులు కానిస్థితియందున్నవారము. పూర్ణముగా హైస్కూళ్లలోనైనను ఆంధ్రభాషకు ప్రథమస్థాన మియ్యలేని యవస్థకు వగచుచుండువారము. నోటమాట్లాడి ప్రజలగోడు బయటపెట్టగల మనలోనియేకొందరో ఉన్నట్లుండి గభీలున తెలుగును వదలివేసి హిందీలో తమలోతాము మాట్లాడుకోవడ మారంభించినప్పుడు ఇంతటిపృశ్యమును మన శత్రువుచే చూడగలిగిన ఆంధ్రపుత్రుని మానసము సంక్షోభించినదనిన ఆశ్చర్యపడవలసినదేమియును లేదు. ఇతరమార్పులు ఇప్పటికి జరుగలేదు. కాబట్టి నేడు రాజగోపాలాచార్యులు హిందీని మొదటిమూడు ఫారములలో నిర్బంధపఠనీయము చేసెనన్నందున ఆప్రాత కారణపరంపరమీదే దృష్టిగల సోదరులకు మనసు కుదటపడుటలేదు. కాబట్టి సంకోచములు కలవారగున్నారనుటను మనసులో నుంచుకొనియే హిందీపరవాదమును బలపరచుకొనవలెను గాని, మనవైపున నెంతబలమున్నను, అట్టివారి నణచివేసి సంస్కారము నములులో పెట్టగలమని మాత్రము తలంపరాదు. నేటిదినము హిందీకి వ్యతిరేకత్వము మన యాంధ్రదేశములో కంటె అరవదేశమునందు బలవత్తరముగా నున్నట్లు తోచుచున్నది. మన రాష్ట్రమున గల కొద్దిపాటి వ్యతిరేకత్వమునకును పైన సూచించిన కారణములే అరవవారియెడలను అనువర్తించు నని చెప్పరాదు. కాని మొత్తముమీద నీ కారణము లచ్చటను కొంతవరకు కలవనుటయందు దోషము లేదు. అచ్చటి వ్యతిరేకత్వమునకు మరి రెండు కారణములు బలమైనవి కలవు. ఒక్క కారణమును కాంగ్రెసుపరముగా హిందీభాషావాదులు ప్రకటించుచున్నారు. అచ్చటి కాంగ్రెసుపార్టీప్రతిస్పర్ధులు ఈ యాందోళనమునకు మూలకారకులట! కావచ్చును. తమిళనాడులో మన యాంధ్రరాష్ట్రమునందువలె ఎల్లర నొకచోట జేర్చు భాషావాద మిదివరలో లేదు. ఇతరవిభేదము లెన్నియున్నను తల్లిభాష యనుటతోనే దేహము పులకరించు ఘట్టము లిటీవలి ఆనాటి చరిత్రలో చూపట్టలేదు. మంత్రులైనతరువాత బొబ్బిలి, వెంకటరెడ్డిప్రభృతు లేమి మాట్లాడినను మాతృభాషోద్దీపనప్రశంసయందు ఆంధ్రులెల్ల రొక్కటను సన్నివేశములు మన కుండియున్నవి. అందులో ప్రముఖు లయినవారే నేడు హిందీభాషాపరులును కావడముచేత వ్యతిరేకభావము కనుబరచువారును పార్టీదృష్టితో గాక అభిప్రాయభేదప్రకటనదృష్టితో మాత్రము ప్రవర్తించువారును ఐనారు. కాబట్టి ఆంధ్రరాష్ట్రములోని హిందీవ్యతిరేకత్వము కన్నుమిన్ను గానని ఖండనగా పరిణమించుటకు వీలు లేదు. తమిళులు హిందీవ్యతిరేకత్వము నెక్కువగా చూపుటకు బలవత్తరమైనకారణ మింకొకటి కలదని నా నమ్మిక. అరవలభాష సాంస్కృతికసంపర్కమును మన యంత విస్తారముగా గాని మనయంత హృదయపూర్వకముగాగాని అంగీకరించినది గాదు. తమిళమేనాడో సంస్కృతమువంటి ప్రాకృతములకు సంబంధము కలిగియుండినదుండవచ్చు నని శ్రీ చిలుకూరి నారాయణరావుగారితో మన మేకీభవించినను తమిళులు వారి యక్షరసమామ్నాయమునుగూడ ఎప్పటివలె స్వతంత్రముగానే క జ చ ఞ ట ణ త న ప మ ల తోనే పెట్టుకొన ప్రయత్నించుచున్నారు. కాల్డువెల్లు స్థాపించిన ప్రత్యేక ద్రావిడాభిమానము మనయందుకంటె వారియందు బహురెట్లెక్కువగా నున్నది! ఒకవేళ కాల్డువెల్లుకు వారే దారిచూపినవా రనిన ననవచ్చునేమో. తమిళము సంస్కృతమునుండి యెంతదూరముగా నుంచుకొనిన నంత స్వాతంత్ర్యము నిలుచునని, అంత యనాదిత్వము తమకు సిద్ధించునని వారి యభిప్రాయము. ఇంతకాలముగా తమసొమ్ముగానే వాడుకొనుచువచ్చిన శ్రీ త్యాగరాజస్వాములవారి కీర్తనలనుగూడ దగ్గరకు చేరరానీయరాదనునంతటి స్వచ్ఛ తమిళాభిమానము ప్రబలుచుండునట్టి ఈ దినములలో వారు సాంస్కృతికము ఆర్యసాంప్రదాయ జీవపోషకమునైన హిందీభాషను నిర్బంధముచేత అభ్యసింతు రనుటకు తగినపరిస్థితులు కన్పించవు. ఈ యభిమానము చాలబలమైన కారణము. ఇట్టి యభిమానములకేమి లెమ్మని త్రోసిపుచ్చుట వట్టి యుత్సుకులకు తగియుండునేమో కాని పరిపాలన కార్యమును నిర్వహించువారికి తగియుండదు. చారిత్రకపరిణామము జీవనపరిణామము. సంస్కారమును ప్రవేశపెట్టదలచునట్టివారు ఆ పరిణామములో తమకు అనుకూలమైన కళలేవికలవో వానిని గురుతించి యుపయోగించుకొని పని సాధించవలసియుందురుగాని వారు కోచిన యీ త్రోవనే నడచునని జీవితప్రవాహమున కెదురీదుట మహాజనజీవితమును తీర్చుసందర్భములందు పొసగదు. తనమట్టుకు తాను విశ్వసించినది ఆచరణయందు పెట్టుకొని నిష్కళంక జీవితము నడపుచు ఇతరులకాదర్శప్రాయుడగుట కర్తవ్యము ధర్మము నగునుగాని తననమ్మికలను విశ్వాసములను—అమృతప్రాయములైనవియైనను- నిర్బంధములనుజేసి ఇతరులను-స్వల్పసంఖ్యాకులనైనను-నవలంబించుమనుట ఈ నిష్కళంక జీవనము

నకు కళంకమగును. అందుచేతనే ప్రజాహిత జీవనమును దీర్చుటలో పదినైపుల నాలోచించి చారిత్రకపరిణామ మెట్లు జరిగినదో పరిశీలించి ముందున కడుగువేయవలసియుండును. ఎంత కొద్ది నిర్బంధముతో కార్యసాధనచేయ వీలగునో అంతకొద్ది నిర్బంధముతోనే సరిపుచ్చుకొనవలసియుండును. అథవా తనవిశ్వాసమే ప్రజావిశ్వాసముగా నున్నదని తనయెడల గలవ్యతిరేకత్వము కృత్రిమమని తోచినప్పుడు ఆవిషయమును గురించి ప్రజాహృదయమును ప్రత్యేకముగా నెరుంగుట కాలోచింపవలెను. అరవసాడువిషయమున ప్రస్తుత ప్రధానమంత్రి రాజగోపాలాచారిగా రేమిచేయుదురను సంగతి జ్యోతిషము చెప్పుట యిట ప్రస్తుతముగాదు. కాని కాంగ్రెసుప్రభుత్వము రాజ్యమేలుచున్నది కాబట్టి, అహింస మనవ్రతముకాబట్టి, దేవాలయ ప్రవేశమంతటి మహావిషయమునందు గాంధీజీ అడుగడ్డునకును ప్రజాహృదయ మెరుగుటకు సమ్మతించునట్టి శాసనమును శ్రీ రాజగోపాలాచారిగారి మూలకముగానే ప్రవేశపెట్టింపజూచిన యైతిహ్యము కలదు. కాబట్టి, జర్మనీ ఇటలీ రుష్యాలలో వలె స్వల్పసంఖ్యాకులస్వాతంత్ర్యములను హరించు ఏకపక్షప్రభుత్వమును మందుగుండు తుపాకుల నాధారముచేసికొని స్థాపించుట నేటి మనదృష్టి కాదు కాబట్టి, ఈ సర్వవిషయములను ఆంధ్రరాష్ట్రమున కన్వయము కానిదే యైనను హిందీనిర్బంధవిధానసమస్య మనయెల్లప్రాంతములకు నన్వయించునదైనందువలన పరిపాలనమూలసూత్రప్రశంస చేయవలసివచ్చినది. మన యుద్దేశమగు హిందీ వ్యాప్తికిగూడ జాగరూకతతో మెలంగుటయే కార్యసాధకము.

ఇప్పటి కాంగ్రెసుపరిపాలకవర్గమువారు తలపెట్టిన హిందీభాషాభ్యాసపద్ధతిని వివరించి ప్రజలకు బోధించుట మొదటి యవసరము. మన విద్యావిధానములోనికి బలవంతముగా హిందీని జొప్పించుచున్నారని ఎవ్వరును ననుకొనవలదు. అట్లనుకొనుటకు మంత్రివర్గమువారు అవకాశమును ఇవ్వరాదు. నిజముగా హిందీ వ్యాప్తినందుటకు బలవంతముతో పనిలేదు. జాతీయావసరములచేతనే తన స్వశక్తిచేతనే హిందీ అన్నిభాషలకంటె ప్రబలమై ప్రాకిపోవుచున్నది; ప్రాకిపోగలదు. కాని కాంగ్రెసుపరముగా నేర్పడిన మన మంత్రివర్గములవారు నేడాలోచించుచుండునది మనదేశములోని విద్యావిధానపు పరిపూర్ణమైన సంస్కారము. ఇదివరలోని విద్యావిధానము పరతంత్రరాజ్యాంగ నిర్వహణమున కేర్పడినది. ఇకముందు నడువవలసిన విద్యావిధానము స్వతంత్రరాజ్యాంగస్థైర్యమును సాధించుట కుపకరింపవలసినది. నాడు మహాజనవిద్యయావసరమెక్కువ కనుపించలేదు. నేడు మహాజనవిద్యయే ప్రథమాంగము కావలసియున్నది. అందుచేత క్రొత్తమార్గములలో నికముందు విద్య నడువవలసినదని నేటి పరిపాలకాధికారులు నిర్ణయించినారు. అందరు బాలురకును—బాలికలకు నందునో లేదో,—విద్య నిర్బంధము చేయుదురు. సాధ్యమగునంతదనుక. నీప్రాథమికవిద్య స్వయంపోషకము చేయవలయుననుట సంకల్పము. అందుచేత నీ విద్యావిధానమునందు పారిశ్రామికశాఖ వ్యవసాయముతో గూడ — ప్రథమాంగము కాగలదు. విద్యాబోధ—చిన్న విద్యాలయములతో నారంభించి పైవరకు—కళాశాలలయందును, నని యెదురుచూడదగియున్నది— దేశభాషలలోనే చేయుదురు. విద్యార్థి మొదటి ఫారము చేరు వరకు— అనగా మొదటి నాలుగైదు సంవత్సరముల్లు - విద్యార్థికి ఇతరభాషాసంపర్క ముండదు. అప్పటి నుండి మూడుసంవత్సరములు హిందీ నిర్బంధముగా నేర్పదలచినారు. దేశభాషాధారకవిద్య పైవిశ్వవిద్యాలయములందునుగూడ సాధ్యము చేయువరకు ఈమూడు ఫారములలో ఇంగ్లీషు నిర్బంధపఠనీయముగా నుండునేమో? నాల్గవఫారము నుండి హిందీ నిర్బంధముండదు. ఒకవేళ ఇంగ్లీషు అప్పటినుండి నిర్బంధముగా తరువాతి మూడేండ్లు నేర్పినను నేర్పనగును. ఇప్పటికే మనపిల్లలు ఇంగ్లీషు క్రిందితరగతులనుండియే నేర్చుకొనుచున్నారు. కాబట్టి మూడేండ్లు మొదటి మూడుఫారములలో హిందీయు, తరువాతి మూడు ఫారములలో ఇంగ్లీషును నేర్వవలసివచ్చినను గొప్పకష్టముకాదు. కాని దేశభాషాధారకవిద్య తుదివరకు ఏర్పరచక ఇంగ్లీషుహిందీలు మొదటి మూడుఫారములలో పరీక్షలకొరకు నిర్బంధముగా చదువవలసి వచ్చునెడల బరువు హెచ్చుగుననుట స్పష్టము. ఈదృష్టితో కొందరు కొంతవ్యతిరేకత్వము సూచించువారున్నారు. మొదట మొదట ప్రధానమంత్రి సి. రాజగోపాలాచార్యులవారు పరీక్షలలో తమకు విశ్వాసమే లేదనియు పరీక్షలన్నియు తుడిచివేయదగునవే యనియు అభిప్రాయ మిచ్చుచుండిరి. ఆయభిప్రాయమునందు వారి కిప్పటికిని విశ్వాసము కలదని కొంత తగియున్నది. అట్లయినయెడల వారు హిందీవిషయమునందైనను తమ యభిప్రాయమును అమలులో ఏల పెట్టరాదు? అప్పుడు క్రైస్తవవిద్యాలయములలో బైబిలు నేర్పునట్లుగా అన్ని విద్యాలయములలో మొదటి మూడుఫారములలో హిందీ నేర్పవచ్చును. విద్యార్థి హిందీతరగతికి హాజరు కావలసినదే. భాష నేర్చుకొనవలసినదే. కాని సంవత్సరాంతపుపరీక్షలలో హిందీకి నిర్బంధముగా నన్ని గుణములు వచ్చితీరవలెనను నిర్బంధముండదు. ఇప్పటి పరిస్థితులలో ఈమాత్రపు టేర్పాటు కావించుట శ్రేయస్కరము. ఆక్షేపణకేవిధమైనఅవకాశము నిచ్చినవారుగారు. హిందీవిద్యార్థులు నిజమైన ఉత్సాహముతో నేర్చుకొనుటకును ఇదియే సరియైన మార్గము. ఈ భ్యాసవిషయములు బరువగుననువారి కిది సరియైన ప్రత్యుత్తర మగును.

పైని చెప్పిన సందర్భముల నన్నిటిని చక్కగా గ్రహించినవారు దేశభాషలయెడల హిందీ చేయగల యపచార మేమియు నుండదని స్పష్టముగా తెలిసికొనగలరు. విద్యాబోధ యంతయు దేశభాషలలో చేయించుచు మొదటి ౪-౫ సంవత్సరములు మాతృభాష తప్ప మరియొక భాషాసంపర్కము లేకుండ యుంచుట, అందరు పిల్లలకును నిర్బంధ విద్యావిధాన మమలులోపెట్టి దేశభా

జ్ఞానము ప్రతి స్త్రీకి పురుషునకు కలుగునట్లు చేయుట అనునీయన్ని పరిస్థితు లమరునప్పుడు హిందీసంపర్కముచే దేశభాషలకు ఉపకారము జరుగునే కాని అపకారము జరుగదు. హిందీ విస్తారముగా అభ్యాసమైననాడు మనకు మహారాష్ట్రాది సన్నిహితభాష లర్థమగుటయు మన దేశములోని అన్నిభాషలును వ్యవహారమునందు క్రమక్రమముగా దగ్గిరి దగ్గిరిబంధువు లగుటయుగూడ సంభవించును. భారతసాంప్రదాయమును నవనాగరకమును ననుభవించియు, సమముగా ననుభవించుచును ఉన్నట్టి మన మన వివిధదేశభాషలలోని సాంకేతికపదములు ఇంకను సమపరచుకొనలేకయుండుట మన దౌర్బల్యమును సూచించును. సాంకేతికపదములే కాదు. తక్కిన సాధారణజీవితమున కన్వయించు పదజాలమును సంస్కృతము, ఫారసీ, మహారాష్ట్రము, ఇంగ్లీషు ఇత్యాదుల మూలకముగా వచ్చినదియు ఎంతో కలదు. అన్నిభాషలును ఒండొరుల నెఱింగికొని వ్యవహరించు నేర్పాటులు దూరదృష్టికలవారు చేయగలిగినయెడల మన దేశభాషలు సునాయాసముగ ఒండొరులు నేర్చుకొనుటకు వీలుండును. అట్టి పరిస్థితిని హిందీవంటి ఏకభాషావ్యవహారము కొంతవరకు సమీపము చేయగలదు. ఆప్రయత్నము నేటినుండి కావించుటయు హిందీయెడల అభిరుచిని పెంచుటకును తోడు కావచ్చును. అన్ని భాషలలోని సమపదములనేర్చి అర్థములు సూచించి భేదమున్నచోట దాని నుదహరించి పట్టికలు ప్రకటించుచు భారతభూమి యంతటికిని కావలసిన ఏయొక్క ప్రత్యేక విషయముననో — ఉదాహరణార్థము గ్రంథాలయోద్యమ విషయముననే యనుకొందము — అన్నిభాషలలోను సాధ్యమైనంతవరకు సమపదజాలము ఉపయోగించి వ్యాసములు ప్రకటించుచు ప్రచారముచేయునట్టిపత్రిక యొకటి ఈప్రయత్నమున ప్రథమ సోపానము. ఇట్టి పనిని అఖిలభారత సాహిత్యపరిషత్తు బోటివారు చేయదగును. నాటికి హిందీవ్యాప్తియగుట మాత్రమేగాక హిందీకి దేశభాషలు దేశభాషలకు హిందీ బాసట యగుచు ఈయఖండ భరతభూమిని ఏకభాషాసామీప్యమునకు తెచ్చునట్టి యుద్యమము గావించినవా రగుదురు. భారతసాంప్రదాయమును బలపరచినవా రగుదురు.



# సినీమా కళ

పద్మరాజు, యం. యస్. సి.

[ఈ వ్యాసంలోని భావాలు రష్యను డైరెక్టరు, పుడోవ్కిన్ వ్రాతల్లోంచి సంగ్రహించబడ్డాయి.]

కొంచెం చదువుకుని, పాశ్చాత్య చిత్రాలనీ, హిందీచిత్రాలనీ చూచిన ఏ తెలుగు వాడూ, తెలుగుఫిలిము, ఏ ఒక్కటైనా బాగుందని అనడానికి సాహసించలేడు. ఈ పరిస్థితికి కారణం సినీమా ఒక ప్రత్యేకకళ ఎల్లా అయిందనేసంగతి తెలుగుఫిలిం డైరెక్టర్ల లో ఎవ్వరికీ తెలియకపోవడమే.

కళకి ప్రధానం సృష్టి. అదిలేకపోతే ఏదీ కళగాదు. అన్నికళలు సత్యాన్ని వ్యక్తపరచటానికి ప్రయత్నిస్తాయి. అల్లా వ్యక్తపరచడానికి ఒక్కొక్క ప్రత్యేకకళకీ, ఒక్కొక్క ప్రత్యేకవిధానం ఉంటుంది. సినీమాకి ఉన్న ఆ విశిష్టవిధానం ఏది? నాటకకళకీ, సినీమాకళకీ ఉన్న భేదం ఎక్కడఉంది? ఆ రెండింటికీ సంబంధం ఎంతవరకు? ఈ ప్రశ్నల కన్నిటికీ సమాధానం వచ్చేదాకా సినీమాస్థితి ఇంతకంటే బాగుపడదు!

సినీమాలో నటించేవారంతా కేవలం వారి నాటకరంగం మీదనున్న అనుభవాన్ని బట్టి నటిస్తున్నారు. 'ఏమయ్యా! నీవు నటించిన ఫలానిచిత్రం ఎందుకు పాడయిపోయిం'దని ఏనటకుడినన్నా అడిగితే 'నేనేం జెయ్యను, నాకుతగినంత స్వేచ్ఛ డైరెక్టరు ఇవ్వలేదు, మాట్లాడుతూంటే సగానికి ఆగమనేవాడు, సగాన్నుంచి మళ్లా మొదలుపెట్టమనేవాడు, అని జవాబుచెబుతాడు.

సినీమాలో నటించడం పూర్తిగా స్వాభావికం కానిమాట నిజమే. అయితే, నాటకరంగంమీద నటించడం ఎంతవరకు స్వాభావికం? మామూలుగా జీవితంలో నాటకరంగం మీద మాట్లాడుతున్నట్టు మాట్లాడుతారా? అల్లా కాళ్లూచేతులూ తిప్పుతారా? మామూలుగా మాట్లాడుకునేస్థాయిలో నాటకరంగం మీద మాట్లాడుతే, ముందరగా కూర్చున్నవాళ్లకితప్ప ఒకమోస్తరు దూరంలోకూర్చున్న వాళ్లకైనా వినిపించదు. అంచేత నాటకంలో పాత్రలంతా ఆఖరికి చివరవరుసలో కూర్చున్నవాళ్లకి వినిపించేటంత గట్టిగానయినా మాట్లాడాలి. లేకపోతే వీల్లేదు. ఇది ఎంత మాత్రం స్వాభావికం గాదు. ఇంక, ఏదైనా ఉద్రేకాన్ని చూపించవలసివస్తే నాటకంలో పాత్ర, దానిని ఒక్కముఖంలో చూపిస్తే చాలదు. ముఖ్యంగా మాటల్లోను, తరవాత నడకమొదలయిన అంగవిన్యాసాల్లోను చూపించాలి. లేకపోతే ప్రేక్షకులుదాన్ని గ్రహించలేరు. ఒక రంగంలో ఇద్దరు మాట్లాడుకూ ఉంటారు. అందులో ఒకడు జాగ్రత్తగా జేబులోనుంచి పిస్తోలుతీసి రెండవవాణ్ణి దడిపించాలి. ఆపరిస్థితిలో జేబులోనుంచి పిస్తోలు తీయడం రెండవవాడికి తెలియకూడదు. అంచేత నటుడు డేంజేస్తాడంటే, పిస్తోలున్న జేబువైపు రెండోవాడు లేకుండా చూసుకుని, ప్రేక్షకులవంక తిరిగి నిలబడి, ప్రేక్షకులకి కనిపించేటట్టుగాను, రెండోవాడికి కనిపించనట్టుగాను పిస్తోలుపయికిదీసి కొంచెం సేపయినా పట్టుకుని నిలబడతాడు. ఇది కూడా ఎంతమాత్రం స్వాభావికంగాదు. దీని అర్థమంతా ఏమిటి? నాటకపు నటుడు ప్రతీ చిన్నవిషయాన్నీ కొన్నింతలు పెంచి పెద్దదిచేసి చూపిస్తాడు. అల్లా చేస్తేనేగాని ప్రేక్షకులకి పూర్తిగా అవగాహన కాదు. అంటే నటుడు తన భావాలని వ్యక్తం చెయ్యడానికి ఒక విధానం సృష్టించుకున్నాడన్నమాట. ఈ విధానం ఎందుకంటే, అస్వాభావికాలయిన చిన్నచిన్న భాగాల సంయోగంచేత ఒక సత్యంయొక్క స్వరూపాన్ని సృష్టించడంకోసం. సినీమాకి కూడా ఒక విధానం ఉండితీరాలి. కాని అది నాటక విధానం ఎంతమాత్రంగాదు.

అసలు సినీమాలు పాడయిపోడానికి కారణమేమంటే, నాటకానికి విలక్షణమైన (Peculiar) దర్శన విధానాన్ని సినీమాలో ఉపయోగించడానికి ప్రయత్నించడమే. సినీమా, నాటకానికంటే స్వాభావికానికి చాలాదగ్గర. అయినా తీసేవిధానంమాత్రం స్వాభావికం గాదు. సినీమా తీసేటప్పుడున్న కాల, స్థల సంబంధాలు వేరు; పూర్తి అయిన తరువాత ఆవేర్వేరు భాగాలన్నీ సరీగ్గా కూర్చిన తరవాత ఆభాగాలు సూచించే కాల, స్థలాలు వేరు. సాధారణంగా సినీమాలో ఒకదాని వెనుక ఒకటిగా ప్రదర్శించబడిన రెండు రంగాలు, తీసినప్పుడు వరసగా తీయబడి ఉండవు. నటుడు ఒకేసంభాషణలో ఒక సగం ఒకప్పుడు, ఇంకోసగం ఇంకోఅప్పుడు మాట్లాడుతాడు. కాని ప్రదర్శనలో అది అంతా ఒకేసారి మాట్లాడినట్టుగా మనకి కనిపిస్తుంది. ఒకొక్కసారి ఎదట ఎవరూ లేకుండా మాట్లాడవలసి వస్తుంది నటుడికి. డైరెక్టరు పరస్పరసంబంధంలేని కాల, స్థలాల విషయంలో ఏమీ ఐక్యంలేని ఈచిన్న ముక్కలనన్నిటినీ సంయోగించి, ఒక క్రొత్త కాలాన్ని, ఒక క్రొత్త స్థలాన్ని సృష్టిస్తాడు. ఈకాల స్థలాలయొక్క అనుభవం ఆచిత్రం చూసే ప్రేక్షకుడికి, డైరెక్టరుపయోగించే కూర్పులోని ఐక్యతనిబట్టి కలుగుతుందిగాని, అవి ఆచిత్రంలో ఎక్కడా లేవు. నాటకరంగంమీద అలవాటుపడిన నటుడికి, మళ్లీ మొదటికివచ్చి తన కలవాటయిపోయిన విధానాన్ని మరచిపోయి, ఇంకో విధానాన్ని అలవాటు చేసుగోడం కష్టంగా ఉంటుంది.

సినీమాకి కొన్ని ప్రత్యేక లక్షణాలున్నాయి. నాటకరంగంమీద ప్రేక్షకుడు తన దృష్టిని ఎప్పుడూ ఒకేచోట కేంద్రీకరించి ఉంచడు. సందర్భాన్ని బట్టి అతని దృష్టి ఒకపాత్రమీదనుంచి ఇంకో పాత్ర మీదికి పోతుంది. కవి, తను వ్రాసిన సంభాషణనిబట్టి ప్రేక్షకుడికి ఇప్పుడొకపాత్రమీదా, మరొకప్పుడు ఇంకో పాత్రమీదా కుతూహలాన్ని కలిగిస్తూ ఉంటాడు. దాన్నిబట్టే ప్రేక్షకుడుకూడా తన దృష్టి కేంద్రాన్ని మారుస్తోఉంటాడు. సినీమాలో డైరెక్టరు చేసేపని ఏమిటంటే, తను ముందర ఒక ప్రేక్ష

ప్రక్రి ననుకుని, సంభాషణనిబట్టి తనకుతూహలం ఎల్లా మారుతుందో చూసుకొని దాన్నిబట్టి సినీమాని చిన్న భాగాలుగా విభజించి చివరని వాటినన్నిటినీ మొదట తను అనుకున్న విధానాన్నిబట్టి ఒకదానివెనుక ఒకటి అతుకుతాడు. సినీమాకి విశిష్టమైన లక్షణం ఏమిటంటే, కెమీరా దేన్నిబడితే దాన్ని, ఎంతదూరంలో బడితే అంత దూరంలో గ్రహించగలదు. మైక్రొఫోను, దూరాన్నిబట్టి, ఎంతమెల్లిగా మాట్లాడినా గ్రహించగలదు. ఈ విషయం పాశ్చాత్య చిత్రాలని చూసిన వారికి బోధపడుతుంది. వాటిల్లో తరుచు, ఊపిరిపీల్చుకునే చప్పుళ్లు కూడా వినబడతాయి. అంచేత కెమీరా, మైక్రొఫోను, ఒక విలక్షణ ప్రేక్షకుడి కళ్లూ, చెవుల్లాగ పని చేస్తాయి. ప్రేక్షకుడు నాటకాన్ని చూసేటప్పుడు చేసే పనినంతనీ డైరెక్టరు కెమీరా మైక్రొఫోనులద్వారా చేయిస్తాడు. పదిమంది కూర్చుని మాట్లాడేటప్పుడు, మాట్లాడే వ్యక్తినొకణ్ణిగాని, వినేవాళ్లలో ఏ ఒకణ్ణిగాని కెమీరా తీయగలదు. మామూలు స్థాయిలో మాట్లాడినాసరే, దగ్గరగా పెట్టిన మూలాన్ని మైక్రొఫోను గ్రహించగలదు. ఈ అవకాశాలు ఉండడంచేతనే సినీమా చూసేటప్పుడు నాటకంలోలాగ మనం దృష్టిని ఒక ప్రక్కనుంచి ఇంకో ప్రక్కకి తిప్పుకోనక్కరలేదు. మనం చూడడానికి కుతూహలపడుతూఉన్న భాగాన్ని, డైరెక్టరు ముందే ఊహించి వేరుగా తెరమీద చూపిస్తాడు.

ఈ అవకాశాలనన్నిటినీ బాగా ఉపయోగించడానికి, సినీమాకి ప్రత్యేకమైన దర్శన విధానాన్ని ఒకదాన్ని సృష్టించుకోవాలి. అందుకోసమే ముఖ్యంగా సినీమాని చిన్న చిన్న భాగాలుగా విభజించవలసిన అవసరం కలుగుతుంది. ఇది నటకుడికి కష్టదాయకమే. కాని సినీమాలో ఒక సౌలభ్యం కూడా ఉంది. నాటకంలోలాగ గొంతుక చించుకుని నటకుడు మాట్లాడక్కరలేదు. ప్రతీ చిన్న విషయాన్ని విస్తృతంచేసి చూపనక్కరలేదు. మామూలుగా జీవితంలో నడచినట్టుగా నటించడం, కేవలం ఒక అవకాశమేకాదు, అవసరంకూడాను. అతిగాచేస్తే సినీమాలో చాలా అసహ్యంగా ఉంటుంది.

అయితే, నటకుడు డైరెక్టరు చేతులో కేవలం కీలుబొమ్మలా గయిపోవలసిందేనా? నటకుడికి ఎంతమాత్రం స్వేచ్ఛ లేకుండా ఉంటే ఎల్లాగ? సినీమాని ప్రదర్శించడం ఒక్కటే కళా? లేకపోతే సినీమాలో నటించడంకూడా కళయేనా? ఈ ప్రశ్నలన్నీ వస్తాయి. ప్రస్తుతం నటకుడికి అంత స్వేచ్ఛ లేనిమాట నిజమే. మొదట్లో పాశ్చాత్య దేశాల్లో గూడా డైరెక్టర్లు తమ నటకుల్ని కేవలం యంత్రాలలాగే ఉపయోగించేవారు. కాని కాలక్రమాన్ని అది పొరబాటని గ్రహించారు. ఇప్పుడు సినీమాల అభివృద్ధి అంతా, ఈకళకి ప్రత్యేకించిఉన్నట్టిఅవకాశాలనన్నింటినీ పోగొట్టుకోకుండా నటకుడికి తగినంత స్వేచ్ఛ ఏవిధంగా ఇవ్వవచ్చును అనే సమస్యమీదనే ఆధారపడిఉంది. ఈ దృష్టితో చూస్తే మనం క్రొత్తఅవకాశాలని చూసుకోవాలిగాని, నటకుడికి స్వేచ్ఛఇవ్వడమే ప్రధానంగా పెట్టుకుని నాటకాలని ఉన్నవి ఉన్నట్టుగా సినీమాతీయటం పెద్దపొరబాటు. నాటకంలో ఉన్నంత పెద్ద పెద్ద రంగాలు సినీమాలో ఉపయోగించినట్టయితే సినీమా మనకి ప్రసాదించిన అమూల్యమైన అవకాశాలని మనం పోగొట్టుకుంటున్నా మన్నమాట.

ఈ సమస్యని ఎల్లాపరిష్కారంచెయ్యడం? సినీమాకళ ఇంకా ఒకశాస్త్రంలాగ అయిపోలేదు. రావలసిన అభివృద్ధి ఇంకా చాలా ఉంది. అయినా కొంతవరకు పరిశీలించి సినీమా టెక్నిక్కును చూసినట్టయితే కొంతవరకూ ఒకమార్గం మనకి కనిపించకపోదు. నాటకంలోకంటెకూడా నటకుడు సినీమాలో తనునటించబోయే పాత్రయొక్క తత్వాన్ని బాగా అర్థంచేసుగోవాలి. ప్రతీచిన్న రంగంలోనూ, తను ఏవిధంగా నడుచుకోవాలో ముందు దృఢపర్చుకోవాలి. ఒకేరంగాన్ని ఎన్నిమార్లు నటించినా, భేదం ఉండకూడదు. అంటే కేవలం ఒకయంత్రంలా గయిపోవాలని కాదు నా ఉద్దేశ్యం. మొదట షూటింగుకు తయారయేముందు, నటకుడికి తప్పకుండా తన పాత్రనంతనీ సింహావలోకనం జేసి, ఆద్యంతాలలో నుంచి తన వేరువేరు రంగాలలో నడత నిర్ణయించుకోడానికి అవకాశం ఉండి తీరుతుంది. అనిర్ణయించుకోడంలోనే ఉంది కళ. ఒకసారి నిర్ణయంఅయింతరవాత దానిని రిహార్సల్సులో స్థిరపరచుకోవాలి. అందుచేతనే సినీమానటకుడు తన ప్రత్యేకవ్యక్తిని పూర్తిగా చంపివేసి, తనునటించబోయే పాత్రలో లీనమయిపోడు. రిహార్సల్సులో తను జాగ్రదవస్థలోనే ఉండి తనుప్రదర్శించబోయే పాత్రయొక్కఛాయను ఒకపోతపోస్తాడు. ఒకసారి అల్లాపోతబోసిన తరువాత నటించడం కష్టంగాదు. అంచేత నాటకపు నటకుడికంటే ముఖ్యంగా సినీమానటకుడికి తనునటించే పాత్రమీద సానుభూతి ఉండాలి. లేకపోతే నటించకూడదు. ప్రస్తుతపు నటకుల్లో నటనలో పూర్తిగా తన్మయంచెందడమే కళ అని ఒక దురభిప్రాయం ఉంది. ఒకత్రాగుబోతు, త్రాగుబోతువేషం వెయ్యడం కళగాదు. తాను జాగ్రదవస్థలోఉండి, ఎటిగిఉండి సృష్టించిందే కళ.

డైరెక్టర్లు గ్రహించవలసిందికూడా ఒక చిన్నసంగతి ఉంది. రంగాలు చిన్నవయినప్పటికీ వాటిని తీసేటప్పుడు నటకుడికి తగినంతస్వేచ్ఛ నివ్వడానికి వీలుగా ఉండేటట్టు వరసగా వ్రాయవచ్చు. కాని ఇది అంత తేలికయినపనిగాదు. దీనికి సినీమాకి సంబంధించిన టెక్నిక్కు అంతా బాగా తెలిసిఉండాలి. ఒకే సంభాషణని, రెండుగాని మూడుగాని ప్రక్కలనుంచి తీయవలసి వచ్చినప్పుడు, నటకుడికి తగినంతస్వేచ్ఛ కలగజేయడానికి సంభాషణని మధ్యలో ఆపనక్కరలేకుండా తీయడానికి మార్గా లున్నాయి. మూడుప్రక్కలనీ, ఒకదాని దృష్టిలోకి ఒకటి రాకుండా మూడు కెమీరాలు పెట్టి తీయవచ్చు. అల్లావీలులేనప్పుడు సంభాషణని అంతనీ మూడుసార్లు మాట్లాడించి కావలసిన భాగాలు మూడుప్రక్కలనుంచీ తీయవచ్చు. ఈ విధంగా సినీమా అవకాశాలని తన్నిపారవేయకుండా వాటిని మంచి ఉపయోగానికి తీసుకువస్తో నటకుడికి స్వేచ్ఛ ఇవ్వడంలోనే సినీమాకళయొక్క అభివృద్ధి ఆధారపడి ఉంటుంది.

ఇంకోముఖ్యమైన సంగతి ఏమిటంటే నటకుడికి టెక్నిక్కు కొంతవరకు తెలిసి ఉండడం అవసరం. అంతకంటే ముఖ్యంగా చివరని, నటకుడు తనునటించబోయే ప్రతి రంగం, సినీమా ప్రదర్శించేటప్పుడు, ఏస్థానంలో, ఏవిధంగా ప్రదర్శించబడుతుందో, దానికి ముఖ్యకథావస్తువుతో ఏవిధమయిన సంబంధం ఉందో తెలుసుకోవాలి. నటకుడికి నటించడమే తనవిధిగాదు. డైరెక్టరు ఉప

యోగించే విధానాలయొక్క ఆవశ్యకతని పూర్తిగా గ్రహించి, అతనితో ఏకీభవించి పనిచెయ్యాలి. అల్లాగయితేనేగాని ఏ నటకు డున్నా తనపనిని సరిగా నిర్వహించలేడు.

అసలు మనడైరెక్టర్లలోనే ప్రజ్ఞ లేనప్పుడు నటకుణ్ణి అనవలసినపని ఏమీలేదు. ఏ తెలుగు ఫిలుమునైనా చూస్తే, ఏనారదుడో, ఏ సత్యభామో పాటపాడుతూంటే మనకి ఒక అరగంటసేపు వరసగా ఆపాత్రయొక్క ముఖాన్ని క్లోస్-అప్‌లో చూపిస్తారు. క్లోస్-అప్ యొక్క ఉద్దేశాన్ని ఏమాత్రం తెలిసి ఉన్న డైరెక్టరయినా ఈతప్పు చెయ్యడు. అల్లా చూపడంవల్ల నటకు డేమనుకుంటాడంటే తక్కిన నటకులి కందరికన్నా తనకి ఒక ప్రాముఖ్యతని డైరెక్టరు ఇచ్చాడనుకుంటాడు. ఇది కేవలం దురభిప్రాయం. తానల్లా పాడిన చిత్రాన్ని, ఆనటించిన నటకుడు ఒకసారి కళాదృష్టితో చూస్తే అది ఎంత వెకిలితనంగా ఉందో తనకే తెలుస్తుంది. ఈ సంగతి ఒకసారి గ్రహించిన, ఏ నటకుడూ మళ్లా ఆవిధంగా నటించడానికి ఒప్పుగోడు. క్లోస్-అప్ అనేది సినీమాలో ఒక వరంలాంటిది. దాని ఉపయోగం ఏమంటే, సందర్భానికి చాలా అవసరం అయిన ఒక చిన్న విషయాన్ని ప్రత్యేకంగా పెద్దదిగా చూపటం. దీనివల్ల నాటకంలోకంటె, సినీమాలో బాగా తేటతెల్లంగా, నటకుడుగాని, డైరెక్టరుగాని చూపదలచుకొన్న ఒకముఖ్యోద్రేకంగాని వస్తుభాగంగాని పూర్తిగా ప్రేక్షకులికి వ్యక్తమవుతుంది. సాధారణంగా పాట పాడేటప్పుడు, అందులో దక్షిణభారతదేశంలో పాటకుడిముఖం ప్రేక్షకులు చూడడానికంత అనుగుణంగా ఉండదు. అయితే ఇది సంగీతంలో ఉన్న లోపంగాదు. పాటకుడికిసంగీతం అంటే ఏమిటో తెలియకపోవడమే దీనికి కారణం. పాటలో మధ్య ఒకసారి, పాటకుడి తన్మయం చూపడానికి క్లోస్-అప్ ఉపయోగించవచ్చు కాని, ఆపాటయిందాకా అదే చూపడం మూర్ఖత.

నాటకరంగంమీద నటకుడు తన నటనని సరిదిద్దుకోడానికి అవకాశం చాలా ఉంది. ప్రేక్షకులలో తను చూపించే ఉద్రేకాలు ఎల్లా ప్రతిబింబిస్తున్నాయో; నటకుడికి బాగా తెలుస్తుంది. ఈ పరిజ్ఞానం, దానంతట అదే, నటనని సరిదిద్దుతుంది. నాటకంలో ప్రేక్షకు డొక సచేతనభాగం. సినీమాలో ఆ అవకాశం నటకుడికి లేదు. అతడు కేవలం తనస్వశక్తిలో నమ్మకంమీద ఆధారపడి ఉండాలి. అంచేతే ముఖ్యంగా ముందు చెప్పినట్టుగా, తనునటించబోయే పాత్రయొక్క ఛాయని ఒకపోతబోసుకుని, ఆవిశాలదృష్టిలోనుంచి తనుసృష్టించే ప్రతిచిన్న భాగాన్ని సరిదిద్దుకోవాలి. కాని డైరెక్టరు చాలావరకు ఈ విషయంలో నటకుడికి సహాయం చెయ్యగలడు. సినీమాతీసేటప్పుడు తను ప్రేక్షకుడుగాఉండి నటకుడినటనని తనలో ప్రతిబింబింపజేస్తూ ఉంటే నటకుడిపని కొంతవరకు తేలికయిపోతుంది. నాటకంలో ప్రేక్షకుడికంటేకూడా ఈ విషయంలో డైరెక్టరు నటకుడికి ఎక్కువ సహాయభూతుడుగా ఉండగలడు. డైరెక్టరు కూడా ఆపాత్రని ముందే బాగా అవగాహన చేసుకుంటాడు. పైగా నటనలో ప్రతిఅంగాన్ని విమర్శించగలశక్తి ఉంటుందతనికి. ఇంత నాట్యకళాజ్ఞానం మామూలు ప్రేక్షకులలో అరుదుగా ఉంటుంది. అయితే, డైరెక్టరే నటకులికందరికీ నటించడం నేర్పడం చాలా పొరబాటు. అల్లాచేసినట్టయితే మనకి సినీమాలో కనిపించేపాత్రలు కేవలం డైరెక్టరుప యోగించిన యంత్రాల్లాగ కనిపిస్తాయిగాని జీవం వాటిల్లో ఏమాత్రంఉండదు. డైరెక్టరు తననటకుల్ని, సరిదిద్దుకోదగిన సజీవవ్యక్తులుగానే పరిగణించడం చాలా ముఖ్యావసరం. తనంతట తా నెప్పుడూగూడా నటించి చూపించకూడదు. అల్లాచేస్తే నటకుడు తను నటించేపాత్రయొక్క స్వరూపాన్ని తనంతట తను సృష్టించుకోవడం మానివేసి, డైరెక్టరును అనుకరిస్తాడు. అప్పుడానటన చాలా అస్వాభావికం అయిపోతుంది.

నాటకంలో సంగీతంపాలు సహజంగా ఎక్కువ. ఒక ఉద్రేకాన్ని సూచించదలచుకొన్నప్పుడు, సంగీతంద్వారా దాన్ని వ్యక్తపరచటం ఒకవిధానంగా నాటకపు నటకుడు ఉపయోగిస్తున్నాడు. నాటకంలో ప్రేక్షకుడు ఊహించుకోవలసినది చాలాఉంది. ఒక పాత్రలు తప్ప తక్కినవాతావరణం అంతా అతడు ఊహించుకోవలసిందే. అంచేత సంగీతం నాటకంలో అంతఅసహజంగా కనబడకపోవచ్చు. సినీమాలో ముఖ్యంగా, సంగీతానికి జీవితంలో ఎంతప్రాముఖ్యం అయితే ఉంటుందో అంతేప్రాముఖ్యం ఉండాలి. లేకపోతే అది అస్వాభావికం అయిపోతుంది. సంభాషణ వ్రాయడంలో గ్రాంథికానికీ, గ్రామ్యానికీ ఎంత భేదం ఉందో సంగీతవిషయంలో సినీమాకీ నాటకానికీ అంతభేదం ఉండి. అంచేత సంగీతం సినీమాలో ఉపయోగించడంలో దానిస్థానం చెడకుండా ఉపయోగించాలి. సినీమాలో సంగీతంయొక్క స్థానం గ్రహించాలంటే, ప్రభాత్ వారి తుకారాము చూడాలి. తుకారాము ఫిలిము అంతందాకా పాడుతూనే ఉంటాడు. కాని ఇక్కడ గ్రహించవలసిందేమిటంటే ఆసంగీతం, సంగీతంకోసం సినీమాలో ప్రవేశపెట్టబడలేదు. అది ఆపాత్రకోసం ఉపయోగించబడింది. ఆపాటలో ఎక్కడా అతిశయంలేదు. తన పాండిత్యాన్ని వ్యక్తపరచటానికి తుకారాముపాత్రధారి ఎక్కడా ప్రయత్నమన్నా చేయలేదు. మామూలుస్థాయిలో నోటికివచ్చిందేదో ఎల్లప్పుడూపాడుకుంటూ తిరుగుతూండే వ్యక్తులు ప్రపంచకంలో చాలామంది ఉంటారు. తుకారాము అటువంటివారిలో ఒకడు. గొంతుకెత్తి అయిదున్నర శ్రుతిలో ఎక్కడా తుకారాము పాడలేదు. తను నటించబోయే పాత్ర, ఏఏ చిన్న చిన్న విషయాల సంయోగంవల్ల సత్యానికి దగ్గర అవుతుందో గ్రహించడం నటకుడివిధి. ఆ పనిని డైరెక్టరు ఎప్పుడూ మాత్రం చెయ్యలేడు. మొత్తంమీద, స్థూలదృష్టిలో ప్రతిపాత్రయొక్క తత్వాన్నీ స్థిరం చేసుకోగలడు గాని, ప్రతిపాత్రనీ ఒక్కొక్కటొక్కటే విమర్శించి, విభాగించి ఆ పాత్రయొక్క నడక దగ్గరనుంచీ మాట్లాడడంవరకూ ఉండే విలక్షణాలన్నీ సృష్టించడం అతనికి అసంభవం. ఏ నటకుడి కానటకుడు తన పాత్రలోని విశిష్టలక్షణాలని సృష్టించుకోవాలి. అతడుచేసే ప్రతీ చిన్న నటన, ప్రేక్షకదృష్టిలోనుంచి చూసి సరీగా ఉందో లేదో మాత్రం, డైరెక్టరు నటకుడికి చెప్పగలడు.

డైరెక్టరు, నటకుడు వారివారి ప్రత్యేకవిధుల్ని గ్రహించి పనిచేయకపోతే, సినీమా కళ అనిపించుకోదు. అది కేవలం నాటకకళ యొక్కగాని, ఇంకొకకళ యొక్కగాని ప్రతిబింబం అయిపోతుంది.

# ఆంధ్రదేశమున యంత్రాలయ పరిశ్రమాభివృద్ధి

"రావు" * * ౨

గత (డిశెంబరు) సంచికలో మనయాంధ్ర రాష్ట్రమున యంత్రాలయ పరిశ్రమాభివృద్ధికి గల యవకాశములు, ఆవశ్యకత, వానివలన మనకు కలుగు ప్రయోజనములు వివరింపబడి నవి. కాని దేశముయొక్క ఆర్థిక పరిస్థితులు పూర్తిగా చక్కబడుట కీమాత్రమున చాలదు. యంత్రాలయ పరిశ్రమలతోబాటు సమముగా చేతివృత్తులు, గ్రామపరిశ్రమలు కూడ వృద్ధి చెందవలసి యున్నది. పాశ్చాత్య నాగరక తావ్యామోహమున బడి విదేశీయులొనరించు సర్వమును గ్రుడ్డివేటుగా మన మనుకరింప రాదు. యంత్రాలయములు, కర్మాగారములు స్థాపింపవలసినదే. కాని వానివలన ప్రాప్తించు ఆర్థిక రాజకీయాది దురవస్థలకును, నిర్వ్యాపార సమస్యలకును, సామ్రాజ్యతృష్ణకును, అశాంతికిని, సాంఘిక వైషమ్యములకును ప్రవేశ మివ్వరాదు. గుణమును మాత్రము గ్రహించి లోపముల విసర్జించుట ప్రాజ్ఞుల లక్షణము.

పశ్చిమదేశములలో యంత్రయుగమువలన గలిగిన యద్భుత పరివర్తనముతోబాటు ఒక విధమగు అసంతృప్తి, ప్రపంచములో కొంత కల్లోలము కూడ ప్రారంభమైనవి. అందుచే యంత్రాలయ పరిశ్రమలకు కొంతపరిమితి యుండవలెననియు, చేతివృత్తుల ప్రోత్స హింపవలసిన యగత్య మున్నదనియు ఆర్థిక శాస్త్రవేత్తలు గ్రహింపగలిగిరి. మహాత్ముడు చెప్పినట్లు మనుష్యునిచే నిర్మింపబడిన యంత్రము మానవకల్యాణమునకు తోడ్పడుటకు మారుగా మనుజుని స్వేచ్ఛకు, నిత్యజీవనము నకు, ప్రపంచశాంతికి భంగము కల్పించి యాతనినే సమూలముగా కబళింపకుండ జూడవలసిన యవసరమున్నది. అదియును గాక మనదేశకాలపరిస్థితుల కనుగుణముగా కార్య కమమును నిర్ణయించుకొనుట మంచిది.

మొత్తముమీద మనకుగల ౧౨ జిల్లాలలో ౩౦,౭౬౮ గ్రామములు, ౭౦ పట్నములు మాత్రముండుటచే చాలభాగము జనులు గ్రామజీవనమున కలవాటు పడినవారేయనుట స్పష్టము. ౧౦౦ కి ౭౦ వంతున ముఖ్యముగా వ్యవసాయమువలన జీవించుచు సంవత్సర ములో యే ౪, ౫ మాసములో తప్ప మిగత కాలమున నిరుద్యోగులైయుండు మన గ్రామ స్థులకు తగిన చేతివృత్తులు కల్పించినగాని దారిద్ర్యబాధ తొలగదు. నిర్వ్యాపారసమస్య నివారణము కాదు. ఈ సందర్భమున ప్రభుత్వముచే నియమింపబడిన వ్యవసాయ పారి శ్రామిక విచారణసంఘములు (Royal Agricultural commission, Indian Industrial Commission) తమ తమ నివేదికలలో గ్రామ పరిశ్రమల వృద్ధి చేయవలసిన యావశ్యకత స్పష్టముగ వెల్లడించినవి. ఒక్క మనదేశములోనే కాదు, ఇంగ్లాండు, జర్మనీ, ఫ్రాన్సు, బెల్జియం, జపాను మొదలగు విదేశములలోకూడ విపరీతముగా వృద్ధిచెందిన యంత్రాలయములతో బాటు ప్రత్యేకము చేతివృత్తులనుకూడ ప్రోత్సాహము చేయుచున్నారు. షెఫీల్డులోని బాకులు, బ్లాక్ కౌంటీలోని మట్టిపాత్రలు, నాటింగు హాములోని మేజోళ్లు, జర్మనీలోని యాటవస్తువులు ఈవిధముగా తయారైనవే.

ఇట్టి యవసరమున మన ఆంధ్రరాష్ట్రమున నీక్రింద నుదాహరించిన చేతివృత్తులను, గ్రామ పరిశ్రమలను పోషించు టావశ్యకమని తెలుసు కొనుట యుక్తము:

౧. వడుకునూలు—చేనేత.

౨. పట్టు, ఉన్నివస్త్రములనేత, తివాసీలు, కంబళ్లు మొదలైనవి.

౩. రంగులు, అద్దకములు.

౪. జరీ, కుట్టుపని, మేజోళ్లు.

౫. లోహపాత్రలు, ఇనుపపెట్టెలు.

౬. చాపలు.

౭. నారత్రాళ్లు, నవారు.

౮. కొయ్యసామానులు.

౯. రాతివిగ్రహములు, పలకలు, చలువ రాతి చెక్కడములు.

౧౦. గాజులు.

౧౧. తలనూనెలు, అగరువత్తులు, సుగంధద్రవ్యములు.

౧౨. నగిషీపని, దంతపుపని, హార్మోని యము మొదలగు సంగీతవాద్యములు.

౧౩. ఆటవస్తువులు, బొమ్మలు.

౧౪. చర్మములు.

౧౫. నస్యము, బీడీలు.

౧౬. బెల్లము.

౧౭. విస్తళ్లు కుట్టుట.

౧౮. నేయి, వెన్నతీయుట- బియ్యము దంపు.

౧౯. ఔషధములు.

పై యన్ని పరిశ్రమలుకూడ మనదేశములో నచ్చటచ్చట కొంతవరకు ఆచరణలోనే యున్నవికాని తగినంత యభివృద్ధి మాత్రము కనుపింపదు. దీనికి ముఖ్యముగా ప్రజాభిమానము లేకపోవుటయే కారణము.

### ౧ వడుకునూలు—చేనేత

సాధారణముగా ౪౦ నంబరుపైగల సన్న నూలు ఇంగ్లాండు, జపాను దేశములనుండి, కొంత యితర రాష్ట్రములలో తయారైన మిల్లులనుండికూడ మనకు దిగుమతి యగు చున్నది. అంతకుతక్కువ నంబరుగల ముతక నూలు మాత్రము కడప, కర్నూలు, అనంతపురం, గుంటూరు, చిత్తూరు, కృష్ణ, ఉభయ గోదావరి, నెల్లూరు, విశాఖపట్నం, గంజాం జిల్లాలలో తయారగుచునే యున్నది.

ఇందులో ముఖ్యముగా కర్నూలు, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, విశాఖపట్నం, గంజాం జిల్లాలు ఈవృత్తికి కేంద్రస్థానములని చెప్ప వచ్చు. కాంగ్రెసు ఉద్యమం ప్రారంభమైన దాది వడుకునూలునకు పూర్వము కన్న ప్రాముఖ్యము హెచ్చైనది. ఇటీవలవరకు వడుకునూలుచే జీవించువారలకు దినమునకు సగటున ౨ అణాలకన్న జాస్తిదొరకుట దు స్తరముగ నుండెడిది. కాని యీమధ్య గాంధి మహాత్ముడు చేసినప్రకటననుబట్టి దినభత్యము అధికముచేయుటకు ప్రయత్నములు జరుగు చున్నవి. అంతయేకాక నేటి కాంగ్రెసు ప్రభుత్వముయొక్క కార్యక్రమము ననుస రించి యీ పరిశ్రమకు ప్రత్యేకముగా తగి నంతప్రోత్సాహము కలుగునట్లు తలంచవచ్చు ను. ఈ యవకాశమును గుర్తించి ప్రజలుకూడ దీనియందు ఆదరణ చూపవలసియున్నది.

చేనేతపరిశ్రమకూడ అన్నిజిల్లాలలోను బాగుగ వ్యాపించియున్నది. చికాకోలు, నర సన్నపేట, గొల్లపాలెం, కావలి, పుల్లంపేట, తొగటుపల్లి, వాయలపాడు, బహదూరుపేట, వెంకటగిరి మొదలగుప్రదేశములలో ౮౦, ౧౦౦, ౧౫౦ నంబరునూలుతో సన్నని ప్రశ స్తమైన వస్త్రములుకూడ నేయబడుచున్నవి. అనకాపల్లి, పాలకొల్లు, పెడన, చీరాల మొ దలగుచోట్ల ౪౦, ౬౦, నంబరుగుడ్డలు జాస్తి తయారగుచున్నవి. చేనేతనేయువారికి సగ టున ౩, ౮ అణాలవంతున, సన్నని వస్త్రముల నేయుప్రదేశములలో మా త్రము షుమారు ౧౨ మొదలు ౧౫ అణాల వరకు దినవేతనములు లభించుచున్నవి. మొత్త ముమీద మనకుగల ముడిపదార్థములు పరిశ్రమ దారులు పూర్తిగ వినియోగింప గలిగినట్లయి నచో పరదేశములయొక్కగాని, పరరాష్ట్ర ములయొక్కగాని సహాయ మక్కరలేకయే మనరాష్ట్రమునకు వలసిన గుడ్డనంతయు మనము తయారుచేసుకొనగలశక్తి యున్నది.

## ౨ పట్టు, ఉన్నివస్త్రములనేత, తివాసీలు, కంబళ్లు మొదలైనవి

పట్టుపరిశ్రమ ఆంధ్రజిల్లాలలో బరంపు రము, పెద్దాపురం, ఉప్పాడ, ధర్మవరం, రాయదుర్గము, కర్నూలు, జగ్గయ్యపేట, తాడిపత్రి, బళ్లారి, గూడూరు, పత్తికొండ, నంద్యాల మొదలగు ప్రదేశములలో సాగుచు న్నది. ఒకపెద్దాపురములోతప్ప సాధారణ ముగా యితరచోట్ల యిది చేతివృత్తివల్లనే జరుగుచున్నది. పెద్దాపురములో మాత్రము దీనికి యంత్రాలయముల నేర్పాటుచేసి యున్నారు.

ఇన్నిచోట్ల పట్టు తయారగుచున్నను మనకు చీనా, జపాను, ఇటలీ, ఇంగ్లాండు, మొదలగు ఇతరదేశములనుండియే కాక కాశీ, ఆగ్రా, కరాచీ, కుంభకోణము, మాయవరం, కంచి, బెంగుళూరు, సేలం మొదలగు ఇతరప్రాంతముల నుండికూడ ప్రతిసవంత్స రము పట్టువస్త్రములు దిగుమతి యగుచునే యున్నవి. దీనివలన మన పరిశ్రమకు నష్టము కలుగుట స్పష్టము. అదేవిధముగ బళ్లారి, కర్నూలు, అనంతపురం, కృష్ణ మొదలగు జిల్లాలలో గొంగ్రెబొంచ్చు కంబళ్లు, తివాసీలు లక్షలకొలదిరూపాయల విలువగలవి ప్రతిసంవత్సరము తయారగుచున్నవి. ఇవి మనరాజధానిమొత్తమున సర్వత్ర ఉపయోగ ములో నున్నవి. ఏలూరు, మచిలీపట్నముల లో పూర్వము చక్కని తివాసీలు తయారు కాబడినట్లు ప్రసిద్ధి. కాని నేడు ప్రజాదరణ లేకపోవుటచే నచ్చట పరిశ్రమ క్షీణదశకు వచ్చుచున్నది. తివాసీలయొక్క ప్రాశస్త్య కూడ తగ్గినది.

ఆదోని, కర్నూలు, జాలకల్లు, గుమ్మనం పాడు, కంబం మొదలగుచోట్ల జంపఖానా లు నేయబడుచున్నవి. ఈపరిశ్రమ లన్నియు మిక్కిలి లాభకరము లగుటయేకాక దీనివల్ల వేలకొలది కుటుంబములకు జీవనాధారము దొరకుచున్నది.

## 3 రంగులు, అద్దకములు

శ్రేష్ఠమైన రంగులు, అద్దకపు పనులలో మనవారు ప్రఖ్యాతి వహించియున్నారు. అనంతపురము, జమ్మలమడుగు, కడప, బంద రు, పెడన, చీరాల మొదలగుచోట్ల చాలకాల మునుండి యీపరిశ్రమ మంచి యభివృద్ధిదశలో నుండియుండెడిది. కాని మన నీలిమందు వర్త కము నీట కలియుటతో నేడు రంగులు, జర్మనీ హాలండ్, ఇంగ్లాండు, బెల్జియం మొదలైన విదేశములనుండి మనము దిగుమతి చేసుకొను చున్నాము. అనగా స్వదేశపరిశ్రమ నంతరింప జేసుకొని పరదేశ వర్తకులకు ప్రణామములు చేయుచున్నాము. ఇది యెంతమాత్రము హర్షింపతగినయంశము కాదు.

## ౪ జరీ, కుట్టుపని, మేజోళ్లు

కుట్టుపనులు సామాన్యముగా మన రాష్ట్ర ములో పారిశ్రామిక పద్ధతులపై నడుపబడుట లేదు. పాలకొల్లు, నరసాపురం, బందరు మొదలగుచోట్ల కొన్ని పాఠశాలలలోమాత్రము సంవత్సరమునకు సుమారు, లక్షరూపాయల విలువ గల కుట్టుపనులు తయారగుచున్నవి ఇవి గూవత్తు విదేశములకే యెగుమతి యగు చున్నవి.

మనకు కావలసిన జరీ, ఫ్రాన్సునుండి, జ మాదిరి తక్కువరకము సూరత్‌నుండి వచ్చు చున్నది. ఈవిధముగా యేటా సుమారు ౩,౮ లక్షల రూపాయల విలువ గల జరీ మనము దిగుమతి చేయుచున్నాము.

నవారు, మొలత్రాళ్లు, చేపలవలలు మొద లైనవి కర్నూలు, నంద్యాల, మాచెర్ల, మల్లవరం, భీమవరంతాలూకాలో కొన్ని గ్రామములందును, చిత్తూరు జిల్లాయందును చేయబడుచున్నవి. మేజోళ్లు మాత్రము తరచు జపానునుండి జాస్తిగా తెప్పించుకొనుచున్నాము. ఈ పరి శ్రమలన్నియు కొంచెము శ్రద్ధవహించినచో మనరాష్ట్రములో మనమే తయారుచేసు కొనవచ్చును.

## ౫ లోహపాత్రలు, ఇనుపపెట్టెలు

రాగి, యిత్తడి, కంచు, అల్యూమినియం మరి యితరమైన లోహపాత్రలు ఈ క్రింది ప్రదేశములలో తయారగుచున్నవి. ఉదయ పురం, (గంజాం), పార్వతీపురం, బొబ్బిలి అనకాపల్లి, విజయనగరం, (విశాఖపట్నం) పిఠాపురం, పెద్దాపురం, రాజమహేంద్రవరం (తూ॥ గోదావరి), అజ్జారం, పాలకొల్లు

ఏలూరు (ప॥ గోదావరి) రమణక్కపేట (కృష్ణ), దుగ్గి (గుంటూరు), నెల్లూరు, వోళివెంట (కడప), తిరుపతి, కాళహస్తి (చిత్తూరు) మొదలగు ప్రదేశములలో సంవత్సరమునకు షుమారు ౭ లక్షల రూపాయల విలువగల పాత్రసామాగ్రి తయారగుచున్నది. కాని యింకను ఇతర రాష్ట్రములనుండి వచ్చు సామానులపోటీ మనము భరించవలసి వచ్చుచున్నది.

అదేవిధముగ ఏలూరులో, ఉదయపురం (గంజాం) లో తయారగుచున్న యినుప పెట్టెలను నిట్టియవస్థ తటస్థించుచున్నది.

### ౬ చాపలు

అయినవోలు (గుంటూరు), బుచ్చిరెడ్డిపాలెం (నెల్లూరు), రాజంపేట (కడప), లింగోజిపల్లి (కర్నూలు), పలమనేరు (చిత్తూరు), ఆముదాలపల్లి, నిజాంపట్నం (గుంటూరు) ఆయాచోట్ల ప్రశస్తమైన తుంగ చాపలు నేయబడుచున్నవి. కడపజిల్లాలో తయారైనవి చాలవరకు బెల్గాం, హుబ్లీ, ధార్వార్ ప్రాంతముల కెగుమతి యగుచున్నవి. ప్రోత్సహించినచో యీ పరిశ్రమ వృద్ధిచెందుట కవకాశమున్నది.

### ౭ నారత్రాళ్లు

అంబాజీపేట, బందర్లంక, చిత్తూరు, జిల్లాలందు కొబ్బరిపీచుతో త్రాళ్లు పేనుదురు. మద్రాసురాజధానిలో ౯౬,౧౧౧ యెకరములు భూమిలో నార వుత్పత్తి యగుచున్నది. దీనిలో గుంటూరుజిల్లా ౮౫, ౨౬౮ యెకరములు, కృష్ణ ౨౬,౨౧౮, తూర్పుగోదావరి ౧౭,౪౯౫ యెకరముల వంతున పైరుచేయుచున్నది. కనుక యీ పరిశ్రమ ముఖ్యముగా మన రాష్ట్రములో వ్యాప్తిగాంచుటకు సదుపాయము లున్నవి.

### ౮ కొయ్య సామానులు

నరసారావుపేటలో తయారగు మంచములు, బల్లలు, కుర్చీలు బాగుగా ప్రసిద్ధికెక్కినవి. అమలాపురం, రాజోలు, రామచంద్రపురం మొదలగుచోట్ల పడవలు చేయుదురు. జయపురం, ఏజన్సీ అడవులనుండియు నెల్లూరు, కర్నూలు, చిత్తూరు ప్రాంతముల నుండి దొరకు వెదురువల్ల మేదరిపనులు విరివిగా సాగుచున్నవి.

### ౯ రాతివిగ్రహములు, పలకలు, చలువరాతి చెక్కడములు

మార్కాపురం, కడప మొదలగుచోట్ల లభించు నల్లరాతిపలకలు మిక్కిలి ప్రశస్తముగా నుండును. ఇవి పూర్వము మంచిస్థితిలో నుండినవి. కాని నేడు సిమెంటు పరిశ్రమ ప్రాబల్యమునందుటచే యీ పరిశ్రమకు కొంత బలము తగ్గినది.

చలువరాతి చెక్కడము పల్నాడులో నిరెంటచింతలలో జరుగుచున్నది. చవుక రకపు ఇటాలియనుమార్బులు బజారులో దొరకుటచే మేలైన మన చలువరాతిని కొనువారు లేకపోవుట తటస్థించుచున్నది. ప్రస్తుతము మాచెర్లకు రైలువేసినందున రవాణాసౌకర్యములు కలిగి యీపరిశ్రమకు కొంచెము కొంచెము ప్రోత్సాహము కలుగుచున్నది.

### ౧౦ గాజులు

ఇవి బళ్లారి, కర్నూలు, అనంతపురం, కృష్ణ, విశాఖపట్నం, నెల్లూరుజిల్లాలలో చేయబడుచున్నను, నాగరకత హెచ్చగుచుండుటచేతను, విదేశపుగాజులమీదను, బంగారునగలమీదను అభిలాష మెండగుటచేతను ఈ పరిశ్రమయంతగా రాణించుట లేదు.

### ౧౧ తలనూనెలు, అగరువత్తులు, సుగంధద్రవ్యములు

చాలకాలమునుండి ఈ వృత్తివలన కొండవీడు (గుంటూరు)నందు ౨౦౦ కుటుంబములకుపైగా జీవనముచేయుచున్నవి. సాధారణముగా వీనిని తయారుచేయు వారందరును మహమ్మదీయులే. ఇచ్చటి సుగంధద్రవ్యములు మిక్కిలి యాహ్లాదకరముగా నుండెడివి. కర్నూలు జిల్లాలోకూడ యిట్టివృత్తి నవలంబించువా రచ్చటచ్చట నున్నారు. కాని ప్రస్తుతకాలములో విదేశములనుండి దిగుమతియగు తలనూనెలు, సెంట్లు, ఫేసుపౌడరులు, పోమేడులవ్యామోహములో ప్రశస్తమైన మనపరిశ్రమను చేతులార పాడుచేసుకొనుచున్నాము.

### ౧౨ నగిషీపని, దంతపుపని, హార్మోనియములు

కళాప్రావీణ్యముగల నిపుణులైన పనివాండ్రెందరో తగినయాదరణ లేక దారిద్ర్యముచే బాధపడుచున్నారు. మనశిల్పకళాకౌశలము, దారుచిత్రములు, పూర్వయుగములోనే చాలవరకు గతించినవి. ఇప్పటికిని కొద్దిగా కర్నూలు, నెల్లూరుజిల్లాలలో సంగీతవాద్యములు, నగిషీపని చేయుచున్నారు. విశాఖపట్నము దంతపుపనులకు ప్రసిద్ధికెక్కినమాట వేరె వ్రాయ నగత్యములేదు. కాని యివన్నియు పోషణలేనిచో సంపూర్ణముగ నశించుట సత్యము.

### ౧౩ ఆటవస్తువులు, బొమ్మలు

ఇవి సెట్టిగుంట (కడప), తిరుపతి, కాళహస్తి, కొండపల్లి, ఉరుచేడు, పర్లాకిమిడి మొదలగుప్రదేశములలో తయారగుచున్నవి.

లక్కసామానులు కర్నూలు, శృంగవరపుకోట (విశాఖపట్నం), మందసా (గంజాం) యందును, చదరంగపుబల్లలు విశాఖపట్నములోను, దువ్వెనలు కాళహస్తి, చిత్తూరు, అనంతపురములందును చేయబడుచున్నవి. వీనన్నిటికిని విదేశవస్తువులయొక్క పోటీ తీవ్రముగనే యున్నది.

### ౧౪ చర్మములు

రాయలసీమలో బళ్లారియు, ఉత్తరసర్కారులలో బెజవాడయు నీపరిశ్రమకు ముఖ్యస్థానములు. ఇచ్చటనుండి చర్మములు విదేశముల కెగుమతిచేసి మనకు కావలసిన చెప్పులు, బూట్సు, మొదలగునవి ఆగ్రా, కాన్పూరు, కలకత్తాలనుండి తెప్పించుకొనుటకన్న యిచ్చటనే పరిశ్రమల స్థాపించి యుపయోగపరుచుకొనుట వాంఛనీయము కాదా ?

### ౧౫ నశ్యము, బీడీలు

ఇవి పూర్తిగా స్వదేశ పరిశ్రమలే కాని మద్రాసు, తమిళజిల్లాలనుండి యీ విషయ

మున కొంతపోటీ వచ్చుచున్నది. కర్నూలు, గుంటూరు, చిత్తూరు జిల్లాలలో కొన్నికొన్ని చోట్ల బీడీలు తయారు చేయబడుచున్నవి. వీని కుపయోగించు ఆకులు కడప, కర్నూలు ప్రాంతములలోని యడవులలో లభించుచున్నవి. పొగాకు మనరాష్ట్రములోనిదే చాలవర కుపయోగించుటకు వీలగును.

అట్లే నస్యమునకుకూడ వేరుచోట్లకు పోవలసినపని లేదు. కాని మనవారు దీనియందు తగినంతశ్రద్ధ వహించుటలేదు. సాధారణముగా మద్రాసునశ్యమున కెక్కుడుప్రాధాన్య మిచ్చుచున్నారు. ఈ వ్యాపారమువలన లక్షలు గడించినవర్తకులు మద్రాసులోనే యున్నారు. సంవత్సరమునకు మనరాష్ట్రములో షుమారు రు ౧౫ లక్షల ఖరీదుగల నస్యము కర్చగునని యంచనా వేయబడినది.

## ౧౬ బెల్లము

మనదేశమున పండిన చెరుకుపంటలో ౧౦౦కి ౭౦ వంతులు బెల్లముచేయుటలో నుపయోగించుచున్నాము. ఈపరిశ్రమ పశ్చిమగోదావరి జిల్లాలో నధికముగా నున్నది. మనము పండించు చెరకువల్ల మన దేశములోనే తయారైన పంచదారనైన వాడుకొనవలెను. కాని యన్యప్రాంతములనుండి మాత్రము కొనరాదని యాంధ్రులు పట్టుదల చూపినచో బెల్లమునకేకాక పంచదార పరిశ్రమకుకూడ సుదినములు రాకతప్పదు.

## ౧౭ విస్తళ్లు

శృంగవరపుకోట, పాలకొండ, పార్వతీపురం, బొబ్బిలి, సాలూరు, వీరవల్లి, కావలి, గూడూరు, నెల్లూరు, కందుకూరు మొదలగు చోట్ల నివి తయారగుచున్నవి. ఈ వృత్తిపై చాల కుటుంబములకు జీవితము జరుగుచున్నది.

## ౧౮ వెన్న, నెయ్యి, బియ్యము

దేశసౌభాగ్యము విస్తరించుటకు దేశజనుల ఆయురారోగ్యములు చక్కగా నుండవలెను. వారు భుజించు పదార్థములు పుష్టికరముగ నుండవలెను. విదేశములనుండివచ్చు కృత్రిమపు వస్తువుల మిశ్రమముచే మనయాహారము చెడిపోవుచున్నది. అందుచే నమ్మకమైన పదార్థముల తయారుచేసినచో ప్రజలకేకాక పరిశ్రమదారులకు కూడ మిక్కిలిలాభము.

## ౧౯ ఔషధములు

సుప్రసిద్ధాయుర్వే దౌషధములును, ఆయుర్వేదవైద్యశిఖామణులును మనరాష్ట్రములో పెక్కుమంది యున్నను మనము ప్రతిసంవత్సరము ఇతరరాష్ట్రములనుండి దాదాపు ౧౫ లక్షల రూపాయల ఖరీదుగల ఆయుర్వే దౌషధములును, రు ౬ లక్షల వెలగల యింగ్లీషుమందులును తెప్పించుకొనుచున్నాము. ఈ యపారధనవ్యయ మక్కరలేకయే మన స్వదేశౌషధములనే యభిమానించి మనభిషగ్రత్నముల నాదరించుట మంచిది.

## ఆర్థికస్వయంసంపన్నత
## (Economic self-sufficiency)

ఈపైనవివరించిన చేతివృత్తులు, గ్రామపరిశ్రమలు వృద్ధిచెందవలెనని కోరుటలోగల మూలసూత్రమేమి? ఇది యెంతవరకు సాధ్యము? ఎంతవరకు మంచిది? అను ప్రశ్నలకు సమాధానము సులభము. ఆధునిక నాగరక ప్రపంచములో స్వయంనిర్ణయము, స్వధర్మము, స్వతంత్రము ఒకదేశమునకేకాదు—ఒక రాష్ట్రమునకేకాదు, చివరకు ప్రతివ్యక్తికిని కావలయునని కోరుచున్నాము. సర్వత్ర యిట్టిసిద్ధాంతములపై సమర్థనలు సంఘర్షణలు జరుగుచునే యున్నవి. మొత్తము మీద ప్రధాన విషయములో నేకాభిప్రాయము కుదిరినట్లే భావింపవచ్చును. వ్యక్తిస్వాతంత్ర్యము, రాష్ట్రీయ స్వాతంత్ర్యము, దేశస్వాతంత్ర్యము. అన్నియు నొకేమూలసూత్రము నాధారము చేసుకొనియున్నది. ఫ్రాన్సువిప్లవము (French Revolution) నాటి స్వాతంత్ర్య, సమత్వ, సౌభ్రాత్రసిద్ధాంతము లీవిధముగా నేర్పడినవే. తిరిగి నేడు ప్రపంచమును కల్లోలపరచుచున్న సామ్యవాదముకూడ యిట్టిదే. ఈ వాదములలోని విధానములను పూర్ణముగా నందరు నంగీకరింపకపోయినా కొన్ని కొన్ని విషయములలో నైన సామరస్యము కుదిరినది. దీని ననుసరించినదే ఆర్థికస్వయంసంపన్నతకూడను. దీనికై ప్రపంచమం దన్ని దేశములలోను తీవ్రమైన ప్రయత్నములు చేయబడుచున్నవి. అట్టియెడ మన రాష్ట్ర మట్టి యాదర్శమును గైకొనుటకూడ సమంజసమే యనకతప్పదు.

ఈ మూలసూత్రము ననుసరించి యీ క్రింది విషయము లాంధ్రులెల్లరు గమనింపవలసియున్నది.

౧. అవకాశముల నెరిగి యాయాపరిశ్రమల స్థాపించినపిదప నవి సక్రమముగా వృద్ధియగునట్లు చూచుకొనవలెను.

౨. మనరాష్ట్రమున కావలసిన వస్తుపకరములు మనరాష్ట్రమున నేర్పాటు చేయబడిన పరిశ్రమలవల్లనే సాధ్యమైనంతవరకు ఉత్పత్తి యగునట్లు చూచుకొనవలయును.

౩. మన కవకాశమున్న పరిశ్రమల సంబంధములో పరరాష్ట్రములమీద నాధారపడరాదు. అనగా మనము తయారుచేయగలిగిన వస్తువుల ఇతరచోట్లనుండి తెప్పింపరాదు. ప్రజ లిట్టి దిగుమతులను ప్రోత్సహింపనురాదు.

౪. ఏగ్రామమున తయారైన వస్తువుల అచ్చటనే యమ్మక మగునట్లు చూచుకొనవలెను. అనగా ఒకగ్రామముగాని, పట్నముగాని, తాలూకాగాని, జిల్లాగాని యొకరాష్ట్రముగాని ఆర్థికముగా స్వాతంత్ర్యము బడసి సాధ్యమైనంతవరకు స్వయంపోషణశక్తిని గుర్తెరుంగవలెను.

## పరిశ్రమాభివృద్ధికి కొన్ని సూచనలు

ఈమార్గమున నభివృద్ధినందవలెనన్న చో మన ప్రధానలక్ష్యమునకు తగిన సాధనసంపత్తిని గూర్చి యాలోచించుకొన వలసియున్నది. ఇట్టి యనుకూలవాతావరణమున కీ క్రిందివిషయములు ముఖ్యముగా నాచరణీయములు:

౧. ఆంధ్రు లెల్లరు ఆంధ్రదేశపరిశ్రమలపై అభిమానము చూపవలసియున్నది.

౨. ఆంధ్రదేశమున పరిశ్రమదారుల సహాయమునకై బ్యాంకులు, ఇన్స్యూరెన్సుకంపె

నీలు, మొదలగు ఆర్థికసంస్థలు నియమింపబడ వలెను. అనగా పరిశ్రమదారులకు సులభముగా పరపతి దొరకవలెను. ఇందులకై జనసామాన్యము త్వరలో బ్యాంకింగుపద్ధతుల నలవాటు చేసుకొనవలయును.

౩. రాష్ట్రమునకు మొత్తమున ఒకపారిశ్రామిక అభివృద్ధిసంఘము [Industrial Development Board] ప్రభుత్వముచేగాని, ప్రజా సంస్థలచేగాని, ఆంధ్రవాణిజ్య సంఘమువారి యాజమాన్యమునగాని స్థాపింపవచ్చును.

౪. ఈ సంఘము చిన్నచిన్న యుప సంఘములద్వారా ఆ యాచోట్లగల యవకాశముల గమనించి పరిశ్రమదారులకు తగిన సలహాల నొసగవలెను.

౫. పరిశ్రమదారులు తమవస్తువుల సులభముగా విక్రయించుకొనుటకై మార్కెట్ల నేర్పాటుచేయవలెను.

౬. రాకపోకలకును, రవాణా సౌకర్యములను, ఇనుమడింప జేసుకొనవలెను.

౭. పరిశ్రమలవల్ల తయారైన వస్తువులు తరచు ప్రదర్శనశాలలో (Exhibitions) ప్రదర్శింపవలెను. వానివిషయమై రాష్ట్రములో పత్రికలద్వారా, కరపత్రములవల్లను, తదితరవిధములను తీవ్రమైన ప్రచారముచేయవలెను. సాధారణముగా ప్రతిముఖ్యావసరములందు నిట్టి ప్రదర్శనముల నేర్పాటుచేయుట యవసరము.

౮. కేంద్రసంఘము రాష్ట్రములోని వస్తువులయొక్క ధరలను సరిగా పోషింపవలెను.

ఈవిధమైన యొకప్రణాళికతో కార్యక్రమమును నిర్ణయించుకొని పరిశ్రమాభివృద్ధికి బూనుకొనినచో ౫ సంవత్సరములలో ప్రోత్సాహకరములగు ఫలితములు కలుగుననుటకు సందేహము లేదు. ఇట్టి కార్యక్రమమునకు ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణము చాల సహాయకారియేగాక ముఖ్యముకూడను. ఆంధ్ర రాష్ట్రసమస్య యీ వరకే తగినంతప్రచారమును బడసి ప్రాధాన్యమునందియున్నది. ఇక ప్రస్తుతము కావలసినది ఒక్క ఆంధ్రసోదరుల ఆసక్తి, అభిమానము, తీవ్రమైన దృఢ సంకల్పము

---

# 'నన్నయార్యుని నిరంకుశ ప్రయోగము'

అనుపేర ౧౯౩౭ సం. డిసెంబరునెల భారతిలో శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు ప్రకటించిన వ్యాసమునందలి 'బహిర్గిర' రూపసాధుత్వమును సాధించుచు శ్రీ విద్వాన్ పిసుపాటి విశ్వేశ్వర శాస్త్రి గారును, శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారును చిన్న వ్యాసములను వ్రాసి భారతియందు ప్రకటింప బంపిరి. 'బహిర్గిర' రూపమును, శ్రీ సూర్యనారాయణ శాస్త్రి గారు చూపిన తక్కిన రెండు నిరంకుశప్రయోగములలో 'ముష్టాముష్టి' రూపమును సప్రమాణముగ సాధించుచు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారును, శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారును కలిసి ౧౯౩౭ సం. డిసెంబరు ౧౮ తేది ఆంధ్ర దినపత్రిక (పు. 3)లో ఒకవ్యాసము ప్రకటించిరి. అందు వారు 'గిరేశ్చ సేనకస్య' అను పాణినీయ సూత్ర ప్రమాణమున 'బహిర్గిర' రూప సాధుత్వమును నిర్ణయించిరి. శ్రీ విశ్వేశ్వరశాస్త్రిగారికిని, శ్రీ సుబ్బారావుగారికిని ఈసూత్రమే ప్రమాణము. ఈవిషయమున నెవ్వరికేని పాణినీయమేకదా యాధారము! కాన చర్వితచర్వణ మేల యని వీరి వ్యాసములను భారతియందు ప్రకటింపమయితి మని మనవి. (సం. భా.)

# సంక్షోభము

గుఱ్ఱము వేంకటసుబ్రహ్మణ్యము

అశనిపాతపరంపరలట్టులయ్యె
ననుదినంబు మనుష్యనాశనవిధాన
జృంభణావర్తవార్తలు చీనిదేశ
నిర్మథనవేళ, నిప్పను నీతి తూల
లక్షలకొలంది జనము లలక్ష్యవృత్తి
మిత్తిపాలైరి నవనవోన్మేషితాహ
వప్రకారపరిజ్ఞానపాటవమున
గగనతలినుండి విస్ఫులింగములు కురియు,
జమునిశ్వాసపోలసిన ట్లలముకొను విష
వాయువులు వార్ధి వెలిగ్రక్క బాడబాగ్ని
సనఁగ రణనౌక లూడ్చును జనపదాల;
నదులు నెత్తురువఱదలు, నగరములు శ్మ
శానములు, మిన్ను పొగచూరు, క్షయము స్థిరము
సౌమ్యమగు సభ్యతకుఁ బురాజన్మసీమ,
భారతోర్వీసహోదరి, ప్రాజ్మరీచి
చీన, చరితార్థ నత్యంతదీనఁ జేసి
వాసిగనునె జపాను దుర్వారమైన
యుద్ధపరికరసంపద నుగ్రమూర్తి?
కళలు విద్యలు ధర్మపు సలలితముగ
నేర్చి నేర్పించి విఖ్యాతి పేర్చుకొన్న
వృద్ధదేశమునకుఁ జిఱిపేర్పుసూడఁ
గాలమును ద్రయ్యుఁ గర్కటిగర్భమట్లు
దేవపుత్త్రులు జపనీయధీరజనులు
ప్రాచ్యవాల్లభ్యవాంఛాప్రభంజనప్ర
చోదితాత్మ, లభంగతుంగోదయులు, ప
తంగకేతనులు, ప్రతాపధామహృదయు,
లార్యసంస్తుత్యు లిట్టు లనార్యకార్య
కరణులైరని మఱియు శోకమ్ముగలుగు
శాంతశివసుందరాత్మక శక్తి యొకటి
విశ్వ మేలు ననశ్వరప్రీతిసరణి
ననెడి విశ్వాస మవియు, యుగాంత మింత
సంతఁ దప్పత్రోవను వచ్చునంచు నెంతు.

# మిసెస్ వి. కే. వటీరావు, యమ్మే

[లేడీస్ కల్చర్ క్లబ్]

**చింతా దీక్షితులు**

[ఈ కథలో సంస్థలూ పాత్రలూ కల్పితములు. దేనినీ ఎవరినీ ఉద్దేశించినవి కావు.]

ఈమధ్య నాభార్య నాతో బహు అన్యోన్యంగా ఉండడం మొదలెట్టింది. సాధారణంగా తన చీరలేమిటో, తన బ్లౌసులేమిటో, తనఆభరణాలేమిటో, తన అలంకరణాలేమిటో, తన క్లబ్బేమిటో అదేగొడవగాని, భర్త అనే మగవాడిని నేనొక్కణ్ణి ఉన్నాననీ, నాకూ, తనకూ పిచ్చిత్తిగాని ప్రేమ ఆజన్మమూ ఉండాలనీ మరిచిపోయేది. హోటల్నించి భోజనం తెప్పించుకొని మేమిద్దరమూ మూగనోముపట్టి భోంచేశేవాళ్ళము. తక్షణమే ఆవిడ క్లబ్బుకు సింగారించుకు వెళ్లిపోయేది. నేను కచేరీకి పరుగెత్తుకు పోయేవాణ్ణి.

పిల్లలు వేరే కాన్వెంటు స్కూలులో చదువుకొంటున్నారు కాబట్టి వాళ్లగొడవ నాకూ మా ఆవిడకూ కూడా పట్టేది కాదు. ఎప్పుడైనా పిల్లలు యింటికి తిరిగి వస్తే నన్ను అసలే మరిచిపోయేది మాఆవిడ. వాళ్లచేత యింగ్లీషు పద్యాలూ పాటలూ పాడించడం, వాళ్ళచేత యింగ్లీషు ఆటలు ఆడించడం, వాళ్లతోపాటు తనూ గంతులెయ్యడం, స్కిప్ చెయ్యడం, డాన్సుచెయ్యడం-ఇదీ పొద్దస్తమానమూను. సాయంత్రం వాళ్లను యింగ్లీషు దుస్తులతో అలంకరించి, వాళ్ళకు హ్యాట్లుపెట్టి, తనూ అలంకరించుకొని క్లబ్బుకు తీసుకుపోయేది. నిజంచెప్పాలి కాబట్టి చెప్తున్నాను—నా భార్యమాత్రం యింగ్లీషు దుస్తులు ధరించేదిగాదు. హ్యాట్ పెట్టేదికాదు. రోజు కోరకం చీర కట్టుకొని, బాహుమూలరుచుల కడ్డురాని రవిక తొడుక్కొని, ఒక చేతికే రెండు బంగారుగాజులు పెట్టుకొని, రెండోచేతికి రిష్టువాచీ కట్టుకొని క్లబ్బుకు వెడుతూండేది.

ఒకమాటు అన్నానుగదా హాస్యానికి—"పోనీ నువ్వు కల్చర్డులేడీవిగదా; యమ్మేప్యాసయ్యేవు; లేడీస్ కల్చర్ క్లబ్బులో సభ్యురాలవు, బైసికిల్ తొక్కగలవు కూడాను—ఈ చీరలూ, రవికలూ ఖర్మం ఏమిటీ? స్కర్టుతొడుక్కొని హ్యాట్ పెట్టుకొని యింగ్లీషు స్త్రీలలాగ.... ..........." వాక్యం పూర్తిగాక ముందే నన్ను గట్టిగా ఛెళ్లున చెంప మీద కొట్టి "మీరు సూటువేసినపుడు నేను కడతానులెండి స్కర్టు" అంటూ నిప్పులు గ్రక్కుతూ లేచిపోయింది.

చెంపకాయ తిని ఊరుకొన్నాను. ఊరుకోక చేశే దేమిటి— యమ్మేప్యాసైన కామిని సహ ధర్మచారిణి అయినప్పుడు? ఇంటిగుట్టు రట్టు చేసుకోవచ్చునా? ఇంతకీ హిందూ స్త్రీ ధర్మానికి వ్యతిరేకంగా స్కర్టు హ్యాట్టుల ధరించుకోమని చెప్పడం నాదే తప్పు!

సాధారణంగా ఈవిధంగా ఉండే నాభార్య నాయెడల ఎక్కువ అన్యోన్యంగా ఉండడమూ, నాతో ఎక్కువకాలం గడపడమూ, నాతో అదేమాటలు చెప్పడమూ, అదేపరిహాసాలు చెయ్యడమూ, అదేకథలు చెప్పడమూ, నన్ను దువ్వడమూ లాలించడమూ—యిదంతా తమాషాగా తోచింది. ఏమిటిచెప్మా కారణం అనుకొన్నాను. ఏమీస్ఫురించింది కాదు.

కాని ఒకసంగతి జ్ఞాపకం వచ్చింది. నిరుడు కొంచెంహెచ్చుతగ్గుగా యీ విధంగానే నాతో అన్యోన్యంగా ఉండేది. నా పూర్వాచారపరాయణత్వాన్ని మెచ్చుకొనేది. చివరకు నాచేత వేషంవేయించి, నన్ను నలుగురు ఆడవాళ్ళలోనూ రవ్వపాలు చేసి, భర్తను ఫూల్ని చెయ్యడంలో అగ్రగణ్య అనే పేరు సంపాదించి, అందుకుగాను క్లబ్ యిచ్చే బహుమానాన్ని సంపాదించింది. నిజానికి కొంతతప్పు నాదికూడాను. వేషం వెయ్యడానికి పూనుకొన్నది నేనే. నాభార్య నన్ను పురిగొల్పి నాకు సహాయంచేసింది—దుర్బుద్ధితోనైతేనేమీ? అంతేకాకుండా తనతో పాటు నాకూ బహుమతులు తెచ్చి

పెట్టింది. అయిందేమిటో అయింది. ఇక యీ యేడు మళ్లీ ఆవిధంగానే చెయ్యదుకద? ప్రతీసంవత్సరం కొత్త కొత్త విషయాలికి క్లబ్బువాళ్లు ప్రైజు లిస్తారు కాని ప్రతీయేడూ భర్తలను భార్యలు ఫూల్సుగా చేసినందుకే ప్రైజు లిస్తారనడం అసంభవంగదా! కాబట్టి ఆదురుద్దేశం నాభార్యకు లేక పోవచ్చును. మరి వేరే విషయం యేదైనా ఉంటుందా?

లేడీస్ కల్చరు క్లబ్బువారు ప్రతీయేడూ డిశంబరులో బహుమతు లిస్తారు. డిశంబరు యింకా మూడు నెల్లు ఉంది. నాభార్య నన్ను లాలించడం అప్పుడే మొదలు పెట్టింది. నాకు బహుమతిగా వచ్చిన నటరాజ విగ్రహాన్ని తనూ పూజించడం మొదలు పెట్టింది. గోడలమీది సినీమాబొమ్మలు తీసివేసి దేవుళ్ళ బొమ్మలు తగిలించింది. రోజూ నాచొక్కాలకు బొత్తాలు పెట్టిపెడుతోంది. ఊడిపోయిన బొత్తాలు కుట్టిపెడుతోంది. పంచెలు మరమ్మతు చేస్తోంది. వద్దంటే వినక నా కప్పుడప్పుడు వాసననూనెలూ, అత్తరువులూ రాస్తోంది. ఒకమాటు బలవంతాన్ని నా మొహం అంతా ఫేసు పౌడర్ పామింది వద్దంటూంటే! సబ్బుతో కడుక్కొని ఆఫీసుకు ఆలస్యంగా వెళ్లి చివాట్లు కూడా తినవలసి వచ్చిం దప్పుడు.

ఒకవేళ నాభార్యకు మమకారం హెచ్చిందేమో నామీద— ఒకవేళ బుద్ధి తిరిగిందేమో. చదువుకొన్నది; హిందూదేశంలో పుట్టినది; విద్యాదోషంవల్ల కొంతవరకు బుద్ధి కొంతకాలం పరదేశపుదారిని పట్టినా క్రమేణా సర్దుకొంటూన్న దేమో?

ఏమైనా యీయేడు బహుజాగ్రత్తగా ఉండా లని దృఢసంకల్పం చేసుకొన్నాను. నాభార్య ఎంతమమకారం చూపినా, ఎంత చాకచక్యంతో నడుచుకొన్నా, ఎంత పూర్వాచారాభిమానం నటించినా నేను చలించదలుచుకోలేదు. రాతి బొమ్మకు చక్కిలిగింతలు పెట్టగలుగుతుందేమో చూద్దాము!

ఈమార్పు తనలో ఎందుకుకలగాలో నాభార్యనే అడిగితే బాగుంటుం దేమో ననిపించింది. చదువుకొన్న లేడీతో వ్యవహారంగవా తీరా అడిగితే తనను ఇన్సల్టుచేశానని విసిరి కొడుతుందేమో? అడక్కపోతే నన్ను మళ్లీ ఫూల్ని చేస్తుందేమో? ఏమైనానరే ఎందుకైనా మంచిదని నిశ్చయించి నాభార్యతో యీవిషయాన్నిగురించి పూర్తిగా చర్చించడానికి తీర్మానించుకొన్నాను. మా ఉభయులకూ తీరుబడిగాఉన్న ఒక రోజున నాభార్యను పిలిచాను. "వటీ! నీవిలువయైన కాలంలో కొన్ని నిముషాలు నాకొరకు వినియోగించ గలవా?" అన్నాను యింగ్లీషుతో. నాభార్యపేరు అసలు కళావతమ్మ, అది క్రమక్రమంగా కళావతి, వతిగా మారింది. ప్రస్తుతం వాడుకలో ఉన్న పేరు "మిసెస్ వటీరావు" లేక "వటీ రావు" ఈచివర "రావు" నాపేరు. ఇంగ్లీషులో మాత్రమే పేరుచదివే వారు నాభార్యను మిసెస్ వటీరావు అనిగాని, మిసెస్ వాటీరావు అని గాని పిలుస్తారు. మొగుడిపేరు తమ పేళ్ళ చివర తగిలించుకోవడంలోనే ఇంగ్లీషు చదువుకొన్న ఆడాళ్ళ అస్వతంత్రత కనబడుతోందని ఒకమాటు నేను దెప్పిపొడిచాను. అది అస్వతంత్రత కాదనీ, పేరు ఒక ప్రత్యేకతకు సూచనగా మాత్రమే వినియోగిస్తుందనీ, మొగుడిపేరు వంటరిగా వదిలివేస్తే దిక్కుమాలినదై పోతుందని దయదలిచి తమపేరుతో జోడిస్తున్నామనీ, అందుకు కృతజ్ఞత చూపక దెప్పిపొడవడం మగవాళ్ల నీచత్వానికి నిదర్శనమనీ చెప్పి మళ్లీ నన్ను కిక్కురుమనకుండా చేసింది.

"అయితే కళా, యీయేడు మీక్లబ్బులో బహుమతు లివ్వడంకద్దా?" అని అడిగాను. "మళ్లీ మీకు బహుమానం పొందాలని ఉందా ఏమిటి పాపం— మా అమ్మే, నాకంటిపాపే."

" నాకు బహుమానం కావా లని కాదు, వటీ; నీకు బహుమానం వస్తే నాకు వచ్చినట్లు కాదూ?"

"ఆఁ" మరే, పాపం— నాబహుమానం మీరు కొట్టెయ్యా లనుకుంటున్నారు గాబోలు—"

"అది కాదు, వటీ!"

"పోనీ కావలిస్తే తీసుకొండి పాపం మాటవరసకి నా కీయేడు ఒకచీర, ఒకబ్లౌసూ బహుమానం యిచ్చారనుకుందాం. మీ రంత సరదాపడుతూంటే మీకుకాదని నేనుమాత్రం వాటిని వాడతానా ఏమిటి? మీరే తీసుకోండి."

"యూ, సిల్లీ; అందుకుకాదు నేను అడుగుతూంట. అసలు సంగతి తెలుసుకోడానికి."

"సంవత్సరోత్సవాలు ఉన్నప్పుడు బహుమతులే ఉండవూ? ఆమాత్రం నాడార్లింగుకు తెలిసిందికాదుకాని,"

"అయితే కిందటి యేడులాగ ఈయేడేమైనా కోతిపనులు చేస్తావా?"

అనగానే నామీసం పట్టుకులాగుతూ "అంత మరపేమిటి మీకు, డియర్ హబ్బీ? కోతిపనులు మీరా, నేనా చేస్త? మీ తెలివి తేటలవల్లనేగా నాకూ మీకూ బహుమానం వచ్చింది!''

మీసం వదిలించుకొని అన్నాను గదా "చూడు కళా, ఈ యేడుగానీ నన్ను అలాంటి కోతిపనుల్లో కలుపుకున్నావంటేమాటదక్కదుసుమా."

"నోఫియర్ మైడియర్.''

"అయితే, వటీ, అసలు సంగతేమిటి? ఈయేడు ఎందుకని బహుమతులిస్తారు?'' అన్నాను సంగతి తేల్చుకోడానికి.

నాభార్య అనుమానించి, నాకేసి పరకాయించి చూచింది. నాముఖమూ, చెవులూ, జుట్టూ తనచేతులతో దువ్వుతూ అన్నది.

"అనుమానం పట్టుకుంది కాబోలు కాదూ మీకు?''

"కాదు, డార్లింగ్!''

"అవును, పీచ్!''

"కాదంటూంటే!''

"అయితే చెప్పడానికి వీల్లేదు!''

"ఏమిటీ?''

"బహుమతు లెందు కిస్తారో చెప్పడానికి వీల్లేదు — క్లబ్బురూల్సు పాటించనక్కరలేదంటారాఏమిటి?"

"చెప్పకూడ దని క్లబ్బురూల్సా?''

"అవును, మైపెట్!''

"డియర్ హబ్బీకికూడా చెప్పకూడదా, రోజ్?''

"సారీ, హబ్బీ.''

"పోనీ ఆగొడవ నా కక్కరలేదు గాని— నామీదకు మాత్రం రాకేం, ఓల్డుగరల్!''

"మీచేత వేషం వేయించనులెండి.''

"సరే, నాజాగ్రత్తలో నేనుంటాలే!''

"ఆల్ రైట్, మై డియర్!''

"కళా, ఇంకోప్రశ్న అడగాలని ఉంది; అడగనా?''

"రైటో; అడగండి.''

"ఈమధ్య నీకు నామీదా, నా అభిప్రాయాలమీదా కొత్తగా అభిమానంకలిగింది.ఎంచాత నంటావు?"

ఈప్రశ్న నేనడగడంతోనే నాభార్య కోపం నటించింది. తటాలున లేచి వెళ్లిపోబోయింది. గుమ్మందాకావెళ్లి మళ్లీ తిరిగివచ్చి, గభాలున నావళ్లో కూచుని నాబుగ్గలురెండూ గట్టిగా సాగదీసింది. నామీసాలు గుంజింది. గట్టిగా కంఠాన్ని ఆశ్లేషించి "ఇంకెప్పుడూ అడగరుగదా అలాంటి పశ్న, అడగరుగదా, అడగరుగదా!'' అంటూ నాచెంపలు మృదువుగా ప్రేమతో వాయించింది.

'నాప్రశ్నలోతప్పేమిటి?''అన్నాను.

"తప్పేమిటా, తప్పేమిటా'' అని నన్ను బుజాలుపట్టి ఊగిస్తూ,

"నన్ను అనుమానిస్తారా యింత డర్టీగా? నాప్రియమైన భర్తమీద నాకెప్పుడు అభిమానంలేదు? నాకను పాప అభిప్రాయాలమీద నాకెప్పుడు అభిమానం లేదు? క్రొత్తగా అభిమానం పుట్టిం దంటారా? మీన్!'' అని మొహం చిట్లించింది. నాఅభిప్రాయానికి ఆధారాలు లేకపోలేదు. కాని అవి అన్నీ నేను చెప్పితే నా భార్య చిన్నబుచ్చుకో వచ్చు, లేదా కోపగించవచ్చు ననుకొని, తనకుమాత్రం ఆలోచిస్తే తెలియదా ఏమిటి అనుకొని ఊరుకొన్నాను.

* * *

పర్యవసానం ఏమీతేల్లేదు. ఎందుకు బహుమతు లిస్తారో రహస్యంగా ఉంచుకొన్నారు. నాచేత వేషం వేయించ ననిమాత్రం నాభార్య చెప్పింది. వెయ్యమంటే మాత్రం వేస్తానా? కాబట్టి అది చెప్పి లాభం లేదు. ఏవిధంగానైనా నన్ను మోసగిస్తుందేమో అని నా జాగ్రత్తలో నేనున్నాను. నాభార్యను కనిపెడుతున్నాను. ఒకనాడు నే నింట్లో ఉండగా నాభార్య ఒకపెద్దమనిషిని తీసుకొనివచ్చింది. అతగాడు యింగ్లీషు దుస్తులు వేసుకొన్నాడు. చేతులో ఈవినింగ్‌హాట్ ఉంది. మీసం ముక్కుకింద మాత్రమే ఉంది. పడుచువాడు.

సాధారణంగా ఎవళ్లనైనా కొత్తవాళ్లను యింటికి తీసుకువచ్చినప్పుడు నాభార్య నాకు వాళ్లని ఎరుకచేసేది. ఇన్‌ట్రడ్యూసు చెయ్యకుండా ఎప్పుడూ ఉండలేదు. ఇప్పుడు మాత్రం ఆనల్లదొర ఎవరో నాతో చెప్పలేదు. నేను ఫలానా అని అతడితోనూ చెప్పలేదు.

వచ్చీరావడంతోనే ఇద్దరూ రెండు కుర్చీలలో కూలబడ్డారు. నాభార్య తనచేతిసంచీ బల్లమీద పెట్టింది. దానిమీద అతడు తనహాట్ పడవేశాడు. కాఫీ ముందర బెట్టుకొని బిస్కత్తులు తింటూ వాళ్లు ఇంగ్లీషున అదేకబుర్లు చెప్పుకోవడం మొదలుపెట్టారు.

పక్కగదిలోకి వెళ్లి నేను పనిచూచుకొంటున్నాను. ఉండుండీ ఇద్దరూ

విరగబడి నవ్వుతున్నారు. చప్పట్లు కొడుతున్నారు. బల్ల గుద్దుతున్నారు. చేతులతో తొడలు తట్టుకొంటున్నారు. ఎందుకో అంతకులాసా నాకు భోధపడిందికాదు.

ఆ మొద్దుముండాకొడుకు కెవరో నా కాఫీ అంతా తాగేస్తూ, నాబిస్కట్లు లన్నీ మింగేస్తూ, నా కుర్చీలూ బల్లలూ విరగ్గొడుతూ, నాభార్యతో అంతజోస్తిగా మాట్లాడుతూ, నవ్వుతూ, నాయింట్లో యింతహంగామా చేస్తూన్నందుకు నాకు కోపం వచ్చింది. కాని ఏమిచేసేది. ఏమైనా కలగజేసుకొంటినా చదువుకొన్న భార్యతో వ్యవహారం పెద్దపులితో చెలగాటంవంటిది.

కాని ఒకటుంది. నాభార్య అనేక పట్టణాల్లో కాలేజీలల్లో చదువుకొన్నది కాబట్టి అనేకమంది స్నేహితులు ఆవిడ కున్నారు. ఆడవాళ్లల్లోనూ ఉన్నారు. మగవాళ్లల్లోనూ ఉన్నారు. బహుశా యీ మనిషి మగమిత్రులలో ఒకడు కావచ్చు. పాత స్నేహితుడు కావచ్చు. చాలాకాలానికి వాళ్లు కలుసుకొని ఉండవచ్చు. అందువల్ల ఈఉత్సాహమంతా అయి ఉండవచ్చు. లేదా అతడు నాభార్య దూరబంధువు కావచ్చు. నాభార్య దూరబంధువుల నందరినీ నేను ఎరిగి ఉండనుగదా! ఒకమాటు చూచిపోదామని వచ్చి ఉండవచ్చు. దూరబంధువే అయితే నేనుకూడా కొంతమట్టుకు బంధువునేగదా! మరి నన్ను కలుసుకోలేదేమి?

లేదా ఒకవేళ వాళ్లక్లబ్ మెంబర్ల తాలూకుమనిషై ఉండవచ్చు. ఏ మెంబరుభర్తో, అన్నో, తమ్ముడో అయియుండవచ్చు. ఆ మెంబరు ద్వారా నాభార్యతో పరిచయం కలిగించుకొని ఉండవచ్చు. ఎందుకు తొందరపడడం? తెలుస్తుందిగదా!

కొంతసేపటికి సద్దణిగింది. నాగది కేసి వస్తారేమో, నాకు అతనితో పరిచయం కలిగిస్తుందేమో అని ఆశతో సులోచనాలు సర్దుకొని సీరియస్‌గా బింకంగా కూర్చున్నాను... ఎవరూవస్తూన్న జాడలేదు. నిరుత్సాహంతో లేచి చూతునుగదా—నా భార్య ఆ ముక్కు క్రింద మీసాలవాడూ కలిసి కబుర్లు చెప్పుకొంటూ నవ్వుకొంటూ వీధమ్మట నడిచి వెడుతున్నారు!

* * *

రెండు మూడురోజులదాకా నాభార్యతో నేను సంప్రతించడానికి వీలు కలిగిందికాదు. నా పనులతొందర, ఆవిడికి క్లబ్బుతొందర, స్నేహితులతో పరిచయాలతొందర— ఇన్ని కారణాలు—

ఈ రెండు మూడు రోజులలోనూ ఎన్నో విశేషాలు కూడాను. ఒకనాడు నేను కచేరీపని పూర్తిచేసుకొని షికారుగా సముద్రతీరానికి వెళ్లాను. హాయిగా గాలి వీస్తోంది. సముద్రపు అలలు నాపాదాలదగ్గిరికి వచ్చి ఆడుకొంటున్నాయి. సముద్రం నాహృదయంలాగే లేచి పడుతోంది. సూర్యుడు సముద్రంలో అస్తమించబోతున్నాడు. కడుపులో చెయ్యిపెట్టి కడిగివేస్తూన్న బెంగలు మరిచిపోయి, సంధ్యావందనం సంగతి కూడా మరిచిపోయి ఆనీలి సముద్రంకేసీ, ఆ ఎర్రసూర్య బింబంకేసీ చూస్తూ సంజవెలుగులో మునిగి ఉన్నాను.

కొంతసేపైనతర్వాత తల పక్కకి తిప్పి చూచాను. ఒక పురుషుడూ ఒక స్త్రీ మాట్లాడుకొంటూ వస్తున్నారు. కొంతసేపటికి పోలిక గట్టగలిగాను. ఆపురుషుడు ముక్కు కింద మీసంవాడు; ఆస్త్రీ నాభార్య! అలలు మరిచాను, సముద్రం మరిచాను, సంజ మరిచాను, అంధకారంలో పడ్డాను. దగ్గిరికి వస్తారుగదా ఏవిధంగా యీ కుట్ర పరిణమిస్తుందో చూతామని వాళ్లను చూడనట్టు నటిస్తూ అక్కడే నిలబడ్డాను.

నాభార్య నన్నుచూచింది కాబోలు దారి మళ్లించి అడ్డదారిని అవతణ్ణి తీసుకువెడుతోంది. ఆ మసకచీకట్లో వాళ్లనవ్వులు వినిపిస్తున్నాయి. కనిపెట్టి చూస్తున్నాను. వాళ్లు మోటారుకారుదగ్గిరికి వెళ్లారు. కారు ఎక్కారు. కారు బయలుదేరుతోంది లేదు. బయలుదేరడం లేదు. ఎందుచేతనో, పదినిముషాలైంది. నేను చూడనేలేదు సముద్రపు ఒడ్డునుంచే వెళ్లింది ఒకపడుచమ్మాయి. కారు సమీపించింది; ఆమె కారు ఎక్కింది. కారు కదలి వెళ్లిపోయింది.

ఎవరో ఆ అమ్మాయి? ఎంతక్షోభపడిందిమనస్సు నిష్కారణంగా అనుకొంటూ ఇంటిమార్గం పట్టాను.

ఇంకోమాటు కచేరీపని కావడంతోనే కల్చరు క్లబ్బు పక్కనుంచి వెడదామని బుద్ధిపుట్టింది. నాభార్య కనిపిస్తుందేమో, ఏమిచేస్తూ ఉంటుందో గేటుయివతలినుంచే చూడవచ్చు ననుకొన్నాను. మనస్సు మహాపాడువస్తువ. ఎంత సమాధాన

పెట్టినా వినదు. ఇంటికి పోనియ్యకుండా ఎందుకు ఈ క్లబ్బువైపుకు ఈడ్చుకురావాలి? ఏదైనా ఫలానా కార్యంకోసమని తీసుకువస్తే బాగుంటుంది. ఏమీ లేదే! ఈ మనస్సు అడుగు పొరల్లో ఏదో అనుమానం దాన్ని శల్యంలాగ బాధిస్తోంది. ఆ అనుమానాన్ని దృఢపరుచుకోడానికో, రద్దుచేసుకోడానికో ఈ ప్రయత్నమంతాను. ఎవరి మీద అనుమానం? నాభార్య మీదనే? నాభార్య గడుసుదంటే ఒప్పుకొంటాను; పెంకెదంటే ఒప్పుకొంటాను, మాటకారి అంటే ఒప్పుకొంటాను చెయ్యిచేసుకొనే స్వభావం కలదంటే ఒప్పుకొంటాను.—కాని యిన్నాళ్లు నిష్కళంకంగా నాతో కాపురంచేసి, మాయిద్దరికీ సంతానంకూడా కలిగినతరువాత యింకా అనుమానమా? మనస్సు మహాచెడ్డవస్తువ!

క్లబ్బుపక్కనుంచి అటూఇటూ తిరిగాను. గేటులోంచి చూచాను నాభార్య కనబడలేదు. ఇంతలో గేటుదగ్గిర జవాను నన్ను చూచి వచ్చి నమస్కరించి అన్నాడు "బాబయ్యా, యీవేల అమ్మెగోరు కబ్బుకు రానేదు. ఆరెవరో, పెద్దింటోరే బాబయ్యా, ఆలుమగల్లు దెబ్బలాడుకొన్నారంట — సంసారం గాదా బాబయ్యా; అమ్మెగోరు ఆమొగాయన్ని యెంటబెట్టుకు ఎల్లిపోయేరంట." మాయామర్మం ఎరగని వాడిమాటలు విని నామనస్సు చివుక్కుమంది. వెంటబెట్టుకు వెళ్లడమంటే ఏమిటి? చెప్పరానిమాటైతే వాడు నాతో చెప్పతాడా? చెప్పగూడిన మాటైతే వెంటబెట్టుకు వెళ్లడ మంటే ఏమిటి? వెధవ అనుమానం బాధిస్తూనే ఉంది ఎందుకు అనుమానం?

ఇంటికి వచ్చినవాణ్ణి నాకు చూపకపోవడం ఒకటి; బీచిదగ్గిర తప్పించుకు పోవడం రెండు; మొగాయన్ని వెంటబెట్టుకు వెళ్లడం మూడు. సరే, కానీ అడిగి చూస్తాను!

నాభార్య సీసంగతు లన్నీ నిలవేసి అడగా లని నిశ్చయించాను. సంజాయిషీ ఏమియిస్తుందో చూడాలని నిశ్చయించాను. కాని ఆవిడ ఎడమొహం పెడమొహంగా తిరుగుతోంది. నాతో సమావేశం కాకుండా ఉండాలని ప్రయత్నిస్తోంది. నేను ఎప్పుడైనా పిలిచినా, ఏమైనా అడిగినా "ఇప్పుడుగాదు, తీరుబడి లేదు; సారీ" అంటోంది. నాభార్య ప్రవర్తనలో, కళ్లల్లో, చేష్టల్లో మార్పు కనిపిస్తోంది. చూడమని నామనస్సు నాకు బోధిస్తోంది. ఇలాఉండగా నాకో ఉత్తరంవచ్చింది. నాశ్రేయోభిలాషి వ్రాసింది. పేరు లేదు ఊరులేదు. అందులో విషయాలు ఏమి టంట— "మీరు బహు ఉత్తములు. విద్యావతిని వివాహమాడి ధన్యులైనారు. ఇంతవరకూ కళంకం లేకుండా మీ సంసారం జరిగింది. మీమేలు కోరినవాడను కాబట్టి చెప్పుతున్నాను. మీభార్య ప్రవర్తన అనుమానాస్పదంగా ఉన్నది. నిరంతరమూ చాటూ మాటూ లేకుండా ఒక జెంటిల్‌మానుతో తిరగడం మా బోటివారికి చాలావిచారంగావుంది. మీరు తగుశ్రద్ధ వహించాలి. సంసారులముగదా! వ్యవహారము ఘోర్తు పరుచుకోవాలిగాని పాడుచేసుకోకూడదు. సెలవు."

ఇంకేముంది. అనుకున్నంతా జరిగింది. ఏమిటి చెయ్యడ మిప్పుడు? వ్యవహారం ఘోర్తుపరచుకోవాలిట! అలాగే వుంటుంది పరాయివాళ్లకి. తనదాకా వచ్చేదాకా తెలియదు.

మతి పోతోంది. ఉత్తరం మళ్లీ చదివాను. ఆదస్తూరీ ఏదో ఎరిగిఉన్నట్లే ఉంది. ఎవరో నామిత్రులలో బంధువులో వ్రాసిఉంటారు. ఉత్తరం జాగ్రత్తచేశాను. కర్తవ్య మేమిటో మాత్రం తెలియడంలేదు. డైవోర్సు బిల్లైనా పెట్టారుగారు.

కార్పణ్యంతో తిరుగు తున్నాను. నా భార్యముఖంకేసేనా చూడ్డం లేదు. మాయిద్దరికీ కొన్నాళ్లు మాటలుకూడా లేకపోయాయి. ఏమి చెయ్యాలో నిర్ణయించి తరవాత దండిద్దా మని ఆలోచిస్తున్నాను. డిశంబరునెల గడిచిపోతోంది.

ఒకనాడు నాభార్య గంతులతో, నవ్వులతో ఒక పెద్దతోల్బుట్టకు పట్టుకొని నాదగ్గర కొచ్చింది. నే నామెముఖం చూడలేదు.

"ఏంచేస్తున్నారు, మైడియర్" అంది. నాకు వళ్లుమండుతోంది. అసహ్యంగా నాభార్యమొహంకేసి చూచాను. ఇంతా చేసి సిగ్గూ బిడియం లేకుండా యీవిధంగా నాదగ్గర కొస్తుందా! కాసే.

"కోపంవచ్చిందా. మైలవ్" అన్నది. నాకు అసహ్యం. కోపం ఎక్కువౌతున్నాయి. తొందరపడి ఏంచేసి పోతానోఅని నాలో నాకే భయంగా వుంది.

"మైడియర్—నన్ను క్షమించరూ?"
"స్త్రీప్రవర్తన ఏమీబాగాలేదు. పిల్లల గన్నదానవు—బుద్ధిలేదూ? సిగ్గూ

భిక్షయం లేదూ? ఏ మొహం పెట్టుకు నాదగ్గిరకొచ్చావు— అవతలికి ఫో" అన్నాను.

ఈమాటలు వినడంతోనే మాన మున్న భార్యఅయితే బయటికి వెళ్లి పోయి గదిలో కూర్చుని ఏడుస్తుంది. నాభార్య—అప్పుడప్పుడు నేను తిట్టి నప్పుడు— ఆవిధంగానే చేసేది. ఇప్పుడుకూడా అలాగే చేస్తుం దను కొన్నాను. చెయ్యలేదు సరిగదా విరగబడి నవ్వడం మొదలుపెట్టింది. చప్పట్లుకొట్టి గిర్రునతిరుగుతూ నవ్వు తోంది. ఈప్రవర్తన నా కర్థం కా లేదు. నవ్వి నవ్వి నా ఒళ్లోకి వచ్చి కూచుని నాచేతులు గట్టిగా పట్టు కొంది. చేతులు వదిలించుకొని కిందకు తోసెయ్యా లనుకొన్నాను. నిదానించాను. అప్పుడంది నాభార్య "మీమనస్సుకు చాలా నొప్పిగలి గించాను, నాకు తెలుసును; రెండు నెలలపాటుమిమ్మల్ని బాధపెట్టాను; నే నెరుగుదును. నేనుమాత్రం బాధ పడడంలేదా ఏమిటి? పైకి నవ్వు తున్నానుగాని మనస్సులో ఎంత ఏడుస్తున్నాను నన్ను క్షమించరూ? నన్ను క్షమించరూ?" అంటూ నా చేతులు వదిలిపెట్టి కళ్లమీద చేతులు పెట్టుకొని ఏడవడం మొద లెట్టింది. నాకు జాలివేసింది. కాని మనస్సు కఠినంగానే ఉండమం టోంది. అన్నా నాభార్య చీరకొం గుతోదాని కన్నీళ్లు తుడిచివేసి, కళ్లముందర నుంచి చేతులుతీసి "ఏమిటిదంతా" అన్నాను.

"నన్ను క్షమించండి. చెయ్యక తప్పిందికాదు" అన్నది.

"సరే నేనడిగిన ప్రశ్నకుసమాధానం చెప్పు" అనిపించింది నా మనస్సు. నాభార్య మాట్లాడలేదు.

"ఎవ రాకెణ్ణెల్లక్రితం మనింటికి వచ్చిన పెద్దమనిషి? వాడిని నా కెందుకు యిన్ట్రడ్యూసు చేశావు కావు? వాడితో నవ్వులు నవ్వు కొంటూ పోక నాదగ్గిర కెందు కొచ్చావు? వాడితో సముద్ర పొడ్డున పికార్లు కొట్టుకో సియిష్టం వచ్చినట్లు! ఆలూమగల్లు దెబ్బలాడు కొంటే, అదేసమయ మని మగాణ్ణి వెంటవేసుకు వెళ్లు— నాదగ్గిర కెందుకు వచ్చావు?" అన్నాను కోపధోరణితో.

"వినండి, వినండి, అంతాచెబతాను. తొందరపడకండి." అన్నది నాభార్య నా వళ్లోనుంచి లేవనెత్తి పక్క కుర్చీలో కూచోబెట్టి చెప్పమన్నాను. నాభార్య యీవిధంగా చెప్పింది.

"మాక్లబ్బులో ఒకమ్మాయి ఉంది. ఆవిడకు పెళ్లయి యింకా సంవత్సర మేనా దాటలేదు. వట్టి తెలివి తక్కువపిల్ల. ఆమొగుడేనా సర్దుకు పోయేవాడేమో ననుకొంటే అతడు కోపదారి. అందువల్ల వాళ్లిద్దరికీ అన్యోన్యం చెడింది. ఇద్దరూ విడి పోయి ఒకనెల్లాళ్లు కాలక్షేపం చేశారు. ఎన్నాళ్లు అలాగ ఉండ గలరు? తాననిచెప్పి ఆపిల్ల మొగుణ్ణి రమ్మనదు. అంత అభిమానం ఆవి డికి. అతగాడు మగాడుగదా సర్దుకో గూడదా అంటే అతనికీ తగనిగర్వం. కాబట్టి మధ్యవర్తులద్వారా వాళ్ల వ్యవహారం ఫాక్షు పరచవలసి వచ్చింది.

మాక్లబ్బులో ఒకనియమ మేమిటం టే— మాలో ఎవరికి ఏ ఆపద వచ్చినా క్లబ్బుమెంబర్లు కలగజేసు కొని సహాయం చేస్తారు. ఈ విష యమై ఒకసభచేసి ఏకగ్రీవంగా నన్ను మధ్యవర్తిత్వం నడిపించ మన్నారు. క్లబ్బు తీర్మానానికి అను గుణంగా నే నతన్ని పిలిపించి నెల్లాళ్లు అతనితో పోరి భార్యతో సమాధానపడడానికి వప్పించాను.

ఆపిల్లదగ్గిరికి వెళ్లి చెప్పవలసిన విధంగా చెప్పి సమాధానపరిచాను. వాళ్లిద్దరూ కలుసుకొని రెండురోజులే అయింది."

"అయితే అతన్ని మనింటికి తీసుకు వచ్చి ఆవిరగబడి నవ్వు లెందుకు? నామొహం ఎదటే అంత అల్లరెం దుకు? బీచిపికార్లెందుకూ?"

"బీచిపికారు అతనూ, నేనూ, అతని భార్యా వెళ్లాము. అప్పటి కింకా వాళ్లు సుముఖులు కాలేదు. వాళ్లి ద్దరినీ చెరోవేపున పెట్టుకొని ఆమాట ఈమాట చెపుతూ నవ్విస్తూండే దాన్ని; క్రమక్రమంగా నన్ను వదిలి వాళ్ళిద్దరూ చెట్టాపట్టాలు వేసుకొని కబుర్లలోకి దిగీదాకాను."

"మరి."

"అతనితో అలాగ విరగబడి మీ మొహంముందు నవ్వడానికి కారణ లేకపోలేదు." అన్నది నాభార్య.

దాచినఉత్తరం తీసుకువచ్చి నాభార్య మీద పడవేసి "ఇదేమిటో చూశావా" అన్నాను.

ఉత్తరం చేత్తో పుచ్చుకుచూసి నాభార్య మళ్లీ నవ్వడం మొద లెట్టింది.

"ఎందు కానవ్వు?" అన్నాను.

"ఎవరు వ్రాశారో ఆ ఉత్తరం చూశారా?" అంది.

"ఎవరో శ్రేయోభిలాషిట!"

"ఆ దస్తూరీ ఎవరిదో?" అన్నది.

"ఏమో, నాకేం తెలుసు?" అన్నాను.

"మళ్లీ ఇంకోమాటు నిదానించి చూడండి" అని నామీదకు ఉత్తరం విసిరింది.

జాగ్రత్తగా దస్తూరీ పరీక్షించి, "ఎవరిదంటావు?" అన్నాను.

"ఎవరిదా? ఇంకోమాటు చూడండి" అన్నది.

"ఎంత మోసం! నీదే ఈ దస్తూరీ! కళ్ళు కప్పేసుకుపోయేయి నాకు."

"ఇప్పుడు తెలిసిందా?" అన్నది.

"ఏమిటి తెలియడం" అన్నాను.

"ఆవిరగబడి నవ్వడమూ, ఈ ఉత్తరమూ నామీద మీకు అనుమానం కలగడానికే!"

"ఎందుకు అనుమానం కలిగించుకొన్నావు?"

"ఈ యేటిక్లబ్బు బహుమానం కోసం."

"బహుమానం యియ్యడానికి ఏమి చెయ్యాలన్నారేమిటి?"

"శీలానికి భంగంరాకుండా ఎవరైతే తమభర్తలకు తమ గుణాన్ని గురించి అనుమానం కలిగిస్తారో వారికి బహుమానం."

"నీవొక్కర్తివేనా ఏమిటి, మీక్లబ్బు కంతకీ అంత ప్రయోజకురాలివి. మై లిటిల్ స్కాండ్రల్?"

"అందరికన్న మార్కులు నాకు ఎక్కువ వచ్చినవి కాబట్టి నాకు బహుమానం వచ్చింది."

"ఎలాగ ఆమార్కులు నిర్ణయించారు?"

"జడ్జీలు గూఢంగా మెంబర్ల తాలూకు భర్తలచర్యలు ఈ రెండు నెలలబట్టీ కనిపెడుతున్నారు. మీ బిక్కమొహం, మీరు క్లబ్బుచుట్టూ తిరగడం, నాతో మాట్లాడక పోవడం— ఇవన్నీ చూచి నేనే నెగ్గానని నిర్ణయించారు."

"ఇలాంటిపనులు చెయ్యడం ప్రమాదంకాదూ? ఎటునుంచి ఎటు వస్తుందో! సంసారాలు చెడిపోవూ."

"ఆ ధైర్య మున్నవాళ్లే యిందులో ప్రవేశించారు. ఈమాత్రం యడ్వెంచర్ సాహసం ఆడవాళ్లకు లేకపోతే ఎందుకు పనికివస్తారు?"

ఈ ప్రశ్న కింక సమాధానం లేదు. నామనస్సులో బెంగ తీరింది. కుదుటబడ్డాను. నిట్టూర్పు విడిచాను.

నాభార్య కాఫీ, బిస్కత్తులూ, చాక్లేట్లూ తెచ్చి బల్లమీదపెట్టింది. ఇద్దరమూ ఆరగిస్తూ సరదాగా ప్రసంగించుకొన్నాము.

"ఈ బిస్కత్తు ముక్క తిను, మై బ్యూటీ" అన్నాను.

"థేంక్సు, మైసోల్" అని బిస్కత్తులు తినడం మొదలుపెట్టింది నాభార్య.

"నువ్వు మీక్లబ్బు కంతటికీ ప్రయోజకురాలవులా గున్నావే! క్రిందటి ఏటిబహుమానం నీదే; యీయేటిదీ నీదే" అన్నాను.

"షియర్ లక్; మీసహాయం లేకపోతే నా కీబహుమతులు వచ్చేవా చెప్పండి మరి."

"అల్లరిపిల్లా! అయితే నీతోకూడా యీయేడు యీపందెంలో ప్రవేశించినవాళ్లసంగతి చెప్పావు కావు" అన్నాను.

"చెప్పనా,—ఒకావిడ తానే తనకు ఎవరో పురుషుడు ప్రేమలేఖ వ్రాసినట్లు వ్రాసుకొని ఆకవరు తనచేతి సంచీలో పెట్టిభర్తతో మాట్లాడడానికి వెళ్లింది. మాటలమధ్య కవరు కింద జారవిడిచి వెళ్లిపోయింది. భర్త ఆకవరుతీసి చదువుకొన్నాడు. కొంతసేపైన తరువాత భర్తదగ్గిరికి వచ్చి బిక్కమొహంతో నా ఉత్తరం పడిపోయిం దంది. ఆ ఉత్తరం తనకు దొరికిం దనీ తాను చదివేననీ భర్త చెప్పాడు. ఆవిడ భయం నటించి గడగడ వణికింది. భర్త ఆవిడతో అన్నాట్ట, "ఇదివరలో ఎన్ని ఉత్తరాలు వచ్చాయి నీకు?"

భయపడుతూ, "ఇదే మొదటిది క్షమించండి" అందిట.

"దీనికి సమాధానం రాశావా" అని అడిగేట్ట.

సందేహిస్తూ నెమ్మదిగా "రాశా నందిట.

"రాశావా! ఎలా రాశావు మైడియర్ వైఫీ? దీనిలో అడ్రసు లేదే!" ఆవిడ తెల్లబోయిందట.

"మళ్లీ మీక్లబ్బువాళ్లు మీచేత కోతిచేష్టలు చేయిస్తున్నారా యేమిటి?" అన్నాట్ట నవ్వుతూ. భర్తకు అనుమానం కలిగించలేకపోబట్టి ఆవిడకు బహుమానం లేదు.

ఇంకో ఆవిడుంది మాక్లబ్బులో. ఆవిడకు సిగరెట్టు అలవాటులేదు. ఆసంగతి భర్తకు తెలుసును. ఆమె భర్తకూ సిగరెట్టు అలవాటులేదు. ఒకనాడావిడ భర్త వచ్చేవేళకు రెండుప్యాకెట్ల సిగరెట్లు కుంపటిలో వేసి ఆపొగ ఇల్లంతా చుట్టివేసుకొనేలా చేసింది. ఇంతట్లోకే భర్తవచ్చి తలుపుతట్టాడు. పదినిముషాలదాకా

తలుపు తియ్యలేదు. ఈపాటికి అనుమానం కలిగిఉంటుందిగదా అనుకొని తలుపుతీసి చీరా పైటా సవరించుకోవడం మొదలెట్టింది. భర్త లోపలికి వచ్చాడు. సిగరెట్టు వాసన పీల్చాడు. భార్యతో అన్నాడుగదా, "చెప్పావు కావు; క్లబ్బులో మెంబర్లంతా సిగరెట్లు కాల్చాలని నిబంధన వచ్చిందా ఏమిటి ? అంతసిగ్గూ దాపరికం ఎందుకు? చంపేశావే వీధులో నిలబెట్టి ! ఈమాత్రం కార్యానికి భయ మెందుకు? నీయిష్ట మొచ్చినన్ని సిగరెట్లు కాల్చుకో నే నేమీఅనను. రేపు మంచి "నేవీ కట్" సిగరెట్లు ఒకడబ్బా తెస్తానుండు." భర్తకు అనుమానం రాలేదుసరిగదా సిగరెట్ల అలవాటు అంటుకొంటుం దని ఆవిడ భర్తతో నిజంచెప్పింది. "ని న్నెప్పుడేనా అనుమానిస్తానా, హనీ?" అన్నా డా భర్త.

" వింటున్నా రా " అంది నాభార్య.

" వింటున్నా. " అన్నాను.

" అనుమానించే వాడు గొప్పవాడా అనుమానించనివాడా? "

" న న్నేంచంపుతావు కానిద్దూ. "

" ఆల్ రైట్, డియర్.——

ఇంకోఆవిడ భర్త వీధులో మొహం కడుక్కుంటూవుంటే తానూ ఆసమయానికి వీధిలోకి వచ్చి యెదుటి యింటి పెద్దమనిషిని నిదానించి చూడ్డం మొదలుపెట్టింది. పదిహేను రోజు లీలాగ అయ్యేసరికి ఆపెద్దమనిషి ప్రతీరోజూ వీళ్లింటికి కాఫీకి తయారయ్యేవాడు. భర్త యెదుటే అత న్నెంతోఆదరించి కాఫీఇచ్చేది. ఫలహారాలు పెట్టేది.అతడు యింటికి వస్తే తాను ఎదురుగా వెళ్లి కుశలప్రశ్న లడిగేది. వెళ్లిపోతూంటే షేక్‌హాండుచేశేది. భర్తకీప్రవర్తనవల్ల ఆవిడమీద ఎటువంటి అనుమానమూ కలగలేదు. క్లబ్బు ఆచారాలు కొత్తగా నేర్చింది కాబోలనుకొన్నాడు. కాని ఒకప్రమాదం వచ్చింది. అప్పటినుంచీ ఆపెద్దమనిషి వదల్చుకోవాలన్నా వదలకుండా పట్టుకొన్నాడు. చివరకి వాడిని వదలించుకోవడం బ్రహ్మాండం అయింది"

" ఎలాగ వదిలించు కొన్నారు ? " అన్నాను.

"ఎలాగా? వాణ్ణి ఒకకూలివాడికింద కట్టి. ఆవిడ ఏమిచెపితే ఆ పనులు చేసేవాడు. రోజూ పోస్టులో ఉత్తరాలు వెయ్యడం వాడే, బజారునుంచి కూరలు తేవడం వాడే, తోటలో చెట్లకు గొప్పులు తవ్వడం నీళ్లు పొయ్యడం వాడే, పిల్లల్ని ఎత్తుకొని ఆడించడం వాడే. ఇలాగ పది పదిహేను రోజులు గడిపి విసిగి లేచి పోయాడు. అప్పుడు ఆవిడభర్త ఆవిడతో అన్నాడుగదా, "లేచి పోయె డేం ఆ పెద్దమనిషి? జీతం బత్తెంలేని కూలివాణ్ణి సంపాదించావు గదా అని సంతోషిస్తూంటే."

ఆవిడకు బహుమానం వచ్చేవిధం లేదుగదా. ఇంక మీరు నన్ను అనుమానించారు. అనుమానిస్తే అనుమానించారులెండి. ఇప్పుడు బహుమానం వచ్చింది కాబట్టి బెంగ లేదు. కాని యికముం దెప్పుడూ నన్ననుమానించరుగదా అని మీాసం పట్టుకోబోతూంటే అన్నానుగదా—

"అయితే, హనీ; నీబహుమానం ఏమిటో చూపావుకావేమి?"

"ఇందాకటినుంచీ మీకోసం ఎదురు చూస్తోంది——అదిగో ఆ ట్రంకు."

"ఏమిటీ? ఆ ట్రంకా; దాల్లోఏమైనా ఉందా? వుత్తిట్రంకేనా"

"తీసి చూడండి."

ట్రంకుతాళం తీసి మూత ఎత్తి చూశాను. అందులో ఒకపట్టుచీరా, ఒకడజను బ్లౌసులూ, ఒకడజను పెసరీలూ ఉన్నాయి.

"ఇవి ఆడవాళ్లసరుకు ముట్టుకో కూడదుకాబోలు" అన్నాను.

"కూడకపోతే మానతారా? మీరు ముట్టుకోకుండానే జరుగుతుందా?" అంది.

"అయినా నాకెందుకు? నీబహుమానాల సంగతి " అన్నాను.

"మీకుమాత్రం గాకేమి? మనం పంచుకొంబాం వాటిని" అంది.

"ఎవరు పంపకం వెయ్యడం" అన్నాను.

"నేవేతునా" అని చీరా, బ్లౌసులూ నానల్లోపెట్టి పారిపోబోయింది. పట్టుకొని చెవులో చెప్పానుగదా.

"అవిమాత్రం మిగుల్చుకొంటా వెందుకు—— ఆ పెసరీలు—— అవీ నాకే యియ్యి."

నాభార్య నవ్వుతూ నన్ను లెంపమీద వాయించి చీరా బ్లౌసులూ తీసుకుపోయి బీరువాలోపెట్టుకొంది.

"ఈట్రంకుకూడాతీసికెళ్లు"అన్నాను.

"మైడియర్ హబ్బీ!ఆట్రంకుమీది."

"థాంక్సు మైలిటిల్ హనీ."

———

# ఉమర్ ఖయ్యాము-చిత్రములు

ఉమర్ ఖయ్యాముకవిత్వము చూచి ఉప్పొంగినవాళ్లలో చాల రకాలవాళ్లున్నారు. కవులూ, తత్త్వవేత్తలూ, చిత్రకారులూ అందులో ముఖ్యులు.

డార్విష్ అనే పర్షియాదేశస్థుడలాంటి చిత్రకారులలో ఒకడు. క్రొత్తగా ఇతనిచిత్రములు లండనులో ప్రదర్శింపబడ్డవి. (వాటిలోవే ఈ మూడుచిత్రములు.)

డార్విష్‌చరిత్ర చిత్రమైనది. చిన్నతనంలో, తండ్రిచదువుతూవుండేఫిర్దౌసీకృతమగు షానామాను చూచి ఆకర్షింపబడి, అందులోని విషయాల నాధారంగా గొని బొమ్మలువేయటం మొదలుపెట్టాడు. అలాంటివి క్రమక్రమంగా ౪౧౯ తయారుచేశాడు.

తరవాత సన్న్యాసిగా కొన్నాళ్లున్నాడు. ఆమీద ఒక గులాబీతోటలో మధుపానం చేస్తూ పక్షులపాటలు వింటూ బ్రదుకు దామని నిశ్చయించుకున్నాడు.

ఇటువంటి ఊహాలవల్ల అతనిమనస్సు ఉమర్ ఖయ్యాముమీదికిపోయింది. వెంటనే చిత్రరచన మళ్లీ ప్రారంభించి ఉమర్ కావ్యంలోని వివిధఘట్టాలకు ప్రతిబింబాలు తయారుచేశాడు. అతని ఊహాశక్తి, తత్త్వబోధ యితడెంతగా గ్రహించాడో యీచిత్రాలవల్ల తెలుస్తుంది.

ఇతడు ఉమర్ దేశమునకే చెందినవాడవటంవల్ల ఇతని చిత్రాలకు ప్రత్యేకమైన విలువకూడా వుంది.

(మూలమునందలి ఇంగ్లీషు రుబాయతుల ననుసరించి శ్రీ కుందుర్తి నరసింహారావుగారు తెలుగుపద్యములను రచించిరి.)

[టైమ్సు ఆఫ్ ఇండియా ౧౯౩౪ సం. సంవత్సరాది సంచికనుండి.]



చిత్రము 3.

అగును పో, ప్రత్యూషస్సంధ్య నవతరించు
లేగులాబీలు; కాని యెందేగె నిపుడు
నిన్నటిగులాబి ?—సుమియించు నన్నమాటె
కాని యీగ్రీష్మమాసాది 'కైకొబాదు
జంపిదూల తా సంహరించి సాగిపోవు.

# సప్తర్షిమండలము

కొంపెల్ల లక్ష్మీనారాయణ

భారతి యీశ్వర చైత్ర సంచికయందు 'సప్తఋషు'లను శీర్షికతో గొబ్బూరి వెంకటానందరాఘవరావుగారు ఒక వ్యాసమును ప్రకటించిరి. అందు సప్తఋషుల నామములను, ఆ మండలమందలి వారివారి తారతమ్య స్థానములను, (Relative positions) చక్కగా నిరూపించి యున్నారు. మరియు వారి గ్రీకు నామములను, ఈ మండల సహాయమున వివిధ ముఖ్యనక్షత్రములను గనుగొను విధానమును ఇచ్చి సూచించియున్నారు. నాయల్పజ్ఞానముతో పైవిషయమున కొకకొంత జేర్పయత్నించిన నా సాహసమును మన్నింతురుగాక.

ఈ దినములలో రాత్రులం దుత్తరదిక్కునను శోభిల్లుచున్న యీ సప్తఋషిమండల మెంతయు మనోహరముగా నుండును. వైశాఖ బ ౧ నాటిరాత్రి ౭ గంటల కీమండలము సరిగా నుత్తరమున గానవచ్చును. ఇందలి, క్రతుపులహ పులస్త్య అత్రి అను నాలుగునక్షత్రములు చతుర్భుజవలెను, తక్కిన అంగిరస వసిష్ఠ మరీచి అను మూడు నక్షత్రములును తూర్పువైపు ఉత్తరకోణమునుండి తోకవలె వ్రేలాడుచుండి గాలిపటమువలె గాన్పించును. తోకయందు మధ్యనున్న వసిష్ఠుని పరికించిన భర్తకుత్తరదిశగా అరుంధతి మిణుకు మిణుకు మనుచుండును.

ఇట్లుత్తరమునకు దృష్టి మరల్పగనే గోచరించు నీ మండల సహాయమున ననేక నక్షత్రములను గనుగొనవచ్చును.

మానవనేత్రము వేలకుమించిన మైళ్ల దూరమునవున్న నక్షత్రముల దూరమందలి తారతమ్యముల గ్రహింపలేనందున నక్షత్రము లన్నియు అర్ధగోళాకృతినున్న కొప్పెరవంటి నీలాకాశమున నతికిన మణులవలె గాన్పించును. కాన రెండు నక్షత్రములచే సూచింపబడినరేఖ యొక్క సరళరేఖ గాక, పరిశీలకు దున్న స్థానమును కేంద్రముగాగాని నేత్రావగాహమైన నక్షత్రదూరమును వ్యాసార్ధముగాగాని యీ రెండునక్షత్రముల గుండా వ్రాయబడిన వృత్తమని యెరుగవలెను. ఇట్లిందీయబడిన కొలతలు Spherical measures.

ఈ సప్తఋషి మండలము నుండి పులహక్రతురేఖ ధ్రువనక్షత్రము గుండా పోవును. పులహ ధ్రువులమధ్యనున్న యీరేఖ ప్రేక్షకునివద్ద 30° ల కోణమును చూపును. ధ్రువ మధ్యనున్న యీ రేఖ 30° పాదవుండును అనగా నీ రేఖ ప్రేక్షకునివద్ద 30° చూపును. కాన ధ్రువపులహ బ్రహ్మహృదయ త్రిభుజము సమకోణ ద్విసమబాహుత్రిభుజము. (?)

పులస్త్యపులహరేఖ ఆర్ద్రిద్వారా పోవును. పులహార్ద్రిలమధ్య నీ రేఖపాదవు ౯౦°. బ్రహ్మహృదయార్ద్రిలను వ్యాసముగాగాని పశ్చిమమున కొక యర్ధవృత్తమును గీచిన దానిపై నెట్టిగా రోహిణి మెఱయుచుండును. ఎద్దు మూతివలెనున్న యీ మండలములో నిది కన్నువలెనుండుటచే వృషభనేత్రమని దీనిని పాశ్చాత్యులందురు.

పులస్త్యక్రతురేఖ రోహిణిక్రింద నుంచి




నక్షత్రము స్థిరముగానుండ నితరనక్షత్రములు దానిచుట్టును ౨౩ గం॥ ౫౬ని॥ ల కొకమారు తిరుగుచుంటచే సప్తఋషిమండలము తిరుగుచున్నను నీ రేఖ ధ్రువునిగుండా పోవుచునే యుండును. ఇట్లు పులహక్రతువులు ధ్రువు నెల్లవేళల సూచించుచుండుటచే నివి సూచీ నక్షత్రము లనబడును. ధ్రువునివద్ద నీ రేఖకు లంబముగా మరియొక రేఖ నూహించిన నది సారధి మండలములోని బ్రహ్మహృదయము [illegible] ద్వారా పోవును. ధ్రువ బ్రహ్మహృదయముల

పోవును. ఈరేఖకు రెండవవైపున (పశ్చిమముగా) రోహిణికి తిన్నగా, మిణుకు మిణుకు మను చిన్ననక్షత్రముల ప్రోవు, కృత్తిక కానవచ్చును. ఈ రేఖ క్రతువద్దనుంచి కృత్తిక రోహిణులవరకు ౭౫° లుండును. ఈ మండలము పిల్లలకోడియని మనవారందురు. మరియు నిది ద్రాక్షపళ్ల గుత్తివలె నుంటచే పాశ్చాత్యు లట్లు వ్యవహరింతురు.

అత్రిపులహరేఖ మిథునములోని Castor, Polux ల మధ్యగా పోవును. పులహునివద్ద

నుంచి యీ రెండు నక్షత్రములవర కీరేఖ పొడవు ౩౫° లుండును.

క్రతుపులహరేఖ సింహరాశి మధ్యగా పోవును. పులహునివద్ద నుంచి యీ రేఖ ద్వారా ౩౦° పోయిన నీరేఖకు పశ్చిమముగా కొడవలివలె కొన్ని నక్షత్రములకూడిక కానబడును. ఈ కొడవలిపిడి మొదటినుండి మఖ ధవళ కాంతి నిగుడించుచుండును. అచ్చటనే యీ రేఖకు పూర్వదిశను మంచపుకోళ్లవలె నాల్గు నక్షత్రము లగుపడును. ఇందలి తూర్పు దెస జంట ఉత్తరఫల్గుని, పడమటి దెస జత పుబ్బ యనబడును. ఉత్తరఫల్గునిలో దక్షిణ దెసనున్న Denabola తక్కటివానికంటె ప్రకాశవంతమైనది.

క్రతుపులస్త్యరేఖ కాషాయకాంతి నిగుడించుచున్న చిత్తానక్షత్రముద్వారా పోవును. పులస్త్య చిత్రల మధ్యనుండు నీరేఖపొడవు ౪౫°.

క్రతు అత్రిరేఖ స్వాతీనక్షత్రముగుండా పోవును. అత్రిస్వాతులమధ్య నుండు నీరేఖ పొడవు ౪౦°.

ఉత్తరఫల్గుని చిత్రలమధ్య హస్తలోనైదు నక్షత్రములు మిణుకు మిణుకు లాడుచుండును. వీనిని చిత్తానక్షత్రముతో గలిపి కన్యగా నూహింపవచ్చును. ఆర్ద్రకు తూర్పు దెసను పునర్వసు, మృగమునకు దక్షిణముగానున్న మృగవ్యాధరుద్రుడు వానికి పశ్చిమముగా ౫° లలోనున్న మరియొక నక్షత్రము మిథునములోని Castor, Po'ux లు కలిసి పిన్నీసు పదవపలె నుండును. కొడవలికి పశ్చిమముగా పాముపడగవలె ఆశ్లేషయును, పుష్యమువలె పుష్యమియుకూడ గాననగును.

---

## 'సింగినాదం-జీలకఱ్ఱ'

సోదరీమణి శ్రీమతి 'కృష్ణకుమారి' 'జీలకఱ్ఱసింగినాదం'అనే శీర్షికతో పయి సామెతనీ, దానికి సంబంధించిన కథనీ కిందటినెల, 'భారతి'లో వ్యాసంగా ప్రకటించింది.

'సింగినాదం జీలకఱ్ఱ'అని సామెతను త్రిప్పి పలకడంకూడా ఉన్నది. కాని ఆ వ్యవహారం తప్పు. ఎలాగో తారుమారైంది. అంతేకాని 'జీలకఱ్ఱసింగినాదం' మనడమే ఒప్పు. ఈ సంగతి......దీని కథనుబట్టి పాఠకులకే తెలుస్తుంది' అనికూడా వ్రాసిందామె.

గోదావరి, కృష్ణాజిల్లాల సంగ తెలాగుందో గాని అటు గంజాంవిశాఖపట్నంజిల్లాల్లోనూ, ఇటు గుంటూరు, నెల్లూరు జిల్లాల్లోనూ, 'సింగినాదం—జీలకఱ్ఱ' అనేవ్యవహారమే కనబడుతున్నాది. చరిత్రాధారాన్నిబట్టి చూచినా యీరీతి వ్యవహారాని కేమీ అభ్యంతరం కనబడదు. 'సింగినాదం' విని అందరూ అల్లకల్లోల మవుతూవుంటే 'జీలకఱ్ఱ' ప్రత్యక్షమయ్యేది, భయాన్ని పటాపంచలచేస్తూ. తుదకి 'పైకి బటారం, లోపల లొటారం'అయింది. అంచేత ఈరీతేకథకి చక్కగాహత్తుకుంటుంది.

సామెతకి తొలిరూపం 'సింగినాదం-జీలకఱ్ఱ'అనేది; మలిరూపం తారుమారయిన 'జీలకఱ్ఱసింగినాదం'అనేది.

సామెత లన్నీ సాధారణంగా (చాలావాట్లో క్రియ లేకపోతేలేకపోతుందిగాని.) వాక్యరూపంగాగాని, చాలా పదాలు కలిసిగాని వుంటాయి. ఒకే సమస్తపదం నేరిగినంతమట్టుకు సామెతల్లో కనబడలేదు. 'కృష్ణకుమారి' నిరూపణనుబట్టి చూస్తే 'జీలకఱ్ఱ(సంబంధమైన) సింగినాదం'అనే సమస్తపదమే సామెత అయినట్లు తెలుస్తున్నాది. సమస్తంగా వుండడం-ఏకపదంగా వుండడం లోకోక్తి మర్యాదకి విలక్షణం. సమస్తపదాలయితే వాటిలోవున్న 'ఫోర్సు'కూడా తగ్గిపోతుంది.

ర.

# తాళ్లప్రొద్దుటూరు శాసనము

నేలటూరు వెంకటరమణయ్య

మట్లూరు వెంకటరామయ్య

ఈక్రిందఁ బరిష్కృతము గాఁబోవుశాసనము రాయలసీమలోనిది. ఇది కడపజిల్లా జమ్మలమడుగు తాలూకాలోఁ జేరిన తాళ్లప్రొద్దుటూరు గ్రామమునందలి శ్రీ యాంజనేయస్వామివారి దేవాలయమునకు ఎదుట పాతియుండు నిలువురాతికి నాలుగుప్రక్కలను జెక్కఁబడియున్నది. శాసనము రాతిమీఁద చక్కఁగాఁ జెక్కఁబడి యుండుటచేత ఎచటనో యొకటి రెండు స్థలములయందుతప్ప తక్కిన భాగమంతయు మాసిపోక స్పష్టముగ తెలియవచ్చుచున్నది. మాసిపోయిన యక్షరములు (౩, ౩౧, ౩౮, ౪౯, ౫౩, ౫౮) పంక్తులయందలివి.

ఈ శాసనము రమారమి ౧౨౦ సంవత్సరముల క్రిందట కర్నల్ కాలిన్ మెకంజీగారి సమాస్తాలయం దొకరు పరిశీలించి ప్రతియొకదానిని వ్రాసికొనిరి. వీరే ఈశాసనమును గుర్తించినవారిలో ప్రథములు. వీరు వ్రాసితెచ్చినకాపీ మదరాసు గవర్నమెంటువారి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందు మెకంజీ కలెక్షన్ అను పుస్తకములయందు కానవచ్చుచున్నది. అందుతప్పులు మెండుగ నుండుటచేత విషయము సుబోధము కాదు. ఇటీవల మ.రా.రా.శ్రీ జయంతి రామయ్య పంతులవారు ఈశాసనమును తమ శాసన పద్యమంజరియను గ్రంథమునందు నరసొఱఁగఁ బ్రకటించిరి. ప్రకటించిన భాగమైనను సమగ్రము కాదు. శాసనవిషయము దేశవాఙ్మయ చరిత్రలకు సహకారి యగుటచేత దీని ప్రతిబింబమును సంపాదించి యథాశక్తిఁ బరిష్కరించి ప్రకటించుచున్నారము.

## చిహ్నములు

శాసనశిల పైభాగమున కుడియెడమ పార్శ్వములయందు, చంద్రసూర్య బింబములును, వీనిమధ్య ఎడమముఖమగు వృషభమును, వృషభమునకు పురోభాగమున సూర్యబింబమునకు క్రింద చక్రరూపమగు వస్తువును, అఱచేతధరించిన హస్తమును జెక్కఁబడియున్నవి. ఈవృషభము శాసనమునిల్పిన రాజుయొక్క లాంఛనముగా గ్రహింపవచ్చును.[౧] వృషభము ముంగలి వామపాదమును నడుగిడఁ బోవుచున్న దానివలె పైకెత్తి తోఁకను నిక్కఁబొడుచుకొని యున్నది. శాసనములయందు గండరించియుండు వృషభములరీతి యిట్టిది కాదు. సామాన్యముగ నవి పండుకొని యున్నట్లుగాని లేక నిలిచియున్నట్లుగాని గండరించుట శిల్పుల యాచారము. ఉంకించి లంఘింపసిద్ధమైన వృషభరూప మెందును గానరాదు. ఈ శాసనమునందలి వృషభమురీతి మాలెపాడు, పెద్దముడియము నందలి తెలుఁగు చోళరాజుల శాసనముఖములఁ జెక్కఁబడిన సింహపురీతినిఁ బోలియున్నది.[౨] మఱియు, ఇందు చెక్కఁబడినట్లు, తెఱచి పైకెత్తఁబడిన ముంజేయి సామాన్యముగ సహగమనమును దెలియఁజేయు శాసనములయందే కానవచ్చుచున్నది. కాని యిది సహగమన శాసనము కాదు. ముంజేయి దీనియం దేల చెక్కఁబడియెనో తెలియదు.

## భాష : లిపి

శాసనభాష తెలుఁగు; గద్యపద్యాత్మకము. పద్యములు కడు సొంపైనవి. తెలుఁగు శాసనములయం దింతచక్కని కవిత్వ మగపడుట యరుదు. ఒకానొకరు ఇందలిపద్యములు నాచన సోమునిచే విరచితములై యుండునేమో యని సంశయించిరి. కాలము సరిపోవుచున్నది. నుడికారమును, కూర్పునేర్పును, పదలాలిత్యమును, సోముని కవనమును జ్ఞప్తికిఁ దెచ్చును. కాని శాసనగ్రంథకర్త సోముఁడని చెప్పుటకే యాధారమును లేదు. కవి యెవ్వఁడైనను ప్రజ్ఞావంతుఁడే. చక్కని కవనము సెప్పనేర్పు కలవాఁడు.

లిపి క్రీ శ. ౧౮ శతాబ్దారంభమున ఆంధ్రదేశమునందు వాఁడుకయం దున్న తెలుఁగుఁగన్నడలిపి. ఇ, ఈ, ఎ, ఏల భేదములను తెలుపు ప్రత్యేకచిహ్నములు లేవు. ఇందు దీర్ఘ ఇకారము వచ్చునట్టి పెక్కుతావులయందు గుడిలోపలికి సుడితిరిగియున్నది. ఈసుడి యొకవేళ దీర్ఘ 'ఇ' కారచిహ్న మగునేమో; కాని నిశ్చయము తెలియదు. ఎత్వము రెండువిధములుగఁ గానవచ్చుచున్నది. సామాన్యముగ ఎత్వము వచ్చు నన్ని తావులయందును అది ఇంచుమించుగ ఇప్పటి కన్నడ ఎత్వము వలె నున్నను కొన్నిచోట్లయందు (ఉ. కైరవ పం. ౨౧) అది ఇప్పటి తెలుగుఅచ్చు సంఖ్య ౭ ను పండవేసినట్లు వ్రాయఁబడియున్నది.'క' ఇప్పటి కన్నడ'క'వలె నున్నది. ఇట్టి 'క' ను మనవారనేకు లింకను వ్రాతయందు వ్రాయుచునేయున్నారు. 'త' కారము ఇప్పటి రూపమును పొందలేదు. కాని దాని ప్రాచీనరూపము చెడి పరిణామమును పొందినది. ఈ శాసనమునందు రెండువిధములు 'త' లు కానవచ్చుచున్నవి. ఒక తరగతి 'త' కు ఇప్పటి 'త' వలె ఎడమ భుజముపై సుడి లేదు. క్రారను వ్రాసి దాని దాపలికొమ్మునకు సుడిఇచ్చి సుడికి పైన అక్షరము నంటనీయక తలకట్టు వ్రాసిన

---

౧. మే మెఱిఁగినంతవఱకు పల్లవ, బాణవంశ రాజులది వృషభలాంఛనము. ఈ శాసనము నెత్తించినరాజు సింహలాంఛనుఁడగు తెలుఁగుచోళుఁడు. ఇతఁ డీలాంఛనము నేల స్వీకరించెనో తెలియదు.

౨ ఎపి. ఇండి: వా. xi పుట. ౩౩౮. ఎదురువైపు.

'త' యగును. క్రార ఇరు భుజములకును సుడిత్రిప్పి ఎడమ భుజముపై సుడికి తగులనీయక తలకట్టు వ్రాసిన రెండవతరగతి 'త' అగును. 'శ' ఇంకను ప్రాచీన రూపమును సంపూర్ణముగ విడువ లేదు. ఇప్పటి 'గ' వత్తును వ్రాసి దాని కుడిపాదమును క్రిందికి దీర్ఘించి దాపలకు త్రిప్పి పైకి కొంత లాగి కుడిపాదముతో చేర్చి అక్షరమునకు తగులనీయక తలకట్టిచ్చిన అప్పటి 'శ' అగును. 'శ' ఇప్పటి అచ్చు 'క' నుఁ బోలియున్నది. వర్గాక్షరములలో వత్తు అక్షరములకు వత్తుచిహ్నమగు అక్షరపృష్ఠమునందలి యూర్ధ్వ రేఖ కానరాదు. ట, ద లకు గల భేద మత్యల్పము. ఇప్పటి అచ్చు 'ఉ'కు పొట్టలోని గీటును దొలగించిన యప్పటి 'ట' యగును. 'ట' నెత్తిపై నున్న ఊర్ధ్వరేఖ ప్రక్కను మఱియొక యూర్ధ్వరేఖను వ్రాసిన 'టా' యగును. (చూ. పంక్తి ౩౭.) ఇప్పటి అచ్చు 'ఉ' కు పొట్టమీది నెత్తిపైని గీట్లనుఁ దొలఁగించి అక్షరమునకు తగులనీయక తలకట్టు వ్రాసిన 'ద' యగును. ఇప్పటి 'ద' యప్పటి వర్గ చతుర్థాక్షరమగు వత్తు 'ధ' అగును. 'ప' కు ఇప్పటివలె పుచ్ఛమునుండి కాక ప్రక్కనుండి కొమ్ము ఇవ్వఁబడి యున్నది. 'క్ష' సంయుక్తాక్షర మని ఈశాసనమునందలి వ్రాత స్పష్టపఱచుచున్నది. 'క' వ్రాసి, దాని క్రింది భాగమున అక్షరము మీదనే 'ష' వ్రాసిన 'క్ష' అగుచున్నది. సంయుక్తాక్షరములలో వచ్చు నకారొత్వెల్లు, రకారొత్వెల్లు, లకారొత్వెల్లులు గమనింపఁ దగినవి. నకారొత్వెల్లులకు ప్రత్యేక చిహ్నము లిందు గానరావు. "థాడికిని" (౧౦౫ పంక్తి) "కామినులు" (౫౩ పంక్తి) అనియే శాసనపువ్రాత. వీనిని "థాడికిన్", "కామినుల్" అని యుచ్చరించవలయును. రకారొత్వెల్లు ఇప్పటి రూపమునకు చేర్పగుచున్నది. అక్షరముపై నధోముఖమగు వర్తులరేఖను ఐమూలగ వ్రాసి దానికుడికొనను గిరికఁద్రిప్పి దానిని సమరేఖఁగ పొడిగించిన రకారొత్వెల్లగును. అరసున్న లుండవలసినతావులలో నెఱసున్న లుండుటచే నర్ధబిందువునకు ప్రత్యేకచిహ్నము లేదని తెలియుచున్నది. బిందుపూర్వకములగుహల్లులు కొన్నియెడల ద్విత్వయుక్తములుగ నున్నవి. (పం. ౭౭ చనుదెంచ్చె; పంక్తి ౯౧-౨ ఉత్సహించ్చె.)

## శాసనమున తప్పులరుదు

'సగ' (పంక్తి ౨); ఘ్రీతాచి (పంక్తి ౭౭-౫), జమదఙ్ఞజుండు (పం ౫౬); నిఖిల (పం. ౧౩౯); న్రిపాలుథాడికిని (పం. ౧౦౭-౫); ఇవి 'సగ', ఘృతాచి, జమదగ్నిజుండు, నిఖిల, నృపాలుధాటికిని (లేక, నృపాలుదాడికిని) అని యుండవలయును.

## అ ప పా ఠ ము లు

మ. రా. రా. శ్రీ జయంతి రామయ్యపంతులుగారిచే ప్రకటింపఁబడిన శాసనభాగమునందు కొన్ని యపపాఠములుఁ గన్పట్టుచున్నవి. పంక్తి ౭౧ 'కీరుణి' అని చదివి 'ణి' ని కుండలీకరించి, యధోజ్ఞాపికయందు, 'కీరుని' అని చదువునది, అనివ్రాసినారు. మా ప్రతిబింబమునందు 'కీరుని' అనియేయున్నది. పం. ౭౯ '(ని)ంగి పథంబునం' అని చదివినారు. 'ని' ని కుండలీకరించినారు. ఇందు మొదటియక్షరము మాసిపోయినది. కొమ్మమాత్రము మిగిలియున్నది. రెండవయక్షరము 'గ్ని' యని స్పష్టముగఁ దెలియుచున్నది. సున్న పొడ యెచ్చటనుఁ గానరాదు. శ్రీ రామయ్యపంతులుగారు దీనిని 'నింగి' యని యెట్లు చదివిరో తెలియదు. 'యగ్నిపథంబునందు' అని సరియైన పాఠము 'అగ్నిపథంబునందు' అనఁగా పతి ననుగమించి యగ్నిప్రవేశ మొనరించి తనూమూలమున స్వర్గమునుఁ జేరెనని భావము. పం. ౫౬ 'జమదఙ్ఞిజుండు' అని చదివినారు. 'జమదఙ్ఞజుండు' అని మా ప్రతిబింబమునం దున్నది. పం. ౬౫. 'దాలె' అనిచదివి 'దాళెం' అని చదువవలయుననియధోజ్ఞాపిక నొకదాని నంటించినారు. మా ప్రతిబింబమున 'దోలె' యని యున్నది. పం. ౧౭౮ - ౭౯ "తెలుపెక్కంగజీవోపు" యని చదివిరి. శాసనమున "తెలుఁపెక్కంగఱవోవ" యనియే కలదు. 'కఱ' అను నదియే సరియైనపాఠము. 'కఱ' యనఁగా 'నలుపు', 'మఱక' యని యర్థము. ఈ యర్థమునసే ప్రాచీను లీపదమును వాడినారు. చూడుఁడు:—

> క. తనసుతుఁడగు శశి మెయికఱఁ
> గని చెచ్చెరఁ గడిగిపుచ్చగా నని దుగ్ధాం
> బునిధి నభంబున కెగసెనో
> యనఁ జంద్రిక పర్వె సాంద్రమై విమలంబై.
>
> కు. సం. ౮. ౧౧౬.

నాచనసోముఁడును, ఎఱ్ఱనయు ఈ పదమును 'కఱ' యనియే వాడినారు. ఇది ఇంకను భాషనుండి యంతరించలేదు. నెల్లూర నిప్పటికిని వాడుకయం దున్నది.

పం. ౮౨. "ఏనుక" అనుమాటకు "ఏనిక" యని చదువవలయునని యొక యధోజ్ఞాపికనుఁ దగిలించినారు ఇందువల్ల 'ఏను:' యను రూపము తప్పని తేలుచున్నది. 'ఏనుక' యనురూపము సాధువు కాదనుటకు కారణము చూపలేదు. ఈరూప మసాధువగుటకు తగిన కారణములు అగపడునంతవరకు దీనిని సాధువనియే తలఁచెదను. శబ్దరత్నాకరమున 'ఏనిక' పదముకడ 'ఏనికగములో యనంగఁ దరణీమణు లుల్లము లుల్లసిల్లఁగన్' అను రుక్మిణీ పరిణయమునందలి ప్రయోగము కలదు. దానినిబట్టి 'ఏనిక' పదము సాధువని తేలుచున్నది; కాని ఏనుకపద మసాధువని చెప్ప వలనుగాదు. పం. ౭౨-౩. 'వీసరనాండు' అని చదివిరి. శాసనమునందు 'వీసర్తినాండు' అని శకటరేఫయుక్తముగ నున్నది. పం. ౧౦౦-౧. మ (ల...ద్యన) అని చదివిరి. 'ల'కుపిమ్మట మూఁడుచుక్కలనుఁ బెట్టి తరువాత 'ద్యన' వ్రాసి అంతటిని– 'ల' మొదలుకొని 'న' వఱకును చేసి కుండలీకరించిరి. మూఁడుచుక్కలవల్ల మూఁడుఅక్షరములు పోయిన వని మన మూహించికొనవలయును. ఇన్ని యక్షరములు పట్టునంత చోటు లచ్చట నుండిన వృత్తముగతి యేమికావలయును? ఇన్నింటిని పొట్ట నిమిడ్చుకొనుశక్తి దానికిఁగలదా? పంతులుగారు ప్రతిబింబమును చక్కఁగఁ బరిశీలించియుండిన ఇన్ని యక్షరముల క్రింద శాఖ

లేదని గ్రహించియుందురు. ఇందువెంటఁ బ్రకటించియున్న ప్రతిబింబము నొక్కమారు తిలకింపుఁడు. ప. ౧౦౦ 'మం' అను నక్షరముతో ముగిసినది. ౧౦౧ పం. మొదటి యక్షరమేదో గుర్తించుటకు వీలు కాకున్నది. రెండవ యక్షరము 'శ్య' మూడవ యక్షరము 'న' అన్నిఁటిని చేర్చిన 'మంశ్యన' అనుచున్నది. ప్రతిబింబమును చూడఁగనే 'మం', 'శ్య' లను నడుమ నొకయక్షర మున్నట్లు తోఁచును. కాని వాస్తవమున నచ్చట నేయక్షరమును లేదు. ౧౦౦ వ పంక్తి యొక్క మొదటి యక్షరమునుఁ 'న్ని'ని చూడుఁడు. 'న' వత్తు యొక్క తోక క్రిందికి దిగి ౧౦౧ పంక్తిలోని 'శ్య' యొక్క తలకట్టునుఁ గడచి దాని యెడమభుజమువఱకు వచ్చినది. ౧౦౨ వ పంక్తియొక్క ప్రథమాక్షర మగు 'గ' ను చూడుఁడు. దానితలకట్టు పైకీడ్వఁబడి ౧౦౦ వ పంక్తి 'న' వత్తుతోకను, ౧౦౧ వ పంక్తిలోని 'శ్య' కు ఎడమవైపున సమీపించినది. వీటి రెంటికిమధ్య రాయి స్వల్పముగ పేడెత్తిపోవుటచే గీటొకటి యేర్పడినది. ఎడమ ప్రక్క శాసనపురాయి మొదటినుండి కొనవఱకును పసుప్లువాసి యున్నది. ౧౦౦ వ పంక్తిలోని 'న'వత్తు ౧౦౨ వ పంక్తిలోని 'గ' యొక్క తలకట్టు శాసనశిలలోని పసుప్లు వీనియన్నింటి సంయోగము ౧౦౧ వ పంక్తిలో 'శ్య' ముం దొకయక్షర మున్నదను భ్రమను కలుగఁజేయుచున్నది. కాని యచ్చట వాస్తవముగ నక్షరమెద్దియును లేదు. కావున రాతిపైనున్న యక్షరములను "మన్నియ వడ్లెక్కలియి మంశ్యన." అని చదువవలయును. రాతిమీద వ్రాలు ఇట్లున్నను పైనిశాసన పంక్తియం దొకయక్షరము కొఱఁతపడియుండుట స్పష్టము. ఏలన, పద్యపాదమున నొకమాత్ర తగ్గుటవలన గణభంగ మగుచున్నది. 'మన్నియవడ్డె (తె)క్కలియ' *అని సవరించుకొనవచ్చును.

మఱియు, రామయ్యపంతులవారు ౧౦౩ వ పంక్తిలో 'నొక్కనాంట' అనుమాటకును 'సె' యను పంక్తిలోని కడపటి యక్షరమునకు మధ్య మాసిపోయిన యక్షరములు సూచించుకొఱకై తొమ్మిది చుక్కల నుంచియున్నారు. ఇందువల్ల నచ్చట తొమ్మిది యక్షరములు మాసిపోయి యుండునన్న తలంపుఁ గలుగవచ్చును. కాని శాసనమునం దీపంక్తియందలి యక్షరములన్నియు స్పష్టముగనే కాన్పించుచున్నవి. రామయ్య పంతులుగారు చుక్కలుఁ బెట్టినతావున 'విసె' అను రెండక్షరము లున్నవి. 'నొక్కనాంటవిసె' అని పంక్తికి రాతిమీఁది పాఠము.

## రెండుశాసనములు

చక్కఁగ పరిశీలించి చూచిన నీ శిలపై రెండు శాసనము లుండుట స్పష్టమగును. ఇందువలననే రామయ్యపంతులవారికి "పన్ని తురంగమంబునకు' అను పద్యమునకు 'పై పద్యముతో సంబంధమున్నట్లు తోఁప" నిది. రామయ్యపంతులుగారు తలచినట్లు ఒకపై పద్యము తోనేకాదు. తక్కిన శాసనగ్రంథముతోడనే దీన్కి సంబంధము లేదు. "పన్ని తురంగమంబునకు" అన్న పద్యము ఏఱువ భీముని ప్రతాపము నుగ్గడించుచున్నది. తక్కిన శాసనగ్రంథ మంతయు జగతాపుగంగని ప్రశస్తిని శౌర్యమును వచించుచున్నది. వీ రిరువురికి నెట్టి సంబంధము గలదో ఎఱుఁగరాదు.

## శాసనకాలము

ఈ శాసనశిలపై మొదట చెక్కఁబడినశాసనము ఏఱువ భీమునిది. శాసనశిలను దిలకించిన నిది తెల్లము కాఁగలదు. జగతాపు గంగని శాసనము శాసనశిలకు మొదటిప్రక్క ఆరంభమై రెండవప్రక్క ¾ భాగములవఱకును చెక్కఁబడినది. తక్కిన ¼ భాగమున "పన్ని తురంగమునకు" అన్న పద్యమునం దొక భాగము చెక్కఁబడియున్నది. పద్యముయొక్క తరువాయి రాతికి మూఁడవప్రక్క మొదటినుండియు చెక్కఁబడు నని మనము తలఁచుట సహజము. కాని యం దట్లు లేదు. మూఁడవప్రక్క జగతాపు గంగనియొక్క శాసనపు తరువాయితో నారంభ మైనది. ౨౫ పంక్తు లైనపిమ్మట "పన్ని తురంగమంబునకు" యొక్క శేషము చెక్కఁబడినది. నాలుగవప్రక్క మరల జగతాపు గంగనిశాసనము సంపూర్ణముఁ గావింపఁబడినది. రాతిమీఁద మొదట చెక్కఁబడిన శాసనము జగతాపుగంగనిదని తలఁచుటకు వీలులేదు. ఏలన, శిల్పి శాసనమును గండరించునపుడు శాసన గ్రంథము సంపూర్ణము గాకుండగనే రెండవ మూడవ ప్రక్కలయందు ఉత్తతావును విడిచియుండఁడు. కావున జగతాపు గంగని శిల్పి రాతిపై శాసనము చెక్క నారంభించుటకు పూర్వమే దాని తలమున క్రిందివైపున "పన్ని తురంగమునకు" చెక్కఁబడియుండుట నిశ్చయము. కావున సదరు రాతిపై మొదట చెక్కఁబడినది ఏఱువ భీముని శాసనము. జగతాపు గంగని శాసనము శా. శ. ౧౨౪౪ నకు సరియగు దుందుభి సం. మాఘ శు. ౧ శనివారమునాఁడు అనఁగా క్రీ. శ. ౧౩౨౩ సం. జనవరి నెల ౮ తేది శనివారమునాఁడు వేయించినదగుటచేత ఏఱువభీమునిశాసనము తత్పూర్వమది కావలయును. ఎంత పూర్వముదో కచితముగ చెప్పుటకు వలనుపడదు. రెండుశాసనముల యందలి యక్షరములును నొక్కతీరుగనే యున్నవి. కాని భీముని శాసనకాలమును నొకవిధముగ నిర్ధారింపవచ్చును. ఇతఁడు చోడభక్తిరాజుయొక్క తాతకు తాత. భక్తిరాజుయొక్క మద్రాసు మ్యూజియముశాసనము అతఁడు క్రీ. శ. ౧౩౫౫ సం. అక్టోబరు ౨౧ తేది సోమవారమునాఁడు చేసినదానమును డెలియఁజేయుచున్నది. ఏఱువ భీముఁడు భక్తిరాజునకు నాలుగుతరములు ముందున్నవాఁడగుటచేత తరమునకు ౨౫ సం. చొప్పున గణించితిమేని అతఁడు ఇంచుమించుగ (౧౩౫౫—౧౦౦=) క్రీ. శ. ౧౨౫౫ ప్రాంతమువాఁడగును. తొల్ల ప్రొద్దుటూరి శాసనములోని "పన్ని తురంగమంబునకు" అన్న పద్యము క్రీ. శ. ౧౨౫౦ ప్రాంతమున శాసనస్థము చేయఁబడినదని నమ్మవచ్చును.

* 'మన్ని యవడ్లెక్కలియి' అను శాసనగ్రంథమును 'మన్నియ వడ్డె తెక్కలియ' అని మా. రామకృష్ణకవిగారు సవరించిరి. వారికి కృతజ్ఞులము.

## శాసనగ్రంథము : చరిత్రాంశములు

### (i) ఏఱువభీమనృపాలుఁడు

ఏఱువభీముఁడు యుద్ధయాత్ర వెడలుటకు సంసిద్ధుఁడై సబ్బినాడు బొక్కర చెట్టిన వార్త విన్నంతమాత్రముననే వీసఱినాండు, చక్రగొట్టము, మన్నియ, వడ్డెక్కలి, మంథ్యన, వెంగి, కళింగము మొదలైన దేశములు కలఁతవాఱెను. ఇవన్నియు నొక్కనాఁడే యతని ధాటికి నవిసెను. ఏఱువభీముని విషయమంతయే మన యీశాసనమూలమున దెలిసికొనగలిగెనది. చాటుపద్యమణిమంజరి రెండవ భాగము. ౫౯వ పుటయందు ఏఱువభీమునిగూర్చి యొక కందపద్యము గలదు. కాని యందు చారిత్రకవిషయము లేవియును గానరావు. బ్ర. శ్రీ. వేటూరి ప్రభాకరశాస్త్రులవారు ఏఱువభీముఁడును మైలమభీముఁడును ఒక్కరేయని తలఁచినట్లున్నది. వారు ఒక్కరేకారని యును, ప్రత్యేకవ్యక్తులనియు శ్రీయుతులు. టి. యన్. రామచంద్రన్ గారు భారతి ౮ సంపుటమున భక్తిరాజు తామ్రశాసనము పరిష్కరించుసమయమున నిరూపించియున్నారు. మైలమభీముని తల్లి మైలమ యనుటచేతను ఏఱువ భీముని తల్లి పేరు అన్నమాంబ యనుట చేతను వీరు భిన్న పురుషులనుట నిశ్చయము. కావునఁ బ్రభాకరశాస్త్రిలవారిచేఁ గూర్పఁబడిన చాటువులలో మైలను భీముని వర్ణించునవి వీఱువ భీముని కన్వయించవు.

ఏఱువ భీముఁ డను పేరును బట్టి యతఁడు ఏఱువనాటి ప్రభువై యుండు నను నూహ కెడము కలుగుచున్నది. ఏఱువనాడు కమ్మనాటికి పశ్చిమముననుు పాకనాటికి పశ్చిమోత్తరమునను పల్నాటికి వాయవ్యమునను, ఉండెను. ఇప్పటి నెల్లూరిజిల్లాలోని పొదిలి, దర్శి డివిషనులలో కొంతభాగమును, కడపజిల్లాలోని బద్వేలు, సిద్ధవట్టం తాలూకాలో కొంతభాగమును, కర్నూలు జిల్లాలోని మార్కాపురం తాలూకాయును, చేరిన దేశమునకు పూర్వము ఏఱువసా డని పేరు. ఇందు ప్రాచీన ముఖ్యస్థానములు ఏఱువ, కొచ్చెర్లకోట, తొంటమారయగుల్ల అను దుర్గములు. ఈ భూమికి రాజైన ఏఱువ భీముఁడు ఎప్పుడు, ఏసందర్భమున మన శాసనమునఁ జెప్పఁబడిన దేశములపై దండువెడలి జయించెనో తెలుసుకొనవలయును. ఇన్ని దేశముల నితఁడు జయించిన ట్లీ శాసనమునం దున్నను ప్రఖ్యాతుఁడైన రాజని చెప్పుటకు నాధారము లేదు. ఇతడు క్రీ. శ. ౧౩-వ శతాబ్ద మధ్యమున నుండె నని స్థూలముగ నిర్ణయించియున్నాము. ఆకాలమునందలి రాజకీయ పరిస్థితులను బట్టి చూడ ఏఱువ భీమునికి ఉత్తరదేశ దిగ్విజయము సులభసాధ్యము గాదు. ఇతనిభూమి యగు ఏఱువనాడు స్వతంత్రరాజ్యము కాక కాకతి రాజ్యాంతర్గతమగు నొక సామంతమండలమై యుండెను. మహాపరాక్రమశాలి యగు కాకతి గణపతిచక్రవర్తి యప్పుడు ఆంధ్రావని కంతటికిని నధిపతియైయుండెను. కావున ఏఱువ భీముఁడు శాసనోక్తములగు ఉత్తరజనపదములను స్వతంత్రుఁడై జయించె ననుటకు వీలులేదు. ఇతఁడు కాకతి రాజు సైన్యములతోఁగూడ పోయి యతని యుత్తర దిగ్విజయయాత్రయందు పాల్గొనియుండును. గణపతి వెంగి, కళింగములను సాధించె ననుటకు ప్రమాణము కలదు. శివయోగసారమందు ఈవిజయములు వర్ణింపఁడియున్నవి. చూడుఁడు :—

చ. ఇలబహుసైన్యము ల్గొలువ నేకశిలాపురితూర్పుదిక్కునం
గల రిపుభూములెల్లఁ గొని గర్వము మై.....మండలీ
కుల నవలీలఁ దోలి సురగోసులనాడునుఁ గోల్మివీడు నా
వెలసినదుర్గము న్గొనుచు వేగమె గౌతమి దాఁటి యిమ్ములన్.

క. మాడియు రెండుంగొని యూ
డాడెడి పన్నెండు మన్నియకుల నోడించి తా
నాడె కళింగయసీమకుఁ
గూడినభువిఁ గొనియె సోమకులముఖ్యుఁ డొగిన్.

ఆ. లీలఁ గొలనిమండలికుల వెలఁదోలి
గొలనివీడు దాను గొనుటఁజేసి
కాకతీశుఁడైన గణపతి (యంతను)
కొలని సోముఁ డనఁగ వెలసె జగతి.

కొలనువీడు అనఁగా ఇప్పటిఏలూరు. ఏలూరు వెంగికి హృదయమువంటి దని ప్రత్యేకించి వ్రాయ నవసరము లేదుగదా! ఈ విజయములు క్రీ. శ. ౧౨౨౮ సంవత్సర ప్రాంతమున గణపతిదేవునికి చేకూడె నని శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు రనుచున్నారు.[3] మఱియు గణపతిదేవుని కళింగ దండయాత్ర రేచర్ల రుద్రుని మంత్రి యగు రాజనాయకుని క్రీ. శ. ౧౨౩౯వ సంవత్సరమునాటి యుప్పరపల్లె శాసనమునందు సంగ్రహముగ వర్ణింపఁబడియున్నది. రాజనాయకుఁడు దండువెడలి "భొక్కరలోని వీరభటావలివధించి గోధుమశాలి తలఁద్రుంచి, ఉదయగిరి సాధించిపడి రాయనింఁదోలె" నట.[4] భొక్కర గంజాంజిల్లా అస్కా తాలూకాలోని ఇప్పటి బొక్కరయే. కాని ఉదయగిరి బార్నెట్ దొర తలఁచినట్లు నెల్లూరిజిల్లాలోని యాసేరిటెదుర్గము గాదు. అది ఉత్కళదేశములోని ఉదయగిరి యని మా తలఁపు.[5]

పైని చెప్పినవిషయములను బట్టిచూడ క్రీ. శ. ౧౨౩౦ సం. ప్రాంతమున గణపతి ఉత్తర దేశమును స్వాధీనపఱచుకొనుటకు సైన్యము నంపెను. వేంగి, కళింగము, మాడియము, పన్నెండుమన్నియములను గొనెను; బొక్కరకడ శత్రువులను పరాజితులనుగావించి గోధుమశాలినిఁ బరిమార్చి ఉత్కళమునందలి యుదయగిరిని కైవసము చేసికొనెను. ఏఱువభీముఁడు జయించినదేశములును ఇవియే- 'వెంగి, కళింగము, మన్నియ, వడ్ల(తె)క్కలి (?). (వడ్ల(తె)క్కలి వడ్డెక్కలి యగునని తలఁచెదము.) ఇవిగాక వీసఱినాడు, చక్రగొట్టము,

---

3 సుభాషి, అక్టో. ౧౯౨౪. పుట. ౧౫.

4 The Hyd. Arch Series No 3, P. 16.

5. మ. సోమశేఖరశర్మగారు : కళింగసంచిక. పు. ౩౮౧.

మండ్యైన, అనుస్థలములను సైతము ఇతఁడు గెల్చెను. వీసఱునాడు వేంగికళింగములమధ్య నుండెను.[౬] వేంగినుండి కళింగమునకు పోవు దండు వీసఱునాటిమార్గమున పోకతప్పదు. కావున గణపతిదేవునిసైన్యములుగూడ వీసఱునాటిని గెలిచియేయుండవలయును. చక్రకోట్టము మండ్యైన ఆంధ్రదేశమునందు త్తరమున నున్నది. వీటినిగూడ గణపతిదేవునిసైన్యములు గొనియుండవచ్చును. కావున ఏఱువభీముఁడు కాకతిగణపతిదేవుని సమకాలీనుఁ డని మే మొనర్చినసిద్ధాంత మసంగతముగాదేని, భీమునియొక్క యుత్తరదేశపు దిగ్విజయము గణపతిసైన్యములఁగూడి చేసినదియనుట యసమంజసము గానేరదు.

## (ii) జగతాపు గంగయదేవచోళమహారాజు

'జగతాపు' అనునది యితనియింటిపేరో లేక బిరుదనామమో తెలియదు. దీనికి 'జగతాపి' (పం. ౬౬) 'జగతాప' (పం. ౯౨-౩) అనురూపాంతరము లగపడుచున్నవి. దీని నిశ్చయరూప మేదో కనుఁగొన సాధ్యముకాదు. ఇతనిశాసనమునందలి వచనభాగమున ఇతనివంశమును, తలిదండ్రులను పేర్కొనఁబడిరి. మఱియు నితని బిరుదావళియును శాసనమును నెలకొల్పినకారణమును వర్ణింపఁబడియె. పద్యభాగమున నితనిపరాక్రమము ముగ్గడింపఁబడినది.

ఇతఁడు చోళవంశజుఁడు. దినకరకుల కుశేశినీపకాసనప్రభాకరుఁడు. కాశ్యప గోత్రజుఁడు. ఒఱయూరి పురవరాధీశ్వరుఁడు. అల్లు గంగరాజునకును గంగాదేవికిని పుత్త్రుఁడు. వారి పేర గంగసముద్రము తటాకమును ప్రతిష్ఠచేసి తత్సూచకముగ నీశాసనమును నిలిపెను. మఱియు నితని బిరుదములయందు ముఖ్యమైనవి నందగిరి నాథ, బలికులాదిత్య, అజమయూరసింధురధ్వజ, సేవణదుర్గాంభోని ధానపరిమథనలబ్ధ లక్ష్మీదక్షిణభుజమందరవిలాస విభవ, నిశితాసికులిశనిపతన శకలిత జోగులకుమార మహామహీధర, ఒఱయూరభీమనిశిరః కందుకోత్పాటన సంశోభిత తత్సంతతిలతాప్రరోహ, గండపెండార గంగయసాహిణి సర్వస్వబందికారు యనునవి. పద్యభాగమున రెండు చంపకమాలలు, ఉత్పలమాల; రెండు సీసములును గలవు. ఇందు చంపకమాలలును సీసములును జగతాపు గంగదేవుఁడు మల్లావనీశునితో నొనర్చిన యుద్ధమును, అతనిని వధించినవిధమును వర్ణించుచున్నవి.

ఇతఁడు తెలుఁగు చోళవంశజుఁ డనియును, గంగాదేవికిని అల్లు గంగరాజునకును పుత్త్రుఁ డనిమాత్రము తెలియుచున్నది. అల్లు గంగరాజనఁగా, అల్లుఁడైన గంగరాజు అని యర్థము. ఇందువల్ల నితనికి మామయొక్కఁడు గంగరాజను పేరుతో నుండెననియు, ఈ యిద్దఱు గంగరాజులను నిర్తించుటకై, 'అల్లు', 'మామ'యను పదములు, వారి నామములతో జోడించఁబడె ననియు కొందఱు తలఁచవచ్చును. కాని యిట్లు అని నిర్ధారించి చెప్పుటకు వీలులేదు. ఏలన నీయూహప్రకారము 'అల్లుఁడు రామరాజు' అను పేరు వినఁగనే మామ రామరాజొకఁడుండెనని మన మెంచవలయునుగదా! అల్లుఁడు రామరాజుయొక్క మామ కృష్ణదేవరాయ లని యందఱెఱింగిన విషయమే. కావున అల్లు గంగరాజన్నప్పుడు అతఁడు అల్లుఁడైన గంగరాజనిమాత్రము నిశ్చయముగఁ జెప్పవచ్చునుగాని యంతకుమించి యూహచేయుట కవకాశము లేదు. జగతాపు గంగయదేవుని పూర్వులను గూర్చి ఈశాసనము తెలియఁజేయు విషయ మింతయే. ఇతని పూర్వు లెవ్వరో తెలుఁగుచోడులయందే శాఖకు సంబంధించిన వారో తెలిసికొనుటకుఁగూడ తదుపసాధనములు లేవు. కాని యనంతపురంజిల్లా సత్తితాలూకాకు సంబంధించిన నిట్టూరు గ్రామమునందు శా. శ. ౧౧౩౭ నాఁటిశాసన మొకటి కలదు.[౭] అందు సేవుణ భూపాలుఁడు సింహణసేవునిసామంతుఁడను మహామండలేశ్వర జగతాపుదండి దేవచోళమహారాజు - మధురాంతకదేవచోళ మహారాజపుత్త్రుఁడు-పేర్కొనఁబడియున్నాఁడు. 'జగతాపు'అను వంశనామము దండిమహారాజునకును గంగమహారాజునకును సామాన్యములగుట చేత వారిరువు రొక్కవంశమువారనియు, దండిమహారాజు గంగమహారాజుకంటె దాదాపుగా ౧౦౦ సంవత్సరములు ముందటివాఁడగుటచేత నతఁడు గంగరాజునకు పూర్వికుఁ డనియు తలఁచుట సహజము. మఱియు మధురాంతకనామము పొత్తపి తెలుఁగుచోడులకు సామాన్యముగావున జగతాపుగంగయరాజువంశము పొత్తపివంశశాఖయని తలఁచవచ్చును.

మనశాసనప్రశస్తియందలి బిరుదావళి గంగయదేవచోళమహారాజుచరిత్రను గొంతవఱకును దెలుపుచున్నది. నందగిరినాథ,[౮] బలికులాదిత్య యనుబిరుదములు బాణరాజులవి. ఇతనిధ్వజముగూడ తెలుఁగుచోడరాజులకు సామాన్యముగాదు. ఇతఁడు అజమయూరసింధురధ్వజుఁడట. అనఁగా నితనిధ్వజముపై అజమయూరసింధురములరూపములు గానవచ్చెడివి. సాధారణముగ రాజులధ్వజములపై నేదో యొక్కజంతువురూప ముండెడిది. రెండుమూడు జంతువులుగాని వస్తువులుగాని యుండిన ఆధ్వజముగలరాజు ఇతరరాజులవియో, రాజవంశములవియో అగుచిహ్నములను స్వీకరించెనని తలఁచవలసియున్నది. గంగయదేవచోళమహారాజుధ్వజముపైని మృగరూపములన్నియు నతనికులక్రమాగతచిహ్నములు కావు. 'అజ' మెవ్వరి చిహ్నమో తెలియదు. బాణవంశీకులదైనను కావచ్చును. మయూరము తెలుఁగుచోడుల దనుటకుఁ గొంతయాధారము గలదు. 'అ(హ)రిదుర్ధర' ప్రశస్తిగల తెలుఁగుచోడరాజులు శిఖిశిఖధ్వజు లని వారిశాసనములవలన తెలియవచ్చుచున్నది. మఱియు నందివర్మపల్లవమల్లునియొక్క సేనాపతిచే నెల్వేలియందు దోడింపఁబడిన శబరరాజగు నుదయనునకు మయూరధ్వజ ముండెను.[౯] సింధురము పాశ్చాత్య గంగరాజు

---

౬. ARE. ౧౯౧౨. Part. I. P. ౭౯.

౭. ARE ౩౮౫ of ౧౯౨౦.

౮. 'నందగిరినాథ' యనుబిరుదును బాణరాజుల నోడించి పాశ్చాత్యగంగరాజు లాడిచికొనిరి.

౯. Udayendiram plates of Nandivarman Pallavamalla: S I. I., II, P. 363.

లది. కొంత తీరట్టరాజులును సింధురధ్వజులే. తెలుగుచోళుఁడను జగతాపు గంగయదేవ చోళుఁడు బాణనృపాలుర బిరుదములు ధ్వజములు లాంఛనములు వహించుటవలన నతనికి బాణులతో గాఢసంపర్క మున్నట్లు తోఁచుచున్నది. ఆసంబంధ మెట్టిదో కనుఁగొనుటకు తగిన సాధనములు లేవు. సింధురధ్వజము ఇతనికి పాశ్చాత్య గాంగులతో డనో రట్టరాజులతోడనో సంబంధము కలదని సూచించుచున్నది.

మఱియు జగతాపు గంగరాజు సేవణసైన్యములను దోలి రాజ్య లక్ష్మిని వరించెనని 'సేవణసేనాదుర్గాంభోనిధాన పరిమథనలబ్ధలక్ష్మి దక్షిణ భుజమందర విలాసవిభవ'యనువాక్యము తెలియఁజేయుచున్నది. కాని ఈవిజయ మెప్పుడు చేకూడెనో తెలియదు. సేవణరాజ్యము క్రీ. శ ౧౩౧౨లో నంతమందెను. రామదేవరాయల మరణానంతర మాతని పుత్త్రుఁడగు సంగముఁడు స్వతంత్రుఁడగుటకు ప్రయత్నము చేసెను. ఈవార్త చెవిసోకగనే అలావుద్దీను ఖిల్జీ జగదేకవీరుఁడను పేరు ప్రఖ్యాతులువడసిన మలిక్ కాఫరును సైన్యముతో దేవగిరిపై కంపి సేవుణ రాజ్యమునంతటిని స్వాధీనపఱచుకొనెను. కావున జగతాపు గంగయదేవ చోళమహారాజు సేవుణసైన్యమును ఓడించినది క్రీ. శ. ౧౩౧౨ సం. పూర్వమై యుండవలయును. ఈవిజయ మాతఁ డెప్పుడు పొందినదియు కచితముగ చెప్పటకు వీలుపడదు. కాని ఈ సందర్భమున దృష్టియందుంచుకొనవలసిన యంశములు ఒండురెండు కలవు.

(౧) జగతాపు గంగదేవుని పూర్వికుఁడగు జగతాపు దండిదేవ చోళమహారాజు సేవుణరాజగు సింగణదేవుని సామంతుఁడని పైన వ్రాసియున్నాము. కావున ప్రస్తుత శాసనమునఁ జెప్పినట్లు జగతాపు గంగయదేవుఁడు సేవుణసైన్యముపై విజయముఁ బడసె ననుటవలన అతఁడు తనస్వామియగు సేవుణనృపాలుని కవిధేయుఁడై తిరుగుబాటు చేసెనని యూహించవలసి యున్నది.

(౨) జగతాపుగంగని తండ్రియగు అల్లుగంగరాజు ఘండికోట మనోరథపురవరాధీశ్వరుఁ డగు నంబదేవునికి శత్రువు. క్రీ. శ.

"మయూర కలాప విరచితం దర్పణధ్వజం".

౧౨౯౦.వ సం॥నాఁటి అంబదేవుని త్రిపురాంతకపు శాసనమునందు౧౦ అంబదేవుఁడు అల్లుగంగరాజును పెక్కు దండనాయకులతోఁ గూడ నోడించినట్లు వ్రాసియున్నది. మఱియు దేవగిరిప్రభు వగు సేవుణరాజు అంబదేవుని కనర్ఘభూషణము లొసఁగినట్లు ఈశాసనము ననే కలదు.

ఈ విషయములనుబట్టిచూడ జగతాపు గంగరాజుయొక్క తండ్రియగు అల్లుగంగరాజు నిజస్వామియగు సేవుణ భూపాలునిపైఁ దిరుగఁబడి స్వతంత్రుఁడగుటకు యత్నము సేయఁగా అంబదేవుఁ డాతని నోడించెననియు, సేవుణరా జందుకు సంతసించి తత్సూచకముగ నంబదేవునకు మణిభూషణములను బహుమానముగ నంపెననియు తోఁచుచున్నది. కాని, సేవుణరాజుపై యల్లుగంగరాజు తిరుగుఁబాటు చేయఁగా నంబదేవుఁ డల్లుగంగని నోడించుట కేమికారణము? ఇందులకు జవా బిప్పుడు పరిష్కృతమగు శాసనమునందే కనుపించుచున్నది. ఇందు 'గంగయసాహిణి సర్వస్వబందికాఱ' యన్న బిరు దొక్కటి జగతాపు గంగరాజున కున్నట్లున్నది. అనఁగా నతఁడు గంగయ సాహిణి సర్వస్వమును చూఱగొనెనని తెల్పుచున్నది. కాని ఇది యసంగతము. గంగయసాహిణి క్రీ. శ. ౧౨౫౦ సం. ప్రాంతమున నుండెను. జగతాపు గంగయదేవచోళమహారా జన్ననో క్రీ. శ. ౧౩౨౩ సం.మునందు తటాకప్రతిష్ఠ చేసెను. కావున వారు సమకాలికులుగారు. తత్కారణమున జగతాపు గంగయదేవుఁడు గంగయ సాహిణియొక్క సర్వస్వమును చూఱగొనుట పొసఁగదు. ఇందువలన 'గంగయసాహిణి సర్వస్వ బందికాఱ' యనునది జగతాపు గంగయదేవుని స్వార్జితమైన బిరుదు కాదనియు, వంశక్రమాగతమై యుండవలయుననియు తోఁచుచున్నది. ఈయూహ కాంధ్రవాఙ్మయ మూతయిచ్చుచున్నది. గంగయ సాహిణికి కవిబ్రహ్మ ఆంధ్రవాఙ్మయమున నమరత్వమును బ్రసాదించియున్నాడు. నిర్వచనోత్తరరామాయణమున గంగయసాహిణి ప్రస్తావము కలదు.

ఉ. రంగదుదారకీర్తియగు రక్కసగంగనఁ బెంజలంబుమై
భంగమొనర్చి మన్మజనపాలుఁడు బల్విడి నాఁచికొన్నరా
జ్యాంగములెల్ల నిచ్చి తనయాశ్రితవత్సలవృత్తి యేర్పడన్
గంగయసాహిణిం బదముఁ గైకొనఁబంచెఁ బరాక్రమోన్నతిన్
(నిర్వ. ౧: ౪౧)

అనఁగా రక్కస గంగన బలవంతముగ గంగయసాహిణి రాజ్యాంగములను నాఁచికొనఁగా నతఁడు మనుమజనపాలుని యాశ్రయించెను. మనుమనృపాలుఁడును తన యాశ్రితవత్సలవృత్తి యేర్పడునట్లుగా రక్కసగంగని భంగమొనర్చి అతఁడు నాఁచికొన్న రాజ్యాంగములను గైకొని గంగయసాహిణికి మరల నొసఁగి యతనిఁ దనపదమును జేకొనఁబంపెను. ఈపద్యమువలన రక్కసగంగఁ డను నొకఁడు గంగయసాహిణిని పరాభూతునిఁ జేసి యతని రాజ్యాంగముల నపహరించెనని తెలియుచున్నది. గంగయసాహిణికి రక్కస గంగఁడను ప్రబలశత్రు వొకఁ డున్నట్లాతని శాసనమువలనఁ దెలియుచున్నది.౧౧ రక్కసగంగఁడు గంగయసాహిణిపైఁ బొందిన విజయమునకును జగతాపు గంగరాజు వహించిన 'గంగయసాహిణి సర్వస్వబందికాఱ' యను బిరుదునకు నేదేనియు సంబంధము కలదో విచారించవలయును.

తిక్కనామాత్యునివాక్సుధాలహరియందోలలాడిన రక్కసగంగఁడు రాయలసీమలోని సిద్ధవటప్రాంతదేశమును కలుకడ పురవరాధీశ్వరుఁడగు రాయదేవమహారాజుక్రింద సామంతుఁడుగ నేలుచుండిన ప్రభువు. ఇతని శాసనములు కొన్ని కాన్పించుచున్నవి. క్రీ. శ. ౧౨౫౪ నాటి

౧౦. ARE. ౨౬౭ ౧౯౦౫

౧౧. A R E. ౨౩౧ ౧౯౦౫.

శాసన మొకటి సిద్ధవట సమీపమున జోతి గ్రామమున నున్నది.౧౨ గంగయసాహిణి కడపసమీపమున నుండు వల్లూరిపట్టణమున రాజ్యము సల్పుచుండుటచే తన పొరుగున నున్న రక్కసగంగనితో నతనికి ఘర్షణ జనించి యుద్ధము కొనసాగియుండును.

గంగయసాహిణిపై రక్కసగంగఁడు పడసిన విజయమునకును, జగతాపు గంగయదేవ చోళుని "గంగయసాహిణి సర్వస్వ బందికాఱ" బిరుదునకును సంబంధముండుట నిశ్చయము. ఆసంబంధ మిట్టిది యని నిర్ధారించి చెప్పుటకు తగు సాధనములు కానరావు. ఈ రక్కసగంగఁడే వంశమువాఁ డైనదియును తెలిసికొను నెర వగపడదు. కాని యీ సందర్భమునఁ దెలుపవలసిన విషయములు కొన్ని కలవు.

(౧) రక్కసగంగ యనుపేరు పాశ్చాత్యగంగవంశజులయందు తఱచుగ కానవచ్చుచున్నది. నామసామ్యమునుఁబట్టి మనరక్కసగంగఁడు గంగవంశజుఁ డని యన్నను అనవచ్చును. ఈ యూహకు విరోధకారణము లగపడువఱకును అట్లు తలఁచుటవలన కలుగుబాధక మేమియు లేదు.

(౨) గంగరాజుల ధ్వజమగుసింధురమును తన ధ్వజముగ జగతాపుగంగయదేవచోళుడు స్వీకరించెను. దీనివలన అతనికి పాశ్చాత్య గంగరాజులతో సంబంధ ముండుట నిశ్చయము.

(3) రక్కసగంగని విజయసూచకపు బిరుదును జగతాపుగంగయ దేవచోళుఁడు ధరించెను.

పై మూడువిషయములను చక్కగా మననము చేసి చూడగా రక్కసగంగనితో జగతాపుగంగయదేవచోళునికి బాంధవ్యముండెనని తోఁచుచున్నది. ప్రాయశః, జగతాపుగంగయదేవుని తల్లియగు గంగాదేవి రక్కసగంగనిపుత్త్రికయై యుండవచ్చును. మాతామహునిధ్వజమును, బిరుదావళియు మనుమని జెందుటయందు అసహజ మేమియునులేదు. ఇట్టి బాంధవ్యమువల్లనే రక్కసగంగని శత్రువగు కాయస్థరాజులతో అల్లుగంగనికి వైరము పొడమియుండెను. కావుననే యంబదేవుఁడు అల్లుగంగనిపై నెత్తిపోయి వానిని నోడించియుండును. అంబదేవుని సహాయమువలన యల్లుగంగనిలిరుసబాటు నణఁగఁగొట్టినను రామదేవరాయలు రాయలసీమపై దనయధికారమును చాల కాలము నిర్వహించుకొనలేకపోయెను. ఇందుకు కారణములు మహమ్మదీయ దండయాత్రలును, అంబదేవునిమరణమును. మహమ్మదీయుల దండయాత్రవలన కలిగినరాజ్యవిప్లవము సేవుణరాజుయొక్క సామంతులనేకులను స్వాతంత్ర్యస్థాపనకు పురికొల్పెను. అప్పుడల్లుగంగఁడో, లేక తత్పుత్త్రుఁడగు గంగయదేవచోళుఁడో మఱల విజృంభించి స్వతంత్రులైరి. ఈ సందర్భముననే వారికి సేవుణసైన్యములతోడి పోరాటమును వానిపై విజయమును చేకూరెను.

వీరలసంబంధబాంధవ్యము లీ క్రిందివిధమునఁ దెలుపవచ్చును.

| తెలుఁగుచోళులు | గంగరాజులు | కాయస్థులు |
|---|---|---|
| మధురాంతక దేవచోళ మహారాజు | | |
| \| | | |
| జగతాపుదండిదేవచోళ మహారాజు (క్రీ. శ. ౧౨౧౫) | | |
| ⋮ | | vs |
| | రక్కసగంగఁడు క్రీ. శ. ౧౨౮౪ | × గంగయసాహిణి (C. క్రీ. శ. ౧౨౪౯-౧౨౫౪) |
| అల్లుగంగరాజు = m. = గంగమహాదేవి (?) | | |
| ⋮ | | vs తమ్ముఁడగు × అంబదేవుఁడు (C. క్రీ. శ. ౧౨౭౨-౧౩౦౦) |
| జగతాపుగంగయదేవ చోళుఁడు (క్రీ. శ. ౧౩౨౩) | | |

జగతాపుగంగయదేవుఁడు తారొక్కన్న ఇతరశత్రువులలో ఒఱటరభీముఁడును, జోగులకుమారుఁడును నీశాసనమునఁ బేర్కొనఁబడియున్నారు. ఒరటరభీముని ఇతఁడు చంపెను. మఱియు గంగయదేవ చోళునిచే యుద్ధమున మడిసి వీరస్వర్గము చూఱగొన్న మల్లావనీశుఁడెవ్వరైనదియు తెలియదు.

ఇంతవఱకును నీశాసనమును చారిత్రకదృష్టితో పరామర్శించితిమి. ఇక భాషావిషయచర్చ యించుక కలదు. ఇందలి తెలుఁగుమాటలలో కొన్నిటినిగూర్చి చెప్పవలసిన విషయము కొంతయున్నది.

౧. 'అల్లు':—జగతాపుగంగయదేవచోళునితండ్రిపేరు 'అల్లు గంగరాజ'నియున్నది. (పం: ౩౫) అంబదేవుని త్రిపురాంతక శాసనమునందుకూడ ఇతనిపేరు అల్లుగంగరాజనియే వ్రాయఁబడియున్నది. 'అల్లు' శబ్దమునకు 'అల్లుఁడు' అని యర్థమునుఁ జెప్పియున్నాము. ఈ శబ్దము నెల్లూరిశాసనములలోను గానవచ్చుచున్నది. అందు "అల్లు తిక్క"యనియు, 'అల్లున్ దిక్క'యనియు కలదు. ఇచ్చట 'అల్లు' 'అల్లున్' శబ్దములకు అల్లుఁడనియే యర్థము. ఇది 'అల్లుఁడు' శబ్దమునకు కడుప్రాచీనరూపము. ఇటువంటిప్రాచీనరూపము లింకను కొన్ని కలవు. మగ, పగ ఇత్యాదులు. ఇవి వ్యాకర్తలు విభక్తిప్రత్యయముల నేర్పఱచుటకు పూర్వ ముండినరూపములు. బహువచనమున నివి 'అల్లురు', 'పగఱు', 'మగలు' అగును. విభక్తిప్రత్యయము లేర్పఱుచఁబడినపిమ్మట 'అల్లుఁడు', 'మగఁడు', అను రూపములను బొంది బహువచనమున "అల్లుండ్రు", 'మగండ్రు' ఆయెను. 'పగ' కు 'పగఁడు' అను రూపము రాలేదు. 'పగవాఁడు' అయినది. ఈ రూపము, 'పగ'శబ్దమునకు 'వాఁడు' అను ప్రథమపురుషైకవచన సర్వ

౧౨. A R E ౫౬౩ ౧౯౧౫,

నామపదమును చేర్చుటచే నేర్పడినది. మ-రా-శ్రీ డాక్టరు చి. నారాయణరావుగారు 'అల్లుఁడు' అను పదమునుగూర్చి యిట్లు వ్రాసిరి.

"అల్లుఁడు అను పదమునకు 'అల్లువాఁడు' యని యర్థము చెప్పుదురు ; కాని అది కన్నడములోని "అళియ" శబ్దముతో సంబంధించినది. 'అలియఁడు' అనురూపము తెనుఁగున నెన్నఁడైన నుండెనేమో కాని, యిది 'అల్లుఁడు' అనురూపముతోనే తెలుఁగుగ్రంథములయందు కాన్పించుచున్నది. అల్లువాఁడు అనురూపము తప్పువ్యుత్పత్తి వలన నేర్పడిన కృతకరూపము; అది లోకములో నెక్కడను వినఁబడదు."౧౩

అల్లుఁడు శబ్దమునకును 'అళియ' శబ్దమునకును సంబంధ ముండవచ్చును. రెండును ఏకధాతుజనితములే. కాని 'అలియఁడు' అను రూపము తెనుఁగున నెన్నడును ఉండియుండదు. ఏలన ఏకధాతు జనితము లనుటచేత 'అలియ', అల్లుఁడు' శబ్దములకు సోదరత్వము కలదు కాని యైక్యము లేదు. తెనుఁగున ఈధాతువు 'అల్లు' ఆయెను. కన్నడమున 'అలియ' ఆయెను. మఱియు 'అల్లువాఁడు' అనునది కృతకరూపమని త్రోసిపుచ్చఁ దగదు. ఇది లోకములో నెక్కడను వినఁబడ దనుటకును వీలుగాదు. ఇప్పుడు ఆరూపము లేకపోవచ్చును. అంతమాత్రముచే పూర్వ మా రూపము లేదని తీర్మానించుటకు ఎట్లు వీలగును ? ప్రాచీనగ్రంథములయందు 'అల్లువాఁడు' అను రూప మగపడుచున్నది. వ్యవహారమున నుండెనో లేదో తెలుసుకొనుటకు సాధనము లేవిగలవు ? 'గొల్ల' 'మాల' శబ్దములనుగూర్చి యించుక చింతింపుము. వీనికి 'గొల్ల వాఁడు' 'మాలవాఁడు', 'గొల్లఁడు' 'మాలఁడు' అను రూపములు కలవు. 'గొల్లఁడు' అనురూపము "గొల్లండును గొల్లఁడౌనె" యను ప్రయోగమువల్లను, 'మాలఁడు' అనురూపము 'మాలనిశాక' యను భారతప్రయోగమువలనను ప్రాచీనము లనుట నిశ్చయము. కావున ఈ పదములకు వాఙ్మయమున మూడురూపములు గాన్పించుచున్నవి.

| | | | |
|---|---|---|---|
| ఏక వచనము | మాల | మాలఁడు | మాలవాఁడు |
| బహు ,, | మాలలు | మాలంద్రు | మాలవాండ్రు |
| ఏక ,, | గొల్ల | గొల్లఁడు | గొల్ల వాఁడు |
| బహు ,, | గొల్లలు | గొల్లంద్రు | గొల్లవాండ్రు. |

ఈ పదములవలెనే 'అల్లు' శబ్దమునకును మూడు రూపము లున్నవి.

| | | | |
|---|---|---|---|
| ఏక వచనము | అల్లు | అల్లుఁడు | అల్లువాఁడు |
| బహు ,, | అల్లురు | అల్లుంద్రు | అల్లువాండ్రు. |

'మాలవాఁడు' 'గొల్ల వాఁడు' అనురూపములు కృతకరూపము లని ఎవ్వరును అనరుగదా. అవి యింకను జీవదశయం దున్నవి. 'అల్లువాఁడు' వాడుకయందు లేకున్నను 'మాలవాఁడు', 'గొల్లవాఁడు' ఎట్లు కృతకరూపములు కావో, అదియును అట్లే కృతకరూపము కాదు-కాఁజాలదు.

౨. ఎసను ఈశబ్దము 'ఎసఁగు' అను సార్థబిందుకముగ నిఘంటువులయందు గాన్పించుచున్నది. దీనికి ఆధారముగ శబ్దరత్నాకరమునందును, సూర్యారాయమునందును ౧౪ ప్రాచీన గ్రంథముల నుండి పెక్కుపద్యము లుదాహరింపఁబడినవి. కాని యందొకదాని యందును ఈమాట ప్రాసస్థలము కాకపోవుటచే వానిమూలమున నది యర్థబిందుసహితమా కాదా యన్న సందేహము నివృత్తికాలేదు. ఈ శాసనమునం దీపదము అర్ధబిందు విరహితముగాఁ గన్పించుచున్నది. "ఏనుక తలలలో నెసఁగిన ముత్తియంబులు" పం. ౮౨. అర్థబిందువు కలదనుటకు సాధనము లేనైనఁ గలవా ?

3. ఏనుక:—ఈరూపము నిఘంటువులయందు లేదు. 'ఏనిక' అనురూపమే వానియందు గాన్పించుచున్నది. శ్రీ రామయ్యపంతులు గారు 'ఏనుక' అన్న శాసనపాఠముక్రింద నొక యధోజ్ఞాపికయందు (పద్యమంజరిపుట. ౯౧) 'ఏనిక' అని చదువవలయునని హెచ్చరిక చేసినారు. ఇందువల్ల 'ఏనుక' యనురూపము తప్పని వా రెంచినట్లు తోఁచుచున్నది. కాని యట్లనితలఁచుట కాధార మేదియైనఁ గలదా ! ఈరూపము సాధువు కావచ్చును. ఏనుకాళ్లుగల జంతువు 'ఏనుక' యగును. తొండముతో జేరి యేనుగకు అయిదుకాళ్లే.

ర. నెఱిక:—ఈపదము అకారాంతముగ శబ్దరత్నాకరమున గ్రహింపఁబడినది. ఉదాహృత పద్యములవల్ల 'నెఱిక' యే దీని సరియైన రూపమని తెలియదు. 'నెఱికొ'యన 'పైఁటపావడ.'

౫. బసవశంకర:—(పం. ౩౭) ఇంగలి 'బసవ' శబ్దస్వరూపమునుగూర్చి వాదోపవాదములు కలవు. కొన్ని శాసనములయందిది "బసువ" యని కన్పించుచున్నది. శ్రీజయంతి రామయ్యపంతులు వారు ఇది "బసవ" యని యుండవలయు ననిరి. నైషధమును పరిష్కరించుచు వ్రాతప్రతులయందు కొన్నిటియందు 'బసువ' అని యుండినను 'బసవ' యని కీ. శే. కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిలవారు దిద్దిరి. రావుసాహెబు శ్రీ. గిడుగు వేంకట రామమూర్తి పంతులవారు ఈ దిద్దుబాటు సంగీకరింపక యట్టిదిద్దుబాటే యాధారము ననుసరించి చేయఁబడెనో యెఱుఁగఁగోరిరి. ఇందుమీఁద బ్ర. శ్రీ. వేటూరు ప్రభాకర శాస్త్రిలవారు సోమనాథ భాష్యానుసారము 'బసవ' 'బసువ' శబ్దములు రెండును సాధువులని యెచ్చటనో వ్రాసినట్లు స్మరణయం దున్నది .సోమనాథభాష్యమున నిట్లున్నది: "శో బసవ ఇతి. ఇదానీం కలియుగే శివభక్తి ముద్ధర్తుం బసవనామకత్వేన వాలి దేవేన వృషభ యేవ జాత : వృషభస్య

౧౩. ఆంధ్రభాషాచరిత్రము, పుట ౫౫౪.

౧౪. సూర్యారాయ మునకును శాసనపద్యమంజరికిని సంపాదకుఁ డొక్కరే శ్రీ జయంతి రామయ్యపంతులుగారు. అయినను పంతులుగారు సూర్యారాయమున 'ఎసఁగ' సార్థబిందుకముగను, పద్యమంజరియందు (పుట. ౯౧) అర్థబిందు రహితముగ 'ఎసగిన' అనియు ముద్రింపించిరి. అధోజ్ఞాపికలు పద్యమంజరియందు వెల్లి కొల్లలుగ నున్నను అవసరమగు నీస్థలమునం దధోజ్ఞాపిక లేకపోవుట చింతనీయము.

## రత్నములు పొదిగిన ఉంగరములు



# సురాజ్ మల్స్

స్థాపితము (18౯౮)

**313, ఎస్ప్లనేడు : మద్రాసు.**

కస్మాత్ కారణాత్ ఆసీదితి. వృకారస్య బకారాదేశో భవతి. వబ యోరభేదఇతి. శషోస్సఇతి సూత్రాత్ వ.కారస్య సకారాదేశో భవతి. ఏతద్వ్యుత్పత్తిరతద్భవాత్ "బసవ" ఇతి నామ వక్ష్యతే!

—సోమనాథభాష్యము. పుటలు ౧-౨.

'బసవ' రూపసాధుత్వాసాధుత్వచర్చ మా కందు కాన రాలేదు. అది యెట్లున్నను సోమనాథుఁడు 'బసవ' శబ్దసాధుత్వమును స్థిరీకరించినాడు. కావున ఈ శాసనములోని 'బసవ'ను 'బసువ' యని దిద్దవలసిన యవసరము లేదు.

౬. బెళసు:—"తెలుపెక్కంగఅవోవ బెళగినపునుక మించిన వెండికోరగాంజేతంబట్టి" (పం. ౭౮-౮౧) ఇచ్చట బెళగుశబ్దమున కర్థమేమి? ఈ పదము శబ్దరత్నాకరమునందు లేదు. 'బెళఁకు' 'బెళఁగు', 'బెళుకు' అనుశబ్దములు కలవు. ఇందు మొదటిదానికి 'చలింపు', 'ఒరయు', 'చలనము' అనియు, రెండవదానికి 'బెడఁగు' యొక్క రూపాంతరమనియు, మూడవదానికి 'తళతళమని ప్రకాశించు' అనియు వివరణములు వ్రాయఁబడియున్నవి. ఇచ్చట 'బెళసు'కు పై అర్థములం దేదియు సరిపడునట్లు తోఁచదు. ఏలన, 'బెళగిన' యనునది క్రియాజనితవిశేషణపదము. అది తత్పూర్వపదము లగు "తెలుపెక్కంగఅవోవ"తోఁగూడి పునుకయొక్క గుణమును దెలుపుచున్నది. 'పునుక' యెట్టిదనగా తెల్లదనము అతిశయించుటకై మలినము పోవునట్లు 'బెళగినది.' ఇచ్చటి సందర్భానుసారము 'బెళగిన' యన్నమాటకు 'కడిగిన','తోమిన' యనియో లేక ఇట్టియర్థము మతియొకటియో చెప్పుకొనవలయును. దీనినిశ్చయార్థమును గ్రహించుటకు సాధ్యమగునేమో చూతము. 'బెళగు', 'వెళగు'యొక్క రూపాంతరము. తెలుఁగునందు ఇతరద్రావిడభాషలయందువలె వబలు తఱచుగ మారుచుండుట యందఱెఱింగినవిషయమే. 'వెళ్' అనుధాతువునకు 'అసు' ప్రత్యయము జేర్పఁగా (వెళ్ + అసు) వెళసుఅనురూపమేర్పడినది. 'వెళ్' అనఁగా తెల్లఁదనము. ఈ ధాతువునుండియే "వెల్ల" అను విశేషణమును 'వెలచు' అనుక్రియయు యేర్పడెను. బెళగిన(వెళగిన) అనుమాటకు 'తెల్లఁజేయఁబడిన' అను నర్థము చెప్పవలయును.

౭. మాంటు:—(పం. ౫౮) (పర్యాయము, తడవ, మాఱు.) శబ్దరత్నాకరమున 'మాఁటు' అని అర్ధబిందువుతోఁగూడ నొకపదమున్నది. "తసులముగోను", 'తసులము', 'మాఱు' అనియర్థము లగపడుచున్నవి. ఇం దావృత్తిని దెలియఁజేయునదేదియు లేదు. 'మాటు' అని యర్ధబిందురహితముగా నొకపదమున్నది. దీనికి 'మఱుగుపఱుచు,' 'మఱుఁగు,' 'వేటకానిదాగుడుపల్లము' అను మూడర్థములున్నట్లు వ్రాయఁబడియున్నది. ఇందును ఆవృత్తిని దెలుపున దేదియుఁగాన రాదు. కాని 'మాటికి' అని యర్ధబిందువులేని యొకమాట కలదు. దీని క్రింద 'ముహుర్ముహుః,' 'అడుఁగడుగునకు' అని రెండర్థములు వ్రాయఁబడియున్నది. ఆలోచించిచూడగా శబ్దరత్నాకరకారునికి 'మాఁటు' అన్నమాటకు ఆవృత్తి యనునర్థము తెలియనట్లు న్నది. ఇది సర్వసామాన్యముగ ఇప్పటికిని వాడుకయందుండుమాట 'రెండుమాట్లు,' 'పదిమాట్లు,' 'ఇరువదియొక్కమాంటు' అని మన శాసనమునం దున్నది.

౮. మించి:—(పం. ౭౦) అతిశయించి, ప్రకాశించి.

౯. ముంజికము:—(పం. ౭౭.) ఈపదము శబ్దరత్నాకరమున లేదు. సందర్భానుసారముగ దీనికి 'విందు' అని యర్థమని తోఁచుచున్నది.

౧౦. వెలఱువాఱు:— (పం. ౫౧-౨) శబ్దరత్నాకరమున 'వెలరు' అని రేఫసంయుక్తముగ నున్నది. ఇందు శకటరేఫముతోఁ గూడియున్నది. ఏది సరియైనరూపమో తెలియదు.

౧౧. హేరి:—(పం. ౭౦) ఈశబ్దము నిఘంటువులలో లేదు. బ్ర. శ్రీ. వేటూరు ప్రభాకర శాస్త్రులవారిచేఁ బ్రకటింపఁబడిన చాటుపద్యమణిమంజరియందు (రెండవభాగము పుట. ౫౮) 'చారుచే' యను పాఠాంతరము గానవచ్చుచున్నది. కాని ఇది శాసనపాఠము గాదు. 'హేరి' అన్నమాట కర్థము తెలియదు.

౧౨. వెంగిగళింగ. ఇట్లు ప్రథమాంతముల మీద సరళాదేశము శాసనములయందు సామాన్యముగఁ గానవచ్చుచున్నది.

## సాంఘిక విషయములు:—

శాసనములోని పద్యములు క్రీ. శ. ౧౮-వ శతాబ్దారంభము నందలి పశ్చిమాంధ్రుల యాచార వ్యవహారముల కొంత తెలియఁజేయుచున్నది.

## వీ ర స్వ ర్గ ము

యుద్ధమునందు మృతినొందిన శూరులు ఇంద్రలోక ప్రాప్తినంది స్వర్గసుఖముల ననుభవింతురను నమ్మకము ప్రాచీన కాలమున నుండియు భారతీయుల హృదయమున నాటుకొనియున్నది. ఆనమ్మకము ఇప్పటికిని సంపూర్ణముగ నశింపలేదు. కాని ౧౩, ౧౪-వ శతాబ్దముల యందు దక్షిణదేశమున ఈనమ్మకము గాఢతమమై యుండెను. కావున అప్పటివారు కయ్యమునకు వెనుదీసెడువారు గారు. ఈ నమ్మకము వారి హృదయమున గాఢముగ నాటుకొని యుండుటవలననే వారు చావునకుఁ దెగించి తురకలతోఁ బోరి యాత్మ స్వాతంత్ర్యము నిలుపుకొనిరి.

## స హ గ మ న ము

ఈశాసనమున జగతాపుగంగనిచే మడిసిన మల్లావనీశుఁడు వీర స్వర్గమునకు పోఁగా అతనిభార్య అగ్నిపథ గామినియై యతనివెంట నంటి స్వర్గమున నాతనిగూడినట్లు చెప్పఁబడియున్నది. (అగ్నిపథ గామినియన నగ్నిప్రవేశము జేసి పతి ననుగమించినది). మల్లావనీశునిభార్య సతి నిశ్చయముగ నగ్నిపథగామినియాయెనా యను విషయమునుగూర్చి సంశయింప నవసరములేదు. సహగమన మాకాలమున సర్వసామాన్యము. విజయనగరరాయలకాలమున సహగమనములను జూచిన పాశ్చాత్యు

లనేకు లీ ఘోరాచారమును వర్ణించియున్నారు. కాని, విజయనగర స్థాపనకుపూర్వమే ఈ గూచారము దేశమున వ్యాపించియుండెనని మనశాసనమువలనఁ దెలియుచున్నది.

## పెండ్లి విందులు

యుద్ధవర్ణనావ్యాజమున శాసనకవి యప్పటి పెండ్లిసవళ్లను గొన్నింటిని సంగ్రహముగ వర్ణించియున్నాడు. వివాహసమయముల యందు విందొనర్చుటయు, విందుభోజనమునకు బంధుమిత్రుల నాహ్వానించుటయు ఇప్పటికి నప్పటికి సామాన్యమే. ఇంతేకాదు. ఇప్పటి వలెనే యప్పుడును సుమంగలులు వెండిగిన్నెలయందు కుంకుమాక్షతలను గొని యాహ్వానింపఁబోవుట యాచారము. ఈ మర్యాద లింకను మాఱలేదు. ఇఁకమీఁదట మాఱునేమో! శాసనకవి యాకాలపుస్త్రీల దుస్తులనుగూడ వర్ణించియున్నాడు. పిశాచవధూటి "సెటికె"ను ధరించెనట. "సెటికె"యన పైటపావడ యనిచెప్పియున్నారుగదా? ఆకాలమున నిప్పటివలెగాక పశ్చిమాంధ్రస్త్రీలు పావడలుగట్టుచుండిరా? వేశ్యాస్త్రీలు, అంతఃపురస్త్రీలును పావడలను ధరించుచుండిరనుటకు గొంతయాధార మున్నది. ఇది సామాన్యస్త్రీలయందును గలదా? మఱియు 'దానన ముసుంగుపెట్టి' ఇటిప్పయనుటచే యుత్తరహిందూస్థాన స్త్రీలవలెనే అప్పటి పశ్చిమాంధ్రస్త్రీలు పైకొంగును నెత్తిపైని ముసుగుగ నైచుకొనుచుండినట్లు తోఁచుచున్నది. ప్రతాపరుద్రునికాలమున నోరుగంటియందు స్త్రీలు ముసుఁగువైచుకొనుచుండి రనుటకు వల్లభరాయని క్రీడాభిరామములోని

"ముసుగు పెట్టిననేమి ముత్యాల కమ్మల క్రొమ్మించుఁదళుకులు గులుకరించె" అను సీసపాదము సాక్ష్యముఁ బల్కుచున్నది. అట్టి వాడుక ఇప్పుడాంధ్రదేశమున— తురకరాజ్యమగు హైదరాబాదునందు దప్ప—గానరాదు. ఆంధ్రస్త్రీలు ముసుఁగుల నెప్పుడు వర్జించిరి? 'బిబ్బిలకు ముసుంగు లబ్బఁజేసె' అని రామరాజభూషణుఁడు యవనస్త్రీల నించుకంత యవహేలనఁ జేసినాఁడు. అందువల్ల రామరాజభూషణుని కాలమున నాంధ్రనారీమణులు ముసుఁగులు వైచుకొనువారుకారని యూహించవచ్చును. తురకల యడావడి హెచ్చుగ నుండిన యాకాలములో ఆంధ్రస్త్రీలు ఉన్న ముసుఁగుల నేల తీసివేసిరో?

ఈశాసన పరిష్కార సందర్భమున మేము మ.రా.శ్రీ ఉ-పి. ఆర్. కృష్ణమాచార్యులు, మల్లంపల్లి సోమశేఖర శర్మగార్ల వల్ల కొంత సహాయము వడసితిమి వారికి మాకృతజ్ఞతాపూర్వక వందనములను సమర్పించుచున్నాము.

# శాసనమూలము

మొదటి ప్రక్క



సూర్యుఁడు     వృషభము     చంద్రుఁడు

సంగ్రహని వస్తువును
అరచేత ధరించిన
మృంజేయి.

౧ స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౨౪౪ అగు నేంటి
౨ దుందుభిసంవత్సర మాఘ సు[1] ౧ శనివా
౩ రమునాండు స్వస్తి యమగ్నదమహీ
౪ పాలమౌలి మాలాలాలిత లలితచరణార
౫ వింద సకలదిగంతావేల్లిత కీర్తివల్లీప్రరోహ
౬ ణ కంఠ[2] నందగిరినాథ రక్షితానాథ బలి
౭ కులాదిత్య పరాక్రమ విక్రమాదిత్య
౮ అజమయూర[సిం]త్థుర[3]ధ్వజ కులా
౯ న్వయ విదితసకలశాస్త్రాన్వయ ఒ
౧౦ అయూరి పురవరాధీశ్వర చతు
౧౧ ర్విధ కామినీజన రతీశ్వర దానవినోద
౧౨ సముదిత సత్పాత్ర కాశ్యపగోత్ర దిన
౧౩ కరకుల కుశేశయ వికాసన ప్రభా
౧౪ కర సుగుణమణిగణ రత్నాకర సేవ
౧౫ ణసేనా దుగ్ధాంభోనిధాన పరిమథ
౧౬ నలబ్ధలక్ష్మీ దక్షిణభుజ మంధర[4]
౧౭ విలాస విభవ భోగపురందర నిసి
౧౮ తాసి కులిశనిపతన శకలిత[జో]గుల
౧౯ కుమార మహామహీధర ప్రతిబల
౨౦ దావపావక ధారాథ ? ర[5] విశదతర
౨౧ నయనచంద్రికా పరిజనచిత్తకైరవ
౨౨ రణరంగభైరవబ ? అటర భీమనిశిరః
౨౩ కందుకోత్పాటన సంశోభిత తత్సంత
౨౪ తిలతాప్రరోహ వరాశ్వారోహ గం
౨౫ డపెండార గంగయ సాహిణీసర్వస్వ
౨౬ బందికాఱ మామనంకకాఱ విరోధి
౨౭ [మ]ండళిక కాలదండ చలమర్తిగండ ఏకా
౨౮ ంగవీర ధర్మావతార మూఱురాయ అ
౨౯ సురనారాయణ ప్రతాపతపనోత్త
౩౦ రాయణ సంగడిద మండళికరథ ?
౩౧ [6]కావ సతతాభ్యర్చిత భూదేవ మండ

---

1 'షు' అని చదువవలయును. 2 'కంద' అని చదువవలయును. 3 'సింధుర' అని చదువవలయును. 4 'మందర' అని చదువవలయును. 5 ధారాధర, అని చదువవలయును. 6 ఒక అక్షరము మాసిపోయినది. 'మె' లేక 'యొ' అయి యుండవచ్చును.

౩౨ [ళి]క బసవశంకర ప్రణతాభయం

౩౩ [కర] అధికతరప్రతాపరాయదిగస్థాప

౩౪ - -[గ]యదేవ చోళమహారాజలు[1] త

౩౫ మతండ్రి అల్లుగంగరాజు తమతల్లి గం

౩౬ గాదేవింగారిపేరను గంగసముద్ర

౩౭ ము అని తటాకప్రతిష్ఠ నేసి నిలిపిన

౩౮ శాసనము మంగళమహాశ్రీ

౩౯ శ్రీ శ్రీ

## రెండవ ప్రక్క

౪౦ ఇలజగతాపిఖస్థ

౪౧ మునస్లీగినవీరుని

౪౨ రంభవుచ్చుకొంద

౪౩ లంచినందూపృర్ణ

౪౪ దిక్కునఘ్రి[2]తా

౪౫ చిగిసుక్కనందు

౪౬ మ్మైనంతలోపల

౪౭ ంజనుదెంచ్చెవా

౪౮ [ని]కులభామిని

౪౯ [య]గ్నిపథంబునం

౫౦ [ద]నిష్ఫలతకు

౫౧ రంభయున్వెల

౫౨ ఉవాటినవ్వి

౫౩ రిదోడికామినులు॥

---

౫౪ గురుమరణోచితం

౫౫ బయినకోపమునం

౫౬ జమదజ్ఞజుండు[3]ము

౫౭ న్నిరువదియొక్క

౫౮ మాంటుధర

౫౯ ణీశులనెల్లనుంజ

౬౦ ంపియమ్మహాపు

౬౧ రుషుండుమర్త్యా

౬౨ లోకమునం

౬౩ బుట్టివధింపంగం

౬౪ బాపమంచు విస్త

౬౫ రముగందోలెంగా

౬౬ కజగతాపిదలంచి

౬౭ ననాండచంపండే॥

---

౬౮ పన్నితురంగమం

౬౯ బునకుంబక్కెరవె

౭౦ ట్టినవార్తహేరిచే

౭౧ విన్నభయంబు

౭౨ నంగలంగెవీస

౭౩ అనాండునుంజ

౭౪ క్రగొర్థమునుమ



---

1 'మహారాజులు' అని చదువవలయును.

2 'ఘృతాచి' అని చదువవలయును.

3 'జమదగ్నిజుండు' అనియుండవలెను.

మూఁడవ ప్రక్క

౭౫ తురగచర్మాంబునం
౭౬ మొప్పనెఱిక్కిగాంబసగర
౭౭ రించిదాననముసు
౭౮ ంగువెట్టి । తెలు పెక్కాంగ
౭౯ అవోవబెళగినపు
౮౦ నుకమించినవెండి
౮౧ కోరగాంజేతంబట్టి
౮౨ ఏనుకతలలలో
౮౩ నెసగినముత్తియ
౮౪ ంబులగుంకుమా
౮౫ క్షతంబులుగంబో
౮౬ సి । వేతాళఢాకినీ
౮౭ భూతంబులారమి
౮౮ కునుముంజికం
౮౯ బనికుడువంజెప్పె ।
౯౦ యొకపిశాచవ
౯౧ ధూటిదానుత్సహి
౯౨ ంచ్చెఛాయజగ
౯౩ తాషగంగభూ
౯౪ రమణుండాజి ।
౯౫ సమరంబెండ్లి[1] [కొ]
౯౬ డుకుమల్లానసీ
౯౭ శుంజెలంగిసు
౯౮ రకాంతతోంబెం
౯౯ డ్లిసేయునపుడు ।

---

౧౦౦ న్నియవడ్లె? క్కేలి
యి[*]మం
౧౦౧ థ్యనవెంగిగళిం
౧౦౨ గలాదిగానిన్నియు
౧౦౩ న్కొక్కనాండవిసె[నే]
౧౦౪ ఉవభీమన్రి[2]పా
౧౦౫ లుఢా[3]డికిని॥



---

1 ‘ బెండిలి ’ అని చదువవలయును.

2 ‘ నృపాలు ’ అని చదువవలయును.

3 ‘ దాడికిని ’ ’’

# నాలుగవ ప్రక్క

౧౦౬ తనదం
౧౦౭ ప్రష్టతుదవ
౧౦౮ సుంధ
౧౦౯ రమెల్ల
౧౧౦ ండాల్చి
౧౧౧ పెంపొ
౧౧౨ ందినవే
౧౧౩ [లు]పుం[బ]
౧౧౪ ందియొ
౧౧౫ ండె। వీ[పు].
౧౧౬ నందొక
౧౧౭ దెసవిశ్వవి
౧౧౮ శ్వంభర
౧౧౯ ంగరమ
౧౨౦ ర్థిండాల్చి
౧౨౧ వక
౧౨౨ మరుండొ
౧౨౩ ండె। వెల
౧౨౪ యంగం[ద]
౧౨౫ నవేయుద
౧౨౬ లలలోనె
౧౨౭ క్కటనిల [ధి?]
౧౨౮ లకొన్నఫ

౧౨౯ ణీంద్రుం
౧౩౦ డొండె। పొ
౧౩౧ దభాగ[ము]
౧౩౨ నభాంభా
౧౩౩ గమంత
౧౩౪ యునువ
౧౩౫ హించిన[ ]
౧౩౬ పనగేంద్రు
౧౩౭ ండొండె। నీ
౧౩౮ [వ]యొండె
౧౩౯ [ం]కాకనిభి[1]
౧౪౦ లథరాభా
౧౪౧ [ర]వహన[కే]
౧౪౨ లిసలు[పు]
౧౪౩ [మ]హి[త]
౧౪౪ భుజుం
౧౪౫ డు। జగము
౧౪౬ నందుగ[ల]
౧౪౭ ండెజగ[తా]
౧౪౮ పుగంగ[వి]
౧౪౯ క్రమవి[హ]
౧౫౦ ంగదీప్తిక
౧౫౧ [లి]పతంగ



---

1 'ంగాకనిభ' అని చదువవలయును.

# ★ సోమశేఖరశాస్త్రి ★

రాయసం వెంకటశివుడు

★

లోకమందలి సర్వ సామాన్య విషయములె నాకు సంతోషదాయకములు. నడచువారినయనము లాకర్షింపక దారిప్రక్కను బెరుఁగుచుండెడి తుమ్మచెట్టు తీయమామిడి కంటెను, గొబ్బిపూవు గులాబి కంటెను, నాకుఁ బ్రియతరము. మాపూర్వు లొకరు "వేపశతకము" వ్రాసి వేయి నూటపదారులు బహుమతి సందిరఁట. నిజ మారసినచో, నిత్యము మనకు వినవచ్చు సామాన్య జనుల సమాచారములె నవలల కంటె నద్భుతకథనము లగుచున్నవి!

౧

మొన్నటి సెలవుదినములు స్వస్థలమునఁ గడపుచుండఁగా, ఇరువదియేండ్లక్రిత మచటికిఁ గాపురము వచ్చిన సోమన్న యను నొక బీదబ్రాహ్మణునిసంగతి యాకస్మికముగ నాకు జ్ఞప్తికి వచ్చెను. వైదికమందుఁ గాని వ్యవహారకాండలోఁ గాని యాతని కంతగా ప్రజ్ఞ లేదు. క్రొత్తగ వచ్చిన తన కేమైన సాయము చేయుఁడని వేడుచుండువాఁడు. అతనిఁ జూచు కుతూహలమున నేనిపుడిలు వెదలితిని. పేరుగుఱుతులు చెప్పితిని గాని, వాని యునికియే యెవరు నెఱుంగరు! ఈనరాటవిలో వానిజాడ గానక నేను వెనుకకు మరలుచుండఁగా, ఒకపూర్వ పరిచితుఁ డగపడెను. కొంత తడవాతఁ డాలోచించి, "జ్ఞాపకమువచ్చినది! మీరడిగే సోమన్న యిపుడు భాగ్యవంతు డయిన సోమశేఖర శాస్త్రిమైనాఁడు! పెద్ద బజారు లోని పచ్చ మేడ వారిదే" అని నాకుఁ బ్రత్యుత్తర మిచ్చెను.

౨

ఉభయ కుశలోపరి: నా కోరిక మీఁద సోమశేఖరశాస్త్రి తన వృత్తాంత మిట్లు చెప్పెను. శాస్త్రి కథను శాస్త్రి నోటనే వినెదము:

"నేను పట్నం వచ్చిన కొత్తరికమందే తమరు గ్రామాంతరము దయచేశారు. ఈపట్నవాస కాపరమెట్లు గట్టెక్కునా అని బెంగపెట్టుకొనేవాణ్ని. అయినా దైవానుగ్రహంవల్లా, తమ బోటి గొప్పవాళ్ల ప్రాపకంవల్లా, క్రమేణా నాకు మంచి రోజులు సంక్రమించినవి. వుద్యోగం లేకున్న, వచ్చినమూడు మంత్రం ముక్కల వల్లనే పొట్ట పోసుకొని, పదివరహాల సొమ్ము వెనుక వేసుకున్నాను. ఈమేడ, పాతిక రూపాయిలు బాడుగ వచ్చే బజారులో కొట్లు, పది యకరాల మాగాణీ, చేతిలో తిరిగే యీ నాలుగు డబ్బులు,— ఇవన్నీ నాకష్టార్జితమే!

"ఈఆస్తి పలుకు బళ్లు నా కెట్లు వచ్చిన వనా మీప్రశ్న? మొదలు నా కింగ్లీషు రాదని, సంస్కృతం చదవలేదని, తమకు తెలియనే తెలుసును. చిన్ననాటి పననే మరచి పోయాను. సంధి మంత్రమైనా సరిగా రాక, సంసారం గడుపుకొందామని పుట్టెడాశతో పట్నం చేరాను. ఇటు లౌక్యానికీ అటు వైదీకానికీ చెడ్డ నన్నెవ రక్కడమాత్రం కనిపెట్టుతారు? అయినా చెప్ప వద్దూ, యిప్పటివలె గాక ఆ రోజులలో బ్రాహ్మణభక్తి యెక్కువగా వుండేది. కనుకనే నాకు వచ్చిన పుణ్యాహవాచన విఘ్నేశ్వర పూజలవల్లే రోజు గడచి పోయేది. యిప్పటివలె తెలుగు మీరని బ్రాహ్మలు కోమట్లు మొదలయినవాళ్లయిళ్లల్లో, శుభాశుభాలకు రోజూ నాలుగు శేర్ల బియ్యం, పావలా డబ్బులకు తక్కువ గాకుండా కళ్ల బడేవి. ఇందుకు వుపరిగా, ఏ సత్రంలోనో సమారాధనలోనో సుష్టుగా వేళకు భోజనం దొరికేది. ఏపెండ్లో, పేరంటమో యింటిదానికి కలిసి వచ్చేది. అవి పైగా మహారాజురోజులు, వస్తువులకు ధరలు వుండేవి. ప్రతినిత్యము మా యింటికి వచ్చిపడే బియ్యపు రాసులు, కాయ గూరలు, బీరు పోకుండా, బజారుధరల కమ్మివేసి, సోమిదేమమ్మ సొమ్ము చేసేది!

3

"సొమ్ముతోనే గదా సర్వం వున్నది. కనుకనే ఆ రోజులలో, మారుమూల చుట్టాలకు కూడా సోమన్న ఆప్త బంధువై పోయాడు! స్వశాఖ వాళ్లకేకాదు, వైదీక బృందాని కంతా అతడు అండగా వున్నాడని అందరు అనుకునేవారు. ఇంతలో భూములకు ధరలు పడిపోవడం బ్రాహ్మణాళ్లకు వుద్యోగాలు బందు గావడం, తటస్థ మయినది. మెట్టిక్షేపను మెట్టు దాటనివాళ్లు

దాటినవాళ్లు, తండోపతండాలుగా వచ్చి బ్రాహ్మణపిల్లలు సోమన్న శరణు జొచ్చేవాళ్లు. 'ఆర్థికదుః స్థితి వస్తే వచ్చింది గాని, బ్రాహ్మణార్థాల కేమీ కరువు రాలేదర్రా!' అని అభయహస్త మిచ్చి, ప్రతిపిల్ల వాడికీ యేదో కాస్త ముట్టచెప్పించే వాణ్ని. మీ రను కొనే బ్రాహ్మణ నిరుద్యోగసమస్యకు నాకు తోచిన సమాధాన మిదే!

"ఇప్పుడు సోమన్న యేకాకి గాడు. తాను విద్య నేర్వనప్పటికీ, చుట్టూ చేరిన బ్రాహ్మణ పిల్ల కాయల కాతడు పెద్ద గురువే! తలిదండ్రులు చిన్నప్పుడు నాకు పెట్టిన పేరు 'సోమన్న' ముక్కు కోసిన మొగంలా గున్నదని చెప్పి చమత్కారి శిష్యు డొకడు, దర్జాకు తగ్గట్టుగా, 'సోమ శేఖర శాస్త్రి' అని నాకు నామకరణం చేశాడు! పాత పేరు పోతే పోయింది గాని, నోరు నిండిన చక్కని క్రొత్తదొకటి సంప్రాప్తి మయిందని సంతోషించాను. ఆ వేసంగిలో పెద్ద పద్దులు కొన్ని వసూలు చేసి, యీ పచ్చ మేడ వేశాను. నాకొత్త పేరు లోకుల నోళ్లలో కొంత రాపాడుతుందనే, వీధి నాపరాతి మీద 'సోమ శేఖర విలాసము' అని విలాసం చెక్కించాను!

౮

"నా తాహతుకు తగ్గ నిష్ఠాని యమా లిప్పు డేర్పరుచుకొన్నాను. నిత్య దేవ తార్చన తోపాటు, యిటీవల వైశ్వదేవం కూడా చేశాను. సన్న కారువాళ్ల యిళ్లకు పౌరోహిత్యానికి పోక, శిష్యులను పంపిస్తాను. గొప్ప వుద్యోగస్తులు, సంపన్న గృహస్థులును నారాకచేత తాము తరిస్తున్నామని తలస్తూ వుంటారు! ఆహితాగ్ని నవడంచేత పరులయింట విస్తరి వేయక నామర్యాద కాపాడు కొంటున్నాను. పట్నంలో యేవైదిక కార్యం జరిగినా సోమ శేఖరశాస్త్రికి పిలుపు రావలసినదే— అతనికి అథర్వంవల్లనో, అతని శిష్యుల వల్లనో, అదిసానుకూల పడవలసి నదే— మాంసము తిన్నప్పటికీ, ముడుసులు మెడకు తగిలించు కొందురా? బ్రాహ్మణ ద్వేషం పెచ్చు పెరిగి పూర్వాచారాలు పరిహాసంచేసే యీ పిదప రోజులలో నయినా, బాహాటంగా బ్రాహ్మణ కర్మ విడిచిపెట్టివేశినవా డెవడయ్యా? కాబట్టి లోకంలో వెల తగ్గిపోని మావైదికవృత్తి కెక్కడా నిత్యపంటే! గనుకనే యెంతకరువు కాలంలోనూ మాబోటి వాళ్లకు నిత్యకృత్యాల కెప్పుడూ లోటు లేదు— గుచ్చి గుచ్చి అడుగుతున్నారు గనుక గుట్టు చెపుతున్నాను— నా శిఫారసువల్ల నాలుగు డబ్బులు కళ్ల జూచిన బ్రాహ్మణముండావాడు, కృతజ్ఞతతో కొంచెమైనా నాచేత రాల్చ కుంటాడా? అంతేగాని, మీరు సూచించేటట్టుగా, పట్నంలోని బ్రాహ్మణార్థా లన్నీ నేను గుత్తకు పుచ్చుకొని, భాగంపెట్టుమని భోక్తల ముందు చెయి జాపుతా నను కోకండి! విప్రధనం విషంతో సమానం!

"ఈ ఐశ్వర్యం శాశ్వత మను కోక పేదబ్రాహ్మల కెన్ని విధాలనో సహాయం చేస్తున్నాను. నాఆశ్రితులలో మంత్రాలు వచ్చిన వాళ్లు ఉదయాస్తమానాలు మాయింటివద్ద బ్రహ్మచారులకు స్మార్తం పాఠం చెప్పవలె. నావద్దలోవుండే విద్యార్థులంతా ప్రాతఃకాలమే లేచి, స్నాన సంధ్యానుష్ఠానాలు నెరవేర్చవలెను. మాయిల్లు వేదఘోషతో మార్మోగుతూ వుంటుంది. సాధు వసు శ్రోత్రియు డసి శాస్త్రికి మంచిపేరు వచ్చిందే గాని, మీ రనుమానపడ్డట్లు, అతనిదగ్గరవుండే విద్యార్థులు ప్రొద్దస్నే కాఫీ యిడ్డెనలు కబళించి బ్రాహ్మణార్థాలకు తయారయ్యే మోసగాళ్లు గారు లేండి!

౯

"ఇంక నాకొమాళ్ల సంగతి పదే పదే మీ రెందు కడిగి, నన్ను బాధిస్తారు? నేనువద్దన్నను, ఆడది మొండిపట్టు పట్టడంచేతనే, పెద్దవాడు మాయ యింగ్లీషు యిస్కూల్లో ప్రవేశించాడు. సౌఖ్యాలు మరిగిన వాళ్లకు చదువు లంటుతవా? అటు గాడు, ప్రాజ్ఞత రాకముందే సినిమా నాటకాలు పట్టుకు తిరుగుతూ, సప్త వ్యసనాలలోను కూరుకు పోయ్యాడు! రెండో వాడైనా బాగుపడతాడేమో నని స్మార్తం చెప్పిస్తే, వీడికి వంటబట్టింది —బీడీలుతాగడం, బేస్తువేకాడడం! కల్పతరువువంటి శాస్త్రికడుపున కారుపిందెలు కాసినవే అని అందరూ మాను లంతా ఆ శ్వర్యపడుతున్నారు! ఎంతటి వాళ్లకూ, తీరని పూర్వఫలం అనుభవింపక గదా!

"ఈసోదె కేమిగాని, గొప్ప శ్రోత్రియులు మీరు రావడంచేత, మా గృహం పావన మయింది!

యానికి జ్ఞప్తికి వచ్చింది,— పెద్ద వకీళ్లయిన మీాసలపో నాకు కావలసి వచ్చినది" అనుచు శాస్త్రి లోపలికి నన్నుఁ గొనిపోయి బంగారు, వెండిసామాను లుండు పెద్దయినుప పెట్టె తాళముతీసి లోని కాగితములు రెండు చూపి, వాటిని గురించి నా యభిప్రాయ మడిగెను. ఏమున్నది? ఎక్కువ రాబడిపన్ను తప్పించు కొనుట, మారుటోరియంపాశము మెడకు రాకుండఁ జేసికొనుట,— వీనిని గురించియె వానిప్రశ్నములు! ఆ సందర్భమున సద్భావముతో నే జెప్పిన రహస్యాలోచనల విశేష ములు వెల్లడిచేయుట మాన్యాయ వాదుల మరియాదగాదు! దీనికేమి గాని, ఉన్నతపరీక్షలిచ్చిన యనుభ వముగల వకీలునైనను, నేఁటికిని నా నెలరాబడిసంఖ్య పదులస్థానము దాటలేదె! ఇంక నేను గూడఁబెట్టిన సొమ్ము గుండుసున్నయె! కాని, నిరక్షరకుక్షి యైన యీబాపన సోమన్న, యీ కొలఁదికాలము లోనె వేలకొలఁది విలువగల యా స్తిని సంపాదించి, సౌఖ్యసంపద లతోఁ దులతూగు చున్నాఁడే! ఇట్టి వైపరీత్యములు సంఘటించుచున్న మాయవిధిని నాఁడు మరల మరల దూఱుచు నేనిలు సేరితిని!



# గృహ పరిశ్రమ

## ఫ్రెట్‌వర్కు [Fret work]

కొ. స్వర్ణవల్లి

★ ★ ★ ★ ★ ★

ఈ ఫ్రెట్ వర్కు అనునది కొయ్య పలకలో ప్రత్యేకవిధ మగు రంప ముతో చిత్ర విచిత్రములుగా కోసి చేయుపని. దీనిలో అనేకవిధములగు వింత వింత సామానులను చేయ వచ్చును. బొమ్మలను పలకపైన అతికించి ఆబొమ్మ అంచువెంబడిని కోసినయెడల బొమ్మ వేరుగా వచ్చును. ఇవికాక పెట్టెలు దీప స్తంభములు, బొమ్మసామానులు, రైలుబండ్లు, వాయువిమానములు, ఇండ్లు, యంత్రములు మొదలగు వాటి నెన్నిటినో చేయవచ్చును. దీనికి కావలసిన పనిముట్లు, పరికర ములు కొంతక్రయమైనను ఫల మధి కము కాన పిన్నలు పెద్దలు ఈపనిని నేర్చుకొని దీని నొక గృహపరి శ్రమగా జేసికొని కొంతలాభమును పొందవచ్చును.

పరికరములు: — ప్లైవుడ్ (Ply-wood) అను పలక కలదు. ఇది రెండుగాని ఎక్కువగాని పొరలు గలిగి గట్టిగా నుండును. ఫ్రెట్ వర్కుకు తగియుండును.

రంపము:- ఫ్రెట్‌సా (Fret saw) అనురంపము దీనికి ప్రత్యేకముగా పనికివచ్చునది. (చిత్రము 1.) దీనిలో పిడిగల యొక పెద్దవంపు కమ్మియ(a) దాని రెండుకొనలలోను రెండు (b) మరలును కలవు. రంపము (c) మా త్రము వేరుగా నుండును. దీనిని రెండు మరలలో మధ్యపెట్టి బిగిం చినయెడల కోయుటకు పనికి వచ్చును.

రంధ్రము వేయు సాధనము: డ్రిల్ (Drill- (చిత్రము 2). పలక యొక్క అంచును కోయక, దాని మధ్యనుండి కోతను ఆరంభించవలెనన్న యెడల మొదట ఈడ్రిల్‌తో కోతను ఆరం భించవలసినచోట రంధ్రమును చేయవలెను. రంధ్రమును చేయు టకు చిత్రము 2నందలి a భాగమును ఒకచోట పలకపైనుంచి b అనుతలను కొంచెముగా నదిమిపట్టుకొని c ని, క్రిందికిని పైకిని త్రోసిన యెడల a చుట్లుగా తిరుగుచు పలకయందు రంధ్రము చేయును.

ఆ రంధ్రముగుండా, చిత్రము యందలి c అను రంపమును విడిగా దూర్చుకొని, పిమ్మట దానికొనలను b, b, అను మరలమధ్య నుంచి బిగించవలెను. చూ. చిత్రము 1. d

సాధారణరంపము:- పలకలను తునుకలుగా కోయుటకు ఈరంపము పనికివచ్చును.

కోతబల్ల(cutting table-చిత్రము 4). దీనిని సాధారణమేజాయొక్క గాని స్టూలుయొక్కగాని పై పలక అంచునకు బిగించవలెను. మేజా పలకఅంచు a అను మరచీలపైన నుండునట్లు పెట్టి చీలను బిగించిన యెడల, కోతబల్ల మేజాఅంచునకు బిగియును. చిత్రమును కోయవల సిన పలకను b అను ఇనుపపలకపై పెట్టి కోయవలెను. అప్పుడు రంప మును c అనుసందునందు దూడునట్లు పెట్టుకొని కోయుటకు అనువుగా నుండును. మిగుల సున్నితములగు వంపులను కోయుటకు ఈకోతబల్ల చాల ఉపయోగపడును.

కోయువిధము:- ఫ్రెట్ రంప ముతో కోయునపుడు రంపపు ముక్క (saw blade) నిలువుగా నుండునట్లు పెట్టుకొని కోయవలెను. ఈముక్క ఏటవాలుగా నుండిన యెడల పలక, పైప్రక్క కోతలు వెడల్పుగను, క్రిందిప్రక్క ఇరుకు గను ఉండును. నిలువుగనుండు కోత వలన చిత్రము అందముగా నుండును (చిత్రము 5). ఇదికాక కోత ఎదటి నుండి మనవైపునకుగాని, మనవైపు నుండి ఎదటి ప్రక్కగాగాని పోవ చ్చును. ఎక్కువఅదిమి కోయరాదు. అట్లు అదుముటవలన వంపులు తిరుగు నపుడు రంపపుముక్క విరుగుట తట స్థించును. వంపులు తిరుగునపుడు రంపమును తేలికగా క్రిందుమీదు లుగా నాడించుచు అనగా తేలికగా కోయుచు పోవలెను.

చిత్రములు 6, 7. రంపముతో కోయబడిన అలంకార రూపములు (Designs) చిత్రము 6 నందు మధ్యనుండు భాగము తీసివేయ బడినది. a. b. c. d అను పలకలతో చిత్రము 7 ప్రధానమయినది.

నందు నల్లనిభాగము తీసివేయబడి తెల్లనిభాగము ముఖ్యభాగమయినది.

చిత్రము 8. ఒక బొమ్మకు చట్టము (Picture frame). దీని వెనుక ఏదైన ఛాయాచిత్రమును పెట్టి బిగించవచ్చును.

చిత్రము 9 a ఒకఏనుగుపటము. దీనిని కోసినతర్వాత దీనిని, నిలువ బెట్టుటకు p, అనుపలకలలో c, d అను సందులను కోసి వాటిలో ఏనుగుయొక్క (pe) పాదములను బిగించవలెను.

e, f, g, h ప్రదేశములలో సాధారణపుకోత లుండినయెడల, ఏనుగు శరీరము నందు ముడతలున్ను, ముందు వెనుకకాళ్ల గుర్తులున్ను తెలియును. ఈకోతలలో ఏదోయొక కొనయందు డ్రిల్లుతో రంధ్రమును వేసి దానియందు రంపపుముక్కను దూర్చి రంపపుచట్టమునకు బిగించి కోయవలెను. k. అనురంధ్రము కంటిని గుర్తించును.

[సర్వస్వామ్యసంకలితము]



# పెద్దజమీందారుగారి సన్యాసం

అక్కరాజు ఆంజనేయులు

"పెద్దజమీందారుగారు హఠాత్తుగా సన్యాసం పుచ్చుకొన్నారు. చదువుకు భంగం అనుకోకుండా బుచ్చిజమీందారుగారువచ్చి వ్యవహారాలు చక్కబెట్టుకోవాలి, లేకుంటే జమీందారీ తారుమారౌతుంది" అని అచ్చయ్యమ్మ పంపిన టెలిగ్రాం తంతెవార్త చూడుకొన్నేసరికి బుచ్చిజమీందారుగారికి ముందు మనస్సు తారుమారు అయింది. అన్నయ్యగారు సన్యాసంపుచ్చుకోవడమంటే నమ్మకంఏలాగా? ఎందుకుపుచ్చుకొనిఉంటారు? సనాతనధర్మంలో ఆశ్రమక్రమంలో వచ్చినసన్యాసం కానేకాదు కదా? అన్నయ్యగారికి యింకా గృహస్థాశ్రమప్రవేశమే లేదు. అంటే శాస్త్రయుక్తంగా లెండి. దాంపత్యార్థంలో గృహం లేదుకాబట్టి గృహచ్ఛిద్రాలూ లేవు. అందువల్ల గృహచ్ఛిద్రాలవల్లవచ్చినసన్యాసమూ కాదు. మరేదోఅనుమానంకలిగింది. దానికి ప్రత్యాలోచనకూడా వెంటనే తోచింది. ఇన్నాళ్లూ ఇంతో అంతో ప్రేమవ్యవహారాలల్లో ప్రసిద్ధిసంపాదించినవారేఅన్నయ్యగారు. ఎంతఆలోచించినా ఏమీ తోచలేదు. తీక్ష్ణంగా ఆలోచించగా, అతీతాధునికసన్యాసమా! అని ఒకశంక తోచింది. అంటే ఎవర్తెనో ఒకర్తెను త్రికరణశుద్ధిగా ప్రేమించి, కలలోనైనా ఇంకొకస్త్రీమీద కన్నువేయకుండా ఉండి, ఆమెప్రోత్సాహము వల్ల ఆప్రేమఫలము స్థిరమని నమ్ముకొని ఉండగా, ఆమె తనను మోసంగించినప్పుడో, తృణీకరించినప్పుడో ఇంక ఈప్రపంచము ఎందుకువచ్చినదిఅని విరక్తిభావంతో తీసుకొన్న సన్యాసమా అని అనుమానం కలిగింది. కాని దీనికి ప్రతిశంక కలుగకపోలేదు. అన్నయ్యగారిహృదయాన్ని పూర్తిగా వశంచేసుకొని, చులకనచెయ్యడంమాత్రంచేత వారికి ప్రపంచముమీద విరక్తి పుట్టించేటంతటికాంత తమపల్లెలోనూ లేదు, చుట్టుపక్కలనూ లేదు. అన్నయ్యగారే, లక్షలకధికారిఅయినజమీందారుగారే, పాలుమాలి అడిగితే ఎవరితె కాదంటుంది? అనగలిగితే ఆమె ఎంతటిది అయిఉండాలి? మరెక్కడనన్నా చూచినారా అంటే, చూచి, కామించి, కొనసాగనంతమాత్రాన విరక్తిపుడుతుందా? ఇద్దరిహృదయాలూ ఏకమై, కొంతకాలము ప్రేమ ముదిరి, ఒకరిని విడిచి ఒకరు బ్రతుకు భారంగా భావిస్తే అప్పుడు చులకనగానీ, తప్పనడుచుటకానీ విరక్తిపుట్టిస్తుంది. అన్నయ్యబాగారు దూరాన ఏమాత్రం దీర్ఘకాలమూ ఉండలేదే!

...బుచ్చిజమీందారుగారికి ఏమీపాలుపోలేదు. శంకలూ ప్రతిశంకలూ మనస్సును చీల్చివేస్తున్నవి......

తుదకు ఒకటి తలపుకు వచ్చింది. తాను హాస్టలునుంచి కాలేజీకి పోయేదారిలో నడుమ నిల్చుకొని మనస్సును సందేహసమాధానప్రవాహంలో విడిస్తే అంతం లేదు. అసలు జరుగబడిచోటుకు వెళ్లి విచారణచేస్తేనే సత్యం తేలడం సందేహం; సందేహమైనా తేలితే అక్కడనే తేలవాలి. ఊరికిపోవడం కర్తవ్యం అనుకొన్నాడు.

ఈవిధంగా ఆలోచిస్తుండగా బుచ్చిజమీందారుగారికి కొంచెంకొంచెం ప్రపంచజ్ఞానోదయం అయింది. అన్నయ్యగారు సన్యాసంపుచ్చుకొంటే, అందులోనూ పెండ్లిచేసుకోకుండానే పుచ్చుకొంటే, తనకే మేలుగా?

తటాలున బుచ్చిజమీందారుగారు వెనుకకుతిరిగి అయిదునిమిషాలలో పెట్టేబేడాసర్దుకొని రైలుస్టేషనుకు రిక్షాలో పోయినారు.

## ౨

బుచ్చిజమీందారుగారు రైలుదిగేసరికి కారుడ్రైవరు వంగివంగి దండాలుపెట్టి చేతిలో తోలుసంచితీసుకొన్నాడు. "దయచెయ్యండి మాప్పెబో, దయచెయ్యండి మాప్పెబో" అంటూ దారిచూపుతూ కారుదగ్గరకు తీసుకొనిపోయి, క్లిక్కుమని తలుపు తీసి బుచ్చిజమీందారుగారు ఎక్కగానే సంచి పక్కన పెట్టి క్లిక్కుమని తలుపువేసి, క్లిక్కుమని ముందుసీటుతలుపు తీసి, తాను ఎక్కినాడు. టప్, క్లిక్...భర్-ర్-ర్-ర్ కారు పోతూంది వెనుక ధూళిమేఘం లేవదీసి నడిచివచ్చేవారిని కప్పివేస్తూ. అధికారంలోకివచ్చిన బుచ్చిజమీందారు కాబట్టినీ, అసాధారణపరిస్థితులలో ఉన్నాడుకాబట్టినీ, అందరికండ్లూ తనమీదనే ఉన్నాయి. అది గమనించి కండ్లు వాల్చుకొని ఆలోచనలో మునిగిపోయినారు. ఊరుదాటి మూడుకోసులు పోయి 'శాంతివనం'ప్రాకారంప్రవేశించి కారు నిల్చేవరకూ కన్నులు తెరవలేదు; తలఎత్తలేదు.

వరండాలో కృష్ణాజినంమీద అన్నయ్యగారు కాషాయవస్త్రాలు వేసుకొని కూర్చొని, కుడిఎడమలఉన్న పుస్తకాలను చూస్తూ ఉన్నారు, ముందర తెరచిఉన్న పుస్తకంలో కాగితంమీద వేలుపెట్టిఉన్నారు. ముందు వరండానిండా జనంకూర్చొని కారునిలువడం, అందులో బుచ్చిజమీందారు ఉండడం చూచి గుసగుసలు పోతున్నారు.

క్లిక్-డ్రైవరు దిగినాడు. క్లిక్-వెనుకసీటు తలుపు తీసినాడు. బుచ్చిజమీందారుగారు దిగినారు. టప్-క్లిక్...టప్-క్లిక్...భర్ర్...ర్ర్ర్...కారు షెడ్డులోకి పోయింది.

బుచ్చిజమీందారుగారు పోయి అన్నయ్యగారి దగ్గరగా నిలువబడి నమస్కారం చేసి ఆశీర్వాదం శిరసా అందుకొని, వారు చూపిన చోట కూర్చోడానికి వంగుతూ సభికులు అందరూ చేసే నమస్కారాలనూ, ఆశీర్వాదాలనూ, మందహాసాలనూ అందుకొన్నారు. అంతట అన్నయ్యగారు ఉపన్యాసం ప్రారంభించారు. టాల్‌స్టాయి, ఫ్రాయిడు, రస్కిన్, లాస్కీ, రస్సెలు, క్రీస్తు, బుద్ధుడు, కృష్ణుడు, జనకుడూ అని రకరకాల వేదాంతుల పేర్లూ తారుమారుగా, తలక్రిందులుగా, ముందు వెనుకలులేకుండా దొర్లుతున్నవి.

## 3

శరీరానికి రక్తప్రసరణము ఎటువంటిదో సంఘానికి ధనప్రసరణము అటువంటిది: రక్తం సమానంగా అన్నిభాగాలకూ ప్రవహించకుండా ఉంటే వెంటనే మనిషికి రోగం ఎట్లా సిద్ధమో అదేవిధంగా ధనం ఎక్కడగాని నిలువ అయినట్లయితే సంఘానికి జాడ్యం తటస్థిస్తుంది; ధనం ఎక్కడకానీ ఎచ్చుతక్కువలు లేకుండా నిలుకడలేకుండా ప్రసరిస్తూ ఉండవాలి—ఇదీ అన్నయ్యగారి ఉపన్యాసధోరణి. దానిలోపడి బుచ్చిజమీందారుగారు తమ స్వార్థపరత్వాన్ని మరచారు; అన్నయ్యగారిపట్ల భక్తిభావం వహించారు. ఎందుకంటే, ఈకాలంయువకులు పాశ్చాత్య సాంఘికశాస్త్ర గ్రంథాలను చదువుతారు; మెచ్చుకొంటారు అంతేకాని పాశ్చాత్యులవలె ఆచరణలో పెట్టరు. ఈ భావాలకూ ఆచరణకూ కలహరుద్ధానికి కారణం అడిగితే, పాశ్చాత్య భావాలను అట్లనే మనం ఆచరణలో పెట్టడం ప్రమాదకరం; వాటిని మననాగరకతకు తగినట్లుగా మార్చవాలి అంటారు. ఈకొత్తభావాలు పాశ్చాత్యులలో పుట్టినప్పుడు వారి నాగరకతకు తగినట్లుగా పుట్టాయికాబోలు! పోనీ, అట్లాగే మార్చరాదా అంటే, 'అక్కడనే ఉందిచిక్కు, అంటారు; సంఘం తమతోపాటు రాదు అంటారు. ఇది అర్థంలేని జవాబు అనుకోరు. కొత్త సిద్ధాంతం లేవదీసిన మనిషికీ సంఘానికీ ఎప్పుడు కానీ ఏదేశంలో కానీ విరోధమే. కాని ఆ మనిషిపట్టుదలా, కార్యదీక్షా మొదలయినవాటినిపట్టి ప్రజలు మొదటలో లేకపోయినా క్రమేణా తనదారినే తొక్కుతారు. ఈ మాత్రం ఆమాత్రం చరిత్రజ్ఞానం కలిగితే ఈ రహస్యం తెలియకపోదు. ఇది తెలిసికూడా మనయువకులు ఎందుకు దారి తీయరు?

ఈ ఆలోచనలు బుచ్చిజమీందారు మనస్సులో పుట్టి; సంఘవిముక్తికి తాను ఏమి చెయ్యడమా అనేసమస్యలో కొంతకాలం కిందనే దింపినవి. మనయువకులు మొత్తంమీద శారీరకంగాను మానసికంగాను సోమరులు కాబట్టి మనసంఘం వెనుకపడిఉంది. తాను కూడా ఆసోమరిజట్టులో కలియడమా? కూడదు. చదువు పూర్తికాగానే తానొకసంఘం లేవదీసి, నూతనసిద్ధాంతాలను ఆచరణలోకి తెచ్చేదారులు వెదకవలెనని నిశ్చయించుకొన్నాడు. అందు కనబోటివాళ్ళే పూనుకోవాలి. ఎందుకంటే, కొత్తభావాలు పాతబుద్ధులకు విరోధంగాఉంటాయి కాబట్టి, ఆకొత్తభావాలను లేవదీసినమనిషి పేదవాడయితే సంఘం వాడిని చంపుకొనితింటుంది; ఆమనిషి ధనికుడేఅయ్యెనా, ఊరుకొంటుంది; అనుకరిస్తుంది.

ఇప్పుడు అన్నయ్యగారు తనకంటే ముందుగా మార్గదర్శకులైనారు. మరిన్నీ మనవారు మతవిషయికమాధ్యంలో మునిగి ఉన్నప్పుడు పాశ్చాత్యసాంఘికసిద్ధాంతాలను ఆ స్వరూపంతోనే మనదేశంలో దించితే కార్యసిద్ధి కాదని కాబోలు తాను సన్యాసి అయి వాటిని బోధిస్తున్నారు. లీపిలోపొదిపిన చేదు మందువిధంగా పనిచేస్తున్నారు. తమ్ముడుగారికి ఆనందం అయింది; సంఘవిముక్తి దృష్టిగోచరం అయినట్లుఉంది.

బుచ్చిజమీందారుగారు ఈ భావప్రపంచంలో పడిపోతున్నారు. అన్నయ్యగారి ఉపన్యాసం మనస్సుకు పట్టడంలేదు. పట్టవలసిన అవసరంమాత్రం ఏమిఉన్నది? సరి అయిన దారిలోపెట్టి కదిలించి నెట్టివిడిస్తే, చురుకైనబుద్ధి సరిగానేపనిచేసి నిలువక గమ్యస్థానం చేరుతుంది.

అన్నయ్యగారు ఉపన్యాసంచాలించి, దగ్గరఉన్న దరిద్రదేవతామూర్తులకు రూపాయల నోట్లు పంచిపెట్టారు. ఈ పంపకం తమ్ముడుగారికి ఒక తాపువలె తోచింది. పాశ్చాత్య సాంఘికవేదాంతులు ఈ సృష్టిమార్గం చూపించలేదే సంఘవిముక్తికి! దీనివల్ల సోమరితనం ముదురుతుందే కాని, సంఘజాడ్యానికి ఇది చికిత్సకాదే! పాశ్చాత్యభావాలను మన నాగరకతకు తగినట్లు మార్చడమా ఇది, మన పాతసృష్టిమార్గమే కాని? ఇచ్చేవారికి డంబం లేకపోయినా చేసినపాపాలుపోయి పుణ్యం [illegible] స్వార్థపరత్వం: పుచ్చుకొనేవారి నోళ్లలో తెచ్చిపెట్టుకొన్న స్తోత్రపాఠాలు' మనసులో అసూయ, ఫలం ఆత్మగౌరవహానీ, సోమరితనం— ఇదీ మనదానాలలో తత్త్వం. దీనివల్ల దేశం బాగుపడుతుందా? ప్రతిమనిషికీ చేతనైనపని చూపించి, చేసినపనికి డబ్బుఇస్తే, ఆ మనిషికి ఆత్మగౌరవం పోదు, సంఘానికి భాగ్యం అబ్బుతుంది, లోకకల్యాణం కలుగుతుంది. ఈ సత్యం అన్నయ్యగారికి ఎందుకు తోచలేదు? ఆ రస్సెలు, ఆలాస్కీ ఆటాల్‌స్టాయి, ఆ మార్క్సు— వారి పేర్లుమాత్రం వచ్చినట్లు ఉన్నదేకాని వారి తత్త్వం బోధపడినట్టు కనబడలేదే!

తమ్ముడుగారికి ఏమీ తోచలేదు. పరిపరి విధాల ఆలోచిస్తున్నారు. ఉపన్యాసం వినడానికి వచ్చినవారంతా పోయినారు. అన్నయ్యగారు ఇంటిలోపలికి పోయి ఒక సంచి చేతపట్టుకొని బయలుదేరినారు. తనకు ఏమీ తోచక తమ్ముడుగారు గదిలోపలికిపోయి వాలుకుర్చీలో చేరబడ్డారు.

## ౪

వాలుకుర్చీలో నిద్రపోతున్న బుచ్చిజమీందారుగారిని అచ్చయ్యమ్మ వచ్చి లేపింది. అచ్చయ్యమ్మకు అన్నదమ్ములు ఇద్దరిపట్లా స్వతంత్రమే. వారి తల్లి పోయినప్పటినుంచీ అంతకుముందు దాదిగా ఉన్న అచ్చయ్యమ్మ తల్లిస్థానం తీసుకొని తల్లిని మరపించింది. మాతృస్థానం దాసీస్థానం వీటికి నడుమ అధికారం పూని, పనులను అన్నిటినీ దాదివలె చేస్తూ, అన్నదమ్ముల సౌకర్యాలూ వ్యవహారాలూ అన్నీ తల్లిఅధికారంతో దిద్దుతూ ఉంటుంది. వీరి తండ్రిహయాంలోనే ఏకారణంచేతనో అచ్చయ్యమ్మ చాలా అధికారం సంపాయించింది. తండ్రిపోయినతర్వాత అన్నదమ్ములు ఇద్దరూ అచ్చయ్యమ్మ మాటఅంటే గౌరవిస్తున్నారు. తనమాటమీద గురుత్వం ఉందికదా, అని అచ్చయ్యమ్మ వీరినెత్తిన ఎక్కలేదు. కాబట్టి అన్నివ్యవహారాలూ అచ్చయ్యమ్మచేతిమీదనే నడుస్తున్నవి.

పెద్దజమీందారుగారు పెద్దవారైనందువల్ల వారిపట్ల దాసిగానే ఉండడంమంచిది

అనుకొన్నది అచ్చయ్యమ్మ. బుచ్చిజమీందారుగారిపట్ల అట్లలేదు, వారు చిన్నవారు కాబట్టీ తాను వారిని పెంచినది కాబట్టి కొద్దిగా అధికారం చెలాయిస్తూవుంది. ఇప్పుడు దగ్గరకువచ్చి నిలువడం, బుచ్చిబాబుగారూ అని పిలువడం, 'మీరు' అని సగౌరవంగా బహువచనప్రయోగం చేయడం - ఈపాటిలో ఉంచుకొన్నది తన అధికారాన్ని.

'బుచ్చిబాబూ, బుచ్చిబాబూ' అనిరెండు మార్లు అచ్చయ్యమ్మ నెమ్మదిగా పిల్చేసరికి బుచ్చిజమీందారుగారు నిద్రనుంచి లేచారు "ఊఁ...అచ్చయ్యా..." అన్నారు. బుచ్చిబాబూ ముందు లేచి స్నానంచేసి చలువగుడ్డలు కట్టుకొని భోజనంచెయ్యండి తర్వాతమాట్లాడ వచ్చు," అన్నది అచ్చయ్యమ్మ. వారులేచి కోటూచొక్కా విప్పి వంకీలకు తగిలించే లోపల అచ్చయ్యమ్మ రెండు చలువకుండు గుడ్డలనూ సబ్బుపెట్టైనూ తెచ్చియిచ్చి "తలకు చమురుపెట్టుకోండి బాబూ, రాముడు అంటుతాడు, రైలుప్రయాణం ఏంతోవేడి... నేను లోపల చూడవలసినపనులు ఉన్నవి." అని చెప్పి అచ్చయ్యమ్మ పోయింది.

*

బుచ్చిజమీందారుగారు భోజనం చేస్తున్నారు. అచ్చయ్యమ్మ వట్టివేళ్లవిసనకర్రతో విసరుతూఉంది.

బు. జ: అచ్చయ్యా, అన్నయ్యగారు యెక్కడికిపోయినారు?

అచ్చ: ఇక్కడ నోట్లపండేరం అయిపోయింది, ఇంక ఊళ్లోకావాలి ఇంటింటా పేదలకు. ఈపద్ధతిమీద జమీందారీ ఎన్నాళ్లు ఉంటుంది? పోనీ ప్రజలదరిద్రం తొలగిపోతే జమీందారీ ఉన్నా ఒకటే లేకున్నా ఒకటే అనుకొందాం అంటే, ఆదరిద్రం కుక్కతోక వంటిది. పెట్టుకున్నన్నినాళ్లూ కూర్చొని తింటారు. ఆ మర్నాడే యథాప్రకారసిద్ధి రస్తు. ఈ పిచ్చిని ఏమిఅనడం, బుచ్చిబాబూ!

బు. జ: అన్నయ్యగారు ఇట్లు ఎందుకు చేసినారు అచ్చయ్యా? సన్యాసం తీసుకొనే పాటి వైరాగ్యం కలవారుగా ఎన్నడూ తోచనేలేదుకదా?

అ:—ఇది పరమరహస్యం, చెప్పడానికే ఇష్టంలేదు, కాని,

బు.జ:—అఁ!......కపటసన్యాసమా?

అ:—రామరామ! దీనివల్ల ఏదో సాధింతాము అని లేనేలేదు. ప్రపంచంలో పాపం అని ఒకటి ఉన్నది అనీ, సన్యాసం, భగవద్ధ్యానం, ఈవి వీటివల్ల ఆపాపం పోతుందని అనీ భావం.

బు.జ:—అచ్చయ్యా, నిజమా ఇది?

అ:—ఇందులో రహస్యం నాకూ తెలినేది కాదు. కాని దైవికంగా ఆస్థలానికి మరెవ్వరూ పోకముందు నేను పోవడం లేటస్థించింది, మర్మం తెలిసింది. ఈ వ్యవహారాలలో తలపండిపోయినదాన్ని కాబట్టి రహస్యం ఇంతైనా పైకిరానియ్యకుండా ఎక్కడిది అక్కడ అణిచివేసినాను. నేను కాకపోయినా, అక్కడికి మరెవ్వరైనా నాకంటే ముందుపోయి ఉండినా ఏమిఅయి ఉండునో కదా!

బు. జ:—రహస్యం ఏమిటి? చెప్పు, అచ్చయ్యా.

అ:—అన్నయ్యగారు పెద్దవారు అయినారు. నేనూ ఇప్పుడు ఎప్పటి అచ్చయ్యను కానుకదా వారితో ఏవిషయంగానీ స్వతంత్రించి మాట్లాడడానికి?

బు. జ: ఈ చాటభారతం ఏమిటి, అచ్చయ్యా?

అ: నాతో మాటమాత్రం సూచనగా అయినా అనిఉంటే, ఏమిచేసిఉందునో కదా! తమచేతిలోకి తీసికొని అన్నివిధాలా చెరిచివేశారు.

బు. జ: విషయంఏమిటి?

అ: ఈమధ్య అన్నయ్యగారు మాలపిల్లలకు ఒకబడి పెట్టించారు. అందులో జాను అని ఒకక్రైస్తవుడు అయ్యవారు: రెపరెపలాడుతూ, సన్నగా, పొడుగుగా, చామనచాయగాఉండేవాడు, మంచి తెలివికలవాడు. కొంచెంకాలంలోనే అతనితత్వం అందరికీ బాగా తెలిసింది; క్రైస్తవుడుఅయినా, దేశం అనీ దేశమాతసేవఅనీ తాపత్రయపడేవాడు.

కాని, ప్రభుత్వంపక్క మాట్లాడేవాడుకాదు. మతవిషయాలలో మిషనువారికీ జానుకూ అభిప్రాయభేదాలువచ్చి జాను ఎదురుతిరిగాడు. ఇండియాలో అనేకమతాలు ప్రబలిఉండి ప్రజలను కక్షలుగా చీల్చి ఐకమత్యం ఏర్పడకుండా చేస్తున్నాయి అనిచెప్పేవారలు ఉండేమతాలకు పైగా క్రైస్తవమతం ఒకటి తెచ్చిపెట్టడం ఎందుకు? అన్నాడు. అంటే ఊరుకోక ఇండియాలో ఉండే అన్ని మతాలూ వాటితోబాటు క్రైస్తవమతమూ రూపుమాసిపోతేనే కాని ఇండియాకూ, ప్రపంచానికి ముక్తిలేదన్నాడు. మిషనువారికి కోపం వచ్చింది. దానితో జానుకు విద్యాసహాయం చెయ్యడం మానారు. ఇటువంటి వాటికి జాను జడిసేవాడు కాడు. మిషనువారి సహాయం నిలిచి తన చదువు పోయినా ఒప్పుకొన్నాడు కాని సత్యం చెప్పక తప్పదు అన్నాడు.

ఇటువంటివాడు జాను. అసలు మిక్కిలి పేదవాడు, ఉండడానికి ఇల్లుకూడా లేదు. ఇక బతికడం ఎట్లా?

ఇట్ల ఉండగా అన్నయ్యగారు బడి పెట్టించడం, అందులో జాను అయ్యవారు కావడం.

బు. జ: అయితే?

అ: ఈజానకు సుగుణమణి అని భార్య. వీరు మాలలో మాదిగలో అయివుండి క్రైస్తవులు అయినారు అనే అభిప్రాయంతో మీరు ఉంటే, సుగుణమణి మంచి సొగసరి అని నేను ఎంత చెప్పినా నమ్మరు. కాని అట్లు కాదు. వారి పెద్దలు మరేకులంవారో అయిఉండాలి.

బు.జ: సుగుణమణి భూలోకసుందరి అని చెప్పినా ఒప్పుకొన్నాను. కథ చెప్పుమా.

అ: జాను ఇక్కడ అయ్యవారు అయిన మొదట సుగుణమణి జానుదగ్గరకు వచ్చింది. ఆమె ఎంతో గారాబంగా పెరిగిందిగా కనబడేది. ఆ నాజూకైన వేషం, ఆ సౌకుమార్యం చూస్తే. ఇటువంటి సుగుణమణి ఈ యిల్లూ వాకిలీలేని జానును ఎట్ల పెండ్లిచేసు

క్కొన్నదా? అని నాకు సందేహం ఉంటూ ఉండేది.

బు. జ: ప్రేమవివాహం లే. తర్వాత?

అ: క్రైస్తవులు కదా? సుగుణమణి పైకివచ్చినట్టు కానీ, ఎక్కువ మాటకారి అయినట్టు కానీ కనబడేది కాదు. జాను బడి నుంచివచ్చి ఏటినుంచి మంచినీళ్లు మోసుకొని వచ్చి ఇచ్చేవాడు. ఇంట్లో వాడుకనీళ్లు అయినా తాను చేదిపోసేవాడేకాని సుగుణ మణిని చేదనిచ్చేవాడు కాడు. ఈ మాత్రం ఆ మాత్రం కాయకష్టం కలపని ఏదికానీ జానే చేసేవాడు. సాయంత్రం భార్యాభర్తలు ఏటిగట్టున షికారు వెళ్ళేవారు. సుగుణమణి పట్ల జానుకు ఉండే ఆ ప్రేమ, ఆదయ, ఆమృదుత్వం, ఆ శ్రద్ధ నేను మరెక్కడా చూడ లేదు, బాబూ.

బు: జ: ప్రేమవివాహంలో ఉండే విశేషమే అది. మనలో పెండ్లాం అంటే కూలి దీనీ పానిదీనీ. ప్రేమబంధంవల్ల ఏర్పడ్డ దాంపత్యంలో క్రూరత్వానికి చోటుఎక్కడిది?

అ:—ఈ విధంగా జోడుపిట్టలవలె ఉండే వాడు జానూ సుగుణమణీ. వీరినడుమ మరొక మనిషికి స్థానం లేదుకదా?

బు. జ: ఉండరాదు సాధారణంగా.

అ:—ఒకనాడు నేను పైకిపోయి ఆపక్కగా వస్తూ అన్నయ్యగారిని వాండ్లసాల ముందర చూచి నాకండ్లను నేను నమ్మలేక పోయాను. జాను బడిలో ఉండడం చూచే వచ్చాను. సుగుణమణి ఒక్కతే ఉంది సాలలో. అన్నయ్యగారు బడితనికీకి వెళ్లడానికి వాండ్లసాలమీదుగా పోనక్కరలేదు. అనుమానం కలిగింది.

బు. జ:—నిజమే?

అ:—వినండి బాబూ. ఇట్ల కాచి ఉండగా మరిరెండుసార్లు జాను సాలలో లేనప్పుడు అన్నయ్యగారిని అక్కడ చూచాను. సత్యం తెలిసింది అనుకొన్నాను. సుగుణమణి జానును మోసంచేస్తూ ఉంది అనుకొన్నాను. రాజును చూచినకంట మొగుణ్ణిచూస్తే మొట్ట బుద్ధిపుడుతుందికదా? కాని నాకు ఒకటి అర్థంఅయ్యేదికాదు. ఇంతఅనుకూలంగా ప్రేమవ్యవహారం నడుస్తూఉంటే అన్నయ్యగారి ముఖంలో విడువకుండా విచారం కమ్మిఉండడం ఎందుకో అని నాలో నేను ఊహచెయ్యడం మొదలుపెట్టాను. తమకు జాను అడ్డంఅని ఏమైనాఉండునా? అట్ల అయితే కార్యసాధకులలక్షణం విచారంకాదే! మర్మం కనుక్కొని మార్గంచెప్పనా అంటే పెదవికదల్చడం ఎట్ల? నాతోకూడా ఆలోచించడానికి ఇష్టంలేక వారికివారే సొంతంగా వ్యవహారం నడుపుకొంటున్నారు కదా, నేను ఎట్లకదిలించేది? ఆలస్యంమీద అన్నీ బయటపడతాయి కనిపెట్టిఉంటే అనుకొన్నాను.

వారితో మాట్లాడడంఅంటే కష్టం కాని, పైనుంచి అంతాకనిపెట్టుతూ చిక్కులు రాకుండా చెయ్యవచ్చుకదూ?

బు. జ: అచ్చయ్యా! అచ్చయ్యా!!

అ: అందుకోసం అని వారు ఆసాలపక్కగాపోయినది కనిపెట్టి నేను బడిపక్కగా పోయేదాన్ని జానును కనిపెట్టడానికి.

బు. జ: అచ్చయ్యా!

అ: జాను బడిలోనేఉండేవాడు వేళతప్పకుండా ప్రతిదినమూనూ. ఇన్నాళ్లు జానుకంట పడకుండా అతడిచెవికి రాకుండా వ్యవహారం నడుస్తూఉందా? అది సాధ్యమా? అని అనుమానం కలిగింది. తెలిసినవాడ్లంతా పెండ్లాలను చంపుతున్నారా? చంపగలరా? తమకు తెలేనట్టు తప్పకొంటారే కాని; అని అనుభవాన్ని పట్టి ఆలోచించి నాలో నేను సమాధానపడ్డాను.

బు. జ: తర్వాత?

అ: ఇట్లఉండగా ఒకనాడు నేను కనిపెట్టడానికి పోయేటప్పటికి జాను బడిలో లేడు. గుండె గుభిలుమంది. వాండ్లసాలపక్క నడిచాను. వాకిట అన్నయ్యగారు నిలిచి ఉన్నారు. ఇక నేను ఎట్లపొయ్యేది? దూరాన మాటిఉండి చూస్తున్నాను. కొంతసేపటికి సుగుణమణి వాకిటికి వచ్చి అన్నయ్యగారికి నమస్కారంచేసి వారిముఖంలో నిలుకడగా తేరిపార జూచింది. ఏమన్నా మాట్లాడు కున్నారేమో... నాకు దూరాన వినబడలేదు. ఏమనిఉంటుంది? మొగుడు లోపల ఉన్నాడు, సమయంకాదు అని చెప్పి ఉంటుంది. అన్నయ్యగారు తలవంచుకొని మహాలుకు వచ్చారు.

ఇక ఇదేరంగం ప్రతిదినమూనూ. ఒక వారంగడచింది. అన్నయ్యగారిని ప్రతిదినమూ అక్కడనే అట్లనే చూచేదాన్ని. వ్యవహారం చెడిసిందా అనుకొన్నాను. కాని నోరు ఎత్తను వీలులేదు కదా?

బడి కనిపెట్టాను. మాలపల్లె పిల్లకాయలు బడికి రావడంలేదు, అయ్యవారు బడితీయడంలేదు. సాలకువెళ్లి అడిగితే "దాసీది అధికారం చలాయిస్తూ ఉంది" అంటారేమో! అందులో నా అనుమానమే నిజం అయితే సుగుణమణికికూడా నేను దాసీనే కదా? ఈ స్థితిలో వారిని అడగడానికి వీలులేక మాలపల్లెపక్కపోయి విచారించగా 'అయ్యవారికి చాలా జబ్బుచేసింది, అందువల్ల బడిలేదు' అన్నారు. సత్యం తెలిసింది. ఎంత ఇది అయినా లోకంకోసం వేషంవెయ్యాలి కాబట్టి మొగుడు అంత జబ్బుతో ఉండగా విడిచిపెట్టి ఎక్కడికైనా రావడం ఎట్ల? సాధ్యం కాదు అని ఆ సుగుణమణి నమస్కారానికి అర్థం.

బు. జ: కానీ అచ్చయ్యా.

అ: వినండిబాబూ, తొందరలేదు. అన్నయ్యగారు రాత్రి తొమ్మిది పదిగంటలకుగాని రారులేండి. నాకు ఆలోచనలు పరి పరి విధాల పోయినాయి. అంత జబ్బు చేస్తే వైద్యుణ్ణి పిలిపించడం మందు ఇప్పించడం లేదు ఏమి? మొగుడిమీద ప్రేమకల పెండ్లాం మందు ఆపని చేస్తుంది. జాను బతకవలెనని ఉంటే అన్నయ్యగారే మందు ఇప్పిస్తారు......అంత బాసన్న జానుకు అసలు రోగం ఏమిటి? ఇందులో ఏమీ మర్మం లేదుకదా?

బు.జ: అచ్చయ్యా! అచ్చయ్యా!!

అ: ఇట్ల నాలో నేను మదనపడుతూ ఉండగా ఒకవారం గడిచింది. ఒకదినం అన్నయ్యగారు సాలవాకిటికి వచ్చి తమకు కనమస్కారం చేసిన సుగుణమణిచేతికి ఒ

డంతపుపెట్టె ఇవ్వడం చూచాను. "ఈరోజు జాను ఆఖరు" అనుకొన్నాను. ముందు రోగం పుట్టించి అంతట దీర్ఘరోగంవల్ల వచ్చిన చావు అనిపిస్తున్నారు అనుకొన్నాను. ......అన్నయ్యగారు వచ్చి అన్నపానాలు అన్నీ అయినమీదట నేను తెపతెప నాలుగు మెతుకులు నోట్లో వేసుకొని ఆసాలకు పోయాను.

బు. జః తొందరగా చెప్పు.

అః సాలతలుపు లోపలికి తోసి చూడగా జానూ సుగుణమణీ ఒకపక్కమీద పండుకొనిఉన్నారు. సుగుణమణి జానుమీద చెయ్యివేసి కాగిలించుకొని నిద్రపోతూఉంది. కలక్కుమన్నట్లు సందేహంకలిగింది. ఇష్టంలేనిసుగుణమణి జాను మేలుకొని ఉన్నప్పుడు ఎంతకపటప్రేమచూపినా, నిద్రపోతున్నప్పుడు పైనచెయ్యివేసుకొని పండుకొంటుందా? కాని ఈసందేహం నామనస్సులో స్పష్టంగా ఏర్పడలేదు. అటూఇటూచూడగా దంతపుపెట్టెకంటపడింది. సవ్వడిలేకుండా మునివేళ్లమీద నడిచి అది తీసుకొని కడపదగ్గరకువచ్చి తెరువగా, నూరురూపాయలనోట్లు కొన్నీ కండ్లు జిగజిగలాడించే కొత్తసవరలుకొన్నీ ఉన్నాయి. ఒకసవరకింద మడిచిన తెల్లకాగితం ఉండింది. సవరఎత్తి కాగితం నాలుగు మడతలూ విప్పదునుకదా, అన్నయ్యగారికి ఒక జాబు. ఆత్రంతో చదివాను.

బు. జః నీ అనుమానాలూ సందేహాలూ మొదలుపెట్టక అందులోసంగతి తొందరగా చెప్పు.

అః అందులో సంగతులు ఇవ్వీ. ముందు సుగుణమణి తనచరిత్ర చెప్పింది. తాను స్కూల్‌ఫైనలు దాకానే బడిచదువు చదువుకొన్నదట. కాని ఇంట్లో స్వయంకృషివల్ల చాలాదూరం పోయిందట. తల్లిదండ్రులు తనను ఒక బి. ఏ., బి. యల్. కు ఇచ్చి పెండ్లిచెయ్యడానికి నిశ్చయించుకొని ఎంత బలవంతపెట్టినా ఒప్పుకోలేదట. తాను బడిలోఉండగా సహపాఠి జాను కొన్నిఏండ్లు స్నేహితుడుగా ఉండి వారిద్దరికీ ప్రేమోదయం అయిందట. ఒకరికొకరు ప్రేమప్రమాణాలు చేసుకొన్నారట. జాను పేదవాడు. అందువల్ల తానుకూడా స్కూలుఫైనలుతోటే బడిచదువు నిలిపినాడట. జాను ఇన్నియేండ్లూ తనయింటికి వచ్చేవాడట, బడి ముగించినమీదటకూడా అట్లే వస్తుండేవాడట. సుగుణమణి యింట్లో ఆమెతండ్రి పుస్తకాలు దండిగాఉండేవి. తెలివికలవాడు పుస్తకాలు వాడుకుంటే సుగుణమణితండ్రి కాదంటాడా? ఈ విధంగా స్వయంకృషివల్ల ఇద్దరూ ఇంటోఉన్నలైబ్రరీఅంతా చదివినారట.

జానుకు మిషనువారు ద్రవ్యం ఇచ్చి చదివించి ఉండవలసిందికాని క్రైస్తవమతం మీద జానుఇచ్చిన ఉపన్యాసాలు అడ్డం వచ్చినాయట. ఒక ఉపన్యాసంలో క్రైస్తవమతవ్యాపకాన్ని గురించి మాట్లాడుతూ "స్త్రీ, పానం, డబ్బు, ఈమూడూ క్రైస్తవమతాన్ని ప్రపంచంఅంతా వ్యాపింపజేసిన మిషనరీలు" అని జాను చెప్పేటప్పటికి మిషనరీలు మండిపడ్డారట. అందువల్ల ద్రవ్యసహాయం చెయ్యడం మానడమేకాకుండా, తమకు అధికారులతోఉండే పలుకుబడివల్ల జానుకు ఎక్కడకూడా ఉద్యోగం పుట్టకుండా చేసినారట.

ఇటువంటివాడు జాను. అభిప్రాయాలను నిలబెట్టుకోడానికి అడివిలోనికైనా పోయాడుకాని, ప్రపంచంలో పైకిరావడానికని తన అభిప్రాయాలను విడిచిపెట్టడు; మాటుపరచడు. ఇటువంటిజాను, నిర్మలమైన పవిత్రమైన మనస్సుకలజాను, ధైర్యానికి ఉనికిపట్టయినజాను సుగుణమణికి పూర్తిగా హృదయాన్ని ఇచ్చాడు; సుగుణమణి ఆజాను చేతులో తనహృదయాన్ని ఉంచింది; కేవలం పశుకామం ప్రేరేపించగా తనను కోరినవాడు కాడట. కొన్నియేండ్లు ఒకరిహృదయం ఒకరికి పూర్తిగా తెలిసి ఏర్పడ్డ ప్రేమవల్ల కోరినాడట; సుగుణమణి తల్లిదండ్రులు ఎంతకాలానికైనా సమ్మతించనీ అంతవరకూ వేచిఉంటానన్నాడట; సమ్మతించకపోతే సుగుణమణిని ప్రేమిస్తూనే ఈప్రపంచయాత్ర ఒంటరిగా గడపుతానన్నాడు కాని ఇంకొకరికి తన హృదయాన్ని ఇయ్యలేనన్నాడు. అంతేకాని, ఎన్నిమార్లో అవకాశాలు తటస్థించినా హద్దుదాటి అడుగుపెట్టలేదట. ఇటువంటిజాను తనను ప్రేమించినాడు. ఇటువంటివాడిని మాని ఎవర్ని పెండ్లిచేసుకొమ్మని పెద్దలు బలవంత పెడుతున్నారు? పెద్దపెద్ద ఉద్యోగాలు చేస్తున్నవారినీ, చెయ్యబొయ్యేవారినీ, జాడ్యంలాగున పెరుగుతున్న ధనంకలవారినీ, విద్యాధికులనూ. మీరు ఒకరు ఎన్ని వేలుఇస్తావు అనేవారు; ఒకరు ఎంతవరకూ చదివిస్తావు అనేవారు. మరీ సిగ్గు లేనివారు కొందరు పిల్లను ఎప్పుడు కాపరానికి పంపుతావు అనేవారు—. ఈవిధంగా తనకూ తన హృదయాన్నీ, శీలాన్నీ ఎరిగి వాటికోసం కాకుండా తన డబ్బుకోసం, తన డబ్బుతో చదువుకొని పెద్దవారు కావడంకోసం, చేతకాని పెద్దమ్మలు కాబట్టి తనడబ్బు తినడంకోసం, తమ వంశంలో గౌరవంలేదు కాబట్టి ఈ సంబంధంవల్లనైనా కొంచెం ప్రతిష్ఠ సంపాయించడంకోసం, అందగత్తె అయిన తనతో తొందరగా కలిసి కామం తీర్చుకోడంకోసం చూచేవారు అందరూ. తన డబ్బు శాశ్వతం కాదు. నిన్నటి లక్షాధికార్లు నేటి భిక్షాధికార్లు. తన అందం శాశ్వతం కాదు; తనతో చదువుకొంటూ ఉన్న పిల్లలు అప్పుడే తాను అట్లుఉండగానే ఒకటి రెండు కాన్పులతో ముసలమ్మలు అయి, సౌదర్యం చెడినందువల్ల మొగుళ్లను తమచేతులలో ఉంచుకోలేకపోతున్నారు. శాశ్వతంగా ఉండేది ఒక్కహృదయం. ఆ హృదయం ఎవరిని ఆకర్షించిందో, ఎవరిచేత ఆకర్షించబడిందో వాడిని, ఆ జానునుతప్ప ఇంకొకణ్ణి పెండ్లిచేసుకోను అని పట్టుపట్టింది సుగుణమణి. ఏండ్లుగడచినా జాను తన ప్రణం తప్పలేదు.

తుదకు విధిలేక చావబోతూ సుగుణమణి తల్లిదండ్రులు జానును పిలిపించి, అతనిచేతులలో కూతురిచేతులను పెట్టి ఆశీర్వదించి ప్రాణాలు విడిచారు. ఈ వధూవరులు ఏ ఛర్చికీవెళ్ళి బూటకపు పెండ్లితంతు నడుపలేదు. అనురాగం లేకుంటే ఈ ఛర్చి అనురాగాన్ని హృదయాలలో పుట్టిస్తుందా?

అది ఉంటే దీనితో అవసరమా? ఏదీలేదు అనుకొని ఆ ప్రస్తావన ఎత్తుకోకుండా దాం పత్యం వహించారు.

బు. జ: నిన్ను కథచెప్పమనాలి, అచ్చయ్యా!

అ: ఆజాబు చాలా పెద్దది, బాబుగారూ. సుగుణమణి ఇంతవిషయమూ వ్రాసింది. ఇం కావినండి.

తండ్రి తనకొడుకులకు ఇచ్చి మిగులగా కొంతభాగం సుగుణమణికి ఇస్తానన్నాడట. అన్నదమ్ములు ఒప్పుకొన్నారట. కాని జాను వద్దు'అనిపట్టుపట్టాడట. డబ్బుతెస్తే మనదాం పత్యం కుదరదు అన్నాడట. పిల్లతల్లిదండ్రు లు దమ్మిడీ ఇవ్వడంలేదు అంటే పిల్లను పెండ్లిచేసుకొనేవాండ్లు ఎందరుముందుకువస్తా రు?అనిఅడిగింది సుగుణమణి అన్నయ్యగారిని. జానుసొంతంగా కష్టపడి పౌరుషంగా సంపా దించి తనప్రేమదేవత సుగుణమణికి కానుకగా సమర్పించదలచుకొన్నాడు జాను. జానుకు జీవనోపాధి ఏర్పడేదాకా పుట్టింటనే ఉండి అంతట జానుదగ్గరకు వచ్చింది సుగుణమణి.

సుగుణమణిని జాను పూలలోపెట్టి పూజిం చుకొన్నాడు. కలిసి చదువుకొంటూ, కలిసి ఆలోచించుకొంటూ, ముందుముందు చేయ బోయే ంఘిక సేవకు తయారుఅవుతున్నారు ఇద్దరూ.

ఈ భావ ప్రపంచంలో, ఈ భూలోక స్వర్గంలో జానూ సుగుణమణీ ఉండగా జమీందారుగారికన్ను సుగుణమణిమీద పడిం దట.

బుచ్చిబాబుగారూ, నేను మొదట నా కంటపడిన వాటిని అట్లగే చెప్పతూ ఆయా పట్ల నాకు అప్పటికప్పుడు తోచిన సందే హాలనూ, కలిగిన అభిప్రాయాలనూ కూడా చెప్పాను. వాటిఅర్థం అదికాకేకాదని నాకు తెలిసింది. సత్యానికీ ప్రపంచానికీ నే అర్థాలకూ ఎంతదూరం ఉంటుందో ఇందులో కనిపె ట్టండి. అన్నయ్యగారిసన్న్యాసం చూచి ఇప్పుడు ఈచుట్టుపక్కల అంతా వారిని భీష్ముడు, హనుమంతుడు, బుద్ధుడు, శంక రుడు అంటున్నారు. ఈ ప్రపంచం కండ్లలో పసిరికలు కమ్మినాయి. మంచి అంతా చెడ్డ గానూ, చెడ్డ అంతా మంచిగానూ కనబడు తుందేకాని, మంచి మంచిగా చెడ్డ చెడ్డగా యథారూపంతో ఎన్నటికీ కనబడదుకదా?

బు. జ: మళ్లీ ధర్మమీమాంసలోకి దిగావు అచ్చయ్యా!

అ: అవును బాబూ నాకే మనస్సు తారు మారు అవుతూఉందే సామాన్యులమాట ఏమని చెప్పడం? అది అట్ల ఉంచండి.

బు. జ: నేను చెప్పడమూ అదే.

అ: అన్నయ్యగారు రోజూ సుగుణమణిని కలుసుకొనేవారట. మార్చిమార్చి ధనాశ చూపేవారట, పెండ్లాడుతాను అనేవారట, వేడుకొనేవారట, జానును వెక్కిరించేవా రట, ఇక బకుకను అనేవారట. ఆద్యం తాలూ సుగుణమణి "ఇష్టంలేని మొగుడికి నన్ను బలవంతాన కట్టిపెట్టిఉంటే ఏమైనా చేసిఉందునుకూడా నేమో; కాని నాహృద యం జానుహృదయంతో కలిపాను; ఇక ఇందులో ఇంకొకరికి ఏమీ చోటులేదు" అని చెప్పేదట; నమస్కారాలుచేసి ఆళ వదలుకో మనేదట. ఇంతగా తానే పోరాడు తూఉందట కాని జానుతో పొరబాటున అయినా ఒక్కమాట అనలేదట. ఎందుకు అనలేదు అంటే, ఈ తలపులతో తన ఒక్క మనస్సూ చెడినది చాలక, జానుమనస్సుకు కూడా వేదన ఎందుకు?

బు. జ: కానీ, అచ్చయ్యా!

అ: తనలోతాను ఇంతా మింగి జానుపట్ల అకలంకపుప్రేమవలె ఉండింది.

జాను జబ్బునపడి తిరుగుమొగం పెట్ట కుండా రోగం ముదురుతూ ఉంది. నెలజీతం ఏ నెలది ఆనెలకు అయిపోగా మిగులుబడి లేక ఈ జబ్బులో ఇబ్బంది అయిందట. ప్రేమవ్యవహారంలో సుగుణమణి విముఖత్వం చూపినందువల్ల కోపంవచ్చి జమీందారు గారు అప్పు ఇవ్వకుండా కోమటిని బందో బస్తు చేసినారట, అందువల్ల అంగడివాడు పథ్యానికైనా అప్పు ఇవ్వలేదట. నాకరి చేసి అప్పుకోసము ... యలన్నా అప్పు ఇయ్యండి అని వేడుకొంటే జమీందారుగారు నాప్రార్థనకు జవాబు ఏమి అన్నారట. ఊరు దూరం; ప్రాణభయంతో ఉన్న జానును విడిచిపెట్టిపోయి ఏఅమ్మ నన్నా అడిగి తెచ్చుకొనడానికి వీలులేదు. అచ్చయ్యమ్మను అడుగుదామా అంటే అంగ డివాడిని కట్టివేసిన జమీందారుగారు అచ్చ య్యమ్మను కట్టివేయలేరా? గతిలేక జమీం దారుగారిపొలంలో పైరుకోసి తీయగా పడి ఉన్న వెన్నులు ఏరితెచ్చి గంజి కాచి పోస్తా ము అని వెన్నులు ఏరుకోడానికి పోగా నాకర్లు తరిమినారట. శతకోటి దరిద్రానికి అనంతకోటి ఉపాయాలు అన్నట్టు సాల చుట్టూ గడ్డి ఎండి ఉండగా ఆ గడ్డి గింజలను తీసి జావకాచి జాను గొంతులో పోసిందట. తనకు నీళ్లు తప్ప మరేమీ లేదట.

బు. జ:—దుఃఖం జాలి అనిలేకుండా ఎంతశాంతంగా చెబుతున్నావు అచ్చయ్యా ఈకథ?

అ:—జానుపోయినమీదట ఈప్రపంచం ఎందుకు. ఎంతకన్నా ఒడబడి జానును బతికించి తనకల్మషాన్ని జానుకు వెల్లడిచేసుకొని తాను ప్రాణాలువిడువవచ్చు అనుకొని, అన్నయ్యగారు రాత్రిపండుకొని ఉండగా కిటికీదగ్గరకు వచ్చి "ఒప్పుకొన్నాను, నాజా నును బతికించండి" అన్నదట! మర్నాడు కరకర పొద్దుపొడిచేటప్పటికి అన్నయ్య గారు ఆదంతపుపెట్టెలో నోట్లూ సవరలూ తీసుకొనిపోయి సుగుణమణికి కానుకగాఇచ్చి, అంగటికివచ్చి పథ్యపువస్తువులు గంపకు పెట్టి పంపించారట. సుగుణమణి జావకాచి జాను గొంతులో పోయబొయ్యేటప్పటికి జానుకు ప్రాణం ...

బు. జ: అచ్చయ్యా! అచ్చయ్యా!! నీకల్పనా? నిజమా?

అ: సుగుణమణి ముఖంలో కండ్లలో తాను చూస్తూ జావ సుక్కైనా మింగకుండానే జాను ప్రాణాలు విడిచాడు. మనశ్శాంతికి భంగంలేకుండా జానుకు ప్రాణం పోయింది. ఇక తాను బతికిఉండడం ఎందుకు? తనకోశే

బరాన్ని తాకవద్దు అని ఆఖరునకోరుతూ ఇంత జాబూ వ్రాసి దంతపుపెట్టెలో పెట్టి...

బు. జ: నమ్మనా ?

అ: ఈజాబు చదువుకొనడంలో నిద్రపోతున్నారు అనుకొన్నవారిని మరచినాను.

ఈఆఖరు వాక్యంతో మనసు కల్లోలపడింది. పోయిచూతును కదా ఇద్దరూ శవాలు. జాబు ఇదుగో తెస్తున్నా. (లోపలికి పోయింది.)

బు. జ: ఔరా! ఔరా!!...ఔరా!!!

అ: (వచ్చి జాబుఅందిచ్చి)ఇదుగోబాబూ, ఇది తీసుకొని నేను వచ్చాను. కొంతసేపటికి అలంకారం చేసుకొని అన్నయ్యగారు పోయి సాలలో చూచారు. మనస్సు వివశంఅయింది.

బు. జ: రామ, రామ.

---

# మూడు గీతాలు

**అనువాదకుడు: శ్రీరంగం శ్రీనివాసరావు**

### ౧. బహిష్కృతుడు

సంజపడి చీకటులు మూగుసమయమందు
దారిప్రక్క ఏకాకిగా కూరుచున్న
ఒకబహిష్కృత తేజస్వి నోరసికొనుచు
తొందరగ దాటిపోవుచుందురు జనాళి.

ఆజనుల్ తమదీప్తగేహమ్ము చేరి,
ప్రియకుటుంబముతోడ నివ్వియవి పల్కి,
తీయతీయపల్కుల తరితీపులందు
సిలువవైచెద రలబహిష్కృతునిమాట.

కాని రాగబంధమ్ములు కదలిపోయి,
జీవయాత్ర కాశ్వాసాంత మావహిల్లి,
పరుగుకడముట్టిపో-సుహృద్వరుడయనుచు
వ్రాలుదురు వారు వెలిపడ్డవానిమీద.

★

### ౨. ప్రవాసులు

దేవతలు విచిత్రాకృతుల్ తీసికొనిరి:
పల్లెటూళ్లలో సూకరపాలకులుగ
కాని వారలమురికిమొగాలయందె
దివ్యతారకాస్నిగ్ధదీధితులు మెరయు.

వికలధూసరగగనవాటికలక్రింద
తప్పులయికూడ పూర్తిగా దాచలేరు
తమపతితదేవతావైభవము, స్వకీయ
దివ్యశోభ, కన్నులయందు దివిపదగ్ని.

మట్టిగోడలగుడిసెలమధ్య, రేల
ఇరికిపడియును వారికే ఎరుగరాక
రాజదండకిరీటధారణ మొనర్చి,
గద్దెనుండి గద్దియ కట్టెకదలుచుంద్రు.

★

### ౩. తిరుగుబాటు

అల సూర్యుడనెడుఉజ్జ్వలదివ్యనౌక,
ఇటునే ప్రయాణించు ఈపాతదోనె
ఏకరహస్యాజ్ఞనే తెలిపోవు:
ఏకప్రవాహాననే ఈదులాడు.

నక్షత్రనౌకల్లారా, నాఆత్మనావ,
ఐంద్రజాలికపర్వతావళి దాటి,
దూరసముద్రవర్తులరేఖ దాటి
మూర్ఛిల్లు నొకస్వచ్ఛముకురార్ణవమున.

రండి, మీసీల్లువిప్పండి! చెప్పండి!
ఏసాహసికయాత్ర ఇది మేమొనర్తు
మేదేవనగరిసాధించుట కొరకొ ?
జన్మధామశ్యామసస్యవీథులకొ ?

★

[A. E. (the late George Russell) వ్రాసిన గీతాలకు అనువాదము.]

---

# నా స్వగతం

నాకు మనవిమర్శకులమీద ఎక్కువైన అభిప్రాయం లేదని అదివరకే బహిరంగంగా తెలియజేసుకున్నాను. నా స్వగతానికి నేనే వ్యాఖ్యానం రాసుకోవటానికి కూడా అదే కారణం. సమర్థులైన విమర్శకులు లేరని తోచినప్పుడు ఎవరిరచనలకు వారు వ్యాఖ్యానాలు రాసుకోవటంలో మహాపాతక మేమీలేదు. వ్యాఖ్యానాన్ని విమర్శకింద గణించే విమర్శకులుండటం నాకు విమర్శకుల మీది అభిప్రాయాన్ని బలపరుస్తున్నది.

నాకథలు చప్పున అందరికీ అర్థంకావటం లేదన్న విషయం నాఅంతట నాకు తట్టినది కాదు. అది కాలక్రమాన నాకు అవగాహన అయినసంగతి. నాలుగైదేళ్ల క్రితమే ఒకదిన పత్రికలో (ఇప్పుడది అంతరించిపోయింది) నాకథలు "పూర్వం" ఒకటి రెండుసార్లు చదివితేనేకాని అర్థం అయేవికావనీ, "ఇప్పుడిప్పుడు" ఎన్నిసార్లు చదివినా అర్థంకాకుండా ఉండేకథలు రాయటానికి నేను కంకణం కట్టుకున్నాననీ ఒకరు అభిప్రాయం వెలిబుచ్చారు. ఆ అభిప్రాయాన్ని అప్పట్లో నేను సరిగా పాటించలేదని ఒప్పుకుంటాను. కాని రాను రాను నన్నుకూడా ఒకకథకుడికింద కట్టికొందరు పత్రికాసంపాదకులూ, తదితర పరిచితులూ కూడా నారచనలను గురించి నన్ను అనుమానా లడగటం ప్రారంభించినతరవాత నారచనలో లోపం నాకు అర్థంకాసాగింది. (నేను ఎవరి ఉపయోగంకోసం కథ రాస్తున్నానో వారి కాకథ అర్థంకాకపోవటం నిజంగా నాలోపమే మరి.)

చాలాకాలంనించీ నేను అందరికీ అర్థమయ్యేటట్టే రాయాలని ప్రయత్నం చేస్తున్నాను. కాని నాకథలు నాకు ఎప్పుడూ అర్థం అవుతూ ఉండటంవల్ల కథను చవుక చెయ్యకుండా, నేను కథలో ఎత్తుకునే అంశాలను ఎంత విపులీకరించితే పాఠకులకు సులభంగా అర్థ మవుతుందో నాఅంతట నేను ఊహించుకోలేని స్థితిలో ఉంటూఉంటిని. నా "కారుణ్యం" మీది విరుద్ధవిమర్శలను గురించి "స్వగతం" వ్యాఖ్యానంలో చెప్పే ఉన్నాను. ఆవ్యాఖ్యానం ఎంతో అవసరమని తోచినమీదటనే అదిరాశాను. ఒకరిద్దరు విమర్శకులు నాకు ఆపాదించిన అభిప్రాయాలు కేవలమూ నిరాధారాలు. అవి వారి **inferiority complex** మాత్రమే ప్రకటిస్తున్నవని చెప్పటానికి నాకు చాలా విచారంగా ఉంది.

నేను స్వగతానికి రాసిన వ్యాఖ్యానంలో కొందరు నా ప్రశంసాప్రేమను కనిపెట్టారు, మరికొందరు నా అహంకారాన్నీ ఆత్మశ్లాఘా పరాయణత్వాన్నీ కనిపెట్టారు. ఆవ్యాఖ్యానం రాసినందుకు నన్ను తప్పపట్టినవాళ్లలో నన్ను మెచ్చుకునే వాళ్లూ, నాన్నే హితులూ ఉన్నారు. సాఫీ అయిన తెలుగువాక్యాలను సాఫీగా చదవకపోవటంవల్ల ఇటువంటి దురభిప్రాయాలు బయలుదేరుతై.

★ ★

కొడవగంటి కుటుంబరావు

★ ★

కొన్ని ఉదాహరణ లిస్తాను. "నాకథలను గురించి పాఠకలోకానికి పనికివచ్చే ముక్క ఒక్కటయినా చెప్పాలని ఏవిమర్శకుడికీ తట్టలేదు" "అందువల్లకూడా (వ్యాఖ్యానంరాసినందువల్లకూడా) సరిఅయిన విమర్శన రాలేదని తోచినట్టయితే—ఆతోచటంలో కొంత ఆత్మవంచనకు తావుండదని నేననను! ఇంకోసారి ("వచ్చేసారి" అని ఉండవలిసింది) నన్ను నేనే విమర్శించుకుంటాను. ఆపైన నా కథలమాట అటుంచి విమర్శకులు నావిమర్శననే విమర్శించవలిసి వస్తుంది;" "నీతితోకూడుకున్నకథ ఆధునికంగా ఉండటానికి అవకాశం ఉందనీ, కథయొక్క నీతి కథచివర ఉండటంవల్ల కథయొక్క అందం చెడదనీ నిరూపించటానికి ఇది (కాలభైరవుడు) రాశాను. ఇటువంటి వాక్యాలు విమర్శకుల గొంతులకు వచ్చి వెలగకాయలవలె అడ్డం పడుతూ ఉన్నై.

నాకథలనుగురించి పాఠకలోకానికి పనికివచ్చే ముక్కలు చెప్పమనటం నన్ను మెచ్చుకోమనటం కింద కట్టివేసిన విమర్శకుడికి విమర్శనఅంటే ఏమిటో తెలుసునని ఎట్లాభావించటం. "ఈ పుస్తకాన్ని ఎవరూ చదవరేమో అనే అభిప్రాయంతో గ్రంథకర్తే పుస్తకాధిక్యాన్ని చెప్పదలచుకొన్నట్లు కనబడుతుంది" అని "ప్రతిభ" ౧.౨ లో అంటున్నారు "రా. సు." అనే ఒకానొక వ్యక్తి. ఈ అభిప్రాయాన్ని రుజువుచెయ్యటానికి నావ్యాఖ్యానంలోనించి శ్రీ రా. సు. గారు ఎన్ని వాక్యాలు ఎత్తిచూపగలరు?

సరిఅయిన విమర్శన అనేది రాలేదని నేను అనుకోవటంలో ఆత్మవంచనకు నాకు అవకాశం ఉందని నేను ఎరిగిఉన్నట్టు స్పష్టంగా మనవిచేసుకున్నాను. అది ఎవరికీ అవసరమైనట్టు కనిపించదు.

కథయొక్క నీతి కథచివర ఉండటంవల్ల కథయొక్క అందం చెడదని నిరూపించటానికి నేను కాలభైరవుడు రాశాను అని అనేసరికి "కాలభైరవుడు" అందంగా ఉందని నేను ఆత్మప్రశంస చేసుకున్నాననే అపోహతో కాబోలు బుర్రా వెంకట సుబ్రహ్మణ్యంగారు "కాలభైరవుడు అందంగాలేదు" అని అనేశారు. నేనురాసిన వాక్యంలో కాలభైరవుడు అందంగా ఉందనే అర్థంలేదు. ఆనీతి తీసివెయ్యటంవల్ల అది ఉన్నదానికి అందంగా ఉండదు అనిమాత్రమే ఉంది. విమర్శించదలుచుకున్న గ్రంథాన్ని ఎదురుగాఉంచుకుని వ్యాకరణ దోషాలులేని తెలుగువాక్యాన్ని అర్థం చేసుకోవటానికి ఒక తెలుగువ్యక్తి ఊహించటం మొదలుపెట్టవలిసిన అవసరమేమిటో నాకు తెలియకుండా ఉంది.

నన్ను విమర్శించేవాళ్లు నేనంత తేలికగా ప్రతిమమ్మాయికీ జగ్గాయికీ దొరికిపొయ్యేటట్టు రాసేవాణ్ణి కానని తెలుసుకోవటం మంచిది. నేను అహంకారినీ. గర్వినీ, ఆత్మవంచకుణ్ణీ, ఆత్మశ్లాఘా పరాయణుణ్ణీ, ఇంకేమేమైనా కావచ్చును కాని నాయీ లోపాలు నేనురాసే ప్రతి వాక్యంలోనూ బయటపెట్టుకుంటానని నమ్మటం నాకు అన్యాయం చెయ్యటం అవుతుంది.

నాకు విమర్శకులమీద గల అభిప్రాయం నేను బహిరంగంగానే చెప్పాను. అది నా అభిప్రాయం మాత్రమే! దానికి నేను ప్రచారం ఇవ్వబోను. కాని నా అభిప్రాయమైనప్పటికీ బయటపెట్టాను కనక దాన్ని సమర్థించటానికి ఉదాహరణ లిచ్చాను. డాక్టర్లమాదిరిగానే విమర్శకులుకూడా ఆత్మసంరక్షణార్థం ఒకరితో ఒకరు ఏకీభవించవలసి ఉంటుంది. ఒకసారి అచ్చుఅయిన కథయొక్క విలువ తిట్టినప్పుడు తగ్గి, మెచ్చుకోగానే పత్తిధర లాగా ఎక్కదు.

అయినా నావంటి రచయితల రచనలు ప్రజా బాహుళ్యానికి ఎరుకపరిచే విమర్శకుల యొక్క ఆవశ్యకత నేను గుర్తించకపోలేదు. అందుకనే కథరాయటంలో నా అభిప్రాయం మాత్రమే నేను చెప్పి ఆ అభిప్రాయాన్ని విమర్శించేపని విమర్శకులకు వదిలిపెట్టాను. అటువంటిపని అసంగతమని ఎవరైనా నిరూపించవలసిఉంది.

'అతివినయం ధూర్తలక్షణ' మని నమ్మినవాణ్ణి కావటంచేత నేను "రా. సు." గారి సలహా ప్రకారం "సవినయంగా పరిచయ వాక్యాలు" రాసుకోలేదు. "నేను వట్టిచవటను, గడ్డి తిని ఈ గ్రంథం రాశాను. దీన్నిండా తప్పులే. అయినా పండితులైన తమరు ఇందులో తప్పులు విసర్జించి ఒప్పులే గ్రహించండి" అని పీఠికలో రాసుకున్న రచయితయొక్క గ్రంథాలు బుద్ధిమంతుడెట్లా చదవగలడు? నేను వ్యాఖ్యానం రాసుకోవటం కొందరికి కంటకింపుగా ఉండటానికి ఒకటేకారణం ఉంది—ఆ వ్యాఖ్యానంలో "నేను" కర్తగాకలవాక్యాలు చాలా ఉన్నై! అందులో అంతకంటె తప్పేమున్నదో ఎవరుచూపినా నేను వారికి శాశ్వతంగా కృతజ్ఞుణ్ణి అయిఉంటాను.

ఇక స్వగతంలో కథలను గురించి.

మొదటిది "అరణ్యం." ఇందులో "భాస్కరరావుపాత్ర కొంత ప్రకృతివిరుద్ధంగా ఉంది" అని "రా. సు." గారు. దానికి కారణం "కథాప్రారంభంలో అతను (భాస్కరరావు) అరణ్యానికి ఇంచుమించు తగిపోయేటట్లు చెప్పి ("మాట్లాడి" అని అభిప్రాయం) చివరకుమాత్రం మామూలు ప్రపంచంలో సంఘసంస్కర్తలజాబితాలో చేరాడు." కథారచనలో అభిప్రాయమే ఇంచుమించు అది. అందులో సామాన్యజీవితానికి కొంచెం కిందుగా ఉండే ఒకఅరణ్యాన్నీ, సామాన్యజీవితానికి కొంచెంపైగా ఉండే ఇద్దరువ్యక్తులనూ కల్పించాను. భాస్కరరావు అరణ్యానికి సరిపెట్టుకుపోయిన "వేదాంతి," ఆఖరుకు తన వేదాంతాన్ని విసర్జించి మానవప్రపంచంలో పడుతున్నాడు. అందులో కథానాయికవంటి స్త్రీని నేనెన్నడూ చూడనిమాట నిజమేకాని ఇకముందు చూడనని భయంలేదు నాకు. మనోవైజ్ఞానికంగా ఆ పాత్రలనిర్మాణంలో తప్పున్నదని ఎవరైనా నిరూపించవలసిఉంది. ఆ కథలోవచ్చినమిగతా పాత్రలనన్నిటినీ నేను స్వయంగా చూశాను. చూడనివారిదృష్టికి అసహజంగా కనిపిస్తే దానికి నేను బాధ్యుణ్ణి కాదు. ఆకథ కంగారుగాఉందన్నారు బుర్రా వెంకటసుబ్రహ్మణ్యంగారు. ఎందులో కంగారు? శిల్పంలోనా, భాషలోనా, భావనలోనా? ఆకథ చదవగానే "ఇది జరిగిఉండవచ్చును!" అని అనిపించేకథ కాదు "అరణ్యం." నాకథలు అవిషయంలో సహజంగా ఉండవని నేను "కారుణ్యం"లోనే మనవి చేసుకున్నాను. సహజంగా ఉండనికథ వల్ల ప్రయోజనం లేదని ఎవరు వాదించటానికి సాహసించుతారు? "కాకీ-నక్క" కథ సహజంగాఉందా? నా వ్యాఖ్యానం తప్పపట్టటానికికాకుండా చదివినవారికి, ఆకథ రాయటంలో నా అభిప్రాయం ఒకరినీతి ఒకరికి వర్తించదని తెలియజేయటమేనని సులభంగా అర్థమౌతుంది. నాప్రయత్నం మంచిదో కాదో, అందులో నేను సఫలుణ్ణి అయినానో కాలేదో చెప్పకుండా, విమర్శకులు నేను మరోపని ఏదోచెయ్యలేదని ఎంతరాస్తే ఏం లాభం?

"ప్రేమ" అనేది వాఙ్మయంలో బాగా ప్రవేశించింది. పూర్వులు "ప్రేమ" అనేదాన్ని ఇప్పుడు మనం వాడుతున్న సంకుచితార్థంతో వాడేవారు కారు. వారు మోహమూ, కామమూ అన్న భావాలసమ్మేళనాన్ని మనం ప్రేమ అనటం ప్రారంభించుతున్నాం. భారత నాగరికతలో ఈ ప్రేమకూ వివాహానికీ కొంత బాంధవ్యం ఏర్పడబోతున్నది. 'సెంటిమెంటాలిటీ'తో కూడుకొని వివాహంగురించి ఒక కథ రాయాలని సంకల్పించుకున్న తరవాత దానికి పాత్రలను మనసంఘంలోనే కొంతవరకు పాశ్చాత్యనాగరికత అబ్బినవ్యక్తులను తీసుకోకతప్పకపోయింది. ఎందుచేతనంటే మన పల్లెటూరి గ్రామాల్లో పాతసాంప్రదాయికులు చేసేవివాహాల్లో 'సెంటిమెంటాలిటీ' ప్రసక్తే ఉండనేలేదు. అట్లాఉండటానికి అవకాశం ఉంటుంది కూడా లేకుండా జరిగిన వివాహాలకి పాత్రలు బి. ఏ. దాకా చదివినబాలవితంతువు సుశీల, మొదటినించీ బ్రాహ్మసామాజికుల ధోరణిలో పెరిగిన భద్రమూ, పార్వతీ నాకు దొరికారు. స్వగతప్రథోరణిలో రాసిన "వరాన్వేషణ" అనేకథలో పార్వతీ, భద్రమూ బ్రాహ్మసామాజికులు అని చెప్పించవలసిన అవసరం నాకు కనిపించలేదు. ఆమాట చెప్పటంవల్ల ఆకథయొక్క శిల్పం బాగుపడిఉండేదని ఎవరికైనా తోస్తే వారిది చదివి ఆకథను మరింత బాగా ఆనందిస్తారని నమ్మటానికి నా కేమీ అభ్యంతరంలేదు. వారు పాశ్చాత్య సంప్రదాయాలు గమనించేవారు కావటమే నాకు అవసరమై ఉండింది. ఆకథలో సంభాషణల్లో అసంతృప్తిచెందినవారు ఆవాక్యాలలోకొన్ని చాలాభాగం—ఇంగ్లీషులోకి తర్జుమా చేసుకుంటే అంత అసహ్యంగా ఉండదని నమ్ముతున్నాను. ఆపాత్రల సంభాషణాధోరణి మామూలు తెలుగువాళ్లు మాట్లాడినట్లు ఉండకూడ దనే అభిప్రాయంతో ఆసంభాషణలు అట్లారాయటమయింది. "ఇది ఇంగ్లీషుకథ" అని అభిప్రాయం పడిపోయిన తరవాత పాఠకుడు లేనిచోటకూడా ఆపాత్రల ప్రవర్తనకు పాశ్చాత్యుల ఆచారాలకు సరిపుచ్చటానికి ప్రయత్నం చెయ్యటానికి వీలుంది. ఉదాహరణ: భద్రం సుశీలను పెళ్లిచేసుకోమని అడగటానికీ ఆమె ఒప్పుకోటానికీ అనంతరం పాఠకుడు వారిద్దరూ Engage అయ్యారని ఊహించుకుని కథను మరింత పాశ్చాత్యీకరణం చెయ్యవచ్చును. ఈవిధంగా కథలో ...

దానికంటె ఎక్కువ ఊహించుకోకుండా ఉండగలందులకే ఆకథ ఇంగ్లీషుకథ కాదు, అనుకరణంకూడాకాదని మనవిచేశాను. అప్పటికి నామాట నమ్మనివారిని నే నేంచెయ్యగలను? "దైవమిచ్చినభార్య" అనే వెంకటచలంగారు **"Passionate Friends"** అనే **H. G. Wells** నవలను అనుసరించి రాస్తూ ఆగ్రంథంలోనే అది అనుకరణమని ఒప్పుకున్నారు. దాన్ని విమర్శిస్తూ ఒకవిమర్శకుడు "ఇది అనుకరణం. ఆమాట దాచిపెట్టారు" అంటే వెంకటచలంగారు ఏంచేశారు కనకా?

స్వగతంలో మూడోకథ "కాలభైరవుడు" ఇందులో ఉన్నకథలన్నిటిలోకీ నాఅభిప్రాయంలో ఇది ఉత్కృష్టమైనది. దీనికి ఒక నీతి ఉందనేకాదు. ఇటువంటి కథ రాయటం సులభం కాదు. నేను మళ్లీ ఇటువంటి కథ ఇంకొకటి రాయటానికి ఎంతికాలం పడుతుందో చెప్పలేను. ఇందులో ఉన్నముఖ్యపాత్ర ఒకకుక్క. (దీనికి శ్రీనివాసరావు కథానాయకుడని భ్రమపడవలిసిన అగత్యం లేదు. ఇది ౧౮ పేజీలకథ. నాలుగో పేజీలోనే కుక్క విషయం వచ్చింది.) ఇతరకథలలో ముఖ్యపాత్రలను ప్రవేశపెట్టినట్టు కాకుండా ఈకుక్కను ఈకథలో పాఠకులకు ప్రవేశపెట్టటంలో కొంత తెలివితేటలు వినియోగించగలిగా ననుకుంటున్నాను. కథ చదివేటప్పుడు పాఠకుడు కథలో పాత్రలలో దేన్నో ఒకదాన్ని నమ్మలేకపోతే చాలాఇబ్బంది ఉంది. ఈకథలో ఉన్నవిషయం పాఠకులు సులభంగా నమ్మజాలనిది. శ్రీనివాసరావు శాస్త్రీయమైన శోధన చెయ్యటానికి ఉద్యుక్తుడైనా మూఢవిశ్వాసపరుడు. ఆకుక్కే "ఆదినారాయణ" అనే అభిప్రాయం అతనికి ఎప్పుడో పడిపోయింది. కనక ఆపాత్రవల్ల పాఠకులకు ఏమాత్రమూ లాభంలేదు. అందుకని పాఠకులను నమ్మించగల మరొకపాత్రను ప్రవేశపెట్టాను. అతనే కథ చెబుతాడు. ఆకుక్క "ఆదినారాయణే" అని అత నెప్పుడూ నమ్మలేదు. కాని ఆకుక్క సామాన్యమైన కుక్క కాదనీ, దానికి మనిషిని అర్థం చేసుకునే శక్తి ఉందనీ అతను నమ్మగలిగాడు. పాఠకులుకూడా అంతవరకు నమ్మాలి. అది నమ్మినతరవాత మిగిలినకథ సులభంగా అర్థమౌతుంది తనకు ప్రసాదించబడిన అసామాన్యశక్తిని వినియోగించి మానవుణ్ణి వంచించాలని చూసింది. మానవత్వానికి కొద్దిపాటి అర్హతగలతను దేవత్వానికే గాలంవేసింది. మానసికంగా అది దాదాపు మనిషిఅయినా శారీరకంగా అది కుక్కమాత్రమే. తనశునకత్వాన్ని దాచాలని అదిచేసిన ప్రయత్నం ప్రకృతి విఫలంచేసింది. ఆకుక్కకు రుగ్మత ప్రారంభమయింది. మానవులను వంచించిన ఆకుక్క తన **biology** జయించలేక దొంగవేషాలు ప్రారంభించింది. కొన్నిసార్లు పట్టుబడ్డదికాని దాని శునకత్వాన్ని బయటపెట్టడానికి మూఢులోకానికి సాహసం చాలకపోయింది. ఆఖరుకు దేవత్వం ఆకుక్కకు ఒక పెద్ద తద్దినమయింది. ఆకుక్క తనభక్తులను నడిసముద్రంలో ముంచి తనశునకత్వం సార్థకం చేసుకోటానికి పరారి అయిపోయింది. అది ఒక ఆడకుక్కవెంట పోతూండగా ఒక ఆసామి చూసినప్పుడు దానిఆరోగ్యం చాలా బాగుపడిఉంది. తనకుఉన్న కొద్దిపాటిశక్తితో సాధించదగినదానితో తృప్తిపడక అధికమైన దానికి ఆశించి ఈ ప్రయత్నానికి అడ్డువచ్చే తన ప్రకృతిని అణిచిపెట్టాలని ప్రయత్నించి దెబ్బతిని ఆఖరుకు తనకు ప్రసాదించబడిన కించిత్తూ విసర్జించి ప్రకృతికి వశుడైన నిర్భాగ్యుడు ఈప్రపంచంలో అక్కడక్కడా కనిపిస్తూ ఉంటాడు. సన్యాసంపుచ్చుకుని తిరిగీ కాపరంపెట్టినవా రందరికీ ఈ కథలో ఉన్న నీతి అర్థమౌతుంది. కొందరు సన్యాసులు చాటుగాచేసే దురాగతాలను పాపభీతిచేత కప్పిపెట్టేవారికికూడా ఈ కథనించి నేర్చుకోవలిసింది కొంత ఉంది. మానవత్వం పరిపూర్ణం చేసుకోగలిగిన మానవుణ్ణి మెచ్చుకోలేని లోకం కొంచెం మానవత్వం చూపిన పశువును దైవంకింద ఆరాధించటానికి సిద్ధపడుతుంది. జీవితంలో ఇటువంటిది జరిగితే అది మాఢ్యం అనిపించదు. అందుకని ఈ కథలోఉన్నకుక్కను దేవుడుగా భావించక దాన్ని శాస్త్రీయంగా విమర్శించగల మనుష్యులను ఇద్దరిని [illegible] అందువల్ల "భక్తుల" అవివేకం స్పష్టంగా తెలిసిరావటానికి అవకాశం ఉంది.

ఈ "కాలభైరవుడు" ఇంత అసహజంగా కనిపిస్తున్నప్పటికీ నేనురాసిన కథలలో ఇంతకంటె సహజమైనకథ లేదు. ఎందుచేతనంటే ఈకథ చాలా వివరాలతోసహా నిజంగా జరిగింది. కాని నిజంగా జరిగినప్పు డది కుక్క కాదు ఎద్దు. ప్రత్యక్షంగా జరిగినప్పు డీకథకు నీతిలేదు. నీతి నేను స్వయంగా కల్పించాను.

"ఇంతలో ఉంది" అనేకథ "పశ్చాత్తాపుడు" అనే కథమాదిరిగానే చెప్పదగిన విశేషం ఆటేలేనిది. ఈ రెంటినిగురించీ వ్యాఖ్యానంకూడా అనవసరంగా రాశాను. వాటిల్లో ఉన్నవిషయం అంత విదితంగా ఉంశిఉండటంవల్ల కాదుకద, బుర్రా వెంకటసుబ్రహ్మణ్యంగారి కా రెండుకథలూ కొంతవరకైనా నచ్చింది?

ఇక మిగిలింది "అశోకవనం." నేను ఈకథ రాయటంలో రామాయణాన్ని తిరగరాశాను. "ప్రతితరంలోనూ చరిత్ర తిరగ రాయవలసి ఉంటుంది" అని ఒకపెద్దమనిషి అన్నాడు. నేను పురాణాలను చరిత్రగానే భావిస్తూవస్తున్నాను. నేను వాటిని అంతవరకన్నా విశ్వసించినందుకు నన్ను ఎగతాళిచేసినవారున్నారు. ఈ రామాయణభాగాన్ని తిరగరాయబూనినప్పుడు నన్ను నేను వాల్మీకితోగాని, నాకంటెముందే "అశోకం"రాసిన ముద్దుకృష్ణగారితోగాని పోల్చుకోలేదు. వాటితో కొంతవరకు అసంతృప్తిచెందటంవల్లనే నేను మళ్లీ "అశోకవనం" అంటూ రాశానని సులభంగా ఊహించవచ్చును. నా అసంతృప్తికారణాలు నా అశోకం వేళాకోళానికి కాకుండా చదివినవారికి ఎవరికైనా సులభంగా అర్థమై ఉండును. వాల్మీకిరామాయణం మార్చి ఇంకొక రామాయణం రాయటం నాపని అయినట్టయితే, రాముడికీ సీతకూ అన్యాయంచెయ్యటమే నాపనిఅయినట్టయితే రాముడు రావణుడిచేత చచ్చినట్టూ, సీత రావణుడిభార్యఅయినట్టూ రాసిఉందును.

రావణుడికి విమానం ఉండేదనీ, ఒకకోతి సముద్రం లంఘించిందనీ అనుకోవటంవల్ల నా

సంస్కారానికి జరగనిఅవమానం రావణుడు సీతను లంకలో ఖైదుచేశాడనీ, రాక్షస స్త్రీలను ఆమెకు పోలీసులుగా పెట్టాడనీ, రాముడు లోకోపకారార్థం వాలిని చాటుగా నుంచుని కొట్టాడనీ, శూర్పణఖముక్కు చెవులు కొయ్యటం లక్ష్మణుడికి ధర్మమేననీ, విభీషణుడు భ్రాతృద్రోహికాడనీ అనుకోవటంవల్ల కలుగుతున్నది. రావణుడు సీతను చెరచదలిచినట్టయితే సీతకు దిక్కెవరు? రాక్షసులను కాపలా పెట్టకపోతే సీత ఎక్కడికి పారిపోగలదు? ఆమె భర్తకోసం తపించి ఆత్మహత్య చేసుకునేటంతటిపతివ్రత అయితే ఆమెచావువల్ల రావణుడికి ఏం నష్టం? ఏ విధంగానూ మృత్యువుకు లొంగనిరావణుడికి నలకూబరుడి శాపంవల్ల హాని కలుగుతుందనుకోవటంకంటె, ఒకసారి రంభను చెరిచినరావణుడికి అటువంటి పనియొక్క హైన్యము తెలిసివచ్చిం దనుకోవటం సహజంకాదా?

వేదవిభజనచేసి నాలుగవబ్రహ్మ అనిపించుకున్న రావణాబ్రహ్మ సీతను తీసుకొనివెళ్లిన రావణుడు కాదనుకున్నప్పటికీ, ఈ రావణుడు ఆర్యుడు కాడని చెప్పటానికి ఆధారం లేనిమాట నిజమే. కాని రాక్షసులు ద్రావిడులు కారని వాదించటానికి ఆధారం ఏముందో నే నెరగను. రావణుడు ఆర్యద్వేషి అనేది నిశ్చితం.

రావణుడికి నేనుచేసినన్యాయం ఎవరైనా చెయ్యవలిసే ఉంది. అతనికి సీతమీద భ్రమ పోలేదని నే ననలేదు. రావణుడికి న్యాయం చేసేప్రయత్నంలో సీతకుకాని రాముడికికాని అనవసరమైన అన్యాయం జరిగిఉంటే అది నాతప్పే. సీతవంటిభర్తృపర అశోకవనంలో సీతమాదిరిగా ప్రవర్తించటం అసహజంకాదు. ఆమె అప్పటికే లక్ష్మణుడిమీద మోపరాని నింద మోపిఉంది. రావణుడు తనను లంక చేర్చటంతో రాజకీయాలకుగలసంబంధం ఆమెకు తెలిసిఉంటే లంకలో ఆమె అంత ఖేదించిఉండదు. ఆమె ఎంతసేపటికీ తనకు కలిగినభర్తృవియోగాన్నే అర్థంచేసుకుంది. నాకథలో సీత తనంతటతను బంగారు మేడల్లో ఉండాలని వాంఛించినట్టు విమర్శకులు అభిప్రాయపడుతున్నారు. ఆమేడల్లోకంటె అశోకవనంలో ఎక్కువహాయిగా ఉంటుందని ఆమెకు తట్టకపోవటం నాకు సహజంగానే ఉంది. ఆమె లంకలోఉన్నకాలంలో ఒక్కసారయినా కన్నెత్తి అశోకవనసౌందర్యానికి ఆనందించినట్టు మనకు నిదర్శనం లేదు. నేను సీతను రావణుడితో ధాటీగా మాట్లాడగల ధైర్యంతో కూడుకున్న మనిషిగానే చిత్రించాను. ఇక రాముడికి నేను ప్రత్యేకించి చేసిన అన్యాయం ఏమీ లేదు. ఆ కథాధోరణిలో సందర్భానుసారంగా రాముడుచేసిన పనులు చెప్పినమాత్రానే రాముడితత్వం నూతనదృష్టిలో కనిపిస్తుంది.

రామాయణకథవల్ల నాసంస్కారానికి అవమానం జరగకుండా ఉండాలంటే నేను తీసుకున్న భాగంలో ఏయేమార్పులు చెయ్యవలిసి ఉంటుందో అవన్నీ చేశాను. అందువల్ల ఎవరెవరి సంస్కారానికి ఎటువంటిహాని కలగగలదో నేను ఊహించగలగటం అసంభవం. రచయిత ఇటువంటి విషయాలలో తన మనోవికాసాన్ని ఆధారంచేసుకుని రచన సాగించవలెనేకాని మార్గాంతరం లేదు—ఉంటే ఆమార్గాంతర మేదో నే నెరగను.

కథాశిల్పకారణాల ననుసరించి అశోకవనానికి ఈకథలో ప్రాముఖ్యత కొంత ఇవ్వవలసి వచ్చింది. రావణుడికి అశోకవనం మీద కల ప్రేమకు మోహంమొత్తేవారికి సీతకు రాముడిమీదగల అపారప్రేమ మోహం మొత్త దని గ్యారంటీ ఏమిటి? లంకలో ఒక అశోకవనం ఉండటమే రావణుడి సౌందర్యపిపాసను సూచిస్తున్నది. ఈ పిపాసలకు సంస్కారి వెగటుచెందడు. నాప్రత్యేకపిపాస సంగీతానికి సంబంధించినది. నాకు సంగీతం మీదకల అభిరుచిలో నారావణుడికి అశోకవనంమీద నూరోవంతు మోజుకూడా నేను సూచించలేదు. ఈ సంగతి తెలిస్తే బుర్రా వెంకటసుబ్రహ్మణ్యంగారు నాపేరు విన్నప్పుడల్లా ఎంతవెగటు చెందుతారో!

ఇతరవిమర్శనల సంగతి నాకు బాగాతెలియదుకాని ప్రస్తుతం కథకులు ఒకరినొకరు విమర్శించవలిసినవారు కావటం కొంతదరిద్రహేతువుగా ఉంది. (అదృష్టవశాత్తూ నేను మాత్రం విమర్శకుణ్ణి కాను, సుబ్రహ్మణ్యంగారు అభిప్రాయపడ్డట్టు నావంటు ఎప్పుడన్నా ఎవరినన్నా మెచ్చుకోవటమే. నా మెప్పుకు చాలాపాత్రులైన వారిలో బుర్రా వెంకటసుబ్రహ్మణ్యంగారు కూడా ఒకరు. వారివిమర్శనుబట్టి వారికథలను కొలవటానికి లేదు.)

ఈ విమర్శకులు స్వతంత్రరచనలకు అలవాటుపడినవారు కావటంచేతను వారి విమర్శలు స్వతంత్రవ్యాసాలుగా పరిణమించి అందులోకి వారివ్యక్తిత్వం రాదగినదానికంటె సుమారుపదింతలు అధికంగావచ్చి, విమర్శింపబడేగ్రంథమూ, తత్కర్తా ఎటో అణిగిపోతారు.

విమర్శలు ప్రకటించే పత్రికల అజ్ఞానానికికూడా మేర ఉన్నట్టు కనిపించదు. అది ఉదహరించటానికి నామీద "ప్రతిభ"లో చేసిన ప్రతికూల విమర్శను తీసుకోవటం ఏమీ బాగాలేదుకాని ప్రస్తుతం నాకు అందుబాటులో అంతకంటె మంచి ఉదాహరణలేదు. (ప్రతిభ అంటే నవ్యసాహిత్యపరిషత్పత్రిక!) అందులో రా.సు.గారు స్వగతాన్ని గురించి చేసినవిమర్శలో కొన్నివాక్యాలు ఎత్తిచూపుతాను:

"అసలు కథాసంపుటికి స్వగతం అనేపేరు సరిపోవటం లేదు"—కారణం ఊహ్యం.

"వరాన్వేషణలో భద్రం సునీని ఎప్పుడూ పెళ్లిచేసుకోవాలె అని అనుకోలేదట. కాని ఆమెసాంగత్యంమాత్రం అతనికి ఆనందం కలిగించేదట. అకస్మాత్తుగా భద్రానికి ఆవేశం పుట్టి చటుక్కున ఆమెను కొండలన్నీ మారుమ్రోగేటట్టు ముద్దు పెట్టుకున్నాడు. పాపం మొదటిసారికాదూ!"—ఆకథను గురించిన విమర్శఅంతా కలిపి ఇదే!

"అశోకవనం"మీద విమర్శ—"అశోకవనం"లో లంకలోఉన్న రాక్షసులంటే కథకుని ఉద్దేశం ద్రావిడులని; రావణుడు శిల్పకళావంతుడట!"

"“పశ్చాత్తప్తుడు” అనేకథలో పశ్చాత్తాపం ఎవరిది?"—ఈసందేహం నివారించలేకపోయిందాకాలే దీపెద్దమనిషికి.

"విమర్శకు లెవ్వరూ తనకథలలో ఉన్న స్వారస్యాన్ని బయటపెట్టడం లేదని ఈకథకుడు స్వయంగా తనగ్రంథాన్ని ప్రశంసించుకొన్నాడు"—అని "రా. సు." ఊహించుకున్నాడు!

ఇంతేకాదు! మరొక ముఖ్యవిషయం—ఒకపత్రికలో రెండుగ్రంథాలు విమర్శించబడితే ఆవిమర్శనలను బట్టి వాటి తారతమ్యం గ్రహించేటందుకు లేదు. ఒకచచ్చుగ్రంథంలో లోపా లేవీ పట్టటానికి వీలుండకపోవచ్చును. మరొక తెలివైన గ్రంథంలో పురుగేరటానికి లక్ష అవకాశాలు దొరకవచ్చును. విమర్శకులు వాటిమీద విరుచుకుని పడటంకంటె ఉచితం కాని సంగతి ఉండబోదు. నావ్యాఖ్యానంలో నేను మనవి చేసినవిషయమే అది—"మనకు అవసరంలేని వస్తువునుగురించి గంటసేపు బేరం ఆడం!... నాకు అవసరం లేనికథలో శిల్పం ఉంటే నాకేం లేకపోతే నాకేం? భావ బాగుంటే నేం? అసహ్యంగా ఉంటేనేం?" అవి నా మాటలు. తెలివితేటల్లో రచన ఏతరగతికి చెందుతుందో, అందువల్ల ఎవరికికాని ఏకించిత్తుగానీ అవసరం ఉండడానికి వీలుందో లేదో ఏమాత్రమూ నిర్ణయించ లేకపోగా "రావణుడు కళావంతుడుట!" అని ఆశ్చర్యపడితే విమర్శన అవుతుందా?

జన్మలో ఎన్నటికీ అవగాహనకాని అస్పష్టమైన ఆదర్శాలను పట్టుకుని వేళ్లాడేవ్యక్తులకు తమరచనలవల్ల వెంటనే ప్రజలకు జరుగుతున్నలాభ మేమిటో అర్థంకావటానికి అవకాశం లేదు. పది సంవత్సరాలక్రితం కంటె ఇప్పుడు తెలుగులో ఎక్కువతెలివైన సంభావణ జరుగుచున్నదని నేను కళ్లారా చూసి నమ్మగలుగుతున్నాను. ఇప్పటి సాహిత్యం వల్ల ఇటువంటి ఉపకారం జరుగుతూ వెళ్లటానికి ఏవిధమైన ఆటంకమూ అవసరంలేదు. ఈ తెలివితేటలను మనం రచనలో వినియోగపరిచినట్టు విమర్శనలో వినియోగపరచ లేకుండా ఉన్నాం. దానికి కారణ మేమంటే స్వతంత్రరచన చేసేవాడు తన తెలివితేటలను స్వేచ్ఛగా వెళ్లనివ్వవచ్చును. అతనికి ఆ వ్యాపారంలో మరొకవ్యక్తితో ప్రమేయం లేదు. కాని విమర్శకుడు ఒకవైపున రచయితను—వివిధ రచయితలను అర్థం చేసుకోగలవాడై ఉండాలి. మరొకవైపున ఆరచన యొక్క ఫలం అనుభవించేవారి మనఃప్రవృత్తి అర్థంచేసుకో గలవాడై ఉండాలి.—విమర్శ వల్ల ప్రయోజనం ఉండాలంటే దీనికికూడా ఒక ఉదాహరణచూడండి. గొప్పరచయితల మనుకునేవా రంతా తెగతిట్టే ఒకపత్రిక వేలకువేలు అమ్ముతుంది. అటువంటప్పుడు వీరితిట్లు వీరి vanity తృప్తిపరచటానికే అవుతూఉంటుంది. అటువంటిగతి ఉత్తమ తరగతి విమర్శలకు పట్టకుండుగాక అని నా ఆశ!

['స్వగతం'మీద బుఱ్ఱా వెంకటసుబ్రహ్మణ్యంగారి విమర్శన జనవరి (౧౯౩౮) భారతిలో పడింది.]

### స వ ర ణ

౧౯౩౮ జనవరి భారతి ౭౦-వ పుటలో బొమ్మల పేరులు తారుమారుగా అచ్చుపడినవి. వానిని మార్చి చదువుకొనవలెను.

# అస్తమయము ★ ★ ★

## ౧ ఆంధ్రవీరకంఠీరవుడు

అవి చలిరోజులు. అందులో ఉత్తర హిందూస్థానములో చలిరోజులంటే చెప్ప నవసరమేలేదు. రాత్రి పదకొండు గంటలు దాటిపోయింది. రామమూర్తి—ఆంధ్రవీర కంఠీరవుడు—తన సర్కసు మేనేజరునుపిలిచి "రేపురాత్రికి మనము అలహాబాదులో ప్రదర్శ నము యివ్వవలెను. తిలకు మహారాజు ఆవిధ ముగా ఆజ్ఞాపించాడు" అన్నాడు. "షుమారు నూటయాభైమైళ్లు దూరములో వున్నాము. స్పెషల్ ట్రయిన్ రప్పించి తెల్లవారు ఝామున బయలుదేరినా రేపు సాయంత్రం కాని అలహాబాదు చేరము. అప్పటికప్పుడు గుడారము అమర్చి రాత్రి ఎనిమిదిగంటలకు ప్రదర్శనము ప్రారంభించడం సాధ్యమవు తుందా?" అన్నాడు మేనేజరు. "జరిగితీర వలెను." అని శాసించినాడు.

అలహాబాదులో పారిశ్రామికప్రదర్శనము జరగబోతూవుంది. పరిశ్రమలకన్నా దేహ బలము మున్ముందావశ్యకమనీ అందుకోసరం కోడి రామమూర్తినాయుడు యావన్మంది పహిల్వానులతోనూ, అలహాబాదుపోయి దేహబల ప్రదర్శనము చేయవలసివుంటుందనీ లోకమాన్య బాలగంగాధరతిలకు అభిలషిస్తూ వున్నట్టు వర్తమానమువచ్చింది. రామమూర్తికి బాలగంగాధరుడే భగవంతుడు.

ఆరోజున అలహాబాదుస్టేషనులో కూలి వాడొక్కడయిన దొరకలేదు. రైళ్లలో దిగిన జనము అందు కాశ్చర్యపడ్డారు. ఏమి టని విచారిస్తే రామమూర్తినాయుడి సర్కసు దిగింది. అలహాబాదులోవున్న కూలీలనందరినీ సర్కసువారు తీసుకొని పోయినారని తెలి సింది. అందరూ నిర్ఘాంతపోయినారు.

అయిదువేలమందిజనము హాయిగాకూర్చుం డడానికి వీలయినపెద్దడేరా రామమూర్తిది. అంతడేరా ఇండియాలో ఏసర్కసు కంపెనీ వారికీ అప్పటికీ యిప్పటికీలేదు. అతనిసర్క సులో పనిచేసేవారి మొత్తము 1800 మంది. అందులో నూరుమంది హిందూదేశపు పహి ల్వానులు. మరొక ముప్పయిమంది వివిధ పాశ్చాత్యదేశాలనుంచీ వచ్చి ఆయనదగ్గిర బాక్సింగ్ తర్ఫీతుపొంది అప్పటికే జగత్ప్రసిద్ధి పొందిన బాక్సర్లు. జగత్ప్రసిద్ధి పొందిన రష్యన్ కోసక్కులటూప్రు, పర్షియా దేశమునుంచివచ్చి ఆయన సర్కసులో పాల్గొన్న నాట్యకత్తెలు......అది వర్ణించ డ మసాధ్యము. ఈనా డావిషయాలు తలచు కొంటే స్వప్నగతవృత్తాంతములవలె వుంటవి.



కీ. శే. కోడి రామమూర్తి

......రాజాధిరాజులు తలపెట్టి . నెగ్గలేని అన్నదానము అలహాబాదులో చేసినాడు.

రాత్రి సర్కసులో మామూలుప్రదర్శన మయిపోయినతరువాత ఒక్కసారిగా ఆయన నూరుమంది పహిల్వాను శిష్యులూ కుస్తీ ప్రదర్శనము యిస్తూవుంటే— బాక్సర్లు బాక్సింగ్ ప్రదర్శనము యిస్తూవుంటే ప్రపం చము చకితమయిపోయింది. పత్రికలు పెద్ద పెద్ద బొమ్మలువేసి పేజీలు నింపుకొన్నవి. గవర్నర్లు సంస్థానాధీశులు, జోహారులిచ్చి నారు. జాతీయనాయకులు "చూడండి, మా హిందూదేశములో యెటువంటి బలాఢ్యు లున్నారో చూడండి" అన్నారు. అనాధ ఆపన్నులాయన్ను అర్థించినారు. బలాఢ్యు లాయన్ను ఆశ్రయించినారు. జనసామాన్యము ఆయనవలె తామున్నూ వుండవలెనని సంక ల్పించుకొన్నారు.

ఆరోజులలో ఆయన సర్కసు వస్తున్న దంటే నూరుమైళ్లు నూటయాభై మైళ్లనుంచి బీదవాళ్లునడిచి భాగ్యవంతులు బండ్లుకట్టుకొని ఆయన్ను చూడడానికి వచ్చేవాళ్లు. ఆవచ్చిన బీదవాళ్లందరికీ యింత అన్నము కూడాపెట్టి తనదర్శనము యిచ్చేవాడు. ఇదంతా ఎవరు? ఒక తెలుగువాడు. జగదేకవీరుడనే కీర్తిగణించి నాడు.

ఈనాడు అనామకుడుగా అజ్ఞాతముగా మరణించినాడు. దీనికి కారణము అతను తెలుగువాడై పుట్టడమే!

రామమూర్తి యినపగొలుసులు తెంచే వాడు. వక్షఃస్థలమువీాదినుంచి మూడుటన్నుల ఏనుగునడిచిపోతే కించిత్తయినా చలించేవాడు కాడు. రెండుటన్నుల రాతిబండను వక్షఃస్థలం మీాదపెట్టి దానిమీాద మరికొన్ని బండలను పగలగొడుతూవుంటే నవ్వేవాడు. మోటారు కారుకు తాడుకట్టి ఆతాటిని తన నడుముకు కట్టుకొని మందహాసము చేస్తూవుంటే డ్రైవ జర్ను నడిపిస్తే కారుమాత్రము నడిచేదికాదు. ఈవైపు నొకకారూ ఆవైపునొకకారూవుంచి వాటిరెండింటి తాళ్లువేసి నడుముకు బిగించు కొని మధ్యను రామమూర్తి స్థాణువులాగా నిలుచుంటే ఆకార్లు నడిచేవికావు...ఇంకా యెన్నెన్నో సాము గరడీలు చేసేవాడు. అతనివక్షోభాగము చుట్టుకొలత నలభైయెనిమి దంగుళములు. దేహాన్ని పెంచినప్పుడు దాని చుట్టుకొలత అరవై అంగుళములు; అంటే అయిదడుగు లయ్యేదన్నమాట......

అతనిసాము గరడీలనుగురించి వర్ణించడము మొదలుపెడితే యెంతయినా గ్రంథమవు తుంది......

అతనితో వున్నంతకాలమూ అతనిపహిల్వానులు ఏమరి ఒక పహిల్వానుతోనూ కుస్తీ పట్టి ఓడిపోలేదు అతని బాక్సర్లు ఏమరి ఒక బాక్సరుతోనూ ఓడిపోలేదు. తనను కానీ తనశిష్యవర్గాన్ని కానీ ఓడించినవారికి వెయ్యిన్నీ నూటపదహార్లు బహుమానము చేస్తానని గొంతెత్తి దిక్కులు పిక్కటిల్లేట్లు యావద్భారతదేశములోనూ- యావద్భారతదేశములోనేమి కర్మము- ఖండఖండాంతరాలలోనూ సవాలుచేసేవాడు. గ్రహచారము చాలని శాండోలు బయలుదేరేవారు వెయ్యిన్నీ నూటపదార్లు కొట్టుకొనిపోదామని: చివరకు తలవంచుకొని పరాభవముపొ పోయేవారు.

ఇదంతా ఏమిటి? కేవలము దేహబలమువల్లనే యీపనులన్నీ చేయగలిగినాడా రామమూర్తి అని నాటికీ నేటికీ ప్రశ్న. హఠయోగాభ్యాసమువల్ల నని చాలామంది బుద్ధిమంతులు నిశ్చయించినారు.

అతనివెంటవుండి చూచినవారి కట్లా తోచదు. అతడొక అసాధారణవ్యక్తి. ఒకప్పుడు అతడు మాసములపర్యంతమూ దేహవ్యాయామము చేసేవాడుకాడు. మరి ఒకప్పుడు మాసములపర్యంతము నిద్రపొయ్యేవాడు కాడు. ఒక్కొక్కప్పుడు ఏదిపడితే అది భుజిస్తూవుండేవాడు. అంతేకాదు. అతను మహాబలాఢ్యుడుగానూ అజేయుడుగానూ వున్న రోజులలోనే (Loose Bowels—ఈ వ్యాధికి తెలుగులో ఏమంటారో నాకు తెలియదు) రోజుకు కనీసము పదిపన్నెండు పర్యాయములయినా మలవిసర్జనము చేయవలసివుంటూ వుండేది. శాండోలుఅయినవారు చేయకూడని యెన్నో పనులు అతడు చేస్తూవుండేవాడు. కాని ఆతనిని తోసిరాజు అన్నవాడు ప్రపంచములో-యావత్తు ప్రపంచములోనూ- లేకపోయినాడు...మామూలు లౌకికవిషయాలలో ఆయన బుద్ధిబలము పూజ్యము. 'మూడోతరగతి ఆరుపర్యాయములు తప్పిపోయిన మహావిద్వాంసుణ్ణి!' అని ఆయనే నవ్వుతూ అందరితోనూ చెపుతూవుండేవాడు...ఒక పహిల్వానో ఒకబాక్సరో తనసవాలు నంగీకరించి తన శిష్యులమీదికివస్తే ఆ వచ్చినవాడి ఆయువుపట్టు ఫలానాచోట అని నిర్ణయించి శిష్యులకు చెప్పేవాడు. ఆ శిష్యులు క్షణలేశములో ఎటువంటిబలాఢ్యుణ్ణి అయినా ఓడించే వేసేవాళ్లు. ఆశక్తి ఎట్లా ఆయన కబ్బిందో ఎవరికీ తెలియదు; ఆయనకూ తెలియదు. అది ఆయనకు జన్మతః వచ్చింది, అంతే. ఆయన పుట్టుకతోనే జగదేకవీరకంఠీరవుడు, బాక్సర్లు — తమ ముష్టియుద్ధప్రాగల్భ్యముతో యావత్తు యూరపుఖండాన్ని ఆశ్చర్యపడేటట్టు చేసిన బాక్సర్లు ఆయనదగ్గిర శిక్షపొందడానికి వచ్చినబాక్సర్లతో గెలువలేకపోయేవారు. వారి విషయములోకూడా అంతే. ఎదటిబాక్సరు ఆయువుపట్టు యెక్కడవుందో రామమూర్తికి చూసేచూడడముతోటే ద్యోతక మయిపొయ్యేది. ఆవిషయము శిష్యులకు చెప్పేవాడు, వా రెంతటిబాక్సరు నయినా యిట్టే ఓడించేవారు...

రామమూర్తి తన సాము గరడీలవల్ల యెంతధన మార్జించినాడో లెక్కలేదు. ఒకప్పుడు అంటే ఆయనకు దారిద్ర్య మారంభమయిన దినాలలో ఆయనదగ్గిర పనిచేసిన ఒక గుజరాతీగుమాస్తా లెక్కవేసి చూస్తే మొత్తముమీద ఆయన పదిసంవత్సరాలలో షుమారు ఒకటిన్నరకోటి రూపాయలు దానధర్మములు చేసినట్టు తేలింది......చివరకు పరమదారిద్ర్య మనుభవించినాడు. ఆయన దారిద్ర్యదినాలలో ఒక్క పండిత మదనమోహనమాళవ్యా తప్ప నా అన్నవాడెవడూ యీ ప్రత్యక్షజగత్తులో లేకపోయినాడు. పాపము! రామమూర్తి జనవరి ౧౬ వ తేదీన పరమపదించినాడు. నరక మంతా యిక్కడే అనుభవించినాడు. ఇక ఆయనకు స్వర్గమే.

ఆనాడు ఆయన మహోచ్చ దశలో వున్నప్పుడు అప్పటికే యావదాంధ్రనాయకుడయిన దేశభక్త కొండ వెంకటప్పయ్యపంతులు గుంటూరులో రామమూర్తికి స్వాగతము చెప్పి జోహారు లన్నాడు.

ఆనాడు కలకత్తాలో చదువుకొంటూ వున్న ఆంధ్రవిద్యార్థులు నే డాంధ్రనాయకులయినవారు రామమూర్తిచుట్టూ చేరి మేము మీదేశస్థులము అని గర్వపడ్డారు.

నేడో, ఆయన మరణించినాడు. ఆంధ్రదేశములో ఆంధ్రులలో ఆవిషయము తలచేవారయినా కనుపించరు. కారణము ఆయన ఆంధ్రుడై పుట్టడమే! ఆంధ్రుణ్ణి అని దేశదేశాలలోనూ చాటుకొనడమే!!... ఆంధ్రదేశములో పొరపాటున ఏ మహానుభావుడయినా పుట్టి వాడు ఆంధ్రుణ్ణి అని బహిరంగముగా చెప్పకొన్నాడో వాడు చివర కనామకుడుగా పోవలసిందే! అది తప్పదు. అది యీ క్షేత్రమహిమ......

ఈసంగతి శ్రియఃపతికి తెలిసేకాబోలు రామమూర్తి తదనంతరము అన్నాతురు లయి అల్లాడవలసిన కుటుంబమంటూ ఒకటిలేకుండా చేసినాడు. అందుకు నిజంగా అందరూ సంతోషించవలసిందే!

ఆయన మరణించినాడంటే విచారపడవలసింది లేదు. ఏమంటారా? ఆంధ్రుడై పుట్టి జగదేకవీరుడని ఖ్యాతి సంపాదించి అజ్ఞాతముగా దేహయాత్ర చేయడముకన్నా మరణమే మంచిది. శ్రీ

## ౨ శరచ్చంద్రచటర్జీ

టాల్‌స్టాయి మరణించినప్పుడు రష్యాదేశమెంత తహతహ లాడిందో ఇంచుమించుగా అంతగా విలపించింది వంగదేశము శరచ్చంద్ర చటర్జీమరణించినా డంటే. టాల్‌స్టాయివలెనే కథలూ,నవలలూ రాసి అనంతయశస్సు సంపాదించాడు శరచ్చంద్రుడు.

జగద్విఖ్యాత గ్రంథకర్త యగు రోమెయిన్ రోలండ్ శరచ్చంద్రుని నవల ఒకదాని ఫ్రెంచి తర్జుమాను జూచి యితనికి విశ్వసాహిత్య నిర్మాతలలో ఉన్నతస్థాన మున్నదని ప్రశంసించాడు. ఇతని కథలసంపుటి నొకదానిని విమర్శిస్తూ లండన్ టైమ్సు పత్రిక యితనిని గైడి మాపాసాకంటే గొప్పవా డని పొగడింది. ఇక వంగదేశీయు లితనిని తల మీద పెట్టుకున్నా రంటే ఆశ్చర్య మేముంది?

శరచ్చంద్రుడు చిన్నతనం చాలా పేదరికంలో గడిపాడు. చదువు సంధ్యలు సాగలేదు డబ్బు లేక. తండ్రి యిచ్చిపోయిన ఆస్తి అంతా రెండు గుణాలు మాత్రమే. శాంతిలేని మనస్సు ఒకటీ, సాహిత్యపిపాస ఒకటీ. మొదటిదానివల్ల అతడు దేశమంతా తిరగటం మొదలెట్టాడు. అందువల్ల అసాధారణమైన లోకానుభవం సంపాదించాడు. రెండవది అతని భావిజీవితధర్మమునకు పునాది.

చిన్న చిన్న పనుల్లో చిక్కుకొని కొన్నాళ్లు కాలం గడిపాడు గాని అవి యేమీ నిలువలేదు. సామాన్యంగా తక్కువజాతి అనబడే సంఘంలో తిరగటం మొదలెట్టాడు. నిశితమైన అతనిబుద్ధి వాళ్ల కష్టసుఖాలన్నీ బాగా గ్రహించింది. అవే తరువాత అతనిగ్రంథాల్లో అనిర్వచనీయసౌందర్యంతో ప్రతిఫలించినవి.

రంగూన్‌లో యేదో గవర్నమెంటు ఉద్యోగం ఒకటి దొరికింది. కాని అందులో అతనికి శాంతి కుదరలేదు. ఇంతలో అకస్మాత్తుగా తన స్నేహితులు కొందరు ఒక పత్రికను ప్రారంభించి "ఏదన్నా రాసిపంపు" మని కబురు చేశారు. ఒక చిన్న కథ పంపాడు. అదే అతనిపేరు వంగదేశమంతా తెలిసేటట్టు చేసింది. యువజనప్రపంచంలో ఒక క్రొత్తచలనం పుట్టించింది. వాఙ్మయాకాశాన నవ్యతారక ఒకటి అపూర్వదీప్తితో ఉదయించిందన్నారు. అతని కథలంటే యెక్కడలేని ఆదరం చూపారు. అప్పటినుంచీ ఒకటివెంబడి ఒకటి ఆపత్రికకే కథలు వ్రాసి స్థిరమైన పేరు సంపాదించుకున్నాడు.

రంగూను ఉద్యోగం వదులుకొని మాతృభూమి చేరి సారస్వతసేవకే సర్వశక్తులూ వినియోగించటం మొదలెట్టాడు. పాతికవరకు పెద్దనవలలు, లెక్కలేనన్ని చిన్నకథలు వ్రాసి వంగదేశజీవితమునకు శాశ్వతరూపము నిచ్చి కృతార్థుడైనాడు. అతని గ్రంథములలో కొన్ని పెక్కు ముద్రణలు పొందినవి. ఐశ్వర్యమున తులదూగినాడు. "వంగదేశమున సారస్వతసేవ చేసి యిక్కట్ల పాలుగాని అదృష్టవంతుడను బహుశా నేనొక్కడనే" అన్నాడతడే ఒకసారి.

ఇంతటి ఆదరణ పొందటానికి అతని రచనలలో వున్న గొప్ప గుణాలు ముఖ్యంగా రెండు; దేశీయజీవితమును, అందులోనూ సంఘముచే బహిష్కరింపబడి అధమంగా చూడబడుతున్న వారిచేష్టలను, మనోవృత్తులను హృదయరంజకముగ చిత్రించటంలో అతనికి వున్న ప్రతిభ ఒకటి. ఆత్మవికాసానికి అడ్డుపడే సాంఘికాచారములను కట్టుబాటులను తిరస్కరించి అతడు మానవవ్యక్తి కిచ్చిన అపూర్వోన్నతస్థానము రెండవది.



కీ. శే. శరచ్చంద్రులు

మొదటిగుణముచేత రవీంద్రునంతటివారు గూడ ముగ్ధులైనారు. "శరచ్చంద్రుడు మన కిచ్చు కానుకలు మనహృదయమున కెంతో చేరువగా వచ్చునవి. ఇదివరకు మన మెరిగిన రచనలం దెచ్చటనూగూడ ఇతడుసృష్టించిన పాత్రలవలె హృదయమునకు సూటిగా తాకే వ్యక్తులు గోచరించలేదు. ఇతడు చక్కగా సర్వతోముఖముగ చూచినాడు; స్పష్టముగా చూపగలడు." అన్నాడు రవీంద్రు డొకసారి.

రెండవ గుణముచేత శరచ్చంద్రుడికి మొట్టమొదట శత్రువులు మిక్కుటంగా యేర్పడ్డారు. అతడి వర్ణనలవల్ల వంగవాఙ్మయంలో నీతిబాహ్యమైన రచనలకు ప్రోత్సాహం కలుగుతున్నదని వాళ్లు కోపగించారు. కాని కొద్దికాలంలో వాళ్ల గడబిడ అణిగిపోయింది. శరచ్చంద్రుడి ముఖ్యోద్దేశము అమానుషము లగు సాంఘికబంధములను త్రెంచి, అన్యాయముగా బాధింపబడు జీవులకు స్వాతంత్ర్య మిచ్చుటే కాని అవినీతిని వ్యాపింపజేయుట యెంతమాత్రమూ కాదని గ్రహించినంతనే వంగదేశ మాతనిని సువర్ణపుష్పములతో పూజించినది.

ప్రేమను చిత్రించటంలో శరచ్చంద్రుడు త్రొక్కిన క్రొత్తత్రోవలు, చూపిన పరిశీలనశక్తి వర్ణించటానికి అలవి కానివి. "చరిత్రహీన్" అనేనవలలో విద్యావంతుడైన ఉన్నతవంశములోని కుర్రవాడికీ హోటలులో పనిచేసే ఒక దాసీపిల్లకూ గలిగిన ప్రేమను మధురకథాసంవిధానంలో అల్లివేసి కనపర్చాడు. "దేవదాస్" అనే నవలలో వివాహిత అయిన స్త్రీకి దురభ్యాసాల్లో పడిపోయిన బ్రహ్మచారికీ ప్రేమ. "పల్లీసమాజ్" లో వితంతువివాహమనే మాట అయినా సహించని పల్లెటూరి పురాతన సంఘంలో ఒక వితంతువుకూ బ్రహ్మచారికీ ప్రేమ. శరచ్చంద్రుడి గ్రంథాల్లో సర్వోత్కృష్టమైన "శ్రీకాంత" లో గూడ యిట్టి సంఘటన లున్నవి. ఇవియెల్ల నతని రచనానైపుణిలో విచిత్రరూపములు పొంది మనుష్యహృదయములోనిలోతు చూపించి వంగసారస్వతమునకేగాక సంఘములోగూడ గొప్ప మార్పు తెచ్చినవి.

శరచ్చంద్రుడి రచనలు హిందీలోకి త్వరలో మా అయినవి. తెలుగులోకి తప్పక కావలసినవి. వంగభాష నేర్చిన నవ్యరచయితలే వెంటనే ప్రారంభింపవలసినపని అది.

కుం. న.

# విమర్శనము

## స్వప్నానసూయ

[పద్యకావ్యము. గ్రంథకర్త: ఆకొండి రామమూర్తి, క్రౌను ౧/౮ సైజు, ౯౦ పుటలు. అచ్చుకూర్పు మొ. అందముగ నున్నవి. వలయువారు 'మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, పల్లిపాలెము, కాకినాడతాలూకా' అని వ్రాసినఁ బడయఁగలరు.]

సరసకవి యగు శ్రీ రామమూర్తిగారు వారి మిత్రుని కోరికపయి మహిళామణులకు నీతిని బోధించు నీ గ్రంథమును అయిదాశ్వాసములలో రచించిరి. వారి మిత్రులగు శ్రీ చందూరి నారాయణరావు శ్రేష్ఠిగారు కవిగారితో

'నా ప్రియధర్మపత్ని సుగు
: ణంబులుఁ, దచ్చరితాంశముల్ తదీ
య ప్రణయప్రకారములు
నందును నందును సుప్పుసప్పనన్,
గ్రపుఁబలుక్కలో యనఁగఁ
గమ్మని తావులఁ నుమ్మరించుచున్
నీ ప్రతిభావి శేషముల
నిగ్గలతో విలసిల్లఁగావలెన్.'

గీ. 'నీరచించుకృతి యుదార భావంబులు
దెలుఁగునాట వెలయు స్త్రీల కెల్ల,
నుచితధర్మసమితి నుగ్గడించుచు బోధ
సేయవలయుఁ బుణ్యసిద్ధి గాఁగ.'

క. 'ఆకృతి నత్యంతమనో
జ్ఞాకృతిగా ముద్రణమున నలరించి సుధీ
లోకము మెచ్చఁగ వనితా
లోకమున క్షమాల్యధర్మనియతినొసఁగెదన్'

అని గ్రంథరచనాపద్ధతిగూర్చి విన్నవించెను. 'కృతి రచింపఁబూని వీరొక్క నిరుపహతిస్థలంబున విశ్రమించి నిమీలితలోచనులై, యాలోచనైకాయత్తచిత్తులై యుండుటయు, నాసమయంబున నిద్దురపట్టుటయు, ఆనిదురయందలి స్వప్నమునం దిర్వురు పుణ్యవతులు గన్పడుటయు జరిగినది. స్వప్నమున— ఆ పుణ్యవతు లిర్వురికి జరిగినసంభాషణమునే కవిగారు కృతిగా రచించిరి. ఆపుణ్యవతులలో నొకరు శ్రీ నారాయణరావుగారి ధర్మపత్నియగు అనసూయాతరుణి; మఱొకరు అత్రిమహాముని ధర్మపత్నియగు అనసూయాదేవి. అందుచే నీకృతికిఁ గృతికర్తలు 'స్వప్నానసూయ' అను నామముంచినట్లు కనఁబడుచున్నది.' అని 'పానుగంటి'వారు 'పీఠిక'లోననిరి.

పరమపదించిన అనసూయ పుణ్యలోకమును చేరి అచటనున్న మహర్షులయు, పతివ్రతలయునుదంతమును, తా నున్న లోకపు సంగతిని, తనబంధువుల సమాచారమును తెలియనేఱక చేరువనున్న అనసూయాదేవిని—అత్రిమహర్షి భార్యను— సంగతిని దెలుపవలెనని ప్రార్థించినది; ఆమె బంధువులఁగూర్చి పరితపించు 'ననసూయ'కు జ్ఞానోపదేశము నొనరించి, మోహము నణంచి, ఆమెబంధువుల క్షేమోదంతమును తెలిపెను; మఱియు నామె 'అనసూయ' కోరికపయిని 'పరమపాతివ్రత్యశ్రీ విలసిల్లిన సతుల ప్రభావమ్ము'లఁ జెప్పి ఆమె నానందమగ్న నొనర్చినది. అవి సీత-ద్రౌపది అనసూయ అనుముగ్గురు ముత్తయిదువుల చరిత్రముల సంగ్రహములు!

ఇందలి కథాంశ మిది:

వైద్యమునందువలె రచనయందును సిద్ధహస్తులగు శ్రీ రామమూర్తిగారి కవితాపద్ధతిని విశేషించి పరిచయ మొనర్ప నక్కఱలేదు. మచ్చునకు ఉదాహృతపద్యములే చాలును.

శ్రీ రామమూర్తిగారు చమత్కారమగు పద్ధతిని కథ నారంభించి యుచితరీతిని పెంచి తమ నేర్పును వెల్లడించినారు. కాని అనసూయాదేవిచే స్వీయప్రభావమును చెప్పించుట ఔచితిని కొంత కోలుపోయినది. సీతా, ద్రౌపదుల చరిత్రల విన్నమీఁదట అనసూయ అనసూయాదేవిని—

గీ. తనివిదీఱఁ బతివ్రతాధర్మసూక్ష్మ
గతి యెఱింగించితివి జగద్ధితముగాఁగ,
నట్టి సత్పతివ్రతల మాహాత్మ్యసరణి
యును నొకింత వచింపు మోజనని! నాకు'

అని యడిగినది; కాని అనసూయాదేవిచరిత్రమునే చెప్ప నడుగలేదు. అట్లడుగకున్నను దేవి—

'ఇందుల కుదాహరణంబుగా మదీయానుభవంబున నున్న యొకానొక వృత్తాంతంబు నీ కెఱింగించెద నాలకింపుము' అని స్వీయచరిత్రమునే చెప్పినది. వేరెవరియుదంత మయిన నామెచేఁ జెప్పించినచో ఎంతయును బాగుగ నుండెడిది.

బు. వేం. ర.

---

## ఆంధ్రకథాసరిత్సాగరము

[పద్యకావ్యము, క్రౌను౧/౮ సైజు. క్యాలికో బయిండు – నాలుగుసంపుటములు; మొదటి సంపుటము పు. ౨౮౦; రెండవ సంపుటము పు. ౨౩౬.; మూఁడవ సంపుటము పు. ౩౬౬; నాల్గవ సంపుటము పు. ౧౧౭.

మంచి కాగితము; చక్కని కూరుపు. గ్రంథకర్తలు: శ్రీ వేంకట రామకృష్ణకవులు, పిఠాపురాస్థానవిద్వాంసులు.]

'సంస్కృతాంధ్రభాషాప్రపంచమున నున్న కథల కన్నిటికిని' కథాసరిత్సాగర మే 'కన్న తల్లి.' సోమదేవకవి దీనిని సంస్కృతమున పద్యకథగా రచించెను. ఆతని గ్రంథమునకు మూలము 'భూతభాష'లో గుణాఢ్యకవిచే రచింపఁబడిన 'బృహత్కథ' యని ప్రతీతి. కాని యా గ్రంథ మిపు డనుపలబ్ధము.

కథాసరిత్సాగర మష్టాదశ 'లంబకా'త్మకము. లంబకములలోని యధ్యాయములు 'తరంగములు.' శ్రీ వేంకటరామకృష్ణకవుల ఆంధ్రీకరణమున ఒక్కొక్క లంబక మొక్కొక్క సంపుటముగ ముద్రింపఁబడుచున్నది.

ఆంధ్రీకృతియందు సుబంధు, బాణ, కాళిదాస, హర్షులును, పింగళి సూరనయు తమ గ్రంథములను రచించుటకు కథాసరిత్సాగరకథల నెట్లుపయోగించుకొనిరో చెప్పఁబడినది; కథాసరిత్సాగరము క్రీస్తుపుకంటెఁ బ్రాచీనమయినదని యిందు చెప్పఁబడినది. కాని యట్లనుటకు ప్రమాణము చూపఁబడలేదు.

పద్యకావ్యములు సులభముగ పలువురి కుపయోగించుటకు భాషాంతరీకరణము గద్యరూపముగ వెలయుట సర్వవాఙ్మయసాధారణము. ఆంధ్రమున ఆపద్ధతి కొంత విలక్షణముగ నున్నది. గద్యమూలములు కొన్ని పద్యానువాద

ములుగ పరిణమించుచున్నవి. విక్రమార్క-చరిత్ర, దశకుమారచరిత్ర, కాదంబరి మొద లగునవి దృష్టాంతములు.

గద్యరూపానువాదమునందలి ప్రయోజన మును గమనించియే శ్రీవేంకటరాయశాస్త్రులు గారు కథాసరిత్సాగరమును గద్యరూపమున వెలయఁజేసిరి.

శ్రీవేంకటరామకృష్ణకవు లీ విషయమున-

'కతలను బద్యకావ్యములు
గా నొనరించుటకంటె సద్రసో
చితగతి గద్యకావ్యములు
చేయుట యుక్తమటంచు కొంద ఱా
విత మది యే నెఱింగియును
వేడుకమై నిటు గద్యపద్య సం
మిశ్రితపు కావ్యభక్కిని ర
చింపఁ దలంచితి దీని నియ్యెడన్.'

అని తమ రచనాపద్ధతిని సమర్థించుకొని నారు. నిజము చెప్పవలసి వచ్చినచో నిది పద్యప్రబంధ మగును; ఆంధ్రమునఁ బ్రత్యేకముగ చంపువులు (గద్యపద్య సంమిశ్రితములగు కావ్యములు) లేవు. పద్యకావ్యము లన్నింటి యందును, (అనగా- నిర్వచనవిశేషణ- విశిష్ట ములందక్క) పయి గద్య పద్య విశిష్టపద్ధతి యుండనేయున్నది.

శ్రీ గ్రంథకర్తలు సుప్రసిద్ధాంధ్రకవులు; పెక్కేండ్లనుండియు కవితాప్రచార మొన ర్చుచు చాల సభలయందు సమ్మానముల పొందుచున్నారు. రచన సరళము, రసవం తము, సర్వజన సులభగ్రాహ్యము. కావున గద్యకావ్యముతో సమానముగ గౌరవము పొందఁదగియున్నది; భావము చెడకుండ సుల ముగ పద్యములందుఁ గూర్చుట ఇందు విశే షము. ఇయ్యది ఆంధ్రు లందఱి యాదరణము నకును పాత్రము కాఁదగినది; కాఁగలదుకూడ. కావున కర్తలు:—

"బంధము లెల్ల వీడి బహు
భావసమృద్ధిగ నేఁడు మత్తపు
ష్పంధయగీతి నా విరియఁ
బాఱుచునున్నది తెల్గుకైత; మ
ద్గ్రంథముఁ గాంచుకాల మిది
గా; దటులైనను నేనుఁ బూర్వ
నిర్బంధకవిత్వపద్ధతులఁ
బట్టియె దీని రచింపఁబూనితిన్"

అని నిరుత్సాహతను ప్రకటింప నక్కఱ లేదు. సుగ్రాహణ పారీణులగు సహృదయులు ప్రాచ్య, నవ్య భేదములను పరిగణింపరు. గుణదోషపరిగణనము, ఆదరానాదరములును వస్తుయథార్థస్థితినిమాత్ర మనుసరించి యుండును; వ్యక్తి, పద్ధతుల ననుసరించి యుండదు.

ముఖపత్రమునుబట్టియు, లంబకాంతగద్య ములంబట్టియు నీ "కథాసరిత్సాగరము" శ్రీ వేంకటరామకృష్ణ కవిద్వయప్రణీత మగు నట్లు తెలియుచున్నది. కాని గ్రంథమునం దచటనచటఁ గల ఏకవచనప్రయోగములం బట్టియు, లంబకాంత పద్యములంబట్టియు నొక్కరే-అనఁగా - వేంకటరామశాస్త్రిగారే దీనిని రచించినట్లు తోఁచుచున్నది. ఏతద్గ్రంథ నమున వారికి శ్రీ రామకృష్ణశాస్త్రిగారి సాయము లేకపోయినది; పాపము! అందు చేతనే వారు—

'అనుఁగు మేనత్తకొమరుఁడై యాశుకవిత,
నాకుఁ జేదోడువాదోడునై కడచిన,
కృతిసమర్థుండు మా రామకృష్ణశాస్త్రి
యున్న నీసాయ మర్థింతునోటు దేవి ?'

అని వాపోయినారు. ఆయనయెడఁ గల ప్రేమచేతనే కృతికర్తృత్వపు వంతును వారి కిని తమతో సమముగఁ బంచిపెట్టిరి. పాఠ కులు పరస్పరవిరోధము నెన్నకుందురుగాక !

'పలుకుల వెలంది యెట్లెటు
పలికించిన నట్టు లేను బలికితి దోసఁగుల్
గలిగిన మన్నింపుడు పె
ద్దలు రసవత్పదపదార్థతాత్పర్యజ్ఞుల్'

అని శ్రీ వేంకటరామ శాస్త్రులుగారి ప్రార్థన. పండితవర్యు లీ ప్రార్థనను పాటించి దీనిప్రాశ స్త్యమును వెల్లడింపఁదగును.

బు. వేం. ర.

---

## కలం పోటు

[శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రికథ లు-రెండవ పుస్తకము. క్రౌను అష్ట కము-వెలరెండు అణాలన్నర. కళాభి వర్ధినీ పరిషత్తు రాజమహేంద్రవరము.]

శ్రీ శాస్త్రిగారు తమ కథలన్నీ సంపుట ములుగా ప్రచురించబోతున్నామని కొంత కాలంక్రిందట ప్రబుద్ధాంధ్రలో వ్రాస్తూ వచ్చారు. అప్పట్లో పత్రిక, ఇబ్బందులవల్ల నడవడం మానుకోవడంతో, ఆప్రయత్నము న్నూ తాత్కాలికంగా విరమించడం జరి గిందనుకుంటాను. పునః స్వాస్థ్యము కుదిరి పత్రికను ఉద్ధరించు కున్నారు. దానితో బాటు, కథలున్నూ-మొదట అనుకున్నట్టు కాకపోయినా- దేని కది విడిగా గ్రంథరూప మునకు ... సాహిత్యాభిమానుల సాహాయ్యం వల్ల తేలుస్తూ ఉన్నారు.

ఇలా ఒక్కొక్క కథ ఒకపుస్తకంగా సమకూర్చడం ఉచితంగానే ఉన్నది-శాస్త్రి గారి కథలన్నీ ఒదుసులో...చిన్ననవలలు పాఠకుల ఉత్సాహమునకు అందు బాటు గానే ఖరీదుకూడా అమిరింది. కనుక శాస్త్రి గారు తలపెట్టినపని, చదివే కుతూహలం ఉన్నవారికి వారికేని, బహుచక్కగా లాభించవచ్చును.

కలంపోటు ... రెండవది ప్రచురణము. రాయలవారు, తిరుమలాంబమీద రాజసభ- చిలిపితనంగా అలిగి ఆదేవి నగరి చాయల కన్నా పోవడం మానివేసినప్పుడు ... ముక్కు తిమ్మన్న పారిజాతాపహరణం ప్రబంధంలో, దీనికి విరుగుడు కలగలిపి గోపాలదేవుని దక్షి ణనాయక పాండిత్యానికి... సత్యభామను ఎదురుతిప్పి పాదప్రహార-బహూకృతి చేయిం చి, ఆకథచదివి వినిపించడంలో ... ప్రభువు రాసిక్యాన్ని గిలిగింతలతో మేల్కొలు పడం... కథ.

ఈకథ... గ్రంథస్థముగా లభించక పోవడం వల్ల ఏకరూపంగాలేక...చిలవలు పలవలతో దేశం అంతా ఏనాడో ప్రచారం అయి పోయి వ్యాపించి మాత్రము ఉన్నది: శాస్త్రి గారు ఈ ఇతివృత్తాన్ని కథ-నాటకంగా తమ రచనలోకి మార్చుకున్నారు. కథకు లుగా వారి శిల్పమునకు వేరొక పత్రికలో ప్రశంసా - వ్యాఖ్యను అంజలించుకున్నాను: ఆవిషయము ఇక్కడ విస్తరించి తలపెట్టిన వసరము లేదనుకుంటున్నాను.

కథలో... పాత్రల ప్రకృతి కల్పనలలో, నాటకం చదివినప్పుడు కొన్ని సందేహములు కలుగుతూ ఉన్నవి.

మహామంత్రికి, అప్పటికి వారంరోజుల క్రితమే తెలిసిపోయి అంతటి మేధా - స్వామి ట్టునుకూడా, గగ్గోలు పరుస్తూన్న ? ఆ అంతఃపుర రహస్యం, దాసీపిల్ల వివరించేదాకా... రాణీకి ఏకైక ఆప్తుడైన తిమ్మన్నకు ఎందుచేత తెలిసిందికాదు? 'అఆమ్మాయి' క్షేమాన్ని ఎప్పుడూ వేయికళ్లతో కనిపెట్టి చూస్తూండవలసిన బాధ్యతతో...పుట్టింటినుంచి,ఆమె వెంట సారస్వత-హరణంగా వచ్చిన కవి-దిగ్గజం...ఎంతస్వల్ప విషయమైనా, ఇంకొకరు వచ్చి చెప్పేదాకా పసిపట్టలేని ధిషణాల సుడా? — లేక, ఉద్రకవిగా, అప్పుడే కావ్యరచన ఆరంభంచేసి...పెద్దల మెప్పులు శిష్యునినోట వినే బులబా౦ఃంలో...అప్పటికి మాత్రం ఇతరజోక్యములేవీ పట్టించుకోకుండాఉంటూన్న...లోపమా ?

అదివరకల్లా సభలో, ఇతర అవరోధ జనంతో బాటు, తెరచాటున కూర్చుండి కావ్యం వింటూన్న తిరుమలాంబ ఆనాడు... చివరిరంగంలో ప్రబంధఘట్టం వినడానికి... రాకపోవడమునకు కారణం? — పడకటింటి ముచ్చట అవాళే అంతఃపురంలో అల్లుకుపోయినందువల్ల సపత్నీమండలిలో కూర్చోలేక...సిగ్గుపడిపోయిందా...లేక, తిమ్మన్నగారి కావ్యవాణి...నాథుడి అలుకతీర్చే అవకాశంలో వాసకసజ్జికగా తీరికలు దిద్దుకుంటూ... నగరు విడువలేదా?

అది, కన్నడరాజ్యరమారమణుని...దివ్య సభాస్థలమా...రాచరికము,పొగడ్తలతో ప్రకటించుకునే...:మన్నెదొర...దరబారా ?

అష్టదిగ్గజములు...నిరంకుశ-సైజం దుశ్శాలువలలో దాచుకుని...వందిమాగధకై వారములకుబారులుతీరిన... భట్రాజులా : తిమ్మరుసు 'అప్పాజీ' కాడా:స్వామిపరామర్శలకు...దోసిలిఒగ్గి అతివినయంతో సమాధానం మననిచేస్తూ దాసజీఃతం తరింపజేసుకునే...చంద్రగిరి మధూకరపు వడుగా?

సభాస్తారు లందరికి గుసగుసలపని కలిపించి...కావ్యపఠనం మానిపించి...ఒంటివాలు మీదసభ వదలిపోవడం...కొన్ని సమయాల్లో గంభీరులుగా ప్రవర్తించవలసిన ప్రభువులకైనా సహజమేనా ?—స్వజనులే కనుక అన్యథా తలచరు...తలచినా మించిపోయేది లేదు అనే ధీమాతో కృష్ణరాయలు ... అలా హఠాత్తుగా...గద్దెగి లోపలికి విజయంచేసినారా ?

రాయలు ఎందు కల్లా పరధ్యానంలో పరవ్యాసంగాలతో...బాధను ? మరపించుకునే సాధన చేస్తూన్నాడు : తనదే పొరబాటని బాధా? అపచారం ఎరుగని దేవిని అనవసరంగా విప్రలంభంతో అలయిస్తూన్నాను, అరసికుణ్ణి అనే బాధా? ఆమెమీద కూరిమి సడలించుకోలేక...చేసినదనుకున్న తప్పు...కాదని సర్ది చెప్పుకోలేక ... కర్తవ్యం స్వయంగా తేల్చుకోలేని...బాధా?

విపులమైన భూమికతో గ్రంథం ఆరంభం చేసినా...సంభావణలకు సాకీగా విషయవివరణం కథగా చేసుకుంటూ వచ్చినా...నాటకాన్ని ఇంకా విరివిగాచేసి రచించినా...ఈ సంశయములకు సమాధానములు లభించేవే అని నమ్మకం:

పింగళి నాగేంద్రరావుగారు 'నారాజు' నాటకంలో (భారతిలో ౮ అంకములుమాత్రముఅచ్చయినట్లు జ్ఞాపకం) 'పెద్దిరాజు' అని కవితాపితామహుడికిచేసిననామకరణమే,కర్ణారుంతుదమై ఉన్నదనుకుంటే శ్రీశాస్త్రిగారి 'పెద్దయ్యంగారు'...ఇంకొక ఆకు ఎక్కువ చదువుతూన్నది. 'అయ్యగారు' పూర్వవ్యవహారంలో గౌరవ-సంబోధన...నామపరిశిష్ట-రూపముగాచలామణిగాఉన్నదనుకున్నా... పనిగా అప్పాజీమొదలు పెద్దలందరికీ నామవైష్ణవమర్యాదలు చేయడం...సని అని తోచడంలేదు : అయినా, ఈవిషయానికి శాస్త్రిగారిసమాధానంఏమిటో తెలుసుకోవలసిఉంది.

సంభావణలు చిత్రించడంలో లేటతెనుగుల సోనలూరించడం శ్రీశాస్త్రిగారు ఒక్కరీ సొమ్ము:

'కలంపోటు'[పూర్వపదప్రాధాన్యము... నాటకవస్తువుకు వినియోగం కాదు గనుక గంట మనీ సవరించుకోవలసిన అవసరం లేకపోగా, 'కలంపోటు' అనేఅ:వ్యర్థ-శక్తిమత్తంగా వాడుకలో వస్తూన్నది...అలాపేరు పెట్టడమే సరసంగానూ ఉంది] -శాస్త్రిగారి రచనల తీయదనాన్ని నిలువచేసుకుంటూన్నది.

—రామకృష్ణశాస్త్రి.

---

## ౧. రష్యా యాత్ర

[క్రౌన్కుసైజు; ౧౬౫ పేజీలు; సీమకాగితం; వెల ౮ అణాలు.]

ఈగ్రంథం విశ్వసాహిత్యమాల(మంగంమ) వారి తొమ్మిదోది. ఇది ౧౯33 లో నిత్యనారాయణ బెనర్జీ గారి Russia Today అనేకపుస్తకానికి శ్రీయుత మహీధర రామమోహన్‌గారి స్వేచ్ఛానువాదమని పీఠికలో వుదాహరింపబడినది.'రషియాటుడే'ను బెనర్జీగారు రచించింది ౧౯3౮ మధ్యలో. ఇప్పటికప్పడే నాలుగేళ్లు కావస్తోంది. రష్యావారి సిద్ధాంతాలు యీ నాటికి కొంత రూపనిర్ణయంలోకి వచ్చియుండాలి. ఆచరణలో అనేకం మార్పులు గూడ కలిగి యుండవచ్చు. రష్యాలో అనుదినము జరిగే నూతనపరిస్థితుల్ని, మార్పుల్ని, విధానాన్ని యావత్ప్రపంచం చేరెడేసి కళ్లెట్టుకుని పరీక్షిస్తోంది.

బెనర్జీగారు వారి ప్రయాణంలో ఎక్కడ చూచినవిషయా న్నక్కడే పొందుపరచి వ్రాసిన కారణాన యేవిషయ మెక్కడుందో తెలియటంలేదు. అయినా గ్రంథం చదువుతుంటే యేమాత్రం విసువుదల వుండక పూర్తిచేయా లనిపిస్తుంది. అనువాదం చక్కగానే వుంది.

గ్రంథస్థవిషయం రష్యానుగూర్చి, అక్కడ విప్లవానంతరం యేర్పడిన నూతన పరిస్థితుల్ని గూర్చి అవగాహన చేసుకోదలచినవారికి ప్రథమపాఠం వలె వుంది. రష్యా అవలంబిస్తున్న సిద్ధాంతాలను చర్చించక అన్నివిషయాలను మార్పుల్ని సూక్ష్మంగా చవిచూపుచున్నట్లుండటంచేత మార్గదర్శికవలె వుంది.

* * *

## ౨. సోవియట్ కమ్యూనిజం

[క్రౌను క్వి సైజు; ౧౧౫ పేజీలు; సీమకాగితం; ఖరీదు ౮ అణాలు.]

ములుగ పరిణమించుచున్నవి. విక్రమార్క-చరిత్ర, దశకుమారచరిత్ర, కాదంబరి మొదలగునవి దృష్టాంతములు.

గద్యరూపానువాదమునందలి ప్రయోజనమును గమనించియే శ్రీవేంకటరాయశాస్త్రులుగారు కథాసరిత్సాగరమును గద్యరూపమున వెలయఁజేసిరి.

శ్రీవేంకటరామకృష్ణకవు లీ విషయమున-

'కతలను బద్యకావ్యములు
గా నొనరించుటకంటె సద్రసో
చితగతి గద్యకావ్యములు
చేయుట యుక్తమటంచ్రు కొంద రా
వితమది యే నెఱింగియును
వేడుకమై నిటు గద్యపద్య సం
శ్రితమగు కావ్యమొక్కని ర
చింపఁ దలంచితి దీని నియ్యెడన్.'

అని తమ రచనాపద్ధతిని సమర్థించుకొనినారు. నిజము చెప్పవలసి వచ్చినచో నిది పద్యప్రబంధ మగును; ఆంధ్రమునఁ బ్రత్యేకముగ చంపువులు (గద్యపద్య సంశ్రితములగు కావ్యములు) లేవు. పద్యకావ్యము లన్నింటియందును, (అనగా- నిర్వచనవిశేషణ- విశిష్టములందక్క-) పయి గద్య పద్య విశిష్టపద్ధతి యుండనేయున్నది.

శ్రీ గ్రంథకర్తలు సుప్రసిద్ధాంధ్రకవులు; పెక్కేండ్లనుండియు కవితాప్రచార మొనర్చుచు చాల సభలయందు సమ్మానముల పొందుచున్నారు. రచన సరళము, రసవంతము, సర్వజన సులభగ్రాహ్యము. కావున గద్యకావ్యముతో సమానముగ గౌరవము పొందఁదగియున్నది; భావము చెడకుండ సులముగ పద్యములందుఁ గూర్చుట ఇందు విశేషము. ఇయ్యది ఆంధ్రు లందఱి యాదరణమునకును పాత్రము కాఁదగినది; కాఁగలదుకూడ. కావున కర్తలు:—

"బంధము లెల్ల వీడి బహు
భావసమృద్ధిగ నేడు మత్తపు
ష్పంధయగీతి నా విరియఁ
బాఱుచునున్నది తెల్గుకైత; మ
ద్గ్రంథముఁ గాంచుకాల మిది
గా; దటులైనను నేనుఁ బూర్వ
నిర్బంధకవిత్వపద్ధతులఁ
బట్టియె దీని రచింపఁబూనితిన్"

అని నిరుత్సాహతను ప్రకటింప నక్కఱలేదు. సుగ్రహణ పారీణులగు సహృదయులు ప్రాచ్య, నవ్య భేదములను పరిగణింపరు. గుణదోషపరిగణనము, ఆదరానాదరములును వస్తుయథార్థస్థితినిమాత్ర మనుసరించి యుండును; వ్యక్తి, పద్ధతుల ననుసరించి యుండదు.

ముఖపత్రమునుబట్టియు, లంబకాంతగద్యములంబట్టియు నీ "కథాసరిత్సాగరము" శ్రీ వేంకటరామకృష్ణ కవిద్వయప్రణీత మగునట్లు తెలియుచున్నది. కాని గ్రంథమునందచటనచటఁ గల ఏకవచనప్రయోగములంబట్టియు, లంబకాంత పద్యములంబట్టియు నొక్కరే-అనఁగా - వేంకటరామశాస్త్రిగారే దీనిని రచించినట్లు తోఁచుచున్నది. ఏతద్గ్రథనమున వారికి శ్రీ రామకృష్ణశాస్త్రిగారి సాయము లేకపోయినది; పాపము! అందు చేతనే వారు—

'అనుఁగు మేనత్తకొమరుఁడై యాశుకవిత,
నాకుఁ జేదోడువాదోడునై కడచిన,
కృతిసమర్థుండు మా రామకృష్ణశాస్త్రి
యున్న నీసాయ మర్థింతునోటు దేవి ?'

అని వాపోయినారు. ఆయనయెడఁ గల ప్రేమచేతనే కృతికర్తృత్వపు వంతును వారికిని తమతో సమముగఁ బంచిపెట్టిరి. పాఠకులు పరస్పరవిరోధము నెన్నకుందురుగాక !

'పలుకులవెలంది యెట్లెటు
పలికించిన నట్టు లేను బలికితి దోసఁగుల్
గలిగిన మన్నింపుడు పె
ద్దలు రసవత్పదపదార్థతాత్పర్యజ్ఞుల్'

అని శ్రీ వేంకటరామ శాస్త్రులుగారి ప్రార్థన. పండితవర్యు లీ ప్రార్థనను పాటించి దీనిప్రాశస్త్యమును వెల్లడింపఁదగును.

బు. వేం. ర.

---

## కలం పోటు

[శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రికథలు-రెండవ పుస్తకము. క్రౌను అష్టకము-వెలరెండు అణాలన్నర. కళాభివర్ధనీ పరిషత్తు రాజమహేంద్రవరము.]

శ్రీ శాస్త్రిగారు తమ కథలన్నీ సంపుటములుగా ప్రచురించబోతున్నామని కొంత కాలం క్రిందట ప్రబుద్ధాంధ్రలో వ్రాస్తూ వచ్చారు. అప్పట్లో పత్రిక, ఇబ్బందులవల్ల నడవడం మానుకోవడంతో, ఆప్రయత్నము న్నూ తాత్కాలికంగా విరమించడం జరిగిందనుకుంటాను. పునః స్వాస్థ్యము కుదిరి పత్రికను ఉద్ధరించు కున్నారు. దానితో పాటు, కథలున్నూ-మొదట అనుకున్నట్టు కాకపోయినా- దేని కది విడిగా గ్రంథరూపమునకు ... సాహిత్యాభిమానుల సాహాయ్యం వల్ల తేలుస్తూ ఉన్నారు.

ఇలా ఒక్కొక్కకథ ఒకపుస్తకంగా సమకూర్చడం ఉచితంగానే ఉన్నది-శాస్త్రిగారి కథలన్నీ ఒదుసులో...చిన్న నవలలు: పాఠకుల ఉత్సాహమునకు అందుబాటుగానే ఖరీదుకూడా అమిరింది. కనుక శాస్త్రిగారు తలపెట్టినపని, చదివే కుతూహలం ఉన్నవారికీ వారికేని, బహుచక్కగా లాభించవచ్చును.

కలంపోటు ... రెండవది ప్రచురణము. రాయలవారు, తిరుమలాంబమీద రాజసపు-చిలిపితనంగా అలిగి ఆదేవి నగరి చాయలకన్నా పోవడం మానివేసినప్పుడు ... ముక్కు తిమ్మన్న పారిజాతాపహరణం ప్రబంధంలో, దీనికి విరుగుడు కలగలిపి గోపాలదేవుని దక్షిణనాయక పాండిత్యానికి... సత్యభామను ఎదురుతిప్పి పాదప్రహార-బహూకృతి చేయిచ్చి, ఆకథచదివి వినిపించడంలో ... ప్రభువు రాసిక్యాన్ని గిలిగింతలతో మేల్కొలుపడం... కథ.

ఈకథ... గ్రంథస్థముగా లభించక పోవడం వల్ల ఏకరూపంగాలేక...చిలవలు పలవలతో దేశం అంతా ఏనాడో ప్రచారం అయిపోయి వ్యాపించి మాత్రము ఉన్నది: శాస్త్రిగారు ఈ ఇతివృత్తాన్ని కథ-నాటకంగా తమ రచనలోకి మార్చుకున్నారు. కథకులుగా వారి శిల్పమునకు వేరొక పత్రికలో ప్రశంసా - వ్యాఖ్యాన అంజలించుకున్నాను: ఆవిషయము ఇక్కడ విస్తరించి తలపెట్టవలసిన అవసరము లేదనుకుంటున్నాను.

కథలో... పాత్రల ప్రకృతి కల్పనలలో, నాటకం చదివినప్పుడు కొన్ని సందేహములు కలుగుతూ ఉన్నవి.

మహామంత్రికి, అప్పటికి వారంరోజుల క్రితమే తెలిసిపోయి అంతటి మేధా - స్రమాట్టునుకూడా, గగ్గోలు పరుస్తూన్న ? ఆ అంతఃపుర రహస్యం, దాసీపిల్ల వివరించేదాకా... రాణికి ఏకైక ఆప్తుడైన తిమ్మన్నకు ఎందు చేత తెలిసిందికాదు? 'అఆమ్మాయి' క్షేమాన్ని ఎప్పుడూ వేయికళ్లతో కనిపెట్టి చూస్తూం డవలసిన బాధ్యతతో...పుట్టింటినుంచి,ఆమె వెంట సారస్వత-హరణంగా వచ్చిన కవి-దిగ్గజం...ఎంతస్వల్ప విషయమైనా, ఇంకొకరు వచ్చి చెప్పేదాకా పసిపట్టలేని ధిషణాల సుడా? — లేక, స్వతంత్రకవిగా, అప్పుడే కావ్యరచన ఆరంభించేసి... పెద్దల మెప్పులు శిష్యునినోట వినే బులబాటంలో...అప్పటికి మాత్రం ఇతరజోక్యములేవీ పట్టించుకోకుం డాఉంటూన్న...లోపమా ?

అదివరకల్లా సభలో, ఇతర అవరోధ జనంతో బాటు, తెరచాటున కూర్చుండి కావ్యం వింటూన్న తిరుమలాంబ ఆనాడు... చివరిరంగంలో ప్రబంధఘట్టం వినడానికి... రాకపోవడమునకు కారణం? — పడకటింటి ముచ్చట అవాళే అంతఃపురంలో అల్లుకు పోయినందువల్ల సపత్నీమండలిలో కూర్చోలేక...సిగ్గుపడిపోయిందా...లేక, తిమ్మన్నగారి కావ్యవాణి...నాథుడి అలుకతీర్చే అవకాశంలో వాసకసజ్జికగా తీరికలు దిద్దుకుంటూ... నగరు విడువలేదా?

అది, కన్నడరాజ్యరమారమణుని...దివ్య సభాస్థలమా...రాచరికము,పొగడ్తలతో ప్రకటించుకునే...:మన్నెదొర...దరబారా ?

అష్టదిగ్గజములు...నిరంకుశ-నైజం దుశ్శాలువలలో దాచుకుని...వందిమాగధకై వారములకుబారులుతీరిన... భట్రాజులా : తిమ్మరుసు 'అప్పాజీ' కాడా:స్వామిపరామర్శలకు...దోసిలిఒగ్గి అతివినయంతో సమాధానం మనని చేస్తూ దాసజీవితం తరింపజేసుకునే...చంద్రగిరి మధూకరపు వడుగా?

సభాస్తారు లందరికి గుసగుసలపని కలిపించి...కావ్యపఠనం మానిపించి...ఒంటివాలు మీదసభ వదలిపోవడం...కొన్ని సమయాల్లో గంభీరులుగా ప్రవర్తించవలసిన ప్రభువులకైనా సహజమేనా ?—స్వజనులే కనుక అన్యథా తలచరు...తలచినా మించిపోయేది లేదు అనే ధీమాతో కృష్ణరాయలు ... అలా హఠాత్తుగా...గద్దెదిగి లోపలికి విజయంచేసినారా ?

రాయలు ఎందు కల్లా పరధ్యానంలో పర వ్యాసంగాలతో...బాధను ? మరపించుకునే సాధన చేస్తూన్నాడు : తనదే పొరబాటని బాధా? అపచారం ఎరుగనిదేవిని అనవసరంగా విప్రలంభంతో అలయిస్తూన్నాను, అరసికుణ్ణి అనే బాధా? ఆమెమీద కూరిమి సడలించుకోలేక...చేసినదనుకున్న తప్పు...కాదని సర్ది చెప్పుకోలేక ... కర్తవ్యం స్వయంగా తేల్చుకోలేని...బాధా?

విపులమైన భూమికతో గ్రంథం ఆరంభం చేసినా...సంభావణలకు సాక్షిగా విషయవివరణం కథగా చేసుకుంటూ వచ్చినా...నాటకాన్ని ఇంకా విరివిగాచేసి రచించినా...ఈ సంశయములకు సమాధానములు లభించేవే అని నమ్మకం:

పింగళి నాగేంద్రరావుగారు 'నారాజు' నాటకంలో (భారతిలో ౮ అంకములుమాత్రము అచ్చయినట్లు జ్ఞాపకం) 'పెద్దిరాజు' అని కవితాపితామహుడికిచేసిననామకరణమే,కర్ణారుంతుదమై ఉన్నదనుకుంటే శ్రీశాస్త్రిగారి 'పెద్దయ్యంగారు'...ఇంకొక ఆకు ఎక్కువ చదువుతూన్నది. 'అయ్యగారు' పూర్వవ్యవహారంలో గౌరవ-సంబోధన...నామపరిశిష్ట-రూపముగాచలామణిగాఉన్నదనుకున్నా... పనిగా అప్పాజీమొదలు పెద్దలందరికీ నామ వైష్ణవమర్యాదలు చేయడం...సని అని తోచడంలేదు : అయినా, ఈవిషయానికి శాస్త్రి గారిసమాధానంఏమిటో తెలుసుకోవలసిఉంది.

సంభావణలు చిత్రించడంలో తేట తెనుగుల సోనలూరించడం శ్రీశాస్త్రిగారు ఒక్కరీ సొమ్ము:

'కలంపోటు'[పూర్వపదప్రాధాన్యము... నాటకవస్తువుకు వినియోగం కాదు గనుక గంట మని సవరించుకోవలసిన అవసరం లేకపోగా, 'కలంపోటు' అనేఅన్వర్థ-శక్తిమత్తంగా వాడుకలో వస్తూన్నది...అలాపేరు పెట్టడమే సరసంగానూ ఉంది] -శాస్త్రిగారి రచనల తీయదనాన్ని నిలువచేసుకుంటూన్నది.

—రామకృష్ణశాస్త్రి.

---

## ౧. రష్యా యాత్ర

[క్రౌన్కాసైజు; ౧౬౫ పేజీలు; సీమకాగితం; వెల ౮ అణాలు.]

ఈగ్రంథం విశ్వసాహిత్యమాల(ముంగండ) వారి తొమ్మిదోది. ఇది ౧౯33 లో నిత్యనారాయణ బెనర్జీ గారి Russia Today అనేకపుస్తకానికి శ్రీయుత మహీధర రామమోహన్ గారి స్వేచ్ఛానువాదమని పీఠికలో వుదాహరింపబడినది.'రషియాటుడే'ను బెనర్జీ గారు రచించింది ౧౯3౮ మధ్యలో. ఇప్పటి కప్పడే నాలుగేళ్లు కావస్తోంది. రష్యావారి సిద్ధాంతాలు యీ నాటికి కొంత రూపనిర్ణయంలోకి వచ్చియుండాలి. ఆచరణలో అనేకం మార్పులు గూడ కలిగి యుండవచ్చు. రష్యాలో అనుదినము జరిగే నూతనపరిస్థితుల్ని, మార్పుల్ని, విధానాన్ని యావత్ప్రపంచం చేరెడేసి కళ్లెట్టుకుని పరీక్షిస్తోంది.

బెనర్జీగారు వారి ప్రయాణంలో ఎక్కడ చూచినవిషయా న్నక్కడే పొందుపరచి వ్రాసిన కారణాన యేవిషయ మెక్కడుందో తెలియటంలేదు. అయినా గ్రంథం చదువు తుంటే యేమాత్రం విసువుదల వుండక పూర్తిచేయా లనిపిస్తుంది. అనువాదం చక్కగానే వుంది.

గ్రంథస్థవిషయం రష్యానుగూర్చి, అక్కడ విప్లవానంతరం యేర్పడిన నూతన పరిస్థితుల్ని గూర్చి అవగాహన చేసుకోదలచినవారికి ప్రథమపాఠం వలె వుంది. రష్యా అవలంబిస్తున్న సిద్ధాంతాలను చర్చించక అన్నివిషయాలను మార్పుల్ని సూక్ష్మంగా చవిచూపుచున్నట్లుంపటంచేత మార్గదర్శికవలె వుంది.

* * *

## ౨. సోవియట్ కమ్యూనిజం

[క్రౌను క్వాసైజు; ౧౧౫ పేజీలు; సీమకాగితం; ఖరీదు ౮ అణాలు.]

లెబోదంపతులు రష్యావెళ్లి అచ్చటివిష యాల్ని సాలంకషంగా అవగాహన చేసి కొన్ని పిమ్మట నారిచే రచింపబడ్డ "సోవి యట్ కమ్యూనిజం" అనే యింగ్లీషుగ్రంథం లోని యేడవప్రకరణానికి ప్రస్తుత గ్రంథం మహీధర కృష్ణమోహన్‌రావుగారి అనువాదం. విశ్వసాహిత్యమాల (ముంగండ) వారు పదో గ్రంథంగా వెలువరించారు.

ఇందలి ప్రధానవిషయం సోవియటు రష్యాలో జమీందారీ, పెట్టుబడిదారీ విధా నాలు యేవిధంగా తొలగింపబడినాయి అనేది. రష్యాదేశంయొక్క చరిత్రలోని యేపుట చూచినా అంతఃకలహాలే. ౧౯౧౭ నాటికి పరిస్థితులు మరీవిషమస్థితికి వచ్చి జారుప్రభు త్వం నాశనంచేయబడింది. బోల్షివిజం తల చూపించి వెంటనే లెనిను ట్రాట్స్కీలు తోడు పడ్డారు. ఈనాటికి రష్యాయొక్కస్థితి పూర్తిగ మారిపోయి సమస్తప్రపంచం అక్కడ అవలం బింపబడుచున్న విధానాన్ని గూర్చి ఆతుర తతో చూస్తూంది.

రష్యాదేశం ప్రపంచమంతటిలోను ఆరవ భాగం ఆక్రమించి ౧౬ కోట్లమంది జనాభా కలిగివుంది. అనేకజాతు లున్నాయి. నాగర కులు అనాగరకులుగూడా వున్నారు. ప్రభు త్వాధీనంలో వున్నవారు, జమీందారులు, యితర పెట్టుబడిదారులు, మతభోగకులుతప్ప మిగత జనసామాన్యమంతా దుర్భరదారిద్ర్యం అనుభవిస్తున్నకారణాన అశాంతిహెచ్చి, వారు పేదనే భేదం లేకుండా యేకమై ధనికవర్గాన్ని నిర్మూలం చేసి నం దు కు ప్రపంచంలోని యేదేశప్రజలు అనుభవించ నంతటిస్వేచ్ఛను, తృప్తిని యీనాడు రష్యా ప్రజ అనుభవిస్తున్నారు. "ఒకమాటు విప్లవం ప్రారంభిస్తే తరువాత దానిని యెన్నికష్టాలు వచ్చినాసరే కొనసాగించవలసినదే" నని లెనిన్ యిచ్చిన హెచ్చరికలో రష్యాప్రజ చూపినపూనిక మెచ్చదగియుంది. దేనికైనా సంఘీభావం, పట్టుదల, త్యాగం, నాయకుల యందు విశ్వాసం అనే లక్షణాలు వుంటే యెంతటి ప్రయత్నమైనా కొనసాగుతుంది.

భారతదేశం స్వాతంత్ర్యంకోసం ప్రయ త్నిస్తోంది. ప్రజకు ప్రభుత్వానికి సంఘర్షణం. రష్యాలోవలె యిక్కడ కత్తులవేట్లాట, రక్త పాతం లేదు. శాంతిసత్యాగ్రహ సమరం. ఏసమరమైనా సంఘటకట్టుబాటు, పూనిక త్యాగం లేనికారణాన కలిసిరాకుండా వుంది. ప్రజాప్రభుత్వాల్ని నిర్మించుకున్న యితర రాజ్యాంగ చరిత్రలైనా కొంతవరకు భారతప్రజకు హెచ్చరికను కల్పింపకపోవు.

* * *

### 3. రష్యా విప్లవము

[క్రౌనుక్వార్టరుసైజు; సుమారు ౧౦౦ పేజీలు; పీచుకాగితం; వెల ౦-౬-౦ అణాలు ]

ఈ గ్రంథము విశ్వసాహిత్యమాల [ ముం గండ ]వారి పదకొండోది. లెనిను మహాశయుని వుపన్యాసమొకటీ, ఆరువ్యాసాలు చేర్చబడి ౧౯౦౫-వ సంవత్సరపు రష్యావిప్లవాన్ని గురించి సర్వతోముఖమూ, సంపూర్ణమూ అయిన వివరణాన్ని యిస్తున్నాము.

విప్లవాన్నెట్లు నిర్మించాలి అనే విష యాన్ని గురించి సరిగా తెలుసుకోవడానికి అమూల్యమైన సలహాలు యీ గ్రంథములో అక్కడక్కడ కనపడతవి. విప్లవోద్యమంయొక్క తత్వాన్నీ, గమనరీతిని తెలుసుకోవడంలో లెనిన్‌కు గలసామర్థ్యాన్ని యీపుస్తకం అవగాహనచేస్తున్నది. విప్లవపోరాటంయొక్క వివిధరూపాలు ఒకదశనుంచి మరోదశకి యేవిధంగా మారుతాయో, యీనూతన-పోరాట-పద్ధతుల్ని కనిపెట్టడంలో ప్రజాసంఘాల యొక్క పరిశోధనశక్తి యేలా అభివృద్ధి చెందుతుందో, పోరాటం నడపడానికి కావలసిన చురుకుదనం మొదలైనవన్నీ బోధపరుపబడినవి.

విప్లవాన్ని లేవదీయటంలో దాని రూపాలు, సంస్థలు, కార్యాలు మొదలైనవాటిని క్రమపద్ధతికి తెచ్చి, ఐక్యనుఘటించి కార్యాచరణంలో దించి, అవసరసందర్భాల్లో ఆయువుపట్టును కనిపెట్టి పనిచేయడం, చాకచక్యంతో గమ్యస్థానాన్ని, తప్పటడుగులు వెయ్యకుండా చేరడం మొదలైనవిప్లవరాజనీతిని సంపాదించటానికి రష్యావిప్లవచరిత్రయైన యీగ్రంథం ఉపకరిస్తుంది.

"విప్లవం ప్రజ్వరిల్లుతూన్న సమయంలో అందరూ కలిసి దెబ్బతీయాలనే రాజనీతి మాత్రం యెప్పుడూ మరచిపోకూడదు."

"జారుప్రభుత్వాన్ని పడగొట్టడానికి విప్లవం చెలరేగేనసమయంలో మనం అందరమూ కలిసి పనిచేయాలి", "మనజాతికంతటా ప్రధానమైన యీ పోరాటంలో బాధ్యత అంతా ప్రతివానిభుజాలమీదా వుందని గుర్తించాలి. తానే అసంఖ్యాకులైన రైతులందరియొక్క, కష్టజీవు లందరియొక్క, దోపిడిచేయబడుచున్నవా ళ్లందరియొక్క, సామాన్యప్రజ లందరియొక్క ప్రతినిధిననే విషయాన్ని మరచిపోకుండా జాతిఅంతకీ విరోధీ, ప్రబల శత్రువూ యైనజారును తొలగించడానికి పూనుకోవాలి",

"ఒక్కబలప్రయోగం వల్లనే, సంఘనిర్మాణబలంవల్లనే, వాళ్ల విశమత్య బలువల్లనే, వాళ్లందరి ధైర్యసాహసాలవల్లనే జారు దగ్గరనుంచి స్వాతంత్ర్యాన్ని పొందగలిగేరు" మొదలైన లెనిన్‌యొక్క కొన్ని హెచ్చరికలు స్వాతంత్ర్య ప్రియుల రక్తాన్ని ఉడుకెక్కిస్తవి.

రష్యాలో విప్లవప్రారంభం, మాస్కో-రైతు విప్లవయుత ప్రజాతంత్ర నియంతృత్వం, మూడు రాజ్యాంగ విధానాలు, విప్లవంయొక్క ప్రథమవిజయం, మాస్కో తిరుగుబాటువల్ల నేర్చుకోతగినపాఠాలు, ౧౯౦౫ విప్లవమునుగూర్చి వుపన్యాసం, విప్లవంయొక్క వివిధావస్థలు, వుద్దేశ్యాలు, అవకాశాలు మొదలగు యేడధ్యాయాలతో రచింపబడింది. ప్రతియొక్కరూ అవశ్యంచదువవలసిన గ్రంథం.

విశ్వసాహిత్యమాలవారు పూనికతో యిట్టి గ్రంథాలను, తరుణంలో ప్రచురించటం కొనియాడతగింది.

గ్రంథములు దొరుకుచోటు: విశ్వసాహిత్యమాల, ముంగండ [ Via ] అంబాజీపేట, తూ. గో. జిల్లా.

వ. కుటుంబరావు

## పుట్టుమచ్చలశాస్త్రము ఫలదీపిక

[సేదునూరి గంగాధరంగారిచే వ్రాయబడినది. పబ్లిషరు కొండపల్లి వీరవెంకయ్యగారు, శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి. వెల ౦-౮-౦.]

పుట్టుమచ్చల రంగులఫలనిర్ణయము ౩ పుట్టుమచ్చలఫలము, సుడులఫలము, అవయవముల అదురుపాటుఫలం, సాముద్రికఫలము, హస్తరేఖాఫల నిర్ణయము, హస్తపాదములందలి శంఖచక్రఫలితములు మున్నగు విషయము లిందు తెలుపబడినవి.

"ఈ శాస్త్రమును నమ్మకముతోడను, విశ్వాసముతోడను, దృఢభావముతోడను చదివి యథార్థమును గ్రహింప గలందులకు ప్రార్థించుచుంటిని." అని గ్రంథకర్తగారు వ్రాసిరి.

ఇట్టిశాస్త్రము నెడల నవిశ్వాసముండు నేమో యని వీరు సంశయించుటకు ఆధారములు కలవు.

శాస్త్రాంశములు కళలవలెగాక ఋజువునకు లొంగును. పరిశీలనమున లోపముండెనేని, శాస్త్రసిద్ధాంతము లయథార్థము లగును. పరిశీలనమునకు లొంగని అంశములు, పరిశీలించుచుండ నదృశ్యమగు నంశములు, ప్రత్యేక యంత్ర సాహాయ్యమునగాని గోచరింపని యంశములు కలవు. కావున కేవలము పరిశీలనముపై నాధారపడు శాస్త్రములు చూపు సిద్ధాంతములు కొన్ని సంశయమునకు తావొసగును. తరువాతి సిద్ధాంతములు తలనూపినంతన తొల్లింటివి మూలబడును.

ప్రత్యక్షపరిశోధనమునకును, ప్రత్యక్షతార్కాణమునకును లొంగువస్తుసముదాయము కలదు. వీనికి సంబంధించిన సిద్ధాంతములు తఱచుగ సరియైనవై యుండును. (Experiment) పై నాధారపడు (Sciences) కును Observation పై నాధారపడు(Sciences) కును వ్యత్యాసము కలదని తెలుపుట నాయాశయము.

భౌతికశాస్త్రమునకు సంబంధించిన నూతన విశేషములును, సత్యము నావిష్కరించుటకు అక్కరైన భావసామగ్రియును, వస్తుసామగ్రియును నేడు ప్రతీచీఖండమున గోచరించుచున్నవి. కపాలపరీక్ష తెలిసినవారు (Phrenologists) తెలుపు అంశములును, సాముద్రికశాస్త్రజ్ఞులు తెలుపు అంశములును-కొన్నియైనను నిక్కములని ప్రత్యక్షనిదర్శనములవలన తెల్లమగుట తెలియదుము. బెసెంటు, గ్లేడ్‌స్టన్ మున్నగువారి యరచేతులను, ముసోలినీ గాంధిప్రభృతుల శిరములను జూచి వారివారి ప్రజ్ఞావిశేషములను నిక్కముగా వచించిన శాస్త్రజ్ఞులు కలరు.

వలసిన పరిజ్ఞానమును పడయక, వేడుకకై చిత్తమువచ్చిన రీతి నిట్టిపొత్తములు వ్రాయువారనేకు లగుటచే వీరివ్రాతలు నిక్కము దాపున నిలువక ప్రజలలో నవిశ్వాసము పుట్టించుచున్నవి. ఇట్టిపొత్తములపేళ్లను విని నవ్వి దూరముగ తొలగిపోవువా రున్నారు. పరిస్థితులు చక్కబడవలెననిన చో, సత్యవిమర్శనమున ఆటితేలిన భౌతికశాస్త్రజ్ఞులు తమవిమర్శనాంశములను గ్రంథస్థములు గావింపవలెను. రోడ్లమీది జ్యోతిష్కులును, గీతలనుగుటించిన మిడిమిడి జ్ఞానముగలవారును తొలగిపోవలెను. కొన్నిపారిభాషికపదములను ప్రయోగించినంతన శాస్త్రవేత్తలు కాజాలువారెవరు?

అనేకగ్రంథములను పరిశోధించి గ్రంథకర్తగారీపుస్తకమును రచించిరి, ఇట్లని ఇందలి శ్లోకములును పద్యములును చెప్పక చెప్పుచున్నవి.

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి.

---

## మహాభక్తులు (గద్యరచనము)

[క్రౌను ౧/౮ సైజు. పు. ౧౧౮. వెల రు. ౦-౧౨-౦. గ్రంథకర్త: వంగూరి నరసింహారావు, నరసాపురం.]

ఈపుస్తకంలో 'రామదాసు,' త్యాగరాజు'ల సంగ్రహచరిత్రలు ఉన్నవి. వీరిద్దరూ ఆస్తిక ప్రపంచంలో చిరంజీవులయిన రామభక్తులు. త్యాగరాజు, ఉపరి, కళాప్రపంచంలోను చిరంజీవి అయిన 'గానబ్రహ్మము.' వీరిచరిత్రలను ఎందరో ఎన్నివిధాలుగానో రచించి ప్రచురించి ఉన్నారు. వాటన్నిటి సాయంతో ఈ సంగ్రహచరిత్రలు పుట్టినవి.

రచనగ్రాంథికభాషకు దగ్గరగా, సరసంగా, ధారాళంగా ఉంది. అక్కడక్కడా పద్యాలు, పాటలుకూడా సందర్భానుసారంగా చేరినవి. రామభక్తులు ఎక్కువ కాలహరణంకాకుండా రామదాసు, త్యాగరాజుల చరిత్రలను మొత్తంమీద తెలుసుకొని ఆనందించడానికి ఈపుస్తకం పనికివస్తుంది; అంతే.

పుస్తకం వెలమాత్రం చాలా ఎక్కువ. అక్కడక్కడా తప్పులు మిగిలిఉన్నా, అచ్చు, కాగితము, బైండు అందంగా ఉంది. అయినాకూడ వెల అరణాలకంటే ఎక్కువ పెట్టడం న్యాయంకాదు.

---

# గ్రంథ స్వీకారము

---

## నవనాథచరిత్ర (ద్విపదకావ్యము)

[గౌరనామాత్య విరచితము :—రాయల్ ౧/౮ సైజు. ౩౯ + ౨౮౧ పుటలు. వెల ౩ రూపాయలు]

మద్రాసు విశ్వవిద్యాలయాంధ్రగ్రంథమాల నెం. ౭. సంపాదకులు : కోరాడ రామకృష్ణయ్య, ఎం. ఏ., ఆంధ్రోపన్యాసకులు, ప్రాచ్యపరిశోధన సంస్థ, మద్రాసు విశ్వవిద్యాలయము.

ప్రకాశకులు : మద్రాసు విశ్వవిద్యాలయమువారు.

---

## రసార్ణవాలంకారము
## (సంస్కృతాలంకారగ్రంథము)

ప్రకాశవర్షకవి విరచితము. సంపాదకులు ఈయుణ్ణి, వేంకట వీరరాఘవాచార్యులు : ఎం. ఏ., ఆంధ్రగీర్వాణభాషోపన్యాసకులు, పిఠాపురరాజ కళాశాల, కాకినాడ. రాయల్ ౧/౮ సైజు. ౪౫ + ౭౯ పుటలు. వెల ౮ అణాలు.

కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచే ప్రకటింపబడినది.

---

౧. మురారి అనర్ఘరాఘవము
(సమాలోచనము)

డిమ్మి ౧/౮ సైజు, ౪౮ పుటలు.

౨. సంస్కృతవాఙ్మయ చరిత్ర
(సమాలోచనము)

[డెమ్మి ౧/౮ సైజు. ౧౪ పుటలు. పయి రెండింటికి కర్తలు: ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు, ఆంధ్రగీర్వాణభాషోప న్యాసకులు, పిఠాపురరాజ కళాశాల, కాకి నాడ.]

---

జవాహర్లాలు వ్యాసములు
(కొన్ని ఉపన్యాసములు సహా)

[క్రౌను ౧/౮ సైజు, పు. ౧౭౮. వెల రు. ౦-౬-౦.]

గ్రంథకర్త:—కొమాండూరి శఠకోపాచా ర్యులు, ఎం.ఏ., బి.ఎల్., వకీలు, కాకినాడ.

---

శివరాత్రి (పద్యకావ్యము)

[నవ్యరూపంతో ఉన్న ౫౬ పుటలపుస్త కము.]

గ్రంథకర్త:—జి. వి. కృష్ణరావు, కూచి పూడి, (via) తెనాలి.

---

బ్రహ్మానందతీర్థ విజయము
(జీవితచరిత్ర)

[క్రౌను ౧/౮ సైజు, పు. ౨౨౫. వెల రు. ౧-౦-౦.]

గ్రంథకర్త:—పి. ఆదినారాయణ, ఉపా ధ్యాయుడు, కోవూరు, నెల్లూరుజిల్లా.

---



---

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor:—K. Nageswara Rao.

# భారతి

## సచిత్ర
## మాసపత్రిక

సంపాదకుడు

కా. నాగేశ్వరరావు

సంపుటము ౧౫, సంచిక 3

# విషయసూచిక



## చిత్రములు

# భారతి చందాదార్లకు హెచ్చరిక

ఈ క్రింది కనబరచిన నెంబర్ల వారికి ఈనెల (1938 సం. మార్చి నెల)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమున కగు చందా మాకు చేరునట్లు ఈనెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమయొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్మురానిచో సహజభాషాభిమాను లగు తాము తిరిగి ఇంకొక సంవత్సరము వఱకు చందా దారులుగ నుందురను నమ్మకముతో 1938 సం. ఏప్రిల్ 10-వ తేదిని రూ 6-4-0 లకు వి.పి. పంపుచున్నాము. గావున తా మెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన ప్రార్థితులు. ఒకవేళ తమ కీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మా కావిషయము వెంటనే తెలియజేసినయెడల వి. పి. పంపుట నాపుదుము.

A 2. B 1, 12. C 3. D 1, 3. H 1, 2, 3, 4, 5, 6, 7, 8, 9, 10, 12, 13, 14, 15, 17, 36. K 1, 2. L 3, 5, 7. M 1, 2, 9. N 1, 2. P 2, 4. R 3, 4, 5, 17, 28. S 1, 6, 7, 9, 10, 12, 76. V 3, 4, 3, 5, 23, 25. W 1.



శి వా జి

—కె. కన్నయ్యశాస్త్రి.



సంపు. ౧౫  ఈశ్వర, ఫాల్గునమాసము ( మార్చి 1938)  సంఖ్య 3

# 'తృణకంకణవిమర్శన' - పరామర్శ

పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి

★

## ౧. ఉపక్రమవాక్యపరామర్శ

నామిత్రులు బ్రహ్మశ్రీ శిరోమణి సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రులుగారు ఈశ్వర ఉగాదిసంచికలో, తృణకంకణ విమర్శనం ప్రకటించారు. నేను కొద్దిరోజుల క్రిందటివఱకూ దాన్ని చూడలేదు. వారివిమర్శకు జవాబు చెప్పవలసిన బాధ్యత ఆగ్రంథ కర్తదే. కాని వారు ఉపేక్షించినట్లు ఉంది

నిజం చెప్పవలసివస్తే నాకు ఆగ్రంథంతో కానీ, ఈవిమర్శనంతో. కానీ ఎట్టి సంబంధమూ లేదు. అయితే నాకు నవ్యసాహిత్యాపైనీ ఆసాహితీపరుల యెడలా కొంత అభిమానం- ప్రాచీనాంధ్ర సాహిత్యం పైనా, తన్నిర్మాతలయెడలా వున్నట్టుగానే వున్నది. ఇది ముమ్మాటికీ నిజం.

ఈపరామర్శ వ్రాయడానికి ఈఅభిమానం వకకారణం. రెండోది శ్రీ శాస్త్రులుగారు తమ విమర్శనవ్యాసం వ్రాయడానికి ఇచ్చిన కారణాలు చదవడం మూలాన ఏర్పడ్డ ఉద్వేగం. ఈరెండు కారణాలచాతానూ నేను ఈ పరామర్శ చేయవలసి వచ్చింది.

శ్రీ సూర్యనారాయణ శాస్త్రులుగారు తమ విమర్శన వ్యాసం వ్రాయడానికి- (౧) పాశ్చాత్య సభ్యతా భూకంపం మూలాన ఏర్పడ్డ తార్మారులు సరిచేయడం అనేది ఒకటిన్నీ, (౨) ఇప్పటి యువకులకు (అనగా నవ్యసాహిత్య పరులకు) భావకవిత్వజ్వరం ఏర్పడి ముదిరి ప్రలాపంలోకి (Delirium) దింపడం అనేది సంభవించడం అనేది రెండున్నూ కారణాలుగా చెప్పారు.

ఇంకా ఈవ్యాధికి చికిత్సజేయడానికి ఏమి మార్గం- అనేవిషయంలో కూడా చికిత్సను వారె చెప్పారు. ఏమని అంటే తృణకంకణ కర్తలు భావకవులలో (నవ్యకవులలో) అందె వేసినచేయి అనీ, వారే ఆంధ్రసారస్వత సౌధ రాజానికి మహాశిల్పు లనీ వారు నవీనాంధ్ర యువకులకు కవితాభిక్ష పెట్టినారనీ ఆచార్య పీఠ మనీ- ఇత్యాదిగా వారికెవరో చెప్పి వుండడంచాత, వారిగ్రంథాలను అందులోనూ మకుటాయమాన మని (ఎవరో) అన్న తృణ కంకణం విమర్శించి తద్ద్వారా పై లోపాలను సరిజేస్తాం అని శాస్త్రులుగారు ఉపోద్ఘాతం చెప్పారు.

శాస్త్రులుగారు చెప్పిన ఈఉపోద్ఘాతాన్ని పరిశీలించి చూస్తే- వీరు ప్రతిఘటింప దలచినది నవ్యసాహిత్యమునే కాని తృణకంకణ గ్రంథకర్త గ్రంథాలను కాదని స్పష్టమే కదా! ఇందువల్లనే వీరిలాగా నేనున్నూ ఈతృణ కంకణ విమర్శను ఆధారంగా చేసికొని నవ్య సాహిత్యమును విమర్శించేవారికి మఱొక్కమారు జవాబుగా ఈపరామర్శ వ్రాస్తున్నాను. సహృదయులు క్షమించాలె శ్రీ శాస్త్రులుగారూ సహృదయులే కదా! వేఱే క్షమించండని అనవలెనా?

లోకంలో—తత్రాపి ఆంధ్రలోకంలో విమర్శ అంటేనూ, అందులో నవ్యసాహిత్య విమర్శ అంటేనూ నోటికసిదీర దూషించడం- అని అర్థం ఏర్పడ్డది. నవ్యసాహిత్యము అంకురింప సాగిన యీపాతికేండ్లలోనూ దీన్ని గుఱించిన విమర్శనములు హెచ్చుగానే వస్తూ వున్నవి. ఇందులో కొత్త ఏదిన్నీ లేదు ఎవరి ఇష్టంవచ్చినపేర్లు వారు పెడుతూ బీభత్సం చేస్తూనే వున్నారు. సహించడం అలవాటైనది.

కాని శాస్త్రులుగారిలాగా విమర్శనము నంతా ఏకో వకగ్రంథంమీద కేంద్రీకరించి

చేసినవా రెవ్వరూ లేరు. శాస్త్రిలుగారు ఈ పంథాను త్రొక్కి వర్తించడం ఒక్కటే క్రొత్త. విమర్శనలోని తక్కినవేళాకోళాలూ వెక్కిరింతలు వగైరాలూ ఒకవైపునకు తోసి వేసి ఈఒక్క విషయానికిన్నీ వీరిని అభినందిస్తున్నాను.

ప్రస్తుత విషయమైన తృణకంకణ విమర్శనము ఎనిమిది శీర్షికల క్రింద విభక్తం అయినది. అవి ఇవీ:-(౧) అపశబ్దములు, (౨) అన్వయ దోషాలు, (౩) అలంకార దోషాలు, (౪) పునరుక్తులు, (౫) అర్థదోషాలు, (౬) దుష్టసమాసాలు, (౭) వ్యాకరణదోషాలు, (౮) ప్రకృతి విరోధాలు- అని; కాని వారిచ్చిన శీర్షికల అంశాలు కొన్నికొన్ని ఒకదానితో వకటి కలసిపోయేవిగా వున్నా- సౌలభ్యాన్ని కోరి ఆయా శీర్షికలతోనే పరామర్శ చేస్తాను. కనుక ఒక్కొక్కదాన్నీ ఉదాహరిస్తాను.

### ౧. అపశబ్దాలపరామర్శ

దీన్ని చర్చించడానికి ముందుగా వకమాట వ్రాయవలసి వున్నది. తెలుగు వాఙ్మయంలోని శబ్దరాశిని అంతా సాకల్యంగా విచారణ చేసి- సంస్కృతంలోవున్న పాణినీయాదులలాగా- అనుశాసింపగల సంపూర్ణ వ్యాకరణం అంటూ ఇంతవరకూ ఒక్కటీ లేదు. ఉన్నవైనా వాఙ్మయాన్ని అంతా శోధించి నిర్దేశించేవి కావు. అనేకమత భేదాలూ అనిర్దిష్ట వాఙ్మయ స్వరూపాలూ అయివున్నవి. ఈస్థితిలో సాధుత్వా సాధుత్వవిచారణ ఆంధ్రవాఙ్మయంలో చేయవలసివస్తే పూర్వులయిన మహాకవుల ప్రయోగాలే శరణంగా ఏర్పడుతుంది.

అయితే శాస్త్రిలుగారు అంటారూ- వీరు భావకవులూ, పూర్వకవులమార్గం ఏల త్రొక్కవలె? వారి ప్రయోగాలు వీరికి శరణమేల?- అని. నిజం చెప్పవలసివస్తే నేటి నవ్యకవితామార్గంవారు ఎవ్వరూ తాము భావకవులం అని చెప్పకోనూ లేదు పూర్వకవుల మార్గం అనుసరింపమనీ అనాలేదు. తమకు ఉపాదేయంగానూ రసవంతంగానూ ఉన్నవని తోచినంత వరకూ ఈనవ్యకవులు ఏకవుల మార్గాలైనా సరే స్వీకరిస్తారు. అల్లాలేకుంటే వాటిని స్వీకరింపరు. ఇంతే సంగతి.

మాటవరుసకు అడుగుతానూ-ఈశాస్త్రిలుగారూ వీరివంటివారున్నూ ఈనవ్యులకృతులు విమర్శించేటప్పుడు ప్రాచీనకవుల లక్షణాలూ నియమాలూ వీరు అంగీకరింపరని దృఢంగా తమకు నమ్మకమున్నప్పుడు నవ్యకవులు అంగీకరింపరని తామనుకొనే లక్షణశాస్త్రాల కొలతలు ఏల ఉపయోగించి విమర్శిస్తారు? ఇలా చేయడానికి తమకు ఏశాస్త్రాలు అధికారం ఇచ్చినవి?-అని అంటాను.

ఇక ప్రస్తుతానికి వద్దాము. అపశబ్దాలుగా పేర్కొన్నవాటిలో యావనుడు మొదటిది. 'అని స్వగతవిలాపములన్...యొక్కయావనుడు' అని తృణకంకణంలో వున్నది. ఇచ్చట యావనమనే ధర్మవాచకాన్ని ధర్మిగా చెప్పారనేది ఆక్షేపణసారం.

పాణినీయం ప్రకారమే ఈ శబ్దము సాధువు కావడానికి అర్శాదిగణాలు సాయపడేవి చాలా వున్నవి. అయినా ధర్మవాచకాన్ని ధర్మిగా చెప్పడం తెలుగుకవులలో ఆచారం కద్దు.

ఉదాహరణం చూడండి:—పాండురంగ మాహాత్మ్యంలో-

మ. వనితామానసనూ నసాయకుడు...
నూనూగుమీసాలలే
గొనబుం బ్రాయపు దేజుమీన
యతడుత్యోచుండువాచాలతన్.

ఇచ్చట వాచాలతలో ఆతడు సిగ్గూబిడియమూ లేనితెంపరి అని దీనిభావము. సంకోచంలాగానే ఉత్కోచం కూడా ధర్మవాచకమే. అయినా ధర్మిగా వాడారు కాదా? ఇట్టిదే—

'వాక్, స్ఫురణంబై విలసిల్లగా నుడువనొప్పన్ గావ్యు డెంతేనియున్.'

ఇక్కడసైతం కావ్యుడంటే కావ్యకర్త కదా. ఇది ధర్మవాచకాన్ని ధర్మిగా చెప్పడం కాదా? మరోవిశేషం కూడా ఉన్నది. లోకంలో పాణినీయంచేత సాధింపబడని శబ్దరూపాలు అనేకంగా కవులు ప్రయోగిస్తూ వచ్చారు. శాస్త్రిలుగారు దీన్ని వప్పుకోరేమో!

'బాహుబాహవి కేశాంచి ముష్టాముష్టి అద్భుతం తథా'—అనే శ్లోకంలో ముష్టీముష్టి (కేశాకేశిలాగా) కావలసినదాన్ని నడిమింటి వారు ముష్టాముష్టి అని అపాణినీయంగానే ప్రయోగించారు. నన్నయ్యభట్టుగారు శబ్దశాసన బిరుదధారులు అయి వుండిన్నీ-తాము శబ్దానుశాసనం (ఆంధ్రశబ్దచింతామణి) ఆరంభిస్తూ ఉండిన్నీ-హరిః ఓం-అని, 'విశ్వశ్రేయః కావ్యం తదదోషా పరికృతా చ వాగ్బుధ' అని సెలవిచ్చి, 'సంపరిభ్యాం కరోతౌ భూషణే' అనే అనుశాసనంవల్ల నిత్యంగా రావలసిన సుడాగమానికి సున్నచుట్టారు కాదా?

పైన పేర్కొన్న కవులకు మనపాటి వ్యాకరణం రాదని అనలేముగదా!-అయితే ఏమని సమాధానం చేసికోవాలె?-అంటే వారి వారి కాలాలకు ఆయాపదాలు శిష్టులయిన కవులు సుశబ్దాలుగా వాడుక చేస్తూ వుండేవారు అనుకోవలసి వున్నది. ప్రకృతం నేటి ఆంధ్రలోకంలో శిష్టులు యావనుడు-అని యువకుడికి బదులుగా వాడుతూన్నారు. అంతేగాక ఉత్కోచుడు, కావ్యుడులాంటి ప్రయోగాలు సయితం ఉన్నవి. అందుచేత-ఈయావనుడు ఒప్పు అవుతుందే గాని తప్పు ఏలాగు అవుతుందీ?

అపశబ్దంగా విమర్శకులు ఉదాహరించిన రెండోమాట- 'పాణిబంధము' అనేది. గ్రంథకర్త—

'చిటికెనవ్రేల...పాణిబంధమున బూన్చిన పచ్చనిపట్టుతోరమున్'—అనివాడినారు. విమర్శకులు మణిబంధ మనే అర్థంలో పాణిబంధం వుపయోగించారు అనిన్నీ, పాణిబంధమునకు పెండ్లి అర్థమ నిన్నీ ఆక్షేపించారు. పెండ్లి అనే అర్థంలో పాణిగ్రహణ పాణిపీడనాదులే రూఢాలని నాకు తెలుసు. కాని పాణిబంధం ఆ అర్థంలో రూఢం అయినట్లు ఎరగను. దీన్ని వీరు ఇంకా చక్కగా నిరూపిస్తే బాగుగా వుండేది.

పూర్వాపరముల్లో వున్న సన్నివేశంవల్ల పాణి బంధ మనగా మణిబంధం అనే అర్థం స్ఫురిస్తూనే వున్నది. పాణి-అనగా [చాచినవ్రేళ్లు గల]చేయి. దానిబంధము అనగా మణిబంధము. అంటే మణికట్టు అని అర్థం. దీనిలోనే సాబసులో-అరసున్న లేదంటారు. ఇది భాషా తత్వసంశోధకులు నిర్ణయింపవలసినవిషయం. కనుక దీన్ని వారికే వదలివేస్తాను.

మూడో అపశబ్దంగా తమిని గ్రహించారు విమర్శకులు. గ్రంథకర్త—తృణకంకణంలో–'తమి విదారించు నవచంద్రగవళరోచిరుదయములఁబోనిచూపులు' అన్నారట. తమి అనగా రాత్రి అనిన్నీ, తమము అనగా చీకటి అనిన్నీ రాత్రి అనే అర్థంగల తమిని విదారించేవి సూర్యకిరణాలే కాని చంద్రకిరణాలు కావనే–ఆక్షేపణ వకటిన్నీ, తమికిన్నీ తమమునకున్నూ నవ్యకవులు భేదం పాటింపకపోయేయెడల-చీకటిలేనప్పుడు చీకటిని హరించేచూపులనడం అనుచితం అవుతుందనే ఆక్షేపణ రెండోదిన్నీ విమర్శకులు చేశారు.

సరే!—బాగున్నది. ఈ రెండాక్షేపణలున్నూ తమిశబ్దానికి చీకటి-అనే అర్థం లేకపోతే అప్పుడు నిలుస్తవి. లేకుంటే నిలువవు కదా! తమిశబ్దానికి చీకటి-అనే అర్థంకూడా శబ్దరత్నాకరకర్త ఇస్తున్నాడు. చూడండి-పుట ౪౬3 లో-తమి=సం. స్త్రీ. ఇ. ఈ. రాతిరి. ౨ చీకటి. ౧-అని అర్థం వ్రాశారు.

ఇచ్చట అసలు గ్రంథకర్త-ఆమెచూపులు చీకటిని చీల్చుచంద్రకిరణములవలె వున్నవి అని రమ్యంగా వ్రాశారు. కమలాక్షి-అంటారు కవులు అక్షిగతమైన అందాన్ని ఇంపునూ భావించి. మరి అల్లాంటిస్థలంలో అంతటా-అక్షిధర్మమైన దర్శనక్రియ కమలంలో ఉందా? అనగా కమలం చూస్తుందా? కమలం చూడలేదుగాబట్టి చూడడమనేధర్మం తత్సాదృశ్యంచాత అక్షికికూడా లేదు. అంచేత గుడ్డికన్నో కాయకన్నో అయి ఉంటుంది-అని ఆక్షేపించవచ్చునా? ఇది సాహిత్యవేత్తల సంప్రదాయమా?

కాబట్టే ఇచ్చట-అంటే తమిశబ్దంలోని దోషం నిరూపించేసందర్భం యావత్తూ నిరాధారమైన కల్పన. మరిన్నీ ఈ సందర్భంలో నవ్యకవులకు లేనిదోషాన్ని ఆరోపించడం కూడా అంత ఉచితంగా లేదు. పైన చెప్పిన రెండు ఆక్షేపణలూ గాక ప్రకృతివిరోధ దోషం అనేది మరోటి వుందనిన్నీ దానిని ఆ శీర్షిక క్రిందనే వివరిస్తామనీ అంటారు శాస్త్రిలుగారు. సరే ఆలాగే చేయవచ్చు. తొందర ఏల? దానికి అక్కడే జవాబు చెబుదాం.

తర్వాత—'క. సఖులమనఃప్రియబంధము, లఖండము లటంచువిందు'—అనే పద్యంలోని ప్రియబంధము—అనే శబ్దాన్ని తీసికొన్నారు. కాని ఇందులో ఏ అపశబ్దదోషాన్నీ వారు చూపలేదు. అయినా రసపరతంత్రులై ప్రియబంధం-అనడంకంటే ప్రణయబంధం-అనడం లెస్స అని సలహా ఇచ్చారు. ఇది మంచిదే కదా!

తలుచుగా పెద్దలు ఇల్లాంటి సలహాలు ఇచ్చేటప్పుడు—ముందు ఉన్న ప్రయోగంలో కల అస్వారస్యమును ఉద్ఘాటిస్తారు. ఆ పిమ్మట తమసలహా నంగీకరిస్తే రాగల స్వారస్యం వెల్లడిస్తారు. ఇది శాస్త్రిలుగారిలాంటి ఆలంకారికులూ వైయాకరణులూ అవలంబించే శిష్టసంప్రదాయం. ప్రకృతసందర్భంలో అట్టిదేదీ వారు చెయ్యలేదు.

వారు చేయకున్నా మనం అల్లాంటి సారస్యం ఏదేనా వుందేమో చూతాము. మన పూర్వకవులు తరుచుగా వర్ణించునట్టిది సంభోగావధికమైన-శృంగారరసాలంబనం కల-ప్రణయబంధము. నవ్యకవులు వర్ణించునట్టిది అల్లాంటిది కాదు. అందులోనూ ప్రకృతగ్రంథకర్త వుద్దేశించినది సుతరామూ కాదు. అందుచేతనే ఇక్కడ సంభోగావధికమైన శృంగారరసాన్ని ఆశ్రయించిన నాయికానాయకుల విషయంలో ఇంతవఱకూ రూఢమైవున్న ప్రణయబంధమును ఈకవి వాడలేదు. కనుకనే ఇచ్చట ఈ మిత్రులబంధమును ప్రియబంధముగా రూపించినారు. ఈ కారణంవల్ల నవ్యకవుల ఆదర్శానికి అనురూపంగా ప్రణయబంధం కంటే—ప్రియబంధమే చాలా వుచితంగా కనిపిస్తున్నది.

పిమ్మట—సుకృతిశబ్దాన్ని గురించినచర్చ. సుకృతిశబ్దానికి పుణ్యాత్ముడనే అర్థం వున్నమాట నిజమే. అయినా ఇక్కడ ఆపతితం కాదగ్గప్రత్యవాయం ఏమీ లేదు. సు + కృతిక—అని సమాసం చేస్తే సరిపోవచ్చు. అప్పుడు—దైవికంబను సుకృతినిదక్క=దైవికమను మంచికారణము లేక, దంపతులయందు ప్రేమోదయంబుకాదు—అని సులువుగా అర్థం ఏర్పడుతూ వున్నది.

దీని తర్వాత మిగిలింది - ఆత్మ తన్మయమందవచ్చు-అనే దానిలో వున్న 'తన్మయ' శబ్దప్రయోగం. దీనిని తన్మయత్వ మనవలెనంటారు శాస్త్రిలుగారు. అపశబ్దాలుగా వారు చూపినవాటిలో వున్న యౌవనశబ్దం దగ్గరే మనవి చేశాను. ఏమని అంటే—తెలుగుకవులు ధర్మిని ధర్మవాచకంగానూ ధర్మమును ధర్మివాచకంగాను చెప్పే మర్యాద ఉన్నదని. కనుక తన్మయంలాంటి ప్రయోగాలు దీన్ని సమర్థించడంకోసం వున్నవేమో చూతాము.

మహాభారతంలోనే నన్నయ్యగారి రచనలోనే—'నీకాదణమున వంశము నాకులమై' అని వకచోటనున్నూ, 'డనికి సాదృశ్యముగా నేనేమి యొనర్తు నీకు' అని మరోచోట నున్నూ కనిపిస్తూ వున్నవి రెండు ప్రయోగాలు. ఇక్కడ సదృశముగా అనడానికి బదులుగా సాదృశ్యముగా అని ప్రయోగింపబడ్డది. ఇల్లే—'ఉద్ధవుడు వచ్చె నీతికినుచిత మెఱిగి'—అనేచోట ఔచిత్యానికి బదులుగా ఉచిత మని ప్రయోగించారు. శాస్త్రిలుగారు ప్రమాణంగా ఎన్నికొన్న-శ. ర. లోనే ఈశబ్దం విశేష్య మనిన్నీ కద్దు.

పూజ్యులూ కవిత్వంలో ప్రాజ్ఞతలో వయస్సులో కూడా- వృద్ధులనిపించుకొన్న వ. సు. రాయలు– 'లోకం బాకుల మంద'-అని (వేణిలో) ప్రయోగించారు. కనుక ఇది ఆంధ్రకవుల సత్సంప్రదాయానుసారంగానే వుందని మనవిచేస్తాను. అపశబ్దాలనే శీర్షిక క్రింద ఇచ్చిన వాటి కన్నిటికి సమాధానం చెప్పాను. శాస్త్రిలుగారు అపశబ్దము లనడం

వక్కాణేటే- అపశబ్దంగా మిగిలిపోయింది. ఇది అపశబ్దాల పరామర్శ.

## 3. అన్వయదోషాల పరామర్శ

ఇక అన్వయదోషాలు అన్నవాటిని పరామర్శింతాము. తృణకంకణంలో కవి—

'క. ఆమోహానహరిణంబును ముద్దిడి
కొనియెను దృణపరిమళము బుసల్కొన
మొగమున్.'

అని ప్రయోగించారు. విమర్శకులు ముద్దిడుకొనడాన్ని పట్టుకొని ఈ క్రియాపదానికి 'గర్మయేమి? హరిణమా? మొగమా? రెండు నా?' అని ఇత్యాదిగా సాగదీసి-చివఱకు శాస్త్రపంక్తుల్లోకి ఎక్కి దేహళీదత్తదీపన్యాయందాకా దృష్టిసారించి 'ఆన్యాయంశాస్త్రులకే చెల్లుతుంది. తృణకంకణం శాస్త్రమా?'— అని అధిక్షేపంతో విరమించారు.

దీపకాలంకారాన్ని ప్రదర్శించేటప్పుడు- కవులందరూ మధ్యదీపకం అనే అలంకారాన్ని తమకృతులకు అలంకారంగా చేసికోవడం వున్నది. అయితే ఆ కవులు తమ కావ్యాలను శాస్త్రాలుగా భావించారో లేదో అనేది శాస్త్రిలుగారు చెప్పదగ్గవిషయం అని మనవిచేస్తాను. ప్రకృతం ఈ పద్యందగ్గర చేసిందంతా అకాండతాండవం.

ఏమంటే—ఆంధ్రకవుల భాషాప్రయోగ రీతుల్లో 'ఉండి' పరంగా వుంటే ద్వితీయా కారకంగానీ సప్తమీకారకం గాని చేయడం రివాజు. అందుచేతనే బాలవ్యాకరణకర్త 'ఉండిపరంబగునపుడు ద్వితీయాసప్తమ్యులగు' —అని సూత్రించాడు.

'క. కలి కర్కోటకవిషంబు గ్రక్కుచు
నొడలన్ వెలువడి'—(భారతము.)
'కుసుమాసారంబులు కబరిం దొరంగ'
—(వసుచరిత్ర.)

ఈ రెండు స్థలాల్లోనూ "ఒడలన్ వెలువడి= ఒడలినుండి వెలువడి"—అనిన్నీ, "కబరి దొరగ=కొప్పునుండి తొరగగా," అనిన్నీ అర్థం స్పష్టంగా అవుతున్నది. అల్లాగే ప్రకృతస్థలంలో ఆమె (కర్త)- తృణపరిమళము మొగమున్=మొగమునుండి, బుసల్కొనన్= వ్యాపింపగా, ఆమోహానహరిణమును ముద్దిడికొనియెను—అని సాఫీగా (అడ్డుకోకుండా) అర్థం ఏర్పడుతూ వున్నదికదా! ఇట్టిస్థితిలో—ఈఘృతపాత్రాధారచర్చ యెందుకూ? దేహళీదత్తదీపన్యాయం యెందుకూ?

అన్వయదోషాలుగా చూపినవాటిలో - రెండోది 'సృష్టిమర్మములసరణి-'ని గుఱించినది. 'ఈసరణి దేనితో అన్వయించును? ఎబుగవో- అన్నక్రియ మాఱుటతో నన్వయించెను గదా'—అని శంకిస్తారు శాస్త్రిలుగారు. ఇక్కడ సృష్టిమర్మములసరణి-అనేది ప్రథమ కాదు; సప్తమీకారకం. సరణిన్-అనేది దాని అసలురూపం. అయితే ద్రుతం ఏమైందీ?—అనే ప్రశ్న రావచ్చు. పాదాంతంలో గానీ, అథవా పద్యాంతంలో గానీ వచ్చే ద్రుతం లోపిస్తుంది. ఇది శాస్త్రిలుగారు ఎఱిగినసంగతే. అయినా చూడండి ఈ ప్రయోగాలను మచ్చుకుగాను:—

'ఏల యున్నదాన వేకతంబ, విజనశైలవిషమవిపినభూమి' —(భారతము.)

విరులు విలుతురు పువ్వులావికలు వీట
—(వసుచరిత్ర.)

అపశబ్దాలలో లాగానే అన్వయదోషాల్లో కూడా ఒక్కటీ నిలువజాలక పోయినది. ఇదీ తేలినఫలితం.

ఇది అన్వయదోషాల పరామర్శ.

## ౪. అలంకారదోషాల పరామర్శ.

'గీ. భావభర మైన హృదయబింబంబునందు,
రక్తి లిఖియించుకొంటివే రమణిరూపు,
అదియెముదవీయకలతకాస్పదమయ్యె,
గ్రహణగతయైన చంద్రుని కళవిధాన.'

శాస్త్రిలుగారు అలంకార దోషాలకు ఇచ్చిన అయిదుదోషాలలో ఇది మొదటిది. దీనిలో! హృదయాన్ని ఫలకంగా రూపించడమే హృద్యం అనీ, బింబంగా రూపించడం బింబంలో చిత్రించడం- కొత్తవిషయం అనీ వక్క ఆక్షేపణ. గ్రహణగతమైన చంద్రునికళ విధాన- అన్న ఉపమానం అన్వయించడం లేదన్నది రెండో ఆక్షేపణ. ఉపమానస్వారస్యం శూన్యం అనేది మూడో ఆక్షేపణ. గ్రహణగత చంద్రకళ ఎందుకు ముదం ఇవ్వదు? పాక్షి అలత యెందుకు ముదం ఇవ్వకపోవచ్చు అలత- అనేటట్టయితే ఆమాట వ్యర్థం- అని నాలుగో ఆక్షేపణ. పూర్ణిమనాడే గ్రహణం వస్తుందిగనుక ఆనాడు పూర్ణచంద్రుడు వుంటాడేగాని చంద్రకళ వుండదని అయిదో ఆక్షేపణ. ప్రియురాలినేగాని ఆమెరూపును చంద్రకళతో పోల్చరాదని ఆరో ఆక్షేపణ. ఏతావతా వీటి అన్నిటివల్లా లింగౌచిత్యం నష్టమైందనీ భావసౌందర్యం తరిగిందనీ ఏడో ఆక్షేపణ.

ఇల్లాగా ఆక్షేపణలసప్తకం ఏర్పాటు అయింది. ఇక పరామర్శిస్తాను. హృదయాన్ని ఫలకంగా రూపించడం హృద్యంగా వుంటే వుండవచ్చు బింబంగా రూపించడంమాత్రం కొత్తవిషయం కాదు. బింబంఅంటే శాస్త్రిలుగారు ఏమిగా అర్థం చేసికొన్నారో తెలియడంలేదు. కాని కవి ఇక్కడ—'బింబస్తు మండలే స్యాత్' అన్న నైఘంటికుల నిర్వచనాన్నీ చంద్రబింబము నితంబబింబము-లాంటి మండలార్థ బోధకాలయిన వాడుకలనూ అనుసరించి- హృదయమండలం అనేఅర్థంలో హృదయబింబం వాడారు అని అనుకొంటాను. కాబట్టే భావభరం- అనేవిశేషణం అందించింది.

తర్వాత రమణిరూపు-అంటే ప్రియా సౌందర్యం అనిఅర్థం. అంతేగాని ప్రియురాలు (అనగా రమణి) కాదు. ఈ సౌందర్యానికి ఉపమానం చంద్రునికళ. అంటే- చంద్రుని శోభ అని అర్థము. కళకు—శోభ, లావణ్యం అనే అర్థంకూడా వున్నదికదా! ఈవిధంగానే రూపు అనగా అందమని అర్థం. (శ. ర. చూడండి.) కళకు పైనచెప్పిన అర్థద్వయంవుండడం మాత్రమేకాదు. వాడుకకూడా వున్నది (పెండ్లికళ, దేవీకళ, మొ.)

'కళాశాలిని చూచి దీవన లొసంగకపోరు' అనే వసుచరిత్రపద్యమూ, దానిపైని వ్యాఖ్యా చిత్తగించండి. కళాశాలిఅంటే లావణ్యశాలి- అని అర్థం వ్రాస్తారు వారు. ఈ విధంగానే గ్రహణశబ్దానికి స్వీకారాపరాగాదులు చాల

అర్థాలున్నవిగదా!- కాగా అన్వయం ఏమని ఏర్పడుతూందో చూచి ఆతర్వాత అలంకార దోషం వుందో లేదో చూతాము. అన్వయం ఈక్రిందివిధంగా ఏర్పడుతూవున్నది.

గ్రహణగతమైనన్ = స్వీకారము (అనగా- పెండ్లి) పొందినది కాగా, రమణిరూపు = చెలువయందను, మద మీయక, అలతకు = శ్రమకు, ఆస్పదమైనది. ఎల్లాగంటే- గ్రహణగ్రస్తమైన=గ్రహణ సంఛన్నమైన, చంద్రునికళ విధాన = చంద్రునిశోభవలె—అని. ఇందులో వున్న గ్రహణగతమనేపదము సాభిప్రాయంగా వుంకి ఉపమానోపమేయాలకు రెండింటికి అన్వయిస్తూ సొంపుకూరుస్తూ వున్నదికాదా? కాబట్టి ఈ ఉపమాలంకారమునందు ఎట్టి దోషం లేదని అనుకోవలసి వున్నది. విమర్శన వల్ల ఎర్పడ్డ భావసౌందర్యపు లఘుసు విఱిగి పోయిందికూడాను.

ఇక ఈ సందర్భంలో మిగిలిన ఆరోపణ లింగౌచిత్యనష్టం - వచ్చిందనేది. చంద్రుని కళా-రమణిరూపూ రెండున్నూ కూడా, స్త్రీలింగ్యజ్ఞవాచకాలు-అనే చిన్నయ్యగారి సూత్రం చొప్పున అమహత్తులయినా, లేదా స్త్రీసమాలయినా కావచ్చు; ప్రథమైకవచన ప్రత్యయం లేదుకాబట్టి. మఱి లింగానికి చలనం లేదు. మహారాజులాగా వుండవచ్చు.

రెండో అలంకారదోషం-'మిసమిసలాడు జవ్వనపుమేలిమి' అనే పద్యంలో ఇచ్చారు. ఇందులో వీరు చేసినఆక్షేపణలు ఆరు (౧) జవ్వనపుమేలిమికిన్నీ సొగసువాడినవళినికిన్నీ సాదృశ్యం అనుభవేతరవిషయం. (౨) అందులో సారస్యంలేదు. (3) ఆతనిదేహము విరహవేదనచే కృశించి వాడిననళినివలె ఉన్నదనడం కవి ఆశయమైతే సొగసువాడినఅనడం తప్పు; అనౌచిత్యం. (౪) విరహవేదనవల్ల దేహం కృశించినా సౌందర్యం తగ్గదు అనడం. (౫) పురుషదేహాన్ని నళినితో పోల్చడం, అనౌచిత్యం అనడం. (౬) లింగౌచిత్యనష్టం.

ఆక్షేపణపంచకం ఏర్పడడానికి ప్రధాన కారణం పద్యం అన్వయించుకోవడంలో కలిగిన దృష్టిభేదం అనుకొంటాను. దీనికి-అంటే ఈ పద్యానికి సర్వసాధారణంగా అన్వయం ఇల్లా అవుతూంది: మేనన్ = శరీరమునందు మిసమిసలాడుజవ్వనము మేలిమి-(ఇది ఉపమేయం) సొబగు లొలుకుతూ వున్నది. అయితే ఆసొగసు వాడినట్టి నళినిందలపించుచున్నది. ఉపమేయమైనసొగసు—స్త్రీసమం. ఉపమానమైన నళిని. స్త్రీలింగమేకదా!—కాగా లింగౌచిత్యనష్టం లేదు. నళినితో పోల్చింది పురుషదేహాన్ని కాదు గదా—కనుక అనౌచిత్యం లేదు. 3-౪-ప్రశ్నలకిక్కడ చోటే లేదు.

మిగిలింది మొదటివిషయం. అంటే అనుభవేతరవిషయం—అనేది. దీన్ని చూతాం. సాధారణలోకదృష్టికి అనుభవేతరవిషయంగా వున్నా, కవి అసాధారణమైన భావనాబలం చేత తనసంస్కారాన్ని అనుసరించి అలౌకిక సౌందర్యాతిశయాన్ని రూపొందించుకోగలడు; దాన్ని వెల్లడించుకోనూ గలడు. అది కొత్తదనడం అందుచేత మంచిదికాదనడం చేయరాదు.

కాళిదాసమహాకవి 'చిత్రాచంద్రమసారివ-' అని వక వుపమానం చెప్పాడు. నా అనుభవంలో అదికొత్తది అనుకొని తద్గతసౌందర్యం భావింపలేక మంచిదికాదనడం న్యాయంగా వుంటుందా? ప్రకృతపద్యంలో ఆశాభంగం వల్ల ఏర్పడిన విరహవేదనా ఆతపదోషమూ అనే రెండూకలిసి ఆయువకుని యౌవనసంపదకు క్లాంతినిస్తూన్నవనే విషయం ప్రధానం కదా. అందుచేత దాన్ని వాచ్యంగా చేయక ఉత్తమరీతిని ధ్వనింపచేశాడు కవి. కనుక ఇందు వైరస్యం లేకపోగా సారస్యమే కనిపిస్తూ ఉన్నది.

అలంకారదోషాల్లో మూడోదాన్ని 'నాయనంసంజెలీ'—అనేపద్యంలో విడతీసిన రేకులపూవుచందం ఏయుపమేయంతో సమన్వయించాలె? అన్నది ఒక్కటే ఆక్షేపణ. ఆక్షేపణకు ఇక్కడ తావేలేదు. ఇక్కడ— వారిమైత్రి విడదీసిన పూవులరేకుచందము అయిపోయింది—అనే లోకపువాడుకను అనుసరించి అన్వయించుకోవాలె. చందం అనే మాటకు విధం—అని అర్థం. పూవై తన్మాత్రం విధమై— అనే ఇత్యాదిస్థలాల్లోలాగే పూవు విధమై అన్నట్టుగా విడదీసినపూవులరేకు విధమై అని అర్థంచేస్తే చాలు.

నాలుగో అలంకారదోషంగా 'కడిగిన మృగమదపాత్రిక' అనేపద్యంలో వారిప్రేమ బంధాలు తెగవుఅనేచోట పరిమళం తెగుటఅనే దాన్ని- తీసికొన్నారు. పరిమళం తెగడంకనీ వినీ ఎఱుగమనీ వకటిన్నీ, భిన్నవచనరూపము- అనే ఉపమాదోషం రెండున్నూ ఉన్నవంటారు ముఖ్యంగా ఇందులో. ఇట్టి అలంకారాలను గల యౌచిత్యములను పాటింపరేమో అనికూడా సోత్ప్రాసంగా అధిక్షేపిస్తారు.

నవ్యకవులకు* నా యెఱిగినంతవఱకూ ఎవ్వరికీ-అలంకారాలనుగానీ అందలి యౌచిత్యాలనుగానీ పాటింపకూడదనే దురాగ్రహం లేదు. రసోపస్కారాలుగా వున్నవని తాము నమ్మినంతవరకూ సందర్భానుసారంగా వాటిని వారు గ్రహిస్తారు. కాని అలంకారాలు కదా అని వాటిని సుడ్డిగా నింపుకోవడానికి మాత్రం పూనుకోను. ఈమాట నిజం.

మఱి ఇటుపైన మృగమద-పాత్రికలపద్యం చూతాము. ఇందులో శాస్త్రిలుగారు చూపించిన దోషాలు— (౧) పరిమళం తెగుట కనీ వినీ యెఱగం. (౨) భిన్నవచనరూపం అయిన ఉపమానదోషం—అనేవి.

దండాన్వయరీత్యా చూచినా, దీనిఅర్థం ఇల్లా సాధారణంగానే అవుతున్నది:—కడిగిన మృగమదపాత్రికను పరిమళం విడువని పగిదిగా, విడుపొందియును వారి ప్రేమబంధాలు తెగవు—అని. పరిమళమూ విడువదు, మైత్రీ ప్రేమబంధాలూ తెగవు—అని వాక్యకతులు. విధినియమములన్—అనేది ఈ రెంటికీ సమానంగా అన్వయిస్తుంది.

విధినియమములన్ = కాలవ్యవస్థలచొప్పున —అంటే ఆయా ఋతుధర్మాల ననుసరించి

---

* ఈపరామర్శలో శాస్త్రిలుగారు, భావకవులని వాడినచోట్ల అంతటా నేను నవ్యకవులని తఱుచు వాడుతూవున్నాను. ఈవ్యత్యయాన్ని గమనింపదగును.

[ప. ఆ. శా.]

[ఇది మృగమదపాత్రికపక్షంలో,] పరిమళము విడదు. విధినియమమూలక=ఈశ్వర నియమన ముల చొప్పున, విడిపోయినప్పటికిన్నీ వారి ప్రేమబంధాలు తెగవు. ఇందులో తెగుటకు లాక్షణికార్థం చెప్పారే. చెప్పితే, ప్రేమ బంధాలు ఉచ్ఛిన్నం కావు — అని అర్థం ఏర్పడుతుంది. చందనపాత్రికలలో— రసికులు నిదాఘకాలంలో ఘనసారచందనా దులున్నూ హేమంతాదుల్లో కస్తూరీలేపనా దులున్నూ ఉంచికొని అనుభవిస్తూ వుంటారు. ఆయా ఋతువులు మారడంతోటే ఆపాత్రల కడిగి ప్రకృత ఋతుధర్మానికి తగిన గంధ ద్రవ్యముల నుంచుతారు. ఇది సంప్రదాయం.

అలాగు వుంచినప్పుడు వెనుకటి గంధ ద్రవ్యముల పరిమళాలు ఆ పాత్రికలనుండీ పూర్తిగా ఉచ్ఛిన్నం కావు. ఈ అర్థం ఇచ్చట కవికి అభిప్రేతంగా వుండివుంటుంది. వుంటే అప్పుడు శాస్త్రిలుగారి యీ అధి క్షేపం ఏమని మనం అర్థం చేసికోవాలె? ఇక ఇందులో వుండే భిన్నవచనరూపమైన ఉపమాదోషాన్ని ముమ్ముందు సమాధానిస్తాను.

ప్రాయమును గ్రసించు తాపవిషం తర్వాత పేర్కొన్న అలంకారదోషం. ఇం దులో తాపాన్ని విషంగా రూపించారు గ్రంథకర్తలు. విమర్శకులు దాని ప్రయోజ నం ఏమిటే? అంటారు. వడ్లగింజలోది బియ్యపుగింజలాగున్నది ఇది. ఇక్కడ గ్రహించ డానికి లాక్షణికార్థం గ్రహిస్తే హరించడమే అవుతుంది. అయితే—కవి 'హరించు' అనే ప్రయోగించకూడదా? అని ప్రశ్నింపవచ్చు. దానికి ఇది సమాధానం.

ఏమంటే—హరించు అనే క్రియకు— వాడుకను బట్టి క్రమరీత్యా హరించుట అనే అర్థం కలుగవచ్చు. కర్పూరం హరించిపో యింది-అన్నప్పుడులాగా. ఇక గ్రహించు అనే క్రియతో తాపం అనేది ఉత్కటమైనవిషం కాబట్టి ఉద్వృత్తిగా మ్రింగివేయడానకు ఉద్యుక్తమయింది అనే సరసమైన అర్థం సూచితం అవుతూ ఉన్నది. కాగా శాస్త్రిలు గారు సెలవిచ్చిన హరించుకంటేనూ గ్రసించే తమ్ముమే నిర్దుష్టంగా వున్నది. దీనితో అలం కారదోష పరామర్శ దాదాపు అంతా ముగి సినట్లే ఎంచవచ్చు. కాని అలంకారదోషాలు విమర్శించే సందర్భంలో తెలుచు శాస్త్రిలు గారు అనౌచిత్యదోషాన్నీ ఉపమాదోషాన్నీ పేర్కొంటూ వచ్చారు.

శాస్త్రిలుగారు పరిశ్రమ చేసినంత తుణ్ణాగా నేను ఈశాస్త్రంలోనే గాదు-ఏశాస్త్రం లోనోకూడా పరిశ్రమ చెయ్యలేదు. అయినా డొక్కశుద్ధి అయినవాడనే కాబట్టి ఈఔచిత్య విషయంలోనూ ఉపమాదోషాల విష యంలోనూ కొన్నిమాటలు వ్రాసి ఈ అలం కారదోషాల పరామర్శ ఉపసంహరిస్తాను.

తెలుసునకు—అటికోలులుగానైనా ఏదో పేరునకు వ్యాకరణంఅనేది కొత్త (చిన్నయ్య ధర్మాన) ఏర్పడ్డదేగాని అలంకారశాస్త్రం ఏర్పడేలేదు ఇంతదాకా; అలంకారానికి ఏపెద్దయ్యగ్రంథమో మచ్చుకు దొరికినా, వాటిలో ఆంధ్రవాఙ్మయమున్నంతా మూలం కమంగా గాకపోయినా దిగ్దర్శకంగానైనా పరామర్శించడ మనేది బొత్తిగా కానరాదు. కేవలంకృతిపతుల గుణకీర్తనం అనేపనినీ- సంస్కృతాలంకార లక్షణాలకు తర్జుమానూ అందులో కనిపిస్తాయి, అంతేగాని ఆంధ్ర లక్ష్యాలు లేవని చెప్పినా తప్పకాదు.

పైగా మనపూర్వకవులు వ్యాకరణానికి చూపిన ప్రాముఖ్యమును అలంకార శాస్త్ర విషయాలపై—అనగా సాహిత్యవిషయాలపై చూపనూలేదు. పురాణాల తర్జుమాతో ఆరంభ మైన వాఙ్మయం చంపూప్రబంధసృష్టి దగ్గ రకు వచ్చేటప్పటికి దాదాపు వెయ్యేండ్లూ నిండాయి. కాబట్టి సంస్కృతాలంకార శాస్త్రిలలో వుండే లక్షణసామగ్రి నంతా తూచా తప్పకుండా సానబట్టుతాము అనే టట్టయితే- ఆంధ్రభారతం మొదలు ఈనాటి ప్రబంధ వాఙ్మయంవఱకూ ఒక్కటైనా నిలవ బడగలది లేదని దృఢంగా చెప్పవచ్చు. మచ్చుకై కొన్ని చూడండి.

(౧) గీ. వహ్ని మొదలైన నిఖిలదైవత గణంబు, తృప్తిఁ బొందుదు రీసుధాదీప్తి యందు, మహిత పుణ్యాత్ము కల్యాణ గృహమునందు, పాలతి; అభ్యాగతులు తృప్తిఁ బొందునట్లు.'— (శ్రీనాథుడు)

ఇందు సుధాదీప్తి కల్యాణగృహము-అనేవి భిన్నలింగములూ అభ్యాగతులూ దైవగణంబు తృప్తినొందుదురు- అనేచోట భిన్నవచనమూ కలదుగదా!

(౨) 'తామరపాకు నీరువలె తల్లడమందిరి పౌరు లందఱుఁ.' —(హరి.)

నీరు- పౌరులు అనే ఉపమానోపమేయ ములు భిన్నలింగములును భిన్నవచనములును కావా? కానిచో గతియేమి?

(౩) 'పూసలలో దారంబుపగిది పరిమళ లోనఁగ, మెలఁగెడుపురుషుఁడు దొరకుట...' —(పారిజాత.)

ఇందు దారంబు-పురుషుడు (ఉపమానోప మేయాలు) నపుంసకంలో పుంలింగంలో వు న్నవికావా? కనుక అల్పాల్పదోషాలు అయిన భిన్నవచనభిన్నలింగత్వాదులు దోషాలుగా ఆంధ్రకవులు [అంటే కేవలం గ్రాంథికాంధ్ర కవులే - నవ్యకవులు కారు-] ఏర్పఱచుకో లేదనీ, అదే ఆంధ్రకవిత్వసంప్రదాయం అనీ మనం అనుకోవలసి వస్తుందికాదా?

అయితే —'అనౌచిత్యా దృతే నాన్య ద్రసభంగస్య కారణం, ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిష త్పరా'—అనేకారికవిషయం ఏమిటి అని ప్రశ్నించవచ్చు. నిజమే, ఈకారి కలో పేర్కొన్న అనౌచిత్యం అనేది ప్రస్తుత తృణకంకణంలో వారు ఉద్ఘాటించినప్రదే లలో ఎక్కడా పట్టలేదు సరిగదా పైగా ఆంధ్రకవిలోకంలోనూ ఆంధ్రవాఙ్మయప్రపం చంలోనూ ప్రసిద్ధమైన ఔచిత్యబంధమే ఇందు కానవస్తూ ఉన్నది.

కేవలం ఇంతమాత్రమే కాదు.'అనౌచిత్యా దృతే—అనేకారిక చెప్పిన ఆలంకారికులే- 'శ్లో. న లింగవచనే భిన్నే న హీనాధికతాపి వా, ఉపమాదూషణాయాలం యత్రోద్వేగో న ధీమతాం'—అని సహృదయులైన యాలకు ఉద్వేగం కలిగింపనంతవఱకూ లింగ భిన్నత్వం గానీ వచనభిన్నత్వం గానీ హీనత్వం గానీ అధికత్వం గానీ దోషాలు ఎంతమాత్రం కావు-అని సాటుతూవున్నారు.

ప్రస్తుత మీ తృణకంకణంలో—సుప్రసిద్ధాంధ్రకవుల సంప్రదాయాన్ని బట్టి చూచినా, లేదా మహాకవీ దండిపండితుడూ పదలాలిత్యానికీ భావసంపదకూ పేరెన్నికపొందినవాడూ 'త్రయోగ్నయస్త్రయో వేదాః'-అన్న సాహచర్యంతో 'త్రయోదండిప్రబంధాశ్చ'-అని శ్రోత్రియత్వానికీ పావిత్ర్యానికీకూడా ప్రసిద్ధి నార్జించినవాడూ అయిన దండికవి కావ్యసౌభాగ్యాన్ని నిలవరించడాన్ని బట్టి చూచినా, — ఏ విధమైన అలంకారదోషాలూ లేవని చెప్పవలసి వస్తున్నది. ఇది అలంకారదోషాల పరామర్శ

## ౫. అర్థదోషాలు

ప్రకృత విమర్శనంలో శ్రీ శాస్త్రిలుగారు అర్థదోష. వ్యాకరణదోష. పునరుక్తిదోషాలను నాల్గింటినీ చేర్చి అర్థదోషాలు అనే శీర్షికతో ఉదాహరించి చర్చించారు. అయినా మధ్య మధ్య అన్వయదోషాలు శబ్దదోషాలు మొదలయినవి కూడా కలుపుతూనే వచ్చారు. వాటిని విడగొట్టి జవాబు చెప్పడానికి నాకు వీలు కాలేదు. కనుక నేనూ వారు నడచిన మార్గంలోనే నడుస్తూ ఈపరామర్శ సాగిస్తూ ఉన్నాను.

అర్థదోషాలు ఉపక్రమిస్తూ-ఈ గ్రంథంలో ముప్పాతిక మువ్వీసం ఈశీర్షిక క్రింద ఉదాహరించవచ్చనీ, గ్రంథవిస్తరభీతిచాత కొద్దిగా వ్రాస్తామనీ అంటారు. ఒక్క ఈగ్రంథాన్నే కాదు-ఏగ్రంథాన్నైనా సరే!—ముప్పాతిక మువ్వీసమేకాదు-పైగా ఇంకో మూడుకాన్ల మూడు పెఱలదాకా - అంటే ముప్పాతికా మువ్వీసాల మూడుకాన్ల మూడు పెఱలవఱకూ కూడా, దోషజ్ఞులవడం మూలాన వారు ఉదాహరింపగలరు, దోషాలుగా నిరూపింపగలరు. అందు కేమీ సందేహం లేదు. నేను విశ్వసిస్తాను. ఆశక్తి వారి కున్నది.

వారు చేసిన ఈవిమర్శనాన్ని అంత సాకల్యంగా పరామర్శించేవోపికా శక్తీ నాకు లేనిమాట నిజమే. అయినా అడుగువేశాను గనుక ఎల్లాగో వోపిక తెచ్చుకొని పరామర్శిస్తాను. ఎక్కడైనా పరామర్శ సరిగా చేయలేకపోతే - అది నా దౌర్బల్యాన్ని సూచిస్తుందేగాని అన్యథా కాదు అని మనవిచేస్తూ 'హరిః ఓం' అంటాను.

ఆలంకారికులు—వాచక లక్షక వ్యంజక భేదాలచే త్రివిధమైన శబ్దజాతాన్నీ వాచ్య లక్ష్య వ్యంగ్య భేదాలచే త్రివిధమైన అర్థజాతాన్నీ వున్నటులు పేర్కొంటారు. తాత్పర్యార్థం-అని మఱోటివుందని కొందరంటారుట- కాని అదికూడా వ్యంగ్యార్థంలో అంతర్భూతమైనదేకాని మఱోటికాదనిఅంటారు. వ్యంగ్యమునకే నామాంతరం ధ్వని అని. ఈ వాచ్య లక్ష్య వ్యంగ్యములలో నియతార్థం వాచ్యమనీ, లక్షణయా ఉపపన్నమైన అర్థం లక్ష్యమనీ, వాచక లక్షకాల రెండింటివలనా గాక, వాక్యార్థోపసంస్కారార్థమై అర్థాంతరవిషయమైనట్టిది వ్యంగ్యమనీ అంటారు.

ఈమూడింటిలోనూ వాచ్యంకంటే లక్ష్యానికీ, లక్ష్యంకంటే వ్యంగ్యానికీ కావ్యప్రపంచంలో ఉన్నతస్థానం అనేది పెద్దలు ఎఱుగనిది కాదు. కాబట్టే సరసకవితా చక్రవర్తులు అయిన పెద్దలు కావ్యప్రపంచంలో కావ్యార్థం అభిధాద్యావరణలు దాటి లక్షణాద్యావరణాలల్లో ఎంత విహరింపగలిగితే అంత—కావ్యార్థం మధురంగా వుంటుం దని సెలవిస్తారు.

నవ్యకవులు ఖండకావ్యాలనే హెచ్చుగా వ్రాస్తున్నారు. వాటిలో విలక్షణమైన పరిభాషతో- రసోపస్కారక మైనట్టీ ఉత్తమోత్తమమైనట్టీ-ధ్వనిమార్గాన్నే వారు అనుసరిస్తున్నారు. వారేర్పఱచుకొన్న రచనలోని పరిభాషాక్రమం ఒకరీతిగా చూస్తే సుతరాం క్రొత్తదిన్నీ ఇదివఱకు మనవారికి అలవడనట్టిదిన్నీ అనేమాట నిజం. నవ్యుల సంప్రదాయం ఏమిటో అవగాహనం చేసికొందామనే వోపిక నేటివిమర్శకులలో చాలామందికి లేదు. ఏమంటే- వారు- ముమ్ముందుగానే ఏదో ఒక అభిప్రాయం స్వకపోలకల్పితంగా తయారుచేసికొని గానీ, లేదా తమకు పరిచయమైవున్న లక్షణశాస్త్రాలు నిఘంటువులు మొదలయిన కొలతబద్దలతో కొలిచిగానీ సరిపెట్ట పూనుకొంటారు.

సారస్వతీయుల దుర్భాగధేయఫలితంగా ఈ విమర్శనంకూడా ఆమార్గంలోనే నడిచిందనడానికి విచారపడుతూన్నాను. రసస్వరూపాన్నీ వ్యంగ్యస్వరూపాన్నీ దిగ్దర్శనప్రాయంగా సూచించడానికి సాధ్యమవుతుందే గాని 'అత్రేత్థంవర్తతే'-అని చేత్తో పట్టి తెచ్చి పఱవేయడానికి ఎంతటివాడికీ సాధ్యంకాదు. ఈ కారణంచేతే తత్స్వరూపాన్ని ఆశాస్త్రకర్తలు సహృదయహృదయసంవేద్య మని వర్ణిస్తారు.

ఇప్పటికే ఈ ప్రస్తావన చాలా పెఱిగిపోయింది కాబట్టి—అర్థదోషాలు అనే శీర్షిక క్రింద వీరిచ్చినవిమర్శనాన్నీ నాపరామర్శనూ చిత్తగించేవేళల్లో పాఠకులు సహృదయతకు భంగంకాని కటాక్షప్రసారం దయచేయింపవలెనని ప్రార్థిస్తాను.

పసినిమ్మపండు చాయల పద్యం —
ఇందులో పసినిమ్మపండుచాయలతోనే గతార్థం అవుతూవుంటే కుందనపుపదం పునరుక్తి—అని ఆక్షేపణ. నిమ్మపండుచాయ-కుసుమిస్తూవున్న వయస్తారుణ్యాన్నిన్నీ, కుందనపుకాంతి ఆజన్మనిసర్గమైన లావణ్యాన్నిన్నీ సూచిస్తవి గనుక పునరుక్తిలేదని సమాధానం. ఇట్టిదే పెద్దన్నగారి- 'కమ్మనికుందనంబు కసుగందని మేను' అనేదికూడా. కవికులగురువు కాళిదాసుగారి-'పుష్పం ప్రవాళోపహితం యది స్యాన్ముక్తాఫలం వా స్ఫుటవిద్రుమస్థం-'అనేదిన్నీ.

కన్నె గేదంగి చెండు—

నాయికాస్వరూపసౌభాగ్యాన్నీ స్వభావసంపత్తినీ సామాన్యంగా కవులు వర్ణించుటకద్దు. ఈకవికూడా అట్టిదే చేయుచున్నాడు. పసినిమ్మపండుపద్యంలో— దేహచ్ఛాయావయోవికాసములూ, దీనిలో ఆకారవైలక్షణ్యమూ వివక్షితాలు అవుతున్నవి. బక్కపలచనికోలశరీరములతో కొందఱి అందము ఉంటుంది. మఱికొందఱి అందము తగిన అంగసౌష్ఠవం బొద్దుశరీరములతో ముద్దులు మూటగడుతూ వుంటుంది. ఈనాయిక రెండవరేఖకు చెందింది. గేదంగిచెండురేకులు ఒత్తుకొని బొద్దుగా వుండటంలో ఏ అందము కలదో అది

యే ఈ నాయికలో వున్నట్లు కవి చిత్రించాడు. సహృదయులు దీనిని భావిస్తే— ఈ రసాభాసాలకు ఏమాత్రం ఆస్కారం వుండదు.

నగ లేవి లేక—

నగలు ఏవీ ఆమెకు లేవనే వాడుకలో— మిక్కిలీపరిమితంగా నగలున్నవనే అర్థం. అంతేగాని మంగళసూత్రంసహా తెంచివేసివున్నదనే అర్థం రాదు, చెయ్యకూడదు. సొమ్ములు లేకున్నా అందంగానే వున్నదని చెప్పడం ఆలంకారికుల్లో మాధుర్యమనే గుణంగా ఎన్నుతారు. నగలేవీలేక అనేవాడుకకు పరిమితాభరణతను అర్థంగా తీసికోకపోతే—ఈ కవిపద్యానికి ఏమిగాని ముద్దుపలుకుముచ్చట్లకు ప్రసిద్ధికెక్కిన ముక్కుతిమ్మన్నగారి పద్యానికి 'మాసినచీరగట్టుకొని మానముతోడ నిరస్తభూషయై' అనేదానికి కూడా ఈ ఆక్షేపణ వర్తింపజేయవలసి వస్తుంది. వర్తింపజేస్తామంటారా ?—తథాస్తు.

చెమ్మట ముత్యాలసరులు—

ఇవి కంఠమున పైటవేసికొని వుండగా ఎట్లు-కనిపించా యని జాణతనపుప్రశ్న. ఆమె ధరించింది జిలుగుకలంకారీచీర. అనగా పల్చనిదికాబట్టి అని సమాధానం మృదువుగా. అంటే-మహాకవి కాళిదాసుగారికి 'క్షామక్షామకపోల మానన మురః కాఠిన్యముక్తస్తనం' అవగతమైనట్లే. - నగలుధరింపదగినస్థానాలు- కర్ణములు కంఠము కరములు కాను నాసిక శిరము అనిన్నీ-ఇందులో ఒక్క కంఠంలో తప్ప తక్కినస్థానాలలో ముత్యాలసరులు ధరించడం వినలేదనీ అంటారు శాస్త్రులు గారు.

నిజమనే వారిమాట నమ్ముతాను. అయితే వాఙ్మయప్రపంచంలో —'పృథుల మౌక్తిక శోభినాసాం' అని ఇత్యాదిగా బహుశా వర్ణనలు కనిపిస్తాయి. పోనీ కనీకనపడకుండా వుందేమో అనుకోవడానికి ఈ వర్ణనల్లో కవి పృథులమౌక్తిక-మంటాడే. ఈనాటి దారిద్ర్యసంపన్నమైన మన యీ ప్రపంచంలో లేకుంటే లేకున్న వేమో! కవీ-కావ్యం-వీరిప్రపంచంలో-ముద్దులు గురిసేటి ముత్యాల ఛాటంకాలూ ముత్యాల పాపటసరాలూ ముత్యాల భుజకీర్తులూ వున్నవి. వెదకిచూస్తే నాడు ముత్యాలశాలలుకూడా కనిపిస్తవి. వీటి అన్నింటికీ మఱి ఏందారి ?

పదియునాల్గు వసంతాల పద్యం :—ఇందు ప్రధానమైన ఆక్షేపణ-పునరుక్తి దోషంకంటే సారస్యం వుందా అనేది. పదునాల్గుసంవత్సరాల యువతిని గూర్చి తద్వయస్సంసూచకాలయిన పదాలు వాడలేదనీ అనేది రెండో ఆక్షేపణ. పూర్వకవులు వాడారని సమాధానింపకుండా, భావకవులు కదా పూర్వకవుల మార్గం ఏల త్రొక్కవలె అనేవి మూడోది. మోహన స్నిగ్ధప్రభృతిపదాలు భావకవులకు జిరాయితీకాబోలు—అనేది నాల్గో ఆక్షేపణ.

వీటిలో మూడోదానికి ఇదివఱకే సమాధానం చెప్పాను. లలి-సరవి ఇత్యాదులు పూర్వకవులు హెచ్చుగా వాడుతారు. నేటివారు మోహన స్నిగ్ధ ప్రభృతులను హెచ్చుగా వాడారు; వాడుతూవున్నారు. కాబట్టి జిరాయితీ అని ఆక్షేపింప నక్కఱలేదు. కాని కాస్త ఆలోచించి చూస్తే నుడికారపు సొంపూ భావగాంభీర్యమూ ఉన్నచోట ఉభయత్రా ఉన్నది. లేకుంటే అసలు లేదు.

కవులు కావ్యాలలో స్వోద్దిష్టమైన భావాతిశయం సిద్ధింపజేసికొనే నిమిత్తం లలితలలితాలయినపదాలు వాడి రచన చేస్తారు. దీనిని పాకము లనడం వాడుక. ద్రాక్షాపాక నారికేళపాకాదులు సహృదయులందరూ ఎరిగినవే. ఇంకా ఎక్కువ పాకాలు కావలసివస్తే రాజశేఖరకవి కావ్యమీమాంస చూడండి. అందులో సాధారణాలంకార గ్రంథాలలో లేనిపాకాలు చాలా వున్నవి. శృంగార రసమనేది చాలా సున్నితమైనది కావడం మూలాన - తెలుచుగా ఆకవులు ఆరసవర్ణన సందర్భంలో అతిమృదువులు-అనగా కోమలము లయిన పదాలే వాడుతారు. విద్యానాథ మహాకవి ద్రాక్షాపాకోదాహరణంగా శృంగార రసమును చిప్పిలజేసే శ్లోకాన్ని ఒకదానిని వాడినాడు. ఆశ్లోకం ఇదీ.—

'శ్లో. స్మరస్మేరాన్ మందస్మిత మధుర సారభ్రూసుభగాన్, మనాగ్విభ్రాంతాన్ ప్రణయరసకల్లోలభరితాన్, కృతాశ్లేష స్కంధాన్ మనసిజ. సహస్రాణి సృజతి కటాక్షాన్ వామాక్షీ కిరతి పరితో రుద్ర నృపతిం.'

వ్యాఖ్యాత భావప్రకాశనుండి ఇక్కడ స్మేరము, మధురము, స్నేహము, ప్రణయ రసకల్లోలాలు, కటాక్షాలు మొదలయినవాటికి చక్కని వివరణములు వ్రాశాడు. దర్పణాది గ్రంథాలలో కూడా వీటికి వైశిష్ట్యబోధకమైన పరిభాష ఉన్నది. దాన్ని వివరించడం ఇచ్చట ప్రధానం కాదు. స్థలమూ చాలదు అని మనవి చేస్తాను.

కాగా పదునాలుగేండ్ల యువతిని తెల్పేటప్పుడు సీమంతిని పడతి గరిత —లాంటి పదాలు ఉచితం కావనీ తరుణి యువతి కోమలి లాంటిపదాలు వాడవలె ననీ అంటారు. నిజమే ఎవరు కాదంటారు. ఆంధ్రకవుల్లో ప్రాయః—ఆదికవీ, ఆదికవిలాంటి ప్రశస్తిని గడించినవాడూ అయిన నన్నయ్యగారు — గరుడునిచేత, అతని తల్లిని సంబోధింపజేస్తూ-

'ఉ. ఆయతపక్షతుండహతి నక్కులశైలము లెల్ల నుగ్గుగాఁ జేయు... నాకు నీపని బాయక... వారికిం బనుల్, సేయను నేమి కారణము ? సెప్పుము దీని బమ్మెరుపోవనా!' — అని చెప్పారు.

నన్నయ్యగారి యీపద్యంలోనూ పదునాలుగేండ్ల యువతిమాత్రమే కాదు సరిగా కద్రువతో బాటు కశ్యపునికి సతియై ఆరాధించింది. పెద్దకొడుకు శాపంవల్ల ఏనూరేండ్లు సవతిదాస్యానికి పాల్పడి పంచశతవర్షాలూ నిండినపిమ్మట గరుత్మంతుణ్ణి కన్న మహాతల్లి! అట్టి యీయిల్లాలిని కొడుకేమని సంబోధించాలెనో ?

మఱి యీ వెక్కిరింపులకేమి లెండి! ప్రతి విషయంలోనూ - తాటిచెట్టెక్కే వాడిపైన తలదన్నేవాడు ఎవడో వుంటూనే వుంటాడు. ఈ విషయం ఇల్లా వుంచి దీనిలోని సారస్యం చూతాము. ఈపద్యంలో పూర్వార్ధంలో నాయికయొక్క పరిపూర్ణ-బాల్యసౌందర్యాన్నీ. ఉత్తరార్ధంలో అపరిమితయౌవనశ్లాఘ

గ్యాన్నీ వర్ణిస్తూ వున్నాడు కవి. కాగా ఇది సౌందర్యసంధివికాసాలను వర్ణించే సందర్భం. నాయిక ప్రాయమునకు తగ్గ ఇంపుసొంపులు కల దని సారాంశం. ఇట్టివర్ణనలు - శ్రీహర్షాదులు పెక్కురు చేసి ఉన్నారని కూడా మనవి.

పిమ్మట జిలుగుపూలకలంకారి చీరపద్యం——

ఇందు చీర జాఱు అనుపదమును తీసికొని చీర ఊడుచుండగా - అని అర్థం చేసి కొంత గ్రంథం నడిపారు శాస్త్రిలుగారు. అంతటి అవసరం ఏమీ ఇందు కానరాదు. చీర జాఱు జిందుకుచ్చెళ్లు - అనగా జీరాడునట్లున్న చీరకుచ్చెళ్లు - అనికానీ, చీర-జాఱగ అటునిటు జరుగగా అని కాని అర్థం చేయవచ్చు.

పోతన్నగారి - పైనున్న పచ్చనిపటము జాఱుటఇట్టిదే. మఱిన్నీ ఇంకొకకవి తాలూకు యానవేగమున బయ్యెదకొంగు సడలిన - అనేదిన్నీ ఇట్టిదే. సస్తమునకు శ.ర. జాఱినది అని అర్థం చెబుతుంది. జాఱుకు జఱుగు అర్థం చెబుతుంది. అందుచేత ప్రస్తుపుఅర్థమే జాఱు అని అనుకోవచ్చుకదా! అనుకోకుంటే -'ప్రస్తాంస వలి మాత్రలోహి త తరా! -అన్నప్పుడు ఘటోత్క్షేపణం [కుంపె యెత్తడం] వల్ల ఆమె బాహువులు ఊడిపడిపోయె నని అర్థం చెప్పవలసిరాదా? కనుక చీరకట్టులో ఆంధ్ర స్త్రీలకుండే నేర్పునే ఈకవి పైమాటచే సూచించెనని తలుస్తాను. జాఱుకు ఊడిపోవడం అనే అర్థానికి గ్రంథప్రమాణం వీరు ఇచ్చారు కారు.

ఈ పద్యంలోనే - కాలికడియాలు మలపుకొనుచు - అనేచోట, ....పూర్వం- నగలేవీ లేవన్నారనీ ఇక్కడ కడియాలు పెట్టారనీ- ఏ అవయవాలకూ నగలు లేకుండా కాళ్ల కడియాలు ఉండడం సహజసౌందర్యమా ? అనీ, అట్లయిన నవి కర్ణునకు కవచకుండలాల్లాగా సహజాలా? అనీ ఆక్షేపించారు. నగలేవిలేక అనడానికి పరిమితాభరణత కవిఉద్దేశమనీ, - అది సాధారణంగా ఇది - 'అభూషణేఽపి రమ్యత్వం' - అనే మాధుర్యాన్నీ వ్యక్తం చేస్తుందనీ మనవి చేస్తాను. కాళ్లకడియాలు మాత్రమే సహజసౌందర్యం అని ఈకవి అనివుంటే వీరు ఆక్షేపించవచ్చు. పోనీండి - కర్ణునికవచకుండలాలు సహజాభరణాలుగా అయితే కావచ్చుగాని సహజసౌందర్యం అవుతుందా ? శాబ్దికులూ ఆలంకారికులూ గదా చెప్పండీ తాము అని వీరిని అడుగవచ్చునా? ఊహాప్రపంచంలో తిరుగుతూ ఈ ఎకసక్కెలు ఎందుకూ ?

ఆనీలాలకయొక్క పోకనీడకు జనియెఁ—— అనేపద్యంలో జాముప్రొద్దువేళ చల్లదనానికై పోకనీడను ఆశ్రయించువా రుందురా?- అని ఆక్షేపణ చేశారు. ఇది సంఖ్యాపూరణార్థమై చేసిన ఆక్షేపణగా తోస్తున్నది. ఏమంటే- ఈపద్యం (౧౪) తర్వాతే కవి-

గీ. క్రిక్కిఱియు కొమ్మలాశల నెక్కిచలువ,
లుట్టిపడు నీడ పందిళ్లు గట్టుచుండ-

అని వర్ణిస్తున్నాడు. విమర్శకు లూహించినట్టి 'జాముప్రొద్దువేళ చల్లదనానికై పోకనీడను ఆశ్రయించడమే'-ఇచ్చట కవికి అభిప్రేతంగా వుంటే- చలువ లుట్టిపడునీడ పందిళ్లు గట్టుచుండే వృద్ధవృక్షాన్ని వదలి- ఈ పోకనీడకు ఎందుకు రావాలె? ఆలాంటి వృద్ధవృక్షగతమైన చలువ లుట్టిపడునీడను భావించేకవి- ఈపాటి- అంటే నిదాఘకాలంలో జాముప్రొద్దువేళ చల్లదనానికై పోకనీడనాశ్రయించేవా రుండరని భావించజాలడా? కాగా-ఇక పెద్దన్నగారి నునుబోదెలో ఏమంతగొప్ప సారస్యం ఉందని ఈకవిని దానిని చేర్పమంటారు విమర్శకులూ? తత్వం ఏమో బోధపడదు.

నాయిక తన అందెల రవళి విని వచ్చిన హరిణమును, ప్రేమార్ద్రమైన మనసుతో ముద్దాడి కేలిచ్చి పిలుచుకొనుచు నలవోకగా పోకనీడకు చనియెను- అని ఇట సందర్భము. అంతేకాని చల్లదనానికై పోలేదు. అట్టిసూచనైనా కవి చేయలేదు. ఈవిమర్శనలోని అర్థకల్పన అంతా శాస్త్రిలుగారి అచ్చం- (స్వ) ప్రతిభోన్నీతమే కాని వేఱుకాదు. అసలు పుస్తకంలో ఉన్న 'నీడకుజనియెఁ' అన్నదానికి నీడ నాశ్రయించె నని అర్థం చేస్తారు శాస్త్రిలుగారు.

బావికి చనియెఁ - అంటేకూడా బావి నాశ్రయించెను- అని అర్థం చేస్తారా? ఒకవేళ చేస్తామనే అంటారా అప్పుడు చేసే దేముందీ? చిత్రం-అని ఊరుకోవడమే నాలాంటి వారిపని. నిజం చెప్పవలసివస్తే ఇచ్చట నీడ సమీపమునకని అర్థం.కిఁ కుఁ-లు చిన్నయ్యగారి ఆదేశం ప్రకారం దిగ్దూరాంతిక వాచకపరములు . కాగా సమీపమునకని ఫలితార్థం ఏర్పడుతుంది.

స్కంధకూలంకషపద్యము——

ఇందులో స్కంధకూలంకష మన్నమాట తీసికొని ఇది నిదాఘకాలమునందలి నదులకు వర్తింపదనీ కూలపదం వ్యర్థమనీ అపార్థం ఇస్తుందనీ ఒక ఆక్షేపణ. స్కంధమును తాకి తాకక- అన్నజాలుననీ తాకితాకకలాంటి పదాలు ఈ కవిసంప్రదాయాలు కదా అని రెండో ఆక్షేపణ. పాడుపుసాన అన నర్థమేమి?- అని మూడో ఆక్షేపణ. పూలకొమ్మల నిండిన శాఖయేమి? పూలగుత్తులతో నిండిన- అంటే అంతకన్న సారస్యముకాదా? పునరుక్తిపోవునే- అనేది నాలుగో ఆక్షేపణ. ప్రాగభిముఖుంకంబె -కేవలం అభిముఖం అనిగానీ లేదా ప్రాఙ్ముఖం అనడం గానీ ఉచితతరమని ఒకసవరణా వంతెనజాగిపోవు అనుచోట 'గా' ఉండడం లెస్స-అని మఱోసవరణా ఉన్నవి.

మొదటి ఆక్షేపణగా వున్న- స్కంధకూలంకషం అనేచోట నదీప్రవాహాలను చెప్పే సందర్భంలోనే కూలశబ్దంగానీ,కూలంకషశబ్దంగానీ వాడవలెనేగాని ఇతరత్ర వాడగూడదూ-అనే శాస్త్రిలుగారి అభిప్రాయంగా వుంటే- ఈనియమాన్ని మహాకవులు చాలామంది ఉల్లంఘించినవారు అవుతారు. శ్రీహర్ష కవి-'కులాయకూలేషు విలుఠ్య తేషు తే-' అని నదీసందర్భంలో కాకుండానే ప్రయోగించాడు కూలశబ్దాన్ని.

వ్యాఖ్యాతలలో అగ్రేసరులని ఎన్నికగన్నవా రొకరు తనవ్యాఖ్యానాలలో ఒకదానికి కూలంకష-అని పేరుపెట్టుకొన్నారు. లోకంలో కూలంకషపాండిత్యం అనే వాడుక కూడ వున్నది. కాబట్టి ఇది లక్షణార్థబోధక

శబ్దం; కాగా శాస్త్రిలుగారు సెలవిచ్చిన—స్కంధకమనే అర్థమే వస్తుంది. అప్పుడు వ్యర్థమూ కాదు, అపార్థాన్నీ ఇవ్వదు. శాస్త్రిలుగారి తాకితాకకలు ఇక్కడ తాకవు. చేసీచేయక రోసీరోయక ఇత్యాదులు ఆయా సందర్భాలలో రసపుష్టికై ప్రాచీనులూ వాడారు, ఈ కవీ వాడాడు.

పాడుపుసాన—క్రిందనుండి నీరు పొడుచుకొనివచ్చునట్టిసానను పాడుపుసాన అంటారు. ఇట్టివి సాధారణముగా అంతర్వాహినులకు ఇసుకనేలల్లో ఉంటవి. కాగా త్రవ్వినచోట కాలువసాన—అని అర్థము. శ. ర.—అర్థాలు ఇక్కడ పట్టవు. ఇది లోకపువాడుకలోని పదము. కనుక ఇచట నామకరణమూ లేదు మహోత్సవమూ లేదు. ఆ ఆశ పెట్టుకోనూ అక్కఱలేదు.

పూలకొమ్మల నింపుసొంపులు వహించు శాఖ—శాఖ అంటే పెద్దకొమ్మ. -కొమ్మ అంటే చిన్న రెబ్బ. పూలు పూచినచిన్న రెబ్బలతో కూడి ఇంపుసొంపులు వహించేపెద్ద కొమ్మ—అని సాధారణంగా ఏర్పడే అర్థం. పూలగుత్తులతో నిండినశాఖ అనకూడదా.—అంటే అనకూడదనే చెప్పవలసి వస్తుంది. పెద్దకొమ్మలకు పూలగుత్తులు పుట్టవు. రెబ్బలకే అవి అంకురిస్తవి. ఏమంటే—అవి లతాంతాలుకదా! పైగా శాఖాపదపు సాహచర్యం వల్ల పూలకొమ్మ లనేచోట పైనచెప్పిన—అర్థం వస్తుంది. ప్రాఙ్ముఖ-ప్రాగభిముఖశబ్దాలు రెండూ సాంప్రదాయికపదాలే. అందులో ఎట్టి తేడాకూడ లేనేలేదు. వంతెనజాగిపోవులోగా—ఉండటం లెన్సే. అది లేనందుచాత వచ్చే లొస్స—ఏమీ లేదు. క్రియావిధేయవిశేషణాలమీది అన్నంతమైన అసుధాతువుకు (అనగా గాక్యాకు)లోపం విభాషగా వస్తుందని ప్రౌఢవ్యాకరణం చెబుతుంది. ఉదాహరణాలు ఆయనే చాలా ఇచ్చారు చూడండి. (ప్రౌ. క్రి. ప. ౨౨ సూ.) పైగా

సందెసాగినకొలది—ఇక్కడ సందెసాగిన కొలదికి సందె గడచిన కొలది—అని అర్థము చెప్పి మొత్తంమీద చీకటిపడినకొలది—అని అర్థం చేశారు. కథ చీకటిపడేదాకా రాలేదు గనుక సందెడాసిన కొలది అంటే సారస్యంగా ఉంటుందంటారు. సందె, సాఁగినకొలది=దీర్ఘమగుకొలది- అనికూడా అర్థం చేయవచ్చు. మిక్కుటమైన మనోభారముతో సమావేశమైన వారికి ఆసందె దీర్ఘమగుచున్నట్లు కానవచ్చెను —అన్నధ్వనిఇందున్నది.

పాడుపుటేటిమెలపు-జారుప్రొద్దువలపు:-ఇందు పాడుపుటేటిమెలపులో మెలపూ జాఱుప్రొద్దువలపూ తీసివేసి-ప్రదోషపవనం-అనమంటారు. అట్లా అనకపోతే అది అర్థహీనమైన అనుప్రాస అవుతుందంటారు. ఇక్కడ-మెలపునకు భ్రమణము అర్థము. కాయంపువలపుకన్దోయి మెలపు - అన్నలాగా. తరంగిణీభ్రమణము ఆత్మభ్రమణానికి ఉపచారకము. కాఁగా ఆక్షేపణము నిరాధారమైనది.

లలితలావణ్య పూర్ణమూలలనచెలువము:—చెలువు అనగా అందమనీ లావణ్య మనగా కూడా అందమేననీ, కాగా-మొదటిపాదానికి చక్కనిచక్కదనంతో గూడిన స్త్రీయొక్క చక్కదనమని-అర్థమనీ వెక్కిరిస్తారు. కాని దీనికి సమాధానం-పదియునాల్గువసంతాల పద్యందగ్గఱే చెప్పి వున్నది. అది ఇక్కడ కూడా అనుసంధించుకోవలె నని మనవి. ఏమంటే లావణ్యశబ్దానికి ఆలంకారికులిచ్చిన అర్థం శాస్త్రిలుగారికి తెలియంది కాదు. కాగా సర్వాంగీణసముజ్జ్వలమైన తారళ్యముతో నిండారుసౌందర్యం-అని అర్థం ఏర్పడుతుంది. అద్వితీయమో సద్వితీయమో కాని నా కిందులో తోచినసారస్యం ఇది.

రుచిరవేణునాళోదయశ్రుతులు — వేణునాళోదితశ్రుతు లనవలెనని విమర్శకుల సవరణ. అనకున్నందున రాగల ప్రత్యవాయం ఏమీ లేదు. వేణునాళములు, ఉదయముగా - ఉత్పత్తిస్థానముగా గలవి—వేణునాళోదయములు. వేణునాళోదయములైన శ్రుతులు అని అర్థంచేస్తే సరిపోతుంది. శ్రుతులు-అనే బహువచనసారస్యం ఏమిటనేది తర్వాత ప్రశ్న.

అల్లసాని పెద్దయ్యగారి 'అవతంస కుసుమంబునందున్న అలలేటిశ్రుతి తిరిని ఉగాది' శ్రుతులనీన' అనేదానిలో ఏ సారస్యమో దీనిలో కూడ నదియే. ఇక్కడ పెద్దయ్యగారి పద్యంలో తేటి ఒక్కటే. శ్రుతులు బహువచనంలో ఉన్నవి కదా! ఇక అణఁగుకువున్నది. దీని కిట గౌణార్థం అభిప్రేతంగా వున్నది. గద్గదక్లాంతి అంటే— గద్గదస్వరముతో కూడిన అలసట అని అర్థము. అనుతాపశబ్దానికి ఇక్కడ పశ్చాత్తాపం అర్థం కాదు; వెన్నంటియుండు తాప మని అర్థం. కాబట్టి— సారస్యం సున్న — వైరస్యమిన్న—అనేది విమర్శనకే ప్రాయః అన్వయిస్తుంది.

నయనముల మూలరుచులు— మూల తెలుఁగనీ మూలరుచులంటే దుష్టసమాసం —అనీ అంటారు శాస్త్రిలుగారు. మూల తెలుగులోనే కాదు; సంస్కృతములోనూ వున్నది. (సం. ప్ర.) ప్రాచీ మూలే—అని ప్రయోగము. ఇట్లే పెద్దన్నగారి బాహుమూలరుచి కూడా చూడవచ్చు.

ఇక ఇక్కడ నయనమూలములనగా కనుగొలుకులు అర్థం. నయనకోణములందామా—అంటే కటాక్షాలు అర్థం కాబట్టి శాస్త్రిలుగారి కోణరుచులు వారికే చెల్లుబడి అవుతవి. కవులు ఆనందబాష్పాలను కనుగొలుకుల్లోను దుఃఖబాష్పాలు కడకన్నుల్లోనూ ఉదయించేట్లు చెప్పడం రివాజు. తనను పెంచిన తరుణిని చూడగానే హరిణానికి ఆనందబాష్పాలు కలిగినవని అర్థం చెయ్యవచ్చు. ఇది ఇల్లా ఉండగా—ఇచ్చట నాయిక—

గీ. నయనమూలాంచలములు స్విన్నంబు లయిన
వేల చెల్లెలా!—యీప్రాలుమాలికలకు
కారణం బెయ్యది కఠోరకంటకంపు
వనులఁ దిరుగవుగద చిన్నతనపు చేష్ట.

అని నగవుం బలుకులఁ గనుగొనలను ఆనందరసము గురియగా—ఆ హరిణిని లాలన చేయుచున్నది. ఇందు గల— ప్రాలుమాలికలకు కారణం బేమి — అనడమున్నూ చిన్నతనపుచేష్టచే కఠోరకంటకంపు వనుల దిరుగలేదు గదా!—అనడమున్నూ — సహృదయహృదయసంవేద్య మగు నర్థవిశేషమును ధ్వనింప

జేస్తున్నవి. కాబట్టి ఇట దాన్ని ప్రస్తావించుట లేదు.

మఱీన్ని ఇచ్చట — కోణకాంతులు స్వి న్నములగుట కొత్త అనిన్నీ భావకవులదృష్టి లకే ఆస్విన్నత గోచరిస్తుందనీ వెటకారము చేశారు. రుచు లంటే కాంతులే. కాని ఇక్కడ లక్షణయా కాంతుల కుపాదానము లగు స్థలము లని అర్థం చెయ్యవలసివుంటుంది. 'తెలుపేల కట్టితివి'—(పారి.) 'సందిదండల దళల్ సాహోనినాదం బిడక్' (మను.) మొదలైన చోట్లలోవలె.

భగ్నమనోర: దోషి—దీనిలో భగ్నమనో రథత్వం దోషం అవుతుందా? దోషిపదంచాత కవి దోషికావడం లేదా—అనేది ప్రధానం. సరే కావచ్చు. అయితే దోషశబ్దానికి తప్పు అనే అర్థం ఒక్కటేనా? మఱే లేదా? లేకపోయ్యేట్టు గా వుంటే అప్పుడు 'కార్పణ్యదోషోపహతస్వభావః' (గీత), 'శక్యమాతపదోషో వాఢ‌ఉత మదనదోషోవా' (శాకుం.) 'తా తే సురా ద్విజవరే మమ భాగ్య దోషాత్' (వేణి.) 'ఈ వర్షపీడా దోషంబు పత్వరిక్ బొరయకుండ మానుపుక్ గాత' (కళా.)- ఇత్యాది సందర్భాలు వచ్చినచోట్ల అంతటా - ఆ అర్థమే చెప్పితే రుచిరంగా వుం టుందా? వుంటే -'ఆతపదోషః'- ఆతపజని తసంతాప మని ఇత్యాదిగా వ్యాఖ్యాతలు అర్థాలు వ్రాస్తారేమి? వారందరూ దోషులు అగుట మూలాననేనా? - కాబట్టి భగ్నమనో రథదోషివగుచు - అంటే భగ్నమనోరథత్వం చేత ఏర్పడ్డ వికృతికలదానివై అని అర్థంచేస్తే చాలు ఇక్కడ.'దుమవైకృత్యే'-ఉన్నదికదా!

తావకీనలీలా సుధాదళపుటంబు— దీనికి బుఱ్ఱబద్దలు గొట్టుకొన్నా అభిప్రా యం తెలియడం లేదంటారు శాస్త్రిలుగారు. అంతటి వాగాయిత్వం చూపవలసిన అవసరం లేదు ఇక్కడ. కావలసిందల్లా శాంతమే. "నీలీల అనే అమృతపుదొన్నె-నాసంబంధమైన ప్రణయపుతునకలనే తేనెచుక్కలను వద లుచూ వున్నది ఈ విపరీతం చూడగా విర క్తియే కన్నీళ్లు వదలుచున్నట్లు ఉన్నది-అని దీనిభావం. స్త్రీప్రేమ సుధాతుల్యంగా చెప్ప డంమూలాన తత్సాత్త్వికభావమున్నూ పురుష ప్రణయం మధువుగా రూపించడంమూలాన తద్రాజసికస్వభావమున్నూ ఇందు సూచి తము లవుతున్నవి. భంగ-కణ పదాలు రెం డున్నూ సాభిప్రాయాలు.

దేశకాలపాత్రములు— ఇందు దేశకాల పాత్రము లంటే ఏమనీ దేనితో అన్వయం - అనీ అంటారు. ఇది చాలవాడుకలో ఉన్న పద మే. దీనికి - క్రమమని అక్రమంబని - అన్న వాటికి వలెనే తాళుకొంటి - అనుదానితో అన్వయము అగుచునే ఉన్నది.

ఎదగృశించెకు నీయరుంతుదవియోగదహన దందహ్యమానము: — అరుంతుదవియోగమం టేనే చాలుఅనీ, దాన్ని దహనంగా రూపిం చడం అనుచితమనీ ఆక్షేపణ వకటిన్నీ, అరుం తుదవియోగశల్య మంటే అర్థసారస్యం మెం డనీ సవరణ వకటిన్నీ దీనిలో చేశారు. దంద హ్యమానమంటే మిక్కిలీ కాలిందనిన్నీ అల్లా కాలితే భస్మం అవుతుందనీ మూడో ఆక్షే పణ. కాగా అసమంజసం ప్రకృతివిరుద్ధం అని చివఱకు రెండుదోషాలు తేల్చారు.

'అరుంతుదస్తు మర్మస్పృక్'అని అమర మే వున్నది. ఆయములు సోకే మాటలువగైరా లన్నీ ఈ అరుంతుదముల్లో చేరతవి. శల్యా దులే కావలెననే నియమం లేదు. దందహ్య మాన - భృశార్థమున యఙ్ ప్రత్యయమట. (పాణిన్యాచార్యులు గర్హార్థమంటాడులా గుంది.) అసహ్యంగా కాలిం దని నియతం. అవునుకాబోలును. ఒకవేళ అల్లాగే అర్థం అయినా - నీరసమైన వస్తువే కాలి బూడిద అవుతుందే కాని సరసమైనది కాదు. ఇచ్చటి ఎద సరసను. అయినా దోషమే అందురేని మహాకవి భవభూతి చెప్పిన—

'జ్వలయతి తనూ మంత ర్దాహః కరోతి న భస్మసాత్.'

అనేదిన్నీ, ముక్కుతిమ్మన్నగారు చెప్పిన 'శోకదవానలంబుచే గాసిలి యేడ్చె'—అన్న దిన్నీ ఈదోషంక్రిందికే రావలసి రాదా? కాబట్టి ఇక్కడ వృథాగా చేసిన ఆక్రోశపు ఆడంబరత్వం తప్ప అనౌచిత్యమూ లేదు; ప్రకృతివిరుద్ధతా లేదు.

గుణలతలపద్యం—ఇందులో లతలు శోభ లను పూచునో లేక పువ్వులను పూచునో అనేది ప్రధాన ఆక్షేపణ. గుణాలయందులతాత్వాన్ని ఆరోపించినప్పుడు శోభలదగ్గఱ పుష్పత్వం ఆక్షిప్తం అవుతుంది[రూపకబలంవల్ల].కాగా, తన గుణలతలు పూచినట్టి (పుష్ప) శోభలా- అనేలాగు, చిఱునవ్వు వెన్నెల =వెన్నెలవంటి మందహాసము చెండ్లు-విసరగా-అని అర్థంఏర్ప డుతుంది. ఇట్టి రూపకమర్యాదలు శాస్త్రిలు గారు ఎరగనివికావు అని నమ్ముతూవున్నాను.

తనమనోలీల—మనోలీల=క్రీడాప్రాయమైన మనశ్చేష్ట. పలుకుబంతులు=మాటల వరుసలు, పూలపాలు = తేనె, (చెఱకుపాలవలె- వ్యావ హారికము.) కాగా, ఇపు డర్థమేర్పడుతుంది.

విడిచి విడువని మౌగ్ధ్యము—అంటే-మౌ గ్ధ్యము మెలమెల్లగా విడుచుచున్నదనీ, లజ్జ పొడముచున్నదనీ అర్థంచేశి- ముగ్ధాలక్షణం పేర్కొని పరిహసిస్తారు శాస్త్రిలుగారు. పైగా ప్రకృతివిరోధదోషం అంటారు. మౌగ్ధ్యానికి ఒక ముగ్ధానాయికాత్వమేనా అర్థమూ? అల్లాగైతే ఈక్రింది సందర్భాలలో అంతటా ఆ అర్థమే చేయవచ్చా?-(౧)'అయ మాచర త్యవినయం ముగ్ధాసు తపస్వికన్యాసు' (శాకుం.)'(౨).హరిరిహ ముగ్ధవధూనికరే విలా సిని విలసతి కేళిపరే', (3) 'వియోగో ముగ్ధా క్ష్యాః స ఖలు రిపుఘాతావధి రభూత్'— ఇత్యాదులు చాలా వున్నవింకానూ. కనుక మౌగ్ధ్యశబ్దానికి ఇక్కడ అమాయకత్వం అర్థం చేయాలె.

విశ్వాసబాష్పము — విశ్వాసబాష్పాలు క్రొత్తవి అనీ, పాశ్చాత్య దేశంనుండి దిగుమతి అయిన వేమో అనీ అంటారు. ఈ ఆక్షేపణకేం గాని ఉవ్వటమహీధరుడి దేవీస్తవంలో ఈ క్రిందిశ్లోకం చూడండి.ఈయన మాధవాచార్య లులాగానే వేదానికి భాష్యం చేశారు.

శ్లో. 'య స్త్వాం విద్రుమపల్లవద్రుమమయీం
రేఖా మివాలోకితాం, ఆత్మానం త్రిపుర
స్థితత్రివలయాం మాయా మభిధ్యాయతి,
తస్మై నిందితచందనేందుకదళీకాంతార
హీరస్రజో, విశ్వాసభ్రమబాష్పదాహ
గహనా మూర్ఛంతి తా స్త్రాస్త్రియః.'

ఇందులోని విశ్వాసశబ్దాన్ని నిశ్వాసంగా మార్చవలె నంటారుకాబోలు!

కలసిన గాటపు జెలిమి—అనేపద్యంలో* సఖికంఠమయ ట్లొదవెర్ - అనే దానిలో వున్న అవధారణార్థక ప్రయోజనం ఏమనిన్నీ ప్రదోషదోహలం అంటే అర్థం బ్రహ్మభేద్యంగా ఉందనీ వ్రాశారు.

సఖికంఠమయ ట్లొదవెర్ = సఖుని కంఠ ధ్వని కాదుసుమా- అనెడిధ్వనియే అవధార ణార్థక ప్రయోజనం- అని మనవి. ఇట్లే - ప్రదోషదోహలమయి = ప్రదోషోల్లసితమై- అని అర్థము. ప్రదోషోల్లసితమై వినిపించింది కంఠము కాదు. కంఠధ్వని. కనుక ఆక్షేప మపాస్తము.

బాలా యేటికి మాటలెత్తి— ఇందులో, 'వ్యథాలీనుండనైతిర్ దుదిర్, జాలుర్ నెయ్యపు తీరుతీయములు, బాష్పజ్ఞాన విద్యార్థినై కాలంబుర్ వయసుర్ వ్రయిం చెదను-అనుచోట, బాష్పజ్ఞాన విద్యార్థి అనగా రోదనవిద్య నభ్యసించేవా డనియా యర్థము?- అని ప్రశ్నించారు. బాష్పసంస్మృతిని అభిలషించినవాడనై అని అర్థము. వ్రయించు-వ్యయించుఅనే అర్థంలోనే శిష్టుల వాడుక వున్నది. చూడు శాబ్దిర్యము.

వదలినకాంక్షమై - అనే పద్యము — సంయుక్త ప్రచురణములోని తృణకంక ణమునందు కవియే దీనిని వదలనికాంక్షమై మొలకవాటిననెయ్యము బెంచుకొన్న - అని సవరించుకొన్నారు కావున ఆక్షేపకులు దానిని చూడదగును.

వస్తుసంప్రీణనమునర్—వస్తు = పదార్థము చేత, సంప్రీణనమునర్ = బాగుగా తృప్తి పొందించుటచేత అని అర్థమగుచున్నది. తన్మ యోన్మీలనామోదసుఖము - తన్మయులయొ క్క-ప్రబోధ మనే వాసనారూపమైన సుఖం- అని అర్థము.

మోహనవసంగనకు - అనేపద్యము— ఇందు కాలచపలున కేది నీతి- అనేచోట భావం దేవరహస్యం వలె ఉన్నదనిన్నీ కాల చపలుడు-తప్పుసమాసమనీ అంటారు. అంద గాడైన వసంతుడికి పసపువన్నె కల మామిడి లేతాకు ఆనందమిస్తూన్నది. హేమంత మనే పిల్లడు కొత్తచీరగట్టుకొన్న తల్లివలెవెక్కి- తొక్కి- ఆనందానికి కారణమైన ఆ అం దాన్ని మాపునట్లు మాపుచున్నాడని మనో హరమైన లోకదృశ్యాన్ని కవి ఇందు చిత్రిం చినాడు. కాలచపలుడు-అనేది 'కాలః చపల ఇవ' అని ఉపమితసమాసం చేస్తే సరిపోగలదు

ఏ, మఱిబోకించుక — జీవితాంతమునం బ్రేమర్ బ్రేమబాష్పాంజలిర్-అని సంయుక్త ప్రచురణమున గ్రంథకర్త సవరించికొన్నాడు. కాబట్టి- ఇచ్చట వీరుపేర్కొన్న ద్విరుక్తి లేదు. ఇట్లే- మ అవంబోకము ముగ్ధరాగ పరి ణామజ్ఞాన సిద్ధాంతమునర్ - అనికూడా సవ రించినారు. ఈవిధంగా నే 'బొందినటించు'- అనేపద్యంలో ఏదో వేదాంత మున్నదని విసిగి కొంటారు. ఇం దెట్టి వేదాంతమున్ను లేదు. శాంతం ఒక్కటి వుంటేఅంతా బోధపడును.

చైత్రుతోవచ్చు - పద్యము—ఇందులో- పడుచుదనంలో వున్న ప్రేమ వార్ధక్యంలో కృశించునట అనీ, అల్లాగైతే అది విశుద్ధ ప్రేమ అవుతుందా-అనీ ఆక్షేపిస్తారు. ఈ పద్యంలో వలపు ఉన్నదే గాని ప్రేమ లేదు. వలపు అంటే మోహము. ఈగ్రంథంలో అం తటా వలపూ ప్రేమా-వీటికిగల అంతర్యము స్పష్టంగా కవి పాటించేవున్నాడు. అందు చేత విమర్శకులు చూపిన ఆక్షేపంగానీ, తత్స మర్థనకై ఉద్ధరించిన శ్లోకంగానీ పటాటోపం అనే అనవలసివస్తుంది.

విషయసుఖేచ్ఛలం దొరయ— సంయుక్త గ్రంథ ప్రచురణములోని తృణకంకణమునందు వీరుద్ధరించిన పద్యభాగము, 'తన్మయమైన యార్ద్రిమానుషదశలే కృతార్థములనుర్ బుషి వాణి'అని ఉన్నది. కనుక 'అవధారణవాచ కాల సారస్యము గగనకుసుమం' అన్నమాట [illegible] ప్రశ్న.

తర్వాత ఆక్షేపణ- 'తేటవలపులు'- అనే పద్యంలో వలపును ప్రేమకు బర్యాయముగా కవి వాడె ననిన్నీ, తర్వాత 'దాపనేటికి' అనే పద్యంలో వలపును మోహానికి పర్యాయంగా చెప్పాడనిన్నీ-కాబట్టి ప్రేమమోహాలకు కవి భేదం పాటింపలేదనిన్నీ కనుక పదప్రయోజ నం లేదనిన్నీ శాస్త్రిలుగారు చెబుతారు.

నిజానికి ఈసందర్భంలో విమర్శకులు ఒక గడుసుఎత్తు ఎత్తినారు. చిత్తగించండి: తేట వలపులు అనేపద్యం ౩౭ డోది. వలపునిం డిన-అనేది 33 డోది. దాపనేటికి నింక నా ధ్యాత్మికంబు-అనేది ౯౦ పద్యాలపైది. వివా హం కాక పూర్వం నాయకుడి రాగాశయాలు స్వగతవిలాపంలో గ్రంథారంభంలో సూచింప బడ్డవి. వివాహం ముగిసిపోయినతర్వాత వారి ద్దరూ కలసికొన్నారు. వలపు పోయినా, విశుద్ధమైన సుమానుష ప్రేమ నిల్పుకోవలసిం దని నాయిక అతడికి సాంత్వనసాధన సూచిం చింది. కాగా, పూర్వరాగ సూచకంగా వుండే పచ్చనిపట్టుతోరం విసర్జించడమున్నూ దానిస్థానంలో విశుద్ధప్రేమబంధంగా తృణ కంకణం ధరించడమున్నూ ఏర్పడి అనుషయ నిర్వాహకంగా కథ పరిణమించింది. అంటే ప్రణయభంగ ఫలితంగా స్వజీవితభంగాన్ని నిశ్చయించిన నాయకుని స్వగతం—కృతికి ఆదిగానూ, విశుద్ధప్రేమావధి కృతికి సమాప్తి గానూ ఉన్నదని స్పష్టంగా తెలుస్తూవున్నది. విమర్శకులు దీన్ని వ్యత్యస్తం చేసి తెంపులో కవికి పైదోషాలు అంటగట్టిరి అనడం స్పష్టంగా కనిపిస్తూ వున్నది. ఇదే వీరు ఇందులో ఎత్తిన గడుసుఎత్తు. కాబట్టి పదప్రయోజనాన్ని పాటిం పలేదనడం—అతిసాహసం అనవలసివున్నది.

నష్టమైనట్టి - అనే పద్యం— ప్రేమఖండ ములు = ప్రేమయనెడి కలకండముక్కలు. 'ఖండో౽స్త్రీ శకలే నేక్షువికారయోః'-అని నిఘంటువు. ఖండనఖండఖాద్యం - శాస్త్రిలు గారు రుచిచూచే వుంటారుగదా. కండచక్కె రముక్కలవలె మధుర మైన ప్రేమ- అని ఫలితార్థం. ఇప్పుడు ఆలోచిస్తే సకవి అక్షరజీవగీతిక— చిత్తానికివస్తుంది.

హస్తగదితము=హస్తమునందు చెప్పబడినది 'చేతిలో చేయివేసి నర్ జెప్పుమనియో'—అని స్థలాంతరంలో ఈకవిదే ప్రయోగ మున్నది.

---

* నాదగ్గఉన్న తృణకంకణంలో (ఇది కవి తాంజలి అనే పేరుతో రా. సు. గారి గ్రం థాలు చేర్చి ముద్రించినప్రతి. ౧౯౩౩ సంవ త్సరపుది.) సఖికంఠమటుల్ పెకలెర్- అని వున్నది. శాస్త్రిలుగారు విమర్శనలో ఉద్ఘా టించిన పద్యపాఠాలు ఈ ముద్రణంలో విభి న్నంగా ఉన్నవి. అయినా తబుచుగా ఇం దులో శాస్త్రిలుగారిచ్చిన పాఠాలనే చర్చి స్తున్నాను.

నిమ్మచెట్టులేగొమ్మ పందిళ్లక్రిందగల పుస్తకాల పెట్టెలో హస్తగదితమైన చిత్రసూత్రం వున్నది. ఆసూత్రమును ఆధారముగా గొని ఇంతదాకా మనప్రేమ వున్నది—అని సరళరీతిగా తాత్పర్యం అవుతూ వున్నది. ఇట్టి స్థితిలో, ఈఘృతాధార పాత్రాధార చర్చల వల్ల ఏంలాభం వుంటుందో?

ఆమృదుశీలపాణి — శీలపదం ఆరోగ్రేవేలి లాగున్నదని విమర్శ. మృదుపాణి అనమనిసలహా. సరే. మృదుపాణి—అంటే ఛందోభంగం కాదా? మృదుశీలయొక్క పాణి—అనిఅర్థం చెయ్యావచ్చు కాదా? రాగసూత్ర మనేమాటకు రాగసంసూచకమైనసూత్రం—అని అర్థం. 'వీచీమయమైన కాల్వవయిచెక్' అని నాపుస్తకపు పాఠము. ఇందున్న అనిర్వాచ్యత ఏమిటోకదా!

పెంపుడుకొన=పెంపుడుతోట అనిఅర్థము. అడవిపూసే అక్కఱలేదు. వారలపెంపుడు మైత్రీప్రేమపాశములు = ప్రయత్నపూర్వకంగా సంవర్థితాలయిన ప్రేమలని సాధారణంగా అయ్యే అర్థము. ఉత్కటభరాప్తి= ఉత్కటమైన ప్రేమాతిశయముయొక్క పొందికచే, కలసిరి అని అన్వయము. ప్రకరణవశమున ఇక్కడ ప్రేమ—ఆక్షిప్తం అవుతుంది. 'క్రిక్కిరియు కొమ్మలాశల నెక్కి చలువ లుట్టిపడు నీడపందిళ్లు గట్టుచుండ'—అని నాపుస్తకములోని పాఠము. ఇది సంయుక్త ప్రచురణపు ప్రతి. చలువలుట్టిపడు—విశేషణములో కావలసినంత విశేషం కనిపిస్తూనే వున్నదికాదా!

ఇట్టి అర్థదోషాలు ఇంకా పెక్కు—ఉన్నవంటారు. ఇంతవఱకూ వీరు చూపినవన్నీ అర్థదోషాలు కావని అనుకోవచ్చు మనం. దోషాలన్నవాటిలో ఏవీ నిలవబడనే లేదు. మిగిలిన పెక్కులున్నా ఇట్టివే కాబోలు ఇది అర్థదోషాల పరామర్శ.

## ౬. ప్రకృతివిరోధదోషాలపరామర్శ

ఇక శాస్త్రిలుగారు ప్రకృతివిరోధదోషాలుగా చెప్పినవాటిని పరామర్శిస్తాను. ప్రకృతివిరోధం అంటే యేమిటో శాస్త్రిలుగారు ముందుగా చెప్పి, ఆపైన ఆక్షేపించడం న్యాయ్యంగా వున్నా వారు అల్లా చెయ్య లేదు. అయితే సంస్కృతాలంకారికులు లోకవిరుద్ధత— అనే ఒకదోషాన్ని చెప్పారు. శాస్త్రిలుగారి ఆక్షేపణరీతిని బట్టి అదేయిదేమో చెప్పజాలకున్నాను. వారుద్దేశించింది ఏదైనా ఆశీర్షిక క్రింద ఇచ్చినదోషాలు పరామర్శచేయడమే నాకు ముఖ్యం కాబట్టి ఆపనే చేస్తాను.

వలపుమొగ్గలు దొడిగిన పద్యం— ఇందులో అనటి మొగ్గలు తొడిగిందనరనీ, తొడిగినా ఒక్కటే పువ్వువేస్తుందనీ కాబట్టి ప్రకృతివిరోధమనీ అంటారు. కాని ఇక్కడ విమర్శకులు పొరపడ్డారు. వలపున్నూ మొగ్గయున్నూ—కలసి వలపుమొగ్గలు. ద్వంద్వసమాసం. అరటి ఇక్కడ ప్రధానం కాదు. పువ్వుకు పూర్వావస్థ మొగ్గే కాదా?

తమివిదారించు పద్యము— (౧) తమి= చీకటి, విదారించు = చీల్చునట్టి, నవ=క్రొత్తవైన, చంద్రునియొక్క ధవళరోచిరువయములు= తెల్లనికాంతుల మొలకరింపులను, పోని=పోలునట్టి; (౨) తమి=ఉత్కంఠ, విదారించు= అలుసులుగట్టు- చూపులు; తమి విదారించుపదం రోచిర్నవోదయాలతోటే, చూపులతోటే అన్వయిస్తుంది. కాగా-చంద్రోదయానికి పూర్వం నల్లనిచీకట్లోనుండి తెల్లని కిరణచ్ఛాయలు రావడం సూచితం అవుతుంది. ఇట్టిదృశ్యములచిత్రించడంలోనే—'సుఖాలంబితమః—కుంతలములు దీర్ఘగోను దంతపుదువ్వెనగా'- పెద్దన్నగారు చెప్పినారు. శూన్యమై అంధకారవార్ధియంగా వున్న నాయకుని దృక్పథమునందు నాయికాసాంత్వనోపదేశాలనే నిర్మలచ్ఛాయాప్రసారాలు సూచితము అయినవి.

పోనీ వీరు 'తమం అంటే చీకటి. తమి— అంటే రాత్రిని చీకటి అనేఅర్థంలో ప్రయోగించారని కదా ఇదివఱకు ఆక్షేపించారు. ధర్మిని ధర్మవాచకంగా చెప్పడం మన కవుల సంప్రదాయంకాదా. కానియెడల—' ఇందీవరంబుల నీనుకాగ్గిన్నుల శరదిందుముఖులు చామరము లిడగ—అనేచోటా, 'కర్పూర కస్తూరికా ప్రవాహంబులు ప్రవహింప లోచనపాలింగణముల'—అనేచోటా ఎట్లు సమాధానిపడం? ధవళిమనీలిమలనే విషయములు ప్రయోజనాలుగా కర్పూరకస్తూరికలనే విషయాలు ప్రయుక్తాలు కాబట్టి రూపకాతిశయోక్తి- అని అంటారే సర్వంకషవ్యాఖ్యలో. మఱి వారికి మనపాటి ఆలంకారికపరిచయం లేదా?

ఇక కన్నెగేదంగె, మిసమిసలాడు, ఎదగ్రొంచెడు—ఇత్యాదిస్థలాల్లో ఈప్రకృతి విరోధదోషం వుందంటారు. ఈమాటకు ఇదివఱకే సమాధానం చెప్పాను. కాబట్టి ప్రకృతివిరోధం కూడా రసోపస్కారకమేమో— అనే ఉల్లసపుమాటకు తావు కానరాదు.

ఇది ప్రకృతివిరోధదోషాలపరామర్శ.

## ౭. దుష్టసమాసాల పరామర్శ

దుష్టసమాసాలుగా విమర్శించినచోటులందంతటా అన్వయించుకోవడంలో గల్గినదృష్టిభేదమే దుష్టంగా కనిపిస్తూ ఉన్నదనవలసివచ్చినది. అయినా ఆక్షేపణకు సమాధానం చెప్పవలసినపూచీ పైని వేసికొన్న కారణంచాత వ్రాస్తున్నానే కాని వీటికి జవాబు ఇవ్వ నవసరమే లేదు.

ఆజననబద్ధబాంధవపద్యం — ఇందలి సమేళనం సంస్కృతమే. (సహమేళన) సహార్థంలో సభావం చేసికోవాలె. 'వారివ, సుఖసకర్పూర తాంబూలాది వాసనాసురభి నిశ్వాసములయు' అని భారతప్రయోగంలో లాగున, బలవదాశావిభిన్న తాపము-బలవంతమైన ఆశచాత, విభిన్న=విశేషముగా వికసించిన (అనగా విస్తరించిన) తాపము అని అర్థం. భిన్నశబ్దానికి వికసించిన—అనే అర్థం వుందా అంటే- 'నవోషసా భిన్నమివైకపంకజం'- ఇత్యాదులు చూడపార్థన. సమయభరము=అతిశయమైన సమయము,-అనగా సమయవిశేషము. ఆవ్యక్తులయందుగల అకుటిలమనుబుద్ధి-అని అర్థములు.

అస్ఖలితమను పద్యము — అస్ఖలితమైనది ప్రేమరహస్యమనెడితత్వము, దానియెడల-విశదతత్పరతక్ =నిర్మలమైన ఆసక్తితో, అనగా ప్రేమతత్వమునెడల అకలుషమైన ఆసక్తితో- అని అర్థము.

సాంధ్యకాంతావియోగ బాష్పములు— సాంధ్య = సధ్యాకాలజన్యము లయిన,

కాంతా= కాంతలయొక్క, వియోగబాష్పములు-అని అన్వయము. వియోగినులు, తమ కాంతులు దగ్గఱ లేకున్నందుచాత శయ్యామాత్ర సహాయలై గడపవలెనుకదా-అని నిశాసూచకాలయిన సంధ్యా సమయాలందు బాష్పోద్గమన మేర్పడునుకదా. ఇట్టిభావమే ఇందున్నది. కాబట్టి సంధ్యాకాంత అనే సవరణ తోసివేయడమైనది. ప్రేమసమేళనన్-అనేచోట చెప్పదగ్గదానిని ఇదివఱకే చెప్పాను.

పావనదీవనాచయము—దేశ్యమైనదీవనను సంస్కృతమునడుమ కవి వుంచాడని ఆక్షేపణ. ఇట్టివాటికి వుదాహరణాలున్నవి అనేకంగా మనవాఙ్మయంలో.

వకుళ సుకుమార తరుమతల్లికలనుండీ — ఇందులో సుకుమారపదం ఎందుకనీ విగ్రహవాక్యం ఎలాగనీ తరుమతల్లిక-అసత్కవిసంప్రదాయమనీ అంటారు. విగ్రహవాక్యం మాటకేం లెండి. విమర్శనలో ఆద్యంతాలూ అర్థమో అనర్థమో విగ్రహమో- ప్రత్యక్షం అవుతూనే వున్నది. సమాధానించినా విమర్శకులు సమాధానపడేటట్టు లేరు. చిత్రం అయిన విషయం మఱొకటి వున్నది చూడండి వీరి విమర్శల్లో! అమర వ్యాఖ్యానంలో

మతల్లికామచర్చికా—అనే శ్లోకానికి వ్యాఖ్యవ్రాస్తూ వ్యాఖ్యాత ఇల్లా అన్నాడు. 'మతల్లికాదయః పంచ ప్రశస్తవాచకాః, అఖండపదానిచ. అశ్వమతల్లికా=ప్రశస్తోఽశ్వః, బ్రాహ్మణమచర్చికా= ప్రశస్తో బ్రాహ్మణః, కుమారీతల్లజః=ప్రశస్తా కుమారీ. తత్తల్లింగపరత్వేపి న స్వలింగత్యాగః'—అని.

మఱి సంప్రదాయం తెలిసినశాస్త్రిలుగారు పురుషమతల్లికా, కాంతాతల్లజుడు-అనకూడదని మందలిస్తూంటేకూడా— ఆవ్యాఖ్యాత ఎందుకుగాను ఇల్లా చెప్పాడా?-అని ఆశ్చర్యం. తరుమతల్లికలలాంటివేసుమండీ అశ్వమతల్లికాదులు! ఇది దుష్టసమాసాల పరామర్శ.

### ౮. ఉపసంహారవాక్య పరామర్శ

ఏవో నాలుగుమాటలు అల్లితే కవిత్వం కానట్టే ఏవేవో లక్షణగ్రంథాలలోని పేర్లు వ్రాస్తే అది విమర్శనం కాజాలదనడం సత్యమైనవిషయం. కనుక ఇంతవఱకూ శాస్త్రిలుగారు చేసినవిమర్శనను పరామర్శించాము సాంతంగా. ఒక్కటైనా నిలవబడగలదోషం అంటూ- వారెన్నినవాటిల్లో లేకపోయింది. విమర్శనం అంతా-ఏదో వ్యక్తిగతమైన ద్వేషమే అని స్పష్టపడింది. అంతే గానివిమర్శనం ఆరంభంలో వారిచ్చిన చికిత్సాపద్ధతి ఏమాత్రం పనికి రాలేదు. కాని నేటి నవ్యసాహిత్య విమర్శకులంతా ఈపద్ధతివారే అనుకోవడానికి మాత్రం కొంతవీలు కల్పించారు. ఇదీ వీరి విమర్శవల్ల ఏర్పడ్డ-అల్పాల్పమైన ఫలితం.

మఱిఇటుపైన ఈపరామర్శకూడా ముగించవచ్చు. కాని శాస్త్రిలుగారు ఉపసంహారసూచకంగా చివఱ కొన్నిమాటలు వ్రాశారు. వాటినీ కాస్త పరామర్శ చేస్తాను. ఈక్రింది మాటలు చూడండి:

(౧) వీరిపదాలకు ఆలంకారికులు నిర్ణయించిన వాచ్య లక్ష్య వ్యంగ్యార్థాలు గాక క్రొత్తఅర్థంవున్నట్లున్నది.(౨)నవ్యకవికి భాషాలంకార వ్యాకరణాన్వయ సంప్రదాయాలు భిన్నాలు.(3) వానిలో ఏకవిధముగానరాదు.

సమాధానం వీటికి ఇదీ: (౧) ఆలంకారికుల త్రివిధాలయిన అర్థాలూ నవ్యులు స్వీకరిస్తారు. కాని కావ్యజీవితమైనధ్వనికే హెచ్చుస్థానం వీరిస్తారు. ఇదీ వీరిసంప్రదాయం. (౨) నవ్యుల సంప్రదాయాలు కొంతవఱకూభిన్నాలే. వారి పరిభాషలూ సంప్రదాయాలూ విలక్షణమైనవి. వాటికొఱకుకూడా పండితులు ప్రాచీన సంప్రదాయాలకు చేసినట్లే కొంతకృషిచెయ్యాలి. (3) ఏకవిధత్వము కానరాకపోవుటకు ఆసంప్రదాయములను తెలిసికోవడానికై ప్రయత్నింపకపోవడమే ప్రధానకారణం. నవ్యసాహిత్యపరిషత్తు ఆపరిభాషలనూ సంప్రదాయాలనూ ఏకత్రకూర్చుటకై యత్నం చేస్తూన్నది. కొంత ఓపికపట్టితే చిత్తగించవచ్చు.

మఱోటికూడా. కవివ్రాసిన గ్రంథాలు ఒక్కతీరున నుండవనీ, పింగళి సూరన్న బాల్యంలో ప్రభావతీ ప్రద్యుమ్నం వ్రాశాడనీ, ఆతర్వాత వ్రాసినకళాపూర్ణోదయం రసవత్తరమనీ శాస్త్రిలుగారు అంటారు. అయితేఆసూరన్నగారేమన్నారంటే-'జనవులెమ్మెచ్చగ మున్ రచించితి సుదంచద్వైఖరీ గారుడం, బునుశ్రీరాఘవపాండవీయము కళాపూర్ణోదయంబున్'-అని ప్రభావతీ ప్రద్యుమ్నంలో తాను కళాపూర్ణోదయంతర్వాతే ప్రభావతీప్రద్యుమ్నం వ్రాసినట్లు చెబుతాడు. ఏది నిజం-? శాస్త్రిలుగారిమాటా? లేక సూరన్నగారిమాటా?

ఇక ఈనవ్యకవులంతా ఈ విధంగానే వ్రాస్తారని అనుకోవద్దనిన్నీ పింగళి-కాటూరి తల్లావఝ్ఝల ప్రభృతులకావ్యాలు సుబ్బారావుగారి కావ్యాలకంటే రసవత్తరాలనీ, అందు ఇందులో వున్నన్నితప్పులు లేవనీ, రసభంజకాలు కానిదోషాలు తృణకంకణంలో వున్నా సహిస్తామనీ- సెలవిస్తారు.

కొంతనయమే. కొందరైనా రసవత్తరంగా వ్రాయగలవారున్నారని ఒప్పుకొన్నారు శాస్త్రిలుగారు. చాలాచాలా ధన్యవాదాలువారికిన్నీ, వీరికిన్నీకూడా. పైన చేసిన పరామర్శవల్ల సుబ్బరావుగారి కవితలోకూడా రసభంజకాలుగా తాము తలంచినవన్నీ రసరంజకాలే అని విధేయతతో మనవిచేస్తూన్నాను. కనుక వారన్నట్లు ఇంతటితో సహించి-ఈకాలాన్ని మఱో ఉపయోగకరమైన వ్యవసాయంలో వినియోగించవలసిందని వారిని ప్రార్థిస్తాను.నవ్యసాహిత్యాన్ని-(లేదా భావకవిత్వమే అనండి దాన్ని) ఒకరు భూషింపనూ అవసరం లేదు; మఱి ఒకరు దూషింపనూ అవసరం లేదు. అందులో స్వతహాగా ఏమైనా చేవ ఉంటే అది దూషణవల్ల నశింపానశించదు; లేకుంటే భూషణవల్ల నిలవా నిలవదు. ఇది పరమసత్యం.

కాబట్టి-ఇంతతో దానిమానాన.. దాన్ని వుండనీయండి. నందో రాజా భవిష్యతి:-అనుకొంటాము.ఇది ఉపసంహారవాక్య పరామర్శ.



# త్రిశూలము

విశ్వనాథ సత్యనారాయణ

## పంచమాంకము.

[ప్రవేశము:— బిజ్జదేవుఁడు, ఇతర మంత్రులు.]

బిజ్జ:—అమాత్యులారా! జగదేవుఁడు యుద్ధములోఁ బరాజితుఁడై తిరిగి వచ్చుచున్నాఁడు.

౧. మంత్రి:—జగదేవుఁడా? పరాజితుఁ డగుటయా?

౨. మంత్రి:—రాజు తనయాశ లన్నియు జగదేవుని విజయముపైఁ బెట్టుకొని యుండెనే, ఈవార్త రాజుగారికిఁ దెలిపిరా?

బిజ్జ:—ఈ వార్త రాజుగారి కెట్లు తెలుపవలయునా యనియే తమ్మందఱను బిలిపించితిని. జగదేవుఁడు వచ్చువఱ కీవార్త దాఁచి యుంచుదమా? రాజునకుఁ దెలియఁజేయుదమా? దాఁచియుంచినచో రాజు జగదేవుని మీఁదఁ బడును. ఇప్పుడే తెలియఁజేసినచో రాజకోపము మనమీఁదఁ గొంత పోవచ్చును.

౧. మంత్రి:—బిజ్జదేవా! ఎవరిమీఁదఁ బోయినను బిజ్జలదేవున కిది గొప్ప దెబ్బ. ఆయన నిర్మింపఁదలఁచుకొన్న కాలచుర్య సామ్రాజ్య మహాసౌధమునకు మొదటి సోపానమే యిట్లు విఱిగిపోయినచో నాయనకోపమును మనము పట్టలేము. మహామాత్యునకుఁ గబురంపి వారి యుద్దేశానుసారముగాఁ గార్యము నెఱపవలయును.

బిజ్జ:—నేను వారికిని గబురంపితిని. వారు నిప్పుడే దయచేయుదురు.

౧. మంత్రి:—నాల్గుదినముల క్రిందటి వఱకును గెలుపాసతోడి యుత్తరములు వచ్చుచున్నవే. ఇంతలోఁ బరిస్థితులు తారుమా రెట్లయినవి?

బిజ్జ:—చిట్టచివర కేమైనదో తెలియదు గాని, కడచిన మూఁడు నాల్గునాళ్లలో శత్రు విజృంభణ మెక్కువగా నున్నదనియే లేఖలు వచ్చినవి. కోట ముట్టడిచేసిన మనసైన్యము నర్ధరాత్రమునందు హఠాత్తుగా శత్రుసైన్యములు మీఁదఁబడి నురుమాడుచు వచ్చిరని మూన్నాళ్ల క్రిందవచ్చిన లేఖలో నున్నది.

౨. మంత్రి:—బిజ్జదేవా! నాల్గు మాసముల క్రింద మాయింటి కొక పరదేశిబ్రాహ్మణుఁ డతిథిగా వచ్చెను. ఆయన వేదవేదాంగ పారంగతుఁడు. జ్యోతిశ్శాస్త్రమందు ఖని. ప్రసంగ వశమున హనుమకొండమీఁద మనరాజు దండెత్తఁజూచుట నేను జెప్పితిని. మనరాజు గెలుపోటములు చెప్పు మంటిని. ఆయనయొద్ద మనదేశములోని సర్వభూపాలుర జాతకములు నున్నవి. ఆయన నాఁడే చెప్పినాఁడు మనము గెలువమని. ఆ బ్రాహ్మణుని యొద్ద కాకతిప్రోలుని జాతకము కూడఁ గలదు. ప్రోలుఁడు గతించులోపుగాఁ బెద్ద యాంధ్రసామ్రాజ్యము నిర్మించి పోవునంత యుత్కృష్టజాతకమఁట.

బెజ్జ:—అమాత్యా! అట్లే కనిపించుచున్నది. జగదేవు నోడించిన ప్రోలుని రాజనీతియుఁ బరాక్రమమును సామాన్యములైనవి కానేరవు.

౧. మంత్రి:—జగదేవుఁ డిది యొకపెద్ద పరాభవముగాఁ బరిగణించునేమో!

౨. మంత్రి:—జగదేవుఁ డెంత పరాక్రమశాలియో యంత భగవద్భక్తిపరాయణుఁడు. ఆయన కొంత నొచ్చుకొనునేమో కాని దీనివలన మతి చెడిపోఁడు.

బెజ్జ:—అవును. మంచి పరిపక్వమైనమనస్సు కలవాఁడు. అదిగో మహామాత్యులు వచ్చుచున్నారు.

(అంతట బసవేశ్వరుఁడు ప్రవేశించును. అందఱును లేచి నిలుచుందురు.)

బస:—అమాత్యులారా! నమస్కారము. దయచేసి యాసీనులు గండు. బెజ్జదేవా! జగదేవునియొద్ద నుండి యేమైన వార్త వచ్చెనా?

బెజ్జ:—ఆర్యా! వచ్చినది. జగదేవుఁడు యుద్ధమున నోడిపోయి సైన్యమును నష్టపడి కొలఁది సైన్యముతోఁ దిరిగి వచ్చుచున్నాఁడు.

బస:—శివునియాజ్ఞ లేదు.

బెజ్జ:—మహారాజు మీ యాశీర్వాద బలము మీఁద రత్నప్రాసాదములు నిర్మించుకొనుచున్నాఁడు.

బస:—ఈ వార్త మహారాజునకుఁ దెలిసినదా?

బెజ్జ—ఎట్లు తెలియఁజేయ వలయునో తెలియక యే మహామాత్యులకుఁ గబురంపితిమి.

బస:—బెజ్జదేవా! మీరును నేనునుబోయి చెప్పుదము రండు.

(పరిక్రమింపఁగాఁ దక్కినమంత్రులు నిష్క్రమింతురు. అంతట బిజ్జలుఁడు ప్రవేశించును.)

బిజ్జ:—బసవా!

నాయింట శివనంది నాట్యమాడినదయ్యా కాలిమువ్వలు ఘలంఘలలుపుట్ట
నాముంగిటను శివనంది పాడినదయ్యా కొమ్ముగంటలు నినాదమ్ము నేయ
వృషభేంద్రరాజు నావీట వచ్చెఁగదయ్యా తళుకుబంగరుజీను వెలుఁగుజిమ్మ
తొలివెద్దు మొగసాల నిలచినదయ్యా నారాజసౌధము శివుతేజ మెంచ

నాగృహమ్ము ప్రమథసాధాళిబస యయ్యె
నాదుతనువు భక్తనాథులకును
గానుకయ్యె నయ్య కమ్మనిబసవ, నా
కట్టిబసవ, నాదుపొట్టిబసవ!

బస:—మహారాజా! మీ రిన్నాళ్లకు శివభక్తులైనందుకు నాకు సంతోసమే కాని శివభక్తులకు లోభక్రోధమాత్సర్యాదిదుర్గుణము లుండరాదు. అన్నింటిలో లోభము మఱియుఁ జెడ్డది.

బిజ్జ:—బసవా! నీ వేదిచెప్పిన నది యనుష్ఠింతును. నేను నీలెంకనయ్యా!

బసవనికనుసన్న పారాడినంతనే కనకాచలేంద్రమ్ము కదలివచ్చు
బసవఁడు కనుగీటు పాటించినంతనే సర్వసామ్రాజ్యమ్ము సాగుచెంచు
బసవఁడు పెదవింత కొసకుంచినంతనే పరరాజసైన్యముల్ పాఱు డెంచు
బసవనిచేకత్తి మిసలాడినంతనే పెఱనృపవ్యూహముల్ బీటువాఱు
బసవనికృపాళి శేవసంభారమునకుఁ పాలసంద్రపుఁదరఁగలు వట్టిపోవు
శివునియొవలోనఁ గనుమూయు కట్టిబసవి, నాగృహమునందు మంత్రియై

[నాట్యమాడె.

బెజ్జ:— మహారాజా! జగదేవ దండనాయకుని యొద్దనుండి వార్త వచ్చినది.

బిజ్జ:— అతఁడు తిరిగి వచ్చుచున్నాఁడా?

బెజ్జ:— చిత్తము. మహాప్రభూ! తిరిగి వచ్చుచున్నాఁడు.

బిజ్జ:— అట్లనా?

చ. బసవని ప్రీతిగాఁ బురము నాటికి లెల్లెడ వీధులెల్లెడన్
కసవుల చిమ్మి నీర్చలికి గందము లల్కి విచిత్రచిత్రశో
మసృణపురంగవల్లికలు మాలలు తీర్చి యలంకరింపుఁడీ
విస్ఫురదభేరిభాంకృతుల విన్నను మన్ననొకండు చేయుఁడీ

బెజ్జదేవా! మనమందఱమును మూలబలములతో జగదేవదండనాథు నెదురుకొని తీసుకొనివత్తము.

బెజ్జ:— త్రిభువనమల్లా! జగదేవదండనాయకుఁ డొక్కఁడే వచ్చుచున్నాఁడు.

బిజ్జ:— ఒక్కఁడే వచ్చుటయేల? సైన్యము త్రిపురాంతకునిఁ గొనిరమ్మని శుభవార్త మనకుఁ దెలుపుట కొక్కఁడే వచ్చుచుండెనా? ఔనౌను. జగదేవుఁ డెంతపరాక్రమశాలియో యంత సత్పురుషుఁడు.

రిపులకంఠము కత్తిరించినకత్తితోఁ గలఁగు శిబలబాధ తొలఁగఁజేసె
భూభార మెంతయు మోచినచేతితో నాశ్రితాళికి నభయంబొసంగె
సమరధూర్వహతాప్రశస్తమౌ మేనితో నభవునిముందుసాష్టాంగమొరగె
పరభీకరపు గాఢనేత్రములతో దీనులపై మంచుఁ జేసెఁ ...

నతనికైన ప్రతీక్ష నాయాత్మయందు
నాఁడు నేఁ డెఱిఁగెన దంషనాథుఁ డవుట
బలమునకు మున్నుమున్నగా వచ్చుచుండె
మచ్ఛవః సేయనుగ గెల్పుమగువుఁ సరియ.

బస:— మహాప్రభూ! జగదేవుఁ డోడిపోయి వచ్చుచున్నాఁడు.

బిజ్జ:— జగదేవుఁ డోడిపోయెనా? బసవా! నీ భక్తునితో నీవు పరాచకమాడవచ్చునా? జగదేవుఁ డోడిపోవుట యేమిటి?

అసలు జగదేవసహస్తమ్మె యధికశోష
భుగభుగాయితే విషమమున్బజగ... జు
బసవదేవునాశీర్వాదపటిమ యొకటి
యేకశిహ్వాస్యమ్మను సహ్రధాశరించు.

బస:— మహాప్రభూ! జగదేవుఁడు నిజముగానే యోడిపోయెను.

బిజ్జ:— మహారాజా! ఇదిగో జగదేవుఁడు పంపించిన యుత్తరము.

బిజ్జ:— మీరు నిజముగానే జగదేవుఁ డోడిపోయె ననుచున్నారా?

బస:— చిత్తము. శివానుజ్ఞలేక యెవరు గెలువఁగలరు? జగదేవుఁ డోడిపోవుటయే నిజము.

బిజ్జ:— బసవా!

బస:— మనుష్యుఁ డొకకార్యము చేయును. దైవ మన్యథా తలఁచును.

బిజ్జ:— దైవము నీరూపమున మాయింటిలో నున్నాఁ డనుకొంటిని.

బస:— నేను దైవమును గాను. శివునిభక్తులకు దాసుఁడను; వారి యుచ్ఛిష్ట మారగించుచుఁ బొట్టపోసికొనుచున్న యొకయల్పజీవిని.

బిజ్జ:—బసవా! నన్ను నమ్మించి గొంతుకోయుచుంటివి.

మడివాలుమాచయ్యమాత్రమున్మనేయవే శత్రుసైన్యములాకసమునవిల్ప
నూదిగశివనాసమయ్యంత నేయవే చితతక్షీరవృష్టిఁ గురియ
అల్ల జంగముసంగమయ్యంత నేయవే యడిగినపాజీషో కంత నిలువ
ఆగల్లకలియంబయంతయుఁ జేయవే నేలజా తెఅకుకాలునిల్వద్రోక్క

నీమహత్తులు చూడలేదా మహేశ!
భక్తజనపారిజాతంబ! బసవలింగ!
వందితార్తజనాశ్రయ! బసవలింగ!
భక్తిసేవకకృతసంగ! బసవలింగ!

బస:— మహాప్రభూ! అట్టిచిన్నిచిన్ని పనులు భక్తిపారవశ్యముచేతఁ జేయునవి. భగవంతుఁ డనుగ్రహించుటచేత నేను జేసిన ట్లగుపించుచున్నవి. ఈ మహాస్మష్టిప్రయాణములో నేస్వారాజ్యము నిలుచునో, యేసైన్యమోడునో, యేసముద్రము పొంగునో, యవి పరమశివుని యధీనమునందలి విషయములు.

బిజ్జ:—అమాత్యా! అబద్ధము లాడకుము. నన్ను నమ్మించి నమ్మించి వీరశైవమార్గమునకుఁ ద్రిప్పితివి. నీ వమాత్యుఁడవైనంతనే నేల యొడ్డఁగెడవై నావైపునకు వంగిన దనుకొంటిని. బసవా! స్వామిద్రోహము చేయకుము; రాజద్రోహ మెవ్వరికిని మంచిది కాదు.

బస:— నేను రాజద్రోహము చేయుట లేదు. దండు నే నడుపుకొని పోలేదు. దండు నడపినది జగదేవదండనాయకుఁడు.

బిజ్జ:— నేను రాజ్యవ్యవహారము, యుద్ధనీతివిశారదత్వమును గూర్చి ప్రసంగించుటలేదు. నీవు భక్తుల ముఖమున బహుమహత్తులు ప్రకటించితివి. ఆమహత్తుప్రకటించి నాయుద్ధములు గెలిపింపుమంటిని. నారాజ్యము విస్తరింపఁజేయు మంటిని.

బస:— భక్తికిని రాజ్యనీతికిని సంబంధములేదు. భక్తి శమదమాదిగుణసంపత్తితోడిది; అంతరింద్రియదోషనిష్కాసనముతోడిది. రాజనీతి లోభమదమాత్సర్యములతోడిది; ఆత్మజ్ఞానదూరమైనది.

బిజ్జ:— బసవా! అట్లయినచో మడివాలుమాచయ్య తనమోయువస్త్రముల నితరులఁ దాఁకనీయ ననుట, తాఁకినవారిని జంపుట యాంతరదోషనిష్కాసనవిషయమా? మదమాత్సర్యవిషయమా?

బస:— మహారాజా! శివుఁడు ప్రమాణముగాఁ జెప్పుచున్నాను. నీయుద్ధములు గెలిపించుటయందు, నీరాజ్యము విస్తరింపఁజేయుటయందు నారాజనీతికి మించి నాయొద్ద శక్తిలేదు. శత్రువులను బహుభంగుల నీతివాగురలఁ జిక్కించి పరస్పరద్వేషములు పెంచి నాశక్తివంచన లేకుండ నీరాజ్యమును విస్తరింపఁజేసెదను.

బిజ్జ:—బసవా! రాజనీతి నీవొక్కఁడవే యెఱుఁగవు. జగదేవ బెజ్జదేవులు నెఱుఁగుదురు. ఇతర మంత్రులు నెఱుఁగుదురు. వట్టి రాజనీతియే యైనచో బసవేశ్వరుఁ డొక్కఁడే మంత్రి కానక్కఱలేదు. బిజ్జలుఁడు స్వతంత్రముగా వ్యవహరించుకొనఁగలఁడు.

బస:— బలదేవదండ నాయకుఁడు వట్టి రాజనీతివేత్తయే.

బిజ్జ:—బసవా! ఈ పొడుపుమాటలు నాకును దెలియును. బలదేవునివంటివాఁడు కావలసి కాదు, నేను బసవేశ్వరున కమాత్యపదవి యిచ్చినది. అయినను బలదేవుఁ డమాత్యుఁడుగా నున్నపుడు జగదేవుఁడే యుద్ధములోనను బరాజితుఁడై తిరిగి రాలేదు.

బస:—ప్రభువులు నావలన దోషము చూపించి నిందింపవలయును.

బిజ్జ:—నీవలన నొక్క దోష మేమి? అన్నియు దోషములే. మిండజంగముల నూరు పట్టించి బొక్కసము కొల్లవెట్టుచుంటివి. మాలమాదిగలతోఁ గలసి తినుచుఁ దిరుగుచు వర్ణాశ్రమాచారధర్మములు పాడుచేయుచుంటివి. శివభక్తు లని ప్రతిచాకలివానికి మంగలివానికి నీ రాజుచేత సాష్టాంగములు చేయించుచుంటివి. కాలు జాఱు గొల్లవాండ్రను బట్టుకొనుమోయి బసవా! నీరాజుసైన్యము యుద్ధమునం దోడినపు డక్కఱకు రాకుము.

బస:—మహారాజా! తమరు కోపగ్రస్తులై యున్నారు.

(అంత జగదేవ దండనాథుఁడు ప్రవేశించును.)

బిజ్జ:—భో భో హనుమకొండ దుర్గవప్రకుద్దాలన చాతురీబాహుదండ మండనాయమాన! కాకతి ప్రోల కంఠరక్తధారా పరిరమ్య కరాసి లలిత బసవేశ్వర పాదనీరజ ధారాయమాన హృదయాంబుజాత! బెజ్జదేవా! ఆరత్నహార మిటు తెమ్ము. భేరీ భాంకారములు మ్రోఁగింపుఁడనుము. విజయాభిరాముఁడైన జగదేవదండ నాయకునకుఁ బుష్పాంజలి చల్లుము. జగదేవ దండనాథా! మీ గెలుపునకు మీరాజు మిక్కిలి సంతోషించినాఁడు. మీ సేవలకు సంతోషించి రాజలాంఛనమైన యీ ఖడ్గము మీకు బహుమానముగా నర్పించుచున్నాఁడు.

(ధిక్కారముతో నొసఁగఁబోవును.)

జగదేవుఁడు:— (సాష్టాంగపడి) మహాప్రభూ! క్షమింపవలయును.

బిజ్జ:—బెజ్జదేవా! జగదేవుఁడు గెలువలేదా యేమి? ఖడ్గమును బహుమానముగా స్వీకరింపఁడేమి? కాకతి ప్రోలునకు జగదేవుఁ డేల యోడవలయును? ప్రోలుఁడు జగదేవునకంటె వయసునఁ జిన్నవాఁడే. హనుమకొండదుర్గము చిన్నదే. చాళుక్యుల ప్రతిభ పెద్దదే. కాలచుర్యులు గొడ్డుపోలేదే! ఓహో! బసవేశ్వరుని యాశీర్వాదబలము కాఁబోలును.

బస:—ప్రభూ! మీ రెంతకు నన్నే యెత్తిపొడుచుచున్నారు. మఱల సైన్యములు సమకూర్చి హనుమకొండపై దాడి స్వయముగాఁ బోయెదను.

బిజ్జ:—బసవా! అట్లు చేయవలదు వలదు. నీవు వెడలిపోయినచో నీయూరి మిండజంగములకు దిక్కెవ్వరు? కటకములోని చాకలులు, మంగలులు, మాలలు, మాదిగలు పవిత్రు లెట్లగుదురు? చాకలివాండ్రు పరదేశివిప్రులను జంపవలదా? మాలవాండ్రు బ్రాహ్మణులకన్న నుత్తములు కావలదా?

జగ:—(లేచి), మహాప్రభూ! దోష మంతయు నాది. మీరు బసవేశ్వరుని నిందింపవలదు. హనుమకొండదుర్గము మనమనుకొన్నంత బలహీనముగా లేదు. ఆంధ్రసైనికులు దుర్గములోపలనుండియే కాక దూరపు రక్షకస్థానములనుండికూడ వచ్చి మనసైన్యములకు రెండువేసల యుద్ధ మిచ్చినారు. ఆ దేశము తృణకాష్ఠజలసమృద్ధి కలిగియున్నది. పదియేండ్లముట్టడికి నిలువఁగలిగిన సంభారము లాకోటలో నున్నవి. దేశప్రజలు క్రమక్రమముగా జైనమతము వదలి సనాతనమత మవలంబించుచు క్రొత్తయావేశములో నున్నారు. ఆంధ్రసామ్రాజ్యవాంఛ యచ్చటి చీమలకుఁగూడఁ బట్టినది. వారిని మనుష్యుఁడు కాదుగదా, యిప్పుడు శివుఁడువచ్చినను గెలువలేఁడు.

బిజ్జ:—నిజము, జగదేవా! నిజము. శివుఁడువచ్చి యేమిచేయఁగలఁడు? అవును జగదేవుఁడే చేయలేనప్పుడు శివుఁ డేమిచేయును? శివుఁడు చేయలేఁడు. శివభక్తులు చేయలేరు.

బస:—మహారాజా! నేటినుండి నేనువట్టియమాత్యుఁడనే, శివభక్తుఁడను గాను.

బిజ్జ:—బసవా! నీశివుఁడు దేవుఁడు కాదు. వాని భక్తులందఱు వట్టిదొంగలు.

బస:—బిజ్జలా! ఏమంటివి! శివుని నీవు వేయి తిట్టుము. శివభక్తులు దొంగలా! హరహరమహాదేవ! శంభో! శంకర! ఇప్పుడే ప్రళయము చేసెదను. (కత్తి దూసి) బిజ్జలా! యేమంటివి? నీనాలుక కోసెదను. ఓరీ శివద్రోహీ! నీతల నేను నఱకుదునా. నీవు నారాజువైపోతివే. బడగరబ్రహ్మయ్యయో, మడివాలుమాచయ్యయో యున్నచో నీరాజ్యము నిర్ధూమధామము చేసెదరు. బిజ్జలా! నీకు రోజులు సమీపించినవి.

కాలాంతోజ్వల కాలభైరవ బలాత్కారోత్థహుంకారగ
ర్వాలీఢప్రతిభాప్రకంపిత సమస్తాజాంత నిర్భేదనో
ద్వేల ప్రాభవరుద్రతాండవ మహావేశక్రియానిర్దహ
ద్గోళంబై చన సృష్టియంతయును ద్రెళ్లుం జండహస్తంబునన్.

శివభక్తులు దొంగలన్న నీయపరాధము సైరింపరాదు. పృథ్వియెల్ల నీరాజ్యముచేసి శివభక్తాపరాధముచేసిన నాలుకగల నీముండముతో శివునకు నీరాజన మెత్తెదను.

సర్వగోళసంఘట్టనపటుసమయకాలతాండవభీకరశివ
గర్వమత్తభూపాలకతనుఖండఖండదారణపటుశివ.
రుద్రరుద్ర శంభో శివశివక్షుద్రమనుజసంహార శివశివ
రుద్రకాలభైరవాగ్రేసర రూపరహిత నామరహిత-శంభో-శివశివ.

(కత్తి యెత్తును.)

జగదేవుఁడు:— [కత్తిపట్టుకొని] బసవేశ్వరా! రాజును జంపెదవా? ముందు నన్నుఁజంపి తరువాత రాజును జంపుము. యుద్ధమునందు మన మోడిపోతిమని భూపాలునకుఁ గోపమువచ్చుట న్యాయముకదా! రాజనీతిపారంగతుఁడవే! భూపాలునియం దుత్సాహశక్తి యెట్లుండును? త్రిభువన మల్ల బల్లహబిజ్జలుని యీయుత్సాహశక్తియేకదా మనరాజ్యమును సంరక్షించుచున్నది. బిజ్జలుఁడెవఁడో యల్పనృపాలుఁ డనుకొంటివా? సార్వభౌముని మహాగుణములు కలవాఁడు.

బిజ్జ:— బసవేశ్వరా! ఆకత్తి బల్లహునిమీఁదికి వ్రాలకముందుఁ బన్నిద్దఱమాత్యులపైఁ బన్నిద్దఱుదండనాథులపై వ్రాలవలయును. బసవా! నీవు మహామతిమంతుఁడ వనుకొంటిని. చివరి కిట్లా చేయుదువు?

జగ:—బసవా! నీకుఁగోప మెక్కించుటకు, నీకుత్సాహము కల్గుటకు నీవు నందియవతార మగుటవలన నీప్రసాదము మాయందుఁ గలుగుటకు రాజుచేసిన ప్రయత్నమును నీవన్యథాకరించితివి.

బిజ్జ:— బసవా! మౌనము వహించెదవేల? శివము దిగలేదా? రాజును చూడుము. మందహాసవదనారవిందుఁడై యెట్లు గూర్చుండెనో! బిజ్జలుఁడు కత్తిదూసినచో నీవును నీశివభక్తులును నిలువగలరా? కోపముకొలంది కత్తి నెత్తితివిగాని నిజముగా నాకత్తి వ్రాలినచో బిజ్జలుని ఖడ్గనై పుణ్యముముందు నీకత్తి తునుకలుతునుక లగునుగదా! మహారాజు కత్తిచివర నీకత్తిపిడిలో దూరినీయఱచేయి రక్తప్రవాహమై యుండును.

బస:— మహారాజా! ఈకత్తి నీపాదసన్నిధానమునం దుంచిపోవుచున్నాను.

(పోఁబోవును.)

బిజ్జ:— బసవా! నీవు రాజద్రోహము చేసితివి. నిన్ను మహామాత్యపదవినుండి తొలగించితిని.

జగ:— మహారాజా!

బిజ్జ:—ఇప్పు డెవ్వరును మాటాడరాదు. బసవా! నీకు గడియసేపు కదలకుండ నిలుచుండుశిక్ష వేసితిని. నీవు నిలుచున్నచోటినుండి కదలరాదు, మాటాడరాదు.

(బసవఁడు తలవంచుకొని నిలుచుండును.)

బిజ్జ:—జగదేవా! నీవు తీసికొనిపోయిన సైన్యమంతయు నేమైనది.

జగ:—ఇఱువది వేల సైన్యములోఁ బదివేలసైన్యము శత్రువులచేఁత నాశనమందినది. ఐదువేలు చెల్లాచెదరైనది. తక్కినభాగము కొందఱు గాయపడి, కొందఱుత్సాహముచెడి, మఱలి వచ్చుచున్నది.

బిజ్జ :— చనిపోయినవారిని మడివాలు మాచయ్యకుఁ జూపింపుము. అతఁడు బ్రదికించును. గాయపడినవారిని శివనాగుమయ్య కర్పింపుము. అతఁడు పాలుపోసి బ్రదికించును.

బిజ్జ:—మహాప్రభూ! బసవనిమన స్సిదివఱకే చివుక్కుమన్నది. ఇంకను దానిని గాయపఱచెదరు.

బిజ్జ:—ఒక రాజబంధితుని మాట నాముందుఁ జెప్పకుము. జగదేవా! మరల సైన్యసన్నాహము చేసి

హనుమకొండమీదికిఁ బోదువా? చెదరిపోయిన సైన్యమును మఱల నెదకించి తెప్పింపుము. మఱలఁ గొన్ని మాసములు విశ్రాంతి తీసికొనుము. ఎన్నఁడు నపజయ మెఱుగని దండనాథుఁడవు నీ విట్లగుటలో నాకుఁ గోపము వచ్చినదా? నేను మన మోడిపోయినందులకుఁ జింతించుట లేదు. ఫలములేక పదివేలనుంది సైనికులను గోలుపోయినందులకు విచారించుచున్నాను. జెజ్జదేవా! ప్రజాపాలన మంత్రితోఁ జెప్పుము: వారి కుటుంబములకు జీవనాధారములు చూడుమనుము. గడియయైనదా?

జగ:—చిత్తము మహాప్రభూ!

బిజ్జ:—(ఆసనమునుండి లేచి బసవనికత్తి డీసికొని బసవనితో) బసవా! నీ వొకసారి రాజదండితుడవఁట. అయినను నీ సద్గుణములు నీ రాజనీతి వేతృత్వము మాకునచ్చినవి. నిన్ను మా సామ్రాజ్యమునకు మహామాత్యునిగా నేర్పఱచుచున్నాను. బసవేశ్వరా! నీ వీయమాత్యఖడ్గము స్వీకరించి మాకు మంత్రివై యుండుము.

సకలసామ్రాజ్యపూజ్యస్థితికల్ల ప్రకటింపగా నీవు పతి వట్లుగాక
నాయర్థమునకు ప్రాణమునకు బలివివేయుదునేల నీనే నేను బసవ!
నిన్ను నమ్మితిని.

బస:—మహారాజా! నీ యమాత్యపదవికి నే ననర్హుఁడను.

బిజ్జ:—బసవేశ్వరా! నీ వొక్కఁడవే యర్హుఁడవు. బలదేవదండనాయకుఁడే నీవు. నీవే బలదేవదండనాయకుఁడు. నాయెడల నేమైనఁ దప్పులున్నచో క్షమించి నాయమాత్యపదవీస్వీకారము చేయుము.

బస:—(మోకరించి) మహారాజా! నీనీతిముందు నానీతియెంత? నీపరాక్రమముముందు నాపరాక్రమ మెంత? నీశివభక్తిముందు నాశివభక్తియెంత? ప్రభూ! నారాజును, నాపాలకుని, నాప్రభువును వధింపఁబోయిన నాపాతకమునకు నాశిరస్సు ఖండించుటమాని నాకు మఱల నమాత్యఖడ్గమిచ్చుచున్న నీదయ యెన్నిసముద్రముల లోతో నాకుఁ దెలియదు. ఇట్టి నీగుండెలోని యౌదార్య మెన్నిపర్వతములయెత్తో తెలియలేదు. ఇట్టి నీ శివభక్తి యెన్నియాకాశములు పట్టునో తెలియదు. తప్పుచేసితిని. నన్ను రక్షింపుము.

బిజ్జ:—జగదేవా! సామాన్యమానవులయందు దోషములుండునుగాని పరమమాహేశ్వరుఁడైన బసవేశ్వరునియందు దోషములుండునా? ఇంక మీరందఱుఁ బొండు. మే మంతఃప్రాసాదమునకుఁ బోదుము.

(మంత్రులు నిష్క్రమింతురు.)

బిజ్జ:—రాజనీతికి శివభక్తికి సంబంధము లేదా? బసవేశ్వరుఁడు నన్ను ద్రోహము చేయఁడు కాని నేడు చేసినపని భవిష్యల్లాభకారి కాకపోదు. నిజమునకు శివభక్తి యాంతరదోషనిష్కాసనహేతుమాత్రమే.

(నీలప్రవేశించును.)

నీల:—

రజతాచలశిఖరమ్మున ప్రాణేశుడు కూర్చుండెన్
నిజభ్రూమధ్యంబందున నిలిపెన్ దనచూపెల్లన్
బసవేంద్రుఁడు తలవంచుక పరయోగవ్రత మూనెన్
బుసకొట్టుటలనుమాని భుజగేంద్రుడు శయనించెన్ -రజతా.
తలలోపల నాకాంబువు తరఁగలలలు లేకుండెన్
తొలిచందురుచిఱువంకయు దోఁకక బెణకకయుండెన్ -రజతా.
విఘ్నేశుఁడు తొండమ్మును నిరియించుక తలవంచెన్
నిఘ్నంబయి జగమెల్లను నీరవపద్ధతి బొందెన్ -రజతా.

బిజ్జ:—నీలా! ఆనాడు రత్నము లేరితినంటివే, అవి యేమిచేసితివి?

నీల:—ఎన్నిసార్లు చెప్పాలి?

బిజ్జ:—ఇదివఱకు నాతోఁ జెప్పలేదే.

నీల:—అన్నా! నీవా! జగదేవుఁడు తిరిగివచ్చాట్టగా! మనవాళ్లు ఓడారుకదూ!

బిజ్జ:—నీకెట్లు తెలియును?

నీల:—జగదేవుఁ డోడిపోవటం నేనుచూశాను.

బిజ్జ:—ఎక్కడ జూచితివి.

నీల:—ఆవాగుమడుగున జగదేవుఁ డోడిపోయాడు. అమ్మఅప్పుడే స్నానం చేయఁ బోయింది. జగదేవుఁడాసమయంలో తెలివితక్కువగా సైన్యాలక్కడ నిలబెట్టాడు. అవతలవాళ్లసైన్యం దూరంగా వుంది. అమ్మ స్నానంచేసేటప్పుడు తనపౌజును దగ్గరగా నిలబెట్టాఁడని అమ్మకి కోపంవచ్చింది.

బిజ్జ:—అమ్మకు అవతలవాళ్లు ఇష్టంవాళ్లా?

నీల:—వాళ్లమ్మనే పూజిస్తారు. నాకు శివుడంటేనే యిష్టం. అమ్మకి నేనంటే యిష్టం లేకపోలేదు.

బిజ్జ:—అమ్మ యెల్లుండును?

నీల:—అమ్మా! అమ్మ.

కన్నులనితళుకుల గరుడాలపచ్చ చిమ్మిన వెలుసుల చెందిరమచ్చ
తనికివన్నెలందపు కాయపసపుతనపై అమెఋగని ముకుకారునిసుబు
నిట్టగాబోడిచిన సెజెపాలకల్లి దట్టంపునావు లందపుబొండుమల్లి

బిజ్జ:—నీలా! రత్నములతో నేమిచేసితివి.

నీల:—చెప్పితినిగదా, అమ్మపైట కంచుగాఁగుట్టితి నని!

బిజ్జ:—నీలా! నీవెవ్వరు?

నీల:—నా పేరు నీలలోచన.

బిజ్జ:—నీ వేలోకపుదానవు?

నీల:—(నవ్వి) నీవేలోకపువాడివో నేనూ ఆలోకముదాన్నే.

బిజ్జ:—నేను భూలోకపువాడను.

నీల:—అన్నా! నాకుమొన్న పట్టుచీర తెప్పిస్తానంటివిగదా! ఏదీ!

బిజ్జ:—మీఅమ్మ నడుగుము.

నీల:—అమ్మా! అమ్మ. అమ్మపోయిందిగా!

బిజ్జ:—ఇందాకటినుండి చెప్పుచున్న అమ్మ.

నీల:—అన్నా! అమ్మగా నీవే, నాన్నవూ నీవే; నాకు తెస్తానన్న పట్టుచీర తెచ్చిపెట్టాలి.

బిజ్జ:— పోపో! జగదేవుఁ డోడిపోయినాడు. ఇప్పుడు డబ్బులేదు, గిబ్బులేదు.

నీల:— (చిన్నపుచ్చుకొని) నువ్వేయిట్లాఅంటే నే నెవరితో చెప్పను.

(పోవును)

పొంచిపొంచీ యమ్మతో దోబూచులాడావా?
మంచీమంచీయమ్మ నవ్వులు మరులుకొన్నావా?
నీలా! మరులుకొన్నావా?

గిలికిగిలికీ యమ్మకూ గిలిగింత పెట్టావా?
తళుకుతళుకూ చిన్నినవ్వులు తల్లిచిలికిందా.
నీలా! తల్లిచిలికిందా?

పలికిపలికి పైటరతనాల్ కూర్చిపెట్టావా?
నిలచినిలచీ యమ్మ చూచీ నీటుపోయిందా?
నీలా! నీటుపోయిందా?

వడలివడలీ వచ్చి యమ్మను వాచిపోయావా?
ప్రిదిలిప్రిదిలీ నీకుసుందె బీటువారిందా!
నీలా! బీటువారిందా?

బిజ్జ:—నీలా, చీరతెప్పింతునమ్మా-

[తెర]

## షష్ఠాంకము.

[ప్రవేశము: బోయలు. శైవులు.]

౧. బోయ:—అనాదినుండీ శివప్రసాదం మాకు వస్తోంది. ఇవ్వాళ మీరు మా కివ్వ మనడం అన్యాయం. ఇవ్వకపోతే బలవంతంగా తీసుకుంటాం.

౨. బోయ:— సంప్రదాయసిద్ధంగా మాకు వస్తోంటే యివ్వాళ మా కెట్లా యివ్వకుండా ఉంటారు?

3. బోయ:—సంప్రదాయాన్ని పాలిస్తాడు రాజు. దేశ మరాజకంగా లేదు. మా కానువాయితగా వచ్చే శివప్రసాదం యివ్వనంటానికి మీరేమి దొరలా?

౧. శైవుడు:—ఓరీ బోయలారా! మీకు శివప్రసాదం రాదురా! గొల్లవాళ్లు శివప్రసాదం ముట్టుకోగూడదు.

౨. శై:—భవులెవ్వళ్లకీ శివప్రసాదం యివ్వము. శివప్రసాదం మైలపడిపోతుంది.

౧. బోయ:—అయ్యా! దేముణ్ణి మోసేందుకు మేమున్నూ ప్రసాదా లారగించేందుకు మీరూనా? గుణ్ణం గుడ్డికైనా దాణాకి లోపంలేదని, అయితే దేముణ్ణి గూడా మీరే మోసుకోండి.

౨. బోయ:—అయ్యా ప్రసాదమే మైల పడుతుందా? చలవచప్రం మేము మోస్తుంటే దేముడు గూడ మైలపడతాడా?

3. బోయ:—బాబూ! మంచిధర్మంచెప్పారు. చాప వేసేందుకు మేము, ప్రహారీలోపల అంతా ఊడ్చేందుకు మేము, చలవచప్రం మోసేందుకు మేము. ఇలా యికర్రలు పట్టుకునేందుకు మేము.

౪. బోయ:—ప్రసాదం తినేందుకుమాత్రం శివబత్తులురా, శివబత్తులు. చాకిరీచేసేందుకు మనమున్నా ఆరగించేందుకు అయ్యలున్నా.

౧. శై:—ఓరే బోయల్లారా! నోటికి వచ్చినట్లెల్లా మాట్లాడకండి.

బోయి:—ఏంచేస్తావయ్యా మాట్టాడితే.

౨. శై:—(కత్తిదూసి) మెడ నరుకుతాను. కాల బెట్టి నేలరాస్తాను.

3. బోయ:—ఆ. ఈయేసాలన్నీ సాగవయ్యోయి. బొమ్మర్లనుకుంటున్నా వేమిటి; కత్తిచూపించి బెదిరించేందుకు? వాటేసుకొని మెత్తి గోడవతల యిసిరేస్తాను.

౨. శై:—ఒరే! మీకూమాకూ తగాదా మెందుకు? మీకు శివప్రసాదం పెట్టకూడదని బసవడిఆజ్ఞ అయింది. మీరు గింజుకు చచ్చినా పెట్టేదిలేదు.

3. శై:—పోయి దిక్కున్నచోట చెప్పుకోండి.

౧. బోయ:—దేశం ముండేలటం లేదయ్యోయి. మేంపోయి రాజుగారితో చెప్పుకుంటాం. చండేసరుడినాటి నుండి శివప్రసాదం మాకు వస్తోంది. చండేస్సరుడు మాకు సంపాదించిపెట్టాడయ్యా! ఇవాళ కాదంటానికి నువ్వెవ్వరు? మీద కలియబడి లాక్కుంటాం.

౨. శై:—కలియబడరా యేంజరుగుతుందో చెబుతాను.

(నలుగురుశైవులూ హరహరమహాదేవ అంటారు.)

౧. శై:—ఇదిగో మేంపోయి శివప్రసాదం పళ్లెం చుట్టూ నిలుచుంటున్నాం. ఎవడు వస్తాడో రండి పుచ్చెగరేస్తాం.

౧. బోయ:—ఒరేయి! సంపేస్తారురా! ఒకళ్లా, యిద్దరా? వేలకొద్దీ ఉన్నార్రా ముండాకొడుకులు! మనం వాళ్లతో నెగ్గలేముగాని పోయి రాజుగారితో చెప్పుకుందాం పదండి.

౨. బోయ:—రాజుగారు బసవన్న పక్షమేరా. మన మొఱ్ఱ వింటాడా?

3. బోయ:—వినకపోతే రాజేమిటోయి.

౪. బోయ:—ఇదిగోరా, దేవిడీ ముందరికి వచ్చాం:

౧. బోయ:—రాజుగారి దర్శనం అవుతుందా మనకు.

౨. బోయ:—రాజుగారు ప్రతివాడికీ దర్శన మిస్తాడుకదరా.

ద్వారికుడు:—(ప్రవేశించి) ఎవరు మీరు? మీకేమి కావలెను?

అందఱు:—బాబోయి! మాకు రాజుగారిదర్శనం కావాలి.

ద్వా:—మీ పని యేమో చెప్పవలయును.

౧. బోయ:—శివబత్తు లందరూ మమ్మల్ని అన్యాయం చేస్తున్నారు. మాకు శివప్రసాదం యివ్వమంటున్నారు.

ద్వా:—అల్లరి చెయ్యకుండా ఉండండి. పోయి ప్రభువుగారితో చెప్పివస్తాను.

(నిష్క్రమించును.)

౧. బోయ:—ఒరేయి, చూశావా! ఎంత మంచివాడో?

౨. బోయ:—ఈయన మంచితనం యేముందిరా? రాజుగారిఆజ్ఞ అట్లావుందికాబోలు. ఎవరొచ్చినా దర్శనం కావలసిందే.

3. బోయ:—మాట్లాడకండి. జాగర్తగా ఉండండి.

(తరువాత బిజ్జలుఁడు ప్రవేశించును.)

బిజ్జ:—మీ రెవరురా?

౧. బోయ:—అయ్యా! మేము గొల్లబోయలం. దేవళంలో చాకిరీ చేసేవాళ్లం బాబూ!

౨. బోయ:—దొరా! మే మీశైవులతో బతకలేకండావున్నాము. బాబూ! ఇదేంమతాలో శ్రీకంఠశివులట, గొర్నాధ శివులట, లోకైకశివులట; త్రిలోచనశివులట.

3. బోయ:—శాశ్వతశివులట, గణేశ్వరశివులట; ఇంకెన్నెన్నో పేరు లున్నాయి.

౧. బోయ:—మహారాజా! బసవయ్యా తోయపు భక్తుల్ని చూచి, వీళ్లందరూ, తాముకూడా లింగవంతుల మంటున్నారు.

౨. బోయ:—ప్రసాదం వాళ్లే తింటున్నారు. మా కేమీ పెట్టటంలేదు.

బిజ్జ:—మొట్టమొదటినుండి ప్రసాదము మీదే కదా!

౧. బోయ:—ప్రభో! మాదే, మాదే. పూర్వం ఎప్పుడో మాగొల్లకుర్రా డొక్కడు పశువుల్ని కాయ డానికి వెళ్లాడు. ఆరోజున శివరాత్రి అవడం మూలంగా అక్కడే ఆయన యిసుకతో లింగం చేసి ఆలింగంమీద పాలు పితుకుతూ అభిషేకం చేస్తున్నాడు. ఇంతలో తండ్రి వచ్చి పాలన్నీ నేలపాలు చేస్తున్నావురా అని యిసుకలింగాన్ని కాలితో తన్నాడు. వాడు తండ్రి అని చూడక దేవుణ్ణి తన్నుతావా అని తండ్రికాళ్లు నరి కాడు. ఆకుర్రాడే చండీశ్వరుఁ డయ్యాడు. ఆయనే మొదట మాకు ప్రసాదం యిచ్చాడు. అప్పటినుంచీ వంశపరంపరగా మేం అనుభవిస్తున్నాము.

౨. బోయ:—దొరా! ఇట్టాజరుగుతోంటే యీ వూళ్లో వీరమాహేశ్వరులంతా పోగై యిప్పుడు మాప్ర సాదం మాకు చెల్లనివ్వమంటున్నారు.

3. బోయ:—దొరా! బసవయ్య యేంయంత్రా లు పన్నాడో. ఇప్పుడు వాళ్లందరూ మాతో కజ్జాలు పెట్టుకున్నారు.

౪. బో:—మారాజా! మాప్రసాదం మాకు చెల్లింపించితే చెల్లింపించండి. లేకపోతే మీవాకిట్లో గుం డాలు తవ్వించుకొని కాలిపోతాం ప్రభూ!

బిజ్జ:—ఎవడురా అక్కడ?

దౌవా:—ఆజ్ఞ.

బిజ్జ:—నీవు పోయి బసవేశ్వరుని బిలుచుకొని రమ్ము.

(దౌవారికుడు నిష్క్రమించును.)

౧. బోయ:—మహారాజా! బసవయ్య యేవో తంత్రాలు చెబుతాడు, తంత్రాలు చేస్తాడు మీరు రక్షించాలి.

౨. బోయ:—దొరా! ఇదిపోతే ఒకపూట మా కూడు పోతుంది. మేమందరం రాత్రిపూట గుళ్లోప్రసా దంతోటే బతుకుతున్నాం. పగటికూటికి కూలీనాలీ చే సుకుంటాం. రాత్రిపూటకి దోసెడుదో సెడు ప్రసాదం తెచ్చుకుతిని యిన్నినీళ్లు కడుపులో పోసుకుని బతుకు తున్నాం.

(బసవేశ్వరుడు ప్రవేశించును.)

బిజ్జ:—బోయలను ద్రోసివేయుట యేమిటి? ప్ర సాదము మీరు కుడుచుట యేమిటి ? ఇది న్యాయమార్గ మా? బలిమియా? వాండ్రు పేదలు. వాండ్ర నోటిముం దరికూడు తీసివేయఁగూడదు. బసవేశ్వరా! మీశైవుల మూలమున రోజు కొక్కతగవుగానున్నది. ఇది యన్యా యము. వారిప్రసాదము వారి కిప్పింపవలయును.

బస:—మహారాజా! బోయలకుబ్రసాద మిచ్చుట యున్నది. చండీశున కభవుడొసంగిన తెఱఁగు మీరెఱుఁ గుదురుకదా! కాని బాణలింగములందు స్ఫటికలింగము లందు బ్రాణలింగములందుఁ బౌష్యరాగాది లింగమ్ము లందును బ్రసాదము లేదు. శివున కాగమోక్తముగ నిచ్చినప్రసాదము భవులు ధరించినను జూచినను నరకా గ్నిశిఖల మ్రగ్గుదురని శ్రుతు లున్నవి. ఓరీ ! బోయ లారా!

శ్రీగురుకరుణానురాగప్రసాద మాగమవిధ్యుక్తమగు ప్రసాదమ్మ<br>
సుప్రసన్నానందశుద్ధప్రసాద మప్రతిర్వాక్యాది లింగప్రసాదమ్మ<br>
పరమపవిత్రసంపత్ప్రసాదమ్మ స్థిరభవరోగౌషధీ ప్రసాదమ్మ<br>
గరళకంధరుకృపాకలితప్రసాద మరుదగు సంగమేశ్వరుప్రసాదమ్మ<br>
మలదేహులకు మీకుఁ దలమె భోగింప మలహరుభక్తులయిలుపుట్టువృత్తి.

లింగప్రసాదము సామాన్యమానవులు భుజింప లేరు. అది వారియిండ్లను దేహములను గాల్చును. కాన లేరుగాక భవులకు లింగప్రసాదలబ్ధి యెట్లు ?

౧. బోయ:— వారాణసి, గయ, కేదారము లందు, ద్రాక్షారామశ్రీశైలములందు, సేతువునందు, నివ న్నియు నాగమస్థానములే. మాకక్కడ శివప్రసాదములు చెల్లుతున్నవి. మీరిక్కడ యెట్లా చెల్లనీయరు? మాప్రా ణాలైనా వదిలిపెడతాముగాని,మామడికూటివృత్తి వదిలి పెట్టము.

బస:—[నవ్వి] ఓరీ! గాలి కాకులు రాలునుగాని గుట్టలురాలవు. బెండ్లు తేలునుగాని గుండ్లు తేలవు. మేము ప్రసాద మీయ మనఁగా హరిబ్రహ్మాదులకుఁ గొలఁది కాదు; మీకొలఁదియా! తొలఁగిపొండు, తొలఁగిపొండు. ఇదివఱ కెన్నఁడైన శైవులయిండ్ల మీరు ప్రసాదము పుచ్చుకొనిరేని దెలుపుఁడు. శైవులైనను వీరమాహే

శ్వరాచారులైనను ప్రాణలింగప్రసాదము మీకిచ్చెద రశా? అదియంతయు నెందులకు. శ్రీమన్మహేశ్వరునకుఁ బాలచంద్రప్రభాభాసురాంకునకుఁ గాలకాలునకు నీల కంఠునకు సర్పకుండలునకు మాసంగమేశ్వరునకు నేఁడు కాలకూటాదులు సమర్పించెదను. మీకుఁ బ్రసాద మిప్పింతును రండు. మీరురా కాలకూట మారగించు వారు? ఇంకఁ జాలునుగాని తొలఁగిపొండు.

౧. బోయ:—ఓహో! బసవయ్యా! మమ్మల్నం దరినీ ఒక్కసారి చంపటానికుపాయ మాలోచించావే. మేలుమేలు బసవయ్యా, మేలుమేలు. మాచేత శృంగినీ, కాలకూటాన్నీ తినిపిద్దామనుకున్నావా?

౨. బోయ:— బతికుంటే బలుసాకు తినవచ్చు. చచ్చి కాలకూట మెవరుతింటారు. ఈబసవయ్యతోటి వాదము దొడ్డరా, దొడ్డ.

3. బోయ:—ఉల్లిపాయలాగఁ బోయిబడిగంటఁ జచ్చినయెలుకల్లే కొల్లకుబోయి పైంజీరకోలుపోయినట్లు మనపని అట్లాఅవుతుంది. బసవనమంత్రి యెట్లాటివా డనుకుంటున్నావు. పగవారిబిడ్డల నవ్వుతూ చంపేవాడు.

౪. బోయ:— అయ్యా, మేమూ వెఱ్ఱివాళ్లము కాదు. మీశివభక్తులంతా కాలకూటం ముందర ఆర గిస్తే తరువాత మేమూ ఆరగిస్తాం.

మేలిప్రసాదంబు మ్రింగ మీపాలు, కాలకూ టమ్ము మ్రింగగ మాదుపాలు. బసవా! బసవా! విసము శివునిప్రసాద మని యెట్లాయిస్తావు? ఆకాలకూటమును శివుడికి నైవేద్యంపెట్టి మీరు తినండి. మీరుచావకుంటే ఆప్రసాదం మీరే పుచ్చుకోండి బాబూ! మా కక్క ల్లేదు.

బస:—అయినచో వాగ్వాదములేక పొండు.

౧. బోయ:—అయ్యా! మీరు విసంపుచ్చుకుం టేకదా మావాదం పోయేది.

బిజ్జ:—బసవేశ్వరా! ఏమందువు?

బస:—మహారాజా! విషములన్నియుఁ దెప్పించి సిద్ధముగా నుంచుఁడు. నేనొక్కఁడనే త్రావను. శివభక్తు లందఱిచేతఁ ద్రాగించెదను.

బిజ్జ:—ఓరీ బోయలారా! మీరు పోయి కాల కూటము, శృంగీ, వత్సనాభీ, హాలాహలము మొదలైన విషములన్నియుఁ దెచ్చి పొడిచేసి నూరించి సిద్ధముగా నుండుడు. మేము వచ్చుచున్నాము.

(బోయలు నిష్క్రమింతురు)

బస:—మహారాజా! నేను పోయి శివభక్తులం దఱను దేవదేవుని గుడియొద్దకుఁ దెత్తును.

(నిష్క్రమించును.)

బిజ్జ:—అయ్యో! కాలకూటమే త్రావుదురా? బసవఁడు త్రాగఁగలఁడేమో! శివభక్తులందఱు నెట్లు త్రాగఁగలరు. విషము త్రాగి యరిగించుకొందురో, యందఱును జత్తురో;

జగదేవుడు:—(ప్రవేశించి) మహారాజా! అంగ ళ్లలో విషములన్నియు నమ్ముడుపోవుచున్నవి.

బిజ్జ:—బోయలకు శివభక్తులకుఁ గలహము ప్రాప్తించినది. త్రిపురాంతకభట్టు (ప్రవేశించి) మహారాజా! విషము శివభక్తులందఱిచేతఁ ద్రాగింపుఁడు. బసవయ్య చేతమాత్రము వలదు.

బిజ్జ:—త్రాగినచో బసవేశ్వరుఁ డొక్కఁడే త్రాగవలయును. తక్కినవా రెల్లరు త్రాగరాదు.

త్రిపు: చచ్చినచో బసవేశ్వరుఁడే చావవల యును. తక్కినవారు బ్రతికియేయుండవలయు.

బిజ్జ:—భట్టారకా! అట్లుకాదు. అందఱును బ్రతి కియుండవలయును.

త్రిపు:—కాలకూటము త్రాగినచో బసవేశ్వరుఁ డు మరణించునుగదా!

బిజ్జ:—బసవేశ్వరుఁ డొక్కఁడే మరణింపఁడు. తక్కినవారందఱు మరణింతురు.

జగ:—మన మింక దేవళము నొద్దకుఁ బోవల యును.

(అందఱును లేచి పరిక్రమింతురు.)

(తెరయెత్తఁగా నాలయము, బోయలు, శివభక్తులుఁ గనిపింతురు.)

బిజ్జ:—గరళము సిద్ధమైనదా?

జగ:—అయ్యా! ఈగాలి తాకి నాకు దిమ్మెక్కి పోవుచున్నది. మన మింక దూరముగా నుండవలయును.

౧. బోయ:—మహారాజా! ఆ విషపుగాలి తాకి పక్షులు ప్రాణాలు తల్లడిల్లి పోతున్నవి.

౨. బోయ:—ఆ బిందెలు పడమటిగోడ ప్రహరీ యొద్దఁ బెట్టినారు. పైని నాలుగుపక్షులు ఎగురుచు నా విసపుగాలి తగిలి క్రిందఁబడి చచ్చినవి.

బిజ్జ:—విస మెవ్వరు సిద్ధపఱిచిరి?

౨. బో:—శైవభక్తులే సిద్ధపఱిచారు. గంగాళములనిండా డోగిసాలనిండా, బిందెలనిండా, శృంగీ, కాలకూటం, వత్సనాభీ తెచ్చినూరి గరగడం చేశారు. పసిడి కొప్పెరల్లో నింపుకొన్నారు.

బస:—[ప్రవేశించి] మడివాలు మాచయ్యగారూ,నమస్కారము.శూలదబ్రహ్మయ్యగారూ, జోహారు. కరహాళమల్లయ్యగారూ, నాజోతలు. నిజలింగచిక్కయ్యగారూ, నాప్రణామములు. దమ్మదబ్రహ్మయ్యగారూ, నాప్రణతులు. మహాభక్తులందఱకూ బసవఁడు నమస్కరించుచున్నాఁడు.

అయ్యా! భగవంతునకు నైవేద్యము జరిగినదా?

మడివాలుమాచయ్య:— బసవా! జరిగినది. ఇంక భక్తులందఱూ బంతులుతీర్చి కూర్చోడమే కొఱత.

బస:—మీరందరూ కూర్చోండి. నేను వడ్డిస్తాను.

(శివభక్తులందఱూ బంతులుగాఁ గూర్చుందురు.)

జగ:—మహారాజా! కొప్పెరలు తీయించినట్లున్నారు. ఇక్కడ నిలుచుండలేకున్నాను.

బిజ్జ:—జగదేవా! శివభక్తులందఱు విసమారగించుచుండగా మనము దానివాసనకైన నాగలేమా?

బస:—భక్తులందఱూ! కాలకూట మారగింపవలయును. బోయలారా! ఇది కాలకూట మగునోకాదో వచ్చి చూచుకొనుఁడు.

బోయలు:—కాలకూటమే, కాలకూటమే. మేమిక్కడి గాలికే తాళుకోలేకుండా ఉన్నాం.

బస:—ఇంక మీబుడిబుల్లు పనికిరావు. మేము చూశాము, చూడలేదు; విన్నాము, విన లేదు; ఉన్నాము లేము;అనుమాటలు పనికి రావు. సర్వలోకములకును శివుఁడేకర్త. ఆయనయే యద్వితీయుఁడు. పరమేశుభక్తులే పరమపావనులు. వారే ప్రసాదయోగ్యులు. ఇది కాదను ద్రోహులమీఁదఁ గత్తికట్టాను. కాలకూటాగ్నితోఁ గాలుస్తాను, శపిస్తాను; సందుసందులలో నలిపిస్తాను. వారినం



దఱి నధోగతికి పంపిస్తాను. భక్తులారా! బంతులు తీర్చి కూర్చుండుఁడు. గలెంతలతో, కోడలతో, గర్పరాలతో, ముంతలతో యిట్లా నా కందించండి. (వడ్డించుచు.) చిక్కయ్యా! చిందకుండఁ ద్రాగుము. సంగయ్యా, వస్తున్నాను సందడిచెయ్యకు. తెస్తానుండవయ్యా త్రిపురారీ. సీకుఁజాలులే సిరాళదేవయ్యా. చాలునా, యింకాతేనా శంకరయ్యా. అంతరుచిగానుందిటయ్యా పురాతయ్యా. వద్దంటావు న్యాయమా? ఇంక కొంచెం వడ్డించుకో పర్వతదేవా. శివభక్తులారా! కోరలు, కర్పరములు తొందర తొందరగా తేవాలి. మీసాలుసర్దుకో మిండసంగయ్య. ఇంకొకకుడికెఁడు తెత్తునా గొల్లవరాయ, మాచయ్యా, స్త్రీలబంతులు తొందరపడుచున్నట్లున్నవే. అంతమూర్ఖత్వ మెందుకే ముదునూరిదాసి. గొగ్గవ్వా, గుడ్డలదేవి, మీ రాబంతులలో వడ్డించండి. అమ్మవ్వా, దోసెఁడు పట్టుము. సకళవ్వా, గ్రుక్కు మిటకరింపకుము, శోళసి బసవమ్మా, ఇంకఁ గొంచెము పుచ్చుకో. హల్లవ్వా,అంత హాబ మెందుకు? నెమ్మదిగా త్రాగు. పురాతవ్వా, నీవీ బంతిలో కూర్చో.

మాచయ్య:—అమ్మయ్య! కడుపు నిండింది!!

గుడ్డలదేవి:—ఒసేవు దుగ్గళా, ఒడ్డాణం సవరించుకో.

బస:—బంతిలో పరాచకా లెందుకు? ఇంకఁ గొంచెం తేనా? ఏమిత్రేచుచున్నావోయి భోగయ్యా! మాచయ్యా, మన యేనుఁగులను గుఱ్ఱములను దెప్పింపుము. వానికి గూడ శివప్రసాదం పోయించాలి. చౌదంతిని, పంచాస్యబలుని, విద్రావణుని, దంతభగ్నుని మొదలైన గుఱ్ఱములను తెప్పించి వానికిఁగూడ విషము పోయించుము.

(అంతట జయదుందుభులు మ్రోఁగును.)

బిజ్జలుఁడు (బసవేశ్వరునకు నమస్కరించి)

భవలతాంచితదాత్ర పరమపవిత్ర శివగణస్తోత్ర విచిత్రచారిత్ర
ప్రోద్దళసూత్ర, మహోగ్రరుద్రపత్ర సద్గుణైకచ్ఛత్ర జంగమక్షేత్ర
అతివిషమామాత్ర దుఃఖాబ్ధివహిత్ర ప్రతివాదిజైత్ర సద్భక్తికళత్ర

బసవా! 'అరిర్మిత్రం, విషం పథ్య' మన్నమాట నీయందు నిజమైనది. బాపురే మా తండ్రి! బాపురే మాయయ్య! నల్లనో బసవయ్యా! నల్ల నంకేశ! గరళము మ్రింగుటకు భయపడి కాలకంఠుడు గళమునందే నిల్పుకొన్నాఁడు; దండనాయకుఁడు మ్రింగినాఁడు.

జగ:—అమృతముఁ ద్రావి దేవతలు నిద్రపోవు చున్నారు. విసము త్రావి బసవఁడు మేలుకని యున్నాఁడు.

అభయమే బసవయ్య యతికృపాంభోధి,
యభయమే బసవయ్య యద్భుతచరిత.

త్రిపురాంతకభట్టు:—బసవా! నీ శివభక్తు లంద అకుఁ గుశలమా? ఇందుకనియే దుర్జనులతోడి విరోధము మే లందురు.

జగ:—శమితవిషయోద్రిక్త షడ్వర్గ నిర్ముక్త సహజజంగమభక్త హరగణహితచ్ఛత్ర కలితకీర్తికళత్ర క్షురవిముఖనిజగాత్ర యఃక్షురస్తుతిపాత్ర శివఃరజ బసవ దండనాథ నమస్తే.

బిజ్జ:—జయజయ బసవ! శ్రీ మన్మహావృష భేంద్రావతార! నిసహచితవీర మాహేశ్వరాచార సార! ప్రమథగణాలంకారా! జగత్త్రియాధార! దేవా! బసవా! జయశివరంజన, జయభవభంజన, జయకరుణాకర, జయసురభీకర, జయ గతదూషణ, జయ ఋతభాషణ, జయగుణరాజిత, జయగణపూజిత జయజయ శ్రీ బసవ దండనాథ! నమస్తే.

జగ:—

శ్రీగురులింగతత్పరుఁడ శేవ జగన్నిధి శుద్ధశైవసం
యోగసుఖప్రపూర్తి వృషభోత్తమమూర్తి యుదాత్తకీర్తి ది
వ్యాగమమార్గవర్తి బసవయ్య కృపాంబుధి భక్తిసం
భోగములన్ ప్రసాదసుఖభోగములం గరుణించుఁగావుతన్.

కళిక:—

వెండియు త్రిభువనవినుతిస మేతుఁడు
మండితసద్గుణమహిమోపేతుఁడు
సురుచిరశివసమసుఖసంధానుఁడు
పరమపరాపర భరితజ్ఞానుఁడు
విదితానందాన్వితమనస్కుఁడు
సదమలవిపులనిశాలయశస్కుఁడు.

బిజ్జ:—

నీవు దయాపయోనిధివి నిన్ను నుతించిన గల్గు భక్తి నీ
చే వరవీరశైవరతి చేకుఱు నీకయి యిత్తు కబ్బముల్
నీవలనన్ గృతార్థత జనించును నీకు నమస్కరింతు నా
భావమునందు నుండి నను బాయకుమీ! బసవయ్య! వేఁడెదన్.

శివభక్తు లందఱు:—

అపిచ పురాతననూతన శివగణ పాదోదకపరిలసదభిషేకః
అపిచ విపల్లవపల్లవ జంగమలింగ సమర్చనవిధి...

మడివాలుమాచయ్య:—

యస్సంగీతనిధి ర్యమాహు రభవం యేనార్చితం మానృశం
యస్మై స్వస్తి యతః ప్రదీయ ముదభూత్ యద్వీరశైవవ్రతః,
యస్యాపాంగసహోదరీచ కరుణా యస్మిన్ మహత్వాదికం
స త్వం శ్రీణి జగంతి పాహి బసవామాత్యైకచూడామణే.

జగ:—

సాక్షాన్నంది వృషభాధిపాంశ బసవాధీశాయ తుభ్యంనమః.

ప్రభూ! ఈనాటినుండి నేను నీకు శిష్యుఁడను.

బిజ్జ:—బసవా! మన మిద్దరము రాజప్రాసాదముకడకుఁ బోవుదము.

(ఇద్దఱును బరిక్రమింతురు. తక్కిన యందఱు నిష్క్రమింతురు.)

బిజ్జ:—బసవా! నీవు సాక్షాన్నందీశ్వరుఁడవు. నీ మాహాత్మ్యము కనుఁగొనుటకు నేనెంతవాఁడను. పంచభూతములు నీవే. శివుఁడవు నీవ. బసవఁడవు నీవ. బోయల కింకఁ బ్రసాదము లేదు. శివభక్తులకే ప్రసాదము.

బస:—మహారాజా! నీదయవలన శివభక్తులు ప్రకాశించుచున్నారు. శివభక్తులు నిర్భయులై నిటలనేత్రుని వడిదుడుకులు లేకుండ సమారాధించుటకు నీయవ్యాజకరుణ కారణము.

బిజ్జ:—బసవేశ్వరా! నారాజ్యమున శివభక్తుల కెదురు లేదు. నాసర్వసంపదలు మీశివభక్తులవి. ఏనుఁగులో, గుఱ్ఱములో, మాడలో, మాడువులో, వారి యిష్టము వచ్చినప్పు డిష్టమువచ్చినట్లు వాడుకొనవచ్చును.

బస:— మహారాజా! మీయౌదార్యమునకు మీ శివభక్తభక్తిపరాయణత్వమునకు నేను నీదాసుఁడ నైనాను. నన్ను యథేచ్ఛముగా నీవుపయోగించుకొనవచ్చును.

బిజ్జ:—బసవేశ్వరా! నీమహత్తు సామాన్యమా!

తెరలుగాఁ దెరల నాలెఁబగాలి యుష్ణాని
యెడలించి ఝుంఝు సృష్టింపఁగలవు
కొనగోరఁ జిదిమి శంభునిచేతిను మ్మెన
నాటినట్లుగ శత్రు నణుకఁగలవు
కనుబొమ్మ ముడివేసి కాలకూటము హాల
హలము జృంభణముల నార్పఁగలవు.
కరుణఁ జూచి యపాంగకలితనీహారవా
హినితరంగములు ప్రవహింపఁగలవు.

ఒకటి నీచేతనై మఱియొకటి కాదొ
యొకఁడు నీపై ధరిత్రి నింకొకఁడు కావొ
నీకరుణ గల్గెనేనిఁ దృణీకరింతు
నార్తిగరోర్వన్మదుల మకుటాధిపతుల.

బస:—మహారాజా! కాలకూటము త్రాగుట శివప్రసాదమగుటచేత. మేము శివభక్తుల మగుటచేత శివప్రసాదమనుభక్తితోఁ ద్రావితిమి. నాయొద్ద మహత్త్వ లుండి కాదు. మీరుగూడ శివభక్తులైనచో మీరు గూడఁ గాలకూట మారగించెడివారే. శివునకు నైవేద్యమిడిన కాలకూటమైనను శివభక్తు లారగింతురనుటకు, శివప్రసాదార్హత యితరులకు లేదనుటకుఁ గాలకూటము త్రాగితిమి గాని యిది మహత్త్వ ప్రకటించుటకుఁ గాదు. ఇందుమహత్త్వమియును లేదు.

బిజ్జ:—బసవేశ్వరా, మీ రట్లే యందురు. శివభక్తులను రక్షించుటకు మీ రేపనినైనఁ జేసెదరు.

బస:—మహారాజా, శివభక్తుల నొక రేలరక్షింప వలయును? శివభక్తులే యందఱను రక్షింతురు. వారు శివునినైన రక్షింతురు.

బిజ్జ:—శివభక్తు లెవరినైన రక్షింతురు. నిజమే. మీరు శివభక్తాగ్రేసరులు.

బస:— మహారాజా! మడివాలు మాచయ్య, గొడగూచి, సంబినైనారు మొదలైన మహా భక్తుల ముందు నేనెంతవాఁడను? మీరిచ్చిన యమాత్యపదముచే శివభక్తులలో నధముఁడనైన నే నధికుఁడనువలెఁ గన్పించుచున్నాను.

బిజ్జ:—బసవా! నాకుఁ గన్నుకప్పకుము.

కం. నిను నమ్మి సర్వమసుధా,
రుణి నేలఁగ నెంతు బసవరో! దయఁగనుమా
మనసున ననిచినభక్తిని,
చెనఁటియైనఁగూడ వానిఁ జెఱుపరు భక్తుల్.

బస:—మహారాజా! తమరితో నిదివఱకే విన్నవించుకొంటిని. (నేను) శివభక్తుఁడ నగుటచేత యుద్ధములు గెల్పించుటయు రాజ్యముల నేలించుటయు శివభక్తివలనఁ జేయరానిపని యని.

కం. నా నీతిఖడ్గమున ధా
త్రీనాయక! సర్వరిపులఁ ద్రెంచెదఁ ద్రుంతుఁ
బ్రాణములు సమర్పించెద
కానీ మఱియొండు నేయఁగాదు నరేంద్రా!

బిజ్జ:—బసవా! నీ వింతకుచ్చితుఁడ వనుకో లేదు. కాలకూటవిషము పదివేలమందిచేతఁ ద్రావించిన నీ కేది చేతఁగాదు. కాలచుర్యులు సర్వధాత్రీమండలమున కేకచ్ఛత్రాధిపతులగుట నీకిష్టము లేదుకాఁబోలు. బిజ్జలునిచేతనైనచో సర్వధాత్రి యేలింపరాదు. ఈ రాజ్యమంతయు నీవే పట్టమ్ము కట్టుకొనుము. నీకుఁ గొడుకున్నాఁడు. వానిచేత నేలింపుము. బసవా! నీ కథయంతయు ద్రోణాచార్యునికథవలె నున్నది. ఆయనయు నిట్లే. సర్వధాత్రీతల మశ్వత్థామచేత నేలింపవలెనని దుర్యోధనుని యుద్ధములో మోసగించినాఁడు.

బస:—మహారాజా! నా గూఢార్థ్యమును మీ రన్యథాభావించుచున్నారు.

బిజ్జ:—నీవు సత్యశీలుఁడ వందు రిదియేనా? నాతో నీ వబద్ధములు తప్ప మఱియొకటి చెప్పలేదు. జగదేవుఁడు నీ మూలమున నోడిపోయినాఁడు. విసము త్రాగినవాఁడవు, త్రాగించినవాఁడవు. శత్రుసైన్యములు గెలువకుండఁ జేయలేవా? సర్వధారుణి నొక్క గొడుగు క్రిందికిఁ దేలేవా?

బస:—అది నిజముగా నాచేతఁ గాదు.

బిజ్జ:—నీచేతఁ గానిచో సరే, పొమ్ము. బసవా! నేను దైలపదేవుని సంహరించినట్లు నీవు నన్ను సంహరింపించుము. రాజ్య మంతయుఁ బట్టము గట్టించుకొమ్ము. బ్రాహ్మణసామ్రాజ్యము నిర్మింపుము. బసవా! వర్ణభేదములు లేవందువుకాని నీవు వీరశైవపుఁ దొడుగుతొడుగుకొనిన బ్రాహ్మణుఁడవు. కులభేదము లక్కఱ లేదనువారెల్లరు నింతే. వా రన్యప్రయోజనార్థులై యిట్టివేసములు వేయుదురు.

బస:—మహారాజా! వృథా, యీ కఠోర వాక్కు లెందులకు? నీవు నా శక్తి సామర్థ్యము లెఱుఁగక నేను దేవుఁడనని పొరపడుచున్నావు.

బిజ్జ:—బసవా! నన్ను హత్యచేయించిన తరువాత నీ రాజ్యము నీవు పట్టము కట్టుకొమ్ము. నీకొడుకుచేత సర్వభారతక్షోణియు నేలింపుము. నే నీ సంగతి మరలఁ బ్రస్తావనచేయను లే.

(నిష్క్రమించును.)

బస:—శివా! శివ!

(తెర.)

జగ:—అమృతముఁ ద్రావి దేవతలు నిద్రపోవు చున్నారు. విసము త్రావి బసవఁడు మేలుకని యున్నాఁడు.

అభయమే బసవయ్య యతికృపాంభోధి,
యభయమే బసవయ్య యద్భుతచరిత.

త్రిపురాంతకభట్టు:—బసవా! నీ శివభక్తు లంద ఱకుఁ గుశలమా? ఇందుకనియే దుర్జనులతోఁడి విరోధము మే లందురు.

జగ:—శమితవిషయోద్రిక్త షడ్వర్గ నిర్ముక్త సహజజంగమభక్త హరగణహితచ్ఛత్ర కలితకీర్తికళత్ర క్షురవిముఖనిజగాత్ర యతిశరస్తుతిపాత్ర శివాఽరజ బసవ దండనాథ నమస్తే.

బిజ్జ:—జయజయ బసవ! శ్రీ మన్మహావృషభేంద్రాపరావతార! నిసహచితవీర మాహేశ్వరాచార సార! ప్రమథగణాలంకారా! జగత్త్రియాధార! దేవా! బసవా! జయశివరంజన, జయభవభంజన, జయకరుణాకర, జయసురభీకర, జయ గతదూషణ, జయ ఋతభాషణ, జయగుణరాజిత, జయగణపూజిత జయజయ శ్రీ బసవ దండనాథ! నమస్తే.

జగ:—

శ్రీగురులింగతత్పరుఁడ శేషజగన్నిధి శుద్ధశైవసం
యోగసుఖప్రపూర్తి వృషభోత్తమమూర్తి యుదాత్తకీర్తి ది
వ్యాగమమార్గవర్తి బసవయ్య కృపాంబుధి భక్తిసం
భోగములన్ బ్రసాదసుఖభోగములం గరుణించుఁగావుతన్.

కళిక:—

వెంపియు త్రిభువనవినుతిస మేతుఁడు
మండితసద్గుణమహిమోపేతుఁడు
సురుచిరశివసమసుఖసంధానుఁడు
పరమపరాపర భరితజ్ఞానుఁడు
విదితానందాన్వితమనస్కుఁడు
సదమలవిపులవిశాలయశస్కుఁడు.

బిజ్జ:—

నీవు దయాపయోనిధివి నిమ్ము నుతించిన గల్గు భక్తి నీ
చే వరవీరశైవరతి చేకుఱు నీకయి యిత్తు కబ్బముల్
నీవలనన్ గృతార్థత జనించును నీకు నమస్కరింతు నా
భావమునందు నుండి నను బాయకుమీ! బసవయ్య! వేఁడెదన్.

శివభక్తు లందఱు:—

అపిచ పురాతననూతన శివగణ పాదోదకపరిలసదభిషేకః
అపిచ విపల్లవపల్లవ జంగమలింగ సమర్చనవిధి వివేకః

మడివాలుమాచయ్య:—

యస్సంగీతనిధి ర్యమాహు రభవం యేనార్చితం నూన్యశం
యస్మై స్వస్తి యతః స్తదీయ ముదభూత్ యద్వీరశైవవ్రతమ్,
యస్యాపాంగసహోదరీచ కరుణా యస్మిన్ మహత్వాదికం
స త్వం త్రీణి జగంతి పాహి బసవామాత్యైశచూడామణే.

జగ:—

సాక్షాన్నిత్రి వృషభాధిపాంశ బసవాధీశాయ తుభ్యంనమః.

ప్రభూ! ఈనాటినుండి నేను నీకు శిష్యుఁడను.

బిజ్జ:—బసవా! మన మిక్వ్వరము రాజప్రాసాదముకడకుఁ బోవుదము.

(ఇద్దఱును బరిక్రమింతురు. తక్కిన యందఱు నిష్క్రమింతురు.)

బిజ్జ:—బసవా! నీవు సాక్షాన్నందీశ్వరుఁడవు. నీ మాహాత్మ్యము కనుఁగొనుటకు నేనెంతవాఁడను. పంచభూతములు నీవే. శివుఁడవు నీవ. బసవఁడవు నీవ. బోయలకింకఁ బ్రసాదము లేదు. శివభక్తులకే ప్రసాదము.

బస:—మహారాజా! నీదయవలన శివభక్తులు ప్రకాశించుచున్నారు. శివభక్తులు నిర్భయులై నిటలనేత్రుని వడిదుడుకులు లేకుండ సమారాధించుటకు నీయవ్యాజకరుణ కారణము.

బిజ్జ:—బసవేశ్వరా! నారాజ్యమున శివభక్తుల కెదురులేదు. నాసర్వసంపదలు మీశివభక్తులవి. ఏనుఁగులో, గుఱ్ఱములో, మాడలో, మాడువులో, వారి యిష్టము వచ్చినప్పు డిష్టమువచ్చినట్లు వాడుకొనవచ్చును.

బస:— మహారాజా! మీయౌదార్యమునకు మీ శివభక్తభక్తిపరాయణత్వమునకు నేను నీదాసుఁడనై నాను. నన్ను యథేచ్ఛముగా నీవుపయోగించుకొనవచ్చును.

బిజ్జ:—బసవేశ్వరా! నీమహత్తు సామాన్యమా!

తెరలుగాఁ దెరల నాతెఱగాలి యుష్మాని
యొడలించి ఝుంఝు సృష్టింపఁగలవు
కొనగోరఁ జిదిమి శంభునిచేతిను మ్మొన
నాటినట్లుగ శత్రు నణుకఁగలవు
కనుబొమ్మ ముడివేసి కాలకూటము హాల
హలము జృంభణముల నార్పఁగలవు.
కరుణఁ జూచి యపాంగకలితనీహారవా
హినితండములు ప్రవహింపఁగలవు.

ఒకటి నీచేతనై మఱియొకటి కాదొ
యొక్కఁడు నీపై ధరిత్రి నింకొక్కఁడు కావొ
నీకరుణ గల్గెనేనిఁ దృణీకరింతు
నా త్తగర్వోన్మదుల మకుటాధిపతుల.

బస:—మహారాజా! కాలకూటము త్రాగుట శివప్రసాదమగుటచేత. మేము శివభక్తుల మగుటచేత శివప్రసాదమనుభక్తితోఁ ద్రావితిమి. నాయొద్ద మహత్తు లుండి కాదు. మీరుగూడ శివభక్తులైనచో మీరు గూడఁ గాలకూట మారగించెడివారే. శివునకు నైవేద్యమిడిన కాలకూటమైనను శివభక్తు లారగింతురనుటకు, శివప్రసాదార్హత యితరులకు లేదనుటకుఁ గాలకూటము త్రాగితిమి గాని యిది మహత్తు ప్రకటించుటకుఁ గాదు. ఇందుమహత్తేమియును లేదు.

బిజ్జ:—బసవేశ్వరా, మీ రట్లే యందురు. శివభక్తులను రక్షించుటకు మీ రేపనినైనఁ జేసెదరు.

బస:—మహారాజా, శివభక్తుల నొక రేలరక్షింపవలయును? శివభక్తులే యందఱను రక్షింతురు. వారు శివునినైన రక్షింతురు.

బిజ్జ:—శివభక్తు లెవరినైన రక్షింతురు. నిజమే. మీరు శివభక్తాగ్రేసరులు.

బస:— మహారాజా! మడివాలు మాచయ్య, గొడగూచి, సంబినైనారు మొదలైన మహాభక్తుల ముందు నేనెంతవాఁడను? మీరిచ్చిన యమాత్యపదముచే శివభక్తులలో నధముఁడనైననే నధికుఁడనువలెఁ గన్పించుచున్నాను.

బిజ్జ: —బసవా! నాకుఁ గన్నుకప్పకుము.

కం. నిను నమ్మి సర్వవసుధా,
రుణి నేలఁగ నెంతు బసవరో! దయఁగనుమా
మనసున ననిచినభక్తిని,
చెనఁటియైనఁగూడ వానిఁ జెఱుపరు భక్తుల్.

బస:—మహారాజా! తమరితో నిదివఱకే విన్నవించుకొంటిని. (నేను) శివభక్తుఁడ నగుటచేత యుద్ధములు గెల్పించుటయు రాజ్యముల నేలించుటయు శివభక్తివలనఁ జేయరానిపని యని.

కం. నా నీతిఖడ్గమున ధా
త్రీనాయక! సర్వరిపులఁ ద్రెంచెదఁ ద్రుంతున్
ప్రాణములు సమర్పించెద
కానీ మఱియొండు నేయఁగాదు నరేంద్రా!

బిజ్జ:—బసవా! నీ వింతకుచ్చితుఁడ వనుకో లేదు. కాలకూటవిషము పదివేలమందిచేతఁ ద్రావించిన నీ కేది చేతఁగాదు. కాలచుర్యులు సర్వధాత్రీమండలమున కేకచ్ఛత్రాధిపతులగుట నీకిష్టము లేదుకాఁబోలు. బిజ్జలునిచేతనైనచో సర్వధాత్రి యేలింపరాదు. ఈ రాజ్యమంతయు నీవే పట్టమ్ము కట్టుకొనుము. నీకుఁ గొడుకున్నాఁడు. వానిచేత నేలింపుము. బసవా! నీ కథయంతయు ద్రోణాచార్యునికథవలె నున్నది. ఆయన యు నిట్లే. సర్వధాత్రీతల మశ్వత్థామచేత నేలింపవలెనని దుర్యోధనుని యుద్ధములో మోసగించినాఁడు.

బస:—మహారాజా! నా యాథార్థ్యమును మీ రన్యథాభావించుచున్నారు.

బిజ్జ:—నీవు సత్యశీలుఁడ వందు రిదియేనా? నాతో నీ వబద్ధములు తప్ప మఱియొకటి చెప్పలేదు. జగదేవుఁడు నీ మూలమున నోడిపోయినాఁడు. విసము త్రాగినవాఁడవు, త్రాగించినవాఁడవు. శత్రుసైన్యములు గెలువకుండఁ జేయలేవా? సర్వధారుణి నొక్క గొడుగు క్రిందికిఁ దేలేవా?

బస:—అది నిజముగా నాచేతఁ గాదు.

బిజ్జ:—నీచేతఁ గానిచో సరే, పొమ్ము. బసవా! నేను దైలపదేవుని సంహరించినట్లు నీవు నన్ను సంహరింపించుము. రాజ్య మంతయుఁ బట్టము గట్టించుకొమ్ము. బ్రాహ్మణసామ్రాజ్యము నిర్మింపుము. బసవా! వర్ణభేదములు లేవందువుకాని నీవు వీరశైవపుఁ దొడుగుతొడుగుకొనిన బ్రాహ్మణుఁడవు. కులభేదము లక్కఱ లేదనువారెల్లరు నింతే. వా రన్యప్రయోజనార్థులై యిట్టివేసములు వేయుదురు.

బస:—మహారాజా! వృథా, యీ కఠోర వాక్కు లెందులకు? నీవు నా శక్తి సామర్థ్యము లెఱుఁగక నేను దేవుఁడనని పొరపడుచున్నావు.

బిజ్జ:—బసవా! నన్ను హత్యచేయించిన తరువాత నీ రాజ్యము నీవు పట్టము కట్టుకొమ్ము. నీకొడుకుచేత సర్వభారతక్షోణియు నేలింపుము. నే నీ సంగతి మరలఁ బ్రస్తావనచేయనులే.

(నిష్క్రమించును.)

బస:—శివా! శివ!

(తెర.)

# కవిత్వతత్త్వవిచారము - అలంకారశాస్త్రము

★

వెంకటేశ్వరులు

కవిత్వతత్త్వవిచారమునకు పింగళిసూరనా ర్యునికవిత్వమును విమర్శించుట ముఖ్యోద్దేశ్య ము. నాంతరీయకమైన కవిత్వసామాన్యమార్గ ముగూడ క్రొంతవర కుపోద్ఘాతరూపమున నిందుఁ జూపఁబడినది.

కవితామార్గములను జూపునది యలంకార శాస్త్రము. అయ్యది తొలుదొల్తఁ బ్రాచీనా చార్యులచే సంస్కృతమున విశేషముగ విపు లముగ రచింపఁబడినది. పిమ్మట తెలుఁగునఁ గూడ నలంకారగ్రంథములు రచింపఁబడినవి. అయిన నిప్పుడిప్పుడు సంస్కృతముననుండి యాంధ్రీకరింపఁబడి వ్యాపింపనున్నవిగాక యింతవున్ను తెలుఁగున రచింపఁబడ్డయలం కార గ్రంథములలోఁ గావ్యమార్గము సంస్కృ తమున నున్నంతవిశేషముగను విపులముగను నిరూపింపఁబడలేదు.

అసమగ్ర మైనంతమాత్రమున విరుద్ధ మని చెప్పుట యసమంజసము.

ప్రాచీనాలంకారికులచే సంస్కృతమున విశేషముగ నిరూపింపఁబడి మూలరూపమై కావ్యమార్గము వెలయుచునేయున్నది. ఆమా ర్గమున నీకవిత్వతత్త్వవిచారములోని కవిత్వ సామాన్యమార్గ మంతర్భూతమే. చూడుఁడు:—

## ౧. భావనాశక్తి

కవిత్వతత్త్వవిచారము— "భావనా శక్తి యనఁగా విషయముల మనసులోఁ బ్రతిబిం బించునట్లు చేయుసామర్థ్యము."

"వ్యాకరణము యతిప్రాసలు అన్నియుఁ దప్పక కుదిరినను భావనాశక్తి లేనియెడల నట్టిపాండిత్యము. జీవములేని యాకారముబలె జడంబుగఁ గాన్పించును."

"జన్మముచేతన కవి గావలయుఁగాని పఠ నము, అభ్యాసము నివి యుండినమాత్రము చాలదు."

అలంకారశాస్త్రము—"శక్తిః కవిత్వబీజ రూపః సంస్కారవిశేషః యాం వినా కావ్యం నప్రసరేత్, ప్రసృతంవా ఉపహసనీ యం స్యాత్." (కావ్యప్రకాశః-ఉ, ౧.)

సూ. "కవిత్వబీజం ప్రతిభానమ్."
కవిత్వస్యబీజం కవిత్వబీజం జన్మాంతరాగత సంస్కారవిశేషః కశ్చిత్, యస్మాద్వినా కావ్యం ననిష్పద్యతే నిష్పన్నంవాప హాస్యాయతనం స్యాత్."

— కావ్యాలంకారసూత్రములు.
(అ. ౧, అధి. 3.)

" శక్తిః కవిత్వబీజం హి
ప్రాక్తనీ సంస్క్రియా మతా,
యయా వినా నప్రసరే
త్కావ్యం శిక్షావతా మపి.

ఇతి దండినాపి కేవలవ్యుత్పత్తిమతః కావ్యం ప్రత్యుక్తం."

"ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా,
తదనుప్రాణనా జ్జీవే ద్రచనానిపుణః కవిః.
సతి వక్తరి సత్యర్థే సతి శబ్దానుశాసనే,
అస్తి తన్నవినా యేన పరిస్రవతి వాఙ్మధు."

(శ్రీనివాసాచార్యకృత శాకుంతల వ్యాఖ్యానము, అం. ౧.)

"సరస్వతీ స్వాదు తదర్థవస్తు
నిష్యందమానా మహతాం కవీనామ్,
అలోకసామాన్య మభివ్యనక్తి
ప్రతిస్ఫురంతం ప్రతిభావిశేషమ్."

(ధ్వన్యాలోకము-౧. ఉద్యోతము.)

## ౨. భావతైక్ష్ణ్యము

కవిత్వతత్త్వ విచారము— "...భావనా శక్తి నధికంబుగ విజృంభింపజేయునవి భావ ములు."

"ఏవృత్తాంతమునైనఁ జూచునట్లు వర్ణింప వలయునన్న దానియొక్క స్థితిగతులను-అందలి పాత్రముల సుఖదుఃఖములను రోమరోమము నకును దానే మనఃపూర్వకముగ ననుభవించినం దప్ప తద్రూపముగ నభినయింప నెవరికిని దరముగాదు."

అలంకారశాస్త్రము—"సన్నిహిత సహ చరీ విరహ కాతర క్రౌంచాక్రందజనితః శోకఏవ శ్లోకతయా పరిణతః."

(ధ్వన్యాలోకము, ఉద్యో. ౧)

"నాయకస్య కవేః శ్రోతుః సమానోఽను భవ స్తతః."

(లోచనము, ఉద్యో. ౧)

"యత్తు సర్వరసా న్భావయన్ భావకశ్చ కవే రంతర్గతం భావం భావయన్ భావశ్చేతి తదభినయకావ్యయోః ప్రవర్తమానస్య భావ శబ్దస్య ప్రవృత్తినిమిత్తకథనం."

(దశరూపకము, ప్రకా. ౪)

" శృంగారీ చేత్కవిః కావ్యే జాతం రస మయం జగత్."

(ధ్వన్యాలోకము, ఉద్యో. 3)

"శృంగారీతి శృంగారోక్త విభావానుభావ వ్యభిచారి చర్వణారూప ప్రతీతిమయః నతు స్త్రీవ్యసనీతి మంతవ్యం." (లోచనమ్.)

## 3. అలంకారము లనావశ్యకములు

కవిత్వతత్త్వవిచారము—"పోలికలను స్థా పించుట సొగసైనకార్యమేయైనను గవితకు ఖండితముగా నుండవలసినలక్షణము గాదు."

"కావున కథాంశము సాక్షాత్తుగ సమీప మున నడచినట్లు భావనాశక్తిబలంబుచే స్ఫు రించెనేని దూరపుసంబంధముగల బలాత్కృ తాలంకారములకుఁ దావుండదు."

అలంకారశాస్త్రము— "రసానుగుణో విశేషోపనిబంధన మలంకారాంతరవిరహేఽపి చ్ఛాయాతిశయయోగిలక్ష్యే దృశ్యతే."

(ధ్వన్యాలోకము, ఉద్యో. ౪)

సూ : కావ్యశోభాయాః కర్తారో ధర్మా గుణాః.

సూ : తదతిశయహేతవ స్త్వలంకారాః.

సూ : పూర్వే నిత్యాః.

(కావ్యాలంకారసూత్రములు, అ.3, అధి. ౧)

"శబ్దార్థయో రస్థిరా యే
ధర్మాః శోభాతిశాయినః,

రసాదీ నుపకుర్వంతో
  ఽలంకారా స్తేఽంగదాదివత్."
(సాహిత్యదర్పణము, పరి. ౧౦.)

కవిత్వతత్త్వవిచారము— "అలంకారము లంగూర్చిన ముఖ్యపద్ధతు లెవ్వియన అయ్యవి ప్రయత్నములేకయ వచ్చినంత సహజముగ నుండుట. కథలోని స్త్రీపురుషులు మాటాడునపుడు పాత్రోచితములైన కొన్నింటిమాత్ర ముపయోగించుట. కవియే వర్ణించునపుడో కింతయెక్కువగ నలంకారములు వాడినను దోషములేదు."

అలంకారశాస్త్రము—
"రసాక్షిప్తతయా యస్య
  బంధః శక్యక్రియో భవేత్,
అపృథగ్యత్ననిర్వర్త్యః
  సోఽలంకారో ధ్వనౌ మతః.
ధ్వన్యాత్మభూతే శృంగారే
  సమీక్ష్య వినివేశితః,
రూపకాది రలంకార
  వర్గ ఏతి యథార్థతామ్."
(ధ్వన్యాలోకము, ఉద్యో. ౨.)

## ౪. సాదృశ్యతత్త్వము

కవిత్వతత్త్వవిచారము— "సామ్యము వర్ణనకు నుపకరణము; ప్రధానంబు గాదు."

ఈ విషయము 'అలంకారము లనావశ్యకములు' అనుదానిచేతనే గతార్థము.

## ౫. పాత్రరచనాతత్త్వములు

కవిత్వ తత్త్వ విచారము — "మఱియు పాత్రముల చరిత్రలను విస్తరించుటలో వర్ణనీయమైన పద్ధతి యేదనఁగా—స్త్రీపురుషులు గుణానుగుణమైన నడవడి గలవారయ్యును ప్రపంచాచారములయందుబలె కావ్యములందును గాలదేశవర్తమానములవలన నొక్కొక్కయెడ విరుద్ధమైన వర్తనము గలవారుగా నున్నట్లును ప్రదర్శించుట."

అలంకారశాస్త్రము— విరుద్ధములు కాని యవిరుద్ధములు కాని భావములైనను నాయకాది వర్తనము లైనను ప్రకృతరసభంజకములు కాఁగూడ దనియే యాలంకారికుల సిద్ధాంతము కాని విరుద్ధసన్నివేశము కూడ దని కాదు.

ప్రతిపక్షనాయకున కుత్కర్షను వర్ణించి ప్రధాననాయకునివలనఁ బరాజయమునుగూడ వర్ణింపవచ్చును.

"అథవా ప్రతిపక్షస్య
  వర్ణయిత్వా గుణాన్ బహూన్,
తజ్జయా న్నాయకోత్కర్ష
  వర్ణనంచ మతం క్వచిత్."
(ప్రతాపరుద్రీయము, నాయకప్రకరణము.)

ఇట్లే నాయకుఁడు పూజ్యులయెడ నమ్రుఁడై శత్రువులయెడ నుద్ధతుఁడు గావచ్చును. యౌవనమునఁ గాంతాసక్తుఁడై వార్ధక్యమున విరాగి గావచ్చును. దాతయై శత్రుధనాపహర్త గావచ్చును.

ఇట్లే భావములకుఁగూడ నౌచిత్య మున్నయెడల విరుద్ధావిరుద్ధసన్నివేశముఁ జేయవచ్చును.

"విరుద్ధై రవిరుద్ధైర్వా
  భావై ర్విచ్ఛిద్యతే న యః,
ఆత్మభావం నయ త్యన్యాన్
  స స్థాయీ లవణాకరః."
(దశరూపకము, ప్రకా. ౪)

కవిత్వతత్త్వ విచారము—"బింబములకుఁ బ్రతిబింబముల నుత్పాదించుట కవి చేయవలసిన పనిగాదు; మరి ఫొటోగ్రాఫరుది. తన మనస్సునకుఁ దగినట్టు తనకన్నులకు గోచరించునట్లును వ్రాయవలయునే కాని యింకొకరికో తోఁచినట్లు దా వ్రాయఁజూచుట మూఢమతము."

అలంకారశాస్త్రము—
"సంవాదో హ్యన్యసాదృశ్యం
  తత్పునః ప్రతిబింబవత్,
ఆలేఖ్యాకారవత్తుల్య,
  దేహివచ్చ శరీరిణామ్.
తత్ర పూర్వ మనన్యాత్మ
  తుచ్ఛాత్మ తదనంతరమ్,
తృతీయంతు ప్రసిద్ధాత్మ
  నాన్యసామ్యం త్యజే త్కవిః."
(ధ్వన్యాలోకము, ఉద్యో. ౪)

కావ్యమునకు నూతనత్వ ముండవలె ననుటలో ధ్వన్యాలోకమునందలి చతుర్థోద్యోతమంతయు సాక్షి.

## ౬. మిశ్రచరిత్రములు గాని పాత్రములు ప్రకృతివిరుద్ధములు

కవిత్వతత్త్వవిచారము - "పాత్రముల చరిత్రములు శుద్ధముగ మంచివిగానో శుద్ధముగఁ జెడ్డవిగానో యుండునట్లు దీర్చుట శిల్పదోషములలో నొకటి. ఏలోపమును లేని స్త్రీపురుషు లుండరు. మఱి కేవలము దుష్టులైన మానవులును గంటికిఁ గానరారు. మనుష్యప్రవృత్తి మిశ్రమైనది."

కొందఱిలో గుణాధిక్య మున్నను కొందఱిలో దోషాధిక్య మున్నను మనుష్య ప్రవృత్తి మిశ్రమనుట వాస్తవమే.

సాకల్యవర్ణనావశ్యకత ప్రకృతిశాస్త్రమునం దుండుట న్యాయముగాని రసప్రధానమైన కావ్యమునందుఁ గాదుగదా! అట్టియెడ కావ్యమునందు వర్ణింపఁబడు మిశ్రప్రవృత్తి యెట్టిదనవచ్చును?

నాయికా ప్రవృత్తిని వర్ణించుచో నేదు శ్చేష్టలోగుండ గలవని వర్ణింపవచ్చునా? అట్లు వర్ణించుచో నాయకుని యభిలషణీయజ్ఞానము సాఫల్యము నొందునా? ఏమానవుఁడైన నెంతసృష్టిధర్మముఁ దెలిసినను దన కభిలషణీయమైన నాయిక సర్వోత్కృష్ట చరిత్రగలదిగను, సర్వోత్కృష్ట సౌందర్యము గలదిగను ఉండవలయునని కోరునేకాని యేదుశ్చేష్టలో గలదిగాఁగాని యేయసుందరరూపమో గలదిగాఁగాని యుండవలెనని కోరునా? ఏశిల్పులైన తమ ప్రతిమలకుఁ గొన్నిదోషములను (వైకల్యములను) సంక్రమింపఁ జేయఁజూతురా?

కనుక నట్టిరసభంజకమిశ్రప్రవృత్తి యవర్ణ్యమే.

... ...

రసభంజకము గాని మిశ్రప్రవృత్తియే యన్నచో సర్వాంగీకృతమే. ఆలంకారికులు కాదనరు.

## ౭. వర్ణనలకన్న అంగాంగసాంగత్యము కావ్యముల శ్రేష్ఠము

కవిత్వతత్త్వవిచారము—"వర్ణనములకన్న ముఖ్యమైనవిషయ మేదనఁగా కావ్యము నందలి యంగాంగములకుం గలకలయిక. పొత్తు పొసఁగనివర్ణనలు రసమునకుం బ్రతికూలములు."

అలంకారశాస్త్రము—

"వాచ్యానాం వాచకానాంచ
యదౌచిత్యేన యోజనమ్,
రసాదివిషయేనైత
త్కర్మ ముఖ్యం మహాకవేః."
(ధ్వన్యాలోకము, ఉద్యో. ౩)

"అకాండే ప్రథనచ్ఛేదా
అంగస్యా ప్యతివిస్తృతిః,
అంగినో ఒననుసంధానం
ప్రకృతీనాం విపర్యయః.
అనంగ స్యాభిధానంచ
రసే దోషాః స్యు రీదృశాః."
(కావ్యప్రకాశ, ఉల్లా ౭.)

ఈ మొదలుగాఁగల యాలంకారికుల రసదోషములన్నియు పొత్తుపొసగుటకొఱకే. ఇంతియగాక పొత్తుపొసగని యలంకారముగాని సంధ్యంగముగాని మఱేదియు నుండఁగూడదనియే వారిసిద్ధాంతము.

"నగరార్ణవ శైలర్తు
చంద్రార్కోదయవర్ణనమ్,
... ... ...
ఏషా మష్టాదశానాం యైః
కైశ్చి దూన మపీష్యతే."
(ప్రతాపరుద్రీయము, కావ్యప్రకరణము.)

ఈ పదునెనిమిదియే కాదు; ఇంకను వర్ణింపవచ్చును.

"సంధ్యాసూర్యేందురజనీ
ప్రదోష ధ్వాంతవాసరాః,
... ... ...
వర్ణనీయా యథాయోగం
సాంగోపాంగా అమీ ఇహ."
(సాహిత్యదర్పణము, పరి. ౬.)

ఇంకను విశేషములు దీని వివృతిపూర్తి యందుఁ జూపఁబడినవి.

ఇచ్చట మహాకావ్యమును జేయుటకు సమర్థుఁడైన కవియొక్క అశక్తతను, అనవకాశమును ఉద్దేశించి 'ఊనం' 'యథాయోగం' అను పదములు ప్రయోగించియుండ రనుట స్పష్టము. ఇక రసపర్యాలోచన చేతనేగదా!

అట్టియెడ వారి యష్టాదశవర్ణనలు రసపర్యాలోచనచే బొత్తు పొసఁగియుండునవియే యని సిద్ధము.

ఈ విషయమును, వర్ణన ప్రకారములను విశేషముగఁ జూపిన దర్పణపువివృతి పూర్తికారుఁడు.

"ఛిద్రూపై శ్చింత్యమానానాం,
భవ త్యేషా మనంతతా."

అని స్పష్టపఱచియున్నాఁడు.

## ౮. స్వభావవర్ణన యనుటకు నిర్వచనము

కవిత్వతత్త్వ విచారము—"ప్రకృతిసమ్మతమైన వర్ణనము అనుమాటకు నిర్వచనము ఉన్నదియన్నట్టు చెప్పటగాదు......... వస్తువుల నిజస్థితి నిర్దేశించుట శాస్త్రముల యొప్పితము. కళలయొక్క కాంక్ష యది గాదు. ఎట్లన కళలలోఁ బ్రధానమైన పురుషార్థము రసము. రసము భావమునకు సంబంధించినది. భావముల పరమైన దృష్టితో గణించి వర్ణించుటయే కళయందు శ్లాఘనీయమైన పద్ధతి."

అలంకారశాస్త్రము—

"స్వభావోక్తి రసౌ చారు,
యథావద్వస్తువర్ణనమ్."

(ప్రతాపరుద్రీయము, అలంకార ప్రకరణము.)

స్వభావేతి. యత్ర చారు సమ్యగ్గ్రామ్యం యథావ దన్యూనాతిరేకేణ వస్తునోవర్ణక్రియా సంస్థానరూపస్య వస్తుస్వభావస్య కవిప్రతిభైకగోచరస్య వర్ణన మసౌ స్వభావోక్తిః."

వ్యాఖ్యానము—

"స్వభావోక్తి ర్దురూహార్థ స్వక్రియారూప వర్ణనమ్."

దురూహయోః కవిమాత్రవేద్యయోః
(సాహిత్యదర్పణము, పరి. ౧౦.)

"తస్యాశ్చాలంకారత్వ మసాధారణపదార్థస్వరూపస్య వనాత్."
(కావ్యాలంకారసంగ్రహము, వర్గ. ౫)

కవిత్వతత్త్వ విచారము—"ఒకే వస్తువు మానవుల ప్రకృతులంబట్టి యనేకుల కనేకభావముల కాస్పదము గావచ్చును.....భారతములోని దుర్యోధనునిగూర్చి విచారింపుఁడు. ధృతరాష్ట్రుఁడు, అనుజులు, సచివులైనకర్ణాదులు, ప్రజలు, పాండవులు మొదలగు వివిధపక్షములవారిలో నొక్కొక్కరి కొక్కొక్కయవతారముగ నాతఁడు దోఁచలేదా?"

"కావున వస్తువు లనేకుల కనేకరీతులఁ దోఁచుననుమాట యొకటిమాత్రమే కాదు. ఒక్కనికే కాలదేశవర్తమానంబులంబట్టి యనేకవిధములఁ దోఁచుటయును స్వభావప్రభావమే."

అలంకారశాస్త్రము—

"గజత్రాతేతి వృద్ధాభిః
శ్రీకాంత ఇతి యౌవతైః,
యథాస్థితశ్చ బాలాభిః
దృష్టః శౌరిః సకౌతుకం."
—(చిత్రమీమాంస.)

"తుషారా స్తాపసవ్రాతే
తామసేషుచ తాపినః,
దృగంతా స్తాడకాశత్రో
ర్భ్యాయాసు ర్మమ భూళయే."
—(రసగంగాధరం.)

అని యిట్లుల్లేఖాలంకారమున కుదాహరణము నిచ్చిన యాలంకారికుల కిమాఱు సుదితము.

## ౯. సర్వలక్షణసమేతములుగా వస్తువుల నిర్దేశించుట తప్పు

కవిత్వతత్త్వవిచారము—"భావముల ప్రసిద్ధి ననుసరించి విక్షేపముందాల్చినగుణముల నధికముగను సంక్షేపముఁబూనినవానిని కొంచెగను వర్ణించి నిక్షిప్తములైనవానిం జెప్పకవిడుచుటయ కళకు శోభ."

అట్లు కానియెడల నాలంకారికులు చూపినదీప్తి, విభావాదిక్లిష్ట కల్పన మొదలగు రసదోషములలో నంతర్భూతమగును.

## ౧౦. భావనాశక్తియొక్క లీలలు

కవిత్వ తత్త్వవిచారము— “మఱియు కొన్నియెడలఁ బ్రకృతికి మీరిన వర్ణనలం జొనిపినను వికారము దోఁపకుండుటయే కాదు. అస్వాభావిక మనియు సామాన్యముగ నెవరికిఁ దట్టవు. ఉదాహరణము- హితోపదేశము.”

“మఱియు అస్త్రములు, కామరూపధారణము, భూతబేతాళ వశీకరణము ఇత్యాది మహేంద్రజాలములు పుంఖానుపుంఖములుగ గ్రంథములనే కాదు తరతరములుగ తల్లిబిడ్డలు చెప్పుకొనెడు ఊఁకొడుకథలందును గానంబడియెడి.”

“కావున లోకులకెల్లరకు రుచ్యములుగానుండు భారతాది వీరకావ్యములందును కథాసరిత్సాగరము మొదలగు వినోద కథలయందును గల ప్రకృతినిమీఱిన వర్ణనలకు నాధారభూతమైన భావనాశక్తి గణనీయముగాదనుట తప్పు.”

“యెంతో శిల్పనైపుణ్యము లేనిది యవి కృత్రిమములుగఁ దోఁచుగాని నిక్కములట్లు భ్రమఁ గొల్పఁజాలవు.”

ఈ భావములనే అలంకార శాస్త్రము—

“అవ్యుత్పత్తికృతో దోషః
శక్త్యా సంవ్రియతే కవేః,
య స్త్వశక్తి కృత స్తస్య
స ఝటి త్యవభాసతే.”
—(ధ్వన్యాలోకము, ఉద్యో. 3.)

“సతివాహనాదిషుతు యేషు యావదపదానం శ్రూయతే తేషు తావన్మాత్ర మనుగమ్యమాన మనుగుణత్వేన ప్రతిభాసతే.”

అని సూచించియున్నారు.

ఇదియ యుపోద్ఘాతరూపమున కవిత్వతత్త్వవిచారమునఁ బ్రధానముగాఁ జూపబడినది యలంకారశాస్త్రముననుగూడ నున్నది యగు నగు కవిత్వమార్గము.

ఇక కవిత్వ తత్త్వ విచారమునఁ గొన్ని స్థలములు విశేషముగఁ జెప్పఁబడినవి కూడ నచ్చటచ్చటఁ గలవు.

“పాండిత్యప్రభావము— రేయింబవలును వ్యాకరణములను, నిఘంటువులను, ప్రాచీన కావ్యములను వల్లించుచుండుటచేత నూనెకు నష్టియే కాని కవితకుఁ బుష్టి లేదు.”

ఈ వ్యాకరణాదిజ్ఞానమునే వ్యుత్పత్తి యందురు. దీనివలనఁ గవితకుఁ బుష్టి లేదనుట యన్యాయము. దీనివలన కవిత్వము జనింపక పోవచ్చును గాని జనించినకవిత కిది పోషకము గాకపోదు. ఈ వ్యుత్పత్తిగూడ నావశ్యకమని యాలంకారికుల యభిప్రాయము.

“శక్తి ర్నిపుణతా లోక
శాస్త్రకావ్యాద్యవేక్షణాత్,
కావ్యజ్ఞశిక్షయాభ్యాస
ఇతి హేతు స్తదుద్భవే.”
—(కావ్యప్రకాశ, ఉల్లా. ౧)

సూ. లోకవిద్యాప్రకీర్ణంచ కావ్యాంగాని.
సూ. శబ్దస్మృతే శ్శబ్దశుద్ధిః.
సూ. అభిధానకోశతః పదార్థనిశ్చయః.
సూ. ఛందోవిచితే ర్వృత్తసంశయచ్ఛేదః.
సూ. కలాశాస్త్రేభ్యః కలాతత్త్వస్య సంవిత్.
సూ. కామశాస్త్రతః కామోపచారస్య.
సూ. దండనీతే ర్నయాపనయయోః.
సూ. ఇతివృత్తకుటిలత్వం చ తతః.

(కావ్యాలంకారసూత్రములు అధ్యా. ౧, అధి. 3.)

“వ్యుత్పత్తిరపి శక్త్యైవ,
సంగతా హ్యనువర్తతే.”
(శాకుంతలవ్యాఖ్యానము, అంక. ౧.)

ఇట్లాలంకారికులే కాక యీకవిత్వతత్త్వవిచారముననే (౯. పుటలో) “తోడంబుట్టిన చాతుర్యముండినచో నివి సహాయభూతములై వృద్ధిని వికాసమును గల్పింపవచ్చును.” అని వ్యుత్పత్తికి శక్తిపోషకత్వ మంగీకరించిరి.

కనుక నిచ్చట ‘పుష్టిలేదు’ అనుచో స్వవచోవ్యాఘాతమే గదా.

ఇట్టివి శేషములను విడిచినచోఁ గవిత్వతత్త్వవిచారమునఁ జూపఁబడిన కావ్యమార్గ మలంకారశాస్త్రమునఁ బ్రదర్శితపూర్వమే.

ఇంతియకాక యలంకార శాస్త్రమున నీమార్గ మింకను విశేషముగ నిరూపింపఁబడినది.

ఇట్లుండగ నీకవిత్వతత్త్వ విచారకర్తగారు చూపిన కావ్యసామాన్యమార్గ మలంకారశాస్త్రమున నిరూపింపఁబడి యున్నను వీర లంకారశాస్త్రమును “కావ్యమార్గభంజక” మని దూషించుట చింత్యము.

అయినను ప్రత్యేకస్థలముల నేవైన లోపములున్నవేమో! వీరు వాచ్యముగ దూషించిన స్థలములఁ బరికింతము.

“సర్వకాలములయందును సర్వావస్థలయందును ఏకరీతిగా వర్తించువా రుండుట యరుదు. మొత్తముమీదఁ జూడ నెంతక్రమముగా నున్నట్లు దోఁచినను సూక్ష్మముగఁ బరీక్షించి చూచినయెడల వంకర లేమాత్రమును లేకుండవు. ఋజుమార్గం బట్లుండఁగా నిక్కమైన యుపజ్ఞ లేమిచేఁ బరులో పెద్దలో చెప్పినట్లు వ్రాయఁజూచు నలఁతికవులు అలంకార శాస్త్రములలో నాయికా నాయకులకు జాతులనేర్పఱచి గుణమ్ముల నిర్ణయించియుండుట బాగుగఁ బఠించియున్నవారు గాన నదియ యొక వేద మనుకొని, ప్రమాణమును పిచ్చివట్టి యందుఁ బేర్కొనఁబడిన ధీరోదాత్త ప్రభృతులలోఁ దమకు వలయువారిని స్వీకరించుకొని యెల్ల దెఱఁగులం బ్రాచీనోపదిష్ట మార్గంబుననే వర్ణించి యెదుట నిలుపుటయ కృతకృత్యతగ భావించిరి.”

(కవిత్వతత్త్వవిచారము, ౨౬-౨౭ పుటలు)

ఆలంకారికు లీ ఋజుమార్గమును గ్రహింపకపోలేదు. “స్వభావో హ్యయం వాచ్యానాం చేతనాచేతనానాం య దవస్థాభేదాద్దేశభేదాత్కాలభేదా త్స్వాలక్షణ్య లక్షణభేదా చ్చానంతతా భవతి.” (ధ్వన్యాలోకము) అను వాక్యమున నీ యర్థము లేకపోలేదు.

ఆలంకారికులుగూడ ఋజుమార్గాశ్రయులే. “విభావాదా వనౌచిత్యం పునర్లోకానాం వ్యవహారతో విజ్ఞేయం.” (రసగంగాధరము.) “విభావౌచిత్యం తావత్ప్రసిద్ధం.” (ధ్వన్యాలోకము) “ప్రసిద్ధమితి లోకే భరతశాస్త్రేచ”-

(లోచనము) అని యిట్లు చెప్పిన యాలంకారికులకు లోకము ప్రమాణమే యగును గదా!

ఇక కావ్యములఁ బ్రధానమైనవి రసములు, రస ప్రతిపాదకములు సాత్త్వతీ, ఆరభటీ, కైశికీ, భారతీ వృత్తులు, ప్రధానముగా నావృత్త్యనుగుణులు ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరలలిత, ధీరశాంతనాయకులు. ఇట్లే ప్రధాన భేదగణన మర్థవంతము.

వీరి స్వరూపములయందలి న్యూనాధిక భావముల నుద్దేశించి చేయఁబడినది జ్యేష్ఠ మధ్యమా ద్యవాంతర భేదగణనము.

వీరు సర్వకాలసర్వావస్థలయందును ఏకరీతిగా నుండరని, ఉండుటలేదని ధీరోదాత్తత్వాదులు జాతివాచకములు గాక యవస్థావాచకములనుట.

ఇవి ఋజుమార్గములుగావా?

ఇట్లు ఈ యర్థవంతమైన భేదగణనముఁజేసిరి గాన సామాన్యముగ రసాలంబనమైన నాయకాదులను గావ్యమున వర్ణించినచో వారిధీరోదాత్తాదులలోఁ జేరవచ్చును లేక యీపద్భేదమున్నచోఁ బ్రధానస్వరూపమునుబట్టి తత్తదవాంతర భేదములలోఁ జేరవచ్చును. అట్లు చేరినంతమాత్రమున నూతనత్వ ముండకపోదు. ఏకస్వరూపు (ఒక భేదమునకుఁ జెందినవార) లయినను భిన్నభిన్న సంఘటనలలో నివారు భిన్నస్వరూపులుగాఁ గనుపట్టరా?

ఇచ్చట యాలంకారికుల భేదగణనము తప్పనవచ్చునా? నాయకాదులు వారిభేదములలోఁ జేరినంతమాత్రమున నవ్యత యుండదనవచ్చునా?

"ఇకఁ బ్రబంధస్త్రీ లన్ననో యట్లుగాదు. అందఱకు నొకటేమూర్తి. ఏవ్వేఱు గుర్తింపనలవిగానట్టిది. ఆకారములు, గుణములు, చీరలు, నగలు అన్నియును నలంకారశాస్త్రమను నొకేయంగడిలో నెరవుతేఁబడిన వస్తువులు." (కవిత్వతత్త్వ విచారము ౨౯ పుట.)

ఒకే యంగడిలోని వస్తువులైన నొకే యాకృతిగలవే యుండవు. భిన్నభిన్నాకృతులు గలవిగూడ నుండును. తీసుకొనువారలొకేయాకృతిగల వస్తువుల దీసికొనినచో నది యంగడితప్పు గాఁబోలు.

"ప్రాచీనులు వ్రాసినట్లును అలంకారశాస్త్రము లాదేశించినట్లును విరచింపఁబ్రయత్నించుట తెలివితక్కువపని."

(కవిత్వతత్త్వవిచారము, ౩౧ పుట.)

ఆలంకారికులు "స్వభావో హ్యయం వాచ్యానాం చేతనాచేతనానాం యదవస్థాభేదా ద్దేశభేదా త్కాలభేదా త్స్వాలక్షణ్యలక్షణభేదా చ్చానంతతా భవతి, తైశ్చ తథా వ్యవస్థితైః సద్భిః అసిద్ధానేకస్వభావానుసరణరూపయాస్వభావోక్త్యాఽపి తావ దుపనిబధ్యమానై ర్నిరవధిః కావ్యార్థః సంపద్యతే."

"యా వ్యాపారవతీ రసాన్ రసయితుం
కాచి త్కవీనాం నవా దృష్టిః."

—(ధ్వన్యాలోకము.)

"నవేతి—క్షణేక్షణే నూతనై ర్వైచిత్ర్యై ర్జగంత్యామాత్రయంతీ." —(లోచనము.)

అని యిట్లు నూతనత్వము నుపదేశించిరి గాని కాళ్లు తీయమనలేదు.

ఇట్టి యాలంకారికుల నూతనత్వసూచనము జెవిఁబట్టక వారేదో నియమించిరని పరిమితముఁజేసిరని భ్రమించి 'అలంకారశాస్త్రములాదేశించినట్లు విరచింపఁ బ్రయత్నించుట తెలివితక్కువ పని' యని నిందించుట యెంత సమంజసము?

ఇట్లింకను మున్ముందుప్రకరణములలోఁ జాలచోట్ల నీరీతినే యలంకారశాస్త్రము దూషించియున్నారు.

అలంకారశాస్త్ర మొక కావ్యము నాధారముగఁ జేసికొని పుట్టినదిగాదు. అన్నికావ్యముల యందలి సామాన్య స్వరూపము జూపునది. అట్లు చూపుటలో కొన్నిచోట్ల విరివిగ భావములను జూపియుండును. కొన్నిచోట్ల మార్గమును జూపి విడిచియుండును. విరివిగఁ జూపఁబడినభావములలోఁ గవి కావ్యమున కుచితములై కావలసినభావములనే స్వీకరింపవలెను. మార్గమును జూపి విడిచినచోట నామార్గమున వారు చూపినచోటనే నిలువఁబడక దానియాధారమున నుచితముగ ముందునకేగి యభీప్సితఫలము నొందవలయును. అట్లు చేయనికవుల కావ్యములను విమర్శించునపుడు మనము దోషము కావ్యములలో నున్నదా? లేక శాస్త్రమునందున్నదా? ఎట్టి దాదోషము? అని విమర్శింపవలయును.

ఈ కవిత్వతత్త్వవిచారమున నట్లు విమర్శించినట్లు కనుపింపదు. వీరి యలంకారశాస్త్రమును దూషించినదూషణ మసమంజసము; నిర్హేతుకము.

# మధూదయము

'సంవత్'

ఈ తొలిప్రొద్దువిప్పులకు నీ యతసీప్రసవమ్ము లేల హే
లాతరుణైకదివ్యసుషమాకృతిఁ దాల్చి పవిత్రభావనా
పూతములైన వీమధు శుభోదయవేళల నానిసర్గక
న్యాతరళమ్ములౌ సితదృగంచలరేఖల కౌఁగిలింతలో ?

చారుసమీరవీచిక, లుషస్సుకుమారి తుషారరేఖ, వి
ప్పారిన లేగులాబి, గఱుపారినసంపెగపూవు, రక్తిమం
బారని లేప్రభాతరజతాంశువులన్ గిఱికొన్నక్రొత్తసిం
గారము నాయెడందనవకమ్ములపంటకు ప్రోదియయ్యెడున్.

పండువెదుల్లు మంగళముపాడె, కుమారసమీరుకూర్మిపూ
దండలు ప్రౌఢలై పరిణతాంశసుధాకలశాల పట్వనీ
మండలి కందజేసిరి, సుమాళపుమంపుల ముంచె, సీసుధా
ఖండమనోజ్ఞమౌ ప్రకృతికన్న పవిత్రములైనతత్త్వముల్.

సుమసుకుమారమైనమనసుల్ పులకింప వసంతవేళ నె
య్యములు దలిర్ప కోకిలము లామనిమావులపైని కీర్తిగీ
తములను పాడుచున్నవి సుధామధురమ్ముగ రమ్యమైనవి
శ్వము పులకించె ప్రేమపరివర్ధితమైనమధూదయమ్మునన్.

చల్లనిపైరగాలి మృదుశాద్వలులన్ బడి నాకుటీరపున్
మల్లెల దారి తోరణపుమార్గమునన్ ననుఁ దాఁకిపోయె; త
త్ఫుల్లసుమానుషంగపరిపూతసమీరుని చక్కిలింత నా
యుల్లము సోగలారువిరులొత్తినరీతిగఁ బుల్కరించెదున్.

ప్రణయతపస్వి మాధవుఁడు వచ్చిన ఈమన తెన్గుతోఁటలో
కనులకు పండువై విరిసె కమ్మనిపూవులు, నిన్న నేఁడు పూ
చినకసుమొగ్గలున్ విరియుచిన్నెలుతోఁచెను ; చేతుమింక మా
జననికి పూలపూజలు ప్రసన్నగుణాదరణానుభూతితో.

ఈపువుఁదోఁటలోన గుసుమించినజాజులు, తుమ్మిపూలు, శో
భాకరమైనగొజ్జగులబంతులు, వింతలసూర్యకాంతముల్,

పూపబెడంగుగన్నెరులు, పోఁకలు, కమ్మనిపాదిరీలు, పు
ష్పాపచయమ్ము వేళకనులందనియించు, నిగారమొల్కుచుక్.

పాయనిసుప్తిలోని పసిపాపనివీడినకన్నుమొగ్గలై
సోయగ మారఁబోసి సొగసుల్ సవరించుప్రసూనకుట్మల
శ్రీయుతమైన ఈనవశిరీషము కన్నెఆకంపుసోగలే
పాయదు సిగ్గుదొంతరలవాలికతో నరవిచ్చుమొగ్గలక్.

అలకనిమంచుమేల్ముసుగులక్ వికసించినలేగులాబికాం
తులు పసనెండలో మిసిమితోఁపఁగ బంగరుపూఁతఁ దాల్చి సొం
పుల బసపాడినైజమగుపూలపిసాళిని చిమ్మ నేటికో!
పులకితమైననాహృదయముక్ సుపరీమళ మొల్కఁజూచెదక్.

ఈమధుమాసశోభ ముకుళింపకపూర్వమె పూలమొక్కనై
పో మనసాను నాకు వలపుల్ కుసుమించి నెలార్చు చిన్నిపొం
దామరనై మరందమధుధారలు రేకుల నంజలించి, లీ
లామయమైనకన్నెమరు లామనిపొంగులఁ దీర్చుకొందునా?

సలిలకుమార వీచికలు సన్ననిముర్మురతోడ నింకు ఈ
పులినతలాల నాడుకొనఁబో రురుశాబక మూర్మిమాలికా
జలజల కుల్కి చెంగులిడి, శాద్వలసీమల నిల్చి చూచు చూ
పులబెదరుక్ అమాయకత, మూడ్చును నాయెద సాత్వికవ్యథల్.

ఏవనకన్య లిట్లుమధురించిరొ నీహృదయమ్ము ప్రేమతో
జీవనవేణువాది విరచింతువు కమ్మదనాల మంపు; మో
దావశమైననాయెద సుధాలసమై నిదురించె; సౌఖ్యమే
జీవకకింత బాధకలిగించిన నెట్టులు తాళుకొందునో!

ఏరతనాలవంటిరమణీమణులెందరు పాడిరో సరి
త్తీరములందు నేకముగఁ దియ్యనిగొంతులనెత్తి ఒక్కశే
తీరుగమారుమ్రోగు భవదీయహృదంతర మింతయాపుకో
నేరక ఎన్నినాళ్లు మననేర్తువు నీవు రసత్తరంగిణీ!

---

# ఆంధ్రగద్య వాఙ్మయ పరిణామము

[నన్నయ భట్టు మొదలు మారన వఱకును-౧౧-౧౩ శతాబ్దులు]

(తరువాయి)

గొబ్బూరి
వెంకటానంద రాఘవరావు

## 3. శబ్దాలంకారములు

తెలుగువారు సహజముగా శబ్దాలంకార ప్రియులు. వారిపద్యములలో, పాటలలో, పలుకులలో యతిప్రాసములు స్వాభావికముగా నగపడుచున్నవి. చూడుడు:—

లంకాయాగము:— "తల్లినీ పిలుచుకొని తమ్ముణ్ణిపిలుచుకొని తానుయిట్లని పలికెనూ—

పామరులపాట:—"హరిహరీనారాయణాది నారాయణా కరుణించిమమ్మేలు కమలలోచనుడా.

ఈమధ్య మాయింటిలో పిల్లలు, పురుడు పట్టిన యొకచుట్టము వచ్చినపు డిట్లు పాడుచుండిరి:—

"పురిటిబుజ్జి, అరిటికాయ
అమావాస్యనాడు అదేపూర.

ఇందువలననాంధ్రులకు పిన్నలకు పెద్దలకు, స్త్రీలకు, పురుషులకు, పండితులకు పామరులకు, అందరకును శబ్దాలంకారములందు సహజమైనప్రీతి కలదని స్పష్టమగుచున్నది. తెనుగు భాషకు మాధుర్యమబ్బుట కీశబ్దాలంకారప్రియత్వ మొకహేతువుగా నిరూపించవచ్చును. పరుషాక్షరములు పరిహరించి, సరళవర్ణములే సంగ్రహించి కూర్చుటవలన కవనమునకు మాధుర్య మబ్బునని యాలంకారికులు కొంద రభిప్రాయపడుచున్నారు. తెనుగు మాటలలో, పాటలలో, పద్యములలో నగుపడు నిట్టిసందర్భములవలన, పాశ్చాత్యభాషలలో ఇటాలియనుభాషవలె ప్రాగ్భాషలలో తెనుగు మధురము, గానయోగ్యము నైనదనియు విద్వాంసు లేకగ్రీవముగా నంగీకరించియున్నారు.

ఆంధ్రభారతమునందలి 'అక్షరరమ్యత' నెల్లరు నాదరించునట్లు రచింప ప్రతినవట్టిన నన్నయభట్టారకుడు తనరచనలలో శబ్దాలంకారములను విశేషముగా కూర్చియున్నాడు, అందు శబ్దాలంకారమున్నదని ప్రత్యేకముగా పరికించినగాని మనము గుఱుతింపజాలనంత చమత్కారముగా నాత డారచనల గావించినాడు. ఆశబ్దములం దాయక్షరములు సహజముగా నచట వెలసిన ట్లమరియుండునుగాని కవి యెరువుతెచ్చి, బలవంతముగా నిలిపిన ట్లుండవు. నన్నెచోడునిరచనలలో నన్నయరచనలలోకం టెను శబ్దాలంకారములు విశేషముగా చూపట్టుచున్నవి. కొన్నిచోట్ల నవి సహజముగా నమరినట్లే రచింపబడినను మరి కొన్నిచోట్ల నన్నెచోడుడు డొంకలుతిరిగి ద్రావిడప్రాణాయామము చేసియైన ననుప్రాస మున్న దనిపించుకొనుటకు తాపత్రయపడినట్లు స్పష్టమగును. సజాతీయపదరచనలు, ఒకేసంఖ్యావాక్యములోపలుమారుదొరలునట్టిరచనలు, ఒకేశబ్దముగాని శబ్దభాగముగాని యొకేవాక్యములో ననేకపర్యాయములు వచ్చున ట్లేర్చి కూర్చుటలు, నీకాలమునాటికవులందరి రచనలలో చూపట్టుచున్నవి. సజాతీయపదరచనము మాత్రము నన్నెచోడునివచనములలో నొకముఖ్య లక్షణమని చెప్పతగినంతతఱుచుగా నగపడుచున్నది. ఈయుగమునాటి గద్యరచనాపరిణామక్రమము వీరి యనుప్రాసరచనలలో ప్రత్యక్షముగా నగపడురీతిని మఱియే సందర్భమునందు నంత సులభగ్రాహ్యము కాదు. తిక్కనకూడ శబ్దాలంకారప్రియుడే. కాని యతడు నన్నెచోడు నంతవిశేషముగా శబ్దాలంకారములకొఱకు ప్రాకులాడడు. అస్వాభావికములైన యలంకారరచనలకొఱ కతడు తాపత్రయపడడు. అతనికూర్పులలో శబ్దములు నన్నయపూర్వకం టెను సహజముగా నమరి తమంతటతామైవచ్చిన ట్లుండునేకాని కృత్రిమముగా నెఱువుతెచ్చుకొని బలవంతముగా నెట్లోనిలబెట్టిన ట్లుండవు. నన్నయయనుప్రాసములకితడు స్వాభావికములైనవన్నెలుచిన్నెలు [illegible] పెంపుచేసినాడు. కేతన, మారనకవులు నన్నయ, తిక్కనలమార్గముల ననుసరించి రచించిరి. కొన్ని యనుప్రాసవిషయములలో మారనకవి తిక్కనచూపినమార్గములను చాల పెంపుచేసినాడు. అంతేకాదు. ఆ పెంపులను పరిపూర్ణత్వమునకు తెచ్చి సర్వజ్ఞతను సాధింపుమని నాచనసోమున కందిచ్చినట్లుస్ఫురించుచున్నది. ఈ యంశము లీ క్రిందియుదాహరణములవలన తెల్లముకాగలవు.

### ౧. శ్రుతిసామ్యము

ఒకరచనలో నించుమించుగా ప్రతిశబ్దము యొక్క మొదటియక్షర మొక్కటేయగునట్లింపుగా రచించుట శ్రుతిసామ్యము.

నన్నయ— మారుత మార్తాండమరీచి గోచరంబు గానిగహనంబు. (ఆది. ౬-౪౦)

వసువులు వసిష్ఠమునివరుశాపంబున వసుమతిం బుట్టవచ్చుచు. (ఆది. ౪-౧౫౭)

సర్పసత్రసదనంబునకుం జనుదెంచి స్వదేహకాంతి సభాంతరంబెల్ల వెలుంగ స్వస్తివచనముల నిట్లు స్తుతించె. (ఆది. ౩-౨౩౦)

(అఖిలజలధి) వేలా వ ల య వ ల యి త వసుమతీవనితావిభూషణంబైన వేఁగీదేశము. (ఆది. ౧-౭)

నన్నెచోడ— విధివిహితవిధానము. (భా. ౧-౧౪౬)

పరిమితపరివార పరివృతుడు. (భా. ౨-౯౪౬)

శిశిరద్యోతిత శశికాంత శిలాతలంబున సమాధిస్థానంబు స్వీకరించి. (భా. ౧-౧౩౩)

ప్రద్యోతన ప్రభావప్రతిహతంబై ... ప్రళయనిర్ఘాత ప్రతిధ్వనులు ప్రేలిపడ. . .

తిక్కన— వారలకు వగవవలవదు. విధివశంబున వచ్చినయది. . .వనంబున వసించి మనవీటనున్న వారు; వినుము.— (విరాట. ౪-౧౩౭)

దుర్యోధను దుర్ణయంబున దుర్వార్త లు విని దుఃఖించువాడనైతిఁ గాంగేయుల గెల్చు నుపాయంబు గన్నవారము గాము. (భీష్మ. ౨-౨౦౦)

విల్లుపుచ్చుకొని వివ్వచ్చుండు వెడంగు పడునట్టివేగంబున వివిధవిశిఖంబులు... (ద్రోణ. ౫-౧౧౩)

కేతన—కన్నంబునెట్టికొని కాంతకుండు కన్యాంతఃపురంబు సొచ్చె. (౬-౧౫౬)

పరిమితాలంకారాలంకృత పరిజనపరి వృతుడు. (౪-౧౫౪)

మారన—ప్రభాకరుండు ప్రచురప్రభన్ ప్రజ్వరిల్లె. (౬-౨౧౭)

నీకు నిజగృహంబునకు నవశ్యంబు నరుగనలయునేని కొండొకకాలము నాతోడ నిష్టోపభోగంబుల ననుభవింపుము. (......)

## ౨. వృత్త్యనుప్రాసములు

నన్నయ—స్నేహలాలస విలోలాపాంగవి లోకనములు. (ఆరణ్య. ౧-౨౭౬)

నన్నెచోడ—జంభాసురుం కు నిజానంత సామంతసంతానం బంతయు నొక్కట కృ తాంతనికేతనాంతర్గతు లగుటయు. (భా. ౨-౭౪౧)

అంతం బార్వతి వసంతానంతలతాంత సంతతి నంతకాంతకాక్రాంతపూజాత్యంత హోమాదిక్రియలం బ్రవర్తింనుచుండు నంత. (౧-౪౯౦).

నన్నెచోడునికి 'న్త' వృత్తితో ననుప్రాస ములు రచించుటయందు ప్రీతి యధికము. ఇతని కుమారసంభవములో నిట్టి 'న్త' వృత్త్య నుప్రాసము లొక యిరువదివఱకు గలవు. (?) ఈ యనుప్రాస రచనమునకై యితడు చచ్చి నారనుటకు 'కృతాంత నికేతనాంతర్గతులై' రనియును, శివుడనుటకు 'అంతకాంతకుండు' అనియు పలుచోట్ల నేర్చికూర్చినాడు. ఇతర వృత్త్యనుప్రాసములును కుప్పలుగా గలవు. గ్రంథవిస్తరభీతిచే విడిచితిని.

తిక్కన—భీమసేనందనుం డగు క్రత సోము నరదం బయ్యుధిష్ఠిరతనయుం డొక్కి యొక్క సముద్దండంబగు కోదండంబు పుచ్చు కొని ఖండనంబు నేసె. (ద్రోణ. ౫-౧౪౨.)

కేతన—ఏకాంతంబునం గాంతారంబున దురంతంబైన యవస్థాంతరంబు... (౩-౫౨)

వచ్చివచ్చి యతండు సన్నుట యెఱింగి యచ్చెరు వొందుచు. (౮-౧౧౪)

మారన—వంచనం జావు దప్పించుకొనం దలంచి యా నక్తంచరులు నక్తంచరారాతి కిట్లనిరి. (౬-౫౫)

## ౩. ఛేకములు

నన్నయ—దమయంతి యంతికము. (ఆరణ్య. ౨-౧౬)

మధ్యందిన దినకరమూర్తి. (ఆది. ౪-౧౦౪.)

నన్నెచోడ—అనవరతరత నిరతుడు. (భా. ౨. ౩౫౬.)

కందెఁ దెఱచిన. (భా. ౧-౫౯౪.)

తిక్కన—కందర్పదర్పగోచరుడు. (విరాట. ౨-౩౭)

పణవాది వాదిత్రములు. (శల్య. ౧-౧౪౧)

భవత్కుమార మారణము. (శల్య. ౧-౩౬౪)

కేతన—మాధవీ మంటపప్రదేశమున శ్రీ కంఠ కంఠధూమ్రమైన ధూమము.

మారన—ఉన్న దాన దానవాధమా. (౪-౧౩౧)

## ౪. సజాతీయపదరచన

నన్నయ—కర్ణు డంశమంతు నంశంబున కానీనుండై పుట్టె. (ఆది. ౫-౧౨౫)

అక్కమలంబు దెచ్చిన గాడ్పున కభిము ఖుండై గాడ్పుపట్టి. (ఆరణ్య. ౩-౩౧౧)

నన్నెచోడ — దివ్యకల్పంబు కల్పించు మహాకవి. (భా. ౧-౫౧)

అలంకారాలంకృతము. (భా. ౧-౧౮౬; భా. ౨-౩౨౬)

నారకోచిత దండంబుల దండించి. (భా. ౧-౨౧౭)

నియోగమునంద నియోగించి. (భా. ౧-౮౭౯)

నర్తి నర్తద్ధ... (భా. ౧-౬౨౧)

తిక్కన—ఆ కృశోదరి వృకోదరుకడకు జని. (విరాట. ౨-౩౨౨)

అగ్రజు నగ్రభాగము. (భీష్మ. ౨-౧౦౫)

తనమాయ నమ్మాయ మాయించిన. (ద్రోణ. ౫-౨౪౨)

కేతన—పణజంఘు డను జంఘాలుడు. (౮-౭౭)

మారన—మహీపతి మహనీయంబైన నిజ రాజ్యంబు సేయుచు. (౬-౪)

## ౫. సంఖ్యాత్మకములు.

వాక్యములో మొదట నేదేనియొకసంఖ్య ప్రస్తావింపబడెనేని ఆసంఖ్యయే యావాక్యము లో పలుమారు దొర్లునట్లు రచించుటయందు కొందఱికి చాలయిష్టము.

నన్నయ— గరుడు డొకనాడు సప్తమ రుతజవమున సప్తాశ్వమండలముదాక నెగసె. (ఆది. ౨-౪౩)

కుంతి సూర్యునితో నిట్లనియె. అజ్ఞానం బున నిన్ను త్రిలోకైకదీపకు, త్రిభువన మూర్తి త్రివేదమయు రావించినయపరాధంబు సహింపుము. (ఆది ౫-౨౧)

ఇట్లే మారన మార్కండేయపురాణము (౪-౪౭)లో సూర్యుని 'త్రివేదమయు, త్రిగు ణాత్మకు, త్రిభువనమూర్తి' యని స్తుతించి నాడు.

వేదవ్యాసుండు "చతుర్వేదవేదాంతాది ప్రాయములను చతుర్వర్గవర్గానుబంధబంధుర కథేతిహాసంబులను, చతుర్యుగప్రసిద్ధమహర్షి రాజర్షి వంశానుచరితంబులును, చతుర్వర్ణాశ్ర మధర్మక్రమంబులను, చతుర్ముఖప్రముఖపూజి తుండైన శ్రీకృష్ణుని మాహాత్మ్యంబులను వర్ణించె. (ఆది ౧-౩౦)

తిక్కన—పురత్రయవిహారంబున జగత్త్రి యంబును నాక్రమించి యసురత్రయంబు... (కర్ణ. ౧-౨౬౩)

నాలుగువర్ణంబులకును నాలుగాశ్రమంబుల కును నిట్టివి యర్హంబులని నాలుగువేదంబు లం జెప్పిన. (శాంతి. ౨-౧౧౦)

## ౬. లలితరచనగల మరికొన్ని యనుప్రాసములు.

పైనివరించినసంఖ్యాశ్లేషకములేగాక, మొదట వ్రాసినయొకపదముగాని, పదభాగముగాని యావాక్యములో మరలమరలవచ్చునట్లు రచింపుట యాకవులకు చాలప్రీతికరము.

నన్నయ్య— భుజవీర్యసనాథులైన నాథులు గలిగియు ననాథయుంబోలె పాంచాలరాజపుత్రి భీమాకృతియై యార్తజనశరణ్యు. (సభా. ౨- ౨౨౦)

నన్నె— అశేషవిశేషంబులు విశేషించుచు. (భా. ౨- ౨౨౩)

గిరిసుండు రజతగిరి కరిగిన గిరిజ. (భా. ౧- ౫౩౫)

తిక్కన— అర్జునప్రశస్తిదక్కి దక్కిన చేష్టలు దక్కి. (విరాట. ౪-౨౬౫)

నరనారాయణులు రథిసారథులైన యారథం బెందును సిద్ధునోరథం బగు. (ద్రోణ. ౧-౯౬)

మద్రపతిసముద్ర సముద్రేకము. (శల్య. ౧-౧౩౫)

కేతన— వసువాలిఖుండును, విరూపకుండును ననునామద్వయంబున కనురూపంబైన ఘనరూపంబులు గలుగనాకు. (౫-౪౩)

సభాసూనంబుగా నిశ్చయించిన పావకమండైన ధూమాన...లుండు నిజా..నాథుపశ్వనంబున. (౪-౯)

మారన— మధ్యమభూవనంబున నాసుమధ్యయుద్భవించునని వరంబిచ్చిన భుజగేశ్వరుండు భుజగకుంచెలునకు నమస్కరించి. (౩-౫౭)

## ౭. లాటానుప్రాసము, ముక్తపదగ్రస్తము, అంత్యప్రాసము

తిక్కన— బలకేవునూట మాటగాదు. (ఉద్యోగ. ౧-౩౩.)

అంతశ్శత్రుజయ సౌఖ్యం బనుభవింపుము. బాహ్యశత్రుజయంబు జయంబు గాదు. (అశ్వమేధ. ౨-౭౧)

మారన— కువలయాశ్వకుమారుని కులప్రమద మదాలస...పరమయోగినియు, యోగిమాతయు కావలయు. (౩-౫౭)

సుగుణసుందరుండును ధృతిమందరుండును సితయశోవిలసిత సురగిరికందరుండును పతికార్యధురంధరుండును నీతియుగంధరుండును. (౧-౨౪)

## ౮ యమకాదులైన మరికొన్ని శబ్దవృత్తులు

నన్నయ— పాండవుల కపాయంబు సేయు నుపాయంబు. (ఆది. ౫-౧౭౯)

అభిప్రాయంబునకు నిరపాయంబైన యుపాయంబు. (ఆరణ్య ౨-౫౭)

బదరీవనంబున పవనంబు. (ఆరణ్య. ౧-౨౩౭)

హిడింబిని పవమానసూనుం డవమానపూర్వకంబుగా. (ఆది. ౬-౧౯౦)

నన్నెచోడ—దుర్నిమిత్తంబులు నిర్నిమిత్తంబుగా పుట్టుట. (భా. ౧-౪౧౬)

ఎదురెత్తి సిద్ధుల నప్రసిద్ధులం జేసి సాధ్యుల హేలాసాధ్యులంజేసివిద్యాధరుల తృణధరులం జేసి వియచ్చరుల వియుచ్చరులం జేయును జనుదెంచి నిల్చిన సురేంద్రు ననురేంద్రుండు గాంచి. (భా. ౨-౨౧౯)

ఇట్లైరావణమరవర మదవారణుం డసురతారకాసుర మదవారణుండై తదీయమదవారణ వారణుండై లం..సతురారుండు. (భా. ౨-౯౬౨)

తిక్కన—భారతరణంబున మరణంబు. (ఆశ్రమ. ౧-౩౭)

దుష్టలోకంబు నధోలోకంబున కనిచి. (విరాట. ౨-౨౩౫)

కేతన— అర్థపతి కపాయంబగు నుపాయంబు. (౬-౫౦)

పరద్రవ్యాపహరణ పరదారదూషణంబులు భూషణంబులు గాపురంబు ముప్పెట్టు పెట్టు. (౩-౬౬)

## ౯. అనుప్రాసరచనా పరిణామము

నన్నయ—భీమజరాసంధు లెప్పుడు యుద్ధంగక యొండొరులం బట్టియు గిట్టియు, దాచియుం ద్రోచియు, నడచియుం బొడచియు యుద్ధంబు సేయుచు. (సభా. ౧-౨౦౬)

నన్నెచోడ—దక్షుండు భయభ్రాంతుడై కన్నవారలకు మ్రొక్కుచు ప్రక్కుచు, లోసుచు, డాసుచు. (భా. ౧-౨౧౬)

ప్రౌఢాంగనలు దమబలిమియు గలిమియు మెఱయుచు నగజ భంగించుచు నగ్గించుచు. (భా. ౧-౬౭౧)

తిక్కన—పుడమి బొడమి పాలిదినిలిచె. (అనుశాసనిక. ౧-౧౦౬)

మకుటంబులు డుల్చియు దలలురాల్చియు ప్రాణంబులు పీల్చియు. (శల్య. ౧-౨౧౧)

మల్లయుద్ధసన్నద్ధులై కిట్టుచుం బట్టుచు, బాయుచు వ్రేయుచు, నొడచుచుం బొడచుచు. (ద్రోణ. ౩-౨౬౮)

కోపంబులు నాటోపంబులు బలంబులు జలంబులు, శౌర్యంబులు ధైర్యంబులు మెఱయ తెఱంగున చెలంగిరి. (ద్రోణ. ౪-౧౯౫)

కరీంద్రుండు నచ్చుటయు నరేంద్రుండు నొచ్చుటయు. (విరాట. ౫-౧౯౬)

వారణంబులపై వనిలపుత్రుండు గదాహస్తుండై కవిసిన దుండంబు లవిసియు దంతంబులు దువిసియు. (శల్య. ౧-౩౬౫)

అశ్వత్థామ యాటోపము :

"భయానకంబునకును బీభత్సంబునకును నన్నేల నెలవగునట్లుగా జేయుచు జెలంగి చెలంగి, మలంగి మలంగి చతురంగంబులు బాతినను బీఱువోయినను తెరలినను, గలంగినను దొలంగినను, దటిమినను నటిమినను, గిట్టినను ముట్టినను" (సౌప్తిక. ౧-౧౩౬)

కేతనంబులు నఱకియు, సారథిగ్రరథికప్రాణంబులు పెఱికియు జర్మంబులువుచ్చియు మర్మంబుల మార్గణంబులు గ్రుచ్చియు సర్వాంగంబులు నొంచియు దలలు ద్రుంచియు విహరించుచుండె. (భీష్మ. ౩-౫౦)

మారన—కపాలంబులు పగిలియు ఫాలంబులు నొగిలియు, గరంబులు త్రెస్సియు, నురంబులు వ్రస్సియు, మెడలు మునిసియు దొడలు మునిసియు, గండలు రాలియు గుండెలు గూలియు, రూపు లసంగియు నేపులు మసంగియు. (౬-౨౦౬)

సురగణరంజనంబు నసురగణ భంజనంబు నిగమనికర రక్షా ఖేలనంబు ధర్మపరిపాలనంబు నొనరించుచు. (౧-౧౬౨)

నాచన సోమనాథుడు—వితెగిన రత్నస్తంభంబులు వితతాటనంబు లగు హేమకుంభంబులు నిలువున గూలిన మేడలు నెఱదప్పిన వాడలు. (ఉ.హరి.౧-౫౩)

పారలెడి యట్టలు తెరలెడి తిట్టలు. (౪-౨౫)

గదలు సారించియు సైరించియు, గదల్చియు నదల్చియు, దాకించియు సోకించియు. (౪-౨౬౪)

సందడి క్రమ్మంది(యు), సంగడివారిం బ్రంచియు, నెత్తురులు గ్రక్కియు, నిగుడలేక చిక్కియు, దాకిపడియును తల్లడపడియును, వ్రేళులు గఱచియు, వెనుకవారికి వెఱచియు, గైదువులు నైచియు, గ్రంతలు చూచియు, బడివాళులం బ్రెల్లియు, బలుకకుమని గిల్లియు, నిండ్లు దూఱియు నెపదవ్వుల వాఱియు, బీనుగులలో డాగియు, జేరుకొన్న రేగియు, భోరాక మరలియు, బోటులేక పారలియు. (౫-౨౩౭)

పన్న గారి నగారినగరిపారువు తెరువుం జనునప్పుడు దుప్పుడు చప్పుడుచే, ఱెక్కల మొక్కలంబుచే, ఱేకుల వీకులచే...(౬-౨౭)

పగ్గంబు లగ్గంబులుగా గుదియింపక నదియింపక ఆకసంబెల్ల బెల్లగిల దిశలు దుర్దశంబులుగ, నిర్జరులు జర్జరులుగా మేఘంబులు మోఘంబులుగా గిన్నరులు గన్నరులుగా భూతంబులు భీతంబులుగా రయంబు గండరవును జయంబు బండరువును నై. (౬-౨౭)

దరవరులవెరవరుల కిచ్చియు మెచ్చియు, చక్రంబులు వక్రంబులు వలుకక సవరించియు వివరించియు, బల్లెమ్ములు బెల్లెమ్ముల విఱువ నమర్చియు జెమర్చియు, స్యందనంబులకు వందనంబుల జేసియు డాసియు, గాలుబలంబులు మేలబలంబుల లెక్కించియు నిక్కించియు. (౬-౫౦)

విన్ననువున గన్ననువున చూప బగ్గింప బగ్గింప సెగ్గించియు...పదంబున మదంబున ద్రొచియు ద్రోచియు,...జానువునానువున నదిమియు గదిమియు. (౬-౧౦౮)

రూపుమాపియు నేపుజూపియు, కరంబులు ఖండించియు శిరంబులు తుండించియు, గజంబులం బఱపియు ధ్వజంబులం జెఱపియు. (౬-౧౨౯)

తెరువున బోవెఱచియు బఱచియు, తెరువులలో దూఱియు ఛాఱియు, పోటువడి పొరలియు గెరలియు, పాటుపడి తెరలియు మరలియు. (౬-౧౩౪)

చంద్రహాసంబులు మందహాసంబులతో జళిపించియు దళిపించియు, తోమరంబులు చామరంబులతో నొనర్చియుం దనర్చియు. (౬-౧౫౪)

ఇట్టి యుదాహరణము లెన్నియేని జూపవచ్చును. పైని జూపబడిన శబ్దాలంకారము లోపికతో పరిశీలించినపక్షమున కాలనుగడచుకొలది సుప్రసిద్ధాంధ్రకవుల వచనరచనలలో శబ్దాలంకారప్రియత్వము మృగవిషాణవ్యాప్తివలె బహుముఖముల విస్తరించుచుండెనని విశదము కాగలదు. నన్నయభట్టారకుకు నాటినయనుప్రాసవిధాన మను నొక్కవటబీజము న న్నెచోడ తిక్కనాదులకృషిచే చక్కగా మొలకలెత్తి యేపుగా పెరిగి పెద్దవృక్షమై సర్వజ్ఞబిరుదాంకితుడగు నాచనసోమనాధునికవనమందు శాఖోపశాఖలతో సర్వముఖముల సాంద్రముగా వ్యాపించి యీనాడలు నైచి మహావృక్షమై యానందాశ్చర్యములను గొల్పుచున్నది. అటుపిమ్మట కొందరుకవుల చేతులలో నీరచనావిధానము అత్యధికవిస్తారము కలదై రమణీయతం గోల్పడి సమీపింప భయావహమై సాంద్రారణ్యమై పోయినది.

## ౪. అర్థాలంకారములు

### ౧. ఉపమ

ఈయుగమునాటి కవిసింహు లందఱును అర్థాలంకారప్రియులు. తద్రచనయందు కుశలులు. రసపోషణమునకును అర్థవ్యక్తికిని ఉపమాలంకారము మిక్కిలి యనుకూలము. నన్నయభట్టారకాదులు రచించిన యుపమానము [illegible] నవకాశముచాలదు. కాని, వీరలురచించినయుపమానమాలికలు కొన్ని చూచితిమేని అందలి చమత్కారము కొంతవఱకైనను గ్రహింపవీలు గలుగు నని యోజించి యట్టి యుదాహరణములను మాత్రము కొన్నిటి నీకింద వ్రాయుచున్నాను.

నన్నయ— చేదిపతి యైన సుబాహుపురమున నజ్ఞాతయైయున్న దమయంతి.

"ధూమజాలానిబద్ధ యైన యగ్నిప్రభయుబుం బోలె నీలాభ్రసంభృతం బైన చంద్రరేఖయుం బోలె, బహుపంకనిమగ్న యైన మృణాళియుం బోలె, నేర్పడకున్న నంత దదీయ భ్రూయుగమధ్యగతం బైన సూక్ష్మలక్షణం బిమ్ముగా వీక్షించి దాని దమయంతిగా నెఱింగి సుదేవుం డాత్మగతంబున నిది పతివిముక్తయై శుష్కప్రవాహం బైన నదియునుంబోలె, శూన్యకమలం బైన నళినియుం బోలె, నపేతభూజం బైన వనభూమియుంబోలె నొప్పకుండియు తన పతివ్రతాత్వమున నొప్పచున్నది."

(ఆరణ్య. ౨-౧౫౧)

నన్నెచోడు— పార్వతి యౌవనప్రాదుర్భావము :—

"మఱియుం గౌమారానంతరంబున తేదీగెకుం గవ్వం బెక్కునట్లు పువ్వునకుం దావి వొందునట్లు చిత్రరూపంబునకు మెఱుగెక్కువిధంబున నిఖిలజన మనోభిరామం బగుచు... అభినవ మధుసంగతిం దనరు ప్రద్యుమ్ను నుద్యానవనంబునుంబోని యౌవనమదాభ్యుదయమున."(భా. ౧-౫౭౨, ౫౭౪)

యుద్ధవర్ణనమునందు ప్రళయకాలమునాటి యుపమానములు విశేషముగా నితడు కూర్చినాడు.

తిక్కన—యుధిష్ఠిరుండు సర్వజనసమ్మతంబుగా సమరోత్సాహంబు చేసి మహోల్లాసంబునం బ్రస్థాన భేరి సరవం బంచిన:-

"భీకరంపతాకున భీటలు వారిన
పచ్చిగోడలమాడ్కి పగిలె దిశలు
కాగిన యెసరుల కరణిని బోరిబోరి
శరనిధు లుప్పొంగి పొరలబడియె
గలముపై గీలించి గాలికత్తినచాప

వోలె మిన్నంతయు బూవటిల్లె
కులపర్వతావళి కులిశభయంబున
బెదరిపాపోవున బ్లెదురు సెలగె
ధాత్రి కుమ్మరిసారె విధమున దిరిగె
జిత్రరూపములట్లు నిశ్చేష్టితంబు
లయ్యె సర్వభూతములు ప్రయాణభేరి
భూరినిష్ఠురఘోర భాంకార మడర."

(ఉద్యో. ౪-౧౧౬)

ఇది పద్యమే. ఐనను భారతార్థము తెను స జన సామాన్యమునకు బోధపడుటకై ప్రతి జనవ్యవహారమునం దందఱును సాధారణముగా చూచు విషయముల యుపమానములే తెచ్చి ఈ యుపమానమాలికను గూర్చి యాంధ్రావళి నెట్లు రంజింపఁజేయు చున్నాఁడో మా పుట కిది యెత్తి వ్రాసినాఁడను. వచనముల లోని యుపమానములనుకూడ కొన్నింటిని చూతము.

"భీష్మునిపై పలువురు ధరణీశు లురువడిం చినం బెక్కుమృగంబులు మార్కొనినం జెలంగు సింగంబు చందంబున నలిరేగి నెరవు గల వనపాలకుండు తాళఫలంబులు దిగద్రోచు చందంబుననమ్మహీశులతలలుడొల్ల నేయుచు."

(భీష్మ. ౩-౬౩)

"గాంగేయుం డెక్కుడజూచిన దానవుఁడై మెఱుంగు మెఱసిన తెఱంగునం గొఱవి ద్రిప్పిన యొప్పున నింద్రజాలంబుసూపిన చందంబున దన రథంబు మెఱయ... బడలువడం జేయుచుం గార్చిచ్చుపొదలినపోలిక, మాయ గావించిన మాడ్కి మంత్రించి పడవైచినపగిదిం గసిమసంగి గాంగేయనేనం గనుపుకొట్టుచు ప్రళయకాలతాండవచక్రవర్తి యైనఫాలలోచనులీలనాజిరంగంబునం బరాక్రమనృత్యంబు నేయుచుండె."

(భీష్మ. ౨-౧౩౭)

"అభిమన్యుపరాక్రమము సహింపనోపని మానధనులగు మానవపతులు నేన నేనయని కడంగి యక్కుమారునిమీద నుఱికి పెనుచోఱమొగంబునంబడిన చిఱుచేపతండంబులచందంబున, దావానలంబు దఱియంబాఱిన మృగకులంబుచాడ్పున, సముద్రంబు సొచ్చినయేఱుల చందంబున నతనియందు డిందిన."

(ద్రోణ. ౨-౭౮)

"సైంధవవధదినంబున కృష్ణార్జునులు కౌరవ వ్యూహమున బడి సాగి పోవునపుడు దుర్యోధనపక్షమునందలి నరపతులు గొందఱు తవులు వెట్టి బెట్టు పెనంగి సముద్రంబు సొచ్చు నేఱులంబోలె నడంగి రట్లు సైన్యంబు గడచి బలితంపువల ద్రచ్చికొని వెలువడినమహామత్స్యంబులును, రాహుముఖంబు వెడలినచంద్రార్కులంబోలెఁ బొలిచి యటవోవుచుండ."

(ద్రోణ ౩-౧౬౯)

వీరశయనముపై భీష్ముఁడు:—

"శోషించినసముద్రంబుచందంబున, విమానంబు విఱిగిపడినదివ్యుని తెఱంగున భూతలపతితుండైన పతంగుభంగి భగ్నపక్షుండైన మైనాకంబుమాడ్కిం బొలుచుచనతనికడకుం బాదచారియై కర్ణుం డరిగి యాఫల్గును నారాచనిచయంబునం బొదువంబడి యమునానదీప్రవాహస్థితంబును మదనివిమీలితంబును నై శోభిల్లు కుండాలంబు ననుకరించుచు వీరశయనమహనీయుండైన యమ్మహానుభావునియడుగులపైఁ గన్నీరు దొరగం బ్రణమిల్లి...."

(ద్రోణ. ౧-౩౯)

అశ్వత్థామపరాక్రమము:—

"మారిమసంగినట్లు, మృత్యుదేవత గెరలినచాడ్పున, జముండు సలిరేగినకరణి కనుపుగొట్టి...... కమలాకరంబు సొచ్చినఘనలులాయంబురేఖయుం గేలివనంబు దఱిసినమత్తశుండాలంబుపోల్కియును ...దోప విహరించుచు."

(సౌప్తిక. ౧-౧౭౬)

## ౨. శ్లేషోపమ

ఈ యుగమున శ్లేషోపమ రచనలందును క్రమాభివృద్ధి గన్పట్టుచున్నది.

నన్నయ—సముద్రము:—"ఉద్యానవనంబునుంబోలె బహు విద్రుమ లతాలంకృతంబైనదాని, నాటక ప్రయోగంబునుం బోలె ఘనరసపాత్ర శోభిత రంగరమ్యంబైనదాని, దివంబునుంబోలె నహిమకరభరితంబైనదాని."

(ఆది. ౨-౨౭)

నన్నెచోడ—శరవణ సరస్సు:—

"అది యనిమిషాస్పదంబనుట నమృతాన్వితం బనుచు, ఖరదండ సహితం చటులతం సముదాన్వితం బనుచు, ద్విజావాసం బనుటం నకాన్వితం బనుచు, హంసాశ్రయం బనుటం గూర్మాసనాన్వితం బనుచు."

(భా. ౨-౩౮౩.)

తిక్కన—విరటుపురమునన ర్తనాగారము:-

"వివేకరహితు హృదయంబునుం బోలెఁ దమోవూషితంబును, విదగ్ధ వనితా ప్రేమంబునుం బోలె దుర్నిరూప్యంబును, ఘోరాటవీభాగంబునుం బోలె నిర్మనుష్యంబును, గాపురుషలక్ష్మీవిలాసంబునుంబోలెననుపయోగ్యంబును, ననభ్యస్త శాస్త్రంబునుబోలె దుర్గమంబును, స్వప్నలబ్ధ పదార్థంబునుం బోలె నదృష్టి గోచరంబును విషకావ్యంబునుంబోలె నస్పష్టాలంకారంబును బాలిశు రాజ్యంబునుంబోలె జారచోరహృద్యంబును నైన న ర్తనాగారము."

(విరాట. ౨-౩౨౪)

కేతన—తిక్కనసోమయాజినిగూర్చి:—

"అతండు వేదాదిసమస్త విద్యాభ్యాస విభాసి యగుచు ననుదినప్రవర్ధనంబు జెంది తుహినభానుండునుంబోలె బహుకళా సంపన్నుండును, గార్తికేయునింబోలె నసాధారణశక్తియుక్తుండును నధరీకృత మయూరుండును నై పరమేశ్వరుండునుబోలె లీలావినిర్జిత కుసుమ సాయకుండును నకలంకవిభూత్యలంకృతుండును నై, నారాయణుండునుం బోలె ననంతభోగ సంశ్లేషశోభితగాత్రుండును, గరుపురుషత్వ ప్రసిద్ధుండును లక్ష్మీసమాలింగిత వక్షుండునునై వెలసె..." (౧-౭౭)

ఇట్టి శ్లేషోపమలు వీరితరువాతి వారిలో నెఱ్ఱాప్రగడ నృసింహపురాణమునందును, బమ్మెర పోతరాజకృత భాగవతమునందును విశేషముగా జూపట్టుచున్నవి.

## ౩. రూపకము

నన్నయరచనలందు సావయవ పరంపరిత రూపములతో రూపకాలంకారము మిగుల పెంపు గనినది.

"అతిప్రీతికుండైనకర్ణుం జూచి భ్రాతృపద్మవనమధ్యంబునుండి దుర్యోధన మదాంధగంధసింధురంబు వెలువడివచ్చి." (ఆది. ౬-౫౬)

"నీయం దాపుగోచనకృతం బైన దుర్యశః పంకంబు సాంపవానుగ్రహజలంబులం జేసి కడిగికొనుము." (౮-౪౯)

నన్నెచోడుని రూపకములుకూడ రమ్యములే:

"కాలనేమి దుర్వారాక్షీణ ప్రాణసమీర ణంబు దుర్వారనారాయణాస్త్రోపహారఘోర మహోరగంబున కాహారంబైన."

(భా. ౨-౮౬౧)

"నిర్గతైశ్వర్య ప్రభావుం డై తారకుండు పురాంగనాంతః సంతాపానల వివర్ధనానిలుం డనుచు" (భా. ౭-౯౪౫)

తిక్కన—"సుణధ్వని తంత్రీనాదంబుగా నావింశ్లనా రొత్తుకాలుగా గాండీవంబు వీణగా వినోదంబు సలిపె."(విరాట. ౫-౬౨)

"మకువులు గట్టుశోణితంబు నీళ్లు, నందు బడి సేలు వెలుగొడుగులు పుండరీకంబులును, వింజామరలు మరాళంబులు నై కొలంకుల చందంబు నొంద." (విరాట. ౫-౯౦)

ఇట్లే యుద్ధభూమి యనేకసందర్భము లందు సరస్సుగాను, నదిగాను, సముద్రము గాను సావయవవివరములతో వర్ణింపబడినది

"రక్తాంబుపూరగావర్తకరికరికలితంబైన సమ రాంగణసాగరంబు నానావిధవాహన యాన పాత్రగతులం దఱియంజొచ్చి తమయట్టివారు కొందఱు మునింగినను వెండియు విజయధన వాంఛంజేసి వెఱ వేది వర్తించు వీరవ్యవహా రులు నయి." (ద్రోణ. ౧-౨౮౦)

"క్రోధతిమిరము, లోభవ్యాళము, కామ దస్యుమూషితము నసుకుర్గము గడచి యొక్క వనంబు ప్రవేశించి." (అశ్వమేధ. ౨-౫౪)

ఇట్లే ఉపమానముల యవయవములను విస్తరించుచు, సాధర్మ్యమును పోషించుచు, బుద్ధిమంతుల సూక్ష్మదృష్టికి మాత్రము గోచ రించు నిగూఢాంశములకు రూపవేషాదులు కల్పించి స్థూలదృష్టిగోచరము లైనట్లు వర్ణించి నీతిబోధకములు నాధ్యాత్మికములు నైన మహద్విషయములు పాఠకుల మనములందు గాఢముగా నాటుకొనునట్లు రచింపవచ్చును. ఇట్టిరచనలను పాశ్చాత్యాలంకారికులు 'Allegories' అని చెప్పుదురు. మనము వీటిని ఆధ్యాత్మికరూపకము లని వ్యవహరింతము. నన్నయభట్టారకుడు తాను రచించిన భారతములో జరత్కారుచరిత్రాదులం దిట్టి రూపకముల గూర్చినాడు. స్త్రీపర్వము నందు విదురుడు ధృతరాష్ట్రున కెఱింగించిన సంసారగహనవృత్తాంతమునందును ఆనుశాసనికపర్వమునందు (౨-౨౧౦) విపులవృత్తాంత మిమమున సహోరాత్ర ములురూపం బైన కాలచక్రంబును, అశ్వమేధపర్వంబున నంతర్యాగవృత్తాంతంబును లోనసురచనలలో తిక్కన ఆధ్యాత్మికరూపకముల రచించినాడు. ఇందు గొన్ని ఆంగ్లపాఠకులకు Addison వ్రాసిన మీర్జాయను వాని స్వప్నవృత్తాంతము (Vision of Mirza)ను స్ఫురణకు తేగలవు. ఇంకను ఉత్ప్రేక్షా-పరికర - క్రమ - శృంఖల - సారాదులైన యర్థాలంకారము లనేకములు విశేషముగా గలవు. వాటినిగూర్చి ప్రశంసించుటకు వ్యవధి లేదు.

## ౫. పదసంపద - ప్రయోగవిధానము

ఈ కవిచంద్రు లందఱును ఆంధ్రగీర్వాణ పండితులు. కావున వీరికవనములం దాపద ములే గోచరించుచున్నవి. అందును నన్నయ రెండుపాళ్లు సంస్కృతమును ఒకపాలు తెను గుపదములును, మృదులములగువాని నేర్చి కూర్చినాడు. నన్నెచోడుడు కావేరీతీరమువాడగుటచేత నతనికి తమిళకర్ణాటాది ద్రావిడ భాషల పరిచయ ముండుటను ఆద్వారా ఆ యాపదములు ఇతనిరచనలో ప్రవేశించినవి. అంతేకాక, మరికొన్ని యపూర్వపదప్రయో గములుకూడ ఇతనికవనమం దగపడుచున్నవి. తిక్కనసోమయాజి కవనమునందు మూడింట రెండుపాళ్లు తెనుగుపదములును ఒకపాలు మాత్రము సంస్కృతపదములును కూర్చబడి నవి. సంస్కృతపదములుకూడ విధిలేనప్పుడు తప్ప ఇత డుపయోగింపబూనుకొనడని తోప గలదు. ఇతనికి రసపోషణమునందే మిక్కిలి దృష్టి గలదు. నిస్సారము లనిపించు తెనుగుపద ము లీ యైంద్రజాలికుని కరస్పర్శనముచే రసో ద్భాసితములై యలరారుచున్నవి. తెనుగు లోకోక్తు లాయాసందర్భములందు సముచితముగా కూర్చుటచేత వర్ణితాంశము పాఠకులమనములందు గాఢముగా నాటుకొని తత్తదుచితరసప్రదీపకహేతువు లై మిక్కిలి యొప్పుచుండును. ఒక్క యుదాహరణము మాత్రము చూతము. ద్రౌపది సుధేష్ణ కోరిన ప్రకారము కీచకునింటికి సుర తేవలయునని "చనుచుండి నీచహృదయుండగు కీచకుండు దనయెదుర నప్పు డాడినకర్ణశూలంబులగు మాటల మీదంబడుసుపడినవానిం గొఱవింజూచిన తెఱంగున సుధేష్ణ తన్నుచితవ్యాపారంబు నకు నియోగించుటకు నిర్వేదించి." (విరాట. ౨-౧౦౩). కేతనమారనకవులు కొన్నిచోట్ల నన్నయభట్టును, కొన్నిచోట్ల తిక్కనసోమ యాజిని అనుకరించిరి. అట్టి యనుకరణములు కొన్ని పైనిచూపియున్నాము. వీరిరచనలలో సగపాలు సంస్కృతపదములు సగపాలు తెను గు పదములును కనబడుచున్నవి.

నన్నయా, తిక్కన, కేతన, మారనలను నీ నలువురుకవులును తమ రచనలందు కడు నప్రమత్తులై జాగరూకులై కావ్యముల రచించిరి. నన్నెచోడుడుమాత్ర మొకొక్కప్పుడు ప్రత్యక్షపరోక్ష భాషణముల తారుమారుచేసియు, (భా. ౧-౪౦౩), ఒకప్పుడు ఒక్క క్రియ ననవరసముగా మూడునాలుగుసారులు రచించియు (భా. ౨-౪౮౧), జాగరూకతె సడలి వ్రాసినట్లగపడును. కాని భావాంబరవీధి విహరించునాకవిరాజురచనలం దివి నెరసులు.

## ౬. ప్రేమాంశవర్ణనలు

నన్నయ ప్రేమాంశములను బహుసున్నితముగా వర్ణించి పాత్రల గౌరవమును పోషించి, తన గౌరవము నిల్పుకొని, మన లను గౌరవించి, ఆంధ్రకవులకు మార్గ దర్శకు డై మనకు కాళిదాసాది కవుల కంటెను పూజ్యు డనుచున్నాడు. ఇంద్రానుగ్రహమున నమరావతి కరిగినయర్జునుని గాంచి యూర్వశి మదనపరవశయై బహువిధముల పిశాచమువలె పీడించినను నిర్వికార ధైర్య ధుర్యుండై "మదీయవంశకర్త యైన పురూరవునకు పత్ని నైనకారణంబునను, పురందరునకు పరిచర్య యొనర్చుటను నాకు జనని

వనుట సంశయంబు లేదు." అనెను. ఇచట నన్నయభట్టు 'పరిచర్య' పద మెంతసొగసుగా ప్రయోగించినాడో చిత్తగింపుడు. అంత మధురము గౌరవజనకము నైనపదము ఆ సందర్భమున నన్నపార్యుడు తప్ప మఱియొకడు ప్రయోగింపజాలడు.

నన్నెచోడుడు సంస్కృతాలంకార శాస్త్రవేత్తల నియమములు విధిగా గమనింపవలయు ననియు, రతి యనగా స్త్రీ పురుష సంభోగవివరణ మేననియు భ్రమపడి, ఏకాంత విహారులగు పార్వతీపరమేశ్వరుల శయనాగారమున నక్కి, యా జగత్పితల బంధనక్రమము లన్నియువర్ణించి, ఆకావ్యపాఠకుల కుద్వేగము గల్గించి రోత పుట్టించినాడు.

తిక్కన నన్నపార్యునిమార్గమునే యవలంబించి తనరచనల మాధుర్యమును మిగుల పెంపు చేసినాడు. కేతన మారన కవు లిరువురును తిక్కనమార్గమునే యనుసరించి పూజ్యులైరి.

సందర్భోచితముగ తిక్కన రసములనుకూడ నీయుగమునందలి కవిచంద్రులు కూర్చి యాంధ్రపాఠకుల కృతజ్ఞతకు శాశ్వతముగా పాత్రులగుచున్నారు.

## ౭. ఉపసంహారము

ఇ ట్లీకాలమునాటి కవులు సంస్కృత వాఙ్మయమునందలి భారత, మార్కండేయ పురాణ, కుమార సంభవ, దశకుమారచరిత్ర లోనగు గ్రంథ రత్నములలోని భావసంపద నాంధ్రీకరించి యాంధ్రజనుల కందజేసి సారస్వతైశ్వర్యము ప్రసాదించిరి. ఇందు నీతి బోధకములైన గొప్పవిషయము లనేకములు గలవు. ఉత్కృష్ట గుణసంపదను ప్రశంసించి యున్నత జీవితాదర్శములను ప్రసాదించునట్టి మహద్విషయము లిందు విశేషముగా కూర్పబడినవి. భావోద్రేకము గలిగినపుడు వీరు రచించిన యుపమానపరంపరలు మిగుల ప్రశస్తములు. వీరి సర్వంకష కృషియు భావౌన్నత్యము వీరిరచనలకు మెఱుగు గూర్చుచున్నవి. అవసరమును బట్టి దృష్టాంత సూచకములై, ఆధ్యాత్మిక విషయములం గరతలామలకము గావించురూపములను రమ్యముగా రచించిరి.

బౌద్ధజైనాది వేదబాహ్య మతముల యొత్తిడిచే బహు శతాబ్దములనుండి పీడింపబడి కృశించి నామమాత్రావశిష్టమై యున్న హిందూమతమును పునరుద్ధరింప జేయుటయే యీ కాలపు వాఙ్మయముయొక్క ముఖ్యోద్దేశము. బౌద్ధ జైన మతములకును, హిందూ మతమునకును, ఆంధ్రదేశములో కడసారి తీవ్రమైన పోరాట మీ యుగమునందే జరిగినది. కావున నీ యుగమునాటి వాఙ్మయము మతప్రాధాన్య మైనది. ఆకాలము నాటిదే గాక భావియాంధ్ర వాఙ్మయ స్వరూపనైఖరులిపుడే శాసనబద్ధము గావింపబడినవి. ఐహికాముష్మిక ప్రయోజనార్థము మతము పేరిట ఆంధ్రజను లొనరింపవలసిన కర్మకలాప విశేషము లన్నియు, ప్రకృతి సౌందర్యమహిమానువర్ణనలతో మేళగించి దివ్యకావ్యముల రచించి యీనాటికవులు ధన్యులైనారు. ఈ కావ్యములన్నియు స్వచ్ఛములు; అద్భుత భావకల్పనా విలసితములు; భక్త్యావేశ పరిస్ఫుటములు. మానవకోటియొక్క తరణోపాయ మార్గబోధనమే యీ కవులయొక్క ముఖ్యాశయము. సద్ధర్మ సౌశీల్యములు సర్వోత్తమములని నిరూపించుటయే యీ వాఙ్మయముయొక్క పరమార్థము.

అందును తిక్కనసోమయాజి ఆంధ్ర భారత రచనకే శిక్షితుడై అది రచించుటయే భవ్యపురుషార్థ మనుకొని, అది యొక భగవదారాధనవిశేష మను గొప్ప భక్తిభావముతోను, తా నాంధ్రజాతికి సేవకుడ నను వినయముతోను, తనజాతివారు, పిన్నలు, పెద్దలు బాలురు, వృద్ధులు, స్త్రీలు పురుషులు, పామరులు, పండితులు ఎల్లరు చదివి యానందించి తరణోపాయముం దెలిసికొని, కర్మప్రాధాన్యముగా తాము ఇహపరముల సాధించి తరించుటయేగాక, స్వార్థత్యాగముచే తమజాతిని కూడ తరింపజేయవలయు నను నంతటి మహావిశాలభావముతో భారతమును రచించినాడు.

ఇతడు సామాన్యుడుకాడు. సమస్తాంశ కుశలుడు. సకలనీతులసార మెఱిగిన ప్రోడ. రాజనీతియం దద్భుత నైపుణ్యము గలవాడు. సహజకవితాసంపదచే శోభించిన యాగర్భ శ్రీమంతుడు. జీవితమునం దొకసంతోషమును, ప్రకృతియందు అత్యంతమైన యనురాగమును గలవాడు. అతనిది అతిపరిశీలనాసహమైన దివ్యదృష్టి. ఎపు డేవాక్యము నేలాగు కూర్పవలెనో అతనికి తెలిసినట్లు మరెవ్వరికి తెలియదు. సమయానుకూలములైన వేళాకోళములు నెత్తిపొడుపులతోకూడి మనోజ్ఞములైన పరిహాసప్రసంగములు రచించుటయం దద్వితీయుడు. మఱియు న్యాయసమ్మతమైనవాగ్జాల మితనిసొమ్ము. ఈ వాఙ్మహిమచే ప్రతిపక్షులు క్షణములో నిరుత్తరులు కావలసినదే. మఱియు నీవాగ్వైఖరి సహజ కవితాసామర్థ్యముచే మహోత్కృష్టమై, అపారవిజ్ఞానసంపదచే సుశోభితమై, ఏకాగ్ర దృష్టిబలముచే నావేశితమై పటుతరసౌందర్య సామర్థ్యవిశేషములచే విభాసితమై మిగుల నొప్పు రమ్యశైలిలో పొంగారుచు నహహా యనిపించును.

విశేషించి యూతపదనికరములతో సమస్తాంశ గ్రహణశీలమైన మనస్సులో, దైవదత్తమగు నాధ్యాత్మికాంతర్దృష్టితో నీతడు విశ్వవిహారము సల్పినాడు. ప్రకృతికాంత కావించు మనోజ్ఞసూచనల సారస్య మంతయు లెస్సగ గ్రహించినాడు. విశ్వకోశ మనదగు తనవిశాల హృదయమున నిదియంతయు భద్రపఱచినాడు. ఆంధ్రులలోకాభ్యుదయమునకై తా గ్రహించిన యర్థమంతయు వెదజల్లి లోకోత్తర చరిత్రుడైనాడు. అతనికడ విశేషము ప్రకృత్యంశములను సరిగా వర్ణించునేర్పుమాత్రమే కాదు; ప్రకృతికాంత యసంఖ్యరూపవిలాసములతో ప్రదర్శించు సౌందర్యవిశేషములను కావ్యదర్పణమున సజీవముగ ప్రతిఫలింప జేయుటమాత్రమే కాదు; ప్రకృతియొక్క భావవిశేషములను, మానవజీవితములందలి సమస్తాంశములను తెఱిమి వర్ణించుటయే కాదు; అతడు ప్రకృతియొక్క యాత్మనే వశీకరము గావించుకొనగల్గిన మహామహుడు. ఈ హేతువుచేత నీతని భారతమునకు శాశ్వతము నక్షరము ననుభవైకవేద్యము, నమృతతుల్యమునగు నొకమాధుర్యమును ఒకానొకదివ్యశోభయు లభ్యమయినవి. ప్రత్యక్షములా యని భ్రమపెట్టు వర్ణనలతో జవసహితమయ్యు సరళమై ఇక్షుఖండమువలె ప్రతిపర్వరసోచయమై, వేదమతసారములగు శుద్ధసత్యముల నిదియాంధ్రజన సామాన్యమునకు బోధించునట్లు మరి యేయితరాంధ్రగ్రంథమును ఆంధ్రులకు బోధింపజాలదు. కావున నిది జనాభ్యర్చితమై యాంధ్రావలి నెపుడును మోదము నొందించుచున్నది.

# 'అభాగ్యజీవి'

విశ్వం

దారుణకరాళ కిరణ సంతాన పంక్తి
జలధు లాపోశనముఁ గొనఁ జాలువాఁడఁ
గనుఁగొనుం డిదె నా'తడాఖా' యటంచు
నట్టనడినెత్తి కెక్కె నుష్ణాంశుఁ డంత.

చిక్కఁగా చివురుటాకుల చీరఁగట్టి
జిలుగుపూవుల మేల్ముసుం గలవరించి
రాణివాసము సేయు 'గులాబి' కూడ
నిప్పుటెండకుఁ గరఁగి కన్నీరు నించె.

ప్రకృతియంతయు గాలించి నికరహా క
ళారహస్యమ్ము లెఱిఁగి, నోరారఁ జెప్ప
తత్త్వవేత్తలు పులుఁగు లార్తమ్ములగుచుఁ
దలిరుటాకులలోఁ దలఁదాఁచుకొనియె.

విశ్వగోళ మాతప వహ్ని వేడిమెక్కి
ప్రిదిలి పొడియగునా యనిపించుచుండె;
అందు సుడివడి పోలేక డిందువడుచు
వేడిగాడ్పులు రొసరొసలాడుచుండె.

అట్టివేళ చేరెడు నీడమైన లేక
విరహి హృదయమ్మువలె శూన్యతరమునైన
ఇసుక మైదానమునఁబడి యేగుచుండె
వచ్చి రానట్టి మీసాల వయసువాఁడు.
కాలుమోపినఁ గములు రాకాసినేలఁ
గాలి జోడైనలేక యేకాకి యరుగుఁ
ప్రబల కర్మచేఁ గాలప్రవాహమందుఁ
గొట్టుకొనిపోవు జీవులజట్టువోలె.
కోమలములైన నునుపుచెక్కులు బెడంగు
మిసిమియంతయు మాసి శమించిపోవ
వెక్కసమ్మను తాపమ్ము చిక్కువెట్టఁ
గ్రక్కుచున్నవి నెత్తుటిచుక్కబొట్లు.
ఆ కఠోరాతపాగ్ని సర్వాంగకములు
కరగిపోయి ద్రవమ్మయిసురియుచుండఁ
కరుడుగట్టిన కలుషమ్ము కరగిపోయి
స్వచ్ఛహేమమ్ము మెఱుఁగులు వాఱునేమొ.
తేఱిచూడగరాక నర్తించుచున్న
అతని భావప్రపంచమం దప్పు డెన్ని
విప్లవోద్యమములు ప్రభవిల్లి దాన
నెన్ని రక్తపాతాల సృష్టించెనొక్కొ.
అడుగు నెత్తిపెట్టుటకైన నాయభాగ్య
జీవికేనాడియందు కాసింతయేని
సత్వమే లేదు : అభ్యాస సరణి నట్లు
త్రోసికొనిపోవుచున్న దేదోమహత్తు.

* * *

ఎంతదూరమో ! అట్టులే యేగినాఁడు
గాని, యెప్పటి కంతమ్ము గానఁబడక
పోయె మైదానమున కింకపోవలేక
ఎండ వడఁగొట్టి యచట మూర్ఛిల్లిపడియె.

## ౫౧-వ అఖిలభారత జాతీయ మహాసభ-హరిపురము, ౧౯౩౮.

## వివిధ దృశ్యములు



విఠల్ నగర సింహద్వారము



పురుష వాలంటీరులు



స్త్రీ-వాలంటీరుదళము



పతాకారోహణ మహోత్సవము

౫౧-వ అఖిల భారత జాతీయ మహాసభ—హరిపురము, ౧౯౩౮, వివిధ దృశ్యములు.



శ్రీయుతులు నెహ్రూ, బోసులు-వెనుకటి, ఇప్పటి అధ్యక్షులు



విఠల్‌నగర నిర్మాణ శిల్పి : శ్రీనందలాల్ బోసు



విషయనిర్ణయ సభకుపోవుచున్న ఆంధ్ర ప్రతినిధులు,
శ్రీ తె. విశ్వనాథం, కళా వెంకటరావు, బులుసు సాంబమూర్తి, పళ్లంరాజుగార్లు



గాంధిమహాత్ముడు, బోసుమున్నగువారిగోష్ఠి

౫౧-వ అఖిల భారత జాతీయ మహాసభ—హరిపురము, ౧౯౩౮, వివిధ దృశ్యములు.



అధ్యక్షుని ఊరేగింపు. రథమునకు కట్టబడిన ఎడ్లు ౫౧

# నగ్నదిన మహోత్సవము

[లేడీస్ కల్చర్‌క్లబ్]

చింతా దీక్షితులు

[ఈ కథలో సంస్థలూ పాత్రలూ కల్పితములు. దేనినీ ఎవరినీ ఉద్దేశించినవి కావు]

కచేరీపని చూచుకొని నేను సాయంత్రం యింటికివచ్చి అవశిష్టాలు తీర్చుకొని ఆరోజు న్యూసుపేపరు చదువుతూ సోఫామీద కూర్చున్నాను. ఆరోజున ఎందువల్లనో క్లబ్బునుంచి యింటికి వచ్చేసింది చప్పున నా భార్య చేతిసంచీ ఒకచేత్తోనూ, పొట్టి గొడుగు యింకోచేత్తోనూ పట్టుకొని స్లిప్పర్లు తొడుక్కొని. వచ్చేసరికి న్యూసుపేపరు బల్లమీద పెట్టి, "ఏమిటి సమాచారం, సటీ" అన్నాను, నాపక్క కూచోమని చోటుచేస్తూ.

"మరేమీలేదు. మీరు పాపం కనిపెట్టుకు ఉంటారని చప్పున వచ్చాను" అని నా భార్య, చేతిసంచీ బల్లమీదపెట్టి, గొడుగు సోఫామీద నా ప్రక్కనుపెట్టి, ఎదురుగా ఇంకో సోఫామీద, కూర్చుండి, "ఏమిటి పేపరు విశేషాలు?" అంది.

"మరేమీ లేవు. కాని నేను కనిపెట్టుకు ఉంటానని ఈ వేళమాత్రమే నీకు తోచిం దెందుకో?"

"ఈవేళైనా తోచిందని సంతోషించకూడదూ? ఎప్పుడూ తప్పులు వెదకడమే." అంది.

"నో ఫియర్, ఊరికే మాటవరసకి అడిగాను, డియర్."

"నాన్‌కింగ్ జపాను పట్టుకొన్నట్టేనా" అంది మాగృహకృత్యాలకి సంబంధించిన విషయంలాగే.

"ఆ, కొద్దిశరవాయిగా —రేపో, ఎల్లుండో జపానువాళ్ల వశమౌతుందన్నమాటే" అన్నాను.

"ఇంకా విశేషాలు?"

"తేనెటీగలకల్చరును గురించి మంచి వ్యాసం ఎవరో అనుభవజ్ఞుడు రాశాడు." అన్నాను.

"బీ కల్చరా! ఎవరిక్కావాలి పోనిస్తురూ."

"అయితే సటీ, బీకల్చరు అంటే"—

"తేనెటీగల్ని పుట్టించడం పెంచడం—"

"లేడీస్ కల్చరం టేనో?" అన్నాను.

"ఏమిటీ?"

"వినిపించ లేదూ?"

"మమ్మల్ని ఆక్షేపిస్తే ఊరుకోను సుమండీ, ఏమనుకున్నారో!"

"లేడీస్‌ను పుట్టించడం పెంచడం..."

"సంతోషించాంలెండి తెలివితేటలు. ఈపాటికి భోజనానికి, లెండి."

ఉడుకుబోత్తనంతో నా భార్య చేతిసంచీలోవస్తువులు యిటూ అటూ సర్ది, కలాలుతీసి బల్లమీద పెట్టి, హెయిర్ పిన్నులూ, దువ్వెనా, అద్దమూ సొరుగులో పెట్టి, కొన్ని కాగితాలు తీసుకొని వెళ్లి తన పెట్టెలో పెట్టి తాళం వేసుకొన్నది. ఇద్దరమూ భోజనానికి లేచాము.

* * *

భోజనము చేసి వచ్చి తాంబూలం నములుతూ సోఫామీద వాలుతుంటే పచ్చకాగితం మడత ఒకటి కింద కనిపించింది. నా భార్య సంచీలో కాగితాలు సర్దుకొంటూండగా కిందపడి ఉంటుందని ఊహించి బద్ధకంగా వంగి కాగితం మడతతీశాను. బద్ధకంగానే మడతవిప్పాను. మొదటి పంక్తి చదివాను. ఉలిక్కిపడి లేచి కూచున్నాను. ఎలెక్ట్రిక్ షాక్ తగిలినంతపని జరిగింది. ఆ మూలాగ్రంగా ఆ కాగితం చదివాను. "సటీ" అని కేక వేశాను.

"ఏమి టా వెర్రికేకలు— వస్తున్నానుండండి" అని ప్రక్కగదిలో నుంచి నా భార్య సమాధానం యిచ్చింది ప్రేమపూర్వకంగా! నా కళ్లను నేను నమ్మవచ్చునా, నేను కలగంటున్నానా అనుకొంటూ మళ్లీ కాగితం చదివాను. నాకళ్లు నన్ను మోసగించడం లేదు. పచ్చకాగితం మీద బంగారం అద్దిన అక్షరాలు, యింగ్లీషు అక్షరాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

నగ్నదిన మహోత్సవాహ్వాన పత్రిక —లేడీస్ కల్చర్ క్లబ్;—అని పైని హెడ్డింగు ఉన్నది:

* * *

నగ్నదిన మహోత్సవమును, యీయేడు క్రొత్తగా జరపవలెనని కార్యనిర్వాహకవర్గమువారు తీర్మానించారు కాబట్టి క్లబ్బుసభ్యురాండ్రందరూ యిందు పాల్గొనవలసినదనియూ, జయప్రదముగా నిర్వహించడము

నకున్నూ యిందుమూలముగా ఆహ్వానింప బడుచున్నారు.

వరాలు-

౧. అందరికీ అనుకూలమైనదినమే ఏర్పాటుచేసి తెలియజేయబడును కాబట్టిన్నీ అందరికీ అనుకూలమైన రహస్యస్థలమందే యీ మహోత్సవము జరుపుటకు నిశ్చయింపబడినది కాబట్టిన్నీ సభ్యురాండ్రందరూ తప్పక పాల్గొనవలసి యున్నది. పాల్గొనని సభ్యురాండ్రు తమ సభ్యత్వమును వదలుకోనైనా వదులుకోవాలి, లేదా, ఏభై రూపాయలు క్లబ్బుకు దండుగైనా చెల్లించాలి.

౨. సభ్యురాలు ఒక్కొక్కంటికి నమ్మకమైన ఒక స్నేహితు రాలిని గెస్టుగా తీసుకొనిరావచ్చును. పూర్వకాలపు వితంతువులైనా సరే. సభ్యురాండ్రకు వలెనే స్నేహితురాండ్రున్నూ, క్లబ్బురూల్సు అన్నింటికీ బద్ధులై ఉండవలెను.

౩. నగ్నదినమున పాల్గొనే సభ్యురాండ్రు గాని, యితరస్త్రీలు గాని ఎట్టివిధమైన బట్టలూ—నూలువికాని, పట్టువికాని, ఉన్నివికాని, మరి ఏ యితరపదార్థములతో తయారైనవికాని—కట్టుకోరాదు. ఏ శరీరభాగమూ ఆచ్ఛాదితము కారాదు.

౪. తీసివేయడానికి వీలైన నగలు తీసివేయాలి. తీసివేయడానికి వీలులేని నగలు—కడియాలూ-చెవులకు పోసులతో బంధించిన లోలకులూ, జూకాలూవంటి ఆభరణాలూ మున్నగు ఉంచుకోవచ్చును. ఎవరికైనా నల్లపూసల పేర్లూ మంగళసూత్రాలూ ఉన్నట్లయితే అవి కూడా తీసివేయడం మంచిదని సలహాయిస్తాము సిల్లీ సెంటిమెంటూ, తెలివి తక్కువ సందేహాలూ పెట్టుకోవడం మంచిది కాదుగదా!

౫. శరీరమున కంతకూగాని, ఏఒక్క శరీర భాగమునకు గాని ఎట్టిపూతలూ పనికిరావు. ఫేసుపౌడరు, స్నో, చెర్రీబ్లాసం, లిప్‌స్టిక్, గంధం, పసుపు, కుంకుం, తలనూనె యిత్యాది పూత లేమీ పూసుకోరాదు. అందరూ తలనీ ళ్లోసుకొని ఆరోజున వచ్చి ఆవుత్సవములో పాల్గొనవలెను.

౬. జడలూ, ముడులూ వేసుకోరాదు. కొప్పు పెట్టుకోరాదు. తలలో పువ్వులూ, పిన్నులూ పెట్టుకోరాదు.

౭. పాలుతాగే చంటిపిల్ల లున్నవాళ్లు పిల్లలను తీసుకొని రావచ్చును గాని యింటి వద్ద దాదులకు వప్పజెప్పడమే మంచిదని అట్టి వారికి సలహా యిస్తున్నాము.

౮. ఆరోగ్య సౌందర్యముల వృద్ధికొరకే ఈ నగ్నదిన మేర్పాటైనది. కాబట్టి అందు కనుగుణంగా అందరూ సంచరిస్తారని ఆశిస్తున్నాము.

౯. ఈవిషయం సభ్యురాండ్రున్నూ, గాదలిచినవారి స్నేహితురాండ్రున్నూ గూఢాతిగూఢంగా ఉంచాలి. భర్తలకుసమేతం చెప్పరాదు.

౧౦. మహోత్సవము జరుగుదినమున్నూ, స్థలమున్నూ ముందుముందు తెలుపగలము.

*　　*　　*

ఇదీ సంగతి నేను కలకనడం లేదు. ఇదంతా యదార్థమే. మళ్లీ కేక వేశాను "వటీ" అని.

వచ్చింది నా భార్య-వటీ! జపాను స్త్రీలు వేసుకొనే "కిమోనో" అనే చొక్కా తొడుక్కొంది. వళ్లంతా పట్టుపువ్వులు, పట్టు ఆకులు, పట్టు సీతాకోకచిలకలతో మెరిసిపోతోంది. చీర కట్టుకోలేదు. చీరకు బదులు టర్కీ-స్త్రీలు తొడుక్కొనే లాంటి లాగు తొడుక్కొంది. మొహమల్ స్లిప్పర్లు తొడుక్కొంది. తాంబూలం నములుతూ వచ్చింది. నా భార్యను నేను పోల్చలేనంతమార్పు ఆ అలంకరణ మావిడకు తెచ్చిపెట్టినది. వచ్చి సోఫామీద నాపక్కని కూచుంది. "వెల్, మైడియర్, ఎందుకు పిలిచారు?" అంది.

ఎంతో ఉత్సాహంతో నాకు ఆనందం కూర్చాలని కొత్తకొత్త అలంకారాలు చేసికొనివచ్చి నా పక్కని కూచున్న నా భార్యకు ఉత్సాహ భంగం కలగజెయ్యడం క్రూరత్వమనిపించింది. నగ్నదినం సంగతి తరవాత మాట్లాడుకో కూడదా అనుకొన్నాను. లోపలనుంచి పుట్టుకువస్తూన్న కోపాన్ని, జెలసీని దిగమింగదలిచాను. కాగితం మడత నా భార్యకు కనిపించకుండా సోఫా కవరులోకి తోశాను.

"ఎందుకు పిలిచారో మాట్లాడరేం?" అంది నా బుజంమీదికి వాలుతూ.

"ఊరికేనే, ఆలస్యంచేస్తూ ఎంతకూ రాలేదని" అని అబద్ధమాడాను.

"మరి ఆ వెర్రి కేక వేశారేమి?" అన్నది నామీసం నదులుగా పట్టుకొని.

"వెర్రికేకా; నేను కేకవేస్తే వెర్రికేకాను, నువ్వు కేకవేస్తే కోకిల పలుకూను—అవునా?"

"మీరు తొందరగా బెంగగా కేక వెయ్యలేదూ? నిజం చెప్పండి."

"నేను చూస్తే వెర్రి చూపూను, నువ్వుచూస్తే తుమ్మెదబారూను—అవునా?"

"కావ్య" ధోరణిలో పడుతున్నారేం? మను చరిత్రగానీ చదువుతున్నారా ఏమిటి?" అంది మీసం నులుముతూ

"నువ్వు పిలిస్తే ఆజ్ఞాను, నేను పిలిస్తే మాటాను—అవునా?" అన్నాను మీసం వదిలించుకొని.

"నా పీచ్‌కి ధోరణి ఎక్కువౌతోందేం?" అంది నా క్రాపింగుజుట్టులో వేళ్లుపెట్టి తడుముతూ.

"మై డార్లింగ్" అని నడుంచుట్టూ చెయ్యివేసి దగ్గిరికి లాక్కొన్నాను.

నా భార్య తల షాంపూ వాసన వేస్తోంది. ముఖం పౌడరు వాసన. చెక్కిళ్లు చెర్రీవాసన. కిమోనో మల్లి పువ్వుల వాసన. నా గదిలో అత్తరవు చెట్లు పూసినట్లుంది. నాభార్య వళ్లో వాలింది.

మళ్లీ నగ్నదినం సంగతి జ్ఞాపకం వచ్చింది. అడగా లనుకొన్నాను. ఆనందమయమైన నాగదిని శుద్ధ సినీమాసీను చెయ్యడం మంచిదికా దనిపించింది. అయినా—మొత్తం మీద—ఆడవాళ్ల తళుకు బెళుకుల ముందర మగవాళ్లు వర్థి......

౨

ఉదయాన్నే కాల్యకృత్యాలు తీర్చు కొన్నాను. నాభార్య కాఫీ వగైరాలు బల్లమీద తయారుచేసి ఉంచింది. ఇద్దరమూ కబుర్లు చెప్పు కొంటూ కాఫీ పుచ్చు కొంటు న్నాము. నా భార్య ఒక స్వెటరు వేసుకొంది. పల్చని చారలచీర కట్టుకుంది. అది బహుశా ఉదయకాలపు డ్రస్సై ఉండవచ్చు.

"అయితే వటీ—ఈమధ్య నేనో పుస్తకం చదివాను. బహుశా నువ్వూ చదివే ఉండవచ్చు. "న్యూడిస్టుకల్టు" దానిపేరు అన్నాను.

"ఒకపుస్తకమేమి? చాలా పుస్తకాలు చదివాను" అన్నది కాఫీ చప్పరిస్తూ.

"అయితే ఈ నగ్నసిద్ధాంతం నీకు సమ్మతమే నంటావా? ఆడవాళ్లూ, మగవాళ్లూ దిగంబరులై ఏకదేశంలో సంచరించడం ప్రమాదకరంగాదూ?"

"మీ కన్నీ ప్రమాదకరాలే! నాలుగు శతాబ్దుల వెనక ఉండవలసినవారు మీరు."

"నువ్వు నాలుగు శతాబ్దాలు ముందుండవలసినదానవు కావూ?"

"మాటలు నేర్చినకుక్కను ఛీ అంటే ఛీ అందిట."

"సరేగాని, మనము ఒక సంఘంలో ఉన్నతరవాత ఆ సంఘపు కట్టుబాటుల......"

"చాల్లెండి మీరూ మీపుచ్చు సంఘమూను. వితంతు వివాహమంటే, విడాకుల చట్టమంటే, రజస్వలా వివాహమంటే, నగ్నసిద్ధాంతం అంటే అన్నీ ప్రమాదకరములే మీకూ మీ సంఘానికిన్నీ."

"అయితే ఒక ప్రశ్న అడగనా?"

"అడగండి. అందుకు నా ఆజ్ఞ కావాలా?"

"మరి నీవు వెడతావా నగ్నదిన మహోత్సవానికి?"

నా భార్యముఖం వెల్లబారింది. ఎరగనట్టు నటిస్తూ అందికదా "నగ్నదిన మహోత్సవ మేమిటి?"

"ఏమిటో నీకు తెలియదూ?"

"ఏమిటో అసలు చెపుదురూ?"

"నీకు తెలియదూ?"

"చెప్పరుకాదూ! నా స్వీట్ డియర్ కాదూ! నా సోల్ కాదూ! చెప్పండి మరి!"

"నీకు ఆహ్వానం కూడా వచ్చింది కాదూ?" అన్నాను.

"ఎవరు చెప్పారు మీకు?"

"ఎవరూ చెప్పలేదు. నేనెరుగుదును."

"అలాగా! ఎరిగుంటే దాచుకోండి! నాకు చెప్పక్కర్లేదులెండి."

"మీ క్లబ్బువారే జరుపుతారటగా" అన్నాను.

నాభార్య భయంతో అనుమానంతో తాగుతూ తాగుతూ ఉన్న కాఫీ అక్కడ ఉంచి లోపలికి వెళ్లింది. తనపెట్టె తాళంతీసి కాగితాలన్నీ పరీక్షచేసింది. నాగదంతా వెదికింది. నాకాగితాలన్నీ కిందామీదా పారేశింది. తనచేతి సంచీ తిరగా బోర్లా వేసి చూచింది. బిక్కమొహంతో వచ్చి మళ్లీ నాయెదట కూర్చుని కత్తులు విసురుతోంది నామీద కళ్లతో!

"ఇలాంటిపనులు ఎప్పుడు నేర్చుకొన్నా" రండి..

"ఎలాంటిపనులు?"

"దొంగపనులు - నాకాగితం మీరు తియ్యలేదూ!"

"కాగితం పారేసుకున్నావా?"

"మరే."

"మరే అయితే అనుభవించు."

"నాకాగితం తీశారాలేదా!"

"నిజం చెప్పనా?"

"నాకాగితం నా కియ్యండి."

అని ఏడుపుమొహం పెట్టింది.

"నేను నీకాగితం తియ్యలేదు, కళా! నిన్నరాత్రి సోఫాకిందఉంటే ఏమిటో నని తీసి చూచాను" అన్నాను లేచి నాభార్యవెనక నిలబడి తలరాస్తూ.

"సంచీలోంచి పడిపోయింది కాబోలు-" అన్నది.

"కావచ్చు" అన్నాను.

"నాకాగితం మీ రెందుకు చదర వాలీ?"

"చదవవద్దన్నావా?"

"నా కేంతెలుసు మీరు తీస్తారనీ?"

"దానిమీద చదవనద్దని లేదే!"

"నాకాగితం నాకివ్వండి."

"సోఫామడతలో పెట్టాను."

అనడంతోనే నాభార్య గదిలోకివెళ్లి ఆహ్వానపత్రిక తెచ్చింది.

"భర్తలకు కూడా చెప్పగూడదని యిందులో లేదూ" అన్నది.

"ఉన్నమాట వాస్తవమే."

"మరి ఎందుకు చదివారూ?"

"నీకు మతిపోతోంది. చదివాక తెలిసింది ఆవాక్యం అందులో ఉన్నదని. నేను చదివితే నీకు వచ్చే ఉపద్రవం ఏమీ లేదూలే."

"నే నొకటి చెపితే చేస్తారా?."

"ఒకటిగాదు, పది చేస్తాను."

"ఇందులో విషయాలు ఎవరితోనూ చెప్పనని ఒట్టు వేసుకోండి."

"ఏమని ఒట్టు?"

"నామీద ఒట్టు వేసుకోండి."

"అమ్మో! నీమీదే? నేను వేసుకోను. నీవు నా ప్రాణమునకును ప్రాణమా ప్రాతకాంతవు కాదూ?"

"అయితే యితరులతో చెప్పతారన్నమాట" అంది.

"ఎన్నటికీ చెప్పను" అన్నాను.

"అయితే ఒట్టేసుకోండి" అని చేతులెత్తి నా చెవులు గట్టిగా పట్టుకొని, "వేసుకుంటారా? వేసుకుంటారా? ఏం?" అంది.

"వదులు, వదులు, అమ్మో, అయ్యో, వదులు, వేసుకుంటా వేసుకుంటా" అన్నాను ఆమె తలమీదకు వంగి.

"వేసుకోండి మరి."

"వదులు, వేసుకుంటా! ఎవ్వరితోనూ నగ్నదిన మహోత్సవాహ్వాన పత్రికను గురించి చెప్పను— నీతోడే; నీ మీద ఒట్టు—ఈ మాటు వదులు."

నాభార్య చెవులు వదిలింది. నిలబడి రెండు చెవులూ ఎన్నిమార్లో ముద్దెట్టుకొంది. ఆ విధంగా నొప్పి తీసివేసిందిట.

"వట్టిమోటమనిషి వై పోతున్నావు సుమా! అబ్బ" అన్నాను చెవులు తడుముకొంటూ.

"మరే! నాకాగితం చదవొచ్చుగాని" అంది.

"నీవే యింత పెంకెమనిషివి గాని మిగిలిన స్త్రీ మెంబర్లందరూ తమ భర్తలతో చెప్పకుండా ఉండగలరనుకున్నావా ఏమిటి?"

"ఎప్పుడూ చెప్పరు."

"చెప్పరూ? అందరూ నీలాగే అనుకొన్నావు కాబోలు?."

"మగవాళ్లనుకొన్నారా ఏమిటి చెప్పడానికి" అని నాకేసి తిరిగి మెకెనవ్వు నవ్వింది.

"అవును, అందుకనే ఆడవాళ్లనోట్లో నువ్వుగింజ నానదన్నారు"అన్నాను.

"మానోట్లో నువ్వుగింజ నానక్కర్లేదులెండి. అన్ని నువ్వుగింజలూ మీ నోళ్లల్లోనే నానవేసుకోండి" అని విసురుకుంటూ తిప్పకుంటూ స్లిప్పర్లు తొడుక్కొని కాఫీముగించి నాభార్య యింట్లోకి వెళ్లిపోయింది - డ్రెస్సు మార్చుకోవడానికి.

నే నెన్నో ప్రశ్నలు వేయదలుచుకొన్నాను ఆవిణ్ణి. వీలైనదికాదు. పోనీ యింకోమాట.

## 3

నెల్లాళ్లక్రితం ఒకఇంగ్లీషు దొరసాని లేడీస్ కల్చరుక్లబ్బులో "దిగంబరత్వము: ఆరోగ్యము" అనేవిషయముమీద ఉపన్యాసము యిచ్చినదట. దిగంబరత్వమనగానే భయపడనక్కరలేదనీ, దానివల్ల ఎటువంటి ముప్పులూ సంభవించవనీ, వస్త్రధారణము మనము తెచ్చిపెట్టుకొన్నది గాని మనకు సహజముకాదనీ, దిగంబరత్వమే మనకు సహజమైనదనీ, మృగములనుండి మనము నేర్చుకొనవలసిన విషయములలో యిది వక్కటని ఉపన్యసించింది. ఈ వస్త్రధారణమువల్ల మనకు అనేకకీడులు తటస్థిస్తున్నవనీ, అనేక చెడుగుణములు కలుగుతున్నవనీ నొక్కి చెప్పింది.

సిగ్గు బిడియములు జంతు కోటిలో ఎక్కడా లేవనీ వస్త్ర ధారణమువల్లనే మనుష్యుల కవి సంక్రమించినవనీ తెలియజేసింది. సూర్యరశ్మి తగలకుండా, గాలిప్రవేశించకుండా దేహభాగములు నిరంతరమూ కప్పకోనడంవల్ల స్త్రీ పురుషుల కనేకవిధముల రోగములు కల్గుతున్నవని నిదర్శనపూర్వకముగా నిరూపించింది. ప్రపంచములో కామవికారము జంతువులం దుద్భవించడము సంతానాభివృద్ధికోసమే ననిన్నీ, అది ఒక ఋతువులోనే తటస్థిస్తున్న దనిన్నీ, మానవులలో యీ కామము, వస్త్రధారణమువల్లనే అసహజమై, రోగప్రాయమై, నిరంతరమై, బాధించుచున్న దనిన్నీ, దిగంబరత్వమే అవలంబించినట్టయితే నీతి దుర్నీతులకు సంఘములో స్థానమే ఉండదనిన్నీ తేల్చింది. స్త్రీ పురుష భేదము మానవ హృదయాలలో అంకురించడ

నికి యీ వస్త్రధారణమే మూల మన్నది. దిగంబరత్వమువల్ల అట్టి భేదము అంతరించుననీ మానవులలో ఏకత్వం సంభవించుననీ చెప్పింది. ఆవులూ, కుక్కలూ, పిల్లులూ మున్నగు జంతువులు నగ్నంగా లేవా? అందువల్ల వాటి కేమిముప్పువచ్చింది? వాటిని మనము నగ్నముగా చూడ్డంలేదా? మనకు వింతగా ఉన్నదా? కారణము అలవాటు. కాబట్టి అలవాటుచేసుకొన్నట్లయితే దిగంబరత్వమువల్ల మనకు అనేకలాభములు కలుగుననిచెప్పింది. దిగంబరత్వము మనసిగ్గును పారదోలుతుంది. మనసీతిని తలయెత్తనియ్యదు. మనని అంతరకామ వికారమున కది మందు. మనరోగము లంతరించుటకు దిగంబరత్వ మమృత ప్రాయమైనది. దిగంబరత్వము మన జన్మహక్కు అని ఆదొరసాని తన ఉపన్యాసము ముగించింది.

ఈ ఉపన్యాసము విన్న లేడీస్ కల్బుసభ్యులు మెంబర్లందరూ ఎంతో సంతోషించారు. నాగరీకమున కాటపట్టులైన పాశ్చాత్యదేశాలల్లో నగ్న క్లబులు బయలుదేరు తున్నవన్న కారణముచేత తామున్నూ అట్టి ప్రయత్నములు సల్పడము ఉచితమని తీర్మానించుకొన్నారు. దేశకాలముల ననుసరించి ప్రస్తుతము స్త్రీలు మాత్రమే నగ్నత్వం అవలంబించవలెననీన్ని, అవసరమని తోస్తే ముందుముందు పురుషులను కూడా చేర్చుకోవచ్చుననీన్ని అనుకొన్నారు. దీని పర్యవసానమే నగ్నదినమహోత్సవాహ్వాన పత్రిక.

* * *

"సిగ్గూబిడియం లేకపోతే సరి-ఎందుకొచ్చిన బతుకంట - మనిషిజన్మ ఎత్తితే నరా..." అనబోతూం టే నా భార్య నా నోటి కడ్డంగా చెయ్యిపెట్టి అన్నదికదా, "మైడియర్ స్వీట్ హబ్బీ, మీ కేమైనా ఇమేజినేషన్ ఉందా? ఊహాపోహలున్నవా ? స్వతంత్రాలోచన ఉందా? దిగంబరత్వాన్ని గురించి యింతా చెప్పితే శ్రీరంగనీతులు చెబుతున్నారా? మీరు నాకు భర్త అని చెప్పుకోడానికి నాకు సిగ్గుగా ఉంది."

"అయితే వదలిపెట్టరాదూ."

"మిమ్మల్ని వదలిపెట్టడం? వటీ రావు అంటే ఏమనుకొన్నారో?"

"అయితే నిజం చెప్పు; బట్టలు లేకుండా తిరిగితే సిగ్గుండదూ?"

"ఎందుకు సిగ్గు; మీరు నా ముక్కు చూడ్డంలేదూ, నోరు చూడ్డంలేదూ, చెవులు చూడ్డంలేదూ? సిగ్గుపడుతున్నారా? దేహమంతా చూసితే ఏమితప్పు ఎందుకంట సిగ్గు."

"అను, అనేదేమిటో పూర్తిగాఅను."

"అంటాను నాకేం భయం లేదు. ఈ దొంగ బిడియాలు నాచేత గావు. బ్రాహ్మలనీ బ్రాహ్మణేతరులనీ, స్త్రీలనీ పురుషులనీ, భేదాలు పెట్టి అన్యాయం చేసేరోజులు వెళ్లాయిలెండి."

"అయితే యీస్త్రీ పురుష భేదానికి కూడా బ్రాహ్మలే కారణమంటావా ఏమిటి?"

"ఏమో! ఎవరుకారణమైతే నేమి? అన్యాయం అన్యాయమే."

"శాంతించు, వటీ, శాంతించు— ఆవేళ నేను చెప్పినమాట నిజమైందా?"

"ఏమిటా మాట?"

"మెంబర్లు భర్తలతో యీవిషయం చెబతారన్నాను, జ్ఞాపకంలేదూ."

"నే నెవ్వరినీ అడగలేదులెండి."

"నేను అడక్కుండానే మెంబర్ల భర్తలు నాదగ్గిరికి వచ్చి ముక్కుమీద వేలు వేసికొని చెప్పారు" అన్నాను.

"చెప్పి!"

"ఇది తప్పించే మార్గం లేదా అన్నారు."

"అంటే మీా రేం చెప్పారు?."

"ఏమీా లేదు. చూస్తూ ఊరుకొని ఉండడమే మంచిది అని చెప్పాను."

"ఇన్నాళ్లకు మీరు తెలివిగా ప్రవర్తించా రని సంతోషిస్తున్నాను."

"అయితే, కళా, మొగాళ్లులేని ఆడవాళ్ల నగ్నత్వంవల్ల ప్రయోజనమేమిట"న్నాను.

"అయితే మీారుకూడా వస్తారా?"

"నన్ను రానిస్తారా?"

"మీాకొక్కరికీ నేను అనుమతి తెస్తాననుకోండి."

"నేను రానుసుమా, నాకు సిగ్గు."

"అయితే ఎందు కాపెంకె ప్రశ్న వేశారు?"

"నీచిత్తవృత్తి తెలియడానికి."

"అయితే మీా రొచ్చి తీరాలి. తప్పదు."

"బలవంతమా ఏమిటి."

"ఆ, బలవంతమే. రహస్యంసుమండీ, ఎవరితోనూచెప్పకూడదు సుమండీ."

"మళ్లీ నీమీద ఒట్టేసుకొమ్మంటావా?"

"నామీద ఒట్టేసుకొమ్మనను లెండి—వినండి. ఆదవారం రాత్రి పది గంటల మూడుగంటల మధ్య దీపస్తంభాని కెదురుగా ఉన్న బీచిలో నగ్నదిన మహోత్సవం జరుగుతుంది."

"రాత్రి చీకటికాదూ."

"వెన్నల రాత్రుల్లు కాదండీ."

"అవును అన్నట్టు; రాత్రి బీచి ఒడ్డున చలివెయ్యదూ?"

"ఓర్చుకోవడానికి సిద్ధపడ్డాము లెండి. ఎవరితోనూ చెప్పకండిసుమా. మీరొక్కరే రండి."

"చూస్తాను."

"చూడ్డంకాదు. తప్పక రావాలి!"

* * *

క్లబ్బు మెంబర్లందరూ మహోత్సవం జరపడానికి మార్గాలాలోచించుకుంటూంటే మెంబర్ల భర్తలము మేమందరమూ దానిని చెడగొట్టే ఉపాయాలు వెదుకుతున్నాము.

ఒకరోజు ముందునుంచీ క్లబ్బు మెంబర్లందరూ క్లబ్బులోనే ఉండిపోవడం మొదలుపెట్టారు. అక్కడే భోజనాలేర్పాటు చేసుకొన్నారు. అక్కడే పడకలు ఏర్పాటు చేసుకొన్నారు.

ఆకారణంవల్ల భర్త లందరికీ కొంత తీరుబడి చిక్కింది. మేమంతా మా యింట్లో సమావేశమయ్యాము. మన హిందూ దేశంలో మన స్త్రీలు యిటువంటి పనులు చేస్తున్నారంటే లోకములో హిందూ స్త్రీజాతి కంతకీ అవమానకరంగా ఉంటుం దనిన్నీ, హిందూ స్త్రీల మాన మర్యాదలు కాపాడేబాధ్యత పురుషుల మీద ఉన్నదనిన్నీ, తత్కారణ మున ఈనగ్నదిన మహోత్సవం జరగకుండా చెయ్యడం ధర్మమనిన్నీ తీర్మానించు కొన్నాము. ఈఉత్సవము జరిగేస్థలము కాలము తెలుసుకోవలసిన అవసరం ఉన్నదనుకొన్నాము. స్థలమూ కాలమూ నాకు తెలుసునన్నాను. నాతోబాటుఅక్కడిపురుషులందరూ మాకు తెలుసునంటే మాకు తెలుసునన్నారు. అందరికీ తెలిసినస్థలము — దీపస్తంభాని కెదురుగా బీచివడ్డు. అందరికీ తెలిసిన కాలము — ఆదివారంరాత్రి పదిగంటలకీ మూడుగంటలికీ మధ్యకాలం. ఇక దీనికి ఆటంకములు కలుగజెయ్యడము ఎలాగా అనుకొన్నాము.

'ఆడవాళ్లను ఆరోజున యింట్లో బంధించకూడదా?' అన్నాడు ఒక పెద్ద మనిషి. --స్త్రీస్వభావం తెలియనివాడు, ప్రాణాలకు తెగించీ!

'ఆడవాళ్లకు నగల బట్టల ఆసచూపి మానిపించవచ్చునేమో?' అన్నాడు ఇంకోడు ధనికుడు.

'వాళ్లతోపాటు మనమున్నా అక్కడ అప్పుడు తయారవుతేనో?' అన్నాడు యింకో బుద్ధిమంతుడు. ఈ ఉపాయం బాగుందంటే బాగుం దని అందరమూ వప్పుకొన్నాము. అందరమూ, ఆరోజున, గూఢమార్గాన్ని బట్టి ఎవరికీ తెలియకుండా బీచికి చేరుకోడానికి నిశ్చయించుకొన్నాము.

అయితే ఒకసందేహం కలిగింది. ఒకవేళ స్థలమూ కాలమూ విషయమై ఏమైనా మోసం జరిగిందేమో? ప్రతిభర్తా ... తనభార్య చెప్పగా తెలుసుకొన్నట్టే చెప్పాడు. భార్యలందరూ భర్తల్ని ఒకమోస్తరుగానే మోసంచేసి ఉండవచ్చు ననిపించింది. ఏమైనా స్థలమూ కాలమూ అవే అని నిశ్చయము చేసుకొన్నాము.

## ౪

ఆదివారం తొమ్మిది గంటలకు భర్తలందరమూ మాయింట సమావేశమయ్యాము. మోస ముండదని నిశ్చయించడముకోసము క్లబ్బువ్యవహారాలు తెలుసుకొంటున్నాము.

క్లబ్బుకు ఉండుండీ ఒక్కొక్క కారు వస్తోందిట. రావడంతోనే ముసుగేసుకొన్న ఒకస్త్రీ కారులో ఎక్కుతోందిట. తెరలు దింపుకొని కారు బీచికి వెళ్లుతోందిట. ఇది తెలుసుకొన్న పిమ్మట మాకు ధైర్యం కలిగి ఒకరితరువాత ఒకరము వేరువేరు మార్గాల్ని బట్టి బీచికి బయలుదేరాము.

పది దాటింది. మేమందరమూ అనుకొన్న ప్రకారము దీపస్తంభము వెనక చేరుకొన్నాము. కార్లు వస్తున్నాయి. స్త్రీలు దిగుతున్నారు. స్త్రీలు ముసుగుతోనే బీచివద్దునడుస్తున్నారు. రావలసిన కార్లన్నీ వచ్చినట్టే తోచింది. అందరుస్త్రీలూ దిగినట్టే తోచింది. గుంపులు గుంపులుగా స్త్రీలందరూ చేరుకొని ఏమేమో కబుర్లు చెప్పకొంటున్నారు.

స్త్రీలు తమబట్టలు విసర్జించుకోవడం మొదలు పెట్టడంతోనే మేము మరుగునుంచి వెల్లడిస్థలమునకు వారికి బాగా కనిపించే స్థలమునకు రావలెనని నిర్ధారణచేసుకొన్నాము. పదకొండుగంట లైంది. స్త్రీలు

యథాప్రకారం తిరుగుతున్నారు. నగ్నలు కాలేదు. పన్నెండు గంటలైనది. ఏమీ మార్పు లేదు.

మాకు కారణం తెలిసింది కాదు. మమ్మల్ని కనిపెట్టి ఉంటారా వాళ్లు అనుకొన్నాము. మేము కోరినదీ అదేగదా! వాళ్ల నగ్నదినమును భగ్నము చెయ్యడమే మా ఆశయముగదా! అది ఈడేరుతూన్నందుకు మాకు సంతోషముగానే ఉన్నది కాని—నిజం చెప్పవలసి వస్తే—మా కందరికీ ఒక విధంగా ఆశాభంగం కలిగింది. ఎంత నగ్నదినాన్ని భగ్నం చెయ్యదలచుకొన్నా మా మనస్సులు నగ్నలను చూడ్డానికి తహతహపడుతూనే ఉన్నవి.

ఒంటిగంట అయింది ఏమీ మార్పు కానరాలేదు. మాకు విసుగెత్తింది. చలి వేస్తోంది. నిద్రకు కళ్లు బరువెక్కుతున్నాయి. చంద్రుడు పశ్చిమదిక్కు చేరబోతున్నాడు. చంద్రకాంతిని తరంగశిఖరాలమీద లాలిస్తున్నాడు సముద్రుడు. సముద్రఘోష దిక్కులను కప్పింది.

మేము ఒకరొకరము బీచికి చేరుకుంటున్నాము. నీరుపారి తడిసి గట్టిపడిన యిసుకమీద నడిచి వెళ్లాము. స్త్రీల గుంపులను సమీపించాము. నాభార్యకోసం నేను వెదికినట్టే యితరులున్నూ తమభార్యలకోసం వెదుకుకొన్నారు. నాభార్య నాకు కనిపించలేదు. వాళ్ల భార్యలు వాళ్లకు కనిపించలేదు.

రెండుగంట లయింది. అందరమూ మళ్లీ దీపస్తంభందగ్గిర చేరుకొన్నాము. ఏమిటిది అంటే ఏమిటిది అనుకొన్నాము.

మనలను మోసంచేసి వాళ్లెక్కడికో పోయారు అని సిద్ధాంతం చేసుకొన్నాము.

మరి యీబీచిని యీస్త్రీరత్నము లెవరు?

పరిశీలనగా చూచిన ఇద్దరుముగ్గురు పెద్దమనుష్యులు—

"వాళ్లు దాసీవాళ్లు చూడలేదా?" అన్నారు.

మూడుగంటలైంది. బీచిలో స్త్రీగుంపులు కరిగిపోతున్నాయి. చంద్రుడు అస్తమించాడు.

మేము ఇంటిమొహం పట్టాము, తలలమీద గుడ్డలు బిగించుకొని! కారులు మమ్మల్ని హూటుచేస్తూ పారిపోతున్నాయి దాసీవాళ్లతో కూడా.

సముద్రుడుకూడా తన ఘోషతో మమ్ము గేలిచేస్తున్నాడు.

౫

సోమవారం ఉదయం యింటికి చేరుకొన్నాను. భర్తలందరమూ కాలవ ఒడ్డున మొహాలు కడుక్కొని ఏవిధంగా అలవిగాని ఈ భార్యలను వశము చేసుకోవడమో ఆలోచించి యిళ్లకు చేరుకొన్నాము.

నా భార్య కాఫీ, టిఫిన్ సిద్ధంచేసి ముసిముసి నవ్వులతో, నేను గుమ్మం దాటడం తోనే "గుడ్ మార్నింగ్, డియర్" అన్నది. నా కాశ్చర్యం వేసింది. నా భార్య యింట్లోనే ఉన్నదే. నగ్నదిన మహోత్సవం జరగలేదు కాబోలు అనుకున్నాను. "గుడ్ మార్నింగ్, డార్లింగ్" అని ముభావంగా చెప్పి లోపలికి వెళ్లిపోయాను.

"అవశిష్టాలు తీర్చుకొని చప్పున రండి కాఫీకి" అంది.

"ఊఁ" అన్నాను.

* * *

కాఫీ తాగుతున్నాము. నా భార్య నాకేసి తిరిగి, "పాపం, ఆశాభంగం కలిగింది కాబోలు, సారీ!" అన్నది.

"ఎందుకు మమ్మల్ని మోసంచేశారు?"

"మిమ్మల్ని ఒకరినే రమ్మంటే అందరినీ ఎందుకు తీసుకువెళ్లేరు?"

"నేను తీసుకు వెళ్లలేదు. వాళ్లంతట వాళ్లే వచ్చారు."

"ఈ మొగాళ్లతో చెప్పితే కార్యాలు యిలాగే జరుగుతాయని మాయ చేశాము."

"ఎందుకంట యీమాయ. మమ్మల్ని రానద్దంటే మానమా?"

"మానరూ, పాపం? రాత్రల్లా దీపస్తంభాన్ని ఆశ్రయించారూ? బీచికి వచ్చిన దాసీవాళ్ల మొహాలు పరకాయించి చూశారూ? ఆశాభంగం కలిగిందేం, పాపం?"

"అప్పుడే ఎలాగ తెలిసింది నీకూ?"

"కార్లు వచ్చాయికావూ."

"ఈమోసం చాలామీన్‌గాఉంది."

"ఇందుకు మీరే కారణం."

"నేనా?"

"ఆఆహ్వానపత్రిక మీచేతులో పడకపోతే ఏమీఉండకపోను."

"ఎందువల్ల?"

"నేను వెళ్లి చెప్పాను — యిటువంటిప్రమాదం కలిగిందని- ఎలాగో భర్తలు- భార్యలవద్దనుంచి యీవిషయం గ్రహిస్తారని ఊహించి మిమ్మ

ల్ని మాయచేసి వేరేయింకోచోట ఉత్సవం జరుపుకోడానికి నిశ్చయించుకొన్నాము. జరుపుకొన్నాము."

"జరుపుకొన్నారా?"

"ఆఁ."

"ఎప్పుడు?"

"ఆదివారంఉదయంమొదల సాయంత్రందాకా."

"ఎక్కడ?"

"పేరాపురంపాడుకోటలో. ఊరికిదూరంగాఉంది. చుట్టూగోడలున్నాయి. లోపలఅన్నీ చెట్లు.ఎంతోరహస్యంగా వైభవంగా జరిగింది."

"ఎంతమోసం. మగాళ్లు ఎవళ్లయినా వచ్చారా?"

"వస్తే పిస్తోలుతో కాల్చిఉందుము!!"

"పిస్తోలుతో కాల్చడానికేనా నన్ను రమ్మంట."

"మిమ్మల్ని వెళ్లమంట బీచికి-పేరాపురంకోటకు కాదు."

"అయింం దేమిటో అయింది - ఏమిటి విశేషాలు?"

"వైభవంగాజరిగిందన్నానుకాదూ."

"మెంబర్లేనా, యింకా యెవరైనా వచ్చారా?"

"నేను నాస్నేహితురాలిని ఒక తెను తీసుకు వెళ్లాను."

"ఏవరూ?"

"ఎవరైతేనేమి? నేను వాళ్లింటికి వెళ్లి, రహస్యంగా అంతా చెప్పి - వస్తావుటమ్మా అన్నాను. అంతే ఆవిడ బుగ్గలమీద వేళ్లువేసుకొని - ఇదేమిటమ్మా! వీళ్ల కేమిచేటుకాలంవచ్చిందమ్మా ? వీళ్ల మొహం ఈడ్చా! యిలాంటిబుద్ధులు పుట్టుకొస్తున్నాయేమమ్మా యీకాలపు ఆడవాళ్లకు? సిగ్గు బిడియాలు ఉండనక్కర్లేదుటమ్మా?—అంటూ అడ్డమైనతిట్లూ తిట్టి చివరికి తయారైంది."

" తిట్టికూడా ఎందుకు వచ్చింది? " అన్నాను.

" తానూ వచ్చి వాళ్ల మొహాలు అక్కడే తగలేస్తానంది. వాళ్లకు బుద్ధిచెబతానంది."

"చివరికి ఏంచేసింది?"

"మాఅందరికన్న ఎక్కువగా ఆవిడే తిరిగింది. ఆరోజు వంటచేసిపెడత ఆవిడే— ఇదిటర్రా నగ్నదినం అంటే, ఏమిటో అనుకున్నాను. ఇందులో కొత్తేముందర్రా. రోజూ తలుపులేసుకొని చిన్నబట్ట కట్టుకొనో కట్టుకోకుండనో పనులు చేసుకోవడం లేదుటర్రా. దీని కింత గొడవ చేశారెందుకర్రా—అంది."

"నువ్వేంచేశావు?"

"బాడ్ మింటన్ వాలీబాల్, పరుగుపందెం—వగైరా ఆటలు ఆడుకొన్నాం కొంతమంది."

"మిగిలిన వాళ్లు?"

"పొట్టలు పెంచుకొన్నవాళ్లూ, దొడ్డికాళ్ల వాళ్లూ, శుష్కవక్షులూ—తమనగ్నత్వాన్ని బహిరంగపరుచుకొనిసిగ్గుపడుతూ వన్యమృగాల్లాగ ఆచెట్టుకిందా ఆచెట్టుకిందా నక్కికూర్చుండిపోయారు —తమకురూపానికి తామే వగస్తూన్నట్టు."

"నీవు సిగ్గుపడలేదుకాబోలు—వన్యమృగంలా నక్కలేదు కాబోలు—ఏం?"

"నాకు ఏమిలోటుందని సిగ్గుపడడానికి —మీరు తప్పు."

"మై డియర్ నాటీ ఓల్డు గరల్!"

"మీరు ఎప్పుడైనా నగ్నదినమహోత్సవానికి వస్తే — నక్కుతా రను కుంటా."

" పెంకే — అయితే దీని కేమైనా ప్రైజుందా?" అన్నాను.

"ఆ, ఉంది, బహుమానం - నేను మీా కిచ్చేది" అంది.

"ఏమి టది?" అన్నాను.

"ఇది" అని నామీాసాలులాగి చెంప వాయించి ముద్దెట్టుకొంది.

"మిస్‌చినవస్ దిగంబరీ" అన్నాను.

---

# సప్తపదులు

బులుసు వెంకటరమణయ్య

ద్రావిడభాషలో శ్రీ గోదాదేవి (ఆండాళమ్మ) రచించిన 'తిరుప్పావై' అను ముప్పది పాశురములకు 'సప్తపదులు' గేయరూపమున తెలుఁగునేత. మూలములోని ఒక్కొక్క 'పాశురము' ఇందు ఏడేసి చరణములుగల పాటగా కూర్పఁబడినది. ఇది సుప్రసిద్ధాంధ్రకవయిత్రియగు ముద్దుపళనిచే రచింపఁబడిన దని ప్రతీతి. ఆ ప్రతీతి ననుసరించియే మచిలీపట్టణమునందలి 'శృంగార కావ్యగ్రంథమండలి' వారు పళనికృతమగు 'రాధికాసాంత్వనము'తోఁబాటు దీనిని చేర్చి, శ్రీ వెంపటి నాగభూషణం, ఎం. ఏ. గారి 'రససమీక్ష'తోఁగూడ ప్రకటించియున్నారు.

రససమీక్షకులు గ్రంథమండలివారి ముద్రణమున కాధారమును, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలుగారిచే ప్రకటితపూర్వము నగు గ్రంథమునుగూర్చి క్రిందివిధమున వ్రాసియున్నారు—

"శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలుగారు—ఈ విషయంలో, తాను చేయ గల్గిన సాహాయ్యాను ... తెలుగుతల్లికి ... సాహసించి—చేశారు. ఉపలబ్ధములైన—ముద్దుపళని 'సప్తపదుల'లో నెరసులను—పూర్వాపేక్షిక ప్రమాదవశములైనవాటిని—మాతృకతో సరిపోల్చి సవరించి,—మిగిలిన ఇరవై పాశురములకున్నూ 'వాక్కులందు భక్తిరసము వాకలూరగా'—తెలుగుసాయించి చక్కని శీర్షికతో, 'సప్తపదుల'ను—ఒక 'పురస్కారం' క్రింద ప్రచురించారు. శ్రీ శాస్త్రిలవారు,... ముద్దుపళనిపద్ధతిని అనుసరించి, 'సప్తపదు'ల మిగతా గ్రంథమును పూరించకుండా, ద్రావిడ గాథలకు వివరణం వ్రాసి ఊరుకున్నా-ప్రమాదమేమీ ఉండేదికాదు......

అతుకు అతుకుగానే ఉన్నందువల్ల... రసవ్యత్యస్తమునకు ఏమీకాని—గ్రంథమునకు, ఛందోరీత్యా, ఏకరూప మిచ్చినశ్రమకు—శ్రీ శాస్త్రిలవారు-వంద్యులు.

ముద్దుపళని—ఒకవేళ—పది 'పాశురము'లకు మాత్రమే తెలుగుగీతములు కూర్చినదేమో అని పిస్తున్నది. గ్రంథమంతా ఆమె రచించినదని వినిక్కి అయినా ఎక్కడా లేనందువల్ల. పైగా, మొదటి పదే—ముప్పదిగాథలలోనూ ...రసవంతములు. అనర్ఘభోగములకే అలవడిన ముద్దుపళని, అలా చేసి ఉన్నదనడం లోనూ...అనౌచిత్యము ఏమీ లేదూ..."

పయి వ్రాఁతలోని విషయములు కొన్ని సంతృప్తికరములు కావు.* కావున 'సప్తపదు'ల తత్త్వమును ఎఱుఁగఁగోరి శ్రీ ప్రభాకరశాస్త్రిలుగారితో ఈ విషయముంగూర్చి ప్రస్తావించితిని.

వారు పూరించి ప్రకటించిన 'సప్తపదుల' ప్రతి వారియొద్దను లేదు; అది ౧౯౨౫-౨౬ సం. న శ్రీ కనుపర్తి మార్కండేయశర్మగారు ప్రచురించుచుండిన 'స్వధర్మప్రకాశిని'లో ప్రకటింపఁబడినవి. ప్రత్యేకించి తీయఁబడిన ప్రతులత్యల్పసంఖ్యాకము లగుటచే అచిరకాలము ననే చెల్లిపోయినవి. ఈ యంశమును దెలుపుచు శ్రీ శాస్త్రిలుగారు 'సప్తపదుల' కర్తృత్వవిషయమున తమకును సందేహము కలిగిన దనియు, తాళపత్రగ్రంథము శిథిలమైయున్న దనియు, శిథిలభాగములను పూరించి, తొలి పదిపాటలను సరిచేసిన శ్రీ పంచాన్నుల దక్షిణామూర్తిశాస్త్రిలుగారు (అప్పటి తాత్కాలికాంధ్రపండితులు, మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము) సప్తపదులు ముద్దుపళనికృతము లని చెప్పుట ఉచిత మని సూచించి రనియు చెప్పియున్నారు.

ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని వ్రాఁతప్రతిని పరిశీలింపఁగా నందు సంస్కర్తలుచేసిన సవరణలు చాల కానవచ్చినవి. అందలి మొదటి పాటలోని సవరణయే గ్రంథకర్తృత్వమునే తారుమారు చేసినది. అందలి మొదటిబంతి—

'శ్రీనివాసగురుడు వి...చిత్తమును ముద్దుపడి...' అని యున్నది. సంస్కర్తలు 'గురుడు'ను 'గురుల'గా మార్చి, 'వి'ని త్రోసిపుచ్చి, 'చిత్తమును' ను 'చిత్తమునను' గా మార్చి 'ముద్దుపడి' ని 'ముద్దుపళని'గా సాహసించి పరిణమింపఁజేసిరి. కాఁగా వారిపాఠము 'శ్రీనివాసగురుల (దలచి) చిత్తమునను ముద్దుపళని' అనురీతిని ఏర్పడినది. విషయ మిట్లుండఁగా 'సప్తపదులు ముద్దుపళనికృతములు కావనుటకు వేఱు సాధనము లభింపమిచే అవ్యవహారమే తెలుఁగునాట చెల్లుబడిలో నున్నది; శ్రీ ప్రభాకరశాస్త్రిలుగారును తమటీకలో పయిపద్ధతినే అనుసరింపవలసి వచ్చినది. వ్యవహార ప్రవర్తకులు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రిలుగారు. †

పరిష్కర్తల దిద్దుబాటు నటుంచి, ఉపలబ్ధ ప్రథమగేయ చరణమును పరిశీలించినచో మూలము 'శ్రీనివాసగురుకు విష్ణుచిత్తునుల ముద్దుపట్టి' అని యూహించుట కవకాశమున్నది. 'ట్టి', 'డి' లు వ్రాఁతలో నొకరీతి నుండుట వింతకాదు. 'ట' ద్విత్వాభావము లేఖకప్రమాదజనితము. ఇట్టి ప్రమాదములు సర్వసాధారణములు.

పయిరీతిని నిర్ణయించుటకును ప్రమాణాంతరములు కావలసియున్నవి. 'సప్తపదుల'ను గూర్చి పెక్కేండ్లక్రిందట శ్రీ శేషాద్రిరమణ కవు లొక వ్యాసమును వ్రాసినట్లు జ్ఞప్తి' అని శ్రీ ప్రభాకర శాస్త్రిలుగారు తెలుపుటచే నేను శ్రీ దూపాటి, వేంకటరమణాచార్యులు

---

* ఈ యంశమును 'రాధికాసాంత్వనము-సప్తపదులు' అను గ్రంథవిమర్శమున సూచించియుంటిని. చూ. భారతి. సం. ౧౪. సంచిక.

† ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని 'ఆర్. నెం. ౨౨౧' అను సంఖ్యగల కాగితపుఁ బ్రతిలోనే ఈ అసమగ్రపు 'సప్తపదులు' ౧౦ పాటలు ఉన్నవి. ఆ ప్రతిలో వరుసగ 'గోపాలశతకము, నరసింహ శతకము, సప్తపదులు, (సప్తపదాలు ?) రుక్మిణీగోపాల సంవాదము, ఆంధ్ర ప్రకరణము' అను గ్రంథములున్నవి. లేఖకుఁడు 'J. కాశీపతిరావు; ప్రతి గ్రంథముచివఱ 'కంచేరు అయినది; P. దక్షిణామూర్తి శాస్త్రి' అని లిఖింపఁబడి యున్నది.

గారి కొక జాబు వ్రాసితిని. వారు 'శ్రీని వాస దేశికులు' రచించిన 'సప్తపదులు' ముద్రితము లయియున్న వనియు, ప్రస్తుతము ప్రతులు అలభ్యము లనియు తెలుపుచు పరిచయము లేకున్నను నన్ను నమ్మి వారియొద్దనున్న ఏకైక ప్రతిని పంపిరి. శ్రీ పురాణం, సూర్యనారాయణ తీర్థులు గారు వాత్సల్యము చూపుచు శ్రీ ప్రభాకరశాస్త్రిలుగారు వెలువఱచిన 'సప్తపదుల' ప్రతి నెరువిచ్చిరి. వీని సాయమునసే 'సప్తపదుల' ఉన్నరూపు నెఱుకపఱచుటకు వీలు కలిగినది. నాకీ యవకాశము గల్గించిన పయి పండితత్రయమునకును ధన్యవాదములు.

శ్రీ వేంకటరమణాచార్యులుగారు పంపిన గ్రంథము పేరు 'తిరుప్పావై' దానిని నైజాము రాజ్యములోని 'గార్ల' నగరమున నుండిన 'వేంకటేశ్వరగ్రంథమాల' వారు ప్రకటించిరి. క్రౌను ౧/౮ సైజున ౯౨ పుటల పరిమితి గలది. దానిని రచించినవారు శ్రీనివాసదేశికులు.

'శ్రీనివాసదేశికులు పాశురములలోని భావముల జక్కగ నొక్కటియు వీడకుండ నచ్చటచ్చట విశేషార్థసూచకముగ నైత మాంధ్రీకరించిరి. ఆంధ్రీకరణము పద్యములుగను, సప్తపదియును పాటలుగను నున్నది.' అంతియకాక గ్రంథసంపాదకులగు శ్రీ చిలుకూరు, శ్రీరాములుగారు కూర్చిన టీకతోఁగూడిన ద్రవిడపాశురములును, (మూలమును) ఇందుఁ జేర్పఁబడినవి. ఆ 'సప్తపదుల'తొలిని—

'శ్రీనివాసగురుడు విష్ణు
చిత్తుకూర్మిముద్దుపట్టి
పూనిచేయు ద్రవిడపాట
లోని భావమూ,
చెలగి తెలియగాను నాదు
జిహ్వాగ్రనను నిలచి యిటుల
పలికె తిరుప్పావు సప్త
పది పదంబుగా'

అనియును, చివరిపాటలో—

'వావిరిలగ నిటుల శ్రీని
వాసదేశికుండు తిరు
ప్పావుభావ మెల్ల సప్త
పదులు గూర్చిరీ.'

అనియు కలదు. కాఁగా గ్రంథము శ్రీనివాసదేశికులు రచించినదే అనుటకు సందేహము లేదు. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారపుఁ బ్రతియును ఈ విషయమున విరుద్ధము కాదు.

* * *

శ్రీ ప్రభాకరశాస్త్రిలుగారు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోని ప్రతియందలి తప్పులను, శైథిల్యములను ఎన్నిటినో సవరించిరి; "విచిత్రశతావధానీత్యాది బిరుదాంకితులును, అతిలోకసామాన్య ప్రతిభాశాలులును, అఖండవిద్వాంసులు నగు శ్రీ పండిత టి. లక్ష్మణాచార్యులవారి యుపన్యాసముల ననుసరించి' వ్రాయఁబడిన 'తిరుప్పావై' తెలుగుటీక సాహాయ్యమున మిగిలిన ౨౦ పాశురములను రసవంతములుగ ననువదించిరి.

శ్రీ వేంకటేశ్వర గ్రంథమాలవారు (గార్ల) ముద్రించిన ప్రతిలోని పాఠములును, ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారపు ప్రతిలోని పాఠములును, చాలవఱకు సరిపోవుచున్నవి. కాని శ్రీ శాస్త్రిలుగా రొనర్చిన సంస్కరణమే మూలాభిప్రాయమున కనువుగ నున్నది. మచ్చునకు మూఁడుదాహృతులు—

౧. మొదటిపాటలోని ౫ వ పాదము -

గ్రంథమాలవారి ప్రతిపాఠము -

'న్యాయశాలియైన నంద
నందనుండు శ్రీయశోద
తోయజాక్షి సింహశిశువు
తో సమానుడే ?

ప్రాచ్యలిఖిత పుస్తకాలయములోని పాఠము నిట్లేయున్నది.

'న్యాయశాలియైన నంద
నందనుండు తోయజాక్షి
శ్రీయశోద కనిన సింహ
శిశువు గాఁడటే ?

అనునది శ్రీ శాస్త్రిలుగారి సంస్కరణము. ఇదియే అన్వయమున కనుగుణము. వెనుకటి వనన్వితములు. ఇచట మూలమున-

'యశోదై యిళఞ్జిఙ్గమ్'

అని యున్నది. 'యశోదాదేవికి సింహకిశోరమువంటి కుమారుఁడు' అని దాని తాత్పర్యము. ఈ మూలము శ్రీ శాస్త్రిలుగారి సంస్కరణమునకే అనుగుణమయినది.

౨. రెండవపాట ౫ వ చరణము:—

గ్రంథమాలవారి ప్రతి-

'పాలవెల్లి మీద చిల్వ
పాన్పుగొన్న పరుని పాద
మూలములను బాడి నెయ్యి
ముట్టుకుందమూ.'

వ్రాఁతప్రతియందును ఇట్లే యున్నది. శ్రీ శాస్త్రిలుగారి సంస్కరణము-

'పాలవెల్లిఁ బాఁపసెజ్జఁ
బండుకొన్న పరునియడుగు
లోలిఁ గొల్చి నేయి, పాలఁ
గ్రోలఁగూడమూ.'

దీనిమూలము—

'పాఱ్కడలుళ్ పైయత్తుయిన్ఱ
పరమనడి పాడి
నెయ్యుణ్ణోమ్ పాలుణ్ణోమ్.'

'పాలసముద్రముపయి యోగనిద్రఁగొన్న పరమపురుషుని పదములఁ గొల్చి, నేతిని, పాలను ముట్టక యుందు' మని మూఁడిమూలమునకు అభిప్రాయము.

3. మూఁడవపాట మూఁడవ చరణము

గ్రంథాలయప్రతి-

'క్షేమమీరగాను మనము
నోమునంటి నీరులాడ
క్షేమములర నెలకు మూఁడు
క్షితిని వానలూ'

ప్రాచ్యలిఖిత పుస్తకాలయ ప్రతిలోని పాఠము నిట్లే యున్నది.

శ్రీ శాస్త్రిలుగారు దీనిని-

'క్షేమమీఱఁగాను మనము
నోముపట్టి నీరులాడ,
భూమిమీఁదఁ గురియు నెలకు
మూఁడు వానలూ.'

అని సంస్కరించిరి.

ఇచటి మూలము—

'నాఙ్గళ్ ! నమ్పావైక్కు చ్చాత్తి
　　నీరాడినాళ్,
తీఙ్గిన్ఱి నాడెల్లామ్ తిఙ్గళ్
　　ముమ్మారి పెయ్దు.'

'మనము వ్రత మొనర్చుటకు చేరి స్నాన మాత్ర దేశమున నెలకు మూఁడువానలు కురి యునని తాత్పర్యము. 'వ్రతముపట్టుట'కు 'వ్రతమునంటుట' సరి గానుననువాదము కాదు.

ఇట్టి వింకను చాల కలవు.

పయి విషయములంబట్టే సంస్కరణపు ప్రాశస్త్యము వెల్లడికాఁగలదు..

శ్రీ శాస్త్రులుగారు స్వతంత్రించి యొన ర్చిన ఇరువది పాశురముల అనువాదమును మూలమున కత్యంతము ననుసుణమయి, శ్రీ శ్రీనివాసగురుల యనువాదముకంటె భిన్నమై యున్నది. మచ్చునకు రెండుదాహరణ ములు—

ముప్పదవ పాశురము (మూలము)—

'కఱవైకళ్ పిన్ శెన్ఱు
　　కానమ్ శేర్న్దుణ్బోమ్,
అఱివొన్ఱుమిల్లాద
　　వాయ్ క్కులత్తున్దన్నై
ప్పిఱవి పిఱన్దనై
　　పుణ్ణియమ్ నాముడైయోమ్
కుఱై వొన్ఱు మిల్లాద
　　గోవిన్దా వున్దన్నో
డుఱవేల్ నమక్కిఙ్గొ
　　ళిక్క వొళియాదు
అఱియాద పిళ్లైగళో
　　మన్బినా లున్దన్నై
చ్చిఱుపే రళైత్తనవుమ్
　　శీఱియరుళాదే
యిఱైవా నీతారాయ్
　　పఱై యేలో రెమ్బావాయ్.'

ఇది గోపికలు శ్రీకృష్ణునిగూర్చి చేయు ప్రార్థనము.

'ఆవులవెంట నంటి యడవులఁ బడి పోయి జీవించువారము; వెఱ్ఱిగొల్లల కులమున దేవర పుట్టుటచే ఆ కులమున పుట్టిన భాగ్యమునకు సంతోషించువారము; కొదువ కొంచెమై నను లేని గోవిందా ! నీతో మాకుఁ గల సంబంధము త్రెంపఁదలఁచినను తెగునది కాదు. తెలివిలేని ఆఁడుబిడ్డలము. చనవుచే మిమ్ము లను కొంచెపు మాటలచే కించపఱచినా మేమో? మా తప్పులను క్షమించి కోపింపక ఓ స్వామీ! నీ సాన్నిధ్యమును దయచేయుము' అని పయి పాశురము యొక్క భావము.

దీనికి శ్రీ శ్రీనివాసగురుల యనువాద మీ క్రిందివిధముగ నున్నది.

'పాపఁదగిన పాపముల క్ష
　　మాపణంబు చేసుకొనుచు
శ్రీపతిని యిటుల ప్రాప్య
　　సిద్ధికోరగా -
చంచలాక్షులెల్ల తమ య
　　కించనత్వమెల్ల తెలుపు
కొంచు మించి వాని పలుక
　　రించి రెలమిని -
కొంచెమైన తెలివిలేని
　　గొల్లకులమువార మేము
మంచిపుణ్య మనుచు ని న్ను
　　తించినారము -
మొదవకదుపువెంట నంటి
　　పొదలనొదలు నడవి చేరి
కుదిరి చెదిరి నడుచుకొంచు
　　కూడు తించుము -
కొరతలేని కలిమి గలుగు
　　గోవింద నీదు పురుడు
ఎరగగూడ దెందు నెంత
　　వెదకి చూచినా-
ఎరుగనట్టి చిన్నతనము
　　మరుగుకొన్న ప్రేమ నీదు
బిరుదు కొరతపేరు పెట్టి
　　పిలిచినా మని-
కోపమునకు నోపదగిన
　　రూపు లేదు వినుము గొప్ప
ప్రాపకంబు నీవు మాకు
　　ప్రాప్య మొసగవే—'

ఇందు మొదటి రెండుచరణముల భావము మూలమున లేదు. శ్రీ శాస్త్రులుగారి అనువాదము.

'గోవుల వెంబడిఁబడి పెనుఁ
　　గోనలంగుఁ గానలందు
దేవుళ్ళాడెడు గోప
　　స్త్రీలము దేవా !
దేవర మా కులమునంగు
　　నావిర్భావముఁ గాంచుట
చే వన్నెయు, వాసియు వ
　　చ్చినది మాకునా.
దేవరతోఁ గలసిమెలసి
　　తిరగఁగల్గె నోకపుల మని
తెలుపఁగల్గె మా భాగ్యము
　　తలఁపఁదరమఁటే !
గోవిందా! యెప్పుడు నే
　　కొఱఁతలేని మహనీయా !
దేవరతోఁ జెలిమి మాకు
　　స్థిరము గావలెన్-
వేర్పాటిక్కడ మాకు నో
　　నర్పకుమా! వెఱ్ఱిగొల్ల
వెలఁదుల మిటు నిన్ను వీడి
　　వెడలఁజాలము.
తెలిసీతెలియని మాటలఁ
　　బిలిచితిమో, కలఁచితిమో
జలజాక్షా! మా తప్పులు
　　క్షమియింపఁగదే !
కరుణింపుము పరమపదము
　　కనికరింపు మో స్వామీ !
శరణము లే దన్యము నీ
　　చరణముదక్కన్.

౨౯ వ పాశురము(మూలము)—

'శిత్తమ్ శిఱుకాలే వన్దున్నై
　　చ్చేవిత్తున్
పొత్తామరై యడియే
　　పోత్తుమ్ పొరుళ్ కేళాయ్.
పెత్తమ్ మేయ్ త్తుణ్ణుమ్
　　కులత్తిల్ప్పిఱన్ద, నీ
కుత్తేవలెఙ్గళై క్కొళ్ళా
　　మత్పోగాదు
ఇత్తైప్పఱై కొళ్వానన్ఱు
　　గాణ్ గోవిందా
ఎత్తైక్కు మేత్తుపిఱవిక్కు
　　మున్దన్నో

ఉత్తోమేసా వోమునక్కే
నాహాబ్బేయ్‌వోమ్.
మత్తైనజ్గామజ్గళ్
మాత్తే లో రెమ్బావాయ్.'

'తెల్లవాఱకముందే మేమందఱము దేవరను సేవించి, పాదారవిందములను గొలువ గోరికపడువారము. పశువుల మేపి బ్రతుకు గొల్లకులమందు పుట్టిన నీవు నీ దాస్యమును గోరు మమ్మ అంగీకరింపవలెను. గోవిందా! సర్వకాలములందును ఏడేడు జన్మములకును దేవరవారితో అవినాభావమును పొంది యుండఁగలవారము. దేవరకే మేము దాస్యముచేయఁ గలవారము. ఇంతకంటె మాకు వేఱు కోరికలు లేకుండునట్లు చేయుము' అని తాత్పర్యము.

శ్రీ శ్రీనివాసగురుల అనువాదము—

'ప్రాప్యమనుచు జనుల కామ
రూప్యమనును సర్వదేవ
గోప్యమైన ప్రాప్యము మది
గోరుకొనుచును -
రుచిరమైన రుచిర దాని
ప్రచురిలంగ జేయుటయును
విచికిలాంగ, యెల్ల త్వరగ
విశదపరచిరి -
ప్రొద్దుప్రొద్దు మేము లేచి
పొలుపుసునీరు పదము కనుల
నద్ది నీదునుతుల బాడి
యరసినివవలెన్ -
పొట్టనిండ పసుల కసవు
పొసగ మేపిగాని కూడు
ముట్టనట్టి కులమునందు
బుట్టి మమ్ములన్ -
బట్టి నీకు వలసినట్టి
గుట్టుపనుల నెల్ల చుట్ట
పెట్టుకొనుము పరగ నాన
బెట్టనేదులేక్ -
ఎన్ని జన్మములకునైన
నిన్నె తలపవలయు కృష్ణ
చెన్నమీఱ నీకె పనులు
చేయుచుందుము -
వేరె మేము గోరు కోర్కె
వేరుచేసి నీమనసు
దీర మముల నెల్ల నీవె
దిద్దుకోవలెన్ -'

ఇందు మొదటి రెండు చరణముల భావము మూలమున లేదు. శ్రీ శాస్త్రిలుగారి తెనిఁగింపు—

'తెల తెలవాఱకముందే
చలియల నెల్లరము వచ్చి
దేవరపదకమలయుగము
సేవచేయఁగాఁ -
గోరిక యిది నిత్తెంపఁ
గోరెద మో కమలాక్షా!
కూడదు కాదనఁదగదో
గోపవల్లభా!
దాసభావమునను వచ్చి
రీ సతులు లోకేశ్వర!
ఆసాసలఁ బఱపు రంచు
నరయఁబోకుమా.
వీడక యీ కాలచక్ర
మాడుమందుదాఁక నేడు
నేడుజన్మములకు నిన్ను
వీడఁజాలమూ.
అవినాభావమున నన
న్యార్హలమై యుండెదమో
యఖిలేశా! యనుమతింపు
మనునయింపుమా.
దాసవృత్తి నెఱపుమ నీ
తో సంతోషమున నుందు
మీ సంపద మాకు నెప్ప
డొసఁగఁజేయుమా!
చింత లింతకంటె వేఱె
చేరకుండఁ జేసి మమ్ముఁ
జేరఁదీసి యేలుకొమ్ము
శ్రీమనోహరా!'

పయి రెండిటియందును శ్రీ శాస్త్రిలుగారి యనువాదమే మిన్నయని మూలానువాదముల తత్త్వము నెఱిఁగినవారి కెఱుకపడక పోదు. ఈ విశేషము నించుమించుగ ప్రతి పాటయందును గానవచ్చును.

కావున గ్రంథమాలవారు ప్రకటించిన 'తిరుప్పావై'కి విజ్ఞప్తిని వ్రాసిన శ్రీ చిలుకూరు శ్రీరాములుగారు "కేవల వైష్ణవసంబంధము లేని శాస్త్రిగారి యాంధ్రీకరణముకన్న గురుపరంపరయాం దొకరై, వైష్ణవులకు బహుమానికమువంటి శ్రీనివాస దేశికుల పద్యములు (?) (పాటలని వారి భావమేమో) సమంజసములుగను, సముచిత భావభరితములుగ నుండునని తలం"చుట సరికాదని చెప్పవలసి వచ్చుచున్నది.

భాషాంతరీకరణపాటవము ప్రతిభాధీనము; కాని ప్రత్యేకమతాధీనము కాదు. 'తిరుప్పావై'ని సరసముగ నాంధ్రీకరించుటకు 'వైష్ణవసంబంధ' మక్కఱలేదు. 'గురుపరంపరయాం దొకరై' యుండుటయు నావశ్యకము కాదు.

* * *

శృంగారకావ్య గ్రంథమండలివారు పరిష్కరించిన రాధికాసాంత్వనముతోఁజేర్చి ప్రకటించిన 'సప్తపదు'లకు పీఠిక రచించిన శ్రీ వెంపటి నాగభూషణంగారు శ్రీ ప్రభాకర శాస్త్రిలుగారి కవిత్వమును విమర్శించుచు 'శ్రీ శాస్త్రిలుగారు —... మిగతా గ్రంథం పూరించకుండా ద్రావిడగాథలకి వివరణ వ్రాసి ఊరుకున్నా—ప్రమాద మేమీ ఉండేది కాదు' అని వ్రాయుట సరికాదు. శ్రీ శాస్త్రిలుగారు శేషరూపముననైనను 'సప్తపదు'లనురచింపఁబట్టియే సరసమును మూలానుసారియు నగు ననువాదము తిరుప్పావునకు కొంతవఱకయినను లభించినది!

శ్రీ నాగభూషణంగారు 'అతుకు అతుకుగానే ఉన్నందువల్ల......రసవ్యుత్క్రమనకు (?) ఏమీ కాని—గ్రంథమునకు ఛందోరీత్యా—ఏకరూప మిచ్చిన శ్రమకు—శ్రీ శాస్త్రిలవారు వంద్యులు' అనివ్రాయుట ఉచితముకాదు. 'సప్తపదులు' కేవలము శృంగారగ్రంథ మని తలఁచి శ్రీ నాగభూషణంగారు 'శాస్త్రిలుగారు రసమును భక్తిగ వ్యుత్క్రమము చేసినట్లు' అభిప్రాయపడినా రని తెలియుచున్నది. ఇది కేవలము శృంగారగ్రంథ మను తలంపుతోనే గ్రంథమండలివారును రాధికా

సాంత్వనముతోఁబాటు ముద్రింప దొరఁకొని యుండవలెను. ఇందు భక్తి ప్రధానము; ప్రాప్యము భగవత్సాన్నిధ్యము. భక్తి, శృంగారములు రెండిటికిని రతియే స్థాయి యగుటచే భక్తునందవు భగవంతునియెడఁగల 'రతి' శృంగార మని విమర్శకులు తలఁచిన తలఁచియుండవచ్చును. దేవ, సర్వాదివిషయకరతి 'భావ' మనును. అదే 'భక్తి.' కాన శ్రీ శాస్త్రిలుగా రేమియు వ్యత్యస్తము చేయలే దని తెలియవలెను. శ్రీ శాస్త్రిలు గారి రచన 'ఛందోరీత్యా'మాత్రమే కాక 'భావరీత్యా' కూడ అన్నివిధముల అనువాద మనకు మెఱుఁగుపెట్టి మే లనిపించుచున్న దని సహృదయు లెఱుఁగకపోరు.

శ్రీ నాగభూషణం గారు అంతటితో తృప్తిపడక 'పళని పది 'పాసరము'లకు మాత్రమే తెలుఁగుగీతములు కూర్చినదేమో అనిపిస్తూన్నది... మొదటి పదీ ముప్పదిగాథలలోనూ రసజీవములు. అనర్ఘ భోగములకే అలవడిన ముగ్ధుపళని అలా చేసి ఉన్న దనడంలోనూ అనౌచిత్యము ఏమీలేదూ' అని కేవలము ఊహలపయి ఆధారపడి సిద్ధాంతీకరింపసాగిరి. కాని యీ వ్యాసమునఁ జర్చింపఁబడిన విషయములఁబట్టియు, తొలి పాటలకన్న వెనుకటిపాటలే భక్త్యనుగుణము లగుటంజేసి ప్రధానములని చెప్ప వీలగుటంబట్టియు, వారి యూహలు నిరాధారములని స్పష్టపడకపోదు.

---

# ఛాయాసుందరి

**జనమంచి కామేశ్వరరావు**

రుచిరసంధ్యారాగ
రక్తాంగ విద్యుతులు
ముని మాపువేళలో
మురి గొత్తిగిల్లినవి.

మధురాతిమోహనము
మంగళాకలితమై
మసలుచున్నది రేయి
కొనరు వెన్నెలలతో.

పూర్ణచంద్రజ్యోత్స్న ౨
కారుణ్యవీథిలో
ఛాయాక్వణమ్మిదో
"హాప్రియా!"యని మ్రోసె.

అమరచుంబిత హాస
వల్లరీ సుమమాల
కైనేసు కున్నదా
శ్యామాభ్ర లక్ష్మి

సితనిశీథిని నేడు
చిమ్ముచున్నది సుభల
ఛాయలవి చోద్యముగ
సెకూపు పచరించె.

---

# బాల్యం

పద్మరాజు

'ఒరే! రాముడూ! కాస్తకోమటి కొట్టు మీదకి వెళ్లి మిరియాలు తీసుకురావ్రూ? నాయనా!'

'డబ్బు లెక్కడున్నాయి?'

తల్లిదగ్గర డబ్బులు తీసుకుని రాముడు ఒక్క పరుగులో వెళ్లిపోయాడు. సరళని వదలి వెళ్లడం అతనికి మన స్సొప్పకపోయినప్పటికీ 'తనుచెయ్యకపోతే ఇంకెవరు చేస్తారీపని?' అనుకుని సంతృప్తిపడ్డాడు.

సరళ అయిదేళ్ల చెల్లెలు. చాలా పెంకి పిల్ల. రాముణ్ణి అస్తమానూ కరుస్తూ, రక్కుతూ ఉండేది. కాని రాము డెప్పుడూ ఆమెని మళ్లీ కొట్టి ఎరగడు. ఆమెచిన్నపిల్ల అనో, మరెం చేతో రాముడికి ఆమె అంటే అపరిమితమైన జాలి, ప్రేమ. అత డామెని వదలి ఎప్పుడూ ఎక్కడికీ వెళ్లే వాడు కాడు. తను స్కూలుకి వెడితే సరళ కూడా ఉండేది. ఆడుకోడానికి వెడితే కూడా వచ్చేది.

సరళ మంచం ఎక్కిన ఈ పది రోజులూ ఆటలూ అదోమోస్తరుగా ఉన్నాయి. మూడురోజులు ఎల్లాగో బళ్లోకి వెళ్లాడుగాని, నాలుగోనా డతనికి స్కూలంటే విసుగెత్తింది. అత డమ్మదగ్గరికి వెళ్లి 'ఈవేళ స్కూలు మానెయ్యొద్దుటే?' అని అతిదీనంగా అడిగాడు. 'నీ యిష్టం' అంది తల్లి. అతని దీనతను జూసి జాలిపడిగాదు. సరళకి ఒంట్లో అల్లా ఉన్నమూలాన్ని అతడడిగిన ప్రశ్నకి ఏదోపరధ్యానంగా ఆమె జవాబు చెప్పింది.

రాముడు మిరియాలు తీసుకొచ్చాడు. తల్లి రసంతీసి మందుతో బలవంతంగా సరళని తాగిస్తోంది. సరళ దొర్లిపోతూ మారాము చేస్తోంది. తల్లి బలవంతంగా కాళ్ళమీద పడుకోబెట్టుకుని 'మా అమ్మ గాదూ! ఇది తాగితే రేపు జ్వరం తగ్గిపోతుంది. తాగుమరి! రే పొద్దులే' అని బతిమాలుతోంది. సరళ మాత్రం కాళ్లమీంచి ఎగిరిపోతూ 'వెధవ రామి గాడేవు. మిరియాలు తీసుకొచ్చాడేవు. వాణ్ణే తాగించవేవు. ముందు వాణ్ణే తాగించవేవు' అని గోలచేస్తోంది.

తనకి జ్వరంవస్తేరాముడు తాగేవాడోలేదోగాని సరళకోసం కొంత రసం గుటుక్కున తాగేశాడు. సరళ కొంచెం ఏడుపు మానింది. తల్లి ఉగ్గుపట్టినట్టుగా నోట్లో వేలుపెట్టి రసంపోసింది. అది గొంతుకులోకి దిగడంతోటే ఉక్కిరి బిక్కిరయి, తుపుక్కుని ఎదురుగా కూర్చున్న రాముడి మొగంమీద పడేటట్టుగా సరళ ఉమ్ము వేసింది. తల్లి సరళని రెండు వీపుమీద గట్టిగా తగలనిచ్చి, లేచిలోపలికి వెళ్లిపోయింది. సరళఏడుపు ఎక్కువయింది. రాము డూరుకోబెట్టడానికి ప్రయత్నించాడు. సరళ అతన్నిపట్టుకు రక్కి కరిచి అరవడం మొదలు పెట్టింది. రాముడు మాత్రం కూర్చుని అల్లాగే సముదాయిస్తున్నాడు.

* * *

'కుంప టిల్లా పట్రారా!'

రాముడు కుంపటి చెవుల్ని రెండు చేతులతోనూ పట్టుకోడంతోనే రెండుచేతులూ చుఱ్ఱునకాలాయి. గబుక్కుని కుంపటి కిందకి వదలివేశాడు.

'గుడ్డతో పట్టుకోబాబూ! చెయ్యి కాలుతుంది.'

గుడ్డతో పట్టుకుని రాముడు కుంపటిని తీసుకొచ్చాడు. దానిమీద నీళ్లుపెట్టి తల్లి, సరళ కడుపు కాస్తోంది. రాముడు కుంపటి విసురుతున్నాడు.

సరళ రెండురోజులనుంచి కళ్లు విప్పడంలేదు. జ్వరం ఎక్కువగా ఉంది. అప్పుడప్పుడు కడుపులోపోట్లు వచ్చిగావురు గిలగిలకొట్టుకుంటుంది వైద్యుడు సుబ్బారాయుడు కడుపుకి కాపడం పెట్టమన్నాడు. రాముడికీ జ్వరం చాలా విసుగ్గాఉంది. ఎన్నాళ్లుంటుందో వెధవ దిది?

ఇప్పుడు సరళ ఏమీ మారాము చెయ్యడంలేదు. రాముడు దగ్గరగా కూర్చుని ఒళ్లు నిమిరినా అట్టేకదలదు. చిరాకుపడదు. మునపటికి మల్లే రక్కదు, గిల్లదు, కేకలువెయ్యదు. 'ఛా! ఇందంతా ఏమీబాగాలేద'నుకున్నాడు రాముడు.

'బాబూ! సుబ్బారాయుడిదగ్గరికి వెళ్లి మందుపట్రా. అల్లాగే ఉందని చెప్పు. రాత్రినించీ మళ్లీ కడుపునొప్పి రాలేదని చెప్పు.'

రాముడు సుబ్బారాయుడుదగ్గరికి వెళ్లాడు. సుబ్బారాయుడు మందిచ్చాడు. రాముడు అనుమానిస్తో 'ఎప్పుడు తగ్గిపోతుందండీ. ఈజ్వరం' అని అడిగాడు.

'తగ్గిపోతుందిలే రెండుమూడు రోజుల్లో.'

రాముడిమనస్సు తేలికయిపోయింది; ఇంక రెండుమూడురోజుల్లో సరళని మళ్లీస్కూలికి తీసికెళ్లవచ్చు.

పక్కయింట్లోకి ఎవరో కొత్తపిల్ల లొచ్చారు. తనకి తీరుబడిలేక వాళ్లతో ఇంకా సరిగ్గా స్నేహంచెయ్య లేదు. అందులో ఒకకుఱ్ఱవాడిదగ్గర కొత్తకొత్త మోటారులూ, బొమ్మలూ, మంచిరంగు అట్టలపుస్తకాలూ ఎన్నోవున్నాయి. సరళకి అవన్నీ చూపించవచ్చు. ఇంకా చాలాసంగతు లున్నాయి తనకిప్పు డన్నిజ్ఞాపకం లేవన్నమాటగాని.

రాముడు గంతులు వేసుకుంటూ ఇంటికి తిరిగి వచ్చాడు.

* * *

మూడునాళ్లూ గడిచిపోయాయి. సరళ కింకా అల్లాగే ఉంది. సుబ్బారాయుడు చెప్పింది అబద్ధమయిపోయింది. ఒకవేళ ఊరికే తనతో అల్లాఅన్నాడేమో సుబ్బారాయుడు!

ఇంకోఅయిదురోజు లల్లాగేగడిచిపోయాయి. పక్కయింటికి వచ్చిన కొత్తకుఱ్ఱాళ్లంతా వెళ్లిపోయారు, వాళ్లబొమ్మలూ మోటార్లూ అన్నీ పట్టుకుని. సరళ బొత్తిగా ఇప్పుడు కళ్లు విప్పటంలేదు. కళ్లురెండూ బాగా వాచాయి. ఊపిరిపీల్చుకునేటప్పుడు గురగురమంటుంది. అప్పుడప్పుడు ఒకమూలుగు మూలిగి ఒకపక్కనించి ఇంకోపక్కకి ఒత్తిగిల్లుతుంది.

మునుపు ఎప్పుడయినా ఇల్లా ఉండేదా? పాపం! లోపల ఏమనుకుంటోందో?ఆటలాడుకోడానికి వీల్లేదు. బళ్లోకి తనతో రావడానికి వీల్లేదు. కేకలువెయ్యడానికి ఓపిక చాలదు. జ్వరం వచ్చినవాళ్లకి ఎల్లాతోస్తుందో ?

రాముడు సరళపక్క మీద కూర్చుని ఆలోచిస్తున్నాడు.

'రామిగాడేవు. వాణ్ణికొట్టవేవు.'

సరళ తనలో తను గొణుగుకుంటోంది మెల్లిగా. రాముడు గబుక్కునలేచి నిలబడ్డాడు.

పదిరోజులీమధ్య సరళ ఎప్పుడూ ఇల్లా పైకి మాట్టాడలేదు!

'అన్నం నాకొద్దు... నాకొద్దు... నేను తినను... నాకు డబ్బియ్యి... ఇస్తావా యియ్యవా?'

సరళవంటిమీద చెయ్యి వేసి 'ఇస్తుంటలే అమ్మా! జ్వరం తగ్గిపోనీ' అన్నాడు రాముడు.

సరళ గబుక్కుని రెండోపక్కకి తిరిగి ఏవో అర్థంలేని మాటలు మాట్టాడింది.

రాముడికి భయంవేసింది. అమ్మని పిల్చాడు.

'అమ్మా! ఏమిటే ఇల్లా మాట్టాడుతోంది?'

'కలవరిస్తోందా? వెళ్లి సుబ్బారాయుణ్ణి కేకేసుకురా!' అంది తల్లి మంచందగ్గిర కిందకూర్చుని. ఆమె ముఖంలో ఆతురత కనిపిస్తోంది.

రాముడి కాపరిస్థితులన్నీ చాలా గంభీరంగా కనిపించాయి. తనకి తెలియని అనుభవాన్ని దేన్నో అనుభవిస్తున్నట్టనిపించింది అతనికి. ఇంట్లో తనకంటే పెద్దమొగాళ్లు ఎవరూ లేరు! పెద్దవాళ్లు చేసే పనులన్నీ తనే చెయ్యాలిప్పుడు' అంతా ఇప్పుడు తనమీద ఆధారపడి ఉంది. ఒక్కసారిగా పెద్దవాణ్ణయిపోయా ననుకున్నాడు రాముడు.

పరుగెత్తి వెళ్లి సుబ్బారాయుణ్ణి పిలుచుకుని వచ్చాడు.

సుబ్బారాయుడు చెయ్యి అతి జాగ్రత్తగా చూస్తున్నాడు.

రాముడు బొమలు ముడివేసి నడ్డి మీద రెండుచేతులూ వేసుకుని నిలబడి అతితీక్ష్ణంగా చూస్తున్నాడు.

సుబ్బారాయుడు పెదవి విరిచి, ఒకచిన్న కాగితంమీద ఏదోరాసి, 'అబ్బాయి! ఇది మాయింట్లో చూపిస్తే ఒక మందిస్తారు. ఒక్కపరుగులో వెళ్లి తీసుకురావాలి. ఇక్కడున్నట్టు రావాలి సుమా!' అన్నాడు.

'పరిగెత్తడం మీరు నాకు నేర్పక్కరలే' దన్నట్టుగా సుబ్బారాయుడికేసి చూసి చీటిపుచ్చుకుని పరిగెత్తి వెళ్లిపోయాడు రాముడు. తనెల్లా పరిగెత్త గలడో ఆయన కేమన్నా తెలుసునా? పెద్ద తనతో చెప్పాలేమిటి ఒక్క పరుగులో రావాలని? సరళ తనచెల్లెలా? ఆయన చెల్లెలా?

రాముడు పరిగెత్తుకుంటూ తిరిగి వచ్చేటప్పటికి, సరళని మంచం మీంచి కిందకి దింపారు. సుబ్బారాయుడు కాళ్ల కేదో మర్దనాచేస్తున్నాడు! తల్లి చీరతో మొగం కప్పుకుని ఏడుస్తోంది.

తను వచ్చేలోపుగా సరళ కేదో అయిపోయింది. తనని చూడనియ్యకుండా సుబ్బారాయు డెక్కడకో పంపించాడు. అదేదో,ఎల్లావచ్చిందో తనుచూడలేదు. సరిగ్గా తననిఅప్పుడే పంపించాలీ?

సుబ్బారాయుడు మందు సరళ నోట్లోవెయ్యడానికిప్రయత్నించాడు. సరళ నోరు తెరవలేదు. బలవంతంగా

నోరుతెరిచి మందువేశాడు. అల్లా బలవంతంగా నోరుతెరుస్తాడేం? చెప్పి పెట్టదూ? అప్పుడప్పుడు అన్నదగ్గర కూడా పెంకితనంచేసి నోరుతెరిచేది గాదు సరళ. అటువంటిది మందు తినమంటే తెరుస్తుందా? రాముడికి సుబ్బారాయుడిమీద కోపంవచ్చింది

'మందు గుటక దిగింది. పనిచెయ్యాలిమరి. ఇంకోగంటకి చూడాలి ఎల్లాఉంటుందో' అన్నాడు సుబ్బారాయుడు.

తల్లి గొల్లుమని ఏడవడం మొదలుపెట్టింది. ఇరుగూపొరుగూ వాళ్లంతావచ్చారు. సుబ్బారాయుడు తనకేదోపనుందని వెళ్లిపోయాడు. వచ్చినఆడవాళ్లు, సరళకి తలోవైద్యంచెయ్యడం మొదలుపెట్టారు. సరళ ఊపిరి అదో మోస్తరుగా పీల్చుకుంటోంది.

రాముడు తదేకదీక్షతో చూస్తున్నాడు. ఏదో మహావిచిత్రమయిన విషయాన్ని మొట్టమొదట చూసినవాడు తనొక్కడే ఇదంతా చూశాననుకుంటాడు. తనతోడివాళ్ల కీవిషయం ఏమీ తెలియదనుకుంటాడు. అంచేత అందరికంటే ఒకగొప్ప దనం తనకివచ్చిందనుకుంటాడు. రాముడూ అల్లాగే అనుకుంటున్నాడాదృశ్యాన్ని చూస్తో.

కొంతసేపటికంతా సరళని వదలివేసి చుట్టూ కొంచెం దూరంలో కూర్చుని, చీరచెరగులతో కళ్లద్దుకుంటూ, ముక్కులు చీదుకుంటూ, 'ఏంశాశ్వతం? ఆపయిని, కలికాలమొచ్చిందట్టా! కలికాలం. మూడేళ్లవాళ్లకి నూరేళ్లూ నిండిపోతున్నాయి' అంటూ ఏవేవో మాట్లాడుతున్నారు.

తల్లి సరళమీదపడి గట్టిగా ఏడుస్తోంది.

ఒకావిడ రాముణ్ణి ఒళ్లోకి తీసుకుని, 'ఏడవకమ్మా! ఏడవకు. చెల్లాయి మన్నిఒదిలిపెట్టి వెళ్లిపోయిందమ్మా' అంది ఏడుపురాగంలో.

తను ఏడవడం లేందే! చెల్లాయి ఎక్కడకి వెళ్లిపోయింది? అదే తెలియండలేదు. ఒకసారి సరిగ్గా చూద్దామనుకున్నాడుగాని ఆవిడ అటుకేసి చూడనివ్వలేదతన్ని. అసలతనికేడవాలని లేదు, కాని అంతా ఏడుస్తో ఉంటే అతనికీ ఏడుపొచ్చింది.

ఎవరో ఒకాయన సరళని భుజంమీద వేసుకుని లేవదీశాడు.

తల్లిగోల ఎక్కువయింది. 'నాతల్లిని తీసుకుపోతున్నారోయి! నాతల్లిని తీసుకుపోకండోయి!' అని గొంతుకెత్తి ఏడుస్తోంది.

ఇరుగుపొరుగు అమ్మలంతా, 'ఏడవకండి? ఏడిస్తే ఏమిలాభం? చచ్చిపోయిన వాళ్లు తిరిగివస్తారా అమ్మా? కుఱ్ఱాడు బెంబేలు పడిపోతాడు' అంటూ ఓదారుస్తున్నారు.

తల్లి ఏడుస్తూంటే రాముడు కూడా పైకి ఏడవడం మొదలుపెట్టాడు.

'మంచివాళ్లని భగవంతుడు తీసుకుపోతాడమ్మా! భూమిమీద ఉంచడు. ఏంఅల్లరిచేసేదండీ పిల్ల, ఇల్లంతా నిండుగా ఉండేదిగదా!

మా చిన్నమ్మామో! ఏంగంతులు! ఏంఆటలూ!' అంటూ తన చచ్చిపోయిన కూతుర్ని తలుచుకు తలుచుకు ఏడిచింది ఒకావిడ.

రాముడి మనస్సు ఈ దృశ్యాం అంతా చూసేటప్పటికి దిగ్భ్రమ చెందింది. ఎవరు మాట్లాడినా అతని కేమీ అర్థం గాదు. అర్థం కాకపోయినా వాళ్లంతా మాట్లాడేదాంట్లో తనకి తెలియని నిజం ఏదో ఉందని అనుకున్నాడతను.

కొంతసేపటికి ఎవరిళ్లకి వాళ్లు వెళ్లిపోయారు.

రాత్రి రాము డొంటరిగా మంచంమీద పడుకున్నాడు. తల్లి ఏడిచి ఏడిచి ఒకమూల కొంగు పరచుకొని పడుకుంది.

రాముడికి నిద్ర రాలేదు. బోర్లగిలపడుకుని, ముఖం తలగడలో దాచి ఏదో ఆలోచిస్తున్నాడతను. మధ్యాహ్నం అయిన ఆ గొడవంతా చూసినతరువాత, అతనికి కళ్లువిప్పి, ఆ చీకట్లో చూడడానికి భయంవేసింది ఎంచేతో.

అసలు ఏంజరిగిందీ?

సరళని ఎక్కడకో తీసుకుపోయారు. ఎక్కడికి? ఒకవేళ మళ్లీ రాదేమో!

అవును! చచ్చిపోయిన వాళ్లు తిరిగిరారుట సరళ చచ్చిపోయింది.

అతని గుండెలు దడదడ కొట్టుకున్నాయి. నిరాశ అతనిహృదయాన్నంతనీ కాళీచేసేసింది.

గబుక్కుని అతనికి పక్కయింటి వాళ్ల సీతసంగతి జ్ఞాపకం వచ్చింది. ఒకరోజు నిల్లాగే చచ్చిపోయింది వాళ్లసీత కూడాను. మళ్లీ అప్పటినించీ కనిపించటంలేదు!

వాళ్లంతా ఇందాకా అనుకుంటున్నమాటల కన్నింటికీ ఒక్కసారిగా అర్థం తెలిసిపోయిం దనుకున్నా డతను.

చచ్చిపోయినవాళ్లు తిరిగిరారు. సరళ చచ్చిపోయింది.

ఒకసారి వెల్లగిలతిరిగి ఇల్లంతా కలయజూశాడు అవును! నిజమే! ఇల్లంతా కాళీ! సరళ ఎక్కడాలేదు! గుండెలు చేత్తోపట్టుకుని ఎవరో పిసికిన ట్టయింది. తలగడాలో ముఖం పెట్టి ఏడవడం మొదలుపెట్టా డతను. అల్లా తనలో వెక్కి వెక్కి ఎంతసేపు ఏడిచాడో ఎవరూ ఎరగరు.

---

# సుడిగాలి

కుందుర్తి నరసింహారావు

రావటే నీవు ?

మనమకరందపాత్ర
చెక్కుచెదరకయుండ దాచితిని; విపిన
మారుతధ్వని నామది మారుమ్రోగ,

రేగి మిన్నంటు సంధ్యాపరాగరేఖ
నాదృగంతః ప్రభాపథరోధకముగ,

ఊగిపడు భూజలతికావిరాగిణుల వి
లుప్తపత్రప్రసూనావలోకనాతి
భయదరూపమ్ములు మదీయభావలోక
బాధకములుగ,

కంపితాభ్రగతి దిరిగి
వేసరి విహంగమవియోగు లానకొలది
ఆలపించువాంఛాగీతు లస్మదీయ
జీవనరహస్యబాంధవ్యచిహ్న మెరిగి
ప్రతిరుధిరనాళమున నడ్డుపడినవేళ,

మనమరందపాత్ర రవంత తొణుకునేమొ
అనుభయమ్మున హృదయమధ్యమున నిలిపి
చెక్కుచెదరకయుండ దాచితిని, నీవు
నందనవనేందిరవు కయికొందువనుచు:
రావటే యింక అమృతానురాగమూర్తి ?

---

# 'సరిపడని సంగతులు'

'సరిపడని సంగతులు' అనేది ఒకనాటకం. కాదు; రూపకం. కర్త టి. రాఘవగారు—అనగా విఖ్యాతనటులు శ్రీ రాఘవాచారి గారు. ఈ పుస్తకాన్ని యీ మధ్యనే సవిమర్శంగా చూడ నవకాశం చిక్కింది. చదువ నారంభించటంతోనే ఆశ్చర్య మారంభమయింది. తుదంటా చదివేసరికి "ఆ నాట్యాచార్యుడు వ్రాయలేదేమో" అని పించింది. సంగతులేమీ సరిపడ్డాయికావు. గ్రంథకర్తగారుగాని సహృదయులింకెవరైనగాని "అప్పటి కిప్పుడా" అని కోపించక నా సంశయాలు తీర్చగోరుతాను.

ఈరూపకం సాంఘికము. శ్రేయోదంబగు సంస్కరణమువిషయమై సనాతనానుయాయులు తమ సంకుచితపక్షమును వదలలేక సంఘాని కెంతటి అపకారం చేస్తున్నదీ వెల్లడించటము దీనిలక్ష్యం. వితంతూద్వాహం తత్సాధనం. లక్ష్యమూ తత్సాధనమూ కూడ అపురూపమైనవి కాకపోయినా ప్రశస్యములై ప్రస్తుత సంఘదృష్టి నాకర్షించేవి. కాని ఆ లక్ష్యమును చేరగల్గుటలోను సాధనము నుపయోగించుటలోను గ్రంథకర్తగారు భగ్నమనోరథులైరి. అ దెట్లో గ్రంథసామస్త్యంమీదనూ రంగక్రమాన్ని అనుసరించి వేరువేరుగాను విశదపరచుకొంటాను.

### గ్రంథసామస్త్యము

గ్రంథకర్తగారు స్వయముగాగాని పెద్దలెవ్వరిచేనైనగాని ఉపోద్ఘాతమో లేక సింహావలోకనమో చేసినట్లయితే చాలా సంశయాలు విడిపోయి గ్రంథవ్యంగ్యమేమో బోధపడేది. అట్లా వ్రాయకపోవటానికి కారణం అదంతా సహృదయులకే వదలివేయుట మంచిదనో లేక............

కేవల గద్యంతోనే అలంకరింపబడ్డ యిందలి కథావస్తువుకు వ్యవహారభాష యెంతో అనురూపంగా ఉండేది. ఈ భాషావ్యత్యయం కళంకమనక తప్పదు. వీరు రచించేనాటికి వ్యవహారభాష వ్యాప్తంకాలే దనటానికి వీలు

'శోభనరావు'

లేదు. గద్యాత్మక రూపకాలు వ్యవహార భాషాత్మకరూపకాలు ఒక్కసారే బయలు దేరాయి. గ్రాంథికభాషయైనా సరిగా నిర్వహింపబడింది కాదు. కలగలుపు. పురాతన వాసనలు వదలలేక నూత్నపద్ధతులం దాదరంగల సందిగ్ధస్థితి యిందు గోచరమౌతూంది. పాత్రానుసారంగా అవసరమైనప్పుడుకూడ భాషలో గంభీరత కొరతవడిఉంది. ఈవేలవత్వం భాషాసారళ్యంగా ఎంచటానికి వీలు లేదు. భావాన్ని యెంతగా వెల్లడిస్తే సహృదయు లానందిస్తారో ఆఘక్కవదలి చాల చోట్ల భావసుంభనలేనిలోటు కనబడుతూంది. ఒకప్పుడు మితిదప్పినసుంభనకూడా కద్దు. ఇక అవసరౌచిత్యములేని సామెతలు తరుచుగా ఉపయోగింపబడ్డవి. దీనినంతటినీ ఒకమాటలో చెప్పాలంటే—కావ్యములలో శ్రేష్ఠమైనరూపకాని కుండవలసిన శబ్దార్థములపస మృగ్యమై పోయింది. ఈ అంశాలన్నీ ఆయాసందర్భాలలో సోదాహరణంగా స్పష్టపడుతాయి.

పాత్రవివరణము— భీమసేనరావు లీలావతులు దంపతులు. వీరి మేనగోడలు తార వితంతువు. ఈమెను పెండ్లాడగోరుతాడు ఏకైకపుత్రుడు రాజారావు. గుమాస్తా శ్రీధరుడు తారకు సహకారి. శ్రోత్రియుడైన విద్యాలంకారాచార్యులు భీమసేనరావును వశంజేసికొని శ్రీధరుడికి చిక్కులు కలిగిస్తాడు. ఇవి ప్రధానపాత్రలు.

పాత్రపోషణము—ఈ విషయంలో కవిగారు చాలా వెనుకబడ్డారు. ఆద్యంతమూ చాలవర కుచితంగా పోషింపబడ్డ పాత్ర ఒక్కతారమాత్రమే. శ్రీధరుడు ఆదిలో తారకై చేసిన ఉద్యోగత్యాగం కొంచెం కృత్రిమంగా ఉంది. అదివరకుగూడ నత డట్టి త్యాగశాలి అని స్పష్టపడక అప్పటికప్పుడు ... త్యాగం చేసినట్టుంది. ప్రయ

త్నించికూడ కవిగా రితని సహజత్యాగత్వ నిరూపింపలేకపోయారు. తదుపరి ఆపాత్ర బాగానే పోషింపబడింది. లీలావతిపాత్ర చివరలో పాడౌతుంది. భీమసేనరావు కేవల మంధవిశ్వాసిగా చెప్పబడ్డాడు. శాస్త్రవేత్తగా నుండవలసిన విద్యాలంకారాచారి ప్రతిపాండిత్యంగల అల్పుడుగా తేలాడు. రాజారావంత పిరికిపందగా వుండకూడదు.

భరతనాట్య లక్షణానుసారంగా దశవిధ రూపకాల్లో యిది "ప్రకరణము" అనేరూపక భేదానికి దగ్గరగా ఉంది. లేదా సంకీర్ణరూపకంగా విభజిస్తే బాసుంటుంది. అతిప్రాచీనమగు భరతలక్షణానికి లొంగని నవీనయుగంలోని ఉత్తమనాటకాలన్నీ యీ విధంగానే విభజింపబడాలి. "నాటిక" యను రూపక మట్టిదే.

ఇందులోనిరసం విచారిస్తే ధర్మవీరరసం. ఇది ప్రకరణంలో నుండదగిన వీరశృంగారములలో నొకటి. నాయకనిర్ణయంలో కొన్ని చిక్కులు కానవస్తున్నాయి. రాజారావందమా? సిద్ధాన్నము నారగించేవాడేగాని నాయకుని కుండవలసిన ధైర్యసాహసములూ కార్యదీక్షా కలవాడు కాదు. నాయికాసాహచర్యం గాని, ఘనానుభవంగాని లేకపోయినా లక్షణాల్ని బట్టి శ్రీధరుడే నాయకు డనటం యుక్తము. భీమసేనరావు ప్రతినాయకుడు. రూపక మెట్టిది? నాయకు డెట్టివాడు? అనే సమస్యనుగూర్చి ముద్రారాక్షసాదిసంస్కృత నాటకాలలో గూడ సంశయా లున్నాయి. ఆ చర్చ నంతగా తీసికోవద్దు. నాటకసంధ్యాదులు, వ్యాకరణాంశము లసలే స్మరించవద్దు.

ఈనాటకప్రయోగము నాదినుండి అంతం వరకు చూచినవాడు తన నిద్రాభంగానికీ, ధనవ్యయానికీ పశ్చాత్తాపం పొంది పైగా కవిగారిపై శాపవాక్యాలు విసరుతాడు. కళాదృష్టిలో యీనాటక మేమాత్రం చరితార్థం కాజాలదు. రసం బహునీరసంగా ఉంది. పాఠకుడికిగూడ మిగుల విసుగుదం

కలిగిస్తున్నది. కవిగారే స్వయంగా దీన్ని ప్రదర్శించారట. ఇందు వారిసహజప్రజ్ఞ కూడ ఉపయోగించదు. ఇట్టిపుస్తకాన్ని యే అనామకుడో వ్రాస్తే దాని కేగతి పట్టేదో చెప్పజాలను. దీన్ని విషాదాంతంగా మారిస్తే బాగుండేది.

## మొదటి అంకము—రంగము-౧

భీమసేనరావు భార్యతో తారనుగూర్చి మాట్లాడేటప్పుడు "సుఖదుఃఖములు కావడి కుండలు" అని అంటాడు. దీనికి సందర్భ శుద్ధి కానరాదు. తార కీకష్టం తొలగే దెట్లాగో? తర్వాత తారకు కలిగేసుఖ మేమిటో? ఇట్టిసూక్తులు తరుచుగా ఉపయోగిస్తే భావ కందకు వస్తుం దనుకొన్నారేమోకాని సందర్భంలేనప్పు డది పాండిత్య ప్రకర్షకా అని తోస్తుంది.

తారకు గర్భస్రావాన్ని భీమసేనరావు బోధించేటప్పుడు దీనికి మూల మెవ్వరో తెలియక భీమసేనరావేమోనని అనుమానం కలుగు తుంది. దాని నంతసంభవగా ఎందుకుంచాలి. ఇది నవలగనుక నా ఒకచోట సంభవగా ఉన్నదాన్ని స్థలాంతరమందు స్పష్టం చేయటానికి.

౭, ౮, ౯ పేజీలలో భీమసేన విద్యాలంకారులు ధర్మప్రసంగం చేస్తారు. ఆ సంభాషణ వింటే "కవి ఒకవిధంగా నిర్మింపదలచు కొన్నపాత్ర లింకొకవిధంగా నిర్మింపబడ్డాయి" అని తేలుతుంది. విద్యాలంకారులు "పండితుల కొకధర్మము, పామరుల కొక ధర్మము. పండితులకు పాపము లేదు. కాక ఒరులకు తెలియకుండ చేసినపాపము పాపము కాదు" అని అంటాడు. భీమసేనరావంతటి వకీలుచే గురుస్థానమం దుంచబడి యెల్లరచేత ధర్మవేత్తగా యెంచబడుతూన్నవానిచేత ఇంత జ్ఞానశూన్యంగా పలికించడ మేమి యుక్తంగా ఉంది? పైగా — భీమసేనరావు పేరుగన్న వకీలు; పురపాలక సంఘా ధ్యక్షుడు; అట్టివాని నంధ విశ్వాసిగా వంతపాటవానిగా చేయటం — కాని — పాశ్చాత్య నాటకాలలో గొప్ప వ్యక్తుల కొక గొప్ప లోపం చూపి దాన్నే తరువాత కథ కంతకీ కారణంగా నిర్మించడమూ కద్దు. దీని తాత్పర్యం మానవగత సహజ లోపాన్ని వెల్లడించటం మంచిదే. ఇట్టిది హైందవ నాటకాల్లో లేకపోవటం. కొరతకూడ. ఆ ప్రకారమే కవి యీపాత్రలను సృష్టించెనా? కాదు. ఈ పాత్రలయందు లోపమే గాని గుణ మెక్కడా చూపబడలేదు. కనుక యిది ఉద్దేశపూర్వకంగా కాక రచనాకౌశలాభావమువల్లనే జరిగింది.

ఉత్తమము లైన చాలనాటకాల్లో రసవత్తమంగా ఉండవలసిన మొదటిరంగంలో కవులు పొరబడుతూంటారు. అట్టి అవస్థయే మన నాటకంలో యెక్కువగా ఉంది. ఈ రంగంలో యేమీ రక్తి పుట్టదు, సరిగదా తలనొప్పికూడ వస్తుంది.

## రంగము—౨

రాజా యెంతవరకు నిలబడగలడో తెలిసి కోకుండా తార తన్నర్పించుకొంటుంది. దానికి "అనుభవము లేని చిన్నతనం" అని సమాధానం చెప్పుకొంటే మరి యీ రంగములో లోపము కానరాదు.

## రంగము — 3

ఇందులో మొదట కొంతభాగం చెత్తగా ఉంటుంది. మిగిలినభాగంలో ఎన్నో ప్రమాణ వాక్యాలు ఉదాహరింపబడ్డాయి. వానిలో చాలావరకు సందర్భశూన్యములే.

## రెండవ అంకము — రంగము-౧

శ్రీధరుని వివాహాభావం ఏకారణంచేతనో సూచనైనా లేదు. ౪౦ కి పైబడ్డ వయస్సు కలవాడు. ఇప్పుడు తారాశ్రీధరుల మధ్య ప్రణయగాథ అంకురింపజేసారు కవిగారు. గర్భిణి యైన తార అనాథయై ఆత్మహత్యకు సిద్ధంకాగా శ్రీధరుడు చేరదీసి పోషిస్తాడు. అప్పుడు ప్రేమగాథ మనుష్య సాధారణంగా యిట్టి హృదయదౌర్బల్యం కలదని చూపించుటకా యిది. కథావస్తువుకిది ఏమాత్రమూ అందం కలిగించకపోయినా రసాభాసకుమాత్రం బాగా తోడ్పడుతుంది.

## రంగము - ౨

ఇక్కడ శ్రీధర రాజారావులసంభాషణ హృదయంగమంగా ఉంటుంది. కాని రాజా తారతో మాట్లాడవెళ్లాడు. దాని సారాంశ మేమిటో యెక్కడా తెలియదు. ఈ రంగంలో లీలావతి బాగా పోషింపబడ్డది.

## రంగము - 3

"అశ్వత్థామా హతః........." అనిన్నీ,
"వారిజాక్షులందు......
......నఘము బొందడధిప"

అనిన్నీ కద్దు. ఇందులో మొదటిది భారతము. రెండోది భాగవతము. కాని—"ఇది మహాభారతమయ్యా, పంచమవేదము, వ్యాసుల వారిది" అని విద్యాలంకారునిచేత పలికించారు. ఇతని జ్ఞానశూన్యతను తెలియజేయుటకా? యిది (కవిప్రమాదము కాదుగదా!) ఇట్లే మొదటి అంకములో రంగములో—"ఫలానా నాశిష్యునికి ఫలానానేను ఉపదేశించున జేమన" అని సొంతభావ వ్రాసి క్రింద "ఇతి నారాయణస్మృతిః" అని పీఠాధిపతులైన ఒకస్వాములవారిచే వ్రాయబడింది. ఇట్టివారిని పూర్వమార్గం తొక్కేవారైనా ప్రజ్ఞాపాండిత్యాలు కలవాళ్లనే చేయాలిగాని ౬ X 3=౧౧ అనే శుంఠలుగా తయారుచెయ్యరాదు. అట్లయితే నాటకంలో పసయేముంది?

ఈరంగంలో ధర్మప్రసంగం మరీచిత్రంగా ఉంటుంది. ఒకటిరెండుమాటలు చూపిస్తాను:

లీలా—దయ వలదా (తారపై)

భీమ—దయ సర్వేశ్వరునిసొత్తు.

లీలా—తాగను బుజ్జగించి లోనుజేసికొన్న వారు పాప మొనర్చిరా? లేక ఒడ లెరుంగక లోబడినతార పాప మొనర్చెనా?

దీనికిచ్చే సమాధానాలుపుస్తకంలో చూడండి.

విద్యాలంకారుడు "ద్రవ్యార్జన సులభమగు వరకు దుర్మార్గమును తొక్కనేరాదు" అని అంటాడు.

## రంగము—౪.

హెడ్ కానిస్టబిలు అరవాయన యెందుకో? తెలుగువాడైతే వచ్చినరసభంగ

మేమిటి? ఇది కేవలం సామర్థ్యప్రకర్షకన్న ట్టుగా ఉంది. కాని ఒకటి చెప్పవచ్చు. ఈగ్రంథంవల్ల యింతవరకు విసుగెత్తినవాళ్లకీ అరవతెలుగు కొ్రొత్తశక్తి నిస్తుంది.

రంగము — ౫.

తల్లి శవము ప్రక్కనుండగానే శ్రీధరుడు దేవతార్చన సాగిస్తాడు. ఇది యేప్రాంతా న్నయినా ఆచారంగా ఉందా? ఈసమయం లోనే "నిన్ను నే నెందుకు పెండ్లాడరాదు?" అని తార అంటే "నే నందుకు తగను." అని శ్రీధరుఁడంటాడు. ప్రణయగాథలకుగూడ ఇదేనా సమయం?

ఈరంగంలో ముఖ్యంగా విచారించవల సింది లీలావతీపాత్రనుగూర్చి. ఈనాటకాని కంతటికి విమర్శనస్థాన మిది. గ్రంథకర్త గారికి లీలావతి వీరవనితగానుండుట యిష్టము. కాని అట్టి లక్షణాన్ని ఆదినుంచి నిగూఢంగా నైనా చూపెట్టలేదు. అవకాశం లేకపోలేదు. తుద కామె యెరువుతెచ్చుకొన్నట్టు ఒక్క సారిగా విజృంభిస్తుంది. అది అటుంచండి. (౬౧ పేజీ మొదలు) శ్రీధరునింట తారనేగాక లీలావతినిగూడ శవవాహికగా చేయటం ఏదృష్టితోజూచినా పాత్రోచితంగా లేదు. ఒక సుప్రసిద్ధన్యాయవాదియొక్క ధర్మపత్ని, ఆభిజాత్యసంపన్న, సాధ్వి - అట్టి ఆమె దిక్కు లేని శ్రీధరునికి శవవహనంవిషయంలోనే దిక్కు కావలసివచ్చెనా? నీచమున్నూ అతిసాధా రణమున్నూ అయిన యీపని ఆప్రాజ్ఞురా లేవిధంగానైనా ఆ పని చేయ దగువాళ్లచేత చేయించగల్గునే. సుతరాం సరిపడని సంగతు లలో ఇది యొకటి. మరొకటి లీలావతి యీ విషయమై తనపతిని తోసిరా జంటుంది. విద్యాలంకారాచారిని తూలనాడుతుంది-పతి గాని మరియెవ్వఁడుగాని సంఘమున కుపద్రవ కారియై మాటలతో చక్కబడనినాడు "స్త్రీ ధర్మములో" యెట్టిసాహసాన్నయినా చేయ దగిందే. అట్టిసాహసం మహాసమస్యాలం బవ లంబించిన ప్రశంసాపాత్రమగును. అట్లుకాక- అత్తవారింట నడుగుపెట్టిందిమొదలు అను కూలదాంపత్యంచే సుఖజీవన మనుభవిస్తూ కడుపులోనీళ్లు కదలని సుకుమారి లీల, అపార సంపదలు గలలీల, వీనినన్నిటినీ కాలదన్నుటా? కుమారుల కనదగిన కుమారుడున్నాఁడు. అతఁడు తన్నెంతవరకనుసరిస్తాడో తెలి యదు. అవసరమైతే అతన్నిగూడ విడనాడ సిద్ధమా? నిన్నటివరకు ప్రయత్నించినా కన బడనివ్యక్తి నేఁడొక్కసారి రాజవీథి కెగబడు టా? దూరదృష్టిగలతార వల దంటుంది; మం దలిస్తుంది. అమ్మా! దూరమాలోచించుకొమ్మ అంటుంది. దానికి తారా! నా కట్టిభయము లేదు....అని పైగా "కాలము మారుచున్నది" అంటూ త్యాగశీలుడగు శ్రీధరుడు భయకంపితు డైనా లెక్కచెయ్యక తనజీవిత మేమగునో ఆలోచింపక 'పట్టండి, శవాన్ని పట్టండి' అని తెగబడుటా? ఏమంతతీరనిసమస్య యని యీ అనుచితసాహసం? ఇదంతా రంగస్థలం మీద చూస్తే సామాజికు లెంకెంతగా విమర్శి స్తారో?

మూఁడవ అంకము — రంగము ౧

నౌకరు వచ్చి చెప్పగా లీలావతి కోర్టులో నుంచి లేచిపోయిం దెందుకో తెలియలేదు. ఇంకొకటి. బంగారుపడకమునకు సంబంధించి నంతవరకు అనగా వీరన్నశెట్టి యింటినుండి దొంగిలింపబడింది మొదలు రాజారావు కోర్టులో చంద్రహార మర్పించినవరకుగలకథ యెన్నిసార్లు చదివినా యేమీ అర్థం కావటం లేదు. రంగస్థలంపై మరీ గందరగోళంగా ఉంటుంది. పిరికిపందయైన రాజారావింతగా ఎట్లు తెగించాడు? ప్లీడరీవృత్తికి జీవిత మర్పిం చిన భీమసేనరావు తనసాక్షి ఆచారితోగూడ న్యాయస్థానంలో సవాలుచేసినపుడు తత్తర లాడటంలో అర్థమేమి? ౬౬వ పేజీలోనూ మరొక్కచోటనూ గూడ "మూడుకూర్ల పిలువగా" అని కవిగారు 'డైరెక్షను'యిస్తారు. పాఠకులకు మాత్రం కోర్టుసంప్రదాయం తెలి యజేయటమే ఉద్దేశమైతే ఛాందసంగా కని పిస్తుంది. అదిగాక వీరు భాషని సజీవంగా చేయదలంచి ప్రయోగించిన "జ్ఞానముకావలె నండి; జ్ఞానము" అనేవాక్యం అభీష్టసిద్ధి కలుగజేయక అస్వాభావికమై పెక్కుసార్లు ప్రయోగింపబడటంచేత వెగటుకూడా కలి స్తోంది.

రంగము — ౨.

గ్రంథంపేరున్నూ కథావస్తువున్నూ సామ రస్యమేమాత్రమూ అర్థతః కుదరకపోయినా పెద్ద అక్షరాలతో "సరిపడని సంగతులు" అని శబ్దతః చివరకు కుదర్చి వారంతటవారు తృప్తి పడ్డారు.

వీ రిదివరకు పత్రికలో వేసిన "పెరుసు ముంత" ప్రహసనాన్నీ యీనాటకాన్నీ చూస్తే శ్రీ ఆచార్యులుగారు "నాట్యా చార్యులు" గా ఉండదగినవారేగాని "కవి బ్రహ్మ"లు కాజాలరని తోస్తుంది. ఈనాట కములో గుణవంతములగు భాగాలు లేకపో లేదు. కాని నాకు కనుపడ్డదోషాల్ని మాత్రమే సరిగా నిర్ణయించి చెప్పవలసిందిగా వ్రాసి కొన్నాను.

# వ్యవసాయ ఋణవిమోచన శాసనము

౧౯౩౭వ సంవత్సరం జనవరి మాసములో సమావేశమై మదరాస్ శాసనసభలవారు ముగింపుకు దెచ్చిన రైతుఋణములకు సంబంధించిన బిల్లువిషయములో దేశమునందు కలిగినంత ఆందోళన ఈవరలో ఎప్పుడును ఏవిషయము నందును కలుగలేదంటే దాని ప్రాముఖ్యము సులభముగా వ్యక్తపడుతుంది. కాంగ్రెసువారు ఎన్నికలలో పాల్గొనడానికి ఉద్దేశించినపుడే రైతుఋణవిమోచనము కలిగిస్తామని వాగ్దానము చేసినారు. శాసనసభలలో అపరిమితసంఖ్యాకులుగా తమకు ప్రవేశము కలిగిన తరువాత తాము దేశానికి చెప్పినమాట సార్థకపరచడానికి ఆలోచించినారు. అప్పులు వడ్డీలు వసూలుచేయడం ఒక్క సంవత్సరంపాటు నిలిపి ఆ సంవత్సరములో బాగా ఆలోచన చేసికొని తగినశాసనము చేయవలెనని సంకల్పించినారు. దానినే ఇంగ్లీషులో 'మారటోరియం' అంటారు. కాని, ఈ ఆలోచన చేసీ చెయ్యకముందే దేశములోని సాహుకారులు ఋణగ్రస్తులను పీడించడము ఆరంభించినారు. అందుచేత మళ్ళీ సంవత్సరముదినములు ఆలస్యము చేసినట్టయితే యింకా ఏఏమార్గాలలో రైతులను సాహుకారులు చిక్కుపెట్టెదరో అను భావము మనసులో కలిగి కావలెను వెంటనే వ్యవసాయ ఋణవిమోచన శాసనాన్ని పూర్ణముగా తయారుచేయడానికి సిద్ధపడినారు. శాసనము ఆలస్యంగా చేసినా, అందులోని ముఖ్యసూత్రాలు ౧౯౩౭ వ సంవత్సరము అక్టోబర్ నెల మొదటి తేదీనుంచే అమలులో నుండవలసినట్టు నిశ్చయించినారు. తరువాత ౧౯౩౭ వ సంవత్సరము డిసంబరు నెల మొదటి తేదీని ఈ నవీనశాసనము మదరాసు గెజట్‌లో ప్రకటించినారు; వెంటనే శాసనసభలలో ప్రవేశపెట్టినారు; సెలెక్టు కమిటీ విచారణకు పంపించినారు. సెలెక్టు కమిటీవారు డిసంబరు ౩౦ వ తేదీన తమ రిపోర్టును తయారుచేసి పంపినారు. జనవరి ముప్పైఒకటవ తేదీకి ఇది శాసనసభలవారిచేత అంగీకృతమైపోయినది. గవర్నరుగారి ఒప్పుదలమాత్రము రావలసియున్నది. త్వరలోనే అట్టి యొప్పుదల రాగలదను విశ్వాసము కలదు.

* * *

ఈబిల్లు ప్రకటితమైనదినము మొదలు శాసనసభలవారి ఆలోచన ముగిసేవరకు రెండు మాసములకాలము ఈ బిల్లునుసరించిన విమర్శ కొలది మహాజర్ల మూలకముగాను సభల మూలకముగాను పత్రికలలో పుటలకు పుటలు వ్యాఖ్యానముల మూలకముగాను విస్తారముగా జరిగినది. ఒకనైపున ధనాధికారులపరముగా నాందోళన, మరియొకనైపున బీదలపరముగా నాందోళన తీవ్రముగా విజృంభించినవి. ఆలోచించి చూడగా సంవత్సరములకొలది వ్యవధియుండిన సందర్భములలోకూడ ఇంత విమర్శ ఏ విషయమునుసరించియు జరుగలేదని చెప్పక తప్పదు. కాబట్టి కాంగ్రెస్ ప్రభుత్వమువారు తొందరపడి ఈ శాసనమును చేసినారనడము పొసగదు. మహోత్తమమైన రోగము పీడించునపుడు చక్కగా నాలోచించి త్వరగా మందిచ్చినవాడు వైద్యుడగును గాని ఆలోచన చేయుచు రోగి చచ్చుటను కనిపెట్టినవాడు వైద్యుడు కాజాలడు.

* * *

మద్రాస్ శాసనసభవారు నిర్మించిన ఈ చట్టపుటుద్దేశ్యము ఏమనునది గమనింపదగును. ఇది ప్రత్యేకముగా బీదలను సంరక్షించుటకేర్పడిన శాసనము కాదని కొందరి విమర్శ. ఆ వాదము నిజమని అంగీకరింపకతీరదు. ఈ శాసనముప్రకారము అప్పులు తీరినతరువాత బీదరైతుకు ఎకరా భూమికూడ నిలువకపోవచ్చును. అతని వ్యక్తిగతముగా అతనికి జీవితమునకే మార్గము లేకపోవచ్చును. ఇంతే కాదు; వ్యవసాయపుపనులు చేసికొనుచు కూలీలుగామాత్రము ఉండేవారి అప్పులుకూడ ఈచట్టముక్రిందికి తేవలసిందని చేసిన సవరణ శాసనసభవారు తిరస్కరించిరి. అనగా అట్టి బీదలకును ఈ శాసనము సంరక్షణ కలుగజేయదనడము స్పష్టము. వారు ఇదివరలోవలె సాహుకారులకు జవాబు చెప్పకోవలసినదే కాని గత్యంతరం లేదు. వ్యవసాయమో లేక యితరవృత్తులో అవలంబించుచూ అప్పుపడిన బీదసాదలకు ఈ చట్టము అసలే ఉద్దేశింపబడినది కాదు. మరికొంద రనుకొనుకీతిని ఈ చట్టము సాహుకారిపద్ధతిని నశింపజేయుటకుగాని, జమీందారుల ఆస్తులను అపహరించుటకుగాని ఏర్పడినట్టిది గాదు. పైన జెప్పిన బీదలందరికిని ఈ చట్టము అన్వయము కాదనడమే ఇందుకు నిదర్శనము. జమీందారులకు రాదగిన సత్తలు కొన్ని ఫసలీలవి రైతు ఇచ్చి తీరవలెనని నిర్ణయించడము, నియమితమైన కాలములో అట్లు ఇవ్వనియెడల మినహాయింపు కాదగిన బాకీలు మినహాయింపు కావనడము జమీందారుల స్వత్వములను అపహరించుటకేర్పడినవి కావు. నిజమునకు ఈ శాసనపుటుద్దేశ్యము ఏమనునా యను ప్రశ్నకు ప్రత్యుత్తరము ప్రధానమంత్రి గా॥ శ్రీ సి. రాజగోపాలాచార్యులుగారు పదేపదే చెప్పియున్నారు. ఈ దేశములో నూటికి డెబ్బదియైదుగురకు జీవనమునకై వ్యవసాయమే ఆధారము. ఇందులో జమీందారులును చేరినారు. సాహుకారులును చేరినారు. వ్యవసాయపు కూలివారును చేరినారు. ఇతర బీదలును చేరినారు. ఇందరి జీవితమును పోషించే వ్యవసాయపరిశ్రమ మన దేశములో ముందు అడుగుపెట్టి విజృంభించడానికి వీలులేనంత అప్పుల బరువుక్రింద క్రుంగిపోతున్నది. ఈ బరువును త్రోసివేసిననేకాని మరల ఈ పరిశ్రమ తలయెత్తుకొని అభివృద్ధి కావడానికి అవకాశాలు లేవు కాబట్టి వ్యక్తులసంపత్తు పేదరికములతో ఈ విషయమునకు సంబంధము లేదు. వ్యవసాయ పరిశ్రమ నడుపుచుండే మానవుడు ఎవ్వరైనా బీదయైనా, బక్కయైనా, బలవంతుడైనా అప్పులుపడి వుంటే అట్టి అప్పుబరువు తగ్గితేనేగాని పరిశ్రమను నిలువబెట్టుకోలేడు; కాబట్టి అట్టి అప్పుల బరువు తగ్గించి వ్యవసాయపరిశ్రమ విజృంభణ

గాడిచర్ల హరిసర్వోత్తమరావు

మునకు తోడై దేశకల్యాణమును సాధించవలె ననే ఉద్దేశ్యముతో ఈ శాసనము ఆలోచించితి మని అతడు మరిమరి స్పష్టపరచినాడు. ఈ విషయము గమనించి ఈ శాసనమును విమర్శింతురేని దీని ప్రయోజనమును గ్రహింపగల్గుదురు.

*　　*　　*

వ్యవసాయపరిశ్రమను సంరక్షించడానికి ఇదివరలో అప్పులబాధతప్పించే ప్రయత్నాలు జరుగలేదా యని ప్రశ్నించేవారుంటారు. గత శతాబ్దములో ఫేమిన్ కమీషనువా రేర్పడి రిపోర్టుచేసిననాటినుండియు ఈ ప్రయత్నాలు సాగుతూనే ఉన్నవని చూపించేవారుంటారు. వ్యవసాయదారులకు అప్పులివ్వడానికి సర్కారువారు అమలులో పెట్టిఉండే 'అగ్రికల్చరిష్టులోన్సు ఆక్టు' "ల్యాండు ఇంప్రూవ్‌మెంటు ఆక్టు." ౧౯౦౪ వ సంవత్సరపు పరపతిసంఘాల, అంటే 'కో ఆపరేటివు సొసైటీల ఆక్టు' "యుజూరర్సు ఆక్టు" (వడ్డీరేటు నిరోధపు శాసనము), ౧౯౩౪ వ సంవత్సరపు "డెట్టు కన్సిలియేషన్ ఆక్టు" ఇటువంటివి అనేకశాసనాలు ఇదివరలో చేసి రైతుకేదో కొంత మేలుచేతామనే ప్రయత్నము అధికారులు జరిపినారు. నాటి ఫేమిన్ కమీషను వారి రిపోర్టువలెనే తరువాతికాలములో 'అగ్రికల్చరల్ కమీషను', 'బ్యాంకింగు ఇన్‌క్వయరీ కమిటీ', 'సత్యనాథన్ కమిటీ' ఇటువంటి సంఘాలేర్పడి రైతుపడే దుర్భరావస్థలనుగురించి విచారణలుచేసి అతని అప్పు ఎట్లా పెరుగుతూవుందో కనుపరుస్తూ నివారణోపాయాలు చేయకపోతే వ్యవసాయ మభివృద్ధి కాదని నిన్నటిదనుక రిపోర్టులు ప్రచారణ అవుతూవచ్చినవి. అనగా అర్థమేమి? వ్యవసాయదారునికి సంభవించియుండే అప్పుల కష్టము తీరడము ఇదివరలో అవలంబించిన ఏ ఉపాయాలచేతను సంభవించలేదు.

*　　*　　*

మద్రాసు శాసనసభయందు దాక్షేపించిన వారియందొక్కరుకూడ ఇదివరలో చేసిన ప్రయత్నాలు చాలును అన్నవారు లేరు. శుద్ధప్రయత్నముగా జరుగుచుండిన "డెట్టు కన్సిలియేషనును బలపరచవలసినది" అని కొంద రాక్షేపకులు సూచించినారు. "డెట్టు కన్సిలియేషన్" అంటే యేమి? అప్పులిచ్చిన వారిని, అప్పు తీసికొన్నవాణ్ణి పిలిపించే అధికారి ఏర్పడడము, ఇష్టపడి రాదలచుకుంటే వారు రావడము, మధ్యవర్తిగా విషయాలు విచారించి అధికారి ఇంతమట్టుకు ఈరీతిగా మీరు పరిష్కారముచేసికొనవలసినదని చెప్పడము, వా రిష్టపడితే పరిష్కారము వ్రాయడము, నిర్ణయమైన మొత్తమును రైతు ఇచ్చుకోలేనినాడైతే సర్కారువారి "అగ్రికల్చరిస్టస్ లోను ఆక్టు" క్రింద తక్కువవడ్డీకి అప్పు మంజూరుచేయడము ఇది "డెట్టు కన్సిలియేషను" శాసనముయొక్క సారాంశము. సర్వమును అప్పిచ్చిన, పుచ్చుకొనినవారి యిష్ట ప్రకారము జరుగడమంటే యుగాలు మారిపోయినా అనుకొన్న సంస్కారము కాదు. కాబట్టి దీనిలో నిర్బంధము కొంత ప్రవేశపెట్టవలసినదని కన్సిలియేషన్ శాసనాన్ని శాసనసభలో పెట్టినదినమునుంచి వాదించినవారు మితవాదులలో చాలమందియున్నారు. రాజగోపాలాచారి చట్టమును ఆక్షేపించడము కొరకు డెట్టుకన్సిలియేషన్ శాసనమును బలపరచవలసిన దనినవారుకూడ ఇట్టి నిర్బంధ మేర్పరచవలసిన దనువారే కాకతప్పదు.

*　　*　　*

"డెట్టుకన్సిలియేషన్" విధానము నిర్బంధము చేయవలసినప్పుడు దానికి కొన్ని మూల సూత్రా లేర్పరచవలసినదేనా? ఆ మూల సూత్రాలు ఏయే విషయాలలో ఏర్పడవలెనని ఆలోచింపవలసినదేనా? తీసికొన్న అసలు అప్పు మొత్తమెంత? వడ్డీరే టెంత? త్రిప్పించి మళ్లించి వ్రాయించుకొనిన పత్రాలన్నిటిని గౌరవించవలసినదేనా? ఈ దినము బజారులో వడ్డీ నూటికి సంవత్సరానికి అయిదో నాలుగో అయినా పత్రములో పంద్రెండని, ఇరువదినాలుగని ఉంటే అట్లే లెక్కవేయవలసినదేనా? వడ్డీకివడ్డీ ఆరునెలల కొకసారి త్రిప్పి కట్టియుండినా యిప్పించవలసినదేనా? తీర్మానమైన మొత్తమును రైతు వెంటనే యివ్వడానికి డబ్బు అతనివద్ద ఉంటుందా? సర్కారువారు ఆ జామీను పెట్టగలరా? పెట్టలేకపోతే అతడు ఇన్‌సాల్వెంటుకోర్టులో పడిపోవలసినదేనా? వ్యవసాయదారుడు జమీందారుకు గుత్తకుగాను అప్పుపడియుంటే అది అప్పవుతుందా కాదా? ఒకవేళ అప్పయినా దాని నాల్గింతలు పదింతలు వడ్డీకే చెల్లించి పోయియుండినా ఆ అప్పు చెల్లిందనే తృప్తి రైతుకు కలిగేమార్గము కనుపించకపోయినప్పటికీ ఆ మొత్తము రైతునెత్తిన మోపియుంచవలసినదేనా? పేరుకు భూమికలవాడో భూమిలో భాగముకలవాడో అయినా ఏ వకీలుపనో వ్యాపారమో చేసుకుంటూ పట్టణవాసాలలో నివసించే మానవునికి సంరక్షణ యియ్యవలసినదేనా? నేడు ఈ సంరక్షణ కలిగించినా రేపు మళ్లీ వ్యవసాయపుపనులకు రైతుకు ద్రవ్యోపపత్తి కావలసియుండునే, ఆ ద్రవ్యోపపత్తిని సక్రమమార్గాలలో కలిగించే సాధనాలేమి? అనే యిన్నిప్రశ్నలకు సదుత్తరాలు చెప్పుకొంటేనేగాని "డెట్టు కన్సిలియేషన్" విధానాన్ని నిర్బంధరూపముగా అమలులోనికి తేవడానికి రాదు.

*　　*　　*

శ్రీ సి. రాజగోపాలాచారిశాసనముద్వారా మద్రాసు శాసనసభలవారు తీర్చియుండే కార్యక్రమము ఇంతకంటే యేమాత్రము భిన్నము కాదు. నిజముగా డెట్టుకన్సిలియేషను విధానాన్ని నిర్బంధముచేయడమే "స్కేలింగు డౌనుఅఫ్ డెట్సు" అంటే అప్పుల తగ్గింపు క్రిందికి సహజముగానే పరిణమించినది. పైపేరాలో సూచితమైన అన్నిప్రశ్నలకూ సమాధానాలు కుదిర్చి ఈ క్రొత్తశాసనములో ఇముడ్చినారు. సూక్ష్మవిషయాలలో భిన్నాభిప్రాయాలుండడానికి అవకాశ ముండవచ్చును, అవకాశమున్నది. కాని శాసనమూలసూత్రాలు శాసనస్వరూపము విషయములలో బహుజనాభిప్రాయము స్పష్టముగా ఇందులో ప్రతిఫలించినది. కాంగ్రెసుప్రభుత్వమువారు మహోదారకార్యము నిర్వహించినారనడము స్పష్టమే. వారి ప్రతిష్ఠయు దీనిచే పెరిగినదనుటయు సత్యమే.

*　　*　　*

ఈ శాసనము వ్యవసాయపరిశ్రమను త్రోవ రుజ్జీవింప నేర్పడినది, కాబట్టి దీని ఫలమును

పొందదగిన వ్యవసాయదారుడనే మానవు డెవడు అనే నిర్వచనము అవసరమైనది. దీని విషయములో చిత్తుచట్టమును ప్రకటించి నప్పుడు వ్రాసిన వివరణమును సెలెక్టు కమిటీ వారు కొంత మార్చిరి. వ్యవసాయమునకు భూమి మొదటి యావసరము. కాబట్టి భూమిలో హక్కుకలవాడు లేదా సత్తదారుగా హక్కుపొందినవాడు వ్యవసాయపరిశ్రమకు ఆదిపురుషులు. అయినా భూమికి సంబంధములేని యితరవృత్తులలో ఉండిపోయేవారికి సంరక్షణకలిగితే అది వ్యవసాయానికి ప్రయోజనము కలుగజేయదు. మన దేశములో వ్యవసాయదారుల కుటుంబాలలో ఇతరవృత్తులవలంబించి పట్టణవాసాలు చేరిపోయినవారున్నారు. సమష్టికుటుంబములోనివారైనా వీరు వ్యవసాయవృత్తిమాత్రములో చేరరు. కాబట్టి ఈశాసన మన్వయము చేయడములో వీరిని వేరుగా చూడక తప్పలేదు. వీరిని వేరుపరచడానికి కొన్ని విషయాలాలోచించినారు. ఇన్‌కంటాక్సు పడియుండడము ౧౯౩౮ సం॥ మార్చి ౩౧ వ తేదీకి ముందు రెండేండ్లలో ఒక ఏడాదైనా టాక్సు విధించియుంటేనే ఈ వర్గములోకి చేర్చుడ మనుననినారు. స్థానికాధికారులకు—అనగా మునిసిపాలిటీలకు, జిల్లా బోర్డులకు, కంటోన్‌మెంటులకు ౧౯౩౦ వ సంవత్సరము ఆగస్టు ౨౬ వ తేదీకి ముందు యూనియనులుగా ఉన్న పట్టణసంఘాలకు సంవత్సరానికి రు. ౩౦౦ లకు మించిన ఆదాయముమీద ౧౯౩౬ వ సం॥ అక్టోబరు ౧ వ తేదీకి ముందు రెండేండ్లవృత్తిపన్నుకు పాత్రమయియుండడము. అదేవిధముగా రు. ౬౦౦ లకు తక్కువగాని ఇంటిపన్ను ప్రాపర్టీపన్నుకు పాత్రమయియుండడము, రు. ౫౦౦ లకు పైబడిన షేమ్కు ష్టు రు. ౧౦౦ లకు పైబడిన క్విట్రెంటు, జోడీ, కట్టుబడి, పొరుప్పు ఇచ్చే భూమిఖామందు కావడము, మలయాళములో ఆ దేశపు చట్టముక్రింద జన్మిగానుండి సర్కారుకు రు. ౫౦౦ లకు పైబడినశిస్తు కట్టడము ఇవన్నీ కూడా ఈ శాసనమునుండి వ్యక్తిని తప్పించవలసినదని తీర్మానించినారు. ఈ శాసన మమలులోనికి వచ్చిన రోజున ఈ నిర్వచనముప్రకారము వ్యవసాయదారుగా లేనివానికీశాసన మన్వయింపదు. అనగా వీరికి ఋణవిమోచన ఈ శాసనము క్రింద జరుగదని నిర్ణయము. ఈ నిర్ణయానికి రావడములో ప్రచండమైనవిమర్శ జరిగినది. జమీందారులు శ్రోత్రియందారులు కొంత మెట్టుకు పైబడినప్పుడు సంరక్షణ పొందలేదు గదా! వేలఎకరాలకు ఖామందులయి వేల కొలదిరూపాయలు సర్కారుకు చెల్లించే బలవంతులను రైతునాకీరైతుల కీసంరక్షణ ఎందుకివ్వవలెను? రైతువాకీరైతైనా ఒక దర్జాకు పైవాడయితే సంరక్షణ ఇవ్వవలదని కొందరాక్షేపించినారు. యూనియన్ బోర్డు ఇత్యాదులలో సంవత్సరానకు ౩౦౦ ఇతరత్ర సంపాదించినమాత్రముచేత, లేదా రు. ౬౦౦ ల విలువమీద పన్నిచ్చినా గొప్ప ఆదాయము కాదు, కాబట్టి అట్లాటివేవున్నా రైతన్నవాడు ప్రతివాడు సంరక్షణకు పాత్రుడు కాతగినవాడని మరియొకవైపు వాదవివాదాలు జరిగినవి. వ్యవసాయదారుని నిర్వచనము సెలెక్టుకమిటీవారు నిర్ణయించినపిదప అసెంబ్లీ సభలో దీనికి ౬౮ సవరణలు పెట్టినారు. నిజమైన మార్పుకలిగించే సవరణ యొక్కటికూడ అంగీకృతము కాలేదు. శ్రీ రాజగోపాలాచార్లుగారు జవాబుచెప్పతూ వ్యవసాయము మీదే దృష్టిని కేంద్రీకరింపనివారినందరిని తామీశాసనలాభమునుండి దూరము చేయదలచినందున ఇన్‌కంటాక్సు వగైరాలు చేర్చితిమనియు, వ్యవసాయముమాత్రముతోనే తృప్తిపడినవారికి వారివారి అంతస్తుకు తగినట్టుగా అప్పులుకూడా తప్పవు. కాబట్టి అందులో పైదర్జా క్రిందిదర్జాలని వేరుపరచడము మానుకొంటిమనియు వాదించిరి. ఈ శాసనోద్దేశ మంగీకరించినపిదప ఈ వాదము సమంజసమని అంగీకరించుట ధర్మము.

* * *

బాకీదా రిట్టివాడని నిర్ణయమైనతరువాత అప్పులిచ్చినవా రందరిని ఈ శాసనముక్రిందికి తేవలెనా, మినహాయింపులు చేయవలెనా అనేది ప్రశ్నగా నేర్పడినది. సర్కారు శిస్తు బాకీలు, కో-ఆపరేటివు సొసైటీల అప్పులు, ఇతర బ్యాంకులు కంపెనీల అప్పులు—ఇట్టి అప్పులను [illegible] మినహాయింపులయినవి. సర్కారే రైతు, రైతే సర్కారు కాబట్టి చక్కగా నడిచే సర్కారే లేకపోతే ఇట్టి శాసనాలు రావడానికి, అవి అమలుజరగడానికి అవకాశమే లేదు. అందుచేత రైతు సర్కారుకుపడే ఋణము ఈ శాసనములో చేర్చడానికి వీలులేదు. రైతుకు ఈ చట్టముక్రింద కలిగే ప్రయోజనము కలుగగా నిలిచే అప్పు తీర్చేదానికి ఇప్పటి పరిస్థితులలో సర్కారువారు కావలసినంతద్రవ్యము తమ ఖజానాలో నుండి యివ్వలేరు. అంతేకాదు; ముందు రాగల రైతు అవసరాలకు అప్పులు దొరికే మార్గాలుకూడా ఉండవలెను. అందుచేత రమారమిగా తమయిష్టాన్ని అంగీకరించి నడువవలసిన కో-ఆపరేటివు సొసైటీలను ప్రభుత్వమువారు ఈ చట్టములో చేర్చక నిలిపినారు. ఈ చట్టములో తలపెట్టిన కొన్ని మార్పులను—వడ్డీరేట్లు వగైరాలను—కో-ఆపరేటివు డిపార్టుమెంటువారు ఇదివరలోనే చలామణికి దెచ్చినారు. కో-ఆపరేటివు సొసైటీలు సాహుకారులకంటే అన్యాయముగా ఇదివరలో ప్రవర్తించినారని ప్రజాభిప్రాయమున్నమాట వాస్తవమేకాని అది విధానము దోషముకాదు. సాహుకారిపద్ధతిని కో-ఆపరేటివు సొసైటీలలో కూడ నిలవబెట్టుటకు తోడైన అధికారాభిమానుల దోషము. ప్రజలకులోబడిన ప్రభుత్వము అధికారములోనికి రావడముతో కో-ఆపరేటివు ఉద్యమస్వభావము మారనారంభించినది. పూర్తిగా మార్చే శక్తి ప్రభుత్వముచేతిలో నున్నది. బ్యాంకులు వగైరాలు ౧౯౧౩ వ కంపెనీల ఆక్టుక్రింద నేర్పడిన కంపెనీలు, వీని విషయమున మదరాసుప్రభుత్వానికి కొంత తొందర కలిగినదనడానికి సందేహములేదు. రైతు అప్పుల పరిష్కారము జాతీయప్రభుత్వమువారి అధీనములోనిది. బ్యాంకులు, కంపెనీలు ఇండియా ప్రభుత్వమువారి అధీనములోనివి. అంతేకాకుండా కో-ఆపరేటివు సొసైటీలవలె ఇవి కూడ రైతుకు తాత్కాలికముగా అప్పులు పుట్టింపగల సర్కారుతరిణీకి లోనైనసంస్థలు. అందుచేత శ్రీ రాజగోపాలాచారిగారు దీని విషయములో చాలా మథనపడి మూడు నాలుగుపర్యాయములు తమ అభిప్రాయాలు

మార్చుకొన్నారు. ఇట్లా వీరు మార్చుకొన్న విషయము ఈ బిల్లుసందర్భములో ఇంకొక్కటి లేదు. ఎట్లయితేనేమి పార్లమెంటువారి శాసనముమూలకంగాగాని, ఇండియా ప్రభుత్వపు ప్రత్యేక శాసనముమూలకముగాగాని, రాజుగారి ఛార్టరువల్లగాని, లెటర్సు పేటెంటువల్లగాని ఏర్పడే ఏసంస్థకుగాని రైతు ఋణపడితే ఈ శాసనముక్రిందికి ఆ యప్పు రాదని వ్రాయవలసివచ్చినది. కాని ౧౯౧౩ వ సంవత్సరపు ఇండియను కంపెనీల ఆక్టుక్రింద నేర్పడిన సంస్థలకుగాని, ౧౯౩౪ వ సంవత్సరపు రిజర్వుబ్యాంకు (చట్టము) క్రింద ఏర్పడిన షెడ్యూల్డు బ్యాంకులకుగాని రైతు పడిన అప్పుకు సంవత్సరమునకు నూటికి తొమ్మిదికంటే ఎక్కువవడ్డీ యుండినయెడల అట్టి అప్పు ఈ శాసనంలో చెప్పినప్రకారము తగ్గింపు పొందరాదని నిర్ణయించినారు. ఈ చట్టమే అన్వయముకాదని చెప్పిన మొదటి నియమము చెల్లునో తొమ్మిదింటికి ఎక్కువ వడ్డీ అయినప్పుడు ఈ రెండవనియమ మెంత వరకు సనికివచ్చునో కోర్టులు నిర్ణయింపవలసి యుండును. అందుచేతనే కాబోలు ఈ చట్టములోని వ్యవహారములను పరిష్కరించడానికి ప్రత్యేకమ న్యాయవిచారణస్థానములను సర్కారువారు నియమింపదగునని మొదట తలపెట్టి శ్రీ రాజగోపాలాచార్లవారు తుదకు దానిని చల్లగా మానుకొనినారు. ఈ విషయమునందు తగినవైశద్యము మీశాసనమునందు లేకపోవడము గొప్ప కొరతయని చెప్పవలసినదే. అయినను ఈ ఆక్టును అమలునందు పెట్టడములో కలిగే యిబ్బందులను తొలగించడానికి నిబంధనలుచేసే అధికారము సర్కారువారు నిలుపుకున్నారు. కావున ఇండియా ప్రభుత్వమువారి సానుభూతిని సంపాదించితే క్లిష్టసందర్భములను తీర్చుకొందురు కాబోలు. ఈ చట్టము అన్వయముకాని ఉత్తమర్ణవ్ముల కొన్నిటిని ఇందులో చేర్చినారు. రైతు వద్ద కూలిచేసే పాలెగాడు వగైరాలకు చెంద వలసిన అప్పుల కీశాసన మన్వయముకాదు.

* * *

బాకీ ఇదివరలో మోస్తరుగానే తీర వలసియుండును. జమీందారీరైతులు జమీందారులకు అప్పుపడిన సుత్తబాకీల కీశాసన మన్వయముచేయుటచేత జమీందారుల ప్రతిఘటన చాల యెక్కువగా తటస్థించినది. ఈ విషయమున విమర్శకుదినుట అప్పుల తగ్గుదలకు చేసిన యేర్పాటులను విమర్శించుటకు దినుట యగును. అప్పు లచ్చుకోవలసినవాని స్వరూపము అప్పులిచ్చినవాని స్వరూపము శాసనము నుండి మినహాయింపవలసినవారి స్వరూపము నిర్ణయముచేసినపిదప ఇక నిర్ణయము కావలసినది ఋణనివారణ యెంతవరకు ఎట్లెట్లు చేయనగుననడమే. దానిని ఈ శాసనమునందు రెండవయధ్యాయమున ఎనిమిదవ తొమ్మిదవ శెక్షనులలో నిర్ణయించినారు. పై వివరణమంతయు ౩-౮ సెక్షనులకు సంబంధించినది.

* * *

ఇదేవిధముగా భరణముగా మంజూరైన మొత్తములును ఇల్లు, గుడ్డలు, నగలు, పాత్రలు తప్ప మరియేమి ఆస్తియులేని స్త్రీకి అసలు రు: ౩౦౦౦ లకు మించని పత్రాలే జీవనాధారముగా ఉంటే అట్టి పత్రాలును ఈ శాసనముక్రిందికి రాన క్లేర్పరచినారు. వడ్డీ ఇచ్చే ఏర్పాటుతో గాకుండ అనుభవముతో కూడిన తనఖాఅప్పులు, మునిసిపాలిటీలలో, కంటోన్మెంటులలో ప్రాతపంచాయతీయూనియన్ బోర్డు ఏరియాలో ఇల్లుమాత్రము తనఖాపెట్టి తీసికొనిన అప్పులు సర్కారుకు స్థానికసంస్థలకు పన్ను, సెస్సు, అప్పులువగైరాల రూపముగా చెల్లవలసిన సొమ్ము ఈ శాసనముక్రిందికి రావు. అంటే ఈ అన్ని సందర్భములలో ఏర్పడునట్టి అప్పులో చేరేవి అసలు అప్పిచ్చిన మొత్తము, దాని వడ్డీ, వసూలుకు అయ్యే కర్చు—జమీందారులకు రైతు లీయ్యవలసిన అప్పులలో సుత్తలు, వడ్డీలు రైతు న్యాయముగా ప్రభుత్వానికిగాని స్థానికసంస్థలకుగాని అచ్చుకోవలసియుండి కూడ జమీందారే రైతుకుగాను ఇచ్చిన మొత్తాలు, కోర్టువరకుకూడ వెళ్లినపక్షానికి, కోర్టుకర్చులు ఇన్నియు చేరుచున్నవి.

* * *

ఈ వర్గాలన్నిటివిషయములోను శాసనమేవిధముగా నిర్ణయించినదో వివరించవలసినవసరము. జమీందారీరైతు అచ్చుకోవలసిన అప్పులసందర్భములో సుత్తలు వడ్డీలుమాత్రమే యీ శాసనముక్రిందికి తెచ్చినారు. రైతు న్యాయముగా ప్రభుత్వానికిగాని, స్థానికసంస్థలకుగాని ఇచ్చుకోవలసియుండి జమీందారే ఇచ్చియున్న బాబతులు కోర్టుకర్చులు రైతుమీదే మోపినారు. ౧౩౪౫ ఫసలీకి అంతకు ముందుఫసలీలకు రైతు సుత్తలెక్కకు అప్పుపడిన మొత్తమంతయు రద్దుకావడానికి ఏర్పరచినారు. కాని రైతు ౧౩౪౬ వ ఫసలీ సుత్త ౧౯౩౭ వ సంవత్సరము సెప్టెంబరు ౩౦ వ తేదీ లోపుగ పూర్తిగా చెల్లించకపోయినా ౧౩౪౬, ౧౩౪౭వ ఫసలీలసుత్తలు ౧౯౩౯ వ సంవత్సరము ( నెల ? ) ౩౦ వ తేదీ లోపుగా పూర్తిగా చెల్లించకపోయినా ప్రాతబాకీలన్నీ ఈ ఫసలీలకుగాను చెల్లించకుండా నిలిచిన మొత్తము దామాషాను అచ్చుకోవలసినదని తీర్మానించినారు. ౧౩౪౦ వ ఫసలీనుంచికాని ౧౩౪౩ నుంచికాని నిలవయయిన మొత్తాల కీచట్టము అన్వయము కాకుండా చూచుకొనడానికి జమీందారు ప్రతినిధులు చాల ప్రయాసపడిరికాని ప్రయోజనము లేకపోయినది. మలయాళపు జన్మీలకును, అచ్చటి మఠ్యవర్గులకును కూడ జమీందారులకువలెనే ఈ ఏర్పాటు లన్వయించును. రైతుకు జమీందారుకు సుత్తల విషయములో కలుగుచుండు సంఘర్షణ లోకవిదితము. సివిలు కోర్టులు ఈ వివాదములతో నిండిపోయినవి. లెక్కలలో మొత్తములు పేరిపోవడము తప్ప జమీందారులకు ఎక్కువ ప్రయోజనమున్నట్లు గూడ కానరాదు. అందుచేత జమీందారీ రైతులకును, జమీందారులకును సరియైన సఖ్యము కూర్చడానికిని ప్రస్తుతపు సుత్తలు సక్రమముగా ఇవ్వడానికి రాబోయే సుత్తలు సకాలములో చెల్లించడానికి, రైతును ప్రోత్సాహపరచడానికిని ఈ చట్టములోని నియమాలు చేయుచున్నామని ప్రధానమంత్రి చెప్పినమాటల కర్థమున్నది. సర్కారువారు కోర్టు అఫ్ వార్డుసువారి మూలకముగా అనేక జమీందారీలపరిపాలన చేయుచున్నారు. వాటియనుభవము వారికున్నది. ఈ విషయమై రివిన్యూబోర్డువారును విచారించి అభిప్రాయ

మిచ్చినట్లును ప్రధానమంత్రి వాక్యాలమూల కముగా స్ఫురించుచున్నది. ఈ చట్టములో చేసిన ఏర్పాటులు రైతుకు బరువుతగ్గించి రైతు జమీందారుల పరస్పరసంబంధములు బాగుపడడానికి దారిచూపుననడము నిజమే కావచ్చును. కాని, ప్రధానమంత్రిగారు కోర్టు అఫ్‌వాగ్దును అనుభవములు కొన్నియైనా వివరించియున్నయెడల లోకమునకు విషయ మింకా చక్కగా బోధపడియుండునేమో.

*　　*　　*

ఇక జమీందా రాదిగాగల వర్గమునకు సంబంధములేక రైతువారీ వ్యవసాయదారుడు చేసుకొనిన సాధారణపు టప్పులవిషయమును రెండవ అధ్యాయములో ౭ మొదలు ౧౪ వ శెక్షను వరకు వివరముగా నిర్ణయించినారు. ఇందులో ౮ వ, ౯ వ శెక్షనులే ముఖ్యతమములు.

*　　*　　*

ఈ అప్పులను రెండువర్గముల క్రింద విభజించినారు. ౧౯౩౨ వ సంవత్సరము అక్టోబరు మొదటితేదీకిముందు చేసిన అప్పులు; ఆటుతరువాత చేసిన అప్పులు.

*　　*　　*

౧౯౩౨-వ సంవత్సరము అక్టోబరు మొదటితేదీకి ముందు చేసిన అప్పులమీద ౧౯౩౭-వ సంవత్సరము అక్టోబరు ౧-వ తేదీ వరకు బాకీపడిన వడ్డీ అంతా రద్దయినట్లు తీర్మానించినారు. అసలు మొత్తము అంతా బాకీయుంటే అంతటిని, కొంత బాకీయుంటే బాకీయున్నంతటిని చెల్లించవలసినదన్నారు. కాని అసలుక్రిందగాని, వడ్డీక్రిందగాని, రెంటిక్రిందగాని అప్పపడ్డవాడు అసలుకు రెట్టింపుగా మొత్త మిచ్చియున్నట్లయితే బాకీ అంతటిని తీర్చిన ట్లెంచుకోవలసినదన్నారు. ఈ రెట్టింపు మొత్తముగాక తక్కువ యిచ్చియుంటే ఆ తక్కువమొత్తము చెల్లించవలెను. బాకీవుండే అసలు ఇంతకంటె తక్కువయ్యే యెడల ఆ అసలుభాగముమాత్రమే చెల్లించదగిన దనినారు. మొదటిపత్రములోని అసలునే అసలుగా ఎంచవలసినదేగాని ఎత్తి వ్రాయించుకొనిన పత్రాలలోని అసలును అసలుగా నెంచరా దనినారు. కాబట్టి యీశాసనము చేస్తున్నారని తెలిసినపిదప ౧౯౩౭ వ సంవత్సరమునకుముందు వ్రాసియిచ్చిన అప్పపత్రాలు త్రిప్పి వ్రాయించుకొనియున్నను ఫలముండదు. మొట్టమొదట పెట్టిన చిత్తుచట్టములో ౧౯౩౭-వ సంవత్సరమునకుముందు ఏర్పడిన అప్పులకు తరువాతనేర్పడిన అప్పులకు ఏవిధమైన విభేదమును పెట్టియుండలేదు. దేశములో జరిగిన గొప్పఆందోళన చూచి ప్రధానమంత్రి యీ విభేదమును నిర్వచించుట కంగీకరించినాడు. కారణము ౧౯౩౨ వ సంవత్సరమునుండి లోకమునందు ఆర్థికదైన్య మేర్పడియుండడమే యనినారు. ఈ కాలపు మితిలో వడ్డీరేట్లు చాల తక్కువైయైన వని యంగీకరించినా, చేసిన విభేదముమాత్రము గొప్ప అర్థముతోచేసిన విభేదముగా కన్పించడము లేదు. ౧౯౩౨ వ సంవత్సరమునకు తరువాతి అప్పులకు నూటికి సంవత్సరానికి అయిదింటివరకు సాదావడ్డీ ఇవ్వడాని కంగీకరించినారు. ఈ శాసనము అమలులోకి వచ్చినదినమునుంచి ఏ అప్పుమీదకూడ రూపాయికి నెలకు ఒకదమ్మిడీకి మించినవడ్డీ యుండరాదనినారు. ఈ రెండుకారణాలచేత అసలు రెట్టింపయ్యే అవకాశ ముండదు అనుకొని కావలెను రెట్టింపు వ్యవహారపునిర్బంధములే పెట్టలేదు. ౧౯౩౨ వ సంవత్సరము తరువాతి అప్పుల విషయములో అప్పిచ్చినవాని పరముగా నింత యౌదార్యము చూపిన ప్రభుత్వము అంతకుముందటి అప్పులవిషయములో నూటికి సంవత్సరానికి ఏ మూడురూపాయలో వడ్డీ వేసియిచ్చియుండరాదా అనేవారి వాదము సవ్యముగాను ధర్మముగాను తోచకపోదు.

*　　*　　*

ఏ అప్పువిషయములోనైనా కోర్టుకర్చులు, తనఖా ఆస్తికాపుదలకు చేసిన న్యాయమైన ఇతరకర్చులు అధమర్ణు లిచ్చుకోవలసిన దని నిర్ణయించినారు.

*　　*　　*

కోర్టులలో వ్యవహారములందుండే అప్పులు, ఇన్‌సాల్వెన్సీలో ఉండే అప్పులు ఈ శాసనముక్రిందికి రాగలిగినవైతే పునర్విమర్శ పొందడానికి ఈ శాసనము అవకాశాలు ఏర్పరచియున్నది. ఈ [illegible] వమప్రకారము అప్పులతగ్గుదల నిర్ణయించగల యధికారులు కోర్టులేకావడము, విచారించవలసినమాత్షాంశను లెక్కువకావడము కారణముగాను ఈశాసనము ప్రజలు చాలయెక్కువగా కోర్టు కెక్కించుననుమాట వాస్తవము. సులభవిచారణకు మార్గములు కల్పింపదలచి యునుకూడ ప్రధానమంత్రి ఆ నిర్ణయమును వదలుకోవడము దౌర్బల్యమునను. పాపము! విధి లేనిసందర్భములు సంఘటించినవి కాబోలు. ఇట్టి గట్టిశాసనాలు చేయవలసివచ్చినప్పుడు కొన్నిచోట్ల ఎంతటి ధైర్యవంతుడును తగ్గి నడుచుకొనవలసియుండును.

*　　*　　*

ఈ శాసనము అమలులోనికి వచ్చే తేదీ వరకు ఏర్పడిన అప్పులకే ఇందలి ఋణనివారణోపాయము అన్వయించును గాని తరువాతి అప్పులకు అన్వయించదనడము రెండవ అధ్యాయారంభమందు వ్రాసిన మాటలనుబట్టి స్పష్టముగా తీర్మానమగుచున్నది. కాని వడ్డీవిషయమునందుమాత్రము ౧౩ వ శెక్షనులో ఈ ఆక్టు ఆరంభమైనతరువాత కోర్టుకెక్కుటకు వ్యవసాయదారుని అప్పువిషయమైన వ్యాజ్యోగము వచ్చినయెడల కోర్టులు రూపాయికి నెలకు దమ్మిడీకి పైబడినవడ్డీ యిప్పించరాదని యున్నది. సర్కారువారు వడ్డీరేట్ల మితులను అప్పటికప్పుడు మార్చవచ్చునని చిత్తుచట్టములో నిలుపుకొనియుండిన అధికారమును మానుకొని ఈ నిర్ణయము చేసినారు. ఇది మంచి నిర్ణయ మని యెల్లరును అంగీకరింపక తప్పదు. కాని బ్యాంకులు కంపెనీలకు నూటికి తొమ్మిదివరకు వడ్డీవిధించే అధికారము పెట్టియుండడముచేత అప్పులిచ్చేవారు కంపెనీలుగా చేరుకొని వడ్డీలు తొమ్మిదివరకు పెంచే అవకాశమున్నది. ఏమి జరుగనున్నదో ముందుముందుగాని తెలియదు. అదీగాక వ్యవసాయదారుని అప్పులతో సంబంధము లేని ఇంకా వేనవేలవ్యవహారాలను బట్టి వడ్డీరేటేర్పడడముచేతను ఆ వ్యవహారంలోగూడ వడ్డీలు మితపరచే శాసననిర్మాణ మిదివరకు జరిగినదిగాక ఇంకను జరుగవలసియున్నందున ఈవిషయమై ఎక్కువగా నాలోచించ

దము ప్రస్తుతము అనావశ్యకమని కన్పించు చున్నది.

*　　*　　*

ఇంతవరకు వ్రాసిన ముఖ్యవిషయాలను అమలులో పెట్టడానికి కావలసిన చిల్లరవిష యాలనుసరించి ఈ శాసనములో నిర్ణయాలు చాలాకలవు. ఉదాహరణార్థ మొకటిరెండు వివరింపనగును. వ్యాజ్యములలో నుండే అప్పుల నీశాసనముక్రిందికి తేవలసినదని అప్పు పడినవాడు కోరవచ్చును. ఎగ్జిక్యూషన్ జరిపే కోర్టువా రట్టిదరఖాస్తు చేరినవెంటనే ఎగ్జి క్యూషనును ఆపుదలచేయవలెను. ఆపుదల యైన ౬౦ దినములలో డిక్రీచేసిన కోర్టులో దరఖాస్తుచేసి ఈ శాసనానుసారము తన అప్పు లను తీర్మానించవలసినదని అఋణమర్ణుడు కోరక పోతే యథావిధిగా ప్రాతడిక్రి అమలు జరిగి పోవును. ౧౯౩౭ వ సంవత్సరము అక్టోబరుకు తరువాత డిక్రీయై స్థిరాస్తి అమ్మకము జరిగి యుండినా ఈ శాసనముప్రకారము అఋణమ ర్ణుడు వ్యవసాయదారుడుగా పరిగణింపబడే అవకాశా లున్నప్పుడు అట్టియతడు ఈ బిల్లు శాసనమయిననాటినుండి తొంబది దినములలో అట్టి అమ్మకమును రద్దుచేయవలసినదని దర ఖాస్తు చేసుకొనవచ్చును. కోర్టువారికి ఈ చట్టముప్రకారము దరఖాస్తుదారుడు సంర క్షణ పొందదగినవాడని తోచినయెడల అట్టి అమ్మకమును రద్దుచేయవచ్చును. ఇటువంటి వివరాలన్నిటిని ఇచ్చుటకు ఈ వ్యాసమునందు తావులేదు. ఇప్పుడు జరిగియుండే శాసనము లోని అన్నిసూత్రాలకు ఈ వ్యాసము సంపూ ర్ణవ్యాఖ్యయని చదువరు లనుకొనవలదు. ఈ శాసనపుస్వరూపమును తేలికమాటలలో స్థూల ముగా చిత్రించుప్రయత్న మిందులో చేయడ మైనది.

*　　*　　*

పైనివ్రాసిన విషయములనుబట్టి కాంగ్రెసు ప్రభుత్వమువారు రైతుకు అప్పుపుట్టే అవ కాశాలను నాశనముచేయకుండా వ్యవసాయ పరిశ్రమలో బాగా ప్రవేశించి పనిచేసే ప్రతి వానికి ప్రతిబంధకముగా నేర్పడియుండే భరింపలేని అప్పుబరువును సాధ్యమైనంతవరకు తగ్గించివేసే ప్రయత్నము చేసినా రనడము అర్థముకాగలదు. ఈ శాసనము కారణముగా ధనసంపన్నుల కనేకులకు నొప్పికలుగుననుట నిజమే. దీనివలన మేలుపొందేవారిలో ఏ కొందరో యెట్టి మేలుకుగూడ అర్హతలేని దుష్ప్రవర్తన కలవారును నుందురు. లక్షలు కోట్లకొలది ప్రజలమేలాలోచించిచేసే శాస నమునందు కొందరకుకలుగు నష్టము లెక్క పెట్టవలసినదిగాదు. అపాత్రులు కొందరకు లాభమగునేయని చింతచేయనురాదు. పాత్రు లు పదిమంది మేలుపొందునప్పుడు అందులో నెందుచోరికి ఒక్క యపాత్రుడు మేలుపొందు నని పాత్రులకు మేలు సమకూర్చక యుండ రాదు. మరియొక విశేషము. నిజముగా రైతు బరువు తగ్గిపోయి అత డుత్సాహముతో ముందడుగువేసి కార్యక్రమము జరుపునప్పుడు ప్రత్యక్షముగా వ్యవసాయ పరిశ్రమకొరకే మూలధనమునకును ఎక్కువ గిరాకికలుగును అతడు బాగుపడి సుఖమునకయి క్రొత్తవస్తు వుల కొనుగోలుచేయు నారంభించుటచేత ఇతరపరిశ్రమలకును గిరాకికలిగి అచ్చటకు పెట్టుబడి కెక్కువమార్గ మేర్పడును. అందు చేత పెట్టుబడిదారులకు కలిగే తాత్కాలిక నష్టము దేశకల్యాణసాధనముచేత తుదకు వారికికూడ లాభముగా పరిణమింపగలదనుట అర్థశాస్త్రవేత్తల యభిప్రాయము. ఋణ బాధ నివారణచేయడము వ్యవసాయదారు కొత్తతేజస్సు పొందడానికి చేసిన ప్రయత్న మనేది ప్రభుత్వమువారు మరువరాదు, రైతు మరువరాదు. ధనికులు మరువరాదు. నేటి నుండి రైతుజీవితము వికాసవంతము చేయడా నికి ప్రభుత్వమువారు మునుపటికంటె వేయిరె ట్లెక్కువపరిశ్రమ చేయవలెను. తమ బరువు తగ్గించడము మానవప్రయత్నముచేత సాధ్య మైనట్లుగానే తమ మానవప్రయత్నముచేత తాము ప్రపంచములోని రైతులలో నగ్ర స్థానము నాక్రమింపగలమని రైతులు ప్రాచీ కాలపు నిరాశదృష్టిని విసర్జించి అహరహము స్వప్రయత్నముచేత లోకాన్ని జయించే కౌశ లము సంపాదించవలెను. కలిగిన అవకాశాన్ని పురస్కరించుకొని ధనవంతులు కో-ఆపరేటివ్ బ్యాంకీలలో ద్రవ్యము పెట్టియు, బ్యాంకీలు, కంపెనీలు స్థాపించియు రైతుకు నవీనజీవితా నికి ద్రవ్యోపపత్తి కల్పించి ప్రపంచస్వర్గ నిర్వహణానికి తోడ్పడవలెను. అందరును తమతమ స్వధర్మాచరణచేత సమస్తజనులను సుఖింపజేయవలెను.



# తెలుగుచోడులు కమ్మవారే

కొత్తభావయ్య చౌదరి

క్రీ. శ. ౧౧, ౧౨ శతాబ్దములలోను, అంతకు పూర్వమును ఆంధ్రదేశమును పాలించిన వెలనాడు లేక తెలుగుచోడులు నేటి కమ్మవారి పూర్వులే యనుటకు చాలినన్ని యాధారములు గలవు. చోడులు సూర్యవంశ్యుల మనియు, చతుర్థ వంశీకుల మనియు, కరికాలుని వంశస్థులమనియు, దుర్జయకులస్థుల మనియు ననేక శాసనములలో జెప్పకొని యున్నారు. సూర్యవంశీకు లగు వీరు బౌద్ధ, జైనమతములు మనదేశములో ప్రబలినప్పడందులో జేరి, తర్వాత వచ్చిన శైవ వైష్ణవ మతములలో జేరుకాలమునాటికి పుట్టుకచేతనే కులములు స్థిరపడుచున్నందునను, మతాంతర దోషమున మరల చతుర్థులుగా పరిగణింపబడినను, వీరు తమ శాసనములలో చెప్పకున్న మూలపురుషులగు కరికాలుడు, దుర్జయుడు అనువారలు వారివంశీకులే యని తెలియదగి యున్నది. చోడరాజులు పైరీతిగ జెప్పకున్న శాసనాధారములను ముందుగా దెల్పి తర్వాత కమ్మవారే చోడు లనుటకు గల యాధారములను నుదాహరించెదను.

(౧) దండనాయక పండినాయకుడు శా. శ. ౧౦౬౧ సంవత్సరంలో శ్రీ భీమేశ్వరాలయమున వ్రాయించిన దానశాసనము. ఇందులో తాను చతుర్థకులశేఖరుడ ననియు, వెలనాటి కులోత్తుంగచోడ గొంకరాజునకు మామయనియు వ్రాసుకొనెను.

(౨) దండనాయక చోడపనాయకుడు శా. శ. ౧౦౩౫ సం॥లో శ్రీ భీమేశ్వరాలయమున వ్రాయించిన శాసనము. ఇందు తాను పండినాయకుని కుమారుడ ననియు, పండినాయకుడు కులోత్తుంగచోడగొంకరాజు మామ యనియు వ్రాయించెను.

(౩) దండనాయక చోడపనాయకుని తల్లి కొమ్మసాని శా. శ. ౧౦౩౫ సం॥లో నచట వ్రాయించిన శాసనములో గూడ తన కుమారుడు చోడపనాయకుడు కులోత్తుంగచోడ గొంకరాజు మఱది యనియే వ్రాయించెను.

(౪) చోడభూపాలుడు బెజవాడలోని విఘ్నేశ్వరాలయమున వ్రాయించిన శా. శ. ౧౧౩౫ నాటి శాసనము. ఇం దతడు దుర్జయవంశస్థుడ నని వ్రాసుకొనెను.

(౫) చోడభూపాలుడు శా. శ. ౧౦౪౨ సం॥ శ్రీ భీమేశ్వరాలయమున వ్రాయించిన శాసనము. ఇందు చతుర్థవంశీకుడ నని వ్రాయించెను.

(౬) వెలనాటి కులోత్తుంగచోడ గొంక నృపాలుని కుమార్తె భీమేశ్వరస్వామికి దాన మొనర్చి వ్రాయించిన శాసనము. ఇందుగూడ చతుర్థవంశ మనియే వ్రాయబడెను.

(౭) వెలనాటి గొంకనృపాలుడు శ్రీ భీమేశ్వరాలయమున శా. శ. ౧౦౫౫ సం॥లో వ్రాయించిన దానశాసనము.

(పై శాసనములకు S. I. I. Vol. IV. పేజీలు ౨౫౬, ౩౯౬, ౩౭౭, ౩౬౩, ౩౫౪, ౩౫౫ చూడుడు.)

(౮) శ్రీమన్మహామండలేశ్వర నిరగనీ చోళమహారాజు అలంపురశాసనము. ఇందులో నాతని బిరుదములలో "కరికాలకులరత్న ప్రదీప" యనునది వ్రాసుకొనెను.

(౯) మరియొక చోళమహారాజు క్రీ. శ. ౧౦౪౬ సం॥లో వ్రాయించిన అలంపుర శాసనము. ఇందులోగూడ నాతనికి "కరికాల కులవర్త" అను బిరుదు వ్రాసుకొనెను.

(౧౦) క్రీ. శ. ౧౦౯౭ సరియగు చా. వి. ౧౩ నందు కందూరు చోడరాజు కొలనుపాకలో వ్రాయించిన శాసనములో "కోడూర్పురవరేశ్వర, కాశ్యపగోత్ర, కరికాలాన్వయ శామాది" బిరుదములు వ్రాసుకొనెను.

(౧౧) కందూరి ఉదయనచోడ మహారాజు సుంకాధికారులు శా. శ. ౧౦౯౪ సంవత్సరంలో వ్రాయించిన



శాసనము ఇందులోగూడ "కోడూర్పురవరేశ్వర, సూర్యవంశోద్భవకులతిలక, కాశ్యపగోత్ర, కరికాలాన్వయనామా"ది బిరుదము లారాజున కున్నట్లు వ్రాయించిరి.

(పైశాసనములకు తెలింగానాశాసన సంపుటములో శాసనసంఖ్యలు ౬, ౯, ౧౨, ౨౧ చూడుడు.)

వీనినిబట్టి వెలనాటిచోడులనియు, కోడూరుచోడులనియు ప్రసిద్ధికెందిన తెలుగు చోడులు సూర్యవంశమునుండి మతాంతర దోషమున చతుర్థముగా మారిపోయినదుర్జయ వంశీకులనియు, కరికాలుడుగూడ వారిమూల పురుషుడేననియు గ్రహింపగలరు. ఇక నేటి కమ్మవారీవంశీకులే యనుటకు దృష్టాంతముల నీక్రింద వివరించెదను.

(౧) శ్రీకాకొలనులోని శ్రీవల్లభునికి ఆలూరి మల్లినాయునికొడుకు పోతినాయుడు దానమిచ్చి వ్రాయించిన శాసనము. (S.I.I. Vol. IV, పు. ౩౧౪) ఇందులో నతడు దుర్జయవంశస్థుడననియు, చతుర్థవంశీకుడ ననియు వ్రాయించెను. ఈ ఆలూరివారు నేటికిని కమ్మవారిలో నున్నారు.

(౨) శ్రీమన్మహామండలేశ్వర ఏటువ తొండయరాజు శా. శ. ౧౦౪౩ సంవత్సరములో శ్రీభీమేశ్వరాలయమున వ్రాయించిన దానశాసనము. (S. I. I. Vol. IV, పేజి ౪౨౦) ఇందులో సూర్యవంశోద్భవుడననియు, కాశ్యపగోత్రుడననియు, కరికాలాన్వయుడ ననియు నితడు వ్రాసుకొనెను. ఇందులోనున్న ఎటువవారు నేటికిని కమ్మవారిలో ఏరువవారుగా వ్యవహరింపబడుచున్నారు.

(౩) విప్పర్ల అమరినాయకుడు శా. శ. ౧౧౫ వ సంవత్సరములో బెజవాడలోని మల్లేశ్వరస్వామికి దీపదాన మొనరించి వ్రాయించిన శాసనము. (S. I. I. Vol. IV,

పు. ౨౮౩) దీనిలో దుర్జయకుల విభూష ణుడనని యతడు చెప్పుకొనెను. ఈవిప్పర్ల వారుగూడ నేటికిని కమ్మవారిలో నున్నారు.

(౮) వెలనాటిసీమపాలకుడగు సాగిమన్మ చోగిగణపతిరాజు అనుమంచిపల్లెలో వ్రాయించిన శాసనము. (శాసన సంఖ్య ౨౭౩, ౧౯౨౮ సం) దీనిలో విప్పర్లగోత్రీకుడ ననియు, శాహుజకులాభరణుడననియు వ్రాయించెను.

(౫) సాగివారు దుర్జయవంశీకులే యను టకు చాలాశాసనములు గలవు. అందు చాగి పోతరాజు వ్రాయించిన శా. శ. ౧౧౨౧ సం॥ నాటిశాసనము. (S. I. I. Vol. IV, పు. ౨౮౮)ఈసాగివారుకమ్మవారిలోనుండి విప్పర్ల గోత్రీకులుగనే యున్నారు. క్షత్రియులలో గల సాగివారికి విప్పర్లగోత్రము లేదు. ఎప్పుడో వారు మారిపోయియుందురు.

(౬) మల్యాలసూరయ దండనాథుడును, ఆయనభార్య కుప్పాంబయు వ్రాయించిన బూదపూరు శాసనములు. (తెలింగానా సంపుటం పుట. ౫౩) ఇందులో దుర్జయవంశీకు లనియు, చతుర్థకులస్థులనియు వ్రాయించిరి. ఈమల్యాలవారి శాసనములు గొన్నిటిలో మల్లాలవారనియు, మల్లలవారనియు వ్రాయ బడినవి. ఇప్పుడు కమ్మవారిలోనున్న "మ ల్లెల" వారు యీమల్యాలవారి వంశీకులుగ గానబడుచున్నారు.

(౭) కులోత్తుంగచోడునకు భార్యయో కుమార్తెయో యగు నల్లూరికుక్కమ వ్రాయించిన శా. శ. ౧౦౨౨ సం॥ నాటి శాసనము. (S. I. I. Vol.IV, పు. ౩౩౭)కమ్మవారిలో నల్లూరివా రిప్పటికిని గలరు.

(౭) వెన్నచోడరాజుభార్య శా. శ. ౧౧౫౯ సం॥ లో వ్రాయించిన భీమేశ్వ రాలయ దానశాసనము. (S. I. I. Vol. IV, పు. ౩౯౦)ఇందుగలవెన్న వారు కమ్మవారిలో నిప్పుడు "వెన్నం"వారుగా వ్యవహరింప బడుచున్నారు.

(౯) దుర్జయవంశస్థులని వ్రాసుకొన్నట్టి యు కాకతీయరుద్రమదేవి అంగరక్షకులై నట్టియు ఎక్కినాయడు, రుద్రినాయడు, పినరుద్రినాయడు, పోతినాయడు, వల్లయ నాయకుడుననువారు వలవుట్లగోత్రీకులని ఎపి. రిపోర్ట్సు. ౧౯౩౬, పు. ౧౩౫ బట్టి తెలియుచున్నది. ఈ వలవుట్లగోత్రీకులు నేటికిని వలవుట్ల లేక వల్లుట్ల గోత్రీకులుగా కమ్మవారిలో నున్నారు.

వీనినిబట్టి కమ్మవారు దుర్జయవంశీకులను పేరిటను; వెలనాటిచోడు లను పేరిటను, సూర్యవంశీకులనియు, చతుర్థులనియు, కరి కాలాన్వయులనియు వ్యవహరింపబడిరని స్ప ష్టపడుచున్నది. సూర్యవంశీకులే మతాంతరు లుగానైనతర్వాత చతుర్థులైపోవుటయేగాక, చంద్రవంశములోనివారగు ధనంజయగోత్రీకు లైనట్టియు, ధరణికోటపాలకులగు కోటకేత రాజాదులుగూడ మతాంతరదోషమునసే చ తుర్థులుగా వ్రాసుకొనియున్నారు. ఇట్లే కాకతీయరాజులుగూడ వ్రాసుకొనియున్నా రు. కొందరు సూర్యవంశీకులనియు, కొందరు చతుర్థులనియు వ్రాసుకొనుటకు పైన సూచిం నదే కారణము. ఏ మతములోనున్నను, ఎట్లు వ్రాసుకొనుచుండినను వారందరును పరస్పర బాంధవ్యములను మాత్రము చేయుచునేవచ్చి నట్లనేకశాసనదృష్టాంతము లున్నను విస్తర భీతి విరమించితిని.

దుర్జయవంశీకులలోనివారే నేటియాంధ్ర క్షత్రియశాఖవారనియు, వారుగూడ పూర్వ ముచతుర్థులుగ వ్యవహరింపబడిరనియు దెలియ గల యొకశాసనము గలదు. ఇది శ్రీభీమేశ్వ రాలయమున పరిచ్ఛేదపంపయరాజు వ్రాయిం చినది (S I. I Vol IV, పు. ౩౬౦) పరిచ్ఛేదులు దుర్జయకులస్థులేనని రుజువుప రచు మరియొకశాసనము గలదు. అది పరిచ్ఛేద అల్లాడనాథదేవుడను మహామండలేశ్వరుడు వ్రాయించినది. శ్రీభీమేశ్వరాలయమున గలదు. (S. I. I. vol IV, పు. ౩౨౨) దుర్జయ వంశీకులలో వెలమవారుగూడ నొకతెగయని గూడూరుశాసనమువల్ల దెలిసినది. ఇందులో విరియాలవారు దుర్జయకులస్థులని స్పష్టముగా నున్నది. (తెలింగానాశాసనసంపుటము, పు. ౯౬) ఈ విరియాలవారు వెలమవారిలో మా త్రమే యున్నారు. కమ్మవారును, వెలమ వారును విడివడిపోవుటకు వీరశైవ, వీరవైష్ణవ మతములే కారణమనియు, ఆంధ్రక్షత్రియు లుగూడ వీరినుండి విడిపోవుట కట్టిదే యొక కారణ ముండుననియు దీనినిబట్టి గ్రహింప గలరు.



# గృహపరిశ్రమ

## కాగితపు పాత్రలు [Papier mache]

కొ. స్వర్ణవల్లి

★ ★

నిరుపయోగము లని మనము చించి పారవేయు పాతవార్తాపత్రికలు మొదలయినవాటిని ఉపయోగకరము లగు చిన్న చిన్న పాత్రలుగా టకును, లేక గుండుసూదులుగాని జడసూదులుగాని వేసియుంచుటకును ఉపయోగించవచ్చును.

★ ★

గిన్నెలుగాని కావలసియుండును. ఒకేవైపునకు ఏటవాలుగా నుండునట్టి పాత్రలే ఇట్టిపనికి ప్రయోజనపడును. మూతి వద్దను, అడుగు




చేయుటకు నేర్చియుండుట మిక్కిలి లాభకరము. అట్టి వస్తువులను చేసి వాటిని బొమ్మలకొలువులలో పెట్టు

ఇట్టివస్తువులను చేయుటకు ఆధారముగా కొన్ని పళ్లెరములుగాని, వెడల్పు [illegible]

నను వెడల్పుగా నుండి, నడుము సన్నముగానుండు పాత్రలు ఉపయో[illegible] ఉపయోగపడు పాత్రల

నమూనాలు చిత్రములు 1,2,3,4 ల సంఖ్యావి.

కొన్ని పాత వార్తాపత్రికలను దీసికొని వాటిని చిత్రము 5 నందలి విధముగా సన్నపాటి తునుకలుగా కత్తిరించుకొనవలెను. వాటిని ఒక రోజంతయు నీళ్లలో నానవేసి పెట్టవలెను.

తర్వాత చిత్రము నందలిరీతిగ ఒకపళ్లెమును (Plate) తీసికొని దానిపైన కాగితపు తునుకల అంచులు తట్టయొక్క అంచునకు వెలుపటికి రాకుండునటుల పరపివేయవలెను. ఇట్లు తట్టయంతయు మూయబడునట్లు కాగితపు తునుకలను ఒకసారి పరచుకొన్నతర్వాత దానిపై పలుచని మైదాపిండి జిగురును (Paste) ను పూయవలెను. అటుతర్వాత మరల కాగితపు తునుకలను రెండవ పరపుగా వేయవలెను. ఇట్లే ఒక దానిపై నొకటిగా మధ్య మధ్య పేస్టును పూయుచు పదిపండ్రెండు పరపులను వేసినయెడల కాగితపు తట్ట తగుమందము కలదగును.

పిమ్మట దాని నంతయు నీడను ఒకటి రెండురోజులు ఆరబెట్టవలెను. తర్వాత, కాగితపు తట్టయొక్క అంచును, క్రిందనుండు ఆదారపు తట్టయొక్క అంచున కనుగుణముగా చక్కగా కత్తిరించుకొన వలెను. ఇపుడు ఈ తట్టను వేరుగా దీయవచ్చును.

తర్వాత ఈతట్టపై రెండుప్రక్కలను తెల్లనివార్నీసు రంగును వేయవలెను.

ఈ రంగు ఆరినతర్వాత మరల నొకటి రెండుసారులు తెల్లరంగును వేసి అది యారినతర్వాత దానిపై మనకిష్టము వచ్చిన రంగును పూయవలెను. ఆరంగు ఆరినతర్వాత తగు రంగులతో ఆకుల యొక్కయు, పూవుల యొక్కయు చిత్రములను వేయవచ్చును.

ఇట్టిపని నేర్చి యుండుటవలన, స్వల్పవ్యయము మూలముగ ఎక్కువ లాభమును సంపాదించుకొన వచ్చును.

ఇట్టి గృహపరిశ్రమలకు గావలసిన సామర్థ్యమును మన బాలబాలికలకు కలుగజేయుటకనియే మహాత్ముడు తన "వార్ధావిద్యావిధానము"ను తలపెట్టినది. దీనితత్వము నరయలేనివారు బావురని మొరపెట్టుచున్నారు గాని దీనిలాభమును గ్రహించగలిగినవారెవ్వరును దీనిని ఖండించజాలరు.



# దేశోద్ధారకుని జీవిత ప్రభావము

జొన్నలగడ్డ
సత్యనారాయణమూర్తి

పురుషులలో మహాపురుషు డెట్లు పొడసూపును? క్రమగతి నాంతరంగిక పరిణామము నందినవాడే సామాన్యుల తలదాటి మానవులందు తలమానికమై వెలయును. ఈ పరిణామమునకు ఆంతరంగికపరిశీలనము మొదటిమెట్టు. లోనికి చూడ్కి నిగిడింపనివ్యక్తి చిత్తము వచ్చినదారిని నడచును. అవ్వలి గమనికకు అక్కరైన ప్రేరణము అంతరంగమునుండియే రావలెనుకదా!

శరీరము నొకవిధముగ నింజనుతో పోల్పవచ్చును. ఇందలి మరలే దీనినరములు; ఆవిరి దీనియాయువు. డ్రైవరు దీనియాత్మ, ఆత్మప్రేరితమై ఇది నడచును. ఈయాత్మ యుద్దేశము ననుసరించి వలసినచోటులం దదియాను. చలనసంవరణ శక్తులు ఆత్మయొక్క కదపున బనిచేయును. ఈసత్యము ప్రతి దేహధారి పట్లగూడ చెల్లుననుట చర్వితచర్వణము.

ముంగలగల తెరువుపై నొకచూడ్కిని, వెనుకనుండి తఱుముకొనివచ్చు రాజన్యునిపై నింకొకచూడ్కిని, దారినున్న రెల్లుగడ్డిపై మఱొకచూపును ఇంచుమించుగ నొకేనిముసమున సారించుచు ముందులకు సాగు సారంగమువలె(కాళిదాసు శాకుంతలము చూడుడు) నైహికయాత్రకై ప్రపంచమున నిలిచిన మానవుడు తనదృక్కుల నొకపరి యంతరంగములోనికిని, వేఱొకమాఱు అవ్వలికిని, మరల నీవలినుండి లోనికిని మరలించి, అప్రమత్తుడై, నిరపాయముగ తనగమనిక సాగించవలెను. నాడే ఈతడు స్వీయగమ్య స్థానము జేరి, దానికి పచ్చతోరణము గట్టగలడు.

ఆంతరంగిక పరిశీలనమును పురికొలుపు పరిస్థితులు మనుజుని మార్కొనవలెను. బలముకొలది పారిజాతవృక్షము నూపుకరముకై వడి, మనసును కదలించు సంఘటనములు సవాలు చేయుచు వీని నెదుర్కొనవలెను. అపుడు కాని పూవులుపోలుతలపు లందుండి రాలవు. అపుడుగాని నిద్దురించుశక్తులు మహోద్వేగయుతములై మేల్కొనవు. అపుడుగాని ఈతనిదృక్కులు గుండెజొచ్చి అందలిరత్నాకరమున మీలవలె మునుగీత నీదవు. సంక్షుభితమైన సింధుగర్భమున తలనూపిన కూర్మావతారమట్లు, దివ్యశక్తి విజృంభణమునకై అపుడే మనుష్యాత్మ తొందరపడును. అపుడే నరుడు కట్టెదుటికురుక్షేత్రమును సఖుతించి, స్వీయగమనికను నిర్ణయించుకొనును.



శ్రీయుత నాగేశ్వరరావుగారు

తీవ్రానుభవమే ఆత్మహస్తమందలి నిశిత హలము. దీనిదుక్కియైన అనంతరమే, గుండెలో, విజ్ఞానసలిల మింకును. అవ్వలిదృశ్యములను విలోకించి, తార్కికసూత్రములను ప్రయోగించి, చక్కనైన సిద్ధాంతములను కనుగొనగలము. ఇవి మెదడున విడిది నేర్పఱచుకొనును. అక్కరైనపుడు ఉపన్యాసములందును, వ్యాసములందును, వీథులందు తెయ్యిమను పగటివేషగాండ్రవలె, వినోదవిజృంభణము నొనరించును. అనుభవ సముద్భవసూత్రములే వ్యక్తిశక్తులగలసి జీవితగ్రథనమున బ్రవేశించును. దెబ్బతగిలినప్పుడే తట్టుకేరును. అపుడే మనసుపై నొకపాతము చివరముద్రితమగును. బాధపడినవాడే భవ్యగుణగరిష్ఠుడగును.........గొప్పగానములు పంచదార గోళీలట్లు గొంతుకనుండి లోపలబడవు.

ఆంతరంగికచలనము గతజన్మమున ప్రారంభమైనగావచ్చును. బహుళశరీరములు చితిమంటలందు చిటచిటలాడవచ్చును. ఆధ్యాత్మికమైన చలనమును కబళింపగలమంట లెవ్వియునులేవు. మాతృగర్భవినిర్గతమైన ముహూర్తమున తొల్లింటిచలనము శిశువుగుండెయందు కాపురముండెనని విజ్ఞానులు గ్రహింతురు. ఆధ్యాత్మికమైన స్టెతస్కోప్‌తో పరీక్షించినపుడు వీరి కీ హృదయస్పందనము కర్ణగోచరము కాకమానదు. పసిబిడ్డయాక్రందనమువ తొంటియా వేదనముండుట వీరెఱుంగగలరు.

కన్నులు తెఱచినదాది లోనియనుభవమును (బూడెయందలినిప్పును కదలించువారివలె) గదపునిమిత్తములు మానవమానసమును తాకును. మనసులోని నిప్పును జిజ్ఞాసయని వాకొందును. ఈయనలము వ్యక్తిగతస్వభావమందలి జఠరమై వెలుంగును. అగ్ని, సమిధల నాశించును. జిజ్ఞాస నవ్యభావములను కాంక్షించును. జీవితమార్గమందలి బహుళదృశ్యముల పొంతనుండి పల్వురు గొఱ్ఱెలమందవలె తను చుంప నొక్కండు రెప్పవాల్పక వానిని విలోకించుచుండెనేని తనజిజ్ఞాసను తనపుటకై ఈతడాతురంపడుచుండెనని గ్రహింపుడు. పక్షమందలి ప్రత్యణువు సమక్షమునవనిలిచి, దానినుండి మంచి ముత్తెముపోలు తలపునకై కొని గుండె-బరణిలో నిడి, కలుకుచు పిదప నడుగవేయును; తొల్లింటికృషినే వేడీతడు సాగించును.

కేవలము జ్ఞానసముపార్జనముతో నీతడు సంతృప్తినందడు. దక్షిణామూర్తివలె నీగతోడను, దోమతోడనుకూడ చెలిమిచేసి భావవిభూతినంది మిన్నకొనియుండడు. ఇతడు వీరులందు వీరుడు. కాని శత్రువులను సంహరించువాడు కాడు. సత్యాగ్రహ దీక్షాపరతంత్రుడు; దౌర్జన్యమునకు వేయియోజనముల

దూరమున తనయాశ్రమమునునిర్మించుకొనును. శత్రువులను ప్రాణమిత్రుల గావించుకొను మహాత్ముడీతడు. మఱొక్కను విచ్చుకత్తులను పూలమాలల జేసికొని, కులుకు పూలరంగ డీతడు! పైబడుపిడుగులను గోళీలు గావించి నవ్వుచు నాటలాడు అపూర్వడింభకు డీతడు! క్రౌర్యమున భయంకరముగ గర్జించి మీద లంఘింప గమకించు సింహమును వాహనము గావించుకొని, గమ్యస్థానముదెసకు కదలిపోవు విక్రమసింహు డీతడు! మాంసపు ముద్దనట్లు తనను నిముసములో గుటుక్కున మ్రింగ మీది కుఱుకు మత్తగజేంద్రమును మూషికశిశువు జేసి తాను గణాధిపతియై విజ్ఞానవసుంధరలో విహరించు వీరశిఖామణి ఈతడు! తనయిక్కట్టులను మెట్టులు గావించుకొని గట్టులదొర తలమీదికెక్కి, ముంగాలి వ్రేళ్లపై నిలిచి, అనంత సౌందర్య సామ్రాజ్యమును చిన్నిపిట్ట నట్టులు దృగ్జాలముసుండా గుండెలో జేర్చి కొని, బ్రహ్మానందము మానసవీథియందు ఉత్తాలతరంగములతో నుప్పొంగుచుండ, జొంత గల నటరాజును గలిసి ఆతనితో తన్మయ నృత్యము నేయు అద్భుతనర్తను డీతడు!

హృదయపరికలనముకతన, తనయం దే మున్నదో, తానెవ్వరో గుర్తించిన మనుష్యుడు, రాతివిగ్రహమువలె పథపార్శ్వమున పడియుండునా? స్వీయశక్తి నీతడు గుర్తించిన ముహూర్తమందే, పాడుపుగొండదాపు నుండి చీకటిమూకలు చెల్లాచెదరగులీల నీతని గుండెనుండి భయసంశయములు కాలుకొలది పరుగెత్తును; స్వాతంత్ర్యము తనపీఠమునందు ప్రతిష్ఠించుకొనును. ధైర్యసాహసములందు జయవిజయులై కాపుర ముం డు ను. ఆత్మవిశ్వాసమపుడు అ ఖం డ జ్యో తి యై అందు వెలుంగును. స్మితముఖుడై ఈతడపుడు జగదీశున కుజ్జీగా నిలిచి, ఆతని గోపికయై వాని నేత్రమున బృందావనసౌందర్యము నవలోకించి, తన్ను దాను మఱచి అందు రాసక్రీడల దేలును. నన్నడిగితిరా, తమశక్తి నెటిగిన తాపసు లందఱు, మహనీయ గుణగరిష్ఠులందఱు, జగదీశుని పట్టమహిషులే యని పల్కెదను. పవిత్రమైన భారతసాహిత్యమును వేయి కన్నులతో విలోకింపుడు. అందలి ప్రత్యక్షరమందును విద్యుద్దీపమువలె నీసత్యము తేజరిల్లుచుండుట గాంతురు.

కఠినశిలాసంకులమైన కొండపై, పసిబిడ్డయై యున్నపుడు తల్లి చేతినుండి భీముడు జారి పడెనట. అచ్చోటున నా డాతడుపడెను కావుననే కాలక్రమమున మహావీరు డైనాడు. కొండల నెదుర్కొని, అడవుల సంచరించి, సగుణోపాసకు డై వడముడి సురుగుణ గరిష్ఠు డయ్యెను. ఈతని యనుంగుసోదరుడే కదా యాత్రికుడై పరమార్థముపై కన్నుంచి, నిర్గుణోపాసకుడై, ధనంజయుడై, ఈశ్వరుని నెచ్చెలియై, ధర్మక్షేత్రమున నాతనిచే తన జీవితస్యందనమును నడపించుకొనినాడు. తమ కురుక్షేత్రమున (ఇదియేసుడీ వారికర్మక్షేత్రము!) అసంఖ్యాకములైన అరివ్రతక్షౌహిణీ వ్రాతముతో పోరుసలుపువారే వీరులందు వీరులై, శంఖములు పూరించి విశ్వరూపసందర్శనమునంది, విజయులయ్యెదరు.

మహాపురుషుని అగచాట్లనడుమ నిలిపి, అదృశ్యుడైయుండియు జగదీశు డాతని బ్రత్యేకదృష్టితో వీక్షించుచునేయుండును. మేల్కాంచియు, కనులుమూసికొని పరుండు వానిని లేపు పెట్టుకష్టమెా, విపదవస్థలందు సన్నిహితుడై నిలిచినవిశ్వేశుని ఆర్తరవమున పెక్కుమాఱులు పిలిచినగాని ఆతని గదలించుట కష్టము. మానవుని ఆతనికర్మకు వదలి వేసి దూరమున నిలిచి, ఈతడు చోద్యము చూచుచుండడని నా యభిప్రాయము. భీమ జరాసంధులను దుర్యోధనభీములను పోరనిచ్చి శ్రీకృష్ణుడు కట్టెదుట జోద్యముచూచుచుండెనా? నేడు కాంగ్రెసున కవ్వల నిలిచియు, అం దెట్లు గాంధిజీ దివ్యప్రదీపకళికయై తేజరిల్లుచున్నాడో, కురుక్షేత్రకదనమున పాల్గొనని శ్రీకృష్ణుడును అందలి ప్రధానపురుషుడై పరగెను. నేటి కురుక్షేత్రమున గాంధికి జోక్యము లేదంటి రేని నాటిధర్మక్షేత్రమున కృష్ణునకును జోక్యము లేదని విశ్వసింపుడు. జరాసంధ దుర్యోధనులను మరున్నందనుడు మార్కొనినపుడు కృష్ణసాహాయ్యము శౌనరూపమున సంజ్ఞామార్గమున భీమునకు లభించెను. కావున నే ఆతడు నెగ్గినాడు. మనుజునిమార్కొను దుష్టకర్మ దుర్యోధను డనుడు, జరాసంధ డనుడు, ఆతని చెంత, పోరువేళ జగదీశ డుండును. ఆతనిహృదయమున శంకచక్రధారియై ఈశ్వరశక్తి విరాజిల్లుచునేయుండును. కర్మ కూలకేమి చేయును? కదనమున నరుడు అలసి సొలసి, చెంతనున్న జగదీశుని హృదయమునను దురంతమైః వ్యాకు గలుగజేయును. అవ్యాజ వాత్సల్యముకతన, నీబవరమున తానుపాల్గొన రాదను నియమమున కవగతుడైయుండియు, నీతడు నరునకై పోరి ప్రతిద్వంద్విని పడగొట్ట దలపడవచ్చును. కాని నరుడు "బావా!" యనిఈతని వెన్కకుదరలించును. విద్యుచ్ఛక్తి తనలోని కాకర్షించుకొనిన లోహశకలము అద్భుతశక్తి సంపన్నమై దొడ్డపనులు చేయు లీల, నీశ్వరశక్తిని హృదయములోని కాకర్షించుకొని నరుడు కర్మవ్యూహ డసుటకై స్వీయ కురుక్షేత్రమున నాహవ మొనరించును. "నాకేమి? ఈపోరేమి?" అనుతీరుననున్నను, గుండెలోని జగదీశుడు మానవునకు ముందుగ నాతని పురోభాగమందలి పక్షమునుగని వాని గమ్యస్థానము నెఱిగి దానిచెంత వానిని చేర్చుటకై పెక్కు నెరవులు రోయును. ఈనెవులు పట్టుపరపులు పోలునవి కావు. అగ్ని పర్వతములు సీమటపాకాయ దంష్ట్రలై ఈనిశితముల కత్తుకలనుండి వ్రేలాడవచ్చును. ఆపాయములందును అగ్నిపరీక్ష యందును ఆతని బడద్రోసి, వాని నందుండి నడిపియే ఆదర్శముపొంత నాసీను జేయును. అసిధారా వ్రతములు సలుపక, అనలపరీక్షలందు నెగ్గక ఎవ్వరు మహాపురుషులు కాజాలిరి? కొండకొన జేరవలె ననిన నెన్నియో మాఱులు మనుజుడు జారిపడవలెను. రెండవ మానవునకు లేని ఇచ్ఛాశక్తిని తన సొమ్ము జేసికొనిన నెపోలియన్ ఎన్నిమాఱులుజారిపడినాడుకాడు. త్రోసినకొలది కదలక మెదలక "ధరణా కూర్చుండు" బండవానివలె పడినకొలది దృఢనిశ్చయము, వానినుండె యంతు మఱింతగట్టిగ "తిష్ఠవేసికొనినది". ఇది హృత్పీఠి నుపవిష్టయై యున్నంత నెత

"అసాధ్యము మూర్ఖుల నిఘంటులో నుండు" నను వాక్కు నెపోలియన్ రసనముపై నృత్యము చేసినది. కొండ ఎదుర్కొనినపుడు నుండెలో పుట్టిన దృఢనిశ్చయ-ఇచ్ఛాశక్తులే ఈతనిచే శైలశిఖరముమీది నుండి వాలు మొగ్గ వేయించినవి! అంతియకాదు. ఈతని కూడ నున్న సామాన్యసైనికుల ధమని స్నాయువు లందు నవ్యతేజమును నింపి ప్రొయ్యిలోనిపొగలవలె వీరి నుండె నుండి వెడలు చుండిన నిట్టూర్పులను నిముసములో నెందో యూదివైచి వీరిచే, గూడెనివి మంచుసానువులమీదనుండి గుమికించెను. ఎన్నడో హేనిబల్ చేసిన సాహస కృత్యముకంటె నీక్రియ పెక్కుమడుంగులు ఘనతరమైనది కదా! తీవ్రప్రతిఘటనమునకును స్థితప్రజ్ఞను పుట్టినదొడ్డబిడ్డ ఈయుత్కృష్టక్రియ! ఈదొడ్డబిడ్డను మానవునకు చేకుఱచేయుటయే జగదీశుని యాశయము. ఈ యాశయసిద్ధిని మదినిడికొనియే, అక్కరైన ప్రతికూలపరిస్థితులను సృష్టించి, తొలుత వీని నాతడు మనుజునిపురోభాగమున నిలుపును.

ఈశ్వరునకుగలదృష్టి మానవునకేది? అతనివలె నీతడు సుదూరభావికాలము నవలోకింపలేడు. కావున నీతడు సన్నిహితవిజయమునే, సత్వరఫలమునే, ప్రత్యక్షశుభమునే కాంక్షించును. ఇవి తాత్కాలికములని, బుద్బుదప్రాయములని ఈతడెఱుగడు. వీనితో తృప్తిపడిన ముహూర్తమున దూరస్థ దివ్యమంగళాదర్శము బారుగ నదృశ్యమగును. సన్నిహితవిజయ మెంత చెఱుపుదెచ్చునో గ్రహించితిరా? దూరదృష్టిగలజగదీశు డిది ఎఱిగియే ఇతనిపురోభాగమునుండి దీనిని నెట్టించి, అపజయములనే అందు నిలుపును. తోడ్తోడనే ఈతనినుండెలోనిశక్తులను నిద్దురనుండి లేపును. ఈసత్యము నెఱుగక ఇక్కట్టులందు నిలిచిన మానవులు కొందఱు ఈశ్వరుని నిందించి పాపమున కొడిగట్టుకొనుచుందురు. తమకు ముక్తినీయ దేవుడు మఱ్ఱవపడుచుండు నెఱుగక, స్వర్గము చేతులనుండి జారెనని వాపోవువారెట్టివారు? ... స్వర్గము గాజుకుప్పెవంటిది; ముక్తి అమృతకలశముబోలునది. ఇది శాశ్వతమైనది. అది తాత్కాలికజీవితము గలిగి ముక్కలగునది.

నాగేశ్వరరావు శైశవమున నందనమున నివసింపలేదు. అం దెన్నో గతుకులు, ఎన్నో ముండ్లు, ఎన్నో డొంక లుండెను. గతభవమునుండి ఈతడు హృదయవిభూతిని దెచ్చుకొనినాడు; కాని గంపలాది మణిమాణిక్యములను గాదు. ఈతడు కలమున్నమందు పెరిగి, హంసతూలికలందు పెంపొందియుండినచో, నీతని నెఱిగియుండెడివి బంగారుగిన్నెలును, మేలిమంచములును మాత్రమే! ఎత్తుపట్టలం దీతడు తప్పటడుగు లిడదొడగిన ముహూర్తమందే తీవ్ర సంఘర్షణ మీతని నెదుర్కొనినది. ఈతని భావిజీవితముపై దృష్టినిలిపి, ఉత్కృష్టక్రియా నిర్వహణమున దన ప్రతినిధులలో నీతనినొక్కనిజేయ నిశ్చయించిన భగవంతుడు కనులెదుటి యాశయమున కనుకూలించు ప్రణాళిక నీతనికై నిర్దిష్ట మొనరించెను. ఈతనినుండెను చలింపజేయు నంశములే ఇందుండెను. జబ్బగొట్టి సవాలొనరించు పరిస్థితు లిందుండెను. సర్వద్రష్టయైన సర్వేశుడు నాగేశ్వరరావు కురుక్షేత్రమును తొలుత బొంబాయిలో నిర్దిష్ట మొనరించెను.

ఆ దినములలో బొంబాయి వాతావరణమున నూతనశక్తు లవతరించి యుండెను. నవ్యభావ విద్యుచ్ఛక్తి నగరవీథుల నాలోకితమొనరించెను. మహారాష్ట్ర హృదయమున నపూర్వస్పంద ముదయించినది. శివాజీనిగనిన మహారాష్ట్ర జనయిత్రి తిలకొరనడే గోఖలేలను గంటినని మురియుచుండెను. మహారాష్ట్ర గిరికందరములు వీరిగుణ సంకీర్తనముతో ముఖరిత మగుచుండెను. బొంబాయినుండెయే తొలి కాంగ్రెసుగద్దె యయ్యెను గదా! నౌరోజీ ప్రభృతుల సింహరవములు యువకుడైన నాగేశ్వరరావు కర్ణపుటములందు ప్రవేశించి, గర్భాలయము పోలునుండెయందు ప్రతిధ్వనులు లేపినవి. డిన్షావాచా, ఫిరోజిషా, మెహతా, ప్రభృతుల యాటపందిరియందే నాటి నాగేశ్వరరావు నిలచెను. పందిరిలోని రేణువులతో కలసిమెలసియుండిన పండుటాకులవలె నల్లగ నాగేశ్వరరావు మనసులోనికి దారిజేసికొనెను. యువకునిచిత్త మాలోకితమైనది. చలితహృదయ మశ్రాంతము తనకవాటమును తెఱచి నూతనభావాగంతువులకు స్వాగతమనును గదా! జ్యోతిర్మండలమునుండి వెడలు కిరణ వితానమట్లు బొంబాయి దిగ్వలయమునుండి ప్రసరించిన భాస్వదాశయోత్కరము నాగేశ్వరరావు కన్నులకు మిఱుమిట్లు గొలిపినవి.

ఈతడు వాణిజ్యము నాశ్రయించినాడని తలపవల్లదు. ఈతని నెన్నియో యాశ్రయించినవి. వీనిలో వాణిజ్య మొండు. దీని నీతడు ప్రధానాశయము గావించుకొనియుండినచో, వర్తకప్రముఖులందు పద్మాసనము వేసికొనియుండెడివాడుగాని వీరవతంసులందు విమానారూఢుడైయుండువాడు కాడు.

వాణిజ్యమును జీవితపరమావధి జేసికొనువారు తమ ఇహపరములను తమ రూకలసంచులందే కాంచి, వానియందే అదృశ్యులై యుందురు. ఉదయాద్రిపై తేజరిల్లు భానుబింబమువలె భావికాలగిరిశిఖరముపై కాంతిలు భాస్వదాశయము నాగేశ్వరరావు చూపులను స్వీయమరీచికలలోని కాకర్షించుకొనెను. ఈ కిరణములును ఆ దృక్కులును పెనవేసికొనినవి. అద్భుత ఆధ్యాత్మికరజ్జువు సృష్టియైనది. "The whole round earth is bound by chains of gold to the feet of God" అనినాడు టెన్నిసన్ మహాకవి. ఇహపరములను లగించుట కిట్టిరజ్జువు లక్కరైనవి కావోలు. వానచినుకులను విలోకింపుడు. ఇవి దివినుండి పుడమిపై జారు నీటిత్రాళ్లుకావా? అందుండి యమరహృదయము లవతరించుటకును, ఇందుండి మనుష్యమానసము లారోహించుటకును, ఇవియును నవియును మేఘసౌధములందు పండువంటి కాపురము చేయుటకును ఇట్టి యాధారము లనివార్యములు కాబోలు! జిజ్ఞాసువుచూపులును, రవికిరణములును గలిసినపుడు సృష్టియైనరజ్జువుగూడ నిట్టి యాధారమేయని వాకొందును. ఇందుండి మిహిరమండలము దిగ్గనదిగి, చక్కని భావకందుకమై జిజ్ఞాసువునుండెలో (బరశిలో చేరిన చెండువలె) ప్రవేశించును. ఇందుండి ఇంకో



15 3- 10

కపుడు జిజ్ఞాసువుమానసము చరచర సూర్య మండలమున కెగబ్రాకి, అందలియద్భుతము లను తనసొమ్ములు గావించుకొని ఆనందిం చును. దినమణి నుద్దేశించి జ్ఞానపిపాసువులు గాయత్రి నేలజపింతురో ఎఱుంగుదురా? ఇట్టి నేస్తముకొఱకు,—ఇట్టి దివ్యానుభవమునకు గాక మఱెందులకు ?

తన పరమాశయమున రవిద్యుతులనుగాం చి, గాయత్రి జపించి నాగేశ్వరరావు భక్తి గీతికల నాలపించినాడు, అంతియకాదు. కట్టెదుటిపొడుపుగొండదెస నాధ్యాత్మికమైన యాత్ర సాగింప దొరకొనినాడు. ఈతని శక్తులన్నియు నీగమనికయందు కేంద్రీకరింప బడినవి.

తెరువున నడచుచుండ పరిచయము సంపా దించుకొనువారు పల్వు రుందురు. తెరువరి గమ్యస్థాన మెఱిగి, తాముకూడ కొంతనడక సాగించి, తమ కొలందికొలది వానికి తోడు పడువా రుందురు. అమృతాంజనము వీరి వర్గములోనిదని వచింతును. ఇది పథికుడైన నాగేశ్వరరావు నాశ్రయించినది. తనచూడ్కి నెదుటి కొండకొననుండి మరల్పక, దీని నాతడు కటుగల నుండనిచ్చినాడు. ఇతని ముందంజ నడ్డుకొనక, తా గావింపగలతోడు నిది సలిపెను. అంతియకాదు; ఈతని సంప ర్కముకతన తానుకూడ నుత్కృష్టాశయ ముపై తనదృష్టి నిబద్ధము గావించినది; పెక్కు సంస్థలందును, అశేష ప్రజానీకమందును నాగేశ్వరరావు మానసము ప్రాలినపుడు చెంత నుండి ధనరాసులను సమర్పించినది.

ఈ సంస్థల యంతర్భాగములను పరిశీలిం తుడు. అందు నాగేశ్వరరావు గుండెను చూ తురు. కరుణారసభరితమైన ఈ హృదయ మును భావికాలము ప్రేమాశ్రుధారలచే నభి షేకించును; సహృదయులు కృతజ్ఞతాపూర్వ కముగ దీనికి పుష్పాంజలిని సమర్పింతురు.

మహాపురుషు లందఱును మహితగుణగరి ష్ఠులు కావున నొకే కుటుంబములోనివారే! ఎల్లరు ఉన్నతపీఠస్థలముల నలంకరించినవారే! కాని కుటుంబస్థులు వ్యక్తిగత ప్రజ్ఞగలవారు. కావున నాగేశ్వరరావు చరిత్రము ప్రత్యేక గుణవిశిష్టమని పఠితలు గ్రహించియే యుందురు.

ఇక్కట్టులలో పుట్టిన బటొక్రిష్టపాల్ తన యిచ్ఛాశక్తికతన నతులైశ్వర్య సంపన్నుడు కాగలిగినాడు. కలకత్తా, బారాబజారుభాగమున Bonsfield Lane లోని ఉన్నతవాణిజ్యసంస్థలన్నియు (Firms of Druggists and Chemists) నీతనివే! కాని, దేశోద్ధారకులం దీతనికి చోటుం డెనని తెలుపలేము. ఈశ్వరచంద్రగుప్త నిప్ప చ్చరమునబుట్టి, స్వయంకృషివలన నికృష్ట పరిస్థితులను వెనుకకు నెట్టివేసి, జీవితరంగ మున నుత్కృష్టస్థానము నందినాడు. విద్యా సాగరుడని పేర్వడసినాడు. కరుణాసాగరుడై వరలినాడు. రెండువేలరూకలు జీతముబడ యు ప్రధానాధ్యాపకుడయ్యు (Principal, Sanskrit College, Calcutta) పరార్థ జీవియై బహుళసంస్థలను స్థాపించి* తాను పేద ఱికమును కవుంగిలించుకొనినాడు. విశేషపరి శోధనమొనరించి వితంతూద్వాహము శాస్త్ర సమ్మతమని తెలిపి, సనాతనధర్మము నను ష్ఠించుపండితుడై, సంఘసంస్కరణమునకై పాటుపడినాడు. వంగీయులందు వీరేశలింగ మై, వంగభారతి నారాధించి పెద్దలకును పిన్నలకును అక్కరైనగ్రంథములను రచించి నాడు. కాని ఈతడు రాజకీయరంగమున ప్రవేశించినాడు కాడు. పవిత్రస్వాతంత్ర్య సమరమున గాలిడి శంఖమును పూరించినాడు కాడు.

ఆర్థిక రాజకీయ సాంఘిక సారస్వతాంగ ణములందు, చెప్పనేల? ఉత్కృష్టమైన ప్రతి క్రియారంగమందు నాగేశ్వరరావు విశేష కృషి సలిపినాడు.

రాజకీయక్షేత్రమున శ్రమించి, స్వీయ సాహిత్యము నెడల ననురాగము జూపనివార ను, భారతరాజకీయములందే తమ దృక్కు లను కేంద్రీకరించి, స్వీయరాష్ట్రసమస్యలకు క్రీగంటనైన జూడనివారును, స్వరాష్ట్రముపై మిక్కిలి మక్కువగలిగి అన్యరాష్ట్రీయులపై కారములను మిరియములను చెరిగిపోసి, పర ద్వేషమును పసరువలె మనసున నూరనిచ్చిన వారును కలరు. స్వజాతికి ప్రణయ-పరిష్వంగ మున ప్రదేశమొసగి పరజాతులదెస వాడిగో ళ్ళు నిసుడించి మీసములు మెలిద్రిప్పువా రున్నారు. కర్మధారయసమాసములచే ప్లాటు ఫారములను నిండబెట్టి, వక్తలందు వక్తలై, గృహజీవితములందు తిమ్మన్నలై చిందులు త్రొక్కువారును గలరు. ప్రకటనమునకై, ప్రచారమునకై, పదుగురలో పెద్దమొత్త ములు వెచ్చించి, ఒంటరులైయున్న తఱి బిచ్చగాండ్రపై, నిర్భాగ్యులపై, నిరు ద్యోగులపై గదలుపూని ఉఱికి, మో గట్టువా రున్నారు. ఒకతావున కాంతి తారకము నుపదేశించి, వేఱొకచోటున హుమ్మని హుంకరించు మహాశయులును పలువు రున్నారు. తలపులకును, చేతలకును నడుమ లోతుగోతులను త్రవ్వి, నడుమలు వంచి అందు నక్కియుండువారును గలరు. నీతినియమములకు నీరువదలి, స్వార్థసిద్ధికై వేయినెరవులు రోసి, పెక్కువేసములుదాల్చి, ఎన్నో జిత్తులను, ఎన్నెన్నియో ఎత్తులను వేసి, సమక్షమున నొకతీఱున పరోక్షమున వేఱొకతెఱగున ప్రవర్తించి, అవలీలగ నమ్మ అభాగులను పాడుజేసి, నిర్భాగ్యుల కంట దుమ్ముగొట్టి, నోళ్లుమూసి, తమపద పతి నిలుపుశక్తిమంతులకు రహస్యముగ ప్రణ మిల్లి, ఎంతోపలుకుబడి సంపాదించి తమ చోటును గట్టిగావించుకొని, ధైర్యస్థైర్యము లతో తెరమఱుంగున గుప్తక్రియలు సలు పుచు, యవనిక కివ్వల గీతగోవిందము లో

---

* వీనిలో ముఖ్యమైనది Metropolitan College (39 Sanker Ghose Lane, Calcutta) పదపడి ఇది స్థాపనాచార్యుని పేరున విద్యాసాగరకళాశాలయని పిలువబడు చున్నది. జాతీయభావములపై దీనిపునాదులు వేయబడినవి. ఉద్యోగచ్యుతుడై దుస్థితియం దుండిన సురేంద్రున కిందు విద్యాసాగరుడు నెలవునొసగినాడు. నాలుగేం డ్లీకళాశాలలో విద్యార్థినై యుండు [illegible]

సించుచు, తమవిజయమున కలరుచు, నొరుల విజయమునకు మనసున క్రుళ్లుచు, ఈర్ష్యనిలు వేలుపు జేసికొని, క్రుచ్చులయ్యు మునిరూపులై మసలుచు, గుండెలేనివారయ్యు, తెలివి సేటలందు పెద్దలై, అపూర్వపద్ధతుల నవలంబించి, పేరుప్రతిష్ఠలు సంపాదించు కొనువా రీకాలమున నున్నారు.

వీరందఱికి నూఱుయోజనముల దూరమున నాగేశ్వరమనీషి నిలిచెనని అసంఖ్యాకములైన దృష్టాంతములు ఘోషించుచున్నవి.

విశ్వదాతదానపరత్వము హిందువులందే కాదు, ముసల్మానులందును, క్రైస్తవులందును, తక్కుంగలవారియందును ఖంగుఖంగున మ్రోగినది. అన్యరాష్ట్రములందలి అభాగుల నకుమగూడ నీతనియర్థము, అమృతకలశమును చేబూనిన విహంగపతిపగిది వ్రాలినది. కలకత్తాలో సీల్డాదిక్కున మాఱుమూలనున్న హుజూరిమల్ లేన్‌లో నిష్ఠుర దారిద్ర్యముతో బంతులాడు శ్యామసుందరచక్రవర్తిశిరముపై దేశోద్ధారకునిసుండె వెల్లగొడుగై యుండెనని ఎందఱో ఎఱుగరేమో! రాజకీయమత సాంఘికసాహిత్యాది రంగములం దేవ్యత్యాసమును గాంచక, దసరాయుత్సవములందు బడిబాలురకు పప్పుబెల్లములు పంచిపెట్టు అయ్యవారివలె సమ్ముఖమున నిలిచినప్రతివారికిని ఈతడు కాసులను పంచిపెట్టినాడు.

సంఘసంస్కరణాభిలాష యనిన సనాతనధర్మవిముఖత్వ మని ఈత డెన్నడును విశ్వసింపలేదు. ప్రధాన హిందూమత సిద్ధాంతములను పిడికిటబట్టి, వాని నీత డాత్మజీవితమున ప్రవేశపెట్టినాడు. సంస్కరణ కర్తలకును, సనాతన వాదులకును విప్రులకును హరిజనులకును సమముగా దోసిళ్లతో రూకలిచ్చినాడు. కాంగ్రెసువాది * యయ్యు, ఇతర రాజకీయ వాదులయెడల నశ్రాంతము సుహృద్భావమును ప్రకటించినాడు. ఉద్యోగ

సద్యోగముల దెస గన్నెత్తి చూడనివాడయ్యు ఉన్నతోద్యోగులకు సముచిత సన్మానము నొసగినాడు. చేతిపనులలో పాల్గొనుచు, లలితకళల నారాధించువారిలో నొక్కండై, కళాప్రపూర్ణుడైనాడు. (ఒకప్పుడీతడు రంగస్థలములందు ముఖ్యభూమికల ధరించువాడని విందుము.) స్వరాజ్యముకొఱకును, స్వరాష్ట్రముకొఱకును కృషి సలిపినాడు. "ఆంధ్ర రాష్ట్రము అచిరకాలములోనే సార్థకమగుగాక!" అని యనవరత మాశీర్వదించుచునే యున్నాడు. ఆంధ్రభాషోద్యమమున నాయకశిఖామణియై హిందీప్రచారమునకై పాటుపడుచున్నాడు. ప్రాచీనసాహిత్యమును నవ్యసాహిత్యమును సమదృష్టితో వీక్షించుచున్నాడు. జాతీయత్వ అంతర్జాతీయత్వముల సమన్వయ మెఱిగి, ఆంధ్రత్వ పునరుద్ధరణమునకై, సర్వతోముఖ ఆంధ్రాభ్యుదయమునకై తనయైశ్వర్యమును ధారవోయుచున్నాడు. తమచిక్కులను లెక్కచేయక, ఒరుల చిక్కులను దీర్చుటకై మక్కువపడువారు మానవులలో నెందఱుందురు? దిగ్వలయమునకైన హద్దులున్నవి గాని నాగేశ్వరరావుహృదయమునకు హద్దు లేదు అం దావంతయైన కల్మషము లేదు. వినీలాకాశ మాతనిగుండెయందు కాపురముచేయుచున్నది. అందుండివెడలు భావధార ఆకాశగంగవంటిదని సహృదయు లెఱుంగుదురు.

సర్వాంశములను ఆధ్యాత్మికదృష్టితో పరిశీలించుట హృదయనైర్మల్యము గలవానికే సాధ్యము. తానొనరించు సర్వకార్యములు ఈశ్వరప్రేరితములని విశ్వసించి, విశ్వేశ్వరు నారాధించు భక్తుడు నాగేశ్వరరావు. "విశ్వ పరిణామమునందు వ్యక్తుల ప్రాజాపత్యము నిమిత్తమాత్ర"మని నమ్మ వినయశీలుడు విశ్వదాత.

"Style is the man" కదా! నాగేశ్వరమనీషి రచనలనుండి ఏయొక్కపంక్తినైన దీసి పరిశీలింపుడు. అం దీశ్వరప్రశంస ఉండితీఱును. భగవద్గీతకు సంబంధించిన ఉల్లేఖన ముండును. మహాత్ములను గుఱించిన ప్రసంగముండును. ఈతనిరచన మీతనిహృదయము

భగవద్గీతతో దైనికపరిచయము గావించుకొని, ఆదర్శజీవితమును కడపునవసరమున అందుండి వెలుగునుపడయువా రాధునికులలో నెందఱోలేరు. ఈ యల్పసంఖ్యాకులలో రాజకీయవేత్తల నెందఱిని లెక్కింతుము? గీతారహస్యమును వ్రాసిన పండితోత్తముడు లోకమాన్యుడు మొదటివాడు. గాంధిమహాత్ముడు రెండవవాడు. వీరి యుదాత్తదృష్టాంతమును మేలుబంతిని గావించుకొనినవాడు నాగేశ్వరరావు. నిత్యపఠనముకతన భగవద్గీత ఈతని కంఠమున కాపురమున్నది. ఈ మూలనుండి ఆమూలకును, ఆమూలనుండి ఈమూలకును, గ్రంథమందలి ఒక్కయక్కరమునైన విడువక, కడువడిగ ప్రతిశ్లోకమును నేకరువెట్టజాలుమనీషి నాగేశ్వరరావు. కారాగారమున నున్నపుడు భగవద్గీతకు చక్కనివ్యాఖ్య వ్రాసి పండితలోకము నీతడు తన గంభీరపాండితిలోని కాకర్షించినాడు.

"దేశోద్ధారకుడ"ని ఆంధ్రమహాజనులు పెక్కేండ్లనుండి నాగేశ్వరరావును ప్రస్తుతించుచున్నారు. "విశ్వదాత"యని గాంధి ఈతని గీర్తించినాడు. "కళాప్రపూర్ణుడ"ని ఇటీవల నాంధ్రవిశ్వకళాపరిషత్తు ఈతని గొనియాడి, బిరుదుతో సత్కరించినది. సుప్రసిద్ధచిత్రకారుడు చిత్రించిన భావసందీప్తచిత్రపటమును బహిర్గత మొనరించుచు, జయపురాధీశు లు విశ్వదాతగుణగణముల నుగ్గడించిరి. విజయవాడలో శిలాప్రతిమను ప్రతిష్ఠించుటకై అచటిమిత్రులు ప్రయత్నించుచున్నారు. Municipal Council విరాళమొసగినది. దీని నిర్ణయమును పాలకు లామోదించిరి. కొంతకాలమునకు మున్నీతనిపేరున మాంబళములో నూతనమార్గ మేర్పడినది. ఈతనిపేరున నొక నాట్యకళామందిరము, ఒక్కపుస్తకభాండాగారము, ఒకవిశ్రాంతిశాల, ఒక క్లబ్ నెలకొనవలెనని కొందఱు మక్కువపడుచున్నారు. వాల్తేరు బెజవాడలలోనేకాక, ముఖ్యముగ నీతనిక్రియాకలాపమునకు కేంద్రస్థానమైన చెన్నపురిలోను, తక్కుంగల ప్రధాన ప్రదేశములందునుగూడ నాగేశ్వర నామాంకితములై, ప్రజాకల్యాణమునకుతోడు పడుసంస్థ లెన్నో తలసూపవలెను. ఇట్టివ్యవస్థ

* కాంగ్రెసు మొదల నొదలగొని సెంట్రలు ఎసెంబ్లీలో ప్రవేశించి, అనారోగ్యముకతననే తనస్థానమునకు రాజీనామా నొసగినాడు.

లెన్నో. ఇతర భారతనగరములందు గావింప బడినవి. దేశోద్ధారకుల శిలావిగ్రహము లీనగరములందు వెలయుచున్నవి. మదరాసున కాంగ్రెసునాయకు లింకను ఈరీతిసమ్మానము నంది యుండలేదు. నేడు నాగేశ్వరరా వందజాలక పోవునా?

అనేకసంస్థ లీతనియర్థముపై తమమూల బంధములను నిర్మించుకొనినవి. ఆంధ్రమృత్తికలో ప్రత్యంగుళమందును విశ్వదాతవదాన్యత ముద్రితమైయున్నది. ఆంధ్రపత్రికను, భారతి పత్రికను, ఉత్కృష్టములైన ఉగాదిసంచికలను, విజ్ఞానసర్వస్వమును, ఆంధ్రగ్రంథమాలా సాహిత్యమును తెఱచిచూడుడు. ప్రత్యక్షరమందును దేశోద్ధారకుని హృదయస్పందము వినబడుచుండును. నాగేశ్వరరా వాంధ్రదేశమైనాడు. ఆంధ్రదేశము నాగేశ్వరరా వైనది. ఎట్టి యవినాభావసంబంధమో! ఆంధ్రమహాజను లెన్నితెఱగుల నీమహాపురుషుని గౌరవింతురో? ఈతని నామధేయమున నేసంస్థను నిర్మించినను, అది ఆంధ్రమాతకై నెలకొనిన దేవాలయమే యగునని పాఠకులు గ్రహింతురుగాక!

ఆంతరంగికోన్నతికై అనవరతము తపించునాతడు సాధకుడు. కఠోర నియమములను పాలించునాతడే శరీరమును, మానసమును లొంగదీసికొనగలడు. ఇవి చిత్తమువచ్చినట్లు చలాయించెనేని కొండొకవడి కొంతసుఖము నిచ్చును. ఈసుఖము సుడిగుండము ప్రక్కగల గట్టువంటిది. గట్టు మిగుల నున్నదైనది. కొంతసేపు సుఖము మనసు నలరించును. ఇందుండి మానవుడు పరక్షణమున జారి, సుడిగుండమున పడుట తథ్యము. ఈ సుడిగుండమే దుఃఖము. సుఖము తాత్కాలికమైనది; దుఃఖమునకు సోదరి. తన పాలబడినవాని నిది అక్కచేతి కప్పనమునని ఎఱిగి, సుఖము పొంతపోక ఆత్మ యానందమునే కాంక్షించును. ఇది యనంతమైనది. శాంతిమయమైనది. గట్టులనుగాని, గుండములనుగాని ఎఱుగదు. కలహంసయై, ఆత్మ ఇందు నీదులాడుచు, శాశ్వతమైన హాయి నందును. క్రమసాధనముకతన, నాత్మశక్తి సమన్వితమై, సుఖదుఃఖములను, స్వర్గ నరకములను దూరముగ నెట్టివేసియే తన యాశయమునందును సాధన సమయమున శరీర మానసము లెదురొక్కనునుజుడీ; వీనిపరివార మింద్రియ స్తోమము. వీనిబలము సామాన్యమైనది కాదు. బహుళ ప్రలోభములు వీనికి తోడుపడును. ఎదురొక్కనిన కరీంద్రమును, మృగేంద్రుని మచ్చికజేసికొని వాహనములొనరించుకొని గమ్యస్థానముదెస చనువాడు మహావీరుడంటిని. సాధకుడే మహావీరుడు. కరికంఠీరవ శార్దూలములకంటె నధికమైన క్రౌర్యమును బలమును గలవి ఇంద్రియములు. కాని గుండెయను గుడిలోనున్నవాడు జగదీశుడు. ("అయమాత్మా బ్రహ్మ") ఈతని విస్మరింప మేని ఇతడే ఇంద్రియములను లొంగదీయును. దేవు నొక్కొకపుడు జగద్ధాత్రి యనియు దివ్యశక్తియనియు పిలుతుము. లింగభేద మాతనిపట్ల శెల్లదుకదా! చిత్తరువులందు జగద్ధాత్రిని చూచియుందురు, ఈమె సింహముపై నాసీనయై యుండును. మనుష్య హృదయమందలి ఆత్మ యనుజగద్ధాత్రి ప్రతికూలశక్తియైన సింగమును వశమొనరించుకొనునని గ్రహింపకపోరు. మహాసంయముల యంతరంగములలోనికి దృష్టిసారింప జాలితిరేని, ఇట్టి చిత్రదృశ్యమును విలోకించి అచ్చెరువొందెదరు. ప్రతికూలశక్తి ఉన్మత్తవేదండము వంటిదనికూడ వచించితిని. బుద్ధునిశత్రువు దేవదత్తు డాసంయమీంద్రునిమీదిపగ దీర్చుకొనుటకై పిచ్చియేనుగు నాతనిపైకి పురికొల్పెను కదా! కరస్పర్శచే తథాగతుడు దానిని మచ్చికగావించినాడు. మారసైన్యమునుగూడ నీతడు నిర్జించెనని చదువుచుందుము. బుద్ధుడు జితేంద్రియుడని దృష్టాంతీకరించుచక్కని కథలివి. క్రమసాధనకతన నాత్మశక్తిని వృద్ధిగావించుకొనువాడే ఇంద్రియములను, శరీర మానసములను చెప్పుచేతలం దుంచుకొనగలడు. ఎత్తుకొండనెక్కు యాత్రీకుని గురించి తెలిపితిని. సాధకు డీతడే! ఎక్కుచుండ నొక్కొకపు డీతడు పడును, లేచును. అంగుళమంగుళమందును ఈతని బ్రతిఘటించు ప్రతికూలశక్తులున్నవి. ఈతడుపడినపుడు నవ్వువారు దుర్మతులు. పడినపు డాతరము లేనీతడు బాధపడిన ట్లొరులెవ్వరును బాధపడరు. ఈతనికన్నీరొడ్చిన ట్లొడ్చువా రెవ్వరును లేరు. వెంటనే ఈతడు ధృతిని చిక్కబట్టును, సహనమును కవచముగావించుకొనును. చెల్లాచెదరైన శక్తులను గుండెలో కేంద్రీకరించి, ద్విగుణీకృతోత్సాహముతో లేచి, ఎదుటిసట్టమీదనుండి మీదిసట్టమీదికి మొగ్గవేయును. సాధకుని మార్గము కడుంగడు క్లిష్టమైయుండునని తెలుపనే తెలిపితిని. ఈర్ష్యయనుడు, క్రౌర్యమనుడు, దుర్విమర్శయనుడు. ఉష్ణవాయువులై ఈతడు తనగమనిక సాగించుచుండ, వీనిమనసును సోకును. కాని, వీని కీతడు కదలడు, తలకడు, చలింపడు. తన ఏకాగ్రదృష్టిని తునకలు కానీయడు. కడ కీతడు తన గమ్యస్థానమును చేరగలడు. జితేంద్రియుడై, కైలాస శిఖరమున నిలిచి జేగంటను మ్రోగింపగలడు!

ప్రతికూలశక్తి పెద్దదైనకొలది, సాధనమధికమగును. ఆ శక్తిలో భేదము లుండును; కావున వేర్వేఱువ్యక్తుల సాధనమున వ్యత్యాసము లుండును. కావుననే సాధకు లందఱు నొకశ్రేణి తరగతిలోనివారు కారు.

ఆడంబర మెఱుగనిసాధకుడు, ఒరుల కంటబడక సాధన మాచరించుసాధకుడు నాగేశ్వరరావు.

అతులైశ్వర్యము మానవులను సాధారణముగా నీశ్వరసామ్రాజ్యమునుండి బరబర దూరముగ లాగివేయును. వీరుడు ప్రతికూలశక్తినే నూడిగము చేయించుకొనునంటిని. తన ధైర్యముచే దేశోద్ధారకు డూడిగము చేయించుకొనినాడు.

సాత్వికాహారమును మిగులమితముగ గొనుచు, అపుడపుడు దీనినికూడ పరిత్యజించుచు, రక్తమాంసములను, వీనిలో విడియు నింద్రియములను, వీనికి దగ్గఱచుట్టమైన చిత్తమును ఆత్మయొక్క హుకుమున నీతడు నిలుపుచుండును.

అంతరంగమునేలు మహిషియై, బలసంపన్నయై ఆత్మ, హృత్సింహాసనమున నాసీనయై యుండ, గుఱిగల విజయదుందుభులు మ్రోగు

మండును. తన గుండెకడ తన చెవియొగ్గి వీర వశంసుడు, అంతరంగమందలి మహోత్సవ మిట్టిదని గ్రహించి, పరమానందభరితుడగును. శేతయెండ సోకినపుడు మట్టిగడ్డకూడ బంగా రపుముద్దవలె దోచును. గుండెయనుపొడుపు గొండనుండి ప్రసరించిన భావమయూఖ మె ద్దానిని సోకినను, అది సౌందర్యసందీపితమై తోచును. పూతమనస్కుడై, ఉత్సాహపూ రిత హృదయుడైన సాధకుడు నలుగడలందు రక్తాభపోలుసదాశనే వీక్షించును. నిట్టూర్పులు విసడించువానికేకదా ప్రపంచము నిరయకుం డమును ప్రత్యక్షము గావించును!

కనుకొలుకులందు సదాశ కాంతిలుచుండ, హృదయమందు ధృతిసహనములును,శాంతితో గూడిన ఆనందోత్సాహములును పంచగంగలై ఆత్మయను అంబదాపున వెలయుచుండ * అంతరంగ గర్భాలయము పవిత్రభావ బంధుర మైయుండ,శరీరమున నెందో ఏలకో తలఎత్తిన నెసలును సాధకుడు లక్ష్యముచేయునా?

కొంత కాలమునకుమున్ను నాగేశ్వరరావు మేనిలో నిట్టినెసలు ప్రవేశించినది. మహాపురు షునిజూచి, దుర్విధి సహింపలేడు కాబోలు! వ్యాధి అసంఖ్యాకుల గుండెలందు ఆందోలన మును పుట్టించినది. దేశమంతయు తొట్రు పడుచున్నది. కాని, ఈసాధకుని హృదయ మున నించుకంతైన తొట్రుపాటు పొడసూప లేదు. అనన్యసామాన్య-ఆత్మవిశ్వాస ధైర్య స్థైర్యములతో నీతడు తనదుష్టవ్యాధితో పోరుచున్నాడు. తనవిజయము నిక్కమని,-తనకు విజయము చేకురెనని విశ్వసించు స్థిత ప్రజ్ఞు డీతడు. పదునేనవయేట "భారతి" అడుగిడినంతన, తనకు మిసలగూర్చు పత్రికా పుత్రికయొక్క గత జీవితమును సింహావలోకన మొనరించుచు "ఇటీవల నేను జబ్బుతోనుం డగా..." అని "స్వ" సంస్మరణమున దేశో ద్ధారకుడు వాకొనెను. వ్యాధిని నిర్జించితినను అద్భుతమైన ఆత్మవిశ్వాసము ఈతనిగుండెలో అమరజ్యోతివలెన్నెట్లు తేజరిల్లుచున్నదో గ్రహింపుడు. ఆత్మశక్తి పరంజ్యోతియై హృ దయ పూజాగృహమున వెలుంగుచుండ, నేవ్యాధియైన నెవ్వనిగాని ఏమిచేయగలదు?

ఆత్మశక్తి కతన నాయువును పొడిగించు కొనిన సాధకులు మనదేశమున మనియుండిరని ఎఱుంగుదుము. చెప్పనేల? అత్యద్భుతమైన ఈ శక్తికతన దుర్విధిని చిత్తుచేసిన మహావీరులు మననేలలో నుండిరి. ఆర్యనారీ శిరోమణి సావిత్రి సమవర్తిచేతులనుండి పతిప్రాణము లను పడయజాలెనని మనసాహిత్యము జలదగంభీర స్వరమున వచించుటలేదా? మృత్యువును దూరముగ తఱుమగొట్టు దివ్యశక్తి యొండు మనుష్యహృదయమున గలదని ఈకథ ఘోషించుచున్నదికదా!

నేడు దేశోద్ధారకుని ఆరోగ్యాభివృద్ధికై దేశవాసులెల్లరు తపసుచేయుచున్నారు. ఎల్ల చోటులందు ప్రార్థనలను, సమారాధనలను సలుపుచున్నారు. ప్రార్థనమందలి ప్రభావ మును, సద్భావమందలి మహత్త్వమును అని ర్వచనీయములు. కమలాసనునిగద్దెనుండి డింపి, తోడ్కొనివచ్చి, నొసలువ్రాత నుచితరీతిని సవరింపజేయజాలుశక్తి వీనికి గలదని విశ్వసిం పుడు. కోటికోటిగుండెలనుండి వెడలుఉత్తాల భావతరంగములు అసాధ్యములను సాధించు నని నమ్ముడు. చూపఱులకన్నులనుండి అశ్రుసలిలము కాల్వలై ప్రవింపగ ద్వగస్థి మాత్రావశిష్టుడై నిమీలితనేత్రుడై "స్వధర్మ నిర్వహణమునందలి పరమార్థమును" మననము గావించుకొనుచు ధ్యానపథమున పరమాత్మను నిలిపి, శాంతమూర్తియై పన్నుండియున్న దేశో ద్ధారకుని, విశ్వదాతను, కళాప్రపూర్ణుని, పరార్థజీవిని, దేశహితము నభిలషించినయైన, కూలి, క్రుంగువారి సర్వతోముఖసముద్ధరణ మును వాంఛించినయైన, అసంఖ్యాకులైన నిర్భాగ్యులబ్రదుకుల వీక్షించినయైన, అభాగిని యైన ఆంధ్రమాత భావికల్యాణమును కాంక్షిం చినయైన దీనరక్షకుడు దీర్ఘాయురారోగ్యో పేతుని గావించుగాక!



---

* కుంభి, తులసి, భోగావతి, కాసారి, సరస్వతి యనునదులైదు కలియుటచే పంచ గంగక్షేత్ర మేర్పడినది. ఈక్షేత్ర తీరమందే కొల్హాపురము విలసిల్లుచున్నది. అంబాలయ మిందు వెలయుచున్నది. ఈ యాలయాంత ర్భాగము చక్కని వెండిపనితో నొప్పుచుండు నని యాత్రికు లెఱుగుదురు. పైన నుల్లేఖింప బడిన అలంకారమునకుత్తరవాది ఈక్షేత్రమే!

# సంగము

## గుఱ్ఱము వేంకట సుబ్రహ్మణ్యము

పంజరమునఁ గీరమువలెఁ బట్టణమునఁ
బ్రకృతిస్వాతంత్ర్యసమ్మోద పరవిహార
మెల్ల స్మర్తవ్య మాగాథ యయిన బహు
వర్షములు పుచ్చుచున్న నాహర్ష మేమ
నన్వలె నొకనాఁడు వెడలినం, బతంగు
నుదయకిరణవరణమున నుర్వి క్రొత్త
కోడలట్లు తళ్కొత్తఁగఁ గూర్మిపేర్మి.
యోజనశతంబు సనలేదు వ్యోమరథ్య,
క్షేత్రపావిత్ర్యసంకీర్తి చెవులు సోకి
గాదు, భూరితరాద్భుతకలన గాదు;
కానిదారి యొకింత సాగంగ నెదురఁ
దోచినయపూర్వరమణీయతాచితాగ
నగజలాశయమయదృశ్యనైజగరిమ
నను వశీకరించుకొనె క్షణంబులోన.

దట్టమై పచ్చనై చెట్లు పుట్టలద్రి
పార్శ్వముల నావరించె సంపత్సమేత
యాస్థలీదేవత స్తనంబు లంటి బహుళ
వళుల రాజిలు పయ్యెదవల్వ పగిది.

కొలకొలనికూజనంబులు కొమరు మీఱ
స్వచ్ఛవర్ణచ్ఛదములైన జలవిహంగ
ములు గుములుగూడి పైఁబయిం బొలయుచుం[డ,
మందమందసమీర సంస్పందనముల
వీచికామాలికలు భానువిహితకాంతి
భువనవహన ప్రవీణాహిమూర్ధరత్న
విస్ఫుటోద్యత్ప్రభాజాలవేష మొంద,
నందగించెఁ గొలంకు లుపాంతమందు.

పఱపు నోఱపు గలిగిన శాద్వలములందు
నీడ లెండలు దోబూచు లాడుకొనఁగ
నాలగొఱ్ఱెలమందలు నంతనంత
మేసి మేయుచుఁ దఱితీపి ఘాసరాశి
స్వైరము చరింపుచుండె నిర్భయమెసంగ.

అవల వరిమళ్లలోఁ బైరు నయ్యవసర
మునఁ గృషిఫలోన్ముఖరుచిరతను వహింప
వెన్నుసూపెను చూలాలివిధము దోఁప.

దారిమెలిక దీఱి మఱికొంత జనునంత
పుష్కలాంబుపూరములు, ప్రభూతభూతి
మూలము, లమోఘపుణ్యానుకూలకూల
ములు, విషయజీవనాళము, లలఘునదులు
దర్శనీయము లయ్యెఁ దత్సంగమమున.

అచట నార్ద్రాంతరార్యులు ప్రచురభక్తి
నెప్పుడు ప్రతిష్ఠ చేసిరో యేమొ, గాంగ
వల్లభుని యాలయము సేవ్య ముల్లసిల్లు
నిత్యపూజాదికైంకర్యనిరతి గలిగి
డీలువడియు మతంబు గై వ్రాలి వయసు.

నిస్తులవినోదవిజ్ఞాననిలయ మైన
యీస్థలం బవలోకించు చాస్థతోడ
నెంతసేపైన నుండఁదలంతుఁగాని
కాలచాంచల్య మట్లరికట్టలేమి
వీడ్కొనకతప్పమి నెఱింగి వీక్ష్యమాణ
మఖిల మంతర్ముఖావలోకార్పణం బొ
నర్చి, యిలువచ్చి, వెలిబుచ్చినాఁడ నిట్లు.

# ఎరువులు

భారతదేశంవారికి ప్రధానమయినవృత్తి వ్యవసాయం. వ్యవసాయంవల్ల ఎక్కువఫలం పొందడానికి పొలం సారవంతంగా ఉండవలెను. పొలం సారవంతంగా ఉండాలంటే ఎరువు ఎక్కువగా పోయవలెను. ఎరువుపోయకపోతే పొలం నానాటికీ సారహీనమయిపోతుంది. దాంట్లో సగమేకాదు, నాలుగోవంతేకాదు అసలేమాత్ర పంట తేలకుండపోతుంది. ఇదే ఇప్పటిపెద్దసమస్య.



పశువులపెంటను గోతులలో పదిలపరుస్తున్నారు

మనదేశంలోవారికి సహజంగా దొరికే ఎరువు పదార్థాలను సేకరించి దాచుకోవడానికి తెలియదు. ఏదో పోయినవల్లాపోగా నిలవచేలిన పశువులు వగయిరాల పెంటతో, ఆకలములతో పొలానికి సత్తువ ఎక్కిస్తూఉంటారు. అది చాలనందువల్ల శ్రమకు తగినంతఫలాన్ని కర్షకులు పంటలో పొందడంలేదు. ఎరువులో సారాన్నేకాకుండా, పొలంలోసహజంగాబీటికాలంలో చేరుకునేసారాన్ని కూడా పైరు ఏటాపీల్చేస్తుంది. మళ్లా ఎక్కువగా ఎరువుపోస్తేనేకాని పైరు చక్కగా పండదు. ఎక్కువగా ఎరువును సేకరించుకోవడానికి మనవారు ప్రయత్నం చేయరు. ఇది స్థితి. ఇంతేకాకుండా దొడ్డిలో చేసేపశువులపేడను పిడకలక్రింద యెండించి గృహకృత్యాలలో కాల్చివేస్తూఉంటారు. ఏటా ఇట్లా కాలిపోయేది కోట్లకొలది టన్నులవుతుంది. పిడకలుకాలగా పడినబూడిద మంచియెరువనిమనకర్షకులుకొంచ రనుకుంటారు. అది పొరపాటు. కాల్చడంవల్ల పేడలో నత్రజని, సేంద్రియపదార్థము- ముఖ్యమయినవి రెండూ-నశించిపోతవి.

వ్యవసాయదారుడు పశువుల ఎరువును ఈ విధంగా కాల్చి పాడుచేసుకొని చాలనష్టపడిపోతున్నాడు. మనదేశంలో అనాదిగా ప్రసిద్ధమయింది పశువులయెరువు. అది సులువుగా దొరుకుతుంది; శ్రేష్ఠమయిందికూడ; అవసరానికి ఒదిగేదిన్నీ. అదయినా, మన వ్యవసాయానికి కావలసినంత దొరకడంలేదు. దాన్ని సేకరించి దాచుకొని ఉపయోగించుకోవడం తెలియనందువల్ల దానిలో చాలపాలు వ్యర్థమయి పోతూఉంది.

సాధారణంగా పశువుల పెంటను పశువుల పాకలవద్ద, ఇండ్లసమీపాన దిబ్బలుగా పోస్తూ ఉంటారు. ఎండకు ఎండుతూ, వానకుతడుస్తూ ఉండడంవల్ల ఆదిబ్బలలో సారం చాలభాగం నశించిపోతుంది. కొంచెము ప్రయత్నంచేసి జాగ్రత్తగా దాచుకుంటే ఎరువు ఎంతో సారవంతంగా ఉంటుంది... వ్యవసాయ శాఖ వారు దీనికి కొన్ని ఉపాయాలు కనుక్కొని వాడుకలోకి తెచ్చిఉన్నారు. అందులో రెండు మంచివి.



పశువులశాలల్లో తుక్కు-చొప్ప పరచి దాన్నిపైన కట్టబడియుండిన పశువులు



దున్ని వేయబడుచున్న జనుముపైరు. ఇది మట్టిలో చివికి పొలానికి మంచి బలాన్ని ఇస్తుంది

పశువుల యెరువులో ముఖ్యమయింది వాటిమూత్రం. పైరుకు మంచిపుష్టిని కలిగించేశక్తి దానిలో ఉంది. మనదేశంలో మూత్రాన్ని జాగ్రత్తపెట్టే కర్షకులు అరుదు. అందువల్ల ఎరువులో అమూల్యమయిన పదార్థం వ్యర్థంగా పోతూంది.

పశువుల మూత్రాన్ని పేడతోపాటు నిలవచేసుకోవడానికి సులువయినదీ, వ్యయంలేనిదీ ఒకపద్ధతి: పశువులశాలలో నేల చుట్టుపట్ల కంటె రెండడుగులు లోతుగా ఒకేమట్టంగా ఉండచేసి, దానిలో తుక్కుచెత్త, చొప్ప మొదలయిన వాటిని పరిచిపెట్టవలెను. పశువులు దానిమీద పరుండి, మూత్రాదులను విసర్జిస్తవి. ఆపెంటలోనే ఇమిడి మూత్రసారం నిలువఅవుతుంది. ప్రతిదినమూ కొత్త చెత్త దానిమీద పరుస్తూ ఉండవలెను. ఈ విధంగా పల్లము నిండినతోడనే ఆపెంటను తీసి వేరే- గోతుల్లోపోసి పదిలపరచవలెను. ఇట్లా చేయడంవల్ల కారమూ సారమూ కలిగిన మంచిఎరువు తయారవుతుంది. కాని దీనికొక ఇబ్బంది ఉంది. ప్రతిదినమూ పశువులకు పడక పరచడానికి కావలసినచెత్త, చొప్ప దొరకడం కష్టం. పడకమార్చకపోతే పశువులకు మురికిపట్టి పోతుంది; రోగాలూ తగులుకొంటవి. అడవులనుండి ఏ ఆకలాలో తెచ్చి పరచవచ్చునంటే అది కొన్నిచోట్ల దొరకడం సాధ్యపడదు. అందువల్ల పశువులశాలలో ఒక మూల తవ్వినగోతిలో మూత్రాన్ని సేకరించి పెట్టడం ఉచితం. మూత్రం ఇంకిపోకుండా గోతి లోపలినైసంతా గట్టిగాను, శాలలో నేల చదునుగాను ఉండవలెను. మూత్రం గోతిలోకి వచ్చుటకు ఒక కాలవకూడ తవ్వించవలెను.

పశువులపెంటను సేకరించడం ఎంత ముఖ్యమో అంతకంటేముఖ్యం దాన్ని భద్రపరచడం. ఎక్కడనంటే అక్కడ పోసిపెట్టకూడదు. అందువల్ల దానిలో సారమ్మే కాకుండా, ఆ చుట్టుపట్ల ఉండే ప్రాణికోటి ఆరోగ్యంసహితమూ పాడయిపోతుంది. అందుచేత ఆపెంటను గోతుల్లో పోసి కప్పిపెట్టవలెను. అట్లా చేస్తే యెరువులో సారమూ పోదు ; చుట్టుపట్ల ప్రాణుల ఆరోగ్యమూ చెడదు.

మెరకప్రదేశంగాచూచి, మన ఇష్టంవచ్చినంత వెడలుపు పొడుగులతో మూడునాలుగడుగులలోతు గోతులుతవ్వి వాటిలోవైపున, నీరింకకుండ రేగటిమట్టిని మెత్తవలెను. ఏమాత్రమయినాసరే ఆగోతులమీద కప్పుఉండడం మంచిది. పశువులశాలలో నిండినపెంటను తెచ్చి గోతిలో పోసి నింపి మీదను, పోటిమట్టితోకాని వండుమట్టితోకాని నాలుగు అంగుళములమందమున కప్పిపెట్టవలెను. గోతిలోపదార్థమంతా త్వరలోచివికి మంచిఎరువు తయారవుతుంది.



జనుమువగైరా పైరు మట్టిలో చక్కగా కలిసిపోవడానికి రెండుమూడు మార్లు దున్నవలెను

ఈ పద్ధతినే, ఇంకకొంచెము శ్రమా, శ్రద్ధా పుచ్చుకుంటే, ఎండిపోయిన ఆకులూ అలములూ చెత్త చెదారమూ మొదలయినవాటినికూడ చక్కనియెరువుకింద తయారుచేసుకోవచ్చు ను. పసువులయెరువు చాలనిచోట్ల దీనిఉప యోగం యెక్కువ. గోతిలో మొదట ముక్కా లడుగుయెత్తున ఆకలములుపోసి, దానిపయిని పసువులపెంటను, తరువాత మళ్లా ఆకలను లను, ఆవలపెంటను ఇట్లా క్రమంగా గొయ్యి నిండేవరకు పోసి, గోతిలోకి కొంచెం నీరు పెట్టి, పైనచెప్పినమాదిరిగా మంటితో కప్పి పెట్టవలెను. నెలకొకమారు గోతిలోనిపెం టను పారలతో తిరగవేస్తూ ఉండవలెను. కొన్నాళ్లకు ఆకలాలంతా కుళ్లి చక్కని యెరు వవుతుంది.



పాలూరు (దక్షిణాది)లో దొరతనంవారి సాగుబడి పొలంలో దున్నడానికి వాడబడే కొత్తరకం నాగళ్లు

దక్షిణభారతంలో వరిసాగు యెక్కువ. దానికి ఎరువు అధికంగా కావాలి. పచ్చిఆకు ఎరువు అందుకు యెక్కువగా తగింది. కర్ష కులు చుట్టుపట్లఅడవులలోనుంచి వచ్చి ఆకు కోసితెచ్చి పొలానికివేసి సారం యెక్కించు కొంటున్నారు. కొన్నికారణాలచేత ఇట్లా చేయడం మంచిదికాదు. ఆకుకోసం పడేశ్రమ అధికం; ఫలంఅల్పం. అడవికిపోయి, అదీయిదీ అనకుండ అన్నిచెట్లఆకును కోసితేవడంలో చెట్లన్నీ మొలకలోనే రూపుమాసిపోతవి. అం దులో కొన్నిచెట్లు పెద్దపెద్దమానులుగా పెరి గితే గ్రామస్థులకు ఎన్నో ఇతరవిధాల ఉప యోగపడేవి ఉంటవి.

ఇంక పచ్చిఆకుయెరువును సమకూర్చుకో వడం యెలాగంటే పొలంలోనే కొన్నిమొ క్కలను పెంచి, పూతపరువునకు వచ్చిన వెంటనే దున్ని వాటిని మంటిలో కలిపివేయ డం. ఇందుకు పనికివచ్చేవి జనుము, నీలివెంప లి, మొదలయినవి. జనుము విత్తినరెండునెలల్లో పెరిగి పరువుకు వస్తుంది. నీలి నాలు గయిదు నెలలకుగాని పెరిగి పరువుకు రాదు. వరి కోయడానికి ౧౫ రోజులుముందు ఈ విత్తులు చల్లి రెండుమూడు మారులు పొలానికి నీరు పెట్టవలెను. ఎకరానికి పౌ. ౨౫ మొదలు ౩౦ వరకు విత్తవలెను. భీటికాలం ఎక్కు వయినచోట్ల నీలీ, తక్కువయినచోట్ల జనుమూ పైరుచేయవచ్చును. పరువున దున్నిమంటిలో కలిపిన మొక్కలు పొలంలో చివికిపోవడం వల్ల వాటి సారమంతా పొలానికి తిన్నగా పట్టి మంచిబలాన్ని ఇస్తుంది.

దండిపంటకు పొలానికి ఎరువు ఎంత ముఖ్యమయిందో పంటు దుక్కికూడ అంత ముఖ్యమయిందే. మనదేశంలో కర్షకసామా న్యంగా ఉపయోగించే నాగళ్లతో కాలవ ల్లాగ చాళ్లు పడుతవికాని చాళ్లనడిమిగడ్డ కదిలి నేల మెతువుపడదు. ఆలాటి నాగళ్లతో ఎన్నిమార్లు దున్నినా సరిగా దుక్కిపడదు. రైతుశ్రమఅంతా వ్యర్థమయిపోతుంది. ప్రకృ తంలో మంచిమంచి నాగళ్లు మూడురూపా యల దగ్గరనుంచి అమ్మకానికి దొరుకుతున్నవి. పెద్ద,చిన్న దుక్కిటెడ్లకు సరిపోయే సైజులో కూడ దొరుకుతవి. వ్యవసాయ శాఖవారు, ఆలాటిపనిముట్లను కొనుక్కోవడానికి అప్పు కూడ ఇస్తున్నారు. రైతులు వాడుకలోఉండే కర్రనాగళ్లననూని, ఈనాగళ్లను వాడు కొంటేనేకాని వ్యవసాయం అభివృద్ధిలోకి రాజాలదు. పండుదుక్కి, దండిఎరువు కలిస్తే, సేద్యంలో పొలం బంగారు పండుతుంది; రైతును నేడు పీడిస్తూవుండే దారిద్ర్యం పటా పంచ లవుతుంగి.

'వాసక'.

# విమర్శనము

## చీనా జపాను ప్రళయము

[క్రౌను ౧/౧౬ సైజు; ౧౧౫ పేజీలు; వెల ౬ అణాలు. గ్రంథకర్త: గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ప్రకాశకులు: నమ్మాళ్వార్సు, తపాలుపెట్టె ౨౫౧. మదరాసు.]

ఈ గ్రంథం నమ్మాళ్వార్సువారి రాజకీయ శాఖకు సంబంధించిన రెండోది. చీనా జపానులమధ్య నేడు ప్రవర్తిల్లినసంఘర్షణ పోను పోను ప్రపంచమహాయుద్ధంగా మారేసూచనలు అనుపడుతున్నయి. వ్యావహారికంగా యీనాటి చీనాజపాను పోరాటానికి యేకారణాల్ని మనం గణించుకున్నప్పటికి అంతర్యంగామట్టుకు జపానువారి దుడుకుతనానికి హేతుభూతమైంది సామ్రాజ్యవిస్తీర్ణానికి సంబంధించిన దురాశతప్ప వేరేకాదు. ఈ ప్రళయ మింకా యెంతకాలం నడుస్తుందో చెప్పటానికి సాధ్యముకావటంలేదు. త్వరలో సమసిపోయే సూచనలుకూడ యేమాత్రం కానరాకున్నవి. చీనాజపాను సమరగాథను హరి సర్వోత్తమరావుగారివంటి విజ్ఞానులు యిప్పట్లో రచించటం సముచితం.

సర్వోత్తమరావుగారు ఆంధ్రులకు చిరపరిచితులు. రాజకీయ విషయాలలో ప్రవేశించి ప్రథమంగా కారాగృహ ప్రవేశంచేసిన ప్రథమాంధ్రవీరుడు. ప్రపంచ చరిత్రము సంపూర్ణ స్వరాజ్యము, హైందవ స్వరాజ్యము, నీతి ధర్మము మొదలైన గ్రంథాలను రచించినవిజ్ఞానధనులు.

"చీనాజపాను ప్రళయము" అనబడే యీ నూతన రచన చీనారాజ్య స్వరూపము, చీనా పూర్వచరిత్ర, విదేశ సంబంధము, పరదేశజుల హక్కులు, జపానుదేశ చరిత్ర, బలిదానము, జపాను సామ్రాజ్యతత్వ విజృంభణము, దోపిడినీతి, అమెరికా భయములు, చీనాప్రజా సత్తాకనాయకులు, షియాంగ్-కై-షేక్, ఇంగ్లాండు జపానులకు యుద్ధము సంభవమా, ముగింపు మొదలైన ౧౬ అధ్యాయాల్లో చీనాను ఆధారముచేసికొని ఆసియాలోను పసిఫిక్కు మహాసముద్రంలోను తమ తమ పలుకుబడిని నిలుపుకొనటానికి జపాను, బ్రిటను, అమెరికా, ఫ్రాంసు, రష్యా మొదలైన రాష్ట్రాలు జరుపునాటక సంవిధానాన్ని వివరించారు. శైలి సులభం. అంతర్జాతీయ విషయాల్ని దేశభాషల్లో ప్రతివానికి అర్థమయ్యే ఫక్కిని వ్రాయటానికి మంచిపరిజ్ఞానము, విషయగ్రాహకశక్తి, మృదువైన శైలి అవసరం. హరిసర్వోత్తమరావుగారి దగ్గర యివన్నీ అమరివున్నవి. —వ. కు.

---

## తిలోత్తమ - పాపయ్యశర్మ

[క్రౌను ౧/౮ సైజు; ౮౦ పేజీలు; వెల ౬ అణాలు. కర్త్రి: పులవర్తి కమలావతి దేవిగారు. ప్రకాశకులు: నమ్మాళ్వార్సు, తపాలుపెట్టె ౨౫౧ మద్రాసు.]

ఇది నమ్మాళ్వార్సువారి సాహిత్య శాఖకు సంబంధించిన రెండో ప్రచురణము. గ్రంథనామం చెవినిపడే పడటంతోటే తారాశశాంక విజయంమాదిరి తిలోత్తమ, పాపయ్యశర్మలకు సంబంధించిన ప్రణయగాథేమోనని స్ఫురిస్తోంది. కాని అది కాదు. ఈ గ్రంథంలో రెండురచనలు చేర్చబడినవి. ఒకటి తిలోత్తమ. (౪౩ పేజీలు). రెండవది పాపయ్యశర్మ (౨౫ పేజీలు.) తిలోత్తమ - పాపయ్యశర్మ ప్రత్యేకరచనలు.

### తిలోత్తమ

ఇది ఔరంగజేబుకాలంనాటి గాథ. గోలకొండ తానీషా కొలువులో ఉద్యోగి అయిన మాధవశర్మ కుమార్తె తిలోత్తమ. ఈమె అసమాన సౌందర్యవతి అని ఔరంగజేబుకు తెలిసి యెలాగైనా ఆమెను లోబరచుకోవాలె నని అనేకపాట్లు పడ్డాడు. ఆమెను చెరబెట్టి తెప్పించుకున్నాడు. కాని పొందలేక పోయినాడు. ఈపాట్లలో అనవసరంగా గోలకొండ మీదకు దండెత్తి యుద్ధానికి కారకుడైనాడు.

మధ్యయుగంనాటి చరిత్రను పరిశీలిస్తే ముస్లిం ప్రభువుల సహాయంతో, స్త్రీజాతి, మానవుల్లో నీచమైన కాముకప్రవృత్తి, సామ్రాజ్య విస్తీర్ణమనేదురాశ లేకపోతే మనభారతదేశ చరిత్ర నేడున్నంత అధోగతిలో వుండదు.

* * *

### పాపయ్యశర్మ

ఇది ఈస్టిండియాకంపెనీ, హైదరాలీ నవాబులకాలంనాటికథ. హైదరాలీకొలువులో పూర్ణయ్యపంతులు ప్రధానామాత్యుడు. రెండోమంత్రి పాపయ్యశర్మ. ఈతని కెలాగైనా మైసూరురాజ్యానికి యేలికకావలెనని దుర్బుద్ధి పుట్టింది. దీనికొరకు పాపయ్యకు తోచినఉపాయం ఒక్కటే. టిప్పుసుల్తానుకు ఒకశ్వేతాంగనను సప్లయిచేయటం. యీమెను యింగ్లాండునుంచి కష్టపడితెప్పించినానికి బెంగుళూరు గవర్నరుపదవి, తనకు ప్రతిఫలంగా మైసూరురాజ్యం ఒప్పగించేచెయ్యటం. హైదరాలీ యీపాపయ్యను మదరాసులోని యీస్టిండియాకంపెనీవారి దగ్గరకే రాయబారానికి పంపుతే యీయనచేసుకు వచ్చిన ఘనకార్యం స్వార్థలాభంచూసుకోడంగూఢచారులసహాయంవల్ల పాపిష్టిపాపయ్య కుట్రనంతా హైదరాలీ తెలిసికొని అతని ప్రయత్నాలన్నీ విఫలం చేయటమేకాకుండా ఫిరంగులయెదుటనిలువబెట్టి కాల్పించివేశాడు.

* * *

తిలోత్తమ- పాపయ్యశర్మల కథలు రెండును కామినీ కాంచనముల మీదగల దురాశా ఫలితాల్ని స్పష్టపరుస్తున్నయి. తిలోత్తమకంటె పాపయ్యశర్మ రచన బాగున్నది. వస్తువు, రచన యింపుగ నున్నది.

అయితే పుస్తకంనిండా అచ్చు తప్పులు విశేషం. గ్రంథముద్రణం ఆకర్షణీయంగా వుండేట్టు చూచుకోవడం మాత్రమే గాక అచ్చుతప్పులు దొరలకుండా కూడ నమ్మాళ్వార్సు శ్రద్ధచూపటంఅవసరసం. —వ. కు.

---

## త్రిలోచన కవిరాజు

[క్రౌను ౧/౧౬ సైజు; ౧౪౦ పేజీలు; వెల ౧౨ అణాలు. కర్త: చక్రపాణి (అనువాదకుడు)]

స్వర్గీయ రవీంద్రనాథ మైత్రగారు బెంగాలీలో రచించిన ఆరుకథల అనువాదమే "త్రిలోచన కవిరాజు" లోనివస్తువు. మైత్ర ప్రతిభావంతుడు. నవలలు, నాటకాలు, చిన్న కథలు విశేషంగా వ్రాశాడు. సాహిత్యకారునికి కావలసిన పరికరాలన్నీ అంటే- ప్రకృతి పరిచయం, సాధారణ జన సంస్కారాభిలాష, గ్రామజీవితం, నిరాడంబరత మొదలైన వన్నో అలవడివున్నవి. వీరికథల్లో అసహజ ఘట్టాలుండక వాస్తవిక ప్రపంచానికి ప్రతిబింబ మాత్రంగా వుంటయి. "త్రిలోచన కవిరాజు" "వెల్లువ" అనేకథలు చదివితే మన విశ్వనాధ కవిరాజు, మునిమాణిక్యం స్ఫురణకు వస్తారు. రవీంద్రుని "వెల్లువ"కు మాణిక్యంగారి "ఎండా—వాన" ఒకేరకంగా వుంటవి.

ఈగ్రంథంలో త్రిలోచన కవిరాజు, ఆల్‌స్టార్ ట్రాజెడీ, నారీద్వేషి, వెల్లువ, సంస్కారి, ఆఖరుపేజీ అనే ఆరుకథలుచేర్చబడి తెనాలి యువ కార్యాలయానుబంధంగా ప్రకటింపబడింది. అనువాదానికి కొంచెం పాలిష్ అవసరం.

ఒకరోజున మంజరి బేచారాం బాబు వద్దకు వచ్చి అన్నది—"ఈసారికూడా నేను పరీక్షకు కూర్చోలేను."

బేచారాంబాబు సంకుచితుడై అన్నాడు —"ఏవిధంగానన్నా కూర్చుంటానికి వీలుందేమోచూడు!

మంజరి వ్రేళ్ల కనుపులు లెఖ్ఖవేసి అన్నది —"ఎట్లానూ వల్లకాదు!"

'అన్నది, అన్నాడు' అనే పదాలతో ముందుగా పాఠకునికి పహరాహుషారు ఇస్తూ రావటం కొంచెం విసువుదలగా వుంటుంది. ఇట్టి చిన్ని లోపాల్ని ముందురచనల్లో సవరించుకొనగలిగితే చక్రపాణిగారి వ్రాతలు ప్రజాదరాన్ని పొందకపోవు. —వ. కు.

---

## ఆధారములు

[గ్రంథకర్త:— జనస్వామి కోదండరామశాస్త్రి. శేపల్లె. వెల ౦-౬-౦]

ఇది చిన్నకథలసంపుటి. గ్రంథకర్తయే దీనిని రెండుభాగాలు విభజించారు. రెండో భాగంలోవి కార్మికకథ లన్నారు. చదివిచూస్తే, యీకథలను రెండుభాగాలుగా విభజించవలసిన అవసరమూ, రెండోభాగానికి కార్మికకథలని పేరుపెట్టవలసిన అవసరమూ యేమీ కనిపించడములేదు. కథలన్నీ ఒక్కతీరుగానే వున్నాయి.

కథానిర్మాణంలో ప్రత్యేకతగాని, పాత్రపోషణలో నేర్పుకాని ఏకథలోనూ కనిపించడంలేదు. కొన్నికథలు చాలా అస్వాభావికంగాకూడా వున్నాయి.

అయితే, రచనాధోరణిచూస్తే, యీకథకుడు భాషను పెంపొందించుకొని, తను వుపయోగించే ప్రతిమాటకూ అర్థం తెలుసుకొని, ఎక్కువగా యితరకథలను చదివి కథానిర్మాణాన్ని బాగానేర్చుకున్నట్టయితే, మంచికథలనే వ్రాయగలడనే అభిప్రాయం కలుగుతోంది. —క. స.

---

## వివిధ మంగళహారతులు
## (స్వరసహితము)

[నేదునూరి గంగాధరంగారిచే వ్రాయబడినది. పబ్లిషర్ కొండపల్లి వీరవెంకయ్య, శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి. వెల ౦-౧౨-౦.]

ఉభయగోదావరిజిల్లాలయందు పెక్కుగ్రామములు తిరిగి, అనేకులను దర్శించి, గంగాధరంగారు చాల పాటలను సంపాదించి వీని నిచ్చినవారిపేరులను, పాటల వివరములను దెలుపుచు అన్నిటిని గ్రంథస్థము గావించిరి. ఆంధ్రుల మతవిశ్వాసములును, సాంఘిక జీవితాంశములును ఇట్టి పాటలందు చక్కగ ప్రతిఫలించుచుండును. హిందూమానసము సహజముగ తాత్త్వికసంపద గలదని స్పష్టము చేయు భావము లెన్నో ఈపాటలం దున్నవి.

సాధారణ దైనికజీవితమున మన దేశవాసులు వాడు మాటలందుగూడ నిట్టిభావసామగ్రి యుండునని ఈపాటలు విశదము చేయుచున్నవి. చూడుడు:

"ఆకాశంబున యేకరూపమై
చేకొని నిలచెద భామా
నీచెంత నుందునే భామా."

"అండపిండబ్రహ్మాండం బెల్లను
నిండియుందునే బాలా......"

సాంఘిక జీవితమున వెనుకటినుండి నేటివఱకు జరిగిన మార్పు లెట్టివో పాతపాటలను నేటిపాటలను పరిశీలించినపుడు తెల్లమగును. ఈ క్రిందినాక్కులు పరిహాసపూరితములే యయ్యు కొన్ని కఠోరసత్యములను మన దురాచారములను దెలుపునవియై యున్నవి.

ప. ఇదేమి చిత్రమో యీపెండ్లివారలు
యెంతెంత మాయ జేసేరు. ఇ.

అ. ఇట్టివార లనియెరుగక పట్టి నిస్తిమి. ఇ.
పెళ్లికొడుకు చూపులకు వెళ్లిన
పిన్నవాన్ని జూపించేరు
పెళ్లియయిన వెనుకజూచిన
పెద్ద పెద్ద మీసాలయ్యా. ఇ.

ఇల్లు జూచునప్పుడు
యిరుగుమేడ జూపించారు
అంతయయిన వెనుకజూచిన
అద్దియిల్లయా. ఇ.

కంటికాసులు పెడతామని
కబు రెన్నో చెప్పినారు
వంటిపుస్తె మామిడాకు
అంటగట్టారు. ఇ.

అప్పులు రావలసినవని,
గొప్పరెంతో జెప్పినారు
అప్పులో మునిగియిప్పుడు
తిప్పలు పడతారు. ఇ.

కొన్ని పాటలందు హృదయము నాకర్షించు కవిత్వము కలదు "ముత్యాల వాన గురిసె ముదితా మీవదినతడిసె" మున్నగు మాటలను జూడుడు.

ఈ పాటలందు క్లిష్ట సంస్కృతపదములు కానరావు. తెలుసురూపుజూపు తేటమాటలే ఇందుగలవు. కావున తలగోకికొనక, మెదడును మొట్టికొనక పామరులు సయితము వీని యందలి భావమును గ్రహింపగలరు. యతు-

గానములు మున్నగునవియును, నివియును పవిత్రమైన పల్లెజీవితమును గీర్తించునవి. పల్లెలందుమసలి శ్రమపడి వీనిని సంగ్రహించుచు పాఠకలోకమున కందించు గంగాధరంగారు వందనీయులు. —జో. స.

---

## జవాహర్లాలు వ్యాసములు
### (కొన్ని ఉపన్యాసములు సహా)

[గ్రంథకర్త: శ్రీ కోమాండూరి శఠకోపాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్. కాకినాడ, పుటలు, ౧౭౮. వెల ౬ అణాలు. గ్లేజుపేపరు ౮ అణాలు.]

కాంగ్రెసు పుట్టినపుడు రాజకీయములు విశేషముగ విద్యాధికులగోష్ఠియందే ఇమిడి యుండెను. బర్కు, ఫాక్సు, పిట్, షెరిడన్, గ్లేడ్‌స్టన్ మున్నగు ఆంగ్లరాజకీయవేత్తలు మనపెద్దలకు ఆంతరంగికముగ సాచార్యులైరి. సురేంద్రనాథ్ లాల్, మోహనబిపిన్ చంద్రపాల్ మున్నగువారు గ్లేడ్‌స్టన్ ప్రభృతులవలె మహావక్తలైరి. నాటిరాజకీయములు గురుగంభీరమైన వక్తృత్వమునకును, గిబ్బన్ మున్నగువారి రచనలతో నెకసక్కెములు సలుపజాలువ్రాతలకును సంబంధించినవి. అవి యాంగ్లభాషనుండి, నగరవీధులనుండి కదలిపోలేదు.

గాంధియుగమున రాజకీయములందు సంపూర్ణమైనమార్పు పొడచూపినది. ఇవి పట్టణములనుండి కదలి పల్లెలందు ప్రవేశించినవి; ఆంగ్లమునుండి జారి మాతృభాషల జొచ్చినవి. ఆర్థిక రాజకీయసమస్యలు తమవియని గుర్తించి ప్రజలు వీని నెదుర్కొనుటకై నడుములు గట్టిరి. ఓటుచేబూని తమలోనొక్కండైన గుణాన్వితునకే దాని నర్పింపదొరకొనిరి. కాంగ్రెసుచరిత్ర వీరికి ప్రస్తుత మహాభారతమైనది; దేశనాయకులు ప్రత్యక్షమహావీరులైరి. కావున వీరిచరిత్రలను, వీరిరచనలను, వీరి ఉపన్యాసములను హృదయంగమ మొనరించుకొనుటకై మన గ్రామవాసు లాతురంపడుచున్నారు. వీరి యుద్దేశసిద్ధికై గ్రంథకర్తగారు పూనుకొనిరి. మోతీలాలు జవాహర్లాలు నెహ్రూగార్ల జీవితచరిత్రను రచించి యిపుడు జవహరుపండితుని వ్యాసములను, కొన్ని ఉపన్యాసములను ఆంధ్రమున రచించిరి.

జవహరుపండితుడు ఆంగ్లసీమయందే విద్యనభ్యసించి, ఆంగ్లవాతావరణమున వరుసగ నేడేండ్లు మసలియుండుటచే ఆంగ్లభాషకు నైసర్గికమైన జాతీయ మీతనికి పట్టుపడినది. ఇంగ్లీషు ఇంగ్లీషును వ్రాయజాలు అల్పసంఖ్యాకులైన భారత విద్వాంసులలో నితడొక్కండు. కావున నీతని రచనమును భాషాంతరీకరించుట సామాన్యమైన పనికాదు. ఆంగ్లజాతీయమున కవగతుడై మాతృభాషలోని జాతీయమును పిడికిటబట్టి శబ్దానువాదమునకు చేయిజేసికొనక, భావానువాదమున సిద్ధహస్తుడై అనువాదకుడు కలమును చేబూనవలెను. విషయమున తగినంత పాండితి నందనివాడు బోర్లపడితీరును. మూలకారునివలె తానును భావోద్వేగపూరిత హృదయుడు కావలెను.

గ్రంథకర్త చక్కని విషయపరిజ్ఞానము గలవారు. విద్యాధికులు. పామరుల యెడల విశేషానురక్తి గలవారు. తేట తెలుగుమాటలందు ఎల్లరకు తెలియునట్లు భావమును ప్రకాశము గావించుట వీరి ప్రధానాశయము గాని నెహ్రూరచనమున కీడైన ఉత్కృష్ట సాహిత్యమును సృష్టించుటకాదు. ఉపవ్యాసములనుండియు, వ్యాసములనుండియు, సర్వాంశములనుగాక, ప్రధానాంశములను మాత్రము వీరు గైకొని తెలుగున బ్రవేశపెట్టిరి. ఇవి యార్థిక, రాజకీయ, మత, సాంఘిక, సారస్వతసమస్యలకు సంబంధించినవి.

జవహరుపండితుని రాజకీయాభిప్రాయము లెల్లరకు విదితములే. కావున వీని నిందు విమర్శింప నక్కఱలేదు. సాహిత్యమును గుఱించి ఈతడు వ్యక్తీకరించిన భావములను తెలుగు సైదోడులుకూడ గ్రహించుటపాడి. "ప్రసిద్ధము గు విదేశీ నవలలతో పోల్చ దగినవి ఇంతవరకు (నాదురదృష్టమున) దొరకలేదు. నాటకములలో స్వతంత్రమైనది నా కింతవరకగపడలేదు. [illegible] యనదేశపు మాతృభాషలలో (సాహిత్యమునకు ప్రాణమగు) విమర్శలగూర్చి నాకు చెప్పదగిన దేమియు కనబడలేదు. (అది నా అజ్ఞానముననే అయినచో బాధలేదు.) ఇందుకు సిగ్గగుచున్నది." ఆంధ్రరచయిత లీ వాక్కుల కేమి యుత్తరముల నొసగెదరో !

ఇట్టి పుస్తకములను బహుళముగ వ్రాసి, ప్రజాసేవ జేసి, గ్రంథకర్తగారు పుణ్యము గట్టుకొందురుగాక. —జో. స.

---

## శ్రీ కాంచీ కామకోటి పీఠాధీశ జగద్గురు - శ్రీ ౧౦౦౮ శంకర భగవత్పాద
## విజయనగర విజయయాత్ర
### (పార్థివ - ధాతృ సంవత్సరములు)

[గ్రంథకర్త: ద్వారకా భమిడిపాటి వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, విజయనగరము.]

ప్రస్తుత కాంచీ కామకోటి పీఠాధీశుల పరమేష్ఠిగురువర్యులగు శ్రీ ౧౦౦౮ మన్మహాదేవేంద్రసరస్వతీసంయమీంద్రులు ౧౮౫౫ సం. లో శ్రీ జగన్నాథయాత్రకై విజయము చేయుచు, విజయనగర సంస్థానాధీశులు శ్రీ శ్రీ ఆనందగజపతి మహారాజులుంగారి ప్రార్థనము ననుసరించి విజయనగరమున విడిసి, చాతుర్మాస్యదీక్షలను, శారద నవరాత్రమహోత్సవములను గావించిరి. నాటివృత్తాంతమును గ్రంథకర్తగారి తండ్రిగారు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తమ దినచర్య పుస్తకమున వ్రాసిరి. ప్రస్తుతపీఠాధీశులు శ్రీ చంద్రశేఖరేన్ద్ర సరస్వతీ సంయమీంద్రులు గంగాదితీర్థ విజయయాత్రలు గావించుచు ౧౯౩౬ లో విజయనగరమున కరిగిరి; శారద నవరాత్రి మహోత్సవము జరిపిరి. వీరి యాత్రను గుఱించిన ఉదంతమును గ్రంథకర్తగారు వ్రాసిరి. తండ్రిగారు వ్రాసినదానికి దీనిని జేర్చి గ్రంథస్థము గావించిరి.

డైరీ సారస్వతాంగములలో నొక్కటి యని భారతీయు లింకను గుర్తింపలేదు. డైరీ కతన వ్యక్తిచరిత్రమేకాక దేశచరిత్రముకూడ తెల్లమగును. సమకాలికులను గుఱించిన

నిష్పక్షికాభిప్రాయములును, వివిధోద్యమములను గుఱించిన సంక్షేప సత్యకథనమును దినచర్య పుస్తకమందే కానవగును. ఆంగ్ల సాహిత్యమున పెపీస్ డైరీ ప్రాముఖ్యమునంది నది. మెకాలే డైరీ ఆతనిమానసిక గ్రథనమును వ్యక్తీకరించినది. మాంటేగుడైరీలో కొందఱు భారతప్రముఖులను గుఱించిన అభిప్రాయములు కలవు.

ముద్రణము నందిన ఆంధ్రదినచర్యపుస్తకమిదియే! ఈ గ్రంథమున నింకను ఏమేమి వ్రాయబడెనో యోజింపగను. స్వాములవారి విజయనగరవిజయ యాత్రను గుఱించిన అంశములే ప్రచురింపబడినవి. ౧౮౯౦ మొదలు ౧౯౩౭ వఱకు మతమునుగుఱించి ప్రజలు చూపిన అభిలాష ఎట్టిదో వీనివలన పఠితలు గ్రహింపజాలుదురు, భిక్షలు, శ్రీముఖప్రసాదములు, బహుమతులు, సమర్పణలు, పూజలు మున్నగువిషయము లీ దినచర్యగ్రంథమున గలవు. స్వాములవారి యుపదేశవాక్యము లందందు ప్రచురింపబడినవి. ఈ వచనములు గమనార్హములు "భగవద్ధ్యానము నభ్యాసయుక్తముగ నొనర్చి, మనోనిశ్చలత నంది, దాన దుఃఖనివృత్తి యొనర్చుకొని, జ్ఞానులును ముక్తులును నగుటకు యత్నింపుడు. మతనియమములను, శిష్టాచారసంప్రదాయములను గర్హింపక యాచరింపుడు."

స్వాములకు సమర్పింపబడిన స్వాగతపత్రమును, వైదికమతము, మతము, స్త్రీధర్మములు మున్నగువానిని గుఱించిన వివరములును పరిశిష్టభాగమున నున్నవి. "ప్రాచీనులగుహిందువులు రాజనీతినిబూని లోకసంరక్షణమునకై పాటుపడక, యెల్లపుడు నాముష్మికఫలము నుద్దేశించి తప మొనర్చుకొనెడివా" రను నిందారోపణమును గ్రంథకర్తగారు చక్కగ ప్రతిఘటించిరి. అనిర్వచనీయ మగు నుత్కృష్టసాధనసంపత్తి కతన వైదికమతము విరాజిల్లుచున్నది కాని శరీరార్థాది సాధనసంపత్తిచే కాదని గ్రంథకర్తగారు వ్యక్తీకరించిన అభిప్రాయమునే హీరేంద్రనాథదత్త మున్నగు నవ్యజిజ్ఞాసువులు పెక్కుడులనుండి ప్రకాశము గావించుచున్నారు.

ఇందలి యుపదేశములు గంభీరభావ బంధురములు. పదమూడవయేట కామకోటిపీఠము నధిష్ఠించిన సంయమి సాధనోదంతము కడుంగడు పవిత్రవంత మైనది కదా! బ్రహ్మచర్యదీక్షవలనగాని మానవుడు ప్రజ్ఞానిధి కాజాలడు. సంయమగుణమున నాటితేటీనగాని ఉత్కృష్టమైన మనుష్య జన్మను సార్థకము గావించుకొనలేడు. కేవల ప్రబోధమువలన, గ్రంథపఠనమువలన నీదొడ్డగుణము లలవడవు. సంయమీంద్రుల దృష్టాంతములే యొరులను పవిత్రానుష్ఠానమునకు పురికొల్పును. సన్నిహితులైన ఇరువురు ఋషిచంద్రుల ఉదంతము పఠితల మనసులందు పవిత్రభావములను ప్రవేశపెట్టగలదు. భక్తులైన గ్రంథకర్తగారి ప్రయత్న మెంతయు గొనియాడ దగినది.........గ్రంథమున చక్కని బొమ్మలున్నవి. పీఠిక ఆంగ్లమున వ్రాయబడినది.

—జో. స.

---

## ఫాసిజం

[కర్త: విద్వాన్ విశ్వం. నవ్యసాహిత్యమాల, తరిమెల, పామిడి పోస్టు, అనంతపురం జిల్లా.]

"కుటుంబములు పవిత్రంగా ఉండవలెనంటే వ్యభిచారగృహా లుండవలెను."— ఈ 'ఫాసిస్టు' వాక్యం ఒక్కటి చాలు యిప్పుడు యూరపులోని ఫాసిజం అంటే యెట్లాంటిదో మన దేశపు ప్రజాసామాన్యానికి తెలియజేయడానికి.

ఫాసిజంలో వున్న రహస్యాన్నంతా సూచనగా తెలియజేస్తుంది గూడా ఆమాట. ఏదోవిధంగా ఎక్కువమంది పిల్లలను పుట్టించడం, వాళ్లను సైనికులుగా తయారుజేసి పశుబలం వృద్ధిచేయడం, దాని సహాయంతో యుద్ధం చేయడం—ఇది దాని ఆశయం.

యుద్ధమే ప్రాణంగా ఫాసిజంకు? "యుద్ధమొక్కటే మానవశక్తిని పరమోచ్చ స్థానానికి గొంపోయి, ధైర్యవంతులపై మహత్త్వముద్రను అంకితం చేస్తుంది" అని ముస్సోలినీ ఆశ! శాశ్వత యుద్ధంలోనే మానవులు ఘనులౌతారు. శాశ్వత శాంతిలో మానవులు నశింపగలరు," అని హిట్లరు నమ్మకం.

ఈ యుద్ధపిపాస వాళ్లలో పెంపొందటానికి ముఖ్యకారణాలు మూడు. ఒక్క వ్యక్తి దేశాన్నంతా లోబరుచుకుని అడ్డు లేకుండా నిరంకుశాధికారం చెలాయించాలన్న వారి తత్వానికి యుద్ధం అవసరం. ఏదో యుద్ధం తెలివిగా నడిపించా డనేపేరో, మహావీరుడు ధైర్యశాలి అనేపేరో ప్రజల్లో వ్యాపింపజేస్తేనే గాని ఆదేశాల్లో ముఖ్యంగా—నియంతమీద గౌరవం యేర్పడదు. అందులో ఫాసిస్టునియంతలు కోరేది భయంమీద ఆధారపడిన గౌరవం కాబట్టి అలాంటిపేరు మరీ ఆవశ్యకం.

తాము ప్రారంభించిన రాజ్యాంగవిధానం వల్ల దేశంలో నిరుద్యోగం, పేదరికం వ్యాపించడంవల్ల ప్రజల్లో అసంతృప్తిరేగి దానివల్ల విప్లవం రాకుండా వాళ్ల మనస్సులను ఏదో ఒక గంభీరమైన ఆశమీదికి త్రిప్పివేయటం ఫాసిస్టునియంతలపన్నుగడలలో ఒకటి. తాము వేరేదేశం జయిస్తామనీ, తమకు సామ్రాజ్యం వస్తుందనీ, తమ జాతీయశక్తినిగూర్చి ప్రపంచంఅంతా పొగడుతుందనీ అనుకొని ఫాసిస్టుదేశాలలోని జనులు తమలో వ్యాపిస్తున్న కష్టాలు మరిచిపోవటానికి యుద్ధం అవసరం.

ఇక 'పెట్టుబడివిధానం'లోని దుర్గుణాలన్నీ కాపాడటానికి నిలిచిన ఫాసిజం యుద్ధంలోనే అందుకు మార్గం కనిపట్టింది. తమ వ్యాపారం యిష్టం వచ్చినట్టు సాగించుకోటానికి తమకింద బానిసలుగా వుండేదేశాలు కావలెననేకోర్కె తక్కిన 'సామ్రాజ్యవాదం' గల దేశాలతోపాటు ఫాసిస్టుదేశాలకూ సహజం. పైగా తమలో జనసంఖ్య పెరిగిందనీ చోటు చాలటంలేదనీ క్రొత్తనేల 'కాలనీ'లరూపంగా కావలెననీ సాకు.

ఇట్లాంటిఫాసిజం ఇప్పుడు ప్రపంచాన్నంతా భయపెడుతూవుంది. జపానుతో చేయి కలిపింది. అందువల్ల హిందూదేశానికిగూడా ఆపద రావచ్చునని సుభాష్‌చంద్రబోసువంటివారే అంటున్నారు.

కాబట్టి మనదేశంలోవారంతా తక్కిన అంతర్జాతీయ సమస్యలతోపాటు యీఫాసిజం తత్వాన్నీ అదినడిచేమార్గాన్నీ సమగ్రంగా అర్థంచేసుకోవటం యీరోజుల్లో అవసరం. ఇంగ్లీషు తెలియనివాడుగూడా దీన్ని గ్రహించటానికి విశ్వంగారి గ్రంథంవంటివి తోడ్పడతవి.

వీ రీసమస్యకు సంబంధించిన గ్రంథాలూ పత్రికావ్యాసాలూ మొదలైనవి బాగాచదివి ఫాసిజం ఉత్పత్తి, స్వరూపం, స్వభావం, ఫలితం క్లుప్తంగా వర్ణించారు. కడపటికి స్పెయినులో స్వాతంత్ర్య తృష్ణతో పోరాడుతున్న ప్రజల ప్రయత్నాన్ని ఆధారంచేసుకుని "ఫాసిజం బద్దలైపోతుంది. సోషలిజం స్థాపింపబడుతుంది," అని తేల్చారు.

ఒక్క స్పెయినుతోనే వదులుతుందా ఫాసిజం? పైగా పరిస్థితులనుబట్టి చూస్తే గ్రీసు మొదలగు దేశాల్లో స్థాపింపబడి, యూరపంతా ప్రాకేట్టున్నది. ఈజిప్టులోకూడా తలచూపింది. జపానుబలంవల్ల చైనా కొన్ని భాగాల్లో నిలుస్తున్నది. దక్షిణ అమెరికాలోని కొన్ని చిన్న దేశాల్లో పెరిగింది. స్పెయినులో అయినా ఎవరు గెలుస్తారో చెప్పటానికి వీల్లేదు; ఎవరూ గెలవక సోషలిజముకూ ఫాసిజముకూ చెరొకముక్కా దొరికి ఇద్దరూ అలిసిపోవటంవల్ల సంధికుదిరినా కుదురొచ్చు.

ఈసంగతు లెట్లా తేలినా, వీటిని మనజన సామాన్యం చర్చించేటట్లు చేయటమే యిటువంటి తెలుగు పుస్తకాల ఫలము.

దీనికి పట్టాభి సీతారామయ్యగారు భూమిక వ్రాశారు. —కు. న.

---

## "ఆఫ్రికా పంపకం"

[డెమ్మీ ⅛ సైజు; ౧౭౨ పేజీలు; ఖరీదు ౧౨ అణాలు. రచయిత: కాళీపట్నపు కొండయ్యగారు, ఎం.ఎస్‌సి; ('విజ్ఞానం' పత్రికా సంపాదకులు), ప్రకాశకులు: మాడరన్ పబ్లిసిటీ బ్యూరో, భీమవరం]

ప్రపంచ భూభాగం అయిదు ఖండాలలో ఆఫ్రికాదేశం ఒక ప్రత్యేకఖండం. ఇది ౧౧,౫౦౦,౦౦౦ చదరపుమైళ్ల వైశాల్యం కలిగింది. ఈదేశంలో యెక్కువభాగం ఎడారులే అయినప్పటికి చక్కని నీటివసతి ఏర్పడివుంది. ఇక్కడ నివసించేవారు అధికసంఖ్య నీగ్రోలు,మరికొన్ని అడవి మృక్కరజాతులు. మొత్తంమీద నాగరకదేశం కాదు. అయినప్పటికి ప్రపంచంలోగల యితర సామ్రాజ్యవాదుల్ని ఆకర్షించే లక్షణా లనేకం ఆఫ్రికాకు అమరివున్నవి. ఈ దేశంలో వున్నన్ని అడవిమృగాలు ప్రపంచంలో మరెక్కడా లేవు. ఆఫ్రికాలో ఖనిజసంపద విస్తారం. ట్రాన్సువాలులో బంగారపు గనులు, రొడేసియాలో రాగిగనులు చాలమందికి తెలుసు.

అనాగరక జాతులకు ఆవాసమైనదీ, ఐకమత్యం అనేది లేకుండా ఒక్కొక్కనవాబు ఒక్కొక్క కునకను 'పహిలా పచ్చీసు పంచకల్యాణి'గ రాజ్యం చేసుకుంటూన్న సందర్భంలోను, అనేక గొప్పనదులతో సారవంతమై చీకినకాలది చీకబుద్ధి పుట్టినట్లు కనపడుతూన్నప్పుడు సామ్రాజ్యతృష్ణలో అహర్నిశమూ క్రిందుమీదు అవుతుండేవారికి ఒక ఎరగా కనపడటంలో ఆశ్చర్య మేముంది; కేవలం యుక్తిచేత ఆస్తి సంపాదించవలెనంటే ఆస్తిపరుని అవసరాన్ని కనిపెట్టి అప్పులిచ్చి మునగానాంచేస్తే తెప్పిరిల్ల లేక చివరకు ఆస్తిని అతడే స్వయంగా దఖలుపరుస్తాడు. ఇట్టిపనే ఒకవ్యక్తి తన ప్రక్కయింటివాని మీద ప్రయోగిస్తే కేవలం యుక్తి అంటాం. గొప్ప రాజకీయవేత్తలు యితరదేశాలను కబళించాలనంటే వారియెత్తులను తంత్రజ్ఞత అంటాం.

బహుకాలం ఆఫ్రికాసంగతి బాగా తెలీదు. యూరపు ఖండానికి ఆఫ్రికా ఖండానికి నడుమ ఒక్క మధ్యధరా సముద్రమేఅయినా చాటునే పడివుంటూ వుండేది. పందొమ్మిదో శతాబ్దం మధ్యనుంచి ఆఫ్రికాఖండపు చరిత్ర వక్రంగా తిరగటం ప్రారంభమైంది. ఈనాటికి యీఖండం యూరపుదేశ రాజ్యాల ఉమ్మడి దైపోయింది. ఫ్రాన్సు, బ్రిటను, ఇటలీ, స్పెయిను, బెల్జియం మొదలైన వన్నీ తలాఒక భాగం పంచేసుకున్నయి. వీరందర లోకి ఫ్రాన్సు, బ్రిటనులదే హెచ్చుభాగం ఈ పంపకానికి ఓంఅంటూ అంకురార్పణ చేసింది ఫ్రాన్సు. పిమ్మట మిగతవారికి పిచ్చులు పెరలు యెత్తినై.

ఈపంపక విధానంలో ఫ్రాన్సు, బ్రిటను, యిటలీ, మొదలైనవారు జరిపిన యెత్తులు, తంత్రాలు, మోసాలు, యీతగింజనాటి తాటిపండుకోసం వేచియుండటం, వ్యాపార నెపమ్మీద రాజ్యాంగ విషయాల్లో ప్రవేశించటం, కన్నుగీటులు, లాలోచీలు, తేనె పూసిన కత్తులవలె ప్రసంగాలు మొదలైన టక్కుటమార గజకర్ణ గోకర్ణ విధానం పరిశీలిస్తే యూరపు రాజ్యాలవారి అసలైన స్వరూపమేమిటో, తంత్రజ్ఞతఅంటే ఎట్టిదో అవగాహన అవుతుంది.

"ఆఫ్రికా పంపకం" రచించటంలో కొండయ్యగారు చాలా శ్రమపడినట్లు తెలుస్తుంది. ఈశ్రమ విలువ యెట్టిదైనప్పటికి యూరపు రాజ్యాలవారి సామ్రాజ్యవాదాన్ని, ఆతృష్ణను బాగా జీర్ణంచేసుకుని త్రేంచినట్లు స్పష్టమవుతోంది. అంతర్జాతీయ విషయాల్ని స్పష్టమైన, సులభమైన పదాలతోను, శైలిలోను వ్రాయబడినగ్రంథం యిదొక్కటే. కొండయ్యగారు యిట్టి గ్రంథాల నింకా వ్రాయతగుదురు. కొండయ్యగా రవలంబించిన శైలికి, ఫక్కికి, విషయానికి యీ ప్రస్తుత గ్రంథనామం "ఆఫ్రికాపంపకం" అని వుండటంకంటె "యూరపురాజ్యాల సామ్రాజ్య తృష్ణ, అందుకు వారవలంబించే తాంత్రిక విధానాలు" అనివుంటే చాలా సార్థకంగా వుండేదేమో! అయితే పెద్దదవుతుంది.

—వ. కు.

---

## నవనాథచరిత్ర

### (ద్విపదకావ్యము)

[గౌరనామాత్యవిరచితము— రాయల్ ౧/౮ సైజు. పుటలు ౩౯ + ౨౮౧. వెల మూఁడు రూపాయిలు.]

మద్రాసు విశ్వవిద్యాలయాంధ్ర గ్రంథమాల, నెం. ౭. సంపాదకులు: కోరాడ రామ

కృష్ణయ్య, ఎం. ఏ. ఆంధ్రోపన్యాసకులు, ప్రాచ్యపరిశోధనసంస్థ, మద్రాసు విశ్వవిద్యాలయము. ప్రకాశకులు: మద్రాసు విశ్వవిద్యాలయమువారు.

ద్విపద జాతీయచ్ఛందస్సు. ద్విపదకావ్యములు తెనుఁగునుడికారమునకు నికషోపలములు. తమ మతముతోపాటు భాషావాఙ్మయమునకును ప్రత్యేకతను, విశిష్టతను చూపఁగోరి శైవకవులు తమ గ్రంథరచనమును సాధారణముగ ద్విపదలలోనే సాగించిరి. శైవభక్తుల చరిత్రమగుటచే 'నవనాథచరిత్రము'ను 'ద్విపద కావ్యము'గనే వెలువడినది.

పేరుపడిన కొలదిమంది ద్విపద రచయితలలో గౌరన యొకఁడు. ఇతని 'హరిశ్చంద్ర చరిత్ర' ఈవఱకే పెక్కేండ్లక్రిందట ముద్రితమయి తెలుఁగువారి హృదయమును జూఱ గొన్నది. గౌరన కృత్యంతరములలో నొకటి యాంధ్రద్విపద కావ్యము; ఇంకొకటి సంస్కృత లక్షణగ్రంథము. ఇన్నియేండ్లును మూలఁబడి ఆదరములేక దయనీయస్థితియందున్న గౌరన కృత్యంతరమగు నీ 'నవనాథ చరిత్రము' మద్రాసు విశ్వవిద్యాలయమువారి యాదరమున, విశ్వవిద్యాలయ పరిశోధకులగు శ్రీ రామకృష్ణయ్యగారి సంపాదకత్వమున అందచందములను గూర్చుకొని తెలుఁగునాట తిరుగఁగలిగినది. సంపాదకులు రచించిన విపులమగు పీఠిక పెక్కు విషయములను విమర్శించుచు, మూలముతత్త్వమును వెల్లడించుచున్నది.

గౌరన గౌతమసగోత్రుఁడు; ఇతనితండ్రి అయ్యలార్యుఁడు, శ్రీ వీరేశలింగము పంతులుగారు తమ కవులచరిత్రమున ఎల్లనమంత్రి గౌరన తండ్రియని వివరించిరి; వారిమతమీ పీఠికలో సయుక్తికముగ ఖండింపఁబడినది. గౌరన శ్రీనాథుని చరమకాలపువాఁడును, ఆ తరువాతివాఁడును కావలెనని నిరూపింపఁబడినది.

గౌరన రచించిన 'నవనాథ చరిత్రము'నకు శ్రీ గిరికవి తెలుఁగుననే రచించిన పద్యకావ్యమే ఆధారమని ఈ గ్రంథమును జట్టియే తెలియుచున్నది. కాని శ్రీగిరికవి పద్యకావ్యమింతవఱకును లభింపలేదు.

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిలుగారు సంపాదించి, ప్రకటింపించిన 'ప్రబంధరత్నావళి'లో 'శ్రీ గిరన్న—చెన్నమల్లు—రచించిన 'శ్రీరంగ మాహాత్మ్యము' లోని వని నాల్గుపద్యము లీయఁబడినవి. 'నవనాథ చరిత్ర' పద్యకావ్యముగ రచించిన శ్రీగిరి కవియే 'శ్రీరంగమాహాత్మ్య' కర్తయని చెప్పుటకు వీలులేదనుచు-దానికి ప్రమాణముగ వీరశైవుఁడగు కవి శ్రీరంగమాహాత్మ్యమువంటి వైష్ణవగ్రంథమును రచించి యుండఁడని పీఠికలో చెప్పఁబడినది. మఱియు 'ప్రబంధ రత్నావళి' లో 'శ్రీరంగమాహాత్మ్యము' లోనివని యీయఁబడిన పద్యములకు దానితో సంబంధము లేనట్లు వ్రాయఁబడినది. అందొకటి శివస్తుతిరూపమగు సీసము; వేఱొకటి హనుమద్వర్ణనము. ఈ రెండవపద్యము 'రామాయణకథకు సంబంధించినదిగా నున్న'దనియు వ్రాయఁబడినది.

'శ్రీరంగమాహాత్మ్యము'ను వ్రాసిన కవియే 'నవనాథచరిత్రము'ను వ్రాసెనని శ్రీ ప్రభాకరశాస్త్రిలుగారు చెప్పలేదు. కాని యతనింగూర్చి మనకు తెలిసికొనుట కవకాశము లేదు; కాని శ్రీగిరికవి వీరశైవుఁడని కాని, శైవ, వైష్ణవగ్రంథములను రెండిటిని రచింపలేదనికాని, ప్రమాణాంతరములు లేక నిశ్చయించుట దుర్ఘటము. 'నవనాథచరిత్రము'ను వ్రాసినంత మాత్రమున మనము 'గౌరన'ను 'వీరశైవుని'గా పేర్కొనుచున్నామా ? లేదే !

'శ్రీరంగమాహాత్మ్యము'లోని వని 'ప్రబంధరత్నావళి'యం దుదాహరింపఁబడిన పద్యచతుష్టయమును ప్రాచీనులు సంధానించినదే; అది క్రొత్తకూరుపు కాదు. ఆ యంశమును శ్రీ శాస్త్రిలుగారు పీఠికలో తెలిపియేయున్నారు. అవి-హేమంత, చంద్రోదయ, శివ, హనుమద్వర్ణనరూపములు. శివ, హనుమద్వర్ణనములు శ్రీరంగమాహాత్మ్యమునకు సంబంధించినవి కావని చెప్పుటకు ప్రమాణములపేక్షితములు. అధ్యాత్మరామాయణము శివునిచే [illegible] విన్పింపఁబడినచో శ్రీరంగ మాహాత్మ్యముకూడనుండవచ్చునేమో! శ్రీరంగ మాహాత్మ్యమున హనుమత్ప్రశంసప్రసక్తమే యగుచున్నది.

నవనాథులలో నొకఁడగు సారంగధరుని కథ మాళవదేశసంబద్ధముగా ఈ చరిత్రమున వర్ణింపఁబడినది. పీఠికలో సారంగధరుఁడు వేంగీదేశాధీశుఁడగు రాజరాజనరేంద్రుని కుమారుఁడను నంశము విమర్శింపఁబడి నిరాకరింపఁబడినది; అప్పకవివ్రాఁత లప్రమాణము లని నిరూపింపఁబడినది. ఈ యంశమును చరిత్రకారులును ఆమోదించుచున్నారు.

సారంగధరుని కథను పోలిన మఱి మూఁడు కథలు- కౌండిన్యనగరమునకును, రుద్రనగరమునకును, కన్నడవాఙ్మయమునకును సంబంధించినవి పీఠికలో వివరింపఁబడినవి. అశోకుని కుమారుఁడగు వీరకుణాలుని కథకూడ దీనికెంతయును సరిపోవుచున్నది. ఏదేని కథ యొకటి ప్రసిద్ధముగ నున్నచో దాని నా యా రాష్ట్రవాసులు ఆ యా దేశములకు సంబధించినట్లు చెప్పికొని మురియుట భారతీయులకు పరిపాటి అయినది. కావున సారంగధరకథకు ఆంధ్రదేశసంబంధమును అట్లే ఏరుపడినది.

ప్రమాణాంతరములు లభింపకున్నను రచననుబట్టి చూచినచో గౌరనమొదటిరచన 'నవనాథచరిత్ర'మనియు, హరిశ్చంద్రచరిత్ర ప్రౌఢమగుటచే రెండవదనియు పీఠికయందు చక్కఁగా వివరింపఁబడినది. ఇది చాల యుక్తముగ నున్నది. 'నవనాథచరిత్రము'న కవి 'శైవ సంప్రదాయానుసారముగ' 'మహారాష్ట్రము' మొదలగు సమాసములనే గాక బుద్ధిపూర్వకముగనే కొన్ని వ్యవహారసిద్ధరూపములను ప్రయోగించెను. తద్వివృతి పీఠికయందు నీయఁబడినది. 'నవనాథచరిత్రము'. 'ప్రౌఢరచన గలదగుటచే నాంధ్రవాఙ్మయమునందలి ద్విపద కవితాశాఖ కొక నూతనాలంకారము కాఁగలదని చెప్పవచ్చును.' 'ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారమున తాళపత్రగ్రంథ మొక్కటియే' దీనిప్రతి 'కలదు. ఇది పెక్కు లేఖకప్రమాదములతోఁ గూడియేయున్నది. మఱి కొన్ని కాగితపు వ్రాఁతప్రతులు నా .తాళ

పత్రగ్రంథమునకుఁ బుత్రికలే యనఁదగియున్న వి.' సాధ్యమగునంతవఱకును సంపాదకులు పరిశోధించి సంస్కరించిరి.

'పూర్వాంధ్రకవులలోనివాఁ డను గౌర నామాత్యుని యీ గ్రంథ మింకను ఖిలము గాకుండ నిలువఁబెట్టవలయునను తలంపుతో నిప్పటికి లభించిన సామగ్రినిబట్టి ఈ గ్రంథము ముద్రింపఁబడినది.'

ప్రాచీనాంధ్రగ్రంథములు ఖిలములు కాకుండఁ బరిశోధనపూర్వకముగఁ బ్రకటింప తలపెట్టిన మద్రపుర విశ్వవిద్యాలయాంధ్రోపన్యాసకుల యొక్కయు, వారి కట్టి అవకాశములను కలుగఁజేసిన విశ్వవిద్యాలయము యొక్కయు ప్రయత్న మత్యంతము ప్రశంసాపాత్రము. —బు. వేం. శ.

---

## సాహిత్యకల

[విమర్శనము. రచయిత: సాహిత్య విశారద శ్రీ కాశీభట్ట సుబ్బయ్య శాస్త్రీగారు. ౧/౧ క్రౌను. ౧౫౮ పుటలు. వెల ౮ అణాలు.]

సాహిత్యకళాతత్త్వమును వివరించి నేటి యాంధ్రసాహిత్య మెట్టి యభిప్రాయములఁ గలిగియున్నదో తెలుఁగువారికి తెలుపుట కీ గ్రంథము వ్రాయఁబడినది. ఇం దిప్పటి కొందఱు భావకవులయొక్కయు,కథకులయొక్కయు, తత్ప్రోత్సాహకులయొక్కయు ఆశయములు సోదాహరణముగ వివరింపఁబడి సయుక్తికముగ ఖండింపఁబడినవి. భావము'అయోమయ'రీతినిగాక సులభగ్రాహ్యపద్ధతి నుండవలెనని, వర్ణనలలో అసభ్యత యుండరాదని, రచనలందు నీతి ప్రధానమనియు శ్రీ శాస్త్రులుగారి అభిప్రాయము.వాఙ్మయ మిట్టిరీతిని ఉండవలయునన్న నియమబద్ధము కావలెనని వారి యాశయము.ఇవి యెంతయు అమోదనీయములు.

శ్రీ శాస్త్రులుగారికి నవ్యసాహిత్యమున అనాదరములేదు. నవకవుల కావ్యములు కొన్ని రచనాసౌష్ఠవము కలిగి రసవంతములయి యున్నవని వారును ఒప్పుకొందురు. అనుచితములును, అసమర్థగ్రథితములు నగు కూర్పులనే వీరు విమర్శింపఁబూనుకొనిరి. అశ్లీలభూయిష్ఠములగు కథలనుండి వా రుదాహరించిన భాగములుసయితము చదువ నేవ కలుగుచున్నది. శ్రీ సుబ్బయ్యశాస్త్రులుగా రట్టి రచనలను రచనలనుగాను,కథకులను కథకులనుగాను లెక్కచేయక ఉపేక్షించి యుండవలసినది. అట్టివానిపయి విమర్శనము లనావశ్యకములు!

ప్రాచ్య.,నవ్యకవితాతత్త్వములను, సాహిత్యకళాతత్త్వమును ఎఱుఁగఁగోరువారును,భాషాభిమానులును ఈ గ్రంథమును తప్పక చదువఁదగుదురు. —బు. వేం. ర.

---

## ఆ ం ధ్ర వా ర ము
## (స్మృతి సంపుటము)

ఆంధ్రవారము డిశంబరు మాసమున వాల్తేరులో ఆంధ్రవిశ్వ విద్యాలయమువారి ఆంధ్ర సారస్వత సమితియొక్కయు, చరిత్రార్థిక రాజకీయ సంఘముయొక్కయు సమ్మేళనాధ్వర్యముక్రింద జయప్రదముగా జరిగినది. ఏతత్సభాసందర్భమున కొన్ని ఉపన్యాసములు కావింపబడినవి. ఆయుపన్యాసము లొక సంపుటరూపముగా ప్రచురింపబడినవి

ప్రారంభోపన్యాసము–ఆంధ్రవిశ్వ విద్యాలయోపాధ్యక్షులు కట్టమంచి రామలింగారెడ్డిగారిది. వీరి పాండిత్యము వక్తృత్వము, ఆంధ్రాభిమానము— ఈయుపన్యాసమున కొక ప్రత్యేకమహోన్నతస్థానమును సమకూర్చినవి. ఏకత్వము, వ్యక్తిత్వము కలిగి, విజ్ఞానము పెంపొందుటకును, ఆంధ్రమాతకు తగినసేవ చేయుటకును, ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రమావశ్యకమని నొక్కి వక్కాణించినారు. ఇది ఆంగ్లమునన్నది.

పిదప పింగళి లక్ష్మీకాంతంగారు 'ఆంధ్ర సరస్వతి' పేరున ఆంధ్రకవులను కొందఱను గూర్చి యొసంగిన ఉపన్యాసము ముద్రితమైనది. తిక్కనకు అగ్రతాంబూల మిప్పించినారు. కాని, ఆంధ్రమున "ఆదికవి, మహాకవి" యని ప్రఖ్యాతిబడసిన నన్నయను మాత్రము మరచిపోయినారు. "మనయువకులు వ్రాయుచున్న భావగీతములు ... లోనగు నవ్యసాహితీ సముదాయమంతయు ఆంధ్రవాణికి ప్రస్తుతకాలమునకూడ గణనీయమైన ప్రతిష్ఠనే యొసంగుచున్నవి కాని అపఖ్యాతిని ఆపాదించుట లే"దనిన వీరి నిష్పక్షపాత విమర్శనము ప్రశంసనీయమైనది!

అనంతరము అడివిబాపిరాజుగారి 'ఆంధ్ర శిల్ప' మను ఉపన్యాసము ప్రకటితమైనది. ఈయుపన్యాసము ఈసంపుట మంతకును మకుటము! కవి, చిత్రకారులు అయిన బాపిరాజుగారి ఉపన్యాసధోరణిలో సైతము కళాకవిత్వములు రేకెత్తినవి! లలితకళాలక్షణమునుగూర్చి సూక్ష్మముగా తెలియచేసినారు. గ్రీకుశిల్పమునకును, భారతీయశిల్పమునకును గల వ్యత్యాసమును చక్కగా విశదీకరించినారు. శాతవాహనశిల్పము, పల్లవశిల్పము, ఆంధ్రచాళుక్యశిల్పము, ఎల్లోరాశిల్పము, ఆంధ్రవలసరాజ్యముల శిల్పము, కాకతీయ శిల్పము, రాయలయుగశిల్పము, నాయక రాజశిల్పము, ఆధునికాంధ్రశిల్పము, వాని కళాపారిశ్రస్త్యమునుగూర్చి విపులముగాతర్కించినారు. ఆంధ్రశిల్పము, గాంధారశిల్పము నుండి గ్రహింపబడినదను అపోహను ఈయుపన్యాసము నిర్మూలించుచున్నదనుట నిశ్చయము. ఆంధ్రాభిమానముగల ప్రతి ఆంధ్రుడును, ఆంధ్రరక్తము శరీరమున ప్రవహించుచున్న ప్రతి ఆంధ్రుడును ఈయుపన్యాసమును చదివినచో పూర్వాంధ్రశిల్ప సౌభాగ్యమును స్మరించుకొని కంటతడి పెట్టక తప్పదు!

తరువాత సత్తివెంకట్రావుగారు "Peeps into the Andbra History and Culture" గూర్చిన ఉపన్యాసము; గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారు—"The Andbra province, A political Necessity" నిగుఱించిన ఉపన్యాసము, మామిడిపూడి వెంకటరంగయ్యగారు—"Some political and constitutional Issues" గూర్చి యిచ్చిన ఉపన్యాసములు వరుసగా ముద్రితములైనవి.

సత్తివెంకట్రావుగారు-అంధ్రులచారిత్రము విజ్ఞానమునుగూర్చి... తెలుపుచు— ఆంధ్రులు ఒక్కరాజకీయ రంగములనేకాక, చిత్రకళా శిల్పసాహిత్య రంగములందును, మతవాణిజ్య

రంగములందునుకూడ అసమానమైన ప్రతిభ గణించినజాతియని ప్రశంసించినారు.

హరిసర్వోత్తమరావుగారు-- ఆంధ్రరాష్ట్రి మొకరాజకీయావశ్యకమని వచించుచు, రాష్ట్రి విభజనము భాషను ఆధారముగాగై కొని చేయ వలెనని కోరినవారు ప్రప్రథమమున ఆంధ్రులే యనియు, ప్రత్యేకాంధ్రరాష్ట్రిము ఆంధ్రుల కందరకు క్షేమకరమే కాని నష్టదాయక మెంతమాత్రము కాదనియు, ఆంధ్రరాష్ట్రి విభాగమునకు రాయలసీమవారు సంపూర్ణాంగీ కారమును చూపుదురే కాని అసమ్మతిని ఎంత మాత్రము తెలుపరనియు నొక్కివక్కాణించి నారు.

వెంకటరంగయ్యగారు ప్రత్యే కాంధ్ర రాష్ట్రి నిర్మాణము వలన ఏకీభావమునకు విభేదము గలుగదనియు, అట్లు తలంచుట అపోహయనియు నుడివిరి. ప్రజాస్వామిక ప్రభుత్వము చక్కగా సాగవలెనంటే అందలి ప్రజల మాతృభాష ప్రభుత్వ భాషయై యుండవలెననియు, అట్టియెడ ప్రజలు ఆ ప్రభుత్వమును తమ ప్రభుత్వముగా భావించి; భక్తివిశ్వాసములు వహించి, స్వార్థరహితులై మెలంగదురనియు,అట్లు ప్రభుత్వము, ప్రజలు ఏకీభావముతో నుండుట ఒక రాష్ట్రిమునకే కాక దేశమునకంతకును క్షేమదాయక మనియు వచించిరి. భాషాధారమున ఆంధ్రరాష్ట్రిము విభజింపబడినపుడు దానికి రాజధాని హైదరా బాదు నియమింపబడుట శ్రేయస్కరమని సూచించినారు.

ఈ ముగ్గురు ఆంధ్రులైనవారు, ఆంధ్రాభి మానము కలవారు. వీరు ఆంధ్రవార మహో త్సవసందర్భమున ఆంధ్రప్రశస్తిని గూర్చి ప్రస్తావించుచున్నప్పుడు, ఆంధ్రమున మాని ఆంగ్లమున ఉపన్యసించుట సమంజసముగ తోచదు.

ఈ సంపుటమందు అచ్చటచ్చట కొన్ని చిత్రములు ముద్రితములైనవి. వానిలో కొల్ల 'శిలకంఠుడు' చిత్రము శిరోమణి! 'పాలం పేటలో నృత్యమూర్తి' చిత్రము కాకతీయ సామ్రాజ్యాంధ్రశిల్పుల అద్భుత శిల్పశక్తిని నిరూపించుచున్నది. ఆ భంగిమాకల్పన, మూర్తివిన్యాస లాలిత్యము, ముఖభావవిలా సము అప్రతిమానము! అనన్యసామాన్యము!! 'బుద్ధుడు' చిత్రము అమరావతీ శిల్పచాతుర్య మును విశదీకరించుచున్నది. 'ప్రజ్ఞాపరిమితి', 'నాగరాణి', 'కృష్ణదేవరాయలు', 'నృత్య గాంధర్వము' చిత్రములు ప్రశంసాపాత్ర ములు! 'మూర్తి'గారి చిత్రము చక్కగా నున్నది. బాపిరాజుగారి—'బిచ్చగాళ్లు' ఒక మోస్తరుగా నున్నది; 'నివేదన' బ్లాకు పాడయినది.

శ్రమపాటింపక, ఉత్సాహముతో, అభి మానముతో, ఆవేశముతో, ఆంధ్రమాతకు అద్భుతసేవ చేసిన ఆంధ్రవిశ్వవిద్యాలయము వారి ఆంధ్రసారస్వతసమితికిని, చరిత్రార్థక రాజకీయసంఘమునకును ఆంధ్రులందరు కృత జ్ఞులు.

—దా. రా.

---

## సంస్కృతవాఙ్మయచరిత్ర సమాలోచనము

[కర్త:ఈయుణ్ణి వేంకట వీర రాఘవా చార్యులు,ఎం.ఎ., పిఠాపురమహారాజ కళాశాల, కాకినాడ. డెమ్మిగ/ర సైజు. ౧౮పుటలు.]

మూడు ప్రకరణముల యీ చిన్నపుస్తక మున శ్రీ మల్లాది, సూర్యనారాయణశాస్త్రి లుగారిచే కూర్పఁబడి,ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వారిచేఁ బ్రకటింపఁబడిన 'సంస్కృతవాఙ్మ యచరిత్ర-ద్వితీయసంపుటము (లౌకికవాఙ్మ యము) విమర్శింపఁబడినది.

శ్రీ ఆచార్యులుగారికి శ్రీ శాస్త్రిలు గారి 'వైదికవాఙ్మయచరిత్రతో...ఇంచుక సంబంధము గలదు. ఈ లౌకికవాఙ్మయసంపు టముతోడను,...ఇంచుక బాదరాయణసంబం ధము గలదు.అందువలన దీనినివిమర్శించుట'... వారికి 'ముదావహము.'

తొలిప్రకరణమున 'ప్రాక్కథన, భూమి కలును, గ్రంథరచనమునకు శ్రీ శాస్త్రిలుగారి కుపకరించిన గ్రంథనామములుఁ పట్టికయు విమ ర్శింపఁబడినవి. రెండవ ప్రకరణమున గ్రంథము విమర్శింపఁబడినది;చివరి ప్రకరణమున వాఙ్మ యచరిత్రను రచించువారి యర్వాత,సంస్కృత వాఙ్మయమునకు హైందవేతరులొనర్చిన సేవ సూచింపఁబడి సంస్కృతపత్రికల పట్టిక ఈ యఁబడినది.

వాఙ్మయచరిత్రరచనము సులభమగు పని కాదు; సంఘమాత్రసాధ్యము. కాన ప్రత్యేక వ్యక్తి రచించిన గ్రంథమున లోపములు కొన్ని దొరలుటయు తటస్థించును. వానిని చూపఁ దలఁచిన విమర్శకులు గుణములనుకూడ పే ర్కొనుట యుచితము.

శ్రీ ఆచార్యులుగారు ముద్రణస్ఖాలి త్యము లనుకొనదగినవానిని,ప్రకారాంతరమున సమర్థింప వీలగువానిని దోషములక్రింద లెక్కిం చిరి; పెక్కుచోట్ల గ్రంథమున లోపములఁ జూప వీలుకానియపుడు సంగతిని కల్పించు కొని తమ వ్యాసములను, తా మెఱిఁగిన వ్యా సములను కూడ పఠింపవలసినదిగా పాఠకులను హెచ్చరించిరి.

శ్రీ శాస్త్రిలుగారి గ్రంథమునకు శ్రీ వడ్డాది, అప్పారావుగారు ఆంగ్లమున వ్రాసిన భూమికలో 'Sarngadhara'అనుటకు బదు లు 'Sarangadhara'అని వ్రాసినారని శ్రీ ఆచార్యులుగారి దోషారోపణము. ఆ పద మున ఎక్కువగ నున్న 'a' ముద్రణస్ఖాలిత్యము కాఁగూడదా? అట్లు రెండుసారులు వ్రాసి నారఁట! వారు వ్రాసినారో పొరపాటున కూర్పఁబడినదో!

'శ్రీ పరవస్తు రామానుజస్వామిచరణులు' తమ 'భూమిక'లో 'శ్రీహర్షవర్ధనుని' 'శ్రీ హర్షుని'గా పేర్కొనుట ఉచితముకాదని ఆచార్యులుగారి ఆక్షేపము. హర్షవర్ధనుఁడే తన్నుగూర్చి 'శ్రీహర్షో నిపుణః కవిః' అని చెప్పికొన్నట్లు వీరే చెప్పియున్నారు. ఇట్లు చెప్పియు అనుచితమనుకొనుట ఎట్లు పొసఁగు ను?

శ్రీ శాస్త్రిలుగారు 'ఈ చరిత్రమును రచించుట కుపకరించిన గ్రంథనామముల పట్టిక'యందు ఆ గ్రంథ మేసంవత్సరమున ఎవరిచే ప్రకటింపఁబడినదో చెప్పలేదనియు, పట్టిక నసమగ్రముగ ఇచ్చిరనియు, అందు

వారు రఘువంశాది కావ్యరత్నములను, శాకుంతల-విక్రమోర్వశీయములను పేర్కొనపోవుటకు హేతువు తెలియకున్నదనియు శ్రీ ఆచార్యులుగారి దోషారోపణము!

గ్రంథకర్తలు తద్గ్రంథరచనా సమయమున ఏ గ్రంథముల నుపయోగించిరో ఇతరుల కెట్లు తెలియును? ప్రసిద్ధములును, తమ కుపస్థితియం దున్నవియు నగు గ్రంథములను వారు తిరిగి గ్రంథమురచించు సమయమునఁ జూడక పోవచ్చును. కావుననే శ్రీ శాస్త్రులుగారు సుప్రసిద్ధములగు కాళిదాసకావ్య, నాటకములను తత్సమయమునఁ జూడకపోవచ్చును. ఇట్టివిషయములకు హేతువు లనపేక్షితములు. కావున పట్టికయొక్క సమగ్రత్వమును, అసమగ్రత్వమును నిర్ణయింపవలసినది గ్రంథకర్తయే కాని విమర్శకుఁడు కాదు.

పట్టికలో 'Catalogus' అనుటకు, 'Catalogues' అనియు 'Theatre'కు 'Thoador అనియు నుండుట 'అల్పజ్ఞులుకూడఁ జేయని తప్పు'లట! అవి ఆచార్యులుగారికి 'నవ్వు పుట్టించుచున్న' వఁట! ఆంధ్ర ముద్రాశాలలలో అక్షరజ్ఞానమయినను లేని కూర్పరు లుండునంతకాలము ఇట్టి తప్పులు చేయని గ్రంథకర్త లెవ్వరు నుండరని మనవి. 'పాఠక్' పండితుఁడు 'పేథక్' గా పట్టికలో నీయబడినదని, అది పట్టికను రచించినవారి కచుంబితవిషయమనియు శ్రీ ఆచార్యులుగారు వ్రాసినారు. ఆంగ్లమున 'Pathak'అను పదమును ఎట్లనుకొనిన అనుకొన వీలుగనున్నది. సంజ్ఞలఁగూర్చి ఆక్షేపించుట కూడదు. నిర్ణయమును దుర్ఘటము. ఐరోపాలోని 'Calai' పట్టణము, జర్మన్ పండితుడగు 'Goethe'అను వతఁడును పలువురిచేఁ బలురీతులఁ బేర్కొనఁబడుచున్నారుగదా! సంస్కృతాలంకారదరిత్రను వ్రాసిన 'కాణే' పండితుని న్యాయశాస్త్రపారంగతులు, న్యాయవిద్యార్థులును 'కేన్'గా వ్యవహరించుచున్నారే! ఇట్టివానిని తప్పులని తలచుట వీలగునా?

తరువాతి యధ్యాయమునం దాచార్యులుగారు శ్రీ శాస్త్రులుగారి గ్రంథములోని తప్పులను పెక్కింటిని చూపిరి. అందుఁ జాలవఱకు ముద్రితము లగు గ్రంథములను శ్రీ శాస్త్రులుగారు అముద్రితగ్రంథము లని పేర్కొనుట; అధునాతను లగు గ్రంథకర్తలను పేర్కొనకుండుటయును. అధునాతను లసంఖ్యాకు లున్నారు. వా రెన్నెన్నో గ్రంథములను వ్రాసియుండవచ్చును. అందఱినిగూర్చి తెలిసికొనుటయు దుర్ఘటము. కొందఱినే పేర్కొనుట అనుచితము. కావున శాస్త్రులుగారు వారిని పేర్కొనకుండ విడిచియుండవచ్చును.

వేదాంతదేశికులు మణిప్రవాళన్యాయమున సంస్కృత ద్రావిడ సమ్మిళిత భాషలో రచించిన 'పరమతభంగ' మను దర్శనగ్రంథములలో స్మరింపఁదగు నని శ్రీ ఆచార్యులుగారనుచున్నారు. ఇది సంస్కృత వాఙ్మయ చరిత్ర కాన తత్స్మరణ మిచట అనావశ్యకము.

ఇందు సందర్భానుసారమున శ్రీ ఆచార్యులుగారు తామును, ఇతరులును ఆయా విషయములంగూర్చి ప్రకటించిన వ్యాసములను పఠన సౌకర్యార్థము పాఠకులకు పరిచయమొనర్చి యున్నారు. కొన్ని సలహాలను గూడ ఇచ్చియున్నారు.

ఈ యధ్యాయమున 'కక్షోర వ్యవసాయ' మొనరించి, యాధునికగ వేషణా విధానమున నాటితేటిన పండితులచే సాహిత్యపరిషత్తులుగాని, విశ్వకళా పరిషత్తులుగాని, సంస్కృత వాఙ్మయ చరిత్రమును 'రచియింపింపఁదగు' నని తమ అభిప్రాయము నాచార్యులుగారు వెల్లడించిరి. 'పాశ్చాత్యపండితుల సంస్కృత వాఙ్మయసేవ, మహమ్మదీయ పండితుల సంస్కృతసేవ' ప్రత్యేకముగ ఆంధ్రుల సంస్కృతసేవయు ఇందు వివరింపఁబడ లేదనియు, సంస్కృత పత్రికలసంగతి చెప్పఁబడ లేదనియు, ఆచార్యులుగారు వ్రాసిరి. వారు తా మెఱిఁగినంతవఱకును హిందూదేశములోని సంస్కృతపత్రికల పట్టికనుకూడ నొసఁగియున్నారు.

'సంస్కృత వాఙ్మయచరిత్రము' పయి వారి యభిప్రాయ మెట్టులున్నను శ్రీ ఆచార్యులుగారి గ్రంథసంగ్రహ పాటవము ఎంతయు మెచ్చుకోఁదగినది. ఎవ్వరికిని పరిశోధించినఁగాని తెలియరాని పెక్కు ముద్రితాముద్రిత గ్రంథ, పత్రికలపట్టికలు ముద్రిత సంస్కృత గ్రంథజిజ్ఞాసువుల కెల్లరకును బహూపకారకములయినవి.

శ్రీ సూర్యనారాయణ శాస్త్రులుగారి వాఙ్మయచరిత్రమున లోపములు లేకపోలేదు. అందుఁ జాలవఱకును సాధారణము లయినవే. శ్రీ ఆచార్యులు గారికి ఈ 'లౌకికవాఙ్మయ సంపుటముతోడను ఇంచుక బాదరాయణ సంబంధము' ఉండనే యున్నది. అప్పుడు వీరు పయిచరిత్రమును కొంత సరిచేసినచో ఇపు డిట్టి విమర్శనము వ్రాయ నక్కఱలేకయుండెడిది. (అ)

---

## మురారి అనర్ఘరాఘవము

### (సమాలోచనము.)

కర్త: ఈయుణ్ణి, వేంకట వీర రాఘవాచార్యులు, ఎం. ఏ, పిఠాపుర మహారాజ కళాశాల, కాకినాడ. డెమ్మి ౧/౮ సైజు. ౧౮ పుటలు.

గీర్వాణవాణియెడ ఆదరము కలవారిలో మురారిని, అతని యనర్ఘరాఘవనాటకమును ఎఱుఁగనివా రుండరు. 'నాటకాన్తం హి సాహిత్యం' అను నానుడియు మురారి యనర్ఘరాఘవమువంటి నాటకములంబట్టియే కలిగియుండవలెను. ఇది యొకదృష్టితో పరిశీలింప నాటకము. ఇంకొక దృష్టితోఁ జూడ అత్యంత ప్రౌఢకావ్యము. ఇయ్యది ప్రదర్శనమునకుఁ గంటె పఠనమునకే ఎక్కువ అనుకూలము. ఆ కాలమున వెలువడిన నాటకము లన్నియు నించుమించుగ ఇదేమాదిరి నున్నవి. అట్లుండుట కక్కాలపుజనులయభిరుచియే కారణము.

ప్రసిద్ధాంధ్రగీర్వాణపరిశోధకులగు శ్రీ వేంకట వీరరాఘవాచార్యులుగారు మురారిని, అతని అనర్ఘరాఘవమును గూర్చి ఇందు విమర్శించిరి. అంతియేకాక అనర్ఘరాఘవపు టాంధ్రీకరణములను ముద్రితప్రతులను, వ్యాఖ్యలను వివరించిరి.

ఈ 'సమాలోచనము'న మురారి ఆంధ్రుఁ డనియు, బ్రాహ్మణుఁడనియు, ఇతఁడు క్రీ. శ ౧౫౦ కంటె నర్వాచీనుఁ డనియును సయు క్తికముగ నిరూపింపఁబడినది. మురారికృతి పయి పాశ్చాత్యు లొనరించిన విమర్శనలు ఖండింపఁబడినవి.

కాని ౮౫ పుటల పరిమితిగల ఈ 'సమాలోచనము'న అనర్ఘరాఘవమును గూర్చిన విమర్శనము అయిదుపుటలుమాత్ర ముండుట విచారకరము. అందును రమారమి రెండు పుటలు కథావివరణ రూపముగ నున్నది. అనర్ఘ రాఘవమును గూర్చిన ఈ ప్రత్యేక విమర్శగ్రంథమున పాత్రౌచిత్య పరిశీలనము, రసపరిపుష్టి, వర్ణనాచిత్యము, స్వభావోన్మీలనము, కథాచమత్కృతి మొదలగు విషయములు చర్చింపఁబడవలసి యున్నవి. ఆంధ్రీకరణములను విపులముగ విమర్శింపకున్నను లోపములేదు. శ్రీ ఆచార్యులుగారు మీఁది కీలి పలువిషయములనుగూడ విమర్శించియుండిన ఈ విమర్శన కింకను వన్నెయు, వాసియు కలిగియుండెడిది. — 'ఆ'

### యౌవనజ్వాల

[గ్రంథకర్త, కుందుర్తి నరసింహారావు: "సండేమైన్సు," మద్రాసు. వెల పం[?]డెండణాలు.]

ఈ ఖండకావ్య సంపుటానికి 'యౌవనజ్వాల' అనేపేరూ, దీనికికర్త కుందుర్తి నరసింహారావుగారు కావడం ఏవోఆశలు కలిగించాయి. ఇదివరకు 'భారతి'లోనూ ఇతర పత్రికలలోనూ అతనిరచనలు చదివినప్పటినుండీ కుందుర్తి నరసింహారావుగారి కవిత్వంమీద నాకు సకారణమైన అభిమానం కలిగింది. తర్వాత ఈయన స్వయంగా ఒకపత్రికను ('విశ్వకళ' అనే పేరుతో) బైటికితెచ్చి తన సామర్థ్యానికి మంచి నిదర్శనం కనపరిచాడు. ఈ జ్ఞాపకాలతో—ఈ మధ్య ఇతడెక్కడా వినిపించకపోయినా,—ప్రస్తుతగ్రంథం ఆతృతతో చూశాను. దీనిలోని గీతాలన్నీ చదివి, మళ్లీచదివి ఆలోచనలో పడ్డాను. నా కేదో వాగ్దానభంగం జరిగిం దనిపించింది. కృష్ణశాస్త్రి, విశ్వనాథాదులను చదివిమూడా ఈతడు పెమ్మరాజు లక్ష్మీపతి, జాషువా వంటి ఉపకవుల ప్రక్కకు పోదామనే అదుగ్దా కనపరచడంలో నాకాశ్చర్యం వేసింది. ఇతని దేశాభిమానగీతాలు విశ్వనాథ సత్యనారాయణదాకా యెసరబోయి కొడాలి సుబ్బారావునైనా అందుకో లేకపోయినవి. ('పంపతో' 'హంపీక్షేత్రం'లోని ఏ ఘట్టాన్నైనా సరిపోల్చి పై వాక్యం నేను స్థిరపరచుకోగలను, స్థలం సరిపోయిఉంటే.) ఇక ఈ సంపుటంలోని ప్రేమగీతాలకు నాయనిఒరవడి స్పష్టం. వాటిదస్తూరీ ఏమీ బాగలేదు.

కవిత్వంగురించి అప్రియవచనాలు నాకు వ్రాయడం ఇష్టంలేదు. ఏమూల ఒక్క కావ్యనిశ్వాసం వినిపించినా నేను దానికి సానుభూతితో స్పందిస్తాను. అదీగాక సున్నితమైన హృదయాలను అప్రియవాక్కులు ఎంతబాధిస్తాయో నాకు తెలుసును. కాని కొన్నికొన్ని విమర్శప్రామాణ్యాలు ఎదుట పెట్టుకొని ఋజువృత్తితో చేసేచర్యలకు క్రుళ్లిపడి లాభం ఉండదనీ ఆటువంటి విమర్శకుల దృక్పథాన్ని అర్థంచేసుకొని మన్నించాలనీ నాఉద్దేశం.

కుందుర్తి నరసింహారావుగారు పదజాలాన్ని మోహించి కవిత్వానికి విడాకులిస్తారేమో అని నా అనుమానం. కవికి తనభావం ఎట్టంగా సాక్షాత్కరిస్తే తర్వాత విమర్శకుడికి శ్రమ వుండదు. 'పులుముడు' రెండు రకాలు. రచయిత మనస్సులోనిది; పాఠకుని అవగాహనలోనిది. వీటిలో మొదటిదే ప్రమాదకరం. భావకవులు ఈ ప్రమాదానికి లోనై తర్వాత పాఠకులను నిందించి లాభంలేదు. ఒక్క ఉన్నత శిఖరాలలోతప్ప మిగిలినచోట దట్టంగా ఈ పులుముడు కనబడుతుంది. ఇది సుగుణంకాదని మనకవులు ఎంతశీఘ్రంగు [?]ర్తిస్తే అంత మంచిది. —శ్రీ. శ్రీ.

## సవరణ

ఫిబ్రవరి సంచికలో 'ప్రాకృత గాథలు' అను శీర్షిక పద్యములందు 'పద్దుకొఱకె పుట్టె నీపాదుకన్నులు' అను పద్యము నాదివర్ణమును 'వ' అని సవరించుకొనవలెను.

# గ్రంథ స్వీకారము

### ౧. సభారంజనము (పద్యరచనము)

క్రౌను ౧/౧౬ సైజు. పు. ౫౦. వెల అ. ౬

### ౨. శివధ్యాన సుధానిధి (పద్యరచనము)

క్రౌను ౧/౧౬ సైజు. పు. ౬౩. వెల అ. ౮

ఇవి శారదారత్నమాలలో ౪, ౫ గ్రంథరత్నములు. గ్రంథకర్త : మక్కపాటి వేంకటరత్నకవి, కవితావిలాసము, అనమనమూరు, (Via) ఒంగోలు, గుంటూరుజిల్లా.

### పరాధీన భారతదేశము

క్రౌను ౧/౧౬ సైజు. పు. ౧౧౦. వెల అ. ౬ గ్రంథకర్త: దేశరాజ రామచంద్రరావు, బి. ఏ. వకీలు, రాజోలు, తూర్పుగోదావరి జిల్లా.

### రాజయోగము (పాతంజలయోగసూత్రములు సహా)

(క్రౌను ౧/౧౬ సైజు. పు. ౩౦౦. వెల రు. ౧-౮-౦. గ్రంథకర్త : స్వామి వివేకానంద. ప్రకాశకస్థానము : శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మదరాసు.

### తులసీదాస చరిత్ర, భా. ౧. (పద్య రచనము)

క్రౌను ౧/౧౬ సైజు. పు. ౮౫+౧౮౫. వెల రు. ౧-౮-౦

గ్రంథకర్త:దంటు శ్రీనివాసశర్మ, బి. యే., బి. యల్. కవితిలక గ్రంథమాల, 3/౭౧ లాయిడురోడ్డు, కతీడ్రల్ పోస్టు, మదరాసు.

### విష్ణుధనువు

క్రౌను ౧/౮ సైజు. పు. ౬౮. రు.౦-౫-౦

గ్రంథకర్త: ఉమావిజయ మహేశ్వరం. నవ్యసాహిత్య పరిషత్తు, గుంటూరు.

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras.

# భారతి

## సచిత్ర
## మాసపత్రిక

సంపాదకుడు
కా. నాగేశ్వరరావు

ఆంధ్రపత్రికా ముద్రాలయము,
మద్రాసు.
౧౯౩౮

సంపుటము ౧౫, సంచిక ౪

# వి ష య సూ చి క



## చిత్రములు




శంకర చండాలురు

—అవధాని

# భారతి

సంపు. ౧౫ బహుధాన్య, చైత్రమాసము (ఏప్రిల్ 1938) సంఖ్య ౪

## తెనుఁగు శిల్పి

విశ్వనాథ వేంకటేశ్వరులు

నీ వెవ్వరోయి శిల్పీ - కేవలమృత్యుంజయత్వకీర్తిఁ బరఁగుచున్
మావలను గాలపుం దెరఁ - జేవెల్చుచుఁ జూతు కరుణచిలికెడుదృష్టిన్.

రాజులు రాజ్యముల్ సమయరాక్షసుఁ డెత్తుకపోవఁ బోయినన్
దేజు దొఱంగ వుజ్జ్వలమతిప్రతిభన్ నవసుందరాత్మశో
భాజితకాలవేగుడ వభంగురతారమణీయరూపలీ
లాజయసృష్టివైభవకలాచతురాననమూర్తి వెంతయున్.

శాతవాహనమహాజ్యోతిస్సు గగనభూపథులఁ దీర్చినరంగవల్లికలును
చాళుక్యవంశవైశ్వానరార్చులు దిగ్దిగంతంబులం గ్రమ్మునమృతకళలు
కాకతికనుదోయికలువరేకులు విచ్చి దెసల నిండించిన తేనెవాక
కృష్ణరాయలబాహుకేయూరమణిఘృణుల్ విశ్వంబునించిన వింత వెలుఁగు
తెలుఁగురాజులఖడ్గపుత్రికలమేలి - నృత్యరేఖలు త్వన్మనోనిశితటంక
ధారలో వెల్గుజీవపదార్థమునకుఁ - బరగు నిత్యతేజోమయోపాధు లయ్యె.

నీపేరైన నెఱుంగ నేరముకదే నిర్వ్యాజవైరాగ్యవి
ద్యాపారమ్యమహేశ్వరుండవు మహాంధ్రక్ష్మాగిరిప్రోద్భవా
శ్రీపీయూషతరంగసుందరకలాశ్రేయోపచిన్వత్సుధీ
వ్యాపారుండవు రూపగాంగజలనిత్యస్నాతశీర్షుండవున్.

నటరాజునై ధాన్యకటకవాటికలోన శిల్పవిద్యాతపస్సిద్ధి వడసి
అలయజంతాగుహాభ్యంతరోత్థితశిల్పసర్వరసాపగల జట ధరించి
ప్రోలునిపురిశిల్పశైలజల వేయికంబాలాట వేరీతి మరులుకొలిపి
విద్యాపురిని శిల్పవృషభు నెక్కి శిలాళియమరాళితోడ వయాళివోయి
ఆంధ్రదేశస్థదేవతాయతనములను - జిత్కళార్చాంతరుత్ఫుల్లశిల్పరూప
శివరసావేశతాదాత్మ్యసిద్ధి నొంది - చిలికి తమ్మృతమ్ము నాంధ్రధీక్షేత్రములను.

అలరువిభావమై యభవుం డంబికయుల రసరాజ్యసృష్టికిల
నెలవులు కాంగ బ్రహ్మపదనిత్యభవత్కళలిత్వవృత్తిం దె
ల్గు లెలమిం జర్వ్యమాణరసలోలత స్థాయులుతొమ్మిదింటి కా
తలిదగుం గేవలానుభవధామము నొందరి చిద్రసాకృతిల.

శివుండు నృత్తము చూపం జిజ్ఞశోన్మేళనావ్యాకృతంబగులయవ్యాప్తిం జూపి
శివుండు నృత్యముసేయ భవనపదార్థవివేచనప్రౌఢిమ వెందుంగొలిపి
శివుండు నాట్యంబాడం జిద్రసైకసువస్తుపూర్ణతావాక్యార్థబోధ నలిపి
శివలాస్యతాండవశ్రీభేదముల సృష్టిసంహృతిక్రీడాప్రశస్తి నెఱపి
శివునిరసమూర్తియుం ద్రిలింగభవనరీతి - వ్యంజకవ్యంగ్యభావసంవాద మొలయ
నాంధ్రులహృదంతరంపురసార్ద్రవృత్తి - శివమహాభూతిం జేసితి శిల్పసిద్ధి.

శిల తాపాధికద్రవ్యమై యులులం గైసేయంగ సేదివ్యహ
స్తలసత్స్పర్శము స్పర్శవేదిగుణబోధం జేసి లోకత్రయో
జ్వలహైరణ్మయరూపసంపద వెలార్పల సృష్టిసౌందర్యశే
ఖలు గ్రుచ్చెత్తెడు త్వన్మనఃకమలసౌగంధ్యం బదేలాటిదో !

ఏఱాయి గిరిశుండో యేది శైలజయౌనో ప్రమథులయ్యెడుశిలాప్రతతి యెదియొ
ఱాలఱాలనుగల్గురమణీయదేవతాకృతిం జూచుబేసిక న్నెనకమెనగ
నాంధ్రరాజులమూర్తి నభినవోజ్జ్వలశైవరూపసంపద మనోరూఢిం దెలిసి
కాలుకన్నొమలగించి కాలాదికాబాధితానంత్యసంస్థితి నమరం జేసి
శివము సత్యమ్ము నౌవస్తుసిద్ధియందు-సుందరాత్మతగూర్చి తానందతుంది
లేందుధరచారుకోటీరహీరకళిక - నాట్యరసధుని పృథ్విపై నాట్యమాడ.

---

# వరూధిని

పుట్టపర్తి
నారాయణాచార్యులు

అన్యభాషలగతి యెట్లున్నను ఆంధ్రము యొక్క హానివృద్ధులకు రాజులచిత్తవృత్తియే ముఖ్యకారణము. మనదేశమున- అందును తెనుగునాట- రాజులు కవులను పోషించుట, వారితో గ్రంథములు వ్రాయించి కృతినందుట మొదలగునవి- వీడరాని ముఖ్యలాంఛనములుగ గ్రహించియుండిరి. ప్రబంధము వ్రాయింపని పాళెగాడు లేడు. కృతినందని కోశాధికారి లేడు. ప్రతియొకడును నంతోయింతో భాషనాదరించి తమకును కవు లున్నారనిపించిన వారే. కవులును కాలదేశ పాత్రముల ననుసరించి అవసరమైనప్పుడు తక్కువచేరములకే దిగినారు. నిండుసభలో స్వర్ణాభిషేకమునందిన కవిసార్వభౌముడను శ్రీనాథుడే యొకమహాగ్రంథమును వాసనాద్రవ్యముల నొసగు అవచి తిప్పయ్యశెట్టి కంటగట్టినాడట. ఇతరులనడుగ నక్కరయున్నదా? లోనిదొసగు లెట్లున్నను రాజుల యౌదార్యము మాత్రము మెచ్చుకొనకతప్పదు.

ఆనాటిరాజులలో నెవరోతప్ప సామాన్యులందరును పదుమురచిన దాసరయ్యలే. పుట్టుకనుండియే సుఖమొకటి వెంటబడియుండుటచే కాలు సేతులుగదలింపలేని-కడకు త్రోవనుగూడ జూడలేని సోమరులైనారు. ఈ యరిష్టమున కింతయో యంతయో దొలగి నిలచినవారు యుద్ధభేరి మ్రోయించినారు. నిరంతరము వీడరాని సుఖపిపాస- లాలసత తప్ప మరేదియు రాజుల జీవితములలో నుండలేదు. విద్యాగంధము లేకుండుటచే నయము-నీతి లేనిభోగము పాత్రతలేని త్యాగము- వారి దైనికజీవితమున దప్పని ముప్పులు. ఇక నిట్టివారికి కవులు దొరకిన వారియవస్థల నేమని చెప్పవలెను? కోతుల కద్దము దొరకుటవంటిదే: వారిని తమమనసునకు వచ్చినట్లు వినియోగింపసాగిరి. తాముంచుకొన్న సానిపై నొకగ్రంథము, తమపై నొక ప్రబంధము, వేయేల తమ్ముదగ్గు తుమ్ము సర్వము కావ్యవస్తువులేయైనవి. మనకవులకు బత్తెమిచ్చువారు రాజులుగదా! వారియాజ్ఞ చొప్పున మెలగనిచో పొంతకుండలు పొర్లాడవలసినదే. కాన, వారుగూడ తమచిత్తవృత్తి లేరీతియున్నను, "అన్యథాశరణం నాస్తి" యని పాలకులనే యనుసరించిరి. వారికినచ్చిన త్రోవనే వ్రాసి మెప్పింపసాగిరి. ఔచిత్యమున్నను, వలసబోయినను, రసమున్నను లేకున్నను, అష్టాదశవర్ణనలులేనిది కావ్యము గాదయ్యెను. నాగదాళి చుట్టుకొన్న పల్లెను వస్తువుగా దీసికొన్నను, అభేద్య ప్రాకారములు గట్టవలసినదే. కడకు కవిత్వమనగా కవిమనస్తత్వముతో సంబంధములేని రసము లేని మరియేవిధమైన సౌందర్యముగాని లేని యసహ్యపదార్థముగా దయారైనది. విజయనగర రాజ్యానంతరము దానికి బట్టిన యవస్థ మరింత దుర్భరమైనది.

అయిన రాజు లందరు నింతే యనియు, వారిదే తప్పంతయు ననుటయు పొరపాటు మహానుభావులగు రాజకవులు కవిరాజులైనారు. సర్వజ్ఞసింగమనాయడు, కాకతీయులు, విజయనగరాధిపతులు మొదలగువారుత్తమ విద్యావంతులే. రాయలు "సాహితీసమరాంగణ సార్వభౌము"డట. యుద్ధకాలముల యందును కవులను పల్లకీలలో నెక్కించి వెంట దీసికొనిపోయెడివాడు. తాను స్వయముగా కవి. అయిన రతిరంగములేని యంగడి కవి గాదుసుడీ! ఉభయభాషలయందు సమగ్రమైన పాండిత్యము చేతబట్టి వ్యక్తిత్వమును వెలిగించి తక్కినవారికన్న విలక్షణతను నిలుపుకొన్న మహనీయుడు అగుటచే రచనలోని పరమార్థమేమో, దాననున్న సాధకబాధకము లెట్టివో నరులించినమనస్వి. తక్కిన రాజధర్మములయెడ నేరీతిప్రవర్తించినను వశ్యవాక్కులగు కవులకుమాత్ర మితడు దాసుడుగనే మెలగినాడు. రాయలకళాభిరుచి యంతు లేనిది. ఒకనాడు వినోదార్థము రాయలు తాతగారి నొకపద్దెము జెప్పుడని కోరిరట. పెద్దన్నయు ముసిముసినగవులతో కవిత్వమంత తేలికపదార్థమనుకొన్నావా! అనికసరిరట. వీరకేసరియగు "మూరురాయరగండడు" సంతోషముతో చీవాట్లను సహించి యూరకుండెనట. ఇట్టి ప్రభువు లభించుట మన పుణ్యమే. ఆతనియభిమానమే వరూధినికి పురుడుదీర్చిన దనవచ్చును.

నిజముగా నీకాలముననే పలనాటిచరిత వంటి, వీరగాథలు దండిగాబుట్టవలసియుండెను. కాని మనవాఙ్మయమునకు శృంగార మొకటే వీడరానిచుట్టమైనది. అది వారి జీవితసూత్రముల ననుసరించి యుండునేమోయని నాయనుమానము.

ఇక పెద్దనయందమా? స్వయముగనే సౌందర్యాభిలాషి. ఒక పెద్దనకే గాదు; సౌందర్యమనకు లోగుట మనుష్యుల- ముఖ్యముగ కళారాధకుల యాంతరికతత్వము. దీనికితోడు జీవితమును బాధాకలితముగాక సంఘముగూడ సుద్రిక్తమైయుండక ప్రసన్నమైయున్నచో మనసును శాంతిబొంది సృష్టిలోని సౌందర్యమునుబరీక్షించును; చూచియానందించును; లేనిచోట కృత్రిమముగా కల్పించియైనను జూడనాశించును. కాళిదాసురఘువంశమును జూడుడు. మహాకవి పాడువడిన యయోధ్యను వర్ణించుచు పూర్వపువైభవముల స్మృతికి దెచ్చుసాకుతో వెనుకకుబోయి యెచటనో దాగియున్న యభిసారికలను దోడ్తెచ్చినాడు. అజవిలాపమునందు చాతుర్యము తలసూపినది. "కవిజీవితమునకును కవిత్వమునకును సంబంధము లేదు. అదియొక నగిషీపని. కవిజీవితమెరిగినపిమ్మటనే కావ్యము బాగుగా నర్థమగుననుట నియమములే"దని కొందరందురు.

నా కీవాదముపై సంపూర్తిగ నమ్మకము లేదు. మనస్తత్వమును దాచి కవిత్వమునల్లగల మహానుభావులను నేను జూడలేదు. జీవితముతో సంబంధములేని మనసుండునా? అటు వాదించువారియందును నా కీపద్ధతి దోచలేదు. జీవితమున కవిత్వములేనిచో కావ్యముననే యుండదనుకొందును.

రాయలవంటి రసికశిరోమణి నాశ్రయించిన పెద్దనజీవితమున లోప ముండునా? అతడు సర్వము సానుకూలముగ నమరినమహాయదృష్టవంతుడు. ఒకరికై యేడ్చుటయు మరియొకరికై నవ్వుటయులేక, హృదయమును మాత్రమే నమ్మిన స్వతంత్రుడు. నిజముగా మనుచరిత్రములోని కొన్ని కొన్ని సన్నివేశములు భావించినపుడు కవితా పితామహుని జీవిత మెంత లలితగంభీరమైనదో చూడలేకపోయితిమే యని కొంతంతవిచారముగలుగును.

ఆంతరికమును, సహజ సౌందర్యాభిలాషను మెరుగిచ్చు జీవితమును సంపాదించుకొన్న "శేఖాశాలి" గనుకనే ప్రపంచమున సౌందర్యమునే భావించి శాంతిని బొందగలిగినాడు. జీవితములోని శాంతిసౌందర్యములు కావ్యమున కెక్కినవి. నిలుకడతో తీర్చినపాత్రలు ప్రభాత కాలమునందలి లేదీగెలవలె తకతక మెఱసి పోవుచున్నవి. కళయనునది రచయితకుగల హృదయపరిణతిని రసికతను వెల్లడించు సాధనముగాని పాండిత్యమును ప్రకటించి పాడు చేయదగిన యెరవుసొమ్ముగాదని గ్రహించిన విలాసియగుటచే బుద్ధిపూర్వకములగు దోషములతో కావ్యమును నింపలేదు. నన్నయలోనియావేశము, తిక్కనలోనియౌచితి, శ్రీనాథునిధారాశుద్ధి ముఖ్యముగా క్రియలసొంపు పెద్దనకవిత్వమునకు సాధనములు. ఈ కూడికచే కొన్ని విలక్షణగుణములును పెద్దనలో నుదురుకొన్నవి.

పితామహుడు తిక్కన నెంతజదివినను తనకుగల చాపల్యమును మాత్రము వీడలేకపోయినాడు. ఒకటి రెండు మూడు చోటులలో శృంగార మస్థానపతితమైనదనియే చెప్పవచ్చును. సాహితీప్రపంచమున రసములను బొమ్మలవలె పట్టిపట్టి సముచితముగ నడిపించు సూత్రధారవిద్య యెందరకో లేదు. కొందరికి పడకటింటికవిత్వపుపస ఖడ్గముల కిణకిణలలో నుండదు. ఖడ్గములలోని వెచ్చదనము కొందరికి కౌగిలింతలలో దొరకదు. నాకు జూడ నీ శక్తి సంపూర్ణముగా నొక కవిబ్రహ్మకే యబ్బినది. కాగా, మనము ప్రబంధముల విమర్శించునపు డీ "మార్జిను" కొంతవరకు విడువకతప్పదు. కొన్నిగ్రంథములలో యీ యస్థానపతితమగు శృంగారమును సముచితముగ లేదు. కేవలము బూతులు నిండినవి. అవియన్నియు వారిజీవితములోని యవకతవకలే. దానికి మనము నిందించిన లాభములేదు. ఒక శతాబ్దిలోని యభిరుచి మరియొకదాన లేదు. నన్నయ శృంగారములోని పవిత్రత, యుదాత్తత ప్రబంధములకు లేదు. తిక్కనలోని "సహజత" తరువాతివారికి సున్న. ఆంగ్లమున "పోపు" కవిత్వము నిపుడు ప్రేమించువా రెందరున్నారు? నన్నయవలెనే యించు మించు చిత్రముల సృజియించు "రాసిటీ" కవిత్వము నిపుడు చదువుదురా? మనదృష్టి మారినది. నూటిగా మన స్తత్వమును బట్టియీయాయగల సన్నివేశములు దప్ప తక్కినవి మన కిపు డంత కొబట్టుటలేదు. ప్రతియొకటియు నింతే. రే పిదియు మారునేమో, ఎవరు చెప్పవారు? మనమూ వెక్కసములకు పట్టుల యందు వారిజీవితానుభవ మట్టిదని శాంతించుట మంచిది. "వివ.యేచ్ఛ" యని పండ్లు నూరినచో మనకు బాధతప్ప చచ్చినవారి కేయుపాయమును లేదుగదా! అస లిందులో నంతయు మనదోషమేగాదు, మనచే ముప్పొద్దు ముడుపు లందుకొను దేవతలనుగ్రహించిన విద్యయే. కడుపుచింతలేని చిరంతనరసికులగుటచే పరకచాటును గూడ మాని తమరసికతను, చాపల్యమును తీర్చికొనుటకై ప్రత్యక్షముగ నొకజాతినే సృష్టించిరట. వారే మనము మాటిమాటికి విని వేసారిన యచ్చరలు. వారివి పదునాలుగువంశములట. అందులో బ్రహ్మ స్వయముగా చేతితోగాక మనసుతోడనే "దిద్దితీర్చిన" మానసిక సృష్టియు నొకటి. ఎంతయమృతమైనను దినము నదేభోజనమైన నాలుక త్రుప్పువట్టదా? దానిని బాపుకొనుటకై విష్ణువు, మహేశ్వరుడు మొదలగుప్రముఖులందరు అప్పుడప్పుడు "డిన్నరుపార్టీలు" జేయుచుందురు. అట్టియెడల అల్పాహారానంతరము భరతశాస్త్రపుభంగిమలు వెలయించుట వీరి యుద్యోగము. ఇంతేగాక ఇంద్రుడు మొదలగువారు కోపినపుడు వారి రాణివాసములు పిలిపించినపుడు యీ నాగవాసములు పోయి "పాట్లు[illegible]" వత్తురట. ఇక వీరిదిననెచ్చములు భరించు షాహుకారు లెవరు? ఉపాయకుశలులగు దేవతలకే మాత్రము తెలియకపోవునా? హయమేధములు, రాజసూయములు మొదలగు సవనతంత్రములను యినాము లుంచినారు. అవి పరంపరగావచు హక్కులు, ఉపకారస్మరణము మరువలేనియచ్చరలు యజ్ఞయాగాదులు చేసినశ్రోత్రియులు, కాలాంతరమున తమ భూములకు వెళ్లినపుడు శక్తికొలది అతిథి సత్కారములు చేయు టాచారము.

స్వర్గలోకపు రాజకీయములందును వీరికి సంబంధము లేకపోలేదు. ఇంద్రునిస్థానము "పర్మనెంటు" కాదు. నూరుయజ్ఞము లాచరించినవా డంతయు దానికై యత్నింపవచ్చును. ఈ పేరాసగల ఋషులు ఒక్కొకసారి తొంబదితొమ్మిది యజ్ఞములును పట్టుదలతో ముగింతురు. అంతివరకు యింద్రుడుగూడ యుపేక్షతోడనో లేక సరిగా ప్రయత్నింపకయో యుండును. నూరవయజ్ఞము గండమేగదా? అప్పు డీపేరు మోసిన నాయకురాండ్రు ఆటపాటలతో వారిని వలపించి ప్రయత్నమును మాన్పించి యింద్రుని కూసనస్థైర్యమును నిలుపుదురట. వజ్రాయుధము మొక్కపోయినపుడు (సాధారణముగా నింద్రుని కట్టివే యెక్కువలెండు) యింద్రుడీయాయుధముల నుపయోగించి శత్రువుల సాధించును. కాంతల కడగంటి చూపునకు లొంగనిమగవా డెవడుండును? అంతేగాదు; "ఖులాసా"గా నున్నపు డింద్రుడుగూడ వీరిపై వలపుగలిగి కనుగిలుపుట వాడుక. శచీదేవి యెన్నిసారులు మూతిముడిచెనో పాపము! వీరిని స్వీకరించుటలో, నేమియు తగతమ భావము లేదు. స్వర్గమునందు కాలిడినవారి కంతయు అప్సరసలపై నధికారమున్నది. అది నిజముగా తకరారులేని పనిగదా!

ఈ వంశములు నాటివి నేటివి గాదుసుడీ! మన వేదకాలమునుండి యుండనేయున్నవి. మన పురాణములలో సాధారణముగా రంభాదులు కాసెగట్టనిగాథలే యరుదు. ఎంతచిన్న రాజపుత్త్రునైనను ఒక్కరంభగాని హాజరై గజ్జె గదలించవలసినదే! లేకున్న మనకథలకు

కడుపే నిండదు. ఏచోట యుద్ధములు జరిగి నను సైన్యములతో బాటు వీరును రావలెను. పాపము! కాచినకల్పవృక్షముల పూలన్నియు మోఘులహారములకే ఖర్చయినయచ్చరలకో? అవిచారము మనవారి కంతగా బట్టలేదు కాబోలు! దేవతలకు, దేవతాసార్వభౌమునికి నీ రెంతమర్యాదగా జూడదగినవారైనను మన కావ్యవీథులలో మాత్రము చింతపండుకన్న నగ్గువయైనారు.

పైజెప్పిన పదునాలుగు వంశములలో నెన్నిమోతరములు గడచినవి. మనకు మిగిలి నవి ముఖ్యములపకొన్ని పేరులే. ఈనా డెంద రున్నారో మన మెఱుగము. ప్రబంధకవులు పోయిననాటనుండి ఆజనాభాలు సరిగా తెలి యుటలేదు. అది యట్లుండె.

వరూధిని యొకయచ్చర ముద్దరాలు. సరి గడచబెరిగిన గరగరనినెఱికురులు, తిమురు గొన్నపయోధరములు, సెలవివారునవ్వులతో, చిన్నివెన్నెలలుగాయు మొగము,మంకెనపూవు వంటివాతెఱ ఆమె బ్రహ్మనడిగి సంపాదించిన వరములు. పైగా నావిడ "తిన్నని మేను" నిగ నిగనిచాయలతో "కాంచనకేతకీకుసుమము" వలె నుండెనట. సౌందర్యముతో తకతకలాడు నామెబాహ్యస్వరూపము, మానసికప్రవృత్తికి ప్రబలమగు పరిమితిని గలిగించినది.

ఈ నిత్యసువాసిని తలిదండ్రులపేరు చెప్ప లేదు పెద్దన్న. తల్లి విషయ మెట్లున్నను తండ్రి మాట కొంతచిక్కేగదా! అందుకే యూస మస్య మెల్లగా జారవిడచి పాలసముద్రమున బుట్టిన వంశమని డొంకతిరుగుడుమాటతో తృప్తిబడినాడు. ఆ విచారము అతనికే యక్కరలేనిది మనకుమాత్ర మేమి! ఎవరో యొక రుందురని శాంతింతము.

వరూధినినివాసము హిమాలయమునందు. ఒక వరూధినియేగాదు; రంభ మొదలగు "కామ శాస్త్రోపాధ్యాయినుల"ందరక్కడనే వసించు నది. తక్కినవారికి గృహము లుండెనో లేదో? ఉన్న నవియెట్టివో మనకు దెలియదు. మన నాయికకు మాత్రము చక్కనిభవనమును గట్టి నాడు పెద్దన. దానికిముందు ఆవరణము నం దున్న ద్రాక్షపందిరియే గరుడపచ్చలు చెక్కి నదట. ఇంటిచుట్టును చెంగలువలతో నిండి యున్న కేదారములు, మావులుక్రోవులు, అల్లి బిల్లిగొన్న కాంతారము, హిమవంతమే తయారుజేసి యిచ్చినది. ఇక నామె వయసు మాటగదా? పొటమరించిన జవ్వన మింకను పూర్తిగా పక్వతకురాలేదు. "ఎకెసెక్కెము లాడు యెలప్రాయ మే" నయ-నాణెములు గురుతించినది. వినయవిధేయత లలవరించు కొన్నది. వీటినడుమ నపుడపుడు చిన్న తనపుచెరలాటము నేనున్నాననుచున్నది. చాతుర్యమును, పాండిత్యమును, అనుభవమును గల యచ్చరలసాహాయ్య మపేక్షింపక, నైజ గతితోడనే తరిబీతై వారినందరినిగూడ వెనుక వేసినది. రంభాదులకును మనసులో భయము కద్దు. ఎన్నడో జవ్వన మమ్ముకొన్న వారు గదా! మెల్లమెల్లగా నేస్తమును బాటించి నారు. కడకు పాపము—ప్రాణసఖులును నైనారు. ముసలిమురిపెములతో తీరికైయైనపు డెల్ల వరూధినిచుట్టును జేరి "నీకేమి యదృష్ట వంతురాలి"వని యిచ్చకములాడుచుండిరేమో! లేకున్న గ్రాసవాసములకు ముప్పే. ఇప్పటికే యింద్రునిసభలకు, పిలుపువచ్చు మేళములలో వరూధినికే యగ్రతాంబూలము. ఇక మేన కాదుల ప్రాణనాట్యములకై మొగమువాచిన మగవాడెవ డుండును?

వరూధినితోడివారందరు సంగీతము నేర్పిన వారే. చెలువ మెరిగినసానివారింటి కంటి వచ్చినవిద్యగదా! అయినను, వారికిని వరూ ధినికి నొకభేదముమాత్రము గలదు. వృత్తికై కళను సాధించినవారు వారు. ఉత్సవసమయ ములలో దర్బారునకు వెళ్లుటకుమునుపు దుమ్ముదులిపి నాలుగుసారులు తంత్రులు మీటికార్యమాయె ననిపించుట వారిపని. మన వరూధినీవ్యాసంగ మందమా! అది బ్రదుకు నకే యేర్పడినది గాదు; స్వీయానందము నే, పరమగమ్యముగా నుంచుకొని, నేర్చుకొన్నది. భౌతికమగు ఫలాపేక్షయు, పరాపేక్షయు లేకుండుటచే కళ పరాకాష్ఠ నందినది. రాగ మున ప్రాణముగల పట్టులు వెదకి "యింపుదళుకొత్త" వీణె వాయింపగలదు. ఆ తంత్రీధ్వని యందు మిళితమై పిల్లగాలివలె నిలుకడతో వెడలు నామె గానమునకు, ... పారెడివట. ఉత్త వ్యాసంగమేనా? కాదు పాండిత్యమును గడించుకొన్నది. మెడపట్ల పాండిత్యము మాత్రము గాక రసస్వరూప మెరిగి, రసానుభూతికై యత్నించి సంపూర్ణ ముగ ననుభవించినది. ఆ యింతచాపల్యము లేకయున్నచో ప్రపంచమంతయు చేతులు జోడించియే యుండును! పై జెప్పినవారిలో నొకరును గిరికవలె "పటుశాస్త్ర శ్రేణికా భ్యాసము" చేయనేలేదు.

మొదటనే స్త్రీహృదయము; అందునను ఆయువుపట్టులు వెదకి, యుపాసించు సంగీ తపు సహవాసము. వీటితో, నామెమనసు, వెన్నవలె నయినది. నిజముగా విచారించినచో సంగీతము కళలకెల్ల రాణివంటిది. చిత్రము నందు వస్తువుయొక్క చంచల ప్రవృత్తులు క్షణికములగు భావములు వరుసగా స్ఫురింపని కొరతయున్నది. కవిత్వమున నీరెండును బాగుగా జూపవచ్చును. కాన కవిత్వ ముత్తమ మని విమర్శకు లన్నారు. ఇది సత్యమే. కాని కవిత్వమునకన్న నెన్నో రెట్లధికమును, భావగభీరత సంగీతమునం దిమిడియున్నది. దానియందున్న వివిధ భావసమావేశమును గభీరమగుభావశబలతను, గ్రహించుటకు మనసుగావలెనంతే. ఒకమహాను భావులు సంగీతము కేవలము శ్రవణానంద దాయకమేనన్నారు. సరసకవిత్వముమాత్రము సర్వాంగములకును "కుత్తుకబంటి" యగునానం దము నిచ్చునట. కవిత్వము నెవరైనను కన్ను లతో విందురేమో నాకు దెలియదు. బ్రహ్మ మనయభాగ్యవశమున యేపాములజాతికో తప్ప యీ యర్థశాస్త్ర నియమమును, మన యందు బాటించలేదు. ఇట్టి విపరీతములగు తలపులకు చోటిచ్చుట దానియస్పష్టతలో నున్నదోషమే.

కళామాత్రమునకే శాంతిపరమసాధన మను చుండ సర్వోత్తమమగు సంగీతమున కడుగ వలెనా? శాంతియనగా చచ్చుపెద్దమ్మవలె మూలగూర్చుండి మూలుగుటగాదు. గంతులతో కార్యము జరుగదని యెరిగి ప్రసన్నతతో సాధించుటయే దానిపరమగమ్యము. భగవంతు ... శేఖరుడన్నట్లు సమాధి అనగా నిలు

కడ, శాంతి పర్యాయము గావచ్చును. "ద్దిది తీర్చుటయే" పరమావధి కాదు. మరి సర్వ గుణములతో సమగ్రముగ సాధించుట. ఈక్రింది రాజశేఖరునిపలుకులు చూడుడు. "కావ్యకర్మణి పరంహేతు స్సమాధిః. సమాధి ర్నామ మనస యేకాగ్రతా!"

బీభత్సము మొదలగు ఘట్టములయందును సౌందర్యము లేకపోలేదు. సౌందర్యము లేనివస్తువు కళానుభూతికి,ఆనందమునకు పరికరమే గాలేదు. సాధకు డెన్నిపాటులుపడినను కడకు పొందదగు - పొందెడు పరమావధి యియ్యదియే. తీక్ష్ణదృష్టియు మననయు ముదురు కొలది విషయకర్కశతయు గభీరతయు నుదురుట పరమసత్యము. మనప్రాచీను లీ రెంటి తత్త్వముల బాసుగా నెరిగినవారు. విషయమునకే ప్రధానత, గభీరతయున్న చోట ఋషిత్వమనిరి. సత్యము నానుషంగికముగా సౌందర్యమును ముఖ్యముగా సేవించువారినే కవులనిరి మొదటితరగతి కుపనివత్తులను జూపి, రెండవ శాఖకు రామాయణాది కావ్యప్రపంచముల నేరుకొనిరి.

అవునుగాని, యీ విరుద్ధపరిస్థితుల కర్థమేమి? నాకు దోచిన దొకటి- ఛాతికములగు వాసనలు వీడనివానికి సౌందర్యపక్షపాతిత్వము మరువరానిది, వీడరానిది. అతని ప్రవృత్తినివృత్తు లారీతి నెందుకు మారినవి? యనుప్రశ్న యనుభవము చాలనిదుడుకుతనము. ఒకకళకుతోడు మరియొకటి ఛాతికముతో, నికను కొంతసమీపసంబంధముగలది, "యొనగూడెనా" యిక నడుగ నక్కరయే లేదు.

కాగా వరూధిని చిననాటనుండియు సంగీతమేగాక కామశాస్త్రభ్యాసములను గూడ గావించినది. దానియందును గూడ చెదరని యాత్మశక్తియే యున్నచో పారమార్థికతనే సాధింపవచ్చును. కాని వరూధినిలేతమన సంతటి కర్కశవిచారములకు తాళలేదు, ప్రయత్నింపను లేదు. నైజముగా మనసుబోవు పద్ధతిని బోవనిచ్చుటయేకాని యరికట్టి నిగ్రహించు టామె యెరుగదు. తనకన్నులయెదుట గనుపించు సౌందర్యమును చూచి యానందించి దానిశక్తికి లోనగుటయే యామె నేర్చినది. చూచిమాత్రమే సంతోషించు యుత్తమ సిద్ధాంతమును గూడ నామె యాచరణయందుంచలేదు. దాని ననుభవించి తృప్తిపడవలెనను సామాన్యదృష్టియు నందులో దాగియున్నది. మన మామెనుండి యంతగొప్ప సిద్ధాంతము నభిలషించుట నాకు జూడ వెర్రియే. ముంచికొనివచ్చు తొలిప్రాయమున తానునివసించు సౌందర్య సీమలో, ఆ సంఘములో, అట్టి మనఃపరిణతి కవకాశమే లేదు. ప్రతిజీవిపైనను అంతో యింతో అధికారము నెరపుట పరిసరముల స్వభావముగదా!

సౌందర్యమును భావించుటయందామెకు సంపూర్ణమగు నధికారమున్నది. అనుభవముచే తొలి చూపునందే హెచ్చుతగ్గులు మంచిచెడ్డలు యేర్పరించు పదునుగల దృష్టిని సంపాదించుకొన్నది. నిరంతరము సౌందర్యమోయని లేకారినది. మంచుసరియు ప్రదేశములలో రాత్రింబవళ్లు ఊపిరిబిగించి తీరనిపూనికతో తపము సాధించు తరుణతాపసులను గాంచి యయ్యో యెంతబ్రాయమే! ఉపభోగార్హమగు దీనిని వైదిక కృత్యములలో నలిపివేయుచున్నారే! కడుపునిండ నారగించి కంటినిండ నిద్రింపరాదా! సుఖముగ భోగింపరాదా! సౌఖ్యములపై ఇంతపగ యెందులకని కరుణావిలులితయై కంట తడి వెట్టుచున్నది. ప్రవరు డెదురుపడినపుడును "పాపము! బ్రాహ్మణుడే! ఆకలిదప్పుల గతి యేమో!యని" పనవుటకు ముందే 'కుందనము వంటి మేను మధ్యందినాతపొష్మగతి గందె నోయనియే కుందుచున్నది.

కొంతవరకు కళయొక్క పరమార్థమును దఱచి పక్వమగు హృదయము గలదిగనుకనే యెంతకన్నను తెగింపలేదు. "పుటపసిడి వంటి వలపుందులకించు" సానికులమున బుట్టినను "పవిత్రత" యనుధర్మము కొద్దియో గొప్పో యుండనేయున్నది. నయ-నాణెముల నెరిగినను విడ్డూరములు నేర్వలేదు. శకుంతల కన్నమునొక్కయా కొక్కవజదివినది. 'జూలి; యట్టు'వంటి నిగ్రహమును సమకూర్చుకొన్నది ఒకరాయి [illegible] పొరపాటుగాదు.

కలభాషిణివంటి జాణ గాదు. మహాకవి "మిరాండా" వంటి చక్కలిగింతరైన నెరుగనిబేల గాదు. అన్నిరీతుల చక్కనిదే. కాని యాపువ్వునకు తొడిమయందే తెవులున్నది. తనకులము, తనమనసు, తనవలపు పరస్పర విరుద్ధములగు సన్నివేశములలో నుండుటచే జీవితకావ్యము రక్తిగట్టలేదు.

ఇక నామెదైనిక జీవితమును గురించి విచారింతము. వరూధినియొక్క దినచర్యను స్పష్టముగా విప్పిచెప్పలేదు పెద్దన్న. అయినను వర్ణనాసన్నివేశములబట్టి మనకు సాధ్యమైనంత యూహింతము. తెల్లవారుటతోడనే యాకాశగంగయొక్క నీటి తుంపురులచే చల్లగా స్వాగతమొసగు మారుతములలో రమణీయముగా ప్రోదిగొన్న కాంతారములయందు 'షికారు' వెళ్లుట మొదటిపని. వనవిహారములు ముగిసిన తరువాత చెలులును తానును జలకేళీలాలసలై సరస్సులయందోలలాడుదురు. స్నానానంతర మందరును తమతమ యిండ్లకు బోవుదురుగదా! అప్పటినుండియు వరూధినికి కళాభ్యాసమే కాలముమారినట్లంతయు తంత్రులను భిన్నభిన్నగతులతో మేళవించి తత్తదనుకూలములగు రాగముల నాలపించుచుండెడిది. హిమశైలమునందు వేసరికగలిగినపుడు మేరుపర్వతములోని కల్పవృక్షముల నీడల క్రింద రచ్చపట్టులలో నందరు కొలువై, విశేషముల ముచ్చటించుకొనుట వాడుక.

వరూధిని సానివాడలలో బెరిగినపుడైనను తక్కినవారివలె వలపుబట్టినయెడ వచ్చిన వానితో విహరించి సాగనంపునదిగాదని ముందే విన్నవించితినిగదా! వయసా నవోద్భిన్నము; కాపురమున్నది! ప్రకృతిసౌందర్యము తూగియాడు హిమగిరిప్రాంతము. భోగములా! హాయి! హాయి! మనసునకుగూడ నూహించుకొనరానివి. ఆమె వాడుసామానులు సంపూర్ణముగా మనకు దెలియవుగాని యనులేపనద్రవ్యములుమాత్రము వివరించినాడు చూడుడు:

సీ. "సద్యోవినిర్భిన్న సారంగనాభికా
హృతమైపిసాళించుమృగమదంబు

క్షణమునో ఖీరెండగరగి కన్నెలనంటి
గమగమవలచు చొక్కపుజవాది,
పారలెత్తి ఘనసారతరువుల తనుదాన
దొరగినపచ్చ కప్పురపుసిరము
గొజ్జంగిపూపొద ల్గురియంగ పటికంపు
దొనల నిండినయట్టితుహినజలము."
(౨-౫౮.)

ఎవరికున్న దీభోగము? ఇట్టి యపురూప మనశ్శీవితమును భావోద్వేజకతకు ప్రోదిగూర్పు సన్నివేశములును గలిగె యామె చెడక నిల్చినదిగదా! ఎందులకు? స్వర్గమున నెవరును మేలురకపుచిటులు లేరా? "జయంత వసంతకంతులు" నిరంతరను సందెవేళల సాని పేనుల దిరుపచుండు వారే! మేలేర్చి కోరు కొనరాదా యొకరిని? ఇంద్రసభలకు నాట్యములకై వెళ్లినపు డెంతమంది, కొంగుతాకునకై యూసించియుండరు? మనవంటి కుక్షింభరులకు తీరికలేదుగాని అమృతపానమున చియ్యబట్టి తీరికగాగూర్చున్న వారికేమి! నిరంతర మీ విచారము లేగదా! అస లింద్రునికే కన్నుగీటినచో ఆ సహస్రనేత్రములు సంపాదించుకొన్న రసికాగ్రణికి మాత్రము చాపల్యము తక్కువా? దైవయోగమున వశుడైనచో తన యదృష్టమునకు మితియేలేదు గదా? ఇవి సామాన్యులగు వారి యాశలు. వరూధినివంటి కళామూర్తికివి నచ్చునా? ఆమె 'యలేఖ్య తనూవిలాసుని' వలచినది. "ఉదుటుచూపులు గల దేవవిటుడు నచ్చ డావధూవుకు." మరి "తారుణ్య భాగ్యములు"గల చిక్కనివరుడు గావలెను. ఆమెది ఆదర్శములేని యదనపు బ్రతుకు గాదు. కళామర్మములు క్రొత్తగా వల్లెవేసినది. తన పచ్చిపాండిత్యమును వెల్లడించుకోరిక యున్నది. దానికై యెదురు చూచు చున్నది. ఆమనోరథము యౌవనకృతమగు మాంద్యమునుగూడ మఱపించునంత తీవ్రమై యుండినది. మునుపు స్వచ్ఛందవృత్తి గలవిలాసి రసికుడగుగంధర్వు డామెను కామించినాడట! తనవిదగ్ధతను జూచి వరూధిని తప్పక ప్రేమించునని గంపెడాసతో వచ్చినాడు. కాని యామె చలించలేదు. వారిరువురికి సంబంధము మనసులు హత్తలేదు. రూపగర్వితు డగువాడు ఒక్క మొగముతో వెనుకకు సాగినాడు. అందచందములతో బాటు అత్యంత రమణీయముగ గుణసౌరభములు వాసించు ముద్దరాలు. ఆత్మశక్తి లేదనరాదు; అపరిణతము. దానికి కళయే కారణము. ఆమె సర్వవిధముల సమ్మానింప దగినదే కాని జీవితమున తోకచుక్క బుట్టినది.

మనుచరిత్రమున నీకథకు ప్రాధాన్యము లేదు. రెండాశ్వాసములే వరూధినియొక్క వృత్తాంతమున గూడినవి. చాలమంది పండితులు పితామహుని కీదోష మంటగట్టియే యున్నారు. "ఇది పురాణముగాదు. కావ్యము, వరూధినీశీవితము కడపటివర కనువర్తింపనిచో, నైక్యము చెడును." పూర్వపక్షము సరియేగాని యీ గ్రంథమున నాదోష మంత పెద్దదియై యుద్వేగమును గలిగింపదని నా మనవి. కొలతదబ్బలతో, కావ్యములగొలుచు బుద్ధిమంతులకు జెప్పలేముగాని యుభయమెరిగినరసజ్ఞులకు దోచుభావ మింతే. లక్షణకారులను తూ-చా-దప్పక, నియమముల బాటించియేతీరవలెనని ముద్రవేయలేదు. భగవంతుడగు రాజశేఖరుడు "లక్షణైకతో ష్యాః పండితంమన్యాః" అని సెలవిచ్చినాడు. ఈ కథగూడ స్వరోచిజన్మవృత్తాంతమును దెలుపుటకు వచ్చినది. స్వరోచిజన్మానంతరమే ప్రారంభింపగూడదా యన్నచో నపు డింత కంటెచిక్కు కవిగ్రంథమునకన్న పాఠకు డూహింపవలిసిన దెక్కువగానుండును. వసుచరిత్రము, శృంగారనైషధము మొదలగునాటి కథ వేరు. దీనికిని తక్కినగ్రంథములకును కవి దృష్టియందును ఫలమునందునుగూడ బ్రహ్మాండమంత భేద మున్నది. ఆ యుపాఖ్యానమే కావ్యయోగ్యము గాదన్నచో నట్టివారికి మనము చెప్పవలసినదియేలేదు. దోషలేశమున్న దానివెల్ల విడుచుచు బోయిన కడకు మనకు మిగులునది పూర్ణానుస్వారమే. అట్టి మడిగట్టుకొన్న మహానుభావులు దోషభూయిష్ఠమగు నీప్రపంచమునుండి సెలవుతీసికొనుట తంటాలేనిపని.

పారిజాతాపహరణమునందువలె ప్రథమాశ్వాసముననే వరూధినిని ప్రవేశపెట్టుటకు వీలులేదు. దానిలో నాతని సాంసారిక పరిస్థితులు దైనికజీవితమును దెలుపకున్నచో ప్రవరునిధర్మనైష్ఠికత మనకు బాసుగా బోధపడదు. పెద్దన సిద్ధాగమనమును పెంచలేదు. విప్రునిధర్మనైష్ఠికతను, సూచించునంగముగా నది సంకుచితముగాక విస్తృతముగాక, మట్టసముగా నున్నది. కనుక మనము ప్రథమాశ్వాసముననే ప్రవేశపెట్టియుండిన దృశ్యకావ్యములతీరును సాధించియుండునేయని నిట్టూర్చిన లాభము లేదు. ప్రవేశించినది ప్రవరుడు గదా! మొదటనే శృంగారపు త్రోవబట్టించిన బెదరుననికాబోలు, తొలుత భగీరథుని తపోవనము, గంగావతరణస్థలము, తరువాత లోకమాతయగు భవానీదేవి యాపసోపములు సూపి క్రమముగా 'గ్రేడు' దించినాడు. ప్రవరునిచే, తనివిదీర, బాగడించి చూచినదానధన్యుడనైతి ననిపించినాడు. ఆసందడిలో పాదలేపము గరగించి పైకి బడమన్నాడు. వరూధిని యొక్క రంగస్థలమున జవనికానిర్దేశ మెంత హాయిగానున్నదో సహృదయులతలపు దాకక పోదు. తిన్నగా చూతము రండు:

సీ. కులిశధారాహతి బొలుపున బైనుండి
యడుగు మోవగ జేసరైన తటుల,
గనుపట్టులోయ గంగా నిర్ఝమువార
జలువయా నయ్యేటి కెలకులందు
నిసుకవెట్టిననేల నెదిగి యర్కాంశుల
జొరనీక దట్టమై యిరులు గవియు
క్రముకపున్నాగ నారంగరంభానాళి
కేరాదివిటపికాంతారవీథి

గీ. గొరలుపిక శారికాకీర కేకిభృంగ
సారసధ్వని దనలోని చంద్రకాంత
దరులు ప్రతిశబ్దమీన గంధర్వయక్ష
గానఘూర్ణితమును నొక్కకోన గనియె."

సందర్భమున కనుకూలమగుభంగి రమ్యముగా జిత్రించినాడు. సర్వసంపూర్ణమగు సౌందర్యముతో వస్తువుకన్నుల యెదుట గోచరించుచున్నది. మొదటిపాదమున ఉపమానము కనుగలిగె చూచినచో సౌందర్యపిపాసయందు దానిని కడముట్ట పాఠకుని కందించు పరిశ్రమయందు అతనియాశ యెంతటిదో తెలియరాగలదు. నన్నయ ప్రారంభించిన

బాహ్యవర్ణన సోమునితో పక్కనమై తిక్కనతో మట్టసముగా కళామర్మములు నేర్చి శ్రీనాథునియందు తూగి సితామహునియందు చల్లగా బండినది. "గంధర్వయక్షగాన ఘూర్ణిత"మని సృష్టించిన చిత్రమునకు ప్రాణప్రతిష్ఠ గావించినాడు. మునిగూశ్రమమను భ్రాంతిని గలిగించి యందలి వివిక్తశాంతిని దెలిపి చెదరనిలావణ్య మొసగినాడు.

పురాతన కాలమునుండియు ప్రకృతివర్ణనమున మనకవు లనుసరించిన పద్ధతులు రెండు గలవు. రంగమున బ్రవేశించుపాత్రల యాంతరిక మనఃప్రవృత్తి కనుకూలమగుభంగి పరిసరముల వర్ణించుట మొదటిది. రెండవది పాత్రల మనస్తత్వమునకు, అనగా తత్కాల పరిస్థితికి విరుద్ధమగు వడువున నిర్దేశించుట! జాగ్రత్తగా బరీక్షించినచో వేదములనుండియు వీటి కుదాహరణము లివ్వవచ్చును. గీర్వాణమున మన మెఱిగినంతవరకు మొదటివాడగు భాసుని యందు నీ యలవాటు గలదు. ఆతనినుండి కాళిదాసు సంగ్రహించెను. కాళిదాసు సాధారణముగా మొదటిమార్గమునే యనుసరించుటవాడుక. అత డనుసరించినాడన్నచో వాఙ్మయమున నామార్గమే విరివియనుట చెప్పకయే చెప్పినట్లగును. వాల్మీకి పంపావర్ణనమున రెండవదారినే దొక్కెను. వ్యాసవాఙ్మయమున నీవిధ మెక్కుడు. భవభూతి వ్యాసభగవానునిమార్గములోనివా డనుటకు సంశయమే లేదు.

రెంటియందును సాధకబాధకములు వీడరానివి. పాత్రలపరిస్థితి కనుకూలములగు పరిసరములు, పరికరములు గలచోట సామాజికులు త్వరితముగా లయింతురు. అపుడు కవిపనియు సుఖకరము, మెప్పును సులభము. రెండవ పద్ధతి నీటి కెదురెక్కుటవంటిది. ప్రకృతియందుగల విరుద్ధపరిస్థితులలో పాత్రప్రవేశించినపుడు రెంటినడుమగల వైరుధ్యము దానిచే పరభాగత మనకు స్ఫుటముగా గోచరించును. తన్మూలమున రంగముననున్న పాత్రలకు సంబంధించిన హృదయావేదన మెుదలగుభావములు చక్కగా మనసునకు బట్టును. మొదటిమార్గమునయందు శాంతియు, రెండవదాన ఆకులతయు వీడరానివి. స్థలభేదములను, వ్యక్తిభేదములను అనుసరించి తూచి యుపయోగించినచో రెండును సామాజికుల, లేక పతితల హృదయముపై తీవ్రముగ పనిచేయగలవు. మనవాఙ్మయముననూ, కొంతవరకు గీర్వాణముననూ నీరెంటి నుపయోగించుటయం దోర్వరాని, యవకతవకలు లేకపోలేదు. అల్లసాని పెద్దన కాళిదాసనుసరించిన తొలుతటిరీతి నిందు సక్రమముగ దూచి యుపయోగించినాడు. ఆవస్తుసౌందర్యము ప్రవరునేగాక ప్రపంచమునంతయు గట్టివేయజాలి యున్నది.

జవనికానిర్దేశమైన తరువాత నారంగమున వాడదగువస్తువుల జూపుచున్నాడు. మణిమయమగు నంగణము, తరుణసహకారము, దానినీడయందొకవితర్దిక, శీతలానిలము మొదలగునవి. ఇక తిన్నగా వరూధినికై తెర నెత్తినాడు. అల్లనసోకిపోవు మారుతాంకురములలో వీణియమెట్లపైని వ్రేళ్లు గదలించుచు గూర్చున్నది సమస్తమగు ప్రకృతియు నామె గానబ్రహ్మమున లీనమైయున్నది. అప్పటి వరూధినిపరిస్థితిని కవియీరీతి వర్ణించినాడు.

సీ. తతనితంబాభోగనవళాంశుకములోని
యంగదట్టపుకావిరంగువలన
శశికాంతమణిపీఠి జాజువారగ కాయ
లుత్తుంగకుచపాళి నత్తమిల్ల
తరుణాంగుళీధూత తంత్రీస్వనంబుతో
జిలిబిలిపాట ముద్దులు ఘటింప
నాలాపగతి సొక్కియరమోడ్పుగనుదోయి
రతిపారవశ్యవిభ్రమము దెలుప
గీ. ప్రౌఢి బలికించుగీతప్రబంధములకు
క్రమకరపంకరుహరత్నకటక ఝుణఝు
ణధ్వనిస్ఫూర్తి తాళమానములు గొలుప
నింపు దళుకొత్త వీణె వాయింపుచుండి.

(౨-౨౭)

నాకు దెలిసినంతవరకు తిక్కనను నూరన్నను విడిచి యిట్టి సుకుమారపద్య మింకొకటి భాషలోలేదు. తతనితంబము ఉత్తుంగకుచపాళి తరుణాంగుళి యను పదములయందు నవోద్భిన్నమగు యౌవనము ధ్వనించుచున్నది. "జిలిబిలి" పాటలో యౌవనకృతమగు మాధుర్యము ఒయ్యారము నున్నది. ఆలాపమును గావించునపుడు సొక్కిన యరమూత గనులు రతిపారవశ్య విభ్రమమును దెలిపినవట. భళిరా! ఆస్థాయిని, ప్రకృతమున కంటియంటక, నెంత సున్నితముగా బలికించినాడు; ఆ యుపమానము అర్థపుష్టిచే మదించి రమణీయమగు తావి పుక్కిటబట్టిన యేడాకులరటిబాలెంత రాలివలె నున్నది. "ఇంపుదళుకొత్త"ననుటలో నా మెసరసహృదయ మున్నది. ఇచటి "ప్రౌఢి" యనుపదమునకు రసోన్ముఖతయని వ్యాఖ్యానమేమో! తత్కాల మనఃప్రవృత్తి కనుగుణముగ బాహ్య స్వరూపమును జిత్రించిన పెద్దన, తిక్కన కెంతటి దగ్గరిశిష్యుడో మనము గ్రహింపవచ్చును. అయిన నొక కొరత. మొదటి పాదములోని తీక్ష్ణదృష్టి రెండవదాన లేదు. అది కేవలము పూరణార్థ మతికించిన ట్లున్నది. నాలుగవ పాదములోని రసాభివ్యంజకత దేనికినిలేదు. భావమును క్రమక్రమముగా పెంచుకొనిపోవు పద్ధతి యందేలనో కొంచెముగా పొరవడినాడు పెద్దన. ధ్వనికారుడు "వాచ్యవాచకలక్షణమాత్రకృత శ్రమాణాం కార్యతత్వార్థభావనా విముఖానాం స్వరశ్రుత్యాది లక్షణమివ ప్రగీతానాం గాంధర్వలక్షణ విరామగోచరయేవాసౌశబ్దః" అన్న నిజము నూహించికాబోలు ధ్వనిమూఢులగు ఛాందసులకై తానన్నదాని కిగతివ్యాఖ్యానము గల్పించినాడు.

"వివిధవిబుధ తరుజనిత మధురమధురసంబానునదటునర్, జిదిమిన నెరుంగక మదనహరునైన జదురునర్ గదియగమకించుతిమురునర్ గొమిరెప్రాయంపు మదంబున ననన్యసామాన్యలావణ్యరేఖామదంబునను"

పై పద్యమున ధ్వనిగా గోచరించిన యౌవన మిందు వాచ్యముగా స్పష్టముగానున్నది.

అందరికన్నను పెద్దనయందు వృత్తవిన్యాసము గొప్పప్రతిభ. ఏ సందర్భమున నేపద్యము వాడిన వృత్తనియమమున గుదిరినపదములు శ్రవణమాత్రముననే సౌందర్యము నింపునని చక్కగా గురుతించినవాడు. మచ్చునకు రెండుమాత్రము గానుపింతును.

శా. తావుల్ క్రేవల జల్లుచెంగలువకే
దారంబుతీరంబునన్
మావుల్ క్రోవులు నల్లిబిల్లిగొను కాం
తారంబునన్ హైందవ
గ్రావాకల్పితకాయమానజటిల
ద్రాక్షాగుళుచ్ఛంబులన్
పూవుల్ దీవెలనొప్పు నొక్కభవనం
బున్ గారుడోత్కీర్ణమున్.

పై పద్యము రెండవయాశ్వాసములోనిది. ప్రవరుడు వరూధినియొక్క భవనమును జూచినసందర్భమున నున్నది. శార్దూలమున యన్నివృత్తములకన్నను సురుపు లెక్కువ. బాగుగా చేతులుజాచి చెప్పుటకు పనికివచ్చుపద్ధతి దానిపుట్టుకతోనే గలదు. ఇచటి యీపద్యముచే వరూధినియొక్క భవనపై శాల్యము మొదలుగునవి రేఖామాత్రములుగా సూచితములని చెప్పినచో నవ్వారనుకొందును. పైగా నను ప్రాసములచే బిగింపబడి, కాసెగట్టి నాట్యమునకు నిలిచినయొయ్యారివలె నున్నది. అనుప్రాసములు బలవంతముగాగాక నైజగతితో బ్రవహించినవగుటచే మరింతసుందరములుగా నున్నవి. అదిగో పై పద్యముననే నాట్యము—

క. మృగమదసౌరభవిభవ
ద్విగుణితఘనసారసాంద్ర వీటీగంధ
స్థగితేతరపరిమళమై
మగువపొలుపుదెలుపునొక్కమారుత మొలసెన్

ఈ పద్యముయొక్క గురులఘుస్వరూపములలో నొకసమగ్రమై స్పష్టమగు లయపాటింప బడినది. కడపటిపాదము ముక్తాయింపిచ్చి ముగించుచున్నది. మరల పల్లవినెత్తినాడు కథకు దిగి.

వృత్తవిన్యాసమున భావమున్నదనుటపిచ్చియందు రేమో! ఈవిషయమున నాకన్న పిచ్చివారు మహనీయులగు విశ్వనాథకవి రాజుగారు. వారింతకుమును పొకచోట మన చరిత్రకారుని వృత్తవిన్యాసమును మాత్రమే గురించి విపులముగ జర్చించియున్నారు. మాయిరువురికన్న క్షేమేంద్రుడు మొదటి పిచ్చివాడు. అతడు ప్రతియొక వృత్తమును విషయ విభాగముతోగూడ నిర్ణయించి యున్నాడు.

ఇక ప్రవరునిసంగతి విచారింతము. పర్వత భూములన్నియు ప్రసిద్ధములైనవి దిలకించినాడు. నెత్తిమైప్రొద్దు. ఎండలు తీవ్రములైనవి. ఆకలి ప్రొద్దయినదిగాబోలు మెల్లగా మన సింటిదారి కీడ్చినది. ఎగురబోయినాడు. కాని పాదలేపమేదీ? ఎన్నడో యారిపోయినది. ముట్టిచూచినాడు తడిగూడ లేదు. "గిరికటకగుహావిహారమతి" యగువిప్రుని కున్న యుత్సాహమంతయు మాయమైనది. పాపమాతని కిపుడు హిమగిరిమాహాత్మ్యములు శచీదేవియు నింద్రుడు జలకములాడినప్పటి యుల్లాసములు స్ఫురించుటలేదు. మరి "వేదండవరాహవాహారిపుఖడ్గవ్యాఘ్రమే" యని భయపడుచున్నాడు. దైవమా! యిచటినుండి బ్రదుకుజీవుడాయని బైటబడిన జాలునని దిక్కులు ‥చుచున్నాడు. పోనీ ఒకవేళ తాను యెవరో మరియొకసిద్ధుని యనుగ్రహముచే నిచటనే సుఖముగా జీవించుదమనుకొందము. అపారమగు పుత్రప్రేమతో కరగిపోవు "దేవియుందేవరవోలు" ముసలి తలిదండ్రులగతి? "తోడునీడలై" నెన్నంటి క్రీడించుచుండు సచ్ఛాత్రుల యవస్థ? వీటికన్నిటికన్న ముఖ్యములగు నిత్యకృత్యములు? చింతాసాగరమునః బడినాడు. ఆకులతచే కమలినమొగముతో నెవడురా, నన్నీకష్టమునుండి గట్టెక్కించు మహాపురుషుడని యా "మిన్నులు బడ్డచోట" వెదకుచు వచ్చుచున్నాడు.

హఠాత్తుగ నాతని కీకోన కంటబడినది. అలతియలతి నలివులతో ప్రక్కన నొకసెలయేరు మలకలై దిగుచున్నది. దాని కిరువైపులను మల్లికలుపూచి పుష్పించియున్నవి. వెంటనే యందలిసాత్వికత దానితోబాటున్న శాంతి, యతని కర్థమైనది. పేదకు పెన్నిధి దొరకినదని సంతసించినాడు. అచటి కరిగిన తనకు మోక్షము గలుగునను తహతహయెక్కువైనది. "బ్రదుకురా బడజీవుడా" యని మల్లికల యాతతో ప్రవాహమున కెదురెక్కి నడచినాడు. ఎదుట నొకకేదారము, ద్రాక్షపందిరి, గరుడపచ్చలచే జెక్కబడిన కుడ్యములతో నిగనిగలాడుచుండు భవనము కంటబడినది. వరూధినిగారి కౌయింటికై ఖర్చెంతయ్యెనో యెవరిచ్చిరో, పాపము మనకవులు

ధర్మాత్ములు. శర్మగారన్నట్లు యింటవెండ్లాముముక్కరకు ముత్తెము లేకున్నను ముంగిళులమాత్రము ముత్యాల ముగ్గులు బెట్టుచురట. ఎంత సంపన్నగృహస్థుడైనను, ప్రవరుడు రాసులురాసులుగా రత్నముల నెచటను జూచియుండడుగదా! ధర్మకాలపువాడు గనుక వెంటనే "ఉదంచితసౌభాగ్యగరిమ కచ్చెరువడి" నాడు. ఇంతలో మృగమదము ఘనసారము మొదలగువాసనాద్రవ్యములతో సురభితమగు చల్లనిగాలి యెదురువచ్చినది. బ్రాహ్మణుడు మునియాశ్రమమయి యుండదని తీర్మానించుకొన్నాడు. ఆశలో అర్ధభాగము తగ్గినది. కాని యెవరో యొక రుండక తప్పదుగదా! మనకెవరైననేమి? వారి నే య డి గి యా రి దా రి తె లి సి కొం ద మ ని రం గ ము న ప్ర వే శించినాడు. ఎదుటనున్న సౌందర్య సంపుల్లమగు ప్రకృతి, చల్లనిగాలి, వీణానాదము రతీదేవివలెనున్న "మరున్నారీ శిరోరత్నము" నాతని మన స్తత్వముపై కొక్కసారిగ గుప్పించి యెగసినవి. హఠాత్తుగ, నకాలమున, గలిగిన యీ విచిత్రసన్నివేశముతో నాతఁడు విభ్రాంతుడై నిలిచినాడు.

ప్రవరునిది రమణీయమై సుకుమారమగు రూపు, కమలములవంటి కన్నులు, వీనులతోడ రాపాడుభుజములు, విశాలమగు నురము, మృదుపదములు నివి యీతనికి పుట్టుకతో బుట్టిన లక్షణములు. విటికన్నిటికి పైపూతయగు బ్రహ్మతేజమును కష్టపడి సంపాదించినాడు. ఆ బ్రహ్మతేజ మెట్లుండినదో మనకిపు డర్థముగాదు లెండు. అతని లావణ్యమా! నేరెటేటియసలు దెచ్చి నీరజాప్తుని సానబట్టగా మిగిలిన రాపొడి గలిపి నీటికి బదులమృతమునేవాడి యాతనిదివ్యసుందర విగ్రహమును తీర్చినాడట బ్రహ్మదేవుడు. చంగులుదీర్చి కట్టిన నీరుకావిపంచె, అరుణాంశుకోత్తరీయము, లలాటపట్టికయందు, వెండికేకులవలె, పలపలమనిమెరయు విభూతిపట్టెలు, చెవులలో, నిగనిగలాడు, మణికుండలములు,- అతడు మనవంటి దౌర్భాగ్యుడు గాడుగదా !- ఆతని యాహార్యకములు. (సశేషము.)

# ఐంద్రజాలిక

శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు

ఎవతెవు నీవు దూరమున నేభ్రుకుటీనటనమ్ము సేతనో
నవజలదమ్ములందునె వినగ్నగళమ్మున మ్రోగు నిష్ఠురా
రవముల శేపినావు, విను రాల్చిన రిక్కలవెల్ల మంటలై
లవములవమ్ములై తునుకలై చితిబేర్చెడి నాజగమ్ముపై!

కనబడకే కనుంగవకు గాటపుగోరిక లేలపూన్చి నీ
ధనువున రంగురంగు జలదమ్ముల లేతెర జీల్చెదేల నా
మనసును వ్రేల్చెదేల, పరిమాణము లేని కఠోరభావమూ
నిన మనజాలునే జగతి నీసుమహాస్త్రమె నిప్పుగుప్పినన్ ?

దురుసుకటారి నీయొరను దూసి నిశాజఠరమ్ముగోసి భీ
కరరుధిరమ్ముబిందువు నొకండయినన్ భువి జేరనీక నే
యరుదగు నింద్రజాలము వియత్తున జేసితొ, శోణితంపు తుం
పరలయి వ్రేలె దారలు నభస్థలి కీలలతోరణమ్ములై!

సుందరవిశ్వమోహిని ! రసోల్బణమూర్తి ! సుఖాంగణాన నీ
వెందుల కగ్నికుండమిడి, యింధనముల్ రగిలించి, సాంద్రధూ
మాంధములోనె ప్రజ్వరిలు హాలహలాద్భుత కీలికాగ్రసీ
మం దలిరాకుపాదయుగమంట నటించెద వైంద్రజాలికా !

---

# వెన్నెలకడలి

కుందుర్తి నరసింహరావు

తెలిమబ్బుపట్టుపొత్తిళ్ళ నొత్తిగిలుజాబిల్లి నుయ్యాలలూపెడికరమ్ము
ఆకొన్న చిరుగాలి యాడుపోకినయంత పెన్నుర్వ్వపాలుచేపెడు నెడంద
పండువెన్నెలసెజ్జపై మేనువాల్చిన ప్రకృతిపజ్జను జోలబాడు నెలుగు
పగటిపోరుల గాసివడు జీవకోటిపై కారుణ్యసుధ జిల్కుకంటివెలుగు
నీసుపర్వరూపజ్యోతి నేడు దెసల-శోభిలు మహేశదరహాసవై భవముగ
అఖిలజగదంబవై మదీయాంతరంగ-నాదరాగమ్ము చూరగొన్నావు, కడళి !

అచ్ఛకళావిలాసవతివై అమరాంబరశోభితాంగివై
స్వేచ్ఛ రుతించునీవదనవీణ చరాచరభూతకోటిచే
తుచ్ఛశరీరవై భవగతుల్ మరపించి యశస్త్రపావిమో
హాచ్ఛవిదివ్యజీవనవిహాయస మార్గములందు ద్రిప్పెదుర్.

---



# త్రిశూలము

విశ్వనాథ సత్యనారాయణ

★

## సప్తమాంకము.

(ప్రవేశము. జగదేవుఁడు, త్రిపురాంతకభట్టు, బ్రాహ్మణులు.)

త్రిపు:—జగదేవా! నీవు భోజనమునకుఁ బిలిచిన చో బసవేశ్వరుఁ డొక్కఁడే రాఁడు; వీరశైవు లందఱును వత్తురు. వారి పంక్తిని గూర్చుండి బ్రాహ్మణు లందఱును భోజనము చేయరు.

జగ:—నేను బసవేశ్వరు నొక్కనినే భోజనమునకుఁ బిలుతును. ఆయనపంక్తిని గూర్చుండి భోజనము చేయుటకు బ్రాహ్మణుల కేమైన నభ్యంతర మున్నదా?

బ్రా:—బసవనిపంక్తిని భోజనము చేయుటకు బ్రాహ్మణుల కెవ్వరికి నభ్యంతరములేదు. బసవఁడు జన్మచేత బ్రాహ్మణుఁడు, మహాభక్తుఁడు, సత్యశమదమాది సద్గుణసంశోభితుఁడు. ఆయన బ్రాహ్మణ్యము వదలి పెట్టినను బ్రాహ్మణుఁడే. కాని మీరు భోజనమునకుఁ బిలిచినచో నాయన యొక్కఁడే రాఁడు. శివభక్తు లందఱును దప్పకుండ వెంటఁదెచ్చును.

జగ:—బసవేశ్వరునియనుయాయులలోఁ జాల మంది శమదమాది గుణసంపత్తికల భక్తు లున్నారు. వారు వచ్చినచో.

బ్రా:—దండనాయకా! వారిలో శమదమాదులగు నాత్మగుణములు కలవా రున్నను గులముచేత బ్రాహ్మణులు కారు. చాకలులు, మంగలులు భక్తులైన చోఁ గావచ్చును. వారు గణాచారులవంటివారు. వారిని మేము గౌరవింతుము. వారితోఁ గలసి భోజనముచేయము. వారు మహాభక్తులని తోఁచినచో వారిపాదసేవ చేయుదుము. వారిచేతినీరు త్రాగము.

జగ:—అయ్యా! వారియొద్ద మనకంటె నెక్కువశక్తులు నెక్కువశీలము నుండఁగా వారితో మన మేల కలసి భోజనము చేయరాదు?

త్రిపు:—జగదేవా! బిజ్జలుఁడు మనకు రాజు. మనమందఱ మాయనబంటులము. ఆయనను మహారాజా యని పిలుతుము. ఆయన యన్నచో మనకు భక్తి. కాని యాయనతోఁ గలసి మనము భోజనము చేయము.

జగ:—ఒకపని చేయుదము. బ్రాహ్మణు లందఱు ముందు భోజనము చేయవచ్చును. తరువాత బసవాదులను బిలిచి భోజనము పెట్టుదము.

త్రిపు:—అట్లయినచో బసవన్నకుఁ గోపము రావచ్చును. దేవతాసైవేద్యాదికములు మున్నుజరిపి బసవనిపంక్తి నారగించుట కిష్టములేని బ్రాహ్మణులను ముందారగింపించి తరువాత మనము కొందఱము బసవనితోఁ గలసి భుజింతము.

జగ:—అయినచో నేను బసవామాత్యుని బిలిచి వచ్చెదను. మీరు పోయి దేవతార్చనాదులు ముందు జరిపింపుఁడు.

(త్రిపురాంతకభట్టును బ్రాహ్మణులును నిష్క్రమింతురు).

జగ:—నే నిటు కర్మసిద్ధాంతమును వదలలేకున్నాను, అటు శివభక్తిని బరిత్యజింప లేకున్నాను. బసవా! నేను నీకు భక్తుఁడను. తర్కముచేత నెంత యాలోచించినను గర్మసిద్ధాంతమే ధ్రువపడుచున్నది. వర్ణాశ్రమాచారధర్మములే పరమ విశ్వాస్యములుగా నున్నవి. కాని—

సీ. బసవనిమనసులో భావించినంతనే పైకమ్ముచే నొడల్ మఱచిపోదు
దీక్షతో బసవని వీక్షించినంత నే గలపరించిన మొడల్ పులకరింతు
బసవనిస్తోత్రముల్ పాడినయంతనే తలఁగని ప్రేమచేఁ దాండవింతు
బసవనిపేరు విన్పడినంతనే చిట్టి బసవనికోసమై జొసలు చూతు

బసవదేవుఁ డొకఁడె ప్రాణలింగము బస
వండె సంగమయ్య భక్తిప్రావు
బసవ బసవ యన్న పాపౌఘ మెంతయుఁ
బుచ్చకాయవోలె విచ్చిపోవు.

నే నీకర్మభక్తి సిద్ధాంతముల మధ్య గతాగతకారియైన యుయ్యెలవలె నూఁగుచున్నాను. ఇదిగో బసవామాత్యుని గృహము బసవని నాకనుల పండువుగాఁ జూచెదను. కాని యాయనను జూచినంతనే తోడి యమాత్యుఁ డనిపించుటయే వింతగా నున్నది. నా యాత్మ దేహసంసర్గమునందుఁ జిక్కువడి యావిభేదవుఁ ద్రాళ్లు త్రెంచుకొన లేకున్నది.

(తెర యెత్తఁగా బసవేశ్వరుఁడు ప్రవేశించును.)

బస:—జగదేవా! రమ్మా! ఏదో పనిమీఁద వచ్చిన ట్లున్నది.

జగ:—అమాత్యశేఖరా! నేఁడు నా కుమార్తె వివాహము. తమరు మాయింటికి భోజనమునకు రావలయును. మీరు వచ్చినచో నా యిల్లు పవిత్రము కాఁగలదు. నాజన్మ కృతార్థమగును. నాయందుఁ బరమశివునకు దయకలుగును.

బస:—జగదేవా! నీవు బ్రాహ్మణుఁడవు. నేను గులము లేనివాడను. నేను శివుఁడను, నీవు భవుఁడవు నీ యింటఁగుడుచుటకు నా కభ్యంతరము లేదు గాని నాకు నీ యింట భోజన మిడుటకు నీకు నీబంధుగులకు నభ్యంతరముండవచ్చును. నీమాట యేమో, నీబంధుగులకుఁ దప్పకుండ నడ్డంకి యుండును.

జగ:—వృషభావతారా! ఎవ్వరికిని నభ్యంతరము లేదు. నీవు నాయింట భోజనము చేయుటకు నా బంధుగులలో నెవరి కభ్యంతరమున్నదో వారందఱితో నా బంధుత్వ మీ నాఁడు వదలుకొనుచున్నాను. నీవు నాయింటికి వచ్చి యుద్ధరిఁపవలెను నీళ్లు పుచ్చుకొంటివా.

నా పితరుల్ పవిత్రముగ నాధులు నా తిను సెల్ల భక్తిప్రా
ప్తి పరమేశ లాంఛన మహోసు విభూతి పసు జ్వలంబునా
నా పతిజీవ నా మనసునం దొలిబత్తిని సత్తగన్న తం
డ్రీ! పరమంపు జాలిఁ గనవే నిటలేక్షణవాహనాకృతీ!

బసవా! నీ పాదాంబుజమ్ములు ముట్టి ప్రార్థించుచున్నాను. నీవు నాయింటికి రాక తప్పదు.

బస:—దండనాయకా! ఇదిఁ జాలచిక్కులున్నవి. విచారించుకొనుము. నీయింటికి వచ్చినచో నే నొక్కడను రాను. నాతో మడివాలుమాచయ్య వచ్చును. శివనాగుమయ్య వచ్చును. బడగర బ్రహ్మయ్య వచ్చును. ఇందులో నెవ్వరును బుట్టుకచేతఁగూడ బ్రాహ్మణులు కారుగదా! వారంద అపరశివులు. వీసమైన దోసముపైయించువారు కాదు, క్రుద్ధులై ప్రళయకాలరుద్రులవలె మండిపోదురు. జగదేవా! మనమైత్రి మైత్రిగా నుండనిమ్ము. నాయందు నీకు ప్రేమ యున్నచో దానిని ప్రేమగానుండనిమ్ము. నీవు శివభక్తుడవై లింగవంతుఁడవైనచో నీవు పిలువచ్చును. నేనురావచ్చును. మనది యంగాంగి సంబంధము గాదు.

జగ:—బసవా! నేను లింగవంతుఁడను గాకపోయినను నీభక్తుఁడనే యగుదును. నీ శివభక్తుల కొఱకు నీకొఱకు నేనైనఁ జేయుదును. నీ కత్తితో నాహృదయమును దెఱచిచూడుము. అందు బసవేశ్వరుఁడు ప్రతిష్ఠింపఁబడి యున్నాఁడు. నీవు రాకతప్పదు. నీవురాకపోతివేని శివభక్తులమీఁద నొట్టిడుచున్నాను.

నీవురావేని బసవ! నిర్నిద్రభావ
సంగయుత! మడివాలు మాచయ్యతోడు.
నీవురావేని బసవ! మనీషిలోక
మహితనుతిపాత్ర శివనాగుమయ్యతోడు.

బస:—జగదేవా! జగదేవ! ఎంతయాన పెట్టితివి? వచ్చెదను, వచ్చెదను, పొమ్ము. భోజనము వేళకు మఱల వచ్చి పిలువుము. నే నింతలో సిద్ధముగా నుండెదను.

జగ:—ప్రభూ! నేను గృతార్థుఁడనైతిని. రెండు గడియలలో మఱల తిరిగివత్తును.

శివుఁడు నాగృహవీథి వెంచేయఁ గలఁడు
హరుఁడు నాయింటిముంగిట నాడఁగలఁడు
మూర్తిమంతుఁడు బసవఁడు మ్రొగ్గఁగలఁడు
నాగృహాంగణగళితోరణముల యందు.

(నిష్క్రమించును.)

బస:—పురాతయ్యా! పురాతయ్యా! నీవు పోయి మడివాలు మాచయ్యను, శివనాగుమయ్యను, బడగర బ్రహ్మయ్యను, కదరి రెమ్మయ్యను, గోడలమల్లయ్యను బిలుచుకొనిరమ్ము. నేడు జగదేవునియింట విందారగింపవలయునఁట. మిమ్మందఱను బసవఁడు రమ్మనుచుండెనని చెప్పుము.

పురాతయ్య:—(ప్రవేశించి) భోజనమున కెక్కడికి! జగదేవునియింటికా! నేను బిలుచుకొనిరాను.

బస:—ఎందుచేతనయ్యా!

పురా:—ఎందుచేతనా? అతఁడు బ్రాహ్మణుఁడు; శైవములు కానివారిని శైవము లని పూజించువాఁడు. వారు వారిదేవతలకు నివేదన చేసిన యుచ్ఛిష్టము ప్రాణలింగమున కారగింపఁబెట్టెదవా ?

బస:—అతఁ డట్లేల చేయును?

పురా:—అట్లేల చేయును? బ్రాహ్మణుఁడు గనుక చేయును. జగదేవునకు నీమీఁద భక్తియున్నది గాని శివభక్తులమీఁద లేదు.

బస:—పురాతయ్యా! అతనికి శివభక్తులమీఁదఁ గూడ భక్తి కలదు. మాచయ్య మీఁద శివనాగురయ్య మీద నొట్టుపెట్టినవానికి శివభక్తులమీఁద భక్తిలేదా?

పురా:—మాచయ్యమీఁద, శివనాగుమయ్య మీఁదను గలదు. అందఱు శివభక్తులమీఁద లేదు. అతఁడు నేఁడు మీ ప్రాణలింగములకుచ్ఛిష్టము నైవేద్య మిప్పింపఁ బోవుచున్నాఁడు.

బస:—పురాతయ్యా! జగదేవుని నీవెఱుఁగవు. అతఁడు నన్నురమ్మని పిలిచినప్పుడు నీవు లేవు. ఉన్నచో నీ కాతనిభక్తి తెలిసెడిది.

పురా:—అతనిభక్తి నాకు నిన్నుఁ బిలువరాక ముందే తెలిసినది.

బస:—పురాతయ్యా! నీవు పొరపాటు పడుచుంటివి.

పురా:—నా చెవులతో విన్నమాటలలో నేమి పొరపాటుండును?

బస:—ఏమి వింటివి? అవి యెవరన్నమాటలు?

పురా:—జగదేవుఁడును మఱికొందఱు బ్రాహ్మణులును గలసి యాలోచించుచుండిరి. ముందర బ్రాహ్మణులు దేవతానివేదన చేసి యారగింతురఁట. తరువాత మీ పంక్తిని గూర్చుండి యారగించుట కభ్యంతరము లేనివారు మీతోఁ గలసి యారగింతురఁట.

బస:—నీ వెప్పుడు వింటివి?

పురా:—జగదేవుఁ డిచ్చటికి రాకముందే వా రనుకొనుచున్న మాటలు వింటిని.

బస:—జగదేవుఁడు న న్నవమానించుటకా యీ పిలిచినది?

పురా:—కాదు, కాదు. జగదేవునకు మీయందు మహాభక్తి కలదు. మీ రెట్లయినను దన యింట భోజనము చేసినఁ జాలునని యాయన యూహ. కాని యితరబ్రాహ్మణుల కది యసహిష్ణువుగా నుండకుండుట కిది యిట్లు చేసినాఁడు.

బస:—ఈ మాటలు నీవు నీచెవులార వింటివా?

పురా:—విన్నాను.

బస:—చీ! నేను జగదేవునియింటికిఁ బోను. నీవు పోయి మాచయ్యను బడగర బ్రహ్మయ్యను బిలుచుకొని రమ్ము.

(పురాతయ్య నిష్క్రమించును.)

జగ:— ప్రవేశించి బసవేశ్వరా! అంతయు సిద్ధముగా నున్నది.. మీ రింక బయలుదేరి వచ్చుటయే యాలస్యము.

బస:—జగదేవా! బ్రాహ్మణు లందఱు మాతోఁ గలసి భోజనము చేయుదురా?

జగ:—అందఱును జేయరు. కొందఱే చేయుదురు.

బస:—తక్కినవారు మనభోజనము లైన తరువాతఁ జేయుదురా?

జగ:—కాదు. వారిదివఱకే చేసిరి.

బస:—అయినచో వారు దేవతానివేదనములు చేసిరికదా! ఆయుచ్ఛిష్టము మాప్రాణలింగములకు నైవేద్యము పెట్టుమందువా?

(మాచయ్యయు బ్రహ్మయ్యయు బ్రవేశింతురు.)

జగ:—బసవేశ్వరా! మీ కట్టుచ్ఛిష్టము పెట్టింతునా? వేఱేవంటచేయించితిని.

బస:—జగదేవా! నీవు ముందు బ్రాహ్మణుల కారగింపించి తరువాత మమ్ముఁబిలుచుటకు, నాతోఁ దరువాత మీరుకొందఱు కలసిభుజించుటకు నీవుపన్ని వచ్చితివా, లేదా?

జగ:—బసవేశ్వరా! నిజము చెప్పుచున్నాను వినుము. నీవు నాయింట నారగించుటయే నాకోర్కి. తక్కినవానితో నాకుఁ బనిలేదు.

బస:—ఛీఛీ! నీమొగముఁజూడను. పురాతయ్యా! నడుమ తెరపట్టించుము. ఈభవిమొగమునేఁ జూడఁజాలను.

(బ్రహ్మయ్యయుఁ బురాతయ్యయుఁ దెర యడ్డము పట్టుదురు.)

బస:—

ముల్లోకనాథుని ముట్టఁ గొల్చియును గల్లరిలోకుల క్షణియింపఁదగునె
హరునకు మజ్జనం బార్చుచేతులను నరకవిప్రులకాళ్లు సరికడ్గ దగునె
శివపాదజలములు శిరమునఁదాల్చి భవులకాళ్లులనీళ్లు పైనల్కఁదగునె
శ్రీమహాదేవుఁబూజించుచేతులను నామాలకుక్కల నర్చింపఁదగునె
కర్మచండాలురఁగలసికుడ్చుటయుఁ గర్మంబుగుడుచుటకాదెయట్లయిన
కలికంతుపద్ధ నిష్కలభక్తియుక్తి జరభుల కదియేల సమహాసుఁ జెపుమ.

దర్శనాదపి పాపదా యన్నట్లు భవుల సంపర్కభోజనాసనదానములు భక్తులకుఁ బనికిరావు. పొమ్ము పొమ్ము.

జగ:—బసవేశ్వరా! అనుగ్రహింపు మనుగ్రహింపుము. నేనుగర్మబద్ధుఁడనైతిని, కష్టుఁడనైతిని, దుర్మదోపేతుఁడనైతిని, దుష్కృతాలయుఁ డనైతిని. దీనికింకఁ బ్రాయశ్చిత్తమేదియులేదు. మాచయ్యా! నీకు నమస్కారము. బ్రహ్మయ్యా! నీకువందనములు. పురాతయ్యా! నీకుమోడ్పుఁగేలు. ఇతర భక్తులారా! మీకు సాష్టాంగ ప్రణామములు. బసవేశ్వరుఁడు నాయింట నారగించునన్న సంతోషములో నీయపచారము నాకు గోచరింపలేదు. వేఱువంట యైనను ముందు బ్రాహ్మణుల నారగింపించుట నాదేదోషము. బసవా! ఈపాపమునకు నిష్కృతి యేమో చెప్పుము. (కత్తి దూసి) బసవా! ఈపాపమునకు నాప్రాణములతో బ్రాయశ్చిత్తము చేసికొనెదను మీయాజ్ఞయిండు. నాతల తరిగి మీపాదములయందుంచు చున్నాఁడను.

బస:—(తెరలాగి) జగదేవా, సాహసమువలదు. నీవు నిజముగాఁ బ్రాయశ్చిత్తమును వాంఛించెదవేని నది నీశిరముతోఁ గాదు. శివద్రోహులశిరములతో నా ప్రాయశ్చిత్తము చేసికొనవలయును. అట్లు వాగ్దానమిమ్ము.

జగ:— ఇదిగో, కత్తి ముట్టి ప్రతిజ్ఞ చేయుచున్నాను.

బస:—ఇంకఁ గొలఁది దినములలోఁగల్యాణకటకమున శివద్రోహము పుట్టఁగలదు. నీవా ద్రోహిశిరస్సు దొలఁగించెదవేని శివుఁడు నీకుఁ బ్రసన్నుఁడగును.

జగ:—తప్పకుండఁ జేసెదను.

బస:—శివద్రోహము పుట్టినపుడు నేను నిన్నడిగెదను. ఆద్రోహియెవఁడైనను నీవు చంపవలసియుండును.

జగ:—ఎవఁడైనను జంపెదను.

బస:—నీకుమారుఁడైనచోఁ జంపెదవా?

జగ:—తండ్రియైనను సరే, కుమారుఁడైనను సరే, చంపెదను.

బస:—నీగురువైనను జంపెదవా?

జగ:—గురువైననుసరే, నాదైవమైనను సరే చంపెదను.

బస:—నీరాజైనను జంపెదవా?

జగ:—రాజైనను సరే, రాజాధిరాజైనను సరే చంపెదను.

బస:—జగదేవా! మాట తిరిగిపోరాదు. ఈనిర్ణయమున కీశానుఁడు, ప్రమథగణములు సాక్షులు.

జగ:—ఈనిర్ణయమున కీశానుఁడు, ప్రమథ గణములు సాక్షులు.

బస:—ఈనిర్ణయమునకు మాచయ్యయు, బ్రహ్మయ్యయు సాక్షులు.

జగ:—ఈనిర్ణయమునకుమాచయ్యయు, బ్రహ్మయ్యయు సాక్షులు.

బస:—ఈనిర్ణయమునకు నీవు తిరిగిపోయినచో శివభక్తులు నీప్రాణములు గొందురు.

జగ:—ఈనిర్ణయమునకు నేను దిరిగిపోయినచో శివభక్తులకు మున్న నేనే నా ప్రాణములు లీసికొందును.

బస:— పురాతయ్యా! ఈమహాద్రోహికంటక చ్ఛేదమహాకార్యారంభమునకు జగదేవునకు వీరతాంబూల మిప్పింపుము.

(పురాతయ్య తాంబూలము తెచ్చియిచ్చును.)

జగ:—

ఘంబుండుఁగ ప్రమథుల్ గణేశ్వరుఁడునాసాక్ష్యంబు బ్రహ్మయ్య సాక్ష్యంబౌ మాచయ సాక్ష్యమా బసవఁడే సాక్ష్యంబు నిక్కంబుగాఁ
దాంబూలంబు గ్రహించితిఁ శివదురంత ద్రోహికంఠాద్రిర
క్తంబుఁ దాఁ జనిచూడఁ జేసెదనుమత్ఖడ్గాహిజిహ్వాగ్రమున్.

(తాంబూలము గ్రహించును.)

బస:—జగదేవా!, ఇంక నీవు పోవచ్చును.

జగ:—నీవు నా యింటికి భోజనమునకు రావలయును.

బస:—ఒక పూట భోజనమున కొరకు శివద్రోహి కంఠము నెలపెట్టెదవా?

జగ:—బసవేశ్వరా! వాఁడు వట్టి శివద్రోహి కాకపోవచ్చును. ఎవఁడో, నా పుత్రుఁడో, నా గురువో, నారాజో.

బస:—జగదేవా! ఒక పూట భోజనమునకు నీప్రాణము వెలకట్టితివి.

జగ:—బసవా! నాయొక్క ప్రాణమేకాదు; నా గౌరవము, నా భక్తి, నా జన్మలోని పరమార్థ మంతయు వెలకట్టితిని.

బస:—నే నింత యూహింపలేదు.

జగ:—నే నంతయు నూహించియే ప్రతిజ్ఞకైకొంటిని.

బస:—శివద్రోహభయముచేత నిట్లు చేయించితిని.

జగ:—బసవఁడు నాయింట నారగించునని నే నిట్లు చేసితిని.

బస:—శివద్రోహమేమైనను సరే. నీమాటనీవు లీసికొనుము.

జగ:—శివద్రోహ విషయముకాదు. నామాట యిచ్చినతరువాత మరలఁ దీసికోను.

బస:—ఇంక భోజనమేమి రుచించును?

జగ:—బసవా! నీకా? నాకా?

బస:—నాకు శివద్రోహివధయే ముఖ్యము.

జగ:—నాకు బసవఁడు నా యింట భోజనము చేయుట ముఖ్యము. నా కిపుడు భోజనము మిక్కిలియు రుచించును.

గీ. ఇదివఱకు వట్టి భక్తుఁడై యెలమికాఁడు
నై బసవఁ డేఁగుదెంచి తా నారగించు
నిపుడు నా ప్రాణలింగమై యీ మదీయ
మఖిల జన్మతత్త్వార్థమై యారగించు.
ఇదివఱకు వట్టి బసవఁడై యేఁగుదెంచు
నిదివఱ కమాత్యుఁడైమాత్ర యేఁగుదెంచు
నిపుడు నా ప్రాణలింగమై యేఁగుదెంచు
నిపుడు శివపరతత్త్వమై యేఁగుదెంచు.

బస:—జగదేవా! బాహిరలింగధారణమునందు నేను మిక్కిలి విశ్వాసిని. నీవు నన్నావిశ్వాసమునుండి కదలించుచున్నావు.

జగ:—గురూ! బసవేశ్వరా!

ఏతేరవయ్యా నందీశ్వరస్వచ్ఛావతార జగత్త్రయాధార వీర!
అనుదెంచవయ్యా శివానందచిత్కళాసార మహాకృపాసార వీర!
వేంచేయవయ్యా విమలాత్మశివతత్త్వపార! సుభక్తిసంభార! వీర!
విచ్చేయుమయ్యా సంపచ్ఛయప్రారంభకార! ఋతార్థప్రకార! వీర!
నడచిరావయ్యా! బసవయ్యా! నాథనాథ!
కదలిరావయ్యా బసవయ్యా గరళకంఠ

యింటిరావయ్యా బసవయ్యా! యాభవమూర్తి
తోసరావయ్యా శివమతద్రోహిచంపె!

బస:— జగదేవా! నీవు పదమా! నేను వెనుక వచ్చు చుంటిని.

జగ:— రా! రా!

పరిక్రమింతురు. వెనుక తెరపడి బసవాదులు తిరోహితులగుదురు.

జగ:— ఓహో! ఇదియేమిటి? నేత్రములయెదుట సాక్షాత్కరించుచున్నది. మొట్టమొదట సర్వము నీలాకాశముగాఁ గనిపించి క్రమక్రమముగా మూఁడుకొనలతోడిబల్లెము నేత్రములకుఁ గనిపించుచున్నది. కైలాసశిఖరము వెనుక నీ ముమ్మొనవాలు,

గీ. నడుమ సితమండలమ్ము నాయెడను గెంచి
దరుణ మండల మాపైని శ్యామలోగ్ర
మండలము మూఁడుగాఁదోఁచి మంచుఁగొండ
స్వచ్ఛశిఖరమ్ము వెన్కసాక్షాత్కరించు.

ప్రత్యంతధాత్రి యంతయు నల్లనై శిఖర మాకాశపథమునఁ బెరుగుకొలది క్రమక్రమముగ నలుపు విరిగి తెల్లనై శిఖరోర్ధ్వభాగము క్షీరపాథోధి తరంగడిండీర శకలమువోలె గొగ్గిగొగ్గియై కనిపించుచున్నది. ఈనీలాకాశము నీత్రిశూలముయొక్క యర్థ మేమి? త్రిశూలము పరమేశ్వరుని సంహారచిహ్నము. ఓహో నేను సంహారణాయుకమునైతిని. త్రిశూలాంశ నాలోఁ జొచ్చుచున్నది. ఈబరువునేను బట్టలేను. కాదు,కాదు, బసవేశ్వరుఁడు నాయింటికి విందారగింపవచ్చుచున్నాడు. ఏఁడీ! బసవేశ్వరుఁడు. నేను తొందరగా నడచితిని కాఁబోలు. వారు వెనుక పడినారు.

(మరల తెరయెత్తఁగా బసవేశ్వరాదులు కనిపింతురు)

జగ:— బసవేశ్వరా! మఱికొంచెము తొందరగా రెండడుగులు వేయవలయును. పదార్థములు చల్లారి పోవునేమో! రుచితప్పిపోవునేమో! రా!రా!నాగృహదేహళియందు ముత్తయిదువ లారతులతో నెదురు చూచుచున్నారు. నీదర్శనమైనంతనే మంగళవాద్యములు ప్రయోగించుటకు వాద్యకులు ప్రతిలిప్తను నిరీక్షించుచున్నారు. బ్రాహ్మణులు నీకై వేదఘోషలతో నీవడుగుపెట్టునిముసమునకు స్వరితము ప్రయోగించుటకు శబ్దమయలోకమును జాగ్రత్తతోఁ బరీక్షించుచున్నారు. రా! బసవా! రా!

## అష్టమాంకము

[ప్రవేశము : అల్లయ్య మధుపయ్యలు.]

అల్లయ్య:— మధుపయ్యా! రాజు మన్నెందుకు పిలిపించాడంటావు ?

మధు:— ఆరోజున మనం బసవయ్యయింటికి భోజనానికి పోతూ రాజదివాణం ముందరగా రాజునేవో కొన్ని మాట లన్నాం. ఆయన వెళుతూ, పోయే వాళ్లందరినీ చూస్తూనేవున్నాడు. మనమాటలు వినునాడేమో అనుకున్నాను.

అల్ల:— అపుడు మన మేమన్నామంటావు ?

మధు:— ఏమన్నాం? చాలా అన్నాం. మాకు బసవడే దేవుడుగాని బిజ్జలుడి లెఖ్ఖేమి టన్నాం.

అల్ల:— నే నామాట లనలేదు.

మధు:— నీ వామాట లనలేదేమో కాని రాజును కావలిస్తే చంపేస్తా నన్నావు.

అల్ల:— మధుపయ్యా! అబద్ధాలు చెప్పకు. కొంపముంచి యెవరైనా వింటారేమో? బిజ్జలుడంటే నాకు చాలా గౌరవం; భక్తీనీన్నీ.

మధు:— నాకుమాత్రం లేదా భక్తీ గౌరవమున్నూ. ఆరోజున ఉత్సాహంలో అన్నాముగాని.

అల్ల:— ఆమాటలు రాజు విన్నా డంటావా? వినియుండడు.

మధు:— విన్నాడనే నా అనుమానం! అయినా తినబోతూ రుచులెందుకు ? అక్కడికే వెళుతున్నాంగా. విన్నాడో లేదో నిమిషంలో తెలుస్తుంది.

అల్ల:— వింటే ప్రాణంమీదికి వస్తుందిగదా!

మధు:— రా జేమి చేస్తాడు?

అల్ల:— ఏంచేస్తాడేమిటి? రాజు యేం చెయ్యలేడు ? తల నరికిస్తాడు. చాలునా ?

మధు:— తల నరికిస్తే నష్టమేముంది: నిమిషంలో చస్తాం. వెంటనే శివసన్నిధానానికి పోతాం.

అల్ల:— కాదు. తల నరికించకుండా యేదో బాధ పెడతాడు. ఉదాహరణకి - కళ్లు పీకిస్తాడనుకో, దాంతో యెంత బాధపడాలి ?

మధు:—ఓయీ అల్లయ్యా! బసవణ్ణి దాటి రాజు యేమీ చెయ్యేలేడు. బసవడంటే రాజుకు చాలా భయం. మనం బసవడి పరివారంలోవాళ్లం. మనమీద చెయ్యివేసి రాజు బతుకుతాడా? రాజుదగ్గిరికి పోదాం పద.

అల్లః:— బసవడూ రాజూ మాట్లాడుతున్నారట గదా! బసవ డక్కడేవున్నాడు గనుక భయంలేదు.

(నిష్క్రమింతురు.)

[ఇది షష్ఠరంగము.]

[తరువాత బిజ్జలుడును బసవామాత్యుడును ప్రవేశింతురు.]

బిజ్జ:—బసవా! ఇంక నీచేతగాదన్నమాట నేను వినను. హనుమకొండ సైన్యమును గెలిపించి తీరవలయును. ఇది నీ చేతిలోని పని. హనుమకొండ సైనికులమీద మహామారిని ప్రయోగింపుము. మీకాంఖైరవుని బంపి వారిసైన్యమును విఱుగబాఱిపింపుము. మఱల సైన్యములు సిద్ధముచేసితిని. ఈసారి బిజ్జదేవునే యుద్ధమునకు బంపుచున్నాను. వెళ్లినచో నీవుకూడ వెళ్లుము.

బస:—రాజా! వెళ్లుటకు నాకేమియు నభ్యంతరములేదు. నేను వారిమీదికి మహామారిని ప్రయోగింపజాలను. నేను భూతవైద్యుడనుగాను. శాక్తేయుడను గాను.

బిజ్జ:— భూతవైద్యు డొకరిద్దఱిమీదనే ప్రయోగము చేయగలడు. శాక్తేయు డొకకొంప కొంప నాశనము చేయనచ్చును. నీ వట్లుకాదు. ఒక్క పెట్ట ముప్పదివేలమంది చేత విషము త్రాగింపగలవు, వారిని జావకుండను జేయగలవు; చంపనుగలవు.

బస.—రాజా! ఈపని నాచేతగాదు.

బిజ్జ:—నీచేతగాదా! కాదా! నీవు శివభక్తుడవుకాదా? గరళము త్రాగలేదా? నీవు చేసినయద్భుతకార్యము లన్నియు నెట్లు చేసితివి? ఆకార్యములు చేయుటకు నీకున్నశక్తి యీపనులుచేయుట కేల లేదు? బసవా! ద్రోహచింత మానుము, నేను సామ్రాజ్య మేలుట నీ కిష్టములేదా? నేను జక్రవర్తినైనచో నీవు సామ్రాజ్యమునకంతయు మహామాత్యుడవు కావా. బసవా? నీకంత యాశకలదేని సగముధాత్రియంతయు నీవు తీసికొనుము. మిగిలినసగమే నాకిమ్ము.

బస:— రాజా! నాచేతగానిపనికి నన్నేందు కిబ్బంది పెట్టెదవు?

బిజ్జ:—బసవా! రాజ్యమంతయు నీవే యేలుము. పేరునకుమాత్రము నన్ను సార్వభౌముడని యనుము.

బస:—బిజ్జలా! కొన్ని సమయములయందు శివుడు నన్ను రక్షించుట నాకొంపమీదకు దెచ్చినది. నా కీయమాత్యపద మక్కఱలేదు. నాదారిని నన్నుబోనిమ్ము.

బిజ్జ:—బసవా! నా మాటలధోరణినిబట్టి నీవు నన్ను దురాశాపరు డనుకొనుచున్నావు. నేను దురాశాపరుడనుగాను. ఈధాత్రియంతయు నొక్కగొడుగు క్రిందికి వచ్చుటయే నాయుద్దేశము. నీవు సర్వభారతదేశము నొక్కగొడుగుక్రిందికి దెమ్ము, నన్ను జంపి నీయిష్టము వచ్చినవానికి బట్టము కట్టుము. ఉత్తరహిందూస్థానమున మొగలులుల దాడు లెక్కువగుచున్నవి. వారు క్రమక్రమముగా దక్షిణాపథము నొత్తుకొనివత్తురు. నీవంటి మహాపురుషుడు మరల జన్మింపడు. నీమాట కెదురాడలేక శివుడే నైనను జేయును. బసవా! నీవు వట్టి బికారి శివభక్తుడవైనచో నిన్ను నేనడగను. నీవు మహామాత్యుడవు. నీతిబుద్ధితో నాలోచింపుము. ఇక్కడ మనరాజ్యము. హనుమకొండలో బ్రోలరాజురాజ్యము. ఆపైని నోఢ్రులది. ద్వారసముద్రమున హొయసాలులు. దేవగిరిలో యాదవులు. దక్షిణమున జోళపాండ్యులు. కనుక మొక్కదక్షిణాపథమంతయు నొక్కగొడుగుక్రిందికి దెమ్ము. శైవమో, వైష్ణవమో, బ్రాహ్మణ్యమో, యీగడ్డమీద బుట్టినవారిచేత నీయిలయెల్ల నేలింపుము. ఇట్లు ముభావము వహింపరాదు. నీవు బదులు చెప్పుము.

(బసవడు నిష్క్రమించును.)

బిజ్జ:—ఎవడురా? అక్కడ?

ద్వారికుడు:— (ప్రవేశించి) ప్రభూ! ఆజ్ఞ.

బిజ్జ:—అల్లయ్యమధుపయ్యలు వచ్చిరా?

ద్వా:—వచ్చి సిద్ధముగానున్నారు మహాప్రభూ!

బిజ్జ:—లోనికిఁ దీసికొనిరమ్ము.

(దౌవా:—నిష్క్రమించును. అల్లయ్య, మధుపయ్యలు ప్రవేశింతురు.)

మధు:—మమ్మిరువురి నేలకో మహారాజులు పిలిపించినారఁట.

బిజ్జ:—మధుపయ్యా! నే నెక్కువా, బసవఁ డెక్కువా?

మధు:—ప్రభూ! మహారాజులు గనుక మీ రెక్కువ. మహాభక్తుఁడు గనుక బసవయ్య యెక్కువ.

బిజ్జ:—అల్లయ్యా! నీవు చెప్పుము. నీవు నన్ను గౌరవింతువా, బసవేశ్వరుని గౌరవింతువా?

అల్లు:—ప్రభూ! మహారాజులని మిమ్ము గౌరవింతును. మహాభక్తుఁడని బసవేశ్వరుని గౌరవింతును.

బిజ్జ:—అల్లయ్యా! మధుపయ్య నేర్పినమాటలు పలుకుచుంటివి. మిమ్మిద్దఱ నడుగుచున్నాను. మీరు రాజద్రోహు లవునా, కాదా?

మధు:—మే మేమిరాజద్రోహము చేసితిమి? రాజద్రోహ మనఁగా నేమి?

బిజ్జ:—బిజ్జలునియాజ్ఞకన్న బసవేశ్వరునియాజ్ఞ నెక్కువగా మన్నించుట రాజద్రోహము.

అల్లు:—మహారాజా! ఆలెక్కను వీరశైవు లందఱును రాజద్రోహులే.

బిజ్జ:—తక్కినవారిమాట నాకుఁ దెలియదు. మీ రిద్దఱును రాజద్రోహులని నే నెఱుఁగుదును.

అల్లు:—ప్రభూ! మేము చేసిన రాజద్రోహ మేదియో మాకుఁ దెలియదు.

బిజ్జ:—నీకుఁ దెలియదా? మధుపయ్యకైనను దెలియు ననుకొందును.

మధు:—మహారాజా! ఆనాఁడు మే మనిన మాటలు ప్రభువులు విని యిట్లనుచున్నారు.

బిజ్జ:—నేను వినవలయుననియే శివభక్తు లట్లన్నారు.

మధు:—తగినశిక్షవిధించినచో ననుభవించుటకు సిద్ధముగా నున్నాము.

బిజ్జ:—ఆశిక్షమాట తరువాత. మీతో నే నొకమాట చెప్పఁబోవుచున్నాను. ఒకకార్యము సాధించి పెట్టుఁడని యడుగుచున్నాను. మీ శివభక్తులలో మీ యిద్దఱ నిట్లడుగుటకు నాకుఁ గలిగినంత వీలు మఱి యింకొకరితోఁ గలుగలేదు.

మధు:—ప్రభూ! ఆకార్య మేదియో చెప్పుఁడు. చేతనైనచోఁ దప్పకుండఁ జేసెదను.

బిజ్జ:—నాకోసము చేయనక్కఱలేదు. మీ ప్రాణములకోసమే చేయవలయును.

అల్లు:— ప్రభూ! ఆకార్యమేదియో సెలవిండు.

బిజ్జ:—అల్లయ్య మధుపయ్యలారా! బసవేశ్వరుఁడు మహాభక్తుఁడుకదా!

ఇద్దఱు:—అందుకు సందేహము లేదు.

బిజ్జ:—మాచయ్య యేనుఁగును జంపెనుగదా!

ఇద్దఱు:—చంపెను.

బిజ్జ:—అల్లే యొకవేయి యేనుఁగులను జంపలేఁడనఁగలమా?

ఇద్దఱు:—అనలేము.

బిజ్జ:—బసవఁడు చెప్పినచో మాచయ్య యేపనియైనను జేయునుగదా!

ఇద్దఱు:—తప్పకుండఁ జేయును.

బిజ్జ:—బసవయ్య ముప్పది నలువదివేలమంది శివభక్తులచేత విషము త్రాగించెనుగదా!

ఇద్దఱు:—త్రాగించినాఁడు.

బిజ్జ:— ఇటు చూడుఁడు! బసవని దయ లేనిచో నంతమందియు విషముత్రాగి యానాఁడు చావవలసినదే.

ఇద్దఱు:—చిత్తము, చిత్తము.

బిజ్జ:—అతఁడు చంపఁదలఁచుకొన్నచో నింతమందియు బ్రదికెడువారా?

ఇద్దఱు:—బ్రతుకరు, బ్రతుకరు.

బిజ్జ:—మధుపయ్యా! బిజ్జలుఁడు వృషభావతారము. ఆయన యిది చేయఁగలఁడు; ఇది చేయలేఁడని లేదు. మీ రిద్ద్వరును బోయి రాజిట్లు చెప్పెనని బసవేశ్వరునితోఁ జెప్పుఁడు.

మధు:—ఏమని చెప్పవలయును?

బిజ్జ:—మూఢుఁడా! భక్తిలో నున్న మూఢత్వము; భక్తిలో వివేకమో, సామాన్య విషయములందది మూఢత్వమే యగుచున్నది.

అల్ల:—వేదపాఠి జడుఁడు; భక్తుఁడు మూఢుఁడు. మాకు దయచేసి విప్పిచెప్పుడు.

బిజ్జ:—మి మ్మిచ్చటి కెందుకుఁ బిలిపించితిమి?

మధు:—మేము రాజద్రోహుల మని.

బిజ్జ:—నేను బసవేశ్వరుని గుఱించి యేమి చెప్పితిని?

మధు:—ఆయన మహాభక్తుఁ డని. ఆయన మహాద్భుతకార్యములు చేసెనని.

బిజ్జ:—చేయఁగలఁడనికూడఁ జెప్పితిని.

మధు:—చిత్తము.

బిజ్జ:—బసవేశ్వరునితో నిదే పోయి చెప్పుఁడు.

అల్ల:—చిత్తము, చిత్తము.

బిజ్జ:—ఇంక మీరు పోవచ్చును. మీరు తేపుదయమున నిచ్చటికి వచ్చి బసవేశ్వరుఁ డేమనునో నాతోఁ జెప్పవలయును.

(ఇద్దరును నిష్క్రమింతురు.)

బిజ్జ:—ఎవఁడురా! అక్కడ?

దౌవారికుఁడు:—(ప్రవేశించి) ప్రభూ! ఆజ్ఞ.

బిజ్జ:—త్రిపురాంతకభట్టారకుని దీసికొనిరమ్ము.

దౌవా:—చిత్తము.

(నిష్క్రమించును.)

బిజ్జ:—భట్టారకుఁడు వచ్చెనా?

త్రిపు:—(ప్రవేశించి) బల్లహా! వచ్చితిని.

బిజ్జ:—భట్టారకా! గొల్లకళియంబను బసవఁడు చేతులతో నెత్తినప్పుడు మీ రొక యుక్తివాదమును జెప్పితిరి. జ్ఞాపక మున్నదా?

త్రిపు:—జ్ఞాపకమే కాదు; కొంతవఱకు విశ్వాసముకూడ నున్నది.

బిజ్జ:—బసవేశ్వరుఁడు శివభక్తు లందఱకు విసముపోసి తానుగూడఁ ద్రాగినపుడు నేను, జగదేవుఁడు, మాచయ్య మొదలగు శివభక్తులు బసవనికిఁ గైవారము పట్టితిమి. అప్పుడు భట్టారకులుగూడఁ గైవారము పట్టిరి. జ్ఞాపక మున్నదా?

త్రిపు:—ప్రభూ! జ్ఞాపక మున్నది. అప్పుడు నేనును విశ్వసించితిని.

బిజ్జ:—మాయందఱవలె సంపూర్ణముగా విశ్వసించితిరా? మీరు బ్రాహ్మణులుకావున బ్రాహ్మణపద్ధతిగా విశ్వసించితిరా?

త్రిపు:—ఆయుత్సాహములో నెవ్వరికి నొడలు తెలియలేదు. నాకును దెలియలేదు.

బిజ్జ:—తెలిసిన తరువాత యుక్తివాదము కుదిరినదా?

త్రిపు:—కుదుర్చవచ్చును.

బిజ్జ:—కుదుర్పుఁడు.

త్రిపు:—మహారాజా! మనమెవ్వరమును బోయి యాగంగాళములలోనిది నిజముగా విసమో, కాదో చూడలేదు. దూరమునకు విషపువాసన వేసినది. ఆవాసన గుడిలోపలఁ గొందఱు పొగలుపెట్టి చేటలతో విసరి ప్రవర్తింపఁజేయవచ్చును. వారు త్రాగినది భోజ్యవస్తువే కావచ్చును. మనము పోవునప్పటికే ముంతపొగవలె శృంగి, కాలకూటాదులు తగులఁబెట్టి యాపొగఁ బఱపింప వచ్చును.

బిజ్జ:—మనము పోయి గంగాళములలోనిది విసమో, కాదో చూడకపోవుట మనదే లోపము.

త్రిపు:- అప్పు డావాసనమూలముగా మనకందఱకు విశ్వాసము కుదిరినది. అప్పు డాయూహ మనకుఁ దోఁచలేదు.

బిజ్జ:—అది నిజముగా విసమేనేమో?

త్రిపు:—మహాప్రభూ! ముప్పది నలువదివేల మంది శైవులలోఁ బ్రతివాఁడును నంతశ్శుద్ధి కలవాఁడనుటకు వీలు లేదు. కామక్రోధాదు లంతర్మలములు. అవి బసవేశ్వరునకే పోలేదు. భక్తిపారవశ్యమునఁగొన్ని గడియలలో భక్తునకు మహాత్త్వప్రాప్తి కలుగవచ్చును. అందఱకు నెల్లప్పు డట్లు కలుగదు.

బిజ్జ:—భట్టారకా! శివనాగుమయ్యచేతఁ బాలు పిండెనుకదా బసవఁడు. దాని కేమందురు?

(త్రిపురాంతక భట్టారకుండు నవ్వును.)

బిజ్జ:—నేను గనులార చూచితిని ; మీరును జూచితిరి.

త్రిపు:—బల్లహా! భక్తి వేఱు. ఇట్టి మ్రుక్కిడి పనులు వేఱు. విప్రవినోది మనము చూచుచుండఁగాఁ బాములను జేయును. ఎడమచేతి గుప్పిటిలోఁ బ్రహ్మ తిమ్మక్కను బెట్టి కూయించును. అది వాని యడచేతి కండరములలోని మెలకువ. గొంతులోని కండరములు కదపకుండఁ బెదవులు మెదపకుండ ధ్వని పుట్టించుటకు సాధనచేసిన నేర్పు.

బిజ్జ:—పా లెచ్చటనుండి వచ్చెనయ్యా ?

త్రిపు:—విప్రవినోది పెద్దపామును మన యొడి లోనుండి తెప్పించును. వానియొద్ద నున్న చిన్న సంచి లో నంతపాము పట్టదు. వాఁ డెచ్చటనుండి తెచ్చెను ?

బిజ్జ:—భట్టారకా!. మాచయ్య బ్రాహ్మణుని జంపెను, ఏన్గును జంపెను. దాని కేమందువు ?

త్రిపు:—ప్రభూ !. చంపుట యనఁగా మొండెము నకు మొండెమును దలకుఁ దలయు విడిగాఁ బడియుండుట. మరల బ్రతుకుట లేదు. దానితోఁ వాని కర్మ దేహమునకు సరి. బ్రాహ్మణుని తలయు నేన్గుతలయు నెగిరిపోయి నవి. అవి క్రిందఁ బడలేదు. ఏన్గుశరీరము కన్పించలేదు. మాలకు మాంసమును, గొడరికిఁ దోలును లేకుండ. నేన్గు శరీరము మాయమగుట యేమి ? తల క్రిందఁబడ కుండుట యేమి ? గారడివాఁడు లేని మామిడి మొక్కను జూపించును. చేత నాణె మిడుకొని గుప్పిట మూసి తెఱచి వట్టిచేయి చూపించును. మరల మూసి మరల దెఱచినచో నాణె మందే యుండును. ఇది కనుకట్టు.

బిజ్జ:— భట్టారకా ! బసవేశ్వరాదులయందు భక్తివలనఁ గలిగిన మహత్తు లేదందువా ?

త్రిపు:—కొంత యున్నది. అంతయును గాదు.

బిజ్జ:—భట్టారకా ! తమరి కేదైనఁ బని యుండ వచ్చును.

త్రిపు:—చిత్తము. సెలవు తీసికొందును.

(నిష్క్రమించును.)

బిజ్జ :—ఎవఁడురా అక్కడ

దావా :—ప్రభూ! ఆజ్ఞ.

బిజ్జ:—జగదేవ దండనాథుని నేను బిలుచుచుంటి నని తీసికొనిరమ్ము.

దావా:—చిత్తము.

(నిష్క్రమించును.)

బిజ్జ:—ఈ భక్తియంతయు నిట్టి ముష్కరపుఁ బనులకే కాని సామ్రాజ్య నిర్మాణమునకుఁ బనికిరాద్య పనికి రాదా ?

సీల:—(ప్రవేశించి)

ఉమాప్రాణనాథా, మహోగ్రాపధాకీ,
ప్రమాణత్వవేదీ, పరంధామ శూలీ,
జగన్నేత సాంబా, దృగంతాగ్నికుండా,
సమస్తాగమాంభోనిధీ ! సర్పభూషా ;
దిగంతావృతాంశుజ్వలద్దీప్తమూర్తీ
నిరాకార ! యీశా నిరస్తాఘపాశా !

బిజ్జ:—సీలా ! పోపో ! నాకుఁ బనియున్నది. నీపాట లింకొక చోటికిఁ బోయి పాడుకొనుము.

సీలి:—

అనంతప్రకాశా, హరా, చిన్మమూర్తీ
ఘృణాక్షప్తమూర్తీ, పరాత్పరవృక్షా,
సుధాధామమాళీ, వినష్టాంకరాత్మా,
ప్రధాశ్రేణీమూర్తీ ! పుణ్యప్రాప్తిహేతూ.

(నిష్క్రమించును.)

జగదేవుఁడు—(ప్రవేశించి)మహారాజా!వచ్చితిని.

బిజ్జ:—జగదేవా ! నీవు నిన్న బసవేశ్వరుని భోజనమునకుఁ బిలచితివటగదా ! బసవేశ్వరుఁ డెవరి యింటికిని రాడు; మీయింటి కెట్లు వచ్చెను?

జగ:-ఆమహాప్రభువుదయ నామీఁద దొరలినది.

బిజ్జ:—జగదేవా! రాజులు చారచక్షువులుగదా!

జగ:—ప్రభూ ! నేనేమిదోష మాచరించితిని?

బిజ్జ:—బసవేశ్వరుఁడు త్రేపు నీరాజును జంపు మనును.

జగ :—మహాప్రభూ ! అట్లనఁడు.

బిజ్జ:—అనినచో.

జగ:—నారాజు నాచేతిలోఁ జావఁడు. నారాజు చేతిలోఁ వేయిగుణము లెక్కువ నైపుణ్యము గల ఖడ్గ మున్నది.

బిజ్జ:—నీ వాగ్దానమునందు రాజును వదలిపెట్టుట స్వవిధియైయుండెను. నీ వట్లు చేయలేదు. జగదేవా! వృథావేశము భక్తి కాదు. భక్తి జ్ఞానముతోం గూడియుండవలయును. దివ్యమైన తర్కముమీఁద నాధారపడియున్న మతమును వదలి గణాచారుల మత మవలంబింపకుము. అవలంబించితివేని, రాజద్రోహమునందులో నిముడ్చకుము. నేను చనిపోయినచో నా కొడుకులు రాజులగుదురు. నీవు కావు. బసవేశ్వరుఁడు కాఁడు. నా కొడుకులు బలహీనులైనచోఁ దైలపదేవుని సంతతివాఁడు సోమేశ్వరుఁడు రాజగును. బసవేశ్వరుఁడును గాఁడు. జగదేవుఁడును కాఁడు. నీ వాగ్దానమునుండి నీ విప్పుడు మరలలేవు. జగదేవుని నే నెఱుఁగుదును. అందుచేత వాగ్దాన వ్యుపసంహరింపుమని నేను జగదేవు నడుగను. కాని నీ రాజెవరో యాలోచించుకొనుము. ఏ రాజు ఉప్పు నీవు తింటివో యారాజును జంపి నీవు శివలోకమునకుఁ బోలేవు. పోదువుపో, ప్రమథులలో నొక ప్రమథుఁడవై సూకరముఖుఁడవో, యుష్ట్రముఖుఁడవో శునీముఖుఁడవో యొక డయ్యెదవు. అప్పుడు నీకేమి కన్పించినది?

జగ:—మహారాజా, త్రిశూలము కన్పించినది.

బిజ్జ:—సరిగా నిన్న యీవేళకు నాకును త్రిశూలము కన్పించినది. నాకిది మూఁడవసారి కన్పించుట. మొదటిసారి నేను దైలపదేవుని సంహరించినప్పుడు కన్పించినది.

కపురంపుఁ గదళికల్ వెలార్చు గిరివెన్కకుఁ దీప్తిమన్మూర్తియై విపులాకాశము నావరించుచుఁ ద్రిధావిర్భూతరోచిశ్ఛటాకృపమై సత్త్వరజస్తమోవివరణక్రీడాప్రచండంబుతై లపదేవుం డెటు చూచె నేనును ద్రిశూలం బట్టులే చూచితిన్.

జగ:—మహారాజా! త్రిశూలము నేనును నట్లే చూచితినిగాని తమవలె నింత సువిస్పష్టముగా దానిని నిర్ణయించుకొనలేదు. తద్వర్ణనమునందు మీ వాక్కునకుఁ గలిగిన ప్రసాదము నాకుఁ గలుగలేదు.

బిజ్జ:—జగదేవా! నీ మనస్సునందు రాజనీతిశోభాజ్ఞానము పోయి కవితాసౌందర్యజ్ఞాన మెక్కువైనది. నీనుండి యమాత్యత్వశక్తి పోయినది.

జగ:—ప్రభూ! నా యమాత్యఖడ్గము నిందు వదలి పోయెదను.

బిజ్జ:—ఓయీ! ఖడ్గవిసర్జనము సేయకుము. వాగ్దానముమాట చూచుకొమ్ము. ఖడ్గరహితుఁడైన శత్రువునుమాత్రము తాఁకకుము. పొమ్ము.

(జగదేవుఁ డధోముఖుఁడై నిష్క్రమించును.)

బిజ్జ:—అదిగో! త్రిశూలము!

నడుమ సితమండలమ్ము నాయెడను గించి
దరుణమండల మాపైని శ్యామలోగ్ర
మండలమ్ము ముమ్మొనవాలు మంచుగొండ
స్వచ్ఛశిఖరమ్ము పెక్కు సాక్షాత్కరించు.

నేనో, జగదేవుఁడో!

(తెర)

# తిక్కన గద్యరచన

శ్రీ ప్విడి రామం
భళ్లమూడి నరసింహశాస్త్రి

"గద్యం కవీనాం నికషం వదంతి:" మానవ జీవితమునందలి వివిధ ప్రవృత్తులను ఆహ్లాదకరముగా నిరూపించడమే సారస్వతముయొక్క పరమావధి. మహాకావ్యములన్నీ జీవితనాటకమందలి వివిధభాగములను యథార్థముగా చిత్రించి, ధర్మసమన్వయము చేసినవి. "రసో వై సః" యని కీర్తింపబడు పరమాత్మతత్త్వమును రసాత్మకములైన కావ్యములయందు విజృంభింపచేసి మహాకవీశ్వరులు కవితాసామ్రాజ్యమును సృష్టించినారు. సమస్తమైన మానవులకును నిత్యమై, సత్యమైన హృదయధర్మములను, మానసికప్రవృత్తులను ప్రదర్శించుటచేతనే కావ్యములకు స్థిరత్వము సిద్ధించినది. ఏడవశతాబ్దమునందు భవభూతి ఉత్తరరామచరిత్రమునందు చిత్రించిన విషాదఘట్టములు నేడుకూడ పాఠకులహృదయములను ద్రవింపచేయుటయే సాహితీపటిమకు ప్రబల నిదర్శనము. మహత్తరమైన అనుభవములు, గంభీరమైనభావములు, ఉత్కృష్టమైన కళానైపుణ్యము గల కావ్యములే రసవంతములై చిరస్థాయిగా యుండగలవు.

భారతీయవిజ్ఞానమును విజృంభింపచేసి, ప్రాచ్యనాగరికతను వ్యక్తీకరించుటలో భారతం అగ్రస్థానాన్ని అలంకరించినది. ఈ మహా గ్రంథమును ఆంధ్రభాషలోనికి అనువదించుటలో తిక్కన మాతృకకు మెరుగుపెట్టినాడు. సంస్కృతభాషా సంప్రదాయమును గాని, ఆంగ్ల భాషా సంప్రదాయమునుగాని చూచినట్టయితే, ఆయా భాషలలోని యాదిగ్రంథములు పద్యరూపములుగనే వున్నాయి. కాని ఆంధ్ర సారస్వతములోని ఆదిగ్రంథమైన మహా భారతమునందు నిశిత ప్రతిభావంతమైన గద్య పద్యరచనలు అహమహమికాభావంతో శోభిస్తున్నవి. తిక్కన పద్యమునందు యెటువంటి కళానైపుణ్యమును ప్రదర్శించినాడో, గద్యమునందుకూడా అటువంటి కళానైపుణ్యమునే ప్రదర్శించి, ఉత్కృష్టమైన సంఘటనలన్నిటిలోనూ గద్యమునుకూడా ప్రయోగించినాడని నిరూపించడమే యీవ్యాసముయొక్క యుద్దేశము.

సహృదయులు విమర్శన దృష్టితో తిక్కన వచనమును పరిశీలించినప్పుడు అప్రతిహతమైన కళాచాతుర్యము వ్యక్తమవుతుందని వేరే చెప్పనక్కరలేదు. వివిధములైనవర్ణనలూ, నర్మగర్భితంగాయున్న గంభీరమైన భావములు, యీ మహాకవి గద్యములో కూడా విశదీకరించినాడు. యింతేకాకుండా వివిధ పాత్రల హావభావనిరూపణ, మానసిక ప్రవృత్తుల వర్ణనకూడా గద్యమునందు కనపడుతున్నది. విశ్వరూప సందర్శనము, వ్యూహనిర్మాణము, మొదలైన ఉత్కృష్టఘట్టములు వచనములలోనే వివరింపబడ్డాయి. యిదిగాక వివిధములైన అలంకారములు, ధ్వని వ్యంగ్యము మొదలైనవి తిక్కనవచనములో పుంఖాను పుంఖాలుగా కనపడుతున్నవి. ఈకవీశ్వరుని వచనమును జాగ్రత్తగా పరిశీలించినట్లయితే నాలుగువిధములైన గద్యము మనకు వ్యక్తమవుతుంది. మొదటిది హృదయావేశముతో కూడిన వచనము (emotional prose). యిది యుద్ధవర్ణనయందు, భయానక బీభత్సరసములను విజృంభింప చేయవలసివచ్చినప్పుడు ప్రయోగించినాడు. రెండవది భావావేశముతో కూడిన గద్యము (Descriptive and imaginative prose). ప్రభాతకాలము సంధ్యాసమయము మొదలైనవి వర్ణించినప్పుడు యిటువంటి గద్యమును ఉపయోగించినాడు. మూడవది రాజనీతి ప్రయోగించినప్పుడు, కళాప్రపూర్ణమైన ఘట్టములను చిత్రించవలసి వచ్చినప్పుడు ఉపయోగించిన వచనము. దీనినే Diplomatic and artistic prose అని అంటారు. నాలుగవది పాత్రలు పరస్పరంగా సంభాషించినప్పుడు ఉపయోగించిన వచనము (Dialogue prose). యిది అలంకార వివర్జితమై సామాన్యంగా ఉంటుంది. ఈవివిధములైన గద్యరచనలలోనూ తిక్కన ప్రదర్శించిన కళానైపుణ్యము, పద్యములయందు ప్రదర్శించినదానికంటె. యెంతమాత్రము తీసిపోలేదని ముందుముందు రుజువు చేస్తాము.

ఈమహాకవి అప్రతిహతంగా ప్రదర్శించిన కళావిశేషములలో భావశ్లేష (Dramatic Iromy) ఒకటి. దీనిని తిక్కన పద్యములలోనే కాకుండా గద్యమునందుకూడా ప్రయోగించినాడు. సుదేష్ణతో ద్రౌపది స్వవిషయంగురించి చెబుతూ, "పురుషపంచకసనాథనై యుండుదు, నొక్క కారణంబున నద్ధకులను విరోధులచేతం బకులసన్నిధిం దలవట్టియీడ్వంబడి వనంబున కరిగి వ్రతంబుమై వల్లభసహితంబుగా వన్యాహారంబులం గాలంబు గడపుచు బ్రహ్మచర్యంబు నడిపితి నికమీద నియమాచరణంబునకు నొక్క సంవత్సరంబు, గొరంత గలదు" అని అంటుంది. పైవాక్యములయొక్క భావం పాఠకులకు ఒకలాగ, సుదేష్ణకు మరొకలాగ అర్థమవుతుంది. ఈవృత్తాంతం వినగానే పాఠకులకు ద్రౌపది పూర్వచరిత్రమంతా స్ఫురిస్తుంది కాని సుదేష్ణకుమాత్రం యీవిషయం అవగతంకాలేదు. ఆమె ద్రౌపదిని కష్టములపాలైన గృహిణిగా మాత్రమే తెలుసుకోగలిగింది. యీవిధమైన భావశ్లేష పద్యంలో ఉంటే ఆలంకారికులు దానిని లక్ష్యంగా యిచ్చి యెంతో వ్యాఖ్యానం వ్రాస్తారు. కాని గద్యంలో యెంత ప్రతిభను ప్రదర్శించినా తగినశ్రద్ధ తీసుకోరు.

విరాటపర్వం ద్వితీయాశ్వాసంలో మల్లయుద్ధ ప్రారంభాన్ని తిక్కన యెంతో సొగసుగా వర్ణించేడు. స్వభావోక్త్యలంకారానికి యిది నిగ్గుమైన ఉదాహరణము. యిదిగాక మల్లయుద్ధంలో ఆనాటికి ఉండే కొన్ని విచిత్రమైన సంప్రదాయములను కూడా యిక్కడ వర్ణించినాడు. "యుద్ధరంగంబుమన్ను ఫాలప్రదేశంబుల ధరియించి శిరంబులపై జల్లుకొని రెండు సేతుల మునివ్రేళ్లను గొండొకవుచ్చికొని . యొండొరుల

"చనకు నైచి" మొదలైనవాక్యములు యుద్ధారంభమునందు మల్లవీరులచేష్టలను మనోహరముగా వ్యక్తీకరిస్తున్నవి.

గద్యభాగంలో ఉండేవర్ణనలలో రెండు విధములైన విచిత్రములు కనపడుతున్నవి. ఒకసంఘటనను యథార్థంగాను, మనోహరంగాను వర్ణించి స్వభావోక్తియందలి ప్రావీణ్యమును తిక్కన యేవిధంగా నిరూపించినాడో యిదివరకే మనవిచేసినాము. సంఘటన యొక్క యథార్థస్వరూపమును యేమాత్రం వర్ణించకుండా శ్లిష్టోపమలచేతనే ఆసంఘటనను పాఠకుల మనోనేత్రంయెదుట చిత్రించడం రెండవవిధమైన చమత్కారం. యిటువంటి వర్ణనాచమత్కృతి కీచకుని నర్తనశాల వర్ణనలో మనకు కనపడుతుంది. ఈనర్తనాగారంతాలూకు స్వరూపం 'ఇదమిత్థం' అని కవియెక్కడా చెప్పలేదు. కాని "ఘోరాటవీభాగంబునుంబోలె నిర్మనుష్యంబును, అనభ్యస్త శాస్త్రంబునుంబోలె దుర్గమంబును, స్వప్నలబ్ధ పదార్థంబునుంబోలె నదృష్టిగోచరంబును, విషమకావ్యంబునుంబోలె నస్పష్టాలంకారంబును" మొదలైన శ్లిష్టోపమలచేత కలుషితమైన నర్తనాగార స్వరూపం పాఠకులకు స్ఫురింపచేసినాడు. యీవిధమైన కళానైపుణ్యం కాదంబరివంటి సంస్కృతకావ్యాలలో మనకు వ్యక్తమవుతుంది.

కేవలం వర్ణనావిషయంలోనే కాకుండా రాజనీతి? ప్రయోగించినప్పుడు నర్మగర్భంగా గంభీరమైన భావములను వ్యక్తీకరించవలసి వచ్చినప్పుడుకూడా, తిక్కన నిశితప్రతిభావంతమైన గద్యమును ప్రయోగించినాడు. కీచకునిచేత పరాభవింపబడి ద్రౌపది కుంగిపోతున్నప్పుడు, ధర్మరాజు ఆమె పరాభవమునకు తగిన ప్రతీకారం చేయకపోవడమే కాకుండా ద్రౌపదినే మందలించి సభను విడచి వెళ్లిపొమ్మని చెప్పినాడు. అప్పుడు ద్రౌపదికి ధర్మరాజుపైన అపరిమితమైన కోపం వచ్చి, "మత్పతి శైలూషుండు కాడు, కితవుండునుం గావున జూదరియాలికి గరువతనం బెక్కడి యది?" అని అంటుంది. ఈనర్మగర్భితమైన నిందావాక్యములవల్ల ద్రౌపది ప్రౌఢత్వము మనకు వ్యక్తమవుతున్నది. తన ఆత్మగౌరవమునకు భంగం కలిగినప్పుడు ఆధునిక నాగరక స్త్రీలవలెనే భర్తనుకూడా మందలించుటకు వెరవని ధీరనారీశిరోమణి ద్రౌపది. ధర్మరాజుయొక్క జూదమునందలి వ్యామోహమే ద్రౌపదిభంగపాటునకు కారణమని "జూదరియాలికి గరువతనం బెక్కడియది" అనే వాక్యంలో ధ్వనిస్తున్నది. యింతేకాకుండా మనోహరమైన సంఘటనలను చిత్రించడంలో ఆరితేరినశిల్పి తిక్కన. అనేకమంది మనుష్యులున్నప్పుడు వారిలో యిద్దరు యితరులకు యేవిధమైన అనుమానం కలిగించకుండా, ప్రత్యేకంగా మాట్లాడుకునే విధానాన్ని యీయన యెన్నోచోట్ల అతిరమ్యంగా నిరూపించినాడు. యీఘట్టములో, ద్రౌపది బహిరంగసభలో క్రోధపూరితమైన మాటలతో ధర్మరాజును నిందిస్తున్నప్పటికీ వీరిద్దరకుగల ప్రత్యేకసంబంధాన్ని గాని ద్రౌపదితాలూకు నిజమైనభావములనుగాని, విరటుని సభలో యెవరూ సర్తించలేకపోయినారు. యిటువంటి చమత్కారమైన ఘట్టములను పూర్వకవీశ్వరులు సాధారణంగా పద్యములలోనే చిత్రించేవారు. ఉత్కృష్టమైన వచనంలోకూడా యిటువంటి ఘట్టములను రచించిన మహాకవియొక్క కళాప్రపూర్ణతను పాఠకులే ఊహింతురుగాక.

తిక్కన అమాత్యుడైనందుకు తనరాజనీతికౌశలాన్ని భారతమంతటా అప్రతిహతంగా ప్రదర్శించినాడు. శస్త్రాస్త్రములను సంధించి సేనాసముద్రాన్ని యెదుర్కొనవలసి వచ్చినప్పుడు యెటువంటి కళానైపుణ్యాన్ని ప్రదర్శించవలసి యుంటుందో, సౌధాంతరాళములందు రాజనీతిజ్ఞులతో ప్రసంగించినప్పుడు యెటువంటిప్రజ్ఞను విజృంభింపచేయవలసి యుంటుందో తిక్కన బాగాగ్రహించినాడు. యిటువంటి సంఘటనలలో సాధారణంగా వ్యక్తమయే హావభావ విలాసములనుకూడా యెంతో ఉచితముగా నిరూపింపగల మేధావి తిక్కన. గోగ్రహణసమయంలో కౌరవసేనాసముద్రాన్ని యెదుర్కొనడానికి ఒంటరిగా వస్తున్న అర్జునుని చూచి ద్రోణుడు అబ్బురపడతాడు. తనశిష్యునికి నిష్కారణంగా సమయభంగం అవుతుందేమోనని భయపడి తనసందేహనివారణంకోసం భీష్ముని ప్రశ్నిస్తాడు. ప్రతికక్షులనుసరించి బహిరంగంగా ప్రసంగించడం యుక్తం కాదుగనక "సురనదీసూనువదనంబు వీక్షించి సన్నవార నిట్లనియె". యీవిధంగా యుద్ధరంగంలోని సేనానాయకుల ఆంగిక చేష్టలనుకూడా యుక్తంగా యీకవి వర్ణించినాడు. ద్రోణునిసందేహాన్ని భీష్ముడు గ్రహించినాడు గాని వెంటనే ప్రత్యుత్తర మిచ్చినట్టయితే వీరిద్దరు ప్రత్యేకంగా మాట్లాడుకోవడంచూచి దుర్యోధనుడు అనుమానిస్తాడేమోనని, ద్రోణునికి కావలసిన విషయమును నిగూఢంగా వుంచి దుర్యోధనునితో ప్రసంగిస్తాడు. ద్రోణుడు అవహిత్థుడు కాబట్టి సంతోషకరమైనవార్తను విన్నప్పటికీ తనసంతోషమును యెంతమాత్రము పైకి వ్యక్తీకరించలేదు. "సమయభంగంబువలని సంకటంబులేకునికి మనంబున ప్రియంబంది మొగంబున దోపనీక" అని అవసరమైనప్పుడు బహుసూక్ష్మమైన హావభావములనుకూడా యథార్థముగా వర్ణించి పాత్రను రమ్యంగా మనోనేత్రంయెదుట సృష్టిస్తాడు.

తిక్కన భారతంలో ప్రదర్శించిన రాజకీయ విజ్ఞానాన్ని పరిశీలించినట్టయితే యీమేధావి ఉత్కృష్టమైన ఆధునికరాజకీయ వేత్తలతో సమానమైనవాడుగా కనపడతాడు. సంజయరాయబారఘట్టంలో యీ అమాత్యుడు రాజనీతిని అత్యద్భుతంగా ప్రయోగించినాడు. సంజయుడు కౌరవులపక్షమున రాయబారిగా వచ్చినప్పుడు, ధర్మరాజు యీరాయబారిని గౌరవించి కుశలప్రశ్నలు చేస్తూ "కార్యమునకు ఖడ్గమునకు కర్ణుని ఆచార్యత్వము" చెల్లుతున్నదా? అని ప్రశ్నిస్తాడు. దీనికి ప్రత్యుత్తరంగా సంజయుడు, "కురురాజునొద్ద నవినీతులు, నీతిమంతులు, సత్వసంపన్నులు, దురహంకారులు, మరియు వివిధప్రకారులయి బెరసియుండుదురు" అని చెబుతాడు. పైప్రశ్నకు సంజయుని ప్రత్యుత్తరమునకు పరస్పరసంబంధం లేకపోవడంచేత పాఠకుడు అబ్బురపడతాడు. కాని ధర్మరాజు

కర్ణుని నర్మగర్భంగా యెత్తిపొడుస్తున్నాడని గ్రహించి, మహారాజులను వివిధ ప్రవృత్తులు గలవ్యక్తులు ఆశ్రయిస్తారనిన్నీ, ప్రత్యేకంగా దుష్టులనే నిరూపించ నక్కరలేదనేభావంతో సంజయుడు మిక్కిలి వినయంగా జవాబు చెప్పేడు. ఈవిధమైన రాజనీతి కౌశల ప్రయోగము అమాత్యశేఖరుడైన తిక్కనకే చెల్లింది.

వివిధ గద్యరచనలను అతిరమ్యంగా వ్యక్తీకరించడంలో తిక్కనది సిద్ధహస్తం. సంద ర్భానుసారముగా చమత్కారమైన వాక్యము లను వ్రాయుటలో తిక్కన గొప్పతనమును గురించి యిదివరకే మనవిచేసినాము. యిప్పుడు అలంకారభూయిష్ఠమై, భావావేశముతోనూ, వర్ణనలతోనూ కూడినగద్యమును పరిశీలిస్తాము. ప్రకృతియొక్క గాంభీర్యము, వైచిత్ర్యము, ప్రభాతకాలమునందు, సాయంసమయమందు యెక్కువగా వ్యక్తమవుతుంది. కాబట్టి ప్రకృతిని వర్ణించవలసి వచ్చినప్పుడు కవులు సాధారణంగా యీరెండుసంధ్యలనే వర్ణిస్తారు. తిక్కన ప్రభాతకాలవర్ణన యెక్కువభావా వేశముతో కూడుకొని వుంటుంది. దీనినే ఆంగ్లభాషలో (Poetic imagery) అని అంటారు. యిటువంటి గద్యరచన మహా కావ్యముల ఉత్కృష్టతను (epic dignity) యెక్కువగా వ్యక్తీకరిస్తున్నది.

విరాటపర్వం ద్వితీయాశ్వాసంలోయున్న ప్రభాతకాలవర్ణనలో తిక్కన అమోఘమైన కళానైపుణ్యాన్ని వ్యక్తీకరించినాడు. సాధా రణంగా ప్రభాతకాలాన్ని వర్ణించవలసివస్తే కవులు, సూర్యోదయాన్ని, పక్షులకిలకిలా రవములను, పద్మసముదాయాన్ని క్రమంగా వర్ణిస్తారు. కాని ఉత్కృష్టమైన కళారాధ కుడు చేయవలసినపని అంతమాత్రమే కాదు. రాత్రి అంతా చైతన్యవిహీనంగా పడియున్న లోకమునకు ప్రభాతము యెటువంటి చైత న్యము, ఉత్తేజము కలిగించినదో చెప్పి, అటువంటిసంచలనము, ఉత్తేజము గలిగించిన ప్రభాతముయొక్క గొప్పతనమును పాఠకుల ఊహకుమాత్రమే అందజేయకలిగినప్పడే కళా రాధకునిప్రతిభ వ్యక్తమవుతుంది. తిక్కన ప్రభాతకాలవర్ణనలో యిటువంటి చమత్కా రమే మనకు కనపడుతుంది.

ఉదయంకాగానే చెట్లు తమశాఖలపై ఉండేపక్షుల రవములచేత ఒకదానిని ఒకటి పలకరించు కుంటున్నాయి అనిన్నీ, గత రాత్రి నిద్రలేక పోవడంచేత కామినీజనం యొక్కకళ్లు కెంపుబారినా, తెల్లవారు జామున మందమారుతం వారిని లేపలేదనే కోపంచేతనే కళ్లు ఎరుపెక్కిన వనిన్నీ, వర్ణించుటచేత, రాత్రి జడమయంగావున్న ప్రకృతికి ప్రభాతం యెటువంటిచైతన్యమును కలిగించినదో పాఠకులే సులువుగా గ్రహించ గలరు. యిదిగాక ఆలంకారికులు నిర్దేశించిన ఉపమ, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి మొదలైన అలంకారములు పుంఖానుపుంఖములుగా యి టువంటివర్ణనలలో కనపడతాయి.

భారతయుద్ధంలో ఆనాటివీరుల పరాక్ర మాలు, యుద్ధసంవిధానమే కాకుండా, యు ద్ధమునందు అవలంబించే కొన్ని సంప్రదా యములు, వ్యూహనిర్మాణవిధానము మొదలై నవికూడా తిక్కన యెంతోచక్కగా వచన ములో వివరించినాడు. అర్జునుడు, గురువర్యు లైన ద్రోణునితో యుద్ధముచేయవలసి వచ్చి నప్పుడు, తాను ముందు ద్రోణునిపాదముల దగ్గరగా పడేటట్లు రెండుబాణములును, భుజ ములకు సమీపంగా వెళ్లేటట్లు రెండుబాణము లను విడిచిపెట్టినాడు. మొదటిరెండుబాణ ములు ప్రణామమును, తరువాతి రెండుబాణ ములు కుశలప్రశ్నను సూచిస్తాయి. క్షాత్రధర్మ ప్రకారము యుద్ధముచేసినా, శిష్యధర్మాను సారంగా భక్తిప్రపత్తిని చూపించే ఆయోధుని ధర్మనియతిని మనం యెంతైనా మెచ్చుకో వలసియున్నది. ఈవిషయమునుగురించి తిక్క న విరాటపర్వం చతుర్థాశ్వాసంలో సరసమైన వచనంలోనే వివరించినాడు.

ప్రతికక్షులకు అభేద్యంగా ఉండగలందు లకు పూర్వం యుద్ధరంగంలో వ్యూహనిర్మా ణం చేసేవారు. ఈ వ్యూహంయొక్కపటిమ నిర్మాతయైన సేనానాయకుని ధీశక్తినిబట్టి ఉంటుంది. "తానును ద్రోణుండును ముందర నిలచి, వలపట కృపాశ్వత్థామలును, దాపట కృతవర్మమద్రేశ్వరులు, వెనుక బాహ్లికసోమ దత్త భూరిశ్రవులును, నడుమను కురుకుమార సహితంబుగా మహీనాథుండును, అతని అగ్ర భాగంబున సంశప్తకులైన సుశర్మ మొదలు గాగల పదివేవురు రథికముఖ్యులును, నిలుచు నట్లుగా నియమించి, తగ నయ్యైసైన్యంబుల కేనుంగులు, ఏనుంగుల కరదంబులు, అరదంబు లకు దురంగంబులు, దురంగంబులకు విండ్ల వారు, విండ్లవారికి నడ్డాయుధులునడ్డంబగు తెరంగున నిలువ నియోగించి" భీష్ముడు అప్రతిహతమైన మానుష వ్యూహమును నిర్మించినాడనిన్నీ యిటువంటి వ్యూహమును కని, విని యుండలేదనిన్నీ భీష్మపర్వం ప్రథ మాశ్వాసంలో యున్నది.

బీభత్సభయానకరసజనకము లైన యుద్ధ భూమిని పాఠకులకు యేమాత్రం జుగుప్స కలి గించకుండా యీకవి వర్ణించినాడు. యీ సందర్భంలో ఉపయోగించేవచనం యెక్కువ హృదయావేశంతో కూడుకొని వుంటుంది. మచ్చుకు ఒకటిచూడండి. "నిలునిలుమని యేచ ల్చిన ఘోషంబుతోడన వెడలు నిశితశరపరం పరల, దట్టంపుబరపున నంబరంబు నీరంధ్రం బగుటయు దదంధకారంబును భయతిమిరంబు నుం గలిసి సుండియ లవిసి కురుబలంబు యెదురునడువను, మరలం బరవను మరచి, వెరచరిచి, హరితనయ హస్తలాఘవ ప్రశస్తిం దక్కం దక్కిన చేష్టలు దక్కియుండె" యీ విధమైన (emotional prose) హృద యోద్వేగాన్ని కలిగించేగద్యము, యుద్ధ భూమియొక్క సహజస్వరూపాన్ని యెంతో చక్కగా పాఠకులకుస్ఫురింపచేస్తుంది. ఇంతే కాకుండా వీరాధివీరులను వర్ణించినప్పుడు, రూపకాది అలంకారములచేత వారిధైర్య స్థయిర్యములను, శౌర్యప్రతాపములను నిరూ పించినాడు. విరాటపర్వం చతుర్థాశ్వాసంలో అర్జునుడు చిత్రాంగద ప్రభృతి కుమారులను యెదుర్కొన్నప్పుడు వారి ప్రతాపమును వర్ణిస్తూ "గుణధ్వనితంత్రీ నాదంబుగా, గాం డీవంబు వీణగా వినోదంబు సలిపె" అని చెప్పినాడు. వీరప్రదర్శనాన్ని సంగీతప్రద ర్శనంతో యెంతచక్కగా సరిపోల్చినాడో చూడండి!

తిక్కన యీ మహాకావ్యరచనారంభమున "శ్రీ విభవాస్పదంబయిన చిత్తముతోడ మహాకవిత్వదీక్షావిధి నొంచి పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్" అని కవి ప్రతిజ్ఞ చేసినాడు. పద్యకవిత్వమునందు యెటువంటి ఉత్కృష్టతను విజృంభింప చేసినాడో గద్యకవిత్వమునందు కూడ అటువంటి ప్రతిభనే ప్రదర్శిస్తానని తానే ముక్తకంఠముగా చెప్పినాడు. తిక్కన గద్యకవితామాధుర్యమును పాఠకులకు యథాశక్తిగా మనవి చేసినాము. ఇది గద్యయుగము. నేడు చాలామంది మహాకవీశ్వరులు గద్యకావ్యములకే యెక్కువ ప్రాధాన్యము నిచ్చుచున్నారు. కనుక ఆంధ్రులుకూడ కళాదృష్టితో ఉత్కృష్టమైన గద్యకావ్యములను వ్రాయాలి. ఆంధ్రుల భాగ్యవశమున వారి ఆదిగ్రంథమందే గద్యపద్యరచనలు అసామాన్యకాభావంతో శోభిస్తున్నవి. కనుక ఆధునిక కవీశ్వరులు తిక్కనాది కవుల రచనలను పరిశీలించి, నిశితప్రతిభావంతములైన గద్యకావ్యములను సృష్టించవలసి యున్నది. పుస్తకములను వల్లెవేయించి, పట్టప్రదానము చేయుటకంటె ఉత్కృష్టమైన సాహిత్య సృష్టికిని, సాహిత్య పరిశోధనకును తగిన ప్రాధాన్యము ప్రోత్సాహము యిచ్చినప్పుడే విద్యాసంస్థలు నిజమైన భారతసేవచేయగలవు.

---

# 'గీతాలు'

విద్వాన్ విశ్వం

ఆవినూతనభావనిశాంతమందు
పాడుకొనుచుంటి నొక్కయభాగ్యగీతి;
ఎవరు చెవియొగ్గి యిటుపరికించువారు ?
ఎవ్వ రందలిరస మారగించువారు ?

కట్టఁ దెగఁగొట్టుకొని యిరుగట్టులొరసి
పాఱుచున్నది మాసెలయే యొకండు
చవుల నలరునానిర్మలజలమునందు
అలతినడకలఁ దిరుగ రాయంచ యేది ?

పలురకమ్ములపటములు పరిఢవిల్ల
జిలుగునగిషీ లొనర్చితి చిన్నియింట;
మిసమిసలఁ దేలిపోవునామేడయందు
తిరుగులాడి యానందించుతెఱవ యేది ?

రకరకాలసుమాలచీరల ధరించి
చివురుమేల్ముసుంగుల సరిచేసుకొన్న
లేగులాబీల నలరుమాలేతపూల
తోటలోవిహరించునాథుం డెవండు

పులుకుపులుకునఁ దేనియ లొలుకుతొక్కు
పల్కులంబల్కుమాచిటిపాపకాన;
చిలిపిచేతల నర్థముఁ జేసుకొంచు
మురిసిపోయెడుదాత యెవ్వరుడు గలడు ?

ఆమనోహరదివ్యరుతాంతరమున
మలయుచున్నవి కప్రపుపలుకు లెన్నొ ?
వానివలపులు తీవియవాఱుచుండె
భూనభోంతరమును దాటిపోవుచుండె

హృదయము ద్రవించి ప్రకృతిదారిద్ర్య మెంచి
దివ్యవాణీవిలాసమ్ము తేజరిల్ల
పలుకుపలుకున కన్నీరు చిలుకరించి
ఆలపించినా నెన్నొగీతాల నిట్లు

కడుపుదహియించుకొనిపోయి కనుల నీరు
గోటమీటుచు పాడు నీపాటలందు
అబ్బ ? మంటల నెగయుచు నంతరమ్ము
గాల్చివేయునగ్నిని నార్పఁగల డెవండు ?

---

# వింత పోకడలు

వెంపటి

నాగభూషణం

మన్మధుడు మంచీ చెడ్డలు విచారించడానికి అవకాశం ఇవ్వకుండా—

మన్మధుడు బాణాలమీద బాణాలు కురిపిస్తూ ముందుకు దూకిస్తూ ఉన్న పదును పదను వయసులో మెరిసిపోతూన్న నాదముని—

భోజనం చేయగానే గోపాలపురం నుంచి అడ్డదోవను అంతదూరమూ నడిచివచ్చేవాడు—శ్రద్ధగా నాదగ్గర "కుసుమాంజలి" చదువుకునేందుకు!

స్వరాజోద్యమ ప్రారంభాన ఆవేశంతో ఆనర్సు పూర్తిచేయకుండా వదిలేసి మైసూరులో పరిభాషల దాకా వ్యాకరణం వల్లెవేసి అభ్యాస దీక్ష కాలు నిలువనీయ నందువల్ల మదరాసు తిరిగివచ్చేశాడు.

—లైబ్రరీలో ఆరంభమైన ఎరిక బీచ్ సావాసాన పరిచయంగా ముదిరింది. చూసినప్పటి నుంచీవాత్సల్య-ప్రణయం రెచ్చగొట్టే సౌమ్యవైఖరి ఆతన్ని నా అంతేవాసినిగా చేసింది.

ఉదయం నేను అడయారు వెళ్లి వచ్చేవాణ్ణి. మధ్యాహ్న మంతా నాదమునికి ఉదయన ప్రజ్ఞావివరణంతో ఖులాసాగా గడిచిపోయేది. ఎంతబలవంతం చేసినా విననందువల్ల నేనుకూడా, విధిలేక, కులపతి దర్జాతో ఆతని సరదా మన్నిస్తూపరిచర్యలు అందుకోవలసివచ్చేది. అంటే పాద సంవాహనాదికములు కావు! మన కామిషములు కాఫీ - సిగరెట్టుగణములో నివేకదూ!

చూసేవారు—అంటే, మామూలుపరిచయంమాత్రం ఉన్నవారు—నాదముని శాస్త్రనిష్ణాతుడని కలలోనైనా తలచేందుకు వీలులేదు. ఆకారం, భాషణ, రంగేలీ కాలేజీ వాలాఎవడో అనిపించేది. మనతో జోస్తీకుదిరిన తరువాత కావ్య-నగీషీ మనసుకు అనుభవ - శృంగారంమెరుగురావడం ఎంతసేపు! ప్రత్యక్షప్రమాణాన్ని లక్షించే వారిలో అగ్రపూజ మనదే, అందువల్ల! కాని, ఇంతవరకూ ఆతను ఎక్కడా స్వతంత్రించలేదు. నేను చూస్తూ ఉండేవాడిని—త్రోవను వచ్చేటప్పుడు గుమ్మాలలోను, కిటికీల దగ్గరా వయ్యారాలు తేలిపోతూ కనిపించే ద్రావిడకన్యలు నాదముని సందుమలుపుతిరగగానే దగ్గరకు వచ్చేదాకా తనివిదీరా వాలుచూపులు విసిరి ప్రక్కకో, లోపలికో తప్పుకుని మళ్లా కనపడీకనపడకుండా మాయింటిగుమ్మం ఎక్కేదాకా మనసులో మాటలు చూపులతో వెంటరాయబారములు పంపేవాళ్లు! కాని, ఏమనుకునేవాడో బయటకి తొణకడు నావద్ద. ఆప్రస్తావనే తీసుకువచ్చేవాడుకాదు. నేను వేయికన్నులతో కనిపెట్టిచూసేవాడిని మావీధినిఉన్న ఏఅప్సరనోమైనా ఫలిస్తుందేమోనని! కాని ఉహుం.

ఎవరికైనా మాత్రం నిదానం ఎన్నాళ్లు?

ఇక మనసునిలుపలేక సాహసించి పిలిచారు. కబురులంపారు. త్రోవ కాశారు. కాని ఏంప్రయోజనం? ఏఒకరసికురాలి మనోరథమూ ఈడేరలేదు. పైగా వాళ్ల ఎత్తులు కనిపెట్టి నాదముని దోవమార్చి తిరిగివచ్చేవాడు! అంతాగమనించి నేను కొంచెం హెచ్చరికగా ఒకటి రెండు సారులు కదిలించిచూశాను. 'ఏమిటోయ్-విశేషాలు-అని మాటలధోరణిలో పురికొల్పి హుషారిచ్చి హితము ఉపదేశించాను. నాశిష్యుడు అమాయిక ప్రవరభూమికను నిర్వహించడం నాకు తలవంపుగా ఉన్నది. తెలియనివాడా? కాగలపని గురుగంధర్వుడు చేయలేడని సాగరరాజు ఆపుణ్యము కట్టుకున్నాడు.

ఓనాడు మేము బీచ్‌వొడ్డున తరగల ఒరవడికి బరాబరిగా కూర్చుండగా ఆఅందకత్తె మాముందునుంచి పమ్మల్ని లక్ష్యంచేయకుండా నడిచి వెళ్లింది. ఆమెవెంటను పసిపాప తప్పటడుగులకు ఊతయిస్తూ బహుశః వాళ్లతండ్రో, మామగారో ఓపందు వంటిఆయన ఉన్నాడు.

చూడగానే నాదముని కొంచెం ఉలికిపడ్డాడు. ఉబికిపోయిన ఉత్సాహంతో ముఖం వెన్నెలచందమామలాగా కళలుతేలిపోయింది. లేవబోయినాడు. కాని, అంతలో కుదుటబడి కదలకుండా ఆమెపోయినవేపు చూస్తూ నాధ్యాస మరిచేపోయినాడు.

రేడియోపాట రాక్షసంగా ఉండటంచేత వెనుదిరిగి నేనూ ఈవాలకమంతా గమనించగలిగాను కార్యశూరునిగా చేదామని. సాక్షీగా చెపితే అపహసించానని, నేను కనిపెట్టానని, బిడియపడతాడేమోనని ఏమీ తెలి

యనివాడిలాగా మామూలుగా వెళ్లి బస్‌క్రీప్‌పట్టుకురమ్మని మేలుకొలిపాను. స్పెన్సరుబండి దూరాన గుంపుదగ్గర ఉన్నది. జనం చాటు అవడంమూలాన ఆ అమ్మాయి మాకు కనుచాటు అయింది. ఆ మాత్రం అందిచ్చినతరువాతకూడా ఇక, అల్లుకుపోకపోతే అంతటితో క్రాపూ, షోకులూ మానిపించి బ్రహ్మజిజ్ఞాసలోకి దింపవలసిందే!

కూర్చునేఉన్నాను. నాదముని తిరిగిరావడానికి ఎందుకో అంత ఆలస్యము చేస్తున్నాడు. ఎవరితోనన్నా బాతాఖానీ వేసుకున్నాడో ఏమన్నా చూస్తున్నాడో, ఏమైతేనేం, నా మాట మరచిపోయినాడు. ఇక లాభంలేదనుకొని ఎనిమిదికొట్టినతరువాత ఒంటరిగా యింటికి వెళ్లాను.

—వరాండాలో కుర్చీనిఅంటిపడుకుని నిద్రపోతూన్న వాడిలాగా ఉన్నాడు—నాదముని. మెట్లమీద అడుగులచప్పుడు విని కలవరంపడుతూ లేవబోవడం కటకటాలగుండా కనపడ్డది, నాకు.

నేను ఎదురు అవగానే లేచి తల వంచుకొని నిలుచున్నాడు సహోథ లాగా. మెల్లగా ముఖం ఎత్తి కళ్లల్లోకి చూపుతో ప్రశ్నించాను. అర్థం చేసుకుని మరీసిగ్గుపడిపోయినాడు!

ఒకనిమిషం ఇద్దరమూ మాట్లాడకుండా నిలుచునేఉన్నాము. మనసు దిటవుపరచుకునేందుకు కొంచెం వ్యవధి యిద్దామని లోపలికి వెళ్లి, దుస్తులు తీసి, స్నానం చేసి లుంగీ, బనియనుతో తల దువ్వుకుంటూ బయటికి వచ్చి ఇంకా పూర్వపు పోజులోనే ఆతడు ఒదిగి కూర్చుని ఉండటం చూసి—

"సిగరెట్ భాయీ" అని, మూగనోము మానిపిద్దామని, పలుకరించాను. లేచి తీసుకువచ్చి ఇచ్చి అంగారసంస్కారం స్వయంగా చేసి పన్నె అందుకుని లోపల వేసి వచ్చాడు. పచారుచేస్తూన్నవాడి నల్లా నాదముని రావడం చూసి ఆగిపోయి దగ్గరగా వెళ్లి...

"ఎవరోయ్... ఆ అమ్మాయి!" అని ఏకథాటిని అడిగేశాను. తెల్లబోతాడని తెలుసును. కాని...అంతటితో వదిలేస్తానా? రెట్టించాను. తెలియదా ... ఇంతేనామరి—అని, మాటలతో గిలిగింతపెట్టాను.

ఇక తప్పనిసరి అయిపోయింది. ముందుకు రెండుఅడుగులు వేశాడు. ఇద్దరమూ వరాండాచివరకు జేరుకుని నిల్చుని ఉండగా ఆర్చిలో నుంచి వాళ్ల ఇల్లు చూపించాడు! మాలాడ్జికి వెనుక రోడ్డుమీదనే మాకు చాలాసమీపంలో—రెండు ఆవరణలూ కలిసే ఉన్నవనవచ్చును—ఆ అమ్మాయి ఉన్నది. ఉన్నదనుకోవడమేమిటి ఎదురుగుండా గదిలో వెలుతురున వాళ్లందరూ శుభ్రంగా కనబడుతూంటేను! ఆయన కూర్చుని పిల్లవాడితో చెలగాటలాడుతున్నాడు-ఆ అమ్మాయి...ఫోనుదగ్గర నిలుచుని ఏ రికార్డు మొదలువేదామా అని ఆయనను సంప్రదిస్తూన్నట్టు తోచింది.

అక్కడే...నిలబడి పోయినాము. మొదట ఆ అమ్మాయి మా యింటి వేపు చూడలేదు. తరువాత చూసింది కాని గుర్తించలేదు. మరికొంత సేపటికి ఎవరో నిలుచుని తనవైపు చూస్తూన్నారని-గుర్తించినట్టున్నది. కాని, మేమేనని ఎరుగున్నదో లేదో పోల్చుకో లేదు. ఏమనుకున్నదో ఏమో తలుపు వేసుకుని మాకు కనపడకుండా మాత్రం పోలేదు.

—ఫోను రకరకాల పాటలు పలికింది. మధ్యమధ్య వాళ్లమాటలు నవ్వూ అస్పష్టంగా—ఎంతోదూరంలేక పోవడంవల్ల—చూచాయగా వినిపించినవి. వాళ్లు దీపం వేసేసుకునేటంతవరకూ ఆలాగా నిలుచుని ఉండిపోయినాము.

నాదముని రాత్రికి నావద్దనే ఉండిపోయినాడు. భోజనం చేయలేదు. కామగ్రీష్మంమహిమ! మరి ముఖమంతా కంది వాడి జ్వేరించిపోయింది! కనుమాయకుండా మసిలి తెల్లవారకముందే లేచి వెళ్లిపోయినాడు.

—ఆరోజునుంచీ పాతాలకు ఆట విడుపు. సాయంకాలము నాతో రోజూ బీచికి వచ్చేవాడు నలుమూలలా తిరిగేవాడు; తిరిగి యింటికి వచ్చి మామూలు స్థానాన వసారా చివర నిలబడి కిటికీలోకి చూసి చూసి మరునాడు పగలంతా మాయమయ్యేవాడు.

—నేను జోక్యంకలిగించుకుని ఫలరూపానికి తీసుకువద్దామనుకున్నాను. కాని, ముందుకు మంచిది, జీవితంలో ఈలాటి విషయాలలో స్వతంత్ర - అనుభవమే అక్కరకు వస్తుందికదా అని రసరూపకమునకు

ఏకైక ప్రేక్షకస్థానాన్ని మాత్రమే స్వాంగీకరించి ఊరుకున్నాను.

వాళ్లు ఇరువురూ దోవకువచ్చేస్తున్నారు. నిర్భయంగా ఒకరినొకరు చూసుకుంటున్నారు. నాదమునిచేసన్నలకు బదులు సైగలు లేకపోయినా, అభిమతం లేకపోయినా ఆ అమ్మాయి కంటగించుకోకుండా లక్ష్యము చేస్తూన్నది. కాని అంతకన్న ఏమీ అవకాశము ఇవ్వడం లేదు. మాశిష్యుడుకూడా చొరవ చేద్దామనే ఊహతో ఉన్నట్టు సూచనలు లేవు.

—చాలాతమాషాగా ఉన్నది. ఆ అమ్మాయివిషయము! వివరాలు తెలిసినమీదట తత్వం ఏమో బోధపడకుండా మరిన్ని ఆశ్చర్యముగా ఉన్నది. వారిద్దరూ దంపతులు. ఆపసిపాప సంసారఫలము. అంతఅందగత్తె యౌవనవిలాసశోభలు తరితీపులు చేస్తూన్న మోహిని ఆవయసు మళ్లిన అరసికమూర్తితో అమిత ప్రేమతో పొరపొచ్చెములు లేకుండా కాపురము చేస్తూన్నది. రతీమన్మథుల ఆనుకూల్యాన్ని మించిపోయింది వారి దాంపత్యమని ఇంటియజమాని రూఢిగా చెప్పాడు. అది నేను అంతగా నమ్మలేకపోయినా ఒకటి మాత్రం నిజం. ఇంతవరకూ అక్కడకు వాళ్లువచ్చిన మూడుసంవత్సరములలోనూ ఆమె పెడదారితీసిందని పుకారైనా లేదు.

—అయితే, యిటీవలిచర్యను బట్టి సుముఖురాలు కాదనడానికి ఏలావీలు? ఒకవేళ ఏమీఎరుగని అమాయకురాలి నిష్కపటవర్తనను మావాడు, తనకుగా అన్వయించుకుని ఆశలూరుతున్నాడా?

లేక కనబడుతూన్నంత ముద్దరాలుకాకుండా జీవిత - ఇంద్రచాపకాంతులు తరళించిన చంద్రకాంతమా? ఎగతాళికి కికురించడమునకు ఆడుతూన్న కపటనాటకమా?

ఏమీ తేల్చుకోలేకుండా ఉన్నాను. అందమైనవయసుపిల్ల సామాన్యవర్తనలో ఇంత అర్థంకానితనము ఎన్నడూ నాకు తారసిల్లలేదు! పరోక్షాన రకరకాలుగా ఆ అమ్మాయినిగురించి ఆలోచనలు పోనిచ్చి సిద్ధాంతీకరించుకునేవాడిని. ఎంతకైనా తగినజాణ అని నమ్మేవాడిని. కాని, ఆలజ్జావతిని చూడగానే మళ్లా మనసులో రాద్ధాంతము ప్రారంభమయ్యేది.

నేనే ఒకనిర్ణయమునకు రానప్పుడు నాదమునికి ఏమనిసలహాయిచ్చి కాండ నడిపించగలను? ఏమీ పాలుపోవడం లేదు. కాని ఒకటిమాత్రం నికరం. ఆమెఆహ్వానించనిదే మావాడు చేయిచేసుకోవడంమాత్రము భావ్యముకాదు. చెడిపోనివాళ్లను, చెడిపోవాలని ఏమాత్రము ఉద్దేశ్యము లేనివాళ్లను, వంచించి వలలో వేసుకోవడం సుతరామూ కలలోగూడా నాకు గిట్టదు.

—రోజూ బీచ్ దగ్గర తారసిల్లుతూనే ఉన్నాము. ఇతర వ్యాసంగాలూ, వినోదాలూ అన్నీ కట్టిపెట్టి నాదముని వెంటనే నేనూ అనుసరించడం అవసరమైనందువల్ల ఇంకొకచోటికి పోవడంలేదు. స్నేహితులను ఎవరినీ కలుసుకోవడం లేదు.

ఎప్పుడు సంజె పడుతుందా అని కాచుకుని ఉండటం యథాయథకీని బీచ్‌కి వెళ్లి ఆదంపతులను మామూలు మేరలో ఉంచుకుని తిరగడం, చూసిచూసి యింటికి వచ్చి ఎప్పుడు తెల్లవారుతుందా ప్రొద్దు గుంకుతుందా ఎప్పుడు ఆమెసమీపంగా కనబడుతుందా అని ఉవ్విళ్లూరడం! ఈ వేదన అంతా నాకు లేదు కాని నాదముని మీదిమమకారాన 'మమ' అనుకోవలసివచ్చింది.

ఇద్దరు విలాసవంతులు తమను అనుసరించి తిరుగుతున్నారని వారు ఏనాడో గమనించారు. బీచ్‌లో ఏమూలకు వెళ్లినా మేమే ప్రత్యక్షమౌతున్నాము, మరి. కాని, ఏమీ చలించలేదు. క్రమంగా ముసలాయనతో మాటలు కలుపుకుని పలుకరించడానికికూడా మొదలుపెట్టాము. ఆయన ఏమీ సంకోచించకుండా కులాసాగానే మాట్లాడుతున్నాడు. నేను సంభాషణలోకి దించి నిలవేసి ఆ పరాకులో నాదమునికి అవకాశం కలిగించాను అనేకసార్లు. ఆతడు ఆమెను నిర్భయంగా కోర్కెతో అర్థం చేసుకునేటట్టుగా చూడడం గమనించాను.

—పసివాడిని దగ్గరకు తీసికోవడం, ఏమన్నా కొనిపెట్టడందాకా వచ్చింది. ఒకటి రెండుసార్లు బీచ్ 'రెస్టరాంట్'లో కలిసి కాఫీ పుచ్చుకున్నాము. అప్పుడప్పుడు వాళ్లయింటికి వస్తూండమని—ఇరుగూపొరుగూ అని తెలిసిపోయిందిగనుక—పిలిచారు కూడాను. మాకుమాత్రం ఆఆహ్వానం అందుకునేందుకు ముఖం చెల్లిందికాదు. అప్పటికి ఆ అమ్మాయితో ఆయనఎదుటనే మాటలాడజో స్తీమాత్రమే కుదిరింది.

ఆవేళ 'పేవ్‌మెంట్' మీదనే ఆమె కనబడ్డది. పలుకరించడానికి

మాకు ఎప్పటికప్పుడు బెరుకుగానే ఉండేది; సందేహించాము. కాని, ఆమె నవ్వుతూ ఎదురుగా వచ్చి 'ఇంత ఆలస్యమైంది. ఇక మీరు రారేమోనని తిరిగివచ్చేస్తున్నాను. ఆయన కంచి వెళ్లారు. ఉదయంకాని రారు. చీకటిపడినతరువాత ఒంటరిగా వెళ్ల వలసివస్తుందేమో నని' అన్నది. ఇంతకన్న ఏలాటిపరకీయ అయినా చేయి పట్టుకుని లాగుతుందా?

నాదముని నందనవనానికి ఎగిసిపోయినాడు. ఎగిరి గంతు వేసేవాడేమో కాని నేను చేయిపట్టుకుని ఆమెవెంట నడిచివెళ్లి ముగ్గురమూ ఒకచోట కూర్చున్నాము, కబుర్లు చెప్పుకుంటూ.

వెన్నెల విరియబూచింది. గాలి కెరటాలతో హాయిగా సరసాలాడుతున్న రేడియోపాట తెలియకుండానే ఆగిపోయింది. లేచి, తిరుగుముఖమై పసివాడికి పిప్పరమెంట్లు లంచమిచ్చి చంకను ఎక్కించుకున్నాను. 'మా... మా' అని పనసచదువుతూ క్రిందికి దిగాలని మెలికలుతిరుగుతూ అల్లరిచేస్తున్నాడు. నేను సంబాళించుతూ కొంచెం ముందుకు తొందరగా అడుగులు వేస్తున్నాను. వాళ్లిద్దరూ కొంచెం వెనుకఅయి మెల్లగా సాగివస్తున్నారు.

నాదముని కొంటెగా పిల్లవాడిని తనదగ్గరకు తీసుకుందామని చేతులు జాచే వ్యవధానంగా 'మామ' అంటూ వాడు మీదికి వాలబోయినాడు. నేను వదలలేదు. ఆమె నవ్వుతూ "అందరూ మామలేనా?' అని ఆ పసికూనచెక్కిలి పుణికింది. ఇంకా సందేహ మేమున్నది. నాదముని తపస్సు ఫలించినదన్న మాటేకదూ?

మారోడ్డుకు వచ్చినతరువాత పిల్లవాడిని నావద్దనుంచి తీసుకుని వెళ్లివస్తానని నాతో మాటతోనూ, నాదమునికి చూపులతోనూ చెప్పింది' నేను వినిపించుకోకుండా వచ్చేసి వాయుపుత్రుడిఉత్సాహంతో క్రింద నుంచి మెట్లమీదుగా రెండుఅంగలలో పైకిఎగిరి తలుపుతీసుకుని కుర్చీలోపడి 'ఇన్నాళ్ళకు నాదముని... అమ్మయ్య' అంటూ సంతోషతరంగాలలో మునిగి తేలుతూండగా...

మెట్లమీద అడుగుల చప్పుడు...

నాదముని అయిఉండడు. వాళ్లిద్దరూ కలిసివెళ్లి పావుగంట అయిందేమో తిరిగివస్తాడా, రాగలడా? పక్కగదిలో ఉన్న కాలేజీకుర్రవాడేమో? పాలుతెచ్చే మునుస్వామి ఏమో? ఏమో?

— ఎవడూ కాదు! నాదముని తలుపు తోసుకుని వచ్చి అవతల గుమ్మంలో పోయి కూర్చున్నాడు. ఆతనివెంట ఆమె!

వచ్చింది! రావడమేమిటి అని ఆశ్చర్యపడటానికీ నివ్వెరపోవడానికీ అవకాశం ఏదీ? అమాంతంగా లేచి నిల్చుని కుర్చీలో కూర్చోమని చూపించాను. వద్దని తలత్రిప్పి, క్రింద చాపమీద ఆసీనురాలైంది. నేను ఆలాగే నిలువబడిపోయినాను.

సంకోచించలేదు తడబడలేదు! కథ చెప్తున్నట్లు మాట్లాడేసింది:

"ఇద్దరు అన్నలతో మాట్లాడడానికి నాకు చనువూ... స్వాతంత్ర్యం ఉన్నది కాదూ? అందుకనే ఇక్కడికి రావడానికి సందేహించలేదు. అలాఅయితే మీతో మొదలు మాటడేదాన్నే కాదు. ఆయనను పరిచయం చేసుకోనిచ్చేదాన్నే కాదు.

మీరు ఇద్దరూ నావంక చూడటం మొదలు పెట్టినప్పటినుంచీ నేను గమనిస్తూనే ఉన్నాను. నాకు ఏమీ కోపం రాలేదు.

"పరాయివాళ్లు వాంఛతో నన్ను చూడటం అంటే నాకు ఏమిటో తెలియకకాదు. అందమైనదాని నని తెలుసును. కాని, ఈ జన్మకు నేను ప్రేమించేది ఆయన ఒకర్నే.

"వివరి స్తేనేకాని మీకు బోధపడదు. నేను అబద్ధమాడు తున్నానని మీరు అనుకోవచ్చు. కాని, మిమ్మల్ని మోసంచేయవలసిన అగత్యం ఏమున్నదీ?

"నేను ఎవరి ఆడపడుచునో ఏమిటో మొదలైన విషయాలు చెప్పనవసరంలేదు, అప్రస్తుతంగనుక. సంపన్నుల యింట్లో పుట్టాను. కవి-గాయక బాంధవ్యంవల్ల కళామాధుర్యారోచులు యౌవనోదయంతో విరిసినందువల్ల లోకవృత్తం తెలియని అమాయికపు ఆవేశంతో మాయ మాటలునమ్మి మోసమోయినాను.

"ఎవరికీ తెలియకుండా ఆమాయగానివెంట (పేరుతలవను) వెళ్లిపోయి కలలాగా కొంతకైతవ ప్రణయంలో లోగిపోయినాను.

"నెలమసలింది! ఒంటరిదానను చేసి నన్ను వదలివేసి ఆతడు మాయమైనాడు. ఏంచేయగలను అర్భకురాలను? బంధువులు రానిస్తారా? ఎవరు తోడవుతారు?

"కాలవలో పడిపోదామని బయలుదేరి వెళ్లి పడిపోయినాను. స్పృహ తప్పి మునకవేశాను....

"అప్పుడు నాపాలిటిదైవం ఈ వృద్ధమూర్తి నన్ను ఉద్ధరించారు! బ్రతుకుదామని నాకు లేదు. కాని, బ్రతికించారు. నాదీనగాథ విని అభయమిచ్చి వెంట తీసుకువెళ్లి జనానా ఆస్పత్రిలో చేరిపించి రాజవైభవంగా ఉపచారములు జరిగేఏర్పాటు చేశారు. పసిపాపను తీసుకుని బాలెంతను, వారియింటికి వచ్చేశాను.

"పిల్లవాడిని ఆయనకు వప్పగించి జీవితం గంగకు అర్పించి పాపవిమోచనం చేసుకుందామని తలచాను; ప్రయత్నించాను. నాముక్తిదాత వదలలేదు. నన్ను వివాహం చేసుకున్నారు! ఎంతో దయతో ఎన్నోవిధముల నన్ను సంతోషపెట్టి వెనుకటి కష్టస్మృతులను మరిపిస్తున్నారు. పసిపాపను- కన్నవానికంటె ఎక్కువ లాలనతో ఆపేక్షతో చూస్తున్నారు. ఎంతఅదృష్టవంతులం? ఆయనకు ఎంత సేవచేసినా ఋణం తీరుతుందా మీరేచెప్పండి?

"పారబడినారని మీమీద నాకు లేశమున్నూ ఆగ్రహం రాలేదు. నాచేతలకు మీరు అపార్థము కలిపించుకునేందుకు అమాయికంగా నేను దోహదం చేశానేమో?

"యౌవన సామాన్యమైన ఆవేశంతో నాదముని అన్నగారు అన్యథాగా నన్ను అనుసరించివచ్చి చొరవజేయబోయినారు. తెలియనిదోషం, మరేమీ పరవాలేదు. కాని బంధువులకు పరితపించేయీప్రాణికి ఆప్తులు దొరికినపుడు వారిదగ్గర దాపరికమెందుకూ?..."

—చలనము లేకుండావిన్నాము. ఇద్దరమూ యథాస్థానాలచిత్రప్రతిమలమైపోయినాము! ఆమెమెల్లగాలేచి నాదమునివద్దకు వెళ్లి వాత్సల్యంతో మీద చెయివేసి "మీరు చిన్నబోయినారంటే నాకు ఏడుపు వస్తుంది. ఏదీ నవ్వండి! అన్నయ్యా!' అని, చక్కిలిగిలి చేసింది. ఆతడు వెక్కివెక్కి కళ్లుకడవలైబరిగిపోగా, సంబాళించుకుని నవ్వి .., నవ్వుతూఉండేటంతవరకూ వదిలిందికాదు ఆమె.

నన్ను సమీపించింది. అడుగడుగుకీ జఘన - వలగ్న - వక్షోభార రమ్య అయిన దేవీమూర్తిని నిర్మలంగా సాన్నిధ్యంచేసుకునే ఉపాసకుని వినమ్రభావం నన్ను ఆవరించింది.

'వెళ్లివస్తాను' అన్నది.

అప్రయత్నంగా చేతులు ముకుళించాను. ఆమె రెండుచేతులతో ముకుళకరాంజలిని సమ్మానించి 'ధన్యురాలను' అని గమనోన్ముఖి అయి హంసమాలికలతో: "మీ బావగారు పిలిచినప్పుడు మీరు మొగమాటపడి భోజనానికి రాకపోయినారో మేనల్లుడిని పంపుతాను. బొమ్మలబండీఎక్కి బూరామేళంతో ఊరేగుతూ. రాకతప్పదు సుమండీ!" అని, పిలుపు అందించి మెట్లుదిగి మాయమైపోయింది.

—మేము విశేషం పొద్దుపోకపోయినా ఒళ్లుతెలియని నిదురలో అలావాలిపోయినాము.



# భాషావిశేషములు

చల్లపిల్ల వెంకటశాస్త్రి

★

శ్రీ కనుపర్తి ఫలానా భాషనుగూర్చి అని తేలకపోయినను తెలుగుదేశస్థుడు వ్రానే దవుటచేతనున్నూ, తెలుగుపత్రికలో ప్రకటించబడేదగుటచేతనున్నూ యీవ్యాసంలో తెలుగునుగూర్చిన విశేషాలే వుదాహరింపబడతాయి. సంస్కృతంలోయీ సందర్భాన్ని తెలిపే పుస్తకాలెన్నో ఉన్నాయి కాని అవి గురుశుశ్రూషాసాధ్యాలేకాని యెవరంతట వారు చదువుకొని అవగతం చేసుకోతగ్గవి కావు. నే నిప్పుడు వ్రానే వ్రాతకుకూడా ఆ సంస్కృతంలో ఉన్నవిశేషాలే మార్గప్రదర్శకాలు. గ్రాంథిక భాషలో మాత్రమే కాక సర్వసామాన్యంగా మన మందఱమూ మాట్లాడుకొనే మాటలలో కూడా కొన్నిప్రయోగాలు లాక్షణికాలుగానూ కొన్ని వ్యంగ్య ప్రధానాలుగానూ గ్రహించుకోవలసివుంటాయి. కొన్నిమాత్రమే అభిధాప్రధానాలుగా వుంటాయి. దాశరథి అంటే, దశరథుని కొడుకు. జానకి అంటే,జనకుని కూతురు. యీలాటి శబ్దాలకు లాక్షణికార్థప్రసక్తితో అవసరం ఉండదు. అవయవార్థంవల్ల అవగతం అవుతుంది. డిగ్గుడు, బిగ్గుడు, డబిగ్గుడు యీశబ్దాలను పైదానికి ఉదాహరణగా చూచుకోవాలి. లాక్షణిక శబ్దాలు చాలా వున్నాయి. పరవశుడు' అనేశబ్దం పరులకు వశమైనవాడు అనే అర్థాన్ని యివ్వవలసివున్నా యితరశబ్ద సాన్నిధ్యమందు ఆలాటి అర్థాన్ని యివ్వక—తన్మయుడు-అనే అర్థాన్ని మాత్రమే యిస్తుంది. ఆ తన్మయత్వంలో అసలర్థం పరవశత్వంకూడా అంతోయింతో యిమిడి వుందని తెలుసుకుంటారు విజ్ఞులు. లక్షణచెప్పిన ప్రతిచోటా నున్నూ యీ సందర్భం వుంటూనే వుంటుంది. కొన్నిచోట్ల అనగా- ప్రవీణుడు మొదలైన స్థలాల్లోమాత్రం అవయవార్థం బొత్తిగా దూరీకృత మయినట్టు వుంటుంది. "ప్రకృష్టా వీణాయస్య సః" అని దాని విగ్రహవాక్యం కదా! మంచి వీణకలవాడని సరియైన అర్థం. దీన్నిబట్టి యేగాయకుడు మంచి విలువగల వీణ పట్టుకుని సభకు వస్తాడో అపదం ఆ గాయకుణ్ణి చెప్పవలసివస్తుంది. అతడికివీణలో అంతగాపాండిత్యం లేకపోయినా అభ్యంతరం వుండదు. కాని అసలు ప్రయోక్తతాత్పర్యం మాత్రంవీణయొక్క యోగ్యతను వర్ణించేదిగావుండదు. కాబట్టి వీణలో మంచినేర్పుటితనాన్నే మనం గమనించాలి. కాని లోకంలో ఆశబాన్ని వీణలో నేర్పుటితనాన్ని తెలిపే సందర్భంలో యెప్పుడోగాని ప్రయోగించడమే లేదు. యేవిద్యలో నేనాసరే, తుదకు యే పనిలోనేనా సరే చక్కనినేర్పువుంటే సరి, వాణ్ణి చెప్పేటప్పుడు వాడుతూవున్నారు—

'కృషిప్రవీణుడు, యుద్ధ ప్రవీణుడు, ద్యూతప్రవీణుడు' యిత్యాదులు వుదాహరణంగా చూచుకోండి. ఆయీ ప్రయోగాల్లో ప్రధానంగావుండే వీణ యెక్కడికోపోయింది, నేర్పుమాత్రమే మిగిలింది. కొన్నిప్రయోగాలు మతీచిత్రంగా వుంటాయి. మచ్చుచూపుతాను.

"గ్రామసింహం"

దీన్ని కుక్కనుగూర్చి సర్వసామాన్యంగా వాడుతూవుంటారు. అడవిలోవుండే సింహానికి వుండే పరాక్రమాదులు దీనియందు వున్నాయనే వుద్దేశంతో వాడుతూ వున్నారేమో అనుకుంటే, ప్రయోక్తలు ఆలాటి తాత్పర్యంతో వాడుతూవున్నట్టు లేనేలేదు. కేవలమూ నీచత్వాన్ని మనస్సులో పెట్టుకునిమాత్రమే వాడుతూవున్నారు. ఆకారసామ్యాన్ని పట్టి వాడినట్టున్నూ కనపడదు. గ్రాంథికంగా లేదేమో అనుకుంటే కూచిమంచి జగ్గకవిగారు చంద్రరేఖావిలాపంలో—

"కొప్పాక గ్రామసింహాసనాధ్యక్షుండు"

అంటూ దురర్థాన్ని మనస్సులో పెట్టుకుని వాడివున్నారు. తెలుగులోమాత్రమే దీన్ని వాడివున్నారేమో అంటే శ్రీమద్భాగవతంలో (1) "గ్రామసింహా స్తత స్తతః (2) మృగయే గ్రామసింహాన్" అంటూ తృతీయస్కంధంలో వ్యాసులవారుకూడా ప్రయోగించి వున్నారు- "గ్రామసింహాః శ్వానః" అని వ్యాఖ్యాత వ్రాసియున్నాడు. యీ అర్థం అన్యశబ్దసాన్నిధ్యంవల్ల వచ్చిందనుకోవాలి. దీన్నిబట్టి "గ్రామగజం" అంటే దున్నపోతు కావచ్చునని యెవరేనా అభిప్రాయపడతారేమో, ఆలా అభిప్రాయపడకూడదు. వ్యవహారంలో వుంటేతప్ప లేనిదాన్ని యే కవిగాని ప్రయోగించినచో ప్రయోజనం వుండదు. కవిత్వం చెప్పడం యెందుకు? తన అభిప్రాయాన్ని లోకానికి తెల్పడానికేకదా! ఆలా తెల్పడం తనకిమాత్రమే తెలిసి యితరులకు యేయేసాధనాలవల్లాకూడా తెలియని సాంకేతికపదాలవల్ల నెఱవేఱదు కదా! అందుకే-"సంకేతితసుప్రసిద్ధ మేవ పదమ్" అని భట్టారకుడు శాసించి వున్నాడు. "పూర్వసువాసిని" "ఇంద్రాణి" వగైరా పదాలుకొన్ని "గ్రామసింహాలు" పదంవంటివే వున్నాయి. ఆపదాలు కవులు వాడినట్టుమాత్రం లేదు. "ఇంద్రాణి" పదం శచీపరంగా గ్రాంథికులు వాడివున్నారు. అది నిరాక్షేపణీయమే. విధవాపరంగా వైదికులు వేదపరిభాషనుబట్టి వ్యవహరిస్తూ వున్నారు. అది దాన్ని బాధించదు. శాస్త్రసంప్రదాయజ్ఞులు కానివారు కొందఱు-'ఇంద్రాణి'పదాన్ని పట్టి-"శక్రాణి" అనికూడా వాడుతూ వున్నారు. అది ప్రామాదికం. సూత్రంలో-ఇంద్ర పదాన్నిమాత్రమే యెత్తుకున్నారు-దానివల్ల యింద్రపర్యాయాలకు ఆ కార్యం రాదు. దీన్నిగూర్చి అన్యత్ర విస్తరించి వున్నాను - గ్రామశబ్దసాన్నిధ్యం వల్ల సింహశబ్దం "కుక్క" అనే అర్థాన్ని యిచ్చినట్టే,నిద్రాశబ్దసాన్నిధ్యంవల్ల "పోవు" ధాతువు "అనుభవార్థాన్ని" యిస్తూవుంది. దీన్నికూడా అన్యత్ర విస్తరించే వున్నాను-'నిద్రపోయెను' ఇత్యాదికం చూచుకోవాలి-కొన్నిచోట్ల అవయవార్థం వదులుకోవలసి వుంటుందని, ప్రవీణశబ్ద విషయంలో వ్రాసివున్నాను. గరుత్మంతుడుతల్లి ని గూర్చి— "చెప్పుము నాకుఁ బయోరుహాననా!" అనిన్నీ, యముఁడు సావిత్రినిగూర్చి — "తనులతాంగి! భవదుదారవాగ్భంగికి" అనిన్నీ వాడివుండడాన్నిగూర్చి అన్యత్ర వ్రానేవున్నాను—

ఆయీ ప్రయోగాలు రెండున్నూ వకటి భట్టారకుడిదిన్నీ వేఱొకటి శంభుదాసుగారిదిన్నీ కాని సామాన్యులవి కావు. వకచోట, ‘అమ్మా!’ అనిన్నీ, వేఱొకచోట ‘అమ్మయ్యో!’ అనే తాత్పర్యమే కాని అవయవవర్ణనా తాత్పర్యం సుతరామున్నూ ప్రయోక్తకు లేనేలేదు. యీ సందర్భం గమనించక కొందఱు ఔచిత్యభంగం వచ్చిందంటూ వ్రాస్తూవుంటారు. క్షేమేంద్రుఁడు ఔచిత్యభంగాన్ని సుతరామూ వప్పుకోలేదని దానికి కారణం చూపుతారు. క్షేమేంద్రుఁడికి తెలిసినంత ఔచిత్యవిషయం నన్నయ్యాదులకు తెలియదా? తెలుసును; తెలిసే అలా ప్రయోగించడానికి కారణం? అక్కడ ప్రాజ్ఞులెవరుగాని అవయవార్థాన్ని వివక్షించుకోరనిన్నీ. వ్యాసవాల్మీకులేమి కాళిదాసాదులేమి యీ విషయంలో యీలాటి అభిప్రాయాన్నే పొందినట్టు వారివారి ప్రయోగాలు శతశస్సహస్రశః సాక్ష్యమిస్తూ వున్నాయి. విస్తరభీతిచేత వుదాహరించలేదు— “ఈ చపలాక్షి మజ్జనని” అని ఆంజనేయులు సీతను గూర్చి వాడినట్టున్నూ అది కాముకత్వద్యోతకంగా వున్నట్టున్నూ వొకరు వ్రాశారు. యీ ప్రయోగం అయ్యలరాజు రామభద్రకవిగారి రామాభ్యుదయంలోనిది. అయ్యో! దైవమా! ఆ మహాకవికీమాత్రమూ తెలియదా? అతనికి తెలియకపోతే అతఁడే మహావిద్వత్కవిరాజసార్వభౌముని ఆస్థానకవిగా నున్నాఁడో, ఆ కృష్ణరాయలకుఁగాని, ఆరాజసభలో అష్టదిగ్గజాలుగావుండే యితరకవులకుఁగాని తెలియదా? మనం యెవరిప్రయోగాన్నిగూర్చి వ్రాస్తామో వారికి యివ్వఁదగ్గ గౌరవాన్ని యిస్తూ వ్రాయవలిసి వుంటుంది గాని తోఁచినట్లల్లా వ్రాయకూడదు. అట్లు వ్రాయడం మహాపరాధమేను. యేదో శ్రీనాథుని ప్రయోగాన్నికూడా చూపి యీలాగే వ్రాసి అంతతో విరమించక— ‘క. యరలవ మదనసయనుచుక్’ అన్న పద్యాన్ని లేదా, అలాటిపద్యాన్ని వ్రాసి యీపద్యంలో యెక్కడా ఔచిత్యం చెడలేదంటూ వ్రాయడం కూడా జరిగింది. అది మిక్కిలీ ఆశ్చర్యజనకంగా వుంది. యీపద్యం వ్రాసినకవి వైపద్యనిర్మాతలకన్న మిన్న సుమీ అని చెప్పడానికి చేసినప్రయత్నం తుదకు యీలా పరిణమించినట్లు స్పష్టమవుతూవుంది. పోనీ క్షేమేంద్రుఁడు యేదో తోవ తొక్కి చాలామంది ప్రాచీనకవులను ఆక్షేపించి వున్నాఁడా, లేదా? అంటారేమో! ఆ క్షేమేంద్రుఁడు వ్రాసినవిన్నీ కొన్ని కావ్యాలు లేకపోలేదు గదా! వాట్లల్లో అతఁడు చూపిన మాదిరి ఔచిత్యభంగాలు లేకుండానే వున్నాయా— అనేవిషయం ముఖ్యంగా గమనించవలసి వుంటుంది. యిట్టి దూరాలో చన లేకుండా పెద్దపెద్దలను స్వల్పజ్ఞానంతో పరిహసించడం మహాపరాధం. యీకర్మం తెలియక యేదో వ్రాఁతకు వుపక్రమిస్తే న్యాయరూపాలు కలుగుతాయనుకోవడం ప్రమాదం. యీకాలస్వభావమేమోకాని ప్రతీ విషయంలోనూకూడా పూర్వులంటే యీసడించడం ఆచారంగా వుంది. వారున్నూ మనుష్యులే కనక యెక్కడేనా భ్రాంతివశంవల్ల యేదేనా అప్రయోగం పడితే దాన్నిగూర్చి వ్రాస్తే అది యుక్తమే. వ్యాసులు, వాల్మీకులు, కాళిదాసాదులు తొక్కి మార్గప్రదర్శకులైన విషయాలనుకూడా యెత్తుకుని ఆక్షేపణకి దిగితే గతేమిటి? అర్థాత్తూ వారివారి జ్ఞానంకంటే ఆక్షేపకునిజ్ఞానం యెక్కువది అనుకోవలసిందేనా? ఆవ్రాఁతకు వచ్చే యీతాత్పర్యానికి సమ్మతించేయెడల అది లోకం సమ్మతించినా సమ్మతించకపోయినా కొంత సమంజసంగా కనపడుతుంది. అసలు అభిప్రాయం అది కాదాయె. యెవరినో పైకి తెద్దామనే ప్రయత్నమాయె. అందుకోసం ప్రత్యేకించి వ్రాసే వ్రాఁత చాలదా? అలాటి మహాకవులను అగౌరవకరించడం యెందుకంటాను. “యరలవ మదనస” పద్యం యే గ్రంథంలోదో, ఆ గ్రంథంలో వెదికితే క్షేమేంద్రుఁడు చూపినమాదిరివి యెన్ని అనౌచిత్యాలేనా కనపడకపోతాయా?

ఈమధ్య యెవరో నన్నయ్యగారి కవిత్వం శ్రోత్రియకవిత్వమన్నారని శ్రీకాశీభట్ట సుబ్బయ్యశాస్త్రుల్లుగారు తిక్కన్నగారి కవిత్వాన్ని నిరసించి చూపుతూ వున్నారు. అది అంత ఫీలైనపనికాదు. [illegible] మహాకవులను అగౌరవకరించడం అనాలోచనప్పని.— అనౌచిత్యాలను గుఱించిన్నీ అపార్థాలు లేక గ్రామ్యాలనుగుఱించిన్నీ లాక్షణికులు చేసిన పరిశ్రమకు ఫలితం కనపడడంలేదు. సంధివశంవల్ల చారులు జారులుగాన్నూ, తనుజుఁడు దనుజుఁడుగానూ మాఱడానికేం గాని అసలుపదంలోనే వున్న అశ్లీలాలగతేమిటి? చూడండి ‘కేశవ’ అనే పరమపవిత్రమైన శబ్దంలో అశ్లీలవర్ణశ్రవణం తీయవచ్చునా? ‘శేఫాలికా’ శబ్దంలోకూడా డిటో. ఆపద్ధతిని ఆయీ శబ్దాలు భాషలోనుంచి తొలఁగించవలనే వచ్చునేమో? సంధ్యావందనంలో మొట్టమొదట ఆచమనం చేయడమే తప్పవుతుంది కదా! అందుచేత లాక్షణికుల తాత్పర్యాన్ని దుర్వినియోగించని పద్ధతిని వ్యాఖ్యాతలేమి, విమర్శకులేమి ప్రవర్తింపవలసివుంటుంది. లోకంలో అజ్ఞులవ్యవహారం కొన్ని శబ్దాలకు ముప్పు తెస్తూవుంది. విరోచన శబ్దానికి సూర్యుఁడర్థం. విరేచనశబ్దానికి బదులు యెందఱో “విరోచనాలు” వెడుతూ వున్నాయంటూ వాడతారు. ఆవాడకాన్ని పట్టి విరోచనశబ్దం కవులు వదులుకోవలసి వస్తూవుంది. దీనివల్ల అజ్ఞులు విజ్ఞుల కెట్టిచిక్కులు కలిగిస్తున్నారో! యితరవిషయాలుకూడా గమనించాలి—

> “శ్రీరఘువర! కరుణాలయా!
> సరసిజలోచన విరోచనాభ,”

అనే త్యాగరాయకృతి పాడుతూవుంటే పామరులకున్నూ వాళ్లనిపట్టి పండితులకున్నూ యెంతో హేయంగా తోఁచవలసి వస్తుంది. ఆయీ సందర్భాలు విచారిస్తే క్రమప్రకారం అన్వయించుకోవలసిందే కాని యీలాటి వెఱ్ఱిమొఱ్ఱి శంకలకు అలవాటుపడకూడదనియ్యేవే తోస్తుంది. అయితే లాక్షణికులు అలాటిమార్గం యెందుకు తొక్కివున్నారనే ప్రశ్నకు నాకు తోఁచినజవాబు వినండి. లాక్షణికులు ప్రతివిషయమున్నూ చాలాకఠినంగా శాసించవలసివుంటుంది. అందులో విశాలహృదయులైన మహాకవులు వేట్లను అతిక్రమిస్తారో, యేకవాక్యతగా అవి అమలు జరగనిఖిలసంహితాశ్రుతులకింద జమకట్టవలసివుంటుంది. కాదు, అమల్లోకి తెస్తామంటారా?

అనండి కాని ఆదోషం చేయనివాణ్ణి వకణ్ణేనా మహాకవులలో వేలుమడిచి చూపండి. చూప లేనప్పుడు అట్టి ఆక్షేపణలు యేంప్రయోజనం? కనక అట్టిశంకలు చేయడం సహృదయత్వ భంజకంగా కనపడవలసి వస్తుంది-యింక యీ విషయం విరమించి యతులవిషయం కొంత ప్రస్తావిస్తాను. యతిప్రాసలు తెలుఁగులో యెందుకు పుట్టినా తుట్టతుదకు నిర్బంధంగా వుంచవలసినట్టు సిద్ధాంతమైపోయి చాలాకాల మయింది. కాని ప్రాసవిషయంలో యేకవు లున్నా యేలాగో వకలాగ "గంధార్థం అక్షతాం శ్చసమర్పయామి" అన్నట్టు చేయడం లేదుగాని యతివిషయంలో యేలాగో వాలాయిత తీర్చుకుంటూవున్నారు.—

శా. "కేదారేశు భజించితిన్ శిరమునన్
గీలించితిన్ హింగుళా
పాదాంభోజములన్ బ్రయాగ నిలయుం
బద్మాక్షు సేవించితిన్
యాదోనాథసుతాకళత్రు బదరీ
నారాయణున్ గంటి"

యీపద్యం మూఁడోచరణంలో యతి వున్నప్పటికీ అది వున్నట్టే వుండదు—యా-అన్నదే శ్రుత మవుతుందిగాని దానికి పూర్వ భాగమందు సంశ్లేషించిన నకారం శ్రుతం కాదు. కొన్ని యింతకన్నా వాలాయిత తీర్చుకున్నట్టు కనపడతాయి. తెలుఁగుభాషకు సహజాలంకారులుగా అనాదిగా యేర్పడ్డ యతులు యేదో నిర్బంధం తొలఁగించుకోవ డానికి వాలాయిత తీర్చడం దగ్గిఱికి వచ్చినట్టు పైమాదిరి యతులవల్ల తేలుతుంది - ద్విత్వాక్షరస్థలాల్లో మొదటిహల్లుకు కాక రెండవహల్లులకు పెట్టే విశ్రమవిషయం కూడా యీలాగే వుంటుంది - ఏకశబ్దవద్భా సమానాలుగా వుండే "ద్వార"శబ్దం. మొద లైనకొన్ని శబ్దాలల్లో స్వరానికి సంబంధించిన- "ద్వారవిహారులై సిరుల నందక నందకపాణిఁ గొల్వరో?"

అనేమాదిరి యతులుకూడా వాలాయిత తీర్చుకోవడానికి పెట్టినట్టే కనపడతాయి. పద్యకవిత్వంలోకన్న పదకవిత్వాలల్లో వాడే యతులు హృదయంగమంగా వుంటాయి. యెందుచేత? ఆకవులు విశేషించి లాక్షణికులు కాకపోవడంచేత ఆట్టే లోఁతుకుపోక తేలికగావుండే వర్గయతివగయిరా సుప్రసిద్ధయతులనే వాడతారు.

"ఈ సంశయము వారింపవే పరమేశ! నన్ను మన్నింపవే! శ్రీ సదాశివ! ప్రశ్న చేసెద వివరింపు, వాసుదేవతత్త్వము, మహత్త్వము, భాసమానవిలాస నే నిదె నీసత్కృపావలోకన మున నీసమయమునఁ దెలియవలసినదే సమస్త మిదే ప్రశస్తము-ఈసం."

యిది అధ్యాత్మకీర్తనలలోది. దీన్ని రచించినకవి పద్యకవులవంటివాఁడే కనక కొంత మట్టుకేనా విశేషయతులదాఁకా వెడుతూ వుంటాఁడు. రామదాసుగారికీర్తనలూ, త్యాగరాయలవారికృతులూ చాలా ప్రసిద్ధయతులతోటే వుంటాయి.—శాస్త్రీయమైన యతులలో కొన్ని హృదయంగమంగా వుండని వున్నాయి. అందులో వకటి ఋకారానికి ఇ-ఈ-ఎ-ఏలు పెట్టేది. ఆయీ యతిమైత్రిని పూర్వులు యెందుకు సమ్మతించారో? తెలియదు. స్థానసామ్యాన్నిపట్టి కొన్నియతులు కనపడతాయి. యీయతికి ఆలాటి సామ్యమున్నా కనపడదు. శ్రవణసుఖంమాత్రం, ఋకారానికి ఉ-ఊ-ఒ-ఓలతో మైత్రికల్పితే వున్నట్టు తోస్తుంది. "అపురూపదర్శనం బాయెఁగదా! నేఁడు కృపగలదా? మాముద్వ గోపాలబాల!"

యీగేయంలో'కృప' అనేపదంలోవున్న 'కృ' అనే అక్షరానికి గోపాలపదంలోవున్న-'గో' యతిగా వుండడమే శ్రవణసుఖాన్ని కలిగిస్తూ వుందో? ఇ - ఈ - ఎ - ఏ - లతో కూడిన మఱివకపదం యతిస్థానంలో లగిస్తేనే సుఖంగా వుంటుందో, బాగా గమనించాలి. లాక్షణికులు— "ఇ-ఈలు ఋకారసహిత మె-ఏలకును" అని వ్రాసిన సంగతి యీక్షేత్రయ్యకు తెలియదనుకోవడానికి యిది యేమంత పెద్ద విషయమో? పరిశీలించవలసి వుంటుంది- యెఱిఁగినీన్ని శ్రవణసుఖాన్నే ప్రధానంగా ఆలోచించి క్షేత్రయ్య పై విధంగా వుపయోగించినట్టు నేను తలుస్తాను. యెన్నో యతులు శాస్త్రీయాలుగా వున్నమా శ్రవణసుఖాన్ని కలిగించినవిగా వున్నాయి. యతిప్రాసలు సహజాలంకారాలుగా తెలుఁగు భాషలో కవిత్వం పుట్టడానికి చాలా పూర్వకాలాన్నుంచి వాడుతూవున్నారనే సిద్ధాంతానికి యిటీవల మహాకవులు వాడే మాఱుమూలయతులు బొత్తిగా వుపయోగించవు. యేలాగో జంగంపాటలు వగయిరాల కవిత్వాలల్లో యీ మాఱుమూలయతులు వాడినట్టు లేదు— "నూఁగు నూఁగు మీసాలవారయా! నూటికెలమదొరలు" లోనైనవి చూచుకోండి. ఆ యీరచనలు ప్రబంధకవులవి కాకపోవడం చేత సాధారణంగా యావత్తూ వర్గయతులతోటే తెల్లవాఱుతుంది- ఆంధ్రకవిత్వం ప్రబలినతరవాత మాఱుమూలయతులు వాడఁబడుతూ వచ్చాయి. కాని శ్రవణసుఖం అంతరించింది. దీని కెన్నో వుదాహరణాలు చూపవచ్చును. కొన్ని విషయాలు నాగరికత హెచ్చినకొలఁది సొగసుగా వుండడమున్నా కొన్ని అవకతవకగా మాఱడమున్నా అనుభూతంగా కనపడుతుంది. అందులో యిది వకటిగా తోస్తుంది. మఱివకటి వివాహవిషయం — యే జాతిలో పిల్లను ఆ జాతి వరుఁడు వివాహం చేసుకొనేరోజులకున్నా కలగాపులగంగా వివాహాలు చేసుకొనేరోజుల కున్నా వున్న భేదం కూడా యీలాటిదే అని నాకు తోస్తుంది. పాండిత్యం ప్రబలడం వల్ల విశ్రమస్థానాలల్లో సొగసుచెడినట్టే నాగరికత ప్రబలడంవల్ల వివాహాలలోకూడాసొగసు చెడుతూ వుందంటే యెవరో గాని వప్పుకోరు. యతులు శ్రవణసుఖానికి కావనేవారికి నేను వ్రాసినది బొత్తిగా నచ్చదు. సంస్కృత భాష ననుసరించిన భాషలలో కర్ణాటభాష కొంచెంగానున్నా తెలుఁగుభాష విశేషంగానున్నా యీయతివిషయాన్ని అవలంబిస్తూ వుంది. అఱవంలో ప్రాసవిషయం నిర్బంధంగా వున్నట్టు వకపద్యంవల్ల అవగత మయింది. ఆపద్యం 'అట్టావదానిగళ్ సెయ్యవల్లెమేన్' అని యెత్తుకొని 'తట్టామలే' అని రెండో చరణంలోనూ మూడునాల్గుచరణాలల్లోనూ ఆలాగే టకారద్విత్వాన్ని వుంచినది యెవరో మా అవధానాన్ని ప్రశంసిస్తూ చెప్పినది. దానివల్ల ఆభాషలోకూడా ప్రాసనియ

మం వున్నట్టుగా నే నభిప్రాయపడ్డాను. ఆంధ్రకర్ణాటభాషలవలె అఱవం విశేషించి సంస్కృతాపేక్ష కలది కాదనిన్నీ స్వతంత్ర భాష అనిన్నీ చెప్పఁగా విని వున్నాను. యింతెందుకు? సంస్కృతభాషకు యతిప్రాస నిర్బంధం లేకపోయినా యాదృచ్ఛికంగా యెక్కడేనా యీయతిప్రాసలు పెట్టి చెపితే ఆపద్యం యెక్కువ శ్రవణసుఖంగా వుంటుంది. అట్టిశ్లోకాలు కొన్ని యిటీవల మహాకవుల కవిత్వాలలోనే కాక పూర్వఋషుల కవిత్వాలలోకూడా కనపడతాయి. భాగవతంలో వుండే గోపికాగీతలు వగయిరా ప్రస్తుతవిషయానికి వుదాహరణంగా చూచుకోవచ్చును. విస్తరభీతిచేత వుదాహరించలేదు. యిప్పుడెందఱో యతిప్రాస నియమాన్ని తొలఁగిద్దామంటూ పెద్దపెద్ద వ్యాసాలు వ్రాస్తూవున్నారు. తొలఁగిస్తే వచ్చే హాని అంతగా వుండదు—నన్నడిగితే ఆలా తొలఁగించేవారు వక్క యతిప్రాసలనే కాదు కొన్ని సంధులనుకూడా తొలఁగించడం ఆవశ్యక మనుకుంటాను. ఆసంధులు అజ్ఞానావస్థలోవున్న విద్యార్థులకు మిక్కిలీ చిక్కుగా వుండి వొకవిధంగా అర్థం కావడానికి బదులు మఱివొకవిధంగాఅర్థమవడానికి దారితీస్తాయి. అట్టిస్థలాల్లో గురువు ఆసంధిసూత్రాన్ని వుదాహరించి 'అబ్బాయీ! దీన్ని యీలా విఱుచుకొని అర్థం చెప్పుకోవలసి వుంటుం'దని బోధించవలసి వస్తుంది. యిప్పటికాలపు నాగరికత ఆమాత్రంకూడా పరాపేక్షకు సహించేస్థితిలో వున్నట్టు తోఁచదు. అందుచేత కొందఱు పూర్వమహాకవుల గ్రంథాలుమాని జంగంకథల మాదిరివాటికి ప్రాధాన్యం యివ్వాలంటూ వున్నారు. అట్టివారికి నేను వ్రాసిన సంగతి మిక్కిలీ అనుకూలం. వ్యావహారికభాషలోనే గ్రంథాలు వ్రాయవలసిం దనిన్నీ వాట్లను విద్యాశాఖవారు విద్యార్థులకు పాఠ్యగ్రంథాలుగా నిర్ణయించాలనిన్నీ కొన్ని సంవత్సరాల కిందటినుంచిన్నీ కొంత కోలాహలం బయలుదేఱింది కాని దాన్ని కొందఱుపెద్దలు ప్రయత్నించి "బ్రహ్మాస్త్రబ్రహ్మ" మీఁద ఆఁపుచేశారు కాని యిప్పుడు ఆలా ఆఁపుచేసిన వెన్నో మళ్లా అమల్లోకి వస్తూవున్నా యికనక కొద్దిరోజుల్లో యిదిన్నీ అమల్లోకి వస్తుందనే నాతలఁపు. అంతమాత్రంచేత గ్రాంథికభాష మాత్రం నశించదు. యేకాలమందున్నా ఆయా భాషాభ్యాసకులలో దానిపారాన్ని చూడాలనే కోరిక కలవాళ్లు విరళంగానే ఉంటారు. వాళ్లుమాత్రం యావజ్జీవమున్నా కృషి చేస్తూనే వుంటారు. యితరులో అంతంతలోనే తృప్తిపడి విరమిస్తూ వుంటారు. మురారినిగూర్చి యెవరో ప్రశంసిస్తూ—

"దేవీంవాచ ముపాసతేహి బహవ
స్సారంతు సారస్వతం,
జానీతే నితరా మసా గురుకుల
క్లిష్టో మురారిః కవిః,
అబ్ధిర్లంఘిత ఏవ వానరభటైః
కింత్వస్య గంభీరతా
మాపాతాళనిమగ్న పీవరతను
ర్జానాతి మంథాచలః."

అని సిద్ధాంతీకరించారు. అందుచేత సామాన్యులకు తేటతెల్లంగా తెలియడానికి కొన్ని వచనాలు వ్రాయడం ఆవశ్యకమే అనుకుంటాను. ఆలా వ్రాసే కవులకు యిహలోకంలోఁ గాని పరలోకంలోఁ గాని వచ్చే హాని లేదనే నాతలంపు. అట్టి పుస్తకాలు ఛందోబద్ధంగా వ్రాసేవారు మాఱుమూల యతులు వదులుకొని సుప్రసిద్ధంగా వుండే వర్గయతులు వగయిరాలవఱకేనా గేయాలల్లోనున్నూ పద్యాలల్లోనూ వాడుకుంటూవుంటే అవి శ్రవణసుఖానికి అనుకూలిస్తాయి. అసలే యతులు మానేస్తేనో శ్రవణసుఖానికి కొంత లోటు కలుగుతుంది. యీ భాషావిశేషాలనేవి యెంత వ్రాసినా తేలవు. చూడండీ, అమ్మగారు. అమ్మవారు అనే మాటలలో స్వల్పంలో యెంత భేదం కనపడుతూ వుందోను. ఆలాగే, అయ్యగారు, అయ్యవారు అనేవికూడా చూచుకోండి. వ్యావహారికభాషలకు విశేషించి లోకవ్యవహారం అనుసరణీయం. అట్లని సంస్కృతానికి అది అనుసరణీయం కా దనుకోకూడదు—ఆ భాషావిషయంలో శాబ్దబోధోపకరణాలలో- "వ్యవహారతశ్చ"అని వ్రాయడమే పైవిషయాన్ని తెలుపుతూ వుంది—మఱొకప్పుడు యింకా వ్రాస్తాను. యిప్పుడు యింతతో ముగిస్తాను.



# గిడుగు కాదు పిడుగు

నండూరి బంగారయ్య



నేను శ్రీ గిడుగు రామమూర్తి పంతులవారి శిష్యుడను కాను; అనుచరుడ నంతకంటెను కాను. "వారి భాషావాదములవలన ఆంధ్రవాఙ్మయమునకు మేలు చేకూరినది" అని విశ్వసించువారిలో కూడ ఒకడను కాను. అందుచేతనే ఈ వ్యాసమునకు విలువ మరింత హెచ్చవలసియున్నది.

ఈవ్యాసశీర్షిక చూడగనే, "మనవాడు క్రమముగ గిడుగువారిమతము పుచ్చుకొనుచున్నాడా" యని గ్రాంథిక భాషావాదులును, "ఈయనకి బహుశా మా బృందంలోకి రావాలనుంది కాబోలు" అని వ్యావహారిక భాషావాదులును సందేహించుటకవకాశ మున్నది. తత్త్వాన్వేషియగు రసపిపాసువునకు వాదభేదములతో నిమిత్తము లేదు. వాదములెప్పడును పూర్ణముగ సత్యమును బ్రకటింపజాలవు. పట్టుదల, ఉద్రేకము మున్నగు గుణములను బురస్కరించుకొని వాదములలో కొంతవరకు సత్యగోపన మనివార్యము. "గుణాః పూజాస్థానం గుణిషు నచ లింగం నచ వయః" అను నార్యోక్తికి "నచవాదం నచ వయః" అను పాఠాంతరమును గల్పించుకొని యానందించు నావంటివానికి వాదభేదములవలన నేమి ప్రయోజనము?

౧

ఫాల్గున శుద్ధవిదియ గురువారము నాడు ఇంకను పూర్తిగ తెల్లవారకుండగనే బ్రహ్మశ్రీ వడ్డాది సుబ్బారాయడుగారు పరమపదించినట్లు కబురువచ్చినది. నే నింకను మంచము నుండి లేవలేదు. దానికి క్రితము రోజున లంఘనము. ఎట్లో ఓపిక తెచ్చుకొని కాల్యములను దీర్చికొని సుబ్బారాయడుగారియింటికి బయలుదేరితిని. సుబ్బారాయడుగారి యింటికెదురుగ నున్న ట్రయినింగు కాలేజీ హాస్టలు అరుగుమీద చిలకమర్తి లక్ష్మీనరసింహముగారును, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారును, నిడమర్తి దుర్గయ్యగారును, శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారును, ఇంకను మరికొందరు పెద్దలును కూర్చుండియుండిరి. "నాకు డెబ్బదిరెండు, మీకు డెబ్బదిమూడు" అని యీతీరుగ వారిలోవారు వయో

నిర్ణయ మొనర్చుకొనుచు ఇకతరు వాత నెవరినంతు వచ్చునా యని యెదురుచూచు చున్నట్లుగ గన వచ్చిరి. సాధింపదగిన యర్థములెల్ల సాధించిఆరముగ్గినవారికి మరణమనిన పెండ్లివలె నుండునుకాబోలును!

నిడమర్తి దుర్గయ్యగారు గిడుగు రామమూర్తిగారి నుద్దేశించి, "పై కెంత భీకరముగ గనవచ్చునో లోపల నాయన అంత అమృతమయుడు. వాదభేదములను బురస్కరించుకొని వ్యక్తులను ద్వేషింపడు" అని తక్కిన వారితో చెప్పుచుండిరి. "నిజము నిజము" అని నా హృదయము ప్రతి ధ్వనించినది. దుర్గయ్యగారి మాటలు ముఖస్తుతికొర కుద్దేశింపబడిన వను కొనుట కెంతమాత్రమునువీలులేదు. దుర్గయ్యగారి కావిద్య పూర్ణముగ నపరిచితమగుట మొదటికారణము. ఎంత బిగ్గరగ మాటాడినను రామమూర్తిగారికి వినబడదనుట రెండవ కారణము.

రామమూర్తిగారి విశాలహృద యమునకు వ. సు. రాయకవిగారి మరణదినమే ప్రత్యక్షసాక్ష్యము. బ్రదికియున్న దినములలో వడ్డాది సుబ్బారాయడుగారు వీరగ్రాంథికులు గదా!

"గిడుగు రామమూర్తి
నుడుగు నిల్వకపోమె
నొగి జయంతి
రామమూర్తి గెలిచె"

అని గ్రాంథికభాషావాద జయ స్తంభముపయి శాసనము లిఖించిన వారు. సరి. రామమూర్తిగారు వీర వ్యావహారికు లనుట జగత్ప్రసిద్ధమే. అట్టిచో తమ వెనుకటిభేదములను విస్మరించి కూర్చున్నచోటునుండి లేచినచో ఆయాసము వచ్చుచున్న డెబ్బదియారవవత్సరమున — దృష్టి సరిగ కనబడక, చెవులు సరిగ విన బడక, కర్రసూతగొనిగాని నడువలేక అవస్థపడుచున్న వయస్సులో మూడు ఫర్లాంగులు నడచి సుబ్బారాయడు గారియింటికి వచ్చి అంతతో నాగక సుబ్బారాయడుగారి శవమువెనుక వారియింటినుండి ఒక మైలుదూర మున నున్న ప్రేతభూమివంక చెంగు చెంగున కుర్రవానివలె పరుగిడు చున్నారు. తరుణవయస్కుడనయ్యు ను నేను వారితో నడువలేక లోలోపల సిగ్గుపడుచు కొంతదూర మయినవెనుక ఇంటికి మరలితిని.

౨

పర్లాకిమిడినుండి రామమూర్తి గారు రాజమండ్రి వచ్చినసందర్భ ములో వారికి స్వాగతపత్రము సమ ర్పించుట కొకసభ హిందూసమాజ భవనమున జరిగినది. ఆ సభకు నేను హాజరయితిని. పర్లాకిమిడి ఆంధ్ర దేశములో చేరవలెనని రామమూర్తి గారి వాదన. అది యోఢ్రదేశ ములో చేరవలెనని పర్లాకిమిడి రాజా వారి పట్టుదల. రామమూర్తిగారి యాజ్ఞ ననుసరించి వారి కుమారు డును మరికొందరు పర్లాకిమిడి వాసు లును ఖండాంతరములకు పోయి సలి పిన ఆందోళనము—దానిని బురస్క రించుకొని గిడుగువారి కుటుంబము నకు ప్రాప్తించిన కష్టములు రామ మూర్తిగారి ముఖతః ఆనాటిసభలో విని శత్రువులుకూడ కంట తడివెట్టిరి. ఆంధ్రాభిమానముచేతను, అంతరా త్మకు వ్యతిరేకముగ వర్తింపకూడదని దృఢవ్రతము వహించుటచేతను చిర కాలమునుండి నివసించుచున్న పర్లాకిమిడి వదలి స్వగృహమును పాడుపరచుకొని వయసుకాని వయ సున, "తలదాచుకొనుటకయి తావు దొరకునా" యని యల్లాడవలసి వచ్చి నది? అదివరలో తమపట్ల భక్తి ప్రపత్తులు చూపు ప్రభువు విముఖు డయినాడు. వినయ గౌరవములు చూపు పురవాసులు విరోధు లయి నారు. తుదకు శరీరమునకు దెబ్బలు తగిలి పర్లాకిమిడిలో కాపురము దుర్భరమయినది. ఈ వీరచరిత్రము చరిత్రగాథలలో జేరకపోవునా?

౩

ఒక్క ఈ యుదంతమునందే కాదు; ఏ యంశమునందైనను అట్టి పట్టుదల—అట్టి దీక్ష—అట్టి స్వార్థ త్యాగమును గిడుగువారి చారిత్ర మున బ్రకాశించుచుండును. వారి భాషావాదమునే తీసికొనుడు. అది సారవంతమయినదా కాదా యను ప్రశ్నతో మన కిచట నిమిత్తము లేదు. కాని తాను భాషకు శ్రేయ స్కరమని నమ్మిన వాదమునిమిత్త మయి వారు జీవితమును ధారపోసిరి. ఇంకను పోయుచున్నారు. అహో రాత్రము లేకదీక్షతో ఇంకను భాషాజిజ్ఞాస సలుపుచునే యుందురు.

సభలో గిడుగు రామమూర్తి పం తులుగారు గ్రాంథికవాదులగు పండితు లను ప్రతిఘటించి వాదించుచుండగ చూడవలయును. వారియుపన్యాసము లలో స్వరూపసౌష్ఠవ ముండ దను మాట నిజమే. ఎన్నిగంటలు మాటా డినను అంగోపాంగ విభజనముగాని, ఏ యంశమున కెంత ప్రాధాన్యము నిచ్చి మాటాడవలెనో గ్రహించి

మాటాడుట కాని సాధారణముగ కానరావు. సభ్యులు తమ యుపన్యాసమునకు సుముఖులా విముఖులా యను విషయమునుకూడ వారు గుర్తింపరు. ఆవేశపూరితులయి బిగ్గరగ చెవులలో గింగురుమనునట్లు మాటాడుదురు. అగ్నిపర్వత మొకటి గ్రమ్మున బ్రద్దలయి 'లావా' వర్షించుచున్నదా యనిపించును. మునలితనమంతయు నెక్కడకు పలాయనమగునో తెలియదు కాని తరుణ యోధుడు అశ్వము నెక్కి కత్తి ఝుళిపించుచు కదనరంగమున వీరవిహార మొనర్చుచున్నట్లుండును. వేయేల? పిడుగులు వర్షించుచున్నట్లుండును.

౪

నేను అప్పుడప్పుడు పంతులవారి దర్శనార్థమయి వారియింటికి పోవుచుందును. పోయినప్పుడెల్ల అయిదారు గంటలకు తక్కువగాకుండ గూర్చుండవలసినదే. ఒకదినము పగలు పది గంటలకు పోయి సాయంత్ర మారు గంటలకు ఇంటికి వచ్చితిని. మనము మాటాడినచో వారికి వినబడదు గావున వారు మాటాడగా వినవలసినదేగాని ఉక్తిప్రత్యుక్తుల కవకాశము లేదు. అప్పుడు వారు వర్షించు ననురాగరసము అమూల్యము. నా ప్రాక్టీసునుగురించి, నా కష్టసుఖములను గురించి, నా పిల్లలనుగూర్చి పుంఖానుపుంఖములుగ ప్రశ్నలు. ఆ వాత్సల్యమునకు మేరలేదు. క్రమముగ సంభాషణము భాషావాదమునకు పరుగెత్తును గదా? ఇక నా పాండిత్యమునకు హద్దులేదు. ఒక్కొక్క శబ్దమునే తీసికొని దాని కేకాలమున నెట్టి స్వరూప మున్నదియు, ఎట్టి యర్థ మున్నదియు వివరింప మొదలిడినచో నిశ్చేష్టుల మయి కూర్చుండి వినుచుండవలసినదే. ఒక్క తెనుగు భాషాచారిత్రము నుండియే గాక ఆంగ్ల భాషాచారిత్రమునుండియు, సంస్కృత భాషా చారిత్రమునుండియు, ఇతర భాషా చారిత్రములనుండియు నుదాహరణములను గైకొనుచు భాషాపరిణామమును గూర్చి వారు ముచ్చటించుచుండగా వినుచున్నపుడు "తెనుగు భాష నా మాతృభాష గదా! దానిలో నేదో పాండిత్యప్రకర్ష చేయుచు పుస్తకములు వ్రాయుచున్నాను. నిజముగ నా భాషను గూర్చి నాకేమియు తెలియనే తెలియదు" అనుభావములు మనస్సును కలతపెట్టును. వారి పాండిత్యమును చూడగా చూడగా ఆశ్చర్యము—వెరపు—దిగ్భ్రమము ఉదయించును. శబ్దస్వరూప నిర్ణయమున వారి సిద్ధాంతము లన్నియు ప్రామాణికములు గాకపోవచ్చును. కాని వారు సలిపిన కృషి యపారము. ఆధునిక గ్రంథములనుండి గ్రంథకర్తల నెదుట బెట్టుకొని కృతకభాష కుదాహరణములుగ తప్పులు చూపుచున్నపు డెంతటివారయిన మారు మాటలేక మౌనముద్ర వహింపవలసినదే. ఆంధ్ర దేశమున సుప్రసిద్ధపండితులు పెక్కుమందితో నాకు పరిచయ మున్నది. కాని ఆంధ్రభాషా తత్త్వవేతృత్వమున నీయనతో తుల్యులు నాకు గానరాలేదనుట అతిశయోక్తి గాదు.

ఇంకొక విశేషము. భాషావాదమును బురస్కరించుకొని ఎదుటివారి గ్రంథములను విమర్శించుచున్నపుడు గ్రంథములను దాటి వ్యక్తిదూషణ కెన్నడును వారు పోరు. ఎంతసేపును గ్రంథములో నున్న వ్యాకరణదోషములనే వారు విశదీకరించి తమ వాదమును పునః పునః ప్రతిష్ఠించుచుందురు.

౫

ఇట్టి మహాపండితునికి చేయదగిన సేవ చేసి ఆంధ్రదేశము పొందదగిన లాభము పొందినదా? వారిచే సమగ్రమగు వ్యాకరణము వ్రాయించుకొనవచ్చునే? లేదా నిఘంటువు వ్రాయించుకొనవచ్చునే? లేదా; భాషాచరిత్రము వ్రాయించుకొనవచ్చునే? లేదా పరిశుద్ధమైన భారత ప్రతి తయారుచేయించుకొనవచ్చునే? వీనికిని వారితో మనకున్న వాదభేదమునకును ఎట్టి సంబంధమును లేదే?

అట్టి భాగ్యమునకు మనము నోచి పుట్టలేదు. వాదభేదములను బురస్కరించుకొని పండితప్రభువులకు వారు అస్పృశ్యు లయిపోయినారు. అందుచే ఆనకట్టకు పూర్వము గోదావరీప్రవాహమువలె ఆ పాండిత్యమంతయు వ్యర్థము కావలసినదే కాబోలును. వారికేమి? వా రెప్పుడును సుకృతులే. అపురూపమైన పాండిత్యసౌందర్యముతో, నైతిక సౌందర్యముతో—ఆ ముఖారవింద మాంధ్రదేశమున్నంతకాలము నిత్యయౌవనముతో నాంధ్రదేశ చారిత్రము నలంకరింపవలసినదే! అట్టి సౌందర్యమునకు విలువగట్టలేని కళంకముకూడ ఆంధ్రజాతికి శాశ్వతముగ నిలువవలసినదే కాబోలును!!!

# 'బ్రాహ్మణీకం'

వడ్లమన్నాటి కుటుంబరావు

★

నవ్యాంధ్ర కథకుల్లో అగ్రస్థానానికి అర్హులైన వెంకటచలంగారి రచనలు ౧౯౩౮ ప్రాంతాల అందరూ నిరసిస్తూ వుండేవారు. అయినప్పటికీ సనాతన-అధునాతనులందరూ ఆప్యాయంగా చదివి, తిరిగీ చదివి ఆనందపడుతూనేవుండేవారు. వారికథలు వ్యభిచారాన్ని ప్రోత్సహించేవనీ, అవినీతివర్ణనలు జాస్తిఅనీ, సంఘశ్రేయానికి అట్టివి మంచివికావనీ ఒక అభిప్రాయం బహుమందికి యేర్పడిపోయింది. వెంకటచలంగారి కథలన్నీ నీతిబాహ్యాలా అని పరిశీలనచేస్తే పొరపాటుపడ్డామని నాలిక కరుచుకోవలసివస్తుంది. వారి రచనలన్నీ నీతిబాహ్యాలక్రింద జమకట్టడానికి వీలు లేదు. సంఘశ్రేయాన్ని అభిలషించి రచింపబడినవికూడ కొన్ని వున్నయి. సంఘంలో వుండే దురాచారాల్ని, అజ్ఞానాన్ని, అమాయకత్వాన్ని రూపుమాపుటకు ప్రయోజనపడే "బ్రాహ్మణీకం" లాటికథలుకూడా రచించారు వెంకటచలంగారు.

ప్రాచీనంగా మనలో కొన్ని ఆచారాలు, సంప్రదాయాలు పాతుకుపోయినై. ఈ నాటి దేశకాల పరిస్థితులకు అవి పనికిరావు. మన వేదాలు, పురాణాలు, స్మృతులు మొదలైనవన్నీ కొన్నివేలయేండ్ల క్రిందట ఆనాటి సంఘ జీవితాన్ని ఆధారంగా చేసుకొని కల్పింపబడినవి. ఇప్పటింకా వాటినే పట్టుకు వ్రేలాడతా మనటంకంటె వెర్రితనం యింకొటి లేదు. ఊఁహూఁ అన్నాకూడా కాలం అంగీకరించదు. కాలశక్తియందు మనశక్తి తృణంవంటిది. భగవంతుడిచ్చిన బుద్ధిప్రాభవంచేత యేవోకొన్ని వింత దృశ్యాల్ని మనుష్యుడు కల్పించ గలిగినంతమాత్రాన యీ తనశక్తి అంతా స్వశక్తి, స్వప్రయోజకత్వమే అనుకోవటం అహంకారమనిపించుకుంటుంది. ప్రపంచంలో జనించిన ప్రతిజీవిలోను అనుదినం జరిగే మార్పుల్ని గమనిస్తూనేవున్నాం. ఒకజీవి పుట్టి, పెరిగి, అనుభవాలు పొంది, పెద్ద అయి, యెలా హరింపు చెందుతున్నదో అదేవిధంగా కాలమనేదికూడ. ప్రతిజీవీ దానికి దాసుడు కావలసిందే. జీవియొక్క హితము, అహితములతో దానికి నిమిత్తం లేదు. జీవియొక్క శ్రేయము, అశ్రేయములను గూడ గమనించదు. జీవి తనను అంటివస్తున్నాడా లేదా అనే ఆదుర్దా, వెనుకచూపు గూడ లేదు. ఒకే నడక. జీవుడు దాని ననుసరించవలసినదే. దాని తీవ్రతక్రింద జీవి నలిగిపోవుతున్నాడేమో ననే జాలి యీషణ్మాత్రం లేదు. కాలముయొక్క దృష్టిలో ప్రపంచజీవి ఒక తుచ్ఛకీటకము. ఆ వేదకాలంనాటికీ యీ నాటికి అనంత విధాలైన మార్పులతో ప్రపంచజీవి కూడ మార్పు చెందకతప్పదు.

అనూచానంగా వస్తూన్న మన ఆచారాల్ని, సంప్రదాయాల్ని కొంచెం సూక్ష్మదృష్టితో, యీనాటి ప్రపంచపరిస్థితుల్తో సమన్వయపరచి చూస్తే అవి కేవలం సైంటిఫిక్ అని తట్టకపోదు. అవన్నీ సుఖమైన, ఆనందమయమైన జీవితం గడపటానికి మానవునకేర్పడ్డ కొన్నిగురుతులు, కొన్ని హెచ్చరికలు. ఇక దుఃఖాలు, కష్టాలు అనేవి ఆకాలప్రవాహానికి యెదురీత సాగించిన ప్రయత్నఫలితం. ఈ స్వల్పమాత్రాంశాన్ని అవగాహన చేసికొనకుండా సంచరించేజీవి క్షుద్రుడై పోతున్నాడు. వెంకటచలంగారు తమ 'బ్రాహ్మణీకం' మనేరచనలో ప్రకటపరచేది యీ రహస్యాన్నే.

సుందరమ్మ పల్లెటూరి బ్రాహ్మణపిల్ల. సంప్రదాయంగావస్తున్న నిక్కారసైన పూర్వాచారపరాయణకుటుంబంలో పుట్టిన కారణంచేత మడి, ఆచారం, దేవుళ్లు, దెయ్యాలు, జ్యోతిషాలు, సోడెలు మొదలైన మాఘనమ్మ కాలుగల అమాయక ప్రవృత్తి కలిగింది. బహు చిన్నివయస్సు అయినా పెద్ద ఆచారాలు, పెద్దమడులు, పెద్దవూహలు. ఎనిమిదోయేటనే మేనత్తకొడుక్కిచ్చి పెళ్లిచేశారు. పెళ్లికాగానే సంస్కృత విద్యాభ్యాసంకోసం పరదేశాలకు పోయి ఆరేళ్లు గడచివచ్చి కార్యం చేసుకుని భార్యతో కాపురం సాగించాడు. సుందరమ్మ యితని [illegible] సౌందర్యరాశి అవటంచేత రెండు సంవత్సరాలపాటు యథేచ్ఛగా ప్రవర్తించారు. ఇంతలో దేవుడికి కన్ను కుట్టిందికాబోలు దాంపత్యాన్ని త్రుంచివేశాడు. తీవ్రజాడ్యం యేర్పడి భూశయనం చేయబడ్డాడు ఆతడు. దీపం కునికిపోయే సమయంలో సుందరమ్మను, మామగార్ని దగ్గరకుపిలిచి "నేనుపోయినా దానిలో నివసించబోతున్నాను. దాని అందాన్ని అమితంగా ప్రేమిస్తున్నాను. దానిని వికారం చెయ్యొద్దు" అనిచెప్పి ప్రాణాలు విడిచాడు. మూడుసంవత్సరాలు గడిచాయి. భర్తకుచేసిన వాగ్దానంప్రకారం యేయితరజోక్యం కలుగచేసికోకుండా తొణుకాడని గాంభీర్యంతో తపశ్శాలినిలా సందే అనుకునేటట్టు తోపచేస్తోంది. ఇంతలో తండ్రికూడా మరణించాడు. దిక్కు శూన్య మయ్యేసరికి మేనమామ చేరదీశాడు. మేనమామ వెంకట్రామయ్య యింట్లో చంద్రశేఖరమనే బీదకుర్రాడు చదువుకుంటూ వెంకట్రామయ్యగారి కుమార్తెకు పాఠాలు సంగీతం చెబుతున్నాడు. సుందరమ్మనుకూడా వానిదగ్గరపాఠం, సంగీతం వగైరా నేర్చుకోవలసిందిగా మేనమామ ఆజ్ఞాపించాడు. చంద్రశేఖరం అగర్భదరిద్రుడు. ఈ స్థానం తప్పితే ఆదరించేందుకు ఒక్క పురుగుకూడ లేదు. ఏమంత పెద్దచదువూ అబ్బలేదు. రూపమా అదీ అంతంతమాత్రమే. వీనికి సుందరమ్మమీద మనసు పారింది. కొంతకాలం వీనిచేష్టలు ఆమె గుర్తించనేలేదు. సుందరమ్మకు ఆగొడవే లేదు. చంద్రశేఖరం తాపన అంతకంతకు జాస్తి అవుతోంది. తన ఉపాయాలన్నీ విఫల మవుతాయి. కొంతకాలానికి వానిదురూహ సుందరమ్మకు కొంచెం అర్థ మవుతుంది. అయినా తొణకదు. ఆతడో ఆమెమీద త్రాచుపగ పట్టాడు. ద్వేషం, మోహం రెండూ పెనవేసుకుని బాధిస్తున్నయి అతన్ని. ఇక సాహసమే శరణ్య మనుకుని యింటిలోనుంచి వెళ్లగొట్టినాసరే, చంపినాసరే, తన ఉత్తర జీవితం బుగ్గి అయినాసరే ఆమెను పొందనిదే జన్మసార్థకత కాదనే మూర్ఖపుపట్టు పట్టి ధైర్యం చేసి సఫలు డైనాడు. సుందరమ్మ పొత్తికడుపు పెద్దదై నను పెక్కుతోంది. ఈ చంద్రశేఖరం గయిర్విలియా అయినాడు. ఈ

గర్భధారణాన్ని గురించి యింట్లో ఆమూలా ఆమూలా చెవులు కొరుక్కుంటున్నారు. ఈ విషయం వెంకట్రామయ్యగారి నోటీసులోకి వెళ్లింది. సుందరమ్మను చంద్రశేఖరానికిచ్చి వివాహంచేయడం తప్ప వేరే ఉపాయమేమీ తోచక వానినిపట్టి తీసుకువచ్చి వివాహంజరిపించి యిరవై అయిదు రూపాయల బ్యాంకు సమాస్తాపనికూడా కుదిర్చి వేరే కాపురం పెట్టించి చేతులు కడిగేసుకున్నాడు. ఈ వివాహ విషయంలో చంద్రశేఖరం సుందరమ్మల యిష్ట - అయిష్టాలను తెలుసుకోవటానికి యెవ్వరూ ప్రయత్నించలేదు. సుందరమ్మ చంద్రశేఖరాన్ని ప్రేమించలేదు. పైగా తన జీవితాన్ని ధ్వంసంచేసినాడనీ, తాను తన పూర్వపుభర్తకు చేసినవాగ్దానం భంగంచేసినదనీ, యీవితంతువివాహం మహాపాపకార్యమనీ చంద్రశేఖరాన్ని ద్వేషంగా చూడటం మొదలెట్టింది. సుందరమ్మయొక్క సరియైన ప్రకృతిని తెలుసుకోకుండా తనుఅంటే ఆమె విముఖురాలుగా వుండటం ఆమెకు పరపురుష సంబంధ మున్నదని చంద్రశేఖరం అనుమానపడి యిద్దరకూ ఒకరినిచూస్తే ఒకరికి ఏమాత్రం పడకుండావచ్చింది. భర్త అంటే ఆడదానిమీద సర్వాధికారి అని చంద్రశేఖరం భావన. సుందరమ్మను కేవలం దాసీకన్నా కనా కష్టంగా చూస్తున్నాడు. సంసారంలో భర్తకు యెక్కువ ఆధిక్యము కలదా, భార్యకు యెక్కువ కలదా? అనే జిజ్ఞాస సుందరమ్మకు లేదు. ఆమె దంతా అచోక్క అడవిగోడు. కాని చంద్రశేఖరం ప్రవర్తన, అతడు తనకు చేసినమోసంవల్ల అతన్ని మనసా ద్వేషిస్తోంది. సంసారం చేస్తున్నారన్న మాటేగాని ఒక్కనాడుగూడ తృప్తికరంగా సుఖంగా గడపిందిలేదు. ప్రసవించింది. ఏముచ్చటా లేదు. బిడ్డఅవసరానికి యేదైనా స్వల్పమాత్రపుడబ్బు కావలిస్తే సుందరమ్మ అతనిదగ్గర వేశ్యాతత్వం అవలంబించవలసిన అవసరం యేర్పడటం ఆమెకు మరింత అసహ్యంగా తోస్తూవుంది. ఈ వివాహం వితంతువివాహం కావటంచేత చుట్టుప్రక్కల యిండ్లవాళ్లెవరూ పలుకరించరు. విరిగినవ్రేలికి సున్నముగూడా పెట్టమంటారు. దేవుడుగుళ్లోకి కొబ్బరికాయ తీసుకుపోతే అక్కడ పూజారికూడా స్వీకరించడు. బిడ్డకు జబ్బు అంతకంతకు ముంచుకువస్తోంది. చంద్రశేఖరం యేమాత్రం శ్రద్ధచూపటంలేదు. ఆబిడ్డకు ఆజబ్బుచేయటం తానుచేసిన పాపకర్మఫలం అని ఆమె విశ్వాసం. శ్రమపడి డాక్టరును పిలుచుకువస్తుంది. చూచి సూదిమం దెక్కించవలె నంటాడు. సుందరమ్మ తొంటిచెయ్యి బయటపెడితే యీమెపిచ్చిదని అతడు వెళ్లిపోతాడు. మందుకొరకు తనే మందులషాపుకు వెళ్లుతుంది. డబ్బుయియ్యనిదే షాపువాళ్లు మందియ్యమన్నారు. ఈమె వాలకంఅంతా షాపులో ఒక గమళ్లకులస్థుడు కనిపెట్టి ఆమెవెంటబడి యింటికివస్తాడు. ఈతడు ప్రథమంనుంచీ బ్రహ్మద్వేషిగా పెరిగాడు. సుందరమ్మ అసమాన సౌందర్యానికి తోడు బ్రాహ్మణజాతిదికూడా కావడం వాని సంకల్పం యీడేరేయోగం పట్టినట్టు భావించాడు. తను డాక్టరు నని చెప్పుకుంటాడు. సహజ- అమాయకత్వంచేత యీ అయాచితుడయిన మనిషి తమపాలిట దైవమని భావిస్తుంది సుందరమ్మ. మందిస్తే దానికి ప్రతిఫలం ఆమెపొందు నభిలషిస్తాడు. ఆమెమానం సంపూర్ణాంగీకారంగా భావించి తనజీవితాశయం నెరవేర్చుకుంటాడు. మందియ్యమంది తను వైద్యుడు కానని అంటే తిరగబడింది. రాక్షసి, దెయ్యం, మహిషాసురమర్దని, శక్తి అయింది ఆమె. ఆమెధాటికి తప్పించుకోవలెనని ప్రయత్నించటంలో వానిబట్టకు అక్కడ మండుతూవున్న కిరసనాయిలుదీపం అంటుకుని భస్మమైపోతాడు. సుందరమ్మ పిల్ల మీద పడి చచ్చిపోతుంది.

ఈరచన్ని పూర్తిచేయటంలో వెంకటచలంగారు కొంచెం గందరగోళపడ్డా రని అనక తప్పటం లేదు. కథ ముప్పాతిక నడచిన తరువాత ముగింపుదగ్గర అవసరపడినట్టున్నది. గవళ్ల రామయ్య వచ్చి మీ రెవరని అడిగితే "బ్రాహ్మలం"అంటుంది సుందరమ్మ. ఈముక్కను ఆధారంగాగ్రహించి రామయ్యకేదో వెర్రియెత్తించి కథను సమాప్తి చేశారు. మనదేశం ఒక్క దేశంగా, ఒక్కజాతిగా మెలగటం లేదు. వివిధదేశాలు, వివిధజాతులు, వివిధమతాలు, జాతులలో తిరిగీ అంతర్జాతులు భిన్నభావాలు కలిగివుంది. సుందరమ్మ "బ్రాహ్మలం" అనటంలో గల ఊహ యేమిటో వెంకటచలంగారి బుద్ధికి తట్టలేదట. తమ రెవ్వరని యెవ్వరైనా అడగటం 'మేము బ్రాహ్మలం, కోమట్లం, మొదలియార్లు' అనటం యీదేశంలో సహజమైన సంప్రదాయ మైపోయింది. ఇది గర్వంతో చెప్పుకునేది యేమాత్రమూ కాదు. రామయ్యతో బ్రాహ్మలం అనటం కాకపోతే ఆవూళ్లో ఆమె ప్రఖ్యాతి చెందినది గనక వేరేవిధంగా చెప్పుకుంటుందా? సుందరమ్మ బ్రాహ్మణి అనేసంగతి సగర్వంగా చెప్పిం దనుకుందాం. బ్రాహ్మణజాతి చాలా గొప్పది, మడి ఆచారవంతులు, మిగతవారంతా తక్కువ వర్ణస్థులు అనేభావమే అనే గర్వమే వుండివుంటే రామయ్యను తగినట్టే తిరిగీ ప్రశ్నించివుండేది "మీరెవ్వరు" అని. "మేము గవళ్లకులం, నా పేరు రామయ్య, ఈ తాలూకాబోర్డు ప్రెసిడెంటును" అని జవాబిస్తే మం దియ్యటానికి అంగీకరించదు. అమాయకత్వంచేత, అజ్ఞానంచేత, మూఢనమ్మకాలచేత సంసారమే ధ్వంసం అయిపోయినా లక్ష్యం చెయ్యనిది గవళ్లవాడి చేతిమందు తన బిడ్డగొంతులో పోయనిస్తుందా? పోనీ ఆచారాలు పనికిమాలినవి, దేవుడు దెయ్యాలు వున్నవో లేవో యింతవిశ్వాసంతో సేవిస్తున్నా కనిపించక ఆదరించనప్పుడు వాటిని కొలిచే దేమిటని మనసు మారిందేమో ననుకుంటే కథ ప్రారంభంమొదలు యింతవరకు ఒకేవిధంగా నడచిందే ఆమెజీవిత మంతా. సుందరమ్మ బ్రాహ్మలం అనటం మన దేశానికి సహజం. "బ్రాహ్మలం" అనటం గర్వమనే పక్షంలో సుందరమ్మ యేబ్రిటిషుజాతిస్త్రీ అయ్యో వుండాలి. ఇంగ్లీషువారికి పెంకెతనం జాస్తి. తమజాతి అంటే చాలా గర్వపడతారు. ఈ గర్వంచేతనే యే యింగ్లండు యువకుడికి అమెరికా, జర్మనీ, ఇటలీ, రష్యావంటిదేశాల్లో నౌకరీలు లభించవు. ఇంతేకాకుండా "Wanted" Columns లో ప్రకటనలకు "No Englishmen need apply" అనికూడా అంటారు.

పై విషయంలో వెంకటచలంగారు "ఆ వొక్కమాట! ఆ మాట ఆమె ఆసమయాన అనితీరవలసిందేనా? ప్రపంచచరిత్రలో అది తప్పనిసరి అయిందా? ఇదివరకే ప్రపంచ సృష్టిలోనే యిది నిర్ధారణ అయిపోయిందా? లేక సుందరమ్మ రామయ్యల పూర్వజన్మ కార్య ఫలిత సంఘట నలవల్లా? లేక భూలోక వ్యవహారాన్ని కనిపెడుతూ నడిపించే దేవతలు అట్లా నిశ్చయించి ఆ నిమిషాన-నే నీ కథని ఎట్లా అంతంచెయ్యాలో యీ నిమిషాన నిర్ణయించినట్లా? లేక ఆమాట అవసరం సుందరమ్మ **heridity** వల్ల నిర్ణయింపబడ్డదా? బ్రాహ్మలం అనే గర్వపు పలుకు యుగ యుగాల బ్రాహ్మణరక్తం బ్రహ్మజ్ఞానుల అధికారయోగ్యత ఆమెనోటిలోనించి పలికిందా? ఊరుకన్న, పేరుకన్న, ఉద్యోగం కన్న, వంశంకన్న ముందు కులంసంగతి వెల్లడి చేసేయీ దేశాచారమే ఆమెని ప్రోద్బలం చేసి వుండొచ్చు"అని జిజ్ఞాసపడ్డారు.'బ్రాహ్మలం' అని ఆమెనోటివెంట రావడం కేవలం **Automatic.** 'మీ రెవరు' అని ప్రశ్నిస్తే 'నేను మీ సోదరుణ్ణి, లేక మీ సోదరిని' 'మీదే జాతి'కి బదులు 'మాది భారతజాతి' అని అనగినంత సంస్కారం, ఏకీభావం మనదేశీయుల కింకా అలవడలేదు. సుందరమ్మ గడుసుదే అయినట్టయితే, కార్యసఫలతే ప్రయోజనంగా పెట్టుకున్నట్టయితే రామయ్యతో "యెవ్వరమయితే యేం నాయనా! మాపాపం పండి యిలా అనుభవిస్తున్నాం, మీ అప్ప చెల్లెండ్రవంటిదానినే నేనూనూ" అని అంద కుండా ఉంటుంది. ఆమె అమాయకత్వమే నిజం పలకమని ప్రేరేపించింది. సుంధరమ్మ మాయలు మర్మాలు నేర్చినదిట్ట కాదు; ఉత్త భోళాది.

"మందిస్తే నా కేమిస్తావు?" అంటాడు రామయ్య. "ఏముంది, ఏంలేదు నాకు, దిక్కు లేనిపక్షిని" అంటే "నువ్వేకావాలి" అంటాడు. ఎంత సాహసం! ముందుగతి చూచుకో కుండా బ్రహ్మద్వేషంచేతనే అన్నాడను కుందాం, స్త్రీ అంగీకరిస్తుందా? మౌనం వహించింది. దీనిని అంగీకారంగా భావించి ఆచచ్చిపోతూన్న పిల్లపక్కన, ఆకిరసనా యిలుబుడ్డి ముందు కదిలేబికారినీకళ్లో సుంద రమ్మని కౌగిలించుకున్నాడు. సుందరమ్మ మనసు యిందుకు అంగీకరిస్తుందా? నీవుకావాలి అనటంతో ఆమెకోయ్యఅయి పోయింది. బిడ్డ యొక్క ఆశ వదలుకుంది; తనకష్టాలన్నీ పాప ఫలమని హృదయంలో ఆవేదనపడుతోంది. తిరుగబోతుదికాదు. చంద్రశేఖరంతో పోయి సందుకే మొదటిభర్తకు ఆగ్రహంవచ్చి యీ విసంగా చికాకులు పెడుతున్నట్టు నమ్మ చుండే సందర్భంలో రామయ్యను అంగీకరిస్తుందా? సుందరమ్మ కిది సుతరామూ యిష్టం లేదు. వెంకటచలంగారే యింకో చోట "స్త్రీ అంగీకారంలేందీ ఎంతబలవంతుడయిన పురుషుడూ నిస్సహాయుడనే సృష్టినిర్ణయం వ్యక్తమయింది" అంటున్నారు. సుంద రమ్మ రామయ్యను ప్రేమించలేదు. నీవే కావాలి అన్నదానికి తగిన శాస్తిచేయటానికి సుందరమ్మకు రామయ్య తగినంత అవకాశ మియ్యలేదు. సుందరమ్మకు సమాప్తిలో వెంకటచలంగా రీగతి కల్పించటం స్త్రీప్రకృతికి విరుద్ధం

ఈకథ ట్రాజెడీగా అంతమయింది. వెంకటచలంగా రీకథ యేకాలంనాటిదో యెక్కడా వుదాహరించలేదు. ఈనాడు జరుగుతూన్న విషయాల్నే వస్తువుగా గ్రహించి అల్లినప్పుడు ట్రాజెడీగా, అంతంచేస్తే ముందింకా యెంతో తదంగం జరగాలిసి వుంటుందే! పై విషయాల్నిపట్టి చూస్తే చివరచివర భారతసంప్రదాయం మరచి పోయినట్టు తోస్తోంది వెంకటచలంగారు. భారతసంప్రదాయంతో ప్రారంభంచేసి పాశ్చాత్యసంప్రదాయపు సమాప్తిని తెచ్చే సరికి యీ అల్లికలో వెంకటచలంగారు కొంచెం గందరగోళపడ్డా రనే వూహించ వలసివస్తోంది. ఇంతవర కిది 'ఉత్తర బ్రాహ్మణీకం.'

గవళ్ల రామయ్య ప్రవేశ పెట్టబడనంతవరకు కథ సరసంగాను, సహజంగాను నడిచింది. అనుదినం మనకళ్ల యెదుట కేవలం అజ్ఞానమే కారణభూతంగా యెన్నో [illegible] కాలి పోతున్నవి. ఏనాడో యేర్పడ్డ ధర్మ శాస్త్రాలు, మతసిద్ధాంతాలు యుగయుగాంత రాల అనంతరం పాశ్చాత్య సంపర్కంవల్ల, నాగరకతా ప్రభావంమూలాన, తత్వశాస్త్ర ప్రయోగంచేత, ప్రత్యక్షాను భవంవలన అనుమానగ్రస్తాలై దూదిపింజలమాదిరిగా ఎగిరి పోతున్నాయి. విశేష గ్రంథపఠన పరిశీల నాదులవలన గూడా ఆనాటి కట్టుబాట్లీనాడు పటాపంచ లవుతున్నాయి. ఒకప్పుడు భారత దేశంలో బ్రాహ్మణుడు మొదలుకొని శూద్రునివరకు కొన్ని సంస్కారాలకు అధి కారులై వున్నారు. ఆశ్వలాయనాది గృహ్య సూత్రాలు, మనుస్మృతి వగైరాల్లో చెప్ప బడిన సంస్కారాలు కాలక్రమేణ మనలో నూటిలో నాలుగవవంతుగూడా ఆచరించటం లేదు. ఆచరిస్తున్నవారైనా అర్థంలేకుండా, ప్రయోజనం గ్రహించకుండా "మాపెద్దలు చేస్తుండేవారు, ఆ ఆనువాయితీ తప్పడమెందు కని మేమూ చేయాలి, తప్పదు"అని సమాధాన మిస్తున్నారు యెవ్వరైనా ప్రశ్నిస్తే. ధర్మ సిద్ధాంతాలనిగూర్చి ప్రశ్నించటానికి యిష్ట పడరు మరికొందరు. కారణం కర్మిష్ఠులకే తెలీదు వాటి పరమార్థం, ప్రయోజనం. తర్క శక్తి, సంస్కారావబోధం, విజ్ఞానసముపార్జ నోద్యోగం విరివైన యీ దినాల్లో ప్రతి పూర్వ పద్ధతికీ 'యిది ఎందుకు, అది యెలాగు' అని శంకలు ఉదయిస్తున్నాయి. ఏకో సక్రమమైన ఋజువులను పరుస్తేనే కాని ధర్మశాస్త్రాలలోని నియమాలు, ఆంక్షలు, ఆజ్ఞలు అవలంబించ కున్నారు. ధర్మ శాస్త్రాలు సంఘకట్టుబాటుకు, సంఘనీతికి, సంఘక్షేమానికీ యేర్పడినవై యున్నాయి. కాని మనదేశం పరరాజులదాడి, ఆక్రమణ, ఆధిపత్యం మొదలైనవాటికి గురి అయినప్పటి నుంచీ పూర్వసంప్రదాయాలు, ఆచారాలు ఒకటివెనుక ఒకటి నిర్వ్యాకమణంలోకి దిగి నూతనరాజుల, సంప్రదాయాలు ఆచారాలు తల యెత్తటం మొదలుపెట్టినవి. అశోకుని కాలంనాటి ఆచారాలు మధ్యయుగంలో లేవు. ఈ నాటివి మరి రెండువందల సంవత్స రాలకు పూర్తిగా మారిపోవచ్చు. కాలగర్భం యొక్క మహాత్వ మట్టిది.

సుందరమ్మ పుట్టింటివైపువారు గాని, అత్తింటివైపువారు గాని సంఘసంస్కర్తలు కారు. బ్రాహ్మణీకం యొక్క యథార్థత వారింట్లోనే వుంది. నూటికినూరుఛాందస ప్రవృత్తి కావటంచేత సౌఖ్యమంటే యేమిటో, లోకజ్ఞానమేమిటో, ప్రపంచ మెట్లా నడుస్తోందో అనే మీమాంస వారికెప్పుడూ తట్టని కారణాన సుందరమ్మ కాపురం యిలా కాలిపోవలసి వచ్చింది. సుందరమ్మకు కొంచెం చదువు, స్వల్పంగా సంగీతం, మధ్యేమధ్యే బస్తీలకు షికార్లు కొట్టి నాగరక షోకులు, నాటకాలు సినీమాలుచూడటం, కొంచెం Sex knowledge, సంసారం నడుపుకునే నేర్పు, బిడ్డల పోషణ మొదలైనవి కొన్ని యేకొద్దిగానైనా తెలిసిఉంటే ఆమెచరిత్ర యింత దీనంగా ఉండివుండదు. సుందరమ్మ ఛాందసానికి తోడు చంద్రశేఖరం లభ్యమయ్యాడు. సుందరమ్మ చంద్రశేఖరాల మనోగతం తెలిసికోకుండా పెండ్లిచేసిన వేంకట్రామయ్య వాళ్లసంసారం యీ విధంగా బుగ్గికావటానికి బాధ్యుడు. అయినా భార్యాభర్తలు ఐకమత్యంతో వుండవలదని వెంకట్రామయ్య మతంకాదుగా! అసలు వీరిపెండ్లికి కారణమే వేరుగా.

భారతదేశం పారతంత్ర్యదేశం. ఏది జరగవలెనన్నా ప్రభువుల అనుమతికావలె. మన పాఠశాలల్లో పనికిమాలిన, సేవకావృత్తికి మాత్రమే పనికివచ్చే చదువు నేర్పుతున్నారు. గృహస్థు అయినపిమ్మట సంసారం ఆనందమయంగా చేసికొనేనేర్పును చెప్పటంలేదు. Sex education, బిడ్డలపోషణ, గృహాలంకరణము, పాకకళ, అతిథిసత్కారం, economy, మొదలైనవి కొన్ని మన పాఠశాలల్లో చెప్పినట్టయితే కొన్ని సంసారాలలో భార్యాభర్తల నడుమ సంభవించే తగాయిదాలు అంతరింపచేసికోవచ్చు. పైవిషయాలమీద మనదేశపు పాఠ్యనిర్ణేతలు, ఉపాధ్యాయులు కొంచెం శ్రద్ధచూపుతే సంసారాలు ఆనందసామ్రాజ్యాలుగా చేసికోవచ్చు. ఈవిషయంలో బ్రిటిషువారికంటె జర్మనీవారు ముందంజవేసి స్త్రీలను చక్కని గృహిణులుగా తయారుచేయటానికి ఒకపాఠశాలను స్థాపించారు. త్వరలోనే జర్మనీ నలుమూలలా యీపాఠశాలలు స్థాపింపబడతాయని తెలుస్తోంది.

మొత్తంమీద వెంకటచలంగారీ కథను రచించటంలో సంఘసంస్కారాన్నభిలషించే వ్రాసినా రనటంలో యేలాటిఆక్షేపము లేదు. సుందరమ్మ చంద్రశేఖరుల పాత్రలు చక్కగ పోషింపబడినవి. అవినీతి ప్రసంగాలు, జిజ్ఞాసలు అనుకున్నంత ప్రమాదకరంగా యేమీ లేవు. కొన్ని సిద్ధాంతరూపంగాను, మరి కొన్ని సలహాలుగాను కొన్నిచోట్ల సంప్రదాయ విరుద్ధంగాను కనబడతాయి. ఉదాహరణానికొకటి రెండు—

మొదటిభర్త చనిపోయినపిమ్మట సుందరమ్మ"కొత్తలో శ్మశానానికిపోయి తెల్లార్లూ బిగ్గరిగా అతన్ని పిలుస్తోయేడ్చేదిట." మనలో ఒకశాస్త్రంవుంది. 'ఉన్నవూరివాడికి కాటిభయం, బయటివూరివాడికి నీటిభయం'అని. ఇందులో యథార్థం లేకపోలేదు. ఇది కాకపోయినా శ్మశానంలోకి వెళ్ళటం, చచ్చినవారిని పిలుస్తోయేడవటం పాశ్చాత్యపద్ధతికాని మన పద్ధతి కాదు.

"పురుషుణ్ణిచూసి కలవరపడి సిగ్గుపడి యెడంగా పోయే ప్రతిస్త్రీ హృదయంలోను వ్యభిచారం దాక్కునేవుంది." ఇది స్త్రీలోకం అంగీకరిస్తుందా?

"స్త్రీ నిజంగానే కళ్ళుతెరిచి పరీక్షించి ఏరుకునేట్టయితే యీ మొగవాళ్లకెవరికైనా వివాహయోగ్యత వుంటుందా?" ఈకారణంచేతనే కాబోలు పూర్వీకులు రజస్వలానంతర వివాహాల్ని నిషేధించింది.

"తినాలంటే వంటా, తిరగాలంటే కట్లూ, మాట్లాడాలంటే భాషా, బతకాలంటే నీతీ, ముందు నేర్చుకోడంయెంతఅవసరమో పిల్లల్ని పెంచే విధంకూడా నేర్చుకోడం అంత అవసరమేనని స్మరించరు. భర్తని ఆకర్షించాలన్నా స్త్రీ మృగాలకన్న ఎక్కువనేర్పు కలిగివుండాలని వొప్పుకోరు."

"ప్రస్తుత హిందూప్రపంచంలో వుత్తమంత్రపు శబ్దాలూ, వాటితోచేసే అర్థంలేని కలాపాలూ మిగిలాయి. బారసాలలూ పెళ్లిళ్ళూ చాలాకర్మలూ, వీటికి మతసంబంధమైన అర్థం వూడిపోయింది. మర్యాదకోసం, క్షేమజంకోసం, తక్కినవారి అమర్యాదకు జడిసీ ఆ తంతులు నడుపుతున్నారు."

[ఈకథంతా తునకలుతునకలుగా కొంత కాలం క్రిందట పత్రికలో పడిందే. ఇప్పుడు యువకార్యాలయం (తెనాలి)వారు గ్రంథరూపంలోకి తెచ్చారు. ఖరీదు 4 అణాలు.]

# సినీమా కళ ౨

## పద్మరాజు

ఏదైనా ఒక భావాన్ని కవి వ్యక్తపరచ దలచుకొన్నప్పుడు కవి దాన్ని మాటల్లో వ్యక్త పరుస్తాడు. ఆ భావం, కవిభావనలో కొన్ని మాటలస్వరూపం దాలుస్తుంది. ఆ భావమే చిత్రకారుని భావనలో, కొన్ని గీతల్లోనో, రంగుల్లోనో స్వరూపం దాలుస్తుంది. ఏకళలోనైనా, ఒక భావాన్ని కళాకారుడు, వ్యక్తపరచదలుచుకొన్నప్పుడు ఆకళకి అనువైన అంగాలలో, దాన్ని భావనలో గోచరం కావించుకుంటాడు. అల్లాగే సినీమాకి కథ వ్రాయదలచుకొన్న కవి దాన్ని తెరమీద కనబడేకొన్ని బొమ్మలవరసలో నిర్మించుకోవాలి. కవికి మాటలెల్లాగో, చిత్రకారుడికి గీతలెల్లాగో, సినేరియో వ్రాతగాడికి బొమ్మ లటువంటివి.

నాటకానికీ సినీమాకీ సంబంధం లేకపోలేదు. అన్నిభావాలూ గూడా నటనలో వ్యక్తంగా వారి రెండింటిలోనూ కూడా, అయితే ఇంకవ్రాతలో ఈ రెండింటికీ భేదం ఎంతవరకు?

నాటక రంగంమీదికి ప్రకృతిదృశ్యాలు చూపడంకోసం, చెట్లుచేమలు తీసుకుని రావడం సభ్యతగా చాలాకాలంనుంచి పరిగణించ డటంలేదు. అల్లాగే జంతువులు కూడానూ. అంచేత నాటకం వ్రాసేటప్పుడు, ఆయా ప్రకృతి దృశ్యాల స్వభావ సౌందర్యాలు పాత్రలద్వారా కవి అనిపిస్తాడు. అది స్వాభావికం కాదుగాని, ఆదృశ్యాలు రంగస్థలం మీదికి తీసుకురావడంకంటే పాత్రచేత అనిపించడమే బాసుంటుం దని వెనుకటి నాటకకారులు కనుక్కొన్నారు. ఒక కుక్కని తెర ముందుకు తీసుకునివస్తే, అది, ఆహడావిడి అంతా చూసి, ఖంగారుపడి, నానా అల్లరీ చేస్తుంది. దానితో దానిప్రదర్శనంవల్ల కలగవలసిన సహజత్వం కలగకపోవడమే కాకుండా, నాటకం హాస్యాస్పదమైపోయి, గాంభీర్యమంతా చెడిపోతుంది. అందువల్ల, ఒక పాత్ర ఒక మంచి అందమైన వనంలో తిరుగుతున్నట్టు చూపించవలసివస్తే, కవి, ఆ పాత్రచేత 'ఆహా! ఈవన మెంత మనోహరంగా ఉంది! ఏమి ఈ రంగుల పువ్వులు,...' మొదలైన మాటలు అనిపిస్తాడు. ఏదైనా జంతువుల సంభాషణ వచ్చినప్పుడు, పాత్ర తెరవెనక ఎక్కడో ఆ జంతు వున్నట్టుగా భావించుకుని దాన్ని వర్ణిస్తాడు. సినీమాలో ఒక వనంయొక్క సౌందర్యంగాని, ఒక జంతువుయొక్క లక్షణాలు గాని పాత్రచేత అనిపించడం అనవసరం. ఎందుచేతనంటే ఆ వనంలో సౌందర్యం, ఆ జంతువు లక్షణాలు అన్నీ ఆ ఆ దృశ్యాలని చూపడంతో మనకి వ్యక్తమయిపోతాయి. తెలుగు సినీమాలలో ఆహా! ఈవనమూ, మనోహరమూ! మొదలయిన పాటలు చాలాచోట్ల కనిపిస్తాయి. ఇటువంటి పాటలవల్ల, ఆ దృశ్యాలు కలగజేసే ఆనందం ఎంతవరకు తరిగిపోతుందో తెలుగు సినీమాడైరెక్టర్లు గ్రహించినట్టు కనబడదు.

సినీమాలు నాటకాలకంటె స్వాభావికానికి దగ్గిర అనడం, ఒక్కనటనలోనే కాదు, తక్కిన అంగాలన్నిటిలోనూ అంతే. సినీమాలో సంభాషణ నాటకంలో వ్రాసినట్టు వ్రాయడం చాలాతప్పు. ముఖ్యంగా వ్యక్తపరచ దలచుకున్న భావం, మాటల్లోతప్ప వ్యక్తంగాదని కవికి తోచినప్పుడే అది సంభాషణలో వ్రాయాలి. ఇది సినీమాకి ప్రత్యేకించిన విధానం. అంచేత, సినేరియో వ్రాతగాడు, కథనంతనీ తెరమీద కనబడేకొన్ని బొమ్మలవరసలో జరిగినట్టుగా భావించుకోవాలి. సంభాషణ, మామూలుగా జీవితంలో ఏ విధంగాఅయితే ఉంటుందో అంతకిమించి ఉండకూడదు. సాధ్య మయినంతమట్టుకు ప్రతీభావం కొన్ని బొమ్మలయొక్క చలనంలో వ్యక్తమయేటట్టుగా భావించుకోవాలి. ఇద్దరు ప్రియులు, ఒక తోటలో నడుస్తూఉంటారు. వారి మనస్సులో ఆతోట అంతా ప్రేమయొక్క ప్రతిబింబంలా ఉంటుంది. గోరింకలు మాట్లాడుకుంటూ ఉంటాయి. తుమ్మెద పువ్వుమీద వాలుతుంది. ఈ మోస్తరుగా వనం అంతా ద్వంద్వమయంగా వారు భావించుకుంటారు. ఈ భావం వ్యక్తపరచ దలుచుకొన్నప్పుడు, వారిచేత మాట్లాడించడంకంటే, వ్యంగ్యంగా దాన్ని వ్యక్తపరుస్తే చాలా హృదయంగమంగా ఉంటుంది. మొదట ఆప్రియు లిద్దరూ వనంలో నడుస్తూ ఉన్నదృశ్యం. వారిచూపులీప్రక్కనించి ఆపక్కకి, ఆ పక్కనించి ఈ పక్కకి తిరుగుతూ ఉంటాయి. తరువాత చిన్నచిన్న ముక్కలలో ఒక గోరింకలజంట, తుమ్మెద పువ్వుమీద వ్రాలడం మొదలయిన దృశ్యాలు. తరవాత ప్రియులిద్దరూ ఆగి ఒకరిమొగం ఒకరు చూసుకుంటారు. ఇద్దరికీ చిరునవ్వువస్తుంది. ఈ పూర్వులో ఒకమాటయినా అవసరం లేకుండా వ్యక్తపరచ దలచుకొన్న భావం వ్యక్త మవుతోంది.

అయితే ఈవిధానంలో సంభాషణలో వ్యక్తపరచడంలోకంటే ఉన్నఉత్కృష్టత ఏమిటి?

కళ వ్యంగ్యప్రధానమైనది. ఒకభావాన్ని సూచించడం కళయొక్కఆదర్శం. కాని ఆసూచనలో అనుమానం ఏమీ ఉండకూడదు. ప్రేక్షకుడియొక్క భావనని మేలుకొలిపి కొన్నిసూచన లిచ్చి వాటిమూలాన్ని ఆభావం దానంత టదే ప్రేక్షకుడిమనస్సులో పూర్తి అయేటట్టు చెయ్యడమే కళ చేసేపని. కాని ఆసూచనలు అసంపూర్తిగా ఎంతమాత్రం ఉండకూడదు. వాటిద్వారా అట్టేప్రయాస లేకుండా ప్రేక్షకుడు భావం గ్రహించగలిగి ఉండాలి. అటువంటి సూచనలు నిర్మించుకోడంలోనే కళాకారుడిప్రజ్ఞ తెలుస్తుంది. దీనివల్ల ప్రేక్షకుడికి కళలో ఒకసజీవస్థానం ఏర్పడుతుంది. ప్రేక్షకుడు కళ్లు చెవులు ఉన్న ఒకయంత్రం గాదు. అతనికికూడా హృదయం ఉంది. సినీమాకి విశిష్టమయిన ఆసూచనలయొక్క తత్వమేమిటో సినేరియో వ్రాతగాడు కనుక్కోవాలి. అప్పుడుగాని సినీమా కళ అనిపించుకోదు.

సినీమాకి ఒకకథ రాసేటప్పుడు, ఆకథా వస్తువుని సినీమాలో ప్రదర్శించడానికి వీలయిన విధంగా తయారుచెయ్యాలి. అంటే

ఏమిటి ? కవి మొట్టమొదటే సినీమాలో వర
సగా తను రాసినకథ ఏవిధంగా డైరెక్టరు
ప్రదర్శిస్తాడో పూర్తిగా తెలుసుకోవలసిన
అవసరం లేదు. కాని కొంతవరకూ, ఇంచు
మించుగానయినా అది తెలియకుండా కథ
వ్రాయడం అసంభవం. సినీమాలో రంగాల
వరస ముందు కవి సూచిస్తే తరువాత డైరెక్టరు
దాన్ని దిద్దిసరిచేసి, ఒకవిధమయిన కూర్పుని
తయారుచేస్తాడు. ముఖ్యంగా సినీమాలో,
కవిపని ఇంతటితో అయిపోతుంది. డైరెక్టరు
పని ఇక్కడినుంచి మొదలు అని చెప్పడానికి
వీలులేదు. డైరెక్టరుచేసేపనిలో కొంతభాగం
కవి ముందే చేస్తాడు. కవిచేసేదానిలో కొంత
పని డైరెక్టరుచేస్తాడు. ఇల్లాగ కొన్నికొన్ని
అంగాల పరస్పరసంయోగంచేత సినీమా
ఏర్పడుతుంది. అల్లాకాకపోయి నట్టయితే
సినీమా కొన్ని పరస్పరసంబంధం లేనిభాగాల
సంయోగంలా కనిపిస్తుంది.

ఒకరంగంలో ఒక అల్లరిపిల్లవాడు వస్తా
డు. అక్కడ పిల్లవాడల్లరిచేస్తాడని కవివ్రాస్తే
చాలదు. తెరమీద అల్లరి ఏ విధంగా బాగా
కనిపిస్తుందో అది కవి ఊహించుకోవాలి. పిల్ల
వాడికి తల్లి అన్నంపెడుతూఉంటుంది. పిల్ల
వాడు అన్నంతినడు. తల్లి యెన్నోవిధాల బతి
మాలుతుంది. దీనిమీదా, దానిమీదా వంక
పెట్టి తల్లి అన్నంపెట్టడానికి ప్రయత్నిస్తుంది
పిల్లవాడు తినడు. తల్లికి విసుగువచ్చి పిల్లవాణ్ణి
కొడుతుంది. పిల్లవాడు ఏడుస్తూ అన్నంకంచం
తన్నివేస్తాడు. ఈ విధంగా వ్రాయడంవల్ల
డైరెక్టరుకి ప్రదర్శించడానికి అనువైన అం
గాలు కొన్ని దొరుకుతాయి. వీటిలో యేది
తెరమీద ఎక్కువ బాగుంటుందో, దాన్ని
ఏ వరసలో ప్రదర్శించినట్టయితే భావానికి
పుష్టివస్తుందో అది డైరెక్టరు చూసుకుంటా
డు. కవి ప్రతిఅంగానికి తగినంత అనువైన
వస్తువు తయారుచేసి డైరెక్టరుకి ఇవ్వాలి. ఈ
అనువైన అనేదాంట్లో చాలా అర్థం ఉంది.
పులావివస్తువు ఎఱ్ఱగా ఉంది, ఈ విధమయిన
సువాసన దానిలోనుంచి వస్తూంది, అని వ్రా
యకూడదు. ఆ ఎఱ్ఱదనం, ఆ వాసన, ఆ వస్తు
వుకి ముఖ్యలక్షణాలలోవే కావచ్చుగాని వా
టిని తెరమీద కొన్నిబొమ్మలవరుసలో చూ
పడంసాధ్యంగాదు. అవి ముఖ్యమైన వయినా
సినీమాకి అనువయినవి యెంతమాత్రం కావు.
అల్లా వ్యక్తం కానిభావాలు సంభాష
ణలో వ్రాసుకోవచ్చు. కాని సాధ్యమై
నంతవరకూ, అటువంటి భావాలు, చిత్రం
యొక్క నడకకీ ఐక్యానికి అంత ఎక్కువ
ముఖ్యంగాకపోతే వాటిని వదలివేస్తేమంచిది.

నాటకంలో అన్నిటికంటే ముఖ్యమైనది
సంభాషణ. నటుడి ఆ ఆంగికచలనాలకి సరి
పోయిన భాష ఉపయోగించి వ్రాయడం
నాటకంలో తప్పనిసరి. లేకపోతే ఆభావం
ఏమీ వ్యక్తంగాదు. సినీమాలో సంభాషణ
ఏమీ అక్కఱలేకుండాకూడా భావం వ్యక్త
మవుతూంది. మాట్లాడని సినీమాలలో భావ
ప్రకటనకి కొరత ఏమీ లేదు. కాని మాట్లా
డని నాటకాలు ఉండడం అసంభవం. ఎందు
చేత నంటే సినీమాలో మన దృష్టిలోనుంచి
ఏ చిన్న విషయాన్నీకూడా దాటిపోనీయ
కుండా చూపడానికి అవకాశం ఉది నాట
కంలో ఒకపాత్రనటనలో పూర్తిగా ఏభావం
వ్యక్తంగాదు. అతడు మాట్లాడితేనే గాని
ప్రేక్షకుల దృష్టి అతనిమీదికి పోదు. అందు
లో ఒకరంగంలో నలుగురయిదుగురు పాత్ర
లున్నట్టయితే అది మరీ కష్టం. అంచేత
నాటకంలో సంభాషణ అన్నింటికంటె
ముఖ్యమైన స్థానం ఆక్రమిస్తుంది. భావ
ప్రకటన పూర్తిగావడం కోసమని, ఆ సంభా
షణని స్వాభావికపు సరిహద్దులను అతిక్ర
మించి వ్రాయవలసి వస్తుంది. సినీమాలో
మాత్రం సంభాషణ స్వాభావికపు సరిహద్దు
లను దాటి ఎప్పుడూ పోకూడదు. సంభాషణ
వ్రాయడం చాలాకష్టం. ప్రతీవ్యక్తికి
ఒకొక్క పరిస్థితిలో ఒకొక్క విధమయిన
అనుభవం కలుగుతుంది. దాన్ని ప్రతీవాడు తన
తత్వానికి అనుగుణమయిన విధంగా అర్థం
చేసుకుంటాడు. అతని మనస్సులో పరిపరి
విధాలయిన ఆలోచనలు బయలుదేరతాయి.
కాని ప్రపంచకంలో ఏమనిషీకూడా తన
మనస్సులోని మూలసూత్రాన్ని పైకి చెప్పి
వెయ్యడు. ఒక మంచివయసులో ఉన్న
యువతి ఒక ముసలిమొగుణ్ణి పెళ్లిచేసుకుం
టుంది. జీవితంమీద ఆమెకు నిరాశ ప్రబలి
పోతుంది. తననీచస్థితికి, తన అసంతృప్తికి,
తనబాధకీ తనమొగుడే కారణమని ఆమెకు
తెలుసును. కాని ఆసంగతి ఎప్పుడూ ఆమె
పైకి చెప్పదు. తన అసంతృప్తిని పిల్లిమీదా
ఎలకమీదా పెట్టి చెప్పతుంది. తనమనస్సులో
ఉండే దంతా పైకి కక్కెయ్యడానికి ఏదో
సాకు వెదుక్కుంటుంది. ఆముసలిమొగుడు
కూడా అంతే. తన అనుమానాన్ని అత
డెప్పుడూ సూటిగా చెప్పివెయ్యడు. అతడల్లా
చేసినట్టయితే ఒక అగ్నిపర్వతం పేలిపోతుం
దని అతనికి తెలుసును. కాబట్టి అతడు
మాట్లాడేదాంట్లో తనఅనుమానాన్ని చూచా
యగా వెల్లడిచేస్తాడు. ఇల్లాగే ప్రతీజీవి
లోనూ, లోపలఉండే ఆలోచనలు ఉన్నవి
ఉన్నట్టుగా పైకి ఎప్పుడూరావు. అతడుమాట్లా
డేమాటలే అంతముఖ్యమైనవిగావు. మాట్లాడే
విధానం, చూపులు, ఆంగికచలనం, అన్నీ చేరి
అతనిసంభాషణకి ఒకవిలక్షణమయిన, ఆమాట
లలో ఇమిడిలేని, అతనిమనస్సుని విప్పిచెప్పే
ఒకఅర్థాన్ని మనకి స్ఫురింపజేస్తాయి. కవి
ఆమాట లేవో గ్రహించాలి ఏపాత్ర ఎల్లా
అనుకుంటే అల్లా వ్రాసివేయడం కళగాదు.
ఆపాత్రయొక్క మూర్తిని భావనలో నిర్మించు
కుని, అతనిచేత మాట్లాడించి ఆమాటలే సంభా
షణగా వ్రాయాలి. ఆమాటలు మాట్లాడే
టప్పుడు ఆపాత్రయొక్క అంగాంగిచలనా
లన్నీకూడా పూర్తిగా కవికి దృగ్గోచరం
గావాలి. అప్పుడే కవి సరియైనసంభాషణ
వ్రాయగలడు.

సినీమాలో కొన్నికొన్ని పరిస్థితుల్లో సం
భాషణ ఏమీ అక్కరలేకుండా అత్యద్భు
తంగా భావాలు వ్యక్తమవుతాయి. పాల్ముని
నటించిన 'ఎమిలీజోలా' అనేచిత్రంలో ఒక
రంగం ఉంది. జోలా చాలా పేదపరిస్థితులలో
ఉన్నవాడు. అతి డొకనవల వ్రాసి ఒకప్రకా
శకుడికి ఇచ్చాడు. కొంచెండబ్బేమన్నా ఇస్తా
డేమో అడుగుదామని ఆప్రకాశకుడిదగ్గరకి
వెడతాడు. ప్రకాశకు డొక ఉత్తరం ఇస్తాడు.
అందులో జోలానవల కొన్నివేలప్రతులు
అమ్ముడుపోయిం దని ఉంది. జోలాకి ఏం
మాట్లాడాలో తెలియలేదు. ఖంగారుపడి
పోతాడు. ఏదో మాట్లాడబోయి మాట్లా

పలేకపోతాడు. నవ్వబోయి నవ్వలేకపోతాడు. ప్రకాశకుడి ముఖంకేసి తిరిగి కొంచెం తల ఊపుతాడు. ప్రకాశకుడు చిరునవ్వునవ్వి జోలా ఊపినట్టుగానే తనూ తల ఊపుతాడు. జోలా కొంచెం అడ్డంగా తల ఊపుతాడు. ప్రకాశకుడు అనుకరిస్తాడు. మళ్లీ జోలానిలువుగా తలఊపుతాడు. ప్రకాశకుడు మళ్లీఅనుకరిస్తాడు. జోలా మనస్సులో పొంగిపోయేఆనందం, ఏ మాటలూ వ్యక్తంచెయ్యలేని ఆనందం, ఈ మార్పులో అత్యద్భుతంగా వ్యక్తమయింది. ఇటువంటి పరిస్థితులన్నీ కవి ఊహించి వ్రాయవలసినవే. ఈ పరిస్థితులన్నీ నటుడికి బోధించినతరవాత తన నటనని పోతపోసుకోవటం నటుడివిధి.

నాటకంలో రంగానికీ రంగానికీ ఉండే ఆంతరంగికసంబంధం చాలా తక్కువ. ఏమయినా ఉన్నప్పటికీ, ప్రదర్శనలో రంగానికీ రంగానికి ఉండే విలంబనమూలాన్ని అది ప్రేక్షకుడికి గ్రాహ్యం గాదు. కాని సినీమాలో ఒకరంగం ఇంకొకరంగాన్ని అనుసరించి ఉంటుంది. కాబట్టి రెంటికీఉన్న ఐక్యము బాగా వ్యక్తమవుతుంది. సినీమామార్పు అంతలోనూ ఈ ఐక్యము లేకపోయినట్టయితే సినీమాగాంభీర్యం అంతా చెడిపోతుంది. ఒకొక్కసారి, సంభాషణలోని ఐక్యమును బట్టి ఈ మార్పు ఏర్పడుతుంది. ఒక చిన్న ఉదాహరణ. 'ఎమిలీజోలా' లో, జోలాకి ప్రభుత్వం దగ్గరనుంచి ఉత్తరంవస్తుంది.అతడు నేరస్థుడనీ, న్యాయస్థానంలో విచారించబడతాడని ఉంటుంది. ఒక రంగము. జోలా ఉత్తరం చదువుతూ ఉంటాడు......'నీ మీద మోపబడిననేరం ఏమిటంటే', రంగం ఆఖరు రెండవరంగము. న్యాయస్థానం. ప్రభుత్వపక్షపు న్యాయవాది నిలబడి మాట్లాడుతూ ఉంటాడు. 'నేర మేమిటంటే......' ఈ మాటతో ఈ రంగం ప్రారంభమవుతుంది. ఈ రెండు రంగాలనీ కలిపేది సంభాషణ. 'నేర మేమిటంటే' అనేమాట. సంభాషణలోని సంబంధాన్ని బట్టి ఈ మోస్తరుగా కొంతవరకు సినీమాలో మార్పు ఏర్పడుతుంది. సినీమాలో అన్నిటికంటే ముఖ్యమయింది మార్పుగాబట్టి సంభాషణ దాని ఐక్యానికి కొంతవరకు తోడుపడకపోతే వీలులేదు.

సినేరియో వ్రాతగాడు, ఈ సంగతులన్నింటినీ మనస్సులో ఉంచుకోవాలి. ఒక కథకి సినేరియో వ్రాయడం తేలికయిన పనిగాదు. నాటకకళలోకంటె ఎక్కువగా సినీమాలో, కవికీ, డైరెక్టరుకీ, నటుడికీ ఉండవలసిన పరస్పరసంబంధం చాలా ఎక్కువ. అందరిసహకారం ఉంటేనేకాని సినీమా నిర్దోషంగా తయారుకాదు.



# అంటుజాడ్యం

సాయంత్రం ఏడుగంటలయింది. బాగా చీకటిపడింది. రామన్నపాలెం గ్రామకరణం చీకటిపడింది. రామన్నపాలెం గ్రామకరణం అరుగుమీద దీపం పెట్టుకొని ఇంకా ఆఫీసు పని చేసుకొంటూనే వున్నాడు.

"ఏమయ్యో! కొంపమునిగిందే!" అని గ్రామమునసబు అయ్యావారప్ప వగర్చుకొంటూ పరుగుమీద వచ్చి అరుగుమీద కూలబడ్డాడు.

కరణానికి ఏభయ్యీ, ఏభయ్యయిదు సంవత్సరాల వయస్సు ఉంటుంది. మునసబు ప్రఖరి చూచేవరకు అతనికి గుండె గుభేల్లుమనింది.

"ఏమి, ఏమి" అని వంచినతల పైకెత్తి మునసబు నడిగాడు కరణం.

"ఇంకేముంది? కొంప మునిగిందయ్యా! యానాదివాడు నన్ను నట్టేట ముంచేశాడు" అని అన్నాడు మునసబు.

"ఏ యానాదివాడయ్యా?" అని కంటి అద్దాలు చేతికి తీసుకొని ఆత్రంతో అడిగాడు కరణం.

"ఆయానాదివాడేనయ్యా!"

"ఏయానాదివాడయ్యా అంటేను?"

"వాడి దేవూరో నాకు తెలియదయ్యా."

"అయితే ఇప్పుడేం వచ్చిందీ?"

"వాడు కలరాతగిలి చచ్చాడు."

కలరాఅనే టప్పటికి కరణానికిగూడా గాబరా పుట్టింది.

"కలరాఅని ఎవరన్నారయ్యా? అంతా లేనిపోనిభంగారు నీది: ఇప్పుడు కలరా ఎక్కడనించి వచ్చిందయ్యా?" అని కరణం విసుక్కున్నాడు.

"సడేలే: నేను స్వయంగా కళ్లారా చూశాను — వాడికి పొద్దున్న కలరాతగిలి వుండంగాను."

"ఎక్కడ చూశావయ్యా?"

"రోడ్డుమీద చూశాను: ఉదయాన్న నేనాతట్టు పోయ్యేవరకు వాడు గవళ్లపాలెం దగ్గర రోడ్డుమీద వేపచెట్టుకింద పడిపోయి ఉన్నాడు."

"ఇస్సు: అబ్బబ్బ: నీతో ఒకటిగాదయ్యా చరా! ఎవడయ్యా వాడూ?" అని ఇంకా విసుక్కున్నాడు కరణం.

"వాడిది అదేదో వూరని చెప్పాడు: పేరు జ్ఞాపకం లేదు. వానంరోజులకిందట ఆవూరు కాపు సుబ్బారెడ్డికయ్యల్లో నారువేతకేమో వచ్చాడట: మొన్న పగటివేళ వాడికి కలరాతగిలేవరకు వాణ్ణి బయటికి వెళ్ల తరిమాడట ఆరెడ్డి! పోయినవాడు బిరగడై పోకుండా మనపొలిమేరలోనే పడి చచ్చాడు —".

"వాడి దేవూరోకూడా అడిగి తెలుసుకోలేదటయ్యా? నువ్వూసరే."

"అడిగానయ్యా: ఉత్తరాదో దక్షిణాదో అని చెప్పాడు - వీడిల్లు వల్లకాడుగానూ."

"అయితే వాడెక్కడ చచ్చాడు?"

"గవుళ్లపాలేనికి దక్షిణంగా చెర్లోకిపోయ్యే డొంకలో పడి చచ్చాడట!"

"నువ్వు చూడలేదా ఏమిటి?"

"నే నెప్పుడు చూశానయ్యా? ఇప్పుడు ముతరాచు లక్షుంగాడు చెప్పతుంటే నాకు తెలిసింది."

"ఏ లక్షుంగాడయ్యా?"

"అదేందయ్యా; గూనివాడి కొడుకు లక్షుంగాడిని ఎరగవు? వాడూ వాడి మేనల్లుడు వెంకటసుబ్బడూ చీకటిపడి చెర్లో పల్లెనుండి డొంకన వస్తుంటే వాడు చచ్చి డొంకలో పడి ఉన్నాడట."

"ఏ డొంకలోనయ్యా?" అని కరణం ఇంకా విసుక్కుంటూనే వున్నాడు.

"నీ దంతా మతిమిద్దూగం. గవుళ్ల పాలేనికి దక్షిణంగా చెర్లోకిపోయే డొంక ఎరగవూ?"

"ఆ ముతరాచువాళ్లు సరిగ్గా చూశారో లేదో, వాళ్ల నిట్లా పిలిపించవయ్యా ఒక్కసారి" అన్నాడు కరణం.

గ్రామమునసబు తలారి నర్సిగాడిని పంపి లక్షుంగాణ్ణి, వెంకటసుబ్బణ్ణి పిలిపించాడు.

"ఏందిరా! మీరు వాణ్ణి చూశారట్రా?" అని దబాయించాడు కరణం.

"మేము కళ్లారా చూశాము సామీ! అబద్ధం చెప్పేదాక మాకేమి సాయ్యమా?" అన్నారు ముతరాచులు.

"ఎక్కడ పడిచచ్చాడురా వాడు?" అని కరణం మళ్లా క్రాసు చేశాడు.

"గమళ్ల పాలేనికి దక్షిణంగా పదిపగ్గా దూరంలో డొంకలో మనుష్యులు వచ్చీపోయే దారికి తూర్పుగా కొంచెంఎడంగా తుమ్మల్లో పడిఉండాడు. మొలకి గుడ్డ కూడా లేదు."

"వాడి దేవూరో మీకు తెలుసా?"

"వాడి పేరూ వూరూ తెలియదుగాని వాణ్ణిమాత్రం మేము మొన్న ఊళ్లో చూశాం. ఈవేళపొద్దున మేము చెర్లోపల్లెకు పోతుంటే వాడు రోడ్డుమీద చెట్టుకిందమాత్రం పడి ఉండాడు. వాడు మాకు బాగా సత్తె" అన్నారు ముతరాచులు

"అయితే ఇప్పుడు పోయిచూస్తే శవం అక్కడ ఉంటుందట్రా?" అని అడిగాడు కరణం.

"ఉండక ఏడకు బోతుందీ? అంటూ ముతరాచు లిద్దరూ "మేంపోతామయ్యా"అని ఇళ్లకు చక్కా పోయారు.

"ఇప్పు డెట్లానయ్యా చేసేది?" అని మునసబు కరణాన్ని సలహా అడిగాడు.

"ఎట్లైనా నాకేకకీ నీకేకకీ ఉరివేసుకొని భావిలో దిగుదాం పద —" అని కసురుకొన్నాడు కరణం.

"నామీద కసురుకుంటావు - నే నేంచేశానయ్యా?" అని దీనంగా అడిగాడు మునసబు అయ్యావారప్ప.

"ఒకవేళ ఆముతరాచువాళ్లు ఇప్పుడీసంగతి నీతో చెప్పి లేమట్టుకు నువ్వు ఊరూవాడా యాగీ చేసుకొంటూ ఇట్టా ఎందుకు పరుగెత్తుకొనిరావడం? ఈసంగతి అసలు ఊళ్లో రెండోవాడిచెవికి ఎందుకుపోవాలి?" అని గొంతు ధ్వని కొంత తగ్గించి కోపంగానే మాట్లాడాడు కరణం.

'కరుణకుమార'

"నే నేమి యాగీచేశానయ్యా? నీతోతప్ప నే నెవరితోనూ అనలేదే ఈసంగతి?" అని అయ్యావారప్ప నెమ్మదిగానే జవాబిచ్చాడు.

"ఇంతటనైనా పలక్కుండా ఊరుకో" అని రహస్యంగా సలహాఇచ్చాడు కరణం.

"ఊరుకుంటే!" అని ఆశ్చర్యపోయి అడిగాడు మునసబు.

కరణం జవాబు చెప్పలేదు.

"అదికాదయ్యా! ఊరుకుంటే ఎట్ల నయ్యా?" అని మళ్లా రెట్టించాడు మునసబు.

"తెల్లవారి ఊరేగవచ్చును లేవయ్యా: నీదంతా ఒక చేతొందరా, ఒక చేహడావుడీని" అన్నాడు కరణం.

"తెల్లవార్లూ ఆశవానికి కాపలాఅయినా లేకుండా ఆమోయిన అడివిలో పడేసిఉంటే, రాత్రి ఏనక్కలయినా పెరుక్కొనితింటే ఎట్లా?" అని మునసబుకు సందేహం కలిగి అడిగాడు.

"ఎట్లనా ? నా గొంతుక్కు ఉరివేయవయ్యా ! నీకు అన్నీ లేనిపోని సందేహాలూ, శంకలూను..." అన్నాడు కరణం.

"కోపం చేయవోకయ్యా ! నాకు తెలియక అడుసతాను. మనం ఆశవానికి ఈరాత్రి కాబ్దారీ చేయించవద్దా అంటాను" అన్నాడు మునసబు.

"నీచేతనయితే చేయించు. ఇప్పుడు అర్ధరాత్రివేళ ఆ అడవిలో ఎవడు పోయి శవజాగరణం చేస్తాడు ?"

"అయితే శవాన్ని నక్కలు పీకవా అంటాను."

"పీక్కొనితింటే తిన్నాయిలే నీకేమో?"

"మనం పోలీసులకీ మేస్ట్రేటుకీ రిపోర్టు చేయవద్దూ? "

"ఉదయాన్న చేయవచ్చునులే."

"శవాన్ని నక్కలు పెకుక్కొనితింటే మనం కాబ్దారీ చేయించలేదని ఆ పోలీసువాళ్లు మనమీద పడతారేమో?"

"పడరు లేవయ్యా! నీకు అసలీసంగతి ఉదయాన్నే తెలిసినట్టూ, వెంటనేపోయి చూచే వరకు శవం ఫలానాఫలానాస్థితిలో ఉండినట్టూ రిపోర్టులో రాయవచ్చునులే—".

"ముతరాచువాండ్లు మనకీ సాయంత్రమే చెప్పినప్పుడు, రేపుపొద్దున్న తెలిసిందని తప్పుడుమాట ఎట్లా మానేదయ్యా?"

"ముతరాచువాండ్లు మనకు ఇప్పుడే చెప్పినట్లు దాఖలా మకాబూ ఏ ముందీ?"

"అమ్మో! రేపు పోలీసువాండ్లు వచ్చి అడిగితే ఈముతనష్టపువాండ్లు నిజం చెప్పరూ?"

"అట్లా చెప్పకుండా వాండ్లని మనం లోగట్టుకొందాంలే."

"ఏమోనయ్యా! నాకుమాత్రం ధైర్యం లేదు. ఏమో! మనకి ఇప్పటికి ఈ ఇద్దరే అనుపడుతున్నారు. గ్రామంలో ఇంకా ఎంత మందిచూశారో ఆశవాన్ని. నిజాన్ని అట్లా కప్పిపుచ్చడానికి ఎంతమాత్రమూ వీల్లేదు సుమా!"

"అయితే ఇప్పుడేంచేస్తానంటావయ్యా?"

"ఒకవేళ పోలీసువాండ్లకి రిపోర్టు ఉదయాన్నే పంపినా, ఈ రాత్రి ఎవర్నయినా శవందగ్గర కాబ్దారీ పెట్టిస్తాను—."

"ఇప్పుడు ఎవరు కాబ్దారీచేస్తారు నీకు?"

"తలారి నర్సిగాణ్ణి పంపిస్తాను."

నర్సిగాడు సమక్షంలోనే వున్నాడు. మునసబూ, కరణమూఅంటే వాడి కసలు లక్ష్యమే లేదు.

"పోతే నానౌకరీ పోయింది లెండయ్యా: నేనూ మనిషినేకాని గొడ్డును కాను. మీరందరూ ఇళ్లకాడ లక్షణంగా పండుకోవలసిందీని, నేనూ నాబిడ్డలూ అన్యాయం అయిపోవలసిందీనా ?— నావల్లకాదు— దీనితల్లి స్గ్గోసిన ఉద్యోగం. మీరేంచేసినా సరే!" నన్నాడు నర్సిగాడు.

"వాడు చెప్పేది నిజమేమరి. వాడు మాత్రం మనిషికాడూ పాపం !" అన్నాడు కరణం.

"అయితే మాలవాడకి పోయి ఇద్దరు వంతు వెట్టివాళ్లనయినా పిలుచుకొని పంపించరా?" అన్నాడు మునసబు.

"వెట్టివాళ్లెవరూ పిలిస్తే పలకడంలేదు. వరినాటు అదునుకు ఒక్క పురుగుకూడా చిక్కడంలేదు. వాళ్లకేమైనా జీతాలా భత్యాలా ? మన కెందుకు చేస్తారు — వెట్టిచాకిరీ?" అన్నాడు తలారి.

"అయితే — ఏంగతి చెప్పవయ్యా ? కరణం గారూ !"

"................."

"ఇస్స......... అబ్బబ్బ........ నే నెన్నడూ ఇట్లాంటి అగచాట్లు పడ్డవాణ్ణి కానయ్యా ! ఆభగవంతుడు నాకే తెచ్చి పెట్టుతూ ఉంటాడు ఈకడగళ్లన్నీని."

కరణం పలకలేదు

తలారి గడ్డంకింద కర్ర ఆనించుకొని అరుగు దగ్గరె నిలబడిఉన్నాడు.

"పలకవేమిటివయ్యా కరణంగారూ ! ఏదోవిధంగా తగలబెట్టవయ్యా స్వామీ!... ......ఇస్స......నాకు కాళ్లూ చేతులూ పీక్కొనిపోతున్నవి. జాంపొద్దు పోయింది: ఇంకా నేను అవశిష్టం తీర్చుకోవాలి. సంధ్యావందనం వార్చుకోవాలి.........వీడితల్లి కడుపు వీడితోనే కాల — చచ్చినవాడు నా పొలిమేరలోనే పడిచావాలా ?" అనినిట్టూరుస్తున్నాడు మునసబు.

కరణం కళ్లకు అద్దాలుతలిగించుకొని చేతికి కలం తీసుకొన్నాడు.

"లేచి పోయినాడయ్యా! రోడ్డుమీద పండుకొన్నవాడు లేచి దక్షిణంగా డొంకన పడిపోయాడు. పీడ విరగడైపోయిందిగదా అనుకొని, ఎంచబడి ఆనైన ఇంటికి వచ్చేశాను. వాడింకా పొలిమేరలోనే తారట్లాడుతూ ఉండినసంగతి తెలిస్తే, అప్పుడే ఎవరినో ఒకరిని పంపి పొలిమేర దాటిపోయ్యేవరకూ వెళ్లతరిమించేవాణ్ణి. వాడిట్లా మోసం చేస్తాడని అనుకోలేదు."

"వాణ్ణి రోడ్డుమీద చూసినప్పుడే అనుకొన్నాను వాడికి ఆయువు మూడిందని: నేనక్కడ నిలబడి ఉండంగనే వాడికి పదిసార్లయినట్టు అయింది. అందులో కలరాజాడ్యం- వాడిది తిరుగులేనివ్యాధి — ఇంతకీ ఖర్మ:

కోదు — ప్రారబ్ధం మనదీ: ఏపూర్వజన్మంలోనో చేసుకున్నసంచితం ఈజన్మలో గ్రామమునసబు నౌకరీరూపంగా పట్టివేధిస్తోంది."

అని ఈవిధంగా ఏమేమిటో చదువుతున్నాడు మునసబు. ఏసమాధానం చెప్పడానికీ పాలుపోక కరణం అడంగలులో సాసుబడి చెల్లువేసుకొంటున్నాడు.

"దీనిమూండామోసిననౌకరీ - రాజీనామా నిచ్చిపారేదామని ఎన్నిసార్లో అనుకొన్నానయ్యా: కాని అన్నోదకరుణానుబంధం తెగనిస్తాడా ఆపాపిష్టిదేవుడు ? ఛీ! ఛీ! ఈనౌకరీచేసుకుని బ్రదికేదానికన్నా, పదిఊళ్లు ముష్టెత్తుకొని బ్రతకడం మేలు" అన్నాడు మునసబు.

"అట్లాఅనుకొన్నవాడివి రాజీనామా ఇచ్చి లేచిపోరాదూ?" అనిఅడిగాడు కరణం.

"ఏమయ్యా ఇస్తే? ఈమూండానౌకరీతోనే బ్రతుకుతున్నా ననుకొన్నావు గాబోలు. బ్రాహ్మడికి ఏవృత్తి చేసుకొన్నా తప్పలేదు" అని పౌరుషంతో జవాబిచ్చాడు మునసబు.

"అసలువిషయంఏమిటో వగదెంచకుండా ఈముచ్చట్లు పెట్టుకొని కూర్చున్నారేం దయ్యా?" అని హెచ్చరించాడు తలారి.

"శవానికి కాబ్దారీ ఉంటే ఉంది లేకపోతే లేకపోయింది. మన చెవికి వచ్చినసంగతి ఆలస్యంచేయకుండా పోలీసులికి వెంటనే రిపోర్టు పంపకుండామాత్రం వీల్లేదయ్యా!" అన్నాడు మునసబు.

"సరే: అయితే రిపోర్టురాసి పంపించు" అన్నాడు కరణం.

"నువ్వే నాలుగుముక్కలు రాసేస్తూ. నేను సంతకం పెట్టుతాను."

"ఏ మని రాయమంటావు?"

"ఈసంగతే! జరిగినసంగతి నీకు తెలియని దేముంది?"

ఎవరో పరాయి గ్రామ యానాదివాడొకడు ఈ వూరు కూలిపనికిగాను వచ్చి అకస్మాత్తుగా కలరాతగిలి చచ్చిపోయాడనీ, వాడిపేరూ, ఊరూ తెలియదనీ, ఈ బేవారసుశవాన్ని కాబ్దారీ చేయించడం కష్టంగా ఉన్నదనీ, పోలీసువారు తక్షణం వచ్చి శవానికి పంచాయతీ జరిపించి పోవలసిందనీ పోలీసు స్టేషన్ హౌసు కొకరిపోర్టు రాశాడు కరణం. గ్రామమునసబు సంతకం పెట్టాడు.

"కలరాతగిలి మనిషి చచ్చిపోతే మనం హెల్తుఇన్ స్పెక్టరుకి తాలూకాకూ కూడా రిపోర్టులు పంపాలికాబోలునే--పంపవద్దూ?" అని అడిగాడు కరణం.

"తెల్లవారి పంచాయతీ జరిగినతర్వాత పంపవచ్చునులే. ముందు పోలీసువాండ్లబదనాయం తప్పించుకోనీ" అంటూ రిపోర్టును తలారి నర్సిగాడి కిచ్చి స్టేషన్ కు ఎత్తుకొని పొమ్మన్నాడు మునసబు.

"అర్ధరాత్రి నేను ఒంటరిగా ఎట్లాగయ్యా పొయేదీ?" అని అడిగాడు తలారి.

"అన్నిటికీ అన్నిసాకులూ చెప్పితే ఎట్లరా? ఈ వూరికి నువ్వొక్కడవే నౌకరువయిపోతివి. అక్కరపడ్డపుడు కాస్త ఒళ్లువంచి పనిచేసుకొని రాకుంటే ఎట్లా చెప్పు నర్సయ్యా? శవానికి కాబ్దారీ చేయలేనన్నావు—సరే. రిపోర్టుఅయినా ఎత్తుకొని పోకుంటే ఎట్లా? మూడుమైళ్లు స్టేషన్ ఇక్కడికి. ఇంటికి పోయి అన్నంతిని వెళ్లావంటే ఎంతసేపట్లో తిరిగివస్తావు- మళ్లా ఊరుమాటుమడిగేవరకు తిరిగి రావొచ్చు; వెళ్లు. నామాట విని వెళ్లిరా" అని మునసబు తలారిని బ్రతిమలాడుకున్నాడు.

"కూడా యానాదివాణ్ణయినా పిలుచుకొని పోరా! ఉన్ననౌకరువు నువ్వొక్కడవూ కాదంటే ఎట్లా?" అని కరణంకూడా హెచ్చరించాడు.

"సరే! ఇటు పారేయండయ్యా ఆరిపోర్టు: ఎక్కణ్ణుంచో వచ్చి ఈడ నాకోసరమే చచ్చినట్టుండాడు — ఆపాపిష్టి నా కొడుకు" అన్నాడు తలారి.

"ఏం చేస్తాంరా నాయనా! నీ ఒక్కడికోసరమేకాదు; మన అందరికోసరమూ చచ్చాడు— ఆ ముతనష్టపాడు. ఇంతాచేస్తే తెల్లవారి పోలీసువాళ్లు వచ్చేలోపల ఏనక్కలయినా శవాన్ని పెకుక్కొని తింటే వాడిచావు అబద్ధమూ, మనచావు నిబద్ధమూ అవుతుంది" అన్నాడు మునసబు.

"ఇ దెక్కడి చట్టమయ్యా—ఈచట్టము? మనిషిబ్రతికి ఉండంగా వాడిగొంతుకలో ఊపిరిఉన్నంతమట్టుకు వాడు చచ్చాడా, బతికాడా, తిన్నాడా, పస్తుపండుకున్నాడా అనే యోచన ఏమారాజుకీ కాబట్టదు. తీరా చచ్చిన తర్వాత ఈరిపోర్టు లెందుకు? ఈకాబ్దారీ లెందుకు? మనల్ని ఇట్లా ఏడిపించడం ఎందుకు? ఏదిపట్టినా దిక్కూ దీమూ ఉన్నట్టు గోచరించదే!" అన్నాడు తలారి.

"మనచట్టాలన్నీ ఇట్లనే ఉంటాయనుకో. మనమంతా చచ్చినవాళ్లని కాబ్దారీచేయడానికేగాని బ్రతికినవాళ్లని పోషించడానికి గాదు. పొద్దుపోయింది - తొందరగా పోయిరా" అన్నాడు మునసబు.

కరణం చిరునవ్వు నవ్వుతున్నాడు.

"అదికాదయ్యా! వాడెవడో బతకలేక కూలిపనిచేసుకోను ఏడనుంచో ఈడకి వచ్చి అమ్మవారిజాడ్యం తగిలితే, వాడి కింతమందూ, మాకూ పోసే దిక్కు లేకపోవడం సరిగదా, వాణ్ణి ఆఖరుకు ఊళ్లోనయినా ఉండకుండా బయటికి వెళ్లతరిమితిరి. వాడెట్లాగా చచ్చాడు గదా- ఇక ఇప్పుడీరచ్చఅంతా దేనికయ్యా? తెండి:ఇట్లా పారెయ్యండి ఆకాగితం. నాతిప్పలు నావి. చచ్చో బతికో ఆపోలీసువాళ్ల మొఖాన్న కొట్టివస్తా." అని రిపోర్టుతీసుకొని విసుక్కుంటూ వెళ్లిపోయాడు తలారి.

"శివశివా! ఏంఖర్మం తెచ్చిపెట్టావురా భగవంతుడా!" అని పెద్దనిట్టూర్పువిడిచి గ్రామమునసబు భోజనానికి ఇంటికి లేచిపోయాడు.

## ౨

రామన్నపాలెం సర్కారు శ్రోత్రియం గ్రామం. ఆ శ్రోత్రియానికి ఒకకరణమూ, గ్రామమునసబూ, ఒకతలారినౌకరూ ఉన్నారు. కరణమూ, మునసబూ ఇద్దరూకూడా వైదీకబ్రాహ్మణులే. కరణానికి ఆరురూపాయలూ, మునసబుకి అయిదురూపాయలూ, తలారికి మూడురూపాయలూ సర్కారు

వాడు నెలజీతా లిస్తారు. కరణం మిస్సల్ కరణమేగాని మునసబుమాత్రం రిజిస్టర్డు మైనరు తరఫున వత్తాసిగా పనిచేస్తున్న అక్టింగు మునసబు. గ్రామాధికార్లిద్దరిలోనూ మునసబుదే చాలా నీరసమైనసంసారం. పైగా ఆయనగారికి ఇంట్లోనిండా గంపెడుపిల్లలు, పెద్ద సంసారం. నెలజీతం అయిదురూపాయలతోనూ ఆయనగారికి సంసారం గడవడం చాలా కష్టంగా ఉంది: అందువల్ల ఆయన అచ్చం నెలజీతాన్నే నమ్ముకోకుండా, సమీపగ్రామాల్లో శుభాశుభకార్యాలకి బ్రాహ్మణార్థాలు చేసుకొంటూ కొంతసంసారపోషణ చేసుకొంటున్నాడు. అదిగాక వాళ్ల గ్రామానికి మూడుమైళ్లదూరంలోవున్న పట్నవాసానికి ప్రతిరోజూ పోయి ప్లీడర్లఆఫీసుల్లో పార్టీలవకాల్తనామాలు వగైరాలు ధృవపరుస్తూ తద్ద్వారా ఒక్కొక్కవకాల్తనామాకు ఒకబేడడబ్బులు చేతిలో వేసుకొంటూ పొట్ట పోసుకుంటూవస్తున్నాడు.

ఆ బ్రాహ్మడికి కలరాజాడ్యంఅంటే తగని భయం. తనగ్రామంలో కాదుకదా, ఆచుట్టుపక్కల ఏగ్రామంలో నయినాసరే, అమ్మవారిజాడ్యం అనే అలికిడి చెవిని పడిందంటే ఇంటిదగ్గర గంపెడుసంసారాన్నీ ఇంటిదగ్గరనే విడిపించి, అంగవస్త్రం చంకనపెట్టుకొని పలాయనమైపోతూ ఉండే అలవాటు. ఆరంభదశలో ఈవిసంగా పారిపోతూ వచ్చాడుకాని, ఆమధ్య రెండుసంవత్సరాల క్రిందట ఇట్లనే ఆతాలూకాలో ఇంకో గ్రామమునసబు కలరాజాడ్యానికి భయపడి పారిపోయి, పై అధికార్లకి సకాలంలో రిపోర్టు చేయలేదన్న కారణంతో, ఆగ్రామ మునసబును సర్కారువారు నౌకరీనుండి మత్తరబు చేసినప్పటినుండీ ఈ శ్రోత్రియం గ్రామమునసబు అయ్యవారప్ప, ఊరు విడిచి పారిపోయే పద్ధతి చాలించుకొని ఏమయినప్పటికీ గ్రామంలోనే నిలబడి పైవారికి రిపోర్టు వగైరాలు పంపి తన ధర్మం యథావిధిగా నిర్వర్తించుకోవాలని నిశ్చయపరచుకొన్నాడు. ఏం చేయగలడు? పాపం! విధిలేదు: కలరాకు భయపడి ఆ అయిదు రూపాయల నౌకరీ పోగొట్టుకుంటే ఆనౌకరీని ఆధారంచేసుకొని తెచ్చుకొనే ఇతరసంపాదన ఎంతో నష్టమైపోతుంది.

కలరాజాడ్యానికి భయపడి పారిపోకుండా యింటిదగ్గరనే నిలబడవలెనని తాను తీర్మానం చేసుకున్నతర్వాత ఆ గ్రామంలో కలరా కనపడడానికి ఇదే మొదటిపర్యాయం.

సందేహాలు నివర్తిచేసుకొని మునసబుగారు భోజనానికి లేచారు. కాని ఆయనగారి మనస్సంతా డొంకలో పడివుండిన శవంమీదనే ఉన్నది. అందులోనూ కలరాతగిలి చచ్చిన మనిషి: కలరా అంటువ్యాధి. తగిలితే మళ్లా తిరుగుముఖంలేదు ఆ జాడ్యానికి. ఆ ఉదయం ఆ మనిషికి కలరాతగిలిఉండగా తాను రోడ్డుమీద వానిని స్వయంగా చూచాడు కూడాను. మునసబుకు గుండెలు పీచుపీచుమంటున్నవి. నోటికి అన్నం హితవుగాలేదు. నాలుగుమెతుకులు ఎంగిలిపడి లేచి మంచం యెక్కి ముసుగుతన్ని పండుకున్నాడు.

రాత్రి పొద్దుపోయింది: పదకొండుగంటలయింది: ఊరంతా మాటుమణిగి నిశ్శబ్దంగా ఉన్నది. కాని మునసబుకు నిద్రపట్టలేదు. కళ్లుమూసినపుడల్లా ఉదయాన్న తాను రోడ్డుమీద చూచినమనిషి కళ్లయెదుట ప్రత్యక్షమవుతూనే వున్నాడు. మనిషికి భయం వేసింది: ఉదయం కలరా తొలగడమూ సాయంత్రానికి చచ్చిపోవడమూనా! ప్రాణం యెంత బుద్బుదప్రాయమైనదో! ఒకవేళ తనకే కలరాతగిలితేనో! అని లోపల హఠాత్తుగా ఒక సందేహం కలిగింది. ఆ వెంటనే మనస్సులో ఇంకోఆలోచన యేదోబయల్దేరింది. దానివెంట మరొకఆలోచన!

మనిషికి ఖంగారుపుట్టింది: కప్పుకున్న ముసుగు తీసి మంచంమీదనే లేచి కూర్చున్నాడు: గుండెలు కొట్టుకొంటున్నవి: చేత్తో పొట్టమీద వాయించుకున్నాడు. డబడబ గాలిబంతిమీద కొట్టినట్లు చప్పుడయింది. పొట్ట ఉబ్బరించినట్టు అనుమానం కలిగింది. తిన్నతిండి జీర్ణానికి రాలేదా అనుకొన్నాడు. భోజనంలో తిన్నపదార్థాలు ఏమాఅని జ్ఞాపకం చేసుకొన్నాడు. అందివచ్చిన, మినుములు వేసిన చింతపండుపచ్చడీ జ్ఞాపకానికి వచ్చినై. అదిగాక ఆరోజు ఇంట్లో వండినబియ్యం క్రొత్తబియ్యం. పొట్టమీద చెయ్యివేసి నిమురుకున్నాడు. కడుపుఖాళీనట్లు చేతికి తగిలింది: పొట్ట అక్కళించుకొన్నాడు. బొడ్డుదగ్గర నొప్పిగా ఉన్నట్టు తోచింది. మనిషికి భయం జాస్తి అవుతూవచ్చింది. దానికితోడు కడుపులో వికారంగా ఉండినట్టుకూడా అనుమానం బయల్దేరింది. అల్పశంకకు పోవలసిన అవసరం కనబడింది. కాని మంచం దిగలేకపోయాడు: ఒంటరిగా బయటికి పోవడానికి భయం. నిద్రలో ఉండిన భార్యను లేపాడు. ఆ సహాయంతో తలుపు తీసి వాకిట్లోకి వెళ్లాడు: అవసరంతీర్చుకొని లోపలికి తిరిగివచ్చాడు. మంచంమీదనే కూర్చున్నాడు. కడుపులో నులినొప్పిగా ఉన్నట్టు తోచింది. లేవవలసిన అవసరమేమో! భయపడ్డాడు. ఏదో ఆయాసంగా ఉన్న దతనికి. రోడ్డుమీది యానాదివాడెదురుగా నిలబడ్డాడు. తనబాధఅంతా కలరా చిహ్నాలు కాదుగదా అని అతనికి అనుమానం వృద్ధి అవుతోంది.

గుండె దడదడమన్నది. నిద్రపోతూ వుండిన భార్యవైపూ పిల్లలవైపూ ఒకసారి చూచుకున్నాడు. తనకి తెల్లవారుతుందో లేదో అనుకొన్నాడు. కడుపులో బుడబుడమని చప్పుడయింది. గబగబా భార్యనులేపి వీథిలోనికి పోయాడు, మళ్లా వచ్చి పండుకున్నాడు.

మంచంమీద వెల్లకిలా పండుకుని చేతులు రెండూ గుండెలమీద చేర్చుకొని కళ్లుమూసుకొన్నాడు. ఏవో వికారస్వరూపాలు గోచరిస్తూఉన్నవి. రాత్రి రెండుజాములు దాటింది. ఎక్కడనో బయట నక్కలు కూస్తున్నట్టు చెవికి వినవస్తోంది. యానాదివాడి శవాన్ని నక్కలు పీక్కొని తింటున్నావో ఏమోనని సందేహం కలిగింది. తానుచేసిన అజాగ్రత్తకి పోలీసువాండ్లు తనమీద పైవారికి రిపోర్టుచేస్తారేమో? ఇట్లాంటి విషయంలోనే అజాగ్రత్తగా ప్రవర్తించినందుకు ఒకగ్రామ మునసబును ఇదివరలో సర్కారువారు

నౌకరీనుండి నిలుపుదలచేశారు కూడాను: తన గతి ఎట్లా ఉన్నదో! అతనికి భయంవేసింది: మళ్లా కడుపులో ఏదో బాధగా ఉన్నట్టుగా ఉంది: మళ్లా భార్యను లేపి వీధిలోకిపోయాడు. మూలుగుతూ ముక్కుతూ రెండుచేతులూ నడుము కానించి లోపలికి వచ్చి పండుకొన్నాడు: కాళ్లు లాగుతూఉండినట్టు ఉన్నదతనికి. శరీరం చిరుచెమ్మటపోసింది: ఒళ్లంతా నీరసంగా ఉన్నది: దాహం అని ఒకలోటా నీళ్లు తాగాడు. అన్నీ కలరాలక్షణాలే! భార్యతో చెప్పనా వద్దా అని సందేహంకలిగింది. ఆట్టే ఆలోచించాడు. 'సంసారం సట్టూ, వ్యాధి రట్టూ' అన్నసామెత స్ఫురణకువచ్చింది.

"ఏమే" అని భార్యను పిలిచాడు.

ఆమె దగ్గరగా వచ్చి నిలబడింది.

"నా కేమో కడుపులో సంకటంగా వున్నది' చూడు: ఒక్కసారి కరణాన్ని ఇట్లా పిలుచుకొనిరా" అన్నాడు మునసబు.

"ఇప్పుడు కరణం ఎందుకు ?"

"అతగాడిదగ్గర ఏమాత్ర అయినా ఉంటుంది. ఏదో కడుపులోకి ఇంతమందు పడితేనేగాని ఈబాధ తగ్గేట్టట్టు లేదు. చుట్టుపక్కల ఊళ్లలో అమ్మవారి జాడ్యాలవల్ల బాగాలేదని అంటున్నారు" అన్నాడు.

భార్యగుండెల్లో రాయిపడింది. దీపం దగ్గరగా తీసుకొనివచ్చి భర్త నట్టే పరీక్షించి చూసింది. ఆయన వైఖరి చూచేవరకు ఆమెకు కూడా ఖంగారు పుట్టింది. రాత్రి నట్టనడిజాము. ఆమె కేమీ తోచలేదు.

లాంతరుదీపం చేతపట్టుకొని ఆమె తిన్నగా కరణంగారి ఇంటికి పోయింది. ఆయన్ని నిద్ర లేపింది.

"ఆయన కడుపులో ఏదో సంకటమంటున్నాడయ్యా! రెండుసార్లు వీథిలోకి పోయి వచ్చాడు; నిద్రపట్టలేదు; ఒళ్లంతా తపనగా ఉన్నదని మంచంమీద పడి ఊఁ ఆకోటా, ఈకోటా పడి కొట్టుకొంటున్నాడు. దప్పిక దప్పిక అని నీళ్లు తాగుతున్నాడు. నా కేమీ పాలుపోక ఇట్లా వచ్చా అన్నా!" అని కరణంతో చెప్పింది.

కరణానికి అనుమానం వేసింది.

"ఊళ్లో ఏమో బాగులేదని అంటున్నారు. ఆ సంబంధం కాదుగదా అన్నా!" అని అడిగింది.

"ఊరుకోవమ్మ నువ్వు! అంతా లేని పోని అనుమానాలూ, కలగదొక్కుకోవడాలూను. అన్నం జీర్ణానికి రాలేదు కాబోలు. అందువల్ల మనిషి అట్లా ఆయాసపడుతున్నాడు" అని కరణం ధైర్యం చెప్పాడు.

"ఏమో అన్నా! బిడ్డల అదృష్టం ఎట్లా ఉన్నదో?" అని కంట నీరు తుడుచుకొంది.

"నీకేమైనా మతిపోయిందా ఏంసమ్మ! ఏం దీ పిచ్చిచేష్టాలు?" అని కరణం కసురుకొన్నాడు.

మునసబుభార్య ముక్కు తుడుచుకొని,

"నిన్నొక్కసారి పిలుచుకొని రమన్నాడయ్యా. నే నెంత చెప్పినా ఊరుకోలేదు. ఒక్కఅడుగు ఇంటిదాకా వస్తూ. నీకోసరం ఆరాటించిపోతున్నాడూ" అని అడిగింది.

రొంటిని ఉన్న నశ్యంపట్టు ముక్కులోనికి జర్రున జుర్రి కాళ్లకు చెప్పులు తొడుక్కొని ఆమెతోకూడా మునసబుగారింటికి వెళ్లాడు కరణం.

కరణాన్ని చూచీచూడడంతోనే మంచంమీద పండుకున్న మునసబు దిగ్గున లేచి కూర్చుని,

"నేను బతకనయ్యో! బిడ్డల్ని నీ కప్పగించి పోతున్నానయ్యో!" అని కరణాన్ని ఘట్టిగా కౌగలించుకొని బావురుమన్నాడు.

భర్తస్థితిచూచేవరకు భార్యకు దుఃఖం ఆగలేదు. "నాగ తేంచేస్తావు,అన్నా!" అని ఆమె ఏడిచింది. ఈగోదనవల్ల పండుకొని నిద్రపోతూండిన బిడ్డలు లేచి గీ, గా అని గోల ఆరంభించారు.

కరణంగారు గుండె నిబ్బరంచేసుకొని వీళ్లందరినీ సముదాయించ లేకపోతున్నాడు. మునసబుగారింట్లో గలభాకు చుట్టుపక్కల వాళ్లందరూ లేచి ఏమిటో విచారించివద్దామని గుంపుకూడారు. అందరూ తలొకమాటా చెప్పి వాళ్లకు ధైర్యంచెప్పారు. వారిలో ఒక పెద్ద ముత్తయిదువ ఇంత శొంఠీ, వాముపాయా తీసుకొనివచ్చి నూరి, ఉండచేసి మునసబు గొంతులో వేసింది. ఒకఅరగంటకి చేరినజనం అంతా వెళ్లిపోయారు. అక్కడచేరినవాళ్లల్లో చాలామంది అది కలరాజాడ్యమే నని తీర్మానం చేసుకొన్నారు.

కరణంమాత్రం మునసబుఇంటనే నిలిచాడు. మాత్ర మింగినప్పటికీ మునసబుకి ఆయాసమూ, వికారమూ తగ్గలేదు. ఏదో బయటికి చెప్పలేనట్టుగా ఉన్నది ఆయనగారి బాధ: పిల్లల్ని పండుకోబెట్టి భర్తమంచాని కానుకొనే కూర్చున్నది భార్య.

ఎదురుగ్గా మంచంమీద కూర్చున్నాడు కరణం. రాత్రి రెండుగంటలయింది. మూడయింది. నాలుగయింది. కరణానికీ మునసబుకీ ఆయనభార్యకీ నిద్రలేదు. ఊఁ, ఊఁ, అని తెగమూలుగుతునే ఉన్నాడు మునసబు: భార్య కాళ్లు పిసుకుతూనే కూర్చున్నది, పాపం.

"ఏమయ్యా! ఆశవం అక్కడనే ఉన్నదో ఏనక్కలయినా పెరుక్కొని తిన్నాయో! ఆపోలీసు సబిన్‌స్పెక్టరు నన్ను బ్రతకనివ్వడు ఎట్లానయ్యా?" అని కరణాన్ని అడిగాడు మునసబు.

"నీకాభయం ఏమీ పనిలేదు లేవయ్యా: నేను ఆయనతో మాట్లాడి నీ కేమీమాట రాకుండా చేస్తానులే:" అని ధైర్యంచెప్పుతూ 'నీకు వంట్లో ఎట్లా ఉందీ?' అని అడిగాడు కరణం!

"కడుపులో ఊఁ వికారంగా ఉన్నదయ్యా! వాంతి వెళ్లేటట్టుగాఉన్నది" అని అన్నాడు మునసబు.

"అన్నా! ఇట్లారా! కాళ్లు చేతికి చల్లంగా ఉన్నట్టుగా ఉన్నవే! నాచేతులకేనా, నీకూడా అట్లనే ఉన్నాయా?" అని కరణంతో చెప్పింది, మునసబుభార్య.

"అయ్యో! అయ్యో!—"రామ హరే,కృష్ణ హరే! తవ నామ వదామి........" అని మూలుగుతున్నాడు—మునసబు. కరణం లేచి వచ్చి మునసబువంటిమీద చెయ్యి వేసి పరీక్షించి చూచి—

"లేనిపోని సందేహాలు పెట్టుకొని మనస్సు కలగదొక్కుకోబోకండి;" అని వాళ్ల నిద్దరినీ మందలించాడు.—

బయట కోడి కొక్కొరోకోయని కూసింది—. ఒక్క అరగంట నడుము వాలుస్తానని కరణం ఆ మంచంమీదనే ఒరిగాడు. మునసబుభార్య చీరపరుచుకొని భర్తమంచాని కానుకొని నేలమీదనే పండుకున్నది. మునసబు కళ్లు మూసుకొన్నాడు.

## 3

ఉదయం అయిదుగంట లయింది. ఇంకా కనిచీకటిగానే ఉన్నది. పోలీసుస్టేషన్‌కు రిపోర్టు యెత్తుకొనిపోయిన తలారి వచ్చి,

"సబిన్‌స్పెక్టరు వచ్చాడు: పిలుస్తుండాడు—"అని కరణంతోనూ, మునసబుతోనూ చెప్పాడు.

ఈ మాట చెవిని పడేవరకు ఉలిక్కిపడి లేచి మునసబు మంచంమీదనే ఈ తట్టూ ఆ తట్టూ కొట్టుకొంటూ,

"నేను రాలేనయ్యో! నా కిక నూకల రుణం తీరిపోయిందయ్యో! నాకాళ్లూ చేతులూ కొంకర్లు పోతున్నాయయ్యో! నన్నువ తలకి ఈడ్చి పారేయండయ్యో" అని పెద్ద పెట్టున గోల ఆరంభించాడు.

భార్య లేచి వచ్చి భర్తమంచంమీద కూర్చుని ఏడుస్తూనే ఆయన్ని సముదాయిస్తోంది. కరణంగారు దగ్గరకి వచ్చి చూచే వరకు మునసబుకు దవడలురెండూ కరుచుకొనిపోయి, మిడిగ్రుడ్లువేసి కొయ్యఅయి పోతున్నాడు.

ఇదేమీ అర్థం కావడంలేదు తలారివాడికి:

కరణంమాత్రం బలవంతాన్న ధైర్యం తెచ్చుకొని మునసబుకీ భార్యకి ధైర్యంచెప్పి తలారివాణ్ణి తీసుకొని సబిన్‌స్పెక్టరు దగ్గరకు వెళ్లిపోయాడు.

"మునసబుకి రాత్రి చాలా జబ్బు చేసిందండి. ఆయన లేచివచ్చేస్థితిలో లేడు" అని కరణం సబిన్‌స్పెక్టరుతో చెప్పాడు.

"ఎక్కడనయ్యా— శవం పడిఉన్నదీ ?" అని కరణాన్ని అడిగాడు సబిన్‌స్పెక్టరు.

"ఒకే గమళ్లపాలేనికి దక్షిణంగా చెర్లోకి పోయే డొంకలోకి దారితీయరా" అని తలారివాడికి ఉత్తర్వుచేస్తూ, ఇంకోమనిషిని ముతరాచు లక్షుంగాడినీ, వెంకటసుబ్బణ్ణీ పిలుచుకొని రమ్మని పంపాడు కరణం.

"చాలా చీకటి ఉండంగనే లేచి వచ్చారే నాయుడుగారు: తెల్లవారినతర్వాత నిదానంగా రాలేకపోయినారా?" అని సబిన్‌స్పెక్టరుతో అన్నాడు కరణం.

"అసలు నేను అచ్చం ఈ డ్యూటీమీదనే రాలేదయ్యా! వేకువజామునే లేచి చెర్లోపల్లెకి పోవాలని ప్రయాణమై ఉన్నాను! రాత్రి పదకొండుగంటలకి తెచ్చియిచ్చాడు మీ రిపోర్టు. పోయేదారిగదా, ఈ పంచాయతీ పూర్తిచేసుకొని మరీ పోదామని వేకువనే లేచి వచ్చా" నన్నాడు సబిన్‌స్పెక్టరు:

ఇంతలో ముతరాచువాం డ్లిద్దరూ వీండ్లని కలుసుకొని డొంకలోనికి ముందుగా దారి తీస్తున్నారు.

తూర్పురేఖలు బాగా ఆరినవి. రాత్రి తెల్లవార్లూ కళ్లని కప్పిన అంధకారం తొలగి ప్రజలకు జ్ఞానోదయం కలిగినట్లు సూర్యోదయం కాబోతోంది. కరణమూ, సబిన్‌స్పెక్టరూ, తలారీ, ముతరాచువాండ్లూ గమళ్లపాలెం దాటి ఒకఫర్లాంగుమారం వెళ్లారు—.

ముతరాచువాండ్లు చూపినస్థలంలో డొంకకి తూర్పుగా తుమ్మచెట్టుకింద పడిఉన్నాడు — యానాదివాడు. ఈ జనసమూహాన్ని జూచి ఆ యానాదివాడు నోటితో ఏమీ మాటాడలేక, చెయ్యి ఎత్తి మూతిదగ్గర పెట్టుకొని దాహ మవుతూవుందని సంజ్ఞ చేశాడు.

అందరికి ఆశ్చర్యం వేసింది.

"వీడు చావలేదయ్యా! బ్రతికేఉన్నాడు. భలేపని చేశారు కదయ్యా! వీడి కిన్ని గంజి నీళ్లు పోయించి ఊళ్లోకి తీసుకొనిపొండి" అంటూ సబిన్‌స్పెక్టరు ఒంపెద్దుబండెక్కి అక్కణ్ణుంచే చెర్లోపల్లెకు పోయాడు.

"అరే, రాత్రిపొద్దు చూస్తే చచ్చినట్టే ఉండాడయ్యా. ఎంతపని జరిగిందో చూశావా?" అన్నారు ముతరాచులు.

కరణానికి ఒళ్లు తెలియలేదు. ఒక్కపరుగున ఊళ్లోకి పేరెం తీశాడు.

మునసబుకి మన స్మారకం లేనేలేదు. పిలిస్తే పలకడు. భార్య ఏడుస్తూ అతని ప్రక్కలోనే కూర్చుని ఉన్నది.

పరుగులుతీస్తూ కరణం మునసబు ఇంటికి పోయి "ఏమయ్యో! వాడు చావలేదయ్యా! బ్రతికే ఉన్నాడు. వాడికి కలరా కాదయ్యా పాపం! జ్వరంతగిలి పడిపోయాడట. వాడితో వచ్చిన కూలివా ళ్లంటున్నారు" అని వగర్చుకొంటూ చెప్పాడు కరణం.

"ఆ! ఆ! ఏమిటే, వాడు చావలేమా? నిజమే! నిజమే!" అని ఎగిరి ఒక్కగంతు వేశాడు—మునసబు.





సనటోజన్
మీకు

# ఆరోగ్యమిచ్చును

"కొంతకాలము మునుపు నేను దుర్బలుడై అలసట జెంది యుంటిని. కేవలము ఆరోగ్యము కొరకు జగత్ప్రసిద్ధమగు సనటోజన్ వాడుమని చాలమంది నాకు సలహానొసంగిరి. ఈ అద్భుతమైన పొడరును వాడిచూచితిని. దానిని కొంచెము నీళ్లలో కలిపి రోజుకు కొన్నిసార్లు చొప్పున వాడితిని. అప్పటి నుండి ఆశ్చర్యకరముగా నా ఆరోగ్యము కుదుటబడెను. అలసట నిలిచెను. నాపనిచేసికొనుటకు అవసరమైన జవసత్వములు చేకూరెను. తిరిగి యౌవనముపొంది సుఖముగానున్నాను. జీవిత సౌఖ్యముగూడ హాయిగా ననుభవింపగల స్థితిలోనున్నాను"
ప్రపంచమునందంతటినుండి యీమాదిరి యోగ్యతాపత్రములు మాకు నిత్యము వచ్చుచున్నవి. మీరు బలహీనులై బక్క చిక్కియున్నయెడల, నేటినుండి సనటోజన్ సేవింపుడు.



"ఇదివరకు నేను బడలికగానుండి పగటిపనుల భారమును సహింపలే కుంటిని. ఇపుడు నానాటికి మంచి ఆరోగ్యము పొందుచున్నాను.
ఆర్. యస్. డి.,డి. ఇయస్. యస్.

## SANATOGEN

నిజమైన బలప్రవర్ధకాహారము
బజారులో ప్రతిమందుల దుకాణమునందు దొరకును.
చేతితో తాకబడలేదు ఏజాతికిని మతవిరుద్ధములగు వస్తువులేదు.

వేటూరి — సుందరశాస్త్రిగారి

## సుందరరసము

సర్వప్రమేహములకుసంజీవి

గుణముప్రత్యక్షము
అనుభవసిద్ధము. ఇంజెక్షన్లు
అవసరంలేదు. ఎటువంటిప్రమేహాలనైనా కుదుర్చును
ఉమా రు 5-

ఆర్యరసాయనశాల, ముక్త్యాల

## తెల్లకుష్ఠు
## బొల్లివ్యాధి

కొద్దిరోజులీ ఔషధమును రుద్దినచో తెల్లకుష్ఠు బొల్లి ఘోరవ్యాధులు మొదలంట నాశనమగును హకీములు, వైద్యులు, కుదుర్చలేనివాటిని యీఔషధము తప్పక కుదుర్చును. గుణములేదని ఋజువు జేయువారికి రూ 500/- బహుమానమివ్వబడును. వెల రు 2/-

## సంతాననిరోధకు

సంతాననిరోధమునకిది అమోఘమైనది. దీనిని వాడుట మానివేసినతోడనే సంతానము గల్గుగును, నెలకు 2 లేక 3 రోజులు మందును వాడుచుండవలెను. సం॥నకు వెల రు 2/- గుణములేదని ఋజువు జేయువారికి రు 100/- బహుమానము. ఆరోగ్యమునకెట్టి హానిగలుగదు.

**Vaidyaraj Akhil Kishore Ram**
No 47 P. O. Katri Sarai (Gaya)

# హంపి

గుఱ్ఱము వెంకటసుబ్రహ్మణ్యము

మహనీయరాజన్యవహనవారణవారవిహరణభూము లీవీథులట్టె
భగవత్పదధ్యాననిగమానుగతి జనుల్ సేవింతురట్టె యీ దేవళముల
నగరయావతమజ్జనప్రక్రియోత్థసౌరభ్యపూర్ణాంబు లీహ్రదములట్టె
స్వైరధీరవిహారవనితాసహస్రసంవాసవేశ్మములట్టె మహళు లివియు
బహుళగోత్రసమావృత వప్రమైన, యీవిశాలప్రదేశ మహీనరాజ్య
కటకమై త్రిశతాబ్దులు క్రాలెనట్టె, కాలగతి మాఱిపోయె నాకార మెల్ల.

స్తంభంబు లున్నవి కుంభికుంభస్తనల్ భోగించిననిశాంతభాగములకు
శకలంబు లున్నవి సమధికశిల్పుల లలితసృష్టికిఁ గొంత లక్ష్యమగుచు
మట్టిలోఁ బూడిన మంటపంబులచాలు తలపించు విప్రసంతర్పణముల
మిగిలె నీరాకట్టు భువనవిజయమన్న కొలువుకూటము నూహఁ గొలుచుకొనఁగ
మిట్టలును గుట్టలును మేలికట్టడముల, జాడలం దెల్పుఁ గొల్పుఁ గన్నడత నేఁడు
పురవిభవమెల్ల పోలిపోయి, పొంతనొక్క, పేదపల్లియ యున్న దాపేరు దాల్చి.

అరుణాస్పదము దీని నొరవడిగా నుంచుకొనియె పెద్దన్న వర్ణనము సేసె
గిరినదీప్రణయమ్ము గీల్కొల్పె భట్టుమూర్తియుఁ బంప యొరగి తీరు జూచి
సిద్ధయతీశాదులఁ జిత్రించె నిచ్చటితీర్థాధ్వగులఁ గాంచి తిమ్మనకవి
ఋశ్యమూక మతంగ హేమకూటసమీక్ష రామాభ్యుదయకర్త వ్రాసెఁ గృతిని
రామలింగన నిగమశర్మను దదీయ, సోదరిని జుట్టుపట్లన చూడఁబోలు
కావ్యలోకమునకుఁ దాన కారణముగఁ, బరిఢవిల్లినపుర మిది పాడువడియె.

ద్వారపాలికల సుందరమూర్తి చెడిపోయెఁ బాలిండ్లు ఛేదింప వాడిమొనలు
శిలకొక్క యేనుఁగు చెక్కినశిల్పముల్ మొండయ్యెఁ దుండముల్ ఖండితములు
గుళ్లుగోపురములు గోడలున్నవిగాని బింబంబులు తిరోహితంబు లయ్యె
ప్రాకారమును దాటి పద్మసద్మం బెక్కఁ బూర్వకాలస్మృతి పొంగిపొరలు.
ఒక్కరాజునహంకార మొక్కయుద్ధమునఁ బరాజయ, మొకపలాయనముతోడ
తిరుగులేని నిహతివొందె దేశదేశ, సంస్తుతాద్భుతవైభవాశ్రయము పురము.

ఒకనాఁడు వేఁటాడ నుగ్రాటవిం జొచ్చి అన్నదమ్ములు విస్మయంపడుటయు
అంత విద్యారణ్యు లత్యంతసంప్రీతిఁ బురనిర్మితిం బల్కి పుచ్చుటయును
అమరావతి ధరిత్రి నావిర్భవిల్లెనాఁ బంపాదరిం బురి వఱలుటయును
రాయలరాజ్యమ్ము ప్రాక్పశ్చిమాబ్ధులు మేరలుగా విక్రమించుటయును

వేదవిద్య, ధర్మపరత, విహితవృత్తి, సరసకవిత, లలితకళ విరివిగాంచి
ఖ్యాతిమించి హఠాత్తు నిష్క్రాంతిగనుట,యుఁ దలపోయ నీరయ్యెడు నుల్ల మిపుడు.

తుల నెక్కి యిచట రాయలు నిస్తులంబైన దానాభిరతిఁ బంచె ద్రవ్యవితతి
లక్ష్మీనృసింహవిగ్రహము దీనిని జెక్కి అగ్రహారముఁ గాంచె నగ్రశిల్పి
జినగవేషణుల విచిత్రాలయము లివి సోపానచతురస్రగోపురములు
రామగాథను దీర్చి రాళ్ళపైఁ గట్టి రీరామాలయము హజారమ్ముకడను
శిల్పముశకుఁ బరాకాష్ఠ స్నిగ్ధముగ్ధ, మధుర మీవిఠ్ఠలాలయమంటపమ్ము
జీర్ణదశయందు నద్భుతోత్సేకము లివి, విభవవేళ నెట్లుండెనో వేద్యమగునె ?

పూచినకాన చిచ్చేచి కాల్చినయట్లు తుఱకలు పురలక్ష్మిఁ జెఱచివైవ
పెనుగాలి ఘనపాళి విరిసిపోయినయట్లు పరువేది పరువెత్తెఁ బౌరకోటి ;
కలుషీకృతాలయోద్గమనసంరంభులై స్వర్గంబుదారి దేవతలు సనిరి
మొక్కవోవఁగ విప్రవాక్కు రాజులటెక్కు మహిమగోల్పడియె సన్మతముగూడ
గ్రక్కదలె సర్వ మొకత్రుటి, దిక్కులేని, దయ్యె దక్షిణఖండరాజ్యమ్ము నకట
గ్రావములుమాత్ర మున్నట్లె కదలకుండ, రాతిగుండెలుగాన నరాతిధాటి.

ఆంధ్రప్రశస్తి యట్లంతరించెను నాఁడు నాల్గుశతాబ్దులు నడచిపోయె
అప్పటికిప్పటి కణుమాత్రసాపత్న్యమును లేదు, యుగము నూతనము పుట్టె
మతసాంఘికార్థపద్ధతు లెల్ల వేర్పడెఁ గ్రొత్తలక్ష్యంబులు హత్తు నెదల
వెనుబడినారము వివిధప్రవృత్తులఁ బాశ్చాత్యదృష్టిలో బర్బరులము
జీర్ణపురిచిహ్న మియ్యది జీర్ణజాతి, కైన నుజ్జీవనముగల్గు టరిదిగాదు.
ఆకృతులుమాఱు శాశ్వతప్రకృతియందు, ఆత్మశక్తి యఖండ మత్యాయతమ్ము.

ఆత్మశక్తియ భారతావనిం బ్రాచీనసంస్కృతికి నవీనసంస్కృతికిని
దానమై, యవి కల్పధర్మకారణమై, జగన్నుత జ్ఞానవిజ్ఞానఖనియు
నై, భగవత్ప్రకాశాంశమై, యవతార లీలావిశేషమై, వేలలేని
సాగరమై, యోగభోగనిశ్శ్రేయమై యున్కి యెల్లరకు విద్యోతితంబు
గానఁ దల్లక్ష్యబింబమక్షతములైన, యివ్విరూపాక్షునాలయ మీక్షసేయఁ
గమలవనముపై వీతెంచు గాలిపగిది, ప్రత్యయము మానసమ్మునఁ బరిమళించు.

---

# భాషాభివృద్ధి - బడిపుస్తకములు

కె. వి. సుబ్బరాయశాస్త్రి

భాషాభివృద్ధివలనగాని దేశాభివృద్ధికానేరదని పలువురు పలుకుచుందురు. దేశస్థుల నాగరకత యాదేశమందలి వాఙ్మయమువలన దెలిసిన ట్లితరసాధనములవలన దెలియరాదు. కావుననే యెట్టి కష్టసమయములందైనను భాషాభివృద్ధి యుపేక్షింపబడక నిరాఘాటముగా సాగింపబడుచుండెను. సంస్కృతాది సార్వదేశికభాషలయందు ప్రజలకు భక్తిభావము ఎంత యధికముగానున్నను దమతమ మాతృభాషలవలె నాభాషలుసంతతాశ్రయణీయములు గానేరవు. సంస్కృతభాష యెన్నడేని వ్యావహారికముగా నున్నదోలేదో నిర్ణయించుట దుష్కరముగాని కొన్నికొన్ని కాలములం దాయాప్రభువులయాలంబమున నాభాషయందు సమస్తజ్ఞానవిజ్ఞానదాయకములగు గ్రంథము లనేకములు వెలువడినవి. నవీనముగా గనిపెట్టబడిన కొన్ని విషయములందుదక్క ప్రాచీన విజ్ఞానవిశేషములం దెలుపుటలో సంస్కృతభాష కేభాషయు నీడుగాదు. ఆసంస్కృతభాష మనహిందూదేశమునం దన్నిప్రాంతములవారికిని గలధనమై యలరారుట వాస్తవము. అట్లయ్యును నాయాప్రాంతములవారు ఓపినంతవరకు సంస్కృతభాషను వృద్ధినొందించుచు దమతమప్రాంతీయదేశభాషలకుగూడ నభివృద్ధినాపాదించుట కత్యధికముగ కృషిచేయుచుండిరి. మహాభక్త తులసీదాసగోస్వామికి సంస్కృతభాషయందు పాండిత్యాభిమానములు లేకపోలేదు. ఐన నాతడు తనరామాయణమును హిందీభాషలో రచించెను. హిందీభాష కౌన్నత్యము గలిగించెను. కాకతీయులు చాళుక్యులు విజయనగరప్రభువులు మొదలగువారికి సంస్కృతభాష దురవగాహముగా నుండలేదు. ఆయాప్రభువులు వారికవులునుగూడ వేదవేదాంగాదిసమస్తవిద్యలను సంస్కృతభాషామూలమున నెఱింగినవారయ్యు దమదేశభాషలందుగూడ సంస్కృతభాషాసార ముండవలయు నను నుత్సాహతోడనే యాయాయాగ్రంథముల నాంధ్రీకరింపించిరి; ఆంధ్రీకరించిరి కూడను. బిడ్డలకొడలుపుష్టికి తల్లిపా లెట్లుపకరించునో వారిజ్ఞానాభివృద్ధికి మాతృభాష యట్లుపకరించును. దాదిపాలవలె సంస్కృతభాషయు విదేశములనుండి దిగబడిన డబ్బాపాలవలెనే విదేశభాషలును నంత పుష్టికరములు గావు. చాళుక్యకాకతీయవిజయనగరరాజులకాలమందు నాంధ్రభాష మహోన్నతస్థితినొందుటంజేసియే యాకాలమం దాంధ్రతేజము దుర్నిరీక్ష్యమై దురావారమై దిగంతములందు దాండవించినది. విజయనగరపతనానంతరము భాషయు దేశమునుగూడ నొకదానిని మీఱి యొకటి హైన్యము నొందినవి.

విదేశీయులు విమతస్థులు నగుప్రభువుల పాలనమున దేశముగాని యందలిభాషలుగాని యభివృద్ధి నొందకుండుటలో వింతలేదు. తురుష్కులపాలనమునకంటెనుగూడ నాంగ్లేయుల పాలనమున దేశభాషలకు మఱువరానిదెబ్బ తగిలినది. మిషనరీలు తమస్కూళ్లను ఆసుపత్రులను దమ మతప్రచారమునకై యెట్లు సాధనములుగా నుపయోగించుకొనుచున్నారో యట్లే ఆంగ్లప్రభుత్వముగూడ దమపాలనమును విద్యావిధానముమూలమున గొనసాగించుకొనుచు వచ్చినది కాని వాస్తవముగ భాషలయభివృద్ధికై యేమియు జేసినది కాదు ఐనను కాలక్రమమున దొరతనమువారుగూడ దేశభాషలను గౌరవింపక తీఱినదికాదు.

19-వ శతాబ్దమున రాజ్యాంగనిర్వహణము పూర్తిగ ప్రజాయత్తము గాకున్నను కీ॥శే॥ దాదాభాయినౌరోజీ, ఫిరోజిషామెహతా, గోపాలకృష్ణగోఖలే మున్నగునాంగ్లవిద్యాధికులగుభారతీయనాయకుల అఖండపరిశ్రమవలన దేశీయులకు దొరతనమునందు గొంత పలుకుబడియు, తన్మూలమున దేశీయులకు గొన్నిస్వల్పలాభములు ప్రాప్తించినవి. ఈసమయమున దేశీయులగువిద్యాధికులు దేశభాషలయభివృద్ధికి పాటుపడిరి. వారినిరంతరకృషివలన దేశభాషలందు నూతనశక మారంభమై భాషలు దినదినాభివృద్ధి నొందుచున్నవి.

ఆంధ్రదేశమున కిరుగుపొరుగులనున్న వంగద్రావిడ కర్ణాటాదిభాషలును, వానితోసమానముగగాకున్న గొంచెమెక్కువతక్కువగ నాంధ్రభాషయు నీకాలముననే యున్నతి నొందిన దనుటలో సాహసము లేదు.

ఈయున్నతి యెట్టిది? గ్రంథము లనేకములుత్పన్నములగుటయా? లేక వాఙ్మయమునందలి విషయగౌరవమా? యని ప్రశ్నించుటకవకాశము గలదు. రెండునౌన్నత్యసూచకములేయని సమాధానము. వంగాంగ్లాదిభాషలందున్నగ్రంథముల ననుకరించియు, ననువదించియు రచించిననవలలు, నాటకములు, కథలును బరశ్శతములుగ వెలువడినవి. అంతకుమున్నసూర్యంపశ్యములగుప్రాచీనతాళపత్రగ్రంథము లనేకము ముద్రింపబడి నలుదెసల వ్యాపించెను. ఈదేశమందే జనించినప్రాచీననవీనమతములను దెలుపుగ్రంథములును, వివిధశాస్త్రగ్రంథములును అనువదింపబడినవి. స్వతంత్రరచనము లనేకములు బయలువెడలినవి. ఆంధ్రవాల్మీకులు, వ్యాసులు, కాళిదాసులు, షేక్సుపియరులు, టెన్నిసన్నులు నున్నారు. ఆంధ్రధన్వంతరి గోపాలాచార్యులు నిన్ననే యస్తమించినను నాయనస్థాన మాక్రమింపగలవారున్నారు. చరిత్రచతురాననులు, గ్రాంథికభాషోద్ధారకులును గలరు. వేయేల ? శ్రీరావుసాహెబ్ గిడుగు వేంకటరామమూర్తిపంతులుగారు విరజల్లుచున్న భాషావిమర్శలహరి యేభాషలయందైన గలదా? ఇట్టిసాధనసామగ్రి యుండుటవలననే దేశభాషలందే విద్యగఱపవచ్చును; కఱపవలయును- అనునభిప్రాయ మెల్లరకు నుదయించినది. ఇప్పుడుగాకున్న మరికొంతకాలమునకైన దేశభాషలకు ప్రాధాన్యము ఆంగ్లభాషకు అప్రాధాన్యము నవశ్యంభావులు కాకతప్పవు.

రాజకీయవ్యవహారములకు దూరప్రాంతములవారు ఇతరేతరము జరుపువర్తకవ్యాపార

ములకు సుకరమైనసామాన్యభాష యొకటి దేశమున నుండకతీరదు. ఈ దేశమందేకాక యితరదేశములందుగూడ జరుపువ్యవహారము లన్నియు నిప్పు డాంగ్ల భాషామూలమున జరుగుచున్నను మనదేశమున నాంగ్లభాష సామాన్యభాష కాజాలదు.

ఒకటిముక్కాలు శతాబ్దము నుండియు కోట్లకొలది ధనమును దిగ్రమింగుచున్న ఆంగ్ల భాష యింతవరకు నూటికి పదివంతునైనను వ్యాపింపనప్పు డింక నాకబంధ కళేబరము దేశమంతటను ముప్పదిమూడుకోట్లకు మించిన మించుచున్న భారతీయులలో సంపూర్ణముగా వ్యాపించుట కెన్ని శతాబ్దములు పట్టునో? కావున నాంగ్లభాష సామాన్యభాష యగుట దుర్ఘటము.

ఐనచో సామాన్యభాష యేది? హిందీ భాషయు దాని సన్నిహిత సంబంధము గల శ్రీ మరాటీ మున్నగుభాషలును జేరి మొత్తము దేశమున మూడుభాగములందు బూర్వకాలము నుండియు వ్యాపించియున్నవి. గాంధీమహాత్ముని పరిశ్రమమువలన హిందీ సత్వర దినదినాక్రమణము గావించుచున్నది. భారత జాతీయసభ తన వ్యవహారములన్నియు హిందీ మూలమున నెరవేర్పజూచుచున్నది. ప్రకృతము పెక్కు రాష్ట్రములందు జాతీయవాదులు ప్రభుత్వము నెఱపుచు దేశాభివృద్ధి కనుకూలములగు సంస్కరణము లన్నిటితో పాటు హిందీ ప్రచారముగూడ ప్రధానలక్ష్యముగా నెంచుచున్నారు. అచిరకాలముననే పాఠశాలలలో హిందీ నేర్పుట నిర్బంధము గావించెదరు. శ్రీ పరమేశ్వరు డనుగ్రహించినచో నొక్కదశలోనే హిందీ సర్వసామాన్య భాష యగు శుభలక్షణము లెన్నియేని గలవు.

హిందీ సామాన్య భాషగా నున్నను విద్యావిధానముమాత్రము ఆయా దేశభాషలయందే జరుగవలయును. ఇతరభాషలో నెంతమాత్రము పనికిరాదు. ఇప్పు డింగ్లీషు భాష యాక్రమించిన స్థానమే హిందీ యాక్రమించినచో విద్యాభివృద్ధి యిప్పటివలెనే కాక తప్పదు. కావున మరికొంత కాలమునకైనను, దేశభాషల మూలమున విద్యావ్యాప్తి కలుగు ననునాశ కవకాశము గలదు. తక్కిన దేశములమాట యెట్లున్నను మన యాంధ్ర దేశమునమాత్రము ప్రాథమికవిద్య మొదలు కళాశాలవిద్యవరకు యెల్లవిద్యలు దేశభాషలోనే నేర్పవలయు ననెడి పట్టుదలయు నుత్సాహమును ఆంధ్రనాయకు లందరియందును దాండవించుచున్నది. తత్ఫలితముగ నాంధ్ర విశ్వవిద్యాలయ మేర్పడుటయు నాంగ్లాదిభాషలలోని వివిధశాస్త్ర గ్రంథము లాంధ్రభాషలోనికి పరివర్తింపబడుటయు గనుచు వినుచు నానందించుచున్నాము. అచిరకాలముననే మనభాషలో సమస్త శాస్త్రములు నేర్పబడుటయు మనము చూడగలము. అప్పుడే గదా మనభాషకు సర్వతోముఖాభివృద్ధి సిద్ధించును.

ఎప్పుడో యన్మూలముననో భాషాభివృద్ధి యగునని అంతవరకు నితరు లుపేక్షించుటయు నిరీక్షించుటయు గూడదు. ఎవరిచేతనైనంత సేవ వారు చేయుచుండుట స్వాభావికము. ఏప్రబలాశ్రయము లేకున్నను జిన్నయసూరి వచనరచనమునకు గ్రొత్తపుంత నిర్మింపలేదా? వీరేశలింగముపంతులు నూతనశకము సృష్టింపలేదా? అప్పారావుపంతులు భాషాశృంఖలముల విచ్ఛేదముచేసి ఎల్లరకు సులభము గావించలేదా? శ్రీరామమూర్తిపంతులు భాషాతత్వము విశదపఱచుచుండుటలేదా? రాయప్రోలు సుబ్బారావు, నండూరిసుబ్బారావు, బసవరాజు అప్పారావు, దేవులపల్లి కృష్ణశాస్త్రిప్రభృతులు జీవద్భాషామాధుర్యము చవిచూపుచుండుటలేదా? నూతనసంస్కరణ మభిప్రేతము గాకున్నను జయంతి రామయ్యపంతులు, కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిప్రముఖులుగూడ భాషాభివృద్ధికేకదా తమ శక్తినంతను దారవోయుచున్నారు. వీరిలో గొందరప్రయత్నము కొంత వ్యుత్పత్తిగలవారియందే ఫలించును. ఇతరుల ప్రయత్నములు ఆబాలగోపాల మెల్లరయందును ఫలించును. కావున అభివృద్ధిప్రయత్నములుమాత్రము ఆరంభవిద్యయందే చేయుట సుకరమును, బహులాభప్రదమును అని పలువురయభిప్రాయము.

తదనుసారముగనే భాషాసేవకు లెల్లరు ప్రకృతకాలమున నేతత్ప్రయత్నముననే నిమగ్నులైయున్నారు. ఏయాంగ్లోపాధ్యాయులైనను బండితులైనను బడిపుస్తకమున రచించుట యందే కాలము వినియోగించుచున్నారు. మార్చినెలమొదలుగ నెక్కడ జూచినను స్కూలుబుక్కుకంపెనీలయేజంట్లగపడుచుందురు. మొదటితరగతిమొదలు స్కూలుఫైనలు వరకు గావలసిన పుస్తకము లనేకవిధములైయగపడుచుండును. ఈలక్షణము లన్నిటిని జూచి మనభాష మహోన్నతి నొందెనని యానందించువారును గలరు. ఐనను అభివృద్ధిమాత్రము ఆశించినంత, అనుకొన్నంతగా లేదు. కారణము విచారింప నీప్రకటనసంఘబాహుళ్యమును గ్రంథబాహుళ్యమును భాషాభివృద్ధియే పరమప్రాప్యముగ నుదయించినది కాదనియు, ఒండొరులపోటీలకును స్వార్థపరులలాభమునకును బ్రకటించిన గ్రంథములే లెక్కకుమిక్కుటముగానున్నవనియు తెలియగలదు. ఉదారాశయరహితులగు కంపెనీలవారు అసమర్థులగుపుస్తకములను బ్రకటించి తాము స్వంతముగను ఏజంట్లమూలమునను బోర్డుప్రసిడెంట్లను, స్కూల్సుప్రధానోపాధ్యాయులను ఆశ్రయించి వారిదయ సంపాదించి తమపుస్తకములకు స్కూలుప్రవేశము కల్పించుకొనుచున్నారు. దీనివలన బాలురకు జ్ఞానముగాని, భాషకభివృద్ధిగాని లేకపోవుటయుండ ఏటేట పుస్తకములు మారుటవలన బాలురపోషకులకు మితిలేనికష్టనష్టములుగూడ కలుగుచున్నవి. ఈవిషయము స్కూలు అనుభవముగలవారికెల్లరకు విదితమే. ఆకారణముననేగదా ఒకసారినియమితమైనపుస్తకము ఐదేండ్లలోగా మార్పబడకూడదని దొరతనము వారు ప్రకటించిరి. ఐనను దానివలనగూడ నుపకారము గనబడకున్నది. ఏదోఒక్కపుస్తకము అట్లు మార్పకున్నను అధికవాచకములనియు ఐచ్ఛికపఠనీయములనియు ఏవేవో పేర్లుపెట్టి పెక్కుపుస్తకములను ఏటేట మార్చివేయుచునేయున్నారు. ఇంతియకాక స్కూలుయజమానులుగూడ నిరంకుశులయి క్షుద్రమైన మోమోటములకును ఆశలకును లోనై పుస్తకములయుక్తాయుక్తతలను దాము

పరిశీలింపకయు నాయాయుపాధ్యాయుల. యభిప్రాయములను తెలిసికొనకయునే పుస్తకములను నియమించుచుండుటయు గలదు.

ఇప్పుడు పెక్కురకముల వాచకపుస్తకము లున్నవి. ఆంధ్రవాచకములు ఆంధ్రనవీన వాచకములు, ఆనందవాచకములు, ఆర్య వాచకములు, శారదావాచకములు, సరస్వతీ వాచకములు, వివేకవాచకములు, కుమార వాచకములు, మారుతీవాచకములు, లాంగ్మన్సు వాచకములు, శ్రీకృష్ణవాచకములు, వావిళ్ల వాచకములు, బాలవాచకములు, భాషావాచకములు మొదలగునవి యెన్నియో గలవు. ఆంధ్రవ్యాకరణములు ఆంధ్రవ్యాకరణ సంగ్రహములు, ఆంధ్రవ్యాకరణ సారములు, ఆంధ్రవ్యాకరణ పాఠములు, ఆంధ్రవ్యాకరణ బోధినులు, ఆంధ్రవ్యాకరణ సర్వస్వములు, ప్రశ్నోత్తర వ్యాకరణములు మొదలగు వ్యాకరణ గ్రంథములుగూడ నధికముగానున్నవి. ఐచ్ఛికముగా జదువదగుపుస్తకములు లెక్కింప తరముగాదు. కంపెనీ లంపినమచ్చుప్రతులు భద్రపఱచుటకు బడులలో తావు చాలకే దన్న నతిశయోక్తి కానేరదు. ఇవియన్నియు కేవలము భాషాప్రధానములు మాత్రమే సుగృహీతనాములచే రచింపబడినవే. అప్రసిద్ధపుస్తకముల విషయమువలన మనకు గాలహరణమే యగును. కావున వానినివిడచి ప్రకృత మనుసరింతము. సరిగా గన్పైనదెఱవని బాలుర విద్యావిషయమై యింతమంది యింతహోరాహోరిగా బోటీచేయుట వాస్తవముగ భాషా సేవచేయుటకో లేక తమపొట్ట నింపుకొనుటకో! గ్రంథకర్తలు సామాన్యముగా భాషాభివృద్ధియే లక్ష్యముగా రచింతురని యంగీకరింపవచ్చును. వారి కీరచనమువలన గలిగెడులాభ మల్పాల్పముకాన వారి ననుట కవకాశము లేదు. ఇంక కంపెనీ లన్ననో చిరకాలమునుండి భాషాసేవచేయుచున్న ప్రసిద్ధసంస్థ లొకటి రెండు మాత్రము ఇష్టముగాకున్నను తమజీవితము నిలుపుకొనుటకు గత్యంతరములేక బడిపుస్తకములవ్యాపార మారంభించినవి. తక్కిన పెక్కుకంపెనీలు పొట్టకూటికై యిట్లు పొరలాడుట నిక్కము. ఆ కుక్షింభర సంస్థలు ప్రకటించు పుస్తకములుగూడ ప్రసిద్ధగ్రంధముల ననుకరించియు, దలవిఱిచికొనియు, మాఱువేషములు వేసికొనియు, తప్పులతడికలుగా నుండును. తమదర్శనమునకు వచ్చినదే చాలునను మోమోటమిచే టెక్స్టుబుక్కు కమిటీవా రేపుస్తకమునైన అప్రూవు చేసి వేయుదురు. దొరతనమువారు గజెట్టులో ప్రకటించెదరు. అశంఖతీర్థ మందినపుస్తకము దేశాటన మారంభించి కలిగించెడి లాభనష్టములు దేవున కెరుక.

బాలురకు ప్రారంభ విద్యాభ్యాసమందే భాషా పరిచయముతోపాటు నీతివినయము సతప్రివర్తనము, మర్యాద, భక్తి మొదలగునవి నేర్పవలయును. దేశచరిత్రములు భూగోళ విషయములు జంతువృక్షశాస్త్రము ఆరోగ్య విషయములును వ్యావహారికములగు పోస్టు, టెలిగ్రాపు, రైలుమొదలగు విషయములు నీసమయముననే యించించుక నేర్పుట మంచిది. వేయేల? బాలురభావ్యభివృద్ధి కీసమయముననే బీజావాపముచేయు టుత్తమపద్ధతి.

"నాతిసులభము నాతికఠినము కానిచక్కని వచనరచనము నేయబడినది.........నీతి, దేశాభిమానము, స్వార్థత్యాగము, భూతదయ, పరోపకారము, ప్రకృతిశాస్త్రజ్ఞానము, లోకానుభవము మొదలగు నుత్తమ గుణముల బోధించువిషయములే మిక్కిలి శ్రద్ధతో జేర్పబడినవి"—వివేకవాచకములు.

"ఈ తెనుగు వాచక పుస్తకములు బోధనపద్ధతుల ననుసరించి వ్రాయబడినవి. బాలురకు నూతనపదజాలము తెలుపుటకు, నిర్దుష్టమయినశైలిని వ్రాయునేర్పు కలిగించుటకు, నుత్తమసారస్వతముపై నభిరుచికల్గించుటకును.........లోకజ్ఞానము, దేశాభిమానమును గల్గించుటకును స్వార్థత్యాగము, సజ్జనసేవ, ఆస్తికబుద్ధి మొదలగునవి గల్గునట్లును, సర్వజన సమాదరణమును, మతసహనమును, ఉత్తమ శీలమును గల్గునట్లును నుద్దేశింపబడినవి."
—లాఙ్మన్సు తెనుగు వాచకపుస్తకములు.

పైనిజూపబడిన యభిప్రాయములతో రచింపబడిన వాచకములు నిక్కముగా నుత్తమములేయని తెలియగలము. ఆరీతిని కాక యితర విధముగ రచింపబడిన పుస్తకములయుద్దేశంబు లెట్లున్నవో పరికింపుడు.

"మారచనావిధాన మాఱవతరగతినుండి సంపూర్ణముగా మారినది. ఐదవతరగతివఱకు ప్రాథమిక విద్యాప్రపంచమేమాదృష్టియందున్నది. కాని యీతరగతినుండి మాదృష్టిని ఉన్నత పాఠశాలావిద్యా ప్రపంచమునకు మఱల్చితిమి. ప్రాథమికవిద్యకంటె నున్నత పాఠశాలావిద్య కేవలము శబ్దమునుబట్టియే కాక విద్యాపరిమాణమును బట్టియు మిన్నయని చెప్పక తప్పదు. కావున దదీయానుగుణముగ మాశైలియు గొంతవఱకు సమాస శబ్దకాఠిన్యతను వహించినది. పాఠములును ముఖ్యవిషయ విపులీకరణముతో జొడిగింపబడినవి... కథలతోపాటు వ్యాసములును గల్పితకథలును, నాటకభాగములును జేర్చి...... భవిష్యద్రచనా పరిశ్రమమునకు బ్రథమసాధనము గాగలదని యేమాయాశయము" -ఆర్యవాచకములు.

పై నుద్ధృతములయి వాక్యముల వలన బాలుర విద్యాభ్యాస మెట్లుండవలయునో విశదపడుచున్నది. కాని యీ విషయమున గ్రంథకర్త లందఱును గ్రంథము లన్నియును గృతార్థత నందినట్లు తలంప వీలులేదు. పైని బేర్కొనబడిన వాచకములు మూడింటను మొదటి రెండును పూర్ణకృతార్థత నందినవి. మూడవది నిరర్థకతనందినది. ఆర్యవాచకముల యుద్దేశమే విపరీత మగుచున్నది. ఆఱవతరగతి పుస్తకము ౧౨౨ పుటలు, ఏడవతరగతి ౧౩౬ పుటలు. మొత్తము ౨౫౮ పుటలలో నొక్క పంక్తియందైనను బాలురకు లోకజ్ఞానము గలిగించువిషయ మించుకయు గానరాదు. వెఱ్ఱి మొఱ్ఱిసిద్ధాంతములు, తప్పులతడకచర్యలు, చేంతాడు సమాసములు, వ్యర్థపద సంఘటనములు మొదలగు దుర్నిరీక్ష్యాకారముతో నున్న యీ వాచకములు బాలుర కెంత యెట్లు ఉపకరించును? గ్రంథకర్తల పాండిత్య ప్రకర్షము నిరాఘాట రచనాపాటవము నిందు బ్రకటితమైనది.

సామాన్యముగా మూడవ ఫారమువఱకు బాలురకు నాతికఠినమగు భాషలోనే లోక

జ్ఞానము గల్గించు విషయములబోధించుట ఉత్తమపద్ధతి. వారుచదువు వాచకములందేమి వారికిబోధించు వ్యాసవిషయములందేమి వన్యములు గ్రామ్యములగు జంతువులు, తరువులు గుల్మములు లతలు, కృషి పరిశ్రమలు, దేశీయోత్సవములు యానసాధనములు, తీర్థక్షేత్రములు, పోష్టు, టెలిగ్రాపులు, రక్షకభటులు, వార్తాపత్రికలు, దేశచరిత్రములు, మొదలగునవి ముఖ్యముగా బోధింపబడవలెను. మూడవ ఫారమువఱకును విద్య విషయ ప్రధానముగా నుండవలయుననే కాని భాషా ప్రాధాన్యమంతగా బనికిరాదు. విషయమున కంగముగా మాత్రమే చక్కని సులభశైలిని నిగ్గుష్టమగు భాషాజ్ఞానమును గలిగింపవలెను. ఈ విషయమున వావిళ్లవాచకములు, వివేకవాచకములు, లాఙ్మన్సు వాచకములును జక్కని మార్గదర్శకములుగా నున్నవి. కాని యితరవాచకములు పెక్కులు విపరీతమార్గములంబట్టి మిక్కిలి యనర్థాపాదకములుగా నున్నవి మచ్చున కొకటి రెండు ఉదాహరణములు.

బాల కుశలవచరిత్ర : ఇది బాలకుల నుద్దేశించి వ్రాయబడినది. ఒకపాఠశాలలో నాల్గవ తరగతి కైచ్చి కపఠనీయముగా నిర్ణీతము. ఇందలి విషయము కుశలవులకథ.

భాష పాషాణపాకమున నున్నది. కొండవీటిచేంతాళ్ల సమాసములు, డొంకతిరుగుడు కల్పనములు, గచ్చకాయపాకములు నిందు తండోపతండములు. కథ మూడుపుటలది కల్పనావిశిష్టమై అఱువది నాల్గుపుటలు అచ్చులో నాక్రమించినది. కూడబలుకుకొని చదువుట చచ్చిచెడి చేయంగల విన్నపము లగుచున్నది బాలకులకు.

మచ్చు : "బాలుడయ్యును వీరాగ్రేసరుడై యోధాగ్రగణ్యుల కభేద్యమగు పద్మవ్యూహము నొంటిరియై యనాయాసముగ భేదించి యసమసమరక్రీడచే శాత్రవుల గెల్ల డిల్లపడజేసి."

"లక్ష్మణుడు క్రోధోద్రేక చిత్తుడై "రామచంద్రా ధర్మపదానువర్తివై బృందారకులు గూడ శ్లాఘింప, సర్వప్రజలను నాత్మసంజాతుల చందంబున సాకుచు సజ్జనరక్షణము దుష్టశిక్షణము గలిగి వసుంధరాపాలనం బొనర్చుచున్నని న్నీగతి బలికిన యాదురాత్ముని శిరము నాకరవాలమున కెరగా నిచ్చెదగాక."

"శత్రుఘ్నుడు దొలుత సందేహించుటకు బోరుసల్పెనుగాని లవునియస్త్ర సంధాన చాతుర్యము చూచి యద్భుతమందె."

"పావకజ్వాలల చందమున హృదయము దహించివేయుచున్న."

"మూడవకన్ను దెఱచి చేత త్రిశూలము దాల్చి మద్రుడు వచ్చినను సంగరంబున వెనుదీయక యద్వితీయ శౌర్యపరాక్రమము విరాజిల్ల."

ఇత్యాదులు దీనియం దపార పారావారములు. దీనికి తమ్ముడే బాలధ్రువ చరిత్రము. ఇందలి కొన్నిమచ్చులు:

"అరిసమూహమునకు భయంకర మొనవజేయు కార్ముకము సంధించి."

" యక్షు లింకనెట్టిమాయలు సలుపుటకు గదనభూమి విడచిరో యని సంశయించి ధ్రువుండు సారథింగాంచి సారథీ! దైత్యమాయలు బహువిధములుగ నుండును. వీరి కృత్యంబు లెఱుంగుట కెవ్వరును శక్తులుగారు. మనము వీరినగరంబు ప్రవేశింతమని."

"యక్షు లొనర్చిన మాయచేత నసేకాస్త్రములును మూత్రపురీషాదులును సర్పములును గురియదొడంగెను."

ఈపైని పేర్కొనబడిన రెండు గ్రంథరాజములు నెవ్వరిచేతను రచితములుగావు. ఇదివఱ కెవ్వరును గని విని యెఱుంగని క్రొత్తరీతి "అనూకితములు"

ఆర్యవాచకము—ఆఱవతరగతి:—

దీనియందు బాలుర పాఠ్యగ్రంథమున కుండవలసిన లక్షణములఛాయయే నొకింతయు లేదు. మొదటనే భీష్మస్తవము పద్యములు బాలురు నోటపట్టరానివి ఒకొక్కపాఠము పదేసిపుటలు దాటినవి. భాష బి. ఏ. లకు నేర్వదగినది. వారు బోధింప శేతకానిది.

"అమ్మహాస్త్ర ప్రభావంబునకోడి దశదిశాచక్రంబు వడంకెను. సాంద్రతమంబులు సర్వత్ర నిండుకొనెను. సకలలోక భూతవ్రాతంబులు మహాసంత్రాస సంక్షుభితములయ్యెను."

"వరమునబుట్టి భరతవంశము చొచ్చి పాండుభూవరునకు గోడలనై భుజవీర్యసనాథులగు నాథులంబొంది నీతి విక్రమధీరులగు కుమారుల గాంచి యాతీరున దిక్కులేని దానవలె బరాభవంబున కోర్చి యుండవలసిన దేనాకు?"

"విదురసాత్యకి ప్రభృతులతో సభ కరుడెంచి ప్రత్యుత్థానాది కృత్యంబులు ముగిసిన వెనుక సభికు లందఱు విన."

"దారు దైత్యాంతకుని బొదువదలంచుట మహానలంబు వసనంబున బంధింపంగడంగుటయే"

"పరిహాస వచోభాసురుం డయ్యును మితభాషి దారసుతాది సంసారుం డయ్యును నిత్యబ్రహ్మచారి."

ఆర్యవాచకము - ఏడవతరగతి: కృతికర్త పాండితీప్రకర్ష మెల్ల నిందగపడుచున్నది. పద్యభాగములు గజేంద్రుని మొఱ, దానపురందరుడు ధర్మజుని సంధిప్రయత్నము, రుక్మిణీసందేశము, మాల్యవంతునినీతిఅనునవి. గద్యభాగము గీతోపదేశము, జయదేవుడు, లక్ష్మణమూర్ఛ, బమ్మెరపోతరాజు; పద్మవ్యూహము, యుగంధరమంత్రి మిత్రలాభము, దేవాలయములు మాటకుమాట అనునవి. నాటకభాగము వామాక్షి. మొత్తము ౧౫ పాఠములు; ౧౩౬ పుటలు.

గీతోపదేశమున : "బాలకులారా! ఆనాటి మహాభారత సంగ్రామరంగము నొక్క మాఱు స్మృతికి దెచ్చుకొనుడు. వివిధ వర్ణశోభితంబులగు కేతనంబులమీది పసిడికింకిణులు మొఱయుచున్నవి. రథనేమిధ్వానము లెడతెగక వినబడుచున్నవి. కదనతురంగహేషారవంబులు మిన్నులకు బ్రాకుచున్నవి. అవిగోయాదవసైన్యములు. అరుగో గాంధారులు. అరుగో మాత్స్యులు. అరుగో పాంచ్యులు. అరుగో ఉత్తరకురుదేశీయులు. ఇరుగో ప్రాగ్జ్యోతిషపుర సైనికులు."

"జననస్థితిలయంబుల కీశ్వరుం డొక్క-రుండ కారణమని యెఱుంగుము. అవనిక పయి దోలుబొమ్మల నాడించునట్లు జగన్నాటకరంగమున సమస్తభూతములను బరమేశ్వరుడు దనయిచ్ఛవచ్చిన ట్లాడించుచున్నాడు."

ఈ మాటలు చదువుచున్నపుడు బాలకులు గోడమీది నీడలవలె నిశ్చలత్వమంది వెంటనే పాఠశాలామోక్షము నపేక్షించుట కభ్యంతర ముండునా?

యుగంధరమంత్రి: "విద్యానాథుని కృతిని బట్టి విచారించినచో నీతడు(యుగంధరుడు) కల్పిత వ్యక్తి కాడు, రాజ్యతంత్రజ్ఞుడై తన మేధాశక్తి సహాయమున సైనికసహాయము లేకుండ నంతటి ఢిల్లీచక్రవర్తిని సమానముగ జయించి ప్రతాపరుద్ర చక్రవర్తిల కారాగృహమునుండి తప్పించికొనివచ్చిన మహామాత్యుడు.

ఇప్పుడు మనకు ప్రమాణము మహాకవి రచించిన గ్రంథమా? సత్యదూరముగాని దేశచరిత్రమా? రెండును ప్రమాణములే. ఈ మహనీయుని చరిత్ర మెఱుంగదలచిన వారెల్లరు విద్యానాథవిరచితమగు ప్రతాపరుద్రీయ నాటకమునే ప్రబలాధారముగా గైకొనుచున్నారు. కావున ప్రస్తుతము మనకుగూడ నదియే శరణ్యము... ...విద్యానాథుని కృతికి సంబంధించిన తక్కుంగల కథయెల్లఁ జరిత్రకు సరిపోవుటయు నొక్క-యుగంధరుని కథమాత్రము సరిపోకుండుటయు నెట్లోయూహింపనలవి గాకున్నది."

ఇవ్విమర్శన ముత్తమోత్తమముగానున్నది. విమర్శకుడు చూచిన విద్యానాథ విరచిత ప్రతాపరుద్రీయనాటక మేభాషలో ఏ లిపిలో ఏ ముద్రాలయమున ముద్రితమైనదో యెక్కడ లభించునో తెలిపిన నస్మదాది జిజ్ఞాసువుల కుపకార మగును. యుగంధర మంత్రియఁట! విద్యానాథుని ప్రతాపరుద్రీయ నాటకమఁట! అందు వర్ణితుఁడట! ఏమి విపరీతప్రవాతలు! తానేకథ వ్రాయదలఁచెనో దానికి సంబంధించిన, అచ్చుపడి సులభముగా నుండిన గ్రంథములైన సరిగజూడక యే, గ్రంథవిషయమును గ్రంథకర్తలనైన సరిగదెలిసికొనక యే అప్రమాణములను నిట్టి యసత్యములను బాలురతలల రుద్దుట యెంతసాహసము! ఇట్టి సాహసములు విపరీతసిద్ధాంతములు 'తెలుగు కవులు' అను పుస్తకమున అసంఖ్యాకములుగానున్నవి. ఇంకను గొన్ని పుస్తకములను పరిశీలింతము. విద్యార్ణవ బిరుదాంచితులు సాహిత్య సరస్వతులు నగు యన్. పేరరాజు గారు స్కూలుఫైనలు ఏగ్రూపు తెలుగు పుస్తకమునకు నోట్సు వ్రాసిరి. దానిలో కొన్ని:—

ప్రేముసజ్జ (ప్రేము + సజ్జ). సూ. నామ్యాది కనుమ్యాదులకు పజ్ వర్ణక మాదేశమగును." ఈ లక్షణము, లక్ష్యసమన్వయము, ఉదాహరణములవలన బాలురకు ఎంతటి జ్ఞానము కలుగునో!

"ఈతడు (పోతన) రచించిన గ్రంథాంతరములు భోగినీదండకము, వీరభద్రవిజయము, నారాయణశతకము. (ఈతడు) నైజామురాజ్యమందలి ఓరుగల్లుపురవాస్తవ్యుడుకాని కడపమండలములోని ఒంటిమెట్టవాడుకాడు".

ఈసిద్ధాంతశక్తి కేవలము అసాధారణమయినది. వాదోపవాదము లింకను ముగియలేదు. రెండుపక్షములకును ప్రబలప్రమాణములే యున్నవి. అట్టియెడ తాము నమ్మిన సిద్ధాంతమే యందఱు నమ్మవలెననుట యేటిమాట!

"ప్రశ్న:—రుద్రుడు భీష్మునకు ప్రసాదించినవర మేది? ఉత్తరము (ప్ర. 75) మొదటగూతురై పుట్టి పిమ్మట బురుషత్వమంది. యుద్ధరంగమున భీష్ముని జంపజాలు బిడ్డ నీకుఁ బుట్టును."

"నీటిరాశితో విహరించునట్టి నీళ్లతోడను,

"క్రియ్యాట:—(క్రింద + ఊట) క్రొత్త శబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్ని యెడల నుగాగమంబునుం గొన్నియెడల మీది హల్లునకు ద్విత్వంబు నగు; పరుషేతరంబులు పరంబులగునపుడు నుగాగమప్రాప్తి లేమింజేసి వానికి ద్విత్వంబగు.

చూచితిరా: సూత్రంబునకు నుదాహరణమునకును గలసంబంధమును, సమన్వయచాతురియును. ఇట్టి విశేషంబు లీగ్రంథరాజమున ననంతములు.

ప్రశ్నోత్తరవ్యాకరణము: ఈపుస్తక మన్ని విధముల నెన్నదగినది. గ్రంథకర్తలు విద్వాన్ ఓలేటి సీతారామశాస్త్రి శిరోమణిగారు. పరిష్కర్తలు ఓలేటి వెంకటరామశాస్త్రిగారు-శతావధానులు. ఆస్థానవిద్వత్కవులు. గ్రంథము బాలురమన స్తత్త్వమున కనుకూలముగ...... యావద్వ్యాకరణమునకును బీజప్రాయమై..... చిన్నతరగతి బాలబాలికలకు బోధనీయముగా దోడ్పడును.

ఇందలి దొక్కటి:

షష్ఠీవిభక్తి:—లోన్—గదిలోన్

లోపలన్—వనములోపలన్.

అని యుదాహరింపబడినది. "నిర్ధారణ షష్ఠికి లోపలవర్ణకం బగు" అని సూత్రించి బాలవ్యాకరణకర్త"....సముదాయమునుండి యేక దేశంబునకు పృథక్కరణంబు నిర్ధారణ మనంబడును" అని వివరించి "గోవులలోపలగపిలబహుక్షీర; అశ్వములలోపలఁ బాఱువాడు శీఘ్ర గామి ఇత్యాదు లుదాహరణములు చూపినాడు. బాలవ్యాకరణ కర్తపొరపడెనని యింతవఱ కెవ్వరు"ననలేదు. సంస్కృత వ్యాకరణమర్యాదనే యాతడు అనుసరించెను. ఈవిద్వచ్ఛిరోమణులు మాత్రము అనాలోచితముగ నెందఱోపాడినపాటలే గ్రహించుట శోచనీయము.

ఎట్లయిననేమి? బాలురకు సంబంధించిన పాఠ్యగ్రంథము లనేకములం దిట్టివిపరీతములు వేనవేలుగలవు. ఈగ్రంథములవలన ఎట్టిలాభము కలుగును? బాలురహృదయములు శిరీషకుసుమ పేశలములు. ప్రణితోపస్థానీయముగావాని నుపచరించి యభివృద్ధినొందింపవలయునుగాని కర్కశతర్కవాగ్వ్రజాఘాతములచే చదుపరాదు. మృదులమగు భాషతో నాతికఠినములగు వివిధవిషయములను బోధింపవలయును. అప్పుడు బాలురకు విజ్ఞానమును భాషాపరిచయమును గూడ కలుగును. సోపానక్రమమున విశేషముల బోధించినచో వారు విజ్ఞానధనులు, భాషాకోవిదులు గూడ నగుదురు. అపుడె మనభాష సర్వతోముఖముగ సంపూర్ణాభివృద్ధి నందును. దేశముగూడ నర్హమైన యున్నతి నొంది వెలయును.

# 'లి' గాడు

కవికొండల వెంకటరావు

సర్వ సామాన్యంగా తెనుగు వారిచే నుపయోగింప బడుతూన్న "లిగాడు" శబ్దాన్నే విఱిచి "లి"గాడుగా మార్చి దానిని సార్థకంగావించే విధంగా ఈకథలో వాడుతూ వున్నాను. పాఠకులు పరామర్శింౘుగాక! లేరు మఱీ"వన్నె కాడు" "అందగాడు" "ఆటకాడు" "పాటగాడు" అని. అట్టివాడే "లి"గాడున్నూ

"లి"గాడు అనగా—కొడవలి, గొడ్డలి, గుద్దలి, రోకలి, నాగలి, వీనిని పనిముట్లుగా గైకొని శ్రమపడే మగవ్యక్తి. ఎంత శ్రమపడ్డా వాడు సంపాదించే సంపాదన, కలి, అంబలి, ఈ రెండింటినీ మించిన ఆహారాన్ని సంపాళించుకోవడానికి చాలదు. వాడనేమాటల్లో "దాపలి" "వెలపలి" అని వినబడేనిగాని ఆపదాలు "గిలక" పరంగా కాకుండా "గిత్త" పరంగా వాడేవి అని తెలుసుకోండి. అంతకంటె ఎక్కుడువిద్య వానికడ ఉండడాని కవకాశమేలేదు. వానికున్న కష్టాలన్నీ విభజిస్తే రెండింటి కిందకు వస్తాయి. ఒకటి ఆకలి. రెండోది చలి. సంఘంలో వానిఅవధి ఎల్లాగు వుంటుందంటే సంపెటపెట్టు తినే దాఁగలియొక్క అవధిలాగుంటుంది, విన్నారా?

ఇటువంటి "లి"గాండ్రు వాళ్ల భార్యలు "లి"కత్తెలు ఒకకొందఱు కలిసి వున్నట్టాయినా వాళ్లందర్నీ మూకుమ్మడిగా మనం "లిగాడుప్రజ" అని అనవచ్చును.

అనవచ్చును ఏమిటి? వాళ్ల మొహాల్లోని దిగాలే చెబుతుంది చూడ్డంతోనే "వీళ్లు "లిగాడుప్రజ" అని. ఆనందం అనేది వాళ్ల కళ్లల్లో మృగ్యం. ఎలావుంటుంది? వాళ్ల బ్రతుకూ, పట్నవాసపు రోడ్డుపక్కను నాటబడ్డ చెట్టుయొక్క బతుకూ వొక్కటాకీగా ఉన్నప్పుడు? ఆచెట్టు కిందే వాళ్ల విడిది అయినప్పుడు? ఆచెట్టుతప్పితే మఱిఆస్కారం ప్రపంచంలో - ఈ ప్రపంచంలో ఎక్కడా వాళ్లకు కానరానప్పుడు?

ఓసాయంత్రం అటువంటి జనసమూహం తాలూకు ఓ కుటుంబాన్నిచూచి వితర్కించడం నాలో జరిగింది కాబట్టే ఇంత బలవత్తర సాక్షిగా వాళ్లనుగురించి నొక్కి వక్కాణింపగల్గుతున్నాను. నమ్మండి నామాట పాఠకులు!

ఆ కుటుంబాంది సంసారమన్నా వొక్కటే సన్యాసంఅన్నా వొక్కటే, ఆస్తినిగురించి జాబితా వ్రాయడం అంటూవస్తే— తవ్వేమట్టి నెత్తికెత్తుకునే రెండుతట్టలు, వట్టివి కావట్లో ఇటూ అటూ పన్నుకుని, ఆతట్టల్లో పెద్దకుండలు రెండూ, కూంతకూంత గంజి వద్దవున్న ముంతలు రెండూ, వుంచుకుని, బుజాన్ని గునపం గునపానికి పార తగుల్చుకొని మొగాడు ముందు వస్తూవుంటే, ఆవెనకనే ఆడది వోచంకను కుఱ్ఱాణ్ణి సముదాయించుకుంటూ, రెండోచేత మూఁటువొ ల్లె తొ ల్లి కా, పుచ్చుకు మగాణ్ణి అనుగమిస్తూ "ఈ చెట్టుకింద దిగుదాంరా!" అనిపట్నంలో గోదావరి గట్టుప్రక్క [illegible] చెట్టుమొదట దిగారు, నడచినడచి ఎక్కణ్ణుంచో వచ్చినట్టు కనబడే దుమ్ముకాళ్లతో చెమ్మటతలకట్లతో—

సన్యాసి వస్తే ఎదురువెళ్లి పట్నంలోని గృహస్థులు అనేకమంది తమయిళ్లకూ తమయిళ్లకూ పిల్చి భిక్షలు పెడతారేగాని యిలాంటివాళ్లను ఎవరున్నా ఆహ్వానించరు. వారి కెవరున్నా ఆతిథ్యమివ్వరు. ఉతకాచిరతాలేని ఊరచెట్లు కాబట్టి అవి నిర్మొహమోటంగా వాళ్ళను తమ కిందకు రానిచ్చాయి. రానిచ్చాయి అన్నమాటేగాని కొంతసేపటివఱకూ వాళ్ళను ఆచెట్లున్నూ పలకరించలేదు. గాలికూనలు బయలుదేరి చెట్లచెవుల్లో వీళ్లునావాళ్లు సుమండీ అని ప్రేరేపించేదాకా లాతిగానే వూరకున్నాయి.

నాడు గాలికి చెట్లుచలించడంలో వొక అపురూపమైన చలవ—ఆపని వాళ్ళమూలంగానో ప్రకృతిమూలంగానో ప్రపంచాని కంతకూ సోకింది. ఆకాశం చూసేసరికి వో అనుకోని మబ్బుతునక బంగారం వర్షించినట్టు సాయంకాలం నీరెండకాంతిలో వర్షిస్తూ, చేరికబడ్డదై, చెట్లనూ, చెట్లకింద దిగినవాళ్ళనేకాకుండా ఆపరిసరప్రాంతాన్ని అంతనూ అతివినోదవంతంగా మార్చివేసింది. పెద్దవాన గాపడలేదు. గోరునీళ్లు చల్లినట్టుగా పడింది. అంతేశాన. వెంటనే కష్టజీవులయొక్క కనురెప్పలమీది దుమ్ము, చెట్ల ఆకులయొక్క ధూళీ కూడా కడిగివేయబడి నట్టయింది. కమ్మనిశ్వాస భూదేవిదా, భూదేవిమీది ప్రాణికోటిదా అన్నట్టు వ్యాప్తమైంది. అంతేకాకుండా "అదివఱకెక్కడున్నవో యీపక్షులు" అని అనిపించేలాగు ఆకుపచ్చని చిలకలు, తెల్లని కొంగలు, నల్లని కాకులు, గోధుంవన్నె గోరింకలు, కొన్ని ఎగు

ఎలిఫేంటాగుహాలలో



బ్రహ్మాండమైన త్రిమూర్తి విగ్రహశిల్పము

దుతూ, కొన్ని నిశ్చింతగా కూర్చుని, కొన్ని అనుస్తూ, కొన్ని కులుకుతూ సందడించేశాయి.

దాంతో పట్నంలోనూ ప్రకృతి శోభకు తావు వుంది అని తట్టింది. మజీన్నీ ప్రకృతితోపాటు పామర జనానికిన్నీ ఆశ్రయం వుంది అని తోచింది.

"లి"గాని అంగన తన అనుగు బిడ్డణ్ణి వెంటనే చెట్టుకు తన విడి పుట్టంతో వొక వుయ్యాలా వేసి ఆ వుయ్యాల్లో పండబెట్టి——

"తొలుత బ్రహ్మాండంబు తొట్టి గావించీ, నాలుగు వేదాల గొలుసుల మరించీ" అని వూచినట్టుగా అంత రాశమం దొక్కసారివూచి మగని కోసంగాను ఛూచింది.

మగ డక్కడ లేడు. "ఆరి వీడి జిమ్మడ! ఇంకా ఈ కొత్తవూళ్లో అడుగెట్టామో లేదో వీడి కప్పుడే ఏ వొంక దానోసన కొట్టిందిరా బాబా! ఆకల్లోసన! ఆకల్లు పాకోసన! ఏత ట్టుకు సచ్చాడని నెమకేదాన? ఆడు మళ్లీ తన తాగుబోతువాలకంతో యీపెద్ద మహానగరంలో దారీతె న్ను నాలంకకు కనుక్కోగలడా! దేవుడా!" అని దీనంగా దిక్కులు చూచింది. చూచిచూచి నిరాశా భావోద్రిక్తమైంది. ఆభావంనుంచి తీవ్రమైన క్రోధభావం లోనికి మాఱింది. "వీడు! వీడు! మొగు డనుకోనా మొద్దులను కోనా? బువ్వ బూరికింద, గంజి పాయసంకింద గడు స్తూవున్న యీబతుకుని లాయిరు బందులుపెట్టేవాడు వీడా తాళిగట్టి నోడు? రానియ్యి! రాడూ? నిసి రేత్రికైనారాడూ? వచ్చాడా వాణ్ణి

అంతదూరంలో ఆచెట్టుకు రెక్కలు విరిచికట్టి చింతబరికెలతో బుద్ధిసెప్పి గడ్డెడతా!" అని నిశ్చయించుకుంది. నిశ్చయించుకుని బిడ్డడంతలోయేడిస్తే వాణ్ణి యువ్యేలలోనుంచితీసి, నేలనే కూర్చుండబెట్టి, యువ్యెలచీరవిప్పి, అదోతలగడాగా చేసుకు, దానిమీద తనకట్టుకొంగు పఱచుకొని, పక్కలో బిడ్డణ్ణిపరుండబెట్టుకు పట్టీపట్టనికునుకు వానితోపాటు పోతూవుంది.—— మి నుకుమినుకుమనే చుక్కల్లే, దీపం లేక, చీకటిలోనే కాలంవెళ్లబుచ్చు తూంది. విశ్వేతరమంతా అంధకార బంధురంగా వుంది.

రేత్రి పదకొండుఘంట లయింది. బిడ్డడు మంచి నిదరలో ఉన్నాడు. మగని అజా పజా ఏమీ కనిపించడం లేదు. ఏం చేస్తుంది ఆ ఇల్లాలు? "ఎక్కడికి పోయినాడో యీ దిక్కు మాలినపక్కణంలో" అని వెక్కు వెక్కున యేడ్వసాగింది.

ఆలాఏడుస్తూండగానే ఆమెవీను లకు "బ్లెడీహుం" అని వొకశబ్దం విని పించింది. అది మనిషిగొంతుక, మగ వానిగొంతుకలాగు తోచింది. కళ్ళ నీళ్లు తుడిచివేసికొని ఆమె "వస్తు న్నాడు. నెట్టొలికించుకుంటూ వీడికీ రోజుతో బుద్ధి రావాలి" అని తన తాత్కాలికపు తలగడాచీర తీసి పొడుగ్గా విప్పింది. తిరిగి ఆవల వ్యక్తి "మేరీ! డార్లింగు! హాల్లో! బ్లెడీ! టారీ! లిలీ! బులీ! జోలీ!" అన్నాడు. —"నన్ను ఒంటిదాన్ని చేసి యింకా ఏడిపించాలని అనుకొం టూవున్నావురా. నేను జడిపిస్తే జడిసే దాన్ని కాదు. ఏడిపిస్తే ఏడ్చేదాన్ని కాదు" అని అమె ఏం చేసిందీ అంటే —— ఆవలవ్యక్తి అంత

దూరాన్ని వుండగానే తన తలగడ చీర వుచ్చుపోసి విసరినట్టు విసరి చెట్టుచెంత కమాంతంగా ఏనుగు నీడ్చినట్టు ఈడ్చి రెక్కలు విఱిచికట్టి "ఈరేత్రి తెల్లవార్లూ అలా మిడకవలసిందే నీవు" అంది. ఆవలివ్యక్తి ఎంచేతో కోరలుతీసిన పాములా కొంతసేపు నీరసస్థాయిలో పడ్డాడు. దీపం పెట్టి చూడ్డానికి స్త్రీ దగ్గఱా దీపంలేదు. వచ్చిన పురుష వ్యక్తి దగ్గఱా లేదు. కాని ఆ వచ్చిన వ్యక్తి శరీరచ్ఛాయ శరీరాచ్ఛా దనచ్ఛాయ సమస్తం నలుపురంగే. దాని మగని రంగూ దాని మగని గుడ్డలరంగూ అట్టిదే. పోనీ కళ్లు తెలుపేమో అని గుర్తించడానికి ఎట్టినికళ్లు తాగినప్పటి కళ్లు, ఎట్టివారి కళ్లైనా చీకట్లో నల్లగానే కనిపిస్తవి.

ఇంతకూ ఎవర్రా ఆ కొత్త వ్యక్తి అని మనకు జిజ్ఞాసగాని ఆమె కు లేనేలేదు ఆసమయాన్ని. ఆమెకు ఆ వచ్చినమనిషి, బాగా తాగి కై పెక్కివున్న తన మగడనే-నిస్సందే హంగా తన మగడనే-ఘట్టినమ్మకం.

దూరంగా ఠంగుఠంగుమని పం డ్రెండుకొట్టారు తాలూకాలో. ఈ పామరాంగనకు దాని పరకాయింపే లేదు. ఆమెకు సూర్యచంద్రు లున్న ప్పటికాలం తెలిసికొనే పాళవు విజ్ఞా నమే కలదు గాని మఱిలేదు. చుక్క ల్నిబట్టి సుంతా తెలీదు. ఆచెట్లకింద నుంచి చుక్కల్ని ఛూడ్డం అనేది కూడా దుస్సహాము. చూడలేదో బ్రతికిపోయింది. చూచివున్నట్టాయి నా బ్రహ్మరక్షస్సో, పిశాచమో ప్రాణం అడలించియుండేది.——"బ్లెడీ హుం!" "బ్లెడీహుం"!——

ఈ "బ్లెడీహుం" అనే వాణ్ణిగురించి మనం రైట్ రాయల్ గా ఎరిగి వుండాలీ అంటే తఱుచు మెయిలు బండీ ఎక్కుతూవుండాలి. ఊరకే ఎక్కడమేకాకుండా మెయిలు బాగా పదినిమిషాలు పదేను నిమిషాలు ఆగుతూవుండే ప్రతీ స్టేషనలోనూదిగి ఇంజెన్ దగ్గరకు వెళ్లి అతివిచిత్రంగా గమనిస్తూ రావాలి. అప్పుడు ఆ ఇంజెన్ యొక్క జఠరాగ్నికి నిరంతరం రాక్షసిబొగ్గు సమకూర్చే తెల్లదొర వొక డాపిస్తాడు. అసలు తెల్లని చాయవాడైనా చేసేపనినిబట్టి నీగ్రోలా నల్లనివన్నె ప్రకటిస్తాడు. ఈ "బ్లెడీహుం!" అన్నది ఆదొర.— ఆదొర నామధేయం మిస్టర్ ఎలూఫ్. ఆయనకు వొకభార్యా వుంది. ఆవిడ పేరు మిసెస్సు ఎలూఫ్.

మిసెస్సు ఎలూఫ్ మాంచి ఫాషనబుల్ లేడీ. క్లబ్బులో డ్యాన్సింగుకు ఎన్నికగన్న అన్నులమిన్న. డ్రెస్సు వేసిందీ అంటే ఆమె డ్రెస్సు ఇతర లేడీస్ కు అందతీకే వరవడి. ఒకరవ్వ వుంగరం వేలికి, ఒకబంగరు గొలుసు మెళ్లో అంతే ఆమె పెట్టుకునే ఆభరణాలు. అవితేమాత్రం! మెడ తిప్పకోకుండా వున్నా గొలుసు అల్లాడం వోసొగసు, మెడ తిప్పకొంటూవున్న గొలుసు అల్లాడకపోవడం వోసొగసు. ఇలాగ్గా వొకవస్తువును పుచ్చుకునే రెండువిధాల సొగసులు ఆమెచూపిస్తూవుంటే ఎవరైనా ఆమెనువింతవింతేగా చూడవలసిందే. మడివేలివుంగరం! అస్తమానం ఎవరినో వొకర్ని పిలుస్తూవున్నట్టే, ఎవరినో వొకర్ని తలుస్తూవున్నట్టే! ఏమా అంటే అందటూమాటాడుతూ, మాట కనుగుణ్యంగా అభినయిస్తూ ఈమెఊహిస్తూ ఊహకేలనుగుణ్యంగా అభినయిస్తుంది. చూస్తే ఆమె వూహిస్తూవుండని ఘటికే లేదు. కనుక ఆమెయొక్క తదంగుళీయకం నిరంతరాభినయంతో కూడుకున్నదై విశ్వమోహనంగా అగపించింది.

ఇటువంటినరళ మిస్టర్ ఎలూఫ్ ను వలచి పెళ్లాడిందీఅంటే అది సాంఘిక సమస్యల్లో మెట్టుసమస్యయే యగుగాక, మన కిచ్చట అప్రస్తుతం. అది కదపరాని సత్యము.

రోజూ మిస్టర్ ఎలూఫ్ రేత్రిపూట తప్పతాగి, ఒక్కొక్కప్పుడు రోడ్డునడాన్న, ఒక్కొక్కప్పుడు డస్టుబిన్నులకాడ, ఒక్కొక్కప్పుడు గట్టుకీపక్క, ఒక్కొక్కప్పుడో గట్టుకాపక్క, ఒక్కొక్కప్పుడు గట్టుమీద, ఎక్కడపడితే అక్కడే వొళ్లు తెలియక పడిపోవడం రివాజు. మిసెస్ ఎలూఫ్ డ్యాన్సుగీన్సు అయిపోయిన తరువాతను ఒకబాటరీలైటుచ్చుకు రోడ్లంటా. రోడ్ల సైడ్లంటా వెతకి తన మగణ్ణి కనుక్కొని ఏకూలివాడి సాయాన్నో తనయింటికి జేరేసుకుంటూ ఉండడం రివాజు.

"లి"గాడు తన భార్యను విడిచిపెట్టి ఎక్కడికో వెళ్లిపోయిన రేత్రి కూడా పై దంపతులకు తమతమ రివాజులు యథాప్రకారం జరిగినయి. మిస్టర్ ఎలూఫ్ తాగి మైమఱచి "బ్లెడీహుం" అని అరచుకుంటూ వచ్చివచ్చి చెట్టుకింద పూర్వోక్తప్రకారం బందీ అయినాడు. కాని అతగాడు "మిస్టర్ ఎలూఫ్" అని "లి" కత్తెకేం తెలుసును. ఆ తాగి తూలుతూ వచ్చిన మానవుడు తన మగడే అనుకొంది. అనుకొని చేయదలచుకొన్నంత పనీ చేసింది. చింతబరికతో బాజా వాయించడం ఒక్కటి మినహాగా!

ఇక అక్కడ "లి" గాడు.— వా డెక్కడికి పోతాడు? అసలు గట్టె వచ్చేటప్పుడే పసిపట్టి వుంటాడు దిశ. పసిపట్టి అనుకొని వుంటాడు. "ఒకగ్లాసుడు ఇద్దరు తిక్కామందు" అని అనిపించే యీకల్లు తాగకతప్పదని. తిన్నగా కల్లు అంగడి వున్న రోడ్డుచ్చుకు అంగడికేసి నడచేడు.

రోడ్డుమీద విద్యుద్దీపాలు వెలిగిపోతున్నాయి. ఎడాపెడా, రుప్పరుప్ప చూచే కుక్కల్లే, కొట్టుకొట్టూ తొంగిచూచీవాడు. పట్నవాసాల్లో కల్లంగళ్లు ఊరిచివరకాక ఊరి మధ్యనే వుంటవికూడాను. దానివాసన రంయిని కొట్టింది వోచాయను. లోపల జనసంకులంయొక్క ధ్వని మిక్కుటంగా యివలకు వినబడుతూ వుంది. కాని జనం కనిపించడంలేదు. గుమ్మం వద్ద మాత్రం "దయచెయ్యండి" అని ఆహ్వానం బోర్డు వ్రాసివుంది. "లి"గాడు ఈ జన్మలో చదువురానివాడైనా పూర్వజన్మసంస్కారం కలవాడేమో—ఆ అక్షరాలబోర్డు వాణ్ణి ఆహ్వానించినట్టయింది. తొంగిచూచేడు. "ఏం తొంగి చూస్తున్నావు? వస్తేరా! లోపలికి! లేకుంటే నీదారిని ఫో! అంతేగాని తొంగిచూడరాదు" అన్నాడు లోపలనున్న వొకవ్యక్తి. మరోవ్యక్తి "వె! వె! వెధవని లోనికి లాగిప—" అని వెనక్కి తానే పడిపోయినాడు. మూడోవ్యక్తి "డబ్బుల్లేని ముఖంలాగుంది నీది. నడువు. ఇక్కడ అరువుగిరువు జాంతానై" అన్నాడు.

ఈ కడమాటతో "లి"గాడు కొంచెం వెనక్కు-తగ్గాడు. వాడిదగ్గిర డబ్బేదీ? నాడసలేసున్న. రోజంతా ప్రయాణంతోనే చెల్లు. కొత్తవూరు పనికోసం రావడంలో.

అయితే డబ్బూగిబ్బూ లేకుండా తాగుడుకు బయలు దేరడంలో అర్థమేమి టంటారేమో. అర్థమేమీ లేదు. ఏమారి పరుగులెత్తడంతప్ప. ఓపర్యాయం ఆపొద్దు కల్లుపాక చుట్టూ తిరిగి దానోసనకు రంజిల్ల డమే లోపలికుట్ర.

అయినా ఆశ పోలేదు. ఆకొట్టు కాకపోతే మరోకొట్టుండదూ? మరోకాడ! అని యింకా బాగా ముందుకు సాగాడు. రేత్రి ౧౦, ౧౧ అయింది. తిండితిన లేదేమో ఆపొద్దు-రోడ్డుపక్కన ఈతట్టు, దారిమఱచి చతికిలబడ్డాడు. రోడ్డు కాపక్కన అతట్టుఓమహాహార్మ్యం వాడిముందు కళ్లక్కట్టినట్టు రెండు అంతరువుల్ది కనిపిస్తూవుంది!

హార్మ్యంయొక్క-దిగుభాగం వొక పెద్దహాలు,పైభాగంపదహారుగదులు. ప్రతీగదిలోను నిల్వుటద్దాలు, చెల్వు సోఫాలు, చల్వరాళ్లు, హాల్వాతీపి మంచాలు, కల్వపూ మెత్తనిపరు పులు వున్నాయి. అన్నిగదుల్లోను లైట్లు. లైట్లుకు షేడ్లు. ఆరిపేయబడేవి కొన్ని వెలిగించబడేవికొన్ని యిల్లా గావుంటూవున్నాయి.

"లి"గానిదృష్టి పైగదులమీదికి పోనేలేదు. అసలువానిదృష్టి ఆది లోనేకిందిహాల్లో ఆగిపోయింది. అదే వాడికి పరమానందదాయకంగా వుం డింది. రోడ్డుపక్కను చతికిలబడ్డ వాడల్లా "గుళ్లోగోవిందరాజుల విగ్ర హం శయనించినట్టు ఓచేతిమీద తలానుకు ఆహాల్ను సూటిగా చూ స్తూవున్నాడు.

హాల్లోనలభైజతలు, ఆడమగ జతలు, తెల్లనికరీ రాలవాళ్లు,మిలమిల ప్రకాశిస్తూ జిలజిలపాకేరోమాంచం తో నాట్యమాడుతూవున్నారు. కిటి కీలన్నీ తెగవబడివున్నాయి. లైట్లన్నీ వెలిగించబడివున్నాయి. బ్యాండు వాయించబడుతూవుంది. ఆర్గన్ మోతబంయిమంటూవుంది. షేంపేన్ బాటిల్సు, కార్కులు పైపుపడేథార చాలక, అధోభాగాన్ని కొట్టబడ్డవై గ్లాసులోకివొంచబడుతూవున్నాయి.

"లి"గాడికి పైదృశ్యమేమీన్నీ అర్థంకాలేదు, ఒక్క-వాళ్లు గ్లాసు పుచ్చుకుతాగేటప్పటిచేష్టతక్క. ఆ లోపల వాళ్ళలో ఎవరైనా గ్లాసెత్తి తాగుతూంటే తానుకూడా రోడ్డు పక్కని చీకట్లో నోరుతెరచేవాడు. పాపం! అలా ఎన్నిసార్లని తెరవ గలడు? ఎంతకాలం తెఱచి వుంచు కోగలడు. క్రమంగా ఆవలింతల్లోకి దిగి తనకు తెలియకుండానే నిదరో యాడు.

హాల్లో గడియారం రాత్రి ఒంటి గంట కొట్టింది. అంతా నిశ్శబ్దవంతం గా మాఱిపోయింది. దీపా లారిపే శారు హాల్లో. పైగదుల్లో అక్క-డక్కడ కొందఱు స్త్రీలు కొందఱు పురుషులు దిగబడ్డా అవికూడా చీకటి కోణాలే. హాల్లోనివారు చాలా మంది హార్మ్యం వెలువడి ఆలా-ఈలా తమ తమ లోగిళ్ళకు వెళ్లిపోయినారు. అందరూ అనక చాలామంది ఎందుకు అనడం వచ్చిందీ అంటే ఒకామె తన యింటికేసి పోక "లి"గాడు పరుండి యున్న రోడ్డుమీదకు వచ్చి యిటూ అటూ చూచి రోడ్డుసైడ్డే "లి"గాడు వున్నదెసకు వాణ్ణి చూడకుండా అడ్డంగా నడుస్తూవుంది.

నడుస్తూ ఆమె ఏమి చేసిందీ? తన పాదంతో తనకు తెలియకుండా "లి"గాణ్ణి తన్నింది. "లి" గాడు "చచ్చాను" అని కెవ్వున అరిచాడు. ఆమె తనచేతిలో తయారుగా వున్న బాటరీలైటు వేసింది. "హు ఆర్ యు బ్లెడీ" అంది. "లి"గాడు మా ట్లాడలే. ఆమె మఱీరవంత కీచుగా "కోన్ హై?" అంది. "మాలోణ్ణి కా దు త ల్లీ" అన్నాడు. "లి" గాడు. "మాలోడిని కావు? కూలో డివా?" అంది. "ఊఁ" అన్నాడు. "స్టాండ్ అప్" అని జబ్బట్టుకు లేవ దీసింది వాణ్ణి. "లి"గాడు తానా పూట తిండి తిన లేదన్నట్టు కడుపు తప్పటగా చూపిస్తూ వంగివంగి సలా ము పెట్టాడు. ఆమె "ఫరవా నై, ఈ రొట్టె తిను. ఈ నీళ్లు తాగు." అని ఫ్లాస్కు-లోను చేతిబుట్టలోను ఉన్నవాటి నిచ్చింది.

"లి"గాడు ఆరొట్టెగబగబ తిని గడ గడ ఆనీళ్లుతాగాడు. "నన్నుఫాలో" అని చేసంజ్ఞ చేసింది. "లి"గాడు ఆమెవెనకనే బంటు అయి నడుస్తు న్నాడు. ఆమె ముందు బారి తీస్తూ వుంది. నడుమనడుమ సైడ్డురోడ్లకు, సందుగొందుల్లోకి బ్యాటరీలైటు వేస్తూవుంది.

"నీవు తాగుతావా?" అంది ఊరికేనే "లి"గాణ్ణి పలకరిస్తూ ఆస్త్రీ వ్యక్తి ఒకచోట ఆనడకలో. "నేను తాగనమ్మా!" అని అప్రయత్నంగా బొంకేశాడు "లి"గాడు. ఆమె "నా

భర్త తాగుతాడు. ఈరోడ్డుపక్కనో ఆగట్టుకిందో పడిపోతూ వుంటాడు. కనిపెట్టిచూడు. నివ్వూను" అంది. అంటూ బ్యాటరీలైటు ఆర్పివేసింది. ఆకాశంకేసి చూసింది. "ఓస్టారు్స ! ఓక్లొడ్సు !" అని కళ్లమ్మట నీళ్లెట్టు కుంది.

దూరాన్నే "బ్లెడీహుం! హాంగర్" అని వినిపించింది. "అక్కడ నాపెనిమిటి వున్నాడురా! త్వరగా రా!" అని తాడిచెట్టు ప్రమాణానికి ఎగసే తన బ్యాటరీలైటు కాంతిని నేలబారుగా ఆమాట వినిపించిన దిక్కుకు వేసికుంటూ నడవసాగింది. వెళ్లినకొద్దీ చూపులో మనిషి, మనిషిలో తనమగనిపోలిక కనిపించింది. "ఓ మై గాడ్ ! అతడే నాడియర్ ఎలూఫ్" అని వేగంగా డాసి ఆచెట్టుకు నిర్బంధితుడైయున్న వానికట్టు విప్పింది. బ్యాటరీలైటు ముఖం మీదకి వేసి చూసింది. తనముఖం నికి చూపింది. వారిద్దరూ ఎలూఫ్ దంపతులు !

"ఈలా నిన్ను ఎవరు అవమానించినారు ?" అనిఅడిగింది మిసెస్సు ఎలూఫ్—"నేను నామొగుణ్ణి! పోయే నాపరతా!" అంది "లి"కత్తెసగం సగంలేస్తూ పక్కలో పండుకొన్న బిడ్డణ్ణి వొత్తిగించుకుంటూ.—మిసెస్సుఎలూఫ్ "నీమొగుడెవరు?" అని బ్యాటరీలైటు "లి"కత్తెముఖమ్మీదికి వేసింది. "అది నాపెళ్లాం" అన్నాడు "లి"గాడు. "ఆబిడ్డడు?" అంది మిసెస్సు ఎలూఫ్. "మాపిల్లడేనమ్మ!" అంది "లి"గాని అంగన.

"నీభర్త తాగడు మిక్కిలి మంచివాడు." అంది మిసెస్ఎలూఫ్. "ఏంరా ? తాగుడికి కాదంట్రా పోయిందీపొద్దునివ్వు?" అంది "లి"కత్తె. "లి"గాడు, "కమ్మనిరొట్టెట్టారే అమ్మగారు. కల్లులొట్ట యిక సెల్లే!" అన్నాడు. మిస్టర్ ఎలూఫ్ తెలివిని బడ్డాడేమో ఊరికేసిగ్గుపోతున్నాడు. మిసెస్ఎలూఫ్ "లి"గానితో "కూలీ! నామగనిని నాతోకూడా ఇంటికి జాగర్తగా తీసికొస్తివా నీకోరూపాయఇస్తాను" అంది. "అక్కర్లేదమ్మా కుసంతగంజితాగితే దొరగారికి నడకబ్బుద్ది." అంటూ "లి"కత్తె తన మగనికోసమని ముంతలోసెట్టివుంచిన చప్పనిచలిగంజి తెచ్చి మిస్టర్ ఎలూఫ్ ముందుపెట్టింది. మిస్టర్ ఎలూఫ్ గడగడా బెస్ట్ కాఫీలాగు ఆగంజి తాగి "థాంక్సు" అన్నాడు.

ఉషఃకాంతులు చిరునవ్వు నవ్వినాయి. పగటిపూటా అది ? ఎవ్వాని జీవితగ్రంథంలోనూ క్రొత్తపుట అది ?



# సీజరుపెళ్లం నేరం చెయ్యదు

మొసలికంటి సంజీవరావు

★

"సీజరుపెళ్లం నేరం చెయ్యదు : సీజరుపెళ్లాన్ని శంకించకూడదు."— అని సీజరు చెప్పేడు. చాలా గంభీరంగా చెప్పేడు. కాని, విషయం తరిస్తే, చాలా జాలివేస్తుంది. సీజరు జగదేకవీరుడు ; మహా మేధావి ; మహాగర్వి. కాని, లోకాన్నిజయించి మనోహర కీర్తి రమాక్రాంతుడైన జగజ్జెట్టి తన కాంతచేత వంచింపబడ్డాడు. అతడు భార్యసంగతి వీరపురుషోచితంగా విస్మరించి చత్రాయిలాగ ఊరుకొన్నా, అతని మిత్రులు మాత్రం ఊరుకోలేదు. అతనిగౌరవ మర్యాదలు దక్కించాలని సీజరును రచ్చకీడ్చేరు. అప్పుడే చెప్పే డతడు గంభీరంగా— "సీజరు పెళ్లం నేరంచెయ్యదు"...*అని

భర్తృ వంచనచేసిన సీజరు భార్య పేరు 'పాంపేయా.' ఈవిడ మూడో పెళ్లాం. సీజరు ప్రథమ వివాహం బాల్యాన్నే అయింది. కాబట్టి మోహంలేక, పునస్సంధానం కాకుండానే ఆపిల్లను వదలేసేడు సీజరు. ఒకపెద్దయింటి పడుచును వెంటనే అతను పెళ్లాడేడు. ఆమెపేరు కార్నీలియా ; సాధ్వి. కాని, ఈ వివాహంవల్ల సీజరుకు చాలాచిక్కులు తటస్థించేయి. అప్పుడు రోమను సామ్రాజ్యాన్ని శాసిస్తూన్న 'సల్లా' అనే మహనీయునికి సీజరు వివాహం నచ్చలేదు. సీజరు అప్పటికి పిన్నవాడు : ఇరవై యేండ్లవాడు. కాని, ముందుముందు మహాపురుష డౌతాడని సల్లా కనిపెట్టేడు. అలాంటి వాడికి తన బంధువర్గంలో ఒకపిల్లను ఇద్దామని సంకల్పించి, సీజరుపెళ్లాడిన కాంతను వదలెయ్యమని పట్టుపట్టేడు సల్లా. కాని, సీజరు అంగీకరించలేదు. 'పాంపే' అనే మహావీరున్నికూడా ఇలాగే సల్లా నిర్బంధించేడు: అతను మానాభిమానాలు చంకొని అలాగే చేసేడు. పౌరుషవంతుడైన సీజరు మాత్రం నిర్భయంగా ధిక్కరించేడు. సామ్రాజ్యచక్రాన్ని తిప్పుచున్న సల్లా క్రుద్ధుడై సీజరును ఉద్యోగ భ్రష్టున్నిచేసి, అతనిభాగ్యాన్ని, అతనిభార్యా భాగ్యాన్నికూడా అపహరించేడు. సీజరు దేశంలో ఉండలేక దేశాంతరంపోయి, సల్లా మరణించేక తిరిగి రాజధానికి వచ్చి, పోయిన ఉద్యోగభాగ్యాలు సంపాదించుకొని, కొంతకాలము పెళ్లాంతో సుఖంగా కాపురంచేసేడు. కాని, ఆ యిల్లాలు అర్ధాయుష్మంతురాలు. ఆమెకొఱకు సీజరు చాలా పరితపించేడు. బహిరంగ ప్రదేశాన్ని ఆవిడగుణాలు ప్రశంసించి, తనదురంత విషాదాన్ని వ్యక్తముచేసేడు. నిజంగా సీజరు ఎంత విచారించినా విచారించవలసిందే. ఏమంటే,— తరువాత కట్టుకొన్నభార్య గత కళత్ర శీలాన్నీ, సీజరువిషాదాన్నీ ఎంతన్నా వృద్ధి చేసింది.

సీజరు మంచికాలంలో ఉన్నాడు: నిత్యం మహావిజయాలు పొందుచూ, కీర్తి భాగ్యం, వైభవం గడిస్తున్నాడు. [illegible] సౌభాగ్యానికి పరమావధి పెళ్లామేకదా. కనుక, చూసిచూసి, పాంపేయా అనేకాంతను వివాహమాడేడు. ఆమె దొడ్డయింటిబిడ్డ : సల్లామేనకోడలు. మంచి యౌవ్వనము : మంచి సౌందర్యము. తను చాలా సుఖపడుతానని మహామురిసిపోయేడు సీజరు. కాని, ఆ మోహనాంగి పాతివ్రత్యం అంటే యేమిటో యెరుగదనీ, స్వైరిణి అనీ తెలుసుకోలేకపోయేడు. ఎలా తెలుస్తుంది ?

ఆమె కటాక్షానికి పాత్రుడైన వారిలో ఒకడు 'క్లాడియసు.' ఇతడు కులీనుడు, పడుచువాడు, మంచి రూపురేఖ విలాసాలు కలవాడు ; ఎదుటివారిని ఆకర్షించే—ముఖ్యంగా స్త్రీలని ఆకర్షించేతెలివి, మాటలలో నేర్పు, ప్రసంగంలో చాతుర్యం, సంభాషణలో ప్రావీణ్యం కలిగిన రసజ్ఞుడు, ఔదార్యం పరోపకారబుద్ధిలేని వాడుకాడు; కాని మనస్సుకట్టుకోలేని చపలుడు: స్త్రీలోలుడు, కామాంధుడు, ఏస్త్రీఐనా సరే— స్నేహం, బంధుత్వం, వావీ వరుసా పాటించని ఉన్మత్తుడు, అఘోరమైన అవినీతి పరుడు.

అ లాంటి విట రాయణ్ణి మోహించింది సీజరుపెళ్లాం. కాని, ఆయిల్లాలికి గొప్పవిఘాతం దాపురించింది. మగనివల్ల ఇబ్బందికలగలేదు. అనర్గళమైన బాహుబలం చేత, నిర్వక్రమైన పరాక్రమంచేత, దేశదేశాలు జయించి కీర్తికాంతను చేపట్టే నిత్యశోభనరాయడికి పెళ్లాన్ని కనిపెట్టడానికి అవకాశమెక్కడ? కాని సీజరుతల్లిమాత్రం నిప్పులాంటి మనిషి: అఖండమైన ధీమంతురాలు. తనకోడలి పోకడలు కనిపెట్టి సహస్ర

---

* cf. "Caesar's wife ought to be exempt not only from, crime but from suspicion also".

నయనాలతో కాచుకొని తిరగడం ఆరంభించింది. సీడలాగ, అంగరక్షకు రాలు ాగ, శృంఖలంలాగ నిత్యం అంటిపెట్టుకొని ఉండేది. తనమనో హరుని దగ్గరికి వెళ్లడానికిగాని,ఇంటికి అతన్ని రప్పించు కోడానికి గాని,వీలు లేకపోయింది. చివరకు, పరస్పరం చూసుకోడమే దుర్లభ మయింది. కాని,అంతమాత్రాన్ని అంతరించేది కాదు వారిమోహం. వారిమోహం పెన్నిసుబంతి లాంటిది: స్టీలుస్ప్రింగు లాంటిది.

కామదేవత కాముకులకి అవకా శాలు కల్పిస్తూఉంటుంది. అదృష్ట వంతులైతే, తమ మనోరథాలు ఈ డేర్చుకొని, కామదేవతనే పరమదై వంగా చూసుకొని, తమజన్మ తరిం చిందని బ్రహ్మానందం పొందుతారు. దురదృష్టవంతులైతే, భగ్నహృ దయు లౌతారు.

రెండువేల సంవత్సరాలక్రిందట దిగంతాలపర్యంతం వ్యాపించిన మహాసామ్రాజ్యానికి రాజధాని రోమునగరము. నాడు పాశ్చాత్య లెకింగిన ప్రపంచానికి రోముమహా పట్టణము రాజధానియైనట్లే సకల భోగభాగ్యాలకూ కూడా రాజ ధానియై, దేవేంద్రుని రాజధానితో తులతూగుతూ ఉంది. అనేకమైన ఉత్సవాలు, వేడుకలు, వైభవాలు, జాతర్లు, యజ్ఞాలు నిత్యం జరుగుతూ ఉండేవి.

ప్రతి సంవత్సరం ధర్మదేవతా యజ్ఞం జరిగేది. ఆ యజ్ఞం 'కన్సలు' అనే నగరాధ్యక్షుడు చెయ్యాలి. అతడు దేశాంతరాన్ని ఉంటే 'ప్రే టరు' అనే ఉపాధ్యక్షుడు అధ్వర్యం వహించాలి. అధ్యక్షుడైనా ఉపా ధ్యక్షుడైనా తన భవనంలోనే ఆ యజ్ఞం చేయించాలి. నిజంగా చేసేది అధ్యక్షుడూ కాదు, ఉపాధ్యక్షుడూ కాదు: అతనిభార్యో, ఇతనిభార్యో చెయ్యాలి. ఉత్సవం చేసేవారు, చూసేవారు, ఆనందించేవారు స్త్రీలే. పురుషులకు ఎంతమాత్రం ప్రవేశం లేదు. పురుషులనే కాదు - పురు షుల్ని పోలిన స్త్రీలని కూడా రానివ్వరు. గృహమేధి కూడా ఆ రాత్రి యింట్లో ఉండడు.

ఆ యజ్ఞం మహా పవిత్రవంత మైంది. వైభవానికి లోపం లేదు. సామ్రాజ్యాధికారులు పూనుకొన్న ప్పుడు వైభవానికి కొదవా? కాని, ఒక్క విశేషం. ఆ సమయాన్ని శృంగారానికి ఏమాత్రం అవకాశం లేదు. శృంగారరసం స్ఫురించే వస్త్ర ధారణమైనా స్త్రీలు చేసుకోకూ డదు. కాని, మోహార్ణవంలో మునిగి సమయం నిరీక్షించే కాముకీకా ముకులు నియమాలు పాటిస్తారా? ధూర్తమే కాని, అపాయం సంభవిస్తుం దని సంశయిస్తారా?

సీజరు ఉపాధ్యక్షుడు.సీజరుభవనం లోనే యజ్ఞోత్సవం. రాత్రిఅయింది. సీజరుమందిరము స్వర్గంలాగ మెరిసి పోతున్నాది. స్త్రీలందరూ వచ్చేరు. కరదీపికా సహస్రాలతోటి భవనము దేదీప్యమానంగా ఉంది. మెరుపుల లాంటి మెరుగుబోడులు మన్మథ బాణాలలాగ చకచక తిరుగుతున్నా రు. చుక్కలమధ్య చంద్రబింబము లాగ సీజరుభార్య యజ్ఞోత్సవాధ్వ ర్యం వహించి కూర్చుంది. కాని మనస్సుమాత్రం అక్కడలేదు. తన ప్రియుడువచ్చి చూడకపోతే ఆవైభవ మంతా వ్యర్థ మనిపించింది. తన మనోహరుడు ఎప్పుడు వస్తాడో అని నిరీక్షిస్తున్నాది : నిరపాయంగా వస్తా డాఅని దిగులు పడుతున్నాది ; దాసీ చాలా తెలివయింది, ఏమీ ప్రమా దంలేదని అనునయించుకొంటుంది. యజ్ఞోత్సవం ఎప్పుడు ఐపోతుందా, చూడవచ్చినవా ళ్లంతా ఎప్పుడు వదలిపోతారా, ఎప్పుడు ప్రియసమా గమమహానందం చూరకొంటానా అని ఆయిల్లాలు — పవిత్రయజ్ఞాని కధ్వర్యం వహించిన సీజరుపెళ్లాం ఉవ్విళ్లూరుతూంది.

పరిజను లందరూ యజ్ఞంగురిం చిన ప్రయత్నాలలో ఉంటే, సీజరు పెళ్లాం తనప్రయత్నంలో ఉంది. మగపురుగుకైనా ప్రవేశంలేని ఆ రాత్రే తనవిటుణ్ణి రప్పించా లని నిశ్చయించింది సీజరుపెళ్లాం. ఆమె ప్రియుడుకూడా తగినవాడే గనుక, వాడూ సిద్ధపడ్డాడు. పురుషులు రాకూడదంటే, స్త్రీవేషం వేసుకొని ప్రవేశించా లని సంసిద్ధు డయ్యేడు. యౌవనంలో ఉండడంచేతా, అంద కాడు కావడంచేతా, పొడవరి కాక పోడంచేతా వేషం బాగా కుదిరింది. ఇలాంటి వ్యాపారాలకి సంధానం చేసేవారు కావాలి. తనదొరసాని మీద విశేషాభిమానంగల ఒకపరి చారిక ఇద్దరిమధ్య రహస్య రాయ బారాలు నడిపి చాలాకష్టపడి ఇద్దరి కృతజ్ఞతకు పాత్రురాలయింది.ఆరసిక శిఖామణి వనితారూంపతో సీజరు భవనానికి వచ్చినప్పుడు ఆదూతిక హాజారంలో ఉండి, అతిథిస్త్రీని ఆహ్వా నించినట్లే అతన్ని కూడా ఆహ్వా నించి, తిన్నగా తనగదిలోకి తీసు కువెళ్లి, తన దొరసాని వచ్చేవరకూ అక్కడ ఉండమని ఉపదేశించి వెళ్లి

పోయింది. విటరాయడు చాలా సంతోషించేడు. ఆయిల్లాలుకూడా పరమానందం పొందింది.

అంతవరకు పన్నుగడ బాగానే సాగింది. యజ్ఞోత్సవం పూర్తి అయే లోపున తనప్రియుణ్ణి ఒక్కసారి చూసి పోదామని ప్రయత్నించింది సీజరు పెళ్లాం. కాని, ఎడతెరిపిలేని యజ్ఞోత్సవ కార్యకలాపము: నేల యీనినట్లు తండోపతండాలుగా వచ్చే అతిథి స్త్రీలు :—ఎలాగ వీలౌతుంది? అందరి స్త్రీలలాగ తను కూడా కొల్వుకూటానికి వెళ్లి, ఉత్సవాన్ని ఉత్సవాధ్వర్యం వహించిన ప్రియురాలిని చూడ్డానికి ధైర్యం చాలిందికాదు విటరాయడికి. కాని, గదిలో ఎంతసేపు కూర్చున్నా ప్రియురాలు రాదు: పరిచారికైనా రాలేదు. ఏమీ తోచింది కాదు. మనస్సు పరిపరివిధాల పోయింది. ఇక గదిలో ఉండ లేకపోయేడు. ఒక్కమాటు తిరిగి వద్దా మనుకున్నాడు. కాని, ఒక ఉద్దేశం లేదు, ఒక లక్ష్యం లేదు, ఒక గమ్యస్థానం లేదు. విటరాయడు చాలా తెలివైన వాడే, కాని, సమయానికి తెలివి తెల్లవారింది. మనస్సు ఒక్కమాటు ఆలోచనలతో సంకులమైపోయింది: తరువాత శూన్యం. గదిలోంచి పైకి వచ్చేడు కాని నలుగురిలాగ భాటాగా చకచక తిరగలేకపోయేడు. ఎవ్వరైనా తారసిల్లుతే, తప్పుకుంటాడు. దీపకాంతిని తప్పించుకుంటాడు : క్రీనీడనే తిరుగుతాడు. ఆవైఖరి ఒక పరిచారిక కనిపెట్టింది. తన దొరసానికి అహితం చెయ్యాలని కాదు కాని ఆస్త్రీ ఎందు కలాగ తిరుగుతూందో కనుక్కోవాలని దగ్గరికి వెళ్లి, "అమ్మా! న వ్వెవరు? ఏమిటి కావాలి? ఎవరుకావాలి?" అని ప్రశ్నించింది ఆదాసి. విటరాయని గాంభీర్యం మంచులాగ మాయమయింది: గుండె జల్లుమంది: శరీరం సీరైపోయింది. మాట పెగలదు. "ఆబ్రా"* కోసం చూస్తున్నా"నని ఎలాగో చెప్పేడు గాబ్రాగాను. జవాబు చెప్పేడుకాని దొరికిపోయేడు. వెంటనే మాట్లాడక పోవడం, ఆ తొట్రుపాటూ చూడగానే ఆదాసి అనుమానించి, నిదానించి, చూసింది. కంఠం స్త్రీకంఠంకాదు: మూర్తి స్త్రీమూర్తి కంటె పొడవు. ఆడదికాదని గ్రహించి "ఎవ్వడో స్త్రీ వేషంతో చొరబడ్డాడు: రండి, రండి! పట్టుకోండి!" అని గగ్గోలు పెట్టింది. యజ్ఞోత్సవం ఆగిపోయింది: భవనంలో హాహాకారాలు పుట్టేయి: అందరూ కంగారుగా తిరుగుతున్నారు.

వెంటనే యథార్థము గ్రహించిందిసీజరుపెళ్లాం. ఆమహాసందడిలో అందరిని తప్పించుకొని, కంగారుగా తిరుగుతూన్న ప్రియుణ్ణి పట్టుకొని, ఆబ్రా గదిలోకే మళ్లాతీసుకువెళ్లింది. ఆపాటి ఓర్పూ నేర్పూ వివేకమూ లేకుండా ఎందుకు తొందరపడ్డావని మందలించి, అంతరాయం కలిగినందుకు చాలా విచారించింది. కాని, అక్కడ అట్టేఉండడానికి వీలులేదు : ప్రమాదముకూడాను. కాబట్టి, జాగ్రత్తగా ఉండమని ప్రియుణ్ణిగట్టిగా హెచ్చరించి సీజరుదొరసాని వెళ్లిపోయింది.

యజ్ఞోత్సవం చూడవచ్చిన స్త్రీలంతా ఒకరిని ఒకరు చూసుకొన్నారు కోపంగా, పరిశీలనగాను. కాని, అందరూ స్త్రీలే. అందరూ కిలకిలనవ్వుకొన్నారు. పరిచారిక పొరపడిందని కొందరన్నారు. ఉత్సవం నిలిచిపోయినందుకు విచారించేరు. ఆ కలవరం చల్లారేక, చూడ వచ్చినవాళ్లంతా వెళ్లిపోయేక, అత్తగారు పడుకొన్నాక, ప్రియుడి దగ్గరికి వద్దామనుకుంది సీజరుపెళ్లాం. ప్రియురాలు తప్పకుండా వస్తుం దని ఆశోత్కంఠంతో కూర్చున్నాడు. కాని, విధి అన్యథా నిర్దేశిస్తే, విటుల ప్రయత్నాలు ఎలాగ సఫల మౌతాయి?

సీజరు తల్లికి ఎక్కడలేని కోపం వచ్చింది. పవిత్రమైన యజ్ఞోత్సవము భగ్న మైపోయిందని మండిపడింది. ఎవ్వడో మదనోన్మత్తుడాలాగ ధూర్తంగా దుర్మార్గంగా మోసంచేయడంవల్ల ఆమహామానవతికి తలవంపు ఘటిల్లింది. కోడలు నిశ్చలంగా ఉండడం చూస్తే అనుమానం వేసింది. క్రోధానుమాన సంతప్తహృదయురాలైన సీజరుజనయిత్రి పరిచారికాసహస్రాన్ని వెంటనేపిలిచి, వీధితలుపులు మూయించి, కాగడాలు పట్టుకొని మూలమూలలు శోధించి ఆధూర్త ద్రోహిని పట్టితెమ్మని ఆజ్ఞాపించింది. ముందూ వెనకా కాగడాలు వేయించుకొని తనుకూడా పులిలాగ తిరిగింది. చివరకు ధూర్తవిటరాయడు దొరికిపోయేడు. సరసానికి వచ్చిన ధూర్తవిటరాయడు అఖిల సుందరీజన సమక్షాన దుర్భరమైన అవమానాన్ని పొంది, మానంపోయిన ప్రాణంతో ఇల్లుచేరుకొన్నాడు.

---

*ఆబ్రా:—సీజరు పెళ్లానికీ విటరాయడికీ సంధానం చేసిన దాసి పేరు.

మరునాడు రాజధానిఅంతా ఇదే ప్రసంగం. యజ్ఞోత్సవానికి వెళ్లినకాంతలు ఇళ్లకు వెళ్లి తమకాంతులతో చెప్పేరు. సీజరుమందిరానికి వెళ్లని ఆడుది లేదు: విటరాయడు చేసిన ఘోరద్రోహం తెలియని మగవాడు లేడు. తెల్లవారగానే ఊరంతా గుప్పుమంది.

విటరాయడు చేసింది మహాఘోరనేరం సీజరుకు జరిగిన అవమానం సీజరు అనే వ్యక్తికి కాదు. సామ్రాజ్యప్రభుత్వపక్షాన్ని ప్రతిసంవత్సరం నిరాఘాటంగా జరిగే పవిత్రయజ్ఞోత్సవము భంగపడిందంటే, ప్రభుత్వానికి ఘోరాపరాధం చేసేడన్నమాట విటరాయడు. అంతటిఘోరం ఎన్నడూ జరగలేదు. ఆపవిత్రోత్సవానికి ఎన్నడూ అంతరాయం రాలేదు. కాబట్టి విటరాయడు కులీనుడైనా ఎంతమాత్రం క్షంతవ్యుడు కాడని 'ట్రిబ్యూను' అనే ఉన్నతప్రభుత్వాధికారి పట్టుపట్టి విటరాయడి మీద అభియోగము తెచ్చేడు.

విటరాయడు అంతమాత్రాన్ని మెత్తపడలేదు. తను చేసింది మహాపరాధమనీ తెలుసును: తను తప్పకుండా శిక్షార్హుడనీ తెలుసును. కాబట్టి అపాయమునుండి తప్పించుకోడానికి విపరీతమైన ఉపాయమాలోచించేడు. తను ఆరోజున రాజధానిలో లేనని వాదించేడు. కాని సాక్ష్యం కిట్టింది కాదు. సాక్షిబలం చాలిందికాదు. అతడు రాజధానిలో ఉన్నాడని సాక్ష్యం ప్రబలంగా వచ్చింది. అందులో, సిసరో అనే మహనీయుని సాక్ష్యం విటరాయడికొంపముంచింది.

సామ్రాజ్యాన్ని శాసించే సినేటు సభ్యులలో సిసరో ఒకడు. అత్యున్నతమైన ఉద్యోగాలు కూడా చేసేడు. మహామేధావి: గొప్పవక్త: అనర్గళమైన వాగ్ధాటి కలవాడు: ధర్మజ్ఞుడని పేరుపడ్డాడు. ఇలాగ అనేకవిధాల ప్రతిష్ఠాగరిష్ఠుడైన సిసరోసాక్ష్యం విటరాయడి కొంపముంచింది. సిసిరో అంతద్రోహం చేస్తాడని అతడు అనుకోలేదు. ఏమంటే, విటరాయడు అతనికి అనేకమైన ఉపకారాలు చేసేడు. అతడు మిత్రుడనీ కృతజ్ఞుడై ఉంటాడనీ విటరాయడు నమ్మేడు. కాని, ఇలాగ కృతఘ్నుడౌతాడని కలలోనూ అనుకోలేదు. తన మిత్రుడు సాక్ష్యానికి రాగానే తనపక్షమే చెప్పతాడని సంబరపడ్డాడు విటరాయడు. కాని, సిసరో యథార్థం చెప్పేసి విటరాయడికి మహాపకారం చేసేడు.

సిసరో సత్యసంధుడు కావచ్చును కాని, ఉపకారికి అపకారం చెయ్యడం శోచనీయం. ఉపకారం చెయ్యడం మానిపోయి: సాక్ష్యానికి రాకుండా తప్పుకుంటే తీరిపోను. ఐతే, సాక్ష్యం ఇవ్వక తప్పిందికాదు: యథార్థం చెప్పకా తప్పిందికాదు.. ఇది కథలో చిత్రకథ.

విటరాయడికి ఒకసోదరి* ఉంది. ఆమెమగడు పేరుప్రతిష్ఠ లున్నవాడే. కాని, ఆవిడ రూపంలోను గుణాలలోను నిజంగా విటరాయనిసోదరే:- సోదరుడు విటరాయడు: సోదరి విటరాణి. సిసిరో యొక్క ప్రతిభావిశేషాన్ని, అతని అధికార గౌరవాన్ని, అతను సర్వజన మూర్ధాభిషిక్తుడై ఉండడంచూచి, వలచి, అతన్ని ఏకంగా పెళ్లాడుదామనే తలపెట్టింది విటరాయనిసోదరి. కాని, సిసరో బ్రహ్మచారి కాడు: భార్యారహితుడు కాడు. అతని పెళ్లాంచడిక్కట్టి మండిపడింది. తాచుపాములాగ కసితీర్చుకోవాలని కనిపెట్టుకొంది. విటరాయడు కామాంధుడై పవిత్ర యజ్ఞోత్సవాన్ని కళంకపరిచి, అభియోగానికి పాత్రుడుకావడం తటస్థమయింది. వానిసోదరి తనకు మహాద్రోహం చెయ్యడానికి తలపెట్టినందుకు విటరాయణ్ణి హతమార్చెయ్యాలని సక్రోధంగా నిశ్చయించి. న్యాయస్థానానికి వెళ్లి యథార్థం చెప్పాలని మగణ్ణి బలాత్కారం చేసింది. ఆలిపోరు దుర్భరమైపోయింది. అనేకోపకారాలు చేసిన మిత్రుణ్ణి రక్షించలేకపోవడమే కాకుండా, అతని నేరాన్ని స్థిరపరిచేసాక్ష్యం చెప్పక తప్పిందికాదు. స్నేహం కృతజ్ఞతాపాటిస్తే, ఇంట్లో కాలుపెట్టే ఆస్కారంలేదు. కాబట్టి, ధర్మవేత్త యథార్థం చెప్పేడు. విటరాయడు నిర్ఘాంత పోయేడు.

విటరాయడికి విరుద్ధంగా సాక్ష్యం ఇచ్చింది ఈ మిత్రుడొక్కడే కాదు; అతడి బావమరది కూడా అలాగే చేసేడు. తనపెళ్లాంబాధ భరించలేక సిసరో సాక్ష్యమిస్తే, తనకు జరిగిన ఘోరావమానం భరింపలేక సాక్ష్యం ఇప్పించేడు విటరాయడిబావ. విటరాయడు వావీవరసా లెక్కచేయని అధమాధమజారుడని ముందుచెప్పేంగదా. తన సోదరిశీలాన్ని కూడా ధ్వంసంచేసేడు. ఆమెమగడు దుర్భరమైన రోషావమానాలతో మండి

*ఆమెపేరు క్లాడియా: ఆమె మగనిపేరు లుసలసు.

పోతున్నాడు. సమయం వచ్చింది. తన పరిచారికచేత సాక్ష్యం చెప్పించేడు.

ఈవిధంగా విటరాయడినేరం సిద్ధపడింది. శిక్షమాత్రం తప్పించుకొన్నాడు. విటరాయడు కులీనుడు. తమలాంటి కులీనుడు నేరంచేసినా శిక్షింపబడడం కొందఱు కులీనులు సహించలేకపోయేరు. వారందరిలో నులత్యంతధనవంతుడైన 'క్రాసస్సు' తనమిత్రుణ్ణి ఉద్ధరించాలని పట్టుపట్టి, సినేటుసభ్యులని, అధికారులని, విచారణకర్తలనీకూడా గుండకొట్టేడు. ధర్మం ధ్వంసమయింది: విటరాయడు విముక్తుడయేడు.

ఈ సందర్భంలో ఒకవిషయం ముఖ్యంగా గమనించాలి. ఘోరావమానం పొందినవాడు సీజరు అయినప్పటికీ, ఆ మహావీరుడేమీ మాటాడలేదు. చెయ్యవలసిన పనిమాత్రం చేసివేసి, అవమానం ఎవరికో అన్నట్టు గంభీరంగా ఊరుకొన్నాడు. తనభార్యసంగతి కనిపెడుతున్నాడు. ఈయజ్ఞోత్సవధర్మాన్ని ఇల్లాలిసంగతి గుప్పుమనగానే, విడాకులిచ్చి పంపించివేసేడు సీజరు. కాని, అతనిమిత్రులకి శాంతి లేకపోయింది. సీజరుయొక్క గౌరవాన్ని కాపాడాలని మిత్రులు పంతంపట్టేరు. ఇలాగ మిత్రులు ఒకప్పుడు మనకువిశేష బాధ కలిగిస్తారు-అమాయికంగాను. సీజరునిర్లక్ష్యంగా ఔదాసీన్యం వహించినా, అతన్ని సాక్ష్యానికి పిలిపించేరు. ఆ మహాపురుషుడేమిటి చెపుతాడో! అని లక్షమంది ప్రేక్షకులు వెయ్యిమందిఉద్యోగులు రెప్పవాల్చకుండా చూస్తున్నారు. సీజరు నిశ్చలంగా, నిర్వికారంగా ఉన్నాడు. అతనిగాంభీర్యం చూసి విచారణకర్తలుకూడా చకితులైపోయేరు. ఐనా, వారు తమధర్మం నెరవేర్చుకోవాలికదా. కనుక, అతనిభార్యావ్యభిచారంగురించి అతన్ని ప్రశ్నించేరు. తనకేమీ తెలియదని ప్రత్యుత్తరమిచ్చేడు. భార్యను ఎందుకువిసర్జించేవని తరువాత ప్రశ్నించేరు. అప్పుడే ఆ మహనీయు డిలాగ గంభీరంగా జబాబుచెప్పేడు.—

"సీజరుపెళ్లం నేరంచెయ్యదు:
సీజరుపెళ్లాన్ని శంకించకూడదు."

సీజరుపలుకులు ఆచంద్రార్కం నిలిచిఉన్నాయి.

---





15. 4- 9

# తెనుగురాణి

మండపాక పార్వతీశ్వరశాస్త్రి

పులిమీద పుట్రలాగు, ఈనాటికి తెలుగుకు హిందీభాష ఒకటి తగులుకొన్నది. ఈబాధ మింగడానికీ వీలు లేదు, కక్కడానికీ వీలులేదు అన్నట్లు ఉన్నది. చాళుక్యుల కాలమువరకూ సంస్కృతానికి లొంగిలొంగి, చివరకు సంస్కృతాన్నే లొంగదీసి, తలమెత్తుకొని సాటివారిలో నెరజాణమై, కొంతకాలమునకుతరువాత హిందూస్థానీకి దాస్యముచేయవలసివచ్చునేమో యని భయపడుతూ పడుతూ,చివరకు హిందూస్థానీనే స్వాధీనముచేసుకొని, తిరిగీ తలయెత్తి నాలుగుదేశాలలో రాణియై, స్వారాజ్యమై రాజ్యసామ్రాజ్యభోగాలన్నీ అనుభవించి, తెల్లవారి చేతిలో పడి నలిగి, వాడి, ఎండి, చిన్న పెద్ద సూదుల అటూయిటూ రగడాయింపులలో చితికి, తొలకరిచినుకులకు చిగిరించి, వేదజయంతుల గాలివానలలో పేరుమాసిపోకుండా గిడుగు చాటుచేసుకొని,తుక్కుదులుపుకొని, క్రొత్త ముస్తాబుతో కన్నులపండువుగా కనబడుతూ వున్న ఈ తెలుగుకు, ఈనాటికి హిందీబాధ తగులుకొన్నది. సంస్కృతాన్ని లొంగదీసుకొన్న తెలుగు,హిందూస్థానీని స్వాధీనముచేసుకొన్న తెలుగు - హిందీకి దాస్యముచేయక తప్పదన్నట్లు కనబడుతూవున్నది.

రెండువేలయేండ్లక్రిందట కణ్వబృహస్పతులకాలంలో, ఆ సేతుహిమాచలం ఆంధ్రులప్రతిభ వెలుగుతూ ఉన్నప్పుడు వ్యాకరణం తెలుగుకు పుట్టింది. అయితే ఏమిలాభం? తెలుగువ్యాకరణం సంస్కృతంలోనే నేర్చుకోవా లన్నారు ఆనాటిపండితులు. తెలుగున కవిత్వం ఆనాడు చెప్పినకవులు తెలుగుకవులే అయినారు. తెలుగువ్యాకరణం రచించవలసిన పండితులు సంస్కృతపండితులే అయినారు. రాజాస్థానాలలో సంస్కృతపండితులకే ప్రవేశం. తెలుగుసంప్రదాయాలు స్థూలంగా తెలుసుకోవడమే సంస్కృతపండితులకు ప్రయోజనం. కాబట్టి తెలుగుకు వ్యాకరణాలు లఘువుగా సంస్కృతంలోనే, వ్రాయవలసి వచ్చింది. రాజులకు సంస్కృతకవిత్వమే కాని తెలుగుకవిత్వము అక్కరలేనందున తెలుగుకవిత్వం ఆస్థానాలలోకి వెళ్లలేదు. అయితే, క్రమక్రమముగా తెలుగుఛందస్సులలో, తెలుగువృత్తాలలో ఉన్న తెలుగుకవిత్వం సంస్కృతఛందస్సులతో, సంస్కృతవృత్తాలతో కలగాపులగం కావడం ఆరంభించింది. ఉదాహరణాలు, యక్షగానాలు తెలుగుకవుల చేతులలో నుంచి సంస్కృతపండితుల చేతులలోకి వచ్చినవి. తెలుగుకవిత్వం రాజశాసనాలలోకి ఎక్కింది. రాజాస్థానముల పొదికట్టుకు తెలుగు కవిత్వం వెళ్లిం దన్నమాట. పొదికట్టున కనిపెట్టుకొని ఉన్న తెనుగుకవిత్వాన్ని నన్నయభట్టుగారు చిత్తగించినారు. బలే-బాగుందన్నారు. "స్వస్థానవేషభాషాభిమతాస్సంతో రసప్రలుబ్ధధియః లోకే బహుమన్యంతే వైకృతికావ్యాని సౌన్యా దపహాయ" అని ఆలోచించినారు. "రా, నాతో రా" అని తెలుగుకవిత్వాన్ని రాజాస్థానలోకి తీసుకొని వెళ్లినారు. రాజుగారప్పుడేమిచేస్తూ వున్నారంటే, "బహుభాషల బహువిధముల, బహుజనములవలన వినుచు భారతబద్ధస్పృహు"లై ఉన్నారు.

ఏలినవారు మా మనవికూడా కొంచెం చిత్తగించా లన్నారు భట్టుగారు. "తెనుగుకవిత్వమేనా" అన్నారు మహారాజావారు. 'చిత్తం' అన్నారు భట్టుగారు. "అయితే,

................ అస్మదీయ వంశమునఁ బ్రసిద్ధులై విమలసద్గుణశోభితులైన పాండవోత్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్టమెమ్మెయిన్.

కాబట్టి, మహాభారతబద్ధ నిరూపితార్థమేర్పడఁ దెనుఁగున రచియింపు మధిక ధీయుక్తిమెయిన్" అని మహారాజావా రానతిచ్చారు. భారతరచనలో భారతఘోరరణమైనది. ఛీఛీ పాడుచేశేశా డన్నారు వైదికులు. లేదు లేదన్నారు నారాయణభట్టుగారు. వేణీసంహారం రచించి జయభేరీవాయించిన నారాయణభట్టుగారి వద్ద అందరూ నోటితాళాలు బిగించుకొన్నారు. భారతరచన సాగింది. తెలుగు ఆస్థానపీఠం అలంకరించింది. అయితే తెలుగు తెలుగు వేషంతో లేదు. నబాబుల ఆస్థానాలలో ఉండిన తెలుగు ఉద్యోగస్థులు తురకవేషాలు వేసుకొన్నట్లు నేటి ఇంగ్లీషు ఉద్యోగస్థులంతా దొరలవేషాలు వేసుకొంటూ ఉన్నట్లు,నన్నయభట్టుగారు రాజాస్థానంలో తెలుగుకు సంస్కృతవేషం వేయించినారు. అలాగైతేనే

గాని సంస్కృతపండితులు సంతోషించరని కాబోలు పాపం!—

నన్నయభట్టుగారు తెలుగుకవిత్వానికి వేయించిన సంస్కృత వేషం ఇదివరకు అందరూ చూచినదే అయినా మరోమారు చికాకుపడకుండా చిత్తగించండి. ఇదిగో—

క. అమృతముతో నుద్భవమై, యమరేశ్వర
యోగ్యమైన హయరత్నము త,ద్విమలో
దధి తీరంబునఁ, గొమరుగ నేకతమ
యిచ్చఁ గ్రుమ్మరుచున్నన్,

వ. కద్రువయు, వినతయు వినోదార్థంబు విహరించువారు, కరిమకర నికరాఘాత జాత వాతోద్ధూతతుంగ తరంగాగ్ర సముచ్చలజ్జల కణాసారచ్ఛటాచ్ఛాదితగగనతలంబైన దాని, మద్యానవనంబునుంబోలె బహువిద్రుమలతాలంకృతంబైనదాని, నాటకప్రయోగంబునుంబోలె ఘనరసపాత్రశోభితరంగరమ్యంబైన దాని, దివంబునుంబోలె నహిమకరభరితంబైనదాని.

చ. అలఘు ఫణీంద్రలోక కుహ
రాంతరదీప్త మణిస్ఫురత్ప్రభా
వలి గలదాని శశ్వదుప
వాస మహావ్రత శీత పీడితా
చల మునిసౌఖ్యహేతు విల
స ద్బడబాగ్ని శిఖాచయంబులన్
వెలిఁగెడుదానిఁ గాంచి రర
విందనిభానన లమ్మహోదధిన్.

మ. వివిధోత్తుంగతరంగ ఘట్టన చల
ద్వేలావనైలావలీ
లవలీ లుంగ లవంగ సంగత లతా
లాస్యంబు వీక్షించుచున్
ధవళాక్షుల్ సని కాంచి రంత నెదురం
దత్తీర దేశంబునం
దవదాతాంబుజ ఫేనపుంజనిభు న
య్యశ్వోత్తముం దవ్వులన్.

సంస్కృత వేషంతో ఉన్న తెనుగును సంస్కృతపండితులు చూచారు, భలే-భలే-అన్నారు. ధొరవేషంతో ఉన్న తెలుగువాడికి దొరలంతా చేసినట్లు మేకుహొందు చేసినారు. ప్రక్కను కూచోపెట్టుకొన్నారు. దొరవేషంతో ఉన్నవాడికి బస్సులలో అగ్రస్థానం యిచ్చినట్లు తెలుగుకి అగ్రస్థానం ఇచ్చినారు. కేవలం సంస్కృతపండితులు "మీ తెలుగంటే ఏమిటో అనుకొన్నాం మా సంస్కృతమే నండీ" అన్నారు. గద్యపద్యాత్మకమైన చంపూప్రబంధాలు వ్రాస్తూవున్న సంస్కృత కవులు "తెలుగుకవిత్వ మంటే ఏమో అనుకొన్నాం, మా సంస్కృత కవిత్వమేనండీ" అన్నారు. 'అవునండీ అలాగే ఉంటుంది. అంతే, అంతే' అన్నారు భట్టుగారు. అయితే కొందరుమాత్రం మూతిముడిచారు. "సంస్కృతం సంస్కృతమే. ఎంతైనా గూఢంగా ఉండాలిగాని, ఈ తెలుగులో చెప్పేస్తే అంతా బట్టబయలై పోతూంది. గూఢంగా ఉండాలి గాని బయలైపోతే మాకేముంది?" అని గొణుగుకొన్నారు. చూడండి మా కాళిదాసుగారు ఏలాగు చెప్పినారో—

"అనసూయా—

అస్తి కౌశిక ఇతి కృతగోత్రనామధేయో మహాప్రభావో రాజర్షిః—పురాకిల తస్య రాజర్షేః ఉగ్రే తపసి వర్తమానస్య కిమపి జాతశంకైః దేవైః మేనకానామాప్సరా నియమవిఘ్నకారిణీ ప్రేరితా-తతో వసంతోదారసమయే తస్యా ఉన్మాదయితృకం రూపం ప్రేక్ష్య—"

అని, ఆ పైమాట చెప్పలేక సిగ్గుపడుతూ పడుతూ, నగంసగంలో నసుగుతూ ఉంటే రాజు ఆమాట అందుకొని, 'పరస్తా దవగమ్యతవేవ' అని అనసూయ చిక్కు తీర్చి [illegible] అన్నారు కాళిదాసుగారు,

"అయితే నన్నయభట్టుగారూ! మీ రేమిటండీ, ఇంత వైదికంగా చెప్పినారు—చూడండీ.

చ. అలసత యొప్పఁగాఁ దరుణి
యమ్మునివల్లభు బ్రమోళి నున్న స
మ్మిళితసుగంధబంధుర స
మీరవశంబునఁ దూలి, చాలపై
వలు వెడలన్ బయల్పడియె
వల్గుకుచంబులుఁ గక్షయుగ్మమున్
లలితకృశోదరంబుఁ దర
శత్రివళీయుతరోమరాజియున్.

ఏమిటయ్యా ఈ వర్ణన? ఇంత వైదికంగా ఎవరైనా చెప్పుకొంటారయ్యా — ఈ తెలుగుకవిత్వం ఈలాగే ఎప్పుడూ ఉంటుంది కాబోలు? అందుకే తెలుగులో కవిత్వ మేమి టని మే మన్నాం"

అని తాటించారు.

ఆమాట అందుకొని మరొకరు అన్నారుగదా — "భట్టుగారూ, ఏమిటండీ ఈ పద్యాలు?

సీ. పలుకులముద్దును, గలికిక్రొల్గన్నుల
తెలివును, వలుదచన్నులబెడంగు,
నలఘుకాంచీపదస్థలములయొప్పును
లలితాననేందుమండలము రుచియు,
నలినీలకుటిలకుంతలములకాంతియు,
నెలజవ్వనంబునవిలసనమును,
నలసభావంబును, పొలుపును, మెలపును,
గలుగు నగ్గిరికను దలఁచితలఁచి,
ముదితయందుఁ దనదుహృదయంబు నిలుపుటఁ
జేసి, రాగ మపర భాసురముగ,
రమణతో వనాంతరమున రేతఃస్కంద
మయ్యె నవనిపతికి నెయ్య మొనర.

సీ. చపలాక్షిచూపులచాడ్పున కెద మెచ్చుఁ
జిక్కనిచనుఁగవఁ జీరఁగోరు;
నన్నువకౌఁదీఁగయందంబు మది నిల్పు
జఘనచక్రంబుపైఁ జలుపు దృష్టి;
యభిలాష మేర్పడున ట్లుండఁగాఁ బల్కు
వేడ్కతో మఱుమాట వినఁగఁ దివురు;

నతిఘనలజ్జావనతయగు నక్కన్య
పైఁబడి, లజ్జయుఁ బాపఁగవలెను;

గీ. నెంతశాంతు లయ్యు నెంతజితేంద్రియు
లయ్యుఁ గడు వివిక్త మైనచోట
సతులగోష్ఠిఁ జిత్తచలన మొందుదు రెందుఁ
గామశక్తి నోర్వఁగలరె జనులు.

యథార్థం వర్ణించారు నిజమే. కాని, శుద్ధవైదికంగా చెప్తే లోకం నవ్వుకోదయ్యా!" అన్నారు.

మరొక రన్నారు——

"నన్నయభట్టుగారు అవిరళ జప హోమతత్పరులు, సంహితాభ్యాసులు అవడంచేత కేవలవైదికు లను కొంటూ ఉన్నారా? వారు లోకజ్ఞులు, మత్స్యమరాధిపాచార్యులున్నూ కూడా సుమండీ! వారికి తెలియని లౌక్యవైదికాలు ఉంటాయా? ఐతే వారు సుజనులు, సద్వినుతావదాత చరితులున్నూ, కాబట్టి యథార్థకథనంకోసం ఆలాగు చెప్పినారు. అంతేగాని వేరేమీ కాదు. వారు చెప్పినదానిలో యథార్థంకానివిషయమేమైనా ఉంటే చూపించండి." ఎవరేమనుకొన్నా సరే చాలాకాలం వరకూ, నన్నయభట్టుగారు ప్రారంభించిన తెలుగుకవిత్వం పండితలోకంలో ఆమోదం పొందలేదు. వైదికంగా ఉంటుందని. పోగా—పోగా కొంతకాలానికి ఒక నియ్యోగిపంతులుగారు ఇదంతా చూచినారు. ఆయన వైదికసంగ్రహంకూడా బాగా ఎరిగినవారు. లౌక్యవైదికాలు రెంటినీ నడిపించడానికి శక్తిసామర్థ్యాలు కలవారు పైగా కవిత్వంచెప్పడంలో ఆరితేరినవారు. వీరు నన్నయభట్టుగారి భారతం బాగా చదివి 'బలే తెలుగు కవిత్వం' అన్నారు. పైని వివరించిన పద్యాలు చూచారు. వైదికంగా బట్టబయలుగా ఉందిగాని, చాలాచాలాసుగుణాలున్నా యన్నారు. సముద్రవర్ణన వింటూవుంటే సముద్రం ఎదురుగా కనిపిస్తూ ఉందన్నారు. దేవతాశ్వంలో దేవత్వం కనిపిస్తూ ఉందన్నారు. సముద్రప్రాంతాలలోని ఉద్యానవనం మనోహరంగా ఉందన్నారు. ఆసముద్రం-ఆప్రాంతంలో ఉద్యానం—అక్కడ మేస్తూవుండే గుఱ్ఱం— అక్కడికి వినోదానికి వెళ్లిన స్త్రీలు—ఈ దృశ్యం చాలా అద్భుతంగా వుంది. అయితే సంస్కృత వేషం—ఛాందసం—ఇవి మాత్రం లోపాలుగా ఉన్నవి. ఈ లోపాలు తప్పించి, తెలుగు వేషం వేయించి, తెలుగుదృశ్యం చూపించి, లౌక్యంగా, అరచాటుదనం కలిగిస్తే, సంస్కృతకవిత్వాన్ని మింగేస్తూ ఉంటుంది తెనుగుకవిత్వం అనుకొన్నారు.

శ్లో. యంత్రాకృష్టసువర్ణసూత్రమివ య
త్పద్యం సుమేరోస్తటాత్
ప్రోన్మీలత్ కురువిందకందళ ఇవ
స్వచ్ఛః పదార్థోదయః,
శ్రోత్రాఫుల్లదంశుకాంతర లస
త్కాంతాకుచాంతోపమ
వ్యంగ్యం యత్తదహో, కవిత్వ మితర
ద్వ్యాఖ్యేవతోపద్రవః.

అన్నారుగదా పెద్దలు. నేను ఆ మాదిరిగా చెప్పి తెలుగుకవిత్వానికి గౌరవం కలిగిస్తాను. నన్నయభట్టుగారు కవిత్వాన్ని రాజాస్థానానికి ఎక్కించినారు గాని, 'సుకవితా యద్యస్తి రాజ్యేనకిం' అన్నమాట ఆలోచించినారు కారు. రాజులే కవిరాజుల పాదాలవద్దకు వచ్చేటట్టు చేస్తాను నేనన్నారు నియోగిపంతులుగారు, పక్కీ మార్చారు. సంస్కృత వేషం విప్పించి పారేశారు. తెలుగుకు తెలుగువేషమే వేయించారు. పైగా దృశ్యంలోకూడా తెలుగుతనమే చూపించారు. ఇదిగో చూడండి:

వ. అక్కాలంబున వినోదంబునకై యరిగి యొక్కయెడ.

సీ: చంచులఁ జిగురాకుఁ జించిగూడుచు నలి
నెలుఁగెంను గంకుఁగోయిలలసొంపు,
అలరుఁదేనియఁ గ్రోలి, యన్నుసోలంబుల
మరియు తేటుల నునుమ్రోఁతయింపు
తనిపండ్లవస మాని, తమలోనఁ జెలఁగుచుఁ
బలికెడు రాచిల్క పలుపురంపు;
కొలఁకులకలఁకులఁ గూడి క్రీడించుచుం
డెడునంచతండంబు నడబెడంగు;

గీ. తరఁగఁ దేలుచుఁ బూఁదీవఁ దనులఁబడుచు
వచ్చు చిఱుగాలి సోకును, మెచ్చిమెచ్చి
తెగిలి, కొని యాడుచును, వినతయును గద్రు
వయును, మున్నీటిచేరువ వనమునందు.

వ. మెలఁగుచుండి రట్టియెడ.

చ. కరువునఁ బోసిరో విధుని
కాంతి, సుధాబ్ధితరంగఁ దెచ్చి గం
డరు వొనరించిరో, హరు జ
టాస్థలికిన్ దొడనైనయేటి పె
న్నురువున వ్రాసిరో యన, మ
నోజ్ఞసితచ్ఛవి నల్లసిల్లు సుం
దరతురగోత్తమంబుఁ దవు
దవ్వులఁ గాంచిరి చారులోచనల్.

వ. నికేచ్ఛమై వచ్చిన యుచ్చైశ్శ్రవంబు నిట్లాలోకించి...

మా గంజాంజిల్లాలో ఉద్దాన (ఉద్యాన) ప్రాంతంలోవున్న సముద్రతీరం, ఆప్రక్క ఉద్యానం, ఆమూల మేస్తూవుండే తెల్లగుఱ్ఱం, అక్కడ విహరిస్తూవుండే కాళింగస్త్రీలు ఇవి జ్ఞాపకానికి వస్తాయి - కళ్లకు కట్టినట్టు ఉంటాయి ఈ వర్ణనవింటే - అంతేకాకుండా——

తెలుగువారియింటి ఆడుపడుచులై వన్నెవాసులు గన్న కరువూ, గండ వరువూ; చిత్తరువూ కూడా వివరించారు. ఈవిధంగా గీర్వాణీవేషం విప్పించి, ఆంధ్రికి ఆంధ్రవేషమే వేయించినారు తిక్కన్నగారు. ఆ ఆంధ్రిని చూచి రాజాధిరాజులంతా వలచినారు; చేపట్టినారు. అంతేకాకుండా ఆంధ్రవధూటి చొక్కపుం జనుగవఁబోలిన యరచాటుతనం కలిగించి, వైదిక వేషం కూడా లేకుండాచేసి, నాజూకుతనం వచ్చేటట్టు చేసినారు. ఇదిగో ఆ నాజూకుతనం ఈలాగు చూడండి:—

సీ. అర్పించుఁ బ్వ డయ్యంగన కెంగేలి
జిగిసొంపు చిత్తంబు దిగిచికొనఁగ;
నరసి కన్గొనునప్డు డయ్యింతికనుఁగవ
పొలపంబు రాగంబు వొదలఁజేయ;
నవ్వులఁ బనిఁ బంచునప్డు డమ్ముద్దియ
పలుకులతీపు కోర్కులఁ గెరల్ప;
నల్లన యాడెదునప్డు డక్కోమ్మవా
తెరతావి ధైర్యంబు ద్రిప్పికొలుప
గీ. మరుఁడు తోడ్తోఁ దేకువమాలి, కడిసి,
తూపుగముల క్రొవ్వాఁడిమిసూప నంత
కంత కగ్గలమగు వలవంతఁ దూల
పోయెఁ బావకుఁ డేమిసెప్పదు నరేంద్ర.

సీ. చిగురుటాకుల గాసిచేయు నీయడుగుల
చెలువంబు చూడ్కులఁజేర్చుకొనియె;
మారేడుపండులగారాము చెఱుచు నీ
యెలచన్నుఁగవ వేడుకలఁ బొనర్చె;
నసుఁదీగెఁ జీరికిఁ గొనని నీ మైదీవ
మురిపెంబు డెందంబు మరులుకొలిపె;
నెఱసందురుని సిగ్గువఱుపంగఁజాలునీ
నెమ్మోము తాలిమి నమ్మనేసె
గీ. నాతి, నీకునై పెక్కుబన్నములు వడితి
నంగజునిచేత వల్లభ వగుచు నాకు;
నావుడును సిగ్గుగదిరి, యాననము వంచి,
యలఁతియెలుఁగున నిట్లను నాలతాంగి.

నన్నయభట్టుగారి వైదికానికీ, తిక్కన్నగారి నియోగానికీ ఎంత తేడా ఉన్నదో చూడండి. ఇక్కడికి తెలుగుకవిత్వానికి వన్నెవాసులు స్థిరపడ్డాయి. తెలుగు ఒకయింటిరాణి అయినది. తన యిల్లు, తన సంసారం, తన సంతానం, తన మాట, తన ఆట, తన నాట చెల్లేటట్టు చేసుకొన్నాడి. అయినా గీర్వాణి ఇంకా గీర్వాణంగానే వుంది. తెలుగంటే చిరికన్ను వేస్తూనే ఉంది. ఆ సంగతి తెలుగు కనిపెట్టింది. ఈ గీర్వాణి నాకు దాస్యం చేయవద్దా అంది. ఒక్కసారి తనవాళ్లనందరినీ తేరిపార చూచింది. పెద్దమీసాల నియోగిపంతులు జరీకండువా సవరించుకొని యెదుట చేతులు జోడించుకొని నిలబడ్డాడు. 'ఏమి పంతులూ—కథ అంతా విన్నావా?' అన్నది. 'ఏమమ్మా ఏమి కథ' అన్నాడు నియోగిపంతులు.

చూచేవా, సంస్కృత వేషం వేసుకొంటే 'తెలుగుకు సంస్కృత వేషమా' అన్నారు. పోనీ అని తెనుగువేషం వేసుకొంటే 'వట్టి తెలుగువేషమా' అన్నారు. ఇకను ఏవేషమో ఏమీ తోచలేదు అన్నది.

"నేనుండగానీకేమి లోపమమ్మా, అందరూ నీకు దాసులే అవుతారు. చూస్తూవుండు—అని ఆంధ్రికి క్రొత్త ముస్తాబు చేశాడు.

గీ. ప్రౌఢిఁ బరికింప సంస్కృతభాషయంద్రు
పలుకునుడికారమున నాంధ్రభాషయంద్రు
ఎవ్వ రేమన్న నంద్రుగా కేమికొదువ,
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష.

అన్నాడు శ్రీనాధుడు. ఒకప్రక్క కర్ణాటభాష, ఒక ప్రక్క సంస్కృతభాష—చామరాలు వీస్తూవుంటే, లక్ష్మీసరస్వతులు సేవిస్తూ ఉంటే మధ్యను వున్న శ్రీ రాజరాజేశ్వరీపరాభట్టారికవలె సింహాసనేశ్వరియై శ్రీనాధునియింట కూర్చుంది ఆంధ్రి. ఆ ఆంధ్రిని సేవించినారు రాజాధిరాజులు. ఆ ఆంధ్రిని చూచి తక్కినవారంతా మచ్చరించినారు.

గీ. బోధ మల్పంబు; గర్వ మభ్యున్నతంబు,
శాంతి నిప్పచ్చరమ్ము, మచ్చరము ఘనము;
కూపమండూకములఁబోలెఁ గొంచెమెఱిఁగి
పండితమ్మన్యులైన వైతండికులకు.

అయినా శ్రీనాధుఁడు ఆంధ్రిని భయపడవద్దన్నాడు. ఏమన్నాడంటే:-

మ. హరచూడాహరణాంకవక్రతయుఁ గా
లాంతస్ఫురత్ చండికా,
పరుషోద్గాఢపయోధరస్ఫుటతటో
పర్యంతకాఠిన్యమున్
సరసత్వంబును సంభవించె ననఁగా,
సత్కావ్యముల్ డిక్కులం
జిరకాలంబు నటించుచుండుఁ గవిరా
జీగేహరంగంబులన్.

కాబట్టి నీవు నాయింట్లో సింహాసనంమీద కూర్చోవలసింది. నిన్ను నేను సేవిస్తాను. రాజాధిరాజులను నీయింటికి రప్పిస్తాను—అన్నాడు. అప్పటికి శ్రీనాధుఁడు ప్రౌఢనిర్భర వయఃపరిపాకములో ఉన్నాడు. ఆంధ్రనాయకుడైన భీమేశ్వరస్వామికి ఆదిభిక్షుత్వము మానిపించి సింహాసనం ఎక్కించినాడు. ఆంధ్రనాయిక యైన కావ్యకాంతకు గీర్వాణీదాస్యము విడిపించి, గీర్వాణీ, కర్ణాటీ కామినీద్వయము సేవలుచేస్తూఉంటే సింహాసనేశ్వరిని చేసినాడు. ఇదిగో ఆ వైభవం చూడండి—ఆనందించండి. ఇందులో శ్రీ రాజరాజేశ్వరీ

రూపమున నున్న ఆంధ్రిని పశ్యంతీ వాక్కులతో ధ్యానించండి.

సీ. హాలాహలం బను నల్లా నేరెడుపండు
  మిసిమింతుడును గాక మ్రింగినాఁడు ;
పెను వ్రేలికొనగోర బిసరుహాసను మోముఁ
  గెందమ్మి విరివోలె గిల్లినాఁడు ;
పంచవన్నియతోడఁ బ్రసవనారాచుని
  నెఱ్ఱచిచ్చుఅకంట జుఱ్ఱినాఁడు ;
మెఱుఁగుఁగోఱలు దుల్ల మృత్యుదేవతనోరు
  ఘట్టించి, యఱకాలఁ దన్నినాఁడు ;
గీ. త్రిపురదైత్యావరోధనారీవిలాస
దంతతాటంకముల కెగ్గ దలఁచినాఁడు,
దక్షపురిసానికూఁతులఁ దవిలినాఁడు,
విశ్వలోకకుటుంబి భీమేశ్వరుండు.

సీ. నేడెత్తమున సప్తగోదావరంబున
  నఘమర్షణస్నాన మాచరించి
త్ర్యాయుతమంత్రాక్షతాభిమంత్రిత మైన
  విమలభూతిత్రిపుండ్రము ధరించి
మొగలివాకిలిఁ దూఱి, డిగువ శాక్వరరాజు
  నగరిపై వెన్నుని నసువుఁ జూచి
మణిశిలాసోపానమధ్యమార్గంబుగా
  నభ్రంకషంబైన హర్మ్య మెక్కి
గీ. సప్తపాతాళభువనవిష్కంభములను
దెఱచి వెడలిన జ్యోతిఃప్రదీప్తమూర్తి
శంభు భీమేశ్వరేశ్వరస్వామిఁ గొలుచు
పరమమాహేశ్వరున కేమిఁబ్రాఁతి ముక్తి?

సీ. గజచర్మ మెన్నఁడో కాని, నిచ్చలుఁ గట్టుఁ
  బసిఁడికమ్ముల పట్టుపచ్చడంబు ;
భసిత మెన్నఁడో కాని ప్రతిదినంబునయందు
  మలయజంబు కురంగమదముఁ గూర్చు ;
నిడుదపాములరాజుతోడవు లెన్నఁడో కాని
  తారహారములు నిత్యము ధరించు ;
నృకరంకరుండమాలిక లెన్నఁడో కాని,
  ధరియించుఁ గల్హారదామ మెపుడు ;
గీ. కాటినడుచక్కి నెన్నఁడో కాని, యుండు
దక్షవాటిసువర్ణసౌధములమీఁద ;
నెన్నఁడో పిశాచులనుగాని, ఇందుముఖుల
నెల్లకాలంబుఁ దలఁచు భీమేశ్వరుండు.

సీ. ఒకవేళ ధరియించు యువనాశ్వుఁ డిచ్చిన
  కట్టాణిముత్యాలకంఠమాల ;
మాంధాతృఁ డిచ్చిన మాణిక్యఖచితకే
  యూరంబు ధరియించు నొక్కవేళ ;
నిష్వాకుఁ డిచ్చిన హీరాంకురంబుల
  యుంగరంబు ధరించు నొక్కవేళ ;
ఘనచక్రవర్తియిచ్చిన ప్రవాళంబుల
  యొడ్డాణము ధరించు నొక్కవేళ ;
గీ. వేఱ్ఱ ధరియించు నొక్కొక్కవేళయందు
భరత దుష్యంత రంతి నాభాగ నహుష
నల భగీరథ నృగమహీనాథ దత్త
హేమమణిభూషణముల భీమేశ్వరుండు.

ఆంధ్రభీమేశ్వరునకు మహారాజాధిరాజుల హేమమణిభూషణములు సమర్పించినాడు. అవన్నీ ఆయన ఆంధ్రీపరాశక్తికి సమర్పించినాడు. ఆంధ్రమాత అవన్నీ తన ఆంధ్రసుతులకు సమర్పించింది. గీర్వాణీ కర్ణాటీకృత సేవల నంగీకరించిన ఆంధ్రమాతదా అదృష్టము? ఆమె గర్భవాసమునఁ బుట్టిన మనదా అదృష్టము? ఈ వైభవ మంతా ఏనాడు చూచినామోగదా!

సీ. ధారాసురత్రాణధాటీసమారంభ
  గర్వపాథోరాశికలశజులకు,
సప్తమాడియరాజ ఝాడియకష్మాపాల
  వందిత శ్రీపాదవనరుహులకు,
సింహాద్రిపర్యంతసీమాంధ్ర మేదినీ
  మండలీపాలనాఖండలులకు ;
హరిదంతదంతిదంతావళీలిఖ్యమా
  నానేకజయశాసనాక్షరులకు,
గీ. వీరభద్రేశ వేమ పృథ్వీధవులకు,
ననుఁగుమంత్రి మహాప్రధానాగ్రగణ్యు
బెండపూడన్న జగనొబ్బగండబిరుద
సచివదేవేంద్రుఁ గృతి కధీశ్వరునిఁ జేసి.

ఆంధ్రసామ్రాజ్య స్వతంత్రాంధ్ర సార్వభౌముఁడు—ఆతని యాస్థాన మందలి ఆంధ్ర మంత్రిసార్వభౌముఁడు - ఆంధ్ర కవిసార్వభౌముఁడు— ఈ ముప్వురును త్రిమూర్తులవలె సేవిస్తూవుంటే ఆంధ్రీపరాశక్తి ఆంధ్ర సింహాసనేశ్వరియై కూర్చుండిన దినములు మరి రావుగదా. రాజులను పాదాక్రాంతులను జేసిన కవిసార్వభౌముని విడిచి, రాజులను తృణీకరించిన కవిమహాత్ముని మహిమను స్మరించుదాం-యింకొకసారి.

గౌడవంశస్థుఁడై సంస్కృతకవియైన డిండిమభట్టారకుని కంచుఢక్కను పగులగొట్టించి, ఆంధ్రీ యశఃచంద్రికలను వ్యాపింపఁజేసి శ్రీనాథుఁ డీలాగు ఢంకామీద దెబ్బకొట్టి చెప్పినాడు:—

శ్లో. అయం మే వాగ్గుంభో లలితపదవిన్యాస
  విశద, స్ఫురద్బంధో వంధ్యః పరహృది
  కృతార్థః కవిహృది, కటాక్షో వామా
  క్ష్యాః దరదళితనేత్రాంతగళితః, కుమారే
  నిస్సార స్సతు కిమపి యూనస్సుఖయతి.

శ్లో. నిర్మాణే యది మార్మికోఽసి నితరా
  మత్యంత పాకద్రవన్
మృద్వీకామధుమాధురీమధుపరీ
  పాకోద్ధురాణాం గిరామ్ ;
కావ్యం తర్హి సఖే, సుఖేన కథయ
  త్వం సమ్ముఖే మాదృశాం
నోచే ద్దుష్కృత మాత్మనా కృతమివ
  స్వాంతా ద్బహి ర్మాకృథాః.

ఆ ఢంకాదెబ్బకు ఆనాటి సంస్కృతపండితు లంతా ఝుడిసినారు. చేసినప్రతిజ్ఞ నిలబెట్టుకొన్నాడు కవిసార్వభౌముడు—ఆనాటివాడు.

# అధునాతన సామ్రాజ్యతత్త్వము

బారు గోవిందరావు

సామ్రాజ్యతత్త్వము వివిధదేశముల దృక్పథమున వివిధరూపములుగా మార్పులు పొందుచు వచ్చినను ప్రపంచచరిత్ర యెంత ప్రాచీనమో అంత ప్రాచీనతను వహించియున్నది. ఒక సంఘమువారు తమ ఆర్థికప్రాబల్యమువలనగాని, తమకుగల పలుకుబడివలనగాని, ఏవిధముగానైనను, మఱియొక సంఘమువారి నెప్పుడు అణచుటకు ప్రయత్నింతురో, అప్పుడే యీసామ్రాజ్యతత్త్వ ముండునన్నమాట. ఆర్థికస్థిరత్వము (Economic Stability), ఆత్మ ఔన్నత్యమును సముపార్జించుట మానవసహజము. అందువలననే తఱచుగా మనము వలసరాజ్యముల నిర్మాణము ఖండ ఖండాంతరముల గనుగొనుటకు జరుగు సముద్ర యానములు, విజయవాంఛలతో జరుపబడు రక్తమయములగు పోరాటములు చూచుచున్నాము. ఇట్టి సామ్రాజ్య స్థాపనా తత్త్వమును గర్హించుచు ౧౯–వ శతాబ్దప్రథమ భాగమున ఆడమ్‌స్మిత్తు (Adam Smith), మిల్, బెన్‌థామ్ (Bentham) మొదలగు రాజకీయార్థిక తత్త్వవేత్తలు తమతమ యభిప్రాయములను వెలిబుచ్చిరి.

వీరి మహోత్కృష్టాభిప్రాయములే సామ్రాజ్యవాదమునకు ద్వితీయ దశయగు నద్వితీయ 'అర్వాచీన సామ్రాజ్యతత్త్వమునకు' దారితీసినవి. ఈదశ ౧౯–వ శతాబ్దపు చరమ భాగమున డిస్రయిలీ (Disraeli) పోషకత్వమువలనను, తరువాత ఖండ ఖండాంతరముల వ్యాపారమునకై డబ్బు పెట్టుబడిచేసి లాభము పొందనెంచిన రాత్స్‌చైల్డ్సు (Rothschilds) మొదలుగాగల జ్యూయిషు ద్రవ్యాధికారుల రక్షకత్వమువలనను, ప్రారంభింపబడినది. అధునాతన సామ్రాజ్యవాద విమర్శనమునకు బూనుకొనుటకు బూర్వము మధ్యయుగముల (Middle Ages) నాటి నుండియు నీసామ్రాజ్య వాదాభివృద్ధిని సంగ్రహముగా సూచింప ప్రయత్నింతును.

౧౫, ౧౬ శతాబ్దములందు అమెరికా, ప్రాగ్దేశముల బయల్వెడలిన సముద్రయానముల వలనను, బంగారుగనులను వెదకి, నూతన వ్యాపారమార్గాన్వేషణ మొనర్చి తమ యధికార ప్రాబల్యము నన్యదేశములతల మోపవలయునను ఆవేశమువలనను జరిగినవి. మొట్టమొదట సామ్రాజ్యస్థాపనమును కాంక్షించినది, కొంతకాల మార్థికముగా నధికారమును చలాయించి యస్తమించిన స్పెయినుదేశము. తరువాత స్పెయినువారిని త్రోసిరాజని జర్మనీవారును, ఇటాలియనులును ప్రాబల్యమువహించిరి. వీరితరువాత డచ్చి, పోర్చుగీసువారు పైకి వచ్చిరి. ౧౭, ౧౮ శతాబ్దములలో ప్రపంచ చరిత్రమునం దార్థికముగా కొంత మార్పు జరిగినది. ఇంగ్లండు, ఫ్రాన్సుదేశములందు పరిశ్రమ దినదినప్రవర్ధమాన మగుచు వచ్చెను. ముడిసరుకులను విదేశములనుండి తెప్పించుకొని యంత్రములను, యంత్రసామగ్రులను తయారుచేసి విక్రయించుకొను తలంపుతో నారెండుదేశములు కూడా వలసరాజ్యముల నేర్పరచుకొనుటకు రంగమున ప్రవేశింప, దినుసుల విషయమున పోరాటములు బయలుదేరినవి. శ్వేతజాతులవారు ప్రపంచమందలి యుష్ణప్రదేశములను గనిపెట్టి క్రమముగా వలసరాజ్యముల నేర్పరచుకొనియుచట అనాదిజాతులపై తమ యధికారము చెలాయించుచువచ్చిరి. ఇంగ్లీషువారు, ఫ్రెంచివారు కెనడాదేశమునకు, స్పెయినువారు ఫ్రెంచివారు మధ్య దక్షిణఅమెరికాకు, ఇంగ్లీషువారు ఆష్ట్రేలియాకు వలస యేగి వాటిని ఆక్రమించిరి. వారు తూర్పుద్వీపములందును, హిందూదేశమునందును వర్తకస్థానముల నేర్పరచుకొని క్రమముగా రాజ్యములను స్థాపించిరి. కాని వారి పరిపాలనాభారమును మోయజాలకపోవుటచేత కొన్ని దేశముల వలసరాజ్యములు చ్యుతమయ్యెను. క్రీ. శ. ౧౭౫౬–౬౩ సంవత్సరములకుమధ్య జరిగిన సప్తసంవత్సరముల యుద్ధమువలన ఫ్రెంచి వలసరాజ్యములు నశించినవి. క్రీ. శ. ౧౭౭౬ వ సంవత్సరమున జరిగిన అమెరికా స్వాతంత్ర్య యుద్ధమూలకముగా అమెరికాదేశమునందలి ఇంగ్లీషు వలసరాజ్యములు స్వాతంత్ర్యమును సంపాదించినవి. స్పెయినువారిని ధిక్కరించి దక్షిణ అమెరికాదేశస్థులు స్వాతంత్ర్యమును ప్రకటించిరి. పోర్చుగీసులు బ్రెజిలు దేశమును కోల్పోయిరి. ఈ పరిస్థితులలో ఒక క్రొత్త ఆర్థికసిద్ధాంతము తలచూపినది. 'లెయిస్సెజ్ ఫెయిర్' అను, నీ క్రొత్తసిద్ధాంతము విదేశములతోగల వర్తకవ్యాపారముసంబంధమున ప్రభుత్వమువారు జోక్యము కలిగించుకొనకూడ దని చాటెను. తరువాత కెనడా, కేప్‌కాలనీ, ఆస్ట్రేలియా, న్యూజీలండులందలి యింగ్లీషు వలసరాజ్యములు స్వపరిపాలనమును సంపాదించినవి.

పారిశ్రామిక విప్లవము, నేత, యినుప సామానులు తయారొనర్చుటలో జరిగినమార్పులలోని యభివృద్ధి, ఇంజనీరింగులో వచ్చిన మార్పులు, యంత్రసామగ్రిని తయారుచేయుటకు గావలసిన ముడిసరుకుల యావశ్యకత, జర్మనీ, ఇటలీ, పోలండుమొదలగు పాశ్చాత్య దేశములం దభివృద్ధిజెందుచున్న జాతీయోత్సాహము, దేశభక్తిమూలకముగా సరిహద్దులను దాటి యన్యదేశముల నాక్రమింపవలయునను వాంఛ, కూలినాలివలన జీవించువారి జీవనపద్ధతిప్రమాణము (Standard of Life) లో కలిగినమార్పు—వీనివలన, 'సామ్రాజ్యతత్త్వము' మరల చిగిర్చినది. ఇదియే పైనపేర్కొనబడిన ద్వితీయదశ, అధునాతన సామ్రాజ్యవాదదశయును. ఇందు దినుసులు హెచ్చుగుట, వ్యాపారాభివృద్ధి ప్రబలుట, జలాశయములను నిర్మించుట మొదలగు ప్రజోపయోగకరములగు కార్యములను నిర్మించుటకు వలసరాజ్యములలో కంట్రాక్టులను సంపాదించుట, వానికి కావలసిన సామగ్రిని దిగుమతిచేయుట

మొదలగునవి—యీ ద్వితీయదశయందలి సామ్రాజ్యవాదగుణములు.

వ్యాపారాభివృద్ధివలన వలసరాజ్యములతో గలిగిన రాజకీయసంబంధమునకుతోడు, ఆర్థికముగాగూడ కొంత సంబంధమేర్పడెను. ఈ శతాబ్దమునం దార్థికముగా పారిశ్రామిక వ్యాపారములలో పాల్గొని కొలది బ్యాంకుల మూలకముగా ధనము నంతయు అమెరికా, జర్మనీ దేశములు తమలో తాము పంచుకొనినవి. గతప్రపంచయుద్ధమువలన నేర్పడినసంక్షోభమీ పరిస్థితులకు మరింత తావు కల్పించినది.

సామ్రాజ్యవాదము లెన్ని రకములో, సామ్రాజ్యములను స్థాపింప ప్రయత్నించిన దేశముల ముఖ్యోద్దేశము లెవ్వియో నిర్ణయింప బూనుకొనుట జరుగనేరనిపని. వీరి యాశయములవలన సమకూడిన ముఖ్యప్రయోజనము ౧౯-వ శతాబ్దపు చివరభాగమున ఆఫ్రికాఖండమును కొలదిమంది ఐరోపాఖండవాసులు—ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మనీ, పోర్చుగీసువారు—పంచుకొనుట. ఆఫ్రికా ఖండమునందు యూరోపియనుల సామ్రాజ్యవాదము కేవలము దేశము నాక్రమించుకొనుటపై గాక ఆర్థికాధిపత్యముపై నాధారపడి యున్నది. ప్రపంచ మహాసంగ్రామానంతరము మొట్టమొదట అమెరికా యూరప్‌ఖండవాసుల దృష్టి సామీప్యప్రాగ్దేశముల వైపునకు మరలినది. టర్కీయందు వ్యాపార సంబంధములైన హక్కులను సంపాదించుకొనువిషయముననే కాక, ఓడిపోయిన టర్కీని పంచుకొనువిషయమునగూడ వారిలో పోటీ బయలుదేరినది. తరువాత మధ్యాసియా యందలి టర్కీ మొదలు చైనావరకుగల దేశముల—పర్షియా, టర్కీస్థానము, ఆఫ్గనిస్థానము, టిబెట్—విషయమునగూడ నిట్టి తికమకలు గలిగెను. అతివిస్తీర్ణమును, అధిక సంఖ్యాకులను నానాజాతులుగలదియునగు హిందూదేశమును అయిదువేలమైళ్లదూరమున నున్న యింగ్లండువంటి చిన్నరాజ్యముసర్వవిధములకొల్లగొట్టుట బహుశోచనీయమును, ప్రపంచచరిత్రకునొకనిరుపమానమైనయుదాహరణమునుగదా యింగ్లీషువారి సామ్రాజ్యతత్త్వమునకు! ప్రప్రథమమున వర్తక వ్యాపారమునకై వచ్చిన బ్రిటిష్‌వారు క్రమేణ రాజ్యము నెల్ల నాక్రమించుకొని పరిపాలన నెలకొల్పగలిగిరి. ౧౯-వ శతాబ్దమున హిందూదేశము ప్రభుత్వమువారి సామ్రాజ్యమునకు సర్వవిధముల నెడదయై వర్తించుటయు, తరువాత నెమ్మదిగా స్వపరిపాలనమును కొలదికొలదిగా సంపాదించుకొనుచుండుటయును ప్రతివారికిని తెలిసిన విషయమే. కాని ప్రాగ్దేశీయుల దేశభక్తి, స్వాతంత్ర్యకాంక్ష, ప్రజాస్వామికప్రభుత్వవాంఛయు దినదినాభివృద్ధి యగుచు, వారు సామ్రాజ్యతత్త్వము నెదుర్కొనుచు నుండుటచే నాదేశములపై పశ్చిమదేశములకు గల ప్రాబల్యము తిరుగుమొగము పట్టి యది నెమ్మదిగా నంతరించుచున్న దని చెప్పవలయును. చివరకు బ్రిటిష్‌వారు తమ యఖండ సామ్రాజ్యమును పరిపాలింపజాలక, దేశమునందలి ప్రజలలో ప్రజలకు కలహములను కల్పించి పరిపాలించుటకు ప్రయత్నించుచుండ నింగ్లీషురాజకీయవేత్త యగు జనరల్‌స్మట్సు, అది అక్రమ మని దూషించి ప్రతిపక్షము వహించెను. ౧౮-వశతాబ్దమునహిందూదేశమునరాజ్యమును కోల్పోయినదానికి మారుగా ౧౯-వ శతాబ్దమున ఫ్రెంచివారు ఆసియాఖండమునందాగ్నేయభాగమును సంపాదించుకొనిరి. ఇది హిందూదేశమును రక్షించుకొనుటకుగాను దానిచుట్టును తాటస్థ్యసంస్థానముల (Buffer-States) నేర్పరచుకొనుటకు బ్రిటిష్‌వారిని పురికొల్పినది. ఈ పరిస్థితులలోనే పీనాంగు, మలయా, సింగపూరులందు బ్రిటిష్ వర్తకస్థానము లేర్పడుటయు, పాశ్చాత్యులు వలసదిగి రబ్బరుక్వారీలందు పనిచేయించుటకుగాను కొన్ని టన్నులద్రవ్యమును వ్యయ మొనర్చుటయు జరిగినది. డచ్చివారి తూర్పుద్వీపముల (East-Indies)యందు వలసదిగిన జనము ౬ కోట్లు. డచ్చివారు పంచదార, కాఫీ, తేయాకు, పొగాకు, సుగంధద్రవ్యములు ఉత్పత్తి యగు ప్రదేశములలో దేశవాసులచే నిర్బంధముగా పనిచేయించిరి. డచ్చివారితోపాటు బ్రిటిష్‌వారును రబ్బరుపరిశ్రమకును, నూనెగనులను కనిపట్టుటకును కొంత ద్రవ్యమును వ్యయపరచి, వారితో సంబంధము కల్పించుకొనిరి (Royal Dutch shells). ఈ స్వాతంత్ర్యదేశముల భాగస్వామిత్వము ఒకవిధముగా నిరువురికిని లాభమునుగూర్చుచు సంబంధము నేర్పరుచుచున్నది.

ఐరోపాఖండమునకు దూరముగా నున్న తూర్పుదేశముల విషయమునుగూర్చి విపులముగా ముచ్చటింపవలసియున్నది. కారణమేమన, ప్రస్తుత చీనా-జపాను యుద్ధమును గూర్చి మనము విపులముగా నాలోచించుటయే. ఐరోపాఖండమునందలి వివిధదేశములు ఇతర దేశములలో తమ యధికారమును స్థాపించుట కేపద్ధతులనవలంబించెనో యీ ప్రాంతములగూడ నాపద్ధతినే యవలంబించెను. ఈ తూర్పుదేశములతో నైరోపాఖండవాసులకు గల సంబంధము మొదట ఒకరకముగా నుండినది, తరువాత నింకొకరకముగా మారినది. క్రీ. శ. ౧౮౪౦-౫౦ వరకు ఐరోపాఖండదేశస్థులు చైనా, జపానులతో వర్తకవ్యాపారసంబంధము కల్పించుకొనిరి. నల్లమందు యుద్ధములకు (క్రీ. శ. ౧౮౩౯-౪౨—౧౮౫౬-౬౦) ఫలితముగా నింగ్లీషువారు హాంకాంగును సంపాదించి, చైనావారిపట్టణములైదింటిని యూరోపియనుల వర్తకమునకు బహిరంగపరచిరి. దీనికి దోడుగా తొమ్మిది రేవులందు ఇంగ్లీషువారు తమ అధికారమును చెలాయించిరి. అమెరికా సంయుక్తరాష్ట్రములవారు కూడా ఐరోపాఖండవాసులతో సంధిచేసుకొని చైనాద్వారములను వ్యాపారమునకొఱకు తెఱచిరి. తరువాత క్రీ. శ. ౧౮౯౦-వ సంవత్సరమున యూరప్‌ఖండవాసులు కేవలము వ్యాపారపుహక్కులతో తృప్తిజెందక చైనాలో చాలాడబ్బు వ్యయపరచి యక్కడ తమ యధికారమును స్థాపించి మార్కెట్టులను తమవశము గావించుకొనిరి. వారు అంతటితోగూడా తృప్తిచెందక చైనాదేశము నాక్రమింపజొచ్చిరి. తరువాత కొంతకాలమునకు జపానువారు పాశ్చాత్యపద్ధతుల నలవరచుకొని వ్యాపారరంగమునకు దుమికి, చైనాను యుద్ధమున నోడించి, కొరియా స్వాతంత్ర్యమును ప్రకటించుటకు సహాయమొనర్చి, మంచూరియాలో కొంతభాగ

మాక్రమించుకొనిరి. వీరి దినదినాభివృద్ధిని జూచి భయపడిన రష్యా, ఫ్రాంసు దేశములవారు జపానుతో సంధి గావించుకొని యేకమైరి. రష్యావారు తమ సొంతడబ్బును వ్యయపరచి, వ్లాడివాస్టక్ (Vlodivostock) నుండి మంచూరియాద్వారా సైబీరియాకు 'చైనాప్రాచ్య రైలుమార్గము'ను నిర్మించిరి. జపానువారు చైనానుండి యుద్ధప్రతిఫలముగా చాలాధనము కోరగా కబళింప గాచుకొనిన యూరోపియన్ బ్యాంకులు సప్లయిచేసినవి. క్రీ. శ. ౧౯౦౩—౪ వరకు రష్యా జపానులకు జరిగిన యుద్ధములో జపానువారు విజయమును గాంచి లియామోటంగోద్వీపకల్పము నండి, పోర్టు ఆర్థరు (Port Arthur) నుండి రష్యావారిని పారద్రోలిరి. ౧౯౧౦ లో కొరియాను జపాను తన సామ్రాజ్యమునందు కల్పుకొనెను.

ఆధునికకాలమున నన్ని దేశముల నావరించిన జాతీయత యుద్ధములకు మూలకారణమయ్యెను. ఐక్యమును కోరిన దేశములను విడివడజేసినది. అన్యదేశీయుల పరిపాలనాభారమును మోయుచున్న వలసరాజ్యములు స్వాతంత్ర్యమునకై పోరాడజొచ్చినవి. విజయముల గాంచుదేశము లన్యదేశముల నావరింప నుంకించుచున్నవి. ఇవి ప్రపంచసంగ్రామ పౌర్వాపౌర్యములనాటి కథలు.

క్రీ. శ. ౧౯౧౪-న సంవత్సరమున జరిగిన ప్రపంచ మహాసంగ్రామము జపానువారికి సామ్రాజ్యసముపార్జనమునకు దారి చూపినది. జపానువారు జర్మనీవారితో యుద్ధము ప్రకటించి కియాచౌను ముట్టడించిరి. మరుసంవత్సరమున పిక్కిన్ (Pekin) కు వారు కోరిన ౨౧ కోరికలను చెల్లించి స్నేహము సల్పిరి. జపానువారికి మంచూరియా, మంగోలియాలతో వర్తక మొనర్చుకొనుటకు చైనావారు ప్రత్యేకహక్కుల నొసంగిరి. పూర్వము జర్మనీవారికి షాంగ్‌టంగ్‌నందు గల హక్కులను జపానువారికి మార్చిరి. తరువాత కొంతకాలమునకు జపాను తా నాక్రమించిన దేశమునంతయు వదలివేసి, కేవలము వర్తకవ్యాపారపు హక్కులను కోరెను. ఈ సందర్భమున రష్యాయందు సాంఘికముగా విప్లవము (Socialism) వచ్చిన దని చెప్పకతీరదు. ఇట్లు కూలివారు ధనవంతులపై తిరుగబాటు సల్పి సర్వసామ్యములను పొందవలసిన పని ప్రతి దేశమునందును జరుగవలయు నని రష్యా పట్టుపట్టెను. ప్రయత్నములు తీవ్రముగా జరుపుటచే కొలదిమంది ధనవంతులవలన ప్రపంచములో మహాసంగ్రామములు చెలరేగుచు వచ్చినవి. అరాజకము ప్రబలు కాలమున రష్యా ఆచరణలో పెట్టదలచుకున్న ఆశయము మహోత్కృష్టమైనదిగదా!

ఇట్టి పరిస్థితులలో జపాను జాగరూకమై సక్రమమైన పద్ధతులమీద యుద్ధసన్నాహ మొనర్చుకొనెను. నేవల్ లిమిటేషన్ కాన్ఫరెన్సు (Naval Limitation conference) జరిగిన సందర్భములో బ్రిటన్, అమెరికా సంయుక్తరాష్ట్రములు, ఫ్రాన్సు, ఇటలీ జపానులు ముఖ్యముగా పాల్గొనినవి. పసిఫిక్ మహాసముద్రమును కాపాడుకొనుటకు జపాను ప్రప్రథమమున నొప్పుకొని తరువాత తాను చేసిన ప్రమాణమును త్రోసిరాజన్నది. క్రీ. శ. ౧౯౩౪ వాషింగ్‌టన్, లండన్ ఒడంబడికలను త్రోసిపుచ్చి తన చేతిలో నున్న తోలుబొమ్మవంటి మంచూరియాను చైనా కష్టమను క్లిష్టపరిస్థితులలో నున్న సమయమున విడదీసెను. తరువాత నౌకాసమాచారములను బట్టి జపాను, ఇంగ్లండు, అమెరికా సంయుక్తరాష్ట్రములతో నౌకాదళసంబంధము కుదుర్చుకొన ప్రయత్నించె నని తెలియుచున్నది. అదియునుంగాక యొక జపాను రాజకీయతత్త్వవేత్త జపాను ముఖ్యముగా నన్యదేశములతో గల వర్తకసంబంధమువలననే జీవించుచున్న దని చెప్పెను. జపానువారు పసిఫిక్ మహాసముద్రమునం దున్న మాండేటు దీవులను (Mandated islands) బలపరచుకొనుటకు క్రా (Isthmus of Kra) భూసంధియందు ౫౦ మైళ్ల కాలువ నొకదాని నడ్డముగా త్రవ్వించి సింగపూరునకు పోటీ చేయుచున్న క్రాయందు నౌకాదళము నుంచు నూహతో నున్నారు. తూర్పుసముద్రములపై బలవంతులుగా నుండుటకు ప్రస్తుతము సయాముతో స్నేహము కల్పించుకొని మెలగుచున్నారు. జపాను ఆసియా నంతయు కబళింప నుంకించుచు ప్రప్రథమమున చైనాపై కాలు దువ్వినది. పెకిన్‌తోసహా, ఉత్తర చైనాదేశమును సామంతరాజ్యముగా జేసికొనుటకు ప్రస్తుతము తలపెట్టినది. అంతర్జాతీయ వలసదేశములందుగాని, హాంగుకాంగునందుగాని జపానుకు ప్రత్యేకపుహక్కు లేమియు లేవు. జపాను యొక్క పశుబలమే జపానువారిని రక్షింపవలయును.

అమెరికా అన్యదేశములపై నధికారమును కాంక్షించి కొలది ధనవ్యయమను మఱియొక నూతనమార్గ మవలంబించినది. దీనినే Dollar diplomacy అందురు. ఇది కేవలము బీద దేశములకు ధన మిప్పించి యార్థికముగా నధికారము చెలాయించుట యన్నమాట. క్రీ. శ. ౧౮౨౩ వ సంవత్సరమున అమెరికా సంయుక్తరాష్ట్రముల కధ్యక్షు డగు మన్రో (Monroe doctrine) పశ్చిమార్థగోళములోనికి యూరప్‌ఖండవాసులు ప్రవేశించినచో నమెరికాకు శాంతి శూన్యమని తెల్పెను. ఆ పద్ధతి ననుసరించి పశ్చిమార్థగోళములోనికి యూరోపియనులను రానీయకుండ కాపాడుటకు ప్రయత్నములు జరుపుచు వచ్చెను. క్రీ. శ. ౧౮౯౮-వ సంవత్సరమున జరిగిన స్పెయిన్ అమెరికా యుద్ధఫలితముగా క్యూబా, ఫిలిప్పయిన్ (Phillipines), హవెయి, (Hawai), హైటీ (Haiti) దీవులను బలవంతముగా సంయుక్తరాష్ట్రముల సంపాదించెను. మధ్య అమెరికాలోగూడ ౧౯౨౦-వ సంవత్సరమున పెనామాజలసంధిని త్రవ్వించి ప్రపంచమంతటితో నౌకాసంబంధమును కల్పించుకొనెను. నూనె సంపాదనమునకు (oil concessions) మెక్సికోను వశపరచుకొనిరి. ఈవిధముగా ౨౦ వ శతాబ్దములోని అమెరికావారు తమ ప్రాబల్యము నన్యదేశములపై చూపుటకు ప్రయత్నించిరి. క్రీ. శ. ౧౯౧౪ నాటి ప్రపంచ మహా సంగ్రామానంతరము నుండియు వీరి ప్రయత్నములు హెచ్చుచున్నవి. వీరు నూతనప్రపంచమును వదలి యూరప్‌ఖండములో సంగ్రామమువలన దెబ్బ



15. 4- 10

తినిన దేశములపైన, దగ్గరగానున్న ప్రాన్దేశములపై కన్నువైచిరి.

నానాజాతి సమితి (League of Nations) యీ సామ్రాజ్యతత్త్వ విజృంభణము నెవల నెట్టి యభిప్రాయము వహించియుండెనో తెలిసికొనుట మన ముఖ్యకర్తవ్యము. 'Laissez-Faire Liberatism'- లైసిఫైరీ మితవాదిత్వము - నేషనల్ లేబరుమువ్మెంట్లు (National Labour movement) సామ్రాజ్యతత్త్వము నెంతగా నెదుర్కొన్నను పెచ్చుపెరిగి పోవుచునేయున్నది. ప్రపంచ మహాయుద్ధమునాటి చివరరోజులలో నానాజాతిసమితివారు సభ జరిపిరి. అధ్యక్షులగు విల్సన్ (Woodrow Wilson) తన ౧౪ వ పాయింటుగా వలసరాజ్యములయొక్క లాభములుగూడ ప్రభుత్వమువారి లాభములతో సమానములుగా నుండవలయు ననియు పరిపాలకులకు హక్కెంతవరకున్నదో నిర్ణయింపవలయు ననియును చెప్పెను. ఈ సభవారి తీర్మానమైనతరువాత జనరల్‌స్మట్స్ (General Smuts) చే నేర్పరుపబడిన వలసరాజ్యముల పరిపాలనాపద్ధతి (Mandate System) ని విల్సన్‌గారామోదించి, నానాజాతిసమితికి వలసరాజ్యముల నుండియు ప్రజాప్రతినిధులు వచ్చునట్లు ప్రయత్నించిరి. శాంతిని గూర్చుటకు క్రి. శ. ౧౯౧౯ లో పారిస్‌నందు గొప్ప సభజరిగెను. ప్రపంచమందలి సర్వ మానవజాతుల ప్రత్యర్థులును దానికి విచ్చేసిరి.

ఈ విధముగా శాంతిని గూర్చుటకు ప్రయత్నించినవారు వలసరాజ్యములను A B C. అని మూడురకములుగా విభజించిరి. A.రకపు వలసరాజ్యములు సంపూర్ణ స్వాతంత్ర్యము ననుభవించ వచ్చును. ఇవి ఫ్రెంచివారి సిరియా, ఇంగ్లీషువారి మెసపొటోమియా; పాలస్టయినులు, పూర్వకాలము నుండియు టర్కీ సామ్రాజ్యములో గలసి మణగియున్న అరబ్బీయుల దేశములు. B. వలసరాజ్యములు సామాన్య వలసదేశములుగా నుండవలయును. ఆత్మస్వాతంత్ర్యము, మతస్వాతంత్ర్యము ననుభవింతురు. నల్లమందు, బానిస వ్యాపారములనుమానుదుమనియూరప్‌వాసులు B. వలసరాజ్యములవారి కభయమిచ్చిరి. సర్వస్వాతంత్ర్యము వహించి వ్యాపారముగూడ చేయ నుని వాగ్దానమిచ్చిరి. ఈ B. మాండేటులు పూర్వము జర్మనీవారి వలసరాజ్యములగు ఆఫ్రికాలోని భాగములు. అనగా నీవలస దేశములు ఆర్థికములను పరిపాలకుల చేతులలో నుంచవలయునన్న మాట. C. రకపు మాండేటకీలు తమ సామ్రాజ్యమున కలుపుకోబడినవి. ఇట్టివి కొన్ని జర్మన్ కాలనీలు సౌత్‌వెస్టు ఆఫ్రికా, న్యూగినియా, సామ్‌సా, జాప్ మొదలైనదీవులు.

వలసరాజ్యముల పరిపాలనాపద్ధతి నీవిధముగా జూచినచో తరువాత కొంతవరకు బాసుపడినదని చెప్పవచ్చును. ఈ వలసరాజ్యములపై గల యధికారము నానాజాతిసమితి వారికి వారి ప్రతిసంవత్సరపు రిపోర్టులను పరిశీలించుటయే. ప్రస్తుతము ప్రపంచమున ౭ యూరోపియన్‌రాజ్యములు సామ్రాజ్యాధిపత్యము వహించియున్నవి. ఇవి ఇంగ్లండు, ఫ్రాన్‌సు, హాలండు, రష్యా, జపాన్, అమెరికా, సంయుక్తరాష్ట్రములు, బెలిజియము, పోర్చుగల్, ఇటలీ, స్పెయిను దేశములు. ఇందు ఇంగ్లీషువారి సామ్రాజ్యము చాల గొప్పది. వీరి సామ్రాజ్యమందలి 3/4 వ వంతు జనసంఖ్య హిందూదేశముననే గలదు. ఇటలీ, జపాను సామ్రాజ్యములందు జనసంఖ్య యభివృద్ధిపొందుటచే నన్యదేశాక్రమణమును కాంక్షించుచున్నవి. అమెరికా, ఫ్రెంచి, డచ్చి దేశములలో పరిశ్రమ లభివృద్ధిచెందుటవలన వాటినివిక్రయపరచుకొనుటకు, ముడిసరుకులను తెప్పించుకొనుటకును, అన్యదేశములతో వర్తక వ్యాపారమును కాంక్షించుచున్నవి. రష్యా దేశముయొక్క ఆసియాయందలి సామ్రాజ్యముగూడ నొకప్రత్యేకప్రాముఖ్యము వహించియున్నది. సామ్రాజ్యతత్త్వ ముఖోద్దేశములు వారి వాంఛితమున చెల్లెనో లేదో మనము నిర్ణయింపజాలము.

ఈ విధముగా అన్యదేశములపై యధికార వాంఛ కేవలము ఆర్థికపరిస్థితుల ననుసరించి, అనగా నొకానొక దేశము తన [illegible]లను దీర్చుకొనుట కన్యదేశములపై నాధారపడుట మిక్కిలి శోచనీయముగా పరిణమించిన దని చెప్పకతీరదు. సామ్రాజ్యవాదులందఱును తమ కార్థికముగా గలిగిన లోటుపాటులను తీర్చుకొనుటకు ప్రయత్నించి యన్యదేశముల కొల్లగొట్టుచున్నారని చెప్పకతప్పదు.

ప్రస్తుత మైరోపాఖండమునందు యుద్ధనీతితోపాటు ఆర్థికనీతిని విడదీయలేము. ప్రజాప్రభుత్వ మున్నదేశములు తాటస్థ్యము వహించుటకు తోడుగా సహకారదేశములు చెలరేగుచున్నవి. ఆర్థికముగా క్లిష్టపరిస్థితులు వచ్చినచో యుద్ధములు చెలరేగుట సహజము. ఈ శతాబ్దమున ననేకదేశములు నూనెపై లాభములకొఱకు యుద్ధరంగమునకు తయారైనవి.

ఇక జపానుపరిస్థితుల నాలోచించినచో నీ సంవత్సర మాగష్టు నెలయందు, కొరియా, మంచూరియా, చైనా దేశాభ్యుదయమున కన్న పేరుతో జపానుచే ఆర్థిక కేంద్రాలోచనసభ (A Central economic council) స్థాపింపబడినది. పోయిన ప్రపంచసంగ్రామమున దెబ్బ తిన్నదేశములను కొన్ని బలవంతములైనదేశములు వాటిని పంచుకొని తమయధికారమును చెలాయించుటచే వారి కార్థిక దుస్థితి సంభవించినది. ఇట్టి సందర్భమున జర్మనీదేశము మంచి యుదాహరణ మగుటయే గాక ప్రస్తుత యూరోపుపరిస్థితుల నన్నిటిని ఆ దేశచరిత్ర విప్పి చెప్పగల సామర్థ్యము గల్గియున్నది. కొన్ని సైనికసంబంధమైన షరతులకు జర్మనీని లొంగదీసి యా దేశముయొక్క యుద్ధసామగ్రిని నిర్మూలముచేయుటకు మిగిలిన దేశములు ప్రయత్నము చేసినవి. జర్మనీదేశమునందు రైనునది కుత్తరముగానున్న దేశమంతటను మిగిలిన యూరప్‌ఖండవాసు లందఱును కలసి, జర్మనీని నేలమట్టము చేయు తలంపుతో తమ సొంత సైన్యములను నిల్పిరి. ఇట్లు ౧౫ సం. వత్సరములు జరిగెను. తరువాతజర్మనీవారు సైన్యమునుబలపరచుకొనుటకుగాని, తిరిగీ కోటగోడలను కట్టించుకొనుటకుగాని వీలు లేదని తీర్మానము గావించిరి. ఈ పరిస్థితులలో జర్మనీదేశము యుద్ధసామగ్రిని తయారు చేసుకొనుచు నానాటికి బల

వంతు లనుచున్న అన్యదేశములమధ్య ఆత్మ సంరక్షణకుకూడ తావులేని శోచనీయదశ ననుభవించుచున్నది. ఇట్లింతతో కాలు మట్టిపెట్ట లేక పోయిరి. క్రమముగా జర్మనీ కోలు కొనెను. వర్సాయిల్సుసంధి (Treaty of Versailles) యేగ్రహముగానైనను శాంతిని సమకూర్పలేక పోయెను. జర్మనీకి దుస్థితి కొలగినది. జర్మనీనియంతయగు హిట్లరు రెండు సంవత్సరములకు పూర్వమే సైన్యమును బల పరచుకొని, వాయుసముదాయములనుగూడ (?) కూర్చుకొనుచుండగా నెదురాడిన దేశము లేదు. సైనిక బలమును కూర్చుకొనగూడ దని శాసిం చిన దేశములోనికి తనసైన్యమును నడిపించి ఫ్రాన్సువద్ద నన్యదేశీయులచే కట్టబడినకోట గోడలను నేలమట్టము గావించెను. వర్సెల్సు సంధిని ధిక్కరించెను. యుద్ధానంతరము ఫ్రెంచివా రనుభవించిన ప్రాబల్యమును క్రీ. శ. 1923 నుండి జర్మనీవా రనుభవించుచున్నారు. హిట్లరు జర్మనీదేశము ప్రపంచసామ్రాజ్య మును స్థాపింపవలయు ననియు, తూర్పుదేశ ముల నాక్రమింపవలయు ననియును చాటగలి గెను. దీనికి దోడుగా జర్మనీభావ మాట్లాడ వారలందరు నేకము కావలయునన్న సంఘ వేదాంతమును (Social Philosophy) నాజీ పక్షమువారు ప్రబోధించుచువచ్చిరి. ఇట్టి పరి స్థితులలో సంధిని కూర్చుటకు రాజకీయతత్త్వ వేత్తలు పట్టణమునుండి పట్టణమునకు తిరుగు చుండిరి. ఆసమయమున నెంతచిన్న తగాదా వచ్చినను ఇంగ్లండుకు సంబంధించకుండా పోజాలదు.

దేశాభ్యుదయమునకు సైన్యమే కారణ మనియు, సైన్యాభివృద్ధి యొనర్చుకొనుట వలన చేయనేరనిపని లేదనియు విశ్వసించుట వలన ముప్పువచ్చినది. ఇంగ్లండు తనకు నౌకా దళమువలననే సామ్రాజ్యము లభించినదని విశ్వ సించుచున్నది. పూర్వము ఫ్రాన్సుదేశాధీశు లైన పదునాల్గవ లూయీయును (Louis-XIV), నెపోలియనులును తమసైన్యమువలననే యూరోపాఖండమును జయింపగల్గిరి గాని వారు పరిపాలించినది రక్తసిక్త ప్రపంచము గాని శాంతియుతప్రపంచము గాదు. సంఘీభావమే సర్వాధికారమును చేకూర్చునని బిస్మార్కు (Bismarck) జర్మనీకి బోధచేసెను. ఇం గ్లండుకూడా తదుపరి తాను సామ్రాజ్యమును స్థాపింపగలిగినది తన నౌకాదళమువలనగాక వర్తక వ్యాపారమువలన నని గ్రహింపగలిగి నది. పరిశ్రమలే యుద్ధమునకు మూలకారణ ముగా పరిగణింపబడుచున్న యీకాలమున ఉక్కు, రసాయనపరిశ్రమలు, యుద్ధసామ గ్రిని చేకూర్చునను తలంపుతో హెచ్చుగా పోషింపబడుచున్నవి. ఇట్లన్ని దేశములును పరిశ్రమ లభివృద్ధి జేసుకొనుటవలన ప్రతిదేశ మునకు ప్రక్కదేశమన్న భయము జనించెను. గొప్ప గొప్ప దేశములు 'సమవృజ్జీ విధానము' (Balance of Power) నిలువబెట్టుటకై సంధిచేసుకొనెను. యుద్ధమువలన ప్రపంచము నకు గలిగిననష్టము.

1914-18

90 లక్షల జనులు చనిపోయిరి.

2 కోట్లు గాయములు దెబ్బలు తగిలినవారు.

56 బిల్లియన్ల పౌనుల ధనవ్యయము.

1930 (తరువాత)

1 కోటి 50 లక్షలమందికి నిరుద్యోగము.

890 పౌనులు ప్రతిసంవత్సరపు యుద్ధ సామగ్రి ఖర్చు.

యుద్ధమునకు కావలసిన సామగ్రినితయారు చేసుకొనకుండ చూచుభారము నానాజాతి సమితివారిపై బడినది. సైన్యాధ్యక్షులందఱిని ఎసర్‌స్కీమును (Eser Scheme) గురించి యాలోచించుటకే పిలిచిరిగాని సైన్యములను గుఱించి యాలోచించుటమానిరి. యుద్ధసామగ్రి తయారుచేయుట జాగ్రత్త పరుచుటనుగురించి తర్కింప మొదలిడిరి. తమనే దారితీయుమందు రేమోనని గొప్పదేశములవారు కాచుకొనిరి. యుద్ధప్రతికూలముగా కెల్లోగ్ ఒడంబడిక (Kellog Pact) జరిగెను. ప్రపంచమందలి గొప్ప దేశములన్నియు దాని కొడంబడినవి. యుద్ధములు ముందెన్నడును తరువాత జరు గుటకు వీలులేకపోయినను అమెరికావారు హెచ్చుధనము వ్యయమొనర్చి నౌకాదళ మభి వృద్ధిచేసుకొనిరి.

'డైలీహెరాల్డు' పత్రికా సంపాదక వర్గ ములో నొక్కడైన ఫ్రాన్సిస్ [illegible] (Living Age) అను పత్రికలో యుద్ధసామ గ్రికై యేయే దేశము లెంతవ్యయపరచినదియు పొందుపరచియున్నాడు. అన్యదేశీయులు యుద్ధసామగ్రిని బలపరచుకొనుచున్న సందర్భ మున బలములేని దేశములను కేవల మాత్మ సంరక్షణముగూడా లేకుండచేయుట యన్యా యమని వాదోపవాదములు కొన్ని సంవత్సర ములకాలముజరిగెను. యుద్ధసామగ్రిని తయారు చేసుకొనరాదని ప్రకటింపజాలిన సభ లనేక ములు నవ్వులపాలయ్యెను. ఈసందర్భమున నానాజాతిసమితి యేమియు చేయలేకపోయి నది.

హేగుపట్టణమునందు అంతర్జాతీయ న్యాయ సభ (International Court of Justice at Hague), ప్రతిదేశమును తనుకోరినవిధ ముగానందు రక్షణమును దీసుకొనుటనుబట్టి, నామమాత్రావశిష్టములయ్యెను. నానాజాతి సమితికూడాను ప్రపంచశాంతి నెలకొల్పుటకు ప్రయత్నించి విఫలమయ్యెను. ప్రతిదేశమును యుద్ధసామగ్రినిబలపరచుకొనుచునేయున్నది. యుద్ధమువలన గలుగు నార్థికఫలితములను గూర్చి ఇటలీనియంతయగు ముసోలినీ తన యాత్మకథయందు 'ఫాసిస్టుస్టేటు-దానిభవిష్య త్తు' (Fascist State and its future) అనుశీర్షిక క్రింద విపులముగ చర్చించియున్నా డు. ఇతడే మరియొకయుపన్యాసమున మానవ శక్తి నంత యత్యుత్తమదశకుగొనివచ్చి సంఘ ములో పలుకుబడియిచ్చునది యుద్ధమొక్కటే ననియు, శాంతియసంభవమని, యుద్ధము లాగి నచో శాంతి యుండవలసినదేగాని యన్యతర ముగా శాంతిశూన్యమని తమసౌభాగ్యముతప్ప యితరవిషయ మనవసరమనియు చెప్పెను. ఇంగ్లండు ఫ్రాన్సుదేశములకు వ్యతిరేకముగా ఇటలీ అబిసీనియాయం దేమియు చేసియుండె డిదిగాదు. ఒకానొకప్పుడు ఫ్రెంచివారుగూడ నిటలీవారికి చేదోడువాదోడుగా పనిచేసిరి. తరువాత వర్సెల్సుసంధికి వ్యతిరేకముగా ఆంగ్ల జర్మనీ నౌకాసంధి జరిగెను. రూసువెల్టు అధ్య క్షుని 'నూనెకొఱకుచేసిన విజ్ఞాపన (Oil embargo) నామోదించినచో నిటలీ నేలమట్టమై [illegible]. నానాజాతిసమితి ఆర్థికముగా

పనిచేయగలిగినదేగాని సర్వమానవసౌభాగ్యము కొఱకు పనిచేయలేకపోయెను. అట్లుచేయలేక పోయినచో నాసమితిప్రయోజనము శూన్యముగాన అట్టిసమితి యనవసరమని చెప్పవచ్చును.

ఇక సామ్రాజ్యతత్త్వమువలన మతనైతిక సంబంధములకు కలుగులాభనష్టముల నాలోచించవలయును. మతవిషయమై ప్రస్తుతదేశముల దృక్పథము విషాదకరముగా నున్నది. రష్యా దేశమందు కమ్యూనిష్టులు బాహాటముగా మతము నెదుర్కొందురు. ప్రస్తుతరష్యాకు స్టాలిన్ తప్పనన్యమైన భగవంతుడు లేడనియు నాతనియుద్దేశముల కెదురుచెప్పువారు అతని మతమున నాస్తికులనియు ట్రాట్స్కీ (Trotsky) రష్యామతమునుగూర్చి యెగతాళిగాబించుచున్న విషయ మెల్లరకును దెలిసినదియే. ప్రస్తుతనాజీ జర్మనీయందు మతము వ్యక్తిస్వాతంత్ర్యమున కేయడ్డు రానంతవరకు సహింపబడును. ఇటలీయందు నియంతయే భగవంతుడుగా పరిగణింపబడుచున్నాడేగాని పరమాత్మని వారెఱుగరు. ఇట్టి వన్నియు బౌద్ధమతాభిమానులగు జపానువంటి ప్రాగ్దేశమునందలి యాస్తికుల కేహ్యముగా దోచవచ్చును. కానియూరప్ఖండవాసుల నావరించిన శూన్యమతతత్త్వము లేక నాస్తికము వీరినిగూడ నావరించుచున్నది. ఇట్టితత్త్వమంతయు విజయులగుచున్న దేశములదేకాని అబిసీనియావంటి వోటమిజెందిన దేశములవారు చెప్పునదిగాదు. వారు భగవంతుని సర్వేశ్వరత్వమును నమ్మువారే.

యుద్ధమువలన వ్యక్తిగతముగా నొకానొక దేశమువారేమైన సౌఖ్యము ననుభవింతురేమో గాని సర్వదేశములకు శాంతిశూన్యము. ఈనాడు యుద్ధసామగ్రి విరివిగా పెరిగిపోయి లోకము నల్లకల్లోలములో ముంచివేయుచున్నది. ఇట్టికల్లోలములు రూపడంగవలయునన్నచో మానవసౌభ్రాత్రమునకు, నాగరికతకు వేరుపురుగులగు నియంత సామ్రాట్టులపదవులు నాశనముకావలయును.

ఈవిధముగా ప్రపంచమంతటిని కొన్ని దేశములు పంచుకొనుచున్నవి. ఓడిపోయినదేశము వారి కణగిమణగియుండిరైయైనను శాంతిని కాంక్షింపదు. వీరికి శాంతియున్నకాలమున ముడిసరుకులు దొరకుచున్నను యుద్ధమును మానక వలసరాజ్యములకై ప్రయత్నించి సామ్రాజ్యమును స్థాపింపప్రయత్నింతురని తత్త్వవేత్తయగు ఆల్ఫ్రెడ్ ప్లమ్మర్ (Alfred Plummer) చెప్పుచున్నాడు. జర్మనీ, ఇటలీ, జపానులు యుద్ధసామగ్రిని తయారుచేయుటలో గర్వమును వహించియున్నాగు. అంతర్జాతీయముగా జరుగబోవుదోపిడుల నాపుటయెట్లన్నప్రశ్నవచ్చును. వలసరాజ్యములను పంచిపెట్టుటతో నాగునని తలపోయుచున్న (ముడిసరుకుల కమిటీ Raw-Material Committee) వారిదివరకే యట్లుచేసినారుగాదా! కాలనీలవారియభిప్రాయమును చేకొని నానాజాతిసమితివారు కాలనీలను మాండేటుక్రింద తిరిగీపంచినచో ప్రపంచమున శాంతి కలుగునేమో యని నానమ్మిక. నానాజాతిసమితి కూడా కొన్నిమార్పులను పొందవలయును. అందలిమాండేటుకమిషన్ వారికి మరికొన్ని హక్కుల నొసంగవలయును. దాని పరమోద్దేశము సర్వదేశములకు ముడిసరుకులను సప్లయిచేయుచు యుద్ధము రాకుండునట్లు చూచుచుండుటయే యైయుండవలయును. సామ్రాజ్యదేశములు డిక్టేటర్లు చేయుదౌష్ట్యము, వారిమనమును మార్చివేయవలయునుగదా!

ఈనాడు మానవజాతికి గలయభిప్రాయమునుగూర్చి అబిసీనియాచక్రవర్తి హైలీసలేసీ (Haile selassie) సరవానరులు కొందఱు యుద్ధసామగ్రిని తయారుచేసి దేశములనాశనమొనర్చుటలో నలుపులేక పనిచేయుచున్నప్పుడు విజ్ఞానఖనులగుస్త్రీపురుషులు పనికిరానివారైరి. సర్వమానవ సౌభాగ్యమునకు పాటుపడవలయు నన్నచో నాధ్యాత్మికజ్ఞానము ముఖ్యావసరమనిచెప్పెను. మన మొకానొక దేశసౌభాగ్యమునకు పాటుపడుటకన్న సర్వమానవసౌభాగ్యమునకే పాటుపడుట పరమోద్దేశముగా నుంచుకొనవలయును. ఇక మున్ముందు రాబోవువీరులకు, వీరవనితలకిదియే కర్తవ్యము.

# ఆంధ్రభాషాపరిణామము

గరిమెళ్ల సత్యనారాయణ

మానవులలో ఎట్టి పరిణామములు జరుగుచుండునో వారుమాట్లాడుచుండు లేక వ్రాయుచుండు భాషలలోకూడ అట్టి పరిణామములు జరుగుచుండుట సహజము. భరతఖండమునందలి ప్రతిజాతియందును నేడు అత్యద్భుతమైన పరిణామములు జరుగుచున్నవి. ప్రాతవిశ్వాసములపై ఒకవరుసనుండి విరోధము, క్రొత్తసూత్రములపై నొకవరుసనుండి విశ్వాసము లేచుచున్నది. ప్రాతదే పరమావధి క్రొత్త దెల్లయు నీటిబుడగవలె తాత్కాలిక మనుభావములు కూడ ఒకప్రక్కను రేకెత్తుచున్నవి. ప్రాచీననాగరికత లేని దేశములలోవలె మనదేశమువంటి దేశములలో క్రొత్తపద్ధతులపై దుర్గ్రాహము ప్రబలుట సంభవింపదు. క్రొత్తదానిపై కెల్ల నెగబ్రాకగోరు కొందరుచపలు రుండుచున్నను, అలతికాలములో వారికే ప్రాచీనచైతన్యతాజ్ఞానముదయించి, వారిభావములను మథించి మరియొక నూతనమార్గమునకు వారలను త్రిప్పినైచును.

అయినను దేనినికాని క్రొత్తదను నేకైక కారణమున తృణీకరించుట లెస్సయునుకాదు; సాధ్యమును కాదు. ఎవ రెంతగింజుకొన్నను "క్రొత్తప్రాతల మేలుకలయిక క్రొమ్మెరుంగులు చిమ్ము"చునేయుండును. క్రొత్తదాని నేవగించుకొనువారును అవలంబించువారును గూడ దానితత్వము నామూలాగ్రముగ గ్రహించియే విసర్జించుటయో స్వీకరించుటయో చేయుచుందురు. మన భరతఖండమును, అందుగల వివిధరాష్ట్రములును ప్రస్తుతము ఈ అవస్థయందే తటపటాయించుచున్నవి. ప్రాతవానిని విసర్జించుటకును వీలులేదు, క్రొత్తవాని ననేకమును స్వీకరించకయు తప్పదు.

ఈ విధమైన చైతన్యమువలన మన ఆంధ్రభాష యెట్లు పలుభంగులుగామారుచు పరిణామములందున్నదో గమనించుట యెంతయును అవసరము. ఈ పరిణామములకన్నింటికిని ఈ జాతీయనూతనచైతన్యమే కారణ మని చెప్పుటకు వీలులేదు. జాతులలో విజాతీయసంబంధమైన నూతనసంచలనములు కలుగుచున్నను, మానుచున్నను కాలగమనమును పట్టికూడ మార్పులును, పరిణామములును సంభవించుచునే యుండును. వేయిసంవత్సరములక్రిందటి పదములును, ప్రయోగములును, వ్యాకరణవిశేషములును యెన్ని నేటికి మాయమైనవో యెవ్వ రూహింపగలరు? ఆనాటిప్రాతప్రతులేవైన దొరకినయెడల ఇది ఆంధ్రమేనా అను సందేహము మనకు కలుగకమానదు.

అయినను అస్థిరమైనభాషలు మారునంత వేగముగా స్థిరమైనభాషలు మారవు. స్థిరమైన భాషలలోకి యెన్నిమార్పులు వచ్చినను వాని యథారూపము ఒకరీతిని శాశ్వతముగానే ఉండును. ఆంధ్రభాషకు నన్నయభట్టుకాలమున ఒకమోస్తరు స్థిరత్వమేర్పడినదని చెప్పవచ్చును. అతనితరువాత సుప్రసిద్ధులైన కవిద్వయము అతని వరవడినిబట్టియే గ్రంథములు వ్రాయుచుండిరి. తరువాతికవులు తమ పదములు కవిత్రయప్రయోగములేనా అని ఒక ప్రమాణమును బట్టి కొలుచుకొనుచుండిరి. తరువాత నెందరోకవులు నూతనప్రయోగముల చేయుచున్నను మహాకవిప్రయోగముల కున్న గౌరవము అల్పకవుల వ్రాతలకు లేక మాడిపోవుచుండెడివి. మహాకవులుగూడ అనేకులు పుట్టి నూతనప్రయోగములు హెచ్చుచుండుటవలనను సాధారణప్రయోగములను నిరసించుచుండుటవలనను భాషకొక క్రొత్తమోస్తరు స్థిరత్వ మేర్పడినది. ఇది పద్యకావ్యముల ధోరణి.

గద్యకావ్యములకును, పదకవిత్వములకును ఇట్టి నిర్బంధము లేవియును లేకుండెడివి. సాధారణకవిమండలులు, వ్యాసకర్తలు వ్యాఖ్యాతలు వాడుకభాషను విరివిగా ఉపయోగించి మహాకావ్యములయందలి గూఢార్థములను తేటతెలుగులో ప్రజల కెరుకపరచుచుండిరి. ఈ వ్యావహారిక భాషావ్యాఖ్యానములు విరివిగా నుండుటవలన కావ్యభాష ప్రాతగిల్లక, ఏనాటికిని సరిక్రొత్తదను నూతనత్వముతోనే రాణింపజొచ్చినది. ఈ విధముగా ప్రాత క్రొత్తలు సస్నేహముగా సరళరీతిని మధ్యయుగము లేక రాయలయుగముదాకా వర్ధిల్లినవి. రాయల యుగములో నాంధ్రభాష ఒక మహౌన్నత్యదశ ననుభవించినది. ప్రాతపురాణ కవిత్వములోనికి క్రొత్త ప్రబంధఫక్కీలు ప్రవేశించినవి. క్రొత్త కల్పనలు నిరాఘాటముగ సాగుచుండినవి. వీనితోకూడ క్రొత్తప్రయోగములు విరివిగా దూరినవి. కవులను పోషించుట, కవిత్వములను వినిపించుట రాజులకు మంత్రులకు శ్రీమంతులకు పరిపాటియైనది. ఆకాలమున పుట్టిన ప్రబంధములకును కృతులకును అంతులేదని చెప్పవచ్చును. నేటికి అచ్చుపడిన వెన్నోపడగా మిగిలిన వెన్నో తంజావూరు భాండాగారమునందును, గృహస్థుల గృహములందును మిగిలియేయున్నవి. ప్రతిగృహస్థునకును తానొక కవికుటుంబమువాడనని చెప్పకొనుటకు గర్వముగాఉండెను. ప్రతికవియు తనతాత ముత్తాత లెటువంటికవులో యే యే గ్రంథములు వ్రాసెనో గ్రంథాదిని యేకరువు పెట్టుకొనుట సంప్రదాయమైనది. జనసామాన్యములో కవిజనాదరణము హెచ్చిపోయెను. ఎవని కేవిద్యయున్నను ఏవిద్య లేకున్నను నోటిలో నాలుగుమాట లుండి పద్యము లల్లగలశక్తియుండే చాలును. దేశాటనము గౌరవముగా చేయగల ఆధారము లభించుచుండెడిది. ప్రతిమహాకవియు అనేకసాధారణ కవులను తన శిష్యవర్గముక్రింద భావించి తరిఫీదు చేయుచుండెను. ఫానురాను సాధారణలేఖలును నిత్యవ్యవహారములునుగూడ కవిత్వభాషలో జరుపుకొనుట యొకవిశేషముగ నెంచబడెను. ఇవి నిజముగా ఆంధ్రభాషామతల్లికి అధికసౌభాగ్యదినములు. దేశములో యెన్నియుద్ధములు వచ్చి యెందరు ప్రాతరాజులు కూలి క్రొత్తసంస్థానములు క్రొత్తగద్దెలు యేర్పడుచున్నను, కవితాపోషణమును కవితాప్రసంగములును యథారీతిని సాగుచునేయుండెను. క్షత్రియులు, రెడ్లు, వెలమలు, మహమ్మదీయులు సమస్తపౌరుష జాతులును కవిపోషణము నేమరక నేయుండిరి.

కనుక విజ్ఞానము వేయిచేతులరేడువలె దేశము నంతటిని వెలిగించుచునే యుండెను.

ఈ ప్రబంధభాష యింత విజృంభించి కూడా, కవిత్రయము భాషను వెనుకకు త్రోయలేదు. నేటికిని ఈ ప్రబంధము లెంత సుగ్రాహ్యములై యున్నవో తిక్కనాదుల భాషకూడ అంత సుగ్రాహ్యమై యున్న దన్న ఆంధ్రభాష యొకమోస్తరుగా స్థిర స్వరూపమును వహించియున్నదని చెప్పుట కాటంకమేమికలదు ? అయినను స్థిరత్వమునే ఒకమోస్తరు దేవతగా భావించి పూజింప మొదలుపెట్టినచో అనుకరణము ప్రబలి అసలు చైతన్య మంతరించకమానదు. పిదప కాలపు ప్రబంధముల కిట్టిదోషమే కొంతవరకు పట్టి పోయినది. ఈ స్థితికి ఆకాలపుకవుల స్థిరత్వా రాధన మొక్కటియే కారణముకాదు. ఆంధ్ర జాతీయచైతన్యమే మందగించినరోజు లవి. ఆంధ్రులశిల్పనైపుణ్యము, క్షాత్రప్రజ్ఞ, వైదిక దీక్ష, ప్రాచీన గౌరవసంప్రదాయ పరిరక్షణము మొదలగు సుగుణములెల్లయు వసివాళ్లు వాడినవి. అంతకుముందుండిన దేశీయ - అల్ల కల్లోలము లడుగంటి బ్రిటిషు ప్రభుత్వమువారి వర్తకవాణిజ్యముల కనుకూలమైన శాంతి వాతావరణ మేర్పడినది. దేశస్థులందరి ప్రజ్ఞలును ఆ ప్రభుత్వనీతిని పోషించుదెసనే వ్యాపింపజొచ్చినవి. ఆంధ్రసంస్కృతభాషలలో పాండిత్యము బిరుదులకంటె ప్రభుత్వమువారిచ్చు బియ్యే, యెమ్మే, లైటిల్సుమీద వ్యామోహము హెచ్చినది. ఆంధ్రభాషోపన్యాస ధోరణియందుకంటె ఆంగ్లేయభాషా వాచాలత్వమునందు చపలత హెచ్చినది. గ్రామములలోని పెద్దమనుష్యుల తీర్పులయందుకంటె జిల్లాకోర్టు హైకోర్టులతీర్పుల కెగ్రబాకు ఆసక్తి పెరిగినది. స్వదేశీవస్త్రములు, బొమ్మలు, కత్తులు, ఆయుధములు వస్తువులకంటె విదేశీవానిపై కులుకువర్ధిల్లినది. ఆంధ్రభాషయందును ఆంధ్రాచారములయందును గల ఆసక్తి యొకమోస్తరు చాదస్తముక్రింద భావించబడినది. వానియం దింకను దీక్షగలవారికి శ్రీమంతులిచ్చు పారితోషికములు దానములుగా భావించబడుటవలన, వానిని స్వీకరించువారి ఆత్మగౌరము భ్రంగిపోయినది. ఆంధ్ర భాషామతల్లికి దుర్దినము లివి. పిల్లలపాఠపుస్తకములుమినహాగా మరియెట్టియుద్గ్రంథములును ఈ కాలమున పొడమలేదు. అవి తప్ప యితరగ్రంథములు చెల్లలేదు. విద్యాశాఖవారి పోషణము తప్ప సాహిత్యాభివృద్ధికి వేరుమార్గము లేదాయెను. క్రమక్రమముగా కవిసంతానము లడుగంటినవి. ప్రతివానికిని ద్రవ్యాపేక్షయు, ఉద్యోగపరవశత్వమును నిత్యవిధులైనవి. ధీమంతులకు కొందరికి ఆంధ్ర విజ్ఞానాభిలాష యుండినను అది కేవలము భేషజమాత్రమై యుండెను. స్వజాతీయచైతన్యము నశించినజాతికి ఇట్టిదుర్గతి పట్టుట ఆశ్చర్యముకాదు.

ఈ విధముగా ౧౯౦౫ వ సంవత్సరము వరకును వచ్చితిమి. బంగాళా విభజనము ధర్మమంటూ ఒకవినూతన జాతీయచైతన్యము ఆసేతుశీతాచలపర్యంతమును చెలరేగినది. భారతదేశపు జాతులన్నిటికివలెనే ఆంధ్రులకును మెలకువకలిగి ఉదాసీనత వీడినది. ఆంధ్ర భాషయందు, ఆంధ్రజాతీయతయందును ఒక భక్తి ఉదయించినది. దీనితో ప్రాచీనవిజ్ఞాన పరిశోధనము చరిత్రస్మరణము, ప్రబంధపఠనము తలయెత్తినవి. విద్యాధికులు, అందునను విద్యార్థులు కళాశాలలలో నేర్చుకొనుచుండు విషయములతో తృప్తిపడి యూరకుండక తీరిక యైనప్పుడెల్ల ఆంధ్రగ్రంథపఠనము నవలంబించి అందలిసారస్యమును గ్రహింపజొచ్చిరి. తాము పఠించుచుండిన ఆంగ్లకవుల విశిష్టమహత్త్వమును గుర్తించి తమ భాషలో అట్టిమార్పులను తెచ్చుటకై కంకణము కట్టుకొనిరి. ఆంగ్లసాహిత్య చరిత్రమువలె ఆంధ్రసాహిత్యచరిత్రమును యే యే కాలముల నెట్టియెట్టి పరిణామములకు పాత్రమైనదో యూహించి వ్రాయజొచ్చిరి. కోటి ప్రబంధము లున్నను అందులోని విషయమును విమర్శించి రసమును వెలిబుచ్చు విమర్శకులు లేకుండుటే ఆంధ్రభాషా నీరసత్వమునకు కారణమని ఊహించి విమర్శకగ్రంథములను వ్రాయ జొచ్చిరి.

పాఠశాలలలో ఆంగ్ల భాషకు పట్టముకట్టబడినదనిన్నీ, ఆంధ్రభాష [illegible] రువలె ఒకమూల కూర్చున్నదనిన్నీ, అందులో నేర్పబడువిషయములు యేదో వట్టిక్కైమాత్రమే చెప్పబడుచున్నవనిన్నీ దేశస్థులు గ్రహించినారు. ఆంధ్రభాష కధికప్రాముఖ్య మీయవలెననిన్నీ, ఆంధ్రవిశ్వవిద్యాలయము స్థాపించబడవలెననిన్నీ, ఆంధ్రరాష్ట్రి మేర్పడవలెననిన్నీ మొట్టమొదట ఆంధ్రదేశమునందు జాతీయాందోళనము ప్రభవించినది. పాఠశాలలలోని గద్యపాఠ్య గ్రంథములభాష సనాతన గద్య గ్రంథభాష కాదనిన్నీ, గద్యభాషలో అనేక వ్యావహారికపదాలు రూపాలూ అనుశ్రుతంగా వాడబడుచూ ఉండేవనిన్నీ, ప్రజాసామాన్యం సులభంగా గ్రంథాలు చదువవలెనన్నా వ్రాయవలెనన్నా వాడుకభాషారూపాలు జోరుగా గ్రంథాలలో ఉండవలెననిన్నీ, వాడుకభాషకై పూర్వకాలంలో ఇప్పుడున్నంత వెగటూ ఏవగింపూ లేక అటువంటి ప్రయోగాలు కవులు తమ పద్యకావ్యాలలోకూడా ధారాళంగా వాడుతూవుండేవారననిన్నీ, ప్రస్తుత గ్రాంథికభాష కేవలం కృతకభాష అనిన్నీ, దానికి నిజమైనవాడుకభాషకుండే సౌందర్యం రాదనిన్నీ శ్రీగిడుగు రామమూర్తి పంతులుగారు వగైరాలు తమ పరిశోధనలు ఉదాహరణాలు రూపకంగా అఖండమైన ప్రచారంచేశారు. చెళ్లపిళ్ల వెంకట కవీశ్వరునివంటి శతావధాన్లుకూడా ఈవాదన నంగీకరించి ఈభాషలో నేడు ధారాళంగా గద్యంవ్రానేస్తున్నారు. ఆగద్యం గ్రాంథిక భాషకంటే వేయిరెట్లు అందంగా వుందనికూడా మనము అంగీకరింపక తప్పకుండావుంది. వాడుకభాషమీద నిరసనదండయాత్రచేయడం ఇప్పుడు అవివేకం వ్యర్థంకూడాను. అయినా బ్రిటిషు పాఠశాలలు స్థాపించబడినప్పటినుంచీ ఈకృతక భాషలో వ్రాయడం మన కభ్యాసమయ్యేవుంది. వాడుకభాషలో వ్రాద్దామని కలంపట్టుకున్న మహారథులకుకూడా అప్పుడప్పుడు 'వచ్చింది' అనే దానికి బదులు వచ్చినది అనో, ఐతే అనుటకు బదులు అయినను అనో, వచ్చాను, అనే దానికిబదులు వచ్చితిని అనో పూర్వపదం పడుతూనే ఉంటుంది. కృతకభాషే అనండి మరే భాష [illegible] భాషలో ఉండే ప్రయోగాలు

నన్నిటినీ బహిష్కరిస్తూ గ్రంథాలు వ్రాయగల గడుసరి నేటివరకు యెవరూ పుట్టలేదు, బహుశా ఒక్క రామమూర్తి పంతులుగారు వారివంటి ఒకరిద్దరూ మినహాగా.

ఇక శుద్ధ గ్రాంథిక భాషలో వ్రాయగల వారు అసలే శూన్యంగా ఉన్నారు. ఇదుగో నేను లేచానని యెవరేనా అన్నారా. 'దీని లోని ప్రయోగాలు శుద్ధతప్పులు, ఈ పదాలు కేవలం వాడుకలు' అని యెవ్వరైనా చూపించ వచ్చును. ప్రస్తుతం మనభాషాస్థితి ఈరెండింటి మధ్యనా ఉయ్యాలలూగుతున్నది. వ్యావహారిక భాషావాదము నంగీకరించకా తప్పదు. అంగీకరిస్తే దానికిహద్దుల నేర్పరచడమూ కష్టమే. ఉన్నవి అన్నశబ్దానికి ఉన్నాయి, ఉన్నయి, ఉన్నై మొదలగు ప్రాంతీయాలను వాడుతున్నారు. నిలచుండు శబ్దానికి నిలచొను, నిల్చొను, నించొను, నుంచొను శబ్దాలను వాడుతున్నారు. వెళ్లినశబ్దానికి వెళ్లితే, వెడితే శబ్దాలనుకూడా వాడుతున్నారు. వేళకు జ్ఞాపకానికి రావుకాని ఇటువంటి ప్రయోగాలు వందలూవేలూ పత్రికలలో కనబడుతున్నవి. కొన్నింటినిచూచి రామమూర్తి పంతులుగారే ఆశ్చర్యపడుతున్నారు. అయినా ఏ ప్రాంతం లోనైనా సర్వ సాధారణంగా వాడుకలో వుండే ప్రయోగాల్ని ఇతర ప్రాంతాల్లో లేవన్న కారణంచేత యెట్లా విడనాడగలము? బహుశా ఇల్లాగు రెండుమూడు శతాబ్దాలువెళ్లేసరికి ఇవన్నీ మనకుప్రాతగిల్లి ఆశ్చర్యకరంగా ఉండకపోవచ్చును. అంతవరకూ యెవరెవరే భాషలో వ్రాస్తున్నా ఆక్షేపించడాని కెవ్వరికీ అధికారం లేదు. వీనిలో కొన్ని కేవల ప్రాంతీయములు కొన్ని అఖిల ప్రాంతీయములు ఉంటవి. కేవల ప్రాంతీయములను కాదని అఖిల ప్రాంతీయములను వ్రాసేవారిని మనము కొనియాడవలసినదే. అట్లు కాదని కేవల ప్రాంతీయాలను వాడేవారినికూడా మన మభినందించ వలసినదే. కలగాపులగంగా వ్రాసేవారినికూడా మనమభినందించకతప్పదు. రాగారాగా యేమిటితోచుచున్నదంటే జను లువ్రాసే భాషలనుపట్టి మన మట్టేపేచీలు పెట్టుకొనరాదనిన్నీ, వ్రాసినవిషయముయొక్క ప్రశస్తనుగూర్చియే యోచించవలెననిన్నీ తోచుచున్నది. విషయమునుబట్టి భాషయొక్క ధోరణి మారుతూనేవుంటుంది. ఒక వ్యాసములోనే రెండుమూడువిషయములలాంటివి యెత్తుకోవలసివస్తుంది. అటువంటప్పుడు ధోరణి కూడా మారుతుంది. ఈవ్యాసంలోనే భాషల తత్త్వములు, ఆంధ్రభాషపరిణామములు మొదలైన విషయములను తీసుకున్నప్పుడు ప్రారంభించినధోరణికిన్ని, వ్యావహారిక భాషావశ్యకతనుగూర్చి నిరూపించవలసిన ధోరణికిన్ని యెంతోభేదము కనుపించుచున్నది. ఒకేధోరణిలో వ్యాసమంతా సాగింతామంటే సాధ్యమైనదికాదు. ఈ ఒక్కవ్యాసమునేకాదు, నేనే గ్రంథమును వ్రాతామని నిశ్చయించుకొనికూర్చున్నా, అది ఒకధోరణిలో ప్రారంభంకావడం, మధ్యన మరియొకధోరణిలోకి మారడం, తరువాత మరియొకధోరణిరావడం ఇది మామూలైపోయినది. ఇది నాచేతకానితనమనియైనా కొందరనుకోవచ్చును, విషయమునుబట్టి ధోరణి అట్లు మారవలసివచ్చినదనియైనా కొంద రనుకోవచ్చును. ఇదైనా నా ఒక్కనినుదుటనే వ్రాయబడ్డవ్రాతలాగ కనిపించలేదు. ప్రస్తుత వార్తాపత్రికా సుప్రసిద్ధ విలేఖరులనుకొనబడే అనేకులవ్రాతలలో యింతోకొంతో యిటువంటిభేదము లనుపించుచున్నవి. తొలిచూపునకు ఇది వెఱ్ఱివెంగళప్ప ధోరణులవలె కనిపించును. కాని నిదానించి చూస్తే యిది యీవిధంగా యీకాలంలో ఉండకతప్పదు కాబోలు ననిపించుతుంది. కేవలం పాఠ్యపుస్తకములను వ్రాసేవారు కొంచెంపట్టు పూరాగా పూర్వపుధోరణిలోనే వ్రాస్తున్నారు. లేకుంటే అవి పాఠ్యగ్రంథములుగా అంగీకరింపరేమో అన్న భావంచేతను అయినా వారు ఆ సమయములయందు తీసుకునే అతిజాగ్రత, భయము, అవ్యగ్రత, అందులో కనిపించుతునేఉంటుంది. అయినప్పటికీ కేవలపాఠ్యగ్రంథములు ఆధోరణిలో ఉంటే వచ్చేఉపద్రవం యేమీలేదు. అవిబాలకులకు పాఠశాలలలో ఉన్నంతకాలం గమనించవలసిన కొన్ని సూత్రములను మాత్రమే సూచించును కాని, పాఠశాలలను విడచి పెద్దవారైనతరువాత వ్రాయగల గ్రంథము [illegible] వ్రాయవలెనో నిర్బంధించవు.

కేవల పాఠ్యపుస్తకములు కాక గణితము, భూగోళము, చరిత్ర, సైన్సు మొదలైన విషయములను వ్రాసే పుస్తకములలోని భాష ఇన్ని కట్టుదిట్టములతో ఉండవలెనని నియమించ నక్కరలేదు. ఏ గ్రంథకర్తకు ఏ ధోరణి యేసమయమున బాగుంటుం దనితోస్తే ఆ ధోరణిలోనే వ్రాయవచ్చును. ఆ పుస్తకములను విద్యార్థులు పఠించడం ఆ ధోరణికొరకు కాదు, ఆ విషయవిజ్ఞానము కొరకు. ఏ విషయమైనను సుగ్రాహ్యముగా ఉండవలెనంటే, ఆయా సందర్భములకు తగినట్లు గ్రంథకర్త ధోరణిని మార్చుకొనక తప్పదు. కనుక పాఠ్యగ్రంథ నిర్ణయమండలులవారు పూర్వపు అధికారములతో విఱ్ఱవీగి, నవీనగ్రంథములను ధోరణుల కారణముగా త్రోసివేయరాదు. విషయము మనోహరమై, అవశ్యమై యున్నప్పుడు, గ్రంథము ప్రవీణునిచే వ్రాయబడినప్పుడు వారు దేనినైనను అంగీకరించక తప్పదు. లేనియెడల యేవేవో కొందరి కిష్టమైన శయ్యాపద్ధతుల నభివృద్ధి పరచుటకొరకు ప్రశస్తమైన విషయములనే త్రోసిరాజుచేసిన నేరము వారియందు నిలచును.

దుష్టప్రయోగం నిర్దుష్టప్రయోగం అన్న శబ్దాల కిప్పుడు పాటించుచున్న అర్థములు తృప్తికరములు కావు. మిత్రులు, అదృష్టవంతు డనుటకై అదృష్టుడు, పంధా, క్రుసించుట, కలశి (కలసి), వ్రాశి, పుస్తకం యీ మొదలైనవానిని దుష్టప్రయోగము లనవలెను. రాతిరి యనుటకు రేతిరి, లేచి యనుటకు లెగిసి, పోతుంది అనుటకు పోతాది, వస్తుంది అనుటకు వస్తాది- ఈ పదములను ఇప్పటివరకు శిష్టు లుపయోగించకుండా వున్నారు గనుక ఇటువంటివానిని కొంచెమెడబెట్టుట మంచిది. తెలుగు బూతుమాటలను దుష్టము లనకతప్పదు గదా! ఇటువంటివాటిని మినహాగా తక్కినవానినెల్ల నిర్దుష్టములుగానే భావించవలెను. భారతబొగ్గు, ఇండియన్ భీమా, తపాలాఫీసు మొదలైన మిశ్రసమాసముల నెందరో వ్రాయుచున్నారు. వీనిపై కినిసిన లాభము లేదు. ఇటువంటివన్నీ పాఠకులకు బాగాపరిచయమై లేనేకాని, ఈసమస్యలనుగూర్చి వ్రాయువారు తమ భావములను ధారాళముగా

ముందుముందు ప్రసంగించగలుగుట కవకాశము లేర్పడవు. ధోరణులు మార్చుకొనుట కెట్లు లేఖకులకు స్వాతంత్ర్య మీయబడుచున్నదో మిశ్రసమాసములపట్లకూడ అట్లే స్వాతంత్ర్యము నీయవలెను. కాలక్రొత్త వేదపంటమొదలైన సమాసములనే నేను కొన్ని సందర్భముల యందు వ్రాసితిని. ఇటువంటివి అపూర్వము లనిచెప్పి విడచిపెట్టితే చాలును.

ఇక పదములను ప్రయోగములను విడచి పెట్టి వాక్యరచనాపద్ధతికి వత్తము. కొందరు వ్రాయువాక్యములలో కర్తృవాచకమును పోల్చుకొనుట కష్టము. తరచుగా అది క్రియకు చాలా దూరమైయుండును. కర్త్రర్థకములో ప్రారంభించబడిన వాక్యములు కర్మార్థకము లోను, కర్మార్థకములో ప్రారంభించబడిన వాక్యములు కర్త్రర్థకములోను, ఏకవచన కర్తకు బహువచనక్రియయు, బహువచన కర్తకు యేకవచనక్రియయు ఈమోస్తరు లోపము లుండుచుండును. వ్రాసినవ్యాసమును పునఃపఠన మొనరించినచో ఇవి యన్నియును తొలగగలవు. విశేషణములకు విశేష్య మొకప్పుడు దూరమై వేరొక విశేష్యమునకు సంబంధించిన ట్లగుపించును. కామాలు, సెమికోలనులు, హైఫనులు, అడ్డుగీతలు మొదలగు వానిని పెట్టుటలో కొంద రేమాత్రమునుకాని యాదస్తులో పెట్టుకొన్నట్లు కనిపించదు. ఇటువంటివాని నన్నింటిని భాషాసంస్కరణములనిన్నీ, నవీనపంథాలనిన్నీ సమర్థిస్తునో్న, అలక్ష్యంచేస్తునో్న విడచిపెట్టుటకు వీలు లేదు. చిన్నచిన్నవాక్యములు వ్రాస్తే ఇట్టి చిక్కు లనేకము తొలగిపోవునుకాని, కొన్ని భావములను చిన్నచిన్న వాక్యములుగా త్రుంచివేయుటకు వీలులేని సందర్భములలో వానిని వ్రాయకతప్పదు. శాసనములలోని క్లాజులు, తీర్మానములలోని వాక్యభాగములు (Phrases) విడదీయుట కెట్లు సాధ్యము? కనుక వీనిని వ్రాయునప్పుడు లేఖరులు జాగ్రత్తగా ఉండవలె నని ఉపారు చెప్పటకంటె మన మధికము చేయజాలము.

ఇవికాక విభక్తుల ప్రయోగములలోనే మునుపటికిని ఇప్పటివాడుకకును భేదము కనిపించుచున్నది. నావల్లకాదు అనుటకు అతి తరచుగా నాచేతకా దనుచున్నాము. దాని యందు లేక వానియందున్న దానిలో లేక వానిలో అను విభక్తులకున్న భేదముచేయక కలగాపులగముగా వాడుచున్నాము. వానికి చెప్పితిమి అనుటకు వానితో చెప్పితి మనుచున్నాము. ఇటువంటి సందర్భములలో సరియైనవిభక్తిని ప్రయోగిస్తేనే వికారముగాను, వాడుకలోని విభక్తిని ప్రయోగిస్తేనే సబబుగాను కనిపించును. బహుళములు, ఆదేశములు మొదలగువాని మూలకముగా చిన్నయసూరిగారే ఇటువంటి మార్పులు కొన్నింటికి శాంక్షను ఇచ్చియున్నారు గనుక, వానిలో ఈ మొదలైనవానిని నవవ్యాకరణవేత్తలు చేర్చవలసి యుంటుంది.

ఇంతవరకు పదములు వాక్యములను గురించియే మన మాలోచించియున్నాము. ఇక విషయములకు వత్తము. కేవలము సాహిత్యమునుగూర్చినశ్రద్ధ ప్రపంచమునందే నానాటికిని సన్నగిల్లుచున్నది. కేవలసాహిత్య పరిజ్ఞానమును చర్చలును యెవరెవరో రసికుల యొక్క విలాసములకు విడచిపెట్టవలసినదిగాను, విషయపరిజ్ఞానమే మానవులకు పరమావధిగాను నేడు తలచబడుచున్నది. ఏదోహిస్టరీయో, జాగ్రఫీయో, సైన్సో, రాజకీయగ్రంథమో, అర్థశాస్త్రప్రసంగమో, కోఆపరేషను భోగట్టాయో, లేబరుసమస్యయో, రైతులబాధలో అయితే జనసామాన్యము దానిపై పునకు దృష్టినిపరపుచున్నారు; కవిత్వమో, కళయో అయితే దానిని మూజూచి విడచుచున్నారు; అథవా అట్టివానిని వంటికి పట్టించుకొన్నను, కాస్త తీరికసమయవిలాసముగా మాత్రమే భావించుచున్నారు. పద్యాలను పాటలను తమపత్రికలలో ప్రకటింపనొల్లని అనేకఆంధ్ర ఆంగ్ల పత్రికాధిపతులు నేడు వేనవేలున్నారు. ఆఖరుకు చిన్నకథలకు గూడా ఒకమూల తావివ్వని పత్రికలు కొన్ని ఉన్నవి.

పత్రికలు బహిష్కరించినంత మాత్రమున వానిప్రతిభ కొరతపడదనియు,వానియెడల జనసామాన్యమునకు నిజమైన ఆసక్తిఉండుటునే యుండు ననియు మనము ఖచితముగా చెప్పవచ్చును. కాని వానికి తీరికసమయములందలి విలాసములకు తగినంత స్థానముమాత్రమే యియ్యవలె ననుటయు సమంజసమే. నేడు జాతుల భావము లెల్లయు మహాందోళనములతో తల్లడిల్లుచున్నవి. ఆంధ్రజాతిభావములును నట్లేయున్నవి. పంట లెంత యెక్కువైతే కాటక మంత యెక్కువగుటకు, ధన మెంత వృద్ధియైతే ధారిద్ర్య మంత యెక్కువగుటకు, విజ్ఞాన (Science) మెంత యెక్కువైతే అజ్ఞాన మంత యెక్కువగుటకు, కోర్టు లెంత యెక్కువైతే నేరము లన్ని హెచ్చుచుండుటకు, బోధ లెంత యెక్కువైతే అనాచారము లేక అనాచరణ మంత వృద్ధి పొందుటకు, సైన్యము లెంత వృద్ధియైతే అశాంతి అంత వర్ధిల్లుటకు కారణము లెవ్వియో ప్రజలు తెలుసుకొనుటకు తల్లడిల్లిపోవుచున్నారు. ఈ మహారహస్యములు బట్టబయలు కానిదే ప్రపంచవాసు లందరికిని నిజమైనశాంతికాని సౌఖ్యముకాని కలుగనేరదు. ఒకొక్కరొకొక్క సిద్ధాంతమును పట్టుకొని యుద్ధమునకు వచ్చుచున్నారు. ఈమహాకల్లోలములో శాంతి నెలకొనగలదా యన్న ఆశకూడా అంతరించుచున్నది. ఈకల్లోల మెంత వృద్ధియైతే విప్లవవాదు లంత మంచి దంటున్నారు. దీనిని చూచీచూడమలో శాంతివాదులు బెగ్గిలిపోయి తమ పురాతనపద్ధతులను మరింత కట్టుదిట్టము చేసుకొనుచున్నారు. ప్రతీవాదమందును పైకి యెంత మేలు కనిపించితే, లోపల నంత గుల్ల యున్నట్లు స్పష్టముగా కనిపించుచునే యున్నది. అయినా, సిద్ధాంతులు ఆమాటకు ఒప్పుకొనకున్నారు. ఈవిషయములను గూర్చి నిష్పాక్షికముగా ఆలోచించి ప్రజలకు సత్యమును నిరూపించవలసిన బాధ్యత ప్రతివిద్యాధికునియందును గలదు.

అయినను ఈ ప్రచారముకూడ అంత సులభసాధ్యమైనట్లు కనపడదు. ఒకప్రక్కన ప్రభుత్వములనుండియు వేరొకప్రక్కన ప్రతిపక్షములనుండియు అట్టివారిపై దోషపరంపరలైన శిక్షణలో దూషణలో కురియుచునేయుండును. ఎవరివిశ్వాసము లెట్లాటివైనను, తీరా

నోరువిప్పేటప్పటికో, కలముతీసేటప్పటికో, పూర్వాపరసంశుద్ధికొరకో, కొందరికి అహితముగా ఉండకుండుటకొరకో, తద్వ్యతిరేకమైన వాక్యములను తెలుపవలసివచ్చుచుండును. మనసులో ఉన్నమాటంతా పైకి చెప్పితే చాలునా, ఆనేతలకు తమ రాజకీయనాయకత్వములు గాలిలో నెగిరిపోవునోయని భయము; ఉద్యోగములూడిపోవునోఅని భయము. నిజమైన సత్యాన్వేషు లెప్పటికిని ఉండనే ఉందురు. ఒకప్పుడు తా మేదోమాటఅన్నాము కదా అని ఊరకొనక, భావము మారినప్పుడు క్రొత్తదానిని చెప్పుచునేయుందురు, రాజకీయనాయకత్వమును పాటింపరు, ప్రపంచ ప్రశంసలకొరకే తూగులాడరు, ఉద్యోగములు పోయినను సరకుచేయరు. నిదానమునిూద అట్టివారిమాటయే నిలచును.

ప్రస్తుతం, ఆంధ్రదేశమునందుగల ప్రతీ సమస్యను ఈ రీతిని తర్జనభర్జనచేసి నిజమును నిరూపిస్తూ బోధించగలవారు అవసరం. ఇందుకై వారు ఒకరాజకీయములేమి, ఆర్థికములేమి, సాంఘికములేమి, శాస్త్రీయములేమి, ఆధ్యాత్మికములేమి సమస్తసమస్యలను పరిశోధనముచేసి తేటతెలుగులో వారిభావములను వ్రాయుచుండవలెను. ఆంధ్రదేశ మిప్పుడీయుగములో తేలుచున్నది. కవీశ్వరు లీగీతములను పాడుచున్నారు, వక్త లీప్రసంగముల నల్లుచున్నారు, విద్యాశాలలు వీనిని తమప్రణాళికలలో చేర్చుకొనజూచుచున్నవి, రాజకీయవాదు లీ మార్పుల నాచరణములో పెట్టుటకై యత్నించుచున్నారు. ఈ మహాకల్లోలములలో ఉత్తములైనవా రందరికిని యే పదము, యే ధోరణి సులువైనట్లు కనిపించితే దానిని వాడితీరుదురు.

ఇదికాక మన మిప్పుడు నేర్చుచున్న ఈ ఆధునికవిజ్ఞానమున కంతకును మనకు మాతృక ఆంగ్లభాష. దాని పోలికలు, వాసనలు, పదములు, పరిభాష వద్దన్నను మనకు తప్పదు. అదే యిప్పటి రాజకీయభాష, ఎలెక్షనుల భాష, వైద్యభాష, సహకారులభాష, శాసనకారులభాష.. జను లందరికిని వీనిని గూర్చిన ఆంగ్లపదములు నోరు తిరుగునట్లు తెలుసు, సంస్కృతం తర్జుమాలు నోరు తిరగవు. ఆంధ్రదేశము బహు విశాలమైనది. కన్నడ భాషాప్రాంతీయులకు అనేక కన్నడ పదములు ప్రయోగములు, అరవభాషాప్రాంతీయులకు కొన్ని అరవభాషాసంప్రదాయములు, ఉరుదూభాషాప్రాంతీయులకు కొన్ని ఉరుదూమర్యాదలు, తమ స్వంతభాషలోని వానివిగానే అల్లుకొనిపోయినవి. ఇదికాక మండలమండలభాషకును, యాసకును భేద మెంతో కొంత ఉండనేఉన్నది. రెయిల్లు లేనికాలములో, పరిచయములు తక్కువైన కాలములో ఇవి ఒకదానికొకటి సవతిబిడ్డలవలె కనిపించుచుండవచ్చును. బ్రిటిషు గవర్నమెంటు ధర్మమంటూ, కాంగ్రెసు ధర్మమంటూ, ఆంధ్రనాయకుల ధర్మమంటూ, ఆంధ్ర మంతా ఒకేరాష్ట్రము, ఒకే భాష, ఆంధ్రులు ఒకేజాతి యనుభావము బాగుగా పాదుకొనినది. నేడు మనము దూరదూరపు బంధువులవలె చూచీచూడనట్లు కాలక్షేపము చేసుకొనుటకు వీలు లేదు. ఇంతకుముందు మన కిట్టిపరస్పరసంబంధములు తక్కువగా ఉండుటవల్లనే ఒకరికొకరము దూరస్థులవలె కనిపించితిమి. కాని రాకపోకలు, ఉత్తర ప్రత్యుత్తరములు, సంబంధబాంధవ్యములు యెక్కువయై యుండినచో ఆంధ్రభాషలో ఇట్టిప్రభేదము లుండకపోయెడివేమో?

ఈ భేదములను చెరుపుకొని మన మందరము నేకకుటుంబమువార మని గ్రహించవలసిన తరుణ మిది. కనుక మీప్రాంతముమాట మాకు తెలియదు, కనుక దానిని వ్రాయకూడదు అని ఒకరినొకర మనుకొనకూడదు. ఏ మండలమునందలి పెద్దలు అక్కడి పరిభాషలో తమ సమస్యలను గూర్చి వ్రాయుచు ప్రసంగించుచు ఉండవలెను. తక్కిన మండలములవా రెల్లరును వానిని ఆనందముతో పఠించి గ్రహించుచుండవలెను. ఇట్లు ఒక పదిసంవత్సరములపాటు జరిగినచో ఆంధ్రుల పదబాహుళ్యము, విజ్ఞానము, పరస్పరస్నేహము, సంపద, సౌభాగ్యము వర్ధిల్లును. మనము తోడిజాతులవా రందరితో సమానులమై, భారతీయనాగరికతకు పెట్టనికోటలము కాగలుగుదుము. గుజరాతీ, బెంగాలీ, హిందీ, మహారాష్ట్రిభాషలవా రందరును ఈరీతిగానే తమ విజ్ఞానమును, భాషలను, సమస్యలను, సర్వమును పరిష్కరించుకొని సత్వరాభివృద్ధిని పొందుచున్నారు. మనము కొన్ని పెడబోధనలు వినియో, వేరుచింతనల చొక్కియో పాతికసంవత్సరములక్రిందట ప్రారంభించిన ఈ శుభప్రదాందోళనముయొక్క ఫలితమును నేటివరకును అనుభవింపజాలకున్నాము. ఈ విధమైన సర్వతోముఖాందోళనము జరుగుటకు భాష యొక్కటియే ప్రశస్తసాధనము. కనుక ప్రతి భాషాసేవకుడును తన చాకచక్యమును, ప్రతిభను, విజ్ఞానమును ప్రకటించుకొనుటకై భాష కెన్నివిధములగు చక్కనిమార్గములను గూర్చవలెనో అన్నిటిని గూర్చగడంగును గాక! వచ్చీ రాని జ్ఞానముతో తెలిసీ తెలియని పదాలను ప్రయోగించి ఇదంతా భాషా సంస్కారమే అని భావించుకొను వెర్రితనము లేకుండేటే చాలును. భాషాపోషకమైన, ప్రతీ విధమైన మార్పునకున్ను స్వాగతం! సుస్వాగతం!!

# ఆంధ్రపత్రిక

## బహుధాన్య సంవత్సరాది సంచిక

———::———

వెలువడినది క్రొత్త పోకడలతో, క్రొత్త అంద చందములతో, ఆర్టు పేపరుమీద ముద్రింపబడి వెలువడినది. ఇది కేవలము ఆంధ్రుల సంచిక. ఆంధ్రజాతికి, ఆంధ్ర చరిత్రకు, ఆంధ్ర సారస్వతమునకు, ఆంధ్ర కళలకు-ఇదియది యననేల? ఆంధ్రులకు సంబంధించిన సకల విషయముల మీదను ప్రముఖులు వ్రాసిన వ్యాసములు గలవు. ఆంధ్ర వైభవమును చాటునటువంటి అమరావతి, నాగార్జునని కొండ, హంపి, పెనుకొండ, చంద్రగిరి మొదలైన ప్రదేశముల చిత్రములును గలవు. వేయేల? ఇదివరకు సంచికల కంటె ఇది యెంతో సర్వాంగ సుందరముగా తయారు చేయబడియున్నది. కావలసినవారు త్వరపడవలయును. ఆలసించిన ఆశాభంగము కలుగును.

## విషయానుక్రమణిక

పంచాంగము, ప్రస్తావన, "బహుధాన్య"—"ప్రేమలత", ఆంధ్ర!—రాయప్రోలు సుబ్బారావుగారు, ఆంధ్రసాహిత్యాభ్యుదయము—పుట్టపర్తి నారాయణాచార్యులుగారు, నతి—అడ్డేపల్లి నాగగోపాలరావుగారు, తెనుగువృత్తము-దేశికవిత—ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు, తంజావూరు మహారాష్ట్రనాయకులు: ఆంధ్రవాఙ్మయము—వావిలాల వెంకట్రామ సోమయాజులుగారు, ఆంధ్రావనీ!—బొడ్డు బాపిరాజుగారు, ఆంధ్రసూత్రకారులు బోధాయన, ఆపస్తంబులు—గొబ్బూరి వేంకటానందరాఘవరావుగారు, రాష్ట్రగానము—తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు, ఆంధ్రదేశమున ఇత్తడిపాత్రల పరిశ్రమ—ఆండ్ర శేషగిరిరావుగారు, తెలంగాణము—శేషాద్రి రమణకవులు, ఆంధ్రరాష్ట్రము-ఖాదీపరిశ్రమ—ఆచంట లక్ష్మీనరసింహముగారు, జన్మభూమి—గుఱ్ఱప్పడియ ఆంజనేయులుగారు, భోగీరలోయ—అడివి బాపిరాజుగారు, మహానటుఁడు—అడివి రాఘవరావుగారు, ఆంధ్రులు - రేడియో, ఆంధ్రప్రబోధము—దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు, నాగార్జునునికొండ—మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, "తెనుఁగు తెలివికై-తెనుఁగు కలిమికై"—కవికొండల వేంకటరావుగారు, చిట్టితల్లి నృత్యము-—కొండేపూడి సుబ్బారావుగారు, ఆంధ్రోద్యమము - ఆంధ్రరాష్ట్రనిర్మాణము—మల్లెల శ్రీ రామమూర్తిగారు, ప్రత్యేకాంధ్రరాష్ట్రము : ఆంధ్రోత్కళ సమస్య—గండికోట సత్యనారాయణమూర్తిగారు ఉత్కళ, ఆంధ్రసమస్య—దూర్వాసుల వరాహ నరసింహముగారు, ఆంధ్రవాణి—కేసరి ఆదినారాయణశర్మగారు, ఫెడరేషను: రాష్ట్రములు-ధనసమస్య—తిమ్మరాజు సత్యనారాయణరావుగారు, శిలాప్రతిమ—శివశంకరశాస్త్రిగారు, ఫెడరలు, యూనిటరీ ప్రభుత్వములు - అంబటి సుబ్బరాయశ్రేష్ఠిగారు, బహుధాన్య వత్సరము—సేమాన సూర్యప్రకాశకవిగారు.

ఖరీదు: ఒక్క రూపాయి మాత్రమే. మా ఏజెంట్లందరివద్దను దొరకును.

# శ్రీ॥ శే॥ వడ్డాది సుబ్బారాయఁడుగారు

పందొమ్మిదవశతాబ్ది చివరపాదమున తెలుఁగుదేశమునందుఁ బలువురుపండితులు కవులు నవతరించి ప్రఖ్యాతినిగాంచిరి. అట్టివారిలో వడ్డాది సుబ్బారాయఁడుగా రొకరు. వారు సహస్రమాసముల కధికముగ జీవించి, కడచిన నెలలో నసువులనుబాసిరి. వారింతపెద్దవయసు వఱకు జీవించియుండుటకుఁ గావలసిన యారోగ్యైశ్వర్యములు వారి కమరియుండినవి. అందువలన వారికిఁగల 'వసురాయకవి' అను సంగ్రహనామము మిక్కిలి సార్థకమయినది.



వారి యుద్యోగజీవిత ముపాధ్యాయత్వముతో నారంభమయి దానితోనే యంతమొందినది. వారికి శిష్యులు సహస్రాధికముగఁ గలరు. వారిప్రయత్నము మూలమున వారు పలుమారు సత్కారములను బొందిరి నిక్కముగ వారిది ధన్యమయినజీవితము. వా రుద్యోగమును మానుకొనినను ఉపాధ్యాయత్వమును మానుకొనినవారు కారు. వా రనేకవిషయములను తమ రచనముల ద్వారమున నాంధ్రులకు బోధించుచునే యుండిరి.

వసురాయ కవిగారు సారస్వతప్రియులు. సంస్కృత నాటకములను గొన్నిటి నాంధ్రీకరించిరి. వానిలో నెన్నఁదగినది వేణీసంహారము. దానికవిత చాలబరువయినది. మూలమును జదివినఁ గలుగునానంద మనువాదమును జదివినఁ గలుగదు. ఈదోష మనువాదరచనముల- అందును నాటకముల- నన్నింటినిఁ బట్టియున్నయదియే.

స్వతంత్రరచనము లనఁబడునవి వీరివి కొన్నిగలవు. వానిలో భక్తచింతామణి ప్రథమగణ్యమని ప్రసిద్ధి. భారతీయహృదయము నిరంతరముభక్తితత్పరము. వారు పరమార్తులు. తమయార్తిని, వా రేదేనొకదైవము నెదుట మొరపెట్టుకొని తొలఁగించుకొనఁ గోరుచుందురు. ఆర్తియట్లు తొలఁగునో తొలఁగదో ఆమాట యటుండుఁగాక! అట్టి యార్తియే భక్తిగాఁ బరిణమించినది. ఆభక్తికిఁ దగినభావములు, వానిని జక్కఁగా, వినువారి మనస్సు కరఁగునట్లు ప్రకటించుటకుఁ దగినవాక్యరచన, పదజాలము-'పేటెంటు' చేయఁబడినవి వాఙ్మయమున ననాదిగాఁగలవు. వానిఁ దగిలించినచో నెంతచేతగాని వానికవిత్వమేనియు భక్తహృదయమును రంజింపఁజేయఁగలిగియుండు ననినచో వసురాయకవివంటి పండితకవి రచనముమాట చెప్పవలసినది లేదు. రచనము చదువఁగలిగియుండుట దీని కింకొకమెఱుఁగు. ఈ దృష్టిని వీరిభక్తచింతామణి నిస్సంశయముగ భక్తులపాలిటికిఁ జింతామణియే.

ఆకాలపుఁబండితులకు సామాన్యముగఁ గల యలవాటుమాటిమాటికి నేవిషయము నేనియుఁ బద్యములలోఁ జెప్పుచుండుట. వీరు నట్టియలవాటుమదాఁటనివారే. కావుననే నిన్నమొన్నటిదాఁక వీరిపద్యములను జదువుభాగ్యమాంధ్రుల కబ్బియుండెను.

ఈ పండితకవి, నేడు-కాదు. ఇఁక నెన్నఁడును-మనకన్నులకుఁ గానరాఁడు. కాని తన రచనములలో నంతర్యామియై, వానిని జదువునప్పుడెల్ల మన మనోనేత్రములయెదుట ప్రత్యక్షమగుచుండఁగలఁడు.

---

# శ్రీ. శే. డా. శ్రీమిస్. జయంతి సుభద్రాదేవిగారు

యం. బి. బి. యస్., డి. జి. ఒ.

ఈమె జననము ౧౯౨౦. ౧౯౨౪ లో స్కూల్ ఫైనల్ పరీక్షలో కృతార్థురాలయి మేజర్ మెక్డ నాల్డు బహుమతిని పొందినది. కలకత్తా యూనివర్సిటిలో ౧౯౨౬ సం. మొదటి తరగతిలో ఇంటరు ప్యాసయినది. మదరాసు వైద్యకళాశాలలో చదివి ౧౯33



సం. యం. బి. బి. యస్. పట్టమును బడసినది. క్లిఫ్ఫర్డు మెడలు, లేడీగ్రాంటు డఫ్ మెడలు ఈమెకు లభించినవి. ఇంకనువక్తృత్వాది సామర్థ్యములకు పెక్కుపతకములను పడసినది. వైద్యమున మరియొక డిప్లొమాకూడ సంపాదించుకొనినది. కర్నూలులో తొలుతను, తరువాత రాజమండ్రిలోను వైద్యవృత్తి స్వతంత్రముగ ప్రారంభించి ప్రజాసేవచేయుచుండెను. ఈమె ౩౭ ఏండ్లు నిండియు నిండకమునుపే కీర్తిశేషురాలయ్యెను. ఈమె రాజమండ్రి ట్రెయినింగు కాలేజి ప్రొఫెసరు జయంతి సత్యనారాయణగారి కుమారిత.

---

# విమర్శనము

## పట్టాభిగారి “సోషలిజం”

[సైజు ౧/౧౬ రాయల్; ౫౦ పుటలు; వెల ఆరు అణాలు. గ్రంథకర్త: గోపీచంద్, నూతాశ్రమం తెనాలి.]

ఇది చూడ, ముచ్చటైన బహు చిన్న గ్రంథ మీగాని విప్పిచూస్తే భారత రాజకీయ విషయం. ఇతరరాజధానినాయకుల నంటే యేమి చిక్కు సంభవిస్తుందో నని అటు తిరిగి ఇటుతిరిగి స్వరాష్ట్ర నాయకుడైన డాక్టరు పట్టాభిగారిని సాధనంగా చేసికొని కాంగ్రెసు మీదికి తోలినా డీ గ్రంథకర్త తన మోటు బండీని గట్లమీద, బురద చేలల్లోంచి, దుప్పల పైనించి అడ్డదిడ్డంగా.

గ్రంథస్థవిషయం సోషలిజం. మొదటి పేజీల్లో సోషలిజం యెట్లా ఆమలులోనికి వచ్చిందో, సోషలిజాన్ని గురించిన శ్వేతుల నిర్వచనాల కొంకి ఆధారంతో భారతకాంగ్రెసులోని భిన్నపక్షాలకు చెందినవారిని పృచ్ఛిస్తూ “స్వాతంత్ర్యోద్యమాన్ని నక్క జిత్తులతో అల్లకల్లోలం చెయ్యటం ఎందుకు? ప్రజాసామాన్యమునకు కుతర్కంతో వాక్పారీణ్యంతో బెదరగొట్టడం ఎందుకు? నూతనభావాలంటే ఇంత నిరాదరణ, ఇంత కంటగింపు ఎందుకు?” అని గాంధీని, గాంధి అనుచరుల్ని మర్దన చేస్తున్నారు. ఈ ఊపులో సాధనగా పట్టాభిగారి ౮౫ వ తూర్పుగోదావరి మండల సభ ఉపన్యాసభాగాల్ని గ్రహించారు గోపీచంద్ గారు.

గోపీచందుగారు దీనిని రచించే సందర్భంలో మానవ మనస్తత్వాన్ని మరచినట్టు లున్నారు. ప్రాతపద్ధతులు పోయి క్రొత్త పద్ధతులు రావడమంటే సామాన్య విషయం కాదు. కొందరకు సంతృప్తి, మరికొందరకు అసంతృప్తి వుండక మానదు. భారతదేశానికి సోషలిజం అనేది స్వతంత్రదేశం అయినపిమ్మటనే గాని పారతంత్ర్యంలో వున్నంతవరకు అది పుట్టగోని తేనెవంటిది. భారతదేశ భవితవ్యతను యోచించేందుకు కొంత ఉదారత, ముందు వెనుక యోచన అవసరం. తీవ్ర-సోషలిస్టులైన జవహరలాలు, సుభాషుబోసులు కాంగ్రెసు అధ్యక్షులైన అనంతరం వారి తత్వం మళ్లటమే దీనికి తార్కాణం. గోపీచందుగారుకూడ తీవ్రసోషలిస్టు. గాంధి అనుచరుల నిర్వచనాన్ని విమర్శించటంలో గోపీచందుగారు తర్కాన్ని ఆధారంగా తీసికొన్నారే కాని సోషలిజంయొక్క ఫండమెంటల్సును ఆధారంగా గ్రహించినట్టు తోచదు. “సోషలిజం హింసాత్మకమైంది అనేదానికి ఆలోచించిచూస్తే గాంధిగారి అహింసావాదం హింసాత్మకమైంది కాదా?” అంటున్నారు గోపీచందుగారు.

గోపీచందుగారి రచనలో వారి రక్తనాళాల్లోని ఉద్వేగం స్పష్టంగా తెలుస్తోంది. యువకులు సవాళ్లు వేసేదానికంటె రథసారథ్యం మనసా వహిస్తే మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చినవెనుక సోషలిజమో లేక మన దేశానికి అనుకూలమైన మరేదైనా ‘ఇజమో’ పెట్టుకోవచ్చు. ఆత్యాగంమినహా విమర్శలు, సవాళ్లు, దెబ్బలు తీయటాలు, కొంచెపరచటాలు, కేవలం ఐకమత్యాన్ని దూరం చేశేవి.

“Causing irritation is likely to obscure the fundamental unity of all ranks within the Congress and introduce an element of sectarianism in our thought and action that is bound to prove harmful the end.” “I believe further that both groups can march shoulder to shoulder as far as the final goal of independence. On the way adjustments will have to be made, clashes will have to be reconciled. But the Companianship can and must remain unbroken” అని సోషలిస్టు క్యామేడు జయప్రకాశ నారాయణ గారు హెచ్చరిస్తున్నారు.

—వ. కు.

## సుభాషచంద్రబోసు

[కౌను ౧/౧౬ సైజు; ౧౦౬ పేజీలు; గ్లేజు కాగితం, ఖరీదు ఆరు అణాలు. రచయిత, ప్రకాశకులు: కొమాండూరి శఠకోపాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్., కాకినాడ.]

తెలుగువారి కిటీవలే అయిదుబళ్లచెర వదలింది. గుణితంకూడా పూర్తిఅయినట్లే. తల, వల, మొల, పలక అనే రెండేసి మూడేసి అక్షరాల మాటలుకూడా పలుకుతున్నారు. దీనిఫలితమే కాబోలు యీనాటి మన పత్రికలకి యీమాత్రపు ప్రచారమైనా. పత్రికా ప్రచారంతోపాటే పుస్తకప్రచారం కూడా.

గ్రంథప్రచారకులు, పత్రికాప్రచారకులు యిప్పుడే శ్రద్ధచూపవలసిన సమయం, చంటిబిడ్డకుదంతాలు వచ్చేసమయంవంటిది. పత్రికాపఠనం గ్రంథప్రచారం వృద్ధికావలెనంటే ఆ వ్యవహర్తలు గమనించవలసినవిషయాలు యెన్నోవున్నయి. ఆకర్షణీయంగా ముద్రించాలి. ఖరీదు దేశ-ఆర్థిక పరిస్థితులకి అనుగుణంగాను; బీదవాడుకూడా కొని చదువటానికి వీలయ్యేటట్టుగాను ఉండాలి. రచనాపద్ధతికూడ క్లిష్టంగావుండక, డొంకతిరుగుడు లేక సామాన్యుల కర్థమయ్యే సులభశైలిలో వుండాలి. తపాలు ఖర్చులు దండుగ తగుల కుండా అసలు వెలకే పాఠకుని గ్రామంలోనే లభ్యమయ్యేటటువంటి ప్రచార సౌకర్యం చెయ్యాలి. ఇవన్నీ కలగలుపుతే వాణిజ్యపరిచయం ముఖ్యమని తోచకపోదు.

పత్రిక లమ్మకునే యేజన్సీ వ్యాపారం ఒకటి యిటీవల కొందరికి జీవనోపాధి అయి పట్నాల్లో పల్లెల్లో పత్రికలు పంపక మవుతున్నయి. ఇక పుస్తకాలసంగతి. వాణిజ్యం నేర్పు మృగ్యమైనకారణాన గ్రంథం అచ్చువేస్తే వెయ్యిప్రతులు అచ్చువెయ్యటం, యీ వెయ్యింటిలో అచ్చుఅయినవెంటనే ౨౦౦ అయినా అమ్ముడు పోకపోతాయా, ముద్రణ ఖర్చు మళ్లి రాకపోతుందా, తతిమ్మాప్రతులు అప్పుడప్పుడమ్ముతూవచ్చినా 3 లేక ౪ సం

వత్సరాల్లో ఖాళీకాకపోతాయూ అనే అంచనాలతో ప్రారంభించటం మనలో చాలామందికి అలవాటైపోయింది. పైహేతువుచేతనే పుస్తకంవెల అసలుఖరీదుకంటె నాలుగైదు రెట్లు పెట్టి సామాన్యులకు అలవికాకుండా వుండటం సంభవిస్తూ పుస్తకవ్యాపారం బహు నీరసంగా వుంది. ఇక రచనలుకూడా పైవిధమైన సంకుచితదృష్టికి అనుగుణంగానే వుంటున్నాయి. గ్రంథంయొక్క వస్తువు యెంతటి మహత్తరవిషయమైనప్పటికిని ఋజువుగా, మృదువుగా, మధురంగా ఉండేటట్టుచేసే పద్ధతిని నేర్చుకోవడంలో శ్రమచేయకుండా కఠినమైన వ్రాతల్లో వుంటున్నాయి.

సుభాషచంద్రుడు గొప్ప కుటుంబంలో జన్మించాడు, యువకుడు; విద్యాధికుడు; ప్రపంచ పరిభ్రమణంవల్ల అనేకవిషయాల్ని అవగతం చేసికొన్న ఘటకుడు; త్యాగి; తీక్ష్ణమైన మేధాశక్తికలవాడు; జీవితపరమావధి మానవసేవ ఒక్కటేనని గాఢంగా విశ్వసించి కలెక్టరుద్యోగాన్ని కాలదన్నిన విరాగి; వివేచనాపటిష్ఠుడు; కార్యచతురుడు; సాహసి; బ్రహ్మచారి. జవహరలాలుకు సుభాషుకు అనేకం పోలికలున్నాయి. ఆతని వెనుక అధ్యక్షపీఠానికి అర్హుడైనవాడు సుభాషబాబేనని భారతవర్షం యేకగ్రీవంగా ఆమోదించి యీ సంవత్సరం వానిపరం చేసింది. ఒక్క సంవత్సరంపాటు భరతావనియొక్క క్షేమ, ఐశ్వర్యాలు యీతని భుజస్కంధాలమీద నున్నాయి. ప్రపంచమంతా ఒక కన్నుచేసికొని యితని చర్యలను గమనిస్తూ వుంటుంది. ఇంతటి మహత్తరపదవి సుభాషుకు లభించటానికి, ప్రజాసేవే ముఖ్యఆరాధనగా స్వీకరించటానికి అవకాశము కల్పించిన ఆతనిని కనిన ఆపూజ్యదంపతులకు చెందాలి నిజంగా మన జేజేలు. ప్రజానీకము సుభాషుని జీవితచరిత్రవల్ల నేర్వతగినదానికంటె ఆమాతాపితల మహోదారాతిశయము వెయ్యింతలు జ్యోతిర్మయమైనదంటే ఆక్షేపంలేదు.

బిడ్డలభవితవ్యం తల్లిదండ్రులమీద వుంటుంది. వారి బాగు ఓగులు, సుఖసంపదలు, ప్రతిష్ఠాప్రతిష్ఠలు మొదలైనవన్నీ తల్లిదండ్రులు శిశుదశలో యిచ్చేతయారులో వుంటుంది. పెద్దలు ఉదారతకలవారైతే బిడ్డలూ అంతే. పెద్దలు తుంటరులైతే బిడ్డలూ అంతే. సుభాషు జననీజనకులు మహోదారులు అవటంచేతనే యీతడుగూడ మహోదారుడుగ తయారైనాడు. గవర్నమెంటువారు కలెక్టరుద్యోగం యిస్తాం కవెనెంటుమీద చేవ్రాలు పెట్టమంటే ఆత్మశుద్ధికి త్యాగానికి గొప్ప పరీక్ష సంఘటించి స్వదేశభక్తి ప్రజాసేవ ఉద్యోగాన్ని తృణప్రాయంగా కాలదన్నే వరకు మన స్తిమితం చిక్కిందికాదు. The Heaven-born Service ను ఉఫ్అని ఊది వేసినను హర్షించి యెనమండుగురు కొడుకుల్లో ఒకడిని దేశ ఆరాధనకు, స్వదేశానికి స్వాతంత్ర్యం తెచ్చే మహాయజ్ఞానికి ఒక అర్చకుడుగా, ఒకయింధనంగా వదలివేసిన ఆపూజ్యదంపతులా భారతవీరులు, లేక సుభాషుచంద్రబోసా? సుభాషుని తల్లిదండ్రులవంటి త్యాగధనులు మనలో నెందరు కలరో ఆత్మపరీక్ష చేసికోవటం అవసరం. బిడ్డల్ని ప్రయోజకులుగా చేసేవిధానం మనం వారిదగ్గర నేర్చుకోవాలి.

ప్రకృతం-కొమాండూరి శఠకోపాచార్యులుగారి సుభాషచంద్రబోసు జీవితచరిత్ర రచన పై విషయాలన్నిటిని యెంతవరకు తృప్తిపరుస్తోందో పరిశీలిద్దాం. శైలి సులభమైనదే. వెల ఆరుఅణాలు పెట్టి కొనడం సామాన్యులకు(కొంచెము)కష్టమే. ఇక వస్తువును గూర్చి భూమికలో రచయిత "ఇంతవరకాయనజీవితచరిత్ర మేభాషలోను నాకు దొరకలేదు. పృథ్వీశచంద్రరాయిగా రింగ్లీషులో నొకచిన్న పుస్తకము వ్రాసినారు. దాని నుపయోగించినాను. కాని అది ౧౯౨౮ది. అందు చాలసంగతులు లేవు. తక్కిన వానిని కలకత్తా మునిసిపల్ గెజెటు వగైరా పత్రికలనుండి గ్రహించినాను. ఆయనకు బి. ఏ. చదువులో సహాధ్యాయిఅగు శ్రీవినయభూషణ రక్షితుగారినుండి సుభాసువిద్యార్థిదశలోని కొన్నిసంగతులు దెలిసికొంటిని." అని వ్రాశారు. సుభాషుబోసుజీవితం ఆదర్శప్రాయమైందని నిరూపించటానికి అవసరమైన ఉత్తేజనశక్తి (force) పుష్టి, వ్రాతలో అగుపడటం లేదు. గ్రంథం తరుణంలో రాదగినది మాత్రం అవును.

ఈగ్రంథంలో సుభాషునిజీవితం యిరవై ప్రకరణాలక్రింద విభజింపబడింది. ఐ. సి. ఎస్. చదువు, జవహరు, గాంధి, సుభాషు, మొదలైన కొన్ని ప్రకరణాలు సొంపుగా ఉన్నాయి.

మహామహుల జీవితచరిత్రలు రచిస్తే చప్పిడిగ నింపడం భావ్యంకాదు. భాషకు మెరుగు యివ్వాలి. పాఠకుని ఉన్నతపథాల్లోకి తీసుకు పొయ్యే నూతనభావోదయం కలగాలి. జీవిత పరమావధిని స్థిరపరచే తత్వప్రౌఢి వుండాలి. ఒకటిరెండు సంవత్సరాల వయస్సప్పుడు ఎర్రకుక్క నల్లకుక్క అని యేవో దొంగకబుర్లు పిచ్చికథలు చెప్పి బిడ్డలకు అన్నంతినిపించ ప్రయత్నించేవిధంగా యిప్పుడిప్పుడే చదువు నేర్చుకుంటున్న మన తెలుగువారికికూడా విషయాన్ని (Dramatic) గా చెప్పి ఆసక్తి కలిగించాలి. కొంచెం హుషారుగావుండి చక్కని గ్రంథాలను ప్రచురిస్తే రచయితలు, పుస్తకవిక్రేతలు యిప్పుడనుభవిస్తున్న దుర్దశ అనుభవించరు; వ్రాతలూ నిష్ప్రయోజనంగా పోవు. —వ. కు.

---

## "రాష్ట్రపతి సుభాషచంద్రుడు"

[సైజు ౧/౧౬ క్రౌను; ౨౦౦ పేజీలు; వెల ౬ అణాలు. గ్రంథకర్త: 'అగ్నిహోత్రుడు.' ప్రకాశకులు, జ్యోతి గ్రంథాలు, ౩౯, ఆండర్‌సన్ వీథి మద్రాసు.]

సొగసైన ఈ చిన్నిగ్రంథం జ్యోతిగ్రంథాలకు సంబంధించి తొలికిరణంగా వెలువడింది. అంశం సుభాషచంద్రబోసుని జీవితచరిత్ర. ౧౫ వరకు చిత్రాలుగూడ యిందులో చేర్చబడ్డయి.

దీన్ని రచించడంలో గ్రంథకర్త శ్రమ తీసుకొని విషయాన్ని సేకరించినట్లే కనపడుతోంది. సులభమైన శైలి; ప్రతి రెండణాల

నెల, సామాన్య తెలుసు జీవియొక్క ప్రస్తుత విజ్ఞాన-ఆర్థిక-తాహతు ననుసరించి గ్రంథకర్త నిర్ణయించినట్లు తోస్తుంది. రచన ఎత్తుగడ, ఫక్కి, విషయవిస్తీర్ణం, భావాలు గమనిస్తే 'అగ్నిహోత్రుడు' చెయ్యితిరిగినవానివలె అనుపడటమే కాకుండా భారత స్వాతంత్ర్య సమరవీరారాధకుడివలె కనపడుతున్నాడు. ఇతర భారతజ్యోతుల చరిత్రలుగూడ యీ గ్రంథమాలవారు 'అగ్నిహోత్రుని' తోడుతో క్రమక్రమంగా వెలువరించి తెలుగుతల్లి ఆదరాతిశయాన్ని పొందదగుదురు.

—వ. కు.

---

## పరాధీన భారతదేశము

[డాక్టరు పట్టాభిగారి తొలిపలుకుతో - గ్రంథకర్త: దేశరాజు రామచంద్రరావు గారు.

బి. యే., వకీలు, రాజోలు. వెల రు 0-6-0]

దేశచరిత్రకును, వ్యక్తిజీవితమునకును అవినాభావసంబంధము కలదు. సత్యమై, సర్వతోముఖమైన భారతచరిత్ర మేకొలదిమంది విద్యార్థులకుమాత్రమె తెలియును. ఆర్థిక, రాజకీయపరిస్థితుల కలరూపును పామరు లెఱుగనే యెఱుగరు. దుస్థితిని, దారిద్ర్యమును తమపై పురికొలిపిన హేతువులకు వీ రవగతులు కారు. బ్రిటిషుపరిపాలనముయొక్క మేళ్లను గుఱించిన ఉదంతమును పెద్దక్కరములందు వీరు చదివియుండిరి. అంతియే! భారత పరిస్థితుల నిక్కంపువృత్తాంతము చిన్నక్కరము లందైన వీరికి గోచరింపలేదు. త్వరమగాని అక్షరములం దీయుదంతమును సంక్షేపముగా గ్రంథకర్తగా రిపుడు వివరించిరి.

విషయము జటిలమైనది. వాడి మెదడు గలవారే అర్థశాస్త్రములందలి బహుళసూత్రముల నవగాహన మొనరించుకొనగలరు. రచనా విధానమును పరికించినపుడే గ్రంథకర్త విషయము నెట్లు హృదయంగమ మొనరించుకొన జాలిరో గ్రహింపజాలుదుము. కళకు అక్కరైన శైలి వేఱు; శాస్త్రమున కవసరమైన శైలి వేఱు. అది హృదయమునకు సంబంధించినది; ఇది మేదస్సునకు సంబంధించినది. దానిశైలి సౌందర్య సౌష్ఠవ మాధుర్యములకు నిక్షేపమై యుండవలెను. దీనిశైలి చులకనై స్పష్టమై, క్లుప్తమై యుండవలెను. హేతుపర్యాలోచనమువలనగాని శాస్త్రాంశము మనసున బ్రవేశింపదు. తనకు స్పష్టమైనవిషయమునే గ్రంథకర్త పఠితకు స్పష్టము గావింపగలడు. ఈ సిద్ధాంతములను దృష్టిలో నిడికొని ప్రస్తుత గ్రంథమును పరిశీలించినపుడది కర్తహృదయమునకు దర్పణమాయెనని స్ఫురింతుము. విషయమును గుఱించి గ్రంథకర్తకు చక్కని పరిజ్ఞానము కలదని తోడనే గ్రహింతుము.

కాని తనపాండితిని ప్రదర్శించుట గ్రంథకర్త ఆశయము కాదు. ఉద్గ్రంథమును రచించుటకూడ వీరియుద్దేశము కాదు. అర్థశాస్త్రసూత్రములను చర్చించి (ప్రత్యేక న్యాయశాస్త్రాంశములను వివరించుతటి జూరిస్ ప్రూడెన్స్ లోని నిబంధనములను నిర్వహించునట్లు) సాధారణార్థిక సిద్ధాంతములను పరిశీలించి భారతదేశముయొక్క ప్రత్యేక పరిస్థితులను వీరు విమర్శించిరికారు. చారిత్రక దృష్టితో ఆర్థిక రాజకీయ పరిస్థితులను సింహావలోకన మొనరించిరి. విషయమునకు సంబంధించిన ఉద్గ్రంథములనుండి చక్కని ప్రమాణముల గైకొనిరి. పట్టాభిగారిపీఠిక, రచయితయత్నమునకు వన్నెదెచ్చెను.

భారతభూమియొక్క తొల్లింటివిభవము నుల్లేఖించుచు, వీ రీకర్జమునకు కడంగిరి. హిందూరాజులకాలమందును, ముసల్మాను ఏలికల సమయమందును భారతాంబ దారిద్ర్యము నెఱుగదు. తాను తయారుచేయువస్తువుల నన్య సీమల కంపి, అంతర్జాతీయవాణిజ్యమున ముందంజ వేసి ధనధాన్యములతో తులతూగుచుండెడిది. ఈవాణిజ్యముపై కన్నువేసినవారు పాశ్చాత్యులే! ముసల్మానుసోదరులవలె భారతభూమి నిమాతృదేశ మొనరించుకొని, భారత విభూతిని భారతావనికై వెచ్చించుట వీరియాశయము కాదు. భారతవర్తకమును తమవర్తకము జేసికొని, భారతదేశమునుండి ధనరాసులను తమదేశమునకు పట్టించుటే వీరిప్రధానోద్దేశము. ఈయుద్దేశసిద్ధిని దృష్టినిడికొనియే రాజకీయమైన అధికారమును హస్తగతము గావించుకొనిరి.

ఇగ్లాండున లభించునవి బొగ్గు, ఇనుము మాత్రమే! కావున నిగ్లాండున కావశ్య పదార్థములను సప్లయిచేయవలసిన బాధ్యత భారతదేశమునకు చెందినది. భారతభూమి నుండి ముడివస్తువులను గొంపోయి, వీరిక్కై చక్కనివస్తువులను తయారొనరించి వీరికి పంపుట ఆంగ్లేయులపనియైనది. ఈయుద్దేశము నెరవేరవలె ననిన వీరు బహుళోపాయముల శరణ్యము నందితీరవలెను. తొలుత భారత పరిశ్రమలు పడిపోవలెను. భారతవస్తువు లొక్క చోటినుండి వేఱొకచోటునకు పన్నుభారముతో కుంటుకొనిపోవలెను. పెద్దమొత్తమునకుగాని ఒరులకు లభింపరాదు. ఇంగ్లాండునుంచి ఇండియాకేవులను, ఈరేవులనుండి దేశాంతర్భాగములను ఆంగ్లఫేక్టరీలందు తయారైనపదార్థములు అవలీలగ చేరుకొనవలెను. కావున నోడకేవులును, రైలుకేవులును రాళ్లవలె గాక బెండులవలె నుండవలెను. నోట్ల సరఫరా,నాణెముల చెలామణీ లాభంపుమొగ్గను తమవంకకు ద్రిప్పవలెను. అధికారము చేతిలో నున్నపుడు వీనికి సంబంధించినతంతు జరుపుట అమ్మక్కకాదు. ఇండియాసొమ్ము ఇంగ్లాండును ఇంగ్లీషుదేశస్థులను చేరుట కింకను వ్యవస్థలు చేయబడినవి. ఇవి రాజకీయములకు సంబంధించినవి. ఉద్యోగస్థులవేతనములు, ప్రభుత్వవ్యయము, సైన్యపువెచ్చము మున్నగు వానియందీవ్యవస్థలు కలవు. నూటయేబదేండ్లనుండి విజృంభించుచున్న రాజకీయార్థికకారణముతే భారతకృషీకుని ప్రస్తుతస్థితికి దెచ్చినవి. ఈస్థితిని మాపుచేయునది స్వరాజ్యమే! జంకుగొంకులకు తావీయక, మొమోటకు చోటొసగక గ్రంథకర్తగా రీయంశముల నన్నిటిని కడుంగడు చక్కగా వివరించిరి.

“బ్రిటిషుపాలనమందలి లాభములను” మననముచేసికొనువారు చప్పున నీ గ్రంథమును చేబట్టవలెను. విషయపరిజ్ఞానము నెఱుగక రొంపిలో నిలిచినరైతులు వెంటనే ఇందలి యంశములను హృదయంగమ మొనరించుకొన వలెను. గ్రామపునరుద్ధరణ మొనరింప గంకణముగట్టుకొనిన దేశసేవకు లిందలివిషయముల నచిరములో జీర్ణించుకొనవలెను. భావినాయ

కులు కాగోరువిద్యార్థులును, సత్యముపై మక్కువగల జిజ్ఞాసువులును దీనిని పుంఖాను పుంఖముగ పరికింపవలెను. ఇందలి పరిజ్ఞానము ఈవిషయమునకు సంబంధించిన గభీరపఠన మునకు మార్గదర్శకము కాగలదు. నేడు మిక్కిలి యక్కరైన గ్రంథమును రచించిన శ్రీ దేశ రాజు రామచంద్రరావుగారెంతయు వంద నీయులు. —జో. స.

---

## మేఘసందేశము

[కాళిదాసకృతికి తెనుగు]

[రచయిత: మాడభూషి మతం వేంకటాచార్యులు, బి.ఏ., ప్లీడరు, తిరుపతి. వెల ఎనిమిదణాలు]

కవులలో ముఖ్యుడయిన కాళిదాసు కావ్యములందలి మేల్పవిచూడంగా నీ కావ్యము దెలిగింపగొనినట్లు వేంకటాచార్యులుగారు మనవిచేసినారు. ఇదివరకే దీని నెందరో తెలిగించినారు. ఎన్నిమార్లు చదివినను చాలని పించని భావములకూర్పు మేఘసందేశము. కావున వీరి ప్రయత్నముకూడ అపేక్షణీయమే. మూలమునందలి భావసంపదను తెలుగులోనికి దేబ్రయత్నించినమాట వాస్తవమే కాని, వేంకటాచార్యులుగారు తెలుగునడకకు గాని, అన్వయశుద్ధికిగాని, రససిద్ధికి గాని ఎక్కువ లక్ష్యమును, మిక్కిలి ప్రయత్నమును గన్పరచినట్లు ప్రస్తుతగ్రంథము సాక్ష్యమివ్వజాలకున్నది. ప్రతిపదమనోహరమైన మూల మేఘసందేశము ఇందులో యథావత్తుగా ప్రతిబింబించుట లేదు. మొట్టమొదటి పద్యమునే నిదర్శనముగా గ్రహింపవచ్చును:

> "ఒక యక్షుండు ప్రమత్తుడౌటc దన యు
> ద్యోగంబునన్, ఱేడు వా
> నికి శాపంబిడ నొక్కవత్సరము ష
> త్నింబాయc, దానుండెc బెం
> పుకొటింతై జనకాత్మజాప్లవ పరీ
> పూతోదకచ్ఛాయ వృ
> క్షకదంబోజ్జ్వల రమ్యరామగిరి వి
> స్తారాశ్రమక్షోణులన్."

'కశ్చిత్కాంతావిరహగురుణా' అను మూల శ్లోకమునందలి భాషా, భావసౌందర్యమునకును ఈ తెలుగుపద్యమందలి దాని యనుకృతికిని గల తారతమ్యమును వివరింప నక్కర లేకయే రసికపాఠకులు గ్రహింపగలరు. 'యక్షశ్చక్రే - జనకతనయాస్నానపుణ్యోదకేషు, స్నిగ్ధచ్ఛాయాతరుషు వసతిం రామగిర్యాశ్రమేషు' అని రామగిర్యాశ్రమములకు కాళిదాసు కూర్చిన విడివిడి విశేషణముల సందర్భశుద్ధి, సారళ్యములకును వేంకటాచార్యులుగారు కూర్చిన 'జనకాత్మజాప్లవపరీపూతోదకచ్ఛాయ వృక్షకదంబోజ్జ్వల రమ్యరామగిరి విస్తారాశ్రమక్షోణులన్' అనెడి దీర్ఘసమాసమందలివానికిని బింబ ప్రతిబింబతయే కన్పించకున్నది. ('ఛాయవృక్ష' శబ్ద సాధుత్వమును వేంకటాచార్యులుగారు ఎట్లు సమర్థింతురో తెలియకున్నది.) ఇటువంటి అనుకరణములవలన మూలమునందలి మేల్పవి గ్రహింపనోపుట కష్టసాధ్యము.

—'ఆచార్య.'

---

## అమరుకావ్యము

[నెల్లూరునివాసులు గుఱ్ఱము వేంకట సుబ్రహ్మణ్యముగారు (బి.ఏ.,బి.ఎల్) దీనిని సంస్కృతమూలమునుండి అనువదించి ప్రకటించినారు.]

ఇది యొక శృంగారచాటువుల సంపుటము. అమరుకవి రచించినది కాబట్టి ఇది అతని పేరుతోనే అమరుకావ్యమని వ్యవహరింపబడుచున్నది. ఇందలి ఒక్కొక్కచాటువు ఒక్కొక్క శృంగారరసగుళిక యని చెప్పవచ్చును. 'అమరుకకవే రేకః శ్లోకః ప్రబంధశతాయతే' అన్నంతటి ప్రతిష్ఠబడసిన దీకావ్యము. ఇంత రసవత్తమముగా పరిగణింపబడు నీకావ్యమును తెలుగులోనికి పరివర్తించి ఏతత్కావ్యామృతమును తెలుగువారాస్వాదింప నవకాశము గలుగజేసిన సుబ్రహ్మణ్యముగారి ప్రయత్నము శ్లాఘనీయము. ఇదివరకే దీనికి ఒకటి రెండు అనువాదము లున్నట్లు తెలియుచున్నది గాని 'క్షణేక్షణే య న్నవతాముపైతి తదేవ రూపం రమణీయతాయాః' అన్నట్లు ఈ రసగుళికలకు ఎందరెన్నివిధముల రూపకల్పన జేసినను అవి క్షణక్షణనవములే యగుచుండుననిమాత్రము చెప్పవచ్చును. సుబ్రహ్మణ్యముగారు దీని ననువదించుటలో మూలమును చక్కగా అర్థముచేసికొని, మూలభావములు సొట్టపోకుండ తెలుగుపద్యములు రచించినట్లు స్పష్టమగుచున్నది. రచనముకూడ వారి 'ఋతుసంహారము' వలె దుర్భేద్యము గాకుండ సరళముగాను, ధారావాహికముగాను, రసవంతముగాను నడచినది. ఒక్కొక్కపద్యమునకును అవతారికలవంటి సూచనలను పుటల కడుగుభాగమున పాఠకుల సౌకర్యార్థమై రచయితలు ఇచ్చియున్నారు. అమరుకవినిగురించియు, అతని కావ్యమును గురించియు, సుబ్రహ్మణ్యముగారి అనువాదమునుగురించియు విపులముగా కాటూరి వేంకటేశ్వరరావుగారు తమ ఉపోద్ఘాతములో తెలిపియున్నారు. —'ఆచార్య.'

---

# గ్రంథస్వీకారము

## విద్యార్థి

[నిజాము కళాశాల తెనుగు సారస్వత సాంవత్సరిక సంచిక] వెల రు ౧-౦-౦

ముఖ్య సంపాదకుడు: విద్వాన్ సరిపల్లి విశ్వనాథశాస్త్రి, యం. ఏ.

ప్రకాశకుడు: ప్రెసిడెంటు, తెలుగు లిటరరీ యూనియన్, నైజాం కాలేజి. హైదరాబాదు (దక్కను)

---

## ఆంధ్రపత్రిక—ఉగాదిసంచిక

బహుధాన్య ౧౯౩౮—౩౯

మామూలుసైజు. ఆర్టుపేపరు. దాదాపు ౧౫౦ పుటలు. వెల రు. ౧-౦-౦

ఆంధ్రపత్రికా కార్యాలయము, ౭, తంబుశెట్టివీథి, మదరాసు.

---

## గ్రంథాలయములకు వలయు నాంధ్రగ్రంథముల రెండవపట్టిక

మద్రాసు గ్రంథాలయ ప్రచారకసంఘము వారు (తిరువల్లిక్కేణి, మదరాసు) దీనిని ప్రకటించిరి. వెల రెండణాలు.

### భగవద్గీత (వచనము)

చిన్నసైజున ౧౬౦ పుటలు. వెల రెండణాలు తపాలుబిళ్లలు. అవి ముందే పంపవలెను. కర్త: తుపాకుల అనంత భూపాలుడు (పదునెనిమిదవ శతాబ్ది). ప్రకాశకులు: గీతాప్రచార పరివత్తువారు, ఎలమంచిలి, విశాఖపట్టణము జిల్లా.

---

### ఆంధ్ర గణితము

౧. (నాల్గవతరగతి పు. ౨౨౬. వెల రు. ౦-౧౦-౦.

౨. (ఐదవతరగతి) పు. ౨౫౬. వెల రు. ౦-౧౨-౦.

౩. (మొదటిఫారము) పు. ౨౮౬. వెల రు. ౦-౧౪-౦.

౪. (రెండవఫారము) పు. ౨౮౫. వెల రు. ౧-౦-౦.

౫. (మూడవఫారము) పు. ౩౨౭. వెల రు. ౧-౨-౦

గ్రంథకర్త: గిడుగు నరసింహమూర్తి, బి. ఏ., యల్. టి. ప్రధానగణితాధ్యాపకుడు, జి. సి. బి. హైస్కూలు, తురుమెళ్ల, గుంటూరుజిల్లా.

ఇవి ఆయాతరగతులలో వాడుకకని వ్రాయబడినవి.

### Great Expectations.

(An exposition of the Problems of Hyderabad from the peoples point of View)

[క్రౌను ౧/౮, సైజు, పు. ౧౧౨, వెల ౦-౮-౦ ప్రకాశకుడు: బి. ఏ. రావు, బెంగుళూరుసిటీ]

౧. (అభినవ) సుమతిశతకము (నాలవ ముద్రణము. ౧౯౩౭ సం.)

౨. భరతుడు (ఆరవకూర్పు.౧౯౩౮సం.)

౩. విశ్వామిత్రుడు (రెండవకూరుపు.)

ఈమూడుగ్రంథముల రచయిత: దుర్భా సుబ్రహ్మణ్యశర్మ, తెలుగులెక్చరరు, వి. ఆర్. కాలేజి, నెల్లూరు.

---

## భారతీయ మహిళామండలి



శ్రీమతి ఆచంట శారదాదేవిగారు

శ్రీయుత ఆచంట వెంకట్రామశర్మ, బి. ఎ., బి. యల్., గారి సతీమణి. ఈమె బందరు లేడీ యాంప్తిల్ గవర్నమెంటు గరల్సు హైస్కూలు విద్యార్థిని. ఈమధ్య జరుపబడిన వక్తృత్వ, వ్యాసరచన, ఏకపాత్రాభినయముల పోటీలలో పాల్గొని ప్రథమబహుమతులను బడసినది. మరియు బ్యాడ్‌మింటన్, వాలీబాల్, నెట్‌బాల్ వగైరా ఆటలపందెములలో పాల్గొని ప్రథమబహుమానములను బడసినది.




వైద్యకుశల డా. యం. సి. పౌనెను లూకోసునతి

తిరువాంకూరు ప్రభుత్వమున సర్జనుజనరులు పదము నధిష్ఠించిన ప్రథమయువతి

---

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor:—K. Nageswara Rao.

# భారతి

## సచిత్ర
## మాసపత్రిక

సంపాదకుడు

శి. శంభుప్రసాద్

ఆంధ్రపత్రికా ముద్రాలయము,
మద్రాసు.

౧౯౩౮

సంపుటము ౧౫, సంచిక ౫

# విషయసూచిక

# భారతి చందాదార్లకు హెచ్చరిక

ఈ క్రింది కనబరచిన నెంబర్ల వారికి ఈ నెల (1938 సం. మే నెల)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమున కగు చందా మాకు చేరునట్లు ఈనెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమయొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్ము రానిచో సహజభాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరము వఱకు చందాదారులుగ నుందురను నమ్మకముతో 1938 సం. జూన్ 10-వ తేదిని రూ 6-4-0 లకు వి.పి. పంపుచున్నాము. గావున తామెప్పటివలెనే పత్రికయం దభిమానముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన ప్రార్థితులు. ఒకవేళ తమ కీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మా కావిషయము వెంటనే తెలియజేసినయెడల వి. పి. పంపుట నాపుదుము.

A 4, 15. B 2. C 1. G 2. H 18, 19. J 2. N 6, 9. P 7, 8, 9.
R 12, 13, 14, 36. S 22, 25, 26, 27, 29, 30, 31, 94, 102. V 11, 12, 13.

---

# తుదిమ్రొక్కు

ఈ బహుధాన్య సంవత్సర చైత్ర శుద్ధద్వాదశీ సోమవారమునాడు మధ్యాహ్నముతో శ్రీనాగేశ్వరరావు పంతులుగారి భవ్యజీవితముయొక్క చరమాధ్యాయము పరిసమాప్తినొందినది.

పంతులుగారి యారోగ్యము చెడియించుమించుగ నొక్క సంవత్సరమునకు మించినది. ఇంతకాలమును తమ్ము పైకొనిన భయంకరవ్యాధితో పోరాడినారు వారు. వార్ధకము, నిరంతరపరిశ్రమము కారణముగా బలము క్రుంగిన పంతులుగారిశరీరము నానాటికి ప్రాబల్యమునొందుచుండిన వ్యాధికి లొంగిపోయినది. దాని యాటుపోటులకు దాళజాలక కృశించి చివికిచివికి చితికిపోయినది. చితికిపోయిన యాశరీరమునుండి, డెబ్బదియేండ్లకాల మం దఖండముగ ప్రజ్వరిల్లుచుండిన జీవనజ్యోతి ఆరిపోయినది. దేశమంతయు విషాదాంధకారమున నొక్కమారుగ మునిగిపోయినది.

తనదేశమును నానాముఖముల సచేతనముగ నొనరించి యుద్ధరించిన 'దేశోద్ధారకుఁడు' విగతచేతనుఁడయిపోయినాఁడు! తేజోవంతములయి కళలను జిమ్ముచు తనయాంధ్రభూమిని కళాపూర్ణముగావించిన 'కళాప్రపూర్ణ'ునినేత్రములు కళావిహీనములయి శాశ్వతముగ మూతలుపడిపోయినవి! తన కమృతాంజనము కురిసిన సర్వస్వమును వినియోగించి తనయాంధ్రప్రజకు చిరస్థితిని సమకూర్చిన 'విశ్వదాత' నేడు మృతుడయి తనస్థితిని కోలుపోయినాడు! ఎంతవైపరీత్యము!!

ఆ చనిపోయిననాడు మరణశయ్యపయి వీరశయనమునన్న యా మహాపురుషుని ప్రశాంతగంభీరముఖమండలమును దర్శించినంతనే గుండె నీరయి కన్నులు నిండిపోయినది. దర్శన మలభ్యమయినది. దుఃఖభారము క్రుంగదీయ నటనిలువనుగూడ వలనుగాకపోయినది. చేతు లొకమారు జోడించి మ్రొక్కి దూరమునకు తొలగకుండుట సాధ్యముకాకపోయినది. అదియే తుదిమ్రొక్కు. ఇకనెన్నడు నామహనీయుని భౌతికమూర్తిని దర్శింపబోము. అది యానాటితోనే తీరిపోయెను.

పంతులుగారి గుణగణము లిన్నియన్నియని యెన్నుటకును, ఇట్టివట్టివని నిర్ణయించుటకును ఎవ్వరికిని సాధ్యముకాదు. వారిహృదయ మొకమహాసముద్రము. దానివిరివిని, లోతును దెలియ శక్యమెవ్వరికిని గాదు. వారిధైర్య మొకమహాపర్వతము. దానిపరపును, ఎత్తును కనుగొన నెవ్వరును జాలరు. ఆంధ్రమహాజనులు సంతాపావిష్కరణరూపమున ననేకవిధములనాదుష్కరకార్యము నెట్లో సాగించుచు సంతృప్తులగుచున్నారు కాని సాఫల్యముమాత్రము మృగ్యమగు చున్నది. ఎందఱివర్ణనలను కలిపి సమన్వయించిచూచినను, పంతులుగారి యాంతరంగిక స్వరూపతత్వ మిదమిత్థమని నిశ్చయముగా తెలిసికొన నెవ్వరును సమర్థులు కాజాలరు.

ఆంధ్రదేశమున మహాపురుషుల లెక్కకెక్కినవారు పలువురున్నారు. వా రొక్కొక్క రొక్కొక్కవిధమున నే ప్రసిద్ధికెక్కి మహాపురుషుల పద్దున బడినవారు. అంతే. పంతులుగారివలె బహుముఖముల ప్రసిద్ధిగన్నవారు కారు. పంతులుగారు మహాపురుషులలో మహాపురుషుడు. ఎంద ఱెన్నితెఱగుల బాగడినను ఇంకను పొగడవలసిన గుణములు వారియందు మిగులుపడియే యుండును. అట్టివా రింకొక్కరేరీ ఇంత సువిశాలమయిన యాంధ్రదేశమున!

పంతులుగారు త్యాగమూర్తి. ఈ యొక్కమాటలో నిమిడిపోయినది వారియంత విశిష్టతయును. నేడాంధ్రదేశముననేకాక నిఖిల భారతదేశమునను నిండి నిరంతరము వెలుగుల జిమ్ముచున్న కీర్తిచంద్రిక లామూర్తి నుండియే యుత్పన్నము లయినవి. అవి చిరంజీవములు. అవియే వారి స్మృతిచిహ్నములు. ఇక నెవ్వరేమి చేసినను అది కేవలము వాలకము.

గన్నవరపు సుబ్బరామయ్య

---

# స్మృతిగీతము

పెమ్మరాజు లక్ష్మీపతి

ఔర ! యీవార్త భూకంపమట్లు, యాంధ్ర
ధారుణిపునాదు లదర కదల్చివైచె;
ఇమ్మహోత్పాతవశమయి యీ తెలుంగు
గడ్డలోనున్న బంగారు గనిమె క్రుంగె.

రెండుకోట్ల తెలుగువారి హృదయములను
వెలుగుదీపము లొకసారి నిలిచిపోయి
చిమ్మచీకట్లలోన ముంచినవి మమ్ము;
అతడ కేంద్రవిద్యుద్దీప మాంధ్రభువికి-

అతనిజననంబు శివము జీవితము శివము,
అతనిత్యాగంబు శివ మాశయంబు శివము,
వెరపు విశ్రాంతి యెరుగని వీరశైవుఁ
డతనిఁ గౌగిట గొని శివు డాడిపోవు-

ధనము గడియింప దగిన విధానములను
మోటతో చేదినాడు సముద్రజలము,
ఈవి యేనుగుపాడిగా నెనయజేసి
నాడు నాగేశ్వరుడు కాశీనాథకులుడు-

అతని దేవాలయం బఖిలాంధ్రదేశ
మందు వెలుగొందుజనసంఘ మతనిశివుడు;
తెలుగుజాతికి ప్రాణప్రతిష్ఠ జేసి
ప్రథమ పూజారియై మహారాధ్యు డయ్యె.

కాలు సేతులు మొలచిన కర్మయోగ
మాతనిప్రవృత్తి; యత డొక వ్యక్తిజీవి
తావధులు లేని సితకలశార్ణవంబు;
వానిక్రీడన మొకనూత్న భాగవతము.

ఆంధ్రజాతీయతానవోద్యమము పేరి
యమలజంబూనదీప్రవాహంబు ప్రహరి
దిరుగుచుండెడి మేరుధాత్రీధరం బ
తండు; యీనాటిసృష్టి కాధార మతడు!

అతనియూర్జనమున కంతరార్థ మీవి,
వాని త్యాగంబునకును కైవల్య మవధి;
అతని కైవల్యధామ మీ యావదాంధ్ర
విషయసముపాస్యలక్ష్మి! ఆ-వెండికొండ!

ఆంధ్రజాతీయజీవనోద్యమపువల్లి
ఆరముగ్గినపండయి యవని రాలె
నతనిదేహంబు; అందలి యమృతబీజ
ములను కాపాడుకొను మాంధ్రభూపురంధ్రి!

# భారతి

సంపు. ౧౫ — బహుధాన్య, వైశాఖమాసము ( మే 1938) — సంఖ్య ౫


## బోధిసత్త్వుఁడు


సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి


ఒకతూరి బోధిసత్త్వం
డకలంకప్రకృతి బ్రాహ్మణాన్వయమందున్
సకలగుణార్ణవుఁ డగు పు
త్త్రకుఁడై శుభలగ్నమందుఁ బ్రభవంబందెన్.

పున్నమచందమామ నగు
ముద్దు మొగంబును, దమ్మిరేకులన్
గన్నపడాగఁ జేయు నయ
నమ్ములుఁ, జక్కనిమొత్త నెన్నొసల్,
వెన్నురముల్, దృఢాంగమును,
నిక్కిన మూఁపులు, దీర్ఘబాహువుల్,
సొన్నపుమేనిచాయ దగి
శోభిలు నాతఁడు చక్కనయ్య నాన్.

వానికన్నముందో? వానితోడనో? పుట్టె
భూతదయ ప్రభూతముగ నెడంద
శాంతిదాంతితొట్టి సద్గుణసముదాయ
ముగ్గుపాలతోడ నుప్పతిల్లె.

కలవకయ సకలవిద్యలుఁ
గరామలక మయ్యె; సందుఁగల ధర్మంబుల్
చరియించుచుండుఁ దూచాఁ
బరిత్యజింపక యతండు బాల్యమునుండిన్.

కుంటిగ్రుడ్డులఁ జేరి కూడుగుడ్డ లొసంగి
వలసిన యుపచారముల నొసఁగి
నాఁకలిగొన్న నాగాంతకునకునైనఁ
గొంచక మెయికండఁ గోసియిచ్చుఁ
బ్రాణంబుల హరించు పాఁపపుర్వుల నేనిఁ
గన్నబిడ్డలరీతిఁ గాచి వదలు
నలికంగఁబడుచున్న తరుగుల్మముల నేనిఁ
గొని కంటఁ దడిపెట్టుకొనుచునుండు

ఎత్తువడ్డపసుల నెత్తి మూఁపున మోయుఁ
బులుఁగు కాలువిఱుగఁ బూయు మందు
వతఁడు ముల్లువిఱుగఁ బ్రాణిమాత్రమునకు
బిట్టు పొగులుఁ దేలు కుట్టినట్లు.

చదువును, జక్కఁదనమును,
గుదురును, దనమనసుఁ జూఱగొన వచ్చె యశో
సుదతీరత్నము తెలియని
మదనావేశమున నాకుమారునికడకున్.

బలిసె రెట్ట; కండపట్టె శరీరంబు
గట్టిపాటె; మీసకట్టు వచ్చె;
జవ్వనంపుమిసిమి సర్వాంగముల నిండఁ
గన్నులను విరక్తి చిన్నెలొదవె.

చక్కనిచుక్కలై, చదువు
సంపదలన్, శుభలక్షణంబులన్,
మిక్కిలివారలై, రమణి
నిక్షదలఁ పించెడిచొక్కుమందులై,

చక్కెరవిల్తుకోలలంబు,
చక్కెర బొమ్మలు నైనవారలన్
బెక్కురువిప్రు లాతనికి
బిడ్డల నీయఁగ వచ్చి రత్తఱిన్.

తన యెత్తు ధనము వోయుదు
మని తమబిడ్డలను బెండ్లియాడు మటంచున్
వినిపింప వార లాతఁడు
వనితయనినఁ గంపతోడుగువలె నెంచె మదిన్.

ఎందఱొ సుందరుల్ వలవ
రింత్రు జపించుచు వానినామమున్;
ఎందఱొ వానిపొం దఖిల
మించుచు వేల్పుల మ్రొక్కుకొందు; రిం
కెందఱొ మంత్రమాఁకులు వ
హింతురు వానివశంబు సేకొనన్;
అందనిమ్రానిపండుకయి
యఱ్ఱులు సాఁచుటగా నెఱుంగమిన్.

వంచినతల యెత్తఁడు; నో
ప్పించఁడు పల్లెత్తుమాటఁ బెఱవారల; వీ
క్షించఁడు వెలిచూపునను బ్ర
పంచము; లోచూపు వదలి వర్తిలఁ డెపుడున్.

పరిణతప్రాయమునఁ గాని పడయరాని
దృఢవిరాగంబును గురూపదేశమునను
గాని కొనరానితత్త్వవిజ్ఞాన మతని
వలచి వచ్చెనో నిండుజవ్వనముఁ జూచి!

నలికంగఁబడుచున్న తరుగుల్మవల్లీక
దంబంబు శాంతిపాఠంబు నేర్పఁ
గంటకక్షతులచేఁ గదలంగఁబాలని
పాషాణములు దృఢవ్రతతఁ గఱప
క్షణభంగురములైన జలబుద్బుదంబులు
దేహాస్థిరత్వంబుఁ దెలుపుచుండఁ
బాడుపుట్టగుంకులు దినంబును బొందు వేవెల్గు
జన్మపారంపరిం జదువఁజేయ

వెలుఁగుఁజీఁకట్లు సుఖదుఃఖములయశాశ్వ
తత్వ మెఱిఁగింప, నాత్మనిత్యతను ఖాడ
శైలసంతతి, యాచార్యుఁ డేల వలయు ?
క్షితినిఁ దత్త్వోపదేశంబు సేయుటకును.

అపరశుకమహర్షి యంచుఁ గొందఱు వల్కఁ
జెప్పఁ బెక్కుమంది సిద్ధుఁ డనుచు
యౌవనమున దుర్జయంబైన యింద్రియ
గ్రామ మడఁచి లెస్స గ్రాలె నతఁడు.

మనమున జనియించెను బ్రా
క్తనసంస్కారమున మోక్షకాంక్ష యతనికిన్
గనువేదుఱుగల యాజ
వ్వనంబునన లౌకికస్వభావుం డగుటన్.

నరులకుఁ గలిగెడు నానా
జరామరణదుఃఖవితతి సహ్యముగామిన్
భారలఁగఁ గన్ని రతఁ డొం
టరిగాఁ గూర్చుండి యిట్లు డెందఁ దలంచెన్.

పాపభూయిష్ఠమగు నీప్రపంచకమునఁ
బుట్టుఁ; జచ్చును, గ్రమ్మఱఁ బుట్టుఁ; జచ్చుఁ;
బుట్టుచావులు వెండియుం బొందుకొనుచుఁ
జక్రనేమిక్రమంబున జనుఁడు తిరుగు.

పలువిధక్రిమికీటములకుఁ బావల మయి
పాడ్వడ్డ చీఁకటిబావియంచు
నలువలంకులఁ దీరములు లేనియుల్లోల
కల్లోలమగు లోఁతుకడలియంచు
బొబ్బరిల్లుచు సింగములు పులుల్ పొదరిండ్లఁ
గడుకొన్న దట్టంపుటడవియంచుఁ
గ్రుళ్ళి పుర్వులు పడి రోఁత సేయుచు గాలు
గొలిపెడు పెనుఱొచ్చుగుంటయంచు

రోసి సంసారముం బాసి కోసివేసి
దారపుత్రధనాదిబంధముల నెల్ల
నారలు ధరించి పడసి మనఃప్రశాంతి
నడవిఁ బట్టిరి మనతొంటియార్యజనులు.

పూఁతపసిఁడివోలెఁ; బొదిగి చక్కెరతోడ
మాటినట్టి విసపుమాత్రపగిది
నైహికాత్మసౌఖ్య మాపాతహృద్యంబు
తుదికిఁ దద్రహస్య మెదకుఁ దెలియు.

గిరిఁ ద్రవ్వి యెలుకఁ బట్టిన
కరణి వ్యయపఱచి యమూల్యకాలంబెల్లన్
నరుఁ డణుతరసుఖమునకై
పరిశ్రమించుచు వహించు బహుదుఃఖములన్,

కుడితిఁబడ్డయెలుక వడువునఁ; బెనురొంపిఁ
గూలఁబడ్డయేన్గు గున్నభాతి;
ముండ్లకొమ్మఁ బడ్డపుట్టంబునై జనుం
డైహికములఁ జిక్కి యలఁతఁ గాంచు.

మలభాండంబగు నీశరీరమును స
మ్మానించి వైకేసి భూ
షలఁ జీనాంబరరాశి, రేఁబవ లిదే
స్వర్గం బిదే మోక్షమం,
చలరుంబోఁడులఁ గూడి మానవుఁడు నా
ట్యంబాడుచుం బాడుచున్
గులుకుంబంగరుతూఁగుటు య్యేలలఁ దూఁ
గుం దత్త్వసమ్మూఢుఁడై.

తన దార పుత్ర ధనములు
దను వెనుకొని వచ్చుననియొ, తా నీలోకం
బున నుట్టి గట్టి యూఁగుదు
ననియో,యనుకొనునుమర్త్యుఁడరయఁడుపరమున్.

మేడల్ మిద్దెలు దొడ్లుఁ దోఁటలును ని
ర్మింపన్ వలెన్, గ్రొత్త పెం
డ్లాడంగావలె యౌవతంబును, నమూ
ల్యంబైన భూషాదులన్
వాడంగాఁ గొనఁగావలె న్న నుచుఁ జిం
తల్ సేయుఁగానీ నరుం
డేఁడున్ వార్ధకమందు నేని విడఁ డి
స్సీ తృష్ణ యావంతయున్.

తనజీవితలక్ష్యం బే
మని, దానిని డాయుమార్గ మది యే మన్నియున్
అనుకొనఁ డేకోశమునను
మనుజుం డొకపరియు మోహమగ్నత్వమునన్.

ఆత్మలక్ష్యరోధు లగుచున్న యాంతర
శత్రువుల జయింపఁజాల కిస్సి!
బాహ్యశత్రుగణము పయికేల దండెత్త?
నింట గెలిచి రచ్చ కెక్కఁ జెల్లు.

మొలకెత్తి మొడఁదమూలను,
మెలమెలఁగా సాఁగి, యాక్రమించి కలంకుల్
బలపడి పెనంచికొనుఁ గొ
మ్మల నాశాలతికఁ ద్రెంప మనుజున కగునే?

ఒకవిషయము సిద్ధింప, మ
రొకవిషయముపైకిఁ బ్రాఁకు; నొదవిన నదివే
ఱొకవిషయమునకు సాఁగును
సకలం బీవరుసఁ దృష్ణ జగ మల్లుకొనున్.

ఆశవలనఁ గ్రోధ మద్దానఁ బాపంబు
దాన నరక మీవిధముగ సతము
ఆశ వేరు దన్ని యజ్ఞానముం బెంచి
భవపరంపరలకుఁ బనుచు జనుని.

సరిరా దైహికసుఖముం
బరలోకసుఖంబుఁ గోటిపాలున కేనిం
బురుషునిమనసున కాశను
బరిమార్చుటవలనఁ గలుగుపరమసుఖమునన్.

అంటుకొన్నఁ దగిలి తంటసం బన లాగు
విషయసంగమంబు వీడిపోక
అడుసుఁద్రొక్క నేల? యడు గేలకడుగంగ?
సన్న్యసించి తపము సలుపుకొందు.
అనుచు దారసంగ్రహము రోసి తృణముగా
నెంచి బంధనములఁ ద్రెంచి మెల్ల
నొక్కనాఁటిరేయి యొంటిమై నతఁ డేగి
యాశ్రయించె నొక్కయాశ్రమంబు.

కాంతాకనకంబుల క
శ్రాంతము దాస్యంబొనర్చు సంసారుల కొ
క్కింతయును బోధిసత్త్వుని
శాంతియుదాంతియు రుచింపఁజాలు నె? యరయన్.

శ్రుతిపర్వముగఁ గల శ్రుతు లొనర్చెడు శకుం
తములు కూర్మిని స్వాగతములు సదివె
నెడనీటి కెనమైనకడుఁ దియ్యనీటితోఁ
బఱచువాఁగులు నీరువట్టు మాన్చె
నారఁబండియు నేల కంటుకొమ్మలుగల్గు
వసుధారుహంబులు పండ్లొసంగె
నల్లిబిల్లిగఁ దీఁగ లల్లి చల్లనినీడ
లిడుచున్నపొదరిండ్లు విడుదు లిచ్చె
కార్ముకంబులు వచ్చి సఖ్యం బొనర్చెఁ
బాపమొత్తంబు పడగల వాల్చి కొలిచె
శాలురప్పలు ముండ్లు మార్దవముఁ బూని
యడుగు లొత్తుచు సేవించె నాతపస్వి.

(క్షాంతివాది జాతకము)

# వరూధిని

## అనువృత్తము

పుట్టపర్తి నారాయణాచార్యులు

అచ్చెరమన సద్దమువంటిది. ఏ భావమునైనను దాచియుంచుట సమయము వచ్చినపుడే వెల్లడించుట మొదలగు "చాకచక్యము" లామె యెరుగనేరదెరుగదు. స్త్రీసహజములగు సిగ్గు, భయము, విభ్రమము మొదలగు భావపరిణామములు గబగబ సినిమాచిత్రములవలె నామె ముఖమున దాండవించును. యౌవనముచేత మొలకెత్తి చిగురించిన చాపల్యము సైజము గాని యవహిత్థకు జోటీయదు. ఒకవస్తువును జూచినపుడు లేక యొకదానిని భావించునపుడు తనకు దోచుతలపును, వెలిపుచ్చువరకు నామెకు నిద్రయేరాదు. రాగతాళములనడుమ విలీనమైయుండిన యామెమనసు నకస్మాత్తుగ ప్రవరు డాకర్షించినాడు. సౌందర్యపరీక్షయందనితరసాధారణమగు చాతుర్య మామెకున్నది గదా! చూచినవెంటనే యాతనిముఖమున దాండవించుముగ్ధత అంగములలోనిమిషమి ప్రవర్తనలోనిన్యాయ్యము స్పష్టముగా గ్రహించినది. అట్టివా డీయెడ కెందుకు వచ్చెను? తానేకాంతమున నున్నయెడ వాని కేమిపని? ఇత్యాదిసందేహము లామెమనసునిండి త్రొణకినవి; కనులు విస్తరించినవి; కనీనికలకాంతి గుమ్మరించి తనివిదీర నాతని జూచినది. గుబ్బచనులు గగుర్పొడిచినవి. మదిని కోరిక లలను కొన్నవి. ఒకటిరెండునిమేషములు గడచినవి... ఇంతలో నెక్కడనుండియో సిగ్గదొంతరలు-వరుసగా నాక్రమించినవి. కడియములఘ్ఘణఝణలతో బిరబిర నొకపొక చెట్టుమాటున కేగినది. ఆనడచునపుడు తుఱుము, లేనడు మల్లలనాడినవట. పోయి, యూరకున్నదా లేదు. అట్లుండుట యాడువారిలక్షణమే గాదు. ఇన్నాళ్లు తప స్సీనాడు ఫలించినదని పొంగిపోవుచు మాటిమాటికి మోచిచూడనట్లు చూచుచున్నది. అప్పటిభావశబలత నీరీతి వర్ణించినాడు పెద్దన:

మునుముగ్ బుట్టెడుకొంకు లౌల్యమునిడన్,
మోదంబు విస్తీర్ణతన్
జొనుపన్, గోర్కులు క్రేళ్లుద్రిప్ప మది మె
చ్చుల్ రెప్పలల్లార్ప, న
త్యనుషంగస్థితి రిచ్చపాటొసగ నొ
య్యారంబునన్ జంద్రికల్
దనుకన్ జూచె లతాంగి భూసురు ప్రఫు
ల్లస్నేత్రపద్మంబులన్.

కొంకు, లౌల్యమును- మోదము, విస్తీర్ణతను-కోర్కులు, క్రేళ్లుద్రిప్పటను-అనుషంగస్థితి, రిచ్చపాటును- మెప్పు, రెప్పలల్లార్పును గలిగించుటలో గొప్ప స్వభావమున్నది. భావమును బెంచుటలో నొకక్రమము పాటింపబడినది. ప్రతిభావమును బైదానికి సహజముగ దారి విడచుచు, వెనుకటి భావమునకు సౌందర్య మొసగుచున్నది. ఒక్కొక్క భావమునందును, అవాంతరములగు తలపులకవకాశ మొసగుట పెద్దనలోని పెద్దపనితనము.

ఎన్న డాపాపమునకు బోని ప్రవరాఖ్యు నామెవిభ్రమము మొదలగువానిని గ్రహించినాడు. వివిక్తస్థలమని మొదలేయెరుగును. అది స్వయముగనే చూచుటచే మరింత స్పష్టమైనది. పురాణపఠనవాసనావశతచే హిమగిరియం దచ్చరలుండి ఋషులనియమముల జెఱచుచుందు రని యెఱిగి కాబోలు పలుకవలయు తెఱగున బలికింపదలచి బెదరుచు చావుధైర్యము దెచ్చుకొని 'యెవ్వతెవే! భీతహరిణేక్షణా! పాపముతో డెవ్వరు లేక!' యని దయ గనుబరచి భూసురుడ నని సహాయపాత్రత్వమును కౌలీనతను సూచించి యాత్మపరాధమునకు పశ్చాత్తాపపడుచు నడుమ నడుమ తిట్టుకొనుచు కర్మనుదూరుచు ప్రారంభించినాడు. కడకు "సహాయమాచరించినచో నీకు శుభమగు"నని గట్టిగా చేతులెత్తి యాశీర్వదించినాడు. బ్రాహ్మణత్వ మెంతపండి ఫలించినదో యాకడపటి చరణము చెప్పుచునే యున్నది.

వరూధిని యాకాంక్షించునది శుభాశీస్సు గాదు; మరి ప్రవరునివంటి యందగాని బిగికౌగిలి. క్షణక్షణోద్భిన్నమగు నవయౌవనమున తనమనసు నగలించు యొకకోరికకై యిన్నిదినము లాగినది. దైవయోగమున నట్టియవకాశము సిద్ధించినపు డౌచిత్యానౌచిత్యముల విచారమెక్కడిది? వరూధిని యీ ఘట్టమున నాత్మశక్తి నెంతవరకు వినియోగించిన దనవచ్చును-

ప్రవరునిమాటకు "చనుగవయు నడుము వడకు భంగి" "సెలవివాఱ" నవ్వినదట. వయస్సుపోతరమున మొలకెత్తిన భావములు వివేకమునకు జోటొసగుటలేదు. మోము దెగినట్లున్న దామె రసావేశము. అయిన నెంత నాజూకుగా మాటాడుచున్నదో చూడుడు. ఇంతలు కన్నులుండ దెరు వెవ్వరినడిగెదవని చిగురువంటి తనపై వగ్గ్యము జూపినది. భూసురేంద్రా! యని నవ్వినది. ఏకాంతమని సమయానుకూలతను సూచించినది. వచ్చినత్రోవ నెరుగవా యని లేనిచాతుర్యము నాతని కంటగట్టి వరుస కుదించినది. భయము లేదా యని గద్దించినది. ఎల్లిదమై నామా యని స్త్రీసాధారణమగు కపరింతను జల్లినది. పైగా వీటియన్నిటియందును స్వభావసౌకుమార్య మను మచ్చమందు గలిపినది.

ఈ "నర్మగర్భముల"లోని గిలిగింత లాతనికి బట్టలేదు. తనచింతలో తానున్నా డేమిరా పైవమా యని తనమాటలలోని పనితనముపై దృష్టియుంచి నటులగాని గ్రహించినట్లుగాని లేదు. అందుకు చిహ్నము లాతనిముఖముపై నగుపించుటలేదు. చూచినది. వరూధిని తిన్నగా మరల మఱచినపాట మొదలందుకొన్నది. కారణమేమి? ప్రవరుడు కర్మనైష్ఠిక డని యాతనివేషమే సాక్ష్య మిచ్చుచున్నది. అతడు తనకౌలీనత నేమిగా దలచెనో! ఆసందేహ మట్టులే యున్న దనపై మొగమోటము జూపడేమో! యిత్యాదు లామెమనసును బాధించుచున్నవి. మెల్లగా మాటలసందులో శ్రీమహావిష్ణువుభార్య యగు లక్ష్మీదేవి తమకు సాక్షాత్తుగా తోడబుట్టిని పెద్దవారితో బాదరాయణసంబంధము గలిపినది. "ననవిల్తు శాస్త్రపుమినుకు లావర్తించుచోట "వెన్నతోడ" బెట్టినదని సరసతలో నగ్రతాంబూలమునకై చేయిజాచినది. "పద్మసంభవ వైకుంఠభర్గసభలు సాముగరిడీల"ని తన "అరెమనెయధికారమును" నెరపినది.

ళ్లను వరూథిని యని తనయుద్దేశ్యు దెలిపినది. మాటలతో ప్రయోజనము లేదని గాబోలు కనుమ లేదమలపాళువంటి లలితసమాసము కోకదానిని మచ్చునకు జూపినది. కడకు మర్యాదయెరిగిన పెద్దమనిషివోలె "మాయింటి విందైన సత్కారమును స్వీకరించి బసెలిక్కుఁ బోసి చను" మన్నది. అది యెట్టిసత్కారమో? ఇంతవఱకు మాటలు వంకచుట్టుగనే జరిగినవి. సమమనుమ ప్రవరునిముఖమును గమనించి నప్పుడు కొన్ని భావరేఖలు గానుపించినవి. ఇక సహేతు మెప్పుగా నక్కన గారవించు నను కొన్నది పాపము. నిజముగా ప్రవరునికిగాను కన్ను మునిఁగినదిగాని వేఱెట్టిప్రాణియైనను అంక మంత మొందియుండెడిదే.

వరూథినిమాటలలోనిసార మర్థ మైనది ప్రవరునకు. అతఁ డేమి లోకవృత్తమును దెలి యనివాఁ డుడా! సమగ్రముగ విమర్శించి తత్వము మాటగట్టిన మహానుభావుఁడుగదా! తానును డొంకతిరుగుడుగనే సమాధాన మిత్త మనుకొన్నాఁడు. చూపిన బాంగవ్యమును మరిం తదృఢపరచి మనలో మనకు భేదములున్నవా! భావించి నిద్రించిపోయిననేనా కృతార్థత! ఆ మాత్రము పిలిచి యాదరించుభక్తియే పదివేలు గాదా యని వ్యవహారపుమాటలాడి తిన్నగా తనసోదె నారంభించినాడు. అగ్నిహోత్రుడు, జపము, తపము, తలిదండ్రులు అందరిని పనవి పనవి యేడ్చినాడు. ఇల్లని కలవరించినాడు. తన్ను బోనిమ్మన్నాఁడు. తా నింటికి బోకు న్నచో దురంతమగు కర్మహాని వాటిల్లు నని లోనున్న మహాపదను విప్పిచెప్పినాఁ డాయా హితాగ్ని.

ఎంతవఱ కాగగలదు వరూథిని. ఎక్కడి యూ రని యీసడించినది. ఒకచోట నీకు కాలు నిలుచునట్లు లేదే! యని విసుగుతో కస రించి స్పష్టముగా విప్పిచెప్పినది. "నీ పయిని మనసు చిక్కినది. నీవే నన్ను రక్షింపగలవాఁ డవు. లేకున్న విరహవేదనచే క్రుంగిపోదు" నని తనప్రాణము లాతనియొడిలో నుంచినది. ఆ సోమయాజి కీ కొసరింతలలో జాలిగలు గునా? "వ్రతులై దినములు గడపెడువారిని కామింపరాదని" పీనలుకోడ్డు నెత్తిచూపి నాఁడు. ఇక నేమికార్యము? శాస్త్రపండితుఁ డగు ప్రవరు నాకొట్టించుట కనుభవవాదము చాలలేదు. అయిన నూరకోవలిసినదేనా! లేదు ముండెకు నీరుపట్టుకొని మరల హేతు వాదములకు డీకొన్నది. తొలుత "యజ్ఞము లకు ఫలము లప్సరసలకౌగిళ్లని" మీమాంస నంతగా గని యచ్చుకట్టు గూర్చుకొన్నది. ఈయెల్లప్రాయము వైదికకర్మలకు బోగా నిక భోగము లెప్పు డని యాశచూపినది. అసుఖ మిపుడే తనకుదాసై సంప్రాప్తించగా-సిరిరా మోకా లొడ్డుదు వేమయ్యా పిచ్చివాడా! యని లాఘవ మాచరించినది. శరీరస్వర్గసుఖ మని మొకయుత్కృష్టతను ప్రత్యక్షప్రమా ణముచే స్థిరపరచినది. ఇక సర్వవిధముల విప్రుడు పంజరములోనిచిట్టవలె - కుక్కు మిక్కనక లొంగిపోవు ననుకొన్నది. కాని యట్లు జరుగలేదు. "నీవన్న యర్థమెల్ల నిజము కాముకుఁడైనవానికని యొక్కమాటతో ల క్ష్యభేదము చూపి పైవాదమునెల్ల తుంటలు గొట్టినాడు.

కసుకు కడపటియత్నముగా ద్విగుణీకృతో త్సాహముతో ముందుకు నడచి - నడుమున చేయి నాని "అథారిటేటివ్"గా మాటలాడ నారంభించినది. "ఆనందో బ్రహ్మ" యను బుు క్కున కర్థమేమయ్యా! ఆనందము పరమార్థ మనిగాదా! ఆనందము సుఖములో లేదా! యింతటి యన్యాయమా!" యని వాదించినది. ఆ యుపనిషదర్థముతో తన సిద్ధాంతమును గూడ జోడించి చలాకీని గనుపరచిన దా నూతనవిద్యార్థిని. దాని కుత్తరమే లేదు. దాని కుత్తరముచూచి వెడనవ్వు నవ్వినాఁ డాతడు. "తల్లీ! యివన్నియు మీ సిద్ధాంతములు. మా యర్థములు మీ రంగీకరింపరు. మీ యుపన్యా సములు మాకు నచ్చవు. మా భాష్యములు వేరు. మా గురువులు వేరు. పోయివత్తును సెల వని పాదములు వెనుక కీడ్చినాడు. నిస్పృహతే యాతనిముఖమునందు స్పష్టముగా చిత్రితమై యున్నది. ఇక నిలువలేక పోయిన దాగోల. మోము వెల్లనయినది. హృదయము కందినది. కంట నీరుపెట్టి "పుల్కుపుల్కన" జూచి నది. [illegible] సమభవించిన యవమానము. అనుభవింపరేనేయను కడుపులోని దుఃఖము. చెప్పినమాట వినడే యను కోపము. వీటికన్ని టిపైగా చాపల్యము మెఱపులవలె మెఱయు చున్నవి. మనసు మరలుటలేదు. "పోనీలే" యను అభిమానమో, శాంతియో జీవిక యందే గానము. యేమిచేయవచ్చును. దీనస్వరూపిణి యైనది వరూథిని. అప్పటి యామె హృదయావేదన రౌరవమున కన్న ఘోరమైనది. మనవలె మనుష్యకాంత గాదుగదా దుమికిచచ్చుటకు. లేదా ప్రవరు నేయుపాయముచేతనైనను పొందవలెను. కాకున్న బ్రదికి యుండవలె నింతేయా పెగతి. గట్టిగా కన్నులుమూసికొని యొక్కసారి సాహ సింత మనుకొన్నది. ఎంతగొప్ప సిద్ధాంతములు నేర్చియున్నను కార్యభాగమున నందరును మట్టమేగదా! ఒక్కసారిగా పాలిండ్లయం చులు మోపి గట్టిగా గాగిలించుకొన్నది. ఆక్షణమున నేమియానందకణిక ననుభవిం చెనో యంతే. మరునిముసముననే యాతనిచే త్రోపువడి నిలచినది. హరిహరీ! ఆదుస్థితి రసి కుఁడైనవాఁడు తలచనుగూడ రానిది. మరలి ప్రవరుని జూచినది. ఇంతయయ్యెగదా! "లజ్జా పరవశనైనను" కోరిక మానినదా. చనుమిట్ట నఖలు చిందుపొంద వేదనపెప మిడి కలస్వన ములో నేడ్చినదట. బిడ్డచచ్చినను తొట్లమ రులు మానలేదుగదా వరూథిని. ప్రవరుడు, మరల పలుకనేలేదు. ఆమె జవ్వాదిచే కదం బించునొడలు గడుసుకొని వార్చి యగ్నిదేవుని యాశీర్వాదమున నింటిదారి బట్టినాడు.

వరూథిని కాభిజాత్యము లేకపోలేదు. అది సహృదయతను మఱపించదు. సిగ్గు కావలసి నంత యున్నది. అది మనోరథము నెదిరించి నిలువలేదు. నేర్చిన విషయము లనుభవమూల మున గడిదేరినవిగావు. నయమున, భయమున, విలాసమున, చాతుర్యమున సర్వవిధముల శోధించి చూచినది. సరసత్వమున పుణ్యపాప విచార మంతగా లేదని యామె చిన్ననాటి నుండి యెరిగినవిషయము. మనసుగలిసి మమత యున్నచోట ననగిపెనగియుండుటయే జీవిత పరమావధి యని యామె యర్థము జేసి కొన్నది. పరాశరునిదాశకన్యాకేళి, గాధిపట్టి

మేనకతో యొనరించిన చుట్టరికము, మాంద కర్ణియొక్క నాగవాసముల చెలిమి, అహల్యా జారత యివి యీ మెమనోభిప్రాయము నిశ్చితముగా నుండుటకై మొదటినుండియు తీరి కూరుచున్న యుదాహరణములు.

పరోపదేశమున పదియాకులెక్కువ చదివిన పండితు లిది యనౌచిత్యమని వాదింపవచ్చును. నిజమే. వలపెరిగి వచ్చువానితో డిసరసము గాని సాటిలేని ఛాందసునితో నేమిపని? వేరొకడు కులశీలసమన్వితుడు రూపవంతుడు దొరకడా! పోనిమ్మని యూరకుండరాదా! ప్రపంచములోనిపరమార్థమే ఇందులో నిమిడి యున్నది. లౌల్యమును విడిచినవాని నెదిరించు పదార్థమే ప్రపంచమున నుండదు. మరుసటి దినమే వాడు మోక్షమునకు నిచ్చెనసి నిర్మింపవచ్చును. కానీ విడుచు టెవరిపూట! నల్లమందు తిని తూగాడువారి నెంతమందిని జూడము. అల్పాహారము మంచిదనియు, కడుపులకు వేసికూరుట చెడుగనియు, యాయుర్వేదము చాటుచున్నదిగదా! మనపండుగల పరమార్థము రాగరాగ నెట్లుమారినది? కడుపును "గ్రంతలతిత్తి"గా జేయుటయేనా వేరేమైన నున్నదా! మనతండ్రితాతలు కాఫీపానీయము ద్రాగలేదుగదా! కాగా మన దేశపు శీతోష్ణస్థితి కది యంటదనియు నెరుగుదుము. వదలుచున్నామా! బైకలతో నున్న - యాడుదాని కౌక్రమట్టిపైగల మక్కువకన్న మనకు కాఫీపై నభిమానము మెండనుటకు సందేహమున్నదా! ఇంట పెండ్లాము చీదరించుకొన్నను తండ్రి పండ్లునూరినను చెట్లచాటుననో గోడలవెనుకనో సిగరెట్టుగాల్చి-యేమియు నెరుగనివారివలె గుప్పచప్పిడిగా దొడ్డిదారిలో నింటబడువారు లేరా! కొందరికి పేకాటలలో సరదా కొందరికి బ్రాందీ బుడ్లను జూచినవెంటనే వితంతువుల కేకాదశి దయచేసినంత సంతోషము. కొంచెము పట్టుదలను వినియోగించినచో నివన్నియు విడువవచ్చునుగదా! ప్రయత్నించుచున్నామా! బాహాటముగా నెదపైని చేయివైచి చెప్పువార లెందరో లేరనుకొందును. ఇట్టి యల్పవిషయములయందే పుర నివృత్తి యింత ముచ్చటగా నున్నదే యిక బ్రహ్మదేవుడే పుట్టుకతో తయారుచేసియిచ్చిన వాటియందుమాత్రము మన నిగ్రహ మెంత లక్షణముగా బనిచేయును? మనమాట యేమిగాని కొమ్ములుదిరిగినవిజ్ఞానులు పెద్ద "కచ్చడాలు" మొలలకు బిగించినమునులు నీయుద్యమమునకు ప్రయత్నించిరే! వారిలో నెంగరు కృతార్థులైరి? సౌందర్యము మనోహారిత్వమున్నచోట నాశించుట మానవస్వభావము. కాదని వాదించువాడు, పుస్తకముల వల్లెవేసిన పండితుడేగాని ప్రపంచమును బరిశోధించిన యనుభవశాలి గానేరడు. యయిన నివృత్తి యనుధర్మమే యక్కరలేదా! అది గాదు నే నన్నది. లౌల్యము ప్రపంచమున విడదీయరాని గొప్పరహస్యములలో నొకటి. నివృత్తి యందుకన్న ప్రవృత్తియందు మనసు సులభముగా బరుగిడును. అట్టియెడ హృదయము నరికట్టుటకు గొప్ప మేధస్సు గావలెను. ప్రంచమున నందరు విజ్ఞానులుగనే యుండరుగదా! అట్టియెడ నొక వ్యక్తియందు దోషలేశ మున్నంతనే వాడు పనికిమాలినవాడని సిద్ధాంతీకరించుట పొరపాటుగాదా? వాని తక్కినగుణము లెన్ని యున్నను, దీన నొకదానితో నన్నియు దోషములుగనే లెక్కించుపిచ్చి యెందరికి లేదు? నేను విద్యార్థిగా నున్నప్పుడొక్కసారి వేణీసంహారమును జదువుచుంటిని. యుద్ధవార్త ప్రకటింపబడినతరువాత దుర్యోధన చక్రవర్తి భానుమతితో సెలవు గైకొనుటకై వెళ్లును. ఆ ఘట్టమును జదువుచు, "స్వామీ! ప్రకటింపబడినయుద్ధ మేమిటి? యిక్కడ నసభ్యముగా వర్ణించిన యీ విషయపిపాస యేమిటి? దుర్యోధనచక్రవర్తి కింతమాత్ర మౌచిత్యము నూహించు తెలివిలేదా?" యని యడుగగ వారు, "నాయనా! లేకున్న నాయక ప్రతినాయకులకు భేదము గానబడదు. అందులకే యీయంకమును ప్రారంభించినాడు మహాకవి భట్టనారాయణు"డని సెలవిచ్చిరి. నాకు నిజముగా కడుపుచెక్కలగునంత నవ్వు వచ్చినది. మాగురువులు మాననీయులు. వారిని దూషింప [illegible]ప్రాయముగాదు. మనదృష్టి యిట్టిదని విన్నవించుటకే యొకఘట్ట మెత్తిచూపితిని.

అసలు - నివృత్తిధర్మ మెంత ముఖ్యమో ప్రవృత్తియు నంతటిదే. బ్రహ్మదేవు కాయింత లౌల్యము లేకున్నచో ప్రపంచమే పుట్టియుండదు. శంకరుడు భీష్మించి కూర్చొనియున్నచో తారకాసురునిజంపు మగవాడు మనకు కాదు, దేవతల కెక్కడుండును? ఇక విష్ణువున కెంతలాలసత యున్నదో యవతారము లెత్తినపుడెల్ల వేషములు మార్చిమార్చి యలసిన లక్ష్మీదేవి నడుగుడు. మానవులమగు మనకుమాత్రము ప్రవృత్తిరూపమగు కాల్యము లేకున్న పనిజరగునా? అందరు కావిపంచెలుగట్టి సన్యాసులే యైనచో నపుడు భిక్ష బెట్టుసంసారి యెవడుండునో యోచించి చెప్పుడు చూతము.

కొందరు "మనజీవిత మెటులున్నను కడకు ప్రపంచానుభవ మేరీతినున్నను ఉన్నతాదర్శములు మాత్రమే కళలయందు జూపవలెను. నైతికదృష్టిలేనిది కళయేగా"దని వాదింతురు. గొప్పప్రశ్నయే కాని కళయొక్క పరమావధి నీతియేగాదు, ఆత్మానందము. నీతిలేనిచోట నానందమే లేదనునది శాస్త్రపుమాట. కళలో నీతియే యుండరాదని కాదు నాతలపు. నీతిలేని చోట కళయే లేదనరాదని. ఆరీతి జిత్రించుట కవి కనావశ్యకము, అశక్యమును. తాను దృశ్యమాన ప్రపంచమునుండి విషయవికారము లంతయో యింతయో యనుభవించుచు, తన చేతితో తనమెదడుతో తనహృదయముతో తయారైన పాత్రముల మాత్రము కేవలధర్మస్వరూపములుగా జేసి యున్నతాదర్శములతోనే వారి బొజ్జ నెట్లు నింపగలడు? లేదు "కవి ప్రతిభాశాలి, అతని మనస్తత్వము - అతనిజీవితమే వేరుగా నుండును. కాన కవి తయారుచేసిన పాత్రములు గూడ నాదర్శభూతములుగనే యుండు"నందురా? సత్యమే. పరమసత్యమును గావచ్చును. అట్టికావ్యములు మనవాఙ్మయమున నెన్ని యున్నవి? కావ్యము లన్నిటను శృంగారమును పచ్చిపచ్చిగా వర్ణించి కడపట, "క్షనుత విట్లు చేయరాదు" అను నొక్కచిన్ననీతి ముక్క నతికించినచో సత్యస్వరూపమును

శోధించిన ట్లగునా? నాట్య మనునది లోక వృత్తానుకరణ మని భరతముని వ్రాసెను. సంగీతమున రాజసతామసములే మనుష్యులకు గానీ కేవలసాత్వికము దేవతలపాలనిరి. చిత్రలేఖనము మొదలగువానియందంతయు.భావాభివ్యక్తీకరణమే ప్రధాన మనిరి. నగ్నచిత్రముల యందు సౌందర్యము కళాభాగ మున్నది.అట్టి వానిజతలోనే జేరిగెన కవిత్వమునందు మాత్ర మున్నిటియందును లేనినీతి యెక్కడవచ్చినది? నీతిని, సౌందర్యమును రెంటిని జోడించి చెప్పవా డుత్తమోత్తము డుగావచ్చును. కాని నీతిలేనిచోటంతయు కళావేశమే లేదనుట పొరపాటుగదా!

ప్రాచీనులలోను బిభిన్నములను నీ వివాదములు లేకపోలేదు. ఆనందవర్ధను డానందోపాసనయే కావ్యపరమార్థ మనెను. కావ్యప్రకాశకారుడు "నియతికృత నియమరహితాం" అని మధురమధురమగు లక్షణమును నిర్వచించెను. ఆలంకారికులకెల్ల సర్వాచీను డనదగు జగన్నాధపండితకవి "రమణీయార్థముగల శబ్దమే కావ్య"మని చాటెను. అయిన నీనైతికవాద మెక్కడనుండి దిగుమతియైనది. శాస్త్రవీథులనుండియే పరపరాయైనవి. నీతి కొకవిధమగు నిర్ణయము లేదు. నేడొకనీతి, రేపొకనీతి. దేని ననుసరింపవలెను? ఈ నాటి బ్రాహ్మడు చాతుర్వర్ణ్యములలో వివాహమాడరాదుగదా! మాంసమును దినరాదుగదా! మరి పూర్వకాలము ననో నివియన్నియు శిష్టాచారములుగా నుండినవి. వాటినన్నిటిని మన మీనాటిదృష్టితో జూచి నేరమని తిరస్కరింపవచ్చునా? ఒక శతాబ్దిలోనినీతి వేరుకాలముల నుండదు. నేటి ముసోలినీనీతి ఆదరింపదగునీతి. జపానుదాడి యాక్రమ మని భారతదేశము వాపోవుచున్నదే గాని తక్కిన దేశములు తేలుసుట్టినదొంగలవలె నుండలేదా? ఈనాటిపరిస్థితి ననుసరించి యిది నీతి. ప్రాగ్జ్యోతిషపురాజుబిడ్డ నగ్నిదేవు డనుగ్రహించినాడట! అచటివా రందరు స్వైరిణులైరట. ఇట్టివి తడవబోయిన నెన్నియోగలవు. కొందరు నీతియు కాలదేశపాత్రముల ననుసరించి మారు నంటిరిగదా! కాన ప్రతిధానను నైతికస్వరూప ముండనే యున్నది. గ్రహించువాని దృష్టియందే భేద మున్నదని వాదింతురు. కావచ్చును. అడ్డుపడినచోటుల నెల్ల నచ్చుకట్టురాళ్లనువేసి-నీతిని సవరించి పట్టించుటలో నంత నిశితమగు దృష్టి యున్నపుడు, దానినిగూడ నొప్పుకొందుము, కళ కడ్డురానినీతి యెంత యున్నను మాకు పరవాలేదు. అది కళాభివృద్ధికి భంగకరమైననో మాచింత. మరికొందరు 'నీతిలేనినిశ్శృంఖలమగు కళకు చోటే యియ్యము. సంఘమునకు జాతికి, తోడుపడునంతవరకే గదా మనకు కళ యుపకారకము; కనుక, మితముగా వాడుకొందు' మందురు. ఇది రుచిభేదమునకుం జెందినది. దీనినుండి సిద్ధాంతమున కేమిబాధ లేదు. అట్టివారికి వేదములు, ఉపనిషత్తు లుండనేయున్నవి. వాటిలోను వైదోషమంతయో యింతయో లేకపోలేదు. తక్కినవి పనియే లేదందురా? కానిందు; అందరు గలసి బండ్లు గట్టించి గంగానదిలోనికి దోలింతము.

మనయనుభవము మనజీవితము దాని ననుసరించిన మనకళ యన్నియు నీరీతిగనేయుండ పాపము పెద్దనపైనను అతిసుకుమారియగు వరూథినిపైనను మాత్ర మీశిలాపాత మేటి న్యాయ్యము? అందరు కవులకు లేనిది పితామహుని కొక్కనికే వచ్చినదా యీయనీతి? వాత్స్యాయనుడు కామశాస్త్రము-బహ్మాండమంతటి గ్రంథమును వ్రాసినాడు. ఒకటి రెండు ప్రకరణముల మాత్రము పతివ్రతా లక్షణము, స్త్రీరక్షణ మొదలగు రెండుముక్కలు విసరి, తక్కిన దాన నంతయు లాలసతకు పనికివచ్చు చుంబనాదులు... మొదలగునవి నిరూపించినాడు. కడపట నేను చెప్పిన దంతయు వ్యతిరేకవిధముచే గ్రహింపవలెనని దిద్దిపోయినాడు. ఇట్టి వన్నియు న్యాయములైనచో పెద్దన వరూథినీవృత్తాంతమును గూడ వ్యతిరేకవిధిచేతనే గ్రహించి పాప మాశవిని తరింపజేయుదము రెండు.

ప్రవరునివియు నిందు దోష మనుట మహాపరాధము. అతడు శ్రోత్రియుడు, ఆహితాగ్ని. వారిపూర్వులు యజ్ఞము లాచరించి పవిత్రులైనవారు. [illegible] గంధమునే యాస్వాదించిన మహావీయుడు, జననీజనకులసేవ, పెద్దలయెడ వినయవిధేయతలు, అతిథిసంతర్పణలు-- వీటితోనే యాతవి యనుభవ మెదిగివచ్చినది. అన్నలు, అతిథులు ప్రియములైన ట్లతని కన్యములు గావట. హిమాలయపర్వతమున కడుపు మాడుచున్నను "అయ్యో! నిత్యవ్యవహారములు" వోయెనేయనియే పెద్దదుఃఖము. పూకటులుగొలిచి చేసిన మారిమిసోమిదమ్మ మనసులో వర్తించునది. పూర్వపురాజు లొసగిన మడి మాన్యములు, తఱుగులేనిపాడి. దేవిదేవరవోలు తలిదండ్రులు దేవుడిచ్చిన రమణీయమగు సౌందర్యము. ఇట్టి యెడనామహానుభావునికిలోటేమైననున్నదా? ఆ ధర్మమూర్తి యైహికాముష్మికములరెంటిని గడముట్ట ననుభవించినవాడే; కేవలపాషాణ హృదయుడుగాడు.మరిపదార్థములపరిమితి నెరిగిన మేధావి. మనసును నిగ్రహించిన మహనీయుడు, ధర్మము - కర్మము సమగ్రముగ గలవాడు. పేరునకుమాత్రము "కచ్చడాలు" బిగించి యాడుదానినీడ సోకినవెంటనే కృష్ణాజినము చంకనిరికించి వెంటబడుముని మ్రుచ్చు గాడు. ఆర్భాటములేని సదాచారి. ఆచారము తనకొరకేగాని డాంబికమునకుగాదని యర్థము చేసికొన్న తపస్వి. తనమతమునందు, తమసిద్ధాంతములయందు నమ్మకము సంపూర్ణముగ సంపాదించుకొన్న మనస్వి. విజ్ఞానముచే పండి, ఫలించిన, తలపులుగలపవిత్రు డేకాంతముననుండి స్వైరవృత్తి కాశించిన పరవనితను త్రోసిపోయినా డన్నచో మనకు రోష మేల? కలుగురసభంగ మేమి? ప్రపంచములో నట్టివారుండరేయని చింతయేగాని నిజముగా నున్నచో బ్రహ్మరథమును బట్టజాలమా? వరూథినియం దెంతమానవత్వ మున్నదో ప్రవరునియందంత మహత్తున్నది. అతనినివృత్తిలోని పేయింట నొకపాలైనను మనకు లేదేయని యేడ్చుటపోయి నిందించుట నిశ్చయముగా తెలివి తక్కువపని.

మరికొందరు మహానుభావులు మనుచరిత్రమునకే శాపోదకములు విడుతురు. వారివాదము విందముగాక. "మనుచరిత్రమున రసమే లేదు. అంతయు రసాభాసమే. రెండవ

యాశ్వాసమున వరూథినియందే యనురాగము మూడవయాశ్వాసమున ప్రవరుని వేడు చెప్పి యేగంధర్వుడో క్రీడించిపోవును. ఉత్తమ గుణములుగల ఘట్టమే లేదు. అంతయు మోసము, 'అసహ్యము'"

నాకు జూష నీవాదమున సంస్కృతి హృదయమే గానరాదు. సుఖమన్న నే మన కంతులేని యసహ్యము, ద్వేషము గలుగును. కారణమేమి? మనయల్పతృప్తి. అదియే వీటికి మొదటిబీజము. కనుబడిన దంతయు రసాభాసమే యైనచో నిక నంతమే యుండదు. అనురాగ ముభయులయందు నిండియున్నచో శోభించుననుట నిజమే. కాని యట్లులేనివన్నియు పరిత్యాజ్యము లనియు, అట్టికథ లన్నియు చదువరానివే యనినచో చాలవాఙ్మయము దాచిపెట్టవలసివచ్చును. ఆశ్లేయైన పూర్వపు స్వయంవరములలో నెన్ని రసాభాసములైననో యొకరస మగుచుండెడిది. రాక్షసవివాహము లన్నియు రసాభాసములు గాగూడదా? వివేకమైనను మందువలె వాడుకోవలసినదేగాని తెగ బెంచినచో లోకన్యాయమునకు ముప్పే.

పోనీ యీరసాభాసమైనను యిక్క డెవరిలో నున్నదో కొంత నిదానముగా నిలిచి పరికింతము. వరూథినీప్రవర్తనమున రసాభాస మున్నదందురా? ఆమెపుట్టువు "పూత పసిడి"వంటి వలపుగల సానివారింట సభలు రంగములు. ఆటపాటలు నిత్యవ్యవహారములు. కళోపాసనతో పక్వమై పూవుల కన్న మెత్తనగుమనసు. వారికి శీలమును గాని యుదాత్తగుణములనుగాని చెడక నిలుపుకొను పట్టుదల లేదు. కంటి కింపయినచోట వలచుట, తరమయిన నవగి పెనగి సుఖించుట వారినై తికచర్య. వరూథిని లోకోత్తరయగు నాయిక గాదు, సరిగదా ఆత్మగుణములకై యత్నించి సాధించి పెక్కుము నిలుపవలెనను కోరికయు నామెకు లేదు. దృష్టియే సున్న. కంటికి చల్లగ నున్నాడు ప్రవరుడు. కామించినది. తొలుత ననుభవమును జూపించినది. విప్రుడు లొంగలేదు. హేతువాదము లకు దిగి తర్కించి చూచినది. అన్నిటి కన్ని చెప్పి యొప్పించి నిలిచినాడు. ఇక మాటలలో సాగదనుకొని కార్యమునకు దిగినది. విశ్వామిత్రుడు మొదలగువారు తొలుత నిట్లు వాదించినవారేగదా! అనుభవములో నేమైనారు? కనుక పాప మామె యీవేదాంతము లన్నియు నాడు పొలికువ తేనంతవరకే దాని యంగము సోకనంతవరకే. తరువాత నిలువ రని తలచినది. కపటియత్రము నుపయోగించినది. అదియు నొక్కవోయినది. ఆప్రాంత ముల నంతటనింతట నెవ్వరును లేరు. సంపూర్ణ మగు నేకాంతము. కనుకనే, వెనుకాడక, ఏకాంతధార్ష్ట్యమునకు దిగినది. సరిగా నర్థము చేసికొన్న నేతప్పు నదియును నంత క్షమింపరానిదోషము గాదు.

ఇక ప్రవరునిది పొరపాటని పెదవి విప్పు ధైర్యము మన కున్నదా? రామరామ! అతని జీవితము పరమపవిత్రమైనది. ఎన్నియోసంవత్సరములు మననగావించినను మనతలపున కందని మూర్తి యాతనిది. మరి రసాభాసమున కేమి యర్థము? విభావానుభావాదులచే క్రమపరిపుష్టమయినరసమే స్థాయిభావతనంది చర్వణయోగ్యమగుచున్నదిగాని సడుమనే పునుకలైనచో అఖండమై సంపూర్ణమైనయానందము గలుగదనుభావము గావచ్చును న్యాయమే. ఈయల్పతృప్తి కెక్కడికి పారము? దినమును పండుగభోజనమేయైన సంసారి 'పాపరు' వేయడా? ఎవడో తిరిపెగాడు "కల్లీ! ఉద్దరకు బెట్టినను మొగునితో డుత బెట్టమన్నాడట" పోనిండు. మనకావ్యములలో నాయికానాయకుల–మనస్సుల నన్యోన్యప్రేమచే పెంచి పెద్దచేసిన–ఘట్టము లెన్నియో యున్నవి గదా! వాటియందును సమగ్రత యున్నదా? మిగిలినచెద లెన్నిపట్టలేదు? వాటినన్నిటిని మనము దిద్దుచున్నామా? అవిమాత్రము రసము నాస్వాదించుటలో నడ్డుపెట్టి యతృప్తిని గలిగించుట లేదా? అన్నిటికి లేని డీ–రసాభాసమున కొక్కదానికిమాత్రము పట్టినదా యీ బహిష్కారము? తొండల దిన్నవారు, నక్కల దిన్నవారు దోషులైయుండగా నకుమగారెల దిన్నవారిదేనా మహాపరాధ మని యెవడో శిష్యుడు గురువుల కుత్తరమిచ్చినాడట. మానవులచరిత్రము స్వభావము పలుతీరులు, దానినంతయు సమగ్రముగ నాలోచించి సముచితముగ నాయాచోటుల నిలుపు మేధాశాలి యెవ డుండును? ఒకవేళ నిర్మించెబో, పరమాదర్శపురుషుడగువానితో మన మెంతవరకు లాభమందగలము? మనతోడనే యుండి మనవలెనే కష్టసుఖములు, చింతలు, చాపల్యములు గలిగి సర్వవిధముల మానవులై యాధ్యాత్మికవీథుల కాంతనితో పాటు మనలను దీసికొనిపోవలెను. కేవలము ఆదర్శపురుషులయే యైనచో మనభావన లరిగించుకొనలేవు. అపుడు లాభమేమి? సంపాదించుకొను నశీర్ణమే.

ప్రతియొకచోట నొకటేనాయికానాయకులు, ఒకటేయచ్చుకట్టు ఉన్నచో మనకేల వేరు కావ్యము లెందుకు? వేరువేరువ్యక్తు లెందుకు? విభిన్నగుణపమేదడు లెందుకు? నైషధములోని చంద్రదూషణ,మాఘములోని మారుతనింద లే ప్రతికావ్యమున నుండవలెనన్న పొరమున్నదా? కవులమనస్సులను, భావములను స్వతంత్రత నకికట్టుసంకెలలు గావాయిని? అందుకే మనభావ.లో నిన్ని తలలోక మార్పులు, మసుసువాసనలు అవశ్యముగా నుండవలసినది మనకర్మయైనది. ప్రారంభింపబోయిన యితివృత్తమునుగాని రసమునుగాని చక్కగా నిర్వహింపలేక చదికల బడినచో దోషమనునుగాని బుద్ధిపూర్వకముగా జేసిన పనికి వీరిప్రాయశ్చిత్తము పరిహాసముకన్న వేరున్నదా? పెద్దన యితివృత్తమును సర్వాంగసుందరముగా జిత్రించలేదనుమహానుభావు లుండ రనుకొందును. నాకుమాత్ర మాధైర్యమేమాత్రమును లేదు. నిజముగా పితామహుడుత్తములలో నుత్తముడు. అతనిని ఒకమేషలో గాదు; పదివేలమేనాలలో మార్చిమార్చి గూర్చుండబెట్టి ప్రపంచమంతయు ద్రిప్పినను దక్కువే. అయిన తప్పెవరిది? మితమెరిగిన కవిదా? ఇచ్చినదానితో తృప్తిపడక పేరాసతో నోరుచాచి యాచించు మనదా? ఆత్మతృప్తి లేకున్నచో దీనియందేమి ప్రపంచమున దేనితో నానందము గలదు?

వరూథినీప్రేమ పవిత్రమైనది. ఏకారతయు, నేదోషము నాకామరాలి మనస్తత్వమున గానబడదు. ఇకనిలుచున దేమి? ఆమెధార్ష్ట్యమనం

గలేమనికదా! గురుకులవాసులే మోగాని యను భవముగలగృహస్థు డెవ్వడైన నది పొరపాటను నేమో రసికులరగు మీరే యోచింపుడు! ఒక వేళ పెద్దనవిషయమున రసాభాసమైనను అందులో వరూథినిచేసిన పెద్దదోషమేమియు లేదు గదా!

ఇక గంధర్వునిసంగమమున రసాభాసమని గదా మనవాదము. కావచ్చును. అయినను పాఠకునిమనసు పూర్వాపరములను గొంత సమగ్రముగ నాలోచించినచో అదియును అంతగా బాధింపదనుకొందును. గంధర్వు డొకవిటుడు. తలచినచోట వలచినచోట రమణీయతయున్నచోట ననుభవించుట వారియలవాటు. ఎన్నో సారులు సానివాడలలో దిరిగి తర్ఫీలైన విటుడగుటచే న్యాయ్యముగనో అన్యాయ్యముగనో తనకోరిక పూరించుకొనజూచినాడు. దివ్యదృష్టిచే గ్రహించి యీయెత్తువేసినాడు. దానిచే ఫల మందినాడు. వాడు సామాన్య విటుడే. ఈనాడు వా డుదాత్తుడు గాడని నిందించిన వానికి నష్టములేదు. మనకు లాభము లేదు. వా డాయనితరలభ్యమగు ఉదాత్తతకై పాటుపడలేదు. కావలసినది మనోరథప్రాప్తి అయినది. ఇప్పుడు మనము వానిపై గోపించిన కేవలము పెదవులచేటుదప్ప వేరులేదు. సాని యగు వరూథినిశీలము చెడిన దానివలనను సంఘమునకు వాఙ్మయమునకు గలుగుమహోపచార మేదియు లేదు. ఆమె ముద్దరాలు. శృంగార స్వరూపిణి. విచ్చినపూవువంటిది.

మనయాలంకారికులలో గొందరు తిర్యక్కులయెడ విభావాదిజ్ఞానము లేదు, కావున నచట రసాభాసమేగాని రసముగాదని సిద్ధాంతీకరించిరి. ఏకావలీకారుడు తిర్యగ్గతమగురతి రసమేగాని యాభాసము గాదని తీర్మానించెను. దానిని వివరించుచు వ్యాఖ్యాతయగు మల్లినాథసూరి రసోద్భూతికి విభావాదిజనన మే కారణముగాని జ్ఞానము గాదని స్పష్టముగా జెప్పెను. ఇది యటులుండ నిక్కడ వరూథినికి ప్రవరుడనుభ్రాంతిచే గంధర్వునియందు మనసున్నది. గంధర్వుడు సంపూర్ణముగ వరూథినిని వలచివచ్చినాడు. అనుచో నిచటమాత్రము రసమేనని యొప్పినచో గలుగు పొరపాటేమి? కార్యకారణవిచారము లేని మృగములకన్నను హీనమైనదా యాలంకారికులదృష్టిలో వరూథిని? పూర్వోత్తరసందర్భముల విచారింపక దృశ్యమానమనుఘట్టమే దృష్టినిలుపు సౌనరయ్యలకుదప్ప తక్కినరసికుల కిచట "నయ్యో! మోసపోయెనే వరూథిని" యని కన్నీరు విడువవలసినయవసరమును లేదు పోనిండు. ఒకవేళ వరూథిని చెడినను బంగారువంటికొడుకు నిచ్చి చన్నది. మేనక మడిగట్టికొనికూర్చొనియున్న మనకు శకుంతలయు, అందుమూలమున కవిత్వపరమార్థమగు శాకుంతలమును జేత దొరకియుండునా? పదిమంది ని జె అ చి యొ క డు గ డ్డ కు వచ్చుట యీనాటి మాధర్మము. అనుభవరసికుల కింకను గ్రహింపదగినది కొంత యున్నది. ముందు నడుతముగాక. ప్రవరు డారీతి త్రోసిపోయినది మొదలుకొని నిలిచినచోట నిలువలేదు వరూథిని. ఆభరణములు లేవు. వాహ్యాళిలేదు. వీణెపైని పాట లేదు. దైవమా యని తలపోయజొచ్చినది. తన్నా ప్రవరుడు తిరస్కరించినది, త్రోసినది యీ యపకారముల నామె దలపనేలేదు. "వానికన్నులిట్టివే, పాదములట్టివే, చొక్కపుప్రాయమే, తెగబారెడు సెంద్రుకలే"యని పనవిపనవి యేడ్చినది. నూనెముడిపైచి మట్టిబ్రేలనె చుక్కబొట్టు వెట్టినడట యా నిత్యసువాసిని. "ఇంతలో తెల్లుల్లసిల్లినచందమున" వెన్నెల వ్యాపించినది. ఇక భరింపలేకపోయినది. అపు డామె చెలికత్తెలతో నాడుమాటలు చూడుడు.

ఉ. "నోములు నోచినమ్మలు మ
నోరథము ల్దయివార నిత్తఱి
తామరతంపరై ప్రియులం
దార విహారము సల్పుచుండఁగా
నీమెయి దుఃఖశీలనను
నే వసియింపఁదరంబె పోద మా
రామముఁజూడ నందు సుక
రంబగు సర్వము పంకజాననా!"

అందరు కవులును నియమము ననుసరించి నాయికలను కూలియిచ్చి యేడ్పించువారేగాని వానియందలి పరమార్థమును మాత్రమును యోచి[illegible] పెద్దన యట్లుగాక తటస్థములగు చంద్రికాదులకు పాత్రలతో గలసంబంధమును గురుతించినాడు. తత్కాలజనితమగు భావమును, కమ్మనిజవరాలిలేతయెడదతో జోడించి మనోహరముగ బలికించినాడు. ఈ విషయమున తక్కినవారికి గుణపాఠము నేర్పినాడు పెద్దన. అయినను తరువాతిపండితకవులు దీని గ్రహింపదగు వస్తువుగా భావింపలేదులెండు! రాత్రి యంతయు నీరీతిగనే వేగిపోయినది. చెలికత్తెలెటులెటులో నవనవోపచారములతో నా రాత్రి నీడ్చినారు. తెల్లవారినది. అయిననేమి? వరూథిని కన్నీటిబొట్లు నిలువలేదు. ఇక కార్యములేదని ఆరామమునకు రమ్మని బలవంతపెట్టినారు. వరూథినికి లేనిరోసము వారికి తెగగోసికొనివచ్చినది. "నీచందము, నీయందము జూచిన యెవరు వెర్రివారుగారే పిచ్చిపిల్లా!" యని యభిమానమున గుండెకు నీరు దట్టినారు. 'వాడనగనింద్రుడా? చంద్రుడా?' యని తూలనాడినాగు. 'విప్రుడు; గోలబాలుడు; వానికేమి తెలియు'నని నవ్వులాడినారు. "పూతపసిడివంటికులమే" యని యింటిమర్యాద దెలిపి "యింత కనువేదురు తగునా" యని బుద్ధిచెప్పినారు. "వా డాయుద్యానవనమున నుండక పోడు రమ్మ వెర్రివానినిజేసి యీడ్చుకొనివత్త" మని కార్యమునకు బ్రేరేచినారు. తనివిదీర నిండుమనమున శృంగారింత మనుకొన్నారు, గాని వరూథిని కీయుబలాటము గిట్టలేదు. అయినను ప్రాణసఖులపలుకులు త్రోసివేయజంకి విసుగుకొనుచు విరులు దునిమినది. బాగాలు బలవంతముతో కొన్ని వెడలనుమిసి, ఒకటి రెండు రుచి చూచినది. ప్రతిదానికిని "సగ ముత్తర మొసగుచు సగముతెల్వి, సగము మఱపుతో చింతచే సగమగుచు వారివెంట తిన్నగా నడచి వెళ్లినదట. చెలియ లందరును సరస్సున దిగి యోలలాడుచున్నారు. తన్ను బిలుచుచున్నారు. కాని మోము నడ్డముద్రిప్పి "యొకహస్తపుమొక్కన" మీరే యాడుడని బతిమాలినదట.

ఇంతలో మాయాప్రవరు డరుగుదెంచినాడు. మనుష్యులము, అల్పశక్తులము నగుమనకు కష్టముగాని వారు కామరూపులుగదా! పసిడితోరముతోడి బాహువు, – నల్లని చూపులు

దెసలబరపు విశాలమైనకన్నులు, జుట్టు బొట్టు
కట్టు అన్నిటియందును అచ్చముగా ప్రవరుడే
యైనాడు. కడకు శాంతిరసమొల్కు బ్రహ్మ
తేజమునుగూడ కృత్రిమముగా సంపాదించు
కొన్నాడట. విపంచినిబోలు మధురమగునాద
మున జటను వల్లించుచు విరులు చిదుము
నెపమున నామెకంట బడినాడు.

మాయాప్రవరుని జూచినవెంటనే యొక్క
సారి గడచినగాథ యుద్బుద్ధమైనది. కన్నుల
నీరుదిరిగినది. ఒక్కసారిగా పరుగిడికౌగిలించు
కొనదలచినది. ఔనుగాని— యేమొగమున
పాఱుని సమీపింపఁగలదు ? లేకున్న చాప
ల్యము విడుచునా ? తిన్నగా లేచినది, చెలుల
కనుమొఱగి వెళ్ళినది. అప్పటి యామెపరిస్థితి
యెంతదీనమైనదో యోచింపుడు. తిన్నగా
నెదుటనిలచి "కాటుకకన్నీరు గ్రేటుకొనుచు"
ప్రారంభించినది ప్రార్థన. "నాల్గుజాలు నిక
జాలు భవంబను నంతకాకకు చాలయిన" దట
యాసుకుమారి. పాదములు పట్టినది. నీకు మన
సునం దిష్టములేకయున్న నీబలవంతపు మాఘ
స్నానమగు కూటమిలో చవిలేదని యెరుగ
దును. అయినను నాయింద్రియపిపాస బలవ
త్తరము. చావుదప్ప దని వెక్కి వెక్కి యేడ్చి
నది. ఇయ్యెడ కవిపోషించినయౌచిత్య మెం
తేని గలదు. పాఠకులు విసుగుదురేమో యని
మాభయము.

ఇక గంధర్వునకు రొట్టెవిరిగి నేతిలో బడి
నటులేగదా ! వాడు నందుకే యాశించి వచ్చి
నాడు. తిన్నగా మొగమునెత్తి అతినిపుణ
ముగా "తెచ్చికోలుమాధ్యమంతో" యుత్తర
మిచ్చినాడు. నేనుమాత్ర మేమి సన్యాశి
సినా ? నాకు సుఖదుఃఖములు లేవా ? కాని
రెంటికిం జెడినరేవడు నాదునేమో"యని గ్రుక్కి
ళ్లు మ్రింగి యాసగలుగబలికినాడు. వరూథిని
మోము వికసించినది. ఇన్నిజన్మముల తపస్సి
నాడు ఫలించినదనిమిన్నందినది. సిగ్గుతో "చేత
చెఱగు బిగియబెనచుచు" నవ్వి తలయూపిన
దట! ఇంతలో చెలికత్తెలు వచ్చి కలుసు
కొన్నారు. పారునికతినతకు నిందించి యామె
యవస్థను విశదముగా వినిపించి కేరడము
లాడుచు వారిని త్రేకేచి తప్పుకొనిరట! తల

వాత "మృగనాభిభుగభుగలు" వాసించు పర
మరమణీయములగు పూపొదలచాటున నామె
"కన్నెరికపురతి" చెలగినది. ఇట నొకనీస
ముచే మనోహరముగ వారిరతిని వర్ణించినాడు
మహాకవి. దీనికి కొందరుపండితు లింతకుముందే
పెదవివిరచినారు. రతివర్ణన యనౌచిత్యమట.
ఇది నాగరికత సంపూర్ణముగ తెగబారినదృష్టి.
ఇంతవరకును ప్రతియొకటియు సవిస్తరముగా
వర్ణింపుచు వచ్చి యిచటరతివర్ణనముమాత్రము
వెంకటేశ్వరులముడుపువలె ప్రక్కకు దీసి
పెట్టవలెననుట యెంత సరసమగుమాట ! కవి
ప్రతిభావంతు డైనచో నెట్టిదానినైనను రమ
ణీయముగనే చిత్రింపగలడు సౌందర్యము
కవిత్వసాధనమైనపుడు స్వాభావికమగు రతి
పైమాత్ర మీవిజ్ఞానవృద్ధుల కింతద్వేష మే
లకో తెలియుటలేదు. మనుచరిత్రలోనిపద్య
మేమి రసాభాసమై ముట్టరానిదుడుగా
నున్నదా ? మరెందులకు కాలుగాలినపిల్లివలె
యీయొక్క పద్యమునకే యెగిరిపడెదరు?ఇంత
వరకు చదివిన, యీయింత యోర్పులో నిక్క
డను కొంచెము వెచ్చింపరాదా ? కాగా
వర్ణింపకపోవుటయు దోషమేయగును. ఇంత
వరకు వరూథిని యామింతసుఖమునకే యష్ట
కష్టములు బడినది. గడచిన రెండాశ్వాసముల
లోని ప్రతియొకపద్యమును భౌతికసుఖమునే
ప్రతిధ్వనించుచున్నది. ఇంత కష్టపడి సంపా
దించినకోరిక నొకనిమిషమైనను చల్లగా నను
భవింపకముందే తెరవేసి "యీరీతిసుఖముగా
నుండిరి" అని చెప్పుట శతవికారముగాదా ?

ప్రవరున కీవార్తలన్నియు దెలుపుటకే సిద్ధు
డును మరలబోలేదు. వరూథినికిజరిగిన మోసము
తెలియనేలేదు. నేటికినిగూడ దెలియదేమో?
పనియైనగంధర్వు డానాడే యింటిదారిఁ బట్టి
నాడు మరల వానిపాలకువయే లేదు. వరూ
థిని మాత్రము "స్వరోచివి" లాలియందుంచి
యీనాటికిని మంగళగీతములు పాడుచునే
యున్నది. వరూథిని చెడినను జగదేకవీరు
డు కొడుకు గలిగినాడు. తాము
చెడియైనను ప్రపంచమును బ్రోవ
యత్నించుట గొప్ప స్వార్థత్యాగము గాదా?
ఇక నామె ప్రేమయా నిమ్మపటమై నిర్మలమై
పవిత్రమైనది. ఆమె తలపులు హార్దములు.

అచ్చరలయింట జన్మించినను ఆదర్శము నలవ
రించుకొని దేవత్వమును సంపాదించుకొన్న
దామె. ఇక నామెకళాపాండిత్యమా ! తలచి
తలచి ధన్యులు గావలసినంతటిది. ఆమెసౌంద
ర్యాభిలాష హృదయమున్న మానవుడెల్ల మె
చ్చుకొని కన్నీరు విడువవలసినది. భౌతికాభి
లాషయా ? అదెవరికిలేదు. మానవమాత్రులెవ
రైన చెప్పగలరా? రచ్చకెక్కినదిగనుక వరూ
థిని యాయింతచాపల్యము లెక్కకు వచ్చినది
గాని అట్టిచాపల్యములు ప్రపంచమున లెక్క
కు మీరియున్నవే. మనకందరికి పూజాపాత్రు
రాలే యాపరమపవిత్ర. సర్వవిఘ్నములను మానవ
కాంతయై మనల వెనుకకువేసి మనయింటిదేవ
తయై కొలువుదీరినది. 'వెన్నవంటి' యామె
మనసు వేయియాదర్శములకన్నను వెలగలది.
ఏ యోగికో రాయికో రప్పకో పనికిరాక
పోవచ్చును, గాని హృదయమున్న భోగుల
కందరికి నామె తలపూవువంటిది. ఆమె
జీవితము మనస్త్రీ లెందరో యలవరించుకొని
మ్రొక్కవలసినది. ఆమెనిష్కలుష మన
మానవత్వము దినదినము పారాయణ మొ
నర్పదగినది. ఆమెసౌందర్యము నిత్యమై
ప్రకృతినిగూడ వలపించునది. అట్టిసర్వగుణ
సంశోభితయగు నాయికను మనసంఘమున
కిచ్చి చన్నపితామహుడును, పెద్దనయమృత
హస్తముచే దిద్దితీర్చబడి నిత్యయౌవనమున
శోభించు "మరున్నారీ శిరోరత్నమును"చిరం
జీవు లనుట కాశ్చర్య ముండునా ? మనుచరి
త్రను పఠించు ప్రతియాంధ్రుడును తలయూపి
పొగరుపడవలెను. ఆపెన్నిధి తెనుగునాటి
పున్నెమున వారి కొకరికే దక్కినది. మను
చరిత్రవంటి రసవత్ఖండ కావ్యమును వ్రాసిన
మహాకవి భౌతికజీవితమును జాలించినాడు.
వరూథినిని జూచినవారు లేరు. వారిద్దరి మనః
పవిత్రతకును సాక్షియై చిరమై మనుచరిత్రము
మాత్రము నాట్యమాడుచునే యుండగలదు.

ఇంతకు జెప్పవచ్చినది మహాద్భుతజీవసృష్టి
రహస్య పరమార్థమును గూర్చి. దీనికి మసు
కుండగూడదు. మాక్సుముల్లర్ The Hindu
Superiority'అను గ్రంథమున, "By divine
concentration during cohabitation
even Rakes can produce angels."

అని "యద్భావం తద్భవతి" అనునార్యోక్తికి సాటిగా జెప్పినాడు. సంగమకాలమున స్త్రీపురుషులు ఎట్టిభావములను గలిగియుందురో తదనుగుణముగనే సంతానము! భ్రమరకీటన్యాయముగూడ నీతత్త్వమునే చాటుచున్నది. ఈసూత్రము ననుసరించి ఒకమహారాజునకు దౌర్భాగ్యదామోదరుడును, నిరుపేదకు శ్రీమంతుడును, లంజెకు బతివ్రతయు, మూర్ఖునకు గవిరాజును, చచ్చుపెద్దమ్మకు వీరాధివీరుడును జనింపవచ్చును! జర్మనీదేశమున ఇటీవల చావునకు సిద్ధపడియున్న యొక్క ఆవును అంతకుముందే చావునకు మొగమువాచియుండిన యొక యెద్దుచే దాటించిరి. ఒకవృషభరాజమునుమాత్రము వీనికి నెదురుగా నా సమయమున నుంచియుండిరి. ఈఆవునకు గొంత కాలమునకు పరమేశ్వరునినందివంటి కోడె పుట్టినది!

సంగమకాలమున విశ్వామిత్రుడు ధుమధుమలాడియుండినను, మేనక తైతెక్కల మీదనే ధ్యానముంచియుండినను, శకుంతల దుష్యంతుని రాయిగా శపించి తల్లిని జేరి జయంత నలకూబరులపంచలలో బడియుండెడిదే! ఇట్టి పరిస్థితులలో భరతుడు హుళక్కి! — భరతఖండము సున్న!

వారిపంచలనుండి శకుంతలను లేపించుటకు కాళిదాసునాయనచేతగూడ గాకుండ నుండెడిని! ఆలంకారికులు రసాభాస మన్న మాటయే రసాభాసము. వరూధినికి మనప్రవరాఖ్యుడు లొంగియుండిన, ఖైమా అంగళ్లు, గోవధాలయములు, బీర్ షాపులు, కాఫీహోటళ్లు మున్నగువానిచే సూదిమోప సందులేకుండ మనయార్యావర్తము కొన్నిశతాబ్దములక్రితమే కిటకిటలాడియుండెడిది! గంగానది యెడారిగా మారియుండెడిది! హిమవంతుడు లోకములోని సుఖవ్యాధులకు మందులనూరుటకు కల్వములను, గుండ్రాళ్లను సప్లై చేయుచుండెడివాడే! అనాటి ఆదర్శబ్రాహ్మణుడీనాటి బ్రాహ్మణుడైన, ఈనాటి బ్రాహ్మణు డేనాటి బ్రాహ్మణుఁడైయుండెడివాడో! ఆదుర్నిరీక్ష్య తేజోవిరాజితమూర్తిని, ఆతపస్సంపన్నుని, ఆయేకపత్నీవ్రతుని, ఆ అతిథిపూజాధురంధరుని, ఆ అశేవ శేముషీధురంధరుని, ఆపరనారీసహోదరుని, ఆ అఖిలవిద్యాపారంగతుని, ఆ జననీజనకపాదార్చకుని కాపీనమునకును వరూధినిమఖమల్ లేస్ పైటకొంగునకును ముడివెట్టి శయ్యాగృహములోనికి బంపి పడకపాటలనుబాడ మన యాలంకారికులు ప్రయత్నించుచున్నారే! పెద్దనమహాకవి సర్వప్రకృతిరహస్యములను జక్కగా నెఱింగినవాడు. అందువల్లనే ప్రవరాఖ్యునిశీలమును బోషించెను. ఆతని కుల స్థాన పౌరుషములను గాపాడెను.

వరూధిని మనోహారిణి యను ముద్దగాలు అమాయికురాలు-! దైవభక్తిసంపన్న, స్నిగ్ధమోహావేశపరవశ, సంఫుల్లసుమచయసౌరభవాసితమరుత్కల్లోలితకుంతల, అఖిలాప్సరోంగనారాజ్ఞి, ఇంతకు బ్రాణముగల బంగారుబొమ్మ! యౌవనవిలాసములు తుత్తరతుత్తరగా బొంగి పొరలుచుండెను. పెద్దన్న ప్రవరాఖ్యునిచే జెలియలికట్ట వేయించినాడు! పాపము! వరూధిని ప్రవరాఖ్యుని ప్రేమించినటులనే ఒక గంధర్వుడు వరూధినిని ప్రేమించియుండెను. స్వర్గముదానిని స్వర్గమువానితోనే కలిపినాడు. సమయముచిక్కినది వదలలేదుసరి! సరాసరిగా గంధర్వునకు పెద్దన రాదారిచీటి నిచ్చినాడు. గంధర్వుడు నాల్గుగంతులలో బ్రవరాఖ్య రూపమునవచ్చిపడినాడు. అసలు ప్రవరాఖ్యునితో వరరూథినిహృదయము నిండిపొంగిపోవుచున్న సమయము నకలుప్రవరాఖ్యుడు హాజరు! ఇంకేమికొఱత! ప్రకృతితత్త్వశాస్త్రమర్మముల ఘోషించుటకుదగిన అదను పెద్దన దీనిని జారవిడుచునా? గంధర్వుడు మన్వంతరపుడంకాను బజాయించినాడు! విశ్వామిత్రుడు భరతఖండపుబాకా ఊదలేదా? ఈపరమరహస్యములను సునిశితముగ లోకమునకు జాటినవాడు కాళిదాసు! పెద్దన! ఔరా! తాళిలేని అప్సరసలసంతతివారు భరతఖండమును, మన్వంతరములను స్థాపింపగల్గిరి!

కేవలము తుచ్ఛసుఖములకొఱకు స్త్రీపురుషులు సృష్టింపబడలేదు. భగవద్ధ్యాన నిమగ్నులై తల్పసుఖమును బొందురురేని దేవతలు స్వర్గమునుండి దిగిరారా మరి!

# పు రా లో క ము

గుట్టము వేంకటసుబ్రహ్మణ్యము

పెన్నదరిం బురాతనము విక్రమసింహపురంబు, ధాన్యసం
పన్నము, మాన్యవాసము, విమానసమున్నతభోగవిస్ఫుటో
ద్యన్నమితాహిభోగము, మదాస్పదముం గలయంగఁజూడు మో
యన్నువమిన్న, జీవితమహాం బలరారుత నాకు నీ కిటన్.

చెలువుగ నెల్ల వేళల నశేషజనంబులు నిండుభక్తితోఁ
గొలువులు సేయుచుండ, నొకకుంచముపైఁ దలవెట్టి నిద్రవోఁ
గలిగినస్వామియాలయముఁ గాంచి ప్రబోధము గాంచఁగల్గుజ
న్మలు సఫలీకృతంబు లనుమానము మాని భజింపు మాతనిన్.

గురుజఘనోపవాహ్యజలకుంభము లొప్పఁగ వైష్ణవాంగనల్
సురుచిరదేహవర్ణపరిశోభితసంధ్యలు దీప్తభూషణాం
బరలు విశాలలోచనలు వారణయానలు ప్రత్యహంబు ని
ప్వరిని బినాకినీసలిలముల్ గొనివచ్చుట చూచు టొప్ప దే.

చిక్కనిపాలమీఁగడలు శేఫలికాసుమసీధుధార లా
తిక్కనకైతపోకడలు తేటతెనుంగులు చిల్కుచుండ, న
ల్దిక్కులు జాణ లక్ష ప్రథ నదింప ననేకశతాబ్దులొప్ప వా
రిక్కడిస్త్రీలు పూరుషు లహీనవచోవిభవాభిరాములై.

ప్రోలి కలంతిదూరమునఁ బొల్చు నృసింహునికొండ పాదముల్
క్షాళనచేయుపెన్నకు జలంబులు సర్వము నప్పగించి, దే
వాలయగోపురోపరిసితాతపవారణరూప మొందు ము
క్తాలుళితాంబుశీకరనవాంబుద మిచ్చు నవప్రమోదమున్.

చు ట్టెటుచూచినన్ మివుల శోభిలులేవరిపైరుచేలలో
చట్టుప లార్చుశుభ్రఖగసంతతి యేయమరీలలామచన్
గట్టునఁ ద్రెస్సి రాలుమణికల్పితహారమొ యుర్విచేడ్కకై
బట్టు ననంగ వ్రాలెడి దివాకరుఁ డొందఁగ మందహాసమున్.

వ్యూహమువోలు వీథులు జనోత్కరసంకరముల్ సదాచర
ద్వ్యాహనముల్ గమించి తెలివా వృషవాహనునాలయంబు ని
ర్మోహవినిశ్చలాత్మత విలోకనసేయు, మఖండసౌఖ్యని
ర్వ్యాహము సేయు గేహము కృపాపరతంత్ర ముమాపతిత్వమే.

పసితనమందు నేఁ దొలుత పల్లియ వీడ్కొని వచ్చి, విద్యకై
వస మొనరించుకోఁదలఁచి, పట్టణ మియ్యది సొచ్చి, యిర్వదేం
డ్లు సనియు, నామెదం బాదలెడున్ మఱి యిప్డు పురావలోకనా
వసరమునన్ నవీనత భవన్నయనాంత ముపాంత మాటచేన్.



# త్రిశూలము

విశ్వనాథ సత్యనారాయణ

★

నవమాంకము

[ప్రవేశము : అల్లయ్య, మధుపయ్యలు]

అల్ల:—మధుపయ్యా! బసవేశ్వరుఁ డేమన్నాఁడని రాజుతో చెప్పాలి?

మధు:—మనము దాయవలసిన పనేముంది? ఎంత జరిగిందో అంతే చెబుదాం.

అల్ల:—మధుపయ్యా! ఈవ్యవహారం మనయిద్దరికీ సంబంధించిందిమాత్రమే కాదు. నిజంగా ఆలోచిస్తే మనం యిద్దరమూ యీవ్యవహారానికి నిమిత్తమాత్రులముగా కనబడుతున్నాము. ఇది యేదో కొంప లంటుకోపోతున్నవి. ఈ అప్రతిష్ఠ మనమీదుగా పోతోంది.

మధు:—బసవేశ్వరుఁ డున్నంతమట్టుకు మనకేమీ భయంలేదు. పైగా రాజు మనలను రాయబారమో యేమిటో నడపమన్నాఁడు. బసవేశ్వరుఁడితో చెప్పమన్నాఁడు. చెప్పాం. మన మాపని చేసిపెడితే మనల్ని వదిలిపెడతా నన్నాఁడుగదా! ఆమాటప్రకారం మనల్ని వదిలిపెట్టాలి.

అల్ల:—మనం యేపని చేసిపెట్టాం?

మధు:—బసవేశ్వరుఁడితో చెప్పమన్నాఁడు. చెప్పాం.

అల్ల:—అందరూ నాకన్న నువ్వు తెలివిగలవాఁడవనుకుంటారుకాని నేను నీకన్న తెలివిగలవాణ్ణి.

మధు:—కావచ్చు.

అల్ల:—కావచ్చు కాదోయ్. బసవేశ్వరుఁడితో యీరెండుమాటలూ చెప్పేందుకు నువ్వూ నేనూ అక్కర్లేదు. రాజుగారికి చాలామంది పరిచారకులు ఉన్నారు. మనయిద్దరితలలూ కుదువబెట్టి రాజు యేదో బసవఁడితో రాజ్యాంగవ్యవహారాలు నడుపుతున్నాఁడు. ఇందులో మనచావు మూఁడిందని బసవఁడికి తెలియదంటావా? తెలిసికూడా ఊరుకొన్నాఁడు.

మధు:—ఏం వూరుకున్నాడూ?

అల్ల:—మనంచెబితే సరేనన్నాఁడు. సరేనంటే అర్థమేమిటి? రాజుపని అవునో కాదో బసవఁడు చెప్పాలనికదా రాజుపంపించింది. బసవఁడు చెప్పలేదు చూశావా? ఒకవేళ రాజు మనలను చంపితే నింద మీారందరూ రాజుమీద వేస్తారేమో నేనుమాత్రం బసవఁడిమీద వేస్తాను.

మధు:—చచ్చినతరువాత నువ్వూనేనూ యెవరిమీాదా వెయ్యలేము.

అల్ల:—అందుకనే ముందరే చెబుతున్నాను.

మధు:—నాతో చెబుతున్నావు. నేనూ చచ్చిపోయేవాణ్ణే. బ్రతికిఉండేవాళ్లతో చెప్పు.

అల్ల:—రాజుతో చెబుతాను. వెళ్లటంతోటే చెబుతాను. ఇదిగో రాజప్రాసాదం. లోపలికి పద.

(తెర యెత్తఁగా బిజ్జలుఁడు ప్రవేశించును.)

అల్ల:—మహారాజా! నీయాజ్ఞప్రకారంవచ్చాము నీవు మమ్మల్ని చంపుతావు. ఆ నింద నీది కాదు. బసవఁడిదే.

బిజ్జ:—నేను మిమ్ము చంపను. ఒకవేళ చంపితే, ఆనింద నాది యెట్లా కాకుండా పోతుంది? బసవఁడిది యెట్లా అవుతుంది?

అల్ల:—నీవు చంపకపోతే చెప్పను.

బిజ్జ:—చంపుతాను. చెప్పు.

అల్ల:—ఆ-ఆ అనటంలో చంపేటట్టుగానేవుంది. చెబుతున్నా విను. బసవయ్య మాకేమీ సమాధానం చెప్పలేదు, విని యూరుకున్నాఁడు. సరే పొమ్మన్నాఁడు. కొంప మునుగుతుం దన్నాను. మునగనీ, నష్టం లే దన్నాడు. అతడి కళ్లుమాత్రం భగ్గున మండినవి.

బిజ్జ:—మధుపయ్యా! నీవు పోయి బసవేశ్వరుని నేను రమ్మంటి నని చెప్పుము.

(మధుపయ్య నిష్క్రమణము.)

బిజ్జ:—అల్లయ్యా! నీకు నా యమాత్య పదవి నిచ్చెదను స్వీకరించెదవా?

అల్ల:—నేను వట్టి మందమతిని.

బిజ్జ:—నీవు మహా మేధావివి.

అల్ల:—నా తెలివియంతయు నాప్రాణముల మీదికి వచ్చినప్పుడే. తక్కినప్పుడు నేను మందమతిని.

బిజ్జ:—ఎప్పుడును నీవు నాయొద్ద నుండుము. ఎప్పుడును నేను నీప్రాణములమీఁదికిఁ దెచ్చుచుందును. ఎప్పుడును నీవు తెలివిగలవాఁడవై యుండుదువు.

అల్ల:—చచ్చిపోవుట యెప్పుడు?

బిజ్జ:—(నవ్వి) తెలివి యెప్పు డాఁగిపోవునో యప్పుడే చచ్చిపోవుట.

(బసవేశ్వరుఁడు, మధుపయ్యయుఁ బ్రవేశింతురు.)

బిజ్జ:—బసవేశ్వరా! వీ రిద్దఱును రాజద్రోహు లు. వీరి నేమి చేయ మందువు?

బస:—వారు చేసిన ద్రోహమేమి?

బిజ్జ:—వారినే యడుగుము.

మధు:—బసవేశ్వరా! మేము రాజును దృణీక రించితిమి. మాకు బసవయ్య రాజు గాని బిజ్జలుఁడు రాజు కా దంటిమి.

బస:—మహారాజా! వీ రీ మాటలు తమ యెడల్లు తెలిసియున్నప్పు డనిరా? మరులు కొనినప్పు డనిరా?

బిజ్జ:—మరులుకొనుట యనఁగా శివుని మరులు కొనుటయా? కడుపునిండ భోజనము దొరకినప్పుడు గూడ మరులుకొందురా?

బస:—త్రిభువనమల్లా! నీ వాక్యములు మిక్కిలి తీక్ష్ణములుగా నున్నవి.

బిజ్జ:—వీరి కేమి శిక్ష విధింపఁబడవలయునో యమాత్యుఁడు నిర్ణయింపవలయును.

బస:—వీరు శివభక్తులు. వారి నేమియు శిక్షింప రాదు.

బిజ్జ:—మహామంత్రిశేఖరా! నీవు సింహాసన మునం దాసీనుఁడవు కమ్ము.

బస:—ప్రభూ! అది రాజపీఠము.

బిజ్జ:—ఓహో! అవునవును. నీ వీ యమాత్య పీఠము నలంకరింపుము.

బస:—ప్రభూ! ఎందుకు?

బిజ్జ:—ఎందుకేమిటి? నీవు మహామాత్యుఁడవు గనుక నమాత్యపీఠమునందుఁ గూర్చుండు మంటిని.

బసవ:—చిత్తము. అట్లే కూర్చుందును.

(కూర్చుండును.)

బిజ్జ:—తమయమాత్యఖడ్గము నాచేతి కొకసారి యిందు. (బసవఁ డీయఁగాఁ దీసికొని) బసవేశ్వరా!

సకల సామ్రాజ్యపూజ్యస్థితికిల్లఁ, బ్రకటింపఁగా నీవ పతి వట్లు గాక నాయర్థమునకుఁ బ్రాణమునకుఁ బతివి, వేయును నేల నీవే నేను బసవ.

బస:—సకలలోకైకరక్షకుఁ డగు శివున కొక నిన్ను రక్షించుటకు నెంత పెద్ద. కావున మా లింగ దేవుభక్తులకు నేవల వెలచుచుం డింతియచాలు.

బిజ్జ:—బసవేశ్వరా! నేనురాజును. నీశివభక్తులు నాకు వెఱువవలయును. నీరాజును నీశివభక్తులకు వెఱ వలెనా? ఏమి మంత్రిత్వమయ్యా! నీ శివభక్తులు నా

రాజ్యమును విస్తరింపఁజేయుదురా? నా సైన్యములు యుద్ధములో నోడకుండఁజేయుదురా? వినపుఁబాఁగ యూదరపెట్టి యంపజలకన్నులలో దుమ్ముచల్లి శర్కరా మిశ్రిత నవేక్షురసము త్రాగుట కాదు. విప్రవినోదివలె వట్టిచేతులయందుఁ బాలు పిండించుటకాదు. బ్రాహ్మణుని నేన్గును గారడీచేసి తలలు కనిపించలేదు, ఉప్పర వీథి కెగిరిపోయినవని వంచించుటకాదు. కళియంబత్తో నిదివఱకే యేర్పఱచుకొన్న సంకేతము రాజుముందర మహిమవలెఁ బ్రకటించుటకాదు. అయినచో శివభక్తుఁడవు కమ్ము. కానిచో నమాత్యుఁడవు కమ్ము. అదియు నిదియు నొక్కసారి కాలేవు. కాఁగలుగుదువేనిఁ గమ్ము. నా కభ్యంతరము లేదు. కాని నీ శివభక్తులకు నేను వెఱువను.

బస:—(నిర్ఘాంతపోయి) రాజా! ఏమియిది? శివభక్తులు సాక్షాత్ప్రమథులు.

బిజ్జ:—బసవా! ప్రమథులను నేను నెఱుఁగుదును. ఒకఁడు సూకరముఖుఁడు. ఒకఁడు శునీముఖుఁడు. ఒకఁడు గార్దభముఖుఁడు. వారందఱు శుకదర్దురాదులు. వారిమాట నాతోఁ జెప్పకుము. వారును, వారివంటి శివభక్తులును రాజనీతి కడ్డమురారు. ఎవఁడు రాజున కక్కఱపడునో వానిని రాజు సంరక్షించును.

బస:—ఎవఁడు శివు నారాధించునో యెవఁడు శివభక్తుల నాదరించునో వానికి శివుడును, శివభక్తులును విధేయు లగుదురు.

బిజ్జ:—నేను శివు నారాధించుచున్నాను. నేను శివభక్తుల నాదరించుచున్నాను. ఈ యల్లయ్య, మధుపయ్యలు రాజద్రోహము చేసి కొన్నిమాసము లైనది. నేను వారి నింతవఱ కేమియు ననలేదు. శివుఁడును, శివభక్తులును నాకు విధేయులు గాకపోయినను సరే, నన్నాదరింతు రేమో యని యిన్నాళ్లు లెదురుచూచితిని. ఈశివభక్తి యంతయు వట్టిబూటక మని యిప్పుడు తెలిసినది. కనుక మరల నారాజనీతిమీఁదనే నేను నిలుచుంటిని.

బస:—బల్లహా! శివభక్తి ముక్తిపదము. అది నీకు రాజ్యములు సంపాదించిపెట్టదు. నిన్ను యుద్ధములలో గెలిపింపదు. నీ యాంతరకలుషములను దొలఁగించి నిన్ను సచ్చిదానందరూపమైన శివునిలో నొకచిత్కళగాఁ జేయును.

బిజ్జ:—నీ శివభక్తులు నాకన్న నెక్కువ క్రోధవంతులు. మీ మాచయ్య పరమక్రోధి. మీ శివభక్తులందఱు దురభిమానులు. బసవేశ్వరా! శివభక్తులు నా రాజ్యమున సంరక్షింపఁబడవలయునేని నీ వీ ముసుఁగు తొలఁగించుకొనవలయును. నీ వమాత్యుఁడవుగా నుండి యీపదవి వెనుక శివభక్తు లని పేరుపెట్టి కొందఱు దొంగలచేతఁ జిందులు త్రొక్కింపకుము. శివుఁడు నిజముగాఁ బరమేశ్వరుఁ డైనచో, నీమహత్తు లన్నియు నిజము లైనచో నామహత్త్వప్రకటనము సర్వవిషయములందును నుండవలయును. ముల్లు శివభక్తులకే విఱిగి తక్కినవారికి విఱుగకుండఁబోదు. ఆ ముంటి బాధ యొక్క శివభక్తులకే తొలఁగవలయునా? అందఱకును దొలఁగవలయును. నేను స్వప్రయోజనార్థినై యడుగుటలేదు. యావద్భారతము కనీసము దక్షిణాపథ మొక్కగొడుగుక్రిందకు రావలయును. అది నీ మతమునకు, నామతమునకు భారతదేశమునఁ బుట్టిన సర్వమతములకు రక్ష. అట్లుచేయఁజాలవేని నీమతము మతము కాదు. నీమహత్తులు మహత్తులు కావు. ఈ మహత్తులు బోయవాండ్ర నోటిముందరి ప్రసాదము తొలఁగించుటకు బ్రాహ్మణుల యాచారములు పాడు చేయుటకుమాత్రమే పనికివచ్చును. ఈ మహాకార్యము చేసి నీశివభక్తి నిలువఁబెట్టుకొనుము. కాదేని రాజనీతికి శరణ మనుము.

బస:—రాజా! శివభక్తులజోలికిఁ బోకుము. వారు నిప్పుకణములవంటివారు.

బిజ్జ:—నీవు రాజుతో వైషమ్యము పెట్టుకొనకుము. రాజు మహాగ్నిజ్వాలవంటివాఁడు. నీమాచయ్య యొక్క యేన్గుతల నెగిరింపవచ్చును. రెండువేలయేన్గులు డీకొన్నచోఁ, బదివేలగుఱ్ఱము లెదురునడచినచో, లక్ష సైన్యము కత్తులు దూసినచో, బన్నిద్దఱు దండనాథు లగ్రయాయు లైనచో, మొగనుండి బిజ్జలుఁడు నడిపించినప్పుడు నీమాచయ్యయు గీచయ్యయుఁ బనికిరారు.

బస:—శివా! శివ! ఈ శివభక్తాపరాధము నేను వినలేను. నన్ను నీలోఁ గలుపుకొనుము.

(నిష్క్రమించును.)

బిజ్జ:—బసవా! బసవ!

జగదేవుఁడు:—(ప్రవేశించి) మహారాజా!

బిజ్జ:—బసవా !

జగ:—మహారాజా! నేను జగదేవుఁడను.

బిజ్జ:—బసవేశ్వరుఁ డేడి ?

జగ:—మహారాజా ! బసవయ్య వెళ్లిపోయెను.

బిజ్జ:—ఎక్కడికి ?

అల్ల:—శివునిలోఁ గలసెద నని వెళ్లిపోయెను.

బిజ్జ:—జగదేవా ! నీవు పోయి బసవేశ్వరుని మళ్లించుకొని రమ్ము.

(జగదేవుఁడు పోయి బసవనితో ప్రవేశించును.)

బిజ్జ:—బసవా ! నీవు పోయి సంగమయ్యలోఁ గలియకుము. నీతో నా కింకను బనియున్నది. నీ కింకను కోపము తెప్పింపవలయును. తెప్పించెదనుపో !

(బసవఁడు నిష్క్రమించెను.)

బిజ్జ:—ఎవఁడురా అక్కడ?

దావా:—(ప్రవేశించును.)

బిజ్జ:—ఈ యల్లయ్య, మధుపయ్య లిద్దఱును రాజద్రోహులు. వీరి నిద్దఱను గొనిపోయి—

అల్ల :—రాజా! చంపుమందువా ?

బిజ్జ:—నీకు వివేకము వృద్ధి కాఁగలదు.

మధు:—రాజా ! ఉరి తీయుమందువా ?

బిజ్జ:—సేవకా! వీరి కన్నులు పెఱికించి యూరి వెంటఁ ద్రిప్పుచు బసవయ్యయింటిముందు వదలిపెట్టి రమ్మనుము.

(అల్లయ్య యేడ్చుచుండఁగా నిర్వురిని భటులు గొనిపోదురు.)

జగ:—మహారాజా ! ఇది శివద్రోహము.

బిజ్జ:—జగదేవా ! నీవు పోయి శివద్రోహిని నీ వాగ్దానప్రకారము చంపుము పొమ్ము.

జగ:—మహారాజా ! ఇది బసవయ్యకు మిక్కిలి కోపకారణము.

బిజ్జ:—కాదయ్యా, కాదు. మహత్త్వ ప్రకటన హేతువు. మరల వారికిఁ గనులు తెప్పించును. శివుఁడు మిక్కిలికంటివాఁడుకదయ్యా! ఆయనకు రెండు కన్నులు చాలును. ఎక్కువకన్ను పంచిపెట్టవచ్చును.

జగ:—మహారాజా !

బిజ్జ:—జగదేవా ! రాజద్రోహులను శిక్షించితిని. శిక్షింపనక్కఱలేదా? చెప్పుము.

జగ:—ప్రభూ ! తప్పక శిక్షింపవలయును.

బిజ్జ:—సరే.

[తెర.]

## ద శ మా ం క ము

[ప్రవేశము : బసవేశ్వరుఁడు, మడివాలుమాచయ్య]

మాచ:—బసవేశ్వరా! ఈప్రళయం విన్నావా? అల్లయ్య, మధుపయ్యలకళ్లు బిజ్జలు పూడబెరికించాడట. ఇంకా శివభక్తు లీవూళ్లో వుండటానికి వీలవుతుందా? ఈబిజ్జలుణ్ణి యేమిచెయ్యమంటావు. వాణ్ణి సర్వనాశనం చేస్తాను.

బస:—మాచయ్యా ! అల్లయ్య మధుపయ్యలు రాజద్రోహం చేశారు. వాళ్లను రాజు శిక్షించాడు.

మాచ:—రాజద్రోహమంటే యేమిటి ? సృష్టిలో శివద్రోహమంటూ వుంటుందిగాని రాజద్రోహమంటూ వుండదు.

బస:—బిజ్జలుడు శివద్రోహం యేంచేశాడు? శివభక్తులకళ్లు తీయించాడు.

మాచ:—శివభక్తుల కళ్లు తీయించటం శివద్రోహమే.

(తరువాత మల్లయ్య బ్రహ్మయ్యలు ప్రవేశింతురు.)

మల్ల:—బసవా! ఇంక నీయూరిలో శివభక్తులు బ్రతకడానికి వీల్లేదు. రాజు శివభక్తులమీద గత్తులు నూరుతున్నాడు. బసవా ! చౌడరాయడు, ఏకాంత రామయ్య, కిన్నరబ్రహ్మయ్య, కేశిరాజయ్య, కన్నడ బ్రహ్మయ్య మొదలగువారు కళ్యాణకటకం వదలిపోతున్నారు. శివభక్తులందరూ మూటలు బుజాలను వేసుకొని ఊరువదలిపెట్టి లేచిపోతున్నారు.

మాచ:—అయితే నేనూ వెళ్లిపోతున్నాను.

బస:—నేనూ వస్తున్నాను.

మల్ల:—మీరందరూ వెళ్లిపోయినా నేను మట్టుకు అల్లయ్య మధుపయ్యల పగతీర్చకుండా రాను.

మాచ:—మల్లయ్యా ! నీవు పోయి అల్లయ్య మధుపయ్యలను దీసుకురా.

మల్లి:—నేను తీసుకురావట మెందుకు? రాజభటులే తీసుకువస్తున్నారు. వారిద్దరిని తాళాలు, తప్పెటలతో నూరేగించి బసవడియింటిముందు వదలిపెట్టమని రాజు ఆజ్ఞచేశాడు.

మాచ:—వీడు రాజుకాదు, రాక్షసుడు.

(తెరలో గలగలలు)

బ్రహ్మ:—అదిగో రాజభటులు అల్లయ్య మధుపయ్యలను తెచ్చినట్లుగా వుంది.

బస:—బ్రహ్మయ్యా! నీవు పోయి వారిని లోనికి తీసికొనిరా!

(బ్రహ్మయ్యపోయి అల్లయ్య, మధుపయ్యలతో ప్రవేశించును.)

అల్ల:—అయ్యో నేను నడవలేకుండావున్నాను.

మధు:—నే నీ బాధపడలేను. బిజ్జలా! నిన్ను శపిస్తున్నాను. నీరాజ్యం నాశనమవుతుంది. నీయూరు వల్లకాడవుతుంది.

అల్ల:—బిజ్జలా! బిజ్జలా! కళ్లు తీయించడం కన్న చంపితే బాగావుండేదే.

మాచ:—అయ్యలారా! మీకళ్లు బాధగా ఉన్నవా?

అల్ల:—ఎవరా మాట్లాడేది, మాచయ్యగారా? కళ్లుబాధగా ఉండవా? కళ్లేమిటి, ఒళ్లంతా బాధగా వుంది. ఒంట్లో ఉన్ననెత్తురంతా యీపాటికే కారిపోయింది. నాకళ్లు నిమ్మదించకముందే నేను చచ్చిపోతాను.

మాచ:—బసవా! నీ వూరకున్నా నే నూరుకోను. ఇదిగో, పోయి రాజును చంపివస్తాను.

బస:—మాచయ్యా! రాజవధ మహాపాపకార్యము. నీవు చేయరాదు.

మల్లయ్య బ్రహ్మయ్యలు:—మాకు పాపభయం లేదు. మేం చేస్తాం.

బస:—బిజ్జలుడు యుద్ధకళా విశారదుడు. మహాబలశాలి. మీరిద్దరూ చెయ్యలేరు.

మాచ:—అయితే నేనే వెళ్లి చంపుతాను.

బస:—మాచయ్యా! నీవంటి లోకోత్తర పురుషుడీకార్యం చేయరాదు. పైగా నా కొకఅనుమానం వుంది. శివభక్తులను లోనికి రానియ్యరు.

మాచ:—కోటకోటంతా నిర్మూలం చేస్తాను.

బస:—మాచయ్యా! అట్టిపని మనం చెయ్యకూడదు. అట్లాంటిపని చెయ్యడానికి మొదలుపెడితే అల్లయ్య మధుపయ్యల కళ్లు పోయేవి కావు.

అల్ల:—బసవా! తప్పు నీదనుకొన్నాను.నన్ను క్షమించు, నీవు రాజుకన్న గొప్ప మేధాశాలివి.

బ్రహ్మ:—ఎదటివాళ్ల తెలివితేటలు మెచ్చుకోవటానికి అల్లయ్యవంటి తెలివిగలవాడు కావాలి.

మల్ల:—బ్రహ్మయ్యా! ఊరుకో! ఈస్థితిలో అల్లయ్య నాక్షేపించరాదు.

మాచ:—ఇప్పుడు బిజ్జలుణ్ణి చంపటం తప్పదు. అది యెవరు చేస్తారు?

బ్రహ్మ:—జగదేవుడు చెయ్యాలి.

మాచ:—జగదేవుడు మనకు వాగ్దానంయిచ్చాడు బ్రహ్మయ్యా! నీవుపోయి జగదేవుణ్ణి పిలుచుకురా!

బస:—జగదేవు డీపని చేస్తాడా?

మాచ:—నేనూ బ్రహ్మయ్యా సాక్షులముగా కొడుకైనా సరే, గురువైనా సరే, రాజైనా సరే, యీపని చేస్తానన్నాడు.

బ్రహ్మ:—నేనుపోయి తీసుకువస్తాను. ప్రత్యక్షంలోనే కనుక్కుందాం. జగదేవయ్య చెయ్యనంటే జగదేవయ్యనే చంపుతాను.

(నిష్క్రమించును)

బస:—మాచయ్యా! జగదేవుడిచేత యీపని చేయించటం బాగాలేదు. జగదేవుడికి బిజ్జలుడు రాజు. నేను గురువును. జగదేవుడిచేత బిజ్జలుణ్ణి చంపించడం నన్నుగూడా చంపించుకోవడం.

మాచ:—బసవా! వెనక్కితీస్తున్నావు.ఆనాడు అల్లాంటివాగ్దానం యీనాడు యిలాంటిబెడద పుడుతుందనే కదా తీసుకోవడం.

బస:—ఇందుకోసమే తీసుకున్నామా? అతని మనస్సు పరిశీలించేందుకు తీసుకున్నామా?

(జగదేవుడు, బ్రహ్మయ్య ప్రవేశింతురు.)

జగ:—బసవా! శివద్రోహము జరిగినదికాదా?

మాచ:—జరిగినది.

జగ:—నేను నావాగ్దానము నెఱవేర్పవలయునా ?

మాచ:—అవును. నెఱవేర్పవలయును.

జగ:—నేను నిన్నడుగుటలేదు. నీకు వాగ్దానము చేయలేదు. నేను వాగ్దానముచేసినది బసవనికి. బసవనినే యడుగుచున్నాను.

బసవ:—జగదేవా! అవును, వాగ్దానము నెఱవేర్పవలయును.

జగ:—నేను బిజ్జలునా వధింపవలసినది.

మాచ:—బ్రహ్మయ్యా! నీవీయనతో సంగతులన్నియు జెప్పి తెచ్చితివా ?

బ్రహ్మ:—నేను నోరు మెదల్ప లేదు. ఈయనతో నొక్కమాటాడలేదు.

జగ:—బసవా! త్రిభువనమల్ల బల్లహ బిజ్జలునేనా వధించునది.

మాచ:—అతఁడే శివద్రోహము చేసెను. అతనినే వధింపవలయును.

జగ:—బసవా! మహాకర్మయోగి, బల్లహు నేనా వధింపవలసినది.

బ్రహ్మ:—వాఁ డల్లయ్య, మధుపయ్యలనేత్రములను దీయించెను. వానినే కత్తితోఁ బొడిచి చంపవలయును.

జగ:—బసవా! సర్వభారతైకచ్ఛత్ర మహోన్నతభావధీవిభవాభిరాముఁడు, బిజ్జలునేనా వధించునది.

మధు:—వానినే వధింపవలయును

అల్ల:—బిజ్జలు నేల వధింపవలయును? మాచయ్య మాకన్నులు తెప్పింపరాదా ? బసవయ్య తెప్పింపరాదా? తెప్పించినచో బిజ్జలుని వధింపనక్కరలేదు.

మల్ల:—వధించితీరవలయును.

జగ:—బసవా! నిన్నడుగుచున్నాను. నావాగ్దానము నేను నెఱవేర్చుటకు సిద్ధముగానున్నాను. నావెంట నాకొడుకునుగూడఁ దెచ్చితిని. అడుగో! అచ్చట నా కొడుకు! ఇడుగో, యిచ్చట నాగురువు బసవేశ్వరుఁడు. అచ్చట నారాజు బిజ్జలుఁడు. ఈ ముగ్వురు నా కొక్కటియే. ఇందులో నెవరితల నెగురవేయవలయును ?

మాచ:—నీవు రాజుతల నెగురవేయవలయును

జగ:—ముందు రాజుతల నెగురవేసి తరువాత నా కొడుకుతల నెగురవేసి—

మాచ:—తరువాత బసవనితల నెగురవేసెదవా ?

జగ:—తరువాత నాతల తెగఁగోసికొందును.

బస:—జగదేవా! నీవు వాగ్దానము చేసితివి.

జగ:—చేసితిని.

బస:—ఆవాగ్దానము నెఱవేర్చుట కిది వేళ.

జగ:—ఆనాఁడే నీతోఁ జెప్పితిని. రాజుతల వెలకట్టితి నంటివి. అప్పుడు నే నేమంటిని ?

బస:—(మౌనము.)

జగ:—ఏమంటినో మీకు జ్ఞాపకములేదు. ఒక్క గురువుతల వెలకాదు, ఒక్క కొడుకుతల వెలకాదు, ఈ నా ప్రాణము ఈనా జన్మయొక్క పరమార్థమునంతయు వెలకట్టితి నంటిని.

బస:—(మౌనము.)

జగ:—బసవేశ్వరా! అట్లే కానిమ్ము. నాజన్మపరమార్థమంతయు నీవొక్కపూట నాయింట నారగించుటకు ఫలమునందు లొంగిపోవును. లొంగిపోయినది. బసవా! ఒక్కటియే నిన్నడుగుచున్నాను. నేను బిజ్జలుని జంపి వచ్చులోపల నీవు కప్పడి సంగమయ్యలో నైక్యము పొందకుము. పొందితివో నాజన్మనంతయు నికృష్టముచేసినవాఁడ వగుదువు. నేను నీయానతి బిజ్జలుని వధించుటకుఁ బోవుచున్నాను. నాతో నింకెవరైన వత్తురా?

మల్లయ్య బ్రహ్మయ్యలు :—మే మిద్దఱము వత్తుము.

మాచ:—అల్లయ్య మధుపయ్యలారా! శివుని దయవలన మీకు నేత్రములు వచ్చుచున్నవి. మీరు శివద్రోహివధఁ గనులార చూడవచ్చును.

మధు:—(కనులు తెఱచి) నేనింక నేచేతులు నా కనులు పెఱికించెనో యాచేతులు విఱుగుట చూచెదను.

అల్ల:—(కన్నులుదెఱచి) నే నీరాజద్రోహము జరిగిన పురములో నుండను. నే నీపురమునుండి వెడలిపోవుచున్నాను. బసవా! బిజ్జలుఁడు శివద్రోహము చేయలేదు. నీవును శివభక్తులందఱును, మేమును రాజ

ద్రోహము చేసినాము. శివద్రోహమునకు శిక్షయుండి రాజద్రోహమున కుండకపోదు.

జగ:—శివద్రోహమునకుఁ గళ్యాణ కటకము నశించుచున్నది. రాజద్రోహమునకు వీరశైవమతము నశించుచున్నది.

బస:—జగదేవా! నీవు బిజ్జలుని వధింప నక్కఱలేదు.

జగ:—బసవా! వాగ్దానము చేసినది నేను. ఇది వఱకే వధింపుమని యాజ్ఞయిచ్చితివి. నేను మాట తిరిగి పోను.

బస—నీవు మాట తిరిగిపోవని నాకును బిజ్జలునకు నిద్దఱకుఁ దెలియును. నీచేత నావాగ్దానము చేయించుట—సంగా! సంగ!

(ఇది విష్కంభము.)

(తరువాత శయ్యామందిరగతుఁడైన బిజ్జలుఁడు ప్రవేశించును)

బిజ్జ:—మొన్నఁ గోపపడినప్పటినుండియు నీల నాదగ్గరకు వచ్చుటలేదు. ఆరోజు పాడినపాటకూడ నాకు విసుగే కలిగించినది. నీలకు వివాహము చేయవలయును. ఈపఱ పొత్తుకొనుచున్నది. నీల మునుపు చాల మంచి పాటలు పాడెడిది. ఈ నడుమ పాడుచువచ్చినవానిలో పట్టిసంబోధనలే తప్ప భావనాబలము లేదు. మానీల గొప్ప కవయిత్రి. బసవనిపాటలకన్న బాగుగా నున్నవా నీలపాటలు. బసవఁడు మహాకవి. ఈపాట యెంత యద్భుతముగా వ్రాసినాడు.

అక్కజం బక్కజం బక్కజం బయ్యో
నిక్క లోకం బెల్ల నీలకంఠుండే
హరునికంఠము చివురాకులో నుండె
హరునిజటాకృతి శరవణం బయ్యో
శివునిలేఁజిరునవ్వు చిఱుపూవు లయ్యో
భవునిమైఁబూది నేదగికిపుప్పొడయ్యో
అక్కజం బక్కజం బక్కజం బయ్యో
నిక్క లోకము లెల్ల నీలకంఠుండె
తూరుపుకోనలోఁ దోచినమబ్బు
తొలిసామిమెయికాంతి దోచినదేమి
కొసనల్లమబ్బొండు కోసగా, దేలి
పసలజటాజూటిభావ మొందినది—అక్కజం—
ప్రజయెల్లహృదయాంతరాళంబునందు
హరునివెఖరి సచ్చిదానందులైరి
మహి జడమ్ములు జంగమమ్ములుహూడ
వహియించె శివదేవుబత్తిక్రొమ్మరులు—అక్కజం—

నాకు నిద్రవచ్చుచున్నది.

నీల:—(ప్రవేశించి.)

రమ్మన్నాడోయ్ పరమశివుడు నను రమ్మన్నాడోయ్
రమ్మనికనుసన్నలుచేసెర్ చిమ్మచేతిఁవేలాడించెర్
ననురమ్మనిరమ్మని కనువిసిరాడోయ్—
రాజుమాళిగల తలయూడించుచు—రమ్మన్నా—
పంపించాడోయ్ అమ్మనుననుపట్టించుకురమ్మనిపంపించాడోయ్
తమ్మియడుగు లిలపై నుంచుచు నెమ్మదినెమ్మదిగా మాయమ
వచ్చినది—రమ్మన్నాడోయ్—
కరములుచాచిందోయ్ అమ్మనన్నురమ్మనుమని చివురుల—
కరములు సాచిందోయ్
కంకణములు ఘలుఘల్లని మ్రోగగ మంకెనపూవులు చూపులు
చూచుచు రమ్మన్నాడోయ్

బిజ్జ:—నీలా! ఎవరు రమ్మన్నారు?

నీల:—పరమశివుఁడు నను రమ్మన్నాడోయ్.

బిజ్జ:—ఎక్కడకు రమ్మన్నాడు? మఱి నీవు వెళుతున్నావా?

నీల:—

ఘలంఘలలుగా కాలగజ్జియలు కదలిపోయెడిని నీలలోచన
తల తలలు గా వెండికొమ్ములూ తళుకుతళుకు లా వెండిలోయలను
హాలహాలము తిన్నట్టిసామి జోహారుసేసి యెన్నాళ్లైనదియొ
నీలచిక్కినది నీలస్రుక్కినది నీలలోన గగ్గోలుపడ్డదీ
ఏదోపురాకృతపుశాపవశమునా యిలకురాక మఱితప్ప దయ్యెడిని
హాలా! హాలా! మహేశీదేవీ హాలా! హాలా! వారాహీదేవీ
సఖుల్ వచ్చితిని మీరు నర్ బరివ్వంగమందునా పూనగావలె
సుఖంబన్నదీ ధారుణిలేదే సారిదిమిమ్ము గలియగ వచ్చెదనిదె
—ఘలంఘలలుగా—

బిజ్జ:—నీలా! ఎక్కడికి పోయెదవు?

నీల:—నా తొలినివాసమైన శివలోకములకు పోతున్నాను.

బిజ్జ:—అమ్మా! పెండ్లియీడు వచ్చినపిల్లవు. ఇట్లల్లరిగాఁ దిరిగినచో మర్యాదకాదు, తల్లీ!

నీల:—

ఈడులేదు శివలోకభూములను జోడులేదు శివలోకభూములను
కూడవయసు కాలమ్ము సర్వమును జోడుకట్టవా శివలోకమ్ముల

లేనిమాట లేమిటికాడెదవో లింగరూపమొక్కటియే మలపై
కానిపోని యపవాదులు పలుకకు లేనిపోని మర్యాదలు చెప్పకు
—ఈడు లేదు—

పరమశివుఁడు కనులుమూయుటతోఁ దెరలు తెరలుగాఁ జిమ్మచీకటులు
తెరలి వేడిలేని యెండయుమంచు సురియనివెన్నెల కూడియాడెడిని
—ఈడు లేదు—

వెలుగుపందిరుల విచ్చెడు వెల్లెడ కలుగునొక్కఁడే సుఖభావమ్మది
కలుగబోవు సంకల్పవికల్పము లలఘువులై శివలోకభూములను
—ఈడు లేదు—

నీల:—నేను వెళుతున్నాను.

బిజ్జ:—నీలా! ద్వారబంధములన్నియు మూయబడియున్నవి.

నీల:—నేను బంధములన్నియుఁ దీయఁగలను.

బిజ్జ:—నీలా! కొన్ని గడియలుపైన నున్నవి. చిన్నపిల్లవు నీకందవు. కొన్నిటి కినుపగుదియలడ్డము వేసియున్నవి. వాని నెత్తుటకు నీపసిచేతులకు బలము చాలదు.

నీల:—

ఎచటిదో ఆకాశమే తలపాగ శివునికందును చిట్టచివరి తారకలే
స్వామిచేయెత్తిజల్లలరాలఁగొట్టు ఈ తారకలుగాని యింతింతపూలు
ఇలకుమింటికిగాని యేచూడుపురములో అలమిచేతులతోడ
నార్పేఁబో శివుఁడు
వానిబాహులలోన బలమెంతకలదో! కానరానివిభుండు కలడు
నాదారిలో—

(నీల పోఁబోవును.)

బిజ్జ:—నీలా! నీవు పోయి సుఖముగా నిద్రింపుము. రేపు మఱలఁ గొన్ని పాటలు పాడవచ్చును.

నీల:—నాపాటలైపోయినవి. నే నింకబోయి నిదురపోతాను.

(నిష్క్రమించును.)

బిజ్జ:—నాకును నిద్రవచ్చుచున్నది. నీల నిజముగాఁ దలుపులు తెఱచుకొని పోవునా? రక్షకభటులున్నారు. పోనీయరు. వారొకవేళ రాజకుమార్తెయని తలుపులు తెఱతురేమో! నీలపోయి నిద్రపోదునన్నది. పోయి నిద్రపోవును. ఈ పాటలు ప్రతిదినము నున్నవే.

(నిద్రించును.)

(జగదేవుడు, మల్లయ్య, బ్రహ్మయ్య ప్రవేశింతురు.)

మల్ల:—రక్షకభటులనందఱను జంపితిమి. తలుపులన్నియు నీల తెఱచి వెడలిపోయినది.

బ్రహ్మ:—నీల యీయర్ధరాత్రమున నెచ్చటికిఁ బోవుచున్నది?

జగ:—అదుగో! బిజ్జలుఁడు. మహారాజా! జగదేవుఁడు నమస్కరించుచున్నాఁడు.

బిజ్జ:—(మేల్కాంచి) జగదేవా! ఇచ్చటి కెట్లు వచ్చితివి? రక్షకభటులు నిన్నెట్లు రానిచ్చిరి? తలుపు లెవరు తెఱచిరి?

బ్రహ్మ:—రక్షకభటులను నేను జంపితిని.

మల్ల:—నీల తలుపులు తెఱచినది.

బిజ్జ:—ఓహో! మీరిద్దరు శివభక్తులే. ఇంత యర్ధరాత్రమున నేల వచ్చితిరి? బసవేశ్వరున కపాయమేమియు లేదుకద. జగదేవా! బసవేశ్వరుఁడు సుఖమై యున్నాఁడా? చూచితివా! నే నల్లయ్య మధుపయ్యల నేత్రములఁ దీయించితిని. బసవేశ్వరు డాదుఃఖముచేత నాత్మహత్య చేసికొనలేదు గద! నిజముగా నీల వెళ్లిపోయినదా? ఎక్కడికి వెళ్లిపోయినది? బసవేశ్వరుఁడు సుఖముగా నున్నాఁడా? ముందది చెప్పుము.

జగ:—మహారాజా! సుఖముగా నున్నాఁడు.

బిజ్జ:—ఆయనకుఁ గోపము రాలేదుకగ!

జగ:—కొంత వచ్చినది, కొంత రాలేదు.

బిజ్జ:—అల్లయ్య మధుపయ్యలకు మఱలఁ గన్నులు వచ్చినవా?

జగ:—వచ్చినవి.

బిజ్జ:—మీ రిప్పుడు వచ్చినపని యేమి?

బ్రహ్మ:—శివద్రోహిని నిన్ను వధించుటకువచ్చితిమి.

బిజ్జ:—జగదేవా! నీవు కానిచో నిప్పు డేమి చేసెడివాఁడనో నీకుఁ దెలియునా? కన్నుమూసి కన్ను తెఱచునంతలో నేను పరమలఘువుగా దాటి యీ మంచము మీ శిరములందు వేసి నొక్కి మీచేతులయందలి ఖడ్గములచే మిమ్ముఁ బొడిచి చంపెడివాఁడను.

(మల్లయ్య బ్రహ్మయ్యలు రాజును బట్టుకొనఁబోదురు.)

జగ:—తుచ్ఛులారా! వెనుకకునుండుఁడు. పవిత్రమైన రాజదేహము మీ యపవిత్ర స్పర్శచేతఁ గలుషితము చేయకుఁడు.

మహారాజా! కళ్యాణకటకమునుండి ప్రజ లందఱును వెడలిపోయినారు. బసవేశ్వరాదులు కప్పడి సంగమయ్య దర్శనార్థ మరిగినారు ఇప్పు డీ కళ్యాణకటకమున నున్నది మేము ముగ్గురమే.

బిజ్జ:—జగదేవా! నాకు నిదురమత్తు వదలినది. నీవు వాగ్దానము చెల్లించుటకు వచ్చితివి కాఁబోలు.

జగ:—ప్రభూ! చిత్తము.

బిజ్జ:—జగదేవా! నా యనంతరము నాకొడుకు రాజగును. నీవును బసవేశ్వరుఁడును వానికమాత్యులుగండు నాకొడుకు రాజగుట బసవేశ్వరున కిష్టము లేనిచో బసవేశ్వరుని కుమారునకుఁ బట్టాభిషేకము చేయుము. చేరకు దక్షిణాపథమంతయు నొక్కగొడుగు క్రిందికిఁ దెచ్చి మహాసామ్రాజ్యముచేసి సనాతనమత మెంత చిరస్థాయియో యంతచిరస్థాయియైన రాజ్యము నిర్మింపుము. ఏమతమును దన్మతరక్షకుఁడైన రాజు లేనిచో నిలువదు. జగదేవా! బసవేశ్వరుఁడింత యనూహశాలి యనుకొనలేదు. కల్యాణకటకము పాడువడినచో బిజ్జలుని రాజ్యమొక్కఁడే పోదు, వీరశైవమతము కూడఁ గ్రమక్రమముగా నశించును.

జగ:—నేను బసవేశ్వరున కా సంగతి మనవిచేసియే వచ్చితిని.

బిజ్జ:—నేనింకఁ జెప్పవలసినమాట లేమున్నవి? తిరిగిపోయి బసవేశ్వరునితో నీ మాటలు తప్పకుండఁ జెప్పవలయును. నేను మిమ్ము మువ్వురిని దేలికగాఁ జంపఁగలను. కాని కటకము పాడువడిన తరువాత నేను గత్తి ముట్టనని ప్రతిజ్ఞ చేసితిని. అదిగో! త్రిశూలము చూచితివా?

జగ:—మహారాజా!

(సీ "పర్యంతధాత్రి సర్వమునల్లనై క్రమశశ్వేతమైపైకి సాగకొలది" మున్నగు పద్యము చదువును.)

బిజ్జ:—జగదేవా! మొదటిసారి యీ త్రిశూలదర్శనము నేనును దైలపదేవుఁడును జేసితిమి. నేను తైలపదేవుని సంహరించి కాలచుర్యవంశము స్థాపించితిని. ఇప్పుడు మన మిర్వురమును దర్శించితిమి. నీవు నన్ను సంహరించి నాతుదికోర్కె యీ మహాసామ్రాజ్యమునకుఁ బునాది వేయుము. బసవేశ్వరునితో నిది నాయాజ్ఞ యని చెప్పుము. బసవఁ డీయాజ్ఞ నతిక్రమించెనేని నేను శపించుచున్నాను. అతని శైవమతము నిర్మూలమగును. ఆంధ్రకర్ణాట రాజ్యములు నశించినట్లే వానిమతము కూడ నశించిపోవును. ఈనేలఁబుట్టిన మతములకుఁ జిట్టెఁడు నీళ్లు పుట్టకుండఁ బోవును.

జగ:—

(తనకత్తి చంకలోఁ బెట్టుకొనఁగా చివర జగదేవుఁడు ముందుకుఁ గనిపించుచుండును.)

బిజ్జ:—జగదేవా! నీవు నాకు బాల్యమిత్రమవు. నా కమాత్యుఁడవు. నా యుద్ధములు గెలిపించినాఁడవు.

గెలిచితి శత్రుమండలినెల్ల నీకత్తికొన జ్వాలజ్వాల దగ్నికణము లురుల
నేలితి ధారుణి నెల్ల నీనీతి పెల్లులు భగద్భగదధ్వనులను జూప
పాలించితిని నెల్లప్రజల నీ కరుణాత్రోవలు జగజ్జనముల వసలఁ జేయ
నపహరించితి నల్పనృపులశ్రీ నీతేజమల నమచ్ఛిరుఃగా నాచరింప
మాటతిరుగనివాఁడవు మంచివాఁడ
వసృతమాడనివాఁడవు నధికభక్తి
పూతహృదయాంతరాళుండవు జగదేవ!
నిన్నుఁ గౌఁగిటఁ బూనఁగా నెమ్మి కలదు.

(కౌఁగిలించుకోఁగా జగదేవునికత్తి రాజుహృదయములోఁ దూఱిపోవును.)

జగ:—హాహా! రాజా! నావాగ్దానము వృథా చేయుచుంటివి. స్నేహితునివలె మాటాడి నన్ను వంచించితివి. ఇదిగో నీ కింకను గొనయూపిరి యున్నది. ఈకత్తితో నీకంఠ మెడపుచున్నాను.

(మల్లయ్య, బ్రహ్మయ్యలు దూరముపోవుదురు. బిజ్జల జగదేవులమీఁద తెరపడును.)

మల్ల:—బ్రహ్మయ్యా! మనము పాఱిపోవలయును. జగదేవుఁడు వచ్చి మనల నిద్దఱఁ జంపును.

బ్రహ్మ:—మనము పాఱిపోయినను మనలను వెదకి పట్టుకొని చంపును. మల్లయ్యా! నాలోనుండి శివభక్తి వెడలిపోయినది. నామనస్సులో రాజభక్తి యుప్పొంగుచున్నది.

జగ:—

(ప్ర వే శిం చి)

గీ. భ్రాతయగు నమాత్యుని కరవాలధార
ప్రాణి... శివద్రోహఫలము

తం్రడివంటిరాజును జంపి తనదిగూడ
్రపాణ మేదుట దుష్టవాగ్దానఫలము.

నే నింకను మాటాడుచుంటినా ? మాటాడుచుంటిని. ఇంకను నాకత్తి నాగుండెలలో దిగఁబడలేదా ? దిగఁబడ లేదు. ఇదిగో నాగుండె యాడుచునేయున్నది. నాకత్తి చేతిలోననే యున్నది.

్రబహ్మ:—జగదేవా !

మల్ల:—జగదేవా !

జగ:—మీరిద్దఱు నిచ్చటనే యున్నారా ?

గీ. ్రకుద్ధుఁడౌ జగదేవుని ్రకూరతర కు
ఠారధారావము్రద క్తధారములుగ
మీగళమ్ములు తెగకమున్నె గరగర
కోసికొండోయి మీరె మీగొంతుకలను.

మల్ల:—్రబహ్మయ్యా ! గతిలేదు.

జగ:—గతిలేదు.

గీ. విప్రుచే రాజహత్య కావించినారు
ఇతనిచే రాజహత్య చేయించినారు
కోరి శివభక్తహత్యలు కూడను జగ
దేవుచేతఁ జేయింపక చావఁబోండు.

మల్ల:—జగదేవా ! ఇదిగో ! చచ్చుచున్నాను. (పొడుచుకొని చచ్చును.)

్రబహ్మ:—జగదేవా! నేను చావను. నేను సంగ మయ్యలోఁ గలసిపోయెదను.

జగ:—ఓహో ! నీ వెవ్వరవు ? కిన్నర ్రబహ్మయ్యవా? అవునవును. సంగమేశ్వరునిలోఁ గలసిపొమ్ము. నిన్నిందాఁకటినుండియు నే నెవ్వరో యనుకొనుచుంటిని. నీవు కిన్నర్రబహ్మయ్యవని నాకింతవఱకుఁ దెలియలేదు. ్రబహ్మయ్యా ! మీ యింటిపేరు కిన్నెరవారని యెట్లు వచ్చినది ?

్రబహ్మ:—నా సంగీతమునకు మెచ్చి నారదుఁడు నా కీబిరుదము నిచ్చెను.

జగ:—ఆ సంగీతము నాకొక్కసారి విన్పింపుము. నాయాత్మలోనుండి సంగీతమే పోయినది. మరల నా యాత్మలోనికి సంగీతము ్రపవేశపెట్టుము.

్రబహ్మయ్య:—

ఇరమ్మదముతో సరస్సులం జిఱుతరంగలందున విహరించెక్
పరాత్పరుఁడు తన మృదంగచర్మము [illegible] ్రపహరించెక్
ఘురా్రపసభమై యోంకారధ్వని నిరాతంకముగఁ జెలఁగెక్
నిరాకృతింగని నిరస్తసుఖమై నిరంతమై యొక తెలివేడెక్-
గరుద్దీప్తమై కనత్కనకరుచి విహంగపతి యొకఁడరుదెంచెక్
ఇరమ్మదముకా గరుత్ ఘటలఁ బడి హృషీకసంతతి విప్పారెక్-

జగ:—నారదుఁడు నీకుఁ జక్కనిబిరుద మిచ్చినాఁడు. నేను బసవేశ్వరుని జూడఁబోవుచున్నాను. దయచేసి నా్రపాణోత్క్రమణవేళ నింకొక పాటపాడి పొమ్ము (పరి్రకమించి) ్రబహ్మయ్యా! ఇదియే బసవేశ్వరుని సౌధము. కళ్యాణకటకవీథు లన్నియు నిర్జనములుగా నున్నవికదా! మాటాడుట కొక్కపురుగైన లేదు. అదిగో సూర్యోదయమైనది. పూర్వము సూర్యోదయ వేళఁ గళ్యాణకటక మెట్లుండెడిది ? ్రబహ్మయ్యా! నీవు పోయి యింట బసవేశ్వరుఁడున్నాఁడేమో చూచిరమ్ము.

(్రబహ్మయ్య నిష్క్రమించును.)

జగ:—బసవేశ్వరునితో నేను దిరిగివచ్చువఱకు నుండు మంటిని. ఆయన నన్ను మోసముచేసి పోయినాఁడేమో? ఛీఛీ! నాచేత గురుహత్యగూడఁ జేయింపకుండఁ బోయినాఁడు. ఏమి బసవఁడు?

్రబహ్మ:—(తిరిగివచ్చి) జగదేవా ! బసవేశ్వరుఁడును దక్కినభక్తు లందఱును గూడలిసంగమునకుఁ బోయినారఁట! ఈపాటి కక్కడ సంగమయ్యలో నైక్యమందియుందురఁట !

జగ — ధిక్ ధిక్. ్రబహ్మయ్యా! బసవనికి దేహముమీఁద నింతయభిమాన మెందులకు? తన దేహ మెన్నటికైన శివునిలో నొక భాగమగునా ? తన యాత్మ యెప్పుడైన శివునకు దూరముగా నున్నదా ? జగదేవుని నరకస్వర్గములమధ్య నూఁగులాడఁ జేసినాఁడు. పోనిమ్ము! నీవు చావఁబోవు చావే చచ్చెను. బిజ్జలా! బిజ్జలా! బల్లహా ! బల్లహా! ్రతిభువనమల్లా! ్రతిభువనమల్లా! నన్ను రాజకుమారులును రాజసైన్యమును వచ్చి చంపకముందు నాచేతులతో నన్ను నేనే చంపుకొని నీయొద్దకు వచ్చుచున్నాను.

(తెరలోఁ ధ్వని)

జగ:—్రబహ్మయ్యా ! వింటివా ? బిజ్జలుని పుత్రులు విజృంభించి సర్వనాశనము చేయుచున్నారు. దేశదేశమునందు వీరశైవులను వెదకివెదకి చంపుదురు.

నీపవిత్ర దేహము వారిచేఁ జిక్కసీయకుము. బిజ్జలుఁడు శివునియవతారము. అతనిపుత్రు లందఱును రాక్షసులు. వారి చేతిచావు పాపలోకములయందు దించును. బ్రహ్మయ్యా! నేను బోడుచుకొనఁ బోవుచున్నాను. నారదుఁడు నీ కాబిరుద మిచ్చినప్పుడు నీవు పాడినపాట పాడుము.

బ్రహ్మయ్య:—

పలపలపలపల నగేంద్రకన్యక జలజలజలజల నవ్వులు కురియఁగ
గలగలగలగల పసిండిమువ్వలు సలసలసలసల తరంగనృత్యాలు
కదలాడఁగ మెదలాడఁగ నటియించఁగ ఘటియించఁగ గణగణలాడఁగ
కనకనకనకన నగేంద్రకన్యక దొనదొనదొనదొన కరుణలు చిందఁగ
రణరణరణమని మృదంగరవములు ధణఘణఘణమని వృషేంద్రుఘంకెలు
ప్రహరించఁగ విహరించఁగ తహతహలాడఁగ.

(పాడుచుండఁగా జగదేవుఁడు పొడుచుకొని చచ్చును.)

బ్రహ్మయ్య!:—సంగా! సంగ...

[తెర పడును.]

సమాప్తము.

# అనాథబాలక!

బొడ్డు బాపిరాజు

దెసలన్నిటిని మ్రింగి త్రేన్చుకొన్న పిశాచి చీకటికడుపులో చిచ్చువెట్టి,
పండుటాకును లేవకుండ శాసించునిశ్శబ్దదేవతకు నిష్కాసమొసగి,
అలసి నిద్రించువృద్ధావనీజపుపాదతలమున నవజీవకళలు వ్రాసి,
పంతాన వచ్చుహేమంతశీతలనాతధాటికి చిటిమేను చాటువరచి,
జిలుగుపొత్తిళ్ళ మెరసెడికులుకుచుక్క,
సన్నపువెలుంగుతో నేడ్చుకన్నెపిట్ట,
చిన్నిశ్రీబుద్ధదేవ, క్రొంబొన్నమొగ్గ,
విడిదిదిగియుంటివేటికీ విజనవాటి ?

పచ్చికపాన్పుపై హరిణబాల సుఖమ్ముగ గుర్రువెట్టె, గో
ర్వెచ్చనిగూటిలో పులుగుపిల్ల కనుంగవ మోడ్చె, పుట్టలో
మచ్చును జల్లిన ట్లురగమాణవకుం డొరగెన్, చివుళ్లయం
దచ్చుగ మొగ్గచిన్నదియు హాయి బరున్నది నీవు దక్కఁగన్.

ఎవరయ్యా, నిను గన్నవారు ? కుశలంబే వారికిన్ ? వెచ్చనౌ
కవుగింటన్ సుఖనిద్ర బుచ్చి, అలపోకన్ సాకు నాతల్లిమే
లవునంకమ్మున కొల్పువీడి యిటు లీయధ్వానపుంజీకటిన్
బవళింపన్ విధి కేయనిష్టమొనరింపన్ గల్గినా వప్పడే !

అడుగనిలోనికోరికల కాహుతియై వయసాగలేక, యే
దుడుకొ యొనర్చి తత్ఫలము తుట్టతుదిన్ గని యగ్నిశైలమ
ట్లుడుకుచు లేచి పైకురుకనున్న భయంకరసంఘదృష్టికిన్
యెడద చలించిపోవ చెలి యెవ్వతె యింత తెగించిపోయెరా !

తెరచిననోరు మూయక యదేపనిగా విలపించుచుంటి వో
చిరుతడ, బాష్పవారి నును జెక్కుల నోడికలయ్యె, ముద్దువా
తెర తడియారె; నిన్ దలచి తేపకుతేపకు పాలు చేపురా
సెర సెదిలేక యెంతదురపిల్లెడినో నినుగన్నతల్లియున్ !

అక్కున కొత్తియొత్తి, వలపారెడిముద్దుల ముంచి తేల్చి, నీ
చక్కదనాలకున్ మురిసి, చంపక నిన్ బ్రదికింప దాదినిన్
బిక్కమొగమ్ముతో నడిగి, మే నట యాపురుటింట శూన్యమా
ప్రక్కను డించి నీవెనుకె వచ్చెనె బాలక తల్లిప్రాణముల్ !

పట్టినపాల్గారుపసిడిబుగ్గల వేడిముద్దు లుంచునదృష్టమునకు దప్పి,
లేగులాబీమోవిరేకుల సుకుమారమ్మున కొన్చుకొనుసౌఖ్యమునకు బాసి,

తలిరాకుకన్న మెత్తనిచేతులను కంఠమున కొత్తుకొనుభాగ్యమునకు దొలగి,
పదిమాసములు మోసి పండించుకొన్నపంటనుజూచుకొను పుణ్యమునకు జెడుచు,

కళుకుబంగారుముద్ద, రోజులనిసుంగు
నడవి కప్పగించుచు కన్నకడుపుకాల్చు
కొన్న దేకన్నెపడుచో, కాకున్న బాల
విధవరాలో ? రహశ్శోకవివశురాలు !

జల్లెడలోని నీరువలెజారెను ధర్మము, నీతి నిల్వగా
చల్లని నీడలేక యగచాట్లకు జిక్కిన, దెల్లశాస్త్రముల్
చెల్లక దిక్కుమాలి తలక్రిందుతపమ్ములునేయు, వేనవేల్
చిల్లులతో జగ మ్మిది కృశించి నశించుచునున్న దర్భకా !

లంగా కట్టుకొనంగలేనిపసిబాలన్ వేడ్కతో పెండ్లికిన్
సింగారించుచు వృద్ధజంబుకము నర్చింపంగ నిల్లాలిగా
నంగీకారమొనంగులోకమున కేయడ్డంబు సాగించు నీ
హంగామా ? తలచెడ్డచిన్న దొకయయ్యంగన్నదన్నంతనే.

ధనికాంతఃపురసీమ, పట్టుతెరలందారాడు దుశ్చేష్టలం
గని నోరెత్తక చేతులన్ నలుపు సంఘవ్యాఘ్ర మాకీర్ణ జీ
వన దుఃఖాశ్రయమందిరమ్మయిన నిర్భాగ్యున్ విమర్శించి శొ
ననికాదంచును పండ్లు నూరుకొనునయ్యా ! ఎంతయన్యాయమో ?

కలుములకున్ గులామయి జగమ్ము సలాములునేయు, పేదసా
దులవెత లేమియుం దనకు దోచవు చెప్పినయాలకింప దం
దులకు సహించియుండిన నెదోయొకనేరము నెత్తిచూపి వా
రలపయి కత్తికట్టు నవురా ! ఇది యెక్కడిధర్మమోకదే ?

ఊరుం బేరును లేనిబాలకుడ ! నీ వూహించి యేపాపపుం
బేరంటమ్మున కేగబోవు; కలుషావిద్ధప్రపంచమ్ము నిన్
దూరంబంచుతొలంగద్రోచినదె యందున్ గాని, కల్యాణశం
ఖారావంబులు విన్చు దైవము బహిష్కారమ్ము గావించెనే ?

పురిటిగది గండముల మున్గిపోవకుండ
చెడుమెకమ్ములపంటికి జిక్కకుండ
వేయికన్నుల గాపాడువిశ్వజనకు
డోయనాథబాలక ! శుభ మొనగుగాక !

# కృత్యాద్యవస్థ

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి

ప్రతీవారూ యేదేనా యెక్కువ కష్టపడి సాధించిన కార్యాన్ని గుఱించి మాట్లాడవలసి వస్తే, "కృత్యాద్యవస్థ" అనే మాటనువాడుతూ వుంటారు. ఇది కవులు యేదేనా గ్రంథం వ్రాయవలసివచ్చినప్పుడు ఆరంభపద్యాన్ని వ్రాయడం విషయంలో పుట్టినమాటగా వున్నా యితరులు యితర కార్యాలవిషయంలోఁ గూడా వారితోపాటు వాడుకుంటూ వున్నట్టు తోస్తుంది. ఇతరులు వాడేవాడకం లాక్షణిక మనుకోవాలి. లోకములో నూటికి యాభై పదాలు యీలాటి లాక్షణికాలే కనపడతాయి. అందుచేతే లక్షణ అనేవృత్తిని శాస్త్రజ్ఞులు అంగీకరించి వున్నారు. ఆ లక్షణావృత్తిసహాయం లేకపోతే యెన్నో పదాలకు అర్థం కానే కాదు. ఆ లక్షణావృత్తిని గూర్చి యిక్కడ వ్రాయను. అది పత్రికా పాఠకులకు దురవగాహంగా వుండే విషయం. మొత్తం యేపనిగాని మొట్టమొదట చాలా కష్టంగా వుంటుం దనేది సామాన్యంగా తెలుసుకోవాలి. కవి కావ్యారంభం చేసేటప్పుడు యెన్నో సందర్భాలు ఛందశ్శాస్త్రానికి సంబంధించినవీ, జ్యోతిషంతో సంబంధించినవీ చూడవలసివస్తుంది. అక్షరాలలో అల్పప్రాణ, మహాప్రాణాది భేదం, పృథివ్యాది బీజభేదం, స్త్రీ పుం నపుంసక భేదం వగయిరాలే కాక యిప్పుడు బొత్తిగా పాటించ నక్కఱలే దనుకొనే బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర జాతిభేదంకూడా వుంది. ఆయా భేదాలను పట్టి కృతినాయకునికి యేది అనుకూలమో ఆలోచించి అట్టిగణంతో పద్యం మొదలుపెడదా మంటే, 'కప్పల తక్కెడ' లాగా 'పీతలమంగం' లాగా యెన్నటికీ అది కుదర నేకుదరదు. వకటి అనుకూలిస్తే వేఱొకటి ప్రతికూలిస్తూ వుంటుంది. అందుచేత గుణదోషాలు రెండున్నూ ప్రతి కృత్యాది పద్యమందున్నూ, వుండి తీరతా యని వేఱే వివరింపవలసి వుండదు. అట్టి స్థితిలో గుణాధిక్యాన్ని ప్రధానంగా చేసుకొని కవులు కృత్యాది పద్యరచన సాగించుకోవలసిందే గాని కేవలం సర్వవిధాలా నిర్దోషంగా రచించవలసివస్తే యెన్నటికీ కృతిప్రారంభమే కొనసాగదు. వక చేదస్తుఁడు సముద్రస్నానానికి వెళ్లి కెరటాల అడావడి తగ్గినతరువాత స్నానంచేదా మని కూర్చున్నాఁడట! అట్టి అవకాశం యెప్పటికేనా తటస్థిస్తుందా? ప్రస్తుతవిషయంకూడా ఆలాటిదే—"సముద్రే శాంతకల్లోలే స్నాతు మిచ్ఛతి మూఢధీః" అనే అభియుక్తోక్తివల్ల మనం తెలుసుకోవలసిన ముఖ్యవిషయం కవుల కృత్యాదిరచనకే కాక, వివాహాది శుభముహూర్తాలకుకూడా వున్నంతలో మంచిని చూచుకొని ప్రవర్తిస్తే తప్ప సంవత్సరానికి కాదుగదా, యెన్నో సంవత్సరాలకుకూడా సుముహూర్తాలు, అందులోనున్నూ గర్భాధాన ముహూర్తాలున్నూ, ఉపనయనముహూర్తాలున్నూ కుదరనే కుదరవు. యీ ముహూర్తాలకు సంబంధించినవి రెండు యితిహాసాలు కనపడుతూ వున్నాయి. అందులో వకటి కృష్ణా డి. కూచిపూడి గ్రామానికి సంబంధించింది. యెవరో వకరు ఆ గ్రామన్నుంచి కాశికి వెళ్లి మహావిద్వాంసులై దేశానికి వస్తూ అంతకు పూర్వమే యీడేరి తనరాకకు నిరీక్షిస్తూ వున్న భార్యా ప్రథమసమాగమానికి నిర్దుష్టమైన సుముహూర్తం వకటి మహోదయం లాగనో, గోవిందద్వాదశిలాగనో యెప్పుడో గాని సందర్భపడనిది కనపడేటప్పటికి ఆ సుముహూర్తానికి కొంత వ్యవధివుండఁగానే స్వగ్రామం చేరుకొనే వుద్దేశంతో వచ్చి, తీరా గ్రామందగ్గఱ వుండే కృష్ణ పాము మీసాన్ని తెగఁగొట్టేటంత వడితో ప్రవహిస్తూ వుండడమున్నూ, యీకాలంలోలాగ ఆకాలంలో దాటించే సాధనాలు లేకపోవడమున్నూ తటస్థించి అప్పటి నదీతీరవాసులు యీఁతలోకూడా మంచి శక్తిసామర్థ్యాలు కలవాళ్లే కనక ఆ బ్రాహ్మణుఁడు యీఁతకు బడి యేటి మధ్యభాగానికి వచ్చి అలయిక వచ్చి యిఁక లాభం లే దనుకొని — "యోగేనాన్తే తనుత్యజామ్" కనక ఆతురసన్న్యాసం తనంతట తానే స్వీకరించి ఆ మంత్రాలు యేకరువెట్టుకుంటూ వుండేటప్పటికి ఆ బ్రాహ్మఁడి మనోనిశ్చయాన్ని పరీక్షించే తలఁపో యేమో? శ్రీకృష్ణపరమాత్మ,

శా. "లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణమ్ములున్, ఠావుల్ దప్పె... నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపంగదే దీనునిన్."

అన్న గజేంద్రుని స్థితిలో వున్న ఆ బ్రాహ్మఁడికి ఆవలివొడ్డుకు చేరడానికి తగ్గంతబలపరాక్రమాలు అనుగ్రహించడం జరిగింది. సుఖంగా యిల్లు చేరుకున్నాఁడు. పిమ్మట అత్తవారు సంతోషించి యేర్పఱచుకున్న సుముహూర్తానికి, శుభకార్యం జరిగించడానికి పీటలమీఁద కూర్చోఁబెడుతూ వుండఁగా ఆ బ్రాహ్మఁడిభార్య కళ్లకి ఆయన యెవరో సన్న్యాసి లాగ కనపడుతూ వచ్చేటప్పటికి ఆపె —"యితఁడు నాభర్త కాఁడు. యెవరో సన్న్యాసి" అని చెప్పి యెంద ఱెన్నివిధాల బోధించినా వినక పీటలమీఁద కూర్చోవడానికి వచ్చింది కాదు. అది వెంకితన మని కొందఱూ, పిశాచమో అని కొందఱూ ఆయా సందర్భాలకు తగ్గ చికిత్సలకు యత్నిస్తూవుండఁగా, ఆ మహావిద్వాంసుఁడు గతంలో యేటిమధ్యలో జరిగిన ఆతురసన్న్యాసస్వీకరణవిషయాన్ని అందఱికీ చెప్పి భగవంతుని యెడల నేను మిక్కిలీ అపచారం చేశానన్నీ, అకారణకారుణికుఁడు కనుక ఆ శ్రీకృష్ణపరమాత్మ నా కపటాన్ని యీరీతిగా బయటఁబెట్టి నన్ను అనుగ్రహించినాఁ డన్నీ చెప్పి క్రమప్రకారం సన్న్యాసాన్ని స్వీకరించాఁ డన్నీ, ఆయనే సిద్ధేంద్రయోగి అనే పేరుతో వుండి వయస్సులో సన్న్యసించిన కారణం చేత శృంగారరసమందు పూర్తిగా భావం విరక్తం కాక శ్రీ కృష్ణపరమాత్మకున్నూ, సత్యభామకున్నూ సంబంధించిన శృంగారాన్ని యక్షగానంగా రచించి పాడుకుంటూ వుంటే, గ్రామస్థులు ఆయనయందు వుండే భక్తిప్రపత్తులనుబట్టి అందఱూ యేకవాక్యతగా ఆ భామాకలాపాన్ని ఆమోదించి ఆ రోజులలో సత్యభామవేషాన్ని ధరించి ప్రఖ్యాతికి తేవడమే కాకుండా యిటీవల కూడా ఆ గ్రామస్థులైన బ్రాహ్మణులందరూ జన్మమధ్యమందు వకపర్యాయమేనా వేషం వేసి తీరాలి - అనే నియమాన్ని పెట్టుకొని అప్పటికీ యిప్పటికీ ఆ నియమాన్ని పాటిస్తూనే వున్నందుకు ఆ గ్రామవాస్తవ్యు లయిన బ్రాహ్మణులే సాక్షులు. (ఆ గ్రామంలో

ప్రతీ బ్రాహ్మణపిల్లవాఁడికీ ముక్కుకుట్టు వుంకి తీరుకుందంటారు.) ఇటీవల వేశ్యలూ, సానిజాతిస్త్రీలూ ఆ భాంవేషాన్ని వినికిడి చేస్తూ వున్నప్పటికీ సంప్రదాయం అక్కడ నుంచి వచ్చిందేగాని మఱోటిమాత్రం గాదు. ఆ సిద్ధేంద్రులవారి కవిత్వంలో వున్న దరువులు, ఆనవాలు తెలుస్తూనే వుంటాయి. ఇతరులుకూడా యిటీవల కొన్ని దరువులు చేర్చి వున్నారు కాని, యేమైనా పునాదిమాత్రం ఆ సిద్ధేంద్రులవారి దే. జయదేవుఁడూ, లీలాశుకుఁడూ, నారాయణతీర్థులూ యేలాటి శ్రీకృష్ణభక్తులో యీ సిద్ధేంద్రులుకూడా అట్టివారే అని ఆయనరచన బోధిస్తుంది. ప్రసక్తానుప్రసక్తంగా చాలామారంవచ్చాము. సుముహూర్తం నిర్దుష్టమైనది కుదరడం కష్ట మనేది మనకు ప్రస్తుతం. దీన్ని గుఱించే యింకో యితిహాసంకూడా వుంది. అది వకటిశాలివాహనుఁడిపుట్టుకకు సంబంధించింది, కుమ్మరిగురునాథుఁడి జననానికికూడా అదే అంటఁగడుతూవున్నారు కొందఱు. యేది యేలాగైనా సుముహూర్తంఅనేది నూటికోకోటికోయెప్పుడోగాని మంచిది కుదరదనేది వక్తవ్యాంశం. ఆలాగే కవికి గ్రంథారంభపద్యమున్నూ అనుకోవాలి. ఛందస్సంబంధమైన చిక్కేకాకుండా ఇతరశుభకార్యాలతోపాటు సుముహూర్తపు చిక్కుకూడా కవికి లేకపోలేదు. అదిగాక పయిఁగా "వర్ణగణాదిశుద్ధి" వగయిరాలు గ్రంథారంభంలో కవికి కావాలి. అందుచేత యివన్నీ యెంతకాలం నిరీక్షించినా యేకవికిన్నీ కుదరడం అసంభవం కావడంచేత—

క. "శ్రీకారము కృత్యాదిని, ప్రాకటముగ నున్నఁ జాలు బహుదోషములన్, బోకార్చి శుభము లొసఁగును"—అని ప్రాచీనలాక్షణికులు వక హైగోడ్డుమార్గాన్ని సూచించారు. అప్పకవికూడా దీనికి సంబంధించిన కష్టాలూ సుఖాలూ వ్రాసివ్రాసి— తే. గీ. "ఇపుడు చెప్పినదోషంబులెల్ల మాని, గుణములన్నియుఁ గలుగంగఁ గూర్పనగునె?, ప్రస్ఫుటైనను"

అంటూ అసాధ్యత్వం వ్యక్తపఱిచి యింకా వ్రాయవలసినవి శేషాలు వ్రాసివ్రాసి తుట్టతుదకు ప్రాచీనలాక్షణికమార్గానికి వచ్చి—

"తే. గీ. వేదముల కెల్ల నోంకార మాదియైన, కరణిఁ గృతులకు నెల్ల శ్రీకార మాది"

అని వ్రాసి, ఆ శ్రీకారమందుకూడా గుణదోషాలు రెండున్నూ వున్నాయని వ్యాఖ్యానించి గుణాధిక్యం వున్నట్టు స్పష్టపఱిచి— "శ్రీయనునక్షరమున, నిండియుండుదోషంబు లన్నియు నెఱింగి,సంయుతంబనియును శుభశబ్దమనియు, నడియ నిల్పె నన్నయ భారతాదియందు"

అని మహాకవిప్రవృత్తిని తెలిపి శ్రీకారం మాత్రమే కాదు మఱికొన్ని శబ్దాలుకూడా మంగళవాచకాలువగయిరా ఈలాటి వున్నాయని వ్యాఖ్యానించి పిమ్మట—కొన్ని అక్షరాలు కొన్ని స్థలాలలో వుండేటట్టు చెప్పఁగూడ దని తెల్పి వాట్లకు వుదాహరణాలు చూపి మఱోప్రసక్తిలోకి దిగియున్నాఁడు. యేయే స్థలాలలో ఆ నిషిద్ధాక్షరాలు వుండకూడ దన్నాఁడో ఆయాస్థలాలలో ఆయా అక్షరాలు వున్నప్పటికి శ్రీకారం పద్యాదియందు వున్నట్టయితే ఆదోషాన్నికూడా పోఁగొడుతుందనే నమ్మకం మహాకవులకు వున్నట్టున్నూ యిది సర్వాపవాదక మైనట్టున్నూ వారివారిప్రయోగాలవల్ల స్పష్టపడుతూ వుంది. ఆప్రయోగాలు కొన్ని చూపుతాను—

(1) శ్రియఃపతి శ్శ్రీమతి (మాఘము)
(2) శ్రియః కురూణామ్ (భారవి)
(3) శ్రీ వైకుంఠ (భాగవతము)
(4) శ్రీభూపుత్రి (వసుచరిత్ర)

యెన్నని చూపుదును? సర్వత్రా ఈలాగే శ్రీకారాన్ని సంరక్షకంగా భావించి మహాకవులు నిస్సంశయంగా ప్రవర్తించివున్నారు— "శన్యుష స్సర్వదోషఘ్న మ్"అనే శాస్త్రాన్ని పురస్కరించుకొని శన్యుష స్సులో అమానాస్యా కొత్తమంగళవారంనాఁడేనా సరే విషఘటికలలోనేనా సరే ప్రయాణం చేయవచ్చు ననడం యేలాటిదో, యిదిన్నీ అంతే శ్రీకార సంరక్షకత్వమున్నూ ఆలాటిదే అని ఆయా మహాకవుల పోకడవలన స్పష్టపడుతూ వుంది. యిది కేవల శ్రీకారానికి మాత్రమే కాదు; దేవతావాచకశబ్దా లన్నిటికీ వుండడమే కాకుండా "కావ్యస్యముఖలక్షణం"

చెప్పిన యితరానికికూడా అంటే, వస్తునిర్దేశానికికూడా వర్తిస్తుం దని కాళిదాసుగారి కుమారసంభవంలో వున్న మొట్టమొదటిశ్లోకం శ్లో. "అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా"

అనేది చెపుతూవుంది. యీ శ్లోకంలో తకారం రెండుచోట్ల నిషిద్ధస్థలాలల్లో ప్రయుక్తమై వుంది. తెలుఁగుకేకాని యీ అక్షరాల బాధ సంస్కృతానికి లేదని కొంద ఱంటారేమో? అహోబలుఁడేమి,అప్పకవి యేమి అట్టి అభిప్రాయాన్ని పొందలేదు, పొంద నక్కఱయున్నూ లేదు. పనిపడితే ఆయీవిషయం విస్తరిస్తాను. అక్షరమాత్రానికి ప్రతిభాషయందున్నూ మంత్రత్వం వున్నట్టు తెలుఁగు మలయాళం వు రు దు వ గ యి రా భా ష లలో వున్నమంత్రాలవల్ల స్పష్టపడుతుంది. శ్రీకారంతోఁ గాని దేవతావాచకశబ్దాలతోఁ గాని అసలు మంగళాచరణం చేయవలసిం దని వేదంలో ఆధారం యెక్కడా వుపలబ్ధం కావడం లేదు కనక యిష్టం వచ్చినట్లల్లా చెప్పుకోవలసిందే గాని మంగళాచరణ నిర్బంధంతో పని లే దనేవారు యిప్పు డున్నారో లేదో గాని పూర్వం నాస్తికవాదులలో కొందఱున్నట్టు కొన్ని గ్రంథాల వ్యాఖ్యానాలవల్ల అవగత మవుతుంది. ఆవ్యాఖ్యాతలే ప్రత్యక్షశ్రుతి లేకపోవడానికి అంగీకరిస్తూ ఆనుమానిక శ్రుతులు—

"సమాప్తికామో మంగళ మాచరేత"
"విఘ్నధ్వంసకామో మంగళ మాచరేత"

అంటూ వుదాహరించి మంగళాచరణానికి ఆవశ్యకత్వాన్ని నిరూపించి వున్నారు. ఆనుమానికశ్రుతు లేమిటి? ప్రత్యక్షశ్రుతు లేమిటి? అని శంకించుకొని కొంత వ్రాయవలసివున్ననూ గ్రంథవిస్తరభీతిచేత విరమిస్తాను. ఆయీ విషయం పూర్వమీమాంసా శాస్త్రంవల్ల తెలుసుకోవలసి వుంటుంది. మా పరమగురువులు శ్రీబ్రహ్మయ్యశాస్త్రుల్లుగారు వ్యాకరణం పాఠం చెపుతూ వున్నప్పుడు షడ్దర్శనాలూకూడా దొర్లుతూ వుండేవి. అప్పుడు విన్న ముక్కలలో యింకా కొన్ని ధారణలో వుండడంచేత అక్కడక్కడ యితరశాస్త్రాల్లప్రసక్తి వుదాహరించడం గాని నా శాశాస్త్రా

లలో ప్రజ్ఞవుండి కాదని విజ్ఞులు తెలుసుకోక పోరు. మహాగాయకశిరోమణి కీ. శే. శ్రీ చిదంబరయ్యరుగారివల్ల మహావిద్వాంసులవద్ద చేసిన శుశ్రూషాఫలితం యెట్టిదో నేను వినివున్నాను. పనిలో పని ఆవిషయంకూడా మంగళార్థంగా వుదాహరించి దీన్ని ముగిస్తాను. యీ చిదంబరయ్యరుగారు సదాశివరాయలవారివద్దకి సంగీతాభ్యాసానికి వెళ్లి సుమారు పుష్కరకాలం వున్నట్టున్నూ, ఆయన వకరోజునా వక స్వరంగాని వక గీతంగాని చెప్పకుండానే యిన్ని సంవత్సరాలూ కాలం గడిచినట్టున్నూ అప్పుడు యిక వీరివద్ద తనకు విద్యాభ్యాసం జరగదని తోఁచి చిదంబరయ్య—"అయ్యా! నేను యిన్ని వత్సరాలనుంచి దేవరవారికటాక్షానికి ఆశించి యీవూళ్లో అఘళ్ళయన బ్రహ్మచర్యాలతో కాలక్షేపం చేస్తూ వున్నాను. నాయందు దేవరవారి కటాక్షం ప్రసరించిందే కాదు. యిఁక ఆజ్ఞ యిస్తే వెడతాను" అనిమనవి చేసుకొనేటప్పటికి శ్రీ రాయలవారు-"అబ్బాయీ! నీవు యిన్ని వత్సరములున్నూ ప్రతిరోజూ నావద్దకు వస్తూపోతూనే వుంటే నీకు వేరే నేను సంగీతశాస్త్రోపదేశం చేయ నక్కఱలేదు. నీవు చాలా నాళ్లక్రితమే సంగీత విద్వాంసుఁడవై వుంటా" వని చెప్పి ఆయన జ్ఞానాన్ని పరీక్షించి సంతోషించి ఆశీర్వ చించి పంపినట్టు ఆయనవల్లనే నేను శ్రీ సోమంచి భీమశంకరంగారిగృహంలో వినివున్నాను. యీ చిదంబరయ్యరుగారిస్థానం గాయకులలో సామాన్యం కాదు పట్నం సుబ్రహ్మణ్యయ్యరు వైద్యనాథయ్యరు మొదలైన సుప్రసిద్ధులలో యీయన వొకరు. యీయన వార్ధక్యంలో నేనూ యీయనా కొన్నాళ్లు యేలూరులో భీమశంకరంగారిగృహంలో వుండడం తటస్థించింది. అందుచేత నీయనకున్నూ నాకున్నూ మైత్రి యేర్పడ్డది. యీయన గురువు సదాశివరాయలవారిస్థానం శ్రీ త్యాగరాయలవారితో పాటుది. యీయన అత్తవారు మైసూరు సంస్థానాధిపతులకు కొంత పన్ను చెల్లించే సామంత ప్రభువులో పెద్ద జహగీరుదారులలో అని చిదంబరయ్యరుగారివల్లనే విన్నాను — అట్టివారి అల్లుఁడు అనడంచేత సదాశివరాయలుకూడా మహదైశ్వర్యసంపన్నుఁ డనడంలో అత్యుక్తి వుండదు "వివాహశ్చ వివాదశ్చ సమయో రేవ శోభతే" అట్టి యైశ్వర్యంలో వుండి అంత మహాగాయకుఁడై వుండి పయిఁగా అందులో త్యాగరాయాదులవంటి కవికూడా అయిన మహామహునియింట యెందఱు శిష్యులో వుండి వుందురుగదా! ఆశిష్య ప్రశిష్యవర్గం యెల్లప్పుడూ చేసే గానవ్యాసంగం వినడంవల్ల కూడా గానం అలవడుతుందంటే ఆశ్చర్యమేముంటుంది? యిది విషయాంతరం. మహామహుల శుశ్రూషామాహాత్మ్య ప్రసక్తిలో వచ్చింది. మంగళాచరణం ఆస్తికులకే కాక నాస్తికులకుకూడా అవశ్యాచరణీయ మని చెప్పే ప్రసక్తికి దిగుతూ మన్య పుణ్యపురుష ప్రశంసకూడా మంగళాచరణమే అని తెల్పడానికి దీన్ని అందుకున్నాను—అమరకోశ గ్రంథకర్త జైనమతస్థుఁడై కూడా మంగళాచరణాన్ని చేసివున్నాఁడు—

శ్లో. "యస్య జ్ఞాన దయాసింధోః"

అనేశ్లోకం పైవిషయాన్ని స్థిరీకరిస్తుంది. తెలుఁగుకవులు యెక్కువగా శ్రీకారానికి ప్రాధాన్యం యిచ్చి రచన కారంభం చేస్తూ వచ్చారు గాని సంస్కృతకవులతాత్పర్యంలో దేవతావాచకశబ్దాల కన్నిటికీ సమప్రాధాన్యమే కాని అందులో శ్రీకారాని కంటూ ప్రత్యేకత వున్నట్టు కనపడదు. అథవా సంస్కృతకవులుకూడా శ్రీకారాన్ని యెక్కువగా గౌరవించారన్నా నేను ప్రస్తుతం వ్రాసే విషయానికి అది భంజకంగాదు. శ్రీకారంతో గ్రంథారంభం చేసినపుడు యెక్కడ యేనిషిద్ధాక్షరం పడినా శంకింపవలసినప్రసక్తి లేదని మహాకవులతాత్పర్యమని భావికవు లందఱూ తెలుసుకుంటా రని యీవ్యాసం వ్రాశాను. ఉద్దేశం సదుద్దేశం కానప్పుడు శ్రీకారంతో మొదలుపెట్టినా అది అన్యథాగానే అంటే వుద్దేశానుసారంగానే పరిణమిస్తుం దనడానికి చంద్రరేఖావిలాపంలో వున్న —"శ్రీకంఠుండు భుజంగ భూషణుఁడు భస్మీభూత పంచాస్త్రుఁడు" అనేపద్యం సాక్ష్య మిస్తుంది. ఇందులో వున్న శ్రీకారం విషార్థకం కావాలనే వుద్దేశంతో గ్రంథకర్త వాడి వున్నాఁడు. దానికి మంగళార్థకల్పన చేదామన్నా శక్యం కాదు. యెక్కడ శ్రీకారం వృథాగా ప్రయుక్తమైనట్టు కనపడుతుందో అక్కడనే మంగళార్థక మవుతుందనిన్నీ అనుకో నక్కఱలేదు. శ్రీ మహాలక్ష్మీవాచకమైనప్పుడు మంగళార్థకమని చెప్పనే అక్కఱలేదు. విషార్థకం కాకుండా వుంటే మంగళార్థకమే.

---

# ఆనందగోత్రజులు

వడ్డాది శ్రీరామచంద్రమూర్తి

సిరిసంపదలతో తులతూగి సుమారైదు శతాబ్దములు వైభవోపేతమై భాసిల్లి చారిత్రక నిహాయసమున భాస్వరజ్యోతియై వెలిగిన ఆంధ్రమహాసామ్రాజ్యము కాలపురుషుని దంష్ట్రాఘాతముల పాల్పడినయనంతరము కొన్ని సామంత రాజవంశములు తల యెత్తసాగెను. అట్టివానిలో క్రీ. శ. నాలుగు అయిదవ శతాబ్దములలో గుంటూరు ప్రాంత మంతయు పరిపాలించిన ఆనందగోత్రజరాజవంశ మొకటి. వీరి చరిత్రనిర్మాణమున కాధారభూతములగు శాసనము లింతవరకు మూడు లభించినవి. వీటిలో మొదటిది అత్తివర్మయొక్క గోరంట్ల తామ్రశాసనము. (Ind. Ant IX, 102 ff). రెండవది దామోదరవర్మయొక్క మట్టేపాడు తామ్రశాసనము. (Epi. Ind XVII, 327 ff) పై రెండు శాసనముల ననుసరించి యీవంశమునకు కందరుడను రాజు మూలపురుషు డనియు, వీరు ఆనందగోత్రజు లనియు, వీరి రాజధాని కంపరపుర మనియు తెలియుచున్నది.

ఇదివర కీవంశమునుగూర్చి వ్రాసిన చరిత్రకారు లందరు (Jour Dep. Letters Calcutta University XXVI (1935) అత్తివర్మ, దామోదరవర్మలను గూర్చియే వ్రాసియున్నారు. పైరెండు తామ్రశాసనములలో, లిపిపరిణామము ననుసరించి, దామోదరవర్మయొక్క మట్టేపాడు తామ్రశాసనము గోరంట్లతామ్రశాసనము కన్న పూర్వపుదానివలె గన్పట్టుచున్నది.

మట్టేపాడు తామ్రశాసనము ననుసరించి దామోదరవర్మ బౌద్ధమతస్థు డయ్యును, హిరణ్యగర్భ, గోసహస్రాది మహాదానము లాచరించినట్లు తెలియుచున్నది. ఇక్ష్వాకుల చరిత్రలోకూడ నిట్టి వింతచరిత్రాంశ మొకటి కనవచ్చుచున్నది. ఇక్ష్వాకు రాజవంశమున రాజులు అగ్నిహోత్ర, అగ్నిష్టోమ, వాజపేయ, అశ్వమేధాది యాగములు చేయుచుండగా వారి స్త్రీలందరు బౌద్ధవిహారములు నిర్మించుటకు, బౌద్ధులను పోషించుటకు చేసినదానములు పెక్కులుగలవు. బౌద్ధమతము విధ్వంసము లు బ్రాహ్మణమతము పునరుద్ధరింపబడునీకాలమునగూడ కొందరు రాజులు రెండు మతములయెడ సమానగౌరవము చూపుచుండిరి. అట్టివారిలో ఆనందగోత్రజునకు దామోదరవర్మ యొకడు.

అత్తివర్మ గోరంట్లశాసనము ననుసరించి ఆతఁడు 'ప్రతాపోపనత సకల సామంతమండలుడు', 'వంకేశ్వరాధివాసిన స్త్రిభువనకర్తుః శంభోశ్చరణకమలరజః పవిత్రీకృతుడు' అనేక హిరణ్యగర్భ మహాదానము లొనర్చిన పుణ్యశాలి.

వీరికాలము, వీరితామ్రశాసనముల లిపిపరిణామము ననుసరించి, ఇక్ష్వాకురాజుల యనలతరమై యుండునని యూహింపవలసియున్నది. ఆంధ్రసామ్రాజ్యము విచ్ఛిన్న మైనతరువాత నాగార్జునకొండ, అమరావతి ప్రాంతదేశ మంతయు వారిసామంతులును, సమకాలికులును అగు ఇక్ష్వాకులవశ మైనట్లు శాసనముల వలన తెలిసికొనవచ్చును.†

వీరిరాజ్యము క్షీణించినతరువాత పల్లవులీరాజ్య మాక్రమించినట్లు మైదవోలుశాసనము (Epi. Ind. VI, 84 ff) సూచించుచున్నది. కాని పల్లవు లనతికాలముననే కాంచీపురముపై దాడివెడలుటయు అచట సామ్రాజ్యమును స్థాపించుకొనుటయు తటస్థించినది. ఆసందర్భమున ఆనందగోత్రజుల మూలపురుషుడగు కందరుడు పల్లవులను ధాన్యకటనగరముకడ నోడించి గుంటూరుప్రాంతమంతయు వశపరచుకొన్నట్లు అతనిమనుమడగు సత్యభామల్లుని శాసనమునుండి యూహింపవచ్చును. ఇదియే వీరి చరిత్రనిర్మాణమున కాధారభూతమగు మూడవశాసనము. ఈ శాసనము గుంటూరుజిల్లాలోని చేజెర్ల గ్రామమందలి కపోతేశ్వరాలయమందు లిఖింపబడి 1899 వ సంవత్సరమున ప్రభుత్వపురాతత్త్వశాఖాధికారిచే చదువబడి తదుపరి దక్షిణ హిందూదేశ శాసనసంపుటి ఆరవభాగములో 594 వ శాసనముగ ప్రచురింపబడినది. (South Indian Inscriptions Vol. VI, No. 594 A. R. No. 155 of 1899) ఇదియే వీరి చరిత్ర నిర్మాణమున కాధారభూతమగు మూడవశాసనము.

ఆనందగోత్రజుల మూలపురుషుడగు కందరనృపతినిగూర్చి పైశాసనము విపులముగా చెప్పుచున్నను, ఆనందగోత్రజులగూర్చి యిదివరకు వ్రాసినవారెవరును కందరునిగూర్చి వ్రాయకపోవుట శోచనీయ మైనవిషయము. పైశాసనమున కందరుని ప్రథమవిజయ మీరీతిగా వర్ణింపబడినది. కందరుడు—"స్వశక్తిశాతిత శాత్రవకరివరఘట సంకటధాన్యకటరణసప్తకోటి." సప్తకోటియన ఏడు మొనలు కల్గిన యొక ఆయుధవిశేష మైయుండవోవు. పైని వర్ణించినధాన్యకటరణము, మైదవోలు శాసనము (Epi. Ind. VI. 84) లో వర్ణింపబడిన పల్లవవిజయస్కందవర్మయొక్క సామంతులపై కందరుడు పొందినవిజయమై యుండవచ్చును.

ఇంకొక చిత్రమైన చారిత్రక విషయ మీశాసనమువలన తెలియుచున్నది. ఒక్కచాళుక్యాన్వయులకు మాత్రమే కలదని భావించుచున్న పృథ్వీయువరాజ బిరుదము కందరునకుగూడ కలదని ఈ శాసనము ఋజువు చేయుచున్నది. కందరుడు ఆనంద మహర్షియొక్క గోత్రమునకు సంబంధించినవాడు. "సమవగాఢ ఆంధ్రసుందరీ చందనాంచనాలక్తకలోలామాలా పరిమోషపరిచయకృతాపరాధనై పుల్యసితేతర బెణ్ణానాథు"డు. దీని ననుసరించి యీతని రాజ్యమున (ఉత్తరపు)

---

† Fpi. Ind. XX 1 ff and XXI, P. 61 ff.)

సరిహద్దు కృష్ణానది. ఈతడు త్రికూటపర్వత పతి. కందరపురవర జనపద ద్వితయాధిపతి, విష్ణుకుండి రెండవమాధవవర్మకు గూడ నీత్రికూటమలయాధిపతిత్వము కలదు. ఇది వారు ఆనందగోత్రజులవద్దనుంచి వారియనంతరము సంపాదించినదే. విష్ణుకుండివంశమునకు మూలపురుషుడగు మొదటిమాధవవర్మ ఆనందగోత్రజుల యొద్దనుంచి జయించి, తన మనుమడును, దేవవర్మకొడుకును, నగు రెండవ మాధవవర్మకిచ్చివేసెను.

ఈ త్రికూటపర్వత మేది యనుప్రశ్నకు సమాధానముగ భావరాజు వేంకటకృష్ణరావు గారు, ఈత్రికూటపర్వతము నేటికోటప్పకొండ లేక కావూరు అని వ్రాసియున్నారు. వారివ్రాత కాధారము కోటప్పకొండపైనున్న దేవునకు 'త్రికోటేశ్వరు' డన్న పేరు పూర్వపు శాసనములలో కానవచ్చుటయే. ఈకావూరు లేక కోటప్పకొండ నరసరావుపేట తాలూకాలో నుండుటచే ఆనందగోత్రజులక్రింద నుండియుండు ననుట కెట్టిసందియమును లేదు. కాని దేవునిపేరు శాసనములం దన్నిటియందును త్రికోటేశ్వరు డని యుండుటయు, 'త్రికోటేశ్వరు' డున్న గ్రామముపేరు కావూరని యుండుటచేతను కోటప్పకొండ త్రికూటపర్వత మగునా కాదా యను సందియము పొడముచున్నది. త్రికూటపర్వతముపైనున్న దేవుడు కనుక త్రికోటేశ్వరు డైనాడని భావరాజువారి వాదము. త్రికూటపర్వతముపైనున్న దేవుడు త్రికూటేశ్వరు డగునుకాని త్రికోటేశ్వరుడు కాజాలడు. ఒక్కశాసనమందుకూడ నీతడు త్రికూటేశ్వరుడని పిలువబడలేదు. ఇదమిత్థమను నిర్ణయము భావి పరిశోధనము వలనగాని తేలదు.

సత్యభామల్లుని శాసనమువలన మన కిదివరకు తెలియని విషయములు తెలియవచ్చుచున్నవి. గోరంట్ల, మట్టెపాడు శాసనములపై ముద్రింపబడినవారి లాంఛనమేదో తెలిసికొనుటకు వీలు కాలేదు. సత్యభామల్లుని శాసనములో కందరుడు 'గోలాంగూలవిజయకేతను' డని వర్ణింపబడెను. దీని ననుసరించి వీరివిజయలాంఛనము 'గోలాంగూలము' (కపి) యని నిశ్చయింపవచ్చును.

కందరునకు పుత్రసంతానము కలదేమో తెలిసికొనుటకు మన కాధారములు లేవు. 'అవనీతలాంతవతీ మహాదేవి' యను తనయ మాత్రము కలదు. ఈమెయే ప్రస్తుతశాసనాధిపతియగు సత్యభామల్లునితల్లి. సత్యభామల్లుని తండ్రిపేరుగాని, వంశముగాని మనకు తెలియుటలేదు. దురదృష్టవశమున శాసనములోని యాభాగము చాల శిథిలమై పోయినది.

ఈ సత్యభామల్లునిశాసనము దక్షిణహిందూదేశ శాసనసంపుటిలోని ఆరవభాగములో ౫౯౪వ శాసనముగా ప్రచురింపబడినది. (South Indian Inscriptions Vol. VI, No. 594: A. R. No. 155 of 1899.) ఈశాసనము చెక్కబడినరాతిపైననే పల్లవ మహేంద్రవిక్రమునిశాసన మొకటి చెక్కబడియున్నది. అందు మహేంద్రవిక్రమునకు అవనీభాజను డనియు, వేగవతీసనాథు డనియు బిరుదులున్నవి. ఏకారణముచే వ్రాసిరో తెలియదుకాని కందరనృపతి మనుమడగు సత్యభామల్లుడు మహేంద్రవిక్రమునికి సామంతుడని శాసనసంపుటిసంపాదకులు సుబ్రహ్మణ్యఅయ్యరుగారు వ్రాసియున్నారు. ఈవ్రాత నిరాధారమైనది. రెండుశాసనములు ఒకేరాతిపై చెక్కబడుటచే పల్లవరాజునకు సత్యభామల్లుడు సామంతు డని వ్రాయుట చారిత్రకపరిశోధనపద్ధతులకు విరుద్ధము. అశోకునికి సముద్రగుప్తుడు సామంతు డని వ్రాసిన ఎంత బాగుండునో యిదికూడ నంతే. పోనీ మహేంద్రవిక్రమునికి సత్యభామల్లు డనుబిరుదము కలదేమో యని చూత మన్ననూ అదికూడ కానరాదు. వీరమల్లుడు మొదలగు నితరబిరుదములనేకము లున్నవేకాని సత్యభామల్లు డనుబిరుదము కానరాదు. రెండును వేరువేరుశాసనములు. ఒకటి పిండీశ్వరుని ఆరాధించునది; వేరొకటి కపోతేశ్వరుని ఆరాధించునది. శాసనశైలియందు రెంటికిని సామ్యము లేదు. దీని ననుసరించి మనము తెలిసికొనదగినవిషయమేమన, మహేంద్రవిక్రము డెప్పుడో వచ్చి తనవంశీయులపుట్టినిల్లగు ఆంధ్రదేశమున తిరిగి తమవంశీయుల కిలువేల్పగు పిండీశ్వరునకు నమస్కృతు లర్పించి ధన్యు డైనాడు. ఈసందర్భమున నీతడు విష్ణుకుండినులకు బంధు వనుచని వ్రాసిన డూబ్రియల్ గారి వ్రాత (The Pallavas, P. ౬౫) విచారింపతగినది. ఇంతవరకు ఏమియు తెలియని ఆనందగోత్రజుల మూలపురుషునిగూర్చి సత్యభామల్లునిశాసనము మన కింత సహాయపడుచున్నది.

ఈ వంశములోనివారే అత్తివర్మయు, దామోదరవర్మయు. వీరికిని కందరునకునుగల సంబంధము నిర్ణయించుటకు ప్రస్తుత శాసనాధారములమూలమున వీలు లేదు. కాని పల్లవులు కాంచీపురమున కేగినయనంతరము నేటిగుంటూరుమండలము నేకచ్ఛత్రాధిపత్యముగ నొక శతాబ్దమువఱకు అవిచ్ఛిన్నముగా పరిపాలించి, ఆంధ్రుల చరిత్రనిర్మాణమునకు సహాయభూతులైన యీరాజన్యులచరిత్ర ఆంధ్రులకు చిరస్మరణీయము. ఇట్టి రాజవంశమునకు చరిత్రలో యథాస్థాన మిచ్చి గౌరవించుట యాంధ్రుల విధి.

# వాఙ్మయం ఎవరికి

ఎలమంచిలి
వెంకటేశ్వరరావు

★

వాఙ్మయం సంఘానికి అద్దంలాంటిది. సంఘంలో ఎప్పుడు ఏమార్పులు—రాజనైతికం, ఆర్థికం, మతసంబంధం—జరుగుతుంటాయో, సాంఘికదృష్టికోణం ఏవిధంగా మారుతూ ఉంటుందో, దాన్ననుసరించి వాఙ్మయంకూడ మారుతూఉంటుంది. సంఘంలోని కష్టసుఖాలే వాఙ్మయంలో ప్రతిబింబిస్తాయి. ఏల నన—కవి ఎవరికి తనరచన వినిపించబోతున్నాడో, వాళ్లకి అనుకూలంగానే-తనవాఙ్మయాన్ని సృష్టిస్తాడు. ఒకవస్తువు సరియైనస్థానాన్ని పొంది-చుట్టూఉన్న అన్నివస్తువులతోను సంబంధం కలుపుకోకలిగిందా, అప్పుడు నలువైపుల వున్న అనుకూలాన్ని పొంది స్థిర మయిపోతుంది. అప్పు డది తనపరిచయమేకాక చుట్టు ఉన్న వస్తుపరిచయంకూడ ఇస్తుంది. దీనికి కారణం దాన్ని నిలబెట్టటానికి ఆవస్తువులన్నీ సహాయకారి కాగలిగినాయి. ఈవిధంగా వాఙ్మయం ఒకహృదయంలోనుంచి బయలుదేరినా, హృదయసామ్యం చూపుతూ విశ్వాన్నంతటినీ తనలో లీనపరచుకుంటుంది. ఒకహృదయంలోపుట్టి పదిహృదయాలనురంజింపచేయకలుగుటయే వాఙ్మయంలోని విశేషత. అప్పుడే వాఙ్మయం తనతోపాటు తనజనకునికూడ కృతార్థుని చేయకలుగుతుంది. సంఘంలోని మనుష్యులవరకే కాదు; సమస్త చరాచరములకు ప్రాతినిధ్యం వహించకలిగినప్పుడే దానికి అక్షయరూపం, అక్షయగౌరవం కలుగుతుంది.

ఇది ప్రజాతంత్రయుగం. రాజతంత్రయుగం దగ్గరదగ్గర గతించిందని చెప్పవచ్చు. అక్కడక్కడ రాజుపేరుతో రాజ్యవ్యవస్థ జరిగినా, ఆరాజులు నామమాత్రులే కాని వారిదగ్గర పూర్వపురాజఠీవిగాని, పూర్వంలాగు ప్రజలు రాజును దేవాంశసంభూతు డని, ఈశ్వరప్రతినిధి అని పూజించేపద్ధతిగాని నశించిం దని చెప్పకోవచ్చు. కనుక ప్రజాతంత్రయుగంలో ప్రతివిషయంలోను ప్రజలదే ప్రాతినిధ్యం కనుక వాఙ్మయంకూడ ప్రజాప్రాతినిధ్యాన్ని గౌరవించాలా అక్కరలేదా? రాజసంస్థానాల్లోకి పోయి 'ఢిల్లీశ్వరోవా, జగదీశ్వరోవా' అన్నకవులు, ప్రజాసామాన్యందగ్గరకుపోయి వారికష్టసుఖాలన్నా కనుక్కోవాలా అక్కరలేదా? అలా చేయవలసినకర్తవ్యం కవి (కవి అంటే నా అభిప్రాయం సరసమైన వాఙ్మయాన్ని రచించు రచయిత అని ఆరచన గద్యమయినాసరే, సౌకర్యంకొరకు అందరికీ కలిపి ఒక్క కవిశబ్దం వాడుతాను.) మీద ఉన్నదా లేదా? అలా చేయక కాలగతి ననుసరించనికవులకు రానున్న విపత్తేమి? మన వాఙ్మయం దేశకాలపరిస్థితులను ఎంతవరకు స్మరించకలుగుతోంది? అనేసమస్య దూరదర్శులు, యుగధర్మాన్ని స్మరించు దీర్ఘాలోచనాతత్పరులను ఆలోచనలోనికి దింపటం ఒక వింతకాదు. జీవంగల ప్రతివాఙ్మయంలోనూ అనేకమంది వాఙ్మయవేత్తలు దీన్నిగురించి అనేకవిధాల చర్చలు జరుపుతున్నారు. అనేక పత్రికలు యుగధర్మాన్నిగురించిన ఈప్రశ్నను గంభీరంగా ఆలోచిస్తున్నాయి. నేటి కొంత మంది సాహిత్యంలో ప్రాణమే లేదు. ఇదంతా ధనవంతుల కామలిప్సను తీర్చునదేకాని నిజమైన మానవజీవితం గడుపు ప్రకృతిమాతపుత్రులకు ఈవాఙ్మయంలో స్థానంలేదు. కాబట్టి ఇది త్యాజ్య మంటున్నారు. ఇంతకంటె ఎక్కువగా రాజనీతి (రాజనీతిశబ్దం సంకుచితార్థంలో కాదు. దీన్ని లోకతంత్రంలేక ప్రజాతంత్రం అనికూడ చెప్పకోవచ్చు. సాంఘికం, రాజనైతికం, ఆర్థికం, అన్నిటికి కలిపి రాజనీతి శబ్దాన్ని వాడాను. కనుక రాజనీతిజ్ఞుడన్నా, రాజనీతివేత్త అన్నా వీటి అన్నిటితో జోక్యం కలుగచేసుకునేవా డని నా అర్థం)తో ఇంకా అధికంగా జోక్యం కలుగజేసుకునేవారు ప్రాచీనసాహిత్యం పైనకూడ దండెత్తుతున్నారు. వీరిదృష్టిలో ఇప్పటిసాహిత్యమే కాదు, పూర్వపుసాహిత్యంకూడ సమస్తమానవకోటికి ప్రాతినిధ్యం వహించ, [illegible] పూజించటానికి ప్రయత్నించలేదు. ఇందుకువాఙ్మయం తరఫునకూడ జవాబిచ్చేవారు తక్కువ మంది లేరు. రాజనీతివేత్తలు వాఙ్మయాన్ని ఎంత తిరస్కారదృష్టితో చూస్తున్నారో, అంతకంటె ఎక్కువతిరస్కారం, ఏవగింపు వీరు రాజనీతిపట్ల చూపుతున్నారు-"రాజనీతికీ సారస్వతానికీ సంబంధం లేదు. మీగొడవ మీది, మాగొడవ మాది. మీరు బుద్ధిని ఉపయోగించేవారు, మేము హృదయాన్ని పల్లవింపచేసేవాళ్లం. మా రససాహిత్యాన్ని మీా రేమి గ్రహించకలుగుతారు? లేవరా కర్షకా! కూర్చోరా కర్షకా! అనటం సాహిత్యానికి లక్షణం కాదు. అది మీవంతు. మీరు మీపార్టీబలంకొరకు పాడుకోవచ్చు. కాని మాసాహిత్యానికి వారిచరిత్రలు పనికిరావు. మానాటకానికి నాయకుడు ధీరోదాత్తుడయిన రాజకుమారుడు కావాలి. మాకావ్యానికి నాయిక సకలగుణసంపన్నయై, ఉన్నతవక్షోజాలు కలిగి, హావభావకుశలయై ఉండాలి. తెల్లవారితే కొడవలి గొడ్డలి చేతో పుచ్చుకుని బయలుదేరే కర్షకులు, కార్మికులు మా వాఙ్మయానికి నాయికానాయకులు కాజాలరు." దగ్గరదగ్గర ఇదేవిధంగా ఉంటున్నది వీరిసమాధానం. రాజనీతిజ్ఞులకువాఙ్మయస్రష్టలకు మధ్య ఈ అగత్త దినదినం పెరిగిపోతోంది. ఈ ఉపేక్ష దినదినాభివృద్ధిగాంచి విషమపరిస్థితుల్లోకి ఈడ్వకమాన దని చెప్పవారి మాటల్లో యథార్థం లేకపోలేదు. సాహిత్యస్రష్ట అనతికాలంలో ఈసమస్యను ఎదుర్కొనకతప్పదు. ఎటు గాలి మళ్లితే అటు వీపు త్రిప్పి 'ఎప్పటి కెయ్యది ప్రస్తుత, మప్పటి కామాటలాడి' జీవించేవారిని ఈసమస్య అంతగా బాధింపకపోవచ్చు. వారు ఎటుపడితే అటే నాలుక త్రిప్పకోకలుగుతారు. కాని [illegible]యంతో సాహిత్యాన్ని సృజించేవారి

మాట వేరు. సూతాన్తుగా క్రొత్తప్రపంచములో కాలు పెట్టవలసివస్తే వీరికి కొంచెం క్రొత్తగా బెరుకు బెరుకుగా ఉండకపోదు. కనుక ముందు గానే భవిష్యత్తును నిర్ణయించుకోవడం మేలేమో!

వాఙ్మయం ఎన్నివిధాల ప్రవహిస్తోందో, ఎవరు దానికి ముఖ్యులో, ఎవరికళ ఎట్టిదో ఈవిషయాన్ని సరించి రాయడం ఈవ్యాసం ఉద్దేశ్యం కాదు. వాఙ్మయం ఎవరికి? ఎవరి జీవితానికి ఎక్కువప్రాముఖ్యం ఇవ్వబడు తోంది? అనేసంగతే దీనికి ప్రధానం. ఇప్పటి వాఙ్మయంలో ముఖ్యంగా మూడుధారలు ప్రవహిస్తున్నా యనిమాత్రం చెప్పవచ్చు. పాశ్చాత్య వాఙ్మయసంపర్కంతో స్వాతం త్ర్యేచ్ఛ మనలో ప్రాదుర్భవించినట్టే, వాఙ్మ యపు పోకడలలోకూడ పాతమార్గాన్ని వదలి క్రొత్తమార్గాన్ని పోవటానికి కొంత అభ్యా సం మనలో కలిగింది. (విషయంలో క్రొత్త లేదు. చెప్పేపద్ధతిలోమాత్రమే ఉన్నదని పాఠకులు గుర్తు ఉంచుకోవాలి.) వీరు అభి వ్యంజనాశైలిని పాశ్చాత్య వాఙ్మయంలోంచి గ్రహించారు. భావం భారతీయవాఙ్మయం లోనిదే. రూపకంద్వారా ఈకవిత్వంలోని ఆత్మ భారతదేశానిది. పదములపూర్వ లేక శరీరఘటన పాశ్చాత్యులదని చెప్పకోవచ్చు. వీరిపాశ్చాత్య - నడవడి కొంతమంది రూఢి ప్రియులకు అసహ్యంగా కనిపించింది. అందు కు వారు మీరు కుర్రాళ్లు, మీ కనుభవంలేదు. నాయనలారా!- "ఈకాలమునన్ గవిత్వ మనగాఁ బెడత్రోవలఁ ద్రొక్కుచున్నగయ్యా ళికిఁ దుల్యమై చెడుట యూరయుచుంటిమి, వారిత్రోవలన్, గాలిఁబోకుమయ్య! గాలికి ధూళికిఁ బోవు" అని ప్రబోధించ ప్రారంభిం చారు. అనేక కృత్రిమసహాయాలతో అయ్యో మనబిడ్డ ఏమవుతాడో అని తహతహలాడే రాజాధిరాజులబిడ్డలకంటె, చెట్టుకింద పుట్టి, ప్రకృతిమాతఆశీర్వాదంతో పెరిగే కూలివాని బిడ్డడు ఎక్కువ బలిష్ఠంగా, ఎక్కువ ఆరో గ్యంగా ఉంటాడనే సంగతి వీరు మరచారు. తరువాత రెండవక్రొత్తశైలి రాజనీతికల్లోలం వల్ల వచ్చింది. వీరు భారతీయవాఙ్మయానికి  క్రొత్త. వీరు వంశపారంపర్యంగా వచ్చే విష యాన్నే మార్చారు. సాహిత్యంలో ఇంత వరకు పేరువూరులేని పాటకజనాన్ని రాత్రిం బగలు రక్తం ఓడిచి పనిచేసి ఉపవాసాలతో, దుర్భరదారిద్ర్యంతో జీవయాత్రగడుపుకర్షక, కార్మికుల జీవితమే వీరికవితకు విషయం. ఇదిగో వీరి పాటలకు మచ్చుగా తీసుకోవచ్చు.

ఈ గేయాన్ని పాఠకులు—

"పొలాల నన్నీ—
హలాల దున్నీ,
ఇలాతలంలో హేమం పిండగ,
జగాని కంతా సౌఖ్యం నిండగ—
విరామ మెరుగక పరిశ్రమించే,
బలం ధరిత్రికి బలిగావించే
కర్షకవీరుల కాయంనిండా,
కాలువకట్టే ఘర్మజలానికి,
ఘర్మజలానికి
ఘర్మజలానికి ఖరీదు లేదోయ్.

తరువాత తమభావికార్యక్రమాన్ని కూడ-

కమ్మరికొలిమీ,
కుమ్మరిచక్రం—
జాలరిపగ్గం,
సాలెలమగ్గం—
శరీరకష్టం స్ఫురింపజేసే,
గొడ్డలి, రంపం, కొడవలి, నాగలి,
సహస్రవృత్తుల సమస్తచిహ్నాలు,
నావినుతించే,
నావిరుతించే
నావినిపించే నవీనగీతికి
నావిరచించే నవీనరీతికి
భావం! భాగ్యం!
ప్రాణం! ప్రణవం!

అని నిశ్చయించుకుంటున్నారు.

పోతే ఇకముఖ్యమైనధార మిగిలింది. ఈ ధారకు చెందినవారందరు 'నీగిచినగీటు దాట'ని ప్రతిజ్ఞ చేసుకు బయలుదేరుతారు. వీరి భావం, వీరిశైలి, వీరిపాటలు అంతా సనా తనం. వీరు పూర్వసంస్కృతిని పోషించాలనే ఆసక్తితో నవీనత అంటే భయపడుతారు. వీరు విషయంకంటె కళనే ప్రధానంగా తీసు కుంటారు. వీరికి రాజనీతి- దేశకాలపరిస్థితులతో ఏమంత సంబంధం ఉన్నట్టు కనపడదు. (మొదటిధారలోనివారుకూడ భావంతో సం బంధించినంతవరకు ఈతెగకు చెందినవారే.) కళయే వీరికి మోక్షదాత. ఆరాధ్యదేవత. వీరిదృష్టిలో బాహ్య ప్రపంచం, ప్రాపంచిక కష్టాలు క్షణికాలు. అందులో వర్తమానమంటే అసలే గిట్టదు. రాజ్యానికి హద్దు ఉంది. వాఙ్మ యానికి హద్దులు లేవు. అది అనంతం. కళయే శాశ్వతం. రవి గాననిచోటును కవి కనుక్కో గలుగుతాడు. మాట్లాడితే నా 'అంతఃప్రేరణ' ఎలా ఆదేశిస్తే అలా నడుస్తా మంటారు. వీరు ప్రాపంచిక కష్టసుఖాలతో సాధ్యమయి నంతవరకు ఎడంగా ఉండాలననీ, శాంతంగా జీవితం గడచిపోవాలననీ కాంక్షిస్తారు. వీరి జీవితంలో క్రియాత్మకమైనభావాలు అరుదు. క్రియకూడ వీరికి చాల దూరం. అందుకనే ఇష్టంవచ్చినట్టు, చిత్తం పోయినట్టు పాడతా మంటారు. వీరిపాటలకూ వ్యావహారికజగత్తుకూ ఎంతేని దూరం. తాము జీవింపవలసింది సం ఘంలోనయినా, సాంఘికపరిస్థితులతో వీరు 'పద్మపత్ర మివాంభసి'గా ఉంటారు.

ఇక్కడే వాఙ్మయానికీ-రాజనీతికీ మధ్య లో అభిప్రాయభేదం వస్తోంది. అనాదికాలం నుండి ఇంతవరకు తయారయిన వాఙ్మయంలో మనవ్యావహారిక జీవితానికి, స్వప్నలోకంలో విహరించేకవుల కల్పనానిర్మితవాఙ్మయానికి ఎక్కడా పొంతనలేదు. దీనికి కారణం వారు చెప్పేవారే కాని అనుష్ఠాతలు కారు. తరువాత వాఙ్మయంలో ప్రకృతిలోని సమస్తప్రాణికో టికి లేదా సమస్తమానవజగత్తువరకైనా స్థానం లేదు. ధనాశాపరులై కవులు తమవాణిని ధన వంతులకు అమ్ముకుంటూవచ్చారనీ, అదే తదుపరి రూఢి అయిపోయి వాఙ్మయానికి ము ఖ్యపాత్రలు . మేలుజీవితం గడిపేవారే కా వాలి కాని కూలినాలితో జీవించువారలు

...పనికిరారను అంధవిశ్వాసం ప్రబలిపోయిం దనీ అనేకమంది విశ్వాసం.

భాషాసంబంధమైనసమస్యకూడ ఇంతవర కు విడివడలేదు. వాఙ్మయం ఎవరికి ? అను ప్రశ్న బయలు దేరినప్పుడు, భావం అనే ఆత్మను వహించటానికి భాష అనేశరీరంకూడ తగినజవ సత్త్వములు కలిగి ఉండవలెనుకదా! భావానికి అనుకూలమయిన భాష ఉపయోగింపబడటం అ వసరంగదా ! ఏభాషను ఎక్కువమంది చదివి అర్థంచేసుకోగలుగుతారు ? జనసామాన్యానికి వాఙ్మయం కావాలి అనుకున్నప్పుడు భాష కూడ అందుబాటులో ఉండాలి. భావం ఒకటి, భాష ఒకటి అయితే 'ముసలి మొగుడు, పడుచు పెండ్లాం' కథలాగ ఉంటుంది. *

వర్తమాన మంతా క్షణికం, నాకల్పనలో చిరంతనజ్యోతి వెలుగుతోంది. నేను రాసేది క్షణంకోరకు కాదు. నేను శాశ్వతసత్యాన్ని అన్వేషిస్తున్నాను. నాకల్పనలో భూతభవిష్య ద్వర్తమానములు ప్రతిబింబించుతుంటాయి-అను వాక్యాలు ఎంతవరకు సత్యమో యోచిం చాలి. నిజంగా భూతభవిష్యద్వర్తమానములు ప్రతిబింబించితే ఈకయ్యే మేల వస్తుంది ? వర్తమానానికి స్థానం లేకపోబట్టియేకదా ! కువిషమపరిస్థితులు వ్యాపించటం. అయినా ఈశాశ్వతసత్యం ఎటువంటిది ? ఎలాలాభించు తుంది ? త్రిగుణాతీత మయిన 'నేతినేతి' అనా దిని భజించేదీ ? వీరి జీవితంలో ఈ నేతినేతి తత్త్వాన్ని ఎంతవరకు పాటించగలుగు తున్నారు ? రాజనీతిజ్ఞుడు క్షణికం అని ఈ వర్తమానాన్ని యీసడించవద్దంటాడు ఈక్షణంకూడ ఆఅనంతలో ఒక భాగమేకదా ? కంటిముందు నిర్జీవమై నశింపనున్న ఈక్ష ణాన్నే నీవు బ్రతికించలేనప్పుడు, నీ అనంతం

కొరకు ఎవరు ఆశపెట్టుకు కూర్చుంటా రం టాడు అతను.

ఇంకా కొంతమంది 'శాంతి'శబ్దాన్ని ఆధా రం చేసుకుని తనవాదన బలపరుప ప్రయత్ని స్తారు. కాని జీవితంలో ఈశాంతి అంతంలో కదూ వస్తుంది ? లేమిడియొక్క ఆటుపోటుల తోనే విశ్రాంతి లేనప్పుడు ఈశాంతి ఎక్కడ లభిస్తుంది ? లేమిడి లేక అభావము నశించి నప్పుడుగదా శాంతి. రజోగుణోద్రేకం,తమో గుణోద్రేకం తదుపరియే సత్త్వగుణానికి స్థానం ఉంది ? 'సామ్యం ప్రలయం' అని జీవితాం తమే శాంతి. జీవితం ఉన్నంతవరకు భావ సంఘర్షణ తప్పదు. భావోద్రేకం కలగడానికి రజోగుణం అవసరం. కవిత్వాన్ని గురించి రాస్తూ శ్రీరామలింగారెడ్డిగారు ఈవిధంగా రాశారు—

"ఆలోచనాశక్తికి శాంతము మొత్తము మీద సహాయకారి. భావములు కొంతవరకు విరుద్ధములు. శమదమాదిసత్త్వగుణములు పట్టు వడినయెడల కైవల్యప్రాప్తియెట్లోగాని కవితా ప్రాప్తి నిండుసున్న. రాజసతామసగుణములు కవిత యను మందాకినీమనోహరప్రవాహము నకుజన్మస్థానములైనమహోన్నతభావములు." సంఘర్షణ మంటే వణకుతూ శాంతికొరకు కల్పనవై పుకుపరుగిడుకవిరణభేరీఏమిమ్రోగించ గలుగుతాడు ? సంఘర్షణలో ఉన్న ఆనందాన్ని అనుభవించకలిగినవాడే యుద్ధగీతికలు పాడ గలుగుతాడు. సమయం వచ్చినప్పుడు కత్తితీసు కుని రణరంగంలో దుముకకలిగినవాడే వీరచరి త్రను రాయకలుగుతాడు. వీరహృదయులే రెంటికీ సమర్థులు. భీరులు కల్పనాలోకంలో ఉండిపోతారు. అయినా కొంతమంది తమ నిష్క్రియతను కప్పిపెట్టేందుకు, సంఘర్షపూ ర్ణజీవితాన్నీ, రజోగుణసోపానాలనీ బాహ్య జగత్తుకు బదులు మనోజగత్తులో దాటుతాము. ప్రతివాడు యుద్ధం చేయగలిగిఉండవలసిన అవసరం లేదంటారు. కాని మనోజగత్తులో దాటటానికి ఇంద్రియనిగ్రహం కావాలి. దగ్గరదగ్గర యోగివలె జీవితాన్ని ప్రయోగిం చాలి. ఇలాంటికవులు ఎంద రున్నారు మన వాఙ్మయంలో ?

తమరూఢిప్రియతను, విలాసితను మరుగు పర్చుకోవడంకొరకు ఇంకా కొంతమంది తమ రచనలకు మూలం'అంతఃప్రేరణ' అంటారు. కాని 'అంతః'శబ్దానికి అర్థం చెప్పరు. ఈ అంతఃప్రేరణ ఎటువంటిది ? ఎవరిదగ్గరన్నా ధనం ఉంటే వారితలకాయ పగులగొట్టి ధన మపహరించటం అంతఃప్రేరణేనా ? బజారున ఎవరయినా ఒక అందమయినరమణి వెళుతూ వుంటే రాడీరకం ప్రోగయ్యి పాటలూ పద్యాలూ పాడుతూవుంటారు. అది అంతః ప్రేరణేనా ? ఈ అంతఃప్రేరణకు అంత మెక్కడ ? దీన్ని విరోధిస్తే అంతఃప్రేరణను గొంతు పిసుక ప్రయత్నించినట్లేనా ?

మన అంతఃప్రేరణకు ప్రేరకం సాంఘిక పరిస్థితులా లేక భగవచ్ఛక్తియా ? అనేసం దేహం మనకు కలగక మానదు. ఏల నన-కవుల్ని మనం సాంఘికజీవు లనటం మానివేశాం. వారినిగురించి ఏవేవో నిర్వచనాలు చేసి నీవు ఇంద్రుడవు, చంద్రుడవు అనటం పరిపాటి అయిపోయింది. కాని కొంచెం దీర్ఘంగా ఆలోచిస్తే ఇది పొరపాటు అని తేలుతుంది. కవికూడ ఒకసాంఘికజీవనీ, అతనికవిత్వానికి మూలప్రేరకం సాంఘికపతనోత్థానములేనని అనుకున్నప్పుడే మనం అతన్నిగురించి ఏమ న్నా చెప్పకో వీలుంటుంది. కవి ఎక్కడ నుంచో ఊడిపడ్డా డని చెప్పుకోవడం అంత యుక్తిసంగతం కాదు. అతని పూర్వసంస్కృతి అతనిమీద తనభావం చూపకుండ ఉండలేదు. అతను సంఘజీవి. సంఘంలోనే అతను పుట్టి పెరిగాడు. సంఘపుభావాలే అతనిరక్త నాళాల్లో జీర్ణించివున్నయి. సాంఘికపరి స్థితులే అతన్ని రాయ మని ప్రేరేపిస్తున్నవి. క్షుద్బాధతో పీడింబడుదరిద్రుడు ప్రేమగీతి కలు పాడలేడు. అతనిహృదయంలోంచి బయ లుదేరేది 'అన్నమో రామచంద్రా ! ' అనే. కవి రానేరాత ఒక్కసారిగా అతని నవసృష్టి కాదు. అదివరకు ఎన్నోబుర్రలు ఆవిష యాన్ని గురించి ఆలోచించే ఉండును. చివ రకు దానికి రూపమిచ్చేశ్రేయస్సు అతనికి లభించింది.

ఇంతకూ చెప్పదలచింది అంతఃప్రేరణ అని చెప్పుకోవడానికి పూర్వం,దానికి పునాదియైన

* భావానుసరించిన ఆందోళన పురాతన మయినప్పటికీ మానాగా ఉంచుకుని ముందుకు సాగటానికి వీలయిన భాష ఇంతవరకు మనకు లభించలేదు. ఈభాష,ఆభాష రెంటిని పత్రిక లలో ప్రకటిస్తూవచ్చారు. ఇది కడుశోచ నీయం. సంపాదకులకృప ఉంటే దీన్నిగురించి మరోమాటు రాస్తాను.

సాంఘిక,రాజనైతిక, ఆర్థికపరిస్థితులను జీర్ణించుకుని తన అంతస్సును సంస్కరించాలని.

ఒకసందర్భంలో రాష్ట్రపతి జవాహరు లాలునెహ్రూ ఒకసారి ఉపన్యసిస్తూ—"రాజనైతికుడు, సాహిత్యస్రష్ట ఇద్దరూ వేరు వేరు కాదు. రాజనీతిని, సంస్కృతిని రక్షింప వలసినబాధ్యత కవిదే. యూరపుఖండంలో లాగ కవులు కాన్ఫరెన్సులు జరిపి సాహిత్యపు భావనిర్మాణాన్నిగురించి పరస్పరం పరామర్శలు జరుపుకోవాలి." అని చెప్పారు. ఇంత వరకు ప్రతియుగం, ప్రతిసమయంలోనూ మన సాంఘికసంస్కృతికి ప్రేరకాలు రాజనైతిక, ఆర్థికపరిస్థితులే. "దేశమంటే మట్టి కాదోయ్, దేశ మంటే మనుషులోయ్." అన్నట్టు సంఘం నిర్జీవమైన మట్టిబొమ్మ కాదు. సంఘం ఎప్పుడూ భావిసంతతివల్ల ప్రభావింపబడుతూ ఉంటుంది. అదేవిధంగా భావిసంతతికి మార్గం చూపించేది సంఘమే. ఒకవ్యక్తి సంఘాన్ని తారుమారు చేయకలుగుతాడు. దానిలో ఎన్నో మార్పులు తెస్తాడు. అదేవిధంగా అతనుకూడా సాంఘికప్రవర్తనవల్ల అనేకవిషయాలు గ్రహిస్తాడు. తనకంటె ముందుపోతున్న సమాజంతో ఏవ్యక్తి ఎంత ఎక్కువగా సంపర్కం కలుపుకుంటాడో అతని అనుభవాలూ, అతనిగంభీరతా అంత అధికం కాగలుగుతాయి. అతని 'స్వ'అతని 'అంతస్సు' అంత అధికంగా వికసించి పల్లవించుతుంది. ప్రతివ్యక్తిలోనూ కొన్ని నైజగుణాలు పుట్టుకతోనే ఉంటాయని ఒప్పుకుతీరవలసిందే. వారిగుణవికాసంకూడా ఆవిధంగానే కలుగుతూఉంటుంది. కనుక అందరిఅంతఃప్రేరణా ఒకేలా నుండదు కాని దీన్ని పురస్కరించుకుని అజ్ఞానంవల్ల కలిగిన ప్రేరణకూడ అంతఃప్రేరణ అని చెప్పకూడదు. అలా చెప్పకోవటానికిపూర్వం సాధ్యమయినంతవరకు తమ అంతస్సును సంస్కరించుకోవాలి.

రాజనీతి క్షణికం. దానికి హద్దులున్నయి. వాఙ్మయానికి హద్దులు లేవు. కనుక మే మీక్షణికవాదంలో పడ మంటారు. కాని ఇది యథార్థమని తోచదు. మనహృదయం మస్తిష్కం రెండూ ఏవిధంగా వేరు కావో, అదేవిధంగా ఈరెండున్నూ వేరుగా విభజింపబడవు. కడుపులో బాధగా వుంటే బుర్ర పనిచేయనట్లే రాజనీతి చెడితే సాహిత్యం కాని, సాహిత్యం చెడితే రాజనీతికాని అంత విశేషంగా ఉపకరించజాలవు. సాహిత్యం అనంతం కావచ్చు. దానితో శాశ్వతసౌఖ్యం పొందగోరవచ్చు. కాని దానిలోనివిలువను గ్రహించాలి. అప్పుడే అది ఆదరణీయం కాగలుగుతుంది. ప్రతివాళ్లున్ను అఖండము, అనంతము నయిన సాహిత్యాన్ని తయారు చేస్తా మని చెప్పటం హాస్యాస్పదం. సంపూర్ణానుభవంతో వికసించిన అంతస్సుకూ, అజ్ఞానంతోకూడిన అంతస్సుకూ భేదముంది. చక్రవర్తి, సామంతరాజు ఒకేగౌరవాన్ని పొందవలెనంటే ఎలా కుదురుతుంది ? ఎవరిస్థానంలో వారు గౌరవనీయులే. ఎవరియోగ్యతప్రకారం వారు కార్యసాఫల్యం పొందకలుగుతారు. నేను వారికంటె తక్కువా అనేచోటనే ముసలం పుడుతుంది.

పువ్వునుగురించి వర్ణించాలని వనస్పతిశాస్త్రం తిరగవేస్తే పువ్వునుగురించిన వివరాలు తప్ప, పువ్వు దొరకదు. అలాగే అంతఃకరణలో చిత్తాన్ని ఏకాగ్రపరచినా దాని సత్యస్వరూపం లభ్యంకాదు. పువ్వు బాహ్యప్రపంచంలో ఉంటుంది. అక్కడ వసంతం-హేమంతం, మలయానిలం, మంచుజలం, వికసించటం- వాడిపోవటం అన్నీ ఒకదానివెంట ఒకటి ఉండితీరుతాయి. ద్వంద్వపరిస్థితిని విడనాడి ఒకేవైపునకు తనదృష్టిని నిగిడించటం తిన్ననిమార్గం కాదు. మానవజీవితం కూడ ఒకేపరిస్థితికి చెందదు. ఒకప్పుడు ఏడ్వడం, ఇంకొకప్పుడు నవ్వడం, ఒకప్పుడు భోగవిలాసాల్లో మునిగి తేలడం, ఇంకొకప్పుడు నీటి చుక్క అయినా దొరకక తపించడం, ఒకప్పుడు చూడాంతశృంగారంలో మునగటం ఇంకొకప్పుడు వియోగవహ్నిలో దగ్ధులవడం మానవుడు పుడుతూ వెంట తెచ్చుకున్న గుణాలు. దమ్మిడీకొరకు ఇతరుల ప్రాణాలు తీయుమానవుడు ఇంకొకప్పుడు తిన కున్నదంతా నిముషంలో దానధర్మం చేస్తాడు. బీద సాదలను పీడించి ధనం పోగుచేయు శెట్టి హారికథదగ్గర ప్రేమావతారంలాగ ఉద్రూతలూగుతాడు. ఇక్కడే ప్రేమ, ఈర్ష్య, అహంకారం, నిర్మమత, రాగద్వేషాలు అనిత్యతత్త్వాలు నిరంతరం పరస్పరం ఢీకొంటూ ఉంటాయి. వీటన్నిటినీ అనుభవించినవాడే సరియైన వాఙ్మయాన్ని సృష్టించకలుగుతాడు.

కాలంమారింది. కాలంవెంట సాహిత్యం మారాలి. అప్పుడే సాహిత్యం జీవించకలుగుతుంది. కాలానుగుణ్యంగా ఆదర్శాలు, మార్గాలు మారిపోతాయనుమాట మరువకూడదు. ఒకప్పుడు రాజే దైవ మనుభావం నిబిడీకృత మయివుంది ప్రజలలో. తమకు లోలోన ఇష్టం ఉన్నా లేకపోయినా, రాజు ఎంత చెప్పితే అంతే అప్పటికాలంలో. పూర్వం రాజే రాజ్యం. రాజుసుఖదుఃఖాలే రాజ్యపు సుఖదుఃఖాలు. రాజుకు ఏరమణి మీదన్నా కోరిక ఉంటే ఆకోరిక తీర్చటానికి ప్రజలు తమ సర్వస్వం ధారపోసేవారు. కాని ఇప్పుడో ప్రజాతంత్రయుగం. రాజుకు ప్రధానత లేదు. ఒకవ్యక్తి సుఖదుఃఖాలకొరకు అనేకవ్యక్తుల్ని బలి ఇవ్వడం ఇప్పటి ఆదర్శం గాదు 'ఎవరో కిరీటధారుల కాంక్షలకొర కిందరి కేలా సంక్షోభం?' అనేసూక్తి ఇప్పుడు చెలామణి అవుతుంది. ఒకప్పుడు స్వర్గం-మోక్షం అనేపేరుతో నిస్సంగత్వం దాల్చి, ఉన్నదంతా విడిచి అడవులకు పోయి కళ్లు ముక్కు మూసుకునేవారు. ఇప్పుడో దేశముక్తియే మనముక్తి "వందే మాతరం" కొరకు నవ్వుతూ ఉరికంబాల కెగప్రాకటం లీల. దేశంకొరకు, సంఘంకొరకు తనప్రాణాలను అరచేతిలో పెట్టుకుతిరగడం ఇప్పటిపౌరుషానికి నిదర్శనం. ఇప్పటివారు ఉన్నదంతా వదలి జైళ్లకు పోతారు. తుపాకిగుళ్లు ఎదురురొమ్ములో తగులుతూఉంటే పువ్వుబాణం తగిలినట్లు భావిస్తూ నవ్వుతారు. ఇప్పటికాలపు పూలు సయితం.—

ఉ. నీచపుదాస్యవృత్తి మన
నేరని శూరత మాతృదేశ సే
వాచరణమ్మునందసువు
లర్పణ నేసినవారి పార్థివ

శ్రీ చెలువారుచోట, తద
సృగ్రుచులన్ వికసించి వాసనల్
వీచుచు రాలిపోవగవ
లెం దదుదాత్తసమాధి మృత్తికన్!

అని కాంక్షిస్తున్నాయి. ఇంతమాత్రపు హృదయం లేనికవి, అనుభవశూన్యుడై, ఆత్మోత్కర్షమంటే ఎరుగనికవి త్యాగాన్ని సరించినగీతాలేమి పాడగల్గుతాడు? ఆగీతాలోంచి ఎరువు తేసుండా, నిజమయిన వీరరసం చిప్పిల్లినప్పుడేకదా! పాఠకుని హృదయం అకృత్రిమమైన మొక్కవోని ఉత్సాహంతో నిండిపోవునది? ఊహాప్రపంచంలో తిరుగుతూ కవులీ భౌతికప్రపంచానికి, జీవితజగత్తుకు దూరమైపడి బయటికి పారిపోయి వారికర్తవ్యాన్ని నెరవేర్చలేరు. కవి అయినందుకు కల్పనాజగత్తులో విహరించటానికి అతనికి జన్మసిద్ధపు హక్కు వుంది. కాని తానుకూడ మనిషియేకనుక, తనకుకూడ భౌతికజగత్తుతో సంబంధం ఉండికనుక భౌతికప్రపంచం కల్లయని, భౌతికవస్తు వ్యాపారాన్ని విస్మరించటం, తన చుట్టు ఎన్నో మానవాత్మలు విలపించుతూ ఉంటే తాను ఆకాశయానం నుండి క్రిందికి దిగకపోవటం శుభప్రదం కాదు. ఇక్కడే రాజనీతిజ్ఞునకూ కవికీ సంఘర్షణ ఘటిల్లించబోతోంది. రాజనీతిజ్ఞుడు ప్రజల హాహాకారాన్ని సైప జాలకపోతున్నాడు. అతని హృదయం ప్రజారోదనం వినలేక విక్షిప్తమయిపోతున్నది. కాని పాప మతడు చేయకలుగున దేమి? శోకాన్ని శ్లోకంలోనికి మార్చగల శక్తిసామర్థ్యములు అతనిలో లేవు. వాళ్ల హృదయంలోని మూకవ్యథకు రూపాన్ని తేగల చిత్రకళను అత డెరుగడు. అందుకని అతను కవివద్దకు వచ్చి మొరపెట్టుకుంటున్నాడు—'అన్నా! ఒకవైపున ఇల్లు కాలుతూఉంటే ఈ సంగీత మేమిటి? ఈ ప్రేమగీతికలతో కడుపు నిండుతుందా? నేనీ వేదనను సహింపజాలను. ఇరుగుపొరుగు వారి రోదనం వినిపించుకొనక దూరంగా పరుగెత్తటం నీకు భావ్యం కాదు. ప్రజలు అజ్ఞానాంధులై మార్గభ్రష్టులైనారు. వారి ఘోర ఆలకించుటకు భగవంతుడుకూడ భయపడుతున్నాడు. వారికి ధైర్యం చెప్పవలసిన భారం నీమీదకూడా వుంది. మనం ఇద్ద్వరం కలసి క్రొత్త ప్రపంచాన్ని సృష్టిద్దాం' అని అతను కవిని ఆహ్వానిస్తున్నాడు. అతని ఆహ్వానం కవికి నచ్చదు. అత డాయాహ్వానాన్ని తిరస్కరిస్తున్నాడు. రాజనీతిజ్ఞుని వాక్కులు అతని చెవికి కఠోరంగా తగులుతాయి. కాని యుగకఠోరతను తన సహృదయతామృతముచే తడిపి పాక మొనర్చి, దానికి భవ్యరూప మీయవలసినధర్మం కవిదేనని అతను గుర్తించటంలేదు. అతనికి రెండవ గొడవఅంటే తలనొప్పిగా ఉంటుంది. శబ్దాలంకారాలు, అర్థాలంకారాలు, నాయికానాయికులను వదలి రెండవవైపునకు తిరిగి చూట్టానికి అతనికి తీరుబడేలేదు. ప్రజలు మూర్ఖులు. నాగీతాలను పాడి అర్థం చేసుకుని ఆనందించగలశక్తి వాళ్లదగ్గర లేదు. "అరసికేషు కవిత్వనివేదన" మెట్లా గంటున్నాడు. కాని యథార్థంగా ప్రజలు మూఢులేనా? మూఢులే కానీయండి. మూఢులైనంతమాత్రాన వారి రసగ్రహణశక్తి నశించిందా? పశువులుసైతం నాదంవిని ముగ్ధములు కాగలిగినప్పుడు, మనుష్యుల రసగ్రహణశక్తి ఎట్లునశించకలుగుతుంది? కవి తన అశక్తతవల్ల, వారల రంజింపజేయగలుగు గీతాలు, సారస్వతం రచింపలేక, వారి రుచిని ఎరుగక ప్రజలు మూర్ఖు లనడం అంత తగిన సమాధానం కాదు. ప్రజలలో ప్రబోధం కలుగజేయవలసినవిధి కవిది. ప్రజలు తనరసికత్వాన్ని గ్రహించకలిగినప్పుడే కొండ దిగుతానన డం కవియొక్క మహత్తుకు సరియైనపలుకు కాదు. ఉచ్చసింహాసనంనుంచి దిగి అజ్ఞానం, లోపడి, ఆత్మశక్తిని మరచి ఉన్న పవిత్రమానవుని పునరుద్ధరించకలిగినప్పుడే కవి తనమహోన్నతపదవికి వన్నెచిన్నెలు తేకలుగుతాడు. ఈ జీవితజగత్తుయొక్క గర్భంలోంచి పుట్టుచుండు వేదనలో కవికూడా పాల్గొనాలి. ఆ వేదన అతనిహృదయాన్ని కలత పెట్టినప్పుడే అతను సరియైనగీతాలు అల్లకలుగుతాడు. అప్పుడే ఆతని అంతస్సు దృఢ మౌతుంది. అప్పుడే అతను అంతఃప్రేరణను అనుసరించి అన్యథా నిర్మించి లాభం పొందకలడు.

మరచి, అబద్ధాన్ని అనుకరించటంకంటె వేరు లేదు. రూసో చెప్పినట్టు కాల్పనికవేదనకు అంతులేదు. యథార్థమయిన పీడ భౌతికమే. శరీరసంబంధమైనపీడయే యథార్థము. మానసికంగా కరుణాసాగరాన్ని ఉప్పొంగించవచ్చు కాని అది నిజమయిన అంతఃప్రేరణ కాదు.

సంఘంలో నలువైపుల వ్యాపించి గుండెను నీరు చేయగల దీనార్తరవం, కరుణాక్రందన, ఇతరులను పీడించుపీడకుల ఉన్మత్త అట్టహాసం ఇప్పటికవుల్ని జొత్తుగా పీడించవని చెప్పవీలులేదు. ఆ కరుణాజనకమైనదృశ్యాలు ఎంతకఠినహృదయులనైనా ఆకర్షించుకోగలవు. దీనులదుఃఖాన్ని సహించలేక దుఃఖించు మహాపురుషుల కన్నీటిధారలలో భగవద్దర్శనం చేసుకోగలిగిన కరుణాహృదయులు జాషువాలాంటి కవులు ఏకొద్దిమందో లేకపోరు.

"పరులదుర్గతిఁ గని గుండె గరగి వగచు
సదయహృదయుల వీక్షణాంచలమునందు
పుట్టుచుండును కన్నీటిబొట్టువోలె
నేడి భగవంతుఁ డని? సంశయింప నేల?"

ఇంతే కాదు. ఆయన కరుణార్ద్రహృదయం మానవుని సాంఘిక పతనాన్ని స్వార్థపరతను సహింపలేక ఇంకా వ్యాకులపడింది.—

"ఎవ డారగించునమృతభుక్తిలో లీన
మయ్యెనో ఈపేదరాలిబువ్వ
ఎవడు వాసము నేయు శృంగారసౌధాన
నణఁగెనో ఈజోగులమ్మ గుడిసె,
ఎవడు నిద్దురవోవు మృదుతల్పములలోన
నక్కెనో యీ లేమ కుక్కిపడక
ఎవని దేహముమీది ధవళాంబరములలో
నొదిగెనో యీయమ్మ ముదుకచీర
వసుధపై నున్న భోగసర్వస్వమునకు
స్వామిత వహించి మనుజుండు ప్రభవమందు
నెవ డపహరించె? నేమయ్యె? నేమిసుఖము
దిక్కు దెస లేక పడుగురిఁ దేబరింప."

పటిమ గల కరుణావైభవం ఏకొలదిమందికో దక్కుతుంది. కరుణాభావం చెలరేగినప్పుడు దానికి క్రియారూపం కలుగచేసే కవులు అరు

దు. ఎక్కడ అడుగు పెడితే ఏమి తంటా వస్తుందో అని వీరి భయం. ఒక మనోవిజ్ఞానవేత్త చెప్పినట్టు మనస్సులో అనేక భావాలు ఒకేసారి రేకెత్తినప్పుడు అందులో ఒకభావం ప్రబలమై మిగిలినవాటిని అణచివేస్తుంది. లేదా ఒకయింట్లో ఇద్దరు నివసించవలసి వస్తే చెరిసగం పంచుకుని ఒడంబడిక చేసుకున్నట్టు రెండు భావాలు కలిసి అంతరాత్మను పంచుకుంటాము. అంతటితో అంతర్ద్వంద్వం చల్లారుతుంది. ఎదుట ఇల్లు తగులబడుతూవుంటే చూచి చల్లార్పటానికి నెళ్లాలనిపిస్తుంది. కాని పంచెలు బురద అవుతాయన్న చింత. సాంఘికసమస్యా పరిష్కారాలలో ఏమి కష్టాలు అనుభవించవలసివస్తుందోనని, కర్మకు దారిచూపక భావాల్లోనే జీవితంయొక్క చరమధ్యేయాన్ని నిశ్చయించుకుంటారు.

మనశ్శక్తి తన స్వభావానుకూలంగా పని చేయలేకపోయినప్పుడు అది పరాగత మవుతుంది. విరోధిప్రవృత్తులను ఎదురించగలశక్తి దానిలో శిథిలమైపోతుంది. ప్రవాహం క్షీణించి ముందుకు పోయేగతి వెనక్కు మరలుతుంది. ఉదారభావము మనస్సులో రేగినప్పుడు వాటికి తగిన మార్గం చూపించాలి. దుర్బలాత్మ గోతిలో పడ్డవాణ్ణి బయటికి తీయ సాహసించదు. వణకిపోతుంది లేదా "శివశివ" అని మొహం తిప్పుకుంటుంది. ఇటువంటివారు కరుణాసముద్రులై ఉంటారు. ఎవరిదన్నా కరుణగాథ వింటే వీరిహృదయం తరుక్కుపోతుంది. కాని రక్షించటానికి కాళ్లూ చేతులూ ఆడవు.

సాహిత్యం ఎవరికి? సాహిత్యానికి ముఖ్య ఉద్దేశ్యం ఏమయివుండాలి? సాహిత్యానికి ఆరాధ్య దేవత ఎవరు? అనేవిషయం తీవ్రంగా చర్చించబడుతోంది. అందరిఅంతఃప్రవృత్తులూ ఒకేవిధంగా ఉండవు. వారివారిసంస్కృతి, విశ్వాసాలు శక్తి ప్రవృత్తుల్ని అనుసరించి వారిభావధార ప్రవహిస్తుంది. కనుక సాహిత్యంలో ఫలానామూర్తిని పూజింపమని చెప్పటం ఉన్నతిగోరువారి లక్షణం కాదు. ఏది ఎంత గొప్పఆదర్శమైనా— వాఙ్మయస్రష్టలనందరిని భయపెట్టి బెదరించి ఒకేగాటిని కట్టచూడటం పొరపాటు. వాఙ్మయానికి ఆరాధ్య దేవత ఒకటేనని మానాపెట్టుకోమని చెప్పటకంటె బహుదేవోపాసనయే శ్రేష్ఠం. ఏకతంత్రవాదాన్ననుసరించి సరస్వతీదేవిని సంతుష్టపరచుట అట్లు ఉండగా ఆమెకల్యాణవాంఛుకులు ఆమెప్రాణాలకే ముప్పుతెస్తారని చెప్పకొంతమంది అనుభవజ్ఞుల హితోక్తులు చెవులబడుతూంటాయి. ఇది అందరకూ సమ్మతమే ననుకుంటాను. ఏదో ఒకవాదంలో పడి సారస్వతాన్ని ఒకేమార్గాన తీసుకుపొమ్మని కల్యాణవాంఛగల ఏసారస్వతోపాసకుడూ చెప్పడు. వాద మెప్పుడూ పార్టీకి విజయం కోరుతుంది. సాహిత్యపు అభంశుభాలతో దానికి సంబంధం ఉండదు. అయినా కవివాక్స్వాతంత్ర్యాన్ని స్వాతంత్ర్యేచ్ఛగల రాజనీతిజ్ఞుడు అరికట్టతలపెట్టుతాడా? బలవంతంగా రెండుచేతులతో గొంతునొక్కి పాడించప్రయత్నించటం హానికరమని అతనికీ తెలుసు. రాజనీతిజ్ఞుడు పొరపాటుపడడు. పిరికిగోమటిలాగ ఏవైపునుంచి ఏం వస్తుందోనని భయపడుట సారస్వతులలక్షణం కాదు. సారస్వతులసృష్టి గొప్పసృష్టి. దానిలో మహత్తు ఉన్నయెడల భయపడవలసిన అవసరం లేదు. విరోధులు లేకుండా చేసుకోవలసినబాధ్యత దానిమీదనే ఉంది. చుట్టూ విరోధులు ఉండి ప్రయత్నించికూడా మనం స్వాతంత్ర్యాన్ని నిలుపుకోలేనప్పుడు మనలో ఏదో గొప్పలోటు ఉన్నదని మనం నిజంగా స్వతంత్రత అనుభవించటానికి యోగ్యులం కామని అనుకోకతప్పదు. తనస్వాతంత్ర్యాన్ని రక్షించుకోగలిగినశక్తి రచనలోనే ఉండాలి.

రాజులఆస్థానాల్లో రచింపబడేసాహిత్యం రాజుల కుత్సితశృంగారవాంఛను తీర్చటానికి పనికివస్తుంది. అక్కడ పెరిగేసాహిత్యవృక్షానికి ప్రకృతిలోని స్వచ్ఛమైన మలయమారుతం లభించదు. కవికల్పన యథేచ్ఛగా విహరించలేదు. తనప్రవృత్తి ననుసరించి స్వతంత్రతను వెలిబుచ్చవీలులేదు. అక్కడ ధనంతో కవియొక్క మానసికపుత్రిక కామవాంఛ తీర్చు దాసిగా చేయబడుతుంది. రాజ్యకార్యాలతో విసుగెత్తిన రాజుమనస్సుకు సంతోషం కలిగించేందుకు కృత్రిమపుబొమ్మలు తయారు చేయబడుతాయి. ఈ కవులు కూడ అంతఃప్రేరణతోనే వ్రాస్తున్నా మనటం హాస్యాస్పదం. 'వానకీ మిడ వాఙ్దేశం గేహేగే హేచ నర్తయన్' లాగు రాజుల్ని సాహుకార్లను సంతోషపెట్టటానికి వీరి స్వాంతం పనికివస్తుంది.

తరువాత "ఎప్పటి కెయ్యది ప్రస్తుత మప్పటి కా మాటలాడి" తిరిగే దుర్బలాత్ములు ఇంకా ఉన్నారు. వీరు తమ ఆధ్యాత్మిక బౌద్ధిక దౌర్బల్యానికి పరవశులై వస్తుస్థితిని (ఉన్న యథార్థాన్ని) మరపించి సారస్వతం చాటున తమ కామలిప్సను అణచుకో ప్రయత్నిస్తారు. ఆస్థానకవులు రాజుల్ని సంతోషపెడితే, వీరు ప్రజల దౌర్బల్యాన్ని రేపి, వారిని నైతికభ్రష్టులనుగాచేస్తారు. వీరి కామలిప్స నాగజెముడుపురుగులాగు అటు ప్రాకి అటుప్రాకి మంచిచెడ్డ రెంటిని, కలగలుపు చేస్తుంది. ఈ దుర్గంధపూర్ణ మయిన సాహిత్యం ఎంత తొందరగా నశిస్తే అంత మంచిది. సాహిత్యంవంటి పవిత్రప్రదేశంలో కాలు పెట్టటానికి నైతికంగా చూస్తే వీరు అనర్హులు.

రాజనీతి-సాహిత్యం ఈరెండూ ఒకదాని మీద ఒకటి ఆధారపడి ఉన్నయి. ఈ రెంటినీ, సాధించకలిగేది ప్రతిభ. శక్తి (Intensity) కావాలి. అదే తన ప్రవాహాన్ని ప్రబలం చేసుకోకలుగుతుంది. మనం భూమి మీద నిలబడి చూస్తే ఒకచోట ఎత్తు, ఒకచోట పల్లం, ఒకచోట గుట్టలు, మరొకచోట చెట్లు ఎగుడుదిగుడుగా కనపడుతాయి. కాని ఒక యెత్తయినగోపురం ఎక్కినపుడు అంతా ఒకేమాదిరిగా చదరంగా కనపడుతుంది ఇదేవిధంగా అనేక విషయాలలో పూర్ణమయిన అంతస్సు అన్నివస్తువులను ఒకే దృష్టితో చూడగలుగుతుంది. యుగప్రాతినిధ్యం వహించటానికి శక్తి కావాలి.

మన దేశంలో గాంధీ, రష్యాలో లెనిన్ ఈ ఇద్దరూ రాజనైతిక వ్యక్తులు. కాని ఈ ఇద్దరివల్ల సాహిత్యంలో ఎంతమార్పు కలిగిం

గా చెప్ప శక్యం కాదు. అలాగే అనేకమంది సాహిత్యకారుల రచనలు, అనేక రాజ్యాలకు నూతనోత్సాహం కలిగించినాయి. ఈ శక్తి ఒకప్పుడు మతాన్నీ, ఇంకొకప్పుడు సారస్వతాన్నీ, మరొకప్పుడు రాజనీతినీ పురస్కరించుకుని విజృంభిస్తుంది. ఇప్పుడు మనలో రాజనైతికజాగృతి మిక్కుటంగా ఉంది. ముందు రాజనైతిక పరిస్థితుల్నే సాధించడం మన శివశక్తికి నిదర్శనం.

మన ప్రేరకశక్తి నిజమయిన శక్తిగా ఉండాలి. అది కేవలం కల్పనామయం కాక, వ్యావహారికంగా కూడా కాలపరిస్థితులకు సంబంధించినప్పుడే అది యథార్థశక్తి కాగలుగుతుంది. అన్యథా అది ఒకపరంపరలోనై తన మర్యాదను పోగొట్టుకుంటుంది. మానవత్వాన్ని పూజించడం, సాహిత్యానికి ప్రథమకర్తవ్యం కావాలి. ఆనందంతోపాటు ఆత్మరక్షణకూడా అవసరం. మనుష్యప్రపంచంలో మనజ్ఞానశక్తి ప్రాపంచిక కర్తవ్యాలను నెరవేరుస్తూంటే, మన ఆనందశక్తి రసాన్ని, లేక వాఙ్మయాన్ని సృష్టిస్తోంది. ప్రాపంచిక కర్మలద్వారా మన ఆత్మరక్షణశక్తి, రసంద్వారా మన స్వాంతాన్ని ప్రకాశింపజేయు శక్తి ప్రకటితమవుతుంది. మనకు ఆత్మప్రకాశమెంత అవసరమో ఆత్మరక్షణ ప్రయత్నంకూడా అంతే అవసరం.

భారతీయసాహిత్యంలో—అందులోనూ మన ఆంధ్రసాహిత్యంలో ఎక్కువ—పరిపాటిని విడిచి ముందుకు తీవ్రంగా పోకలిగిన రచయితలు చాల తక్కువ. "దివంగతులై, ఈ ప్రపంచపు సుఖదుఃఖాలతో సంబంధం తెంపుకున్న వారికోరికలే వారిభావాలే, వారి పోకడలే మనకు సర్వస్వమా? జీవంతో, అనేకవేదనలకు పాల్పడి దుఃఖాక్రాంతులై, జర్జరితులగుచున్న ఈవర్తమానంలోని మానవుల ఆశలు, ఆకాంక్షలకు ఏమీ విలువ లేదా?" అనుప్రశ్నయే తరుణసమాజాన్ని పీడిస్తోంది. ఆదికాలంనుంచి ఇంతవరకూకూడ సాహిత్యం మతగురువులు, రాజులు, సాహుకార్ల పాదాలొత్తుతూ, వారిమనోవినోదానికి సాధనంగా ఉపకరించింది. అందుకనే స్వరాజ్యం రాకముందే స్వరాజ్యం ఎవరికి? కర్షకులకా? కార్మికులకా? లేక ఇంకెవరికో? నిర్ణయింపవలెననుజనాందోళన రేగినట్టుగానే, సాహిత్యం ఎవరికి? నోరుగలవాడిదే రాజ్యమా? లేక నోరులేనివారికికూడా స్థానం ఉందా? అనే ద్వంద్వపరిస్థితి బయలుదేరింది. ఇన్నివేల సంవత్సరాలనుంచి చూపింపబడిన ఉపేక్షాభావం ఇప్పుడు పగతీర్చుకోవాలనని బయలుదేరుతున్నది. కాలచక్రం అనేకవిధాలుగా తిరిగి తిరిగి ఇప్పుడు ప్రజాతంత్రశబ్దాన్ని ప్రతిధ్వనింపచేస్తోంది. అంతా ప్రజలదే. హక్కులన్నీ ప్రజలవే. కష్టించి పనిచేసేది నిమ్నజాతులు కనుక రాజ్యం వారిదే. జీవంగల జాతులు అన్వేగనుక వాఙ్మయానికికూడా రాజులు ఆ కష్టజీవులే. వారికథలే వర్ణింపబడాలి. వారి కీర్తనలే ప్రతిధ్వనించాలి. వారిదినచర్యలే వాఙ్మయంలో కావ్యాలు కావాలి. వారు ప్రకృతిమాతకు నిజమైనబిడ్డలు. ప్రకృతియే కవికి రమణీయమయిన భావప్రవాహాన్ని చేకూరుస్తుంది. కాబట్టి కవికి లభించేసంపత్తి కష్టజీవులదే. కాని, కవి హిందూదేశాన్ని కొల్లగొట్టి తనజాతి ఉదరాలను నింపుతూ తైతక్కలాడు ఆంగ్లేయులవలె కృతఘ్నుడై ఆసంపత్తిని దుర్వినియోగం చేస్తున్నాడు. పరపీడనమే పరమావధిగా తలంచుచూ జీవించు ధనికుల ఎంగిలిమెతుకుల కాసపడి, కవి నిజమైన సత్యజీవుల కష్టగాథలు వర్ణించడం మానుకున్నాడనువాదం కర్ణకఠోరంగా కనుపించినా సత్యానికి దూరంమాత్రం కాదు. ఇంతవరకు ఉపేక్షింపబడటంవల్లనే వారు కావ్యానికి కథలకు నాటకానికి నాయికానాయకులు కాజాలరను అంధవిశ్వాసం తొందరగా తొలగిపోవటం కష్టమే. వర్ణనాశక్తి రూఢిగతమై, దృష్టి సంకీర్ణమయిన యీ దినాల్లో పాతమార్గాన్ని వదలి క్రొత్తమార్గాన్నవలంబించడం తేలికపని కాదు. అంధవిశ్వాసాలను మానసిక దాస్యాన్ని పటాపంచలు చేసి ముందుకు సాగిపోగల ప్రజ్ఞావంతులకు కాని అది సాధ్యం కాదు. అంతర్దృష్టిగల మహ[illegible]లు కావాలి.

ఆంగ్ల భాషలో మాట్లాడిననే గాని సభ్యపురుషులు కాదనుకొనుదినాలవి. మహాత్ముడు దక్షిణాఫ్రికానుండి భారతదేశం వచ్చినప్పుడు, బొంబాయిలో జిన్నా, ఉత్తమలాల్ త్రివేదీ మొదలగువారు మహాత్మునకు ఇంగ్లీషులో స్వాగత మిచ్చారు. ఏవైపు చూచినా అంతా ఇంగ్లీషులో మాటలాడువారే. మహాత్మునకు ఈదేశానికి రావడం క్రొత్త. చాలకాలంనుంచి ఈదేశపు పరిస్థితులలో అపరిచితుడు. ఆంగ్లభాషలో స్వాగతమిస్తే గుజరాతులో స్వాగత మందుకోవటానికి మహాత్ముడు లోలోపల జంకాడు కాని ఆయన విశ్వాసం ఇతరు లేమనుకుంటారో యని జంకేది కాదు. అఖరుకు గుజరాతులోనే మాటలాడినాడు. ఈవిధంగానే యుద్ధానికి జనాన్ని ప్రోగు చేయవలసిం దని చెప్పటకు వైస్రాయి పిలిపించినప్పుడు మహాత్ముడు వైస్రాయియెదుట ఢిల్లీలో హిందీలో మాట్లాడినాడు. అవసరం అయితే వైస్రాయి హిందీని ఇంగ్లీషులో తర్జుమా చేయించుకొనవచ్చు. కాని నేనుమాత్రం రాష్ట్రభాషయగు హిందీలో తప్ప మాటాడ నన్నాడు. అవి ఇప్పటిదినాలు కావు. అప్పటికీ ఇప్పటికీ జాతీయాందోళనలో చాలాభేద మున్నది. అదికాక గాంధీమహాత్ముని ఆసాహసం చరిత్రలో స్వర్ణాక్షరాలతో లిఖింపబడవలయును. ఏలనన షుమారు వెయ్యిసంవత్సరాలనుంచి రాజనైతిక వ్యవహారాలలో దేశభాషకు స్థానం లేదు. మహమ్మదీయుల పరిపాలనలో ఫారసీ రాజభాషగా నియమింపబడింది. తరువాత ఆంగ్లేయుల పరిపాలనలో ఆంగ్లభాష వాడబడుతోంది. ఇంతకాలానికి తిరిగీ దేశభాష రాజదరబారులో వ్యవహరింపబడటం తక్కువవింత కాదు. ఇంతకూ చెప్పదలచింది స్వయంగా ఆలోచించేశక్తి కావాలని. మన రక్తంలో ఇమిడిపోయిన ఆచారాలు తొందరగా వదిలించుకుందామన్నా వదలవు. నిరంతర సాధనతో గాని నవీనపథాన్ని నిర్మింపలేరు. అయినా అనుస్థాత తనమార్గాన్ని తానే సృష్టించుకోకలుగుతాడు.

తూర్పుదిశ తెలతెలవారకముందే పిట్టలన్నీ మధురరుతం చేస్తూంటే హాయిగా నిర్ద్వంద్వ

మనస్సుతో ప్రకృతియొక్క రామణీయకలను కన్నులపండువుగా చూచి ఆనందించుకర్షకుని జీవితం కవులకు అప్రాకృతంగా కనబడటం ఆశ్చర్యం. కాని ఇప్పుడిప్పుడే ప్రకృతజీవితం వైపుకు కొందిదినవకవులదృష్టి మరలుతూన్నందుకు సంతోషం—

తూర్పు తెలతెలవారకుండనె
తోడివారితో కాడి గట్టి
తోటకును నీర్వెట్టు రాముడు
మోట తోలుచును.

ప్రకృతిదేవత చామరములన
పైరగాలికి కదలి యాడెడు
కంకిపరువున వరికి చేనులు
సుంకుపోయంగన్.

చేనులోపల పిట్టకావలి
చేయుటకు సీతమ్మ వచ్చును
పెరుగుముంతను బువ్వదుత్తను
ప్రియునికై తెచ్చున్.

వరికికంకిని ప్రకృతిదేవత చామరం అని రూపకం కూర్చటానికి కవి కర్షక జీవితాన్ని అనుభవించాలి. సస్యశ్యామల యగు ప్రకృతితో పరిచయం ఉండాలి.

మనం సాహిత్యానికి క్రొత్త పూంతలు తేబోయి మళ్లీ అతిని ఉపాసించకూడదు. 'అతి సర్వత్ర వర్జయేత్.' కర్షకులను కార్మికులను తీసుకు వస్తున్నాం గదా! అను సంబరంలో మిగిలినవారిని మరవడం కూడదు. అందరికీ సరియైన స్థానం ఉండితీరాలి.

ఒక జన సామాన్యానికే వాఙ్మయం తయారుచేయవలె నని చెప్పమహానుభావులు విశ్వకవి రవీంద్రనాథుని ఈ వాక్యాలను గుర్తు వుంచుకోమని ప్రార్థన—'మనుష్యునిధ్యేయం తరచుగా ఉపధ్యేయంవల్ల అణచబడుతూ ఉంటుంది. ఇది అతని దౌర్భాగ్యం. అతను పాడటం నేర్చుకుందా మనుకుంటాడు కాని చివరకు పంతులుగా తయారవుతాడు. ధనికుణ్ణి కావా లనుకుంటాడుకాని ధనం సంపాదించి కృపణతాపాత్రు డౌతాడు. దేశకల్యాణం కోరుతాడు. కాని కమిటీలలో తీర్మానాలు ప్యాసుచేసి నేను కృతార్థుణ్ణయ్యా ననుకుంటాడు.' సాంఘికసమస్యా పరిష్కారంతోపాటు మానవహృదయంలోని సమస్తభావాలను చిత్రించకలిగేది కవియొక్క అంతర్భేదినియగు దృష్టియే. అంతఃప్రవృత్తులు ఉపేక్షించతగ్గవి కావు. అవే సాహిత్యానికి మూలం-పునాది. సంఘంలో అందరికంటే గొప్పగా సత్కరింపబడు మహనీయునిలో సైతం ఎక్కడ దౌర్బల్యం వుందో ఏపరిస్థితులలో అతడు నీచాతినీచుడు కాగలుగుతాడో, నీచాతినీచుడుగా పరిగణింపబడు సామాన్యమానవుడుకూడా ఒకప్పుడు ఎంతమహోన్నత గుణగరిమను పొందకలిగి, దేవాంశసంభూతుడనిపించుకుంటాడో చెప్పకలిగేదీ, పరీక్షించకలిగేదీ కవియొక్క సూక్ష్మదృష్టియే. అందుకని కవికి మానసికస్వాతంత్ర్యం ఇచ్చితీరాలి.

కవియొక్క అంతఃప్రేరణను అందరం ఆదరించకతప్పదు. అంతఃప్రేరణను కోలుపోయినకవి జీవచ్ఛవంలాగ తయారవుతాడు. కాని అంతఃప్రేరణ అని చెప్పుకోవటానికి పూర్వం, అంతస్సును సాధ్యమైనంతవరకు సంస్కరించుకోవలెననిమాత్రం మరొకమాటు జ్ఞాపకం చేస్తాను. కవిసాధన ఎంత ఉత్కృష్టమైతే అంత చక్కని వాఙ్మయం మనకు లభిస్తుంది. అనుస్మాత కానిక విరచనలు శాశ్వతరూపాన్ని పొందజాలవు. చెప్పేది ఒకటీ చేసేది ఒకటీ కాగూడదు. ఈదౌర్బల్యం కళను నిర్జీవం చేస్తుంది. తాను రచనకు కర్తనని రచనకంటె తాను గొప్పవాడనను భావం మరవకూడదు. తాను చెప్పతలుచుకున్న దానికంటె ఎన్నోరెట్లు హెచ్చుగా కవి తనను వృద్ధిచేసుకోవాలి.

ఇది గాంధీయుగం. పరిశ్రమకు మహత్తుని ఇచ్చేయుగం. రాజుకీ పాకీవాడికీ భేదం లేదు. సేవాభావానికి మహత్తరమయిన గౌరవాన్ని సమర్పింప ప్రయత్నించి మహాత్ముడు ప్రపంచానికి ఒకచిరంతనసందేశ మిచ్చాడు. అనాదియుగంనుంచీ చీదరించుకొనబడిన సేవాపరాయణులు గాంధీయుగంలోని కవులవల్ల గౌరవింపబడాలి. భావిసంతతికి కవు లీయ కలుగు నవీనఉపహార మిది యొక్కటియే. రాత్రింబగళ్లు కష్టించి పనిచేయుకార్మిక కర్షకులజీవితాన్ని వర్ణించి వారిదయనీయమయిన జీవితాలకు సానుభూతి చూపించకలవాడు కవి. తనతోపాటు ఇతరులనుకూడ ఏడిపింపగలశక్తి అతనివీణయందే వుంది. మహాత్ముని సేవాభావాన్ని చరితార్థపరచుకవులు ఏనాడు బయలుదేరుతారో ఆనాడే సాహిత్యం పూర్ణమనిపించుకుంటుంది. తథాస్తు.

# భగవద్భక్తి

★

కొడవటిగంటి కుటుంబరావు

"ఏమండీ ? మనింటోకూడా ప్రతి రోజూ భజన చేసుకుందాం?" అన్నది నాభార్య.

"ఇప్పు డెవరింటో చేసుకుంటున్నా రేమిటి?" అన్నాను చదువుతున్న పుస్తకం మూసిపెట్టి. మాది చాలా అన్యోన్యదాంపత్యం. రోజూ కీచులాడుకునే భార్యా భర్తలకు ఒక్కరోజయినా అన్యోన్యంగా ఉందామని ఉండటం సహజం. నాకుమటుకు ఏవంక పెట్టుకుని మా రాజితో కీచులాడుదామా అని ఉంటుంది. అదృష్టవశాత్తూ ఇప్పుడు నాకు దొరకవలిసిన విషయం దొరికింది — దేవుడు!

నా భార్యకు నామీద అపారమైన ప్రేమ ఉందనటానికి ఎటువంటి సందేహమూ లేదు. నలుగురుపిల్లల్నికనికూడా అన్ని విధాలా కంటిని రెప్పలాగ కనిపెట్టి ఉండటమేకాక నామీద తనకు పెంచినమోహముట-అంటుంది మా రాజి! తనపిల్లలంతా పళ్లేటగాని నావంటి ముంతమామిడిపళ్లుకారుట! ఇదంతా నేను లేకితనం కొద్దీ చెప్పుకుంటున్నా ననుకోవద్దు. నేనంటే అంత మమత ఉన్నా మా రాజికి నన్ను చూస్తే ఒకందుకు అలుసు—నేను నాస్తికుణ్ణిట! నావైపు వాళ్లంతా కూడా నాస్తికులేట! తనూ, తనతల్లిదండ్రులూ, తన అన్నలూ పరమ భాగవతోత్తములుట!

మా వైపువాళ్లంతా నాస్తికులని నేను ఒప్పుకున్నాను. మా నాన్న దేవుడిపేరు చెప్పి కాసీఖర్చు చెయ్యవలసివస్తే, "ఆఁ! భగవంతుడు తిరపతిలోనేఉన్నాడా ఏమిటి? ఇక్కడ లేడూ? గుళ్లోకి పోయి కొబ్బరికాయలు కొడితేనే సంతోషిస్తాడా ఏమిటి ? ఇంటోనే బెల్లంముక్క నైవేద్యంచేస్తే సంతోషించడూ ?" అని తప్పించుకో జూచేవాడు. మా అమ్మ ఈనాటికికూడా ఒక పురాణంగాని, హరికథగాని, భాగోతంగాని ఏమిటో ఎరగదు. అటువంటివాటికి తీరికలేదు ఆవిడకు తీరినా ఆవిడ కవి అర్థం కానూకావు, బాగానూ ఉండవు! ఇక నేను ఉండనే ఉన్నాను, నాభార్య అన్నట్టు, ఆవలించి అయినా "అబ్బ! శ్రీరామచంద్రా !" అనుకోని పరమనాస్తికుణ్ణి !

ఎటొచ్చీ నాభార్యే అంగీకరించదు, తనవారంతా ఆస్తికులై మా కంటె వెలగబెట్టిం దేమీలేదని. మా మామగారు అపర రామదాసు. ఆయన ఇప్పుడు రెండవ రామకోటి రాస్తున్నాడు. భద్రాచలంలో ఆయన్ని ఎరగనివాడు లేరని ఆయనే చెప్పుకుంటాడు కనక నిజమే అయిఉండాలి. మా పెద్దబావమరిది బైరాగిముండాకొడుకై తిరుగుతూ, పెళ్లీ పెటాకులూ లేకుండా, గంజాయిగాళ్లదగ్గ చేరినా వాడి నోటివెంట వేదాంతం తప్ప రాదు. మధ్యమధ్య తనే ఆయొక్క విరాట్స్వరూపం అనే భ్రమలోపడి అందర్నీ హైరానపెడుతూ ఉంటాడు కూడాను. ఇక మా రెండో బావమరిది భజనలు చెయ్యటానికి ప్రసిద్ధి. వాడు లేని భజనలూ సప్తాహాలూ ఉండవు మాప్రాంతాల. అసలు భజనతంతు వాడికి తెలిసినట్టు మరొకరికి తెలియదుట. (భజనకొకతంతుకూడా ఉందని నా అంతట నేను ఊహించగలిగిఅయినా ఉండను.) మా రెండో అబ్బాయి ముఖ్యంగా తరంగాలు పాడటంలోనిధి. బాలగోపాలతరంగం ఆవెల్లటూరాయన పాడితేనే వినాలి మళ్లీ మా బావమరిది పాడితేనే వినాలి అని ఒకఅభిప్రాయం ఉంది కొంతమందిలో.

పోతే, మా అత్తగారు! ఆ విషకాపరానికి వచ్చిన చాలాసంవత్సరాలవరకూ ఏమీ ఎరగనిదానల్లే ఉండి ఉండి అకస్మాత్తుగా ఒకనాడు తనే అందరికన్నా తలదన్నిన భక్తురాలని రుజువుచేసుకున్నది. సాక్షాత్తూ ఆ శ్రీరామచంద్రమూర్తి ఆవిషవంటిమీదికి వచ్చాడు...అదికొంచెం వివరంగా చెప్పవలిసినకథ.

మా మామగారు మొదటి రామకోటి పూర్తిచేస్తూఉండినరోజులవి. ఆ రోజుల్లో మా అత్తగారికి ఒంటో సరిగా ఉండటం లేదు. ఈ బ్రాహ్మడేమో భోజనాలముందర రామకోటి పెట్టుకుని రెండుజాములదాకా వడ్డనకు అనుజ్ఞ ఇచ్చేవాడు కాడు.

★

ఒకనాడిట్లాగే మా మామగారు రామకోటి రాసుకుంటున్నాడు. మా అత్తగారు ఆయనకు ఎదురుగా గోడకు చేరగిలబడి కూర్చుని, "దబ్బున కానిస్తురూ! నాప్రాణం పోతున్నదీ!" అని అంటున్నది. ఇంత దైవచింతన లేని భార్యను తనకు అంటగట్టటంలో భగవంతుడి ఉద్దేశం ఏమై ఉంటుందా అని ఆశ్చర్యపడుతూ మామామగారు రామకోటి రాస్తూండగా, నిస్త్రాణగా కూర్చుని ఉండినమా అత్తగారు చప్పున నీలుక్కుపోవటం ఆయనకళ్లపడింది.

"అమ్మాయి! ఒసే, మీ అమ్మకు పైత్యపుదడ వచ్చినట్టుంది, ఒకసారి ఇట్లా రావే!" అని ఆయన కూతుర్ని కేకపెట్టాడు.

మా అత్తగారు కోపంతో చలించిపోతున్నదానల్లే కంపిస్తూ, భయంకరమైనకళ్ళతో భర్తవంక చూస్తూ, "నాకుపైత్యమంటావుట్రా? చూడు, నిన్నేంచేస్తానో! పెట్టు - నాకుహారం పెట్టు! పెడతావా, లేదా!" అని పెడబొబ్బలు పెట్టింది.

నాభార్య—అప్పటి కింకా నాకు పెళ్లి కాలేదు; పసిది—తండ్రి కేకవిని పరిగెత్తుకుంటూ వచ్చి, తల్లి పెడబొబ్బలకు నిర్ఘాంత పోయి వణుకుతూ అట్లాగే నిలబడ్డది. ఇదంతా ఇట్లా ఎప్పుడు జరుగుతుందా అని కనిపెట్టుకున్న వాళ్లల్లే పొరుగింటి పుల్లమ్మా, ఎల్లమ్మా అక్కడ మరుక్షణంలో హాజరయినారు.

"త్రిపురమ్మకుపూనింది!" అన్నది పుల్లమ్మ, వెంటనే జరిగిందంతా అర్థంచేసుకుని.

"అపరాధం అనవయ్యా, పిచ్చి బ్రాహ్మడా! నువు రామకోటిరాస్తున్నావాయెనూ! మరిదానికి శాంతి వద్దూ? మొక్కుకో—సంతర్పణ చేస్తానని మొక్కుకో!" అన్నది ఎల్లమ్మ.

"ఓహో, ఇదా సంగతి?" అన్నట్టు మా మామగారు అక్కడ ఉన్నవారిమీద ఒక చిరునవ్వు ప్రసరింపజేసి, భార్యవంక తిరిగి, "నా కామాత్రం తెలియదా, స్వామీ! నీకోటి పూర్తికాగానే భద్రాచలం రానా? నిన్నుదర్శించనా? వైభవంగా సంతర్పణ చెయ్యనా—వెయ్యి బ్రాహ్మణ్యానికి?" అని మృదువుగా తనభార్య వంటిమీదికి వచ్చిన శ్రీరామ చంద్రమూర్తిని మందలించాడు. ఆయన మాటల ధోరణిచూస్తే ఆయొక్క శ్రీరామ చంద్రమూర్తి ఈమాత్రం తెలుసుకోలేనందుకు మా మామగారు ఆశ్చర్యపడ్డట్టూ, ఆసారికి రామచంద్రుడి అజ్ఞానాన్ని తాను క్షమించినట్టూ కనపడ్డాడు. అయితే ఎదురుగా సాక్షాత్కరించిన శ్రీరామచంద్రమూర్తిని విగ్రహరూపంలో భద్రాచలంలో చూడటం ఎందుకో నాకర్థం కాలేదు!...అయినా నామామగారి వంటి పరమభాగవతోత్తముడి ఉద్దేశాలను విమర్శించటానికి నేనెవణ్ణి? నాభార్యా, మామగారూ స్వయంగా చెప్పిన సంగతులే ఇక్కడ రాస్తున్నాను గాని నే నేమీ కల్పించటం లేదు, ఊహించడంకూడా లేదు.

అట్లా ఊహించ దలుచుకున్నవాణ్ణే అయితే, మా మామగారు మా అత్తగార్ని చూసి అసూయపడ్డట్టు ఊహించగలను. నిజానికి, చూడండి, పేరుపడ్డ రామదాసు మా మామగారు, రామకోటి రాస్తున్నది మా మామగారు, గడ్డాలూ మీసాలూ పెంచుకున్నది మా మామగారు, రామకోటి రాసినందుకు తద్దోషపరిహారార్థం సంతర్పణ చెయ్యబోతున్నది మా మామగారు! (రామకోటి రాయటానికి జ్యేష్ఠా నక్షత్రానికి చేసినంత శాంతి చెయ్యాలల్లే కనపడుతుంది మరి!) చివరకు ఆ రామచంద్రులవారు మా అత్తగారివంటిమీదికి వచ్చి ఆమెను పవిత్రం చెయ్యటం [illegible]?... ఇట్లా ఊహించగలను కాని నా ఊహ నిజమని నాకే నమ్మటానికి లేదు.

ఎందుకంటే—

పై కథవినండి. ఆనాటికి మా అత్తగారికి గుగ్గిలంపొగా పసుపూవేసి నశ్లు తెలిసేటట్టు చేశారు ఎల్లమ్మా, పుల్లమ్మా. ఆ తరవాత ఆవిడను బావి దగ్గిరికి తీసుకుపోయి ఇన్ని బిందెలు తోడి ఆ విడకు స్నానంచేయించి వాళ్లు వెళ్లిపోయినారు.

కాని రెండుమూడు రోజులకు మా అత్తగారికి మళ్లీపూనింది. ఆవిడ మళ్లీ "హారం! హారం! ... నాకు హారంకావాలి!" అని పెడబొబ్బలు పెట్టింది.

మా మామగా రీసారి రాముడికి కటీబిటీగా చెప్పేశాడు—"స్వామీ! నిన్ను నమ్మినభక్తుల్ని నువ్విట్లా ఒత్తిడిచేస్తే ఎట్లా? నీకు శాంతిచేస్తానని నీకు నేను వాగ్దానం చేస్తినే! నీకు నాపరిస్థితులన్నీ తెలుసునే!"

కాని మా అత్తగారుమటుకు ఆ ధోరణి మానలేదు.

"స్వామీ, నేను నీభక్తుణ్ణి. నువ్వు భక్తులకు దాసుడివి. నువ్వునన్నేమీ చేయలేవు...ఇక సర్దుకోవాలి! లేకపోతే వీలులేదు!" అని మామామగారు భార్యమీద ఎగిరిపడ్డాడు.

తరవాత అప్పుడప్పుడూ మా అత్తగారికి పూనుతూనేఉండేది. మా మామగారు "స్వామీ, సర్దుకోవాలి ఊఁ!" అని రాముణ్ణే తొందర చేస్తూనే ఉండేవాడు.

నిరాకారుడైన శ్రీరాముడి యందు అంత భక్తి ప్రేమ విశ్వాసాలు కలిగిఉండిన మామామగారు,

రాముడు ఏక్షణాన సాక్షాత్కరించు
తాడో, తన భార్యనోట ఏక్షణాన
పలుకుతాడో అని గడగడలాడి
పోతూండేవాడు. రామచంద్రమూర్తి
తనయింటికి రావటం తనమంచికి
కాదన్నట్టు ఆయనభావించేవా డని
తోస్తుంది, ఆయన ప్రవర్తనచూస్తే.
కాని భక్తుడికి అటువంటి మనస్తత్వం
అసంభవం! అందుకనే అన్నాను
భక్తుణ్ణి విమర్శించేటందుకు నేనెవ
ణ్ణని.

నా భార్యవైపువాళ్లను గురించి
ఇంత వివరంగా చెప్పాను. రాతలో
చెయ్యి తిరిగినవాణ్ణి కావటంచేత
నేను కొంతయుక్తి వినియోగించి,
మా మామగారి కుటుంబాన్ని గురిం
చి అంతా నిజమే రాసినప్పటికీ, మా
వాళ్ల నాస్తికత్వం కంటె నాభార్య
వైపువాళ్ల ఆస్తికత్వం ఏమంత
ఘనంగాలేదని వినేవాళ్లకు అనిపించే
టట్టు చేసి ఉండవచ్చును. నారచనకు
వశులై ఎవ్వరూ నావైపువాళ్లను
శ్లాఘించావద్దు, నాభార్యవైపువాళ్ల
ను నిరసించావద్దు.

ఏమంటె ఆస్తికత్వమేమిటో, నా
స్తికత్వమేమిటో మన మెవరమూ
ఎరగము. మేమంతా నాస్తికులమే
నని నేను అంగీకరించబట్టే నాభార్య
మావాళ్లను నాస్తికులని చెప్పగలు
గుతున్నది. "కాదు, మేము ఆస్తి
కులమే!" అని నేను నానోటివెంట
అన్నట్టయితే నాభార్య ఏమీచెయ్య
లేదు. వెనకటికి పురాణాలుకూడా
ఇటువంటి చిక్కులోనేపడినై. "నా
కన్న దేవు డెవడురా, కుర్రకుంకా!
జగన్నాధుండ, నాకంటె నీభూత
శ్రేణికి రాజు లేడెవ్వడు!" అన్న
హిరణ్యకశిపుణ్ణి భాగవతకర్త నాస్తికు
డన్నాడు. (అంతకంటె చండాలమైన
మాటలుకూడా అన్నాడు లెండి.)
"నేనే సమస్తచరాచర ప్రపంచానికి
నాథుణ్ణి, మామేవశరణంవ్రజ" అన్న
కృష్ణుణ్ణి భారతకర్త,ఆస్తికుణ్ణి చెయ్య
టంతో పోనివ్వక సాక్షాత్తూ ఆ
మూలవిరాట్టుయొక్క భౌతికస్వరూ
పం చేసిపారేశాడు. అట్లాగే "ఇందు
గల డందు లేడని సందేహమువలదు.
చక్రి సర్వోపగతుండు" అన్న ప్రహ్లా
దుడు నాస్తికుడని నాభార్య అనలేదు
గాని, "దేవుడు గుళ్లోనే ఉన్నా డా
ఏమిటి? మన ఇంటోలేడూ?" అన్న
మానాన్నను నాస్తికుడనటానికి సం
దేహించదు. కనక, అయ్యా,
చెప్పలేం!

నిజమైన ఆస్తికుడికీ నాస్తికుడికీ
మతవైషమ్యం ఉండితీరాలి. ఆస్తి
కుడు నాస్తికుడికి కాళ్లుకడిగి పిల్లనివ్వ
డు.నాభార్య నన్ను అన్నివిధాలాప్రే
మతో చూసినా నాస్తికత్వాన్నిమ
టుకు తప్పపట్టంలో అర్థంలేదు.
ప్రపంచంలో ఎంతమంది ఆస్తికు
లున్నారో అంతమంది భగవంతు ళ్లు
న్నారు. ఒకడి భగవంతుడితో ఒకరు
తప్పు పట్టటానికిలేదు. ఇప్పుడిప్పుడు
మతబుద్ధి నశించి నాగరికత ప్రబల
టంవల్ల ఒకమతంతాలూకు భగవం
తుణ్ణి మరొకమతం సహించటంనేర్చు
కుంటున్నది—"అంతా ఒకటే!
మీరు అల్లాఅంటారు, మేం కృష్ణుడం
టాం, కిరస్తాన్లు క్రీస్తు అంటారు!"
అంటె పేరులో ఏమీలేదని తాత్ప
ర్యం. కాని మన ఆస్తికత్వం అంత
టితో ఆగలేదు. మనదేవుడికి వెం
ట్రుకలు కావాలి, రక్తంకావాలి, లం
చాలు కావాలి, దుష్టుడికి దూరంగా
ఉన్నట్టు మనం మన దేవుడికి దూరం
గా ఉండాలి. మనసామీప్యానికి గాని
ఈదేవుడు వచ్చాడో మన కేదో ఆప
ద ఉందన్నమాటే! ఎందుకో తెలియ
కుండా చెంపలు వాయించుకుని అప
రాధం అనాలి—దేవుణ్ణి ఎట్లాగైనా
సాగనంపాలి. తిరపతికి పోదామని
ఊరికే అనుకోనైనా కూడదు! చెం
పలు వాయించుకుని, ముడుపులుకట్టి,
కొండలెక్కి, దేవాలయనిధికి దోచి
పెట్టి, సంతర్పణలు చేస్తామని వాగ్దా
నంచేస్తే అమృతాంజనం అవసరం
లేకుండా తలనొప్పిపోతుంది, వాము
పోచ అవసరం లేకుండా కడుపు
నొప్పి పోతుంది! ఈ పరిస్థితులను
సహించగలిగిన వాడు ఆస్తికుడు,
సహించలేనివాడు నాస్తికుడు!

* * *

"ఏమండీ? ప్రతిరోజూ మనింటో
కూడా భజన చేసుకుందాం?"
అన్నది నా భార్య ఒకనాడు.

"ఇపు డెవరింటో చేసుకుంటున్నా
రేమిటి?" అన్నాను. నాభార్యకాప
రానికి వచ్చినకొత్తలోనే నేనూ ఆవి
డా ఒకవిధంగా రాజీపడ్డాం—ఆవిడ
తన యిష్టంవచ్చినప్రకారం భగవం
తుణ్ణి ధ్యానించుకునేటట్టూ, నేను
మటుకు అందువిషయమై బాధింప
బడకుండా ఉండేటట్టూ. ఆరాజీని అతి
క్రమించి నాభార్య నాదగ్గిర దేవుడి
విషయమైనప్రశంస తెచ్చింది కనక
ఆవిణ్ణి కొంత క్రాసింగులో పెట్టటా
నికి నాకు అధికారం ఉందని నే నను
కున్నాను.

నేనడిగినదానికి నాభార్య "పోని
స్తురూ! మనకు ఒకళ్లతో పోటీ
ఏమిటీ?" అన్నది.

"అయితే 'మనంకూడా' అని ఎందుకన్నావు?... దీన్నే ఇంగ్లీషువాళ్లు ఆడతర్కమంటారు."

"ఇంగ్లీషువాళ్లకు తెలుగు వచ్చునా ఏమిటి?...అదంతా ఎందుకులెస్తురూ? మనింటో భజన చేసు కుందాం."

"ఎ:దుకూ?"

"ఎందుకేమిటి? భజన చేస్తే ఇంటికీ వంటికీ మంచిది. దుష్టగ్రహాలు ఆసించవు."

"దుష్టగ్రహాలు ఆసించకుండా ఉండటానికి చీనాలో ఏ: చేస్తారో తెలుసా? టపాకాయలు కాలుస్తారు. మనంకూడా—"

"ఏమి ఎగతాళండీ! మనం చీనావాళ్లమా ఏమిటి? డబ్బు ఏగాని ఖర్చులేకుండా భజన చేసుకోటాని కింత వితర్కిస్తున్నారు గాని టపాకాయలు కొంటారూ?"

"కొంటాను! దేవుణ్ణి భజన చేస్తున్నందుకు కళ్లు నెత్తిమీ:కి వచ్చేవాళ్లున్నారు. టపాకాయలు కాలిస్తే ఒళ్లు కాలుతుం దేమో కాని కళ్లు నెత్తిమీదికిమాత్రం రావు."

నాభార్య నావంక చాలసేపు విచారంతో చూసి, "నేను అడిగిన దానికీ మీరు మాట్లాడేదానికీ ఏమైనా సంబంధం ఉంది? రెండక్షరాల్లో చెప్పేదానికి ఇంత రభస ఎందుకు చెప్పండి!" అన్నది.

"సరే, నీయిష్టం-నీ పిల్లలఇష్టం! నేనుమాత్రం భజన చెయ్యను.మీరు నాకు ఏనాడు అడ్డంవస్తే ఆనాడు ఇది ఆపుదలచేస్తాను!" అన్నాను.

ఎటుపోయి ఎటువచ్చినా మంచిదని నాభార్య నాకేమీ జవాబుచెప్పలేదు.

ఆరోజునించీ మాయింటో భజన ప్రారంభమయింది. మాపిల్లలు నలుగురూ భజనలు చేసేవాళ్ల దగ్గిరికి వెళ్లి కీరపాండురంగ భజనకీర్తనలు నేర్చుకోసాగారు. మా ఆవిడకూడా వడ్డించేటప్పుడూ, వంటచేసేటప్పుడూ కసువు వూడ్చేటప్పుడూ కీచుగొంతుతో ఆకీర్తనలు మననంచేసుకోవటం వింటూండేవాణ్ణి.

మా ఇంటో భజన చెయ్యటానికి అనుజ్ఞఇచ్చిన వారంరోజులకు నేను నాభార్యతో అన్నాను:

"ఏమే ఇవాళ వెంకట్రావు బందరునించి వచ్చాడు, కనిపించాడు—"

"వెంకట్రావంటే కాంతమ్మ మొగుడా? నల్లగా పొట్టిగా అసహ్యంగా ఉండేఆయన!" అని నాభార్య నాకు అడ్డం వచ్చింది.

"సరేలే! అసలుసంగతి విను. ఈ భజనలు మొదలుపెట్టినతరవాత వాళ్లింటో మాణిక్యమంటి వెండిగిన్నె పోయిందిట! నామాటవిను. ఈభజన ఎందుకు? మానెయ్యి!"

"చాల్లెండి! భజన చెయ్యటమేమిటి, వెండిగిన్నె పోవటమేమిటి? నేనేం తెలివితక్కువ దద్దమ్మ ననుకున్నారా? కావలిస్తే ఆయ న్నదంతా కథరాయమనండి!"

"అప్పుడు నమ్మదగినట్టుగా ఉంటుందేం? ఎంతకష్టపడి రాసినా నేను రానేకథలు నమ్మదగినట్టుగా ఉండవు! కాదూ? పోనీ. నాకేం? నీయిష్టం!"

ఒకనాడు మా పెద్దమ్మాయి నా దగ్గిరికి వచ్చి, "నాన్నా, నాన్నా! 'పాండురంగప్రభో' పాటకు స్వరం వేసిపెట్టవూ? నేను హార్మనీమీద వేసుకుంటా, నాన్నా!" అని గంతులువేసింది. అది మాంఙ్ రాగంమీద ఒక మరాఠీకీర్తనకు అనుకరణం. ఆ కీర్తనకు స్వరంవేసి, నేనువాయించి, మాపెద్దపిల్లచేత వాయింపించటం పూర్తిగా ఒకపూట పని అయింది. ఆరోజు సాయంకాలం నేను బయటికి పోతుండగా మా రెండోపిల్ల తనకు సరిగమలు నేర్పమని అర్జీపెట్టుకుంది. రేపు చూస్తాను లెమ్మని నాదారిన నేను వెళ్లాను.

ఆరాత్రి పెద్దదితప్ప మిగిలిన ముగ్గురూ నాదగ్గిరికి వచ్చి ఫిర్యాదు చేశారు — మా పెద్దది భజనకు హార్మోనిస్టుపనిచేసి భజన యావత్తూ తగలవేసిందిట. ఆ విషయమై తీర్పు నావల్లకాదని పిల్లలకు నచ్చచెప్పటానికి నాకు ఒకగంట పట్టింది.

మరొకనాడు మాపెద్దపిల్లను ఎవరో శ్లాఘించారుట, భజన చేస్తుంటే విని— "చక్కాముది ఏం వరహాల గొంతే! అది పాడుతుంటే అంతా సినిమాలో పాడినట్టుంటే!" అని.

దానిఫలితం, మిగిలిన ముగ్గురు పిల్లలూ దానిమీద సత్యాగ్రహం పూనారు. దానితో కలిసిపాడరు. అది ఒకచరణం పాడితే వీళ్లు మరొక చరణం పాడతారు. ఆఖరుకు గొంతు లన్నా శ్రుతిలో కలపరు. అది త్వరగా పాడితే వీళ్లు మెల్లిగా పాడతారు.

ఇక పెద్దది అపరనారదు డైపోయింది. అది మేలుకుని ఉండంటే పాడుతూఉండదన్న మాటే. ఎవరన్నా

దాన్ని పలకరిస్తే పాడుతూనే "ఏం కావాలి?" అన్నట్టు తల ఊపుతుంది. వాళ్ళడిగినదానికి అవుననో, కాదనో, తనకు తెలియదనో, అంతే నో పాడుతూనే సంజ్ఞ చేస్తుంది తల ఊపుతో. అది దొడ్లో ఏమూలో పాడుతూఉంటే, నాభార్య దేనికైనా దాన్ని కేకపెడితే అది పాట ఆపి "ఓయ్" అనకుండా, పాడుకుంటూ తల్లిదగ్గిరికి వచ్చి పాడుతూ నిలుచుంటుంది.

నాభార్యకు ఒళ్ళుమండి దాన్ని ఏదోవిధంగా మాట్లాడేటట్టు చేస్తుంది. మాపెద్దది కోపం పట్టలేక, "ఏంటర్రా లేనితనమే, తల్లీ!" అని చెప్పి సమాధానం చెప్పకుండా మళ్ళీ పాడుకుంటూ వెళ్ళిపోతుంది.

రెండు మూడు రోజులపాటు నా భార్య పెద్దదాని కూనిరాగం వినవచ్చినప్పుడల్లా, "అబ్బ! తలపట్టిపోతున్నది. తండ్రీ—దీని కూనిరాగాలతో!" అని నాకు వినపడేటట్టు విసుక్కునేది. ఇది ఎట్లాగూ నాదాకా వచ్చేసంగతే నని ఊహించి నేను జోక్యం కలిగించుకోలేదు.

ఆఖరుకు నాభార్య నాదగ్గిర ఫిర్యాదు చేసింది—పిల్లలందరిమీదా కూడా! అంతా విని నాతీర్పు చెప్పసాగాను.

"ముందు పెద్దదాని సంగతి విచారిద్దాం. అది రోజల్లా పాడుతుం దంటావు. పాట ఆపిస్తే ఏడ్పుతుం దంటావు. అదిపాడేది మీరు భజన చేసే కీర్తనలేనా? ఇంకేం? అది రోజల్లా భజన చేస్తున్నది. ఇందులో తప్పేముంది? వెనకటికి నారదుడూ ఇంతే—రోజల్లా పాడుతూనే ఉండేవాడు. పాడటం మానేశాడో, ఎవరికో తంపులు పెట్టాడన్న మాటే! అందుకని దేవతలంతా నారదుణ్ణి నీవంటిభక్తుడు లేడని ఉబ్బించి, ఆముండాకొడుకును రోజల్లా పాడేటట్టు చేస్తూండేవాళ్ళు. నువుకూడా పెద్దపిల్ల విషయంలో అట్లాగే చెయ్యి—ఇంటికీవంటికీ మంచిది. ఇక రెండోదానిసంగతి—"

కాని నాభార్య రెండో దాని విషయం నాతీర్పు వినటానికి ఆగలేదు, ముద్దుగా మొహం చిట్లించుకుని నా దగ్గిరనించి అవతలికి వెళ్ళిపోయింది.

తరవాత వారంరోజులదాకా నా భార్య నాసహాయం అపేక్షించలేదు. భజనలు జయప్రదంగా లేవని నేను ఊహించగలిగాను.

ఆఖరుకు మాఆవిడ నాతో రాజీకివచ్చింది.

"ఒక్కనాడు మీరు మేంభజన చేసేటప్పుడు దగ్గిర ఉండండి. ఈ కొరువులకు నామాటంటే బొత్తిగా లక్ష్యం లేకుండా ఉంది! రెండు రోజులు మీరు దగ్గిరఉండి వాళ్ళ చేత భజన చేయిస్తే ఇంత అల్లరి ఉండదు. వాళ్ళకు మీరంటేగురి. నాలుగైదు రోజులు ఓపికపట్టారంటే ఆతరవాత మీరు మాచాయలకు రాకుండానే పని జరిగిపోతుంది—"

ఆవిడను ఈ విధంగా మాట్లాడనిస్తే ఒకరోజుకాస్తా నెలలూ సంవత్సరాలూ అయిపోతుందని, "ఈ విషయం మాత్రం నన్ను బాధించకు!" అన్నాను, ఆవిడకు అడ్డం వచ్చి.

"నామాట వినరూ? పండు కాదూ?"

"కాదు!"

"చూశారూ?"

"చూడను!"

నాభార్య పాశుపతం ప్రయోగించింది—నాదగ్గిర కూర్చుని నాతల నిమురుతూ, "ఇంత బతిమాలుతుంటే ఒప్పుకోకపోవటానికి మీకు నోరెట్లా వస్తున్నదండీ!" అన్నది.

సరే, ఆ సాయంకాలం మాయింటో భజనకు నేను అతిథిని. మా వాళ్లు ఆనాడు చేసినది భజనకాదు కోలాహలం. ఏ చిన్న విషయంలోనూ నాభార్యాపిల్లలు ఒకరితో ఒకరు ఏకీభవించలేదు. భగవంతుడి సాన్నిధ్యంలో అందరూ ఒకటేనన్నది నేనానాడు ప్రత్యక్షంగా చూశాను—భజనదగ్గిర మావాళ్ళంతా మాపనిదానితో సమానమైనారు.

ముందు మాపెద్దపిల్ల హార్మోనియం తెచ్చి దగ్గిరపెట్టుకుని కూర్చున్నది. ఆ తరవాత మిగిలిన నలుగురూ చేరారు. "పాండురంగని భజనకు బోవా భక్తులందరు రారమ్మా" అనేకీర్తన ప్రారంభించారు. మా పెద్దది విడిగా హార్మోనియం వాయిస్తేనే చెప్పతరం కాకుండా ఉంటుంది. దానికి పట్టుచోట త్వరత్వరగా వాయించి పడనిచోట్ల ఏకుపెంజ తీసినట్టు సాగతీసి వాయిస్తుంది. ఇక నలుగుర్తో కలిసి పాడేభజనలో అది హార్మోనియం వాయించటం ఎట్లా ఉంటుందో చెప్పనవసరం లేదు. మధ్య మధ్య దానిచేతికి తప్పుమెట్లుకూడా తగులుతూ ఉంటై. ఇది జరిగినప్పుడల్లా మా రెండోది ఆడటార్జాను కేక పెట్టినట్టు కేక పెడుతుంది. అప్పుడు మా మూడోది కడుపారా నవ్వుతుంది.

నాభార్యా పిల్లల్నీ కసిరినమీదట మళ్లీ భజనసాగుతుంది. మ్మా రెండోదీ మూడోదీ వాళ్లకు జ్ఞాపకంవచ్చిన చరణాలు వాళ్లయిష్టం వచ్చిన శ్రుతుల్లో పాడతారు.

నేను చూసిననాటికి భజన దీని కిందికి తేలింది—మాపెద్దపిల్ల ప్రాణానికి తనసంగీతం పాడే నేర్పు ప్రకటించే పాటకచ్చేరీ, రెండోదానికీ మూడోదానికీ అల్లరిచేసే అవకాశం మానాలు గోదానికి చాటుగా ప్రసాదం పొదంచేసే అవకాశం, నాభార్యకు పిల్లలమీద తను అధికారంచలాయించటానికి అవకాశం. ఇందులో ఎవరికీ జయంచేకూరకపోవటాన మా ఇంటిభజన ఏవిధంగానూ రక్తికట్టక పోయింది.

నాభార్య ఎన్నడూ పిల్లల్ని కొట్టదు. ఆనాడు వాళ్లంతా తన్ను నా ఎదట పరాభవించటం సహించలేక, నామాటవినక తను ప్రారంభించిన భజన ఇట్లా పరిణమించటం నేను కళ్లారా చూశానన్నది తెలుసుకుని, పట్టలేక పిల్లలందర్నీ తలా ఒకటీ పెట్టింది. ఆనాటికి భజన ఆఖరయింది.

మా ఆవిడమనస్సు కష్టపడుతున్నదని గ్రహించి, నేను, "నువ్వెందుకు, పాపం, వృధాగా హైరానపడతావు? దేవుడిదగ్గిర పిల్లలకు అల్లరిచేసేటందుకూ నవ్వేటందుకూ అధికారం లేకపోతే ఇంకెవరికుంది? భజనఅంటూ పెట్టినదానివి నీఇష్టం వచ్చినట్టు నువ్వుచెయ్యి. వాళ్లఇష్టం వచ్చినట్టు వాళ్లను గోలచెయ్యనీ! భజనవల్ల మనస్సుకు కాస్త శాంతి రావాలి కాని వ్యధకలిగితే ఎట్లా?" అని బోధించాను.

"అయితే మానెయ్యండి!" అన్నది నాభార్య కళ్లనీళ్లపర్యంత మయి.

అభిమానవతి, ఎగతాళి చేస్తే దారికి రాదని ఆరాత్రి నా భార్యను బుజ్జగించి మంచిచేసుకుని ఒకసలహా చెప్పాను.

"నా మాట విని వారంరోజుల పాటు ఈ భజన ఆపేసెయ్యి. ఆతరవాత నేను వీళ్లను ఎట్లాగైనా దారికి తెస్తాను," అన్నాను.

"ఈ రాక్షససంతానంతో భజనలు కాదు"—అని మా ఆవిడ మిగిలినది నా ఊహకు వదిలివేసింది.

అయితే నేను చెప్పినసలహా జయప్రదంగా పనిచెయ్యలేదు. మా ఆవిడ భజనమానేసినా మాపిల్లలు మాత్రం మానలేదు. యథాసమయానికి వాళ్లంతా చేరి మామూలు ధోరణిలోనే భజన ప్రారంభించారు. తల్లి దగ్గిరకూడా లేదేమో, వాళ్లారోజున చేసిన ఆగం ఇంతా అంతా కాదు. వ్యవహారం ముదురుతున్నదని తోచగానే నేను భజన ఆపుదలచేయించి భోజనాలు పెట్టించాను. ఈవిధంగా రెండు మూడు రోజులు జరిగిన తరవాత మా ఆవిడ, "వీళ్ల అల్లరి ఎట్లాగైనా మానిపింతురూ! పొద్దూకనివ్వరు. తల పట్టిపోతున్నది," అన్నది నాతో.

ఆనాటితో నాభార్య నాకు సాంతంగా ఓడిపోయింది. మళ్లీ ఎన్నటికీ ఇటువంటి ఎత్తు ఎత్తనని ఆవిడచేత వాగ్దానం చేయించుకుని మాపిల్లల చేత ఈ అల్లరి మానిపించాను. దానికి నేను చేసిం దేమిటంటే ఒక గ్రామఫోనూ నాలుగు రికార్డులూ తెచ్చి ఇంట్లో పెట్టాను. మాపిల్లలు అల్లరిపిల్లలు కావచ్చుగాని అందరూ సంగీతమంటే చెవి కోసుకుంటారు. సాయంకాలంపూట నేను పిల్లల్నందర్నీ చుట్టూ కూర్చోపెట్టుకుని ఆ నాలుగు రికార్డులూ మోగించేవాణ్ణి.

అంతటితో నాభార్యకు భజన పిచ్చివదిలింది. వదిలిందనుకున్నాను. ఎందుచేతనంటే ఆమధ్య ఒకనాడు మా ఆవిడ నాతో, "ఏమండీ, విన్నారూ? ఈమధ్య మనింటిపక్కన ఉండేవాళ్లే, వాళ్లపిల్ల, మూగది, కుసుమహారనాథ్‌జపం చేస్తే నోరు వచ్చిందిట. రోజూ వెయ్యిసార్లు 'కుసుమహారనాథ్' అనుకునేదిట!... మనింటో ఏమీ లేదూ!" అంటే, నేను, "మూగది జపం చెయ్యటం వింతకంటె మూగదానికి నోరురావటం వింత ఏవిధంగా ఎక్కువ? మనస్సులో చేసిందంటావా? నువ్వు కూడా రోజుకు పదివేలసార్లు మనస్సులో 'కుసుమహారనాథ్' అనుకో. మళ్లీ భజనఅంటూ పెట్టకు, నీపుణ్యమాయిది!" అన్నాను; "ఆకీర్తనలు ఎంత బాగుంటయ్యనుకున్నారు!" అన్నది; నేను 'ససేమిరా' అన్నాను; నాభార్య నిట్టూర్చి, "పోనివ్వండి. గీతలో లేకపోతే ఏం చేస్తాం?" అని సరిపుచ్చుకుంది. ఇక ఎప్పటికీ అవిడ భజన ఊసెత్తదుకదా అని నేను దిగులుకూడా పడ్డాను—అర్థం లేకుండా.

కాని నిన్ననంటే నిన్న సాయంకాలం మా ఆవిడ బజారుకు బయలుదేరిననన్ను వెనక్కి పిలిచి, "ఏమండోయి! జ్ఞాపకం పెట్టుకుని గ్రామఫోనుషాపులో 'రండయ్యా, రండయ్యా,' రికార్డు తీసుకురండి! మరిచిపోకండి," అని హెచ్చరించింది.

# పూర్వకవి ప్రయోగ విశేషములు

మల్లాది సూర్యనారాయణశాస్త్రి

సంస్కృతభాషలో వాల్మీకి మహర్షి వలెనే యాంధ్రభాషలో నన్నయార్యుఁడు మొదటి కవి. ఇతనికి ముందు పుట్టినవిగా నేవో నాలుగు శాసనపద్యములు కనవచ్చిన నేమి? ఆంధ్ర లోకమున కితఁడు పెట్టినదే సత్కవిత్వభిక్ష. తరువాతి నన్నెచోడ తిక్కనార్యాదుల కవి తాకౌశలమునకు నితని భారతమే మార్గదర్శకము. సుప్రసిద్ధమైన యీ విషయము కొవమువారు రుం డరోగు.

కాని, "ఆంధ్రభారత కవితావిమర్శనము" నన్నయకవిత్వము తిక్కనకవిత్వమునకేకాదు, ఎఱ్ఱన కవితసంగూతఁ దీసిపోవునని స్వాభి ప్రాయము తెల్పినఁ దెల్పుఁగాక, ఇతని భార తమునుగూర్చి యేమేమో వ్రాసివ్రాసి, (పుటలు ౧౧౫-౧౧౭) ఆకాశమున మేడలు కట్టి, తిక్కన మహాభారతము మొదటినుండి తెలిగింపకపోవుటకును, నన్నయ మూఁడు కృ తులవలె తక్కిన పర్వములు తెలిఁగింపమిం టకును గారణము "చాళుక్యప్రభువు లొనర్చిన మహత్కార్యమందలి గౌరవ"మని చెప్పినఁ జెప్పుఁగాక, (అయభిప్రాయము లేమేని కానిండు) "తిక్కనకాలమువఱకు నన్నయ భారతము చూచినవారులేరు, చదివినవారు లేరు" అనుచును, తిక్కనార్యుఁడు "నన్నయ రచించినభాగము సంపాదించి చూచి చదివి యానందించి... మిగిలిన భాగము పూరించినట్లు తోఁచదు" అనుచు నిచ్చిన యభిప్రాయములు మాత్ర మాశ్చర్యజనకములు కాకపోవు. తిక్కన తన గ్రంథావతారికలో నన్నయను గూర్చి వ్రాసినమాటలను వానికిఁ బై విమర్శ నము చేసిన వ్యాఖ్యానమును బరామర్శించుట యిప్పటి మనపని కాదు కాని, తిక్కన నన్న యభారతము చక్కఁగా శ్రద్ధగా నెన్నో సార్లు చదివినవాఁడని బహుప్రయోగముల యేకీభావమునుబట్టియుఁ గొన్ని పద్యరచనల పోలికనుబట్టియుఁ గొన్ని ముఖ్యపాత్ర ప్రవృ త్తుల సామ్యమునుబట్టియు నాంధ్రీకరణపద్ధ తుల సమతనుబట్టియు నిద్దఱి రచనలఁ జక్కఁ గాఁ జదివినవారికిని, లేక సభాపర్వ ద్వితీయా శ్వాసోద్యోగపర్వ ప్రథమభాగము లైనను సవిమర్శముగాఁ జదివినవారికిని దెలిసియున్న దనిమాత్ర మిచ్చటఁ దెలుపఁదగియున్నది.

అట్టి తిక్కనవంటి మహాకవి గౌరవము నకు నన్నయ సతియగుటకు గారణ మితఁడు మిక్కిలి పూర్వుఁ డగుట కాదు. ఇతని భారతమే యతనికట్టి గౌరవబుద్ధిని బుట్టించి నది. పుట్టినది మొదలుగా నేటిదనుక దేశ మున బ్రమాణమై పఠనపాఠన వ్యవహారమం దెక్కువగా బ్రసిద్ధిగాంచినది పాణినీయ మగుట నిర్వివాదము. దానికి సమ్మతము లైన సంస్కృతశబ్దములను తెలుగునకు దెచ్చు టలో నితఁడు చూపిన నేర్పు నిరుపమానము. ఇది యిట్లుండ, నితనినాఁడు తెలుగునకు వ్యాకరణములేదు. ఛందోలక్షణము లేదు. అట్టియెడ శిష్టసంప్రదాయమును బురస్క రించుకొని దానికినగ్గఱగా బద్యరచన కను కూలముగా నాచ్ఛికశబ్దముల రూపము లేర్ప ఱచుకొనియున్నాఁడు. ఇట్లు స్వప్రతిభా నిర్ణీతరూపములతోడి యుభయభాషా శబ్ద ములతో దన వాగ్జాలమే తెలుగునకు లక్ష ణము లక్ష్యమునగునట్లు చక్కని మృదుమధుర శైలిని భారతము సృజించినాఁడు. అదియే తరువాతివారి కన్ని విధముల బ్రమాణ మైనది. తిక్కనకు నన్నయయెడ గలిగిన గౌరవ బుద్ధి కిదియే మొదటికారణము. తిక్కన యెల్లెడల శబ్దప్రయోగవిషయమున నన్నయ ననుసరించుటయే యిందుకు నెక్కువగా దార్కాణము. అందుకే కవిత్రయభారతమే యాంధ్రమునకు బ్రమాణ మని కవిరాక్ష సుఁడు గ్రంథస్థమొనరించినాఁడు. కావున నటు కావ్యరచనకును, ఇటు లక్షణగ్రంథ రచనకును మూలాధార మితని భారతమే యనుట మఱువరాని విషయము. ఇంతటి మహత్త్వము కలదు గావుననే యాత్మవిశ్వా సముతో నితఁడు "విపులశబ్దశాసను" డను విశేషణము వేసికొన్నాఁడు. తిక్కనాదులు 'విద్యా దయితుండు మహితాత్ముఁడు' నని స్తుతించినారు.

అట్టియితని తొంటిశబ్దశాసనమును మొదటి కావ్యమునైనభారతము తొలుతటి ప్రమాణ ముగా దరువాత వెలసిన కావ్యములందును వ్యాకరణములందును ఛందోలక్షణములందును, ఆయానాటిమార్పుల ననుసరించిన శబ్దములును లక్షణములును గనవచ్చినవి.

గాని, యెవరో భాషానుశాసకులు చెప్పి నట్లుగా (నన్నెచోడ) 'కుమారసంభవవిమర్శ నము' వక్కాణించిన యీ క్రింది సూత్రము వంటి సూత్రమును (౧౬౧ పుట) ఇందుకుఁ దగిన యుదాహరణమును గనఁబడలేదు. ముందు కనఁబడఁబోదు. అది యిది:—

"తద్భవముగాని, దేశ్యముగాని సంస్కృత సమముతో సమసింపరాదు అనియు నట్లు సమసించినవి వైరిసమాసము లనియు భాషాను శాసకులు చెప్పుదురు."

అట్లు లోకోత్తరమైనభారతము రచియించి మహాకవులకును వ్యాకర్తలకును వంద్యుడై మననన్నయార్యుడు లోకజ్ఞుడు, వాక్స్వతం త్రుడు, గ్రాంథికభాషాజనకుడు, ఉభయ భాషాకోవిదుఁడు. అట్టిమహనీయుడు శిష్ట వ్యవహారమున గాంచియో, ప్రతిరమ్యతనా దరించియో లెక్కకు మూడు నాలుగు మాటల బాణినీయ మతిక్రమించిననేమి? అతి క్రమించెనని చెప్పిననేమి? ఇతడు వాల్మీకివలె మనకు మహర్షియే. ఇతనిప్రయోగములు మన కార్షములే. ఇందుకు మఱియొక ప్రయోగము.

"వ. అని నియోగించినఁ గుంతియు..... మహాముని యిచ్చిన మంత్రంబు విధివ తంబుఁ జేసి"[1]—ఆది ౫-౯౩.

---

1. జజాప విధివజ్జాప్యం దత్తం దుర్వాస్సా పురా—ఆది. ౧౨౩ అధ్యా.—

వ. వసిష్ఠుండు విధివంతంబుగా సంవరణున కుం దపతి వివాహంబు సేయించె.

—ఆది. ౪-౭౭.

ఇట్లు మూడు నాలుగు చోట్ల "విధివ తంబు" అని ప్రయోగించియున్నాఁడు మన నన్నయార్యుఁడు. నేను జూచిన యచ్చుపుస్త కములలోను, తాటాకు పుస్తకములలోను గూడ నీప్రయోగ మిట్లే యున్నది. కాని, వావిళ్లవారి ముద్రణమందు–౧౯౧౪—౧౭ సం పుటక్రిందను–ఆనందముద్రణమందు—౧౯౩౦ ౧౭౪—పుటక్రిందను సరిగా నొక్కచోట విధివత్తుగా, అను పాఠాంతరము చూపఁబడి నది. దీనినిబట్టి యీరెండు నొక తాటాకుల ప్రతినిజూచి యీపాఠాంతరము చూపినవనుట విదితము. ఇందు కీ రెండుముద్రణములుగూడ దక్కినచోట్ల నీపాఠాంతరము చూపకుండుటయే తార్కాణము. ఇంక పాఠాంతరము మాట.

ఒక పూర్వలిఖితపుస్తకము చూచి ప్రతి వ్రాసికొన్న పాణినీయజ్ఞుఁడైనయొక లేఖకుఁడు, దానిలోనున్న విధివంతంబు; అను దానిని 'విధివత్తు'గా సవరించుకొని వ్రాసికొన్నట్లును, తరువాత మరలనట్లే కనబడగా నిది కవిప్రయుక్తమేకాని పూర్వలేఖకుని ప్రమాదముకాదని గ్రహించి తక్కినచోట్ల సవరింపక మానుకొన్నట్లును, ఒక్కప్రతిలో నొక్కస్థలమందే యున్నదానినిబట్టి యూహింపనయ్యెడి. కావున సార్వత్రికముగా నున్న "విధివంతంబు" ప్రయోగము, నన్నయార్యుఁడు తెలిసిచేసినదే యని చెప్పవచ్చును. అందుచే "ఇది వచనములోనున్నది పద్యములో లేదు. యతిప్రాసస్థానముల లేదు. పూర్వలేఖకులందఱు తప్పవ్రాసిరి పరిష్కర్తలందఱు పొరపడిరి" అనెడిమాటలు యుక్తియుక్తములు కాఁజాలవు.

విధివంతము, మతుబంత మందమన్న విధిమంతము కావలెనుగాని, వకారాదేశమురాఁ జేసి విధివంతము కాఁజాలదు. అదిగాక యిచ్చో మతుబర్థము సముచితమును గాదు. 'తదర్హమ్' (౧-౫-౧౧౭) అను పాణినిసూత్రమునుబట్టి 'విధి మర్హతి' యనునర్థమున 'విధి వత్' అనురూప మేర్పడును. దీని తత్సమరూపము విధివత్తనునుగాని విధివంతము కాదు. నన్నయార్యుఁ డీ విషయ మెఱిఁగియు, విధివత్తుకంటె విధివంతము శ్రుతిరమ్యమనునియో ఆనాఁటి శిష్టులవాడుకలో నీ రూపముండుట తెలిసియో యిట్లు ప్రయోగించియుండును. ఎట్లైననుదీనికిశాస్త్రమునకుఁదగినట్లుగా యథాశాస్త్రముగా ననెడియర్థమే ప్రకరణోచితము. ఇట్లు ప్రయోగించు స్వాతంత్ర్య మఖిల భాషాకోవిదుఁడు లోకజ్ఞుఁడునైన యితనికిఁ జెల్లునుగదా! ఇఁక నొక్కవిషయము. చిరకాలముక్రిందట నేను ప్రకటింపఁ జేసిన సవిమర్శ మహాభారత పీఠికలో 'అనుగుణ భార్యావంతుఁ' డను ప్రయోగ మపాణినీయమే కాని, పెక్కండ్రు కవు లిట్టివానిని ప్రయోగించి యున్నారని వ్రాసియున్నాను. దానినిగూర్చి యిప్పటియభిప్రాయ మొకింత.

"న కర్మధారయాన్మత్వర్థీయః బహువ్రీహిశ్చేత్తదర్థప్రతిపత్తికరః" అను వచనమును వైయాకరణులును నైయాయికులును గూడ నందం దుదాహరించియున్నారు. అనఁగా, కర్మధారయ సమాసముకంటె మత్వర్థీయ ప్రత్యయము రాదు. బహువ్రీహి చేసినచో నట్టియర్థము సిద్ధించునని భావము. అనఁగా, నీలోత్పల మనుకర్మధారయముమీఁద మతుప్ప్రత్యయము చేర్చి నీలోత్పలవంతము సరస్సని చెప్పరాదు. నీలములైన యుత్పలములు కలది నీలోత్పలము సరస్సని బహువ్రీహి చేసినయెడల సరిపడు ననుట.

పాణిన్యాచార్యులు కర్మధారయముమీఁద మత్వర్థీయమును విధించలేదు, నిషేధించలేదు. కాని, మహాభాష్యమునం దీప్రసంగము వచ్చినది. భగవత్పతంజలి "వర్ణో వర్ణేన" (౨-౧-౬౯.) భాష్యములోఁ బై విషయమున గౌరభరవదరణ్యమ్–సర్వధనీ–కృష్ణసర్పవాన్ వల్మీకః–ఇత్యాదు లుదాహరించుచు, మత్వర్థీయము కర్మధారయప్రకృతి యగునా కాదా యని చర్చించుచు, ఆయాప్రయోగములయందలివిశేషములు విశదీకరించుచు,

"కృష్ణసర్పోనామ సర్పజాతిః సాస్మిన్నాస్తీతి కృష్ణసర్పవాన్. వల్మీకః, యథాస్యాన్తరేణజాతిం తద్వతాభిసంబన్ధః క్రియతే కృష్ణసర్పో వల్మీక ఇత్యేవ భవతి."

అనుచుఁ గర్మధారయముపై మత్వర్థీయము చేయునప్పటివిశేషమును బహువ్రీహి చేయునప్పటివిశేషమును దెలుపుచు సవిస్తరముగా నీ విషయమునఁ బ్రసంగించియుండెను. ప్రదీపకారకైయటుఁ డీ సందర్భమునందు 'కర్మధారయస్తు మత్వర్థీయసహిత ఇతి శబ్దగౌరవప్రసఙ్గః' అని వ్రాసియుండెను. ఇట్లే మఱికొందఱు వ్యాఖ్యాతలు నీ విషయమును బరామర్శించియున్నారు. మొత్తముమీఁదఁ బరిశీలింపఁగా సుందరమైన దేహము సుందరదేహము, అది కలవాఁడు సుందరదేహి–అని, సమాసవృత్తియు, తద్ధితవృత్తియు నొకప్రయోగమునఁ జేయుట గౌరవమనియు, సుందరమైన దేహముకలవాఁడు సుందరదేహుఁడని యిచ్చట బహువ్రీహిచేసినచో నొక్కసమాసవృత్తిచేసిన లాఘవము సిద్ధించుననియుఁ దేలినది. అయినను, కర్మధారయముకంటె మత్వర్థీయము చేయుట పెక్కండ్రు పాణినీయుల కిష్టము కాదు. పూర్వసంస్కృత మహాకవుల కృతులలో నెక్కడైన నట్టి ప్రయోగము దొరకునో లేదో యన్నంతకావ చిక్కను. అందుచేఁ గర్మధారయముమీఁద మత్వర్థీయము కేవల మపాణినీయము గాకున్నను, పాణినివిహితము కాదనియు, సర్వసమ్మతము గాదనియుఁ జెప్పవచ్చును. మన నన్నయార్యుఁడు—

క. సంతతగృహమేధి ఫలం
బంతయుఁ బడయంగనోపు ననుగుణ
భార్యావంతుం
డగు వాఁడు...... ఆది-౪-౭౭.

క. సుతవంతు లయి విశుద్ధ
వ్రతనయవంతులయి పాండుసుతులు.
...ఆది-౭-౨౭౯.

క. సమశీలవ్రతయుతులకు,
సమధనవంతులకు... ఆది-౫-౨౦౫

అనుచుఁ బ్రయోగించెను. ఇవి తరువాతివారికిఁ బ్రమాణములైనవి. ఇఁక నొకటి రెండు ప్రయోగవిశేషములు—

తరుణీయ లొప్పనాడిరి ముదంబునఁ దీర్చితే నిందుధృతిఁ బతియిష్టంబు దీర్పనకాన"

ఆది-౫-౧౫౫.

"అస్త్రవిద్యలు గఱచినాడైన యిష్టు, మొగినఁ దీర్పంగ నిం దెవ్వఁ డోపు ననిన.—"

ఆది-౫-౨౨౪.

ఇష్టశబ్ద మిట్లు నన్నయభారతములో విశేష్యముగాఁ బెక్కుచోట్లఁ గనవచ్చును. ఇట్టి స్థలములందు, ఇష్టమైనట్టియని విశేషణపరముగా నర్థము చెప్పి విశేష్య మధ్యాహార్య మనుట సముచితము కానేరదు. ఇంక నొకరిద్దఱు నన్నర్థము తెలియనడిగెన యొక ప్రయోగము.

'కాంచనవీట' ఇది కాంచన కందుకమను నర్థమున నన్నయార్యుఁడు ప్రయోగించెను.

"ధృతరాష్ట్ర పాండుసుతు లందఱుఁ గందుకక్రీడాపరులై వేడుకతో నాడుచున్నంత నక్కాంచన కందుకంబొక్క నూతంబడి...

ఆది-౫-౨౦౬.

ద్రోణుఁడు—"ఇట్టిమీకు దుష్కరముగ నూతిలోఁబడినకాంచనవీటఁ గొనంగ నేరకొండొరుల మొగంబు చూచి నగుచుండఁగఁ జన్నె యుపాయహీనతన్" (మూలమ్) క్రీడన్తోవీటయా, తత్ర వీరాః పర్యచరన్ముదా, పపాతకూపే సా వీటా తేషాం వై క్రీడతాం సతామ్, భరతస్యాన్వయే జాతా యే వీటాం నాధిగచ్ఛత. ౧౩౧ అధ్యా. వ్యాఖ్య. వీటయా యవాకారేణ ప్రాదేశమాత్రకాష్ఠేన...

వీటా శబ్దము నమరసింహుఁడెత్తలేదు. శబ్దరత్నాకరము చూపలేదు: ఆంగ్లసంస్కృత నిఘంటువులు కొన్ని చూపెనవి. మన దేశములో గోటీబిళ్లయనఁబడు సన్ననిచిన్న కఱ్ఱముక్క యర్థము. ఆప్టే, A small piece of wood అని యర్థము వ్రాసెను. కాని నన్నయార్యుఁడీ వీటాశబ్దమును బంతియను నర్థమునకు మార్చెను. భారతకవులు మూలములోని కొన్నిశబ్దములను దమయభీష్టార్థములకు మార్చుకొనిరనుట కిది యొక యుదాహరణము. వీటకు గోటీబిళ్లయనునర్థము వచ్చుపదము వాడుటకంటె, కందుకమను పదమువాడుట సరసము,సముచితమని యౌచిత్యమెఱిఁగి యితఁడు ప్రయోగించెను. కాంచనవీట= బంగారురంగుగల బంతియనెడియర్థముసిద్ధించినది. ఇపుడు వీటా శబ్దార్థమున నన్నయార్యుఁడు స్వాతంత్ర్యము వహించెననుట విదితముగదా! లేకున్న 'వీట' యితనికాలమున 'బంతి' యను నర్థమున వాడఁబడెనని విశ్వసింపననుగదా! శబ్దార్థముల మార్పు లిట్లే యుండును.

తరుణీయ లొప్పనాడిరి ముదంబునఁ గమ్మ జనాళి మెచ్చఁగన్." ఆది. ౭-౧౬౫.

తరుణియలు=స్త్రీలు. తత్సమమైన తరుణికిట్టి బహువచనరూపము కలుగదు. ఈతరుణియశబ్దము పెక్కు వ్రాతప్రతులలో నున్నట్లు ముద్రణములు చెప్పుచున్నవి. నేను జూచిన రెండు వ్రాతప్రతులలో నీరూప మిట్లే యున్నది. కావున, "తరుణులు నొప్పనాడి" రనియో, మఱియొక విధముగానో దీని నెవ్వరును దిద్దనందుకు సంతోషింపవలెను.

సఖికి, సకియ తద్భవము. దీనిని బూర్వకవు లందఱుసు వాడిరి. అట్లే తరుణికి, తరుణియ తద్భవ మనఁదగును. దీనిని దద్భవమన్న లాక్షణికులు లేరుగాని, అట్లనుట కెట్టి విరోధములు లేవు. ఇతరులు దీనిని వాడినట్లు కనఁబడకున్నను, ఇది ప్రయోజనము కాకపోదు. కావున "తరుణియ" అపూర్వమైన తద్భవప్రయోగవిశేష మనఁదగును.

విశేషణములను విశేష్యములుగా వాడుటకు దారితీసినవాఁడు నన్నయార్యుఁడు. అందుచేఁ గారణ మాకాలమున వాడుకలోఁ గొన్ని శబ్దము లట్లు మాఱుటయే. ఇందుకుఁ బ్రయోగ మొకటి

"కమలాక్షినీవు, దిరముగా నిష్టంబు

# బొమ్మలులేని జాతి

## చరిత్రలేని

# అనాగరకజాతి

వడ్లమన్నాటి కుటుంబరావు

[కొండపల్లి బొమ్మలపరిశ్రమను
ఆంధ్రదేశం పోషించాలి]

★

బొమ్మలు బొమ్మ లంటే వయసుమీరిన వాళ్లకు అంత వుబలాటం వుండదేమో గాని బిడ్డలకు అవి అంటే పరమప్రీతి అని వేరే చెప్పనక్కరలేదు. స్తన్యాన్నిచ్చి పోషించే తల్లికంటె బొమ్మసామగ్రిఅంటే బిడ్డలకెంతో మక్కువ. బిడ్డలుగల ప్రతియింట బొమ్మ సామగ్రి వుండక తప్పనిసరి. కొంచెం సూక్ష్మ దృష్టితో యోచనచేస్తే ప్రపంచంలో యీ బొమ్మలవ్యాపారం చాలా ప్రధానమైనదని స్ఫురింపకపోదు.

నాలుగువందల డిపార్టుమెంట్లుగల ఒక గొప్ప అమెరికాషాపులో యేడిపార్టుమెంటుకు సంబంధించినసరుకు హెచ్చుగ అమ్ముడు పోతుందో కనుక్కోవలెనని ఒకసంవత్సరపు లెక్కలవల్ల పరిశీలనచేస్తే సబ్బులు, టాయిలెట్లు నూటికి ౩౧ వంతులు, ఆడపిల్లలకు సంబంధించిన దుస్తులు ౧౨ వంతులు, స్త్రీల గౌనులు పురుషులదుస్తులు ౧౩ వంతులు, బిడ్డ లాడుకునే ఆటవస్తువులు ౧౦ వంతులు అని తేలింది. ఈపరిశోధననుబట్టి ప్రపంచంలోని వ్యాపారంలో బొమ్మసామగ్రి కెంతవిడుదల గిరాకివున్నదో తెలుస్తోంది. ఒకసంసారంలో ఒకబిడ్డ పుట్టి ఆరునెలలు వచ్చిందంటే మూడు దమ్మిడీలు ఖరీదుచేసే గిలకపండు మొదలు చేసుకుని రెండురూపాయలు ఖరీదు చేసే సెల్యులాయిడు పెద్దసైజు బొమ్మవరకు ఆయింట్లో క్రమేపి చేరుతోంది. ఆబిడ్డ యెదిగినకొద్ది రకరకాలైనసరుకు కావాలి. బిడ్డకు కొంచెం చెయ్యికాలు వచ్చినదంటే ప్రథమంలో కొన్నగిలకపండు చేతికిస్తే చాలదు. అప్పటి కేదో త్రాడుగట్టి యీడ్వ బడేది కావా లంటుంది. ఇలాగే నాలుగు అయిదు సంవత్సరాలు వచ్చేపర్యంతం ఆబిడ్డ కొరకు ఆసంసారంలో బొమ్మ ఆటసామగ్రి క్రింద అధమం కొన్నిరూపాయిలైనా ఖర్చు అవుతున్నదంటే అతిశయోక్తి యేమీలేదు.

బిడ్డలకుగల బొమ్మలాశ తండ్రి కంతగ తెలియదు. ఇరవైనాల్గుగంటలు యింట్లో బిడ్డలతో సతమతమయ్యేతల్లికి తెలుసు. ఆటవస్తువులు బిడ్డ కుపశాంతి కలిగించేవనీ, ప్రాణంతో తుల్యమైనవనీ. ఒక్కొకసమయంలో తల్లిసహితం కలిగించలేనంతటి ఆనందాన్ని; తృప్తిని; ఉల్లాసాన్ని బొమ్మసామగ్రి బిడ్డలకుయిస్తుంటే అట్టిసామగ్రిలోగలమహిమ యెట్టిది? బిడ్డలకు మాత్రమే అవి ప్రాణసమానంగా వుండటమేమి అనేవూహ తట్టి శిశుప్రకృతిని, బ్రహ్మ యొక్క సృష్టిరహస్యాన్ని కొంచెం తరచి చూదామని హెచ్చరిస్తుంది మనసు.

బొమ్మసామగ్రినిగూర్చి యథార్థం చెప్ప వలసివస్తే అవి విజ్ఞానదాయకాలు బొమ్మల ఆధారంచేతనే వివిధజాతులకు సంబంధించిన ఉనికిని తెలిసికొనవీలుపడుతుంది. బొమ్మల ఆధారంచేతనే ఒకానొకజాతియొక్క పూర్వ చరిత్రను అల్లవచ్చును. బొమ్మల ఆధారం మూలాన్నే గడచినశతాబ్దాలలో ఒకజాతి సంపూర్ణగాధను వారికట్టు, బొట్టు, నడక, వృత్తులు, నాగరకత, అనాగరకతలు, కళా సంప్రదాయము, ఆచారవ్యవహారాలు మొదలైన సమస్తం పఠించవచ్చు. బొమ్మలను సృజించలేనిజాతి, బొమ్మలులేనిజాతి చరిత్ర లేని అనాగరకజాతి.

పాఠశాలల్లో ముఖ్యంగా చిన్నితరగతుల్లో విద్యావిధానం మార్పుచెందాలెనని యిటీవల కోరబడింది. బాల్యదశలో పాఠాలు వల్లింప చేయటం వారిమెదడుకు మించినశ్రమయియ్యటమనీ, ఆవల్లింపుపద్ధతివల్ల నేర్పగలిగినదానికంటె బొమ్మలద్వారా హెచ్చుజ్ఞానాన్ని కలిగించవచ్చుననీ శిశుప్రకృతిని అవగాహన చేసికొన్న వారితలంపు. ఇది సత్యదూరమేమాత్రంకాదు. శిశువుమెదడు అతిసున్నితమైనది; సూక్ష్మమైనది. పెద్దలకు మెదడు ఘట్టిపడుతున్నకొలది జ్ఞాపకశక్తికూడా కుంటుపడుతూవుంటుంది. ప్రొద్దున ఆహారంలో తీసికొనినపదార్థాలు సాయంకాలానికి జ్ఞప్తికి రావు. శిశుదశలో ముద్దుమాటల్లో నేర్చిన "ఉప్పుకప్పురంబు," "జొన్నచేనుకాడ," "కస్తూరీతిలకం" మొదలైనవి ప్రాణం పోయే అనేవరకు మరవరు. చెట్టుగవంగనిది ప్రాసై వంగదనేలోకోక్తి సామాన్యంగా అందరెరిగినదే. పుట్టెడుబిడ్డ తను, తనజాతి, తనసంప్రదాయము, తనవృత్తి, తనజాతిచరిత్ర మొదలైనవి తెలిసికొని దేశభక్తి, దైవభక్తి, మాతాపితలయందుభక్తి విజ్ఞానం మొదలైనవాటితో చిరకాలం మనవలెనని ఆశచే తండ్రి ఆబిడ్డకు చిన్ననాటినుంచే తగినశిక్ష యియ్యవలసివుంటుంది. ఈశిక్షకు, యీవిజ్ఞానబోధకు బొమ్మలు యెంతో ఉపకరిస్తవి. మనభారతదేశం, అందులో ముఖ్యంగా మన ఆంధ్రదేశం సంగతి ప్రస్తుత మొకప్రక్క నుంచి యితర ఖండాలలో బొమ్మలు బిడ్డల కేవిధంగా విజ్ఞాన సముపార్జనాధారాలుగ చూడబడుచున్నవో, అక్కడ యీపరిశ్రమ యెట్లున్నదో, వీటి కెంతగిరాకి కలదో కొంచెం పరిశీలిద్దాం.

బొమ్మలు ప్రపంచంలో యీనాటివికావు సృష్టితోనే ప్రారంభమైనవన్నా సత్యదూరం కాజాలదు. బ్రహ్మ యీప్రపంచాన్ని సృష్టించాడు. నేనుమాత్రం సృష్టించలేనా అనే అహంకారంతో విశ్వామిత్రుడుకూడా కొన్నిటిని సృష్టించాడు. బ్రహ్మసృష్టికీ, విశ్వామిత్రసృష్టికీ భేదం జీవం పొయ్యటంలోనే. బ్రహ్మం మనుష్యజాతిని సృజించేకొరకు మట్టితో మనుష్యప్రతిమను తయారుచేసి జీవం పోశాడు. విశ్వామిత్రుడుకూడా ప్రతిమనైతే తయారుచేయగలిగాడు గాని జీవం పోయలేకపోయినాడు. దీనినిబట్టి బొమ్మలు విశ్వామిత్రసృష్టి అయియుండవచ్చునని యూహింపవలసివస్తోంది. విజ్ఞానపరిశోధన ప్రబలమవుతున్నకొద్ది మనుష్యుడే విశ్వామిత్రుని పుణికిపుచ్చుకున్నాడు. బొమ్మ ప్రపంచానికి ప్రతిబింబం. ఏనాడు యేబొమ్మ యేజాతిలో తయారవుతే అబొమ్మ ఆనాటిజాతియొక్క ప్రతిబింబమని స్పష్టము. ఈకారణాన ప్రపంచంలోని అనేకజాతులయొక్క అభివృద్ధిని నాగరకతను సూక్ష్మరూపంలో బొమ్మలు చూపుతవని విశ్వసింపతగివుంది.

రంగులుపూయబడ్డ రకరకాలైన కొయ్య బొమ్మలు, పింగాణీవి, దంతపువి యీజిప్టు, గ్రీసు, మెక్సికో ప్రదేశాలల్లో భూమిని త్రవ్విస్తుంటే బిడ్డలప్రక్కనో, రొమ్ముల మీదనో బయటపడుతూ ఆసరుకు మూడు నాలుగువేల యేండ్లనాటిదని పత్రికల్లో మనం చదువుతుంటే ఆశ్చర్యపడతాం. ఆబొమ్మలు ఒక్క మనిషిరూపాలే గావు; ఏనుగులు, పక్కులు మొదలైన జంతుసంబంధం, రోమను ఉపయోగించుచుండిన కొన్ని Furniture యొక్క సూక్ష్మరూపాలు, సుడ్డ బొమ్మలు మొదలగు యెన్నోరకాలు ఆచిన్ని చిన్ని కళేబరాలప్రక్కను కనపడుతూంటే ఆసరుకంటే శిశుజాతి కంత ప్రేమ యెందుకా అనిపిస్తుంది.

పదిసంవత్సరాలుగా మనదేశంలోకి మర బొమ్మలు దిగుమతి అవుతూన్నయి. ఈ మర బొమ్మలుకూడ ప్రపంచంలో యీనాటి సరుకుకాదు. క్రీస్తుకుపూర్వమే యీజిప్షనులు, గ్రీకులు నడిచేజంతువుల బొమ్మలు తయారుచేసేవారట. కొన్నికొన్ని అంద వికారంగానే వున్నప్పటికీ అచ్చటచ్చట సాగసైనవికూడా దొరికినట్లు Archaeology-reports వల్ల తెలుస్తోంది. ఇటీవలనే యీజిప్టులో ఒకటవసెన్వాస్రట్గోరీ సమీపంలో తవ్వుతుంటే దంతంలోచేయబడ్డ ఒక బొమ్మ దొరికింది. అందులో ఒకదంతపు చెక్కమీద నాలుగు నాట్యకత్తెలబొమ్మలు అమర్చబడినవి. ఈనాలుగున్నూ విచిత్రంగా త్రాడుతో కట్టబడటమేకాకుండా నాట్యం కూడా చేస్తవి.

ఇంకా వెనుకకుపోయి అనగా చరిత్రాధారాలుకూడా లేనిదినాలసంగతి పరిశీలిస్తే ఆనాటిమానవజాతి యీబొమ్మలను చెట్లమీదను, కొండగుహల్లోను సంచరిస్తూవుంటాయని విశ్వసింపబడే దుష్టగ్రహాలను తరుమ గొట్టటానికి పూజలు చేస్తుండేవారట. అంతేగాక మెరుపులు, సుడిగాలుపులు, తుపానులు, వరదలు మొదలైనవికూడా భయంకరస్వరూపాలుగా పరిగణింపబడి బొమ్మలను ఆరాధించుటవల్ల వాటిప్రమాదాలనుంచి తప్పించుకుంటూండేవారట. ఈకారణంచేతనో, చంటి బిడ్డల నాడించటానికో, వారికి ఉల్లాసాన్ని కూర్చేదానికో, మన మిప్పుడు సరిగా తెలిసికోదగిన ఆధారాలు యెక్కడా కానరాకపోయినప్పటికీ, మానవుడు బొమ్మలనే ప్రతిసృష్టిని అనాదినుంచీ చేస్తూనేవున్నాడని వూహించవచ్చు. కాలక్రమేపి పశుపక్ష్యాదులు, భూజలచరాలు, రైళ్లు, ట్రాములు, రేడియోసెట్లు, మోటార్లు, బ్యాండుసెట్లు మొదలైన మరలతో గూడినవికూడా తయారుచేయబడుతున్నవి.

బొమ్మలతయారు చతుష్షష్టికళలలో ఒక కళ. ఈఘనవిద్య వంశపారంపర్యమైన వ్యాపారంగా, వృత్తిగా కొంతకాలం వెలిగింది. తండ్రివిద్యనే కొడుకుగూడా కొంతకాలం అభ్యసించి క్రమేపి వృత్తిని తెగనాడిన కారణాన మోటార్లు వచ్చి యెద్దుబండ్లవాళ్లనోట మట్టిపడినట్టు, గ్రామఫోనులుబలిసి సంగీతకళ ధ్వంసమైనట్టు, మరబియ్యంవచ్చి చేబియ్యపు పరిశ్రమ అంతరించినట్టు విజ్ఞానదాయకమైన బొమ్మలపరిశ్రమకూడా మనదేశంలో తుడిచి పెట్టుకుపోయి సెల్యులాయిడు, గాజుసరుకుకు గిరాకీ యెక్కువైంది.

రష్యాదేశంలో వాట్కాబొమ్మలు చాలా ప్రసిద్ధి. ఈ బొమ్మల ఆధారంవల్ల రష్యా మారుమూలప్రదేశాల్లో అనాగరకజీవితాన్ని గడిపేకృషికుడు కొంత పట్నవాసపుమనిషి కావటానికి ఉపయోగపడినట్టు, వానిలో కళకాంతులు అబ్బినట్టు సుప్రసిద్ధరష్యను నాటకకర్త బకూషిన్స్కి ఒకచోట వ్రాశాడు. ఈబొమ్మలతయారు రష్యాలో వంశపారంపర్యవృత్తి. ఇటీవల యీబొమ్మల తయారు తగ్గిపోయింది. ఇవి తయారుచేయగలిగినాతడు ౭౫ యేండ్ల వృద్ధు ఒకడుమాత్రమే యింకను జీవించియున్నాడు. ఈవృద్ధుడవలంబించిన వృత్తిని అతనిపుత్రులు అవలంబించనందున యీవిద్య ఆతనితో అంతమొందవలసినదే. ఈతనికి యితర శిష్యబృందముకూడ యేమీ లేదు. రష్యాలో సోషలిజం వచ్చి నాటకాలు, సినీమాలు [illegible] టికి బొమ్మల పరిశ్రమను రష్యను గవర్నమెంటు వదలలేదు. ఈ పరిశ్రమను పరిశీలించి అభివృద్ధికి తేవటానికి ఒక డిపార్టుమెంటును విద్యాశాఖకు ఒప్పగింత చేశారంటే వాటి ఆవశ్యకత యెట్టిదో మనం కొంచెం తీవ్ర దృష్టితో యోచనచెయ్యవలె.

పూర్వం రష్యాలో యీ బొమ్మలు ధనికుల యిండ్లను అలంకరించటానికే తయారు చేయబడేవి. ఇప్పుడు అట్టివి కాక సాధారణ కృషికుడు పారిశ్రామికుడు మధ్యమతరగతి వారి కానందాన్నిచ్చేవీ, వారిజీవితాన్ని యథాతథంగా చిత్రించేవీ, వారిజీవితాన్ని సంస్కరించేవీ, జాతియొక్క భావ్యభివృద్ధికి ఉపయోగపడేవీ తయారు చేయబడవాలెనని గవర్నమెంటు శాసిస్తోంది. రక్తకవచధారులైన సిపాయీలబొమ్మలు తయారుచేయబడుతూ కొన్ని కొన్ని సమయాల్లో బిడ్డలచేత వీరపురుషారాధనకొరకు ఉపయోగపడేటట్టు చేస్తున్నారు. క్రేనులు, ట్రాక్టర్లు మొదలైన పారిశ్రామిక, వ్యావసాయిక పరికరములు కూడ సూక్ష్మరూపంలో తయారుచేయబడి బిడ్డలకు వాటినిగూర్చి నేర్పటమే కాకుండా రష్యాలోజరిగిన విప్లవగాథను, అఖండమైన మార్పులను ప్రకటపరచి దేశభక్తిని ప్రజ్వలింపచేస్తున్నారు.

బొమ్మల చరిత్రలో ఒకప్పుడు స్పెయిను ప్రధానస్థాన మాక్రమించివున్నట్టు తెలుస్తుంది. "ఫావన్ బేబీసు" అనేపేరుతో బొమ్మలను తయారుచేసి స్పెయిన్ దేశపు కళావిలసనాన్ని యూరపుఖండంలోని యితరరాజ్యాలకు విరివిగా రవానా చేశేవారు. స్పెయిన్ దేశపు న్యాయస్థానము, వారిదుస్తులు శిరోవేష్టనముల తీరును శిల్కుగుడ్డలతో బొమ్మలకు కుట్టి అతి భద్రతతో నరునిప్రాణంకంటె యినుమిక్కిలైన జాగ్రత్తతో యెగుమతి చేస్తుండేవారు. యుద్ధసమయాల్లో యిట్టి బొమ్మలతోగూడిన ఫ్రెంచి ఓడలను యింగ్లీషు నావికదళాలు యెట్టి ఆపత్తు జరపకుండా యింగ్లీషుచానెలు ద్వారా నిరాఘాటంగా పోనిచ్చేవారని చరిత్రవల్ల గ్రాహకమవుతోంది.

అమెరికాలో యీనాడుకూడ కొన్ని ప్రాంతాలలో కొయ్యతో బొమ్మలుచేస్తారు. వీటిని ఆటవస్తువుల నేదృష్టితోకాక కొన్ని ప్రత్యేక ఋతువులు లేక సమయాలలో బిడ్డలకు మతబోధ కుపకరించేటట్టు దేవతాంశము వాటికి నిరూపిస్తారు.

జపానువారు తమదేశానికి అఖండమైన సేవచేసిన మహావీరులను సంస్మరించేదానికి సంవత్సరాని కొకతడవ బ్రహ్మాండమైన ఉత్సవాలు చేస్తారు. బిడ్డలలోకూడ వీరారాధనాశక్తిని పెంపొందించి దేశభక్తిని పూరించేదానికి గవర్న మెంటు కొన్ని బొమ్మలను-వీరులకు సంబంధించినవి, యుద్ధసామగ్రి సూక్ష్మరూపంలో - తయారుచేయించి బహూకరిస్తారు. మనం మదరాసులో నిత్యం చూసే రిక్షాలు జపానుసరకే. ఒక పాశ్చాత్య మిషనరీ తనబిడ్డలు ఆడుకునేందుకు కొయ్యముక్కలతో ఒక బొమ్మబండి చేసియిచ్చాడు మొట్టమొదట. అదే ప్రపంచంలో ప్రథమరిక్షాబండి. ఆ సూక్ష్మరూపాన్ని ఆధారంగా గ్రహించి జపానుదేశం రిక్షాలను వేలకొలదిగ తయారుచేస్తున్నది.

౧౭, లేక ౧౮ శతాబ్దాలలో ధనికులబిడ్డలు వెండితో తయారైన బొమ్మలతో ఆడుకునేవారట. విక్టోరియా మహారాణిదగ్గర నూరు బొమ్మలకుపైగా వుండేవి. అవన్నీ ఆనాటి రాజసభాదృశ్యాలను ప్రకటపరుస్తూ వుంటవి.

కొన్ని దేశాల్లో బొమ్మలంటే చాలభయం. పురుషుల్ని వంచించి అపకారం తలపెట్టినప్పుడు స్త్రీలు బొమ్మలుచేసి పురుషులమీదకు ప్రయోగించేవారట. కొంతకాలం క్రిందటివరకు బొమ్మలలో దుష్టగ్రహాలు చేరియుండునని వాడుక. నవనాగరకత బలిసిన యీదినాల్లోగూడ బాగ్‌డాడ్‌లో మహమ్మదీయస్త్రీలకు బొమ్మలంటే బహు అనుమానం.

ఆఫ్రికాలోను, అమెరికాలోను పూర్వవాసనలమీద నమ్మకంతొలగని కొందరుఅడవిజాతులవారు యీబొమ్మలలో యేవో దుష్టగ్రహాలను పరకాయప్రవేశం చేయించి విరోధివర్గంయొక్కదూకుడు నణచటానికి దారిమార్గాలలో వ్రేలాడతీస్తే యివికంటబడినపిమ్మట విరోధులు వెనక్కిమరలినట్టు, కొంతమంది అక్కడే ప్రాణావశిష్టులైనట్టు కొన్నికథలు చెబుతున్నయి.

మరికొన్ని ప్రాంతాల్లో యీబొమ్మలు మనుష్యజాతికి ప్రత్యామ్నాయంగా కొన్ని క్రతుసమయాల్లో ఉపయోగింపబడేవి. ఇట్టివి యీజిప్టు, జపాను, ఆసియాలలో జరగటం కలదు. ఒకప్పుడు రోములో ఒకనదిపొంగింది. పొంగుటకుకారణం మానవజీవితావసర మేనని వారినమ్మక మవటంచేత మనుష్యజాతికి బదులుగా విరివిగ బొమ్మలు తయారుచేయబడి కొన్నిమంత్రవిశేషాదులవల్ల వాటి నన్నిటిని ఆనదికి బలియిచ్చినారట.

ఆసియా దేశపు కొన్ని జాతులలో బొమ్మల సహాయంవల్ల జాడ్యనివృత్తి చేయబడుతోంది. ఒకరోగిష్టిమనిషి వుంటాడు. మనిషిబొమ్మను బొమ్మగుర్రంమీద నిలబెట్టి రోగియెదుట నుంచి వానిలోచేరియున్న దుష్టగ్రహాలను ఆబొమ్మలో ప్రవేశింపచేశేవారు. ఆగ్రహాలు రోగిని విడిచి బొమ్మలో చేరిదొడుతీయునని వారినమ్మకం.

దక్షిణఆఫ్రికాలో రోగిని పరీక్షించేదానికి ఒకనేటివువైద్యుని పిలుచుకువస్తే ప్రథమంలో ఆతడు చేసేది ఒకగడ్డిపందిని. ఈ మృగంలోకి ఆరోగిజాడ్యాన్ని పరకాయప్రవేశం చేయించేవాడట. పిమ్మట యీ గడ్డిపందిని ఊరుబయటకు తీసుకుపోయి లోతుగ పాతిపెట్టెడివారు. ఈపాతుమీదనుంచి యెవరు నడిస్తే వారికి ఆరోగం సంక్రమిస్తుందని వారి విశ్వాసం.

యంత్రపరిశ్రమలపైని ఆధారపడే దేశాల్లోని పిల్లలకు మెకానికలు డాల్సుద్వారా వారికి నేటి ప్రపంచపరిస్థితు లవగాహన చేయవచ్చు. ఇంతేకాక చిరుతప్రాయంలో పొందిన స్వల్పమాత్రపు విజ్ఞానమే పెరిగి పెద్దవాడైనపిదప బుద్ధిసూక్ష్మత, పూనికవల్ల జీవనోపాధిసాధకం కావటానికి అవకాశంవుంది. **Scientific progress**, జీవకళలేని జాతుల్లో మెకానికలుడాల్సు తయారు కాజాలవు. పరాయిదేశాలనుంచి దిగుమతి అయినా వాటి ప్రయోజన మంతగా తెలియదు. మరికొంత సామగ్రి బిడ్డలయొక్క ఆరోగ్యమును పోషించేదిగ ఉపకరిస్తున్నవి. బిడ్డలకు యీ బొమ్మల ద్వారా యావత్ప్రపంచాన్నీ అవగాహన చేయవచ్చు. సృష్టి ఆదినుంచి యీ క్షణం పర్యంతం యేర్పడ్డ వివిధ-మార్పుల్ని, అనాగరికత నుండి నాగరకత యెలా ప్రభవించిందో, నాగరికతయొక్క బాహ్యాంతరము లేమి, యంత్రయుగ ప్రారంభానంతరం చేతివృత్తి నాశనమైన విధానం, తద్వారా యేర్పడ్డ దుర్భరదారిద్ర్యం, కాటకం వగైరా బాల్యదశయందే మనస్సుకెక్కించి దేశారాధక లక్షణాలు ప్రజ్వలింప చేయవచ్చు.

మనఆంధ్రదేశంలో సంకురాత్రికి బొమ్మల పండుగ అంటూ ఆడపిల్లలున్న ప్రతియింట జరుపుతున్నారు. దక్షిణాదిని యీబొమ్మల పండుగనే దసరాకు చేస్తున్నారు. దక్షిణాదినిలాచేయడంలో కొంతచరిత్రాధారం కనపడుతోంది. కొంతకాలం క్రిందట దక్షిణదేశాన్ని స్వతంత్రరాజులు పాలిస్తూవుండేవారు. వారు యీనాటిరాజులమాదిరి అనుదినం సామాన్యులవలె బయట సంచరింపక అంతఃపురం, ఆపరిసరాల్లోనే యేర్పరచుకున్న ఉద్యానవనాల్లో కాలంగడుపుతూ సంవత్సరాని కొకపర్యాయం మాత్రం (అదేవిజయదశమినాడు) ప్రజ యావన్మందికీ దర్శనమిచ్చేవారు. ఆ ఆచారము యీనాడుగూడ మైసూరులో జరుగుతోంది. చాలవరకు ఆసంస్థానాలు, ఆరాజులు, ఆ ఆచారమర్యాదలు, ఆసంప్రదాయాలు పరరాజ్యాక్రమణవల్ల పరప్రభుత్వంలో లీనమై క్రమేపి అంతరించిపోయినవి. అయినప్పటికీ ఆరాజులయొక్క ఉప్పును తిని జీవితాన్ని గడపినప్రజ యావన్మందీ ఆ ఆచారాన్ని అంతతో త్రోసిపుచ్చక రాజుయొక్క దర్శనం స్వయంగా కాకపోయినప్పటికే వారిచిత్రాన్ని అలంకరించి పూజలు జరిపిస్తూ రాజభక్తిని ప్రదర్శిస్తూండేవారు. ఈఆచారంకూడా కాలప్రవాహంలో కొట్టుకుపోయి అర్థంలేనిబొమ్మలు పెట్టి ఒక తదంగం జరిపి ముచ్చటపడుతున్నారు. ఆంధ్రదేశంలో యీబొమ్మల పండుగను సంకురాత్రిదినాల్లో జరపటంలో గల ఊహ యేమిటో బోధపడకుండావుంది.

తెలుగునాడులలో గల యీపండుగసమయాల్లో నీచజంతువులకుసహితం ఆరగింపు జరుగు తోంది; ఆరాధనజరుగుతోంది. ఈపద్ధతివల్ల లేనిజాడ్యాలను, గ్రహాలను కోరి తెచ్చుకోవడ మవుచున్నది. ఏప్రాంతాల యేపండుగతో యేపద్ధతిప్రకారం జరిపినా బొమ్మసామగ్రికి సర్వత్రా మంచి విరివైనవ్యాపారం జరగటా నికి అవకాశా లున్నవని స్ఫురిస్తోంది.

ఇతరదేశాల్లో బొమ్మలను తయారుచేసే oందుకు బ్రహ్మాండమైన ఫ్యాక్టరీలు నిర్మింప బడియున్నవి. జపానుబొమ్మల వ్యాపారంలో యితరదేశా లేవీ పోటీ చెయ్యలేకుండా వున్నవి. జపానుధాటీకి నిలువబడలేక జర్మ నీలో రెండుఫ్యాక్టరీలు బొమ్మలు తయారు చేళేవి కట్టివేశినట్టు యిటీవల వార్తలవల్ల తెలుస్తోంది.

ఆంధ్రదేశంలో కొండపల్లి బొమ్మలు, ఏక్కపల్లి లక్కసామగ్రి బహుప్రఖ్యాతిగా వుండేవి. తిరుపతిలో చందనపుబొమ్మలు తయారవుతాయి. కాని వీటికి ముక్కు, ముఖం, తీరు వుండదు. కొండపల్లి సరుకు బందరుకలంకారీవలెనే విదేశాలవరకు ప్రాకి అఖండమైన ఖ్యాతిని ఆర్జించినవి. ఈ దినం కూడా కొండపల్లి బొమ్మలపరిశ్రమను ఆంగ్ల మిత్రులే పోషిస్తున్నారంటే ఆంధ్రుల పూర్వపు యశస్సును గూర్చి యీ నాడు జబ్బచరచేవారు సిగ్గుపడతారో, ఆ పరిశ్రమ యింకా జీవించియున్నందుకు సంతోషించి తదభివృద్ధికి వెంటనే యేవిధంగానైనా పూను కొంటారో పరీక్షింపవలసివుంది.

ఇటీవల మదరాసులో జరిగిన అఖిల భారత స్వదేశవస్తుప్రదర్శనంలో కొండపల్లి బొమ్మలస్టాలుఒకటి వుంది. ఇతరస్టాలులవలె యీ స్టాలుకు ఆడంబరమైన అలంకారాలు యేమీ లేవు. బాహ్యాడంబర ముంటేనేగాని యీ దినాల్లో జనాన్ని ఆకర్షించటం కష్టం. ఏ సిద్ధహస్తుని తూలికావిహారమునుండి వెలు వడ్డ రమ్యప్రభలో గాని స్వల్ప సంఖ్యా మాత్రపు ఆ కొండపల్లిసామగ్రి కళాప్రియు లైన వానిని తమవైపుకు ఆకర్షించుకొనక పోవు. స్టాలును కనిపెట్టుకొనియున్న ఆతడు గూడ నిరుత్సాహముగ అగపడినాడు. చేత పైసాలేకున్నను మనసు తొందరించుటచేత విచారణచేసి హృదయ విదారకమైన యీ క్రింది వృత్తాంతమును తెలిసికొంటిని.

"ఒకప్పుడు కొండపల్లిప్రజ యావన్మందికీ యిదే ప్రధానవృత్తి. ఆబాలగోపాలం వారి కాలాన్ని యీబొమ్మల తయారుక్రింద విని యోగించినా డిమాండుకు సరిపడేసరుకు తయారుచేసియియ్యటం దుర్ఘటం అయ్యేది. ఈవృత్తినే అంటిపెట్టుకునివున్నవి యిప్పటికి యింకా పదికొంపలున్నవి. జపానుబొమ్మలు, గాజుబొమ్మలు, పుదుచ్చేరివి చౌకగా లభ్య మవుతున్నపిమ్మట కొండపల్లివాటికి గిరాకీ తగ్గినది. పైగా సరుకు తయారుచేసేందుకు తగినంతమంది జనం లేదు. ఈబొమ్మలవ్యా పారం యిప్పుడు నెల ౧-కి అయిదువందల రూపాయలు. ఈమొత్తంలో నెలకు నాల్గు వందలరూపాయలు వెలగల సరుకు మదరాసు లోని School of Arts వారు కొనుక్కొని విదేశాల కెగుమతిచేస్తారు. ఈలెక్కలనుపట్టి ఒకప్పుడు అఖండైశ్వర్యంతో వున్న యీపరి శ్రమని నేడు ఆంధ్రదేశం యెంత ఆదరిస్తోందో ఇప్పటికి గ్రాహ్యమైవుంటుంది. మదరాసు గవర్నరుగారు కొన్నిబొమ్మలు కొనుక్కొని పోయినారు."

ఆంధ్రదేశైశ్వర్యానికి పాటుపడుతున్న అసంఖ్యాకులలో కొందరు తమదృష్టిని యిట్టి పరిశ్రమలవైపుకుగూడా మరల్చి, ఆదరించి, పోషించి నిలువబెట్టుటవిధి, కర్తవ్యము. ఇంత వరకు ఆంధ్రులకు చరిత్రలేదు, జాగ్రఫీలేదు, చివరకు యీబొమ్మల పరిశ్రమనైనా నిలువ బెట్టుకుంటే ముందుసంతతివారికి మనగోడును, మనకృషిని, మనపోరాటాన్ని అవైనా కొంత శ్రుతపరుస్తవి.

---

# ఆంధ్రుల శిల్పకళా నైపుణ్యము

బులుసు వేంకటేశ్వర్లు

కళానిపుణత రూప, భావముల సంప్రదర్శనమున కలదు. కళకుగల ప్రధానాంగము లారును ఈ రూప భావములయం దగపడును. అంగ సౌష్ఠవము, వ్యక్తరూప చిత్రము, చాయ, సౌందర్యము, వికృతి, సామ్యాసామ్యములు మొదలగు లక్షణములు రూపముక్రింద వచ్చును. భావసౌష్ఠవము, భావ వివరణము, సౌందర్య దర్శనము మొదలగు లక్షణములు భావముక్రింద వచ్చును. ఈ భావ, రూపము లుచితగతి నొప్పవిలసిల్లినదే మన యాంధ్రనాయకుల పాలననాటి కళ.

హైందవశిల్పకళయందు బ్రధానములగు రూప, భావములు సరసగతి నుండుటయే గాక మరిరెండు ప్రధాన లక్షణము లుండి విఖ్యాతి నొడగూర్చినవి. హిందూదేశము విశ్వవిఖ్యాతి జెందిన కారణము దేశమునందలి జ్ఞానులయు, వేదాంతులయు సుప్రసిద్ధ జన్మములె. హిందూదేశము జ్ఞాననిధుల నిధి యనియు, వేదాంతజ్ఞులగని యనియు ననేకులగు పాశ్చాత్య పండితవర్యులచే గొనియాడబడుచున్నది. పూర్వ మాంధ్రులు రాజ్యము జేయునాటికిగూడ, నిట్టి మహామహుల ననేకులను భరతధాత్రి కన్నది. ఆనాటి శిల్పకళయందు తత్త్వబోధన మిమిడియుండెను. మహాజ్ఞానియగు బుద్ధునియు, మఱికొండఱ ఋషీశ్వరులయు సిద్ధవిగ్రహముల గాంచి జనులు జ్ఞానము బొందెడివారు. తదుపరి, శిల్పకళయందు మహోత్కృష్ట సౌందర్య మీ కాలమున గనుపట్టెడిది.

పూర్వాంధ్రుల కళానైపుణ్యము సవిస్తరభావ ప్రదర్శనము చేతను, రూపసౌందర్య పోషణచేతను విఖ్యాతి గాంచినది.

అమరావతి యందలి శిల్పకళ ఆంధ్రులయద్వితీయ కళానైపుణ్యము వేనోళ్ల జాటుచున్నదని యనేకులు పాశ్చాత్య పండితులు పొగడియున్నారు. ఫెర్గుసన్, విన్సెంటుస్మిత్తు మొదలగువార లెందఱో అమరావతియందలి యాంధ్రశిల్ప కళానైపుణ్యము నత్యంతముగ బొగడియున్నారు.

హిందువులను పొగడుటయన్న నలవాటులేని విన్సెంటుస్మిత్తుకూడ నమరావతీకట్టడముల నత్యంతముగ, నద్వితీయ మని పొగడియున్నాడు. ఆఱువందల అడుగులు చుట్టుకొలత, పదమూడు పదునాల్గడుగుల యెత్తుగల కట్టడమునే యింతగా పొగడిన స్మిత్తువంటివారు, ఇంతకన్న గొప్ప కట్టడము లాంధ్రులచే నిర్మింపబడినపుడు చూచి దిగ్భ్రాంతపడి యుండెడివారు. అనేకములగు పలుచని చదరపురాళ్లతోను, సూర్యచంద్రబింబములవంటి గుండ్రని యాకారములుగల శిలలతోను, ఈ యమరావతి యందలి కట్టడ మద్భుతముగ నుండెడివి. ప్రతిచదునురాయిపైనను, బహువర్ణ (?) చిత్రితములైన స్థాపనములు నిర్మింపబడినవి. గోడపైభాగమున పెద్ద పుష్పాకృతిగల చిత్రములు చెక్కెడివారు.

ఇందలి ఈశిల్పములు జీవకళతో విరాజిల్లు చుండెడివని యనేకచరిత్రకారులు వ్రాకుచ్చినారు.

"It is in the sculptures of Amaravati that we find the richest, most rythmic and most imaginative designs."

అనియు,

"The sculpture of Amaravati is one of the most splendid exhibitions of artistic skill known in the his tory of the world."

అనియు బహుధా కొనియాడియున్నారు.

కాలకర్మవశమున నింతటియాంధ్రుల శిల్పవైభవము కాలగర్భమున గలసిపోయినది. తరువాత విజయనగరరాజులకాలమున పునరుద్ధరింపబడినది. పదునారవ శతాబ్దమున తాడిపత్రి స్వదేశము(?)యొక్క అపూర్వ విభవముజూపినది. ఆనాటి యాంధ్ర విభవమును కాలము, ధారుణీగర్భము బాగుగా జూచియున్నవి.

ఒకనాడు యావద్విశాల భారతదేశమును బరిపాలించిన మనయాం

ఆంధ్రులు అఖండ బలపరాక్రమ సంపన్నులగు యుద్ధవీరులైనారు. ఈవిషయము నొకచరిత్రకారు డిట్లు వ్రాసియున్నాడు:

"The Andhras had a great military power, who ruled the whole of India including Magadha, Southern India, who saved Hindusthan from the clutches of foreign invaders Yavanas, Pallavas, and chiefly from the fangs of the dreadful Sakas who, inflamed by the glowing reports of the wealth and magnificence of Patali putra, the Indian Babylon, which excelled its Assyrian rival, in wealth and power, poured in, invast hordes, on its fruitful soil as is well proved by the long and eloquent inscription recorded in 144 A.D. by a famous Andhra Queen of of the time........"

ఆంధ్రులు నిర్వక్రపరాక్రమ సంపన్నులై మగధ, కొంకణాదిదేశముల జయించినారు. గ్రీకుసామ్రాజ్యాధిపతి యగు అలెగ్జాండరుకూడ జయింప జాలకపోయిన మగధను జయించుటచే నాంధ్రుల కమిత ఖ్యాతి కలిగినది.

"To the gratification of every Andhra on the eame battlements which refused access to the Macdonion standard, the invincible Andhra flag was flying gaily"

అనిపొగడి యానందించినాడొక చరిత్రకారుడు.

త్వరలో ప్రత్యేకాంధ్రరాష్ట్ర మేర్పడి, ఆంధ్రుల పూర్వమహోన్నతి వివిధరీతుల పునరుద్ధరింప బడుగాక!

---

# నవ్యసాహిత్యానికి నియమా లక్కరలేదా?

బులుసు వేంకటరమణయ్య

నవ్యసాహిత్య శబ్దాన్ని నలుగురూ నాలుగువిధాలా నిర్వచిస్తున్నారు. 'అది నూతనపద్ధతిది కానీండి, ప్రాచీనపద్ధతిది కానీండి యిప్పటివాళ్లు రచించే పద్యవాఙ్మయం అంతా నవ్యసాహిత్యం' అని కొందరి అభిప్రాయం. విశ్వవిద్యాలయాలు ఈ సూత్రాన్నే అనుసరించి యిప్పటికాలపువాళ్లు రాస్తూవున్న ప్రబంధాల్నీ, చిత్రకవిత్వాన్నీ 'మోడరన్ పోయిట్రీ' విభాగంలో పఠనీయంగా నిర్ణయిస్తున్నారు. కొందరు 'గద్యం చేసుకున్న పాపమేమిటీ? దానికీ దీన్లో పద్దు పడవలసిందే' అంటారు.

పాశ్చాత్యపద్ధతుల్ని అనుసరించే యువకులూ, వారికి ప్రోద్బలం యిచ్చే నడిమివయసువారూ 'మానవుడి మనోభావాల్ని మాత్రం సువ్యక్తం చేసి సహృదయుల్ని రసతన్మయులని చేసే ఖండకావ్యాలే నిజమైన నవ్యసాహిత్యం 'అంటారు.' అవి గ్రాంథికాలైనా కావచ్చు; వ్యావహారికాలైనా కావచ్చు. వాటి ఛందస్సులు క్రొత్త, పాతల్లో యేవైనా వుండొచ్చు; కథ స్వల్పంగా వుంటే వుండావచ్చు; లేకపోతే లేకపోనూ వచ్చు' అంటారు. ఈ మతాలన్నిట్లోనూ ఈ చివరిమతమే చాలామందికి సమ్మతమయింది. ఏమంటే నవ్యత అనేది సాహిత్యానికి భావభేదాల్నిబట్టి వచ్చేదే కాని వ్యక్తిభేదాలనీ, కాలభేదాలనీ బట్టి వచ్చేది కాదు.

మంచి అభిప్రాయంతో యేర్పడనీయండి; చెడ్డ అభిప్రాయంతో యేర్పడనీయండి - నవ్యసాహిత్యం 'భావకవిత్వం' అనే వ్యవహారం ఏర్పడింది; అంతే కాదు. ఆభావకవిత్వం చాలామంది అనాదరణకూ పాత్రమౌతున్నాది.

నవ్యసాహిత్యం ప్రచారం చేసే వారి వుద్దేశాలేమో మంచివే; ఆ పద్ధతిలో చక్కగా కవిత్వం చెప్పగల పెద్దలూ వున్నారు. కాని అందులో వొక పద్ధతికి చెందినవాళ్లు నియమా లక్కరలేదనీ, కవి తాను స్వేచ్ఛగా తనకు తోచినట్టు యేమయినా రాసుకోవచ్చుననీ ప్రచారం చేస్తూవుండడంచేత శక్తివున్నవాళ్లకంటె లేనివాళ్లే యెక్కువగా 'భావకవిత్వం' వ్రాయడానికి ప్రారంభించారు, ఏనియమాలూ లేకపోవడంచేత సులభమయినది కాబట్టి. కాబట్టే బాహుళ్యాన్నిబట్టి భావకవిత్వంలో సారవంతమయిన భాగం వకవంతూ, సారంలేనిది మూడువంతులున్నూ.

భావకవిత్వాని కుండే యీ అప్రథని తొలగించడానికి యువకవులేమన్నా ప్రయత్నిస్తున్నారా? అంటే అది కనబడడం లేదు. అది తొలగిపోవాలంటే వాళ్లు చెప్పేకవిత్వం మంచి సున్నితమయిన భావాల్ని వ్యక్తపరుస్తూ వుండాలి. అలా వుండాలంటూ వారూ చెప్పుకుంటారు. చాలామంది కవిత్వం అలా లేదని అంటారు. కాని తమరు రాసే గీతాల్లో భావం బోధపడలే దంటే 'బోధపరచుకునే శక్తి అలా అడిగినవాళ్లకి లే' దంటారు. పోనీ మీరే చెప్పండయ్యా అంటే 'అది చెప్పడానికి సాధ్యమయ్యేది కాదు; ఊహించుకోవలసిందే; సహృదయులైనవాళ్లకి అదే తెలుస్తుంది; కానివాళ్లకి తెలియదు' అంటారు.

అలాంటి సమాధానాలూ, అలాంటి కవిత్వాలూ ఏవిధంగానూ తృప్తికరాలు కాలేవు.

నవకవుల్లో చాలామంది నియమాలని అతిక్రమించడమే కవిత్వానికి నవ్యత చేకూర్చడ మని అనుకొంటూ వున్నట్టు తోస్తున్నాది. వారి స్వేచ్ఛ చాలావరకూ అశక్తతాకృతం.

ఏదేనా పనిచేశా మంటే దానికొక ప్రాప్య మంటూ వుంటుంది. నవకవులు నియమాలని అతిక్రమించినా ప్రాప్యం భావమో, రసమో తప్పకుండా వుండాలి. రస, భావాల కోసమే కావ్యంలో నియమాలన్నీ యేర్పడుతా. రస, భావాల్ని స్వతంత్రంగా నిలబెట్టగల సామర్థ్యం వుంటే నియమా ల్నతిక్రమించినా బాధలేదు.

అవి లేకపోతే—అలాంటి కవిత్వంవల్ల వెల్లడయేది కవిగారి చేతగానితనమే.

చేతనైనవాడు యే తప్పుచేసినా ...సుకుపోతుంది. చేతకానివాడు ...త గింజుకున్నా తప్పే కనబడు ...ంది; అందుకే అన్నాడు ఆలంకా ...కసార్వభౌముడు ఆనందవర్ధనాచా ర్యులు—

'అవ్యుత్పత్తికృతో దోషః
శక్త్యా సంవ్రియతే కవేః,
య స్త్వశక్తికృతో దోషః
స ఝటి త్యవభాసతే'

అని—

శక్తిసామర్థ్యాలు వున్న వాడు కాబట్టి కాళిదాసు పార్వతీపరమేశ్వ రుల పచ్చి శృంగారం వర్ణించినా దోషంలో లెక్కకురాక తోసుకుపో యింది. అదే మరొకడు రాస్తే బం డారం బయటపడేదే.

ప్రతీవారికీ కొన్ని భావాలు మన స్సులో వుంటాయి; వాటిని బయ టికి వ్యక్తపరచాలనే అభిలాషా వుంటుంది. తగిన సామగ్రి వుంటేనే అది వ్యక్త మవుతుంది. లేకపోతే 'అంతగ్గడగుడాయతే' అనిపించుకుం టుంది. ఆ భావోద్బోధకసామగ్రిని గురించీ, మనకు కొంత తెలియాలనే నియమాలని ఏర్పరచారు పెద్దలు. ఆ నియమాలని అనుసరించాలంటే అన్నివిషయాల్లోనూ మంచి ప్రవే శం వుండితీరాలి; కవి అనిపించుకోద లచినవాడు మంచి పండితుడూ కా వాలి. ఆ తర్వాత మంచి కవితాధా రాశుద్ధి వుండాలి. అలావుంటే అలా టివాడు చెప్పిన కవిత్వానికి చలనం వుండదు.

నియమానుసరణం అగ్నిపరీక్ష యివ్వడం లాంటిది. నియమాలని అనుసరించి చెప్పగలవాళ్లకి వాటిని అనుసరించడం కష్టంలోకి కొంచె మూకూడా లెక్కకిరాదు.

ఇల్లాంటి పరిస్థితుల్లో నియమాలు స్వేచ్ఛని చంపి మానవుడిని కట్టిపడ వేసే శృంఖలాలుగా భావించడం, వాట్ని తెంచుకుని పోవడం భావ్యం కాదు. చిలకని మనం పంజరంలో బంధించబట్టే దానికి చక్కగా మా ట్లాడడం వస్తున్నాది. లేకపోతే అది మూగనోము పట్టవలసిందే కదూ తక్కినవాటిలాగ!

అయితే ఒక సంగతుంది.

ప్రయోజనం యేమీ లేక ఉపజ్ఞ లేనివాళ్లు కేవలమూ శృంఖలాలచే బంధింపబడ్డా ప్రయోజనం లేదు. అలాటివాళ్ల కవిత్వం నియమబద్ధ మైన పదగుంభన అవుతుందేకాని అసలయిన కవిత్వం కాదు. ఒకటి కాదు—పది శృంఖలాలు తగిలించు కున్నా లాభంలేదు. కొందరు అక్షర నియమాలతోటీ, అనుప్రాసాలతో టీ, ఓష్ఠ్య, నిరోష్ఠ్యాలతోటీ, శ్లేషల తోటీ కవిత్వం చెబుతారు. ఎన్నుం టే ఏం లాభం జీవం లేకపొయ్యాక.

దేశ, కాలాల్నిబట్టీ, జనసామా న్యపు అభిరుచుల్నిబట్టీ నియమాల్ని మార్చుకోవలసిందే గాని ఎప్పుడూ పాతవాటినే అన్నివిషయాల్లోనూ పట్టుకుని పాకులాడడమూ అంతసర సంకాదు. అసలు నియమాల్నే తోసి రాజు చేస్తే లాభం లేదు. హద్దు, పద్దుల్లో వున్న మనిషికీ, లేని మని షికీ యెంత వ్యత్యాసం వుంటుందో నియమసహితమైన కవిత్వానికీ, లేని కవిత్వానికీ అంత తేడా వుంటుంది.

యువకవుల్లోనూ, యింగ్లీషు వ్యా ముగ్ధుల్లోనూ చాలామంది ప్రతి విష యానికీ పాశ్చాత్యదృష్టాంతాన్ని తీసుకువస్తూ వుంటారు. దానితో మనవి సరిపోతేనే మోక్షం! లేక పోతే లేదు. వారికి ఆ భావాలూ, ఆ అలవాట్లూ బాగా నచ్చుతాయి. ఏమంటే—వారు మొదట్నించీ అటు వంటి శిక్షణలోనే విద్య నభ్యసిస్తా రు—అదేవిద్య నభ్యసిస్తారు. అట్టి సమాజంలోనే తిరుగుతారు. వారికి మన కట్టుబాట్లు, నడవడికలు ఆచా రాలు తెలియవంటే ఆశ్చర్యమూ లేదు.

పాశ్చాత్యులకి ప్రధానం స్వేచ్ఛా జీవనం; వారికి నీతితోనూ, జాతి తోనూ ఎక్కువ సంబంధం వుండదు. వాళ్లు తమ సాహిత్యంలో కేవలం సాంఘిక జీవితాన్నే ప్రతిబింబింప చెయ్యడానికి ప్రయత్నిస్తారు ప్రయో జనమున్నా లేకపోయినా. వారి ప్రేమ కేవలం భోగప్రధానం!

మనపద్ధతో దానికి అత్యంతమూ విలక్షణ మయింది. మనం కేవలం జీవితప్రతిబింబనంతో తృప్తిపడం. ప్రతీదానికీ ప్రయోజనం వుండాలి. స్వేచ్ఛకని రెక్కలు కట్టుకొని ఎగిరి పోము. మనవారిప్రేమ పవిత్రం! సాధనప్రధానం. మన ప్రాచీనులు స్త్రీలని ఎక్కువగా వర్ణించినా కన్న బడ్డదాని నల్లా ప్రేయసీభావంతో వర్ణించడం లేదు. భావకవులు పచ్చి గా వర్ణించలేదంటారు — కాకపో వచ్చు; కాని స్త్రీసామాన్యంపైని వారి కుండేది ప్రేయసీభావమే.

స్వేచ్ఛావిహారం పాశ్చాత్యుల్లో తప్పులేదు మనలో తప్పు. అది ఎం

చేతా అని ప్రశ్న వేస్తే జబాబుదారీ నేను కాను; వారే ఆలోచించుకో వాలసి వుంటుంది.

జనుడు సామాజికజీవి. అతడు చేసే ప్రతీపనీ—సాధ్యమైనంతవరకూ దేశాభ్యున్నతికి కారణం కావాలి. ఏ కవిన్నీ 'నాకోసం నా యిష్టం వచ్చినట్టు రాసుకుంటాను' అని చెప్పడానికి వీలులేదు. తనయిష్టం నచ్చినట్లల్లా లోకవ్యవహారం జరిగించడానికి వీలవుతున్నాదా? జరిగిస్తే లోకమూ, ప్రభుత్వమూ వొప్పుకుంటాయా? అసలు జరిగింతామన్న వుద్దేశమేనా కలుగుతుందా? ఏం కొంపమునుగుతుందో అనే భయమే కదూ. తాను స్వేచ్ఛాగీతా లాలపిస్తూ యింటిదాన్ని గదిలో పెట్టి తాళంవేసే పద్ధతే కదూ చాలా మందిది!

అంచేత స్వేచ్ఛని అవలంబించడానికి అనువయిం దేమిటి? ఒక్క సారస్వతమే. దా న్నేంచేసినా ఎవరితోనూ చెప్పకోలేదు; ఎవడూ అడ్డుపడేవాడూ లేడు. పాపం, అనాథ!

యువకవు లీ స్వేచ్ఛని అవలంబించడానికి వారి కుండే ముఖ్యమయిన దన్ను ప్రోత్సాహకులు. ప్రోత్సాహకుల్లో విజ్ఞులూ వున్నారు. కాని కొత్తపద్ధతికి విశిష్టతను చేకూర్చే ప్రయత్నాల్లో వారు పాలుమాలి వుంటున్నారు. ప్రత్యేకతను కూర్చడానికి పాటుపడడమూ లేదు. 'శృంఖలాలు తెంచుకోని స్వేచ్ఛగా విహరించం డోయ్' అంటారుగాని ఎలా విహరించాలో నిర్ణయించడం లేదు. కాబట్టే కవులు తలోదారీ తొక్కుతున్నారు

దేశ, కాల పరిస్థితుల్ని బట్టి మన వేషభాషలు మారుతున్నాయి. నిత్య జీవనంలోనూ అనేక పరిణామాలు జరుగుతున్నాయి. ఏదో పద్ధతులు మారుతున్నాయి గాని ఎందులోనూ 'విడవటం' అనేది లేదు. అది 'విడవటమే' తటస్థిస్తే ప్రపంచజీవనమే జరిగేది లేదు.

నియమాలు మారాలంటే మంచిదే; కాని అక్కర్లేదంటే మాత్రం అసందర్భంగా వుంటుంది' మాటకి ఒక సంగతి. మనం వ్యావహారికభాషను వాడుతున్నాం. దీనికి ప్రోత్సాహం జోరుగా జరుగుతున్నాది; ఇది రానురాను అందరి ఆమోదాన్నీ పొందుతున్నాది. కాని దీని కోనియమమూ, పద్ధతీ లేదు. ఒకరు రాసినట్టు యింకొకరు రాయరు. కొందరి వ్రాత కొందరికి పరమాసహ్యాం. ఇది మంచి పద్ధతి, యిది చెడ్డ పద్ధతి అని చెప్పడానికి ఆధారం, కనబడకుండా వున్నది. నవ్య(పద్య) కవిత్వం సంగతికూడా యిదేమాదిరి.

అన్ని పద్ధతులకూ చెందిన పెద్దలు చేయవలసిం దేమంటే—

౧. ఏ కావ్యానికన్నా సరే రస, భావాలు ప్రధానాలు కాబట్టి వాటి పరిపోషణకు తగినట్టుగా నియమాలు నిర్ణయించాలి. అవి క్రొత్తవైనా సరే అభ్యంతరపరచకూడదు.

౨. భావం సరసంగా, సామాన్య జ్ఞానం కలవాళ్లు అర్థంచేసుకొనేరీతి వున్న గ్రంథరచనకి ప్రోత్సాహం యివ్వాలి.

3. రసానుగుణాలయిన ఛందో, వ్యాకరణనియమాల్ని అతిక్రమించడం దోషంగా పరిగణించాలి.

౪. భావపరిమితినీ, కథావస్తువునీ, ఒక హద్దులో వుంచాలి.

౫. నవ్యకవిత్వం చెప్పడానికి అర్హులెవరో నిర్ణయించాలి.

౬. చివరకి పుస్తకాల వెలలని కూడా ఒక అదుపులో వుంచాలి.

౭. సాహిత్యాభ్యుదయాని కన్ని విధాలా పాటుపడాలి.

# పంతం ★

పద్మరాజు

గోదావరివరదలు, పొగలాగ చుట్టలు చుట్టుకుంటూ ప్రవహించే ఆ చిక్కనీటిని చూస్తే భయంవేస్తుంది ఎల్లాంటివాళ్లకయినా. చాకలివాళ్లు మాత్రం నడిప్రవాహంలోకి నిర్భయంగా ఈదుకువెళ్లి పుల్లల్ని ఏరుకుని గట్టుకి తెస్తూంటారు. ప్రతీరోజూ ప్రొద్దున్నే చాకలివాళ్లంతా చిన్న తెప్పల్ని పొట్టకింద వేసుకుని గోదావరిలోకి దిగుతారు. సాయంకాలమవేసరికి గట్టునిండా పుల్లలుగుట్టలు పడిపోతూఉంటాయి. మగవాళ్లంతా నడేట్లోకి పోతే ఆడవాళ్లు పొడుగుపాటిగడలకి చివరకొంకెలుకట్టి గట్టున నిలబడి అందినంతమేర పుల్లలు దాటిపోనియ్యకుండా గట్టుకి లాక్కుంటూ ఉంటారు. ఆ రోజుల్లో గోదావరి మహాకోలాహలంగా ఉంటుంది. గోదావరి తన మహాప్రవాహంలో అరణ్యాలని అరణ్యాలని వేళ్లతో పెకలించుకు వస్తూఉంటే, ఆ గోదావరి నరికట్టిపుల్లలనన్నింటినీ గట్టుకి చేర్చి, ప్రకృతికంటే తమ ఆధిక్యతని నిలబెట్టుకుంటారు మానవులు. ఆ పుల్లలు పట్టడానికి చాలా నేర్పు కావాలి. కేవలం బలంవల్ల ఉపయోగమేమీ ఉండదు. నడిప్రవాహంలో ఏదైనా ఒకచెట్టు మనవశం అయితే, ప్రవాహానికి కొంతమనం లొంగినట్టయితేగాని అచెట్టు మనస్వాధీనంలోకి రాదు. ఆపుల్లలు పట్టడంలో ఒక విధమయిన పోటీ ఉంది. అది చాకలివాళ్ల నేర్పుకి ఒకకొలతబద్ద. ఒక్క పుల్లలమీది ఆశేకాదు. ఆపోటీలో వాళ్ల గౌరవలాఘవాలు ఇమిడి ఉన్నాయి. అందులో నెగ్గినవాడు జాతికంతకీ వీరుడన్నమాట. ఆఉత్సాహంచేతే వాళ్లు ప్రాణాల నయినా లక్ష్యపెట్టకుండా సుడిగుండాలలోకి కూడా పోతూ ఉంటారు.

రామికి చాలా పెంకిదని పేరు. ప్రతీవిషయంలోనూ అందరితోనూ పోట్లాడడం దాని స్వభావం. అది కనుచీకటి ఉండగానే లేచి ఒకకొంకికట్ట పుచ్చుకుని దాని ఇంటికి దగ్గరగా ఉన్న రేవులోకి వెళ్లి నిలబడుతుంది. ఇంక ఆనాడు ఆరేవులోకి ఎవరూ రావడానికి వీలులేదు. ఎవరయినా వచ్చినట్టయితే పోట్లాట ప్రారంభమవుతుంది. దానినోరు మహావాడి. రెండు మూడు సార్లు పోలీసువచ్చి దాన్ని దడిపించాడు. తక్కినవాళ్ల మీదకిమల్లేనే అది వాడిమీదకీ చఱ్ఱుమని లేచింది. అధికారులు తనకిచ్చిన అధికారాన్ని దానిమీద మాత్రం చలాయించలేకపోయాడా పోలీసు. గోదావరీ, పుల్లలూ, కేవలం తన ఒక్కత్తివేకావని దానికర్థమయినప్పటికీ, తనందరికంటే మొట్టమొదట వచ్చి ఉండగా, ఇంకొకళ్లు తనరేవులోకి తనతరవాత వచ్చి పుల్లలు పట్టుకోడంలో ఉండేసబబు ఏమిటో ఏ న్యాయశాస్త్ర వేత్తా, దానికి నచ్చచెప్పలేడు. న్యాయం తమవైపుని ఉన్నా, న్యాయంకంటే బలమైనదానినోటికి దడిసి ఇంకే ఆడవాళ్లూ అది చేరిన రేవులోకి రారు.

వెంకడు కొంచెం హుషారు మనిషి. ఎవరినన్నా ఏడిపించడమంటే వాడికి సరదా. చాకలివాడలో వయసువచ్చిన ఆడపిల్లలందరికీ వెంకడంటే చాలాఇష్టం. వాళ్లదృష్టిలో అతడొక వీరుడు. వెంకడికుటుంబానికీ రామికుటుంబానికీ చాలా కాలంనుంచి పోట్లాట. వెంకడితండ్రి ఒకమాటు రామిగుడిసెకి నిప్పంటించాడుకూడానూ. రామి అతడి నస్తమానూ తిడుతూ ఉంటుంది. ఆడముండతో ఎందుకని వెంకడుమాత్రం ఎప్పుడూ ఆట్టే ఆతిట్లని లక్ష్యపెట్టేవాడుగాదు. దానితోడి ఆడపిల్లలందరికీ అదంటే అసహ్యం. 'మొగముండ' అని వాళ్లలోవాళ్లురహస్యంగా తిట్టుకునేవారు దాన్ని, పైకి తిట్టడానికి భయపడి.

రామి రోజూ రేవులోకి వచ్చిన ఆడవాళ్ల నందరినీ తరిమివేస్తూం దని తెలిసి దానిసంగతేమిటో కనుక్కోవాలని ఒకరోజున వెంకడు దానిరేవులోకి దిగాడు.

రామి చఱ్ఱుమని లేచింది.

'ఏరా! యెదవకానా? ఆడదానితో పోటీకొచ్చావా?'

'మాటలు తిన్నగా రానీయి. నువ్వు, నీకొంకీ నడేట్లోకెడతారు.'

'నేను ముందొచ్చిన రేవులోకి నువ్వెందుకొచ్చా? సిగ్గునేదేం?'

'ఈరేవు నీ దొక్కదానిదేకాదు; అందరూ రావొచ్చు.'

'నేను ముందొచ్చాను.'

'నేను తరవాత ఒచ్చాను.'

'పెంకి ఎదవలతో ఏంటి; ఆడళ్లతో సమంగా?'

'ఇదుగో! నువ్వు కొంచెం నెమ్మదిగా మాట్లాడితే నే నిక్కణ్ణుంచి ఎల్లిపోతాను.'

'నింపా దేంట్రా, నింపాది — నా పుల్ల లన్నీ పట్టుకుంటూను!'

'పోసి! నీ కందనిపుల్లలే నేను నొల్లుకుంటానులే.'

'నీకందనిపుల్లలు నేను పట్టుకుంటాలే.'

ఇంక ఆ రేవువదలి వెళ్లిపోయి నట్టయితే వెంకడు వెనుదీసిన ట్టవుతుంది.

వెంకడు తన తెప్పని గట్టుమీద పడవేసి తనూ ఒక కొంకికఱ్ఱ పుచ్చుకుని పుల్లలుపట్టడం ప్రారంభించాడు.

రామి నే విధంగా లొంగదియ్యాలో వెంకడికి తెలియలేదు. దానీడు పిల్లలంతా తనని ఊ, పొగుడుతూ ఉంటారు. ఇదొక్కత్తే ఏదో పెద్ద తనకంటె ఎక్కువగా మాట్లాడొస్తుంది. వాళ్లకుటుంబాలకి చాలాకాలం నుంచి పోట్లాట అనుకోండి. అయినా తనెప్పుడయినా వాళ్లతో పోట్లాడాడా? పోసి తను ఒక్కడితోటే కాదు; ఊళ్లో అందరితోటీ ఇల్లాగే పోట్లాడుతుంది ఇది. దీన్నెలాగయినా సాధించా లనుకున్నాడు వెంకడు.

గట్టుని నిలబడిపుల్లలు పట్టడంలో మాత్రం రామి వెంకణ్ణిజయించేసింది. రామి నెల్లాగయినా ఓడించాలని అతడు చాలాప్రయత్నించేవాడు గాని దానినేర్పు, అతనిబలానికంటే బాగా ఉపయోగించేది. కొంకితోపుల్లలులాగడంలో ఉండేవడుపూ, ఆదృథత్వం వెంకడికిమాత్రం పట్టుబడలేదు. అతడెంత ప్రయత్నించినా చాలాపుల్లలు అతని కొంకికిందనించి దొర్లిపోతూ ఉండేవి. దానినేర్పరితనం చూసి అతడాశ్చర్యపడేవాడు. నడేట్లోకి వెళ్లి వచ్చినవాళ్లుకూడా అది గట్టునినిలబడిపట్టినన్ని పుల్లలు పట్టలేక పోయేవారు.

అన్నింటికంటే అతనికర్థంకానిదేమంటే దానిపెంకితనం. ఆరేవులో నుంచిపోయే పుల్లలన్నీ అదెల్లాగా తియ్యలేదు. తక్కినవాళ్లనన్నా ఎందుకు పట్టుకోనియ్యదు?

౨

ఆనాడు గోదావరి చాలా భీకరంగా ఉంది. నాలుగుపక్కలా ఆకాశంనిండా నల్లనిమబ్బులు కమ్మివేసాయి. చినుకులు గాలి ఎక్కువగా ఉన్నాయి. చాలామంది చాకలివాళ్లుభయపడి దిగడం మానివేశారు.

ఆవేళమాత్రం వెంకడు తన తెప్పని వేసుకుని బయలుదేరాడు. ఒక ఆడదానితో పంతంపెట్టుకుని గట్టుని కూర్చోడంకంటే మొగవాళ్లలో చాలామంది చెయ్యలేని సాహసం చెయ్యాలని అతనిలోని వీరత్వం అతడిని పురికొలిపింది.

నడేట్లోనుంచి వెంకడు పుల్లలు పట్టుకొస్తున్నాడు, గట్టున నిలబడి రామి పడుతోంది. ఇద్దరిగుట్టలూ ఒకదానిప్రక్కని ఒకటి పెరిగిపోతున్నాయి.

సాయంకాలం నాలుగుగంటలయేసరికి తక్కిన చాకలివాళ్లంతా ఎవరిళ్లకి వాళ్లు వెళ్లిపోయారు. రామీ, వెంకడే మిగిలారు. వెంకడు బాగా అలిసిపోయినప్పటికీ రామికంటే ముందుగా ఇంటికిపోవడాని కతనికి మనసు ఒప్పలేదు. ఇద్దరూ అల్లా పోటీగా పుల్లలు పడుతున్నారు.

కనుచీకటి పడుతోంది. చినుకులూ, గాలీ అల్లాగే ఉన్నాయి.

'నువ్వింకా ఎంత సేపుంటా?'

'నువ్వింకా ఎంత సేపుంటా?'

వెంకడు ఒక ఆడదాని పెంకితనానికి లొంగిపోతాడా?

'ఇంకా చాలా సేపుంటా' నన్నాడు.

రామి జబాబు చెప్పకుండా నీటి అంచుని రాళ్లమీద నిలబడి వడుపుగా పుల్లల్ని దగ్గిరకి లాక్కుంటోంది.

'జాగ్రత్త! జారినీట్లో పడిపోగలవు!

'నీసంగతి నువ్వుచూసుకో. నేపడిపోతే నువ్వేం తియ్యక్కరలేదులే!'

'నేనే తియ్యాలి. పెద్దకబుర్లుసెపుతున్నావుగాని.'

దూరాన్ని ఒకచెట్టు కొట్టుకుపోతోంది. వెంకడు, రామిమీద తన ఆధిక్యతని క్రియలో చూపించాలని, దిగి ఈదుకుంటూ వెళ్లిపోయాడు. మాటల్లో చూపించలేడన్న సంగతి అతనికీ అర్థమయింది.

చెట్టు చాలా బరువుగావుంది. ఆపైని అతడు బాగా అలిసిపోయాడు. రామితో పంతంకోసం దిగాడు గాని లేకపోతే అంత అలిసిపోయినమీదట దిగడు. ఎల్లాగో ఒకలాగ నెమ్మదిగా ఆచెట్టుని లొంగదీశాడు. నెమ్మదిగా బారవేసుకుంటూ గట్టుకేసి దాన్ని కదులుస్తున్నాడు. ఒకసారి కన్నెత్తి గట్టువేపుచూశాడు. కనుచీకట్లో అతనికి సరిగ్గా ఏమీకనిపించలేదు. నెమ్మదిగా బారవేసుకుంటూ కొంత దూ

రం వచ్చాడు. గట్టు కొంచెం కనిపిస్తోంది.

రామి మొలలోతునీళ్లలో దిగి, అంకీ అందని ఒక పెద్దచెట్టుని గట్టుకి లాగుతోంది.

'బడ్డొరకంగా ఉంది. దాన్ని ఒగ్గెయ్యి.' అని కేకవేశాడు వెంకడు.

'నీ కెందుకు? నువ్వు నీపని సూసుకో' అంది రామి.

'ఛీ! నే నెందుకు దాన్ని పలకరించాను?' అనుకున్నాడు వెంకడు. అ దేమయిపోతే తన కేం? పెంకిముండ! దానికి తెలియ:దా? ఆట్టే దిగితే చస్తుంది.

కాని వెంకడు త దేకదీక్షతో గట్టుకేసి చూస్తో ఈదుతున్నాడు. రామి రెండుసార్లు కాళ్లుపట్టు తప్పితూలింది. వెంకడి నోటిచివరదాకా కేక వచ్చి ఆగిపోయింది. తనమనస్సుకి దృఢత్వం లే దనుకున్నాడు.

అటుచూడకూడదని తల కొంచెం వంచి నెమ్మదిగా గట్టుకి ఈదుతున్నాడు.

ఇంతలో అతనికి ఏదో జారి సీటిలో పడినచప్పుడు వినిపించింది. అతనిహృదయం స్తబ్ధమయిపోయింది. చేతులు చెట్టుని వదలివేశాయి. మొగముఎత్తి చూశాడు.

రామి కనబడ లేదు!

తన శక్తికొలదీ గట్టుకి విసురుగా ఈదాడు. పదిగజాల క్రింద ప్రవాహంలో ఎవరో కొట్టుకుంటున్నట్టు కనిపించింది. వెంకడు ఈదుకు వెళ్లాడు. ఒకచేత్తో రామి నెత్తిపట్టుకున్నాడు. రామి రెండుచేతులతోనూ అతని మెడ మెలివేసింది. ఇద్దరూ మునిగిపోయారు. ఒకపెద్ద ప్రయత్నంతో మెడపట్టు విడిపించుకుని ఊపిరి పీల్చుకోడాని కని పైకి వచ్చాడు. ఈసారి రామికి స్పృహ తప్పింది. నెమ్మదిగా బహుకష్టంతో దానిమెడ తనవీపుమీద ఆన్చి, దానిచేతులు తనరొమ్ముకి చుట్టుకుని తన తెప్పమీద ఆనుకుని కొంచెం నిలదొక్కాడు. ఈ పాటికి గట్టుదగ్గరనుంచి వారిని ప్రవాహంలోపలికి నెట్టింది. అతనికి గట్టు కేవిధంగా చేరాలో తెలియలేదు. పుల్లలు పట్టిపట్టి అలిసిపోయి ఉన్నాడు. అల్లాగే నెమ్మదిగా బారవేసుకుంటూ గట్టుదగ్గరగా వచ్చాడు. అక్కడ గట్టుని ప్రవాహం నిలువునా కోసివేసింది. అతిప్రయత్నంతో చెయ్యిఎత్తి గట్టుమీద వేశాడు. అండ ఊడిపోయింది. కొంచెం మునిగిపోయాను. ఇంక తనకి మూర్ఛవస్తుం దేమోననిపించింది. ఎడం చేత్తో గట్టుని పట్టుకుని, రామి దేహాన్ని నెమ్మదిగా గట్టుమీదికి ఎక్కించాడు కుడిచేత్తో. తరవాత నెమ్మదిగా తనూ గట్టెక్కి ఒక పదినిమిషాలు వెల్లగిల పడుకున్నాడు ఆయాసం తీర్చుకోడానికి.

రామి కొంచెం కదిలింది. మెల్లిగా 'మెంకా!' అంది. మళ్లీ మూలగలేదు.

---

వెంకడు దాన్ని భుజాన్ని వేసుకుని, చాకలివాడకేసి బయలు దేశాడు.

తను బయటికి తీసినట్టుగా దానికి తెలుసును. అంచేతే 'ఎంకా!' అంది. అసలు మొట్టమొదట తనపీక పట్టుకున్నప్పుడు దానికి స్మారకం ఉందిగా! చూశే ఉంటుంది. ఆపైనిగట్టునింకెవరూ లేరు కూడాను. అంతకితమే అన్నాడు దానితో వేళాకోళంగా, 'నువ్వు పడిపోతే నేనే తియ్యా'లని! తమాషా! చివర కల్లాగే అయింది'

దానితో తనెందుకు పంతం వేసుకున్నాడు? ఎందుకు అసహ్యించుకొన్నాడో దాన్నింతకాలం! అది శుద్ధ పొగరుబోతయితే దానిజోలి తన కెందుకు? దాన్ని ఎల్లాగయినా లొంగదియ్యాలనుకున్నాడు. లొంగదియ్యలేకపోయాడు. అదీ! అంచేతే అదంటే కోపం తనకి. దానితో పుల్లలు పట్టడంలో ఎవరు పోటీచెయ్యగలరు? తక్కిన ఆడవాళ్లకీ దానికీ పోలికే లేదు. అది అసలుపిల్ల. కొంచెం పెంకిది నిజమే. తనుమాత్రం పెంకివాడుగాడూ?

అది పడిపోవడం, తను తన ప్రాణాలుపోయే పరిస్థితులు వచ్చినాసరే వదలకుండా దాన్ని గట్టుకితియ్యడం! ఇంతటి ఘనకార్యం తన జీవితంలో ఎప్పుడూ చెయ్యలేదు. అంతా చాలాసార్లు అతని ధైర్యాన్ని పొగిడారు కాని, ఇది ఎవరూ పొగడడానికి సాధ్యం గానిది. ఇంతకష్టపడి రక్షించిన ఆమెదేహం, నైతికంగా తన దైపోయిం దనుకున్నాడు వెంకడు. ఆమెనొకవిధంగా జయించా ననుకున్నాడు.

వెంకడికి, ప్రపంచకంలో ఏ ఆడపిల్ల వంటికీ, ఈ పొంకం, ఈ నునుపూ, ఈ మెత్తదనం ఉండ దనిపించింది.

నెమ్మదిగా దాన్ని కిందకి దింపి వెంకడు రామి తల్లిదండ్రుల్ని పిలిచాడు.

అంతా చుట్టూ చేరారు. రామి తల్లి గొల్లుమని ఏడవడం మొదలు పెట్టింది. తండ్రి నిస్తబ్ధుడయిపోయి ఒకమూల కూర్చున్నాడు. తక్కిన

చాకలిపెద్దలంతా చుట్టూజేరి దాన్ని బ్రతికించే ఉపాయాలు చూస్తున్నారు. కడుపుతొక్కి నీళ్లుతీశారు. మంట వేసి కడుపు కాచడం మొదలు పెట్టారు.

రామితల్లి గొంతెత్తి ఏడుస్తోంది.

'ఎంకడు సంపేశాడట్రోయి. నా తల్లి నెంకడు ముంచేశాడట్రోయి.'

వెంకడా ఏడుపుని వినిపించుకో లేదు. అలసిపోయిన చూపులతో రామిని చూస్తున్నాడు.

రామి కొంచెం కదిలింది. కళ్లు సగం విడివడ్డాయి. వెంకడు దగ్గరగా వెళ్లాడు

రామి 'ఎంకడు, ఎం౦డు' అంది.

ఆ అనేటప్పుడు బాధచేత మరుగు పడిపోయిన దాని చిఱునవ్వుని వెంకడుతప్ప ఇంకెవరూ గ్రహించలేదు.

వెంకడిహృదయం జల్లుమంది. అది తన చిరునవ్వులో తనుచేసిన సహాయానికి కృతజ్ఞత చూపెంది.

రామితల్లికి అది పలవరించిన 'ఎంకడు' అన్నముక్క దాని అనుమానం స్థిరపరచటానికి సరిపోయింది.

దాని ఏడుపు ఎక్కువయింది.

'అమ్మో! దొంగనాకొడుకోయి. నాతల్లిని ముంచేశాడమ్మో! ఎవరూ లేకండాసూసి ముంచేశాడట్రో!'

వెంకడు నిర్ఘాంతపోయాడు. తనింతా శ్రమపడితే ప్రతిఫలం ఇదా? ఛీ! వెధవప్రపంచకం అనుకున్నాడు వెంకడు.

రామికి ఎగ ఊపిరి పట్టింది. అంతసేపు స్తబ్ధుడైకూర్చున్న రామితండ్రి చట్టున లేచి వెంకడితో

'నీసంగతి కనుక్కుంటా నుండు' పోలీసోళ్లని తీసుకొత్తాను.' అని గబగబా వెళ్లిపోయాడు.

వెంకడిందాకా కొంచెం అలిసిపోయి ఉంటే రామితో తనూ గోదావరిలో కలిసిపోయిఉండును. అంత కష్టపడి దాన్ని పయికితీశాడు. దాని ప్రాణమా చివరకి కాపాడ లేకపోయాడు. తనకి చివరకి మిగిలింది ఈ అభియోగం.

ఈ విపమరహస్యం అతని కర్థం కాలేదు.

వెంకడీప్రపంచకం అంతా చెడ్డదనుకున్నాడు. తనూ రామే ఈ ప్రపంచకంలో తప్పపుట్టారు.

---

సవరణ

---

భారతి, ఈశ్వరనామ సంవత్సరము ఫాల్గునమాస సంచికలో ౨౫౫ పుట, రెండవ కాలము పంక్తి ౧౪ తర్వాత చదువవలసినది. "ఇందులో 'చతుర్థకుల వనజవన మార్తాండుఁ' డని యున్నది." మూడవ కాలములో చివర ౧౧౫ సంఖ్య ౧౧౫౭ గా చదువవలెను. ౨౫౬ పుట రెండవకాలములో ౧౫ వ పంక్తిలో ౧౯౩౬ సంఖ్య ౧౯౧౬ గా చదువవలెను.

కా. భా.

---

# ఫెడరల్ విధానము

[అది ప్రవేశపెట్టకుండ ఆపుచేయుట ఎట్లు?]

చావలి వెంకట హనుమంతరావు

కాం్రగెసు మహాసభ ౫౦ సంవత్సరముల అనంతరము ప్రభుత్వాధికారమును చేపట్టుటకు నిశ్చయించుటయు, ఆ నిర్ణయము ననుసరించి ౧౧ రాష్ట్రములలో ౭ రాష్ట్రములందు కాం్రగెసుపార్టీ వారు మంత్రిపదవులను స్వీకరించుటయు మన దేశ రాజకీయచరిత్రలో ఒక ప్రముఖ్యమగు విషయ మని ఎల్ల రంగీకరింతురు. వా రట్లు మంత్రిపదవులను స్వీకరించుటకు పూర్వము గవర్నరులవద్దనుండి మంత్రులుగానుండి తాము చేయదలంచిన పనులలో అనవసరముగ కలుగజేసుకొనన మని వాగ్దానముల నడిగియుండిరి. కాని కాం్రగెసు మంత్రివర్గము లేర్పాటు కాబడినతరువాత ఏ కాం్రగెసు మంత్రియు గవర్నరులుకాని, సివిల్ సర్వీసు ఉద్యోగులుకాని తమపనులకు అడ్డుతగులుచున్నారని చెప్పినట్లు ఎచ్చటగాని వినరాలేదు. దీనినుంచి ఒక ముఖ్య పర్యవసానము తేలుచున్నది. అది ఏమన ౧౯౩౫ ఇండియా ప్రభుత్వ సంస్కరణ చట్టము Government of India Act of ౧౯౩౫ నందు ఇమడ్చబడిన రాష్ట్రములకు సంబంధించిన సంస్కరణములు కాం్రగెసుపార్టీ వారు మొదట తలంచినంతకాని చెప్పచువచ్చినంతగాని సంకుచితములు కావనియు, కాం్రగెసు పార్టీవారు తలపెట్టిన ప్రజాహిత కార్యక్రమమును కొనసాగించుటకు వాటియందు తగినంత అవకాశములు కలవనియును కాం్రగెసు పార్టీవారు మంత్రిత్వముల నంగీకరించి కొన్నినెలలు కావచ్చుచున్నను, ఏరాష్ట్రీయ గవర్నరుగాని ఇంతవరకు తన మంత్రివర్గపు చర్యలలో జోక్యము కలుగజేసుకొనుట కిష్టపడుచున్నట్లు నిదర్శనములు కాన్పించవు. అంతేకాక కాం్రగెసుమంత్రివర్గములు తమతమపనులను తమ ఇష్టమువచ్చినట్లు చేయగలుగుచున్నారనియు ఇకముందు కూడ అట్లే చేయగలుగుదు రనియు తలంచుటకు కావలసినన్ని అవకాశములు కలవు. కలకత్తాయందు ౧౯౩౭ అక్టోబరు మాసాంతరమున జరిగిన అఖిలభారత కాం్రగెసు సంఘసమావేశమందు కాం్రగెసుపార్టీలు మంత్రిత్వములను చేపట్టవచ్చునని వార్ధాయందు చేయబడిన నిర్ణయము అనుకూలముగనే కొనసాగుచున్నదని తీర్మానింపబడిన దని జ్ఞాపక ముంచుకొనిన కాం్రగెసు సభ్యులలోనే ఈ విషయమును గురించి చాలవరకు ఏకాభిప్రాయము కలదని గ్రహింపవచ్చును. కొంతమంది అతివాదులగు సామ్యసిద్ధాంతవాదులు తప్ప మిగిలినవా రందరు ఆ తీర్మానమునకు అనుకూలముగ నుండిరి.

## ౨

రాష్ట్రములందు క్రొత్తసంస్కరణము లింతవరకు అనుకూలముగ నుండినప్పటికిని, సంస్కరణచట్టమునందు కేంద్రప్రభుత్వమునకు సంబంధించిన మార్పులకు, ముఖ్యముగా అఖిలభారత ఫెడరేషను (All India Federation) విధానమునకు కాం్రగెసుసంస్థ వ్యతిరేకముగా నున్నదను విషయము ఎల్లరకును విదితమే. ఫెడెరల్ విధానము ఏర్పాటుకాకుండ కాం్రగెసువారు సర్వవిధముల ప్రయత్నింపవలెనని ఫెయిజ్ పూర్ కాం్రగెసు సభలో తీర్మానమామోదింపబడెను. ఆ కాం్రగెస్ సమావేశమునకు అధ్యక్షత వహించిన పండిత జవహర్ లాల్ నెహ్రూగారు తమ ఉపన్యాసమందు ఫెడరేషనును గురించి తీవ్రమగు వ్యతిరేకాభిప్రాయమును వెల్లడించియుండిరి. స్వదేశసంస్థానములందలి ప్రజలకు ఏవిధమగు అధికారములనుకూడ సమకూర్చనట్టియు, బ్రిటిష్ ఇండియా రాష్ట్రములకుగూడ రాజకీయముగ త్వరితముగ ముందుకు సాగిపోవుటకనుకూలించనట్టియు, ఫెడరల్ విధానమువలన ఏ విధమగులాభమును దేశమునకు రాజాలదని గ్రహింపవలసియున్నది. కాం్రగెసు మహాసభయేకాక ౧౯౩౭ అక్టోబరుమాసమందు లక్నోలో మహమ్మదాలీ జిన్నాగారి అధ్యక్షత క్రింద జరిగిన ముస్లిమ్‌లీగుసమావేశమునందు కూడ ఫెడరల్ విధానమునకు ప్రాతికూల్య తీర్మానము అంగీకరింపబడెను. ఫెయిజ్ పూర్ కాం్రగెసు అనంతరము కాం్రగెసు మంత్రివర్గముల నేర్పాటు చేయుటవలనను ఇతరకారణములవలనను ఫెడరల్ విధానమును గూర్చి కాం్రగెసుసభవారి అభిప్రాయమునందు కొంతవరకు మార్పువచ్చినట్లు కన్పించుచున్నను, ౧౯౩౭ అక్టోబరు మాసాంతమందు కలకత్తాలో జరిగిన అఖిలభారత కాం్రగెసు కమిటీ సమావేశమందు ఫెడరేషనును ఖండించుచు తీర్మానము తిరుగ చేయబడెను. ఆ తీర్మానమును వివరముగ ముందు ఆలోచించెదము. ఇక్కడ చెప్పదలచిన ముఖ్యవిషయమేమన, హిందూదేశమందలి రాజకీయసంఘములలో ప్రధానస్థానము నాక్రమించుచున్న కాం్రగెసు మహాసభయు, ముస్లీమ్‌లీగు సభయుకూడ ఫెడరల్ విధానమునకు ప్రతికూలముగానున్నవి. ఇది ఇట్లుండ స్వదేశసంస్థానాధీశులలోకూడ ఆ విధానమునుగురించి ఎక్కువ సంతోషమును, ఆతురతయును చూపుచున్నవారిని వ్రేళ్లపై లెక్కింపవచ్చునని చెప్పిన అతిశయోక్తి ఎంతమాత్ర ముండదు. మొదటి రౌండుటేబిల్ సమావేశ (First Round Table Canference) మందుఅఖిలభారత ఫెడరేషన్‌నుగురించి అతి ఉత్సాహముతో మాట్లాడిన సంస్థానాధీశులే ఇప్పుడు నిజముగ ఆవిధానములో చేరుసమయము వచ్చుసరికి అనుమానముతో వెనుకకు తీయుచున్నారు. వారు ఇండియా ప్రభుత్వమువారితో జరుపుచున్న రాయబారములను, వారివారి అధికారముల కెట్టిలోటును లేకుండ చేసుకొనుటకు చేయుచున్న ప్రయత్నములను చూచువారికి ఫెడరల్ విధానమునకు వారియందు కొంతమందియైనను నిశ్చలమగు ఉత్సాహముతో నున్నారని తలంచుటకు వీలులేకున్నది. ఈ విధముగ హిందూదేశమందు ఏసంస్థగాని, ఏ పక్షమునకు చెందినవారుకాని. కోరనట్టివిధానమును వీ రెంతత్వరలో ప్రవేశపెట్టజూచుట దేశము

నకు పూర్తిగ నష్టమేకాని ఏ మాత్రమును లాభము లేదని స్పష్టమగుచున్నది.

## ౩

కాని, ఆ విధానమును ప్రవేశపెట్టుటకును, దానిని వీలైనంతత్వరలో ప్రవేశపెట్టుటకును కూడ ఇండియా ప్రభుత్వమువారును, వైస్రాయియగు లిన్‌లిత్‌గో ప్రభువుకూడ సర్వప్రయత్నములను చేయుచున్న విషయము అందరకును తెలిసినదే. ఈ ప్రయత్నములలో ముఖ్యవిషయమేమన స్వదేశ సంస్థానాధీశులను ఎట్లయినను మంచిమాట చేసుకొని వారిచే ఫెడరేషన్‌నందు చేరుట కంగీకరించునట్లు చేయుట. ఈవుద్దేశము ననుసరించియే సంస్థానాధీశులు మొదట ౧౯౩౫ సంస్కరణచట్టమునందును, పిమ్మట వారితో చేసుకోవలసిన ఒడంబడిక Instrument of Accession యందును వారు కోరిన మార్పులన్నిటిని చేయుటకు ప్రభుత్వమువారు సంసిద్ధులుగా నున్నారు. ఈవిధముగ సంస్థానాధీశులను నయముననో భయముననో కూడగట్టుకొనిన బ్రిటిష్ ఇండియా ప్రజలను లొంగదీయుట తేలికయని వారు తలంచుచున్నట్లు స్పష్టమగుచున్నది. కాని ఆకారణమును బట్టియే ఫెడరల్ విధానము బ్రిటిష్ ఇండియా రాష్ట్రములందలి ప్రజల కెంతవరకు నష్టదాయకముగ పరిగణించుటకు వీలున్నదో తేలుచున్నది. ఫెడరల్ శాసనసభయందు సంస్థానాధీశుల ప్రతినిధులు వారిచే నియమింపబడువారై యుండుటయు, సంస్థానాధీశులే బ్రిటిష్ ప్రభుత్వమువారి చేతులలో కీలుబొమ్మలవలె నుండుటయు, బ్రిటిష్ఇండియన్ రాష్ట్రముల అభివృద్ధికి అడ్డంకులుగా నుండు నని తేటతెల్లము.

## ౪

ఫెడరల్ విధానము దేశమున కనర్థదాయకమని నిర్ధారణ అయినప్పుడు అది ఆచరణలోనికి రాకుండ ఆపుచేయుటకు మార్గములేవి యను ప్రశ్న ప్రాముఖ్యమును వహించుచున్నది. ఈ సందర్భములో ముఖ్యముగ గమనార్హమగు విషయము ఫెడరల్ అసెంబ్లీ (Federal Assembly or Federal Lower House) కి సభ్యులు వివిధ రాష్ట్రముల శాసనసభాసభ్యులచే indirect పద్ధతిని ఎన్నుకోబడవలసి యున్నదను విషయము. ఆ ఎన్నికలు జరుగకుండ ఆపుచేయుటకు మార్గముండినచో ఫెడరల్ అసెంబ్లీ పని ప్రారంభించకుండ ఆగిపోవును. ఫెడరల్ ఎసెంబ్లీ ఏర్పాటు కాబడకపోయినచో ఫెడరల్ విధానమునందలి ఇతరభాగములను ఆచరణలోనికి తీసుకొనివచ్చుట కవకాశములుండవు. కాన ప్రస్తుతము ముఖ్యముగ ఆలోచింపబడవలసిన ప్రశ్న ఈ విధముగ ఫెడరల్ ఎసెంబ్లీకి ఎన్నికలు జరుగకుండ చేయ వీలున్నదా యనునది. కాంగ్రెసు పార్టీసభ్యులు అధికసంఖ్యాకులుగా నుండి, కాంగ్రెసు మంత్రివర్గములు పనిచేయుచున్న రాష్ట్రములందు మంత్రివర్గములు రాజీనామా నిచ్చి సంస్కరణ విధానము పనిజరుగకుండచేయుట ఈ మార్గములలో ఒకటని కొంతమంది సూచించుచున్నారు. కాని ఈ విధముగ మంత్రులు రాజీనిచ్చుటవలన రాష్ట్రశాసనసభలను గవర్నరులు అంత మొందింతు రని కాని, ఫెడరల్ శాసనసభకు ఎన్నికలు జరుగవని కాని తలంచుట కెట్టి అవకాశములును లేవు. మంత్రులు రాజీనామానిచ్చినను, మెజారిటీపార్టీ మంత్రివర్గము నేర్పాటుచేయుట కిచ్చగింపకపోయినను రాష్ట్రీయశాసనసభల నంత మొందించక యుంచుటకు గవర్నరులకు కావలసినన్ని అధికారము లున్నవి. ఇదియుకాక కాంగ్రెసుపార్టీవారు ఫెడరలు అసెంబ్లీసభ్యుల ఎన్నికలలో పాల్గొనకపోయినను, కాంగ్రెసేతర సభ్యులు వారిచే వారెన్నుకోబడునట్లుగ చేయవచ్చును. ఇంకొకవిషయమేమన, కాంగ్రెసురాష్ట్రములందు ఫెడరల్ శాసనసభకు ఎన్నికలు జరుగకపోయినను, కాంగ్రెసుమంత్రివర్గములు లేనిఇతర రాష్ట్రములందు ఎన్నికలు జరుగవచ్చును ఈ స్థితిగతులలో కాంగ్రెసురాష్ట్రములకు ఫెడరల్ శాసనసభలో ప్రాతినిధ్యము లేకుండపోవుటయేతప్ప వేరులాభ ముండదు. అక్టోబరునెలలో లక్నోలో జరిగిన ముస్లిమ్‌లీగ్ సభలో ఫెడరేషనును ఖండించుచు తీర్మానము చేయబడుటయు, పంజాబుప్రధానమంత్రి యగు సర్ సికందర్‌హయత్‌ఖాన్‌గారును, బెంగాలు ప్రధానమంత్రియగు ఫజ్‌లుల్‌హక్‌గారును ముస్లిమ్‌లీగ్‌నందు చేరుటకు నిశ్చయించుటయు కొంతవరకు అనుకూలములగు విషయములే. వీటి పర్యవసానముగ ఆ రెండురాష్ట్రములునుకూడ ఫెడరల్ విధానమునకు వ్యతిరేకముగ కాంగ్రెసుకు చేయూతనిచ్చునని తలంపవచ్చును.

## ౫

పై విషయము అట్లుండగా కలకత్తాయందు జరిగిన అఖిలభారత కాంగ్రెసుకమిటీ సభయందు ఫెడరేషనునుగూర్చి చేయబడిన తీర్మానము నాలోచించుట అవసరము. ఆ తీర్మానము ననుసరించి ప్రతిరాష్ట్ర శాసనసభయందును ఫెడరల్ విధానమును ఖండించుచు తీర్మానించి బ్రిటిష్‌ప్రభుత్వమువారికి పంపవలసియున్నది. పై విధముగ తీర్మానములు కాంగ్రెసు రాష్ట్రముల ఏడింటియందును, పంజాబు, బెంగాలు రాష్ట్రములందునుకూడ ఆమోదింపబడిన వనుకొందము. అటుపిమ్మట జరుగవలసినపని ఏమి? ఆతీర్మానముల ననుసరించి బ్రిటిష్ ప్రభుత్వమువారును, ఇండియా ప్రభుత్వమువారును ఫెడరేషనును ప్రవేశపెట్టరని తలంచుట కెంతమాత్రమును వీలులేదు. ఈ రెండు ప్రభుత్వములును వీలైనంతత్వరలో ఫెడరేషనును ప్రవేశపెట్టుటకు సర్వప్రయత్నములను చేయుచున్నారు; ఇక ముందుకూడ చేసెదరు. ఈ సందర్భములలో కాంగ్రెసు చేయదలంచుకొనిన విధానమును జయప్రదముగ కొనసాగించుటకు తగు విధాన మేమి? ఈ విషయమునుగూర్చి ఆలోచించినచో, ఒకటిరెండువిషయములు మనస్సునకు తట్టును.

(౧) కాంగ్రెసునాయకులు రాష్ట్రీయశాసనసభలలో ఫెడరేషను మా కవసరము లేదని తీర్మానములను ఆమోదింపజేయుటతో సంతృప్తిపడక, దానితోపాటు హిందూమహమ్మదీయ సంయోగమునకై తీవ్రప్రయత్నములను చేయవలసియున్నది. ఈవిధముగ కాంగ్రెసువారును, ముస్లిమ్‌లీగ్‌వారును, లిబరల్ ఫెడరేషనువారునుకూడ ఏకగ్రీవముగ తమ తీవ్రమగు అసమ్మతిని వెలిబుచ్చినచో, బ్రిటిష్‌ప్రభు

త్యము వారుకూడ తమ నిశ్చయమును మార్చు కొనుట కవసర మగునని తలంపవచ్చును.

(౨) వివిధరాష్ట్రముల ప్రధానమంత్రులు సంస్థానాధీశులకు ఫెడరేషన్‌లో చేరుటవు వారు సమ్మతించుటవలన గల నష్టములను చూపుచు అట్లు చేరవద్దని వారినికోరుట. సత్యమూర్తిగారు 'హిందూస్థాన్ టైమ్సు' పత్రికయం దీ సమస్యననుసరించి వ్రాయుచు ఈ సూచన చేసియుండిరి. కాని కాంగ్రెసుమంత్రుల కోరిక ననుసరించి సంస్థానాధీశులు వైస్రాయి, పొలిటికల్ డిపార్టుమెంటు (Political department) ల ఇష్టమునకు వ్యతిరేకముగ చేయుటకు సమ్మతింతు రని తలంచుట అసంభవము. బ్రిటిష్ రాష్ట్రములలో చాలరాష్ట్రములు హర్షించని రాజకీయవిధానములో చేరుటవలన తమ కెంతమాత్రము లాభము లేదని వారిలో కొంతమంది గ్రహింతు రనుకొనినను, ఫెడరేషనును పూర్తిగ ఆపుచేయుటకు వారు చేయూతనొసంగుదురని ఆలోచించుట పిచ్చిమాట.

౬

ఏసందర్భమునుబట్టి చూచినను ఈ దేశమందెవరికిని ఆమోదకరము కాని ఫెడరేషనును ఆచరణలోనికి రాకుండచేయుట అసంభవముగనే కాన్పించును. అఖిలభారత కాంగ్రెసు కమిటీవారి తీర్మానములో హిందూదేశ ప్రజల ఇష్టమునకు వ్యతిరేకముగ బ్రిటిష్‌ప్రభుత్వము వారు ఫెడరలువిధానమును ప్రవేశపెట్టినచో, కాంగ్రెసువా రేమి చేసెదరో సూచింపబడియుండలేదు. కొంతమంది సభ్యు లీ ప్రశ్నను పైకి తీసుకొనివచ్చినప్పటికిని దానికి సరియగు జవాబు ఏకాంగ్రెసునాయకుడు గాని ఇచ్చినట్లు కన్పించదు. సత్యమూర్తిగా రా తీర్మానముపై మాట్లాడుచు అట్టిసందర్భములలో కాంగ్రెసువారేమి చేయుదురో ఇప్పుడు నిశ్చయింపజూచుట తెలివితక్కువ యని వాదించిరి. ఆయన 'హిందూస్థాన్ టైమ్సు'లో వ్రాసిన వ్యాసమునందుకూడ ఈ ప్రధాన ప్రశ్న కే విధమైన సరియగు సమాధానముకాని ఇచ్చియుండ లేదు. పైగా బ్రిటిషుప్రభుత్వము వారుకానిమొండితనముగ ఫెడరేషనుప్రవేశ పెట్టిన, కాంగ్రెసువారు ఫెడరల్ ఎసెంబ్లీలో బ్రిటిష్ ఇండియన్ రాష్ట్రములకు ప్రత్యేకింపబడిన ప్రతిస్థానమును ఆక్రమింపవలెనని వ్రాసిరి. దీనినుండి గ్రహింపవలసిన విషయమేమి? కాంగ్రెసువారు చివరకు ఫెడరేషనను అంగీకరింతు రనియేకదా! ఒకటే పర్యవసానము ఈ సందర్భములో తేలుచున్నది. రాష్ట్రములందు ఇండియాప్రభుత్వ చట్టములోని రాష్ట్రీయ రాజకీయ విధానమునకు మొదటినుండియు అత్యంత ప్రాతికూల్యము చూపిన కాంగ్రెసుపార్టీవారు చివరకు ఆవిధానముక్రిందనే మంత్రివర్గములను కూడ ఏర్పాటుచేయుట కెట్లు సమ్మతించిరో, అట్లే ప్రస్తుతము ఫెడరల్ విధానమును ప్రవేశపెట్టుటకు వారు ప్రాతికూల్యమును చూపుచున్నప్పటికిని, ఇకముందు దానికి సమయము వచ్చినప్పుడు ఆ విధానమునుకూడ వా రామోదింపవచ్చును. వారు చేయగల్గినట్టియు, చేయవలసినట్టియు నా బ్రిటిష్ ఇండియన్ రాష్ట్రములకు ప్రత్యేకింపబడిన ప్రతిస్థానమును గెల్చుటకు ప్రయత్నించుటయే! అట్లు వారు చేయుటవలన ఫెడరల్ విధానము ప్రవేశపెట్టబడినను కొంతలాభ ముండకతప్పదు. ఫెడరల్ శాసనసభయందు సంస్థానాధీశుల ప్రతినిధులు కాంగ్రెసుప్రతినిధులతో కొన్ని విషయములలో కాకపోయిన కొన్ని విషయములందైనను కలసిమెలసి పనిచేయవలసివచ్చును. ఈ సంపర్కమువలన స్వదేశ సంస్థానములకు కూడ త్వరలోనే మార్పుకల్గుట కవకాశము లున్నవి. స్వదేశ సంస్థానాధీశులలో కొంతమందియైనను, ముఖ్యముగ కొంతమంది పెద్ద సంస్థానాధీశులు తమతమప్రజలకురాజకీయహక్కులనిచ్చుటకు అంగీకరించుటకును, ఆ సందర్భములో సంస్కరణలను ప్రవేశపెట్టుటకును సుముఖులుగావచ్చును. ఇతరవిధముగ సంస్థాన ప్రజలకు రా వీలులేని హక్కులు ఈ విధముగ వారికి చేకూరుట కవకాశము లున్నవి. ఇంతకంటె వేరేమిజరుగుట కవకాశమున్నదో ప్రస్తుతము గ్రహించుట కష్టము. కాంగ్రెసువారిలోకూడ ఎవరికిగాని పైన సూచింపబడిన సందర్భములలో ఏమిచేయవలెనను విషయమునుగురించి నిశ్చితాభిప్రాయము లున్నట్లు కన్పించదు. దీనికొరకై మరల కాంగ్రెసు సహాయనిరాకరణమును, చట్టనిరోధమును ప్రారంభించునా యను ప్రశ్న ప్రజాసామాన్యమునకు తట్టుటలో ఆశ్చర్యమేమియులేదు.



# నాగార్జున కొండ

రావిపాటి లక్ష్మీనారాయణ

నాగార్జునకొండవద్ద కొలదిసంవత్సరముల క్రిందట కొన్ని బౌద్ధవిగ్రహములు బయల్పడిన సంగతి యెల్లజనులకు విదితమే. ఈ నాగార్జున కొండ గుంటూరుజిల్లా పల్నాడు తాలూకా మాచర్ల రైల్వేస్టేషనుకు ౧౪ మైళ్ల దూరమున కృష్ణానదీతీరమున కలదు. ఇచటకు 3 ఫర్లాంగుల దూరమున పుల్లారెడ్డిగూడె మను నగ్రహారము కలదు. ప్రాచీన భారతీయ శిల్పకళాకౌశలమును ప్రకటించు బౌద్ధవిగ్రహములు, స్తూపములు, చైత్యములు, విహారములు అనబడు బౌద్ధసన్యాసుల నివాస గృహారామములు బయల్పడినవి. కొన్ని రోమీయనాణెములు దొరకినవి. బ్రాహ్మీభాషలో వ్రాయబడిన శిలాశాసనములు బయల్పడినవి. అనేక రత్నములతో గూడి, బటాణిగింజంత పరిమాణము కలిగి బంగారుబరిణెలో భద్రపరుపబడిన బుద్ధునియెముక దొరకినది.

నాగార్జునుడు బౌద్ధసన్యాసి; ఆంధ్రుడు; రెండవశతాబ్దాంతమునాటివాడు. నాగార్జునకొండయే యితని నివాసము. ఇతనినిబట్టియే ఈ ప్రదేశమునకీపేరు వచ్చినది.

నాగార్జునకొండవద్దనున్న పుల్లారెడ్డిగూడెమను గ్రామము పువ్వుగిరిపీఠమువారి యగ్రహారము. శంకరుని రాకతో ఉండవల్లి గుహాలయములోని బుద్ధుడు అనంతపద్మనాభస్వామిగా మారినాడు. అమరావతిలో నమరేశ్వరుడు వెలసెను. ఘంటసాల, భట్టిప్రోలు, జగ్గయ్యపేట, గుడివాడ, బెజవాడ మొదలగు బౌద్ధస్థలములలో మిన్నయగు నాగార్జునకొండ కూడ ఇట్లే పువ్వుగిరివారి యగ్రహారముగ మారియుండవచ్చును.

పూర్వము నాగార్జునుని కాలమున నాగార్జునకొండ యొక దివ్యస్థలముగ నుండెడిది. బౌద్ధభిక్షులు నివసించుట కచట చక్కనివిహారము లుండెడివి. రాజు తన ప్రజలతో నివసించుట కొక దుర్గముపూడ నుండియుండవచ్చును. ఇప్పటికిని పాడుపడిన కోటగోడలును, ఒక పెద్ద దిగుడుబావియు కొండపై కలవు. ఈ దివ్యసీమను పరిపాలించిన రాజులలో బాహుబలుడు చివరవాడు. ఇచ్చట బయల్పడిన మహాచైత్యాలయము "ఛాంతిశ్రీ" యను రాజకుమారి ప్రోద్బలమువలన నిర్మింపబడినట్లచ్చట బయల్పడిన బ్రాహ్మీలిపిలోని శిలాశాసనమువలన తెలియుచున్నది. వీరపురుషదత్తుడను రాజునకీ 'ఛాంతిశ్రీ' బంధువట. ఈ నాగార్జునకొండ గ్రీసు, చీనా, టిబెట్టు, కాశ్మీరము, గాంధారము (కందహారుదేశము), వంగము (తూర్పు బెంగాలు) మొదలగు దేశములలో పేరుపొందినది. వర్తకులు, పండితులు, మతాచార్యులు మొదలగువారన్ని దేశములనుండి యిచ్చటకు సముద్రముమీదుగా కృష్ణానదీద్వారమున వచ్చువారు. కొండనుండి కృష్ణానదివరకు గల కాలువజాడనొకదానిని దక్షిణదేశపు ఆర్కియాలజికల్ డిపార్టుమెంటు అసిస్టెంటు సూపరింటెండెంటుగారగు ఏ. హెచ్. లాంగ్‌హర్స్టుగారు తీసినారు. ఆ కాలమున ఆంధ్రరాజులకద్ద లక్షలకొలది సైన్యమేకాక, గొప్ప నౌకాబలముకూడ నుండెను. అశోకుని కాలమున నతనికి కప్పము కట్టుచుండిన యాంధ్రు లతని యనంతరము స్వతంత్రులైరి. ఒకప్పుడు ఆంధ్రరాజ్యము కాంచీపురము మొదలు గంగానదివరకు వ్యాపించియుండెను. కొంతకాలము వారికి అమరావతి ముఖ్యపట్టణముగ నుండెను. వారు కవులను, మతాచార్యులను, శిల్పులను పోషించుచుండిరి. గ్రీసు, రోము, ఈజిప్టు మొదలగు దేశములతో వర్తకము సాగుచుండెను. ఆంధ్రులు రమారమి ౪౦౦ సంవత్సరములు పాలించిరి. బౌద్ధస్తూప విహారాదులతో రాజిల్లిన ఆ దివ్యసీమ నామమాత్రావశిష్టమయ్యెను.

౧౪, ౧౫ శతాబ్దములందు నాగార్జునకొండ కొండవీటి రెడ్డిరాజుల యధీనమునందుండినట్లు కొండవీటి దండకవిలెవలన తెలియుచున్నది. కొండవీటిరాజ్యమున ౧౪ సీమలుండెను. అందు నాగార్జునకొండ సీమ యొకటి. నాగార్జునకొండ సీమలో ౧. మాచర్లసముతు, ౨. గురిజాలసముతు, ౩. కారెంపూడిసముతు, ౪. తంగెడసముతు, ౫. తుమృకోడుసముతు లనబడు ౫ సముతులుండెడివి. అవి మొత్తము ౧౫౦ గ్రామములు. ౧౬వ శతాబ్దమున నాగార్జునకొండవిజయనగరసామ్రాజ్యమునకు చెందియుండినట్లు మాచర్లలో వీరభద్రస్వామివారి యాలయములోని యెర్రరాతిబండమీది యీ క్రిందిశాసనమువలన తెలియుచున్నది. "స్వస్తిశ్రీ ః జయాభ్యుదయ శాలివాహనశక వర్షంబులు మాచర్ల యిష్టకామేశ్వరికి, వీరభద్రేశ్వరునకు గాయిగోవాళ ఖడ్గనారాయణ బిరుదాంకిత ప్రశస్తులై శ్వేతచ్ఛత్రాధీశ్వర రేచర్లగోత్ర పవిత్రులైన వెలుగోటినాయనింగారి ప్రపౌత్రులై ... నాయనింగారి పుత్రులైన కుమారతిమ్మానాయనింగారి యర్ధాంగి లింగాంబ దండంపెట్టి యిచ్చిన శాసనము.

శ్రీమద్రాజమార్తాండ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప సదాశివదేవ మహారాజులుంగారు పృథ్వీరాజ్యం చేయుచుండంగాను, తద్రాజ్య ధురంధరులైన శ్రీమన్మహామండలేశ్వర రామరాజు తిరుమలయ్యదేవ మహారాజులుంగారు కుమార తిమ్మానాయనింగారి నాయంకరానకు పాలింప యిచ్చిన నాగార్జునకొండ సీమలోని మాచర్ల కుత్తరభాగాన చంద్రభాగానదికి పడమర సంవత్సరమునకు ౪ నాలుగుపుట్ల పండుమ క్షేత్రముపాలిచ్చే లింగాపురము అగ్రహారము కట్టించి యీ సోమగ్రహణ పుణ్యకాలమందు గంగాగర్భ

ముందుల ధారాపూర్వకముగాను సమర్పిస్తిమి కనుక...

నాగార్జునకొండ బౌద్ధనిర్మాణములు కాల ప్రభావమున భూగర్భమున పూడిపోయినవి. కొంతకాలముక్రిందట ఇచ్చట కొన్ని మంటి దిబ్బ లుండెను. అందునుండి బ్రాహ్మీలిపిలో వ్రాయబడిన రెండుమూడు శిలాశాసనములు మద్రాసు వెంకటవానల కోర్చి తల సూపు చుండెను. ఇచ్చట బౌద్ధవిగ్రహము లుండు నని యూహించి సుమారు ౧౫ సంవత్సరముల క్రిందట కొందఱు ఫ్రెంచిదొరలు వచ్చి త్రవ్వించి కొన్ని బౌద్ధవిగ్రహములను తీసి కొనిపోయిరి. కాని యా విగ్రహములు పట్టు కొనబడి చెన్నపట్టణమునందలి మ్యూజియము నకు చేర్చబడెను. అంతట ఆర్కియాలజికల్ డిపార్టుమెంటువారు వచ్చిచూచి పుష్పగిరిస్వా మివారినుండి యాస్థలమును రు. ౧౯౫౦-౮-౦ లకు కొనిరి. ఆ మంటిదిబ్బల నన్నిటిని త్రవ్వగా కొన్ని దిబ్బలలో ననేక విగ్రహ ములు, మహాచైత్యములు, స్తూపములు, విహార ములు, రోమీయనాణెములు దొరకినవి. సుట్ట చివర సంఘారామమున కెసువ శిథిలములై రెండు స్తూపములున్నవి. అందు చిన్నదానిలో ౧౪ అడుగుల యెత్తుగలదై స్తూపాకారముగల యొక పేటిక దొరకెను. దానిలో నట్టిదే ౬ అంగుళముల యెత్తుగల యింకొకపెట్టె యుండెను. దానిలో ౪" యెత్తుగల రాగి పెట్టె. అందులో ౩" ఎత్తుగల వెండిడబ్బి. దానిలో ౧½" ఎత్తుగల యొక బంగారుడబ్బి యుండెను. దానిలో కొన్ని రత్నములును నొక మానవశల్యమును దొరకెను. ఆ శల్యము ఒటాణిగింజంత పరిమాణము కలిగియుండెను.

ఇది బుద్ధునిశల్య మని నిశ్చయించినారు. మహాబోధిసత్వసంఘమువారు వారణాసివద్ద సారనాథ మను బౌద్ధప్రదేశమున మూలగంధ కుటీవిహార మనుపేరుతో నొక బౌద్ధవిహారము కట్టిరి. దానికి ౨౯-౧౨-౩౨ తేదీన శంకుస్థాప నము జరిగెను. టిబెట్టు, చైనా మొదలగు దేశముల నుండికూడ ననేక బౌద్ధులు వచ్చిరి. అప్పుడు ఇండియా ప్రభుత్వముతరపున డైరక్టరు జన రల్ ఆఫ్ ఆర్కియాలజిగారగు రాయ బహద్దరు లాలాదయారాం సాహినీగారు నాగార్జునకొండవద్ద దొరకిన ఈ శల్యమును దానికి కానుకగా నిచ్చిరి. ఇప్పు డీ నాగా ర్జునకొండవద్ద బంగళాకట్టి విగ్రహముల నొక చోటికి చేర్చి తీగెలచే కట్టుబడిచేసినారు. మాచర్ల రైల్వేస్టేషనునుండి నాగార్జునకొండకు రోడ్డును నిర్మించుచున్నారు.

## నాగార్జునుడు

నాగార్జును డమరావతీవాస్తవ్యు డని "బుద్ధిస్టు ఇండియా" అను గ్రంథమున రైసు డేవిడ్సు అనునతడు వ్రాసినాడు. నాగార్జును డాంధ్రరాజులకాలమువా డనియు, శాత వాహను డను ఆంధ్రరాజునకు స్నేహితు డనియు, నితనికొఱకే యాంధ్రరాజులచే నమరావతీస్తూపము కట్టబడినదనియు 'హూయాన్ త్సాంగ్' వ్రాసినాడు. హూయాన్‌త్సాంగ్ బౌద్ధ యాత్రికుడు; గొప్ప విద్వాంసుడు. చైనాలో దొరకని బౌద్ధగ్రంథముల సంపాదించుటకు, బౌద్ధక్షేత్రముల దర్శించుటకు ఇతడు హిందూ దేశమునకు వచ్చెను. పదునాలుగుసంవత్సరము లానేతుహిమాచల మితడు సంచార మొనర్చెను. తన యనుభవములను, అప్పటి హిందూదేశ పరిస్థితులను నొక గ్రంథముగా వ్రాసెను. ఇత నిని హర్షవర్ధనుడు తన యాస్థానమునకు బిలిచి గౌరవించెను. ఆర్యదేవుడు నాగార్జునని శిష్యుడు.

## నాగార్జునుని నివాసము

నాగార్జున విరచితమైన సిద్ధవినోదన మను గ్రంథమున ని ట్లున్నది.

"సిద్ధనాగార్జునో నామ
పురాసీత్ తాపసో మహాన్,
శాంతో దాంతో జితాత్మాచ
నియతః ప్రయతస్శుచిః.
ఉవాస స చిరం సోఽపి
రేవాతీరే మనోరమే,
శాంతినికేతనే తత్ర
ఆశ్రమే చిత్తహారిణి" యని.

రేవా (నర్మదా) నదీతీరమున శాంతినికే తన మను నొక యాశ్రమమున చిరకాల మిత డుండె నని తెలియుచున్నది. సర్ ప్రఫుల్ల చంద్రరాయిగారు సెలవిచ్చినదానిని బట్టి ఘూర్జర (Guzarat) దేశమందలి సోమనాథ పురివద్ద 'డయహక్' గ్రామ మగుచున్నది. కాశ్మీరరాష్ట్రమందలి యరణ్యములో నిత డాయుదినము లుండె నని రాజతరంగిణి యను గ్రంథమువలన తెలియుచున్నది. రాజతరంగిణి కాశ్మీర దేశచరిత్రను తెలుపు గ్రంథము. అది యాంధ్రమునకుకూడ ననువదింపబడియున్నది. పారావతమతమునకు నాగార్జునుడు బౌద్ధ భిక్షువులను సన్న్యాసులను రప్పించి వారికై ధర్మశాస్త్రముల నన్నిటిని వ్యాఖ్యానములతో సహా తెప్పించి మహాభాండారము నేర్పాటు చేసెను. వరదానది సమీపమున "భాండక్" అను పట్టణసమీపమందలి వింధ్యసానిపర్వత మీతని నివాస మని పెర్గ్యాసనుగారి యభి ప్రాయము. శ్రీశైలమే యితని నివాసస్థల మని చిలుకూరి వీరభద్రరావుగారు తమ యాంధ్రులచరిత్రములో వ్రాసినారు. అప్ప టికి నాగార్జునకొండ బయల్పడకపోవుట చేతను, నాగార్జునకొండలోవలె పెద్ద బౌద్ధ విగ్రహములు శ్రీశైలమున లేకపోవుటచేతను, శ్రీశైలమువలె నాగార్జునకొండయు, నాగా ర్జునివంటి మతాచార్యుల కనువగు (కృష్ణా) నదీతీరమందే గల పర్వతప్రాంత మగుటచేతను నాగార్జునకొండయే ఇతనినివాసస్థల మనియు, శ్రీశైలము కా దనియు మన మనుకొన వచ్చును. నాగార్జునకొండ యను నామమే యీ విషయమును బలపరుచుచున్నది. ఇతని శిష్యుడయిన ఆర్యదేవుడు పాటలీపుత్రసమీప మున 'నలంద' విహారమును నితని ప్రోత్సాహ ముచే కట్టించెను. కావున నితని నివాసస్థానము నాగార్జునకొండ యనియు, సన్న్యాసి యగుట చేత ఘూర్జరదేశమున చాలకాల ముండె ననియు, కాశ్మీరము, మగధదేశములలో నితడు సంచరించెననియు తెలియుచున్నది.

## నాగార్జునునికులము

నాగార్జునుడు భూమిశ్వరు డని రాజ తరంగిణివలన తెలియుచున్నది. ఇతనికొఱకే యమరావతీస్తూపములు నిర్మింపబడె నని హూయాన్‌త్సాంగ్ వ్రాసినాడు. ధర్మశాస్త్ర పరిభాషలో కల లిచ్ఛవిక్షత్రియులలోని

యొక శాఖవారగు శాక్యులవంశజుడు బుద్ధుడు. లిచ్ఛవిక్షత్రియులు యజ్ఞయాగాదికర్మలను వదలిన సూర్యవంశజులనుండి వేఱుపడిన యొక శాఖవారు. నాగార్జును డీ శాఖవా డని తెలియుచున్నది. కాన నితడు సూర్య వంశజుడగు క్షత్రియకులు డనియు, యాంధ్రు డనియు మన మూహింపవచ్చును.

## నాగార్జునుని కాలము

ఈ నాగార్జునునకు పోషకుడు (దాన పతి)గా నుండిన యాంధ్రరాజు తన రాణి యొక్క తంత్రమునకు వశుడై యామె కొడుకు సుశక్తి యనువానికి సింహాసనము కట్టబెట్టు టకై ప్రయత్నించి, తన యాచార్యుడైన నాగార్జునుడు మరణించినకాలముననే మర ణించెనట. ఈరాజు శాతవాహనవంశమందలి కడపటి యాంధ్రరాజులలోనివాడై యుండు నని టిబెట్టుదేశచరిత్రను వ్రాసిన తారా నాథుడు క్రి. శ. ౧౫౦ మొదలు ౨౨౦ వఱకు నాగార్జును డుండినట్లు కాలనిర్ణయము చేసి నాడు. శకరాజయిన కనిష్కుని బౌద్ధసభ (రెండవ బౌద్ధసభ) బుద్ధనిర్వాణమునకు తరు వాత రమారమి ౪౦౦ సంవత్సరములకు జరిగి నట్లు టిబెటీయుల గ్రంథములలో చెప్పబడి నది. ఈ కనిష్కుడు క్రీ. శ. ౭౮ మొదలు ౧౦౦ ప్రాంతమువా డని సామాన్యముగా నందరును అంగీకరించుచున్నారు. బౌద్ధుల ప్రధానగురు వగు పార్శ్వుకు డా బౌద్ధసభ కధ్యక్షుడు కాన నతడు కనిష్కునకు సమ కాలికుడై యుండవలెను. పార్శ్వుకుని తరు వాత నశ్వఘోషుడు, నాగార్జునుడు బౌద్ధపీఠ మెక్కిరి. కావున నాగార్జునుడు రెండవశతా బ్దాంతమున నుండవలయును. కనిష్కుని తోపాటు హవిష్కుడు, జుష్కుడు, తరు వాత నభిమన్యు డను పేరుగల రాజులు పాలిం చిరి. ఈ యభిమన్యుడు కాశ్మీర మేలు నప్పుడు నాగార్జునుని ప్రబోధమువలన కాశ్మీర రాష్ట్రమందలి ప్రజలు నీలపురాణోక్తమైన యాచారముల వదలి యాగమ ద్వేషు లయి రని కల్హణుడు వ్రాసినాడు. ఈ నాగార్జునుడు వ్రాసిన "సుహృల్లేఖ" యను కావ్యమును సం స్కృతభాషాంతరీకరణమును గుణవర్మ యను నాతడు క్రి. శ. ౪౩౧ ప్రాంతమున జేసె నని యాంధ్రులచరిత్ర చెప్పుచున్నది. పై కారణములవలన నాగార్జునుడు రెండవ శతా బ్దాంతమువా డని మనము నిర్ణయించవచ్చును.

## నాగార్జునునిమతము, గ్రంథములు

నాగార్జునుడు మహాయానసూత్రముల రచిం చెను. రసతంత్రమునుగూర్చి యనేకగ్రంథముల రచించెను. వైద్యమునందును నితని పేర కొన్ని మందులు కనుబడుచున్నవి. సిద్ధ బోధన మను గ్రంథమును, సుహృల్లేఖ యను కావ్యమును రచించెను. సిద్ధవినోదనమం దిట్లున్నది.

శ్లో. శివస్య ప్రియశిష్యస్య
త్రికాలజ్ఞో మహామతిః
వశగా న్యధితిష్ఠంతి
షట్కర్మాణిచ ధీమతే. అని.

దీనినిబట్టి యితడు శివుని శిష్యు డనియు, త్రికాలజ్ఞు డనియు, మారణోచ్చాటనాది షట్కర్మలను వశపఱచుకొనినవా డనియు తెలియుచున్నది. హిందూదేశచరిత్రను వ్రా సిన స్మిత్తు మహాశయుడు అమరావతీ బౌద్ధ స్తూపములతో నితనికి సంబంధము కల దని తెలుపుచున్నాడు. నాగార్జునుడు గొప్ప ప్రవక్త యని బౌద్ధగ్రంథములలో కలదు.

హీనయాను లని, మహాయాను లని బౌద్ధులు రెండు తెగలవారు. అందు మహాయానపద్ధతిని నాగార్జునుడు నెలకొల్పెను. ఇతడు బ్రహ్మ, విష్ణు, శివ, గణేశు లను దైవతములతో నా విగ్రహముల తలలయందు బుద్ధుని నెలకొల్పి, వారికి ఉపాసకు లని పేరుపెట్టి బోధిసత్వగణ ముగా హీనయానులను వేఱుపఱచి తన మహా యానమతమును వ్యాపింపజేసెనట. అట్టి శిలా విగ్రహము లిప్పటికిని నాగార్జునకొండవద్ద కొన్ని కలవు. ఇతడు ప్రజ్ఞాపారమితము లన బడు గ్రంథముల రచించెను. నాగార్జునుడు శివశిష్యు డని సిద్ధవినోదనమం దుండుటచే మొదట శైవుడుగా నుండి తదుపరి బౌద్ధు లలో చేరియుండును. గోతమీపుత్ర యజ్ఞశ్రీ యను ఆంధ్రరాజు (ఈతని సమకాలికుడు) పేరుగల నాణెములందు "ఓడ" చిత్రింపబడి యుండుటచేత నీతనికాలమున ఓడలగూర్చి యు, నౌకాయాత్రనుగూర్చియు నాంధ్రు లకు బాగుగా తెలియు ననియు, సుమత్రా, జావా, బోర్నియో, బర్మా, సింహళము చీనా మొదలగువానితో విశేష వర్తక వ్యాపారముల చేయుచున్నట్టు తెలియు చున్నది. శాతకర్ణి ని యేవో సులికలు సేవించ నియోగించె నని "భీల్" మున్నగు పాశ్చాత్య రసాయన శాస్త్రవేత్తలు నమ్ముచున్నారు. ఇతడు రాళ్లను బంగారముగా మార్చు విద్యను నెలకొల్పిన శాస్త్రవేత్తయట. బౌద్ధమతమును బోధించుటకై రాజాంతఃపురములలోనికి నిరాటంకముగా బోవుచు వచ్చుచుండువా డట. ఇతడు రతిరమణము మున్నగు కామ తంత్రగ్రంథములకూడ రచించెను. ఇతనికి ఇంద్రజాలముకూడ తెలిసినట్టు తెలియుచున్న ది. ఇతడు శ్రీశైలమున మరణించె నని యాం ధ్రులచరిత్రలో కలదు.

# ఆంధ్రుల పరిశ్రమలు: ★

# ★ తెలుగుటాకీ వ్యాపారము

ఏ. ఏ. సీతారామయ్య

ప్రస్తుతము ప్రపంచమందలి ప్రసిద్ధవ్యాపారములలో నొకటగు సినిమా వ్యాపారము టాకీలు వచ్చినతరువాత విశేషమైన మార్పు చెందినది. తదాదిగా ఈవ్యాపారము బహు శీఘ్రగమనంలో అభివృద్ధిచెంది ప్రపంచమంతటా విపరీతంగా వ్యాప్తిపొందినది. మన దేశంలో కూడా ఈ సినిమావ్యాపారము షుమారు పాతికసంవత్సరముల కిందటనే ప్రారంభించినా ౧౯౩౧-౩౨ ప్రాంతములలో టాకీలు వచ్చినదాకా దేశంలోని ఏ ఒకటి రెండు ముఖ్య నగరములలోనో తక్క ఎక్కువగా ఆలోచింపబడలేదు. మహారాష్ట్రములోని నాసిక్ నగర ప్రాంతములయందును కలకత్తానగరమునను ఈవ్యాపారమును కొందరు సాగించుచుండిరి. తరువాత బొంబాయి కూడ చేరినది. కాని ౧౯౩౧-౩౨ లో టాకీలు ప్రవేశించగనే బొంబాయి ఇంపీరియల్ కంపెనీవారు తమ మొదటిటాకీ 'ఆలం-ఆరా' టాకీని దేశంలో విడుదలచేయగనే ప్రేక్షకులకు దానియందుగల్గిన వ్యామోహమును గుర్తించి ధనవంతులు వ్యాపారస్థులు దీనిలోదిగి కంపెనీలు స్థాపించి టాకీలు తీయడం మొదలుపెట్టినారు. మూడు సంవత్సరాలకిందట మన దేశంలో ఈ టాకీవ్యాపారంలో షుమారు ౫ కోట్ల రూపాయిలు పెట్టుబడి వినియోగించారు. ఇప్పుడు దాదాపు ఇది రెట్టింపు అయివుంటుంది. హిందూదేశం మొత్తంమీది పరిస్థితు లిట్లున్నాయి. అటు కలకత్తాలోని న్యూథియేటర్సు, పూనాలోని ప్రభాత్ ఫిలింకంపెనీ, బొంబాయిలోని బొంబాయిటాకీస్ అను మూడు సంస్థలు మనదేశంలో ఫిలిములను తయారుచేయడంలో వాటిమీదరాబడి పొందడంలో విదేశకంపెనీలకు చేరువగావున్నాయి.

ఇక అసలు విషయానికి వద్దాం దేశంలో పరిస్థితు లిట్లావుంటే మన ఆంధ్రదేశంలో ఈ వ్యాపారంయొక్క స్థితి యెట్లాగున్నదీ అనే నేను యిక్కడ వ్రాయదలచుకున్నది.

తెలుగు సినిమావ్యాపారం ప్రారంభించి దారిచూపిన గౌరవం మన తెలుగువాడికి కాక ఒక అన్యరాష్ట్రీయుడికే పోయింది. మన మొదటి తెలుగుటాకీ తమిళనటీమణి టి. పి. రాజలక్ష్మి నాయకిపాత్ర ధారిణిగా, బొంబాయి ఇంపీరియల్ ఫిలింకంపెనీవారిచే తయారు చేయబడిన 'కాళిదాసు'. దానిని నేనుమాత్రం యింతవరకు చూడలేదు. దానిలో భాష కొంతవరకు తమిళమిశ్రమంగా వుందన్నారు. అవిఘ్నంగా ప్రారంభమైన మన తెలుగుసినిమా వ్యాపారము ఈస్టిండియా ఫిలింకంపెనీ వారిచే తయారుచేయబడిన 'సావిత్రి' వలన కొంత పైకి వచ్చింది. ఆ కంపెనీలోనున్న విలువగల యంత్రముల నాధారము చేసికొని ప్రసిద్ధులైన సాంకేతికశాస్త్రజ్ఞులు చిత్రమును తయారుచేయుటవలన దానికి మంచి పేరువచ్చి ప్రజలలో ఒక నూతన అభిరుచి - అభివృద్ధి పొందజొచ్చింది. అప్పటికీ ఈ వ్యాపారంలో వున్న లాభములనుగురించి ఆలోచించగల దూరదృష్టి మన వర్తకులలో ధనవంతులలో వకరికైనా లేకపోయింది. పైగా అటువంటి వారి కెవరికైనా దీనివిషయం చెపితే నాటకాలలో సినిమాలలో డబ్బు రావడమేమిటని నవ్వి పారేశేవారు. ౧౯౩౩ వ డిసెంబరు 'భారతి'లో నేనదివరకే వ్రాసిన ఒకవ్యాసం ఈ పరిశ్రమయొక్క గొప్పదనమును సూచిస్తూ వ్రాసినవ్యాసం- ప్రచురింపబడింది. కాని అది ఒకవ్యాపారస్థుని దృష్టినైనా తగిలియున్నట్లు నాకు తోచదు. పైగా అప్పటికే కొన్ని టాకీలు ఇతరరాష్ట్రీయులవలన తయారైనవి మనదేశం వచ్చి డబ్బు దోచుకుపోతుంటే మన దాన్నుచూచి యిగిలించినారేకాని ఒక్కరైనా ఈ వ్యాపారాన్నిగురించి ఆలోచించినవారున్నట్లు కనపడదు. ఇక్కడ ఒక్కసంగతి. ఇప్పటికే చాలప్రఖ్యాతినొంది యింకను అభివృద్ధి పొందుటకు అవకాశము గల ఈ వ్యాపారముయొక్క మన రాష్ట్రములోని పురోభివృద్ధినిగురించి చర్చించేటప్పుడు యింతవరకు మనం చేసినతప్పులు కొంతవరకు ముచ్చటించక తప్పదు. అందువలన ఈ వ్యాపారమునకు సంబంధించిన యెవరును మరొకవిధంగా ఎంచరాదని నాప్రార్థన.

౧౯౩౩ డిసెంబరులో నేను వ్రాసిన దానికిని యిప్పటి పరిస్థితులకును ఈ వ్యాపారమునకు సంబంధించిన ముఖ్యపరిస్థితులలో ఎక్కువభేదం కనపడటంలేదు. కాకపోతే అప్పటికన్న యిప్పుడు మనం తయారుచేశామని అనుకుంటున్న కొన్నిచిత్రాలు ఏర్పడినాయి. కాని తీసినవాటిలో ఎన్ని మనసొంతంగా చెప్పుకోవచ్చో గమనించండి. ౧౯౩౫ ప్రారంభంలో కాబోలు యం. యస్. ఆర్. ఐ. గుప్తగారివలన తయారు చేయబడిన 'తులాభారం' వారిసొంత మట. అందువలన దానికి ముందువన్నీ తెలుగువారివి కావని చెప్పవచ్చు. అంతకుముందు కాని, తరువాత కాని తయారైన 'సావిత్రి' 'అహల్య' 'పాదుక' 'లవకుశ' వగైరా చిత్రములు యితరరాష్ట్రీయులవి. 'అనసూయ' 'రుక్మిణీకల్యాణం' 'కీచకవధ' 'నరనారాయణ' మొదలైనవి మన తెలుగువారు స్టూడియోసొంతదారులతో గాని యితరులతోగాని భాగస్థులుగా చేరి తయారుచేసినవి. వేలుపిళ్ళవారి చిత్రాలు ఆకంపెనీ మూలధనంలో మూడువంతులు గనక తెలుగువారి దైనట్లైతే అవికూడా తెలుగువారివే అవుతాయి. ఆవిషయం నాకు తెలియదు. పోతే అచ్చంగా

తెలుగువారి వని చెప్పదగ్గ చిత్రాలు 'ద్రౌపది'కి సంబంధించిన రెండు చిత్రాలూ, 'రాణీ ప్రమీల' 'కనకతార' 'సతీతులసి' 'సంపూర్ణ రామాయణం.' దాదాపు ౪౦ చిత్రాలు తెలుగులో తయారైతే ఒక అరడజను మాత్రం మనవాళ్లవి అని చెప్పుకునే అవకాశం కలిగింది. వీటిలో తక్కువచిత్రాలతో పోల్చిచూస్తే చెప్పుకోదగ్గరాబడికూడ కలగ లేదు. వ్యాపారంలో దిగి నాలుగుసంవత్సరాలైంది. పరిస్థితు లీవిధంగా వున్నాయి. కారణాలు ఆలోచిస్తే మన ఈ వ్యాపారం యికముందు ఏవిధంగా నడిస్తే లాభకరమో తెలుస్తుంది.

## స్టూడియోలు

ఇంతవరకు తయారైన ఫిలిములు దాదాపుగా అన్నీకూడా అన్యరాష్ట్రీయుల స్టూడియోలలోనే తయారైనాయి. దీనికి కారణం మనకు యిటీవలవరకూ స్టూడియో అనేది లేకపోవడమే. స్టూడియో అనగానే అదోపెద్ద పెనుభూతంలాగ వుంటుంది మనవ్యాపారస్తులకు. నిజానికి మనవాళ్లుయింతవరకూ తయారుచేసిన చిత్రాలమాదిరి చిత్రాలు తయారుచేయడానికి అనువయే స్టూడియో నిర్మించడానికి ఒక్క రెండులక్షల రూపాయీలుంటే చాలు. గొప్పగొప్ప చిత్రాలు తయారుచేయడానికి విలువయిన యంత్రాదులూ కావలసివస్తాయి. "ద్రౌపది" కథను ఫిలిములుతీసిన రెండుకంపెనీలవాళ్లూ కలిసి స్టూడియో నిర్మాణానికి పూనుకొన్నట్టయితే చక్కని తెలుగుస్టూడియో ఒకటి తయారై ఆదర్శవంతములైన తెలుగుఫిలిములు తయారుచేశేందుకు స్థిరంగా ఏర్పడివుండేది. అటువంటి స్టూడియోమీద, ఆర్థికంగా చూచినా, ఈ ఫిలిములమీదవచ్చిన రాబడిమాత్రం ధనం రాకపోయేదీ కాదు. ౧౯౩౩ వ డిసెంబరులో "భారతి"లో నేను వ్రాసినవ్యాసంలో స్టూడియో నిర్మాణావసరం తెలుగుదేశంలో ఎంత అవసరమో, దానివలన ఎంత లాభ మున్నదో, అది లేకపోవుటవలన కలిగే నష్టమెంతో తెలుపుతూ ఆంధ్రదేశంలో స్టూడియో వకటి వెంటనే కట్టించవలసినదిగా సినిమావ్యాపారస్తులను కోరినప్పటికీ చాలాకాలంవరకూ వారికి దీనిలోని అర్థం బోధపడిందికాదు. అన్యరాష్ట్రీపు స్టూడియోలలో మనచిత్రాలు తీయడంవలన కలిగేనష్టాలు అనేకం. అన్నిటికంటె సాంకేతికములయిన యిబ్బందులు ముఖ్యం. తెలుగుటాకీ తయారుచేసినా, దానిలో భావ తెలుగుభావ అయినప్పటికీ వేషాలు ఏ బెంగాలీ అవతారాలు గానో మహారాష్ట్రీపు అవతారాలుగానో పరిణమిస్తాయి. కథావాతావరణానికి తగినభవనములు ఉద్యానవనములు చిల్లరపాత్రధారులు మొదలగు ప్రకృతిసిద్ధములైన విషయములు దొరకకపోవడమేగాక మనం స్టూడియోలో తయారుచేసికొనే సెట్టింగులు వగైరాలు కూడ ఆయారాష్ట్రీయుల కళాసంప్రదాయములను బట్టి మనకు కొత్తగావున్న విధంగా తయారై వుంటాయి. మనకళాభిజ్ఞులనూ మన శిల్పులనూ తీసికొని వెళ్లి మనసంప్రదాయానుకూలముగా వాటిని తయారుచేసికొనుట మనకు చాలాకష్టం. ఒకవేళ తీసుకువెళ్లినా వారికి అచ్చట తగు అవకాశములు లభించడం అసంభవం. ఈ కారణంచేతనే మనకథలు ఇతర వాతావరణములలో తయారగుచున్నాయి. సెట్టింగులూ సామానులూ వగైరా అన్నీ మనకు సంబంధించనివిగా వుంటాయి. ఇంతవరకు ఇతరరాష్ట్రీయులో సాంఘికటాకీలు మనవాళ్లు తీయడం మొదలుపెట్టబడక పోవడం వలనగాని లేకపోతే ఈ యిబ్బంది మామూలు ప్రజలకు గూడా బాగా కనపడేది. నటుల వేషధారణ గూడా ఆయా రాష్ట్రీయుల సంప్రదాయానుసారముగా తయారుచేయుటవలన వేషములుగూడ మన కల్పనాదృష్టికి అతీతములుగానుండి ఒక్కొక్క సమయంలో హాస్యాస్పదంగా వుంటాయి. చిల్లరపాత్రల విషయంలో ఇది మరీఘాటుగాకనపడుతుంది. ముఖ్యపాత్రలు మనవాళ్లయియుండి ప్రక్కనవున్న చిల్లరపాత్రలు ఇంకోదేశంవాళ్లుండి మూగవాళ్లలాగ ప్రవర్తించడం, ఖర్మంచాలక మాట్లాడితే వచ్చీరాని అసభ్యపు తెలుగు మాట్లాడడం జరిగి నానారసాభాసవుతున్నది. నటులు యిచ్చేసంగీతంకాక, కథవెంటనడుపబడు ప్రక్కసంగీతం సాధారణంగా అన్యరాష్ట్రీయులచే నడుపబడుటవలన నటుల గానానికి దానికీ, వారి సంభాషణలకూ దానికి సామరస్యము కుదరక వాతావరణం పాడు చేస్తున్నది. మన మే ప్రత్యేకంగా ఒకసంగీతపుజట్టును ఏర్పరుచుకొని అంతమారం పోవడానికి ఖర్చవుతుందని స్టూడియోవారిమీదనే ఆధారపడడం వారిసంగీతానికి మనవాళ్లకి సంబంధించక అవకతవకగా వుండటం సంభవిస్తున్నది. నటులు పాడే పాటలు వగైరాలు సయితం, మ్యూజిక్ డైరెక్టరులు చాలా పరిస్థితులలో అన్యరాష్ట్రీయులే కావడంచాతనూ, లేక ఎవరైనా మనవాళ్లున్నా వారుకూడా తదన్యరాష్ట్రీయ గాయకులకు దాసులే యైయుండుటచేతనూ, పాటయొక్క ఫణితి యిచ్చేవానికి తెలుగు భాష తెలియక, పాట వ్రాసేకవికి ఆభాష తెలియకపోవుటచేతనూ, మన సంప్రదాయానుగతమైన సంగీతము సాధారను చేసికొని సందర్భమునకు తగుపాటలు వ్రాయగలవారు లేకపోవుటచేతనూ, యిటీవల వచ్చిన అసంఖ్యాక 'సునోసునో' గీతానుకరణ పాటలవలె సంకరముగా తయారవడం కలుగుతున్నది. అట్లుగాక స్టూడియో మనదేశంలోనే వుంటే మనగాయకులతో విద్వాంసులతో ఆలోచించుకొని ఒకప్రత్యేక గానపద్ధతిని మన ఫిలిములకు ఉపయోగించుకొనే అవకాశం కలుగుతుంది అవసరం కూడాను. న్యూ థియేటర్సు, ప్రభాత్, బాంబే టాకీసు మొదలగు సంస్థలు ప్రత్యేకతతో కూడిన చక్కని గానపద్ధతులను సృష్టించుకొని యున్నారు. మనం ఏది కనబడితే అది తడుముకుంటూ ఏది ఎట్లా ఉపయోగించుకోవాలో తెలుసుకోకుండా తారట్లాడుతున్నాము. అందువలన సాంకేతికములయిన యిబ్బందులను దాటుటకు (సెట్టింగులు వేషధారణ, చిల్లర నటులు వగైరా), తెలుగు సంప్రదాయానుసారముగా మనఫిలిముల కనువగు సంగీతము సృష్టించుటకొరకు, మన దేశంలో మనస్టూడియోలోనే మనచిత్రాలు తయారుచేసుకోవలసిన అవసరమున్నది. ఇటువంటిపరిస్థితులలో రాజమండ్రిలోని దుర్గాసినిటోనువారు ఆంధ్ర

లలో ముందంజవేసి, స్టూడియో కట్టించారు
కాని చెప్పుకోదగ్గఫిలిము తీయకపోవడమే
కాక తీసినవకదానితో సంతృప్తి చెంది మళ్లీ
యింతవరకు కలుగజేసికోకుండా వున్నారు.
తరువాత ఆస్టూడియో గుత్తకు తీసికొన్నవా
రైనా, యింతవరకు ఒక సంవత్సరమైనా,
ఏమి చేశారో ప్రపంచానికి తెలియజేశారు
కారు వార్తాపత్రికలవారి గోల తప్ప.
తరువాత ప్రఖ్యాతవర్తకులైన రాజుఅండ్ కో
వారు విశాఖపట్టణంలో ఆంధ్రసినిటోనును
ఏర్పాటు చేశారు గొప్పవారిని ప్రోత్సచేసి.
కాని స్టూడియోనిర్మాణం ప్రారంభించి దాదా
పు ఒకసంవత్సరన్నరకాల మైనప్పటికీ యిం
తవరకూ ఒకచిత్రమైనా తయారుచేయలేదు
సరిగదా యింతవరకు ప్రారంభించినట్టుగూడ
వార్తలు లేవు. అయినప్పటికీ ఆంధ్రులు,
ముఖ్యంగా ఫిలిములు తీసేవారు, ఆంధ్రసిని
టోనును, దుర్గాసినిటోనును, స్టూడియో
నిర్మాణాభిముఖులైన లక్ష్మీసినిటోనును అభి
మానించి ప్రోత్సహించవలసినవిధి కలిగి
యున్నారని తెలుపుచున్నాను. అన్య
రాష్ట్రీయులు స్టూడియోలలోమాదిరే ఫిలిం
నిర్మాణముగూడ ఉన్నతాదర్శములతో సక్రమ
పద్ధతులమీద తయారుచేయబడుటకు వలయు
పూచీ ఈస్టూడియోవారు చూపవలెను. అటు
వంటినమ్మకము స్టూడియోలవారు కలిగించిన
ప్రొడ్యూసర్లు అన్యరాష్ట్రములకు పోరు.

ఇక్కడ మరియొకవిషయం అప్రస్తుతం
కాదు. స్టూడియోలను నిర్మించినంత మాత్ర
మున సంతృప్తిచెందక వాటిలో పనిచేయు
సాంకేతిక శాస్త్రజ్ఞులు మొదలగువారిని
సాధ్యమైనంతవరకు మనవారినే నియమించి,
పరిశ్రమ మనరాష్ట్రములో ప్రారంభదశయం
దున్నదిగాన అట్టివారు వెంటనే లభించరు
గాబట్టి, ఏరాష్ట్రమువారినైననూ అగ్వాతను
పట్టి తీసికొని మనయువకులను ఆయాశాఖ
లలో వారిచేతిక్రింద తయారుచేసి కొలది
కాలములో ఫిలింనిర్మాణముయొక్క అన్ని
శాఖలలోనూ ఆంధ్రులనే నిపుణులుగా నియ
మింపగల అవకాశము నేర్పరుపవలెను. కాని
పరిశ్రమ ప్రారంభమందున్న ఈ సమయములో
మాత్రము ఈ ఆంధ్రత్వమును వదలి ఆయా
శాఖలలో అనుభవమూ జ్ఞానమూ గలవారిని
చేకొని మంచి పునాదివేసికొనిననే మనఫిలిం
పరిశ్రమాసౌధము చక్కగా తయారుకాగలదు.

### ఫిలిం కంపెనీలు

స్టూడియో సరియైనది ఒకటైనా లేకపో
యినా ఫిలిములు తీసేకంపెనీలు మాత్రం
మిక్కుటంగా ఏర్పడిపోయినాయి. పూర్వం
మైలవరంకంపెనీలోని నటులు ఆకంపెనీ
పోగానే తలకొక కంపెనీ స్థాపించారు;
దాదాపుగా అందరూ ఆవిధంగానే నేడు
కూడా ఒక్కమారు ఏఫిలింకంపెనీతోనైనా
ఏవిధమైన సంబంధమైనా కొంత ఏర్పడిందీ
అంటే దానితో ప్రతివ్యక్తీ వకకంపెనీ స్థాప
నకు పూనుకుంటున్నాడు. అందువలన దేశ
మంతటా కంపెనీలు వెలిశాయి కుక్కగొడు
గుల్లాగ. ఇందులో ఎక్కువ లిమిటెడ్ కంపె
నీలు. ప్రజలమీద పడి షేర్లు వసూలుచేయడం
వచ్చిన సొమ్ము కంపెనీనడిపే ఖర్చులుకిందా,
అలవెన్సులకిందా ఖర్చు చేసుకుంటున్నారు
చాలామంది. అందువలన ప్రజలలో యిప్పుడు
ఈ ఫిలింకంపెనీలంటే అందరికీ అనుమానం,
అపోహ ఏర్పడింది. వీటిలో నిజంగా ఫిలి
ములు పరిశ్రమదృష్టితో చక్కగా తీసి
ప్రదర్శించవలెననే కంపెనీలు లేకపోలేదు.
కాని అటువంటివి బహుతక్కువ. చాలా
కంపెనీల మూలపురుషులు ఈ పరిశ్రమ
అనుభవంకాని పరిజ్ఞానంకాని లేక ఆద
ర్శాలుగూడ లేక తయారవడంచేత వసూ
లయే సొమ్ము ఖర్చులకింద జమకట్టి ఎన్నా
ళ్లయినా వకఫిలిమైనా బయటపడటం జరగక
పోతున్నది. కొన్ని కంపెనీలు బోర్డు కట్టడం,
కట్టిన పదిరోజులకే తీసివేయడం, ఏమీసంబం
ధంలేని వ్యక్తులను సంబంధమున్నట్టుగా ప్రక
టించడం, మారుమూలల గ్రామాదులలోని
అమాయకప్రజలను మోసగించి ధనంకూర్చడం
ఎక్కువగా జరుగుతోంది. కొన్ని కంపె
నీలలో ధనవంతులు చేరినప్పటికినీ డబ్బువిష
యంలో వారి కేమీ బాధ్యత లేకపోవడం,
తమ గొప్పపేర్లమీద వసూలయేధనం తమ
యలవెన్సులమీద ఖర్చుచేసుకుంటూ కాల
క్షేపం చేయడం జరుగుతున్నది.
ఈ కంపెనీలలోని కొన్నిటిచరిత్రలు చూస్తే
చాలా అసహ్యకరంగా వున్నాయి. అందు
వలన యింతకటె విపులంగా పోకుండా నేను
చెప్పేదేమంటే పరిశ్రమను చక్కనిదృష్టితో
అవగాహనచేసుకుని పరిశ్రమాభివృద్ధిని ఆదర్శ
కరంగా పెట్టుకొని నడుపుకుంటే యిటువంటి
లాభాలు యింకో పరిశ్రమలో కనపడవు
యిప్పట్లో. మన తెలుగుదేశంలోని యిన్నికంపె
నీలు తక్కువ మూలధనముతో బాధపడుతూ
కాలక్షేపణచేసేకంటె కొన్నికలసిపోయి పెద్ద
కంపెనీలుగాఏర్పడి పరిశ్రమను చక్కగాపెం
పొందించుకుంటే మంచిది. దీనికి ఆయాకంపె
నీల పెద్దలు సామరస్యబుద్ధితో ఆలోచించు
కుంటే కష్టంగాదు. అందరికీ లాభకరం.
విశేషత్యాగం అవసరంలేదు. అందువలన
మనకంపెనీలు ఒకదానితో ఒకటి చేరి పెద్ద
కంపెనీలుగా ఏర్పడడం చాలా అవసరం.

### జాయింటుచిత్రాలు

కొన్నికంపెనీలయితేనేమి కొందరు ఫిలిం
నిర్మాణమందలి ఉత్సాహవంతులైతేనేమి
తగినంత ధనము లేనప్పుడు స్టూడియో సొంత
దారుతో కలసి జాయింటుగా తీయడం కద్దు.
దీనివలన నటులకు యిద్దరు యజమానులవడం
సాధ్యమైనంతత్వరలో చిత్రం తయారు
చేయాలని ఒకరికి సంకల్పం, అదివరకు తమ
స్టూడియోలో తయారైన చిత్రాలతాలూకు
భాగాలను అతికించి చౌకగా తీసేయాలని
వకరి ఆలోచన మొదలైన విషయాలతో ఈ
విధంగా తీసినచిత్రం ఎప్పుడూ గూడా సరిగా
తయారయేందుకు వీలులేదు. అందువలన ఈ
విధంగా తీయడం ప్రోత్సహించదగినదిగాదు.

### డైరెక్టరులు

మన చిత్రాల డైరెక్టరులలో చాలామం
దికి తెలుగు రాదు. ఫిలిం నిర్మాణంలో
ముఖ్యుడైన డైరెక్టరు ఫిలింయొక్క భావ
తెలిసివుండా లని యింకా యిప్పుడుగూడా
చెప్పవలసిరావడం మనఫిలింపరిశ్రమయొక్క
దౌర్భాగ్యమే అని చెప్పాలి. భావ తెలియని
డైరెక్టరుకు చిత్రనిర్మాణం వొప్పజెప్పడం
మన అజ్ఞాన ప్రదర్శనమేగాని వేరుగాదు. సరి
యైనచిత్రం తయారుగావలెనంటే ఒక డైరె

క్టరుకేగాదు సాంకేతిక శాస్త్రజ్ఞు లందరికీ భావ తెలిసివుండాలి. ఇంతవరకు పరిశ్రమ మొదలుపెట్టి నాలుగు సంవత్సరాలైనప్పటికీ ఒక్క నూతనడైరెక్టరునైనా సృష్టించుకోలేకపోయాం. ఇప్పటికైనా అభిరుచిగల విద్యావంతులను మన స్టూడియోలలో శేర్చుకొని ఆదర్శవంతులైన డైరెక్టరులను తయారు చేసికొనటం మనవిధి. ఇది మనపరిశ్రమాధికారులు చక్కగా గమనిస్తారని నాకోరిక.

## సాంకేతికశాస్త్రజ్ఞులు

ఆదర్శవంతనులైన చిత్రములు తయారుగావలెనంటే సాంకేతిక శాస్త్రజ్ఞులుగూడ మనవారైయుండాలి. అప్పుడుగాని సరియైన కథావాతావరణం ఏర్పడదు చిత్రంలో దానికిగాను మనం స్టూడియోలను నిర్మించుకొని శాస్త్రప్రవీణులను నియోగించుకొని వారి శిక్షణయందు మనతెలుగువారిని ఆయాశాఖలకు తగినట్లు తయారు చేసికొనవచ్చును. అంతవరకు మూఢజాతీయత వదలి ప్రవీణులపైననే ఆధారపడి మనపరిశ్రమకు మంచి పునాది వేయాలి.

## నటులు

పరిశ్రమ ప్రారంభించినది మొదలు యిప్పటివరకు అదివరకు రంగస్థలంమీద ఆడుతున్న నటులనే పట్టుకొని దేవులాడినారు మనకంపెనీలవారందరూ. కొద్దిగా ఈసంవత్సరమే కొంచెం కొత్తవారిని ఉపయోగించడానికి ధైర్యంచేశారు మనడైరెక్టరులు, ప్రొడ్యూసర్లు. రంగస్థలానుభవం రంగస్థలకీర్తి సినిమాకు ఉపచరిస్తుందని యింతవరకు నమ్మి కంట్రాక్టు నాటకాలమాదిరి ఫిలిములు తయారుచేశారు మన పారిశ్రామికులు. కొన్నిలక్షలు ఖర్చుచేసినతరువాత కొద్దిగా గ్రహించారు యిదంతా అనవసరమని. పోనీ ఏ ఒకరిద్దరు నూతన తారలనయినా సృష్టించారా వీరి సహాయంతో నంటే అదీ జరగలేదు. ప్రతిఫిలిములో ఆ మామూలు నటీనటులే ప్రత్యక్ష మవుతున్నారు. వేరుగత్యంతరం లేక సినిమా యందు నూతనముగా గలిగిన అభిరుచివలన ప్రేక్షకులు వాటిని చూస్తుంటే ఈ నటులవలననే జన మంతా వస్తున్నారు కాబో లని ఫిలిం నిర్మాతలు అనుకొంటూ కూపస్థమండూకములమాదిరి వుంటున్నారు. మరీ ఒక్కొక్క నటుడు ఏపాత్ర. ధరించినా ఒకే మాదిరి కనపడుతూ అదేవిధముగా గర్జిస్తూ కనపడుతుంటే ప్రజలు విసుగుచెందుతున్నారు. అందువలన ప్రేక్షకుల అభిరుచిని అణచిచంపి పారేస్తున్నారేమో ఈ ఫిలింనిర్మాతలు అనిపిస్తుంది ఆలోచించేవాడికి. పాత్రకుతగిన నటులను ఎన్నడమంటే ఏమో తెలియదేమో మనవాళ్లకు? సమర్థులైన నటులను వారికి తగని పాత్రలనిచ్చి వారిని అపకీర్తిపాలుచేసిన డైరెక్టరులూ ప్రొడ్యూసర్లూ వున్నారు. అందువలన యికముందైనా శక్తిసామర్థ్యములు గల మననటులను పాతవారినిగాని కొత్తవారినిగాని వారికి తగుపాత్రల నిచ్చి వారి కళాప్రదర్శనమునకు అవకాశ మివ్వవలయునే గాని వారిని నాశనముచేసి తాము నష్టపడుట వ్యాపారలక్షణము గాదు నటులుగూడ సాధ్యమైనంతవరకు కంపెనీవా రిచ్చుచున్న పాత్ర తనకు తగినదేనా యని ఆలోచించుకొని వొప్పుకొనుట మంచిదిగాని ఆ యిచ్చే నాలుగుడబ్బులకే ఏపాత్రకు పడితే ఆపాత్రకు సిద్ధమైతే అపకీర్తిపాలై ఆర్థికంగాగూడా నష్టపడతాడు. ప్రతిచిత్రంలోను కనీసం ఒక నూతనతారను సృష్టించగలిగియుండాలి ఫిలింకంపెనీవారు.

## సంగీతము

ఇన్నిఫిలిములు తయారుచేసినా, ఇన్నిరకాల స్టూడియోలు చూసినా, ఇన్నిదేశాల గాయకులు సంగీతపర్యవేక్షకులతో కలసి సంచరించినా, ఇన్నివిదేశ ఫిలిములలోని సంగీతశాఖను పరిశీలించినా మనడైరెక్టరులకుగాని ప్రొడ్యూసర్లకుగాని ఫిలిమునకు కావలసిన సంగీతాన్నిగురించి యింతవరకు కొంతయినా తెలిసియుండలేదని వ్రాయవలసివచ్చినందుకు నేను చాల విచారపడుతున్నాను. అసలు సంగీతమంటే పాటలూ పద్యాలూ మాత్రమేనని అనుకునేవారిసంగతి మనకు అనవసరము. కాస్త కళాభిమానము కళాపోషణ రసపిపాస యిత్యాదిగుణముల యందలి అభిమానమువలననేగాక వ్యాపార దృష్టినిగూడ లాభకరమైన ఆదర్శకరమైన సంగీతమును యింతవరకు మనఫిలిములలో జోడించుటకు శ్రద్ధజూపలేదు. మనఫిలిములలోని సంగీతమును గురించి మనదేశమందలి సంగీతవిద్వాంసులలో శ్రేష్ఠులనదగు కీ. శే. ఖాన్‌సాహెబ్ అబ్దుల్ కరీంఖానుగారు ఈవిధంగా అభిప్రాయమిచ్చారు, ఒకమారు వార్తాపత్రిక విలేఖరితో మాట్లాడుతూ. "సామాన్యప్రజలకు సంగీతమందు మిక్కుటమైన అభిరుచి కలిగించింది సినిమా. కాని ఈవిధమైన ప్రజానుమతం ఆనందించతగ్గదికాని ప్రోత్సహించ తగ్గదికాని మాత్రం కాదు. ఒక కళను ప్రజానుమతం (Popular) గా చేయవలెనంటే విపరీతమైన ధనవ్యయ మవుతుంది. అందువలన సంగీతప్రమాణాన్ని తగ్గిస్తే ఆత్మహత్య అవుతుంది. అటువంటివిధానం గ్రహించవలసినదే" హైందవసంగీతంయొక్క భవిష్యత్తును నిర్ణయించే నూతన శక్తులలో నొకటయిన సినిమాకు తనసంగీత కళయొక్క ఆదర్శములకును సామరస్యము కుదురుటలేదని ఖాన్‌సాహెబ్‌గారన్నారు. "చిత్రములు తయారుచేయుట వ్యాపారము, వ్యాపారదృష్టిని డబ్బురావలెనంటే పాటకజనాకర్షణ కలిగియుండాలి సంగీతం. అటువంటి సందర్భంలో నీచమైనసంగీతం కాకుండా వున్నతమైన సంగీతంతో పాటకజనులను ఆకర్షింపగల్గుదుమా? సాంకేతిక వ్యాపార దృష్టులయందుగల హద్దులలోనే ను సుస్వరములతోడను పరిశుద్ధమైన బాణీతోడను మూలసూత్రాను సరణముతోడను సంగీతము నేర్పరుచగలిగి యుండవలెను." ఇదివారి అభిప్రాయం. నిజంగా యిటువంటిసంగీతంతో పామరజను లన్నమాటేమిటి సకలజీవరాసుల్ని ఆకర్షించవచ్చని ససగీతంలో యిసుమంత అభిరుచి వున్నవారికేరికైనా తెలుస్తుంది. ప్రస్తుతం శాస్త్రమునకు భంగం వాటిల్లకుండా మన దేశీయ సంగీతానుకూలంగా సంగీతాన్ని ఫిలిములో పూరించేవారు లేకపోలేదు. (Originality) మూలనిర్మాణం ఏమీకనబరచకుండా కేవలం పాశ్చాత్య సిద్ధాంతాలను గుడ్డిగా అనుసరిస్తున్నారు మనవాళ్లు సంగీతంలో" నని గూడా కీ. శే. కరీంఖానుగారు సెలవిచ్చారు. అందువలన విధానంమాత్రం వారిని చూచి

నేర్చుకొని మనసంగీతశాస్త్రముల సిద్ధాంత ములకు వాటిని (Adopt) తగిన ట్లుపయోగము చేసికొని చక్కని దేశీయసంగీతం యివ్వడానికే పూనుకోవాలి. ఇది అసంభవంమాత్రం కాదు ప్రముఖులైన సంగీతవిద్వాంసులు కలసి పూనుకుంటే. ఇటువంటి పరిశుద్ధసంగీతాన్ని కొంతవరకైనా దేశీయపద్ధతులకు భిన్నంతే కుండా యివ్వగల గాయకుడు మాస్టర్ కృష్ణారావు. అమరజ్యోతిలోని సంగీతపర్యవేక్షకుడు. ఇక ఈవిధంగా సంగీతాన్నిగురించి వ్రాస్తే ప్రత్యేకం ఒకవ్యాసమే తయారవుతుంది కాబట్టి మనసంగీతశాస్త్రాన్ని మతమైన సంగీతాన్ని ఫిలిములో జోడించి ప్రజాకర్షణ కలగజేస్తూ ప్రత్యేకం ఒకతెలుగు పద్ధతిని సృష్టించునట్లుగా ఏఆంధ్ర-సినిటోనువంటి సంస్థయినా పూనుకొని ఆచరించవలసినవిధి వారియందున్న దని హెచ్చరిస్తున్నాను. ఇంకా వంగాలులో బోరల్, పంకజమల్లిక్ తిమిరబరన్, రంజిత్ రాయ్, బిశ్వాసు వగైరా ప్రముఖులుకూడా వున్నారు.

## గ్రంథకర్తలు

ఫిలిమునకు వలయుకథను ఎన్నుకొనినతరువాత దానిని ఫిలిమున కనువగునట్లు మార్చి సంభాషణలు గేయములు (ఇవన్నీ వకరిచేతనే చేయిస్తారు మనవాళ్లు. పాశ్చాత్యఫిలిములలో వేర్వేరు నిపుణు లుంటారు ఆయాపనులకు) మొదలగువానిని తయారుచేయడమునకు తగిన వ్రాతగాళ్లని నియమించాలి. ఈపనికి మామూలుగ్రంథకర్తలుగాక కొంత సాంకేతికజ్ఞానముగల ప్రత్యేకరకపు వ్రాతగాళ్లను తయారుచేయాలి. ఇంతవరకు మనఫిలిములలో సరియైనరచన వెలువడలేదనిచెపితే ఎవరూ కోపగించుకోకూడదు. సినారియో, సంభాషణలు, గేయములు మొదలగువానిని రచించే ప్రత్యేక నిపుణులను తయారుచేయవలసిన అవసరమెంతైనా వున్నది మన ఫిలింనిర్మాణ కార్యవిధానంలో.

## ప్రచురణ

ఏవ్యాపారానికైనా ప్రచురణశాఖ కున్న ప్రాముఖ్యం మరొకశాఖకుండదు. వ్యాపారం రాబడి అసలుసరుకుకంటె ఎక్కువ ఈప్రచురణవలననే వస్తుంది. ఫిలిమునుగురించి ప్రచురణచేయడంలో పాశ్చాత్యులవలంబించుచున్న విధానాలు అనుకరిస్తేచాలు మనవాళ్లు కొంతవరకైనా. దీనికై ప్రతికంపెనీకి ముఖ్యంగా స్టూడియోలకు—ఒక ప్రచురణశాఖాధికారి, అతనికి సహాయకుడుగా ఒకచిత్రలేఖకుడు వుండటం చాలఅవసరం. మన కంపెనీలలో ఈప్రచురణశాఖ చాలా నిర్లక్ష్యము చేయబడుతున్నది. ఈశాఖనుగనక యింతకంటె బాగా పోషిస్తే ఆదాయంకూడా వృద్ధి అవుతుం దనటానికి సందేహం లేదు మనతెలుగుటాకీలన్నిటిలోకి చక్కని ప్రచురణ జరిగినది "హరిశ్చంద్ర"కు మాత్రమే. చాలావరకు తక్కిన ఫిలుములకు కొన్నిపత్రికలలో అదేపనిగా ప్రకటించడమే జరిగినది. డబ్బుఖర్చు చేశారేగాని ఒకకంపెనీగూడ "హరిశ్చంద్ర"కు మాదిరి పోస్టర్లయినా తయారుచేయించలేకపోయారు. కేవలం పెద్దవిగా చేయించినంత మాత్రాన లాభం లేదు. కథాసారాంశం తెలిపేదిగా వుండాలి పోస్టరు. ఈప్రచురణశాఖను గురించి మన కంపెనీలవారంతా తీవ్రంగా ఆలోచించవలసిన అవసరమున్నది.

## ప్రదర్శనశాలలు

ఫిలింయొక్క జయాపజయాలు చాలావరకు ప్రదర్శనశాలమీద ఆధారపడివుంటాయి. ప్రదర్శనయంత్రం మంచిదైవుండకపోతే సాంకేతికజ్ఞానములేని ఎక్కువమంది ప్రజలు ఫిలిమునే దూరుతారు. ప్రదర్శనశాల సౌఖ్యవంతంగావుండాలి. కూర్చునేందుకు అనువైన ఆసనాలు, హాయిగా గాలివచ్చే అవకాశం వుండి ప్రేక్షకుడుకి కూర్చున్నంతసేపూ సౌఖ్యంగావుండాలి. లేకపోతే ఫిలిము చూచినంతసేపూ విసుగ్గానే వుంటుంది. అందువలన ఫిలిముమీదగూడ చెడుఅభిప్రాయమేర్పడుతుంది ప్రేక్షకునికి. నిజం చెప్పాలంటే సౌఖ్యవంతమైన సినిమాప్రదర్శనశాల మన ఆంధ్రదేశంలో యింతవరకులేదు. అందువలన ఈ వ్యాపారంలో ఉత్సాహంగల కొందరు వేలం వెర్రిగా ఫిలిములు తీయుట మాని ప్రదర్శనశాలలు కట్టిస్తే వారికీ పరిశ్రమకుగూడ లాభకరము.

## వ్యాపారదృష్టి

మనవారికి ఈవ్యాపారంలో ఉన్నఅవకాశమునుబట్టి ధనంమిక్కుటంగా ఆర్జించవలెననే ఆశయున్నదేకాని దానికితగు ప్రయత్నం చేసి ఫలితంపొందేవిధానం గమనించటంలేదు. అందువలన పైవిషయాలన్నీ గమనించి ఫిలిం వ్యాపారస్తులు యికముందైనా సక్రమవిధానం అనుసరిస్తారని నమ్ముతున్నాను. ప్రజాభిప్రాయాన్ని తయారుచేయడంలో శక్తిమంతములైన పత్రికలు నిష్పాక్షికములైన అభిప్రాయముల నిచ్చి పరిశ్రమను బాగుగా నడిపించవలసినది పోయివచ్చినఫిలిమును ప్రతిదానినీ ఆకాశానికిఎత్తి పత్రికాభిప్రాయానికుండే గౌరవం కూడా పోగొట్టినాయి. ఇకముందైనా పత్రికలు నిర్భీతిగా నిష్పాక్షికములైన అభిప్రాయముల నిచ్చి పరిశ్రమ నుద్ధరించాలి. కనుక మన పరిశ్రమ వృద్ధిచెందాలంటే.

౧. మనస్వంతస్టూడియోలలో ప్రవీణులైన సాంకేతిక ప్రవీణులతో ఫిలిములు తయారుచేయాలి.

౨. ఫిలింకంపెనీల నిర్మాణం యింతటితో ఆ ఫిలింనిర్మాణమునకు పనికివచ్చు వస్తుసముదాయాలను తయారుచేయు కంపెనీలను నెలకొల్పాలి.

౩. స్టూడియోలతో జాయింటుగా ఫిలిములను తీయరాదు.

౪. ఫిలింయొక్క భావ తెలియని డైరెక్టరులను ఎప్పుడును వినియోగించరాదు.

౫. కొత్తనటులను సృష్టించుతుండాలి.

౬. ఒకప్రత్యేకసంగీతపద్ధతిని ఏర్పరచాలి.

౭. ఒకప్రత్యేకఫిలింవ్రాతకారుల ముఠాను తయారు చేయాలి.

౮. ప్రచురణావిధానానికి శ్రద్ధచూపాలి.

౯. ప్రదర్శనశాలలు మంచివి దేశమంతటా కట్టించాలి.

# పాతర గడ్డి

'మూర్తి'

భారతదేశం కరువులకూ కాటకాలకూ పుట్టినిల్లు. అందులోనూ పశువుల గ్రాసంవిషయంలో పశువులకు మేత కరువయితే రైతుపని యింక పడకే.

వ్యవసాయానికి పశువులే ప్రధానాంగము పొలందున్నడం మొదలుపెట్టి ఆపొలంలో పంటను అమ్మి సొమ్ముచేసుకునేటంతవరకు కావలసిన పనులు ఇంచుమించుగా అన్నీ పశువులతోటే కావలసి ఉంది. అవి పుష్టిగా ఉండి కష్టించి పనిచేయవలెనంటే వాటికి మేత దండిగా ఉండడం అవసరము. మన దేశంలో పశువులకు కరువు లేదు. కాని వాటిమేతకు మాత్రం తరుచు కరువు పుడుతూవుంటుంది. అందువల్లనే మన దేశంలో పశువులు సామాన్యంగా బక్కపారి శుష్కించి ఎందుకూ పనికిరాకుండా పోతూఉండడము.

ఈలాటికరువులవల్ల కలిగేబాధలు అనంతము. వాటిపోవడికి తప్పకోవడము అసాధ్యము. కరువుకాలంలో రైతులు పశువులకు మేత సంపాదించి పెట్టలేక వాటిని తరిమివేస్తూవుంటారు. కడుపుకు మేత లేక సగంచచ్చిన ఆపశువులు వాటియిష్టానుసారం పొలాలవెంటా, అడవులవెంటా విచ్చలవిడిగా తిరిగి ఆకలాలుపెరుక్కొని తిని ప్రాణాలునిలుపుకుని ఉంటవి. కాని అవి మళ్లా రైతుకు లొంగి పనిపాటులకు ఉపయోగపడడంమాత్రం కష్టసాధ్యమే. అవి ఆలా ఉండగానే రైతుకు సేద్యం సాగడానికి కొత్తవాటిని సేకరించుకోవలసి వుంటుంది. పాతవాటినీ కొత్తవాటినీ మేపడానికి యింక రైతు పడేకష్టం ఇంతా అంతా కాదు.

ఇలాంటివరువు వచ్చినప్పుడు పశువులను కాపాడుకోవడానికి పనికి వచ్చేటట్టుగా మేతను సేకరించి నిలవచేసుకోవడం రైతుకు చాలా అవసరము.

కారణం ఏదయితేయేంకాని మన దేశంలో, సాగుబడికి లాయకయిన పొలం కోట్లకొలది ఎకరాలు ఏటా బీడుపడిపోతూ ఉంటుంది. ఆబీటిపొలంలో మామూలుగరికి, జొన్న చొప్ప, ఏనుగుగడ్డి మొదలయిన వాటిని అట్టేవ్యయం లేకుండా పైరుచేసి ఆగడ్డినికోసి నిలవచేసి ఉంచవచ్చును. వర్షాలు ప్రారంభమయినప్పటినుండీ ఆపొలాన్ని కాపుదారీలో ఉంచితే, వచ్చేపోయే చినుకులకు గడ్డి ఏపుగా పెరుగుతుంది. దీనికి ప్రయాస లేదు; నీటి తీరువా లేదు.

ఇలా పెరిగినగడ్డిని కోసి పాశ్చాత్యదేశాల్లో మట్టికింద పాతరవేసి నిలవచేయడం అలవాటు; ఇదిచాలా విస్తారంగా కూడా జరుగుతుంది. మన దేశంలోకూడా అలాటి పనిచేసుకుంటే రైతులకు పశువుల గ్రాసం తాలూకు ఎద్దడి చాలావరకు తీరుతుంది.

పచ్చిగడ్డిని గోతులలో తొక్కిగాని, మేటలుగా పేర్చిగాని మీదమట్టి కప్పిపెట్టి నిలవచేసి ఉంచుకోవాలి. ఈ పాతరలలో గడ్డిని పచ్చిగా, చెమ్మ అరకుండా ఉంటుంది; మృదువుగాను



౧. చొప్పను ముక్కలు చేయుట

సవనవలాడుతూను ఉంటుంది. గడ్డిని నిలవ చేసుకోవడంవల్ల రైతుకు ఎన్నోలాభా లున్నవి.

అసలు దీనికి వ్యయమంటూ అంతగా ఉండదు. గడ్డినివాములు నేసేకంటే పాతరవేయడం చాలా తేలిక పనిలో కాని, వ్యయంలో కాని. పాతరవేయుడంవల్ల గడ్డిలో పచ్చి ఆరిపోదు; బరువు తగ్గదు. వాములు నేస్తే గడ్డి ఎండకూ గాలికీ ఎసపోయి తేలికయిపోతుంది. మరిన్నీ పాతరవేస్తే నిప్పుభయం, దొంగభయం అంటూ ఉండదు. పశువుల్లో చాలవాటికి ఈమేత రుచిగా ఉంటుంది. రుచిఉండేది, సులువుగా జీర్ణమయేది కాబట్టి పశువులకిది మంచి ఆహారము. ఈ మేత తిన్న ఆవులు దండిగా పాలు పితుకుతవి. ఎడ్లు పుష్టి ఎక్కి ఎక్కువ గాటా పనులు చేస్తవి. మామూలుస్థితిలో పశువులు మూచూడనిగడ్డిగాదాలను, ఈలాగా పుష్టినిచ్చే రుచికరమయిన ఆహారంగా తయారు చేసుకోవచ్చును.



౩. గోతిలో గడ్డిని అణగత్రొక్కుట.

కనడా దేశంలో రైతులు అవలంబించే చౌకయిన పాతరపద్ధతే భారతీయులకును చాలా అనుకూలమయింది. ఎత్తయినచోట, ఎనిమిదడుగులులోతు, పదిహేనడుగులు వెడలుపు, కావలసినంతనిడివి పెట్టి గోతినిత్రవ్వవలెను. ముఖ్యంగాపక్కలు నిట్టనిలువున ఉండడం అవసరం. పక్కలకు పూతపూయడము గాని, రాళ్లుకట్టడముకాని పనికిరాదు. ఇట్లా చేయడంవల్ల ఒకటి; వ్యయం అధికం ౯వుతుంది. రెండు; గడ్డిలో ఉండే ఎక్కువచెమ్మను నేల పీల్చడానికి వీలులేకుండా పోతుంది. ఏరకం గడ్డితోగాని, ఇంకఏపచ్చిమేతపదార్థంతోగాని గోతిని నింపవచ్చును. పూత పరువుకు వచ్చిన గడ్డిమొదలయినవి పాతరవేయడానికి తగి ఉంటుంది. పండబారిందికాని, ఎండిందిగాని మంచిది కాదు. జొన్నచొప్ప మొదలయినవాటి విషయంలో కంకికి గింజపట్టేపరువులో కోయవలసి ఉంటుంది. చొప్పనుగాని, గడ్డినిగాని ముక్కలు



౨. గడ్డిని, చొప్పముక్కలను గోతిలో పాతరవేయుట.



౪. పచ్చగడ్డి మొ. వాటితో నింపబడిన గొయ్యి

గా నరికి పాతరవేయడం మంచిది. అలాచేస్తే బాగా అణిగిఉంటుంది. కాని ఇది అంత ముఖ్యం కాదు. గోతిలో గడ్డిని ఒకవరస పరిచి ఆవరసను అణగదొక్కి, మళ్లా ఇంకొకవాలు పరిచి, దాన్ని అణగదొక్కి ఇల్లాగొయ్యినిండేవరకు గడ్డిని పరుస్తూ, దాన్ని అణగదొక్కుతూ రావాలి. గాలి ఏమాత్రమూ గడ్డిలోకి జొరబడకూడదు. బలిష్ఠమయిన ఎడ్లచేతగాని, కూలీలచేతగాని గడ్డిని బాగా అణగదొక్కించవచ్చును. గోతిలోని పక్కవైపుల,మూలలలోగడ్డి బాగాకూరుకొని ఉండేటట్టు శ్రద్ధతో చూడాలి. గోతిని, నేలకు నాలుగైదు అడుగులు ఎత్తువచ్చేవరకు గడ్డిని పేర్చవచ్చును. ఆవల దానిచుట్టూ రెండు మూడడుగుల వెడలుపు దిన్నెగామట్టిపోయవలెను. ఇందువల్ల లోపలిగడ్డి తర్వాత ఉబికి రాకుండా ఉంటుంది. నీరు, గాలి లోపలికి చొరబడకుండానుఉంటుంది. తర్వాత దానిని పూర్తిగా మట్టితో ఏటవాలుదిబ్బగా కప్పేసి బాగా గట్టించాలి. ఆ దిబ్బమీద నీరు ఒక చుక్కఅయినా నిలవతాకిఉండకూడదు. ఏ కారణంచేతగాని, దిబ్బ బీటలువేసినా, కుంగి కుంటలుపడినా, వెంటనే మట్టితో కప్పిపెడుతూ ఉండాలి. లేకుంటే లోపలికి నీరుదిగి నిలవగడ్డి పాడయిపోతుంది.

రెండేండ్లదాకాకూడ ఇలాగా గడ్డిని పాతరలో పెట్టి ఉంచవచ్చు. సామాన్యంగా వరుపుకాలంలో ఏటా పైకితీసి గడ్డిని వాడేస్తూఉండడం మామూలు. పాతరవేసిన రెండుమూడు నెలలకు తర్వాత ఎప్పుడయినాసరే గడ్డిని తీసి వాడుకోవచ్చును. లోపలి గడ్డికి ఎండతగలకుండా ఉండడానికని కొంచెం కొంచెం — ఒక చదరపు గజంమేర—తవ్వి ఆభాగంలో గడ్డి అంతా తీసుకొని వెంటనే ఆగోతిని





౫. [illegible] వ్వను ఇట్లు నిలువుగకూడ నుంచవచ్చును



౬. పాతరలోని గడ్డిచుట్టు మట్టిపోయుట

మట్టితో పూడ్చేయాలి, మరొక మారు మరొకచోట ఇలాగే తవ్వి తీసుకోవాలి.

ఒకదినానికి ఈ నిలవగడ్డి సామాన్యంగా ఒకఆవుకుగాని, ఎద్దుకు గాని ౩౦ మొ. ౪౦ పౌనులవరకు అయితే దండిమేత అవుతుంది. ఎనిమిది అ. లోతు, పది అ. వెడలువు, పదిహేను అ. నిడివి గలగోతిలో పౌ. ౧౫౦౦౦ మొ. ౨౦,౦౦౦ వరకు గడ్డి నిలవ చేయవచ్చును. (ఈమితి నిలవచేసే గడ్డిరకాన్ని పట్టి ఉంటుంది.) ఇది రెండెడ్లకు ఒక్కసంవత్సరం దండి గ్రాసం అవుతుంది. మేతకరువు ఏటి పొడుగునా ఉండేదికాదు కాబటి ఒకచిన్నగోతిలో గడ్డిని ఇలాగ నిలవచేసుకుంటే రైతుకు ఎంతో ఉపకరిస్తుంది.

వ్యవసాయశాఖవారు మనదేశంలో వరుపుదినాల్లో పశువులమేతకు ఈవిధంగా గడ్డిని నిలవచేసు కుంటున్నారు.

కొన్నిపశువులు ఈ నిలవగడ్డిని తినవు. వాటికి అలవాటుచేయాలి. అలాటప్పుడు కొంచెంకొంచెంగా ఈ గడ్డిని మామూలు గడ్డితోగాని, చొప్పతోగాని కలుపుతూరావాలి. ఒకవారంరోజు లయ్యేసరికి ఈగడ్డినే ప్రత్యేకం బాగా తినడానికి మొదలు పెడతవి. చక్కగా నిలవచేసినగడ్డి గమగమలాడుతూ ఉంటుంది. దీనిని తిని పుష్టి ఎక్కిన పశువులతో దొడ్డి కలకలలాడుతూ ఉంటుంది.

ఆంధ్రదేశం రైతులు ఈ మార్గాన్ని అవలంబించి అనుకూలంగా ఉంటే వాడుకలోకి తెచ్చుకోవడము శ్రేయము.



౭. పూర్తిగా మట్టితో కప్పబడిన గడ్డిపాతర

# ప్రేమ బంధం

కొల్లూరి రామమూర్తి

రాత్రి సుమారు తొమ్మిదిగంట లయింది స్వరాజ్యలక్ష్మి పట్టడానికి శక్యం కాకుండా ఏడుస్తోంది లేచి తొట్టెలో. కృష్ణారావుగారు ప్రశాంతంగా బల్లదగ్గర కూర్చొని 'లా'పుస్తకాలు తిరగేస్తున్నాడు. మర్నాడు వాయిదా పడ్డ కేసులపట్టిక డైరీలో ముందుంది. వాటి విషయమై వాదించడానికి పుస్తకాలు ముందు వేసుకొని పాయింట్సు నోటుచేసుకుంటున్నాడు. నర్సి, పనిమనిషి, ఓమూల కూర్చొని కునుకుతోంది. పిల్లయేడ్పుతో అతని ఆలోచనకి భంగం కలిగింది. నర్సిని పిల్చాడు. కళ్లు నులుముకుంటూ పిల్లని లేవతీసింది నర్సి. కాని పిల్లయేడుపు మానలేదు. ఇక లాభం లేదని నర్సిదగ్గర పిల్లనులేనుతీసికొని బుజ్జగిస్తూ బుజాన వేసుకొని పచారు చేస్తున్నాడు. గడియారం అరగంట కొట్టింది. "అబ్బా, అప్పుడే తొమ్మిదిన్నర అయింది, ఇంకా సరోజ యింటికి రాలేదే" అనుకున్నాడు. ఇంతలో కారు హారన్ వినపడింది, తలుపు భళ్లున తెరుచుకొంది. సరోజ ఎదుట ప్రత్యక్షమయింది.

సరోజ కృష్ణారావుగారి గృహిణి. కొద్దో, గొప్పో, విద్యాగంధం కలది. పాశ్చాత్య నాగరికతా వ్యామోహానికి సిసలైన నమోనా. "చలం" గారి"స్త్రీ" తత్వంపూర్తిగా జీర్ణించి ప్రతీఅణువులోను ప్రతిధ్వనిస్తోంది.వారిఐచ్ఛిక ప్రేమతత్వం (Free love theory )అంటే అమితమైన ఆదరణ. స్వేచ్ఛామూర్తి, స్త్రీల పాలిటి కల్పతరువు. స్త్రీ సంఘ సంస్కారోద్యమపితామహి, విడాకులచట్ట ఉపపాదనలలో ప్రప్రథమ, పురువ. ప్రతిష్ఠావిధ్వంస బద్ధకంకణ. వేయేల?నారీలోకోద్ధరణ అవతారమూర్తి, అప్పుడే సినిమానుండి స్నేహితురాలి కారులో యిల్లు చేరింది.

కృష్ణారావు ఒక న్యాయవాది. న్యాయవాదేకాదు జాతీయవాదికూడాను. అహింసా తత్వం బాగా అర్థం చేసుకున్న వాడు, దేశాభిమాని, స్వాతంత్ర్యప్రియుడు, నిరాడంబర జీవి. ఖద్దరుతప్ప మరేమీధరించడు, సాధ్యమైనంతవరకు స్వదేశీవస్తువులనే వాడతాడు. ఉదారబుద్ధిగలవాడు. టాల్‌స్టాయిసిద్ధాంతముల నంగీకరించువాడు. ఉన్నంతలో లేదనకయిచ్చువాడు. నౌకరులనుగూడ నీచముగ చూచువాడుకాడు, కుశాగ్రబుద్ధి. పట్టినకేసు నెగ్గి తీరవలసినదే. జడ్జీలకుకూడ అత యనిన గౌరవము, భయముకూడాను, ఉపన్యాస సంస్కర్తలలో చేరక న్యాయ మనితోచిన సంస్కరణల ఆచరణలో పెట్టువాడు, సంఘమునకు దాసుడు కాడు. మొత్తమునకు ఉత్తమ గుణములసంపుటి అని చెప్పవచ్చు.

స్వరాజ్యలక్ష్మి పైదంపతులకు ఏకైకపుత్రి. సరోజ నోములపంట కాదు (నోములు, వ్రతములు అన్న నమ్మకము లేదు గాన) కాని, కృష్ణారావుగారి మాతృదేశారాధన ఫలితము ఆకసికందు. వయస్సు పదకొండుమాసములు. సాక్షాత్తూ కృష్ణారావుగారి చిత్రం చిన్న సైజులో (Epitome)తల్లి చేరదీయదు కాబట్టి తండ్రిదగ్గరే ఎక్కువ చనువు. భూమిమీద పడ్డప్పటినుండీ తల్లిపాలు ఎరుగదు; యౌవన నాశనానికి కారణభూత మని పాలివ్వలేదు గనుక. ఇదీ ఒకవిధంగా మంచిదే (It is all for the best) అనుకుంటూ. ఎందుకంటే పాలిచ్చేవాళ్లగుణాలే తాగేపిల్లలకు అబ్బుతాయంటారు కాబట్టి.

సరోజకాలు ఇంట్లోనిలవదు. ఎంతసేపూ సంచారమే పట్నంలో. ప్రతిసభకు ఆమే ఒకఅలంకారం. ఇకస్త్రీల సభలమాట చెప్పనక్కరలేదు,ఆమెలేనిదే ఏదీ జరగదని. స్త్రీల సంఘాలకి అధ్యక్షురాలో,ఉపాధ్యక్షురాలో, కార్యదర్శినో,లేకకనీసం ఆహ్వానసంఘ సభ్యురాలో అయిఉంటుంది. సాధారణంగా ఆంధ్రదేశంలో ఆమెను ఎరగనివా రుండరు పత్రికల ద్వారా. ఎందుకంటే చిత్రంతోకూడా ఆమె పేరు బొద్దక్షరాలతోపడుతూ ఉంటుంది కాబట్టి. ఇంతెందుకు ఆమె "నామకురాళ్లలో ఒకటి" అంటే అంతా అందులోనే ఉంది. మామూలుప్రకారం నాలుగుగంటలకు యిల్లు వదిలింది. ఆవేళకూడా. సరే వచ్చినసమయము మీకు విదితమేకదా ? వచ్చింది, డ్రస్సు మార్చింది, నర్సిసిద్ధంచేసిన భోజనం ఏదోకతికింది (ప్రొద్దస్తమానం వేళాపాళా లేకుండా ఉపహారా లారగించేవాళ్లకి తిండేమి సయిస్తుంది;) వెళ్లి తనగదిలోపడుకొని (తనగది వేరు, భర్తగదివేరు) "చలం"గారి "స్త్రీ" పారాయణచేయడం మొదలెట్టింది.

కృష్ణారావుకూడా కాస్సేపు పేపరుచూసుకొని గదిలోకివెళ్లి పరున్నాడు. నర్సి నాలుగు మెతుకులుతిని పిల్లతొట్టిదగ్గర చాపమీద పడుకుంది. ఇది వారిదినచర్యలో ఆఖరుఘట్టం.

స్వేచ్ఛావృత్తులలో న్యాయవాదవృత్తి ఒకటి. ఇష్టం ఉంటే కోర్టుకి వెళ్లవచ్చు, లేకపోతే మానెయ్యవచ్చు. అడిగేవాడు లేడు, "కాజువల్ లీవు"ముందుగా శాంక్షన్ చేయించుకోవాలన్న బాధ లేదు. రాలేదేమని పై అధికారుల మొట్టికాయలు లేవు. అల్లాగని కాళ్లుముడుచుకొని కోర్టుకివెళ్లడం మానేవాడు కాడు కృష్ణారావు. అవసరమైతే ఒక్క చీటీతో కేసులు వాయిదావేసేవారు న్యాయాధికారులు. ఆదాయం సుమారు వెయ్యి రూపాయలకు మించి ఉంటుంది.

కృష్ణారావుగారి తెలివితేటలకు ప్రభుత్వం వారు మెచ్చుకొని మునసబుపదవికి ఆహ్వానించారు. కాని ప్రభుత్వశృంఖలాలకి బద్ధుడు కాతలంపులేక నిరాకరించాడు స్వాతంత్ర్యప్రియుడు కాబట్టి. అధికారగర్వం, వ్యామోహంగల ఏమానవ ప్రకృతీ వచ్చిన అవకాశం జారవిడుచుకో దనుకుంటా యిల్లాగు. అంతే స్వాతంత్ర్యప్రియుడు కాబట్టే భార్యను కూడా ఏమీ అనేవాడు కాదని తోస్తుంది. ఒక్కనాడేనా పెదవివిప్పి "ఇదేమి?" అన్న పాపాన పోలేదు. ఆమె స్వేచ్ఛకు అడ్డుతగలలేదు. ఆమె ప్రత్యేకఖర్చులకు నూరురూపాయలు యిచ్చేవాడు నెలకి. దానికి జమాఖర్చు ఆయనజన్మలో ఎప్పుడు అడగలేదు సరిగదా

కాలం చే యింకా యెక్కువ మొత్తం యిస్తూ ఉండేవాడు. ఆయన ఓరిమి చూచి చూచి కూడా తలవంచి క్రుంగిపోయింది దినవకి.

సాయంకాలం మూడుగంట లయింది. సరోజిని హడావిడిగా దుస్తులు వేసుకుంటోంది. ప్యారిసుసిల్కు చీర కట్టి, కప్పనోటిపొట్టి చేతుల జాకెట్టు తొడుక్కుంది. ఎదుట బల్ల మీద పెద్ద అద్దం. అద్దమునకుముందు "పెరల్ క్రీము" సీసా, "ఛెర్రీరోజు" పవుడరు ఆమె కొరకు ఎదురుచూస్తున్నాయి. దుస్తులు ధరించి, బల్ల సమీపించి, ఆ 'లెవెండరు యింగ్లీషు సబ్బు'తో తోమిన ముఖాన్న "పెరల్ క్రీము" పట్టించి. పిమ్మట "ఛెర్రీరోజు" పవుడరు చక్కగా ముఖంనిండా కొట్టింది. వింతవింత వెన్నలు తెగిలించి లేనివంకరలు కల్పించింది కురులలో. వెనుక చక్కగా 'బరమా'ముడి. ముడిచుట్టూ చేమంతి పూలదండ. చెవులనుండి భుజాలవరకూ వ్రేలాడే లోలకులు. మెడలో పొడలేదు ఒక సన్నని గొలుసుతప్ప. పిమ్మట తెల్లనిసాక్సు తొడిగి ఎత్తుమడమల (High-heeled) బూటు వేసుకుంది. తమలపాకుల నమిలి చాలకకాబోలు కొంచెం ఎర్రరంగు కూడా పూసింది పెదవులకు. అల్లాగే చెక్కిళ్ళకుకూడా కొంచెం ఎర్రరంగు అద్దింది "రోజీ చీక్సు" అవాలని. అద్దంలో తనరూపం చూసుకుంది. "సరిగ్గా సినీమానటిలా ఉన్నా నా" అనుకుంది. "ఉన్నా న"ని సంతోషించింది. చేతికి ఒకచిన్నతోలుసంచి తగిలించుకుని వీధిలోకి వచ్చి చూసింది.

స్నేహితురాలు, కమల యింకా రాలేదు. ప్రొద్దుపోతోందని విసుక్కుంది కొంచెం. చిందులు త్రొక్కిందికూడాను. బంగారపు గొలుసుతో ఉన్న "కీపుసేకు" రిష్టువాచీకేసి ఓ చూపు పారేసింది. "అప్పుడే నాల్గున్నర అయింది యింకారాలేదే" అనుకుంది. ఇంతలో బుర్రుమని కారువచ్చి గుమ్మంముందు ఆగిందో, లేదో To-day is Saturday, There is tea-party at four thirty. Dont you know, అని మాటలవర్షం కురిపించింది. గభాలున కారులో కూర్చుంది. కారువానికి ఆజ్ఞయిచ్చింది వడిగా నడపమని.

సరి యిద్దరూ నాల్గుముప్పైఅయిదింటికి క్లబ్బు చేరారు. కారుదిగి డ్రైవరుతో సరిగ్గా ఎనిమిది గంటలకు రమ్మనమంది విస్పాటంగా.

నాడు శనివారం. ప్రతిశనివారం క్లబ్బులో 'టీపార్టీ'. సరోజ కమలలు లోనికి వెళ్లేసరికి మెంబర్లందరూ, వింతవింత ఫాషన్లతో ప్యారిసును ఎడమకాలితో తన్నేవాళ్లంతా బల్లల చుట్టూ కుర్చీలమీద కూర్చునిఉన్నారు. అనుకొన్నట్టు మన సరోజా కమలలే ఆఖరివారు క్లబ్బుచేరడానికి, Excuse me, I am sorry, I am late. అంటూ ఒకకుర్చీలో చతికిల పడింది సరోజ. ప్రక్కస్థానం ఆక్రమించింది కమల. సరి ఆలస్య మెందు కని అందరూ మొదలు పెట్టారు ఆరగించడం. కబుర్లు చెప్పకుంటూ ముగించారు అల్పాహారవిందు. కాఫీ బల్లదగ్గర, భోజనశాలలోనేగా రాజకీయాలు, మతకలహాలు, సంఘదుర్ణయాలు, లోకవ్యవహారాలు మాట్లాడునది.

సుమారు అయిదుగంట లయింది. ఇక ఎవరిఅభిరుచికి తగినట్టు వారు ఆటలకు బయలుదేరారు. కొందరు టెన్నిసు, కొందరుబాడ్మింటను, కొందరు టేబిలు టెన్నిసు, కొందరు కారమ్సు, సరే మిగిలిన వారు నలుగురు చొప్పున "ఆక్షన్ బ్రిడ్జి" ఆడటం మొదలుపెట్టారు. చీకటిపడేదాకా బయట ఆటలు (Out door games) సాగాయి. ఇంక అలసిపోయి "Cool drinks" పుచ్చుకున్నారు. అభ్యాసమున్న వారు గోల్డుఫ్లేకు సిగరెట్టుడబ్బా ముందువేసుకుని సిగరెట్లుముట్టించి N. S. R యింజనులాగ పొగవదలడం మొదలు పెట్టారు. ఈవిధంగా కులాసాగా కాలక్షేపం చేస్తూనే ఉన్నారు. యింతలో గడియారం "టింగు, టింగు" మని ఎనిమిది కొట్టింది. అందరూ బిలబిలా లేచారు. వీధిలో 'బుర్రు, బుర్రు'మని కారులచప్పుడు. ఒక్కరొక్కరే "గుడ్ నైటు"లు చెప్పకొన్న పిమ్మట కారులలో ఎక్కి నిజనివాసాలకి వెళ్లారు, అందులో మన సరోజ ఒకతె.

'టీపార్టీ'లోకటితప్ప మిగిలినవి క్లబ్బులో నిత్యకృత్యాలేకాని వింతలు విశేషాలు కావు. అంటే సుమారు నాలుగుగంటలు వీరంతా కులాసాగా కాలక్షేపం చేస్తున్నారన్నమాట క్లబ్బులో; అదే వారు చేయుపని. పైగా అట్టివారు సంఘాన్ని దూషిస్తారు. దాన్ని ఉద్ధరించడానికి తాము దిగి వచ్చామంటారు. ఇక దేశసేవమాట చెప్పనక్కరలేదు వారు చేయునది. ఎందుకంటే, మోటని వారు ఖద్దరు ధరించరు. బాగుండ వని స్వదేశీవస్తువులు కొనరు తిట్టమంటే చడా, మడా తిడతారు సనాతనులను. స్త్రీ జాతి అధోగతి పాలయిందంటారు. దానికి విద్యావిహీనతే కారణమంటారు. హరిజనులకు చాలా అన్యాయం జరిగిందంటారు, కాని ఏదీచూద్దాం, వారు స్త్రీల విద్యావ్యాప్తికి చేసినకృషి, ఏమి! పాఠశాలలు పెట్టించారా ? పుణ్యాత్ము లెవరైనా పెట్టించిన పాఠశాలలలో విద్యావతులైన తాము ఏమైన అనరరీగా పనిచేశారా ? హరిజనుల అభివృద్ధికి ఏంచేశారు ? పాఠశాలలు పెట్టించారా ? పల్లెలకు పోయి ప్రచారం చేశారా ? వారివిజ్ఞానం ఏవిధంగానైనా పెంపొందింపచేశారా ? లేదు. వారేమో, వారి క్లబ్బులేమో, వారి ఆటలేమో, వారి పాటలేమో, వారి అల్పాహార విందులేమో, వారి అధికాహార భోజనములేమో, వారివేషాలేమో, వారి భాషలేమో, అంతేకాని యిల్లాంటి వాళ్లు దేశానికిగాని, సంఘానికిగాని చేసిన సేవ యేమిటి ?

ఇల్లా కాలం గడిచిపోతోంది, స్వరాజ్యలక్ష్మికి మూడేళ్లు నిండాయి. అప్పుడే తండ్రితో నెమ్మదిగా చేయి పట్టుకొని పచారు చేస్తూ "నాన్నారూ, అమ్మయేదండీ? యింకా యింటికేరాలేదు. నాకు నిద్దరొస్తోంది, రోజూ అమ్మ నేను నిద్దరపోకుండా యింటికేరాదండీ, ఇవ్వాళ వెల్లాతప్పదుకూడా చెప్పానండీ నువ్వొత్తేనేకాని నిద్దరపోనని. దబ్బున, వత్తానందంది. రానేలేదు, పోనీయండి, రోజూ యింతే. నేను బజ్జుంతాను మీరు రండి," అంది ముద్దుముద్దుగా వచ్చీరాని మాటలతో. కృష్ణారావు అంతా శాంతంగా విని ఒక్క నిట్టూర్పువిడిచి "లేదమ్మా. వస్తుంది. కమలమ్మ పిన్నిగారింటికి వెళ్లింది. ఇప్పుడే వస్తుంది'

నీకు నిద్దరవస్తే పడుకో అమ్మా నేను నీదగ్గర కూర్చుంటా" నంటూ ఆమెను పక్క మీద పరుండబెట్టి జోకొట్టాడు. స్వరాజ్యం నిద్రపోయింది.

మానవుని జీవితం దుఃఖభాజనంగా చేయు వాటిలో 'అనుమానం' అగ్రస్థానం వహిస్తుంది. కాబట్టి ప్రతివ్యక్తికీ ప్రతివిషయంలోనూ కొంతనమ్మకం ఉండాలి. అది లేకపోతే అడుగేనా సాగదు జీవయాత్ర ముందు. కాబట్టే సరోజప్రవర్తన సహించి రాగంలోపడి స్త్రీ సహవాసంతోపాటు పురుష సహవాసంకూడా యెక్కువైనా కలతచెందలేదు కృష్ణారావు గారు. శీలమునకు భంగంలేకుండా ఏకార్యాలలోనైనా స్త్రీలు పురుషులతో కలసి పని చేయుట తప్పలేదని వారిఅభిప్రాయం. వారి అభిప్రాయమేకాదు; అందరి అభిప్రాయమూ కూడాను.

మాధవరావు పాశ్చాత్యదేశాలు తిరిగి వచ్చాక "మధు" అయినాడు. ఫుల్‌సూటు, ఫ్రెంచి కట్టు ఆయన పాశ్చాత్య వ్యామోహాన్ని ప్రదర్శిస్తాయి. ఒక 'గోల్డుఫ్లేకు' సిగరెట్టు డబ్బా ఎప్పుడూ కూడాఉంటుందని వేరే చెప్పనక్కలేదు, నోటిలో తెల్లచుట్ట లేకుండ వారిని చూడడం అరుదు.

ఆయన సంస్కారులలో ఒకడు. స్త్రీల స్వేచ్ఛకొరకు తన జీవితం ధారపోస్తానని కంకణం కట్టుకున్నాడు. మన హిందూసంఘం చాలా పతితమైందని, పాశ్చాత్య స్త్రీలను చూచి మనం చాలా నేర్చుకోవాలనీ, పలుమారు ఉపన్యసించాడు. కాబట్టి సంఘోద్ధారకులలో ఆయనకుకూడా ఒక ఉన్నత స్థానం యిచ్చారు ఆ సామాజికులు.

మనసరోజకి వారికీ జోస్తి కలసింది. అది క్రమక్రమాభివృద్ధి పొందింది. మధు "బేబీ ఆస్టిన్" అల్లా నడుతోందంటే సరోజ అందులో ఉందన్నమాటే.

లోకులు కాకులు. కుండ్లు మూయుటకు మూకుడుంది కాని వారినోళ్లు మూయుటకు సాధ్యపడదు ఎవ్వరికీ. అందులో వాక్స్వాతంత్ర్యం, పౌరహక్కులు కావాలనే యీ రోజులలో ఎవరినోరు ఎవరు మూయగలరు? సరోజ మధువుల విషయంలో లోకం విపరీతంగా చెప్పుకుంటోంది. కొంతమంది సరోజ యీ నడవడికి కృష్ణారావుగారిని నిందిస్తున్నారు కూడాను. కాని ఆయనమాత్రం చలించలేదు కొంచెమైనా. కళ్లారా చూస్తేనేగాని దేన్నీ నమ్మకూడదనే సిద్ధాంతంలో వాడు కాబట్టి.

ఆనాడు కృష్ణారావుగారికి కోర్టులో అట్టే పనిలేదు. పోనీ ముద్దుల స్వరాజ్యలక్ష్మితో ముచ్చటగా కాలక్షేపం చేయవచ్చునని సుమారు 3 గంటలకే యింటికి వచ్చాడు. వచ్చేసరికి యింటిముందు కారు. అది మాధవరావుది, నెమ్మదిగా లోపలికి వచ్చాడు. ఇంట్లో అలికిడి ఏమీలేదు. నర్సి, పిల్లాకూడా కనబడలేదు. కచేరిసావడి వదలి నెమ్మదిగా లోన ప్రవేశించాడు. సరోజగదిలో మాటలు వినబడుతున్నాయి. గదితలుపులు మూసిఉన్నాయి. ఇది ఆయనకు కనబడినదృశ్యం. స్థాణువై పోయాడు. అయిదు నిముషాలు అట్లే నిలబడి పోయాడు. అతనిబుర్ర గిర్రున తిరిగిపోయింది. చివరకి అనుకున్నంతా అయిందనుకున్నాడు. మాట్లాడక వెళ్లి పడకకుర్చీలో చతికిలపడ్డాడు.

కొంతసేపటికి సరోజ, మాధవరావులు బయటపడ్డారు. కృష్ణారావును చూసి తెల్లపోయారు. మాధవరావు చల్లగా జారాడు ఆయనకుచూచీ, చూడనట్లు కృష్ణారావుగారు బుర్రవంచుకొని కూర్చుండుటచే. సరోజని లోనికి వెళ్లి ఆలోచనలో పడింది. ఇంతలో నర్సి పిల్ల నెత్తుకొని వీధిలోనుంచివచ్చింది. పిల్ల తండ్రిని చూడగానే ఒక్క ఉరుకు ఉరికి తండ్రిదగ్గరకు వెళ్లింది "నాన్నారూ, ఇవ్వాళ దబ్బునొచ్చారు" అంటూ. కృష్ణారావు నెమ్మదిగా తలయెత్తి స్వరాజ్యాన్నిదగ్గరకు తీసికొన్నాడు. ప్రశాంతంగా సరోజనిని పిలిచి "నేటినుండి నీవు యీ యిల్లు విడిచి నీయిష్టము వచ్చినచోట ఉండవచ్చు. ప్రతినెలా నీకు మామూలుగా యిచ్చే నూరురూపాయలు ఎక్కడి పంపమంటే అక్కడికి పంపుతాను" అని రెండు వేడికన్నీటిబొట్లు రాల్చాడు స్వరాజ్యాన్ని నిమురుతూ.

ఈ సందర్భంలో ఒక సంగతి జ్ఞాపకం వచ్చింది. మిస్ మేయో, సరోజలాంటి ఏ వేళ్లమీద లెక్కపెట్టగల స్త్రీలనో చూసి "Mother India" వ్రాసింది కాని, కృష్ణారావుగారిలాంటి వీరపురుషులు, స్త్రీరత్నములు ఎందరున్నారో ఈ హిందూదేశంలో ఆమె కేమితెలుసు- చుట్టపుచూపుక్రింద వచ్చి ఏ పెద్దపట్నాలలోనో బసచేసి, ఏ అధికారి సభ్యులనో, ఏ ప్రభుత్వబిరుదాంకితులై భట్రాజులవలె వారి పరిపాలనను కీర్తించువారినో విచారించి పోయిన "సైమన్ కమిషన్" వారికి పల్లెవాసులకు రైతుల కష్టజీవనము తెలియనట్లు?

కృష్ణారావుగారి ఆ ప్రశాంతమగు పలుకులతో త్రాగినవాడిమైకం తాపుతో తగ్గినట్టు సరోజకు కమ్మిన మైకం పోయి కళ్లు విడ్డాయి. మొదటినుండీ ఆమె ప్రవర్తనా కృష్ణారావుగారి ఆదర్శజీవనమూ ఒక్కమారు కళ్లకు కట్టినట్టయింది. తననడవడి తానే విమర్శించుకుంది. ఆయనపట్ల తాను చేసిన ద్రోహం, ఆయన ఓరిమీ రెండూ బోధపడ్డాయి. తాను మహాద్రోహినని గ్రహించింది. సాధారణంగా తల్లులకు పిల్లలయందు అపరిమితప్రేమ యని వాడుక. అదికూడా తాను కల్లచేశానని గుర్తించింది. అన్నిటికంటె స్వరాజ్యలక్ష్మిపట్ల చేసిన ద్రోహం బోధపడింది. మారుమాటాడక యిల్లు వదలి వెళ్లిపోయింది.

చేసిన పాపమునకు ప్రాయశ్చిత్తముగ (మత్తువదలి పాపఫలన్యావిచక్షణ కలుగుటచే) తన జీవితము మానవసేవకై వినియోగించ నిశ్చయించింది. మర్నాడే వెళ్లి ఆస్పత్రిలో నర్సు (Nurse)గా ప్రవేశించింది. ధనాశతో కాక సేవావృత్తితో రోగులకు ఉపచర్య చేయుటకు మొదలుపెట్టింది. స్వల్పకాలములోనే ఉన్న పరిచారికలలో ఉత్తమురాలని పేరుపొందింది.

సరోజిని యిల్లు వదలిన మర్నాటినుంచి స్వరాజ్యం మంచం పట్టింది. అది క్రమంగా దీర్ఘరోగంక్రింద పెట్టింది. అపరిమిత ఆందోళనతో డబ్బు విరజిమ్ముతున్నాడు కృష్ణా

రావు. కాని అల్లోపతిక్ డాక్టర్ల కేమీ అంతు దొరకలేదు. ఆశ నిరాశ చేసుకొ న్నారు. చివరికి 'ఛెంగు' అని నిర్ధారణ చేశారు. అప్పుడప్పుడు స్వరాజ్యం తల్లికొరకు కలవరించటం దాన్ని బలపరచింది. దైవం మీద భారంవేసి గవర్నమెంటు ఆస్పత్రిలో ప్రవేశపెట్టాడు స్వరాజ్యాన్ని.

ఇల్లు వదలినప్పటినుంచీ సరోజ పిల్లవిష యమై కర్ణాకర్ణిగా వింటూనేవుంది. ఆమె మనస్సు ఆందోళన పడిపోతోంది. ఇంటికి వెళ్లడానికి మొహం చెల్లదు. వెళ్లి పిల్లను చూడమని మనస్సు తొందరపెడుతోంది. ఏమి చెయ్యడానికి తోచటంలేదు ఆమెకు. ఈ సందిగ్ధావస్థలో స్వరాజ్యాన్ని ఆస్పత్రికి తీసుకొచ్చారని తెలిసింది. దైవవశాత్తూ తను ఆ వార్డు (ward) లో ఉండటం తట స్థించింది. ఒక్కమారు కళ్లుమూసుకొని భగవం తుణ్ని స్మరించింది ఆ అపూర్వసంఘటనానికి.

కృష్ణారావుగారు లేనిసమయంలో రాత్రి అనక, పగలనక స్వరాజ్యాన్ని కనిపెట్టుకొని ఉంటోంది సరోజ. స్వరాజ్యానికి ఆహార మేమీ పోవటంలేదు. ఎవరుచెప్పినా సుక్కెడు పాలైనా తాగటంలేదు. తరచు తల్లికొరకు కలవరింతలు, చెరుపు, మరపుకింద ఉందిస్థితి. ఇల్లా రెండురోజులు గడిచాయి. మూడో నాడురాత్రి ఎవ్వరూ లేనిసమయాన్న సరోజ తనదుస్తులు తీసి స్వరాజ్యానికి తన్ను ఎరుక పరచుకుంది. స్వరాజ్యం దభాలున లేచి తల్లి ఒళ్లో బల్లిలా అంటిపెట్టుకొనిపోయింది. సరో జని కన్నీళ్లు ధారకట్టి స్వరాజ్యాన్ని అభిషే కించాయి. తలకిచల్లదనం తగలడంతోటే స్వరాజ్యం తల ఎత్తి చూచింది. తల్లికన్నీటి ధారలు కనిపించాయి. "ఏడవకమ్మా, ఎందు కేడుస్తావు? ఊరుకోవే అమ్మా" అంది హీన స్వరంతో. "లేదమ్మా" అంది సరోజ కళ్లు తుడుచుకుంటూ. తల్లి పడితే కొంచెం పాలు తాగింది స్వరాజ్యం. తరువాత నిద్రపోయింది తల్లిజోకొడుతూంటే. అదే ఆస్పత్రికి వచ్చాక ఆమె నిద్రపోవడం.

స్వరాజ్యాన్ని తండ్రితో చెప్పవద్దంది తనసంగతి సరోజ. అదిమొదలు స్వరాజ్యం తేరుకోవడం మొదలుపెట్టింది. కృష్ణారావు గారులేనిసమయం చూసి సరోజ పిల్లకి ఆహారం యిచ్చి వెళ్లిపోతూఉండేది. రాత్రి తెల్ల వార్లూ ఆమెదగ్గరే గడుపుతూ ఉండేది ఎవ్వరూ ఉండేవారుకారు కాబట్టి.

స్వరాజ్యానికి బాగా నెమ్మదిగా ఉంది. "ఇంక ఆస్పత్రినుండి యింటికి తీసుకువెళ్ల వచ్చు" అన్నారు వైద్యులు. మర్నాడే మంచిరోజుటచే స్వరాజ్యంతో "అమ్మా, మనం రేపు యింటికి వెళ్లిపోదాం" అన్నాడు కృష్ణారావు. ఆమాట స్వరాజ్యం చెవికి సుండు దెబ్బలాగ తగిలింది. మనస్సు ఏదో పెద్దరాయి పెట్టినట్టు బరువైపోయింది. "నాన్నారూ, నేను యింటికి రానండీ; ఇంటికి వస్తే అక్కడ అమ్మలేదండీ" అంది స్వరాజ్యం ఏడుస్తూ. నిర్ఘాంతపోయాడు కృష్ణారావు. "అమ్మ! అమ్మయేమిటమ్మా? అమ్మెక్కడుంది? చాలా రోజులైంది వెళ్లిపోయి. ఇక్కడమాత్రం అమ్మ ఎక్కడమ్మా?" అన్నాడు ఒక్క నిట్టూర్పుతో తనకు ఆసంగతేమీ తెలియదు గనుక; సరోజనుగూర్చి మళ్లీ ఏమీ వినిఉండ లేదు గనుక. అప్పుడు స్వరాజ్యం సంగతంతా చెప్పింది విపులంగా తండ్రితో. ఆశ్చర్యం, ఆనందంకూడా కలిగాయి ఆయనకి. రెండు కన్నీటిచుక్కలు రాలాయి ఆసంతోషంలో అప్రయత్నంగా. "అమ్మా, అమ్మకూడా యింటికివస్తుంది నీతోటి. రేపే వెళ్లిపోదాం అంతా యింటికి. సరేనా" అన్నాడు చిరు నవ్వుతో కృష్ణారావు.

---

అరుగుదె మ్మానందజీవీ!
పులుగు వెన్నడు గావు నీవోహో!
...ల్లాదివినో దివముదరినో
...ల్లహృదయము నోలుకబోసెదు
నిరనుభూతకళాంచితమ్మగు
నీయనర్గళ నిస్వనమ్ముల!

ఉన్నతము నున్నత తరమ్ముగ
మున్నదిగవిడి మిన్నులంటెద
వెన్నచిచ్చుల మేఘమట్టుల;
నీలవార్నిధి నెగసి మీరెదు,
పాటబాడుచె పరుగువారెదు,
పరుగువారుచె పాటబాడెదు!

# "స్కై లార్క్"

మల్లవరపు విశ్వేశ్వరరావు

స్రుక్కు-సూర్యసువర్ణవిద్యు
ద్రక్తిమొగిళులు రగులుచుండగ
దేలియాడెదు, సోలిమెగసెదు
నవ్యచలదశరీరదివ్యా
నందభావ మవంగనో!

లలితరక్తిమ సంధ్యనీపథ
వలయమున నీరై కరంగును,
పట్టపగలున మడగుతారక
పగిది జూపుల కందకున్నను
నిలిచి వినిమెద నీవు వర్షిలు
నిశితలసదానందమున్.

ధవళశుభ్రోష స్తటమ్మున
దరల తనతీక్ష్ణప్రదీపము
తరచి చూచిన తలపు లంటని
రజితకాంతుల రాజబింబము
రాల్చువాడిశరాల బోలిన
నిశితలసదానందమున్,

భూనభోంతరమెల్ల నీని
స్వానమే ధ్వనియించిపోయెడి
ప్రస్ఫుటమ్మగు రేయి జంద్రుడు
పరగి యొంటరి మొయిలుపజ్జను
కిరణపుంజము గురియదివియే
పొరలిపారిన పోలికన్.

ఏది నీవో ఏ మెరుంగము,
ఏది నీ కతిసన్నిభంబో ?
ఇంద్రచాపాభ్రముల జాలగు
బిందుసందీప్తులె తులింపవు
నీ ప్రసన్నిధి కురియుగానధు
నీ ప్రభావముతో.

లోక మెల్లను మునుగణింపని
శోకములు నాశలు పెనంగొన
నేకభావమొనర్చి, కోరకె
యూరకే గేయముల బాడుచు
నూహవెలుగుల దాగుకవిగతి :

ప్రణయమధురాలాపనలతో
ప్రేమభరితాత్మోపలాలన
కేనితాంతరహస్యవేళనో.
యా నికుంజము పొరలబ్రాసా
దాగ్రమున బ్రవసించి పాడెడి
యగ్రవంశ కుమారిపోలిక :
మరుగుపరచెడు విరుల, శాద్వలి,
నెరుగబడకయ వెలుగు లీనుచు
శిశిరసిక్తము కోనలోపల
మసలుబంగరు మిణుగురుంబలె :
వెచ్చవెచ్చని వాయువులు దళ
గుచ్ఛముల విరజిమ్మిపోగా,
పచ్చమగు తత్సౌరభమ్ములు
పక్షభారుల మధుపచోరుల

హెచ్చు మధురత మచ్చుగొల్పగ,
పచ్చనగు తన పత్రశాలనె
పరగు 'రోజా' పుష్పమట్టుల :

తళుకులీనెడి తృణశలాకల
దొలకరిల్లెడు జడుల యలికిడి,
వర్ష విచలిత వరసుమమ్ముల
హర్ష విలసిత మతులనవ్యము
స్వచ్ఛతరమా సొబగునెల్లను
హెచ్చిమీరును నీసుగీతము !

సూక్ష్మజీవమొ ? పక్షియాదో ?
సుంత నేర్పుము మాకు నేమధు
రానుభావము లీ వెరుంగుదో :
ప్రణయమ్రదాత్మసారసంస్తవ
నినదముల నెన్నండు గని విన
నీ మహాకల్లోలరంజన !

విమలకళ్యాణార్ద్రరాగము,
విజయవర్ధితమంద్రరావము
నీరుతమ్మున కీడు నేసిన
నీరసాతిశయమ్మె వెలివడు

నే రహస్యాభావకలననో.
సృష్టి నీకలగాననిర్ఝరి
యెట్టిలక్ష్యము లెంచి ప్రవహిలు :
ఏమి గిరికేదారలహరులు,
శ్యామలములే భూనభమ్ములు ?
ఏ విహంగకులానురాగము,
ఏ వ్యథాబాహ్యానుభోగము ?

నీ విశుద్ధానందగరిమను
నిలువజాలదు క్లాంతిసుంతయు,
నీడవోలిక నేని క్లేశము
నీదెసకె ప్రసరించ దెన్నడు;
నీకు వలచుటె-వలపుసొలపును
సోకి వగపుల నెరుగ వింకను.

నిత్యమును జాగ్రత్సుషుప్తుల
నీవు మది భావించియుందువు
మర్త్యులకు స్వప్నైకవేద్యము
మృత్యువైజాగాధసత్యము,
లటులగాక త్వదార్ద్రగీతిక
లెటుప్రవాహిలు నచ్ఛధారగ ?

వెనుకముందుల నరసి మేమా
వనరుచుందుము లేనిదానికి :
మా వినిర్మలహాసమందే
మలయునే బాధానుభూతియొ,
నిరవధికకారుణ్యభావ
స్ఫురితములె మా మధురగీతులు.

కాని మదమాత్సర్యభీతుల
గణన సేయక నుండజాలిన,
మ్లానబాష్పమ్మొక్కటేనియు
లేని జన్మమె పూనియుండిన,
ఏ గతిని నీయాప్రమోదము
నూహసేతుమొ ఏ నెరుంగను.

మోదభరితము నాదహృదయను
మొరయు నానాశ్రుతుల మీరగ,
గ్రంథరాజిని గడన సేసెడి
గూఢసంపద కెల్లమిన్నగ
నీయుపజ్ఞయె కవిహితమ్మగు
నోయిలాత్రల హేయభావీ !

నీమనస్సుకు దెల్లహా సుఖ
నిరతిలో సామైన నేర్పుము,
నాముఖమ్మున నే ప్రవాహిల
నంతబ్రేమోన్మత్తగానము,
ఇపుడు నే నెటు లాలకింతునో
యటులె జగమపు డాలకించును !

# మల్లెవిల్లు

కుందుర్తి నరసింహారావు

ఈనవమల్లి కాహృదయ మెంత కఠోరమొ! దూరదూరమం
దే నను గాంచి త్రుళ్లిపడి తీవ్రసుగంధశిలీముఖవ్యథన్
మే నుడికించుచున్న, దనిమేషవిలోచన వై కనుంగొనన్
మానస మొప్పెగాని యణుమాత్రము సాయపడం దలంపవే?

చండకరప్రసారిత విషాంబకతాండవఘోర మీధను
ష్మాండిలి యీరవంత సుమబాలిక కెవ్వరు నేర్పిరే? దిశల్
మండి దవాగ్నికుండములమాడ్కి మహోష్ణసమీరజిహ్వలన్
నిండుమనమ్ములం బ్రణయనీరము లిట్లుడుగంట బీల్చెదున్.

మంచుతెరల్ తొలంగి నరిమార్గణపీడితదుర్నివార్య రా
త్రించరనేత్రగోళముల తీరున వెల్గెడితారకల్, విషా
దాంచితభావనాజ్వలిత మైనయెడంద వడంకునెత్తుటన్
చంచలరూపయా కణకణమ్మున భగ్గున మండిపోయెదున్.

రాసులుగట్టెదున్ నరనరమ్మున శూలముపోటువోలె నీ
యాశుగపంక్తి గ్రుచ్చుకొని యావలకుం జనలేక, రంపమై
కోసెడు నొక్కొకండు నెదరున్ నలుప్రక్కల జుట్టినిల్చి, పై
శ్వాసయుగూడ వెల్వడనివైఖరి నడ్డుపడున్ విషాగ్నులై.

శంభుని మోసగింప సుమసాయకముల్ పదివేలు గుప్పి సం
స్తంభితశక్తుడై నిటలచక్షువుచే మడిసెన్ మరుండు: వి
శ్వంభర నెల్ల మాడ్చి పయిసాగెడు నీ సుమవాసనాసమా
రంభము నేడు తా నతనుప్రాతపగల్ వడిదీర్తు నంచనున్!

ఈ సుమసారభాంబకము లించుక నీదయ గల్గెనేని ది
వ్యాసవబిందురూపమున హాయి నొసంగు, సమస్తలోకసం
త్రాసము నిల్చిపోవుగదె, తద్విశిఖాగ్నిశిఖావిదగ్ధ వి
శ్వాసుడుగాడు వీ డకట పైదలి, యేటి కుపేక్ష నేయుదే?

# భారతీయ మహిళా మండలి



**శ్రీ పి. యం. కుమారమంగలం కన్య**

డా. పి. సుబ్బరాయనుగారి కుమార్తె. ఇంగ్లాండులో విద్యనభ్యసించి ఇటీవల తిరిగివచ్చెను.



**శ్రీ టి. టి. జయలక్ష్మీబాయి**

బళ్లారి పురపాలకసంఘమున స్త్రీల స్థానమున నిస్సపత్నముగా ఎన్నుకోబడిన సభ్యురాలు. ఈమె కాంగ్రెసువాది.



**శ్రీ కే. బోసు**

జినివాలో జాతిసమితి సభకు భారతీయ స్త్రీ ప్రతినిధి.

# శ్రీ పంతులు గారు

★

౧

ఆంధ్ర దేశచరిత్రలో వీరేశలింగ యుగానికి తరువాతది నాగేశ్వర రాయ యుగమే. సంకల్పబలమూ, కార్యదీక్షా, త్యాగమూ, యుగపురుషు లిద్దరికీ సమానమే. నాగేశ్వర రావుగారు వీరేశలింగముగారివంటి గొప్పవిద్వాంసులూ, రచయితలూ, కాకపోయినా, ఆంధ్రవిజ్ఞానాభివృద్ధికీ, జాతీయవికాసానికీ అద్భుతంగా కృషిచేశారు. కడచిన నలభైసంవత్సరాలలోనూ, వారు పాల్గొనని మహోద్యమము లేనేలేదు. ఇట్టి సర్వతోముఖమైన అభినివేశమూ ఉత్సాహమూ, వారికి యౌవనదశలోనే రేకెత్తి, నానాటికివృద్ధిచెంది, ఆంధ్రుల ప్రేమనూ, గౌరవాన్నీ పూర్తిగా చూరకొన్నవి. ఈ సత్పురుషుని గురించి మిత్రులూ, ఆప్తులూ, ఆశ్రితులూ, ఎంతోమంది వ్రాస్తున్నారు. పంతులుగారి సమగ్రజీవితచరిత్రను ప్రకటించడానికి ముందు కొన్ని ప్రధానఘట్టాలు—ముఖ్యంగా వారు చెన్నపట్టణానికి వచ్చి ఆంధ్రదినపత్రికను స్థాపించడానికిపూర్వము జరిగిపోయిన చరిత్రభాగములు చక్కగా వర్ణిస్తూ వారి బాల్యస్నేహితులు వ్యాసాలు వ్రాయాలి. వారి ఉత్తరాలూ, సంభాషణలూ, రచనలూ, స్వీకరించి సంపుటాలుగా ప్రకటించాలి. పంతులుగారే తమ స్వీయచరిత్రను వ్రాసిఉంటే, అమూల్యమైన గ్రంథంగా ఉండేది.

పంతులుగారి చరిత్ర 'అరేబియన్ నైట్సు' కథలవలె రసవంతంగానూ విస్మయజనకంగానూ ఉంటుంది. పుట్టుక గుడివాడసమీపంలో, ఆరాధ్యబ్రాహ్మణాగ్రహారంలో, సదాచారసంపన్నమైన పండితకుటుంబంలో. విద్యాభ్యాసము బందరు, చెన్నపట్టణాలలో. స్వతంత్ర వ్యాపారము సాగించి లక్షలాది ధనమార్జించింది బొంబాయినగరంలో. ఆంధ్రవారపత్రికను స్థాపించింది గుజరాతీ మరాటీమయమైన ఆ దూర ప్రాంతములోనే. చిన్ననాడు విద్యార్థిదశలో తాను నివసించిన తంబుచెట్టివీథిలోని భవనాన్ని కొని అందులోనే 'ఆంధ్రపత్రికా' కార్యాలయాన్ని స్థాపించారు. పాతిక సంవత్సరాలక్రింద అరవల ఆధిపత్యంలో ఉన్న చెన్నపట్టణంలో మరల ఆం



నాగేశ్వరరావుపంతులుగారు

(బొంబాయిలో నున్నప్పుడు)



రామాయమ్మగారు

★

కోలవెన్ను
రామకోటేశ్వరరావు

ధ్వజము నెలకొల్పి ఆంధ్రులకు యావద్భారత ప్రఖ్యాతి సంపాదించారు. సత్యాగ్రహోద్యమంలో ప్రకాశంగారికి కుడిభుజమై నిలచి వృద్ధాప్యంలో, అనారోగ్యస్థితిలో, కారాగారవాసము అనుభవించారు. ఇదంతా చిత్రమైన నాటకంగా తోస్తుంది. ప్రతిరంగంలోనూ మంచిపట్టుదలతో తనపాత్రను నిర్వహించి కార్యసాఫల్యమును పొందిన కర్మయోగి మన పంతులుగారు.

ఏదో ఒక ఘనకార్యాన్ని తలపెట్టి, దానిని సాధించడానికే జీవితమంతా ధారపోసి చరితార్థులయ్యేవారు కొందరు. అన్ని సదుద్యమాలకూ తోడ్పడి, తమ శక్తిసామర్థ్యాలను పలువిధాల వినియోగించేవారు కొందరు. ఆంధ్ర మహాపురుషులలో కోపల్లె హనుమంతరావుగారూ, కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారూ, మొదటిపద్ధతివారు. పట్టాభిగారూ, నాగేశ్వరరావుగారూ, రెండవ పద్ధతివారు. తమ చిత్తవృత్తినీ, అభిరుచినీ అనుసరించి, వీరంతా దేశాన్ని ఆరాధించారు. వీరిలో హెచ్చుతగ్గులు లేవు. అందరూ మనకు పూజ్యులే.

హనుమంతరావుగారు ఆంధ్ర జాతీయకళాశాలను బందరులో ప్రారంభించిన రోజులలోనే నాగేశ్వరరావుగారు బొంబాయిలో ఆంధ్ర వారపత్రికను స్థాపించారు. అంతకు పూర్వమే 'దేశాభిమాని' 'కృష్ణాపత్రిక', 'ఆంధ్రకేసరి' మొదలైన ఉత్తమపత్రికలు ఆంధ్రుల రాజకీయ పరిజ్ఞానానికి తోడ్పడుతూ, భాషాసేవ, సంఘసేవ పురికొల్పేవి, కాని పంతులుగారి వ్యాపార—వ్యవహార—జ్ఞానము ఆ పత్రికాధిపతులకు లేదు. నష్టము వచ్చినాసరే, వేలు, లక్షలు పెట్టుబడిపెట్టి, వ్యాసరచయితలకూ, వార్తాలేఖకులకూ పారితోషికమిచ్చి, నిరంతరాయంగా పత్రికను సాగించగలశక్తికూడా వారికి లేదు. ఆలోటు పంతులుగారు తీర్చారు. మొదట కొన్ని సంవత్సరాలు వారపత్రికగాను, తరువాత ౧౯౧౪ నుండీ దైనిక పత్రికగాను, తమ 'ఆంధ్రపత్రిక'ను నిర్వహించడమే పంతులుగారి దేశసేవా ప్రణాళికలో ఉత్తమోత్తమంగా ప్రశంసింపతగ్గది. వారివదాన్యత మహాప్రవాహంవలె ఆంధ్రదేశాన్ని ముంచివేసినా, అనేక వ్యక్తులూ, కుటుంబాలూ, సంస్థలూ వారి దయకు పాత్రమైనా, ఆంధ్ర పత్రికామతల్లియే శ్రీ పంతులుగారి కీర్తిని చిరస్థాయి కావించునని నా నమ్మకము. ('ఆంధ్రపత్రిక' నిర్వచనంలో 'భారతి' 'విజ్ఞానసర్వస్వము' 'ఆంధ్రగ్రంథమాల' కూడా చేరినవి. ఇవన్నీ, పత్రికకు ఉపాంగములు.) లాభసాటి పనులెన్నో చేసి వాటివల్ల అపారమైన ధన మార్జించి, ఎప్పటికప్పుడు ఆధన మంతా నష్టదాయకమైన పత్రికకు వినియోగించిన సందర్భము తలుచుకుంటే, పంతులుగారి త్యాగము హిమవత్పర్వతశిఖరమువలె ఉన్నతమై, స్వచ్ఛమై, తేజోమయమై, కనుపిస్తుంది. అటు 'ఆంధ్ర జాతీయ కళాశాల,' ఇటు 'ఆంధ్ర పత్రిక' ఇరువురు త్యాగధనులు ఆంధ్రజాతికి సమర్పించిన మహాసంస్థలు.

౨

నేను లాకాలేజీలో విద్యార్థిగా ఉన్నరోజులలోనే (౧౯౧౭-౧౮) మొట్టమొదట పంతులుగారిదర్శనం చేశాను. వారి సౌజన్యమూ, ఆంధ్రాభిమానమూ, చూసి ముగ్ధుడనై పోయినాను. కేవలము పరిచయము సంపాదించడమేకాక, వారి సన్నిహితులలో ఒకడనై ఉండవలెననే అభిలాష ఎక్కువైనది. ఏదో కొంత దూరపుబంధుత్వ మున్నదనీ, మా తండ్రిగారికి వారు స్నేహితులని అదివరకే విన్నాను. కాని వీటిని నేను ప్రధానంగా గణించలేదు. నా సామర్థ్యమువల్లనే పంతులుగారి మనస్సుకు ఎక్కవలెనని నాపట్టుదల. వందలకొద్దీ ఆంధ్రవిద్యార్థులు నాకన్న సమర్థులు చెన్నపట్టణములో ఉండగా నా ప్రత్యేకత ఏమిటి? అప్పట్లో తెలుగులో వ్యాసాలు వ్రాయగల ఆంధ్రవిద్యార్థులు తక్కువ. కొంతప్రయత్నముచేసి ఏదోవిధంగా ఆరెండు సంవత్సరాలలో 'ఆంధ్రపత్రిక'కు "ఇటలీ స్వాతంత్ర్యోద్యము" "మహారాష్ట్రవీరులు" అనే శీర్షికలతో పది పన్నెండు వ్యాసాలు వ్రాసి సహాయసంపాదకులైన కర్రా లక్ష్మీనరసింహముగారి ద్వారా ప్రకటింపగలిగినాను. వ్యాసాల ప్రాశస్త్యము మాట ఎట్లా ఉన్నా ఇందుమూలంగా నేను పంతులుగారిని అప్పుడప్పుడు కలుసుకోవడానికీ, వారు ఆదరణతో ప్రస్తావించడానికీ అవకాశము కలిగింది.

అసహాయోద్యమ ప్రారంభదశలో 'ఆంధ్రపత్రికా' సంపాదకులైన చల్లా శేషగిరిరావుగారికి ఆరోగ్యము చెడినప్పుడు కొంతకాలము నేను సంపాదకుడుగా ఉండవలెనని పంతులుగారు ఆజ్ఞాపించారు. కాని త్వరలోనే శేషగిరిరావుగారికి స్వస్థత

కలగడమువల్ల నేను పత్రికలో చేర వలసిన అవసరము లేకపోయింది. పంతులుగారికి నాపైగల సదభిప్రాయము, అభిమానము, ఈ సందర్భములో వ్యక్తమైనవి. పిమ్మట నేను జాతీయకళాశాలలో గడిపిననాలుగు సంవత్సరములలోను (౧౯౨౩-౨౭) అవి పెంపొందినవి.

ఏటేటా దీపావళి చందాలకై చెన్నపట్టణము రావలసినపని కళాశాలవారు నాకు వప్పగించినారు. చెరుకువాడ నరసింహారావుగారి మూలంగా ఈ వ్యవహారములో నాకదివరకే కొన్ని సంవత్సరాలనుండి ప్రవేశముకలిగింది. నేను కళాశాలకు వెళ్లకపూర్వపు సంవత్సరమే—నేను 'స్వరాజ్య'లో ఉన్నప్పుడు—నరసింహారావు చెన్నపట్టణము వచ్చి సమయానికి జబ్బుపడితే, దీపావళి భిక్ష కార్యక్రమ మంతా నేనే నిర్వహించాను. ఇక స్వయంగా కళాశాలలో పనిచేస్తున్నప్పుడు చెప్పేదేమిటి. రెండుమూడువారాలు అదే పనిగా చెన్నపట్టణ మంతా తిరగడమూ పట్నపువిద్యార్థులకు డబ్బాలు ఇచ్చి వీథివీథీ తిప్పడమూ, వార్షికాలిచ్చేవారి ఇండ్లచుట్టూ ప్రదక్షిణాలు చేయడమూ — ఇదంతా ప్రయాసతో కూడినపని. కాని, పంతులుగారి తోడ్పాటు ఉండబట్టి అంతకష్ట మనిపించేదికాదు. కొన్నిపూటలు వారి ఇంట్లోనే ఆతిథ్యము. వీలైనప్పుడు వారికారులోనే తిరగడము. కొన్ని చోట్లకు వారినే వెంటపెట్టుకుని వెళ్లడము. ఈ విధంగా జరిగేది. వారి కార్యాలయపు సిబ్బందినీ, వారి పలుకుబడినీ స్వేచ్ఛగా ఉపయోగించుకోవచ్చును. సామాన్యంగా ప్రతి ఆంధ్రునికీ కీర్తిశేషులైన హనుమంతరావుగారిమీదా, వారి కళాశాలమీదా ఉన్న అభిమానమే పంతులుగారికి కూడా ఉన్న దనుకున్నాను. వీటివల్లనే వారు నాతోపాటు కళాశాలకై శ్రమపడుతున్నారనుకున్నాను. కాని, ఒకనాటి మధ్యాహ్నము చిత్రమైన సంఘటన ఏర్పడ్డది. పార్కుటవున్‌లో ఎవరో వర్తకుడివద్దకు చందాకై వెళ్లవలసి వచ్చింది. పంతులుగారు వెంటఉంటే నేగాని సరిమైనపద్దు పడదని నాభయము. వారు రావడానికి సిద్ధమే. కాని, కారు హాజరులో లేదు. పోనీ, ఇంకోరోజున పోవచ్చుగదా అని సమాధాన పెట్టుకున్నాను. పంతులుగారు మాత్రము, "జట్కాలోపోదాము, పదండి" అని జట్కా పిలిపించారు. కారు లేకపోయినా సరే, కళాశాలపని ఆలస్యము కాకూడదని వారిపట్టుదల. త్రోవలో "ఏమండీ, పంతులుగారూ! కళాశాలకై మీరెంత శ్రమపడుతున్నారండీ! ఈవేళ, పాపము, మీకు కారుకూడా లేకపోయిందే!" అన్నాను. పంతులుగారి కండ్లు వెంటనే నీరుక్రమ్మినవి. గద్గదకంఠంతో, 'అదేమిటండీ! హనుమంతరావుగారికి నామీద ఎంతప్రేమ! వారునాకెంత సహాయం చేశారు! వారిఋణము



శ్రీ శివలెంక
శంభుప్రసాదుగారు
(నాగేశ్వరరావుగారి అల్లుడు)



శ్రీ శివలెంక
కామాక్షమ్మగారు
(నాగేశ్వరరావుగారి పుత్రిక)

ఈజన్మకి తీర్చుకోగలనా?' అన్నారు. ఆ నిమేషమునుండీ పంతులుగారికీ నాకూ ఏదో నూతన సంబంధము ఏర్పడిన ట్లయింది. మా హనుమంత రావుగారికి ఆప్తు లైతే, నాకుమా త్రము ఎందుకుకారు!

నేను కాళాశాలలో ఉన్నప్పుడే వారి చిన్న మేనల్లుడు చి॥ శంభు ప్రసాదును చదువుకై అక్కడికి పంపి నారు. ప్రసాదు తల్లిదండ్రులనూ, అన్నగారినీ నేను బందరులో చదు వుకొన్న రోజులలోనే ఎరుగుదును. కొంత కాలము బుట్టయ్యపేటలో ఒక ఇంటిలోనే కాపురమున్నాము. అప్ప టికి ప్రసాదు నాలుగైదేండ్ల పసి బాలుడు. అతను మా కళాశాల లోనే విద్యార్థిగా చేరడము నాకు పరమానంద మైనది. పంతులుగారు బందరు వచ్చినప్పుడు కళాశాలసంద ర్శించి మేనల్లుడి యోగక్షేమములు విచారిస్తూ ఉండడమేకాక, అప్పు డప్పుడు పట్నమునుండి నాపేర ఉత్త రాలు వ్రాస్తూఉండేవారు.

పంతులుగారు కళాశాల స్థాపిం చిననాటినుండీ ఎంతెంత విరాళాలు ఇచ్చారో నాకు తెలియదు. కాని నా అనుభవములో ఉన్న సంగతి చెప్ప గలను. ౧౯౨౬ ప్రారంభములో కళాశాల చిత్రలేఖనోపాధ్యాయు లైన ప్రమోదకుమార చటర్జీగారు తమ ఉద్యోగము మానుకొని కల కత్తా వెళ్లిపోతా మన్నారు. వారిని బలవంత పెట్టి ఉంచినా, వారికి నెలకు నూరు రూపాయలజీతము ఇవ్వగల సామర్థ్యము కళాశాలవారికి లేదు. ఈ స్థితిలో ఇంకో సంవత్సరమైనా చటర్జిగారిని నిలపడానికి, పంతులు గారిని అర్థించవలసివచ్చింది. ఈరా యబారానికి నేనూ, బాపిరాజు గారూ (అప్పటికి కళాశాల చిత్ర లేఖన తరగతిలో విద్యార్థి-నేటి కళా శాలాధ్యక్షుడు) ప్రత్యేకంగా చెన్న పట్టణము ప్రయాణ మైనాము. ఈ సంగతి పంతులుగారితో ఏవిధంగా ప్రస్తావించాలో, పదేపదే వారినే మొగమోట పెట్టడము భావ్యమవునో కాదో, ఇంతకూ మనఇద్దరివల్లా ఈ పని నెరవేరునో లేదో, అని చాలా సంశయించాము. ఒక వారమురోజు లైనా చెన్నపట్టణములో ఉంటేనే కాని ఈ కార్యము సాధించజాల మేమో, అనుకున్నాము. రైలుదిగి సరాసరి పంతులుగారు కాపురమున్న "రెంటాలభవనా"నికి వెళ్లాము. నె మ్మదిగా మరునాడో మూడోనాడో, పంతులుగారితో ప్రస్తావించవచ్చు కదా అనుకున్నాము. కాని, ఇంకా స్నానమైనా, భోజనమైనా కాక ముందే, "వచ్చినపనేమిటి" అన్నారు. జంకుతో నేనోమాటా, సాభినయం గా బాపిరాజు ఇంకోమాటా, మొ త్తంమీద, పంతులుగారు చటర్జీగారి జీతముక్రింద పన్నెండువందలు కట్ట వలసినట్టు తేల్చాము. "సరే దాని కేముంది అట్లాగే ఇస్తాను" అన్నా రు. అసలు ఏవిధంగా వారిని అడగ గలమా అని అంతగా మథన పడ్డామే, చివరకు ఇంత సులభంగా తేలిపోయిందే, అని ఆశ్చర్యపడ్డాము వచ్చినపని మొదటి పూటలోనే అయిపోయింది. అయినా నాలుగు రోజులపాటు పట్నంలో స్నేహితు లతో గడిపి, మా సామర్థ్యమువల్లనే ఇంత ఘనకార్యమును నిర్వహించి నట్లు, సగర్వంగా బందరు చేరు కున్నాము.

కళాశాల బీదవిద్యార్థులకు పుస్త కాలకనీ, బట్టలకనీ, కొందరికి ఉద్యో గాలకనీ, అనేక పర్యాయములు నేను పంతులుగారిని అర్థించాను. "ఈమాట చెప్పవచ్చునా, వారికి శ్రమగా ఉంటుం దేమో," అన్న సంశయము నాకేగాని, ఎట్టిసహా యము చేయడానికీ వారికిమాత్రము సంకోచము లేదు.

చివరకు౧౯౨౭ సంవత్సరములో, ఒకానొక దుర్ముహూర్తములో, కళా శాల వ్యవహారాలవల్లనే, నాకు పంతులుగారియెడ అసంతృప్తి ఏర్ప డింది. కళాశాల స్థితిగతులు చక్క పరచడానికై ఏర్పడిన విచారణసంఘ ములో పంతులుగారు సభ్యులు. కళా శాల ఆర్థికస్థితి చక్కగా లేనందున, కర్మాగారానికి, అసహాయోద్య మానికి పూర్వములో వలెనే, సర్కారు సహాయము పొందవచ్చు నని సభ్యులు సలహా ఇచ్చినారు. దీనిని పంతులుగారుకూడా ఆమో దించారు. ఇది అసహాయోద్యమ సిద్ధాంతాలకు వ్యతిరేకమనీ,౧౯౨౧ నుండి కాంగ్రెసువల్ల ముప్పది, నలు బది వేలవరకు సహాయము పొందిన కళాశాల, స్వరాజ్యస్థాపన జరిగిన పిమ్మటనేగాని,సర్కారు సహాయము పొందకూడదనీ, నాపట్టుదల. ఈవిష యములో నేను పంతులుగారిని గురించి తీవ్రముగా వ్రాసినాను; తీవ్రముగా మాట్లాడినాను. అభి ప్రాయ భేదమును ఓర్వగల సహ నము నాకు లేకపోయినది.

ఇదంతా జరిగినా, మేము సమా వేశ మైనప్పుడుమాత్రము పంతులు గారు నాపైన ఎప్పటి వాత్సల్యమే ఉంచేవా రని నే నెరుగుదును. దేశ

నాయకు లన్న గౌరవమూ, సాధుపుంగవు లన్న భక్తీ, అనేకసందర్భాలలో నన్ను ఆదరించిన "పంతులుగా"రన్న ప్రేమా, నేను విడనాడలేదు. హనుమంతరావుగారికీ, పంతులుగారికీ, నాకూ, ఎన్నిజన్మల నాటి సంబంధమో !

## 3

పంతులుగారి జీవితమంతా దిగ్విజయమే. విద్యార్థి దశలోనూ, బొంబాయిలో వ్యాపారము పెట్టిన మొదటి దినాలలోనూ, కొంత ఆశాభంగము కలిగినదేమో చెప్పజాలను. కాని ౧౯౧౧ సంవత్సరమునుండీ వారు అస్తమించే వరకూ వారు తలపెట్టిన కార్యా లన్నీ నిర్విఘ్నంగా నెరవేర్చారు. వారికిగల ఉత్తమాశయాలనన్నిటినీ నెరవేర్చుకున్నారు. కవులనూ, పండితులనూ ఆదరించారు. మహారాజులకంటె అధికంగా ఆంధ్రభాషను పోషించారు. ఉత్తమ కృతులను స్వీకరించారు. రెండుకోట్ల ఆంధ్రులకూ అండగానిలిచి, ఆంధ్రుల ఖ్యాతికీ, పురోభివృద్ధికీ, ఎట్టిలోపము వాటిల్లినా, ఆ లోపము తనదే అన్నట్లు, వేయికన్నులతో కాపాడినారు. చివరకు స్వరాజ్యమునూ, ఆంధ్రరాష్ట్రమునూ, కనుచూపుమేరలో చూసి, పరమపదము పొందినారు.

ఒకవేళ ఏ ఘట్టములోనైనా పంతులుగారు అపజయము పొందినట్లయితే, అది దేశానికి గొప్పముప్పుగా ఉండేది. కాని వ్యక్తిగతంగా పంతులుగారికి మాత్రము జయాపజయాలు ఒక్కటే-వారి పత్రికలు ఆగిపోయి, వారు 'శ్రీబాగు'లో కాక ఒక చిన్న కుటీరములో ప్రాణము విడిచినా, పంతులుగారు శాంతచిత్తముతో వెళ్లిపోయేవా రనియే నా విశ్వాసము.

పంతులుగారు మొదటినుండీ తమ ఏకపుత్రికను మేనల్లుని కిచ్చి వివాహము చేయవలెననీ, ఆ వివాహానికి ఫలితంగా దౌహిత్రుడు కలుగవలెననీ, అల్లుడు ప్రయోజకుడై తమ అనంతరము తాము తలపెట్టిన సత్కార్యా లన్నీ అవిచ్ఛిన్నముగా సాగించవలెననీ, ఆశపడ్డారు. తక్కిన వాటితోపాటు, ఈ సంకల్పము కూడా అమోఘముగా నెరవేరినది. చి. శంభుప్రసాదుకు జాతీయకళాశాలలోను, అడయారులోను, విశ్వభారతిలోను, నేర్పినచదువు ఫలించి, అతనికి బుద్ధికుశలతా, సత్ప్రవర్తనా అలవడినవి. ధనముకన్న దేశసేవయే ఉత్తమ మని గ్రహించినాడు. అతని శక్తినంతా ధారపోసి 'ఆంధ్రపత్రిక' మొదలైన సాహిత్యసంస్థలను స్వయంపోషకము లొనర్చి, పంతులుగారి ఆత్మకు జోహారు లీయ సంకల్పించినాడు. పంతులుగారి నిర్యాణమువల్ల దేశాన్ని ఆవరించిన గాఢాంధకారంలో, మనకు కనుపించే ఆశాజ్యోతి ఇదే !

ఒక్కమాట చెప్పి విరమిస్తాను. పంతులుగారు మా 'త్రివేణి'పత్రికకు యావజ్జీవపు చందాదారు. వచ్చే 'మే'నెల పత్రికలు పంపేటప్పుడు పంతులుగారిపేరు తొలగించవలసి ఉంటుందనే సంగతి తలుచుకుంటే నా మనస్సు కలవరపడుతున్నది.



# నా గే శ బా బు!

బొ డ్డు బా పి రా జు

ఇవి సర్వాంధ్రజనాశ్రువాహినులు పోటెత్తెన్ భవత్స్వర్గతి
శ్రవణోత్థాపితవేదనాహతదరిద్రప్రాణిహృద్రక్తబిం
దువులన్ జోగురువారి; అర్థిజనబంధూ! నీ వియోగంబుతో
నవనాడుల్ తెగి దానకన్యకకు ప్రాణం బూర కల్లాడుబో!

"తెనుగుధరిత్రి కెంతటి యదృష్టపుగాలినొ రాలిపడ్డ నం
దనవనకల్పపాదపలతాంతము, పావనదేవధేనుక
స్తనమధుబిందు" వన్న నుడిచందము దప్పని యేవదాన్యతా
ఖని గని యుబ్బిపోవు తెనుగమ్మ అతం డెడబాసి పోయెనా?

ఎన్నికలములలో సిరా యిగిరిపోయె
నెన్నికుంచెలలో రంగు లెండిపోయె
నెన్ని చాచినచేతు లల్లే కృశించె
వెల్లడింపు డీనాలుగునాళ్లలోన?

కడకంటియొక్కచిక్కనినవ్వు వ్రాపుగా వ్రాకివచ్చినవి కావ్యమ్ము లెన్ని
తలపేలు నొకముహూర్తమున లేచినవాంధ్రశారదానర్తనశాల లెన్ని
వెలలేని యొక్కగుప్పిలికి దీనులగృహమ్ములవెలింగినదీపకలిక లెన్ని
చల్లనియొకపల్కుజాడలో తిరుగక సాగిపోయినవి దేశమ్ము లెన్ని

ఎన్నని వచింపవచ్చు నీ వన్న నొక్క
మేలిమిగొనాలగని వన్న జాలు; నైన
నద్భుతకథావిచిత్రమ్ములగు భవద్వ
దాన్యతలు నచ్చినవి సమస్తమున బాబు!

భావానందరసశ్రీ, స్థావరము, శివామహేశచరణాబ్జరజః
పావని, రజతాచలశృంగావని నభ్యాగతార్చ లందుము ఘనుడా!

—— (*) ——

# ఉత్తర నాగేశ్వరీయము

దేశిరాజు వీరభద్రరావు

[రంగము :—ఇంద్రసభ]

[అప్సరసలు నాట్యముచేసి ముగిస్తారు]

నారదుడు

ఎన్నాళ్లైనా పాతపద్ధతులతోటే కాలక్షేపం చేసుకోకపోతే కొత్త నాట్యభంగిమలు కొన్ని నేర్చుకుంటూండకూడదూ ?

రంభ

మహర్షి పుంగవులకి మా నాట్యం నచ్చలేదా ?

నారదుడు

నాకు నచ్చడంమాట అటుండనీ. అప్సరస లంతా యింకా పాత పాటల్నే పట్టుకుని పాకులాడుతున్నారని మనలోకానికివచ్చిన మానవులు గుసగుస లాడుకోడం చాలామార్లు వింటున్నాను. వాళ్లని రంజింపచెయ్యడంకూడా మీ విద్యుక్త ధర్మాల్లో ఒకటిగదా !

మేనక

మా నాట్యాన్ని ఏవగించుకొనే నాగరికతకూడా వుందా మర్త్యలోకవాసులకు ?

నారదుడు

ఈ స్వర్గంతోటీ, మీ నాట్యంతోటీ అందరికీ సంబంధం లేకపోవచ్చును. కాని కర్మనిరతులైన భారతీయుల కెక్కువసంబంధం వుంది. వారిమాటే నే చెపుతున్నాను.

ఊర్వశి

పరాధీనులై గర్భ దరిద్రంతో క్రుంగిపోతూన్న భారతీయులు మా నాట్యకళను ఆక్షేపించడమా ?

ఇంద్రుడు

అల్లాంటినటీనటులు మన లోకానికి వచ్చినప్పుడు ఆలోచిద్దాం. ఇప్పుడాగొడవ కట్టిపెట్టి అత్యవసర విషయాలు చూసుకుందాం.

నారదుడు

ప్రస్తుతం యింతకన్న అత్యవసర విషయం మరొకటి లేదు. నటీనటుల మాటెందుకు ? నాట్యకళాపోషకులలో ముఖ్యుడే నిన్న స్వర్గలోకానికి వచ్చాడు.

ఇంద్రుడు

అయితే అత డేప్రాంతంవాడో?

నారదుడు

ఆంధ్రుడు.

ఇంద్రుడు

(వికటంగానవ్వి) అమాయకుడా! నువ్వు ఆంధ్రుడికంటే అమాయకుడులా కనిపిస్తున్నావే. ఆంధ్రదేశంలాగే నాట్యపోషణకూడా నీ ఊహాప్రపంచంలోదేనా ?

నారదుడు

నేచెప్పేది అంతచులాగ్గా తీసుకోకండి. ప్రత్యేకాంధ్రదేశ నిర్మాణావశ్యకాన్ని తెలియజేసిన ఆంధ్రముఖ్యు[illegible] ఇక ప్రస్తుత విషయంలోకొద్దాం. ఆ కళాప్రపూర్ణుడు కట్టించిన దుర్గా కళామందిరాన్ని చూసినవారు తమ నాట్యశాలల్ని చూస్తే 'రాజునుచూసిన కళ్ల మొగుణ్ణిచూస్తే మొత్తుకోబుద్ధేసిం' దన్న సామెత చటుక్కుని జ్ఞాపకం వస్తుంది. నిత్యకల్యాణము పచ్చతోరణంలా ఎల్లప్పుడూ అతిథులతో నిండి కలకలలాడుతూ సర్వజనోపయోగంగా వున్న ఆ సర్వకళా ప్రపూర్ణుని 'శ్రీబాగ్ 'ముందర తమ రాచనగరు కూడా దివిటీముందర దీపంలాగే వెలవెలపోతుంది. అస్తమానూ యీ భోగంవాళ్లని తైతక్క లాడించినంత మాత్రంలో నువ్వు కళాపోషకుడవు కాజాల వని ఆయన రాగానే నీకు తెలియజేస్తాడు.

కుబేరుడు

అంతంత గొప్పభవనాలు కట్టించడాని కతడేమాత్రం ధనం పోగేశాడేమిటి ?

నారదుడు

పోగేసిన ధనంమాట కేంగాని, ఆ విశ్వదాత చేసిన దానాలే, మీ యినప కొట్లలోని ధనరాసులకి చాలా రెట్లు వుంటా యనడంలోయేమీ అతిశయోక్తిలేదు. తమరు యేయే దానాలు చేశారు? యేయే సంస్థలను పోషించారు? ఎల్లాంటి గుప్తదానాలు చేశారు? అని ఆయన ప్రశ్నిస్తే తమరు తల వంచుకోనసలు శాస్త్రం చేమోనని భయపడుతున్నాను.

అశ్వినీ దేవతలు

ఉత్తరదేశస్థు లైతే ఉపన్యాసాలిచ్చి సంపాదించచ్చు. దక్షిణ దేశస్థు లైతే కాఫీహోట లెట్టిసంపాదించచ్చు. కాని ఆంధ్రు డింతధన మెల్లా సంపాదించగలిగాడు ?

నారదుడు

మనవిచేస్తా. ఆంధ్రుల శక్తిసామర్థ్యాలు చాటడానికి పుట్టిన ఆదర్శావతారం యిది. ఆయన స్వతంత్రజీవనారంభం ఉత్తరాన్ని, పిమ్మట అంత్యంవరకు దక్షిణాన్ని సాగించి యిద్దరినీ తలదన్నేడు. అన్ని విధాలైన అర్థిజనులకీ అత డెల్లా అండగా నిలిచాడో, అల్లాగే అన్ని విధాలైన నొప్పులకీ అతనిచే కనిపెట్టబడ్డ అమృతాంజనం అమృతంలా పనిచేసింది. అదేఆయన ధనార్జనకి మూలాధారం. ఆ అమృతాంజనమేకనక యిక్కడ ప్రచురణచేశాడంటే తమ రిక వైద్యవృత్తికి తిలోదకాలిచ్చి మరోవుద్యోగం వెతుక్కోవలసిందే.

గురుడు

సకలశాస్త్ర పారంగతు లైన వాళ్లుకూడా ఇక్కడకొచ్చాక చచ్చు పెద్దమ్మల్లా కూచున్నారు. వాళ్ల కంటె యిత డేమంత గొప్పవా డని నీ విల్లా పొగడుతున్నావు ?

నారదుడు

గురువుగారికికూడా గురుడువక్రించాడనే నావుద్దేశ్యం. ఆయన తమ రికిమల్లే పుస్తకాలన్నీనమలి బుగ్గని పెట్టుకోలేదు. ఆంధ్ర దిన, వారపత్రికలు, భారతిమొదలైన వార్తాపత్రికలతో, నిద్రపోయే ప్రజలకళ్లు తెరపించిన దేశోద్ధారకుడు. ఆయనసహాయంతో అనేకమైన పుస్తక భాండాగారాలు స్థాపింపబడ్డాయి. జంధ్యాలు పెనేసి వేదాలు వల్లెయ్యడం విద్య కాదని ఆయనవద్ద మీరు తెలిసికోవల సుంటుంది. లేదా తమగురుత్వానికి రాజీనామాయియ్యవలసుంటుంది.

ఇంద్రుడు

(చిరునవ్వుతో) మీ దేశోద్ధారకు డిక్కడున్నంత కాలం ఆయనికి యీ బృహస్పతి శుశ్రూషచేస్తూంటా డన్నమాట.

నారదుడు

నేను హాస్యానికి చెప్పడం లేదు. “ క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి ” అనికదా లోకోక్తి. స్థితప్రజ్ఞుడు చేసిన పుణ్యకార్యాలు మానవలోకంలో శాశ్వతంగా వుండేవేకాబట్టి యితనికి శాశ్వత స్వర్గలోకప్రాప్తి తప్పకుండా కలుగుతుంది. ఇక తన సుగుణసంపదవల్ల, స్వశక్తివల్ల త్రిదశు లందరి దయకు పాత్రుడై, స్వర్గోద్ధారకేత్యాదిబిరుదాల్ని పొంది బృహస్పతికే కాక మీ అందరికీకూడా నాయకుడు కాగల డనడం అతిశయోక్తి కాదు. ఒక్క కవిత్వంలో మాత్రం కాస్త ప్రజ్ఞగడించిన శ్రీనాథుడు యిక్కడ కొచ్చేసరికే మన “ దివిజకవివరుగుండియల్ దిగ్గు ” రన్నాయి. మీకు జ్ఞాపకం లేదూ ?

ఇంద్రుడు

ఇంతటి కర్మయోగి భూలోకంలో వున్నాడని యింతకుపూర్వము యెందుకు చెప్పలేదు నువ్వు ? ఏదో విధంగా అతణ్ణి కర్మభ్రష్టుణ్ణి చేసుండేవాణ్ణికదా ! బ్రహ్మసృష్టికి ప్రతిసృష్టి చేసే కౌశికుడంత ఋషిపుంగవుణ్ణే ఒకవేశ్యవలలో పడవేశానే. ఈ సామాన్య మానవమాత్రుడంటే నాకు లెక్కా ?

నారదుడు

మన యమధర్మరాజుగారు ఆయనకు మూడుపాతిక లేనా నిండకుండా కాయకల్పచికిత్సపొంద నియ్యకుండా యిక్కడకు తీసుకొచ్చి యెదుర రొమ్ములమీాద కుంపటిలా పెట్టుకుంటాడని యెవ రెరుగుదురు? అదీకాక మీరు చెప్పేది పూర్వకాలంకబుర్లు. ఇప్పుడు భారతీయుల్లో మునుపటి భావదాస్యము, బానిసోద్దేశాలు లేవు. వారిలో స్వాతంత్ర్య తృష్ణ క్షణ క్షణము అభివృద్ధి పొందుతోంది. పూర్వం దేశంలో చాలా భాగం రాక్షసపాలనంలో వుండేది కనక మీరు చాటునుండి వారికివీరికి నిత్యమూ కలహాలుపెంచుతూ మీరు మాత్రం అదృశ్యులై వార్ని పాలిస్తోంటే మీ ఆటలు సాగేవి. విడదీసి పాలించడములో మీకంటే ఏడాకు లెక్కువ చదివిన ఆంగ్లేయులే ఇప్పుడిక చేసేది లేక క్రమక్రమంగా దాసోహం అంటున్నారు. మీ లెక్కేమిటి ? ఈకలియుగంలో మీ మంత్రాలకి చింతకాయలు రాలవు.

ఇంద్రుడు

(ఆదుర్దాతో) ఇంతకీ ప్రస్తుత కర్తవ్య మేమిటి?

నారదుడు

కర్తవ్యమున కేముంది ? ఏకాలం ఎల్లా మారుతుందో మన మేంచెప్పగలం?ఇన్నాళ్లు మీరువాళ్లని పాలిస్తే యిప్పుడు వాళ్లు మిమ్మల్ని పాలించే రోజులొచ్చాయేమో? (ఆలోచించి) నా కొకటి తోస్తోంది. ఈ లింగధారి యీశ్వరాంశవల్ల జన్మించాడేమో అని నావుద్దేశ్యం. కాబట్టి మీరంతా ఆయీశ్వరుణ్ణి ప్రార్థించి ఈ ఆపత్తునుంచి తప్పించుకోండి.

(అందరూ నిలబడి యీశ్వరుణ్ణి ప్రార్థించాక యీశ్వరుడు ప్రత్యక్షమౌతాడు.)

అందరు

ఓం నమశ్శివాయ, నమశ్శివాయ నమస్తే.

ఈశ్వరుడు

సుఖీభవ! మీ యుద్దేశ్యం గ్రహించాను. ఈ నాగేశ్వరుడు నా అంశవలన జన్మించాడు. ఈతడొకప్పుడు మహాయోగి. స్వల్పమైన సంచితకర్మ శేషించినందువల్ల యిల్లా మానవుడై పుట్టవలసివచ్చింది. "సురైరపి వాంఛితం, మనుజదేహ మిమం దుర్లభం" అన్నట్టు సత్కర్మలని ఆచరించడానికి మీకన్న మానవులలోనే యెక్కువ అవకాశం వుంది. అందువల్ల యీ కర్మయోగి మానవుడై పుట్టి యుగానుగుణ్యకర్మల నన్నింటిని ఆచరించి జీవన్ముక్తుడై నాయందే ఐక్యమయాడు. స్వర్గలోకవాసం యితనికి అనవసరం. కాబట్టి మీ ఆధిపత్యాల కేమీ భంగం లేదు. ధర్మమార్గప్రకారం మీవిధుల్ని మీరు నిర్వర్తించుకోండి.లోకాస్సమస్తాస్సుఖినోభవంతు. (అదృశ్యుడౌతాడు).

అందరు

అనుగ్రహీతాఃస్మః.

(తెర వాలును)

---

# శ్రీ నాగేశ్వరరాయని లింగైక్యము

పురాణం సూర్యనారాయణతీర్థులు

## గేయము

కామేశ్వరి! నాగేశ్వర-నామక జీవుండు నేడు,
శ్రీ మహేశ్వరుని జేరెను-చేసిన కర్మము తీఱెను. కా.

కోప మెట్టిదో యెఱుఁగఁడు-కుజనులపక్షము తిరుగఁడు
భూపాలకు మదివిఱుగఁడు-దుర్వ్యసనములకుమరగఁడు.

ఆడినమాటకుఁ దప్పఁడు-వేఁడిన లే దని చెప్పఁడు
నేఁ డని తే పని త్రిప్పఁడు-చాడీలకు మది నొప్పఁడు. కా.

శివునకు నీకును భక్తుఁడు-శ్రీపతియం దనురక్తుఁడు,
భవభావానాసక్తుఁడు-బళి బళి! జీవన్ముక్తుఁడు. కా.

ధీరజన వినుత చర్యుఁడు-మేరు ధరాధర ధైర్యుఁడు
సూరి పురాణం సూర్య-నారాయణకవిధుర్యుఁడు. కా.

క. మన యాంధ్రసార్వభౌముఁడు
మన దేశోద్ధారకుండు మన తండ్రి, అహో!
మన విశ్వదాత జననీ!
మనలను విడనాడిపోయె మఱి రాకుండన్.

క. కా. నా. శుభవర్ణాంచిత
మై నెగడెడికాగితంపుటలఁతితునియ స్వ
ర్ణేనువుగాఁ జేసెడి మన
శ్రీ నాగేశ్వరవిభుండు శివుఁ డయిపోయెన్!

---

# శ్రీనాగేశ్వరరాయ స్మృతి

కొత్త భావయ్యచౌదరి.

ఆంధ్రభారతకృతి నంది పేరొందిన, రాజరాజునియశోరాశికన్న
సంస్కృతాంధ్రంబుల సమతఁ బోషించిన, వీరప్రతాపుని పేరుకన్న
నవ్యప్రబంధాదికావ్యముల్ వ్రాయింపఁ, గృష్ణరాయలకున్న కీర్తికన్న
బహువిధశృంగారవర్ణనాకావ్యని,ర్మాతయౌ రఘునాథుఖ్యాతికన్న

నెక్కుడౌ కీర్తి బొందినా వక్కజముగ
భళిర ! నాగేశరాయ ! నీ ప్రాప్త మేమొ !
జ్ఞానదాయివి సర్వాంధ్ర జనులకెల్ల
నిన్ను స్మరియింపకుండఁగా నిలువగలమె ?

జీవము బుద్బుదం బగుటఁ జింతిల నేమిప్రయోజనంబు? నీ
చావున కైన, నిట్టిమృతజన్మున కెక్కడిచావు? బాపురే !
యావిధినిర్ణయం బెటులొ యట్టు లగుఁ, భవదాత్మశాంతికై
స్థావరజంగమాధిపుని శాశ్వతుఁ డీశు నెదం దలంచెదన్ !

జన్మచేఁ గాశినాథవంశము తరించె
విద్యచే నాంధ్రభూమి పవిత్ర మయ్యె
సేవచే దేశ మెల్లెడ నీవ యుంటి
ప్రథితగుణహార ! నాగేశరాయ వీర.

---

# ప్రజాహితైకజీవి

నుల్లంపల్లి సోమశేఖరశర్మ

శ్రీనాగేశ్వరరావుపంతులుగారు ప్రజాహితజీవనంలో ఆరముగ్గి అస్తమించినారు. వారు అస్తమించారనుకోవడమే తప్పుగా తోస్తున్నది. ఇప్పటికీ మైలాపూరు శ్రీభాగుకు వెడితే పంతులుగారు ఎక్కడో ఏ మూలో ఉన్నట్టే అనిపిస్తుంది. ఏ ఉద్యమంలో చూచినా ముందడుగై, ఏ సంస్థలో చూచినా ముందువెలుగై, ఎక్కడ చూచినా తానై విసువసువులులేక, అలతనలతలులేక వాయువేగముతో, యంత్రబలముతో పని చేసినపంతులుగారు ఇక లేరంటే అవాచ్యముగా కనబడుతున్నది; ఇక కనబడరంటే నమ్మసాధ్యం కాకుండా ఉంది; కాని అది విషమమయిన సత్యం. దానిని గుండెనిబ్బరంచేసుకొని సహింపవలసిందే.

పంతులుగారికేమి — నిండుజీవనం, ప్రకాశమానమయిన దివ్యజీవనం గడపినారు. మనమే దురదృష్టవంతులం. ఆయనే ధన్యజీవి.

పంతులుగారిజీవిత మంతా ప్రజాజీవితము; పంతులుగారు లోకకుటుంబి. తమ సంకల్పబలముచేత, తమయిచ్ఛాశక్తిచేత, తమ యోగసాధనచేత తమ్ము తా మెన్నడో తుడిచివేసికొని ప్రజలలో, దేశములో విలీన మయిపోయినారు. ప్రజవినా తాను లేడు; తాను వినా ప్రజ లేదు. ఇంత సంపూర్తిగా ప్రజలలో ఐక్య మయిపోయిన మహనీయచరితుడు ఇటీవలికాలంలో ఇదివరకు లేడు; ఇప్పుడు లేడు; ఇకముందు ఉండబోడు.

శ్రీభాగ్ కాదు — సమగ్ర ఆంధ్రదేశమే ఆయనమహాయతనము. అదే ఆయనలక్ష్యను. ఆంధ్రదేశములో ఏ మూల ఏ విపత్తు, ఏ యనర్థకము సంప్రాప్తించినా, ఆంధ్రులకు ఏకొరత కలిగినా అందుకు తనహృదయాంతరాళంలో తలచి వాపోయేవాడు; చేతనైనరీతిని తన్నివారణమునకు సిద్ధమయ్యేవాడు. — ఆయన తరువాతనే అందరును. ఏడీ అట్టి ఉదారహృదయుడు ? మరొక డేడీ అట్టి కరుణాంతరంగుడు ?

పంతులుగారికి యోగి జనసాధ్యమయిన అంతటి సర్వసమభావము కేవలము సాధనవలన, స్వానుభవము వలన చేకూరినది. మొట్టమొదట ఇంగ్లీషువాసన యెరుగని సామాన్య కుటుంబంలో జన్మించి మాతృప్రబోధంచేత ఇంగ్లీషువిద్య అభ్యసింపవలెననే కుతూహలం కలిగి, ఆయభీష్టం నెరవేర్చుకునేటందుకు దరిద్రజన సామాన్యములయిన కష్టాలన్నీ పడి ఒక్కొక్కమెట్టే పైకెక్కివచ్చినకష్టజీవి పంతులుగారు. ఆయన అనుభవము సామాన్యమయినదా? ఆయన విద్యార్థిదశ ముగిసేవరకూ ఆయన గడపిన జీవితం ఒక విచిత్రసంఘటనల దివ్యసంపుటి. ఈ పంతులుగారేనా ఆకష్టా లన్నీ పడినది అని పిస్తుందది-మన మిప్పుడే పైనా వాటిని వింటే.

బందరు, గుంటూరు పురాలు ఆయనకు కష్టాలబాటను నడపడం మప్పినా, ఆయన సాంస్కృతికమైన అభిరుచులను నిగూఢముగా దిద్దినవీ అవే. ఆయన కష్టపరంపరలోనే ఆయన అభిరుచులుకూడా అంకురులు కట్టుకొని తీర్పుతీరువలు దిద్దుకొంటూ వచ్చినవి. జీవితపథము సర్వసామాన్యముగా కష్టకంటకావృత మయినది. దానిని గడచి గట్టెక్కేవారే అరుదు; గట్టెక్కి తమ జీవితసర్వస్వాన్ని ప్రజాభ్యుదయంకోసం అంకితం చేసేవారు మరీ అరుదు; అట్టి వీరులు నూటికి కోటికి ఎంద రుంటారు? నాగేశ్వరరావుపంతులుగారి కట్టివీరగుణం జన్మసహజమయినది. అందుచేతనే ఆశాజ్యోతులు వెలిగిపోయిన ఆయన యువహృదయం కష్టానుభవాలవల్ల అణగిమణగిపోవడానికి బదులుగా కొత్త అనుభావమునూ, కొత్తశక్తినీ సంతరించుకొంటూవచ్చింది. పురోగమనం విషయంలో ఆయన దృఢసంకల్పంతో చుక్కాని పడుతూవుంటే తెరచాపగాలి పోసుకొన్నది. పంతులుగారు మద్రాసు వచ్చి చేరారు.

లేతవయసులో తమకు తొడరిన కడగండ్లనూ, సంభవించిన యిక్కట్లనూ తొట్టి మెట్టివేసి తమ హృదయాన్ని ఆయనుభవాలలో పదును చేసి పరిపక్వం కావించుకొంటూ వచ్చారు పంతులుగారు. ఆకష్టాల మడతలలో అణగారిపోకుండా తల

మెత్తి పైకి నిలబడగలగడం ఆయనది ఎంతటి గొప్పతనం!

మద్రాసురాక పంతులుగారి జీవితంలో ఒక స్మరణీయమయిన ఘట్టం.

అంతవరకు పొందిన విద్యతోనే సంతృప్తి పడిఉండి పంతులుగారు మద్రాసే వచ్చియుండకపోతే ?—

ఆంధ్రదేశానికే ఇది ఒక పెద్ద ప్రశ్న. అభివృద్ధి పరిణామాలు ఆగవు కాని నేటి ఆంధ్రదేశచరిత్ర మరో రీతిగా పరిణమించే దనడం నిక్కం. కాదా మరి? ఆయన ఆశయా లన్నీ ప్రస్ఫుట మయిన రూపాన్ని పొంది పోషితము లైనవి ఇక్కడ. దక్షిణ దేశాని కెంక రెండరినో విద్యాధికులను, ఉన్నతోద్యోగులను, ప్రజాహిత జీవనులను తయారుచేస్తూ వచ్చిన మద్రాసు క్రైస్తవ కళాశాల లో విద్యాభ్యాసమయ్యె పంతులుగారిది — ఉన్నతోదార ఆశయపోషణానికి కొరత తెక్కడి దింక? క్రైస్తవ కళాశాల విద్యార్థిగా నున్నప్పుడు హాస్టలుగా ఉండి తాము చదువుకొన్న భవనమే నేడు ఆంధ్రదేశాభ్యుదయానికి పనిచేసే ఆంధ్రపత్రికకు సొంత భవనమైన దని అప్పు డప్పుడు ప్రసంగవశాన పంతులుగారు చెపుతూఉంటే ఆయనహృదయరత్నాకరం ఉప్పొంగి ఆయన కన్నులలో పవిత్ర ఆనందవారిబిందువులు తొలకాడేవి. ఎంతటి ధన్యుడాయన! ఎంతటి ధన్యజీవితమాయనది.!! ఆయనచదువు దేశంకోసమూ, ఆయనజీవితము ప్రజలకోసమూ అయినది.

పంతులుగారి ఆశయాలు శక్తి సంతరించుకొని అంతరిక్షవిహారం చేసేనాటికి ఆయనకు రెక్కలు వచ్చినవి; ఆయన కలకత్తా, బొంబాయిలకు వలసవెళ్లినాడు. స్వతంత్రజీవనము : దేశారాధనము — ఈ రెంటిలోనే ఆయనకు ధర్మపథము పొడకట్టినది. ధనార్జన పుష్కలంగా ఉంటేకాని స్వతంత్రజీవనం స్వేచ్ఛగా సాగదు; స్వతంత్రజీవనం స్వేచ్ఛగా సాగిననాడుకాని దేశాభ్యుదయం కోసం పనిచేయడం పడదు. ఇదే ఒక లక్ష్యమూ, ఇదే ఒక పరమసాధనా అయినది. ఈ సాధనలో ఆయన ఎట్టెట్టి కష్టనష్టములకు గురిమైనారో ఎవరికెరుక ? ఈ సాధనకు ఫలితంగా రూపొందినవే అమృతాంజనం, ఆంధ్రపత్రికలు. అప్పటి పరిస్థితుల ననుసరించి అయితేయేమి, వ్యాపార ప్రవృత్తి ననుసరించి అయితేయేమి మొట్టమొదట ఈ రెంటికీ సరిసమానంగా పంచియిచ్చిన తమజీవితాన్ని పంతులుగారు క్రమక్రమంగా ఆంధ్రపత్రికపరముచేసి ఆద్వారాన ఆంధ్రదేశాని కర్పణచేసివేశారు. అనుభవజ్ఞానసముపార్జనచేత క్రమక్రమంగా పరిపక్వము పొందుతూవచ్చిన పంతులుగారి హృదయసీమలో ఒక విశిష్టమయిన తత్వజిజ్ఞాసా, ఒక విలక్షణమయిన యోగనిరూఢీ అంకురించి వర్ధిల్లుతూవచ్చినవి. ఆంధ్రోద్యమము పంతులుగారి ఈసాధనకు ఒక ఆవేగము నిచ్చింది. పంతులుగారి హృదయంలో ఆంధ్రదేశం ముద్రిత మైపోయింది.

బొంబాయినుంచి ఆంధ్రపత్రిక మద్రాసురావడం పంతులుగారి జీవితంలో కాదు, ఆంధ్రదేశచరిత్రలోనే ఒక ముఖ్యమయినఘట్టం. పంతులుగారి కాంధ్రదేశమూ, ఆంధ్రదేశానికి పంతులుగారూ సన్నిహితులయినారు. పంతులుగారి కాంధ్రదేశమూ, ఆంధ్రదేశానికి పంతులుగారూ అర్థమయినారు. పంతులుగారి కాంధ్రదేశస్థితి అవగతమయింది. నాటినుంచి ఆంధ్రదేశంలో ఏ ప్రజాహితకార్యం వచ్చినా పంతులుగారిదే ముందడుగూ, ముందుచేయూని.

ఈ విధమయిన దృష్టిలో, ఈవిధమయిన సాధనలో ఉండగానే వచ్చింది గాంధీమహాత్ముడి నాయకత్వముక్రింద సహాయనిరాకరణోద్యమం. అంతవరకు రాజకీయాలలో చురుకుగా పాల్గొనకుండా ఉండిన పంతులుగారి శాంతిప్రియమగు హృదయానికి అహింస, ప్రేమ ప్రధాన కీలకములుగాగల సహాయనిరాకరణోద్యమం అమిత ప్రియమయింది. నిజమయిన పంతులుగారు తమలోనుంచి తాము బయటబడి రాజకార్య ప్రవృత్తు లయినారు. నాటినుంచి ఆయన ఎన్నడూ ఏ కార్యమునకూ వెనుకదీసి యెరుగరు. ఆయన ఈ యుద్యమాన్ని ఒక యోగసాధనగా చేసికొన్నారు; ఇంతటి ప్రవృత్తిలోను నివృత్తిని, ఇంతటి విప్లవములోను ప్రశాంతిని సాధనచేసినారు; భోగములోనే త్యాగమును, స్వార్థములోనే పరార్థమును, ఆర్జనలోనే వితరణను లక్ష్యముచేసికొన్నారు; భగవద్గీత పారాయణగ్రంథమయి ఆయన కర్మయోగిమైనారు.

ఈ విధమయిన యోగసాధనలోనే ఆయన తనదేశంతో, ప్రజలతో ఐక్యమయిపోయినారు. ఆంధ్రదేశంలో ఏ ప్రాంతాన్నయినా సరే, ఏవిధమయిన కొరత వచ్చినా సరే అది నాగేశ్వరరావు పంతులిదే. తన

చేసినయినట్లు ఆకొరత తీర్చడానికి ఆయన సిద్ధము. ఆంధ్రదేశములోని ఏ ఉద్యమాలయినా సరే, ఏ సంస్థ లయినా సరే అభివృద్ధి చెందుతున్న వంటే ఆ కీర్తిప్రతిష్ఠలు నాగేశ్వర రావు పంతులువి. ఇంత సంపూర్తిగా దేశీయుల ఆశయాలతో, ఉద్యమా లతో ఐక్యమయిపోయిన పుణ్యవ్యక్తి మన కింకొకడు కనబడడు. ఆయన గేహము, ఆయన దేహము, ఆయన ధనము, ఆయనశక్తి, ఆయనయుక్తి, సమస్తము తన దేశము నిమిత్తమయి నది.

పంతులుగారికి వయఃసు హెచ్చు తూవచ్చినా యౌవనోత్సాహము మాత్రము కుంటువడలేదు. సార స్వతవీథి నెంతటి నవీనాతినవీనో ద్యమం వచ్చినా, వృద్ధులచేత శిరః కంపం చేయించే ఎంతటి విప్లవో ద్యమం వచ్చినా దాని నామోదిస్తూ ఆదరిస్తూ ముందే నిలబడేవారు పం తులుగారు. ఇందే ఉన్నది ఆయన ఘనత. ఆయన ఎంతటి వృద్ధుడో అంతటి యౌవనుడు; ఎంతటి పూర్వాచారపరాయణుడో అంతటి సంస్కర్త; ఎంతటి ప్రాచీనుడో అంతటి ఆధునికుడు. ఆయనలో తెలుగుదేశపు ప్రాచీనతా ఆధుని కతా రెండూ చక్కగా, నవ్యముగా పెనవేసుకుపోయినవి. వీరేశలింగము పంతులుతరువాతికాలానికి ఆయన ప్రతినిధి.

రాజకీయాలకంటెనూ సాహిత్య సేవ అంటే ఆయనకు ప్రీతి మెండు. రాజకీయరంగంలోనుంచి విరమించి కేవలం సాహిత్యసేవే చేయా లని ఆయన చివరిరోజులలో ఉద్దేశించా రుకాని అది సాధ్య మైనదికాదు. తుద కాయనజీవిత మంతా ఈ రెం డింటి సంఘర్షణతోనే గడచిపోయిం ది. ఆంధ్రపత్రికవల్ల ఆంధ్రదేశ రాజ కీయరంగం శోభావంతమయితే ఆయ న పెట్టిన భారతివల్ల సారస్వతవీథి ప్రకాశమానమయింది. భారతివచ్చిన తరువాతనే తెలుగుదేశములో ఏలేఖ కులకూ, చిత్రకారులకూ తృణమో పణమో ఇవ్వడమంటూ కలిగింది; యువకులలో స్వతంత్రకృషికి కొంత ప్రోత్సాహం కలిగింది. నాటకాలంటే ఆయనకుగల అభిమానము విప రీతము. పుణ్యాత్ములు కాబట్టి చిన్న నాటి ఆశయాలను సిద్ధింపజేసికో గలిగి నారు పంతులుగారు.

ధర్మబద్ధముగ వితరణశీలియ దగిన దారు లన్నీ, తీసినా డాయన; పేరు మోసినాడు. వదాన్యచక్రవర్తి-ఆయ నపట్ల దాతృత్వ మొక వ్యసనమే యైనది. వా విడిచి అడుగలేనివారిదే దురదృష్టము.

నవ్యాంధ్రజాతినిర్మాతలలో ప్ర ముఖు డాయన. ఆంధ్రజాతి అభ్యు దయానికి ఆయనచేసినంత సేవ మరె వ్వరూ చేయలేదు — ఎందరుంటే నేమిగాక! ఎందరో ధనవంతు లున్నారు; ఎందరో విద్యాధికు లున్నారు; ఎందరో కీర్తికాములు నున్నారు కాని నాగేశ్వరరావుగారి వలె ధైర్యసాహసములు గలవారూ, వితరణౌదార్యములు గలవారూ మాత్రము లేరు. ఆయన కాయనే సాటి. ఒక యుగపురుషుడే ఆయన.

నాగేశ్వరరావు పంతులుగారి అస్తమయమునకు ఆవేదన పడని ఆంధ్రు డెవ డుంటాడు? ఆయనలేని లోటు మనకు తీరనిమాట నిజము. కాని ఆయనదిమాత్రము ధన్యజీవి తము. ఆయన మృతజీవి.

పునరావృత్తి రహిత శాశ్వత శివసాయుజ్యసిద్ధి నందిన ఆ సుకృ తాత్మునికి ఇంక కోరదగిన దేము న్నది?

---

# స్వర్గమనము

సామవేదం జానకిరామశర్మ

అది వచియింపరానిది దివ్యతేజమ్ము, నెలవుగా నీమేను నిలుపుకొనెను
బహిరంతరముల సత్త్వము దేహమున నిల్చె ఉతికినమడుగుధోవతులపేర
కార్యానుమేయసంకల్పంబు లెటిగించె నిశితదృష్టిప్రభల్ నిల్పుకనులు
గంభీరభావణారంభంబు హృదయ, మవ్యక్తమే యైనసువ్యక్తపఱచె,

అనుచు నిను గాంచి జేశీయు లధికముదము
నొందుచుండంగ, వెడలితె! నందనోప
వనవిహారపరాయణాప్సరసుగంధ
బంధురకుచోపగూహాన మందుకొఱకు!

*    *    *    *

అనిదంపూర్వము నీ మహత్త్వము! దయాత్మా! తెల్గునా డెల్ల నీ
వనగా బ్రహ్మరథమ్ము బట్టినది! ఊహాతీతముల్ నీఘన
ర్పినసత్కార్యపరంపరల్; తెలుగువారిన్ రక్షసేయంగజా
లును సర్వోన్నతులిచ్చి యివ్వసుధ స్వర్లోకోన్నతిం గూర్చుచున్.

మనవలె, నీవలె, నీయిల, తనువందినఫలము జీవితము ధన్యముగా
కనమా! వినమా! అందరి, మనుగడకొఱమాలి యుఱక మన్నుగలియుటల్.

---

# సర్వసమదర్శి

భిన్నహృదయుడు

అస్తమించెనుగదా ఆంధ్రకళావేది గతి యెవ్వ రిక కళావితతులార!
తనువు వీడెనుగదా దానకర్ణుం డింక నలరించు నెవడు విద్యార్థులార!
తరలిపోయెనుగదా ధర్మానురాగి మీ కేబారి యిక కాంగ్రెసీయులార,
నాక మేగెనుగదా నీకు గూర్చెడువాడు దిక్కెవ్వ రింక ఆంధ్రీమతల్లి,

తనదునాత్మను అఖలభూతములయందు,
అఖలభూతంబులను దనయాత్మయందు,
గాంచుసమదర్శి యకట స్వర్గామి యయ్యె,
ఇంక తెరు వేది మీకు సుధీంద్రులార!

"సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః."

---

# విషాదగీతములు

శేషాద్రి రమణకవులు

అర్ణోరాశిపరీతభూవలయమం దాంధ్రాళివేల్పై కళా
పూర్ణాలంకృతకాశినాథమణియై పొల్పొంది యార్యాశయ
స్వర్ణాంభోజవిహారియై తనరె నే బ్రహ్మంబు నాగేశ్వరో
దీర్ణం బద్ది మహానటంబు పర మొందెన్ లోక మల్లాడఁగన్.

గీతాంతరార్థసంగీతంబు త్యాగవి, పంచిపైఁ బాడిన పాటకాఁడు
అఖిలాంధ్రకవుల నిజాస్థానగతులఁగా, మన్నింపఁజాలు వాఙ్మయవిదుండు
దైవదత్తధనంబు ధర్మకర్తగ వాడి, విఖ్యాతిగాంచిన విశ్వదాత
విజ్ఞానసర్వస్వవివిధార్థములు చూఱ, విడుచుచుండిన జగద్విదితకీర్తి

ఆంధ్రవిష్ణువు విద్యారహస్యవేత్త
భారతోద్ధారకుఁడు పరబ్రహ్మవిదుఁడు
కాశినాథాన్వయుండు నాగేశమౌళి
పంచతం గాంచె దేశదౌర్భాగ్యమునను.

దేశోద్ధారకకీర్తిచిహ్న మెద నుద్దీపింప నాంధ్రావనీ
ప్రాశస్త్యంబును భారతీముఖమునన్ భాసిల్లఁగాఁ జేసె నా
నాశావాసితకీర్తిసౌరభము వెన్నాడంగ నాగేశుఁ డా
కాశీనాథునిఁ జేరె నాంధ్రమహి యాకంపించి క్షోభింపఁగన్.

స్వాతంత్ర్యలబ్ధికై చండతపము కృష్ణ, జన్మస్థలంబున సలిపినాఁడు
ఒరుల మెచ్చనిగాంధిపరమాత్ముఁడే విశ్వ, దాతయితండనఁ దనరినాఁడు
ఆంధ్రసాహిత్యసౌధాంతరస్థధనంబు, విబుధలోకమున కర్పించినాఁడు
త్యాగవర్షముచేఁ బరాధీననిఖిలాంధ్ర, పరితాపభారంబు బాపినాఁడు

ఆంధ్రులకు వేల్పు, మాతృదేశాభిమాని
ఉత్తమతపస్వి సర్వజనోపయోగి
ఘనుఁడు నాగేశ్వరుం డాంధ్రకల్పకంబు
మాతృదేశంబు క్షోభింప మరణమందె.

సప్తత్యుత్సవరూపకంబు భగవత్సంకీర్తనల్ చేసి నీ
వ్యాప్తిన్ పాటఁగ-నాంధ్రపుత్రులు మహాయత్నంబు సేయన్ మహా
సుప్తిన్ బొందితి వింతలోన స్వజనస్తోమంబు బాష్పాంజలి
ప్రాప్తిన్ నీ కొఁగి తర్పణంబులిడుటే పాటిల్లె ధీమన్మణీ!

ప్రాయ్యపై నెనరుంచి బియ్యంబునకునిన్ను, యాచించుననద లల్లాడుచుండ
ప్రతిమాన మీవిచ్చుదైన ఋణములో జీవితము బుచ్చుపండితుల్ కుములుచుండ

ఈకృతి నిచ్చి నాగేశదత్తధనాన, బ్రదికెద మను కవుల్ పరితపింప
పనిపాట లెం దొదవనినిరుద్యోగు లిం, కెది దిక్కటంచు వా యెత్తియేడ్వ

మూఁడుకోట్లకుమారుల ముద్దుదీర్చ
పెద్దకొడు కేగె ననుచింత పెచ్చుపెరుగ
నాంధ్రమాతయు వగవ బ్రహ్మైక్యమందె
కాశినాథకులుండు నాగేశబుధుఁడు.

మహనీయంబుగ నాంధ్రరాష్ట్రశుభనిర్మాణార్థమై సోదరుల్
బహుయత్నంబు లొనర్చుకాలమున దౌర్భాగ్యంబునన్ గార్యధూ
ర్వహులన్ నిన్నొగిఁ గోలుపోవలసె నిర్వ్యాజాంధ్రసేవారతున్
మహితాత్మున్ నిను విస్మరింపఁగ వశంబా దేశభక్తాగ్రణీ.

చతురత్వంబును, సాహితీగరిమయున్, జాగంబు భోగంబు, పం
డితసత్కారము సంఘపోషణము వాణీసేవ చేదోడుగా
బ్రతుకెల్లన్ వెలయించినాఁడవు జగద్బంధుండ వీ వేగుటన్
క్షితికిం గల్గెఁ గొఱంత మెట్టు లది సంతోషించు ధీమన్మణీ.

నీసతియేగాదు నిఖిలాంధ్రదేశంబు, ననదతనంబుతో నడలుచుండె
నీపుత్రియేకాదు నిఖిలాంధ్రసోదరుల్, జనకుఁ గోల్పడినట్లు జాలిబడిరి.
నీమిత్రులేగాదు నిఖిలాంధ్రసంస్థలు, పోషకరహితతఁ బొక్కుచుండె
నీకుటుంబమెగాదు నిఖిలాంధ్రరాష్ట్రంబు, బొటబొటఁగన్నీరు పొంగనేడ్చె.

ఆంధ్రనాయక, త్యాగవీరాగ్రగణ్య
ఆంధ్రవిజ్ఞానసంపాదకాగ్రగణ్య
ఆంధ్రకర్ణ భవద్వియోగాప్తి గుందు
దేశమున కెన్నటి కడంగు దీనవృత్తి,

నాశం బందనినీచరిత్ర, జగదానందంబు సంధింపఁగా
కాశీనాథజటాటవీతటలుఠద్గంగాతరంగానువా
కాశాపూరిత కీర్తిచంద్రికలతో నాచంద్రతారంబు నా
గేశా నీవలరారఁగాఁగలవు గొమ్మా మానమోవాకముల్.

అవతారంబును నాంధ్రసేవకొఱకై యర్థించి గైకొంటి వా
వ్యవహారంబులు తీర్చికొంటివి పరబ్రహ్మంబులో లీనమై
భవముల్ గల్గవు నీకు లోకులు నీప్రాజ్ఞత్వమున్ విస్మరిం
పవు నీవాంధ్రులపాలివేలుపువు గావా కాశినాథాగ్రణీ.

——— (*) ———

# విమర్శనము

## రాజయోగము

[వివేకానంద ప్రణీతము, ద్వితీయ ముద్రణము. శ్రీరామకృష్ణ మఠము వారిచే ప్రకటింపబడెడి. మైలాపూరు, మద్రాసు. వెల రూ. 1—4—0.]

మతమునకు సంబంధించిన ప్రబోధము మన విద్యావిధానమున మృగ్యమై యుండుటచే, ఆధ్యాత్మికాంశములను, హేతుపరిశీలనమునకు లొంగని సంఘటనములను ఆధునికులు నమ్మకున్నారు. అలౌకికాంశములు కారణకార్యసూత్రముచే కట్టు బడవు. పర్యాలోచనమునకివి యందునవి కావని, కేవలము విశ్వాసమూతగొనియే వీనిని గ్రహించుట పాడి యని పలుకు పెద్దలు కొంద ఱున్నారు. ఈరెండు తెగలవారి వాదములును లోపభూయిష్ఠములు. మూర్ఖులై, సర్వాంశములకును తల లూపుటకు ఆధునికు లంగీకరింపరు; హేతుశక్తిని త్రుప్పు పట్టనిచ్చుటకు వీ రియ్యకొనరు. ఈశక్తికి భంగము రానితీఱున నాధ్యాత్మికాంశముల నవగాహన మొనరించువిధానము ననుష్ఠించి విజ్ఞానమునందుటకు వీరువ్విళ్లూరుచుందురు. ఈవిషయమునకు స్వానుభవమువలన నవగతుడైన మహావిజ్ఞాని వివేకానందస్వామి. ఈతడు పట్టభద్రుడైన ఆధునికుడు. ఆధ్యాత్మికానుభవమువలన విజ్ఞానమునందిన పరమహంసయొక్క ప్రధానశిష్యుడు. కావున హేతుసూత్రమును పిడికిటబట్టి, గురుకరుణకతన దానందినయనుభూతిని పురస్కరించుకొని, స్వామిజీ తన ప్రబోధములకు గడంగినాడు. ఈప్రబోధము మేదస్సును, హృదయమునుగూడ దట్టునవి; హేతుశక్తిని తనిపి, అంతరాత్మ నలరించునవి. కావుననే, భౌతికశాస్త్రమునకే అంజలెత్తు పాశ్చాత్య దేశవాసులుకూడ మహోత్సాహముతో నీతనియుద్బోధములకు మనసు లొడ్డిరి.

స్వకీయమైన పరిశీలనమునకు ఆత్మానుభూతి మిగుల నక్కరైన దనుట స్పష్టాంశమే కదా! మహాప్రవక్తలు—ఏసు, బుద్ధప్రభృతులు—ఈరెండు శక్తులనలవఱుచుకొని మానవశ్రేష్ఠులైరి. "మతప్రవక్తలందఱును భగవంతుని సందర్శించినవారే. ఆత్మద్రష్టలై, త్రికాలజ్ఞులై, తమ శాశ్వతత్వమును దర్శించి తాము కన్నదానిని వారు లోకమునకు బోధించి యున్నారు." కొందఱి కొకప్పుడు సంభవమైనది. సర్వదా సంభవమైయుండునని స్వామిజీ జలదగంభీరస్వరమున బలికినాడు. స్వానుభవమున కీత డెంతో ప్రాముఖ్యము నొసగినాడు. ఈయనుభవమునందు విధానమును బోధించు శాస్త్రమే యోగశాస్త్రము. తత్త్వాన్వేషణ మొనరించి, మానవుడు సత్యమును గనినపుడే అజ్ఞానము (రవిరశ్మిసోకినంతన నంతర్ధానమగు మంచుతెరవలె)తొలగిపోవును. తత్త్వము నవలోకించుటకై మనుష్యసంఘమునకు తగు తెరువు చూపుటయే రాజయోగముయొక్క లక్ష్యము.

బాహ్యాభ్యంతరస్థితులను పరిశీలింపగలవాడే తత్త్వదర్శి యనబడును. ఏకాగ్రతాశక్తియం దాఱితేఱినవాడే చక్కని తత్త్వదర్శి కాగలడు. ఈశక్తి యధికమైనకొలదియు మానవునివిషయపరిశీలనాప్రజ్ఞ యధిక మగుచుండును.

రాజయోగమందలి అష్టాంగములు ద్వితీయాధ్యాయమున వివరింపబడినవి. "అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అప్రతిగ్రహము, శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానములు యమనియమములు. ఆసనము తృతీయాంగమనియు, ప్రాణాయామము నాలవయంగమనియు, శబ్దాదులగు బాహ్యవిషయములనుండి ఇంద్రియములను మరల్చుటయం దేర్పడు ప్రత్యాహార మైదవదనియు, ఏకవిషయమున చిత్తమును నిలుపుటయం దేర్పడుధారణ ఆఱవదనియు ధ్యానసమాధులు తక్కినవి రెండనియు, నిందు దెలుపబడెను. తరువాతి యధ్యాయములం దీయాయాంశములు విపులముగా విమర్శింపబడినవి. శ్వాస, "ఇడ" "పింగళ" నాడులు ప్రాణాయామమునందలి సాధనములు, మున్నగువానిని గుఱించిన అంశములు చర్చింపబడినవి.

కూర్మపురాణము నుండి యనువదింపబడిన రాజయోగసంగ్రహముపై యుదంతమున ననుబంధింపబడినది. పాతంజల యోగసూత్రములవృత్తాంతము చక్కని వ్యాఖ్యతో గ్రంథమున ప్రవేశమందుటచే, నిది మహోత్కృష్టమైన భావమూల్యము నందినది. ఏకాగ్రతయందలి ప్రయోజన మిందు చక్కగ వివరింపబడినది.

గ్రంథప్రభావ మనిర్వచనీయ మైనదనుట చర్వితచర్వణమే యగును. ఉత్కృష్టాశయములను నిర్వచించి, దైనికజీవితమున వానిననుష్ఠించు క్రమవిధానమును దెలుపుగ్రంథములు మేధానిధులైన మహాత్ములమనసులు కనినడింభకము లేకదా! ఆధునికులైన భారతమహాత్ములలో వివేకానందు డొక్కడు. ఈసంయమీంద్రుని రచనములును, ఉపన్యాసములును గంభీరభావబంధురములు; మహాద్భుత సత్యములతో నివి తుందిలములై యుండును. భారతీయులు వీనిని హృదయంగమ మొనరించుకొనగలిగిననాడే భారతపునరుద్ధరణము, హిందూమతసముద్ధరణమును సుసాధ్యము లగును. ఈ యుత్కృష్టాశయములు రామకృష్ణ మఠము వారి దృష్టిలో నున్నవే! ఈయాశయ సిద్ధింపగృషి సలుపుచు వీ రీగ్రంథప్రచురణమును గావించియుందురు. ఇట్టి గ్రంథములను బహుళముగా వీరు దేశాటనమునకై పంపెదరుగాక!

క్లిష్టపదములపొంత పోక, జటిలపారిభాషికపదజాలమునకు త్రోసిరాజని, అనువాదకులు దీనిని సులభశైలిలో ననువదించుట ముదావహము. తత్త్వశాస్త్రమునకు సంబంధించిన క్లిష్టభావము వలీలగ పతితమనసున కెక్కుటకై చక్కనిఉపమలను సృష్టించుటయు, ఉచితమైన దృష్టాంతములను పేర్కొనుటయు, కథల నుల్లేఖించుటయు స్వామిజీ యభ్యాసమై యుండెను. వివేకానందుని యడుగుజాడలబట్టి నడచి గ్రంథకర్త తనపవిత్ర కర్తవ్యమును నిర్వహించె ననుట కిం దెన్నేని దృష్టాంతములు కలవు.

ఈవాక్కుల నవలోకింపుడు!

"చెదరిన సూర్యకిరణములను కేంద్రీకరించి నప్పుడవి తీక్ష్ణముగా వెలుగును. ఇట్లే యేకాగ్రతవలన మనశ్శక్తులు దీప్తిచెందును. జ్ఞానమున కివియే సాధనము."

"తగినంతబలమును చేకూర్చుకొని సాధనయం దభివృద్ధి పొందినవెనుక ఆహారవిషయమునుగూర్చి అంతగా పాటింప నక్కరలేదు. అపాయమును నివారించుటకై యెదుగుచున్న మొక్కచుట్టును కంచెవేయవలయును. చెట్టయినతరువాత కంచె లూడదీయుదురు. అప్పుడెట్టి తాకుడు కలిగినను ఎదిర్చి నిలుచుటకు తగినంతచేవ చేకూరును." మున్నగునవి.

"ఒకవైపున భోగలాలసత్వమును, మఱియొకవైపున ఉగ్రతపశ్చర్యలను యోగసాధకుడు విసర్జింపవలసియున్నది." ఈభావము బుద్ధప్రబోధమునకు అనువాదమే! కావున యోగసాధనమున హిందూ బౌద్ధమతములు కడుంగడు సన్నిహితములై యున్నవనుట నిస్సంశయము.

గ్రంథము జిజ్ఞాసువు లందఱి యాదరానురాగముల నందుగాక.

— జో. స.

---

## "Great Expectations"

(An Exposition of the problems of Hydrabad from the people's point of view.)

[క్రౌను ౧/౮ సైజు; పు ౧౧౩; పీమకాగితం; వెల ౮ అణాలు. గ్రంథాలకు చిరునామా:— డక్కను జనరలు ఏజన్సీ, హైద్రాబాదు (డక్కన్).]

నిజాంరాష్ట్రం తెలుగునాడుకు సరిహద్దుగా వుంది. నిజాంరాష్ట్రి జనాభాలో నూటికి నలభైమంది తెలుగు స్వభాషగా వున్నవారైన కారణాన మనకు ఆరాష్ట్రంతో సన్నిహిత సంబంధ ముంది. ప్రత్యేకరాష్ట్రం కోరుతున్న మనం మనస్వజనం, యెక్కడెక్కడ యెవ్విధమైన బాధలు అనుభవిస్తున్నారో, యెవ్విధమైన సుఖమయ జీవనం గడుపుతున్నారో తెలుసుకోవటం అత్యంతం అవసరమే కదా!

హైదరాబాదు నవాబుగారు మన తెలుగు వారిని ఆదరిస్తున్నారా?

భరతదేశంలో ఆరువందల స్వతంత్రసంస్థానాలున్నయి. వైశాల్యాన్నిబట్టీ, జనాభానుబట్టీ, ఐవజునుబట్టీ నిజాంరాజ్యం రెండోదిగ వస్తుంది. నవాబు కోటికి పడగెత్తిన కుబేర సమానుడు. ఇట్టి వీరి రాజ్యంలో దుర్భిక్షముంటుం దంటే యెవ్వరూ నమ్మలేరు. పైగా నిజాంగారు రాష్ట్రేతరులకు చేసే దానాలు వారిరాజ్యాంగంలోని లోపాలను తరచనీయక నోటికి తాళాలు వేస్తయి.

నిజాంరాజ్యం మహమ్మదీయరాజ్యమైనా తెలుగువారు నూటికి ౪౦, మహారాష్ట్రులు ౩౦, కన్నడులు ౨౦, మహమ్మదీయులు ౧౦ మంది ఉన్నారు. నవాబుగారు యెట్టి పక్షపాతమూ లేకుండా భిన్నజాతులు, భిన్నమతాలు, భిన్నభావలతో కూడిన ౧౪,౪౩౬,౧౪౮ మంది యావజ్జనాభాను సమానాదరంతో చూస్తున్నారా?

"Great Expectations" అనే యీ యింగ్లీషురచన ఒకప్పుడు "హైద్రాబాదు బుల్లెటిను" అనే యింగ్లీషు దైనికపత్రికలో వెలువడ్డ వ్యాసాలసంపుటి. ఇందులో నిజాంరాజ్యాంగానికి సంబంధించిన విద్యావిధానం, ఫైడరేషను, ప్రతినిధిసంఘాలు, పరిశ్రమలు, వాణిజ్యం, గ్రామాలు, జాగీరుదారులు, పత్రికాస్వాతంత్ర్యం, మతవ్యవహారాలు, పబ్లికుసర్వీసు కమిషను, ముగింపు, మరికొన్ని ప్రముఖుల ఉపన్యాసాలు మొదలైన అనేకము చేర్చబడి నిర్మొగమాటంగా, కచ్చితంగా విమర్శించబడి రాష్ట్రాభివృద్ధికి అవసరమైన సంస్కరణాలుకూడా సూచింపబడినవి. రాజ్యాంగ విషయాల్నిగూర్చి ప్రజగాని పత్రికగాని విమర్శింపతగదని గట్టికట్టడి వున్నప్పటికీ యీగ్రంథాన్ని వెలువరించటంలో ప్రకాశకులు సాహసించినారనే అనవలె. గ్రంథం ఆసాంతంపఠిస్తే నిజాంరాజ్యం 'నవాబుదర్బారు' అనేది సార్థకమైనదే నని స్ఫురిస్తుంది. రాష్ట్రమర్యాదకు భంగంరాని ఫక్కిని అన్నిశాఖలకు ఖర్చుచేసేది చేస్తారు నవాబుగారు కాని రాణింపుకూ, ప్రయోజనానికీ రాదు.

ఏరాజ్యాంగశాఖ తరచినా నిజాంరాష్ట్రం బారా ఫసలీలనాటిదిగ కనబడుతోంది. విద్యావిధానంచూస్తే బ్రిటీషుయిండియాలో నూటికి ౧౨ మంది చదువుకున్నవారుంటే నిజాంలో నూటికి ౫ మందిమాత్రమే. ఉర్దూ, యింగ్లీషులకే యెక్కువ ప్రాముఖ్యం. తెలుగు, కన్నడం, మరాటీలకు ప్రోత్సాహం లేదు. గవర్నమెంటులో నౌకరీకావలెనంటే ఉర్దూఆవశ్యం రావాలి. స్త్రీ విద్యకు ప్రోత్సాహం అసలే మృగ్యం.

పరిశ్రమలు వృద్ధికావటానికి సౌకర్యాలు అమరినదేశం అయినా ఒక్కటే కొనసాగదు ఇప్పుడీశాఖ అయిదుసంవత్సరాలుగా పనిచేయటమే లేదట. చిన్నచిన్న పరిశ్రమలకు తగినంత సహాయం లేదు.

జనాభాలో నూటికి ౯౦ పాళ్ళు గ్రామవాసులు. హెచ్చుసంఖ్యకు వ్యవసాయమే జీవనాధారం. ఈ గ్రామవాసుల స్థితిగతులు బ్రిటిషుయిండియా గ్రామవాసి స్థితికంటె దుర్భరంగా వున్నట్టుంది. కర్షకజాతి ఆర్థికపరిస్థితుల్ని విచారించటానికి ఒకరిని నియమించి, వారు తయారుచేసిన రిపోర్టు యింతవరకు తెరచి చూడబడనేలేదట.

వార్తాపత్రికలకు స్వాతంత్ర్యం లేదు రాజ్యాంగ వ్యవహారాల్ని విమర్శిస్తే ప్రమాదం. నిజాంరాజ్యంమొత్తంమీద ౧౪౫ అచ్చు ఆఫీసులు, ౮ పత్రికలు వున్నవంటే యెంత హడలో తెలుస్తుంది. గస్తీ అనే సి. ఐ. డి. శాఖ ఒకటి వుంది. ఈశాఖను తప్పించుకోవటం బహుకష్టం.

మతవిషయాలను గురించి నైజాంగారు ప్రసంగిస్తూ, "This is an Islamic state" అని చెప్పారు. ముసల్మాను మతంకొరకు ౮౦ లక్షలు ఖర్చుచేసింది. ౨౮ హిందూదేవాదాయసంస్థలకు గవర్నమెంటు యిచ్చే గ్రాంటు ౫౪౪౯ రూపాయలు.

ఇక గవర్నమెంటునౌకరీల సందర్భంలో "మతభేదం మేము పాటించం" అంటారు. ౮ మంది హిందువులకు ఒక ముసల్మాను చొప్పున జనాభా వుంటే గవర్నమెంటు

...పెడ్ సర్వీసులో ఉన్నవారు ౪ గురు ముసల్మానులు, ౧ హిందువు. జ్యూడిషియలు డిపార్టుమెంటులో ౧౭౩ మంది ముసల్మానులు, ౧౭ మంది హిందువులు.

నిజాంరాజ్యంయొక్క స్థితుగతులు తెలిసికోవటానికి మచ్చుకు పైలెక్కలు కొంచెం చాలు. ఇంకా అనేక వివరాలు గ్రంథంలో యియ్యబడినవి. మొత్తంమీద మనతెలుగువారు అక్కడ సుఖపడటం లేదు. వారినిగూర్చి మనం కొంచెం శ్రద్ధ చూపాలి.

—వ. కు.

---

## మధుర గీతికలు

[నాలుగు సంపుటములు. కర్త: మధురకవి నాళము కృష్ణరావు, రాజమహేంద్రవరము. క్రౌను సైజు; ఒక్కొక్కటి అరువదినాలుగేసి (రమారమి) పుటలు. సంపుటము ౧కి వెల ఎనిమిదణాలు.]

ఎన్నికగన్న యువకవులలో శ్రీకృష్ణరావుగారొకరు. తేటతెల్లములగు తెనుగు మాటలలో—తేనెల జిలుగు తీయని భావములలో—తేటగీతము లల్లుటయందు వీరికి చక్కవచ్చక్కవ. పెక్కేడులనుండియు పెక్కు విధముల మధురగీతికల నాలాపించుచు తెలుగువారి హృదయముల జూఱ గొని వీరు 'మధురకవి' యను గౌరవమును గడించినారు.

ఇప్పటి నవకవులలో పెక్కురరచనలు పామరులకే కాక పండితులకును కొఱకరాని కొయ్యలయి రచయితృహృదయైకగోచరభావ శరీరములయి పెక్కుర యాదరమునకు పాత్రములు కాకున్నవి. శ్రీకృష్ణరావుగారి రచన లట్టివి కావు. అవి సర్వసాధారణముగ కథారూపములు; కొన్ని సులభగ్రాహ్యములగు వర్ణనలు.

### ౧. పాలతరగలు

ఇది శ్రీకృష్ణరావుగారి రచనలలో నాలుగవ సంపుటము. ఇందు పందొమ్మిది చిన్ని కావ్యములు కలవు. ఇందు కొన్ని యీవఱకు ప్రకటింపబడినవి. పయి కావ్యములలో అయిదు అనువాదము లయినట్లు 'కథావీథి' (విషయసూచిక)నుబట్టి తెలియుచున్నది. తక్కినకావ్యములలో కొన్నింటి భావములు తెలుగువారికి పరిచితములే; అయినను శ్రీకృష్ణరావుగారి చాతురి వానికి క్రొత్తదనమును జతగూర్చుచున్నది.

తెలుగుపలుకుబడులను, తెనుగుసామెతలను, తెలుగువారి చిట్టికతలను పద్దెములలో చక్కగ సంతరించునేర్పు కలవారు శ్రీకృష్ణరావుగారు. కొలదిచోటులమాత్రము వారి కూరుపు ప్రసిద్ధికి కొంత విలక్షణముగ నున్నది. ఈ సంపుటమునందలి 'చేపలవేట' యను కావ్యమున రంగడను నమాయకబాలుఁడు జాలరి నొకనిం బిలిచి 'ఏది చూతము జాలరీ! నీదు నేర్పు; పట్టనేర్తువె? చేప లీ పడియయందు' అని కోరగా అతడు 'చేపలుండినఁగద! నేర్పు చూపుటెల్ల,...' అని రంగని కోర్కె రిత్తచేసి తనదారిం బోయెను. రంగడు 'తింగు రంగా యనంగ నరిగెను.'

రంగడు చిన్నవోయిన మనస్సుతో నింటికి పోయెను; అతని కోరికి యీడేరలేదు; కాన సంతసమును లేదు. 'తింగు రంగా!' అను పలుకుబడి సంతోషసూచకము; అట్టి యర్థమే దానికి బ్రసిద్ధము.

ఇందున్న 'లక్కగేద' కథ మహాజనసంప్రదాయమునకు విలక్షణము. బ్రాహ్మణి యొకతె మగనియెఱుకలేక కమసాలికి నగ చేయ బంగారమీయ వాడు దానిలో చాల భాగము హరించి లక్క పూరించి నగచేసి యిచ్చెను; కొన్నాళ్లకు పాఱుత శ్రా మాయ తెలిసెను. తెలిసియు, తేలు కుట్టిన దొంగవలె నేమియు చేయలేక యూరకుండెను. కొలది దినములకు పిదప నామెభర్తయే ఆ కమసాలి యొద్దనే గేద నొకదానిని కొనెను. దానింగని యాతని భార్య మూఢమతి యగుట ఎన్ని సుగుణములు కలిగియున్నను గేదె లక్కగేదె యేగాని నిజముగు బఱ్ఱెకాదని వాదించెను. బ్రాహ్మణు డెంత బోధించినను లాభము లేకపోయెను. ఇది జనసామాన్యపు వాడుకలో నున్న కథ.

'విప్రుఁ డొక్కడు లేమిచే వెతలఁబడుచు, తన కుటుంబము పోషించుకొనగలేక, ధనము నార్జింపమానసంబునఁ దలంచి, జలనిధిని దాటి దూరదేశముల కేగెను'. 'కొంతకాలము గడచినయంత నతఁడు, ధనము గడియించి తన పురంబునకు వచ్చెను'. అపు డతనిభార్యయతనికి గట్టిపెరుగు వడ్డించెను. బ్రాహ్మణుడు 'ఇందు తక్కిన వన్నిటి కేమి గాని ...ఎట్టు లభియించె నీ కిట్టిగట్టిపెరుగు?' అని భార్యను ప్రశ్నించెను. తాను 'నుల్లసుద్ర తాకట్టు పెట్టి పొరుగింట నున్న కంసలివద్ద 'ఒకగేదె'ను కొనినట్లామె చెప్పెను. అది లక్కగేదె గాని నిజముగ గేదె కాదని బ్రాహ్మణుడు తన యనుభవమును తెలియజేసెను. భార్య యెంత నచ్చజెప్పినను తన మూర్ఖపు బట్టును విడువలేదు. ఇది శ్రీకృష్ణరావుగారు గ్రహించిన కథ.

ప్రసిద్ధిలో పాఱుతకుఁ గల మొఱకుతనమిందు పాఱునకు గట్టబెట్టబడినది. తిండికిలేక దేవురించునామె—మగనికి తా నొన్న గేద లక్కది కాదని నచ్చజెప్ప బుద్ధిమతి అనాలోచితముగ నుల్లసుద్ర తాకట్టుపెట్టి గేదెను కొనుట యుచితమగునా? లక్కగేదకును, మంచిగేదెకును తారతమ్యము నెఱుకపఱచుకోలేని మూర్ఖవిప్రుడు 'జలనిధిని దాటి దూరదేశముల కేఁగి' 'ధనము గడియించు' టెట్లు?

'జీవహింస' యను కావ్యమున బల్లిని ప్రస్తుతించునపుడు 'బల్లి యొక్కటి యీ దృశ్యమెల్లఁ గాంచి ఇస్సి! 'జగమెల్ల పాపభూయిష్ఠ' మనుచు, నుటుకుమని యొక్క దోమను గుటకవైచి, రివ్వునం జనె 'హా! శ్రీహరీ!' యటుంచు' అని చెప్పఁబడినది. బల్లియఱపు 'కృష్ణ! కృష్ణ!' కు అనుకరణముగ దోఁచుట ప్రసిద్ధము. కాన 'రివ్వునం జనె హా! 'కృష్ణ కృష్ణ యంచు' అని యుండిన నెంతయు ననుగుణముగ నుండెడిది.

### ౨. తేనె చినుకులు

ఈ యయిదవ సంపుటమున బదునాలు గీతకావ్యములు కలవు. అం దయిదు 'స్వకీయములు; తక్కినవి అనువాదములు.' ఇందు

కథాకావ్యము లల్పములు; వర్ణనరూపము లధికములు. అన్నియు హృదయంగమములు; మధురభావ భరితములు. తెలుగుపలుకువెలదికి తను తొడవులు.

## 3. దీపావళి

ఈ యాఱవసంపుటమున ఎనిమిది పద్యకావ్యములు కలవు. అందు నాలుగు ఆంగ్లానువాదములు, తక్కినవి స్వతంత్రరచనలు. సగము కథాకావ్యములు; తక్కినవి వర్ణనాత్మకములు. కవిగారి స్వతంత్రరచన యగు 'దీపావళి' యందు మొదటికావ్యము. ఆ పేరే గ్రంథమునకుగూడ ఉంచబడినది.

'పంద' ఆంగ్లమున 'టెన్నిసన్' రచించిన 'డోరా' యను పద్యమున కనుకరణము. డోరాశీలమువలె మేరీశీలముకూడ లెస్సగ పోషింపబడుట యిందలి విశేషము.

'ఈఁగ—సాలీఁడు' కథకు గీతరచనకంటె గేయరచన అత్యంతము అనుగుణము. అట్టి యనువాదమే యీవఱకు తెలుగునాట వ్యాపించియున్నది. అయినను ఇందు భావములకు ఏమాత్రమును కొఱత లేదు. శ్రీకృష్ణరావుగారి స్వతంత్రరచనలగు ఋతువర్ణనములు ఇందు స్వభావసిద్ధములయి వారి వర్ణనపాటవమును చాటుచున్నవి.

## ౪. విరిదండ

ఇది కవిగారి ఏడవ సంపుటము. 'విరిదండ' మొదలగు నాలుగురచనలు కలవు. ఇందు కొన్ని యనుకరణములు; అయినను అన్నియును స్వతంత్రరచనలు.

'విరిదండ' కాళిదాసమహాకవి రచించిన రఘువంశమునందలి 'అజవిలాపము'నకు అనుకరణము. విహరించుచున్న ఇందుమతిపయి వీణాదండాగ్రమునుండి జాఱిపడిన విరిదండ యామెయసువులను హరించుట, అజుఁడు విలపించుట యిందలి కథాంశము. కథ రచన కనుగుణము; రచన కథ కనుగుణము. భావములు మూలానుసారులు.

'పైఁడిలేడి' రామాయణకథ. మారీచుని మాయలకు లోబడి జానకి జింక వెంటనంటిన రామునికి సాయముచేయ లక్ష్మణుని ఆజ్ఞాపించు సందర్భములోనిది. సీత కఠినవాక్కులు, లక్ష్మణుని వినీతభావణము, వైదేహిపరిదేవనము ఇందు ఉచితరీతిని వర్ణింపబడినవి.

'అపవాదము' కంకంటి పాపరాజుగారి ఉత్తరరామాయణము ననుసరించి వ్రాయబడినది. జనాపవాదదూషిత యగు సీతను కాఱడవులలో విడుచునపుడు వదినె, మఱదులకు జరిగిన సంభాషణ మిందు వర్ణితము. ఇది ఎంతయు హృదయంగమము! చదువరులను రసతన్మయుల నొనరింపగల దీ చిన్నికావ్యము.

'గోగీతము' అనంతామాత్యుని 'భోజరాజీయము'నకు రసవంతమగు ననుకరణము. మూలమునందలి భావము లన్నియు ఇందును కూర్పబడినవి. సీసములందును, వృత్తములందును గల భావము లిందు గీతములలో చక్కగ సంగ్రహముగ బొందు పఱుపబడినవి. కాని కొలదిచోటుల మూలమున లేని భావములు కూర్పబడినవి.

ఆవును వర్ణించినపిదప నిందు 'పోతరించిన దాని మూపురములఁజూచి, గండుపులి యొండు దానిపైఁగన్ను వైచె. 'ఒక్క దినమున నాధేను వూరిబయట, గానలో మేయుచుండంగ... గోవుపైఁ బడె నాపులి గొంద్రుమంచు' అని కథ సందర్భింపబడినది. పులి యావుపై గన్నువేయుట యొకమాఱును, పట్టనడరుట వేఱొకమాఱును జరిగినట్లు మూలమున లేదు. అందు 'ఇట్టిగోరత్న మొక్క సాఁడేకతంబ, పోఁక మేయుచునుండ బెబ్బులి యొకండు, దాని గని పొంచి యొడలెల్ల దాఁచి? వాల, మవని దాటించుచును వ్రేయ నడరుటయును' అనిమాత్రమే కలదు. ఇచటి మార్పునకు దగిన కారణము తెలియకున్నది.

తన సత్యమునకు మెచ్చి బిడ్డకు పాలిచ్చి తిరిగి వచ్చిన యావును జంపనొల్లక పులి దానిని తిరిగి ఇంటికి బొగోరెను. దానికి ఆవు— 'ఈవు నను గాచి విడువ నే సింటికేఁగఁ గాంచి, 'ఈయావు పులిఁ గికరించి వచ్చె, మాయురే! ఎంత మాయలమారి? యనుచు నెల్లి దంబులు సేయరే యెల్లవారు' 'అకట! సడికంటెఁ జావు మే లనుగాన, చారుబరలీల నీకు నాహారమగుచు, కాయ మర్పించుటో, అట్లుకాకయున్న జీవముల బల్మి దొరగుటో చేయుదాన.'

అని పలికినది! మూలమున నియ్యది కాన్పింపదు.

ఈ యావు పులి కాహారము కావలెనను సంశము తక్కిన యావు లెఱిగినట్లు ఈ కథలో నెచ్చటను వ్రాయబడలేదు. ఆవువచ్చినపిదప దూడవల్ల తెలిసియుండవలెను. కాని మాట చెప్పవలెనను నియమమేమి? ఒకవేళ తెలిసియున్నను అవి యావును నిందింపవలసిన పని లేదు. ఆవు పులిని మోసము చేసినదనిన నమ్మువా రెవ్వరు? మోసము చేయదలచిన ఆవు పులివద్ద కేల పోవలెను? తక్కిన యావుల కీ మాత్రపుటాలోచన లేకుండునా?

చివఱకు గోవ్యాఘ్రములకు భగవంతుడు సాక్షాత్కరించి యెవరిదారిని వారిని పొమ్మనెనే? అపుడు 'కాయ మర్పించుటో, అట్లుగాకయున్న జీవములఁ బల్మిఁ దొరఁగుటో' చేయదలచిన ఆవుప్రతిన ఏమయినది? తిరిగి యింటికి బోయిన గోవుం జూచినచో తక్కిన గోవులు 'ఇది పులిని మోసగించిన గోవని నిందింపవా? ఆవునకు 'సడి' కలుగదా? పయి రీతి ప్రసంగమే లేకుండిన ఈ యనుపపత్తుల కవకాశమే యుండకపోవునే.

పయిరీతి స్వల్పవిషయముల కేమిగాని మొత్తముపయి ఈ రచనలన్నియును ప్రశస్తములయి సర్వజనాదరమును పొందజాలియున్నవి.

'పాలతరగ'లకు శ్రీ మున్నంగి...శర్మగారు, 'తేనెచినుకు'లకు శ్రీ చేకుమళ్ళ అచ్యుతరావుగారు, 'విరిదండ'కు శ్రీ సహదేవ సూర్యప్రకాశరావు గారును తొలిపలుకులను కూర్చి అందు ఆ యా కావ్యసంపుటముల ప్రశస్తిని వెల్లడించిరి. వానివలనను శ్రీ కృష్ణరావుగారి కవితావైశిష్ట్యము తేటపడుచున్నది. శ్రీకృష్ణరావుగారిట్టి చిట్టిసంపుటములను పెక్కిటిని వెలువరించి భాషాయోషను సేవించుచుందురుగాక!

—బు. వేం. ర.

## స్వయంకృతాపరాధం

చిన్నకథ;—కర్త, శ్రీ రామారావు

ఇతివృత్తం సాంఘికం. కథ విషాదాంశ ముతో ప్రారంభ మయినది; విషాదాంశం చక్కగా పెంపొందింపబడలేదు. సంభాషణమాత్రము సరసంగా సాగినవి. కాని కథలో అల్లిక సున్న. కొన్నికొన్ని చోట్ల రసమైన భాగములు విశేషముగా పోషింప బడ్డాయి. బాల్యవివాహం, బర్తుకంట్రోలు కూడ ఉపన్యాసధోరణి విశేషంగా గోచరి స్తూంది. కథ నీతిని బోధించనవసరం లేదు; దానినుండి మనము గ్రహించవలసినదే! అంతేకాని నీతిని గురించి లెక్చరుకొడితే ప్రయోజనం శూన్యం. కథకునకు కళాసంపత్తి తక్కువలాగ కనిపిస్తూంది. —దా. రా.

---

## జానకిప్రేమ

మొదలైన చిన్నకథలు

రచయిత-చేకుమళ్ల కామేశ్వరరావు.

వెల అయిదణాలు. ప్రకాశకులు-చేకుమళ్ల విశ్వనాథం-రాజమహేంద్రవరం.

ఇది పదిచిన్నకథల సంపుటి. జానకిప్రేమ, తంజావూరు స్నేహితుడు, రైలుప్రయాణం, సుబ్రహ్మణ్యం దెయ్యం, పార్వతీబాయి, అజంట, పోయినఫోటో, ప్రసాదరావుపెళ్లి చూపులు, వట్టి అనుమానంమనిషి, నభూతో నభవిష్యతి-అనేవి ఆపదికథలూనూ. కథలన్నీ కూడా, రచయితలో కథారచనశక్తి వున్నదని నిరూపిస్తున్నాయి. ఈ కథలలో ముఖ్యంగా బాగున్నది అజంట, పోయినఫోటో, సుబ్రహ్మణ్యం దెయ్యం అనేవి మాత్రమే. తక్కినకథలలో, కథాపోషణ కొంచెం కుంటుపడింది. ముఖ్యంగా, జానకిప్రేమ, పార్వతీబాయి, నభూతోనభవిష్యతి అనేవి ఏమీ బాగాలేవు. రచయిత కొంచెం శ్రద్ధ తీసుకుంటే, కథాపోషణ సరిగానే చెయ్యగలరని, కథలనడక చూస్తే తెలుస్తున్నది. భావాలనూ, రూపాన్నీ వర్ణిస్తూ ఒకచోట, 'మొద్దుమొహం' అని అంటూ ఆమొహంలోనే వున్న కళ్లను 'చురుకైన చక్కని పెద్దకళ్లు' అని వ్రాశారు. 'చక్కనిపెద్దకళ్లు' వుండీకూడా భావప్రకటన లేకపోవచ్చునుగాని, చురుకైన కళ్లువున్నప్పుడు మొహం తప్పకుండాకళగలిగి వుండాలి. ఇట్లాటి సన్నివేశాలు చూస్తే రచయితకు పరిశీలనశక్తి ఇంకా ఎక్కువకావలసిన అవసరంకనిపిస్తుంది.

మొత్తానికి, ప్రతికథా ఒకొక్కరకపు ధోరణితో, విసుకొక్క అక్కరలేకుండా చదవదగినవిగా వున్నాయి. —క. స.

---

## మహతి (తొలిసంచిక)

రాయల్ సైజున అఱువదిపుటలలో వెలువడిన మాసపత్రిక. సం. చందా రు. ౨. విడిపత్రిక రెండణాలు. సంపాదకుడు: వాసిరెడ్డి వెంకటసుబ్బయ్య, తెనాలి. పత్రిక ప్రారంభము. ౧౫-౮-౧౯౩౭.

"ప్రపంచదృష్టినంతటిని ఉద్వేత్తుగ ఆకర్షించు లోకవృత్తమును క్షణక్షణము తారుమారు చేయుచున్న వర్తమాన రాజకీయ వ్యవస్థకును జాతీయ నిత్యజీవనమునకు సంబంధించు సాంఘిక నైతికాది చర్చాసందర్భములకును, కళాపోషకములయి మానవహృదయ సంస్కారమునకు దోహదమొసగు కథానికలకును ఆదర్శములగు చరిత్రాంశములకును మా 'మహతి' సేవాంజలి సమర్పించుచుండును" అని 'ప్రాస్తావిక'యందు గలదు. మనదేశమున పత్రికానిర్వహణ మన్నివిధముల నసాధ్యమయిన యీ కాలమున మీదవేసికొనిన యుద్దేశములతో వెంకటసుబ్బయ్యగారు పత్రికను ప్రారంభించుట సాహస మనకతప్పదు. కాని అన్నివైపులనుండి తగినసాయము చేకూరునేని వారి యీ సాహసప్రయత్నము సామాన్యవిషయమయి నిర్విఘ్నముగ సాగుచుండగలదు. ఈ తొలి సంచికలో గద్యపద్యాత్మకములగు వ్యాసములు పదునాఱు కలవు. గద్యవ్యాసములు వివిధ విషయములకు సంబంధించినవి. అన్నియు సామాన్యములు. సంపాదకుల ఉద్దేశములకు దూరమున నుండిపోయినవి. ఒక రెండుమూడు మాత్రము [illegible] మున్నవి. మొత్తమున సంచిక కవు సాహిత్యవాసన (అదయినను పాతకాలపుదే) ఎక్కువగా పట్టినది.

వెంకటసుబ్బయ్యగారు పత్రికను తమ యుద్దేశములకు అనురూపముగా సాగించవలెనని గట్టిప్రయత్నము చేయవలెను. వ్యయప్రయాసలకు ఎక్కుడుగా లోనుగావలెను. అప్పుడు కృతార్థులు కాగలుగుదురు. వారికిందు సహృదయులగు రచయితలు, పాఠకులు ముఖ్యముగా సాయపడవలసినవారు.

---

## విద్యార్థి

ఇది నిజాముకళాశాల తెనుగుసారస్వత సాంవత్సరికసంచిక. దీనికి ముఖ్య సంపాదకుడు విద్వాన్ సరిపల్లి విశ్వనాథశాస్త్రి, యం. ఏ. దీనివెల - ఒకరూపాయ.

గద్యపద్యాత్మకములగు ఇందలి రచనములన్నియు నించుమించుగ నిజాము కళాశాల (నేటి, వెనుకటి) విద్యార్థులవియే.

వ్యాసములలో భావములందును, విషయవిమర్శయందును భాషయందును, విద్యార్థులు సర్వాత్మనా గోచరించుచున్నను వారి భావ్యభివృద్ధిని సూచించులక్షణములు లేకపోలేదు. ఇది సంతసింపదగిన విషయము. విద్యార్థులయందు కాంక్షింపవలసినది వారిభావ్యభివృద్ధియేకదా!

విద్యార్థులయభివృద్ధి విషయమున నింత శ్రద్ధవహించి యిట్లు వారిని వ్యాసరచనయందు ప్రోత్సహించు చున్న సంపాదకవర్గము మిక్కిలి యభినందింపదగినది.

---

# గ్రంథస్వీకారము

## Foreign Connection of Buddha

ఇంగ్లీషున ౧౩ పుటల గ్రంథము. రెండవ ముద్రణము ౧౯౩౭. వెల. రు. ౧.

గ్రంథకర్త: ఉమాకాంత విద్యాశేఖరుడు, వాఙ్మయసమితి, తిరువల్లిక్కేణి, మదరాసు.

---

## రాజసూయరహస్యము

క్రౌను ౧/౮ సైజు. పు. ౧౩౪. వెల ఒక రూపాయ. ౧౯-౩౮.

గ్రంథకర్త: పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి, పిఠాపురము, తూర్పుగోదావరి జిల్లా.

---

## రాష్ట్రగానము

క్రౌను ౧/౮ సైజు పు. ౩౨. వెల నాల్గణాలు. ౧౯-౩౮.

గ్రంథకర్త: తుమ్మల సీతారామమూర్తి చౌదరి. హైస్కూలు పండితుడు, బాపట్ల.

---

## ౧. హిమగిరిశతకము

డిమ్మి ౧/౮ సైజు. పు. ౨౮. వెల రెండణాలు. ౧౯-౩౮.

## ౨. చిద్విలాసము (నాటకము)

డిమ్మి ౧/౮ సైజు. పు. ౧౧౭. వెల పంద్రెండణాలు, ౧౯-౩౮.

త్యాగికృతములు. మార్కండేయ భవనము, నరసరావుపేట, గుంటూరు జిల్లా.

## విద్యావిధానము (ప్రథమఖండము)

క్రౌను ౧/౮ సైజు. పు. ౧౫౬ వెల ఒక రూపాయ. ౧౯-౩౮.

మూలగ్రంథకర్త: హర్బర్టుస్పెన్సరు. అనువాదకుడు: దుగ్గిరాల బలరామకృష్ణయ్య. ప్రకాశకులు:- తిపిర్నేని లక్ష్మీనారాయణ, మానవాదర్శ గ్రంథమండలి, అంగలూరు, కృష్ణాజిల్లా.

---

## మొయిలు రాయబారము (పద్యకావ్యము)

క్రౌను ౧/౮ సైజు. పు. ౩౮. వెల అర్ధ రూపాయ. ౧౯-౩౮.

మూలగ్రంథకర్త: కాళిదాసు; అనువాదకుడు: చర్లగణపతిశాస్త్రి, నిడదవోలు, పశ్చిమగోదావరిజిల్లా.

---

## కథామాల (మొదటిభాగము)

డెమ్మి ౧/౮ సైజు. పు. ౧౦౪. వెల ? గ్రంథకర్త: శనివారపు వెంకటలక్ష్మీనరశింహం, తణుకు. ౧౯-౩౮.

## వివాహమంగళము

(పునర్ముద్రణము) వెల రెండణాలు ౧౯-౩౮.

అనువాదకురాలు: కీ. శే. మా. అన్నపూర్ణాదేవి. ప్రకాశకులు: కె. రామస్వామి; కొ బ్రిగడేర్ సోడా ఫౌంటెన్, బెజవాడ.

---

## Modern Chinese History (Political, Economic & Social)

ఇది ౮౦ పుటల ఇంగ్లీషు గ్రంథము. వెల రు ౦-౮-౦. ౧౯-౩౮.

గ్రంథకర్త: ప్రొ. టాన్ యున్-షాన్ (Prof. Tan yun-Shan), ఆంధ్రవిశ్వవిద్యాలయము, వాల్తేరు.)

---

## లెనిన్

క్రౌను ౧/౮ సైజున ౪౮ పుటలగ్రంథము. వెల అర్ధరూపాయ. ౧౯-౩౮.

గ్రంథకర్త: విద్వాన్ విశ్వం, నవ్యసాహిత్యమాల, తరిమెల, పామిడిపోస్టు; అనంతపురంజిల్లా.



Printed and Published by S. Sambhu Prasad,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor:—S. Sambhu Prasad.

# భారతి

## సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు

శి. శంభుప్రసాద్

ఆంధ్రపత్రికా ముద్రాలయము,

మద్రాసు.

౧౯౩౮

సంపుటము ౧౫, సంచిక ౬

# వి ష య సూ చి క



త్రివర్ణచిత్రములు : స్మృతితరంగము, ఇతరచిత్రములును.




సంపు. ౧౫ బహుధాన్య, జ్యేష్ఠమాసము (జూన్ 1938) సంఖ్య ౬

# కువలయానందసారము

కే. శేషశర్మ

ప్రపంచమున గల పాంచభౌతికము లైన వస్తువుల నెందరో గాంచుచున్నారు. ప్రకృతి నంతయును పలువురు పరికించుచున్నారు. కాని, సామాన్యముగ జనులందరును ప్రకృతి యొక్క బాహ్యస్వరూపముసం దే విశ్రాంతు లగుచున్నారు. కవి యొకడుమాత్రము సార్వజనీనమైన యా ప్రకృతినే చూచి, తత్స్వరూపమును మనస్సున ప్రతిఫలింపజేసికొని, పలుమరు భావించి, దానితత్వము నరసి, నిగూఢములైన భావములను ప్రపంచముపై వెదచల్లుచున్నాడు. చూడుడు—

"కలిమి గల లోభికన్నను
విలసితముగ పేద మేలు వితరణియైనన్,
జలచెలమ మేల కాదా ?
కులనిధి యంభోధికన్న గువ్వలచెన్నా"

ఎందరులేరు చెలమను, సముద్రమును చూచినవారు. అందరకు నీ నిగూఢభావము గోచరించినదా ? కవి తనభావనామహిమచే ప్రకృతియందు నిలీన మైన యా తత్వమును వెలువరించి ప్రజల "నా నా" ననిపించెను. అందులకుగదా

"ప్రకృతిక్ భావ్యప్రణేతల్ కవుల్" అని యందురు. ఇట్టికవి యొనర్చిన ప్రకృతి భావ్యమే కావ్యము.

సామాన్యముగ ప్రకృతినిజూచినవారందరు దానియందు నిలీనమైనభావముల నేవిధముగ నెఱుంగజాలరో, అటులనే కావ్యమును జూచినవా రందరు దానితత్వమును కనుగొనుటకు గూడ చాలరు. అందులకుగూడ భావనాశక్తి యవసరము. అట్టిభావనాశక్తికి దారిచూపునవియే అలంకారశాస్త్రములు, కావ్యమీమాంసలును.

మన ఆంధ్రవాఙ్మయము పురాణకాలము నుండి సంస్కృతమునుండి మూలధనము తెచ్చుకొనుచున్నది. పురాణములు, ఇతిహాసములు, ధర్మములు, శాస్త్రములు, కావ్యములు— వేయేల, విజ్ఞానమంతయు దాననుండి దిగుమతియైనదే. మనకు ప్రకృతము కావలసినది కావ్యవిషయము.

కావ్యము లెపుడు సంస్కృతము ననుసరింపసాగెనో, అపుడు వానిలక్షణములుగూడ యాభాషనుండియే రావలసివచ్చెను. కావ్యాలంకారచూడామణి, నరసభూపాలీయము, ఆంధ్రదశరూపకము మొదలైన వన్నియు పైభాషయందలి గ్రంథములకు తెనుగుసేతయని యెల్లరకును తెల్లముగదా !

ఆరీతిగా సంస్కృతభాషలోనుండు లక్షణగ్రంథములే తెనుగువేషముతో వెలువడినవి, నేటికి వెలువడుచున్నవి; వెలువడగలవు.

గీర్వాణభాషయందు దిగ్దంతులవంటి పండితప్రకాండులు విమర్శించివిమర్శించి, వాదప్రతివాదఫలితముగ నిర్ధరించి, లక్షణముల నిరూపించిరి. ఆసిద్ధాంతితవిషయములను అనాయాసముగ తెచ్చి, మన తెనుగుతల్లి నలంకరించుట దోసగు కాదు.

కాని సువ్యక్తములైన విషయముల గాంచియు, వాటినే తెనుగులోనికి మార్చుచు, మన లాక్షణికులు సరిగ పరిశీలించకనో, మఱియేకారణముననో, సరియైన యర్థముల తెలుపుటయందు తబ్బిబ్బు లగుచున్నారు. కావ్యాలంకారచూడామణి, నరసభూపాలీయము మొదలైనవాటియందలి అనౌచిత్యములు ఎల్ల రెరింగినదే. సంస్కృతాలంకారగ్రంథములు చదివినవారలకు ఇవి చదువుట నరక మనుభవించుటయ. వాటియందలి దోషములు పరిగణించుట కిది యదనుగాదు.

సంస్కృతాలంకారగ్రంథముల కెల్ల మేలియలంకారమైనది చంద్రాలోకము. లెక్కకుమించిన అలంకారగ్రంథములు చదివిన మహాపండితులకుగూడ స్ఫురణకు వచ్చునవి చం

ద్రాలోకలక్షణములే. సూక్ష్మమై సొంపైన లక్షణములతో ముద్దులొల్కు ఉదాహరణములతో కూడియుండుటయే దాని మహత్త్వమునకు కారణము. అప్పయ్యదీక్షితులు కువలయానందమను వ్యాఖ్యతో దానికి మెరుగుపెట్టిరి.

వాటిసారమే బులుసు వేంకటరమణయ్యగారిచే రచింపబడిన కువలయానందసారము. దీనియందు చంద్రాలోకలక్షణములు అన్యూనాధికముగ, సామాన్యముగ గీతలలో లిఖింపబడినవి. ప్రాచీనులవలె పద్యమంతయు నొకలక్షణమునకై వదలి, అనవసరములైన పొల్లుపదములతో పద్యము కడుపునింపక, ఒకపద్యమునందే రెండుమూడు, సీసములయందైన ఐదు, ఆరు లక్షణములనుగూడ నిముడ్చుచు వచ్చిరి.

లక్షణోదాహరణమునకే కావ్యము పూర్వవలయునన్న సామాన్యముగ విద్యానాథుని ప్రతాపరుద్రీయనాటకమువలె జీవకళ లేక, చెక్కబొమ్మవలె నుండును. అటుగాక అప్పయ్యదీక్షితులమార్గమునే యనుసరించి, సహజాలంకారవిరాజమానములైన ప్రాచీన కావ్యముల నుండుపద్యముల నుదాహరించి, కువలయానందసారత్వము నన్వర్థముగావించిరి. ప్రాచీన కావ్యములలో నుదాహరణములు దొరకకున్న స్వయముగ కువలయానందమును తెనింగించిరి.

వీరియనువాదము "లక్షణములయందు గాని, లక్ష్యములయందుగాని మూలమునకు తీసిపోదు" అని చెప్పుటకుమారు ఒకపద్యమును— అందును తొలిపద్యమును ఉదాహరించుచున్నాను.

మూలము. "అమరీకబరీ భార
భ్రమరీముఖరీకృతమ్,
దూరీకరోతు దురితం
గౌరీచరణపంకజమ్".

దేవతాస్త్రీలెల్లరు గౌరీదేవి పాదకమలమునకు శిరంబులువాల్చిరి. వారినమ్మిలములయందలి సౌగంధ్యమున కాసపడి, తిరుగుచున్న తేంట్లు ఆ గౌరిపాదకమలమును ముసరుకొన్నవట. దీనిచే "వారి కబరీభరములకన్న గౌరీపాదపంకజము సౌరభ్యాతిశయముగల" దని వ్యంగ్యము. అట్టి పాదకమలము పాపహారమగుగాక యని దీనియర్థము.

దీనికి తెనుగు:

"వేల్పుటింతుల పెన్నెరివేణితావి
కాసపడి క్రాలుతుమ్మెద యాలపించు
గానమున మార్మ్రోగెడి గౌరిపాద
పంకజము పాపహారమయి పరగుగాక."

మూలార్థ మేమాత్రము మొక్కపోలేదు. వ్యంగ్యమునకు బాధ కలుగలేదు. "పెన్నెరివేణితావికాసపడి" యనుమాటచే కబరీభారమునందు భ్రమరసత్తకు కారణము తెల్లమైనది. మూలమందున్న యలంకారము మారలేదు.

చరణపంకజ మనుచోట, తుమ్మెదలు ముసరుకొనుటకు కారణమగు సౌగంధ్య మకరందములకు అనుగుణముగ "చరణమనెడిపంకజము" అని రూపకసమాసము నాశ్రయించి పంకజమునకు ప్రాధాన్య మీయవలయును. అట్టికమలము స్వయముగ దురితదూరీకరణమునం దసమర్థము. గౌరి-పాదమునకుగదా ఆ సామర్థ్యము గలదు! దానిచే గావలసినపని పంకజముచే నెఱవేరునా? కాన పంకజమునకు గౌరీపాదతాదాత్మ్య మవసరము. కాన పరిణామాలంకారము మూలానుకృతులయందు రెంటను సమానము.

"స్తనాదీనాం ద్విత్వావిష్టా జాతిః ప్రాయేణ"అని వామనసూత్రము. స్తనములు,కన్నులు, మొదలగునవి నేకవచనమున ప్రయోగింపగూడ దని తాత్పర్యము. మీకాలికి నమస్కార మనుట మరియు ననుచితముగదా!

"గౌరీచరణపంకజం" అనుటచే, ఈ ఏకవచనముతో దోషము లేకుండుటయేగాదు, వాచ్యమునకు విషయముగాని గొప్పయర్థము తెలియవచ్చుచున్నది.

దేవతాస్త్రీలు గౌరీపాదమునకుమాత్రము నమస్కరించినట్లు వాచ్య మున్నది. కాని దంపతుల కిరువురికిని నమస్కరించినట్లు కవిభావము. ఒక్కపాదమునకు నమస్కరించుట ఎట్లు? మఱొకదానికి విడుచుట ఎట్లు? కాన గౌరి కొక్కటేపాద మున్నట్లుంగీకరించవల్లయును. అర్ధనారీశ్వరదశయందు పార్వతి కొకరునిసామే నైనపుడుగదా ఒక్కటేపాద ముండుట! అట్టిపాదమునకు వందనముచే అతర్కితమైన శివపాదవందనము గూడ దేవతాస్త్రీలకు సిద్ధించుచున్నది. అట్టిదేవతలనతులనొందు ప్రాచీనదంపతులస్తుతి గ్రంథాదిని ఏకవచనముచే కవికి సిద్ధించుచున్నది. ఈ సారస్యమంతయు "పాదపంకజము పాపహార మయి పరగుగాక" అను ననువాదమునందును విడిపోకయున్నది. ఈ రీతి మూలసారస్యము చెడక గ్రంథమంతయు రమణీయముగ నందున ల్లేర్చికూర్చిరి. కాని—

"ఎచ్చటేనియుం దప్పంపు టేరికైన
ధర్మమే, భ్రాంతి పురుషుల ధర్మమనుట."

అన్నట్లు అపరిశీలితములు, అసమీక్షితములుమూలముగా, కొన్నిదోషములు దీనియందు సంక్రమించినవి. ఈ పొత్తమును విద్వత్పరీక్షకు పాఠ్యగ్రంథముగగూడ నెలకొల్పిరి గాన, పాఠకులు ఆ దోషముల సంస్కరించుకొనుటకు సహాయపడుటకుగానే యీవ్యాసము వ్రాయుచుంటిని. పురోభాగిత్వ మనక పాఠకులు దీనిని కైకొందు రని భావించుచున్నాను.

## ఉల్లేఖము :

మూ."ఏకేన బహుధోల్లేఖో వ్యాసౌ విషయభేదతః, గురు ర్వచ స్యర్జునోఽయం కీర్తౌ భీష్మ శ్శరాసనే". గృహీతృభేదము లేకున్నను, విషయభేదముచే ననేకవిధముల నుల్లేఖించుట (విషయీకరించుట) ఉల్లేఖము. మాటల విషయమున బృహస్పతి, కీర్తివిషయమున అర్జునుడు, ధనుర్విషయమున భీష్ముడీరాజు. అని లక్షణోదాహరణములు.

"పెక్కుగతుల నుల్లేఖము, నొక్కఁడె యొకదానఁ గూర్ప నుల్లేఖ మగున్" అని లక్షణము చెప్పి,

"మనసిజమంత్రఘోషములు,
మన్మథునానతిమాట, లిందిరా
తనయవిహారవాసములు,
దర్పకునార్పు ఖేలులంగ లంగజ
న్మనిచదువుల్ మనోభవుని
మోహనగీతు, లనంగచాదుళే

(నములు నెల్లదిక్కులఁ జె
లంగె మదోత్కటకోకిలధ్వనుల్"

"ఇట మదోత్కటకోకిలధ్వనులు మన్మథుని మంత్రఘోషములుగను, ఆనతిమాటలుగను, మన్మథుని విహారహాసములుగను, దర్పపు బిలంసులుగను, మదనుని చదువులుగను, మోహనగీతులుగను ఒక్కనిచే నుల్లేఖింపబడినవి. ఆయుల్లేఖించినవాఁడు కవి" అని సమన్వయించిరి. మూలమున విషయభేదము నాశ్రయించి లక్షణము ఉదాహరణము నుండగా వీరులక్షణమున "విషయభేద"మనుమాట వ్రాసినై చిరి.

మదోత్కటకోకిలధ్వనుల మన్మథునిమంత్రఘోషములు మొదలైవాటినిగా నుల్లేఖించెననిరి. ఇచట "నైవిషయమున" ననునది అసలే చెప్పబడలేదు. "కామోద్దీపకత్వమున" ననునొక్క విషయమైనను తెచ్చిపెట్టుకొనవలసినదిగా నున్నది. కానలక్షణమునకు విరుద్ధము

అక్రమాతిశయోక్తి:—

"అక్రమంబున కార్యమును హేతువునొక్కసారి జెప్ప" అని లక్షణము వ్రాసిరి. ఈ"ఒక్కసారి జెప్ప" డ మన నేమి? ఒక్కసారి కార్యకారణవాచకపదముల నెట్లు చెప్పవీలగును? శ్లేషచే కొన్నిచోట్ల చెప్ప వీలైన కావచ్చు ననుకొనుడు. అది స్వాభిప్రాయము గాదు. మూలార్థమునుగాదు. కాన కార్యకారణములను "ఒక్కసారి జెప్ప" "ఒకేవాక్యమున జెప్ప" అని యర్థమగుచున్నది. అట్లైన,

"హేతో ర్హేతుమతా సార్థం వర్ణనం హేతు రుచ్యతే."

కారణమును కార్యముతోడ చెప్పడము హేత్వలంకృతి అని హేత్వలంకారముగదా యాను!

మూల మె ట్లున్నదో చూచెదముగాక.

"అక్రమాతిశయోక్తి స్స్యాత్ సహత్వే హేతుకార్యయోః". అనియున్నది.

కార్యకారణములకు సహత్వము = సమకాలికత్వము అనిచంద్రిక. కారణము కార్యమునకన్న పూర్వకాలమం దుండవలయును. అటుగాక, కార్యకారణములకు ఏకకాలికత్వము వర్ణించుట అసంగతమై, క్రియ శీఘ్రముగ నెఱవేరిన దని తెల్పుచున్నది. ఈ అర్థము "కార్యమును హేతువు నొక్కసారిజెప్ప" అనుటచే రాదు.

"కార్యమును కారణమును ఒక్కసారియే యైనట్లు చెప్ప" అని అనవలయును. కాన లక్షణము సరిగలేదు. ఇక నుదాహరణమును పరికింతము.

"పాఱఁజూచిన రిపుసేన పాఱఁజూచు.
వింటికొఱగిన రిపురాజి వింటికొఱగు."

అని. "శత్రువుల బాణములచే గొట్టినపిదప వారు వింటికొఱగుట లోకసిద్ధము. కాని, ఇచట రాజు వింటికొఱగిననే రిపురాజి మరణించెనని రెండుపను లొక్కసారి జరిగినట్లు (అనగా క్రమములేక) వర్ణింపబడినది. కావున నిది అక్రమాతిశయోక్తి" అని సమన్వయించిరి.

ఇందు కార్యకారణము లొక్కసారి జరిగినట్లు వర్ణింపబడినవియా? అని విచారింపవలయును.

బాణముచే గొట్టుట కారణము. వింటికి-ఆకసమునకు ఒఱగుట కార్యముగదా! "బాణములచేగొట్టిన శత్రువులు వింటికొఱగిరి" యన్న కార్యకారణము లొక్కసారి జరిగినట్లు కాదని వారే యొప్పికొనిరి. ఒప్పకొనవలసినదియును.

"ఉన్నకలజెన వర్ణంబులు భవద్భావిశత్రుక్తవదర్థంబులం దగు" (బాలవ్యా.) అని విధించిరి. "తెలుగున భూతకాలమున 'న' వర్ణకము కలుగుననిభావము"అని సుస్వార్థప్రకాశిక. "బాణమునగొట్టిన" అనుదానికి కార్యపూర్వవృత్తిత్వము సిద్ధించినట్లే, వింటనొఱగిన యనుదానికిగూడ ఆ 'న'వర్ణకముచేతనే సిద్ధించుచున్నది. కాని కార్యకారణములకు ఏకకాలికత్వము సిద్ధించలేదు. అట్టియెడ "రెండుపను లొకసారి జరిగినట్లు వర్ణింపబడినది" అనుట సరిగలేదు. ఏకకాలికత్వము సిద్ధించలేదుగను కనే యిది అక్రమాతిశయోక్తి కాజాలదు.

మూలోదాహరణ మెట్లున్నదో యించుక పరికింతము.

"త్రిలింగంతి సమం దేవ
జ్యాం శరాశ్చ పరాశ్చ తే."

(రాజా! నీ బాణములు, శత్రువులును (సమం) ఒక్కటేసారి (జ్యాం) అల్లెత్రాటిని భూమిని తాకుచున్నారు.)

ఇచట "సమం" అనుపదముతో కార్యకారణము లొక్కసారిజరిగినట్లు తెల్పుచున్నాడు. దానికి తగినట్లు "జ్యాం" అనుపదమును శ్లిష్టమైనదానిని ప్రయోగించుట యెంతయు రమణీయమై,"అల్లెత్రాటిని, భూమిని, అని రెండు పదములచే నుచ్చరించువ్యవధానముగూడలేనంతశీఘ్రముగ భూపతనము జరిగినదేమో" యని అనిపించుచున్నది. "వింటనొఱగిన" యనుదాని యందు "సమం" అనునట్టిపదము లేదు. కాన అక్రమాతిశయోక్తి కాదు. "జ్యాం" అను పదమువలె "వింటక్" అనుపదముగూడ శ్లిష్టమైనదిగాన, నిచటగూడ నాయలంకార ముండవచ్చునని వారియూహ యేమో! మఱి యిచట నేమియలంకార మన్న—

చావునకు బాణముచే కొట్టుటగాని వింటికొఱగుట కారణము కాదు. అది కారణమునకింకను ప్రయత్నమే. కారణప్రయత్నమునందే కార్యము జరిగినట్లు వర్ణింపబడినది: కాన ఇది చపలాతిశయోక్తి.

"చపలాతిశయోక్తిస్స్యాత్ కార్యే హేతుప్రసక్తిజే." అని లక్షణము. "యాస్యామీత్యుదితే తన్వ్యా వలయోఽభవ దూర్మికా" అని యుదాహరణము.

చపలాతిశయోక్తి:

"మన్మథానలతాపంబు మాన్ప వేడి
డెందమునఁ జేర్పఁ బూనుకెందమ్మివిరులు
వెలఁదినిట్టూర్పుగాడ్పుల వెచ్చ దాఁకి
(?)చెరసి యరత్రోవమర్మరము లయ్యె."

అని చపలాతిశయోక్తి నుదాహరించిరి. "పూవులు వాడిపోవుటకు హృదయముపైనైచుట కారణము. అదిలేక హృదయమునుండి వెల్వడిన ఊర్పులచేతనే అవి శుష్కించినవి" గాన కారణప్రసక్తి మాత్రముచేతనే కార్యమువర్ణించుటచే చపలాతిశయోక్తి." అని వీరిసమన్వయము.

అట్లుచెప్పుట సరియైనట్లు తోచదు. ఊర్పులవేడి తగిలియేగదా యవి శుష్కించుట.

పుష్కలకారణమేయున్నదియే కారణప్రసక్తిమాత్రమని యెట్లు చెప్పనగును?

"ఉర్వులవేడి కారణముగాదు. హృదయముపై నైచుటయే వాడుటకు కారణము" అనిరియెదరా?

ఆదిమాత్ర మెట్లు కారణము కాగలదు? నిప్పునబెట్టుట ఎండవైచుటగదా శుష్కించుటకు కారణము? హృదయనిధానము కారణముగునా?

"అంతయొక్కవతాప మున్నదని తెలియజేయుటకుగాను హృదయనిధానము శోషణ కారణ మనియెదరా?

దానినుండి వెల్వడినయార్ద్రే ఆపనిజేసెనన మరియు తాపాతిశయము వ్యంగ్యము కాగలదుగదా! అతిశయోక్తిగా చెప్పుట రెంటను సమమే: కాన నది చపలాతిశయోక్తి కుదా వ్యాప్తి కాజాలదు.

మతి, "అనిష్టస్యాప్యవాప్తిశ్చ తదిష్టార్థసముద్యమాత్". తనయభీప్సితము నెఱవేరకుండుటగాక, పైన ననిష్టము గూడ దాపురించుట విషమాలంకారము" అనిరి.

తాపశాంతిజేయబోయిన విరులకు అభీష్టము నెఱవేర్చుట గల్గలేదుగదా! పైగా తమకే శోషణమను అనిష్టముగూడ ప్రాప్తించినది: కాన విషమాలంకారము.

## ప్రతివస్తూపమ:

"సదృశవాక్యార్థములకైక్య సంఘటనము
వరుస నది ప్రతివస్తూపమయగు కృతుల"

అని "ప్రతివస్తూపమకు లక్షణ" మనిరి. సదృశవాక్యార్థములకు ఐక్యసంఘటనము ప్రతివస్తూపమ ఎట్లు కాగలదు?

వాక్యార్థముల కైక్యసంఘటనమన్న
"యద్వాకు స్వామ్యతా నేయం
పూర్ణేందో రకలంకతా."

అనునదిగదా! అట్లయిన నది నిదర్శనగాని ప్రతివస్తూపమ యెట్లు గానోపు? "వాక్యార్థయో స్సదృశయో రైక్యారోపో నిదర్శనా." అని లక్షణము.

కాని ఉదాహరణమేమిచ్చిరో చూతము.

"మందారమకరంద మాధుర్యమునదేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మలమందాకినీ వీచికలఁ దూగు
రాయంచచనునె తరంగిణులకు
లలితరసాలపల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకు
పూర్ణేందుచంద్రికా స్ఫురితచకోరకం
బరుగునే సాంద్రనీహారములకు."

అని యుదాహరించి, "ఇచట వాక్యము లన్నిటియందును "ఏగకుండుట" ధర్మమొక్కటియే, అని నిరూపించబడినది: కావున "ప్రతివస్తూపమ" అని సమన్వయించిరి. లక్షణము చెప్పిన దొకటి సమన్వయము చేసిన దొకటి. ముందువెనుకలు చూడలేదు.

మూలము పరికింతము.

"వాక్యయో రేకసామాన్యే ప్రతివస్తూపమా మతా" అనిలక్షణము. "ఉపమానోపమేయ వాక్యయో రేకః సమానో ధర్మః పృథఙ్నిర్దిశ్యతే" అని వ్యాఖ్య. ఉపమానోపమేయ వాక్యములయందు ప్రత్యేకముగసమానధర్మము భిన్న పదములచే నిర్దేశించుట ప్రతివస్తూపమ అనికాని, సదృశవాక్యార్థముల కైక్యసంఘటన కాదు. అందుచే లక్షణమును పరిష్కరించవలెను.

## వ్యతిరేకము:

చెలఁగు వ్యతిరేకమనుచు విశేషమున్న
వర్ణ్యము నవర్ణ్యమునకంటె వర్ణనమున

అని లక్షణము. విశేషము, ఉన్న, వర్ణ్యము, ను, అవర్ణ్యమునకంటె, అనిగదా పదచ్ఛేదము! ఇచట 'ఉన్న' అనుధాతువునకు కర్తయేది? విశేషము అను ప్రథమాంతమున కన్వయ మెచ్చటికి?

'ఉన్న' అనునది ధాతుజవిశేషణ మని పోవుదున్న, అనునదివోలె, 'వర్ణ్యమున'కు విశేషణ మందమన్న, 'విశేషము' అనునది ధాతువు గాదుగదా! వారు సమన్వయమున "వర్ణ్యమునందు విశేషమున్న" అని వివరించిరి. లక్షణమున ప్రథమ - వివరణమున సప్తమియైనది. యథావస్తుగా నన్వయము కుదర దనిగదా దానిభావము. కాన లక్షణమందలి ప్రథమ కన్వయమెట్లో?

## అతద్గుణము

"అతద్గుణంబయి చెలయు వన్యసంగతి
దానిగుణము పొసంగకున్న"

అని లక్షణము చెప్పిరి.

కరతలపీడనంబునను
కందనిచక్కని పూలచెండ్లుక
ర్పూరమున రూపు నేపుచెడి
పోవని పచ్చని నిమ్మపండ్లు మేల్
పరిమళసంపదం గలిగి
వర్థిలు బంగరుగిండ్లు నీవు నే
పరమతపంబునం గలిగె?

(ప్రాయముచే ననుకొందు) గోమలీ.

"ఇచట కరతలపీడనాదులచే పూలచెండ్లు మొదలగునవి కందిపోవుట మొదలగుగుణములు గలవి కావలసినవి. అట్టిగుణములు గలుగలేదని వర్ణించుటవలన ఇది అతద్గుణము" అని సమన్వయించిరి.

కాని, అనుబంధమునందు "అతద్గుణతద్గుణాలంకార లక్షణములయందలి గుణశబ్దము రూపరసగంధాది గుణపరము. అచట నొకదానిగుణముచే వేరొకదానికి తాద్రూప్యము వివక్షింపబడియుండును." అని ఉల్లాసావజ్ఞాకృతుల కన్న భేదమును నిరూపించిరి.

కాని తాము మను పుదాహరణ మెట్టిదిచ్చియుండిరో ఒకపరి సింహావలోకనము చేసియుండిన బాగుండెడిది.

"కరతలపీడనంబునను కందనిచక్కనిపూల చెండ్లు" అనుచో కందడము పూలచెండ్లకు రాలేదట. అది దేనిగుణము? కరతలము గుణమా? తద్రూపత్వము చెండ్లకు రాలేదని చెప్పుటకు? అట్లులనే "రూపు నేపు చెడిపోవుట కర్పూరము" గుణముగాదు: కాన అభిప్రేతలక్షణము లక్ష్యమున లేదనుట స్పష్టము.

మూలమందలియుదాహరణ పరికింతము.

"చిరంరాగిణిమచ్ఛిత్తే నిహితేపి సరజ్యసే"

ఇచ్చట రాగము ఎరుపు - అనురాగము చిత్తముయొక్కధర్మము. అట్టిచిత్తమున నుంచి

నేప్రుంఛినను, నాయిక రక్తకౌశే దని, "అర్థద్గుణంబు వెలయు నన్యసంగతి దానిగుణ ము పొసంగకున్న" అనులక్షణము సమన్వితె మనుచున్నది. అది తెనుగున కొఅతివడ్డది.

దీపకము:

"పండితుండు శూరవరుఁడును పరులసేవ
యందు దిట్టతనము నందువాడు
స్వర్ణపుష్పయైన వసుధను కోయగా
నంచితగతి మది దలంచుచుండు"

అనుపద్యమున "ఇచట ధర్మము తొలుత ప్రస్తుతమునను ఆపై నప్రస్తుతమునను సమన్వయింప లేదు. ప్రస్తుతాఽప్రస్తుతములయం దొక్కసారియే యన్వయించుచున్నది. కావున నిది దీపకోదాహరణము కాజాలదేమో?" అని చెప్పబోవు సమాధానమునకు శంక నుపక్షేపించిరి.

మూలమున నున్న శంకాసమాధానములను తెనిగించుట యుక్తమేగాని—మూలమందు శంక కవకాశ మున్నట్లు తెలుపన లేదు. చూడుడు—

"మదేన భాతి కలభః ప్రతాపేనమహీపతిః" అనిమూలము. క్రియాపదము ఏకవచనాంతము గాన ప్రకృతమునందు ప్రత్యేకముగ నన్వయించి, ఆవృత్తిచే పిమ్మట నప్రకృతమునం దన్వయించుచున్నది.

"మణిశాణోల్లీఢః సమరవిజయీ హేతిదలితో మదక్షీణో నాగః శరది సరిత శ్యానపులినాః, కలాశేష శ్చంద్రః సురతమృదితా బాలవనితా తనిమ్నా శోభంతే గలితవిభవాశ్చార్థిషునృపాః"

అనుకువలయానందోదాహరణమునను ప్రథమమున "శోభంతే" యనుక్రియ "నృపా" అను ప్రకృతమం దన్వయించి ఆవృత్త్యాదులచే నప్రకృతములయం దన్వయించుచున్నది: కావున నచట శంకావకాశము గలదు. కాని,

"వాసనలేనిపూలు, బుధ
వర్గము లేనిపురంబు, నిత్య వి
శ్వాసము లేనిభార్య, గుణ
వంతుఁడుగాని కుమారుఁడున్, సద
భ్యాసము లేనివిద్య, పరి
హాసప్రసంగము లేనివాక్యమున్,
గ్రాసము లేనికొల్వు కొఱ
గానివి పెమ్మయసింగధీమణీ."

అనుపద్యమున "కొఱగానివి" అనుధర్మము ప్రస్తుతాప్రస్తుతముల యన్నిటియందును నొక్కసారియే "పండితుండు" ఇత్యాది పద్యమునందువలెనే అన్వయించుచున్నది. అట్టితఱి దానియందు పూర్వము సమన్వయమైన లక్షణమునకు మరల నిట్టిశంకకు అవకాశ మెక్కడిది.

ప్రస్తుతాంకురము:

ప్రస్తుతం బొకప్రస్తుతార్థంబు దెలుప
ప్రస్తుతాంకురసంజ్ఞచే బరగుచుండు.
"భ్రమరమా యుపమర్దమింపలర నోర్చు
పుష్పలతగూడి సౌఖ్యము పొందవలయు.
బాల నరజస్క నవమల్లికాప్రసూన
కళిక నేలనె చెఱుతు వకాలమునను."

"కళిక నేలర" యనుట యుక్తము.

"ఈపద్యమున నన్యాపదేశధ్వని యని లోచనకారుడు." అభినవగుప్తాచార్యులంతటివారు ఇట్టిదానిని ధ్వని యని యనగా, దాని నలంకారమని నిరూపించుటకు ఎట్టిప్రబలమైన కారణము గావలయునో యోజింపుడు.

అప్పయ్యదీక్షితులు మూలమున నీశంకకు సమాధానము చిత్రమీమాంసయందు చూచుకొమ్మనిరి. చిత్రమీమాంస యంతవరకు లేదాయె. అట్టిచో నిట్టి చిక్కునకు ఒక్కమాటతో సమాధానము చెప్పినట్లు భావించుట యుక్తముగా తోచదు.

దీనికి వీరిసమాధాన మరయుదము.

"ఇచట శృంగవృత్తాంతము ప్రస్తుతమైనను, కోపిత ముఖ్యవృత్తాంతము కాముకసంబద్ధమైన దగుటచేత, అభిన శృంగవృత్తాంతము మాత్రమే చెప్పగలదని యొంచక, కాముకవృత్తాంతమునుగూడ చెప్ప ననుట యుక్తము. కావున నిదెయుగూడ నలంకారమే యగును. కాని ధ్వని కాజాలదని చెప్పిరి అట్లైన—

"నిశ్శేషచ్యుతచందనం స్తనతటం నిర్మృష్టరాగోధరో నేత్రే దూర మనంజనే పులకితా! తన్వీ తవేయం తనుః, మిథ్యావాదిని, దూతి బాంధవజనస్యాఽజ్ఞాతపీడాగమే వాపీం స్నాతు మితో గతాసి నపునస్తస్యాధమస్యాంతికం." అను ఆలంకారికులచే ధ్వనిగా అంగీకరింప బడినదానియందుగూడ, కోపిత ముఖ్యవృత్తాంతము "మానికోపాలంభనరూప" అభిధేయము గావలసివచ్చును.

"శయితా సవిధే ప్యనీశ్వరా సఫలీకర్తు మహోమనోరథాన్, దయితా దయితాననాంబుజం దరమీలన్నయనా నిరీక్షతే" ఇత్యాది కావ్యములయందు రసాదులు కోపిత ముఖ్యవృత్తాంతములుగాన నివన్నియు ప్రస్తుతాంకురములు గావలసివచ్చును: కావున నీసమాధానము శంకానిరాసకము కాజాలదు.

గొప్పశంకకు సమాధానము చెప్పబూనుకొనుట శ్లాఘనీయాంశమే, గాని, ఏదో యొక సమాధానము చెప్పినా మని దాటివేయుట కన్న శంకనే యనువదించకుండుట యుక్తము.

దీనికి రసగంగాధరమున అప్రస్తుతప్రశంసయందు శంకాసమాధానము లున్నవి. అవి తెనిగించుట యెంతయు రమణీయము.

ఇట్టినెరసులు కొన్ని కువలయానందసారమున కనబడుచున్నవి. మరుముద్రణమునందు వాటిని సరిపుచ్చుకొనియెదరన్న యూహయు నా వ్యాసమునకు కారణము.

# శాస్త్రకర్తల యుద్దేశ మేమి?

★

పల్లపిల్ల వేంకటశాస్త్రి

ఇష్టప్రాప్తినీ అనిష్టనివృత్తినీ శాస్త్రాలవల్ల నేర్చుకుని వాటికి అనుకూలించే పనులను ఆచరించవలసి వుంటుంది. యిష్టమనఁగా, యీ లోకమందుమాత్రమే తాత్కాలికంగామాత్రమే సుఖాన్ని కలిగించేదిగా వుండకూడదు. యిక్కడ వుండే కించిజ్ఞులైన అధికారులకేకాక ఆలోకంలో వుండే సర్వజ్ఞులైన అధికార్లకుకూడా జవాబు చెప్పడానికి ప్రతిమనుష్యుఁడున్నూ అర్హుఁడుగా వుండాలనే వుద్దేశంతో ఋషులు కొన్ని శాసనాలు యేర్పరచి వున్నారు. వాట్లప్రకారం సంచరించవలసి వస్తే చాలాచిక్కుగా వుండేమాట సత్యం. అందుచేత వీలైనంతవఱకు ఆచరిస్తూ వీలుకానివాట్లకు 'అయ్యో! అతిక్రమిస్తూ వున్నాంగదా!' అని పశ్చాత్తాపాన్ని పొందుతూ కాలక్షేపం చేసేవారే చాలామంది. యిప్పుడు అట్టిపశ్చాత్తాపానికి అవసరమే లేకుండా అవన్నీ సదాచారాలే అని కొందఱు కొన్నిసూత్రాలు యేర్పఱచడానికి ప్రయత్నిస్తూ వున్నారు. యీప్రయత్నం అభినందనీయమే కానియిది సక్రమంగా ఆయా ఆచారాలను పూర్తిగా ఆచరించేవారెవరేనా భవిష్యత్కాలంలో పుట్టేయెడల వారిప్రవృత్తిని భంగించేది కాకపోవదు. సదాచారానికి కట్టుఁబాట్లుండవలసి వస్తుంది గాని దురాచారానికి కట్టుఁబాట్లతో అవసరమే వుండదు. దొంగతనం, వ్యభిచారం, ఋణము లెగవేయుట, కూటసాక్ష్యము, తాగుడు, జూదము యీమొదలైనవాటికి శాస్త్రాధారం వుండ నక్కఱలేదు.

శ్లో. "లోకే వ్యవాయామిషమద్యసేవా
జన్తోస్తు నిత్యా నహి తత్ర చోదనా,
వ్యవస్థితి స్తత్ర......"

యీ శ్లోకంలో నేను పైని వుదాహరించిన వాట్లలో కొన్నిటినిమాత్రమే వుదాహరించి నప్పటికి తక్కినవి వుపలక్షణతయా వ్యాఖ్యానం చేసుకోవడానికి అభ్యంతరం లేదు. శ్లోకంలో వున్న—(౧) స్త్రీ పురుషసాంగత్యమున్నూ, (౨) మాంసభక్షణమున్నూ, (౩) మద్యపానమున్నూకూడా నింద్యములే అయినను బొత్తిగా లేకుండా చేయడం అప్పటి శాస్త్రకర్తలకు అసాధ్యంగా కనపడి కొంత వ్యవస్థను యేర్పఱచి ఆప్రకారం ప్రవర్తించడం యిహపరలోకసమ్మతమని శాసించి వున్నారు. అందులో వున్న వివాహానికి యేర్పఱచిన కట్టుఁబాట్లు యిక్కడ వివరించ నక్కఱ లేదు. ఆకట్టుఁబాట్లకు భిన్నంగా యిప్పటివారు కొన్ని కొత్తత్రోవలు తొక్కుతూ వున్నారు. యెక్కువకులంవారి కన్యకకు తక్కువకులంవారివరుఁడు పనికిరాఁడని యెన్నో సందర్భాలు చెపుతాయి. (అనులోమ వివాహాలుకూడా పూర్వపుగ్రంథాల్లో తప్ప యిప్పుడు లేనేలేవు.) దాన్ని యిప్పటివారిలో ప్రముఖులైనవారు వుపన్యాసరూపంగానే కాక ఆచరణరూపంగా కూడా అమల్లో పెట్టి "మీ రందఱూ యీలా ప్రవర్తించండి" అని చాటించుచున్నారు. వారికి యేగ్రంథం గాని ప్రమాణకోటిలో చేరదు. అథవా చేరినా యేకొంతభాగమో చేరుతుందిగాని పూర్తిగా చేరదు. వర్ణాశ్రమాచారాలనుగూర్చి వారు బొత్తిగా విశ్వసించరు. వీట్లకు యేర్పఱచిన నియమాలు చాలా చిక్కుగా వున్నమాట సత్యం. కాని వివాహవిషయంలో సవర్ణవివాహ మనేది యేజాతివారికికాని అంతగాని కొంతగాని బాధించేది కాదు. కాకపోయినా దాన్నికూడా సున్నచుట్టడానికి మొదలుపెట్టారు. "వర్ణాశ్రమాచారాలు యిటీవల కల్పితమైనాయి కాని మొట్టమొదటినుంచీ లేనేలే" వంటూ వకవాదం భగవద్గీతలలో "చాతుర్వర్ణ్యం మయా సృష్టం" అని స్పష్టంగా శ్రీకృష్ణభగవానుఁడు—సృష్టం అని చెప్పినప్పటికి వారు దాన్ని విశ్వసించనే విశ్వసించరు. ఆ విశ్వసించనివారు తొక్కేత్రోవలు సామాన్యలోకానికి యెంతో ప్రీతిగా కనపడతాయి. విశ్వసించి వర్ణాశ్రమాచారాలు అనాదిగానే వున్నాయి అనుకొనేవారు సంచరించే సంసారంలోకూడా బుద్ధిపూర్వకంగానో అన్యథాగానో కొన్నిలోట్లు వుంటూ వుంటాయి. సోమయాజులుగా రున్నారనుకోండి. ఆయన యెంతో శ్రద్ధాభక్తులతో ఆయా కర్మలు జరుపుకుంటూ కాలక్షేపం చేసినా యెప్పుడో రైలెక్కవలసి వస్తుంది. ఆరైల్లో యేదో అస్పృశ్యత ఆయనికి తటస్థిస్తుంది. దానికోసం ఆయన యేదో ప్రాయశ్చిత్తం చేసుకున్నప్పటికి అసలు రైలెందు కెక్కాలి అంటూ ప్రశ్నిస్తారు. యెక్కకుండా కాలక్షేపంచేసిన కర్మఠులుకూడా వుండేవారు. యిప్పుడువున్నారో లేదో? చెప్పలేను. యీ భారతభూమినిపరమపవిత్రమైనకర్మక్షేత్రంగా మనపూర్వులు నిర్వచనం చేశారు. యూరపుఖండంతోపాటు మంచు గడ్డకట్టుకొనే ప్రదేశాలల్లోకూడా ప్రాతఃస్నానాదులు ఆచరిస్తూకర్మకాండ నెఱవేర్చుకున్నారు. అట్టి భారతభూమినియిప్పుడు మనం దుష్కర్మభూమిగా మార్చివేశాము. కొందఱు ఉన్నతవిద్యాభ్యాసానికియూరోపు వెళ్లినవారుఅక్కడ— 'యస్మిన్ దేశే య ఆచారః' అన్నట్టు ప్రవర్తించినా యిక్కడికి వచ్చాక— "కులంతోపాటు గోవిందా" అని ప్రవర్తించడం లేదు. అట్టివారు ఆయీ సోమయాజులుగారికి సన్నిహితబంధువులు కావడం తటస్థిస్తూ వుంది. వారు యీయన యింటఁగాని, యీయన వారి యింటఁగాని తిన్నా తినకున్నా యేలాగో వీరిహత్తు వారికి సాక్షాత్తూ కాకపోయినా పరంపరాగానేనా కలుస్తూ వుంది. యీలాటి వన్నీ యెక్కఁడీసి సంస్కర్తలు యెత్తిపొడుస్తూ వున్నారు. యేదోమాదిరికి వకటి వుదాహరించాను. యీలాటి వెన్నో వున్నాయి. వొకావిడ వున్నతవిద్యాభ్యాసానికి యూరోపు వెడుతుంది. యేముప్పైయేళ్ల వయస్సులోనో దేశానికి వస్తుంది. యింత పర్యంతమున్నూ బ్రహ్మచారిణిగానే వుంటుంది. ఆవిడ అప్పుడు పెళ్లాడవలసివస్తే యెవరో ఆలాటి బ్రహ్మచారి తప్ప వరుఁడు దొరకఁడు. ఆదొరకడంలో జాతివివక్షకూడా అవసరం లేకపోవలసి వస్తుంది. కర్తవ్య మేమిటి? యిత్యాదు లెన్నో యిప్పుడు తటస్థిస్తూవున్నాయి. యీలాటివారి నందఱినీ "త్రోసిరా" జంటామా? అన్న సంఘానికే చిక్కు. యీ సంఘం చాలా తక్కువగా వుంటుంది. అందఱితోటీ కలిసిమెలిసి వుందామంటే?.....

కూడా భ్రష్టులు కావలసివస్తుంది. కర్తవ్యం యేమిటి? అందుకోసం కొంపెలు ప్రాచ్యాచారాలకీ, నవీనాచారలకీ మధ్యగా వుండే వారు యేకోవిధంగా యీ నవీనాచారాలు కూడా యథాకథంచిత్తుగా శాస్త్రసమ్మతాలే అనేశక్తే తీరిపోతుందని ప్రయత్నిస్తూ వున్నారు. పూర్వంకూడా ధర్మశాస్త్రాలు దేశకాలపాత్రాల ననుసరించి మారుతూనే వచ్చాయి కనక యిప్పుడు యెంనుకు మనం మార్చకూడదని వారి ఆశయం. నాకేమీ అజ్ఞులు కారు, విజ్ఞులూ కారుకూడాను. పైపెచ్చు విజ్ఞతనులు. అయితే "స్థితస్య గతిశ్చింతనీయా" అనే తెగలోవారు. అంతే కాని అన్యులుకారు. తీరా మనపిల్ల రేజాత్యం తరుణ్ణో భర్తగా స్వీకరించిం దనుకుందాం. దాన్ని పరిత్యజించడంకన్న అనికూడా వొక మాదిరిసన్యమే అంటే అంత చిక్కుండదనుకో మంటారు. సర్వత్రా అలాటిసంపర్కాలే జరుగుతూవున్నప్పుడు బహిష్కరించడంకన్న పరిగ్రహించడమే యుక్తంగావుంటుందికదా! బహిష్కరించి చేసే దేమిటి? ఆ సంఘం హెచ్చిపోతుంది. అక్కడినుంచి ఆసంఘమే యీసంఘాన్ని బహిష్కరించడానికి ఆరంభిస్తుంది. "సంఘే శక్తిః కలౌయుగే." యీకష్టసుఖాలన్నీ వారు బాగా ఆలోచించారు. ఆలోచించి యేదోతోవ కనపడాలని వారి వుద్దేశం. పూర్వపండితుల వుద్దేశమో?—

"వచనాత్ ప్రవృత్తిః, వచనా న్నివృత్తిః"

అనేస్థితిలోనే వుంది. అప్పుడప్పుడు ధర్మవ్యవస్థలు మారినా యింత తండాలంగా మారిలే దంటారు. దొంగ్రైతేం మారింపా లేదా ధర్మవ్యవస్థ అంటారు వీరు. యిది తర్కతర్కం మీాద ఆధారపడవలసిన విషయం కాదు, సహృదయత్వంతో సంబంధించిన విషయం. ఆడవాళ్లు యుక్తవయస్సు వచ్చాక బ్రహ్మచారిణులుగా వుండి దేశంగాని దేశానికి వెళ్లి విద్యాభ్యాసం చేయడమున్నూ దానికి కన్న తల్లిదండ్రులున్నూ అన్నదమ్ములున్నూ సహకారులుగా వుండడమున్నూ ప్రస్తుతపన్న పరివర్తనానికి అవసరాన్ని కల్పిస్తూ వున్నాయంటూ స్థూలదృష్టితో కొంత అంటారు కాని నా కది నచ్చదు. అనేక కారణాల్లో అదికూడా వొకకారణం అయితే కానివ్వండి. యిటీవల 19-వ శతాబ్దంలో వచ్చిన ప్రకృతివిప్లవమున్నూ ధర్మపరివర్తనకు కారణమే అని నే ననుకుంటాను. పరివర్తన మంటే పరివర్తనమా? యూరంకే! మనదేశంలో నెలమవాం రున్నారా? వారి ప్రవర్తనంకన్న అసిధారాప్రవర్తనం యేనాము యోగాజులు గారికిన్నీ వుండేదు. వారి మీాసాలనుగూర్చి యెన్నో కథ లున్నాయి. వారి కొండెకిగలనుగూర్చిన్నీ డిటో. యింకా కొన్ని విషయాలలో వారికుటుంబాచారాలను రాజపుత్రకుటుంబాల ఆచారాలు తీసికట్టనే చెప్పవలసి వస్తుంది. చూడండీ, యిప్పుడు వారిమీాసా లేమైనాయోను, కొండెసిగ లేమైనాయోను! మరికొన్నిటినిగూర్చి వ్రాయడ మెందుకు? వారి అభివృద్ధి కంటూ యేర్పడ్డ పత్రికలో చదివితే యెన్నో వింతలు బోధపడతాయి. యెవరేనా మారితే మారుతారేమోకాని నా చెప్పేదేనా యీలా మారుతా రనుకున్నామా? వారిపౌరుషం యేలాటిది? అలాటి పౌరుషం ప్రస్తుతాచారాలకు దోసిలి వొగ్గుతూ వుంది. వారు కొందరిలాగ స్వంతపౌరోహిత్యం చేసుకుందా మని యిప్పటికి అనుకోవడం లేదు. మాకు వేదాధికారం కావా లని అనడం లేదు. యింకా యేవేవో కొన్నిటిని కొన్నివర్ణాల వారితోపాటు అభిలషించడం లేదు. కాని ఘోషాపోవాలనీ, సంతాననిరోధం అవసరమనీ వ్రాస్తూ వున్నారు. యెందుచేత? అలా వ్రాయడం? పూర్వపుకట్టుబాట్ల ప్రకారం యిక జరుప్రలో లేమనే అశక్యంచేతనే. హైదరాబాదానవాబుకుటుంబానికే యిప్పుడు ఘోషా లేదు మనకొక్కమి టంటూ కొంద అనగా విన్నాను. ఆకుటుంబానికి ఘోషా వున్నా వున్నట్టే లేకున్నా వున్నట్టే. ఆప్రభువు సకుటుంబంగా షికారుబయలుదేరితే వినగానే క్షిప్రనిర్జనం దానంతట అదే అవుతుంది. అందుచేత మనం ఆవుదాహరణ మనకి వుపయోగించ వనుకోవడం యుక్తం. బ్రాహ్మణులకు ఘోషాపం లేదుగాని, క్షత్రియులకి వాదగమున్నా అలాటిదే కనక దాన్ని వుదాహరించాను కాని లేకపోతే యెన్నో వుదాహరణాలు వుండగా దాన్ని వుదాహరించి వుండను. యీ నూతననాగరికతా ప్రభావం యేలాటిదో కాని అంతటినీ తారుమారు అనుకుంది. ... చేస్తున్నా బలవంతం చేస ... యీ నాగరికతలో సర్వత్రా పరివర్తనమే కనపడుతుంది. స్త్రీలు పురుషులుగా ... కుంటారు. పురుషులు స్త్రీలుగా వుండాలను కుంటారు. బ్రాహ్మలు శూద్రులుగా వుండా మనుకుంటారు. శూద్రులు బ్రాహ్మలుగా వుందా మనుకుంటారు. యింకా స్త్రీలల్లో మరికొన్ని పరివర్తనాలు పునిస్త్రీలు విధవలుగా, విధవలు పునిస్త్రీలుగా, కులస్త్రీలు వేశ్యలుగా, వేశ్యలు కులస్త్రీలుగా, యీలాటి మార్పులకుకూడా అభిలాష పుట్టిస్తూ వుంది యీనాగరికత. దీనిమాహాత్మ్యాన్ని యెంత వివరించినా తనివి తీరదు. ... అగ్నిహోత్రశాలలో చూచినా అంతో యింతో యీ నాగరికతాచిహ్నాలు కనపడతాయి. యిప్పటికి సమారు ... నాడు నెల్లూరులో శ్రీరంగు వాసుదేవ శాస్త్రులుగారు ... గా వున్నప్పుడు మేము అవధానాలకంటూ ఆపట్నం వెళ్లడం తటస్థించింది. మేము ఆవాసుదేవశాస్త్రులుగారికి అతిథులుగా కొన్నాళ్లు వున్నాము. కొవ్వొత్తిదీపాలే అప్పటికాలంలో ... అపురూపం. వాళ్లను భోజనకాలంలో వెలిగించి పెట్టేవారు. కాని ఆ "స్టాండు" మడిగట్టుకున్నవారు ముట్టుకోకూడదు. ముట్టుకుంటే మయిలపడ్డట్టే. యిప్పుడో! అవసరమయితే యింటిచాకలి ఆ పంక్తిని దీపం పెట్టి పోవడానికి అధికారం కలిగివుంది. యిదంతే. యిదే కావనుకోండి. ఆ చాకలిచే మన సంతానం విద్యాదినమాలని పురస్కరించుకొని ... చేస్తే అలాగే ... మనం సంతోషించవలసినంత అవశ్యకత కనపడుతూ వుంది యిప్పటిమార్పులో. మనవాళ్లల్లో యిలాటి ప్రాయశ్చిత్తాలు లేకపోలేదు కాని ఆ పిల్లకు ఘటశ్రాద్ధాలు ... జరిగేవి. యెందుకోసం? ... సంబంధించిన జాతకాచమ్మ ...

వదుల్చుకోవడానికి. "ఘటా శ్రాద్ధం"అంటే? మనిషి జీవించి వుండగానే జరిగే ఉత్తర క్రియ. యిప్పు డెవడేనా చాదస్తుఁడు ఆలాటి క్రియను వుపక్రమిస్తే అది 'లీగల్' గా శిక్షార్హంకూడా అవుతుందేమో? అనుకుంటాను. యిప్పుడు "లీగల్" దెబ్బ? చాలినదెబ్బ యేదీ లేదు. అన్నిటిమీఁదా దీనికి అధికారం వుంది. రెండోది వుపవాసదీక్ష. యిది కూడా "పిడుక్కీ బియ్యానికీ" కూడా వుపకరిస్తూ వుంది. మనదేశంలో పూర్వం జ్వరాల్లో కటికిలంఘనాలు వుండేవి. యిప్పుడు ఆ లంఘనాలు తగ్గించారు. కాని మళ్లా యీ స్వరూపంతో అవతరిస్తూ వున్నాయి. యింకా జరగలేదు గాని యిక ముందు దీన్ని వివాహాల్లోకూడా వుపయోగిస్తారని తోస్తుంది. యేకన్యకమీఁదో యేవరుఁడికో అనురాగం పుట్టడం, ఆకన్యకకి ఆవరుఁడిమీఁద యిష్టం లేకపోవడం, అప్పుడు కర్తవ్యమేమిటి? వుపవాసదీక్ష. దానితోటి పదిమందీ ఆకన్యకమీఁద విఱిచి "ప్రాణదానంబు కన్నను క్రతువు కలదె? యెఱుఁగవే."

అని వొప్పించడం జరుగుతుందేమో? భవతు. దాన్ని ఆలా వుండనిదాం. వాట్లంతట అవి జరిగేవి జరిగిపోతూనే వున్నాయి. వీట్లని సమర్థించడానికి శాస్త్రసవరణ వుండనే అక్కఱలేదు. యెందుకోసం పెద్దలు ప్రయత్నిస్తూ వున్నారో గోచరించడం లేదు. పోనీ, ఆ జరిగేసందర్భాలను సమర్థించినట్టవుతుందని ఆచారపరివర్తనతోపాటు శాస్త్రపరివర్తనానికి కొందఱు మహామహులు పూనవలసివచ్చిందనుకుంటే, దాన్ని కాదంటూ మళ్లా కొందఱు వుపక్రమించారుగదా! యీ వుపక్రమణానికి ఫలిత మేమిటో? వారివారి గలశాస్త్రాభిజ్ఞత ప్రకటించడం తప్ప అన్యం వుండదనుకోవాలి.—శ్లో. శక్తో యః స్థాపితుం ధర్మముపేక్షాం కురుతే నరః, సో ఽసిపత్రవనంనామ నరకం ప్రతిపద్యతే. అనే దోషాన్ని నివర్తింప చేసుకోవడం కూడా వకఫలితం అనుకోవాలి. నామట్టుకు యిందులో రెండోవారి ప్రవృత్తికన్న మొదటివారిప్రవృత్తే అభినందనీయంగా కనపడుతూ వుంది. కాంగ్రెస్సంటే, వోట్లు పడ్డాటే మొదటివారి ధర్మపరివర్తనానికే వోట్లు యెన్నో పడతాయి. కిరిపెట్టెలు అయ్యవార్లంగారి నట్టిళ్లే" అవుతాయి. లక్ష్యం లేని శాస్త్రం వుండేమి లాభం? లేకేమి నష్టం? "ఏత ద్యుగాదా? లక్షణవివేకము లక్ష్య మెఱుంగకుండినన్." యెక్కడేనా వకలక్ష్యం వుండకపోతుందా? అంటే, వుండనివ్వండి "నహ్యేకం లక్ష్యం యోగారంభం ప్రయోజయతి" కదా! ఆలాటివారిదివఱకే యేలాగో వీలున్నంతలో వారివారి సదాచారాలు జరుపుకుంటూనే వున్నారు. కొలఁదిసాళ్లక్రిందట వొకరింటికి విందుకు వెళ్లాను. యింటిల్లిపాదీ పూర్వాచారంగానే కనపడ్డారు. మళ్లా కోర్టుకెళ్లడానికి మోటా రెక్కేటప్పటికో! అచ్చంగా దొరగా తయారైనాఁడు యింటి యజమాని. యీలాటి పరివర్తనం అయితే యేలాగో సరిపెట్టుకోవచ్చు. యీరీతికి యిదివఱకే అలవాటుపడింది మనదేశం. అంగేసేకాని కోడును యే యూష్టిండియన్ కోడలినో అంగీకరించిన్నీ, కూతురికి యేఅరబ్బీనో అంగీకరించిన్నీ (శాస్త్రసమ్మతి కల్పించే అనుకుందాం) యేలా సరిపెట్టుకోవడం? యీ మాత్రానికే కాదు! పాపం! రాజపుత్రస్థానం అంతా పాతమయింది గతకాలంలోను. తుదకి విధిలేక హతశేషులు "ప్రాణములు తీపని మన్ వినవే బృహన్నలా!" అన్నట్టు అందుకు వొడఁబడి ఆకొత్త జాతిగౌరవాన్ని మంటఁ గలుపుకున్నారు. అష్టకష్టాలూ అనుభవించి వొక్క ప్రతాపసింహు కుల గౌరవాన్ని నిలఁబెడితే యివల అవసరమైనప్పుడల్లా ఆయనపేరు చెప్పకొని బ్రతికేవారు ఆ జాతివారు. యెవళ్లకీ యీలోకమే కాదు; యేలోకమేనా శాశ్వతం కాదు. శైల్లో టిక్కట్టెంత పని చేస్తుందో యిదీ అంతే. నాటమాత్రం చరిత్రలో నిలిచిపోతుంది. కాని, ఆలాంటి మంచిపేరు తెచ్చుకోవడం చాలా కష్టం. దాన్ని భంగించే అంతరాయాలు చాలా వుంటాయి. బుట్టబద్దలు కొడతానని బెదరించేటప్పుడే ఆలాటి సీతతో పోలిక సంపాదించడం కష్టం గాని సాఙ్గహాసతో పోలిక తెచ్చుకోవడం కష్టంకాదు. పేరు నిలుపుకోవచ్చును గాని మొత్తగా దురాచారాలలోకి దింపేటప్పుడు నిలుపుకోవడం మఱీ కష్టం. యిప్పుడు సంఘాలు చేస్తూ వున్న పని బుట్ట బద్దలుకొట్టడం వంటిది కాదు. యీవిప్లవంలోన్నుంచి యెందఱెన్ని ప్రయత్నాలు చేసినా తప్పించుకోవడం దుర్ఘటం. వకవేదపండితుఁడు సదాచారసంపన్నుఁడు వకపల్లెటూళ్లో వుండేవాఁడు. ఆయనకు అయిదాఱుగురు కొడుకులు. అంతా విద్వాంసులు. వారయితే అనాచారులు కారు గాని యేవో తండ్రిగారితో అకటాకటవ్యాఖ్యానాలుగా మాట్లాడడంమాత్రం వుండేది. దానికి ఆయన కోప్పడక వకమాదిరిగా వూరుకునేవారు. ఆకొడుకులలో రెండవ కొడుకు సంస్కృతంలో పెద్ద పండితుఁడు. అతనికి ఆయన 'ఆపస్తంబులు' అని కొత్తనామకరణం చేశారు. నీవు ధర్మశాస్త్రం మార్చడానికి ఆపస్తంబుఁడవా? యేమి అని ఆయన తాత్పర్యం. ఆయన నిన్నమొన్న గతించారు. ఆయన సదాచారసంపత్తి కేలోటున్నూ కలగలేదు. ఆ కుటుంబంలోనుంచి వచ్చిన నాలుగోతరం ఆడపిల్లలకి యిప్పుడు శారదా బిల్లుప్రకారంకూడా వివాహం కాదేమో? యమ్. యే. ప్యాసుదాఁకా వుండవలసివస్తుందేమో? అన్నట్లుంది. యివన్నీ శాస్త్రపరివర్తనద్వారా సమర్థించే యెడల ఆలాటి శాస్త్రం వుండేమి? మండేమి? అందుచేత ఆపరివర్తనం నిష్ప్రయోజనమే. అనిష్ప్రయోజన-ప్రయత్నాన్ని అరికట్టడానికి పెక్కుమహామహులు బ్రహ్మిష్ఠబ్రహ్మంగా చేసే ప్రయత్నమున్నూ నిష్ప్రయోజనమే అనుకోవాలి. యీపూర్వాచారులవారికి యీనవీనాచారాలు యేవంగానే వుంటాయి. వుండవూ పాపం! అల్లుఁడు యేజాత్యంతరుఁడో అయితే చీమూ నెత్తురూ వున్న యేప్రాచీనాచార పరాయణుఁడు ఆమోదిస్తాఁడు? ప్రాచీనాచారపరాయణుఁడే కాఁడు నవీనాచారుఁడే అనుకుందాం, పైకి యేలా సహించినట్టు నటించినా అంతరాత్మలో కొంత దుఃఖిస్తానే వుంటాఁ డనుకోక తప్పదు. యెంత తీసి పారేసుకున్నా తరతరాలనుంచి ప్రతి నాడిలోనూ ప్రవహిస్తూ వున్న పరమపవిత్రమైన భారతీయరక్తం బాధించదని చెప్పడా

నికి వీలు లేదు. యీ బౌన కొద్దికాలంలో అందఱికీ వస్తుందనియ్యేవే ప్రస్తుత వాతావరణంవల్ల గోచరిస్తూ వుంది. యీఅవమానాన్ని చూస్తూ చూస్తూ యేలా భరించేదిరా, అనే దుఃఖం వున్నవారు, బ్రహ్మచారులుగా వుండి జీవయాత్రగడుపుకోవడమో; లేదా, గార్హస్థ్యం అవలంబించినా సంతాననిరోధానికి సిద్ధపడమో కర్తవ్యంగా తోస్తుంది, కాని ఆనిరోగం—"భ్రూణహత్య"గా భావిస్తారు వారని యెఱుఁగుదును. ఆపక్షంలో అవమానానికి తల వొగ్గవలసిందే! గత్యంతరం లేదు. లేనే లేదు. యెంత వ్రాసినా యింతే—

శా. "వ్యాసాదుల్ ఋషులై నిజమ్ములయిత
ద్వాక్యమ్ముల్ భవిష్యద్గతిన్,
బూసక ప్రచ్చినరీతిఁ జెప్ప టదియుక
బోవంసి, యీకాల! వీ
రేసారజ్ఞులు? వీరి కయ్యొవల లే
నేలేసు విశ్వాస మీ
యీ సన్లేసు నెటు లుండు భ్రష్టు లసవా
శే తన్మతోద్ధాకుల్."



ఏక్ పైసా మహరాజ్

—దుర్గారావు.

# ఆధునికాంధ్రవాఙ్మయము:

[శ్రీ విశ్వనాథసత్యనారాయణగారు]

వేంకటేశ్వర్లు

ఇదివరలో శ్రీ సత్యనారాయణ గారి నర్తనశాలలనుగూర్చి, ఆంధ్ర ప్రశస్తినిగూర్చి ఒకటి రెండుమాటలు ఆంధ్రలోకమునకు మనవి చేసుకొని ఉంటిని. ఇప్పుడు "ఏకవీరాదేవి త్వగింద్రియములోని స్వచ్ఛత్వము, కోమలత్వము"నుగూర్చి ఒకటిరెండు మాటలు చెప్పదలచితిని.

అసలు భగవంతుడు తనకు కావలసినవారిని తానే ఎన్నుకొనుచున్నట్లు శ్రీ సత్యనారాయణగారి కావ్యములు తమ కృతిభర్తలను తామే ఎన్నుకొనుచున్నవి. ఏకవీరలోని రసము భావమిథునస్పర్శ కల్గి అనుక్షణము చదువరిని తనసుకొని పోవు చున్నవి. ఇది ఒక విలక్షణత. నవలలోనే మొదటినుంచి తుదివరకు నాటకములోవలె, మహాపురుషుని జీవితములోవలె ముందుకథ సూచింపబడుచునే ఉండును.

కథలో చరిత్రను జోడించిరి, నిర్వహించిరి. నాటిరాచగృహములు, మరియాదలు, అనుభవములు, విద్యావ్యాప్తి, నాగరకత, శిల్పనైపుణ్యము, ఆంధ్రుల ప్రతిభ, పరిపాలనా విధానము, అన్నియు కన్నులకట్టినట్లుగా వర్ణించిరి. కుట్టాన్ వీరభూపతుల స్నేహము వారివారి మానసిక పరిణామములు చిత్రముగ రమ్యముగ చిత్రించిరి. కూచిపూడివారి భామకలాపము, గొల్లకలాపము శ్రీ సుందరేశ్వరస్వామివారి కళ్యాణ సందర్భమున అంత సమంజసముగా చూపించుట వారి అసమానమైన అభిజ్ఞతను తెలుపుచున్నది. ఇది చాలమందికి కుదరదు. ప్రేమలేని భార్య నొకవంక, ప్రేమలేనిభర్త నొకవంక సృష్టించుటలో సృష్టివిచిత్రముగూడ కనబడుచున్నది. కామందరుడు, కౌటిల్యుడు మొదలగువారి ప్రశంస శ్రీ సత్యనారాయణగారి సర్వతోముఖప్రజ్ఞను చెప్పుచున్నది. ఇది అంతయు ఒక ఎత్తు.

శ్రీ సత్యనారాయణగారు "ఏకవీరాదేవిత్వగింద్రియములోని స్వచ్ఛత్వము కోమలత్వము ఈ కావ్యమునందు రెండు ఉద్దిష్టార్థము"లని భారతిలో ప్రచురించునపుడు వ్రాసిరి. ఇది ఏమిటి అన్నది ఒకసందేహము. ఈనవలను పలువురు పలువిధములుగా విమర్శించిరి. ఈ వాక్యమును గూర్చి ఎందుచేతనో ముచ్చటించలేదు. ఈ నవలకు అంతకు ఈ వాక్యము ప్రధానసూత్ర మని విశ్వసించుటచేతనున్న మిగతవిషయములు కూలంకషముగా ఇతరులు చర్చించి ఉండుటచేతనున్ను, పై వాక్యమును గూర్చి ఒకటిరెండుమాటలు చెప్పి విరమింతును.

త్వక్కు, చక్షుపు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము ఇవి పంచేంద్రియములు. సృష్టిలో ఒకచిత్రము ఉన్నది. అది ఏమన జీవరాశిలో కొన్నిటికి కొన్ని ఇంద్రియములు మాత్రమే స్ఫుటముగా ఉండుటయు, వానిచేతనే మడియుటయు కనుపించుచున్నది. ఉదాహరణకు పామును గైకొనవచ్చును.

కాని మానవుని నిర్మాణములో పంచేంద్రియములు ఇమిడియున్నవి. మానవులలో గూడ కొంతకొంత మందిలో కొన్ని ఇంద్రియములు మిక్కిలి నిశితములై ఉంటవి. నలుగురు కలసిపోవుచున్నపుడు ఎవనికి వినిపించనిది ఒకనికే వినిపించును. ఎవనికి కనుపించనిది ఒకనికే కనుపించును. అనగా ఆయా ప్రకృతుల యందు ఆయా ఇంద్రియములు మాత్రమే నిశితములైనవి. ఈ ప్రధాన సూత్రముమీదనే ఈ కథ అంతయు ఉల్లేఖింపబడినది. ఈ విషయము శ్రీ సత్యనారాయణగారి అద్వితీయమైన అగాధమైన, అనూహ్యమైన, అనుపమానమైన మేధాసంపత్తిని సూచించుచున్నది. కథాసంవిధాన రచనా వైదగ్ధులందు గ్రంథకర్తగారు అందె వేసినచేయి. రసము ప్రవాహము కట్టినది.

ఏకవీరాదేవి త్వగింద్రియములో స్వచ్ఛత్వము, కోమలత్వము ఉన్నవి. సామాన్యముగా ఈ రెండును కలసియే ఉండును. స్వచ్ఛత లేని కోమలత్వమును స్నిగ్ధతయని అనవచ్చును. ఈ స్వచ్ఛత కోమలత తామర తూడులో, మంచి సబ్బులో, భూతి అద్దములో, పొరతీసిన పచ్చిఅరటి పట్టలో కనుపించును. అరటి పైభాగము మిక్కిలి స్నిగ్ధముగా నుండును. ఒక పొరతీయగా లోనిభాగము-లన్ని

యు తెరలోనుంచి కనుపించును. గళ్ల గళ్ల మధ్యనున్న భాగములలో కోమల ప్రదేశము కనుపించును. హెచ్చు చైతన్యము కనుపించును. స్వచ్ఛతతోగూడి కోమలత మంచి సబ్బునందు చూడదగును. అదిచాల మృదువుగాను Tran sparent గాను ఉంటుంది. ఏకవీరాదేవి త్వగింద్రియములోని కోమలత్వముతో గూడిన స్వచ్ఛత్వ మెట్టిదనిన ఆమె మంచినీరు త్రాగునపుడు, ఆనీరు లోనికి పోవునపుడు బయటికి నీరు పోవు మార్గము, పోవుచున్న అనుభూతి వ్యక్తమగుచుండును.

ఆస్వచ్ఛత, కోమలత ఉండుటచేతనే ఆమెశరీరము ఒక శీతోష్ణస్థితిని కొలచుయంత్రము పగిది అయినది. స్వచ్ఛతచే స్పర్శతలోని నిశితత్వములోనికి చేరుచున్నది. కోమలతచే నిశితానుభూతి, భూతద్దమునకు వెనుకభాగమందు మెత్తని దూధిని పెట్టి సూర్యున కెదురుగా పెట్టునట్లు, కలుగుచున్నవి. మొత్తము మీద ఆమెత్వగింద్రియము మిక్కిలి సున్నితము, నిశితము అయినది. ఈ విషయములను మనము బోధచేసుకొనుటకు గూడ గ్రంథములో ఎప్పటికప్పుడు చాల అవకాశములుగూడ కూర్చబడినవి. ఈ విషయమును కవి మొదటినుంచియు సందర్భానుసారముగా సూచించుచునే యున్నాడు. నాటి వర్షాసమయమందు "ఆమె త్వగింద్రియము రక్తప్రవాహ దగ్ధముగా చల్లనిగాలిని కొల్చుచున్నది" "త్వగింద్రియముయొక్క స్పర్శగుణవ్యాప్తి చర్మము దాటి లోని గోరువెచ్చని ప్రవాహముదాటి శల్యముల తాకినని తోచిన దామెకు" దీనిని రానురాను కవి బాగుగా నిరూపించినాడు. ఎట్లన వీరభూపతి ఏకవీరాదేవిని ముట్టుకొనినప్పుడు క్రమశః ఇచ్చిన వర్ణన అదేతనువునుకుట్టాన్ ప్రభువు ముట్టుకొనినప్పుడు క్రమశః ఇచ్చినవర్ణన పై విషయమును బాగుగా నిరూపించును. వీరభూపతి తాకినప్పుడు ఆమె త్వగింద్రియము "చర్మ దఘ్నముగా శిశిరాతిశిశిరమయ్యెనట—భూమధ్య రేఖాప్రాంతస్థుని ఉత్తరధ్రువ సమీపమునకు ఒక్కసారి గొనిపోయి నట్లయ్యెనట" అదే తనువును ఇనుమడించిన ప్రేమతో కుట్టాన్ స్పృశించినపుడు "ఆమె త్వగింద్రియము చైతన్య రహితమయ్యెనట........,ఆమె రక్తమంతయు మృత్యు స్పర్శవల్ల కలుగుశైత్య మలవరించుకొన్నదట." అసలు ఈ రెండుఘట్టములు రచించునపుడు కవిజూపిన నైపుణ్యము, జాగ్రత మిక్కిలి ప్రశంసార్హములు. ఒకదానిప్రక్క ఒకటిఉంచి వ్రాసెనా అనిపించును. చదువరులు రెండు ఘట్టములు ఒకదానిప్రక్క ఒకటి పెట్టి చదివిన ఏకవీరాదేవిత్వగింద్రియములోని స్వచ్ఛత్వకోమలత్వము చక్కగా బోధయగును. స్వచ్ఛత లేనికోమలత గాజుముక్క వెనుక దూది ఉంచి సూర్యున కెదురుగా నుంచినట్లగును. కనుకనే "స్వచ్ఛత" ముందుఉంచి తరువాత "కోమలత" శబ్దము ఉంచబడినది. ఇట్టి రచన సామాన్యులు చేయలేరు.

శ్రీ సత్యనారాయణగారు కీచకవథాభాగమునకు సంబంధించక పోయినను ముందుకథలోని ఉత్తరపాత్రను వెనుకకు లాగి చొప్పించినారు. అటులనే గుజ్జువాళ్లపిల్ల, అమృతమును ఏకవీరలో సృష్టించినారు. ఈ రెండు సృష్టులును శ్రీ సత్యనారాయణగారు మహాకవి అని సూచించుటకు చాలును. షేక్స్పియరు వ్రాసిన నాటకములలో అందంపు సూత్ సేయర్సును ప్రవేశపెట్టును. కాని అది యొకత్రోవ; ఇది యొకత్రోవ. భారతములో అశ్వత్థామ ఉపపాండవుల గొంతులు కోయుటకు పూర్వము, నాటిరాత్రి గుడ్లగూబ......కథఒకటి ప్రవేశపెట్టబడినది True to feil కూడ అవసరమేగా ?

నర్తనశాల పుస్తకమంతలో రెండుచోట్లనుమాత్రమే అరసున్నలు గమనింపబడినవి. వాటిలో ప్రయోజన మున్నది:—

"ద్రౌపది :—పురుషులకుఁ బ్రవేశింపరాని యీ యంతఃపురమున నీతఁడెట్లు ప్రవేశించినాడు? భూమిం [illegible] దిశాకుమారులే ప్రవేశింపరాదే.

పరిచారిక:—ఆయనకు సుధేష్ణాదేవియెడల గలచను వట్టిది.అదియుఁగాక ఆయన భుజాబలమే మత్స్యధాత్రీతలమునకు రక్ష."

"నర్తనశాల"

పై రెండు వాక్యములు అంతఃపుర విషయమునుగూర్చి మాట్లాడు సందర్భములోనివి. అరసున్నలుంచుటచే వాక్యోచ్చారణలో నాసల్ సౌండ్ కలుగుచున్నది. తద్వారా కొంచెము రహస్యము కొంచెము అస్పష్టత ఏర్పడుచున్నది. అంతఃపురవిషయము గనుక ఈ రెండును అవసరమే అగుచున్నవి. వేదంవారి 'అక్షరవిలువ'ను గూడ దాటిపోయినది. కీచకవధలో అంతఃపుర మంతకును ఉత్తర, ఏకవీరలో [illegible]కు

అమృతము ఒకవిధమగు ఆవేశమును కలిగించి ఒక విచిత్ర సన్నివేశమును కలిగించిరి. గుజ్జువాళ్ల పిల్ల అమృతము ఎదురుగానున్న కుడ్యముపై బొగ్గుచే "ఆరంజేవిరుంబు" అని వ్రాయుటచే ఏకవీరా మనఃపరిణామము ముందువెనుకగా నడచినది. నడచినడచి శ్రీ సత్యనారాయణ గారిని నిర్దాక్షిణ్య రచయితగా చేసి వైచినది.

వర్షఋతువువర్ణన కన్నుల కట్టినట్లుండును. పాత్రపోషణలోని ఔచితి క్షేమేంద్రుని కికురించుచున్నది. 'స్థానాపతీ! క్షమించలేకపోతివి' అన్న కుట్టాన్‌వాక్యము మారు మ్రోగుచున్నది. గ్రామవర్ణన నూతన తేజము కలిగించుచున్నది. 'సైక్‌సీక్‌ప్' కూడ నశిపోవుచున్నది. ప్రకృతికి అద్దుపడతారు! సాధారణముగా చరిత్రాత్మకమైన నవలలో చరిత్రను చరిత్రగాను, కథను కథగాను విడదీసి చదువుకొనుట తటస్థించదు. ఎందుచేత ననగా హెచ్చు భాగము చరిత్రపాత్రలలో తొంగి చూచుచుండును. ఔచితిచెడక దేనికదిగా చదువుకొను పద్ధతిమీద నవల వ్రాయుటకు వీరే ప్రథము లేమో!

ప్రతిభావ్యుత్పత్తులలో ప్రతిభ గరీయసి అన్నను శ్రీ సత్యనారాయణగారి విషయములో మాత్రము అనుకూలము అనులోమ విలోమ సంప్రసారణము జరుగుచున్నది.

భాసమహాకవి నాటకములవలె ఏకవీర అంతయు ఒక్కసారిగా ఊహచేసి వ్రాయబడినదివలె కాన్పించుచున్నది. పనితన మంతయు ఆపేరు నిర్మించుటలోనే ఉన్నది. వెనకటికి సాహితిపత్రికలో వ్యాఖ్య చేసినట్లు అదోశక్తిపేరుగా, దేవతపేరుగా సుందరాతి సుందరముగా ఉన్నది. ఏకవీర నవలమాత్రమేగాక...... కావ్యముగూడానట. ఏదిచేయలేరు...... అనార్కలిలో ఛందస్సే లొంగిపోయినది...... వేనరాజులో భగవంతుడు ...ప్రభావము...ఇచ్చు అజ్ఞాతశిక్ష ...చక్కగా వ్యక్తమైనవి.

ఏ గుణవిశేషముచేత మానవుడు తెలియబడుచున్నాడో, ఆ గుణవిశేషముచేతనే మడియుచున్నాడు. అదే విధంగా, అనంతసృష్టివలె, ఏవైగైసిక తాతలముల, ఏవేళ ఈకథ ప్రారంభమైనదో, ఆవైగైసిక తాతలములందే, ఆవేళయందే, ఈకథ అంత్యమైనది. అంతే. ఏదో "As many heads as many wits there been" అన్నాడు. Chaucer.



# నాదిర్ షా

★ అంకత్రయి ★

మల్లాది అవధాని

## పాత్రలు :

నాదిర్ షా—మొదట సామాన్య సేనా నాయకుడు, తరువాత పెరిషియాకు చక్రవర్తి అయినాడు.

తామాస్ప—పెరిష్యా చక్రవర్తి.

మిరాజ్—నాదిర్ షా మిత్రుడు.

మిర్జా—నాదిర్ షా కుమారుడు.

రిజా—నాదిర్ షా రెండవకుమారుడు.

ముల్లాబక్షీ—మతగురువు.

ఖామినీ—తామాస్ప తల్లి.

హీరా—ఢిల్లీ సుల్తాన్ అయిన మహమ్మద్ షా కుమార్తె.

ప్రజలు, ముల్లాలు, సైనికులు, నౌకరులు.

అంకము—౧. దేశము : పెర్షియా.

కాలము : ౧౭౩౬.

దృశ్యము—౧.

(రాత్రి. గుడ్డివెన్నెల. ఇసాఫాన్ పట్టణంలో ఒక వీధి. తామాస్ప, మిరాజ్ మట్లాడుకుంటున్నారు. తామాస్ప ముప్పైయేండ్లవాడు. మిరాజ్ అతనికంటె పాతికసంవత్సరాలు పెద్ద.)

తామాస్ప—మిరాజ్ !

మిరాజ్—(తలవంచి) జహాపనా!

తామాస్ప—(నవ్వి) నా కీగౌరవ మెందుకు?

మిరాజ్—తమరు యీ సకలపెరిష్యాకూ చక్రవర్తిగదా.

తామాస్ప—ఒకప్పుడు?

మిరాజ్—ఎప్పుడూ తమరే చక్రవర్తి.

తామాస్ప—కాదు. నన్ను సింహాసనం మంది కిందకు తోసి ఫాత్ ఆలీ ఖాను చక్రవర్తి కాలేదా?

మిరాజ్—ఫాత్ ఆలీని సుంకెవెకలించి ద్రోహిని చంపి నాదిర్ తిరిగి తమ్ముల సింహాసనంమీద కూర్చుండబెట్టలేదా?

తామాస్ప—నాదిర్ చేసిన వుపకారం నే నెన్నటికి మరువలేను.

మిరాజ్—నాదిర్ చేసింది వుపకారం కాదు జనాబ్! ప్రభుసేవ. నాదిర్ తమ సేనానాయకుడు; అంటే భృత్యుడు.

తామాస్ప—కాని మిరాజ్! నా కీ సింహాసనం శాశ్వతంకాదుసుమా. నాబోటి దుర్బలు డాసింహాసనంమీద కూర్చుండడానికి తగడు. మహామహులు, నా వంశపూర్వులు కూర్చున్న సింహాసనంమీద నాబోటి నికృష్టుడు కూర్చొనడానికి అర్హతలేదు.

మిరాజ్—తమ మాటలు నాకు విచారం కలిగిస్తున్నాయి.

తామాస్ప—ఈ ఇసాఫాన్ నగరం నా తాతలకాలంలో, మా నాయనగారి కాలంలో ఎంత వైభవంగా వుండేది. కాని నాకాలంలో నశించి ఎలాగ నయిపోయిందో చూశావా? మహాభవనాలు, ఉద్యానవనాలు, శిలాప్రతిమలూ అన్నీ కూలిపోయినాయి. ఫాత్ ఆలీ నాతండ్రి తాతలు ఏలిన యీ నగరాన్ని ఫిరంగిగుండ్లతో బ్రద్దలుచేస్తూవుంటే చూస్తూ కన్నుల్లో నీరుగ్రుక్కుకొంటూ నోరుమూసుకుని వూరుకున్న నేను చక్రవర్తిగా వుండ తగినవాడనా?

మిరాజ్—నాదిర్ తిరిగి యీ ఇసాఫాన్ నగరాన్ని పునర్నిర్మిస్తే బాగుంటుందని హుజూరువారితో మనవిచేసుకుంటానని నాతో చెప్పినాడు. తమ హుకుము అయితే వారంరోజులలో యిక్కడనే యీ పాడుపడిన పట్టణం తన పూర్వశోభతో కలకలనవ్వుతుంది.

తామాస్ప—ఒక విషయంవిను మిరాజ్! ఈ పట్టణం నశించిందంటే మా వంశంకూడా నశిస్తుందని తెలుసుకో.

మిరాజ్—ఎన్నటికి కాదు జనాబ్.

తామాస్ప—మా నాయనగారు నాతో ఆఖరంగా చెప్పినారు, ఎంత కష్టించిఅయినా యీపట్టణం పాడుకాకుండా నిలబెట్టవలసిందని కోరినారు. కాని నేను దుర్బలుణ్ణి నా తండ్రిగారి కోర్కెను చెల్లింపలేకపోయినాను.

మిరాజ్—చక్రవర్తిగద్గదస్వరం వినలేను. (పాడుపడిన భవనంలోనుంచి తామాస్ప తల్లి అయిన ఖామినా వచ్చి తొందరగా తామాస్పను కౌగలించుకొంటూ ఉన్నది)

ఖామినా—నాయనా! తామాస్ప! నా తండ్రీ! బ్రదికివచ్చినావా?

తామాస్ప—ఎవరమ్మా నువ్వు? నీ గొంతుక ఎక్కడో విన్నట్టుంది.

ఖామినా—నన్ను పోల్చుకోలేదా తండ్రీ! ఈ నిర్భాగ్యురాలి నింకా పోల్చుకోలేదూ?

తామాస్ప—అమ్మా! అమ్మా! నువ్వా! నువ్వేనా?

ఖామినా—నే నే నా కన్నతండ్రి! ఆ ఫాత్ ఆలీ నిన్నింకా యేమిచేసినాడోనని ఎంతో బెంగపెట్టుకొని యేడుస్తున్నాను.

మిరాజ్—ఫాత్ ఆలీ ప్రభువువారిని ఖైదులో వుంచాడు. గాని మన నాదిర్ ఆలీని చంపి చక్రవర్తి వారిని విడిపించాడు.

తామాస్ప—అమ్మా! నే నాఖైదులోనే చనిపోతే యెంత బాగుండేది.

ఖామినా—అశుభం మాటలాడి నా మనస్సు బెదరకొట్టకుమా!

తామాస్ప—నేను బ్రదికి యీ దుఃఖం భరించుకోలేను. నా తండ్రిగారి ఆఖరుకోరిక యీ యిసాఫాన్ పాడుపడకుండా చూడడం నాచేత గాకపోయింది. సరి. నాతో సరి. ఈ పవిత్రవంశం నాతో నశిస్తుంది.

ఖామినా—ఈ ఆనందసమయంలో కన్నీ రెందుకు నాయనా?

తామాస్ప—క న్నీ రు...ఇవి దుః ఖ బాష్పాలు కావమ్మా! నిన్ను కలకాలానికి చూసినందు కానందానికి తట్టుకోలేక అశ్రువులు రాలుస్తున్నాను.

## దృశ్యము—౨.

(వెన్నెలరాత్రి. పునర్నిర్మితమయిన ఇసాఫాన్ పట్టణంలో చక్రవర్తిభవనం. శయన మందిరం సుందరంగా సజ్జితమై ఉన్నది. దీపికలు వెలుగుతున్నవి. గవాక్షందగ్గర తామాస్ప కూర్చుండి బయట పట్టణసౌంద ర్యం చూస్తున్నాడు. ఖామినా నిలుచున్నది.)

ఖామినా—నాయనా!

తామాస్ప—ఎందుకమ్మా!

ఖామినా—పాడుపడిపోయిన పట్టణాన్ని చూసి ఎంతో విచారించావు. చూడు వొక వారంరోజులలో నాదిర్ ఎంత చక్కటి పట్టం కట్టించాడో.

తామాస్ప—నాదిర్! బలవంతుడమ్మా.

ఖామినా—ఎంతో మంచివాడుకూడా. నిన్ను ఫాత్ ఆలీనుంచి రక్షించాడు. నిన్ను తిరిగి ఈ పెరిష్యాసింహాసనంమీద కూర్చుండ పెట్టాడు. నీకోసమని యీ నగరం తిరిగి నిర్మించాడు.

తామాస్ప—నాదిర్ మేధావి.

ఖామినా—నువ్వంటే అతనికి యెంతో భక్తి. ఇంత సామ్రాజ్యంలోనూ నిన్ను నాదిర్‌వలె ప్రేమించే వ్యక్తి యింకొకాడు లేడనుకుంటాను. ఏమంటావు తామాస్ప.

తామాస్ప—కావచ్చును.

ఖామినా—నువ్వేదో పరధ్యానంగా ఆలోచిస్తున్నట్టున్నావు. నామాటలకు సరిగా సమాధానమివ్వడంలేదు.

తామాస్ప—వెన్నెలలో యీ పట్టణవీధు లెంత సొగసుగావున్నాయో చూసి ఆశ్చర్య పోతున్నాను.

ఖామినా—ఆ మసీదులుచూడు, మసీదు శిఖరాలు చూడు. 'షానామా' లోని కథల్లో మాత్రమే యిటువంటిపట్నాలను వొక్క రాత్రిలో కట్టేశినట్టు వింటాము. కాని కథలు కూడా జరగడాని కవకాశం వుందని తోస్తుంది.

తామాస్ప—మనిషితలలో తోచే ప్రతీ ఆలోచనాకూడా జరగడానికి అవకాశం వుందమ్మా.

ఖామినా—చాలారాత్రయింది. పండుకో తండ్రీ!

తామాస్ప—(విచిత్రంగా నవ్వి) నా పట్నం...నేనూ...

ఖామినా—నీలో నువ్వే నవ్వుకుంటున్నా వెందుకు?

తామాస్ప—నే నెటువంటి చక్రవర్తినో నా పట్టణంకూడా అటువంటిదే.

ఖామినా—తామాస్ప!

తామాస్ప—అమ్మా!

ఖామినా—ఈరోజు విచిత్రంగా మాటాడుతున్నావే.

తామాస్ప—లేదు. లేదు.

ఖామినా—నీ వెటువంటి చక్రవర్తివో యీ పట్టణంకూడా అటువంటిదే. నువ్వు నూరేళ్లు బ్రదుకుతావు. నీ పట్టణంకూడా నీ పాలనలో చక్కగా వర్ధిల్లుతుంది.

తామాస్ప—రెండూ అసంభవమే.

ఖామినా—ఏమిటీ?

తామాస్ప—ఈ నూతన యిసాఫాన్‌నగరం పదేళ్లలో తిరిగి పాడుపడిపోయి భూమట్టమయిపోతుంది.

ఖామినా—అశుభం మాటలాడకు.

తామాస్ప—ఈ పట్టణంకట్టిన పదిరోజులలో నేను చనిపోతాను.

ఖామినా—(భీతితో) నాయనా!

తామాస్ప—అమ్మా! భయపడకు.

ఖామినా—నీమాటలు వింటే నాగుండె అదిరిపోతూంది.

తామాస్ప—నాకు గూడాను.

ఖా—ఎవరు చెప్పినారు అలా జరుగుతుం దని.

తామా—మానాయనగారు చాలాకాలం క్రిందట.

ఖా—హా! భగవంతుడా!

తామా—అమ్మా! ఎందుకలాగ కంపించి పోతున్నావు.

ఖా—నే నెంత నిర్భాగ్యురాలను.

తామా—మళ్లా యీ నూతననగరం నశించడం నేను చూడనుకదా!

ఖా—నాయనా పోయి పండుకో! నేను అల్లాను ప్రార్థించుతాను.

తామా—నాకు నిద్ర అంటే భయం వేస్తుందమ్మా.

ఖా—ఎందుచేత?

తామా—నిద్ర మృత్యుదూత అని కావ్యాల్లో చదివాను.

ఖా—కావ్యాలూ కథలూ కల్పనలు. పోయి పండుకో.

తామా—జీవితాలూ లోకం కూడా కల్పనే. నిద్ర మృతి యీ రెండూ రెండు కత్తులవంటివి. నాకు మృత్యువంటే ఎందుకు చెప్పా యింత భయం. అమ్మా! నీపిరికితనం నా రక్తనాళాల్లో ప్రవహిస్తూంది. కాని నాన్నగారి ధైర్యసాహసాలు నారక్తంలో నీరైపోయి నాయి.

(అర్ధరాత్రి నగారా వినబడుతూ ఉన్నది.)

ఖా—అదుగో నగారాధ్వని.

తామా—నువ్వుపోయి పండుకోఅమ్మా

ఖా—నువ్వో?

తామ—నేనుకూడా నిద్రపోతానులే(పో యుపండుకున్నాడు.)

తా—(కన్నీరు తుడుచుకొని క్షణంనిలచి వెళ్లిపోయినది.)

తామ—(లేచి పర్యంకముపై కూర్చున్నాడు.)

(మిరాజ్ మరిద్దరుఘాతకులు నెమ్మదిగా వచ్చినారు.)

మిరాజ్—(మెల్లగా) మేలుకునే వున్నాడు.

ఒకఘాతకుడు—(కత్తి తీసి) ఇక మీరు వెళ్లండి.

రెండవఘాతకుడు—కదిలినాడా పొడి చానే!

మిరాజ్—జహాపనా!

తా—ఓహో! మిరాజ్! అర్ధరాత్రి ఎందుకు వచ్చినావు?

మిరాజ్—(తనచేతులలో నున్న బంగారు శృంఖలాలు చూపుతూ) ఇందుకు జనాబ్!

తామ—నీచేతులలోని వేమిటి?

మిరాజ్—బంగారపు శృంఖలాలు.

తామ—నాకు కానుకలుగా తెచ్చావు కామా?

మి—అవును జనాబ్!

తా—ఎవరు పంపించినారు.

మి—(సంశయించి) నాకు తెలీదుజనాబ్!

తా—నాకు తెలుసును. నాదిర్ పంపినాడు కాదూ?

మి—నాదిర్ పంపలేదు జనాబ్!

తా—అబద్ధ మాడుతున్నావు. నే నెరుగుదును. చక్రవర్తి యింకొకరయితే యినపసంకెళ్లే పంపుతారు. బంగారపు శృంఖలాలు పంపాలెననే వుద్దేశం యీ సకల పెరిష్యాలోనూ నాదిర్‌కితప్ప యింకెవరికీ కలగదు. కా మిరాజ్! సంకెలలు నాచేతికి తగిలించు.

ఒకఘాతకుడు—అరవలేదు.

రెండవవాడు—కత్తి తీసి పొరలేదు.

ఒకటవవాడు—తనంతట తానే సంకెళ్లు తగుల్చుకుంటున్నాడు.

మిరాజ్—(తామాస్ప చేతులకు సంకెలలు తగిల్చి) రండి జనాబ్.

తామ—ఎక్కడికి?

మిరాజ్—కైస్ ఖానాలోనికి.

తామ—(నవ్వుతూ) కాదు; మృత్యుగర్భంలోనికి. పద!

మిరాజ్—(ఘాతకులతో) నడవండి.

తామ—మా నాయనగారి రెండువాక్యాలలోనూ ఒకటి జరిగింది. రెండోది జరిగితీరుతుంది మిరాజ్!

మిరాజ్—జనాబ్?

తామ—నాదిర్‌కు నా ఆఖర్వ చనం చెప్పు.

మిరాజ్—ఖుదాబంద్!

తామ—మా అమ్మకు నాకథ చెప్పవద్దు.

మిరాజ్—ఖుదాబంద్.

తామ—మరొకటి. ఈనూతన ఇసాఫాన్ మహానగరం సరిగా పదేళ్లనాడు కూలిపోయి నేలమట్టమయి పోతుందని నాదిర్‌తో చెప్పు!

మిరాజ్—ఆఁ?

## దృశ్యము—౩.

(సూర్యోదయం అవుతున్నది. మొఘాన్ మైదానము. సైనికులు తుపాకులు పట్టుకుని వరుసలువరుసలుగా ఉన్నారు. వారికి దగ్గరగా మిరాజ్ మద్ది. అతనిచేతులలో మణిమకుట మున్నది. ఎదురుగా వేలకొలది జనము న్నారు.)

మిరాజ్—(ఉపన్యాస ధోరణిలో) ఈ పెరిష్యా పరమపవిత్రమైన దేశం. మహావీరులను గన్న పుణ్యభూమి యిది. ఈ దేశాన్ని పాలించిన 'షా' కీర్తి లోకంలో మూలమూలలకుసైతం ప్రాకిపోయింది. తైమూర్ వారి పాలనలో పెరిష్యాఘనత హిందూదేశానికికూడా తెలిసింది. అటువంటి యీ వీరభూమిని తామాస్ప చేతులలో మన మంధరమూ కొన్నాళ్లక్రిందట వుంచాము. తామాస్ప పరమపిరికివాడని మీరందరూ గ్రహించే వుంటారు. ఫాక్ ఆలీఖాన్ ఇసాఫాన్ నగరాన్ని ధ్వంసంచేస్తూవుంటే యేమీ అనలేక పూరుకున్నాడు. ఆఖర్లో పోరలేక అతని ఖైదీ అయినాడు.

(జనంలోనుంచి ముల్లాబక్షి మిరాజ్ వద్దకు వచ్చినాడు. ముల్లా ఎనుబదివత్సరాలు నిండిన వృద్ధుడు. అతనినడుము వంగినది. పొడవైన గెడ్డము. నల్లని దుస్తులు...అతని ముఖములోని సౌమ్యత ముల్లా పవిత్రతను తెలుపుతూ ఉన్నవి.)

ముల్లా—(వార్ధక్యంచే వణకుతున్న స్వరంతో) నాయనా! నువ్వు చక్రవర్తినిగురించి చెడుగను మాటాడుతున్నావు. ఇది రాజద్రోహం కాదా?

మి—(అతనిమాటల సరకుజేయక) ఖైదులోపడి దుఃఖించి విలపించుతున్న తామాస్ప్‌ను నాదిర్‌కులీ విడిపించినాడు. ఫాత్ ఆలీని చంపినాడు. నాదిర్ మన సేనానాయకుడు మహావీరుడు. అతని వీరత్వమే ప్రస్తుతం మన దేశాన్నీ మనల్నీ రక్షించింది. ఏమంటారు?

జనం—(ఒక్కమారుగా) అవునవును.

మి—దేశాన్నిపాలించే చక్రవర్తి ప్రజలకు రక్షకుడుగా వుండాలి. అతనిచేతులలో కోట్లకొలది జీవుల క్షేమం వుంటుంది. అటువంటి చక్రవర్తి పిరికివాడై దుర్బలుడై వుదార శయాలు లేకుండావుంటే ప్రజలు తరుచు తరుచుగా నానాకష్టాలపాలూ అవుతూ వుంటారు.

జనం—అవునవును! నిజం.

మిరాజ్—మీరందరూ పెరిష్యాసంతానం. మీరక్తనాళాలలో రుస్తుంవీరునిరక్తం ప్రవహిస్తూంది. మీకు తామాస్ప తగిన చక్రవర్తి అవునో కాదో మీరే ఆలోచించుకొనండి!

ముల్లా—నాయనా! భగవంతుని ప్రతినిధి చక్రవర్తి. చక్రవర్తి యోగ్యతను చర్చించవలసినవాడు ఆపరమాత్ముడు. నీవూ నేనూ కాదు.

మిరాజ్—ఆలోచించండి. తిరిగి ఆఫ్ఘనులు యీ దేశంమీదకు వస్తున్నారు. ఆసమయంలో మనలను యీతామాస్ప రక్షించగలడా?

ముల్లా—నాయనా! చక్రవర్తిని ధిక్కరించకు. మనతండ్రి అది సహించడు.

మిరాజ్—అయ్యా! మీరు అనవసరంగా మాటాడవద్దు. నేను ప్రజలను ప్రశ్నిస్తున్నాను. మిమ్మ కాదు.

ముల్లా—నేను కూడా ప్రజలలో ఒకడనే.

(గుర్రపుడెక్కలధ్వని వినబడుతున్నది.)

మిరాజ్—అదుగో వీరాధివీరులు నాదిర్ కులీవారు వస్తున్నారు.

(సైనికులు బాకాలు ఊదుతున్నారు.)

(నాదిర్ కులీ అశ్వారూఢుడై వచ్చినాడు. బలిష్ఠకాయు డతడు. ఆరడుగులమనిషి. గంభీరమైన ముఖము. నీలికన్నులు. చిన్న వెడల్పు పెదవులు. చిరుగడ్డము. సేనానాయకుని దుస్తులు ధరించినాడు.)

మిరాజ్—(జనంతో) వీరే మనల్ని వుద్ధరించినారు. మనల్ని ఆపదలనుండి రక్షించినారు. కాని తామాస్ప మన కేమీ సహాయం చేయలేకపోయినాడు. ఇపుడు తామాస్పను ఏమి చేస్తే బాగుంటుందో మీరే ఆలోచించి చెప్పండి.

నా—(నిర్భయంగా) చక్రవర్తిని ఖైదీ చేసివైచినాను.

ముల్లా—(గగ్గోలుపడుతూ) చక్రవర్తినా? చక్రవర్తినా ? తామాస్పనా ?

ద్రోహం...పాపం...భగవంతుడు సహించడు, నీవు సైతాన్ అవతారానివా ?...

నాదిర్—మిరాజ్ !

మి—జనాబ్.

నా—ఆ 'దేవదూత' గొంతునులిపివెయ్యి.

మి—జనాబ్ (సంశయించుతున్నాడు.)

నా—(కన్నులెర్రజేసి) మిరాజ్ !

(మిరాజ్ వృద్ధముల్లా గొంతుకు పిసుకుతున్నాడు. జనంలో గోల.)

నా—(సైనికులవైపు తిరిగి) హుం!

(సైనికులు తుపాకులెత్తి జనానికి గురి చేసినారు ముల్లా కెత్తురుకక్కుకుని చచ్చి నేలనుపడిపోయినాడు. మిరాజ్ చేతులు రక్తమయంగా ఉన్నవి.)

మి—(కిరీటం తీసినాడు. కిరీటమునకు నెత్తురుమరకలు అంటుకున్నవి) ఓ ప్రజలారా! మీ అందరితరఫునా యీకిరీటాన్ని నేను నాదిర్ కులీవారికి సమర్పించుకొంటున్నాను.

(నాదిర్ చేతుల్లో కిరీటాన్ని ఉంచినాడు.)

నా—(స్వీకరించి) దేశంకోసం ప్రజలకోసం మతంకోసం నాజీవితం వినియోగించగలను. అల్లా నామాటలు వినుగాక!!

(సైనికులు బాకాలు ఊదుతున్నారు.)

(నాదిర్ అశ్వారూఢుడై వెళ్లిపోతున్నాడు.)

## దృశ్యము—౭

(సాయంకాలము. ఖురాసాన్‌లో ఖైదుఖానా. లోపల తామాస్ప. చిన్న దీపిక వెలుగుతూ ఉన్నది. ఒకనౌఖరు ఆహారసామగ్రి పట్టుకుని వచ్చినాడు. తామాస్ప నేలను కూర్చుండి ఆలోచిస్తున్నాడు.)

తామా—(త్రుళ్లిపడిచూచి) అబ్బాయీ! ఒకగడియ నిలుచుండి నాతో మాటాడవు ?

నౌఖరు—మీతో మాట్లాడుతూ కూచుండుకు నాకు తీరుబాటు లేదండి.

తామా—వుదయం నువ్వు చెప్పినమాట నిజమేనా ?

నౌఖరు—ఏమాటండి ?

తామా——నాదిర్ 'షా' అయిన సంగతి.

నౌఖరు—నిజంకాకపోతే అబద్ధమా మరి. నాదిర్ షావారు పట్టాభిషేకం చేసుకున్నారు. మా గొప్పవైభవంగా జరిగింది. మా అందరకూ డబ్బు పంచిపెట్టారు.

తామా—ఇసాఫాన్ నగరం ఒకసారి కూలిపోతే దానితో మావంశమూ కూలిపోతుంది. తిరిగి నిర్మించితే అది పదిసంవత్సరాలకుపైగా నిలవదు. దాన్ని నిర్మించిన పది రోజులలో నిర్మించిన చక్రవర్తీ చనిపోతాడు. ఇసాఫాన్‌ను నిర్మించి నేటికి సరిగా పదిరోజులయింది కాదూ ?

నౌఖరు—ఏమోనండి. నాకా లెక్కలన్నీ ఏం తెలుస్తాయండి ?

తామాస్ప—చక్రవర్తితో మాటాడడమంటే అంత విసుగా ?

నౌఖరు—మీరు చక్రవర్తా అండి.

తామాస్ప—ఒకప్పుడు.

నౌఖరు—(వికావిక నవ్వి) నీకు వెర్రెత్తిండి. నన్ను కరుస్తావో యేమో! నేపోతా.

తామాస్ప—ఇదుగో ఆగు. ఉదయం నుంచి నాతో మాటాడేజీవి లేక వొంటరిగా వున్నాను. చూడు. రేపు తెల్లవారేలోగా నేనో నాదిర్ కులీవో చనిపోవక తప్పదు.

నౌఖరు—(వెర్రివాడి మాటలు వింటున్నట్టుగా విని) ఎంచాత ?

తామాస్ప—ఇసాఫాన్‌ను కట్టించడానికి డబ్బిచ్చింది నేను. కట్టించింది నాదిర్. నేను ఆనాడు చక్రవర్తిని. నాదిర్ నేడు చక్రవర్తి. ఇసాఫాన్ తిరిగి కట్టించిన చక్రవర్తి పదిరోజులలో చనిపోతాడని మా నాన్నగారు చెప్పినారు. తప్పదు. యీరాత్రి నేనో నాదిర్ షావో...నా వంశం ఎప్పుడు నాశనమై పోతుందీ ?

తా—తామాస్ప ఒకప్పుడు చక్రవర్తి, ఇపుడు ఖైదీ.

నా—అయితే తమ రాక దొంగ అని మిరాజ్ సెలవిచ్చినా రెందుచేత ?

తా—(వినిపించుకోకుండ) ఇసాఫాన్ పట్టణం పదిమందిముల్లాల గోరీలమీద మొదట నిర్మించినారట. ఎన్నోమంత్రాలు చదివి నిర్మించినారు...విచిత్రనగరం...మానవ జీవితాలమీద దాని కెంత అధికారం వుంది!

(మిరాజ్ వచ్చినాడు.)

తా—సరి, సరి, సరి.

మి—ఏమిటి ?

తా—నావంశం సరి నేటితో సరి. నాదిర్ బ్రదికిపోయినాడు.

మి—జనాబ్! తమ వుద్దేశ మేమిటి ? (నౌఖరుతో) బయటకు పో.

నౌ—(పోయినాడు.)

తా—మిరాజ్! నాదిర్ 'షా' అయినాడా ?

మి—అవును.

తా—నిన్నిక్కడకు పంపినాడా ?

మి—అవును.

తా—తుపాకి తెచ్చినావా? కత్తి తెచ్చినావా?

మి—ఎందుకు?

తా—నన్ను చంపడానికి. నీ వంటుకే కదూ వచ్చినావు?

మి—బాగా గ్రహించినారు. (కైజారు తీసి) ఇదుగో కైజారు. అల్లాను తలుచుకోండి.

తా—కైజారు, మృత్యువు నాలిక జాచినట్టుంది. దాన్ని నా గుండెలోనికి పొడుస్తావా? అబ్బా! మిరాజ్! చనిపోయినతరువాత నే నెక్కడకు వెళ్లుతాను?

మి—నేను చనిపోయి బ్రదికినవాణ్ణి కాను.

తా—నాగోకిలో వుంటానుకాబోలు.

మి—మీరు భగవంతుని పుత్రులుకదా?

తా—మిరాజ్! అల్లా అనేవాడు నిజంగా వున్నాడా?

మి—వున్నాడు.

తా—ఎక్కడ?

మి—ఖోరాన్‌లో.

తా—అంతే అంతే. ఈ లోకంలోనూ ఇంకేవయినా లోకాలుంటే ఆ లోకాల్లోనూ కూడా లేడు.

మి—(కైజారును తామాస్ప గుండెమీద గుచ్చినాడు.)

తా—నాశరీరం జలదరిస్తూంది. మృత్యువునకు నా కిచ్చి నువ్విరోజు వివాహం చేస్తున్నావు. మంచివాడవు.

మి—(ఒక్కపోటు పొడిచినాడు.)

తా—(నేల గూలిపోయి) ఫరవాలేదు నాదిర్‌షా...ఇంకా పదేళ్లు...తరవాత అతడూ...అతని వంశం...నశింపక తప్పదు...నా మార్గమే...మా నాయనగారి మాటలు జరిగితీరుతాయి...ప దే ళ్లు...ఇసాఫాన్...(మృతి)...

అంకము—౩. దృశ్యము—౧

దేశము: భారతవర్షము. కాలము: ౧౭౩౯.

(అర్ధరాత్రి. అంధకారము. ఢిల్లీలోని మహమ్మద్‌షా సుల్తాన్‌కోటను నాదిర్‌షా ముట్టడించుతున్నాడు. మొగలాయీ సైనికులూ, పెరిష్యన్ సైనికులూ పోరుతున్నారు. తుపాకు లెడతెగక ప్రేలుతున్నవి. సైనికులు కూలిపోతున్నారు. కాగడాలు పట్టుకొని కొందరు సైనికులు పరుగెత్తుతున్నారు. ఊరిడుండి బయటనుండి ఫిరంగిధ్వనులు వినబడుతున్నవి. చీకటిలో నాదిర్‌షా కుమారుడయిన నాశ్రిఉల్లా మీర్జా తుపాకి పట్టుకొని వచ్చినాడు.)

మీర్జా—ఎవ రది?

(నిశ్శబ్దం.)

మీర్జా—(తుపాకి తీసి) మిత్రులా? శత్రువులా?

సన్ననిగొంతు—మి త్రు ల మూ కాము, శత్రువులమూ కాము.

మీర్జా—(ముందుకు పోయి చీ క టి లో పోబోతున్న ఆ వ్యక్తిచేయి పట్టుకొని నిలిపి) ఆఁ! ఎవరు నువ్వు? స్త్రీవా? నీచేతికి గాజులున్నాయి.

సన్ననిగొంతు—అవును. న న్ను వదలి వెయ్యండి.

మీ—వీలు లేదు. నీపేరు?

సన్ననిగొంతు—హీరా!

మీ—నువ్వెవరు?

హీరా—నేనా? నేనొక బానిసకన్యకను.

మీ—ఈ యుద్ధరంగంలోని కెందుకు వచ్చినావు?

హీ—జనానాను ఆ నాదిర్‌షా సైనికులు ముట్టడించినారు.

మీ—అయితే?

హీ—నాదిర్‌షావలెనే వా రు కూ డా హృదయంలేనివారు.

మీ—నాదిర్‌షా నాతండ్రి. ఆయనను దూలనాడవద్దు.

హీ—నేను దూలనాడడం లేదు. మీరు నాదిర్‌షావారి కుమారులుగదా. ఒక మానవంతురాలయిన ఒక అపరిచితకన్యక చేతిని పట్టుకొనడం బాగుందా?

మీ—ఈ యుద్ధసమయంలో మే ము ధర్మాధర్మాలు విచారిస్తూ కూర్చుండడానికి వీలుపడదు. శత్రుపక్షములోని ప్రతిజీవినీ మేము దొరికితే చంపడమో, ఖైదుచెయ్యడమో చెయ్యవలసివుంటుంది. నువ్వు యిపుడు మా ఖైదీవి.

హీరా—నన్ను ఖైదుచెయ్యవద్దు. తుపాకితో పేల్చి చంపివెయ్యండి.

మీ—ఎందుకు?

హీ—(గద్గదస్వరముతో) పురుషస్పర్శ ఎన్నడూఎరగని నాచేతిని మీరు పట్టుకున్నారు. ఈ అవమానం సహించుకోలేను. దయచేసి నన్ను కాల్చి చంపండి.

మీ—నువ్వు బానిసవు కావా?

హీ—బానిసనే.

మీ—బానిసకన్యవుకదా?

హీ—అవును.

మీ—బానిసకన్యలకు యింత నీతినియమాలా?

హీ—బానిసలూ మనుష్యులే.

మీ—ఇంతకూ నేను నిన్నేమీ అవమానించలేదు. నువ్వు తప్పించుకొనిపోవకుండా నీచేయి పట్టుకున్నాను.

హీ—మీకు అక్కలూ చెల్లెళ్లూ లేరా?

మీ—లేరు.

హీ—కనకనే మీకు తెలియదు. మీరు స్పృశించిన యీచేతిని తెగనరికినా యింకా అవమానవిషం నా హృదయాన్ని కాల్చివేస్తూనే వుంటుంది.

మీ—నీమాటలు వింతగావున్నాయి.

(కాగడా పట్టుకొని సైనికుడొకడు వచ్చినాడు.)

మీ—(వెలుగులో ఆమెమోమును పరికించి ఆమెచేతిని వదలి) మీ రెవరు? మొగలాయీ జనానాలోనివారా?

హీ—అవును.

మీ—క్షమించండి. క్షమించండి. తల వంచి నేను తమ సన్నిధిని క్షమాభిక్ష యాచించుకున్నాను. మీరు బానిసనని చెప్పడంచేత......

హీ—నేను బానిసనే.

మీ—నేను నమ్మలేను. మీ దుస్తులు బానిసలుధరించే దుస్తులేగాని మీ ముఖకళ... మొగలాయీ.....

హీ—నా తండ్రి మహమ్మద్ షా.

మీ—(ఆశ్చర్యముతో) సుల్తానువారా?

హీ—యావద్భారతవర్షాన్నీ ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలించిన చక్రవర్తి 'ఔరంగజేబ్' మా తాతగారు. కాని మా తండ్రి నేడు ఒక బానిస అయిపోయినాడు.

హీ—అదేమిటి?

హీరా—నాదిర్‌షాకు తలవంచి దోసిల్లొగ్గి లోబడిపోయినాడు. కనక అతడు బానిస. అతనికుమార్తెను నేను బానిసకన్యను.

మీ—నాదిర్‌షాకు దోసిలి వొగ్గినవారు రాజాధిరాజులే కాని బానిసలెంతమాత్రమూ కారు. ఈ లోకంలో గల సమస్తరాజులూ నాదిర్‌షాకు తలవంచి నమస్కరించినవారే. అతడు దిగ్విజయి.

హీరా—నాదిర్‌షా ప్రశంస వినడానికి నేను రాలేదు.

మీ—మీచేతిని స్పృశించి నే నపరాధం చేసినాను. మీరు యిక వెళ్లిపోవచ్చును.

హీ—మీరు నన్ను స్పృశించినారు. నా శరీరం కళంకితమైనది. ఇక నే నెక్కడకు వెళ్లగలను. మీ తుపాకితో నన్ను పేల్చి చంపండి.

మీ—మీమాటలు నా కర్థంకాలేదు.

హీ—మొగలాయీ స్త్రీలకు మానమే ప్రాణమని తమకు తెలిసేవుంటుంది.

మీ—మీరు నిజంగా అంటున్నారా?

హీ—మీ రాతుపాకిని నా కిచ్చినా సరే, నన్ను నేను కాల్చుకోగలను.

మీ—వద్దు. వద్దు. (ఆలోచించి) నే నెంత అపరాధంచేసినాను! మీపేరు?

హీ—హీరా! ఇదివరకే చెప్పినాను.

మీ—నామూలంగా మీ ప్రాణానికి హాని రారాదు.

(మిరాజ్ మహీది-వస్తున్నాడు.)

మిరాజ్—ఎవరది? ఎవరది?

మీ—నేను మీర్జాను.

మి—(దగ్గరకు వచ్చి) మీర్జా యేం చేస్తున్నా విక్కడ? మహమద్‌షా జోహూకు మయినాడు. కోట లోబడిపోయింది. దిగ్విజయం మనది. నాదిర్‌షావారి తలమీద కిరీటం పెట్టింది మనుషులు కాదు అల్లా!... మీర్జా! ఆమె ఎవరు?

మీ—ఈమె మొగలాయి కన్య.

మి—భేష్‌భేష్. నాదిర్‌వారికి కానుక.

మీ—కాదు.

మి—కాదూ?

మీ—నీ వామెనుగురించి అసందర్భంగా మాటాడరాదు.

మి—అలాగునా? చక్రవర్తికుమారుడవు యుద్ధం జరిగినంతసేపూ యిక్కడ ప్రణయమా చేస్తున్నావు?

మీ—మిరాజ్! నాన్నగారి ఆదరణ గలదని నువ్వు నన్నవమానించడం బాగులేదు.

మి—అవమానించింది నేనే? సరే, ఆ అమ్మాయితో మాట్లాడుతూవుండు. నే 'షా' వారిని కలుసుకుంటాను.

(మిరాజ్ వెళ్లిపోయినాడు.)

మీ—హీరా! నా కొక్కమార్గం కనబడుతూంది.

హీ—చెప్పండి.

మీ—ను వ్వన్యథా తలంచవద్దు. నేను నీ పాణిగ్రహణం చేసినాను. అదే యుక్తమేమో?

హీరా—(చిరునవ్వుతో తల వంచుకొన్నది.)

మీ—నీ కంగీకారమని నీ చిరునవ్వే చెబుతూంది హీరా. (ఆమెచేతిని స్పృశించుతున్నాడు.)

(నాదిర్‌షా చిన్నకుమారుడు రిజాకులీ వచ్చినాడు. అతని వయస్సు యిరువదిరెండు సంవత్సరాలు.)

రిజా—అన్నా!

మీ—ఏమి?

రిజా—మిరాజ్ నీమైని నేరాలు నాన్నగారితో చెపుతున్నాడు... నేను మిరాజ్‌ను ఎదిరించినాను. మిరాజ్‌కు నామైని కోపం వచ్చింది. నాన్నగారు నన్ను వారించినారు. లేకుంటే యీరాత్రి మిరాజ్‌ను తుపాకితో పేల్చివేసి వుందును. (సంశయించి హీరాను చూస్తూ) వా రెవరు?

మీ—(నవ్వుతూ) వీరా? వీరు మీ వదినగారు.

రిజా—(తలవంచి హీరాకు నమస్కరించుతూ) ఖుదా బంద్.

## దృశ్యము—౩.

(సాయంకాలము. సూర్యాస్తమయ మవుతూవున్నది. ఢిల్లీ కోటలో సుందరమయిన మస్‌జిద్. మస్జిద్ శిఖరాలు బంగరు సూర్యరశ్మిలో ధగధగ మెరుస్తున్నది. మస్జిద్‌దగ్గరకు మీర్జా, రిజా, హీరా వచ్చి మెట్లెక్కుతున్నారు. మిరాజ్ మెట్లు దిగుతున్నాడు.)

రిజా—(వెటకారముగ) ఓహో! మిరాజ్! నేడు అల్లా ధన్యుడయినాడు.

మిరాజ్—ఎందుకు?

రిజా—తమరు ప్రార్థనకు మస్జిద్‌కు రావడంవలన.

మిరాజ్—నేను ప్రార్థన చెయ్యడానికి క్కడకు రాలేదు. నిజానికి కోసరమై వచ్చాను!

రిజా—అచ్చా! అలాగచెప్పండి. లేకుంటేయిదేమిటీ వింత మిరాజ్‌వా రీరోజు యిక్కడకు రావడమేమని మేమందరమూ ఆశ్చర్యపోతున్నాము.

(మీర్జా, హీరా కిలకిల నవ్వినారు.)

మిరాజ్—(కోపంగా) అవును నావవల్ల మీకు ఆశ్చర్యంగానే వుంటుంది.

రిజా—కోపగించకండి మిరాజ్! అవును గాని మరి ఆరోజు మామీర్జాదాదామీదనూ, మావదినగారి మీదనూ నాన్నగారితో ఏవో రహస్యాలు చెప్పినారే వాటిసంగతి ఏమయినట్టు?

మిరాజ్—రిజా! నన్నవమానించుతున్నావు.

రిజా—అబ్బే! లేదండి. విషయం అడుగుతున్నాను. అంతే.

మిరాజ్—(ఉగ్రంగా) తెలుసుకుంటువు గాని, తెలుసుకుందువు గాని (చరచర వెళ్లిపోయినాడు.)

మీర్జా—రిజా! వాడితో విరోధంమంచిది కాదు నాయనా!

రిజా—ఎప్పుడో వొకప్పుడు యీపరమ నాస్తికుణ్ణి పేల్చి చంపకపోతానా ?

హీరా—అత నంత క్రూరుడా ?

రిజా-వాడు వనమృగం. అరబ్బీరాత్రులు కథలు చదివినారా వదినగారూ మీరు.

హీరా-చదివినానండి. ఎందు కావిషయం?

రిజా—ఆకథల్లో వస్తారు చూశారూ రాక్షసులు వాళ్ల యీమిరాజ్ కంటె వెయ్యి రెట్లు నయం.

మీర్జా—పరమ దురాత్ముడు వాడు.

హీరా—అటువంటిమనిషిని షావా రెందు కు చేరదీసినారో !

రిజా—మా నాన్నగారి దవొక విచిత్ర స్వభావం. ఈ మిరాజ్ మీద ఆయన కమిత విశ్వాసం. వాడివాక్యమే ఆయనకు ఖొరాన్ సిద్ధాంతం.

హీరా—పోనియ్యండి మరదిగారూ ! ప్రార్థనకువెళ్లుతూ నా స్త్రీకులననుసరించి మాటా డవ మెందుకూ.

మీర్జా—నిజమే.

రిజా—వదినగారూ ! రేపుకదా మాప్ర యాణం. మాతో మీరుకూడా వచ్చేస్తారు గదూ మాపెరిష్యా.

మీర్జా—(హాస్యం) రారు రిజా, ఇక్కడే వుండిపోతారు.

హీరా—నన్ను విడిచి వెళ్లిపోదా మను కుంటున్నారు కాబోలు.

మీర్జా—అల్లాఎదుట మిమ్మ వివాహం చేసుకొన్నానుకదా మిమ్మెలాగ విడిచివెళ్లి పోగలను ?

రిజా—ఈ భారతవర్షం కంటె మాపెరిష్యా ఎన్నివేలరెట్లు సుందరంగా వుంటుందో చూదురుగాని.

రిజా—రేపటిరాత్రి మనం బయలుదేరాలని నాన్నగారి హుకుం. ఒంటెలమీద కూర్చుండి హాయిగా రాత్రి నక్షత్రాలక్రింద ప్రయాణం చెయ్యడం ఎంత చక్కగావుంటుంది. ఏమంటావు అన్నా ?

మీర్జా—మీ వదినగారికి మంచిమంచికథలు చెప్పేదువుగాని.

రిజా—చూడండి వదినగారూ హిమాలయ పర్వతాల సందులలోనుంచి మనం వెళ్లేటప్పుడెంతవిచిత్రంగా వుంటుందనుకున్నారు.

హీరా—రెక్కలుకట్టుకుని యెంతవేగం పెరిష్యాలోనికి ఎగిరిపడదామా అని వుంది నాకు. సాదీ, నిజామీ, కవుల గ్రంథాలుచదువుతూ మునుపు పెరిష్యాగులాబితోటల సౌందర్యాన్ని వూహించుకునేదానను.

మీర్జా—గులాబి తోటలు. ద్రాక్షపాదలు...చక్కటి బుల్బుల్ పక్షులు...

రిజా—తోటల్లో తిరుగుతూ బుల్బుల్ పక్షితో కలసి వదినెగారుకూడా పాడవాలి.

మీర్జా—(నవ్వుతున్నాడు.)

(మస్‌జిద్‌లోనుండి ప్రార్థనధ్వని 'అల్లా' అని వినబడుతున్నది.)

హీరా—ప్రార్థనవేళ అయింది.

రిజా—అల్లా దగ్గర శెలవుపుచ్చుకుందాము.

మీర్జా—వద్దువద్దు. ఏ దేశంలోనయినా సరే యెక్కడనయినాసరే అల్లా మనతోనే వుంటాడు.

## దృశ్యము-3.

(ఉషస్సు, ఢిల్లీ వెలుపల షాలిమార్ ఉద్యానంలో నాదిర్‌షా మిరాజ్‌తో కలసి తిరుగుతున్నాడు. నాదిర్‌షా ప్రార్థనాసమయపు దుస్తులు ధరించి చేతులో జపమాల త్రిప్పుతున్నాడు.)

మిరాజ్—జహాపనా !

నాదిర్ షా—(వినిపించుకొనడు.)

(ఎదురుగా పొగ, పొగలో 'తామాస్ప' ఆకృతి.)

మి—(భయపడి) జహాపనా! జహాపనా!

నా-(ఆకృతినిచూచి) మిరాజ్! తుపాకి.

మి-(తుపాకిని యిచ్చినాడు) తామాస్ప.

నా—(తామాస్ప ఆకృతికిసరిచేసి తుపాకిని ప్రేల్చినాడు.)

తా. ఆకృతి—ఏమి నాదిర్! నీతుపాకిగుండు ఏమయింది?

నా—నువ్వు చావలేదా ?

తా. ఆ.—నామానవదేహాన్ని మిరాజ్ చేత నువ్వు చంపించినావు.

మి—తామాస్ప దెయ్యమయినాడు జహాపనా! ఇది తామాస్ప దెయ్యం.

తా. ఆ.—మిరాజ్ ! నేను మిమ్మ హింసించడానికి రాలేదు.

నా—నురెందుకు వచ్చినావు ?

తా. ఆ.—మిరాజ్! మీరు యిద్దరూ... మీ సైన్యాలూ కూడా యిపుడు నన్ను హింసించలేవు.

మి—ముందు షావారి ప్రశ్నకు జవాబు చెప్పు !

తా. ఆకృతి—అతడు మీకు 'షా', నాకు కాదు. నా'షా' ఆ దయామయుడు 'అల్లా'.

మిరాజ్—అల్లా అంటూ వొకడున్నాడూ. అతన్ని నువ్వు చూశావా ?

తా. ఆకృతి—అల్లా వొక్కడే వున్నాడు. నేనతన్ని యింకా చూడలేదు. ఇసాఫాన్ యింకా కూలిపోలేదు. నాదిర్‌షా యింకా నాశనంకాలేదు. ఆ తరవాత అల్లాను చూస్తాను.

నాదిర్—(ఉగ్రంగా) పిశాచీ! ఫిరంగి పేల్చి నిన్ను...

తా. ఆకృతి— నీ ఫిరంగులు నన్నేమీ చెయ్యలేవు నాదిర్, నామీద ఆగ్రహమెందుకు, ఇసాఫాన్ పునర్నిర్మించి పదేళ్లునిండిన పహోరోజున నువ్వూ ఆ పట్టణమూ ఒకేసారి ఒకేసారి...నాశనం తప్పదు...

మిరాజ్—దెయ్యాలమాటలు నమ్మతగ్గవి కావు జహాపనా !

నాదిర్ షా—తామాస్ప ! నువ్వు రాజద్రోహంగా మాటాడుతున్నావు.

తామాస్పఆకృతి—(వికావికనవ్వి) రాజెవరు.. ఓ దిగ్విజయీ ! అనేకదేశాలు జయించిన నువ్వు రాజువా చక్రవర్తివా? పైనున్నవాడు వాడూ రాజు...నీకు జ్ఞాపకం చేస్తున్నాను...సరిగా ఇసాఫాన్ కట్టించిన పహోషేట పహోరోజున, మరిచిపోవకుమా ఇసాఫాన్‌ను పూర్వం ముల్లాలగోరీలమీద మంత్రాలతో కట్టించినారని మా నాయనగారు చెప్పే

వారు. ఈ పిశాచలోకంలోనుంచి ఎంతపైకి పైలోకాలకు చూచిన మాతండ్రిగారూ తాత గారూ కనబడరు కాని వారిమాటలు ఇసాఫాన్‌తో నాదిర్‌షా సరిసరి అని వినబడు తూనే వున్నాయి. జాగ్రత్త! నాదిర్ మన మంతా సర్వనాశనమైనాక ఒక్క లోకంలో కలుసుకొందాము.

(తామాస్ప్ఆకృతి పొగలో కలిసిపోయి మాయమైపోయినది.)

నా—మిరాజ్! తుపాకిలో గుండు మంచిది కాదా?

మి—మంచిదే జహాపనా. కాని దెయ్యాలకి దెబ్బలుతగలవు.

నా—దెయ్యాలు మూర్ఖత్వం.

మి—మరి మనం కళ్లారా చూశాంకదా!

నా—ఇది యీమహమ్మన్‌షా చేయించిన కుట్రయేమో!

మి—దెయ్యాలున్నాయనే నమ్మకం నాకు కుదిరింది జహాపనా! అల్లాకూడా వొకసారి కనబడితే అతనుకూడా వున్నాడనినమ్మి రోజూ నమాజ్ చేస్తాను.

నా—ఈదేశంలో బ్రాహ్మణులని ఒక తెగ వున్నారట. వాళ్లు మాయలూ మంత్రాలూ చేసి యిటువంటివాటిని సృష్టించి మోసగిందుతారని విన్నాను.

(గాలిలో పొగలు. ఆపొగలలో వేల కొలది ఆకృతులూ, పురుషులూ, స్త్రీలూకూడా. ఆ ఆకృతులలో వృద్ధుడు ముల్లాబక్షీ ఆకృతి. కూడా గలదు)

నా—ఎవరు మీరు?

ఆకృతులు—'షా' వారి ప్రజలం.

మి—నాదిర్‌షా వారి ప్రజలా?

ఆకృతులు—కాదు తామాస్ప్‌షావారి అనుచరులం.

మి—పెర్షియానుంచి వచ్చినారా?

ఆ—బ్రదికివున్నప్పుడు మాదేశం పెర్షియా ఇప్పుడన్ని దేశాలూ మావే.

మి—ఎందుకు వచ్చినారు మీరు.

ఆ—నాశనం! నాశనం నాదిర్‌కులీ నాశనం!

(పాడుతూపాడుతూ పొగలో కలిసి కరిగి మాయమైపోయినవి.)

## అంకము-3. దేశము: పెర్షియా

## దృశ్యము-౧. కాలము: ౧౭౪౬

(రాత్రి ఇసాఫాన్‌పట్టణంలో 'షా' భవనములలో శయనమందిరములో నాదిర్‌షా నిద్రబోతున్నాడు. దీపాలు వెలుగుతున్నవి. ఇద్దరుఘాతకులు తుపాకులు పట్టుకొనివచ్చినారు.)

ఒకఘాతకుడు—షా నిద్రబోతున్నాడు.

రెండవవాడు—మెల్లగా మాటాడు.

ఒకటవవాడు—ఇదే మంచి అదను.

(తుపాకులు సరిచేసుకొంటున్నారు.)

రెండవవాడు—బయట ఎవరిదో అడుగుల చప్పుడు.

ఒకటవవాడు—(బయటికి చూచి) త్వరగా పని కానియ్యాలి. 'షా'చిన్నకుమారుడు రిజాకులీ యిటే వస్తున్నాడు.

(ఇద్దరూ ఒక్కసారిగా నాదిర్‌షాకి గురిచేసి తుపాకులు పేల్చి పారిపోయినారు.)

నా—(దిగ్గన లేచినాడు. అతని భుజములోనికి గుండు పోయినది.)

ఎవ రది! మిరాజ్! మిరాజ్!

నౌఖరు—జహాపనా!

నా—మిరాజ్‌ను పిలుచుకురా.

నౌఖరు—ఖుదాబంద్ (పోయినాడు.)

(మిరాజ్ రిజాకులీ వచ్చినారు.)

రిజా—(తండ్రిభుజమునుండి కారుతున్న రక్తం చూచి) నాన్నగారూ! ఇదేమి టిదీ? రక్తం...

మి—పాపం...రిజా...నీవేమి యెరగవు కదూ?

రిజా—మిరాజ్ నీ అభిప్రాయమేమిటి?

మి—ఎవ రక్కడ?

నా—జో హుకుం.

మి—అదర్వాజాదగ్గర పడివున్న తుపాకి తీసుకురా?

నా—(వెళ్లిపోయినాడు.)

మి—ఎవ రక్కడ?

(మరొకనౌఖరు వచ్చినాడు.)

మి—వైద్యులను రావించు.

నాదిర్‌షా—వద్దు.ముందీద్రోహియెవరో తెలియవలె. (నౌఖరుతో) నువ్వు పో!

నౌ—ఖుదాబంద్(నిష్క్రమించినాడు.)

(మొదటినౌఖరు తుపాకి పట్టుకొని వచ్చినాడు.)

మి—(తుపాకితీసుకొని) జహాపనా! దీని మీద యీ పేరెవరిదో చిత్తగించండి.

నా—(తుపాకిమీద పేరు జూచి) 'రిజాకులీ' రిజా! ఏమంటావు?

రిజా—ఈతుపాకి నాదే.

నా—నీదేనా? నువ్వు ద్రోహివికావా?

మి—ప్రజలకుట్ర జహాపనాయిది. వారంతా మొఘాన్ మైదానంలో సమావేశమై తమ్ము చంపడానికి కుట్రలుచేస్తున్నట్టు వార్త వచ్చింది. తమదర్శనం కోసమని వస్తున్నాను. ఇంతలో తుపాకిధ్వని. చేతులో తుపాకిపట్టుకొని రిజా. నాకళ్లను నేనే నమ్మలేక పోయినాను. కన్నతండ్రిని చంపడానికి సాహసించే కొడుకు లోకంలో ఎక్కడయినా వుంటాడా?

నా—ఎవ రది?

నౌ—ఖుదాబంద్.

నా—రెండు యినపకమ్ములు బాగా కాల్చి తీసుకురా పో!

నౌ—ఖుదాబంద్(నిష్క్రమించినాడు.)

మిరాజ్—జహాపనా! రాజద్రోహులు ఎక్కువయిపోతున్నారు. వారిని కఠినంగా శిక్షిస్తేనేగాని దేశంలో శాంతి వుండదు.

రిజా—మిరాజ్! ఇదంతా నీకుట్ర. నా తుపాకి దొంగిలించి నువ్వే ఎవరిచేతనో నాయనగారిని చంపించే యేర్పాటులు చేశావు.

మిరాజ్—(నవ్వి) అవును రిజా! నీకు పితృభక్తి ఎక్కువ. నాకు ప్రభుభక్తి లేదు.

(నౌఖరు భగభగమండుతూ ఎఱ్ఱగా కాలిన రెండు యినపకమ్మలు పట్టుకువచ్చినాడు.)

నాదిర్ షా—రిజా! నువ్వుచేసిన రాజద్రోహానికి శిక్షగా నీకళ్లు కాల్పించివేస్తున్నాను.

రిజా—నాన్నగారూ! నాన్నగారూ! నేను ద్రోహినికాను...తొందరపడకండి...

నా—(నౌఖరుతో) ఆ యినపకమ్మలు వాకన్నులలో వుంచండి...

నౌఖరు—(సంశయించుతున్నాడు.)

రిజా—నేను ద్రోహినికాను. అల్లా సాక్షిగా చెబుతున్నాను. ఈ కుట్ర నే నెరగను.

నా—నే నెరుగుదును. నువ్వు ద్రోహివి. శిక్ష తప్పదు. (నౌఖరుతో) కానియ్యి!

రిజా—(కాలుతున్న యినపకమ్మలను చూస్తూ) అబ్బా! ఆ కాలి భగభగమంటున్న యినపకమ్మలతో నా కన్నులు పొడిచివేస్తారా?

మి—ఈదేశంలో రాజద్రోహులకు దేశిక్ష!

రిజా—రాజద్రోహులను శిక్షించండి. కాని నిరపరాధులను శిక్షించడమా? నాన్నగారూ! (దీనంగా పిలిచినాడు.)

నా—నేను రాజును నీవు ద్రోహివి. కాని నేను నీకిప్పుడు తండ్రినిగాను. ఈ శిక్షను నీవు అనుభవించి తీరవలసిందే.

రిజా—నాకు తప్పదా?

నా—తప్పదు.

రిజా—సరే. నాకు రెండురోజులు గడువు ఇవ్వండి. ఈలోగా అమ్మనూ అన్ననూ వదిననూ ఆఖరి సారి రూపాలు దృఢంగా నామనస్సులో నిలిచిపోయేటట్లు చూసివేస్తాను. గులాబి తోటలనూ ప్రభాత సాయంప్రకృతినీ రాత్రి ఆకాశమూ నక్షత్రాలకాంతినీ చంద్రుని వెన్నెలనూ కడసారి తుదిసారి చూచివేస్తాను. ఆ తర్వాత యీ రెండుకన్నులూ పొడిపించె య్యండి. శాశ్వతాంధకారంలో పడి పోతాను.

నా—వీలులేదు.

మి—పావారు ధర్మమూర్తులు.

రిజా—పోనీయండి రేపటి వుదయంవరకయినా...

నా—వీలులేదు.

రిజా—అయితే అమ్మనూ అన్ననూ చూచివస్తాను.

నా—వెంటనే. (నౌఖరుతో) కానియ్యి!

(నౌఖరు కాలుతున్న యినపకమ్మలను రిజాకులీకన్నులలో పొడుస్తున్నాడు.)

రిజా—అల్లా! అల్లా! అల్లా.

(మరణబాధలోవలె గావుకేకలువైచుచుండును. కాలే యినపకమ్మలు అతనికళ్లలోనికి దూసుకుపోయినవి.)

## దృశ్యము-౨.

(అర్ధరాత్రే గులాబితోట, గులాబిపొదలు విరియబూచినవి. హీరా మిర్జా తోటలో తిరుగుతున్నారు.)

హీరా—నాకీరాత్రి యీతోటలోతిరగాలనిలేదు.

మిర్జా—ఎందుచేత?

హీరా—ఎందుచేతనో చెప్పలేను, కాని మనస్సంతా ఆందోళనగావుంది. మామమ్మమ్మ నాలుగు సంవత్సరాలకిందట చచ్చిపోయినాడు. ఆ చచ్చిపోయిన రాత్రికూడా నా మనస్సిలాగునే వుంది.

మిర్జా—నా హృదయాన్ని నీమాటలు ప్రతిధ్వనిస్తున్నాయి. చెప్పలేని బాధ యీ వుదయంనుంచి నామనస్సులో ప్రారంభమయింది. ఈరాత్రి తుపానుగాలివలె విజృంభించింది.

(అంధుడు రిజాకులీ ఒకబానిసచేతిని పట్టుకొని తోటలోనికి వస్తున్నాడు.)

రిజా—అన్నా! అన్నా! ఎక్కడున్నావు?

హీరా—ఎవరది! రిజా!

మిర్జా—నాయనా, రిజా!

రిజా—అన్నా! ఎక్కడున్నావు. ఈ అంధుడు నిన్ను చూడలేడు.

హీరా—రిజా! రిజా!

మిర్జా—నాయనా రిజా!

(హీరా మిర్జా రిజాను కౌగలించుకొన్నారు.)

రిజా—వదినగారూ! మరి నేను మీకెపెరిస్యా శోభను చూపించలేను. నాకంతా చీకటి. లోకమంతా అంధకారం.

మిర్జా—ఏమిటీ ఘోరం? ఏమిటీదౌర్జన్యం? నీకన్నులు పొడిచిన పరమపాతకి ఎవడు.

రిజా—మననాన్నగారు.

హీరా—మానాన్నగారా!

రిజా—నేను రాజద్రోహినట.

మిర్జా—అమిరాజ్ కల్పనే కదూ....

రిజా—అవునన్నా...అన్నా! అమ్మను కూడా వొకసారి చూస్తాను...లేదులేదు... నేనిక చూసేదేమిటి. అమ్మదగ్గరకు నన్ను తీసుకు వెళ్లవూ.?

మిర్జా—నాన్న గారేనా?...అతనికి మతి పోయినది. హృదయం చచ్చింది. రాతుకుక్షైపోయినాడు...

హీరా—(వెక్కి వెక్కి యేడుస్తూ ఉన్నది.)

రిజా—ఎవరో ఏడుస్తున్నట్లుంది. ఈ నిర్భాగ్యుడికోసం ఎవరుమాత్రం కంటతడి యెందుకు పెట్టాలి?

హీరా—(ఇంకాయేడుస్తున్నది.)

రిజా—వదినగారి గొంతుకవలెవుంది. వదినగారూ! ఊరుకోనండి.

మిర్జా—రిజా! నేనింతకాలం యెందుకు బ్రదికివున్నానా అని విచారిస్తున్నాను. ఈ ఘోరాలు చూడకముందే చనిపోతే యెంత బాగుండును.

రిజా—అలాగనకు అన్నా! నన్ను అమ్మదగ్గరకు తీసుకు పోవూ!

(రిజాకుడిచేతిని హీరాఎడమచేతిని మిర్జా పట్టుకొని అతనిని తీసుకువెళ్లు తున్నారు. చెట్టుమీద బుల్బుల్ ఏడుస్తున్నది)

## దృశ్యము—౩.

(రాత్రి. చీకటి. ముందుఫిరంగిబండ్లు వాటి వెనక ప్రజా నడుస్తున్నారు. ప్రజలకు ముల్లాలు నాయకులుగా ఉన్నారు.)

ఒకముల్లా— ఈ నాదిర్ షా ఘోరాలు యీ రాత్రితో సరి.

మరొకముల్లా—ముల్లాబక్షీ ని చంపినపాతకి యీ రాత్రి చావాలి. వాడిరాజ్యం కూలి పోవాలి.

ప్రజలు—(గగ్గోలుగా) కూలిపోవాలి!

ఒకముల్లా—గోలచెయ్యకండి! నిదానంగా నిశ్శబ్దంగా పనికావాలి. ఈ నరహంతకుడయిన నాదిర్ కి యీ రాత్రి సర్వనాశనం తప్పదు.

మరొకముల్లా — ఆ 'షా'గొంతు కొరికి రక్తం పీల్చి తాగాలని వుంది నాకు.

ఒకముల్లా—అ పండి! ఫిరంగిబండ్లు!! అవుగో నరకద్వారాలు.

వేరొకముల్లా—'షా' భవనా లవుగో,

## దృశ్యము—౪.

(నాదిర్ షా శయనమందిరంలో జానుపత్తుడై ధ్యానం చేసుకొంటున్నాడు...ఆరాత్రే...నలుగురుముల్లాలు ఛురికలు పట్టుకొని లోపలికి వచ్చినారు.)

ఒకముల్లా—ఓ రక్తపాయీ!

ఇంకొకముల్లా—ఓ సైతాన్!

మరొకముల్లా—ఓ పిశాచీ!

నా—(కళ్లు తెరచి) ఎవరు మీరు?

ముల్లాలు—అల్లాదూతలం.

ఒకముల్లా—నేను యీపాతకి నెత్తురు త్రాగుతాను.

(నలుగురు ముల్లాలూ నాదిర్ షాకు నాలుగు పోట్లు పొడిచినారు.)

నాదిర్ షా--మీరెవరు? నాదిర్ షాపవిత్ర దేహంలో కత్తితో పొడవదలచినవారు మహా పవిత్రులై వుండాలి. షాను స్పృశించడానికే అర్హతలేని సామాన్యు లీకార్యం చెయ్యలేరు.

ముల్లాలు—మేము అల్లాదూతలం. నీకోసమని వచ్చాము.

నా-మీకందరకూ తలవంచి నమస్కరించుతున్నాను. అల్లా దయామయుడు. పరమ పావనులైన ముల్లాల హస్తాలతో నాకు మృత్యువును ప్రసాదించినాడు. ఓముల్లా! ఇంకా యిసాఫాన్ కూలిపోలేదు.

ఒకముల్లా—లేదు. ఇక కూలిపోతుంది.

నా—నాదిర్ షాతో పునర్నిర్మిత నగరం యిసాఫాన్ దానితో నాదిర్ షావంశం... సర్వనాశనం...తామాస్ప! నేను నీమాటలు నమ్ముతున్నాను.

ఒకముల్లా—తామాస్పను చంపించింది నువ్వేకదా!

నా—అవు నవును. దిగ్విజయి నాదిర్ షా యీ సకల ప్రపంచాన్ని జయించినాడు. స్వర్గలోకాన్ని జయించడానికి వెళ్లిపోతున్నాడు. (మృతి.)

## దృశ్యము-౫

(ఆరాత్రే భవనాలు కూలిపోతున్నవి. ఉండుండి మహోగ్రంగా ఫిరంగిధ్వనులు విన బడుతూ ఉన్నవి. భవనంలో మిర్జా హీరా, రిజా నిలుచున్నారు.)

మిర్జా— అదుగో మళ్లా ఫిరంగి!

హీ—ఆభవనం ఎలాగ కూలిపోతూందో!

రిజా—మనముగ్గురమూకూడా క్షణంలో చనిపోతాముకదూ?

మిర్జా—చావునుంచి తప్పుకొనే మార్గం కనబడదు.

రిజా—అన్నా! మనతండ్రిచేసిన పాతకాలఫలాలన్నీ మనం అనుభవించవలసివచ్చింది.

మిర్జా—మనతండ్రి ఋణాలు మనం తీర్చుకోవాలి. మనతండ్రి ఆస్తిని మన మనుభవించాలికదా!

హీరా—నేను హాయిగా చనిపోతాను. అబ్బ! అవుగో అగ్గిపిడుగులు.

రిజా—నాతండ్రిచేసిన పాపాలే ఆరూపాలు దాల్చి అగ్గిపిడుగులై మనమందిరాల మీద ఉరుకుతున్నాయి.

(ఫిరంగిధ్వని వినబడుతూ ఉన్నది.)

మిర్జా—సిరంగులగుం డ్లిక యిటువైపే వస్తున్నాయి.

రిజా—మరికొంతకాలం బ్రతికివుంటే మీర్విద్దరూ గులాబితోటలు సాయంసౌందర్యాలూ చూతురుగదా! అన్నా నావోటి అంధు లంతా బ్రదికివుండడంకంటె చనిపోవడమే మంచిదికాదూ?

మిర్జా—పాతకి రక్తానికి వారసులైన ప్రతివారూ కూడా చనిపోవడమే మంచిది.

హీరా—ఇంతచక్కటి భీకరదృశ్యాలు నేనెక్కడా చూడలేదు.

మిర్జా—మృత్యునర్తనంలోని సౌందర్యాన్ని చూస్తున్నావా హీరా?

హీరా—హిమాలయాలు సుందరప్రభాతాలు జ్యోత్స్నానిశలు గులాబితోటలు... ఏవీకూడా యీ భయంకరరాత్రి అంతసొగసుగా లేవు. ఇక మన మెలాగూ చనిపోతాము గనుక హాయిగా భగవంతుని గురించి గానమూ నృత్యమూ చేస్తూ చనిపోదాము.

(ముగ్గురూ ఒకరిచేతు లొకరు పట్టుకొని చక్రాకృతిలో ఉన్నారు.)

ముగ్గురూ

(పాట)

దయాసాగరా
త్రిలోకనాథా
అఖిలాధారా
అల్లా! అల్లా!

(ఆనందంగా పైపాట పాడుతూ నృత్యం చేస్తున్నారు. ఫిరంగిధ్వని, అగ్గిపిడుగులు వచ్చి పడినవి. భవనము కూలిపోయినది. రాతిపలకలు పైనపడి ముగ్గురూ చచ్చిపడిపోయినారు అక్కడ భవనము లేదు. నల్లనిఆకాశము తెల్లని నక్షత్రాలూ కనబడుతూ ఉన్నవి.)

## దృశ్యము—౬.

(రాత్రి గ్రుడ్డివెన్నెల. పాడుపడిన ఇసాఫాన్ పట్టణంలో ఒకవీధి. నిర్జనంగా ఉన్నది.

...స్తున్నాను. పాడుపడినయింటిలో నుంచి వృద్ధు... ఖామినా వచ్చినది. ఎదురుగాపాగ. పా... తామాస్ప ఆకృతి )

తా-ఆ—నాతండ్రి తాతలమాట ఖోరాన్ ...శం. ఈ ఇసాఫాన్ కూలిపోయింది. ...ర్ నశించాడు. నావంశం నాదిర్ వంశం ...నమైనాయి.

ఖామినా—నాయనా తామాస్ప! నువ్వేనా ...డుతూవున్నావు. నాకు దృష్టి సరిగా ...పించదు.

తామాస్ప ఆకృతి—నేనేనమ్మా.

ఖామినా—నాతండ్రీ! నానాయనా! ...నన్ను కౌగలించుకో!

తా-ఆ...వీాగు మానవులు. మిమ్మల్ని నేను ముట్టుకోలేనమ్మా!

ఖా—నాయనా! నిన్నా నాదిర్ చంపించి వెయ్యలేదుగా?

తా-ఆ—చంపించివేశినాడు.

ఖా--మరి నువ్వెలాగ మాటాడుతున్నావు?

తా-ఆ—ఇంకో లోకంలో నుంచి మాటాడుతున్నాను.

ఖా—నాదిర్ కూడా నీలోకంలోనికే వచ్చినాడా?

తా-ఆ—లేదమ్మా.

ఖా—వాడు పాతకి నరకంలోనికి పోయి వుంటాడు.

తా-ఆ—నరకంలోనికి ఎన్నడూ వెళ్ల డు. అతడు అల్లాదగ్గరకు రెక్కలు గట్టుకొని యెగిరిపోయినాడు. నేనూ అక్కడికే పోతు న్నాను.

ఖా—నాయనా! నాదిర్ వంటి పాపా త్ములు కూడా అల్లాదగ్గరకే వెళ్లుతారా?

తా-ఆ--అల్లాసృష్టిలో పాపాత్ములంటూ ఎవ్వరూ లేరమ్మా! సకలజీవులూ అల్లా చేతులో యంత్రమాత్రులు. వెడుతున్నాను అమ్మా వెడుతున్నాను.

(తామాస్ప ఆకృతి మాయమయిపోయింది. "తామాస్ప! తామాస్ప!" అని గట్టిగా పిలుస్తూ ఖామినా అనిర్జనమైన వీధులో తిరు గుతూ ఉన్నది.)

---

# సీ త య్య

ఒక ఆలాపన

శ్రీరంగం
శ్రీనివాసరావు

దారిచెయ్యండి. కథానాయకుడికి దారి చెయ్యండి. సీతయ్య వస్తున్నాడు. దారి చెయ్యండి. అమ్మయ్య! ఇక ప్రపంచం తనకు సీతయ్యకథ తెలియదని మూలగడానికి వీలులేదు. అనేకప్రయాసల కోర్చి, ఎన్నో సంవత్సరాలు ఏకదీక్షగా సీతయ్యజీవితం గురించి పరిశోధనలు చేసి తుదకు అసలుకథ చెప్పగలుగు తున్నాను. ఇదివరకు పుకారుగా, చూచాయగా ఇక్కడో చిన్న సంగతీ, అక్కడో చిన్నరహస్యం, ఎవరో అనుకున్న మాటలూ, ఎక్కడో చదివిన వార్తలూ మాత్రమే లోకానికి తెలుసును. ఇక మరి భయం లేదు. సీతయ్యను గురించిన భోగట్టాయావత్తూ బాగుచేశాను. సరే. కొంత కష్టపడవలసి వస్తేనేం? అదో లెక్కలోనిది కాదు. లోకానికి నిజం తెలియజెయ్యగలుగుతున్నాను కదా! అందుకు లోకం హర్షిస్తే అదే నాబహుమానం.

ఈ సీతయ్య! ఇతగాడి సంగతి నాకు తప్ప మరెవ్వరికీ పూర్తిగా తెలియదన్న కారణంవల్ల నాకు కాస్త గర్వం కలగడం సహజమే. ఇన్నాళ్లకు నేనొక విషయంగురించి పరిపూర్ణజ్ఞానంతో మాట్లాడగలుగుతున్నాను. దీన్నెవరూ కాదనలేరు. నామాటే శిలాక్షరం; వేదవాక్యం. సీతయ్యసంగతి మాట్లాడుతున్నంతసేపు నేనొక్కణ్నే జ్ఞానిని. మిగిలినవాళ్లంతా నాదగ్గరకు రావాలి.

సీతయ్యగురించి నాకంటెఎక్కువ తెలిసినవాళ్లెవరూ లేకపోవడంచేత నే నేమిచెప్పినా కిక్కురుమనకుండా మీరు నమ్మితీరాలి. అయితే మీరు నమ్ముతారుకదా అని నాయిష్టంవచ్చి నన్ని అబద్ధాలు గుచ్చెత్తి మీముందు పొయ్యవలసినవాణ్ని కాను. నేను వ్రాస్తున్నదానిలో కాస్తైనా అబద్ధం ఉన్నట్లు మీకు ఆచోకీ దొరికిందంటే నాశిల్పమే భగ్నమయిపోయిందన్నమాట. శిల్పంవిషయమై నేను చాలాజాగ్రత్త తీసుకుంటానని మీకు వేరేచెప్పాలా? అందువల్ల నేను తాటిమీద నడుస్తున్నట్లుగా, అసిధారావ్రతంగా సంచరించాలి.

ఈ సీతయ్య! వీడి పరిపూర్ణచిత్రం మీముందు ఉంచాలనే ఈ వ్రాతకు ఉపక్రమించాను. నేను చిత్రకారుణ్ణి. అయితే వర్ణలేపనంతో కాదు నాప్రసక్తి. 'వర్ణ' లేపనంతో. అనవసరంగా ఒక్క రేఖగాని ఒక్క ఊర్పుగాని వ్యయంచేస్తే నాశిల్పం ధ్వంసం అవుతుందని నాకు తెలుసు. కాని పాటగాడు సంగీతం అందుకునే ముందు రసావస్థపొలిమేరలలో కూనిరాగంతో తచ్చాడుతూ ఉంటాడు. ఆత్మహత్య చేసుకునేవాడు నీళ్లలో పడడానికి ముందు ఒడ్డున పచారు చేస్తాడు. ప్రేయసీప్రియులు... సర్లే. ఉదాహరణలతో మిమ్మల్ని విసిగించను. అన్నీ మీకు తెలిసినవేకదా!

సీతయ్య సంగతి ఒక్కటే మీకు తెలియదు. నే నంతా చెప్పిన తర్వాత మీ ఆక్షేపం 'ఓ, మాకు తెలుసు. ఫలానా చోట చూశాం. వీడు మాకు పరిచితుడే!' అంటారు. కాని నికరంగా ఏదీ నేను చెప్పనంతసేపు మీఆదుర్దా అరికట్టుకొంటున్నాను. అదీ కాక సీరియస్‌గా కథ చెప్పుతున్నానని కొంటూ పాఠకుణ్ణి మరిచిపోయే కథకుడు ఎన్నటికీ క్షంతవ్యుడు కాడు. ఎంతసేపూ తనపాత్రల వ్యవహారాలలో మునిగిపోయి ఇతడు తనకు కొందరు పాఠకు లుంటారనీ వారిని కొంచెం గిలిగింతపరచడం అవసరమనీ మరిచిపోతాడు. అదే నా కిష్టం లేదు. అవసరమైతే ఎంత ముఖ్యపాత్రనైనా వదలి పాఠకుని ఔత్సుక్యాన్ని ఆకర్షించుకోవాలి.

ఇప్పుడు సీతయ్యగురించి నిజం మీకు తెలిసిందా? స్వయంగా చెప్పడానికేమీ లేనప్పుడూ, బహుశా ఇష్టం లేనప్పుడూ నేనుచేసే తంత్రం. సీతయ్య నాచేతిలో యంత్రం. సంభాషణ తిరగడానికి 'కీ' సీతయ్య. సీతయ్య నా హార్మోనియం పెట్టె. కేరమ్ బల్ల.

ఇంకా స్పష్టంగా చెప్పాలంటే సీతయ్యంటూ ఎవడూ ఒకవ్యక్తి లేడండీ! ఇందాకా పరిశోధనలనీ ప్రయాసలనీ అన్నానే అవన్నీ కథారచనకు నేను పడ్డ పాట్లుమాత్రమే. ఓ గొప్ప కథానాయకుణ్ణి సృష్టించు

...మని నేను చాలా యత్నించిన ...మాట వాస్తవమే. ఇంత సేపూ ...తయ్య ఒక యథార్థవ్యక్తి అనీ ...డిగురించి యావత్తూ నాకు ...తెలుసుననీ మీలో ఒక అభిప్రాయం ...కలిగించాను. మరి నేను సృష్టించే ...పాత్రగురించి నాకంటె ఎక్కువ ...వరికి తెలుస్తుంది చెప్పండి? ఇక ...వ్యక్తుల యాథార్థ్యం! దీనివిషయమై ...మీరు ఆట్టే పట్టింపుచేస్తే మీలో ...వేదాంతం చాలా తక్కువని బుజువై ...పోతుంది.

ఇది కేవలం మోసం అని మీరు ...అనబడవచ్చును. పైగా 'సీతయ్య'ను ...గురించి తెలుసుకుందామని మే మీ ...మాట త్రిప్పాముగాని నీ ఉపన్యాసం ...వినడానికా? అని మీ రడగవచ్చు. ...సీతయ్య గురించి తెలుసుకోకపోతే ...మాకేం లోపం వచ్చిం దని నే ...డుగుతే?

కేవలా కుతంత్రాలతో మిమ్మ ...ల్ని నిలబెడుతున్నానుకాదూ? పాపం! ... అమూల్యమైన కాలం వ్యర్థ ...పుచ్చుతున్నాను. లేకుంటే ఈ లో ...పున మీరు మరేదో చదువుకొని ...వుందురు. పద్యం, విమర్శ, తమా ...షాలు, వార్తలు, ఏవో! ఏవో! ...సృటికే మీకు కొంత విసుగుపుట్టి ...ఉండాలున తర్వాతిపుటలకు పోదా ...మని ఉంటుంది కాని 'సీతయ్యగురించి ...పూర్తిగా తెలుసుకొని మరీపోదాం, ...ఎలాగూ రానే వచ్చాం' అనే ఆస్థ ...ఉన్నా ఉంటుంది. కల్పితవ్యక్తి అయితేనేం? కథ బాగుంటే చాలు నని నిలబడతారు.

కాని ఇంతట్లో సీతయ్య గురించి చెబుతానని మీ రనుకుంటే చాలా పొరపాటుపడ్డవా ళ్లవుతారు. నిజానికి నేను సీతయ్య వ్యవహారం వెనక పెడుతున్నానంటే దానికి కొంత కారణం లేకపోలేదు. కథంతా నాలుగుముక్కల్లో తెమిల్చి 'అయిపోయింది' అని నేను ఆఫీసు మూసి వెయ్యవచ్చును. అదో కష్టమైన పని కాదుకూడా! కాని నే నలా చెయ్యను. నా కథకు నాయకపదవికి నోచుకున్న నాడు చాలా అదృష్టవంతుడు. ఒకంతకుగాని బైటపడడు. అలా, అలా, నాపాఠకులలో ఔత్సుక్యం పెంపొందించి తంటాలు పెడతాడు. ఈ ఔత్సుక్యం విసుగుదలగా మారి కొందరు పాఠకులు నన్ను తిట్టుకుంటున్నా కొంతమందిమాత్రం తెల్లవార్లూ జాగరంచేసినా ఈసంగతేదో తేల్చుకుందామని కూర్చుంటారు. వాళ్లూ అసలైన ఆంధ్రులు! అలాంటి వాళ్లే దేశానికి కావాలి.

చూశారా, మరినే నెలాగ మిమ్మల్ని నిలుపగలుగుతున్నానో? ఈమాటు మీ దేశాభిమానం రెచ్చగొట్టుతున్నాను. ఇవన్నీ మామూలు పద్ధతులే అనుకొండి. కాని వీటికి మీరు లోబడిపోవడం మాత్రం ఆశ్చర్యం కాదూ?

ఇక నట్టే శాఖాచంక్రమణం చెయ్యక సీతయ్యమాట మొదలు పెడదామా అని ఉంది. కాని ఆతనికి ఆకారం ఇయ్యడంతోనే శాశ్వతంగా ఒక పోతవిగ్రహం అయిపోతాడు. అటువంటప్పుడు అన్ని విధాలా యోజించి సృష్టించబోయే బొమ్మకు రూపం కల్పించి ప్రాణం పొయ్యాలి. ఇతగాడు సాహిత్యంలో ప్రసిద్ధిపొందిన మహావ్యక్తులతో తుల తూగాలంటే అశ్రద్ధగా వెళ్లకూడదు. Falstaff, Don Quixote మొదలైన వాళ్లలాగు మనసీతయ్యను హాస్య వ్యక్తిని చేదామా అని ఒక ఆలోచన చేసినా చెయ్యొచ్చు. అదేమీ కష్టంలోని పనికాదు. అయితే తీరా ప్రారంభించివేస్తే తర్వాత మనస్సు మారిపోయి Hamlet, Othello మొదలైనవాళ్లలాగు వీడినొక Tragichero గా చేశానుకానే అని కించ కలుగుతుంది. అందువల్ల ఎంతమాత్రమూ తొందరపడిపోకూడదు.

మరోవిశేషం. చెప్పకేంగాని నేను వచనం వ్రాస్తున్నా నా హృదయాంతరంలో మట్టుకు కవిత్వం అంటే మహా అభిమానం. అందువల్ల ఈ సీతయ్యను Byronలో లాగ ఒక కావ్యనాయకుణ్ణిచేస్తే ఎలా ఉంటుందో అనిపించుతోంది. Don yuan, Childe Harold, Giaourల్లాగ, కాళిదాసు యక్షుడూ, మిల్టన్ సైతానూ, పెద్దన్నగారి ప్రవరుడూ, పాండురంగ కవి నిగమశర్మా వీళ్లలో ఎవరి లాగైనా బతికిపోయిఉండును. కాని సీతయ్య అని మగపేరు పెట్టకపోతే 'చింతామణి' 'సక్కుబాయి' 'బాల యోగిని' అంటూ మోతకల్పన కవ

కాశం ఉండును! తీరా ఇక విచారిస్తే లాభ మేమిటి? స్త్రీనాచకం అయిందా మరి. తిర్యగ్లోకంలోకీ, జడపదార్థాలలోకీకూడా భావనావిహారంచేస్తే మనం తేలడ మెలాగు?

అయితే సీతయ్య చాలా మొగ మాటపు మనిషి. గొప్పగొప్పవాళ్ల పక్క కూచోడానికి తాను అర్హుణ్ణి కానని ఎరుగును. అదీకాక వాళ్లంత వాళ్లు వాళ్లు, నా అంతవాణ్ణి నేను అనే స్వాభిమానం ఉన్నవాడు కూడాను. మరిన్నీ తాను పూనుకుంటే సులువుగా గొప్పవాణ్ణే కాగలననే రకంలోవాడు. ముఖ్యంగా ఎవరైనా గ్రంథకర్తకు తనజీవితం అప్పగించి నన్ను గొప్పవాణ్ణి చెయ్యవయ్యా అంటే అతనే చేస్తాడు తగుమాత్రం ఫీజుతో. గొప్పవాళ్లు కావడానికి ఈ కాలంలో అట్టే శ్రమపడవలసిన అవసరంకూడా లేదు. ఓపత్రికకు ఫోటో పంపించడం, మరోపత్రికకు వ్యాసం వ్రాయడం, ఓ ఊళ్లో ఉపన్యాసం ఇవ్వడం ఒక సమావేశానికి వెళ్లకపోతే జయం కోరుతూ సందేశం పంపడం, వెళితే సభకు వచ్చిన వారిలో ముఖ్యులు అనిపించుకోవడం ఎన్నో చవకపద్ధతు లున్నాయి. సీతయ్యా కివేమీ ఇష్టం లేకపోబట్టి కాని లేకపోతే అబ్బో, ఇంకా మీకు సీతయ్యసంగతి తెలియదు.

ఇక వాఙ్మయంలో శాశ్వతంగా జ్ఞాపకం ఉండవలసిన వ్యక్తికి ఫలానా లక్షణాలు ఉండాలని యెవ్వరూ నిర్దేశించలేదు. నాయకుల గురించిన విభాగాలలో మనవాళ్లు ధీరోదాత్తుడూ, ధీరలలితుడూ అంటూ కొన్ని లక్షణాలు చేసినా Victor Hugo సృష్టించిన Quasimodo అందానికీ, Dostoievski సృజించిన Idiot తెలివికీ క్రొత్త జాబితాలు వేసుకోవాలి. నాలుగు రోజులు భూమిమీద ఉండి పేరు లేకుండా పోయిన వాళ్లందరి కన్నా వీరిని మనం జ్ఞాపకం ఉంచుకుంటామా, లేదా?

అందువల్ల సీతయ్యకు గొప్ప గుణాలున్నాయనీ, గొప్ప కార్యాలు చేశాడనీ మీరు వాడిని స్మరించ నక్కరలేదు. ఎవరెస్టు ఎక్కడం, సముద్రాలు దాటడం, భూప్రదక్షిణం చెయ్యడం గొప్ప కార్యాలే. పద్యాలు వ్రాయడం, సినీమాలో నటించడం, విమవాయువులు కనిపెట్టడం గొప్పకార్యాలే. ఇవన్నీ మన సీతయ్య చేశాడంటే వెంటనే నేనబద్ధాలు వ్రాస్తున్నానని మీరు పోల్చేస్తారు. సీతయ్యా కివేమీ చేతకావని మీకు తెలుసును.

అయితే 'ఎవరయ్యా ఈ సీతయ్య? వీడిని మేమెందుకు తెలుసుకోవాలి?' అని మీ రడుగుతారు. మీ రడుగుతున్నకొద్దీ నాలో పట్టుదల హెచ్చి ఏమి చెప్పడానికీ ఇష్టం కలగదు. ఈ ఆలాపనలో ఇంకా ఎన్నో సంగతులు పడతాయి.

ఈసీతయ్యతో నేను ఏంతపనైనా చెయ్యగలను. వీడు నాసృష్టి. పూర్తిగా నాచెప్పు చేతలలో మెలగవలసినవాడు. 'సీతయ్యా! నువ్వు ఫలానారకం వ్యక్తివి' అంటే ఔనని ఒప్పుకుంటాడు. 'నిన్ను ఫలానా పరిస్థితులలో పెడుతున్నాను; ఎలాసంచరిస్తావు' అంటే 'సయిష్టం!' అంటాడు. సీతయ్యను ఎలక్షన్‌కి నిలబెట్టి గెలిపిస్తాను. టైఫాయిడుజ్వరం వచ్చిందని ఆసుపత్రిలో ప్రవేశపెడతాను. 'సీతయ్యా! నువ్వు పదిరూపాయల టిక్కెట్టు కొనుక్కొని ఆంధ్రదేశమంతా తిరగాలంటే 'సరే' అంటాడు. అయితే వీటివల్ల సీతయ్యకు వచ్చిన ప్రత్యేకత యేమిటి? ఓ ఆహా! ప్రత్యేకత కూడా కలిగించే సన్నివేశాలు దొర్లించవచ్చు. అదో కష్టంలోపని కాదు.

ఏ మాత్రం నేను సీతయ్య గురించి స్పష్టంగా చెప్పినా నా ప్రయత్నం పాడయిపోతుంది. ఇప్పటికే చాలాసంగతులలో సీతయ్య వ్యక్తిత్వం కనబడిపోతున్నది. ఇంకా స్ఫుటవర్ణాలు ఉపయోగించి వీడిని చట్రంలోకి దింపడం అన్యాయం. ఒక నీడగా, మబ్బుగా, దోబూచిగా సీతయ్యను వదిలేస్తున్నాను. వీడికి రూపం ఇచ్చి, గుణాదులు కల్పించి, సంఘటనలో నిలిపి కథ నడిపించాలన్నా నడిపించవచ్చు. అదో కష్టమైనపని కాదుకూడా!

# ఆంధ్రులు - ఆయుర్వేదము

విశ్వాత్మ - ఆరాధ్య

ఆంధ్రదేశము, ఆంధ్రజాతి అతి ప్రాచీన...న అంశము అందరికీ అవగతమే. ఆంధ్ర...మన్ని విధముల పేరెన్నిక గన్నదే. అందు ...లున్నారు, గాయకు లున్నారు. పండి...లు, జ్యోతిష్కులు, గ్రంథకర్తలు, ప్రాణ...లు, ప్రభుమాన్యులు, అన్నిటా ప్రముఖు...న్నారు. వారే దేశమువారికిని తీసిపోయిన...వా కారు; తీసిపోరు.

...ధ్రుల ప్రతిభ, విజ్ఞానము, అన్నిటా ...చినవి. అట్లే ఆయుర్వేదమునకూడ ...న్యమునే పొందెను. ఆంధ్రౌన్నత్యము ...క్క యితర వివిధరూపములను ఆంధ్ర ...ములచే రచించబడిన యీ సంచిక ...లి యితర వ్యాసరాజములచే తెలియ... ఆంధ్రుల ఆరోగ్య వైద్యవిజ్ఞానములను ...మాత్రమే నేనిచట ప్రస్తుతించెద.

ఏజాతియైనను, ఏదేశమైనను ఎంత ప్రాచీ...ా అందలి విజ్ఞానముగూడ అంత ప్రాచీ... అట్లే ఆంధ్రుల వైద్యవిజ్ఞానమున్ను. ...ల విజ్ఞానము సహజము. ఏజాతికైనను ...ముగా అనుభవ మెక్కువైనకొలది దాని ...కలుగు ఫలస్వరూపమే విజ్ఞానము. ...హిత వివేచనజ్ఞానమేగదా విజ్ఞానము. ...స్థితిలో ఆరోగ్యవిజ్ఞాన మత్యంతసహ...

ప్రాణిసంతతికి బాధ సహజము. బాధా...నకై ప్రాకులాడుట అంతకంటెను సహ... అట్టిచో విశేషజ్ఞానము లేని జంతు...యే ఏ ఆకో, అలమో తినిగాని, ఉప...గాని, లేక ఆ ప్రదేశమును నాకియో ...నెన్నెన్ని అవస్థలతో పడిగాని తన ...స్వల్పజ్ఞానమును సాధనముగా చేసు... తనచుట్టు నున్న స్వల్పసాధనసంప... తన స్వాస్థ్యమును తాను చేకూర్చు...ంతగా, ఎంతో విజ్ఞానముకలిగి చెప్ప...పుండి, యిష్టమువచ్చినట్టు ఉప

యోగించుకొనదగిన కరచరణాద్యంగములతో బుద్ధి, మనస్సు కలిగియుండి తనచుట్టునున్న వస్తుజాలమున కంతటికిని ఏకైకప్రభువగు మానవుడు ఆరోగ్యవిజ్ఞానమును సంపాదించుకొనుటలోగాని, దాపున అందుబాటులో ఉన్న అన్ని వస్తువులను అనుభవించి, పరిశోధించి చూచి యీయీ సాధనలచే యీయీ (రోగముల) బాధల నివారించుకొనగలననుు (చికిత్సాప్రావీణ్యము) విజ్ఞానమును సంపాదించుకొనకల్గుటలో నాశ్చర్య మేమిగలదు?

అట్టి ఆరోగ్యవిజ్ఞానమే ఆయుర్వేదము.

అది ఆర్యుల దన్నను, అనార్యుల దన్నను, ప్రాచ్యుల దన్నను, అప్రాచ్యుల దన్నను, చివరకు మిశ్రమమన్నను ఆయుర్విజ్ఞానము గాన ఆయుర్వేదమే. ఆయుర్వేద మనుటలో ఏమియు తప్పులేదు. అది సంస్కృతపు పేరు – అంతే. అన్నిజాతులూ, అన్నిదేశాలూ ఉపయోగించుకొనవచ్చును.

ఏజాతి కాజాతి ప్రత్యేకంగా సంపాదించుకొన్న ఆయుర్వేదం ఉండనే ఉంది. అట్లే ఆంధ్రజాతికిన్ని కొంత ప్రత్యేక సహజపరిశ్రమానుభవజన్యమైన ఆయుర్వేదం ఉండనే ఉన్నది. అట్లు అన్నిజాతులయొక్క ప్రత్యేక పరిశ్రమజనిత ఫలముయొక్క సమష్టిస్వరూపమే ఈనాటి ఆయుర్వేదముగాని లేక యే యితర రోగనివారణశాస్త్రమైనను.

అట్టి ఆయుర్వేదాభివృద్ధికి ఆంధ్రదేశము, ఆంధ్రులు ఎంతవరకు తోడుపడినారో, పరిశ్రమించి పరిశోధించారో, త్యాగంచేశారో, సోదరజీవకోటి కెంత సేవచేశారో, లోకకల్యాణాని కెంతవరకు పాటుపడ్డారో, ఎంత ఫలితమును తాము పొంది, తమ తోడిమానవులను పొందించి కృతకృత్యులైనారో వివరించి ప్రకటించడమే ఈ వ్యాసరచనోద్దేశ్యము.

అన్ని దేశాలు, అన్ని జాతులలోవలె ఆంధ్రజాతిలోను, ఆంధ్రదేశంలోనూ ప్రాచీనకాలం నుంచీ ఆయుర్వేదాభివృద్ధికై జీవితముల ధారవోసి పరిశోధనలొనరించిన మహాత్ములున్నారు. అన్నాహారముల సరకుగొనక ఆతురుల ప్రాణరక్షణ చేసిన అపరధన్వంతరులున్నారు. ఆయుర్వేద విజ్ఞానసాగరమును తరచి ఆయుర్వేదామృతమును పంచిపెట్టిన గ్రంథకర్తలున్నారు. అట్టివారి నాదరించిన ప్రభుసత్తములున్నారు. అట్టితరి ఆంధ్రులును ముందుకే నడచిరి. మనం వద్దనుకున్నా నిరాటంకంగా ముందుకి నడవటం, అభివృద్ధిచెందటం అన్నిటికీ ప్రకృతిసహజం. అలాగే శాస్త్రాలకు, ఆయుర్వేదానికీగూడా. వారును వారి ప్రత్యేకతను సార్థకము చేసుకొనిరి. వారివంతును వారునూ పూర్తిగనే చెల్లించిరి.

ఈనాటివరకు ఆ చరిత్రంతయు మనకు దొరకుట అసంభవము. ఎంతవరకు పురాణములుగానీ, చరిత్రలుగాని, రాజులు, రాజ్యాలు, వారి విజయపరంపరలు, వారి యుద్ధవార్తలు, భాగ్యభోగములు, రాణివాసములు, అందలి రహస్యములనేగాని, ఆకాలమందలి శాస్త్రములు, కళలు, వాటి నిర్మాతలు, వారినిగూర్చిన గొడవ ఏమాత్రమూ ఎత్తుకోవు. ఏమైనను కొంచెమున్న కాలగర్భమున లీనమై యుండవచ్చును. ఆధునిక చరిత్రకారులైనను అంత శ్రద్ధ తీసుకొనలేదు. ప్రత్యేకముగా యిట్టి చరిత్రల ప్రకటించుటకు అయినను వారి పరిశోధనలమధ్య అడ్డము వచ్చినపంక్తుల నొకచో చేర్చినను యీపాటికి శాస్త్రజ్ఞుల జీవితములుకూడ తయారుగనే యుండెడివి. ఇకనైనను ఆంధ్రచరిత్ర చతురాననులు, ఆంధ్ర చరిత్ర శేఖరులు తమ హృదయమున నొకమూల కొంచెము తావుంచినచో మన కనతికాలములో గావలసినంత చరిత్రగ్రంథ మమరు నని విన్నవింతును.

పోనిండు, యింతమందిభిషగ్వరులున్నను ఇందు పెయిచేసికొనకుండుటయు చింతించదగినదే. ప్రాచీన గ్రంథకర్తలు ఆత్మస్తుతియగునేమో యను భయమున వారి సంగతి బయల్పడనీయకుండుటను మనము సంతసించవలయునో, చింతించవలయునో తెలియదు. కవులను చూచియైనను నేర్వకపోయిరే. ఇ

ముందైనను ఉభయులు శ్రమచేసి యథాశక్తి శాస్త్రజ్ఞులు, శాస్త్రముల చరిత్రలుహూడ ఆంధ్ర దేశమున కందింప ప్రార్థన.

ఉన్న చరిత్రలనుండి దొరకిన కొలదియంశ ములనుమాత్ర మిందు వ్రాయదలచితిని.

## అజ్ఞాతయుగము

ఈకాలమందలి చరిత్రగాని, స్థితిగతులు గాని అప్పటి రాజులు, రాజ్యములు, ప్రజలు మున్నగువాటి పరిచయమే మనకు తిన్నగా లేనపుడు ఆయుర్వేదము, వైద్యులు, వారిని గూర్చి మనకు తెలియుట అసంభవముగాదా? అది మన కజ్ఞాతయుగముహూడా, సందేహము లేదు, కాని విశ్వామిత్రుని, అతని పుత్రుడును, ధన్వంతరి శిష్యుడును, సుశ్రుతసంహితా కర్తయు నగు శల్యశాస్త్రనిపుణుడు, ప్రవర్తకుడు సుశ్రుతాచార్యునిమాత్రము కాంచనగు.

## విశ్వామిత్రమహర్షి—సుశ్రుతుడు

ఈమహర్షిచరిత్ర మన్ని పురాణములయం దును చూడనగును. ప్రతిసృష్టిచేసిన యీమహ నీయునికి ఆయుర్వేదవిజ్ఞానము కొరవడునా? విశ్వామిత్రసంహితను రచించెను. ఇది చాల పురాతన గ్రంథము. అందు బాటులో లేదు. ఐనను చాల పురాతన కాలముననే చరక, సుశ్రుతవ్యాఖ్యాకారులను చక్రపాణిదత్త, శివ దాసు సేనులు తమవ్యాఖ్యానములయం దుదా హరించిరి. ఈసంహిత కాయచికిత్సా ప్రధాన మైన గ్రంథము. దాదాపు ఈతనిపుత్రులలో చాలమంది ఆయుర్వేదవేత్తలు. అందు సుశ్రుతుడు ప్రముఖుడు.

## సుశ్రుతాచార్యులు

విశ్వామిత్రమహర్షిపుత్రుడు సోదరులతో బయల్వెడలి (సోదరమానవులు పడు దురవస్థలకు వగచి) వైద్యవిద్యను అందు శల్యశాస్త్ర ప్రధానముగా విద్య నభ్యసించి ప్రజాసేవచేసిన సత్పురుషుడు. దివోదాస ధన్వంతరివద్ద విద్య నభ్యసించెను. సుశ్రుతసంహితను రచించి దేశ మున కర్పించెను మనదేశముననేగాక ఖండఖం డాంతరముల ప్రసిద్ధికెక్కిన శస్త్రవైద్యుడు. ఈకాలమందలి గొప్పగొప్ప పాశ్చాత్య వైద్యులవలనగూడ పొగడ్తలందుట యేసా ధ్యము. యీమహనీయుని శల్యతంత్ర విజ్ఞానమును స్తరిగియే ఆయుర్వేదముహూడ నొక విద్యయే యని యంగీకరించునంతటి దురవస్థ పట్టినది స్వాభిమానపూరితులను పాశ్చాత్యు లకుగూడ. ఇప్పుడీతని సుశ్రుతము (వృద్ధ సుశ్రుతము) దొరకుటలేదు; నాగార్జున ప్రతిసంస్కృతమగు సుశ్రుతమే యీరోజుదొరకునది.

## పూర్వయుగము

ఈ యుగప్రారంభముహూడా ఆంధ్రచరిత్ర, ఆంధ్రశకము, ఆంధ్రసామ్రాజ్యములతోనే ప్రారంభించినది. యిది దివ్యమైనయుగము. ఆంధ్రప్రతిభ, ప్రాభవము దీనికి తోడైనవి. ఇట్టి ప్రశాంతసమయమే ఆంధ్రాయుర్వే దాభివృద్ధికిహూడా తోడుపడినది.

ఇట్టి ఆయుర్వేద విజృంభణమునకు కారకుడు ఆంధ్రశకకర్తయగు శాలివాహనుని తరువాత అంతటి అద్వితీయపరాక్రమముతో ఆంధ్ర సామ్రాజ్యము నేలిన చక్రవర్తియు, ఆంధ్రుల ప్రతిభ ఖండఖండాంతరముల వ్యాపింపచేసిన ఆంధ్రచక్రవర్తియనగు గోతమీపుత్ర యజ్ఞ శ్రీశాతకర్ణి (క్రీ. శ. ౧౬౨—౯—౨౦౫.)

ఈ చక్రవర్తి బహుకాలము రాజ్యమేలుటేగాక కవులకల్లబొల్లిమాటల కుబ్బి తబ్బిబ్బులగుచు తన పొగడ్తలకు తాను సంత సించిన యితరరాజులవంటివాడుగాడు. రాజ్య రక్షణకు సైన్య మెంత యవసరమో యితర శాస్త్రములుహూడ యంతయవసర మని ఎరిగి పోషించిన మహామేధావి.

కావున నేరసవాదమున, ఆయుర్వేదమున, యోగశాస్త్రమున ఇంక ననేకశాస్త్రముల నిధియైన నాగార్జున సిద్ధుని జేరదీసి యాద రించి ఆయుర్వేదపరిశ్రమ కెంతయో వసతి కల్పించి ఆయుర్వేదము నుద్ధరించినాడు. ఒక టేమిటి రసశాలలు, విహారములు, విశ్వవిద్యాల యములు ఎన్నియో అమరిచినాడు.

## సిద్ధనాగార్జునుడు

(క్రీ. శ. ౧౩౫-౨౦౦)

మహాయోగి, సిద్ధిపొందిన రసవాది, మొట్ట మొదట రసవాద పరిశోధనలచేసి సిద్ధిపొందిన వాడు. లోహలక్షణ రసగ్రంథనిర్మాత, భిషక్పద్ధతి మునకు, రసప్రభావము నెరిగించిన సిద్ధుడు ఆంధ్రుడేయనుట ఆంధ్రజాతి హర్షించదగినది.

ఈయన వైద్యమాత్రుడేగాదు, గ్రంథముల రచించిన మహాకవిశేఖరుడు, మహాయాన మత (బౌద్ధమతశాఖ) ప్రవర్తకుడైన మతాచార్యుడు, దార్శనికుడు, కాయసిద్ధి బడసిన సిద్ధుడు, అష్టసిద్ధు లుండినయోగి.

రసప్రభావమును రసవాదమునకే బోధించి తృప్తిచెందలేదు. అనేకరసౌషధయోగములను మాలికాయోగములను గూడ నిర్మించి మానవుల జరామరణక్లేశవర్జితులనుగా జేసినభిషగ్వరుడు.

యోగశాస్త్రమున, రతిశాస్త్రమున, ఇంక ననేక శాస్త్రముల కృషిసల్పి గ్రంథరాజముల రచించి మన కర్పించిన గ్రంథకర్త. విశ్వవిద్యాలయముల శిష్యకోటిని సృష్టించిన ఆచార్యుడు.

ఆంధ్రచక్రవర్తి యగు యజ్ఞశ్రీ శాతకర్ణి సమకాలికుడే కాక తదాస్థానపోషితుడు. ఆయన ఆవరణముననే పరిశోధనల సాగించినది శ్రీశైలమందు. ధాన్యకటక విశ్వవిద్యాలయమున కాచార్యుడు; శ్రీశైలవిహారమున కధిపతి.

ప్రస్తుతము 'బీరార్' అనబడు 'విదర్భదేశ మున' మహాకోసలయందు ఒక బ్రాహ్మణ కుటుంబమున ఇతడు జన్మించెను. బాల్యము ననేబయలుదేరివెళ్లి నలందవిశ్వవిద్యాలయమున విద్యాభ్యాస మొనర్చెను. అచటనే తరువాత ఆచార్యుడుగా నుండెను. బౌద్ధమతమును స్వీకరించి మహాయానమతమను నొకశాఖను క్రొత్తగా స్థాపించి ఆ శాఖకు ఆచార్యుడై ప్రచార మొనర్చెను. మహారాజులకు గూడ బౌద్ధమత దీక్ష యిచ్చెను. తిబెట్ దేశమున స్వయముగానే మహాయానమతమునకు బహుళప్రచార మొనర్చెను.

అనేకశాస్త్రములయం దనేక గ్రంథముల రచించెను. మొత్తము ౨౪ గ్రంథములు రచించినట్లు బౌద్ధగ్రంథములవలన తేటపడుచున్నను అవి అన్నియు నమ్మటకు వలనుగాదని సర్ రే గారు అనుచున్నారు. అందు ఆయుర్వేదగ్రంథములు మాత్రము.

౧. లోహశాస్త్రము
౨. రసరత్నాకరం
౩. ఆరోగ్యమంజరి
౪. రసకచ్ఛపుటము
౫. సిద్ధనాగార్జునీయము
౬. సుశ్రుతము (సంస్కరించెను.)

ఇంకనేమేని గ్రంథము లున్నవేమో గాని అవి మన కపరూపములు. ఇంక ననేకౌషధయోగములు గూడ యీ మహనీయుని నామముతో యితరగ్రంథములలో గూడ ప్రసిద్ధములు.

అందరికీ అందుబాటులో ఉండుటకు బహుళప్రచార మివ్వదలచి 'పాటలిపుత్రము' న 'నాగార్జునవర్తి' యను నేత్రరోగహరౌషధయోగమును ఒక శిలాస్తంభమున చెక్కించెను.

కొందరిమతము నాగార్జునాచార్యుడాంధ్రుడు కాదని.

ఈ మహనీయుని జన్మ ఆంధ్రదేశమునందైనను కాకపోయినను, జన్మతఃఆంధ్రుడైనను కాకపోయినను, సేవించినది కృష్ణాస్రవంతీ పవిత్రోదకము. విహరించినది శ్రీశైల అమరావతీ పుణ్యభూముల. జీవితము ధారవోసినది ఆంధ్రరాజ్యపురోభివృద్ధికి, ఆంధ్రవైద్యపరిశోధనమునకు, ఆంధ్రవిద్యాభివృద్ధికి. ఆదరింపబడినది ఆంధ్రచక్రవర్తిచేత. కలసి తిరిగినది ఆంధ్రసోదరులతో. భుజించినది ఆంధ్రసోదరుల కరకమలము లర్పించిన ఆంధ్రమాత ఓగిరము. వేయేల? ఎచట పుట్టి ఎచట గిట్టినను నాగార్జునసిద్ధుని జీవితము ఆంధ్రదేశమునకే అర్పితము. పుట్టినది, పెరిగినది, గిట్టినది ఆంధ్రదేశమునందే గాన నిస్సంశయముగా సిద్ధు డాంధ్రుడుగానే చిరస్మరణీయుడు.

ఈయుగచరిత్రమం దింతకంటె ఎక్కువగా నేమియు యింతవరకు తెలియజాలకుంటుట మన దురదృష్టము.

## మధ్యయుగము

ఈయుగమందును రాజపోషణము బాగుగనే యుండెను. వైద్యులు వైద్యగ్రంథకర్తలు కూడ కొలదిగనె కన్పించెదరు. ఈ యుగమున రాజులు తమ సంస్థానముల వైద్యుల నుంచి ఆదరించుటేగాక వారిపోషణకై అగ్రహారాదికముల నొసగి బహూకరించుటగూడ కాననగును. అయినను మనకు దొరకిన ఆధారములమీద చెప్పదగినంత అభివృద్ధి లేదనియే తలంచ నగును.

## హరిహర బుక్కరాయలు
## (క్రీ. శ. 1336—1377)

ఈకాలమున ఆయుర్వేదము నాదరించి యుద్ధరించినవారిలో వీరును ప్రధానులే. అరివీరభయంకరులై దక్షిణదేశమంతటను మ్లేచ్ఛుల నుక్కడచి భారతధర్మమును కాచి నూత్న కర్ణాటరాజ్యస్థాపన మొనర్చి శాంతి నొడగూర్చుటేగాక విద్యారణ్యస్వామి నాదరించుటచేతనేగదా కొన్ని ఆయుర్వేద గ్రంథము లవతరించినవి. వీరిచే శాంతి స్థాపించబడినసమయముననే భరతదేశమున యితరప్రాంతమున కూడ కొందరు (శార్ఙ్గధరాదులు) శార్ఙ్గధరాది గ్రంథముల రచించిరి, భరతదేశమునేగాక భరతదేశవైద్యమునుగూడ ఉద్ధరించిరి.

## మాధవవిద్యారణ్యస్వామి
## (క్రీ. శ. ౧౨౮౦—౧౩౮౬)

మధ్యయుగమున మనకు కనబడు గ్రంథకర్త యింతవరకు యీమహనీయుడొక్కడే. ఈ మహనీయుడు శతాధికగ్రంథకర్త, కాని ఆయుర్వేదమునమాత్రము ఒక్కటే గ్రంథము వీరిపేరుతో నున్నది. ఇతడే కర్ణాటరాజ్యమును స్థాపించి, విజయనగర నిర్మాణమును చేసి వైదికధర్మము నుద్ధరించినఘనుడు.

ఇతడు పవిత్ర తుంగభద్రాతీరమున బంపాక్షేత్రమున జన్మించెను. తండ్రి మాయణుడు, తల్లి శ్రీమతి, సాయన, భోగనాథు లనువారు తమ్ములు, పేరు మాధవభట్టు. యజుశ్శాఖీయుడు, భారద్వాజసగోత్రుడు, బోధాయన సూత్రుడు.

అన్ని శాస్త్రములందును అసమానప్రతిభాశాలి. రాజకీయధురంధరు డనుటకు మొదటి హరిహరరాయలకును బుక్కరాయలకును మంత్రియు, హితబోధకుడునై విద్యానగర నిర్మాణమునకు, విజయనగర (కర్ణాట) రాజ్యస్థాపకుడై యుండుటే నిదర్శనము.

తదుపరి సన్యసించి శంకరపీఠ మధిష్ఠించి విద్యారణ్యస్వామి యయ్యెను. అద్వైతగ్రంథములను, వేదభాష్యములను, వేదాంతగ్రంథముల నెన్నిటినో రచించి మతప్రచార మొనర్చెను. విద్యానగర రాజులకును గురువయ్యెను. హైందవధర్మము నుద్ధరించెను.

ఇతడు శతాధికవర్షజీవి. ఇంతకాల మిట్టి ఘనకార్యముల నెన్నో చేసి క్రీ. శ. ౧౩౮౬ సంవత్సరమున బ్రహ్మైక్య మొందెను.

ఈయనరచించిన గ్రంథము లసంఖ్యాకములు. వేదవేదాంగములయందును, సమస్త శాస్త్రములయందును పెక్కింటిని రచించెను. అందుననే "సర్వజ్ఞస్సహిమాధవః" యనియు, విద్యారణ్యుడనియు ప్రసిద్ధి. ఐనను ఆయుర్వేదమునమాత్ర మొక్క గ్రంథమే ఉన్నటుల వినికిడి. మఱిరచించ నేలేదో, రచించినను నశించెనో తెలియుటలేదు.

ఇదియైనను మనకందుబాటులోగాని అచ్చులోగానిలేదు. ప్రస్తుతము మనకుదొరకు మాధవనిదానమిదిగాదు, "విద్యారణ్య కృతమాధవనిదాన" మొకటి రాజపుత్రస్థానమందలి ఉదయపుర సరస్వతీభాండారమున నున్నట్లు 'పాటర్‌సన్' గారు వ్రాసిరట.

ఇది మన కందుబాటులో లేకుండుటచే వీరిరచననుగూర్చి సమగ్రముగా తెలియునవకాశము లేదు. కాని ఆంధ్రదేశమున ఆంధ్రునిచే రచించబడిన యిట్టి ఉద్గ్రంథము, మాతృభూమినివదలి పరభూముల ప్రవాస మొనరించుటెలకో దురూహముగ నున్నది.

ఇది బసవరాజుకాలమువరకు ఆంధ్రదేశమును వీడినటుల తోచదు. తరువాతి ప్రబుద్ధులే యీగతి పట్టించిరి. బసవరాజీయమున కన్పడు ఔషధయోగములు "మాధవనిదానే" యని యుండుటచే నీ గ్రంథమునుండి యుద్ధృతములేమో యనుశంక కలుగును. ప్రస్తుతము ప్రచారమునన్నున్న మాధవ కరమాధవనిదానమున యోగములు లేమిచే, ఇకనైనను ఈ గ్రంథమును ఆంధ్రభూమికి చేర్చ బ్రయత్నించుట ఆంధ్రప్రముఖులను వైద్యశేఖరులవిధి.

## అనితల్లి శాసనము

ఈ యుగచరిత్ర బయల్వెడలించుటలో గాని, యీ కాలమందలి ఆయుర్వేదపండితులను, భిషఙ్మణులను కొందరిని లోకమున కెరిగించుటలోగాని సాయపడుచున్నది.

ఈ శాసనము శాలివాహనశకము ౧౩౫౬ (క్రీ. శ. ౧౪౩౫) శోభకృద్వర్ష శ్రావణ కృష్ణైకాదశీదినమున, మార్కండేయేశ్వర స్వామిసన్నిధిని పరహితాచార్యుడను వైద్యశేఖరునికి కృతజ్ఞతతో (ఆయన పరహితచింతకు సంతసించి) కలువచేరను గ్రామమును అన్నవరమను పేరిట (ఈ గ్రామ మిప్పుడు గోదావరీ మండలమందలి రామచంద్రపురం తాలూకాలోని కలవచెర్ల) బహూకరించి చెక్కింపబడెను.

## వీరభద్రభూపాలుడు—అనితల్లీ దేవి

వీరభద్రభూపాలుడు ఆంధ్రరాజులలో ప్రసిద్ధిగన్న వారిలో నొకడు. ఆకాలమున విద్యలను, విద్యాధికులను గౌరవించి పోషించినవారిలో నొకడు. వేమభూపాలుని సోదరుడు. రాజమహేంద్రపురరాజ్యము నేలినరాజు. శ్రీనాథునంతటి. కవిసార్వభౌముని పొగడ్తలందిన ట్టి. పతిహితయగు అనితల్లీ దేవియే యిట్లు దానధర్మములచేత విద్యలపోషింప ఈ ప్రభుని నూర్పి వేరుగ చెప్పనేల ?

## పరహితాచార్యుడు

ఈతని వంశమే ప్రసిద్ధమైన వైద్యవంశము. అత్రిమహర్షి గోత్రము (ఆత్రేయమహర్షి సంతతిగూడను). కొన్ని తరములు ఆ వైద్యవృత్తి యందు పేరొందుటయేగాక 'పరహితు' లనే పేరుకూడా సార్థకపరుచుకొన్నాడు.

ఈశాసనములోనే ఒక యితిహాసముకూడా కలదు. ఒక రోగగ్రస్తమైన సర్పము నోరుతెరచుకొని పుట్టప్రక్కన పడిఉంటే చూచి యీ పరహితాచార్యుడు తన ప్రాణభీతినికూడా వదలి దాని బాధానివారణ చేసినాడు.

ఇట్టివానినామము సార్థకము గాదా? అట్టివానిని పరహితు డనుటలో ఆశ్చర్యమేమి?

ఇతడు ఆయుర్వేదము, యజుర్వేదముల నభ్యసించిన వైదికకర్మనిష్ఠుడు, శాంతుడు, సర్వకళాకోవిదుడు దీనజనులపాలిటి బంధువు, శివభక్తుడు వైనభిషఙ్మణి.

ఈతనితాత పేరుగూడ పరహితుడే, తండ్రి కాశీనాథుడు, సోదరులు దేవనార్య, వర దార్యు లనువారు. అందరును ప్రసిద్ధినొందిన వైద్యశేఖరులే.

పినతండ్రులు పరహిత, దేవనార్యులును భిషగ్వరులే. తాతతండ్రియగు రామనాథుడును వైద్యుడే. (ప్రసిద్ధ) రామనాథునితండ్రి గూడ పరహితుడే. సర్వచికిత్సచేసిన దీపర హితాచార్యుడే. అన్ని శాస్త్రముల నారితేరిన విద్వాంసుడు. ఈపరహితునితండ్రి మల్లినాథుడును భిషగ్వరుడే. ఆ సునతండ్రియు పరహితుడే, వైద్యముఖ్యుడే.

ఇట్లీ వంశమంతయు వైద్యవంశము యైనను వీరిచే రచించబడినగ్రంథములేమైన నున్నటులగాని, రచించినటులుగాని శాసనమున చెప్పబడలేదు. మనకు ప్రస్తుతము ఎచటనేని యున్నటులుగూడ తెలియుటలేదు.

## ఉత్తరయుగము

ఈకాలమున శాస్త్రజ్ఞుల పోషణ అంతగా కనుపించదు. అట్లు పోషించిన రాజచంద్రులు గూడ నెందును అంతగా గాన్పింపరు. కల్లబొల్లి పద్యములల్లు కవితల్లజుల పొగడ్తల కుబ్బితబ్బిబ్బులైన రాజులే యెక్కువ. వారి ప్రబంధములు, చాటుధారల గడబిడయేగాని మరేమియు అంతగా గానరాదు.

వినను బాధలు, రోగములు పద్యములతో పోవునవి కావు గాన, ప్రతిరాజునకును, ప్రతి గ్రామముననను ఎవరో కొందరు వైద్యు లుండక తీరదు.

అదిగాక వైద్యము స్వయంపోషకమైన వృత్తి. కావున స్వయముగనే వైద్యశాస్త్ర మభివృద్ధి చెందినది.

అభివృద్ధి యనుటేగాదు, యీకాలముననే తెలుగుభూమిని మంచి పరిశోధనగూడ సాగిన దనవచ్చును. అట్టి పరిశోధనఫలితమే వైద్య చింతామణి, బసవరాజీయాదుల ప్రాదుర్భావము.

ఈ కాలముననే యింకను కొందరు వైద్య ప్రకాండులు గ్రంథరచన చేసినదికూడ.

అట్టి గ్రంథకర్తలలోను, వైద్యశేఖరులలోను ముఖ్యులు యింద్రకంఠి వల్లభాచార్యులు.

ఈ వైద్యశేఖరుడు మంచి కవికూడను. కవిత్వము మృదుమధురము. తండ్రి అమరేశ్వరభట్టు. ఇంటిపేరు యింద్రకంఠివారు. శ్రీవత్సగోత్రము, ఆపస్తంబసూత్రము. సకల విద్యాప్రవీణ, భైషజ్యవిద్యాపారీణ, సకల పాండిత్యప్రవీణ అని సంఁడె నిబ్బరముగా తన గద్యమున వ్రాసుకొన్న మేటి.

ప్రస్తుతము గోదావరీ మండలమున యింద్రకంఠివారు వైదికులు ఉన్నారు గావున యీ యనవాసస్థలము గోదావరీమండల మనియు, వారు వీరి పంక్తిలని ఊహించనగునేమో! కాలనిర్ణయమునకేమియు నింతవరకాధారము లసుపడవు.

ఈయన రచించిన యితరగ్రంథము లేమియు దొరుకుటలేదు. వైద్యచింతామణి యొక్కటే వారిపరిశ్రమఫలము మనఅదృష్టఫలము ను. ఇది యితర గ్రంథములనుండి సేకరించి వ్రాసినది మాత్రమేగాదు. అటులైన యింతకంటెను గొప్పది యగును. తాను స్వయముగా శోధించి స్వానుభవమును లోకహితార్థమై యర్పించిన పరిశోధక శిరోమణి యితడు.

"ఆయుర్వేదానికి కదలికలేదు, మురిగిపోతున్నది" అని యితరులనుట వారి అసహనమే గాని వేరుగాదు. ప్రతినిమిషం అభివృద్ధినొందటం అన్ని శాస్త్రాలకు సహజం. అట్లే వైద్యశాస్త్రమునకుగూడ జరిగెను; జరుగుచున్నది. దానిని గ్రంథస్థముచేయుచునే యున్నారు. అది వలదన్నను జరుగును.

అభివృద్ధియన తమతమ స్వానుభవముచే గన్గొన్న ఫలితముల జోడించుటేగదా! అట్లే చేసినాడు వల్లభాచార్యుడును. యీరోజు శాస్త్రము విపరీతవేగముతో బెరుగుటేగాక రోగములసంఖ్యయు నామములును, ఔషధోపయోగములును నెట్లు పెరిగెనో, ఆకాలమందును అట్లేపెరిగెను. వాటిని తనవిచేదనా

శక్తితో పరిశోధించి వల్లభుడును ఆంధ్రుల కర్పించినాడు.

అట్టి నూతనవిషయములలో :—

'మహాజ్వరములు' అను పేరుతో క్రొత్త విభాగము చేయుట, తయలు క్రొత్తవి లక్షణ విభాగముతో నింక నిరువదియున్నటులు నిరూపించుట, కాసలలో బంగాళీకాస, మందార కాసలు మున్నగునవి నిరూపించుట. ఇట్లే యొక కొన్నివ్యాధులకును ప్రత్యేకవిషయముల వివరించుట.

ద్రవ్యపరిశోధన :—క్రొత్త ద్రవ్యముల యొక్క ఉపయోగవిధానమును, వాటి ప్రత్యేక ఉపయోగములను, పూర్వములేని అనుభవముల నిరూపించి (శాస్త్రీయ పరిశోధనచే) బోధించుట.

మూత్రపరీక్షయందు మూత్రమును కాచి పరీక్షించు విధానమేర్పరచుట మున్నగునవి.

## బసవరాజు

ఈ మహనీయుడుకూడ ఆంధ్ర వైద్యశేఖరులలో ముఖ్యుడు. ఈదేశమున నీతనినామము స్మరింపని వైద్యుడుగాని, ఈతనిగ్రంథము చదువని వైద్యుడుగాని లేడు.

నీలకంఠ కొట్టూరు బసవరాజు; తండ్రి నమశ్శివాయ; గురువు ఆరాధ్యరామదేశికుడు; శైవుడు. (జంగముడు కావచ్చును) కవితా చాతురీధురీణ, వైద్యజనశిరోభూషణ అని తన బసవరాజీయగద్యలో ధైర్యముతో వ్రాసుకొన్నాడు. అందు సందేహమావంతయు లేదు. యోగ్యుడే. ఆత్మస్తుతి గాదు. సత్యముగనే సార్థకము చేసుకొన్నాడు.

## బసవరాజీయము

ఈతని యితరగ్రంథము లేవియు గాన్పింపవుగాని బసవరాజీయము మాత్ర మాంధ్రదేశ వైద్యులకు ఏకైకదివ్యజ్యోతి, అందరి హృదయపేటికలయందును భద్రముగా నున్నదే.

స్వయముగనే తనగ్రంథ మితరగ్రంథముల నుండి సంగ్రహించి వ్రాసితినని చెప్పినాడు. వైగా వాటినామములనుగూడ యిచ్చినాడు. అన్యగ్రంథములలో నున్నటుల గీకెననిగాదు తాను స్వయముగా అనుభవమునిచ్చినను, పరిశోధనలచేతను మాన్యములని తలచినంతవరకే సేకరించెనని. అంతియగాక తాను క్రొత్తగా కనుగొనిన రహస్యములగూడ నందుప్రకటించి మనకు బోధించెను.

అనేకౌషధములను జేర్చి నూతనయోగముల ననేకము విశదీకరించెను. అగ్నికర్మ మున్నగునవి అనుభవముతో వివరించినాడు. చివరకు శస్త్రకర్మగూడ బాగుగా బోధించినాడు.

నిజముగా రాజ్యములు, రాజులు తలక్రిందులై, రాజ్యతంత్రములు తారుమారై తిరతిండి కట్టునష్టలేక ఆరోగ్యవిధాన మననేమియో ప్రజలకును, వైద్యులకునుగూడ తెలియక అజ్ఞానాంధకారమున విద్యావిహీనులైయున్న యీ మధ్యకాలమున ఆంధ్రదేశమునుద్ధరించినది యిద్దరు మహాత్ములయొక్క జ్ఞానమే, పరిశ్రమయే, త్యాగమే. వీరిగ్రంథములవలన గల్గిన జ్ఞానతేజమే.

అప్పటి వైద్యులకు వేరొక గ్రంథమున్నటుల నేమైన తెలియునా? చరకసుశ్రుతాదు లున్నట్టుగాని, ఉన్న వీరి కందుదాటునగాని కలవా? కంఠస్థమైన చింతామణి, బసవరాజీయములేగా ఆంధ్రుల నున్ధబాలతోపాటు రక్షించినవి.

ఆంధ్రులకొరకు ఆంధ్రుల శరీర మనస్తత్వముల నెరిగిన ఆంధ్రభిషగ్వరులచే రచించబడినవి కనుకనే ఆంధ్రులచే ఆదరించబడినవి. అంతగా సాయపడినవి.

తరువాత నింకను కొందరు వైద్యమహాశయులు కలరు. వారందరు ఆంధ్రభాషయందే గ్రంథరచన మొనర్చిరి. అది యంతయు పద్యమయము. కొందరు స్వతంత్రగ్రంథముల రచించిరి. (ఇతర గ్రంథములనుండి సంగ్రహించి) కొందరు అనువాదములనే చేసిరి ఆంధ్రపద్యములతో. అట్టివారు-

## తుమ్మూరు శరభరాజు

పండితుడు, కవి, జ్యోతిష్కుడు, మంత్రశాస్త్రజ్ఞుడు, గణితవేత్త, వైద్యశేఖరుడు, శైవుడు. శివపూజాధురంధరుడు. ఇతర దేవతా భక్తిఆరాధనలుగూడ కలవాడని 'వేణుగోపాల వరప్రసాదము'చేతను, 'ఆంజనేయానుగ్రహముల'చేతను గ్రంథరచన చేసితినని గద్యమం దుండుటచేత తెలియుచున్నది.

కొమిరపూడి (గుంటూరుమండల) నివాసి కొమిరపూడి ఆంజనేయస్వామికే తనగ్రంథ మంకితముచేసెను.

శ్రీవత్సగోత్రం. ఓరుగల్లు ప్రతాపరుద్రుని ప్రధానమంత్రి యగు శివదేవయోగి వంశకర్త. తండ్రి వీరనాగ్యుడు, తల్లి బాపమ్మ. ప్రతాపరుద్రునిచే నివ్వబడిన 9 అగ్రహారములలో నొకటగు తుమ్మూరు మిరాసిదారు లగుటచే తుమ్మూరువారని యింటిపేరు.

అనేకమంది గురువులవద్ద అనేకశాస్త్రముల నభ్యసించిన శాస్త్రవేత్త.

ఇతడు అనేకశతకాలు ప్రబంధాలు రచించెను. కాని ఆయుర్వేదమునమాత్రము 'సర్వవైద్యగ్రంథసారం' లేక 'శరభరాజీయ' మనబడు గ్రంథముమాత్రమే మనకు దొరకుచున్నది. అనేక ఉత్తమయోగములు గల గ్రంథరాజము మన దేశమున ప్రసిద్ధిగాంచినవాటిలో నొకటి.

## దేవులపల్లి వెంకటనరసయ్య

ఈవైద్యశేఖరుడు శ్రీనివాసమంత్రి మనుమడు. "ఆంధ్రవైద్య చింతామణి" యను పేరుతో వల్లభాచార్యవిరచిత మగు "వైద్య చింతామణి"ని ఆంధ్రీకరించినాడు. గ్రంథము సమగ్రముగా దొరకుటలేదు.

## ముడుంబి వెంకటాచార్యులు

ఇతడు గోదావరిమండలనివాసి ఒకశతాబ్దిలోపలివాడు. రసప్రదీపికను ఆంధ్రభాషలోనికి పరివర్తనము చేసినాడు. ఇది ఆంధ్రభాషలోని రసగ్రంథములలో మొదటిది. దీనికి గోపాలాచార్యులవారు 'ప్రభ' యను వ్యాఖ్యాన మొనర్చినారు.

## ఇర్లపాటి పేరయామాత్యుడు

ఇతడు'వైద్యసార'మను పేరుగల "నవనాథసిద్ధ ప్రదీపికను" తెనుగున పరివర్తనముచేసెను. గ్రంథ మసమగ్రముగా నున్నది.

### చిలకమఱ్ఱి వెంకటాచార్యుడు

ఇతడు చంద్రనాచార్య పుత్రుడగు గంగాధరా చార్యునిచే సంగ్రహించబడిన భేషజకల్పమును ఆంధ్రమున పద్యరూపముగా నొనర్చినాడు. తండ్రి శరణ్యపాదాచార్యుడు. గురువు కందాళ రంగాచార్యులు.

### మాధవ పండితుడు

ఇతడు శ్రీవత్సగోత్రుడు, ఆపస్తంబ సూత్రుడు. 'వైద్యవిద్యాత్రినేత్ర'యనుబిరుదముగలవాడు.

'గదాసంజీవన' మను గ్రంథమును సంస్కృతభాషలో రచించెను. సంపూర్ణగ్రంథము దొరకుటలేదు.

### పానకాలరాయడు

ఇతడు గుంటూరుమండలమందలి తాడేపల్లిగ్రామమున జన్మించెను. తాత రంగామాత్యుడు, తండ్రి వెంకన్న, తల్లి మహాలక్ష్మి. వెంకటరాయలు, సీతాపతిరాయలు సోదరులు. 'అఖిలరాజాధిరాజ సభాంతరాగ్ర పూజితుడ, సర్వవిద్యావిరాజితుడ' నని చెప్పుకొన్నాడు.

శ్రీ వాసిరెడ్డి వెంకటాద్రిప్రభుని యాస్థానమున సత్కరింపబడినట్లుగూడ ప్రతీతి కలదు గాన ఆకాలపువాడు గావచ్చును. అనగా ౧౮-వ శతాబ్దివాడు గావచ్చును. ఇతడు నేత్రదర్పణము, పానకాలీయము మున్నగు గ్రంథముల రచించెను.

ఇంక నెందరు అజ్ఞాతభిషక్శేఖరులు కాలగర్భమున మరుగుపడిరో తెలియరాదు. ప్రయత్నించిన నింకను కొందరిచరిత్రలైనను తెలియకపోవు. కాని యీ చిన్నివ్యాసమున అట్టి అవకాశములేదు. ప్రత్యేకగ్రంథముండుట శ్రేయస్కరము. అందు పూర్ణమైన విమర్శగూడ చేయ నగువగును.

### నవయుగము

శ్రీ డా॥ గోపాలాచార్యులతో ప్రారంభించిన దనవచ్చును. ఈ అపరధన్వంతరియే ఆంధ్రదేశమునగేమి, దక్షిణభారతమునసేమి ఆయుర్వేదప్రచార మారంభించినమహాత్ముడు.

స్వయముగనే పండితుడై, ఆచార్యుడై, భిషఙ్మణియై, ఆయుర్వేదకళాశాలను, వైద్యాలయమును, ఔషధనిర్మాణశాలను స్థాపించి దేశ మంతటను ఆయుర్వేదాభివృద్ధికి తోడ్పడుటేగాక యావద్భారతభూమినిగూడ పర్యటన మొనర్చి ఆయుర్వేదప్రచారము సల్పినాడు. యావద్భారత వైద్యసభ కధ్యక్షుడై నాయకుడై ఆయుర్వేదోద్ధరణ మొనర్చినాడు.

ఆంధ్రదేశమునగూడ నొక ఆయుర్వేద సమ్మేళనమును నిర్మించి నడిపినాడు.

స్వయముగా గ్రంథముల రచించినాడు. చరక సుశ్రుతాది మహాగ్రంథములకు చక్కని వ్యాఖ్యల రచించి ప్రకటించినాడు. తన ఔషధ నిర్మాణశాలయందు ఔషధముల తయారుచేయించి ఘోరములగు విషూచి, మహామారులనుండి మరణోన్ముఖులగు రోగులను రక్షించినాడు.

ఈతడు జన్మించినది వైద్యకుటుంబమున; వైద్యవరులగు రామకృష్ణమాచార్యులవారికి. తల్లి రాజ్యలక్ష్మమ్మ. జననము మచిలీపట్టణమున. మైసూరు ఆయుర్వేదకళాశాలయందు విద్య నభ్యసించి 'భిషఙ్మణి' యాయెను, ప్రభుత్వబిరుదమును, 'వైద్యరత్న'ను పొందెను. ఈమహనీయునిచే సంకల్పించి ప్రారంభించబడిన ఆయుర్వేదోన్నతి అంతటితో ఆగలేదు. అది యీరోజువరకును యావద్భారతదేశమునను వటవృక్షమువలె విస్తరించినది.

ఈమహనీయుని సృష్టిలోనివారే ఈరోజు ఆంధ్రదేశమున నేమి యావద్భారతముననేమి ఆయుర్వేదాభివృద్ధికై యహోరాత్రములు కృషిచేయు శ్రీలక్ష్మీపతి, కృష్ణమాచార్య, రామశాస్త్రి మున్నగు మహనీయులు.

ఇప్పటికే గ్రంథము పెరిగినది. ఇట్టిమహనీయు లింకెందరో యీరోజున ఆయుర్వేదోద్ధరణకై కృషిచేయుచున్న ఆంధ్రప్రముఖులున్నారు. వారందరి సమగ్రచరిత్రమును వ్రాయుట కిందు తావులేదు. మనయదృష్టమున ఎవరైనను అట్టిపనికి దొరకొన్న ధన్యవాదము లర్పింతము.

ఈయుగముననే శ్రీపువ్వాడవారు గ్రంథప్రచురణమునకు ప్రారంభించిరి. సాంధ్రవ్యాఖ్యా తాత్పర్యములతో నింకననేకమంది వైద్యముఖ్యులు గ్రంథభాషాంతరీకరణములకు దొరకొనిరి.

అన్ని యుద్యమములకును ఆంధ్రులదే ముందంజ. అట్లే ఆయుర్వేదమునగూడ నీరోజు ముందున్నది ఆంధ్రులే. ఉద్యమప్రారంభకుడు గోపాలాచార్యులాంధ్రుడు ఈరోజు నడుపుచున్న లక్ష్మీపతి యాంధ్రుడు. మద్రాసునందున్నను ఆరోజు చెన్నపురాయుర్వేద కళాశాల యందుగాని ఈరోజు ప్రభుత్వభారతపాఠశాలయందు గాని అధికసంఖ్యలో జేరి విద్య నభ్యసించిన దాంధ్రులు. ఈరోజు దేశమంతటను ప్రజాసేవచేయున దాంధ్రులు.

ఈ యుగమును నిజముగా స్వర్ణయుగ మనవచ్చును. ఈ కొలదికాలముననే ఆయుర్వేదమున నతిశీఘ్రముగ అభివృద్ధి కల్గినది.

లక్ష్యలక్షణయుక్తముగా బోధించు కళాశాల లేర్పడినవి. ప్రభుత్వముచేతను, ప్రజలచేతను కొనియాడబడిన ఆంధ్ర ఫార్మసీవంటి అనేక ఔషధనిర్మాణశాలలు ఏర్పడినవి, గ్రంథాలయములు, గ్రంథమాలలు, గ్రంథకర్తలు, గ్రంథములు, అనువాదములు అన్నియు ఏర్పడినవి, ఏర్పడుచున్నవి. ప్రభుత్వాదరణ ఇంచుక కల్గినది. ప్రతి ఊర వైద్యాలయము లేర్పడుచున్నవి.

ఇప్పుడు స్వయంప్రభుత్వము. అందును ఆంధ్రరాష్ట్రమే ఏర్పడినచో ఆంధ్రజాతితో పాటు ఆంధ్రవైద్యమునకుగూడ నితోధిక సత్వరాభివృద్ధి కేమియు సందేహములేదు. (ఆంధ్ర విశ్వవిద్యాలయమున ఆయుర్వేదమునకు స్థానము లేకుండుట శోచనీయమే యైనను.) సత్వరాంధ్రరాష్ట్రసిద్ధికై ప్రయత్నముచేయుటే మనవిధి. రాష్ట్రసిద్ధితోనే మనకు సంపూర్ణవికాస మన్నివిధముల కల్గును. పూర్వపువైభవము, ఔన్నత్యము, విజ్ఞానము, వేయేల? మనము ఆత్మసందర్శనము చేసినవార మగుదుము. ఆంధ్రుల మగుదుము. లేనిచో అంధులము.

# కృష్ణదేవరాయల
## రెండవ
# కళింగయుద్ధము

కొండవీడు ప్రస్తుతము గుంటూరుజిల్లా నర్సారావుపేటతాలూకాయందు గలదు. ఇది గొప్పదుర్గము. మహాబలాఢ్యమైనది. ఇది ప్రస్తుతము శిథిలావస్థయందున్నను చూచుటకు బహురమ్యముగానుండెను. దీనిచుట్టుకొలత రమారమి ముప్పదిమైళ్లు. ఈపర్వతము పై నిప్పుడుచింతలు, కుంకుళ్లు, సీతాఫలములు ఫలించుచున్నవి. గవర్నమెంటువారు వీనిని సత్తకు యిచ్చుచున్నారు. ఈపర్వతమున చిరుతలు మొదలగు క్రూరమృగములుగూడ గలవు. ఈ పర్వతాగ్రము సుమారురెండున్నరమైళ్ల యెత్తు గలది.౧ఈపర్వతమున యేబదిశిఖరములు గలవు. అందు నాలుగు ముఖ్యమైనవి. ఈనాల్గుశిఖరములకు పశ్చిమభాగమున మూడుమైళ్ల చదరము గల విశాలప్రదేశము గలదు. ఈసమప్రదేశమునకును పైనచెప్పబడిన నాలుగు శిఖరములకును చుట్టును కోటకట్టబడినది. ఈగోడలు శత్రుదుర్భేద్యమై బలిష్ఠముగా నుండెను. పర్వతముయొక్క ప్రతిశిఖరమునకును బురుజు నిర్మింపబడెను. ఇట్టి బురుజులు మొత్తమున యిరువదియొకటి గలవు. ఈదుర్గము యెప్పుడు యెవరిచే నిర్మింపబడినదియు తెలిసికొనుటకు తగినశాసనాధారములు గానరావు. కాని యోరుగంటిరాజ్యము పోయినతరువాత రెడ్డిరాజులు స్వతంత్రులై యీదుర్గమును నిర్మించినట్లు క్రీ. శే. కొమర్రాజు వెంకటలక్ష్మణరావు పంతులుగారు వ్రాసియున్నారు.

ఈదుర్గమునకు క్రిందిభాగమున కొండవీడు పురము గలదు. ఈపురము రమారమి౪-౫మైళ్లు వైశాల్యమును, యేడువాడలు (వాడయనగా పేటయనిఅర్థము)ను కలిగి యున్నట్లు తెలియుచున్నది. ఇది శా. శ. ౧౧౬౦సంవత్సరమున అనగా గణపతిదేవునికాలమున రాజధానిగ ప్రసిద్ధికెక్కెను. అందుచేత నిది బహుప్రాచీనమైనదిగ చెప్పకతప్పదు. కొండవీటి దుర్గప్రాశస్త్యమును శ్రీనాథమహాకవి బహుహృద్యముగా వర్ణించినవిధము ఇటతిలకింపనగును. శ్రీరాయలకాలమునాటికి యీదుర్గము కళింగాధి పతియగు ప్రతాపరుద్రగజపతి పరిపాలనలో నుండెను-అనగా క్రీ.శ. ౧౪ ౫౪ మొదలు ౧౫౧౫ వరకు ఓఢ్రరాజుల క్రింద నుండెను. దీనిని ప్రతాపరుద్రగజపతి కుమారుడు వీరభద్రగజపతి పరిపాలించుచుండెను. ఈదుర్గమును కృష్ణరాయలు జయించి తన కీర్తిచంద్రికల వెల్లివిరియబోయ దలచి యుదయగిరి విజయానంతరమున కనకగిరిని జయించి సైన్యమును కొండవీటికి మరలించెను. మార్గమధ్యమున కొండవీటిరాజ్యమునకు జెందిన అద్దంకి, వినుకొండ, నాగార్జునకొండ, బెల్లముకొండ, తంగెడ, కేతవరము మొదలగు దుర్గములను జయించి కొండవీటికి మరలెను. ఈజయించిన దుర్గములలో బెల్లంకొండకు వీరభద్రయ్యను, వినుకొండకు భాస్కరయ్యను నాగార్జునకొండకు అయ్యలయ్యను అధిపతులుగా నియమించెను. కొండవీడుదుర్గాధిపతి కృష్ణరాయ లుదయగిరిని జయించుట విని యుండెను. ఇతనికి కొందరు పాత్రసామంతులు సహాయము చేయుటకు తల పడిరి. వీరభద్రగజపతియు పాత్రసామంతులును కొంత సైన్యముతో బోయి రాయల నెదుర్కొనిరి. ఉభయసైన్యములకును ఘోర సంగ్రామము జరిగెను. ఈయుద్ధము మహామంత్రిశేఖరుడగు తిమ్మరుసు యోధాగ్రేసరుని నాయకత్వమున జరిగెను. వీరభద్రగజపతి పాత్రసామంతుల సహాయమున యెదిరించెను గాని యాతని సేనలు చాలనష్టపడెను. వీరభద్రగజపతియు, పాత్రసామంతులును వారిప్రాణరక్షణార్థము దుర్గములో తలలు దాచుకొనిరి. పిదప రాయలసేనలు కొండవీటి సైన్యమును దరుముకొనుచు కొండవీడుసమీపించి దుర్గమును ముట్టడించిరి. క్రీ. శ. ౧౫౧౫ వ సంవత్సరం మార్చినెలలో తిమ్మరుసుమంత్రి ముట్టడి ప్రారంభించెను

కృష్ణరాయలు కొండవీటిని ముట్టడించెనని విని కటకాధిపతియగు ప్రతాపరుద్రగజపతి కొండవీటిదుర్గ సంరక్షణార్థము పదమూడు వందల (౧౩౦౦) యేనుగులు, యిరువదివేల యాశ్వికులు, అయిదులక్షలకాల్బలము గల సేనతో బయలుదేరెను. గజపతిరాక గూఢచారులవలన రాయలు విని తిమ్మరుసుమంత్రిని కొంతసేనతో కొండవీటివద్ద నుంచి తాను కొంతసైన్యమును తీసికొని స్వయముగా గజపతిని యెదిరింపబోయెను. ఇరుసైన్యములును కృష్ణానదియొడ్డున తలపడెను. కృష్ణకుత్తరమున గజపతియు, దక్షిణమున రాయలును వుండిరి. అంత రాయలు గజపతి కిట్లు వర్తమాన మంపెను. "మీరు రెండుక్రోసులదూరము వెనుకకు బోయిన మేము నదిదాటి వచ్చెదము. లేకున్న మేము రెండుక్రోసులు వెనుకకు పోయెదము మీరు నది దాటి రావలసినది. లేకున్న అనావశ్యముగా సేనలు మడియును." గజపతి యిందుల కేమియు నుత్తర మీయక యూరకుండెను. అంత రాయలు స్వసైన్యముతో నదిదాటి మేపూరువద్ద కేగెను. ఉభయసేనలకు యెడతెగని ఘోరసంగ్రామము జరిగెను. అందు గజపతిసేనలు నశించినవి. గజపతి విఫలమనోరథుడై కొండవీటిపై నాశవీడి హతశేషమగు సైన్యముతో ప్రాణరక్షణార్థము వెనుకకు మరలెను. రాయలు కీయుద్ధ

---

౧. కొండవీటి సామ్రాజ్యము.

౨. సీ. "పరరాజ పరదుర్గ పరవైభవశ్రీల
గొనకొని విడనాడు కొండవీడు
పరిపంథి రాజన్యబలముల బంధించు
కొమరుమించినజోడు కొండవీడు
ముసురురాజులకును మోహంబు పుట్టించు
గుఱువైనయురిత్రాడు కొండవీడు
చటులవిక్రమకళా సాహసం బొనరించు
కుటిలాత్ములకు గాడు కొండవీడు
జవనఘోటకసామంతసరసవీర
భటనటానేకహాటకప్రకటగంధ
సింధురారావమోహనశ్రీల దనరు
కూర్మి నమరావతికి జోడు కొండవీడు."
—శ్రీనాథమహాకవి.

★

ఆడవి లక్ష్మీనరసింహారావు

మున విశేషమసుధనమును, ఏనుగులు, గుఱ్ఱములు లభించినవి. ఇట్లు ఆడంబరముతో వచ్చిన గజపతి నోడించి రాయలు సేనాపతి వృతుడై తిమ్మరుసునకు సహాయార్థము కొండవీటి కరిగెను. తిమ్మరుసుమోఘాగ్రేసరుడు. రెండుమూడు మాసములు కొండవీడు ముట్టడించి క్రీ. శ. ౧౫౧౫ వ సంవత్సరం జూన్ 23 వ తేదీని (అనగా శా.శ ౧౪౩౭ ఆసాఢశుక్ల యేకాదశి శనివారం) స్వాధీనము చేసికొనినట్లు ఆదుర్గముమీదగల శాసనము వలన డెలియుచున్నది. ౧ ఆదుర్గమునందు గల ప్రతాపరుద్రగజపతికుమారుడు వీరభద్ర గజపతి, కుమారహంవీరమహాపాత్రుని కుమారుడు వీరమహాపాత్రుడు, రాచూరిమల్లాఖానుడు, ఉద్దండఖానుడు, పూసపాటి రాచిరాజు, శ్రీనాగరాజులక్ష్మీపతిరాజు, జన్యాలమల కసవాపాత్రుడు, పశ్చిమబాలచంద్ర మహాపాత్రుడు మొదలగు పాత్రసామంతులను మన్నెవారిని జీవగ్రాహముగా పట్టుకొని వారికి అభయదానమిచ్చి వారినందరను విజయనగరమునకు పంపించెను. ౨ కృష్ణరాయల శౌర్యప్రతాపాగ్ని కోర్వజాలక కొండవీడు రాయలస్వాధీనమయ్యెను. కటకాధిపతి రాయలతో సంధిచేసికొనినపిదప రాయలు పైవారిని విడిచిపెట్టెను. ౩ కొండవీటి విజయానంతరము రాయలు కొండవీటిని మహామంత్రిశేఖరుడును, పితృసమానుడును, గురువును నగు తిమ్మరుసుమంత్రిసత్తమునికి జాగీరొసంగెను. ఈదుర్గమునకు తిమ్మరుసు మేనల్లుడగు నాదెండ్ల అప్పయామాత్యుని ప్రతినిధిగా వుంచెను. కృష్ణరాయలు యాత్రార్థము వెళ్లినపుడు తిమ్మరుసుప్రధాని ప్రభుత్వముయొక్క సివిల్, మిలిటరీ పనులన్నియు చూచుచుండెడివాడు. ౪

కొండవీటియుద్ధమున రాయలవెంట కవులు మాత్రమేగాక రాణులగు చిన్నాదేవి, తిరుమలదేవులుగూడ కలరు. కొండవీటి విజయానంతరము రాయలు భార్యలిరువురితో ధరణికోటకు జని యచట అమరేశ్వరుని సేవించెను. అమరావతియందు రాయలు స్వామిని దర్శించి తాను సువర్ణతులాభారము తూగి బ్రాహ్మణుల కొసంగెను. రాణి చిన్నాదేవి రత్నధేనుదానమును, రాణి తిరుమలదేవి సప్తసముద్రదానమును చేసిరి. కృష్ణరాయలు తనతండ్రి పేర 'పెద్దముద్దూరు' అను గ్రామము దేవునికిని, తనతల్లిపేర 'నిడుమానూరు' 'వల్లూరు' అను గ్రామములు వేదపారాయణము చేయుటకు నూటయెనిమిది (౧౦౮) మంది బ్రాహ్మణులకును దానము చేసెను. నూతనముగా జయించినవానిలో రెండుగ్రామములు పురోహితుడగు రంగనాథదీక్షితునకు యిచ్చెను. కొండవీటి విజయానంతరము సుమారు పదునైదు దినములకు శా. శ. ౧౪౩౮ ఆసాఢ బహుళ ౧౨ న యిచ్చినట్లు తెలియుచున్నది. ౫

కృష్ణరాయలు కొండవీటిని జయించుటకు పూర్వము నిర్ణయింపబడిన యజమాని పెత్తనదార్లందరు రాయలవిజయానంతరము ఆయనను దర్శించి వారివారి పెత్తనములు వారికే యుండునట్లనుగ్రహింపవలసినదిగా కోరగా రాయ లట్లు నియమించుట కంగీకరించి వారి కానందము కలుగజేసెను. కొండవీటి రాజ్యము క్రిందగల వివిధగ్రామములకు నియమించిన పెత్తనదార్లను యీ క్రింద వ్రాయుచున్నాను.

| గ్రామముపేరు | పెత్తనదార్లు |
|---|---|
| కొల్లిపర... | (౧) మాచర్లవారు (౨) మహంకాళివారు. |
| మున్నంగి, దంతలూరు | ఖేతనభొట్లవారు. |
| ఈమని...... | నగరంవారు |
| ఆతుమూడి............ | శిష్టవారు |
| తెనాలి | (౧) పిల్లలమఱ్ఱివారు (౨) నందులవారు |
| మంచాల | శిష్టవారు |
| సుద్దపల్లి | దంటువారు |
| జంపని | రంగవీటివారు |
| కుంచవరం | అత్తోటవారు |
| పెడమటి జొన్నలగడ్డ, పోతవరము | రూపాకులవారు |
| అన్నవరం | మాగంటివారు |
| గొడవర్రు | పిసపాటివారు |
| నందివెలుగు, కటివరం | పన్నాలవారు |
| కరిలేరు | వంగలవారు |
| పెదపలకలూరు | బొడ్డుపల్లివారు |
| దుగ్గిరేలపూడి | మెట్టవారు |
| నల్లూరు, కొమరాజుగడ్డ, చాట్రగడ్డ | కొత్తపల్లివారు |
| వెల్లటూరు | తంగిరేలవారు |
| చినతాళ్లూరు | గుండెపూడివారు |
| పాలడుగు | వేదాలవారు |

---

౧. Epigraphia Indica Vol. VI, Page 117-233 or No 58 & 25 of 1889 Epigraphic collections.

౨. A. S. R. 1908, 9 page 178

౩. A. H. R. Vol. II, page 212

౪. Nos. 18 and 64 of 1915, Madras, Epi. Coll.

౫. Nos. 266, 272 of 1897, Madras Epi. Coll.

# ఆంధ్రుల గోత్రపరంపర

★

కొత్త
భావయ్య
చౌదరి

ఆర్యమతానుసారు లైన హిందూదేశ వాస్తవ్యుల కందరికిని, యేదేశములో, యే స్థానములో నుండినవారికైనను గోత్రములును, ప్రవరలును, సూత్రములును గలవు. గోత్రము లన్ని వర్ణములవారిలో చెప్పగలరుగాని బ్రాహ్మణులలో మాత్రమే ప్రవరలు, సూత్రములు చెప్పుదురు. ఇవి యార్యుల కెట్లు వచ్చి నదియు దెలుసుకొనుటకు ముందుగ నార్యులకు నాంధ్రులకు గల భేదమును గమనింతము.

వేదకాలమున నార్యులు వేరుగ ఆంధ్రులు వేరుగ నుండిరి. ఆర్యు లాంధ్రులను దస్యులుగా బరిగణించినట్లును, వీరు విశ్వామిత్ర సంతతి యనియు నైతరేయ బ్రాహ్మణములోని యీ క్రిందిసూక్తము వచింపుచున్నది.

"తస్య హ విశ్వామిత్ర స్యైకశతం పుత్రా ఆసుః. పంచాశత్ ఏకజ్యాయాంసో మధుచ్ఛందసః, పంచాశత్ కనీయాంసః. తద్యే జ్యాయాంసో నతే కుశలం మేనిరే. తాన్ అను వ్యాజహారణ్ తాన్ వః ప్రజాభక్షీ ష్టేతి త ఏతేంఽధ్రాః, పుండ్రాః, శబరాః, పుళిందా మూతిబా ఇత్యుదంత్యా బహవో భవంతి వైశ్వామిత్రా దస్యూనాం భూయిష్ఠాః"

ఈయాంధ్రులు వైదేహు లనియు, గ్రామముల బయటనుండువా రనియు మనుస్మృతి తెలుపుచున్నది. ఇట్లు మొట్టమొదట నార్యులకన్న తక్కువదశలో నున్నను, ఆంధ్రు లత్యంత ప్రాచీను లైయుండి క్రమముగా నార్యులతో సంబంధము లొనర్చి వారిమతములలో గలిసిపోయి వారివలెనే గోత్రసూత్రాదుల నేర్పరచుకొనిరి. బ్రాహ్మణులలో దశవిధ బ్రాహ్మణు లుండుటయు నం దాంధ్ర, ద్రావిడ, మహారాష్ట్ర, ఉత్కళ, గౌడ, కన్యాకుబ్జ, కేరళాది దేశముల వా రుండుటయు నెల్లరెరిగిన దే. ఆంధ్రు లార్యులలో గలిసినతర్వాత వా రేర్పరచిన చతుర్వర్ణము లలో జేరి వారిమతానుసారమే యజ్ఞయాగాది క్రతువుల నొనర్చుచువచ్చిరి. ఇక వారి గోత్ర సూత్రములను గురించి చర్చింతము.

గోత్ర మనగా పసువులమందస్థలము లేక మందయని యొకయర్థము చెప్పవా రార్యులు వేదకాలమున పశుధనము మాత్రమే గల్గియుండి యచ్చటచ్చట మందలుగా నుండువా రనియు, నాయామందలలోని పెద్దలపేళ్లే గోత్రములనియు నామందలో దర్వాతవచ్చిన ప్రముఖులపేళ్లే ప్రవర లనియు జెప్పుదురు. గోత్రమనగా మూలపురుషుడు లేక పుట్టస్థుడని సాధారణముగా జనులు వాడుకొనుచున్నారు గాని యీయర్థ మాపదమునకు లేదు. గోత్ర మనగా స్వర్గమును రక్షించునది లేక యిచ్చునదని యర్థమని కొందఱు చెప్పుదురు. ఈవిషయమై సుప్రసిద్ధ విద్వాంసులగు తాతా సుబ్బరాయశాస్త్రిగారి యభిప్రాయము గమనింపదగియున్నది. దాని నీక్రింద వివరించెదను.

"గోత్ర మనగా—వంశములో గోత్రవంశ శబ్దములు పర్యాయములు. పురాణములలో ఋషులను గోత్రకరులని కొన్నిచోట్లను వంశకరులని కొన్నిచోట్లను వాడిరి. మరియు అపత్యము గోత్రమని ఋషులవాడుకలో కన్పడుచున్నది. అపత్య మనగా ఉత్తమలోకము నుంచి పతనము లేకుండ చేయునది. గోత్ర మనగా స్వర్గమును రక్షించునది. అచట గోత్ర శబ్దమునకు స్వర్గమనియర్థము. కావున గోత్రాపత్యశబ్దములు పర్యాయములు. కొందఱు మనప్రాచీన గ్రంథసంప్రదాయము నెఱుగక గోశబ్దమునకు ఆవు లను అర్థమునుమాత్రము సంగ్రహించి గోత్రశబ్దమునకు విపరీతార్థము లను వ్రాసిరి. వంశాభివృద్ధి కలిగినగాని పితృదేవతల కుత్తమలోకము లుండవని యార్యుల యభిప్రాయము. ఈ యంశము భారతము నందలి జరత్కారుచరిత్రమువల్ల స్పష్టమగును. వంశములకు అందలి ప్రసిద్ధపురుషుల పేళ్లు పెట్టుటవాడుకై యున్నది." గోత్ర పదములో పుట్టస్థుడను నర్థము లేకున్నను వీరియభిప్రాయము ప్రకారము గోత్రపురుషులు మూలపురుషులే యని తేలుచున్నను క్రింద వివరింపబోయెడి కారణములను బట్టి గోత్రపురుషు లన్నికులములవారికిని మూలపురుషులు కావనియు వా రొకవేళ కొన్నికుటుంబములవారి కట్లుండినను గోత్రపురుషులు మతాచార్యు లనియు మతాచార్యులకు సహాయులుగా దర్వాత నేర్పడినవారే ప్రవరఋషులనియు, వానిపై మతకర్తలే సూత్రజ్ఞు లనియు జెప్పుటకు సాహసించుచున్నాను.

బ్రాహ్మణులలో రాజవంశములలో జనించిన విశ్వామిత్ర, ముద్గల, శునక, మిత్రయు, కణ్వ, విష్ణువర్ధన, హరీత, రథీతర, వీతహవ్యాదులు గోత్రపురుషులుగా నున్నట్లు ద్రావిడ బ్రాహ్మణవంశచరిత్రవల్ల దెలియుచున్నది. ఇంతేకాక మాంధాతృ, అంబరీషమహారాజులు కుత్సస, హరితస గోత్రీకులునైన ద్రావిడబ్రాహ్మణ వంశములకు ప్రవరఋషులుగా నున్నట్లు తెలియుచున్నది. ఈ రాజగోత్రములనుగురించి ద్రావిడచరిత్రకారు డిట్లు వ్రాయుచున్నాడు.

"విశ్వామిత్ర, శునక, మిత్రయు, ముద్గల, కణ్వ, విష్ణువర్ధన, హరీత, రథీతర, వీతహవ్యాదులనుకొందఱు క్షత్రియులుకూడ గోత్రకర్తలుగ నున్నారు. వీరు క్షత్రియులుగ నున్నంతకాలము గోత్రప్రవర్తకులు కారు. వీరు తపస్సామర్థ్యముచేత బ్రాహ్మణ్యమును పొంది గోత్రకర్తలయిరి." దీనినిబట్టి యీ లెడు పుట్టుకతో బ్రాహ్మణత్వమురాని కొందరు రాజులు బ్రాహ్మణత్వముస్వీకరించి బ్రాహ్మణ వంశములకు మూలపురుషు లైనట్లు భావించినట్లు కనుపడుచున్నది. విశ్వామిత్రగోత్రము లేక ప్రవర బ్రాహ్మణులలోనే గాక, క్షత్రి

యులలోను, వైశ్యులలోను, శూద్రులలోను స్పష్టముగ గన్పడుచున్నందున నీ వర్ణములవారి కందఱకిని కౌశికుడు మూలపురుషు డనుటకు వీలులేదు. పైన నుడివినరీతి నీత డాయావర్ణములలోనివారికి మతాచార్యుడుమాత్రమే యైయుండెను. విశ్వామిత్రు డాంధ్రుడని యైతరేయబ్రాహ్మణము వచింపుచుండగా నాతడు ద్రావిడబ్రాహ్మణులకు మూలపురుషుడని చెప్పుటగూడ భావ్యముగా గన్పడదు. కోట శ్రీరామకవి సానందోపాఖ్యాన మను గ్రంథము రచించి యందు తాను కౌశికగోత్రజుడనని వ్రాసుకొనెను. ఈకవి శూద్రుడు. ఇంతేగాక వైశ్యులప్రవరలలో వసిష్ఠకుల గోత్రీకులకు వసిష్ఠు డనియు, కదంబకులగోత్రీకులకు కౌత్సు డనియు, క్రమశిష్టగోత్రీకులకు శరభంగుడనియు, ఘనకులగోత్రీకులకు కృష్ణుడనియు, ఖీమశిష్టగోత్రీకులకు జాబాలి యనియు, ఇక్ష్వాకుగోత్రీకులకు మహాతేజస్సు డనియు, గణముఖకులగోత్రజులకు కశ్యపు డనియు, ముష్టికకులగోత్రజులకు ముచికుందు డనియు, శౌనకకులగోత్రీకులకు శౌనకుడనియు, మన్యకులగోత్రీకులకు మాండవ్యు డనియు,కర్ణాటకులగోత్రీకులకు కణ్వు డనియు, ఘంటకులగోత్రీకులకు పల్లవఋషి యనియు, జానుకులగోత్రీకులకు జహ్ను డనియు, విక్రమశిష్టగోత్రీకులకు విశ్వామిత్రు డనియు, సాంతాలకులగోత్రీకులకు వాల్మీకి యనియు, తుప్పాలకులగోత్రీకులకు తుంబురు డనియు, కుమారశిష్టగోత్రీకులకు ఉగ్రసేను డనియు, అనంతకులగోత్రీకులకు ఋష్యశృంగుడనియు, అభిమంచకులగోత్రీకులకు యాజ్ఞవల్క్యుడును నిట్లే మరికొందఱుగూడ నున్నట్లు కన్యకాపురాణము వచించుచున్నది. ఇందలివారలలో నన్ని కులములవా రుండుటయు, బ్రాహ్మణ, క్షత్రియ, శూద్రవర్ణములలో గూడ నీ ఋషు లుండుటయు జూచినను వీరు మూలపురుషులుగాని, వంశములోనివారుగాని కాదనియు, మతాచార్యులకు సహాయులుగా నేర్పరుపబడిన ఋషులే యనియు తోపకమానదు. ఋషిగోత్రములు అన్నికులములలో నున్నట్లీ క్రింది యాధారములు గలవు. విశ్వామిత్ర, కౌండిన్య, భరద్వాజ, ఆత్రేయ, కౌశ్యప, మానవ్యస, వశిష్ఠ గోత్రములు నేటికిని బ్రాహ్మణులలోను, క్షత్రియు లనువారిలోను గలవు. మత్స్యవంశ బ్రాహ్మణులకుగూడ కౌశ్యపాదిగోత్రములే ఉన్నట్లు శాసనముల వల్లగూడ దెలియుచున్నది. (S. I. I. Vol. V, పుటలు ౪౨౭)

ప్రాచీనశాసనములను నిష్పాక్షికబుద్ధితో విమర్శించిచూడగా పూర్వకాలమున నీఋషిగోత్రము లన్ని కులములవారికి నున్నట్లు దృష్టాంతములు లభించుచున్నవి. నాగవంశ క్షత్రియులగు మన్నేరు సంక్యరాజును (శా.శ ౧౧౨౫ ప్రాంతీయుడు) సోమేశ్వరుడును (క్రీ. శ. ౧౧౧౪ ప్రాంతమువాడు) కాశ్యపగోత్రీకులని కుమారారామచాళుక్య భీమేశ్వరాలయశాసనమువల్లను, కృష్ణపురశాసనము వల్లను దెలియుచున్నది. పల్లవరాజులలోని రాజసింహ పల్లవేశ్వరుని కాంచీపురమునందలి కైలాసనాథస్వామి యాలయ శాసనమువల్లను, రెండవ సింహవర్మ అమరావతి శాసనమువల్లను మరికొన్ని యితర పల్లవరాజుల శాసనముల వల్లను(S. I. I. Vol. I, పుటలు ౧౨,౯౬) పల్లవులు భారద్వాజగోత్రీకు లనియు, అశ్వత్థామసంతతివా రనియుగూడ దెలియవచ్చుచున్నది. వీ రాకాలమున వృత్తినిబట్టి (ఆరవశతాబ్దము) క్షత్రియులుగా పరిగణింపబడినట్లు హరివంశమున్నగు పురాణములవల్ల దెలుసుకొనుచున్నాము. గంజాంజిల్లాలోని శ్రీకరణములకును, పాత్రులనువారికిని ఋషిగోత్రము లున్నట్లు ప్రత్యక్షానుభవమే గాక ప్రాచీనశాసనములు గూడ కలవు. శ్రీకరణమహానాథసేనాపతి కాశ్యపగోత్రజు డనియు, బచ్చిసేనాపతి పౌలస్త్యగోత్రజు డనియు, గోవిందదేవమహాపాత్రుడు భారద్వాజగోత్రజు డనియు వారి శా. శ. ౧౧౫౭, ౧౨౦౧, ౧౩౩౬ సం. లనాటి శ్రీకూర్మనాథదేవాలయ శాసనములవల్ల దెలియుచున్నది.

(S. I. I. Vol, V.)

పర్లాకిమిడిప్రాంతస్థులగు కాయస్థులకును, కాపులకును ఋషిగోత్రములే శాసనములలో గలవు. బుడుమూరి దామినాయకుకొడుకు చోడగంగుదేవర (శా. శ. ౧౦౭౬ ప్రాంతీయుడు) ఆత్రేయగోత్రు డనియు, పంచాదినారదనాయడు భారద్వాజగోత్రీకుడనియు (ఇతడు ౧౩౯౩ శకమునాటివాడు) ఉరలాన కూర్మినాయకుడు (శా. శ. ౧౧౯౫ ప్రాంతీయుడు) హారిగోత్రజుడనియు, సూరునాయకునికొడుకు కాపుమేగాపనునతడు (శా. శ. ౧౧౯౮ ప్రాంతపురుషుడు) పారాశర్య గోత్రీకుడనియు శ్రీ కూర్మములోని కూర్మనాథాలయ శాసనములవల్ల దెలియుచున్నది.
(S. I. I. Vol. V, పుటలు ౩౯౮, ౪౫౯,౪౭౪)

చంద్రవంశరాజులలోని వాతాపిచాళుక్యులు మానవ్యసగోత్రీకు లనియు, హారీతపుత్రులనియు రెండవకీర్తివర్మశాసనము మొదలైనవి తెలుపుచున్నవి.

(భారతి. శ్రీముఖ సం.)

వైశ్యులప్రవరలలోనేగాక గోత్రములలో గూడ ఋషిగోత్రములు శాసనములలో నున్నవి. శా. శ. ౧౧౨౩ సం. నాటి భీమేశ్వరాలయశాసన మొకటి మాండవ్యగోత్రీకుడగు ప్రోలిశెట్టి వ్రాయించినది కానవచ్చుచున్నది. (S. I. I. Vol. IV, పుట ౪౪౫) ఇతడొకవేళ వైశ్యుడుగాక నే శెట్టియో యనగా సాలిశెట్టి, బలిజశెట్టులలోని వాడైనను వారికి ఋషిగోత్రము లున్నట్లు కనుపడుచున్నదిగదా. ఇదిగాక యాదవరాజులలోని కాటమరాజుతాత వల్లురాజు ఆత్రేయగోత్రోద్భవుడని దశకుమారచరిత్రలో గలదు. బోయలను బిరుదనామముగల్గిన యాదవులు కొందఱు బ్రాహ్మణు లైనట్లును, వారిది కౌండిన్యగోత్రమనియు క్రీ. శ. ౬౭౩ సం. నాటి సర్వలోకాశ్రయమహారాజుశాసనము (ఎపిగ్రాఫీయా ఇండికా సం. ౮, పుట ౨౩౬) వచింపుచున్నది.

భట్రాజులు (వీ రిప్పటిశూద్రులలో జేరినవారు) గూడ నేటికిని కౌశ్యప, భారద్వాజాది ఋషిగోత్రీకులుగనే యున్నారు. బ్రాహ్మణులుగా నుండి, భారద్వాజగోత్రీకులను

కమ్మకులజులనుసరించి క్రీ. శ. ౧౦౦౦ సం. నాటి రెండవ అమ్మరాజవిజయాదిత్యుని కుగ్ర నాస శాసనమును, అమరావతిలోని మరియొక శాసనమును వదింపుచున్నవి. వ్యాసవిస్తరభీతి నవి యుదాహరింపబడుటలేదు. పురాణము లలో భార్గవుడు కొన్ని కులముల వారిని బ్రాహ్మణులుగా నొనర్చె నని వ్రాసియుం డుట నెల్లెరెఱిగిన దే. కమ్మవారికిగూడ మొద ట ఋషిగోత్రము లుండెననియు, బౌద్ధ జైన మతాంతరులై తిరిగి బ్రాహ్మణమతమున జేరి నప్పుడు గ్రామగోత్రము లేర్పడినట్లును పూర్వ శాసనములవల్లను, యిప్పటి అనుభవమును బట్టియు తెలియుచున్నది.

వీనినిబట్టి చూడగా నార్యులు మొదట తమమతములో జేరినవారి కెల్లరికిని అనగా ఆంధ్ర, ద్రవిడ, మహారాష్ట్ర, ఉత్కల, ఘూర్జర, కర్ణాటాది దేశములలోని పలు తెగల వారికిని ఋషిగోత్రములనే యేర్పరచినట్లును, ఆఋషు లాయా తెగల లేక కులములవా రందరికిని మతాచార్యులుగా నుండి గోత్రపురుషులు (వనగా స్వర్గ మిప్పించువారు)గా నెంచుకొనిరనియు, వారికి మతవిషయములలో దర్వాత సహాయులుగా నుండినవారే ప్రవర ఋషు లనియు తెలుసుకొనవలసియున్నది.

ఆర్యు లాకాలమున నొకకులములోనుండి మరియొకకులములోనికి బోవుచున్నట్లు మతానుసారముగా నివర కన్ని కులములవారిలోను ప్రముఖులు ఋషు లగుచుండి మతబోధకులగుచుండినట్లుగూడ పైవిషయములనుబట్టి నుడువ వచ్చును. కౌణ్వశతపథ బ్రాహ్మణమునందున్న యీక్రిందివాక్యముగూడ దీనినే ధ్రువపరచుచున్నది.

“సో యజ్ఞ్యా చ్ఛందోభ్య స్తస్మా ద్యద్యప్ర బ్రాహ్మణో దీక్షతే రాజన్యోవా వైశ్యో వా బ్రాహ్మణ ఇత్యే వైన మాహు శేతర్హి, బ్రాహ్మణో జాయతే.”

బ్రాహ్మణు లైనవారు వైశ్యునిగాని క్షత్రియునిగాని వేదదీక్ష యిచ్చి క్షత్రియునిగాను యజ్ఞదీక్ష నిచ్చి బ్రాహ్మణునిగాను చేయవచ్చునని యీ సూత్రార్థము. విశ్వామిత్రాదు లిట్లే బ్రాహ్మణులై యుండిరి. పై విషయములనుబట్టి నేటి బ్రాహ్మణులలో నన్ని వర్ణములవారును గల రనియు వారందరు వృత్తివల్లనే బ్రాహ్మణులై తుదకు మతాచార్యులై యన్ని వర్ణములకును స్వర్గము గల్పించు గోత్రపురుషులును, ప్రవరపురుషులును, వీరి పై ముఖ్యాంశములను సమర్థించుటకు కొందరు సూత్రఋషులును నైరని దీనివల్ల స్పష్టమగుచున్నది.

ఇట్లార్యులు తమ మతానుసరణములకు ఋషాదుల నేర్పరచి, తమమతము నన్ని దేశములలోను (ఆంధ్ర, ద్రావిడ, మహారాష్ట్ర, ఘూర్జర, కర్ణాట, ఉత్కళాదులు) విస్తరింప జేసుకొనుచువచ్చిరి. దీనినే యాంధ్రు లవలంబించి వారిలో లీనమైపోయిరి. ఇదియే గోత్ర సూత్ర ప్రవరల రహస్యము.

---

# కుబేర పుష్పకం

పూ. వెంకటరమణయ్య

శుద్ధస్ఫటికంలా గుంటుంది; ఆ నైర్మల్యాన్ని కనధి లేదేమో అని పిస్తుందామెను చూస్తే; చలవమల్లు పంచ ముసుగూ, మారుపైటా, తెల్లనికర్పచ్ఛాయా, అడవిమల్లెలాటి యౌవనశరీరసౌష్ఠవం, నొసట విభూతి పుండ్రం, — పాపం! ఆవిభూతిజాడను చీల్చుకొని మరీ నిలువునా పరుగెడు తూంది - మరకతరేఖలాగు పచ్చ బొట్టు తిలకం - వ్రేలికో ఉంగరం ఉంది. దానిలో ఏదో చిత్రరచనకూ డా ఉంది- శ్రీరామపంచాయతనమో ఏదో. జిగజిగలాడుతూన్న ఇత్తడి సజ్జ చేతపట్టుకొని అనుదినమూ వస్తుందామె సుందరంగారి పెరట్లోకి. ఆమెవిశుద్ధతా, ఆ శ్రద్ధా, ఆ శరీర సౌష్ఠవం అవన్నీ వింతగా చూచేది సుందరం "రా! జానకీ, చూడానంది వర్ధనాలన్నీ నీకోసమే విడీనట్లున్నా యి; ఎలా పలుకరిస్తున్నాయో నిన్ను? కోసుకో! నీ కడ్డేమిటి?"

"అక్కా, ఆ చిన్న మొక్కను పూచినపూలు నీపూజకు వదిలేస్తా; తక్కినవి కోసుకొనిపోతా" అన్నాది పిల్లమొలుగుతో జానకి.

నియిష్టమే. నీకు కావలసినన్ని పూలేరుకొనిపో. నమ్ముతావో నమ్మవో నీకోసమే పూలమొక్కలింత జాగ్రతగా నీరుపోసి పెంచుతున్నాను. లేకపోతే నాకేలా? ఆచారమా? పూజా? పునస్కారాలా? ఆఁ! అలా వెళ్లకు జానకీ! ముళ్లకంచె నాట్లు పెట్టేడు, వాడు-మాలీవాడు.

ఆ ఉదయపునీరెండలో ఆ తెల్ల పంచ పైటముసుగులోనుండి తెల తెల్లని ముంజేయి ఆ తెల్లని పూల మీదికి చాచి ముత్తెపుచిప్పలలాటి గోళ్లతో ఆపూలు చిదుముతూ ఉంటే జానకిని వింతదృశ్యంలాగు చూచింది సుందరం-ఏదో నైర్మల్యం-ఏదో దేవత్వం-ఆపరిసరాలంతా నిండి కనిపించేది. పూలతో సజ్జ నిండుతూ ఉంటే సుందరిహృదయం నిండిపోయి నట్టనుకునేది-పూలన్నీ కోసి ఉంగ రపుచేతితో ముసుగు చెవులంట సవ రించుకుంటూ, వాల్గన్నులలో నుండి దృష్టి పూలసజ్జామీదికి జాలుగా విడిచి కాస్తకాళ్లూని నిలిచి, "సుందర మ్మక్కా, వెళ్లదునా?" అని జాలిగా అంది జానకి.

"ఆఁ వెళతావా?"

ఏమో ఆలోచిస్తూంది సుందరం-అంత శ్రద్ధగా ఆమెకు జవాబు చెప్ప కుండా ఆమెముఖ మలాచూస్తూ నిలబడిపోయింది. "ఆఁ! అయితే, జానకీ, సరేగాని చెక్కులచెమట గాబోలు! తుడిచేసుకో! వెళతావు మరీ. ఇంకా పండుకోవాలి కాబోలు!"

"లేదు, ఈరోజు ఏకాదశి కాదూ? భోజనంచేయను గదూ. వడపప్పు కలుపుకుంటా సాయంకాలం."

"ఔనుకాదూ? ఆమాటేమరచి పోయాను, సరే వెళ్లు మరి పూజా విధానం ఉందిగా!"

సజ్జాలో పూలుసర్దుకుంటూ నేల చూచి తాపీగా అడుగులు పెడుతూ జానకి వెళ్లిపోయింది. ఆమెవేపే అలా చూస్తూ నిలబడి సుందరి, ఆమె ఇల్లు దాటేక, అలసటగా నిట్టూర్చింది. జాలిచేత ఆమె నిలువునా ఝల్లనకది లింది. "పాపం చిక్కతే పాలుగారే చిన్నారివయసు! ఆ నిర్మలశరీరసౌష్ఠ వం - ఆనిర్మలహృదయం, ఆనిర్మల భక్తి, ఆనిర్మలాచారం పాపం! ఉప వాసంతో దినమంతా శుష్కించాలి కాబోలు! వడపప్పు..."

* * *

"ఏమేవ్ - ఈవేళ పదిగంటలకే కచేరీకి వెళ్లాలి. ఏం; ఇంకా వంట ప్రయత్నమే చేసినట్టు లేదు.

"ఇదిగో! చేసేస్తాను"

త్రిపురాంతకం - కలక్టరుకచేరీలో గుమాస్తా, సుందరిపెనిమిటి, ముప్ప దేండ్లలోపు వయసువాడు. ఎప్పుడూ ఉత్సాహంతో కాలంగడిపే సంతుష్ట హృదయుడు, సుందరిమీద మంచి ప్రేమ. సుందరానికీ వానిమీద మంచి ప్రేమా, చనువూను. తూచాలు తప్పకుండా గడియారంలాగు సంసా రం త్రిప్పుకుంటూంది. సుందరి కాపు రానికి వచ్చి నాలుగయిదేళ్లవుతుం ది. ఆమెకూడా సంసారం అంటే సవి లాసంగా త్రిప్పుకుంటూంది గాని,

ఏదో భాగంగానూ, బాధ్యతగానూ ఆలోచించేది కాదు. పిల్లామేకా లేదు; పెద్దావిన్నా లంపటం లేదు. త్రిపురాంతకం రాబడి తాము తినా, ఒకరికి పెట్టకూడా చాలును.

"ఏమిటే అలా విచారంగా ఆలోచిస్తూ బియ్యంగడుగుబుట్ట కదప కూడా నిలబడిపోయావు నూతిదగ్గర?"

మెల్లగా ఊగుతూన్న నడకతో త్రిపురాంతకం వచ్చి నిలచే డామెను వింతగా చూస్తూ.

"ఆఁ! ఏమీ లేదండీ!" బుట్ట రెండుమూడుసార్లు కుదిపి నిట్టూర్చింది. నీరువంచుతూ ఆ నీటిధార వైపే అలా వంగి చూస్తూంది. త్రిపురాంతకం కత్తిపీట ముందు వేసుకొని కూరలసజ్జా మూతమెత్తి కూర లెంచుతూ, ఎన్నో వంటవిషయమయిన ప్రశ్న లడుగుతున్నాడు సుందరాన్ని.

"అబ్బ! ఏదో ఒకటండీ. ఈ పాడుపొట్ట కేం తిన్నా పాయ లెద్దు తూ. ఏమి టూరికే స్వయంవరోత్సవం సాగిస్తున్నా రేమిటి?"

దడదడా వంటయింట్లోకి వెళ్లి పొన్నగిల్లిన ప్రొయ్యి రగిల్చింది సుందరి. ఆమె కేం తోచలేదు. ఆలోచిస్తూంది, తొట్రుపడుతూంది.

"ఏమిటో! సుందరి వేళ అలాగుం" దన్నాడు త్రిపురాంతకం, తరిగిన కూర వంటయింటి పొద్దిగట్టున వంగి పెడుతూ. అతని చూపులు సుందరి మీదే ఉన్నాయి.

ఎసరు మరుగుతూంది. సుందరి హృదయమూ మరుగుతూంది, కుతకుతా ఉడుకుతూంది కూడాను. త్రిపురాంతకానికి జవాబే లేదు. ఏదో నిరాశతో, నిస్త్రాణతో నిస్పృహతో కనబడుతూంది సుందరం. భర్తకు వడ్డన చేసింది. భోజనానంతరం ఆకులు మడిచియిచ్చింది. కచేరీబట్ట లందించింది. అతని నంపకం పెట్టి వీధితలుపు గడియ వేసుకొని వంటయింట్లోకి వెళ్లి భర్తవిస్తట్లో నాలుగూ వడ్డించుకొని ఆ పీటమీద కూర్చుంది. యంత్రంలాగే కదుల్తూంది గాని ఆమె నేదో ఆలోచన కళవళ పెట్టేస్తూంది.

తలపులు వారించుకోబోతూంది, తట్టుకోలేకుండా ఉంది. అన్నం కలుపుకొని అభిగారం చేసికొని కడి ఒక చుత్తి నోటిలో పెట్టుకొంది. ఆమె కేమీ రుచి పట్టినట్టు లేదు. కడి నోట నమలకుండా మ్రింగబోయింది. దిగలేదు. చెంబెత్తి మంచినీళ్లు త్రాగింది. అన్నం దిగిపోయినా ఆమె గొంతుకలో ఏదో పచారు చేస్తూంది బిర్రబిగిసి భారంగా.

ఆమె కడుపునిండా అన్నం తిన్నదో లేదో ఆమె గుర్తించలేదు. వాలాయితగా, అయిందనుకొని ఆకు మడిచి అవతల పారవేసింది.

ఏదో దుఃఖం, ఏదో అనుతాపం, ఏదో అన్నుక్రోశం అలా తరంగాలుగా ఆమెను నిలువునా కలత పెట్టి [illegible]

తివాసీ వేసికొని ఆకులతట్టముందుంచుకొని చెక్క నోట నవరిస్తూంది. చెక్కకు వసే లేదు; ఆకులకు కారమే లేదు.

ఈ నతీసిన ఆకు ఇట్టె తీసి నేలను జారవిడిచేసింది. పరిసరాలే చూస్తూంది గాని ఆమె దృష్టిమాత్రం అక్కడ లేదు. ఎవరో వీపుమీద తట్టినట్టు త్రుళ్లిపడి లేచింది. విరవిరా వెళ్లి పడకగదితలుపు తెరచి బల్లమీదనున్న అరటిపండ్లపెడ చేత్తో పట్టుకొని ఈవలకు వచ్చింది. వీధి తలుపు చేరబెట్టనేనా చేరబెట్టకుండా ఆ అరటిపండ్లనే అపురూపంగా చూస్తూ క్రొత్త హెచ్చరికతో పొరుగునుండే జానకియింటికి వెళ్లింది.

జానకి చిన్న సీమవెండిగిన్నెలో కొంచెం పెసరపప్పుపోసి కడుగుతూంది నడుంవంచి నేల చూస్తూ.

అరటిపండ్లపెడ పైటకప్పులో దాచి- "జానకీ" అంది వెనుకపాటున నిలిచి సుందరి.

జానకి త్రుళ్లిపడి వెనుదిరిగి చూచి విస్మయంగా "ఏమక్కా? ఏం కావాలి?"

"నీవే కావాలి."

"నేనెప్పుడూ నీదాననేగా? నాకిం కేలంపట ముందిగనకా?"

సుందరి కన్నులలో నీరు తిరిగినట్టయింది. చేతిలో అరటిపళ్లు చూపుకొని చిన్నబోయింది. ఆమె దృష్టిలనే గమనిస్తూన్న జానకి, పొంగిపోయింది అరటిపండ్లు చూచి. సుందరి తనమొదల చూపిన వాత్సల్యానికి

జానకిహృదయం కొలతపాత్ర కా జాలిందికాను.

రెండుచేతులూ ముందుకు జాచి "నాకేనా?" అంది జానకి. ఆమె అమాయికానందానికి మతిపోయింది సుందరికి. అప్పళ్లు ఆమెచేతిలో పడేసి వస్తానంటూ గిఱ్ఱున తిరిగి తనయింటి లోనికి వెళ్లిపోయింది సుందరి. తలుపు చేరవేసి లోపల కెలా వెళ్లిందో — పడుకగదిలో మంచంమీద మెత్తని దిండులో తలదాచికొని వెక్కి-వెక్కి యేడువ నారంభించింది.

"జానకి, పాపం సృష్టిలో నున్నది. సృష్టే ఆమెకు ఉత్త చేయి చూపింది. సహాయ మపేక్షిస్తే దేమోనని కాబోలు మొండిచేయే చూపింది." ఆమె ఎంత సేపలా తలచుకుంటూ వెక్కి-వెక్కి యేడ్చిందో తలగడా మూడువంతులదాకా కన్నీటితో తడిసిపోయింది. ఆమె గొంతు కారిపోయినట్టు పొడిపొడిగాఅయిపోయింది. అలసటతో ప్రక్క-లెగిరి యెగిరి ఊర్పులు తొట్రుపడుతున్నాయి. పడకి పడకి పెదవులు వేడిగా తోస్తున్నాయి. ఆమె అంతరంగం గాలివాన వెలిసిన అకాశంలాగు తేరుకొంటోంది. ఆమె దిగ్గన లేచి మంచం నడుమ కూర్చుంది; పడుక్కుంది. నిద్రలో శాస్త్ర విశ్రాంతి పొందుదా మనుకుంది. నిద్ర పట్టక లేచి కూర్చుంది. పైటచెరగుతో కను లొత్తుకుంది. ఏదో సమస్థత ఆమెలో రేగింది, ఏదో ప్రత్యేకసత్వం, తనలో ప్రవేశించిన ట్టనుకుంది.

"పాపం! 'వేరులంపటం లే' దని ఎంత జాలిగా అంది జానకి. ఔను, ఏదీ! అయ్యో!" నిట్టూర్చింది సుందరి. కూర్చుంది దిటవుగా మంచం నడుమ. గోడనున్న గడియారం గంటలు కొట్టింది. మూడో నాలుగో. కన్నులు విశాలంగా విప్పి పడుకగది అంతా కలయచూచింది. ఏదో సహాయంకోసం, క్రొత్తగా ఆగది చూస్తూన్నట్టు, గోడను పటాలు, అద్దాలు, నేలను మేజా. మెత్తని పరుపులు దిండ్లు, పూలు, అగరువత్తులు, పచ్చిచందనం, ఫలాహారాలు...ఏమిటిది ?...పడుకగది ! ...ఆఁ! ఇది నాది...ఎట్లు - తెచ్చినానా? ఎక్కడనుండి? అయ్యో - జానకి...పాపం జానకికుటీరం! ఆనాటి జానకి పర్ణకుటీరాన్ని జ్ఞాపకంతెస్తూంది అన్నీఅక్కడే 'వేరులంపట మేముంది?' అంది! అబ్బ ఆమెచూపూ, ఆమాటలధ్వనీ తలుచుకుంటే నాకు వ్రేవులు నులుచుకున్న ట్టవుతూంది పాపం! జానకి - ఏంపాపం చేసింది? ఏంద్రోహం ఎవరికి చేసింది? ఎందు కింతశిక్ష? ఎవరు విధించేరు?". దిగ్గన మంచం దిగి పైట సవరించి దిద్దుకుంటూ అద్దంలో నీడ అప్రయత్నంగా చూచుకొంది. ఆమె కానీడలో జానకి కనబడింది. జాలిగా తలవంచుకొని బల్లమీదికి చూపులు పరపింది. గాజుపళ్లెంలో గంధంముద్ద.

జానకినిర్మలముఖయిన చెక్క-లా రెండిటా కదలుతున్న ట్టనిపించింది. గాఢంగా నిట్టూర్చింది సుందరి. ఏమిటి చేయడం? ఏమీ తోచదు! ఏపని మీదికీ బుద్ధి వెళ్లదు. ఎవరిసహాయం అపేక్షించడమో తెలీదు. ఎందు కీనేరంలేనిశిక్ష? ఎవరు విధించేరు? ఎలా తలబడ్డ దీవిధి? కిరకిరలాడి గింజుకొనిపోయింది సుందరి. ఆఅవస్థలో ఇక నొక అరనిమిషమయినా నిలువలేనంతకటకటంపడ్డది... "ఆఁ! సంఘం! ఇదా! సంఘమంటే ఎవరు? ఎవరు? నేనూ నువ్వూ!" భర్త ఆమె కన్నులయెదుట నిలిచిన ట్టనుకుంది. "సంఘం మీరూ నేనూనా? -ఔను మనమే - ఈ ఉసురు- ఈ అమాయికపుదుఃఖం, ఈచిత్తక్షోభ, ఈ ఎడతెగని కలతవడ్డ సముద్రఘోష, వినిపించుకోదూ సంఘం? సంఘం ఎవరు? నేనూ ఆయనానూ. ఏరీ ఆయన? కచేరీ, గంటలనియమం! ఎవరి ఘోష వారిది. లోకం తన సందడిలో చెవుడుపోయింది. అబ్బ! ఎంత ఘోష! మేమే సంఘం - సంఘం- సంక్షోభావం." గోడ నున్న వాచీ చూచింది, "అయిదు! ఇంకా పావు గంటకి ఆయన వస్తే సంఘ మన తాను. సంఘాని కింత నెత్తికిల్లా? తన కనురెప్పల నీడలో మల్లెపువ్వు విడబారుతూ నలిగిపోతూంది. ఇనుప రెప్పలు నిప్పులు చూస్తూంది. చల్లార్చే కరుణ! ఒక చిన్న తుషారం! ఒక చిన్న జల్లు! ఒక ప్రవాహం. ఎందుకు కూడదూ?" అంది సుందరి గట్టిగా.

తలుపు తెరచికొని వస్తూన్న త్రిపురాంతకం ఆమాట విని "ఎం

మను కూడదూ! కూడునే" అన్నా
ష తనకు సహజమయిన సంతోష
ధోరణిలో, ధ్వనితో.

త్రుళ్లిపడి వాని కెదురుగా వెళ్ల
బోయి జానకి గదిగుమ్మంలో ఆగి
పోయింది. ముందువెనుకల కొట్టాడు
కుంది ఆమెహృదయం.

"సుందరీ!" పిలుస్తూ ముఖం
చూచి త్రుళ్లిపడి తెల్లబోయి నిలబడి
పోయాడు, త్రిపురాంతకం.

"కళ్లూ మొగమూ ఏమంత ఎఱ్ఱగా
ఉన్నాయి? ఇంతసేపూ ఏడుస్తున్నా
వా? జుట్టమీా అంత చింకిరయిపోయిం
ది," (చేరబోయి) ఏమిటి చెప్పు. నిన్ను
నేనేమన్నా అన్నానా?"

"అయితే నేను నొచ్చుకుంటా
నా?"

"మరేమిటి?"

"ఏంలేదూ. ద్రోహం చేసిన హృ
దయానికి శాంతి ఉండదుగా?"

"ఏమిటో నీమాట నాకు బోధ
పడలేదు."

"సంఘమంటే మనమేనా?"

"మనమూ, మరికొందరూను."

"మనం అనుకోకుండా చేస్తూన్న
ద్రోహం మీా రెప్పుడేనా గుర్తిం
చారా?"

"ఏమిటో?" నవ్వబోయాడు
త్రిపురాంతకం.

"నవ్వుతాలుగాదు. నేనిలా ఏడు
స్తూఉంటే మీాకునవ్వొలావస్తూంది?"

"పొరపాటే! అది అలా గుంచి
అసలుసంగతేమిటో చెప్పు"

"జానకి - పాపం!...
నాకు మాటలు తెమలకుండా
ఉన్నాయి."

"ఏమిటో కొంచెం చెప్పు నేను
మిగిలింది గ్రహిస్తాను."

"జానకి, సృష్టికే దూరమయి
పోయి అలా చీకువారవలసిందేనా?
త్రోవలేదూ? ఆమెకు...అదేమిటో
నాకు చెప్పడం వచ్చిందికాదు; కొండ
చరియలో వాగులాగు నాకు దుఃఖం
పొంగిపొరలివచ్చింది."

"సరే, పోనీ, నీకు దుఃఖం ఉప
శమించాలంటే మన మేంచెయ్యాలి?
నే నేంచెయ్యాలి?"

"ఆమెను మనయింట్లో ఉంచు
కొనికను రెప్పలలో పెట్టుకోలేమూ?
చేసిన అపచారానికి ఉపశాంతి-"

"ఓ! రాసీ, ఇందుకేనా ఇంత
వాపోతున్నావు -. ఇదో పెద్దకార్య
మా?"

* * *

"సుందరీ! మగవాని మనస్సు
కుబేరపుష్పకం! తెలిసిందా."



# మంచుపాట

కుందుర్తి నరసింహారావు

వ్రాసినపద్యముల్ జెరిపివైచితి నీ దరహాసచంద్రికల్
లేశము దానిలో ప్రతిఫలింపమి; ఈ మధుమాససర్వతో
ల్లాసము నీనిరంతరవిలాసమయాంగరుచిన్ వహించి నా
కోస మటే కడానిపలుకుల్ కురిపించెడి తాన కావ్యమై?

ఈమధుమాస శోభ ద్విగుణీకృతమైనది మంచుకొండపై
బూమిన కప్పురమ్మున గుబుల్కొను వాసనవోలె మంద వా
తామృత సేచనార్ద్రి కుసుమాగ్ర నట ద్ధిమబిందు మౌక్తిక
స్తోమ మినాంశుకుందనరుచుల్ శతథా విరజిమ్ము నేర్పునన్.

కంటికి మంటి కేకనదిగా విలపించెడి నా యెడందకున్
జంటగ నిల్చి యేడ్చు హిమశైల సుహృద్వరు డంచు కావ్యమం
దంటిని గాని మున్నది యథార్థము గాదు; రసార్ద్రమూర్తు ల
న్నింటి సనూహ్య హర్షమయలే యొనరించు నితం డజేయుఁడై.

తెమ్మెర మాటలన్ జెరిపితిన్ మును వ్రాసిన పద్యముల్ సమ
స్తమ్ము నసత్యపుం దొసగుదాక, భవద్దరహాస రూప స
త్యమ్మొక డీ యనంత హిమధామమునన్ జనియించి సర్వలో
క మ్మెగఁబ్రాకు నేడమృతకావ్య మనోజ్ఞకళాప్రసన్నమై.

నే నిక నెన్నఁడుం బలుక నీ కమనీయ హిమావనీధర
ప్రాణసఖుండు పాడు మని యాజ్ఞ సమీరునిచేత బంపినం
గాని, విషాద గద్గద వికంపిత కంఠ నిశాంత ముక్తమై
ప్రాణము పోయినన్, దిశలు బ్రద్దలుగా నెద యార్చి వ్రచ్చినన్.

# తెనుఁగు వ్యాకరణము - కొన్ని విశేషములు

కట్టి సాంబమూర్తిశాస్త్రి

వ్యాకరణములయొక్క ప్రయోజనమును గూర్చి పలువురు పలువిధములగు నభిప్రాయములు గలిగియున్నారు. ప్రజలవ్యవహారమునందు బడి పదములు క్షణక్షణము విపరీతములగు మార్పులు బొందకుండ నెల్లప్పుడు నొక్కరీతిగానే యుండునట్లు నియమించుట వ్యాకరణముల ప్రయోజనమని ప్రాచీను లందురు. నవీనులు వ్యాకరణములు భాషను నియమింపనంతమాత్రమును సమర్థములు గావు. భాష ప్రవాహమువంటిది. దేశకాలపాత్రభేదములవలన నయ్యది మారుచునేయుండును. ఆయా కాలములందు దేశములందును భాషకు సంభవించినమార్పులను గన్నుల కగపడునట్లు ప్రదర్శించుటయే వ్యాకరణముల ప్రయోజనమని యందురు. ఈ రెండుపక్షములవారికిని భాష నుపయోగించుటలో గొంతయభిప్రాయభేదమున్నను పదముల వ్యాకరించు విషయమున మాత్రము మార్గ మొక్కటిగానేయుండును. ఇరువురును బద ముచ్చరించినంతనే దానికి ప్రకృతి యేది, ప్రత్యయ మేది, యనియే చూచెదరు. రచించుపట్ల నందరు నేకాభిప్రాయము గలిగియే యుందురనుట వాస్తవము.

పదములకు సమగ్రమగువ్యుత్పత్తిని దెలుపు వ్యాకరణములన్నింటిలోను సంస్కృతభాషకు సంబంధించినపాణినీయము మిన్నగానున్నది. ఆభాష చిరకాలముక్రిందటనే వ్యవహారభ్రంశమొందుటచే నందలి వ్యుత్పత్తులను జక్క నెఱుంగుట కవకాశము లభించినది. దేశభాషలన్నో యింకను మార్పులనేకములు పొందుచున్నవి, పొందనున్నవి. కావున వాని కట్టిసమగ్రవ్యాకరణము సమకూడనేరదు. ఆంధ్రవ్యాకరణముల విషయమున నభిప్రాయభేదము లధికముగానున్నవి. ఎవ్వడో కవిరాక్షసుడట! నన్నయభారతము- తొలిమూడుపర్వములందు ప్రయోగించినపదములు దక్క నితరములు ప్రయోగింపరాదని నియమించివేసినాడట! ఆంధ్రశబ్దచింతామణి, అథర్వణకారికావళి, మొదలగునవి ప్రాచీనులు రచించినవ్యాకరణములు. వానిరచించినవారు కేవలము సంస్కృతపండితులు, వైయాకరణులు నగుటచే దమకృతులను గేవలము సంస్కృత వ్యాకరణమర్యాద ననుసరించియే రచించిరి. నవీనులగు శ్రీమాన్ పరవస్తుచిన్నయ్యసూరిగారుగూడ తమ బాలవ్యాకరణమును గేవలము సంస్కృత వ్యాకరణమర్యాదనే రచించిరి. సూరిగా రంతకుముందటివారికంటె గూడ నెక్కుడుగా బాణినీయపరిభాషలను సంజ్ఞలను దమగ్రంథమున నుపయోగించిరి. వర్తమానకాలమున నాంధ్రభాషాపండితుల కెల్లరకును గొప్పప్రామాణికులు శ్రీ చిన్నయ్యసూరిగారే. శ్రీమాన్ బ.సీతారామాచార్యులుగారు సూరిగారి గ్రంథమునందలి లోపముల బూరించి దానిని సంపూర్ణ మనదగునట్లు త్రిలింగలక్షణశేషమురచించినను ప్రామాణికత్వమున సూరిగారి కించుకతక్కువగానే చూడబడుచున్నారు. వారెల్లరును రచించినవ్యాకరణములన్నియు గేవలము నిరంకుశముగా భాషను శాసించుటకే యుపకరించునుగాని దేశకాలాదిభేదములచే బదములపరిణామమును దెలిసికొనుట కంతగా నుపకరింపవు. ఇప్పుడిప్పుడు గొందఱు ఆంగ్లభాషాపండితులు ఆంధ్రభాషలో సహితము గొంతపరిశ్రమము గావించి భాషాపరిణామము దెలుపుచుండుట శుభసూచకము. పాణిన్యాచార్యుడు తనకు వశపడినంతవఱకు ప్రకృతిప్రత్యయవిభాగము గావించి శక్యముగానివాని నవ్యుత్పన్నప్రాతిపదికలుగా వదలివేసినాడు. ఎవరియిచ్ఛ కుస్ఫురించినరీతిని వారు రూపకల్పనముచేసికొనుటకు వివిధములగుగణములసృజించినాడు. ఉణాదులు, పృషోదరాదులు, శకంధ్వాదులు, మొదలగుగణములు వక్తలబుద్ధివిశేషమువలన గ్రామభేదప్రాయముగ శబ్దముల సగియుచున్నవి. ప్రస్తుతము ఆంగ్లాంధ్రపండితులుగూడ దమతమబుద్ధివిశేషములెల్ల వినియోగించి శబ్దముల తత్త్వము లోకమున కెఱింగించుచున్నారు. పండితులు గమనింపవలసిన కొన్ని విశేషములు నాకు స్ఫురించుటచే వాని నీ క్రింద బ్రకటించుచున్నాడను. పండితులు వానియాథాతథ్యము విమర్శించి లోకమున కుపకరింతురుగాక!

## విభక్తిప్రత్యయములు

ప్రాచీనకాలమున బదములకు బరస్పరసంబంధము తెలుపుటకు గొన్నిపదములనే యుపయోగించెడివారనియు, కాలక్రమమున శీఘ్రోచ్చారణాదికారణములచే నా సంబంధము తెలుపుపదములు క్షిప్తపఱుపబడినవనియు, లుప్తశేషములే యిపుడు ప్రత్యయములని వ్యవహరింపబడుచున్నవనియు గొందఱు చెప్పుచున్నారు. ఈవిషయము మన ఆంధ్రవైయాకరణులుగూడ నెఱింగినట్లే యగపడుచున్నది. వారు కంఠోక్తిగా నీవిషయము చెప్పకున్నను వారు గ్రహించినప్రత్యయములవలన దెల్లమగుచున్నది. స్పష్టముగా నిర్ధారణము చేయవలయునుగాని డు,ము,వు,లు మొదలగు వానిని ప్రత్యయములుగా గ్రహించినారు. ఉండు, కూడు ధాతువులక్త్వార్థరూపములగు ఉండి, కూర్చి మొదలగువానిని గ్రహించినారు. కావున నీవిషయము వారు బాగుగా నెఱింగినదియే యని చెప్పవచ్చును. విభక్తిప్రత్యయము లన్నింటిలోను "లు"వర్ణకము మాత్రము బహువచనమని యందరును జేర్కొనిరి. అది కేవలము ప్రథమావిభక్తియందే వచ్చునని గూడ జెప్పిరి. ద్వితీయాదిబహువచనములందు లడాగమమని వేఱుగా నొకలకారము నాగమముగా విధించిరి. "లు"కారమే అన్ని విభక్తులందును బహుత్వద్యోతకముగా నుండుననియు దాని కితరవిభక్తులు పరమగునపుడు ఉకారమున కకారము ఆదేశమగుననియు విధించుట సమంజసముగా నుండునని నాయభిప్రాయము.

వ్యావహారిక భాషలో "వృక్షములచేత" "ధన ములయొక్క" మొదలగు కొన్ని ప్రయోగములు సామాన్యముగా నున్నవి. ఎప్పుడే నక్కడ "లు"వర్ణ ముండియుండకున్న నట్టివ్యవహార మెట్లు సంభవించును ? మొట్టమొదట "లు"వ ర్ణముగానే యుండి కాలక్రమమున నాఉకార మత్వాంతముగా మాఱియుండును. అప్పుడు లాక్షణికులు ఆలకారము నాగమముగా విధించి యుందురు. వార ల్లాగమముగా జేర్కొ నుట కొక్క హేతువుకూడ గలదు. ప్రత్యయాంతమునకు ప్రాతిపదికసంజ్ఞ లేదని సంస్కృతవైయాకరణులసిద్ధాంతము. దానినే యాంధ్రవైయాకరణులు నంగీకరించిరి. కాని దానికి విరుద్ధముగా ధనములనుగూర్చి మొదలగు ప్రయోగము లనేకము లున్నవి. ఆట్టిస్థలములం దెల్ల నాగమములు పెక్కింటిని విధించియు న్నారు. ఇట్లు పెక్కు ఆగమముల విధించుట కంటె విభక్త్యంతముకంటె విభక్తిపూర్వత్వము మన ఆంధ్రభాషలోని ప్రత్యేకసంప్రదాయ మని యంగీకరించుట సమంజసముగా దోచు చున్నది.

కూర్చి: ఇది ద్వితీయావిభక్తి ప్రత్యయ మని యుప్పటివ్యాకరణపుస్తకములు పెక్కింటి యందుండును. కాని చిన్నయ్యసూరిగారును, సీతారామాచార్యులవారును, దానిని విభక్తి ప్రత్యయముగా జేర్కొనలేదు. కూర్చియను నది కూడుధాతువునకు ప్రేరణార్థంబున జుక్కుపరంబగు నప్పుడు "ఆదేశోడుకూరులడ కారణజనకుం జక్కు పరంబు లగునప్పుడు రేఫంబగు"నను సూత్రముచే రేఫము రాగా నైన రూపమనికాని కూర్చుధాతుజమైనరూపమని కాని వ్యాఖ్యానము మైయుండును. ప్రౌఢ వ్యాకరణమున "ఈ ద్వితీయార్థంబునందు నుజేరిచి యుక్తప్రయుక్తంబని సూత్రింపబడినది. ఇందలి "యు"అక్షరసముచ్చయమువలన గ్రహిం పబడునది కూర్చి లేక నుజేరిచి యుపయోగించు యుక్తరూపమా ? యని సంశయము కలుగు చున్నది. కూర్చియు, నుజేరిచియుకూడ ద్వి తీయావిభక్తిప్రత్యయములేయని యుప్పటివా రనుచున్నారు ! ఆట్లయిన సూత్రమందలి సముచ్చయముచే దీనిని గ్రహింపవలెను ?

రెంటిని గ్రహించుట కవకాశము గలదేమో ? సూత్రమున నుజేరిచి యని నిర్బంధకముగా విధించి యనుప్రయుక్తమనని విధించిరేకాని యయ్యది ప్రత్యయమో, ధాతుజరూపమో చె ప్పలేదు. నుజేరి చూచి అనుపదములు శబ్దపల్లవ మర్యాదచే "చూ" లోపింప నుజేరిచి అనురూప మేర్పడును. నుజే ఉంచి అనుపదములుకూడ నామర్యాదనే ఉకారము లోపింప నుజేంచి యనురూపమేర్పడును.

చేత చేన్ : తృతీయావిభక్తి ప్రత్యయ ములుగా చేత తోడ వర్ణకములు విధింప బడినవి. చేయిశబ్దమున కొన విభక్తిక మను "త"వర్ణకము చేర్చి యిత్వమున కత్వము చేయగా చేతక అనురూపమును తివర్ణము చేర్పకున్న చేన్ అనురూపమును సిద్ధించును. కావున చేతన్ చేన్ అనునవి చేయిశబ్ద రూపములుగాని ప్రత్యయములు గానేరవు. తృతీయావిభక్తిప్రత్యయము కేవల నువర్ణక ముగామాత్రమే అగపడుచున్నది. ఇదియేకాక సాధారణముగా నన్నివిభక్తులందును నువర్ణ కమే ప్రత్యయముగాను ఇతరపదములు పూ ర్వానుప్రయుక్తములుగాను నగపడుచున్నవి.

తోడక తోన్ : ఇట తోడు శబ్దము నువర్ణకమునకు పూర్వానుప్రయోగమును ఉత్వంబున కత్వంబును చేయగా తోడన్ అనురూప మగును. తోడులోని డువర్ణము వై కల్పికముగా లోపింప తోన్ అని సిద్ధించును.

కొఱకు: ఇది కొఱ శబ్దమునకు షష్ఠీవిభక్తి ప్రత్యయమగు "కు"వర్ణకము చేర్పగా నైన రూపము. సాధారణముగా షష్ఠీ,చతుర్థీవిభ క్తులు సమానార్థములవిగానే యున్నవి. నీకు వందనము, నీకొఱకువందనము నని రెండు విధములగు ప్రయోగములు నగపడుచున్నవి. సం స్కృతభాషయందు నిట్టివ్యవహారము గలదు. కావుననే యుష్మదస్మచ్ఛబ్దములకు తే,మే అనురూపములు రెండువిభక్తులందును గనబడు చున్నవి.

మఱియు "కై"అనునది షష్ఠీప్రత్యయ మగు కు వర్ణకమునకంటె ఐ అను అంధాతువు యొక్క క్త్వార్థకరూపము యొక్క కైప రూపమును "ఐ" చేర్చుటచే సిద్ధించినరూపమే

కాని ప్రత్యయముగాదని తెలియనగును. కా గా, చతుర్థీవిభక్తియందును "ను" వర్ణమొక్క టి, మాత్రమే ప్రత్యయమని తేలుచున్నది.

వలనన్ పంచమి. వలనుశబ్దమునకు దిక్కు అని అర్థముకదా ? దానికి నువర్ణకము చేర్చి యుత్వమున కత్వము చేయగా వలనన్ అని రూపనిష్పత్తి యగును. కాగా పంచమీ విభక్తియందును, నువర్ణకమే ప్రత్యయమనియు దానికి పూర్వానుప్రయోగము"వలన" అనియు నెఱుంగనగు.

కంటెన్ : ఇది నువర్ణకమునకు దృశ్యర్థ కమయిన కనుధాతుజన్య మగు కంటె (చూచితివా అని అర్థము) అనుపదము అనుప్ర యుక్తమై దీర్ఘమునకు హ్రస్వము రాగా నైనరూపము. "రామునికంటె నన్యుండు ధాను ష్కుండు లేడు"ఇత్యాదిస్థలములందు రాముని చూచితివా; తదితరుండు ధానుష్కుండు లేడు అనియర్థము, "కంటెవర్ణకం బన్యార్థాదియోగ జంబగుపంచమి కగు" ననుసూత్రముకూడ నీయర్థమును సమర్థించుచు నేయున్నది.

ఉండి : ఇయ్యది ప్రత్యయము గాదనియు పంచమి కనుప్రయుక్తమగు పదమనియు బాల వ్యాకరణమున కంఠోక్తిగానే పేర్కొన బడినది. ఇది ఉండుధాతువు క్త్వార్థకరూపము. ఇది యింతకుమున్ను చెప్పిన అనుప్రయోగముల వలెవిభక్తికి పూర్వమునగాక పరమున నను ప్రయుక్తమగును.

పట్టి: ఇది యు ప్రత్యయముగాదు. పట్టు ధాతువు క్త్వార్థకరూపము. ఇదియు విభక్తికి బరానుప్రయోగమే. ఉండిని అనుప్రయుక్త మని చెప్పినసూరిగారు పట్టిని వర్ణకముగా నేల పేర్కొనిరో తెలియదు. ఉండిపదము సాధారణముగా శబ్దములన్నిటిపైని గనబడును. పట్టిశబ్దము హేతువులగు సత్క్రియలపైని మాత్రమే అగపడును. ఇంతమాత్రమున నొక దానిని పర మనియు, నొకదానిని వర్ణక మని యు జెప్పుటకు హేతువేమో యని సందే హము గలుగుచున్నది. కాని న్యాయముగా రెండును బరములే యనుట యుక్తము.

యొక్క : "శేషషష్ఠికి యొక్కయు నగు" (బాలవ్యాకరణము). శేషంబనగా సంబంధ

మ, స్వస్వామిభావము మొదలగునది. ఇదియు
క్తిప్రత్యయము గాదు; ఇతరవ్యావర్తక
ము ఒక్కశబ్దము. రామునియొక్క భృత్యు
నగా రామున కొక్కనికిమాత్రము భృత్యు
యు నితరులకు గా డనియు నర్థము. ఇద
క్క అని అజాదియైనను సంధ్యభావవశమున
ప్పిన యడాగమవిశిష్టమై యొక్క అని పాలా
గా వ్యవహరింపబడుచున్నది.

లోపలన్: లోపలవర్ణకము యొక్క లుప్త
కము "లోన్" అని అందఱు నంగీకరించిరి.
దియును ప్రత్యయము గాదు. లోపల అను
ది యొకసమస్తపదము. విభక్తిప్రత్యయ మగు
"ను" వర్ణకమునకు బూర్వానుప్రయోగముగా
పెలుంగునది. పల అనుశబ్ద మొక్కటి పూర్వ
కాలమున వ్యవహరింపబడుచుండెడిదనియు,
లో, వెలు, డా, వల శబ్దములతో దానికి
సమాసము చేయగా లోపల, వెలుపల, డాపల
వలపల అనురూపము లేర్పడినవనియు, సమస్త
రూపము లిప్పు డగపడుచున్నను దదవయవ
మగు పలశబ్దముమాత్రము వ్యవహారభ్రష్టమైన
దియు దోచుచున్నది. ఇట్లే వ్యవహార
భ్రష్టమైనశబ్దము లింకను గొన్ని యగపడు
చున్నవి. వాకిలి, ముంగిలి, లోగిలి, అంగిలి.
ఈశబ్దములందలి "కిలి" అనునది గృహ మను
నర్థము గలది వ్యవహారభ్రష్టమైనది. వాయి +
కిలి= వాకిలి, ఇంటిముఖభాగము; ముందు+కిలి
ముంగిలి, ఇంటిముందటిభాగము; లోను +
కిలి=లోగిలి, ఇంటిలోపలిభాగము; అంచు ×
కిలి=అంగిలి, ఇంటి అంచుభాగము—అని అర్థ
ములు. సమస్తపదము లిప్పుడున్నను అవయవ
మగు కిలిశబ్దము ప్రత్యేకవ్యవహారము లేక భ్రష్ట
మైనది. ఈవిషయ మిట్లుంచి ప్రకృతమునకు
వత్తము. లోపలవర్ణకము నిర్ధారణషష్ఠి కను
ననియు కొన్నివస్తువులనుండి యొకవస్తువును
వేఱుపఱచుట నిర్ధారణమనియు బూర్వవ్యాక
రణములందు గలదు. కాని యీకాలపువ్యా
కరణములందుమాత్ర మారీతి పాటింపక గది
లోన్, వనములోపలన్, మొదలగునవి యు
దాహరణముగా నీయబడుచున్నవి. ఇది ఎంత
సారస్యమో ప్రాజ్ఞు లూహింతురుగాక.
మఱియు నీప్రత్యయమువిషయమున సూరి
గారు నించుక ప్రమాదపడి రన సాహసింతును
వారు విభక్తిప్రత్యయముల ఏకత్వ,బహుత్వ
వచననిరూపణమున, డు, ము, వు,న లేకవచన
ములు, లువర్ణము బహువచన మనియు నక్కి
నవి యుభయము లనియు జెప్పిరి. కావున
లోపలవర్ణక ముభయవచనమని వారితాత్పర్య
మైనట్లు స్పష్టము. నిర్ధారణ మనగానే అనేక
వస్తువులలో నేకవస్తువును వేఱుపఱచుటగదా?
అప్పుడు అనేకవస్తువులను ఏకవచన మెట్లు
తెలుపగలదు ? న్యాయమున లోపలవర్ణకము
బహుత్వమందేకాని ఏకత్వమందెన్నటికి నుం
డదు. కావున నిది యుభయము గాదు. వారు
విభక్తిప్రత్యయముల దెల్పునప్పుడు బహు
వచనమని చెప్పకున్నను లువర్ణము బహువచన
మని లోపలివర్ణకమును వ్యావర్తించినను కారక
ప్రకరణమున నిర్ధారణషష్ఠికి లోపలవర్ణకంబగు
ననుసూత్రమునకడ జేర్కొన్న వాక్యములవల
ననే లోపలవర్ణకము బహువచనమాత్ర మేయని
సిద్ధాంతముగా దెలియుచున్నది. మఱియుఁ
గొందఱు ఇంటిలోపలన్,వనములోపలన్ అను
నిత్యాదిస్థలములందు షష్ఠీవిభక్తిగా బొరపడు
చున్నారు. అది సరికాదు. అట్టిస్థలములందు
సప్తమ్యర్థకమగు(ఇంతకుముందుచెప్పిన)లోపల
శబ్దముగాని లోపలన్ అనువేఱొకవిభక్తిప్రతి
రూపకమగు అవ్యయ మనికాని తెలియనగును.
"నూతిలో వెలువడఁ గోమలిన్ దిగిచె" నిత్యాది
ప్రయోగములందు నిట్లే తెలియనగును.

అందున్ ఇందున్-ఎందున్: వీనిలో మొదటి
దానిని సప్తమీవిభక్తి ప్రత్యయముగా గొంద
ఱును,మఱికొందఱు ఇందున్ అనుదానినిగూడ
వర్ణకముగాను చేర్చుకొందురు. కాని యివి
ప్రత్యయము లనుకంటె ప్రత్యయవిశిష్టము
లనుట సమంజసము. కేవలప్రత్యయముల
కంటె ప్రత్యయములు చేర్చుటయు కేవల
ప్రత్యయములకు స్వతంత్రప్రయోగమును,
సంస్కృతవ్యాకరణ విరుద్ధములు.

ఆంధ్రవైయాకరణులు గ్రహించిన యీ
ప్రత్యయములందన్నియో పూర్వసానుప్రయో
గరూపమున బ్రత్యయముల నొందుటయు
స్వతంత్రప్రయోగమునుగూడ నగపడుచున్న
ది. "ఒకానొకచో నామంబు సంశ్లిష్టబహు
వచనాంతతుల్యం బయి బహువచనంబు
నొనర్చునని బాలవ్యాకరణమున కొడవండ్లు
లు మొదలగునుదాహరణము లీయబడినవి,
ప్రౌఢవ్యాకరణమం దన్నియో "దేశ్యంబునం
గొన్నియెడల మహన్మహత్యర్థక బహువచనాం
తంబులపై మరల బహువచనంబులు చూపట్టె
డు" అని సూత్రమున బెక్కండ్రురు, చూప
ఱులు, వేకకాండ్రుఱు మొదలగునుదాహర
ణములు పెక్కు లీయబడినవి. మఱియు,
"అబ్జాసనుండు దన్ను నర్థితో సుఱిచి యజిం
పంగఁగోరి సృజించె సురల," "స్తంభగతరత్న
పుత్రిక తనదుబోటి యని విలోకించి తోడ
మాటాడకునికి" మొదలగుస్వతంత్రప్రయోగము
లగపడుచున్నవి. "బాంధవులయుఁ దమ్ములయుతోడన్," "తమ్ములుఁ దమవస్త్రముల
యుఁ దమశస్త్రవరూధమ్ములతోడను" అను
నిత్యాది స్థలములఁ జెక్కు పదములపై
నొక్కచే తోడన్ అనునది యగపడు
చున్నది. అందలివారు, ఎందలివారుఁ
ఇందలివారు అనియు స్వతంత్రప్రయో
గము లున్నవికదా ? ఇందులకు, అందు
లకు, ఎందులకుననికూడ గలవు. వీనిని విమ
ర్శించుచో అందు మొదలగునవి శబ్దములనియు
వానికి "కు"వర్ణకము చేర్చఁగా లడాగమవిశి
ష్టమై అందులకు మొదలగురూపములును,
సమాసమున లడాగమలకారమునకిత్వము చేయ
గా అందలి మొదలగురూపములును సిద్ధించిన
వనియు "ను"వర్ణకమే సప్తమీవిభక్తిప్రత్యయ
మనియు,దానికత్వము చేయగా నన్ అనురూప
మేర్పడినదనియు నూహించుట కవకాశము
కలుగుచున్నది.

ఈ వ్రాసినవిషయమువలన డు, ము, వు,
లును, కుఱ అనునవిమాత్రమే విభక్తిప్రత్య
యము లనియుఁ, దక్కినవి శబ్దములే అనుప్ర
యుక్తము లగుచున్న వనియు దేలుచున్నది.
పరిశీలించిన నింకను ననేకములు వింతలు
బయలుపడవచ్చును.

## సంఖ్యావాచకములు

"ఏక ద్వి త్రిచతుః" మొదలగు సంఖ్యా
వాచకములను సర్వనామములందు గణముగ
సంస్కృతవైయాకరణులు పఠించిరి. వానికి

రూపనిష్పత్తిప్రక్రియగూడ వారు చేసిరి. ఒకటి, రెండు, మూడు, మొదలగు సంఖ్యావాచకములను గణముగ పరిగణించి బాలవ్యాకరణమున ఏకవచనములకు బహువచనములును, మహదమహదర్థకాది భేదజన్యరూపములును పట్టికగా నుదాహరింపబడినవి. ప్రౌఢవ్యాకరణమున నంతకంటె నొంచెముదిశేషముగాఁ బ్రక్రియ సాధింపఁబడినది. కాని యీరెండుగ్రంథములందును సమగ్రమగు ప్రక్రియ లేదు. వాని కన్నింటికిని సమగ్రమగు ప్రక్రియ సాధించుటయు సుకరము గాదు.

ఒకఁడు, రెండు, మూఁడు అను శబ్దములు ప్రక్రియాసాధితములా? లేక అవ్యుత్పన్నములా? యని విచారింప "ఒక, ఇరు, మూ" అను ప్రాతిపదికములపై డుజ్వర్ణకము చేర్పఁగా నేర్పడినరూపము లని తోఁచుచున్నది. ఒక శబ్దమునకు మహత్త్వవివక్షయందు ఒకనిని, ఒకనిచేతను, ఒకనియందు నిత్యాదిడుమంత విభక్తు లన్నియు నగపడుచున్నవి. సామాన్యముగా సంఖ్యావాచకము లౌపవిభక్తికము లగుటం జేసి ఇట వర్ణకంబులును గానవచ్చుచున్నవి. కేవలార్థకమయిన ఏకశబ్దమునకు ప్రాకృతమునందు ఏక్కమ్ అనియు, దానికి ఆంధ్రమున ఒక్క అనియు, దాని క్షప్తరూపము ఒక అనియు, ఇంకను క్షప్తపబు వెంగా 'ఒ' అనియు ప్రాతిపదికము లేర్పడినవి. వానిపైని మహత్త్వమహత్త్వవివక్షలందు డుజ్వు రాగా ఒక్కఁడు, ఒకఁడు ఒండు అనురూపము లైనవి. వీనికి ద్వితీయాదులందు టి వర్ణకము రా ఒక్కటిని, ఒకటి. ఒంటి అనురూపము లగును. ఒక్కటి ఇత్యాదులు అమహదర్థంబున ప్రథమైకవచనము లని బాలవ్యాకరణమున గలదు. అది సరికాదేమో యని సంశయించుచున్నాను. టి ప్రత్యయాంతము ప్రథమాంతమే యనుటకు దృఢమైనప్రమాణము లగపడకున్నవి.

రెండుశబ్దమున ఇరు ప్రాతిపదికము. దానికి డుజ్వర్ణకము చేర్పగా ఇరుండు. అను నవస్థయందు వర్ణవ్యత్యయముచే రేఫమునకు ఆదినున్న ఇకారమును, పైనున్న ఉకారమును సంఘర్షణవశమున ఎకారముగా పరిణమించి రెండనురూపము సిద్ధించినది. ద్రావిడభాషలందు ఇరెండు అనురూపము గలదు. ఇరువురు, ఇరుగేల ఇత్యాదులందు ఇరుశబ్దము మనభాషయందు నున్నది. ప్రౌఢవ్యాకరణమున "ఇరు రెండున కాదేశం బగు" అని సూత్రింపబడుట సరికాదని తలంతును. ఏడు + పది యనునవస్థయందు వర్ణవ్యత్యయమున డెబ్బది యనురూపము సిద్ధించునని యందఱు నంగీకరించినదేకదా!

మూఁడు శబ్దమున 'మూ' అనునది ప్రాతిపదికము. డుజ్వర్ణకము రాగా మూఁడు అనురూప మగును. ఔపవిభక్తికము గావున మూఁటిని ఇత్యాదిరూపంబులు సిద్ధించును. ఆంధ్రవ్యాకరణకారులు 'మూ' ప్రాతిపదికమని యభిప్రాయపడినట్లే కనబడుచున్నది. "సమానాధికరణంబగు నుత్తరపదంబు పరంబగునపుడు మూఁడు డుజ్వర్ణకంబునకు లోపంబును మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు." (బా. వ్యా. సమా. ౧౮.) ఒక్కొకాదులకు డు వర్ణకంబు." "టి వర్ణం బమహదర్థనంబు నొక్కండాదుల డువర్ణకంబునకు విభాష నగు." (ప్రౌ. వ్యా. శబ్ద.)

బాలవ్యాకరణమున డువర్ణకమని ప్రత్యేకముగ జెప్పకున్నను, జిత్వానుబంధవిశిష్టముగ నుదాహరించుటచే నది ప్రత్యయమే యని తెలియుచున్నది. ప్రౌఢవ్యాకరణమున డు వర్ణక మని స్పష్టముగా జెప్పబడియున్నది. కావున మన లాక్షణికులు ఒకఁడు, మూఁడు ఇత్యాదులందు ఒక, మూ ఇత్యాదులు ప్రాతిపదికము లని యంగీకరించి రనుట స్పష్టము.

నాలుగు: ఇందు "నాలు" ప్రాతిపదికము. మహత్త్వవివక్షనునాలు + అగు + వారు అను పదములకు సమాసముచేసి అగులోని అకారమునకు వారులోని వాకును లోపము చేయగా నాలుగురు అనురూపము సిద్ధించును అమహత్త్వమున అగుమాత్రము చేర్చి అకారలోపము చేయఁగా నాలుగు అనియగుచున్నది. మహత్త్వమున నాలుగురు రూపాంతర మగు నలుగురు అనునదియు, అమహత్త్వంబున నాలుగు అనురూపమునుమాత్రమే మన కగపడుచున్నవి. ద్రావిడభాషయందు నాలు అనురూపము అగపడుచున్నది. ఆంధ్రభాషయందును నలుమోములు, నలువ, నలుదిక్కులు మొదలగురూపము లగపడుచున్నవి. ఏగురు, ఐదుగురు, ఆఱుగురు, ఏడుగురు, పదుగురు, నూఱుగురు మొదలగుతావులందు ఏను, ఐదు మొదలగుశబ్దములకు 'అగు, వారు' శబ్దములతో సమాసమును అ, వాలకు లోపము నెఱుంగునది.

## సర్వనామములు

బాలవ్యాకరణమున సర్వనామములు గణపాఠముగా జూపబడినవి. వానికి మహత్త్వమహత్త్వములందును, నేకత్వబహుత్వములందును రూపభేదములు చూపఁబడినవి. ప్రక్రియమాత్రము చూపబడలేదు. ప్రౌఢవ్యాకరణమునఁ బ్రక్రియ కొంతవఱకు జూపబడినది.

ఆ, ఈ, ఏ అను త్రికమును ప్రాతిపదికముగా గ్రహించి వాని కాగమాదేశాదికల్పనమున బహురూపములు సాధింపబడినవి. "ఆ" శబ్దమువలన వాఁడు, అతఁడు, అందఱు, అది, ఆమె, అంత, అన్ని మొదలగురూపములును, "ఈ" శబ్దమువలన వీఁడు, ఇతఁడు, ఇందఱు ఈమె, ఇది, ఇన్ని ఇత్యాదులును, "ఏ" శబ్దమువలన ఎవఁడు, ఎతఁడు, ఎందఱు, ఎవతె, ఎన్ని, ఏది మొదలగురూపములును, ఒక శబ్దమువలన ఒకఁడు, కొంత, కొన్ని, కొందఱు మొదలగురూపములును నిష్పత్తి చేయబడినవి. ప్రక్రియాకల్పనమున వైయాకరణసాధారణమైన లాఘవము చక్కఁగా పాటింపబడినది. కాని యది వాస్తవికపరిణామమునకు దూరముగా నున్నదేమో యని తోఁచుచున్నది. వాఁడు, వీఁడు, ఎవఁడు అనుశబ్దములు మొదటను వకారముగలదు. ఈ వకారము పూర్వాగమ మని ఆచార్యుల అభిప్రాయము. కాని వాఁడు అనుశబ్దమునకు ఆ, ఈ, ఏ వర్ణములు పూర్వపదములుగా జేర్చి వర్ణప్లుతిచే వాఁడు, వీఁడు, వేఁడు, ఎవఁ డిత్యాదిరూపముల నిరూపించుట వలన పరిణామము గొంతవఱకు దెలియును. ప్రక్రియాలాఘవము రెండుపక్షములందును సమానముగానే యుండును. మఱియు నిట్లు గ్రహించుటవలన ద్రావిడభాషలసంబంధము తేటపడును. అరవభాషయందు అవన్

ఇవన్, ఎవన్ అనురూపములు గలవు. ఆ పదములకే వర్ణవ్యత్యయదీర్ఘములు గల్పించిన వాడు, వీడు, వేడు, మొదలగురూపములు సిద్ధించును.

అంత, ఇంత, ఎంత, కొంత, అతఁడు, ఇతఁడు, ఎతఁడు, ఎవతె అను లాక్షణికరూపములందును, అతను, ఇతను, మొదలగు వ్యావహారికరూపములందును, తాను, తన్ను, తన చే, తాము, తమరు, తారు మొదలగుశబ్దములందును తకారము సామాన్యముగా నగపడుచున్నది. అందఱు, ఇందఱు, ఎందఱు, కొందఱు మొదలగుచోట్ల గూడ బిందుపూర్వకమై సారళ్యమునొందిన తకార మగపడుచున్నది. అది, ఇది, ఏది, అవి, ఇవి, ఏవి అను స్థలములందు ది, వి, వర్ణములు సాధారణముగా నున్నవి. ఈ రూపములన్నింటను త్రికము ప్రాతిపదముగా నంగీకరించి తకార, దకార, వకారము లాగమాదేశములుగా నంగీకరించుట న్యాయమా ? లేక తకారాదులనే మూలముగా గ్రహించి త్రికమున కాగమాదేశవ్యత్యయాదిధర్మము లంగీకరించుట సుకరమా యని యాలోచింపవలసియున్నది. తాను, తాము, తరు, తమరు మొదలగు రూపములందు త్రికసంబంధవిరహితముగ తకారము గనబడుచున్నది కాని, తకారాదుల సంబంధము లేని కేవల త్రికములరూపము లెందు నగపడవు. నిర్దేశమునందు విశేషణమాత్రమై ప్రత్యయరహితముగమాత్ర మగపడుచున్నది. కావున త్రికమును ప్రాతిపదికముగా గ్రహించుటకంటె తకారవకారములనే ప్రాతిపదికములుగా గ్రహించుట సమంజసము.

అది యనుమహద్వాచకమునకు ద్వితీయా ద్యేకవచనములందు దానిన్, దానిచేతన్, దానన్ మొదలగురూపము లున్నవికదా ? త్రికమునకు పరాగమంబులుగా దివులు చేయుటయు, వర్ణప్లుతిచే దాని నీత్యాదిరూపములు సాధించుటయు ప్రౌఢవ్యాకరణమున గలదు. కాని యీకల్పనము సమంజసముగాదు. మన భాషలో నొకప్పుడు "దాయి" అనుశబ్దము స్త్రీసామాన్యవాచకముగా వ్యవహారములో నుండెడిది. గంజాము మండలమందును, విశాఖపట్టణమండలమున గొన్నిప్రాంతములందును ఆశబ్ద మిప్పుడును వ్యవహారమున నున్నది. వృత్తియం దాలుశబ్దము స్త్రీమాత్రపరమైనట్లే యీ దాయిశబ్దమును స్త్రీమాత్రవాచకముగా కూలిదాయి, బాపనదాయి, చాకలిదాయి, మంగలిదాయి మొదలగురూపములతో నున్నది. ఆడది అనుటకు బదులు ఆడదాయి యనియు వ్యవహారము గలదు. ఈ వ్యవహారము కేవలము పామరజనవ్యవహారమేయైనను నిరాకరించుటకుమాత్రము వలనులేదు. ఒకప్పుడు బ్రాహ్మణాదివర్ణములవారుగూడ నా శబ్దము నుపయోగించెడువారు. ఆంధ్రులు పితృతర్పణమున స్త్రీలనామములచివర నీ శబ్దము నూరపదాయీం, వెంకపదాయీం ఇత్యాదిగ నిప్పుడు నుపయోగించుచున్నారు. ఆబ్దికమంత్రమునందు నూరపదాయ్యై, వెంకపదాయ్యై మొదలగురూపము లుపయోగింపబడుచున్నవి. సంబోధమునందు వెంకపదాయి అనియు వ్యవహరింపబడుచున్నది. మఱియు గొందఱు నూరపదాం, వెంకపదాం, నూరపదాయై, వెంకపదాయై, నూరపడే, వెంకపడే యనియు వ్యవహరించుచున్నవారు. దీనివలన నొకప్పుడు దాయీ, దా శబ్దములు రెండును వ్యవహారమున నున్నట్లు తెలియుచున్నది. ఈ దాయీశబ్దభవమే అఱవములోని తాయీ శబ్దము కానోపును. మఱియు పాఱుత, చాకిత, ఒకత, ఒకర్త, ముట్టుత, మిండత, సబ్బెత మొదలగుశబ్దములందు స్త్రీత్వద్యోతకమగు తవర్ణకమునకు నీదాయీ, దా శబ్దములే మూల మని తోచుచున్నది. ఈ శబ్దములు సంస్కృతములని యెవ్వరు నంగీకరింపరు గదా ? ఈ దాయీశబ్దమునకు బ్రథమాంత రూపమిపుడు గ్రంథములం దగపడదు. వానికి ద్వితీయాదులందు నివర్ణకము పరమగునపుడు యకారము లోపించును. అప్పుడు దాని నీత్యాదిరూపములగును. దా శబ్దమే గ్రహించినపుడు లోపప్రసక్తియే లేదు.

ఇంకను అది, ఇది, ఏది యనురూపములందును అందఱు, ఇందఱు, కొందఱు, ఎందఱు, అనురూపములందును నగపడుచున్న దకారమునకును, నీ దాయీ, దాశబ్దములకును సంబంధ ముండునేమో ప్రాజ్ఞులు విమర్శింపవలసియున్నది. దాయీదాశబ్దములవలన దాని నీత్యాదిరూపములు నిష్పన్నము లగునని మన మంగీకరించునెడల ఈ+దానిన్, ఏ+దానిన్ అను స్థలములందు వర్ణప్లుతిచే దీనిని, దేని నీత్యాదిరూపములు సిద్ధించు నని యంగీకరింతుము. ఆ+దాయి, ఏ+దాయి అను తావులయందు శీఘ్రోచ్చారణ వశమున పూర్వాచ్చు దీర్ఘమునకు హ్రస్వమును, దకారోపరి ఆకారమునకును యకారమునకును లోపము రాఁగా, అది, ఇది, ఏది అనురూపము లేర్పడును. కాని యీ శబ్దములందును అతఁడు, ఇతఁడు మొదలగుచోటులందును సంస్కృతమునందలి అదస్, ఇదమ్ శబ్దముల సంబంధము సన్నిహితముగా నున్నట్లగపడుచున్నది. విజ్ఞులు విమర్శించిన నింకను విశేషములు బయల్పడగలవు. నీవు-ఈవు, మీరు-ఈరు, నేను-ఏను, మేము-ఏము, వాఁడు-వారు, తాను-తాము, తాగు మొదలగు సర్వనామములందు సాధారణముగా సుబంతముల కేర్పడిన డు, ము, వు, లు ప్రత్యయములు చేర్చుట సరియగుపద్ధతి కానేరదు. ఈ సర్వనామములు ప్రథమావిభక్తి ప్రత్యయములకును, క్రియావిభక్తి ప్రత్యయములగు డుఙ్, రు, వు, రు, ను, ము, లకును బోలిక విశేషముగా నగపడుచున్నది. వాఁడు, వీఁడు, అతఁడు మొదలగుతావులందు డు వర్ణకమును, తారు, తమరు, వారు, మీరు, మొదలగుతావులందు రువర్ణకమును, తాను, నేను (అతను, ఇతను గ్రామ్యములు) శబ్దములందు నువర్ణకమును, నీవు అనుచో వువర్ణకమును, తాము, మేము లందు మువర్ణకము నగపడుచున్నవి. కావున వీనిని సాధారణసుబంతములుగా పరిగణించి సుబ్లోపము నంగీకరించుటకంటె తిఙంతనియతములగు డుమ్మ్రలే వీనికిని విధించుట సుకరము, న్యాయము నైయుండును. ఇంతకుముందు విభక్తిప్రత్యయము లన్నియు గొన్ని శబ్దముల లుప్తశేషరూపములే యని వ్రాసితిని గదా ? క్రియావిభక్తిప్రత్యయములుమాత్రము అట్లేల కాగూడదు ? ఈ సర్వనామముల లుప్తశేషములే క్రియావిభక్తిప్రత్యయములు

గా వ్యవహరింపబడుచున్నవి అని సందేహిం చుటకు నవకాశము లేకపోలేదు. ఇందలి తత్త్వ మింకను బాగుగ విమర్శించిన గాని తేలదు.

నీవు, నేను శబ్దములందు నకారమును, మీరు, మేము శబ్దములందు మకారమును సామాన్యముగా నున్నది. వీనియందలి హల్లులు ప్రథమావిభక్తియందు లోపింపగా ఈవు, ఈరు, ఏను, ఏము అనురూపము లేర్పడు చున్నవి. తక్కిన యన్ని విభక్తులందును నకార మకారము లగపడుచునేయున్నవి. నే, మే, అనురూపములుకూడ ప్రథమావిభక్తియందే కలవు. తక్కిన విభక్తులందు నా, మా, యను రూపములే యుండును. ఒక్క. ఈశబ్దము షష్ఠీవిభక్తియందు "ఈకు" అనురూప మొ క్కచో గలదు.

నా, మా, శబ్దములకు ప్రథమావిభక్తిప్రత్య యములగు ను, ము, వర్ణకములు చేర్పగా నవి పరమగునెడ అకార మేకారముగా బరిణమిం చుటచే నేను, మేము అనురూపములు సిద్ధిం చును. గ్రామ్యభాషయందు నాను, మాము అను ప్రథమాంతరూపములు గలవు. ద్రావిడ భాషయందు నేను అనుటకు నాన్ అనురూప ము గలదు. ఈ రూపమునకును సంస్కృత భాషయందు అస్మచ్ఛబ్దరూపము లగు మామ్, మా, మే, నౌ, నః అను రూపములకును గల సంబంధమును పరిశీలింపనగును. ఇట్టివిషయము లింకను గ్రంథపరిశీలనమువలన తెలియవచ్చును. వీనిని పండితులు విమర్శింతురుగాక!

కొమరాలు: "పేదాదిశబ్దముల కాలు శబ్దము పరమగునపుడు కర్మధారయమునందు రుగాగమం బగును. పేదరాలు. పేద, బీద, ముద్ద, బాలెంత, కొమ, ఐదువ, జవ ఇత్యా దులు పేదాదులు" బా. వ్యా.

విశేషణవిశేష్యములకు జేయుసమాసమే కర్మధారయమగునుగాని రెండును విశేష్యము లగునపుడుగాని, రెండును సామాన్యవాచకము లగునపుడుగాని కర్మధారయము రాదు. కొమ రాలు అనుసమాసమున కొమ్మశబ్దము రూపాం తరమగు కొమశబ్దమును, స్త్రీమాత్రపరమగు ఆలుశబ్దమును రెండును విశేష్యములే యగుటం జేసి వీనికి కర్మధారయసమాసముగాని, రుగా గమముగాని దుర్ఘటములే యగును. కావున నిందుం బూర్వపదము కొమ్మశబ్దరూపాంతర మనుట పొసంగదు. కుమారీశబ్దభవమగు కొమిరె శబ్దముతో నాలుశబ్దమునకు సమాసము గావిం చినచో విశేషణము పూర్వపదముగ, విశేష్య ముత్తరపదముగ నుండి కర్మధారయము సుక రమై యుండును.

ఇట్టి విషయము లింకను గ్రంథపరిశీలనము వలన తెలియవచ్చును. దీనిని పండితులు విమ ర్శింతురు గాక.

---

# మహాప్రస్థానము

శేషాద్రి రమణ కవులు

మహనీయాత్ముఁడు నందికేశ్వరుఁడు ధర్మస్థాపనానూనధూ
ర్వహుఁడై బిజ్జలరాయమంత్రిపదవిం బాలించుచున్నాఁడు త
న్మహితాత్ముం బసవేశ్వరుం గనుట, యస్మజ్జీవితాదర్శ ని
ర్వహణం బంచును వీరశైవమణి చేరంబోయెఁ గల్యాణమున్.

శ్రీమత్పండిత మల్లికార్జునగురుశ్రేయోర్థులై ఛాత్రు ల
త్యామోదంబున వెంట రా, మహితచైత్రారంభచండాతప
శ్యామీభూతదురంతదుర్గమవనీచ్ఛాయాప్రదేశంబులం
దామాన్యుండు పరిభ్రమించె నలకల్యాణంబు దర్శింపఁగన్.

వెలనాటిచోడభూవిభునిధర్మాస్థాని పరశివధర్మ ముపన్యసించి
హతశేషజైనపండితనికాయము నోర్చి రక్షార్థమై శివదీక్ష యొసఁగి
శివకవితామృతశీకరలబ్ధిచే నాత్మీయభక్తుల నాదరించి
ఉదయచోడునికటాక్షోగ్రకాలానలజ్వాలలచేత నాశన మొనర్చి
మహితకల్యాణనగరసామ్రాజ్యకలిత - భవ్యసింహాసనాధ్యాసి బసవనాథు
దర్శనము గోరినడిచె నుత్తమతపస్వి - పండితారాధ్యమణి యాంధ్రభాగమెల్ల.

బసవేశా! మహనీయభవ్యకరుణాపాథోనిధానా! మహా
రసికాగ్రేసర! వీరశైవమణి కర్ణాటాంధ్రభాషాద్వయీ
రసవత్కావ్యకృదగ్రణీ యని స్తుతిప్రారంభసంరంభుఁడై
వెసఁ గల్యాణముత్రోవఁ బట్టె మహితోద్వేగంబు నిండారఁగన్.

ఆకాశంబు మహోక్షరూపమునఁ జెల్వై మించెఁ, గల్యాణరా
జ్యాకీర్ణోత్కటధూమసంగతమహార్చిర్జ్యోతి యమ్మూర్తిలో
నేకంబయ్యెను పండితుండు మది నూహించెన్ "దయాసత్యనీ
త్యాకల్పుం బసవేశ్వరుం గనెడిభాగ్యం బింక లేదో కదో.

అత్యంతసాహసిమై బసవేశుండు బిజ్జలుమదిని నొప్పించుచుండె
వితతమతోద్రేకవిశ్రుతులై వీరశైవులు ప్రభుభక్తి సాటరైరి
జైనులు ప్రభుబలసంపన్నులై పరశివతత్త్వమును నిందసేయుచుండ్రు
అతులమతోద్రేకయుతులచేయూఁతచే నొగి రాజ్య ముట్టూఁత లూఁగసాగె
ఇట్టిసందిగ్ధతరుణమం దెప్పు డెట్టి - వార్త విందునో బసవేశపాదయుగళిఁ
జూచుభాగ్యంబు భూదేవి నోఁచ లేదో - యనుచునారాధ్యమణి విహ్వలాత్ముఁడయ్యె.

పడఁగొట్టించెను జైనమందిరములన్, బాపండులన్ జంపె నే
ర్పడరన్ గన్నడమందు శైవమత కావ్యశ్రేణి గల్పించెఁ బే
రడవుల్ శైవనికేతనంబులుగఁ జేయంగల్గె నే ధన్యుఁ డా
తఁడు శ్రీమద్బసవేశ్వరుండు శివచింతాలోలుఁ డేమయ్యెనో.

జైనుల్ శైవులు ధర్మబంధువులు త్రెంచన్ జూచుచున్నార ల
జ్ఞానావేశముతోడ సంగర మటన్ సన్నద్ధ మైయుండె, నం
దేనుం బ్రాణము వీడుటో శివమతం బిప్పించి వేదేతర
స్థానాధీశుల జైనులన్ గెలుచుటో సాధింతుఁ గల్యాణిలోన్.

శివతత్త్వబోధకుని పర - శివధర్మవినోది సకలశివకవిలోక
స్తవనీయుని బసవేశ్వరు - నవలోకించుటకు హృదయ మకట తపించెన్.

కల్యాణనగరరంగంబునఁ బ్రవహించె జైనశైవాసృక్ప్రచండనదులు,
కలచుర్యభూపాలకంకాళములతోడ నిఖలదిక్తటములు నిండిపోయె
వీరశైవకుమారవిలయరూపంబుగా సమరంబు సర్వత్ర సంఘటిల్లె
జైనశైవాన్యోన్యసంగరంబులతోడ నుభయపక్షంబు లుజ్జ్వలత లూఁగె
జైనధర్మంబుకొఱకు బిజ్జలవిభుండు - పరమశివధర్మమునకయి బసవమంత్రి
కాలగతు లైరి యీవార్త నాలకించి - మల్లికార్జునపండితమణి కలంగె.

అనితరపుణ్యమూర్తి బసవన్నను జూడఁగ నోఁచుకున్న యీ
కనులును వానికౌఁగిలియుఁ గల్గనియీతను వేల యంచుఁ బా
వనమతి పండితార్జునుఁడు పల్కుచు శ్రీగిరిమల్లికార్జునున్
మనమునఁ జేర్చి తచ్ఛిఖరమార్గమునం బడి వీడెఁ బ్రాణముల్.



# జిడ్డు కృష్ణమూర్తి

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

మనుష్యహృదయము నొకపరి గంభీరసింధువునకును, వేఱొకపర్యాయము నభోమండలమునకును, ఇంకొకతూరి భూగర్భమునకును, మఱొకమా రెత్తుకొండకును పోల్చవచ్చును. కొంత నెక్కినకొలది క్రొంగ్రొత్తదృశ్యములు పొడగట్టును క్లిష్టమైననేలను పసులగొట్టినకొలది పాతాళగంగ పొడసూపును. వెండి బంగారములును, వజ్రనివహమును భూగర్భమందేకదా చేరుండును! సింధువును రత్నాకరమే యందురు. ఇం కెన్ని రతనము లున్నవో! జలరాశి హృదయమందలి అనంత కాంతిలో మ్రుంకు లిడినకొలది ఎట్టియద్భుతములు కానంబడునో! దూరదర్శనితో ఖగోళమును పరిశీలించినపు డెన్నెన్ని వింతలు దృష్టిబడవు? కాలము కడచినకొలది కనివినిఎఱుగని దృశ్యము లనంతశూన్యమున తళ్కొత్తుచున్నవి. సూర్యునికంటె నెన్నివేలమడుగులో పెద్దదియైన నక్షత్రమును (Epsilson Aurigae) ఇటీవల Dr. Otto Struve కనుగొనెనుకదా!

మానవహృదయమున ప్రవేశించినకొలది ఊహకందనిఅద్భుతదృశ్యములు గోచరించును. బంగారుగనిని త్రవ్వనిచో కనులబడునది మట్టిదిబ్బయే! ఖననముకానిమానసము దిబ్బ కెనయైనదే! పుట్టినచోటున, పెరిగినతావున, పడసిననేస్తమున, అందిన ఉపదేశమున, కాంచిన దృష్టాంతమున, పీల్చిన భావవాతూలమున రాజిలుశక్తులే ఆంతరంగికమైన ప్రజ్ఞ నీవలబెట్టును.

నేలపై తలయెత్తినంతన మొక్కపడయు నీరును, వెలుంగును, గాలియును దానిభావివృద్ధికి తోడగువడువున, శైశవమున మానవుడందు శిక్షణప్రోత్సాహము లాతని పురోభివృద్ధికి హేతువు లగును. చరిత్రగ్రథనమునకు Environment వేయివిధముల చేయూతనొసగును. అనుకూల వాతావరణ మున్నగాని ప్రతిభ ప్రజ్వరిల్లనేరదు. ఖగేంద్రుడు పెద్ద రెక్కలు కలవాడే; అమరేంద్రుని గెలువంజాలినవాడే! వాయువులేనిచో నీతని రెక్కలేమి చేసెడివి? ఈతనిశక్తి ఎందులకు పనికివచ్చెడిది?

ఒక్కని ప్రాకారములుకల కృష్ణమూర్తి జీవితమును పరిశీలింపుడు. ఈ యంశములను

రూఢిచేయుదృష్టాంతమును తొలిసమ్మమందే వీక్షింతురు.

నారాయణయ్యయొద్దనే ఈతడు పెరిగియుండినయెడల, నీతని గుండెలోనిశక్తి మన్నులో నిదురించుమానికముమాడ్కి, అందే యడగిమడిగి యుండెడిది. కృష్ణమూర్తిని బెసెంటువంటి మహాశక్తిసంపన్నయైన వ్యక్తిచేతులందు జగదీశుడు న్యస్తమొనరించినాడు. ఇంగ్లాండువఱకు (House of Lords) దనుక) ప్రాకినకేసున దైవసంకల్ప మున్నదని భావింపవచ్చును. దురంతదుస్థితితో పోరిపోరి విజయకేతనమును చేబూనినవీరవిదుషి ఈ యాంధ్రబాలకునకు పెంపుడుతల్లి కావలెనని యుద్దేశించినదేవుడే నాడుతండ్రియుల్లమును చల్లపఱిచినాడు. ఆదరానురాగములకు చేదోడైన విజ్ఞానానుభవములందే జిడ్డుసోదరులను నిలిపినాడు.

పాడుపుగొండకెదుట నిలిచినవ్యక్తి స్వర్గాలోకమున చిత్తమువచ్చినతెఱగున నీదులాడగలడు. ఏడురంగులను తనగుండియలో నిడికొనిన స్వర్ణమకీచి హృదయస్థసౌందర్యమును, వింతవసంతమున ట్లీతనిపై నెంతోసంతసమునజల్లదా? తమ్మునితోగూడి* కృష్ణమూర్తి పెంపుడుతల్లి చెంగట నిలిచినంతన నీతనిజీవితమాలోకసముద్భాసితమాయెను. బాలకుని గుండెలోని బంగారును బయటబెట్టుటకై బెసెంటుసతి బహుళములైన వెరవులను రోసెను.

కూలి, క్రుంగియున్నజాతులను పునరుద్ధరించి, విశ్వమానవకల్యాణమహోత్సవమును జరపుట బెసెంటువిదుషి జీవితపరమావధియాయెను. ౧౮౯౩ లో భారతభూమిలో నడుగుపెట్టుటకుము న్నీమె ఐర్లాండుమున్నగు నేలలం దీయుత్కృష్టాశయసిద్ధికై శ్రమించెను.

గతభవమున నీమె భారతదుహితయై, ప్రాచీవిజ్ఞానమున రాజహంసియై వరలెనేమో! భావిభవమునగూడ భారతపుత్రికనై పుట్టెదనంచు వాకొనుచు, భారతభూమి నాయేటినుండి వాసస్థానము గావించుకొనినది. ఐదుఖండములందును మాఱుమ్రోగిన ఈమె ప్రతిభాషాణింధమము కృష్ణమూర్తిహృదయకుహరమున నెట్టి ప్రతిధ్వనులను లేపెనో యూహింపుడు.

గుండెలో ననురాగ బ్రహ్మాండము నిడికొనిన సీమంతినీచూడామణిస్పర్శకతన (ఇది కిరణస్పర్శ కెనయైనదంటినిగదా) కృష్ణమూర్తి హృదయము ప్రఫుల్లమాయెను. గంగోత్తరినుండి వెలాగు పూతపూరమ ట్లందుండి యవిరళముగ సౌరభము వెడలదొడగెను. ఇరుఖండములందు విద్య నభ్యసించి ప్రాచీప్రతీచీవిజ్ఞానములం దీతడు మ్రుంకులిడినాడు. లుంబినీవనమున పుండరీకములపై నడుగులు వేసి, చరచర సాగిపోయిన దివ్యడింభకునివడువున ప్రాక్పశ్చిమార్ధగోళములందు పలుమా ఱడుగులువేయు భాగ్యము కృష్ణమూర్తికి కలిగెను. భూభ్రమణము వైజ్ఞానికరాజసూయ మనివచింతును. దీనికతన నెంతవిభూతి, ఎట్టిభావసామగ్రి హృదయసామ్రాజ్యమున, నాత్మసమక్షమున జేరదు? గిరగిర సూర్యునిచుట్టు తిరిగికదా భూమి అనుదిన మాలోకమునందుచు అశేషాభ్యుదయము నందుచున్నది. పరిభ్రమణ మొనరించుమానవు డెట్టి వెలుగు నందడు?

బెసెంటుసతిప్రభృతులు కృష్ణమూర్తి వాక్కున నీశ్వరవాక్కును వినిరి. జగదీశు డెన్నుకొనిన నిమిత్త మీత డని విశ్వసించిరి. నల్వంకల వసుమతి పంకిలసంకులమై యుండుట విలోకించిరి; కాలపరిస్థితులు కలుషితములై యుంట గాంచిరి. ఉద్ధరణసమర్థుడుదయించువేళ "ఇది"యని గ్రహించిరి.

---

* ఈతడు పదపడి పరమపదించినాడు.

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే."

"యదాయదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత!, అభ్యుత్థానమధర్మస్య తదా ౽౽ త్మానం సృజామ్యహమ్."

అనుపవిత్రవాక్కులు పీరిమానసదివ్యాలయమును సదాశచే సందీప్త మొనరించెను.

ఈశ్వరపునరవతరణమును హిందువులే కాదు అన్యమతస్థులును విశ్వసించిరి. మైత్రేయుం డవతరించు ననియు, ఏసు మరల పుడమిపై దోచు ననియు, జోరాష్ట్రిక మతలోకమాతు వసుమతిపై జనించు ననియు నమ్మువార నవవరతము విలోకించుచునేయుంటిమి.

సర్వమతకేంద్రస్థానము దివ్యజ్ఞానసమాజము. ఈ కేంద్రస్థానమున మానవోద్ధరణమునకై అవతరించిన జగద్గురువు కృష్ణమూర్తి యని బెసెంటమ్మ మున్నగువారు హృదయపూర్వకముగ నమ్మిరి. విశ్వవిస్తృతమైన మహాసంస్థను నడపు మహారథికులు వీరు. వీరెల్లరు జగతిలో నద్భుతమైన ప్రచారము సాగెంచిరి. కృష్ణమూర్తిచుట్టును జయభేరీని మ్రోగించిరి. ఈతని చూచుటకై, ఈతనివాక్కులు వినుటకై వసుంధరలోని విజ్ఞానులు మక్కువపడిరి. తూరుపున చుక్కతోచినంతన మూవురువిజ్ఞాను లొకప్పుడు బెత్లెహేమ్ దిశకు పయనమైరి. మరల ప్రాచీయాచార్యుడు తోచె నని విశ్వసించిన అసంఖ్యాకులు కృష్ణమూర్తి ఉన్నయెడకు బయనమైరి. అనేకుల చూడ్కులు అడయారుపై వ్రాలినవి. ఎల్లరుగూడి The order of the star ను నెలకొలిపిరి. అచిరములో భూగోళమున ననేకశాఖలు తలచూపినవి. అసంఖ్యాకములైన సభలు జరిగినవి. మహోపన్యాసములు కుంభవృష్టిగ వెడలినవి.

ఇట్లు కొన్నేండ్లు కడచెను. ఐదుఖండములనుండి అష్టదిక్కులనుండి అవిరళముగ రాలు పూలవానకు తలయొగ్గి అవనీతలమున నారాధ్యదేవతగా నిచ్చగింపని మానవు డెవండు? అవలీలగ అయాచితముగ లభించు అనిర్వచనీయమైన పూజకు తనయుత్తమాంగము నొడ్డ నిరాకరించిన మహాపురుషుడు కృష్ణమూర్తి. పూజారులైన మహామేధావుల నందఱి నొక్కదుక్కున నిలిపి, పూలకుప్పకు పదియామడల దూరమున వేఱొకదిశ దాను నిలిచినాడు. ఎదుటివ్యక్తిపై పూలుచల్లి, ఎదుటిసంస్థకు దండ మిడి, ఎదుటిపీఠమునకు ప్రణమిల్లి, ఎదుటినుండి వెడలునుడువులకు బారుగ చెవులొగ్గి, చూడ్కి నెదుటివాని నొసలున కప్పగించి నిలుచుట మానవప్రజ్ఞకు తలవంపులు తెచ్చుటనియు, మనుష్యత్వమును మన్ను పాలుచేయుటనియు, దాస్యమును నెత్తికి గట్టుకొనుటనియు, అభివృద్ధిమార్గమున ననల్పములైన గట్టులను నిలుపుటనియు కృష్ణమూర్తి విశ్వసించినాడు. విచక్షణసామర్థ్యమును పురస్కరించుకొని, స్వయంకృషి నేడుగడ గావించుకొని, సత్యము నన్వేషించి, వర్తమానకాలమందే మనుజుడు పరిపూర్ణత్వమునంది, ఆత్మజీవితమును సార్థకము గావించుకొనవలెనని ఈతడు ప్రబోధింప గడంగినాడు. స్వీయభావమును స్వీయజీవితమున ననుష్ఠించినాడు. అనేకులు ప్రతిష్ఠించిన ఉత్కృష్టపీఠమునుండి సభాలున నేలపై లంఘించినాడు. Order of the Star ను రద్దు చేసినాడు. మనుష్యసంఘమున భావస్వాతంత్ర్యమును నెలకొలుప నిశ్చయించినాడు.

ఈతనిజీవితమును, ఈతనిమోచనమును ప్రత్యేకములు. నిర్దిష్టమైనపంథనుండి నడచువాతడు పుంతలోపోవు మేకకంటె అధికుడు కాడని ఎంచువారిలో నీతడు మొదటివాడు. ఇతడు నాస్తికుడని తెలుపుట తప్పు. కాని దేవునిగుఱించి, మతమునుగుఱించి, భక్తినిగుఱించి, ప్రార్థనమునుగుఱించి, ముక్తినిగుఱించి, గతమునుగుఱించి, భావికాలమునుగుఱించి కృష్ణమూర్తి ప్రత్యేకమైన యూహలుకలవాడు. సంప్రదాయము నుత్తరధ్రువముపై నిలిపి ఈతడు దక్షిణధ్రువమున విడియ నిచ్చగించును. మెడలు వంచి కూర్చుండబెట్టినను, గతకాలశిఖరమునుండి పాఱివచ్చు భావముల కీతడు మానసాంజలి నొడ్డడు. ఏ విషయమునుగాని మానవుడు తనంతదాను యోచించుకొనవలెనని, ఎట్టి ప్రమాణమునకు నీత డంజలి ఘటింపరాదని పలుమాఱు కృష్ణమూర్తి పలుకుచుండును. తలమానికములు దాల్చిన తాతముత్తాతలకడనుండి దొరలివచ్చినతలపులు తనవిగాదని ఈతడు దూరముగ తరలిపోవును. పరాభిప్రాయమునకు (అదెట్టిదైనను, తనవారిదైనను, లాతివారిదైనను) తలయొగ్గునాతడు భావదాస్యము ననుష్ఠించు అభాగ్యుడని, తన చుట్టు నడ్డుగోడలను నిర్మించుకొని, తనంతదాను ఖైదీయై, జ్ఞానాలోకము నాలోకింప నేరడని సంశయరహితచిత్తుడై ఈతడు పలుకుచుండును. సంప్రదాయమును కట్టుదాడుగ జూచు కృష్ణమూర్తి ఉత్తమాశయములను గుఱించినఘోష వినవచ్చినంతన చెవులుమూసికొనును. గురుగంభీరమైన ఈ ఘోష ఈతనికి తలనొప్పిగలిగించును. కఠోరమైనవర్తమానస్థితినుండి తప్పించుకొనుటకు మానవుడు వేయు పన్నుగడ ఈ ఘోషకు సంబంధించిన దని ఈతడు యోజించును. నిష్ఠురానుభవమునుండి మనుష్యుడు పాఱిపోరాదని, ఎట్టిరక్షణమును కోరరా దని కృష్ణమూర్తితలంపు. ఇట్టి యనుభవమందు, తీవ్ర సంఘటనమునందు నిలిచి, మానవుడు సత్యము నెఱుగవలెనని ఈతని యభిప్రాయము. దుఃఖమం దుండి, దుఃఖకారణ మరసి, ఈతడు దుఃఖవిమోచనము నందవలెనని కృష్ణమూర్తియుద్దేశము.

కృష్ణమూర్తిభావములను నిశితబుద్ధితో, నిష్పాక్షికదృష్టితో పరికించుట పాడి. కన్నులకు గంతలు కట్టుకొని పరిశీలనాశక్తిని చంపివేసి, తనయడుగులకు మడుగు లొత్తువారిని, తనపదముల కెరలువారిని జూచి కృష్ణమూర్తి "ధిక్" అనును. ఈతని యుద్దేశములను పుంఖానుపుంఖముగ పరిశీలించుట మన పవిత్రకర్తవ్యము.

కృష్ణమూర్తి ప్రబోధముకతన నెంతేని మేలు చేకుఱుట నిక్కమే! కాని, అందు కొంతలోపము లేదని తెలుప జెల్లదు.

తర్కశాస్త్ర తత్త్వశాస్త్రములను పరికించితిమేని, విజ్ఞానార్జనమునకు అక్కరైన పంథాలలో ప్రమాణ మొక్కటియని గ్రహింతుము. ఏవ్యక్తినుండి, ఏపీఠమునుండి ఏజనస్థలమునుండి, ఏ సందర్భమునుండి ప్రమాణ మవతరించెనో తెప్ప వాల్పక పరిశీలించి, శక్తి

సహితమైన దానిని (స్వీయభావమును బల వత్తరము గావించుట కనుడు, ఉత్కృష్ట పంథను ప్రవేశించుటకే మేలుబంతి చేసికొనుట కనుడు) గ్రహించి, శక్తిరహితమైన దానిని దూరముగ నెట్టివేతుము. ప్రమాణ మనినంతన కనుబొమ్మలు ముడివేసి, చిడిముడిపాటుతో తరలిపోతిమేని మానికముల ప్రోవువలె చిర సంచితమైన భావసామగ్రికి దూరస్థులమయ్యె దము. చరిత్రలును, ఆప్తవాక్కులును చేసూ ర్పు విజ్ఞానమునకు విరోధుల మగుదుము. శ్రుతులును, స్మృతులును, శాస్త్రములును, ఉపనిషత్తులును, పురాణములును మనవికానివే యగును. ప్రమాణగ్రహణము విశ్వాసముపై నాధారపడియున్నదికదా!

మనుష్యాంతరంగమున నొక్క హేతు శక్తిమాత్రమే పీఠాధిపతియై యుండలేదు. హేతుశక్తి మహత్తరమైనదే! కాని పరిమితి సహితములైన స్థలకాలములందు, అనంత విశ్వమున నిరంతరము సాగిపోగలదు? హృదయమున విశ్వాసమునకుగూడ చోటు కలదు. నన్నడిగితిరా, హేతువిశ్వాసములు పార్వతీ పరమేశులని వాకొందును. రెండింటి యందేది కొఱవడినను, హృదయము కైలా సము కానేరదు. హేతువు నెఱుగని విశ్వా సము గ్రుడ్డి దగును. విశ్వాసము నెఱుగని హేతువు ఆధ్యాత్మికవృద్ధిని తొంగియైన చూడనేరదు.

హేతువుపై నాధారపడు భౌతికశాస్త్ర ములుగూడ తత్త్వశాస్త్రమునుండి కొన్ని సత్య ములను (Self-evident truths taken from metaphysics) గైకొనియే తమ పరి శీలనమునకును, అన్వేషణమునకును దొడరును. మీమాంస కాసత్యములు మూలబంధములగును.

మతమున విశేషముగ పనిచేయునది విశ్వా సము. షెల్లీకవీంద్రు డనిన Owl-winged Calculation మతదృష్టిలోని దురూహ్య విహాయసమున నెగయలేదు. మతాంగణమం దలి జ్ఞానయోగ, కర్మయోగ, భక్తియోగము లను కడపటివే అశేషజనములచే ననుష్ఠింప బడుచుండెను. "విశ్వాసే పాయిబే కృష్ణకో" అను వాక్కు వంగభూమిలో విశేషప్రశస్తి నందినది. సంపూర్ణముగ నారాధ్యదేవత కాత్మార్పణ మొనరించుకొనువాడు మహా భక్తు డనబరగుచున్నాడు.

అంత మెఱుగని విమర్శనమునకును, విశ్వాస మునకును మట్టితికి మేది? నిత్యవిమర్శనము కతన దాస్యముతోపాటు భక్తిగూడ తుడ్క లగును. ఛేదనమునే జీవితపరమావధి గావించు కొనువాడు ఉద్యానమున బ్రవేశింపవచ్చునా? కలుపును, కంటకములను మాత్రము తొల గించి ఈత డీవలికి వచ్చునా? చక్కని చుక్కలబోలు పూవులనుగూడ కత్తిమొన కప్పగించి, ఘోరపాపము నొడిగట్టుకొనడా? కేవలము భౌతికశాస్త్రమున కంజ లెత్తువారు, కేవలము హేతుశక్తినే ప్రయోగించువారు చేయజాలని దుష్కృత్య ముండదు. తమ నుండెలనుండి దూరముగ తరలిపోయి, మేఘ శిఖరములపై నిలిచి ఉత్తమాశయములపై వాడిశూలములను విసురుదురు. ఇటలీ స్పెయిన్ మున్నగు ప్రతీచీసీమలును, పాశ్చాత్యప్రథమ స్థైర్యకరదైవము గావించుకొనిన జపానును, హృదయశక్తిని గోల్పోయి, హేతుమాత్రమే మనుష్యజీవితమునకు నక్కరైన పరమసూత్ర మని యూహించి, భౌతికశాస్త్రపరిజ్ఞానమును సంపూర్ణముగ దుర్వినియోగము గావించుచు, సౌందర్యసందీప్తమైన ఈశ్వరసృష్టిపై విష వాయువులను, కారుపొగలను పుక్కిలించుట లేదా? తమఃపిరంగులచే పిశాచగణమును క్రక్కించుటలేదా? భక్తివిశ్వాసములు హృద యస్థసంపదలు. మతమున విశేషముగ చెలా మణియగున విడియే! నిరంతరవిమర్శచే వీనిని వీక్షించి, వీనివిలువ నెఱుగదలచుట ఈశ్వ రుని కొలబద్దతో కొలుచుటవంటిది. సర్వాంత ర్యామియైన భగవంతుడు కొలబద్దలకును, కొల బద్దలకును లొంగునా? అనంతశక్తిగలభక్తి మారలకును, బారలకును లొంగునా?

భక్తిభావదాస్యమేయని ఎంచువా రనేకు లాధునికవిద్యార్థులందు గోచరించుటచే, అవమానితుడగు అతిథివలె పల్వుర మేధావుల హృదయములనుండి భక్తి తరలిపోయినది! మనుష్యసంఘమున మతము తొట్రుపడు చున్నది! దురంతములైనదురములనటు నిలు పుచు; ప్రచ్ఛన్నవేషము దాల్చినదౌష్ట్యము మతచ్యుతులైన మనుజులందు (వీరిలో కొంద ఱు మహామేధావులుసుడీ!) నిత్యపూజల నందుచున్నది. నుడితేనియలను వీనులందు బోసి, నిష్ఫలండముపోలు వంచనమున నిర్మల చారిత్రుల బనద్రోయువిద్యార్థిప లున్నారు. మోములను పైడిపూతలచే తళుకొత్తించి, నిరంతరాయముగ పాడుచేత లొనరించి, గడు సరులగుడు పట్టుపడక, పలువుర నవలీలగ మొ అకులజేసి, పేరుప్రతిష్ఠలను పడయు మేధావు లును ఉన్నారు. దశముఖముల గలిగి బహు విధముల విజృంభించు వీరిదౌరాత్మ్యమును వర్ణించుట నా ప్రస్తుతాశయముకాదు. హేతు వును, ఋజువునుమాత్రమే పాటించి, ఆధ్యా త్మికచింతనమున కలవాటుపడని విద్యార్థికులు నిజరూపులందు గోచరింపక ప్రత్యక్షదస్యులు చూచి నెఱచుజఘన్యకృత్యములకు చేయి చేసి కొని, సంఘజీవితమును కలుషిత మొనరించు చున్నారని తెలుపుట నా ప్రస్తుతోద్దేశము. భక్తిస్పర్శ నెఱుగనిహృదయము అనుకంపకు గాని, అనురాగమునకుగాని అవగతము కాదు. ఇది మనుజు నెట్టిచెట్టుపై కూలద్రోయునో గ్రహించితిరికదా!

ఆకాశమునకును పాతాళమునకును నడుమ నెంతచోటున్నదో భక్తికిని దాస్యమునకును మధ్య నంతతావల మున్నది. ఆంతరంగికశక్తు లను మటుమాయము చేయునది దాస్యము. బ్రదికియున్న వానిని చచ్చినవారిలో జమ చేయున దదియే! మనుష్యహృదయము ననవ రతము భయసంశయములకు సంజాకొనబెట్టు నదియు నదియే! మానవుని మానాభిమానము లకు దూరముగ నిలుపునది ఇదియేసుడీ! మాన వత్వమును ముక్కుదారములతో నడపి, స్వా తంత్ర్య సముద్భవ సుణములను అంచలను తటి మికొట్టు పలుగాకివలె తఱిమివేసి, మనుష్యత్వ మును పశుత్వములోనికి దింపునది దాస్యమే యని నమ్ముడు.

మనుష్యత్వమును దేవత్వమున జేర్చునది భక్తి!

దాస్య మాత్మగుణములను చచ్చినట్లు పడి యుండనిచ్చును. నిర్లక్ష్యముకతన వానిపై

నివురు చేరనిచ్చును. భాస్వంతమైన ఎదుటి శక్తి ననుసరించి భక్తిలోనిశక్తిని కదపుచు ప్రజ్వరిలజేయును. దాస్యమును తలపైవాల్చిన వాడును భక్తుండును ఒకేరీతిగ తోచినను భక్తునిమానసము ఇంజనులోని మరవలె సుండె లోనిస్పందమట్లు పనిచేయుచునే యుండును. ఎదుటికోనేటిపై కన్నుంచి జలయంత్రము మూలమున దానిని వెన్కగల కేదారములోనికి వలసిననీటి నాకర్షించుకొను కృషీవలుని చందమున భక్తుడెదుటి భావపూరములోనికి చూడ్కులనుగొట్టములను చొప్పించి దానిని హృదయక్షేత్రములోనికి పట్టించును. దృష్టి చెదరినపుడు భావము చెల్లాచెదరగును. ఇటునటు పర్వులెత్తు చూడ్కులు చెరువుకట్టలందు తోచిన గండిలు పోలునవి. గండిలగుండా నీరవ్వలికి పోవును. భావగ్రహణ సమయమున దృష్టి చెదరెనేని భావపూరము మనది కాకుండ పోవును. పెద్ద రంధ్రముగల పాత్రలో పడిననీ రేమగును? పరధ్యానము హృదయపాత్రమందలి రంధ్రమే యగును. ఇట్టిరంధ్రమున కెడమీయక చూడ్కి నెదుటి భావశైవలినికి లగించి (నదినుండి కాల్వలను పొలములోనికి పాఱించునట్లు) మనసులోని కల్లనల్లన నాపూరమును ప్రవహింపజేసి తోడ్తోడనే ఆంతరంగిక సేద్యమును సాగించి, అపూర్వభావములను బదనికలయట్లందు నాటి, భక్తుడు నిజహృదయమును రెండవనందనము గావించుకొనగలడు. ఆంతరంగికసౌందర్య సముద్భవ భావోద్వేగమే పట్టరాని ఆనందము. సింధుహృదయమున నుద్భవించిన ఉత్తాలతరంగములు తమయుద్వేగము నరికట్టజాలక మింటిమీది కెగయుచుండునుగదా! ఉద్వేగభరిత హృదయుడు పరమహంసయై తన్మయనృత్యము సలుపును. ఈతడు మహాభక్తుడు. దాస్యమును కొండభారమట్లు వీపుపై వహించినవ్యక్తి జడమట్లు పడియుండును. భక్తుడో? నటరాజువలె దివ్యనృత్యము సలిపి, దిక్కామినుల మేనులగూడ పులకలు లేపును. చూపఱులను కూడ పరవశులను జేసి, వారిచే భావబంధుర నృత్యము చేయించును.

భక్తునిచూడ్కి అవ్వలను, అంతరంగమందునుగూడ పనిచేయుచుండునని పాఠకులు గ్రహించియేయుందురు. శమంతకమణిపోలు గుణమణిపై నవ్వలిచూపు వ్రాలును. దానిని గ్రహించి తోడన ఇది లోనిచూడ్కి కందించును. ఈమణినది మానసకోశాగారమున నిడును. ఈ దృక్కులను గృహమున కివ్వలను అవ్వలనుగల ఎలక్ట్రిక్ తీవలకు పోల్చవచ్చును. ఆవలి తీగకు స్విచ్ లగింపబడియున్న దనుకొనుడు. పవర్ హౌసునకును దీనికిని సంబంధ మున్నది. స్విచ్ నవ్వలవేసినంతన గృహాంతర్భాగ మాలోకితమగునుగదా! అవ్వలిచూడ్కి కొండొక సుందరదృశ్యమందలి మహితగుణమునకు లగింపబడెనని యూహింపుడు. ఈ మహితగుణమే ఈ ఘనభావమే అద్భుతమైన పవర్ హౌస్! ఈ చూడ్కితీవకు సహజమైనస్విచ్ కలదు. బుద్ధిప్రేరణమున నిది కదలును. తోడన హృదయాగారము మహితగుణాలోకముచే నుద్భాసిత మగును!

"ఎద్దానిని ధ్యానింతువో నీ వదియ అయ్యెదవు. కావున బ్రహ్మమును దలపుము." అని కదా ఈ శోపనిషత్తు వాకొనుచున్నది. బ్రహ్మముపై, ఉత్కృష్టాశయములపై దృష్టి నిబద్ధమొనరించువాడు భక్తుడు. సత్యముపై, సౌందర్యముపై, శివమగు ధర్మపథముపై నేకాగ్రదృష్టి నీతడు నిలుపును. తోడన నీతనిహృదయ మీపరమాశయములకు కేంద్రస్థాన మగును. ఏకాగ్రదృష్టియందును మహితగుణగ్రహణమందును, బంగారున మణులనుచెక్కిన ట్లీగుణముల నాత్మహృదయమున, నాత్మచరిత్రమున, నాత్మజీవితమున స్థాపించునేరిమియందును ఆఱితేఱినవాడే అద్భుతమైన ఆంతరంగిక ఆధ్యాత్మిక అభివృద్ధినంది కాలక్రమమున "సోఽహమ్" అనజాలును.

మహితగుణము ప్రాణభరితము. ఇది భవ్యభావమునకు రూపాంతరము. ఇది జీవసంచారము కలదనుట విదితమేకదా! ఆత్మప్రకాశము గావించుకొనుట దీని సహజలక్షణము. గురుగుణపూరితమైన హృదయ మనుడు, భవ్యభావబంధురమానస మనుడు అనవరత మాత్మప్రకాశమునకై ఆతురంపడును. ఈ ప్రకాశమందే యుత్కృష్టసృష్టి దృగ్గోచరమగును. తనగుండెకు సీల్లువేసికొనుట జగదీశునకే సాధ్యముకాలేదు. హృదయకవాటమును తెఱచి, సృష్టికర్తయై "అమ్మయ్యా!" అనుకొని కొంత డనంతానందమున నోలలాడినాడు. భావమయమనస్కుడైన కవియును కావించుకర్జమిదియేకదా! భక్తుడీతనిసైదో డని పైన దెలుపబడిన ఉదంతమువలన విదితమైయుండును. సృష్టికర్తకును, కవిచంద్రునకును, భక్తవరేణ్యునకును అవినాభావసంబంధము కలదని రూఢిచేయగలను. ఇట్టిచుట్టఱికము నెఱుగనికవి కవి కాడు, భక్తుడు భక్తుడు కాడు. భవ్యసంబంధమును వీరు ఫుటుక్కున త్రెంచుకొనగలరు. ఇది తెగినముహూర్తమున మనకు ప్రత్యక్షమగువారు కుకవియును, మృషాభక్తుడును. ఆతని వ్రాతలోని చెత్తయే ఆతని నిజరూపమును, ఈతనినడతలోని మచ్చయే ఈతనినిక్కంపు స్వరూపమును బయటబెట్టును. భవ్యసంబంధమున నచలుడై నిలిచినకవియును, భక్తుడును సృష్టికర్తతో నేకాసనమున నాసీనులై తమవాక్కులనుండి అనంతములైన స్థలకాలములలోనికి భావబ్రహ్మాండములను దొరలించుచు, అశేషయుగముల జోహారుల నందుచుందురు.

సహజమైన ఆత్మవ్యక్తీకరణము మహోత్కృష్టసృష్టికెట్లు కన్నతల్లి యగుచున్నదో గ్రహించితిరా? గంభీర వాక్కులందును మధుర గానమందును, మహితనృత్యమందును లోని దివ్యసామగ్రి ఆత్మప్రకాశము గావించుకొనును. ప్రేమవ్యక్తీకరణమును, భక్తివ్యక్తీకరణమును, ఆత్మప్రకాశములోని వసుడు మనుష్యహృదయమునకు నైసర్గికములు. ఎవరెట్టిహుకుమును జారీచేసినను, ఎట్టి దుర్విమర్శనమును గావించినను, ఎట్టి యధికారమును చెలాయించినను, నైసర్గికగుణము కట్టుత్రాళ్లకు లొంగదు. కడలికెరటాలకు డ్రిల్లు చెప్పగలవా రెందఱు? వాతూలమును గుప్పిటబట్టువారెవరు? పూవునోరు మూసి సౌరభమును పుష్పహృదయమున కైదీ గావించువారెవ్వరు? దుడ్డుకఱ్ఱలతో బాది గంగోత్తరి నెవ్వరైన కొండనెత్తములందు బంధించి ఈవల సీల్లువేయగలవా రెవరు? హృదయమున వసించువాడీశ్వరుడు, సన్నిహిత సంపర్కముకతన నిద్ది ఈశ్వరగుణము నలవఱచుకొనుచుండును. ఈశ్వరుని చీకటికొట్టులో బెట్టి

న్నెనకంపు డెవ్వండును లేడు. హృదయమున మును పట్టి బంధింపగల రక్కసి యెవ్వండును లేడు. ఇట్టులైన నాత్మప్రకాశము గావించుకొన్ని, ఆత్మానందము నందితీఋను. హృదయమునమైనభక్తి ఇట్టిదనుట చర్వితచర్వణము. భౌతికశాస్త్రభజనలో నీశ్వరభజనను మఱచిన పాశ్చాత్యులు నేడు వ్యక్తిభజనకు గడంగిరనియు జర్మనులును ఇటాలియనులును హిట్లరు ముసోలినీలను దైవమట్లు కొలుచుచున్నారనియు దెలుపుచు అసీమవాసుల వాక్కులనుండి ఇటీవల సుప్రసిద్ధ పాశ్చాత్యతాత్త్వికుడు జోడ్ కొన్ని దృష్టాంతములను జేర్కొనినాడు (Vide: C. E. M. Joad's article in the current issue of "The Aryan Path") హృదయ మారాధనమునకై మక్కువపడుననుట స్పష్టాంశమేకదా! హేతుశక్తినే గణించు భౌతికశాస్త్రము ఆత్మక్షుత్తును దీర్చలేదని స్వానుభవమువలన నెఱిగి ఈయాకలిని దీర్పజాలు విజ్ఞానకబళమునకై ప్రతీచీవిద్వాంసులు ప్రాచీదిక్కుగ నేడు హృదయాంజలుల నొగ్గుచున్నారు. జోడ్ మహాశయుని వాక్కులను గమనింపుడు:—

"Many thoughtful Occidents are looking for the Eastern mystical discipline of life...—Not philological but philosophical, not speculative but practical ideas are required; the soul-satisfying teachings of the Aryans are needed now."

భక్తిప్రభావమును ప్రార్థనమహత్త్వమును పల్వురు పాశ్చాత్య విజ్ఞానులుకూడ బహుధం సల నగ్గడించిరి. "More things are wrought by prayer than this world dreams of" అని టెన్నిసన్ మహాకవి పలికినాడుకదా! (Vide! Mortede Arthur. in "The Idylls of the King.")

ప్రార్థన మాంతరంగికశక్తిని గాక ఆంతరంగిక దౌర్బల్యమును బుట్టించునని కృష్ణమూర్తి పలుకుచుండును. కృతనిసుపులను, విలోకింపుడు.

"Isn't it the fundamental idea of prayer to seek aid and understanding beyond ourselves? If that is soon we are depending, something, which makes us weaker in our own intelligence?" (Vide. Authentic Report of Twenty-five talks given by J. Krishnamurti in Latin America.)

మనుష్యహృదయ మొకయారాధ్యదైవతమునకై యారాటపడునదేయయ్యు, నీదైవమును స్మరింపక, తానందవలయుగుణములను స్వీయచింతనమున రంగరింపక ఆంతరంగికముగ గ్రోలరాదు. త్రుప్పుపట్టిన సంప్రదాయమును త్రోసివేయుటొప్పు. గ్రుడ్డియేటుగ నెట్టి సంప్రదాయమును గ్రహింపరాదు. సచలమై, ప్రాణయుతమై, భావబంధురమైన సంప్రదాయమును పాటించి క్రియాంగణమున మానవుడు మేలునందజాలును. అంధుడైనాతడెట్టిప్రమాణమును గైకొనినను చెఱుపును తలమీదికి తెచ్చుకొనును.

విచక్షణశక్తికి విడాకులు సమర్పింపని విశ్వాసము హృదయస్థమైయుండవలెను. ఇట్టి హృదయమున మాత్రభక్తికి తావలమే యుండదు.

విచక్షణశక్తియే మూలవిరాట్టని విశ్వసించు కృష్ణమూర్తి భ్రమరకీటక, మర్కటకిశోర, మార్జాలకిశోరన్యాయములు ఒక తుమ్మెదకును, ఒక కోతికిని, ఒక పిల్లికిని తగునుగాని మనుష్యునకు కావని స్పష్టవాక్కులందు తెలుపుచున్నను, ఈతనియుద్బోధనములందలి సారాంశమిట్టిదని చెప్పకయే చెప్పును. బుద్ధియందు, ప్రజ్ఞయందు, స్వాతంత్ర్యచింతయందు, అవగాహనసామర్థ్యమందు కిశోరమైయున్నవాడే ఆ కిశోరన్యాయముల నవలంబింపవచ్చును. ఏకాగ్రదృష్టికి ప్రధానప్రాముఖ్యము నొసంగు భ్రమరకీటకన్యాయమును త్రోసిరా జనరాదు. ఆ దృష్టివెనుక నెంతేని యవగాహనశక్తి నిడికొనియే మనుష్యుడీన్యాయమును పాటింపవలె నందును.

హేతు విమర్శనమువలన నవగాహనశక్తి వృద్ధిగనును. హేతు పరిశీలనమును, స్వతంత్రగమనికయును మహత్తరము లనుట నిస్సంశయము. కారణాన్వేషణము సత్యాన్వేషణమునకు మార్గదర్శకము. ఈయన్వేషణమునకై నిర్దిష్టమైనబుద్ధిని ప్రయోగింపక, కనులుమూసికొని, చేతులు ముడుచుకొని, నడచువాడు తనబుద్ధిని త్రుప్పుపట్టనిచ్చును. తనమనుష్యత్వమునకు తలవంపులు తెచ్చును. తాను మూఢ్యమునకు మాఱుపేరగును; పశువే యగును.

మూఢ్యము నారాధించువారు నేడనేకులున్నారు. అనంతశక్తిసమన్వితుడైన జగదీశుని, పరిమితిశక్తిగల మానవుడు సంపూర్ణభావమున నూహింపజాలకపోవుట నిక్కమే! కాని, తనశక్తిని ప్రయోగింపక వెనుకనిలుచునాతడు ఈశ్వర సమక్షమునుండి దూరస్థుడగును. జగదీశుడు పూర్ణాలోకమేకదా! హేతుశక్తి వెలుంగేకదా! వెలుగును వీడి దివ్యజ్యోతిని గను టెట్లు? పరంజ్యోతిని నుఱుతించు టెట్లు?

తా దలచినదానిని మానవుడు తనమాడ్కినున్నదానితలకు గట్టును. తనవెలుగును వీడి తాను మూఢుడైనవాడు మూఢ్యమునే ఆరాధించును. కావున మూఢు డారాధించునది భగవంతునిగాదు, మూఢ్యమును పెద్దదిబ్బను. ఈదిబ్బ నాతడు (నలువురు పిలుచుచుండిరని) "దేవా!"యని పిలిచిన నేమిగాక.

భావమును పరిశీలింపనితఱి, మూఢ్యమునే విలోకింతుము. భావము ప్రాణము; మూఢ్యము జడముగదా! భావమును స్మరింపక, కట్టెదుట కానంబడు జడమును పూజించితిమేని, మొఱకులమే యగుదుముకదా!

జగతియందు నేడు విశేషముగ జడమునకు సంబంధించిన ఆరాధనమే విజృంభించుచున్నది. మతము పేరిట గొన్నికర్మ లొనరించువారును, ఆచారముల నవలంబించువారును నేడన్ని దేశములందును గలరు. ఈ యాచారములును, కర్మలును నిమిత్తములుమాత్రమే!— ఇవి యుత్కృష్టభావములయొక్క బాహ్యవ్యక్తీకరణములు. భావములు మనసునందే

జారకుండుటకై, భావోపాసనమున కక్కరైన ఏకాగ్రదృష్టిని, నిశ్చలచిత్తమును, వ్రతదీక్షలు నిలుపుటకై ప్రాచీనులు భావములను కొన్నియాచారములకు, కొంత కర్మకాండకు లగించిరి. నిలుకడగ, భావమననము కర్మకాండ ననుష్ఠించుసమయమందే జరుగజాలునని వీరు విశ్వసించిరి. మన స్తత్వమునకును పూజావిధికిని ఆంతరంగికమైన సంబంధమున్నపుడే పూజ పూజ యగును. మిడుతువలెగాక బుద్ధిగల మానవునివలెనే కర్మకాండననుష్ఠించు నాతని మానసికదృష్టినుండి భావములు మెఱపుల ట్లెగసిపోవు. ఎదుటిపూజాపీఠమున కద్దబడిన నక్షత్రముల ట్లివి (హృదయపూర్వకమైనకర్మానుష్ఠానమున) మనశ్చక్షుస్సమక్షమున నిలుకడగ దోచుచుండును. నిలిచినభావవిద్యుత్తు ఉపాసకుని మనసున నెట్టిద్యుతులను తళుక్కుత్తింపదు? పూజావిధానమున నాచారానుష్ఠానమున దృష్టి నిబద్ధమై యుండవలసినది భావములమీదనే! మననని దిధ్యాసనముల నెఱుగక భావములపై మనసు నిలుపక భావములను గ్రహింపక గ్రహింపవలె ననియే యెఱుగక నిమిత్తములైన ఆచారములనే అనుష్ఠించునాతడు మాధ్యమునే ఆరాధించు నవ డెల్లును. పీఠమందలి దేవుని స్మరింపక పీఠమునే "దేవ దేవా!" యని పిలుచుట కాష్ఠమును సంబోధించి, కాష్ఠమును ప్రస్తుతించుట కాదా? కాని ఇట్టిక్రియ పెక్కుతావులందు నేడు మతానుష్ఠాన మనబరగుచున్నది. దీనికి సంబంధించిన ప్రార్థనమును, ధ్యానమును ఎట్టిదై యుండునో యూహింపుడు. ఇట్టిప్రార్థనమును, ఇట్టిమతానుష్ఠానమును గర్హించుటకు కృష్ణమూర్తికి నిండుహక్కు కలదు. యూపకాష్ఠములకు ఛాగశిశువులను గట్టినట్లు మానవమానసములను భావరహిత కర్మానుష్ఠానములకు గట్టి ధనబలమువలన, ప్రచారశక్తికతన, సంఖ్యాబలము మూలమున (Organisation)కు సంబంధించిన సామర్థ్యము కతన చిత్తమువచ్చిన తీరున ప్రపంచమున విజృంభించుచు పరమతములను వెక్కిరించుచు రగులుచున్న అంతఃకలహములం దాజ్యము వోయుచు, మాధ్యమును దాస్యమును క్రౌర్యమును పిచ్చికుక్కలట్లు విచ్చలవిడిగ మానవసంఘమున వదలు మతబోధకులను ప్రతిఘటించుటకు కృష్ణమూర్తికి సంపూర్ణాధికారము కలదు.

ధమనీస్నాయువులందు, వివిధనాళములందు రక్తము ప్రవహించునపుడే శరీరమున ప్రాణసంచారము కల దని స్మరింతుము. మనసున భావసంచారమున్నపుడే అది ప్రాణయుతమైనదని క్రమాభివృద్ధి నందు నని గ్రహింతుము. విచక్షణతో విజ్ఞానముతో గూడిన అనుభవమే అంతరంగదిగ్వలయమును క్రమక్రమముగ విశాల మొనరించి అం దీశ్వరసామ్రాజ్యమునకు వలసినచో టొసగును.

జగదీశుడు సర్వాంతర్యామియనియు, అంతరంగవాసి యనియు నెఱుంగుదుము. (God is Omnipresent. He is immanent and transcendent) భావానుభవమున ప్రవీణుడు కాగోరుమనుజు డీయంశములు పలుమాఱు మననము గావించుకొనవలెను. ఎల్లెడల విరాజిల్లు దివ్యభావము నిజమానసమందలి భావమునకు వేఱు కా దని స్మరించినముహూర్తమున నీత డాంతరంగికముగ జగతితో తనకు దగ్గఱిచుట్టఱికము కలదని గ్రహించును. సన్నిహితసంబంధమందే పరస్పరగుణగ్రహణము సుసాధ్యమగును. మహాకవులును, మహాభక్తులును ఈ చుట్టఱికమును పురస్కరించుకొని ఆతురపాటున తమ మనసుల నెదుటిదృశ్యములపై వ్రాలనిచ్చి, వీని యంతరంగములందు వానిని ప్రవేశపెట్టి అందు వెలయుభావముల నవలీలగ గ్రహించిరి. వర్డ్సవర్త్కవీంద్రుడు కొండచరియలందు దిరుగుచు ప్రకృతిచిత్రములం దేల విడియువాడో ఎఱుగమా?

పైన నుల్లేఖింపబడిన బాంధవ్యముకతన, మనసు కదలినపుడెదుటి వస్తుహృదయము కూడ చలించును. దీనిచలనమును స్మరింపగలవానిమనసు చలించుననికూడ తెలుపవచ్చును. భావబంధురములైన దృశ్యములును, అసామాన్యసంఘటనములును, అపూర్వానుభవములును, నిశితమైన ఆత్మపరిశీలనమును ఆంతరంగికచలనమునకు హేతువులై, మనసును విజ్ఞానాన్వేషణమునకై పుత్తెంచును.

ఆత్మపరిశీలనము నెఱుగనిపాడు వస్తుహృదయము నెట్లు విలోకించును? వస్తుతత్త్వము నరయ గాంక్షింపనిమనస్సు, ప్రాణబంధువునుండి విడిపోయినవ్యక్తివలె నేకాకియై వ్యర్థజీవియై అల్లాడును.

వస్తుహృదయపరిశీలనముకంటె వ్యక్తిహృదయపరిశీలనము చులకనయే! హావభావములును, ప్రసంగధోరణియు, జీవితవిధానమును హృదయస్థితిని వ్యక్తీకరించును. కాని కవియును, భక్తుడును, ప్రణయియును, జిజ్ఞాసువును, తపస్వియును ఎనుటియెడందయందు (జడధిలో జలించుచేపవలె). మునుగుచు, దేలుచు భావాన్వేషణము సలుపుచునేయుందురు. భక్తియును, అనురాగమును ఉద్వేగసంభరితములు. ఆంతరంగికచలనముతో బాటివి బాహ్యవ్యక్తీకరణము నందితీఱును. ప్రేమసంశ్లేషమందును, పూజయందును, భజనయందును, తన్మయనృత్యమందును ఈ వ్యక్తీకరణమును గాంతుము. గోపిగోపాలు రంఙ్గొరుల సుండెలందు జలక్రీడలు సలుపునపుడే రాసక్రీడల దేలిరి! పరస్పరహృదయపరిశీలనమున పండిన పట్టరానిపరితోషమును రాధాకృష్ణులు ప్రణయపరిష్వంగమున ప్రకాశ మొనరించుకొనుట ముముక్షువు లెఱుంగుదురు. ఆంతరంగికముగ నారాధ్యదేవత హృదయనందనమున సానందపురస్సరముగ విహరించుచు, అందలి ననల నొక్కటొక్కటిగ గైకొనుమధుమయ ముహూర్తమంటె సగుణోపాసకు డావేల్పు తలపై నొక్కొకపూవు నిడుట మన మెఱుంగమా? పట్టరానియానందమున బిడ్డను ముద్దిడుకొను కన్నతల్లియును, భజనసేయుచు తాజూచు భగవంతుని దెస బర్వెత్తు భక్తుండును, నిజసృష్టిసముద్భవపాత్రలతో నాంతరంగికముగ పరమప్రమోదమున సయ్యాటలాడు కవిచంద్రుడును వారివర్గములోనివారే యని గ్రహించుట కాలసింతుమా?

ఉత్కృష్టాశయమహత్త్వమును గ్రహింపక మధురచింతనమున మసలక ఉన్నతభావాంబరవీథియందు విహరింపని మానస మధోగతిపాలగును.

చిత్తమున కొకవంక జగదీశుడు విడియుచున్నను, సుందరరూపు దాల్చి ప్రణయము నభినయించుచు వేఱొకదిక్కునుండి పిశాచము దాని నాకర్షింప యత్నించుచునేయుండును. దృష్టి ఈశ్వరునిపై నిబద్ధముకానిచో, పిశాచము దీనిని తనవంకకు ద్రిప్పుకొని (త్రాడునుబట్టి పశువు నీడ్చినట్లు) వానిచూడ్కి త్రాటిచే తనసమీపమునకు వానినీడ్చి ఇష్టము వచ్చినట్లు వానిపై స్వారిచేయును. భావమును గ్రహింపక జడమును పూజించునాతడు జగదీశునకు దూరమందే నిలుచును కావున పిశాచముయొక్క పట్టునకు దగ్గఱనుండును. కావున దృష్టి ననుసరించియే, ఆంతరంగికమైనచలనము ననుసరించియే, మానసగమనము ననుసరించియే, అవగాహనసామర్థ్యము ననుసరించియే మనుష్యజీవితము (అటునాకంపుదిశకో, ఇటు నరకంపుదిక్కునకో) నడచును.

భావపతనమునకు బహుళమార్గము లున్నవని చదువరు లెఱుంగుదురు. వీనిలో (ఏకాగ్రదృష్టి, ప్రార్థన మున్నగునవి) నాటితేటకై మానవుడు తొలుత నాత్మసంయమమున, నియమబద్ధజీవితమున సిద్ధహస్తుడు కావలెను. శరీరమానసముల నాత్మకు భృత్యుల గావింపగాలినవాడే. బహుభావవిభూతి నంది ఆంతరంగికోన్నతిని పడయగలడు.

ఆత్మసంయమ మలవడినపుడు మనసు నిర్మలమైయుండును. కమలముపోలు ప్రఫుల్ల హృదయమును సృష్టికర్త నిజాసనముగావించుకొని, నాల్గువేదముల బఠించును. అంతరంగగర్భాలయమున నివి ప్రతిధ్వనించును. నిర్మలాత్ముడైన విజ్ఞానివాక్కులకు చెవులొగ్గినపుడు వానియందీ ప్రతిధ్వనియుంట గ్రహింతుము.

కమలము నిర్మలమైనదేకాదు; కడుంగడు సుందరమైనది, సుధాబంధురమైనది. నిర్మల హృదయము సౌందర్యసంశోభితమై, అనురాగామృతముతో తొలుకాడుచు, ఆనందము చేకూర్చును. కావుననే చతుర్ముఖు నాకర్షించునంటిని.

జిజ్ఞాసువులలో మొదటివాడు చతురాననుడే! వాణిని రాణి గావించుకొని, నాలు నోళ్లతో నాల్గువేదములు చదువుచు, భావమయ హృదయమును సత్యలోకము గావించుకొని, అందు విడియును. భావపాతకు లీతని దృష్టాంతము ననుకరించుట పాడి. పవిత్ర వాతావరణమున విడిసి, పవిత్రపఠనము గావించి పవిత్ర సంసర్గమున మనిరేని, వీరు పవిత్ర భావములను తమవి కావించుకొని సృష్టికర్తలై పవిత్రాత్ములై అవిరళానందమంది, సత్యమున వసింతురు.

భావపతనము, జిజ్ఞాస, అనురాగము, సౌందర్యము, భక్తి, ఆనందము, సత్యసందీప్త జీవితము అవినాభావసంబంధము గలవని పరితలు గ్రహించియేయుందురు.

హృదయస్థ భావమూల బంధముపై నాధారపడు క్రియయే హృదయపూర్వకమై మహత్తరమైయుండును. దీనికి వ్యతిరేకమైన చెయువు ఆడంబరమును, అసత్యమును ప్రకాశము గావించును. కాలక్రమమున నిది చెప్పరాని చెఱుపునకు దారితీయును. పండువులందును, పబ్బములందును పూజ లొనరించి, అన్యదినములం దనుచితక్రియలు సలుపు హిందువు లెందఱు లేరు? ఆదివారములందు తప్పక చర్చి కరిగి, అన్యసమయములం దేసు మదికి దురంతసంతాపము నొదవించు చెట్టలకు చేయిచేసికొను క్రైస్తవు లెందఱు లేరు? పులితోళ్లపై గూర్చుని, యొడళ్లకు దట్టముగ బూడిద బూసికొనినవా రెందఱెందఱో కనులెఱ్ఱజేసి దుర్భుక్తు లుచ్చరించు టెఱుగమా? పెక్కు దేవాలయములందు శంఖములను పూరించుచు, నొకచేతితో గంటమ్రోగించుచు రెండవచేతితో వర్తకము చేయువారిని నేడు విలోకించుచుంటిమికదా! ఆరాధన మాంతరంగికము కానపుడు పెక్కుదుష్క్రియలకు బురఖా కాగలదు. పూజను పురస్కరించుకొని కొందఱుకొందఱు చేయుపనులను పరిశీలింపుడు. నిజము మీకే తెలియును. భావవిదూరుం డొక్కొకపుడు బందిపోటునకంటె భయంకరుడగునని మీరే గ్రహింతురు. ఈ రీతివ్యక్తులు హేతువునకును, విశ్వాసమునకును గూడ దూరస్థులే! హేతుశక్తినే పాటించువారి క్రియలు—అవెట్టివైనను—అంతరంగికములు. వీరిచర్యలకంటె వారిక్రియలు అధమములు. హేతువిశ్వాసము లంతర్ధానమైన ముహూర్తమందే భక్తియును, భవ్యభావమును అంతర్ధానమగును. పాడుపడిన కొంపలలో దయ్యము లుండు నని విందుము. పాడుపడిన గుండెలో నుండునవి ఇవియే సుమీ!

ఆచార్యుడు వ్యక్తీకరించు భావమును హృదయంగమ మొనరించుకొనక ఆచార్యు నారాధించువారు మతాంగణమందే కాదు వివిధ జీవిత రంగములందును నేడు గోచరించుచున్నారు. వాక్కులోని భావమును గ్రహింపజాలనివారు, వాక్కు నుచ్చరించు వాని యంతరంగము నెట్లు స్మరింపగలరు? స్మర్తలుగక చేయుపను లెంతకు దెచ్చునో తెలిపియే యుంటిని.

మిషనులవలెను, శానిసలవలెను పనులొనరించువారిని, పవిత్రనామముల నుచ్చరించుచు, వక్రక్రియలకు గడంగుచు, నిరంకుశత్వమును చెలాయించుచు, మానవసంఘమున కెనలేని యరిష్టము దెచ్చువారిని ఎందఱెందఱినో కృష్ణమూర్తి చూచియుండును. భగవద్గీతను, కొరానును, బైబిలును చేబూని దురంతదుష్క్రియ లొనరించువారిని పల్వురను పరికించియుండును. దేవునిపే రుచ్చరించి, పైశాచిక కృత్యములు గావించువారిని విలోకించి యుండును. కావున తన నిశితవిమర్శనలచే మనుష్య విశ్వాసములను మార్కొనుచున్నాడు. అక్కఱైన అనుభవమునుండి తప్పించుకొనజూచువారిని పిడికిట బట్టి, "To a man in a prison, freedom can be only in imaginative flight, your search for reality, for God, is but an escape from actuality." అని కృష్ణమూర్తి జలదగంభీరస్వరమున బలుకుచున్నాడు.

అనవరతము సాంఘపరిశీలనమును, పూర్ణావగాహనమును ఉగ్గడించిన ఆధునికులలో అగ్రగణ్యుడు కృష్ణమూర్తి. "నీ వెవ్వరవో స్మరించుకొనుము" ("Know thyself") అని బహుళశతాబ్దములనుండి ప్రాచీప్రతీచీమతము లేకగ్రీవముగ బల్కుచునేయున్నవి. నూవా

కు కృష్ణమూర్తిచెవిలో నక్రాంతము ఘంటారవము సలుపుచున్న దేమో! ఇందలినిక్కము గ్రహించి, నిందుహాక్కుతో నీవాక్కు తనదికావించుకొని, కష్టైదుటిజఘన్యదృశ్యమునను మిక్కిలికనలి, సకలారిష్టములకు భావదాస్యము హేతువని నమ్మి దీనిని మాపుచేయనీతడు యత్నించుచున్నాడు. ఈతని యుద్దేశమందలి మహత్త్వమును హృదయంగమమైన రించుకొని, ఈ యుద్దేశమును మనయది గావించుకొని, దీనికి మనయాశయములను, మనయభిప్రాయములను సహకరించుట పాడియని వచింతును.

తా నెవ్వరో ఎఱింగినమనుష్యు డొరులకు దాసుడు కానేరడు. కాని, "నీ వెవ్వరవో ఎఱుంగు"మని ఘోషించుమతము లెవ్వియు మానవు నొంటరిగ విడువలేదు. ఆచార్యులను తఱిమికొట్టలేదు.

స్వకీయమైన పరిశీలనమువలన, గంభీరమైన పర్యాలోచనముకతన, తీవ్రమైన అనుభవము వలన చేకుఱుమేళ్లు బహుళములైనను, పరప్రబోధము, పరదృష్టాంతము పనికిరావన లేదు. అలవఱిచికొనిన పరిశీలనాశక్తి చల్లగనున్నంతసేపు ఇవి యెగ్గుచేయజాలవు. కనులకు గంతలుకట్టుకొనక ఒరులచేకట్టించుకొనక తన చూడ్కిని వాడిగావించుకొని, తనమనుష్యత్వమును మేరుశిఖరాగ్రమున నిలుపుశక్తి మంతుని ఏ మాయగాని, ఏ ప్రలోభముగాని ఏమిచేయగలదు? హిమగిరిపై నిలిచినప్రవరాఖ్యుని మోల వరూథినిపప్పు ఉడికినదా? మంచులో నదిచల్లబడిపోలేదా? శారీరకము గనేకాదు మానసికముగను, ఆధ్యాత్మికముగను ప్రవరాఖ్యుడు మహోన్నతస్థానమున నిలిచినాడు. ఈతని పరిశీలనము చల్లగనుండుటచే వరూథిని యత్నము చల్లబడిపోయినది. వంచనము విజయకేతన మెత్తజాలకపోయినది.

విజ్ఞాన మనంతమైనదికదా! అనేక యుగములనుండి యనేకమానసములు నిరంతరపరిశోధనమువలన, చిరతపస్సుకతన సమధికజ్ఞానము నంది భావికాలమునకు పంపుచుండెను. నవ్యాన్వేషణమునకును, నూతనసృష్టికిని వానిపూనికలు చేయూత నొసగిన నొసగవచ్చును. ఈ యూత మన జతనపుకుత్తుకకు కోత యని అడలరాదు, సంశయింపరాదు. ఇట్టి యనలును సంశయమును స్వకీయ పరిశీలనాశక్తికి తలవంపులు తెచ్చును. ఎదుట కోటిదివ్వెలు జ్వలించుచు, కనులపండువొనరించుచుండ, వీని నెవ్వరో వెలిగించిరని పలికియో, ఇవి కొరవియ్యములని యులికిపడియో దూరముగ తొలగిపోవుటుచితమా? కన్నులు తెఱచి కూడ చీకటినుండి వెడలనంతవఱకు గోతులందు కూలబడుచుందుము కదా! మనదీపము మనము వెలిగించుకొనుట మంచిదే. కాని చిరప్రదీప్తములైన ఉత్తమాశయములు నక్షత్రములై వెలుగుచుండ, అద్భుతదృష్టాంతమొండు పూర్ణచంద్రునివలె కాలవిహాయసమున కాంతిలుచు విజ్ఞానాలోకమును జగతిపై కలువడించుచుండ నిది సొంతసృష్టి కాదని, ఇది మనలను ముట్టరాదని మన బ్రదుకులను నాలుగుగోడల నడుమ నక్కించుట పాడియా? ఎదుటి వెన్నెలనుండి తొలగిపోక, మనతపసును పరిత్యజింపక, దానిని క్రమగతిని బండించుకొనుచు, పండువెన్నెలకు ప్రతి వచ్చునట్లొనరించుకొనుట మనకెంతో శ్రేయస్కరముకదా! ఉత్తమాశయము లొక్కనాటివి కావు; అనంతకాలమున గాంతిలునవి. వీనికి ప్రాతక్రొత్తలు లేవు. మనసృష్టికాదని వీనిని త్రోసిరాజనజెల్లునా? వీనినే రుచ్చరించుచు కొందఱు నక్రక్రియలకు గడంగుచున్నారని, "Ideals really give you the opportunity not to face the present corruption and exploitation in which you are taking part" అని చెప్పివేయవచ్చునా? ప్రాణప్రతిష్ఠమైన సంప్రదాయమును హృదయద్వారమున ప్రవేశింపనీయక, అవ్వయెుద్దకును తాతకడకును తఱిమివేయదగునా? భగవద్గీతను, కొరానును, బైబిలును, జెండావెస్టాను, గ్రంథను తలపైనికొని ఎవ్వరో అబద్ధపుసాక్ష్యములు చెప్పిరని, వీనిని హృద్గతములు గావించుకొనకుండుట మనకు కూడివచ్చునా? బుద్ధ, ఏసు ప్రభృతులనుండి తొలగిపోక, మహత్తరమైన ప్రాచీన విజ్ఞానమునుండి పాఱిపోక, దీనికు అగల నిలిచిన ప్రవక్తల చేయూతనంది ప్రదీపములై కన్నిడి మనదివ్వెల నందు ముట్టించుట ఉచితముకాదా? కాలముచుట్టు వెట్టికంచెయును లేదు. ఇది యనంతమైనది. క్రొత్తబదనికలనిందు నాటి క్రొత్తపూలనిందు పూయించుట మనకర్తవ్యమే! సర్వదిక్కులను ముంచెంచు శాఖలతో నొప్పు మఱ్ఱిచెట్లిందు వెలయుటగాంచి, ఇవి తొల్లింటివి కావున వీనినీడ సోకరాదని ఎంచి వీనిని గొడ్డలిపెట్టులకు గుఱి చేయుట చెప్పరానిచెట్టకాదా? పనికిమాలిన దెద్దియో తనంత దాసే చచ్చును. స్వీయశక్తి కతన, చిరమైనదానిని చంపదలచినను, నెగ్గవా రెవ్వరు? నెగ్గక నెత్తినిబాదికొని నెగ్గుదెచ్చుకొనువా రెందఱుందురు? సంజీవిని దెచ్చి, ప్రొయ్యిలో బెట్టి పులగమును వండుకొనగలవా రెవ్వరైన నుందురా?

క్రమయత్నమువలనగాని మానవుడు తన దృష్టిని తీక్ష్ణమొనరించుకొనజాలడు; నిశితపరిశీలనము నంపలేడు. పామరులందు పల్వురును, పండితులందుకొందఱును పరిశీలనాశక్తియందు కొఱవడియుండుట నెఱుంగుదుము. విచక్షణశక్తి ప్రత్యేకమైనది కాదు. దండెములను బస్కీలనుదీసి కండను గట్టిపఱచుకొనుటవంటి డికా దీశక్తినలవఱుచుకొనుట. వివిధమనుష్యప్రకృతులను గమనించి, బహుళసంఘర్షములందు దెబ్బలు తినితిని, ఎంతో స్వానుభవము నంది, ఆంతరంగికపరిపక్వమును పడసినయనంతరమే మనుజు డీశక్తిని కొంతదనుక నలవఱుచుకొనగలడు. ఉద్వేగము నరికట్టి, సందెను చెప్పుచేతలం దుంచి అద్భుతమైనసహనమునునుష్ఠించి, మెదడుచే పని చేయించుకొనగల సామర్థ్యము మానవునకు కాలక్రమమునగాని కలుగదు... కారణాన్వేషణమునకు సంబంధించినదికదా పరిశీలనశక్తి! కారణమును కనుగొనుట సామాన్యక్రియ కాదు. ఒకేసంఘటనమునకు పెక్కు కారణము లుండును. ఇవి యనేకములైన అన్యవిషయములతో మిళితమైయుండవచ్చును. వివిధఫలితములును కలిసియుండును. ఏ హేతువుకతన నేఫలము వొడమినో కనుగొనుట, కారణకార్యముల నడుమగల సూత్రమును గ్రహించుట చులకనైనపని కాదు. ఎంతో తార్కికపరిజ్ఞానమును పడసి, మానవుడు మానసికవృద్ధి నందినప్పుడే

...ను. ఇది యొక్కనాటితో నలవడదు. కావున స్వయమర్థుండును, అనుభవశాలియును, విశాల హృదయుండునైన ఆచార్యుని మానవులు, - విశేషముగ పామరులు ప్రపంచమున వెమకు చుందురు. విపదవస్థలం దొకనాయకుని చే యూత నండ నాతురంపడుచుందురు. మన ...స్త్వమునకు సంపూర్ణముగ నవగతులై, పూ ర్వులు మతమునకు సంబంధించిన జీవితమున తరగతుల నేర్పఱచిరి. నిర్గుణోపాసనము సర్వో త్కృష్టమైనదని తెలిపి, క్రమమైన ఆంతరంగి కోన్నతివలనగాని యది అలవడదని ఎఱిగి ...ణోపాసనమునకు అక్కరైన అవకాశము ...సగిరి. ఇట్లని భావమును గ్రహించుట కసలే యత్నింపక, రాళ్లనే దేవుళ్లనియెంచి పూజా ...ములు సలుపుట తగదు. చితి నెక్కవలసిన "...శాద్ధళి"ని పునశ్చరణ మొనరించుట కూడ దు. మెదడు నోరులకు తాకట్టువెట్టి తాను "తం దా న తా న" యనుచు, మను ...డు తన మనుష్యత్వమును మంటగలుప రాదు. శిక్షణము నందుతఱి ఆచార్యు ననుగమించుచున్నను, "ఏల?" "ఎందు లకు?" అని ప్రశ్నించు సామర్థ్యము నల వఱుచుకొని, జిజ్ఞాసానలమున వలసినన్ని సమి ధలు వేయుచు, మానవుడు తనపరిశీలనమును, తన విమర్శనాపరిజ్ఞానమును వృద్ధి గావించు కొనవలెను. ఈ పరిజ్ఞానము ముందంజవేసిన కొలది, అనుకరణ అనుసరణములు వెను కంజవేయును. మాయనుండి విడివడినవాని వలె, మనుష్యుడపుడు హాయినందును; భయ సంశయములనుండి విడివడి, సంపూర్ణ స్వాతం త్ర్యము నంది ఆనందాంబుధి నోలలాడును. కృష్ణమూర్తి ప్రబోధమును తల కెక్కించుకొన జాలినవారు విద్యాధికులలోకూడ మిక్కిలి తక్కువగ నున్నారు. జనసామాన్యమున కిది దుష్ప్రగ్రాహ్య మనుననని, అవలీలగ నిది యా చరణయోగ్య మని వచించువా రెవరు? కాల క్రమమునగాని ఇందలి పరమార్థము మానస గోచరము కాదు.

భౌతికవిషయాన్వేషణమునందే హేతు మాత్రము పనికివచ్చు నని ఆధ్యాత్మికాంశ ములం దెంతో దూరము సాగనేరదని తెలిపి ...తి, మతజీవితమున హేతువుకంటె ఘనతర మైనది విశ్వాస మనుచో, విశ్వాసముకంటె మహత్తరమైనది అంతర్వాణియని పల్కెదను. ఇది కేవల మీశ్వర ప్రేరితము. మానవుని నిమిత్తము గావించి, భగవాను డాతనిరసనము నుండి అద్భుతసత్యములను జగతిపై దొరలిం చును. ఈశ్వరుని కారుణ్యముకతన, వాని కన్నులు దివ్యద్యుతుల కాపురస్థానములై యుండును. అపు డాతనికి దివ్యదృష్టి కలుగును. అపూర్వ భావ భూగోళములు, విశ్వమహా వృక్షమునుండి వ్రేలాడు ఫలముల ట్లపుడు వానికి గోచరించును— —Reason and Faith, Intuition and Revelation ఆధ్యాత్మిక సామ్రాజ్యమునకు నలువలంకు లందును గలనాలుగు ద్వారములు. ఏదిమూయ బడినను లోపము కలిగితీఱును.

క్రమదీక్ష ననుష్ఠించుమహాత్ముడు, క్రమ గతి నాత్మహృదయమందలి ఈశ్వరసామ్రా జ్యము నవలోకించును. నాలుగుద్వారముల నుండి ప్రవేశించి, తనపరమగు పరమార్థమును గాంచి ప్రాప్తలాభముదితహృదయు డగును.

పరమార్థమును పడసి, పరమహంసయై పర మానందభరితు డగునాతడే పరిపూర్ణత్వము నందిన తపసి యనబరగును. అనంతకాలము నుండి ఉత్తుంగతరంగములతో ప్రవహించు భావసింధువునుండి ఈతడు తరలిపోడు. తన నుండెనుండి వెడలు భావపూరమందు కలి యుట నీతడబ్బురపాటుతో విలోకించును. అనంతమైన అంబురాశిని నింగినుండి వీక్షిం చుచు తన్ను జూచి ఉప్పొంగునాయుదధి తనది యని మురియు పూర్ణచంద్రునిచందమున, ననంతభావవారాశి నవలోకించుచు నీత డానం దించును.

ఆకసమందును, పుష్పమందును, పారుగు వానియందును, వనమాలియందును, అన్నిటి యందును, అందఱియందును తన ప్రేమికు డున్నాడని కృష్ణమూర్తి విశ్వసించును; స్వార్థ మును చంపి ఈతని గలిసి, వీనితో నొక్కండ గుట మానవునిపరమాదర్శమని ఆంతరంగికముగ నమ్మును. ఈయాదర్శమును తా నందితిననియే కృష్ణమూర్తి తెలుపుకొనుచుండును.

ఇచ్ఛగించినచో, నీత డతులైశ్వర్యసంప న్నుడు కాజాలియుండును. పాశ్చాత్యు లీతని కెంతో ధనము నీయదలపడిరి. కృష్ణమూర్తి దీనిని నిరాకరించినాడు. వ్యక్తిగాని, జాతి గాని ఎద్దానినైన (అది ధనమనుడు, అధికార మనుడు) చేపట్టుట తగదనియు, ఆక్రమణ కాంక్షయే ప్రపంచమున పోరును ప్రోత్సహిం చుచున్నదనియు విశ్వసించువా డీతడు. మేధా కృషికి శారీరకమైనకృషి తీసిపోవునని నమ్మ వా డీతడు కాడు. తనతమ్మునిగూడి కేలిఫోర్ని యా మున్నగుచోటులందు తా నెట్లు శారీరక ముగ శ్రమించియుండెనో ఈతడు తెలుపు చుండును. ఇట్టికృషి మానసికముగను, ఆధ్యా త్మికముగను మానవునకు స్వాతంత్ర్య మొసగు నని ఈతడు విశ్వసించును. తాను నమ్మిన దానిని తనక్రియయందు ప్రకటించుపృలి మను జునకు నుండవలె నని ఈత డనుచుండును; ప్రధానమైనదానినే (ఇది యాధ్యాత్మికమైన అర్థమే యని యూహింపుడు.) మానవు డన్వే షింపవలె నని పలుకుచుండును; సంపూర్ణమైన ఆత్మప్రకాశము ప్రపంచమును శాంతిమయ మొనరించు నని విశ్వసించుచుండును.

ఆంధ్రు డయ్యు, కృష్ణమూర్తి ఇంచుమిం చుగ నాంధ్రమును మఱచుట శోచనీయము. శైశవమందే ఆంధ్రసంపర్కమునుండి విడివడు టయ దీనికి హేతువు. తనరచనలను, ఉపన్యా సములను ఈత డాంగ్లమందే జరపుచుండును. భావస్వాతంత్ర్యమును, సహజయోచనమును, ప్రబోధించువాడుకావున, వ్యక్తిగతరుచి ననుస రించియే భాషాప్రయోగ ముండవలెనని ఈత డనుచుండును.

కృష్ణమూర్తివాక్కులు గంభీరభావబంధు రములై యుండును; శైలి సౌందర్యప్రదీప్తమై యుండును. గట్టిముద్దలందు నేయి గలిపి కన్న తల్లి వాని నల్లన బిడ్డగొంతుకలో ప్రవేశపెట్టు నట్లు, మహారచయిత చక్కని ఉపమలతో సముచితదృష్టాంతములతో క్లిష్టాంశములను పఠితలమనసులందు ప్రవేశపెట్టును. అవగాహన మునకు నగ్రస్థాన మొసగు కృష్ణమూర్తి ఈ భావ సాధనముల నలవఱుచుకొనినాడు.* మన

* పద్యరచనమున వీని నీతడు తప్పక ప్రయోగించుచుండును.

సును చలింపనీయక తాత్త్వికచింత కలవడినవా రీతని నుడువులందలి భావవిభూతిని తమయది గావించుకొందురు. మహావక్తలలో నీతం డొక్కండు కాకున్నను, ఆంగ్లరచనమున సిద్ధహస్తులైన అల్పసంఖ్యాకులైన భారతీయులలో నీతం డొక్కం డనుట నిస్సంశయము. ఆంగ్లకవనమున నాతిశేజీ, అంతర్జాతీయమైన కీర్తినందిన ఆధునిక దాక్షిణాత్యు లిద్వురలో (రెండవవాడు ప్రిన్సిపాల్ శేషాద్రియని చదువరు లెఱిగియే యుందురు) కృష్ణమూర్తి యొక్కండు.

కృష్ణమూర్తిప్రబోధము నే డెంతయు నక్కరైయున్నది. ఆత్మపరిశీలన మెఱుగక తన్ను దాను స్మరించుకొనక మనుజుడు పశుప్రవృత్తులకు నిరంతరము పేతవేయుచు, ప్రపంచమును పశువులశాల గావించుచున్నాడు. ఈశాలలో కుమ్ములాట యుండునుగాని మనువ్యత్వ ముండునా? తన్నులాట యుండునుగాని తప సుండునా? దుర్గంధ ముండునుగాని సుగంధ ముండునా? అసహ్య మేడ అంద మేడ? మృగశాల యేడ పూజాగృహ మేడ? జంతువసతిలో సత్యమునకు, సౌందర్యమునకు, స్థైర్యమునకు, ధైర్యమునకు చోటుండునా? ఆత్మశక్తికి అన్వేషణశక్తికి, సహనశక్తికి స్వతంత్రశక్తికి, సహజశక్తికి సృష్టిశక్తికి పశువులశాలలో నెల వుండునా? కృష్ణమూర్తి వాక్కులకు చెవులొగ్గి ఆతని గూడి పృథ్వీవాసు లీయద్భుతశక్తులను తమయందును, పుడమియందును పునరుద్ధరించుటకు పూనుకొనవలెను. విశ్వమందును, తమయందును గూడ విశ్వేశుడు విడిసియున్నాడని హృదయపూర్వకముగ విశ్వసించి, వీ రీపూనికను సలిపిరేని, బహిరంతరములందు వ్యాపించియున్న తమోయవనిక నచిరములో చించివేయగలరు. కృష్ణమూర్తి తెలుపుచుండు ప్రేమికుని గని తమ యైక్యభావమును స్మరింపజాలుదురు. తమ యెడందలందును, అవ్వల నన్నియెడలందును దివ్యాలోకము నాలోకించి సచ్చిదానందములం దోలలాడగలరు.

ఈ పంక్తులను పరిశీలింపుడు:

"As the spark
That shall give warmth
Is hid among the grey ashes
So, O friend,
The light
Which shall guide thee
Is concealed
Under the dust
Of thine experience."

"I have read of Thee in Many books.
They tell me
That there are many
like unto Thee,
That many temples
are built for Thee,
That there are many rites
To invoke Thee.
But I have no close
communion with them
For all these are but the shells
Of mens thoughts."

---

# వీరాబాయి ప్రబోధము

గో. నరసింగరావు

ఉదయసింహరాణా చిత్తూర్ ప్రభువు. ఆతని యర్ధాంగి వీరాబాయి. అగ్బరు రాణాను రణరంగమున నోడించి, ఖైదు చేసెను. రసపుత్త్రులు కర్తవ్యము నెఱుగక భీతచిత్తులై మిన్నకుండిరి. ఆ తరుణమందు వీరాబాయి వీరపురుషోచితమైన వేషము దాల్చి యుద్ధభూమికి పయనింప నుద్యుక్తురాలై రసపుత్రవీరులతో నుడివిన పల్కులు—

ఓరసపుత్ర చమూపతు - లారా! చిత్తూరురాజ్యలక్ష్మీశుంభ
ద్గౌరవరక్షణదీక్షా - పారయశోవిసరులార! పటుధృతులారా!
ఈ ఇసివేళ మీకుఁ దగునే? యిటు లీయెడ నింతగా నుదా
సీనతఁ బూన; శ్రీ యుదయసింహమహీశ్వరుఁ డగ్బరుక్షమా

జానికి నగ్గ హానెడల, శత్రువధోద్యమ ముజ్జగించి, మీ
మానితవంశగౌరవము మ్రగ్గఁగఁజేతురె, సిగ్గు లేదొకో ?

ధైర్య స్థైర్యము లిట్లు పోనడఁచి, చింతాక్రాంతత న్మ్రందుటల్
శౌర్యంబే ? రసపుత్రవంశయశ మస్తంగామితన్ బొందునే ?
ఆర్యావర్తము నేఁటితో మొగలరాజ్యాధీన మైపోవునే ?
కార్యాకార్యవిచక్షణప్రవణు లుత్కంపంబు, మీ కేటికిన్ ?

పగఱకు వెన్నుఁ జూపు టది పౌరుష హానె ? చితూరుసీమలో
దిగు లనుమాట మున్న కలదే ? ప్రభుసింహుఁడు బందెఖానలో
నెగులును బొందుచున్నపుడు నెమ్మది నెమ్మనమందు నిల్చునే ?
తెగువ వహించి వైరుల వధింపుఁడు, శాంతి విధింపుఁ డాపయిన్.

క్రోధము రోషమున్ విడి, దిగుల్పడ నేల ? చితూరురాజ్య ల
క్ష్మీధవు నింక నెట్లయిన మ్లేచ్ఛుల బంధమునందునుండి, స్వే
చ్ఛాధృతి నొందఁజేయుటయె సత్వరకార్యము ; దీక్షఁ బూనుఁడీ ;
యోధులు కారె మీరు ? భయమొందిన మృత్యువు మిమ్ము వీడునే ?

ఎవరిసాయంబు గోరి నిరీక్ష సేతు - రాత్మవిశ్వాస మెల్లఁ బోనాడి మీరు ?
మానధనులయ్యు దేహాభిమానులగుట - కంటె గాజులుతొడిగించుకొంట లెస్స,
ఖైదులో నున్న రాణా ప్రకాస్తి నిలుపఁ - గైదువూనంగవలయునో జోదులార !
అబలనగు నేనె సంసిద్ధనై దురంబు - కై దుముక నేఁడు మీకు శౌర్యంబు లేదె ?

ఘోరపరాభవాగ్ని పయికొన్నది, దాన నశింపనెంతురో,
వీరవిహారవిస్ఫురణఁ బేరును బెంపు గడించుకొందురో,
శూరవరేణ్యులార ! యొకచొప్పుఁ దలంపుఁడు ; పాడి నిల్పఁగా
వేఱువిచార మేల ? రణవీథికి దూఁకుడు నూఁకుఁ డెల్లరన్.

అద నిదె లెండులెండు రణమాడఁగ, నగ్బరుచక్రవర్తిదు
ర్మదము నడంప నిర్భరపరాక్రమధాటి ; శిశోదయాన్వయా
భ్యుదయము చెంగలింపఁగ సముద్ధతిఁ జూపుఁడు ; ఖడ్గపాణులై
కదలుఁడు 'జే హరా!' యని యకంపనులై విజిగీష పెంపునన్.

వారువమెక్కి, కత్తి గొని, భండనభూమి విరోధిసైన్యముల్
మారిమసంగునాకు నభిమానముతో విజయప్రమోదముల్
సారెకుఁ గూర్పుఁడీ, మిగుల సాహస మూనుఁడి ; రాజ్యలక్ష్మితో
భూరమణున్ స్వతంత్రతను బొందఁగఁజేసి కళంకుఁ దీర్చెదన్.

---

# మాంసమును తిను మొక్కలు

గుమ్మలూరు సత్యనారాయణ

ప్రకృతిని బరిశీలించుకొలదియును 'కోటి విద్యలును కూటికొరకే' కను ఆర్యోక్తి స్వచ్ఛముగ విశదమగుచుండును. ఒకజీవము బ్రతుకుట కింకొకజీవము ఆహుతికావలెను. బ్రతుకుతెరువులకొరకు మన మింత కష్టపడుచుంటిమనుకొనెదము; కాని యొకసారి విశాలమగు ప్రకృతిని శాస్త్రదృష్టిని పరిశీలించినచో, 'యాచకో యాచకః శత్రువ'ని యొకదానితో నింకొకటి యెట్లు విరోధించుచుండునో ఒక సూక్ష్మాహారమును గొనుట కెన్నెన్ని జీవరాసులు కాచుకొనియుండి ప్రయత్నించుచుండునో, ఆ యాహారస్వీకరణమున కెన్ని యంత్ర తంత్రములను సిద్ధపరచుకొను చుండునో, ఆమహా సంగ్రామమునందు దుర్బలములగు జీవము లెన్ని మరణించుచుండునో— చక్కగ విశదమగును. అందున మనము సాధారణముగా దుర్బలములని నిరసనచేయుసూక్ష్మజీవరాసులలో నత్యంతక్లిష్టమగు నాహార స్వీకరణ సాధనము లగుపడుచుండును. అన్యవిషయములలో నవి దుర్బలములుకావచ్చును కాని వాటికి ముఖ్యమగు నాహార స్వీకరణ కార్యసాధనమునకు మాత్ర మవి మహాబలము కలిగియుండును. అటులనే యొకానొక కార్యసాధనలో పురుషులకంటె నబలలగు స్త్రీలును వీరిరువురకంటెను దుర్బలులగు శిశువులును, అధిక కార్యసాధన పరులగుట చూచుచుందుము.

ఉద్భిజ్జములలో నాహారస్వీకరణమునకు ముఖ్యమగు నంగములు— వేరులు, ఆకులు, నని మన మెరుగుదుము. ఉద్భిజ్జములు వేరుల ద్వారా భూమిలోనున్న యాహారమును, ఆకులద్వారా గాలి, సూర్యరశ్మి, తేమ, మొదలగువాని సహాయమున మరికొంతయాహారమును తయారుచేసుకొనిస్వీకరించుచుండును. ఇది యుద్భిజ్జములకు సాధారణమగు నాహార స్వీకరణ విధానము. దీనినుండి కొన్ని ఉద్భిజ్జములు వింతవిధానములకు మరలుట కలదు. పరాన్నభుక్కులగు బదనికలు వృక్షశాఖలపై పుట్టి ఆ శాఖలలోనుండి ప్రవహించు ఆహార




౧. చిత్రము: ౧. బదనిక, ౨. వృక్షశాఖనుండి ఆహారమును గ్రహించు ప్రత్యేకాంగము, 3. బెరడు, ౪. శాఖలోని ఆహారనాళములు.

నాళములలోనికి నొకవిధమగు స్వీకరణాంగములను జొనిపి, తనమూలమున అందలి యాహారమును గ్రహించి జీవించుచుండును. (చి. ౧) మరికొన్ని మొక్కలలో 'నిచ్చిపుచ్చుకొను' నియమము కలదు. అం దన్యోన్యలాభము కొంతవరకు కారణమయియుండును. ఆహార విషయములలోగల యట్టి యన్యోన్యత ఒకానొకపుడు మొక్కలకును, బహు సూక్ష్మ జీవులకును కలిగియుండుటయు గలదు. అందుల కుదాహరణముగా నేపప్పుధాన్యపు మొక్కనైనను వేరులతో నూడబెరికి చూచిన గోచరించును. వాటివేళ్లపై చిన్నచిన్న బొబ్బరలు కొన్నియుండును. వాటియందు సూక్ష్మ జీవరాసులెన్నో యున్నవి. (చి. ౨) ఆమొక్కల వేళ్లగుండా పోవు నాహార నాళముల లోని జీవగృహములకు ద్వారము లున్నవి. సూక్ష్మజీవులవలన మాంసకృత్తులను మొక్కలు కొంతవరకు దీసికొనుచు, అవి వాటియాకులవలన తయారుచేసిన పిండిపదార్థముల నాజీవరాసుల కిచ్చుచుండును. ఆయాయాహార స్వీకరణవిధానము ననుసరించి యుద్భిజ్జముల యంగవివరణములలో కూడా మార్పు లగుపడుచుండును : బదనికలో స్వతస్సిద్ధముగ ఆహారమును తయారుచేసుకొని గ్రహించునేర్పాటు లేదు; కనుక పత్రములు, వేళ్లును, ఉండవలసినంత విస్తారముగను, ప్రయోజనకరముగను ఉండవు. కేవలము పరాన్నము నపహరించుటకు వలయుపరికరములు మాత్రము చక్కగా నెదిగి యుండును.

ఆహారసంపాదనములో నిట్లు విపరీత విధానముల నవలంబించుటయేగాక సంపాదించు నాహారస్వభావమునందు గూడ విశేషమైన పక్షత్యమును జూపించు మొక్కలుండుట యొకవింత. సాధారణముగా నుద్భిజ్జము లన్నియు శాకాహారము లనియును, జంతువులు మాంసాహారము లనియును మనము చేసిన విభజన. మొక్కలపై జంతువులాధారపడి యుండుట సామాన్యవిషయము కాని, మొక్కలు కొన్ని జంతువులను తిని బ్రతుకుచుండుట—యనగా, నుద్భిజ్జములు మాంసాహారమును గోరుట— సాధారణము గాదు. ఐనను ప్రకృతియందు గోచర మగుచుండుటవలన మాంసమును దిని జీవించు మొక్కల విశేషమును పరిశీలించుట కానందముగా నుండును.

మొక్కలు మాంసము నేలతినవలయును?— ఈ విషయ మాలోచించుట యావశ్యకము. ఏ జీవమైనను తాను తినునాహారములో నీదిగువ నుదాహరించిన యాహారతత్వములను పొందుపరచుకొనుచుండును.



౨. చిత్రము.

—నీరు, కర్బనోదజనితములను పిండిపదార్థములు, మాంసకృత్తులు, చమురుపదార్థములు లేక క్రొవ్వుపదార్థములు, భస్మములు, జీవస్సత్త్వములు.

ముఖ్యముగ నీయారు ఆహారతత్త్వముల కలయికయైనను, ఒక జీవమునకు కావలయునట్టి మొక్క కలయికయైనను, ఆహారసంపాదనము, ఆ యాహారధర్మములును మారుచుండును. ప్రకృతి యొక సాధనచే, తన కీయాహారతత్త్వము గావలసినను మొక్క పొందుచున్నది. దాని యాకులు తనలోగల పసరుకణముల సహాయమునను, సూర్యరశ్మివలనను, తేమ, బొగ్గుపులుసువాయువును (కాంతిసంకలనపరచి) కలిపి పిండిపదార్థములను మొక్క తయారుచేసుకొనుచున్నది. భూమిలోగల సాధ్యాహార పదార్థముల నన్నిటిని ద్రవరూపమున వేళ్లద్వారా తనలోనికి పీల్చుకొనుచున్నది. ఆ ద్రవాహారములో భస్మములు, నీరు మెండుగా నున్నవి. పత్రములలో తయారుచేసిన పిండిపదార్థములు, వేళ్లద్వారా లోనికి గొనివచ్చిన భస్మములును, కలిసి మాంసకృత్తులగుచున్నవి. ఒక్కొకప్పుడు ఎక్కువగు పిండిపదార్థమంతయు నిలువయుండుటకు చమురురూపమున ఘనీభవింపజేయబడియుండును. కొన్ని యితర



౩. చిత్రము: పిట్చరుప్లాంటు. కీటకములు ప్రవేశించినతోడనే మూతలుబిగించి లోపలనే వాటిని జీర్ణించుకొను కూజాలు మూడు వ్రేలుచున్నవి.

పరిస్థితులలో జీవస్సత్త్వములను మొక్క తయారుచేయును. సాధారణముగా మొక్కలిట్లు దమకు కావలసిన యాహారతత్త్వములను బొందుచున్నవి. కాని మొక్కలన్నియు సమానశక్తిగలిగి యుండవు.

కొన్ని మొక్కలకు కొన్ని యాహారతత్త్వము లెక్కువ యవసర మగుటచేతనేమి, సాధారణరూపమున నాయా యాహారతత్త్వసంపాదనకు శక్తిలేమిచేనేమి, విపరీతములగు అంగము లుండును. మాంసకృత్తుల నెక్కువగోరు మొక్కలు కొన్ని గలవు. అదిగాక, యీ మొక్కలలో మాంసకృత్తులను తయారుచేసుకొనుశక్తి నశించి





చి. ౮. చి. ౯.

౮. చిత్రము: లోపలపడి నశించుటకు ఈగలు కూజామూతివద్దకు పోవుచున్నవి.

౯. చిత్రము: ఇది యింకొరకపుచెట్టు: తాలూకు కూజా. దాంట్లో తగుల్కొన్న నుకీటకమునకు నాశనము తప్పదు.

నది. కనుక తయారయి తినుటకు సిద్ధముగా నుండిన మాంసకృత్తులే కావలయును. మాంసమునిండను మాంసకృత్తులు గలవు. ఆ మాంసమును దినునపుడు మాంసకృత్తులును విశేషపరిమితులలో దినబడుచున్నవి. అట్టి మాంసకృత్తులను కలిగియుండు పప్పుధాన్యములు, పాలు, గ్రుడ్డు మొదలగునవి కలవు. కాని వాటిని పొందుటకు దగినయవకాశములు లేకపోవుటయేకాక, స్వల్పములోనుండి యెక్కువ మాంసకృత్తులను పొందగల యాహారము మాంసమే యగుటచేతను, మాంసమునే యెట్లైనను స్వీకరించుటకును, ఆ మాంసమును జీర్ణముచేసు

కొని మాంసకృత్తులను బొందుటకును, విపరీత పరికరములతో మాంసమును దిని వృద్ధిపొందు మొక్కలు కొన్ని గలవు.




౬. చిత్రము: పిట్చర్ ప్లాంటు. కూజానిర్మాణమును తెలుపుకణముల కలయిక. త. ముఖద్వారముతలుపు. వి. విషగ్రంథులు.

మాంసాహారులగు ఈ మొక్కలు తిను మాంస మంతయు చిన్నచిన్న కీటకములకు సంబంధించినదియే. ఆకీటకములను బట్టి, చంపి, జీర్ణము చేసికొనుటకు తగిన పరికరములన్నియు ఆయా మాంసాహారులగు మొక్కలయందు దమరియున్నవి. ఆ పరికరములలో పత్రములును పత్రములకుగల కొన్ని విషగ్రంథులును ముఖ్యమయినవి. ఇవి ఎట్లెట్లు ప్రవర్తించునో కొన్ని రకముల మొక్కలయందు పరికింతము.

కొన్ని మొక్కలలో Pitcher plant ఆకులకు చిన్న కూజా లుండును. కూజాకు మూతివద్ద నొకతలుపువలె పత్రభాగ మొకటియుండును. ఆతలుపు, ఎలుకల బోనులోవలె, కూజాలో భాగమునకు వంగగలదు. కూజా పైభాగమున సాధారణముగ కీటకముల నాకర్షణీయములగు వర్ణములు కొన్నియుండును. ఏకీటకమైనను కూజాతలుపులపై వ్రాలినచో, వెంటనే తలుపులు కూజాలోనికి వ్రాలును వెంటనే కీటకము కూజాలో పడును. తిరిగి తనంతట తానులేచి తలుపు కూజాద్వారమును చేరుకొనును. కనుక కీటకము కూజాలో పడిపోవును. ఇక కూజాలోపలనుండు చిన్న విషగ్రంథులు కీటకముపై పనిచేయ నారంభించును. ఆగ్రంథులు జీర్ణరసములను తయారుచేసి ద్రవింపజేయును. కీటకము లోపలనేమ

లందు జీర్ణమయి, మొక్కల శరీరములో కలసిపోవును. మరియొక విశేషము గలదు—



౭. చిత్రము: 'సన్‌డ్యూ' మొక్క.

ఈహూజాలో నీరుండును. ఎండవేళలలో చిన్నచిన్న తొండలు, బల్లులు మొదలయినవి దాహము తీర్చుకొనుటకయి యా హూజా లోనికి దిగును. హూజా పొడవుగా నుండుట వలనను సాధారణముగా తిరిగి వెలుపలికి రాలేవు. ఒకపుడు ప్రయత్నించి వచ్చినను మీదనుగల మూతకుదగిలి తిరిగి నీటనేపడును. అంతట ఆనీటిలోనే మరణించి, క్రమముగా జీర్ణ మయిపోవును.



౮. చిత్రము.

బెంగాలుపరిసరములందు మరియొక విధమగు చిన్నమొక్కలున్నవి. Sundew



౯. చిత్రము.

plant. అవి సాధారణముగా పొలములగట్లపై మొలచును. వాటియాకు లన్నియు గులాబి, చేమంతి పువ్వుదళములవలెనే దగ్గరగా దట్టముగా నుండుటయేకాక భూమి నంటుకొనినే మీదనుండు ఆకుపచ్చనిగడ్డిలో కలసిపోయి కనుపడక యుండును. కాని ఆయాకులన్నిటికిని మీదభాగమున ఎర్రని కేశము లుండును. వానిలో నొక్కొక్కదాని తుద నొక్కొక విషగ్రంథి యుండును. పైకి నగుపడు మొక్క ఆకుపచ్చనిగడ్డిపై నొక చిన్న ఎర్ర మచ్చవలె నుండి, నేలకు సుమారు ౨, 3 అం. పొడవు కాడలుగల ఎర్రనిపూవులనుపూచును. చి. ౭. ఉదయమనుసరికి ఆపత్రములపై రాత్రియంతయు పడినమంచు బిందువులు లేతసూర్యరశ్మికి మెరయుచుండును. కీటకము లుదయముననే ఆహారమునకయి దిరుగుచుమార్గమునందుండు నాపత్రములపై వ్రాలును. వెంటనే యరుణకేశములలో కీటకములు చిక్కుకొని తప్పించుకొనిపోవ యత్నించుకొలదియు మరింత యసాధ్యమయి తుదకు వానిలో చిక్కి అని మరణించును. కడకు విషగ్రంథులు స్రవించిన జీర్ణరసమునందు జీర్ణమయి మొక్కలకు చక్కని యాహార మయిపోవును.

నాలుకవలె వెడల్పుగనున్న యొకయాకుపై విషకేశముల నడుమ నొకయీగ చిక్కుకొని యుండుట ౮ వ చిత్రములో జూడగలను.

మరికొన్ని జాతులలో (Venus fly trap) వేలువిధములగు యంత్రము లున్నవి. ఆ మొక్కలు సాధారణముగా చెరువులలోనుండును. (చి. ౯) వాటికి వేళ్లుండవు. కాండము దుర్బలమై తీగవలె నుండును. ఆ కాండముపై నొక్కొకకణుపువద్దను ఆకులన్నియు సంపుగూడియుండును. మోదుగ, దేవమందార మొదలగువాని ఆకులవలె ఒక్కొకయాకు రెండు సమభాగములయి యుండును. వాటికి బలమగు ముండ్లతో కూడుకొనిన విషకేశము లుండును. (చి. ౧౦) నీటిలో పోవుచున్న చిన్న చేపపిల్లలు, కీటకములు మొదలగునవి ఆ యాకులమీదకు పోయినచో వెంటనే, తెరచియుంచిన పుస్తకముపుటలు మూతపడునటులు, పత్రముయొక్క రెండుభాగములును మూతపడును. ఆ రెండిటికిని మధ్య నాకీటక ముండిపోవును. కీటకము తప్పించుకొనిపోవుటకు ప్రయత్నించుచున్నకొలదియు, విషకేశములు మరింత యధికముగా గ్రుచ్చుకొనుచుండును. పోరాడిపోరాడి ఆజీవి మరణించును. మరణించినదానిని క్రమముగా మొక్క జీర్ణము చేసుకొనును.

ఆకీటకము జీర్ణమయిన పిదప నంతవరకు ముడుచుకొనియుండినయాకు మరల విచ్చును. విషకేశములు తిరిగి తిన్ననగును. మరల నొక



౧౦. చిత్రము.

కీటకమును పట్టి బంధించుటకు సిద్ధముగను. కీటకములను పట్టుటలోగల చాకచక్యము ఈ మొక్కయొక్క చిన్న యాకులలో నెక్కువగా నుండును.

మరియొక వింతమార్గమున మొక్కలు కీట

పాగాకు మొక్కయు మాంసాహారి యేమో యని శంకించుట కవకాశములున్నవి. పొగాకు మీద నొకవిధమగు జిగురుపదార్థ మున్నది. బాగుగా పరిశీలించినచో చిన్న చిన్న పురుగులీయాకుల కంటుకొని చనిపోవుట చూడ



౧౧. చిత్రము: (టీసల్ మొక్క)

కములను బట్టుచున్నవి. ౧౧ వ చిత్రములో గల పూవుల చుట్టు సన్నముగ పొడవుగ నుండు ఆకులు ఒక గిన్నెవలె నుండును. అట్టి గిన్నెల మొదట నీరు సాధారణముగ నుండును. దాహముచే కీటకము లాపయోముఖ నివసించుటకుగా చుట్టి నీళ్ళకై వెలుపలికి పోలేక ఆయా గిన్నెలలో చిక్కుకొనును. (చి.౧౧) తుదకు వెలికిరాలేక అందే మరణించును. ఇకను జీర్ణరసముల సహాయమున మొక్కలు కీటకములలోగల మాంసకృత్తులను స్వీకరించును.

౧౨ వ చిత్రములోగల మొక్క (బట్టరు వర్టు) అరటిదొప్పలవలె లోపునకు మడచుకొనియున్న యాకులతో కీటకములను బట్టి జీర్ణము చేసుకొనును.

కనుక సాధారణముగా మనము చూచు గలము. పొగాకువంటి మైనపు జిగురు మొక్క ఆవశ్యకము నిక్కొన్ని యుపకరణములకై నను కీటక గ్రహణమునకుపూడ నొకసాధనము కాగలవనియు, తమ్మూలమున పొగాకు మొక్క కూడ కొంతవరకు మాంసాహారి కాగలవనియు చెప్పవచ్చును.

ఇపుడు చెప్పిన నాలుగైదు రకముల మొక్కలలో పత్రములు కొన్ని వివపరికరములచే కీటకములను పట్టి, జీర్ణము చేసి, మొక్కల కిచ్చుచున్నటులు గ్రహించితిమి. సాధారణముగా నట్టి యాహారస్వీకరణము వేర్లపని. మాంసాహారులగు నిట్టి మొక్కలలో పత్రములు పనిచేయుచుండుటవలన, వాటికి బాగుగా వేళ్లేదిగియుండవు; కొన్నిటికి బహు స్వల్పములై, దుర్బలములై యుండును.



౧౨ చిత్రము: బట్టరువర్టు మొక్క.



౧౩. చిత్రము: 'కవహ్క్ పైటు' అను మొక్క. ఈగలు దీనివింత సువాసనకు మోసపడి వచ్చి పూవులో చిక్కుకొని వెలుపలికి రాజాలక మరణించి దాని కాహారమయిపోవును.

సృష్టిలో వృక్షజము లన్నియును నాటి యాహారపదార్థములకు భూమిపై నాధారపడి యుండి స్వంతముగ నాహారమును తయారు చేసుకొని భుజించుటయును, తుదకు వాటి యాహారముతోపాటు అవియును జంతువుల కాహుతి యగుటయు సామాన్యము. ఏకారణముచేతనైననేమి, బహుస్వల్పములయ్యును జంతువులనే పట్టి, చంపి భక్షించునట్టి యుద్భిజ్జములు ప్రకృతిలో నున్నవని తెలియవచ్చుచున్నది.

అఖిలభారత

రేడియో

స్టేషనుల

విన వీలగు క్రొత్త

"హిస్
మాస్టర్స్
వాయ్స్"

రేడియో
రిసీవరు

మాడల్ 650 A. C.

50-100 సైకిల్స్ : : 195-255 వోల్టు

వెల రూ 500/-




# ॥"HIS MASTER'S VOICE"॥

★ ఈ రేడియో రిసీవరునందు అఖిల భారత రేడియో స్టేషనులే గాక 5-2000 మీటర్లలోని సర్వదేశముల వార్తలను, సంగీతమును గూడ శుద్ధముగా విన వీలగును.

ముఖ్యాంశములు

- విశాలమైన డయల్
- అధికమైన శబ్దప్రసారము
- అతి సున్నితమైన పరికరములు
- పిక్కప్ ఉపయోగింపనగును.

నేడే మా అనుమతిపొందిన రేడియో వ్యాపారియొద్ద ఈ మాడలును, వివరములను చూడుడు.

## ది గ్రామఫోన్ కంపెని, లిమిటెడ్.,

45, సౌత్ పెరేడ్, బెంగుళూరు.

# చెల్లని రూపాయ

కొడవటిగంటి కుటుంబరావు

అది శివరామయ్యగారి దగ్గిరికి ఎట్లా వచ్చిందో తెలీదు, ఆచెల్లని రూపాయ. మసకకళ్లవాడు కనుచీకట్లోకూడా ఆరూపాయ చెల్లదని కనుక్కోగలచ్చు—చెల్లని రూపాయల్లోకూడా మరీ వెధవరూపాయ, ఆ చెల్లనిరూపాయ! అది రూపాయల్లే మోగదు. దానిరంగే రూపాయ రంగు కాదు, అది రూపాయ బరువు లేదు. అది చేతికైనా రూపాయల్లే తగలదు. మందమతివాడు కూడా దాన్ని రూపాయ అనుకోటానికి వీల్లేదు–చెల్లని రూపాయల్లోకూడా అంత మరీవెధవరూపాయ, ఆచెల్లని రూపాయ!

అది శివరామయ్యచేత పడటం మరీ అన్యాయం. శివరామయ్య సాధువు. భక్తిశూన్యమైన ప్రపంచంలో, ఈ కలియుగంలో మళ్లా ప్రహ్లాదుడల్లే పుట్టాడు శివరామయ్య. బియ్యేపాసయి రెండుమూడేళ్లు ప్లీడరీ చేసికూడా లౌకిక సంబంధాలన్నీ తెంచుకుని, ఆర్యధర్మాన్ని అవలంబించి, ఊరికే పైన పటారమూ లోపల లొటారమూ కాకుండా నిజంగా మనోవాక్కాయాల ధర్మరాజల్లే నడుచుకుంటూ, అన్నిరకాల వాళ్లచేతా ఔననిపించుకుంటున్నాడు శివరామయ్య.

అతన్ని తప్పుపట్టినవాడు ఎటు వచ్చీ మా శర్మ ఒక్కడే. (శర్మశాస్త్రి రాయవెధవ అని ఎవరెరగరు గనకా?) "వీడు మోక్షానికి అడ్డదార్లు వెతుకుతున్నాడల్లే ఉందిరా! ఈ శివరామయ్య ఫిఫ్త్‌ఫారంనించీ బియ్యేదాకా నోట్సుచదివి పరీక్షలు పాసయినఘటం!" అనేవాడు శర్మశాస్త్రి రాయవెధవ!

శివరామయ్యది శుద్ధాంతఃకరణం. వాడు బంగారాన్ని మట్టిగా చూసే వాడు, పరస్త్రీని తల్లిలాగ చూసే వాడు. వాడిమనస్సు పరిపక్వమయింది—శర్మ వెయ్యిఅన్నా గాక!

అటువంటి శివరామయ్య చేతికి వచ్చింది ఈ దిక్కుమాలిన చెల్లని రూపాయ.

ఆచెల్లని రూపాయది ఎంతశక్తో! అది శివరామయ్యయొక్క పరిపక్వమైన మనస్సును సూటిగా, స్వయంగా, జయించగలిగి ఉండదు; అందుకని అది శివరామయ్యయొక్క అపరిపక్వమైన అంతరాత్మద్వారా శివరామయ్య మనస్సులో తెగులు ప్రవేశపెట్టింది. మామూలు రూపాయలను మట్టిగాచూసే శివరామయ్య ఎవరైనా "దేహి!" అని చెయిచాస్తే జేబులో ఎంత ఉన్నదీ లెక్కచూడకుండా తీసి ఇచ్చివేసేశివరామయ్య, ఈ మహానాటకంలో తను ధరించటానికి పూనుకున్న పాత్రయొక్క ప్రకృతిశీలాదు లన్నీ సంపూర్ణంగా మరచిపోయి, ఆరూపాయను ఎట్లా వదిలించుకోవటమా అని ఆరాటపడసాగాడు.

ఒకనాడు శివరామయ్య ఆరూపాయతోపాటు మరొక మంచిరూపాయ జేబులో వేసుకుని, వెచ్చాల అంగడిలో కొన్ని సరుకులు కొని, నిర్లక్ష్యంగా జేబులోనించి రూపాయతీసి కోమటి కిస్తే, ఆకోమటి దానివంక నన్నా చూడకుండా దాన్నిగల్లాలో వేసుకుని చిల్లరతీసి శివరామయ్య కిచ్చాడు. శివరామయ్య ఇవతలికి వచ్చి కొట్టుకుంటున్న గుండెతో జేబులోనించి మిగిలిన రూపాయ చూసుకుంటే అది ఆదిక్కుమాలిన చెల్లనిరూపాయే! నిశ్చింతగా జేబులో ఉంది...ఇంతకూ భగవంతుడు శివరామయ్యపక్షాన లేడు.

ఆతరవాత శివరామయ్య వంచనతో మరొకమెట్టు ఎగాడు. చెల్లని రూపాయ ఒకజేబులోనూ మంచి రూపాయ మరొకజేబులోనూ పెట్టుకుని ఆయన బట్టలదుకాణంమీదికి వెళ్లి తనభార్యకు ఒకగజం రవికగుడ్డకొని నిర్లక్ష్యంగా జేబులోనించి రూపాయ తీసి బల్లమీద పడేస్తేనే, రూపాయ ఖంగుమని మోగటంలో పూటా బయటపడుతుం దని జ్ఞాపకం వచ్చి, గట్టిగా నాలుక కొరుక్కున్నాడు. కాని అదివృథాబాధ అయింది. బల్లమీద పడ్డరూపాయ బాగానే మోగింది. పూటారూపాయ ఉన్నది మరోజేబులో!

అక్కడ బయలుదేరి శివరామయ్య చెల్లనిరూపాయను మామూలుగా చేతికి అలవాటైన జేబులోకి మార్చి, పచారీదుకాణం మీదికి వెళ్లి, ఒకపాలడబ్బాకొని, ఏమీఎరగని వాడల్లే మాట్లాడకుండా ఆపడనిరూపాయ తీసి ఆదుకాణదారు చేతిలో పెడితే, అతను ఎవరికో సమాధానం చెబుతూ ఆరూపాయ మిగతారూపాయల్లో వేసుకున్నాడు. కాని మరుక్షణమే అన్ని రూపాయల మోతలోనూ ఆపాపిష్ఠి చెల్లనిరూపాయమోత అపస్వరమల్లే అతని చెవికి

పోకిందో ఏమో, అతను పాముకరిచిన వాడల్లే ఉలిక్కిపడి, రూపాయల్లోకి ఇట్టేచూసి, చప్పున ఆపడనిరూపాయను పైకి లాగి, "ఇది పడదు, స్వామీ! మరొకటిప్పించండి!" అని వినయంగా అన్నాడు. అప్పుడు శివరామయ్య ఆశ్చర్యం నటించవలసి వచ్చింది, నటించాడు నటించటమనేది శివరామయ్యకు, పాపం, చాతకానివిద్య; కాని చేసినప్రయత్నం మెచ్చుకోదగినట్టుగానే ఉండింది.

"పూ హూ రూపాయా? ఎవరిచ్చారబ్బా'...సరే, సీదగ్గిరే ఉండనీ. నాదగ్గిర చిల్లర లేదు, తరవాత చిల్లర ఇచ్చి దాన్ని నేనే తీసుకుపోతాను లే!" అని అనిచూశాడు శివరామయ్య. దుకాణదారు తక్కువతిన్న వాడు కాడు.

"డబ్బులెక్కడికిపోతై, స్వామీ. తరవాత ఇవ్వండి! నాదగ్గిర ఇది కూడా ఎందుకూ?" అన్నాడతను.

ఆరూపాయ ఎక్కడా చెల్లలేదు. సినిమాలదగ్గిరా, కాఫీహోటళ్లలో, దుకాణాల్లో, పోస్టాఫీసులో, బాంకీలో — ఎక్కడా ఎవరూ తీసుకోలేదు. ఆ దిక్కుమాలిన చెల్లని రూపాయను.

రైలుస్టేషనులో బుకింగుక్లర్కు "ఈరూపాయ చెల్లదు. ఇంకొకటి ఇవ్వండి!" అన్నాడు మర్యాదగా.

"మంచిదేనే!" అన్నాడు శివరామయ్య అర్థంలేకుండా.

"కావాలంటే కత్తిరించి పూటా చూపిస్తాను!" అన్నాడు బుకింగుక్లర్కు....

ఆ రూపాయ మార్చాలని ప్రయత్నం చెయ్యటంలో శివరామయ్య అవమానంపాలూ అప్రతిష్ఠపాలూ అయేటట్టు కనపడ్డది. అన్నిటికన్నా ముందు అడ్డమైనవాళ్ల దగ్గిరా ఆశ్చర్యం నటించటం ఆయన ప్రాణంమీదికి వచ్చింది. అతడి ఆశ్చర్యం అందరిమీదా పారుచున్నట్టు లేదు. ఒకరిద్దరు మందహాసం కూడా చేశారు.

ఏమయినా సరే ఆ రూపాయను ఇకముందు డొక్కశుద్ధి అయిన వాళ్ల దగ్గిర బయటికి తియ్యకూడదని శివరామయ్య తీర్మానించుకున్నాడు.

ఇంతలో దేవుడు పంపినట్టు ఒక చిల్లిడబ్బాపట్టుకుని ఎవరో చందాకు వచ్చారు. ఆరూపాయను వదలించుకోవటానికి ఇంతకంటె మంచి అవకాశం ఏముందీ? కాని అదేదో భగవద్విషయకమైన చందా. ఒక్కరూపాయకోసం పాపం తెచ్చుకోవటంఎట్లా? శివరామయ్య ఆడబ్బాలో మంచి రూపాయ తెచ్చి వేశాడు....

"నెలజీతం ఇప్పించండి, అయ్యగారూ! ఇంటో గింజల్లేవు. ముసలాడు మంచమెక్కాడు. బుడ్డోడికి రేత్తిరి నించీ గంజయినా లేదు." అని అడిగింది పనిమనిషి. దాని కింకా నెల కాలేదు.

శివరామయ్య మనస్సు చిక్కబట్టి ఆదిక్కుమాలిన చెల్లనిరూపాయ దానిచేతిలో పెట్టాడు. అది కృతజ్ఞతతో పెట్టిన ప్రతిదణ్ణమూ శివరామయ్యకు ఒక్కొక్కబల్లెపుపోటల్లే ఉండటమేకాక ఆ వెధవ రూపాయ వదిలినతృప్తి అతడికి కలగలేదు. ఆ రూపాయ తన్నంత సులభంగా వదులుతుందా? అది దానికిమాత్రం ఎట్లా మారుతుందీ? ఆముసలిముండ ఎట్లాగో ఆరూపాయ తెచ్చి మళ్లీ తన మీద పారేస్తుంది.' "ఇది నేనిచ్చిన రూపాయ కాదు!" అనటానికి తనకు నోరు రాదు. పాపంకూడాను!—ఈ విధంగా మధనపడ్డాడు శివరామయ్య.

కాని ఆ పనిచేసేముండ ఆయన జోలికి మళ్లీ రాలేదు. విశ్వప్రయత్నం చేసినా ఆయనకు మారని ఆరూపాయ దానికి ఇట్టేమారి ఊరుకుంది!

# తెలుఁగులిపి సంస్కారము

గా. హరిసర్వోత్తమరావు

జ్ఞానవిజ్ఞానముల యభివృద్ధికి శ్రవణమే ఆధారమై యున్నంతకాలము లిపిసమస్యపుట్టి యుండదు. చక్షురింద్రియమువమూలకముగా సంజ్ఞలను గ్రహించి పదములను కూర్చి అర్థవంతమగు రచననేర్పరచి పత్రములలో దానిని నిక్షిప్తము చేయుటకు తొడంగిన దాది లిపికి ప్రాముఖ్యము కలిగినది. మన దేశమున లిపి ఏకొద్దిగనో ప్రచారమున నుండుటకు ప్రజా ప్రబోధ ప్రయత్నమే కారణముగా కన్పించును. అశోకుడు బౌద్ధమత ప్రచారము సాగించు దినములలో ఆతని సందేశములు శిలలపై చెక్కించి భారతభూమిలోని పలుప్రాంతములలో స్థాపించినాడు. నాటికి నేటికి రెండువేలయేండ్లకు పైబడినను విషయ స్వభావమునుబట్టి లిపి ప్రశంస మరల ప్రజోపయోగ కారణముగనే చేయవలసి వచ్చినది. ప్రజారాజ్యోద్యమమే యేకభాషయేకలిపుల ప్రశంసకును సులభభాష సులభలిపుల ప్రశంసకును మహత్తమోద్దీపకమయినది.

భారతభూమిలో నేర్పడియుండు ముఖ్యభాషలన్నిటికిని కల లిపులకు మాతృక నాగరలిపి కాని, దానికి ప్రాచీనబంధువులైన ఇతరలిపులుగాని అగుననుటకు సందేహము లేదు. అందులోను మనభాషలు అన్నియు సంస్కృతమునుండి పుట్టినవను వాద మంగీకరించినను అంగీకరింపకున్నను అన్నిటను సంస్కృతపదజాలము సంస్కృతసమ సంస్కృతభవ పదజాలము నిండిపోయిన దనుట నిజము. మన సర్వసంప్రదాయములును నిజమునకు సాంస్కృతికములే కాబట్టి లిపినిగురించి వ్యవహరించునప్పుడు సాంస్కృతిక సంబంధము మరచుటకు రాదు.

లిపి భాషయందలి వేరువేరు శబ్దములసంకేతమనుట స్పష్టము. అందుచేత ఉచ్చారణలో కనబడు శబ్దముల బాహుళ్యమునకు అనుగుణముగా అక్షర సమామ్నాయము అభివృద్ధి యగుట సహజము. వ్రాయుటలో నుపయోగించు పరికరములను అనుసరించి అక్షరముల స్వరూపము మారుటయు సహజమే. భాషను నియమబద్ధముచేయక వాడుచూపోయిన యెడల నోటినుండి నోటికి ఉచ్చారణ భేదించి అనంతమైన సంజ్ఞలు ఏర్పడవలసి వచ్చును. కాని, అట్టి విపత్తురానీక భాషను వైయాకరణులు మొదటినుండియు కాపాడినారు. సంస్కృత స్వరూపమును వేలయేండ్లక్రిందట నిర్ణయించి ఉదాత్తానుదాత్త స్వరితములతో ఉచ్చారణను బంధించినారు. మనపూర్వులు మనకు సంస్కృతభాషల శబ్దోచ్చారణకు చాలి యలికట్టవైచినారు. అందుచేత ఆ భాష కుపకరించిన సంజ్ఞలనే ప్రాతిపదికముగా మనము నేటివరకుకూడ మనభాషలలో వాడుకొనుచున్నాము. ఇంత కట్టుదిట్టములు చేసినను, సంస్కృతమునకు అక్షరములు నలువది తెలుగునకు అక్షరములేబది అని యొకొకస్సను వ్రాసికొనవలసివచ్చినది.

* * *

ప్రాతిపదికమైన సంజ్ఞల, అనగా అక్షరముల సంఖ్యమాట ఎట్లున్ననూ, వానిసంయోగముల స్వరూపవిషయమునందు మిక్కుటమైన మార్పులుకలుగుటకు అనంతకాల గర్భమున జలిగిన వ్రాయసకాండ్రు, ఉపయోగపడిన సాధనములు, కారణభూతము లైనవి. వ్రాయసకాండ్రకు కలిగిన వ్యక్తి స్వాతంత్ర్యము మూలకముగా మనభాషలలో, అందును ముఖ్యముగా తెలుగుభాషయందు, అద్భుతమైన స్వరూప పరిణామ మేర్పడినది. మన పెద్దలు వ్రాయుట కుపయోగించిన పత్రము తాటియాకు. సాధనము ఉక్కుగంటము. అడ్డగీతలు తాటియాకుపైని గీచినయెడల ఆకు చీలికలగును. కాబట్టి మనలిపి సాంస్కృతిక లిపులలో ప్రధానముగా కాన్పించు అడ్డగీతలను మొదటనే పరిహరించినది. నిలువుగీతలు గీయవచ్చునుగాని దానికి ప్రయత్నమెక్కువ కావలసివచ్చును. అందుచేత వర్తులములకు మన లిపియందు ప్రాధాన్య మేర్పడినది. సూర్యచంద్రులు, మనలిపికి అధిష్ఠానదైవము లైనారు. మనయక్షరముల దేహములన్నియు బిందుకళలను పోలినవి. నాగరలిపియందలి అడ్డగీత తలకట్టు మనలిపిలో ఏటవాలైన నిలువుగీతయైనది. వలయాకారములు పెంచుకొనిపోవుట సులభము కాబట్టి [illegible], క్రిందివైపు, కుక్షివైపు, వలయములపై వలయము లేర్పడి, ఉత్వములు, ఇత్వములు, ఎత్వములు, ఒత్వములు అన్నియు నమరినవి. వ్రాయువాని హస్తలాఘవమును బట్టి [illegible] తీరి అక్షరము నక్షరము కలుపు సంజ్ఞ లమరినవి. ఇన్ని కారణములచేత సర్వస్వతంత్రత మను భవించిన మన తెలుగులిపి హస్తములలో నలిగి మెరిసి యుండక సంద్రముకంద్రముగా క్రొత్తక్రొత్త అనంతమైన బ్రహ్మస్వరూపమును పొంది ఇంపుగనింప నారంభించినది.

కాని, ఈ సంపూర్ణ స్వాతంత్ర్య మోహనస్వేచ్ఛల విధిగా నేర్పడిన ఈ పెంపుదలయే, యంత్రయుగమేతెంచి ఒక్కపూర్వములో లక్షలక్షలప్రతులు ముద్రణమగునట్టి సమయము కలిగినప్పుడు సర్వతజ్ఞానవిజ్ఞాన ప్రచారమునకు ఆటంకముగా కన్పట్టుచున్నది.

* * *

ఇప్పుడు మరల ప్రజాప్రబోధయుగము విజృంభించియున్నది. ఇది ప్రజాప్రబోధ యుగమాత్రము కాదు. ప్రజారాజ్యస్థాపనయుగము. ఒక్కొక్క వ్యక్తికిని—స్త్రీగాని పురుషుడుగాని—జాతి మత వివక్షత లేక—అనంతముగా పెరిగిన జీవితాలలో కొక్కింటిలోని పరమరహస్యములన్నియు అక్షర గోచరముగా అవగతము కాదగిన

మహా త్తమావశ్యకను చెలరేగినది. తుర్కీ రాజ్యనిర్వాహకుడు కెమల్ పాషా తన తుర్కీలిపి విజ్ఞానప్రబోధమునకు ప్రబలాటంకమని దానిని పరిత్యజించి రోమనులిపిని అనగా ఇంగ్లీషులిపి నన్నమాట-దేశమునందు ప్రవేశ పెట్టినాడు. రోమనులిపిలో అక్షరము లిరువదియారే కలవు. అందులో అచ్చులైదు. ఈ ఐదచ్చులను ఐరోపాభాషలన్నిటను ముప్పది తొమ్మిది ఉచ్చారణలు అందిన వన్నమాట నిజమేయైననూ, వీనికి పైచుక్కలు క్రింది చుక్కలలో తప్ప మరియే స్వరూపభేదమును కల్గించక పాశ్చాత్యులు వాడుకొనుటచేత ముద్రణకార్యము అతిసులభము చేసికొని నారు. టైపురైటర్లు లీనోటైపు యంత్రములు కనిపెట్టిన పిదప రోమనులిపి యూరోపుఖండమంతటను, అమెరికాఖండమంతటనూ, ఆస్ట్రేలియాయంతటనూ, ఆఫ్రికాలో కొన్ని కొన్ని ప్రాంతాలలోనూ, విజ్ఞానప్రచారమునకు అతిశీఘ్రసాధన మైనది. తుదకు ఏసంస్కృతిభావమకై మనము ఆరువందలకు పైబడిన సాంకేతికములను ఉపయోగించుకొనుచున్నామో ఆసంస్కృతమునే పాశ్చాత్యులు ఇరువదియారక్షరములు, పదియంకెలు, కామాపైరాలు మాత్రము తోకూడిన తమ రోమనులిపిలో విరివిగా అచ్చొత్తుచున్నారు ఉపయోగించుకొని యానందించుచున్నారు.

* * *

ఈ సందర్భమునందు గమనింపదగిన విషయమొక్కటి యున్నది. చేతివ్రాతతో ప్రపులుతీయు కాలము లిథోవ్రాత కనిపెట్టిననాడు పోయినది. సీసముతో అచ్చుములుకులు తయారుచేయుట మారంభించినపిదప లిథోవ్రాతకు స్థానము లేకున్నది. టైపురైటరు, లీనోటైపుయంత్రము లేర్పడిన ఈ దినములలో ప్రత్యేకము ప్రత్యేకముగా పోసిన యచ్చుములకుల కూర్పు ప్రయత్నముగూడ వృథా యని తోచనారంభించినది.

* * *

ఆంగ్లీషు టైపురైటరు లినోటైపు యంత్రముల పరమరహస్యమేమో గ్రహింపదగును. వ్రాతప్రతి చేతికి వ్రాసియివ్వవలసినది. వ్యక్తి ఈ వ్రాతప్రతి నెదుట పెట్టుకొని ఎత్తు పీటవేసికొని కూర్చొనును. అతనియెదుట చేతిపెట్టెకంటె వెడల్పుగాని యంత్రముండును. దానికి నలువదిరెండు అరకానివెడల్పు 'కీళ్ళు' కూర్చి యుందురు. ఇందులో ఇరువదియారు కీళ్లదిమిన నొక్కొక్క యక్షరము పడును. పదునారింట రెండేసి పడును. అన్నిటను చిన్నక్షరములు పెద్దక్షరములు రెండు రకములు పడును. ఈ మార్పులు జరుగుటకు గాను మరినాల్గు కీళ్లు ప్రక్కల నున్నవి. అక్షరముపడినపిదప కాగితమును జరుపుటకుముందు నైపున నడ్డకర్ర యుండును. పైని వివరించిన నలువదియారు కీళ్లను--దిమ్మెలన్నమాట---అడ్డకర్రను ఇన్నిటిని రెండుచేతులలోని పది వ్రేళ్లతో సమయానుకూలముగా నడుపుచు వచులుచు 'ఆపరేటరు'---అనగా కర్మకరుడు-టైపురైటరులోగాని లీనోటైపులోగాని నకళ్లుతీయుటకు కావలసిన మొదటి యచ్చుప్రతిని కాగితముమీదగాని సీసపు పంక్తులలోగాని సిద్ధము చేయుచున్నాడు. టైపురైటరు నుండి రోనియోకు మార్చి వందలకొలది ప్రతులు సిద్ధముచేయుట నేడు సాధ్యమైనది. 'లీనోటైపు' నుండి 'స్టీరియో' తీసి లక్షల ప్రతు లచ్చువేయుట ఆచారమైనది. చూచితిరా! నేడు సీసపుములుకులు కొనవక్కరలేదు. గళ్లుగళ్ల చట్టాలమర్చి యుంచుకొని అందులోనికి ములుకులువేసి కర్మకరుడు నిలిచి తిరిగి ములికిములికిగా కూర్చి కాలహరణము చేయ పనిలేదు. స్థలము, కాలము, శ్రమ, పరికరవిస్తారము అన్నియు సంకోచింపజేసి ఏరియోప్లేనులో ప్రయాణముచేసిన వేగముతో వ్రాతను కోట్లకొలది ప్రతులక్రింద తీర్చడానికి రోమనులిపిలో సాధ్యము చేసికొనినారు.

* * *

ఒక్కనిమిషము అచ్చుములుకుల లెక్క కొద్దిగా ఆలోచనచేసి చూతాము. ఈ ములుకులు వేసికొనేచట్టానికే ఇంగ్లీషులో 'కేసు' అని పేరు. ఇంగ్లీషుఅక్షరాల కేసులో ౧౫౧ గళ్లున్నవి. మన దేశములోని లిపులలో తక్కువ అక్షరసంఖ్యగల లిపి అరవములిపి. ఆ అరవము కేసులో ౧౯౦ గళ్లున్నవి. తెలుగులో చూచితిమా ౬౦౦ గళ్లున్నవి. ఎక్కడ ౬౦౦?. ఇంగ్లీషు లీనోటైపులో పైని చెప్పినలెక్కనుబట్టి చూచిన ౧౧౬ అక్షర సంజ్ఞలు ఏర్పడును. నేటిదినము అరవమునకు తెనుగునకు కూడ టైపురైటర్లు ఏర్పరచినారు. అరవమునందు ఇంగ్లీషులోవలెనే ౪౨ కీళ్లమర్చినారు. కాని, ఒక్కొక్కకీలున రెండేసి యక్షరములకీలి నిమిడ్చినారు.

ఈ ౪౨ లో ఎనిమిదింటికి ప్రత్యేకత్వము కల్పించి వాటిని ఇతరసంజ్ఞలతో చేర్చి క్రొత్త సంజ్ఞలు సృష్టించుటకు అవకాశము పెట్టినారు. ఇట్లగుటచేత కొన్నికొన్ని అక్షరము లేర్పడుటకు ఒక్కొక్క యక్షరమునకే నాలుగు పర్యాయములు కీళ్లు త్రిప్పవలసి వచ్చుచున్నది. శీఘ్రముగా కార్యముసాగుట దుర్ఘటమగుచున్నది. తెలుగు టైప్‌రైటరు సంగతి యింతకంటె కఠినతరముగా కన్పించును. అందులో నలువదియారు కీళ్లేర్పరచినారు. ఇరువదింటిని ప్రత్యేకపరచి వానిని ఇతరములతో చేర్చి వేరువేరుసంజ్ఞలు కల్పించుటకు ప్రయత్నించినారు. అ, ఆ, ఇ, ఉ, ౨, ఐ, ఒ, ఖ, ఞ, జ, ఙ, ణ, ర, ట, ౬, ల---ఈపదునారుమాత్రము తమంతట తామేర్పడునవి. అంకెలుపదియు అట్లే ఏర్పడును. మిగిలినవన్నియును రెండుమూడునాలుగు సంయోగములచే నేర్పడతగినవి. అనగా, ఎంతో ఆలస్యము మీదటగాని, అక్షరములేర్పరుచుటకురాదు. అరవభాషలో లీనోటైపుకూడ సిద్ధముచేసినారు. అందులో ౨౭౬ స్వరూపములకు తావుపెట్టినారు. తెలుగులో నిదివరకు లీనోటైపు సిద్ధముకాలేదుకాని, సిద్ధముచేయు ప్రయత్నములు సాగుచున్నవి. ఐన, ఆప్రయత్నములకు పైనచెప్పిన టైపురైటరు విధానము పనికివచ్చునట్లు కన్పించలేదు. ఆంధ్రపత్రిక కార్యనిర్వాహకులగు శ్రీ శంభుప్రసాదుగారును వారిమిత్రులును ఈ విషయమున గొప్పపరిశ్రమ చేయుచున్నారు. ౧౬౦ వేరువేరు స్వరూపములకు దిమ్మెలమర్చి తెలుగుభాషా లిపులన్నిటిని అచ్చుగ సాధింప జూచినారు.

* * *

ఎవరెన్ని ప్రయత్నములు చేసిననూ మన భాషకు సంబంధించినంతవరకు లిపి సంస్కరణ

ణములు. కాబట్టి పూర్ణానుస్వారమును అను నాసికము లన్నిటికిని సాంకేతికముగా గ్రహిం పవలెను. 'జ్ఞానము' 'విజ్ఞప్తి' మొదలగువాని లో 'జ్ఞ' ఉన్నదే దీనికతియేమి యందు రేమో. ఇది నిజముగా గ్ ఞ్ నల సంయో గము. కాబట్టి సంస్కారలిపిలో 'గ్‌జ్ఞ' గ వ్రాయవలెను. 'ఋ' కారముతప్ప తక్కిన యన్ని దీర్ఘములకును కన్నడమున 'ఃి' సం జ్ఞను వలపల వ్రాయుదురు. 'ఋ' కార మున కుకు దీని నుపయోగించుటయందు తప్పులేదు. 'ఇ' కారమునకు మనసుది సర్వ్వత్రకలదు. 'ఊ' 'ఇ' కారమునకు మనకొయున్నది. 'ౠ' 'ఌ' లు నేటి ప్రయోగాలలో లేవు. 'ఎ' త్వమునకు అరవమున మన 'ఎ'ను త్రిప్పి వ్రాసినారు. 'ై' ఇదిసంజ్ఞ ఎంత చక్కటిదవలయునో చూడుడు. 'ఏ'త్వమున కింద రెండవదివరకుకూడ 'ె'గా సుస్త్రెము గాదింపురు.

* * *

'ఏ'త్వమునకు డాపల 'ఎ' త్వము వల పల దీర్ఘసంజ్ఞ అరవమున నుంచురు. 'ఐ'త్వ మునకు 'ై' ఆ యక్షరభాగమునే డాపల వ్రాయుదురు. 'ఔ'త్వమునకు డాపల నైత్వము వలపల దీర్ఘసంజ్ఞ. ఈ విధానము మనము ప్రామాణ్యముగా నంగీకరింపవచ్చును. అచ్చులలో అ, ఇ, ఉ, ఎ, ఒలు చాలును. వీనికి దీర్ఘములు కావలసివచ్చినచో దీర్ఘసం జ్ఞను వలపల వేసికొనవచ్చును. 'ఐ' 'ఔ' ఇదివరలో నే 'అయి' 'అవు'లుగా వ్రాయు చున్నాము. హల్సంయోగములు వరుసక్రమ మున తలకట్టులు లేకుండ వ్రాసికొనుటచేత నేర్పడవలసి యుండును. 'క్రవ్యాద' శబ్ద మాలోచింపుడు. 'క' కార, 'ర' కార, 'అ' కారములు 'క్ర'. సంస్కార లిపిలో 'కర' 'వ' కార 'య' కార 'అ' కారములు 'వ్యా'. సంస్కారలిపి లో 'ఎము' 'ప' కార 'అ' కారములు 'ప' సంస్కారలిపిలో 'ద' పదము సం స్కారలిపిలో 'కర ఎము ద' యని యుం డును. ఇందులో 'క' కార 'వ' కారములను గమనించునది, మన 'ర' కు తలకట్టు తీసివేసి నచో పూర్ణానుస్వార మగును. కాబట్టి హల్లు 'క్' మాత్రము సూచించుటకు పూర్ణానుస్వా రము కడపున నేటివాలు గీతగీచితిని. ఎ, ప, స లు: న, ప లు: ఒకలు తెలుగున ఆకృతి రమత్వముకలవి. 'ఎ' వ్రాయుటకు అక్షరము త్రిప్పి వ్రాయవచ్చును. 'ె' ఇది 'ఎ' ఎత్వ ముతో సారూప్యముపొందును. 'ప' 'వ' ల

తలకట్టులు తీసివేసి హల్లులుమాత్రము నిలుపు నప్పుడు వేరు సాంకేతికములు వినియోగింపక తప్పదు. 'ప' ను సూచించుటకు అక్షరము క్రింద పై ఈకీలిని అడ్డగీత ఉంచమందును. అట్లే 'స'ను సూచించుటకు నక్రింద ఈకీలిని అడ్డగీత ఉంచమందును.

* * *

పైన చెప్పిన వివరాలనుబట్టి 'హల్' రూ పముల కిరువది, అచ్చులకైదు, అచ్చుశబ్దముల కేను, అనునాసికమున కొకటి ఒత్తక్షరసం జ్ఞమొక్కటి, మొత్తము ౩౬ సంజ్ఞలతో తెలుగు వ్రాయవచ్చునని తోచుచున్నది. ఇంతేకాదు: ఒత్తక్షరసంజ్ఞ పొట్టలో నొక చుక్కపొడిచి దంత్యోచ్చారణకు దానిని సర్తగావించుకొనిన యెడల తెలుగులోని దంత్యచ జలను ఇంగ్లీషులోని 'f' ఉచ్చార ణాదికములును, ఉరుదూ 'ఖ్' 'ఫ్' వగైరాలును, అరవములోని ழ యును సూచింపవచ్చు నేమో.

* * *

ఈ వ్యాసమున తేల్చినపత్రకములో సూచిం చిన క్రొత్తసర్తులలో నొకటికూడ తెలుగు కన్నడము తమిళము మలయాళములకు బయ టిదిగాదు. హల్రూపములు వేరువేరుగా వ్రాసి సంయోగముచేయుట సంస్కృతలిపిలో లేని యాచారముగాదు. అంకెలు, కామాలు వగై రాలు నేను సాధారణముగా ఇంగ్లీషుపద్ధతినే వాడుచున్నాము. వానినే వాడుటవలన వచ్చిన నష్టమేమియులేదు.

* * *

ఈ సంవిధానమున కొక్క యాక్షేపణ మాత్రము కలుగవచ్చును. వ్రాయునప్పు డక్షర ములు విడివిడిగా వ్రాయవలసియుండును గదా ఖత్తువ్రాతనశించునేయని కొంద రాక్షే పింపదురు. ఇప్పటికే ఖత్తువ్రాత గతకాలము నకు చేరిపోయినది. ఇంత దీర్ఘవ్యాసము నేను వ్రాసినప్పటికి అక్షరములు విడివిడిగానే యు న్నవి. అందులోను ముప్పదినాలుగు, ముప్పది యైదు సంజ్ఞలతో చక్కని టైపురైటరు వ్రాత ఏర్పడినాదులలో ఖత్తువ్రాతకయి విల పించువా రుండరు.

* * *

మరియొక సహజాక్షేపణయుగలదు. అక్ష రము ప్రక్కన అక్షరముగా వ్రాయుచు పో యినయెడల ఇప్పటికే స్థలమాక్రమించే వ్రాత యింకను నెంత యాక్రమించునోయని. అది

వట్టిభ్రమ. ఇప్పటి వ్రాతకైన క్రిందిస్థలమాక్ర మించి వరుసలువరుసలే ఆక్రమించివేయు చున్నాము. నూతన విధానమునందు అస్థల మును ప్రక్కల కాక్రమింతుము. ప్రక్కల కాక్రమించుట యిప్పటికిని కలదే, క్రొత్తది కాదు. మన 'అ' దీర్ఘము, ఒత్వము, ఓత్వ ము, కవత్తు, పవత్తు, వవత్తు, క్యావడి, క్రావడి ఇవియన్నియు ప్రక్కలకు స్థలమాక్ర మించునవే. నిజముగా క్రొత్తవిధానమున స్థలము మిగులవచ్చును.

* * *

ఈ వ్యాసమునందు నేను చేసిన సూచన లను అట్లే యంగీకరింపవలసిన దని కోరుట నాయుద్దేశముకాదు. విమర్శకు ప్రాతిపదిక ముగా నొక ప్రణాళిక సిద్ధపరచిన యెడల బుద్ధిమంతులు అభివృద్ధి మార్గములను సూచిం తురనే యూహయే నన్నీ పనికి పురికొల్పినది. శతాబ్దికాలముగా అన్ని ఆధునికోపయోగ ములకు మహోత్తమాభివృద్ధిని చెందిన జాతుల చేత పరివర్తన మొనర్చుకొననగుండు రోమ నులిపికే లోపము లెంచువారున్నారు. అం దలి యచ్చులకు హల్వ్యాపారము లున్నవి. కొన్ని హల్లులకు అచ్చుల వ్యాపారము లేర్ప డినవి. అచ్చుల దీర్ఘములకు వక్రములకు స్పష్ట సంజ్ఞలు కనుపించవు. దంత్యోచ్చారణకు తగిన గురుతులు లేవు. ఇట్టికొరతలు చూప వీలున్నది. కాబట్టి మననాల్గుభాషలకుగాను నాయూహలమేర కల్గిన ఈలిపికను చిల్లులు లేవననగునా? ఇది మన లిపిసంస్కారము నెడల భావమును పురికొల్పి నేటి 'ఏరోప్లేను' వేగమున కనువగు రీతిని మనము మన వ్రాతను తీర్చుకొనదగునను ఆవేదన మనలో కొందర కైనను కలిగినయెడల నాప్రయత్నము ధన్య మగును.

* * *

నే నేర్పరచిన తెలుగక్షరముల నీక్రింద కనుబరచితిని. అ,అఃి, ఇ,ఇఃి, ఉ,ఉఃి, ం, ఒ,ఒఃి, ఒ,ఒః, క,క△ గ,గ△, ం, ఙ,ఙ△, చ,చ△, జ,జ△, ం, ట,ట△, డ,డ△, ణ, త,త△, ద,ద△, న, ప,ప△, బ,బ△, మ, య, ం, ల, వ, శ, ష, స, హ, –(అత్వము)—ా(అత్వదీర్ఘము) ి(ఇత్వము) [illegible](ఇత్వదీర్ఘము) ు (ఉత్వము) ూ(ఉత్వ దీర్ఘము) ె (ఎత్వము), ే(ఎత్వదీర్ఘము), ొ...ో (ఒత్వము), ొ...ో(ఒత్వదీర్ఘము) ై(ఐత్వము), ౌ(ఔత్వము).

# తోటమాలి గురవడు

కనుపర్తి వరలక్ష్మమ్మ

ఋతురాజగు వసంతుని ఆగమనం వల్ల ఆ గృహోద్యానం నవజీవం పోసుకొన్నట్లైంది. తరులతాదులు పాతతొడుగులు వదిలి క్రొత్తదుస్తులు ధరించినవి. గాయకప్రవరుడు పికరాజు తనమనోహరగానమును లోకమునకు విందుపెట్టుటకై గొంతు సవరించినాడు. సకలప్రాణిలోక సుఖాధారమగు గంధవహుడు లోకమును హాయిహాయి మనిపింప పిల్లతెమ్మెర వీవనల చేబట్టినాడు. మాలతీమల్లికలు నవపుష్పపరిమళంతో దిక్కులు నింపివేస్తున్నవి. విరబూచిన పువ్వులతో సన్నజాజి మేలిముసుగుదాల్చిన మెలతవలె ఒయ్యారం ఒలుకపోస్తున్నది. ఫలభారవినమ్రములైన గుజ్జుమామిడిచెట్లు శుకదంపతుల సరస సల్లాపకళానిపుణతతో మారుమ్రోగుచున్నవి. కాని ఎటుచూచినా నేత్రపర్వమై చెవులపండుపై మనోహ్లాదకరమైన ఆ వనలక్ష్మి సౌందర్యమును గమనించువారు లేరు. ఒకప్పుడు దాని అపూర్వసౌందర్యమునకు క్షణక్షణవికాసమునకు మనోజ్ఞసౌరభమునకు మురిసి ముచ్చటపడిన పద్మావతికి దానిపై యిప్పుడు చూపేలేదు. పందిరినుండి బలవంతముగా పెఱికి నేలపైచినవల్లికవలె ఆమె ఒకమూల శోభావిహీనంగా పడివున్నది. ఆతల్లి దప్ప వేఱొకప్రియతమపదార్థ మెఱుగని ఆమెముద్దుబిడ్డలిరువురు నిరాశ్రయమై నేలపై పొరలులతను వేసిన సన్నలవలె తల్లిని అలముకొని ఉన్నారు.

అవి సీతారాముల కల్యాణదినములు! యింటింట వేడుకలు; వీధివీధిని పందిళ్లు, గుడిగుడిని ఉత్సవములు! ఒక అనిర్వచనీయమైన ఆనందం, ఒక అపూర్వమైన ఉత్సాహం ప్రజలనెల్లర అలముకొన్నది. పగటిపూట పనులు, రాత్రిపూట నిద్రలు మఱచిపోయినారు జనులు. అవును, యేడాదికొకమారు జరిగే వేడుక! పాడుపనులు యెప్పుడూ ఉండేవే! పనికిమాలిన నిద్ర యెప్పుడూ పొయ్యేదే! ఈ ఉత్సవానంద లహరిలో ఈనాడు మునకలు వేయకపోతే మరల లభించే దెప్పటికి? ఏడాదికి! ఏడాది యెవరో మన మెవరో! గతము గతమే! భవిష్యత్తు మన చేతిలో లేదు. వర్తమానఫలము జాఱవిడువకుండ అనుభవించినవాడే వివేకులు, దేవుని వూరేగింపు ఉత్సవాల్లో ఊదబడే తిరుచూర్ణా(బాణాలు)ల మోతలు ఊరంతటా ఒక్కమాటు వినపడ్డాయి. ప్రజాహృదయం దేవుడు వస్తున్నాడనే భావనతో జాగరితమైంది. పద్మావతికిగూడా ఆధ్వని వినిపించింది. తాను, తనపెనిమిటీ, చేతియొక బిడ్డను చంకనిడుకొని పుచ్చపువ్వు పిండినట్లున్న తెల్లని పండువెన్నెల్లో చల్లని పిల్లతెమ్మెరలు వీస్తూఉండగా చూచిన ప్రతిదానినిగుఱించీ ప్రశ్నలువేసే బిడ్డల ముద్దుపల్కులకు జవాబులు చెప్పకుంటూ ఉల్లాసంగా దేవోత్సవం తిలకించి వచ్చిన గతవత్సర వృత్తాంతం ఆమెతలపునకు వచ్చింది. చిత్తం క్షోభిల్లి దుఃఖం సుళ్లుదిరిగి కన్నుగవలో వెల్లివిరిసినట్లైంది. తల్లి తనూలతనే యెల్లప్పుడూ పెనవైచుకొని ఆమె మొఖములోనే మొఖం పెట్టుకొని, అద్దములోని బింబముల వలె తల్లి దైన్యమునే తమముఖాల ప్రతిబింబింపజేస్తూ వున్న ఆబిడ్డలిరువురూ తల్లివంక తేఱిపాఱచూచారు. వారికీ దుఃఖం కంఠగతమైంది. చెమ్మగిల్లేకన్నులు తుడుచుకుంటూ బిక్కముఖం వేసుకొని "యెందుకమ్మా యేడుస్తున్నావూ?" అన్నారు యిద్దఱూ ఒక్కమాఱుగా. ముద్దుబిడ్డల ప్రశ్న వినగానే పద్మావతి పశ్చాత్తాపపడ్డది. తనకళవళపాటు వారికి తెలియనీయరా దనుకొన్నది. "కడుపులో నొప్పిగావున్నదమ్మా; అందువల్ల కళ్లనీళ్లొచ్చాయి. మీరు కాసేపు అట్లా ఆడుకుంటూ ఉండండమ్మా కడుపునొప్పితగ్గగానే వస్తా" నన్నది తల్లి. "అమ్మా! నీకు కడుపునొప్పిగా ఉంటే డాటర్ బాబయ్యగారిమందు వేచుకో పోతుంది" అన్నది చిన్నపిల్ల.

"అమ్మయ్యో! డాక్టరుబాబయ్యగారిమందే! ఆమందు అమ్మకు పడ్డు. ఆ మందు తాగే మన నాన్నగారు

చచ్చిపోయినారుకాదూ?" అన్నది పెద్దపిల్ల.

"అవునా అమ్మా!" అన్నది చిన్నపిల్ల. పద్మావతి పలుకలేదు. ఆమెమనస్సు ఆ దుఃఖస్ఫురణలో లగ్నమై ఉన్నది.

"అవునే! చచ్చిపోవడంవల్లనేగా నాన్నగారు మనకు ఒక్కమారైనా కనిపించడంలేదు. డాక్టరు బాబయ్యగారిమందు తాగి అమ్మగూడా అట్లాగే కనుపించకుండా పోతే మన కెట్లా?" అన్నది పెద్దపిల్ల న్యాకులపాటుతో. "అయితే ఆ మందు మన అమ్మకు వద్దు" అని చిన్న బిడ్డ తల్లిని గట్టిగా తన చిన్ని చేతులతో కౌగిలించుకొన్నది. పెద్ద పిల్లకూడా మఱియొక ప్రక్కనుండి తల్లిని ఆలింగన మొనర్చుకొన్నది. ఆచిన్నబిడ్డ లిరువురు తమతల్లి తమ కప్పుడే యెడమై పోతుందేమో అను నంత మహాభీతితో తాము గట్టిగా పట్టుకొని ఉన్నందువల్ల తల్లి యెక్కడికీ పోజాలదు అను గాఢమయిన నమ్మకంతో తమబాహులతలు పెన వైచి చుట్టుకొని కూర్చున్న బిడ్డలను చూచి తండ్రివియోగచింత ఆబాల హృదయాల్లో యెంత గాఢంగా నాటుకపోయిందీ తలచి పద్మావతి మఱెంత దుఃఖం చెందినదై "నే నెక్కడికీ పోతాను పిచ్చితల్లుల్లారా! మీ నాన్నగారంతటి ఆ శ్రీరామచంద్ర మూర్తివంటి ఉత్తమ పురుషులు గనుక ఆ పరమాత్మకు ప్రియ మైనారు. ఈ అభాగ్యురా లెందుకు స్వామికి? ఈ మొండిప్రాణికి ఎన్నేళ్లాయుర్దాయము పోసినాడో? ఇంతకు నాకాలిసంకెలలు మీరుండగా మిమ్ములను యెవరిపాలుచేసిపోతాను?" అని బిడ్డలశిరసులు నిమురుచు కన్నీరునించింది పద్మావతి.

౨

పురుషోత్తమరావు విద్యార్థిదశలో ఉండగానే సంఘసంస్కరణాభిలాష అతనిహృదయంలో రేకెత్తింది. వరకట్నాలపై అతిబాల్య వివాహాలపై యేవగింపు గలిగింది. తాను చేసుకొనే వివాహం ఆదర్శప్రాయంగా యేదుఃఖజీవినో ఉద్ధరించేదిగా ఉండవలెనని అతడు అప్పుడే మనసులో నిశ్చయం చేసుకున్నాడు, కాని ఆ అభిప్రాయంమాత్రం తుదివఱకు యెవరితోనూ చెప్పలేదు. వేలకువేలు కట్నమిస్తామని రోజురోజూ వస్తూవున్న సంబంధాలు చూచి మురిసిపోయి యేదోగొప్పసంబంధం స్థిరపరుస్తా మని తల్లిదండ్రులు యెంత చెప్పినా అతడు వొప్పుకోలేదు. "చదువు పూర్తికాందే పెండ్లెం"ని పాటకొట్టివేస్తూ వచ్చాడు. సరే బి. ఏ. ప్యాసుకాగానే పెండ్లి చేద్దామని తల్లిదండ్రులు అనుకుంటూ వచ్చారు. పురుషోత్తమరావు బి. ఏ. ఫస్టున ప్యాసైనాడు. బ్యాంకిలో నూరురూపాయలఉద్యోగం లభించింది. పురుషోత్తమరావు యిక వివాహయోగ్యమైనస్థితికి వచ్చాననుకున్నాడు. వర్ణాంతరవివాహమా! దరిద్రబాలికాకరగ్రహణమా! వితంతుకన్యాపరిణయమా! ఏదియుక్తమని అతనిచిత్తము పరిశీలించింది. అభాగినియగు వితంతుకన్యాస్వీకారమే యుక్తమని అతనిఅంతరాత్మ వక్కాణించింది. వెంటనే మిత్రులసహాయంతో కన్యాన్వేషణకు దొరకొన్నాడు. ఉత్తమమైన ఉన్నతవంశంలో జన్మించి మంచివిద్యావతి అయి చక్కగా సౌకుమార్యంగా పదునాలుగు పదునేడు వత్సరములప్రాయంలో ఉన్న పద్మావతి వరప్రసాదినిలాగా అతనికి లభ్యమైంది. అభిజాత్యంగల పద్మావతిని పరిగ్రహించడానికి పురుషోత్తముడు ఆలసించలేదు. పద్మావతిగూడ పురుషోత్తమునివంటి పురుషోత్తముడు లభ్యమైనందుకు పెన్నిధిగన్న పేదవలె పొంగిపోయినది.

పురుషోత్తముడివర్తనం తల్లిదండ్రులకు మహాక్రోధవిషాదకారణమైంది. ముఖ్యంగా తండ్రి అతన్ని తీవ్రంగా నిరసించి వైదొలుగు అన్నాడు. సిద్ధపడియున్న యీ కష్టాలకు పురుషోత్తముడు కలతజెందలేదు. ఒకచక్కనియిల్లు బాడుగకు తీసుకొని అందు భార్యాసహితుడై కాపురమున్నాడు. వివాహమైన రెండు సంవత్సరాలకు వారి కొకకుమార్తె గలిగినది. మఱి మూడు సంవత్సరాలకు మఱియొక కొమార్తె గలిగినది. తమప్రేమనిధానాలైన ఆ ముద్దుబిడ్డలను చూచుకొని తమసాంఘిక కష్టము లన్ని మఱచి పద్మావతీ పురుషోత్తములు సుఖంగా కాలం గడుపుతున్నారు. ఉద్యోగానికి వచ్చిన యెనిమిదేండ్ల

లో పురుషోత్తముడిజీతం మూడింతలైంది. స్వయంపోషకమే ఉత్తమోత్తమమని నమ్మిన పురుషోత్తముడు, తండ్రిఆస్తికి అఱ్ఱులు చాచి ఉండక యిరువదివేలకు జీవితం భీమాచేయించాడు. ఒకమంచి స్థలం గొని అందు చక్కని పూలమొక్కలను ఫలవృక్షములను నాటించి వానిమధ్య సుందరమైన గృహం కట్టించి అచట కాపురమున్నాడు. "కులజయు నిర్మలాంగియనుకూలయు సద్యుయువిద్యలందు కౌశలవతియు సుశీల గుణసన్నుతురాలును" నైన భార్య, ముద్దులు మూటగట్టు బిడ్డలు! గొప్పవేతనము గల ఉద్యోగము! పురుషోత్తముని గార్హస్థ్యజీవితం యెంతో సుఖదాయకంగాముచ్చటగొలుపు తున్నది.

పరస్పరానురాగలతానిబద్ధమైన యీదంపతియుగళాన్ని చూడంజాలక విధి కేమికన్ను కుట్టిందో, పురుషోత్తముడికి తలవనితలంపుగా జ్వరం వచ్చింది. 'ఆఁ, యీకాస్తజ్వరానికి డాక్టర్ను పిలిపించడ మెందుకు? మన యింట్లో ఉన్నమందు వేసుకుంటే చాలదూ' అని పురుషోత్తముడు నిర్లక్ష్యంగా అన్నప్పటికీ పద్మావతి ఉపేక్షచేయలేదు. నౌకరును పంపించి పురుషోత్తముడికి ప్రియమిత్రుడైన డాక్టరు మధుసూదనరావును పిలిపించింది. మధుసూదనరావు ప్రాణపదమైన స్నేహితుని దక్కించుకొనుటకు పడగలపాట్లు పడ్డాడు. తనచేయి మించిం దనుకొన్నప్పుడు యితర వైద్యుల సహాయంగూడా తీసుకున్నాడు. అహోరాత్రములు ఆహారనిద్రలు వర్జించి అతనినే సేవించాడు. కాని శ్రమ ఫలింపలేదు. వచ్చినజ్వరం వచ్చినట్టే పట్టినపట్టు విడువకుండా వుండివుండి యే ఔషధసేవకూ లొంగక విషమించి నానా కల్లోలపెట్టి పందొమ్మిదవనాటిరాత్రి పదునొకండుగంటలకు అతనిని యిహలోకమునకు బాపినది. ఉత్తమోత్తముడైన పురుషోత్తముడి మృతికి ఎల్లరును విచారించారు. సరి యిక పద్మావతిదుఃఖానికి మేరేలేదు. ఎవనియొక్కసాంగత్యం తన దుఃఖమయజీవితానికి సుఖస్వప్న మాయెనో, ఎవనిదర్శనం తనవిపదంధకారానికి వెన్నెలరేకఅయ్యెనో, ఎవనికరగ్రహణం తనకష్టవారాశికి తెప్పకొయ్యాయెనో అట్టి ప్రాణప్రియుడైన పురుషోత్తముడు తన్ను బాసిపోయినవెనుక ఆమెశోకానికి పార మెట్లావుంటుంది? పురుషోత్తముడు తనకు ఆశ్రయమై వుండి తన అనిర్వచనీయప్రేమసుధామధురధారలతో తన్ను ప్రోదిసేయుచుండినన్నాళ్లు బంధువులయెడబాటు, సంఘంయొక్కబహిష్కారం, లోకుల అవహేళనలు పూర్ణిమాజ్యోత్స్నలో నక్షత్రాల కాంతివలె ఆమెకు గోచరించనేలేదు.

కాని నేడా రాకాసుధాకరబింబము అస్తమించగనే ఆరిక్కలకెంత కాంతి వచ్చినది! పద్మావతిదుఃఖము పరిపరివిధాల బహుళమైపోయింది. ప్రాణసమముగా ప్రేమించు పెనిమిటి! సిరుల తులతూగుతున్న కాపురము, ముక్కుపచ్చలారని బిడ్డలు! నా అన్నవారు లేనిబ్రతుకు!

పద్మావతి వివాహం చేసుకోక తన తల్లిదండ్రులచెంతనే ఉండి యే అవినీతి ప్రవర్తనలో ప్రవర్తిస్తున్నప్పటికీ సంఘం ఆమెను బహిష్కరించేది కాదు. బంధువర్గం ఆమెను యెడబాసేది కాదు. తల్లి ఆమెను తనకడుపులో పెట్టుకొని రక్షించేది. తండ్రి ఆమెను ఆదరించేవాడు. తోడబుట్టినవారు ఆమెను కమ్ముకొని ఉండేవాళ్లు. పంక్తిభోజనాది సాకర్యాలకు ఆమెకు కొఱత ఉండేది కాదు. కాని శీలవతియైన పద్మావతి తన వినిర్మలజీవితమును పాపవర్తనముచే పంకిలమొనర్చుట కంగీకరింపక సత్యసమ్మతముగ నొకనిని వివాహమాడింది. అపరాధులను నిస్సంకోచంగా తనలో ఇముడ్చుకొనే సంఘం బాహాటమైన యీసత్యప్రవర్తనకు పద్మావతీ దంపతులను శిక్షించి మీరు సంఘంలో ఉండి చాటుమాటుల ఎన్ని అపభ్రంశపు పనులైనా చేయండి భరిస్తాను కాని మీరు బహిరంగంగా వివాహమాడి నీతిమంతులై ఉండటానికి అంగీకరించనని చెప్పివేసింది. హిందూసంఘంలో వున్న యీ బలవత్తరమైన నియమం మంచి పదార్థాన్నిపైకి గెంటి కుళ్లును యింటిలో పెట్టుకున్న చందంగా ఉన్నప్పటికీ దూరదృష్టిలేని సనాతన లోకము ఉదారములైన నూతన సంస్కరణములను అంగీకరించనంతవఱకు పద్మావతీ పురుషోత్తముల

వంటి సజ్జనులు సంఘనిర్బంధమునకు లోనుగాక యెట్లు తప్పించుకొనగలరు? అన్ని విధాలా సౌఖ్యంగా ఉన్నప్పుడే యీ సంఘబహిష్కారం. సంఘజీవులగు మనుష్యులకు మనోవేదనాకారణమైనప్పుడు ఒక గొప్పదైన ఆపద తలపై పడినప్పుడు ఆబాధ యెంతబహుళమై ఉంటుందో చెప్పవలసినదేమి? ఈ నానావిధ దుఃఖాలవల్ల పద్మావతి హృదయం విభిన్నమైపోయింది. కాని ఆమెను వోదార్చేవా రెవరు?

3

పురుషోత్తమరావు యిల్లు కట్టడానికి స్థలంగాని పూలమొక్కలు వగైరాలు నాటించినప్పటినుంచీ గుఱవడే తోటమాలిగా ఉన్నాడు. పెనిమిటి పోయేటప్పటికి ఆ పూలమొక్కలపై ఉన్న గౌరవానురాగాలు తొలగిపోయినప్పటికీ భర్త వాత్సల్యంతో పెంచిన ఆలతాద్రుమాదులను చేజేత చంపివేయడం ఇష్టంలేక పద్మావతి గుఱవడిని నౌకరీలోనే ఉంచి పోషిస్తున్నది. గుఱవడు లోకజ్ఞానం లేని మోటు, యీనాడిదని పన్న మాటెరుగని మహావిశ్వాసపాత్రుడు. అమ్మగారన్నా, అయ్యగారన్నా వాడికి అమితభక్తి. పురుషోత్తముడు గూడ గుఱవణ్ణి అత్యధికంగా ఆదరించేవాడు. అటువంటి వాత్సల్యపూర్ణుడైన యజమానిని కోల్పోవడంచేత గుఱవడు పొందినదుఃఖం యింతా అంతాగాదు. తండ్రికోల్పోయిన బిడ్డవలె విలపించాడు. భర్తగతించిన తర్వాత దుఃఖంచేతా విరాగంచేతా పద్మావతి ఆపూలమొక్కలను ఒక్కమాటైనా కన్నెత్తిచూడకపోయి నప్పటికీ స్వామిభక్తి తత్పరుడైన గుఱవడు కరుణార్ద్రహృదయంతో ఆ మొక్కలను అనాథశిశువులను సాకినట్లు సాకుతూ యజమానియందు తనకుగల ప్రేమను కృతజ్ఞతాపూర్వకంగా చూపిస్తున్నాడు. అయ్యగారి మంచిమనసు గుర్తెరిగిన గుఱవడికి అమ్మగారిని చూచినా, ఆమె ముద్దుబిడ్డలను చూచినా కడుపు చెరుగుకుపొయ్యేది. కండ్లనీళ్లు బొటబొటరాలేవి. “ఆ మహారాజుగారుంటే అమ్మగారు బిడ్డలుగూడా యెంతసుఖ మనుభవించేవాళ్లు! పండువంటికాపురం యెంతలో చితికిపోయింది! దొరకు బిడ్డలంటే ఎంత అపేక్ష! అమ్మగారంటే యెంత ప్రేమ. ఇన్నేండ్లనుంచి చూస్తున్నానుగదా ఆ ఆలూ మగళ్లు ఒక్కనాడు ఒక్క పోరుపుమాట అనుకున్నట్లు, కాసంత మొగం చిన్నబుచ్చుకున్నట్లు చూడలేదుగదా! చిలకా గోరంకల్లాగా అంతముచ్చటగా ఉండేనారు. ఇంత కనులపండుగైన సంసారం యెందుకు నిలుపుతాడు దేవుడు! ఆయన కంతాబాగును ఓగుచేయడం ఓగును బాగుచేయడం అదో వేడుకాయె” అనుకుంటూ ఏడ్చుతుంటాడు, కళ్లనీళ్లు కారుస్తూవుంటాడు. అమ్మగారేది చెప్పినా అగ్రాన ఆనబెట్టి చేస్తూవుంటాడు. పిల్లలు యేదికోరినా యెంతశ్రమకైనా తెచ్చియిస్తూ వుంటాడు. ఇంతకష్టకాలంలో గుఱవడివంటి విశ్వాసపాత్రుడైన సేవకుణ్ణి అనుగ్రహించినందుకు పద్మావతి గూడా లోలోన కృతజ్ఞతాపూర్వకంగా భగవంతుణ్ణి స్మరిస్తూవుంటుంది.

४

ఆనాడు వూరిలో తిరునాళ్ల. వింత వింత సామానులతో రకరకాల దుకాణాలు వచ్చినవి. చుట్టుప్రక్కల పల్లెలజనం వూరంతా నిండిపోయినారు. సాయంత్రం నాల్గుగంటలయ్యేటప్పటికి జనసమూహంతో తేరువీథి క్రిక్కిరిసిపోయింది. స్త్రీలతో పిల్లలతో నేడలు మిద్దెలు కలకలలాడిపోయినవి. మంగళవాయిద్యాలతో భగవన్నామ స్మరణలతో రథం సాగింది. అడుగడుగున స్వామికి నారికేళఫలములు కర్పూరం సమర్పించి ప్రజలుధన్యోస్మి అనుకున్నారు. రథోత్సవం ముగిసి స్వామి యథాస్థానమునకు విచ్చేయగానే జనప్రవాహం స్వామిని విడిచి బజారువీథికి పొర్లింది. బొమ్మలదుకాణాలు గాజులంగళ్లు సువాసినీ స్త్రీలతో నిండిపోయినవి. జాడీలదుకాణాలు రాచిప్పలదుకాణాలు బ్రాహ్మణవితంతువులు చుట్టుముట్టారు. చెంచుకజ్జలు నూనెమిఠాయి అలగాజనం కంట్రాక్టుతీసుకున్నారు. కాసంత కల్లునీళ్లు తాగితేనే గాని తిరునాళసంబరం అనుభవించినట్టుగాదని త్రాగుడలనాటుకలవాళ్లు కల్లుపాకలకేసి నడిచారు. గుఱవడుగూడా తిరునాళ చూడటానికి పోవాలెనని తలపువ్వు ముడివేసుకొని

పండుగకోసం అపరూపంగా దాచిపెట్టుకొన్న పంతులుగారి పాతదోవతి కట్టి, గీరలచొక్కా తొడుక్కొని వేలంలోగొన్న ముదురురోజాసిల్కు ఉత్తరీయం వేసుకొని ఒక అర్ధరూపాయిడబ్బులు జేబులోవేసుకొని రథోత్సవానికి బయలుదేరాడు. పోతుంటే వెంకి కేకేసి "ఉన్న అర్ధరూపాయిడబ్బులు నీవే జేబులోవేసుకొనిపోతుండావు. ఆకాస్తా కల్లుపాకల్లో కాలెట్టి రావాక, పోరగాళ్లకేదైనా మిఠాయి కొనుక్కుర"మ్మన్నది. "సరేలే" అని గుఱవడు వెళ్లిపోయినాడు పెండ్లాం హెచ్చరించిన మొదట పిల్లలకే కొనుక్కొద్దామని అనిపించినా తీరా బజారుకు వచ్చిన తర్వాత తోటివాళ్లంతా కల్లుపాకలవైపు పోతూవుంటే గుఱవడికి గూడా అక్కడికేపోవాలని భ్రమపుట్టింది. "వెంకి చెయ్యిడిసేమణిసి కాదులే. పిల్లల కేదో దాచిపెట్టేవుంటుంది. పండగపూటా కాసంత కల్లు సీల్లు చప్పరించకుండా ఒట్టినోటితో యెందుకుపోవాలె? ఇట్లాంటి పండగపూటన్నా కొత్తచవిచూడకపోతే యెందుకీజన్మ." రథం దేవాలయం వద్దకు చేరగానే గుఱవడు కల్లుపాకవద్దకు పోదామని బయలుదేరి బజారులోంచి వస్తున్నాడు. బజారునుంచి కల్లుపాకవైపు పొయ్యేసందుమలుపులో బిడ్డలిద్దరికీ రంగురంగుల బొమ్మలూ గిలకపండ్లూ కొని చేతికిచ్చి ఒక బిడ్డను చంకనెత్తుకొని ఒకబిడ్డను చేయిపట్టి నడిపించుకుంటూ పోతూవున్న ఒక పుణ్యవతి కనుపించింది. ఆమెను చూడగానే తన యజమానురాలైన పద్మావతి వానికి గుప్పున జ్ఞాపకం వచ్చింది. "మా అయ్యగారు చల్లగా ఉన్నట్టయితే మా అమ్మగారుగూడా యిట్లాగే చిన్నమ్మాయిగారి నెత్తుకొని పెద్దమ్మాయిగారిని నడిపించుకుంటూ బొమ్మలంగడికి వచ్చేవారు గదా. అయ్యో! ఆ అమ్మగారికి, బిడ్డలకు నేడెంత దురవస్థ పట్టింది?" ఈ విషయాలన్నీ తలపున బారేటప్పటికి గుఱవడిమనస్సు చేయిపెట్టి కలచిన ట్లైపోయింది. కండ్లనీళ్లు జొటజొట కారినాయి. "ఎంత పాపాత్ముణ్ణి! ఈ తిరునాళ్లపూటా ఆ అమ్మాయిగార్ల కేమైనా కొనియివ్వకుండా తాగి తందనా లేయడానికి పోతున్నానే" అనుకున్నాడు. యిక కల్లంగడికి పోవడానికి గుఱవడికి కాళ్లు సాగలేదు. క్షణమాగి ఏమో ఆలోచించి గిఱ్ఱున వెనక్కుదిరిగి బొమ్మల దుకాణానికి వచ్చాడు. మూడేసి అణాలకు రెండుబొమ్మలు కొన్నాడు. మిగతా రెండణాలకు రెండు మామిడిపండ్లు పుచ్చుకున్నాడు. చరచరా నడిచి యజమాని యింటికి వచ్చాడు. పద్మావతి యిద్దఱుబిడ్డలను దగ్గిరపెట్టుకొని నిర్వికారంగా కూర్చునివున్నది. ఆతల్లిబిడ్డలను చూస్తే గుఱవడికి బోరున యేడ్పువచ్చింది. ఎట్లో సంబాళించుకొని "అమ్మా! యివ్వాళ వూళ్లో యెంత సంబరం జరుగుతున్నది. అయ్యగారుంటే ఆ రంగురంగుల మరబొమ్మలతో మనయిల్లు యెంత మెఱిసిపొయ్యేది! అమ్మాయిగార్లెంత సంతోషించేవారు!" అని దుఃఖంతో డగ్గుత్తికవడినకంఠంతో పలుకుతూ తానుకొనుక్కొచ్చిన బొమ్మలు, పండ్లు ఉత్తరీయపుకొంగులో నుంచి విప్పి బిడ్డలచేతిలో పెట్టాడు. "అయ్యో పిచ్చివాడా! అర్ధరూపాయో పదిఅణాలో పెట్టి యెందుకు తెచ్చావురా అవి? పిల్లలు ఆడుకోడానికి యింట్లో బొమ్మలులేవ్వ్రటా." అన్నది పద్మావతి వాడికృతజ్ఞతకు సంతోషిస్తూనే విచారంతో. ఆబొమ్మల్ను చూడగానే ఆబిడ్డలు సంతోషంతో ముఖాలు వికసించినపువ్వుల్లాగా చేసుకొని ఆనందించడం మొదలుపెట్టారు. గుఱవడిచ్చినబొమ్మలు చూచి "గుఱవడు మంచివాడు చక్కనిబొమ్మలు తెచ్చిపెట్టాడు" అని మురుసుకుంటూఉన్న బిడ్డలను చూచి, "పనివాడు గుఱవ డిచ్చినబొమ్మలకే యింత మురుసుకొంటున్నారు. యింకా మేనమామలు, పినతండ్రులు, యిటువంటివి తెచ్చియిస్తే యెంత సంతోషించేవాళ్లో! అయ్యో! నా బిడ్డల కంతభాగ్యమా? మేము సంఘబహిష్కృతులముగదా" అని తలచి దీర్ఘమగు నిట్టూర్పు విడిచింది పద్మావతి.

# ఆభరణములను

కొనుటయందు నిజముగా

## ఇంద్రజాల మేదియు లేదు.



మాడరన్ డిజైనులు.

ఏ నగల దుకాణములోనైనను నమ్మకము, నీతి, పేరుప్రఖ్యాతులు సుస్థిరత్వము, విశ్వాసము మొదలైనవి తృప్తికరమైన కొనుగోలుకు యథార్థసోహదములుగా నుండగలవు - - - - - -



అద్భుతమైన పనితనము.

మీరు వీరితో లావాదేవీలు జరిపినచో

అది సులభముగాను

నమ్మకముగాను నుండును

# సురాజ్ మల్

"మీ విశ్వాసమునకు పాత్రులైన నగలవర్తకులు"

## డైమండ్ మర్చంట్సు

313, మెన్ప్లనేడ్ మదరాసు

1895 నుండి, అనగా 40 యేండ్లకుపైగా, ఇండియాలోను, బర్మాలోను, దానికి సాటిలేని పేరుప్రఖ్యాతులు కలవు—వారి ఒకే ధరపద్ధతి—అందరికి ఒకే నిర్ణీతమైన ఖరీదు—మిమ్ముల నాకర్షించగలదు. నాణ్యదనములోను, తృప్తిలోను వారి గ్యారంటీ స్థిరపడుచున్నది. మీ ప్రక్కయింటివా రెంత చెల్లించుచున్నారో మీరుగూడ అంతే యిచ్చుచున్నారు. కాబట్టి మీరు పోస్టుద్వారాగాని, స్వయముగాగాని నమ్మకముగా లావాదేవీలు జరుపవచ్చును. - - - - - - - - - - - -

★ ★ ★

## పోస్టుద్వారా ఆర్డరుచేయుడు.

పోస్టల్ ఆర్డర్లు నమ్మకముగాను, బాగుగాను అపులు జరుపబడును.



క్రొత్తకల్పనలు.

359, కాల్బాదేవిరోడ్ బొంబాయి

134, మొగల్ స్ట్రీట్ రంగూన్



# "కల్జానాకు వందనములు, నా కుటుంబము తిరిగి మంచి ఆరోగ్యముగా నున్నది."

**కల్జానావల్ల బలహీనత, చర్మవ్యాధులు, అలసట, పాండువు, స్త్రీల జబ్బులు తొలగును.**

"అవును" అని డాక్టరు చెప్పెను." సంవత్సరములనుండి నేను శిఫారసు చేయుచున్న కల్జానా యెల్లప్పుడు అద్భుతమైన ఫలితములు నొసంగును. కల్జానా సేవించుచున్న కుటుంబములలో జీవితసౌఖ్యమును భంగము కలిగించు జబ్బులుగాని, ఖనిజముల లోపముచే కలుగు జబ్బులుగాని యేర్పడవు." ఈ డాక్టరు సలహా ననుసరింపుము. శరీర బలమునకు, బలహీనత నాడి వగైరాలనుండి తప్పించుకొనుటకు స్త్రీలకు పిల్లలకు కల్జానా శ్రేష్ఠమైనదని వేలకొలది డాక్టరులు వక్కాణించుచున్నారు.

"కల్జానా సేవించిన కొద్దికాలమునకే, దాని ఫలితమును వెంటనే కనుగొంటిని. నా భార్యకూడా దానిగుణములను శీఘ్రముగా పొందెను. స్త్రీల సంబంధమైన సమస్త వ్యాధుల కిది అమోఘ నివారిణి యని ఆమె కనుగొనెను" అని

యఫ్. ఇ. ఫొచ్, యస్. గారు వ్రాసిరి.

# KALZANA

ఆరోగ్యాభివృద్ధికి ఖనిజాహారము

(3)

చేతితో తాకబడనిది.

ప్రతి మందుల దుకాణములోను బజారులోను దొరకును.

క్రీస్తుశకంలో ఏ తేదీనాటితిథినయి నను తెలిసికొనే క్రమము.

క్రీస్తుశకంలో ప్రతిసంవత్సరానికీ సంబంధించినవిషయాలు రెండున్నాయి—ఒకటి స్వర్ణసంఖ్య (Golden number), రెండవది వత్సరాది తిథి. (Epac - Age of the moon on 1st. January.)

తేదీ—తిథిచక్రం ౧౯ సంవత్సరాల్లో ఒక సంపూర్ణ పరిభ్రమణం చేస్తుంది. అంటే యిప్పుడేనెల యే తేదీనా డేతిథి అవుతుందో తిరిగీ ౧౯ సంవత్సరాలకి ఆనెల ఆ తేదీనా డాతిథే అవుతుంది. అట్లాగే ౧౯ సంవత్సరాలకు పూర్వం ఆనాడే ఆ తిథే ఉండన్నమాట. ఇలాగు క్రీస్తుశక వర్షాలన్నీ పందొమ్మిదిపందొమ్మిదిగా విభజింపబడ్డవి. ఈపందొమ్మిదేండ్లకు వరసగా ౧,౨,౩ ఇత్యాదిగా...౧౯ స్వర్ణసంఖ్యలు వుంటవి. ఇట్లాగే ప్రతి౧౯ఏండ్లకున్నూ స్వర్ణసంఖ్య వరసగా వస్తుంది.

పూర్వం గ్రీసుదేశంలో ప్రతిసంవత్సరక్రమసంఖ్య ఏథెన్సు ఆలయంలో (Temple of Athens) పైన సువర్ణాక్షరాలతో లిఖింపబడి ఉండడంచేత ఈ క్రమసంఖ్యకు స్వర్ణసంఖ్య అని పేరు వచ్చింది.

సూత్రము: క్రీస్తుశకసంవత్సర సంఖ్యకు ౧ కలిపి ౧౯ చే భాగిస్తే

# తేదీ - తిథి

కొంపెల్ల లక్ష్మీనారాయణ

వచ్చినశేషం ఆసంవత్సర స్వర్ణసంఖ్యను తెలియజేస్తుంది. ఉదా: ౧౯౩౮ తో ౧ కలిపితే ౧౯౩౯ అవుతుంది. ఆ మొత్తాన్ని ౧౯ తో భాగిస్తే ౧ మిగులుతుంది. ఆమిగిలిన ౧, స్వర్ణసంఖ్య. ఇలాగే మళ్లా ౧౯౫౬ వరకు వరసగా స్వర్ణసంఖ్య ౨, ౩...౧౯ వరకు పెరుగుతుంది. అవల, ౧౯౫౭-వ సంవత్సరం స్వర్ణసంఖ్య మళ్లా ౧ అవుతుంది. ఇట్లా ప్రతిపందొమ్మిదేండ్లకు తిరుగుతూ ఉంటుంది స్వర్ణసంఖ్యాక్రమము.

ఈ స్వర్ణసంఖ్య సహాయంతో జనవరి ౧-వ తారీఖునాటితిథి తెలుసుకోవచ్చును. దానికి సూత్రము: సంవత్సరంతాలూకు స్వర్ణసంఖ్యలో ౧ తీసివేసి శేషాన్ని ౧౧ తో గుణించి ౩౦ (తిథులసంఖ్య)తో భాగిస్తే వచ్చినశేషం వత్సరాదితిథిని తెలియజేస్తుంది. ఉదాహరణం: ౧౯౩౮ సం. స్వర్ణసంఖ్య ౧ దాంట్లో ౧ తీసివేస్తే మిగులుసున్న. ఆసున్నను ౧౧ తో పెంచితే సున్నవస్తుంది. దాన్ని ౩౦ తో భాగిస్తే శేషం సున్ననిలుస్తుంది. అంటే తిథి ౩౦—అమావాస్య అవుతుంది. మరొకఉదాహరణం. ౧౯౩౯ సం. స్వర్ణసంఖ్య ౨. దాంట్లో ౧ తీసివేస్తే మిగులు ౧. దానిని ౧౧ తో పెంచితే ౧౧ వస్తుంది. దాన్ని ౩౦ తో భాగిస్తే ౧౧ శేషం. అంటే ౧౧ తిథి శుద్ధఏకాదశి అవుతుంది. ఇంతే కాదు.

ఏ తేదీ నాడయినా తిథి తెలుసుకోడానికీ మార్గం ఉంది. దానికిసూత్రము: జనవరి ౧-వ తేదీనుండి తిథికావలసిననాటివరకు జరిగిన తేదీలను ఒక్కటిగా కూడి, ౨౯½ తో భాగించగా మిగిలిన శేషానికి వత్సరాది నాటితిథి కలిపితే కావలసినతిథి తెలుస్తుంది. ఉదా: ౧౮-౬-౧౯౩౮ నాటి తిథి కావలసినది. జనవరి తే ౩౧, ఫిబ్రవరి-౨౮ మార్చి-౩౧, ఏప్రిల్-౩౦, మే-౩౧, జూన్-౧౮ మొత్తం జరిగిన తేదీలు ౧౬౯. ఈ మొత్తాన్ని ౨౯½ తో భాగించగా శేషం ౨౧½ మిగులుతుంది. ఇందులో పూర్ణాంకమే గ్రహించాలి. అంటే ౨౧. అపుడు బహుళషష్ఠి అవుతుంది జూన్ ౧౮ తేదీనాడు. ఈ విధంగా నిర్ణయించిన తిథి సాధారణంగా సూర్యాస్తమయ సమయానికి ఉంటుంది. సూర్యోదయ వేళ తిథి తెలుసుకోవాలంటే శేషంలో ౧ తీసివేయాలి. అలా చేస్తే ఆ నాటి ఉదయం పంచమితిథి ఉంటుందన్నమాట.

# కోనమన్మమల్లభూపతి కందికుప్ప శాసనము

మల్లంపల్లి సోమశేఖరశర్మ

కొంతకాలము క్రిందట తూర్పుగోదావరి జిల్లా అమలాపురము తాలూకా కందికుప్ప గ్రామమున ఒక పాటిదిబ్బ త్రవ్వుచుండగా శ్రీ పెరివెల వెంకటకొండయ్యగారికి ఈశాసనము దొరకినది. దీనిని వారు మన్మిత్రులు శ్రీ గొబ్బూరి వేంకటానంద రాఘవరావు పంతులుగారి కీయగా ప్రకటనార్థము వారు దయతో దానిని నా కొసంగినారు.

ఈశాసనము కోనసీమను పరిపాలించిన హైహయవంశజులది. హైహయవంశమువారి శాసనము లింతవరకు అనేకములు దొరకినవి కాని అవి యన్నియు శిలాశాసనములే. ఇది యొక్కటే వారికి సంబంధించిన తామ్రశాసనము. ఇంతవర కీవంశమువారి తామ్రశాసనము లేవియు దొరకని కారణమున వారు తామ్రశాసనము లీయలేదేమోయని కొందర యభిప్రాయము; కాని యది సరియైన యభిప్రాయము కాదని దీని ననుసరించి తేలుచున్నది. కోనసీమ హైహయు లేలిన కాలమున శాసనములు శిలలమీద చెక్కించుట ఎక్కువ వాడుకయైనను తామ్రశాసనము లిచ్చునాచారము లేకపోలేదనువిషయము దీనివలన ధ్రువపడుచున్నది. అగ్రహారములను దాన మొసంగి, హైహయు లిచ్చిన తామ్రశాసనము లింకను ఉండవచ్చును; కోనసీమయందు కాని, తత్పరిసర ప్రాంతములందు కాని విచారణ చేసిన యెడల హైహయులవి మరికొన్ని శాసనములు దొరకిన దొరకవచ్చును.

ఈశాసనమున ఆరు రేకు లున్నవి. ఒక్కొక్క రేకు వెడల్పు ౪ 3/౪ అంగుళములు, పొడుపు ౯ ౧/౨ అంగుళములు. ఈయారును ముద్రికతోనున్న ౪ 3/౮ అంగుళముల వ్యాసముగల యొకగుండ్రని కడియమున దూర్చియున్నవి. ముద్రిక — ఈశాసనము దొరకినప్పటికే కావచ్చును — పూర్తిగ శిథిలమయి చెడిపోయినది. దానిమీద నేముండెనో యిప్పుడు తెలిసికొనుట కష్టము. మొదటి రేకు మొదటిపెడమీదను, ఆరవ రేకు రెండు పెడల మీదను వ్రాతయేదియు లేదు. అయిదవ రేకు రెండవ పెడనుగల వ్రాతకు కాపుదలగ నుండుటకయి ఆరవ రేకును చేర్చినట్లు తోచును.

శాసనమంతయు బర్నెలుగారు పేరుపెట్టిన 'సంధికాలపు లిపి'లో వ్రాసియున్నది. సంధికాలమనగా లిపికి అంతకుపూర్వ ముండినస్వరూపము మారి క్రొత్తరూపము వచ్చుచుండిన కాలమని భావము. క్రీ. శ. ౧౦౦౦ మొదలు ౧౩౦౦ ల వరకు నని బర్నెలుగా రీకాలమునకు స్థూలదృష్టిని హద్దులు తెలిపినారు. దీని ననుసరించి సరిగా ౧౦౦౦-వ సంవత్సరమునుండియే మార్పారంభమయినదనికాని, ౧౩౦౦ లతో మార్పాగి పోయినదనికాని తలంపరాదు. దక్షిణ హిందూదేశ శాసనములను మొత్తముమీద పరిశీలించి వేసినయంచనా యిది. స్థానికముగ అచ్చటచట ఈ నిర్ణయమున కించుకవ్యత్యాస ముండిన నుండవచ్చును.

ఆంధ్ర కర్ణాట దేశములయందు నాలుగైదుశతాబ్దులలో పల్లవ, శాలంకాయన, గాంగ, కదంబ, వల్లభి మొదలయిన వంశములవారికాలమునందుండినలిపియే కొంచెమించుగ పది, పదునొకండవశతాబ్దులవరకు వాడుకలో నుండెను. కేవలము తెలుగులిపి యనికాని, కన్నడములిపి యనికాని విడదీసి చెప్పవీలులేని 'తెలుగు - కన్నడ' లిపి యది. బాదామి చాళుక్యలిపియు, వేంగి చాళుక్యలిపియు దానివికాసమే. ఈ తెలుగు - కన్నడ అక్షరములకు క్రీస్తుశకము ప్రాథమిక శతాబ్దులనుండి కలుగుచువచ్చిన వికాసము కొంచె మించుమించుగ పదునొకండవశతాబ్దినాటికి పూర్తియై వాటికి ప్రాయ

మబ్బినది. అంతటినుండి యవి మార్పునంది, వ్యక్తిత్వ మును పొందినవి. ఈ మార్పు ౧౩౦౦ ల వరకు జరగిన దని బర్నెలుగారు స్థూలదృష్టిని చెప్పినను అటుతరు వాత కొంతకాలమువరకుగూడ ఈ మార్పు సాగు చుండెనని చెప్పవచ్చును. లిపి కీకాలమునందు గలిగిన మార్పులకు ఫలితముగ నేటి యక్షరరూపములు దిద్దు బాటయినవి.

ఈ శాసనమునందలి యక్షరములు పైనుడివిన 'సంధికాలము' నాటి ఇతరాంధ్రదేశ శాసనము లందలి వాటిని బోలియున్నవి. ఇట్టి 'సంధికాలపులిపి'లోని శాస నములను బాపట్ల, బెజవాడ, దాక్షారామము, పాలకొల్లు, సింహాచలము, ముఖలింగము, త్రిపురాంతకము మొదల యిన సుప్రసిద్ధక్షేత్రములయందు మనము పొడగాంచ వచ్చును.

ఈ కాలమునాటి కొన్ని శాసనములలో 'ఆ' యను అచ్చు ఇప్పటివలె సంపూర్ణవికాసమును పొంది కానవచ్చుచున్నను ఈ శాసనమునమాత్ర మట్టిది కానరాదు. అచ్చుల, హల్లులమీది ఎ, ఒల హ్రస్వ, దీర్ఘ రూపములు రెంటికిని ఒక్కచిహ్నమే కనుపించు చున్నది. హల్వర్ణములమీది ఐత్వమును సూచించు చిహ్నము ఇంతకుపూర్వము వర్ణమునంటి ఎడమప్రక్క నుండగా ఈ శాసనమున అది నేటిలిపిలోవలె వర్ణము దిగువకు చేరినది.

ఒకటిరెండు తక్కువగా ఇందు హల్వర్ణము లన్నియు వచ్చినవి. చ, ఛ వర్ణములు రెంటికిని గల భేద మిది. ఛ వర్ణపుపార్శ్వరేఖలు దిగువభాగమున ఒకదానితో నొకటి మెలివేసికొని యున్నవి. చవర్ణమున ఈమెలిక కానరాదు. బ ఇప్పటివలెనే తలకట్టు లేక యున్నది. భ వర్ణముపార్శ్వరేఖలు దిగువభాగమున ఇప్పటిలిపిలోవలె గలసిపోలేదు. ఛ, భవర్ణముల కిప్పటి లిపిలోవలె ఒత్తులు కానరావు. కాని, ఫ వర్ణమునకు మాత్రము ఒత్తు దానికుడి పార్శ్వరేఖనబుమ దానినంటి యడ్డుగీటుగనూపమున ఉన్నది. థ, ధ లకును, ఓ, దేల కును భేదము కానరాదు. సంధికాలమునకు పూర్వము వాడుకయందుండిన ఐ (ఙ్జ) వర్ణమునకు తలకట్టిచ్చిన మొదల ఈశాసనమున ఙ వర్ణ మేర్పడుచున్నది. తలకట్టులేని ట, ద, వర్ణములు కొంచె మించుమించుగ ఒక్కపోలిక నున్నవని చెప్పవలెను. ద్విత్వాక్షరముల లోని ద్విత్వములన్నియు తలకట్టులేని ప్రధానవర్ణ ములే. ఈద్విత్వములలో ౧, స లు ఈశాసనమున గొంచె మించుమించుగ ఒక్కపోలిక నున్నవి. అన స్వారపూర్వకము లయినట్టియు, వలపలిగిలకతో గూడి నట్టియు హల్లు లచ్చటచట ద్విత్వమును జెందనవి.

శాసనమునందలి ప్రధానభాగమంతయు సంస్కృ తభాషను గద్యపద్యములలో నున్నది. సరిహద్దులను పేర్కొనిన భాగము మాత్రము తెలుగున నున్నది. శాసనాంతమున దానసంరక్షణాదిఫలములను తెలుపు మామూలు శ్లోకములు కలవు. చిట్టచివర, ఒకశ్లోకమున దానము ఏశకవర్షమున చేయబడినదో అది తెలుపబడి నది.

శాసన ఉత్కీర్ణకుడు శాసనమును అశ్రద్ధగ జెక్కుటచేత ఇందు వ్రాతతప్పులు మొదలయినవి చాల గలవు. ఇందలి తెలుగుపదములలో 'కాలి' యనునది గమనింపదగినది. పదునొకండవ, పన్నెండవ శతాబ్ది నాటి తెలుగు శాసనములయందు 'కాలి', 'కాలియ' రూపములే కానవచ్చును. ఉదా: నిగ్గలపుంగాలియ; భోడతాతకాలియ; నక్కలకాలియ. 'కాలి'పదము కాల క్రమమున 'కాలియ' అయి, 'కాలువ'గ మారినది. 'కాలువ' అర్వాచీన రూపము. సీమావధులుగ చెప్పబ డిన 'కొప్పనిమొట్టు', 'మడతేవు' అను వానిలోని 'మొట్టు', 'మడ' పదములకు అర్థము తెలియవచ్చుట లేదు.

ఈ శాసనము కోనదేశమును పాలించిన మన్మ చోడభూపతికుమారుడు కోన మల్లిదేవరాజుది. శాస నము కోనసీమను పరిపాలించిన హైహయులదే మైనను కోనమన్మసత్య, మల్లిదేవుల పిఠాపురము శిలాశాసన మువవలెనే ఇందును సగముభాగము (పం. ౪౨ వరకు) చాళుక్యవంశానుతారక్రమమే వర్ణింపబడినది.

అందునను పౌరాణికవంశానుకథనమును, విజయాదిత్య గాథయు అతివిస్తరముగను, అసలు రాజవంశము—కులోత్తుంగచోడునివరకు — అత్యంతసంగ్రహముగను నున్నది. తరువాత శాసనలేఖకుడు కులోత్తుంగ చోడునియాజ్ఞవల్ల వేంగీభూపరిపాలనము నిమిత్తము నియోగింపబడినవానివంశము నభివర్ణించుచున్నానని చెప్పి (౮౩-వ పంక్తినుండి) యదుకులమునం దుద్భవించిన హైహయుని సంతతిక్రమము నిచ్చెను. కోన మండలము లేక కోనసీమను బరిపాలించినహైహయులకు మండలాధికారమును, రాజలాంఛనములును చాళుక్యవంశ్యుడయిన కులోత్తుంగచోడునివలన లభించినవగుటచేత కావచ్చును వారు తమకృతజ్ఞతను వెలిపుచ్చుటకై తమశాసనములందు ముందు తమప్రభుసంతతిని వర్ణించియున్నారు. ఈ విధమయినక్రమము ననుసరించి శాసనమును మూడువిభాగములుగ పరిగణింపవచ్చును. మొదటివిభాగము చాళుక్యవంశావతారక్రమము; రెండవవిభాగము హైహయవంశాభివర్ణనమును, దానవిషయకథనమును; మూడవది దానరక్షణ ఫలమును చెలుపు మామూలు శాసనాంతశ్లోకములు.

చాళుక్యుల పౌరాణిక వంశానుకథనము విష్ణుమూర్తితో ప్రారంభమగును. విష్ణువునకు బ్రహ్మయు, బ్రహ్మకు అత్రియు, అత్రికి చంద్రుడును కలిగిరి. చంద్రునినుండి ఉదయనునివరకు చంద్రవంశ మభివర్ణితమయినది. ఇట్లు అనవచ్ఛిన్న సంతానక్రమమున అయోధ్యా సింహాసనము నధివసించి పాలించిన యేబదితొమ్మండ్రు చక్రవర్తులు చన్న వెనుక ఆవంశమునందలి విజయాదిత్యుడను రాజు విజయాభిలాషగలిగి దక్షిణాపథమునకు వెళ్లి త్రిలోచనపల్లవుని యుద్ధమున నెదుర్కొని కాలవశమున లోకాంతరమున కరిగెను. ఆసంకుల సమయమున గర్భభారాలసయయిన ఆరాజు మహాదేవి అంతఃపురాధికృతలయిన కొలదిమంది యువతీజనముతో వృద్ధామాత్య పురోహితులచేత తీసికొని పోబడినదై, ముడివీము అను పేరుగల అగ్రహారమును చేరి, ఆ గ్రామవాస్తవ్యు డయిన విష్ణుభట్టసోమయాజివలన కన్నకూతురు మాడ్కి అభిరక్షింపబడుచు దినములు గడపుచుండగా ఆమెకు విష్ణువర్ధనుడను ఒకకుమారుడు కలిగెను. ఆకుమారునికి స్వక్షత్రియకులోచితముగ జాతకర్మాదులు చేసి అతనిని పెంచెను. తల్లివలన ఆ కుమారుడు జరిగినవృత్తాంతమంతయు విని ఆమెకు నమస్కరించి తపస్సునిమిత్తము వెళ్లి, చళుక్యగిరిమీద నెలకొనియున్న గౌరి నందాభగవతి నారాధించి, కుమారస్వామిని, నారాయణుని, మాతృగణములను సంతుష్టిపఱిచి, వారివలననుండి వెల్లగొడుగు, శంఖము, పంచమహాశబ్దములు, పాలీకేతనము, ప్రతిహారము(?), వరాహలాంఛనము, కుంతము, సింహాసనము, మకర తోరణము, కనకదండము, గంగ యమున మొదలయిన స్వకులక్రమాగతములగు సామ్రాజ్యచిహ్నములను బడసి, కడంబ గంగాది భూపతులను జయించి సేతు నర్మదామధ్యస్థమైన సార్ధసప్తలక్షదక్షిణాపథమును పరిపాలించెను.

ఆ విష్ణువర్ధనభూవరునికి విజయాదిత్యుడును, అతనికి పులకేశియు, అతనికి కీర్తివర్మయు జనించిరి. అతని కొడుకు కుబ్జవిష్ణువర్ధనుడు పదునెనిమిదేండ్లు పాలించెను. అతనితనయుడు జయసింహుడు ముప్పదిమూడేండ్లు ఏలెను. అటుతరువాత, కులోత్తుంగచోళదేవుడు. అతని యాజ్ఞను పురస్కరించుకొని వేంగీదేశమును బరిపాలించుటకు నియుక్తుడయినవానిసంతతిక్రమ మిది:

యదుకులమునందు హైహయుడు పుట్టెను. అతనికి అడ్డులేనిదోర్గర్వవిలాసముగల కృతవీర్యుడు జనించెను. అతనికి అంధకారమును తొలగించివేయు సూర్యునివలె వేయికరములతో కార్తవీర్యు డుదయించెను. ఈతనివంశమున అమేయశౌర్యముగలవారును, గుణాన్వితులును, నిర్మలధర్మవర్తులును, సామ్రాజ్య లక్ష్మీ పరివర్ధితులును అయిన కొందరు రాజులు గతించిన వెనుక ఆ రాజవంశమున ధర్మధనులైనవారిలో అగ్రేసరుడును, రణరంగమున వీరలక్ష్మినిపొందినవాడును అయిన భూపాగ్రణి రాజపజేందు జన్మించెను. ఈతనికి శిక్షింపబడిన శత్రుమండలము గల ముమ్మడిభీముడును, యశో

రాయయినని చోడిమహీపతియు గలిగిరి. ప్రథితగుణ శిధియు, దానధర్మాభిరాముడును అయిన ఈ రాజేంద్ర చోడనికి(చోడిమహీపతికి) మైలారదేవియందు బేతరాజు, దేవదేవుడు, పురాంతభూపతి, వెన్నమహీపతి, మల్లిదేవుడు అనువారలు జనించిరి. వీరిలో పుణ్యమూర్తియు స్థిరరాజ్యలక్ష్మీ విభవుడును, భూపాల కులావతంస మును అయిన బేతరాజు రాజేంద్రచోడభూనాథుని అగ్రతనయుడు. అతనిభార్య గంగాదేవి. బేతరాజ గంగాదేవులకు శివపార్వతులకు కుమారస్వామివలె, శ్రుతిస్మృతులకు ధర్మమువలె పండిత పారిజాతమయిన మన్మచోడి నృపాలుడు పుట్టెను. ఇతనిపత్ని చోడమహాదేవి విశ్వమాతయని ప్రసిద్ధికెక్కినది. ఈదంపతు లిరువురికి రామలక్ష్మణులవలె బేతమహీపాల, మల్లభూపతులు జన్మించిరి ; వీరియనుజన్ముడు చోడిభూవల్లభుడు గంగమాంబాతనూభవుడు. మన్మచోడిరాజుకుమారులకు మన్మబేతరాజ మన్మమల్లిదేవులను నామాంతరములు కలవు. మన్మబేతరాజు సోదరుడయిన మల్లభూభర్తకు విష్ణుమూర్తికి లక్ష్మీదేవివలెను, చంద్రునికి రోహిణివలెను ఆకాదేవి (అక్కాదేవి) పత్నియైనది.

మన శాసనమునందు చెప్పబడినప్రకారము కోన హైహయుల వంశవృక్ష మిట్లు.




సహస్రబాహుప్రతాపవీర్య సంపన్నుడును, మహామండలేశ్వరుడును, ఆత్రేయగోత్ర పవిత్రుడును అగుకోన మన్మమల్లనరపతి తనతండ్రి మోక్షావాప్తి నిమిత్తము వియత్ (౦), అబ్ధి (౪), రుద్ర (౧౧) సంఖ్యలచేత తెలియనగు - అనగా ౧౧౪౦ - శకవత్సరమున, చంద్రగ్రహణపుణ్యకాలమునందు పిత్రార్జితమయిన నిజవృత్తియగు గుద్దేశవిషయమునందలి పల్లమకుర్తి గ్రామమునుండి విడదీసి కందికుప్పగ్రామమును సర్వకర పరిహారముగా దేవభోగముచేసి సమ(?)విద్యాస్థానని వాసియు, గంగాసాగరసంగ మాధిపతియు నగుచోడేశ్వర శ్రీమహాదేవునికి ఆచంద్రార్కముగ సాగునట్లు దానము చేసెను. ఈ విషయమును దెలుపుటకే ఈ శాసనము పుట్టినది.

ఈ సందర్భముననే ఆమల్లమహీవరుడు భైరవునికి అయిదు పుట్లభూమిని (పంచఖండుకభూమి) ఇచ్చెను; ఆచోడేశ్వరుని స్థానాధిపతులయిన ఆదిశైవులు కాశ్యప గోత్రులగు భైరవ, విద్దన, శంకరులకును, కౌశికగోత్రుడగు వడుగనకును పూజానిమిత్తము ముప్పదిపుట్లభూమి (త్రింశత్ఖండుకభూమి)కూడ ఇచ్చెను.

దానమిచ్చిన గ్రామము కందికుప్పయొక్క సీమావధు లివి :

పూర్వున — దండివంకకాలి
దక్షిణమున — దండివంకకాలి
పడుమట — వంకని కుళితికాలి (వంకనికుర్రు కాలువ)
వాయవ్యమున — కొప్పనిమొట్టు ఏటి అద్దరి
ఉత్తరమున — మడచేను
ఈశాన్యమున — చక్కని ఏటి అద్దరి

కోనమండలమును పదునొకండవ, పండ్రెండవ శతాబ్దులయందు పాలించినవారు హైహయవంశజులు. కోనమండలమన్నది ఇప్పటి తూర్పుగోదావరిజిల్లా యందలి అమలాపురము తాలూకా. ఇప్పటికిని ఆ ప్రాంతమునకు కోనసీమయని పేరు. రాజరాజ

నందంపూడి శాసనమున పేర్కొనబడిన రెండేరుల నడిమివిషయము అమలాపురముతాలూకాయే అని శ్రీజయంతి రామయ్యపంతులుగారు ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో ఇట్లు వ్రాసియున్నారు:

"రెండేఱులనడిమిదేశ మనఁగా గోదావరిజిల్లాలో గౌతమీ వైనతేయముల నడుమనున్న అమలాపురము తాలూకాయనియు, నందంపూడియనఁగా నాతాలూకాలోని నందంపూడియనియు నూహింపదగియున్నది."

దీనినిబట్టి చూడగా కోనమండలము గౌతమీ వైనతేయముల నడిమిదేశమని నిశ్చయింపవచ్చును.

ఈకోనమండలమును పరిపాలించిన హైహయుల శిలాశాసనములు ఇంతవరకు చాల బయలుపడినవి. ఇదివరలో నుడివినట్లు ఇదియొక్కటే ఇంతవరకు గానవచ్చిన కోనహైహయుల తామ్రశాసనము. కోన హైహయుల శిలాశాసనము లన్నిటిలో కోనమన్మసత్య, మల్లిదేవుల (శకవర్షము ౧౧౨౭ నాటి) పిఠాపురము శాసనమే చాలదీర్ఘమైనది. ఇందు మనశాసనమునందు వలెనే మొదట చాళుక్యవంశాభి వర్ణనమును, పిదప హైహయ వంశవర్ణనమును గలవు. చాళుక్యుల పౌరాణిక సంతతిక్రమము పిఠాపురము శాసనమున చాల సంగ్రహముగ నున్నది. అందు వదలివేసిన పెక్కుతరములు మనశాసనమున తెలుపబడినవి. పిఠాపురము శాసనముప్రకారము కోనహైహయులలో మొదటివాడు ముమ్మడిభీముడు. ఇతనికొడుకు రాజపరేండు. ఇతడు మనశాసనమునందలి హైహయవంశవృక్షమున మొదటిప్రభువు. పిఠాపురముశాసనము ఇతనికి లక్ష్మి, తొండాంబిక అను ఇరువురుభార్య లుండిరని చెప్పి, ఆ యిరువురివలన గలిగినసంతతిక్రమమును అభివర్ణించును. ఆ యిరువురిలో లక్ష్మికి ముమ్మడిభీమ, రాజేంద్రచోడులును, తొండాంబికకు సత్యమహీపతియను సత్యాశ్రయుడును జనించిరి. మనశాసనమున లక్ష్మికి జనించిన వారి సంతతిక్రమముమాత్రమే అభివర్ణితమయినది. పిఠాపురముశాసనము రాజేంద్రచోడునికి మైలారదేవివలన గలిగిన అయిదుగురుకుమారులలో జేత, మల్లిదేవులను మాత్రమే పేర్కొనును; మనశాసన మైదుగురు పేర్లను దెలుపును. పిఠాపురముశాసనము జేతరాజు కొడుకయిన మన్మచోడభూపతితో ఆగిపోవును; మన శాసన మట్లుగాక మన్మచోడభూపతికుమారులను (జేత, మల్లి, చోడిమహీపతులను) గూడ దెలిపి, పిఠాపురము శాసనమువలన మన కిదివరకు తెలిసినసంతతిక్రమమునకు ఇంకొకతరమును కలుపును. పిఠాపురముశాసనమునకును, మనశాసనమునకును గలవిభేదము లివియే. పిఠాపురముశాసనమువలన కంటె అధికముగ మనశాసనము వలన దెలియవచ్చు చరిత్రవిశేషము లేవియు లేవు.

శాసనదాత మన్మచోడిమహీపతికి చోడమహాదేవివలన గలిగిన యిరువురు తనయులలో రెండవవాడగు మన్మమల్లిదేవనృపతి. ఇతడు తనతండ్రిమోక్షావాప్తికొరకు గావించినదాన మగుటచేత ఈ శాసనకాలము శకము ౧౧౪౧, అనగా క్రీ.శ. ౧౨౧౯ నాటికి మన్మచోడిమహీపతి లోకాంతరగతు డయినట్లు నిశ్చయమగుచున్నది. మనశాసనమునకు సంబంధించిన విషయములు మాత్రమే ఇట తెలుపబడినవి. కోనహైహయుల చరిత్రమును గురించి ఇంకొకతడవ వ్రాసెదను.

దానమిచ్చినది చోడేశ్వర శ్రీమహాదేవునికి. చోడేశ్వర మహాదేవుడు గంగాసాగర సంగమాధిపతియని తెలుపుటవలన ఈ యాలయము గంగాసాగర సంగమస్థలమునకు సమీపమున నుండిన దూహించవచ్చును. ఇచట గంగయనునది గోదావరీనది పాయలలో నొకటియైన గౌతమీశాఖ. ఇది కందికుప్పకు చేరువనుండియే పోయి సముద్రమున గలియుచున్నది. మన్మమల్లిదేవుని తండ్రియగు మన్మచోడి మహీపతియో, అతనిపూర్వుడయిన చోడి మహీపతియో ఈశివలింగప్రతిష్ఠ చేసియుండురు. దానంజేసియే ఆదేవునికి చోడేశ్వర శ్రీమహాదేవుడనుపేరు కలిగినది. ఈచోడేశ్వర దేవాలయము విద్యాస్థానము. ఈవిధముగ పూర్వము ప్రతిదేవాలయమును విద్యాస్థానముగ నుండెడిది. నమవిద్యాస్థాన మననేమో బోధపడుట లేదు.

దానమిచ్చిన గ్రామము కందికుప్ప అమలాపురము తాలూకాలో పల్లముకుర్రుకి సమీపమున నున్నది. ఈ గ్రామము నేర్పాటుచేసినవాడు మన్మమల్లి దేవభూపతి. ఈ శాసనము ననుసరించి, కందికుప్పగ్రామ మేర్పాటయి యిప్పటికి ౭౨౦ సంవత్సరము లయినట్లు తెలియుచున్నది. కందికుప్పగ్రామమున నేడు చోడేశ్వరాలయము లేనట్లు తెలియుచున్నది. ప్రాయికముగ అది గౌతమీగర్భమున పడిపోయియుండునేమో. కందికుప్ప గ్రామము సరిహద్దులుగ దెలుపబడినవానిలో వంకని కుర్రు ఒకటి. ఈగ్రామ మిపుడు కానరాదు.

కడపజిల్లా, జమ్మలమడుగు తాలూకాయందు కుందేటియొడ్డున నున్న పెద్దముడియమే చాళుక్యవిష్ణువర్ధనుని జన్మస్థలమని చెప్పబడిన 'ముడివీము 'గ గుర్తింపబడినది.

ఈశాసనమున దెలిపినదానము దేవునికిచేసినది. అందువల్లనే కందికుప్ప దేవభోగము, — దేవునికి చెల్లెడిఊరు — అయినది. చోడీశ్వర, చోడేశ్వరరూపములు రెండును శాసనమున వాడబడినవి.

ఈస్వామి స్థానాధిపతులు ఆదిశైవులు. శ. ౧౧౪౦ నాటికి అమలాపురముతాలూకాలో ఆదిశైవము విస్తరించియుండెననుటకు ఈ శాసనమే ప్రమాణము.

వామము, దక్షిణము, మిశ్రము, సిద్ధాంతముఅని శైవము నాలుగువిధములుగ చెప్పబడినది. వీనిలో సిద్ధాంతశైవము వేదసమ్మతమయినది.

వేదసిద్ధాంతయో రైక్య
మేకార్థప్రతిపాదనాత్,
ప్రామాణ్యం సదృశం జ్ఞేయం
పండితై రేతయో స్సదా

అని శైవతంత్రము. ఈ సిద్ధాంతశైవము మూడువిధములనియు, వీనిలో ఆదిశైవ మొకటియనియు శైవసిద్ధాంతశిఖామణియందు ఇట్లు తెలుపబడినది :

సిద్ధాంతభేదం కథితం త్రివిధం వ్రతతత్పరే,
ఆదిశైవో మహాశైవో వైదికస్స్యాంతశైవకః
ఏవ మాదిత్రిభేదాని శైవే ప్రోక్తాని పార్వతి!

శ్రీ చోడేశ్వరమహాదేవుని స్థానాధిపతులయిన ఆదిశైవులు కాశ్యపసగోత్రులును, కౌశికసగోత్రులును పేర్కొనబడినారు. వీరు బ్రాహ్మణులని యెంచవచ్చును. దీనిననుసరించి శకము ౧౧౪౦, అనగా క్రీ. శ. ౧౨౧౮ నాటికే బ్రాహ్మణులలో వేదసమ్మతమైనశైవము నవలంబించిన శైవు లుండిరని తేటతెల్లమగుచున్నది.

మల్లికార్జునపండితుడు
"భక్తిమీఁద వలపు బ్రాహ్మణంబుతోఁ బొత్తు
పాయఁజాల నేను బసవలింగ!"
అనిచెప్పినట్లు ప్రసిద్ధమేకదా! మల్లికార్జున పండితాదులు ప్రాయికముగ వేదసమ్మతమయిన సిద్ధాంతశైవము నవలంబించినవారై యుందురేమో.

కందికుప్పగ్రామమున ఇప్పటికిని కొన్నిశైవ బ్రాహ్మణ కుటుంబములు కలవని తెలియుచున్నది. ఈ కుటుంబములవారిలో కాశ్యప, కౌశిక సగోత్రములవారు కలరేమో తెలియరాదు.

మన్మమల్లమహీపతి కందికుప్పగ్రామమును దానముచేసినది శకవర్షము ౧౧౪౦ కి సరియైన క్రీ. శ. ౧౨౧౮ సంవత్సరమునందలి చంద్రగ్రహణ పుణ్యకాలము నిమిత్తమున. క్రీ. శ. ౧౨౧౮ లో ఆషాఢపూర్ణిమనాడును, పుష్యపూర్ణిమనాడును చంద్రగ్రహణములు కలవు. శాసనమున మాసము పేర్కొనబడకపోవుట చేత ఈరెంటిలో ఇది ఏగ్రహణమునిమిత్తమున నిచ్చిన దానమో నిర్వచింప వీలులేదు.

కంటకుప్ప గుద్దేశ విషయమున నున్నట్లు తెలుపబడినది. ఇదివరకు శాసనములవలన గుద్దవాది విషయము లేక గుద్దవాదినాడు తెలియవచ్చినదికాని గుద్దేశ విషయము తెలియరాలేదు. ఇప్పటి రామచంద్రపురము, దాక్షారామములు, పూర్వపుగుద్దవాది విషయములోనివి. ఒకవిధముగ ఇప్పటి రామచంద్రపురముతాలూకా పూర్వపుగుద్దవాదివిషయ మనవచ్చును. గుద్దేశ, గుద్దవాదివిషయము లొక్కటేమైనయెడల ఇప్పటిరామచంద్రపురము, అమలాపురము తాలూకాలు గుద్దవాది నాటిలోని వనపలసియుండును; కాని ఈ విషయ మింకను విచారణీయము.

# మూ ల ము

## మొదటిరేకు : రెండవ పెడ



౧. ఓం [।*] స్వస్తి శ్రీ భూమిభర్త్తుః క్షీరవారాశిశాయినః [।*] ధాతాఽవిదిత వేదాత్మా నా

౨. భీపద్మా దభూ త్ప్రభుః। [।*౧] తస్మా త్సంజాతవా నత్రిః ఖ్యాతకీర్త్తిరుదారధీః। ము

3. నీనాం ప్రథమో నిత్య స్సత్యధర్మ్మపరాయణః [॥*౨] జేతుం హేతుః తత సోమః సర్వ్వభూత

౪. హితేరతః। కామస్య త్రిపురారాతి ముఖ్యశేషజనానభూత్ [॥*3] సన్మార్గ్గకంజాకరరా

౫. జహంసః శంభోర్జటామండలమండనశ్రీ [ః*।] [సుధామరీచి] స్సచరాచరాణా

౬. ం శ్రింగార[2]దీక్షాగురు రుల్లలాస [॥*౪] తతోఽజని బుధస్త[స్య [1]స్తస్యాజాతః పురురవాః[3] [।*] త

౭. [స్మా] త్సంజాతవా నాయు రాయుషో నహుషః తతః।[।*౫] తత[ః] యయాతిః [।*] తస్మా త్పూ

౮. [రు*]ః [।*] తస్మా జ్జనమేజయః [।*] తస్మా త్ప్రాచీశః [।*] తస్మా త్సైన్యయాతిః [।*] తస్మా ద్ధయపతి

౯. [ః] [।*] [త]స్మా త్సార్వ్వభౌమ[।*]స్తస్మా జ్జయసేన[।*]స్తతో మహాభౌమ[।*]స్తస్మా దైశానః[।*]స్తస్మా[4]

---

1. నాదగ్గరనున్న రేకుల ననుసరించి.
2. 'శృంగార°' అని చదువవలెను.
3. 'పురూరవాః' అని.
4. 'తస్మాత్' అని.

గండవరేకు : మొదటిపెడ

10\.



15\.

18\.

౧౦. దక్రోధన [।*] స్తస్మా ద్దేవకి [।*] స్తస్మా దృచుక[5] [।*] స్తస్మా దృక్షుకః [।*] సరస్వతీసదినాథో

౧౧. నామ్నా మతివరస్తుతః[6] [।*] ఇష్టసత్రత్రయ స్తస్మా దజనిష్ట విశిష్టధీః [॥౬*] త

౧౨. తః కాత్యాయన [।*] స్తస్మా నిల[7] [।*] స్తతో దుష్యంత[8] [।*] స్తతః [।*] [అశ్వ*]మేధశతై రిష్ట్వా భరతో

౧౩. భాస్కరద్యుతిః [।*] ఆవేలాంతం పయోరాశేః పా[లయామాస] భూతలం [॥౭*] తస్మా

౧౪. ద్భూమన్యు[9] [।*] స్తస్మా త్సుహోత్ర [।*] స్తతో హస్తీ [।*] తతో విరోచన [।*] స్తస్మా దజమీఢా

౧౫. ఢ [।*] స్తస్మా త్సంవరణ[10] [।*] స్తస్య తపత్యాశ్చ సుధన్వా [।*] తస్మా త్పరీక్షిత్ [।*] తస్మా ద్భీమసేన [।*] స్త

౧౬. స్మా త్ప్రదీపన [।*] స్తస్మా చ్ఛంతను [।*] స్తస్మా ద్విచిత్రవీర్యః [।*] తతః పాండునృపః స్తస్మా[11]

౧౭. త్సర్వభూతహితేరతాః [।*] యుధిష్ఠిరాదయః పుత్రాం[12] పంచరత్నప్రభోపమాః [॥౮*] స్వస

౧౮. ంశవారాశి సుధాకరాణాం [।*] పాండోః సుతానాం విజయాబభాసే [।*] జయాంగనాలి

5\. 'దృభుక' అని.

6\. 'నామ్నా మతివర' అని.

7\. 'స్తస్మాన్నీల' అని.

8\. 'దుష్యంత' అని.

9\. 'ద్భూమన్యు' అని.

10\. 'త్సంవరణ' అని.

11\. 'తస్మా' అని.

12\. 'పుత్రాః' అని.

రెండవ రేకు : రెండవ పక్క

19.



23.

27.

౧౯. ంగ్గిత పా[హుదంష్ట్రః[।*] కల్పద్రుమాణామివ] పారిజాతః[॥౯] కుక్షౌ యస్య ధరాధరేంద్రనిచ

౨౦. యైః ధాత్రీసరిత్సాగరైః[।*] కల్పాంతే కరిభిర్దిశాంచ[13] ఫణిభి ర్లోకా వసంత్రిప్రభో

౨౧. ః[।*] సోయం యస్య రథస్య దైత్యవిపినప్రోద్భూతదావానల[।*] శ్రీకంఠాంకుచకుచ్యు-

౨౨. మాంకితతనుర్య్యంత్రా హరిస్సోదరాత్[॥౧౦*] తతో భిమన్యు[।*]స్తతః పరీక్షిత్[।*]తతో జ

౨౩. నమేజయ[।*]స్తతః క్షేమక[।*]స్తతో నరవాహన[।*] తత శ్శతానీ*]క[।*]స్తస్మా దుద

౨౪. యనః[।*] తత్ప్రభృతిష్వనవచ్ఛిన్నసంత్తా[నేష్వయో]. [ధ్యాసింహాసనాసీనే ష్వే*]కునప

౨౫. ష్టి[14]చక్రవర్త్తిషు గతేషు[।*] తద్వంశ్యో విజయాదిత్యో [నామా రాజా వి][జిగీష*][యా] ద

౨౬. క్షిణాపథం గత్వా త్రిలోచనపల్లవ మధిక్షిప్య కాలవశాల్లోకాంతర మగమ[త్][।*]

౨౭. తస్మిన్నంసంకుల్తే[15] తస్యమహాదేవీ గురుగర్భభారాలసాంతఃపురాధికృత[కతి*]

---

13. 'కరిభిర్ది శాంచ' అని.

14. 'ష్ట్యేకోనషష్టి' అని.

15. 'తస్మిన్నంకుచే' అని.

మూడవరేకు : మొదటిపెడ . . .

28

32.



36.

౨౮. పయయువతీ జనైస్సార్ధం వృద్ధామాత్యపురోహితేన చ నీయ్యమానా[16]కథ

౨౯. మ్మండివీము[17]నామాగ్రహార ముపాగమ్య తద్వాస్తవ్యేన విష్ణుభట్ట సోమయాజి

3౦. నా దుహిత నిర్విశేష[18]మభిరక్షితా కతిచిదినాని[19]స్థిత్వా నందనం విష్ణువర్ధన ము

3౧. సూత[।*] తస్య చ కుమారస్య స్వకుత్రగోత్రోచిత [జా]తకర్మాణి కారయి

3౨. త్వా త మ[వ*]ర్ధయత్ । స చ మాతుర్నివేదిత[20]వృత్తాంతస్సన్ ప్రణమ్య తాం త

33. పసే నిర్గత్య చలుక్యగిరౌ నందాభగవతీం గౌరీ మారాధ్య కుమార నారయ

3౪. ణ[21]మాతృగణా న్సంతర్ప్య శ్వేతాతపత్రైక శంఖ పంచమహాశబ్దపాలీకేతన ప్ర[తి]

3౫. హార[22]వరాహలాంఛన కుంతసింహాసన మకరతోరణ కనకదండ గంగాయ

3౬. మునాదీని స్వకులక్రమాగతాని నికిపాసిన[23]సామ్రాజ్యచిహ్నాని సమాదా

---

16. 'నీయమానా' అని.
17. 'కథంచిన్ముడివేము' అని.
18. 'దుహితృనిర్విశేష' అని.
19. 'కతిచిద్దినాని' అని.
20. 'మాతుర్నివేదిత' అని.
21. 'నారాయణ' అని.
22. చాళుక్యశాసనములందు 'ప్రతిహారక' మనుటగా 'ప్రతి ఢక్కా' అనియుకలదు.
23. 'నిక్షేపానీవ' అని.

మూడవ రేకు : రెండవ పెక్క

37.

41.
45.

౩౭. య కదంబ గంగాదిభూమిపాలా న్నిర్జిత్య సేతునర్మ్మదామధ్యం సార్ద్ధసప్తల

౩౮. క్షం దక్షిణాపథం పాలయామాస[।*] తస్మా [ద్విష్ణువర్ద్ధ]నభూపా ద్విజయాదిత్యః[।*]

౩౯. తత్సుతః పులకేశీ[।*] తత్పుత్రః కీర్త్తివర్మ్మా[।*] తస్యతనయః కుబ్జవిష్ణువర్ద్ధనో

౪౦. ష్టాదశవర్షాణి వేంగీదేశమపాలయత్। తదాత్మజ[ః*] జయసింహః [త్ర]య

౪౧. స్త్రింశద్వర్షాః। తతః కులోత్తుంగచోడదేవః। అపిచ నిజాజ్ఞాపురస్స

౪౨. [రం*] వేంగీభూపరిపాలనే య[ః*] నియుక్తవాన్ తదీయ్యవంశ్యా న్వన్వయిను[24]

౪౩. ముపచక్రమే[।*] కులేయదూనాం సమభూన్వణాం[25]చూడామణి హై[హ*]హయ

౪౪. నామధేయః[।*] తతః కృతజ్ఞః కృతవీర్య్య ఆసీ దవార్య్యదోర్గ్గర్వ[26]విలాస

౪౫. శాలీ[॥౧౧*]తతోజని యథాభాను ర్దీప్తవిశ్వ స్తమోహరః[।*] స్ఫురత్కరసహస్రే

24. 'తదీయ వంశ్యా న్వర్ణయిను' అని.

25. 'సమభూ న్నృపాణాం' అని.

26. 'దవార్య్యదోర్గర్వ' అని.

నాలుగవ రేకు: మొదటి పెడ

46. 50. 51.



౪౬. ణ కార్త్తవీర్య్య స్తుతోజనైః [॥*౧౨] తస్యాన్వయే నిర్మ్మలధర్మ్మవర్త్తిష్వప్రమేయశౌర్య్యే
౪౭. షు గుణాన్వితేషు । కేషుక్షితేశేషు[27] గతేషు సత్సు సామ్రాజ్యలక్ష్మీపరివర్ద్ధితేషు॥[।౧౩*] త
౪౮. తోభవ ద్విశ్వమహీపతీనాం స్తుత్యో గుణైర్ద్ధర్మ్మ ధనాగ్రయాయీ[।*] భూపాగ్రణీ రాజప తే
౪౯. ండునామా రణోల్లసత్సంభృతవీరలక్ష్మీః[28] [౧౪*] తస్య ముమ్మడిభీమశ్చ దండితారాతిమండలః [।*] అజ
౫౦. నిష్ట యశోరాశిః కోనచోడిమహీపతిః [॥౧౫*] సోయంరాజేంద్రచోడః పథిత[29]గుణనిధిః దా
౫౧. నధర్మ్మాభిరామః[।*] లేభే మైలారదేవ్యాం రవికులతిలకం ఛేతధాత్రీశలేశం [।*] సద్వంద్యం దేవ
౫౨. దేవం త్రిజగదభినుతం శ్రీపురాంతకక్షితీశం [।*] సత్కీర్త్తి[ం*]పెన్నభూపం సురపతివిభవం మల్లిదేవ
౫౩. క్షితీశం[॥౧౬*] తేషాం వరః స్సన్నుతపుణ్యమూర్త్తిః[30] ఛేత క్షితీశః[*]స్థిరరాజ్యలక్ష్మీః[।*] ప్రఖ్యాత భూపాల
౫౪. కులావతంసో రాజేంద్రచోడక్షితిపాగ్రసూనుః [॥౧౭*] తత్పత్నీ త్రిజగత్ఖ్యాతా గంగ్గాదేవీ వి

---

27. 'క్షితీశేషు' అని.
28. 'లక్ష్మీః' అని.
29. 'ప్రథిత' అని.
30. 'సన్నుత పుణ్యమూర్తిః' అని.

నాలుగవ రేకు : రెండవ పెడ

౫౫.



౫౫. రాజతే[।*] లావణ్యలహరీలోలా దయాంభఃపరిపూరితా[॥౧౮*]తాభ్యాం శివాభ్యామివ కార్త్తి

౫౬. కేయః శ్రుతిస్మ్రితిభ్యామివ[31]ధర్మ్మ ఇద్ధః[।*]శ్రీమన్మచోడః క్షితిపాగ్రగణ్యః సంజాతవా

౫౭. న్ పండితపారిజాతః॥[।౧౯*] తస్యచోడిమహీశస్య విక్రమాక్రాంతభూభుజః[।*] పత్నీచోడమ

౫౮. హాదేవీ విశ్వమాతేతివిశ్రుతా॥[।౨౦*] భ్యాం బేతమహీపాలమల్లభూపాలకౌస్థిరౌ[।*] స

౫౯. ంజాతౌ త్రిజగత్ఖ్యాతౌ[32]యథాశ్రీరామలక్ష్మణౌ[॥౨౧*][అనుజన్మ[33]తయోధీమా నోచ్చడి

౬౦. భూవల్లభో భువి[।*]భాతిభాసితకీర్త్తిశ్శ్రో గంగ్గమాంబాతనూభవః॥[।౨౨*]శ్రీమ

౬౧. న్మబేతక్షితిపానుజన్మా ప్రఖ్యాతవిద్వజ్జనపారిజాతః[।*]దేవద్విజానుగ్రహలబ్ధసం

౬౨. పదీర్ఘ్ఘాయు[34]రారోగ్యబలాభివృద్ధిః[।౨౩*]పత్నీమల్లమహీశస్య సుధాంశోరివ రోహి

౬౩. ణీ[।*]ఆకాదేవీ ముకుందస్య కమలైవ విరాజతే[॥౨౪*]యెతోర్క్కపాగ్ని[35]కషాయనేత్రరుచయ

౬౪. ః ప్రాతఃవివస్వత్కరాః[36]తేనైరినృపాలకు(?)లవ బృహన్మహార[37]నిరోన్న తేః[।*] కః[।*] కపూర్వరమ

---

31. 'శ్రుతి స్మృతిభ్యామివ' అని.
32. 'సంజాతౌ త్రిజగత్ఖ్యాతౌ' అని.
33. 'అనుజన్మా' అని.
34. 'సంపద్దీర్ఘాయు' అని.
35. 'యతోర్క్కపాగ్ని' అని.
36. 'వివస్వత్కరాః' అని.
37. 'తేనైరినృపాలకు(?)లవ' అన్నది అర్థమగుటలేదు; ఛందస్సును తప్పినది. 'జాతే నైరినృపాలకావలి బృహన్మహార' అని యుండవలెనేమో.

అయిదవ రేకు : మొదటి పెడ

65.

70

74.



౬౫. రాలహా_క్తిక సద్ధకన్తీర్తి లక్ష్మీపతిః[38] [।*]మల్లక్ష్మాపతి మన్వయాబ్ధిశశినం జేతుం సమర్థో నృపః[॥౨౫*]

౬౬. సోయం స్వస్తి సహస్రబాహుప్రతాపవీర్య్యగుణసంపన్న[ః*] శ్రీమన్మహామండలేశ్వరః ఆత్రేయ గో

౬౭. త్ర పవిత్రః కోనమన్మ మల్లన రేశ్వరః గుద్దేశవిషయవాసినో రాష్ట్రకుటపముఖా న్కుటి

౬౮. ంబిన [39]స్సమాహూయేత్థమాజ్ఞాపయతి [।*] విదితమస్తు [।*] అస్మత్పిత్రార్జిత నిజవృత్తి[40]గు

౬౯. ద్దేశవిషయే పల్లమకుక్షిగ్రామాదాదాయ కంద్ది [కుప్ప]గ్రామం సర్వకరపరిహారం దేవభోగ

౭౦. ం కృత్వా[41]సమ(?)విద్యాస్థాన నివాసినే చోడేశ్వర శ్రీమహాదేవాయ సోమగ్రహణనిమిత్తే ఆ

౭౧. చంద్రార్గ్గం[42]దత్తమితి । తస్మిన్నేవ పంచఖండుకభూమి ద[ు*]త్తో భైరవాయ । తస్యచోడేశ్వర స్యాదిశై

౭౨. వానాం స్థానాధిపతీనాం నామగోత్రాణివృత్తి పరిమాణంతు లిఖ్యంతే[।*]కాశ్యపగోత్రిణః భై

౭౩. రవ విద్దనశంకరాఖ్యాః[।*]కౌశికగోత్రం[43]వడుగనాఖ్యః[।*] తేషాం పూజార్థం ద్వాత్రింశత్ఖండుక[44]భూ

౭౪. మి ద[ు*]త్తః [।*] అస్య కందికుప్పగ్రామస్యసీమానః[।*]పూర్వతః దండివంక్గ [45]కాలి[।*]దక్షిణతః దం

---

38. 'సద్భక్సత్కీర్తి లక్ష్మీపతిస్' అని.
39. 'విషయనివాసినో రాష్ట్రకూటప్రముఖాన్కుటుంబిన' అని.
40. 'వృత్తి' అని.
41. 'కృత్వా' అని.
42. 'చంద్రార్కం' అని.
43. 'కౌశికగోత్రజ' అని.
44. లేఖకుడు మొదట 'ద్వాదశఖండుక' అని వ్రాసి, దానిని పిదప 'ద్వాత్రింశత్ఖండుక'గా దిద్దెను. ఇట్లు దిద్దుటలో 'త్రిం'లోని సున్న క్రింద వ్రాసెను. త్రింశత్ఖండుక'లోని 'త' వర్ణమును 'ఖ' పైని చిన్నదిగ వ్రాసెను.
45. 'వంక' అని.

అయిదవ రేకు : రెండవ పెడ

75.

79.

84.



౭౫. డివంక్గ[46] కాలి[।*] పశ్చిమతః వంక్గని[47]కుంతితికాలి[।*]వాయవ్యతః కొప్పనిమొట్టుపేటిఅర్దరి[।*]ఉ

౭౬. త్తరతః మడతేవు[।*]ఈశాన్యతఃచక్కనిపేటిఅర్ధరి । స్వదత్తాం పరదత్తాం వా హరేద్భూమి న్న

౭౭. రాధమః[।*]స పచ్యతే మహాఘోరే నరకే కాలమక్షయః[48][।౨౬*]షష్టింవర్ష సహస్రాణి స్వర్గేతి

౭౮. [ష్ఠ]తి భూమిదః[।*]ఆచ్ఛేత్తాచానుమంత్తాచ[49]తాన్యేవ నరకే వసేత్ ।[।౨౭*]బహుభిర్వ్వసుధాదత్తా

౭౯. బహుభిశ్చానుపాలితా[।*]యస్యయస్యయదాభూమి స్తస్యతస్యతదాఫలం[।।౨౮*]మ

౮౦. ద్వంశజాః పరమహీపతివంశజావా [।*]పాపా దపేత మనసా భువి భావి[50]భూపాః[।*]యే పాల

౮౧. యంత్తి మమధర్మ్మ మిమంసమస్తం[।*]తేషా మ్మయా విరచితాంజలి రేషమూర్ధ్ని[।।౨౯*]శాకా

౮౨. బ్దే వియదబ్ధిరుద్రగణితే శ్రీకంద్దికుప్పత్యయం[51][।*]గ్రామ[o*]నామసమున్నతం గుణనిధి మల్లక్షు

౮౩. మావల్లభః [।*] ప్రాదాదారవితారక న్నిజపితు ని[ః*]శ్రేయసప్రాప్తయే [।*] గంగాసాగర సంగ్గమా

౮౪. ధిపతయే చోడేశ్వరాయాదరాత్ ।[।*౩౦*] శ్రీ శ్రీ [।*]

---

46. 'వంకొ' అని.
47. 'వంకని' అని.
48. 'మక్షయన్' అని.
49. 'ఆత్కేత్తాచానుమన్తాచ' అని.
50. లేఖకుడు 'భావి' అన్నది మొదట వ్రాయమరచి, పిదప
    పంక్తికి దిగువను వ్రాసెను.
51. 'కంధికుప్పేత్యయం' అని.

# ప్రపంచమందలి పుస్తకాగారములు

బందా వెంకటరత్నం

★

ప్రాచీనకాలమునుండియు పుస్తకాగారము లున్నట్లు ఇతిహాసములనుబట్టి తెల్లమగు చున్నది. క్రీస్తుకుపూర్వము ౩౫౦౦ సంవత్సరముల క్రిందట బాబిలోనియా అస్సీరియా దేశములందు ఇటుకలపైన పద్యములు మొదలగునవి చెక్కబడుచుండెను. ఇట్టివిధములగు కొన్ని ఇటుకలే అప్పటి కనువగు గ్రంథాలయములు నుండెను. జనసామాన్యమున కుపయోగించుట కనువగునట్లు అవి పెద్ద మృణ్మయ భాండములందుగాని, పేము, వెదురు మొదలగువానిచే నల్లబడిన పెద్ద బుట్టలందుగాని నిక్షేపింపబడుచుండెడివి. ఇట్టి గ్రంథాలయములు సాధారణముగా ఒకానొక దేవళమందు గాని, మఠమందుగాని పదిలపరుపబడుచుండెడివి. ఇవియే ప్రాచీనగ్రంథాలయములు. ఆ కాలమునందును పిమ్మటనుగూడ రాజులవద్ద వారి హుకుములు మొదలగువాని నకళ్లు రాళ్లమీద తామ్రపత్రములమీద వ్రాయబడుచుండి జాగ్రత్తపెట్టబడుచుండెను. క్రమముగ నితర విషయములగు శిలాలేఖలుకూడ సంగ్రహపరుపబడుచువచ్చెను. ఈవిధముగ ప్రభుత్వ పుస్తకాలయము లుదయించెను. క్రీస్తు ౧౩౦౦ సంవత్సరములకు పూర్వము ఈజిప్టురాజు రెమెసకీమ్సుకాలమున థీబ్సునగరమున అనేక గ్రంథములు గలిగిన పుస్తకాగారమున్న జాడలు తెలియవచ్చుచున్నవి. అలెగ్జాండ్రియాయందలి టాలెమీరాజుల పుస్తకాలయము చాల ప్రసిద్ధమైనది. దీనియందు వివిధవిషయవిభూషితములగు గ్రంథములు నానా దేశములకు చెందినవి లక్షలకొలదిగ నుండెను. జూలియస్ సీజరను రోముదేశపురాజు ఈజిప్టుపై దాడివెడలినసందర్భమున ఈగ్రంథాగారమందలి విశేషభాగము కాల్చివేయబడెను. కాగితములు తయారగుట కారంభమైనది మొదలు గ్రంథరచనమునకు ప్రోత్సాహము లభించెను. కాని ఒకటికి పదిప్రతులు సిద్ధముచేయవలెనన్న చాల కాలహరణ మగుటయేగాక విశేషధనవ్యయ మగుచుండెడిది. ఇందుచే నాకాలమున పుస్తకములు వ్రాయుటకంటె ప్రాచీనపుస్తకములను పదిలపరచుకొనుటయే పరమలక్ష్యమయ్యెను. మధ్యయుగమువరకును యూరోపీయగ్రంథాలయములందు, గ్రంథములను అలమారులలో బలమగుగొలుసులతో కట్టివేయువారు. పుస్తకములు దొంగిలింపబడునేమో యనుచింత ఎప్పటికప్పుడు జనులను పీడించుచునేయుండెను. పాఠకు లెల్లప్పుడును అలమార్లసమీపముననే నుండి గ్రంథపఠనము చేయవలసివచ్చుచుండెను. సామాన్యజనులకీ పుస్తకాలయములందు బొత్తిగ ప్రవేశము లేకుండెను. ధనవంతులుమాత్రము కొద్దిగనో గొప్పగనో లాభ మందుచుండిరి.

ముద్రణయంత్రావిష్కరణముచేతను, విద్యాప్రచారముచేతను పుస్తకాలయోద్దేశములందు మరల మార్పులు కలిగెను. ౧౯-వ శతాబ్దమందుత్పన్నమైన నూతనస్వాతంత్ర్యభావములు వీనిరూపును పూర్తిగ సంస్కరించెను. జనసామాన్యము లాభము నందుటకై సార్వజనిక పుస్తకాగారముల ప్రచార మెక్కుడయ్యెను. ప్రజలయందు ప్రచార మెక్కుడైనకొలదియు పుస్తకాగారసంబంధమగు విజ్ఞానముకూడ వృద్ధినొందసాగెను. ఏయేపుస్తకముల నెట్లు కొనవలెనో, వానిసూచికల నెట్లు సిద్ధపరుపవలెనో, వాని నేప్రకారముంచవలెనో, సామాన్యజనుల కందుబాటులోనుండునటుల ఎట్టివ్యవస్థ నేర్పాటుచేయవలెనో మొదలగు గ్రంథభాండాగార విజ్ఞానవిషయకములను గూర్చిన యనేకగ్రంథములు ప్రతిసంవత్సరము వెలువడుచున్నవి. పుస్తకాలయవ్యవస్థాశాస్త్ర మను పేర విశ్వవిద్యాలయములలోకూడ నిది ప్రవేశించినది. ప్రస్తుతకాలమందు పుస్తకాలయములే విద్యాప్రచారమునకు ముఖ్యసాధనములని గ్రహింపబడెను. ప్రసిద్ధ ఇంగ్లీషులేఖకుడగు "కార్లయిలు" పుస్తకాలయములే నిజమగు విశ్వవిద్యాలయములని నుడివెను. పుస్తకాగారము లున్న తావులందు, పరీక్షలలో నుత్తీర్ణులు కాకయే ప్రతిమనుష్యుడును జ్ఞానోపార్జన చేయ సమర్థుడగును. వాస్తవముగ పుస్తకాలయములే రాష్ట్రమునకు మస్తిష్కములు. అన్యదేశములందు పుస్తకాలయ ప్రచార మెట్లున్నదో వానివ్యవస్థ ఎట్లున్నదో ఆయా దేశములవారు పుస్తకాలయముల కెట్టి ప్రాధాన్యము నిచ్చుచున్నారో తెలిసికొనినగాని మనవాస్తవికస్థితి మనకు గోచరింపజాలదు. ప్రపంచమంతటిలోను ౧౭ వేల భాండాగారములు కలవు.

## అమెరికా

పుస్తకాలయముల విషయములో అమెరికా సంయుక్తరాష్ట్రములు లోకమున మేటి యని చెప్పదగు. ౧౮౭౬-వ సంవత్సరమున నిచ్చట మొదటి గ్రంథాలయసంఘ మేర్పడెను. ౧౮౫౦ లో ఇచ్చట ౬౪౪ భాండాగారములు మాత్రమే యుండెను. వీనిలో కొన్నిటియందు మాత్రమే సామాన్యజనులకు ప్రవేశము కలదు. ఈ సమయమున నిచ్చట ౬౫౦౦ గొప్పపుస్తకాగారములు కలవు. వీనిని సామాన్యజనులుకూడ ధారాళముగ నుపయోగించుకొనవచ్చును. లెక్కలవలన ౫౬ మనుష్యుల కొకటిచొప్పున పుస్తకాగారము లున్నట్లు విదితమగుచున్నది. ప్రతిసంవత్సరము ఈ గ్రంథాలయములకు ౯ కోట్ల రూపాయలు వ్యయపరుపబడుచున్నవి. ౨౫ కోట్ల పుస్తకములు పాఠకుల కివ్వబడుచున్నవి. ఆండ్రూసు, కార్నెగీ, రస్సెలు, రాక్ఫెల్లరు మొదలగు కోటీశ్వరులు వీనికి కోట్లకొలదిగ దాన మిచ్చిరి. నూరుపౌనులకు ఒకపెన్నీవంతున ఆదాయముమీద పన్ను విధించి దానిని గ్రంథాలయములకు వినియోగించు నిమిత్తము స్థానికసంస్థల కధికార మివ్వబడెను. సంయుక్తరాష్ట్రమందలి గ్రంథాలయములలో ముఖ్యమైనది వాషింగ్టను కాంగ్రెసు పుస్తకాలయము. దీనియందు నలుబది లక్షల ఉద్గ్రంథములు కలవు. దీనిభవన నిర్మాణమునకు రెండుకోట్ల రూప్యములకంటె నధికముగనే వ్యయమయ్యెను. దేశమందు ముద్రింపబడు గ్రంథము లన్నిటిని రెండేసి ప్రతులు

ఉచితముగ నీగ్రంథాలయమునకు పంపవలసినట్లు శాసింపబడెను; ప్రభుత్వమునుండి సాలునకు ౬౦ లక్షల రూప్యములుకూడ లభించుచుండును. ౧౯౩౩-వ సంవత్సరములో షేక్స్పియరు గ్రంథాలయమును స్థాపించునిమిత్తమొకానొక సజ్జనుడు ౩ కోట్ల ౫౦ లక్షల రూపాయలు దానమిచ్చినటుల మనము వార్తాపత్రికలలో చదివియేయున్నాము.

### గ్రేట్‌బ్రిటను

౧౬౦౮ న నార్విచ్చినగరమున మొట్టమొదటి సార్వజనికపుస్తకాలయము స్థాపింపబడెను. ౧౮౫౦ లో పుస్తకాలయశాసనము చేయబడెను. ౧౮౭౭ లో గ్రంథాలయ సంఘమొకటి స్థాపింపబడెను. ఈ సంఘ ప్రచారముచే, ఇష్టములేకపోయినను, ప్రభుత్వమునకు విధిలేక గ్రంథాలయములకు ధన ద్రవ్యము ఖర్చింపవలసివచ్చెను. ఇచ్చట ప్రతి సంవత్సరము ౩ కోట్లరూపాయలు పుస్తకాలయములకొరకు వ్యయపరుపబడుచున్నవి. పల్లెటూరిగ్రంథాలయములకు మనిషి ౧-కి ౦-౧౦-౦ వంతున ౧ కోటి ౫౦ లక్షల రూపాయలు ఖర్చుచేయబడుచున్నవి. రూపాయకు ౩ పైసలొప్పున పన్ను వసూలుచేయబడుచున్నది. అచ్చటి విశ్వవిద్యాలయములలో గ్రంథాలయవిజ్ఞానము విపులముగ బోధింపబడుచున్నది. ఒక్క లండనునగరముననే, ఒక్కొక్కదానియందు ౧౦ వేలగ్రంథములకు తక్కువగలేని ౧౫౦ గొప్పగ్రంథాగారములు గలవు.

వీనిలో బ్రిటిషుమ్యూజియముగ్రంథాలయమన్నిటికంటెను గొప్పది. దీనియందు ౩౪ లక్షలకంటె నధికముగ గ్రంథములు గలవు. వీనిలో ప్రాచ్యభాషాసంబంధములగు లక్షముద్రితగ్రంథములును, ౧౬ వేలు హస్తలిఖితగ్రంథములును గలవు. పుస్తకములజాబితా ౧౨౦౦ సంపుటములుగ నున్నది. బ్రిటిషుసంయుక్తరాష్ట్రమున ముద్రింపబడు ప్రతిపుస్తకమునను నొక్కొక్కప్రతి దానికి పంపునట్లు ఒకశాసనము చేయబడెను. ఇచ్చట దినమునకు నేబది యరువది నూతనగ్రంథములు వచ్చుచుండును.

దీని వ్యయమునకు ప్రభుత్వమువారు ౩౨ లక్షలరూప్యము లిచ్చుచున్నారు. లండను నగరమున అంధుల గ్రంథాగారమున ౧ లక్ష ౪౪ వేల పుస్తకములు గలవు. ఇంగ్లండులోని యనేకగ్రంథాలయములలో ప్రాచ్య లిఖితగ్రంథములు గలవు. లండనులోని ఇండియా ఆఫీసుగ్రంథాలయములో, సంస్కృత, పార్సీ, అరబ్బీగ్రంథములు ౩౫ వేలును, ఆక్స్‌ఫర్డులోని బాడ్లియన్ పుస్తకాలయమున ౧౨ వేల సంస్కృతగ్రంథములును గలవు. ఈ విధముగ ప్రాచ్యవిజ్ఞాన మంతయు యూరపుఖండమున జేరి పాశ్చాత్యులను వైజ్ఞానికులుగ జేసివైచినది.

### ఫ్రాన్సు

ఫ్రాన్సుదేశములో తరచుగ పెద్దనగరములన్నిటిలోను మ్యునిసిపలుగ్రంథాలయములు గలవు. పారిస్‌నగరమున "బిబ్లియోథెక్ నేషనలు" అనుపేరుగలిగిన గొప్పగ్రంథాలయము గలదు. దీనియందు ౪౦ లక్షలకుపైగా గ్రంథములు గలవు. పారిస్ గ్రంథాలయమందు ౧౨ వేల సంస్కృతలిఖితగ్రంథములు గలవు. ఈ దేశమునందు మొత్తముమీద ౧౧౧ గొప్ప సార్వజనికగ్రంథాలయములు గలవు. వానియందలి గ్రంథసంఖ్య సుమారు ౨ కోట్లు.

### జర్మనీ

ప్రతిసంవత్సరము జర్మనీదేశమందు ప్రకటింపబడనన్ని గ్రంథములు ప్రపంచమందే దేశమందును ప్రకటింపబడుటలేదు. ఇచ్చట పుస్తకములుకూడ చాలచౌకగ నమ్మబడును. ఈ కారణములచే పుస్తకాలయములసంఖ్యను బట్టి జర్మనీ ప్రపంచమునందటిలోను అగ్రస్థానము నాక్రమించినది. బర్లినునగరమందలి ప్రష్యారాజకీయగ్రంథాగారము చాల పెద్దది. దీనియందు ౩౦ లక్షలగ్రంథములు గలవు. ప్రతి సంవత్సరమును ౫౦ వేల నూతనగ్రంథము లీ గ్రంథాలయమునకు జేర్చబడుచున్నవి. ఈ గ్రంథాలయమునకు ౨౦ వేల పత్రికలు తెప్పింపబడుచుండును. గ్రంథాలయభవనము ౧౩ అంతస్తులు గలిగి ౨ లక్షల చదరపుటడుగుల వైశాల్యముగలిగిన ప్రదేశము నాక్రమించినది. గ్రంథములజాబితా వేయిసంపుటములు గలది. అక్షరక్రమానుసారము ౩ వేల సంపుటము లయ్యెను. ప్రతిసంవత్సరము ౯౦ సంపుటములు క్రొత్తగ చేర్చబడుచుండును. ఈ గ్రంథాలయమందు ౩౨౦ మంది నౌకరులు గలరు. వారిలో గ్రంథాలయ విజ్ఞానవేత్తలగు వారిసంఖ్య ౭౬. బర్లిను గ్రంథాలయములలో నలువదివేల సంస్కృత లిఖితగ్రంథములు గలవు. మునిసిపలు విశ్వవిద్యాలయ గ్రంథాలయములుగాక జర్మనీలో ౧౬౦ సార్వజనిక పుస్తకాగారములు గలవు. వానియందలి గ్రంథముల సంఖ్య సుమారు ౩ కోట్లు.

### ఇటలీ

౧౯౧౩ నుండి ఇటలీదేశమందు గ్రంథాలయము లున్నతినొందసాగెను. ఇప్పుడు ఫాసిస్టు ప్రభుత్వమువారు గ్రంథాలయములన్న ఎక్కువశ్రద్ధ తీసికొనుచున్నారు. గ్రంథాలయరక్షణకు ఒకడైరెక్టరు జనరలు అను ఉద్యోగి ప్రభుత్వముచే నియమింపబడెను. గ్రంథాలయ రక్షణకొరకు ఫ్లోరెన్సునగరమున నొకకళాశాలకూడ స్థాపింపబడెను. ఇచ్చట ౨౫౦౦ పుస్తకాలయములు గలవు. వీనిలో రోమునగరమందలి రాష్ట్రీయ పుస్తకాలయము ప్రధానమైనది. ౪ లక్షల ముద్రితగ్రంథములును, ౬౦ వేల లిఖితగ్రంథములును గలిగినపోప్పుగ్రంథాలయము యూరపుఖండమంతటిలోను మిక్కిలి ప్రాచీనమైనది.

### రష్యా

బోల్షివిక్కు పరిపాలన రష్యారూపమును పూర్తిగ మార్పుచేసెను. రష్యా యూరపుఖండ మంతటిలోను విద్యావిషయమున మిక్కిలి వెనుకబడి యుండెను. కాని ౧౦, ౧౨ సంవత్సరములనుండి రష్యా పూర్వస్థితి మార్పునొందెను. లెనిను మహాశయునకు, విద్యాప్రచారము లేనిచో దేశవాసులయందైకమత్య ముండదనియు, ఆర్థికస్థితి చక్కబడదనియు, రాజకీయనైతికోన్నతి యసంభవమనియు వాకొనెను.

ఆతని ప్రయత్నమువలననే ప్రప్రథమమున విద్యాప్రచారమునకు పునాదివేయబడి, ౧౦ వత్సరములలో కోటిమంది యువకులు విద్యార్థులుగ జేయబడిరి. ౧౯౩౮ లోపుగ అక్షిక్షితులనందరను శిక్షితులనుగా జేయవలెనని సోవియటుప్రభుత్వమువారు సంకల్పించిరి. ఈసమయమున నచ్చట ౧౫౦౦౦ గొప్ప స్థావర గ్రంథాలయములును, ౮ వేల గ్రామగ్రంథాలయములును, ౫౦ వేల సంచారగ్రంథాలయములును గలవు. వీనిలో గ్రామగ్రంథాలయములే విశేష ఉల్లేఖనీయములు. వీనిలో పల్లెటూరిజనుల నాకర్షించు మనోరంజకములగు గ్రంథములు సేకరింపబడినవి. పట్టణములందలి నాట్యశాలలలోను, సినిమాగృహములందును కూడ గ్రంథాలయములు గలవు. పుస్తకాలయముల కన్నివిధములగు నవకాశములు నివ్వబడెను. గ్రంథాలయములకు పంపబడుపుస్తకముల బిగీలకు తపాలచార్జి బహు స్వల్పముచేయబడెను. లెనినుగ్రేడునందలి రాష్ట్రీయగ్రంథాలయమందును, మాస్కోయందలి లెనిను గ్రంథాలయమందును వరుసగా ౪౦, ౩౦ లక్షల గ్రంథములు గలవు. రష్యాలో సాలునకు ౩౬ వేలకంటె నధికముగ గ్రంథములు ప్రకటింపబడును. ఈవిధముగ ప్రపంచమందలి ఏదేశమందును గ్రంథములు వెలువడుచుండుట లేదు.

## యూరపునందలి యితర దేశములు

హాలెండునందలి లేడెనువిశ్వవిద్యాలయస్థితము పుస్తకాలయము చాల ప్రాచీనమైనది. ఇది ౧౫౭౩ లో స్థాపింపబడెను. ఈకాలమున హాలెండులో పుస్తకాలయములు ౫౦౦ కంటె నధికముగ గలవు. బెల్జియములో ౨౧౦౦ పుస్తకాలయములును, ౩౦ లక్షల గ్రంథములును గలవు. డెన్మార్కులోని ౯౦౦ పుస్తకాలయములకు సర్కారు ౭ లక్షలరూప్యముల 'వార్షిక గ్రాంటు' నిచ్చుచున్నారు. అచ్చట మొత్తము సాలుకు ౧౯ లక్షలరూప్యములు గ్రంథాలయములకు వెచ్చింపబడుచున్నవి. పన్నులవలన ౧౨ లక్షల రూప్యములు లభించుచున్నవి. స్వీడనులో ... ఒకొక్క గొప్పగ్రంథాల

యము స్థాపించినారు. వానికి ౧౫ లక్షల రూపాయలు సర్కారు గ్రాంటు వచ్చుచున్నది. నూతన గ్రంథాలయ స్థాపనకు ప్రత్యేకముగ ౭౫౦౦ రూపాయలు వార్షికముగ నివ్వబడుచున్నవి. ఈకాలమున స్వీడనులో ౨౫౦౦ గ్రంథాలయములు గలవు. ఆస్ట్రియానుండి విడివడిన పిమ్మట జెకోస్లొవేకియారాష్ట్రమున ప్రతిపల్లెయందునుకూడ గ్రంథాలయములు స్థాపింపబడెను. ఇచ్చట ప్రస్తుతకాలమందు ౧౬౨౦౦ పుస్తకాగారములు గలవు. ప్రభుత్వమువారు సాలునకు ౧౦ కోట్లరూప్యములు వ్యయపరచుచున్నారు.

### జపాను

౭౭౫-వ సంవత్సరమున, జపానులో మొట్టమొదటిగ్రంథాలయము స్థాపింపబడెను. ఈ కాలమున జపానులో ౪౧౬౭ గ్రంథాలయములు గలవు. టోకియోవిశ్వవిద్యాలయమందలి లైబ్రరీలోనున్న ౨ లక్షలగ్రంథములును ౧౯౨౩ సంవత్సరమున భూకంపముచే నశించెను; కాని అమెరికాదేశస్థులసహాయముచే మరల పూరింపబడెను. బ్రిటిషువారుకూడ ఈగ్రంథాలయమునకు ౩ లక్షల ౭౫ వేలు విరాళముగ నిచ్చిరి. ఇప్పుడు దీనియందు ౬ లక్షలపుస్తకములు గలవు.

### చైనా

క్రీస్తునకుపూర్వము ౩ వేల వర్షముల క్రిందటనే ఇచ్చట గ్రంథాలయమున్నజాడలు గోచరించుచున్నవి. ఇచ్చటి యొకగ్రంథాలయము క్రీస్తునకు ౭౦౦ సంవత్సరములకు పూర్వమున స్థాపింపబడెను. అప్పటిగ్రంథములు ౨ లేక ౨౪ అడుగులపొడవుగల కొయ్యచెక్కలమీద వ్రాయబడుచుండెడివి. పిమ్మట వ్రాతకు పట్టువస్త్రము లుపయోగింపబడెను. ప్రపంచమం దంతరికంటెను ముందుగ చైనాదేశము కాగితములను జేయుట కనుగొనెను. వేలకొలది సంవత్సరముల క్రితమే యొక ... గ్రంథము ౧౧౦౦౦ సంపుటములుగ సిద్ధము చేయబడెను. ప్రప్రథమమున నీదేశమే ముద్రణయంత్రమునుకూడ కనుగొనెను. ఇచ్చట ప్రస్తుతము ౩౦౦ గ్రంథాలయములు గలవు. అమెరికాయందలి విశేషజ్ఞులను పిలిపించి నూతన పద్ధతి ననుసరించి గ్రంథాలయముల నిర్మించుచున్నారు. బూన్ విశ్వవిద్యాలయమందు గ్రంథాలయ నిర్మాణమునుగురించిన ప్రత్యేకవిషయ మొకటి బోధింపబడుచున్నది.

### టిబెట్టు

టిబెట్టులోకూడ అనేకగ్రంథాలయములు గలవు. ఇవి చాల పురాతనములు. ఇచ్చట బౌద్ధకాలమునకు చాలపూర్వము లిఖింపబడిన సంస్కృత ప్రాకృతగ్రంథములును భారతీయదేశభాషాసంబంధము లగు ననేకగ్రంథములును లభించుచున్నవి. బౌద్ధభిక్షుకుడును బౌద్ధమతశాస్త్రముల పరిపూర్ణముగ నభ్యసించిన త్రిపిటకాచార్యబిరుదాంకితుడు నగు శ్రీరాహులసాంకృత్యాయన్ అనునాయన టిబెట్టులోని మఠములు, లామాలు, నిర్మించిన గ్రంథాలయములనుండి యమూల్యము లగు అనేక సంస్కృత, ప్రాకృత హిందీగ్రంథములను సేకరించి భారతభూమికి గొనితెచ్చి అవర్ణనీయ మగు మేలొనరించెను.

### భారత దేశము.

వాజసనేయ సంహితయందు "అక్షరపంక్తి ఛందః", "శతసా విష్టాః శతాక్షరాణి" మొదలగువాక్యము లున్నవి. దీనినిబట్టి వైదికకాలమందుకూడ లేఖనపద్ధతి గల దని స్పష్టమగుచున్నది కాని ఆకాలమందు గ్రంథములు వ్రాయబడుచున్నట్లును పుస్తకాలయము లున్నట్లును ప్రమాణము లేవియు లభించుచుండుటలేదు. బౌద్ధయుగమున భారతదేశమందు అనేక ఉత్కృష్టమగు గ్రంథాలయము లున్నటుల "ఫాహియాను", "ఇత్సింగు" మొదలగు విదేశీయ యాత్రికుల వ్రాతలవలన తెలియుచున్నది. ఇంతేకాదు, ఆకాలమున అనేకగ్రంథములు భారతభూమినుండి విదేశములకు కొంపోబడుచుండెడివి. ఫాహియాను తాళపత్రగ్రంథములను ౫౨౦ మోపులుగ కట్టి తనదేశమునకు గొంపోయెను. ఇత్సింగు అట్లనేను ౫౦౦

బౌద్ధగ్రంథప్రతులను చైనాదేశమునకంపెను. వీనిలో ప్రతిగ్రంథమునందును ౬౦౦ శ్లోకము లుండెను. ౫౬౯-వ సంవత్సరమునాటి వల్లభి శాసనమందు చెప్పబడిన దానము గ్రంథముల కొరకు చేయబడినట్లున్నది. ౭-వ శతాబ్ద మందలి నాలందలోని 'రత్నోదధి' యను పేరుగల పుస్తకాలయము చాల ప్రసిద్ధికెక్కి యుండెను. దీనిభవనము ౯ అంతస్తులు గలిగి ౩౦౦ గదులను కలిగియుండెను. సప్తరాజుల కాలమున మఠములందును దేవళములందును గొప్పగొప్ప గ్రంథాలయము లుండెడివి.

పాలరాజులకాలమున ౯-వ శతాబ్దమున ఓదంతపురి, విక్రమశిలలయందలి విశ్వవిద్యాలయములలో సంస్కృత, పాళీగ్రంథముల గొప్పసంగ్రహ ముండెడిది. ఈ విశ్వవిద్యాలయములలో టిబెట్టుదేశపు బౌద్ధసన్యాసు లనేకులు విద్య నభ్యసించుచుండెడివారు. విక్రమశిలయందలి గ్రంథాలయము నాలందయందలి రత్నోదధిగ్రంథాలయముకంటె చాల గొప్పదిగ నుండెను. ౧౨౦౫ లో ఈ గ్రంథాలయమును భక్త్యారు ఖిల్జీ యనునతడు నాశము చేసెను ఇచ్చటి యనేక అమూల్యగ్రంథములు నేపాలుదేశమున కంపబడెను. గుజరాతునందును, కాకయవాడునందును జైన గ్రంథాగారము లుండెడివి. పట్టణ మనుగ్రామమున ౧౩ వేల లేఖాసంగ్రహ ముండెను. ౧౧-వ శతాబ్దమున భోజరాజు ధారానగరమున గొప్పగ్రంథాగారము నేర్పరచెను. చాళుక్యరాజు వీసలదేవు డనువాడు "భారతీభాండారము" మనుపేర నొకగ్రంథాలయమ్మును స్థాపించెను. ఇప్పు డావిశాలభవనమునకు బదులచ్చట మసీ దొకటి కలదు. హైదరాబాదు రాజ్యమందలి తగాయీశిలాశాసనము ననుసరించి చాళుక్యరాజు రాయనారాయణ యను వానిమంత్రి మధుసూదనుని గ్రంథాలయమున ఆగ్గురు భాండాగారోద్యోగు లున్నట్లు తెలియుచున్నది. వీరు సామాన్యసేవకులు గాక గొప్పవిద్వాంసులై యుందురు. దక్షిణదేశములో చోళరాజులసమయమున తమిళగ్రంథాలయము లున్నట్లు జాడలు తెలియుచున్నవి. ఈ గ్రంథాలయములు "పట్టిమండపము" లను పేర బరగుచుండెను.

మహమ్మదీయచక్రవర్తులకు కూడ గొప్ప గొప్పగ్రంథాలయము లుండెడివి. అల్లాఉద్దీను ఖిల్జీయొక్క గ్రంథాలయాధ్యక్షుడు మొట్ట మొదటి ప్రసిద్ధఉర్దూభాషాకవియగు అమీరు ఖుసురూ అయియుండెను. ఈకాలముననే నిజాముద్దీను ఔలియావద్దకూడ ౩ వేలగ్రంథములుగల గ్రంథాలయ ముండెను. మొగలు చక్రవర్తులు గ్రంథనిర్మాణసంగ్రహకార్యములందు మిక్కిలి వన్నెకెక్కియుండిరి. హుమాయూను "షేరుమండల" మను భవనమున తన గ్రంథాగారము నుంచెను. దీని మెట్లనుండి జారియే యాతడు మృతు డయ్యెను. అక్బరుకాలమున ఎన్నియో సంస్కృతగ్రంథములు ఫారసీలోని కనువదింపబడెను. ఆతనికి పుస్తకములన్న మిక్కిలి ప్రేమ. అక్బరు గుజరాతునుండి గొప్పగ్రంథాగారము నొకదానిని ఢిల్లీకి తెచ్చెను. అబుల్ ఫైజీ యనువాని గ్రంథములుకూడ నీతనిగ్రంథాలయమందే నింపబడెను. ఈ గ్రంథాలయమందలి గ్రంథములు మూడువిభాగములుగ విభజింపబడెను. మొదటివిభాగమందు కావ్యములు, ఆయుర్వేదము, జ్యోతిషము, గణితమును, రెండవదానియందు దర్శనశాస్త్రములు, భాషావిజ్ఞానమును, మూడవదానియందు ధర్మశాస్త్రములు నుంచబడుచుండెను. జహాంగీరు, షాజహానులకుకూడ పుస్తకములన్న మిక్కిలి ప్రేమ. మొగలుసామ్రాజ్యక్షీణతకు పిమ్మట ఉత్తరమున నయోధ్యయందును, దక్షిణమున నిజాము, టిప్పుసుల్తానులవద్దను అనేకములు ఫారసీగ్రంథాగారము లుండెను. సిపాయీల కలహమున అయోధ్యనవాబుల పుస్తకాలయము నాశముచేయబడెను. టిప్పుసుల్తాను మరణించినపిమ్మట నాతని ౨౦౦౦ గ్రంథములు కలకత్తా పంపబడెను.

ఆకాలమందు రాజకీయపుస్తకాలయములు గాక, మఠములందును దేవళములందును, ధనవంతుల గృహములందును స్వకీయభాండారము లుండెడివి. ప్రాచీనకాలమునుండియు సంస్కృతవిద్యకు కేంద్రముగనున్న కాశీయందలి ౧౭-వ శతాబ్దమునాటి ఒకానొకగ్రంథాలయ వర్ణనముగలదు. దక్షిణదేశపు సన్న్యాసియగు కవీంద్రాచార్యుడీగ్రంథాలయయజమాని. దీనిగ్రంథములసూచిక గాయక్వారు ఓరియంటలు సీరీసు ౧౭-వ సంపుటమున ప్రకటింపబడెను. దీనిలో ౬౪ కళలతోపాటు పుస్తకపఠనము నొకకళనుగరించికూడ వర్ణనకలదు. వాత్స్యాయనకామసూత్రములందుకూడ దీని వర్ణన లభించుచున్నది. మొగలులకాలమున కాశీ, ప్రయాగలందు యాత్రికులపై పన్ను వేయబడుచుండెను. దానినాపుట కీకవీంద్రాచార్యుడు షాజహానుదర్బారునకు బోయినట్లును, అచ్చట నాతనియుపన్యాసమును విని చక్రవర్తికన్నీరు పెట్టుకొని ఆపన్నును దీసివేయుట కాజ్ఞనిచ్చి, యాతనికి విద్యానిధానమను బిరుదు నిచ్చినట్లును ఒకకథ కలదు. ఈ సన్న్యాసిని, దారాషికోహు యను నతడు గురుభావమున జూచుచుండెను. ఈ పరివ్రాజకుని గ్రంథముపై ఢిల్లీపతిపూజ్యపాద యని యాతనినామమునకు చేర్చియుండెను. ఈతని వద్ద గ్రంథములనకళ్లను వ్రాయుటకు అల్లాబక్షు అను నొకానొక మహమ్మదీయుడు నౌకరుగ నుండెను. ఈతనిచే లిఖింపబడిన "గమనసూత్రవృత్తి" యను గ్రంథము కాశీయందలి సరస్వతీభవనమున గలదు. "పౌష్కర సంహిత" యను గ్రంథమున భారతదేశమందు ప్రాచీనకాలమునగూడ తాళపత్రగ్రంథములు ఇనుపపెట్టెలలో భద్రపరచినటుల గలదు.

మనదేశమున ఆంగ్లేయులు ప్రవేశించినది మొదలు భారతదేశమందలి లిఖిత గ్రంథము లన్నియు పరదేశములపాలయినవి. లక్షలకొలది గ్రంథములు పాశ్చాత్యదేశములకు బోయెను. పారిసు, బర్లిను, ఇంగ్లండు మొదలగుచోట్ల సంస్కృత లిఖిత గ్రంథము లున్నటు లిదివరకే చెప్పబడెను. మిగిలినవానిని రక్షించుకొనుటకు కొలదికాలమునుండి మనదేశమున ప్రయత్నములు జరుగుచున్నవి. పూనాయందలి భాండార్కరు రీసర్చి ఇన్స్టిట్యూటునందు ౨౦ వేలును, మదరాసు నందలి ఓరియంటలు లైబ్రరీలో ౨౩ వేలును, కలకత్తాయందలి ఏషియాటికు సొసయిటీయందు ౧౪ వేలును, అడయారు దివ్యజ్ఞానసమాజము, కాశీ సరస్వతీభవనము, తంజావూరు గ్రంథాలయము మున్నగుచోట్లను వేలకొలదిగను సంస్కృతగ్రంథముల వ్రాతప్రతులు గలవు.

స్వదేశరాజ్యములలో బరోడా, మైసూరు, బికనీరు, జయపురము, జోధపురము, కాశ్మీరము, తిరువాన్కూరు, నేపాలునందుకూడ వ్రాతప్రతు లనేకములు గలవు. పాట్నాయందలి ఖుదాబక్షు లైబ్రరీయందును, హైదరాబాదునందలి సయ్యదు అలీ బిలగరామీ పుస్తకాలయమునందును అరబ్బీ పారసీ గ్రంథముల వ్రాతప్రతు లనేకములు గలవు. ఖుదాబక్షు లైబ్రరీయందు మొగలు చక్రవర్తుల యమూల్యగ్రంథము లనేకములు గలవు. దీని చరిత్ర విచిత్రమైనది. ఖుదాబక్షు అనువాని తండ్రికి పుస్తకములన్న చాలప్రేమ. ఆతడు మరణించుసమయమున ౧౪౦౦ గ్రంథముల నప్పగించుటయేగాక ఇంకను గ్రంథముల సంపాదింపుమని కుమారుని కుపదేశించెను. తండ్రియాజ్ఞను కుమారు డక్షరశః పరిపాలించెను. ఖుదాబక్షు బీహారురాష్ట్రమున జడ్జిగనుండెను. అతడు లక్నో, ఢిల్లీ, హైదరాబాదు పట్టణముల నెల్ల గాలించి యనేకగ్రంథములను సంపాదించెను. అరేబియా, దమిష్కు, ఈజిప్టు, ఈరానుదేశములలో గ్రంథములను సంపాదించుటకతడు ఒక అరబ్బుదేశస్థుని నౌకరుగా నియమించెను. అనుచితరీతిని గ్రంథముల సంపాదించుట యతడనుచితమని తలంపలేదు. ఈ పుస్తకాగార మిచ్చినచో విశేష ధన మిచ్చెదమని బ్రిటిషు మ్యూజియమువారు చెప్పినను ఆతడొప్పుకొనలేదు. ఇతడు నేవిధములను గ్రంథచౌర్యశిక్షణము పొందినవాడు ప్రపంచమున నున్నారని చెప్పువాడు. నిజముగ నేత్రములు లేనివారు, అమూల్యములను గ్రంథముల నితరుల కిచ్చువారు, అమూల్యములను గ్రంథములు చేతికి లభించినయెడల మరల వానిని వాని యజమానుల కిచ్చివేయువారు. వీరే — ఇతని యభిప్రాయమున — మూర్ఖులను అంధులు.

భారతదేశమందలి యాధునిక గ్రంథాలయములలోని కెల్ల కలకత్తాలోని ఇంపీరియలు లైబ్రరీ ముఖ్యమైనది. ౧౮౩౫ లో జనుల ప్రయత్నముచే కలకత్తాలో సార్వజనిక గ్రంథాలయమొకటి స్థాపింపబడెను. ౧౯౦౨ సంవత్సరమున వైస్రాయియగు లార్డు కర్జను ఇంపీరియలు లైబ్రరీని సార్వజనిక గ్రంథాలయమునకు చేర్చెను. ఈ గ్రంథాలయమున భారతదేశమందలి యన్ని గ్రంథములును గలవు. ముఖ్యముగ బ్రిటిషుయుగ సంబంధములగు గ్రంథము లీలైబ్రరీలోతక్క నెచ్చటను లభింపవు. దీనియందు ౨ లక్షల ౭౫ వేల గ్రంథములు గలవు. భారతదేశమందు ప్రతి సంవత్సరము ౧౫ వేల పుస్తకములు ప్రకటింపబడుచున్నవి. అలహాబాదు, లక్నో, లాహోరు, బొంబాయి, మదరాసు నగరములందుగూడ సార్వజనిక గ్రంథాలయములు గలవు. కాని లాహోరుతక్క మిగిలిన గ్రంథాలయములలో ౫౦ వేలకంటె నధికముగ గ్రంథము లెచ్చటను లేవు.

విశ్వవిద్యాలయములందున్న పుస్తకాలయములు సామాన్యముగ అచ్చటివారికే వినియోగింపబడుచున్నవి. వీనిలో ఉన్నతకోటికి చెందిన గ్రంథము లేయధికముగ నుండును. వీనిలో లక్షగ్రంథము లనుగలిగిన పుస్తకాలయ మొక్కటియు లేదు. కలకత్తా విశ్వవిద్యాలయభాండారమునకు దర్భంగామహారాజుగారు భవనమున కనుసొమ్మునిచ్చిరి. కాశీవిశ్వవిద్యాలయపుస్తకాగార భవనమునకు బరోడామహారాజు ౨ లక్షల రూప్యముల విరాళము నిచ్చిరి. దేశభాషల పుస్తకాలయములలో నొక్కటిగూడ మంచిదిలేదనియే చెప్పవచ్చును. దేశభాషలందు సాహిత్యము దినదినప్రవర్ధమాన మగుచున్నను దేశీయులు దేశభాషాగ్రంథాగారముల విషయమై యుపేక్షాభావమును వహించియున్నారు. కలకత్తాయందలి సాహిత్యపరిషత్తువారి బంగాళీపుస్తకాలయ మొకటియు, కాశియందలి నాగరీప్రచారిణీసభ వారి హిందీ గ్రంథాలయ మొకటియు, బొంబాయి పూనా నగరములందలి గ్రంథసంగ్రహాలయములును మరాఠీ గ్రంథాలయమును, ఆంధ్రదేశమందలి గౌతమీ రామమోహన గ్రంథాలయములును దేశభాషావిషయకములగు గ్రంథాలయములలో కెల్ల పేర్కొనదగినవి.

బ్రిటిషు యిండియాయందుకంటె స్వతంత్రరాజ్యములందు గ్రంథాలయముల విషయమున నెక్కుడు శ్రద్ధ చూపబడుచున్నది. భారతదేశమందు పాశ్చాత్యపద్ధతిని గ్రంథాలయనిర్మాణ మొనర్చి మార్గదర్శకులైనవారు బరోడా గైక్వారుగారని వేరుగ చెప్పనక్కరలేదు. యీనాటవరు అమెరికాదేశములలో పర్యటన మొనర్చునపుడమున అచ్చటి గ్రంథాగారములను జూచి వారు ముగ్ధులైరి. పాశ్చాత్యపద్ధతి ననుసరించి గ్రంథాలయముల స్థాపించు నుద్దేశముతో ౧౯౧౦ సంవత్సరమున అమెరికానుండి ఒకానొక విశేషజ్ఞు నొకని తమ వెంట తీసికొనివచ్చి ఆ సంవత్సరముననే పుస్తకాలయవిభాగము నొకదానిని నిర్మించిరి. ౪౫ నగరములును, ౨౦౦ గ్రామములును, ౪౬౩ సంచారభాండాగారములును ఈ విభాగమునకు లోబడియున్నవి. వీనికొరకు ప్రతి సంవత్సరము లక్షరూపాయలు వ్యయమగుచున్నవి. నగరపుస్తకాలయములలోని కెల్ల బరోడాలోని కేంద్రపుస్తకాలయము ముఖ్యమైనది. దీనియందు ౧ లక్ష గ్రంథములు గలవు. దీనియందు స్త్రీలకును బాలురకును వేరు నొకవిభాగ మున్నది. బాలురాడుకొను నాటవస్తువులు, మనోరంజకములగు కథలపుస్తకములు, చిత్రపటములు మొదలగునవిగూడ ఇచ్చట గలవు. ఈ పుస్తకాలయమున దినమునకు సుమారు ౬౦,౭౦ మంది బాలురు చదువుచుండెదరు. బరోడారాజ్యములో గ్రంథాలయము లన్నియు కేంద్రీకరింపబడినవి. గ్రామపుస్తకాలయములు సాలున నెంతమైకము వెచ్చించునో యంతమైకము ప్రభుత్వము నుండి విరాళముగ లభించును. భవననిర్మాణమునకుగూడ నిట్లే సహాయము లభించును.

సంచారపుస్తకాలయములకొరకు చిన్న చిన్న పెట్టె లుండును. వానిలో పుస్తకముల నుంచి పల్లెలకు పంపుదురు. తిరిగి వానిని కొద్దిమాసముల తరువాత మరల పంపివేయవలెను. సినీమాలు, ప్రదర్శనములు, సభలు, ఉపన్యాసములు మొదలగువానిమూలమున పుస్తకాలయప్రచారము జరుగుచుండును. పుస్తకాలయవ్యవస్థాశాస్త్రబోధనము బరోడాకేంద్రభాండాగారమునందు జరుగుచుండును. మైసూరు, తిరువాన్కూరురాజ్యములందు కూడ నిట్టివ్యవస్థ నేర్పాటుచేయుటకు ప్రయ

త్నములు జరుగుచున్నవి. మైసూరురాజ్యములో బెంగుళూరునందలి సార్వజనికపుస్తకాలయము చాల ప్రసిద్ధమైనది.

... కొలదికాలమునుండి భారతదేశమునందు పుస్తకాలయప్రచారకార్యమునందు శ్రద్ధచూపబడుచున్నది. బెంగాలు, మదరాసు, పంజాబుప్రాంతములలో పుస్తకాలయసంఘము లేర్పడినవి. పనికూడ చురుకుగ జరుగుచున్నదని చెప్పవచ్చును. పేరునకుమాత్రము "భారతీయ పుస్తకాలయసంఘ" మనునది యొకటి కలదు గాని, అది తరచుగ గాఢనిద్రయందే మైయుండును. ఇందుల కనేకములగు కారణములు గలవు. వానిలో ముఖ్యమనునది ప్రభుత్వమువారి యుదాసీనభావము. ఈవిషయమై తన ధనవ్రయము చేయుట లేదు సరికదా, ఏపుస్తకాలయమును గూడ "కాపీరైటు గ్రంథాలయము"గా జేయుటకుకూడ ప్రభుత్వము ప్రయత్నింపలేదు. కలకత్తాయందలి ఇంపీరియలు లైబ్రరీ విషయ మనేకవత్సరములనుండి నిర్లక్ష్యముగ జూడబడుచున్నది. ఇంతవరకు భారతదేశ ప్రభుత్వశిక్షాప్రణాళిక ననుసరించి పురుషులలో వేయికి ౧౨౨ మంది, స్త్రీలలో వేయికి ౧౫ మంది మాత్రమే చదువను వ్రాయను నేర్వగలిగిరి: విద్యావిషయ మీవిధముగ నున్నప్పుడు పుస్తకాలయములకువృద్ధియెక్కడ? మనదురదృష్టవశమున రాక్ఫెల్లరు కార్నెగీ వంటి కోటీశ్వరులుకూడ మనదేశమున బుట్టలేదు. ఏకొలదిమందియో నామమాత్రధనికులున్నను వారికి పాత్రదాన మన్న గిట్టదు. అట్టిచో గ్రంథాలయములకు ధనప్రాప్తి యెట్లు కలుగును? మనదేశనాయకులు రాజనీతియందు బడి దేశసౌభాగ్యమునకు ముఖ్యావసరములగు గ్రంథాలయములను విస్మరించిరి.

---

# మీరాబాయి - తరిగొండ వేంకమాంబ

వడ్డాది సీతారామాంజనేయకవి

పరమేశ్వరుఁడు — పరమేశ్వరారాధనము ననువిషయమునుగుఱించి మానవలోకమునందుఁ గల యభిప్రాయ విశేషములను మనము గుర్తించుచునే యున్నాము. పరమావధి యెల్లరకు నొక్కటియే. భావమునందును, సేవయందును మాత్రమే భేదము పొడకట్టుచున్నది. శ్రీవిద్యాశంకర భగవత్పాదులవారి యనుయాయులు భగవంతుని కేవల పరమాత్మగా భావింతురు. జీవాత్మ—పరమాత్మల నైక్యసంధానము వారి మతము, అనఁగా వారద్వైతులు. ఇఁక విశిష్టాద్వైతులు ప్రపత్తిమార్గావలంబులు. భక్తియే వీరిమతమునకుఁ గీలకము. తమవలె భగవంతుఁడు రూపధారి కాకున్న, సంపూర్ణముగ భక్తిఁ జూపించి కొలుచుటకు వశము కాదని వీరి విశ్వాసము. భక్తిసిద్ధాంతమును నాలుగు విధములుగ విభజింపవచ్చును: (౧) దాస్యము (సేవ్యసేవకభావము), (౨) వాత్సల్యము (మాతృపుత్త్రీ భావము), (3) సఖ్యము (సుహృద్భావము). (౪) మాధుర్యము (పణయినీ ప్రణయభావము). పై రెండుమతములతోనే మన కీవ్యాసమునఁ బ్రసక్తికలదు. మొత్తముపై, హైందవులు, మహమ్మదీయులు, క్రైస్తవులు మొదలైనవారందఱు నేకగ్రీవముగా భగవంతుఁ డున్నాఁడని యొప్పుకొన్నవారే; ఆస్తికులే. కాని వారివారి పూజావిధానములు మాత్రము భిన్నభిన్నములుగా నున్నవి. అట్టి భిన్నమార్గములకు జెందినవే యద్వైత విశిష్టాద్వైత మతములు.

మీరాబాయి విశిష్టాద్వైత మతము నవలంబించినట్టి దనియుఁ, దరిగొండ వేంకమాంబ యద్వైత మతము నవలంబించినట్టి దనియు వారి చరిత్రలనుబట్టి తెలియవచ్చుచున్నది. ఇరువురును భిన్నకాలములకు, భిన్నమతములకు, భిన్న దేశములకు, భిన్న వర్ణములకుఁ జెందినవారయ్యును జీవితములందుఁ బెక్కుసాదృశ్యములు గలిగి భక్తలోక శిరోరత్నములై విరాజిల్లుచున్నారు. గేయకావ్యనిర్మాత్రి మీరాబాయి. పద్యకావ్యనిర్మాత్రి వేంకమాంబ. మీరా గాయకురాలు. వేంకమాంబ తన కావ్యమునకు వలసిన శృంగార వర్ణనములను శ్రీకృష్ణునిచేతనే పాడింపించిన రసజ్ఞురాలు. ఉభయలును బాల్యవైధవ్య దుఃఖమున భాగస్వాములే. ఉభయలును గష్టపరంపర సమానముగఁ బంచుకొన్నవారే. తమకు సంభవించిన కష్టనష్టములు సంతోషముతో ననుభవించి, సంసారమునందు విరక్తినొంది యుభయలును శ్రీకృష్ణ [illegible] నోలలాడి తన్మయ లైనవారలే. ఉభయలును నామపారాయణ పరాయణలే. గోపాలుఁడు, గోవిందుఁడు, గిరిధరుఁడు, ప్రభువు, హరి, శ్యామసుందరుఁడు, నందనందనుఁడు, రాముఁడు, స్వామి మున్నగు నామములతో శ్రీకృష్ణు నిరువురును గొంతెత్తి పిలిచినవారే. భారతభక్త దహరాకాశమున జ్యోత్స్నయును, రశ్మియును బ్రసరింపఁజేసిన రేవెలుఁగును, వేవెలుఁగును మీరా వేంకమాంబలు. ఇరువురును [illegible]వలంబనార్థముగ సంఘ[illegible]ముల నుల్లంఘించిన స్వాతంత్ర్య పరాయణలే. ఇరువురును సర్వకాల సర్వావస్థలయందును భారతీయ మహిళాలోకమున కాదర్శప్రాయలే. ఉభయలును స్త్రీలకేకాక పురుషులకును గూడ నీతిఁ గఱపు పవిత్రజీవిత చరిత్రలు కలవారే. ఉభయలును పాతివ్రత్య మాహాత్మ్యమును విశ్వవిశ్వమునఁ జిరస్థాయిగా నాటిపోయినవారే. చతుర్విధ పురుషార్థములయందలి మోక్షేచ్ఛయే మానవధర్మ మని నిరూపించిన లోకోత్తర చరిత్రలీ వ్యక్తిద్వయము. సత్యపరాక్రమధురీణ లగు వీరిచరిత్రములు వేర్వేఱ ముచ్చటించి, భావసాదృశ్యమును బిదపఁ బరిశీలింతము—

### మీరా జీవితకథ

మీరాకును, వేంకమాంబకును గురువు లెవరో తెలియ రాకున్నది.

ఒక్క గేయములో మీరాయొక్క గురువునుగూర్చిన ప్రస్తావన కాన్పించుచున్నది. క్రీ. శ. ౧౪౦౦ లో నున్న రామానందుని శిష్యుఁడును, జర్మకారుఁడును నగు 'రైదాసు' మీరా యొక్క గురువు.

మీరావారికుటుంబ చరిత్రకుఁ బ్రాధాన్యమిచ్చుచు రాజస్థానచరిత్ర వ్రాసిన 'టాడ్' దొరగారు తన వ్రాఁతకు సహకారిగా నుండుటకుఁ గైకొన్న యంశములలో మీరాబాయిచరిత్ర యొకటి. ఆతనికిఁదగిన సరికరములు దొరకక పోవుటచే మీరాచరిత్ర సరిగా వ్రాయఁజాలక పోయెను. కాని మన చరిత్రకారులు బాగుగఁ బరిశోధించి యథార్థచరిత్రమును బ్రచురపఱిచియున్నారు.

నభాదాసుయొక్క భక్తమాలయు, దీనిపైఁ బ్రియదాసు వ్రాసిన వ్యాఖ్యయు, ధ్రువదాసుయొక్క భక్తనామావళియు; వేణీ మాధవదాసు యొక్క మూలగోసెన్ చరిత్రయు, హరిరామవ్యాస — మాలుక్ దాసు ల రచనలును మీరాబాయి యొక్క యథార్థచరిత్రను బ్రచురింపుచున్నవి. మీరా వ్రాసిన గేయములలోఁగూడ, స్వవచన వ్యాఘాతములను బ్రక్షిప్తములుగాఁ బరిహరించి చూచినచోఁ జాలవఱకు నామె చరిత్రాంశములు విశదపడుచున్నవి.

మేర్తావంశస్థుఁడగు రత్నసింహునకు మీరాబాయి యేకైకపుత్రిక. తండ్రిగారి జాగీరగు 'కూఖరీ' లో నామె జన్మించినది. ఆమె శైశవమునందే తల్లి గతించినది. తండ్రిగారు నిరంతరము యుద్ధవ్యాపార నిమగ్నులై యుండుటచే సంరక్షణార్థమై తాతగారైన దూదాజీయొద్దకు, మేర్తాకు నామె పంపఁబడినది. క్రీ. శ. ౧౫౧౫ లో దూదాజీ పరమపదించెను. పిమ్మట నామె తన పెదతండ్రియగు వీరంజీసంరక్షణలో నుండెను. క్రీ. శ. ౧౫౧౬ లో ఆమెను రాణా సంగునిపెద్దకుమారుఁడగు భోజరాజున కిచ్చి వివాహము గావించిరి. టాడ్ దొరగారు పొరపాటుపడినట్లు కుంభరాణా కామె పెండ్లి చేయఁబడలేదు. మీరాబాయి కొక శతాబ్దము వెనుకనున్న కుంభరాణా నెట్లామె పెండ్లాడఁగలదు? ఇది యసంభవమని చరిత్రపరిశోధకులు రూఢిపఱిచియున్నారు. కావున మీవారు- మేర్తా కుటుంబములకు బాంధవ్యము కుంభరాణా గతించిన పిమ్మట నొక శతాబ్దమునకుఁ గ్రీ. శ. ౧౫౧౬ లో మీరాబాయివివాహ కారణమున నేర్పడినది. యువరాజైన భోజరాజు క్రీ. శ. ౧౫౨౬ లోఁ దండ్రిగారు బ్రతికియుండఁగనే మరణించెను. ఈతఁడు 'రాణా' కాలేదు. మీరాయొక్క తండ్రిగారును, మామగారును గూడఁ గ్రీ. శ. ౧౫౨౭ లోఁ జనిపోయిరి. తనకు ౨౧ ఏండ్లు నిండకముందే యామె తన తల్లిని, తాతను, భర్తను, తండ్రిని, మామగారినిగూడఁ గోల్పోయినది. ఈ యాపదలన్నియుఁ జుట్టుముట్టి యామెకోమలహృదయమును గలఁచివైచి దుఃఖపూరిత మొనరించెను.

బాల్యమున నామెను బెంచిన దూదాజీ (తాతగారు) విష్ణుభక్తుఁడగుటచే నామెహృదయక్షేత్రమున శ్రీకృష్ణభక్తిబీజము నాటుకొనెను. ఆ కుటుంబికుల దైనందినచర్యలు దానికి దోహదకారులయ్యెను. ఆమె బాల్యవిశ్వాసబీజము, నేఁటి కంకురించి, కష్ట పరంపరానుభవనీరములచే మారాకుహత్తి, వేరూని క్రమముగా విస్తరించి మహావృక్షమైనది. సంసారమునందు వైరాగ్యము ప్రబలి ప్రాపంచికవిషయములయెడ విముఖత్వము హెచ్చి, యామె భౌతిక వ్యాపారముల నన్నిటిని విడనాడి, గిరిధరుని ధ్యానించుచుఁ, దత్సేవయందే నిమగ్నురాలై, గిరిధరమహిమలు గానముచేయుచు, వైష్ణవ సాధుసమాజపరీతమైన దేవాలయమునందు స్వామిమ్రోల భక్తిపారవశ్యమున నాట్యమొనర్చుచు జన్మము ధన్యమొనర్చుకొనుచుండెను. రాణా సంగునినిర్యాణానంతర మాతని మువ్వురుకుమారులు (౧) కర్ణుఁడు (౨) రత్నసింహుఁడు (౩) విక్రమజిత్తు ననువారలు వరుసగా సింహాసన మధిష్ఠించిరి. విక్రమజిత్తును క్రీ. శ. ౧౫౩౭ లో వనవీరుఁడు చంపి, తాను రాజ్యమాక్రమించుకొని క్రీ. శ. ౧౫౪౦ లో రాణా సంగుని కనిష్ఠకుమారుఁడగు నుదయసింహునిచే జంపఁబడెను.

రాజవంశమర్యాద నతిక్రమించి మీరాబాయి కోటవిడిచి దేవాలయమునకు వెళ్లుటయే రత్నసింహ

విక్రమజిత్తులకు మిక్కిలి కంటకముగ నుండెను. హరిభక్తసాధువు లనం బడు నపరిచితుల యెదుట నామె పాడుటయు, నాడుటయు బొత్తిగా వారికిం గిట్టదాయెను. రాణా విక్రమజిత్తు ముగమోటము విడిచి యామెపట్ల శ్రద్ధ ఖండించియున్నాడు. కొందఱ కామెభర్తయే యామెను గడగండ్లపాలు చేసె నందురు. కాని విక్రమజిత్తే మీరాబాయిని మిక్కిలి దుర్దశల నొందించెనని చెప్పుటకు వీలు చాలం గనంబడుచున్నది. రాజకుటుంబమర్యాద ననుసరించి, పెండ్లికూతురగు మీరాబాయి చిత్తూరుగడములో నెలువెల్పుగానున్న యేకలింగేశ్వరునకును, భవానీదేవికిని మ్రొక్కవలసి యున్నను, సమ్మతింపక, పుట్టినింటనుండి తనతోం గొని వచ్చిన గోవిందవిగ్రహమునే పూజించుచు భజనలు సేయుచుండెడిది.

"ప్రేమప్రవాహిని యొడిదొడుకులు లేకుండం బ్రవహింపదు. అందును, గోపాంగనగోపాలకుం బ్రభువైన పరమాత్మునియెడం గల ప్రేమ దుర్భర దుఃఖభూయిష్ఠ" మని మీరా చెప్పినట్లు, గోవిందభక్తివలన నామె చిత్తూరులో గాలిడిన దే మొదలామెకు దుఃఖపరంపరయే సంభవించెను. ఆమెను బ్రత్యేకముగ నొకగదిలో బంధించి, తినుట కనువుగాని యాహారపదార్థముల నొసంగుచుండెడివారు. ఆమె యీ బాధలను సరకు చేయనే లేదు. నిరంతరముగ గోవిందుని భజన కొనసాగుటయే యామెకుం గావలసినది. ఆమె పట్టుదలను విడువకుండుటం జూచి, మొదట విషప్రయోగముం జేయించియుం, బిదప నొకబుట్టలోం బెట్టి భీకరవిషోరగమును బంపియు నామెను లోకాంతరమంపి కళంకముం బాపుకొన విక్రమజిత్తు ప్రయత్నించెను. ఈ విషమావస్థలో నామె కేమిచేయుటకును దోంచక 'సుఖపాలుం' డను నొక బ్రాహ్మణునిచేతి కొక జాబు నిచ్చి, క్రీ. శ. ౧౫౩౬ లేక ౧౫౩౭ లో, సనంగా దులసీదాసు ౪౦ ఏండ్ల ప్రాయములో నుండంగా నాతని సలహా నర్థించుచుం బంపెను. తులసీదాసువంటి భక్తాగ్రేసరుని ప్రత్యుత్తరము తేటతెల్లమును, సాటిలేనిదియు నని వేఱుగం జెప్పనక్కఱయే లేదు "తన కెంత ప్రేమాస్పదుం డైయున్నప్పటికి, నే మానవుండు భగవంతునిం బ్రేమింపండో వానిని శత్రువునిగ సహస్రధా విసర్జింపవలయును. ప్రహ్లాదుండు తండ్రిని దిరస్కరించెను. విభీషణుం డన్నను విడనాడెను. భరతుండు తల్లి నుల్లంఘించెను. బలి గురూపదేశము నాలింపం డయ్యెను. గోపికలు తమ ప్రాణేశ్వరుం డగు శ్రీకృష్ణుని బొందుటకై భర్తలను విడిచిపెట్టిరి. వారివారి ప్రవర్తన మెంతయు విశ్వశ్రేయోదాయకమై, సౌఖ్యనిధానమై యొప్పినది. భగవంతునితోడి తాదాత్మ్యమువలననే యెల్లవారును వర్ధిల్లుచున్నారు. గాజుకంటికిం గాటుక యేల? మనకు భగవంతునిపై మక్కువ నెక్కువచేసినవాండే నిజమైన స్నేహితుండు, పూజార్హుండు, ప్రాణాధికుండు. ఇదే నా యభిప్రాయ" మని తులసీదాస మహాత్ముండు మీరాబాయికిం గష్టకాలములో సమృతతుల్య మగు సందేశ మిచ్చినాడు.

చిత్తూరులో మీరా యనుభవించుచున్న దురవస్థ నంతయుం దెలిసికొని యామె పెదతండ్రి, రావువీరమదేవుండు మనస్సున మిక్కుటముగాం గ్లేశపడి, మీర్తా కామెను రప్పించి సంరక్షించుచుండెను. ఇక్కడనైన నామెకు దుఃఖానుభవము తప్పినది కాదు. క్రీ. శ. ౧౫౩౮ లో [illegible] పూరుభూపాలుండు దండెత్తి వచ్చి మీర్తారాజ్యాన్ను, రావువీరమదేవుని నోడించెను. ఇదేసమయమున మీరావారు రాణా యగు విక్రమజిత్తును వనవీరుండు పదభ్రష్టుని జేసినాడు. ఇంక నామెకుం దలదాచుకొన నెరవు లేక, తనకు రక్షణ మొసంగినవారి కిట్టి యిక్కట్టులు తటస్థించుటచే, సంసారమునం దామెకుం గలిగిన విరక్తి మఱింత దృఢమై, తీర్థయాత్ర లొనర్చుచుం గాలము వెళ్లబుచ్చుట కామె నిశ్చయించుకొన్నది. మొట్టమొదట మథురకును, బృందావనమునకును వెళ్లినది. పిమ్మట ద్వారకకుం జేరుకొన్నది. అక్కడనే ద్వారకానాథుని భజించుచు నామె జీవితశేషమును గడపనెంచినది. ఆమె యెక్కడి కేగినను దివ్యపూజలు కొల్లగొనుచుండెడిది. పూర్వోక్త భక్తివిభాగములలో నాల్గవదగు మాధుర్యము నామె యవలంబించి, గోవిందునే జీవితేశ్వరునిగ వరించి, యాత్మేశ్వరుని బ్రత్యక్షముగ శ్రీకృష్ణవిగ్రహ

ముసఁ జూచి, పరమాత్మునితో సంగాఁగ స్పర్శసుఖము నొందుచు, స్వాదబ్రహ్మమున లీనమై, చిత్తవృత్తి నెన్నఁడునుఁ దాఁచియెఱుఁగనిమీరా బాయికి నెక్కడ కేఁగినను దివ్యప్రాజలు కొల్లలుగ జరుగుట కేమి కొఱంత?

బృందావనములో, గోపికలకు రాధకును శ్రీకృష్ణ పరమాత్ముని యెడఁగల నిర్వ్యాజానురాగ బంధమును, భక్తిమార్గమునకుఁ బ్రాణమును నగుమధురరసమును బ్రజలకెల్లరకు మీరాబాయి చైతన్యదేవు నివలెనే నిరంతరమును బంచిపెట్టుచుండెడిది. జయదేవుఁడు, విద్యాపతి, చండీదాసు, సనాతన గోస్వామి, గోవిందదాసు, జ్ఞానదాసు, నరసీమెహతా, సూరదాసు మొదలగు వైష్ణవ కవిశిఖామణులవలె మీరాబాయియు సరళమును మధురమును దివ్యావేశపూరితమును నగు గేయముల నపారముగ విరచించి, తన్మయత్వముతో గాన మొనర్చి శ్రోతలను దన్మయులఁ జేయుచుండెడిది. ఆమె గేయకవిత్వము పట్టణముల లోను, పల్లెలలోను, గేదారముల లోను, మైదానములలోను నేటికిని మాఱ్ఱోఁగుచున్నది. ఆమె(౧)'నరసీజీకామాయిరా' యను కృతియును, (౨) జయదేవుని గీతగోవిందముపై నొకవ్యాఖ్యయును(3)'రాగగోవింద' యనుకృతియును వ్రాసినది. కానితుది రెండు గ్రంథములు నింతవఱకు లభింపలేదు. ఇట్లామె తన జీవితసర్వస్వమును గోవింద పాదారవిందములకే సంపూర్ణముగ సమర్పించి వేసినది. రేయుంబవ ళ్లామెకు గోవిందచింతనమేకాని వేఱొకటి లేదు. ఈ భక్తి యామె శిరీషకోమల హృదయము నందు క్షణక్షణము నభ్యుత్పరివర్తనమును గలిగించుచు సర్వత్ర శ్రీకృష్ణ మూర్తినే దర్శింపఁజేయఁ జాలినది. ఎల్లెడల నామె సమగ్రముగు సౌందర్యమును, జ్ఞానమును, శక్తిని, బ్రహ్మానందమును సర్వదా దర్శించుచుండెను. గోవిందుఁ డొక్కఁడే యీ విశాలవిశ్వమునఁ బురుషుఁడనియుఁ, దక్కిన సృష్టియెల్ల నశ్వరప్రకృతి యనియు నామెనిశ్చయము. ఆమె మనశ్శక్తి యనన్యసాధ్యము. సంపూర్ణస్వాతంత్ర్యమే యామెమూర్తి. ప్రపంచ మంతయు నొక్కుమ్మడిఁ బ్రతిఘటించినప్పటికిని నామె తాను సత్రమ మని నమ్మినపని చేసి తీరుటే కాని యెుకరికి జంకి లొంగు టెన్నఁడును లేదు. ఆమె చర్యలలోఁ గొన్ని స్త్రీస్వభావమున కతీతముగఁ గన్పట్టు చుండెను. ఉత్తమవంశ సంజాతయగు స్త్రీకి నేఁటివలె నేనాఁడును సంగీతనాట్యములు దోష మని యెవ్వ రెన్ని బాధలు పెట్టి నిరసించినను, నామె దివ్యోన్మాదమున మునిఁగి లక్ష్యపెట్టినది కాదు.

చితూరులోఁ గుంభ రాణా నాఁటి నుండియుఁ బెంపొందుచుండిన లలిత కళాసాహిత్యమును, విష్ణుభక్తియును మీరాబాయి హృదయమున గాఢముగ నలమికొని, బాల్యమందే యామెకు సంభవించిన వైధవ్య దుఃఖమును, బిమ్మట బంధుజాతము సమకూర్చిన నిర్బంధవ్యథయును నుపశమింపఁ జేసి, యామె పాతివ్రత్యమాహాత్మ్యమును లోకమునకు వెల్లడించి,మహాత్ములలో నామె కగ్రస్థానమును బ్రసాదించినవి.

క్రీ. శ. ౧౫౪౦ లో రాణాప్రతాపుని తండ్రియు, రాణాసంగుని కుమారుఁడును నగు నుదయసింహుఁడు వనవీరు నోడించి స్వారాజ్యమును గైకొనెను. క్రీ.శ. ౧౫౪3లో నవఁగా మూఁడేండ్లపిమ్మట రావు వీరమదేవుఁడు మీర్టాలో మరలఁ దనయధికారమును బ్రతిష్ఠించెను. ఈ రెండుసమయములయందును మీరాబాయిని ఇంటికిఁ గొనివచ్చుటకుఁ బ్రయత్నములు జరిగినవి. రావు వీరమదేవుఁడు క్రీ. శ. ౧౫౪౪ లో మరణించినతరువాత, నాతనికుమారుఁడు, విష్ణుభక్తాగ్రేసరుఁడు, రావు జయమల్లుఁడు మీరా బాయి ని మరల నింటికిఁ దీసికొని వచ్చుటకు శక్తివంచన లేకుండఁ బ్రయత్నించెను. కాని యామె తనదృఢ సంకల్పమునకు వికల్పము రానీయక క్రీ. శ. ౧౫౪౬ లో విష్ణుసాయుజ్యముఁ జూఱగొన్నది. ఆహా! ఆమె సంసారముతోను, స్నేహితులతోను సంబంధమును ద్రెంచివైచికొని సాధువులను, భక్తులను దండ్రులుగను, సోదరులుగను సమ్మానించుచు, నేకాకినియై, పరతత్త్వమునఁ దన్మయురాలై ప్రపంచమున సంచారమొనరించినప్పు డెంతయానందము నొందినదో కదా!

## వేంకమాంబ చరిత్రము

ఇక నాంధ్రదేశమువంకకు దృష్టి ప్రసరింపఁగనే మొల్ల, ముద్దుపళని, తరిగొండ వేంకమాంబ యను కవయిత్రీత్రయము మనకు గోచరించును. అందు రాధాకృష్ణ భక్తిని బురస్కరించుకొని రాధికాసాంత్వన మను కావ్యము వ్రాసిన ముద్దుపళని మీరాబాయితరువాత నొక శతాబ్దమునఁ గ్రీ. శ. ౧౭౬౦ ప్రాంతమున నున్నది. భక్తికిఁ బ్రధానమైన సౌశీల్య మీమెయందుఁ గానరాకుండుటచే సహజముగఁ గావ్యము త్తమాశయ ప్రతిపాదకముగ నున్నను, జీవితము నీరసమై నిరసన భాజనమై సంఘమునకుఁ బరిగ్రహణ యోగ్యము కాకపోయినది.

తరువాత మఱియొక శతాబ్దమునకుఁ గ్రీ. శ. ౧౮౦౦ లో నాంధ్రదేశమును ధన్య మొనరింపఁజేయఁ దరిగొండ వేంకమాంబ ప్రాదుర్భవించినది. ఈమె మీరాబాయి కెవిధమునను దీసిపోవక, యద్వైత తత్త్వామృతమును గ్రోలి, కావ్యసుధల నిప్పటికి నాంధ్రులచేఁ గ్రోలించుచు, నాంధ్రమాతృతపఃఫలమై విరాజిల్లినది. చిత్తూరు మండలములోని వాయిల్పాడునకు నాలుగు మైళ్లదూరములో నున్న తరిగొండగ్రామము నివాసస్థలముగా నుండిన నందవరీక నియోగి బ్రాహ్మణుఁడును, వసిష్ఠగోత్ర పవిత్రుఁడును నగు కృష్ణయామాత్యుని తనూభవ యీమె. ఈమెకుఁ గడుంగడు బాల్యమునందే వైధవ్యదుఃఖము సంప్రాప్తించినది. నాఁటినుండియు నీమె సాహిత్యవ్యాసంగముతోడను, వేదాంత విద్యాభ్యాసముతోడను గాలము వెడలించుచు జన్మము సార్థక మొనర్చుకొన్నది. ఏకాంతముగ నొకగదిలోఁ గూర్చుండి గ్రంథరచన మొనర్చుచు నాత్మజిజ్ఞాస చేయుచు నుండెడిది. పరమాత్మ సాక్షాత్కార విషయమునఁ జేసిన సాధనములోనే మీరాబాయికి నీమెకును భేదము మనకు గోచరించును. కాని తుద కుభయలును బొందిన పరమార్థమొక్కటియే. శ్రీ కృష్ణభగవానుఁ డీమె ననుగ్రహించి దర్శన మొసంగి ధన్యురాలి నొనరించెను. ఈమె బంధువు లీమెపై ననేక నిందల నారోపించిరి. ఈమె శీలమునకు వారు కళంక మాపాదింప యత్నించిరి. ఈమెవదినెలు తమభర్తలతో నెన్నెన్నో యీమెపై నేరములు చెప్పుచుండెడివారు. నవవైధవ్యము దుస్సహము కదా! అయినను వేంకమాంబ నిశ్చలచిత్తయై యాత్మపరిశోధనోద్యమమునే కొనసాగించుచుండెను. బంధువులెల్ల రప్పుడప్పు డీమెసన్నిధిని శ్రీకృష్ణుని పరిహాసధ్వనియు, నృత్యధ్వనియు వినుచుండుటచేత ననుమానగ్రస్తులై యీమెయుండు గది తలుపులు హఠాత్తుగాఁ దెఱపించి పరిశోధించుచుండెడివారు. శ్రీ కృష్ణుఁడు తప్పఁ దనగదియం దన్యు లుండ రని యీమె ప్రశాంతముగఁ వారికిఁ బ్రత్యుత్తరము నిచ్చుచుండెడిది. అన్ని విధముల నీమెను బహిష్కరించి వారు కడకు హతాశులైరి. ఈమెశీలము నిరుపహతమై, దేదీప్యమానముగఁ బ్రకాశించినది. బ్రాహ్మణులలో నున్న యాచారమునుబట్టి వితంతు వగు నామె శిరోజములను దీయించుటకై బంధువులందఱును బట్టుపట్టిరి. సాంఘికు లామెయన్నదమ్ములను బహిష్కరింపనున్న సమయమున వారి గ్రామమునకు వేంచేసిన శంకరపీఠాధిపతికడ కామెను దోడ్కొనిపోయిరి. ఆయన వేంకమాంబకు శిరోజములు దీయుడను సంస్కారమును నిర్ణయించిరి. అప్పు డామె జంకక ఈ సంస్కారమువలనఁ బరపురుషస్పర్శదోషము సంభవించుట లేదా? ఇది సమ్మతమేనా యని యడిగినది. కాని యీమె మొఱ్ఱ లరణ్యరోదనము లైనవి. బంధువులెల్లరు నీమెకు బలవంతముగా వపనకర్మ మొనరింపించి, స్నానము చేయించుటకు నదికిఁ గొనిపోయిరి. స్నానముచేసిన వెంటనే యీమె యెప్పటివలెనే కేశభారాన్వితయై యొప్పినది. సన్న్యాసియు, బంధువులును మహాశ్చర్యము నొంది, యామె జోలి కటుపైఁ బోవరైరి. శిరోజముండనము కంటె సతీమణికి శిరఃఖండనమే యానందదాయకమై యుండును. మీరాబాయి పడినకష్టములతో నీవిషయమును బోల్చిచూచినచో నియ్యది దుర్భరావమానము కదా! వేంకమాంబ మహాయోగిని యగుటచే నామె తపోమహిమయే యీ యవమానమునుండి యామెను రక్షించెను. తపఃప్రభావము నెఱుంగఁజాలక, కలిపాశబద్ధులై కొందఱిట్టి

వృత్తాంతములను నిరసించినంత మాత్రమున వాని యాథార్థ్యమునకు భంగము కలుగునా? పంచాంగములు చించివేసినమాత్రాన నక్షత్రములు పోవునా? కీనురాలగు నామె యొక్క గుహావంటి గృహాంతర్భాగమున దపస్వినియై యుండుగియుండుటచే నీమె జీవిత విశేషములు మన కంతగాఁ దెలియరావయ్యెను. పోనిండు; కష్టచరిత్రలు వినుటవలన మనసును గుండె పుండుపడును. వేంకమాంబహృదయమునకుఁ బ్రశాంతిని బ్రసాదించిన వేదాంత సాహిత్యగోష్ఠులవంక మన మనములను మరలింతము.

ఈమె ప్రసిద్ధులకన్న మిన్నయగు విద్వాంసురాలు. శ్రీమద్భాగవతములోని కపిలదేవహూతిసంవాదమును గైకొని యీమె రాజయోగసార మను వేదాంతగ్రంథమును రచించెను. ఇది ద్విపద కావ్యము. ఈ గ్రంథమువలన సామాన్యులకుఁగూడ వేదాంతము కరతలామలక మగుచున్నది. మఱియు విష్ణుదేవుఁడు పద్మావతిని వివాహమాడినకథను గైకొని వేంకటాచల మాహాత్మ్యమను ప్రబంధమునీమె వ్రాసినది. ఇంతటి సకలరస శిరోమణియగు శృంగారరస మీమె కెట్లు స్ఫురింపవలయును. ఇది యీమె కెట్లు సాధ్యపడును? స్వానుభవముతోఁ గూడిన నాయికానాయకుల ప్రేమలీలావిలాసములు వర్ణించినగాని కావ్యము సమగ్రము కాదుగదా. కావున నీమె యావద్భారమును శ్రీకృష్ణమూర్తి మీఁదనే వదలివైచి యిట్లు ప్రార్థించినది.

"శా. శృంగారాకృతితోడ వచ్చి పదముల్ శృంగారసారంబుతో
దం బూర్ణంబుగఁ జెప్పు నీ వనిన న ట్లాఁ జెప్పలే నన్న నా
ముంగోపంబునఁ జూచి లేచి యట నే మ్రొక్కంగ మన్నించి త
చ్ఛృంగారోక్తులు తానె పల్కఁగొను నా శ్రీకృష్ణు సేవించెదన్."

ఈమె కావ్యరచనామూలమునఁ బరిచ్ఛిన్నమునం దపరిచ్ఛిన్నమును దర్శింపఁజాలిన శుద్ధసన్న్యాసిని. శ్రీకృష్ణునిపై వ్రాసిన ప్రేమగీతములను శ్రీకృష్ణుఁడే యీమె హృదయవీణతో శ్రుతిఁగలిపి పాడుకొన్నాఁడు. తత్త్వజిజ్ఞాసలోఁ దనివితీరక యీమె భాగవతము ద్వాదశస్కంధములును ద్విపదకావ్యముగా రచించినట్లు,

దారుణనిర్మలవీణ నామాధిఁ బల్కించు
గాయక పురుషుని కరణిఁ గాను,
బురుషోత్తముఁడు దయాప్రేరితుండై నాజిహ్వ
యందుఁ దా వసియించి యరుదుగాను,
బలికించుఁ గావున భాగవతపురాణ
మమర నే ద్విపదకావ్యంబుగాను,
ద్వాదశస్కంధముల్ దగఁ జెప్పి హరికి స
మర్పించి శ్రీ వేంకటాద్రిమహిమ,
మలసిపై రమ్యపద్యకావ్యంబుఁ జేసి,
శ్రీనివాసునకే సమర్పితప నుంటి,
నీగ తోయధి దాటఁ బోయిన విధమున,
నాస్వతంత్రత కిల బుధుల్ నవ్వఁబోరె?

యను వేంకటాచల మాహాత్మ్యములోని పద్యమువలన వేద్య మగుచున్నది. అద్వైతమునకుఁ జెందిన షణ్మతములలోను శాక్తేయమును మిక్కిలి యనుమోదించి, పదపలంబకులాలైన శ్రీమె వ్రాసిన యీ క్రింది పద్యమువలన సూచింపఁబడుచున్నది:

"క. అల కాశినుండి వెలువడి,
వలనుగ మాకొఱకు నందవరపురమందే
సెలకొని వెలసె వతమై
యలరుచు మమ్మేలు చౌడమాంబను గొలు [తుఁడా.

పరతత్త్వమును భగవన్మూర్తులన్నిటియందును సాక్షాత్కరింపఁజేసికొన్న యానందమయి యీమె. ఈమె కావ్యములు ద్రాక్షాపాకమునఁ బలరారుచున్నట్లే యీమె జీవితము గూడ శ్రీ కృష్ణపదభక్తి యను ద్రాక్షారససేవనముచే రసోద్రిక్తమై యున్నది.

### భావసాదృశ్యము

మీరాకును, వేంకమాంబకును బ్రపంచమునెడలను, మానవజీవితమునెడలను నభిప్రాయములు సమానములే. జగత్తు మిథ్య యనియుఁ, బరమాత్మయే సత్యమనియు, శరీరధారులెల్లరును దుదకు మంటిపాలు కాకతీర దనియుఁ, గావున భోగలాలసత విడిచి, పునరావృత్తిరహిత స్థితికై యాత్మజ్ఞానసంపాదన మొనరించుటే కర్తవ్యమనియు, సర్వమును బరమేశ్వరార్పణ మొనరించి, భగవద్దాస్యముఁ జేయుచుఁ గర్మబంధమునుండి విడివడవలయు ననియు, రాముఁడో కృష్ణుఁడే ప్రభుఁ డనియుఁ, నా ప్రభునిఁ జేరునెడల సంఘము పెట్టు నష్టంకులనెల్ల సహనముతో

ప్రతిఘటించి తీరవలె ననియు, సూర్యుడున రశ్మియునుబలెం దానును బరమేశ్వరుడును నుంటి మనియుం, భ్రాంతిజనకమైన ద్వైతభావమురహితమై యద్వైతమే స్థిరముగ నుండున్న గావున బ్రహ్మత్వమును దాను బ్రాపించితీరదు ననియు మీరాబాయి గేయములలో నాలపించి యున్నది. ఇదేవిధముగ మన వేంకమాంబకూడ రాజయోగ సారములోను, వేంకటాచల మాహాత్మ్యములోను బద్యధోరణి నుపన్యసించి యున్నది.

"కాయ మస్థిర మని కానంగలేక
పాయక సంసారబద్ధులై మమత
వదలక కామార్థవాంఛితు లనుచు
మదమత్తు లనుచు దుర్మార్గత నొంది
మదిలోన నుబ్బి కామక్రోధలోభ
మదమోహ మత్సరాల్ మాటికిం బెంచి
సంపద గలిగిన, సామర్థ్య మనుచు
సొంపు మీఱిన తుచ్ఛసుఖ మిచ్చగించి
కామాంధులై తమగతిం గానలేక
భామలవలలోనం బడి లేవలేక
తెలుగని యీషణత్రయవార్ధిలోను
మఱిమఱి మునుగుచు మమత రెట్టింప
నాలుబిడ్డల కని యర్థంబుం గూర్చి
కాలంబు నరకకే కడపుచు నంచి
యంతకాలము వచ్చినప్పుడు యమునిం
జింత సేయుచు హింసచేం గంది కంది
తాపంబులం బడి క్రొన్నినా స్సండి
పాపాత్ము లనుచుం బ్రపంచంబునందుం
బుట్టుచు, గిట్టుచుం బొరలు చుండెదరు."
(రాజయోగసారము.)

ఉ. "ఇంతటి యోగపూరుషుడు
హెచ్చుడు తగ్గుడు సంతతంబు నే
కాంతమునన్ వసించుం దన
యందుం బరాత్మను జూచుచుండు వి
భ్రాంతులు తన్నుం జుట్టినను
గ్రమ్మఱ వారినిం దాను దిట్టం డీ
శాంతుడు రాజయోగి ఘన
సద్గురుడంచు వచింపంగాదనుకా."
(వేంకటాచలమాహాత్మ్యము.)

ఆంధ్రసాహిత్య రత్నాకర గర్భమున నాంధ్ర మీరాబాయి యనం దగిన వేంకమాంబవంటి విద్వత్సౌన్దర్యమణు లెందఱుంగారియున్నారో కదా! మహత్త్వప్రాప్తికై మీరాబాయియు, వేంకమాంబయు జగన్మోహనముగం బాడిపోయిన యొక గేయమును, నొకపద్యమును సర్వదా మన హృదయములందు మననము చేయుచుందుముగాక!

"అలీ సాంవరే కీ దృష్టి
మానో ప్రేమకీ కటారీహై॥
లాగత్ బేహాల్ భయీ, తన్
మనకీ సుధ్‌- బుధ్ గయీ,
తన్ మన్ వ్యాపో ప్రేమ్,
మానో మత్ వారీ హై।
సఖియాం మిలి దుయీ చారీ,
భావరీ సీ భయీ న్యారీ,
హౌంతో వాకో నీకో జానౌం,
కుంజకీ విహారీహై॥
చంద్‌కో చకోర్ చాహై,
దీప్ పతంగ్ దాహై,
జల్ వినా మీన్ జైసే,
జైసే ప్రీత్ ప్యారీహై।
వినతీ కరూం హే శ్యామ్!
లాగూం మేం తుమ్హారే పాయ్,
మీరాప్రభు ఐసే జానో,
దాసీ తుమ్హారీహై॥"

ఉ. "రామనృపాల! ఘోరతర
రావణ శౌర్యవిశాల! భవ్యసు
త్రామసురార్య యోగిజన
తాపసపాల! కృపాలవాల! శ్రీ
భూమిసుతాత్మలోల! పరి
పూర్ణ సుకీర్తి విశాల! వానర
స్తోమముతోడ వచ్చి మముం
జూచి కృతార్థుల మైతి మిప్పుడు!""



# విమర్శనము

## తల్లిప్రాణం

[శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కథలవరుసలో మూడవది. క్రౌను ౧/౧౬ పేజీలసైజు. ౧౨౮ పుటలు. ౮ ప్రకరణాలు. వెల. ౧ అ. ౬ పై. కళాభివర్ధనీపరిషత్తు. రాజమండ్రి.]

శ్రీశాస్త్రిగారు నేటిసుప్రసిద్ధాంధ్రకథకులలో నొకరు. జగ మెరిగినవారు. ఈకథ సాంఘికము, గృహ్యమూను. ఇందులోని పాత్రలు-రామబ్రహ్మం,ఒకసంపన్న గృహస్థు; ఆయనభార్య భద్రమ్మ మొగుడుపోయినకొమార్తెకు మళ్లీ పెళ్లి చేయించినది; సుందరమ్మవీరి కుమార్తె మళ్లీ వివాహంచేసుకున్నది; వెంకసాెమ్మ రామబ్రహ్మంతల్లి.

ఇందలికథ-రామబ్రహ్మనికి ఉన్నదంతా అనుభవించడానికి ఏకైకసంతానం సుందరమ్మ. సుందరమ్మకు చిన్నతనంలోనే వివాహం. తల్లియొక్కాను అక్కయొక్కాను బలవంతంమీద తనభార్య, కొమార్తె యిష్టపడకపోయినా అక్కకొమారుడికే తనకొమార్తె నిచ్చి యీయన పెళ్లిచేస్తాడు. పెళ్లైన వెంటనే అల్లుడుకాస్తా దేహం చాలిస్తాడు. అదిమొదలు కొమార్తెగతికి భద్రమ్మ చింతిస్తూ ఉంటుంది. సుందరమ్మఆకారమూ తెలివితేటలూ పేరుకు తగినట్లే ఉండేవి. భద్రమ్మ మొదట కొమార్తెకు చదువుచెప్పించడానికి ప్రయత్నిస్తుంది. రామబ్రహ్మంతల్లి అడ్డుపడుతుంది. ఆమె పూర్వాచారపరాయణ. ఆయన కూడా ఆమెమార్గం అనుసరించినా పూర్తిగా భార్యకు ఎదురుచెప్పలేకపోతాడు. భద్రమ్మ పంతంపట్టి కృష్ణారావు అనే చక్కనిఅబ్బాయిని ట్యూటరుగా ఏర్పాటు చేయిస్తుంది. సుందరమ్మ కృష్ణారావులకు స్నేహం కలిసి వాళ్లయిద్దరికెళ్లికి భద్రమ్మ లోలోపల ఎత్తులు వేస్తుంది. భర్తహృదయాన్ని కరగించి తన మార్గంలోకి తేవడానికి భద్రమ్మ ఎంతెంతో ప్రయత్నిస్తుందిగాని ఆ మొద్దుహృదయం చలించదు. తల్లి ఉపాయంచేతా సాయంచేతా సుందరమ్మ తాను వీరభద్రపురం వెళతానని చెప్పి ఎక్కడికో పోతుంది. ఇంట్లో భద్రమ్మా రామబ్రహ్మం కబుర్లు చెప్పుకొంటూఉండగా రాత్రి ఎవరిదో పెళ్లివాళ్ల ఊరేగింపు ఆవైపు వస్తుంది. వీళ్లమేడదగ్గర నిలుస్తుంది. చూస్తే ఎవరాదంపతులు? కృష్ణారావూ సుందరీనూ! తల్లి సంతోషిస్తుంది; తండ్రి కొయ్య అయిపోతాడు; ముసలమ్మ మండిపడుతుంది.

రామబ్రహ్మం ఒకవైపు. అర్థంలేనిసనాతనధర్మం ఆయనది. ఆడాళ్లకు చదువుకూడదనీ, చదువుకుంటే నిదానిస్తే యేమీ లాభం ఉండదనీ, ఆపైని చదువుకొంటే ఉద్యోగాలు చేస్తుందా ఊళ్లేలుతుందా అని, కాలంగడుపుకోడానికి ఆడాళ్లకి లక్షమార్గాలున్నాయనీ, తీర్థయాత్రలకి డబ్బివ్వవచ్చని, ఈలాంటి అభిప్రాయా లున్నాయి. కొమార్తెపెళ్లివిషయంలో అక్కకూ ముసలమ్మకూ బానిస అయిపోయినాడు. వయసువచ్చినసుందరి, వితంతువు పుణ్యస్త్రీవేషం వేసుకు తిరగడమే కాకుండా, పెద్దపరీక్షలకు చదవడమూ,తరుచు సభలకి వెడుతూఉండడమూ యీయనకు కంగారు పుట్టిస్తాయి. 'మరొకటీ మరొకటీఅయితే' అనికూడా జంకేడు.

ముసలమ్మ చాలాపూర్వాచారంది. ఈమెతో వ్యవహారం కష్టం. ఈమెఅభిప్రాయాలు చాలాసనాతనం. తనకుటుంబము ఆహితాగ్నులదట; సుందరి చదువు తమకు అవమానమట. సాటిముసలమ్మలు ఏమనిపోతారో అని యీమెకు భయంకూడా. అర్థంలేనిపూర్వాచారాలకు ఈమె గని.

ఇలాంటివాళ్లకు 'ఝుమాయించి' భద్రమ్మ బదులు చెపుతుంది. కొమార్తెకోసం ఈమెపడే ఆవేదన ప్రతిమెట్టులోనూ కనపడుతుంది. గట్టి పట్టుదలమనిషి. తమ (దంపతుల) వాంఛలెలాంటివో పిల్ల వాంఛలున్నూ అలాంటివే అని భర్తకు చాలామార్లు మనసుకు వచ్చేటట్లు చేస్తుంది. పట్టుపట్టి కొమార్తెకు చదువు చెప్పించి వివాహానికి సాయంచేసి ఆమెను పెళ్లికూతురుగా మళ్లీ కళ్లచూస్తుంది.

ఈకథలో ప్రారంభము పెంపకమూ ముగింపూ చక్కగా అతికిపోయినవి. పాత్రలను మొదటనే తడుపుకోకుండా ఉండేలాగు చూపుతున్నారు. కొమార్తెకోసం తల్లిపడే సంతాపం ఆదినుండీ క్రమంగా వృద్ధి అవుతూ వస్తుంది. నిరంతరం భర్తతో కొమార్తెచదువుకోసం జగడమాడుతూ భర్త తనతో సరసాలకు దిగితే 'పెద్దవాళ్లకు తమకే ఈలాగుంటే పసిపిల్లలకు ఏలాగుంటుందని స్ఫురింపజేస్తుంది. అలాంటిమాటలు వచ్చినప్పుడు కొన్ని సన్నివేశాలు చాలా రసవంతంగా ఉంటాయి, హృదయాన్ని కరగించేస్తవికూడా. క్రమంగా కథ సుందరీవివాహంతో ముగియడం చాలా చక్కగా ఉన్నది.

ఈకథలో బోధ విశేషంగా ఉన్నది. పూర్వాచారాలూ, వాటి నవలంబించేవారూ, వారి అర్థంలేనిమాటలూ, వాదాలూ, పనులూ చదివేవాడికి క్రమేణా మనసులో మార్పుకలిగి తప్పక సంఘసంస్కారం అయితీరవలె నని తోపింపజేస్తాయి.

సుందరి వివాహానికి భద్రమ్మ ఆఖరునవేసిన బీజము మాటమాటలోను ఉత్తమనాటకాలలోని వ్యంగ్యవైభవాన్ని తలపులోకి తెస్తూ రాబోయేఅవస్థను తెలుపుతాయి. 'శుభకార్యనికి అమ్మాయి పోతూంటే' అని భద్రమ్మ అనడమూ, సుందరమ్మ తండ్రితో తానులేని భోజనం అలవాటు చేసుకొమ్మని చెప్పడమూ ఇవి ఉదాహరణాలు.

వీరికథల సామాన్యలక్షణము - విసిగించే వర్ణనలూ అనవసరపు పెంపకమూ ఉండవు. వచనము సులువుగా తనంతటనే జారి దొర్లిపోతూఉంటుంది. మంచివ్యావహారికము. చిన్నచిన్నవాక్యాలు. అందుచేత శైలిలో వేగమున్నూ చదివేవాళ్లకు ఆతురతా కలుగుతాయి. సంభాషణలు యింటిమాటలలాగే ఉంటాయి. తెచ్చిపెట్టుకొన్న శైలి కాదు. నేటిచదువరులు సగం వీరిసంభాషణలకే ముగ్ధ లయిపోతున్నారు.

వే. వెం.

## MODERN CHINESE HISTORY

[By Prof. Tanyun-shr
Published by the Andhra University,
Waltair.
Price As. ౬.]

ప్రొఫెసరు టాన్‌యూన్‌షాన్‌గారు శాన్‌తినికేతన్‌లోనున్న సైనో-యిండియన్ కల్చరల్ సొసైటియొక్క ముఖ్యప్రచారకులు. చైనా భారతదేశాలమధ్య సహకారం పెంపొందించటం, విజ్ఞాననాగరికత విషయాల్లో రెండు దేశాలవారు పరస్పరంగా నేర్చుకోతగిన సంగతులు ప్రచారంచేయటం యీ సొసైటీ ముఖ్యాశయం. ఈ సొసైటీతరపున టాన్‌యూన్‌షాన్‌గారు భారతదేశం వచ్చినపుడు ఆంధ్రవిశ్వవిద్యాలయంలో చైనాదేశాన్ని గురించి అయిదు ఉపన్యాసాలిచ్చారు. చైనాయొక్క ప్రాచీనచరిత్రను, ఆర్థికంగా, రాజకీయంగా, సాంఘికంగా చైనాలో ఎట్టి అభివృద్ధి జరిగినదీ చక్కగా వివరించారు. ప్రొఫెసరుగారి అయిదు ఉపన్యాసాలూ అయిదు మాణిక్యాలని చెప్పవచ్చు.

మొదటి ఉపన్యాసంలో చైనాశబ్దార్థమును, ఆదేశపు ప్రాచీనచరిత్రను, పూర్వము ఏవిధంగా తనసామ్రాజ్యం నెలకొల్పిందీ, జపానులో చైనాయొక్క నాగరికత విజ్ఞానాలు ఏటుల వ్యాప్తిచెందిందీ విశదపరిచారు. అనాదినుండి ఎన్నో సామ్రాజ్యాలు పుట్టినాయి, గిట్టినాయి. కాని చైనా సామ్రాజ్యంమాత్రం కాలాన్నికూడా ధిక్కరించి యిప్పటికిని పరివ్యాప్తి చెందియుండటానికి గల ముఖ్యకారణాలను టాన్‌యూన్‌షాన్‌గారు సూత్రప్రాయంగా తెల్పారు. చైనాయొక్క ఉత్కృష్టమగు ప్రాచీననాగరికత యింతకాలం సజీవంగా ఉండటానికి అది, . . . . .

(1) స్వకల్పితమైంది కాని అనుకరణ కాదు.

(2) సర్వతోముఖంగా అభివృద్ధిపొందింది.

(3) మానవ సౌభ్రాతృత్వానికే కృషిసల్పింది.

(4) శాంతియే మానవపరమావధి అని నలుదిక్కుల చాటింది.

రెండో ఉపన్యాసమందు చైనాలో సంభవించిన రాజకీయములసమార్పులనువివరించారు. జాతీయోద్యమంయొక్క పుట్టుపూర్వోత్తరాలు, అన్యరాజ్యాలవారెటుల చైనాను ఆర్థికంగా కొల్లగొట్టటానికి ప్రయత్నించిందీ, చైనా జాతీయనాయకులు చీలిపోయిన రాజ్యభాగాలను ఐక్యంచేయటాని కెటుల కృషిసల్పిందీ వివరించారు. జాతీయోద్యమ నాయకులగు డాక్టరు సన్‌యత్‌సేను షియాంగ్‌కేషేకు సేనానులు గావించిన సేవను, చైనాలో సమవాద మెటుల వ్యాప్తిచెందిందీ, దానిని అరికట్టటానికి నాయకులు చేసిన ప్రయత్నాలను సుస్పష్టపరిచారు. "నేడు మాజాతికి ప్రబల విరోధి జపాను. కాని జపానుమూలాన మాకు జాతీయంగా లాభమే కల్గింది. నిరంతరం జపాను గావించుదాడులవలన మా దేశీయులు పరస్పరవిభేదము లంతరింప జేసికొని ఐకమత్యంతో జాతిపునరుద్ధరణకు కృషిసల్పటానికి అవకాశం లభించింద"ని టాన్‌యూన్‌షాన్‌గారు చెప్పారు. . .

మూడో ఉపన్యాసంలో చైనాలో జరుగుచున్న ఆర్థికాభివృద్ధిని చర్చించారు. వ్యవసాయమే చైనాయొక్క ముఖ్యపరిశ్రమ. "తనభూమిపై చైనాదేశీయునికి గొప్పమమకారం కలదు". అనాదినుండి కూడ చైనానాగరికతకు వెన్నెముక. చైనాయొక్క గొప్ప పరిశ్రమలు పింగాణి, పట్టు, తేయాకు. ప్రాచీననాగరికతమూలాన ఆర్థిక స్వసంపన్నత పొందిన చైనా నవీననాగరికతభావాలను ఎదుర్కొని ఎటుల సమన్వయం చేసికొనటానికి ప్రయత్నిస్తున్నదో సూచించారు.

నాల్గో ఉపన్యాసంలో చైనాలోని సాంఘికాభివృద్ధిని తెల్పారు. కుటుంబజీవనం, స్త్రీలకు సంఘంలో గల ప్రత్యేకస్థానాన్ని, పూర్వసంప్రదాయాలను తంతులను క్లుప్తంగా చెప్పారు. ప్రాచీన సంప్రదాయాలకును నవీనాభిప్రాయాలకును కల్గుచున్న సంఘర్షణనుకూడ వివరిస్తూ చైనాప్రజ లేవిధంగా యీ విషయంలో సంచరిస్తున్నదీ వ్యక్తపరిచారు.

తుదకు చైనాలోగల మతాన్ని గురించి ఉపన్యసించారు. బౌద్ధమతం, కన్‌ఫ్యూషియానిజమ్, టయోనిజమ్ మూలాన చైనాప్రజలలో కల్గిన నైతికపరివర్తనాన్ని తెల్పుచూ, చైనావారి మతప్రాముఖ్యతను అన్యులకు గ్రాహ్యమగునట్లు వివరించారు.

అయిదు ఉపన్యాసాలలో చైనాయొక్క రాజకీయ, ఆర్థిక, సాంఘిక, మతపరివర్తనము అందరికి అర్థమయ్యేటట్టు టాన్‌యూన్‌షాన్‌గారు చెప్పినందులకు వారి నభినందింపవలయును. గ్రంథం ౮౩ పేజీలకన్న ఎక్కువ లేదు. శైలి మనోహరంగా ఉంది. ఇట్టి ఉత్కృష్ట గ్రంథప్రకటనానికి ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు వంద్యులు.

. . గో. వెం. కృ.

---

### వకుళ మాలిక

[గీతికాస్వగతము—కర్త: తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి- ప్రకాశకులు: నవ్య సాహిత్య పరిషత్తు, గుంటూరు. వెల ౧-౩౮.]

ఈ మధ్యను, . . . వేసంగి ఇక వస్తుం దనగా . . . అతి ప్రఖ్యాతుడై ఉండికూడ్ని, నవ్య సాహిత్య పరిషత్తుతో ఏ విధంగానూ సంబంధ బాంధవ్యాలు ఉంచుకోని ఆధునికకవి, నాకు ఆప్తశ్రేణిలోవాడు, అన్నాడు గదా, ఏదోమాటల సందర్భాన- 'ఏంభాయీ! మన శాస్త్రి యిటీవల బొత్తిగా చప్పబడి పోతున్నాడేం?'. . . (అతనికి. . .మాకందరికీ పూజ్యులైన శ్రీ శాస్త్రిలవారి విషయంలో ఏకవచన ప్రయోగం చేయగల చనువూ స్వాతంత్ర్యమూ కలిసిన సమానస్థాయీ ఉంది). నాకు, అతనలా అనడానికి సందర్భమేమిటో తెలుసును. సమాధానం కూడా నాలుకచివరను తొణికిసలాడింది: కాని, పండువెన్నెలను మా గొంతుకల జవిలి అప్రస్తుతులతో ద్రోహించదలచుకొనే యిష్టము లేక, జవాబు ఎటూ తేలని ఒక సందిగ్ధపు చిరునవ్వు విసిరేసి, మగో ప్రసంగ ధోరణిలో నిదురకు మళ్లించాను.

ఇది గ్రంథవిమర్శనకు ఉపకరించని అప్రస్తుత ఉపక్రమణిక కాదు. ఇప్పుడు గ్రంథరూపముగా వెలువడిన 'వకుళమాలిక' . . .

కథను నడిపింది: లోకంలో అభిరుచులు విభిన్న మార్గములలో పాయలౌతూంటవి అని ప్రత్యేకంగా నిర్దేశించవలసిన అవసరము లేక పోయినా, ప్రతిహుల వాదమును కూడా ఉచ్చరించడం...రంగుల పొదుపుకోసం చీకటుల మీదుగా వెలుగు తళతళలను దర్శించే చిత్రకారుల పనితనపు ఛాయలు సారస్వత ప్రశంసల కలవరమునేందుకు:

మనం కథలలో చదవడం, విక్రమాదిత్యుడు తన పట్టం గడుపునేందుకు... ఎదుట ఉన్న అచేతనాలకి ప్రాణం పోసి, వాటిచేత తనకు అనుకూలపడే కథను చెప్పించాడని: నవ్యసాహిత్య యుగంలోనో, ఎందుకూ అక్కరకు రాక, ఏ శుభమూ చూడటానికి నోచుకోక, చీకటిలో, రేకలు నలిగా వాడి రాలిపోతూన్న వకుళమాలిక, విడువలేని పరిమళపు నిట్టూర్పులలో, లేనిప్రాణం తెప్పించుకుని, మెరుపువల్లే మెరసి మాయమై మబ్బుల్లో మునుగుపోయిన, సుఖ-ప్రారంభం తలగుస్తుంటూ, విషాదం వదలైన కథను... చెప్పడానికి యిష్టం లేకుండానే... తీరని కోర్కెల ఆలాపనలో...ఏకరువు పెడుతుంది:

వకుళమాలిక...ఏకధారలో స్వగత ప్రకటనముగా రచనలో ఉన్నప్పటికినీ... భావవర్ణన సౌలభ్యంకోసం...ప్రత్యేక చిత్రములుగా విడదీసికొని పరామర్శించవచ్చును:

వెన్నెల తీవలుగా సాగి, వలపుల గిలిగింతలు చేస్తూండగా...ఇందిరాంబ, చెక్కిళ్ళ, పెదవుల ఎఱ్ఱదనం బింబించుకున్న అరుణ సూత్రాన, మనసులో కోరికలు లాగా...పొగడ పూలను మాలగా కూరుస్తూన్నది: రచన పూర్తి అయినతరువాత...నాయకుడి సొత్తుగా ప్రేమోపహార మయేలోపుగా... వకుళమాలికకు...పూర్వసుకృత వశాన... వసోజనేల స్తరణం...క్షణకాలమే అయినా ...లభిస్తుంది: తరువాత, ఆతని కౌగిలింతలో ...నాయికతోబాటు...తానూ పారవశ్యంలో కొంత నలిగినా...వారిదాంపత్యసిద్ధి... కలలలో ఆమెకన్న తానెక్కువగా పులకరించుతుంది; ఇక అక్కడనుంచీ ఏకాంత వాసం...కాని వారివ్వరూ ఎడబాసి...పేరు తనువులుగా ఉండేది...ఇక ఏడు రోజులేగా ...తాను వాడకముందే... ఆమె ఆతనిలో సగపాలవుతానని... అంత వెన్నెలలోనూ బాస యిచ్చిందిగా...

కాని, దైవం మనోవిషంగా తలచాడు. గడువురోజులు గడచిపోయిన తరువాత... ఆతడు వచ్చి, ఇంకా గడువున్నదని బుజ్జగించి... చీకటి పెట్టెలో ఒంటరిగా ఉంచటం మాపడానికి... ఆమెయిచ్చిన ముద్రికను... సహవాసయోగమున, పరస్పరం, తావి, మేలిమివర్ణమూ అలవరచుకుంటూ ప్రొద్దుపుచ్చడం జని ఉంచి...వెళ్లిపోతాడు:

ఈసారి మాత ఎత్తినపుడు...చాలాకాలానికి... నాయకుడి కవళికలో కళ్యాణ-కళ పూర్తిగా మాసిపోయి ఉంటుంది. ఆమెకు ఆతనిమీద మనసు ఎవరోబోధనలలో సాఫుగా విరిచేశారట.

ఇక్కడితో అఖరు కాలేదు. ఈవిషాద పరిణామంలో మరొక విరుపు ఉన్నది... కడసారి...నాయకుడు, మాలికను చెప్పిన దేమంటే ఆమె, 'సోదరుణ్ణిగా చూసుకోగలను కాని మగోడుగా అనుకోవడానికి మనసు పోకుండా ఉంది.' అని...కాని, ఆతడికి ఇంకా ఆశఉంది...ఎన్నటికన్నా...ఆమె అనుగ్రహించదా అని. మాలికకుకూడా ఒక కోరికఉంది తాను ఆశరూపైతే, ఆతణ్ణి అంత అలయించకుండా ఏనాడో వరించి అప్పటికి ఏన్నాళ్ళనుంచో సుఖంగా కాపురంచేస్తూ ఉండునుగదా అని.

ఇదీకథ. జరిగి పోయిన దాన్ని వెనుకకు మళ్లించలేము కాని, అలా ఎందుకు కావాలిసి వచ్చిందీ అని కొంచెం విచారణ చేయవలసి ఉంటుంది. మొదటసారి ఇందిరాంబ గడువు పెట్టించినప్పుడు 'తల్లినీవాళ్లనీ వదలి అంతత్వరగా వచ్చేయడం కష్టంగాఉంది. ఇంకకొంతకాలం సెలవివ్వండి. నాకుమాత్రం మీఅంత ఆదుర్దా ఎప్పుడు మీ అర్ధాంగినవుతానా, ఎప్పుడెప్పుడు అనేదు బలాటము లేదా? కాని, కొంచెము తాళండి నాథా' అని బతిమాలుకోవడం, ఆతడు సరేనని కోరిక తేలూగ బిగబట్టుకోవడం అంతవరకూ సబబుగానే ఉంది: తరువాత, అసలేమీ ప్రసక్తకాం ఆనాటికో, పా ఒకటి రెండురోజులు హెచ్చుతగ్గగానో, ఆతనికి దైపోయిందా? అసలు కొన్నాళ్లు కనబడటమే మానేసిందే. కనబడినా మాట్లాడటం మానేసిందే, మాట్లాడినా వెనుకటివన్నీ మరచి పోయి, నీవు మంది వాడవు కావని నాకు వాళ్ళూ వీళ్ళూ చెప్తున్నారు. ఏమిటివి? అని నిగ్గదీసి సూటిపోట్లు ప్రారంభించిందే! ఇదేం న్యాయం? అంతటిరసికకవిచక్రవర్తి సుందరమూర్తి ప్రేమకు నోచుకున్న భాగ్యశాలి ఇలాగా ప్రవర్తించవలసింది? అయితే, ఇక్కడ నాయకుడిలోపంకూడా పూరాగా కనబడుతూంటది! 'నేను అనవసరంగా తొందర చేయడంవల్ల అమాయకురాలు బెదరిపోయి ఇలా సంద్రగోళ పడుతుందేమోనని అసంబద్ధమైన అనునయాలు ఆత్మశాంతికి చెప్పుకోవడం తప్పసరి: తొందర, లోజేనా తనకన్న ఆమే ఎక్కువ చూపించిందే అంతకు పూర్వం! అప్పుడు నాయకునికే గనుక సరి అయిన గార్హస్థ్యధీమా ఉన్నట్లయితే ఏంచేయవలసి ఉంటుందా, ముందు, వీరి సమాగమాన్ని కటాక్షవీక్షణాలతో కని పెడుతూఉన్న ఆమెసోదరి దర్శనం చేసికొని విషయమంతా వివరించి ఆమె ప్రసాదాన ఇందిరాంబను పునః ప్రసన్నను గా చేసుకోవడం. ఇది కొంతనిదానంతో కూడినపని: అసలు నడపవలసింది ఏమా? బెదిరిపోయి ఏమంటున్నదో కూడా తెలియకుండా గజిబిజి అయిపోతూన్న నాయికను భుజంమీదుగానో, నడుముచుట్టుగానో చేయి వేసి, దగ్గరకు లాక్కొని బుజ్జగించి, అనవసర ప్రసంగాన్నంతా చుంబనభాగంలో మాట్లు మణిగించేసి బెదురు యావత్తూ తీర్చి తల్లికన్న మిగతా బంధువులకన్నా విడువకూడనిది తాను తానేనని ఆమెకు ఊహంగా నచ్చచెప్పి ఇక వెనుక తిరిగిచూడ నీయకుండా వెనుకటి తలపులు రానీకుండా వెంట నడిపించుకుని విరిబాయల లోకి మాయం కావలసింది: పరీక్షలో నాయకుడు నెగ్గలేకపోయినాడు అని నిశ్చితంగా తెలుసుకున్న జాణ ఏమంటుంది 'తార్కికుడికి కవితాకన్యకూ ఉండవలసిన భాంధవ్యమే కావ్యంలో కన్యనైన నామా నాయక పీఠం వేసుకున్న నీకూ అంతకన్న ఒక

ఆయనగైనా ముందుకువేసి దగ్గరకు వచ్చేవో, నా అన నీకు భాయీ! అవునా...

ప్రకృతిలో అర్థంలేని ప్రణయభంగాలు ఇలా తారసిల్లుతూంటని అని, స్పష్టంగా, ఇన్ని అరమరికలు ఓకుతూన్న కథను కావ్యమునకు ప్రాణంగా సంగ్రహించుకోవడంలో శ్రీ శాస్త్రిగారు ప్రతిభకు మెరుగులు దిద్దుకున్నారు. తలచుకుంటే సూటిగా యకాయకీని మంగళాంత మయేటట్టుగా వస్తువును సర్దుకుని పూర్వ సంప్రదాయాలు నిలుపుకోలేకనా? ఈకథ ఇలాకాక మరోత్రోవను నడచినట్టయితే ఇంతటి రసపరాకాష్ఠకు అందించగల ఇరువు దొరికేది కాదేమో:

ఇక్కడినుంచీ మొదటికివద్దాం: రచన కావ్యం మొత్తంమీద ఏలాఉన్నది స్టాలినుబిళ్ల (ఇది పిప్పరమెంట్లలో కొంచెం ఘరానాజాతి) అంగిటికి తగిలిన మరోనిమిషానికల్లా సుళువుగా కరిగిపోతుంది: కాని చాలా సేపటిదాకా, దాని తాలూకుఘాటు, ఘుమాయింపు, నోటిని విడువదు. తద్వారా, ఇతివృత్తంలో మనసుకు పట్టిపోయే ఆలోచనలతో పాఠకులను కలవరపెట్టగల తాహతు ఉన్నప్పుడు కవిసామర్థ్యం అంతా క్లిష్టములైన అలంకారములూ, శబ్దచిత్రాడంబరములూ బజాయించకుండా, ఎంతో నిగ్రహంతో శిల్పాన్ని అనవసరంగా ముందుకు దుముకనీయకుండా, వ్యంగ్యమర్యాదలకు ఆవంత అయినా గుణీభూత-దోషం సంక్రమింప జేయకుండా కాపాడుకుంటూ రావడంలోనే ద్యోతక మవుతుంది. 'వకుళమాలిక' చదివేటప్పుడు అర్థాలు కుదరక తడుముకో అక్కరలేదు, అన్వయాల దూరపు తిప్పుకుళ్లలో దారి తప్పనవసరములేదు. చదివి, పుస్తకం మూసివేసిన తరువాతనుంచీ కథలో ఒక్కొక్క సన్నివేశమే పదింబదిగా 'నా మాట ఏమిటంటే నామాట ఏమిట'ని కవ్విస్తూ, భావనకు రవంతఅయినా తీరిక లేకుండా చేస్తవి: ఈనేర్పరితనం ధన్యవాదాలు కవికి చెందవలసినవే:

'వకుళమాలిక' కొంత సర్దుబాటుతో, అభినయకావ్యముగా మాధ్యకు నేందుకు వీలున్నట్టు కనిపిస్తూంది: ప్రదర్శించితే 'పద్మావతి'కన్నకూడా ఇదే ఎక్కువ రక్తిలో పడవచ్చును. నవ్య కవికులగురువులు సాహితీపరులకు పూజ్యులు అయిన శ్రీ శాస్త్రిగారిని ప్రతి ఒక్కమారూ ప్రశంసించడం అనవసరం: వారు ఇతోధికంగా కావ్యసంపదలతో తెలుగు వాణిఖజానాలను నింపేయత్నములో ఉన్నట్టు 'వకుళమాలిక' జాకెట్టు మడుపులు అటూ ఇటూ నిండిపోయిన కావ్యనామ మాల సాక్ష్యం. రానీయండి...

మరి, ఈగీతికావ్యాంతంలో దోషాలు లేనే లేవా? అంటే ఉండకతప్పదు: మానవయత్నం కేవలం నిర్దుష్టంగా ఉండటానికి వీలున్నదా...

సన్నివేశముల సందర్భములు ఆముచ్చటలు ఇంకా విపులీకరించవచ్చును; నాయిక భావాందోళనము నిరూపించడానికి ఏతన్మూలమున కథావస్తువునకు ఇంకా పుష్టిని తీసుకురావడానికి ముఖ్యంగా ప్రయత్నించి తీరవచ్చును: గేయముల ఏకచరణములను వీలైనంతవరకున్నూ కలిపిగమకించి ఎక్కువ సత్తాయిచ్చి, విశేష అర్థవంతములుగా జేయవచ్చును. అసలు ఇలా కాకుండా, శక్కనే మార్చి సంభాషణ భాగములతో రూపక గమనాన పోనిచ్చి కావ్యమునకు పటుత్వము కలిగించ వచ్చును. కాని, యీ పనులేమీ జరగనందువల్లనయినా గుణసంఖ్యను దోష లేశములఛాయలు అతిక్రమించవు కనుక, అంత యిబ్బందిలేదు. శ్రీ శాస్త్రిగారు, తాము తీసి మొదటి అడుగులు వేసి లోకోపయోగమునకు వదలివేసే క్రొత్త బాటలలో ఇది ఒకటి. అందరూ అందుకు మాత్రం ఆయనను అభినందించవలసిందే:

—రామకృష్ణశాస్త్రి.

---

### చిద్విలాసము

[ఐదంకముల సాంఘిక నాటకము. "భాషామణి" పత్రికనుండి పునర్ముద్రితము. గ్రంథకర్త త్యాగి. ప్రకాశకులు: శ్రీ మార్కండేయ భవనము, నరసరావుపేట, గుంటూరుజిల్లా. వెల ౦-౧౩-౦. గ్రంథము నరసరావుపేటలో ప్రకాశకులయొద్దను, రాజమహేంద్రవరమున 'భాషామణి'పత్రికా కార్యాలయమునను లభించును]

కందర్పరావు వకీలు; ధనవంతుడు; సంఘసంస్కర్త! సంఘ సంస్కరణమును గురించి గంభీరముగ నుపన్యసింపగలవక్త. ఈతని భార్య మోహిని, గానకోపాధ్యాయిని. కాని బాలికలకు పాఠము చెప్పటలో నీమెకు మక్కువ లేదు. దుష్టగుణగణములలో పతిక్కి దీసిపోనియాడుది. సంఘసంస్కరణగురువులు ఆతనివలెనే "ప్రీతి" కలది. లక్ష్మి పిరికిబిడ్డ ఈమెయుపాధ్యాయిని సరస్వతి. ఈమె తండ్రి ఉన్నతవిద్య నంది, విరాగియై వెడలిపోయినాడు. సరస్వతి రూపవతి; విమలగాంధర్వమున వన్నె కెక్కినట్టి విద్యావంతురాలు. సద్గుణ సంశోభిత. బాలికలకు వీణనేర్పుచు, వలసిన ధనమును సంపాదించి కొడుకు ప్రహ్లాదునకు చదువుచెప్పించుచున్నది. తండ్రి రామారావు పట్టణమును వీడి తనకడ నుండుమని సరస్వతిని వేడుకొనెను. కొడుకుచదువు చెడునను అనుచే తండ్రియనాతికి బోనిచ్చగింపదు. ప్రహ్లాదుడు భక్తుడు. తల్లికడ సంస్కృతాంధ్రములను సంగీతమును అభ్యసించును. ధర్మారావు సార్థకనామముగలవాడు. పరార్థజీవి. సరస్వతి భర్తయే చిదానందయోగియై, హిమగిరి-వనములందు వసించి, పదపడి కృష్ణానదీతీరమందలి కుండినపురమున కొంతకాలముండును. ప్రస్తుత కథాపాత్రలతో పరిచయము కలుగును. శిష్యుడు: కందర్పరావుకడ గుమాస్తాగానున్నవాడే విరాగియై పదపడి యోగీంద్రు నాశ్రయించును. యోగీంద్రుడు త్రికాలవేది. ముక్తి పొందినమహాజ్ఞాని. తాను ఈశ్వరావతారమని విశ్వసించువాడు. "ఈజగన్నాటకమునకు నేను సూత్రధారిని. సాక్షీభూతుడనై చూచుచుండియు నదిప్రవాహను నేను. నదియు నేను నిర్లిప్తుడనే. వేదేల? నేనుగాని దొక్కటియు లేదు. నామాయచే-నీలోకములన్నియు యంత్రములందలిచక్రములవలె పరిభ్రమించుచుండు" నని ఘంటాపథముగ వక్కాణించినాడు. రాంజీస్వాంకీసూరీలు దొంగసన్యాసులు; హంత

కులు ; కలియుగనిశాచరులు, మోహినీకందర్ప రావులకు సన్నిహితులు.

స్వేచ్ఛావిహారులైన మోహినీకందర్పరావులకథ ఇందు ప్రధానస్థానము కలది. కందర్పరావు సరస్వతిని ప్రేమించును. మోహిని ధర్మారావును వలచును. ఈదుష్టులు ఉద్దేశ సిద్ధికై వేయివెరవులు రోసిరి. కాని ఫలము గాంచరైరి. పరిచారికనూకమ్మయింటికడ కందర్పరావు సరస్వతిని నిర్బంధింపగమకించును. సర్వతిదురవస్థ నెఱిగి, ఆమెవలె వేషముదాల్చి ధర్మారావు రాత్రిగం గంటలకు పాడుపడిన శివాలయములో కందర్పరావును హత్య చేయును. ధర్మారావున కెగ్గుచేయదలచిన మోహిని పశ్చాత్తప్తచిత్త యగును. పదపడి యోగీంద్రునొద్ద నుపదేశమందును. ధర్మారావు, ఆతనిసతి, ప్రహ్లాదుడు, సరస్వతికూడ నుపదేశము లందెదరు. చక్కనిభరతవాక్యము నుచ్చరించి యోగీంద్రుడు కథను కంచెకంపును.

గ్రంథకర్తగారు సనాతనధర్మపరాయణులు. మహత్తరమైన భారతసంప్రదాయము నారాధించుమహాత్ములు. ఉదాత్తమైనభారతాశయములను బూజించుచు, వీరు కాలప్రవంతి ననుసరించి నడచిన, వీరిగ్రంథము ఆధునికుల యాదరము నందజాలెడిది. సంఘసంస్కరణమునకును వీరికిని చూపులు లేవు! స్త్రీస్వాతంత్ర్యము నెడలను, పునర్వివాహముల యెడలను వీరికి సానుభూతిలేదు. కైక, చుప్పనాతి, హిడింబ, చిత్రాంగి, (ఈమెనుగూర్చిన కథ వట్టినాటకము) పూతన, తాటకాదులను పేర్కొని "రాక్షసభావంబు స్త్రీల సొమ్ము, స్త్రీలుచేయజాలనిపని యేది?" అని (తోడ్తోడనే సరస్వతిని మెచ్చుచు) ధర్మారావువంటి సద్గుణశాలిచే వీరు పలికించుట భావ్యముకాదేమో! వైరాగ్యమే ముముక్షువులకు శరణ్యమని వీరు భావింతురు. విరాగి పూజనీయుడే! కాని మనుష్యసంఘమునుండి దూరస్థుడై స్వంతముక్తికై తపించువానికంటె సంఘమందేయుండి కురుక్షేత్రమందే నిలిచి, సరముక్తికై బాధలుపడువాడే అధికు డని శంకరరామానుజాదులనాటనుండి తిలకుగాంధి ప్రభృతులనాటివఱకును భారతీయులు విశ్వసించుచున్నారు. "కేవల మాశరీరమునకు సంబంధించిన ప్రారబ్ధమున నిచ్చటికి (కుండిననగరమునకు) రావలసివచ్చినది. హిమాలయములకేగి తపముగావించినచో నీ సమస్యలన్నియు విడిపోయి ముక్తి లభించును" అని వీరనపుడు సమ్మతిపూర్వకముగా తలలూపువారు నే డెందఱోయుండరు. ఈ సమస్యలు హిమాలయములలో నెట్లు పరిష్కారమందునూ!

"నాటకము నాడినతరువాత వైరాగ్యము చెంది తపమునకై హిమాలయముల కేగెదను. అప్పు డన్నియు సాధ్యపడును" "ఈకవి కేవల పారమార్థికబుద్ధితో భగవదాజ్ఞచే దీనిని హిమగిరిశిఖరప్రదేశములయందు వ్రాసెను." హిమగిరిపై నిలిచినచో, శంభువు ప్రత్యక్షము కావచ్చును కాని సంఘముయొక్క సత్యపరిస్థితు లెట్లు గోచరించును? సాంఘికనాటకము వ్రాసినగ్రంథకర్త సంఘసముద్ధరణము నభిలషించుమహాత్ము డని తలంపవచ్చును. హిమగిరివాస మేడ? సంఘసముద్ధరణ మేడ? ఏకాంతవాస మేడ? నాటక మేడ? . .

"బెల్ల మున్నచోటికి చీమలు చేరునట్లు నేనిటనున్న మూడుదినములలో నాకడకు వేలకువేలు ప్రజలు వత్తురు" స్వామిజీ యేడ? ఆత్మప్రశంస యేడ?

నాటకము సాంఘికమైనది. కావున సంఘముయొక్క సత్యస్వరూపమును రంగస్థలిపై నిలుపుట నాటకకర్తవ్యము. సంఘగుణములను ప్రదర్శించువారు పాత్రధారులు. కావున సంఘప్రాతినిధ్యమును వహించియే కుశీలవులు రంగస్థలిపై తమకర్తవ్యమును నిర్వహింతురు. తన ప్రత్యేకాభిప్రాయములను గ్రంథకర్త ఒక్కరిద్దఱుపాత్రధారులచే చెప్పించిరేని (యీపాత్రధారులు సంఘప్రతినిధులే యని ప్రజ లూహింతురు కావున) సత్యమునకు తలవంపులు తెచ్చినవా రగుదురు. సంఘము నుద్రేకించినవా రయ్యెదరు. "కాలేజీగరల్"ను చిత్రించిన గ్రంథకర్త ఈకీలుపాటునకు పాల్పడిరి. ప్రస్తుతగ్రంథకర్తగారుకూడ ఈకీలుపాటునుండి తప్పుకొన లేకపోయిరి.

పక్షుల్లలో కొందఱు నీతిబాహ్యులు లేకపోలేదు. సరస్సంస్కర్తలు [illegible] లేనివారు లేకపోలేదు. కందర్పరావును వక్షీలును, ఆతనిభార్యయైన మోహినిని ఆధునికలని, సంఘసంస్కర్తలని తెలిపి వీరు సూనృతహితు లని, పిశాచములకు సహపాఠు లని గ్రంథకర్తగారు నిరూపించిరి. అట్టు వకీలని, యీదంపతులు సంఘసంస్కర్త లని తెలుపవలసిన యక్కఱ కథావస్తువున కనివార్యమైనది కాదు. కాని వారి నిట్లని పేర్కొనుట గ్రంథకర్తగారి ప్రధానోద్దేశ మైయుండును.

గ్రంథకర్తగారు పవిత్రమైన భారతధర్మము నుగ్గడించుచు, ననుష్ఠించువారు కావున పరమధర్మమైన అహింస వీరికి నొంటబట్టినదే.

"ధరణి నసాధ్య మొండు గలదా? యెటువంటి దురాత్ముఁడేనియున్ గర మనుతాప మొంది పరఁగన్ గడుభక్తిని నీశ్వరేచ్ఛ దుర్భరదురితంబులెల్ల నెడఁబాసి వెలుంగుఁ బవిత్రుఁడౌచు న, బ్బురముగఁ బంకిలుండు జలపూరముచేఁ బరిశుద్ధుఁ డౌగతిన్."

అని పలికి, దురాత్ముఁరాలై ధర్మారావును చంపింపదలచిన మోహిని ననుతాపవహ్నిలో నిలిపి ఆమెహృదయమున మహత్తరమైన మార్పు గలిగించి (ఇదియే తాత్త్వికులను "Inward renewal") గ్రంథకర్తగా రామెను ధన్యురాలిం గావించినారు. వీరికి ధన్యవాదములు. కందర్పరావును గూడ వీ రీదృష్టితోనే వీక్షించిన బాగుండెడిది. నాటకరచనమున దుష్కృతులందు పట్టభద్రుడైనవానిపై (Nemesis)ను పురికొలుపుట సమంజస మని వీరూహించియుందురు. ఈతనిహత్య అక్కఱైనదని వీరికి తోచినచో, సోంజీ, రాంజీ, సూర్జీలలో నెవ్వరిచేనైన దీనిని చేయించవలసినది. దుర్మతు లొకరి నొకరు కొట్టుకొని చచ్చుట జగతిలో తఱచుగా జరుగుచున్న పనియే! కందర్పరావుదుర్మరణమువెనుక పవిత్రచారిత్రులైన సరస్వతీధర్మారావులను నిలిపి గ్రంథకర్తగారు పొరపా టొనరించిరి. మహాత్ముడైన ధర్మారావును హంతకుని గావించిరి.! ఊరి బయట శివాలయములో (ఇందు నిత్యపూజలు కాక నిత్యహత్యలు జరుగుచుండును.) నీపని చేయించిరి; ధర్మారావు రక్తసిక్తాంబరము ను మధుపర్కముల [illegible] వానిని-దాచు

గానెనట! ఈయకృత్యము నని వానికి జ్ఞప్తికి దెచ్చుచుండవలెనా? "ఇది పాపము గాదు కాని దారుణకృత్యమమాత్ర మగును" అని సరస్వతిచే చెప్పించిరి. దారుణకృత్యము పాప కృత్యము కాదా?

"ఎన్ని నాటకములు వ్రాసినను నాడినను నిహమేగాని పర మావంతయు గోచరించుట లేదు. ఈ నాటకము నాడినతరువాత వైరాగ్యము చెంది తపమునకై హిమాలయముల కేగెదను. అప్పు డన్నియు సాధ్యపడును" అని గ్రంథకర్తగారు సూత్రధారునిచే పలికించిరి. ఈతడు పవిత్రవర్తనుడుకదా! నటీహృదయ నట్టి వర్తనముకలదే! దుర్మతులైన మోహినీ కందర్పుల పాత్రలను వీరిచే ధరింపజేయుట సమంజసమైనపని కాదు. రంగస్థలమందైనను మహాత్ముడు దురాత్ముడు కాలేడు.

సరస్వతి పావనగుణశోభిత. తనశీలమును తోడినారీమణులశీలమును ఒకేరీతి జూచునది. "నీకామోపభోగమునకు లోకమున నెందరేని యంగనలు లేరా?" అని యాతల్లిచే పలికించుట పాడి కాదు. "ఇప్పు డొక్కరుద్దయిన నీయవా?" అని కందర్పరావనిసపుడీమెచే "అన్నియు నప్పుడే" యని చెప్పించుట తగునా?

మోహినీ కందర్పరావుల విరహము ప్రబంధములందు పరిపాటియైన విరహమునకు సహపాఠిగా నున్నది. ఇది సహజమైనది కాదనుట స్పష్టము.

ప్రస్తుతము ఆంగ్లహిందీలే ప్రాముఖ్యము వహించి తెలుగు వెనుకబడి యుండుటను వీరు గమనించుట ముదావహము.

వీరిపద్యరచన రమ్యమైనది. "కవితయుఁ గాంతయున్ స్వయముగా వరియించిన యప్పుడేగదా, చవు లెద వూర నొల్కెడు రసంబు" "వీణకుఁ బ్రాణ మిచ్చినటు ప్రేమల తోడను దంత్రి మీటు" మన్నసుపద్యములు మనోహరములు.

నాటకమున తప్పక పద్యము లుండితీఱవలెనని యూహించువారు గ్రంథకర్తగారు. కావున నొక్కొకచోటున గద్యమందు చెప్పినదానినే క్రింద పద్యమున జెప్పుచు వచ్చిరి. చూడుడు:

"సర—ఇంతవఱకుఁ బొరపడి మీతో వాదించినాను. ఈ విషయమైన వాదప్రతివాదములు నా కసమ్మతములు. ఇట్టి ప్రసంగములు లేనప్పుడే నేను మీయింటఁ బాతము నంగీకరించెదను.

ఉ. వాదము లేరితో సలుపవత్తును బాతముఁ
జెప్ప నంతియే, నాదువిధిన్ బొనర్చిన
యనంతర మింటికిఁబోదు సూటిగా, వా
దము లట్టులుండు............"

"క్షమింపుడు" అని గద్యముతో చెప్పి, "క్షమియింపంగదవయ్య నేరముల" అని పద్యముతో దిగువను జెప్పవలెనా? "నే నంధుఁడనుగా నున్నాను" అని గద్యముతో చెప్పి, వెంటనే "అంధప్రక్రియనున్న వాఁడ"నని పద్యముతో పలుకవలెనా?

"ఆరయెలనాగఁ గూడికొని హర్షదమైన
సుఖాప్తితోడ నా,నాయుతబంధచాతురి
ననంతవిధంబుల జుంబనాదులన్, బాయని
కౌఁగిలింతలను వర్తిలినప్పుడు గాని..."

ఈరీతిపద్యములను తొలగించిన రసభంగము రాదు. "లండీకే" "భోసడీ" "మొద్దుమంద" మొదలగుమాటలను తుడిచివేయుట తప్పుకాదు.

గ్రంథకర్తగా రందందు చక్కని ఉపమలను, సామెతలను, జాతీయములను, భావబంధురములైనసత్యములను (Epigrams) వైరకు ముదముగూర్చుమాటలను ప్రయోగించిరి.

భాగవతమునుండి, భక్తచింతామణినుండి, వైజయంతీవిలాసమునుండి, దాశరథిశతకము నుండి, చక్కనిపద్యములను, భజగోవింద కృష్ణకర్ణామృతాది శ్లోకములనుండి చక్కని పంక్తులను దీసి ఉచితసందర్భములందు ప్రవేశపెట్టిరి.

ఈ త్యాగి పూజనీయులు; ఉత్కృష్టాశయముల నారాధించు మహనీయులు. సంఘమున లోపములు గోచరించినపు డిట్టివారికి పవిత్రమైనఆగ్రహము కలుగుచుండును. మానవసులభమైనలోపములను విశాలదృష్టితోను విజ్ఞానదృష్టితోను వీక్షించి, ఇష్టమైనా...... మాపుచేయుదురుగాక! తమ యుద్దేశసిద్ధికి తోడ్పడునట్టి నాటకరాజములనే వీరు రచింతురుగాక!

ఈ త్యాగి తమగ్రంథమును తమ గురుపర్యులకు భక్తిపూర్వకముగా సంకిత మొనరించి, తమహృదయమహత్త్వమును ప్రకటించిరి.

జొ. స.

---

## దీపావళి

[కర్త: వేదుల సత్యనారాయణశాస్త్రి. ప్రకాశకులు: కందుకూరి రామభద్రరావు, బి. ఏ., పిఆన్. కాలేజి, కాకినాడ; వెల ౧ రూపాయి.

శాస్త్రిగారికవిత్వాన్ని చవిచూచి ఆంధ్రలోకం చాలాయేండ్లక్రిందే ఆనందించింది. కాని అది కేవలం పత్రికాముఖాన. అది గ్రంథరూపందాల్చటానికి ఇదే ప్రథమం.

గ్రంథంలో అన్నివిధాలపద్యాలూ ఉన్నవి. దేశభక్తిమొదలుకొని ప్రణయం, విరహం, ప్రకృతిశోభ, దైవాన్వేషణం మొదలైనవన్నీ వస్తువులైనవి. కాని దేనిలోనైనా కవిస్వానుభవం చక్కగా ప్రతిబింబించటంవల్ల, స్వాభావికమైన ఆవేశమూ జీవమూ గోచరిస్తూ కవిత్వాన్ని చదువరిహృదయానికి సూటిగా తాకేట్టు చేస్తవి.

ఇలాంటికవిత్వానికి ఉచితమైనబాహ్యరూపం ఇయ్యటానికి శాస్త్రిగారికి ధారాశుద్ధి, పాండిత్యం, కళాకౌశలం ఉన్నవి. చక్కని సమాసాలు కూర్చి పద్యాన్ని శ్రవణపర్వంగా చెయ్యటంలో వీరి కీడైనవారు ఆధునికుల్లో లేరనవచ్చు:

"నాకు వలంపులేమ లల
నాజనతాకబరీభరైకభూ
షాకలనన్, సతీమృదుభు
జాంతరతల్పకుచోపగూహనా
భోకమునన్-వధూసితక
పోలగళచ్ఛ్రవణావతంసహే
లాకమునన్, విలాసినుల
పాపటచెందిరకాంతిపూతలన్."

మొదలైనవి చాలామందికున్రవాళ్ల కంఠతా వచ్చినవే.

శాస్త్రిగారిగ్రంథంలో విశేషం యేమిటంటే బాగున్నమాటల్లో చాలామటుకు రవీంద్రనాథటాగూరుగారివిలాగానే వుంటవి. గీతాంజలి మొదలైనకావ్యాలు విప్పి చూస్తే వీరి ఉద్దేశాలన్నీ వాటిలో వుంటవి. మచ్చుకు :

"Pluck this little flower and take it, delay not ! I fear lest it droop and drop into the dust..."—గీతాంజలి.

"కోసుకోనుమ యీకోమలకుసుమము
కోరి విరిసె నీకోసమే స్వామీ !
విడినచేకునమి వడలిపోవునో
తొడిమ వీడి పెనుధూళిని రాలునో..."
—దీపావళి.

"This little flute of a reed throw has carried over hills ond dales, and hast breathed through it melodies eternally new"—గీతాంజలి.

"ఈనవవేణుదండ మిటు
లేటికి జెక్కడ వేల చిల్లులై
పో నొగిలించె దం చడలి
పోయిటి, వ్యర్థపుటూర్పుగాడ్పులక్
గానముగాగ మార్చుటకె
గా యని యిప్పుడె నే గ్రహించితిన్."
—దీపావళి.

దళసరికాగితాలమీద గ్రంథం చక్కగా ముద్రింపబడ్డది. —కుం. న.

---

## లెనిన్

[విద్వాన్ విశ్వంగారిచే వ్రాయబడింది. నవ్యసాహిత్యమాల రెండో పుష్పం వెల ౦-౮-౦.]

ఈ చిన్నగ్రంథంలో విద్వాన్ విశ్వంగారు లెనిన్ జీవితాన్ని సంగ్రహంగా చదువరులకు "చవిచూపించారు." రష్యాలో చక్రవర్తుల నిరంకుశపాలనము, సామ్రాజ్యవాద మెట్టిరూపం పొందిందీ, సాంఘికవాదం ఎటులవ్యాప్తి చెందిందీ, సమవాదనాయకు డను లెనిన్ దేశీయులలో ఏవిధంగా సమవాదసూత్రాలు ప్రచారంచేసి విప్లవాన్ని జయప్రదంగా కొనసాగించిందీ యీ గ్రంథంలో చాలసంగ్రహంగ వర్ణింపబడినాయి. సమసమాజపువిూలసూత్రాల నిర్ణయించి మార్క్సు తత్వంలోని మహిమను వెదచల్లిన లెనిన్ మహనీయునిజీవితం యింత టూకీగా ఆంధ్రులకు తెల్పడం బాగుండ లేదు. విద్వాన్ విశ్వంగారు రెండవముద్రణంలోనైనా గ్రంథాన్ని విస్తరించి ౧౯౧౭-వ సంవత్సరపు విప్లవం మొదలు యిప్పటివరకు రష్యాలో జరిగిన మార్పులను తప్పేలుగ వివరించటం మంచిదని నా అభిప్రాయం.

లెనిన్ చిత్రపటాన్ని గ్రంథంలో చేర్చి యుంటే ఎంత బాగుండెడిది! ఈలోపాన్ని రెండవ ముద్రణంలో విశ్వంగారు సవరిస్తారని ఆశిస్తా.

మొత్తంమీద ౭౨ పేజీలలో రష్యాలో జరిగిన సాంఘికపరివర్తనం లెనిన్ జీవితంమూలేణ అరచేతిలో మోక్షంవలె విశ్వంగారు చూపించారు. ప్రతి ఆంధ్రుడు చదవదగిన గ్రంథం.

గో. వెం. కృ.

---

## మాతృభారతి తృతీయ సంపుటము

[శ్రీ మాడపాటి హనుమంత రావు గారు, గౌరవకార్యదర్శి, బాలికల ఉన్నత పాఠశాల- సుల్తాన్ బజారు హైదరాబాదు - దక్కన్]

ఇదియొక తెలుగుపత్రిక. యీ పాఠశాల బాలికలయందు లేఖనోత్సాహమును వృద్ధి నొందించుట కిది నిర్వహింప బడుచున్నది. దీనిలో బాలికలు వ్రాసిన వ్యాసములును కొందరు విద్యార్థినులు వ్రాసిన వ్యాసములును గూడ వెలువడుచుండును. దీనికి వ్యాకరణ శిరోమణి శ్రీమాన్ ఓ. హెచ్. రంగాచార్యులుగారు సంపాదకులు. దీనిలో చాలకథలును యితర వ్యాసములుమగూడ నున్నవి. కథలు పాఠకుల నాకర్షించుచున్నవి. దీనిలో ౬౭ పేజీలలో ౨౯ తెలుగువ్యాసములలో తెలుగు అక్షరములలో నున్న మూడు సంస్కృత వ్యాసములును కలవు. కథలు మున్నగునవి వీటిలోనే చేరియున్నవి. వీటిలో కొన్ని చిన్నవియూ కొన్ని పెద్దవియూగూడ కలవు. సంస్కృత వ్యాసములు మూడును స్త్రీలచేతనే వ్రాయబడినవి. తెలుగువ్యాసములలో ౧౭ స్త్రీలచే వ్రాయబడినవి. ఇదియొక ఉత్తమతరగతిపత్రిక యనుట కెట్టి సందియము లేదు. —శే.

---

## దేవుడు

ఇదొక చాలచిన్నపుస్తకం. దేవుడుఅంటే నిర్గుణపరబ్రహ్మం అనేవిషయం తెలుపడానికి పనికివచ్చే కొన్నిఉపనిషద్వాక్యాలూ, వాటికి తెనుగూ ఇందులో ఉన్నవి. దీనిని శ్రీస్థానాపతి రుక్మిణమ్మగారుసంగ్రహించి పుస్తకంగా ప్రకటించినారు. ఈపుస్తకం విశాఖపట్టణంలో శ్రీ గరుడా నీలయ్య శ్రేష్ఠిగారివద్ద దొరుకుతుంది.

---

## భా ర తీ శ త క ము

వెల రెండణాలు. ౧౯౩౮

గ్రంథకర్త: కొంపూరి నరసింహమూర్తి 'భారతీ' యను మకుటముగల వృత్తపద్యశతకమిది. లోకవర్తన మిందు విమర్శింపబడినది. కవిత్వము చాల సామాన్యము.

ప్రకాశకులు: కొంపూరి సూర్యనారాయణ, చెరుకువాడ, ఆకివీడుపోస్టు, ప. గోదావరిజిల్లా.

---

## దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారి గ్రంథములు

౧. విశ్వామిత్రుడు
(౨-వ కూర్పు) వెల ౦-౮-౦.

౨. భరతుడు
(౬-వ కూర్పు) వెల ౦-౮-౦.

3. (అభినవ) సుమతిశతకము
(౪ వ కూర్పు) వెల ౦-౨-౦.

వీనిలో మొదటి రెండును వచన రచనములు.

ఇవి బాలురకొఱకు నుద్దేశింపబడినవి. పాఠ్య గ్రంథ నిర్ణాయకసంఘముముద్రను ఏనాఁడో పొంది మిక్కిలి వ్యాప్తిని చెందినవి. వీని వి? ప్లవ వీనివ్యాప్తిని బట్టియే ప్రకటిత మగు చున్నది. శర్మగారు నెల్లూరుపురమున పెద్ద పేరుమోసినపండితులు. వీరిరచన మీ పత్రావ్రి షముగ నున్నదయినను ఇంచుక శ్రద్ధతో జది వినబాలురు వీనివలన ప్రయోజనము నధిక ముగ పొందగలరు.

---

అగస్త్యుఁడు—బాలభారతము

[విమర్శనము ౩క్రౌను ౧౦౪పుటలు.

కర్త: ఈయుణ్ణి వేంకట వీరరాఘవా చార్యుఁడు, ఎం. ఏ., ఆంధ్రగీర్వాణ భాషోపన్యాసకుఁడు; పిఠాపురరాజ కళాశాల, కాకినాడ.]

సంస్కృతమున 'అగస్త్య'విరచిత మని ప్రసిద్ధికెక్కిన 'బాలభారత'మునుగూర్చియు, తత్కర్త అగస్త్యునిగూర్చియు, అతని గ్రం థాంతరములఁగూర్చియు నిందు సంగ్రహ రూపమగు విమర్శ కలదు. సుప్రసిద్ధపండితుఁ డగు విద్యానాథకవి (ప్రతాపరుద్రీయకర్త)యే అగస్త్యుఁ డని యిందు సయుక్తికముగ నిశ్చ యింపఁబడినది. అగస్త్యుని సమకాలికు లగు సంస్కృతాంధ్రకవులఁగూర్చియు, విద్యా నాథుని గ్రంథములఁగూర్చియు నిందు వ్రాయఁ బడిన యంశములు వాఙ్మయసేవాపరాయణుల కత్యంతోపకారకములు.

ముఖపత్రమునుబట్టియు, 'ఈ యాంధ్ర బాలభారత'మునకు మూలగ్రంథమగు సంస్కృ త'బాలభారతము'ను రచియించిన అగస్త్య మహాకవి...'అని ౨వ పుటలోని విషయమును బట్టియు ఇది బాలభారతాంధ్రానువాదమునకు పీఠికారూప మని తోఁచుచున్నది. ఆ యను వాద మెవ్వరిదో, దాని తత్త్వమేమో యిందు చెప్పఁబడలేదు. 'శ్రీ'

---

స్వ్రవతము (తిరుప్పావై) అను కాత్యాయనీవ్రతచరిత్రము

[నాటకము. డెమ్మి ౩౪పుటలు; వెల అ. ౩. పెంటపాడు. శ్రీవైష్ణవపత్రిక నుండి పునర్ముద్రితము. కర్త: శ్రీమత్తి రుమల పెద్దింటి రామానుజాచార్యులు దుంపగడప అగ్రహారం.]

ద్రవిడభాషలో ఆండాళమ్మ వ్రాసిన 'తిరుప్పావై'అను ముప్పది పాశురముల గ్రంథ ము ఆధారముగ ఈ చిన్ని నాటకము మూఁ డంకములలో రచింపఁబడినది. గోదాదేవి (ఆం డాళమ్మ)రాత్రి నాల్గవజామున తండ్రితోఁగూ డ పూలతోఁటకుఁ బోయి తండ్రి పూవులు కోయుచుండఁగా తాను గోపికాలీలలఁ దలఁచి కలఁకనిద్దుర చెందినట్లును, మూఁడు సారులు కలలో స్వ్రవతము నొనర్చుగోపికలను,వారి ఆరాధ్యదైవమగు శ్రీకృష్ణునిఁ జూచినట్లును పిదప తనకల తండ్రికిఁ జెప్పి భగవదాజ్ఞాను సారము దివ్యప్రబంధము రచింపఁగడఁగినట్లును ఇందు చెప్పఁబడినది. ముమ్ముక్షుకలకు మూఁడం కములు కూర్పఁబడినవి.

ఇది భగవద్భక్తిప్రధానమగు గ్రంథము; కథ అత్యల్పము. దృశ్యకావ్యమునకు సరి పడదు; ఈ నాటక మభినయమునకుఁ గాక పఠనమునకే అనుగుణము. విషయావగాహన మునకుమాత్రమే నాటకఫక్కి అవలంబింపఁ బడిన దన్నచో గ్రంథకర్తప్రయత్నము ఆమో దింపఁదగినది. ఇందలి రచన సరళము.

'శ్రీ'

---

భగవద్గీత

(తెనుఁగు వచనము. శ్రీకుపాకుల అనం తభూపాల ప్రణీతము. చిన్నసైజు, ౧౭౪ పుటలు. ప్రకాశకులు: గీతా ప్రచారపరిషత్తు, ఎలమంచిలి, విశాఖ పట్టణంజిల్లా.

రెండణాల తపాలబిళ్లలు పంపువారి కుచితముగ పంపఁబడును.)

హైందవులకుఁగలయుత్తమోత్తమవేదాంత గ్రంథములలో భగవద్గీత ప్రధానము. ప్రపంచ మునఁ గల నాగరకభాష లన్నింటిలోనికి ఇది తర్జుమాచేయఁబడినది. భారతదేశమున దీనికిఁ గల ప్రచారము మఱియేగ్రంథమునకును లేదు. భగవద్గీతకు తెలుఁగున పద్యరూపమునగను, గద్యరూపమునగను లెక్కలేనన్ని అనువాద ములు వెలసినవి. అందు ప్రాచీనము లత్యల్ప సంఖ్యాకములు; అధునాతనము లధికసంఖ్యా కములు.

అనువాదకుఁడు 'కుపాకుల అనంతభూపా లుఁడు శ్రీ చంద్రగిరి కృష్ణభూపాలుని పుత్రుఁడు; రెండువందల సంవత్సరముల క్రిం దటివాఁడు'. ఇతని యనువాదము యథామూ లము; సంస్కృతపదజటిలము; రచన కున్న ప్రాధాన్య మిందు విషయనిరూపణమునకు లేదు. అయినను పాఠకులహృదయము నాకర్షిం చుటకు ఈగ్రంథ మెంతయు తగియున్నది.

ఆంధ్రులు విజ్ఞానవంతులును, కర్మకారు లును నగునట్లు గీతాప్రచారము సాగింపనెంచి గీతాప్రచారపరిషత్తువారు ఈ గ్రంథము నుచితముగ తెలుఁగువారి కందఁజేయుట ప్రశంసనీయము; ఉదారులగు నాంధ్రమహా శయులు పరిషత్తువారి ప్రచారమునకు తోడు పడుదురుగాక!

"శ"

---

హిమగిరిశతకము

(త్యాగికృతము. ౧/౮ డెమ్మి ౨౬ పుటలు, వెల రెండణాలు, ప్రకాశ కులు: శ్రీ మార్కండేయ భవనము, నరసరావుపేట, గుంటూరుజిల్లా.)

'హిమగిరిస్థల మాహాత్మ్య మెన్నఁదరమె?' అను మకుటముతో ఇందు ౧౧౪ పద్యము లలో ఒక యాత్రికుఁడు చూచిన హిమగిరి ప్రాంతము వర్ణింపఁబడినది. కవిత సామాన్య మైనది; కొన్ని పద్యముల మకుటములకు, తక్కిన పాదములకును పొందిక కుదురకున్న ది. హిమగిరి విశేషములను తెలుపుటయే కవియుద్దేశమైనచో పద్యరచనకంటె గద్య రచనయే అనుకూలము; విషయజిజ్ఞాసువగు పాఠకునికిని గద్యము విసువును కల్గింపక పఠన మునకు హెచ్చరికను కల్గించును.

"శ"

---

## రాష్ట్రగానము

(పద్యములు. కర్త: ఉభయభాషా ప్రవీణ తుమ్మల, సీతారామమూర్తిచౌదరి, బాపట్ల. చక్కని కూరుపు. క్రౌను సైజు; పుటలు ౩౦, వెల ౪ అణాలు)

చిరకాలమునుండి ఆంధ్రులు కోరుచున్న ప్రత్యేకరాష్ట్రపు టావశ్యకత యీ చిన్ని పుస్తకమున సయుక్తికముగ సమర్థింపఁబడినది. ఆంధ్రుల పూర్వపుటౌన్నత్యము, రాజధానిలో వారిస్థితిగతులు, ఇతరులవలన వారికి గలుగుచున్న యిత్తిడి, ప్రాక్పశ్చిమాంధ్రుల పరస్పరవైమత్యముల కారణము, హితచింతన మొదలగు వివిధవిషయము లిందు ముద్దులు మూటగట్టు పద్దెములలో నాతివిస్తరముగ వివరింపఁబడినవి. ఆంధ్రుల ప్రత్యేక వ్యక్తిత్వ మిం దందందు వాచ్యముగను, వ్యంగ్యముగను తెలుపఁబడినది. కాని యిందలి విషయముల చర్చమాత్ర మతివిస్తృతము; నప్రసక్తము నగుచున్నది.

చక్కఁగా కవిత్వము చెప్పి, పండితపామరుల మనస్సుల నాకర్షింపఁగల యువకవులలో శ్రీ సీతారామమూర్తిచౌదరిగా రొకరు. వీరి రచన లిదివఱకే ఆంధ్రహృదయములను చూఱగొనినవి; ఈ రాష్ట్రగానము, అందు ప్రధానస్థానము నాక్రమింపఁగలదు.

ప్రత్యేకరాష్ట్రావశ్యకతను స్మరించిన ఆంధ్రుల రక్తము నుడుకెత్తించి, పొంగించి రాష్ట్రసిద్ధిపర్యంతము ఆందోళనపఱుచుట కీ రాష్ట్రగానము అత్యంతము అనుకూలము.

"ర"

---

## ప్రకాశవర్షుని రసార్ణవాలంకారము

'రసార్ణవాలంకారము' సంస్కృతమున 'ప్రకాశవర్షుఁ' డను నాలంకారికునిచేఁ గూర్పఁబడిన యలంకారగ్రంథము. 'ఈ కృతిని మొట్టమొదట, మహోపాధ్యాయ, విద్యాభూషణ బిరుదాంకితులు, చెన్నపురి విశ్వవిద్యాలయపు సంస్కృతపండితులు నగు వి. వేంకటరామశర్మగా రాంగ్లలిపిలో నుచ్చారణచిహ్నముల (Dia-critical marks) తోడను, నుపోద్ఘాతముతోడను కలకత్తానగరమున ఆచార్య నరేంద్రనాథ లా సంపాదకత్వమున వెలువడు 'భారతీయేతిహాస త్రైమాసికపత్రిక'లో నేఁటికి తొమ్మిదిసంవత్సరములకుఁ బూర్వము (మార్చి ౧౯౨౯ లో) ప్రకటించియున్నారు. ఈ కృతి గుణోత్తరముగా నుండుట గాంచి యాంగ్లలిపిలో ముద్రింపఁబడిన శ్లోకముల నాంగ్లభాషాభిజ్ఞులే యెంతయో పరిశ్రమ సల్పినఁగాని చదువనేరనప్పుడిక నాంగ్లభాషాగంధము నెఱుఁగని యాంధ్రదేశ సంస్కృతపండితుల కీకృతి యన నచుంబితప్రక్రియగా నుండు నని యెంచి దీనిని* తెలుఁగులిపిలో విపులసమాలోచనపూర్వకముగా శ్రీ వేంకట వీరరాఘవాచార్యులుగారు 'రసజ్ఞలోకమునకునివేదించుచున్నా'రు.

శ్రీ ఆచార్యులుగారు జే, రాఘవన్, నందకిశోరశర్మ, పాండురంగవామనకాణే, మాడభూషి కృష్ణమాచార్యులు మొదలగువారి మతములను తమ'కుపకరించుకొని' 'విపులసమాలోచనము' నొనర్చియున్నారు. మూలగ్రంథమున 'పాఠకులకు సుబోధముగా నుండుటకై శ్లోకముల ప్రక్క నాయా శ్లోకములందలి విషయములఁ దెలుపు సూచికలను జేర్చియున్నా'రు. 'విజయనగరమహారాజసంస్కృతకళాశాలలోని 'రసార్ణవాలంకారము'యొక్క వ్రాఁతప్రతియందలి పాఠభేదము లటనుండి మునఁ జూపియున్నారు.

### పీఠిక

విపుల సమాలోచనరూప మగు నీ పీఠికయందు రసార్ణవాలంకార కృతికర్తృత్వము, ప్రకాశవర్షుని కాలము, గ్రంథపరిమితి, అలంకారగ్రంథాంతరసారూప్యము, ఏతద్గ్రంథప్రతిపాదితవిషయములు విశేషాంశములతోఁ గూడ వివరింపఁబడినవి.

---

* ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికటితము. సంఖ్య ౩౭. సంపాదకుఁడు : ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యుఁడు, ఎం. ఏ., ఆంధ్రగీర్వాణభాషోపన్యాసకుఁడు, పిఠాపుర రాజకళాశాల, కాకినాడ. రాయల్ ౧/౬ ... పుటలు. వెల ... అణాలు.

ప్రకాశవర్షుని పేరితో మాఘ, భారవి వ్యాఖ్యానములు రెండును, ఈ యలంకారగ్రంథమును, సుభాషితగ్రంథములలో ప్రకాశవర్షకృతము లని పేర్కొనఁబడిన కొన్నిశ్లోకములును గానవచ్చుచున్నవి. శ్రీ ఆచార్యులుగారు పయి వ్యాఖ్యలను రచించిన యాతఁడును, సుభాషితశ్లోకాలంకారగ్రంథకర్తయు విభిన్నులని చివరకు నిశ్చయించి తగిన ప్రమాణములను చూపియున్నారు: ప్రకాశవర్షుఁడు —(ఆలంకారికుఁడు) క్రీ. ౧౨౦౦–౧౩౬౩ నడుమ జీవించియుండె నని తోఁచుచున్న దనియు నితని కాలమును నిశ్చయించియున్నారు.

ప్రకాశవర్షుని కాలమును నిర్ణయించు సందర్భముననే శ్రీ ఆచార్యులుగా రొకచో (పుట ౭.) భోజునికంటె నితని యర్వాచీనతను తెలుపుచు 'ప్రకాశవర్షుఁడు భోజుఁడు దోషమనినదానికపవాదమును...నిపుణముగాఁ జూపియున్నాఁ' డని వ్రాసియున్నారు.

అచటిమూల మిట్లున్నది :—

'శబ్దశాస్త్రవిరుద్ధం య
త్తదసాధు ప్రచక్షతే,
యథా—
భూరిభారభరాక్రాన్త
బాధతి స్కన్ధ ఏష తే,
తథా న బాధతే స్కన్ధో
యథా బాధతి బాధతే.

అత్ర బాధతే రాత్మనేపదిత్వాత్
'బాధతే' ఇతి స్యాత్, న పున 'ర్బాధతి' ఇతి.

(సరస్వతీకంఠాభరణము, పుట. ౪.)

భోజుఁడు దోష మని చెప్పినది ప్రథమార్థములోని 'బాధతి' అను నపప్రయోగము; కాని రెండవ సగములోని 'బాధతి' కాదు. అది ప్రాసక్తాపప్రయోగమున కనుకరణము.

'ఇదం తత్త్వమ్. విద్యమానస్యార్థవత్త్వ స్యావివక్షాయాం గవిత్యయ మాహేత్యాదావివ ప్రాతిపదికసంజ్ఞా న ప్రవర్తతే' అను రత్నేశ్వరుని పయిశ్లోకవ్యాఖ్యాంశముకూడ నుత్తరార్థమునందలి 'బాధతి' అనునది దోషోదాహృతి కాదనియే తెలుపుచున్నది. కాన 'భూరిభార' అను పైశ్లోకమును శబ్దశాస్త్ర

విరుద్ధ మగునసాధుదోషమున కుదాహరణముగా భోజుఁడు చూపియుండ నందలి యుత్తరార్థమును స్వీకరించి ప్రకాశవర్షుఁడు భోజుఁడు దోషమనినదాని కపవాదమును... విపులముగాఁ జూపియున్నాఁ' డని యభిప్రాయపడుట సరికాదు.

మనకు లభించిన రసార్ణవాలంకారము పంచ పరిచ్ఛేద పరిమితము. అలంకార, రస, విషయనిరూపణ మసమగ్ర మని, ఈ గ్రంథ మాఱుపరిచ్ఛేదముల పరిమితిగల దనియు శ్రీ ఆచార్యులుగారు సయుక్తికముగ వివరించి యున్నారు.

పీఠికయందు వాక్యార్థదోషములను వివరించు సందర్భమున 'ఖిన్న' మను దోషవిశేషము పేర్కొనఁబడినది. ఆలంకారికులు పెక్కురు 'భిన్నము'ను పేర్కొని యున్నారు. ఇందలి దోషముకూడ 'భిన్న' మై యుండునేమో! 'ఖి, భి' లకు లిపులలో సాజాత్య ముండుటచే ప్రతిలేఖకులు పొరపడియు నుండవచ్చును.

పయి సందర్భమున 'విరుద్ధ' దోషమును వివరించుపట్టున పీఠికారచయితలు 'ఇందలి విరుద్ధదోషము 3 విధములు—ప్రత్యక్షవిరుద్ధము, అనుమానవిరుద్ధము, ఆగమవిరుద్ధము'- (ప్రత్యక్షవిరుద్ధము) '3 విధములు—దేశవిరుద్ధము, కాలవిరుద్ధము, లోకవిరుద్ధము' (అనుమానవిరుద్ధము) '3 విధములు — యుక్తివిరుద్ధము, ఔచిత్యవిరుద్ధము, కామశాస్త్రవిరుద్ధము' అని చెప్పి ఆగమవిరుద్ధము నంతర్భేదములను పొరపాటునఁగాబోలు విడిచిపెట్టినారు. విరుద్ధదోషము మూఁడువిధములలో నొక్కొక్కటియు మూఁడువిధములు, అనఁగా నీవిరుద్ధదోషము మొత్తము తొమ్మిది తెఱఁగులు అని మూలమునఁ బేర్కొనఁబడినది. [చూ. ౧ పో. 3౯-౪౧].

భోజుని గుణపరిగణన వివరణ సందర్భమున నిందు 'ఈతనివలె నింత విలక్షణముగ నిన్ని గుణములను మఱి యే యాలంకారికుఁడును జెప్పియుండలేదు. ప్రకాశవర్షుడుమాత్ర మిందలి 'గతి, ప్రౌఢి' అనువానిని వదలి తక్కిన [illegible] గుణముల లక్షణములను భోజుని కృతినుండి సంగ్రహించెను' అని వ్రాయఁబడినది. భోజునివలె ౨౪ గుణములను 'ప్రతాపరుద్రయశోభూషణము'న విద్యానాథ పండితుఁడును జూపియున్నాఁడు. ప్రకాశవర్షుఁడు రెండు గుణములను 'వదలె'ను గాని విద్యానాథుఁ డట్టి లోపమును చేయలేదు.

## మూలగ్రంథము:

ముద్రితమగు రసార్ణవాలంకారమున మూలప్రతిశైథిల్యము ననుసరించి చాల లోపములు తటస్థించినవి. ఆ యా స్థలములం దెన్నెన్ని యక్షరములు లోపించినదియు శ్రీ ఆచార్యులుగారు అక్షరసంఖ్య ననుసరించి చుక్కలను గుఱుతుపెట్టియున్నారు. శ్రీ విజయనగర మహారాజ సంస్కృతకళాశాలలోని ప్రత్యంతరము లభించినపిదప ముద్రితగ్రంథలోపములను పూరించుభాగములను, పాఠభేదములను, మఱికొన్ని సవరణలను 'అనుబంధము'నఁ గూర్చియున్నారు. అది మూలగ్రంథసమన్వయమున కెంతయు నుపకారకము.

సంపాదకులు మూలమునందును, అనుబంధమునందును అచ్చటచ్చట సమన్వయాభావమును, అనౌచిత్యమును సూచించునపు డుపయోగింపఁబడు ప్రశ్నార్థకచిహ్నములను (?) చాలచోట్ల ఉపయోగించియున్నారు. అట్టి స్థలములందుఁ జాలచోట్ల సమన్వయమున కేమియు నాటంకము కలుగలేదు.

ఈ రసార్ణవాలంకారమునకు మూల మాంగ్లలిపిలో ముద్రితమగు గ్రంథము. అందుఁ గొన్నియెడల నుచ్చారణ చిహ్నములు(Dia-critical marks) తారుమారయి, విడువఁబడియు నుండవచ్చును. గ్రంథ మాంధ్రలిపిలో వ్రాయఁబడునపుడు సమన్వయ దృష్టితోఁ జూచినచో ముద్రణమున దొరలిన మఱికొన్ని స్వల్పలోపములు పూరింపఁబడవచ్చును. ఇందు 'మిశ్రేతి తం' [3-3౭], 'తం వినా' [3-౭౫] అనువానిని 'మిశ్రేతి తాం, తాం వినా' అని వ్రాయవలసినట్లు సమన్వయము కోరువారికి తెలియకపోదు.

ఇట్లే 'రసాక్షిప్తనియం వాక్యం నైకార్థమపి దుష్యతి' [౨-౭౬] అనుదానిని [illegible] దుష్యతి' [illegible] స్థితి యద్వాక్యం [illegible] అనియు, 'ఇతి సమ్యఙ్మేనైతత్' [౨-౭౦] అనుదానిని 'ఇతి సమ్యఙ్నవ మేనైతత్' అనియు, 'శస్త్రాసమాసా నైదక్ష్యే [ప్రాయో బహు (?) పాశ్చాత్య] గుణాన్వితా' అనుదానిని 'శస్త్రాసమాసా నైదక్ష్యే పాశ్చాత్య గుణాన్వితా' [3-౧౯] అనియు సులభముగా సరిచేసికొనవచ్చును. మఱియు 'స్వరవర్ణగతిస్థానబన్ధకారాదిబన్ధనాత్' [3-౭౨] ను, 'స్వరవర్ణ గతిస్థాన బన్ధాకారాది బన్ధనాత్' గను, 'రచనా నామ చాతుర్యం తం వినా కః కవేర్గుణః' [3-౭౫] అనుదానిని 'రచనా నామ చాతుర్యం తాం వినా కః కవేర్గుణః' అనునట్లుగను, 'స్మ (?) —— జాయతే స్మృతిః' [౪-౪౦] ని 'స్మరణా జ్ఞాయతే స్మృతిః' గాను, 'సమాదిభిరుపాయైస్తు'ను [౪-౬౬] 'సామాదిభిరుపాయైస్తు' అనగను, సమన్వయించి సరియగుపాఠము వ్రాయుట చాల సులభము. పాదాంతమునను, వాక్యమునను సంధి వైకల్పిక మని యెఱింగినచో 'తతః ప్రబుద్ధే సంస్కారే [అ?]ను భావో భవే ద్ద్వివిధా' [౫-౬] అనుదానిని ప్రశ్నార్థచిహ్నరహితముగను, ఆకారచిహ్నరహితముగను వ్రాయ వీలయ్యెడిది. ఇట్టి కొలఁదిపాటి సంస్కరణములను కోరు భాగము లింకెన్ని గలవు. వానిని సరిచేసినచో పాఠకుల కెంతో సౌకర్యము చేకూరెడిది; శైథిల్యాదిపూర్ణమగు రసార్ణవాలంకారములోని కొన్ని భాగములు సమన్వయానుకూల్యమును పొందియుండెడివి.

'రసార్ణవాలంకార'పుఁ బేరు తెలిసియున్నను శ్రీ ఆచార్యులుగారు 'ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక'లోఁ బ్రకటించునంతవఱకును 'ఆంగ్ల భాషాగ్రంథము నెఱుఁగని యాంధ్రదేశ సంస్కృతపండితులకు' దీని యునికి తెల్లము కాలేదు. శ్రీ రాఘవాచార్యులుగారు విశేషశ్రమల కోర్చి విపులవిమర్శరూపమగు పీఠికతోఁబాటు దీనిని ప్రకటించుట యెంతయుఁ బ్రశంసనీయము. వీరు 'అనుబంధము'నఁ గూర్చిన 'లోపపూరణములు—పాఠభేదములు' మూలగ్రంథసమన్వయమున కెంతయు నుపకరించుచున్నవి.

## నీలాసుందరీపరిణయము

కవిసార్వభౌమ కూచిమంచి తిమ్మకవి ప్రణీతము. క్రౌను ౧౦౩ పుటలు; వెల ౬ అణాలు. ప్రకాశకులు, ఆర్. వేంకటేశ్వర్ అండు కో; ఆనందముద్రణాలయము, మదరాసు.

అచ్చతెలుఁగున కబ్బములను రచించిన వారిలో కూచిమంచి తిమ్మకవి అగ్రగణ్యుఁడు. ఉన్న కొలఁదిపాటి యచ్చతెలుఁగు గ్రంథములలోను ఇతనికృతులు- అందును నీలాసుందరీ పరిణయము అభిజ్ఞుల ఆదరమును పొందుచున్నది.

నీలాసుందరీపరిణయము మూఁడాశ్వాసముల (౩౪౮ పద్యములు గల) చిన్న ప్రబంధము. ఇతరముల పెద్ద ప్రబంధములలోని కథకంటె నిందలికథ రసవంత మయినది. రచన మృదుమధురము; 'తేనియ తేట' లను 'తిమ్మయ మాట'లను అచ్చతెలుఁగున వ్రాయఁబూనిన నియమము ఈ కావ్యమునకు మెఱుఁగు పెట్టినది.

ఈ ప్రబంధ మిదివఱకే పలువురచే ముద్రితమయినది; అవి యన్నియును తప్పులతడకలు, విజ్ఞులకును కొఱుకరానికొయ్యలునయి యున్నవి. వానివలన వాఙ్మయమునకు తగినంత సేవ లభింపలేదు. ఈ యంశమును గమనించి శ్రీ ఆనందముద్రణాలయమువారు తగినవారిచే గ్రంథమును పరిశోధింపఁజేసి, చిన్న సైజున-పెద్ద చ్చులో చక్కఁగ ముద్రించి ప్రకటించిరి.

ఈ ముద్రణమున ప్రాఁతప్రతులలోని పెక్కుతప్పులు తాళపత్రగ్రంథపరిశోధనపూర్వకముగ సవరింపఁబడినవి; ఉచితపాఠములు స్వీకరింపఁబడినవి; పాఠాంతరము లధస్సూచికలో చేర్పఁబడినవి. ఇంతవఱకును ముద్రాపకులు విడుచుచున్న మూఁడు క్రొత్తపద్యములు మూలమున చేర్పఁబడినవి. ఈ సంస్కరణము పాఠకులకు, విమర్శకులకును మిక్కిలి ఉపయోగకరము.

శ్రీ మునిగోపాల రామన్న గారు విపులమగు 'పీఠిక'యందు కవి 'వంశము, జన్మభూమి, మతము', కవితా 'ప్రశస్తి, నియమము, గ్రంథసందర్భము, కథారచన, ముద్రితప్రతులు, శుద్ధపాఠసంగ్రహము' అను విషయములను గూర్చి పెక్కువిషయములను సయుక్తికముగ వివరించిరి. వారి విమర్శనము ప్రశంసనీయము.

పరిశుద్ధమగు నీలాసుందరీ పరిణయపుఁ బ్రతిని తెలుఁగువారికి అందఁజేసిన శ్రీ ఆనందముద్రాలయమువారు ప్రశంసాపాత్రులు. వారికికనే ప్రసిద్ధాంధ్రగ్రంథములను తగినవారిచే పరిష్కరింపఁజేసి ప్రకటించి వాఙ్మయమును పోషించుచు, తమ వాఙ్మయాభిమానమును వెల్లడింతురుగాక!

బు. వేం. ర.

---

# గ్రంథస్వీకారము

## వాసిష్ఠరామాయణము అను శ్రీ యోగవాసిష్ఠము

తాత్పర్యప్రకాశిక యను ఆంధ్రానువాద సహితము. అనువాదకుఁడు—శ్రీ పూర్ణానంద పూర్వార్ధము.

సంపు. ౧. సంచిక ౪. రాయల్, పుటలు ౯౯౭ మొదలు ౬౭౨ వరకు.

సంచిక ౫. రాయల్, పుటలు ౬౭౩ మొదలు ౮౪౮ వరకు.

సంపాదకస్థానము: శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడుపోష్టు, చిత్తూరుజిల్లా.

---

## సమ్మాళ్వారు గ్రంథములు (౧౯౩౮)

### ౧. ప్రపంచ వీరులు

క్రౌను ౧/౮ సైజు ౧౦౦ పుటలు.

గ్రంథకర్త: గోపరాజు వెంకటానందం.

### ౨. రాజకీయ శాస్త్రము

క్రౌను ౧/౮ సైజు ౧౫౬ పుటలు.

గ్రంథకర్త: మంతెన సుబ్బరాజు.

### ౩. భాగ్యసాధము

క్రౌను ౧/౮ సైజు ౭౬ పుటలు.

గ్రంథకర్త: గిరాజు రామారావు.

### ౪. వెంకటచలం కథలు

క్రౌను ౧/౮ సైజు ౧౪౮ పుటలు.

గ్రంథకర్త: గుడిపాటి వెంకటాచలం.

### ౫. శిరోమణి కథలు

క్రౌను ౧/౮ సైజు ౧౪౧ పుటలు.

గ్రంథకర్త: శ్రీనివాస శిరోమణి. ఒక్కొక్క గ్రంథము వెల ఆరణాలు, ప్రకాశకులు: సమ్మాళ్వారుస్, పోస్టుబాక్సు ౨౫౧, మద్రాసు.

---

## మాధవనిదాన శేషము

(ఆంధ్రతాత్పర్యసహితము)

క్రౌను ౧/౮ సైజు, ౮౩ పుటలు. వెల ఒకరూపాయి. ౧౯౩౮.

ఆంధ్రతాత్పర్యకర్త: 'రాజవైద్య' ద్విభాష్యం వెంకటరావు, మండపేట, తూర్పుగోదావరిజిల్లా.

---

## ఆంధ్రసాహిత్యదర్పణము ద్వితీయభాగము

(౭-౧౦ పరిచ్ఛేదములు)

రాయల్ ౧/౮ సైజున పు. ౧౫౭.

అనువాదకులు: శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారు. ప్రకాశకులు: వేదము వేంకటరాయశాస్త్రులు అండ్ బ్రదర్సు, ౪, మల్లికేశ్వరస్వామికోవిలవీధి, లింగిశెట్టివీథి, మన్నాడి, మదరాసు.



Printed and Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor:—S. Sambhu Prasad.